# ప్రపంచ రాజ్య సర్వస్వము


సంపాదక మండలి :

శ్రీ దేవులపల్లి రామానుజరావు

శ్రీమతి శారదా హెచ్. రావు (ప్రభుత్వ ప్రతినిధి)

డాక్టర్ సరోజిని రెగాని

డాక్టర్ ఆర్. వి. రావు

డాక్టర్ యం. రాధాకృష్ణశర్మ

డాక్టర్ కె. విఠల్‌రెడ్డి

సంకలనకర్త :

శ్రీ చీమకుర్తి శేషగిరి రావు





ప్రచురణ

ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్‌రోడ్డు, హైదరాబాదు.

1977

# తొలిపలుకు

తెలుగు భాషా వికాసానికి తోడ్పడే గ్రంథాలను ప్రచురింపజేసే ఉద్దేశంతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1966 - 67 సంవత్సరాలలో ఒక ప్రణాళికను రూపొందించి దానిని అమలు జేయడానికి ఒక సలహా సంఘాన్ని ఏర్పాటు చేసినది. ఆ సలహా సంఘం చేసిన సూచనల ప్రకారం కొన్ని గ్రంథాల ప్రచురణ బాధ్యతను రాజధానీ నగరములోని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, ఆంధ్రప్రదేశ్ లలితకళా అకాడమి, అంజుమన్ తరక్కీ ఉర్దూలతోపాటు ఆంధ్ర సారస్వత పరిషత్తుకు కూడా అప్పగించడం జరిగినది. ఆంధ్ర సారస్వత పరిషత్తుకు అప్పగించిన గ్రంథం "ప్రపంచ రాజ్య సర్వస్వము". ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ నిర్ణయం 1974 మార్చినెలలో సారస్వత పరిషత్తుకు తెలియ జేయడం జరిగినది. ఈ నిర్ణయం ప్రకారం యీ గ్రంథ ప్రచురణకు జరిగే ఖర్చులో నాలుగింట మూడు వంతుల ఖర్చును ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈయ డానికి వాగ్దానం చేసి ఆ వాగ్దానం నెరవేర్చినది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము కోరికను అంగీకరించి ఆంధ్ర సారస్వత పరిషత్తు 1974 మే నెలలో పరిషత్తు అధ్యక్షులైన శ్రీ నరోత్తమరెడ్డి అధ్యక్షతన జరిగిన కార్యానిర్వాహకవర్గ సమావేశంలో ప్రపంచ రాజ్య సర్వస్వము వ్రాత ప్రతిని సిద్ధం జేయడానికి ఒక సంపాదక సంఘాన్ని నియమించినది.

ఈ సంపాదక సంఘంలో 1. శ్రీ దేవులపల్లి రామానుజరావు, 2. డా॥ ఆర్. వి. రావు, 3. డా॥ సరోజిని రేగాని, డా॥ యం. రాధాకృష్ణ శర్మ, 5. డా॥ కె. విఠల్‌రెడ్డి గార్లను సభ్యులుగా నియమించడం జరిగినది. ప్రభుత్వం శ్రీమతి శారదా హెచ్. రావు గారిని ఈ సంపాదక మండలిలో తన ప్రతినిధిగా నియమించినది. ఈ గ్రంథం వ్రాతప్రతిని సిద్ధం చేయడానికి యీ సంపాదక మండలి నిర్ణయించిన ప్రకారం శ్రీ చీమకుర్తి శేషగిరిరావు గారిని సంకలనకర్తగా నియమించడం జరిగింది. రెండు సంవత్సరాల కృషి ఫలితంగా యీ గ్రంథం వ్రాతప్రతి 1976 మేలో సిద్ధమైనది. ఈ విధంగా యీ పనిని విజయవంతంగా నిర్వహించిన సంపాదక మండలికి, సంకలన కర్తకు సారస్వత పరిషత్తు పక్షాన ధన్యవాదములు.

ఈ గ్రంథం ముద్రణ 1976 జూన్‌లో ప్రారంభించి 1977 ఆగస్టులో పూర్తిచేయడం జరిగినది. ఈ గ్రంథములో ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వము కలిగిన దేశాలతోపాటు ఇతర దేశాలకు సంబంధించిన వివరాలు సమగ్రంగా తెలియ జేయడం జరిగినది. వీనితో పాటు ప్రతి దేశానికి, ప్రతి ఖండానికి సంబంధించిన పటాలను కూడా యీ గ్రంథములో చేర్చడం జరిగినది. ప్రతి దేశం యొక్క చరిత్ర, భూగోళము, వ్యవసాయము, వాణిజ్య వ్యాపారాలు, ఆర్థిక వ్యవహారాలు, రాజకీయ వ్యవస్థ, ఇతర దేశాలతో సంబంధాలు, రవాణా సౌకర్యాలు, పరిశ్రమలు, విద్య, సంస్కృతి మొదలైన విషయాలకు సంబంధించిన వివరాలు యీ గ్రంథంలో తెలియజేయడం జరిగినది. ఇంతవరకు ఇటువంటి గ్రంథం తెలుగు భాషలో వెలువడలేదు. ఈ గ్రంథాన్ని ప్రభుత్వం, గ్రంథాలయాలు, పాఠకులు, ఆదరించి సారస్వత పరిషత్తును ప్రోత్సహించ గలరని విశ్వసిస్తున్నాను. ఈ గ్రంథాన్ని సుమారు ఒక సంవత్సరంలో చక్కగా అచ్చువేసి ఇచ్చిన శివాజీ ప్రెస్ వారికి పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము ఇటువంటి ఉత్తమ గ్రంథమును సిద్ధం చేసి ప్రచురించే అవకాశం సారస్వత పరిషత్తుకు యిచ్చి యీ సంస్థపట్ల తన విశ్వాసాన్ని వెల్లడి చేసినది. అంతేగాక యీ గ్రంథము సిద్ధముచేసి ముద్రించ డానికి జరిగిన ఖర్చులో నాలుగింట మూడువంతులు ప్రభుత్వం మంజూరు చేసి ఆ డబ్బును పరిషత్తుకు యిచ్చినది. ఇందుకు ఆంధ్ర సారస్వత పరిషత్తు పక్షాన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కృతజ్ఞతాభి వందనములు. ఈ గ్రంథ ములో చేర్చిన పటాలకు బ్లాకులను చాలామట్టుకు తెలుగు భాషాసమితి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి యిచ్చి పరిషత్తుకు తోడ్పడినారు. ఈ రెండు సంస్థలకు సారస్వత పరిషత్తు పక్షాన కృతజ్ఞతాభివందనములు.

25-11-77
హైదరాబాదు

గడియారం రామకృష్ణశర్మ
కార్యదర్శి

# విషయ సూచిక

అధ్యాయము | పేజి నెం.



ఐక్య రాజ్య వ్యవస్థా రీతి
ఐక్యరాజ్యసమితి
ఐ రా స యుద్ధవిరమణ పర్యవేక్షణ సంఘము (పాలస్తీనా) UNTSO
ఇండియా-పాకిస్తాన్‌లలో ఐరాస సైనిక పరిశీలకవర్గము UNMOGIP
ఐ రా స శాంతి సంరక్షక సంఘము (సైప్రస్) UNFICYP
ప్రాథమిక కమిటీలు
వ్యవహార ప్రక్రియా, స్థాయీ కమిటీలు
సాధారణ సభకు ఉపాంగములగు తదితరములు
సమీప ప్రాచ్యమున పాలస్తీనా కాందిశీకులకు సహాయ, సౌకర్యములు కల్పించే పనిచేయు ఏజన్సీ (UNRWA)
వర్తక, అభివర్ధనముల ఐరాస సమ్మేళనము (UNCTAD)
వర్తక, అభివర్ధన మండలి
ఐ రా స అభివర్ధన కార్యక్రమము (UNDP)
ఐ రా సే మూల ధనాభివర్ధన నిధి
ఐ రా స పారిశ్రామికాభివర్ధన వ్యవస్థ (UNIDO)
ఐ రా స శిక్షణ అనుశీలనా సంస్థ (UNITAR)
ఐ రా స శిశునిధి (UNICEF)
ఐ రా స హైకమీషనరు (కాందిశీకుల) UNHCR
ప్రపంచ ఆహార వ్యవసాయ వ్యవస్థా ఐ రా స కార్యక్రమము
నిరాయుధీకరణ కమీషన్
సైనిక సిబ్బంది కమిటీ
భద్రతా సంఘము
అంతర్జాతీయ న్యాయస్థానము
సాధారణ సభ
సచివాలయము
ధర్మకర్తృత్వ సంఘము
ఆర్థిక, సాంఘిక సంఘము
ప్రాంతీయ ఆర్థిక కమీషన్
వ్యావహారిక కమీషన్
సమావేశక, స్థాయీ, తాత్కాలిక ఉపసంఘములు
ప్రత్యేక ప్రవీణతా మండలులు - అణుశక్తి మండలి
IAEA అంతర్జాతీయ అణుశక్తి మండలి
ILO అంతర్జాతీయ కార్మిక వ్యవస్థ
FAO ఆహారవ్యవసాయిక ఐక్యరాజ్య వ్యవస్థ
UNESCO విద్యావైజ్ఞానిక సాంస్కృతిక ఐ రా వ్యవస్థ
WHO ప్రపంచ ఆరోగ్యవ్యవస్థ
IMF అంతర్జాతీయ ద్రవ్యనిధి
IDA అంతర్జాతీయ పరివర్ధన సమితి
IBRD పునర్నిర్మాణ, పరివర్ధన అంతర్జాతీయ బ్యాంకు
IFC అంతర్జాతీయ విత్త సంస్థ
ICAO అంతర్జాతీయ పౌర విమాన వ్యవస్థ
UPU సార్వదేశీయ తపాలా సంయోజనము
ITU అంతర్జాతీయ దూరసందేశ సంయోజనము
WMO ప్రపంచ వాతావరణశాస్త్ర వ్యవస్థ
IMCO అంత: ప్రభుత్వ సాగరిక సమాలోచనా వ్యవస్థ
GATT శుల్క-వ్యాపార సార్వత్రిక సమ్మతి

# 1. ఐక్య రాజ్య సమితి

ద్వితీయ ప్రపంచ మహా సంగ్రామము ముగియ నున్న సమయమున విజేతలగు అగ్ర రాజ్యముల నాయకులు ప్రపంచమున శాంతి భద్రతలను కాపాడుటకును, యుద్ధముతో నిమిత్తము లేకుండ ప్రపంచ రాజ్యములు తమ వివాదములను సౌహార్ద, సౌమనస్యములతో పరిష్కరించుకొనుటకు మార్గ మును నెలకొల్పుటకును, వివిధ రాజ్యములమధ్య సహకారమును పెంపొందింపజేసి తన్మూలమున సామాన్య మానవునికి సుఖశాంతులను అందజేయు టకును ఒక అంతర్జాతీయ వ్యవస్థ ఆవశ్యకమని భావించిరి. అట్టి వ్యవస్థకు రూపరేఖను కల్పించు టకై ఆ అగ్రనాయకులు తక్కిన మిత్ర రాజ్యముల సహకారానుమోదములతో సాగించిన కృషికి ఫలిత ముగ 1945, అక్టోబరు 24 న ఐక్యరాజ్యములు (యునైటెడ్ నేషన్స్) అను సంస్థ అవతరించినది. అదియే ఐక్యరాజ్యసమితి (యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్) అనియు వ్యవహరింపబడుచున్నది.

ఐక్యరాజ్యసమితి (ఐ. రా. స) యొక్క ఆశ యములును, అధికారములును, వ్యవహార విధులును ఐ. రా. చార్టరులో పొందుపరుపబడినవి. ఐ. రా. స. అవతరణ సందర్భమున 50 రాజ్యముల సాధికార ప్రతినిధులు ఆ చార్టరును ఆమోదించుచు సంత కములుచేసి ధ్రువీకరించి తమ రాజ్యములకు సమితి యందు సభ్యత్వములను కల్పించిరి.

చార్టరులోని విషయములను ఆమోదించుచు తదనుగుణములగు బాధ్యతలను నిర్వర్తించుటకు తగు సమర్థతయు సంకల్పమును కలిగిన శాంతి కాముక రాజ్యము ఏదియైనను ఐ. రా. స. యందు సభ్యత్వమును పొందవచ్చును; కాని నూతనముగ అట్టి సభ్యత్వమును కల్పించుటకు ఐ. రా. స. కు సంబంధించిన సాధారణసభ (జనరల్ అసెంబ్లీ), భద్రతాసంఘము (సెక్యూరిటీ కౌన్సిల్) అనునవి అందులకు అనుమతింపవలెను. ఇటుల ఆయా కాలములందు, సమితి అనుమతితో, కొన్ని నూతన రాజ్యములు సభ్యత్వములను ఆర్జించినవి. తత్ఫలిత ముగ ఐ. రా. స. లోని సభ్య రాజ్యముల సంఖ్య అంతటంతట పెరుగుచున్నది. ఈనాటి (1975, నవంబరు) సమితి సభ్యరాజ్య సంఖ్య 142.

ఐ రా. స. ముఖ్య కార్యాలయము యునైటెడ్ స్టేట్స్‌లోని న్యూయార్క్ నగరమున నెలకొల్ప బడినది. సమితి వ్యవహారముల నిర్వహణకు ఇంగ్లీష్, ఫ్రెంచి, రష్యన్, స్పానిష్, చీనీయ భాషలు సాధికార భాషలుగ ఆమోదితములైనవి. అయినను అంతర్జాతీయ న్యాయస్థానమునందు మాత్రము ఆంగ్ల, ఫ్రెంచిభాషలు మాత్రమే సాధికార భాషలుగ నిర్ణయింపబడినవి.

ఐ. రా. స. కు సాధికారకమగు ఒక లాంఛ నము (ఎమ్బ్లెమ్) కలదు. లేతనీలపు భూమికను ఆశ్రయించిన ప్రపంచపటము రజతవర్ణమున ఇందు చిత్రితము. ఈ ప్రపంచ పటము ఉత్తర ధ్రువము ఆధారముగ ప్రస్తరింపబడినటుల రూపొందింప బడినది. ప్రపంచపటమునకు ఉభయ పార్శ్వము లందును శాంతిచిహ్నములగు ఆలివ్ శాఖలు అమరి యుండుట ఇందు కననగును. ఐ.రా.స. పతాకయు ఇట్టి చిహ్నమునే కలిగియున్నది.

మానవుని శాంతికాముకతకు ఐ. రా. స. ఒక ప్రతీకము. అందువలననే ఆ సంస్థ అవతరించిన తేదీని (అక్టోబరు, 24 ను) ప్రపంచ ప్రజలు 'ఐ. రా. స. జయంతి' అనుపేర ప్రతి వత్సరము నను ఒక పర్వదినముగ పాటించుచున్నారు.

# 2. ఐక్యరాజ్యసమితి ప్రాదుర్భావ చరిత్ర

ప్రపంచమున శాంతి భద్రతలను కాపాడుటకై వివిధ రాజ్యముల సంపూర్ణ సహకారముతో ఒక శాశ్వత, సచేతన, రాజకీయ సంస్థను నెలకొల్పుటకు ప్రప్రథమ ప్రయత్నము ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున జరిగినది. ఆ ప్రయత్న ఫలితమే నానాజాతి సమితి (లీగ్ ఆఫ్ నేషన్స్) సంస్థాపన. దానికొరకై తొలుత చొరవ తీసికొని పనిచేసినవాడు, అప్పటిలో యునైటెడ్ స్టేట్స్‌నకు అధ్యక్షుడుగ వ్యవహరించిన, వుడ్రూ విల్సన్. వెర్సెయిల్స్ శాంతి ఒడంబడిక రూపొంది, ప్రథమ ప్రపంచయుద్ధము ముగిసిన సమయముననే (1919) నానాజాతి సమితియు రూపుగొనినది. కాని ఆ సంస్థ తొలుతలోనే అనేక బాలారిష్టముల పాలైనది. దాని స్థాపనలో ప్రముఖ పాత్రను యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు వుడ్రూవిల్సన్ నిర్వహించినను, ఆ దేశపు ప్రజాప్రతినిధిసభ వెర్సెయిల్స్ సంధిలోని తమ బాధ్యతలను ధ్రువపరుప నిరాకరించినది; తత్ఫలితముగ యు. స్టే. సమితిసభ్యత్వమునుండి వైదొలగినది. వేరొక ప్రముఖ రాజ్యమగు సోవియట్ రష్యాకు నానాజాతి సమితిలో సభ్యత్వమే లేకుండెను. ఇందులకు తోడుగ ఆ కాలమున ప్రపంచమున అత్యధిక భాగము బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి వలస పాలనలలో ఉండుటవలన ఆ వలస రాజ్యములందలి పీడిత ప్రజానీకమునకు సమితియందు సరియగు ప్రాతినిధ్యమును పొందుటకు అవకాశమే లేకుండెను. అంతియేకాదు; సమితికిగల అధికారములును చాల పరిమితములు. సర్వసత్తాక స్వతంత్ర రాజ్యముల సద్భావపూర్వక సమ్మేళనముగ మాత్రమే సమితి ఆనాడు వ్యవహరింపగలిగినది; అందువలన దురాక్రమణలను, యుద్ధములను వ్యతిరేకించుచు ఆ సమితి చేసిన తీర్మానములకు కార్యరూపమును సాధించుటకు తగిన యంత్రాంగము సమితికి లేకుండెను. 1932 లో మంచూరియాను జపాను ఆక్రమించినపుడును, 1935 లో ఎతియోపియాను ఇటలీ వశపరచుకొనిన సందర్భమునను సమితి ప్రదర్శించిన నిస్సహాయ వైఖరి దాని నిరర్థకతను వెల్లడించెను. కడకు 1939 లో ద్వితీయ ప్రపంచ యుద్ధము ఆరంభమగుటతో సమితి నామమాత్రావశిష్టమయ్యెను. ఆ పరిస్థితిలో 1946, ఏప్రిల్‌లో లాంఛన ప్రాయముగ ఆ నానారాజ్య సమితి తన తుది సమావేశమును జరపి, తనను తానే అంతరింపజేసికొనినది.

పై విధముగ నానారాజ్యసమితి విఫలతను పొందినను ప్రపంచమున శాంతి, భద్రతలను కాపాడి విశ్వ ప్రజలను అస్వతంత్రతా, అవిద్యా, దారిద్ర్యముల బారినుండి రక్షించుటకు ఒక అంతర్జాతీయ రాజకీయ వ్యవస్థ అవశ్యకమను భావన ద్వితీయ ప్రపంచయుద్ధ సమయమున విజ్ఞులగు రాజకీయ వేత్తలందు రూపుగొని, క్రమముగ బలమునార్జించి, ఐ. రా. స. ప్రాదుర్భావమునకు కారణభూతమైనది.

ద్వితీయ ప్రపంచయుద్ధపు తొలుతటి దశలో, ఇటలీ, జర్మనీలను ఎదుర్కొని పోరాడుచుండిన 14 రాజ్యముల ప్రతినిధులు లండనున 1941, జూన్ 12 న సమావేశమై దురాక్రమణ బాధనుండి విముక్తి పొందిన స్వతంత్ర ప్రజారాజ్యముల మనఃపూర్వక సహకారమును ఆధారముగగొని మాత్రమే సుస్థిర శాంతి నెలకొనగలదనియు, అట్టి శాంతిని సాధించుటకు సమష్టిగ కృషిచేయుటయే తమ సంకల్పమనియు ప్రకటించుటను ఐ. రా. స. ప్రాదుర్భావ చరిత్రలోని తొలిఘట్టముగ పరిగణింపవచ్చును. తదనంతరమున 1941, ఆగష్టు 14 న అట్లాంటా

నౌకపై యునైటెడ్‌స్టేట్సు అధ్యక్షుడు రూజ్‌వెల్ట్‌తో బ్రిటిష్ ప్రధాని చర్చిల్ సాగించిన చర్చల ఫలితముగ వెలువడిన 'అట్లాంటిక్ చార్టరు'లో పై భావన సమర్థితమగుటయేగాక దురాక్రమణలను అంత మొందించి సుస్థిరశాంతిని నెలకొల్పి, ప్రపంచ ప్రజలకు భద్రతర భవిష్యత్తును చేకూర్పదలచు తమ మహదాశయమునకు సాధనముగ ఉపకరించు ఒక అంతర్జాతీయ వ్యవస్థను శాశ్వత ప్రాతిపదిక పై నెలకొల్పుటయు ఉద్దేశితమైనది.

1941, డిశెంబరు 7న పెరల్ హార్బరుపై జపాను జరిపిన దండయాత్రవలన యునైటెడ్ స్టేట్స్ సైతము ద్వితీయ ప్రపంచ యుద్ధమున దిగవలసి వచ్చినది. అంతట అక్షరాజ్యములను - జర్మనీ, జపాను, ఇటలీలను - ఎదుర్కొని పోరాడు చున్న 26 రాజ్యముల ప్రతినిధులు 1942, జనవరి 1న వాషింగ్‌టన్ నగరమున జరిపిన చర్చల ఫలితముగ వెలువడిన ప్రకటనలో అట్లాంటిక్ చార్టరునందలి మూలసూత్రములును ఉద్దేశములును ఆమోదితములగుటయేగాక, అంతర్జాతీయ స్థాయిలో మానవస్వత్వముల పరిరక్షణయే ఆ రాజ్యముల ధ్యేయముగ పేర్కొనబడినది. ఈ ప్రకటనయందే తొలుతగ 'ఐక్యరాజ్య' అను పదము శాంతి కాముకములగు రాజ్యములకు సమష్టిరూపమున వాడ బడినది. ఆ తరువాత అదనముగ 21 రాజ్యములు ఆ ప్రకటనను ఆమోదించుచు సంతకములు చేసినవి. తదనంతరమున యు. స్టే., బ్రిటన్, సోవియట్ రష్యా దేశముల విదేశాంగ మంత్రులును, మాస్కో లోని చీనాదేశపు రాయబారియు 1943, అక్టోబరు 30 తేదీన మాస్కోలో చర్చలను సాగించి, వెలువ రించిన ప్రకటనయందు, ప్రపంచమునందలి శాంతి కాముక రాజ్యములకు అన్నింటికిని, సభ్యత్వపు అవ కాశమును కల్పించుచు, ఆ రాజ్యముల సర్వసత్తాక సమానతను మన్నించుచునే, అంతర్జాతీయ శాంతి భద్రతలను కాపాడగలుగు ఒక సంస్థ సాధ్యమైనంత త్వరలో నెలకొల్పబడవలసిన ఆవశ్యకత ప్రస్ఫుటము చేయబడినది.

అంతట పై సంకల్పమునకు కార్యరూపమును సాధించుటకై వాషింగ్‌టన్ నగరమునందలి డంబర్‌టన్ ఓక్స్ భవనమున అగ్రరాజ్య ప్రతినిధుల సమావేశము 1944, ఆగస్టు 21 నుండి అక్టోబరు 7 వరకు జరిగినది. అందు కొన్ని మూల సూత్రములపై ఏకీభావము సాధింపబడినను అగ్ర రాజ్యములు 'వీటో' అధికారమును ఉపయోగించు తీరునుగురించి భిన్నాభిప్రాయములు ప్రదర్శితము లైనవి (ఏ ఒక అగ్రరాజ్యమైనను తనకు ఇష్టము లేని విషయమును చర్చకురాకుండ నిరోధించు అధి కారమే 'వీటో' అని వ్యవహృతము). తరువాత 1945, ఫిబ్రవరిలో యాల్టాయందు అగ్రరాజ్య నాయకులు - రూజ్‌వెల్ట్, స్టాలిన్, చర్చిల్ - సాగించిన చర్చలవలన ఈ విభేదములును, వలస రాజ్యములపై ధర్మకర్తృత్వపు సమస్యయు పరిష్క రింపబడినవి. తత్పర్యవసానముగ యునైటెడ్ స్టేట్స్‌లోని సాన్‌ఫ్రాన్సిస్కో నగరమున ఐక్యరాజ్య ప్రతినిధుల సమావేశము 1945, ఏప్రిల్ 25 మొద లుగ జూన్ 26 వరకు జరిగినది. 50 రాజ్యములకు చెందిన 282 మంది ప్రతినిధులు ఆ చర్చలలో పాల్గొనిరి. తుదకు డంబర్‌టన్‌ఓక్స్ సమావేశపు తీర్మానములు, సముచితములగు మార్పులతో, అందు ఆమోదితములై ఐక్యరాజ్యసమితి చార్టరు రూపొందినది. అంతియేకాదు; ఐక్యరాజ్య వ్యవస్థలో అంతర్భాగముగ అంతర్జాతీయ న్యాయస్థానముకూడ నెలకొల్పబడవలయునని ఆ సమావేశపు ప్రతినిధులు తీర్మానించిరి. అంతట ఆ న్యాయస్థానపు అధికార, నిర్వహణ విధులను తెలియజేయు ప్రశాసనము (Statute) రూపొందింపబడి, ఐక్యరాజ్యముల చార్టరునందు దానిని పొందుపరచుట జరిగినది. ఆ చార్టరునకు తగిన సవరణలను అంతటంతట చేయు టకు అవకాశము సైతము చార్టరునందు కల్పింప

బడినది. కాని అట్టి సవరణకు దేనికైనను సాధారణ సభలోని సభ్యులలో మూడింట రెండువంతులును, భద్రతా సంఘమునందలి శాశ్వత సభ్యులు అందరును తమ ఆమోదమును తెలిపినపుడే దానికి ప్రతిపత్తి చేకూరగలదు.

చార్టరును అంతటంతట పునఃపరిశీలించుటకును, చార్టరున అవకాశము కల్పింపబడినది. ఐక్యరాజ్య సమితి తన పదవ సాధారణ సమావేశము జరుపు నాటికి, అనగా 1955 నకు అట్టి పునఃపరిశీలన ఏదియు జరుగని పక్షమున, ఆ సమావేశము చర్చావిషయావళి (అజెండా) లో ఈ పునఃపరిశీలన విధిగ చేర్చబడవలయునను నియమము చార్టరు కలదు. దానిని అనుసరించి 1955 న, అజెండాలో పునఃపరిశీలనయు చేర్చబడి, ఆ విషయమున కొంత చర్చజరిగి, భవిష్యత్తున 'సముచితమగు' సమయమున ఇట్టి పరిశీలనకై ఒక సమావేశము జరుపబడవలెనని తీర్మానించుట జరిగినది; కాని ఆ 'సముచిత సమయము ఏదియో ఇప్పటికి నిర్ధారితము కాలేదు



# 3. ఐ. రా. స. లక్ష్య, ఉద్దేశ, మూల సూత్రములు

ఐ. రా. స. యొక్క లక్ష్యములుగ పేర్కొనదగు మూడు ముఖ్యాంశములను సంక్షిప్తముగ ఇటుల తెలుపవచ్చును :

1. ఒక పురుషాంతరముననే రెండు పర్యాయములు మానవ ప్రపంచమును దుఃఖమునకు లోజేసిన యుద్ధముల భీతినుండి రాబోవు తరములవారిని రక్షించుట;

2. అంతర్జాతీయ భద్రతను కట్టుదిట్టముచేసి తద్ద్వారా యుద్ధభీతికి ఆస్కారమును తగ్గింపజేయుటకు అనువగు సమర్థ యంత్రాంగమును నెలకొల్పుట;

3. ఆరోగ్య, విద్యా ప్రమాణములను పెంపొందించుటద్వారా ప్రపంచ మానవుల ఆర్థిక, సాంఘికోన్నతిని సాధించి, మానవ స్వాతంత్ర్య, ప్రాతిపదిక స్వత్వములయెడ ఆదరమును వృద్ధిచేయుట.

పై లక్ష్యములు, ఐ. రా. స చార్టరునందలి ప్రథమాధ్యాయమున విశదితములగు ఉద్దేశ, మూల సూత్రములందు గర్భితములై ఉన్నవి. ఆ ఉద్దేశ, మూలసూత్రములను ఈ దిగువ రీతిలో సంగ్రహముగ తెలుపవచ్చును.

**ఉద్దేశములు :**

1. **అంతర్జాతీయ** శాంతిభద్రతలను పరిపోషించుట, అందులకై : దురాక్రమణ చర్యలను తొలుతలోనే త్రుంచివైచి, శాంతికి భంగకరములుగ పరిణమింపగలవని భావింపబడు పనులను నిరోధించి, ఉన్మూలింప సమర్థములగు సమష్టి కార్యాచరణ మార్గములను అవలంబించుట; శాంతిభంగమునకు త్రోవదీయగల అంతర్జాతీయ వివాదములను, పరిస్థితులను, అంతర్జాతీయ న్యాయ, ధర్మ సూత్రములకు అనుగుణమగు రీతిలో, శాంతియుత మార్గమున పరిష్కరించుట లేదా సరిదిద్దుట.

2. ప్రజల స్వయం నిర్ణయాధికారమును, రాజ్యముల స్వత్వ సమానతను మన్నించుచు వివిధ రాజ్యములమధ్య స్నేహ సంబంధములను పెంపుజేసి, ప్రపంచశాంతిని పటిష్ఠము చేయుటకు తగిన మార్గములను అవలంబించుట.

3. జాతి, లింగ, భాషా, మతములతో నిమిత్తము లేకుండ మానవుల ప్రాతిపదిక స్వాతంత్ర్య, స్వత్వములయెడ ఆదరమును ప్రోత్సహించి పరిపోషించి, అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, మానవతా సమస్యలను పరిష్కరించుటలో అంతర్జాతీయ సహకారమును సాధించుట.

4. పై ఉద్దేశములను ఆచరణలోనికి కొనివచ్చు సందర్భమున ఆయా రాజ్యములు నిర్వర్తించు కార్యకలాపములను సమన్వయితములుగ చేయుటకు అనువగు కేంద్రముగ ఐ. రా. స వ్యవహరించుట.

ఐ. రా. స యు, అందలి సభ్యరాజ్యములును పై ఉద్దేశములకు కార్యరూపమును కల్పించుటలో ఈ దిగువ తెలుపబడిన మూలసూత్రములకు అనుగుణముగ వ్యవహరింపవలెనని చార్టరు విధించుచున్నది :

1. సభ్యరాజ్యముల సర్వసత్తాక సమానతపై ఆధారపడియే ఐ. రా. స వ్యవస్థితమైనది.

2. చార్టరునందు విధింపబడిన తమ బాధ్యతలను సభ్యరాజ్యములు మనఃపూర్వకముగ నిర్వర్తింపవలయును.

3. శాంతి, భద్రతా, న్యాయధర్మములకు భంగకరముకాని రీతిలో శాంతియుత మార్గమున తమ అంతర్జాతీయ వివాదములను సభ్యరాజ్యములు పరిష్కరించుకొనవలయును.

4. అంతర్జాతీయ వ్యవహారణమున ఇతర రాజ్యములయెడ బలమును ఉపయోగించుటను లేదా బలమును ఉపయోగింతుమని బెదరించుటను సభ్యరాజ్యములు మానుకొనవలయును.

5. చార్టరునకు అనుగుణముగ ఐ. రా. స. పూనుకొని నిర్వహించు ఏ చర్యకైనను సభ్యరాజ్యము, అన్నివిధముల, సహకారమును అందీయవలయును; అంతియేగాదు, ఏ రాజ్యముపై ఐ. రా. స. చర్య తీసుకొనుచున్నదో అట్టి రాజ్యమునకు సభ్యరాజ్యము ఏ విధముగను సాయము చేయరాదు.

6. సభ్యత్వములేని రాజ్యము సైతము అంతర్జాతీయ శాంతిభద్రతల పరిరక్షణకై ఈ మూలసూత్రములకు కట్టుబడి వ్యవహరించునటుల చేయుటలో ఐ. రా. స. ను సమర్థింపవలయును.

7. ఒక రాజ్యపు అంతరంగిక వ్యవహార పరిధికి అచ్చముగ చెందియున్న విషయములలో జోక్యము కలిగించుకొను ఎట్టి అధికారమును ఐ. రా. స. కు చార్టరువలన కల్పింపబడలేదు; అయినను శాంతికి భంగము లేదా భంగము కలుగునను భీతి ఏర్పడినపుడు, తప్పనిసరిగ, ఐ. రా. స. అమలులోనికి తెచ్చు చర్యలను అరికట్టుటకు మాత్రము ఈ అపవాదము వర్తింపనేరదు.

# 4. ఐ. రా. స. ముఖ్య కార్యాలయము

1945 లో తొలుత ఐ. రా. స రూపు గొనినపుడు ఆ అంతర్జాతీయ సంస్థకు సొంతమని చెప్పకొనదగు వసతి ఎట్టిదియు లేకుండెను. అట్టి పరిస్థితిలో యు. స్టే. దేశపు ప్రజాప్రతినిధిసభ 1945, డిసెంబరు 11 న ఒక ఏకగ్రీవపు తీర్మానపు మూలమున ఐ. రా. స ను, తన ముఖ్యకార్యాలయమును, యు. స్టే. లో నెలకొల్పుకొనవలసినదిగ, ఆహ్వానించెను. కాని అట్టి కార్యాలయమునకై తగు స్థల

మును నిర్దేశించుటకు కొంత వ్యవధి పట్టెను. అంతలో రాక్‌ఫెల్లర్ అను ధనికుడు 85 లక్షల డాలర్లను ఐ. రా. స. కు విరాళమొసగి న్యూయార్క్ నగర మున ఈస్ట్ నదిని ఆనుకొనియున్న విశాల ప్రదేశ మును ఆ సంస్థపేర కొనుగోలు చేయుటకు అవకాశ మును కల్పించెను. తరువాత యు. స్టే. ప్రభుత్వము వడ్డీ లేకుండ 650 లక్షల డాలర్లను ఐ. రా స. కు ఋణము నీయగ, దాని సాయమున 1951 నాటికి ఆ ప్రదేశమున 39 అంతస్తుల భవనము, ఐ. రా. స. ముఖ్య కార్యాలయమునకై, నిర్మింపబడినది. అంతట ఐ. రా. స. వ్యవహార నిర్వహణము అటనుండి సాగుట మొదలైనది. ముఖ్యభవనమునకు దాపు ననే, ఫోర్డు ఫౌండేషన్‌వారి ధనసాహాయ్యముతో, ఒక గ్రంథాలయ భవనము నిర్మితమై, అంతకు పూర్వమున ఐ. రా. స. కార్యదర్శిగ వ్యవహరించి దివంగతుడైన, హామర్‌షెల్ట్ స్మృతికి, 1961 లో, అంకితమైనది. తరువాత సమావేశ భవనములను సమలంకృతములుగ చేయుటకై సుప్రసిద్ధ కళా ఖండములను పెక్కింటిని సభ్యరాజ్యములు బహూక రించినవి. సమావేశ భవనముననే 'ధ్యానశాల' అని వ్యవహరింపబడునది, నెలకొల్పబడుటను ఒక విశిష్ట చర్యగ భావింపదగును. కాంతి ప్రసరణము అతి మందముగ ఉండు ఏర్పాటు కలిగిన ఈ నిశ్శబ్దపు ధ్యానశాలలో కేంద్ర భాగమున ముడి ఇనుప ఖనిజపు దిమ్మె ఒకటి నెలకొల్పబడినది. పై కప్పుననుండి ఒక అత్యుజ్జ్వల కాంతికిరణము ఆ దిమ్మెపై పడు ఏర్పాటు కలదు. ఆ దిమ్మెనే 'అందరును ఆరాధించు పరమేశ్వరుని బలిపీఠము' అని హేమర్‌షెల్డ్ వర్ణించెను. అటు నాగేటి కర్రు లను, ఇటు ఖడ్గములను రూపొందజేయునది ఇనుమే అగుటవలన అట ధ్యాననిమగ్నుడగువాడు అట్టి ఉపయోగములలో ఏది యెక్కువ సముచితమో దానిని నిర్ణయించుకొనగలడనుట ఆ ప్రతీకమువలన సంభావితము.

ముఖ్య కార్యాలయ ప్రదేశ, ప్రాంగణములందు ఐ. రా. స. కు కల హక్కులు 1947, జూన్ 26 న అప్పటి ఐ. రా. స. కార్యదర్శి, యు. స్టే. ప్రభు త్వపు దేశీయశాఖా కార్యదర్శితో కుదుర్చుకొనిన ఒక ఒడంబడికను అనుసరించి నిర్ధారితములైనవి. ఐ. రా. స. భవనములు నెలకొనిన 18 ఎకరముల విస్తీర్ణమున, ఐ. రా. స. కు సర్వహక్కులును ఇందువలన కల్పింపబడినవి. ఐ. రా. స. అధికారుల అనుమతిలేనిదే యు. స్టే. లోని రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాధికారులు ఎవరును తమ అధికారములను ఆ ప్రదేశమున అమలుపరుపజాలరు. ఐ. రా. స. కు సొంతముగ తపాలా స్టాంపులను ముద్రించి వినియో గించుకొను సదుపాయము కలదు.

---

# 5. ఐ. రా. స. సభ్యత్వము

చార్టరులోని 4 వ అధికరణము "చార్టరునందు సభ్యరాజ్యమునకు నిర్దేశింపబడిన బాధ్యతలను స్వీకరించుటకు ఆమోదమును తెలిపి, ఆ బాధ్యతలను నిర్వహించుటకు ఇచ్ఛయు, సమర్థతయు కలిగి నటుల సమితి భావింపగల, ఏ శాంతికాముక రాజ్య మైనను" ఐ. రా. స. యందు సభ్యత్వమును పొంద వచ్చునని తెలుపుచున్నది. ఐ. రా. స ప్రాదుర్భావ కాలమున చార్టరును అంగీకరించిన రాజ్యములుగాక తరువాత చేరిన రాజ్యములు సభ్యత్వమును గ్రహించుటకై అవలంబింపదగు ఒక విధానమును

ఐ రా. స. రూపొందించినది. దానిని అనుసరించి, సభ్యత్వమును పొందుటకు సంకల్పించిన రాజ్యము ఐ. రా. స. ప్రధాన కార్యదర్శికి తొలుత ఒక దరఖాస్తును పంపుకొనవలసియున్నది. ఆ దరఖాస్తును భద్రతాసంఘము చర్చించిన తదుపరి అందలి సభ్యులలో, శాశ్వత సభ్యులందరితోను కలసి కనీసము తొమ్మిదిమంది (ఇదివరలో ఏడుగురు) తమ ఆమోదమును తెలిపినయెడల మాత్రమే ఆ దరఖాస్తు సాధారణ సభయందు చర్చింపబడుటకై సిఫారసు చేయబడును; కనీస సంఖ్య ఆమోదమును తెలిపినను, శాశ్వత సభ్యులలో ఏ ఒకరైన వ్యతిరేకించు నెడల, అట్టి ఆమోదము చెల్లనేరదు; అందువలన ఆ దరఖాస్తును సాధారణ సభకు సిఫారసు చేయుట జరుగదు. తనకు పంపబడిన దరఖాస్తును సాధారణ సభ చర్చించి మూడింట రెండువంతుల ప్రాబల్యముతో ఆమోదించినపుడు మాత్రమే దరఖాస్తుదారగు రాజ్యమునకు సభ్యత్వము ఈయబడును.

ఐ. రా. స యందలి ప్రతియొక సభ్యరాజ్యమును సమితి వ్యవహార నిర్వహణమునకగు సాలుసరి వ్యయమున ఒక నిర్దిష్ట శాతమును భరించవలసిన నియమము కలదు. సభ్యరాజ్యపు జాతీయాదాయము, వ్యక్తి సరాసరి ఆదాయము, లభ్యమగు విదేశీ కరెన్సీ, యుద్ధ ఫలితమగు ఆర్థిక క్లిష్టత మొదలగు వానిని దృష్టియందుంచుకొని ఈ వ్యయశాతమును సాధారణసభ మూడేండ్లకు ఒక పర్యాయము నిర్ణయించును.

ఐ. రా. స యందు ప్రస్తుతమున (నవంబరు 30, 1975) సభ్యత్వమును కలిగియున్న రాజ్యముల పట్టిక అకారాది క్రమమున ఈ దిగువ ఈయబడినది. ప్రతి రాజ్యపు పేరునకు ఎదురుగ ఆ రాజ్యము భరించు వ్యయశాతమును, ఆ రాజ్యము సభ్యత్వమును పొందిన సమయమును తెలుపబడినది.

## ఐ. రా. స. సభ్యరాజ్యాలు

| వరుస సంఖ్య | పేరు | వ్యయ శాతము | ప్రవేశ సమయము |
|---|---|---|---|
| 1. | అప్పర్ వోల్టా | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 2. | ఆఫ్ఘనిస్తాన్ | 0.04 | 1946 నవంబరు 19 |
| 3. | అరబ్ యెమిరేట్స్ | — | 1971 డిసెంబరు 9 |
| 4. | అర్జెంటీనా | 0.93 | 1945 అక్టోబరు 24 |
| 5. | అల్జీరియా | 0.10 | 1962 అక్టోబరు 8 |
| 6. | అల్బేనియా | 0.04 | 1955 డిసెంబరు 14 |
| 7. | ఆస్ట్రియా | 0.57 | 1955 డిసెంబరు 14 |
| 8. | ఆస్ట్రేలియా | 1.52 | 1945 నవంబరు 1 |
| 9. | ఇండియా (భారత్) | 1.74 | 1945 అక్టోబరు 30 |
| 10. | ఇండోనీసియా | 0.34 | 1950 సెప్టెంబరు 28 |
| 11. | ఇజ్రాయెల్ | 0.20 | 1949 మే 11 |
| 12. | ఇటలీ | 3 24 | 1955 డిసెంబరు 14 |
| 13. | ఇరాక్ | 0.07 | 1945 డిసెంబరు 21 |

| వరుస సంఖ్య | పేరు | వ్యయ శాతము | ప్రవేశ సమయము |
|---|---|---|---|
| 14. | ఇరాన్ | 0.22 | 1946 అక్టోబరు 24 |
| 15. | ఈక్వటోరియల్ గినీ | — | 1968 నవంబరు 12 |
| 16. | ఈక్వడార్ | 0.04 | 1945 డిసెంబరు 24 |
| 17. | ఈజిప్ట్ | 0 20 | 1945 డిసెంబరు 24 |
| 18. | ఉగాండా | 0.04 | 1962 అక్టోబరు 25 |
| 19. | ఉరుగ్వే | 0.09 | 1945 డిసెంబరు 18 |
| 20. | ఎతియోపియా | 0 04 | 1945 నవంబరు 13 |
| 21. | ఎల్ సాల్వడార్ | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 22. | ఐర్లాండ్ | 0.17 | 1955 డిసెంబరు 14 |
| 23. | ఐవరీకోస్ట్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 24. | ఐస్‌లాండ్ | 0 04 | 1946 నవంబరు 19 |
| 25. | ఓమన్ | — | 1971 అక్టోబరు 7 |
| 26. | కటార్ | — | 1971 సెప్టెంబరు 22 |
| 27. | కాంగో | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 28. | కామెరూన్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 29. | కువాయిట్ | 0.07 | 1963 మే 14 |
| 30. | కెనడా | 3.02 | 1945 నవంబరు 9 |
| 31. | కెన్యా | 0.04 | 1963 డిసెంబరు 16 |
| 32. | కేప్ వర్డీ | — | 1975 సెప్టెంబరు 17 |
| 33. | కొలంబియా | 0.20 | 1945 నవంబరు 5 |
| 34. | కోస్టారికా | 0.04 | 1945 నవంబరు 2 |
| 35. | క్యూబా | 0.19 | 1945 అక్టోబరు 24 |
| 36. | ఖ్మేర్ (కాంబోడియా) | 0.04 | 1955 డిసెంబరు 14 |
| 37. | గాంబియా | 0.04 | 1965 సెప్టెంబరు 21 |
| 38. | గినీ | 0.04 | 1958 డిసెంబరు 12 |
| 39. | గినీ - బిస్సావ్ | — | 1974 సెప్టెంబరు 18 |
| 40. | గేబన్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 41. | గైయానా | 0.04 | 1966 సెప్టెంబరు 20 |
| 42. | గ్రీస్ | 0.29 | 1945 అక్టోబరు 24 |
| 43. | గ్రెనడా | — | 1974 సెప్టెంబరు 18 |
| 44. | గ్వాతెమాలా | 0.05 | 1945 నవంబరు 21 |
| 45. | ఘానా | 0.08 | 1957 మార్చి 8 |
| 46. | చాడ్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |

| వరుస సంఖ్య | పేరు | వ్యయ శాతము | ప్రవేశ సమయము |
|---|---|---|---|
| 47. | చిలీ | 0.23 | 1945 అక్టోబరు 24 |
| 48. | చీనా | 4.00 | 1945 అక్టోబరు 24 |
| 49. | జపాన్ | 3.78 | 1956 డిసెంబరు 18 |
| 50. | జమైకా | 0.05 | 1962 సెప్టెంబరు 18 |
| 51. | జయిరే | 0.05 | 1960 సెప్టెంబరు 20 |
| 52. | జర్మనీ (తూర్పు) | 0.05 | 1973 సెప్టెంబరు 18 |
| 53. | జర్మనీ (పశ్చిమ) | — | 1973 సెప్టెంబరు 18 |
| 54. | జాంబియా | 0.04 | 1964 డిసెంబరు 1 |
| 55. | జెకోస్లోవాకియా | 0 92 | 1945 అక్టోబరు 24 |
| 56. | జోర్డాన్ | 0.04 | 1955 డిసెంబరు 14 |
| 57. | టర్కీ | 0.35 | 1945 అక్టోబరు 24 |
| 58. | టాంజానియా | 0.04 | 1964 మే 13 |
| 59. | టునీసియా | 0.04 | 1956 నవంబరు 12 |
| 60. | టోగో | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 61. | ట్రినిడాడ్ & టొబాగో | 0.04 | 1962 సెప్టెంబరు 18 |
| 62. | డెన్మార్క్ | 0.62 | 1945 అక్టోబరు 24 |
| 63. | డొమినికన్ రిపబ్లిక్ | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 64. | తాయిలాండ్ | 0.13 | 1946 డిసెంబరు 14 |
| 65. | దక్షిణ ఆఫ్రికా | 0.52 | 1945 నవంబరు 7 |
| 66. | దహోమీ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 67. | నార్వే | 0.43 | 1945 నవంబరు 25 |
| 68. | నికరాగ్వా | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 69. | నెదర్‌లాండ్స్ | 1 16 | 1945 డిసెంబరు 10 |
| 70. | నేపాల్ | 0.04 | 1955 డిసెంబరు 14 |
| 71. | నైగర్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 72. | నైగీరియా | 0.14 | 1960 అక్టోబరు 7 |
| 73. | న్యూజీలాండ్ | 0.36 | 1945 అక్టోబరు 24 |
| 74. | పనామా | 0.04 | 1945 నవంబరు 13 |
| 75. | పరాగ్వే | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 76. | పాకిస్తాన్ | 0.37 | 1947 సెప్టెంబరు 30 |
| 77. | పాపువా - న్యూగినీ | — | 1975 అక్టోబరు 16 |
| 78. | పెరూ | 0.10 | 1945 అక్టోబరు 31 |
| 79. | పోర్చుగల్ | 0.16 | 1955 డిసెంబరు 24 |

| వరుస సంఖ్య | పేరు | వ్యయ శాతము | ప్రవేశ సమయము |
|---|---|---|---|
| 80. | పోలండ్ | 1.47 | 1945 అక్టోబరు 24 |
| 81. | ఫిజీ | — | 1970 అక్టోబరు 13 |
| 82 | ఫిన్లాండ్ | 0.49 | 1955 డిసెంబరు 14 |
| 83. | ఫిలిప్పీన్స్ | 0.34 | 1945 అక్టోబరు 24 |
| 84. | ఫ్రాన్స్ | 6.00 | 1945 అక్టోబరు 24 |
| 85. | బంగ్లాదేశ్ | — | 1974 సెప్టెంబరు 18 |
| 86. | బర్మా | 0.06 | 1948 ఏప్రిల్ 19 |
| 87. | బల్గేరియా | 0.18 | 1955 డిసెంబరు 14 |
| 88. | బహామా దీవులు | — | 1973 సెప్టెంబరు 18 |
| 89. | బహరీన్ | — | 1971 సెప్టెంబరు 22 |
| 90. | బార్బడోస్ | 0.04 | 1966 డిసెంబరు 9 |
| 91. | బురుండీ | 0.04 | 1962 సెప్టెంబరు 18 |
| 92. | బెల్జియం | 1.10 | 1945 డిసెంబరు 27 |
| 93. | బైలోరషియా | 0.51 | 1945 అక్టోబరు 24 |
| 94. | బొలీవియా | 0.04 | 1945 నవంబరు 14 |
| 95. | బోచ్వానా | 0.04 | 1966 అక్టోబరు 17 |
| 96. | బ్రజిల్ | 0.89 | 1945 అక్టోబరు 24 |
| 97. | భూటాన్ | — | 1971 సెప్టెంబరు 22 |
| 98. | మంగోలియా | 0.04 | 1961 అక్టోబరు 27 |
| 99. | మలగాసీ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 100. | మలావీ | 0.04 | 1964 డిసెంబరు 11 |
| 101. | మలేసియా | 0.11 | 1957 సెప్టెంబరు 1. |
| 102. | మారిటేనియా | 0.04 | 1961 అక్టోబరు 27 |
| 103. | మారిషస్ | — | 1968 ఏప్రిల్ 24 |
| 104. | మాలీ | 0.04 | 1960 సెప్టెంబరు 28 |
| 105. | మాల్టా | 0.04 | 1964 డిసెంబరు 1 |
| 106. | మాల్దీవులు | 0.04 | 1965 సెప్టెంబరు 21 |
| 107. | మెక్సికో | 0.87 | 1945 నవంబరు 7 |
| 108. | మొజాంబిక్ | — | 1975 సెప్టెంబరు 17 |
| 109. | మొరాకో | 0.10 | 1956 నవంబరు 12 |
| 110. | యుక్రెయిన్ | 1.93 | 1945 అక్టోబరు 24 |
| 111. | యుగోస్లావియా | 0.40 | ,, |
| 112. | యునైటెడ్ కింగ్‌డమ్ | 6.62 | ,, |

| వరుస సంఖ్య | పేరు | వ్యయ శాతము | ప్రవేశ సమయము |
|---|---|---|---|
| 113. | యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా | 31.57 | 1945 అక్టోబరు 24 |
| 114. | యూనియన్ ఆఫ్ సో. సో. రిపబ్లిక్స్ | 14.61 | ,, |
| 115. | యెమెన్ (ఉత్తర) | 0.04 | 1947 సెప్టెంబరు 30 |
| 116. | యెమెన్ (దక్షిణ) | — | 1967 డిసెంబరు 14 |
| 117. | రుమేనియా | 0.36 | 1955 డిసెంబరు 14 |
| 118. | రువండా | 0.04 | 1962 సెప్టెంబరు 18 |
| 119. | లక్జెంబర్గ్ | 0.05 | 1945 అక్టోబరు 24 |
| 120. | లావోస్ | 0.04 | 1955 డిసెంబరు 14 |
| 121. | లిబియా | 0 04 | 1955 డిసెంబరు 14 |
| 122. | లెబనాన్ | 0.05 | 1945 అక్టోబరు 24 |
| 123. | లెసోతో | 0 04 | 1966 అక్టోబరు 17 |
| 124. | లైబీరియా | 0.04 | 1945 నవంబరు 2 |
| 125. | వెనిజ్యులా | 0.45 | 1945 నవంబరు 15 |
| 126. | శ్రీలంక | 0.06 | 1955 డిసెంబరు 15 |
| 127. | సావోటోమీ - ప్రిన్సిపీ | — | 1975 సెప్టెంబరు 17 |
| 128. | సింగపూర్ | 0.05 | 1965 సెప్టెంబరు 21 |
| 129. | సియెర్రా లియోని | 0.04 | 1961 సెప్టెంబరు 27 |
| 130. | సిరియా | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 131. | సుడాన్ | 0.05 | 1956 నవంబరు 12 |
| 132. | సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 133. | సెనెగల్ | 0.04 | 1960 సెప్టెంబరు 28 |
| 134. | సైప్రస్ | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 135. | సోమాలియా | 0.04 | 1960 సెప్టెంబరు 20 |
| 136. | సౌదీ అరేబియా | 0.05 | 1945 అక్టోబరు 24 |
| 137. | స్పెయిన్ | 0.92 | 1955 డిసెంబరు 14 |
| 138. | స్వాజీలాండ్ | — | 1968 సెప్టెంబరు 24 |
| 139. | స్వీడెన్ | 1.25 | 1946 నవంబరు 19 |
| 140. | హంగరీ | 0.52 | 1955 డిసెంబరు 14 |
| 141. | హయిటీ | 0.04 | 1945 అక్టోబరు 24 |
| 142. | హోండూరాస్ | 0.04 | 1945 డిసెంబరు 17 |

పై పట్టికలోని ఈ క్రింది రాజ్యములను గురించిన కొన్ని విషయములు గమనింపదగినవి :

1. ఈజిప్టును సిరియాయు ఐ. రా. స. యందు 1945 అక్టోబరు, 24 ననే సభ్యత్వములను స్వీక

రించినవి. తదనంతరమున ఆ రెండు రాజ్యములును 1958 లో మేళనముచెంది యునైటెడ్ ఆరబ్ రిపబ్లిక్ అనుపేర సభ్యత్వమును గ్రహించుటతో ఆ రిపబ్లిక్‌నకు ఈజిప్ట్ స్థానము లభించి సిరియా సభ్యత్వము అంతరించినది. కాని ఆ తరువాత విభేదములు చెలరేగి సిరియా వేరుపడి 1961, అక్టోబరు 13 న సభ్యత్వమును మరల గ్రహించినది. యునైటెడ్ ఆరబ్ రిపబ్లిక్ స్థానము ఈజిప్టునకు నిలిచినది.

2. చీనా, అగ్రరాజ్యములలో ఒకటిగ, ఐ.రా.స. ప్రాదుర్భావ కాలముననే సభ్యత్వమును స్వతః ఆర్జించినది. కాని తరువాత చీనాదేశపు ముఖ్య భూభాగము కమ్యూనిస్టులపశమై అట కమ్యూనిస్టుల ఆధ్వర్యమున ప్రభుత్వము (1949) ఏర్పడినది. పూర్వపు చీనా ప్రభుత్వపు అధినేతయగు చియాంగ్ కేషేక్, మిగిలిన తన బలముతో తైవాన్ దీవికి చేరి అచ్చట ప్రభుత్వమును నెలకొల్పెను. ఆ ప్రభుత్వమునకు యు. స్టే. ప్రభుత్వపు అండదండలుండుట వలన, ఆ ప్రభుత్వమునే చీనాప్రభుత్వముగ ఐ. రా. స. పరిగణించునటుల యు. స్టే. చేయ కలిగినది. కాని కాలక్రమమున ప్రపంచరాజ్యములనేకములు చీనా ముఖ్య భూభాగపు కమ్యూనిస్టు ప్రభుత్వమునే చీనా ప్రభుత్వముగ గుర్తించుట వలన, ప్రపంచ ప్రజాభిప్రాయమునకు తలయొగ్గి యునైటెడ్ స్టేట్స్ తన ప్రాతికూల్యమును వదలుకొనినది. అంతట 1972 నుండియు పీకింగునందలి కమ్యూనిస్టు ప్రభుత్వమే ఐ. రా. స యందలి చీనా స్థానమును కైవసము చేసికొని వ్యవహరించుచున్నది.

3. టాంగనికా, ఐ. రా. స. యందు, 1961, డిసెంబరు 14 న సభ్యత్వమును ఆర్జించినది; జాంజిబారు 1963 డిసెంబరు 16 న సభ్యత్వమును గ్రహించినది. ఆ తరువాత ఆ రెండు రాజ్యములును మేళనముచెంది 'టాంజానియా'గా రూపొందినవి (1964). అంతట టాంగనికా స్థానము టాంజనియాకు లభించి, జాంజిబారు స్థానము లుప్తమైనది.

4. 1963 లో స్వాతంత్ర్యమును ఆర్జించిన ఉత్తర బోర్నియో (సాబా), సారవాక్ అను ప్రాంతములును, అదివరకే స్వపరిపాలనమును పొందిన సింగపూర్‌ను ఇచ్ఛాపూర్వకముగ మలయాతో 1957 న మేళనము చెందుటవలన, మలయా రాజ్యము మలేసియా రాజ్యముగ రూపాంతరత పొందినది. కాని తదనంతర కాలమున సింగపూర్ విడివడి స్వతంత్ర ప్రతిపత్తితో ఐ. రా. స. యందు సభ్యత్వమును పొందినది.

5. పైన తెలుపబడిన రీతిగ మలేసియా రూపొందినపుడు, సాబా, సారవాక్ ప్రాంతములు మలేసియాలో చేర్చబడుటకు తన నిరసనను తెలుపుచు ఇండోనీసియా ఐ. రా. స లోని తన సభ్యత్వమును వదలుకొనినది. కాని తరువాత ఇండోనీసియాలోని ప్రభుత్వమున మార్పువచ్చిన ఫలితముగ ఆ రాజ్యము మరల ఐ. రా. స. లో సభ్యత్వమును గ్రహించినది (1966).

6. 1973 లో పాకిస్తాన్‌నుండి విడిపడి బంగ్లాదేశము స్వతంత్ర రాజ్యమై ఐ. రా. స. లో ఒక స్థానమును ఆర్జించినది.

7. యునైటెడ్ కింగ్‌డమ్‌కే గ్రేట్‌బ్రిటన్, బ్రిటన్ అను పేరులును పర్యాయ నామములుగ వాడబడుచున్నవి; అంతేకాదు, ఆ రాజ్యమున ఇంగ్లండ్ ఒక ప్రత్యేకభాగమేయైనను, కొందరు అపుడపుడు ఆ రాజ్యమునే ఇంగ్లండ్ అని వ్యవహరించుటయు కలదు.

8. యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్ (యు. సో. సో. రి.) అను దానికే సోవియట్ రష్యా, రష్యా అనబడునవి పర్యాయ నామములుగ వాడుకలో ఉన్నవి.

# 6. ఐ. రా. స. యంత్రాంగము

సక్రమముగ, సమర్థతతో తన విధులను ఐ. రా. స. నిర్వహించుటకై ఆరు ముఖ్యాంగములు నెలకొల్పబడవలెనని చార్టరు విధించినది. అటుల తొలుత ఈ క్రింది ముఖ్యాంగ సంస్థలు నెలకొల్ప బడినవి :

1. సాధారణసభ, 2. భద్రతాసంఘము, 3. ఆర్థిక, సాంఘిక సంఘము, 4. ధర్మ కర్తృత్వ సంఘము, 5. అంతర్జాతీయ న్యాయస్థానము, 6. సచివాలయము.

కాని కాలక్రమమున ఐ. రా. స. నిర్వహించు కార్య కలాపములు విస్తరించినపుడు వీనిలో కొన్నిం టికి కొన్ని ఉపాంగ సంస్థలనుకూడ నెలకొల్పవలసి వచ్చునని భావించి అట్టి ఉపాంగ సంస్థలను రూపొం దించు అధికారమును సాధారణసభా, భద్రతా సంఘ, ఆర్థిక – సాంఘిక సంఘములకు చార్టరు కలుగజేసినది. ఈ అధికారమును ఉపయోగించు కొని ఆ ముఖ్యాంగ సంస్థలు అంతటంతట కొన్ని ఉపాంగ సంస్థలను నెలకొల్పినవి. వీనిలో ఏదియో ఒక తాత్కాలిక కార్యకలాపమునకై స్థాపింపబడు నట్టి సంస్థలును కలవు. అందువలన ఇట్టి ఉపాంగ సంస్థల సమష్టి సంఖ్యయు అంతటంతట మారు చుండును. ఇవిగాక ప్రత్యేక ప్రవీణతా నియోగ ములు (స్పెషలైజ్‌డ్ ఏజన్సీలు) అనబడు 14 సంస్థలతోను అంతర్జాతీయ అణుశక్తి మండలి (IAEA) తోను ఐ. రా. స. సన్నిహిత సంబంధ మును కలిగియున్నది. 2వ పేజీలో ఈయబడిన చార్టువలన ఐ. రా. స. లోని ముఖ్యాంగ, ఉపాంగ, తదితర సంస్థల సంబంధము విశదము కాగలదు.

---

# 7. సాధారణ సభ

ఐ రా. స. వ్యవస్థా కుటుంబమున తొలుత రూపొందినది సాధారణ సభ (జనరల్ అసెంబ్లీ). ఆ వ్యవస్థకు పునాదిగ ఈ సభను పేర్కొనదగును. సభ్యరాజ్యములు అన్నింటికిని ఇందు ప్రాతినిధ్యము కలదు. ఏ సభ్యరాజ్యమునకైనను ఒకే ఒక వోటు ఉండుట ఇందలి ముఖ్యలక్షణము; కాని ప్రతి సభ్య రాజ్యము అయిదుగురు ప్రతినిధులను పంపుటకు అవకాశము కలదు. సంవత్సరమున ఒకసారి సాధారణసభ సమావేశమగుచుండును. ఈ సమా వేశము సెప్టెంబరు నెలలోని మూడవ మంగళ వారమున మొదలై సాధారణముగ మూడునెలలు కొనసాగి క్రిస్టమస్ పండుగకు ముందుగ అంత మగును; కాని అటుల విధిగ అంతము కావలయు నను నియమము మాత్రము లేదు. అందువలన, ఆవశ్యకమగునెడల, సమావేశమును వాయిదావేసి, క్రిస్టమస్ సెలవుల తరువాత మరల దానిని కొన సాగించుటయు జరుగుచున్నది. ఇక భద్రతా సంఘము, లేదా అత్యధిక సంఖ్యాకులగు ఐ. రా. స. సభ్యులు, లేదా అత్యధికుల మద్దతుపొందిన ఒక సభ్యరాజ్యము ఒకానొక నిర్దిష్ట విషయమును అత్యవ సరముగ చర్చింపవలెనని అభ్యర్థించినయెడల సాధారణసభ ప్రత్యేక సమావేశమును జరిపి ఆ విష యమును చర్చించుటయు కలదు. ఇంతియేగాక శాంతికృషి సంఘటనా తీర్మానము (Uniting for Peace Resolution) నందలి విషయములను అమలుపరుపవలసినదిగ తొమ్మిదిమంది సభ్యుల

ఆమోదముతో భద్రతా సంఘమును లేదా ఐ. రా. సభ్యులలో అత్యధిక సంఖ్యాకులును, లేదా అధిక సంఖ్యాకుల మద్దతుతో ఒక సభ్యరాజ్యమును, అభ్యర్థించినయెడల, ఆ వెనువెంటనే 24 గంటల లోపల సాధారణసభా ఆత్యయిక సమావేశమును జరుపుటకును చార్టరునందు అవకాశము కల్పింప బడినది.

చార్టరుయొక్క అధికార పరిధిలోనుండు ఏ విషయమయినను చర్చించి దానిపై తన సిఫారసు లను తీర్మాన రూపమున సాధారణసభ తెలియజేయ వచ్చును. భద్రతా సంఘపు అజెండాలో ఆ విష యము ఉన్నదా లేదా అను ప్రసక్తితో నిమిత్తము లేకుండ ఈ తీర్మానమును చేయుటకు సాధారణ సభకు అవకాశము కలదు. 1950 లో చేయబడిన ఒక తీర్మానమువలన సాధారణసభకు ఒక విశిష్టాధి కారముసైతము లభించినది: ఒక విషయమును చర్చించి నిర్ణయించుటలో ఏకీభావము భద్రతా సంఘమున సాధింపబడజాలని సందర్భమున, అట్టి విషయము సభ్యరాజ్యములమధ్య శాంతిభంగమునకు లేదా శాంతిభంగ భీతికి ఆస్పదమగునెడల, సాధా రణ సభయే చొరవ తీసికొని ఆ విషయమును చర్చించి, తనకు ఉచితమని తోచిన చర్యను సిఫారసుచేయుచు తీర్మానము చేయవచ్చును.

ఐ. రా. స. యొక్క సాలుసరి బడ్జటును ఆమోదించుటయేగాక ప్రతి సభ్యరాజ్యము భరింప వలసిన వ్యయశాతమునుకూడ సాధారణసభ నిర్ణ యించును. ప్రత్యేక ఉపసంఘముల నివేదికలను గ్రహించి, చర్చించు బాధ్యతయు ఆ సభకు కలదు. సాధారణ విషయములపై ఒక తీర్మానము ఆమోదింపబడవలెనన్న అధిక సంఖ్యాకుల అంగీ కృతియే సరిపోవును; కాని అతి ప్రాముఖ్యము కలిగిన విషయములపై ఒక తీర్మానము ఆమో దితము కావలయుననిన మూడింట రెండువంతుల సభ్యరాజ్యముల అంగీకారము విధిగ ఉండి తీరవల యును. భద్రతా సంఘములోని శాశ్వతేతర సభ్యు లను, ఆర్థిక - సాంఘిక సంఘమునందలి సభ్యులను, ధర్మకర్తృత్వ సంఘములోని ఎన్నిక సభ్యులను సాధారణ సభయే ఎన్నుకొనును. అంత ర్జాతీయ న్యాయస్థానమునందలి జడ్జీలను, సాధారణ సభయు, భద్రతా సంఘమును ఎన్నుకొనెదరు. భద్రతా సంఘపు సిఫారసును అనుసరించి సాధారణ సభయే ఐ. రా స. యొక్క ప్రధాన కార్యదర్శిని నియమించును. ప్రతి సంవత్సరమునను సభా కార్య క్రమ నిర్వహణకై ఒక అధ్యక్షుని, 17 మంది ఉపాధ్యక్షులను సాధారణ సభ ఎన్నుకొను చుండును.

సాధారణ సభాధ్యక్షుని ఎన్నిక రహస్యపు వోటింగుద్వారా జరుగును. కాని అధ్యక్షపదవి ఒక క్రమరీతిలో ప్రాదేశిక విభజనమును అనుసరించి చెందుచుండవలయునను ఒక సంప్రదాయము పాటింపబడుచున్నది. అందులకై ఐ. రా. స. సభ్య రాజ్యములు ప్రాదేశికరీతితో ఆఫ్రికా - ఆసియా రాజ్యములు, తూర్పు యూరప్ రాజ్యములు, లాటిన్ అమెరికన్ రాజ్యములు, పశ్చిమ యూరపీయాది పరిశిష్ట రాజ్యములు - అను నాలుగు వర్గములుగ పరిగణింపబడి, అధ్యక్షపదవి క్రమరీతిలో ఆ నాలు గింట చేతులు మారునటుల జాగ్రత్తవహింపబడు చున్నది. ఇంతేకాదు; భద్రతా సంఘమున శాశ్వత సభ్యత్వము కలిగిన రాజ్యపు ప్రతినిధి ఎవరును అధ్యక్షపదవికి ఎన్నుకొనబడకూడదను అలిఖిత నియమము సైతము తుచ తప్పక పాటింపబడు చున్నది.

సాధారణసభ నిర్వహింపదగు కార్యభారమును సరిగ కొనసాగించుటకై ఏడు ముఖ్యోపసంఘ ములు పని చేయుచుండును. ఈ ఉపసంఘములు (కమిటీలు) ప్రతి వార్షిక సమావేశ సందర్భమునను కొంగ్రొత్తగ సాధారణసభచే నిర్మితములగును. ఇట్టి ఉపసంఘములలో ప్రతియొకదానియందును

ఒక్కొక్క ప్రతినిధిని కలిగియుండుటకు సభ్య రాజ్యములకు హక్కుకలదు. ఈ ఉపసంఘములు క్రమముగ (1) రాజకీయ భద్రతా విషయిక ఉప సంఘము (2) ఆర్థిక, విత్త విషయిక ఉపసంఘము (3) సాంఘిక, సాంస్కృతిక, మానవతా విషయిక ఉపసంఘము (4) ధర్మకిర్తృత్వ ఉపసంఘము (5) పరిపాలనా ఆదాయ వ్యయ విషయిక ఉప సంఘము (6) న్యాయ విషయిక ఉపసంఘము (7) ప్రత్యేక రాజకీయోపసంఘము అని వ్యవ హృతములు.

పై ఉపసంఘముల వ్యవహార కలాపములను సమన్వయము చేయుటకు ఒక సాధారణ ఉప సంఘము పనిచేయును. ఈ ఉపసంఘమున సాధా రణ సభాధ్యక్షుడును, ఉపాధ్యక్షులు 17 మందియు, ముఖ్యోపసంఘముల అధ్యక్షులు ఏడుగురును – వెరసి 25 మంది మాత్రమే సభ్యులుగ ఉండెదరు. ఇంతేకాక సాధారణసభకు చెందినవియే రెండు స్థాయీ ఉపసంఘములును కలవు; ఇందులో ఒకటి పరిపాలనా ఆదాయ వ్యయములపై సలహా నిచ్చునది; రెండవది విరాళములకు సంబంధించినది. ఇక అంత టంతట ఉదయించు కొన్ని ప్రత్యేక సమస్యల పరిష్కారమునకై నియమింపబడు అనుబంధిత తాత్కాలిక (అడ్‌హాక్) ఉపసంఘములును కొన్ని పనిచేయుచుండుట కలదు. అంతర్జాతీయ న్యాయ కమీషన్, కొరియా కమీషన్, అస్వతంత్ర రాజ్య విషయిక ఉపసంఘము, ఆణవిక వికిరణ విషయిక వైజ్ఞానిక ఉపసంఘమువంటివి ఇట్టి తాత్కాలిక ఉపసంఘములకోవకు చెందినవియే.

---

# 8. భద్రతా సంఘము

అంతర్జాతీయ శాంతి భద్రతలను తన ప్రాథమిక బాధ్యతగ స్వీకరించు సంస్థగ భద్రతా సంఘము (సెక్యూరిటి కౌన్సిల్) చార్టరునందు పేర్కొన బడినది. ఈ బాధ్యతను చక్కగ సమర్థతతో నిర్వ హించుటకు అనువుగ, ఐ. రా. స. లోని తక్కిన సంస్థలలో దేనికిని లేని విశిష్టాధికారములు ఈ సంఘ మునకు ఈయబడినవి. సాధారణ సమయములందు భద్రతాసంఘ తీర్మానములును సాధారణ సభా తీర్మానములవలె సలహా, సిఫారసుల రూపముననే ఆమోదింపబడినను, అసాధారణ పరిస్థితులు ఏర్పడి శాంతికి భంగము కలుగుటకు అవకాశము ఉన్న పుడు, భద్రతా సంఘము తన తీర్మానములను అక్షరశః అమలుపరుపవలసినదిగ సభ్యరాజ్యము లను ఆదేశించు హక్కు న్యాయశాస్త్రతః దానికి కల్పింపబడినది.

ఐ. రా. స. లోని తక్కిన సంస్థలలో దేని యందును కన్పట్టని ఒక విలక్షణత భద్రతా సంఘ మున కన్పట్టుచున్నది. అదియే శాశ్వత సభ్యత్వము కలిగిన రాజ్యములు అమలుపరుపగలుగు వీటో హక్కు. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున అక్ష రాజ్యములను ఓడించుటలో నాయకత్వమును వహిం చిన ఐదు రాజ్యములకు – గ్రేట్‌బ్రిటన్, ఫ్రాన్స్, చీనా, యునైటెడ్ స్టేట్స్, సోవియట్‌రష్యా అను వానికి – భద్రతా సంఘమున శాశ్వత సభ్యత్వము కలదు. ఈ అయిదు రాజ్యములలో ఏ రాజ్యమైనను తనకు నచ్చని విషయమున భద్రతా సంఘము ఎట్టి చర్యయు తీసికొనకుండ నిరోధింపగలుగు అధి కారమునే 'వీటో' అని వ్యవహరింతురు. ఇట్టి హక్కు పై అయిదు రాజ్యములకు కలదనుట చార్టరు నందే పేర్కొనబడినది. ఐ. రా. స. ను సంస్థా

పించిన కాలమున ఆ అయిదు రాజ్యములును అగ్ర శ్రేణికి చెందినవి అగుటవలనను, శాంతికొరకై తీసి కొను ఎట్టి చర్యయైనను, ఆ అయిదుగురిలో ఏ ఒకరి సహకారము లేకపోయినను విఫలమగుట అప్పటిలో తథ్యముగ కన్పట్టుటవలనను ఇట్టి హక్కు ఆ రాజ్య ములకు అపుడు కల్పింపబడినది. కాని తరువాత చరిత్రగతిలో వచ్చిన మార్పులవలన యునైటెడ్ స్టేట్స్, సోవియట్ రష్యాలు మాత్రమే అగ్ర రాజ్యములుగ పరిగణింపబడగలిగిన పరిస్థితి ఉద యించినను, చార్టరును ఇందుకొరకై మార్చుట అనువుగాని పనియగుటవలన, పై అయిదు రాజ్యము లును అగ్రరాజ్యములుగనే ఇప్పుడును వీటో హక్కును, వానికి ఉచితమనితోచిన సందర్భము లందు, ఉపయోగించుచున్నవి

శాశ్వత సభ్యులతోకలసి, భద్రతా సంఘమున 11 మంది సభ్యులు ఉండవలెనని తొలుత విధింప బడినది. కాని 1965లో ఆమోదితమైన ఒక సవరణవలన ఆ సంఖ్య 15కు పెంచబడినది. ఇందులో శాశ్వత స్థానములుగాక తక్కిన పది స్థానములకు ఆఫ్రికా - ఆసియా రాజ్యములనుండి అయిదుగురిని, లాటిన్ అమెరికన్ రాజ్యములనుండి ఇరువురను, తూర్పు యూరప్ రాజ్యములనుండి ఒకరిని, పరిశిష్ట రాజ్యములనుండి ఇరువురను ఎన్నుకొనుటను ఒక సంప్రదాయముగ సాధారణ సభ పాటించుచున్నది ఈ శాశ్వతేతర సభ్యుల పదవీకాల పరిమితి రెండు సంవత్సరములు. అయి నను ప్రతి సంవత్సరాంతమునను, ఐదుగురు సభ్యుల పదవీ కాలపరిమితి అంతమగు ఏర్పాటు కలదు. కావున ప్రతి సంవత్సరమునను అయిదుగురు నూతన సభ్యుల ఎన్నిక జరుగును. పదవినుండి విరమించిన రాజ్యమే తిరిగి ఎన్నుకొనబడుట నిషిద్ధము.

భద్రతా సంఘము నిరంతరాయముగ పనిచేయు సంస్థగ సంభావితము ఆ సంఘము తన కార్య క్రమ నిర్వహణకై నెలకొక అధ్యక్షుని ఎన్ను కొనును. సభ్య రాజ్యపు పేరునకు మొదటినుండు వర్ణమునుబట్టి, ఆంగ్ల వర్ణమాలాక్రమమును అనుస రించి, ఆ అధ్యక్షపదవి సభ్యరాజ్యములలో ప్రతి దానికి క్రమరీతిలో లభ్యమగును.

కార్యక్రమ ప్రక్రియకు సంబంధించిన విష యములందు తప్ప తక్కిన అన్ని విషయము లందును, శాశ్వత సభ్యులందరి వోట్లతో సహా 9 వోట్లు లభించినపుడే ఒక విషయము భద్రతా సంఘ మున ఆమోదితమైనటుల భావింపబడును. తనకు ఇష్టములేని తీర్మానమును శాశ్వత సభ్యరాజ్యము ఏదియైనను వీటో చేయవచ్చును.

భద్రతా సంఘమునకు చెందిన రెండు స్థాయీ ఉపసంఘములును కలవు. ఇందు ఒకటి ప్రవీణులకు సంబంధించినది; రెండవది క్రొత్త సభ్యుల దరఖాస్తు లకు సంబంధించినది. ఇవిగాక 'నిరాయుధీకరణ కమీషన్' అనునది భద్రతా సంఘమునకు చెందిన శాశ్వత అనుబంధ సంస్థగ వ్యవహరించుచున్నది.

భద్రతా సంఘమున, శాశ్వత సభ్యరాజ్యములు గాక ప్రస్తుతమున (1976). 1. ఇటలీ, 2. గైయానా, 3. జపాన్, 4. టాంజానియా, 5. స్వీడెన్, 6. దహోమీ, 7. పనామా, 8. పాకిస్తాన్, 9. రుమేనియా, 10. లిబియా సభ్యత్వములను వహించి ఉన్నవి. వీనిలో తొలుతటి అయిదింటికి 1976 డిశెంబరు 31 తోను, కడమవానికి 1977 డిశెంబరు 31 తోను పదవీ కాలపరిమితి ముగియును.

# 9. ఆర్థిక సాంఘిక సంఘము

అంతర్జాతీయ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, ఆరోగ్య వ్యవహారములందు ప్రగతిని సాధించుటకై ఐ. రా. స. చేయు కృషికి బాధ్యతవహించి వ్యవహరించునది ఆర్థిక సాంఘిక సంఘము (ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిల్). సాధారణసభకు అనుబంధముగ ఇది పనిచేయును. పై ఆర్థికాది రంగములలో పనిచేయు అంతః ప్రభుత్వ సంస్థలతోను, అంతర్జాతీయములయ్యును ప్రభుత్వ ప్రమేయము లేక వ్యవహరించు సంస్థలతోను, జాతీయ సంస్థలతోను సహకరించుచు ఈ ఆర్థిక, సాంఘిక సంఘము తన కృషిని కొనసాగించును. తొలుత ఈ సంఘమున సభ్యసంఖ్య 18 గ ఉండెడిది. కాని 1964 లో ఆమోదితమయిన ఒక సవరణవలన ఈ సంఖ్య 27 కు పెంచబడి, తరువాత 1971 లో 54 కు మార్చబడినది. ఈ 54 లోను ఆఫ్రికా - ఆసియా రాజ్యములకు 25, తూర్పు యూరప్ రాజ్యములకు 6, లాటిన్ అమెరికన్ రాజ్యములకు 10, పరిశిష్ట రాజ్యములకు 13 స్థానములు చెందునటుల ఏర్పాటు కలదు. ఈ సభ్యుల పదవీకాల పరిమితి మూడు సంవత్సరములు. అయినను క్రమరీతిలో మూడవ వంతు సభ్యులు అనగా 18 మంది ప్రతి సంవత్సరమునను, పదవినుండి వైదొలగి వారి స్థానమున క్రొత్త ఎన్నికలు జరుగురీతిగ ఏర్పాటు జరిగినది. పదవీ విరమణచేసిన సభ్యరాజ్యమే తిరిగి ఎన్నుకొనబడుటకు ఎట్టి నిషేధమునులేదు. తన ఆధ్వర్యమున పనిచేయు ఈ క్రింది కమీషనులకు సభ్యత్వము వహించు రాజ్యములను ఈ సంఘమే ఎన్నుకొనును.

1. పరివహన, వార్తా సౌకర్యముల కమీషన్ (15 మంది) 2. గణసంఖ్యా విషయిక కమీషన్ (15 మంది) 3. సాంఘిక కమీషన్ (15 మంది) 4. జనసంఖ్యా కమీషన్ (15 మంది) 5. మాదక ద్రవ్యముల కమీషన్ (15 మంది) 6. మానవ స్వత్వముల కమీషన్ (18 మంది) 7. స్త్రీజన ప్రతిపత్తి కమీషన్ (18 మంది) 8 అంతర్జాతీయ వ్యాపార ద్రవ్య కమీషన్ (18 మంది) 9. యూరపీయ ఆర్థిక కమీషన్ (30 రాజ్యములు) 10. ఆసియా, దూర ప్రాచ్య ఆర్థిక కమీషన్ (24 రాజ్యములు) 11. లాటిన్ అమెరికా ఆర్థిక కమీషన్ (24 రాజ్యములు) 12. ఆఫ్రికా ఆర్థిక కమీషన్ (24 రాజ్యములు).

పై వానిలో మాదకద్రవ్యముల కమీషన్‌నందు తప్ప తక్కినవాని సందర్భమున ఐ. రా స. ప్రధాన కార్యదర్శితో సంప్రతించి, తదనుగుణముగ సభ్యరాజ్యములను ఆర్థిక సాంఘిక సంఘము ఎన్నుకొనును. ఆ యా కమీషనులలో వివిధ ప్రాంతముల వారికి మొత్తముమీద ప్రాతినిధ్యము సరికుదురుటకు ఈ సంప్రతింపులు అత్యావశ్యకములు. ఎన్నుకొనబడిన సభ్యరాజ్యములు తమ ప్రతినిధులను కమీషనులలో నియమించును. మాదక ద్రవ్యముల కమీషనుకు మాత్రము ఐ. రా. స. ప్రధాన కార్యదర్శి సలహాతో నిమిత్తము లేకుండగనే ఎన్నిక జరుగును.

ఆర్థిక సాంఘిక సంఘమున ప్రస్తుతమున (1975 డిసెంబరు) ఈ దిగువ 54 రాజ్యములు సభ్యత్వములను కలిగియున్నవి :

ఆర్జెంటీనా, అల్జీరియా, ఆస్ట్రేలియా, ఇండోనీసియా, ఇటలీ, ఇరాన్, ఈక్వడార్, ఈజిప్ట్, ఉగాండా, ఎతియోపియా, ఐవరీకోస్ట్, కాంగో, కెనడా, కెన్యా, కొలంబియా, గినీ, గేబన్, గ్వాతెమాలా, చీనా, జపాన్, జమైకా, జయిరే, జర్మనీ (తూర్పు), జర్మనీ (పశ్చిమ), జాంబియా, జెకోస్లోవాకియా, జోర్డాన్, టర్కీ, ట్రినిడాడ్ & టూబాగో, డెన్మార్క్, తాయిలాండ్, నార్వే, నెదర్‌లాండ్స్, పాకిస్తాన్, పెరూ, ఫిజీ, ఫ్రాన్స్, బల్గేరియా, బెల్జియం, బ్రెజిల్, మంగోలియా, మాలీ, మెక్సికో, యుగోస్లావియా, యునైటెడ్ కింగ్‌డమ్, యునైటెడ్ స్టేట్స్, యెమెన్ (ఉత్తర), యెమెన్ (దక్షిణ), రుమేనియా, లైబీరియా, వెనిజ్యులా, సెనెగల్, సోవియెట్ రష్యా, స్పెయిన్.

# 10. ధర్మ కర్తృత్వ సంఘము

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున విజిత రాజ్యములనుండి, కొన్ని వలసరాజ్యములను మిత్ర రాజ్యములు సంపాదించినవి. ఇట్టి వలసరాజ్యము లను 'మాండేటరీ రాజ్యములు' అని వ్యవహరించి, వీనికి స్వతంత్రతాస్థాయి లభించువరకు, తమ అధీన ములో ఉంచుకొని పాలించుటకు అధికారమును నానారాజ్య సమితి మిత్రరాజ్యములకు - బ్రిటన్, ఫ్రాన్స్, బెల్జియం, ఇటలీ, ఆస్ట్రేలియా, న్యూజీ లాండ్, దక్షిణ ఆఫ్రికా, జపానులకు-కలుగజేసినది. తన్మూలమున ఆ యా రాజ్యములు తమకు లభ్యము లైన వలసలను పాలించుచుండుటయు, ఐ రా. స ఉద్భవించునాటికి వానిలో అత్యధికభాగము వలసలు గనే నిలిచిపోవుటయు తటస్థించినది. అట్టి వలస లను, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున జపాను, ఇటలీలనుండి వశపరచుకొనిన వలసలను, వలస రాజ్యములుగల ఏ ఇతర రాజ్యమైనను ధర్మకర్తృత్వ పాలనకై ఐ. రా. స. కు అప్పజెప్పు వలసలను సరి యగు పాలకరాజ్యము ద్వారా ధర్మకర్తృత్వ దృష్టితో పరిపాలింపజేసి ఉచిత సమయమున వానికి స్వయంపాలనమును కలిగించు దృష్టితో ఈ ధర్మకర్తృత్వ సంఘము (ట్రస్టీషిప్ కౌన్సిల్) ఐ. రా స. యందు ముఖ్యాంగముగ కల్పింప బడినది. అంతట దక్షిణఆఫ్రికా తప్ప తక్కిన పాలకరాజ్యములు అట్టి ధర్మకర్తృత్వమునకు అంగీకరించుచు సాధారణసభతో ఒడంబడికకు వచ్చినవి. తన మాండేటరీ పాలనలోఉన్న నైరుతి ఆఫ్రికా (నమీబియా) ను ధర్మకర్తృత్వ పాలనకు ఒప్పజెప్పుటకు ద. ఆఫ్రికా నిరాకరించినది. ఈ నాటికిని నమీబియా సమస్య అపరిష్కృతముగ నిలిచియున్నది.

తనకు ధర్మకర్తృత్వ పాలనకై పై రీతిగ అప్ప జెప్పబడిన 11 ప్రాంతములకు ఐ. రా. స. పాలక రాజ్యములను నిర్ణయించి, ఆ పాలనను పర్యవేక్షించు టకై ధర్మకర్తృత్వ సంఘమునకు అధికారమును ఇచ్చినది. ఆ సంఘమున ప్రతి పాలకరాజ్యమునకు ఒక్కొక్క ప్రతినిధియు, పాలకరాజ్యములుగాని తక్కిన శాశ్వత సభ్యరాజ్య ప్రతినిధులును, మూడేండ్ల పదవీకాల పరిమితితో ఐ. రా. స. చే ఎన్నుకొనబడిన సభ్యులును సభ్యత్వము కలిగి యుండు ఏర్పాటుకలదు. పాలకరాజ్యముల సభ్య సంఖ్యకు తగ్గనిరీతిలో పాలకేతర సభ్యసంఖ్య ఉండురీతిగ ఐ. రా. స. ఎన్నుకొను సభ్యుల సంఖ్య అంతటంతట నిర్ణయింపబడును. ధర్మకర్తృత్వ ప్రాంతములలో కాలక్రమమున కొన్ని స్వతంత్రతను ఆర్జించుటయో లేదా స్వేచ్ఛా పూర్వకముగ వేరొక స్వతంత్ర రాజ్యముతో మేళనము చెందుటయో జరుగుటవలన ధర్మకర్తృత్వ సంఘమున పాలక రాజ్య సభ్యసంఖ్య తగ్గుటయు, తదనుగుణముగ తదుపరి ఎన్నికలో ఐ. రా. స. ఎన్నుకొను సభ్యుల సంఖ్యను తగ్గించుటయు జరుగుచు వచ్చినది.

1968 నాటికి ధర్మకర్తృత్వ ప్రాంతములలో 9 ప్రాంతములు స్వతంత్రతను పొందినవి. రెండు ప్రాంతములు - ఆస్ట్రేలియా అధీనములోని పాపువా-న్యూగినీ, యునైటెడ్ స్టేట్స్ పాలనలోని పసిఫిక్ ద్వీపములు మాత్రమే అప్పటికి ధర్మకర్తృత్వ ప్రాంతములుగ నిలిచియుండినవి. అందువలన ఆ పాలకరాజ్యములు రెండును, పాలకరాజ్యములుగాని శాశ్వత సభ్యరాజ్యములు నాలుగును - వెరసి ఆరు రాజ్యములును ధర్మకర్తృత్వ సంఘముగ వ్యవహ రించవలసినదిగను, అదనముగ సభ్యులను ఐ.రా.స. ఎన్నుకొనవలసిన ప్రసక్తిలేదనియు 1968 లో ఐ.రా.స. తీర్మానించినది. కాని 1975 లో పాపువా-న్యూగినీ స్వతంత్ర మగుటవలన, ఆ సంఖ్య అయిదు నకు తగ్గినది.

తమకు ఐ. రా. స. చే అప్పగింపబడిన ధర్మ కర్తృత్వ ప్రాంతమున శాసన నిర్మాణ, పరిపాలనా,

న్యాయ నిర్వహణాధికారములను పాలక రాజ్యము, పాలిత ప్రాంతపు ప్రజల శ్రేయోదృష్టితో, నిర్వహించుచు సాలుసరి పరిపాలనా నివేదికలను ధర్మకర్తృత్వ సంఘమునకు అందజేయును. ఆ సంఘము ఆ నివేదికల సాయమునను, అంతటంతట తాను స్వయముగ పంపు పర్యవేక్షక బృందముల నివేదికల మూలమునను అచటి పరిస్థితులను తెలిసికొని లోపములను సరిదిద్దుచుండును.

ధర్మకర్తృత్వ సంఘమున అధిక సంఖ్యాకుల ఆమోదమువలన విషయ నిర్ణయము జరుగుచుండును. సంవత్సరమునకు ఒకసారి ఆ సంఘము సాధారణముగ సమావేశమగును; అవసరమగు నెడల ప్రత్యేక సమావేశములును ఏర్పాటు చేయబడును.

---

# 11. అంతర్జాతీయ న్యాయస్థానము

ఐ. రా. స. చార్టరులో అంతర్భాగముగనున్న 'న్యాయస్థాన ప్రశాసనము' (Statute of Court) మూలమున అంతర్జాతీయ న్యాయస్థానము రూపు గొనినది. అంతర్జాతీయమగు ఒక ఒడంబడికవలన పై ప్రశాసనము సృజింపబడినది. ఐ. రా. స. సభ్య రాజ్యములలో ప్రతియొకటియు ఈ ఒడంబడికకు బద్ధమైనటుల సంభావితము.

తమ దేశములందు అత్యున్నత న్యాయ నిర్వహణాధికారమున నియమింపబడుటకు తగు అర్హతలు కలవారును, అంతర్జాతీయ న్యాయశాస్త్రమున సమర్థతకు పేరొందిన ఉత్తమశ్రేణి న్యాయవేత్తలును ఈ అంతర్జాతీయ న్యాయస్థానమున జడ్జీలుగ, వారి జాతీయతతో ప్రసక్తిలేకుండ, నియమితులగుదురు. అట్టి జడ్జీలు 15 మంది ఉందురు. వీరిలో ఏ ఒక దేశమునకు చెందినవారయినను ఒకరికన్న మించి ఉండుటకు వీలుపడదు. ఈ జడ్జీల నియామకము, సాధారణ సభచేతను, భద్రతా సంఘముచేతను వేర్వేరు ఎన్నికలద్వారా జరుగును. ఒక్కొక్క జడ్జి పదవీకాల పరిమితి 9 సంవత్సరములు. అయినను జడ్జీలందు క్రమరీతిలో అయిదుగురు, ప్రతి మూడు సంవత్సరముల అంతమునను పదవీవిరమణ చేయు పద్ధతి ఏర్పరుపబడినది. అందువలన మూడేండ్లకొకసారి అయిదుగురు జడ్జీలను ఎన్నుకొనుట జరుగుచున్నది. పదవీ విరమణ చేసినవారిని తిరిగి జడ్జిగా ఎన్నుకొనుటకు ఎట్టి అభ్యంతరమును లేదు.

ఎన్నికకు ముందుగ, జడ్జిపదవికి అర్హులగువారి పేర్ల పట్టికను తయారుచేయు అధికారము పరిష్కారక శాశ్వత న్యాయస్థానము (Permanent Court of Arbitration) కు కల్పింపబడినది. ఈ న్యాయస్థానము 1899, 1907 ఒడంబడికల వలన రూపొందినది. అయినను ఈ ఒడంబడికలలో భాగస్వామ్యములేని తదితర రాజ్యములును, కొన్ని పేర్లను సూచించుటకు అధికారముకలదు ఇటుల తయారు కాబడిన పట్టికలోనివారినుండి, తమకు అర్హులుగ తోచినవారిని జడ్జీలుగ సాధారణసంఘ, భద్రతా సంఘములు ఎన్నుకొనును.

15 జడ్జీలు కలిగిన ఆ న్యాయస్థానము మూడేండ్లకు ఒకసారి ఒక అధ్యక్షుని, ఉపాధ్యక్షులను తమనుండి ఎన్నుకొని, వారి ఆధ్వర్యవమున నిరంతరాయముగ (సెలవు దినములందు తప్ప) పనిచేయుచుండును. సాధారణముగ వివాదముల

విచారణ కాలమున 15 మంది జడ్జీలును ఉపవిష్టులగు చుందురు; కాని న్యాయస్థాన వ్యవహార నిర్వహణకు జడ్జీల కనీససంఖ్య 9 గ నిర్ణయింపబడినది. కొన్ని సందర్భములందు ఆ యా వివాదముల స్వభావమును అనుసరించి ముగ్గురు లేదా అంతకన్న ఎక్కువ జడ్జీలుగల కక్ష్యలను కొన్ని రూపొంది విచారణలను కొనసాగింపవచ్చును. ఇక కక్షిదారుల అభిమతము లను అనుసరించి వివాదములను సంక్షిప్తరీతి (సమ్మరీ ప్రొసీజరు) లో పరిష్కరించుటకు అను వుగ 5 గురు జడ్జీలుగల ఒక కక్ష్య ప్రతి సంవత్స రమునను ఏర్పరుపబడుచున్నది.

అంతర్జాతీయ న్యాయస్థానము రాజ్యములమధ్య బయలుదేరు వివాదములను మాత్రమే విచారించి పరిష్కరించును. అందును, ప్రశాసనమునకు బద్ధమైయున్న రాజ్యములు మాత్రమే ఆ న్యాయ స్థానమునకు పరిష్కారార్థమై వచ్చుటకు నిర్నిబంధ మగు అవకాశము కలదు. తదితర రాజ్యములు ఈ న్యాయస్థానమును ఉపయోగించుకొను సందర్భ మున పాటింపదగు కొన్ని నియమములను భద్రతా సంఘము రూపొందించినది. ఇట్టి నియమములకు లోబడి స్విజర్‌లాండ్, లిక్టిన్‌స్టీన్, సాన్ మేరినో రాజ్యములు ఈ న్యాయస్థాన పరిధిలో ప్రస్తుతమున చేరిఉన్నవి (ఈ మూడు రాజ్యములకు ఐ.రా.స.లో సభ్యత్వము లేదు). కక్షిదారులగు రాజ్యములు తనకు నివేదించు వివాదముల విషయమునను, చార్టరువలన నియమితములగు అన్ని విషయముల మీదను, లేదా అమలులోనున్న ఒడంబడికలను, ఆచారములను గురించిన వివాదముల సందర్భము నను సరియగు విచారణచేసి పరిష్కరించు అధి కారము ఆ న్యాయస్థానమునకు కలదు. ఒక వివాద ముపై తనకు విచారణాధికారము కలదా లేదా అను విషయమున ఆ న్యాయస్థానమే తుదితీర్పు నిచ్చును.

ఒక వివాదమును పరిష్కరించు సందర్భమున, అంతర్జాతీయ ఆచారములను, అంతర్జాతీయ మర్యాద లను, నాగరక రాజ్యములచే సర్వే సర్వత్ర ఆదరింపబడు న్యాయశాస్త్ర మూలసూత్రములను అంతర్జాతీయ న్యాయస్థానము ఆధారములుగ గ్రహించును. ఇందులకు తోడుగ, ప్రపంచమున అత్యంతాదరణను ఆర్జించిన ప్రముఖ పండితుల అభి ప్రాయములను, న్యాయస్థానముల తీర్పులను సైతము ధర్మసూక్ష్మముల నిర్ణయము విషయమున సాహాయ్యముగ ఆ న్యాయస్థానము స్వీకరించును. కాని వీని అన్నింటిలో వేనితోను నిమిత్తము లేకుండ, కక్షిదారులు ఇష్టపడునెడల, తమ ధర్మ విచక్షణోపజ్ఞ (Ex aequo et bono) మూలమున మాత్రమే ఒక వివాదమును ఆ న్యాయస్థానము పరిష్కరించవచ్చును.

అంతర్జాతీయ న్యాయస్థానమున వ్యవహార భాష లుగ ఆంగ్ల - ఫ్రెంచి భాషలు సాధికారముగ మన్ననను పొందినవి. కాని ఏ కక్షిదారైన ఉటుల అభ్యర్థించునెడల వేరొక భాషలోకూడ ఆ కక్షిదారు వ్యవహరించుటకు న్యాయస్థానము అనుమతించును. ఉపవిష్టులగు జడ్జీలలో అధిక సంఖ్యాకుల ఆమోద మును పొందిన తీర్పే తుది తీర్పుగ పరిగణింప బడును. ఉభయ పక్షముల వోట్లు సమానముగనున్న సందర్భమున నిర్ణయపు వోటు (Casting Vote)ను వేయు అధికారము అధ్యక్షునకు కలదు. ఆ విధ ముగ ఆ న్యాయస్థానము ఇచ్చెడు తీర్పే కడపటి తీర్పు; దానిపై అపీలునకు అవకాశములేదు. అయి నను, ఒక క్రొంగ్రొత్త పరిణామము ఉదయించెనను ఆధారముపై, ఆ తీర్పును పునఃపరిశీలించవలసి నదిగ తీర్పు ఇచ్చిన తేది మొదలుగ 10 సంవత్స రముల లోపుగ అభ్యర్థించవచ్చును. వేరొక విధ ముగ నిర్ణయింపబడు సందర్భమునతప్ప తక్కిన అన్ని సందర్భములందును కక్షిదారులలో ప్రతి యొకరును తన ఖర్చును తానే భరించుకొన వలయును.

ఒక వివాదమును అంతర్జాతీయ న్యాయస్థానము విచారించునపుడు, కక్షిదారగు రాజ్యమునకు చెందిన జడ్జి ఎవరును న్యాయపీఠమున లేనపుడు, అట్టి తన దేశపు జడ్జిని నియమించుకొను అధికారము కక్షిదారునకు కలదు. ఇటుల నియమితులగు జడ్జీలును, న్యాయపీఠపు జడ్జిలతో బాటుగ సమాన హోదాతో, ఆ వివాదము పరిష్కారమగువరకు వ్యవహరింప గలరు.

అంతర్జాతీయ న్యాయస్థానపు నెలవు హేగ్ నగరముగ నిర్ణయింపబడినది. కాని అవసరమగు నెడల తదితర ప్రదేశములందును అది సమావేశ మగుటకు దానికి అధికారము కలదు. ఆ న్యాయ స్థానపు నిర్వహణకు అవసరమగు వ్యయము నంతటిని ఐ. రా. స. భరించును.

సాధారణ సభా, భద్రతా సంఘములచే ఎన్నుకొనబడి ప్రస్తుతమున (1975) అధికారమందున్న జడ్జిల పేరులును, జాతీయతలును, పదవీకాల పరిమితులును ఈ రీతిగ కలవు :

I. 1976, ఫిబ్రవరి 5 వరకు పనిచేయువారు :

1. ఫౌవద్ అమ్మౌన్ (లెబనాన్) 2. సీజర్, బెన్‌జాన్ (ఫిలిప్పీన్స్) 3. స్టూరే పెట్రెన్ (స్వీడెన్), 4. మాన్‌ఫ్రెడ్ లాక్స్ (పోలండ్), 5. చార్లెస్ డి. ఓనియామా (నైగీరియా).

II. 1979, ఫిబ్రవరి 5 వరకు పనిచేయువారు :

6. ఫ్రెడెరికో డి కాస్ట్రో (స్పెయిన్), 7. లూయీ ఇగ్నేషియో - పింటో (దహోమీ), 8. సి. డిల్లార్డ్ (యునైటెడ్ స్టేట్స్), 9. ఎడ్వర్డో జిమెనెజ్ డి అరీచగా (ఉరుగ్వే), 10. ప్లేటోన్ డి మోరోజోవో (సోవియట్ రష్యా).

III. 1982, ఫిబ్రవరి 5 వరకు పనిచేయువారు :

11. ఆంద్రీ గ్రోస్ (ఫ్రాన్స్), 12. ఇసాక్ ఫార్‌స్టర్ (సెనెగల్), 13. సర్ హంఫ్రీ వాల్‌డాక్ (గ్రేట్ బ్రిటన్), 14. నాగేంద్రసింగ్ (ఇండియా), 15. జోసీ మేరియా రూదా (ఆర్జెంటీనా).

---

# 12. సచివాలయము

ఐ. రా. స. నిర్వహించు సర్వ వ్యవహార కార్య కలాపములకును సాధనముగ ఉపకరించునది సచివాలయము (సెక్రటేరియట్). దీనికి పెద్దగ వ్యవహరించునతడు ప్రధాన కార్యదర్శి (సెక్రటరీ జనరల్). ఈ ప్రధాన కార్యదర్శిపదవి అత్యంత బాధ్యతాయుత మగుటవలన, ఈ పదవికొరకై చేయు నియామకమున భద్రతా సంఘ, సాధారణ సంఘములు రెండును పాల్గొనును.

భద్రతా సంఘమున శాశ్వత సభ్యత్వమును కలిగియున్న అయిదు రాజ్యములలో ఏ రాజ్యపు పౌరుడును ప్రధాన కార్యదర్శిగ నియమింపబడ కూడదను ఏర్పాటు, చార్టరులో లేకపోయినను, శాశ్వత రాజ్యముల మూజువాణీ ఒడంబడికవలన ఏర్పడి సదా పాటింపబడుచున్నది. ఈ పదవికి నియమింపబడునతడు అత్యుత్తమస్థాయికి చెందిన, సామర్థ్య, కుశలతా, సచ్ఛీలములను కలిగియుండవలెనను నియమము చార్టరునందు కలదు. ఇట్టి వానిని నిర్ణయించుటకై భద్రతా సంఘము తొలుత రహస్య సమావేశమును జరిపి, ప్రతిపాదితులగు వారల అర్హతానర్హతలను గురించి సమగ్రముగ చర్చించి, కడకు నిర్ణయింపగలుగువాని నామమును సాధారణ సభకు సిఫారసు చేయును. అంతట

సాధారణసభ సమావేశమై మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదమును ఆ సిఫారసునకు తెలియజేసి నపుడే, నిర్ణయితుడగునతడు ప్రధాన కార్యదర్శి కాగలుగును.

సచివాలయమునందలి సిబ్బందిని ప్రధాన కార్యదర్శియే, చార్టరు విధించిన నియమములకు భంగము లేని రీతిలో, నియమించును. ఈ నియామకముల సందర్భమున, వివిధ భౌగోళిక ప్రాంతములకును, సరియగు మన్నన చేకూరి, ఏ దేశీయులకుగాని, ఏ ప్రాదేశిక విస్తృతికి చెందినవారికిగాని, ఐ.రా స. కార్యాలయమున అధికతర ప్రాబల్యము చేకూర కుండ ప్రధాన కార్యదర్శి శ్రద్ధవహింపవలసి ఉండును. సాధారణ సభా వ్యవహారముల పర్యవేక్షణకై ఒక ఉపప్రధాన కార్యదర్శిని, ప్రత్యేక రాజకీయ వ్యవహారముల నిర్వహణకై ఇరువురు ఉపప్రధాన కార్యదర్శులను, ప్రధాన కార్యదర్శి తనకు సాయము చేయుటకై నియమించును.

ప్రధాన కార్యదర్శి పదవీకాల పరిమితి అయిదు సంవత్సరములుగ నిర్ణయింపబడినది. అయిదు సంవత్సరముల తరువాత క్రొత్తవానిని ఎన్నుకొన వలసియున్నను, పదవీవిరమణ చేసిన వానినే మరల ఎన్నుకొని అతని పదవీకాలమును పెంచుట కును అవకాశము కలదు.

ఐ. రా. స. పరిపాలనా వ్యవహారములను అన్నింటిని తన సిబ్బంది సాయమున నిర్వహించు బాధ్యత ప్రధాన కార్యదర్శియందు కలదు. సాధారణ సభకు వార్షిక నివేదికలను, అంతటంతట ఆవశ్యకములగు ఇతర నివేదికలను అతడు అంద జేయును. అంతర్జాతీయ శాంతికి భంగకరముగ పరిణమించగలదని తాను భావించు ఏ విషయము నైనను అతడు భద్రతా సంఘపు దృష్టికి కొనిరా వచ్చును. సాధారణ సభయు భద్రతా సంఘమును ఆమోదించిన తీర్మానములకు కార్యరూపమును కల్పించుటకు అతడు బాధ్యత వహించును. ఐ. రా. స. యందు అంతర్గతములును, అనుబంధిత ములునగు వివిధ నియోగముల కార్యకలాపములను అతడు పర్యవేక్షించును.

ఐ రా. స. సిబ్బందిని అంతటిని ప్రధాన కార్యదర్శియే నియమించుచున్నను, కాందిశీకుల హై కమీషనరును, అంతర్జాతీయ ద్రవ్యనిధియొక్క మేనేజింగ్ డైరెక్టరును సాధారణ సభయే నియ మించును. కాని ఈ సంస్థల కార్యకలాపముల పర్యవేక్షణాధికారము ప్రధాన కార్యదర్శికి కలదు.

ఐ. రా. స. యొక్క ప్రప్రథమ ప్రధాన కార్యదర్శిగ నార్వే దేశీయుడగు ట్రిగ్వే లీ నియమితు డయ్యెను (1946). అతని పదవీకాలము ముగి సిన వెంటనే దానిని మూడేండ్లు పెంచుటకు యునైటెడ్ స్టేట్స్ కృషిచేసినది. కాని సోవియట్ రష్యా అందులకు అంగీకరింపక పోవుటతో భద్రతా సంఘమున ప్రతిష్టంభన ఏర్పడి ఆ విషయము సాధారణ సభలో చర్చింపబడవలసిన పరిస్థితి ఏర్పడినది. సాధారణ సభలో యు. స్టే. కు ఉన్న పలుకుబడివలన ఆ దేశపు ప్రతిపాదన ఆమోదిత మయ్యెను. కాని సోవియట్ రష్యా సహకార నిరాకరణను అవలంబించుటవలన ట్రిగ్వే లీ ఎక్కువ కాలము ఆ పదవిలో కొనసాగలేక 1952, నవంబరు 10 న రాజీనామాను సమర్పించి, పదవి నుండి వైదొలగెను. ఆ తరువాత 1953, ఏప్రిల్ 7 న, స్వీడను దేశీయుడగు హేమర్ షెల్డ్, కార్యదర్శిగ, క్రమరీతిలో ఎన్నుకొనబడెను. అతడు అయిదేండ్లు పనిచేసిన తరువాత మరల ఐదేండ్ల కాలము పనిచేయునటుల నియమింపబడెను. కాని ఆ రెండవ పదవీకాలము ముగియకముందే, అతడు విమానప్రమాదమున మరణించెను.

అంతట 1961, నవంబరు 3 న సాధారణ సభయు, భద్రతా సంఘమును ఏకగ్రీవముగ బర్మా

దేశీయుడగు ఈ థాంట్‌ను ప్రధాన కార్యదర్శిగ నియమించినది. ఈ థాంట్ రెండు టరములు పని చేసి 1971 లో పదవినుండి విరమించెను. అంతట ఆస్ట్రియా దేశీయుడగు కుర్ట్ వాల్‌డీమ్ ఐ. రా. స. ప్రధాన కార్యదర్శిగ నియమితుడయ్యెను. (1972, జనవరి 1).



# 13. అంతర్జాతీయ కార్మిక వ్యవస్థ (I L O)

నానాజాతి సమితి రూపొందిన కాలముననే (1919) తదనుబంధ సంస్థగ అంతర్జాతీయ కార్మిక వ్యవస్థ (ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్) రూపు గొనినది. నానాజాతి సమితి అంతరించిన తరువాత ఈ వ్యవస్థ (అం. కా.)ను ఐ. రా. స. చేపట్టి, ఒక ప్రత్యేక విశిష్టతగల ఏజన్సీగ దానికి పరిగణనను కల్పించినది (1946).

ఈ వ్యవస్థయొక్క లక్ష్య, ఉద్దేశములు 1919 లోనే, దాని సంవిధాన పత్రపు పీఠికలో, పొందు పరుపబడినను, 1944 లో ఫిలడెల్ఫియాలో జరిగిన అంతర్జాతీయ కార్మిక సమ్మేళనమున అవి చక్కగ విపులీకరింపబడి, 'ఫిలడెల్ఫియా ప్రకటన' అను పేర ప్రసిద్ధిని ఆర్జించినది. ఈ ప్రకటన అం. కా. వ్యవస్థయొక్క సంవిధాన పత్రమున ఒక సవరణగ చేర్చబడినది. ఆ ప్రకటనను అనుసరించి, అం. కా. వ్యవస్థ, ఈ క్రింది లక్ష్యముల సాధనకై, నిరంతర కృషిని సాగించుట తన పవిత్ర ధర్మముగ గ్రహించినది.

1. కొరవలేని రీతిలో ఉద్యోగ వసతులను చేకూర్చి, జీవన ప్రమాణ స్థాయిని పెంపుచేయుట;

2. ప్రజా శ్రేయమునకు తాను ఎక్కువగ సమ కూర్చుటకు అవకాశమును కల్పించునట్టిదియు, తన శక్తి సామర్థ్యములకు అన్నివిధముల సరిపోవు నట్టిదియునగు ఉద్యోగమును కార్మికుడు, ప్రతి వాడును, పొందునటుల చేయుట;

3. ఉద్యోగ నిర్వహణకు అనువగు శిక్షణకు వసతులు కల్పించుటయేగాక, ఉద్యోగ సాధనకై ఒకచోటినుండి వేరొకచోటికి పోవుటకును, అట, అవసరమగునెడల, స్థిరవసతిని కల్పించుకొనుట కును ఎట్టి అభ్యంతరములు లేకుండ చేయుట.

4. పనికాలము, జీతబత్యములు తక్కు విధ ముల పని షరతులు మొదలగునవి నిర్ణయింప బడుటలో, శ్రమ ఫలితమున కార్మికులకు దక్క వలసిన భాగము, వారికే చెందితీరవలయునను దృష్టితో విధానములను రూపొందించుటయేగాక, అవసరమగు సందర్భములందు, ఒక కనీసపు జీతము సైతము నిర్ణయింపబడి కార్మికునికి రక్షణ చేకూరునటుల చూచుట;

5. సమష్టిగ, తమ శ్రేయస్సునకై బేరమును సాగించు హక్కు కార్మికులకు కలదనుట గుర్తింప జేయుట; ఉత్పాదనా కుశలతయందు నిరంతర వికసనమును సాధించు సంకల్పముతో యాజమాన్య, కార్మిక వర్గములు పరస్పరము సహకరించుకొను నటులను, సాంఘిక, ఆర్థిక ప్రయోజన సాధనకై అవలంబింపదగు చర్యలను సంకల్పించి, కొన సాగించుటలో యజమానులును కార్మికులును చేదోడు వాదోడుగ వ్యవహరించునటులను చేయుట;

6. అవసరమనితోచు అన్ని సందర్భము లందును, ప్రతివానికిని, ఒక ప్రాతిపదికాదాయము

లభించుటకు అనువుగ, తగు సాంఘిక భద్రతా చర్యలను అమలుపరుప జేయుటయేగాక, సమగ్ర మగు వైద్య సాహాయ్య వసతిని చేకూర్చుట;

7. అన్ని తరగతుల శ్రామికుల ప్రాణరక్షణ కును, ఆరోగ్య భద్రతకును అనువుగ తగు రక్షణ లను కల్పించుట;

8. శిశు సంరక్షయమునకును, మాతృ పరిరక్ష ణమునకును, తగు మార్గములను అవలంబించునటుల చేయుట;

9. కార్మికునికి పోషకాహార, నివాస వసతి, విశ్రాంతి, సంస్కృతి వికసనములకు మార్గములు తగినంతగ లభించునటుల చూచుట;

10. విద్యను, వృత్తివిద్యను అభ్యసించుటలో ప్రతి కార్మికునికి సమానావకాశములు కలవను నమ్మకము చేకూర్చుట.

పై లక్ష్యములను సాధించుటకు అంతర్జాతీయ స్థాయిలో కృషిని సాగించు ఈ అంతర్జాతీయ కార్మిక వ్యవస్థయందు, ఏ ఐ. రా. స. సభ్యరాజ్య మైనను, తాను అం. కా. వ్యవస్థా నియమములకు బద్ధత వహింతునని, తన సంకల్పమును ఆ వ్యవస్థ యొక్క డైరెక్టర్-జనరల్‌కు తెలిపిన మాత్రమున, అందు సభ్యత్వమును గ్రహింపవచ్చును.

అం. కా. వ్యవస్థయందు అంతర్జాతీయ కార్మిక సమ్మేళనము (ఇంటర్నేషనల్ లేబర్ కాన్ఫరెన్స్), పాలకసంస్థ (గవర్నింగ్ బాడీ) అంతర్జాతీయ కార్మిక కార్యాలయము (ఇంటర్నేషనల్ లేబర్ ఆఫీస్) అను మూడు ఉపాంగములు కలవు.

అం. కా. వ్యవస్థా కార్యక్రమ నిర్ణయమున ఉచ్చతమ సమాలోచనా వేదికగా ఉపకరించునది అంతర్జాతీయ కార్మిక సమ్మేళనము. ప్రతి సంవత్స రమున ఒకసారి జెనీవా నగరమున అది సమావేశ మగును. సభ్యరాజ్యములకు అన్నింటికిని అందు ప్రాతినిధ్యము కలదు. సభ్యరాజ్యములలో ప్రతి యొక్కటియు ఆ సమ్మేళనమున పాల్గొనుటకు నలువురు ప్రతినిధులను పంపును; అందులో ఇరు వురు ఆ సభ్యరాజ్య ప్రభుత్వపు ప్రతినిధులు; ఒకరు ఆ రాజ్యమునందలి యజమానుల ప్రతినిధి; ఒకరు ఆ సభ్యదేశపు కార్మికవర్గమునకు ప్రతినిధి.

సమ్మేళనమునందలి ప్రతినిధులందరును కలసి పాలకసంస్థను ఎన్నుకొనెదరు. ఆ పాలకసంస్థ యందలి 48 మంది సభ్యులలో 24 మంది ప్రభుత్వ ముల ప్రతినిధులు; యాజమాన్యపు ప్రతినిధులు 12 మంది; కార్మికవర్గపు ప్రతినిధులు 12 మంది. కాని ఆ యా దేశముల పారిశ్రామిక ప్రాముఖ్యమును అనుసరించి, పది దేశముల - ఇండియా, ఇటలీ, కెనడా, చీనా, జపాన్, జర్మనీ (పశ్చిమ), ఫ్రాన్స్, యునైటెడ్ కింగ్‌డమ్, యునైటెడ్ స్టేట్స్, సోవి యట్ దేశముల - ప్రభుత్వ ప్రతినిధులకు పాలక సంస్థయందు శాశ్వత స్థానములు కల్పింపబడినవి. అందువలన తక్కిన 14 ప్రభుత్వ స్థానములకును, యాజమాన్య, కార్మిక స్థానములకును మాత్రమే ఎన్నికలుజరుగును. ఆయా స్థానముల ప్రతినిధులను, ఆ యా వర్గములవారు మాత్రమే ఎన్నుకొనెదరు; ప్రభుత్వ ప్రతినిధుల ఎన్నికలో శాశ్వత స్థానములు గల రాజ్యముల ప్రభుత్వ ప్రతినిధులు పాల్గొనరు.

అం. కా. వ్యవస్థా కార్యకలాపముల నిర్వ హణలో పాలకసంస్థ, కార్యనిర్వాహక వర్గముగ వ్యవహరించును. సంవత్సరమున అనేక పర్యాయ ములు ఈ సంస్థ సమావేశమై వ్యవస్థా కార్యకలాప ములను నిర్వహించును. అంతర్జాతీయ కార్మిక కార్యాలయపు డైరెక్టర్ - జనరల్‌ను పాలక సంస్థయే నియమించును.

అంతర్జాతీయ కార్మిక కార్యాలయము జెనీవా నగరమున ఉన్నది. సచివాలయము, కేంద్ర కార్యస్థానము, అన్వేషణా కేంద్రము, ప్రచురణ

సంస్థ ఇందు నెలకొని పనిచేయుచున్నవి. ప్రపంచ విస్తృతములగు తన కార్యక్రమముల నిర్వహణకై ఈ కార్యాలయము, తనకు అనుబంధములుగ, ఆసియాకు సంబంధించినంతవరకు బాంగ్‌కాక్‌లోను, ఆఫ్రికాకై అడిస్ అబాబాలోను, అమెరికాకై లిమాలోను మూడు ప్రాంతీయ కార్యాలయములను నిర్వహించుచున్నది. ఇవిగాక వివిధ ప్రాంతములందు వివిధ శాఖా కార్యాలయములు కలవు. న్యూఢిల్లీలోను ఇట్టి శాఖా కార్యాలయము పనిచేయుచున్నది.

అం. కా. వ్యవస్థా కార్యకలాపములకై వ్యయమగు మొత్తమును సభ్యరాజ్యములు తమ శక్తి సామర్థ్యములను అనుసరించి నిర్ణయింపబడినరీతిలో చెల్లించుచున్నవి. అంతర్జాతీయ కార్మిక సమ్మేళనము తన రెండేళ్ళ వ్యయపు బడ్జెటును నిర్ణయించుట ఒక సంప్రదాయముగ పెట్టుకొనినది. 1972-73 లో ఇటుల ఆమోదింపబడిన బడ్జెట్ మొత్తము 715 లక్షల డాలర్లు. ఇదియేగాక, తాను నిర్వహించు సాంకేతిక సహకారాది కార్యక్రమములకై ఐ. రా. వికసన కార్యక్రమ నిధుల నుండియు, అం. కా. వ్యవస్థకు కొంత ధన సాహాయ్యము లభించుచున్నది.

కార్మిక రంగమున కొన్ని అంతర్జాతీయ ప్రమాణములను రూపొందించి, సభ్యరాజ్యములచేత వానిని అంగీకరింపజేసి, వానిని ఆ రాజ్యములు పాటించునటుల చూచుట అం. కా. వ్యవస్థా కార్యక్రమమున ఒక ముఖ్యభాగముగ పరిగణింపదగును. ఇట్టి ప్రమాణములు అంతర్జాతీయ కార్మిక సమ్మేళనముచేయు తీర్మానముల రూపమున నెలకొల్పబడుచున్నవి. ఈ తీర్మానములు - సంప్రదాయములు (కన్‌వెన్‌షనులు), సిఫారసులు, అను - రెండు తీరులుగ ఉన్నవి. సంప్రదాయము అనబడుదానిని సభ్యరాజ్యము తన జాతీయ ప్రభుత్వమునకు ధ్రువీకరణకై నివేదింపవలయును; అట్టి ధ్రువీకరణను ఇచ్చిన ప్రభుత్వము తన దేశమునందలి కార్మిక శాసనములను ఆ సంప్రదాయమునకు అవిరుద్ధముగ ఉండునటుల సరిచూడవలయును. ధ్రువీకృతములగు సంప్రదాయములను ఆ యా ప్రభుత్వములు చక్కగ పాటించు రీతిని పర్యవేక్షించుటకు అం. కా. వ్యవస్థకు తగు యంత్రాంగము కలదు. ఇట్టి సంప్రదాయములలో తొలుతటిది 1919 లో ఆమోదితమైనది. రోజునకు 8 గంటలకు మించి పనికాలము ఉండగూడదనియు, వారమున 6 రోజులు మాత్రమే పనిచేయవలయుననియు ఆ సంప్రదాయము నిర్ణయించి, ప్రపంచమున వివిధ ప్రభుత్వముల సహకార, ధ్రువీకరణలతో ఆ నిర్ణయమును అమలులోనికి తేగలిగినది అది మొదలుగ 1972 అంతమునకు మొత్తముమీద 136 సంప్రదాయములు రూపుగొని, పలు ప్రభుత్వములచే ధ్రువీకృతములైనవి.

అం. కా. సమ్మేళనముచేయు రెండవరకపు తీర్మానములకు, అనగా సిఫారసులకు, పై రీతిగ ధ్రువీకరణ అవసరములేదు. కాని, ఈ సిఫారసులకు కార్యరూపమును కల్గించుటకై, శాసనరీత్యా గాని తదితర మార్గములవలనగాని, తగు చర్యలను తీసికొను దృష్టితో ఆ సిఫారసులను శ్రద్ధగ పర్యాలోచన చేయవలసిన బాధ్యత మాత్రము సభ్యరాజ్యముపైన కలదు. 1919 మొదలుగ 1971 అంతమునకు మొత్తముమీద ఇట్టి 144 సిఫారసులను, సమ్మేళనము ఆమోదించినది.

సాంఘిక, కార్మిక విధానములందు అంతర్జాతీయ స్థాయిలో ప్రమాణములను నెలకొల్పుట వలననేకాదు, ఈ ప్రమాణములకు ఒక స్థిరరూపమును కల్పించుటకై తగు సాంకేతిక సలహాలను, ప్రవీణుల మూలమున సాహాయ్యమును వర్ధమాన దేశములకు అందజేయుటవలనగూడ శ్రామికలోకపు

యోగక్షేమములకై అం. కా. వ్యవస్థ కృషిచేయు చున్నది. ఆ వ్యవస్థయొక్క బడ్జెటున దాదాపు సగము ఇట్టి సాంకేతిక సహాయమునకు, తదను బంధ కార్యక్రమములకు వినియోగింపబడుచున్నది. కార్మిక బలమును సువ్యవస్థీకృతముచేయుట, వృత్తి విద్యా శిక్షణ, యాజమాన్య నిర్వహణమున కొం గ్రొత్తరీతులు, ఉత్పాదనా కౌశలమున అభివృద్ధి సాధన, చిన్నతరగతి పరిశ్రమలు, చేతిపనులు మొదలగు వివిధ రంగములందు పైన తెలుపబడిన సాంకేతిక సహాయ కార్యక్రమముద్వారా అం. కా. వ్యవస్థ పలుదేశముల ప్రజలకు సహాయపడు చున్నది. ఆ యా రంగములందు ప్రవీణులగువారిని వివిధ దేశములకు పంపి అచటి కార్మికులకు శిక్షణను ఇప్పించియు, శిక్షితులగువారికొరకై అగు వ్యయమును భరించియు అందులకు ఉపకరించు సంస్థలకు గ్రాంటులను ఇచ్చియు అం. కా. వ్యవస్థ కార్మికలోక ప్రగతికి ప్రోత్సాహ మొసగుచున్నది.

మొత్తముమీద గత 45 యేండ్ల కృషి మూల మున అం. కా. వ్యవస్థ ప్రపంచ శ్రామిక లోకమున ప్రయోజనకరములగు కొన్ని ప్రమాణములను నెలకొల్పియు, సాంకేతిక సాహాయ్యము నొసగియు, సుస్థిర శాంతియుత మానవ సమాజ నిర్మాణమున గణనీయమగు సఫలతను ఆర్జించినదని చెప్ప వచ్చును. ఇట్టి అసమాన కృషిమూలముననే ఈ వ్యవస్థకు 1969 లో నోబెల్ శాంతి బహుమానము లభించినది.

---

# 14. ఆహార వ్యవసాయ వ్యవస్థ (F A O)

ప్రపంచ మానవకోటిలో అత్యధిక సంఖ్యాకులను బాధించుచున్న 'ఆకలి' సమస్యను పరిష్కరించు టలో, రాజకీయములతో నిమిత్తము లేకుండ, ప్రపంచ రాజ్యములు సహకరింపగలవను భావనతో, యు. స్టే. కు ఆ కాలమున అధ్యక్షుడుగ ఉండిన రూజ్‌వెల్ట్, తన దేశమునందు వర్జీనియా రాష్ట్ర మునఉన్న హాట్‌స్ప్రింగ్స్‌వద్ద, 1943, మే-జూన్ లలో, ఒక అంతర్జాతీయ సమ్మేళనమును సమావేశ పరచెను. అది ద్వితీయ ప్రపంచ యుద్ధకాల మగుటవలన, అక్షరాజ్యములను ఎదిరించి పోరా డుచు 'ఐక్యరాజ్యములు' అను పేరున వ్యవహరింప బడిన 44 రాజ్యములు మాత్రమే అందు పాల్గొనెను. ఆ సమ్మేళనపు చర్చల ఫలితముగ, ఒక తాత్కా లిక కమీషన్ నియమింపబడి, ఆహార, వ్యవసాయ సమస్యలను పరిష్కరించుటకై అంతర్జాతీయ స్థాయిలో ఒక వ్యవస్థను నిర్మించుటకు ప్రణాళికను తయారుచేయు భారము ఆ కమీషన్‌కు అప్పగింప బడెను. అంతట ఆ కమీషన్ తయారుచేసిన ప్రణా ళికను అనుసరించి 16 అక్టోబరు, 1945 న ఆహార, వ్యవసాయ వ్యవస్థ (ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గ నైజేషన్) అవతరించినది. అనంతరమున అది ఐక్యరాజ్య సమితిచేత ఒక ప్రత్యేక విశిష్టతగల ఏజన్సీగ పరిగణనను పొందినది.

ప్రపంచమున పెక్కు రాజ్యములు 1947 తరు వాత స్వాతంత్ర్యమును ఆర్జించుటతో ఆ. వ్య. వ్యవస్థయందు సభ్యసంఖ్య కాలక్రమమున పెరిగి నది. 1974 లో అందలి సభ్యసంఖ్య 125. భారత దేశమునకు ఇందు సభ్యత్వము కలదు. వ్యవస్థ యందలి తొలుతటి సభ్యరాజ్యములలో సోవియట్ రష్యాయు చేరియున్నను, సభ్యత్వమును గ్రహించు టకు నిరాకరించినది. అయినను అనధికారరీత్యా, సోవియట్ రష్యా సైతము ఆ. వ్య. వ్యవస్థా కార్య క్రమములతో సంబంధములను నిలువుకొని, తన

సాంకేతికులను సైతము ఆ కార్యక్రమములలో పాల్గొననిచ్చుచున్నది.

ఆహార, వ్యవసాయ వ్యవస్థా సమ్మేళనము (కాన్ఫరెన్సు) అనునది ఈ వ్యవస్థయందలి ఉచ్చతమ సంస్థ. రెండేండ్ల కొక పర్యాయము (క్రైస్తవ శకపు బేసి సంవత్సరపు శిశిర ఋతువులో) ఆ సంస్థ రోమ్ నగరమున సమావేశమై, విధాన రీతులను నిర్ణయించి, బడ్జటును ఆమోదించును. ఆ. వ్య. వ్య. మండలి (కౌన్సిల్) యందలి సభ్యరాజ్యములను, డైరక్టర్ - జనరలును ఆ సంస్థయే నిర్ణయించును.

ఆ. వ్య. వ్య. మండలియే వ్యవస్థయొక్క కార్యవర్గముగ వ్యవహరించును. 1970 లో చేసిన మార్పులను అనుసరించి ఇందు 34 రాజ్యములకు సభ్యత్వము కలదు వీరి పదవీ కాలపరిమితి రెండేండ్లు. ఆ రెండేండ్లలో కనీసము మూడు పర్యాయములైనను మండలి సమావేశములు జరిపి, వ్యవస్థా కార్యక్రమముల నిర్వహణరీతిని పరిశీలించి తగు సూచనలను చేయుచుండును.

ఆహార, వ్యవసాయ వ్యవస్థా కేంద్ర కార్యాలయము రోమునగరమున ఉన్నది. అందే సచివాలయము కలదు. సచివాలయమున పనిచేయువారే గాక అదనముగ 2200 మంది ప్రవీణులు వ్యవస్థ ఆధ్వర్యవమున వర్ధమాన దేశములందు నిర్ణీత కార్యక్రమములలో పాల్గొనుచున్నారు. ఈ ఉద్యోగి బృందము, డైరెక్టర్ - జనరల్‌కు బాధ్యత వహించి పనిచేయును.

ప్రపంచమునందలి ఆహార, వ్యవసాయ పరిస్థితులను సింహావలోకనముచేయుట, ఉత్పత్తులందు అభివృద్ధిని సాధించుట, పోషకాహారముల పరిమాణమును పెంపొందించి, ప్రపంచవాసుల జీవన ప్రమాణ స్థాయిని అభివృద్ధిచేయుట, భూస్వామ్య రీతిలో తగు అభివృద్ధికరములగు మార్పులను సూచించుట, వ్యవసాయ నిర్వహణకై తగు పరపతిని సమకూర్చుట - అను కార్యకలాపములను ఈ వ్యవస్థ నిర్వహించుచున్నది. ఈ విధి నిర్వహణలో ఒక ముఖ్యభాగముగ వ్యావసాయిక కృషికి సంబంధించి ప్రపంచమున సాగుచున్న కార్యకలాపముల సంఖ్యా సమాచారములను, ఉత్పత్తి అంచనాలను, వ్యాపార, వస్తు వినియోగములను గురించిన తాజా అంచనాలను సభ్యరాజ్యములకు ఆ. వ్య. వ్యవస్థా సచివాలయము అంతటంతట అందజేయుచున్నది.

ప్రపంచమునుండి 'ఆకలి బాధను' పారదోలు మహత్సంకల్పముతో ఆ. వ్య. వ్యవస్థ, ప్రపంచ వ్యవసాయిక వికసన పరిసూచక ప్రణాళిక (ఇండికేటెడ్ వరల్డ్ ప్లాన్ ఫర్ అగ్రికల్చరల్ డెవలప్‌మెంట్) అను దానిని రూపొందించినది. క్రమముగ 1985 నాటికి, వర్ధమాన దేశముల జనసంఖ్య పెరుగుటవలన, అదనముగ చేరెడు 100 కోట్ల ప్రజలకు తగు సమగ్రాహారమును చేకూర్చుటకై ఇప్పటినుండియే ప్రణాళికా బద్ధముగ కృషిని నిర్వహించుట దీని లక్ష్యము. 1962 లో వర్ధమాన దేశములలోని సాగుబడినేల విస్తీర్ణము 56.2 కోట్ల హెక్టేరులుగ ఉన్నదనియు, ఆ సాగుబడినేలను 1985 నాటికి 66 కోట్ల హెక్టేరులకు పెంపొందించి, శాస్త్రీయ పద్ధతిలో వ్యవసాయమును సాగించినపుడు మాత్రమే ఆ లక్ష్యము సాధ్యమగుననియు పరిసూచక ప్రణాళిక స్పష్టము చేసినది. ఇందులకే, వివిధ వర్ధమాన దేశములందు తన ప్రవీణుల సాంకేతిక సాహాయ్య మూలమున ఆ. వ్య. వ్యవస్థ కృషిచేయుచున్నది.

ఒక ప్రణాళికను రూపొందించవలయుననిన అందులకు సంబంధించిన వర్తమాన సంఖ్యా వివరములు అత్యావశ్యకములు. అందువలన వ్యవసాయ, పశుపోషణలకు సంబంధించిన సర్వ

దేశముల సంఖ్యా వివరములకొరకై 1950 లో, తొలుతగ, ఆ. వ్య. వ్యవస్థ అంక సేకరణ (సెన్సస్) ను నిర్వహించినది. తరువాత 1960 లోను 1970 లోను మరల ఇట్టి అంక సేకరణలను కొనసాగించినది.

తమ తమ జాతీయోత్పత్తుల నిష్పత్తులను అనుసరించి సభ్యరాజ్యములు చెల్లించు విరాళములవలన ఆ. వ్య. వ్యవస్థ తన నిర్వహణకగు వ్యయమును సమకూర్చుకొనుచున్నది. 1972 లో ఆమోదింపబడిన బడ్జెటు వ్యయము 5.2 కోట్లు డాలర్లు.

---

# 15. ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ (W H O)

ఐక్యరాజ్య ఆర్థిక సాంఘిక సమితి ఆధ్వర్యమున 1946 లో జరిగిన ఒక అంతర్జాతీయ సమ్మేళనము ఆమోదించిన తీర్మాన ఫలితముగ ఏప్రిల్ 7, 1948 న ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ (వరల్డ్ హెల్త్ ఆర్గనైజేషన్) రూపుగొనినది.

ఐక్యరాజ్య సమితియందలి ఏ సభ్యరాజ్యమైనను, ప్ర. ఆ. వ్యవస్థా సంవిధానరీతి తనకు ఆమోదయోగ్యమేయని తెలిపినంత మాత్రమున దానికి ఆ వ్యవస్థయందు సభ్యత్వము లభించుచున్నది. ఐ. రా. స. యందు సభ్యత్వములేని అస్వతంత్ర రాజ్యములును ఇందు అనుబద్ధ సభ్యులుగ చేరు అవకాశము కలదు. ప్రస్తుతమున ఇందలి సభ్య సంఖ్య 136.

ప్ర. ఆ. వ్యవస్థయందు 1. ప్రపంచ ఆరోగ్య సభ, 2. కార్యమండలి, 3. సచివాలయము అనునవి ముఖ్యాంగములు. ఆరోగ్య సభయందు సభ్యరాజ్యములకును, అనుబద్ధ సభ్యరాజ్యములకును ప్రాతినిధ్యము కలదు. వ్యవస్థా ముఖ్య కార్యాలయము ఉన్న జెనీవా నగరమున సంవత్సరమున ఒకసారి సాధారణముగ ప్రపంచ ఆరోగ్య సభ సమావేశమగును. కార్యమండలి యందలి సభ్య సంఖ్య 24. ఆరోగ్య సభలోని ప్రతినిధులు ఎన్నుకొనిన 24 రాజ్యములవారు, రాజ్యమునకు ఒక్కొక్కని వంతున ఈ సభ్యులను నియమింతురు. ఇటుల నియమింపబడు సభ్యుడు ఆరోగ్య విషయిక శాస్త్రములందు నిష్ణాతుడుగ ఉండవలయుననుు నియమము కలదు. సచివాలయము డైరెక్టర్ - జనరల్ ఆధ్వర్యవమున పనిచేయును. వ్యవస్థాకృషి ప్రపంచ వ్యాప్తముగ చక్కగ సాగుటకై ఆఫ్రికాకై బ్రజ్జవిల్లిలోను, ఆగ్నేయ ఆసియాకై న్యూఢిల్లీలోను, యూరప్‌కై కోపెన్‌హేగన్‌లోను, ప్రాచ్య మధ్యధరా ప్రాంతమునకై అలెగ్జాండ్రియాలోను, పశ్చిమ పసిఫిక్ ప్రాంతమునకై మనిలాలోను, అమెరికాకై వాషింగ్‌టన్‌లోను ప్రాంతీయ కార్యాలయములు పనిచేయుచున్నవి.

'ప్రపంచ ప్రజానీకమునకు సాధ్యమయినంత అత్యున్నత ఆరోగ్యస్థాయిని లభ్యమగునటుల చేయుటయే' ఆ వ్యవస్థా సంకల్పముగ ప్ర. ఆ. వ్యవస్థా సంవిధానమున ప్రథమ విభాగమున పేర్కొనబడినది. ఈ సంకల్ప సాధనకై, ఐ. రా. స. నుండియు, దాని ఏజన్సీలనుండియు, వివిధ దేశముల ప్రభుత్వములనుండియు సహకారమును ప్ర. ఆ. వ్యవస్థ గ్రహించుచున్నది. ఆయా దేశములందలి ఆరోగ్య సంసేవా కార్యక్రమములను దృఢతరములుగ చేయుటయు, రోగముల వ్యాప్తిని నిరోధించి, వాని మూలకారణముల నిర్మూలించు

టకై సమధిక శాస్త్రీయ కృషిని సాగించుటయు, మాతా శిశు స్వాస్థ్యమును పెంపొందించుటయు, మానసిక స్వాస్థ్య పరిరక్షణయు, వైద్య విషయిక పరిశోధనయు, వైద్య వృత్తియందు బోధనా శిక్షణా, స్థాయీ ప్రమాణములను అభివృద్ధి చేయుటయు, పరిపోషణ, నివసనము, శౌచము, పని చేయు పరిస్థితులు మొదలగువానిని చక్కజేసి పరిసర పారిశుద్ధ్యమును పెంపొందించుటయు, ప్ర. ఆ. వ్యవస్థ నిర్వహింపవలయు కార్యక్రమములుగ సంవిధానమున పేర్కొనబడినవి.

ఆయా దేశములందలి ప్రత్యేక పరిస్థితుల మూలమున అచట నిర్వహింపవలసివచ్చు తన కార్యక్రమములను, ప్రాంతీయ కార్యాలయముల ద్వారా వ్యవస్థ నిర్వహించుచున్నది, కాని విశ్వవ్యాప్తముగ నిర్వహింపవలసిన కార్యక్రమములను మాత్రము కేంద్ర కార్యాలయమే నిర్వహించుచున్నది. డైరెక్టర్ - జనరల్‌కు, విధి నిర్వహణమున సాయపడుటకై, ప్రవీణుల సలహా మండలులు 46 పనిచేయుచున్నవి. వైద్య శిక్షణయందు, ప్రపంచ స్థాయిలో ఒక ఏకరూపతను సాధించుటకై ప్ర. ఆ. వ్యవస్థ అంతటంతట సదస్సులను, సాంకేతిక సమ్మేళనములను, గోష్ఠులను నిర్వహించుచున్నది. వైద్యవిద్యలో అత్యున్నత శిక్షణను పొంద నభిలషించుచు, అందులకు అర్హత కలిగిన వారికి ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ గౌరవవేతనములను ఇచ్చుచున్నది. 1971 ముగియునాటికి, ఇటుల వేతనములను పొందినవారి సంఖ్య మొత్తముమీద 40,000 ను అందుకొనినది.

అంటువ్యాధుల విషయమున, అందును మలేరియా, మశూచుల నిర్మూలనమున ప్ర. ఆ. వ్యవస్థ సమధిక కృషిని సాగించినది. మలేరియా వ్యాప్తికి లోనయినవిగ భావింపబడు 145 దేశములందలి ప్రజలలో, వ్యవస్థ సాగించిన కృషి ఫలితముగ, 1971 నాటికి 39% ప్రజలు నివసించు ప్రాంతములందు మలేరియా వ్యాప్తి నిశ్శేషముగ అంతము చేయబడినది. విశ్వవ్యాప్తముగ ఈ వ్యవస్థ సాగించిన మశూచి నిర్మూలనా కార్యక్రమ ఫలితముగ 1967 మొదలుగ ఆ రోగపు వ్యాప్తి క్రమక్రమముగ తగ్గినది. 1972 ముగియునాటికి ఉత్తర, దక్షిణ అమెరికాలు మశూచి బెడదనుండి విముక్తములైనవి. ప్రస్తుతమున ఆఫ్రికాలో రెండు దేశములందును ఆసియాలో నాలుగు దేశములందును మాత్రమే మశూచి వ్యాప్తి కననగుచున్నది.

పుట్టకురుపు (కేన్సరు) రోగపు కారణములను కనుగొని, తగు నివారణమును సాధించుటకై ప్ర. ఆ. వ్యవస్థ తన ఆధ్వర్యమున లియాన్స్‌లోను, జెనీవాలోను పరిశోధనా శాలలను నిర్వహించుచున్నది.

సభ్యరాజ్యములు, ఐ రా. స. వ్యయమునకై తాము చెల్లించు మొత్తముల నిష్పత్తిలోనే, ప్ర. ఆ. వ్యవస్థా వ్యయమునకై విరాళములను చెల్లించుచున్నవి. 1971 లో ఈ వ్యవస్థకై ఆమోదింపబడిన బడ్జెటు వ్యయము 73, 230 వేల డాలర్లు.

---

# 16. ఐ. రా. అంతర్జాతీయ ఆత్యయిక శిశునిధి (UNICEF)

ద్వితీయ ప్రపంచ సంగ్రామ ఫలితముగ అనాథ లైన శిశువుల ఆరోగ్య సంరక్షణకై తొలుత ఈ నిధి ఐ. రా. సాధారణ సభవలన 1946 లో సంస్థాపితమైనది. యుద్ధక్షోభకు లోనైన దేశములలోని అట్టి అనాథ శిశువులకు ఆరోగ్య రక్షణ దృష్టిలో అత్యంతావశ్యకములగు పాలు, రొట్టె, ఓషధులు, సబ్బులు, దుప్పట్లు, చెప్పులు మొదలగువాని రూపమున సహాయమును ఆ నిధి అందజేసెడిది. 1950 ముగియునాటికి ఆ కార్యక్రమము అంతమయినది. అంతట ఐ. రా. సాధారణసభ చేసిన ఒక తీర్మానమును అనుసరించి ఈ నిధియొక్క కార్యక్రమములు వర్ధమాన దేశములకును వ్యాప్తములయినవి. అంతటినుండి దీని పేరులోని 'ఆత్యయిక' అను పదము అర్థరహితమైనందున దీనిని ఐ. రా. శిశునిధి అనియే సాధారణముగ వ్యవహరించుచున్నారు.

వర్ధమాన దేశములందు సదా ఆకలి – రోగముల బెడదకు లోనై, అభివృద్ధికి అవకాశములు ఎట్టివియు లేక మనుచున్న శిశువులకు ఆరోగ్య రక్షణకై పోషకాహారమును, ఓషధులను, సమకూర్చుటయేగాక, విద్యా వసతులను సైతము కల్పించి సాయపడుట ఈ నిధియొక్క సంకల్పము.

ముప్పదిమంది సభ్యులుగల ఒక కార్య నిర్వహణ మండలి ఈ శిశునిధిని నిర్వహించుచున్నది. ఐ. రా. సభ్యులనుండి ఈ ముప్పదిమందిని ఆర్థిక, సాంఘిక సమితి ఎన్నుకొనుచున్నది. వీరి పదవీ కాల పరిమితి మూడు సంవత్సరములు. 1973 లో ఎన్నుకొనబడిన అట్టి ముప్పదిమంది సభ్యులలో ఇండియా చేరియున్నది. కార్యనిర్వాహకమండలి పర్యవేక్షణకు లోబడి నిధియొక్క దైనందిన కార్యకలాపములను డైరెక్టరు నిర్వహించును. ఇతనిని, కార్యనిర్వాహకమండలి సలహా సంప్రతింపులతో, ఐ. రా. ప్రధాన కార్యదర్శి నియమించును. ఐ. రా. శిశునిధి ముఖ్య కార్యాలయము న్యూయార్కున ఉన్నది. దీనికి సాయపడుటకై ప్రపంచమున వివిధ ప్రాంతములలో 36 ప్రాంతీయ కార్యాలయములును, స్థానిక కార్యాలయములును పనిచేయుచున్నవి.

తన కార్యక్రమ నిర్వహణమున, కొన్ని రంగములలో, ప్రపంచ ఆరోగ్యవ్యవస్థ మొదలగు కొన్ని అంతర్జాతీయ సంస్థలతో కలసిమెలసి ఐ రా. శిశునిధి వ్యవహరించుచున్నది. శిశునిధి చేయు సహాయము దేశమున సక్రమముగ వినియుక్తమగునటుల చూచుటలో ఆయా దేశములందలి కొన్ని ప్రముఖ స్వచ్ఛంద సంస్థలు గణనీయ పాత్రను నిర్వహించుచున్నవి. శిశునిధి నిర్వహించు సాహాయ్య కృషిలో ఆయా దేశముల ప్రభుత్వములును శ్రద్ధతో పాల్గొనవలయునను సంకల్పముతో "అనురూప నిధి" (మేచింగ్ ఫండ్స్) పద్ధతిని ఐ. రా. శిశునిధి రూపొందించినది. అందువలన ఒక దేశమునందు ఒక ప్రత్యేక కృషికై శిశునిధి వెచ్చించు ప్రతియొక రూప్యమునకును, 2.50 రూ.లను ఆ దేశపు ప్రభుత్వము వెచ్చించుట ఒక నియమముగ ఏర్పడినది.

ప్రభుత్వములును, వైయక్తిక సంస్థలును, వ్యక్తులును, స్వచ్ఛందముగ ఇచ్చెడు విరాళముల మీద ఆధారపడి ఐ. రా. శిశునిధి వ్యవహరించుచున్నది. కాని నిధియొక్క కార్యకలాపములు విస్తృతములైనకొలది వ్యయము సైతము పెరుగుచున్నది. 1975 లో ఈ శిశునిధి కార్యకలాపములకై 10 కోట్ల డాలర్లు చేకూర్చవలసిన అవసరము కలుగగలదని కార్యనిర్వాహకమండలి అంచనా.

దాదాపుగ 120 వర్ధమాన దేశములలో ఐ. రా. శిశునిధి, ప్రస్తుతమున, తన కృషిని సాగించు చున్నది. ఈ దేశములందలి శిశుసంఖ్య 100 కోట్లకు పైగా ఉన్నది. 1980 నాటికి ఐ. రా. నిధి సాహాయ్యమును స్వీకరించు శిశుసంఖ్య 130 కోట్లు కావచ్చునని అంచనా.

ఐ. రా. శిశునిధి కృషిలో ముఖ్యమయినది మాతా, శిశువుల ఆరోగ్య రక్షణ. ఇందులకై ఆ యా దేశములందు మాతా, శిశు ప్రాథమికారోగ్య కేంద్రములను విరివిగ నెలకొల్పుటలోను, వానికి తగిన పరికరములను సమకూర్చుటలోను, మాతా, శిశువులకు ఆవశ్యకములగు ఓషధులు, పాలపొడి, విటమిన్లు, సబ్బులు మొదలగువానిని అందించుట లోను శిశునిధి ఎక్కువగ సాయపడుచున్నది. ఇంతేగాక ఇట్టి కేంద్రముల నిర్వహణకై అచట పనిచేయగోరువారికి తగు శిక్షణను శాస్త్రీయరీతిలో కల్పించుటయందును, కొలది సంవత్సరములనుండి, శిశునిధి శ్రద్ధవహించుచున్నది.

ఎదిగెడు శిశువులను సర్వసాధారణముగ ఎదు ర్కొను జఠర, ఆంత్ర సంబంధములగు జాడ్యము లను నిర్మూలించుటకై, పరిసరముల పారిశుద్ధ్య మును సమకూర్చుటలో సైతము ఐ. రా. శిశునిధి ఎంతయో కృషిచేయుచున్నది.

భావి ప్రపంచమును సౌఖ్యమయము చేయుటలో అత్యంత ప్రముఖపాత్రను నిర్వహించు కుటుంబ నియంత్రణ కార్యక్రమమునుగూడ 1967 మొదలుగ ఐ. రా. శిశునిధి చేపట్టినది. ప్రస్తుతమున ఇండియా, మలేసియా, పాకిస్తాన్, బంగ్లాదేశ్, సింగపూర్, తాయిలాండ్, ఈజిప్ట్, దక్షిణ కొరియా, ఇండో నీసియా, ఫిలిప్పీన్‌లలో, ఆ యా దేశ ప్రభుత్వము లతో సహకరించుచు, కుటుంబ నియంత్రణ రంగ మున ఐ. రా. శిశునిధి కృషిచేయుచున్నది.

# 17. ఐ. రా. కాందిశీకుల హైకమీషనర్ (UNHCR)

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలమున స్వదేశ ములనుండి నిర్వాసితులైనవారికిని, దేశమున నుండియు యుద్ధఫలితముగ బ్రతుకుతెరువు కోల్పో యిన వారికిని సహాయపడు నిమిత్తమై ఐ. రా. సాహాయ్య పునరావాస నిర్వహణసంస్థ (UNRRA) నవంబరు 9, 1943 న, సంస్థాపితమైనది. తదనంత రమున 1946 లో అంతర్జాతీయ కాందిశీక వ్యవస్థ (I. R. O.) అనునదియు ఐ. రా. స. చే సంస్థా పితమై దానికే తొలుతటిదాని బాధ్యతలును అప్ప గింపబడినవి. ఈ అంతర్జాతీయ కాందిశీక వ్యవస్థ సాగించిన కృషిఫలితముగ 1951 అంతమగు నప్పటికి దాదాపు 30 లక్షలకుపైగా కాందిశీకులకు పునరావాస సౌకర్యము చేకూరుటయేగాక, దేశాం తర గతులగు లక్షలకొలది తక్కిన కాందిశీకులకును ఏదియో విధముగ కొంత సహాయము లభించినది. అంతట అంతర్జాతీయ కాందిశీక వ్యవస్థ రద్దుచేయ బడినది. కాని కాందిశీక సమస్య మాత్రము, చాల వరకు, అపరిష్కృతముగ నిలిచియుండినది. అట్టి పరిస్థితులలో కాందిశీకులకు ఏ కొలదిగనైన సహాయ మును కొనసాగించవలసిన బాధ్యతను గుర్తించి, ఐ. రా. స. సాధారణసభ, 1949 డిసెంబరులో, తాత్కాలికముగ, ఆ విధినిర్వహణకై, ఒక హై కమీషనర్‌ను నియమించినది. ఆ తరువాత 1951, జనవరి మొదలుగ మూడు సంవత్సరములు ఆ పదవి కొనసాగవలెనని నిర్ణయింపబడినది; కాని అంతటంతట క్రొంగొత్తగ కాందిశీక సమస్యలు

బయలుదేరుటవలన ఈ ఉద్యోగపదవిని రద్దు చేయుటకు వలనుపడినదికాదు; కావున ఆ పదవీ కాలమును పొడిగించుచు కొనసాగించవలసి వచ్చినది. ముఖ్య కార్యదర్శి సూచనలను పరిశీలించి, ఐ రా.స. సాధారణ సభ్యులు ఎన్నుకొనిన వ్యక్తి ఈ హైకమీషనరు పదవికి నియమితుడగుచున్నాడు. ప్రస్తుతపు హై కమీషనర్ 1972 లో ఎన్నికయ్యెను ఈతని పదవీ కాలపరిమితి మూడేండ్లే అయినను, 1975 లో మరల మూడేండ్లు పొడిగింపబడినది.

ఐ. రా. కాం. హై కమీషనరుయొక్క కేంద్ర కార్యాలయము జెనీవాలో ఉన్నది. యూరపునకు సంబంధించిన శాఖా కార్యాలయములు ఆస్ట్రియా, బెల్జియం, లగ్జెంబర్గ్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, గ్రీస్, ఇటలీ, నెదర్‌లాండ్స్‌లలో పనిచేయుచున్నవి. మధ్య ప్రాచ్యశాఖ కైరోలోను, దానికి అనుబంధమగు ఆఫ్రికా ప్రాంతీయ కార్యాలయము అడ్డిస్ అబాబాలోను ఉన్నవి. లాటిన్ - అమెరికాలోను యు. స్టే. లోను శాఖా కార్యాలయములు పనిచేయుచున్నవి దూర ప్రాచ్యమున హాంగ్‌కాంగ్‌లో ఒక కార్యాలయము కలదు; కాని దీనిపై యూరపీయ పునరావాస అంతః ప్రభుత్వ కమిటీకి కూడ సంయుక్తాధిపత్యము కలదు.

ఐ. రా. స బడ్జెటులోనే ఒక అంతర్భాగముగ ఐ. రా. కాం. హైకమీషనరునకు సంబంధించిన బడ్జెటు పరిగణింపబడుచున్నది. అయినను ఐ. రా. సాధారణసభ అనుమతినిపొంది ప్రభుత్వముల నుండియు, వైయక్తిక వ్యవస్థలనుండియు విరాళములను హైకమీషనరు సేకరింపవచ్చును.

1951 లో ఈ హైకమీషనరు కార్యాలయము నెలకొల్పబడునప్పటికి, దాని పరిధికి లోనైన కాందిశీకుల సంఖ్య దాదాపు 20 లక్షలు. ఇందులో యూరపునకు సంబంధించినవారు దాదాపు 1,20,000. హైకమీషనరు సాగించిన కృషి ఫలితముగను, పశ్చిమ జర్మనీ, మొదలగు కొన్ని దేశములు ప్రదర్శించిన సహకారమువలనను 1965 ముగియునప్పటికి యూరపీయ కాందిశీక సమస్య పరిష్కృతమైనది. కాని, తక్కిన ప్రదేశములకు సంబంధించిన సమస్య అంత సులభముగ పరిష్కరింపబడుటకు వలను చిక్కినదికాదు. ఈ తక్కిన వారిలో ఆఫ్రికాకు చెందినవారు 1970 నాటికి దాదాపు పది లక్షలకు పైగా నుండిరి.

ఆఫ్రికాలో 1957 మొదలుగ 1962 వరకు సాగిన అల్‌జీరియా విమోచనోద్యమము, ఆ ఖండములోని రువండా - ఉరుండీ ప్రాంతము ద్విధావిభక్తమగుటతో 1961 మొదలుగ సాగిన అంతఃకల్లోలములు, సుడాన్‌లో అరబ్ - ఆఫ్రికన్ తెగలమధ్య 1969 లో సాగిన సంఘర్షణ, పోర్చుగల్‌కు చెందిన ఆఫ్రికన్ వలస ప్రాంతములలోని స్వాతంత్ర్యోద్యమములు, ఆఫ్రికాలో కాందిశీకుల సంఖ్య అంతటంతట విస్తృతముగ పెరుగుటకు తోడ్పడినవి. ఇప్పటికిని ఇందు అత్యధిక సంఖ్యాకుల పునరావాస సమస్య అపరిష్కృత మగుటవలన, వీరి జీవితసమస్యలయెడ ఐ. రా. కాం. హైకమీషనరే శ్రద్ధవహించుచున్నాడు.

చీనాలో ముఖ్య భూభాగము కమ్యూనిస్టుల వశమగుట, టిబెట్ దేశపు పరిమిత స్వయం పరిపాలనా ప్రతిపత్తిని చీనా ప్రభుత్వము అంతమొందించుట, బంగ్లాదేశపు స్వాతంత్రోద్యమమును పాకిస్తాన్ దౌర్జన్య మార్గమున అణచివేయ ప్రయత్నించుట అను సంఘటనలవలన ఆసియాలో కాందిశీక సమస్య రేకెత్తి, దాని విషయమై ఐ. రా. కాం. హైకమీషనరు సాహాయ్య కార్యక్రమమును అమలు జరుపవలసివచ్చినది. ఇందు బంగ్లాదేశపు సమస్య మాత్రమే ఇప్పటికి పరిష్కృతమైనది.

1965 లో క్యూబాలో కమ్యూనిస్టు ప్రభుత్వమేర్పడినప్పుడు, అటనుండి పలువురు పారిపోయి వచ్చి లాటిన్ - అమెరికా దేశములలో చేరుటతో

ఆ కాందిశీకుల సమస్యను ఐ. రా. కాం. హైకమీష నరు ఎదుర్కొన వలసివచ్చెను.

ఇజ్రాయెల్ రాజ్యము, ఏర్పడిన ఫలితముగ 1949 మొదలుగ పాలస్తీనా కాందిశీకుల సమస్యయు ఐ.రా.స ను ఎదుర్కొనినది. ఆ కాందిశీకులకొరకై ఒక ప్రత్యేక సంస్థను - ఐ. రా. సాహాయ్య కృషి సంస్థ (UNRWA) అనుదానిని - ఐ. రా. స. నిర్మించినది.



# 18. ఐ. రా. విద్యా, విజ్ఞాన, సంస్కృతి వ్యవస్థ (UNESCO)

విద్యా, విజ్ఞాన, సంస్కృతి రంగములలో అంతర్జాతీయ సహకారమును పెంపొందించు కృషి ఏ కొలదిగనో, నానాజాతి సమితి కాలముననే, కొంత సాగినను, అది ప్రపంచ వ్యాప్తముగ గాఢ రీతిలో పెంపొందించుటకు అనువగు యంత్రాంగ మును సృజించుటకు తగు అవకాశముగాని వసతులు గాని ఆనాడు లేకుండినవి. ఐ. రా. స. నిర్మాణ కాలమున అట్టి యంత్రాంగమును సృజింపవలసిన ఆవశ్యకతను పలువురు ప్రముఖులు స్పష్టమొనర్చిరి. అంతట గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్సుల ఆహ్వానమును పురస్కరించుకొని, ఐ. రా. స. నిర్మాణమున పాల్గొనిన 51 రాజ్యములలో 47 రాజ్యముల ప్రతి నిధులు లండన్‌లో 1945, నవంబరున సమావేశ మైరి. ఆ సమావేశమున ఆమోదింపబడిన ఒక సంవిధానమును ప్రాతిపదికగ గ్రహించి నవంబరు 4, 1946 న ఐ. రా. విద్యా, విజ్ఞాన, సంస్కృతి వ్యవస్థ రూపొందినది.

విద్యా విజ్ఞాన సంస్కృతి రంగములందు ప్రపంచ దేశములమధ్య సన్నిహిత సహకారమును పెంపొందించి తద్వారా ప్రపంచమున శాంతి భద్ర తల నెలకొల్పుటను ఐ. రా. మూలశాసనమున ప్రసక్తితమగురీతిగ జాతి, లింగ, మత, భాషా వివక్షత లేకుండ ప్రజలకందరకు ప్రాతిపదిక స్వాతంత్ర్యములను, మానవ స్వత్వములను చేకూర్చి న్యాయ ధర్మయుత వ్యవహారణయెడ సర్వత్ర ఆదరము చేకూరజేయుటను ఈ వ్యవస్థ తన ఆశయములుగ ఇడుకొనినది.

విద్యారంగమున ఈ వ్యవస్థ (1) విద్యా పరిధిని విపులతర మొనర్చుట (2) విద్యా స్థాయిని పెంపొందించుట (3) వసుధైక జాతిగ మనగలు గుటను నేర్పెడు విద్యను ప్రోత్సహించుట - అను మూడు లక్ష్యములతో వ్యవహరించుచున్నది. మౌలిక విద్యా, సాంకేతిక విద్యలందు సుశిక్షితు లగువారిని తయారుచేయుటకై ప్రాంతీయ, జాతీయ శిక్షణ కేంద్రములను నెలకొల్ప ఐ. రా. వి. సం. వ్యవస్థ సంకల్పించినది. ఇప్పటికి లాటిన్ అమె రికాకై మెక్సికోలోను, అరబ్ రాజ్యములకై ఈజిప్టు లోను ఇట్టి కేంద్రములు ఆరంభితములైనవి.

విజ్ఞాన రంగమున అంతర్జాతీయ స్థాయిలో వైజ్ఞానిక సహకారమును పెంపుజేయుటను, మానవ జీవిత పరిస్థితులను చక్కబరుచుటకు అనుకూలించు వైజ్ఞానిక విషయములలో పరిశోధనను గాఢతరము చేయుటను తన ధ్యేయములుగ గ్రహించి ఐ. రా. వి. సం. వ్యవస్థ పనిచేయుచున్నది. ఇందులకు అనువుగ మాంటివిడో, కైరో, న్యూఢిల్లీ, జకర్తాలలో వైజ్ఞానిక సహకార కార్యాలయములు నెలకొల్ప బడినవి.

అంతర్జాతీయ స్థాయిలో వార్తా పత్రికలు, ఫిలు ములు, రేడియో ప్రసార సేవలు ప్రయోజనకర రీతిలో వికసన మొందుటకు తగు పరిశోధనను

సాగింపజేసి, అవసరమగు సలహాలను ఆయా దేశీయ సంస్థలకు అందజేయుచు, సంస్కృతి రంగమున ఐ. రా. వి. సం. వ్యవస్థ కృషిచేయుచున్నది.

ఐ. రా. సభ్యదేశము ఏదియైనను ఐ. రా. వి. సం. వ్యవస్థలో సభ్యత్వమును ఆర్జించు అర్హతను కలిగియున్నది. ఐ. రా. లో సభ్యత్వము లేని దేశమైనను కార్యనిర్వాహకమండలి ఆమోదముతో సభ్యత్వమును పొందవచ్చును; కాని అందులకు సాధారణ సమ్మేళమున మూడింట రెండువంతుల సభ్యులు తమ ధ్రువీకరణను తెలియజేయవలయును. ఐ. రా. వి. సం. వ్యవస్థయందలి ఇప్పటి సభ్యసంఖ్య 126 (1973). ఇందు భారతదేశమునకు సభ్యత్వము కలదు.

ఐ. రా. స. కు అనుబద్ధమయ్యును, ఈ వ్యవస్థ స్వయంపాలనా ప్రతిపత్తిని కలిగియున్నది. సాధారణ సమ్మేళనము, కార్యనిర్వాహకమండలి, సచివాలయము అను మూడు ముఖ్యాంగములు ఇందు కలవు. వ్యవస్థయందలి సభ్యదేశములలో ప్రతియొక దానికిని సాధారణ సమ్మేళనమున ప్రాతినిధ్యము కలదు. సభ్యరాజ్యమునకు సమ్మేళమున ఉండునది ఒక వోటు మాత్రమే అయినను, ప్రతినిధులను మాత్రము అయిదుగురిని ఆ రాజ్యము పంపవచ్చును. ఆ ప్రతినిధులను, నిర్ణయించుటలో ఆ రాజ్యమునందలి విద్యా, వైజ్ఞానిక, సంస్కృతి సంస్థలతో ప్రభుత్వము సంప్రతించి తీరవలయునను నియమము కలదు. 1946 నుండి 1952 వరకు సంవత్సరమున ఒకసారి సాధారణ సమ్మేళనము జరిగినది; కాని ఆ తరువాత రెండేళ్లకొకసారి, అనగా క్రైస్తవ శకపు సరిసంఖ్యా సంవత్సరమున మాత్రమే, సమ్మేళనము జరుగవలయునను నియమము ఏర్పడినది.

సాధారణ సమ్మేళనము ఎన్నుకొనిన 34 మంది సభ్యులు కార్య నిర్వాహకమండలిగ రూపొంది వ్యవహరింతురు. ఈ మండలి సభ్యుల పదవీ కాల పరిమితి 6 ఏండ్లు. ఇండియా ప్రతినిధి ఈ మండలి ఉపాధ్యక్షులలో ఒకరుగ ప్రస్తుతమున వ్యవహరించుచున్నాడు. దైనందిన కార్య నిర్వాహణను సాగించునది సచివాలయము. కార్యనిర్వాహకమండలి నియమించు డైరెక్టరు - జనరలు ఆధ్వర్యవమున సచివాలయము పనిచేయును.

ఐ. రా. వి. సం. వ్యవస్థ ముఖ్యకార్యాలయము పారిస్‌లో ఉన్నది. ప్రాంతీయ కార్యాలయములు హవానా (క్యూబా), సాంటియాగో (చిలీ) లలో కలవు. వైజ్ఞానిక, సాంకేతిక ప్రాంతీయ కేంద్రములు అరబ్ రాజ్యములందును, ఆగ్నేయాసియాలోను, ఆఫ్రికాలోను నిర్వహింపబడుచున్నవి; ఒక విజ్ఞానశాస్త్ర వికసన కేంద్రము లాటిన్ అమెరికాలో నడుపబడుచున్నది. వైజ్ఞానికవేత్తల వినిమయమును, నూత్న విశేషములను ఆయా దేశములకు అందజేయుటను, పరికరములను సరఫరా చేయుటను ఈ కేంద్రములు నిర్వహించుచున్నవి.

ఐ. రా. వి. సం. వ్యవస్థకు సాయపడుటకై కొన్ని దేశములందు జాతీయ కమీషనులు పనిచేయుచున్నవి. తమ దేశములందలి విద్యా, విజ్ఞాన, సంస్కృతి రంగముల వికసనమును గురించి ఐ. రా. వి సం. వ్యవస్థకు యథార్థ సమాచారమును ఇవి అందజేయుచున్నవి.

సభ్యరాజ్యముల విరాళములే ఈ వ్యవస్థయొక్క ఆర్థిక ప్రతిపత్తికి మూలాధారములు. ఐ.రా.స. విషయమున జరుగునటులే, సభ్యరాజ్యముల సమర్థతను అనుసరించి ఈ విరాళములు నిర్ణయింపబడుచున్నవి. వ్యవస్థయొక్క బడ్జటు రెండేండ్లకు ఒక్కసారిగ ఆమోదితమగుచున్నది. 1972 లో ఆమోదింపబడిన బడ్జెట్ వ్యయము 5.198 కోట్ల డాలర్లు.

# 19. అంతర్జాతీయ ద్రవ్యనిధి (IMF)

1930 ప్రాంతమున ప్రపంచ ఆర్థిక వ్యవస్థను కల్లోతముచేసిన ఆర్థిక, ద్రవ్య మాంద్యస్థితి పునరావృత్తము కాకుండ చూచుటకై 1943 లో యు. స్టే, గ్రేట్ బ్రిటన్‌లకు చెందిన ఆర్థిక శాస్త్ర ప్రముఖులు విభిన్న ప్రణాళికలను తయారుచేసిరి. తదనంతరమున యు. స్టే. లోని బ్రెట్టన్ వుడ్స్‌వద్ద, అప్పటి యు. స్టే. అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ పంపిన ఆహ్వానమును పురస్కరించుకొని, 44 ఐక్యరాజ్యముల ప్రతినిధులు జులై 1-22, 1944 న సమావేశమును జరిపి, ఆ ప్రణాళికలను, తదితర సూచనలను చర్చించిరి. ఆ చర్చల ఫలితముగ డిసెంబరు 27, 1945 న అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థాపితమైనది.

అం. ద్ర. నిధి ఉద్దేశములను సంక్షిప్తముగ ఈ దిగువరీతిలో తెలుపవచ్చును.

1. అంతర్జాతీయ స్థాయిలో ద్రవ్య విషయమున సహకారమును పెంపొందించుట 2. అంతర్జాతీయ వ్యాపారము సముచిత, సౌష్టవరీతిలో విస్తరించు అవకాశములను కలుగజేయుట 3. సభ్యరాజ్యములమధ్య వినిమయ స్థిరతను అభివృద్ధిచేసి, వినిమయపు ఏర్పాట్లు వడిదుడుకులకు లోనుగాకుండ నిలుపుటలో శ్రద్ధవహించి, తమతమ ద్రవ్యముల విలువలను, పోటీలుపడి, తగ్గించుకొను దురలవాటును దేశములు వదలుకొనునటుల చూచుట 4. సభ్యరాజ్యముల లావాదేవీలలో చెల్లింపులకు చెందినంతవరకు బహుపక్ష విధానమును ఏర్పరచి, విదేశీయ ద్రవ్య వినిమయమున అవరోధములను తొలగించి, ప్రపంచ వ్యాపారము చక్కగ విస్తరించునటుల చూచుట 5. చెల్లింపుల నిలువల విషయమున ఇబ్బందులకు లోనగు సభ్యరాజ్యములకు నిధినుండి తగు ఋణసహాయమును, కట్టుదిట్టపు రీతిలో, కల్పించి, ఆర్థిక అస్తవ్యస్తతకు తావులేకుండ చేయుట

ఐ. రా. సభ్యత్వముకల రాజ్యమైనను, అట్టి సభ్యత్వములేని రాజ్యమైనను, పాలకమండలి విధించు నియమములకు అంగీకరించునెడల ఈ నిధియందు సభ్యత్వమును పొందవచ్చును. ప్రస్తుతమున అందలి సభ్యసంఖ్య 128 (1976). సోవియట్ వర్గమునకుచెందిన రాజ్యములును, స్విజర్‌లాండ్‌వంటి కొన్ని తదితర రాజ్యములును నిధియందు సభ్యత్వమును పొంద నిరాకరించినవి.

అం. ద్ర. నిధి తన ఆర్థిక ప్రతిపత్తికొరకై సభ్యరాజ్యముల విరాళములపైనను, ఋణ సహాయముపైనను ఆధారపడియున్నది. ఒక సభ్యరాజ్యము చెల్లింపవలగు విరాళమును, నిర్ణయించుటలో రాజ్యముయొక్క జాతీయాదాయమును, బంగారపు నిలువను, పరివర్తనీయపు కరెన్సీ నిలువలను, ఎగుమతి దిగుమతుల మొత్తమును లెక్కలోనికి తీసికొనబడుచున్నవి. ఇటుల నిర్ణయింపబడు విరాళములే 'కోటా'లు అని వ్యవహరింపబడుచున్నవి. ఈ కోటాయొక్క పరిమాణమునుబట్టియే ఆయా సభ్యరాజ్యమునకుగల వోట్ల సంఖ్య నిర్ణయింపబడుచున్నది. 1973 ఆరంభమున ఈ కోటాల మొత్తపు విలువ 2916.86 కోట్ల డాలర్లు.

అం. ద్ర. నిధిపై సర్వాధికారములను వహించునది పాలకమండలి (బోర్డ్ ఆఫ్ గవర్నర్స్). ఇందు సభ్యరాజ్యములకు అన్నింటికిని ప్రాతినిధ్యము కలదు. ప్రతి సభ్యరాజ్యమునకును మౌలికముగ 250 వోట్లును, ఇదిగాక తాను చెల్లించు కోటాలో ప్రతి లక్ష డాలర్లకు ఒక వోటు చొప్పున అదనపు వోట్లును, కలిగియుండు హక్కు కలదు. ఇందు

వలన ఎక్కువ కోటాను చెల్లించిన రాజ్యమునకు ఎక్కువ వోటింగ్ సమర్థతయు, తత్ఫలితముగ నిధిపై ఎక్కువ అధికారమును లభించుచున్నవి. ఈ ఏర్పాటువలన మొత్తపు వోట్లలో దాదాపు 20% యు. స్టే. కే ఈనాడు చెందియున్నవి. ఇండియాకు గల వోటు సమర్థత దాదాపు 3% మాత్రమే.

పాలకమండలిచే దత్తములగు అధికారములను పురస్కరించుకొని అం. ద్ర. నిధి వ్యవహారములపై సాధారణాధికారమును నెరపువారు కార్య నిర్వాహక డైరెక్టరులు. వీరు ఇరువదిమంది. దైనందిన పరిపాలనా వ్యవహారములకు అన్నింటికిని వీరు బాధ్యులు. అం. ద్ర. నిధియొక్క కేంద్ర కార్యాలయమున, అవసరమైనపుడెల్ల, వీరు సమావేశమయి నిర్ణయములను తీసికొనెదరు. అం. ద్ర. నిధికి ఎక్కువ కోటాలను చెల్లించు అయిదు రాజ్యములు - యు. స్టే, గ్రేట్ బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, ఇండియా అనునవి - తలకొక డైరెక్టరును ఇందు నియమించును. ఇటలీ దేశపు ద్రవ్య ప్రతిపత్తినిబట్టి ఆ దేశము సైతము ఒక డైరెక్టరును నియమించు అధికారము దానికి ప్రత్యేకముగ కల్పింపబడినది. తక్కిన 14 డైరెక్టరులను, మిగిలిన సభ్యరాజ్యములు ఎన్నుకొనును. ఇటుల ఎన్నికైన డైరెక్టరునకు, తనను ఎన్నుకొనిన రాజ్యముల వోట్లు అన్నియు దక్కి, వానిని ఉపయోగించు సమర్థత లభించును.

కార్యనిర్వాహక డైరెక్టరులచే నిర్ణయింపబడు మేనేజింగ్ డైరెక్టర్, వారి పర్యవేక్షణకు లోబడి, నిధియొక్క కార్యకలాపములను నిర్వహించును. అతని పదవీకాల పరిమితి అయిదు సంవత్సరములు. కార్యనిర్వాహక డైరెక్టర్ల సమావేశమునకు ఇతడు అధ్యక్షత వహించును; కాని వోటు హక్కులేదు. అయినను ఒక తీర్మానముపై డైరెక్టరులలో ఉభయ పక్షములందు సమాన సంఖ్యలలో వోట్లు వచ్చినపుడు నిర్ణయపు వోటును ఇచ్చు అధికారము మాత్రము అతనికి కల్పింపబడినది.

అం. ద్ర. నిధియొక్క శాశ్వత కార్యాలయము వాషింగ్టన్ నగరమున కలదు. వివిధ దేశములకు చెందిన దాదాపు 1300 మంది ఉద్యోగులు అందు పనిచేయుచున్నారు.

అం. ద్ర. నిధియందలి ప్రతి సభ్యరాజ్యమును తన చెలామణీ ద్రవ్యమునకు వినిమయపు రేటును (బంగారపు లెక్కలోగాని, యు. స్టే. డాలర్ల లెక్కలోగాని) కచ్చితముగ నిర్ణయించి, దానిని స్థిరముగ ఉంచుటకు బద్ధత వహింపవలసి ఉన్నది. ఇటుల నిర్ణయింపబడిన రేటునకు 10% నకు మించి మార్పును ఆ సభ్యరాజ్యము తేదలచినయెడల అందులకు అం. ద్ర. నిధియొక్క అనుమతిని విధిగ పొందవలయును. సభ్యరాజ్యము, తన ఎగుమతుల తగ్గుదలవలన, తాత్కాలిక ఇబ్బందులకు లోనైనపుడు తన కోటాలో 50% వరకును, నరకుల నిలువకై 50% కోటా వరకును మొత్తములను తీసికొని వాడుకొనవచ్చును. నిర్ణయింపబడిన ఒక మొత్తమును మించకుండ విదేశీయ కరెన్సీని, ఒక సభ్యరాజ్యము నిధినుండి కొనుగోలుచేసి, దాని విలువను తన నాణెములో నిధికి చెల్లించుటకును వసతి కలదు. సభ్యరాజ్యముల మూలధనపు నిలువలు తగ్గిపోయినపుడు వానిని సరిచేసికొనుటకై ప్రత్యేకరీతిలో పెద్ద మొత్తములను తీసికొని, కొంత కాలము తరువాత చెల్లించివేయు అవకాశములు సైతము జులై 28, 1969 నుండి అమలులోనికి కొనిరాబడినవి. వీనినే ప్రత్యేక సంగ్రహణ స్వత్వములు (స్పెషల్ డ్రాయింగ్ రైట్స్) అని వ్యవహరించుచున్నారు. దీనివలన 1969 నుండి 1972 వరకు 950 కోట్ల డాలర్ల ధనము సభ్యరాజ్యములకు ఋణరూపమున ఈయబడి, తరువాత వసూలు చేయబడినది.

ఇటుల ప్రపంచ ఆర్థిక పరిస్థితిని వడిదుడుకుల నుండి కాపాడుటకు అం. ద్ర. నిధి కృషిచేయు చున్నను, 1972 తరువాత పరిస్థితి కొంత క్లిష్టతను పొంది, దానిని ఆ నిధిసైతము, ప్రస్తుతమున, చక్క జేయజాలకున్నటుల 1973 నకు చెందిన అం. ద్ర. నిధి నివేదిక స్పష్టము చేయుచున్నది. 1973 లో యు. స్టే డాలరు సైతము తన విలువను కొంత కోల్పోయినది అంతట కొన్ని పారిశ్రామిక దేశ ములు తమ ద్రవ్య వినిమయపు రేటును గాలి వాటము (ఫ్లోటింగ్) నకు వదలివేసినవి. అం. ద్ర. నిధియందు సభ్యత్వముకల రాజ్యము ఇటుల చేయ గూడదు; కాని విధిలేక దీనిని ఒక తాత్కాలిక చర్యగ నిధి పాలకమండలి ఆమోదించి తన నిస్సహాయతను వెల్లడించినది. ఇందులకు తోడుగ, పెట్రోలు ఎగుమతిచేయు రాజ్యములు పెట్రోలు ధరను విపరీతముగ పెంచివేయుటవలన ఆ రాజ్యము లందు ద్రవ్యరాసులు, అనుపయుక్తములుగ, పేరు కొని పోయినవి. ఇక తక్కిన వర్ధమాన రాజ్య ములు (ఇండియా వంటివి) పై అంతర్జాతీయ కారణములవలన చెల్లింపుల నిలువల విషయమున పేదవడి ఇబ్బందులకు లోనైనవి.

పై ఇబ్బందులనుండి ప్రపంచ రాజ్యములను - అందున ముఖ్యముగ వర్ధమాన రాజ్యములను - రక్షించు సంకల్పముతో, తక్కువ వడ్డీరేటున, మూడేండ్ల తరువాత చెల్లించివేయు షరతుపై, ఋణసహాయము చేయుటకు అం. ద్ర. నిధి నిర్ణ యించినది (సెప్టెంబరు, 1974).

---

# 20. పునర్నిర్మాణ, వికసన నిమిత్తపు అంతర్జాతీయ బ్యాంకు (IBRD)

## (ప్రపంచ బ్యాంకు)

1944 లో జరిగిన బ్రెట్టన్ వుడ్స్ సమావేశపు ఫలితముగ, అం. ద్ర. నిధితోపాటుగ, ప్రపంచ బ్యాంకు 1945, డిసెంబరు 27 న సంస్థాపితమైనది (చూ : అంతర్జాతీయ ద్రవ్యనిధి పు. 37).

ఈ బ్యాంకు తొలుత స్థాపింపబడినపుడు, యుద్ధకాలపు ఆర్థిక వ్యవస్థను శాంతికాలపు ఆర్థిక వ్యవస్థగ సరళరీతిలో మార్చుటకు కృషిచేయుటయే తన ధ్యేయముగ గ్రహించినది. కాని కాలక్రమ మున పునర్నిర్మాణమునకన్న, ఆర్థికాభివృద్ధికే ఈ బ్యాంకు చేయు కృషియందు ప్రాముఖ్యము లభిం చినది. ఉత్పత్తిని అభివృద్ధి చేయుటకు అవసరమగు పెట్టుబడి సౌకర్యమును సభ్యరాజ్యములకు కల్పించి తద్ద్వారా అంతర్జాతీయ వ్యాపారమున సముచిత మును చిరస్థాయియగు అభివృద్ధిని, అధిక వస్తూ త్పత్తిని, కార్మికులకు ఉన్నత జీవన ప్రమాణ స్థాయిని సాధించుట ఈ బ్యాంకుయొక్క లక్ష్యము. ఒక సభ్యరాజ్యమున తగినంత పెట్టుబడి లభ్యము కానపుడు, దానికి ఋణరూపమున అవసరమగు పెట్టుబడిని ఈ బ్యాంకు సమకూర్చి సాయపడు చున్నది. ఇందలి సభ్య సంఖ్య 126 (1974).

ప్రపంచ బ్యాంకున దాదాపుగ వర్ధమాన రాజ్య ములకు అన్నింటికిని సభ్యత్వము కలదు తక్కిన పారిశ్రామిక దేశములలో, సోవియట్ కూటపు

రాజ్యములును, స్విజర్లండును తప్ప తక్కినవి అన్నియును సభ్యత్వములను కలిగియున్నవి.

ప్రపంచ బ్యాంకుపై సర్వాధికారములును పాలకమండలి (బోర్డ్ ఆఫ్ గవర్నర్స్) అధీనమున ఉన్నవి. ఈ మండలియందు సభ్యరాజ్యములో ప్రతిదానికిని ప్రాతినిధ్యముకలదు. ప్రతి సభ్య రాజ్యమునకును మౌలికముగ 250 వోట్లును, బ్యాంకున కొనుగోలుచేసిన వాటాలనుబట్టి వాటాకు ఒక వోటు లెక్కను, అదనపు వోట్లును కలవు (ఒక వాటా విలువ లక్ష డాలర్లు). పాలకమండలిచే అధికార మొసగబడిన 20 మంది కార్యనిర్వాహక డైరెక్టర్లు బ్యాంకు వ్యవహారములపై అధికారమును నిర్వహింతురు. వీరిలో అయిదుగురిని, ఎక్కువ వోట్లు కలిగిన అయిదు రాజ్యములు - యు. స్టే, గ్రేట్‌బ్రిటన్, పశ్చిమ జర్మనీ, ఫ్రాన్స్, ఇండియా దేశములు - తలకొక ప్రతినిధి చొప్పున నియమించును. తక్కిన సభ్యరాజ్యములు మిగిలిన 15 మంది డైరెక్టరులను ఎన్నుకొనును. ఇటుల ఎన్నికైనవారి పదవీకాలపరిమితి రెండు సంవత్సరములు. వీరిలో ప్రతియొకనికిని తనను ఎన్నుకొనిన దేశముల వోటు సమర్థత అంతయు లభించును. కార్యనిర్వాహక డైరెక్టరులచే ఎన్నుకొనబడిన అధ్యక్షుడు, డైరెక్టర్ల సమావేశమునకు అధ్యక్షత వహించును. అతనికి స్వతః వోటు హక్కు లేకున్నను, చర్చపై జరిగిన వోటింగ్‌లో అనిశ్చిత పరిస్థితి ఏర్పడినపుడు నిర్ణయపు వోటును మాత్రము ఇచ్చుటకు అతనికి అధికారము కలదు. బ్యాంకుదైనందిన వ్యవహార నిర్వహణకు అధ్యక్షుడే బాధ్యుడు. వివిధ దేశములకు చెందిన దాదాపు 2500 మంది ఉద్యోగులు అతనికి విధినిర్వహణలో సాయపడుచున్నారు. బ్యాంకుయొక్క ముఖ్య కార్యాలయము వాషింగ్‌టన్ నగరమున కలదు. కాని వ్యాపార సౌకర్యార్థమై న్యూయార్కున ఒక కార్యాలయము పనిచేయుచున్నది. యూరపు దేశముల సౌకర్యమునకై పారిస్‌లో ఒక కార్యాలయమును, లండన్‌లో ఒక చిన్న కార్యాలయమును నెలకొల్పబడినవి. ఇవిగాక వ్యవహార సౌలభ్యమునకై నైరోబి (కెన్యా), అబిజాన్ (ఐవరీకోస్ట్) లలో శాశ్వత వ్యవహార సంఘములు (మిషన్స్) ను, న్యూఢిల్లీ (ఇండియా), జకర్తా (ఇండోనీసియా), బొగోటా (కొలంబియా), లాగోస్ (నైగీరియా), అడ్డిస్ అబాబా (ఎతియోపియా), కిన్షాసా (జయిరే గణరాజ్యము), ఇస్లామాబాద్ (పాకిస్తాన్), డక్కా (బంగ్లాదేశ్), కాబూల్ (ఆఫ్ఘనిస్తాన్) లలో నివాసక వ్యవహార సంఘములు (రెసిడెంట్ మిషన్స్)ను పనిచేయుచున్నవి.

ప్రపంచ బ్యాంకునకు అధికృతమగు మూలధనము పదివేల కోట్ల డాలర్లు. సభ్యరాజ్యముల వాటాలవలన ఈ ధనము చేకూరవలసె ఉన్నది. వాటా విలువ లక్ష డాలర్లలో 10% మాత్రమే ప్రవేశకాలమున వసూలుచేయబడును; తక్కిన దానిని అవసరమగు సమయమున వసూలు చేయుటకు అధికారము బ్యాంకునకు కలదు. జూన్ 30, 1972 నాటికి వాటాలవలన వసూలయిన మూలధనము దాదాపు 2.5 వేలకోట్ల డాలర్లు. వాటాల సంఖ్యనుబట్టియే ఋణముగ ఈయబడు మొత్తము నిర్ణయింపబడును.

వ్యవసాయము, విద్య, పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, వార్తా సౌకర్యములు, నీటిసరఫరా, మురికినీటి తొలగింపు మొదలగు వానిని చక్కగ అభివృద్ధి పరచుటకై ప్రపంచ బ్యాంకు సభ్యరాజ్యములకు ఋణములను ఇచ్చుచున్నది. జూన్ 30, 1972 నాటికి ఈ కార్యక్రమములకై వివిధ దేశములకు ఋణరూపమున 1829 కోట్ల డాలర్లు ఈయబడినది.

బ్యాంకువలన తమ దేశములందు అభివృద్ధిని సాధించుటకు ఎక్కువ ఋణసహాయమును పొందునవి : కొలంబియా, ఎతియోపియా, ఘానా,

ఇండియా, దక్షిణ కొరియా, మలేసియా, మొరాకో, నైగీరియా, పాకిస్తాన్, పెరూ, ఫిలిప్పీన్స్, శ్రీలంక, సుడాన్, తాయిలాండ్, టునీసియా, జయిరే, కెన్యా, ఉగాండా, టాంజేనియా. ఈ దేశములు తక్కిన అంతర్జాతీయ సంస్థలనుండియు, పారిశ్రామిక దేశములనుండియు వేరు విధమగు సహాయమునుకూడ పొందుచున్నవి. అట్టియెడ ఉభయ రీతుల సహాయములమధ్య పొందికను సాధించుటకై, ప్రతిదేశపు సందర్భమునను, సాహాయ్యక దేశముల సలహా సంఘమును - కన్సార్షియము అని వ్యవహరింపబడుదానిని - ప్రపంచ బ్యాంకు ఏర్పరచినది.

ఆ యా దేశములందు పెట్టుబడికిగల అవకాశములను గురించి ప్రాథమిక పరిశీలనను జరిపి చక్కని నివేదికలను ప్రపంచ బ్యాంకు తయారు చేయించుచున్నది. ఇందువలన ఆ యా దేశములందు వివిధ రంగములలో సాగించవలసిన కార్యక్రమములకై సరియగు అంచనాలను రూపొందించుటకు సౌకర్యము చేకూరుచున్నది. సభ్యరాజ్యములలోని ఉన్నతోద్యోగులకు తగు ప్రవీణతను చేకూర్చుటకై వాషింగ్టన్ నగరమున ఒక శిక్షణ శాలను, ఆర్థికాభివృద్ధి సంస్థను ప్రపంచ బ్యాంకు నిర్వహించుచున్నది.

కొన్ని సభ్యదేశములకుగల విదేశీ ద్రవ్యపు నిలువ అతిస్వల్పమగుటవలన, వానికి ప్రపంచ బ్యాంకున ఋణము ఎక్కువగ లభించుటకు అవకాశము చాల తక్కువగ ఉండి, అవి ఇబ్బందులకు లోనగుటను గమనించి, వాని సౌకర్యముకొరకై అంతర్జాతీయ అభివృద్ధి సంఘము (IDA) అను దానిని ప్రపంచ బ్యాంకు నెలకొల్పినది (1960). వడ్డీ లేకుండ దీర్ఘకాలిక ఋణములను బడుగు దేశములకు ఈ అభివృద్ధి సంఘము ఇచ్చుచున్నది. ఈ విధముగ 1972, జూన్ 30 నాటికి 61 దేశములకు 440 కోట్ల డాలర్లను ఋణముగ ఈ సంఘము ఇచ్చి సహాయము చేసినది.

---

# 21. అంతర్జాతీయ విత్త సంశ్రేణి (IFC)

ప్రపంచ బ్యాంకు పనిచేయుటకు మొదలిడిన తరువాత కొలది సంవత్సరములలోనే, పేదదేశములందలి వ్యక్తిగత పారిశ్రామిక రంగమునకు కావలసిన పెట్టుబడిని సమకూర్చుటలో, ఆ బ్యాంకు ఎట్టి సహాయమును చేయజాలదనుట సువిదితమైనది. వ్యక్తిగత పారిశ్రామిక వ్యవస్థలకు అట్టి సహాయము చేయుట, బ్యాంకు మూలప్రణాళికలయందు, నిషేధింపబడినది. అందువలన ఈ లోపమును పూరించుటకై, ప్రపంచ బ్యాంకుకు అనుబంధముగ, అంతర్జాతీయ విత్త సంశ్రేణి (Internationl Finance Corporation) జులై 24, 1956న సంస్థాపితమైనది.

అభివృద్ధిచెందని ఐ. రా. సభ్యరాజ్యములందలి వ్యక్తిగత పారిశ్రామికరంగపు అభివృద్ధికి, వికసనమునకు తోడ్పడుట ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశముగ పరిగణింపవచ్చును. స్థానికులగు పెట్టుబడిదారులును, యాజమాన్యమును సమకూర్చుదానికి తోడుగ అదనపు మూలధనమును కూర్చుట, పెట్టుబడి మార్కెటులకు ప్రోత్సాహమును కల్పించుట, అంతర్జాతీయ రీతిలో పెట్టుబడిని ఒక దేశమునుండి

మరొక దేశమును చేర్చు వసతులను కల్పించుట - అను కార్యక్రమములద్వారా ఈ సంస్థ తన లక్ష్య సాధనకు కృషి చేయుచున్నది.

ఈ సంస్థయొక్క పాలక వ్యవస్థ ప్రపంచ బ్యాంకుయొక్క పాలక వ్యవస్థను అనుసరించియే ఏర్పడినది. ప్రపంచ బ్యాంకు పాలకవర్గమున సభ్యత్వముగల రాజ్యములలో, ఈ సంస్థయందు సభ్యత్వముకలవి, అన్నియు ఈ సంస్థయొక్క పాలకవర్గమునను సభ్యత్వము కలిగియున్నవి. 1974 లో ఈ సంస్థలోని సభ్యసంఖ్య 98. ఇందు ఇండియాయు చేరిఉన్నది.

ప్రపంచ బ్యాంకుయొక్క పాలకవర్గ సమావేశము జరుగు కాలముననే ఈ సంస్థా పాలక వర్గమును తన వార్షిక సమావేశమును జరపును. పాలక వర్గ సభ్యులు సంస్థయొక్క అధ్యక్షుని ఎన్నుకొనెదరు.

ఈ సంస్థయొక్క అధికృతపు పెట్టుబడి 11 కోట్ల డాలర్లు. సభ్యరాజ్యములనుండి వాటాల ద్వారా ఇది సేకరింపబడుచున్నది. వాటా ధనమునుబట్టి వోటు హక్కునకు పరిమితి నిర్ణయింపబడినది. ఇందు అత్యధికపు పెట్టుబడిని (3.52 కోట్ల డాలర్లు) యు. స్టే. సమకూర్చినది. ఇండియా వాటా 44 లక్షల డాలర్లు. ఈ మొత్తముల పెట్టుబడివలన ఈ సంస్థ విశేషముగ లాభములను ఆర్జించి, దానిని మరల పెట్టుబడిలోనికి మార్చి, తన ఆర్థిక సామర్థ్యమును ఎంతయో పెంపొందించుకొనినది.

జూన్ 30, 1971 నాటికి, ఏ విధపు పెట్టుబడులవలన నైతేనేమి, ఈ సంస్థ 47 దేశములలో 57.8 కోట్ల డాలర్లను పెట్టుబడి పెట్టినది.

ఈ సంస్థయొక్క ముఖ్య కార్యాలయము వాషింగ్‌టన్ నగరమున ఉన్నది.

---

# 22. అంతర్జాతీయ పరివర్ధన సంఘము (IDA)

ప్రపంచ బ్యాంకునకు అనుబంధముగ ఈ అంతర్జాతీయ పరివర్ధన సంఘము (Internationl Development Association) 1960, సెప్టెంబరులో సంస్థాపింపబడినది. విదేశీ ద్రవ్యపు నిలువ అతి స్వల్పముగఉన్న సభ్యరాజ్యములకు ప్రపంచ బ్యాంకున ఋణసౌకర్యము తగినంతగ లభించుటకు అవకాశము లేనందున, ఆ లోపమును పూరించి, బడుగుదేశములకు సాయపడుటకై, యు. స్టే. ప్రోత్సాహ మూలమున ఈ సంస్థ రూపొందింపబడినది (చూ : పు. 41).

ఇందలి సభ్యరాజ్యములలో రెండు కక్ష్యలు కలవు. మొదటికక్ష్యకు చెందినవి 18 రాజ్యములు; ఇవి అన్నియు ఆర్థికముగ సుసంపన్నములు. ఈ రాజ్యములు, తమ వాటా మొత్తమును బంగారమునగాని లేదా స్వేచ్ఛగ పరివర్తనీయమగు చెలామణి ద్రవ్యరూపమునగాని విధిగ చెల్లించి తీరవలెను. ఇక రెండవ కక్ష్యకు చెందినవి 94 రాజ్యములు; ఇవి వర్ధమాన రాజ్యములు. ఈ రాజ్యములు తమ వాటాలో 10% బంగారమునను లేదా స్వేచ్ఛా పరివర్తనీయపు చెలామణి ద్రవ్యమునను చెల్లించవలెను. తక్కినదానిని తమ దేశీయ నాణెమున చెల్లింపవచ్చును. ఇటుల సంస్థ రూపుగొనునాటికి మొదటి కక్ష్య రాజ్యములవలన 75.13 కోట్ల డాలర్లను, రెండవ కక్ష్య వానివలన 26.3 కోట్ల

డాలర్లను వాటాలవలన లభించినది. మొదటి కక్ష్య రాజ్యములలో ఎక్కువ వాటాధనము (32.03 కోట్ల డాలర్లు) యు. స్టే. చెల్లించినది. రెండవ కక్ష్యకు చెందిన రాజ్యములలో ఎక్కువ వాటాధనము (4.035 కోట్ల డాలర్లు) భారతదేశము చెల్లించినది. సభ్యరాజ్యముల వోటు సామర్థ్యములు వాని పెట్టుబడుల నిష్పత్తులలో ఉండును. పై వాటాలవలన వచ్చిన ధనము గాకుండ, సంపన్న కక్ష్యలోని రాజ్యములు అంతటంతట ఇచ్చెడు అదనపు మొత్తములును, సభ్యరాజ్యములుకాని స్విజర్‌లండ్‌వంటివి ఇచ్చెడు సహాయపు మొత్తములును, ప్రపంచ బ్యాంకునుండి బదలాయింపు చేయబడు మొత్తములునుకూడ ఈ సంస్థ తన కార్యకలాపములను సాగించుటకు ఉపయోగపడుచున్నవి.

ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడే ఈ సంస్థకును అధ్యక్షుడుగ వర్తించుచు, తన సిబ్బందిద్వారానే ఈ సంస్థా కార్యకలాపములను నిర్వర్తింపజేయును. అందులకే, మేనేజిమెంటు - రుసుము రూపమున, ప్రపంచ బ్యాంకునకు, అం. ప. సంఘము ఏటేటా కొంత మొత్తమును చెల్లించుచున్నది.

బడుగు దేశములలో క్రొత్త భూములను సాగునకు తెచ్చుట, పాతవానిని అభివృద్ధి చేయుట, రోడ్ల నిర్మాణము, రైలురోడ్ల అభివృద్ధి, హార్బరుల నిర్మాణము, అందలి వసతుల ఏర్పాటు మొదలగు కార్యక్రమములకు, ఋణములను ఇచ్చి ఈ అం. ప. సంఘము సాయపడుచున్నది. ఈ ఋణములకు వడ్డీలేదు. నామమాత్రముగ ఖర్చులకై 3/4% మాత్రము రుసుము వసూలు చేయబడుచున్నది; చెల్లింపు వాయిదా గడువు 50 సంవత్సరములు. ఇట్టి ఋణములవలన సహాయమును పొందిన దేశములలో తైవాన్ ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక, ఈజిప్ట్, ఇండోనీసియా ప్రముఖములు.

జూన్ 30, 1972 నాటికి మొత్తముమీద 61 దేశములకు 440 కోట్ల డాలర్లను ఋణముగ ఈ అం. ప. సంఘము ఇచ్చి సాయము చేసినది.

---

# 23. శుల్క, వ్యాపార సార్వత్రిక సమ్మతి (GATT)

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున వివిధ రాజ్యములు ప్రపంచపు శాంతికొరకై ఐ. రా. స. ను రూపొందించిన కాలముననే, ప్రపంచపు ఆర్థిక వ్యవస్థను, వ్యాపారరీతిని, సర్వదేశముల శ్రేయస్సునకు అనుగుణముగ సువ్యవస్థీకరించు ఆవశ్యకత కలదను విషయము గుర్తింపబడినది. తదనుగుణముగ వివిధ దేశముల మధ్య ఆర్థిక సంబంధ సహకారములకు పరిష్కృత రూపమును కల్పించుటకై అంతర్జాతీయ ద్రవ్యనిధి (IMF), ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ వ్యాపార వ్యవస్థ (ITO) అనునవి ఏర్పరుపబడవలెనని అంగీకరించుటయు జరిగినది. అందు తొలుతటి రెండును రూపుగొనిన తరువాత మూడవ దానిని రూపొందించుటకై హవానాయందు 17 రాజ్యముల సన్నాహక సంఘము ప్రాతిపదిక చర్చలనుజరిపి, ఆ వ్యవస్థ ఆమోదింపనగు ఒక మూల ప్రణాళికను తయారుచేసినది (1948). ఈ మూల ప్రణాళికయందు వ్యాపారావరోధముల తగ్గింపు చర్యలేగాక, గుత్త సంస్థలపై నియమనము మొదలగు కొన్ని వివాదాస్పద విషయములును ప్రసక్తింపబడుటవలన, యు. స్టే. లోని ధనస్వాములలో కొంత కలవరము చెలరేగినది. తత్ఫలితముగ యు. స్టే. ప్రభుత్వపు ఆమోదము

ఈ ప్రణాళికకు లభింపకపోయెను. అందువలన అంతర్జాతీయ వ్యాపార వ్యవస్థా నిర్మాణమే అనిర్దిష్టముగ వాయిదాపడినది.

కాని ఈ హవానా చర్చల కాలముననే సన్నాహక సంఘ రాజ్యములును, మరికొన్ని రాజ్యములును, తాత్కాలికముగ, అంతర్జాతీయ వ్యాపార వ్యవస్థ రూపొందువరకు, తమకుతామే ఒక ఒడంబడిక మూలమున, శుల్కముల నియమనము మొదలగువానిని అమలులోనికి తెచ్చుకొనుట మంచిదను అభిప్రాయమునకు రాగలిగినవి. అందులకు అనుగుణముగ వారు ఒక ఒడంబడికను కుదుర్చుకొనిరి (అక్టోబరు 30, 1947). ఆ ఒడంబడికయే శుల్క వ్యాపార సార్వత్రిక సమ్మతి (General Agreement on Tariffs and Trade - GATT) అనుపేర వ్యవహరింపబడుచున్నది. ఆ ఒడంబడిక జనవరి 1, 1948 నుండి అమలులోనికి వచ్చినది. తొలుత అత్యల్ప సంఖ్యాక రాజ్యముల సభ్యత్వముతో మొదలైన ఈ ఒడంబడికయందు క్రమేణ ఇతర రాజ్యములును చేరుటవలన 1973, సెప్టెంబరునకు ఇందలి సభ్యసంఖ్య 83 అయినది; పూర్తి సభ్యత్వము లేకపోయినను, ఈ ఒడంబడికను ఆమోదించిన ఇతర రాజ్యములు 16 కలవు. ప్రస్తుతమున ప్రపంచపు వ్యాపారమున 80% దీని అధీనమున ఉన్నది. ఈ విధముగ అంతర్జాతీయ వ్యాపార వ్యవస్థ లేనిలోటును ఈ సంస్థ చాలవరకు పూరింపగలిగినది.

ఈ సంస్థ ఒక ఒడంబడికకు ఫలితమే అగుటవలన ఇందలి సభ్యరాజ్యములు ఒడంబడికదారులు (Contracting Parties)అని పేర్కొనబడుచున్నవి. విపరీత శుల్కముల విధింపును, వ్యాపార వస్తువుల రవాణాలోని అవరోధములను తొలగించి, ప్రపంచ దేశములమధ్య వ్యాపారము సుహృద్భావరీతిలో జరుగునటుల చూచుట ఈ ఒడంబడికయొక్క ముఖ్యోద్దేశము. ఈ ఒడంబడికదారులలో ఏ ఒకరును, తక్కిన వారిలో ఏ ఒకరియెడలయైనను పక్షపాతము వహించి, వారికి తన దేశమున వ్యాపార వసతులను, ఇతరులకంటె ఎక్కువగ కల్పింపరాదు. అయినను, చెల్లింపులలోటును ఎదుర్కొనవలసి వచ్చిన సందర్భములలో అట్టి ప్రత్యేక పరిస్థితిని ఎదుర్కొనుటకై ఏదో ఒక రాజ్యమునకు ప్రత్యేక సదుపాయములను కల్పించుటకు ఒక ఒడంబడికదారునకు అనుమతి లభింపగలదు. శుల్కముల విధింపు వివిధ రాజ్యములమధ్య ఇచ్చి పుచ్చుకొను వ్యవహారరీతిలో జరుగగలదు. వేరొక ఒడంబడిక రాజ్యమునకు తన రాజ్యముద్వారా వేరొక రాజ్యపు వస్తువుల ఎగుమతి దిగుమతులు జరుగుటను ఒడంబడిక రాజ్యము నిరోధింపగూడదు. కాని ఏ ఒడంబడిక రాజ్యమైనను తన దేశపు పరిశ్రమలకు భంగముకలుగురీతిలో వేరొక దేశము తన రాజ్యమునకు సరకులను విరివిగ చేర్చుచుండినటుల రుజువుచేసినపుడు, దిగుమతులపై అదనముగ సుంకము విధింపవచ్చును.

పై సామాన్య నియమములను లోబడి ఒక ప్రత్యేక ప్రాంతమునకుచెందిన ఒడంబడికదారులు ప్రాదేశికపు ఏర్పాటులనుకూడ కొన్నింటిని చేసికొనవచ్చును.

ఈ సార్వత్రిక సమ్మతికి చెందిన ఒడంబడికదారుల సమావేశము సంవత్సరమునకు ఒకసారి, కేంద్ర కార్యాలయ స్థానమగు, జినీవాలో జరుగును; అవసరమునుబట్టి ఒక్కొక సంవత్సరమున రెండు సమావేశములును జరుగును. ఒడంబడిక రాజ్యములలో ప్రతి ఒకదానికి ఒకే ఒక వోటు కలదు. సమకాలీన ప్రపంచ ఆర్థిక పరిస్థితిని పర్యావలోకించి, తదనుగుణముగ సార్వత్రిక సమ్మతియందు మార్పులను ఈ సమావేశము కొనివచ్చును. మూడింట రెండువంతుల ప్రాబల్యము ఒక ప్రత్యేక విషయమై రావలయునని మూలపు ఒడంబడికలో సూచింపబడిన సందర్భములందుతప్ప తక్కిన అన్ని సందర్భములందును అధిక సంఖ్యాక ప్రాబల్యము వలననే నిర్ణయములు తీసికొనబడును.

భారతదేశమునకు తొలుతటినుండియు ఇందు సభ్యత్వము కలదు.

---

# 24. అంతర్జాతీయ అణుశక్తి మండలి (IAEA)

1945 ఆగస్టు 6 న జపానునందలి హిరోషిమా నగరముపై అటంబాంబు ప్రయోగింపబడుటతో ప్రపంచ చరిత్రలో ఆణవిక యుగమునకు నాంది పలుకబడినదని చెప్పవచ్చును. తొలుత యు. స్టే. కు మాత్రమే వేద్యమైన ఆణవిక విజ్ఞానమున సోవియట్ రష్యా మొదలగు రాజ్యములును కాలక్రమమున ముందంజ వేసినవి. అణువునందు నిహితమైఉన్న అద్భుతశక్తిని మానవ వినాశమునకై ఉపయోగించు అవకాశముతోపాటుగ, మానవ శ్రేయమునకును దానిని ఉపయోగింప వీలగునని శాస్త్రజ్ఞులు గుర్తించిరి. అట్టి పరిస్థితిలో ఈ శక్తిని మానవ శ్రేయమునకు మాత్రమే వినియోగించు సంకల్పముతో ఐ. రా. స. యొక్క ప్రోత్సాహ, ఆదరణలతో 1957 న అంతర్జాతీయ అణుశక్తిమండలి (International Atomic Energy Agency) ప్రాదుర్భావము నొందినది.

"ఆణవశక్తి, ప్రపంచమందంతట శాంతి, ఆరోగ్య, ఐశ్వర్యముల పెంపుదలకై, వినియుక్తమగునటుల చేయుటకు తీవ్రకృషిని సాగించుచు, అట్టి కృషి ఏ రీతిగను యుద్ధ చర్యలకు సహకారి గాకుండ ఉండునటుల జాగ్రతవహించుట" ఈ మండలి ధ్యేయముగ దాని మూలశాసనమున పేర్కొనబడినది.

ఈ మండలికి ఐ. రా. స. తో సాధికారిక సంబంధము ఎట్టిదియు లేదనియే చెప్పవచ్చును. ఐ. రా. స. యందలి ఒక ఉపాంగముగగాని, దాని ప్రత్యేక ప్రవీణతా మండలు (స్పెషలైజెడ్ ఏజన్సీ) లలో ఒకటిగగాని ఇది పరిగణింపబడుటలేదు. ఐ రా.స. కు చెందిన వివిధ వ్యవస్థల కుటుంబమున ఒక స్వయంపాలనా ప్రతిపత్తిగల సంస్థగ ఇది పరిగణింపదగినది.

నవంబరు 15, 1970 నాటికి ఈ మండలి యందు 103 రాజ్యములు సభ్యత్వము గ్రహించినవి. అందు భారతదేశమును చేరియున్నది.

ఈ మండలియందు సాధారణసభ, పాలకవర్గము, సచిలవాయము అను మూడు ఉపాంగములు కలవు. సాధారణ సభయందు సభ్యరాజ్యములన్నింటికి ప్రాతినిధ్యముకలదు; పెద్ద, చిన్న రాజ్యములను వివక్షతలేకుండ ప్రతి రాజ్యమునకు ఒకే ఒక వోటు కలదు. మూలశాసనమున సవరణను, మూడింట రెండువంతుల ప్రాబల్యముతో సాధారణ సభ ఆమోదించి, అమలులోనికి తేవచ్చును. దైనందిన కార్యనిర్వహణను పాలకవర్గము (బోర్డ్ ఆఫ్ గవర్నర్స్) నిర్వహించును. ఇందలి 25 మంది సభ్యులలో 12 మందిని సాధారణసభ ఎన్నుకొనును. తక్కిన 13 మందిలో అయిదుగురు ఆణవిక విజ్ఞాన సుసంపన్నములగు రాజ్యముల ప్రతినిధులై ఉండవలయును. ఈ స్థానములకు తొలుతటి మండలి ఏర్పడినపుడు కెనడా, ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్, యు. స్టే., సోవియట్ రష్యాల ప్రతినిధులను సన్నాహక సంఘము నియమించినది. వారి పదవీకాల పరిమితి ఒక సంవత్సరమే అయినను, ఆణవిక విజ్ఞానమున వారిదే ఈనాడును అగ్రస్థానమగుటవలన, ఇప్పటికిని ఆ స్థానములందు ఆ రాజ్యముల ప్రతినిధులే కొనసాగుచున్నారు.

తక్కిన 8 స్థానములలో, ప్రాదేశికరీత్యా, ప్రపంచమునందలి ఆయా ప్రాంతములందు ఆణవిక విజ్ఞానమున గాఢపరిచితిని, ఆర్జించగలిగినవానికి అయిదు స్థానములు ప్రత్యేకింపబడినవి. అవి : ఆస్ట్రేలియా (ఆగ్నేయ ఆసియా, పసిఫిక్ ప్రాంతములు), బ్రజిల్ (లాటిన్ అమెరికా ప్రాంతము), ఇండియా (దక్షిణ ఆసియా ప్రాంతము), జపాన్ (దూర

ప్రాచ్య ప్రాంతము), దక్షిణ ఆఫ్రికా (ఆఫ్రికా, పశ్చిమ ఆసియా ప్రాంతము). వీనిలో బ్రజిల్ స్థానమును, అర్జెంటీనాయు పంచుకొనుటవలన, అవి రెండును తలకొక సంవత్సరము చొప్పున వంతుల వారీగా ప్రాతినిధ్యమును కొనసాగించుచున్నవి.

ఇక మిగిలిన వానిలో రెండు స్థానములు, అణవికశక్తి ఉత్పత్తికి సాధనములగు ముడిపదార్థములు కలిగిన దేశములకు - అనగా బెల్జియం, జెకోస్లోవాకియా, పోలండు, పోర్చుగల్ దేశములకు - ప్రత్యేకింపబడినవి. వీనిలో మొదటి రెండును ఒక్కొక సంవత్సరమును, కడమ రెండును ఒక్కొక సంవత్సరమును వంతులవారీగా అందు ప్రాతినిధ్యము వహించుచున్నవి.

పైవి పోను, మిగిలిన ఒక స్థానమును సాంకేతిక సహాయమొసగ సమర్థతగల దేశములగు - డెన్‌మార్క్, నార్వే, స్వీడెన్‌లకు - ప్రత్యేకింపబడినవి. ఈ మూడింటిలో ప్రతిఒకటియు ఒక సంవత్సరము చొప్పున వంతులవారీగా ఆ ప్రాతినిధ్యమును వహించుచున్నవి.

పాలకమండలి ఎన్నుకొనిన డైరెక్టరు-జనరల్, సచివాలయముపై అధ్యక్షత వహించి, పాలక మండలికి బాధ్యుడై దైనందిన వ్యవహారములను నిర్వహించును.

ఆణవిక విజ్ఞానమున వివిధ దేశములు సాధించిన ప్రగతి వివరములను నానా ప్రాంతములనుండి సేకరించి సభ్యరాజ్యములకు అందజేయుట, ఆ విజ్ఞానమును సభ్యరాజ్యములు మానవ శ్రేయస్సునకై వినియోగించునటుల చూచుట - అను కార్యక్రమములను ఈ మండలి నిర్వహించుచున్నది.

కాని 1970 లో ఈ మండలి, కొన్ని అగ్రరాజ్యముల ప్రాబల్యమునకు లొంగి, అణవికాయుధముల వ్యాపన నిరోధపు ఒడంబడిక (Treaty on the Non-Proliferation of Nuclear Weapons) అనుదానిని రూపొందించినది. అణుప్రస్ఫోటనమున, సమధిక విజ్ఞానమును అప్పటివరకు సాధించని దేశములు ఏవియు ఆ ప్రస్ఫోటకమునకు తదనంతరమున సైతము పూనుకొనరాదనుట అందలి సారాంశము. సాధన సంపత్తి రహితములగు కొన్ని సభ్యరాజ్యములు అందులకు అంగీకరించినను, ఫ్రాన్స్‌తోపాటుగ భారతదేశమును ఒడంబడికపై సంతకము చేయుటకు నిరాకరించినది. శాంతియుత ప్రయోజనములకు సైతము అణుప్రస్ఫోటనము చేయవలసిన అవసరము కలదనియు, ఆ హక్కును కొన్ని అగ్రరాజ్యములు మాత్రమే గుత్తకు తీసికొనుటవలన, వివిధ రాజ్యములయెడ వివక్షత చూపినటుల అగుననియు భారతదేశము భావించినది.

ఈ మండలియొక్క ముఖ్యకార్యాలయము అస్ట్రియా దేశమందలి వియెన్నాలో ఉన్నది.

---

# 25. అంతర్జాతీయ పౌర విమానయాన వ్యవస్థ (SCAO)

వివిధ దేశములమధ్య పౌరవిమానయానమును సువ్యవస్థితముచేయు కృషి 1919 లోని పారిస్ కన్‌వెన్షన్‌తో మొదలయ్యెనని చెప్పవచ్చును. ఆనాడు విమానయానము విస్తృత వ్యాప్తము కానందున, చాలవరకు అది యూరపియన్ దేశములకు మాత్రమే పరిమితమై ఉండినది. అటులే పశ్చిమార్థ

గోళమున వివిధ దేశములమధ్య పౌర విమానయానము సువ్యవస్థితము చేయుటకును పాన్ అమెరికన్ కన్‌వెన్‌షన్ అనునది 1928 లో హవానాలో ఆ దేశములచే రూపొందింపబడి, తదాదిగ అమలున ఉండినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున అతి దూరదేశములమధ్య విమానయానము సుసాధ్యమైన ఫలితముగ, యుద్ధానంతరమున ప్రపంచ వ్యాప్తముగ పౌర విమానయానమున కొన్ని ప్రమాణములను, సంప్రదాయములను ఏర్పరచుకొనవలసిన ఆవశ్యకత కలిగినది. అందులకై 1944 న చికాగోలో 54 రాజ్యముల ప్రతినిధులు సాగించిన చర్చల ఫలితముగ జూన్ 6, 1945 మొదలుగ ఒక తాత్కాలిక అంతర్జాతీయ పౌరవిమానయాన వ్యవస్థ రూపొందినది. కాలక్రమమున దాని మూల శాసనమును అనేక ప్రపంచ రాజ్యములు ఆమోదించిన తరువాత అదియే అంతర్జాతీయ పౌరవిమానయాన వ్యవస్థ (Internationl Civil Aviation Organisation) గ పరిణమించినది (ఏప్రిల్ 4, 1947). అంతటితో పారిస్ కన్‌వెన్‌షన్, పాన్ అమెరికన్ కన్వెన్‌షన్ రద్దయినవి.

దేశములను అతిక్రమించి పౌరవిమానములు పోవునపుడు సరిహద్దులవద్ద ఇబ్బందులను సడలింపచేయుట; సాంకేతిక ప్రమాణములను ఏర్పరచి తద్వారా విమానయానమున కుశలతను, భద్రతను పెంపొందింపజేయుట; అంతర్జాతీయ విమానయానమునకు తగు రీతులలో, ఆ యా దేశములందలి విమానాశ్రయములలో, సదుపాయములను, సంసేవా సాధనములను నెలకొల్పజేయుట; విమానయానమునకు సంబంధించిన సంఖ్యా వివరములను నానాదేశములనుండి సేకరించి సభ్యరాజ్యములకు అందజేయుట; ప్రయాణపు రేట్లలో పోటీలవలన ప్రయాణ వ్యవస్థలు నష్టపడకుండ వానిమధ్య సహకారమును పెంపొందజేయుట; విమానయాన శాసన సంప్రదాయములను నెలకొల్పి ఆమోదితములుగ చేయుట; ఐక్యరాజ్యసమితి నిర్వహించు అభివృద్ధి కార్యక్రమములలో భాగస్వామిత్వము వహించి వర్ధమాన దేశములకు విమానయాన సాంకేతిక జ్ఞానమును అందజేసి, అచట విమానయానమును ప్రోత్సహించుట – అనునవి ఈ వ్యవస్థ నిర్వహించు ముఖ్య కార్యక్రమములు.

1974 నాటికి ఇందలి సభ్యసంఖ్య 128. ఇందు ఇండియాయు చేరి ఉన్నది.

ఈ వ్యవస్థయందు సాధారణసభ, పాలక సంఘము అనునవి ఉపాంగములు. పాలక సంఘమును సాధారణ సభయే ఎన్నుకొనును. సాధారణ సభయందు సభ్యరాజ్యములకు అన్నింటికిని సమాన ప్రాతినిధ్యము కలదు. పాలకసంఘపు సభ్యసంఖ్య 27. ఈ పాలకసంఘ సభ్యులను ఎన్నుకొనుటలో 1. విమానయానమున చాల ముందంజవేసిన దేశములు, 2. విమానయాన సంస్థలు ఎక్కువగ లేకపోయినను అంతర్జాతీయ విమానయానమునకు పనికివచ్చు విమానాశ్రయములుకల దేశములు, 3. పైవానిలో చేరక, భౌగోళికరీత్యా అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరింపగల రాజ్యములు – అను మూడు వర్గములకును సముచిత ప్రాతినిధ్యము కల్పించుట ఒక సంప్రదాయముగ పాటింపబడుచున్నది.

ఈ వ్యవస్థయొక్క ముఖ్య కార్యాలయము కెనడా దేశమందలి మాంట్రీల్ నగరమున ఉన్నది.

---

# 26. అంతర్జాతీయ దూరదేశ సంయోజనము (ITU)

వివిధ దేశములమధ్య తంతి, రేడియోలవలన గాని, లేక తక్కు విధముల వైద్యుతిక – కాంత (ఎలెక్ట్రో - మాగ్నెటిక్) పద్ధతులవలనగాని పంప బడు వార్తలు అంతర్జాతీయ దూరసందేశములు అని వ్యవహరింపబడుచున్నవి. వీనిని పంపుట లోను, గ్రహించుటలోను కొన్ని సామాన్య ప్రమాణ ములను, సంజ్ఞలను, సంకేతముల ఏకరూపతను ఆయా విభిన్న రాజ్యములవారు ఆమోదించి అమలు పరచినపుడు మాత్రమే ఈ వార్తా సౌకర్యము ఫల ప్రదము కాగలదు. అందులకై 1932 లో మాడ్రిడ్ నగరమున తంతి – టెలిఫోన్‌లకు సంబంధించిన ఒక సాధికారిక సమావేశమును, తక్కిన రేడియో టెలిగ్రాఫ్ పద్ధతులకు చెందినవారికై వేరొక సమా వేశమును జరిగి, వాని చర్చల ఫలితముగ కొన్ని సంప్రదాయములు ఏర్పరుపబడి, ఆ సంప్రదాయ ములు 1934 లో ఒక నూత్న సంప్రదాయముగ రూపొందినవి. ఆ సంప్రదాయమును ఆమోదించిన రాజ్యములు తదాదిగ అంతర్జాతీయ దూరసందేశ సంయోజనము (International Telecommunication Union) అను వ్యవస్థగ వ్యవహరించినవి.

ఈ సంయోజనము ఏర్పరచిన సంప్రదాయమున అంతటంతట కొన్ని మార్పులు జరిగినవి. 1947 లో అట్లాంటిక్ నగరమున జరిగిన ఈ సంయోజనపు సమావేశమున సాగిన చర్చల ఫలితముగ ఆ సంయోజనపు స్వరూపముననే తీవ్రతర పరివర్తనలు కాలానుగుణముగ కొనిరాబడినవి.

ఈ సంయోజనము ఈ క్రింది కార్యక్రమములను నిర్వర్తించుచున్నది.

1. ఆయా సభ్యరాజ్యములకు రేడియో పౌనః పున్యములను (ఫ్రీక్వెన్సీలను) నిర్ధారించి, వాని వివరములను నమోదుచేసి ఉంచుట; 2. దూర సందేశ సంస్థలకు సంబంధించిన ఆర్థిక వ్యవహార నిర్వహణము సువ్యవస్థితము లాభదాయకమునగు రీతిలో సాగుటకు అనుగుణముగ సాధ్యమైనంత తగ్గుస్థాయిలో సందేశములకు రేట్లను నిర్ణయించుట; 3. దూరసందేశ సాధనములను తగు రీతిలో ఉపయోగించి, ప్రాణాపాయస్థితిలో నున్నవారిని రక్షించుటకు తగు యంత్రాంగమును రూపొందిం చుట; 4. దూరసందేశ సాంకేతిక వ్యవహారములకు సంబంధించిన వివిధ విషయములను అనుశీలించి, ఫలితముల సేకరించి, ఆ వివరములను సభ్యరాజ్య ములకు అందజేయుట.

ఈ సంయోజన వ్యవస్థయందు 1. సర్వ ప్రతి నిధి సభ (Plenipotentiary Conference), 2. పరిపాలక సంస్థ, 3. సచివాలయము, 4. అంత ర్జాతీయ పౌనఃపున్య సంలేఖన మండలి (International Frequency Registration Board) అనునవియు; రేడియో, టెలిఫోన్, టెలిగ్రాఫులకు క్రమముగ సంబంధించియుండు మూడు సంప్ర తింపుల కమిటీలును అంతర్భాగములుగ పనిచేయు చున్నవి.

సర్వ ప్రతినిధి సభయందు సభ్యరాజ్యముల కన్నిటికిని సభ్యత్వము కలదు; ఈ సభయందలి ప్రతి సభ్యరాజ్యమునకును ఒకేఒక వోటు కలదు. సర్వ ప్రతినిధిసభ అయిదు మొదలు ఏడేండ్లకు ఒకతూరి జరుగును. గత సమావేశము 1973 లో జెనీవాలో జరిగినది.

పరిపాలక సంస్థయందలి సభ్యసంఖ్య 25. వీరిని సర్వ ప్రతినిధిసభ ఎన్నుకొనును. సాధారణ ముగ ఈ సంస్థ ఏడాదికి ఒకసారి సమావేశ మగును; కాని అవసరమగునెడల అంతకు తక్కువ వ్యవధిలోగూడ సమావేశము కావచ్చును. సభ్య

రాజ్యముల దూరసందేశ సంస్థలమధ్య తగు సహకారము పెంపొందుటకు ఈ సంస్థ దృఢరీతిలో కృషిచేయుచున్నది.

ఆ యా సభ్యరాజ్యములమధ్య రేడియో పౌనఃపున్యముల ఏర్పాటులో సంఘర్షణ ఏర్పడకుండ వారించుటకై తగు చర్యలను అంతర్జాతీయ పౌనఃపున్య సంలేఖకమండలి తీసికొనుచున్నది.

ఈ సంయోజనపు ప్రధాన కార్యాలయము జెనీవాలో ఉన్నది.

—

# 27. సార్వదేశిక తపాలా సంయోజనము (UPU)

ప్రపంచమున తపాలా వ్యవస్థ అనునది తొలుతగ ఆంగ్లదేశమున సువ్యవస్థితమైనటుల భావింపదగియున్నది. 1840 లో ఆ దేశమున 'పెన్నీ' రేటున తపాలాలో ఉత్తరములను పంపుట మొదలైనది; దూరముతో నిమిత్తం లేకుండా ఒక నిర్ణీతపు రేటుతో, ప్రభుత్వ బాధ్యతపై ఉత్తరములను ఒకచోటునుండి వేరొకచోటికి చేరవేయుటలో ఈ విధముగ ఆ దేశము మార్గదర్శినియైనది. తరువాత అనతికాలముననే తక్కిన దేశములును ఈ పద్ధతిని అనుసరించినవి. అంతట ఆ యా దేశములమధ్య తపాలా సర్వీసులను సక్రమ రీతిలో నిర్వహించుటకు కొన్ని సంప్రదాయములను ఏర్పరచుకొనవలసిన ఆవశ్యకతను ఆ రాజ్యములు గుర్తించగా, ఆ ఆశయసాధనకై పారిస్ నగరమున 1863 న 15 దేశముల ప్రతినిధులు సమావేశమై చర్చలను సాగించిరి. అచట తీసికొనిన నిర్ణయములను అనుసరించి ఆ తరువాత 1874 లో బెర్నీ నగరమున 22 దేశముల సాధికార ప్రతినిధుల సమావేశము జరిగి 'జనరల్ పోస్టల్ యూనియన్' అనుపేర ఒక అంతర్జాతీయ సంస్థను నెలకొల్పుటకు ఒడంబడిక కుదిరినది (9 అక్టో, 1874). తదనుగుణముగ అనంతరమున అన్ని రాజ్యముల సద్భావముతో తపాలా సర్వీసుల విషయమున కొన్ని అంతర్జాతీయ సంప్రదాయములు రూపుగొనుటయు, వానిని అమలుపరచుటకై జనరల్ పోస్టల్ యూనియన్ సంస్థాపితమగుటయు జరిగినవి (1875). 1878 లో జరిగిన రెండవ తపాలా కాంగ్రెస్ సందర్భమున ఈ యూనియన్ పేరును సార్వదేశిక తపాలా సంయోజనము (యూనివర్సల్ పోస్టల్ యూనియన్) అను రీతిగ మార్చుట జరిగినది. ఆ తరువాత అంతటంతట తపాలా కాంగ్రెస్‌లు సమావేశమగుచు, కాలానుగుణముగ ఆయా సంప్రదాయములలో కొన్ని మార్పులను కొనివచ్చినవి. అట్టివానిలో 17 వ సమావేశము 1974 లో స్విజర్లాండులో జరిగినది.



ఈ సంయోజనము ఐక్యరాజ్య వ్యవస్థా కుటుంబమున ఒక ప్రత్యేక నియోజక సంస్థగ 1947 మొదలుగ పరిగణనను పొందినది.

వివిధ దేశముల తపాలా వ్యవస్థల నిర్వహణ కౌశలమును పెంపొందింపజేయుచు, ఆ యా దేశములమధ్య, ఈ రంగమునకు సంబంధించినంత వరకు, అంతర్జాతీయ సమగ్ర సహకారమును వృద్ధి చేయుట ఈ సంయోజనపు లక్ష్యము.

ఈ సంయోజనమున ప్రపంచమునందలి స్వయంపాలక రాజ్యములకు అన్నింటికిని (ఐ. రా. స. సభ్యత్వముతో నిమిత్తము లేకుండ) సభ్యత్వము కలదని చెప్పవచ్చును.

ఈ సంయోజనమున 1. సార్వదేశిక **తపాలా** కాంగ్రెస్, 2. కార్యవర్గము, 3. **తపాలా విషయ** ముల సంప్రదింపుల సంఘము, 4. **అంతర్జాతీయ మండలి** (ఇంటర్నేషనల్ బ్యూరో) అనునవి **ముఖ్యాంగములు.** కాంగ్రెసున సభ్యరాజ్యములకు అన్నింటికిని సభ్యత్వమును, ప్రతి సభ్యరాజ్యము నకు ఒకేఒక వోటున్ను కలవు. సాధారణముగ అయిదేండ్లకు ఒకసారి ఈ కాంగ్రెస్ సమావేశ మగును; కాని సభ్యరాజ్యములలో మూడింట రెండు వంతుల అభ్యర్థనపై ప్రత్యేక సమావేశములను, ఎప్పుడైనను జరుపవచ్చును. **తపాలా అంతర్జాతీయ** సంప్రదాయములలో కాలానుగుణములగు మార్పు లను చేసి, అందులకు అనుగుణములగు ఒడంబడిక లను ఈ కాంగ్రెస్ రూపొందింపజేయును.

కార్యవర్గమునందలి సభ్యసంఖ్య 31. వీరిని **తపాలా** కాంగ్రెస్ సభ్యులు ఎన్నుకొనెదరు; అటుల ఎన్నుకొనుటలో ప్రపంచమునందలి వివిధ ప్రాంత ములకు సముచిత ప్రాతినిధ్యమును కల్పించుటకు తగు శ్రద్ధ వహింపబడును. వీరిలో 15 మందిని మాత్రమే మరల ఎన్నుకొనుటకు వీలగును; అంతే కాదు; ఏ సభ్యరాజ్యమును వరుసగా మూడు పర్యా యములకు మించి సభ్యత్వము వహింపకూడదు. అందువలన కార్యవర్గ సభ్యత్వము, వంతులవారీగా, ఏదియో ఒక సమయమున ప్రతియొక రాజ్యమునకు దక్కుటకు అవకాశము లభించుచున్నది.

**తపాలా** సర్వీసుల నిర్వహణనుగురించి గాఢతర అనుశీలనలను నిర్వహించి సాంకేతికములగు సల హాలను రూపొందించుపనిని సంప్రదింపుల సంఘము నిర్వర్తించుచున్నది. ఈ సంఘమున సభ్యసంఖ్య 30. ఈ సభ్యులు ఆరు స్థాయీ సంఘములుగ ఏర్పడి, వివిధ శాఖలకు సంబంధించిన సాంకేతిక వ్యవహారముల అనుశీలనను నిర్వహింతురు.

అంతర్జాతీయ మండలి 1875 లో ఏర్పరుపబడి నది. ఇది ఈ సంయోజనపు సచివాలయముగ వ్యవహరించును.

ఈ సంయోజనపు ప్రధాన కార్యాలయము స్విజర్లండులోని బెర్ని నగరమున ఉన్నది.

---

# 28. అంతఃప్రభుత్వ సాగరిక సంప్రతింపుల వ్యవస్థ (IMCO)

**అత్యంత** ప్రాచీన కాలముననుండియు, సప్త సముద్రములపై అధికారము, సర్వేసర్వత్రా, అన్ని దేశముల వారికిని, కలదను విషయము సూత్ర ప్రాయముగ అందరివలనను అంగీకృతమైనది. కాని ఆ యా చారిత్రక యుగములందు నౌకా బలమువలన ప్రాబల్యమును ఆర్జించిన పెక్కు రాజ్యములు, పలు ప్రాంతములందు, సముద్రముల పైన సైతము తమ నిరంకుశాధికారమును వ్యాపింప జేసి, తక్కిన దేశముల వ్యాపార వాణిజ్యములకు, స్వేచ్ఛాయానమునకు ఆటంకములను కల్పించిన వనుట సువిదితమగు విషయము. అందువలన సముద్రములపైగల అంతర్జాతీయాధికారమును సుప్ర తిష్ఠితము చేయుటకై ఐ. రా. స. ఆధ్వర్యమున వివిధ రాజ్యముల ప్రతినిధులు 1948 లో జెనీవా నగరమున సమావేశమై ఒక అంతర్జాతీయ సాగరిక సంప్రదాయమునుగురించి ఒడంబడికకు రాగలిగిరి. కాని ఆ ఒడంబడికను వివిధ రాజ్యములు ధ్రువపర చుటలో జరిగిన ఆలస్యమువలన 1958 నుండి మాత్రమే ఆ ఒడంబడిక అమలులోనికి రాగలిగినది. అంతట 1959 లో ఈ ఒడంబడికరాజ్యములు

లండనులో సమావేశమై అంతఃప్రభుత్వ సాగరిక సంప్రతింపుల వ్యవస్థ (Inter Governmental maritime Consultative Organisation)ను ఏర్పరచినవి. ఐ. రా. స. యును దీనిని తన కుటుంబమున ఒక ప్రత్యేక నియోగముగ గుర్తించినది.

ఈ వ్యవస్థ ఈ దిగువ లక్ష్యములతో వ్యవహరించుచున్నది.

1. అంతర్జాతీయ వాణిజ్యమున పాల్గొనుచున్న సభ్య ప్రభుత్వములమధ్య నౌకాయానమునకు సంబంధించిన సాంకేతిక సమస్యల పరిష్కార విషయమున సహకారమును పెంపొందించుట, 2. నౌకాయానమున భద్రతను కుశలతను పెంపొందించుటకు ఆచరణ సాధ్యములగు ఉన్నత ప్రమాణములను ఆ యా ప్రభుత్వములు అవలంబించునటుల చేయుట, 3. అంతర్జాతీయ నౌకాయాన విషయమున ఒక దేశమునెడల వేరొక దేశము అనుచిత వివక్షతను ప్రదర్శించి, అభ్యంతరములను ఏర్పరచుటను అరికట్టుటకై కృషిచేయుట, 4. నౌకాయాన సంస్థలు అనుచిత, సంకుచిత విధానములను అవలంబించకుండ చూచుట.

1948 లో జరిగిన సమావేశమునకు ఆహ్వానింపబడిన ఏ రాజ్యమైనను, లేదా ఐ రా. స. లో సభ్యత్వముకల ఏ రాజ్యమైనను 1948 సంప్రదాయపు ఒడంబడికను ఆమోదించునెడల దానికి ఈ వ్యవస్థయందు సభ్యత్వము లభించుచున్నది. తక్కిన రాజ్యములలో ఏదియైనను సభ్యత్వమునకై దరఖాస్తు చేసినపుడు, దానిని వ్యవస్థా రాజ్యములలో మూడింట రెండువంతులు ఆమోదించినపుడే దానికి సభ్యత్వము లభించును. భారత దేశమునకు ఇందు సభ్యత్వము కలదు, 1971 నాటికి ఇందలి సభ్యసంఖ్య 75.

ఈ సంప్రతింపుల వ్యవస్థయందు 1. మహాసభ 2. కార్యవర్గము 3. సాగరిక భద్రతా సమితి అనునవి ముఖ్యాంగములు.

మహాసభ (అసెంబ్లీ) లో సభ్యరాజ్యములకు అన్నింటికి ప్రాతినిధ్యము కలదు. రెండేండ్లకు ఒకసారి ఈ మహాసభ సమావేశమై బడ్జటును ఆమోదించి, సామాన్య కార్యక్రమ విధానమును నిర్ణయించును

కాద్యవర్గము (కౌన్సిల్) అంతటంతట సమావేశమై వ్యవస్థా కార్యకలాపముల నిర్వహణతీరును, నిర్ణయించును. అసెంబ్లీ చర్చించదగు విషయములకు ప్రాతిపదిక రూపములను ఈ కార్యవర్గము రూపొందింపజేయును. ఇందలి సభ్యసంఖ్య 18. ఇందులో అంతర్జాతీయ నౌకాయానమున ఎక్కువ నౌకలను వినియోగించు రాజ్యములకు 6 స్థానములును, సముద్ర వాణిజ్యమున ప్రత్యేక ప్రతిపత్తి కలిగినవారికి 6 స్థానములును, పై ఉభయవర్గములకు చెందనివారికి 6 స్థానములును చెందునటుల ఈ సభ్యులను మహాసభ ఎన్నుకొనును. సంవత్సరమునకు రెండుసార్లు, సామాన్యముగ, ఈ కార్యవర్గము సమావేశమగును; అయినను అవసరమగునెడల అంతకన్న తరచుగను సమావేశములను జరుపును.

సాగరిక భద్రతాసమితి (Maritime Safety Committee) లోని సభ్యసంఖ్య 16. సాగరిక యాన భద్రతా విషయమున ప్రత్యేక శ్రద్ధగల రాజ్యముల ప్రతినిధులనుండి, ఈ 16 స్థానములకు సభ్యులను మహాసభ ఎన్నుకొనును. ఈ స్థానములలో సగము, ఎక్కువ నౌకా సంఖ్యగల 8 రాజ్యములకు దక్కునటులను, తక్కినవి ప్రాంతీయ రీతిలో వివిధ ప్రాంతములకు లభించునటులను ఎన్నికలో శ్రద్ధవహింపబడును. నౌకాయానమునకు

సంబంధించిన వివిధ సాంకేతిక విషయములను ఈ సమితి పర్యవేక్షించును.

వ్యవస్థయొక్క దైనందిన పరిపాలనా వ్యవహార ములను నిర్వర్తించుటకు ఒక సెక్రటరీ - జనరల్ ఆధ్వర్యవమున సచివాలయము కలదు. దీని ప్రధాన కార్యాలయము లండన్‌లో ఉన్నది.

# 29. ప్రపంచ వాతావరణ శాస్త్రీయ వ్యవస్థ (W M O)

వాతావరణమున రాగల మార్పులను, శాస్త్రీయ పద్ధతిలో, తొలుతనే గుర్తించి వానినిగురించి ముందుగనే మానవులకు తెలియజేసి హెచ్చరించి, తగు సలహాలను ఇచ్చుటయే వాతావరణ శాస్త్రము (మీటియరాలజీ) వలన చేకూరు ప్రత్యక్ష ప్రయోజన మని చెప్పవచ్చును. నావికులకు, వ్యవసాయికు లకు. ఇంకను తక్కిన కొన్ని వర్గముల వారికి ఇట్టి హెచ్చరికలవలన ఎక్కువ ప్రయోజనము కలుగ గలదనుట నిర్వివాదాంశము. అయినను ఇటుల రాబోవు మార్పులను కచ్చితముగ సూచించుటకు తగినంత శాస్త్రీయ సంపత్తి వాతావరణ శాస్త్రము నకు ఇప్పటికి చేకూరలేదు అందువలన వర్ష పాతము, తుపాను మొదలగువానినిగురించి ఆ శాస్త్ర జ్ఞులు ముందుగ తెలియజేయు సూచనలు కొన్ని యదార్థములు కాకుండుటయు జరుగుచున్నది. ఈ లోపమును నివారించుటకు ఆ శాస్త్రమున ఇంకెంతో పరిశోధన జరుగవలసియున్నది. వాతావరణమును ఏ శాస్త్రజ్ఞుడును కృత్రిమముగ పరిశోధనశాలలో సృజించలేడు; కావున ప్రపంచ వాతావరణమున అన్ని ప్రాంతములందును పరిశోధన సాగునపుడే ఆ శాస్త్ర రహస్యములను ఎక్కువగ తెలిసికొన వీలగును. నేటి, విజ్ఞానశాస్త్ర వికసనమువలన లభించు గణిత్రములు (కంప్యూటరులు) ను, రాకెట్లును, కృత్రిమోపగ్రహములును, ఈ విస్తృత ప్రాంతమున పరిశోధనలను సాగించుటకు ఎక్కువగ సాయపడగలవు. అట్టి పరిశోధనలను ఏకకాలము నందు వివిధ దేశముల శాస్త్రజ్ఞులు సాగించినపుడు మాత్రమే, వాని స్పష్టరూపములను, ఫలితములను తెలిసికొన సాధ్యము కాగలదు.

ఇట్టి పరిశోధనలను సాగించుటకు ఏదో విధ ముగ కృషి 1823 నుండియు సాగుచున్నను, 1873 లో ప్రపంచ వాతావరణ శాస్త్రీయ వ్యవస్థ (World Meteorological Organisation) ఏర్పాటుతో దానికి ఒక సువ్యవస్థిత రూపము ఏర్పడినది. 1947 లో ఐ. రా. స. కుటుంబమున ఈ వ్యవస్థకు స్థానము కల్పింపబడుటతో, ప్రపంచ విస్తృతముగ అన్ని రాజ్యముల సహకారమును దానికి లభించినది.

ఈ వ్యవస్థ ఈ దిగువ తెలుపబడిన లక్ష్యము లను కలిగియున్నది.

1. ఆయా దేశములందు వాతావరణ శాస్త్రము నకు సంబంధించిన వివరములను పరిశీలించుటకును, ఆ శాస్త్రమునకు సన్నిహితములగు అచటి భూభౌతిక శాస్త్ర విశేషములను కనుగొని తెలియజేయుటకును అనువుగ ప్రపంచ విస్తృతముగ ఒకదానితో ఒకటి ముడివడి యుండురీతిగ వాతావరణ పరిశోధన శాలలు సంస్థాపింపబడునటుల చూచి, ఆయా వాతా వరణశాస్త్ర కేంద్రముల అభ్యున్నతికిని, పరిపోషణ కును కృషిచేయుట.

2. వాతావరణములోని మార్పులను గురించిన సమాచారము వెనువెంటనే ఒక కేంద్రమునుండి తక్కిన కేంద్రములకు త్వరితగతిలో పంపబడుటకు వసతులను ఏర్పరచుట.

3. వాతావరణ శాస్త్ర పరిశోధనల సందర్భమున శాస్త్రవేత్తలు ఒకేరీతి ప్రమాణములను వాడుచు, సంఖ్యా వివరములను శాస్త్రీయ పద్ధతిలో ప్రచురింపజేయుట.

4. వైమానికులకు, నావికులకు, జలసమస్యలకు, వ్యవసాయమునకు, తదితర ప్రజా వ్యవహారములకు వాతావరణశాస్త్ర పరిజ్ఞానము వినియుక్తమగునటుల చూచుట.

5. వాతావరణ శాస్త్రమున అవేక్షణ (రిసర్చి), శిక్షణ పెంపొందింపజేయుటకు ప్రోత్సాహమును కల్పించి, అట్టి అవేక్షణా శిక్షణలందు అంతర్జాతీయ స్థాయిలో సమన్వయతను సాధించుట.

వాతావరణశాస్త్ర పరిశోధనశాలలు కలిగియున్న ప్రతిదేశమును – అది స్వతంత్రమైనను, అస్వతంత్రమైనను – ఈ వ్యవస్థయందు సభ్యత్వమును పొందవచ్చును. 1970 నాటికి అందలి సభ్య రాజ్య సంఖ్య 132. ఇందు భారతదేశమును సభ్యత్వము కలిగియున్నది.

ఈ వ్యవస్థయందు 1. ప్రపంచ వాతావరణ శాస్త్రీయ కాంగ్రెస్, 2 కార్యవర్గము, 3. సచివాలయము అనునవి ముఖ్యాంగములు.

కాంగ్రెస్‌లో సభ్యరాజ్యములకు అన్నింటికిని సభ్యత్వముకలదు. నాలుగేండ్లకు ఒకసారి ఇది సమావేశమై ఒక అధ్యక్షుని, ముగ్గురు ఉపాధ్యక్షులను ఎన్నుకొని, ప్రాంతీయ సంఘములను సాంకేతిక మండలులను ఏర్పరచి కార్య విధానపు మూల సూత్రములను నిర్ణయించును. ఆయా సభ్యరాజ్యములందలి, వాతావరణశాస్త్ర పరిశోధనశాలల డైరెక్టరులే ఈ కాంగ్రెస్‌న సభ్యులుగ వ్యవహరింపవలెననుట ఒక సంప్రదాయముగ పాటింపబడుచున్నది.

కార్యవర్గమందలి సభ్యసంఖ్య 24. ఈ సంఖ్యలో అధ్యక్షుడు, ముగ్గురు ఉపాధ్యక్షులును, 6 ప్రాంతీయ సంఘముల అధ్యక్షులును చేరియున్నారు. తక్కిన పదునాలుగు స్థానములకు సభ్యులను కాంగ్రెస్ ఎన్నుకొనును. ఏడాదికి కనీసము ఒకసారియైనను కార్యవర్గము సమావేశమై కాంగ్రెస్ విధానములకు అనుగుణముగ కార్యక్రమములు జరుగునటుల శ్రద్ధ వహించును.

ఈ వ్యవస్థయొక్క సచివాలయము ఒక సెక్రటరీ జనరల్ ఆధ్వర్యవమున జెనీవాలో పనిచేయుచున్నది.




ఆఫ్రికా
రాజకీయ విభాగములు
స్పెయిన్
టర్కీ
అల్జీర్స్
మొరాకో
ట్రిపోలి
అల్జీరియా
లిబియా
కైరో
ఈజిప్టు
మారిటేనియా
మాలీ
నైజర్
చాడ్
సుడాన్
సెనెగల్
గినీ
నైజీరియా
లాగోస్
కామెరూన్
సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్
ఎతియోపియా
సోమాలియా
కెన్యా
నైరోబి
గబన్
జయిరే
కిన్షాసా
టాంజానియా
లువండా
అంగోలా
జాంబియా
మొజాంబిక్
నమీబియా
దక్షిణ ఆఫ్రికా

పటము : 1.

# 1. అంగోలా

**ముఖ్యనగరము :** లువాండా; **నాణెము :** ఎస్కుడో; 1000 ఎస్కుడోలు లేదా ఒక కోంటో = రు. 260.75 **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమునఉన్న ఈ దేశమునకు ఉత్తరమున కాంగో (జయిరే) నదియు, ఉత్తరమునను తూర్పునను జయిరేదేశము, తూర్పున జాంబియా, దక్షిణమున




పటము 2.

నమీబియా సరిహద్దులందున్నవి. ఈ దేశముననే రాజకీయముగ అంతర్భాగముగ పరిగణింపబడు చున్న 'కేండిడా' అను ప్రదేశమును, జయిరేదేశపు చీలిక, ఈ దేశమునుండి ప్రాదేశికముగ వేరుచేయు చున్నది. కేండిడాతోకలసి మొత్తపు దేశ వైశాల్యము 12,46,700 చ. కిమీ. ఉత్తరదేశపు మిట్టభూముల ఎత్తు 910 మీ. నుండి 1,520 మీ. వరకు మారుచుండును. దక్షిణపు పీఠభూమి ఎత్తు 1,220 మీ. నుండి 2,130 మీ. వరకు మారుచుండును. నదులు అనేకములు ఉన్నవి; కాని వానిలో ఏదియు నౌకాయానమునకు ఉపకరించదు.

**2. శీతోష్ణస్థితి మొ. :** పీఠభూమియందు సమ శీతోష్ణ పరిస్థితియు, తక్కిన ప్రాంతములందు ఉష్ణ మండల పరిస్థితియు కాననగును; నవంబరునుండి ఏప్రిల్ వరకు వానలు కురియును.

**3 జనసంఖ్య మొ. :** 1970 సంవత్సరపు లెక్కల ప్రకారము జనసంఖ్య 56,73,046; ఇందు దాదాపు 3 లక్షలమంది శ్వేతజాతీయులు, తక్కిన వారు నీగ్రో జాతీయులు. జనసాంద్రత చ. కి. మీ.కు 4. నగరములలో లువాండా (జ. సం. 2,24,540), నోవాలిస్‌బోవా (70,629), బెంగ్వేలా (40,282), లోబితో (50.424) పేర్కొనదగినవి. దేశమున వివిధ ఆఫ్రికన్ భాషలు వాడుకయందున్నను పోర్చుగీజు భాషయే అధికారభాషగ వాడుకయందున్నది.

**4. సమాచార సౌ. :** కేబిల్‌ద్వారా తూర్పు, పశ్చిమ, దక్షిణ ఆఫ్రికా తంతివార్తా మండలముతో ఈ దేశమునకు సంబంధము కలదు. 1,808 కి.మీ. పొడవున తంతి సౌకర్యమును, 65 టెలిఫోను స్టేషనులును, 158 తంతి కార్యాలయములును, 31 వైర్‌లెస్ కేంద్రములును కలవు (1971).

**5. యాన సౌ. :** దేశపు రోడ్ల నిడివి 72,323 కిమీ; రైలు మార్గముల మొత్తపు నిడివి 3,260 కిమీ. దేశమున బెంగ్వేలా దగ్గర బయలుదేరిన రైలుమార్గము జయిరే, రొడీసియా, జాంబియాల ద్వారా మొజాంబిక్‌లోని బీరా నగరమును చేరు చున్నది. అట్లాంటిక్ తీరమందలి లోబితో, లువాండా, మోజామీడిస్ నగరములవద్ద రేవు

సౌకర్యములు కలవు. దేశమునందలి వివిధ ప్రముఖ కేంద్రములను కలుపు విమానయాన సౌకర్యము కలదు. లువాండాలోని విమానాశ్రయమునుండి విదేశ ప్రయాణమునకు వసతులు కలవు.

**6. చరిత్ర :** భారతదేశమునకు సముద్ర మార్గమును అన్వేషించు కృషి సందర్భమున క్రీ. శ. 1482 న కాంగోనదీ ముఖద్వారమున కాలిడి, తదనంతరమున అంగోలాదేశపు తీరమును పరిశోధించి, అటనట స్థావరములను పోర్చుగీజు వారు నెలకొల్పిరి. 1575 లో లువాండా నగరము నిర్మింప బడెను. బానిస వ్యాపారము మొదలగు వానివలన పోర్చుగీజు వారిట మంచి ఆదాయములను పొందిరి. బెర్లిన్ కాంగ్రెస్ (1884-85) న, పోర్చుగీజువారి ఆధిపత్యము గుర్తింపబది, అంగోలాకు సరిహద్దులును నిర్ణయింపబడినవి. అంతటి నుండి పోర్చుగీజు సామ్రాజ్యమున అడగియుండిన ఈ దేశమునందు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున చెలరేగిన స్వాతంత్ర్యా కాంక్షను అణచుటకు పోర్చుగీజు పాలకులు దమననీతిని అవలంబించిరి; తత్ఫలితముగ దేశభక్తు లనేకులు పరిసర స్వతంత్ర ఆఫ్రికన్ దేశములలో తలదాచుకొనిరి. ఐ.రా.స.యు పోర్చుగీజు చర్యను నిరసించినది (1962). కడకు పోర్చుగల్ దేశమున నియంతృ ప్రభుత్వము అంతరించి ప్రగతిశీలక ప్రభుత్వము ఏర్పడిన తరువాత, ఆ ప్రభుత్వము, వలస రాజ్యములకు స్వతంత్రతను కల్పించు విధానమును అవలంబించి అందు, అంగోలాకు సంబంధించినంతవరకు, తొలుతటి మెట్టుగ స్వయం పరిపాలనను ప్రవేశపెట్టి, దేశ నాయకులతో చర్చలను జరిపి, 1975, నవంబరు 11 నకు స్వాతంత్ర్యమును కల్గించుటకు అంగీకరించినది (సెప్టెంబరు, 1974). స్వాతంత్ర్యము ఇటుల కనుచూపుమేరలో ఉండగ అంగోలాయందలి మూడు రాజకీయ పక్షములు అధికారాసక్తితో పోరాటమునకు దిగినవి; తత్ఫలితముగ వందలకొలదిగ దేశీయులు మరణించిరి. కడకు దేశమున ప్రజలకు అందరకు ప్రాతినిధ్యము వహించగల రాజకీయ పక్షము ఏదియు కన్పట్టనందున పోర్చుగీజు వలస పాలకులు అధికారమును ఏకపక్షముగ త్యజించి దేశమును వదలిపోయిరి (నవంబరు 11, 1975). అంతట అంగోలా విమోచక ప్రజోద్యమము (MPLA) అనబడునది దేశమున అధికారమును గ్రహించినటుల ప్రకటించినను తక్కిన రాజకీయ పక్షములు దీనిని గుర్తించనందు వలన అంతస్సంగ్రామము చెలరేగినది. ఈ ప్రజోద్యమ పక్ష ప్రభుత్వమును సోవియట్ వర్గమునకు చెందిన రాజ్యములును, కొన్ని తదితర యూరపీయ రాజ్యములును దాదాపు 22 ఆఫ్రికన్ రాజ్యములును గుర్తించి సాయము చేయుచున్నవి. కాని తక్కిన పక్షముల ప్రభుత్వమును జయిరే మొదలగు దాదాపు 22 తదితర ఆఫ్రికన్ రాజ్యములును, యు. స్టే, దక్షిణ ఆఫ్రికా మొదలగు కొన్ని రాజ్యములును గుర్తించి దానికి సాయపడుచున్నవి. ఈ విధముగ అంగోలా రాజ్యము అగ్రరాజ్యముల వైమనస్యములకు గురియై ఈనాడు (1976, జనవరి) సువ్యవస్థిత ప్రభుత్వమునకు నోచుకొనకున్నది.

**7. పరిపాలన :** దేశము పరిపాలనా, సౌలభ్యమునకై 13 మండలములుగ విభక్తమై ఉన్నది కాని ప్రస్తుతమున సువ్యవస్థితపాలన ఎచటనులేదు.

**8. దేశరక్షణ :** అంతస్సంగ్రామమువలన ఈ దేశము కల్లోలిత మగుచున్నందువలన దేశరక్షణను గురించిన వివరములు ఏవియు తెలియవు.

**9. అంతర్జాతీయ సం. :** సార్వదేశీయ పరిగణన పొందిన ప్రభుత్వము లేనందున లెక్కింప

దగిన అంతర్జాతీయ సంబంధములు ఎట్టివియు ఏర్పడలేదు.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయము, మత్స్య పరిశ్రమ, ఖనిజ పరిశ్రమ దేశ ప్రజలకు జీవనాధారములు. వ్యవసాయమువలన ఉత్పత్తి యగు ఆహార పదార్థములు చాలవరకు దేశ ప్రజలకు మాత్రమే సరిపోవుచున్నవి. ముడి ఇనుము విరివిగ దొరకును. పెట్రోలుకూడ 1967 మొదలుగ ఉత్పత్తి అగుచున్నది. ఎగుమతులలో కాఫీ, ప్రత్తి, మొక్కజొన్న, వజ్రములు, కలబందనార, చేపలు, కలప, ముడిఇనుము, పెట్రోలు, కొబ్బరి నూనె, చక్కెర పేర్కొనదగినవి. యంత్రసామగ్రి మొదలగునవి దిగుమతి అగుచున్నవి. ఎగుమతుల విలువ 1213.7 కోట్ల కోంటోలు; దిగుమతుల విలువ 1212.7 కోట్ల కోంటోలు (1971). విద్యుదుత్పత్తి 45.7 కోట్ల కివా. బడ్జెటరీ వ్యయము 1,02,90,089 కోంటోలు (1970).

**11. సాంఘిక రంగము :** దేశమునందలి 4,651 ప్రయిమరీ పాఠశాలలలో 4,40,985 మంది; 101 సెకండరీ సన్నాహక పాఠశాలలలో 29,263 మంది; 58 సెకండరీ పాఠశాలలలో 13,911 మంది; 60 వృత్తి పాఠశాలలలో 12,620 మంది; 5 ఉన్నత పాఠశాలలలో 2,312 మంది విద్యార్థులు కలరు (1970-71). దేశమున ఒక విశ్వవిద్యాలయమును, ఆరు మ్యూజియములును, పది లైబ్రరీలును కలవు. దేశమున వైద్యసంఖ్య 450. 165 ఆసుపత్రులును తదితర వైద్య వసతులును పనిచేయుచున్నవి; వీనియందలి శయ్యా సంఖ్య 12,736 (1967).

---

# 2. అప్పర్ వోల్టా

**ముఖ్యనగరము :** అవగాదవుగౌ; **జెండా :** నలుపు, తెలుపు, ఎరుపు అడ్డచారలు ఎగువనుండి దిగువకు కలది; **జాతీయ గీతము :** పియరీ వోల్టా...... (మా పూర్వికుల గర్వకారణమైన వోల్టా......); **నాణెము :** ఫ్రాంకు (సి. ఎఫ్. ఎ), వినిమయపు రేటు అనిశ్చితము; సాధారణముగ 100 సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు = రు. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. కాలగణన : మ. 12 గం. = భారతదేశమున సా. 5-30 ని.




పటము 3.

**1. ఉనికి మొ. :** పశ్చిమ ఆఫ్రికాలో భూపరివృతమై 9°30′—15° ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 2° — 5° పశ్చిమ తులారేఖల మధ్యను విస్తరించిఉన్న ఈ దేశమునకు ఉత్తర, పశ్చిమములందు మాలీ, తూర్పున నైగర్ గణరాజ్యము, దక్షిణమున దహోమీ, టోగో, ఘానా, ఐవరీకోస్టు దేశములు సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 2,74,200 చ. కిమీ. ఉత్తరమునుండి దక్షిణము

నకు వాలుగానున్న భూతలముకల ఈ దేశమున వోల్టానదియొక్క మూడు శాఖలును, దాని ఉపనది యగు సౌరోనదియు ప్రవహించుచున్నవి. ఈ నదుల లోయలే ఈ దేశమును ఆవరించినవని చెప్ప వచ్చును వానకాలమున మాత్రమే ఈ నదులలో నీరుండును. భూసారరీత్యా పేదవడిన భూమిగ లెక్కింపదగినది ఈ దేశము.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉత్తరమున ఉష్ణోగ్రత చాల ఎక్కువ. ఆ ప్రాంతమునఉన్న ముఖ్య నగరమున సరాసరి ఉష్ణోగ్రత 106°ఫా. 'హర్మ త్తాన్' అను ఎడారి గాలివలన ఉష్ణోగ్రత ఇంకను పెచ్చుపెరుగుచుండును. దక్షిణ ప్రాంతమున ఉష్ణోగ్రత కొంత తక్కువ. దేశమున సాలుసరిన సరాసరి వర్షపాతము 72 సెం. మీ. నుండి 120 సెం. మీ. వరకు ప్రాంతములను అనుసరించి మారుచున్నది. చిట్టడవులును, పచ్చిగడ్డి మైదాన ములును విరివిగ కనబడును. అటనట కన్పట్టు దట్టపు అడవులలో ఏనుగు, కారుదున్న, నీటి గుర్రము మొదలగు పెద్దజంతువులు కొన్ని కలవు. లేళ్లును, కోతులును, నదులలో మొసళ్లను సర్వ సాధారణపు జంతువులు.

**3. జనసంఖ్య మొ. :** అంచనాలను అనుసరించి జనసంఖ్య 52.1 లక్షలు (1970). దేశపు నగర ములలో అవగాదవుగా (జ సం. 1,24,779); బోబో డవలస్సో (1,02,059) అనునవి పేర్కొన దగినవి. 'మాన్‌డింగో' అను ఆఫ్రికన్ జాతి ప్రజలు దేశమున విరివిగ కలరు; వీరియందును 'మోసీ' అను ఉపజాతివారు వ్యవసాయమే ముఖ్య వృత్తిగ, మధ్యదేశమున వసించుచున్నారు. వీరికి ఒక విధమగు ఆంతరంగిక స్వయంపాలనా ప్రతి పత్తి కలదు. దేశమున వివిధ ఆఫ్రికన్ భాషలు ప్రచారమున ఉన్నవి; అందువలన ఫ్రెంచిభాషయే అనుసంధాన, బోధనా, వ్యావహారిక భాషగ ఆమో దితమైనది. ప్రజలలో దాదావు 12 లక్షలమంది ముస్లిములు, రెండు లక్షలమంది క్రైస్తవులు కలరు. తక్కిన వారందరు ప్రాచీన సంప్రదాయ మతాను యాయులు.

**4 సమాచార సౌ. :** దేశమున 40 పోస్టా ఫీసులును, 30 తంతి - టెలిఫోన్ ఆఫీసులును పని చేయుచున్నవి. పారిస్‌నకును, సన్నిహిత ఆఫ్రికన్ దేశములకును రేడియో - టెలిఫోను సౌకర్యము ఇటనుండి కలదు. దేశపు ప్రముఖ నగరములు రెంటింట రేడియో ప్రసార కేంద్రములు రెండు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశము పేదదైనను, ఇట యానసౌకర్యము విరివిగ కలదు. మొత్తపు రోడ్ల నిడివి 17,000 కిమీ. ఐవరీకోస్ట్ దేశములోని అబిజాన్‌నుండి నైగర్ దేశములోనికి పోవు రైలు మార్గము, ఈ దేశమున 505 కిమీ. దూరము వ్యాపించియున్నది. దేశపు ప్రముఖ నగరములు ఈ రైలుమార్గము ప్రక్కనే ఉన్నవి. దేశమున 35 విమాన క్షేత్రములు (ఎయిర్ ఫీల్డులు) కలవు. వీనివలన దేశపు నగరముల మధ్యనేగాక విదేశము లతోకూడ ప్రయాణ సౌకర్యము లభించుచున్నది.

**6. చరిత్ర :** 15వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్ర అంతయు 'మోసీ' జాతి చరిత్రయే అని చెప్పవచ్చును. 11వ శతాబ్దిలో ఇటచేరిన ఈ జాతి వివిధ రాజ్యములను స్థాపించి విదేశీయుల, ముస్లి ముల దండయాత్రలను ఎదుర్కొని స్వాతంత్ర్య మును రక్షించుకొని 15వ శతాబ్దిలో క్షీణతను పొందినను ఎటులో 19వ శతాబ్దివరకు నిలువ గలిగినది. అంతట వారి అంతఃకల్లోలములను అవకాశముగ గ్రహించి, ఫ్రెంచివారు ఈ ప్రాంత మును ఆక్రమించి (1896) తమ విశాల ఆఫ్రికన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి అయి నను 'మోసీ' జాతివారికికల ఆంతరంగిక స్వపరి

పాలనా ప్రతిపత్తిని ఫ్రెంచివారు ఆదరించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, మోసీ జాతి పలుకుబడిలో పూర్వముండిన ఈ ప్రాంతమును, అప్పర్ వోల్టా అనుపేర ఒక ప్రత్యేక వలస దేశముగ ఫ్రెంచివారు రూపొందించి, క్రమముగ రాజకీయ స్వాతంత్ర్యమును కలుగజేసిరి (1960).

**7. పరిపాలన :** 1960 లో ఒక ప్రజాస్వామిక గణరాజ్య విధానము ప్రజామోదితమై అమలులోనికి వచ్చినను, సైనిక సహాయమున 1966 లో అధికారమును గ్రహించిన లామిజానా సేనాని జాతీయ శాసనసభను రద్దుచేసి, రాజ్యాంగ విధానమును అమలులో లేకుండ నిలిపియుంచెను. ప్రస్తుతమున రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుటలేదు. దేశమున 5 డిపార్టుమెంటులును, 6 కమ్యూనులును కలవు. అందలి ప్రజాప్రతినిధుల సలహాతో ఆయా ప్రాంతములను ప్రభుత్వోద్యోగులు పాలించుచున్నారు. మతమునకు సంబంధించిన విషయములలోతప్ప, తక్కిన అన్ని వ్యవహారములందును ఫ్రెంచి న్యాయశాస్త్రమే అనుసరింపబడుచున్నది.

**8 దేశరక్షణ :** ఒక పదాతిదళము, ఒక వేగు దళము, ఒక పేరాట్రూపుదళము కలవు వీని యందలి మొత్తపు సైనిక సంఖ్య 1,750.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా. స. లోను, తదనుబంధ సంస్థలు పెక్కింటను, పశ్చిమాఫ్రికా శుల్క సమ్మేళనమునను ఈ దేశము సభ్యత్వము కలిగి ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** పశుపోషణయే దేశపు ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారము. ఎనుము జాతి, ఆవుజాతి, గొర్రెజాతి, గాడిదలు, ఒంటెలు కలసి మొత్తముమీద 65 లక్షలు కలవని అంచనా; ఆహార ధాన్యములగు జొన్నలు మొ. వానికై దేశము కొంతవరకు విదేశములపై ఆధారపడియున్నది. ఎగుమతులలో సజీవ పశువులు, చర్మములు, ప్రత్తి, వేరుసెనగపప్పు, చేపలు ముఖ్యములు. మొత్తపు ఎగుమతుల విలువ 529 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 1,012 కోట్ల ఫ్రాంకులు. ఫ్రాన్స్ మొదలగు కొన్ని దేశముల సాయమున చెల్లింపుల లోటు పూరింపబడుచున్నది. దేశమున సాలీనా విద్యుదుత్పత్తి 2.28 కోట్ల కి. వా. (1968). బడ్జెటరీ వ్యయము 975.7 కోట్ల ఫ్రాంకులు (1970).

**11. సాంఘిక రంగము :** పల్లెపట్టులందు సరియైన గృహవసతి కన్పట్టదు. దేశమున అక్షరాస్యత 10% మాత్రమే. దేశమునగల 587 ప్రాథమిక పాఠశాలలలో 97,929 మంది, 31 సెకండరీ పాఠశాలలలో 7,614 మంది, 10 సాంకేతిక పాఠశాలలలో 1,354 మంది విద్యార్థులు పఠించుచున్నారు. ముఖ్యనగరమున ఒక ప్రముఖ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. ప్రభుత్వము ప్రచురించు దినపత్రిక ఒకటి మాత్రమే దేశమున ప్రచారమున ఉన్నది. దేశమున వైద్యసంఖ్య 68 (74,320 మందికి ఒక వైద్యుడు). అవగాదవుగౌలోని ఆసుపత్రి పశ్చిమాసియాలోని అట్టి వానిలో ప్రముఖము. ఇదిగాక ప్రజల ఆరోగ్య రక్షణకై 30 ఆరోగ్య కేంద్రములును, 70 ప్రసూతి శాలలును. 257 డిస్పెన్సరీలును బోబో డవలస్సో నగరమున ఒక ఆసుపత్రియు కృషిచేయుచున్నవి.

**12. యాత్రా సౌ. :** వేటకు అనువగు ప్రదేశములు ఉన్నను, కొలదిగ మాత్రమే విదేశ యాత్రికులు దేశమును దర్శించుచున్నారు.

# 3. అఫార్స్ - ఇస్సాస్ ప్రాంతము

## (ఆఫ్రికాలోని ఫ్రెంచి వలస రాజ్యము)

**ముఖ్యనగరము :** జిబూతీ; **నాణెము :** జిబూతీ ఫ్రాంక్; 100 జి. ఫ్రాంకులు = రు. 3-50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 3 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర - ఆఫ్రికా పశ్చిమ తీరమున, సోమాలీ ద్వీపకల్పపు ఉత్తర భాగమున ఉన్న ఈ ప్రాంతమునకు తూర్పున ఎర్ర సముద్రమును, ఆగ్నేయమున సోమాలియా, తక్కిన దిశలందు ఇతియోపియా సరిహద్దులందు ఉన్నవి. దేశవైశాల్యము 23,000 చ. కిమీ. దేశమున అత్యధిక భాగము ఎడారి భూమి. జనావాసములు తీర ప్రాంతమున మాత్రమే కలవు.

**2 శీతోష్ణస్థితి మొ :** ఇచట శీతోష్ణస్థితి దాదాపుగ సోమాలియాలోని పరిస్థితినే అనుకరించుచున్నది; ఎడారి ప్రాంతమున ఎండ వేడిమి ఎక్కువ; గాలిలో చెమ్మదనము తక్కువ.

**3. జనసంఖ్య మొ. :** 1968 అంచనాను అనుసరించి జనసంఖ్య 1,25,000. అయినను జనులలో పలువురు విదేశములకు తరుచుగ జీవనోపాధికై పోవుటవలన, జనసంఖ్య విపరీతపు హెచ్చుతగ్గులకు లోనగుచున్నది. ముఖ్యనగరమగు జిబూతీలోని జనసంఖ్య దాదాపు 62,000. దేశపు ప్రజానీకమున యూరపియనుల సంఖ్య దాదాపు 10,200. ప్రజలలో మూడవవంతు అరబ్బుల సంతతివారు; వీరు సాధారణముగ వ్యవసాయము వలన జీవించుచున్నారు. తక్కిన ఆఫ్రికన్‌లలో దనాకిల్, ఇస్సాసోమాలీ అను తెగలవారు అత్యధిక సంఖ్యాకులు. వీరందరును గొఱ్ఱెల కాపరులగు ద్రిమ్మరులు. ఆఫ్రికన్, అరబ్బు జాతుల ప్రజలు అందరును ముస్లిములు అరబ్బీ, అఫార్, సోమాలీ, ఫ్రెంచి భాషలు మాతృభాషలుగ ఆ యా వర్గములందు ప్రచారమునఉన్నను, ఫ్రెంచియే సాధికార భాషగ పరిగణనను పొందినది.

**4. సమాచార సౌ. :** జిబూతీలోను, తత్పరిసరములందును తంతి తపాలా సౌకర్యములు కలవు. టెలిఫోనుల సంఖ్య 2,352 (1971). జిబూతీలో ఒక రేడియో ప్రసార కేంద్రము పని చేయుచున్నది.

**5. యాన సౌ. :** దేశమున 880 కిమీ నిడివి కల రోడ్లు కలవు. ఇవి అన్నియు ఉత్తమ శ్రేణికి చెందినవి. ఇవిగాక కచ్చారోడ్లు 1280 కిమీ. పొడవున కలవు. ఇతియోపియాలోని అడ్డిస్ అబాబాను జిబూతీతో కలుపుచు ఒక రైలుమార్గము కలదు. ఇది ఈ దేశమున 96 కిమీ. పయనించుచున్నది. 1949 లో ఈ ప్రాంతము స్వేచ్ఛా వ్యాపార ప్రాంతముగ ప్రకటింపబడినప్పటి నుండియు, జిబూతీకి, అంతర్జాతీయ నౌకాశ్రయముగ, ప్రతిష్ఠ కలిగినది. తూర్పు పశ్చిమ దేశముల వ్యాపార మార్గముల కూడలిలో, ఎర్ర సముద్రపు ముఖద్వారమున ఉండుటవలన జిబూతీయందలి అంతర్జాతీయ విమానాశ్రయమునుండి యూరపు, తూర్పు ఆఫ్రికా, పశ్చిమ ఆసియా, ఇండియాలకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు అంతగ తెలియ వచ్చుటలేదు. ఈ ప్రాంతమున 19 వ శతాబ్దిలో దనాకిల్ తెగల నాయకులు పలు మండలములందు అధికారమును వహించి నామ మాత్రముగ ఇతి

యోపియాదేశపు పాలకుని ఆధిపత్యమును అంగీకరించియుండిరి కాని ఫ్రెంచివారు 1862 లో ఈ తెగల నాయకులతో ఒడంబడికలను కుదుర్చుకొని, అట రాజకీయాధికారమును నెలకొల్పి, క్రమక్రమముగ దానిని దృఢతరము చేసికొనిరి. 1869 లో సూయెజ్ కాలువ తెరువబడిన తదుపరి, ఫ్రెంచి కంపెనీలు ఇటచేరి, వ్యాపార రీత్యా జిబూతీకి ప్రముఖ స్థానమును కల్పించినవి. 1946 లో దీనిని ఫ్రెంచి దేశపు సముద్రోత్తర మండలముగ ప్రకటించుట జరిగినది; 1956 లో ఆంతరంగిక స్వపరిపాలనము కల్పింపపడినది. 1967 లో జరిగిన జనాభిప్రాయ సేకరణమున, ఫ్రాన్సుతో చేరియుండుటకు, ప్రజలు తమ అంగీకారమును తెలిపిరి

**7. పరిపాలన :** దేశమున పరిపాలనకు బాధ్యత వహించు ఒక ప్రతినిధిసభ కలదు; ఇందలి సభ్యసంఖ్య 32. వీరిని ప్రజలు ఎన్నుకొనెదరు. ఈ ప్రతినిధులు తమలోనుండి ఎన్నుకొనిన 8 మంది సభ్యులు పరిపాలక సంఘముగ వ్యవహరించి పరిపాలనను నిర్వహింతురు. పారిస్‌లోని ఫ్రెంచి జాతీయ సభకు, ఒక ప్రతినిధిని ఈ ప్రతినిధిసభ ఎన్నుకొనుచున్నది. దేశమున నాలుగు రాజకీయ పక్షములు కలవు.

**8. దేశరక్షణ :** దేశపు రక్షణ భారము ఫ్రాన్సు దేశముపైన కలదు; ఫ్రెంచి ప్రభుత్వము ఈ దేశమున 2 రెజిమెంటులును, ఒక యాంత్రిక పటాలమును కలిగి 4,400 యోధులుకల పదాతి దళమును, 150 మంది నావిక యోధులను కొలది నౌకలును కల నావిక దళమును, 550 మంది యోధులుకల వాయు సేనను నిలిపియున్నది.

**9. అంతర్జాతీయ సం. :** దేశపు అంతర్జాతీయ వ్యవహారములు అన్నియు ఫ్రెంచి ప్రభుత్వము ద్వారానే నిర్వహింపబడుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** కూరగాయలును, ఖర్జూరములును దేశమున ముఖ్యములగు పంటలు. దేశమున సహజపు వనరులు చాల తక్కువ. కొన్ని ప్రాంతములందు పశుపోషణయు, తీరప్రాంతమున చేపల పరిశ్రమయు జీవికకు ఉపకరించుచున్నవి. జిబూతీ పరిసరములలో కొన్ని పరిశ్రమలు కలవు. జిబూతీరేవు, నానా దేశముల వస్తువులకు వినిమయ స్థానముగ ఉపకరించుటవలననే ఎగుమతి దిగుమతి వ్యాపారమున చాలభాగము సాగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 81.7 కోట్ల ఫ్రాం; దిగుమతుల విలువ 819.5 కోట్ల ఫ్రాం. (1968). దేశపు సాలుసరి బడ్జెటరీ వ్యయము 248.7 కోట్ల ఫ్రాం.

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రభుత్వమును, ప్రయివేటు సంస్థలును నిర్వహించు 174 ప్రయిమరీ పాఠశాలలలో 6,422 మంది విద్యార్థులును, ఉన్నత పాఠశాలలలో 1,475 మంది విద్యార్థులును కలరు (1970-71). జిబూతీలో 891 శయ్యాసంఖ్యకల 2 ఆసుపత్రులును, 7 డిస్పెన్సరీలును కలవు. తక్కిన ప్రాంతములలో 140 శయ్యలుకల 4 డిస్పెన్సరీలును, 5 వైద్య సహాయక సంస్థలును కలవు. సంచార జాతులవారి సౌకర్యార్థమై ఒక సంచారక వైద్యసంస్థ పనిచేయుచున్నది (1971).

# 4. ఆల్ జీరియా

## (ఆల్ - జిజైరియ)

**ముఖ్యనగరము :** అల్‌జియెర్స్ (అల్‌జెర్); **జెండా :** ఆకుపసిమి, తెలుపు రంగుల రెండు నిలువుచారల భూమికపై అరుణవర్ణపు నెలవంకలో కుదురుకొనిన అయిదుకొనల ఎఱ్ఱని నక్షత్రము




పటము 4.

కలది జాతీయ పతాకము; **జాతీయ గీతము :** కస్సమ్... (శపథం చేయుదుము...); **నాణెము :** దీనార్ అను పేరుకల అపరివర్తనీయపు కాగితపు కరెన్సీ (1 దీనార్ = రు 1.52); చిల్లరగ ఒక దీనారునకు 100 సెంట్లు; 1,2,5,10,20,50, సెంటుల నాణెములును, 1,5,10,50,100 500 దీనార్ల కరెన్సీ నోట్లును చలామణీలో ఉన్నవి; **కొలతూకములు :** మెట్రిక్ విధానపు కొలతూకములే ప్రామాణికములు; **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండమున, వాయవ్య భాగమున, మధ్యధరా సముద్ర తీరమును ఆశ్రయించి నెలకొనిన ఈ దేశపు వైశాల్యము 23,81,741 చ కిమీ. దేశమునకు తూర్పున టునీసియా, లిబియా దేశములును; దక్షిణ ఆగ్నేయములందు నైగర్ దేశమును, నైరుతిన మాలీ, మారిటేనియాలును; పశ్చిమమున ఒక కొనన స్పెయిన్ పాలిత సహారాయును, తక్కిన పశ్చిమ భాగమునను వాయవ్యమునను మొరాకో దేశమును; ఉత్తరమున మధ్యధరా సముద్రమును సరిహద్దులందున్నవి. దేశపు తూర్పు - పడమరల గరిష్ఠపు కొలత (12° నుండి 8° తూ. తులాంశములమధ్య) రమారమి 2,400 కి. మీ; ఉత్తర - దక్షిణములు గరిష్ఠపు కొలత (37° నుండి 19° ఉ. అక్షాంశ రేఖల మధ్య) దాదాపు 2,100 కి. మీ.

అట్లాస్ పర్వతముల రెండు శ్రేణులు దాదాపు సమాంతరముగ తూర్పు - పడమరలుగా వ్యాపించి ఈ దేశమును మూడు సహజ ప్రాంతములుగ విభజించుచున్నవి. వీనిలో సముద్ర తీరమునకు చేరువన ఉన్నది తెల్ పర్వతశ్రేణి అనియు, దానికి దక్షిణమున ఉన్నది సహారా అట్లాస్ పర్వతశ్రేణి అనియు వ్యవహృతములు. దేశపు సహజ ప్రాంతములలో ఉత్తరమున నున్నటి సముద్రతీర ప్రాంతము; మధ్యనున్నది పీఠభూమి; దక్షిణమున ఉన్నది సహారా ఎడారిలోని ఒక భాగము. పర్వత శ్రేణులలో అత్యున్నతపు శిఖరపు ఎత్తు 2280 మీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమునందలి సముద్ర తీరప్రాంతమును, పీఠభూమియు సమశీతోష్ణ మండలమునకు చెందినవి. అచటి శీతోష్ణ పరిస్థితి చాలవరకు తక్కిన మధ్యధరా ప్రాంతపు దేశము

లందు ఉన్నటులే ఉండును. అందును సముద్ర తీరప్రాంతమున శీతర్తువున 50° – 54° ఫా. మధ్యను, గ్రీష్మర్తువున 75° – 79° ఫా. మధ్యను తాపమానము ప్రవర్తించుచుండును పీఠభూమి యందు, చలికాలమున 39° – 43° ఫా. వరకును, ఎండకాలమున 79° – 85° ఫా. వరకును తాప మానము మారుచుండును; దక్షిణ ప్రాంతము ఎడారియగుటవలన అచటి తాపమానమున మార్పు లలో వైపరీత్యము ఎక్కువ; అచట శీతకాలమున తాపమానము 14° ఫా. వరకును పడిపోయి, ఎండ కాలమున 128° ఫా. వరకును, కొన్ని సమయము లందు ఇంకను పైకిని, పోవును. దేశమున సముద్ర తీరప్రాంతమున మాత్రమే విస్తారమగు వర్షపాతము కలదు. అచటి సాలుసరి వర్షపాతము 37 నుండి 68 సెం. మీ. వరకు మారుచుండును. తక్కిన ప్రాంతములందు వర్షపాతము చాల తక్కువ. అందును, దక్షిణపు ఎడారిలో అరుదుగ మాత్రమే వానలు అటనట కురియుచుండును తెల్ పర్వత శ్రేణినుండి ప్రవహించు కొన్ని నదులందు సంవత్స రము పొడవునను నీరు ఉండును. కాని వీనిలో ఏదియు నౌకాయానమునకు ఉపకరించదు. సహారా యందు తప్ప, తక్కిన ప్రాంతములలో నిత్య శ్యామల వర్గమునకుచెందిన వృక్షజాతుల వనము లును, అడవిపందులు, లేళ్ళు మొదలగు అల్ప మృగములును కననగును.

**3. జనసంఖ్య మొ.:** 1966 సం.పు జనాభా లెక్కల ప్రకారము దేశపు జనసంఖ్య 1,21,01,994 (1973 అంచనా 150 లక్షలు). వీరిలో అత్యధిక భాగము సముద్రతీర ప్రాంతమున వసించుచున్నారు. అచటి జనసాంద్రత చ. కిమీ. కు 60; పీఠభూమియందలి జనసాంద్రత చ. కిమీ.కు 10; దక్షిణపు సహారా ప్రాంతమున సంచార జాతుల ప్రజలు మాత్రమే అటనట అతిస్వల్ప సంఖ్యలో కాననగుచుందురు. దేశపు మొత్తమున జనసాంద్రత చ. కి. మీ. కు 5 మాత్రమే. దేశపు ఆదిమ నివాసులు బర్బరజాతికి చెందినవారైనను, అరబ్ జాతితో తదనంతర కాలమున కలసిపోవుట వలన ఒక మిశ్రమజాతి దేశమున రూపొందినది. స్వాతంత్ర్యసిద్ధి (1962) కి పూర్వమున యూర పీయ ప్రజలు సముద్రతీరపు పట్టణములలో విరివిగ నివాసములను ఏర్పరచుకొనినను, ఆ తరువాత, దాదాపుగ వారు అందరును దేశమును వదలి పోయిరి. దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ. బర్బరభాషా మాండలికములు అటనట వ్యాప్తియందున్నను, వాని సంఖ్యా వివ రములు తెలియవు. ప్రజలలో విద్యావంతులగు వారిలో పలువురు ఫ్రెంచిభాషనుకూడ మాటాడు దురు. దేశ ప్రజలలో అత్యంత వ్యాప్తికలది సున్నీ సంప్రదాయపు ఇస్లాం మతము. తక్కినవారిలో దాదాపు 25 వేలమంది యూదు మతానుయాయులు కలరు. అల్ప సంఖ్యలో క్రైస్తవులు కొందరున్నను 1962 తరువాత వారిలో పలువురు దేశమును విడిచి పోయిరి.

దేశమునందలి ప్రముఖ నగరములలో జన సంఖ్యా ప్రాబల్య క్రమమున అల్‌జియెర్స్ (9,03, 350), ఓరాన్ (3.27,493), కాన్‌స్టాన్‌టయిన్ (2,43,558), అన్నాబా (1,52,006) అనునవి పేర్కొనదగినవి.

**4. యాన సౌ.:** రాకపోకల వసతులు. సముద్రతీర ప్రాంతమున మాత్రమే, తగినంతగ కలవు. జాతీయ రహదారుల మొత్తపు నిడివి 18,649 కిమీ; రైలుమార్గముల మొత్తపు నిడివి 4100 కిమీ; దేశ, విదేశ యానములకు ఉపక రించు విమానయాన వసతి విరివిగ కలదు. దేశ మున పలు తరగతులకు చెందిన విమాన స్థావర ములు 200 ఉన్నవి (1971). సముద్రతీరమును ఆశ్రయించి పెక్కు రేవులును కలవు; వాని

అన్నింట నౌకాయాన వసతుల ప్రాముఖ్యమును ఆనుసరించి అల్‌జియెర్స్, బోన్, ఓరాన్ అనునవి క్రమరీతిలో గణనీయములు.

**5. సమాచార సా. :** దేశమున 862 తపాలాఫీసులును, టెలిఫోనుల వసతియు కలవు. టెలిఫోనులలో సగమునకు పైగా అల్‌జియెర్స్ నగరముననే ఉన్నవి. అల్‌జియెర్స్, ఓరాన్, కాన్‌స్టాన్‌టెయిన్‌లలో రేడియో ప్రసార కేంద్రములు పనిచేయుచున్నవి. సహారాలోని పలుదూర ప్రాంతములతోను, ఫ్రాన్స్, టునీసియా, మొరాకోలతోను, అల్‌జీరియాకు రేడియో - టెలిఫోను సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** తొలుతటినుండియు బర్బరుల నివాసభూమిగ ఉన్న ఈ దేశము, ప్రాచీన కాలమున కార్తేజియన్, రోమన్, బైజాంటైన్ పాలకుల అధీనమున క్రమముగ ఉండి, క్రీ. శ. 7 వ శతాబ్దిలో అరబ్బుల వశమైనది. అరబ్బుల ప్రాబల్యము వలన, బర్బరులును, వారితో మేళనమొంది క్రీ. శ. 12 వ శతాబ్దినాటికి, అరబ్బీభాషా, సంస్కృతులను, ఇస్లామును అవలంబించిరి. అంతట వివిధ ముస్లిం రాజవంశములవారు అట పాలనలను నెరపి, కడకు, అంతఃకలహములకులోనై, బలహీనులగుట వలన స్పెయిన్ పాలకులు దేశమును వశపరచుకొనిరి (1510). కాని అనతికాలముననే దేశప్రజల సాయమువలన టర్కీ దేశపు సామ్రాట్టు ఈ దేశమును వశపరచుకొని (1518), అచటి పాలనను, తన ప్రతినిధి మూలమున నిర్వహించెను. టర్కీ సామ్రాజ్యము కాలక్రమమున బలహీనముకాగా ఫ్రెంచివారు ఈ దేశమును వశపరచుకొని, తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ జేసిరి (1848). ఫ్రెంచివారి పరిపాలనలో తీరమునందలి సారవంత భూములు ఫ్రెంచి భూస్వాముల వశములయ్యెను. కడకు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఫ్రెంచి పాలనను అంతమొందించు సంకల్పముతో ఫ్రంట్ డి లిబరేషన్ నేషనల్ (F. L. N.) అను రాజకీయపక్షము, ప్రజలను సమీకరించి, షెర్హాత్ అబ్బాస్ అనువాని నాయకత్వమున ఫ్రెంచి ప్రభుత్వమును ఎదిరించి దౌర్జన్య మార్గము నవలంబించి పోరాటమును సాగించినది. ఆ పోరాటపు ఫలితముగ తుదకు దేశము స్వాతంత్ర్యమును ఆర్జించినది (1962, జులై 3). అంతలో స్వాతంత్ర్య యోధులందు అంతఃకల్లోలము చెలరేగి, అబ్బాస్‌ను నాయకత్వమునుండి తొలగించి, బెన్‌బెల్లా నాయకత్వము వహించెను. అంతట దేశమున ఎన్నికలు జరిగి, ప్రజాప్రతినిధులు దేశమునకు ఒక రాజ్యాంగ విధానమును రూపొందించి ఆమోదించి, బెన్‌బెల్లాను, దేశాధ్యక్షుడుగ ఎన్నుకొనిరి (1963 అక్టోబరు). కాని అనతికాలముననే సైనికవర్గపు సాయముతో హౌవరీ బౌమెడిన్ అనునతడు, బెన్‌బెల్లాను పదవీచ్యుతునిజేసి, అధ్యక్షుడయ్యెను (1965 జూలై 10). అంతటినుండి అతని నాయకత్వమున విప్లవ సమితి పరిపాలనను నిర్వహించుచున్నది.

**7. పరిపాలన :** 1963 లో ఒక రాజ్యాంగ విధానము ప్రజలచే ఆమోదితమైనను, 1965 లో విప్లవ సమితి నాయకుడగు బౌమెడీన్, ప్రభుత్వమును వశపరచుకొని, అధ్యక్షుడైన తరువాత ఆ రాజ్యాంగ విధానము రద్దుచేయబడి, విప్లవసమితి నిర్దేశించు మూలసూత్రములకు అనుగుణముగ అధ్యక్షుడే, తాను నియమించుకొనిన మంత్రిమండలి సాయముతో, పరిపాలనను నిర్వహించుచున్నాడు. పరిపాలనా సౌలభ్యమునకై దేశము 15 డిపార్టుమెంటులుగను, ఒక్కొక డిపార్టుమెంటు, కమ్యూనులుగను, విభక్తమై ఉన్నది. నాలుగు సంవత్సరములకు ఒకసారి కమ్యూనుల ఎన్నుకొనబడు అసెంబ్లీ, ఆ కమ్యూనులోని స్థానిక పాలనను నిర్వహించును.

విప్లవసమితి సభ్యులందరును, ఫ్రంట్ డి లిబరేషన్ నేషనల్ పార్టీకి చెందినవారు. ఆ పార్టీతప్ప తక్కిన అన్ని పార్టీలును నిషిద్ధములు.

న్యాయపాలనను నిర్వహించుటకై 1966 లో చేసిన సంస్కరణలను అనుసరించి దేశమున 152 దిగువ కోర్టులును, 15 అపీలు కోర్టులును, ఒక సుప్రీమ్ కోర్టును పనిచేయుచున్నవి. పౌర (సివిల్) వ్యవహారములకు సంబంధించినంతవరకు ఇస్లామిక న్యాయసూత్రములు కొన్నిపట్టుల ఆదరింపబడు చున్నను దండ (క్రిమినల్) వ్యవహారములందు ఫ్రెంచి ధర్మశాస్త్ర నియమములే పాటింపబడు చున్నవి.

**8. దేశరక్షణ :** దేశ సైన్యమున ఒక యాంత్రిక దళమును, 4 ఫిరంగుల దళములును, కొన్ని పదాతిదళములును, వీటి అన్నింట కలసి 53,000 సైనికులును కలరు. నౌకాబలము తగినంతగ లేకపోయినను సోవియట్ రష్యా సాయమున 6 తీర నౌకలు, 10 మిసిలీబోట్లు, 2 మైన్ స్వీపర్లు, ఒక ట్రాలరు లభించినవి. సోవియట్ రష్యా సాయముననే, 140 పోరాట విమానములును, 4000 వైమానిక యోధులునుగల విమాన దళమును ఈ దేశము ఆర్జించినది (1971).

**9. అంతర్జాతీయ సం. :** ఐ రా. స. యందు 1972 లో ఆల్జీరియా సభ్యత్వమును గడించినది. తదాదిగ తదనుబంధ సంస్థలలో పెక్కింట సైతము సభ్యత్వమును ఆ రాజ్యము ఆర్జించినది. అరబ్ లీగునను, ఆ దేశమునకు సభ్యత్వము కలదు; భారతదేశముతోసహా, పలు ప్రముఖ దేశములతో, దౌత్య సంబంధములును కలవు. ఇజ్రాయెల్ తో సాగిన యుద్ధఫలితముగ 1967 నుండి యు. స్టే. దౌత్య కార్యాలయము మూసివేయబడినది.

**10 ఆర్థిక రంగము :** సోషలిస్టు సిద్ధాంతములకు అనుగుణముగ, దేశపు ఆర్థిక వ్యవస్థను రూపొందించుట పాలకుల ఆశయము; అయినను ఉత్పత్తి సాధనములలో కొన్ని - విదేశీయుల అధీనమునఉన్న గనులు, దేశమును వీడిన ఫ్రెంచివారి భూసంపత్తి, భీమా కంపెనీలు - మాత్రమే ఇప్పటి వరకు జాతీయములు చేయబడినవి. 1971 లో చేసిన సంస్కరణలవలన, భూగరిష్ఠ పరిమితి నిర్ణయితమై, పెద్ద కమతములు సహకార వ్యవసాయ సంఘములకు పంచబడినవి. కాని తక్కిన రంగము లందు, వ్యక్తి యాజమాన్యముననే ఉత్పత్తి ప్రోత్సహింపబడుచున్నది. ఇప్పటివరకు దేశ సంపద చాలవరకు వ్యవసాయముపై ఆధారపడియున్నది. కాని పారిశ్రామికముగ దేశమును, సంపన్నము చేయుటకై, చతుర్వర్ష ప్రణాళికల మూలమున కృషి జరుగుచున్నది. వీనిలో తొలుతటిది 1970 లో మొదలైనది. ఆ ప్రణాళికా వ్యయమున 45% పరిశ్రమలకును, 15% వ్యవసాయమునకును ప్రత్యేకింపబడినవి దేశమున 62,000 చ. కిమీ. భూమి సేద్యమునకు అనుకూలముగనున్నది. పంటలలో ముఖ్యమైనవాని ఉత్పత్తి (వేల మెట్రిక్ టన్నులలో) గోధుమ 1,235; బార్లీ 340; ద్రాక్ష సారాయము 825; ఆలివ్ పండ్లు 220; నిమ్మపండ్లు 471. 8,220 లక్షల ఘనమీటరుల నీరునిలుచు 13 జలాశయములవలన, సేద్యభూములలో 1,55,000 హెక్టేరులకు నీటిపారుదల జరుగుచున్నది (1971). దేశమున పశుసంపద విరివిగ కలదు; వానిలో ప్రముఖముగ పేర్కొనదగినవి గొఱ్ఱెలు; వీని సంఖ్య 8 లక్షలు. అడవులు విస్తీర్ణమున 35,000 చ. కిమీ. ఉన్నను, అందు చిట్టడవు లెక్కువ; మిగిలినది దేశపు కలప అవసరములకు సరిపోవుచున్నది. మత్స్యపరిశ్రమ పురాతన మార్గముననే సాగుటవలన ఎక్కువ అభివృద్ధిని చెందకున్నది. అందువలన దానిని ఆధునికము చేయుటకై కృషి జరుగుచున్నది. దేశమున విస్తారమగు ఖనిజ సంపద కలదు. ప్రాముఖ్య క్రమమున వాని ఉత్పత్తి (వేల మెట్రిక్ టన్నులలో) ఇనుము 1,546; ఫాస్ఫేట్ 492; రాక్షసి బొగ్గు 15; తుత్తునాగము, 17; సీసము, 6.5 (1971). వీని

అన్నింటికన్నను దేశసంపదకు ఎక్కువగ సాయ పడునవి పెట్రోలియమ్, ఇంధనవాయువు (నేచురల్ గ్యాస్). పెట్రోలియమ్ 36,346 వేల టన్నులును, ఇంధనవాయువు 668.4 కోట్ల ఘన మీటరులును 1971 లో ఉత్పత్తి అయినవి. దేశమున విద్యుదుత్పత్తి, 189.6 కోట్ల కి. వాట్లు (1971). 1969 లో దేశపు సకలోత్పత్తి విలువ (G. D. P.) 1980 కోట్ల దీనారులుగ లెక్కింపబడినది. ఆనాటి వ్యక్తి ఆదాయము 1500 దీనార్లు. 1973 లో సకలోత్పత్తి విలువ 2650 కోట్ల దీనార్లుగ అంచనా.

ప్రభుత్వమునకు చెందిన బాంకే సెంట్రల్ డి ఆల్‌జీరే అనునది నోట్లను జారీచేయు కేంద్ర బ్యాంకు. దాని అజమాయిషీకి లోబడి 5 ఇతర బ్యాంకులు వ్యవహరించుచున్నవి. దేశ ప్రభుత్వమునకు ఆదాయపు పన్ను, వ్యాపార ధనపు (టర్నోవర్) పన్ను, రేవు సుంకములు, పరోక్షపు పన్ను ఆదాయ మార్గములుగ ఉన్నవి. కొలది యేండ్ల నుండి పెట్రోలియంవలన వచ్చునదియే ఎక్కువగ ఆదాయ మార్గమైనది. ప్రభుత్వమునకు వచ్చు ఆదాయమున 40% దానివలననే ఇపుడు లభించుచున్నది. రేవు సుంకములందు - ఫ్రాన్సు దేశముతో జరుగు వ్యాపారముపైనను, కామన్ మార్కెట్ వస్తువులపైనను-కొంత తగ్గింపు ఈయబడుచున్నది. 1973 లో సాధారణ బడ్జెటు వ్యయము 643 కోట్ల దీనారులు; పెట్టుబడి వ్యయము 1200 కోట్ల దీనారులు.

జాతీయకరణవలన దేశమునందలి విదేశీయ పెట్టుబడులు రద్దయినను ఆ తరువాత విదేశీయ ఋణములను, పెట్టుబడులను, ఆకర్షించుటకై ప్రభుత్వము కొన్ని వసతులను కల్పించినది. అందువలన సోవియట్‌రష్యా, చీనాలనుండియేకాక జపాన్, యునైటెడ్ స్టేట్స్ నుండియు కొంత పెట్టుబడి అల్జీరియాకు చేరినది.

**11 సాంఘిక రంగము :** దేశమున వైద్య వసతిని, కలిగించుటకు, 148 సాధారణ వైద్య శాలలును, 13 ప్రత్యేక రోగముల వైద్యశాలలును పనిచేయుచున్నవి. ఇవిగాక 1,295 దవాఖానాలును, 308 ఆరోగ్య కేంద్రములును కలవు. డాక్టర్ల సంఖ్య 1700 (1966).

దేశమున ప్రాథమికవిద్య అరబ్బీలోను, ఉన్నత విద్య ఫ్రెంచిలోను బోధింపబడుచున్నది. క్రమ క్రమముగ ఉన్నతవిద్యయు అరబ్బీలోనే బోధించు వసతులను చేకూర్చ వలయునని ప్రభుత్వాశయము. ప్రాథమిక పాఠశాలలు 6,500 లో 1,851 వేల విద్యార్థులును, ఉన్నత పాఠశాలలు 670 లో 287,700 విద్యార్థులును పఠించుచున్నారు. అల్జియర్స్ ఓరాన్, కాన్‌స్టాన్ టైనులలోఉన్న, మూడు విశ్వవిద్యాలయములలో 22,568 విద్యార్థులు కలరు. (1972)

# 5. ఇతియోపియా

## (ఈతియోపియా)

**ముఖ్య నగరము :** అడ్డిస్ అబాబా; **జెండా:** ఆకుపసిమి, ఎరుపు, అడ్డచారలు పై నుండి దిగువకు అమరియుండగ, అందు పసిమిచార మధ్యన యూదసింహపు చిత్రము కలది; **జాతీయగీతము :** ఇతియోపియా హాయ్‌దస్స్ ఇబల్లిష్ (ఇతియోపియా ఆనందసీమగ ఉండుగాక...) అను చరణముతో

మొదలగునది; **నాణెము :** ఇతియోపియన్ డాలరు; ఒక ఇ. డాలరు = రు. 3-00; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 3 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : తూర్పు ఆఫ్రికాలో 4°-18°ఉ, అక్షాంశ రేఖలకును, 33°-48° తూ. తులారేఖల




పటము 5.

కును నడుమ విస్తరించి ఉండి, అబిసీనియా అని తప్పుపేరుతో వ్యవహరింపబడుచుండిన, ఈ దేశమునకు ఉత్తరమున ఎర్రసముద్రము; తూర్పున సోమాలియా, అఫార్స్-ఇస్సాస్ ప్రాంతము; దక్షిణమున సోమాలియా, కెన్యా; పశ్చిమమున సుడాన్ సరిహద్దులలో ఉన్నవి. దేశవైశాల్యము 11,84, 320 చ. కిమీ. భూతల వైవిధ్యము వలన ఈ దేశమున కనీసము ఆరు ప్రాంతములుగ నైనను విభజింపదగి ఉన్నది. భూతలపు ఎత్తు సముద్రపు మట్టమునకు దిగువ 116 మీటర్లనుండి ఎగువన 4,570 మీ. వరకు, ప్రాంతములను అనుసరించి, మారుచున్నది. ఆఫ్రికాఖండపు పర్వత శిఖరములందెల్ల ఎత్తున మూడవదిగ లెక్కకువచ్చు రాస్ దాషన్ శిఖరము ఈ దేశమున కననగుచున్నది. దేశమున ఈశాన్యపు మూలనుండి నైరుతికి పయనించు ఒక లోయను ఈ దేశపు భౌతిక లక్షణములలో ప్రముఖముగ లెక్కింపదగును. సైనికులు వాడెడు డాలును అనుకరించు రూపము కలిగిన ఈ దేశమునకు మధ్యనున్న అక్షరేఖగ దీనిని భావింపవచ్చును. ఆ లోయ యొక్క మధ్యభాగము విస్తృతమగు ఉన్నత భూమి; దీనికి వాయవ్యసీమన నిలువున పైకిలేచు పర్వతశ్రేణి ఒకటి ఉన్నది. ఈ ఉన్నత భూమి పశ్చిమప్రాంతమున మైదానములకును, తూర్పున హిందూమహాసముద్రమునకును, క్రమక్రమముగ దిగజారిపోవుచున్నది. ఇక ఇతర నిమ్నభూములు ఉష్ణతకు పేరొందినవి. దేశపు ఆగ్నేయ ప్రాంతము (ఒగాడెన్ అనబడునది) దాదాపుగ ఎడారి. ఉత్తర ప్రాంతపు దానాకిల్ ఎడారి ఎర్రసముద్రము వరకు విస్తరించి ఉన్నది. దేశపు సరస్సులందెల్ల ప్రముఖము తానా సరస్సు. దీనినుండి పుట్టిన నీలపు నైల్ నది (బ్లు నైల్) దాదాపుగ ఒక వృత్తరేఖను అనుసరించుచు ఉన్నత పీఠభూమిని చుట్టి ప్రవహించి, కడకు వాయవ్యదిశగ పోయి సుడాన్ దేశములోనికి పోవుచున్నది. ఇటుల ఉన్నత ప్రాంతములను చొచ్చుకొనిపోవు ఈ నదీ తటపు ఎత్తు కొన్ని ప్రదేశములలో దాదాపు 1,220 మీ. వరకు ఉండును.

**2. శీతోష్ణస్థితి** మొ. : భూతల వైవిధ్యమును అనుసరించి శీతోష్ణ పరిస్థితియు పలురీతుల మారుచున్నది. దేశ మధ్యస్థమగు పీఠభూమియందలి శీతోష్ణస్థితి చాలవరకు సౌమ్యముగ ఉండును; ఈ ప్రాంతముననే ఉన్న ముఖ్యనగరమున అత్యధికోష్ణత 70° ఫా.ను దాటదు. మాసపు సరాసరిన అచటి అధికోష్ణత డిసెంబరులో 56°ఫా; మార్చి నుండి మే వరకు 62°ఫా; అచటి అత్యల్పోష్ణత యందు వ్యత్యాసములు ఎక్కువ; సముద్రపు మట్టమునకు దిగువగ ఉన్న ఎడారులలో ఉష్ణత దుర్భరము, జిగాడెన్ ఎడారిలో సాలీనా వర్షపాతము 10 సెం. మీ. లోపు; ఇక పశ్చిమ ఇతియోపియాలో

సాలీనా వర్షపాతము 200 సెం మీ.; దేశ మధ్యపు పీఠభూమిపై సాలీనా సరాసరి వర్షపాతము దాదాపు 120 సెం. మీ.

వైవిధ్యముకల వృక్షజాతులును, జంతువర్గములును దేశమున విరివిగ కలవు అలంకరణరమ్యతకు పనికివచ్చు కొన్నివిధముల మొక్కలు ఈ దేశమున మాత్రమే కనవచ్చుట వలన, వీనిని విదేశీయులును కొనిపోయి తమ దేశములందు పెంచుచున్నారు. ఏనుగు, సింహము మొదలగు పెద్ద జంతువులును, కోతులు, సివంగులు మొదలగు మర్కటజాతులును దేశమున పలు ప్రాంతములందు కలవు. పెద్ద కొమ్ములుగల అడవిమేక (వాలిస్ ఇబెక్స్ అనబడునది) ఈ దేశమున మాత్రమే కననగుచున్నది.

**3. జనసంఖ్య మొ.** : దేశమున జనసంఖ్యా గణన, శాస్త్రీయరీతిలో, ఇప్పటికి జరుగలేదు. 1969 అంచనాలనుబట్టి దేశపు జనసంఖ్య 2,47,70,000గ నిర్ణయింపబడినది. దేశములోని నగరములలో అడ్డిస్ అబాబా (జ. సం. 6,45,000). అస్మారా (1,90,500) పేర్కొనదగినవి. జన సాంద్రత చ. కిమీ. కు 20, శీతోష్ణస్థితియు, వ్యవసాయపు వనరులును అనుకూలముగ ఉన్న దేశమధ్యపు పీఠభూమియందు జన సాంద్రత చాల ఎక్కువ. ప్రజలలో 5% మాత్రమే పట్టణములందు వసించుచున్నారు.

దేశమునందు వివిధ ఆఫ్రికన్ జాతులు-కుషిటిక్, సెమిటిక్, హమిటిక్, నీగ్రోజాతులు - కననగుచున్నవి. ఇందు సెమిటిక్ జాతులవారు ప్రజలలో మూడవవంతు ఉన్నారని చెప్పవచ్చును. హమిటిక్ జాతులవారు 40%; నీగ్రోజాతులవారు 6 . కలరు. పైన పేర్కొనబడిన జాతులవారుగాక, అరబ్బులు ఇటాలియనులు, ఆర్మీనియనులు, గ్రీకులు, భారతీయులు అటనట కన్పట్టుదురు. వీరి మొత్తపు సంఖ్య 50,000 వరకు ఉండగలదని అంచనా (1968).

దేశమున 70 కి మించిన మాతృభాషలు ప్రజలలోని వివిధ ప్రాంతీయులందు ప్రచారమున ఉన్నవి. వీనిలో అనేకములు, సెమిటిక్-హమిటిక్, కుషిటిక్ భాషా కుటుంబములకు చెందినవి. జాతీయ భాషగ పరిగణింపబడు అంహారిక్‌ను ప్రజలలో 60% మాటాడుచున్నారు. దేశమునందలి ఎరిట్రియా రాష్ట్రమున అరబ్బియు, తిగ్రీనియాయు చాలమందికి మాతృభాషలుగ ఉన్నవి. దేశవాసులలో అత్యధిక సంఖ్యాకులందు సనాతన క్రైస్తవ మతము ప్రచారమున ఉన్నది. ఈ మతానుయాయులు దేశపు చక్రవర్తినే తమ పీఠాధిపతిగ భావింతురు. తూర్పు ఈశాన్యపు ప్రాంతములలో ఇస్లాము మతమునకు ఎక్కువ ఆదరణ కలదు. ప్రకృతి దేవతారాధకులు 5 నుండి 15% వరకు ఉందురని అంచనా. ఒక సంప్రదాయపు యూద మతము, ఫలాషాలు అనబడు ఒక అల్పసంఖ్యాకవర్గమున, వ్యాప్తికలిగి యున్నది.

**4. సమాచార సౌ.** : తపాలా వ్యవహారము లన్నియు విమానముల సహాయము చేతనే నిర్వర్తింపబడుచున్నవని చెప్పవచ్చును. దేశపు మొత్తమున 69 కేంద్రములు తపాలా స్థావరములుగ వినియుక్తము లగుచున్నవి. దేశమునందలి వివిధ ప్రధాన జనావాసములును అడ్డిస్ అబాబాతో టెలిఫోనుద్వారానో, రేడియో-టెలిగ్రాఫ్ ద్వారానో సంబంధమును కలిగియున్నవి. యూరప్, ఉత్తర అమెరికాలలోని దేశములతోను, భారతదేశముతోను టెలిఫోను సంబంధములు కలవు. ముఖ్యనగరమున ఒక రేడియోస్టేషను, ఒక టెలివిజన్ కేంద్రము పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.** : దేశమున 7,200 కి. మీ. నిడివిగల రోడ్డుమార్గములు ఉన్నవి. ఇందు దాదాపు

మూడవ భాగము తారువేయబడినవి. ఇవిగాక, ఎండకాలమున మాత్రమే పనికివచ్చు మట్టిరోడ్లు కలవు; వాని మొత్తపునిడివి 16.000 కిమీ. ప్రముఖములగు మార్గములకు అన్నింటికిని అడ్డిస్ అబాబా లేదా అస్మారానగరము కూడలులుగ ఉపక రించుచున్నవి. ఈ విధముగ దేశమునందు వస్తూత్పత్తికి పేరొందిన కేంద్రములును, రేవునగరములును అడిస్ అబాబా, అస్మారాలతో సన్నిహిత సంబంధమును కలిగి ఉన్నవి.

దేశమున రెండు రైలుమార్గములు ఉన్నవి. అందొకటి అడ్డిస్ అబాబాను జిబూతీరేవుతో కలుపుచున్నది. (ఈ రేవు నగరము ఫ్రెంచివారికి చెందిన అఫార్స్-ఇస్సాస్ ప్రాంతమునఉన్నది). ఈ మీటరు గేజి రైలుమార్గము ఈ దేశమున 779 కి మీ. పయనించును. రెండవ రైలుమార్గము ఎరిత్రియారాష్ట్రమున ఉన్న బ్రాడ్‌గేజి మార్గము, ఇది అస్మారాను మస్సావారేవుతో కలుపుచున్నది. దీని నిడివి 306 కిమీ.

దేశమున కొన్ని ప్రాంతములకు రైలువసతిగాని రోడ్డువసతిగాని లేనందున అటువంటి ప్రాంతముల మధ్య విమానయానపు వసతి తప్పనిసరి అగుచున్నది. అడ్డిస్-అబాబా అస్మారాలలోని విమానాశ్రయములు ఇందులకు కేంద్రములుగ ఉపక రించుచున్నవి. విమానములకు దిగు వసతులు దేశమున వివిధ ప్రాంతములందు కల్పింపబడినవి. పై రెండు విమానాశ్రయములనుండి అంతర్జాతీయ విమానయానమునకును తగు వసతులు కలవు.

మస్సావా, అస్సాబ్ అను రేవులు విదేశవ్యాపారమునకు ఉపకరించుచున్నవి. ఇవి రెండును ఎర్ర సముద్రపు తీరమున ఉన్నవి.

**6 చరిత్ర :** అత్యంత ప్రాచీనచరిత్ర కలిగి నిరంతరాయముగ పనుగడను సాగించుచున్న ప్రపంచ రాజ్యములలో ఈ దేశము ఒకటిగ పేరొందినది. తొలుత నీగ్రోల నివాసముగ ఉండిన ఈ దేశమున కీ. పూ. 4000 ప్రాంతమున హమిటిక్ జాతులును, వారితరువాత సెమిటిక్ జాతులును చేరెననియు, ఆ ఉభయజాతులును నీగ్రోలను, చాల వరకు తరిమివైచి, కొందరిని బానిసలుగ తీసికొని బానిసత్వము ప్రాతిపదికగ దేశమున సంఘవ్యవస్థను నెలకొల్పిరనియు చారిత్రకుల భావన. క్రీ. పూ. 1600 నాటికి ఈ దేశము ప్రాచీన ఈజిప్టు పాలకుల విశాల సామ్రాజ్యమున అంతర్భాగముగ ఉండెను. కాని క్రీ. పూ. 800 దరిదాపులలో ఈ దేశము స్వతంత్ర రాజ్యముగ రూపొందుటయే గాక, కొంతకాలము ఈజిప్టుపై సైతము సార్వభౌమత్వము వహించెను. ఆనాడీ రాజ్యము అక్సుం రాజ్యము అని వ్యవహరింపబడినది. ఆ రాజ్యమునకు ప్రాభవమును సమకూర్చినది షీబారాణి అనియు, ఈమె యూద చరిత్రలో పేరెన్నికగన్న సాలమన్ చక్రవర్తికి భార్యయినియు సాంప్రదాయిక కథనము కలదు.

క్రీ. శ. 4 వ శతాబ్దమున, ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నుండి ఇటకుచేరిన ఒక మతాచార్యుని మూలమున క్రైస్తవమతము ఈ దేశమున దృఢమగు స్థావరమును కల్పించుకొన కలిగినది. తరువాత క్రీ. శ. 7 వ శతాబ్దమున మతావేశ ప్రేరితములగు ఇస్లామిక సేనలు ఉత్తర ఆఫ్రికాలోని దేశములన్నింట మతవ్యవస్థను తారుమారుచేసిన కాలమున సైతము ఈ దేశము క్రైస్తవ మతమునకు ఆటపట్టుగ నిలిచినది. అయినను అప్పటినుండి ముస్లింరాజ్యముల ఒత్తిడికి ఈ దేశము అనేక సందర్భములందు లోనుగావలసి వచ్చినది. అయినను ఈ దేశపు ప్రాచీన రాజవంశము ఎటులో కాలు నిలువద్రొక్కుకొని 14 వ శతాబ్ధమున, ముస్లిం ఆక్రమిత ప్రాంతములను తిరిగి వశపరచుకొని దేశ సమగ్రతను కాపాడినది. 16 వ శతాబ్దమున ముస్లిం సేనలు మరల ఈ దేశమును వశపరచుకొనుటకు కృషి

చేసినవి. కాని, అప్పటిలో పోర్చుగీజువారికి ఈరాజ్యముతో పరిచయము ఏర్పడుటను అవకాశముగ గ్రహించి సాటి క్రైస్తవులగు పోర్చుగీజుల సాయముతో దేశపాలకుడు ముస్లింసేనలను నిర్జింపగలిగెను (1543).

18, 19 శతాబ్దములలో మాండలిక పాలకులు బలవంతులై, కేంద్రాధికారమును నామమాత్రముగ చేసిరి; అంతట 19వ శతాబ్ది ఉత్తరార్ధమున దేశమును పాలించిన తియొడోర్‌రాజు, మాండలికులను అడచి కేంద్రాధికారమును పునరుద్ధరించెను (1855). కాని ఈ కాలముననే ఇటలీదేశము ఆఫ్రికాలో వలసలను నెలకొల్పు కృషిలో అంతర్భాగముగ ఎరిట్రియా రాష్ట్రములోని పలు ప్రాంతములను వశపరచుకొనగ 1896 లో ఇతియోపియా సేనలు ఇటలీ సేనలను అడోవావద్ద ఓడించినవి. కాని, తదనంతరమున బ్రిటన్, ఫ్రాన్సులతో పాటుగ ఇటలీయు తీరప్రాంత భూములందు తన అధికారమును నిలుపుకొనగలుగుటవలన ఎరిట్రియా రాష్ట్రము వారి వశముననే ఉండినది. మరల 1935-1936 లో ఇటలీ సేనలు ఇతియోపియాపై దండెత్తి దేశమునంతటిని వశపరచుకొనగ, అప్పటి దేశపాలకుడగు హెయిలీసెలాసీ చక్రవర్తి దేశమును వదలి గ్రేట్ బ్రిటన్‌లో తలదాచుకొనెను. తరువాత ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున ఇటలీ సేనలను దేశమునుండి తరిమివైచి, గ్రేటు బ్రిటన్ ఈ దేశము తిరిగి హెయిలీ సెలాసీకి వశమగునటుల చేసినది. ఇటలీ అధీనమునఉన్న ఎరిట్రియా రాష్ట్రము స్వతంత్రమై 1952 లో ఇతియోపియాతో సమాఖ్యా రీతిలో, కలియునటుల ఐ. రా. స. చేయగలిగినది. 1960 లో ఈ రాష్ట్రమును దేశమున అంతర్భాగముగ మేళవించుట జరిగినది. ఈ విధముగా హెయిలీసెలాసీ చక్రవర్తి దేశమును ఏకీభూతము చేసి దృఢముగ పరిపాలనా వ్యవస్థను నెలకొల్పినను, అధికారమంతయు రాజకుటుంబీకులయు, తదాశ్రితులయు వశముననే ఉండి, ప్రజలకు ఎట్టి భాగస్వామ్యమును లేకుండెను. ఇందులకు తోడుగ ముస్లిములు అధిక సంఖ్యాకులుగఉండు ఎరిట్రియాలో స్వయం పరిపాలనాకాంక్ష ఎక్కువ కాసాగెను. ఈ పరిస్థితులలో సైనికవర్గము అధికారమును వశపరచుకొని, రాజును పదవీచ్యుతుని చేసినది (27 ఫిబ్రవరి, 1974). రాజవంశీయులను, రాజాశ్రితులను నిర్దాక్షిణ్యముగ నిర్మూలించుటయే గాక, ఎరిట్రియాలో స్వాతంత్ర్య కాంక్షతో బయలు దేరిన తిరుగుబాటునుకూడ ఆ సైనికవర్గము క్రూరతతో అణచివేసినది.

**7. పరిపాలన :** దేశము ప్రస్తుతమున సైనిక వర్గపు నిరంకుశపాలనలో ఉన్నది. ఏకపక్ష విధానపు ప్రభుత్వము త్వరలో నెలకొల్పబడగలదనియు, సోషలిష్టు ప్రభుత్వమును నెలకొల్పుట తమ ధ్యేయమనియు తాత్కాలిక సైనిక ప్రభుత్వము 22 డిసెంబరు 1974న ప్రకటించినది; కాని వివరములు రూపొందింపబడలేదు.

**8. దేశరక్షణ :** బ్రిటిష్ ప్రవీణులచే సుశిక్షితమై రూపొందింపబడిన 4 డివిజనుల పదాతిసేన కలదు; ఒక్కొక్క డివిజనున, మూడు పటాలములు పనిచేయుచున్నవి. వీనియందే అంతర్భాగముగ ఒక యాంత్రిక దళమును కలదు. మొత్తము ఈ వివిధ రీతుల పదాతిసేనయందును 40,000 మంది సైనికులు కలరు. బ్రిటిషువారి సాయముచేతనే నిర్మితమయిన నావిక సేనయు కలదు. ఇది చాల వరకు తీర రక్షణకు ఉద్దేశితము; అందువలన అందులకు అనుగుణములగు నౌకలు 15 కలవు. మసావాలో ఒక నావిక శిక్షణ శిబిరము పనిచేయుచున్నది. మొత్తముమీద నావికసేనయందు 1,134 మంది యోధులును, 240 మంది ఉద్యోగులును కలరు.

అమెరికనులచేతను, స్వీడెన్‌వారిచేతను శిక్షణను పొందిన వైమానిక యోధులు కల వాయుసేన

కలదు. ఒక బాంబరుదళము, ఫైటరుదళము, తక్కిన అనుబంధ దళములు కలవు. మొత్తపు వాయుసేనలో 1,790 మంది యోధులును, 330 మంది ఉద్యోగులును పనిచేయుచున్నారు.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో దాదాపుగ అన్నింటను ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ఆఫ్రికా ఐక్యతా వ్యవస్థయందు, ఈ రాజ్యము ప్రముఖ పాత్రను వహించుచున్నది. ఆ వ్యవస్థయొక్క సచివాలయమును, ఆఫ్రికా ఆర్థిక కమీషన్ ప్రధాన కార్యాలయమును అడ్డిస్ అబాబాలో ఉన్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమును, పశుపోషణయు ముఖ్యాధారములని చెప్పవచ్చును. ఆహారపు పంటల విషయమున దేశము స్వయంపోషక స్థితిలోఉన్నది. రొక్కపు పంటలలో ప్రముఖముగ పేర్కొనదగినది కాఫీ గింజల పంట. కాఫీ పంటలకు ఈ దేశమే మాతృభూమియనుట ఇచట గమనార్హము. ఈ దేశమునందలి 'కఫా' అను ప్రాంతమున పెరుగునది యగుటవలననే ఆ పంటకు 'కాఫీ' అను పేరు కలిగినది. ఇపుడును దేశపు మొత్తమున ఆ 'కఫా' ప్రాంతముననే 'కాఫీ' పంట ఎక్కువగ పండుచున్నది. ఇప్పటికిని ఆ పంటలో ఎక్కువ భాగము, ఏ సేద్యము అవసరము లేకుండనే, అడవి చెట్లవలెనే ప్రతియేటా ఎదుగుచున్నది; అయినను కాఫీ తోటలను కొన్నింటిని వేయుటయు ప్రస్తుతమున జరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువలో 60% కాఫీగింజల ఎగుమతి వలననే లభించుచున్నది. 1971 లో కాఫీ గింజల ఎగుమతి 80,820 మె. టన్నులు.

గోజాతి పశువులు దాదాపుగ మూడుకోట్లును, గొర్రెలు దాదాపుగ 125 లక్షలును దేశమున కలవు; ప్రజలకు కావలసిన పాలు, వెన్న వీనివలన లభించుటయేగాక, వీనిలో కొన్నింటిని సజీవముగను, కొన్నింటిని మాంసపు రూపమునను పారసీక సింధుశాఖా ప్రాంతమునకు, అందును ముఖ్యముగ కువాయిట్‌కు, ఎగుమతిచేయుట జరుగుచున్నది. చర్మముల ఎగుమతివలనకూడ దేశమునకు మంచి ఆదాయము లభించుచున్నది.

ప్రాచీన కాలమునుండియు ఈ దేశము బంగారు గనులకు పేరొందినది; అయినను ప్రస్తుతమున అడోవా, ఆకోబా అను ప్రాంతములందు మాత్రమే గనులనుండి బంగారము తీయబడుచున్నది. 1968 లో దాని ఉత్పత్తి 1,119 కి. గ్రా. తక్కిన ఖనిజములు ఏవియు చెప్పదగిన మొత్తములలో లభించుటలేదు. దేశపు ఎగుమతుల విలువ 2,58,047 వేల ఇ. డాలర్లు; దిగుమతుల విలువ 4,32,522 వేల ఇ. డా. (1968). బడ్జెటరీ వ్యయము 75.7 కోట్ల ఇ. డా. (1972-73).

**11. సాంఘిక రంగము :** దేశమున 10% మాత్రమే అక్షరాస్యులు ఉన్నటుల అంచనాలవలన తేలుచున్నది. దేశమున ప్రయిమరీ, సెకండరీ స్కూలులును, ప్రయివేటు పాఠశాలలును మొత్తము మీద 2,000 కు పైబడి ఉన్నవి; ఇందలి విద్యార్థి సంఖ్య 7,90,812 (1970-71). ఉన్నత విద్యాబోధనను నిర్వహించుటకై హెయిలీసెలాసీ విశ్వవిద్యాలయమునకు అనుబంధితములగు పెక్కు కళాశాలలు, విద్యా సంస్థలు కలవు. వీనియందు 5,000 విద్యార్థులకు బోధనావకాశములు కలవు. సెకండరీ స్థాయి మొదలుగ విద్యాబోధన ఇంగ్లీషులోనే చాలవరకు జరుగుచున్నది. ప్రభుత్వాధ్వర్యవమున భాషకు ఒక్కొక్కటి చొప్పున, ఇంగ్లీష్, ఫ్రెంచి, అంహరిక్ భాషలలో మూడు దినపత్రికలు అడ్డిస్ అబాబానుండియు, ఇటాలియన్ భాషలో రెండు దినపత్రికలు ఆస్మొరానుండియు ప్రచురింపబడు చున్నవి. ముఖ్యనగరమునను,

అస్మారాలోను గ్రంథాలయములును, మ్యూజియము లును ఉన్నను అవి ఉన్నత స్థాయికి చెందినవి కావు.

వైద్య సహాయము కొరకై దేశము చాలవరకు యూరపీయ వైద్యులపై ఆధారపడి ఉన్నది. దేశ మున 9,310 శయ్యలుకల 81 ఆసుపత్రులు ఉన్నను, ఇందు 14 ముఖ్యనగరముననే ఉన్నవి; ఆ నగరమునందలి మెనెలిక్ II ఆసుపత్రి అత్యంత ఆధునిక పరికరయుతము; అందలి శయ్యాసంఖ్య 375. దేశమున మొత్తపు వైద్యుల సంఖ్య 362; ఇందు దేశీయవైద్యుల సంఖ్య అత్యల్పము.

**12. యాత్రా సౌ.:** దేశమున దర్శనీయ స్థలములు పెక్కున్నను, వానిని అభివృద్ధిచేసి, విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకు కృషి తగి నంతగ జరుగకున్నది. వీసా, పాస్‌పోర్టు మొదలగు అనుమతి పత్రములను విదేశీయ యాత్రికులు విధిగా కలిగియుండవలయును.

**13 ప్రసిద్ధ పౌరులు:** 1. యారేద్ (15వ శతాబ్ది): క్రైస్తవ మతమున కోప్టిక్ సంప్రదాయపు ప్రార్థనా గీతములకు స్వరకల్పన కావించిన వాగ్గేయ కారుడు, 2 జరాయాకూబ్ (1414-68 ప); ప్రసిద్ధ పరిపాలకుడుగనేగాక, ధర్మశీలుడుగను సారస్వత పోషకుడుగను పేరొందెను; అంహరిక్ సారస్వతము ఇతని కాలమున ఎంతయో అభివృద్ధిని పొందెను.

---

# 6. ఈక్వటోరియల్ గినీ

**ముఖ్యనగరము:** సాంతా ఇజబెల్; **జెండా:** ఆకుపసిమి, తెలుపు, ఎరుపు, అడ్డచారలు కలిగి,




పటము 6.

దండము కడనుండి, మధ్యచారలోనికి శీర్షముండు నటుల ఏర్పడిన నీలపు త్రిభుజమును, మధ్యనున్న తెలుపుచారలో నడుమ ప్రత్తి చెట్టును కలది; **నాణెము:** గినీయ పెసేటా అను దశాంశపు నాణెము; ఒక గి. పెసేటా = రు. 1.07; **కొల తూకములు:** మెట్రిక్ విధానపువి; **కాల పరి గణన:** సాయంకాలము 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఆఫ్రికా పశ్చిమ తీరమున, తీరస్థమగు 'రియో ముని' అను ప్రాంతమును, ఆ తీరమునకు అనతి దూరముననే, అట్లాంటిక్ మహా సముద్ర పరివృతములై, జనావాసితములగు, అయిదు ద్వీపములును, (ఫెర్నాండో పూ, అన్నో బోన్, కోరిస్కో, ఎలోబీ చికో, ఎలోబీ గ్రాండ్) కలసి 'ఈక్వటోరియల్ గినీ' అను దేశముగ వ్యవహరింపబడుచున్నవి. రియో మునియు, పై ద్వీపములును చేరియున్న యావత్ ప్రదేశము $1°1' - 3°48'$ ఉ. అక్షాంశ రేఖల మధ్యను,

8°26 — 11°20 తూ. తులా రేఖల మధ్యను ఇమిడి ఉన్నదని చెప్పవచ్చును. ఖండస్థమగు రియోమునికి, ఉత్తరమున కామెరూన్; తూర్పునను, దక్షిణమునను, గేబన్; పశ్చిమమున అట్లాంటిక్ మహా సముద్రము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 28,051 చ. కిమీ. ఫెర్నాండో పూ, అన్నోబోన్ అనునవి, అగ్నిపర్వత ద్వీపములు. రియోమునిలో తీరభూమియందలి ఇసుక మైదానము తప్ప, తక్కినది అంతయు పీఠభూమి. ఈ పీఠభూమికి ఇరుప్రక్కల, ముని, కాంపోనదులు కలవు. దేశమంతయు చాలవరకు అరణ్యమయము. వ్యవసాయమునకు అనుకూలమగు భూమియు, గాలి చెమ్మయు, ఇచట కలవు.

**2. శీతోష్ణస్థితి** మొ. : దేశమున వివిధ ప్రాంతములందు 59° ఫా. నుండి 71° ఫా. వరకు సరాసరి ఉష్ణోగ్రత మారుచున్నది. సాలుసరి వర్షపాతముకూడ 180 సెం. మీ (సాంతా ఇజబెల్ వద్ద) నుండి 1,075 సెం. మీ. (ఫెర్నాండో పూలో) వరకు మారుచున్నది. 140 రకముల ఉత్తమ శ్రేణి వృక్షములు, ఈ దేశపు అడవులలో కలవు. ఏనుగులును, మర్కటజాతి వన్యజీవములును అడవులలో కనబడును.

**3. జనసంఖ్య** మొ. : 1970 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,90,000, నగరములలో, సాంతా ఇజబెల్ (జ. సం 37,237), ఎబీబియన్ (31,120) బాటా (27,024), సాన్ కార్లోస్ (19,951) పేర్కొనదగినవి. వివిధ ఆఫ్రికన్ జాతులు చేరిన, ఈ జనానీకమున, ఫాంగ్ జాతివారు అత్యధిక సంఖ్యాకులు. వివిధ ఆఫ్రికన్ భాషలు, దేశమున, ప్రచారమున ఉన్నవి. అయినను స్పానిష్ భాషయే, అధికారభాషగ అమలున ఉన్నది. 'పిడ్జింగ్లీస్' అనబడు సంకరపు ఆంగ్లమును, పోర్చుగీజు - బంటూ భాషల సంకర భాషయు, వ్యాపార భాషలుగ కొన్ని ప్రాంతములలో వాడుకయందు ఉన్నవి. దేశీయులలో మారుమూల ప్రాంతములందు కొలదిగ సాంప్రదాయిక ప్రకృతి దేవతారాధన వ్యాప్తియందున్నను, అత్యధిక సంఖ్యాకులు (99%) రోమన్ కేతలిక క్రైస్తవులు

**4. సమాచార సౌ.** : దేశమున 12 తపాలా ఫీసులు, 16 సంచార తపాఫీసులు కలవు. దేశమున వివిధ ముఖ్య కేంద్రముల మధ్య టెలిఫోన్ సౌకర్యము కలదు. సాంతా ఇజబెల్, సాన్‌కార్లోస్, బాటాలనుండి కెనరీ దీవులద్వారా యూరప్‌తో, రేడియో - టెలిఫోను వసతి ఏర్పడియున్నది. ముఖ్యనగరమున రేడియో ప్రసార కేంద్రము, టెలివిజన్ కేంద్రము పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.** : ఫెర్నాండో పూ ద్వీపమున 158 కిమీ. నిడివిగల, మంచి కాంక్రీటు రోడ్డు మార్గము కలదు; రియోమునిలో 1016 కిమీ. పొడవున తారురోడ్లు వేయబడి ఉన్నవి. తక్కిన ప్రదేశములందు డొంక బాటలు మాత్రమే కలవు. సాన్‌టా ఇజబెల్, బాటారియో, బెనిటో, పోర్టో ఇరేడియన్, సాన్‌కార్లోస్ అనునవి రేవునగరములు. ప్రక్కనున్న ఆఫ్రికా దేశములకు, ఈ రేవులనుండి నౌకా ప్రయాణ వసతి కలదు. బాటాలో అత్యుత్తమ మగు విమానాశ్రయము ఉన్నది. సాంటా ఇజబెల్ లోని విమానాశ్రయము దేశాంతర్గత విమానయానమునకు ఉపకరించుచున్నది.

**6. చరిత్ర** : ఈ దేశమున తొలుత పొట్టిజాతి (పిగ్మీ) మానవులు వసించిరనియు, వారిని మారుమూల ప్రాంతములకు తరిమి అంతటంతట, వివిధ ఆఫ్రికన్ జాతులు దేశమున చేరి రాజ్యములను, సంస్థాపించియుండిరనియు తెలియవచ్చు చున్నది. 15 వ శతాబ్ది అంతమున, పోర్చుగీజువారికి, ఈ ప్రాంతము పరిచితమైనది. అన్నోబోన్, ఫెర్నాండో పూ ద్వీపములను, ఆ కాలమున పోర్చుగీజువారు

ఆక్రమించిరి. కాని 1778 లో కుదిరిన ఒక ఒడంబడికను అనుసరించి మరికొన్ని ప్రాంతములతో పాటుగ, ఈ రెండు ద్వీపములను స్పెయిను వారికే పోర్చుగీజు ప్రభుత్వము ఇచ్చివేసెను. ఈ ద్వీపములతో పాటుగ, రియోముని యందును, స్పెయిన్ సేనలు ప్రవేశించి 1927 నాటికి ఇప్పటి ఈక్విటోరియల్ గినీని అంతటిని తమ ఆధీనములోనికి తెచ్చుకొనగలిగినవి. 1958 నుండి స్పెయిన్ దేశమున ఒక రాష్ట్రముగ ఈ దేశము పరిపాలింపబడెను. కాని ప్రజల ఆందోళనకు ఫలితముగ జరిగిన, జనాభిప్రాయ సేకరణను అనుసరించి, అక్టోబరు 12, 1968న దేశము స్వతంత్రతను ఆర్జించినది.

**7. పరిపాలన :** సార్వజనిక వయోజన వోటింగ్ పద్ధతిన, దేశాధ్యక్షుడు ఎన్నుకొనబడును. అతని పదవీకాల పరిమితి 5 సంవత్సరములు. అతడు సర్వాధికారయుతుడు; జాతీయ శాసనసభ యందు 35 ప్రతినిధులు కలరు. శాసనసభకు ఎన్నికలు 5 ఏండ్లకు ఒకసారి జరుగును. దేశము రెండు రాష్ట్రములుగ పరిపాలనా రీతిలో విభక్తము. (ఫెర్నాండో పూ, అన్నోబిన్ ద్వీపములు, ఒక రాష్ట్రముగను, తక్కినవి ఒక రాష్ట్రముగను ఉన్నవి). స్థానిక ప్రతినిధుల సాయముతో, అచటి పాలన నిర్వహింపబడుచున్నది. స్వతంత్రమగు న్యాయశాఖ, సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున, న్యాయ పాలనను, నిర్వహించుచున్నది.

**8. దేశరక్షణ :** జాతీయ సంరక్షక దళము దేశపు ఆంతరంగిక భద్రతకు, బాధ్యత వహించి ఉన్నది. దేశ సమగ్రతను కాపాడుటకు, స్పెయిన్ దేశము పూచీపడి ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** 1968 మొదలుగ ఐ.రా.స. యందును, ఆఫ్రికా రాజ్య ఐక్యతా సంఘమునను, ఈ దేశము సభ్యత్వము వహించియున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ, కకావ్, కాఫీ పంటలపైనను, అడవులందు దొరకు కలపపైనను, ఆధారపడియున్నది. కకావ్ విత్తనములనుండి, కోకో, చాకోలెట్లు తయారగును. అన్నోబిన్ ద్వీపమున చేపల పరిశ్రమ విరివిగ సాగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 181,71,89,000 పెసేటాలు; దిగుమతుల విలువ 127,85,02,000 పెసేటాలు (1966). ఎగుమతులలో 90% స్పెయినుకు చేరుచున్నవి; దిగుమతులలో 50% ఆ దేశమునుండియే వచ్చుచున్నవి. విద్యుదుత్పత్తి 98,39,786 కివా. (1966). సాలుసరి బడ్జెటరీ వ్యయము 113.9 కోట్ల పె. (1970-71).

**11. సాంఘిక రంగము :** గృహ నిర్మాణ విషయమున, స్పెయిన్ ప్రభుత్వపు వలస పరిపాలనా కాలమునుండియు, 1949 మొదలుగ, ఈ దేశమున ప్రత్యేక కృషి జరుగుచునే ఉన్నది. బడ్జెటులో 38% ఇందులకు వెచ్చింపబడుచున్నది (1966). 260 ప్రాథమిక పాఠశాలలలో 28,454 మంది, ఒకే ఒక మాధ్యమిక పాఠశాలలో 986 మంది, ఒకే ఒక ఉన్నత పాఠశాలలో 100 మంది విద్యార్థులు చదువుచున్నారు (1966). ఉన్నత విద్యకై విద్యార్థులు, విదేశములకు, అందును ముఖ్యముగా స్పెయిన్ దేశమునకు పోవుచున్నారు. అక్షరాస్యత, ప్రభుత్వ అంచనాలను అనుసరించి, 90—95%. సాంతా ఇజబెల్‌లో ఒక ప్రముఖ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. ఫెర్నాండో పూ లో మాత్రమే ఒక దిన పత్రిక వెలువడుచున్నది.

**12. యాత్రా సౌ. :** 'వీసాలు' మొదలగు అనుమతి పత్రములు కలిగిన విదేశీయులకు మాత్రమే దేశమున పర్యటింప వీలగును.

# 7. ఈజిప్ట్

## (అల్ మిస్ర్)

**ముఖ్యనగరము :** కయిరో; **జెండా :** ఎరుపు, తెలుపు, నలుపు రంగుల మూడు అడ్డు చారలలో మధ్యనున్న తెల్ల చారపై కుదురుకొనిన అయిదు కోణముల నక్షత్ర చిహ్నములు రెండింటిని కలిగి యున్నది. **జాతీయ గీతము :** అల్‌నషీద్ అల్ వతన్; **నాణెము :** అపరివర్తనీయపు కాగితపు కరెన్సీ రూపమున నుండు ఈజిప్షన్ పౌను (ఒక పౌను = రు. 17.18); చిల్లరగ ఒకపౌనునకు




పటము 7.

100 పియాస్త్రులు. **కొలతూకములు :** మెట్రిక్ మానమే సాధికారముగ పరిగణనలో ఉన్నను, కొన్ని స్థానిక మానములును అటనట వాడుకలో కలవు; **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు ఈశాన్య భాగపు మూలన 21°35—31°35 ఉ. అక్షాంశల మధ్యను (1,086 కిమీ.). 25°—36° తూ. తులారేఖల మధ్యను (1,239 కిమీ.) ఉన్న ఈ దేశమునకు ఉత్తరమున మధ్యధరా సముద్రమును తూర్పున ఇస్రాయెల్‌ను, ఎర్రసముద్రమును; దక్షిణమున సుడాన్‌దేశమును; పశ్చిమమున లిబియాయను సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 10,00,214 చ. కిమీ. భౌతిక పరిస్థితిని బట్టి, దేశమును పడమటి ఎడారి, నైలు లోయ, తూర్పు ఎడారి అని మూడుభాగములుగ విభజింపవచ్చును. పడమటి ఎడారి సహారాలో అంతర్భాగము. తూర్పు ఎడారి అరేబియా ఎడారికి చెందినది. నైలు లోయలోని, ఉత్తరభాగమగు, నైలుడెల్టా అత్యంత సారవంతము; ఆ లోయలోని దక్షిణభాగము ఎగుడు దిగుడు నల్లరాతి గుట్టలు. దేశమందు కొన్ని ప్రాంతములందు, అందును ముఖ్యముగ పడమటి ఎడారిలో, భూమి ఎత్తు సముద్రపు మట్టమునకు 130 మీ. దిగువనుండి తూర్పు ఎడారిలో, సైనాయ్ ప్రాంతమున, సముద్రమట్టమునకు 2,100 మీ. ఎగువకు మారుచుండును.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఈజిప్టున అత్యధిక ప్రాంతము, ఉపోష్ణమండల ప్రాంతమునకు చెందినది; కాని దక్షిణభాగము మాత్రము ఉష్ణమండలమందున్నది. మధ్యధరా తీరప్రాంతము తప్ప తక్కిన దేశమున ఎండకాలమున తాపమానము 100—110 ఫా. వరకు పోవును, అందును దక్షిణ, పశ్చిమ ప్రాంతములందు, గరిష్ఠోష్ణత, కొన్నియెడల 120° ఫా. అందుకొనును. మధ్యధరా తీరమున మాత్రము గరిష్ఠోష్ణత 90 ఫా.ను దాటదు. శీతకాలము మాత్రము సమశీతోష్ణముగ, సాధారణముగ, ఉండును. వసంతకాలమున, ఎడారులనుండి

వెచ్చని యిసుక తుఫానులు వీచును. దేశమున సరాసరి సాలీనా వర్షపాతము 5 సెం. మీ. గరిష్ఠ వర్షపాతమునకు, ఆ దేశమున పేరొందిన, అలెగ్జాం డ్రియాలో సాలీనా వర్షపాతము 20 సెం. మీ. దేశమున అడవులు లేనేలేవని చెప్పవచ్చును. ఖర్జూర వృక్షముల తోపులును, నిమ్మ వనములును అటనట కననగును. అడవిపంది, నక్క, రేచు వంటి అల్పవన్యజంతువులు మాత్రమే అటనట కాననగును. ఎడారులలో లేళ్ళు అరుదుగ కన్పట్టుచుండును.

**3. జనసంఖ్య మొ. :** ప్రాచీన దేశీయ ప్రజలతో అరబ్‌జాతి ప్రజలు క్రీ శ. 7వ శతాబ్ది మొదలుగ, మేళన మొందిన ఫలితముగ రూపొందినదియే ఈజిప్టులోని ఆత్యధిక ప్రజానీకము. 1966 లెక్కల ప్రకారము దేశజనసంఖ్య 3,00,75,858 (1972 అంచనా 3,45,83,000). ఇందు 92% ముస్లింలు; తక్కిన వారిలో ఈజిప్టు దేశపు అత్యంత సనాతన క్రైస్తవ సంప్రదాయమగు కోప్టిక్ శాఖకు చెందినవారు దాదాపు 10 లక్షలమంది; మిగిలిన వారు పలువిధములగు తక్కిన శాఖలకు చెందిన క్రైస్తవులు. యూదులు తొలుత కొంతమంది దేశమున ఉండినను, వారంచరును, రాజకీయ కారణములవలన, 1966 లో దేశమునుండి వెడలిపోయిరి. దేశమున దాదాపుగ అందరికిని మాతృభాష అరబ్బీయే; అయినను పశ్చిమపు ఎడారులలో, ఊట నీటిపట్టుల (ఓయసిస్)ను ఆశ్రయించి అటనట వసించు అల్పసంఖ్యాకులు కొందరు బర్బరభాషా మాండలికములను మాటాడుచున్నారు. విద్యావంతులలో పలువురకు, ఆంగ్లమో ఫ్రెంచియో సుపరిచితము. జనసంఖ్యా (1972 అంచనా) క్రమమును అనుసరించి, కయిరో (53,84,000) అలెగ్జాండ్రియా (21,46,000) పెద్ద నగరములుగ గణనీయములు.

**4. సమాచార సౌ. :** ప్రభుత్వపు ఆధిపత్యమున, ఒక జాతీయ వ్యవస్థ, పోస్టు, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రేడియో, టెలివిజన్ శాఖలను నిర్వహించుచున్నది. 15,381 కిమీ ల తీగపొడవు గల తంతివార్తా సౌకర్యము దేశమున కలదు. కయిరో నుండి అరబ్‌వాణి (వాయిస్ ఆఫ్ అరబ్స్) అను పేర అంతర్జాతీయ రేడియో ప్రసారము 31 భాషలలోను, దేశీయ ప్రసారము 6 భాషలలోను సాగుచున్నది.

**5 యాన సౌ. :** చక్కగ పరిణతి చెందిన, యానసౌకర్య విధానము ఈ దేశమున కలదు. పక్కారోడ్ల మొత్తపు నిడివి 22,140 కిమీ. రైలు రోడ్ల మొత్తపు నిడివి 4,446 కిమీ. మధ్యధరా సముద్రమును, ఎర్రసముద్రముతో కలుపు సూయెజ్ కాలువ, అంతర్జాతీయ యానమునకేగాక దేశమునను, నీటి రహదారిగ ఉపకరించు వసతి కలదు. కాని ఈజిప్టు-ఇస్రాయెలు, వైరుధ్యముల ఫలితముగ ఆ కాలువ 1967 జూను నుండియు మూతపడినది. కయిరో, అలెగ్జాండ్రియా, లక్సర్, అశ్వాన్, మెర్సా, మాత్రూలలో, అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. ఇవికాక దేశమున విమానయానమునకు పనికివచ్చెడు 6 విమాన క్షేత్రములు కలవు. సముద్రపు రేవులలో, అలెగ్జాండ్రియా, పోర్టుసయ్యద్, సూయజ్ నగరముల రేవులు గణనీయములు.

**6. చరిత్ర :** మానవ జాతికి నాగరికతను ప్రసాదించిన, ప్రాచీన నాగరికతా కేంద్రములలో ఒకటిగ ఈజిప్టు పేరొందినది. నైలునదివెల్లువల వలన పంటలను పండించుచు, కరువు, కాటకముల బాధనెరుగక, మనుటకు అవకాశము లభించిన, ఆ దేశపు ప్రాచీనజాతులకు, పూర్వు-పడమరల నుండు ఎడారులు, అనాగరిక జాతుల బెడద నుండి రక్షించుటకు, పెట్టని కోటలవలె ఉపకరించినవి. అందువలననే, అచటి ప్రాచీనమానవులు నిరంతరాయముగ ప్రగతిని సాధించి, క్రీ. పూ. 3400

నాటికే సుసంఘటితమగు సాంఘిక వ్యవస్థను, అభిప్రాయ ప్రకటనకు ఉపకరించు ఒక చిత్రలిపిని రూపొందించుకొనిరి. ఆ చిత్రలిపిలో లిఖితములగు 'పపైరస్' పత్రములను, శిలాలేఖనములను పండితులు చదువగలుగుట వలన, ఆ దేశపు ప్రాచీన చరిత్రలోని, విశేషములు విదితములైనవి.

క్రీ. పూ. 3,400లో ఈజిప్టును ఏకరాజ్యముగ 'మెనిస్' అను ప్రభువు రూపొందించెనని ప్రాచీన కథనము కలదు. తదాదిగ క్రీ. పూ. 332 వరకు ఆ దేశమును 31 రాజవంశములు పాలించినవి. ఆ రాజులలో ప్రతియొకనికిని పేరో (ఫారో) అను బిరుదము ఉండెడిది. మూడవ రాజవంశపు రెండవ రాజగు, తసర్త్రస్ (జోసర్) కాలమున, శిల్పాది లలితకళలు వికసనమును పొందగలిగినవి. ఆ వికసనమునకు కారణభూతుడైన వాడు, అప్పటి ప్రధానియగు, యెమ్‌హోత్పీ (ఇమ్‌హోతెప్). నేడు సైతము, ద్రష్టలను విభ్రాంతమనస్కులుగ చేయుచున్న పిరమిడులలో తొలుతటివి, ఆ కాలమున నిర్మితములైనవి (రాజులయు, ప్రముఖులయు, మృతశరీరములను లోనుంచి నిర్మించిన సమాధులనే పిరమిడులని వ్యవహరింతురు). గిజా నగరపు సమీపమున నేడు కన్పట్టు పిరమిడ్, అన్నింటియందును, ఔన్నత్య, వైశాల్యములందు మిన్న. దాని నేలమట్టపు వైశాల్యము 72 చ. మీటర్లు; ఎత్తు 137 మీ. ఒక్కొక్కటి 2032 కి. గ్రా. బరువుగల ఇరువదివేల రాళ్ళు, దీని నిర్మాణమున, ఉపయోగింపబడినవి. 18 వ రాజవంశమునకు చెందిన, తుతెన్‌ఖామేన్ అను ఫారోకై క్రీ. పూ. 13 వ శతాబ్దిలో నిర్మింపబడిన పిరమిడ్‌లో జరిపిన త్రవ్వకములు, చరిత్ర పరిశోధకులకు ఎంతయో ఉపకరించినవి. రాజశవముతో పాటుగ, ఆ సమాధిలో ఉంచబడిన అమూల్యా వస్తువులును, పరికరములును, ఉపకరణములును ఆనాటి సభ్యతా విశేషములను స్పష్టీకరించుటకు సహకరించినవి.

క్రీ. పూ. 1790 ప్రాంతమున ఆసియావాస యోధజాతికి చెందిన హిక్సాస్‌లు, ఈజిప్టును జయించి పాలించినను, క్రీ. పూ 1580లో ఆ పాలనను అంతరింపజేసి ఈజిప్టు దేశీయ రాజవంశమే మరల అధికారమును కైవసము చేసికొనినది. కాని క్రీ. పూ. 525 లో, ఆ దేశము పారసీక ప్రభువుల వశమయ్యెను. తదనంతర కాలమున, పారసీక సామ్రాజ్యమును, అలెగ్జాండరు నాయకత్వమున గ్రీకులు, తుదముట్టించుటతో, ఈజిప్టున గ్రీకు పాలన మొదలయ్యెను (క్రీ. పూ. 332). అలెగ్జాండరు మరణానంతరమున జరిగిన రాజ్య విభజన వలన 'టాలమీ' వంశీయులగు గ్రీకురాజులకు ఈజిప్టు లభించెను. వారి పాలనా కాలమున అలెగ్జాండ్రియా నగరము, గ్రీకు సంస్కృతికి ప్రముఖ కేంద్రముగ రాజిల్లెను. గణిత, జ్యోతిషాది విద్యలు అట ఎంతయో వికసనమును ఆర్జించి, తరువాత రోమక, ఇస్లామిక సంస్కృతులకు, మూల స్రోతస్సులుగ ఉపకరించినవి. గ్రీకుల ప్రాభవము సన్నగిలిన కాలమున క్రీ. పూ. 30 లో, అప్పటి రాజ్ఞియగు క్లియోపాత్రాను ఓడించి, రోమన్ పాలకుడగు ఆగస్టస్ ఈజిప్టును వశపరచుకొని, ఆ రాజ్యమును, రోమక సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను. రోమనుల పరిపాలనా కాలముననే, దేశమున క్రైస్తవమతము వ్యాపించి క్రమముగ సర్వత్ర వ్యాపింప గలిగినది. క్రీ. శ. 640 లో, ఇస్లాం మతావేశితులగు అరబ్బుల సేనావాహినులు రోమన్ సేనలను నిర్జించి, ఈజిప్టును లోగొనినవి. తత్ఫలితముగ అరబ్బుల భాషా, మత సంస్కృతులకు, దేశమున, అత్యధికవ్యాప్తి లభించి దేశము అరబ్ దేశముగ మార్పొందినది. క్రీ. శ. 968 నుండి 1171 వరకు, ప్రవక్త కూతురయిన ఫతీమా యొక్క వంశమునకు చెందిన పాలకులు ఈజిప్టును, సర్వస్వతంత్రులుగ పాలించిరి. వీరి కాలమున కయిరో నగరము, ఇస్లామిక సంస్కృతికి, ప్రముఖ

కేంద్రముగ రూపొందినది. అనంతరమున అధికారము వివిధ ముస్లిం రాజవంశముల చేతులుమారి కడకు 1517 లో టర్కీ దేశపు సామ్రాట్టులకు వశమయ్యెను. 1799 లో ఫ్రెంచి సార్వభౌముడగు నెపోలియన్ దేశమును వశపరచుకొనినను, తుదకు 1805 లో మహమ్మద్ఆలీ అనునతడు, టర్కీదేశపు సుల్తాన్ అనుమతితో, ఈజిప్టున ప్రభువు (పాషా) కాగలిగెను. ఇతని వంశీయులలో, ఇస్మాయిల్ అనువాని కాలముననే, 1856 లో, సూయెజ్ కాలువను త్రవ్వించుటకు ఒక సంఘము రూపొందినది. దీనికి ప్రోత్సాహకుడు ఫెర్డినాండ్ డి లెసెప్ అను ఫ్రెంచి పౌరుడు. అది మొదలుగ ఇస్మాయిల్ బలహీనతను, దుర్వ్యయలాలసతను, అదనుగ గ్రహించి, బ్రిటిష్, ఫ్రెంచి పాలకులు దేశ రాజకీయములలో జోక్యము వహించిరి. కడకు 1884 లో బ్రిటిష్వారు, టర్కీ సుల్తాన్ అనుమతితో, ఈజిప్టు పాలనా వ్యవహారములందు సర్వాధికారములను ఆర్జించిరి. ప్రథమ ప్రపంచయుద్ధ కాలమున, టర్కీతో వైమనస్యము ఏర్పడుటవలన, బ్రిటిష్ వారు టర్కీదేశపు సామ్రాట్కుగల అధికారములను కాదని ఈజిప్టును తమ రక్షిత రాజ్యముగ ప్రకటించిరి (1914). తరువాత అహమద్ ఫవుద్ అను నతడు సుల్తానుగ, ఈజిప్టును స్వతంత్ర దేశముగ, బ్రిటిష్వారు ప్రకటించినను (1922), బ్రిటిష్ సేనలను, ఆ దేశముననే ఉంచుటవలన ఆ స్వాతంత్ర్యము నామమాత్ర మయ్యెను. కడకు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ఈజిప్టు దేశీయుల ఆందోళనకు లొంగి, బ్రిటిష్ ప్రభుత్వము తన సేనలను కొన్ని ప్రాంతములనుండి మాత్రము తీసికొని పోయినది (1946).

కాని కాలక్రమమున రాజరిక ప్రభుత్వముపట్ల, ప్రజలలో విముఖత పెచ్చుపెరుగగ, మహమ్మద్ నజీబ్ అనువాని నాయకత్వమున సైన్యము తిరుగుబాటుచేసి రాజగు ఫరూక్ను దేశమునుండి సాగనంపి (1952, జులై 20), కడకు 1953 జూన్ 18 న, దేశమును ఒక గణరాజ్యముగ ప్రకటించెను. అనతి కాలముననే, నజీబ్ను, పదవీ భ్రష్టునిచేసి, జమాల్ అబ్దుల్ నాసర్ అను సేనాని అధ్యక్షుడయ్యెను (1954, నవంబరు 4). దేశమును, సైన్యమును, అధునాతనములుగ చేయుటకు అతడు ఎంతయో శ్రమించెను. సూయెజ్ కాలువను జాతీయముచేసి జాతీయాదాయమును వృద్ధి చేసెను (1956). భారతదేశపు ప్రధానియగు, నెహ్రూ పండితునితోడను, యుగోస్లావియా అధినేతయగు టిటోతోను కలసి, అలీన రాజ్యములను ఒక సమర్థ వర్గముగ, రూపొందించుటకు అతడు కృషి సల్పెను. సిరియా, ఎమెన్ దేశములతో, ఈజిప్టును కలిపి, యునైటెడ్ అరబ్ రిపబ్లిక్గ, అతడు ఒక సమాఖ్యను, రూపొందింప జేసెను (1956). కాని నాసర్యొక్క విప్లవాత్మక ధోరణికి జంకి సిరియా, ఎమెన్లు అందుండి త్వరలోనే విడివడినవి. పశ్చిమాసియాలో, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, పాలస్తీనాలోని అరబ్బుల ప్రయోజనములకు విరుద్ధముగ రూపొందిన ఇస్రాయెల్ రాజ్యముతో ఈజిప్టునకుగల వైమనస్యమువలన 1967 లో ఆ రెండు దేశముల మధ్య, జూన్ 5 న యుద్ధము మొదలై, నాలుగు దినములు సాగి, ఐ. రా. స. జోక్యమువలన అంతమయ్యెను. కాని ఆ నాలుగు దినములలోనే, తూర్పు ఎడారిలోని, గాజా చీలికను, సైనాయిని సూయెజ్ కాలువ ప్రాంతము వరకు ఆక్రమించి, ఆ సూయెజ్ కాలువలోని రాకపోకలను ఇస్రాయిల్ అరికట్టినది. యుద్ధ విరమణ జరిగినను, ఇస్రాయెల్ ఆ ప్రాంతములను వదలుకొనుటకు నిరాకరించినది. ఈ పరిస్థితులలో నాసర్ మరణించెను (1970, సెప్టెంబరు 28). అంతట అన్వార్ అల్-సాదత్ అధ్యక్షుడయ్యెను (1970, అక్టోబరు 6). సాదత్ కాలమున, మరల ఇస్రాయెల్తో జరిగిన యుద్ధమున (1973)

సూయెజ్ కాలువకు పశ్చిమమున కొన్ని ప్రాంతములను, ఈజిప్టు సేనలు కైవసము చేసికొనినను, తూర్పు ఎడారిలో అత్యధిక భాగము ఇజ్రాయెల్ అధీనముననే నిలిచినది. అంతట ఐ. రా. స. జోక్యమువలన, యుద్ధము అంతమై మధ్యవర్తుల కృషివలన, సూయెజ్ కాలువను మరల తెరచుట జరిగినది అయినను ఇజ్రాయిల్ (1975) సమస్య మాత్రము అపరిష్కృతముగనే ఉన్నది. సుడాన్, లిబియా, సిరియాలతో తన దేశమును కలపి, ఒక సమాఖ్యను రూపొందించుటకు, సాదత్ కృషి చేసి, విఫలతను పొందెను.

**7. పరిపాలన :** 1971, సెప్టెంబరు 11న ప్రజామోదమును పొందిన, ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. 1956 మొదలుగ యునైటెడ్ అరబ్ రిపబ్లిక్ అను రీతిగనున్న దేశనామము ఈజిప్టు (అల్ మిసర్) అరబ్బీ గణరాజ్యముగ, ఇందు మార్పుచేయబడినది. అరబ్ సోషలిస్టు యూనియన్ అనునదియే దేశపు ఏకైక, రాజకీయ పక్షముగ అందు గుర్తింపబడినది. ఇస్లామును జాతీయ మతముగ గుర్తించినను, తక్కిన మతానుయాయుల, ఆచార, విశ్వాసములకు రక్షణ కల్పించబడినది. అరబ్ సోషలిస్టు యూనియన్‌చే నియమితులై, ప్రజలచే అయిదేండ్ల కొకసారి ఎన్నుకొనబడి, 350 మందికి తగ్గని సభ్యులు జాతీయ ప్రజాసభలో ఉందురు. వీరిలో కనీసము మూడవవంతు మందిచే ప్రతిపాదింపబడి కనీసము మూడింట రెండువంతుల సభ్యులచేత ఆమోదితుడై, కడకు జనాభిప్రాయము (రెఫరెండము)న నెగ్గిన వ్యక్తి దేశాధ్యక్షుడగును. అతని వయస్సు ఎన్నికనాటికి 40 ఏండ్లకు తక్కువ కారాదు. అతని పదవీకాలము ఆరేండ్లు. కార్యనిర్వహణాధికారము అధ్యక్షునియందే న్యస్తము. పరిపాలనలో తనకు సహాయము చేయుటకై ఉపాధ్యక్షుని, లేదా, ఉపాధ్యక్షులను, మంత్రులను అతడు నియమించుకొనవచ్చును. వారియెడల సదభిప్రాయము లేనప్పుడు వారిని పదవులనుండి తొలగింపవచ్చును. జాతీయ ప్రజాసభను సయితము అధ్యక్షుడు రద్దుచేయవచ్చును; కాని ఆ వెనువెంటనే, జనాభిప్రాయమునకు తన చర్యను నివేదించి, దాని తీర్పునకు లొంగవలెను. రద్దుఅయిన అరువది దినముల లోపల ప్రజాసభ మరల ఎన్నుకొనబడవలయును.

దేశము పరిపాలనా సౌకర్యార్థము 21 రాష్ట్రములుగ విభజింపబడినది. రాష్ట్రములు, మండలములుగ, విభజితములు. మండలముల పరిపాలనకై మండల సభలు, ముదీర్ అను అధికారి ఆధ్వర్యమున పనిచేయుచు, స్థానిక పరిపాలనను నిర్వహించును.

న్యాయ పరిపాలనలో ఏ మతమునకు సంబంధించినంతవరకు, ఆ మత ధర్మములను గుర్తెరిగిన ప్రత్యేక న్యాయస్థానములు ఇదివరలో ఉండెడివి. కాని 1956 లో ఈ ఏర్పాటు రద్దుచేయబడి అన్ని పౌర వ్యవహారములును, సామాన్య న్యాయస్థానముల లోనే విచారింప బడుచున్నవి. దేశమున సమ్మరీ న్యాయస్థానములు 165; దిగువ కోర్టులు 14 కలవు. వీనిలో ప్రతిదానిలోను, ఒక జడ్జి మాత్రమే పనిచేయును. ఎగువ కోర్టులు 19 కలవు. వీనిలోను ప్రతియొకట ఒకే జడ్జి పనిచేయును. ఒక్కొకట ముగ్గురు జడ్జీలు పనిచేయు 5 అపీలు కోర్టులును కలవు. 1931 లో అపీలు కోర్టులపై, పునర్విమర్శన చేయు అధికారము కలిగిన ఒక ఉన్నత న్యాయస్థానము నెలకొల్పబడినది. ఇందు ఒక అధ్యక్షుడును, నలువురు ఉపాధ్యక్షులును 36 జడ్జీలును కలరు. వీరు మూడు వేర్వేరు వర్గములుగ సమావేశమై, దండ వ్యవహారములను పౌర, వాణిజ్య వ్యవహారములను, వ్యక్తి విషయిక వ్యవహారములను, క్రమముగ విచారించుదురు. పరిపాలనా

నియమముల ఔచిత్యానౌచిత్యములను మాత్రమే విచారించు న్యాయస్థానము (రాజ్యాపాలనా న్యాయ స్థానము) ఒకటి 1946 నుండి పనిచేయుచున్నది. ఇందు జడ్జీల సంఖ్య మూడునకు తగ్గక, అయిదు నకు మించక ఉండును.

**8. దేశరక్షణ :** 18 ఏండ్ల వయసువచ్చిన ప్రతి పురుషుడును, సైన్యమున మూడేండ్లు నిర్బంధ ముగ పనిచేయవలయునను శాసనము దేశమున అమలులో నున్నది. అంచనాలను అనుసరించి త్రివిధ రక్షక శాఖలందును, మొత్తముమీద 2,30 000 మంది పనిచేయుచున్నారు. ఇవిగాక జాతీయ రక్షకదళమున 1,30,000 మంది కలరు. సేనలో 2 టాంకు దళములును, 4 మరతుపాకీ దళములును, 3 పటాలముల పారాచూట్ దళము లును, 12 ఫిరంగి దళములును కలవు. టాంకుల సంఖ్య, దాదాపు 1200. మొత్తపు సైనిక సంఖ్య దాదాపు 1,80,000.

నౌకా సేనయందు 12 జలాంతర్గాములు, 5 డిస్ట్రాయర్లు, 36 టార్పెడోబోట్లు, 14 వాహక నౌకలు, తక్కువిధముల నౌకలు 60 ఉన్నవి. ఇందు పనిచేయు నావికులును, అధికారులును కలిసి మొత్తం 14,000 (1972).

సోవియట్ రష్యా, జెకోస్లోవాకియాల సాయ మున, సమర్థమగు వైమానిక సేనను, ఈజిప్టు సమ కూర్చుకొనినది. వైమానిక యోధుల సంఖ్య దాదాపు 25,000. పలు తెరగుల పోరాటపు విమానములును, వాహక విమానములును కలిసి మొత్తం 550 విమానములు కలవు. వీనిలో ధ్వన్య తీతవేగపు పోరాటపు విమానములు 120. పైనుండి దిగువకు మిసిలీ (క్షిపణు) లను ప్రయోగించు విమానములును కొన్ని కలవు (1972).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు 1945 లో ఈజిప్టు సభ్యత్వమును ఆర్జించినది. తదాదిగ, తదనుబంధ సంస్థలలో పెక్కింట సైతము సభ్యత్వము కలిగి వర్తించుచున్నది. ఆరబ్ లీగునందు ఈజిప్టునకు ప్రముఖ స్థానము కలదు. అలీన రాజ్యముల కూటమునను, ఈజిప్టు సభ్యత్వమును వహించి, ప్రముఖపాత్రను నిర్వ హించుచున్నది. భారత దేశముతో సహా పలు ప్రముఖ దేశములతో ఈజిప్టు దౌత్య సంబంధము లను కలిగియున్నది. కాని 1967 నుండియు, ఇజ్రాయెల్‌తో సాగిన యుద్ధమున, యు. స్టే. అనుసరించిన వైఖరికి నిరసనగ, యు. స్టే. దౌత్య కార్యాలయము మూసివేయబడినది. అయినను 1974 నుండి ఈజిప్టు, యు. స్టే. ల మధ్య సౌమ నస్యము కొంత ఏర్పడగలిగినది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక విధా నము సోషలిస్టు వ్యవస్థా ప్రాతిపదికపై రూపొం దింప బడవలయుననుట, రాజ్యాంగపు ధ్యేయము. అందులకు అనువుగ ప్రణాళికా రీతిలో ప్రభుత్వము 1961 మొదలుగ కృషిచేయుచున్నది. ప్రస్తుతము అమలున ఉన్నది దశవర్ష (1971-80) ప్రణాళిక. 1970 లో 250 కోట్ల పౌ. గ ఉన్న జాతీయా దాయము 1980 నాటికి రెట్టింపు కావలయుననుట ఈ ప్రణాళికా లక్ష్యము.

సోషలిస్టు విధానమునకు అనుగుణముగ, ఉత్పత్తి సాధనములను, అన్నింటిని జాతీయ ములుగ చేయుటకు కృషి 1958 మొదలుగ సాగు చున్నది. అందులకు ప్రాతిపదికలుగ, సూయెజ్ కాలువయు, విదేశీయుల ఆస్తులును (1956), దేశీయ పరిశ్రమలును (1961) జాతీయములు చేయబడినవి. పట్టణపు ఆస్తులును, వ్యవసాయ భూములును, జాతీ యములు చేయబడకపోయినను, అందులకు గరిష్ఠ పరిమితులు విధింపబడినవి. కుటుంబమునకు 100 ఫద్దానులను (ఒక ఫద్దాన్ = 1.038 ఎకరము) మించి భూవసతి ఉండకూడదను నియమము

కలదు. వ్యక్తి సాలుసరి ఆదాయము 5,000 ఈ. పౌనులను మించరాని రీతిగ పన్నుల విధానము రూపొందింప బడినది.

ప్రస్తుతమున దేశసంపదకు ముఖ్యాధారము వ్యవసాయము. కాని దేశ వైశాల్యమున 4% అనగా 60 లక్షల ఫడ్డానుల భూమి మాత్రమే సేద్యమునకు అనుకూలముగ ఉన్నది. ఇట్టి భూమి నైలునది లోయలోను, డెల్టాలోను మాత్రమే కలదు. దీనిని ఆశ్రయించియే దేశ ప్రజానీకమున అత్యధిక భాగము జీవించుచున్నారు. దేశమున వర్షపాతము చాల తక్కువగుటవలన నైలునదిలోని నీరే పంటలకు ఆధారము. నైలునది వెల్లువలవలన నిండిన జలాశయముల సాయమున భూములను సాగు చేయుట ప్రాచీన కాలముననుండియు సంప్రదాయముగ ఉన్నది. కాని ఇందువలన ఎక్కువ పంటలను పండించుటకు అవకాశములేదు. అందువలన ఈ శతాబ్దిలో నైలునదికి అడ్డముగ కొన్ని తావుల ఆనకట్టలు కట్టబడినవి. అట్టివానిలోనెల్ల, అత్యంత ఫలదాయకమైనది అశ్వాన్ ఆనకట్ట. సోవియట్ రష్యా ఇచ్చిన, ఆర్థిక, సాంకేతిక సాహాయముతో ఇది నిర్మింపబడినది. 1960 లో మొదలైన ఈ ఆనకట్ట 1971 లో పూర్తియైనది. దీనివలన, ఇది వరలో సేద్యమున నున్న భూమికి, నిరంతరాయముగ, సాలుపొడవున నీరు లభించుటయేగాక, 1980 నాటికి 4 65,000 ఫడ్డానుల భూమికి అదనముగ నీటిపారుదల లభింపగలదు. ఇదియేగాక, పశ్చిమపు ఎడారిలోని, భూగర్భ జలాధారములను, శాస్త్రీయ దృష్టితో పరిశోధించి, ఊటబావుల సాయమున ఎడారి భూములను సస్యశ్యామలములుగ చేయుటకును కృషి జరుగుచున్నది.

పండించు పంటలలోనెల్ల అతి ముఖ్యమైనది ప్రత్తి పంట, ప్రపంచపు ప్రత్తి పంటలో 6% ఈజిప్టుననే పండింపబడుచున్నది. అందునను, పొడుగుపీచు ప్రత్తికి ఈజిప్టు చాలా పేరుగనినది. ఈ ప్రత్తిలో విస్తార భాగము విదేశములకు ఎగుమతి అగుచున్నది. 1970-71 సంఖ్యా వివరములను అనుసరించి ఆ సంవత్సరపు ప్రత్తి ఉత్పత్తి 102 లక్షల కంటారులు. (1 కంటారు = 157.5 కి. గ్రా). పంటల మార్పిడి పద్ధతిలో, ప్రతి సాలున, ప్రత్తితోపాటుగ, తక్కిన పంటలను గూడ పండించుచున్నారు. కొన్నిచోట్ల సాలున నాల్గు పంటలను పండించుటయు కలదు. వేల టన్నులలో ఉత్పత్తి క్రమమున చెరకు (7486), వరి (2,534), మొక్కజొన్న (2,342), గోధుమ (1,720) ముఖ్యముగ పేర్కొన దగినవి. వేల సంఖ్యలో పెంపకపు పశువులు క్రమమున గోసంతతి (2,088), మహిష సంతతి (2,075), మేకలు (1,152), గొర్రెలు (1,968) లెక్కింప దగినవి.

సముద్ర తీరముననను, నైలునదీ డెల్టాలోను, అశ్వాన్ డామ్‌వలన రూపొందిన నాసర్ సరస్సునను, మత్స్య పరిశ్రమ సాగుచున్నది. ఆ పరిశ్రమలో దాదాపు 14,000 పడవలు పనిచేయుచున్నవి. అయినను తగినంత ఉత్పత్తిలేక చేపలను ఈజిప్టు దిగుమతి చేసికొనుచున్నది.

దేశమున విద్యుదుత్పత్తి, అశ్వాన్‌డామ్ నిర్మాణానంతరమున, చాల పెరిగినది. డామువద్దనే 1000 కోట్ల కిలోవాట్ల శక్తిని ఉత్పత్తిచేయు వసతి కలదు. తక్కిన ప్రాంతములందు 600 కోట్ల కిలోవాట్ల శక్తి ఉత్పత్తి అగుచున్నది.

పారిశ్రామికముగ దేశమును సుసంపన్నము చేయుటకు కృషి జరుగుచున్నను, అందు ప్రస్తుతమునకు ఎక్కువ పురోగతి సాధింపబడలేదు. జాతీయోత్పత్తిలో 8% మాత్రమే దానివలన లభించుచున్నది. నూలు, సిమెంటు, చక్కెర, ఖాద్య తైలములు, సబ్బులు, పారిశ్రామికోత్పత్తులలో పేర్కొనదగినవి. దేశమునకు ఎక్కువగ ఆదాయ

మును కొనివచ్చు తక్కిన వానిలో, ముఖ్యముగ పేర్కొనదగినది పెట్రోలియం. దినమునకు 130 వేల పీపాల ముడి పెట్రోలియము ఉత్పత్తికి దేశమున అవకాశము కలదు. ఇందు 60% సైనాయిలో లభించును. కాని ఆ ప్రాంతము 1967 మొదలుగ, ఇజ్రాయెల్ ఆక్రమణలో ఉన్నందున, దేశమునకు చాల నష్టము కలిగినది. సూయెజ్ కాలువను, జాతీయముచేసిన తరువాత, ఆ కాలువలోని, రాకపోకల సుంకములవలన, జాతీయాదాయము, అత్యధికము కాగలదని ఆశింపబడినది. కాని 1967 నుండి, యుద్ధ ఫలితముగ, అది మూతపడినది. 1974 ఏప్రిల్ మొదలుగ, ఆ కాలువను మరల రాకపోకలకు అనువుగ చేయుటకై యు. స్టే; సోవియట్ రష్యాల స్సాయమున పనిమొదలై 1975 లో సూయెజ్‌కాలువ రాకపోకలకు తెరువబడినది. అంతేకాక సైనాయిలో పెట్రోలు గనులున్న భాగము సైతము, ఆ సమయముననే ఈజిప్టునకు ఇజ్రాయెల్ అప్పగించినది. అందువలన 1976 మొదలుగ ఈజిప్టు దేశము ఆర్థికముగ ఎక్కువ పురోగతిని సాధించుటకు అవకాశములు ఏర్పడినవి.

కార్మికులకు ట్రేడు యూనియన్ హక్కులు, 1942 మొదలుగ కల్పింపబడినవి. కార్మిక సమాఖ్య అనునది ప్రముఖ ట్రేడ్ యూనియన్. ఇందలి సభ్యుల సంఖ్య 15 లక్షలు. దేశపు ఎగుమతులలో ముఖ్యముగ పేర్కొనదగినవి ప్రత్తి, నూలు, నూలు వస్త్రములు. 1971 లో ఇందువలన 2281 లక్షల ఈ. పౌనుల ఆదాయము లభించినది. ఇందులో, అత్యధిక భాగము క్రమమున సోవియట్ రష్యా, ఇండియా, జపాన్, జెకోస్లోవాకియాలకు ఎగుమతియగును. మొత్తము దేశపు అన్నివిధముల ఎగుమతులు, 3432 లక్షల ఈ. పౌనులు; దిగుమతులు 4000 లక్షలు ఈ. పౌ; దిగుమతులలో ఎక్కువ భాగము, యంత్ర సామగ్రి, రసాయన పదార్థములు. ఇందువలన చెల్లింపుల నిలువలో ఋణమేర్పడుటయేగాక, ప్రణాళికపై పెట్టుబడికిని అధికముగ ఋణములను చేయవలసి వచ్చుచున్నది. సో. రష్యా ఇందు అత్యధిక భాగపు ఋణములను ఇచ్చినది. 1967 మొదలుగ నూనె సంపత్తికి, పేరొందిన కువాయిట్, సౌదీ అరేబియా, లిబియాలు ఇచ్చు ధనసహాయముకూడ ఈజిప్టునకు చాలవరకు ఉపకరించుచున్నది.

1971-72 బడ్జెటు లెక్కల ప్రకారము ఆదాయము 192.2 కోట్ల ఈ. పౌ; వ్యయము 235.1 కోట్ల ఈ. పౌ; వ్యయమున 30 కోట్లు పెట్టుబడికై, వినియోగింపబడుచున్నది. ప్రపంచపు బ్యాంకు లెక్కలను అనుసరించి, దేశమున సాలీనా తలసరి సకలోత్పత్తి (G. N. P.) 462 ఈ. పౌ (1970).

బ్యాంకులు జాతీయములు చేయబడినవి. కేంద్ర జాతీయ బ్యాంకు తన వివిధ శాఖలద్వారా బ్యాంకు వ్యవహారములను నిర్వర్తించుచున్నది.

**11. సాంఘిక రంగము :** సాంఘిక సంక్షేమమునకై ప్రభుత్వపు ఆధ్వర్యవమున పెక్కు సంస్థలు పనిచేయుచున్నవి. ఇట్టి వ్యవస్థలు దేశమున 864 కలవు. గృహనిర్మాణమునకై ప్రణాళికా వ్యయమున 10.2% ప్రత్యేకింపబడినది. దేశమున 6,000 డాక్టర్లును, 66,862 శయ్యా సంఖ్యగల ప్రభుత్వపు ఆస్పత్రులును, 8,580 ప్రయివేటు ఆసుపత్రులును కలవు.

విద్యా విషయమున దేశము ఎక్కువ పురోగతిని సాధించుటకై కృషి జరుగుచున్నది. దాదాపు 70% నిరక్షరాస్యులుగ ఉన్నారు. ఉచిత, నిర్బంధ, ప్రాథమిక విద్యావిధానము 1944 నుండి అమలున ఉన్నది. 1950 నుండి మాధ్యమిక, సాంకేతిక విద్య ఉచితముగ లభ్యమగుచున్నది. దేశమున 88,056 ప్రాథమిక పాఠశాలలలో 37,40,551 మంది పఠించుచున్నారు. దేశమున 4 విశ్వవిద్యాల

యములు (కైరో, అలెగ్జాండ్రియా, ఈన్‌షామ్స్, అస్సూత్) కలవు. వీనిలో విద్యార్థుల సంఖ్య 1,24,227. కయిరోలోని అల్ - అజార్ విద్యాపీఠము ఇస్లాం మత విద్యాకేంద్రము. ఇది క్రీ. శ. 972 లో స్థాపింపబడి, నిరంతరాయముగ నిలువ గలిగినది. దేశమునందలి పత్రికలన్నియు జాతీయము లు చేయబడినవి. అల్ - అహరమ్, అల్ - అక్బార్, అల్ - గుమూరియ అనునవి ప్రముఖ దిన పత్రికలు.

**12. యాత్రా సౌ. :** ప్రాచీన సంస్కృతి కేంద్రముగ పేరెన్నికగనిన ఈ దేశమున ప్రాచీనపు వాస్తు, శిల్ప, కళా సామగ్రి యాత్రికులను ప్రపంచపు నలుమూలలనుండి ఆకర్షించుచున్నది. గిజే వద్దనున్న పిరమిడ్, సింహికా విగ్రహము (స్ఫింక్స్), లక్సర్, కర్నక్‌లలోని మహత్తర దేవాలయములు, అశ్వాన్‌డామ, అచటి నాసర్ సరస్సు, అబూ సింబెల్ అవశేషములు దర్శనీయములు. 1972 లో 5,40,880 మంది విదేశీయులు వానిని దర్శించిరి. ఈ విలాసయాత్రల నిర్వహించు ప్రభుత్వశాఖ 232 హోటళ్ళను నడపుచున్నది.

**13. ప్రముఖ వ్యక్తులు :** 1. ఇమ్‌హోతెప్ (క్రీ. పూ. 27 శతాబ్ది) ధీశాలిగ పేరొందిన ఒక మంత్రి. ఈజిప్టు ప్రాచీన సంస్కృతికి మూలాధారముగ వర్తించినవాడు.

(2. రామిసెస్ II క్రీ. పూ. 13 వ శతాబ్ది) ఒక ప్రముఖ విజేత; అబూ సింబెల్‌వద్దనుండి, ప్రస్తుతమున పలు దేశములకు పంచబడిన, విగ్రహసంపద ఈతని కాలముననే రూపొందినది.

3. క్లియోపాత్రా (క్రీ. పూ. 67-30). తన కాలమున, జగదేక సుందరిగ పేరొంది, తన సౌందర్యమునే ఒక సాధనముగ వినియోగించి, రోమక చక్రవర్తులను, ఇరువురను క్రమమున లోగొనిన రాజ్యతంత్రజ్ఞ.

4. జమాల్ అబ్దుల్ నాసర్ (క్రీ. శ. 1918-1970) ఈజిప్టును ఆధునికము చేయు కృషికి నాంది ప్రస్తావనచేసి, అలీనరాజ్య వ్యవస్థా నిర్మాణమున పాల్గొనిన పరిపాలనావేత్త.

---

# 8. ఉగాండా

**ముఖ్యనగరము :** కంపాలా; **జెండా :** నలుపు, పసిమి, ఎరుపు రంగులలో ఒకదాని తరువాత వేరొకటిగ సమవిస్తృతిలో అమరిన ఆరు అడ్డు చారలలో మధ్యభాగమున తెల్లని వృత్తమున చిత్రింపబడిన కొంగ కలదు. **జాతీయ గీతము :** జాతీయ గీతము కలదు, వివరములు తెలియవు; **నాణెము :** ఉగాండా షిల్లింగ్; 1 ఉ. షి. = రు. 1.05; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 3 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య ఆఫ్రికాలో తూర్పు భాగమున, 1°-4° ఉ. అక్షాంశ రేఖలకును, 30°-35° తూ. తులారేఖలకును నడుమ విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తర దిశయందు సుడాన్; తూర్పున కెన్యా; దక్షిణమున టాంజానియా; నైరుతిన రువండా; పశ్చిమమున జయిరే సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 2,36,037 చ. కిమీ; ఇందు 42,440 చ. కిమీ. భూమి నీటిమునకలో ఉన్నది. దేశము, చాలవరకు, 1220 మీ. రమారమి ఎత్తుగల పీఠభూమి. పశ్చి

మమున ఉన్న రువెన్‌జోరి పర్వతములందలి ఉన్నత శిఖరపు ఎత్తు 4875 మీ; తూర్పు సరి హద్దునఉన్న ఎల్‌గన్ పర్వత శిఖరపు ఎత్తు 4,320 మీ. తెల్ల నైలునది ఈ దేశముననే విక్టో




పటము 8.

రియా సరస్సులో జన్మించి, దేశమున ఉత్తరదిశకు క్యోగా సరస్సువరకు పయనించి, అటనుంచి పశ్చిమమునకు తిరిగి ఆల్‌బర్ట్ సరస్సుచేరి, అందుండి ఉత్తరమునకుపోయి సుడాన్‌లోనికి పయనించుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** భూమధ్య రేఖపైననే ఉన్నను, దేశమున ఎండలు తక్కువనియే చెప్ప వచ్చును. దేశపు సరాసరి ఉష్ణోగ్రత 71° ఫా; దేశమున అత్యధిక భాగమున సాలుసరి వర్షపాతము 75 సెం. మీ; విక్టోరియా సరస్సు ప్రాంతమున మాత్రము అది 148 సెం. మీ. ఉన్నది. దేశమున నైరుతి ప్రాంతమునను, దక్షిణ ప్రాంతమునను దాదాపు భూమియంతయు సేద్యమున ఉన్నందున, దట్టపుటడవులు అటనట కొలదిగ మాత్రమే కన్పట్టు చున్నవి; పశ్చిమపు ఉన్నత భూములలో 'మూలీ' అను పెద్దజాతి వృక్షములు కన్పట్టును; వాని కలప గట్టితనమునకు పేరొందినది. వేటకై ప్రత్యేక రక్షిత ప్రాంతములుగ లెక్కింపబడు కొన్ని అడవు లలో సింహము, ఏనుగు, నీటిగుర్రము, కారెనుము మొదలకు పెద్ద జంతువులును, వివిధ మర్కట జాతులును విరివిగ కననగును. తక్కిన ప్రదేశము లలో, వ్యవసాయ భూముల రక్షణకై, వన్య మృగ ములు విరివిగ వధింపబడుచున్నవి. సరస్సులలో వివిధ మత్స్య జాతులును, చిత్తడి పట్టులందు అనేక సర్పజాతులును కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ.:** 1969 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 95,26,217. ముఖ్య నగరమగు కంపాలాలోని జనసంఖ్య రమారమి 3,31,000. తక్కిన నగరములలో జింగా (47,000), అంబేలే (23,000) పేర్కొనదగినవి. దేశపు వివిధ ఆఫ్రికన్ జాతులలో **బంటూ జాతి** అధికముగ కననగును; వీరిలో బుగాండా తెగవారు సంఖ్యా విషయికముగను, తక్కు రీతులను ప్రము ఖత కలిగిఉన్నారు ఇస్లామును, క్రైస్తవ మతమును కొన్ని ప్రాంతములందు విరివిగ వ్యాపించియున్నను దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు ప్రాచీన సంప్ర దాయిక విశ్వాసములనే కలిగిఉన్నారు. దేశమున ఆసియావాస సంతతికి చెందినవారు దాదాపుగ 91,000 ను, యూరపీయులు 9,700 ను ఇదివరలో ఉండినను వారిలో అత్యధిక సంఖ్యాకులు 1971 లో, ప్రభుత్వ విధానముల ఫలితముగ, దేశమును వదలి పోయిరి.

దేశపు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు లుగాండా భాష సుపరిచితము; ఇంగ్లీషు అధికార భాషగ పరిగణనను పొందినది.

**4. సమాచార సౌ.:** తూర్పు ఆఫ్రికా తపాలా, దూరసందేశ వ్యవస్థయే ఈ దేశపు తంతి తపాలా సౌకర్యములను నిర్వహించుచున్నది. దేశమున 34,190 టెలిఫోనులు కలవు (1972). కంపా లాలో ఒక రేడియో ప్రసార కేంద్రమును, టెలి విజన్ కేంద్రమును పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** తూర్పు ఆఫ్రికా సామాజిక వ్యవస్థ (కమ్యూనిటీ) యే కెన్యా. టాంజానియాలతో పాటుగ ఈ దేశపు యాన సౌకర్యములను నిర్వ హించుచున్నది. దేశమున 6,200 కిమీ. నిడివిగల పక్కా రోడ్లు కలవు; ఇవిగాక 17,970 కిమీ. నిడివిగల సాధారణపు రోడ్లు ఉన్నవి. దేశపు రైలు మార్గముల మొత్తపు నిడివి 1,152 కిమీ; ఎన్‌తెబ్బెలోని అంతర్జాతీయ విమానాశ్రయమునుండి ఆఫ్రికాలోని తదితర దేశములకును, గ్రేట్ బ్రిటన్ కును విమాన ప్రయాణపు వసతులు కలవు. దేశాంతర్భాగమున 12 నగరముల మధ్యకూడ విమాన ప్రయాణపు వసతులున్నవి.

**6. చరిత్ర :** క్రీ. పూ. 4000-3000 మధ్య కాలమున, ఈజిప్టునుండి కొన్ని హమిటిక్ జాతుల ప్రజలు ఇటకు వలసవచ్చి చేరి, తమ నాగరికతను ఇచటి నీగ్రోలయందును, తదితర ఆదిమ జాతు లందును వ్యాపింపజేసిరి. కాలక్రమమున ఆఫ్రికా లోని పరిసర ప్రాంతములనుండి పలు ఆఫ్రికన్ జాతులు ఇటకు చేరినవి. ఈ వివిధ జాతులు తొలుత చిన్నచిన్న రాజ్యములుగ చీలియుండినను, 19 వ శతాబ్దినాటికి బుగాండా, బున్యోరో, అంకోలే, తోరూ అను నాల్గు రాజ్యములు మాత్రమే దేశమున ప్రముఖతను ఆర్జించినవి 1862 లో తొలుతగ శ్వేతజాతీయుడు దేశమున అడుగిడెను. అంతకు పూర్వమే అరబ్బులకును దేశముతో పరి చయము లభించెను. అంతట శ్వేతజాతీయులవలన క్రైస్తవమును, అరబ్బులవలన ఇస్లామును దేశమున కొన్నియెడల వ్యాపించినవి. 1886 లో యూర పియను జాతుల ఒడంబడికలను అనుసరించి విక్టో రియా సరస్సునకు తూర్పునఉన్న ఆఫ్రికా ప్రాంతము బ్రిటన్, జర్మన్ రాజ్యములకు దక్కి నది. తరువాత 1894 లో ఉగాండాను అంతటిని, అచటి ప్రభువుల అంగీకారములతో తన రక్షణ లోనికి తీసికొని 1897 లో బుగాండా రాజ్యపు ప్రభువును పదభ్రష్టునిజేసి, అతని కుమారుని రాజుగచేసి, వివిధ తెగల నాయకుల సహకారముతో దేశమున వలసపాలనను బ్రిటన్ ప్రవేశపెట్టినది. 1962 లో దేశము వలసపాలననుండి విముక్తిచెంది స్వతంత్రతను ఆర్జించి, 1967 లో గణరాజ్యముగ మార్పొందెను. 1971 లో అప్పటి అధ్యక్షుడు డా. ఒబోటేను పదవినుండి తొలగించి ఇదీ అమీన్ అను సేనాని తన అధ్యక్షతన సైనిక ప్రభుత్వ మును నెలకొల్పెను.

**7. పరిపాలన :** 1967 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధానము ననుసరించి, ప్రజా స్వామిక గణతంత్ర సమాఖ్యా ప్రభుత్వము దేశ మున అమలునకు వచ్చినను, ప్రస్తుతమున ఇదీ అమీన్ నాయకత్వమున ఏర్పడిన సైనిక ప్రభు త్వమే సర్వాధికారములను వహించినది. దేశమున విదేశీయుల పలుకుబడిని అరికట్టు మిషతో తీసి కొనిన చర్యల ఫలితముగ భారతీయ సంతతి వారును, యూరపీయులును, ఆస్తులను అన్నింటిని వదలివైచి దేశమును వదలిపోయిరి.

**8. దేశరక్షణ :** 5700 మందిగల నాలుగు వటాలముల సేనయు, 275 మందికల వాయు సేనయు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందున, కామన్‌వెల్తున, ఆఫ్రికా సమైక్య సంఘమున, ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఇజ్రాయెల్, రొడీసియా, దక్షిణ ఆఫ్రికాలతోతప్ప, తక్కిన ప్రముఖ రాజ్యములతో దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవ స్థకు వ్యవసాయమే ముఖ్యాధారము. జాతీయో త్పత్తిలో సగమునకు మించియు, ఎగుమతులలో 90% ఆదాయమును వ్యవసాయిక ఉత్పత్తివలననే లభించుచున్నవి. అయినను సేద్యమున ఉన్న

భూమిలో 70% దేశావసరములకు సరిపోవు ఆహార ధాన్యముల ఉత్పత్తికే వినియుక్తమగుచున్నది. ఎగుమతియగు రొక్కపు పంటలలో ప్రత్తి, కాఫీ ప్రముఖములు. ప్రపంచమున కాఫీ గింజలను పండించు దేశములలో ఈ దేశము అయిదవ స్థానమును ఆక్రమించి ఉన్నది; ప్రత్తి, కాఫీ తరువాత పొగాకు, చక్కెర, తేయాకు, కలబందనార క్రమముగ లెక్కకు వచ్చునవి. దేశమున తగినంత పశుసంపద లేదు; పాలకొరకు, కెన్యాదేశముపై, ఈ దేశము కొంతవరకు ఆధారపడి ఉన్నది. మత్స్య పరిశ్రమ పలువురను పోషించుచున్నది. తూర్పు ఆఫ్రికాలో పలు ప్రాంతములకు ఈ దేశమునుండి చేపలు ఎగుమతి అగుచున్నవి. దేశమున ఖనిజ సంపద తక్కువ; రాగి మాత్రము కొన్ని గనుల నుండి తీయబడుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 73.2 కోట్ల కివా; ఇందు 22.4 కోట్ల కివా. కెన్యాకు అమ్మబడుచున్నది (1968). దేశపు ఎగుమతుల విలువ 130.94 కోట్ల ఉ. షిల్లింగులు; దిగుమతుల విలువ 87.6 కోట్ల ఉ. షి. (1968). కెన్యా, టాంజానియాలతో ఈ దేశమునకు శుల్క మేళనపు ఒడంబడిక కలదు. దేశపు బడ్జెటరీ వ్యయము 143 కోట్ల ఉ. షి. (1972-73).

**11. సాంఘిక రంగము :** కేంద్ర, స్థానిక ప్రభుత్వములును, మత ప్రచారక సంస్థలును విద్యా ప్రచారమునకై కృషిని సాగించుచున్నవి. దేశమున 2676 ప్రాథమిక విద్యాశాలలలో 6,63,546 మంది, 95 మాధ్యమిక, ఉన్నత పాఠశాలలలో 22,548 మంది 31 వృత్తి విద్యాశాలలలో 2,703 మంది విద్యార్థులు కలరు (1969). కంపాలాలోని మకెరేరే విశ్వవిద్యాలయ కళాశాలయందలి విద్యార్థి సంఖ్య 1,539; వీరుగాక దాదాపు 2 500 మంది ఉగాండా దేశీయులగు విద్యార్థులు విదేశములలో చదువుచున్నారు (1968). మకెరేరే కళాశాలలోని గ్రంథాలయము తూర్పు ఆఫ్రికా ప్రాంత రాజ్యముల లోని అట్టివానిలో అత్యుత్తమము. కంపాలాలోని మ్యూజియమున మానవ విజ్ఞానశాస్త్రమునకు చెందిన పెక్కు విశేషములు కననగును. ఇంగ్లీషున రెండు దిన పత్రికలును, లుగాండా భాషలో మూడు దిన పత్రికలును ప్రచురితములై ప్రచారమున ఉన్నవి.

వైద్యశాలలను పెక్కింటిని ప్రభుత్వమేగాక, మత సంస్థలును నిర్వహించుచున్నవి. మొత్తము మీద 15,500 శయ్యా సంఖ్యకల 55 ఆసుపత్రులు కలవు; వైద్య సంఖ్య 800 (1969).

**12. యాత్రా సౌ. :** దేశమునకు విదేశ యాత్రికులను ఆకర్షించుటకై ప్రభుత్వము హోటళ్ళు మొదలగు పెక్కు సదుపాయములను కల్పించినది. జాతీయ వనములలో కొన్నింటిలో మృగయా వినోదమునకై వసతుల ఏర్పాటు కలదు. దేశము నందలి ప్రకృతిసిద్ధపు సరస్సులు – విక్టోరియా, ఆల్బర్ట్ మొ. – ప్రకృతి రమణీయతకు నెలవులు. 1968 లో 53,000 మంది విదేశీయ యాత్రికులు దేశమును దర్శించిరి.

---

# 9. ఐవరీ కోస్ట్

**ముఖ్యనగరము :** అబిజాన్; **జెండా :** నారింజ, తెలుపు, ఆకుపసిమి నిలువుచారలు కలది; **జాతీయ గీతము :** లా అబిజానేసే... (నమస్తే, మా ఆశా భూమీ......); **నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఎ), విలువ అనిశ్చితము; సాధారణముగ 100 సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు = రు. 2.60; **కొల**

**తూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** మ. 12 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : పశ్చిమ ఆఫ్రికా తీరభూమి యందు 2°30′–7°30′ తూ. రేఖల మధ్యను, 5° – 10 ఉ. అక్షాంశ రేఖల మధ్యను విస్తరించి




పటము 9.

యున్న ఈ దేశమునకు ఉత్తరమున అప్పర్ వోల్టా, మాలీ దేశములును; తూర్పున ఘానా; పశ్చిమమున గినీ, లైబీరియాలు సరిహద్దు లందున్నవి దేశ వైశాల్యము 3,22,463 చ. కిమీ దేశమున అత్యధిక భాగము మైదానము; తక్కిన ప్రాంతమున గినీ దేశపు పీఠభూములు ముందునకు సాగియున్నవి. ఇందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 1,520 మీ. కవల్లీ, సస్సాండ్రా, బందామా, కోమో అను నాలుగు నదులు ఉత్తరమునుండి దక్షిణము నకు ప్రవహించుచున్నవి. ఇవి నౌకా ప్రయాణము నకు తగినవికావు. తీరరేఖను అనుసరించి ఇసుక తిన్నెలు, వాని వెనుక మడుగులు, కొంతవరకు చిన్న గుట్టలు అంతటంతట కననగును. వీనికి వెనుక అటవీభూమి కననగును. ఒక్కొకచోట అటవీభూమి వెడల్పు 150 కిమీ. వరకు ఉండును.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉత్తర ప్రాంతమున ఉష్ణోగ్రత ఎక్కువ; అచటి సరాసరి ఉష్ణోగ్రత 73° నుండి 80° ఫా. వరకు ఉండును. తీర ప్రాంతమున వర్షపాతము 200 సెం మీ. నుండి 300 సెం. మీ. వరకు ఉండును. అటవీ ప్రాంత మున 130 సెం. మీ. నుండి 250 సెం. మీ. వరకు వర్షపాతము మారుచుండును. అడవులలో మహా గనీ మొ. పెద్ద వృక్షములును, ఏనుగు, నీటి గుర్రమువంటి పెద్ద వన్యజంతువులును కననగును.

**3 జనసంఖ్య** మొ. : 1969 అంచనాలను అనుసరించి దేశ జనసంఖ్య 42,00,000. వివిధ ఆఫ్రికన్ జాతులవారు ఇందు చేరియున్నారు. నగర ములలో అబిజాన్ (జ సం. 5,00,000), బువోకీ (1,05,000) పేర్కొనదగినవి. దేశమున వివిధ జాతులలో దాదాపు 60 ఆఫ్రికన్ భాషలు ప్రచార మున ఉన్నవి; కాని ఫ్రెంచి భాషయే సాధికార భాషగ వాడుకయందున్నది. దేశ ప్రజలలో 65% ప్రకృతి దేవతారాధకులు; 23% ముస్లిములు; తక్కినవారు క్రైస్తవులు

**4. సమాచార సా. :** దేశమున 125 పోస్టు ఆఫీసులు కలవు (1966). తంతి వార్తా సౌకర్యము పెక్కింట గలదు. టెలిఫోనుల సంఖ్య 24,811 (1966). ఫ్రాన్స్‌తో కేబిల్ సౌకర్యము కలదు. అబిజాన్‌లోను, దేశమున ఇంకను 6 కేంద్రము లందును రేడియో ప్రసార కేంద్రములు కలవు.

**5. యాన సౌ. :** దేశపు రోడ్ల నిడివి 32,620 కిమీ; ఇందు 900 కిమీ. తారు వేయ బడినది. అబిజాన్‌నుండి, అప్పర్ వోల్టా దేశము లోనికిపోవు రైలుమార్గము ఈ దేశమున 652 కిమీ. వ్యాపించియున్నది. అబిజాన్, సస్సాండ్రా, టాబూ అనునవి ముఖ్యములగు రేవు పట్టణములు. అబి

జాన్‌లో, అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించు విమానాశ్రయము కలదు.

**6. చరిత్ర :** ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు తెలియవచ్చుటలేదు. కాని 15వ శతాబ్దిలో పోర్చుగీసువారు ఇట సముద్ర తీరమున కాలూనునాటికి అగ్ని, అబ్రాన్ అను రెండు దేశీయ రాజ్యములు కొంతవరకు సుస్థిర సాంఘిక వ్యవలస్థను ఏర్పరచి సహజీవనమున మనుచుండినటుల తెలియవచ్చుచున్నది. కాని తదాదిగ యూరపీయజాతులు ఆఫ్రికాఖండమునకు తమ పలుబడిని వ్యాపింపజేయుటకై జరిపిన కృషిఫలితముగ, ఈ ప్రాంతము పెక్కుసారులు కల్లోలములకు లోనై ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును సాగించిన ఆక్రమణలలో పలుమారులు చేతులుమారి, కడకు 1887 లో పూర్తిగ ఫ్రెంచి అధికారమునకు లోనైనది. అంతట దేశీయుల తిరుగుబాటులను అడచి 1908 నాటికి ఫ్రెంచి ప్రభుత్వము దేశమునందు అంతట వలసపరిపాలనను నెలకొల్పినది. దేశమునకు 'ఐవరీకోస్ట్' అను పేరును ఫ్రెంచివారే వాడిరి. ద్వితీయ ప్రపంచయుద్ధానంతరమున క్రమముగ స్వాతంత్ర్యపథమున పురోగమించి, ఈ దేశము కడకు ఆగస్టు 7, 1960 న పూర్ణస్వాతంత్ర్యమును ఆర్జించినది.

**7. పరిపాలన :** దేశమున ప్రజాస్వామిక గణరాజ్య ప్రభుత్వవిధానము అమలున ఉన్నది. ప్రజలు అయిదేండ్ల కొకసారి ఎన్నుకొను అధ్యక్షునియందు కార్యనిర్వహణాధికారము న్యస్తమైనది. శాసనసభయందు సభ్యసంఖ్య 85. వీరిని అయిదేండ్లకొకసారి ప్రజలెన్నుకొనెదరు. సార్వజనిక వోటింగు హక్కు అమలున ఉన్నది. సుప్రీమ్‌కోర్టు సభ్యులను శాసన సభయే ఎన్నుకొనును. దేశమున ప్రస్తుతమున ఒకే రాజకీయపక్షము పనిచేయుచు, ఏకపట్టికా విధానమున ఎన్నికలు జరుగుచున్నవి. దేశమున ఆరు మండలములు కలవు. ఎన్నుకొనబడిన సభ్యులుకల సమితి సాయమున కేంద్రప్రభుత్వాధికారి మండలపు పరిపాలనను నిర్వహించును.

**8. దేశరక్షణ :** 4000 మంది సైనికులుకల మూడు పదాతిదళములు, 300 మంది యోధులు పని చేయు వైమానికదళమును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా స. లోను, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును 1960 మొదలుగ ఈ దేశమునకు సభ్యత్వము కలదు. పశ్చిమాఫ్రికా శుల్క సమ్మేళనమున ఇదియొక సభ్యరాజ్యము

**10. ఆర్థికరంగము :** వ్యవసాయము, అటవీ సంపత్తి, చేపలపరిశ్రమ అనునవి, ఈ దేశపు ప్రజలలో 90% కు జీవనాధారములు. కాఫీ గింజలను పండించు దేశములలో ఈ దేశము మూడవదిగ లెక్కకు వచ్చినది; కలపయు విరివిగ ఉత్పత్తి యగుచున్నది. ఎగుమతి పంటలలో కాఫీ అతి ముఖ్యము. తరువాత కోకో, అరటిపండ్లు, పైనాపిల్ క్రమముగ గణనీయములు. ఖనిజసంపద భూగర్భమున విరివిగ ఉన్నటుల తెలియుచున్నను, మాంగనీసు, వజ్రముల గనులలో మాత్రమే ఉత్పత్తిజరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 11,800 కోట్ల ఫ్రాంకులు; దిగుమతులవిలువ 8600 కోట్లఫ్రాంకులు (1969), దేశపు విద్యుత్పత్తి 37.2 కోట్ల కి వా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 5700 కోట్ల ఫ్రాంకులు (1970).

**11. సాంఘికరంగము :** స్థానికములగు కొన్ని మార్పులతో ఫ్రెంచి విద్యాపద్ధతి ఇట అనుసరింపబడుచున్నది. దేశమునందలి 2,020 ప్రయిమరీ పాఠశాలలో 4,07,609 మంది, 104 సెకండరీ పాఠశాలలో 38,556 మంది, 20 సాంకేతిక పాఠశాలలో 3,892 మంది విద్యార్థులు పఠించుచున్నారు (1968). అబిజాన్‌లో ఒక విశ్వవిద్యాలయము 1963లో స్థాపింపబడినది. అచట దేశీయులతో

పాటు తక్కిన కొన్ని పశ్చిమాఫ్రికాదేశముల విద్యార్థులను పఠించుచున్నారు. దేశీయ విద్యార్థి సంఖ్య 608. ఒక దినపత్రిక (ఫ్రెంచి) మాత్రమే దేశమున ప్రచురితము. దేశమున అయిదు ఆసుపత్రులు, 59 వైద్యస్థావరములు, 58 ప్రసూతిశాలలు, 190 డిస్పెన్సరీలు, 6 కుష్ఠునివారణ కేంద్రములు, ఒక మానసికరోగ వైద్యశాల పనిచేయుచున్నవి. శయ్యాసంఖ్య 8500; వైద్యసంఖ్య 162. దేశమున 17,980 మంది ప్రజలకు ఒక వైద్యుడు కలడు.

**12. యాత్రా సౌ.** : అబిజాన్‌నందు యాత్రికుల సౌకర్యార్థము పెక్కువసతులను ప్రభుత్వము కల్పించినది.

**13. ప్రసిద్ధ పౌరులు** : ఫెలిక్స్ హౌఫవెత్ బొయినీ (జ. 1905) : ఫ్రెంచి ప్రభుత్వపు మంత్రివర్గమున స్థానమును ఆర్జించిన ప్రప్రథమ ఆఫ్రికావాసి. తనదేశము స్వతంత్రతను ఆర్జించిన వెంటనే స్వతంత్ర ప్రభుత్వపు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడి ఇప్పటికిని ఆ పదవిలో కొనసాగుచున్నాడు.

---

# 10. కాంగో

**ముఖ్య నగరము** : బ్రజ్జవిల్లీ; **జెండా** : ఎర్రని భూమికపై వాయవ్య భాగమున, సుత్తియు, దంతియు, పెనవేసికొని ఉండగ, పైన ఒకనక్షత్ర



పటము 10.

చిహ్నమును, ప్రక్కలన ఆకుపచ్చ ఆకులును కలది; **నాణెము** : ఫ్రాంకు (సి. ఎఫ్. ఎ.); 100 ఫ్రాంకులు = రు. 2.60 ; **కొలతూకములు** : మెట్రిక్ విధానపువి ; **కాలగణన** : సా 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : ఆఫ్రికాఖండమున భూమధ్యరేఖకు ఉభయపార్శ్వముల నెలకొని, 5°ద-3° ఉ. అక్షాంశరేఖల మధ్య విస్తరించి ఉన్న, ఈ దేశమునకు వాయవ్యమున కామెరూన్ ; ఉత్తరమున సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ ; తూర్పునను, దక్షిణమునను జయిరే రాజ్యము ; ఆగ్నేయమున అట్లాంటిక్ మహాసముద్రము ; పశ్చిమమున గేబన్ సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 3,42,000 చ. కిమీ. తీరభూమి నిమ్నమైన వృక్షరహితపు మైదానము. దానిని ఆశ్రయించి, 490 మీ. నుండి 610 మీ. వరకు ఎత్తు కలిగిన తిప్పల శ్రేణి కలదు. ఈ శ్రేణియందు అడవులెక్కువ, ఈ శ్రేణికి తూర్పునను, ఉత్తరమునను పీఠభూమి కలదు. ఈ పీఠభూమి వలననే కాంగోనదీ పరీవాహ ప్రదేశము, ఒగోవీనదీ పరీవాహ భూమినుండి వేరుపరుప బడుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణ మండల శీతోష్ణ స్థితిని ఈ దేశము కలిగియున్నది. ఎండలెక్కువ. గాలిలో చెమ్మదనమును ఎక్కువయే. సాలీనా సరా సరి ఉష్ణోగ్రత 80° ఫా నుండి 90° ఫా. వరకు, ప్రదేశములను అనుసరించి మారుచుండును. వానలు ఎక్కువ. తత్ఫలితముగ దేశమున సగభాగము అరణ్యమయము. పీఠభూమియందు, అటనట, పచ్చగడ్డి మైదానములు కలవు

**3. జనసంఖ్య మొ :** 1972 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 12,50 000. నగర ములలో బ్రజ్జవిల్లీ (జ సం.2,50,000), పోయింటే నయిరే (జ. సం. 1,50 003) పేర్కొనదగినవి. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 4. దేశమున ప్రజలలో 75 తెగల ఆఫ్రికన్ జాతులు కననగును. అందు కోంగో జాతివారు అత్యధిక సంఖ్యాకులు. ప్రజలలో వీరి సంఖ్య దాదాపు 50%. ఈ జాతు లకు వివిధ ఆఫ్రికన్ భాషలు మాతృ భాషలుగ ఉన్నవి. కాని ఫ్రెంచియే సాధికార వ్యవహారభాష. ప్రజలలో 50% ప్రకృతి దేవతారాధకులు. తక్కిన వారిలో ఎక్కువ భాగము క్రైస్తవులు. దాదాపు 15 వేల ముస్లిములు కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున వివిధ ముఖ్య జనావాసములను కలుపుచు, టెలిఫోను సౌకర్యము కలదు. రేడియో - టెలిఫోను, టెలిగ్రాఫ్ల ద్వారా పారిస్. డాకర్, తనానరీవే నగరములకు సరా సరిన వార్తలను పంపు వసతులున్నవి. బ్రజ్జవిల్లీలో చాలా సమర్థతగల రేడియో ప్రసార కేంద్రము కలదు. 1969 నుండి టెలివిజన్ ప్రసారకేంద్రము పనిచేయుచున్నది. 1600 ప్రజలకు ఒక టెలివిజన్ సెట్టు కలదని అంచనా.

**5. యాన సౌ. :** తక్కిన ఆఫ్రికా దేశము లలో ఏ దేశమునను, కనరాని చక్కని రీతిలో ఇచ్చట ప్రయాణ మార్గములు ఏర్పడి ఉన్నవి. మొత్తపు రోడ్ల నిడివి 14,768 కిమీ. ఇందు 3.768 కిమీ. కాంక్రీటు చేయబడినది. 517 కిమీ. నిడివిగల రైలుమార్గములు గలవు. కాంగో, ఉబాంగీ నదులు నౌకాయానమునకు చక్కగ ఉపకరించు చున్నవి పోయింటే నయిరే వద్ద ఒక హార్బరు కలదు. దేశములోని వివిధ ప్రాంతములకు విమాన యాన సౌకర్యము కలదు. బ్రజ్జవిల్లీలోని విమానాశ్ర యము నుండి ప్రక్క ఆఫ్రికన్ దేశములకు పయ నించు వసతులు కలవు. పోయింటే నయిరేలో ఒక అంతర్జాతీయ విమానాశ్రయము ఉన్నది.

**6. చరిత్ర :** ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు చక్కగ తెలియరాకున్నవి. అయినను 16వ శతాబ్దమున ఇచట ఒక రాజ వంశము కాంగో సామ్రాజ్యమును ఒకదానిని నెల కొలిపి పాలించెననియు, అంగోలాలో కొంత భాగము కూడ, ఆ సామ్రాజ్యమున, ఆనాడు చేరియుండె ననియు తెలియవచ్చుచున్నది. తరువాత 'అంజికో' అను వేరొక సామ్రాజ్యమును అది రూపుగొని, కొంతకాలము మనెననియు చెప్పెదరు. కాని, 17వ శతాబ్ది అంతమునకు ఈ సామ్రాజ్యములు అన్నియు నామమాత్రావశిష్టములైనవి. 15వ శతాబ్దిలో పోర్చుగీజువారికిని, 17వ శతాబ్ది మొదలుగ ఫ్రెంచివారికిని, ఈ దేశముతో పరిచితి ఏర్పడినది. బానిస వ్యాపారము నిషేధింపబడిన తరువాత ఫ్రెంచివా రనేకులు, దేశాంతర్భాగమునకు చొర బారి, కాలక్రమమున, బ్రజ్జా అను ఫ్రెంచియోధుని కృషి మూలమున, కాంగోనదియొక్క ఉభయ తటములందును, తమ అధికారమును సుస్థిరము చేసికొనిరి. 1960 మొదలుగ 'మిడిల్ కాంగో' అనుపేర ఈ ప్రదేశము ఫ్రెంచి సామ్రాజ్యమున చేరియుండి, 1958 లో కాంగో అనుపేరుతో స్వతంత్రతను ఆర్జించినది.

**7. పరిపాలన :** స్వతంత్రతను ఆర్జించినది మొదలుగ, ఈ దేశపు ప్రభుత్వము పలుమార్పులకు

లోనైనది. 1963లో ఆమోదితమై, అమలున ఉన్న, రాజ్యాంగ విధానమును అనుసరించి, జాతీయ శాసనసభకు సార్వజనిక వోటింగ్ పద్ధతిన అయిదేండ్ల కొకసారి ఎన్నికలు జరుగును. ఆ సభలో సభ్యసంఖ్య 55. వీరును, వివిధ ప్రాంతీయ పరిపాలనా సంఘ సభ్యులును, దేశాధ్యక్షుని ఎన్నుకొనెదరు. అతని పదవీకాల పరిమితి 5 ఏండ్లు. కార్యనిర్వహణపైనను, సైన్యముపైనను, అతనికి సర్వాధికారములు కలవు. ప్రధానిని అతడే నియమించును. శాసనసభ చర్చించి, ఆమోదించిన బిల్లును పునఃపరిశీలనకై అధ్యక్షుడు పంపినపుడు, మూడింట రెండువంతుల ఆమోదముతో మాత్రమే అది శాసనము కాగలదు. కాని 1960 మొదలుగ దేశమున ఒకేఒక రాజకీయ పక్షము (కాంగోలీజు వర్కర్సు పార్టీ) పనిచేయుచు, పరిపాలనపై సర్వాధికారమును చేపట్టినది.

**8. దేశరక్షణ :** 2000 మంది సైనికులుగల పదాతిదళమును, 200 మంది యోధులుగల వైమానికదళమును, 1800 మంది నావికయోధులుకల, నౌకాదళమును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందు అన్నింటను ఈ దేశము సభ్యత్యము కలిగియున్నది. ఫ్రెంచి కమ్యూనిటీలోను, ఆఫ్రికా దేశముల ఐక్యతా సంఘమున సభ్యత్వము కలదు. ప్రస్తుత ప్రభుత్వము చీనా, సోవియట్ దేశములతో సన్నిహిత సంబంధములను పెంపొందించుకొనినది. 1965 నుండి యు. స్టే. తో. దౌత్య సంబంధములు లేవు.

**10. ఆర్థిక రంగము :** దేశమున వ్యవసాయమునకు అనుకూలమగు భూమిలో 80% సేద్యమున ఉన్నది. అరటి, పెండలము మొదలగు ఉత్పత్తులు దేశావసరములకు మాత్రమే వినియోగపడుచున్నవి. కాని కొబ్బరి, కొబ్బరినూనె, వేరుశెనగ, పంచదార ఎగుమతి అగుచున్నవి. పొగాకు, కాఫీ, కోకోలు కూడ పరిమిత స్థాయిలో, ఉత్పత్తి అగుచున్నవి. మత్స్య పరిశ్రమకు అవకాశములు ఎక్కువ కాని, ఉత్పత్తి ఎక్కువగ జరుగుటలేదు. ఖనిజోత్పత్తిలో, ఇనుము, తుత్తునాగము, పొటాష్ ప్రముఖములు ఎగుమతుల విలువ 1,172.9 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 2023 8 కోట్ల ఫ్రాంకులు (1967). విద్యుదుత్పత్తి 4 కోట్ల కివా. (1967). సాలుసరి బడ్జెటరీ వ్యయము 2,180 కోట్ల ఫ్రాంకులు (1972).

**11. సాంఘిక రంగము :** అంచనాలనుబట్టి దేశమున అక్షరాస్యత 25%. స్థానిక పరిస్థితులకు అనుగుణములగు మార్పులతో ఫ్రెంచి విద్యా విధానము ఈ దేశమున అమలున ఉన్నది. దేశమున 922 ప్రయిమరీ పాఠశాలలలో 1,94,968 మంది, 392 సెకండరీ పాఠశాలలలో 15,939 మంది, 40 సాంకేతిక పాఠశాలలలో 3,339 మంది విద్యార్థులు చదువుచున్నారు (1968). బ్రజ్జవిల్లీలో ఒక విశ్వవిద్యాలయము కలదు. ఒక ప్రముఖ చిత్రకళా కేంద్రముగ బ్రజ్జవిల్లీ పేరొందినది; ఒక ప్రత్యేక, ఆఫ్రికారీతి కళా సంప్రదాయము అట పెంపొందింపబడుచున్నది బ్రజ్జవిల్లీలో ఒక ప్రముఖ గ్రంథాలయము కలదు. ఆ నగరముననే మూడు దిన పత్రికలు, ప్రచురితములగుచున్నవి. బ్రజ్జవిల్లీలోను, పోయింటే నయిరేలోను, రెండు పెద్ద ఆసుపత్రులు కలవు. ఇవికాక 275 చిన్న ఆసుపత్రులు, 79 డిస్పెన్సరీలు, 11 మాతా శిశు కేంద్రములు, 10 గ్రామీణ వైద్య కేంద్రములు పనిచేయుచున్నవి. వీని అన్నింటి శయ్యాసంఖ్య 5,005; వైద్యసంఖ్య 103 (అనగా 18,350 మందికి ఒక వైద్యుడు). కుష్ఠ రోగమును, నిద్రా జాడ్యము (స్లీపింగ్ సిక్‌నెస్) ను అదుపులోనికి తీసికొని రాబడినవి (1967).

**12. యాత్రా సౌ.:** యాత్రికులు 'వీసా' లు మొదలగు అనుమతి పత్రములను విధిగ పొంద వలెను. యాత్రికుల సౌకర్యమునకై బ్రజ్జవిల్లీలో 5 హోటళ్ళను, పోయింటే నయిరేలో నాలుగింటిని, డోలిసీ నగరమున ఒక హోటలును ప్రభుత్వము నిర్వహించుచున్నది.



# 11. కామెరూన్

**ముఖ్యనగరము:** యావాండీ; **జెండా:** ఆకు పసిమి, ఎరుపు, పసుపు, నిలువుదారలలో తొలుతటి పై భాగమున నిలువుగ అమర్చిన పసుపువన్నె, పంచకోణ నక్షత్రములు కలది; **జాతీయ గీతము:** ఓ కామెరూన్, బెర్సోడినోస్, యేన్‌సెత్రెస్...... 




పటము 11.

(తరతరాల మా జన్మభూమి కామెరూన్...) అను నది; **నాణెము:** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఎ), విని మయ విలువ అనిశ్చితము; సాధారణంగా 100 ఫ్రాంక్‌లు = రు. 2.60; **కొలతతూకములు:** మెట్రిక్ పద్ధతివి; **కాలగణన:** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఆఫ్రికా ఖండపు పశ్చిమ భాగమున గినీ సింధుశాఖను ఆనుకొని, త్రిభుజా కృతిలో ఉన్న ఈ దేశపు శీర్షము చాడ్ సరస్సు (13° ఉ. అ; 14° తూ. తు) వద్దను, పీఠరేఖ 700 కిమీ. పొడవున 2° ఉ. అక్షాంశ రేఖను ఆశ్రయించియు ఉన్నవి. తూర్పున చాడ్. సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్; దక్షిణమున కాంగో, గేబన్, ఈక్వటోరియల్ గినీ; పశ్చిమమున గినీ సింధు శాఖ; వాయవ్యమున నైగెరియా సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము 4,74,000 చ. కిమీ. దేశము భౌగోళికంగా నాలుగు ప్రాంతములుగ విభజింప దగి ఉన్నది. దక్షిణమున తీరము నానుకొనియున్న ప్రాంతము దాదాపు 300 మీ ఎత్తుగలిగి, అటవీ మయమగు పీఠభూమి; మధ్యప్రాంతము 'సనగా' నదిని ఆశ్రయించిన పచ్చగడ్డిభూమి, ఇందే అత్యు న్నతమగు అదమావా పీఠభూమియు ఉన్నది; దీని ఎత్తు 760 మీటర్లనుండి 1450 మీటర్లవరకు కలదు. ఉత్తర ప్రాంతము మైదానముగ ఉండి చాడ్ సరస్సు వైపునకు దిగజారును; పశ్చిమ ప్రాంతమున అటవీమయములగు పర్వతసీమలు కలవు. ఇందలి అత్యున్నతపు శిఖరపు ఎత్తు 2,400 మీటర్లు. దేశమున బీనోవీ, సనగా అను రెండు నదులు కలవు; ఇందు తొలుతటిది సంవత్సరమున

చాల నెలల కాలము నౌకాయానమునకు అను కూలించును.

**2. శీతోష్ణస్థితి మొ.:** సరాసరి ఉష్ణోగ్రత 73° ఫా నుండి 79° ఫా వరకు మారుచుండును. తీరప్రాంతమున వర్షపాతము సాలున 380 సెం మీ; తక్కిన ప్రాంతమున సగటున సాలుసరి వర్ష పాతము 80 సెం. మీ; పశ్చిమమున పర్వత సీమ లందు వర్షపాత మెక్కువ, అట శీతోష్ణత సమ స్థాయిలో ఆహ్లాద జనకముగ ఉండును. ఆఫ్రికా యందలి ఉష్ణమండలమున కన్పట్టు అన్ని విధముల వృక్షసంతతియు, వన్యజంతు సంతతియు ఈ దేశపు అడవులలో కన్పట్టును.

**3. జనసంఖ్య మొ.:** 1969 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 56,80,000; జన వృద్ధి సాలీనా 2.1%; జనసాంద్రత చ. కిమీ. కు 12. నగరములలో యావాండీ (జ. సం. 1,29,000); దవాలా (2,50,000). బిపీ (9,000) పేర్కొనదగినవి. ప్రజానీకమున 80 ఆఫ్రికన్ జాతులవారున్నారు. వీరందరికి వేర్వేరుగ మాతృభాషలు కలవు; అయినను సాధికార భాష లుగ ఫ్రెంచి, ఇంగ్లీషు భాషలు ఆదరింపబడు చున్నవి. దేశ ప్రజలలో 33% క్రైస్తవులు. తక్కిన వారిలో దాదాపు 56,000 మంది ముస్లిములు కలరు. మిగిలిన వారందరు సాంప్రదాయిక ప్రకృతి దేవతారాధకులు

**4. సమాచార సౌ.:** దేశమున 88 పోస్టు ఆఫీసులు పనిచేయుచున్నవి. ఇందు 71 లో తంతి వార్తా సౌకర్యములు కలవు. దవాలా నుండి పారిస్ మొదలగు ప్రముఖ యూరపీయ నగరములకు రేడియో - టెలిఫోను సదుపాయములు కలవు. యావాండీలోను, దవాలాలోను రేడియో ప్రసార కేంద్రములు పనిచేయుచున్నవి ప్రముఖ నగరము లందన్నింట టెలిఫోను సౌకర్యములు కలవు.

**5. యాన సౌ.:** దేశమున 12,320 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; ఇందులో 860 కిమీ. మాత్రమే ఉత్తమ శ్రేణికి చెందినవి. రోడ్లను అభి వృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది. దేశమున రైలురోడ్ల నిడివి 955 కిమీ. సముద్రపు రేవులలో ముఖ్యమైనది దవాలా. టికో, విక్టోరియా, క్రిబీ అను రేవులు ఆ తరువాత లెక్కింపదగినవి. బీనోవీ నదీ ముఖద్వారమున గగౌనావరకు సముద్రపు టోడలు సంవత్సరమున రెండు మూడు నెలలు పయనించగలవు; కావున ఆ సౌకర్యము నైగీరి యాతో జరుగు వర్తకమునకు వినియుక్తమగు చున్నది. దేశమున, అన్ని తరగతులకుచెందిన విమానాశ్రయములు 45 కలవు; అందు ప్రముఖ ములు దవాలా, యావాండీ, గరౌవా, టికోలలో ఉన్నవి. ఈ విమానాశ్రయములను, దేశీయ, విదే శీయ వైమానిక సంస్థలు వాడుకొనుచు, యాన సౌకర్యమును కల్పించుచున్నవి.

**6. చరిత్ర:** 19 వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్ర మనకు ఏమియు తెలియవచ్చుటలేదు. 15 వ శతాబ్దిలో ఇట పోర్చుగీజు వర్తకులును, మత ప్రచారకులును కాలిడి కొంతకాలము వ్యవహరించి నటుల తెలియవచ్చుచున్నది; కాని వారు శాశ్వత స్థావరములను వేటిని నెలకొల్పినటుల కన్పట్టదు. జర్మన్ దేశమునకు చెందిన గస్టావ్ నక్టిగల్ అను సాహసికుడు దేశమును అన్వేషించి, అచటి ఆదిమ జాతుల నాయకులతో ఒడంబడికలను కుదుర్చు కొని, జర్మన్ రక్షిత రాజ్యముగ ఆ దేశమును 1884 లో రూపొందించుటతో ఆ దేశపు ఆధునిక చరిత్ర మొదలయ్యెను. ఆ దేశమున రైలు రోడ్లు మొదలగు పెక్కు ఆధునిక యానసౌకర్యము లను నెలకొల్పుటయేగాక జర్మనులు దవాలావంటి రేవు నగరములను సైతము నిర్మింపజేసిరి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున దేశమున అయిదవ భాగము (నైగీరియాకు ప్రక్కనఉన్న ప్రాంతము)

బ్రిటిష్‌వారికిని, తక్కినది ఫ్రెంచివారికిని మాండేటరీ ప్రాంతములుగ దక్కినవి. ఫ్రెంచి ప్రాంతమున వ్యవసాయమునకును, పరిశ్రమలకును మంచి ప్రోత్సాహము లభించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున 1958 లో ఫ్రెంచి అధీనపు కామెరూన్ స్వతంత్రతను ఆర్జించెను; 1960 లో బ్రిటిష్ అధీనపు ప్రాంతమును స్వతంత్రతను సంపాదించినది. అంతట 1961 లో ఈ రెండు ప్రాంతములును ఏకరాజ్యముగ, సమాఖ్యా విధానమున, రూపొందినవి.

**7. పరిపాలన :** దేశమున సమాఖ్యారీతి పరిపాలన అమలునందున్నది. తూర్పు (పూర్వపు ఫ్రెంచి ప్రాంతము) రాష్ట్రమునను, పశ్చిమ (పూర్వపు బ్రిటిష్ ప్రాంతము) రాష్ట్రమునను వేర్వేరు ప్రాంతీయ శాసన సభలు కలవు. తూర్పు దానిలో సభ్యసంఖ్య 100; పశ్చిమపు దానిలో సభ్యసంఖ్య 37. ఆ ప్రాంతములకు వేర్వేరు మంత్రివర్గములును కలవు. ప్రధానులను దేశాధ్యక్షుడు నియమించును. జాతీయ శాసనసభకు తూర్పు ప్రాంతమునుండి 40 మంది; పశ్చిమ ప్రాంతమునుండి 10 మంది ఎన్నుకొనబడెదరు. దేశపు అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును, అయిదేండ్ల కొకసారి జరుగు ఎన్నికలలో, ప్రజలవలన ఎన్నుకొనబడెదరు. వారు వేర్వేరు ప్రాంతములకు చెందియుండవలయునను నియమము కలదు. దేశమున సార్వజనిక, వయోజన వోటింగు హక్కు కలదు. దేశమున ఉన్న రాజకీయ పక్షములలో యూనియన్ కామెరూన్ అనునది ఎక్కువ ప్రజాదరణను ఆర్జించియున్నది. ఫ్రెంచి న్యాయ విధానమును అనుసరించి, తూర్పు ప్రాంతమునను, బ్రిటిష్ విధానమును అనుసరించి పశ్చిమ ప్రాంతమునను న్యాయ నిర్వహణ సాగుచున్నది. ఫెడరల్ కోర్టునకు అంతిమ నిర్ణయాధికారము కలదు.

**8. దేశరక్షణ :** దేశపు రక్షణకై 4,000 మంది సైనికులుగల నాలుగు పదాతి దళములు కలవు. 300 మంది పనిచేయు వైమానికయోధ దళమును కలదు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో దాదాపుగ అన్నింటను ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది. ఆఫ్రికా ఖండ వ్యవహారములకు సంబంధించిన పెక్కు సంస్థలలోను సభ్యత్వము కలదు. చాద్ సరస్సు పరీవాహ ప్రదేశాభివృద్ధికై, చాద్, నైగర్, నైగీరియా, కామెరూన్ దేశములు ఒక అంతర్దేశీయ సమితిద్వారా కృషి చేయుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయమే దేశమున అత్యధిక సంఖ్యాకుల వృత్తి; తరువాత పశుపోషణయు, అటవీకృషియు లెక్కింపదగినవి. ఆహార వస్తువుల విషయమున దేశము దాదాపుగ స్వయంపోషకము. కోకో, కాఫీ, ప్రత్తి పంటలలో ఎక్కువ భాగము విదేశములకు ఎగుమతి యగుచున్నవి. ఖనిజపు ఎగుమతులలో అల్యూమినియం ప్రముఖము తక్కిన ఎగుమతులలో కలప, అరటి పండ్లు, రబ్బరు క్రమరీతిలో పేర్కొనదగినవి. దేశపు దిగుమతుల విలువ 3,23,08,000 ఫ్రాంకులు; ఎగుమతుల విలువ 3,24,17,000 ఫ్రాంకులు (1969). దేశమున విద్యుదుత్పత్తి 101 6 కోట్ల కివా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 2,753 కోట్ల ఫ్రాంకులు.

**11 సాంఘిక రంగము :** దేశమున తూర్పు ప్రాంతమున ఫ్రెంచిలోను, పశ్చిమ ప్రాంతమున ఇంగ్లీషులోను విద్యాబోధన సాగుచున్నది. ప్రయిమరీ తరగతులలో విద్యార్థి సంఖ్య 4,89,808; సెకండరీ తరగతులలో వారి సంఖ్య 18,387. 1962 లో యావాండీ నగరమున ఒక విశ్వవిద్యా

లయము స్థాపింపబడినది. అందలి విద్యార్థి సంఖ్య 1450 (1963). దేశమునందలి పెక్కు మ్యూజియములలో దవాలాలోనిది ప్రముఖము. ఫ్రెంచిలో ఒకటియు, ఇంగ్లీషులో ఒకటియు దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. దేశమున 230 మంది డాక్టర్లు కలరు. (అనగా 25,000 మందికి ఒక డాక్టరు). మలేరియా, కుష్ఠు, బోదకాలు వంటి వ్యాధులు విరివిగ వ్యాప్తియందున్నవి. వీనిని అరికట్టుటకై ప్రభుత్వమును కొన్ని క్రైస్తవమత సంస్థలును విరివిగ కృషి చేయుచున్నవి. దేశము మొత్తమున 44 ఆసుపత్రులు, తక్కు తరగతుల వైద్యశాలలు 168 కలవు; వానిలో శయ్యాసంఖ్య 10,000 (1969).

**12. యాత్రా సౌ. :** ప్రకృతి సౌందర్యమునకు పేరుగనిన అడవులును, వేర్వేరు ఆచారముల వివిధ ఆదిమ జాతులును కల ఈ దేశము దర్శనీయమే అయినను, ఇప్పటివరకు అట్టి యాత్రికుల సంఖ్య అత్యల్పముగనే ఉన్నది. యాత్రికులను ఆకర్షించుటకై ప్రభుత్వము పలు దర్శనీయ ప్రాంతములందు హోటళ్ళు మొదలగు వసతులను కల్పించినది.

# 12. కెన్యా

**ముఖనగరము :** నైరోబి; **జెండా :** నలుపు, ఎరుపు, ఆకుపసిమి అడ్డుచారలును, చారచారకు




పటము 12.

మధ్య తెల్లని సన్నని అడ్డురేఖయును కలిగి, మధ్యన ఎర్రరంగున ఒక డాలును, కత్తెర రీతిగ రెండు బల్లెములు తెలుపునను చిత్రింపబడినది; **నాణెము :** కెన్యా షిల్లింగ్; ఒక కెన్యా షి. = రు. 1.05; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువే అయినను మెట్రిక్ విధానమునకు మార్చు యోచన కలదు. **కాలగణన :** సా. 3 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండమున భూమధ్య రేఖకు ఉభయ పార్శ్వములందును, దాదాపుగ, 4° ఉ.–4° ద. అక్షాంశ రేఖల మధ్యను 34°–41° తూ. తులారేఖల మధ్యను విస్తరించి ఉన్న, ఈ దేశమునకు ఉత్తరమున ఇతియోపియా, సుడాన్, తూర్పున సోమాలియా, హిందూమహాసముద్రము; దక్షిణమున టాంజానియా; పశ్చిమమున విక్టోరియా సరస్సు, ఉగాండా దేశము సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 5,82,600 చ. కిమీ; ఇందు 13,393 చ. కిమీ. జలాంతర్గతము. భూతల వైవిధ్యమునకు పేరొందినది ఈ దేశము. తీరప్రాంతము సారవంతము.

అటనుండి లోనికి పోవుకొలది, ఒక శాద్వలపు మైదానము క్రమముగ 1525 మీ. ఎత్తునకు లేచును. అట తీరమునుండి 480 కిమీ. దూరమున ఒక పీఠభూమి మొదలై నైరుతికి విస్తరించును. ఇందలి గరిష్ఠోన్నతి 3048 మీ. దేశపు ప్రజానీక మున 85% ఈ పీఠభూమియందు నివసించు చున్నారు. దేశపు వైశాల్యమున దాదాపు అయిదింట మూడువంతులను, ఆక్రమించిన ఉత్తర ప్రాంతము సారరహితపుభూమి. ఆగ్నేయ ప్రాంతమున అధిక భాగమును అట్టిదియే. నైరుతి ప్రాంతపు పీఠ భూమిని కెన్యా ఉన్నత భూములు అనియు వ్యవహ రింతురు. ఈ పీఠభూమియందే దేశపు ఉన్నత పర్వత శిఖరములు – కెన్యా పర్వతము (ఎత్తు 5,200 మీ.), ఎల్‌గాన్ ప. (4,320 మీ) – కలవు. తానా, అతీ అనునవి ముఖ్యములగు నదులు. ఇవి ఆగ్నేయమునకు ప్రవహించి, హిందూమహా సముద్ర మును చేరుచున్నవి. ఉత్తర ప్రాంతమున రుడాల్ఫ్ సరస్సును, పశ్చిమపు సరిహద్దున విక్టోరియా సరస్సును ఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశపు భూతల వైవిధ్య మునే శీతోష్ణస్థితియు అనుకరించుచున్నది. తీర ప్రాంతపు సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా. ఇటనుండి భూతలపు ఎత్తు 300 మీ. పెరుగుకొలది సరాసరి ఉష్ణోగ్రత 3° ఫా. తగ్గుచుండునని సాధారణ రీతిలో భావింపవచ్చును. అందువలన, భూమధ్య రేఖపై ఉన్నప్పటికి, ఈ దేశపు జనావాస భూము లందు ఉష్ణోగ్రత తక్కువగనే ఉన్నది. కెన్యా పర్వత శిఖరము, సదా మంచుచే కప్పబడియే ఉండును. సాలీనా సరాసరి వర్షపాతము 125 సెం. మీ. నుండి 175 సెం. మీ. వరకు ప్రాంతములను అనుసరించి మారును. తీరమునను, ఉన్నత భూములందును, ఆ వర్షపాతము 100 సెం. మీ; విక్టోరియా సరస్సు ప్రాంతమున అది 175 సెం. మీ. తీరప్రాంతమున కొబ్బరి తోటలును, చిట్టడవులును కలవు. ఉన్నత భూములందు కొన్ని యెడల దట్టపు అడవులు కలవు. ఉత్తర, ఆగ్నేయ ప్రాంతములు దాదాపుగ ఎడారులు. వివిధ జాతుల జంతువులు అడవులందును, పర్వత సీమలందును కననగును. వానిలో ఏనుగు, ఖడ్గమృగము, సింహము, నీటిగుర్రము మొదలగు పెద్దజంతువులు, మొసలి మొదలగు జలజంతువులును కలవు. పక్షు లలో ఉష్ట్రపక్షులును కొన్నియెడల కన్పట్టును.

**3. జనసంఖ్య మొ.:** 1969 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,09,45,708; ఇందు 1,37,037 ఆసియావాసులు; 40,593 యూరపీయులు. 27,886 అరబ్బులు; తక్కిన వారు వివిధ ఆఫ్రికన్ జాతులవారు. దేశపు నగర ములలో, నైరోబి (జ. సం. 5,09,286), మొంబాసా (2,46,000) పేర్కొనదగినవి జన సాంద్రత చ. కిమీ. కు 19.

ఆఫ్రికన్ జాతులలో జనసంఖ్యారీత్యా ఎక్కువ ప్రాముఖ్యము కలది కికియూ తెగ; తరువాత లెక్కకు వచ్చునది లూవో తెగ, అరబ్బులు దాదాపుగ అందరును తీరప్రాంతమున వసించు చున్నారు. ఆసియా వాసులలో అత్యధిక సంఖ్యా కులు భారత దేశీయులు. వీరు సాధారణముగ పట్టణములలోనే వసించుచున్నారు. యూరపీయు లలో అత్యధిక సంఖ్యాకులు బ్రిటనుకు చెందినవారు.

ఆఫ్రికన్ జాతులలో వేర్వేరు మాతృభాషలు ప్రచారమున ఉన్నను స్వాహిలీ అనునది దాదాపుగ అందరికిని తెలియు భాష. దీనితో బాటుగ ఇంగ్లీషు కూడ అధికారభాషగ వ్యాప్తియందు ఉన్నది. భార తీయులలో గుజరాతీ, పంజాబీ ఎక్కువగ వ్యాప్తి యందున్నవి.

ఆఫ్రికన్ ప్రజలలో 32% క్రైస్తవులు; 4% ముస్లిములు; తక్కినవారందరు ప్రకృతి దేవతారాధ

కులు. యూరపీయులందరును క్రైస్తవులు. భారతీయులలో హిందూ, ముస్లిం, సిక్కు, జైనమతములు క్రమ ప్రాముఖ్యముతో ప్రచారమున ఉన్నవి.

**4. సమాచార సౌ.:** ఉగాండా, టాంజానియాలతోపాటుగ, ఈ దేశపు తంతి, తపాలా, దూర సందేశ సాధనములను, తూర్పు ఆఫ్రికా తంతి తపాలా వ్యవస్థయే నిర్వహించుచున్నది. నైరోబీయందు, ఒక రేడియో ప్రసార కేంద్రము కలదు. దీని ప్రాంతీయ శాఖలు, కిసూమూ, మొంబాసాలలో ఉన్నవి. నైరోబీలోను, మొంబాసాలోను, టెలివిజన్ కేంద్రములు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** దేశపు మొత్తమున 42,000 కిమీ. ల నిడివిగల రోడ్లు కలవు. ఇందు 3,000 కిమీ. మాత్రమే తారు చేయబడినది (1970). వివిధ నగరములను, ప్రముఖ వ్యావసాయిక కేంద్రములను మొంబాసారేవుతో కలిపెడు 6,926 కిమీ. ల నిడివికల రైలుమార్గము కలదు. మొంబాసాయందు, ఉత్తమ శ్రేణికిచెందిన హార్బరు కలదు. నైరోబియందలి, అంతర్జాతీయ విమానాశ్రయము నుండి, యూరప్, ఆసియా దేశములకును, ఆఫ్రికాలోని, ఇతర దేశములకును ప్రయాణ సౌకర్యములు కలవు. మొంబాసాలోకూడ ఒక ప్రముఖ విమానాశ్రయము కలదు.

**6. చరిత్ర:** ఈ దేశపు ప్రాచీన చారిత్రక విశేషములు సవివరముగ తెలియకున్నను, తీర ప్రాంతపు త్రవ్వకములందు లభించు అవశేషములను బట్టి, క్రీ. పూ. 6 వ శతాబ్ది ప్రాంతముననే, కొంత నాగరికతా స్థాయిని అందుకొనిన ఆఫ్రికా జాతుల వారు ఇట వసించి, సమకాలీన యూరపీయ, ఆసియా దేశములతో వ్యాపార సంబంధములను కలిగియుండిరనియు, కొన్ని అనిర్దిష్ట కారణముల వలన ఆ నాగరికత అంతరించెననియు భావించుటకు అవకాశము కలదు. క్రీస్తుశకారంభము మొదలుగ ఈ తీరభూమికిచెందిన కొన్ని రేవు స్థలములు భారతీయులకును, గ్రీకులకును, రోమనులకును సుపరిచితములై ఉండెనని, గ్రంథాధారములవలన తెలియుచున్నది. క్రీ. శ. 5 వ శతాబ్ది మొదలుగ అరబ్బులు వ్యాపారము కొరకై తీరప్రాంతము లందు స్థావరములను నెలకొల్పుకొని మొదలిడి కాల క్రమమున ఇస్లాము మతమునకు, అరబ్బీ సంస్కృతికి అట తావు కల్పించిరి. అరబ్బుల కాలమున సైతము ఈ తీరము భారతీయ, చీనా వర్తకులకు పరిచితమై ఉండినను, వారెవరును అట నెలవులను ఏర్పరచుకొనలేదు. ఇటుల 15 వ శతాబ్దివరకు, అరబ్బుల అధీనమునే ఆ ప్రాంతము ఉండెను. ఆ కాలమున అరబ్బీ భాషతో దేశీయభాష సంకరము చెందుటచే రూపొందినదియే స్వాహిలీభాష.

16 వ శతాబ్ది ప్రారంభము మొదలుగ ఈ ప్రాంతముతో పాశ్చాత్యులకు పరిచయము కలిగినను వారు వ్యాపారముతో, కొంతకాలమువరకు, తృప్తిపడి ఊరకుండిరి. 19 వ శతాబ్ది ఆరంభమున తీరప్రాంత భూమి, జాంజిబారును పాలించు సుల్తాన్‌కు, వశమయ్యెను. 1887 లో ఆ తీరప్రాంత భూమిని సుల్తాన్ ఒక బ్రిటిష్ వర్తక సంస్థకు కౌలునకు ఇచ్చెను. క్రమక్రమముగ దేశాంతర్భాగమునకును, బ్రిటిష్ కంపెనీ తమ అధికారమును వ్యాపింప జేసినది. 1895 లో ఈ కంపెనీనుండి బ్రిటిష్ ప్రభుత్వమే, హక్కులను కొనుగోలుచేసి, అరబ్బుల ప్రతిఘటనను అడచి, దేశమునకు 'తూర్పు ఆఫ్రికా రక్షిత రాజ్యము' అని పేరిడి పాలింప ఆరంభించినది. 1903 న మొంబాసానుండి, విక్టోరియా సరస్సు వరకు రైలుమార్గము ఏర్పడిన తరువాత, ఆ మార్గమునకు ఉభయ పార్శ్వముల ఉన్న భూమి శ్వేతజాతుల నివాసమునకు అనుకూలమని భావించి, ఆ ప్రాంతమును చట్టరీత్యా ఆ జాతులకు ప్రభుత్వము ప్రత్యేకించగా, బ్రిటిష్ కుటుంబ

ములు అనేకము అచటికి వచ్చిచేరి వ్యవసాయ క్షేత్రములను స్థాపించినవి. ఈ కాలముననే భారతీయులును, బ్రిటిష్ ప్రభుత్వపు ప్రోత్సాహముతో అటకు చేరి 1911 నాటికి యూరోపియనులకు మూడురెట్ల సంఖ్యలో ఉండిరి. రాజకీయాధికారము మాత్రము, శ్వేతజాతుల వశముననే ఉండినది. సాగుబడి భూమియందు 24% వారి అధీనముననే ఉండినది. ఏ విధముగ చూచినను, ఆఫ్రికన్ జాతుల పరిస్థితి శోచనీయముగ పరిణమించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము, 'కెన్యెట్టా' అను దేశీయ నాయకుడు, ప్రజలను సంఘటిత పరచి, దేశీయ ప్రజల స్వాతంత్ర్యమునకై ఆందోళన లేవదీసెను. ఆ కాలముననే కికుయూ జాతివారు కొందరు, 'మావ్‌మావ్' అను దౌర్జన్య ఉద్యమముతో, శ్వేతజాతి అధికారమును అంతము చేయుటకు కృషిచేసిరి. ఈ ఉద్యమమును, తీవ్రతర చర్యలవలన అడచి, ప్రభుత్వము కెన్యెట్టాను నిర్బంధించినను (1952) ప్రజల స్వాతంత్ర్యాకాంక్షను నిర్మూలింపలేక పోయినది. కడకు 1961 లో కెన్యెట్టాను విడుదలజేసి వివిధ ఘట్టములలో, జరిపిన సంభాషణల ఫలితముగ, డిశంబరు 12, 1964 న దేశము స్వాతంత్ర్యమునుపొంది కామన్‌వెల్తున సభ్యత్వముకల గణరాజ్యముగ రూపొందినది.

**7. పరిపాలన :** జాతి, మత, వర్ణ విపక్షత లేని ప్రజాస్వామ్య గణతంత్ర ప్రభుత్వ విధానము దేశమున అమలున ఉన్నది. అధ్యక్షుడును, అతడు నియమించుకొను మంత్రులును, సమష్టిగ జాతీయ శాసనసభకు బాధ్యత వహించి పరిపాలనను నిర్వహింతురు. జాతీయ శాసనసభయందు శిష్టసభ, ప్రతినిధులసభ అనబడు రెండు కక్ష్యలు కలవు. శిష్టసభలోని 41 మంది సభ్యులలో దేశమునందలి 7 రాష్ట్రములలో ప్రతియొకదానికి ఒక ప్రతినిధియు, ముఖ్యనగరమునకు ఒక ప్రతినిధియు చేరిఉన్నారు. ప్రతినిధుల సభలో 117 మందిని సార్వజనిక వోటింగు పద్ధతిన ప్రజలు ఎన్నుకొనెదరు. శిష్టసభలో మూడవవంతు స్థానములకు 2 ఏండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగు ఏర్పాటు కలదు. శిష్టసభకు పరిమితాధికారములు మాత్రమే కలవు. 1969 కు పూర్వమున రెండు ప్రధాన రాజకీయ పక్షములు దేశమున పనిచేయుచుండెడివి. కాని, ఆ సంవత్సరమున ప్రతిపక్షము రద్దుచేయబడి, అధ్యక్షుడగు కెన్యెట్టాకుచెందిన 'కానూ' (కెన్యా ఆఫ్రికన్ నేషనల్ యూనియన్) పార్టీ మాత్రమే పనిచేయుటకు అనుమతింపబడి, ఆ పార్టీవారే ప్రతిఘటన లేకుండ ఎన్నుకొనబడిరి.

**8. దేశరక్షణ :** 4 పటాలముల పదాతి దళమును ఒక పేరా్రటూప్ దళమును కలవు. ఇందలి యోధసంఖ్య 4,700. బ్రిటిష్‌వారి సాయముతో నిర్మింపబడిన ఒక వాయుసేన కలదు; ఇందు యోధసంఖ్య 625.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను, కామన్‌వెల్తునను, ఆఫ్రికా సమైక్యతా సంఘమునను దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపైననే చాలవరకు ఆధారపడిఉన్నది. అయినను ఈ ఉత్పత్తిలో అధిక భాగము, ద్వితీయ ప్రపంచయుద్ధము ముగియువరకు, బ్రిటిష్ వ్యావసాయికుల చేతులలోనే ఉండినది. స్వాతంత్ర్యానంతరమున, బ్రిటిష్ గుత్తాధిపత్యము తొలగి, వారి భూములలో కొన్నింటిని కొనుగోలుద్వారా, ఆఫ్రికన్ రైతులకు వశపరచిన పిమ్మట, ఆఫ్రికనులును వ్యావసాయిక ఉత్పత్తిలో ముందంజవేసిరి. దేశావసరములకుతగిన ఆహార పదార్థములను పండించుటయేగాక, తక్కిన పరిసర దేశములకును ఈ

దేశము కొన్ని ఆహార వస్తువులను ఎగుమతి చేయు చున్నది. రొక్కపు పంటలలో కాఫీ గింజలు, తేయాకు ప్రముఖములు. దేశావసరములకుతగిన పశుసంపద కలదు. మత్స్య పరిశ్రమ కొంత అభి వృద్ధిని సాధించిన ఫలితముగ, చేపలు కొద్ది మొత్తములలో ఎగుమతి అగుచున్నవి. అరణ్యముల ఉత్పత్తులలో వాటిల్ చెక్క మొదలగునవి ఎగు మతి అగుచున్నవి. ఖనిజముల ఉత్పత్తి అంతగ లేదు. ఉన్నవానిలో సోడాయాష్, రాతి ఉప్పు, ప్రముఖములు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 1,58,000 కి. వా. (1968). దేశపు ఎగుమతుల విలువ 79,690 వేల స్టెర్లింగ్ పౌండ్లు; దిగుమతుల విలువ 1,20,000 వేల స్టె. పౌండ్లు (1967). అయినను ఈ దేశమునకు ఉగాండా, టాంజానియా లతోగల ఒడంబడికవలన, ఈ మూడు దేశము లును, ఒకే వ్యాపార మండలమునకు చేరియున్నం దున, ఈ దేశమునకు ఆ రెండు దేశములతోగల ఎగుమతి - దిగుమతుల లెక్కలు పై అంకెలలో చేరలేదు. దేశపు బడ్జెటరీ వ్యయము 81,292 వేల పౌండ్లు (1970-71).

**11. సాంఘిక రంగము :** దేశమునందలి 6,111 ప్రయిమరీ పాఠశాలలలో 13,60,750 మంది, దేశపు వివిధవృత్తి విద్యాసంస్థలలో 8,139 మంది విద్యార్థులు పఠించిరి. నైరోబీ విశ్వవిద్యాల యమున, విదేశములలోను మొత్తముమీద 4,831 మంది కెన్యా వాసులు ఉన్నత విద్యను అభ్యసించిరి (1970). నైరోబీలోని మేక్‌మిల్లన్ లైబ్రరీ ప్రముఖ గ్రంథాలయము. నైరోబీలోను, మొంబాసా లోను పేరొందిన మ్యూజియములు కలవు. ఇంగ్లీ షున మూడును, స్వాహిలీలో రెండును దిన పత్రికలు కలవు. దేశమున 13,104 శయ్యలుకల పలువిధముల వైద్యశాలలు కలవు.

**12. యాత్రా సౌ. :** విదేశీ వినిమయ ద్రవ్య మును దేశమునకు సమకూర్చుటలో యాత్రిక పరిశ్రమ దేశపు ఆర్థిక వ్యవస్థలో సముచిత పాత్రను నిర్వహించుచున్నది. దేశమునందలి ఉన్నత పర్వ తములును, ప్రపంచ ప్రసిద్ధములగు జాతీయ వనములును, పరిరక్షితాటవులును, యాత్రికులను ఆకర్షించుచున్నవి. జాతీయ వనములందు వేటకు అవకాశములు కలవు. పాస్‌పోర్టు, వీసా పలు దేశములవారికి విధిగ ఉండితీరవలయును. యాత్రికులకు తగు వసతులు కలవు. 1969లో విదేశీయ యాత్రిక సంఖ్య 1,75,000. దీనివలన దాదాపు 5 కోట్ల అమెరికన్ డాలర్ల ఆదాయము దేశమునకు లభించినది.

---

# 13. కేప్‌వర్డ్ దీవులు

**ముఖ్యనగరము :** ప్రయ్యా; **జెండా, జాతీయ గీతము :** వీని వివరములు తెలియరావు; **నాణెము :** కోంటో; ఒక కోంటో = రు. 260.75; **కొల తూతములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 10-30 ని. = భారతదేశమున సా. 5 గం. 30 నిమిషములు.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమునందలి డాకరునకు దాదాపు 590 కిమీ. లు పశ్చిమమున, అట్లాంటిక్ మహా సముద్ర పరివృత ములై $14°48' - 17°12'$ ఉ. అక్షాంశ రేఖలకును $22°40' - 25°52'$ ప. తులారేఖలమధ్యను ఈ ద్వీప ములు అటనట నెలకొని ఉన్నవి. ఇవి ఉత్తర

వర్గము, దక్షిణవర్గము అను రెండు వర్గములుగ ఉన్నవి. ఉత్తర వర్గమున సావో అంతావో, సావో విసెంటీ, సాంతా లూజియా, సావో నికలావ్, సాల్, బో విస్టా అను దీవులును, దక్షిణ వర్గమున బ్రావా, ఫోగో, సాంతియాగో, మయో దీవులును కలవు. ఇవిగాక ప్రతివర్గమున మరికొన్ని చిన్న




పటము 13.

దీవులు ఉన్నవి. ద్వీపముల మొత్తపు వైశాల్యము 4,033 చ.కిమీ. ఈ ద్వీపములన్నియు అగ్ని శైలజ ములు. అత్యున్నత ప్రదేశపు ఎత్తు (ఫోగో దీవిలో) 2,850 మీ. లు; ముఖ్యనగరమగు ప్రయా, సాంతియాగో ద్వీపమున ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఈ ద్వీపమున ఎండ లెక్కువ; అందును గ్రీష్మఋతువు దుర్భరముగ ఉండును. వానలు తక్కువ; ఆ కొలది వర్షమును ఆగస్టు, అక్టోబరు మధ్యన కురియును. నాలుగు ద్వీపములలో మాత్రమే వాగులందు ఏడాది పొడవున నీరుండును. మొత్తముమీద అనావృష్టి బాధ ఎక్కువ.

**3. జనసంఖ్య మొ.:** మొత్తపు దీవుల జనసంఖ్య 2,72,071 (1970). అందు సాంతియాగో దీవిలోని జనసంఖ్య, తక్కిన దీవులలోనిదానికన్న ఎక్కువ. ఆఫ్రికన్ జాతులతో సంకరత చెందిన పోర్చుగీజులు ప్రజలలో దాదాపు 60% ఉందురు; సాంతియాగోలో ఆఫ్రికనుల సంఖ్య అత్యధికము; 2% మాత్రమే అచ్చపు యూరపీయ సంతతివారు. సావో నికలావ్ దీవిలో స్వచ్ఛమైన పోర్చుగీజు భాషయే మాతృభాషగ ఉన్నను, తక్కిన దీవులలో ఆఫ్రికన్ భాషలతో సంకరతచెందిన అపభ్రంశపు పోర్చుగీజుభాష వాడుకలో ఉన్నది. ఆ అపభ్రంశ ముననే కొంత సాహిత్యమును రూపొందినది. ప్రజలందరును క్రైస్తవులు.

**4. సమాచార సా.:** తెలియవచ్చుట లేదు.

**5. యాన సౌ.:** ద్వీపములందలి మొత్తపు రోడ్ల నిడివి 1,477 కిమీ. (1971); సావో విసెంటీ ద్వీపమునందలి పోర్టో గ్రాండీ ముఖ్యమైన రేవు పట్టణము. సముద్ర వ్యాపారమున 90% దీని ద్వారానే నడచుచున్నది. ద్వీపములమధ్య ప్రయాణము మోటార్‌బోట్ల సాయమున జరుగుచున్నది.

**6. చరిత్ర:** క్రీ. శ. 1460 లో పోర్చుగీజు నావికులు ఈ ద్వీపములను కనుగొనిరి. తరువాత 1462 లో పోర్చుగల్‌నుండి కొందరిట వలసచేరిరి. వారివద్ద పనిచేయుటకై కాలక్రమమున ఆఫ్రికనులను ఇటకు కొనిరాబడుటవలన ఆ ఉభయ జాతుల మేళనమువలన ఒక సమ్మిశ్రజాతి రూపొందినది. 1587 లో ఈ దీవులన్నియు పోర్చుగీజువారి వలస రాజ్యముగ ఏకీకృత పరిపాలనలోనికి వచ్చినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున గినీ–బిస్సావ్ ప్రజలతో కలసి, ఇచటి ప్రజలును స్వాతంత్ర్యము నకై ఆందోళనను సాగించిరి. కడకు పోర్చుగల్ లోనే నిరంకుశ ప్రభుత్వము అంతరించిన తరువాత, కేప్‌వర్డీ దీవులు స్వతంత్రతను ఆర్జించినవి (జులై 5, 1975).

**7. పరిపాలన, 8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం.:** నూతనముగ స్వతంత్రతను ఆర్జించిన

రాజ్య మగుటవలన వివరములు తెలియవచ్చుట లేదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై చాలవరకు ఆధారపడి ఉన్నది. వ్యవసాయ పంటలలో ముఖ్యమైనది కాఫీ; అరటి, వేరుసెనగ ఆ తరువాత లెక్కకు వచ్చును. దేశపు ఎగుమతుల విలువ 45,642 కోంటోలు; దిగుమతుల విలువ 573,464 కోంటోలు. బడ్జెటరీ వ్యయము 2,75,933 కోంటోలు.

**11. సాంఘిక రంగము :** దేశమున 45,103 విద్యార్థులు పఠించు 354 ప్రయిమరీ పాఠశాలలును, 799 మంది చదివెడు 7 సెకండరీ పాఠశాలలును, 2,006 మంది విద్యార్థులున్న 5 సెకండరీ సన్నాహక పాఠశాలలును, 369 మంది విద్యార్థులు చదివెడు 2 సాంకేతిక పాఠశాలలును, 80 మంది విద్యార్థులతో ఒక చర్చి పాఠశాలయు ఉన్నవి (1970-71).

---

# 14. కొమోరో ద్వీపములు

## (ఫ్రెంచి వలస రాజ్యము)

**ముఖ్యనగరము :** మొరోనీ; **నాణెము :** సి. ఎఫ్. ఎ. ఫ్రాంక్; అట్టి నాణెములు 100 = రూ. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 3 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.




పటము 14.

**1. ఉనికి మొ. :** హిందూ మహాసముద్రము నందలి మలగాసీ (మడగాస్కరు) దీవికి వాయవ్యమున, మొజాంబిక్ చానెల్ అని వ్యవహృతమగు సముద్ర భాగమున నెలకొని ఉండిన ఈ ద్వీప రాజ్యమున నాలుగు ప్రముఖ ద్వీపములు (గ్రాండ్ కొమోరీ, అంజువాన్, మాహేలీ, మయొట్టే) ను, మరికొన్ని అల్ప ద్వీపములును చేరిఉన్నవి. ఈ ద్వీపము లన్నింటి మొత్తపు వైశాల్యము 2,171 చ. కిమీ. (గ్రాండ్ కొమోరీ 1,148; అంజువాన్ 424; మాహేలీ 190; మయోట్టే 374 చ. కిమీ. వైశాల్యములు కలిగియున్నవి). అగ్ని పర్వతముల వలన ఈ ద్వీపములు రూపొందినటుల శాస్త్రజ్ఞుల భావన. గ్రాండ్ కొమోరీలోఉన్న కర్తాలా పర్వత శిఖరము ఈ కాలమునను అంతటంతట అగ్నిపర్వతముగ విజృంభించుచున్నది. అగ్నిపర్వతముల నుండి వెలువడిన మృత్తికలవలన ఈ ద్వీపములు అతి సారవంతములగుటవలన వృక్షసంపద ఎల్లెడల విరివిగ కాననగును.

**2. శీతోష్ణస్థితి మొ. :** నవంబరు మొదలు ఏప్రిల్‌వరకు ఇచట బాగుగ వర్షములు కురియును.

అప్పుడు శీతోష్ణస్థితి ఉష్ణమండల పరిస్థితిని బోలి యుండును. తక్కిన కాలమున సౌమ్యముగ ఉండును.

**3. జనసంఖ్య మొ.:** 1966 లెక్కలను అనుసరించి మొత్తపు జనసంఖ్య 2,48,517 (గ్రాండ్ కొమోరీ 1,26,205; అంజువాన్ 80,082; మొహేలీ 10,300; మయొట్టే 31,930). ముఖ్యనగరమగు మొరోనీ, గ్రాండ్ కొమోరీ దీవిలో ఉన్నది. దాని జనసంఖ్య 11,515. 1970 లో అంచనాను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య 2,75,227. దేశ ప్రజల మాతృభాష మలగాసీ; ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిములు. యూరపియనులును, ఫ్రెంచి సంతతికి చెందిన దాదాపు 2,000 దేశీయులును క్రైస్తవులు.

**4. సమాచార సౌ.:** వివిధ ద్వీపములను కలుపుచు టెలిఫోను, తంతి సౌకర్యములు కలవు; ఈ దీవులనుండి మలగాసీ దీవికి వార్తా సంబంధము ఏర్పడియున్నది. మయొట్టెలోని జువొజీలో ఒక రేడియో స్టేషను పనిచేయుచున్నది.

**5. యాన సౌ.:** వివిధ ద్వీపములందు 1,024 కిమీ. నిడివిగల చక్కని రోడ్లు కలవు. జువాజీలో ఉత్తమ స్థాయికిచెందిన నౌకాశ్రయము ఉన్నది. ప్రతి ద్వీపమునను, విమానములు దిగు వసతులు కలవు. వీనినుండి తక్కిన ద్వీపములకును ద్వీపములనుండి ఫ్రాన్సునకును, ఫ్రెంచి విమానసంస్థ విమానయానమును నిర్వహించుచున్నది.

**6. చరిత్ర:** ఫినీషియనుల కాలమునుండియు, అనగా క్రీ. పూ. పదవ శతాబ్దమునుండియు, ఈ ద్వీపములను అంతటంతట వివిధ దేశముల నావికులు సందర్శించినటుల తెలియవచ్చుచున్నది. అటుల వచ్చిన వారియందు పారసీక సింధుశాఖా ప్రాంతమునుండి వచ్చిన అరబ్బులలో కొందరు మాత్రమే ఇట దేశీయులతోపాటుగ నిలిచి, తమ మతమును వ్యాపింపజేసిరి. 1503 లో పోర్చుగీజు వారికిని, 1517 లో ఫ్రెంచివారికిని ఈ దీవులతో పరిచయము ఏర్పడినది. 16 వ శతాబ్దమున మలగాసీ ద్వీపమునుండి మలగాసీ యోధులు ఈ దీవులపై దాడిజరిపి వశపరచుకొనిరి. అట్టి వారిలో ఒకరు మయొట్టే దీవిని 1843 లో ఫ్రెంచి వారికి దత్తముచేసెను; 1865 లో మొహేలీ పాలకునితో మైత్రి ఒడంబడికను ఫ్రెంచివారు కుదుర్చుకొని, కాలక్రమమున గ్రాండ్ కొమోరీ, అంజువాన్, మొహేలీ దీవులను 1886 లో తమ రక్షణలోనికి తీసికొనిరి. 1912 లో మొత్తము నాలుగు దీవులను, తక్కిన అల్ప ద్వీపములను తమకు అదివరకే దక్కిన మలగాసీ దీవితో పరిపాలనారీత్యా ఫ్రెంచి వారు చేర్చిరి. కాని 1946 లో ఈ దీవులను మలగాసీనుండి విడదీసి, ఫ్రాన్సుదేశపు సముద్రోత్తర మండలముగచేసి, 1961 లో ఆంతరంగిక స్వపరిపాలనను ఫ్రెంచి ప్రభుత్వము కల్పించినది. కాని 1974 లో ప్రజలలో కొన్ని పక్షములవారు దేశ స్వతంత్రతకొరకై ఆందోళన చేయగ, ఫ్రెంచి ప్రభుత్వము జనాభిప్రాయమును సేకరించినది. అందు మయొట్టె దీవియందలివారు తప్ప, తక్కిన దీవులవారు స్వాతంత్ర్యమునకై వోటుచేసిరి. ఇట్టి పరిస్థితిని పరిష్కరించుటకు కృషిజరుగు లోపలనే, మయొట్టే ప్రతినిధులుతప్ప తక్కిన ప్రతినిధులు అబ్దాల్ అనువాని నాయకత్వమున ఏకపక్షముగ స్వతంత్రతను ప్రకటించిరి (జులై 6, 1975). కాని అనతికాలముననే ఆ ప్రభుత్వమును కూలద్రోసి వేరొక ప్రభుత్వము అచట అధికారమును గ్రహించినది; కాని దానికి ఇంకను పరిగణన లభింపలేదు (ఆగస్ట్ 3, 1975). మయొట్టే దీవి మాత్రము ఫ్రెంచి దేశపు సముద్రోత్తర మండలముగ కొనసాగుటకు అంతట నిర్ణయించుకొనినది (ఫిబ్రవరి, 1976).

**7. పరిపాలన :** దేశమున సార్వజనిక వయోజన వోటింగు పద్ధతిన ఎన్నుకొనబడిన 31 ప్రతినిధులుకల శాసనసభ కలదు; ఈ శాసనసభకు బాధ్యతవహించు మంత్రిమండలి కార్యనిర్వహణాధికారమును కలిగియున్నది; ప్రభుత్వాధ్యక్షుడుగ ఫ్రెంచి ప్రెసిడెంటు నియమించు ఒక హైకమీషనరు వ్యవహరించును. కాని స్వాతంత్ర్య ప్రకటనతో ఈ వ్యవస్థ రద్దుఅయినది; వేరొక వ్యవస్థ రూపొందవలసి ఉన్నది.

**8. దేశరక్షణ :** ప్రస్తుతకాలమువరకు దేశరక్షణ బాధ్యత ఫ్రాన్సుదేశముపైననే ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఫ్రెంచి ప్రభుత్వమే ఈ దేశపు అంతర్జాతీయ సంబంధములను నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయమే దేశపు ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారము. కొబ్బరి, లవంగాలు, కాఫీ, ఆహారపు పంటలు, (వరి, చెరకు) పండ్లు దేశమున విరివిగ పండుచున్నవి. సిసల్‌నారయు ఉత్పత్తియగుచున్నది. లవంగాలేకాక నిమ్మగడ్డి మొదలగు పలువిధముల సుగంధ వనస్పతులును ఇట లభించును. ఈ సుగంధ ద్రవ్యములు, కొబ్బరి, సిసల్‌నార దేశపు ఎగుమతులలో ప్రముఖములు. ఎగుమతుల విలువ 157.2 కోట్ల సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు; దిగుమతుల విలువ 283.4 కోట్ల సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు (1971). బడ్జెటరీ వ్యయము 159.8 కోట్ల ఫ్రాంకులు (1971).

**11. సాంఘిక రంగము :** దేశమునందలి 355 ప్రాథమిక పాఠశాలలలో 16,660 మంది, 5 సెకండరీ పాఠశాలలలో 1,466 మంది విద్యార్థులు కలరు (1972). జువౌజీలోను, గ్రాండ్ కొమోరీ దీవిలోను పెద్ద ఆసుపత్రులు కలవు; తక్కిన దీవులలో చిన్న ఆసుపత్రులు పనిచేయుచున్నవి. వివిధ ద్వీపములందు సంచారక వైద్య దళములు ప్రజలకు వైద్య సహాయము అందజేయుచున్నవి.

---

# 15. గాంబియా

**ముఖ్యనగరము :** బాత్‌హర్‌స్ట్; **జెండా :** ఎరుపు, నీలం, ఆకుపసిమి, అడ్డచారలును, చారలకు మధ్యను తెలుపు గీతలును కలది. **నాణెము :** గాంబియా పౌను. ఒక పౌను = రు. 18.00; 1971 మొదలుగ దశాంశ నాణెపు పద్ధతి అమలులోనికి వచ్చినది. **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** మ. 12 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.




పటము : 15.

**1. ఉనికి మొ. :** పశ్చిమ ఆఫ్రికా తీరమున 13° – 14° ఉత్తర అక్షాంశ రేఖల మధ్యను, 14°30′ – 17° ప. తులారేఖలమధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు పశ్చిమమున అట్లాంటిక్ మహా సముద్రమును, తక్కిన మూడు దిక్కుల

సెనెగల్ దేశమును సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 9,301 చ. కిమీ. గినీ దేశమున జన్మించిన గాంబియానది ఈ దేశమున 480 కిమీ. దూరము ప్రవహించి, సముద్రమున సంగమించుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ :** ఉష్ణమండలపు శీతోష్ణ పరిస్థితి ఇట కానవచ్చుచున్నది. ఎండకాలమున గరిష్ఠోష్ణోగ్రత 110° ఫా ; సముద్ర తీరమున మాత్రము కొంత తక్కువ. సంవత్సరమున అత్యల్ప ఉష్ణోగ్రత 45° ఫా. సాలీనా సరాసరి వర్షపాతము 100 సెం మీ. వన్యజంతువులందు కోతులు మాత్రమే ఇట కాననగును. పుష్ప వృక్షములు విరివిగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** జనసంఖ్య, 1971 అంచనాలను అనుసరించి, 3,83,000. జన సాంద్రత చ. కిమీ. కు 31. ముఖ్యనగరమగు, బాత్‌హర్‌స్ట్ జనసంఖ్య 31,600 (1967). దేశమున వివిధ ఆఫ్రికన్ జాతుల ప్రజలు కలరు. అందు మాన్‌డిన్‌గో జాతివారు అత్యధిక సంఖ్యాకులు. జాతీయ భాషలలో వొలోఫ్, మాండింకా అనువానికి ఎక్కువ ప్రచారము ఉన్నను ఇంగ్లీషే అధికార భాషగ వాడుకయందు ఉన్నది. ప్రజలలో 80% ముస్లిములు. తక్కినవారు, ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ. :** దేశమున తపాలా సౌకర్యము తగినంతలేదు. నదీ తటములందలి కొన్ని గ్రామములకై సంచార తపాలాఫీసులు పనిచేయుచున్నవి. 6 తపాలాఫీసులును 8 ఏజన్సీలును కలవు. పట్టణములందు టెలిఫోను సౌకర్యములు కలవు. ముఖ్యనగరమున ఒక రేడియో ప్రసార కేంద్రము కలదు; అయినను, సెనెగల్ దేశమునందలి కేంద్ర ప్రసారములనే ఇచ్చటి ప్రజలు అభిమానింతురు.

**5. యాన సౌ. :** దేశమున 1170 కిమీ. నిడివి గల రోడ్లు ఉన్నవి. ఇందు 530 కిమీ. ఉత్తమ శ్రేణికి చెందినవి. బాత్‌హర్‌స్టున చక్కని హార్బరు కలదు గాంబియానదిలో పోటునీరు చాలదూరము వరకు ఎగుపకు పోగలదు. అందువలన కొన్ని రకముల స్టీమర్ల ప్రయాణమునకు అందు వసతి చిక్కుచున్నది. రైలు మార్గములు దేశమున లేవు. 'యుండమ్' అను ప్రదేశమునఉన్న విమానాశ్రయమువలన విమానయానమునకు వసతి లభించుచున్నది.

**6. చరిత్ర :** క్రీ. శ. 1455 న పోర్చుగీజు నావికులు గాంబియానదిని కనుగొనుటతో, యూరపీయులకు ఈ ప్రాంతముతో పరిచయము ఏర్పడినది. ఆంగ్లేయ వర్తకులు, 1678 లో ఇట కాలిడి అధికారమును కైవసము చేసికొనిరి. అంతట ఆంగ్ల - ఫ్రెంచి పోరాటములలో రెండు పర్యాయములు, ఈ ప్రాంతము చేతులుమారి, కడకు పారిస్ ఒడంబడిక మూలమున, బ్రిటిష్‌వారికి దక్కినది. తొలుత సియెర్రా - లియోనీలోని వలస ప్రభుత్వపు పాలనలోనే ఈ దేశము ఉండినను, 1888 నుండి ప్రత్యేక వలస రాజ్యముగ రూపొందింపబడి బ్రిటిష్ సామ్రాజ్యమున ఉండినది. 1963 లో ఆంతరంగిక స్వపరిపాలనను ఆర్జించి కడకు ఏప్రిల్ 23,1970 న స్వతంత్ర గణరాజ్యముగ రూపొందినది. కామన్‌వెల్తున సభ్యత్వమును ఐచ్ఛికముగ కల్గియున్నది.

**7. పరిపాలన :** శాసనసభయందు ప్రజలెన్నుకొనిన సభ్యులు 32 మందియు, వివిధజాతుల నాయకులు ఎన్నుకొనిన సభ్యులు నలుగురును కలరు. వీరే దేశాధ్యక్షుని ఎన్నుకొనెదరు. అధ్యక్షునిచే నియమితుడగు ఉపాధ్యక్షుడే ప్రధానిగ పనిచేయును. దేశమున పనిచేయు రాజకీయ పక్షములలో పీపిల్స్ ప్రొగ్రెసివ్‌పార్టీ ఎక్కువ బలము గలది. పరిపాలనా సౌలభ్యమునకై దేశము నాలుగు

మండలములుగ విభక్తమైనది. వీనిలో ప్రతిదానిని, ఎన్నుకొనబడిన సభ్యుల సలహాతో, కమీషనరు పాలించుచుండును. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున, ఇంగ్లీషు కామన్ చట్టమును అనుసరించి, న్యాయ పరిపాలన ఇట సాగుచున్నది,

**8. దేశరక్షణ :** సైన్యము ఎట్టిదియు లేదు. పోలీసు బలగము 400 కలదు. దానికి సాయపడుటకై సైనిక ప్రతిపత్తి కొంత కలిగిన, 200 మంది కల దళము ఒకటి పనిచేయుచున్నది.

**9. అంతర్జాతీయ సం. :** 1965 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను ఈ దేశము సభ్యత్వము వహించి యున్నది. సెనెగల్‌తో విదేశ వ్యవహార, రక్షణ, భద్రతా, ప్రగతి కార్యక్రమములకు సంబంధించిన ప్రత్యేక ఒడంబడికలు, ఈ దేశము కుదుర్చుకొనినది. సెనెగల్, గ్రేట్ బ్రిటన్‌లలో మాత్రమే ఈ దేశమునకు ప్రతినిధులు కలరు. ఈ దేశమునకు పలు విదేశములతోగల దౌత్య వ్యవహారములను, సెనెగల్ దేశపు ప్రభుత్వమే నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వేరుసెనగ పంట, ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారము. వరి, జొన్న, సజ్జ, మొక్కజొన్నవంటి ఆహార ధాన్యములు దేశావసరములను కొంతవరకు తీర్చుచున్నవి. కొబ్బరిచెట్లును విరివిగ కలవు. వీని ఫలసాయమున కొంత ఎగుమతి అగుచున్నది. ఎగుమతుల విలువలో 90% వేరుశనగవలన లభించుచున్నది. తక్కిన ఎగుమతులలో పేర్కొనదగినవి ఎండు చేపలు. ఖనిజ పరిశ్రమ దాదాపుగ శూన్యము. ఎగుమతుల విలువ 6,557 వేల పౌనులు; దిగుమతుల విలువ 7,123 వేల పౌ. (1969-70). విదేశ యాత్రికులవలన లభించు ద్రవ్యమువలన, చెల్లింపుల లోటును, దేశము కొంతవరకు సర్దుకొనగలుగుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 109 లక్షల కి. వా. (1967). బడ్జెటరీ వ్యయము, 40,38,350 పౌ. (1970-71).

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రజలలో 15% ఆంగ్లమునను 20% అరబ్బీయందును అక్షరాస్యులు. అరబ్బీని బోధించు మత పాఠశాలలు విరివిగ కలవు. ప్రభుత్వాధ్వర్యమున నడుపబడు, 94 ప్రయిమరీ పాఠశాలలలో 16,280 మంది, 16 సెకండరీ పాఠశాలలలో 4,012 మంది విద్యార్థులు పఠించుచున్నారు (1968-69). ముఖ్య నగరమున ఒక గ్రంథాలయము కలదు. దిన పత్రికలు లేవు తక్కు రకముల పత్రికలు అయిదు కలవు. దేశమున వైద్య సంఖ్య 18. (అనగా 18,670 మందికి ఒక వైద్యుడు కలడు). దేశపు మొత్తమున, 240 శయ్యా సంఖ్య కల 5 ఆసుపత్రులు కలవు. మలేరియా, క్షయ, మశూచి మొదలగు సాంక్రామిక రోగముల వ్యాప్తి ఎక్కువ. కుష్ఠురోగ నివారణకై ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ ఈ దేశమున కృషిచేయుచున్నది.

**12. యాత్రా సౌ. :** యూరపీయులు అనేకులు దేశ పర్యటనకై ఇటకు వచ్చుచుందురు. బెల్జియం, డెన్‌మార్క్, ఐస్‌లాండ్, ఐర్‌లాండ్, ఇటలీ, లక్సెంబర్గ్, హాలండ్, నార్వే, స్పెయిన్, స్వీడెన్, స్విజర్లాండ్, గ్రేట్‌బ్రిటన్, తుర్కీ దేశముల యాత్రికులు 'వీసా' లేకుండనే ఇటకు రావచ్చును. తక్కిన దేశములవారు అనుమతి పొందవలెను. యాత్రికులకు పెక్కు సౌకర్యములను, ప్రభుత్వము ఏర్పాటు చేసినది.

# 16. గినీ

**ముఖ్యనగరము :** కోనాక్రి; **జెండా :** దండము కడనుండి నిలువుగ వరుసన ఎరుపు, పసిమి, ఆకు పసిమి వన్నెల చారలు అమరియున్నది. **జాతీయ గీతము :** లిబర్టీ...... (స్వాతంత్ర్యము......);




పటము 16.

**నాణెము :** గినీ ఫ్రాంక్; సాధారణముగ 100 గినీ ఫ్రాంక్‌లు = రు. 3.03; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** మ. 12 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమున 7°35′ – 12°30′ ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 8–15 పశ్చిమ తు. రేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు **ఉత్తరమున** గినీ-బిస్సావ్, సెనెగల్, మాలీ దేశములు; తూర్పున ఐవరీకోస్ట్ దేశము. దక్షిణమున సియెర్రా లియోనీ, లైబేరియా దేశములు; పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 2,45,857 చ. కిమీ. వాయవ్యము నుండి ఆగ్నేయమునకు దేశపు నిడివి 768 కిమీ. పశ్చిమమున అట్లాంటిక్ తీరరేఖ నిడివి 272 కిమీ. దేశమును 1. ఒండ్రుమట్టిగల తీరపు మైదానము, 2. ఫూటాజల్లాన్ పర్వత శ్రేణిగల మధ్యగినీ, 3. చిన్నచిన్న తిప్పలతో ఎగుడుదిగుడు పచ్చిక బీడులుకల ఎగువ గినీ, 4. గినీ పీఠభూమి అను నాలుగు ప్రాంతములుగ భౌగోళికరీతిలో విభజింప వచ్చును. పీఠభూమియందలి అత్యున్నత ప్రదేశపు ఎత్తు 1890 మీ. నైగర్‌నది గినీ పీఠభూమి యందును, గాంబియా, సెనెగల్ నదులు ఫూటా జల్లాన్ కొండలందును ఈ దేశమున జన్మించు చున్నవి.

**2 శీతోష్ణస్థితి** మొ. : దేశమున అత్యధిక ఉష్ణోగ్రత 100° ఫా.; అత్యల్ప ఉష్ణోగ్రత 60° ఫా.; ఏప్రిల్ నెలలో ఎండ అధికము; జులై, ఆగస్టులు వర్షము లెక్కువ. దిగువ గినీలో వర్షపాతము ఎక్కువ. కోనాక్రియందు సాలీనా సరాసరి వర్షపాతము 420 సెం. మీ; ఫూటా జల్లాన్‌లో వర్షపాతము తక్కువ (150 – 200 సెం. మీ.); పీఠభూమిపైన వర్షపాతము 275 సెం. మీ. పర్వతములందును, పీఠభూమియందును దట్టపు అడవులు కలవు. ఏనుగు, నీటి గుర్రము మొదలగు పెద్ద వన్యజంతువులు అడవులందును, మడుగులందు మొసళ్ళును కననగుచున్నవి. విష సర్పములును విరివిగ కలవు.

**3. జనసంఖ్య** మొ. : 1969 సం. అంచనాలను అనుసరించి జనసంఖ్య 37,80,000. చ. కిమీ. కు జనసాంద్రత 15.3. దేశపు నగరములలో కోనాక్రి (జ. సం. 1,50,000), కన్‌కన్ (30,000), కిందియా (25,000) పేర్కొనదగినవి. దేశపు వివిధ ఆఫ్రికన్ జాతులలో ఫులానీ తెగవారు అత్యధిక సంఖ్యాకులు (దాదాపు 10 లక్షలు). దేశమున ఎనిమిది ఆఫ్రికన్ భాషలు ప్రచారమున ఉన్నవి. కాని దేశీయభాషలు పరిపుష్టతను ఆర్జించు వరకు ఫ్రెంచి భాషను పరిపాలనా వ్యవహారము

లందు వాడుటకు నిర్ణయము జరిగినది. దేశమున ప్రజలలో 62% ముస్లిములు; 1.5% క్రైస్తవులు; తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ.:** ఫ్రాన్సు దేశముతోను, పరిసరదేశముల ముఖ్యనగరములతోను, కేబుల్ ద్వారా వార్తా సౌకర్యము కలదు. కోనాక్రిలోని వైర్‌లెస్ కేంద్రమువలన ఆఫ్రికా ఖండములోని తదితర రాజ్యములతో దేశమునకు వార్తా సౌకర్యము ఏర్పడినది. దేశపు వివిధ ప్రాంతముల మధ్య టెలిఫోన్ సంబంధము విస్తృతముగ కలదు. టెలిఫోనుల సంఖ్య 7,488 (1972). కోనాక్రిలో ఒక రేడియో ప్రసార కేంద్రము పనిచేయుచున్నది.

**5. యాన సౌ.:** దేశమున 3,500 కిమీ. నిడివిన పక్కా రోడ్లును, 7,000 కిమీ.ల నిడివిన కచ్చారోడ్లును కలవు. కోనాక్రినుండి కంకన్‌కును (662 కిమీ).), సంగారెడినుండి కంసార్ రేవునకు (150 కిమీ.)ను, రైలు మార్గములు కలవు. చీనీయ ఇంజనీర్ల సాయముతో రైలుమార్గములను పొడిగించు కృషి జరుగుచున్నది. కోనాక్రివద్ద సహజ సిద్ధమగు లోతైన హార్బరు కలదు. కంసార్‌వద్ద ఒక హార్బర్ నిర్మింపబడినది (1972). కస్సా, బెంతీ, కకాండీ అను చిన్న రేవులును కలవు. కోనాక్రిలోని అంతర్జాతీయ విమానాశ్రయమువలన విదేశ ప్రయాణ సౌకర్యము ఏర్పడియున్నది. దేశమున వివిధ ప్రాంతములమధ్య విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర:** పశ్చిమ ఆఫ్రికాలో మధ్య యుగములందు ఒక మహా సామ్రాజ్యముగ పేరొందిన ఘానా సామ్రాజ్యమునందు ఈ దేశమున అత్యధిక ప్రాంతము అంతర్భాగముగ ఉండెడిది. 15 వ శతాబ్ది మొదలుగ పోర్చుగీజువారు మొదలగు యూరపువాసులకు ఈ ప్రాంతముతో పరిచయము ఏర్పడినను, నౌకా ప్రయాణమునగల కొన్ని ఇబ్బందులవలన వారిట ఎక్కువగ చొరబారకుండిరి. 18 వ శతాబ్ది అంతమున ఫ్రెంచివారు మాత్రము ఈ దేశపు తీరప్రాంతపు అన్వేషణలో శ్రద్ధ వహించిరి. కడకు 1814 లో యూరపీయ రాజ్యముల మధ్య జరిగిన శాంతి ఒడంబడికను అనుసరించి, ఫ్రెంచివారికి ఈ ప్రాంతమున హక్కు లేర్పడినటుల గుర్తింపబడినది. ఫ్రెంచివారు దేశమునందలి వివిధ తెగల నాయకులలో కొందరిని లోబరచుకొని దేశమున అధికభాగమును తమ రక్షిత రాజ్యముగ ప్రకటించిరి (1949). కాని తక్కిన ప్రాంతముల తిరుగుబాటులను అడచి 1898 నాటికి మాత్రమే దేశమునంతటిని ఫ్రెంచివారు వశపరచుకొనగలిగిరి. తొలుత ఈ ప్రాంతమును సెనెగల్ దేశమున అంతర్భాగముగనే ఫ్రెంచివారు పాలించిరి. కాని 1891 నుండి ఫ్రెంచి గినీ అను పేరుతో దీనికి ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ఫ్రెంచి వలస సామ్రాజ్యము క్రమముగ అంతరించుటతో అక్టోబరు 2,1958 న దేశము స్వతంత్రతను ఆర్జించెను.

**7. పరిపాలన:** దేశమున ప్రజాస్వామిక గణరాజ్య విధానము 1958 నుండియు అమలులో ఉన్నది. సార్వజనిక వయోజన వోటింగు పద్ధతిన ఎన్నుకొనబడిన అధ్యక్షుడును, శాసనసభయు కలవు. అధ్యక్షుని పదవీకాల పరిమితి 7 ఏండ్లు. శాసనసభకు అయిదేండ్లకొక పర్యాయము ఎన్నికలు జరుగును. దేశమున ఒకే ఒక రాజకీయ పక్షము (గినీ ప్రజాస్వామిక పక్షము) పనిచేయుచున్నది. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును. స్థానిక పాలనను ప్రజా ప్రతినిధుల సాయముతో ప్రభుత్వ ప్రతినిధి నిర్వహించును. ఫ్రెంచి న్యాయ విధానమును అనుసరించియే సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున ఇట న్యాయ పరిపాలన సాగుచున్నది.

**8. దేశరక్షణ:** దేశమున రెండేడ్ల నిర్బంధ సైనిక శిక్షణ అమలున ఉన్నది. 5,000 మంది

సైనికులుగల పదాతిదళమును, 200 మంది వైమానిక యోధులుకల వైమానిక దళమును కలవు. ఆయుధములకై ఈ దేశము చీనా, సోవియట్ జెకోస్లొవాకియాలపై ఆధారపడి ఉన్నది. నౌకాసేన నిర్మాణమున ఉన్నది.

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలు పెక్కింటను 1958 మొదలుగ ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది. ఆఫ్రికా ఖండ దేశములకు సంబంధించిన వివిధ సంస్థలందును ఈ రాజ్యము సభ్యత్వము పొందినది. ఆఫ్రికాఖండ రాజ్యము లన్నింటిని కలుపుకొనిన 'ఆఫ్రికా సంయుక్త రాష్ట్రములు' అను మహారాజ్యము రూపొందుటకు కృషిచేయుటయే గినీ వాసుల ధ్యేయమని ఈ దేశపు రాజ్యాంగ విధానమున కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమే ముఖ్యాధారము. దేశపు వ్యావసాయిక ఉత్పత్తులలో తాళజాతి వృక్ష ఫలసాయమును, అరటి పండ్లును, కాఫీగింజలును, వేరుశనగ పప్పును ప్రముఖములు. కాఫీ, తేనె, అరటిపండ్లు, కొబ్బరి విదేశములకు ఎగుమతి అగుచున్నవి. బాక్సైట్ ఖనిజము దేశమున విరివిగ లభించుచున్నది. తరువాత చెప్పదగినది ముడి ఇనుము. బంగారము, వజ్రముల గనులు ఉన్నను వాని ఉత్పత్తి చాల తగ్గినది. ఉత్పత్తియగు ఖనిజములలో అత్యధిక భాగము దేశమునుండి ఎగుమతి అగుచున్నవి. మొత్తము ఎగుమతుల విలువ 1,610 కోట్ల గినీ ఫ్రాంకులు; దిగుమతుల విలువ 1,120.1 కోట్ల గినీ ఫ్రాంకులు (1968). దేశపు విద్యుదుత్పత్తి 20 కోట్ల కివా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 2,780 కోట్ల గినీ ఫ్రాంకులు (1971-72).

**11. సాంఘిక రంగము :** దేశమున 1800 ప్రయిమరీ, సెకండరీ పాఠశాలలలో, మొత్తముమీద దాదాపు 2,50,000 విద్యార్థులు పఠించుచున్నారు. విద్యాబోధనమున ఫెంచి భాషకు పూర్వపు స్థానము ఇప్పటికిని కొంత నిలిచియున్నను, ఆఫ్రికా భాషలను ప్రోత్సహించి, ప్రజలలో 'ఆఫ్రికేయతను' నెలకొల్పుటకు కృషి జరుగుచున్నది. కోనాక్రిలో ఒక గణనీయమగు గ్రంథాలయము కలదు. దిన పత్రికలు లేవు. ప్రభుత్వమే ఒక సమాచార పత్రమును దైనికముగా ప్రచురించుచున్నది. కోనాక్రిలో రెండును, తదితర ప్రాంతములందు 4 ను ఆసుపత్రులు కలవు. వీనియందలి శయ్యా సంఖ్య 6,800. వైద్యసంఖ్య 88 (42,000 ప్రజలకు ఒక వైద్యుడు).

**12. యాత్రా సౌ. :** ఆఫ్రికాలోని స్వతంత్ర రాజ్యముల ప్రజలందరును 'వీసా' లు లేకుండనే ఈ దేశమున విలాసయాత్రకు రావచ్చును. తక్కిన వారికి అనుమతి కావలెను.

**13. ప్రసిద్ధ పౌరులు :** సమోరీ తౌరే (1846-1898) దేశపు జాతీయ యోధుడు. ఫ్రెంచి సామ్రాజ్య వాదమును ఎదిరించి పోరాడి మరణించెను. ఇతని మునిమనుమడగు సేకు తౌరే (జ. 1922) స్వతంత్ర గినీ జనకుడు. కార్మిక నాయకుడుగ రాజకీయ జీవితమున కృషిచేసి 1958 లో దేశాధ్యక్షుడై అదాదిగ ఆ పదవిలోనే, ప్రజాభీష్టమును అనుసరించి, కొనసాగుచున్నాడు.



# 17. గినీ - బిస్సావ్

## (1974 లో స్వతంత్రతను పొందిన వలస రాజ్యము)

**ముఖ్యనగరము :** బిస్సావ్; **జెండా, జాతీయ గీతము :** మొదలగు వివరములు తెలియరావు. **నాణెము :** కోంటో; ఒక కోంటో = రు. 260.75;




పటము 17.

**కొలతూకములు** · మెట్రిక్ విధానపువి; **కాల గణన :** ఉ. 11 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమున 10°52′ – 12°40′ ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 13°38′ – 16°43 ప. తులారేఖల మధ్యను విస్తరించిన ఈ దేశమునకు ఉత్తరమున సెనెగల్; తూర్పునను ఆగ్నేయమునను గినీ; వాయవ్యమునను పశ్చిమమును అట్లాంటిక్ మహా సముద్రము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 36,125 చ. కిమీ. ఇందు 10% భూమి అంతటంతట సముద్రపుపోటు నీటిమునుకకు లోనగు చున్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఎండలు తీవ్రముగ ఉన్నను, గాలిలో చెమ్మదనము ఎక్కువ. వర్షపాతము సాలీనా సరాసరిన ప్రాంతములను అనుసరించి 125 సెం. మీ. నుండి 300 సెం. మీ. వరకు మారుచుండును. చిన్నచిన్న నదులును, మడుగులును, విస్తారముగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1969 అంచనాలను అనుసరించి దేశ జనసంఖ్య 5,30,000. ముఖ్య నగరమగు బిసావ్‌న జనసంఖ్య 50,000. వివిధ ఆఫ్రికన్ జాతులవారు ఇందు కలరు. వారి మాతృ భాషలుగ పెక్కు ఆఫ్రికా భాషలు దేశమున ప్రచారమునఉన్నను, క్రియోల్ అనబడు సంకర భాష సర్వేసర్వత్రా వాడుకయందున్నది. ప్రజలలో 45% ముస్లిములు; క్రైస్తవులు కొలదిగ కలరు; తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సా. :** రెండు రేడియో - టెలిగ్రాఫ్ స్టేషనులు, 23 తంతి స్థావరములు, ఒక రేడియోస్టేషను పనిచేయుచున్నవి. టెలిఫోనుల సంఖ్య 1,517.

**5. యాన సౌ. :** 3,165 కిమీ. నిడివిన రోడ్లు కలవు. ఇవి ఉత్తమ శ్రేణికి చెందినవి. రైలుమార్గములు లేవు. నదులును, కాలువలును, చిన్న నౌకల ప్రయాణమునకు అనుకూలించు చున్నవి.

**6. చరిత్ర :** క్రీ. శ. 1446 లో ఈ దేశమున పోర్చుగీజు నావికులు కాలిడిరి. క్రమక్రమముగ ఇట పోర్చుగీజువారి పలుకుబడి పెరిగినది. తుదకు 1820 నాటికి దేశమంతయు పోర్చుగీజు సామ్రాజ్యమున అంతర్భాగమైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, తక్కిన పోర్చుగీజు ఆక్రమిత ప్రాంతములందువలెనే ఇట సైతము ప్రజలందు స్వాతంత్ర్యాసక్తి హెచ్చుపెరిగి, 1962 మొదలుగ

అందులకై ఉద్యమములు సాగినవి. కడకు సెప్టెంబరు 24, 1973 న స్వాతంత్ర్య యోధులు దేశమున కొంత భాగమున స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పి దేశ స్వాతంత్ర్యమును ప్రకటించిరి. తక్కిన ఆఫ్రికన్ రాజ్యములును, ఐ. రా. స. యు, ఈ ప్రతిపత్తిని గుర్తించినను, పోర్చుగల్ అందులకు నిరాకరించినది. కడకు పోర్చుగల్‌లోనే నిరంకుశ ప్రభుత్వము అంతరించిన తరువాత అచటి నూతన ప్రభుత్వము ఈ దేశపు స్వాతంత్ర్యమును గుర్తించినది (సెప్టెంబరు 10, 1974).

**7. పరిపాలన :** స్వాతంత్ర్యానంతరమున నూతనముగ ఏర్పడిన ప్రభుత్వ వ్యవస్థను గురించిన వివరములు తెలియవచ్చుటలేదు.

**8. దేశరక్షణ :** వివరములు తెలియవు.

**9. అంతర్జాతీయ సం. :** 1974 సెప్టెంబరు మొదలుగ ఐ. రా. స. యందు ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము :** ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. దేశావసరములకు తగినంతగ వరి, జొన్న పండుచున్నవి. వేరుసెనగయు, కొబ్బరియు, ఎగుమతి అగుచున్నవి. దేశపు ఎగుమతులలో 80% విలువ వీనివలన లభించుచున్నది. పశుసంపదయు విరివిగ కలదు. చర్మముల ఎగుమతివలన కొంత ఆదాయము లభించుచున్నది. ఈ ఎగుమతులలో అత్యధిక భాగము పోర్చుగల్‌కు చేరుచున్నది. ఎగుమతుల విలువ 5,91,000 కోంటోలు; దిగుమతులు 4,72,000 కోంటోలు. దేశమున విద్యుదుత్పత్తి 5,600 కివా. మాత్రమే. బడ్జెటరీ వ్యయము 2,97,000 కోంటోలు (1967)

**11. సాంఘిక రంగము :** దేశమున 98.8% నిరక్షరాస్యులు. ప్రయిమరీ పాఠశాలలో 1,827 మంది, సెకండరీ పాఠశాలలలో 272 మంది, సాంకేతిక పాఠశాలలలో 354 మంది విద్యార్థులు పఠించుచున్నారు. దేశమున ఒక గ్రంథాలయమును, ఒక మ్యూజియమును కలవు. దేశమున మలేరియా, క్షయ మొదలగు అంటు జాడ్యములు ఎక్కువ. పోషకాహారపు లోపమువలనకూడ రోగబాధ పెరుగుచున్నది. 67 శయ్యలుకల 5 ఆసుపత్రులును, 6 వైద్య కేంద్రములును, 50 చికిత్సా స్థావరములును కలవు. ప్రభుత్వ వైద్యుల సంఖ్య 25 (1960).

---

# 18. గేబన్

**ముఖ్యనగరము :** లైబర్‌విల్లీ; **జెండా :** ఆకుపసిమి, బంగారు పసిమి, రాజనీలపు ముప్వన్నె అడ్డుచారలు కలది; **జాతీయ గీతము :** లా కంకర్డీ......; **నాణెము :** ఫ్రాంకు (సి. ఎఫ్. ఎ.); సాధారణముగ 100 ఫ్రాం = రూ. 2.60; **కొలతూతములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 నిమిషములు.

**1. ఉనికి మొ. :** పశ్చిమాఫ్రికా తీరమున 3° ఉ – 3° ద. అక్షాంశ రేఖల మధ్యను, 9° – 14° తూ. తులారేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున ఈక్విటోరియల్ గినీ, కామెరూన్ దేశములు; తూర్పునను దక్షిణమునను, కాంగో రాజ్యము; పశ్చిమమున 800 కిమీ. పొడవున అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము, అంచనాలను అనుస

రించి, 26,700 చ. కిమీ. దేశమంతయు ఒగోవీ నదీ పరీవాహ ప్రదేశమున ఉన్నదని చెప్పవచ్చును. ఆ నది ఈ దేశమున 800 కిమీ. ప్రవహించి అట్లాంటిక్ మహాసముద్రమున చేరుచున్నది. దేశమున అటనట ఉన్నత పర్వతములు కలవు. అందు అత్యున్నతపు శిఖరపు ఎత్తు 1574 మీ.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఉష్ణమండల ప్రాంతములందు సహజముగ కన్పట్టు రీతిగ ఇచట గాలిలో




పటము 18.

చెమ్మదనముతో పాటుగ ఎండలును ఎక్కువ. ఫిబ్రవరి మొదలుగ జూన్ వరకు, వానలు ఎక్కువగ కురియును. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా. ముఖ్యనగరమగు లైబర్‌విల్లీ పరిసరములందు సాలీనా సరాసరి వర్షపాతము 250 సెం. మీ. కు మించి ఉండదు. వాయవ్య తీర ప్రాంతమున ఆ వర్షపాతము 375 సెం. మీ. దట్టపు అడవులు ఎక్కువగ కలవు. వీనివలన దేశమంతయు, నిత్యశ్యామలముగ కన్పట్టును. ఆ అడవులందు 80 మీ. ఎత్తుకు పైబడిన చెట్లును, తీరభూమియందు ఎత్తు రెల్లుగడ్డియు చూడనగును. ఉష్ణమండలపు అడవులలో కన్పట్టు వన్య జంతువులలో పెక్కు రకములు ఈ అడవులందును కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1971 అంచనాలను అనుసరించి జనసంఖ్య 7,52,295. ఇందు అత్యధిక భాగము నదీ తటములను అనుసరించి నివసించుచున్నారు. దేశాంతర్భాగమున చాలాచోట్ల జననివాసమే కన్పట్టదు. జనసాంద్రత చ. కిమీ. కు 2.3; నగరములలో లైబర్‌విల్లీ (జ.సం. 65,000), పోర్ట్ - జన్‌టిల్ (35,000) పేర్కొనదగినవి. ప్రజలలో 80% పల్లెలందు వసించుచున్నారు. దేశ ప్రజలలో దాదాపు 40 రకముల ఆఫ్రికన్ జాతుల వారు కలరు. 'పిగ్మీలు' అని వ్యవహరించబడు పొట్టిజాతి ప్రజలు, ఇట 3,000 మంది, అటనట అడవులలో, వసించుచున్నారు. అన్ని జాతులలో ఫాంగ్ జాతివారు అత్యధిక సంఖ్యాకులు (1,80,000). వివిధ ఆఫ్రికన్ భాషలు, ఆయా జాతులందు, ప్రచారమున ఉన్నను ఫ్రెంచి భాషయే అధికారభాషగ ఆదరితము. ప్రజలలో 50% క్రైస్తవులు; తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సా.:** దేశమున 33 పోస్టాఫీసులు, 27 రేడియో ట్రాన్స్‌మిటరులు, 4 టెలిఫోన్ ఆఫీసులు పనిచేయుచున్నవి. పారిస్‌కును, మరికొన్ని సముద్రాంతర స్థలములకును, ఇటనుండి, రేడియో - టెలిఫోను సౌకర్యము కలదు. లైబర్ విల్లీలో ఒక రేడియో ప్రసార కేంద్రము పనిచేయుచున్నది. టెలివిజన్ ప్రసార కేంద్రము 1963 మొదలుగ లైబర్‌విల్లీనుండి ప్రసారము సాగించుచున్నది.

**5. యాన సౌ.:** దేశమున ప్రస్తుతమున రైలుమార్గములు లేవు. ముడిఇనుము ఎగుమతి కొరకై ఒక రైలుమార్గము నిర్మింపబడుచున్నది. దేశమున 1,918 కిమీ. జాతీయ రోడ్లును, 2,871 కిమీ. ప్రాంతీయ రోడ్లును కలవు; ఇవికాక డొంక బాటల నిడివి 1,500 కిమీ. నదులమీద నౌకాసాయమున ప్రయాణము చేయుటయు ఎక్కువగ వాడు

కలో ఉన్నది. లైబర్‌విల్లీ, పోర్ట్ - జన్‌టిల్ అనునవి ముఖ్యములగు రేవు నగరములు. ఇవిగాక నదీ ముఖద్వారమును ఆశ్రయించి, లైబర్‌విల్లీకి 16 కిమీ. ఎగువన, ఒక హార్బరు, ఓవెండోవద్ద, నిర్మింపబడుచున్నది. లైబర్‌విల్లి, పోర్ట్ - జన్‌టిల్ నగరములలో పెద్ద విమానాశ్రయములు కలవు. వీనినుండి విదేశ ప్రయాణములకు వసతులు కలవు. దేశాంతర్భాగమున, విమానయాన సౌకర్యమునకై అడవులలో అటనట మొత్తముమీద 120 విమాన క్షేత్రములు (ఎర్‌ఫీల్డ్స్) రూపొందింపబడినవి.

**6. చరిత్ర :** క్రీ. శ. 15వ శతాబ్దికి పూర్వపు ఈ దేశచరిత్ర మనకు ఏమియు తెలియ వచ్చుటలేదు. అప్పటికే అట పలు ఆఫ్రికన్ జాతులవారు చేరిరనుట మాత్రము స్పష్టము. 15వ శతాబ్ది అంతమున పోర్చుగీజు నావికులు ఇట కాలూనిరి. తదాదిగ వివిధ యూరపియన్ జాతులవారు, బానిస వ్యాపారమునకై, ఇట చేరుట సంభవించినది. బానిస వ్యాపారము నిషేధింపబడిన తరువాత తక్కిన యూరపియన్ జాతులవారు ఇటనుండి వైదొలగినను, ఫ్రెంచివారు మాత్రము చొరవ తీసికొని తమ పలుకుబడిని దేశాంతర్భాగమునకు వ్యాపింపజేసి 1839 లో దేశపు ప్రభువును అంగీకరింపజేసి, రాజ్యమును తమ రక్షణలోనికి తీసికొనిరి. 1885లో బెర్లిన్ కాంగ్రెసున, ఫ్రెంచి వారికి ఈ ప్రాంతమునగల అధికారము గుర్తింపబడినది. అంతట అది ఫ్రెంచి కాంగోలో అంతర్భాగముగ కొంతకాలము ఉండినది. 1910 లో ఈ దేశమును ప్రత్యేక వలసరాజ్యముగ ఫ్రెంచివారు రూపొందించిరి. తరువాత ప్రపంచ రాజకీయములలో వచ్చిన మార్పులవలన, ఆగస్ట్ 17, 1960న ఈ దేశము స్వతంత్ర రాజ్యముగ మార్పొందినది.

**7. పరిపాలన :** ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యపాలన ఈ దేశమున 1960 మొదలుగ అమలున ఉన్నది. సార్వజనిక వయోజన వోటింగు పద్ధతిన దేశాధ్యక్షుడు ఎన్నుకొనబడును. అతని పదవీకాల పరిమితి 7 ఏండ్లు. శాసనసభయందలి 47 మంది సభ్యులను ప్రజలే ఎన్నుకొనెదరు. ఆ సభకు అయిదేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. దేశమున ఒకే ఒక రాజకీయ పక్షము (గేబన్ డెమోక్రాటిక్ పార్టీ) పనిచేయుచున్నది. స్థానిక పాలన, చాలావరకు, అధికారులద్వారా జరుగుచున్నది. కొన్ని ప్రత్యేక జాతులు వసించు చోటులందు జాతిపెద్దలు పరిపాలించుటయు కలదు. లైబర్‌విల్లీలోని ఉన్నత న్యాయస్థానపు ఆధిపత్యమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** ఒక పటాలపు పదాతి దళమును, 6 విమానములుకల విమాన దళమును కలవు. తీర రక్షణకై, ఒక రక్షణ నౌక కలదు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలు ఐ. రా. స. యందు, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో దాదాపుగ అన్నింట, ఫ్రెంచి కమ్యూనిటీయందు, ఆఫ్రికా ఏకీకరణ సంఘమున ఈ దేశమునకు సభ్యత్వము కలదు. సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, కాంగో (బ్రజ్జవిల్లి), చాడ్, కామెరూన్ దేశములును, ఈ దేశమును ఒక శుల్కసమ్మేళమున భాగస్వామ్యమును వహించియున్నవి. అందువలన ఈ దేశముల మధ్య, ఆర్థిక వ్యవహార నిర్వహణ సౌలభ్యము కలిగినది.

**10. ఆర్థిక రంగము :** ఇదివరలో ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ, దాని అటవీ సంపదపైననే ఆధారపడి యుండినది. కాని ఇప్పుడు ఖనిజ పరిశ్రమ, ఆ స్థానమును ఆక్రమించినది. దక్షిణ దేశమున లభ్యములగు ఇనుము, మాంగనీజు నిక్షేపములు, ప్రపంచమునందలి అట్టి గనులందు, అత్యంత సంపన్న స్థాయికి చెందిన వానిలో స్థానమును ఆర్జింప గలిగినవి. ఇక ముడి పెట్రోలు ఉత్పత్తిలో ఆఫ్రికా

ఖండ దేశములందు అయిదవ స్థానమును ఈ దేశము పొందినది. యురేనియము, బంగారము పరిమిత రీతిలో లభ్యములగుచున్నవి. వ్యావసాయిక రంగమున వరి, మొక్కజొన్న, అరటి మొదలగునవి ఉత్పత్తి యగుచున్నను, దేశము విదేశములనుండి ఆహార వస్తువులను, దిగుమతి చేసికొనుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 3,366 కోట్ల ఫ్రాంకులు. దిగుమతుల విలువ 2,230 కోట్ల ఫ్రాంకులు (1970). విద్యుదుత్పత్తి 741 లక్షల కివా. దేశపు బడ్జెటరీ వ్యయము 1,670 కోట్ల ఫ్రాంకులు (1971).

**11. సాంఘిక రంగము :** స్థానిక పరిస్థితులకు ఆవసరములగు కొలది మార్పులతో ఫ్రెంచి విద్యావిధానము ఇట అమలున ఉన్నది. అక్షరాస్యత 12%. దేశమున 647 ప్రయిమరీ పాఠశాలలలో 85,628 మంది, 33 సెకండరీ పాఠశాలలలో 7,278 మంది విద్యార్థులు పఠించుచున్నారు (1967). ఇవికాక 22 సాంకేతిక పాఠశాలలు కలవు. దేశమున విశ్వవిద్యాలయము లేదు. విదేశములలో గేబన్ విద్యార్థులు 800 మంది ఉన్నత విద్యను అభ్యసించుచున్నారు (1967). గణనీయములగు లైబరీలుగాని, మ్యూజియములుగాని లేవు; దినపత్రికలును లేవు. ప్రభుత్వము అంతటంతట ఒక సమాచార పత్రమును ప్రకటించుచున్నది. దేశమున 5 పెద్ద ఆసుపత్రులు, 27 ప్రాంతీయ వైద్య కేంద్రములు, 58 డిస్పెన్సరీలు, 9 సంచార వైద్య కేంద్రములు, ప్రత్యేక రోగ చికిత్సా కేంద్రములు 34 కలవు. మొత్తం శయ్యా సంఖ్య 4,788; వైద్య సంఖ్య 80 (అనగా దాదాపు 9,000 మందికి ఒక వైద్యుడు.)

**12. యాత్రా సౌ. :** దేశపు దట్టపు అడవులు వేటకు ఉపకరించుచున్నవి. తీరభూమియందు చేపలను పట్టు వసతులు కలవు. ఇందులకై పలువురు విదేశీయులు దేశమును దర్శించుచుందురు. ప్రఖ్యాత మానవతావాది డాక్టరు ఆల్బర్ట్ ష్వైజర్, ఈ దేశమున లాంబరీన్‌వద్ద, స్థాపించిన ఆసుపత్రిని పలువురు దర్శింతురు. విదేశ యాత్రికులకు ప్రభుత్వము ఏర్పరచిన వసతులు కలవు. యాత్రికులు 'వీసా' మొదలగు, అనుమతి పత్రములను విధిగ పొంది యుండవలయును.

**13. ప్రసిద్ధ పౌరులు :** ఆల్బర్ట్ - ష్వైజర్ (1875 - 1965). జర్మన్ దేశమున జన్మించినవాడు; మతాచార్యుడుగ, వైద్యుడుగ, సంగీత శాస్త్రవేత్తగ, ప్రపంచ ఖ్యాతిని ఆర్జించినవాడు; ఈ దేశపు ప్రజలకై కృషిచేసి ప్రశస్తమగు ఒక వైద్యశాలను అతడు ఈ దేశమున స్థాపించెను.

---

# 19. ఘూ నా

**ముఖ్యనగరము :** అక్రా; **జెండా :** ఎరుపు, పసిమి ఆడ్డుచారలు పైనుండి అమరియుండగ నడుమనున్న పసుపు చారపై మధ్య నెలకొలకొనిన పంచకోణముల నల్లని నక్షత్ర చిహ్నము కలది; **జాతీయ గీతము :** లిఫ్ట్ హై ది ఫ్లాగ్ ఆఫ్ ఘానా (ఘూనా పతాకను పైపైకి కొనిపొమ్ము......); **నాణెము :** దశాంశ రీతిలోనున్న 'చేది' అనునది; విలువ 1 చేది = రు. 7.60; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి. **కాలగణన :** మ. 12 గం. = భారతదేశమున సా. 5 గం 30. ని.

**1. ఉనికి మొ. :** పశ్చిమ ఆఫ్రికా ఖండపు దక్షిణ తీరమున 4°45′ – 11°10′ ఉ. అక్షాంశ

రేఖల మధ్యను 1°12′ తూ. – 3°15′ ప. తులా రేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున వాయవ్యమున అప్పర్ వోల్టా, తూర్పున టోగో, దక్షిణమున గినీ సింధుశాఖ, పశ్చిమమున ఐవరీకోస్ట్ సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 2,38,540 చ. కిమీ. ఉత్తర – దక్షిణముల గరిష్ఠపు నిడివి 835 కిమీ; తూర్పు పడమరల గరిష్ఠపు నిడివి 568 కిమీ. దేశమున అత్యధిక భాగము




పటము 19.

వోల్టానదియొక్క అరగాణిలో నున్నది (అనగా ఆ ప్రాంతమునబడు వర్షజలము వోల్టా నదిలో చేరుచున్నది). ఈ నది అప్పర్ వోల్టాలో పుట్టినను ఘానాదేశపు ఆగ్నేయ ప్రాంతమున ప్రవహించి కడకు గినీ సింధు శాఖలో చేరుచున్నది. దేశపు తూర్పు ప్రాంతమునకల పర్వత శ్రేణులలో అత్యున్నత ప్రాంతపు ఎత్తు 885 మీ. తీర ప్రాంతమంతయు ఇసుక తిన్నెలతోనిండి, వాని మధ్య పెద్ద నీటిమడుగు లుండును. ఈ మడుగులను ఆశ్రయించి ప్రా, అంకోబ్రా అను రెండు చిన్న నదులు ప్రవహించి, ఇసుక తిన్నెలను చీల్చుకొని సముద్రమును చేరుచున్నవి. మిగిలిన అత్యల్పము లగు వాగులు, నీటిమడుగులలోనే అంతరించు చున్నవి. ఈ ఇసుక తిన్నెలను ఆనుకుని తీరపు పొడవున దట్టములగు అడవులు కలవు.

**2. శీతోష్ణస్థితి** మొ. : ఉష్ణమండలపు దేశము లందలి శీతోష్ణస్థితియే ఈ దేశమున కననగు చున్నది. దేశమునందు ఉత్తరమున 'నవరంగో' అనుచోట సంవత్సరము మొత్తముమీద అత్యుష్ణతాప క్రమము 108° ఫా. న్ను, అషాంటీ రాష్ట్రమున కుమాసీ నగరమున అత్యల్పతాప క్రమము 51° ఫా. న్ను వేద్యమగుచున్నవి. దేశపు ఆగ్నేయ ప్రాంతమున 'ఆగ్జిమ్' నగరమును ఆశ్రయించి అత్యధిక వర్షపాతమును, ఉత్తర దేశమునను, అక్రా నగరమును ఆశ్రయించిన మధ్యదేశమున అత్యల్ప వర్షపాతమును కలవు. 'హర్‌మత్తాన్' అను ఎడారిగాలి ఈశాన్యమునుండి దేశమున డిశంబరు మొదలుకొని మార్చి వరకు వీచుచుండును. తత్ఫలితముగ దేశపు ఉత్తర ప్రాంతమున ఆ సమయమున పగటిపూట వేడియు, రాత్రిపూట చలియు ఎక్కువగ ఉండును. ఉష్ణమండలపు వన్యజంతువులును, వృక్ష విశేషములును ఇట కననగును. అయినను వ్యవసాయముకొరకై దక్షిణ ప్రాంతమున అడవులు చాలవరకు కొట్టివేయబడుటవలన, ఉత్తర ప్రాంతమున మాత్రమే వన్యజంతువులు కననగుచున్నవి.

**3. జనసంఖ్య** మొ. : 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 85,45,561. ఇందులో వివిధ ఆఫ్రికన్ జాతులవారు – గ్వాన్, ఫాంటి, ట్వి, ఈవీ, గా అడంగ్బే, జాతులవారు – చేరియున్నారు. ఈ వివిధ జాతులకును వేర్వేరు

మాతృభాషలు కలవు. వానిలో ట్వీ, ఫాంటీ, ఈవీ, అనువానికి విశేష ప్రచారము కలదు. అయినను ఇంగ్లీషు భాషయే సాధికార సామాన్య భాషగ దేశమంతట వాడుకలో ఉన్నది. దేశ ప్రజలలో 42.8% క్రైస్తవులు; 38.2% సాంప్రదాయిక ఆఫ్రికన్ మతానుయాయులు; 12% ముస్లిములు; తక్కినవారు ఏ మతమునకు చెందనివారు.

దేశపు నగరములలో జనసంఖ్యా ప్రాబల్యమును అనుసరించి ఈ క్రింది నగరములు పేర్కొనదగినవి. అక్రా (జ. సం. 6,15,800), కుమాసి (2,50,000), సెకొండీ తకోరాది (1,28,000). దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 32.

**4. సమాచార సౌ.** : దేశమున 187 పోస్టాఫీసులును, 669 పోస్టల్ ఏజన్సీలును కలవు (1970). దేశమున తంతివార్తా సౌకర్యమునకై వేయబడిన తంతి పొడవు 3,524 కిమీ. ; టెలిఫోను తీగ పొడవు 33,705 కిమీ. అక్రా, కుమాసీ మొదలగు తొమ్మిది ప్రముఖ నగరములలో నిస్తంత్రీవార్తా సౌకర్యములు కలవు. అక్రాలో ఒక రేడియో ప్రసార కేంద్రము పనిచేయుచున్నది.

**5. యాన సౌ.** : దేశమున రోడ్ల మొత్తపు నిడివి 32,180 కిమీ; ఇందు 5,470 కిమీ. వరకు తారు వేయబడినది. ఇవిగాక 24,150 కిమీ. పొడవున దేశపు పలు మండములందు కచ్చారోడ్లు కలవు. దేశమునకు 537 కిమీ. పొడవున తీరరేఖ యున్నను సహజ సిద్ధములైన నౌకాశ్రయములు లేవు. అందువలన కృత్రిమ రీతిలో సెకొండీ - తకోరాదీవద్ద ఒక లోతైన నౌకాశ్రయము పెద్ద ఎత్తున నిర్మింపబడినది (1920); తరువాత, అక్రాకు తూర్పున 32 కిమీ దూరమున తీయావద్ద వేరొక నౌకాశ్రయము, వెనుకటిదానికన్న పెద్దది, నిర్మింపబడినది (1962); ఆఫ్రికాయందలి నౌకాశ్రయములందు అన్నింట ఇది పెద్దది. అక్రాలో ఒక అంతర్జాతీయ నౌకాశ్రయము ఉన్నది. ఆఫ్రికాలోని వివిధ ప్రాంతములకును, ఖండాంతర దేశములకును ఇటనుండి విమాన యానమునకు అవకాశములు కలవు.

**6. చరిత్ర** : దేశమున ప్రస్తుతమున నివసించుచున్న ఆఫ్రికా జాతులు అంతటంతట 12వ శతాబ్దము మొదలుగ ఇట చేర మొదలిడినటుల, స్థానిక గాథలవలన తెలియవచ్చుచున్నది. పశ్చిమ సుడాన్‌లో క్రీ. శ. 10వ శతాబ్దిలో విలసిల్లిన ఘానా సామ్రాజ్యవాసులే ఇటకు తరలివచ్చిరని ఇచ్చటి ప్రజల అభిప్రాయము; క్రీ. శ. 1471 లో పోర్చుగీజు నావికులు ఈ ప్రాంతమున కాలిడుటతో ఈ దేశపు లిఖిత చరిత్ర మొదలయ్యెనని చెప్పవచ్చును. ఇచట లభించు బంగారము, దంతము, మసాలా ద్రవ్యములు పోర్చుగీజు వర్తకులు పలువురు ఇచట చేరుటకు కారణభూతములైనవి. ఆ కాలమున అంకోబ్రా, వోల్టా నదుల మధ్యదేశమున బంగారము విరివిగ లభించెడిది. అందువలననే పోర్చుగీజువారు ఈ దేశమును 'మీనా' (అనగా బంగారు గని) అని వ్యవహరించిరి. తరువాత ఇటకు చేరిన ఫ్రెంచి వర్తకులు ఈ దేశమును 'కోటీ డి లోర్' (స్వర్ణ తీరము) అని వ్యవహరించిరి. వారి ననుసరించి అనంతర కాలమున ఇటకు చేరిన ఆంగ్లేయులు తమ భాషలో ఈ దేశమునకు 'గోల్డ్ కోస్ట్' (స్వర్ణ తీరము) అని పేరిడిరి. బంగారమే గాక బానిసల వ్యాపారముకూడ ఈ దేశమునకు పాశ్చాత్యులను ఆకర్షించినది. కాని కాలక్రమమున బానిస వ్యాపారము నిషేధితమైన తరువాత తక్కిన పాశ్చాత్యులు ఇటనుండి వైదొలగినను, ఆంగ్లేయులు మాత్రము నిలిచి, ఈ దేశమున, తాము అప్పటికి దక్కించుకొనిన దానిని 'మకుటపు వలస' (క్రౌన్ కాలనీ) గ మార్చిరి (1872). తరువాత క్రమముగ తక్కిన భాగమును (అషాంటీ ప్రాంతము మొదలగు వానిని) రక్షిత రాజ్యముగ చేసికొనిరి.

(1901). ప్రథమ ప్రపంచయుద్ధానంతరమున జర్మన్‌లకుచెందిన టోగో లాండ్‌లో కొంత భాగము బ్రిటిష్‌వారికి మాండేటరీ ప్రాంతముగ దక్కినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున జనాభిప్రాయమును అనుసరించి ఆ మాండేటరీ ప్రాంతముకూడ గోల్డ్‌కోస్ట్‌లో కలుపబడినది (1956). 1957 లో గోల్డ్‌కోస్ట్ స్వాతంత్ర్యమును ఆర్జించి, పూర్వపు ఘానా సామ్రాజ్యముపేర, ఘానా అను పేరును గ్రహించినది. తదనంతరమున (1960) ఆ రాజ్యము బ్రిటిష్ కామన్‌వెల్తున సభ్యత్వముగల గణరాజ్యముగ మార్పొందినది. 1966 లో, అధ్యక్షుడుగ ఉండిన న్క్రుమాను పదవినుండి తప్పించి సైన్యము అధికారమును గ్రహించి, ఎన్నికలు జరిపి, 1970 లో పౌర ప్రభుత్వమునకు అధికారమును అప్పజెప్పినది; కాని, అనతికాలముననే సైన్యము మరల జనవరి 13, 1972 న అధికారమును స్వీకరించినది.

**7. పరిపాలన :** స్వాతంత్ర్యసిద్ధి తరువాత ఒక ప్రజాస్వామిక గణరాజ్య విధానము నెలకొల్పబడినను, కాలక్రమమున అది నామావశిష్టమైనది; జనవరి 13, 1972 మొదలుగ దేశము సైనిక ప్రభుత్వపు అధీనమున ఉన్నది. జాతీయ ఉద్ధరణ సంఘము (నేషనల్ రిడెంప్షను కౌన్సిల్) అను నది, సైనిక సహాయమున అధికారములను గ్రహించినది. దీని అధ్యక్షుడే దేశాధ్యక్షుడుగ వ్యవహరించుచున్నాడు. ఆ సంఘపు కార్యవర్గ సభ్యులు మంత్రుల విధులను నిర్వహించుచున్నారు. దేశము పరిపాలనా సౌలభ్యమునకై 9 మండలములుగ విభక్తమై ఉన్నది. సాంప్రదాయికముగ వివిధ ప్రాంతములందు అధికారమును నిర్వహించుచున్న జాతినాయకుల సలహా సంప్రతింపులతో వీనియందు స్థానిక పరిపాలన నిర్వహింపబడుచున్నది. అధ్యక్షుడు, ఉద్ధరణ సంఘపు సలహాతో, నియమించు ఒక ముఖ్య న్యాయమూర్తియొక్క ఆధ్వర్యవమున న్యాయపరిపాలన, వివిధ న్యాయస్థానములద్వారా, సాగుచున్నది. ఆంగ్లదేశపు పౌర, దండ న్యాయ సంహితలే, స్థానికపు మార్పులతో ఇట అమలునందున్నవి. 1972 మొదలుగ రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుటలేదు.

**8. దేశరక్షణ :** 14,000 మంది సైనికులు కల పదాతిదళమును, 1,100 మంది నావిక యోధులుకల నౌకాదళమును, 1,100 మంది వైమానిక యోధులుకల వైమానిక సేనయు దేశ రక్షణకై ఏర్పడియున్నవి.

**9. అంతర్జాతీయ సం. :** 1957 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, తక్కిన ప్రముఖ అంతర్జాతీయ వ్యవస్థలందును ఈ దేశము సభ్యత్వమునుకలిగి, ప్రముఖ పాత్రను నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థలో వ్యవసాయము ప్రముఖపాత్ర వహించియున్నది. ఆ వ్యవసాయపు పంటలలో కోకో ప్రముఖము. ఆహారధాన్య విషయములలో దేశము స్వయంపోషకము. రొక్కపు పంటలలో కోకో తరువాత కాఫీ, కొబ్బరి, వేరుసెనగ చెప్పుకొనదగినవి. రబ్బరుచెట్ల పెంపకము ప్రస్తుతమున ప్రోత్సహింపబడుచున్నది. ఎగుమతులలో కోకో అతి ప్రముఖము. అడవులనుండి లభించు కలపలో కొంత భాగము ఎగుమతి యగుచున్నది. ఖనిజముల ఎగుమతులలో బంగారము, మాంగనీజు, వజ్రములు, బాక్సైట్ క్రమముగ ప్రాముఖ్యముకలవి. దేశపు ఎగుమతుల విలువ 3,57,484 వేల చేదీలు; దిగుమతుల విలువ 4,43,142 వేల చేదీలు (1971). దేశపు విద్యుదుత్పత్తిలో అత్యధిక భాగము వోల్టా నదినుండి జరుగుచున్నది. ఇందులకై వోల్టానదిపై ఒక ఆనకట్ట నిర్మింపబడినది. దాని ఫలితముగ, ప్రపంచమునందలి మానవ నిర్మిత సరస్సులందెల్ల

పెద్దదియగు వోల్టా సరస్సు (వైశాల్యము 9,065 చ. కిమీ.) ఇట రూపొందినది. దేశపు మొత్తపు విద్యుదుత్పత్తి సామర్థ్యము 5,99,000 కివా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 35.72 కోట్ల చేదీలు. చెల్లింపుల లోటును దేశము అంతర్జాతీయ బ్యాంకు మొదలగు వానినుండి ఋణముల సాయమునను, ధనిక దేశముల సహాయము వలనను పూర్తి చేసికొన యత్నించుచున్నది.

**11. సాంఘిక రంగము :** దేశమున పట్టణములందేగాక పల్లెపట్టులందును గృహనిర్మాణము సాగుటకు ప్రభుత్వము విరివిగ ఋణములనుఇచ్చి సాయపడుచున్నది. కర్మాగారములు మొదలగువానిలో పనిచేయు కార్మికుల శ్రేయస్సునకు అనుగుణములగు కార్మిక శాసనములు అమలున ఉన్నవి. 1961 మొదలుగ ఉచిత, నిర్బంధ ప్రయిమరీ విద్యా విధానము అమలు జరుపబడుచున్నది. దేశమున 10,600 ప్రయిమరీ పాఠశాలలు, 170 సెకండరీ పాఠశాలలు ఉన్నవి. మూడు విశ్వవిద్యాలయములు కలవు (1972). దేశీయులలో 4,800 మంది విద్యార్థులు విదేశములలో ఉన్నత విద్యను అభ్యసించుచున్నారు. దేశమున నాలుగు దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో 'డైలీ గ్రాఫిక్' అను దాని వ్యాప్తి అత్యధికము; అక్రాలో ఒక ప్రముఖ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. దేశపు మొత్తమున 597 మంది వైద్యులు కలరు; అనగా 14,240 మంది ప్రజలకు ఒక వైద్యుడు కలడు. 10,296 శయ్యా సంఖ్యకల 154 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. ఇవిగాక ప్రజల ఆరోగ్య రక్షణకై 50 ఆరోగ్య కేంద్రములును, 7 సంచార దళ వైద్య దళములును కృషిచేయుచున్నవి (1966).

**12. యాత్రా సౌ. :** విస్తృతమగు వోల్టా సరస్సును, దట్టపుటడవుల ప్రకృతి రమణీయతను దర్శించుటకై యాత్రికులు దేశమునకు వచ్చుట కలదు. వేట సౌకర్యమును కలదు. ప్రభుత్వము విదేశ యాత్రికులను ప్రోత్సహించుటకై, తగు వసతులను ఏర్పరచి, కృషిచేయుచున్నది.

**13. ప్రసిద్ధ పౌరులు :** జె. ఇ. కేస్లీ హేవర్డ్ (1867 - 1930) ఘానాదేశపు సుప్రసిద్ధ ప్రజాసేవకుడుగ దేశమున ఆదరితుడు; క్వామీ న క్రుమా (1909 - 1972) దేశపు ప్రప్రథమాధ్యక్షుడు; దేశ రాజకీయములలోనేగాక, ఆఫ్రికా ఖండపు రాజకీయములందును, అంతర్జాతీయ రాజకీయములందును ప్రముఖపాత్ర నిర్వహించెను; కాని 1966 లో దేశ భ్రష్టుడై 1972 లో లండనున మరణించెను.

---

# 20. చా డ్

**ముఖ్యనగరము :** ఫోర్ట్‌లామీ; **జెండా :** నీలి, పసిమి, ఎరుపు రంగుల నిలువు చారలుగలది. **జాతీయ గీతము :** 'పీపుల్ చాదీన్...' (చాదీయులారా లేచి కృషిచేయండి); **నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఎ); 100 ఫ్రాంకులు = రూ. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ మానపువి. **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి :** మధ్య ఆఫ్రికాయందు 8° – 23° ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 14° – 24° తూర్పు తులారేఖలమధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున లిబియా, తూర్పున

సుడాన్, దక్షిణమున సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, పశ్చిమమున కామెరూన్, నైగీరియా, నైగర్ దేశములు సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 12,83,000 చ. కిమీ. ఉత్తరము సహారా యెడారి ప్రాంతమువలెనున్నను, దక్షిణమునకు వచ్చుకొలది ఆ పరిస్థితులు క్రమశః మారి సస్యశ్యామలభూమి, దక్షిణమున, అందును ముఖ్యముగ చాద్ సరస్సు ప్రాంతమున కననగును.

**2. శీతోష్ణస్థితి మొ.:** భూమి పరిస్థితులు మారినటులనే శీతోష్ణ పరిస్థితులలోను ప్రాంతముల



పటము 20

వారీగా మార్పు కాననగుచున్నది. ఉత్తర ప్రాంతమున, ఎండకాలమున ఎండలును, శీతకాలమున చలియు ఎక్కువ; తూర్పు ప్రాంతమున సమశీతోష్ణ పరిస్థితియు, తక్కిన ప్రాంతములందు ఈ రెండింటికి మధ్యస్థితియు కన్పట్టును. జులై నుండి అక్టోబరు వరకు వానలు కురియును. ముఖ్యనగరమున సాలుసరి సగటు వర్షము 74 సెం. మీ.

**3. జనసంఖ్య మొ.:** 1969 అంచనాలను అనుసరించి జనసంఖ్య 35.1 లక్షలు; జనసాంద్రత చ. కిమీ. కు 3. దేశపు నగరములలో ఫోర్ట్‌లామీ (జ. సం. 1,50,000), మౌన్‌డో (జ. సం. 30,000) పేర్కొనదగినవి. దేశ ప్రజలందు 93% పల్లెలలో నివసించుచున్నారు. అరబ్ జాతీయులతో కొలదిగ సంకరతచెందిన వివిధ జాతుల నీగ్రో ప్రజలు ఇట వసించుచున్నారు. ఈ వివిధ జాతులకు వివిధ మాతృభాషలు కలవు. అయినను, ఫ్రెంచియే వ్యవహార భాషగ ఆదరితము. ముస్లిము లెక్కువగ ఉన్న ఉత్తర ప్రాంతమున అరబ్బీయు విరివిగ వాడుకలో ఉన్నది. దక్షిణ ప్రాంతమున సాంప్రదాయిక ప్రకృతి దేవతారాధక మతములవారు ఎక్కువగ ఉన్నారు. ప్రజలలో 5% మాత్రమే క్రైస్తవులు.

**4. సమాచార సౌ.:** ఫోర్ట్‌లామీనుండి పారిస్‌కు టెలిఫోన్ సంబంధము కలదు. దేశమున పలు తరగతులకుచెందిన 35 పోస్టు ఆఫీసులు కలవు; వీటి అన్నింట తంతివార్తా సౌకర్యములును లభించుచున్నవి. ఫోర్ట్‌లామీయందును ఫోర్ట్ ఆర్ చంబాల్ట్ వద్దను అబెకిలోను రేడియో ప్రసార కేంద్రములు కలవు. దేశమున 50,000 రేడియో సెట్టులు ఉన్నవి (1968).

**5. యాన సౌ.:** రాకపోకల సదుపాయములు చాల తక్కువ. ప్రక్క దేశమగు కామెరూన్ నుండి ఫోర్ట్ ఆర్ చంబాల్ట్‌కు రైలు మార్గమును వేయుటకు యత్నములు సాగుచున్నవి. ప్రస్తుతమున వానకాలమున దేశ మధ్యమున పలు ప్రాంతములను చేరుటకు అవకాశములు శూన్యము.

**7. చరిత్ర:** యూరపియనులు ఈ దేశమును ఆక్రమించుటకు పూర్వపు దేశచరిత్రను గురించిన వివరములు లభించుటలేదు. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున తొలుత బ్రిటిష్‌వారును తరువాత ఫ్రెంచివారును ఈ దేశమున వివిధ ప్రాంతములతో పరిచయములను ఏర్పరచుకొనిరి. తరువాత బ్రిటన్,

జర్మనీ ఫ్రాన్సులమధ్య జరిగిన ఒడంబడికలను అనుసరించి దేశము ఫ్రెంచివారివశమైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశము స్వతంత్రమై (1960), ఫ్రెంచి కమ్యూనిటీలో స్వేచ్ఛాపూర్వకముగ సభ్యత్వమును కలిగియున్నది. 1967 మొదలుగ దేశమున పలు అంతఃకల్లోలములు చెలరేగినవి; అంతట ఫ్రెంచి సేనల సాయముతో, అధ్యక్షుడు ఈ తిరుగుబాటులను అడచి (1968) దేశమున వ్యవస్థిత పాలనను నెలకొల్పెను.

**7. పరిపాలన :** దేశమున ఒకే ఒక రాజకీయ పక్షపు (ప్రొగ్రెసివ్ పార్టీ) పాలన సాగుచున్నది. ఏకపట్టికా విధానమున ఎన్నుకొనబడెడు 75 సభ్యులుకల జాతీయ శాసనసభ కలదు. అధ్యక్షుడుగ తోంబల్‌బాయే 1969 లో ఎన్నికయ్యెను. ఇతని పదవీకాల పరిమితి 7 సంవత్సరాలు. దేశము 14 మండలములుగ విభజింపబడినది. దేశమున 1963 లో ఒక సుప్రీమ్‌కోర్టు నెలకొల్పబడినది. దాని అధికారమునకు లోబడి న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8 దేశరక్షణ :** దేశ భూతల సేనలో 700 మందియు, వైమానిక సేనలో 200 మందియు సైనికులు కలరు. ఇవిగాక దేశరక్షణకు సాయపడుటకై ఒక ఒడంబడికను అనుసరించి, ఫోర్టులామీలో 1,600 మంది ఫ్రెంచి సైనికుల స్థావరము ఒకటి కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. లోను, తదనుబంధ సంస్థల పెక్కింటను, మధ్య ఆఫ్రికా ఆర్థిక సమ్మేళనమునను దేశమునకు సభ్యత్వము కలదు. చాద్ సరస్సుయొక్క పరీవాహ ప్రదేశమును అభివృద్ధి చేయుటకై కామెరూన్, నైగర్, నైగీరియా దేశములతో ఆర్థిక సహకార ఒడంబడిక ఈ దేశమునకు కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశ వైశాల్యమున 20% మాత్రమే సేద్యమునకు అనుకూలముగ ఉన్నను, ఆహార ధాన్యముల విషయమున దేశము స్వయం పోషకము; ప్రత్తి ఇటనుండి ఎక్కువగ ఎగుమతి అగుచున్నది. పశుసంపదయు ఎక్కువ; మాంసమును చర్మములును ఎగుమతి యగుచున్నవి. అడవులలో లభించు తుమ్మబంకయు ఎగుమతి యగుచున్నది. దేశపు ఎగుమతులు 850 కోట్ల ఫ్రాంకులు; దిగుమతులు 1,500 కోట్ల ఫ్రాంకులు. ఎగుమతి దిగుమతులలో ఎక్కువ భాగము ఫ్రాన్సు దేశముతో ముడివడి ఉన్నవి. బడ్జెటరీ వ్యయము 1,25,63,882 ఫ్రాంకులు (1968).

**11. సాంఘిక రంగము :** ఫ్రాన్సు దేశపు విధానమును పోలిన విద్యా విధానము దేశమున అమలునందున్నది. ఫ్రెంచియే బోధనాభాష. దేశపు ప్రయిమరీ పాఠశాలలలో 1,73,262 మందియు, సెకండరీ పాఠశాలలలో 9,089 మందియు విద్యార్జన చేయుచున్నారు (1966). విదేశములలో 121 విద్యార్థులు ఉన్నత విద్యను అభ్యసించుచున్నారు. ఫోర్ట్ లామీలో ఒక పెద్ద గ్రంథాలయమును జాతీయ మ్యూజియమును కలవు. ఒక ఫ్రెంచి దినపత్రిక ప్రచారమున ఉన్నది. దేశపు బడ్జెటులో 10% ను వైద్యావసరములకు ప్రభుత్వము వెచ్చించుచున్నది. 3,716 శయ్యా సంఖ్యకల 161 ఆసుపత్రులు కలవు (1966).

**12. యాత్రా సౌ. :** దేశపు దట్టపు అడవులలో జంతువులను వేటాడుటకై పలువురు విదేశీయులు దేశమును దర్శించుచుందురు. జకౌమా, బౌగ్వియా, అను ప్రదేశములందు వేటాడుటకై కొన్ని అటవీ ప్రాంతములు ప్రత్యేకింపబడినవి. యాత్రికుల సదుపాయమునకై హోటళ్ళు మొదలగు వసతులు ఆ ప్రదేశములందు కలవు.

---

# 21. జయిరే

**ముఖ్య నగరము :** కిన్‌షాసా; **జెండా :** నీలపు భూమికపై, వాయవ్యపు మూలన పసుపు పచ్చని నక్షత్ర చిహ్నమును, నైరుతి కోణమునుండి ఈశాన్యమునకు పసిమి అంచుగల ఎర్రని చారయు కలది; **జాతీయ గీతము :** 'ది బూత్ కాంగోలే'... **నాణెము :** జయిరే; ఒక జయిరే = రు 3.75; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాల గణన :** కిన్‌షాసాలో సా. 1 గం. = భారతదేశ మున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : భూమధ్యరేఖకు ఈవల ఆవలను, 5°23′ ఉ. — 13°27′ ద. అక్షాంశ రేఖల




పటము 21.

మధ్యను, 13°10′ – 31°18′ తూ. తులారేఖల మధ్యను, మధ్య ఆఫ్రికాలో విస్తరించిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, సుడాన్ దేశములు; తూర్పున ఉగాండా, రువాండా, బురుండి దేశములు, టాంగన్యికా సరస్సు; దక్షిణమున జాంబియా, నైరుతిన అంగోలా; పశ్చిమమున అంగోలాకు చెందిన కబిందా రాష్ట్రము, కాంగో దేశము సరిహద్దులందున్నవి; దేశపు పశ్చిమపు కొనన ఒక చీలిక ప్రాంతము ముందునకు చొచ్చుకొనిపోయి అట్లాంటిక్ మహాసముద్ర తీరమున 40 కిమీ. నిడివిన తీరరేఖగ అంతమొందుచున్నది. దేశ వైశాల్యము 23,44,932 చ. కిమీ. దేశపు మధ్యభాగము పల్లముగనుండి, కడ అంచులందు పీఠభూమి కననగును. అందును ఆగ్నేయమున ఒక పర్వతశ్రేణి కలదు; ఇందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 1,830 మీ. తూర్పువఉన్న పర్వత శ్రేణిలోని అత్యున్నత ప్రదేశపు ఎత్తు 5,120 మీ. దేశమున దాదాపుగ సగభాగము, అందును ముఖ్యముగ మధ్యదేశము, దట్టపు అడవులతో నిండియున్నది. ఉత్తర, దక్షిణపు అంచులందు పచ్చిక మైదానములును, కాంగోనది పరిసరములందు చిత్తడి భూములును కననగును. దేశమున అత్యధిక భాగమును కాంగోనదీ పరీవాహ ప్రదేశముగ భావింపవచ్చును. దేశపు వివిధ దిశలందు టాంగన్యికా మొదలగు సరస్సులు కలవు. దేశపు నదులలో పెక్కు కాంగోనదీ శాఖలుగనో, కాంగోనదికి ఉపనదులుగనో ఉన్నవి. అట్టి ఉపనదులలో ఉబాంగీ ప్రముఖము.

**2. శీతోష్ణస్థితి** మొ. : తూర్పు దేశమునందలి ఉన్నత భూములందు సమశీతోష్ణ పరిస్థితియు; పశ్చిమ, మధ్యదేశములందు ఉష్ణమండల సహజమగు శీతోష్ణస్థితియు కననగును. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత మధ్యదేశమున 77° — 79° ఫా. గ, చుట్టునున్న ఉన్నత భూములందు 64° — 68 ఫా. గను ఉండును. ఏప్రిల్‌నుండి నవంబరు వరకు భూమధ్య రేఖకు ఉత్తరమునను, దక్షిణమున నవంబరునుండి మే వరకును, భూమధ్యరేఖ ప్రాంతమున ఋతువులతో నిమిత్తము లేకుండగను వానలు కురియును. సాలీనా సరాసరి వర్షపాతము 118 సెం. మీ. అడవులందు అతి శ్రేష్ఠజాతికి చెందిన

మహా వృక్షములును, తక్కు రకములును కాన నగును సింహము, ఏనుగు, కారెనుము, ఖడ్గ మృగము మొ పెద్ద వన్యజంతువులును, గోరిల్లా మొదలగు మర్కట జాతులును ఆ అడవులందు కన్పట్టును. నదులందును సరసులందును పెక్కు విధముల మత్స్యజాతులును, మొసళ్ళను కలవు. వివిధ పక్షిజాతులు విరివిగ దేశమున కనబడును. మొసళ్ళను ఆశ్రయించి జీవించు ఒక విధపు పక్షి ఈ దేశమున కన్పట్టుచున్నది.

**3. జనసంఖ్య మొ.:** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,16,37,876. జనసాంద్రత చ కిమీ. కు 9. ప్రజానీకమున నీగ్రో జాతి, పిగ్మీజాతి, హమైట్ జాతి ప్రజలు చేరి యున్నారు. నీగ్రోజాతికిచెందిన బంటూ తెగవారు అత్యధిక సంఖ్యాకులు. ప్రజలలో మూడింట రెండు వంతులు ఈ తెగవారే. నగరములలో కిన్‌షాసా (జ సం. 5,07,868), లుబుంబాషి (2,33,145) పేర్కొనదగినవి. బంటూభాషా కుటుంబమునకు చెందిన అనేక భాషలు, దేశమున ఆ యా తెగలలో, మాతృభాషలుగ ప్రచారమున ఉన్నవి. అందు విపులవ్యాప్తి కలది స్వాహిలీ. కాని సాధికార భాషగ ఫ్రెంచి వాడుకయందున్నది.

**4. సమాచార సౌ.:** దేశమున వివిధ జనావాసములమధ్య టెలిఫోను సౌకర్యము విరివిగ కలదు. మొత్తముమీద 335 పోస్ట్ ఆఫీసులు పని చేయుచున్నవి. తంతిలైనుల నిడివి 2,459 కిమీ; వైర్‌లెస్ టెలిగ్రాఫ్ కేంద్రములు 161, టెలిగ్రాఫ్ ఆఫీసులు 206 కలవు. టెలిఫోనుల సంఖ్య 22,344 (1971). కిన్షాసావద్దనుండి కృత్రిమోపగ్రహములవలన, వివిధ దూరప్రాంతములకు వార్తా ప్రసారము చేయుటకు అవకాశము కలదు. రేడియో ప్రసార కేంద్రముల సంఖ్య 15.

**5. యాన సౌ.:** దేశమునందలి రోడ్ల నిడివి 1,40,000 కిమీ. గ లెక్కదేలుచున్నను, అందు 40,000 కిమీ. మాత్రమే జాతీయ ప్రాముఖ్యము కలవి. అందును 2,000 కిమీ. నిడివిన మాత్రమే తారు వేయబడినది. రైలుమార్గముల నిడివి 5,795 కిమీ (1970). ఈ రైలుమార్గములవలన, ఈ దేశమునకును, జాంబియా, అంగోలా దేశముల కును మధ్య ప్రయాణ సౌకర్యము లభించినది. మటాడీ, బోమో అనునవి సముద్రపు రేవులు, నదీ తటములందలి కిన్‌షాసావంటి పట్టణములు కొన్ని, నదులపై రహదారికి రేవునగరములుగ, వర్తించుచున్నవి. దేశము అతి విశాలమగుటవలన, అందలి వివిధ కేంద్రముల మధ్య విమానయానము జరుగుటకు తగు వసతులు ఏర్పరుపబడినవి. కిన్‌షాసా, లుబుంబాషి, కిసన్‌గానీలలో అంతర్జాతీయ విమాన యానమునకు ఉపకరించు పెద్ద విమానాశ్రయములు కలవు.

**6. చరిత్ర:** 15వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్రకు సంబంధించిన విషయములు తెలియవచ్చుటలేదు. కాని ఆ శతాబ్దిలో పోర్చుగీజు నావికులకు కాంగోనదీ ప్రాంతముతో పరిచయము ఏర్పడునాటికి అచట 'కాంగో' అను దేశీయ రాజ్యమొకటి ఏర్పడియుండెనని మాత్రము తెలియవచ్చుచున్నది. పోర్చుగీజువారుకాని, తదనంతర శతాబ్దములందు వారిని అనుసరించిన తక్కిన యూరపీయ వర్తకులుగాని, దేశాంతర్భాగమునకుపోయి దానిని తెలిసికొనుటకు యత్నించలేదు. ఇట్టి అన్వేషణా కృషిని తొలుతగ సాగించినవాడు హెన్రీ యం. స్టాన్లీ. 1877 లో అతడు జరిపిన అన్వేషణ వలన, దేశపు సంపదనుగురించి కొన్ని వివరములు బాహ్య ప్రపంచమునకు తెలియవచ్చినవి. అంతట అప్పటి బెల్జియం దేశపు ప్రభువగు లియోపాల్ట్ II, స్టాన్లీని ప్రోత్సహించి, అతడు గాఢతర రీతిలో ఇంకను అన్వేషణను సాగించుటకు వసతులను కల్పించి అతనిద్వారా దేశపు వివిధ తెగల నాయకులతో ఒడంబడికలను ఏర్పరచుకొని, దేశముపై,

వ్యక్తిగతముగ, తన అధికారమును స్థాపింప యత్నించెను. అంతట కొన్ని ఇతర యూరపీయ రాజ్యములును జోక్యము వహించుటకు యత్నించి నవి. కాని బెర్లిన్ కాన్ఫరెన్సు (1884-85) లో జరిగిన ఒక తీర్మానపు ఫలితముగ లియొపాల్ట్ II కు ఈ దేశముపైగల అధికారము ధ్రువీకరింప బడుటయు, దేశము కాంగో అను పేర వ్యవహరింప బడుటయు జరిగినది. కాంగోనదికి ఆవల వేరొక కాంగో దేశముకూడ ఉండుటవలన ఇది తన రాజ ధాని పేరును అనుసరించి కాంగో (లియొపాల్డ్‌విల్లి) అని వ్యవహరింపబడినది. 1968 లో లియొపాల్డ్ II తనకు దేశముపైగల వ్యక్తిగత రాజరికపు అధికార మును బెల్జియం ప్రభుత్వమునకు దత్తము చేసెను. తదాదిగ, స్వతంత్రము పొందువరకు, దేశము బెల్జియం సామ్రాజ్యమున అంతర్భాగమై మనినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, తక్కిన వలసదేశము లందువలెనే, ఇట సైతము స్వాతం త్ర్యేచ్ఛ పెచ్చుపెరిగి, ప్రజలు తిరుగుబాటుచేసిరి. కడకు జూన్ 30, 1960 న దేశమునకు స్వాతంత్ర్య మొసగి బెల్జియం ప్రభుత్వము వైదొలగినది. కాని సామ్రాజ్యపాలనా కాలమున, దేశీయులందు విద్యా వ్యాప్తికి తగిన కృషి జరుపబడక పోవుటవలన ప్రభుత్వ యంత్రము భగ్నమైనది. ఈ పరిస్థితు లలో ప్రధానమంత్రియైన పాట్రిస్‌లుముంబా దేశైక మత్యమును కాపాడుటకు కృషిచేసెను; కాని విదే శీయుల కుట్రలవలనను, వివిధ తెగల నాయకుల మధ్య వైషమ్యముల వలనను ఆ ప్రయత్నము వ్యర్థమై, కటాంగా అను సంపన్న రాష్ట్రము దేశము నుండి వేరుపడ యత్నించెను. అంతట లుముంబా ఐ. రా. స. సాయమును కోరెను; కాని ఐ. రా. స. కృషియు ఫలవంతము కాలేదు. దేశాధ్యక్షునకును లుముంబాకును మధ్య వైమనస్యములు ఏర్పడినవి. అంతట లుముంబాను శత్రువులు చేజిక్కించుకొని వధించిరి (1961). దేశ పరిస్థితులను గమనించి అంతట ఐ. రా. స. సలహాపై దేశీయ పార్లమెంటు సమావేశమై ఒక ప్రధానిని ఎన్నుకొనినను కటాంగా రాష్ట్ర నాయకుడగు షోంబే కలసిరాకుండెను. ఈ పరిస్థితిని చక్కజేయుటకై వచ్చిన ఐ. రా. స. కార్యదర్శి హేమర్‌షెల్డ్, విమాన ప్రమాదమున మరణించెను. కడకు 1963, జనవరి 14 నాటికి దేశమున తిరుగుబాటు ఉద్యమములు, ఐ. రా. స. సేనల సాయమున అణచివేయబడెను. కాని 1964 న, ఐ. రా. స. సేనలు వెడలిపోయిన తరు వాత, దేశము మరల ఆంతరంగిక కల్లోలముల పాలయ్యెను. అంతట సేనాధిపతియగు జోసెఫ్ డిసైరే మొబూతూ ప్రభుత్వాధికారమును కైవసము చేసికొనెను (1965, నవంబరు 24). తదాదిగ కొన్ని నిరంకుశ చర్యలవలన దేశమున అతడు రాజకీయ సుస్థిరతను నెలకొల్పెను. దేశమున జాతీయభాషా, సంస్కృతులయెడ ఆదరమును కల్పించుటకు దేశమునకు, నదులకు, పట్టణములకు విదేశీయులిచ్చిన పేరులను ఇతడు మార్పు చేయిం చెను. తత్ఫలితముగ దేశము, అంతటినుండి 'జయిరే' అనియు, రాజధాని 'కిన్‌షాసా' అనియు వ్యవహరింపబడుచున్నవి. కాంగో నదియు 'జయిరే' అనియే పిలువబడుచున్నది.

**7. పరిపాలన** : స్వాతంత్ర్యానంతరమున ఈ దేశమున పరిపాలనా విధానము పలుమారులు మార్పుల నొందినది. 1974 న ప్రచురితమైన మొబూతూ వాదమును అనుసరించి ఇచటి పరిపాలనా వ్యవస్థ ప్రస్తుతమున పనిచేయుచున్నది. దేశమున ఒకే ఒక రాజకీయ పక్షము (విప్లవ ప్రజోద్యమ పక్షము) మాత్రమే పనిచేయుటకు అనుమ తింపబడినది. దీని అధ్యక్షుడు మొబూతూ ప్రస్తుత దేశాధ్యక్షుడుగ వ్యవహరించుచున్నాడు. ఈ పార్టీ నిర్ణయించు ఏకపట్టికను అనుసరించి శాసనసభయు, కార్యనిర్వాహక వర్గమును రూపుగొని వ్యవహరించు చున్నవి. న్యాయసభయందలి సభ్యులనుకూడ ఆ

పార్టీయే నిర్ణయించును. ఆ పార్టీకి సంబంధించిన మహాసభ అయిదేండ్లకు ఒకసారి సమావేశమై పాలనా విధాన మూలసూత్రములను నిర్ణయించును. ఆ పార్టీకి చెందిన 'రాజకీయ సమితి' దైనందిన పరిపాలనను పర్యవేక్షించును. అధ్యక్షుని పదవీ కాలము అయిదేండ్లుగ నిర్ణయింపబడినను, ఆ పరిమితి ప్రస్తుతాధ్యక్షునకు వర్తించకుండునటుల నిర్ణయము జరిగినది.

**8. దేశరక్షణ :** 40,000 మంది సైనికులు గల 14 పటాలముల పదాతి దళమును, 7 పటాలముల పేరాచూట్ దళమును, 8 పటాలముల రక్షక దళమును, 6 పటాలముల మిలిటరీ పోలీస్ దళమును కలవు; ఈ దళములు సర్వాయుధ, శకట సమన్వితములు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను, ఆఫ్రికా సమైక్యతా వ్యవస్థ యందునను ఈ దేశము సభ్యత్వము వహించి యున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ యంతయు వ్యవసాయము పైనను, ఖనిజములపైనను ఆధారపడియున్నది. దేశ ప్రజలలో 73% వ్యవసాయముపై ఆధారపడియున్నారు. దేశమున పండు సజ్జ, మొక్కజొన్న, చిరుగడదుంప దేశావసరములకు కొంతవరకు సరిపోవుచున్నవి; రబ్బరు, కాఫీ, ప్రత్తి పంటలలో అధిక భాగము ఎగుమతి యగుచున్నవి. మత్స్య పరిశ్రమలోని ఉత్పత్తి దేశావసరములకు సరిపోవుచున్నది. ఆహార పదార్థములను దేశము కొంతవరకు దిగుమతి చేసికొనుచున్నది. దేశమున అటవీసంపద విరివిగ కలదు. దాదాపు 10 కోట్ల హెక్టేరుల వైశాల్యముకల అడవులున్నవి. ఇందలి కలప చాలవరకు ఎగుమతి అగుచున్నది. ఖనిజసంపద విరివిగ కలదు. ఎగుమతుల విలువలో 80% ఖనిజములవలన లభించుచున్నవి. ఖనిజములలో ముఖ్యముగ పేర్కొనదగినది రాగి. తరువాత వజ్రములును, కోబాల్టును లెక్కకు వచ్చును. బంగారము, తగరము మొదలగునవియు కొలదిగ ఉత్పత్తి అగుచున్నవి. ఎగుమతుల విలువ 34.1 కోట్ల జయిరేలు; దిగుమతులు 31.9 కోట్ల జయిరేలు; విద్యుదుత్పత్తి 24 వేల కోట్ల కివా. ప్రపంచపు విద్యుదుత్పత్తిలో ఇది నాలుగవ భాగము. దేశపు బడ్జెటరీ వ్యయము 27.8 కోట్ల జయిరేలు.

**11. సాంఘిక రంగము :** దేశము స్వతంత్ర మగునప్పటికి దేశమున ఉన్నత విద్య అభ్యసించిన వారు 12 మంది మాత్రమే ఉండిరి. అట్టి పరిస్థితి నుండి, దేశమును విద్యావిషయికముగ పునర్నిర్మించుటకు కృషి జరుగుచున్నది. 1966 లో 9,477 ప్రయిమరీ విద్యాశాలలలో 21,93,200 మంది, 215 సెకండరీ పాఠశాలలలో 1,47,680 మంది, 75 వృత్తి విద్యాశాలలలో 28,951 మంది విద్యార్థులు పఠించిరి. లుబుంబాషిలో ఒకటియు, కిన్‌షాసావద్ద ఒకటియు, లొవేనియావద్ద ఒకటియు, కిసన్‌గానీవద్ద ఒకటియు విశ్వవిద్యాలయములు కలవు. వీని అన్నింట విద్యార్థి సంఖ్య 2,442 (1969). కిన్‌షాసాలోను లుబుంబాషిలోను పెద్ద మ్యూజియములు కలవు. దేశమున 9 దినపత్రికలు వివిధ నగరములనుండి ప్రచురితము లగుచున్నవి (1968). దేశమునుండి బెల్జియం దేశపు డాక్టర్లు వెళ్ళిపోవునప్పటికి (1960) దేశీయులలో డాక్టరు పట్టము పొందినవాడు ఎవడును లేకుండెను. అందువలన ప్రపంచ ఆరోగ్య వ్యవస్థవలన పంపబడిన వివిధ దేశీయులగు వైద్యులు అంతటినుండి ఇట పనిచేయుచు, దేశీయులకును శిక్షణను ఇచ్చుచున్నారు (ఇట్టి వైద్యులలో భారతదేశమునకు చెందినవారును దాదాపు 130 మంది ఉన్నారు). 1969 నాటికి అట్టి నానాదేశీయులగు వైద్యుల

సంఖ్య 599. దేశమున 75,000 శయ్యాసంఖ్య కల 500 ఆసుపత్రులును, 2,000 గ్రామీణ వైద్య శాలలును కలవు.

**12. యాత్రా సౌ.:** ప్రకృతి రమణీయతకు పేరొందిన ప్రాంతములు ఎన్నియో ఈ దేశమున కలవు. అందును 'కివూ' ప్రాంతము ఆ దేశమున 'భూతల స్వర్గము' గ పేరొందినది. విదేశ యాత్రికులకు వీసా మొదలగు అనుమతి పత్రములు కావలెను.

**13. ప్రసిద్ధ పౌరులు:** పాట్రిస్ యెమెర్జీ లుముంబా (1926-61), స్వాతంత్ర్య యోధుడు; స్వాతంత్ర్యానంతరమున దేశపు ప్రప్రథమ ప్రధాన మంత్రి; విచ్ఛిన్న శక్తులనుండియు, సామ్రాజ్య వాదులనుండియు దేశమును రక్షించుటకు కృషిచేసి, తన జీవితమునే బలిదాన మొసగిన, ప్రగతి శీలుడుగ చరిత్రలో పేరొందెను.

---

# 22. జాంబియా

**ముఖ్యనగరము:** లుసాకా; **జెండా:** ఆకు పచ్చ భూమికయు, అందు కుడిప్రక్క దిగువ భాగమున **మూడు** వర్ణములు నిలువుగ దీరిన దీర్ఘ **చతుర**స్రమును, దానిపైన ఎగురుచున్నటుల కాషాయ వర్ణమున చిత్రింపబడిన ఒక గరుడ




పటము 22.

పక్షియు కలదు; ఇందలి దీర్ఘచతురస్రమున ఎరుపు, నలుపు, కాషాయ వర్ణముల రేఖలు నిలువున కలవు. **నాణెము:** క్వాచా; 1 క్వాచా = రు. 10.87; **కొలతూకములు:** బ్రిటిష్ విధానపువి; **కాలగణన:** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఆఫ్రికాయందు జాంబెసీ నదికిని, కాంగో (జయిరే) నదీ పరీవాహ ప్రదేశపు దక్షిణపు అంచుకును మధ్య 8° – 18° ద. అ. మధ్యను, 23° - 34° తూ. తు. మధ్యను విస్తరించి యున్న ఈ దేశమునకు ఉత్తరమున జయిరే దేశము; తూర్పున టాంజానియా, మలావీ దేశములు; ఆగ్నేయమున మొజాంబిక్; దక్షిణమున రొడీసియా, బోట్స్వానా; పశ్చిమమున అంగోలా సరిహద్దులం దున్నవి. దేశ వైశాల్యము 7,52,262 చ. కిమీ. దేశ వైశాల్యమున అత్యధికభాగము ఉన్నత పీఠభూమి. ఇచట ఎచట చూచినను ఎత్తు 1,065 నుండి 1,100 మీ. వరకు ఉండును. ఉత్తరమున ఉన్న ముచింగా పర్వతశ్రేణియందలి ఉన్నతశిఖరపు ఎత్తు 2,150 మీ. ను మించిఉన్నది. నదుల లోయలందు మాత్రము 600 మీ. ఎత్తు ప్రాంతములు కననగు చున్నవి. తూర్పునఉన్న లువంగ్వానదియు, పశ్చిమమునఉన్న కఫ్యూనదియు జాంబెసీనదిలో కలియు చున్నవి.

దేశపు ఉత్తర ప్రాంతమున బంగ్వేలూ, మేరూ, టాంగన్యికా సరస్సులు ప్రకృతి సిద్ధముగ రూపొంది ఉన్నవి వీనిలో బంగ్వేలూ సరస్సు, తత్పరిసరపు బురద నేలలు 9,880 చ కిమీ. ల భూమిని ఆక్రమించి ఉన్నవి. జాంబియా దేశపు సంపదకు మూలాధారమగు రాగి గనుల ప్రాంతము, దేశపు పశ్చిమ ప్రాంతమున, జయిరోతోగల సరి హద్దున ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశము ఉష్ణమండలము ననే ఉన్నను, ఉన్నత పీఠభూమి యగుటవలన శీతోష్ణస్థితి సౌమ్యముగ ఉన్నది; సరాసరి గరిష్ఠోష్ణత 105°; కనిష్ఠోష్ణత 27° ఫా. నవంబరునుండి ఏప్రిల్ వరకు వర్షములు కురియును; వర్షపాతము సాలీనా 75-90 సెం. మీ. వరకు ఉండును. దేశమున, ఆగ్నేయ ప్రాంతమగు, బరోచీలాండున దట్టమగు అడవులు కలవు; అందు దేశీయపు టేకు లభించు చున్నది; ఉత్తర, తూర్పు ప్రాంతములందు పలు చటి అడవులను, తక్కిన ప్రాంతములందు గరిక భూములును, వానియందు అటనట ముండ్ల చెట్లును కన్పట్టును. లవంగవా లోయలోని అడవులలో ఏనుగు, ఖడ్గమృగములవంటి పెద్ద జంతువులు కలవు; తక్కిన చిన్న వన్యజంతువులు అటను, తక్కిన అడవులందును కన్పట్టుచున్నవి; 658 రకముల పక్షిజాతులు కలవని తెలియుచున్నది; దేశమున సర్పజాతులును విశేషముగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1969 లెక్కల ప్రకారము దేశపు జనసంఖ్య 40,56,995. దేశపు నగరములలో లుసాకా (2,80,200), కిట్వే (జ. సం. 1,79,300), అనోడోలా (1,50,800), ముఫులీరా (1,01,200), చెంగోలా (92,800), రోన్ (90,400) పేర్కొనదగినవి. వీనిలో తొలుత టిదితప్ప తక్కినవి రాగిగనుల ప్రాంతమున ఉన్నవి. జనసాంద్రత చ. కిమీ. కు 5. దేశపు ప్రజలు వివిధ ఆఫ్రికన్ తెగలకు చెందినవారు; మొత్తముమీద 73 ఆఫ్రికన్ జాతుల ప్రజలు కలరు. వీరిలో బెంబా, చేవా తెగలవారు సంఖ్యా ప్రాబల్యము కలవారు. యూరపీయ సంతతికి చెందినవారు 67,400 కలరు (1969); ఆసియావాసుల సంతతివారును కొలదిగ కలరు. దేశమున ఆ యా ప్రాంతములందు విభిన్న ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ ప్రచారమున ఉన్నను ఇంగ్లీషు అధికారభాషగ పరిగణన పొంది నది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు; క్రైస్తవులు దాదాపు 5 లక్షల మంది మాత్రము కలరు. ఆసియా వాసుల సంత తిలో ముస్లిం, హిందూ మతములు ప్రచారమున ఉన్నవి.

**4. సమాచార సౌ. :** దేశమున 132 పోస్టాఫీసులు కలవు; దేశమున వివిధ ప్రాంతముల మధ్యను, రొడీసియా, దక్షిణ ఆఫ్రికా, జయిరేల తోను తంతి సంబంధములు కలవు. లుసాకా - లండనుల మధ్యను, లుసాకానుండి తక్కిన పరిసర ఆఫ్రికా దేశములతోను రేడియో తంతి సౌకర్యము ఉన్నది. దేశమునందలి రేడియో ప్రసార కేంద్రము నకు లుసాకా, కిట్వేలలో స్టూడియోలు కలవు; కిట్వేలో టెలివిజన్ ప్రసార కేంద్రము పనిచేయు చున్నది.

**5. యాన సౌ. :** దేశమున 35,400 కిమీ. పొడవుగల రోడ్లు కలవు; కాని యిందు 6,200 కిమీ. పొడవుగలవి మాత్రమే ఉత్తమ శ్రేణికి చెందినవి; 1,050 కిమీ. పొడవుగల రైలు మార్గము కలదు. దేశమునందలి రాగిగనుల ప్రాంతమును దక్షిణ ప్రాంతముతో ఈ మార్గము కలుపుచున్నది. టాంజానియా ప్రభుత్వముతో కలిసి దేరా-ఇస్-సలామ్‌నుండి ఈ దేశపు రాగిగనుల ప్రాంతము నకు ఒక రైలు మార్గము, చీనీయ ప్రభుత్వపు ధన, సాంకేతిక సాహాయ్యముతో నిర్మింపబడు

చున్నది (1971). టాంగన్యికా సరస్సు తీరమున ఉన్న ఉంపులుంగా రేవు, టాంజానియాతో వ్యాపార మునకు ఉపకరించుచున్నది. అంగోలాలోని లొబి తోజే రేవునుండి ఈ దేశపు సముద్ర వ్యాపారము నకు, ఒక ఒడంబడికద్వారా ప్రస్తుతమునకు వసతి కల్పింపబడినది.

**6. చరిత్ర :** 19వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియ వచ్చుటలేదు. ఆ శతాబ్ది మధ్యభాగమునుండి తొలుత డేవిడ్ లివింగ్‌స్టన్ కృషివలనను, అనంత రమున వేరొక ఫ్రెంచి మిషనరీ కృషివలనను, ఈ దేశముతో యూరపీయులకు పరిచయము కల్గినది. కాని ఈ ప్రాంతమున రాజకీయ పరివర్తనకు కారణ భూతుడైనవాడు సిసిల్ రోడ్సు అను ఆంగ్లేయ వర్తకుడు (చూ : దక్షిణ ఆఫ్రికా, రొడీసియా). అతడు స్థాపించిన ఒక కంపెనీ ఇచటి భూములపై, గుత్తాధిపత్యమును సంస్థాపించి, ఆంగ్లేయుల వలస లను ఏర్పరచినది. 1924లో కంపెనీ అధికార మును అంతముచేసి, బ్రిటిష్ ప్రభుత్వము అధికార మును గ్రహించి, పాలింప ఆరంభించినది. ఆ కాల మున ఇది ఉత్తర రొడీసియా అని వ్యవహరింప బడెడిది. 1925లో దేశమున విరివిగ రాగిగను లున్నటుల వెల్లడి యైనది. అంతట యూరపి యనులు వలస వచ్చుటయు పెరిగినది. 1948 వరకు ఈ దేశపు ప్రభుత్వమున ఆఫ్రికన్ ప్రతి నిధులకు తావే లేకున్నను, తదాదిగ ఏ కొలదిగనో ప్రాతినిధ్యమును కల్పించుట మొదలైనది. కాని అధికారమంతయు శ్వేతజాతులకే చెందియుండెను. 1953లో ఈ ప్రాంతమును ప్రక్కనున్న న్యాసా లాండ్ (మలావీ), దక్షిణ రొడీసియాలతో కలిపి సమాఖ్యగ రూపొందుట జరిగినది. అంతటినుండి, అధిక సంఖ్యాక ప్రజలగు ఆఫ్రికనులు, తమకు అధికతర ప్రాతినిధ్యము లభింపవలెననియు, సమాఖ్య రద్దు కావలెననియు ఆందోళనచేసిరి. కడకు అక్టోబరు 24, 1964న ఈ దేశము, 'జాంబియా' అను పేరుతో స్వతంత్రతను ఆర్జించి కామన్‌వెల్తున సభ్యత్వము కలిగియున్నది.

**7. పరిపాలన :** 1964లో ఆమోదింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి ఈ దేశము ఒక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యము. దేశమున సార్వజనికముగ వయోజనులకు వోటింగ్ హక్కు కలదు. అధ్యక్షుని, దేశపు వోటరు లందరును ఎన్నుకొనెదరు; ఆ ఎన్నిక సమయముననే జాతీయ శాసనసభకును ఎన్నికలు జరుగును (ప్రస్తుతపు అధ్యక్షుడగు కెన్నెత్‌కౌండా మాత్రము, జాతీయ శాసనసభా సభ్యులచే ఎన్నుకొనబడుటకు రాజ్యాం గము అనుమతించినది). శాసన సభయందలి సభ్యుల సంఖ్య 105; అదనముగ అయిదుగురు సభ్యులవరకు నియామకముచేయు అధికారము అధ్యక్షునికి కలదు. సాధారణముగ ఎన్నికలు అయిదేండ్లకు ఒకసారి జరుగును. శాసనసభ చేసిన తీర్మానము అధ్యక్షునికి ఆమోద యోగ్యము కాని యెడల, దానిని మూడింట రెండుపంతులు ప్రాబల్య ముతో శాసనసభ తిరిగి ఆమోదించినపుడు, అధ్య క్షుడు దానిని విధిగ ఆమోదించి తీరవలెను; లేదా శాసన సభను రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరిపి తీరవలెను. దేశమందలి వివిధ తెగల నాయకులలో 272 మంది సభ్యులుగ ఉన్న నాయక సభను సలహాలనొసగు అధికారము మాత్రమే కలదు. జనవాక్యమువలన ముఖ్యవిషయములను నిర్ణయించు పద్ధతి అమలున ఉన్నది. దేశమున పలు రాజకీయ పక్షములు ఉన్నవి; అన్నింట యునైటెడ్ ఇండి పెండెన్స్ పార్టీ బలవత్తరము. అప్పెలేట్ కోర్టు, హైకోర్టులకు లోబడి స్థానిక న్యాయస్థానములు న్యాయ పరిపాలనను నిర్వహించుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశమునకు సముచితాయుధ సంపత్తియు, 3,000 సైనికులును కలిగిన పదాతి దళము కలదు; 1,000 మంది యోధులును, కొన్ని

శిక్షక విమానములునుకల వైమానిక దళము కలదు.

**9 అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును దేశమునకు సభ్యత్వము కలదు. ఆఫ్రికా ఐక్యతా సంఘమున సభ్యత్వమునువహించి, ఆఫ్రికాలోని అస్వతంత్ర రాజ్యములకు స్వాతంత్ర్యమును కల్పించు కృషిలో, శాంతియుత మార్గమున, ఈ దేశము కృషి చేయుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థకు మూలాధారము రాగిగనులలోని ఉత్పత్తి; అయినను ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు జీవనాధారము వ్యవసాయమే; ఈ వ్యవసాయమున ఉత్పత్తి చాల తక్కువ; దేశపు సమష్టి జాతీయోత్పత్తిలో 10% మాత్రమే ఇందువలన లభించుచున్నది. మొక్కజొన్న, జొన్న మొదలగు ఆహార ధాన్యములు కొలదిగ పండుచున్నను విదేశములమీదనే ఆహార ధాన్యములకొరకై దేశము చాలవరకు ఆధారపడియున్నది. రొక్కపు పంటలలో పేర్కొనదగినది పొగాకు; తరువాత లెక్కకు వచ్చునది ప్రత్తి. వ్యవసాయాభివృద్ధికై ప్రభుత్వము ఎంతో కృషి చేయుచున్నది. దేశమున పశుసంపదయు తగినంతగ లేదు; దేశమున లభ్యమగు మాంసము దేశావసరములకు సరిపోవదు; అందువలన బోచ్వానా, టాంజానియాలనుండి మాంసమును ఈ దేశము దిగుమతి చేసికొనుచున్నది. దేశమున సగభాగమున అడవులున్నవి; ఇందలి కలప చాలవరకు దేశావసరములకు సరిపోవుచున్నది.

ప్రపంచమున రాగిని ఎగుమతిచేయు దేశములలో ఈ దేశము మూడవదిగ లెక్కకు వచ్చుచున్నది. తుత్తునాగము, సీసముకూడ ఇట లభించుచున్నవి. 1968 లో రాగి 6,85,000 టన్నులు, తుత్తునాగము 67,300 టన్నులు, సీసము 23,000 టన్నులు, ఉత్పత్తి జరిగినది; రాక్షసిబొగ్గుకూడ విరివిగ దొరుకుచున్నది. పరిశ్రమలలో ప్రభుత్వము 51% స్వామ్యము వహించి ఉన్నది. దేశపు విద్యుత్ వినియోగము 437.13 కోట్ల కివా. (1971). ఇందు అధికభాగము, రొడీసియా, జాంబియాలకు ఉమ్మడి సొత్తగు జాంబెసీ నదిపైఉన్న కరీబా జల విద్యుత్ కేంద్రమునుండి లభించుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 47,95,78,000 క్వా; దిగుమతుల విలువ 39,52,18,000 క్వా. (1971); దేశపు బడ్జెటరీ వ్యయము 3,56,623 వేల క్వా. (1973).

**11 సాంఘిక రంగము :** 1971 లో 7,29,801 మంది విద్యార్థులుకల 2,598 ప్రయిమరీ పాఠశాలలును, 56,000 మంది పఠించు 114 సెకండరీ పాఠశాలలును దేశమున ఉండినవి. యూనివర్సిటీ ఆఫ్ జాంబియా దేశమునఉన్న ఏకైక విశ్వవిద్యాలయము; ఇందలి విద్యార్థి సంఖ్య 1,700 (1972). దేశమున ఒకే ఒక దినపత్రిక ఆంగ్లమున ప్రచురింపబడుచున్నది. లివింగ్‌స్టన్ నగరమున ఒక పెద్ద మ్యూజియము కలదు; పెద్ద గ్రంథాలయములు లేవు. వివిధ సంస్థలచేతను, ప్రభుత్వముచేతను నడుపబడు 64 ఆసుపత్రులు దేశమున కలవు; ఇవిగాక, 482 క్లినిక్కులు పని చేయుచున్నవి. దేశమున వైద్య సంఖ్య 362 (1969).

**12. యాత్రా సౌ. :** దేశపు సరిహద్దున జాంబెసీ నదిపైఉన్న విక్టోరియా జలపాతము, జాంబెసీనదిమీది కరీబా ఆనకట్ట, దేశమున వివిధ ప్రాంతములందు మృగయా వినోదమునకై ప్రత్యేకింపబడిన అడవులు విదేశీయా యాత్రికులను ఆకర్షించుచున్నవి. 1971 లో 25,000 యాత్రికులు దేశమును దర్శించిరి.

---

# 23. టాంజానియా

**ముఖ్యనగరము :** దేరా-ఇస్-సలామ్; **జెండా :** ఒక నల్లని బద్దవంటి రేఖ జెండాయొక్క దిగువ భాగమున, దండమువద్ద మొదలై కర్ణరేఖగా పయనించి, ఎదుటి కోణమునుచేరి, జెండాను రెండు త్రిభుజములుగ, విభజించుచున్నది; ఈ రేఖను త్రిభుజములనుండి రెండు సన్నని పసుపు చారలు వేరుచేయగా పై త్రిభుజము ఆకుపసిమిలోను, దిగువది నీలిమలోను, చిత్రించబడిఉన్నవి. **జాతీయ గీతము :** ముంగూ జరికి ఆఫ్రికా... (ఈశ్వరుడు




పటము 23.

ఆఫ్రికాను కటాక్షించుగాక......): **నాణెము :** టాంజానియా షిల్లింగు; ఇది 100 సెంట్లుగ విభక్తము; 1. టాం. షి. = రు. 1.05; **కొలతూకములు :** బ్రిటిష్ మెట్రిక్ విధానములు రెండును అమలున ఉన్నవి. **కాలగణన :** సా. 3 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** తూర్పు ఆఫ్రికాలో, భూమధ్య రేఖకు దిగువనఉన్న, ఒక ముఖ్య భూభాగమును, దాని సమీపముననే తీరరేఖకు 20 కిమీ. లోపలనే కుదురుకొనిన జాంజిబారు ద్వీప ప్రాంతమును కలిసి టాంజానియా అని వ్యవహరింపబడుచున్నవి. 1° - 11°45′ ద. అ. రేఖలమధ్యను, 29°21′ – 40°24′ తూ. తులారేఖలమధ్యను, విస్తరించియున్న ముఖ్య భూభాగమునకు ఉత్తరమున ఉగాండా, కెన్యా దేశములు; తూర్పున హిందూమహా సముద్రము; దక్షిణమున మొజాంబిక్; నైరుతిన మలావీ, జాంబియా; పశ్చిమమున జయిరే, బురుండి, రువాండా సరిహద్దులందు ఉన్నవి. జాంజిబారు ద్వీపప్రాంతమున, జాంజిబారు, పెంబా అను పెద్ద దీవులును, మరికొన్ని చిన్న దీవులును చేరిఉన్నవి. మొత్తపు టాంజానియా వైశాల్యము 9,42,578 కిమీ. ఈ లెక్కలో జాంజిబారు (1,658 చ. కిమీ.), పెంబా (984 చ. కిమీ.) కూడ చేరిఉన్నవి.

ముఖ్య భూభాగమున, తీరరేఖను అనుసరించి వెడల్పున 16-64 కిమీ. ఉండు, ఒక చీలికతప్ప తక్కినది అంతయు సర్వసాధారణముగ 300 మీ. ఎత్తునకు తగ్గని ఉన్నత భూమి. ఇందును అధిక భాగము 915-1370 మీ. ఎత్తుగల పీఠభూమిగ ఉన్నది ఈశాన్యదిశన పేరే, నైరుతిన ఉసంబరా అనబడు పర్వతశ్రేణులు కలవు. ఈశాన్యదిశన ఉన్నవానిలో అత్యున్నతముగు కిలిమాంజరో శిఖరపు ఎత్తు 5,895 మీ; సరిహద్దులందు విక్టోరియా, టాంగన్యికా, మలావీ అను సరస్సులు ఉన్నవి. వీనిలో తొలుతటిది విస్తృతి లెక్కలో ప్రపంచపు మంచినీటి సరస్సులందు రెండవ స్థానమును, రెండవది, లోతు లెక్కన, రెండవ స్థానమును ఆక్రమించి ఉన్నవి. దేశము లోపలన రుక్వా మొదలగు నాలుగు చిన్న సరస్సులు కలవు.

ప్రముఖ నదులగు నైల్, కాంగో, జాంబెసీ నదులు ఈ దేశమున జన్మించినను, దేశమునకు

అవి పనికివచ్చుటలేదు. వేరుగ చెప్పదగిన జీవ నదులును లేవు. పీఠభూమియందు, మధ్యభాగమున సంవత్సరమున ఆరు నెలలు ఎచటను నీటిజాలు కన్పట్టదు. ఉన్ననదులలో వామీ, రుఫిజీ, రువహా, ఇంబెంకురు, రువుమా, కగేరా చెప్పదగినవి. జాంజిబారు దీవిలో పశ్చిమ ప్రాంతము మాత్రమే సారవంతమై జనావాస యోగ్యముగ ఉన్నది. అచట విస్తారమగు జనసాంద్రత కలదు పెంబాలో తూర్పు ప్రాంతమున ఒక చిన్న చీలికతప్ప తక్కినది సారవంత భూమి.

**2. శీతోష్ణస్థితి మొ.:** ముఖ్య భూభాగమున ప్రాంతములనుబట్టి శీతోష్ణ పరిస్థితులు మారుచున్నవి; తీరప్రాంతమున సరాసరి ఉష్ణోగ్రత 80 ఫా.; వర్షపాతము 100-190 సెం. మీ. పీఠభూమి మధ్యప్రాంతమున ఎండ లెక్కువ; గాలిలో చెమ్మదనము తక్కువ; వర్షపాతము 50-75 సెం. మీ.; తక్కిన ఉన్నత భూమియందు శీతోష్ణస్థితి సౌమ్యముగ ఉండును.

జాంజిబారు ద్వీపసముదయమున శీతోష్ణ పరిస్థితి ఉష్ణమండల రీతిలో ఉండును అయినను సముద్రపు చల్లగాలివలన సౌమ్యత కన్పట్టును. అత్యధిక ఉష్ణోగ్రత దాదాపు 85° ఫా.; అత్యల్ప ఉష్ణోగ్రత దాదాపు 75 ఫా.; వర్షపాతము రమారమి 150 సెం. మీటర్లు.

దేశపు మొత్తమున మూడవ భాగమున శాద్వల భూములును, అత్యధిక వర్షపాతముకల పర్వత సీమలందు సాంద్రాటవులును కలవు. ఏనుగు మొదలగు 430 రకముల జంతువులును, ఉష్ట్రపక్షి మొదలుగ 1,000 రకముల పక్షిజాతులును కలవు. ద్వీపములందు మాత్రము అల్పమృగములును, అందును కొన్ని వింతజాతులును, కననగును.

**3. జనసంఖ్య మొ.:** 1967 లో జరిగిన జనాభా లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,22,31,342. ఇందులో ముఖ్య భూభాగమునకు చెందినవారు 1,18,76,982 (జనసాంద్రత చ. కిమీ. కు 15.5); ద్వీప ప్రాంతమునకు చెందినవారు 3,54,360 (జనసాంద్రత చ. కిమీ. కు 134). దేశపు పట్టణములలో డేరా - ఇస్ - సలామ్ (జ. సం. అంచనా 2,50,000); టాంగా (68,000) గణనీయములు. దేశ ప్రజలలో 95% బంటూజాతికి చెందిన పలుతెగల ఆఫ్రికనులు. ఆఫ్రికేతర జాతుల వారిలో 75% ఆసియావాసుల సంతతివారు. అందును భారత - పాకిస్తానులనుండి వచ్చినవారు ఎక్కువ; వీరిలో చాలమంది రాజకీయ కారణముల వలన 1967–70 లో దేశమును వదలిపోయిరి. తక్కిన ఆఫ్రికేతరులలో దాదాపు 25,000 యూరపీయులు, అత్యల్పసంఖ్యలలో చీనీయులు మొదలగువారు ఉన్నారు. ద్వీప ప్రాంతమున అరబ్బుల సంతతివారు గణనీయ సంఖ్యలో కలరు. దేశ ప్రజలందు, మాతృభాషలుగ, వివిధ ఆఫ్రికన్ భాషలు ప్రచారమున ఉన్నవి. అయినను 'స్వాహిలీ' అనునది అధిక సంఖ్యాకులకు సుపరిచితము. బంటూభాషా కుటుంబమునకు చెందిన ఈ భాష అరబ్బీ, ఇంగ్లీషు పారసీ, హిందీ, పోర్చుగీజు పదములను పెక్కింటిని తనలో కలుపుకొని రూపొందినది. స్వాహిలీ జాతీయ భాషగను, ఇంగ్లీషు అధికార వ్యవహార భాషగను పరిగణింపబడుచున్నవి.

దేశప్రజలలో దాదాపు 60 లక్షలు సాంప్రదాయిక ప్రకృతిదేవతారాధనకు అలవడినవారు ; ముఖ్య భూభాగమున దాదాపు 20 లక్షల ముస్లిములు, తీర ప్రాంతమునను, దేశాంతర్భాగపు పట్టణప్రాంతములందును కలరు. క్రైస్తవులును ఆ సంఖ్యలోనే ఉన్నారు. ద్వీప ప్రాంతపు ప్రజలలో దాదాపుగ అందరును ముస్లిములే.

**4. సమాచార సా.:** ఈ దేశమునకుచెందిన, తంతి, తపాలా సౌకర్యములును, పెక్కు విధముల

దూర సందేశ సాధనములును, తూర్పు ఆఫ్రికా తంతి తపాలా వ్యవస్థచే నిర్వహింపబడుచున్నవి. ఈ వ్యవస్థయందు, ఈ దేశముతో పాటుగా కెన్యా, ఉగాండాలును సభ్యత్వము కలిగియున్నవి. దేశమున తపాలాఫీసుల సంఖ్య 230 (1968). డేరా-ఇస్-సలామ్‌లో, ఒక రేడియోస్టేషను పని చేయుచున్నది.

**5. యాన సౌ.:** ముఖ్య భూభాగమున 40,000 కిమీ. పొడవున రోడ్లు కలవు. ఇందు 34,400 కిమీ. అన్ని ఋతువు లందును ప్రయాణమునకు అనుకూలము. ద్వీపప్రాంతమున 1020 కిమీ. పొడవున రోడ్లు కలవు. అందు 584 కిమీ. ఉత్తమశ్రేణికి చెందినవి. అంతర్జాతీయ సాహాయ్యముతో 496 కిమీ. రోడ్డు, జాంబియా దేశమునుండి డేరా-ఇస్-సలామ్‌కు నిర్మింపబడుచున్నది. దేశపు ముఖ్య భూభాగమున, రైలుమార్గపు నిడివి 1837 కిమీ. డేరా-ఇస్-సలామ్‌ను జాంబియాదేశపు రాగి గనులతో కలుపు ఒక రైలుమార్గము (1785 కిమీ.) చీనాదేశపు సహాయముతో నిర్మింపబడుట 1970లో మొదలైనది. డేరా-ఇస్-సలామ్‌న అన్నివసతులు కలిగిన పెద్ద హార్బరు ఉన్నది. కగేరా, రుఫిజీ నదులు నౌకాయానమునకు కొంతవరకు ఉపకరించుచున్నవి. ఉంత్వారా, టాంగాలలోను హార్బరులు ఉన్నవి. ద్వీప ప్రాంతమున జాంజిబారు రేవు లెక్కింపదగినది.

డేరా-ఇస్-సలామునను, జాంజిబారునను అంతర్జాతీయ విమానాశ్రయములు రెండు కలవు; ఇవిగాక ముఖ్య భూభాగమున పలురీతుల విమానాశ్రయములు 54 కలవు.

**6. చరిత్ర:** పురాతత్వ శాస్త్రజ్ఞులలో కొందరి అభిప్రాయములను అనుసరించి తొలిమానవుడు. ఈ దేశపు ముఖ్య భూభాగముననే రూపుగొనెను. కాని ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు అంతగ తెలియవచ్చుటలేదు. క్రీ. పూ. 7 వ శతాబ్దినుండియు అరేబియా ద్వీపకల్పపు దక్షిణ భాగపు కొన్ని రాజ్యములు అంతటంతట ఈ దేశపు తీరభూమి పైనను, ద్వీపప్రాంతమునను, అధికారమును కలిగియుండెననియు, ప్రాచీన గ్రీకు భూగోళ శాస్త్రజ్ఞులకును ఈ ప్రాంతము తెలియుననియు, క్రీ. శ. 7-10 వ శతాబ్దిలో అరబ్బులద్వారా ఇస్లామ్, ఇట, కొన్ని ప్రాంతములందు, నెలకొనగలిగెననియు మాత్రము తెలియవచ్చుచున్నది. ఆ కాలమున భారతదేశపు పశ్చిమ తీరమునుండి కొన్నిజాతుల వారు, ద్వీపప్రాంతమునకు వచ్చిరనియును సాంప్రదాయిక కథనము కలదు; క్రీ. శ 1498 లో పోర్చుగీజు వారికి ఈ ప్రాంతముతో పరిచయము కలిగినది. అంతట ఈ ప్రాంతపు పాలకులలో కొందరు పోర్చుగీజువారికి మిత్రులుగను. కొంతకాలము సామంతులుగను, వ్యవహరించి మనగలిగిరి. 1698 లో పోర్చుగీజుల ఆధిపత్యమును అంతమొందించి, అరేబియా ద్వీపకల్పమునందలి ఓమన్‌రాజ్యపు పాలకుడు, ఈ ప్రాంతమును అంతటిని వశపరచుకొనెను. ఈ దేశపు పాలకులలో ఒకడు, అల్ బూ సయ్యద్ అనువాడు, జాంజిబారునే తన రాజధానిగ చేసికొని (1822), ఈ ప్రాంతమున సువ్యవస్థితపాలనను ఏర్పరచెను. జాంజిబారుస తొలుతగ లవంగముల పంటను అతడే ప్రవేశపెట్టెను. అతని తరువాతి కాలమున పాలకుల బలహీనతవలన క్రమముగ ముఖ్య భూభాగమున (తీరప్రాంతమునందు ఒక చీలిక తప్ప తక్కినది) అంతయు జర్మనులకు లభించినది. 1886—1890-లో ఈ చీలికను గూడ జర్మనీ కొనుగోలు చేసెను. ఆనాడు ఈ ముఖ్య భూభాగము టాంగన్యికా అనబడెడిది. ఈ భాగముతో కూడ, ప్రక్కనున్న రువండా, బురుండీలును, జర్మనుల అధీనముననే ఉండెను. 1890 లో జాంజిబారు పాలకుని అభ్యర్థనను అనుసరించి, ఆ

ద్వీప ప్రాంతమును బ్రిటిష్‌ప్రభుత్వము తమ రక్షిత రాజ్యముగ గ్రహించినది.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున జర్మనుల నుండి, టాంగన్యికాను, మాండేటరీ ప్రాంతముగ బ్రిటన్ స్వీకరించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమునుండి అచటి ప్రజలకు, క్రమముగ పరిపాలన యందు, భాగస్వామ్యమును కల్పించి, కడకు జ్యూలియస్ న్యేరేరే అనువాని నాయకత్వమున సాగిన జాతీయోద్యమమునకును, ఐక్య రాజ్యసమితి అభిప్రాయమునకును తలయొగ్గి డిశంబరు 9, 1961 వ టాంగన్యికాకు బ్రిటిష్ ప్రభుత్వము స్వాతంత్ర్యమును కల్పించినది. జాంజిబారు ద్వీపప్రాంతమును, క్రమగతిలో, డిశంబరు 10, 1963 న స్వాతంత్ర్యమును ఆర్జించినది. ఆ మరుసటి సంవత్సరమున సుల్తానును పదవీభ్రష్టుని జేసి, ద్వీపప్రాంతపు ప్రజాప్రభుత్వము తమ ప్రాంతమును టాంగన్యికాతో సంలీనము చేయగ, తత్ఫలితముగ, టాంగన్యికా—జాంజిబారు సంయుక్త గణరాజ్యము రూపొందినది (ఏప్రిల్ 26, 1964), ఆ సంవత్సరపు అక్టోబరులో, ఆ పేరు టాంజానియాగా మార్పుచేయబడినది.

**7. పరిపాలన :** దేశమున ఏకపక్ష పరిపాలన గలిగిన, గణరాజ్య ప్రభుత్వ విధానము అమలున ఉన్నది. టాంగన్యికాలో ఆఫ్రికన్ నేషనల్ యూనియన్ పార్టీ, ద్వీప ప్రాంతమున ఆఫ్రో షిరాజి పార్టీ పనిచేయుచున్నవి. దేశమున వయోజనులకు అందరికి వోటుహక్కు కలదు. జాతీయ శాసన సభకును, అధ్యక్ష పదవికిని ఎన్నికలు ఏక కాలమున జరుగుచున్నవి సాధారణముగ ఎన్నికలు అయిదేండ్లకు ఒక పర్యాయము జరుగును. జాతీయ శాసనసభయందు ఎన్నుకొనబడిన సభ్యులు 107, అధ్యక్షుడు నియమించిన వారు 62 మంది, ప్రాంతీయ కమీషనరులు 20 మంది సభ్యత్వము కలిగియున్నారు. జాంజిబారు దేశపు ప్రాంతీయాధ్యక్షుడు, దేశపు ఉపాధ్యక్షులలో ఒకడుగ ఉండును. రెండవ ఉపాధ్యక్షుని శాసనసభలోని ఎన్నిక సభ్యులు ఎన్నుకొనెదరు. జాతీయ శాసన సభకే శాసన నిర్మాణాధికారము కలదు. శాసనసభ సాధారణ ప్రాబల్యముతో ఆమోదించిన తీర్మానమును, అధ్యక్షుడు ఆమోదించనిచో, దానిని మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో శాసన సభ తిరిగి ఆమోదించినపుడు అది చట్టమగుటకు అధ్యక్షుడు విధిగ ఆమోదింపవలెను; లేదా శాసన సభను రద్దుచేసి. అధ్యక్ష పదవికిని, శాసనసభకును తిరిగి ఎన్నికలను జరుపవలెను. బ్రిటిష్ న్యాయ విధానమును, దేశీయ సాంప్రదాయిక విధానమును సంయుక్తముగ అనుసరించుచు, హైకోర్టు ఆధ్వర్యవమున, న్యాయపరిపాలన 900 స్థానిక న్యాయ స్థానముల ద్వారా నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ** · 4 పదాతిదళములును, వాయు సేనయు కలవు. ప్రస్తుతమున చీనాతో కుదిరిన ఒక ఒడంబడికను అనుసరించి, దేశీయ వైమానిక యోధులు చీనాలోని పీకింగునగరమున శిక్షణను పొందుచున్నారు.

**9. అంతర్జాతీయ సం. :** 1961 మొదలగు ఐరాస యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, కామన్‌వెల్తునందును, ఆఫ్రికా ఐక్యతా సంఘమునను, తూర్పు ఆఫ్రికా ఉమ్మడి సంసేవా వ్యవస్థ యందును, ఈ దేశము సభ్యత్వము కలిగి యున్నది,

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. వ్యావసాయిక ఉత్పత్తులందు 'సిసల్' అనబడు ఒక విధపునార అత్యంత ప్రముఖము. ప్రపంచమున అవసరమగు ఈ నారలో 40% ఈ దేశమువలననే లభ్యమగుచున్నది, తక్కిన వ్యావసాయికోత్పత్తు

లలో చక్కెర, ప్రత్తి, కాఫీ పేర్కొనదగినవి. ద్వీప ప్రాంతమున, అందును పెంబాలో, లవంగపుపంట అత్యధికము; దేశమున పశుసంపద దేశావసర ములకు తగినంతగ కలదు. మత్స్య పరిశ్రమ టాంగన్యికా సరస్సు ప్రాంతమున విరివిగ సాగు చున్నది. దేశమున $\frac{1}{8}$ భాగమును ఆక్రమించిన అటవీప్రాంతమున దేశావసరములకు తగినంత కలప దొరకుచున్నది. ఖనిజోత్పత్తులలో, ముఖ్య మైనవి వజ్రములు; తరువాత లెక్కకు వచ్చునది బంగారము. అభ్రకము, వెండి, బొగ్గు మొదలగు నవి కొలది మొత్తములలో మాత్రమే లభించు చున్నవి. ఎగుమతుల విలువలో కాఫీ, ప్రత్తి, వజ్రములు, నిసల్, లవంగములు క్రమప్రాముఖ్య మును కలిగియున్నవి. దేశమున విద్యుదుత్పత్తి సామర్థ్యము 71, 600 కివా. (1967). దేశపు ఎగుమతుల విలువ 179.24 కోట్ల టాం. షి.; దిగుమతుల విలువ 170.98 కోట్ల టాం, షి. (1969). దేశపు బడ్జెటరీ వ్యయము 143.5 కోట్ల టాం. షి. (1969-70).

**11. సాంఘిక రంగము :** అంతర్జాతీయ కార్మిక వ్యవస్థా సంప్రదాయములకు అనుగుణ ములగు కార్మిక శాసనములు దేశమున అమలున ఉన్నవి. దేశమున పట్టణములందు సయితము తగి నంత గృహవసతి లేదు ఆ వసతిని అభివృద్ధి చేయుటకై ప్రభుత్వము ప్రణాళికాబద్ధముగ కృషి చేయుచున్నది. 9,02,609 మంది విద్యార్థులు ప్రయిమరీ పాఠశాలలలోను, 32,603 మంది సెకండరీ పాఠశాలలలోను కలరు; డేరా ఇస్ సలామ్ లోని యూనివర్సిటీ కళాశాలలో 2,028 మంది విద్యార్థులు కలరు; దాదాపు 1500 మంది విదేశ ములలో ఉన్నతవిద్య పఠించుచున్నారు (1971). డేరా ఇస్ సలామ్‌లో, జాతీయ మ్యూజియమును, అచటను టాంగాలోను పెద్ద గ్రంథాలయములును ఉన్నవి. ముఖ్యనగరమునుండి రెండు దినపత్రికలు ఇంగ్లీషునను, రెండు స్వాహిలీలోను వెలువడు చున్నవి. జాంజిబారులో, జాంజిబారీ ఆర్‌కివ్స్‌న ఒక మ్యూజియమును, ఒక గ్రంథాలయమును కలవు. స్వాహిలీలో ఒకటియు, ఇంగ్లీషున వేరొకటియు దినపత్రికలు జాంజిబారున ప్రకటింప బడుచున్నవి. దేశమున 22,117 శయ్యాసంఖ్య కల వివిధరీతుల వైద్యశాలలు 1,899 ఉన్నవి. వైద్యసంఖ్య 395 (1969). ఐ. రా. స. సహాయ ముతో మలేరియా మొదలగు రోగముల నిరోధ మునకై దేశమున కృషి సాగుచున్నది.

**12.** యాత్రా సౌ. : ప్రకృతి సిద్ధములగు విశాల సరస్సులును అత్యున్నతములగు కిలిమాంజరో, మేరు శిఖరములును, సెరెంగీతి జాతీయ వనమును విదేశీయ యాత్రికులను ఆకర్షించుచున్నవి. వేటకు, చేపలు పట్టుటకు, నౌకావిహారములకు, పర్వతా రోహణకు తగు సౌకర్యములును, నివాసవసతులను ప్రభుత్వముచేత ఏర్పాటు చేయబడినవి.

---

# 24. టునీసియా

## (టూనీషియా)

**ముఖ్యనగరము :** టునిస్; **జెండా :** ఎర్రని భూమికపై మధ్యనున్న తెల్లని వృత్తమున ఎరుపు రంగున చిత్రింపబడిన నెలవంకయు, అయిదు కోణ ముల నక్షత్రమును కలది; **నాణెము :** టునీసి యన్ దీనార్; 1 టు. దీనార్ = రు. 14.25; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :**

సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 నిమిషములు.

**1. ఉనికి మొ.:** ఆఫ్రికా ఖండపు ఉత్తర తీరమున 7°33′-11°38′ తూ. తులారేఖలకును, 29°52′-37°21′ ఉ. అ. రేఖలకును మధ్యన




పటము : 24.

విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమునను, తూర్పునను, మధ్యధరా సముద్రము; దక్షిణమున లిబియా; పశ్చిమమున ఆల్-జీరియా సరిహద్దులలో ఉన్నవి. దేశ వైశాల్యము 1,64,150 చ. కిమీ. అట్లాస్ పర్వతశ్రేణి తూర్పు పడమరలకు వ్యాపించి దేశమును రెండు ప్రత్యేక భాగములుగ విభజించుచున్నది; అందు ఉత్తర భాగము జలాధారములు గల భూమి; దక్షిణ భాగము దాదాపుగ ఎడారి. ఉత్తర భాగమున మజర్దానది ప్రవహించి మధ్యధరా సముద్రమున చేరుచున్నది. ఆ భాగపు వాయవ్య ప్రాంతము విస్తృతాటవులకును, మధ్యప్రాంతము సారవంతములగు గరికపట్టులకును ఈశాన్య ప్రాంతము ఫలవృక్ష వనములకును పేరొందినవి. దక్షిణ భాగమున మధ్యప్రాంతమున ఒక పీఠ భూమియు దక్షిణపు కొనన ఎడారి భూమియు కలవు; ఈ ఎడారి క్రమక్రమముగ సహారా ఎడారిలో అంతర్భాగమగుచున్నది. ఈ ప్రాంతమున అచ్చటచ్చట ఖర్జూర వృక్షములచే పరివృతములగు ఊటనీటి బుగ్గలును, ఉప్పునీటి మడుగులును కన్పట్టును. ఉత్తర భాగమునందలి మెజెర్దా పర్వతములును, దక్షిణ భాగమునందలి తిబెస్సా పర్వతములును పేర్కొనదగిన కొండల వరసలు.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఉత్తర భాగమున తీరము వెంబడిన శీతోష్ణస్థితి చాలవరకు సౌమ్యముగ ఉండును; దక్షిణ భాగమున ఎండ లెక్కువ. ఉత్తర భాగమున పర్వత ప్రాంతమున సాలుసరి వర్షపాతము 150 సెం. మీ; తక్కిన ప్రాంతమున అది 40 సెం. మీ. నుండి 100 సెం. మీ. వరకు మారుచుండును. దక్షిణ భాగమున ఏ ప్రాంతమునను సాలుసరి వర్షపాతము 20 సెం మీ. ను మించదు; సాధారణముగ ద్రిమ్మరి జాతుల ప్రజలు మాత్రమే ఇచ్చట నివసించుచున్నారు. ఊటనీటి పట్టులను ఆశ్రయించి అచటచట వ్యవసాయము జరుగుచున్నది. ఉత్తర భాగమున అడవులలో ఓకు చెట్లు మొదలగు పెద్దజాతి వృక్షములును, అడవిపంది, నక్క మొదలగు

వన్యజంతువులును కన్పట్టును. దక్షిణపు ఎడారిలో పలురకముల తేళ్లు కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ. :** 1966 సం. లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 45,33,351; జన సాంద్రత చ. కిమీ. కు 28. దేశపు నగరములలో టునిస్ (జనసంఖ్య 7,89,787), స్ఫాక్స్ (1,00,000), సూసా (90,000), బిజెర్తా (70,000), కైర్వాన్ (50,000) లెక్కింపదగినవి. దేశపు ప్రజానీకమున అరబ్బి, బర్బర, తుర్కీ ప్రజల సంతతివారు కననగుదురు. మొత్తపు ప్రజలలో దాదాపు 30,000 యూదులును. 39.000 యూరపీయులను కలరని అంచనా. దేశప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బి; అత్యల్పసంఖ్యాకులలో బర్బర భాష వ్యాప్తియందు ఉన్నది. అరబ్బియే అధికార భాషయైనను ఫ్రెంచియు పరిపాలనా విషయములందును, వ్యాపార సంస్థలందును విరివిగ వాడబడుచున్నది.

దాదాపుగ దేశీయ ప్రజలందరును సున్నీ సంప్రదాయపు ముస్లిములు. ఇస్లామును జాతీయ మతముగ ప్రభుత్వము లెక్కించినను, మతేతరుల యెడ సహనభావము దేశమున విరివిగ కననగును. యూరపీయసంతతివారు అందరును క్రైస్తవులు.

**4. సమాచార సౌ. :** ప్రభుత్వాధీనమున, సువ్యవస్థితముగ పనిచేయు తంతి తపాలా వ్యవస్థ కలదు. దేశమున 381 తపాలాఫీసులు కలవు (1966); టెలిఫోనుల సంఖ్య 76,370 (1971). ఫ్రాన్సుతో ఈ దేశమునకు కేబుల్ సంబంధము కలదు. టునిస్ నగరములోని రేడియోకేంద్రమున ఫ్రెంచి, అరబ్బి, ఇంగ్లీష్, జర్మన్, ఇటాలియన్ భాషలలో ప్రసారములు నిర్వహింపబడుచున్నవి. 1966 లో టెలివిజన్ సౌకర్యము కొన్ని ప్రాంతములకు తొలుతగ కల్పింపబడి, 1972 లో ఆ వసతి దేశమునకు అంతటికిని కల్పింపబడినది.

**5. యాన సౌ. :** దేశమున మొత్తపు రోడ్ల నిడివి 18,267 కిమీ. దీనిలో 10,843 కిమీ. ప్రధానమార్గముల తరగతికి చెందినది; 5,603 కిమీ. మధ్య తరగతికి చెందినది (1971). రైలుమార్గపు మొత్తపు నిడివి 2,305 కిమీ. (1969). ఈ రైలుమార్గము అంతయు తీరమునకు సమానాంతరముగ పోవుచు ఖనిజ ప్రాంతములకును, వ్యావసాయిక కేంద్రములకును, ఉపకరించు రీతిగ ఉన్నది.

దేశపు రేవులలో అతిప్రముఖమైనది టునిస్; ఇచ్చట ఆధునిక పరికర సమన్వితమగు మంచి హార్బరు ఉన్నది. దాని తరువాత రేవునగరములుగ లెక్కకు వచ్చునని బిజెర్తా, సూసా, స్ఫాక్స్; ఇందు కడపటిది ఫాస్ఫేటుల ఎగుమతికి ఎక్కువగ ఉపకరించుచున్నది. దేశపు వర్తకనౌకాదళము టునిస్ నుండి, ఫ్రాన్సులోని 17 రేవునగరములకు రవాణా సౌకర్యములను కల్పించుచున్నది.

టునిస్ నగరమునకు దాపున ఉన్న ఎల్ అయోవినా విమానాశ్రయము నుండి, పెక్కు అంతర్జాతీయ విమానయాన సంస్థలు మొరాకో, ఆల్జీరియా, యూరపులకు ప్రయాణ సౌకర్యమును కల్గించుచున్నవి; దేశాంతర్గత నగరముల మధ్యను విమానయాన సౌకర్యము కలదు. అందుకు తగినటుల ప్రముఖ నగరములందు మధ్యతరగతి విమానాశ్రయములు ఏర్పడి ఉన్నవి.

**6. చరిత్ర :** ప్రాచీనమగు చారిత్రకసంపత్తి కలిగిన దేశములలో ఒకటిగ ఈ దేశము పేరొందినది. క్రీ. పూ. 12వ శతాబ్దమున ఫినిషియనులను ప్రాచీనజాతి ఇట నెలవును కల్పించుకొని కార్తేజ్ అను ప్రముఖనగరమును నిర్మించి, వర్తక వ్యాపారములు ఆలంబనముగ ఒక సామ్రాజ్యమును స్థాపించి, వర్ధిల్లి కడకు క్రీ. పూ. 146 లో రోమనుల దాటికి నిలువజాలక, అంతరించినది. అంతట రోమన్ సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగమై,

ఆ సామ్రాజ్యము అంతరించుటతో అరాజకము పాలై విదేశీయ సాహసికుల దండయాత్రలకు పలుమార్లు లోనయ్యెను. క్రీ శ. 7 వ శతాబ్దమున అరబ్బీ సేనావాహినులు తక్కిన ఉత్తర ఆఫ్రికా దేశములతోపాటుగ ఈ దేశమును లోగొని, తమ మత, భాషా, సంస్కృతులను ఎల్లెడల వ్యాపింపజేసి, పూర్వ సంస్కృతుల అవశేషములను అంతరింప జేయుటవలన, ఈ దేశచరిత్రలో ఒక నూతనాధ్యాయము మొదలయ్యెను. తొలుత ఇది బాగ్దాదు కలీఫాల రాజ్యమున ఉన్నను, కాలక్రమమున అగ్లేబ్ వంశీయుల ఆధ్వర్యమున స్వతంత్ర మయ్యెను (క్రీ. శ. 800). ఆ తరువాత హఫ్సీ అను వేరొక రాజవంశము అధికారమును గ్రహించి (1336) కొంతకాలము పాలించినది. 1574 లో ఈ దేశము తుర్కీ సామ్రాజ్యమున అంతర్భాగమైనది. 1705 నాటికి ఆ సామ్రాజ్యపు ప్రతినిధి స్వతంత్రుడై ఒక రాజవంశమును స్థాపించెను.

19 వ శతాబ్దమున పాలకుల అసమర్థతవలన ప్రభుత్వము విదేశీయులకు - అందును ఎక్కువగ ఫ్రెంచివారికి - ఋణపడగ, ఫ్రెంచి ప్రభుత్వము దేశపు రాజును ఒప్పించి, దేశమును తన రక్షణలోనికి తీసికొని, పాలకుని అధికారము కట్టుదిట్టముగ దేశమున వ్యాపింపజేసినది. కాని ప్రజలలో ఫ్రెంచి సర్వాధిపత్యమునెడల నిరసన ఎక్కువై పలు రాజకీయ పక్షములు స్వాతంత్ర్యమునకై ఆందోళన చేసినవి వాటిలో, హబీబ్ బోర్గుబా నాయకత్వమున పనిచేసిన నియోడస్తూర్ పక్షము ప్రముఖము. కడకు జాతీయవాదులతో జరిపిన సంప్రతింపుల ఫలితముగ, దేశమునందలి బిజెర్టా రేవును మాత్రము తన అధికారమున కొంతకాలము ఉంచుకొను షరతుపై, తక్కిన దేశమునకు స్వతంత్రతను కల్పించుటకు ఫ్రెంచి ప్రభుత్వము అంగీకరించినది (మార్చి 20, 1956). 1957 లో ఎన్నుకొనబడిన రాజ్యాంగ పరిషత్తు దేశపాలకుని పదవినుండి తొలగించి, దేశమున గణరాజ్యప్రభుత్వ విధానమును నెలకొల్పినది. తరువాత ప్రజాప్రభుత్వపు ఆందోళనకు లొంగి ఫ్రెంచి ప్రభుత్వము బిజెర్టా రేవుపై తన అధికారమును వదలుకొని ఆ రేవును దేశప్రభుత్వమునకు అప్పజెప్పినది (జూన్ 30, 1962).

**7. పరిపాలన :** 1959 లో ఆమోదింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున గణరాజ్య ప్రభుత్వ విధానము అమలునందున్నది. 20 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు. అయిదేండ్లకు ఒకసారి జాతీయ శాసనసభకును, అధ్యక్షపదవికిని ఒకేసారిగ ఎన్నికలు జరుగును. శాసనసభయందలి సభ్య సంఖ్య 90. శాసన నిర్మాణాధికారము శాసనసభ యందు న్యస్తము. శాసనసభచేయు తీర్మానములను అధ్యక్షుడు వీటో చేయవచ్చును; కాని మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో ఆ తీర్మానమును జాతీయ శాసనసభ తిరిగి ఆమోదించినయెడల అది విధిగ చట్టము కాగలదు. 1959 మొదలగు జరిగిన నాలుగు ఎన్నికలలోను హబీబ్ బోర్గుబాయే అధ్యక్షుడుగ ఎన్నికయ్యెను. కార్యనిర్వహణాధికారము అధ్యక్షునియందు ఉన్నది. అతడు నియమించిన మంత్రివర్గము అతనికి పరిపాలనలో సాయపడుచున్నది.

దేశమున 13 రాష్ట్రములు కలవు. అధ్యక్షుడు నియమించు పాలకుడు, తాను నియమించుకొనిన సలహా సంఘపు సంప్రతింపుతో రాష్ట్రమున పాలనను నిర్వహించును.

న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. సుప్రీమ్ కోర్టు ఆధిపత్యమున, దిగువ కోర్టులు పనిచేయుచున్నవి. మతముతో నిమిత్తములేని రీతిగ పౌర, దండ, న్యాయ సంహితలు రూపొందింప బడినవి.

దేశమున ప్రస్తుతము ఒకే ఒక రాజకీయ పక్షము - పూర్వపు నియో దస్తూర్ పార్టీ - పని చేయుచున్నది. ఇది ఇపుడు దస్తూర్ సోషలిష్టు పార్టీ అని పిలువబడుచున్నది. దేశాధ్యక్షుడగు బోర్గుబాయే ఈ రాజకీయపక్షపు అధినేత.

**8. దేశరక్షణ :** 20,000 సైనికులుగల పదాతిసేనయు, 2,000 నావికయోధులుకల నావిక సేనయు, 2,000 మంది పనిచేయు వాయుసేనయు ఉన్నవి. సైనికులు ఫ్రాన్సునందలి శిక్షణశాలలందు శిక్షణను పొందుచున్నారు.

**9. అంతర్జాతీయ సం. :** 1956 మొదలుగ ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశము సభ్యత్వము వహించియున్నది. అరబ్‌రాజ్యముల సంఘమున ఈ దేశమునకు సభ్యత్వము కలదు; కాని, అభిప్రాయభేదములవలన, అంతటంతట అందుండి వైదాలగుచున్నది. ఆఫ్రికా ఐక్యతా సంఘమునను, ఈ దేశము సభ్యత్వము కలిగి ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నదని చెప్ప వచ్చును. దేశమునందలి వ్యవసాయోత్పత్తిలో అత్యధిక భాగము అట్లాస్ పర్వతశ్రేణికి ఉత్తరముననే జరుగుచున్నది. దక్షిణ భాగపు పీఠభూమి యందును, ఎడారియందును, వీలైన చోటులలో బార్లీమాత్రము విరివిగ పండింపబడుచున్నది. ఉత్తర భాగపు వ్యవసాయోత్పత్తులలో గోధుమ. ఆలివ్‌పండ్లు, తదితర ఫలజాతులు ముఖ్యములు. ద్రాక్షసారాయము ఇట విరివిగ తయారగుచున్నది. 1968 మొదలుగ చక్కెరదుంప (బీటుదుంప) యు ఉత్పత్తియగుచున్నది. దేశపు ఎగుమతులలో ఈ వ్యవసాయోత్పత్తులే ప్రముఖములు. పశుపోషణయు, మత్స్యపరిశ్రమయు వేలకొలది ప్రజలకు జీవ నాధారములుగ ఉన్నవి. దేశమున 38 లక్షల ఎకరముల అటవీభూమి కలదు. ఓకు కొయ్యనుండి తయారగు బిరడాలు విదేశములకు ఎగుమతియగుచున్నవి.

ఖనిజములలో ముఖ్యముగ పేర్కొనదగినది దక్షిణ ప్రాంతమున లభించు ఫాస్ఫేటు; ఉత్తర ప్రాంతమున ఉత్తమమగు ఇనుప ఖనిజము లభించుచున్నది. సీసము తుత్తునాగము లభించుచున్నను, వాని ఉత్పత్తి చాల తక్కువ. పెట్రోలుగాని, రాక్షసిబొగ్గుగాని దేశమున ఖనిజరూపమున లభ్యము గాక పోవుటవలన పెద్ద పరిశ్రమలను స్థాపించుటకు అవకాశము లేకున్నది. సూపర్ ఫాస్ఫేటును సిమెంటును, వ్యావసాయిక వస్తువులను ఆశ్రయించి కొన్ని చిన్న పరిశ్రమలు దేశమున కలవు. వీని యందలి కార్మిక సంఖ్య 64,000 (1968). దేశమున విద్యుదుత్పత్తి 79 38 కోట్ల కివా. దేశపు ఎగుమతుల విలువ 150.3 కోట్ల దీనార్లు; దిగుమతుల విలువ 222.2 కోట్ల దీ. (1971). ప్రభుత్వపు బడ్జెటరీవ్యయము 154 కోట్ల దీ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున సువ్యవస్థిత రీతిలో, ఫ్రెంచి వలస ప్రభుత్వపు కాలము నుండియు విద్యావ్యాప్తికై కృషి జరుగుచున్నది. దేశము స్వతంత్రమైన తరువాత ఇస్లామిక మత పాఠశాలల ప్రత్యేక ప్రతిపత్తి రద్దుచేయబడినది. దేశమునందలి బాలబాలికలలో దాదాపు 60% విద్యా శిక్షణను పొందుచున్నారు. ఈ శాతము క్రమశః అభివృద్ధియగుచున్నది. ప్రయిమరీ పాఠశాలలలో 9,64,206 మందియు, ఉన్నత, సాంకేతిక, వృత్తి విద్యా పాఠశాలలలో 1,83,928 మందియు విద్యార్థులు కలరు; టునిస్ నగరమునందలి విశ్వ విద్యాలయమున విద్యార్థి సంఖ్య 14,050 (1970-71). ప్రయిమరీ పాఠశాలలలో మొదటి రెండు సంవత్సరములలో అరబ్బీయే బోధన భాషగ ఉన్నను, అటనుండి క్రమశః ఫ్రెంచికే ప్రాముఖ్యము కల్పింపబడి, ఉన్నత విద్య ఫ్రెంచి

లోనే బోధింపబడుచున్నది. దాదాపుగ 3,000 మంది ప్రతి సంవత్సరమున ఉన్నత విద్యాభ్యాసమునకై విదేశములకు పోవుచున్నారు.

టునిస్‌నగరమున **అత్యుత్తమ స్థాయికి** చెందిన ఒక గ్రంథాలయమును మ్యూజియమును ఉన్నవి. అరబ్బీ మొదలగు ప్రాచ్యభాషలకు చెందిన అపురూపపు వ్రాత ప్రతులు ఆ గ్రంథాలయమున సేకరింపబడినవి. టునిస్‌లోని మ్యూజియమునను, సూసాలోని వేరొక మ్యూజియమునను ప్రాచీన చారిత్రకావశేషములు కాననగును. టునిస్ నగరము నుండి రెండు దినపత్రికలు అరబ్బీలోను, రెండు ఫ్రెంచిలోను వెలువడుచున్నవి. 12,654 శయ్యలు కల 89 ఆసుపత్రులు కలవు; వైద్యసంఖ్య 864 (వీరిలో 490 మంది విదేశీయులు).

**12. యాత్రా సౌ.** : దేశపు పరిశ్రమలలో 'యాత్రిక' పరిశ్రమను ముఖ్యమైన దానినిగ పేర్కొనవచ్చును. ఫినీషియను, రోమన్ నాగరికతలకు ఆటపట్టులై వర్ధిల్లిన నగరముల శిథిలావశేషములను, అరబ్బీ నగరములను దర్శించుటకై పలువురు విదేశీయ యాత్రికులు దేశమును దర్శించుచుందురు. యూరపులోని కమ్యూనిస్టేతర రాజ్యముల పౌరులును, యు. స్టే. పౌరులును వీసాలతో నిమిత్తము లేకుండ పాస్‌పోర్టులతో దేశమును దర్శించవచ్చును కాని ఆ యా దేశముల ప్రాముఖ్యమును అనుసరించి, వారు దేశమున ఉండదగు కాలము నెలనుండి నాలుగు నెలల వరకు మారుచున్నది. పై దేశములుగాక తక్కినవాని పౌరులు ప్యాస్‌పోర్టులను, వీసాలను తప్పక కలిగియుండవలెను. యాత్రికులకు సహాయము చేయుటకై ఒక ప్రభుత్వసంస్థ కృషి చేయుచున్నది. వారి సౌకర్యమునకై 178 హోటళ్లు స్థాపింపబడినవి. 1971 లో 6,08,200 మంది విదేశ యాత్రికులు దేశమును దర్శించి, దేశమున 5.4 కోట్ల దీనార్లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు** : 1. ప్రాచీన కార్తేజియన్ సామ్రాజ్యపు సేనానియగు హన్నిబల్ (క్రీ.పూ. 247-183), రోమన్ సేనలను పలుమారులు పరాజితములుగచేసి కడకు క్రీ. పూ. 202 లో వానిచే ఓడింపబడి మరణించెను.

---

# 25. టోగో

**ముఖ్యనగరము** : లోమీ; **జెండా** : ఆకుపసిమి, పసుపుచారలు ఒకదాని తరువాత వేరొకటి అడ్డముగ అమరిన అయిదు చారలలో వాయవ్యభాగమున దండమును ఆనుకొనిన అరుణవర్ణపు చతురస్రమున ఇమిడిన, పంచకోణముల శ్వేత నక్షత్రము కలది; **జాతీయ గీతము** : టెరే డి నోస్ ఏయూ (మముగన్నవారి భూమి...); **నాణెము** : ఫ్రాంక్ (సి. ఎఫ్. ఏ), వినిమయపు విలువ అనిశ్చితము, సాధారణముగ 100 ఫ్రాంక్‌లు = రు. 2.60; **కొలతూకములు** : మెట్రిక్ మానపువి; **కాలగణన** : సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమున 6°10′-11°5′ ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 1°47′ తూ - 0°25′ ప రేఖాంశ రేఖల మధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున అప్పర్ వోల్టా, తూర్పున దహోమీ, దక్షిణమున గినీ సింధుశాఖ, పశ్చిమమున ఘానా దేశము సరిహద్దులందున్నవి. దేశపు ఉత్తర - దక్షిణముల నిడివి 540 కిమీ; దేశ వైశాల్యము

దాదాపు 56,000 చ. కిమీ. దేశమున అటకోరా పర్వతశ్రేణి అడ్డుగ పయనించుచున్నది. దీని సరాసరి ఎత్తు 700 మీ; దేశమున ప్రవహించు వోల్టా నది, కొంతవరకు ఘానా, టోగోలమధ్య సరిహద్దుగ ఏర్పడియున్నది. వేరొక ముఖ్యమైన నది ఓటీ. ఇది ఉత్తర దేశమున ప్రవహించి కడకు వోల్టాలో




పటము 12.

కలియుచున్నది. 52 కిమీ. పొడవుగల తీరరేఖ పొడవున ఇసుక ప్రదేశములును, అందు కొబ్బరి చెట్లు విరివిగను కన్పట్టును.

**2. శీతోష్ణస్థితి** మొ. : ఈ దేశమున ఉష్ణ మండలపు శీతోష్ణస్థితి కననగును. కాని వర్షపాతము పరిసర దేశములందుకన్న చాల తక్కువ. పశ్చిమ, నైరృతి, ప్రాంతములందును మధ్యదేశమునను తక్కిన ప్రాంతములందుకన్న వర్షపాతము ఎక్కువ. ఉత్తరమున సాలీనా సరాసరి వర్షపాతము 100 సెం. మీ; దక్షిణమున 175 సెం. మీ.

**3. జనసంఖ్య** మొ. : 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 19,55,916. జనసాంద్రత చ. కిమీ. కు 32. ఉత్తరమున కన్నను దక్షిణ ప్రాంతమున జనసాంద్రత ఎక్కువ. ముఖ్యనగరమగు లోమీ నగరపు జనసంఖ్య 1,34,800. ప్రజానీకమున వివిధ ఆఫ్రికన్ జాతులు కలగాపులగముగ కలసిఉన్నవి. ఆయా జాతులవారికి వేర్వేరు మాతృభాషలున్నను ఫ్రెంచియే సాధికార భాషగ వాడుకలో ఉన్నది. దేశీయ భాషలలో 'ఈవీ' అనుదానికి ఎక్కువ ప్రచారము కలదు. దాని తరువాత లెక్కకు వచ్చునది 'హౌసా' భాష. దేశ ప్రజలలో మూడింట రెండుపంతులు సాంప్రదాయిక ప్రకృతి దేవతారాధకులు. తక్కినవారిలో 4,50,000 క్రైస్తవులును, 1,35,000 ముస్లిములును కలరు.

**4. సమాచార సౌ.** : దేశమున 22 తపాలా ఫీసులును, 12 తపాలా ఏజన్సీలును, 4,567 టెలిఫోనులును (1970) కలవు. వైర్‌లెస్ టెలిగ్రాఫ్‌ద్వారా యూరప్, అమెరికాలతో ఈ దేశమునకు వార్తా సౌకర్యము కలదు. లోమీలో ఒక రేడియో ప్రసార కేంద్రము పనిచేయుచున్నది.

**5. యాన సౌ.** : దేశమున 4,644 కిమీ. పొడవున రోడ్లు కలవు; ఇందు 155 కిమీ. మాత్రమే ఉత్తమ శ్రేణికి చెందినవి. 433 కిమీ. నిడివికల మూడు మీ. గేజి రైలుమార్గములు ఉన్నవి. లోమీకి

సమీపమున ఒక పెద్ద తరగతి హార్బరు నిర్మిత మైనది (1968). క్పేమీవద్ద ఒక చిన్న హార్బరు కలదు. లోమీవద్దనున్న అంతర్జాతీయ విమానాశ్రయమునుండి పశ్చిమ, మధ్య ఆఫ్రికా దేశములకును, యూరపులోని పలుదేశములకును విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** దేశ ప్రజలలో అధిక సంఖ్యాకులగు 'ఈవీ' జాతి ప్రజలు ఇచటికి 14 వ శతాబ్దిలో వచ్చి చేరినటుల తెలియుచున్నది. ఈ దేశము 15 వ శతాబ్ది మొదలుగ పోర్చుగీజువారికి సుపరిచితమే అయినను, వారిట స్థిరస్థావరములను నెలకొల్పకుండిరి. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున జర్మన్ వర్తకులు కొందరు ఇటచేరి 1885 లో అచటి ఒక స్థానిక ప్రభువుతో కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి ఆ ప్రాంతమును తమ ఆధిపత్యములోనికి తెచ్చుకొని, సరిహద్దుల విషయమున బ్రిటిష్, ఫ్రెంచి నాయకులతో ఒడంబడికకు రాగలిగిరి. జర్మనులు ఇట రోడ్లను, రైలురోడ్లను నిర్మించుటయేగాక, సువ్యవస్థిత పరిపాలనను ఏర్పరచిరి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఈ దేశమున కొంత భాగమును బ్రిటిష్‌వారును తక్కినదానిని ఫ్రెంచివారును మాండేటరీ ప్రాంతములుగ గ్రహించి పాలించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఐక్యరాజ్య ధర్మకర్తృత్వ పాలనకు బ్రిటిష్‌వారును, ఫ్రెంచివారును తమతమ ప్రాంతములను అప్పగించిరి. తరువాత జరిగిన జనాభిప్రాయ సేకరణను అనుసరించి బ్రిటిష్ ప్రాంతము ఘానా దేశముతో మేళనమందినది (1956). అటులే ఫ్రెంచి వారి ప్రాంతమున జరిగిన ప్రజా నిర్ణయమును అనుసరించి ఆ ప్రాంతము కడకు 1960 లో సంపూర్ణ స్వతంత్రరాజ్యమయ్యెను. కాని 1967 లో సైన్యము ప్రభుత్వమును వశపరచుకొని, తత్ఫలితముగ ఎయదేమా సేనాని అధికారమును గ్రహించెను. 1972 లో జరిగిన జనాభాభిప్రాయ సేకరణను అనుసరించి, అతని అధ్యక్షపదవి ధ్రువీకృతమయ్యెను.

**7. పరిపాలన :** దేశమున గణతంత్ర ప్రభుత్వము అమలులో ఉన్నటుల పరిగణింపబడుచున్నను, సేనాబలపు అండతో అధ్యక్షుడే పాలలను నిర్వహించుచున్నాడు; దేశమున వ్యవస్థితములగు రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుటలేదు. పరిపాలనా సౌకర్యమునకై దేశము 19 మండలములుగ విభక్తమై ఉన్నది. 1961 లో దేశమున ఒక సుప్రీమ్‌కోర్టు స్థాపింపబడినది. దాని ఆధిపత్యమున దేశమునందలి వివిధ న్యాయస్థానములు పనిచేయుచున్నవి.

**8. దేశరక్షణ :** 1000 మంది సైనికులుగల ఒక పదాతిదళమును, ఫ్రెంచివారి సాయమున రూపొంది పనిచేయు 5 విమానముల వైమానిక దళమును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా స. యందును, తదనుబంధ సంస్థలు పెక్కింటను ఈ రాజ్యము సభ్యత్వము కలిగి యున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. ఆహార విషయమున దేశము స్వయంపోషకమగుటయేగాక, ఆహార ధాన్యములను కొలదిగ విదేశములకు ఎగుమతి చేయగలుగుచున్నది. రొక్కపు పంటలలో కాఫీ, కోకో, ప్రత్తి, కొబ్బరి, వేరుసెనగ లెక్కింపదగినవి. దేశమున ఖనిజసంపద విరివిగ ఉన్నటుల తెలియుచున్నను, దానిని వినియోగించుకొను కృషి జరుగుటలేదు. ఫాస్ఫేట్ ఉత్పత్తి మాత్రము విరివిగ సాగుచున్నది. దేశమున నదుల సాయమున సాలునకు 5.62 కోట్ల కి. వాట్ల విద్యుత్తు ఉత్పత్తి యగుచున్నది (1969). దేశపు ఎగుమతులవిలువ 1147.7 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ

1457.2 కోట్ల ఫ్రాంకులు (1969). చెల్లింపుల లోటును పూడ్చుటకు అంతర్జాతీయ ఋణముల పైనను, పరపతిపైనను దేశము ఆధారపడి ఉన్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 653.32 కోట్ల ఫ్రాంకులు (1969).

**11. సాంఘిక రంగము :** దేశమున నిరక్షరాస్యతను తొలగించుటకై ఐ రా. స. సహాయమున ప్రత్యేక కృషి జరుగుచున్నది. 1968-69 లో ప్రయిమరీ పాఠశాలలందు 1,57,548 మంది, సెకండరీ, టెక్నికల్ పాఠశాలలలో 13,126 మంది విద్యార్థులు విద్యను అభ్యసించిరి. ప్రయిమరీ విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. దేశమున రెండు దినపత్రికలు, ఫ్రెంచి భాషలో ప్రచురింపబడుచున్నవి. ప్రభుత్వ ప్రచార శాఖవారు నడుపుచున్న గణనీయమగు గ్రంథాలయము ఒకటి కలదు. దేశమున వైద్య సౌకర్యముల కొరకై 2 జనరల్ ఆసుపత్రులును, 15 సెకండరీ ఆసుపత్రులును 150 డిస్పెన్సరీలును, 16 ప్రసూతి కేంద్రములును పనిచేయుచున్నవి దేశమున 19,820 మంది ప్రజలకు ఒక డాక్టరు కలడని లెక్క తేలుచున్నది. మశూచి, మలేరియా, కుష్ఠు రోగము మొదలగు సాంక్రామిక రోగముల వ్యాప్తిని నిరోధించుటకు సంచార వైద్య దళములు పనిచేయుచున్నవి.

**12. ప్రసిద్ధ పౌ. :** సిల్వానస్ ఒలింపియో (1902-1963) ఈ దేశపు స్వాతంత్ర్య యోధులలో ప్రముఖుడు.

---

# 26. దక్షిణ ఆఫ్రికా

**ముఖ్యనగరము :** కేప్‌టౌన్ (శాసనసభలకు); ప్రెటోరియా (పరిపాలనకు); బ్లూమ్‌ఫీల్డు (న్యాయ నిర్వహణకు); **జెండా :** నారింజ, తెలుపు, నీలపు




పటము 26.

అడ్డు చారలలో నడిమి తెలుపు చారకు మధ్యన బ్రిటన్ దేశపు యూనియన్ జాక్, **పూర్వపు** ఆరంజి ఫ్రీస్టేట్ **తాలూకు** నిలువుచారల జెండా రూపము, ట్రాన్స్‌వాల్ దేశపు నిలువు అడ్డురేఖలు వరుసగ అమరియుండుసది; **జాతీయ గీతము :** ది స్టెమ్ ఫాన్ స్వీత్ ఆఫ్రికా... (దక్షిణ ఆఫ్రికా వాణి...); **నాణెము :** దక్షిణ ఆఫ్రికా రాండ్ అను దశాంశపు నాణెము; ఒక రాండు = రు. 10.50; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువే. **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి :** ఆఫ్రికా ఖండపు దక్షిణపు కడన 22° – 35° దక్షిణ అక్షాంశ రేఖల మధ్యన విస్తరించియున్న ఈ దేశమునకు వాయవ్యమున నమీబియా; ఉత్తరమున బోట్స్వానా, రొడీసియా; ఈశాన్యమున మొజాంబిక్, స్వాజీలాండ్; తూర్పున హిందూమహాసముద్రము, దక్షిణమున అట్లాంటిక్-హిందూమహాసముద్రముల కూడలి; **పశ్చిమమున**

అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 12,21,042 చ. కిమీ (దేశ మధ్యస్థమై 'లెసోతో' అను పేరునఉన్న స్వతంత్ర రాజ్యపు వైశాల్యము ఇందు చేరదు). దేశమున అత్యధిక భాగము పీఠభూమి; సాధారణముగా అచటి భూమి ఎత్తు 900 మీ. కు పైబడియుండును. పశ్చిమమునుండి తూర్పునకు పోనుపోను భూమి ఎత్తు పెరుగుచుండును. తూర్పున ఉన్న డ్రాకెన్స్ బర్గ్ పర్వతశ్రేణిలో అత్యున్నత శిఖరపు ఎత్తు 3,300 మీ. పశ్చిమమునను దక్షిణమునను సముద్ర తీరము మాత్రము 5-50 కిమీ. వరకు, 150 మీ. నుండి 180 మీ. వరకు ఎత్తుకలిగిఉన్నది; ఈ తీర భూమి అత్యంత సారవంతమైనది. అటనుండి ఉత్తరమునకుపోగా పర్వత పరివృతమగు బెట్ట భూమియు ఆపైన కలహారీ ఎడారియు కన్పట్టును. డ్రాకెన్స్‌బర్గ్ పర్వత శ్రేణినుండి తూర్పున హిందూ మహాసముద్రము వైపునకు క్రమముగ నేలమట్టము తగ్గిపోవుట కన్పట్టును. దేశ మధ్యస్థమగు పీఠ భూమినుండి నీటిని కొనివచ్చు నదులలో ఆరంజి నదియు, లింపోపోనదియు ప్రముఖములు. వానిలో తొలుతటిది అట్లాంటిక్ మహాసముద్రమునను, రెండవది మొజాంబిక్ దేశముద్వారా హిందూ మహా సముద్రమునను కలియుచున్నవి.

**2 శీతోష్ణస్థితి మొ :** దేశమంతయు దక్షిణార్ధ గోళపు సమశీతోష్ణ మండలమున ఉన్నదని చెప్పవచ్చును; అందువలన శీతోష్ణ పరిస్థితి సౌమ్యముగ, ఉత్తరపు దేశములందుకన్న చల్లగ ఉండును. దేశపు సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 60° ఫా. కు లోపుగనే ఉన్నది. పీఠభూమి ప్రాంతమున రాత్రింబగలుల ఉష్ణోగ్రతలలో ఎక్కువ వ్యత్యాసము కన్పట్టినను, తీరభూమియందు మాత్రము ఆ వ్యత్యాసము చాల తక్కువ. దేశమున సాలీనా సరాసరి వర్షపాతము 44 సెం మీ. ఆయినను దేశమున 30% ప్రాంతమున ఆ వర్షపాతము 25 సెం. మీ. ను మించదు. ఈ వర్షపాత మైనను అనిశ్చితము; అందువలన కొన్నిప్రాంతము లందు తరచుగ కరవుబాధ కలదు. వానలు సాధారణముగ గ్రీష్మఋతువున కురియును; కాని పశ్చిమ తీరప్రాంతమున మాత్రము శీతకాలములో వర్షించును. దక్షిణపు కడనున్న కేప్‌రాష్ట్రపు కోస్తాయందుమాత్రము ఋతువులతో నిమిత్తము లేకుండ వానలు కురియుచుండును. దేశ విస్తృతికి అనుగుణముగ నానావిధముల వృక్షసంపదయు, దానిని ఆశ్రయించి జీవించు వన్యజంతువులును కలవు. వన్యములలో ఏనుగులు, సింహములు, చిరుతపులులు, ఎనుములు, ఖడ్గమృగములు మొదలగు పెద్దజంతువులును పలుప్రాంతములందు కన్పట్టుచున్నవి.

**3 జనసంఖ్య మొ. :** 1970 సం. లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,14,48,172; ఇందు 37,51,328 శ్వేతజాతీయులు; ఆఫ్రికా జాతులవారు 1,50,57,952; ఆసియాదేశముల వారు 6 20,436. ఇందులో భారతీయసంతతివారు అత్యధిక సంఖ్యాకులు; వర్ణజాతులవారు 20,18,453. ఆఫ్రికా జాతులవారందరును 'బంటూ'జాతి అను పేర పిలువబడుచున్నారు వీరిలో ప్రముఖ తెగలు జూలూ (జ. సం. 40 లక్షలు), జోసా (39 లక్షలు), చ్వానా (17 ల.), సెపెదీ (16 ల.), సోతో (13 లక్షలు). దేశపు నగరములలో జోహనెస్‌బర్గ్ (జ. సం. 14,07,963); కేప్ టౌన్ (8,25,752), ప్రెటోరియా (5,71,541); బ్లూమ్ ఫీల్డ్ (1,80,179); దర్బన్ నగరము (8,74,001) అనునవి పేర్కొనదగినవి (1970). శ్వేతజాతులలో దాదాపు 18 లక్షల మందికి మాతృభాష ఆఫ్రికాన్స్; ఇది ఒక డచ్చి భాషా వికృతి; ఇందు పోర్చుగీజు, ఇంగ్లీషు, ఆఫ్రికన్ భాషల పదములు కలగా పులగముగ చేరి

ఉన్నవి; తక్కిన శ్వేతజాతీయుల మాతృభాష ఇంగ్లీషు; అయినను శ్వేతజాతీయులలో దాదాపు 70% కు ఈ ఉభయభాషలతో పరిచితి కలదు. వర్ణ జాతులవారందరికి మాతృభాష ఆఫ్రికాన్సే; అయినను కొందరికి ఇంగ్లీషు భాషతోకూడ పరిచయము కలదు. పట్టణ ప్రాంతములందలి ఆసియాదేశీయులందరును పౌరవ్యవహారములందు ఇంగ్లీషుననే మాటాడుచు, తక్కిన సందర్భములందు హిందీ, తమిళ్, చీనీజ్ మొదలగు తమతమ మాతృభాషలలో ప్రసంగింతురు. ఆఫ్రికాజాతి యులలో జోసా, జూలూ, మొదలగు పలు భాషలు వాడుకయందున్నను, శ్వేతజాతీయులవద్ద పని చేయుటకై వారిలో కొందరు ఇంగ్లీషును నేర్చు కొనెదరు. వారి మాతృభాషలు సైతము ఇంగ్లీషు భాషాపదములను పెక్కింటిని గ్రహించినవి. మొత్తముమీద పట్టణములందు ఇంగ్లీషును, పల్లె లందు ఆఫ్రికాన్స్‌భాషయు వ్యావహారిక భాషలుగ ఉన్నవని చెప్పవచ్చును. ఆఫ్రికాన్స్, ఇంగ్లీషుభాషలు సాధికార భాషలుగా పరిగణను పొందినవి. శ్వేత జాతీయులందరును క్రైస్తవులు; వర్ణజాతులవారును దాదాపుగ అందరును క్రైస్తవులే. ఆసియావారిలో మాత్రము వారివారి మతములు - అందును విస్తృ తముగ హిందూ, ఇస్లాంమతములు - వ్యాప్తిలో ఉన్నవి. బంటూజాతి వారిలో దాదాపు 16 లక్షల మంది క్రైస్తవులు, తక్కినవారందరుసు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ.** : దేశమున (నమీ బియా*తోకలసి) 3,873 తంతితపాలా ఆఫీసులు పనిచేయుచున్నవి. టెలెక్స్ సదుపాయముద్వారా 112 విదేశములతో వార్తా సౌకర్యము ఏర్పడి యున్నది. 15,53,825 టెలిఫోన్‌స్టేషన్లు కలవు. దేశపు రేడియో బ్రాడ్‌కాస్టింగ్ కేంద్రము 20 స్టేషన్లద్వారా వివిధ భాషలలో ప్రసారములను నిర్వ హించు చున్నది

**5 యాన సౌ.** : దేశమున మొత్తపు రోడ్ల నిడివి 3,20,000 కిమీ., ఇందు జాతీయ రహ దారులకుచెందిన 1,300 కిమీ., రాష్ట్ర ములకు చెందిన 30,700 కిమీ., తారువేయబడినవి. మొత్తపు రైలుమార్గముల నిడివి 22,400 కిమీ. ఇందు 7,520 కిమీ. లో విద్యుత్‌సహాయమున బండ్లు నడుచుచున్నవి (1970). సముద్రతీరమున సర్వ పరికర సమన్వితములగు 4 హార్బరులు కలవు. ఇందు డర్బన్‌రేవు ప్రముఖమైనది. కేప్‌టౌను, పోర్ట్ ఎలిజబెత్, ఈస్ట్‌లండన్ అనునవి తక్కినవి. ఇవిగాక అల్పపు రేవులును అనేకములు ఉన్నవి. నమీబియాలో, పరిపాలనా రీత్యా చేరియున్న వాల్విస్ బే హార్బరు కూడ ఈ దేశపు వర్తక వ్యాపారములకు ఉపయోగపడుచున్నది. దేశమున 10 విమానాశ్రయములను ప్రభుత్వమే నిర్వహించు చున్నది. ఇందొకటి నమీబియాదేశపు ముఖ్య నగరమున ఉన్నది. ఇవిగాక 13 విమానాశ్ర యములు కలవు. వీనివలన దేశ, విదేశ విమాన యానికులకు సౌకర్యములు బాగుగా ఏర్పడినవి. 22 విదేశీయ విమానయాన సంస్థలును, దేశీయ ప్రభుత్వ విమానయాన సంస్థయు ఈ విమానాశ్ర యములను ఉపయోగించు కొనుచున్నవి

**6. చరిత్ర :** దేశమున పురాతత్త్వ శాస్త్రజ్ఞులు జరిపిన త్రవ్వకములలో వెలువడిన మానవ కపాల శిథిలముల వలన ఈ ప్రాంతము మానవజాతి తొలుతటి నివాస భూములలో ఒకటిగ లెక్కకు రాగలిగినది. కాని 15 వ శతాబ్ది అంతమున యూరపువాసులు ఇట కాలిడునాటికి రెండువిధముల జాతులప్రజలు - బుష్‌మన్ అనబడు అనాగరిక దిమ్మరి జాతివారును, హాటెన్‌టాట్లు అనబడు

*నమీబియా అనునది ఈ దేశపు వలసరాజ్యము (చూ : నమీబియా)

వ్యావసాయిక జాతిప్రజలును - మాత్రమే ఇట వసించుచుండిరి. 1488 లో బార్తొలోమ్యూ డయజ్ అను పోర్చుగీజు నావికుడు ఈ దేశపు దక్షిణపు కొననున్న గుడ్‌హోప్ అగ్రమును కనుగొనెను. తరువాత 1497 లో భారతదేశమునకు సముద్ర మార్గమును అన్వేషించుచు వాస్కో డి గామా అను పోర్చుగీజు సాహసికుడు ఈ దేశమునందలి నెటాల్ ప్రాంతమును దర్శించెను. కాని అతడు ఈ దేశమున స్థావరములను నెలకొల్పలేదు. 1662 లో డచ్చి ఈస్ట్ ఇండియా కంపెనీ అను వ్యాపారసంస్థకు చెందిన జాన్ ఫాన్ రీబెక్ అనువాని నాయకత్వమున కేప్ (అగ్రము) ప్రాంతమున తొలుతటి స్థావరము నెలకొల్పబడినది. డచ్చివారిటకు మలయా మొదలగు తూర్పు ప్రాంతములనుండి కూలీలను కొనివచ్చిరి. ఆ కూలీలును, డచ్చివారును దేశీయులగు హాటెన్ జాట్ జాతుల స్త్రీలను భార్యలుగ స్వీకరించుటవలన, కాలక్రమమున ఈ దేశపు రంగుజాతుల ప్రజలు రూపొందిరి. దేశమున పశువుల పెంపకమునకు విరివిగ అవకాశములు ఉండుటవలన క్రమేణ యూరపీయ కుటుంబములును అనేకములు అటకు వలసవచ్చి దేశాంతర్భాగమునకు చొచ్చుకొని పోవుచు, దేశీయులను తరుమసాగినవి. తత్ఫలితముగ దేశీయప్రజల సంఖ్య సన్నగిలినది. యూరపియనుల ఈ దురాక్రమణను ఆపుటకు కొన్ని ఆఫ్రికన్ జాతులవారు 1779 మొదలుగ 1812 వరకు పోరాటములను అంతటంతట సాగించిరి; కాని ఫలితము లేకపోయినది

1795 లో కేప్ ప్రాంతమును గ్రేట్‌బ్రిటన్ ఆక్రమించినది. అంతవరకు తనకు ఉండిన అధికారములను డచ్చిప్రభుత్వము 1814 లో వియెన్నా ఒడంబడిక ద్వారా బ్రిటన్‌కు దత్తము చేసినది. 1820 నుండి బ్రిటన్ పౌరులు ఇటకు వలస చేరసాగిరి. అంతట ఇంగ్లీషు అధికారభాషగ రూపొందినది (1828). 1834 లో బానిసత్వము రద్దైనది.

అనంతరకాలమున ఇంగ్లీష్ ప్రజలతో కలిగిన పొరపొచ్చెముల మూలమున ఆఫ్రికాన్స్ ప్రజలు (పూర్వపు డచ్చి సంతతివారు) కేప్ ప్రాంతమును వదలి ఉత్తరభూములకు వలసపోయిరి (1836). వారివలన రూపొందినవే ఆరంజి ఫ్రీస్టేట్, ట్రాన్స్‌వాల్ రాష్ట్రములు. వారిలో కొందరు నెటాలునను చేరిరి. బ్రిటిష్‌వారు నెటాలును 1843 లో ఆక్రమించి అటనుండి క్రమముగ పురోగమించి విస్తృతప్రాంతములను వశపరచుకొనిరి (1887). అయినను, ఆఫ్రికాన్స్ ప్రజల అధీనమున ఆరంజి ఫ్రీస్టేట్, ట్రాన్స్‌వాల్ రాష్ట్రములు కొంతకాలము స్వతంత్రతతో మనగలిగినవి; అట్లులే ఆఫ్రికన్ జాతుల ఆధ్వర్యమున స్వాజీలాండ్ కూడ స్వతంత్రరాజ్యముగ కొంతకాలము ఉండినది.

దేశమున ఇటుల పలు విదేశీయ స్థావరములు ఏర్పడిన తదుపరి చెరకు తోటలు వగైరాలలో పని చేయుటకు కుశలురగు పనివారి కొరత ఏర్పడెను. అందులకై ఇండెంచరు పద్ధతి*పై భారతదేశము నుండి కూలీలు కొనిరాబడిరి. ఇండెంచరు వాయిదా గడచిన తరువాతకూడ వారిలో పలువురు ఇట నిలిచిపోయిరి. వారి సంతతియే నేటి దక్షిణ ఆఫ్రికా లోని భారతీయ సంతతి.

1869 లో ఆరంజినది ప్రాంతమున వజ్రపు గనులు వెలువడుటయు, విదేశీయులు అనేకులు వచ్చి చేరుటయు, తత్ఫలితముగ యాన సౌకర్యాదులేర్పడి దేశము సుసంపన్నమగుటయు జరిగినవి.

* ఇండెంచరు పద్ధతి అనగా కొంత నిర్దిష్ట కాలమువరకు విధిగా జీతము వగైరాలను ఇచ్చి పనిచేయించుకొనుటకై ఏర్పడిన ఒడంబడిక విధానము.

ఇంతలో ఆరంజిఫ్రీస్టేటు, ట్రాన్సువాలులలోని బోయర్లకును (డచ్చి సంతతి వ్యావసాయికులకును) ఇంగ్లీషువారికిని విరోధము లేర్పడి పోరాటములు జరిగి, కడకు 1902 లో ఆ రాష్ట్రములును బ్రిటిష్ వారి వశమైనవి. ఇటుల అంతటంతట బ్రిటిష్ వారికి వశములైన వివిధ ప్రాంతములలో కొన్ని స్వయంపాలిత రాష్ట్రములుగను, కొన్ని మకుటపు వలసలుగను బ్రిటిష్ సామ్రాజ్యమున చేరియుండినవి. కాని డచ్చిజాతి ప్రజలు (బోయర్లు లేదా ఆఫ్రికనీరులు) ను ఇంగ్లీషు ప్రజలును కాలక్రమమున ఒక ఒడంబడికకు వచ్చిన మూలముగా 1909 లో ఈ రాష్ట్రములు అన్నియు 'దక్షిణ ఆఫ్రికా' అను పేర, బ్రిటిష్ సామ్రాజ్యమున స్వపరిపాలనగల రాజ్యముగ రూపొందినవి. ఆ రాజ్యము 1926 న కామన్‌వెల్త్‌లో భాగస్వామియైనది. ప్రథమ ప్రపంచ యుద్ధమున ఈ రాజ్యము పాల్గొని, సంధి ఒడంబడిక మూలమున నమీబియాను మాండేటరీ రాజ్యముగ తన పాలన లోనికి గ్రహించినది.

దేశమున ఆర్థిక వ్యవస్థయంతయు, శ్వేతజాతుల వశముననే ఉండినను, ప్రజలలో వారు అత్యల్ప సంఖ్యాకులగుటవలన, తమ అధికారమును నిలువ బెట్టుకొనుటకై పరిపాలనా విధానమును అందులకు అనువుగ ఏర్పరచుకొనుటకు, ఆ శ్వేతజాతులవారు తొలుతనుండియు ఎంతయో శ్రద్ధవహించిరి. శ్వేత జాతులు కానివారికి వోటు హక్కును లేకుండ చేయుటయేగాక, వారిని కడు హీనముగ చూచు చుండిరి. అచటి ఆసియావాసి సంతతివారికిని ఈ కష్టములు తప్పలేదు. అట్టి భారతీయ సంతతి ప్రజల ఇక్కట్లను అంతమొందించి వారిలో స్వాభిమాన ఆత్మగౌరవములను పెంపొందించుటకై, అప్పటిలో అచట పనిచేయుచుండిన మోహన్‌దాస్ కరంచంద్ గాంధి 'సత్యాగ్రహము' అను నూత్న ఆందోళనా విధానమును రూపొందించి, శాంతియుత రీతిలో పోరాడెను (1904-1914). అందువలన కొన్ని సత్ఫలితములు కలిగినను వర్ణవిచక్షణ సమస్య అటులే నిలిచియున్నది. ఈ సమస్యపైననే, కామన్‌వెల్త్‌లోని తక్కిన రాజ్యములలో అనేక ములు, దక్షిణ ఆఫ్రికా కామన్‌వెల్త్‌లో ఉండుటకు వ్యతిరేకించినవి. కడకు దక్షిణ ఆఫ్రికా గణరాజ్యముగ రూపొంది కామన్‌వెల్త్‌నుండి వైదొలగెను. (మే 31, 1961).

**7. పరిపాలన :** ఈ దేశమున ఒక విధమగు విచిత్రమగు పరిపాలనా విధానము అమలునందున్నది. ప్రజాస్వామిక గణరాజ్య విధానము అమలునందున్నను పార్లమెంటులోని సభ్యులందరును శ్వేతజాతీయులే. వోటుచేయు హక్కు 18 ఏండ్లకు పైబడిన శ్వేతజాతీయ స్త్రీ పురుషులకు మాత్రమే కలదు. అత్యధిక సంఖ్యాకులగు బంటూ జాతీయులకుగాని తక్కిన జాతులవారికిగాని పార్ల మెంటున ప్రాతినిధ్యమేలేదు. కేప్ రాష్ట్రపు రంగు జాతులకు ఒక ప్రత్యేక వోటర్ల పట్టిక కలదు; కాని అందలి వోటర్లు నలుగురు శ్వేతజాతీయులను మాత్రమే పార్లమెంటుకు ఎన్నుకొనవలయును. పార్ల మెంటునందు రెండు కక్ష్యలు కలవు. అందొకటి విధానసభ; రెండవది శిష్టసభ. పార్లమెంటునకు ఎన్నిక అయిదేండ్ల కొకసారి జరుగును. పార్ల మెంటు సభ్యులందరును దేశాధ్యక్షుని ఎన్నుకొనెదరు. అతని పదవీకాల పరిమితి ఏడు సంవత్సరములు.

దేశమున నాలుగు రాష్ట్రములు (కేప్ ఆఫ్ గుడ్ హోప్, నెటాల్, ట్రాన్స్‌వాల్, ఆరంజి ఫ్రీ స్టేట్) కలవు. ప్రతి రాష్ట్రమునను శ్వేతజాతీయులచే ఎన్నుకొనబడిన శాసనసభ పనిచేయుచున్నది. దీనికి, రాష్ట్ర విషయములందు శాసన నిర్మాణాధికారము ఉన్నను, దేశాధ్యక్షుడు అట్టి శాసనమును దేనినైనను, అవసరమని తోచునెడల, త్రోసిరాజనవచ్చును. కేంద్ర ప్రభుత్వము నియమించు పరిపాల

కుడు, ఈ శాసనసభ సహాయముతో, రాష్ట్రమును పాలించును. రాష్ట్ర శాసనసభకును 5 ఏండ్ల కొకసారి ఎన్నికలు జరుగును. పెద్ద నగరములకు ఎన్నుకొనబడిన నగరపాలక సభలును అధ్యక్షులును కలరు. దేశమునగల 5 రాజకీయ పక్షములలో నేషనల్‌పార్టీ, యునైటెడ్ పార్టీ అనునవి ప్రముఖములు.

1951 లో ఆమోదింపబడిన ఒక చట్టమును అనుసరించి ఆయా జాతుల ప్రజలు తమతమ నిర్దిష్ట ప్రత్యేక ప్రాంతములలో స్వయంపాలక మండలములుగ రూపొందవలసియున్నది. ఇదియే 'అపార్తీడ్' (వర్ణ విచక్షణ) విధానము అని వ్యవహరింపబడుచు ప్రపంచమునందలి ప్రగతిశీలక రాజ్యముల వారిచేతను, అభ్యుదయ కాముకులచేతను నిరసింపబడుచున్నది. దీనిని అనుసరించి, ఆయా వర్ణములవారలు, తమతమ ప్రత్యేక మండలములలో పాలనను నిర్వహింప నేర్చుకొని కాలక్రమమున స్వయంపాలక మండలములుగ రూపొందవలసియున్నది. ఆచరణలో ఇందువలన, ఆయా జాతులకు ప్రత్యేక నివాస ప్రాంతములు, విద్యాశాలలు ఏర్పరుపబడుట జరిగినది. హోటళ్ళు, పాఠశాలలు మొదలగునవికూడ ఈ రంగు విచక్షణతోనే నెలకొల్పబడుచున్నవి.

పైన పేర్కొనబడిన చట్టమును అనుసరించి బంటూ జాతి ప్రజల నివాసమునకై ఆరు ప్రత్యేక మండలములు రూపొందింపబడినవి. వీనిలో ట్రాన్స్‌కీ* అనుదానికి 1963 లో స్వయంపాలనా ప్రతిపత్తి కల్పింపబడినది.

భారతీయ సంతతివారి యోగక్షేమములను కనిపెట్టి యుండుటకై దక్షిణ ఆఫ్రికా ఇండియన్ కౌన్సిల్ అను సలహా సంఘము ఏర్పరుపబడినది. ట్రాన్స్‌వాల్, నెటాల్, కేప్ రాష్ట్రములలో నివసించు భారతీయుల వివిధ సంఘములనుండి, ప్రభుత్వమే ఈ కౌన్సిల్‌కు 25 మందిని నియామకము చేయుచున్నది. భారతీయుల శ్రేయస్సునకు సంబంధించిన విషయములపై ప్రభుత్వమునకు ఈ కౌన్సిల్ సలహాలను ఇచ్చుచున్నది.

వర్ణజాతులవారికి ఒక ప్రత్యేక ప్రతినిధి సంఘము కలదు. ఇందలి సభ్యసంఖ్య 40. వీరిని ఆ జాతులవారే ఎన్నుకొనెదరు. ఆయా జాతులవారి విద్యా, సాంఘిక శ్రేయాది విషయములను ఆ సంఘమే నిర్వహించుచున్నది.

దేశమున న్యాయపరిపాలన రోమన్ డచ్చిలాను, అనుసరించి జరుగుచున్నది. కేప్ రాష్ట్రమున మాత్రము ఆంగ్ల న్యాయసంహిత, కొన్ని వ్యవహార శాఖలందు, అమలున ఉన్నది. బంటూ జాతులవారికై కొన్ని ప్రాంతములందు ప్రత్యేక న్యాయస్థానములు కలవు. దేశమున అత్యుచ్చ న్యాయస్థానము సుప్రీమ్‌కోర్టు.

**8. దేశరక్షణ :** దేశమునకు మూడు విధముల రక్షక బలము కలదు. అవి (1) శాశ్వత సేన, (2) పౌరసేన, (3) ఆదేశిక (కమాండో) సేన. 17 నుండి 65 ఏండ్లవరకు వయసుగల ప్రతి పౌరుడును సైనిక శిక్షణను పొందియుండి, అవసరము వచ్చినపుడు యుద్ధమున పాల్గొనవలెనను నియమము కలదు. శాంతికాలమున సైతము సర్వసన్నద్ధమై ఉండునది శాశ్వతసేన. ఆదేశిక సేనలోనివారును సుశిక్షితులే; అయినను అవసరమును అనుసరించి, ప్రభుత్వాదేశ ప్రకారము యుద్ధరంగమునకు వత్తురు. పౌరసేనవారు పైవారి యంతగ సుశిక్షితులుకారు.

* జోసాజాతి ప్రజల నివాస భూమిగ ఇది నిర్ణయింపబడినది. దీని వైశాల్యము 43,090 చ. కిమీ; జనసంఖ్య 15 లక్షలు; వీరికి 109 మంది సభ్యులుకల ఒక శాసనసభ కలదు. ప్రజలలో 18 ఏండ్లకు పైబడిన వారికి వోటు హక్కు ఏర్పడియున్నది.

శాశ్వత సేనయందు 10,000 మందికల పదాతి దళములును 3100 మందికల నావికా దళమును, 5,000 మంది కల వైమానిక యోధ దళములును కలవు. ఈ వివిధ సేనాంగములును పటుతర పరికర, ఆయుధ సమన్వితములు.

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స సంస్థాపక సభ్యరాజ్యములలో ఈ దేశమొకటి. అయినను ఈ రాజ్యము అనుసరించెడు 'రంగు విచక్షణ' ను బట్టియు, నమీబియాకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించుటకు నిరాకరించుటవలనను, ప్రపంచ రాజ్యములలో పెక్కింటితో — అలీన రాజ్యములతోను, కమ్యూనిస్ట్ రాజ్యములతోను, ఆఫ్రికా యందలి పెక్కు స్వతంత్ర రాజ్యములతోను — ఈ దేశమునకు దౌత్య సంబంధములు రద్దయినవి.

**10. ఆర్థిక రంగము :** ప్రపంచమందలి సంపన్న రాజ్యములలో ఇది ఒకటి. ప్రపంచమున సాలీనా గనులనుండి వెలికి దీయబడు బంగారమున సగము ఈ దేశమున లభించుచున్నది. కాని ఈ సంపత్తిలో అత్యధిక భాగము శ్వేతజాతీయులకే దక్కుటవలన జీవన వ్యయ ప్రమాణమున తక్కిన జాతులు శ్వేతజాతులకన్న చాల తక్కువ స్థాయిలో ఉన్నవి.

దేశమున 12% భూమి సేద్యమునకు అనుకూలము; అందును 75% శ్వేతజాతీయులకే చెందినది. ముఖ్యమగు పంట మొక్కజొన్న; తరువాత లెక్కకు వచ్చునది గోధుమ. తక్కిన ధాన్యములును, చక్కెరయు దేశావసరములకు కొంతవరకు సరిపోవునటుల ఉత్పత్తి అగుచున్నవి. ఖనిజములలో ఉత్పత్తి విలువలనుబట్టి బంగారము, రాగి, బొగ్గు, వజ్రములు క్రమముగ పేర్కొనదగినవి. పశుసంపదియు విరివిగ కలదు. పరిశ్రమల యందును దేశము చాల పురోగమించి, పారిశ్రామికోత్పత్తులను, యంత్రములను ఎగుమతి చేయుచున్నది. బోట్స్వానా, లెసోతో, స్వాజీలాండులతో కలసి ఈ దేశము ఒక శుల్క సమ్మేళనమున చేరియున్నది. అందువలన ఎగుమతి దిగుమతుల లెక్కలలో, తక్కిన దేశముల సంఖ్యలును చేరియున్నవి. అట్టి ఎగుమతుల విలువ 229.96 కోట్ల రాండ్లు; దిగుమతుల విలువ 287.79 కోట్ల రాండ్లు (1968). కాని ఎగుమతులలో బంగారమునకు సంబంధించిన లెక్కలు చేరుటలేదు. దేశమున విద్యుదుత్పత్తి 4,094.8 కోట్ల కివా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 230.54 కోట్ల రా.

**11. సాంఘిక రంగము :** దేశమున సమగ్రమగు సాంఘిక భద్రతా విధానము అమలున ఉన్నది. దాని వలన నిరుద్యోగ భీమా, వార్ధక్యపు పెన్షన్లు మొదలగు సౌకర్యములు పౌరులకు ఏర్పడినవి. గృహనిర్మాణమునకు ప్రభుత్వము విరివిగ సాయము చేయుచున్నది. దేశమున విద్యావిధానమునను రంగు విచక్షణ అమలున ఉన్నది. అందువలన ఆ యా జాతులవారికి వేర్వేరుగ విద్యాశాలల వసతులు ఏర్పడియున్నవి. 1972 లెక్కలను అనుసరించి ఈ దిగువ వివరములు తెలియవచ్చుచున్నవి.

| | పాఠశాలలు | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| శ్వేతజాతులు | 2,662 | 32,505 | 8,78,939 |
| వర్ణజాతులు | 1,850 | 15,701 | 5,39,019 |
| ఆసియా జాతులు (చీనీయులు గాక) | 368 | 6,034 | 1,79,648 |
| బంటూ | 10,551 | 52,442 | 29,36,905 |
| చీనీయులు | 6 | — | 609 |

పైవి ప్రభుత్వ పాఠశాలలు. ఇవిగాక శ్వేత జాతీయులకు 197, వర్ణజాతులకు 23, ఆసియా వాసులకు 3, బంటూలకు 443 ప్రయివేటు పాఠ శాలలు పనిచేయుచున్నవి. దేశమునగల 16 విశ్వ విద్యాలయములలో శ్వేతజాతులకై 11 (విద్యార్థి సంఖ్య 56,495), బంటూలకొరకై 3 (4,417 వి.), రంగు జాతుల వారికై 1 (600. వి.), భారతీయుల కొరకై 1 (2,668 వి.) పనిచేయుచున్నవి. ఆంగ్ల మున 15, ఆఫ్రికన్స్‌లో 4, ఆంగ్ల, జూలూ, సెసెతో భాషా ప్రతులతో ఒక దినపత్రికయు దేశ మున ప్రచురితము లగుచున్నవి (1969.) ప్రముఖ గ్రంథాలయములు పెద్ద నగరములలో అన్నింట ఉన్నను, జోహానెస్‌బర్గ్‌లోనిది అన్నింటికన్న పెద్దది. మ్యూజియములలోకూడ ఆ నగరపు మ్యూజియమే ముఖ్యము. 1970 లో దేశమున 688 ఆసుపత్రులు పనిచేయుచుండినవి. వైద్య సంఖ్య 7,271; దేశమున వివిధ ఆసుపత్రులలోని శయ్యా సంఖ్య 1,79,562.

**12. యాత్రా సౌ. :** దేశమున పర్యటించ గోరు విదేశీయులకు అనుమతి పత్రములు ఉండి తీరవలయును. 1967 లో 2,75,538 మంది విదే శీయులు దేశమును దర్శించిరి. ఇందులో పలువురు వ్యాపారాదుల కొరకును, విశ్రాంతి కొరకును వచ్చినవారు.

**13. అధీన ప్రాంతములు :** ప్రథమ ప్రపంచ యుద్ధ ఫలితముగ నమీబియా (నైరుతి ఆఫ్రికా) ఈ దేశమునకు వలస రాజ్యముగ దక్కి (1920) తదాదిగ, ఈ దేశపు పరిపాలనలోనే ఉన్నది (చూ: నమీబియా).

**14. ప్రసిద్ధ పౌరులు :** 1. జనరల్ జాన్ క్రిస్టియన్ స్మట్స్ (1870-1950); బోయర్ సంతతివాడు. ఆంగ్లేయులను తొలుత ప్రతిఘటించి పోరాడినను, అనంతర కాలమున బ్రిటిష్ కామన్ వెల్తునకు ప్రముఖ ఆధారముగ నిలిచినవాడు. దేశ మునకు ప్రధానిగా చాలకాలము పనిచేసెను. ఆ దేశమున గాంధిజీ సత్యాగ్రహోద్యమమును నిర్వ హించి నపుడు, ఇతడు గాంధీజీని జైలున నిర్బం ధించెను; కాని గాంధీజీ యెడల గౌరవ భావమును ప్రదర్శించెను.

2. **ఆల్బర్ట్ జాన్ లితూలి :** (1898?– 1967) బంటూ జాతీయుడు. ఆఫ్రికన్ జాతీయ కాంగ్రెసునకు అధ్యక్షుడుగ కొంతకాలము పని చేసెను. శాంతియుత విధానమునను, సహకార మార్గమునను దేశమునందు శ్వేత, శ్వేతేతర జాతుల మధ్య గౌరవయుత సంబంధములను నెలకొల్ప వీలగునని విశ్వసించి కృషిచేసినవాడు. ప్రపంచ శాంతి సాధనకై కృషిచేసిన ప్రముఖుడుగ అతనికి 1961 లో నోబెల్ శాంతి బహుమానము లభించినది.

---

# 27. దహోమీ

**ముఖ్యనగరము :** పోర్టో – నోవో; **జెండా:** దండమువద్ద ఆకుపచ్చని నిలువుచారయు, ఆ చారకు ఆనుకొని సమవిస్తృతిలో అడ్డముగ ఎగువన పసిమి చారయు, దిగువన ఎరుపు చారయు కలది; **జాతీయ గీతము :** లా ఆబి నౌ విల్లే... (ఆ నవో దయం...); **నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఎ), సాధారణముగ 100 సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు = రూ 2.60; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** పశ్చిమ ఆఫ్రికా యందు, గినీ సింధుశాఖయొక్క ఉత్తర తీరమున, 0°40′-3°-40′ తూ, తులారేఖల మధ్యను, 6°40′-12°40′ ఉ. అక్షాంశల మధ్యను విస్తరించి ఉన్న ఈ గణ రాజ్యమునకు ఉత్తరమున




పటము 27.

నైగర్, తూర్పున నైగీరియా, పశ్చిమమున టోగో, దక్షిణమున అట్లాంటిక్ మహాసముద్రము, వాయవ్యమున అప్పర్‌వోల్టా దేశము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 1,15,760 చ. కిమీ. దేశపు నదులలోనెల్ల ఔమీ అనునది పెద్దది; దాని నిడివి 455 కిమీ; అందు 200 కిమీ. వరకు నౌకాయానమునకు అనువుగ ఉన్నది. తరువాత లెక్కింపదగినది కాఫోనది; ఇది అహీమీ సరస్సులో చేరుచున్నది. దేశమున అగ్నేయదిశగా అటకోరా పర్వతశ్రేణి కలదు. ఇందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 730 మీ.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశపు పశ్చిమ ప్రాంతమున భూమధ్య రేఖాప్రాంతపు శీతోష్ణ పరిస్థితియు, ఉత్తర ప్రాంతమున ఉష్ణమండల పరిస్థితియు కాననగుచున్నవి. ఉత్తర, తూర్పు ప్రాంతములందు సాలీనా వర్షపాతము 100 సెం. మీ; నైర్భుతి ప్రాంతమున ఆ వర్షపాతము 76 సెం. మీ; మధ్య ప్రాంతమున అదియే 133 సెం. మీ. పగటి ఎండలతీవ్రత జనవరిలో ఎక్కువ. సంవత్సరము పొడవున పగలు, రాత్రుల ఉష్ణోగ్రతల మధ్య వ్యత్యాసము 28° ఫా. గ ఉండును. దేశమున చెప్పుకొనదగిన విశాలపు అడవులు లేవు. తీరమున కొబ్బరి చెట్లు విరివిగ కన్పట్టును. ఆ దేశాంతర్భాగమునఉన్న కొలది పాటి అడవులలో ఏనుగు, సింహము మొదలగు పెద్ద వన్య జంతువులును కననగుచున్నవి.

**3 జనసంఖ్య మొ.:** 1970 లోని అంచనాను అనుసరించి దేశపు జనసంఖ్య 27,18,000, జన సాంద్రత చ. కి. మీ. కు 24. దేశ జనులలో పెక్కురు దేశపు దక్షిణపు ప్రాంతమున వసించుచున్నారు. నగరములలో పోర్టోనోవో (జనసంఖ్య 87,000), కొటోనూ (1,39,000), అబోమీ (34,000) పేర్కొనదగినవి. దేశప్రజానీకమున దహోమీ, అడ్జా, అయిజో, బరిబా, మొదలగు ఆఫ్రికన్ జాతులవారు కాననగుచున్నారు, వీరిలో తొలుతటివారు అత్యధిక సంఖ్యాకులు. ఆయా జాతుల మాతృభాషలు వేర్వేరుగ ఉన్నను ఫ్రెంచియే వ్యవహార భాషగ వాడుకయందున్నది. ప్రజలలో దాదాపు 336 వేల ముస్లిములును, 386 వేల క్రైస్తవులును కలరు. తక్కిన వారందరును సాంప్రదాయిక ప్రకృతిదేవతారాధకులు.

**4. సమాచార సా.:** దేశమున 68 పోస్టాఫీసులు 6,494 టెలిఫోనులు కలవు. కొటోనూ నుండి నైగర్, సెనెగల్, టోగోదేశముల ముఖ్య

నగరములకు తంతిసౌంకర్యమును, పారిస్‌కు రేడియో - టెలిఫోన్ సదుపాయమును కలవు. రేడియోప్రసారకేంద్రము ఒకటి పనిచేయుచున్నది.

**5. యానసౌ. :** దేశమునందలి 6,320 కిమీ. నిడివిగల రోడ్డు మార్గములలో 1,152 కిమీ. మాత్రమే తారువేయబడినవి. దేశమునగల ఒకే ఒక రేవునగరము కొటోనూ. నైగీరియా దేశము అన్ని వైపుల భూపరివృతమగుటవలన ఆ దేశమును ఒక ఒడంబడికమూలమున లభించిన సదుపాయమువలన ఈ రేవునే తన ఎగుమతిదిగుమతులకు వాడుకొనుచున్నది. దేశపుతీరపు వెంబడి ఇసుక దిబ్బల వలన ఏర్పడిన జలాశయములు నౌకాయానమునకు కొంతవరకు ఉపకరించుచున్నవి. కొటోనూలో ఒక అంతర్జాతీయ విమానాశ్రయము ఉన్నది. దేశమున తక్కిన ప్రాంతములలో అటనట చిన్న విమానాశ్రయములు కలవు వీనినుండి కొటోనూకు చిన్న విమానములు పయనించుచున్నవి. కొటోనూనుండి పశ్చిమాఫ్రికాలోని పలు ప్రముఖ నగరములకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** 19 వ శతాబ్దికి పూర్వమున ఈ ప్రాంతమునకు ఒక దేశముగ పరిగణన లేకుండినది. ఆఫ్రికాఖండమున తమ ఆధిపత్యమును నెలకొల్పుటకు ఫ్రెంచివారును ఆంగ్లేయులును సాగించిన పోటీలో కుదిరిన ఒక ఒడంబడిక మూలమున ఒక తీరుతెన్నులేని రీతిలో సరిహద్దులు నిర్ణయింపబడి 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున ఫ్రెంచివారి ఆధిపత్యమున ఈ దేశము రూపొందినది (1888-89). అయినను స్థానికులు కొందరు ఫ్రెంచివారి అధికారమును ఎదిరించి పోరాడిరి. కడకు 1894 లో అట్టి తిరుగుబాటులను అన్నింటిని అడచి ఫ్రెంచి వారు దేశమును కైవసము చేసికొనిరి. తదాదిగ ఫ్రెంచివారి పశ్చిమాఫ్రికా సమాఖ్యలో అంతర్భాగముగ ఈ దేశము వలసపరిపాలనలో ఉండినది. 1946 మొదలుగ దేశము అంచెలవారీగా స్వతంత్రతను పొంది, కడకు అగస్టు, 1960 న పూర్ణ స్వాతంత్ర్యమును ఆర్జించినది.

**7. పరిపాలన :** స్వాతంత్ర్యము లభించిన తరువాత కొంతకాలము దేశమున ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రభుత్వము అధికారమున ఉన్నను 1963 మొదలుగ దేశమున ఒకవిధపు సైనిక ప్రభుత్వమే అమలునందున్నది; ఈ ప్రభుత్వమునకు పౌరప్రముఖులలో కొందరి అండయు కలదు. అందువలన 1970 లో జనాభిప్రాయసేకరణ (రెఫరెండం) ద్వారా ఒక ప్రాతిపదిక ప్రభుత్వచట్టము (ఫండమెంటల్ స్టేట్ లా) ఆమోదితమైనది. దానిననుసరించి ముగ్గురుప్రముఖులు సభ్యులుగాగల అధ్యక్షవర్గము దేశపరిపాలనను నిర్వహించు బాధ్యతను గ్రహించినది. ఈ ముప్వురిలో ప్రతియొకడును వంతులవారీగా రెండేండ్లు అధ్యక్షుడుగ వ్యవహరించుచుండును. స్థానికపరిపాలనను, అచటి ప్రజాప్రతినిధుల సలహాతో, కేంద్రప్రభుత్వప్రతినిధులు నిర్వహింతురు. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు.

**8. దేశరక్షణ :** 2100 మంది సైనికులు గల పదాతి దళములు రెండును, 100 మందిగల వైమానిక సేనయు కలదు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా స. లోను, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. నైగర్ నదీప్రాంతపు తక్కిన దేశములతో పాటుగ ఆ నదిని వాడుకొను విషయమున ఈ దేశమునకును ఒడంబడికద్వారా హక్కులు ఏర్పడి ఉన్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థకు ముఖ్యాధారము వ్యవసాయము. సాగుపంటలలో జొన్న, వేరుసెనగ అతిముఖ్యములు. పశుసంపదయు దేశమున విరివిగ కలదు. కొబ్బరిజాతి చెట్లనుండి లభించు నూనెవలన దేశమునకు కొంత ఆదాయము

లభించుచున్నది. ఈ నూనెలును, తదనుబంధ ద్రవ్యములును దేశమునుండి ఎక్కువగ ఎగుమతి యగుచున్నవి. దేశపు ఉత్తరభాగమున ప్రత్తియు, దక్షిణభాగమున కాఫీయు, క్రొత్తగ సాగుచేయబడు చున్నవి. వీని వలన మున్ముందు గొప్ప ఆదాయము లభింపగలదని ప్రభుత్వాభిప్రాయము. దేశపు ఎగుమతుల విలువ 550.8 కోట్లఫ్రాంకులు; దిగుమతుల విలువ 1220.8 ఫ్రాంకులు (1968). విద్యుదుత్పత్తి 2.8 కోట్ల కి. వా. ఇది యంతయు తాపవిద్యుత్తే. జలవిద్యుత్తును ఉత్పత్తిచేయుటకై తగు వసతులు లేనందున, టోగో, ఘానాల నుండి అట్టి విద్యుత్తును ఒక ఒడంబడిక ద్వారా ఈ దేశము గ్రహించుచున్నది. దేశపు బడ్జెటరీవ్యయము 983.6 కోట్ల ఫ్రాంకులు (1970).

**11. సాంఘిక రంగము :** స్థానికపుమార్పులతో ఫ్రెంచి విద్యావిధానము ఇట అనుసరింపబడు చున్నది, ప్రయిమరీ పాఠశాలలో 1,39, 734 మంది, సెకండరీ పాఠశాలలలో 3,917 మంది, వృత్తి పాఠశాలలలో 229 మంది, విదేశములందలి ఉన్నత విద్యాసంస్థలలో 1000 మంది దేశీయ విద్యార్థులు పఠించుచున్నారు. బడికేగు వయసుగల పిల్లలలో 31% మంది చదువుచున్నారు. పోర్టోనోవోలో ఒక రమ్యమగు మ్యూజియమును, పోర్టో నోవో, కొటోనూలలో ప్రముఖ గ్రంథాలయములును కలవు. దినపత్రికలు ఏవియులేవు; కొన్ని వారపత్రికలు మాత్రము, ప్రభుత్వ పర్యవేక్షణలో నడచుచున్నవి. దేశమున ఆరోగ్యకేంద్రములు, తక్కిన అఫ్రికన్ దేశములతో పోల్చినపుడు ఎక్కువగ ఉన్నవనియే చెప్పవచ్చును. దేశమున 20 వేల మందికి ఒక డాక్టరు కలదని తెలుచున్నది. కుష్ఠు, యాస్ మొదలగు జాడ్యములు చాలవరకు అరికట్టబడినవి. దేశమునందలి పలుతెరగుల వైద్యశాలల మొత్తపు సంఖ్య 230.

**12. యాత్రా సౌ. :** దేశమున జాతీయ వనములను ఏర్పరచి వానిని మృగయాకేంద్రములుగ అభివృద్ధి పరచుటకు కృషి జరుగుచున్నది. యాత్రికుల సౌకర్యార్థమై కొటోనూలో రెండు పెద్ద హోటళ్లు నిర్మింపబడినవి.

---

# 28. నమీబియా (సౌత్ వెస్ట్ ఆఫ్రికా)

## (దక్షిణ ఆఫ్రికా పాలనలో ఉన్న దేశము)

**ముఖ్యనగరము :** విండ్‌హోక్; **నాణెము :** దక్షిణ ఆఫ్రికా దేశపు 'రాండ్' నాణెమే చలామణిలో ఉన్నది. 1 రాండు = రూ. 10.50; **కొలతూకములు;** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికాఖండమున నైరృతి మూలన, 12°-25° ద. అక్షాంశరేఖల మధ్యను, 19°-29° తూ. తులాంశ రేఖలమధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రము; ఉత్తరమున అంగోలా; ఈశాన్యమున జాంబియా; తూర్పున బోట్స్వానా, తూర్పునను దక్షిణమునను దక్షిణ ఆఫ్రికా సరిహద్దులందున్నవి. ఈశాన్యమూలన దేశములోని కాప్రివీ చీలిక, తూర్పుగ ముందునకు చొచ్చుకొని పోయి అంగోలాను బోట్స్వానానుండి వేరుచేయుచున్నది.

ఈ చీలిక వెడల్పు 32-96 కిమీ. నిడివి 480 కిమీ; తీరమును అనుకొనియున్న వాల్విస్ బే అను ప్రదేశము పరిపాలనారీత్యా దేశమున చేరి యున్నది; అయినను అది చట్టరీత్యా దక్షిణ అఫ్రికాలోని కేప్ ప్రావిన్స్‌కు చెందినటుల భావింప బడుచున్నది. దేశపు వైశాల్యము 8,23,145 చ. కిమీ. భౌతిక రీత్యా దేశము మూడు మండల ములుగ విభజింపదగియున్నది: (i) తీరమువెంబడినే 80-130 కిమీ. వెడల్పున ఉన్న నమీబ్ ఎడారి. (ii) మధ్యప్రాంతవు పీఠభూమి; దీనిఎత్తు 1000-2000 మీ. వరకు మారుచుండును. హెచ్చు




పటము 28.

తగ్గుల పరుపుడుతో కొంతవరకు ఇసుక నేలయు, మరికొన్ని యెడల గుట్టలును కలిగిన ఈ ప్రదేశపు వైశాల్యము దేశవైశాల్యమున దాదాపుగ సగము (iii) తూర్పు, ఈశాన్య, ఉత్తరమండలములు. ఇది యంతయు ఇసుకమైదానము; ఎచ్చటను నీటిమడుగు ఈ ప్రాంతమున కన్పట్టదని చెప్పవచ్చును.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఎండలు తక్కువయే యైనను, గాలిలో చెమ్మదనము చాల తక్కువ. అతి వృష్టియు అనావృష్టియు ఒకదాని తరువాత మరి యొకటి దేశమును బాధించుచున్నవి. తీరప్రాంతమున సాలీనా వర్షపాతము 0.5 సెం మీ. కాని లోనికి పోవుకొలది ఈ వర్షపాతము అతిశయించి, కాప్రివీ చీలికయందు సాలీనా 60 సెం.మీ. కు చేరుకొను చున్నది. నదులలో ఉత్తరపు సరిహద్దున ఉన్న కునీనీ. ఓకవాంగా నదులును, తూర్పు సరిహద్దున ఉన్న జాంబెసీ నదియు, ఆ ప్రాంతముననే ఉన్న మాషీనదియు ప్రముఖములు.

**3. :జనసంఖ్య మొ. :** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 7,46,328. ఇందు శ్వేతజాతీయుల సంఖ్య 90,658; వర్ణజాతులవారి సంఖ్య 25,000; తక్కిన వారందరు నీగ్రో జాతులలో పలుతెగలకు చెందినవారు. అందు ఓవంబో అను ఒకరీతి బంటూతెగకు చెందినవారు దాదాపు 50% ఉన్నారు. ముఖ్యనగరమగు విండ్‌హోక్ జనసంఖ్య 50,000.

**4. సమాచార సౌ. :** దేశమున 94 పోస్టాఫీసులు, 73 టెలిగ్రాఫ్ ఆఫీసులు పనిచేయు చున్నవి; టెలిఫోన్ సౌకర్యములు విరివిగ కలవు (1970).

**5. యాన సౌ. :** 3,372 కిమీ. ట్రంకు రోడ్లును, 8,933 కిమీ. పెద్ద రోడ్లును, 19,552 కిమీ. జిల్లా రోడ్లును కలవు; ఇవిగాక డొంకబాటల నిడివి 25,298 కిమీ రైలురోడ్ల నిడివి 2,325 కిమీ; వాల్విస్‌బే వద్దను, లీడరిట్జ్ వద్దను హార్బరులు కలవు. ప్రముఖ నగరములలో విమాన స్థావరములు ఉన్నవి (1970).

**6. చరిత్ర :** ఈ దేశమున మధ్యయుగముల నాటినుండి వివిధ ఆఫ్రికన్ జాతులు వసించుచుండి నటుల తెలియవచ్చుచున్నది. 1878 లో ఈ దేశపు తీరపు వెంబడి ఉన్న వాల్విస్‌బే మొదలగు దీవులను గ్రేట్‌బ్రిటన్ ఆక్రమించుకొనినది; అంతట జర్మన్ వర్తకులు దేశమునచేరి పలుకుబడిని ఆర్జించగ క్రమమున 1884 లో ఆ దేశమును జర్మన్ ప్రభుత్వము తన రక్షణలోనికి తీసికొని, దేశీయుల తిరుగుబాటులను అడచి, 1908 నాటికి తన ఆధి

పత్యమును సుస్థిరము చేసికొనగలిగినది. ప్రథమ ప్రపంచ యుద్ధమున, మిత్రరాజ్యముల పక్షమున పోరాడిన దక్షిణ ఆఫ్రికా, ఇటనుండి జర్మన్ సేనలను తరిమివైచి దేశమును ఆక్రమించుకొనినది. యుద్ధానంతరమున మాండేటరీ రాజ్యముగ దీనిని పాలించు హక్కు దక్షిణ ఆఫ్రికాకు కలుగజేయడ మైనది (17 డిసెం. 1920) ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున రూపొందిన ఐక్యరాజ్య సమితి, తన ధర్మకర్తృత్వ సంఘపు అధిపత్యమును దక్షిణ ఆఫ్రికా గుర్తించి, నివేదికలను పంపుచు, స్వయం పాలనవైపునకు దేశమును పురోగమింప జేయ వలసినదిగ ఆదేశించినది. కాని ఆ ఆదేశమును దక్షిణ ఆఫ్రికా త్రోసిపుచ్చి, తన స్వంతభూమి వలెనే, దీనిని తన ప్రతినిధి ద్వారా పాలించుచు, అటకూడ తనదేశమున ఉన్నటులనే వర్ణవిచక్షణను, వేర్వేరు రంగుల జాతులకు వేర్వేరు నివాస భూములను ఏర్పరచి, శ్వేతజాతి అధిక్యమును కాపాడుటకు యత్నించినది. ప్రపంచ రాజ్యములు, అందున ముఖ్యముగ ఆఫ్రికా-ఆసియా రాజ్యములు, నమీబియాకు స్వాతంత్ర్యమును కల్గించుటకై ఐ. రా. స. ద్వారా చేసిన కృషియంతయు ఇప్పటికి విఫలమైనట్లే (1975).

**7. పరిపాలన :** దక్షిణాఫ్రికా ప్రభుత్వము నియమించు పరిపాలకుడు ఇట పాలనను నిర్వహించుచున్నాడు. అక్టోబరు, 13,1966 మొదలుగ, ఈ దేశమునను, దక్షిణాఫ్రికాలో ఉన్నటులనే 'అపార్తీడ్' (వర్ణవిచక్షణ) విధాన మును అమలుపరచి నల్లజాతులకును, రంగుజాతుల కును, శ్వేతజాతులకును వేర్వేరు నివాస భూములను కల్పించు కృషి మొదలైనది. తత్ఫలితముగ నల్ల జాతులవారికై 'ఓవంబోలాండ్' 'కవంగోలాండు' అను రెండు మండలములు నిర్దేశింపబడి, అందలి శాసనసభలకు అచ్చటి నల్లవారే ప్రతినిధులను ఎన్నుకొను ఏర్పాటు జరిగినది. దేశపు శాసన సభయందు శ్వేతజాతివారికి మాత్రమే ప్రాతి నిధ్యము కలదు. 10 మంది సభ్యులుకల ఈ శాసనసభ సాయముతో పరిపాలకుడు పాలనను నిర్వహించును. దక్షిణ ఆఫ్రికా శాసనసభకు ఈ దేశము ఆర్గురు సభ్యులను పంపును; వీరందరును శ్వేతజాతీయులే;

**8. దేశరక్షణ :** దేశమును రక్షించు బాధ్యతను దక్షిణ ఆఫ్రికా రాజ్యము నిర్వహించుచున్నది.

**9. అంతర్జాతీయ సం. :** వలస రాజ్యము కావున అధికార రీత్యా అట్టి సంబంధములు ఏవియు లేవు.

**10. ఆర్థిక రంగము :** భౌతిక పరిస్థితులను బట్టి పశుపోషణకు మాత్రమే దేశమున విరివిగ అవకాశము కలదు. ఉత్తర, ఈశాన్య ప్రాంతము లందు ఏ కొలదిగనో సాగుబడి అగుచున్నను, అందలి ఉత్పత్తి దేశావసరములకు ఏ తీరునను చాలదు. పశుపోషణ మూలమున వెన్న, జున్ను విరివిగ తయారగుచున్నవి. పదునుచేయబడని చర్మముల ఉత్పత్తియు ఎక్కువయే. మత్స్య పరిశ్రమయు ఒక ముఖ్యవృత్తిగ లెక్కలో ఉన్నది. వీని అన్నింటికన్న ఎక్కువగ లెక్కింప దగినది ఖనిజసంపత్తి. వజ్రములు విరివిగ లభించు చున్నవి. దేశమునకు అధికాదాయము ఇందువలన వచ్చుచున్నది. ఎగుమతి, దిగుమతులు దక్షిణ ఆఫ్రికా లెక్కలలో చేరియుండుట వలన వివరములు తెలియవు. దేశమునందలి గోమాంసమును దక్షిణాఫ్రికాయు, పెద్దచేపలను యు. స్టే. యు కొనుగోలు చేయుచున్నవి. మొత్తము మీద దిగుమతుల విలువకన్న ఎగుమతుల విలువయే ఎక్కువనుట సుస్పష్టము. దేశపు బడ్జెటరీ వ్యయము 54,476 వేల రాండులు.

**11. సాంఘిక రంగము :** దేశమున విద్యా విధానమున సైతము వర్ణవిచక్షణయే అవలం

బింపబడి, వేర్వేరుగ పాఠశాలలు నిర్వహింపబడు చున్నవి శ్వేతజాతివారికి సంబంధించిన 83 పాఠశాలలో 95,302 మంది, తక్కినరంగు జాతులకై ఏర్పడిన 56 పాఠశాలలో 12,270 మంది విద్యార్థులు పఠించుచున్నారు. (1970). 4,500 మందికి ఒక డాక్టరు చొప్పున వైద్యవసతి కాలదు. మొత్తము మీద 156 ఆసుపత్రులు కలవు; ఇందు 17 తెల్లవారికి మాత్రమే ఉద్దేశింపబడినవి.

---

# 29. నైగర్

## (నైజర్)

**ముఖ్యనగరము :** నియామీ; **జెండా :** నారింజ, తెలుపు ఆకుపసిమి అడ్డు రేఖలలలో మధ్యనున్న తెలుపు, భూమికపై నారింజవర్ణపు వృత్తము కలది; **జాతీయ గీతము :** దెబోర్ – నైగర్ (నిలిచి యుండుము, నైగర్), **నాణెము :** ఫ్రాంకు




పటము 29

(సి. ఎఫ్. ఎ.); 100 ఫ్రాంకులు = రు. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాల గణన :** మధ్యాహ్నం 12 గం. = భారతదేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి** మొ. : పశ్చిమాఫ్రికాలో భూపరి వృతమగు ఈ దేశము 12° – 24° ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 0.30′ – 15°30′ తూ. తులా రేఖల మధ్యను వ్యాపించినది. దీని వాయవ్య – ఉత్తరములందు ఆల్‌జీరియాయు, ఉత్తరమున లిబియాయు, తూర్పున చాద్ గణరాజ్యమును, దక్షిణమున నైగీరియాయు దహోమియు, నైరుతిన అప్పర్ వోల్టాయు, పశ్చిమమున మాలీయు సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 12,67,000 చ. కిమీ. దేశమంతయు దాదాపుగ ఒక పీఠభూమి. సరాసరి ఎత్తు 360 మీ. దేశపు మధ్య, ఉత్తర భాగములు చాలవరకు ఎడారి ప్రాంతములు. మధ్యభాగమున నున్న పర్వత సీమయందు అత్యున్నతభూమి 1800 మీ. ఎత్తు కలిగి ఉన్నది. దేశమున 296 కిమీ. పొడవున నైగర్‌నది ప్రవహించుచున్నది. దేశపు తూర్పు సరిహద్దున చాద్ సరస్సు కలదు.

**2. శీతోష్ణస్థితి** మొ : ఉత్తర భాగము ఎడారి ప్రాంతపు శీతోష్ణ పరిస్థితిని కలిగియున్నది; ఎక్కడో కొన్ని ఉన్నత ప్రాంతములందు తప్ప, అట సంవత్సరము పొడవున వర్షపాతము శూన్యము. దక్షిణ భాగమున వర్షపాతము 22 సెం మీ నుండి 75 సెం. మీ. వరకు ప్రాంతముల ననుసరించి మారుచున్నది. ఈ భాగము అరణ్యమయము; సింహమువంటి పెద్ద జంతువులును కననగును. నైగర్ నదిలో మొసళ్ళు, నీటి గుర్రములు కలవు.

**3. జనసంఖ్య** మొ. : 1969 అంచనాలను అనుసరించి జనసంఖ్య 39,09,000; జనసాంద్రత చ. కిమీ. నకు ముగ్గురు వ్యక్తులు మాత్రమే, అందును ఉత్తరపు ఎడారిలో అది ఒక వ్యక్తిని

మించదు. అట దిమ్మరి జాతులు తమ పశువుల మందలతో స్థిరనివాసము లేక తిరుగుచుందురు. ముఖ్యనగరమగు నియామీలో జనసంఖ్య 70,000. జనులలో 95% పల్లె ప్రజలు. జాతిరీత్యా 75% నీగ్రో జాతులవారు. తక్కిన వారిలో అరబ్, బర్బర జాతులవారు అత్యధిక సంఖ్యాకులు. వివిధ జాతులలో వివిధ మాతృభాషలు ప్రచారమున ఉన్నను ఫ్రెంచియే అధికార భాష. బజారు భాషగ హౌసా అనుదానికి విశేష వ్యాప్తికలదు. ప్రజలలో 30 లక్షలమంది ముస్లిములు. దాదాపు 1 లక్షమంది క్రైస్తవులు. తక్కినవారు సాంప్రదాయిక ప్రకృత్యారాధకులు.

**4. సమాచార సౌ.:** దేశమున 35 పోస్టు ఆఫీసులు, 3073 టెలిఫోనులు కలవు (1969). నియామీలో ఒక రేడియో స్టేషను కలదు; ఇట నుండి ఫ్రెంచి, హౌసాలలో ప్రసారములు జరుగుచున్నవి.

**5. యాన సౌ.:** దేశమున 8,480 కిమీ. పొడవున రోడ్లు కలవు; కాని అందు పక్కారోడ్డు నిడివి 128 కిమీ. మాత్రమే (1969). నైగర్ నదిలో సంవత్సరమున 6 నెలలు నౌకలు తిరుగ గలవు. నియామీలో ఉత్తమ స్థాయికి చెందిన విమానాశ్రయము కలదు; తక్కిన ప్రముఖ నగరములలో నాలుగింటను రెండవ తరగతి విమానాశ్రయములు ఉన్నవి. పశ్చిమాఫ్రికాలోని ప్రముఖ నగరములకు నియామీనుండి విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర:** చరిత్రకు తెలియవచ్చినంతవరకు ఈ దేశమున తొలుతటినుండియు వసించుచున్నవారు వివిధ శాఖలకు చెందిన నీగ్రో జాతులవారు. వీరిని లోగొని ఇచట తమ ఆధిపత్యమును స్థాపించుటకు అరబ్బులును బర్బరులును 10 వ శతాబ్ది మొదలుగ కృషిచేసిరి. ఇటుల నలుపు తెలుపు జాతుల సంఘర్షణకు నెలవుగ ఈ దేశము పలుమారులు ఆ యా జాతుల ఆధిపత్యమున చేతులు మారినది. తత్ఫలితముగ మాలీ, ఘానా, గావ్, హౌసా, బోర్నూ సామ్రాజ్యములలో ఈ దేశము అంతటంతట అంతర్భాగమైనది. అరబ్ జాతీయులిట ఇస్లామును ప్రవేశపెట్టిరి. కాని అనతికాలముననే నీగ్రోజాతులు కొన్ని దానిని స్వీయము చేసికొని, సామ్రాజ్య విస్తృతిని పెంచుటకు మతవ్యాప్తిని సాకుగ గొని వ్యవహరించినవి. 19 వ శతాబ్దిలో ఫ్రెంచివారిట అడుగుపెట్టి ఆధిపత్యమునకై కృషిచేసిరి. దేశీయ జాతులు, తమ నాయకుల ఆధిపత్యమున తీవ్రముగ ప్రతిఘటించినను, కడకు 1922 నాటికి ప్రతిఘటనను అంతరింపజేసి, ఫ్రెంచివారు దేశమును తమ సామ్రాజ్యమున అంతర్భాగము చేసికొనిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరపు పరిణామముల ఫలితముగ కడకు 1960 లో దేశము సర్వస్వతంత్రమైనది.

**7. పరిపాలన:** 1960 లో ఆమోదింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి ఇట పరిపాలన నిర్వహింపబడుచున్నది. ప్రజలకు సార్వజనిక వోటింగు హక్కు కలదు. కాని ఒకే ఒక రాజకీయ పార్టీ (పార్టీ ప్రోగ్రెసిస్టే నైగీరియన్) యే దేశమున అనుమతింపబడుటచేత ఏకపట్టికా విధానమున ఎన్నికలు అయిదేండ్ల కొకతూరి జరిగి, శాసనసభకు 50 మంది సభ్యులును, దేశాధ్యక్షుడును ప్రజలచే ఎన్నుకొనబడుచున్నారు. మంత్రివర్గమును అధ్యక్షుడే నియమించుకొనును; ఆ మంత్రివర్గము అధ్యక్షునికి బాధ్యత వహించి పాలించును. శాసన నిర్మాణాధికారము శాసనసభదే అయినను శాసనమును పునఃపరిశీలించవలసినదిగా అధ్యక్షుడు కోరినపుడు, మూడింట రెండువంతుల సభ్యులు ఆమోదించిననే ఆ శాసనము అమలులోనికి వచ్చును. దేశము 16 మండలములుకల 7 డిపార్టుమెంటులుగ పరిపాలనా సౌకర్యమునకై విభక్తము. సుప్రీంకోర్టు ఆధ్వర్యవమున దేశ న్యాయస్థానములు పనిచేయుచున్నవి.

**8. దేశరక్షణ** : దేశమున 1,200 మందికల సేన కలదు. వైమానిక దళమున 100 మంది పనిచేయుచున్నారు. దేశమున రెండేండ్ల నిర్బంధ సైనిక శిక్షణ అమలునందున్నది.

**9. అంతర్జాతీయ సం.** : 1960 మొదలుగ ఐ. రా. స. యందు ఈ దేశము సభ్యత్వమును కలిగిఉన్నది ఆ సంస్థయొక్క అనుబంధ సంస్థ లలో పెక్కింటను దానికి సభ్యత్వము కలదు. ప్రపంచ ప్రముఖ రాజ్యము లన్నింటితో దౌత్య సంబంధములు ఈ దేశమునకు కలవు.

**10. ఆర్థిక రంగము** : వ్యవసాయము, పశు పోషణ అనునవి ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారములు. దేశమున 80% ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నారు. జీవ జంతువులు, చర్మములు, ప్రత్తి, పప్పుగింజలు దేశపు ఎగుమతులలో ముఖ్యములు. దేశమున యురేనియమ్ గనులు కలవని తెలియుచున్నది. కాని వానిలో ఉత్పత్తి విరివిగ జరుగుటలేదు. తగరము, టంగ్‌స్టన్ గనుల నుండి కొలది పరిమితులలో ఉత్పత్తి చేయబడుచున్నవి. దేశపు విద్యుదుత్పత్తి 282 లక్షల కి. వా. (1968). ఇది అంతయు తాప విద్యుత్తే. నైగర్ నదిపై ఆనకట్ట కట్టి జలవిద్యుత్తును ఉత్పత్తి చేయుటకు అవకాశము కలదు. భారీ పరిశ్రమలు ఎట్టివియు లేవు. ప్రత్తి, ఆహారధాన్యముల పరిశ్రమలు మాత్రమే కొన్ని కలవు ప్రజలలో 3,000 మంది మాత్రమే ఇందు పనిచేయుచున్నారు. దేశపు ఎగుమతుల విలువ 630 కోట్ల ఫ్రాంకులు (సి. ఎఫ్. ఎ.); దిగుమతులు 1,135 కోట్ల ఫ్రాంకులు (1967). విదేశీయుల పెట్టుబడులవలన, విదేశముల సహాయములవలన చెల్లింపుల లోటు చక్కబరచబడుచున్నది. బడ్జెటరీ వ్యయము 1,120 కోట్ల ఫ్రాంకులు (1969).

**11. సాంఘిక రంగము** : గృహనిర్మాణమును పట్టణములందు మాత్రమే ప్రభుత్వము ఎక్కువగ ప్రోత్సహించుచున్నది. పల్లెలలో మట్టిమిద్దెలే పూర్వపు రీతిలో కొనసాగుచున్నవి. దేశమున ప్రాథమిక పాఠశాలలలో 77,261 మంది, సెకండరీ పాఠశాలలలో 3,900 మంది, సాంకేతిక పాఠశాలలలో 900 మంది పఠించుచుండిరి (1968). 7-14 వయసు వారికి నిర్బంధ విద్యావిధానము అమలునందున్నది. 243 మంది విద్యార్థులు విదేశములలో ఉన్నతవిద్య అభ్యసించుచుండిరి (1970). విద్యకై ప్రభుత్వము, సాలీనా 138 కోట్ల ఫ్రాంకులు వెచ్చించుచున్నది (1968). ఫ్రెంచిలో ఒక దినపత్రిక మాత్రము ముఖ్యనగరమునుండి వెలువడుచున్నది. అరబ్బీలో వెలువడే కొలది పత్రికలు ముస్లిములందు మాత్రము ప్రచారమున ఉన్నవి. నియామీలో ఒక లైబ్రరీయు, మ్యూజియమును కలవు. నియామీ, జిందర్ నగరములలో ప్రతిదానియందు ఒక్కొక్క ఆసుపత్రి కలదు. వీనితో కలసి మొత్తముమీద 2,553 శయ్యాసంఖ్యకల 55 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. మశూచి, మలేరియా మొదలగు సాంక్రామిక జాడ్యములు చాలవరకు అరికట్టబడినవి.

**12. యాత్రా సౌ.** : విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకై ప్రభుత్వము పెక్కు వసతులను కల్పించినది.

**13. ప్రసిద్ధ పౌరులు** : దేశీయులలో ప్రసిద్ధుడు హమానీ దౌరీ (జననం 1916). ఇతడు తొలుత ఒక బడిపంతులుగ పనిచేసి, 1946లో ఒక రాజకీయ పక్షపు స్థానిక నేతగా పేరుపొంది, క్రమమున, ప్రజాదరణవలన 1958లో దేశాధ్యక్షుడై, ఇప్పుడును ఆ పదవిలోనేఉండి, దేశ భవితవ్యమును తీర్చిదిద్దుచున్నాడు.

# 30. నైగిరియా

## (నైజీరియా)

**ముఖ్యనగరము :** లాగోస్; **జెండా :** ఇరువైపుల ఆకు పసిమి నిడివి చారల మధ్య తెలుపు చారకలది; **జాతీయ గీతము :** నైగిరియా వుయ్ హెయిల్ దీ (నైగిరియా, నీకు జే కొట్టెదము). **నాణెము :** నైగిరియన్ పౌను (ఒక నై. పౌ. = రూ. 21.00) **కొలతూకములు :** బ్రిటిషు




పటము 30

కొలతూకములే వాడుకలో ఉన్నవి; అయినా మెట్రిక్ మానమును ప్రవేశపెట్టు యోచన కలదు. **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికాఖండపు పశ్చిమతీరమున గినీ సింధు శాఖకు లోతట్టున 4°30′-14°17′ ఉత్తర అక్షాంశలమధ్యను, 2°30′-14°30′ తూ. తులారేఖలమధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తర, వాయవ్యములందు నైగర్ గణరాజ్యము, ఈశాన్యమున చాద్ సరస్సు; తూర్పున కామెరూన్, దక్షిణమున ఆట్లాంటిక్ మహాసముద్రము (గినీ సింధుశాఖ) సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 9,23,773 చ.కిమీ. తీరముపొడవున చిత్తడినేలయు, చిట్టడవులును, దానికి ఉత్తరమున ఉష్ణమండలపు అడవులును 80-160 కిమీ. వెడల్పున కననగుచున్నవి. లోపలికి పోను పోను నేలమట్టము పెరిగి శాద్వలభూమియు, ఉత్తరపు కొనన ఎడారి యనదగు పఱ్ఱభూమియు, కాననగుచున్నవి. తూర్పున సరిహద్దున కొలది కొండలు కలవు, తక్కిన ప్రాంతమున అట్టివి కనరావు. కొండలలో కొన్నింట 760 మీ. ఎత్తుకు మించిన శిఖరములు కలవు. నైగర్, బెన్వి, క్రాస్ అనునవి ముఖ్యములగు నదులు.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమంతయు ఉష్ణమండలముననే ఉన్నను, వివిధ ప్రాంతములందు వేర్వేరు శీతోష్ణ పరిస్థితులు కననగుచున్నవి. తీరప్రాంతమున గరిష్ఠోష్ణత 90° ఫా; కాని గాలిలో చెమ్మదనము ఎక్కువ. లోపలి ప్రాంతమున 100° ఫా. కు మించిన గరిష్ఠోష్ణత; చలికాలమున చలి ఎక్కువ; జోస్ పీఠభూమి సమశీతోష్ణపరిస్థితి కలిగిఉన్నది; తీరప్రాంతమున సాలుసరి వర్షపాతము 175 సెం. మీ. 255 సెం. మీ. వరకు ప్రదేశములను బట్టి మారుచున్నది. లోపలికి పోయిన కొలది ఈ వర్షపాతము తగ్గి మధ్యదేశమున 125 సెం. మీ; ఉత్తరప్రాంతమున 50 సెం. మీ. గను ఉన్నది. తీరమునకు దూరముగ ఉన్న దట్టపుటడవులలో గోరిల్లాలు, చింపాంజీలు మొదలగు పెద్దజాతి కోతులును, లేళ్లు మొదలగు సాధుజంతువులును కలవు. ఏనుగు, నీటిగుఱ్ఱము, జిరాఫీ మొదలగు పెద్ద మృగములు అటనట కననగుచున్నను, వానిసంఖ్య క్రమముగ తగ్గుచున్నది.

**3. జనసంఖ్య మొ. :** 1969 అంచనాలను అనుసరించి దేశ జనసంఖ్య 6,38,70,000. ఆఫ్రికాదేశములలోనెల్ల అత్యధిక జనసంఖ్యాక దేశము నైగీరియాయే. జనసాంద్రత చ. కిమీ. కు 68. దేశపు నగరములలో లాగోస్ (జ. సం. 6,65, 246), ఇబదాన్ (జ. సం. 6.27,379) పేర్కొనదగినవి. దేశప్రజలలో ముస్లిములు దాదాపు 262 లక్షలు; క్రైస్తవులు 192 లక్షలు తక్కినవారు వివిధ సంప్రదాయిక ప్రకృత్యారాధక మతములకు చెందియున్నారు. ఉత్తర నైగీరియాలో ముస్లిములును, దక్షిణ నైగీరియాలో క్రైస్తవులును ఎక్కువగా కలరు. దేశమున వివిధజాతులందు దాదాపు 250 ఆఫ్రికన్‌భాషలు వాడుక యందున్నను, ఇంగ్లీషు భాషయే అధికార భాషగ సర్వత్ర వ్యవహారమున ఉన్నది. ఆఫ్రికన్ భాషలలో 'హౌసా' అనునది మాతృభాషగ దేశప్రజలలో 40% న వాడుక యందున్నది. ఉత్తర ప్రాంతమున ఇంగ్లీషునకు తోడుగ అధికార భాషగ 'హౌసా'యు ఉపయుక్తమగుచున్నది.

**4. సమాచార సౌ. :** దేశమున 1,428 పోస్టు అఫీసులు కలవు. వీటిలో 280 లో తంతివార్తా సదుపాయములు కలవు. టెలిఫోనుల సంఖ్య 79,828; దాదాపు సగము ముఖ్యనగరముననే ఉన్నవి. 1957 మొదలుగ రేడియోప్రసారము, 1959 మొదలుగ టెలివిజన్ వ్యాప్తిలోనికి తేబడినవి.

**5. యాన సౌ. :** దేశమున 80,000 కిమీ. నిడివిగల రోడ్లుకలవు; ఇందు 14,400 కిమీ. పొడవుగల రోడ్లు ఉత్తమశ్రేణికి చెందినవి. దేశమునందలి ప్రముఖనదులగు నైగర్, బెన్వీలలో చాలవరకు నౌకాయాన సౌకర్యము కలదు. దేశపు కోస్తాయందున్న 14 రేవులనుండియు విదేశములకు స్టీమరు సౌకర్యములు కలవు. విదేశవ్యాపారమున దాదాపు 60% అపాపారేవు (లాగోస్) నుండి సాగుచున్నది. తరువాత తెక్కింపదగినది పోర్ట్ హార్కోర్ట్. 4093 కిమీ. నిడివిగల రైలుమార్గము దేశమున ప్రధాన నగరములను రేవులను అనుసంధించుచున్నది. వైమానికయాన సౌకర్యములు నానాట అభివృద్ధి చెందుచున్నవి. లాగోస్, కానో నగరములందలి విమానాశ్రయములు అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించుచున్నవి.

**6. చరిత్ర :** ఈ దేశము 19 వ శతాబ్ది అంతమున బ్రిటిష్ సామ్రాజ్యమున అంతర్గతమగు వరకు ఆ దేశమున నడచిన చరిత్రను గురించి వివరములంతగ తెలియవచ్చుటలేదు. మధ్య యుగములందు ఈ దేశమునందలి పలుప్రాంతములు అంతటంతట ఘానా, మాలీ, సోన్‌ఘే మొదలగు ఆఫ్రికన్ సామ్రాజ్యములలో భాగములుగ ఉండినటులను, 15 వ శతాబ్ది ప్రాంతమున ఇస్లామ్ మతము ఇట తావు కల్పించుకొనినటులను, 19 వ శతాబ్ది ఆరంభకాలమున 'ఫులానీ' అని వ్యవహృతమగు ఒక ముస్లిం రాజకుటుంబపువారు దేశమున అధికభాగమును ఆక్రమించినటులను తెలియవచ్చుచున్నది. 1861 లో తమ వ్యాపార సౌకర్యములకొరకై లాగోస్‌దీవిని వశపరచుకొనిన బ్రిటిష్ ప్రభుత్వము కాలక్రమమున తన పలుకుబడిని తక్కిన దేశమునకును వ్యాపింపజేసి, కడకు 1914 లో నైగీరియాను తన వలస రాజ్యముగ చేసికొనినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశీయుల స్వాతంత్ర్యాకాంక్షకు తలయొగ్గి, అంచెలవారీగా అధికారములను దత్తముచేసి, బ్రిటిష్ ప్రభుత్వము 1960 అక్టోబరు 1 న దేశమునకు సర్వసత్తాక స్వాతంత్ర్యమును కల్పింపగ అంతట ఆ రాజ్యము బ్రిటిష్ కామన్‌వెల్తున సభ్యరాజ్యమైనది. కాని 1963 మొదలుగ కేంద్ర ప్రభుత్వమునకు తూర్పు రాష్ట్రములు ఎదురుతిరుగుటవలన, దేశమున అంతర్యుద్ధములు పదింబదిగ జరిగినవి. వీనిలో కడపటిది 1967 లో జరిగిన తిరుగుబాటు; ఇందు

ఒజుక్వూ అను సేనాని నాయకత్వమున తూర్పు ప్రాంతము విడిపోయి, 'బయఫ్రా' అనుపేరున స్వతంత్రతను ప్రకటించినది. అంతట ఈ తిరుగు బాటును అడచివేయుటకు కేంద్ర ప్రభుత్వము తీసి కొనిన చర్యలు బహుళ రక్తపాతమునకు హేతువు లైనవి. కడకు తిరుగుబాటు అడగునప్పటికి (1960) దాదాపు 20 లక్షల ప్రజలు హతులై, దేశము అర్థికముగ సంక్షుభితమయ్యెను. తదాదిగ దేశమున సైన్యముదే పయిచేయిగ పరిణమించి, దాని అండగలవాడే అధ్యక్షుడగుచున్నాడు.

**7. పరిపాలన :** దేశమున సమాఖ్యా (ఫెడరల్) రీతి సైనిక ప్రభుత్వము 1967 మొదలుగ అమలునందున్నది. దేశమునందలి 12 రాష్ట్రముల పాలనను మిలటరీ గవర్నర్లు నిర్వహించుచున్నారు. దేశమున రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుటలేదు. దేశమునందలి సుప్రీమ్ కోర్ట్ ఆధ్వర్యవమున న్యాయశాఖ పనిచేయు చున్నది. ప్రతి రాష్ట్రమునకు ఒక హైకోర్ట్ కలదు.

**8. దేశరక్షణ :** దేశపు భూతల సైన్యమున 2,62,000 సైనికులును, నౌకాదళమున 2,190 మంది నౌకాయోధులును పనిచేయుచున్నారు. చిన్నది యైనను, సమర్థవంతమగు వైమానికదళము కలదు.

**9 అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా. స. యందును, అణవికశక్తి సంఘమున తప్ప, తక్కిన ఐ. రా. స. అనుబంధ సంస్థ లందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ఆఫ్రికాఖండ రాజ్యముల సంస్థలందు ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది.

**10. అర్థిక రంగము :** నైగీరియా దేశపు ఆర్థిక వ్యవస్థకు మూలాధారము వ్యవసాయము. ఆహార ధాన్యములకు సంబంధించినంతవరకు ఈ దేశము స్వయం పోషక స్థాయిలో ఉన్నది. అంత ర్యుద్ధ కాలమున ఈ ఉత్పత్తి తగ్గి, ఆహార ధాన్యముల విషయమునను దేశము ఇబ్బందిపడినను, ప్రస్తుతమున పూర్వస్థాయికి రాగలిగినది. దేశపు వ్యావసాయికోత్పత్తిలో సగభాగమును దేశము ఎగుమతి చేయగలుగుచున్నది. దేశమున పశుసంపద అత్యధికము చర్మముల ఎగుమతివలన దేశమునకు ఆదాయము లభించుచున్నది. మత్స్య పరిశ్రమ విరివిగ సాగుచున్నది. దేశ వైశాల్యమున మూడవ వంతు అటవీమయము; అందు లభించు కలప విదేశములకు ఎగుమతి యగుచున్నది. ఖనిజములలో అత్యంత ప్రముఖమైనది పెట్రోలియమ్. దేశపు ఎగుమతులవలన వచ్చు ఆదాయమున 42% పెట్రోలియమ్‌వలన లభించుచున్నది. దీని తరువాత తగరము, రాక్షసిబొగ్గు వరుసగ గణనీయములు. దేశమున విద్యుదుత్పత్తి 10,642 లక్షల కి. వా. (1965-66); దేశపు దిగుమతుల విలువ 2,487 లక్షల నై. పౌనులు; ఎగుమతులు 3,197 లక్షల నై. పౌనులు (1970). దేశపు బడ్జెటరీ వ్యయము 2,680 లక్షల నై. పౌనులు (1970-71).

**11 సాంఘిక రంగము :** దేశమున అక్షరాస్యత 20% మాత్రమే; అయితే విద్యావ్యాప్తికై కృషి విరివిగ జరుగుచున్నది. దేశమునందలి దాదాపు 50 లక్షల బాలబాలికలలో దాదాపు 31 లక్షలమంది ప్రయిమరీ విద్యా శాలలలో పఠించు చున్నారు (1966). 1,000 కి మించిన సెకండరీ పాఠశాలలు కలవు; 35 సాంకేతిక పాఠశాలలు పనిచేయుచున్నవి. దేశమున ఉన్న అయిదు విశ్వ విద్యాలయములలో 9,000 మంది ఉన్నత విద్యను అభ్యసించుచున్నారు (1967-68). దేశమునందలి గ్రంథాలయములలోనెల్ల ప్రముఖమైనది ఇబదాన్ విశ్వవిద్యాలయమున ఉన్నది. లాగోస్‌లో ఒక ప్రముఖ మ్యూజియం కలదు; దేశమున యాస్, మలేరియా మొదలగు సాంక్రామిక రోగముల వ్యాప్తిని అరికట్టుటకు కృషి జరుగుచున్నది. లాగోస్, ఇబదాన్‌లలో మాత్రము వైద్య కళాశాల

లకు చెందిన పెద్ద ఆసుపత్రులు కలవు. ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ సాయమున పల్లెపట్టులందు రోగ నిరోధమునకు కృషి జరుగుచున్నది. దేశపు మొత్తమున అన్నిరకములకు చెందిన ప్రభుత్వ ఆసుపత్రులు 100, ప్రయివేటు ఆసుపత్రులు 175 కలవు. దేశవాసులలో 2,000 మందికి 1 ఆసుపత్రిశయ్య చొప్పున మాత్రమే వైద్య సహాయము లభించుచున్నదని అంచనా.

**12. యాత్రా సౌ. :** యాత్రికుల సౌకర్యమునకై ప్రభుత్వము పలుతావులందు నివాస వసతులను కల్పించినది. లోగోస్, ఇబదాన్, కదూనా నగరములందు ఉత్తమ శ్రేణికి చెందిన హోటళ్ళు కలవు. 1968 లో దేశమును 23,400 యాత్రికులు దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** హెర్‌బర్ట్ మెకాలే (1864-1946), నైగిరియా జాతీయవాద జనకుడుగ పేరొందెను.

---

# 31. బురుండి

**ముఖ్యనగరము :** బుజుంబురా; **జెండా :** మూలలను కలుపు రెండు తెల్లని కర్ణరేఖలును, ఆ రేఖలు కలియు స్థలమున, ఒక తెల్లని వృత్తమును, దానిమధ్య ఆకుపసిమి అంచులుకల మూడు ఎర్రని




పటము 31.

నక్షత్రములను కలవు; కర్ణరేఖల వలన ఏర్పడిన నాలుగు త్రిభుజములలో, ప్రక్కది ఆకుపసిమి రంగును, ఎగువను, దిగువను ఉన్నవి, ఎరుపు రంగును కలిగియున్నవి. **జాతీయ గీతము :** చీరీ బురుండీ ఓ దో పేస్... (ప్రియ బురుండీ ఓ మధుర భూమీ...) **నాణెము :** బురుండీ ఫ్రాంకు; 100 బు. ఫ్రా. = రూ. 11.25; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య ఆఫ్రికాయందు తూర్పు ప్రాంతమున 2° 20'-4°28' ద. అక్షాంశ రేఖల మధ్యను, 29°-30° 50' మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున రువండా; తూర్పున దక్షిణమున టాంజానియా; పశ్చిమమున జయిరే సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 27,834 చ. కిమీ. దేశము పర్వతములతోను, పీఠభూములతోను, నిండియున్నదని చెప్పవచ్చును. పశ్చిమమున టాంజానియా సరిహద్దున, రుజీజీ నదీ పరిసరములనున్న 792 మీ. ఎత్తుకల ఒక చీలిక భూమి మాత్రమే దేశమందు అంతట ఎత్తుతక్కువ భూమిగ లెక్కకు వచ్చుచున్నది. తక్కిన దేశమున ఎత్తు ఎచ్చటను 910 మీ. కు తగ్గదు. తూర్పు

ప్రాంతమున నున్న, పర్వతభూమి క్రమముగ దక్షిణ పశ్చిమములకు. పయనించు కొలది, ఎత్తు తగ్గి 1,370 మీటర్ల ఎత్తును చేరుకొనును మధ్యదేశపు పీఠభూమి, సరాసరి ఎత్తు 1707 మీటర్లు. ఆకన్యారూ, కగేరా నదులు, ఈ దేశమును రువండానుండి వేరుచేయుచున్నవి. దక్షిణపు సరిహద్దున మలగరాజీనది ఉన్నది; కగేరా, రువూవూ నదులు నైలునదికి ఉపనదులు.

**2. శీతోష్ణస్థితి మొ.** : ఉష్ణమండల ప్రాంతముల ఉన్నతభూముల శీతోష్ణరీతియే ఈ దేశమున కలదు. రాత్రింబగలుల మధ్య తాపక్రమ వ్యత్యాసము చాల ఎక్కువ. ప్రదేశములను అనుసరించియు శీతోష్ణస్థితి మారుచున్నది. మధ్యదేశపు పీఠభూమి యందు శీతోష్ణపరిస్థితి సౌమ్యముగ ఉండి, సరాసరిన పగటి తాపక్రమము 68° ఫా. వరకు ఉండును వర్షపాతము అనిశ్చితరీతిలో ఉండుట వలన, దేశమున అధికభాగము తరచుగ అనావృష్టికి లోనగుచున్నది. వాయవ్య ప్రాంతమున మాత్రము అత్యధికముగ వర్షించును

దేశమున అధికభాగము గరికపట్టు భూమి. అడవులు చాల తక్కువ; అక్కడక్కడ యూకలిప్టస్, కొబ్బరిజాతి వృక్షములు కనబడును. దేశమున ఒకపుడు ఏనుగులు మొదలగు పెద్ద జంతువులు విరివిగ ఉండెడివి. కాని దేశమున జనసంఖ్య విపరీతముగ పెరిగి, ఎల్లెడల జనావాసములు ఏర్పడుట వలన వన్యజాతి అంతరించుచున్నది.

**3. జనసంఖ్య మొ.** : ఆఫ్రికాలో ఎక్కువ జనసాంద్రత కలిగిన దేశములలో ఇది ఒకటి. 1969 అంచనాలను అనుసరించి జనసంఖ్య 34,75,00. జనసాంద్రత చ. కిమీ. కు 154. ముఖ్యనగరమగు బుజుంబురా (జ. సం. 70,000) తప్ప వేరుగ లెక్కింపతగిన పెద్దనగరములు లేవు. ప్రజలలో తుత్సీ, హూటూ, త్వా జాతుల ప్రజలున్నారు దేశ జనులలో తొలుతటి జాతివారు దాదాపు 14%; వీరు చాలా పొడగరులు, స్ఫురద్రూపులు. హూటూ జాతివారు ప్రజలలో 85% ఉందురు. వీరు బంటూ జాతిలోని ఒక శాఖకు చెందినవారు. త్వా జాతి ప్రజలు చాల పొట్టివారు. వీరు ప్రజలలో దాదాపు 1% ఉందురు. యూరపీయులును, ఆసియావాసులును కలసి దాదాపుగ 7,000 ఉందురు. 'కిరుంది' అను ఆఫ్రికన్ భాష ప్రజలలో విపుల ప్రచారమున ఉన్నది. ఇదియు ఫ్రెంచియు అధికార భాషలుగ పరిగణన పొందినవి. సాంప్రదాయికమగు, ఒక ఆఫ్రికన్ మతమునకు, దేశమున విపుల వ్యాప్తి కలదు ప్రజానీకమున దాదాపు సగముమంది క్రైస్తవులు.

**4. సమాచార సౌ.** 10,000 ప్రజలకు 9 టెలిఫోన్లు చొప్పున కలవు (1969). బుజుంబురాకు బెల్జియంలోని బ్రస్సెల్స్‌కు మధ్య, రేడియో టెలిఫోను సౌకర్యము 1960 నుండి కలదు. బుజుంబురా, కిటేగా నగరములలో రేడియో ప్రసార కేంద్రములు కలవు.

**5. యాన సౌ** : దేశమున రైలుమార్గములు లేవు. 6,000 కిమీ. పొడవున రోడ్డుమార్గములు ఉన్నను, అందు పక్కామార్గములు చాల తక్కువ. టాంగన్యికా సరస్సున నడచు నౌకల వలననే, దేశ వ్యాపారము సాగుచున్నది. అందు ఆ సరోతీరమున ఉన్న బుజుంబురా చక్కని రేవుగ ఉపకరించుచున్నది. బుజుంబురాలో అన్నివసతులు కల విమానాశ్రయమును, కిటేగాలో ఒక విమాన క్షేత్రమును కలవు. దేశమున పలుతావులలో హెలికాప్టర్లకు దిగువసతులు కలవు.

**6. చరిత్ర** : తొలుతనుండియు ఈ దేశచరిత్ర రువండా చరిత్రతో ముడివడి యున్నది (చూ : రువండా). జర్మనులు 19 వ శతాబ్దమున, రువండా-

ఉరుండి అను పేరుతో, ఈ ఉభయ ప్రాంతములపై అధికారమును వహించి, ఆ ప్రాంతములపై స్థానిక తూత్సీ జాతి పాలకుని అధికారమును, తమ సర్వాధిపత్యమునకు లోబడి సాగనిచ్చిరి. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఈ రెండు ప్రాంతములును, బెల్జియం ఆధిపత్యమున మాండేటరీ ప్రాంతములుగ పాలింపబడినవి. అయినను 1959 లో రువండాలో చెలరేగినటుల, ఇచట తూత్సీ - హూటూ ప్రజల మధ్య వైషమ్యములు మాత్రము తలఎత్తలేదు. దేశమునకు జులై 1, 1962 లో స్వాతంత్ర్యము కలిగిన తరువాత కూడ, రాజ్యాంగ బద్ధముగ రాచరికము కొంత కాలము సాగినది; కాని 1966 లో అప్పటి రాజును వధించి, గణతంత్ర రాజ్యముగ దేశమును, అప్పటి ప్రధాని ప్రకటించెను. తరువాత రాజవంశము అధికారమును నిలబెట్టుకొనుటకై తిరుగుబాటును ప్రోత్సహించగ, పోరాటములు జరిగి, జననష్టము విపరీతముగ సంభవించినది. కడకు ఈ పోరాటమున విజయమును పొందిన ప్రధాని మైకోంబెరో, తానే అధ్యక్షుడుగ, ఒక నూతన ప్రభుత్వమును నెలకొల్పెను (జూలై 14, 1972).

**7. పరిపాలన :** స్వాతంత్ర్యమును ఆర్జించిన వెంటనే దేశము ఒక రాజ్యాంగ విధానమును రూపొందించుకొనినను, ప్రస్తుతమున ఆ రాజ్యాంగము నిలుపుదల చేయబడి, అధ్యక్షుడే సర్వాధికారములను వహించి పాలించుచున్నాడు. అధ్యక్షుడగు మైకేల్ మైకోంబెరో నాయకత్వమునఉన్న ఉప్రోనా పార్టీ తప్ప, తక్కిన పార్టీలు అన్నియు నిషేధింపబడినవి.

**8. దేశరక్షణ :** 2,600 మంది సైనికులు కల పదాతి దళము కలదు. బెల్జియం దేశీయులు, రక్షణబలముల నిర్మాణమున సలహాదారులుగ పనిచేయుచున్నారు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధములగు కొన్ని ప్రత్యేక సంస్థలందును, దేశమునకు సభ్యత్వము కలదు. ఐ. రా. స. సంస్థల వలనను, యు. స్టే.; బ్రిటన్, ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, బెల్జియం మొదలగు దేశముల వలనను, ఈ దేశము సాంకేతిక, ధన సహాయములను గ్రహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** 95% ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి జీవించుచున్నారు. కాని అందలి ఉత్పత్తి చాల తక్కువ. మొక్కజొన్న, సజ్జ, అరటి, చిరుగడదుంప, బటాణి చిక్కుళ్ళు ముఖ్యములగు ఆహారపు పంటలు. రొక్కపు పంటలలో కాఫీ ప్రముఖము. ఎగుమతులలో కాఫీ గింజలు, ప్రత్తి క్రమ ప్రాముఖ్యమును కలిగియున్నవి. పశుసంపద విరివిగ ఉన్నను, మంచిజాతి పశువులు చాల తక్కువ. ఖనిజములకై సర్వే జరుగుచున్నది. ప్రస్తుతమున కస్సిటరైట్, బస్తానసైట్ మొదలగు ముడి ధాతుద్రవ్యములు మొత్తము మీద 1000 టన్నులకు లోపుగ సాలీనా ఉత్పత్తి అగుచున్నవి. విద్యుద్వినియోగము 12.2 కోట్ల కి. వా. సాలీనా ఎగుమతుల విలువ 12.2 కోట్ల బు. ప్రాంకులు (1997). బడ్జెటరీ వ్యయము 212.1 కోట్ల బు. ప్రాం. (1971)

**11. సాంఘిక రంగము :** ఆధునికమగు గృహవసతి దేశమునందు, అందును ముఖ్యముగ పల్లెపట్టులందు, చాల తక్కువ. పల్లె ప్రజలు సర్వసాధారణముగ, గుడిసెలలో నివసింతురు. 7-16 వయసున ఉన్న పిల్లలందరి విద్యాబోధన ఉచితము; అయినను విద్యావ్యాప్తి తక్కువ. 1,70,000 మంది విద్యార్థులు ప్రయిమరీ తరగతులలోను; 5,800 మంది సెకండరీ పాఠశాలలలోను; 1,337 మంది వృత్తి విద్యాశాలలలోను; బుజుంబురాలోని విశ్వవిద్యాలయమున 120 మంది విద్యార్థులును కలరు (1967-68). బుజుంబురాలో రెండు గ్రంథాలయములును, కిటేగాలో ఒక మ్యూజియమును కలవు.

దినపత్రిక ఏదియులేదు. ప్రభుత్వమే క్రమముగ, ఫ్రెంచి, కిరుండీ భాషలలో రెండు వారపత్రికలను ప్రచురించుచున్నది. ప్రభుత్వ అధీనమునను, మతసంస్థల అధీనమునను పనిచేయు వివిధములగు ఆసుపత్రుల సంఖ్య 103; అందలి శయ్యాసంఖ్య 2,961; డాక్టర్ల సంఖ్య 63. ఇందు ఆర్గురు మాత్రమే దేశీయులు (1966).

**12. యాత్రా సౌ.:** దేశమున యాత్రిక పరిశ్రమ బాల్యస్థితిలో ఉన్నది. టాంగన్యికా సరోవర ప్రాంతభూమి ప్రకృతి రమణీయతకు పేరొందినది. తుత్సీ జాతివారి నాట్యములు జగత్ప్రసిద్ధములు.

---

# 32. బోచ్వానా

**ముఖ్యనగరము :** గబెరోనిస్; **జెండా :** మూడు అడ్డుచారలు కలది; అందులో పైది, దిగువది లేత నీలపువి, మధ్య ఉన్నది నలుపు రంగుది; మధ్య నలుపును ఎగువదిగువల నీలమునుండి వేరుచేయు



పటము 32.

సన్నని తెలుపు చారలు కలవు; **జాతీయ గీతము :** ఫాత్ షే లా రోనా (ధన్యదేశము); **నాణెము :** దక్షిణ ఆఫ్రికాలో అమలున ఉన్న రాండు నాణెమే. ఇది 100 సెంట్లుగ విభక్తము; 1 రాండు = రూ. 10.50; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఆఫ్రికా ఖండపు దక్షిణ భాగమున 17°47′-26°54′ ద. అ. మధ్యను, 20°-29°21′ తూ. తు. మధ్యను విస్తరించిన ఈ దేశమునకు ఉత్తరమున జాంబియా, నమీబియాకు చెందిన కాప్రివీ చీలిక; ఈశాన్యమున రొడీసియా; ఆగ్నేయ, దక్షిణములందు దక్షిణ ఆఫ్రికా; పశ్చిమమున నమీబియా సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 6,00 372 చ. కిమీ. దేశమంతయు ఉన్నతభూమి, సరాసరి ఎత్తు 1005 మీ; కన్యే వద్దనుండి రొడీసియా సరిహద్దువరకు పోవుచు 1,232 మీ. ఎత్తు కలిగిన ఒక పీఠభూమి దేశమును రెండు విస్పష్ట భాగములుగ విభజించుచున్నది. ఇందు తూర్పు ప్రాంతము గుట్టలమయమైన చిట్టడవుల గరికపట్టు; పశ్చిమమున కొంతవరకు చిత్తడినేల, కొంతవరకు ప్రభుత్వమునకే స్వామ్యముకల జాతీయ భూమి, వానికి దక్షిణమున కలహారి ఎడారి ఉన్నవి. ఉత్తరమున చోబీ, తూర్పున లింపోపో, వాయవ్యమున ఒకవాంగో

అనునవి మాత్రమే దేశమున ప్రవహించు నదులలో పేర్కొనదగినవి.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశమున అక్టోబరు నుండి ఫిబ్రవరివరకు గరిష్ఠోష్ణత 90° ఫా. వరకును; జూన్ మొదలు ఆగష్టువరకు కనిష్ఠోష్ణత 30° ఫా. వరకును ఉండును. సాలున సరాసరి వర్షపాతము 45 సెం. మీ; అయినను ఉత్తరమున ఆ వర్షపాతము 68 సెం. మీ. ఉండగా, అది దక్షిణమున 22 సెం. మీ.కు పడిపోవుచున్నది. ఉత్తరమున ఉన్న జాతీయభూమి యందలి అడవులలో దాదాపు 10 వేల ఏనుగులును, తదితర ములగు వన్యజంతువులును కలవు. వేటకై ప్రత్యేకింపబడిన కొన్ని తదితర వనములలో లేళ్ళు మొదలగు అల్పజంతువులు విరివిగ కలవు. కలహారి ప్రాంతము ఎడారియైనను అచటి పచ్చిక పట్టులను ఆశ్రయించి పెక్కు వన్య జంతువులు అచట బ్రతుకుచున్నవి. దేశమున 84% భూమి ముండ్లపొదలు, అటనట గరికబీడులు కల శాద్వల భూమి.

**3. జనసంఖ్య మొ.:** దేశసంఖ్య 6,30,379; ఇందు అత్యధిక భాగము తూర్పు ప్రాంతముననే వసించుచున్నారు. దేశపు నగరములలో కన్యే (జ. సం. 39,200), సెరోవీ (జ. సం. 43,186), మోల్‌పొలోల్ (జ. సం. 31,986), లొబాచీ (జ. సం. 12,920), ఫ్రాన్సిస్‌టౌన్ (జనసంఖ్య 19,903), గబెరోనిస్ (జనసంఖ్య 18,436) అనునవి ప్రముఖములు. ఇందు చివర మూడును వ్యాపార కేంద్రములు (1970).

ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ఆఫ్రికాకు చెందిన బంటూ జాతివారు; వీరు ఎనిమిది తెగలుగ విభక్తమై ప్రత్యేక ప్రాంతములందు వసించుచు, తెగ పెద్దల నాయకత్వమున అంతరంగిక స్వపరి పాలనను కలిగి యున్నారు. అన్నిటిలోను బమాంగ్‌వాతో తెగకు చెందిన ప్రాంతము అత్యంత విశాలమై, దేశమున దాదాపు మూడవ భాగమును ఆక్రమించి ఉన్నది. వీరుగాక దాదాపు 6,000 ఆదిమవాసులు (బుష్‌మెన్ అనబడువారు) కలహారి ఎడారిలో వసించుచున్నారు. వీరి పూర్వులు కళాభి రుచికి పేరొందినటుల, అచటి గుహాకుడ్య చిత్రములు ప్రస్ఫుటము చేయుచున్నవి.

దేశమున అత్యల్ప సంఖ్యలలో యూరపియనులు (4,000), యూరపీయ సంతతివారు (3,500), ఆసియావాసులు (390) ఉన్నారు; వీరిలో దాదాపుగ అందరును గబెరోనిస్, లొబాచీ పరిసర ములలో బంగారు గనుల పనులలో పాల్గొను చున్నారు.

దేశీయులలో పలువురు 'సెచ్వానా' అను ఆఫ్రికన్ భాషను మాట్లాడెదరు; తక్కిన వారి యందు పెక్కు భాషలు ప్రచారమున ఉన్నవి. ఆంగ్ల భాషయు, సెచ్వానాకు తోడుగ సాధికార భాషగ పరిగణన పొంది వ్యవహారమున ఉన్నది.

దాదాపుగ దేశీయులందరును ప్రకృతి దేవతా రాధకులు; రమారమి 43,000 మంది మాత్రమే క్రైస్తవులు కలరు (1968).

**4. సమాచార సా.:** దేశమున 29 పోస్టా ఫీసులును, 38 తపాలా ఏజన్సీలును, 5,197 టెలి ఫోనులును కలవు. వీనిలో అధిక భాగము తూర్పు ప్రాంతముననే ఉన్నవి. గబెరోనిస్‌లో ఉన్న రేడియోస్టేషన్ ఇంగ్లీష్, సెచ్వానా భాషలలో ప్రచారములను నిర్వహించుచున్నది.

**5. యాన సౌ.:** దేశమున 8,000 కిమీ. పొడవున రోడ్లును, 630.4 కిమీ. పొడవున రైలుమార్గమును కలవు. దక్షిణ ఆఫ్రికాలోని కేప్‌టౌనునుండి రొడీసియాలోని బులవాయోకు పయనించు రైలుమార్గమున, ఈ దేశపు రైలు మార్గము అంతర్భాగము. గబెరోనిస్, ఫ్రాన్సిస్

టౌన్, లొబాచీ నగరములకు ఆ మార్గము ఉపకరించుచున్నది. ఫ్రాన్సిస్‌టౌనునను, గబెరోనిస్‌లోను విమానాశ్రయములు కలవు ఇచటనుండి విదేశములకు విమానయాన సౌకర్యము కలదు. ఇవికాక దేశమున పలుప్రాంతములందు విమానపు దిగువసతులు కలవు. వీనివలన దేశాంతర్గత విమానయానము సాగుచున్నది. దేశమునకు స్వయముగ విమానయానసంస్థ లేదు; దక్షిణ ఆఫ్రికా, జాంబియాలలోని అట్టి సంస్థలు ఇచ్చట విమానయానమును నిర్వహించుచున్నవి.

**6. చరిత్ర :** దేశమునందలి ఎనిమిది తెగలును బచ్వానా అను మూలపు తెగనుండియే ఆవిర్భవించి, 17వ శతాబ్దినుండి ఈ దేశమున వివిధ ప్రాంతములందు స్థావరములను ఏర్పరచుకొనినవని, సాంప్రదాయిక కథనమువలన తెలియుటతప్ప, ఈ దేశపు పూర్వచరిత్రనుగురించి తక్కిన వివరములు ఏమియు తెలియరావు. యూరపీయనులకు దక్షిణ ఆఫ్రికాలోని బోయర్లద్వారా, ఈ దేశము పరిచితమగు నాటికి, పైతెగల నాయకులు సామరస్య భావముతో, తమప్రాంతములను పరిపాలించుచు, బమాంగ్‌వాతో తెగనాయకుని అధిపత్యమున దేశరక్షణకై కృషి చేయుచుండెడివారు. బోయర్లు ఈ దేశమును వశపరచుకొనుటకు యత్నించగ, ఈ తెగలు కొంతకాలము ప్రతిఘటించి కడకు బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణను పొందినవి (1885). అంతట బెచూనాలాండ్ అను పేరు ఏర్పరచి, ఈ దేశమును బ్రిటన్ పాలించినది. తరువాత కాలక్రమమున ప్రజల అభీష్టమును అనుసరించి స్వతంత్రతను బ్రిటన్ కల్పింపగ సెప్టెంబరు 30, 1966న ఈ దేశము స్వతంత్రమైనది.

**7. పరిపాలన :** దేశాధ్యక్షుని యందు కార్య నిర్వహణాధికారము న్యస్తమైయున్నది; అతడే దేశమునకు అధిపతి; జాతీయ శాసన సభయందలి సభ్యులవలన, అధిక సంఖ్యాక బలముతో అతడు ఎన్నుకొనబడును. జాతీయ శాసనసభయందలి సభ్య సంఖ్య 37. ఇందులో, 32 మందిని ప్రజలు ఎన్నుకొనెదరు; నలుగురిని ప్రత్యేక నియోజకవర్గములు ఎన్నుకొనును. ఈ 36 మందియు ఎన్నుకొనిన వాడు శాసనసభకు సభాపతి (స్పీకరు) గ ఎన్నికై, సభలో సభ్యుడుగ లెక్కింపబడును. శాసనసభ గాక నాయకమండలి (హౌస్ ఆఫ్ చీఫ్స్) అనునది వేరొకటి కలదు. దీనియందు తెగల నాయకులు ఎనిమిది మందియు, వారును ఉపనాయకులును కలిసి ఎన్నుకొనిన ఏడుగురును సభ్యులుగ ఉందురు. ఉభయ సభలును కలసి పార్లమెంటుగ వ్యవహరించును; నాయకమండలి ఎగువ సభగ వ్యవహరించును. 21 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతి పౌరునకు వోటుహక్కు ఉన్నది; అయిదేండ్లకు ఒకసారి తప్పక ఎన్నికలు జరుగవలయును. అవిశ్వాసతీర్మానము ఆమోదింపబడినపుడు, అధ్యక్షుడు రాజీనామానైనను ఇవ్వవలెను; లేదా పార్లమెంటును రద్దుచేసి ఎన్నికలు జరిపి, కొత్తపార్లమెంటు అభీష్టమును అనుసరించవలెను. స్థానిక పరిపాలనను, న్యాయ నిర్వహణను అధునికము చేయుటకు ప్రస్తుతమున కృషి జరుగుచున్నది. దేశమున 4 రాజకీయ పక్షములు కలవు. వానిలో బోచ్వానా డెమోక్రాటిక్ పార్టీ అనునది అత్యధిక ప్రతిపత్తి కలది.

**8. దేశరక్షణ :** దేశమునకు ఎట్టి సైనిక బలమును లేదు; ఆంతరంగిక భద్రత కొరకు దాదాపు 600 మందికల పోలీసులబలము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** 1966 మొదలుగ ఈ దేశమునకు ఐ. రా. స. యందును, కామన్ వెల్తునను సభ్యత్వము కలదు. ఆఫ్రికా ఐక్యతా వ్యవస్థయందును సభ్యత్వము కలదు. లెసోతో, స్వాజీలాండులతో సన్నిహితమైత్రి కలదు. ఈ మూడు రాజ్యములును దేశీయ, అంతర్దేశీయ విధానములలో, సమన్వయిత భావమున వర్తించు

చున్నవి. దక్షిణ ఆఫ్రికాలోని ఆఫ్రికన్ ప్రజల ఆశయములయెడ సానుభూతి ఉన్నను, ఆర్థికరీత్యా దక్షిణ ఆఫ్రికాతో ముడిపడి యుండుటవలన, దక్షిణ ఆఫ్రికా ప్రభుత్వమును నిరసించక దానితో సామరస్యమున ఈ దేశము వర్తించుచున్నది. రొడీసియానుండి వచ్చెడు దిగుమతులను మాత్రమే 1969 నుండి బోచ్వానా ప్రభుత్వము నిషేధించినది.

**10. ఆర్థిక రంగము :** దేశము కరువు కాటకములకు పలుమారు గురియగుచున్నది. దేశమున వ్యవసాయ యోగ్యముగనున్న 5 లక్షల ఎకరాలలో అధికభాగము తూర్పుప్రాంతముననే ఉన్నది. సజ్జ, జొన్న, మొక్కజొన్న, పండింప బడుచున్నను, దేశీయుల ఆహారావసరములకు అవి చాలవు. కొన్ని నీటి పారుదల వసతులను అభివృద్ధి పరచి రొక్కపు పంటలను-పొగాకు, వేరు శనగ, ప్రత్తి మొదలగువానిని-పండించుటకు కృషి జరుగుచున్నది. దేశమున పశుసంపద విస్తారము ; పశుపోషణయు చక్కగా సాగుచున్నది. 1954 కు పూర్వమున సజీవ పశువులే విరివిగ విదేశములకు ఎగుమతి అయ్యెడివి. అంతటినుండి కసాయిశాలను పెద్దస్థాయిలో నిర్వహించి, పశుమాంసమును కూడ ఎగుమతి చేయుట ఆరంభమైనది. ప్రస్తుతమున ఈ దేశపు ఎగుమతుల విలువలో మూడింట రెండు భాగములు పశువులు, వాని మాంస చర్మములు మొదలగు వానివలన లభించుచున్నది.

ఖనిజ పరిశ్రమ తగినంతగా లేదు. 1866 నుండి ఇప్పటివరకు బంగారు గనులలో కొంత ఉత్పత్తి సాగినది ; కాని ఇపుడు ఆ గనులలో బంగారము లభించుట చాల తగ్గిపోయినది. ప్రస్తుతము మాంగనీజ్, రాతినార గనులలో కొంత కృషి జరుగుచున్నది. రాతిఉప్పు విరివిగ త్రవ్వబడు చున్నది. కొద్దికాలము క్రిందట వజ్రపుగనులు కనుగొనబడి 1974 మొదలుగ అందు పని మొదలైనది. ఆవిరివలన మాత్రమే విద్యుదుత్పత్తి జరుగుచున్నది. దేశమున విద్యుద్వినియోగము 1,23,80,164 కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 74,91,118 రాండ్లు; దిగుమతుల విలువ 2,32,30,640 రాం. (1968). దక్షిణ ఆఫ్రికాలోని గనులలో ఈ దేశ వాసులలో పలువురు పనిచేసి, ఇంటికి పంపు ద్రవ్యమును, దక్షిణ ఆఫ్రికాతోఉన్న సుంకముల ఒడంబడిక వలన లభించు మొత్తమును, బ్రిటిష్ ప్రభుత్వముచేయు సహాయమును చెల్లింపుల లోటును సరిపుచ్చుచున్నవి. దేశపు బడ్జెటరీ వ్యయము 1,96,54,950 (1971-72).

**11. సాంఘిక రంగము :** దేశమున అక్షరాస్యత 20%. దేశపు ప్రయిమరీ పాఠశాలలలో విద్యార్థి సంఖ్య 78,442; ప్రయిమరీ విద్యాశాలలు 288, సెకండరీ పాఠశాలలలో విద్యార్థులు 870 ; విదేశములందు విశ్వవిద్యాలయములలో పఠించు వారు 97; దేశమున విశ్వవిద్యాలయములు లేవు. (1972). దేశమున ఒకే ఒక దినపత్రికను, ఇంగ్లీషునను, సెచ్వానాభాషలోను, ప్రభుత్వము నడుపుచున్నది. చెప్పదగిన గ్రంథాలయములుగాని మ్యూజియములుగాని దేశమున లేవు.

దేశమున 1785 శయ్యాసంఖ్య కల ఆసుపత్రులును, తక్కు విధముల వైద్యవసతులును 92 కలవు; వైద్య సంఖ్య 40 (1972).

**12. విలాస యాత్రా సౌ. :** దేశమున మృగయా వినోదమునకై ప్రత్యేకింపబడిన వన భూములందు వేటాడుటకు విదేశీయులు పలువురు దేశమును దర్శింతురు; గుహాకుడ్యములందలి చరిత్రపూర్వపు చిత్తరువులు కూడ పలువురను ఆకర్షించుచున్నవి. యాత్రికుల సౌకర్యము కొరకై పలు నగరములందు చిన్న హోటళ్లు కలవు

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. సెరెచీ ఖామా (జ. 1921); ప్రస్తుతమున ఇతడు దేశాధ్యక్షుడు;

బమాంగ్ వాతో తెగనాయకుని కుమారుడు; కాని ఒక ఆంగ్ల వనితను పెండ్లియాడుటవలన, దేశీయులలో ఛాందసుల ఒత్తిడికి లోనై తన వారసత్వపు అధికారమును వదలుకొనెను. ఆక్స్‌ఫర్డ్‌న ఉన్నత విద్యను అభ్యసించెను; దేశీయ ప్రజలకు నాయకుడై కడకు అధ్యక్ష పదవిని పొంది, అటు దక్షిణ ఆఫ్రికాలోని శ్వేతజాతి ప్రభుత్వముతోను, ఇటు ఆఫ్రికన్ ప్రజల నాయకులతోను సామరస్య భావమున మెలగుచు తన దేశమును ఆధునికము చేయుచున్నాడు.



# 33. మలగాసీ

## (మడగాస్కర్)

**ముఖ్యనగరము :** తనానరీవ్; **జెండా :** దండముపద్ద తెలుపున ఒక నిలువుచారయు, దానికి అభిముఖముగా అడ్డముగ ఎగువన ఎరుపుచారయు, దిగువన ఆకుపసిమి చారయు కలది; **జాతీయ గీతము :** రీ తనింద్రాజనే మలాతా ఓ (ఓ మా ప్రియతమ మాతృభూమి); **నాణెము :** మలగాసీ ఫ్రాంక్, 1,000 మ. ఫ్రాంకులు = రు. 27.00; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 3 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు ఆగ్నేయ తీరమునకు సుదూరమున నెలకొనిన, ఈ ద్వీప రాజ్యము, హిందూమహాసముద్ర పరివృతమై 12° – 25°30′ ద. అక్షాంశ రేఖలకును, 44°20′ – 50°10′ తూ. తులారేఖలకును మధ్యన విస్తరించి ఉన్నది. దేశ వైశాల్యము 5,90,000 చ. కిమీ. ఆఫ్రికా తీరమునుండి ఈ దేశమును మొజాంబిక్ చానెల్ వేరుచేయుచున్నది. ఆఫ్రికా తీరమునుండి ఈ దేశపు తీరమునకుగల కనీసపు దూరము 384 కిమీ. ప్రపంచమునందలి ద్వీపములందెల్ల విస్తృతిలో నాలుగవదిగ లెక్కకువచ్చు ఈ ద్వీపపు గరిష్ఠపు నిడివి 1,568 కిమీ; గరిష్ఠపు వెడల్పు 676 కిమీ. తూర్పు కోస్తానుండి క్రమక్రమముగి భూతలము పైకి లేచి మధ్యదేశమున ఒక ఉన్నత పీఠభూమిగ పరిణమించి, అంతట పడమటికి దిగి సముద్రపు ఒడ్డున గుట్టలుగ పరిణమించుచున్నది. పీఠభూమి సైతము పలుతావులందు నీటికోతపడి, తూర్పువైపున పలు లోయలను జలపాతములను కలిగియున్నది. పూర్వపు అగ్నిపర్వత విజృంభణ ములవలన రూపొందిన కొండలు అనేకములు ఉన్నవి. వీని అన్నింటిలోను పెద్దదియగు 'చారత నానా' ఎత్తు 2,880 మీ. భూతలపు వాటమునుబట్టి ప్రముఖనదులు అన్నియు తూర్పునుండి పశ్చిమము నకు ప్రవహించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఈ ద్వీపరాజ్యము వ్యాపార వాయువుల మండలమున ఉండుటవలన, ఆగ్నేయ వాయువుల మూలమున, దేశపు తూర్పు నైరుతి కోస్తాలలో విపరీతముగ వర్షించుచున్నది. ఈ ప్రాంతపు 'తమతావే'లో సాలుసరి వర్షపాతము 560 సెం. మీ; దక్షిణ ప్రాంతమున వర్షము చాల తక్కువ; ఇచటి భూమి దాదాపుగ ఎడారిగ లెక్కింపదగి ఉన్నది. ఉన్నతినిబట్టి దేశమున ఎండవేడిమి మారుచున్నది. తూర్పు తీరమున ఎండవేడిమి 70° – 80° ఫా. గ ఉండగ, పీఠ భూమియందున్న ముఖ్యనగరమున ఆ వేడిమి 55°– 60° ఫా. గ ఉన్నది; కాని ఆ నగర ప్రాంతమున

సాలుసరి వర్షపాతము 280 సెం. మీ. మాత్రమే. ఇచట జంతు, వృక్ష సంతతికి, ఆఫ్రికాలోని అట్టి వానితో ఎట్టి సంబంధమును, కన్పట్టుటలేదు. దేశమున అడవులు చాలతక్కువ. విషసర్పములు ఎక్కువ.




పటము 33.

మర్కటములుగాక తక్కిన సస్తనజాతి జంతువులు ప్రకృతి సిద్ధముగ దేశమున కన్పట్టవు.

**3. జనసంఖ్య మొ.:** 1971 లెక్కలనుబట్టి దేశపు జనసంఖ్య 76,55,134; ఇందు 48%, 18 ఏండ్ల వయసునకు లోబడినవారు. 1970 అంచనాలను అనుసరించి క్రింది నగరముల జనసంఖ్య ఈ రీతిగ ఉన్నది. తనానరీవ్ 3,22,000, తుమతావే 50,500; మజుంగా 43,500. ప్రాచీన కాలమున అంతటంతట దేశమున వచ్చిచేరిన ఆఫ్రికన్, అరబ్బీ ప్రజలు, అంతకు పూర్వమే ఇచట చేరిన ఇండోనీసియా జాతి ప్రజలతో మేళవించుటవలన మలగాసీ ప్రజానీకము రూపొందినది; ప్రజలలో ఏకరూపత జాతిరీత్యా ఏర్పడియున్నను 14 మొదలు 22 వరకు ఇందు తెగలు కలవని లెక్క తేలుచున్నది. దేశీయులుగాక వ్యాపారాదులరీత్యా ఇచట వచ్చి చేరినవారిలో దాదాపుగ 30,000 ఫ్రెంచివారు, 37,000 కొమోరో ద్వీపవాసులు, 17,000 భారతీయులు, 9,200 చీనీయులు, తదితరులు 4,750 కలరని అంచనా (1968).

దేశీయులందలి వివిధ తెగలలో సాంస్కృతిక, రాజకీయ ప్రాబల్యమువలన మెరినా తెగకు అధిక ప్రాముఖ్యము ఇదివరలో ఉండినను, క్రమముగ తెగల మధ్యగల హెచ్చుతగ్గుల విభేదము తగ్గిపోవుచున్నది

దేశమునందలి ప్రజల మాతృభాష మలగాసీ. ఈ భాష ఇండోనీసియాభాషా కుటుంబమునకు చెందినది; ఇందు లింగభేదమును, క్రియా పరిణామమును కన్పట్టవు. వాక్య నిర్మాణమున కర్మణి ప్రయోగమునకు వ్యాప్తిఎక్కువ. ఈ భాష ఇపుడు ఫ్రెంచితో పాటుగ అధికారభాషగ పరిగణన పొందినది.

రాజ్యాంగ విధానరీత్యా మత స్వాతంత్ర్యము పౌరులకు కలదు. దేశమున ఒక సాంప్రదాయిక మతము కొలది స్థానిక విభేదములతో దేశమున వ్యాప్తియందున్నది. ఐతిహాసిక వీర పురుషుల ఆరాధనయు, పితృదేవతల పూజయు ఇందు ముఖ్యాంగములు. క్రైస్తవమత ప్రచారము 19 వ శతాబ్ది మొదలుగ సాగుచున్నది; క్రైస్తవుల సంఖ్య దాదాపు 4 లక్షలు ఉండును; తీరప్రాంతమున దాదాపు 5 లక్షల ముస్లిములు కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున 547 తపాలా ఆఫీసులును, 55 వైర్‌లెస్ టెలిగ్రాఫ్ స్టేషనులును కలవు. తంతి, టెలిఫోను సౌకర్యములును విరివిగ కలవు. తననారీవ్, పారిస్, మారిషస్, రియూనియన్‌లమధ్య సరాసరి టెలిఫోను సంబంధము కలదు. తనానరీవ్, పారిస్‌లమధ్య వైర్‌లెస్ టెలిగ్రాఫ్ సౌకర్యము కలదు. దేశమున 7 రేడియో స్టేషనులు మలగాసీ, ఫ్రెంచి భాషలలో ప్రసారములను నిర్వహించుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున 40,000 కిమీ. నిడివికల రోడ్లు కలవు; ఇందు 8,364 కిమీ. ఉత్తమ శ్రేణికి చెందినది. దేశమున మొత్తముమీద 864 కిమీ. నిడివిగల నాలుగు రైలుమార్గములు ప్రముఖ నగరములను కలుపుచున్నవి. తమటావే, ముజుంగా, డీగో సువరెజ్, తులియర్, నొస్సిబే, మనకారా అను రేవునగరములవలన నౌకా వ్యాపారము సాగుచున్నది. ముఖ్యనగరమును, తక్కిన దేశీయ నగరములతోను, పారిస్, రోములతోను కలిపెడు విమానయాన వసతి కలదు.

**6. చరిత్ర :** ప్రాచీన కాలమున ఇండోనీసియన్ ప్రజానీకము అంతటంతట దేశమున వలస చేరుటవలన ఈ దేశమున జనావాసములు తొలుత ఏర్పడి, నాగరికత నెలకొనినదని చారిత్రకుల భావన. 1506 లో పోర్చుగీజువారు ఇట కాలిడిరి. ప్రాచీన కాలమున మార్కోపోలో అను నావికుడు పేర్కొనిన మడగాస్కరు ఇది కాదగునని వారు భావించి, దేశమునకు ఆ పేరును పొరపాటున కల్పించిరి. వారిని అనుసరించి ఫ్రెంచి, డచ్చి బ్రిటిష్ వర్తక సంఘములును దేశమున చేరినవి. కాని రాజకీయాధికారము చాలకాలమువరకు మలగాసీ రాజుల ఆధీనముననే ఉండినది. ఈ రాజులను అందరిని నిర్జించి దేశమును ఏకీకృతము చేసినవాడు అంద్రియనామ పొయినీమెరీనా (1787-1810). కాని అతని అనంతరమున రాజులు బలహీనులగుట వలన ఒక మాండలికునివలన తమకు దత్తము చేయబడినదను మిషతో ఫ్రెంచివారు ఒక రాష్ట్రమును తమ రక్షణలోనికి తీసికొనిరి (1883). రాజు ప్రతిఘటించినను ప్రయోజనము లేకపోయెను. బ్రిటిష్‌వారును మలగాసీయందు ఫ్రెంచివారికి ప్రత్యేక ప్రతిపత్తి కలదనుట గుర్తించిరి. తత్పర్యవసానముగ ఫ్రెంచివారు, దేశీయుల ప్రతిఘటనను నిర్మూలించి తుదకు దేశమంతట తమ ఆధిపత్యమును నెలకొల్పిరి. తుదకు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున సాగిన ప్రజోద్యమమునకు లొంగి ఫ్రెంచి ప్రభుత్వము 26 జూన్, 1960 న దేశమునకు స్వతంత్రతను కల్పించినది.

**7. పరిపాలన :** 1959 లో ఆమోదింపబడి, 1960 లో సవరింపబడిన ఒక రాజ్యాంగ విధానము వలన, సార్వజనిక వోటు హక్కుతో ఎన్నికైన ప్రజా ప్రభుత్వముగల గణరాజ్య ప్రభుత్వము ఏర్పడినను, అది 18 మే, 1972 న అధ్యక్షుని వలన రద్దొనర్పబడినది. ఆ సంవత్సరము జూన్ మొదలుగ ప్రధానియగు రామనంచవ సేనానియే సర్వాధికారములను గ్రహించి పాలించుచున్నాడు. దేశము పరిపాలనా సౌకర్యముకొరకై 6 రాష్ట్రములుగ విభజింపబడి ఉన్నది. మలగాసీ ప్రజలకు సంబంధించినంతవరకు వ్యవహారములు సాంప్రదాయిక శాసనమును అనుసరించి కోర్టులందు పరిష్కరింపబడుచున్నవి. తనానరీవ్‌లోని సుప్రీమ్ కోర్టునకు అప్పీళ్ళను పరిష్కరించు అధికారము కలదు.

**8. దేశరక్షణ :** 8,500 సైనికులుగల ఒక పదాతిసేనయు, 100 మంది నావిక యోధులుకల నావిక దళమును, 400 మంది పనిచేయు వాయుసేనయు కలవు. ఫ్రాన్స్ దేశముతో కుదుర్చుకొనిన ఒక రక్షణ ఒడంబడికను అనుసరించి, డీగో సువరెజ్

వద్దనున్న నౌకా స్థావరమున 2,500 ఫ్రెంచి సైనికులు కలరు.

**9. అంతర్జాతీయ** సం.: 1960 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక **సంస్థ లలో** పెక్కింటను సభ్యత్వము కలిగియున్నది. కామన్ మార్కెట్‌తో సన్నిహితత్వమును వహించి, **దానివలన** ఆర్థిక సహాయమును, పొందుచున్నది. ఫ్రెంచిభాష మాటాడు 11 ఆఫ్రికన్ రాజ్యములతో **ఆర్థిక** సహకారపు ఒడంబడిక ఈ దేశమునకు కలదు.

**10. ఆర్థిక రంగము:** దేశపు ఆర్థిక వ్యవస్థ అంతయు వ్యవసాయముపైన ఆధారపడి ఉన్నది. దేశమున వ్యవసాయమునఉన్న భూమిలో సగమున వరి పండింపబడుచున్నది; ఇదియే దేశ ప్రజలకు ముఖ్యాహారధాన్యము. మొక్కజొన్న, చిరుగడ దుంపలు, ఉరలగడ్డలు మొదలగునవియు పరిమితపు మొత్తములలో పండింపబడుచున్నవి. రొక్కపు పంటలలో కాఫీ గింజలు, మసాలా ద్రవ్యములు, చక్కెర, లవంగములు మొదలగు సుగంధ ద్రవ్యములు క్రమ ప్రాముఖ్యము కలిగియున్నవి; సిసల్ నారయు పెద్దమొత్తమున ఉత్పత్తి అగుచున్నది. ఎగుమతులలో పై వస్తువులే అధిక ప్రాముఖ్యము కలవి. గనులందు గ్రాఫైట్, అభ్రకము దొరకు చున్నది. సీమబొగ్గు లభ్యము కాగల సూచనలు ఉన్నను, అచట పని జరుగుటలేదు. వ్యవసాయ వస్తువులకు సంబంధించిన పరిశ్రమలు మాత్రమే అటనట కొలదిగ కలవు; పరిశ్రమల అభివృద్ధికై ప్రభుత్వము కృషిచేయుచున్నది. దేశమున విద్యు దుత్పత్తి 21 కోట్ల కివా. (1971). దేశపు ఎగుమతుల విలువ 4,080.6 కోట్ల మ. ఫ్రాంకులు; దిగుమతుల విలువ 5 926 1 కోట్ల మ. ఫ్రాంకులు (1971). చెల్లింపుల లోటును సరిపుచ్చుటకు ఫ్రెంచి సహాయము చాలవరకు ఉపకరించుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 5,250 కోట్ల మ. ఫ్రాంకులు (1972).

**11. సాంఘిక రంగము:** దేశమునందలి 5,856 ప్రయిమరీ పాఠశాలలలో 9,38,015 మంది విద్యార్థులు కలరు. 6 నుండి 14 వరకు వయసు కలిగినవారికి నిర్బంధముగ ప్రయిమరీ విద్య బోధింపబడుచున్నది (1970-71). 9,302 మంది విద్యార్థులు పఠించు 62 సాధారణ కళాశాలలును, 46,335 మంది చదివెడు 15 ఉన్నత పాఠలును కలవు. తనానరీవ్‌లోని విశ్వవిద్యాలయ కళాశాలల విద్యార్థి సంఖ్య 3,779 (1968). 2,162 విద్యార్థులుకల 16 సాంకేతిక కళాశాలలును, 3,237 మంది చదివెడు 3 ఉన్నత సాంకేతిక పాఠశాలలును కలవు (1967-68). తనానరీవ్‌న ప్రామాణిక గ్రంథములుకల ఒక పెద్ద గ్రంథాలయమును, ఒక మ్యూజియమును కలవు. దిన పత్రికలు మలగాసీ భాషలో ఏడును, ఫ్రెంచిలో ఒకటియు, ఫ్రెంచి - మలగాసీలలో ఒకటియు ప్రచారమున ఉన్నవి దేశమున 17,700 శయ్యలు కలిగిన పలురీతుల వైద్యశాలలు 609 కలవు; వైద్యసంఖ్య 659 (1969).

**12. యాత్రా సౌ:** విదేశీయ యాత్రికులు వీసా, పాస్‌పోర్టులను విధిగ కలిగి ఉండవలెను. యాత్రికుల సౌకర్యమునకై హోటలుల వసతి కలదు.

# 34. మలావీ

**ముఖ్యనగరము :** జొంబా; **జెండా :** నలుపు, ఎరుపు, ఆకుపసిమి అడ్డుచారలు పైనుండి క్రిందికి అమరియుండగ నలుపు చారపై ఎరుపు రంగున ఉదయభానుని చిత్రము కలది; **నాణెము :** క్వాచా;




పటము 34.

ఒక క్వాచా 100 తంబాలాలుగ విభక్తము; ఒక క్వాచా = రు. 3.75; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య ఆఫ్రికాలో తూర్పు ప్రాంతమున 9°22′ – 17°08′ ద. అ. మధ్యను, 33° – 36° తూ. తు. మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమునను తూర్పునను టాంజానియా; దక్షిణమున మొజాంబిక్; పశ్చిమమున జాంబియా సరిహద్దులందున్నవి. దేశపు ఉత్తర – దక్షిణముల నిడివి 832 కిమీ; తూర్పు పశ్చిమముల కొలత 80 కిమీ. నుండి 160 కిమీ. వరకు మారుచుండును. దేశ వైశాల్యము 1,26,338 చ. కిమీ; ఇందు 31,080 చ. కిమీ. భూమి నీటిమునకలో ఉన్నది. దేశమున మలావీ అను సరస్సు కలదు. దీనిలో తూర్పున కొంతభాగము మొజాంబిక్‌కు చెందినను, తక్కినది ఈ దేశమునకే చెందియున్నది; ఈ సరస్సు ఉత్తర – దక్షిణముల నిడివి 576 కిమీ; ఈ సరస్సు సముద్ర మట్టమునకుపైన 457 మీ. ఎత్తున నెలకొనియుండుట ఒక విశిష్ట భౌతిక లక్షణము. తక్కిన దేశపు ఉపరితలమును చాలవరకు పీఠభూమి. ఇచటి ఎత్తు సాధారణముగ 915 మీ. నుండి 1,220 మీ. వరకు మారుచుండును; ఉత్తరమున కొన్ని ప్రత్యేక ప్రాంతములందు, 2,440 మీ. ఎత్తునకును, మ్లాంజీ పర్వతములలో 3,050 మీ., జొంబావద్ద 2,135 మీ. కును ఈ ఎత్తు మారుచుండుట కననగును. దక్షిణమున మాత్రమే తక్కువ ఎత్తు (610 మీ.) కల ప్రదేశములు కననగును.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున వివిధ ప్రదేశములమధ్య ఎత్తున కననగు వ్యత్యాసములును, సమీపముననే విశాలమగు మలావీ సరస్సు ఉండుటయు దేశపు శీతోష్ణస్థితియందు పెక్కు ప్రాంతీయ విభిన్నతలకు కారణములైనవి. మొత్తముమీద గరిష్ఠ కనిష్ఠోష్ణతలమధ్య వ్యత్యాసము చాల ఎక్కువ. మధ్య మలావీయందు గరిష్ఠోష్ణత 97° ఫా; కనిష్ఠోష్ణత 26° ఫా. నవంబరునుండి ఏప్రిల్‌వరకు వర్ష

ములు కురియును. దేశమున 25% ప్రాంతమున అంతగ దట్టముగ ఉండని అడవులు కలవు. వీనిలో కొన్నిటియందు తగ్గుజాతికి చెందిన కలప దొరుకును; కొన్ని ప్రాంతములలో ఏనుగు, ఖడ్గమృగము, నీటి గుర్రము, కారెనుము కననగును; చిన్న వన్యజంతువులు అన్ని అడవులందును ఉన్నవి. 609 రకముల పక్షిజాతులును, పలు రకముల సర్పములును కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1973 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 45.5 లక్షలు; ఇందు 90% పల్లెపట్టులందు నివసించుచున్నారు. మొత్తపు జనసంఖ్యలో ఆసియా వాసుల సంతతివారు దాదాపు 12 వేలు, యూరపీయ సంతతివారు రమారమి 8 వేలు చేరియున్నారు. జనసాంద్రత చ. కిమీ. కి 38. నగరములలో బ్లోన్‌టైర్ (జ. సం 110 వేలు), లిలోంగ్వే (19,500), జోంబా (19,700) పేర్కొనదగినవి. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు బంటూ జాతికి చెందిన పలుతెగల ఆఫ్రికనులు. యూరపియనులలో అత్యధిక సంఖ్య బ్రిటిష్‌వారిది; డచ్చి, పోర్చుగీజు వారలును అల్ప సంఖ్యలలో కలరు; ఆసియా వాసులలో భారతీయుల సంఖ్య ఎక్కువ. దేశీయులలో పెక్కు ఆఫ్రికన్ భాషలు ప్రచారమున ఉన్నను చిన్యంజా అనునది సామాన్య భాషగ పలువురకు గ్రాహ్యము; అయినను ఇంగ్లీషే అధికార భాషగ పరిగణనను పొందినది. దేశ ప్రజలలో పదిలక్షల మంది క్రైస్తవులు; ఆసియావాస సంతతివారిలో 68% ముస్లిములు, 19% హిందువులు, తక్కినవారు క్రైస్తవాది మతములవారు. ఆఫ్రికన్ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు.

**4. యాన సౌ.:** దేశమున 10,280 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; వీనియందు 1,080 కిమీ. మాత్రమే పక్కారోడ్లు; తక్కినవి మట్టిరోడ్లు. దేశమున 437 కిమీ. పొడవుగల బ్రాడ్‌గేజి రైలు మార్గము మధ్యదేశమందలి సలిమ్మా నగరమును, దక్షిణ ప్రాంతపు న్సాన్జీతో కలుపుచున్నది. ఈ రైలు మార్గము దక్షిణమునకు మొజాంబిక్‌లోనికి విస్తరించి బీరా రేవును చేరుచున్నది. బ్లాన్‌టైర్‌లోని విమానాశ్రయమునుండి పరిసర దేశముల ముఖ్య నగరములకు విమానయాన వసతులు ఉన్నవి. దేశమున వివిధ నగరముల మధ్యకూడ విమానయానపు సౌకర్యములు కలవు.

**6. చరిత్ర:** క్రీ. శకారంభ కాలమునుండియు ఇచట, కొందరు ఆఫ్రికన్ జాతులవారు వసించుచుండినటులను, 10 వ శతాబ్దికి పూర్వమునుండియే అరబ్బులకు ఈ ప్రాంతముతో పరిచయ ముండెననియు తప్ప ఈ దేశపు పూర్వ చరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. 1616లో ఒక క్రైస్తవమత ప్రచారకుడు, ఈ ప్రాంతమును దర్శించి, దాని ఉనికిని తెలియజేసినను, తదనంతర కాలమున దాదాపు 250 సంవత్సరములవరకు యూరపువాసు లెవరను, ఇట కాలిడలేదు. 1859 లో తక్కిన మధ్య ఆఫ్రికాతో పాటుగ, ఈ ప్రాంతమునుకూడా డేవిడ్ లివింగ్‌స్టన్ (చూ : జాంబియా) దర్శించి క్రైస్తవమత ప్రచారమునకు అంకురార్పణచేయగ, అంత బ్రిటనునుండి వివిధ మతప్రచార సంఘములు ఆ ప్రాంతమున చేరి మత వ్యాపనమునకై కృషిచేసినవి. వారితో పాటుగ ఒక బ్రిటిష్ వర్తక సంస్థయు అట చేరి పలుకుబడిని ఆర్జించినది. అంతట అరబ్బులు దేశీయులను బానిసలుగ కొని పోవుటను నిరోధించుటకై బ్రిటిష్ ప్రభుత్వము అట జోక్యమువహించి, తెగల నాయకులను అంగీకరింపజేసి, 'న్యాసాలాండు' అను పేరు దేశమునకు కల్పించి దానిని తమ రక్షిత రాజ్యముగ చేసికొనిరి; వారు కొన్ని ప్రజాస్వామ్య విధానములను ప్రవేశ పెట్టినను, దానివలన శ్వేతజాతులకు మాత్రమే మేలు కలిగినది. 1953 లో ఉత్తర, దక్షిణ రొడీసి

యాలను, న్యాసాలాండును కలిపి ఒక సమాఖ్యా రాజ్యముగ బ్రిటిష్ ప్రభుత్వము ఏర్పరచెను. క్రైస్తవమత ప్రచారకులవలన విద్యావ్యాప్తి ఎక్కువగ జరిగిన ఫలితముగ దేశపు ప్రజలలో రాజకీయ చైతన్యము కలిగినది. అంతట వారు, హేస్టింగ్స్ బందా నాయకత్వమున, సమాఖ్యను రద్దుచేసి, ఆఫ్రికన్ ప్రజలకు అధికారముగల స్వతంత్ర రాజ్యముగ దేశమును రూపొందింపవలెనని ఆందోళన చేసిరి. తత్ఫలితముగ 1963 లో సమాఖ్య రద్దయి, జులై 6, 1964 న న్యాసాలాండ్, మలావీ అను పేరుతో, స్వతంత్ర రాజ్యమై కామన్‌వెల్తున సభ్యత్వము కలిగిఉన్నది.

**7. పరిపాలన :** దేశమున గణతంత్ర ప్రజాస్వామ్య ప్రభుత్వపు రాజ్యాంగము అమలున ఉన్నది. శాసన నిర్మాణాధికారము జాతీయ శాసనసభయందును, కార్యనిర్వహణాధికారము అధ్యక్షుని యందును న్యస్తములై ఉన్నవి. 21 ఏండ్ల వయస్సుకు తగ్గని ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు; జాతీయ శాసనసభకు సాధారణ పరిస్థితిలో ఎన్నికలు అయిదేళ్ళకు ఒకసారి జరుగును; ఆత్యయిక పరిస్థితిలో ఈ వ్యవధి పొడిగింపబడవచ్చును. శాసనసభ యందు ఎన్నుకొనబడు సభ్యులు 50 మంది, అధ్యక్షుడు నియమించు సభ్యులు అయిదుగురు కలరు. దేశమున ఒకే ఒక రాజకీయ పక్షము - మలావీ కాంగ్రెసుపార్టీ - మాత్రమే పనిచేయగలుగుచున్నది. ఆ పార్టీ నాయకుడు హేస్టింగ్స్‌బందా, యావజ్జీవము అధ్యక్షుడుగ ఉండవలెనను నిర్ణయము జరిగినది. అతని అనంతరమున అధ్యక్షుని ఎన్నుకొను తీరును రాజ్యాంగ విధానము నిర్ణయించియున్నది. కార్యనిర్వహణలో అధ్యక్షునికి సాయపడుటకు మంత్రులను అతడు నియమించుకొనును; ఈ మంత్రులు శాసన సభయందు సభ్యులై ఉండవలెను. 1969 కి పూర్వమున బ్రిటిష్ విధానపు న్యాయ నిర్వహణమే దేశమున అమలున ఉండినది; కాని తదనంతరమున సాంప్రదాయపు ఆఫ్రికన్ తెగల న్యాయస్థానములకే మరణశిక్షనుకూడ, అధ్యక్షుని తుది నిర్ణయమునకు లోబడి, విధించు అధికారము కల్పింపబడినది.

**8. దేశరక్షణ :** ఒక బ్రిటిష్ సేనాని నాయకత్వమున పనిచేయుచు, 850 మంది దేశీయ సైనికులుకల పదాతిదళము కలదు. పౌరులలో పలువురు సైనిక శిక్షను పొందుచున్నారు

**9. అంతర్జాతీయ సం :** ఐక్యరాజ్యసమితి యందును, దాని అనుబంధ ప్రత్యేక సంస్థలందును దేశమునకు సభ్యత్వము కలదు. ఆఫ్రికా ఐక్యతా సంఘమున సభ్యత్వము కలిగియు, ఈ దేశ ప్రభుత్వము దక్షిణ ఆఫ్రికా, రొడీసియాలతో సామరస్యమున మెలగుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. దేశమునుండి ఎగుమతియగు రొక్కపు పంటలలో ముఖ్యమైనది తేయాకు; తరువాత లెక్కకు వచ్చునది పొగాకు. ఆహార ధాన్యములలో మొక్కజొన్న ప్రముఖము. ఖనిజ పరిశ్రమలు చెప్పదగినవి లేవు; వ్యవసాయ వస్తువులకు సంబంధించిన పరిశ్రమలు మాత్రమే దేశమున కలవు. దేశమున విద్యుత్ వినియోగము 10.57 కోట్ల కివా. (1969). దేశపు ఎగుమతుల విలువ 4,98,00,05 క్వా.; దిగుమతుల విలువ 7,14,00,000 క్వా. (1970). దేశము అంతర్జాతీయ అభివృద్ధి సంఘమునుండియు గ్రేట్ బ్రిటన్, యు. స్టే., దక్షిణ ఆఫ్రికా, పశ్చిమ జర్మనీ, డెన్మార్కులనుండియు ధనసహాయమును గ్రహించుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 562 లక్షల క్వా. (1972-73).

**11. సాంఘిక రంగము:** దేశమున విద్యాశాలలను అన్నింటిని ప్రభుత్వమే నిర్వహించుచున్నది. మొత్తమున 3,28,437 విద్యార్థులు పఠించు 18,000 ప్రయిమరీ పాఠశాలలును,

13,836 మంది విద్యార్థులుకల 53 సెకండరీ పాఠశాలలును కలవు. వీటి అన్నింట ఉపాధ్యాయ సంఖ్య 9,407; సాంకేతిక, వృత్తి పాఠశాలలలోని శిక్షితుల సంఖ్య 1,904 మలావీ విశ్వవిద్యాలయము లింబే నగరమున 1965 లో స్థాపించబడినది అందలి విద్యార్థి సంఖ్య 1,027 (1972). బ్లాన్ టైర్‌లో ఒక పెద్ద గ్రంథాలయము కలదు. ఆ నగరమునకు సమీపముననే ఒక మ్యూజియము కలదు. వారమున నాలుగు దినములు వెలువడు ఒక ఆంగ్ల దినపత్రిక బ్లాన్‌టైర్‌నుండి, వారిమునకు రెండు దినములు, ఆంగ్లమునను చిచేవా భాషలోను వెలువడు ఒక పత్రిక లింబేనుండి ప్రచురింపబడుచున్నవి. దేశమున 4,250 శయ్యాసంఖ్యకల 52 ఆసుపత్రులు కలవు; ఇవికాక మత ప్రచార సంఘములు, ప్రభుత్వ సహాయముతో నడపు 64 వైద్యశాలలు కలవు. దేశమున వైద్య సంఖ్య 95 (1965)

**12. యాత్రా సౌ.:** దేశమందలి మలావీ సరస్సు, మ్లాంజీ పర్వతము, జొంబా శిఖరము విదేశీయ యాత్రికులను ఆకర్షించుచున్నవి; యాత్రికుల సౌకర్యమునకై వసతులను ఆ యా ప్రదేశము లందు ప్రభుత్వము ఏర్పరచినది.

---

# 35. మా రి టే ని యా

**ముఖ్యనగరము :** నయక్‌చోట్ ; **జెండా :** లేత ఆకుపసిమి భూమికపై, సువర్ణ రంజితమగు




పటము 35.

నెలవంకయు, అందు నక్షత్రమును కలది; **జాతీయ గీతము :** 'మారిటేనియా' అను గీతము; **నాణెము.** ఫ్రాంకు సి. ఎఫ్. ఎ. (కమ్యూనిటీ ఫినాన్సిఎరే ఆఫ్రికానే) 100 ఫ్రాం = రూ. 2.60. **కొలతూకములు ;** మెట్రిక్‌మానమే ప్రామాణికము ; **కాలగణన :** మధ్యాహ్నం 12 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** వాయవ్యపు ఆఫ్రికాలో 16°–27° ఉ. అక్షాంశరేఖలమధ్యను, 5°–17° పశ్చిమ తులారేఖలమధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు వాయవ్య, ఉత్తరములందు స్పానీయ సహారాయు, ఈశాన్యమున ఆల్‌జీరియాయు, తూర్పున మాలీదేశమును, దక్షిణమున మాలీ దేశమును, సెనెగల్ నదియు పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రమును స్పానీయ సహారాయు సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము 10,30,700 చ. కిమీ దేశమున అత్యధిక భాగము ఎత్తు తక్కువగ ఉన్న చదును ప్రాంతము. దక్షిణమున ఉన్న సెనెగల్‌నది యొకటియే జలమార్గము.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశమున ఉత్తర భాగమున అత్యధిక ప్రాంతమున సహారా ఎడారిలోని

శీతోష్ణ పరిస్థితులు - యథాతథముగ కననగును. సముద్రతీరమున అత్యధికోష్ణత 90° ఫా; అల్పోష్ణత 79° ఫా. వర్షపాతము సాలీనా 42 సెం. మీ. వరకు ఉండును. దక్షిణ దేశమున వర్షపాతము అంతకు తక్కువగ ఉండును. దక్షిణదేశమున కొన్ని మధ్యతరగతి ఆటవీప్రాంతములు కలవు. ఎడారులయందు ఊటనీటి పట్టులలో పచ్చగడ్డి భూములును, కొన్ని ముండ్లచెట్లును కననగును. దక్షిణదేశపు అడవులలో సింహములు, చిరుతలు మొదలగు పెద్ద తరగతి వన్యజంతువులు కలవు; కాని ఉత్తరమున లేళ్లు మొదలగు చిన్న జంతువులు మాత్రమే కననగును.

**3. జనసంఖ్య మొ.:** 1972 అంచనాను అనుసరించి జనసంఖ్య 11.8 లక్షలు. ముఖ్య నగరపు జనసంఖ్య 21,000; తక్కిన నగరములలో కేడి (జ. సం. 18000), ఆటర్ (జనసంఖ్య 18,000), రోసో (జ. సం. 18,000) పేర్కొన దగినవి. బర్బర, అరబ్బీ, నీగ్రోజాతుల సమ్మిశ్రణ జాతికి చెందినవారు దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు. దేశీయులలో దాదాపు సగముమంది స్థిరస్థావరములేని ద్రిమ్మరి జాతులకు చెందినవారు. 99% ప్రజలు ముస్లిములు; అత్యధిక సంఖ్యాకుల మాతృభాష 'హస్సానీయా' అనబడు అరబ్బీ మాండలికము.

**4. సమాచార సౌ.:** దేశమున 25 తపాలా ఫీసులు కలవు. వీనిలో 15 లో టెలిఫోన్ సౌకర్యములును, 24 లో తంతి సౌకర్యములును కలవు. పారిస్‌కు నవాక్‌చోట్‌నుండి సరాసరి టెలిఫోన్ సంబంధము కలదు. దేశమున వివిధకేంద్రములమధ్య రేడియో టెలిఫోన్ సౌకర్యము కలదు. ముఖ్యనగరమున రేడియో స్టేషన్ ఒకటి పనిచేయుచున్నది. దేశమున 45,000 రేడియోలు కలవు (1968).

**5. యాన సౌ.:** దేశమున రోడ్డు సౌకర్యములు ప్రధాన నగరముల మధ్య మాత్రమే కలవు. వాని మొత్తపు నిడివి 2,500 కిమీ. నవధిబౌ నుండి ఫోర్ట్‌గౌరా వరకు 675 కిమీ. నిడివి గల రైలు మార్గము కలదు, సెనెగల్ నదిలో సముద్రము నుండి ఎగువకు 840 కిమీ. వరకు నౌకలు పోగలవు. దేశమునకు అంతటికి నవాధిబౌ అను నదియే ముఖ్యమైన సముద్రపు రేవునగరము. ఆ నగరముననే ఒక విమానయాన స్థావరమును కలదు. ఇటనుండి అతిదూర దేశములకు విమాన యాన సౌకర్యము కలదు.

**6 చరిత్ర:** నీగ్రోల చరిత్రలో ప్రసిద్ధిని ఆర్జించిన ఘానా సామ్రాజ్యమున అంతర్భాగముగ తొలుత ఉండిన ఈ దేశమును, 11 వ శతాబ్దిలో బర్బరులు వశపరచుకొనగ, 14 వ శతాబ్దిలో ఆ బర్బరులను లోగాని అరబ్బులు రాజ్యాధికారమును కైవసము చేసికొనిరి. 15 వ శతాబ్దిలో పోర్చుగీజు వారిట చేరి, నెలవు నార్జించిరి. అనంతరమున 19 వ శతాబ్దిలో యూరపీయజాతులు ఆఫ్రికా ఖండమును విభజించుకొనినపుడు ఫ్రెంచివారికి ఈ దేశము దక్కినది (1815). దేశమునందలి వివిధ ప్రాంతములను జాతులను క్రమముగ వశపరచుకొని 1920 లో, ఆయా ప్రాంతములను కలిపి మారిటేనియాగా ఫ్రెంచివారు రూపొందించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున క్రమేణ అధికారమును దేశీయులకు ఫ్రెంచివారు సంక్రమింపజేసిరి. కడరు నవంబరు 28, 1960 న ఈ దేశము సంపూర్ణ స్వాతంత్ర్యమును ఆర్జించెను.

**7. పరిపాలన:** 1961, మే 20 న ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి ఇచటి పాలన నిర్వహింపబడుచున్నది. అయిదేండ్లకు ఒకసారి, సార్వజనిక వోటింగు ప్రాతిపదికన, శాసన సభకు 40 మంది సభ్యులును, దేశాధ్యక్షుడును ప్రజలచే ఎన్నుకొనబడెదరు. దేశమున, హిజ్‌బ్ షాబ్ (ప్రజాపార్టీ) అను ఒకే

ఒక పార్టీకి మాత్రమే పరిగణన కలదు. ఈ పార్టీ నియమితులు మాత్రమే శాసనసభ్యులుగ, ఏకపట్టికా విధానమున, ఎన్నుకొనబడెదరు. దేశము, పాలనా సౌలభ్యమునకై, 8 ప్రాంతములుగ విభక్తము. ప్రాంతమున పరిపాలనను స్థానిక ప్రభుత్వము నిర్వహించును. పౌరవ్యవహారములలో ముస్లిం న్యాయశాస్త్రమును, దండవ్యవహారమున ఫ్రెంచి న్యాయశాస్త్రమును ఇచటి న్యాయస్థానములు పాటించుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశమునకు 1000 మందిగల పదాతి సేనయు, 1000 మందిగల వాయుసేనయు కలదు. 1962 మొదలుగ నిర్బంధ సైనిక శిక్షణ అమలులోనికి కొనితేబడినది.

**9. అంతర్జాతీయ సం. :** 1961 మొదలుగ ఐ. రా. స. యందును, అందలి అనుబంధ ప్రత్యేక సంస్థలయందు కొన్నింటను ఈ దేశము సభ్యత్వమును కలిగి యున్నది. ఈ దేశము, తన రాజ్యమున అంతర్భాగమే అను వాదమును మొరాకో ప్రభుత్వము 1956 లో లేవదీసినది; కాని కడకు ఆ వాదమును వదలుకొనినది; 1970 మొదలుగ ఈ ఉభయరాజ్యములు దౌత్య సంబంధములను కలిగి యున్నవి. ప్రపంచ ప్రముఖ రాజ్యము లన్నింటిలో మారిటేనియాకు దౌత్య సంబంధము కలదు.

**10. ఆర్థిక రంగము :** ఆఫ్రికాలోని పేద దేశములలో ఇది ఒకటి. సెనెగల్ నదీతటమునను, ఎడారులలో ఊటనీటిపట్టులందును మాత్రమే కొలదిగ వ్యవసాయము సాగుచున్నది. సేద్యమునకు తగిన భూమి 39,000 హె. లు; ఇందు 3,000 హె. కు మాత్రమే నీటిపారుదల వసతి కలదు. దేశమునందు దాదాపు 8 లక్షల ఖర్జూర వృక్షములు కలవు. వీని ఫలములు దేశీయుల ఆహారమునకు ఎక్కువగ ఉపకరించుచున్నవి. పచ్చిక భూమి 39,000 హె. లు ఉండుట వలన, పశుపోషణకు అవకాశమేర్పడి, తత్ఫలితముగ మాంసము లభించుచున్నది. తుమ్మజాతి చెట్లనుండి వచ్చు బంకయు, దేశమునుండి ఎగుమతి అగుచున్నది. సముద్ర తీర ప్రాంతమునను, సెనెగల్ నదియందును మత్స్యపరిశ్రమ ప్రోత్సహింపబడుచున్నది. చేపల ఎగుమతి వలన సాలీనా 126 కోట్ల ఫ్రా. (సి ఎఫ్. ఎ.) ఆదాయము లభించుచున్నది (1969). అకోజోట్ ప్రాంతమున రాగి గనులలో పని 1970 లో మొదలైనది. ఈ దేశపు ఇనుప గనులు జగత్ ప్రసిద్ధములు. ముడిఇనుము ఎగుమతివలన సాలీనా 1710 కోట్ల ఫ్రా. లభించుచున్నది (1969). ఈ గనులలో పనులను అన్నింటిని విదేశీ కంపెనీలే నిర్వహించుచున్నవి; ప్రభుత్వమునకు లాభమునందు సగం వాటా లభించుచున్నది. టి. వి. సెట్ల నిర్మాణమున ఉపకరించు ఇట్రియం అనునది, ఈ దేశమున బౌనాగా ప్రాంతమున ఖనిజరూపమున ఉన్నటుల కనుగొనబడినది; ఆయినను ఆ గనులలో ఇంకను పనిమొదలు కాలేదు. దేశమున విద్యుదుత్పత్తి 428 లక్షల కి వా. దేశపు ఎగుమతుల విలువ 1820 కోట్ల ఫ్రా; దిగుమతుల విలువ 934 కోట్ల ఫ్రా. (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 749 కో. ఫ్రాంకులు. ఫ్రెంచి సామ్రాజ్యమున ఇదివరలో చేరి ఉండిన తక్కిన రాజ్యములతో పాటుగ మారిటేనియాకును సమష్టిగ బ్యాంకింగు వ్యవహారములను పశ్చిమ ఆఫ్రికా సెంట్రల్ బ్యాంకే నిర్వర్తించుచున్నది. దీనికి లోపడి స్థానికాధికారములు కలిగిన కొన్ని బ్యాంకులు దేశమున పనిచేయుచున్నవి.

**11. సాంఘిక రంగము :** దేశపు ముఖ్య నగరమగు నవాక్‌చోట్‌న, 1957 మొదలుగ విరివిగ ఆధునిక పద్ధతిలో గృహనిర్మాణము సాగుచున్నను, దేశపు తక్కిన ప్రాంతములందు ఇట్టిది కనబడుటలేదు ; ఈ గృహ నిర్మాణ విషయమున చీనా (పీకింగ్) ప్రభుత్వము మారిటేనియాకు సాయపడుచున్నది. మాతృభాషయగు

అరబ్బీలో బోధించు సాంప్రదాయిక విద్యాశాలలు కలవు ; కాని ప్రస్తుతమున సెకండరీస్థాయి మొదలుగ ఫ్రెంచిలోనే బోధన జరుగుచున్నది. దేశమున మొత్తంమీద 598 పాఠశాలలును, 26,640 విద్యార్థులును కలరు (1968). ద్రిమ్మరి జాతులతోపాటుగ పోవుచు వారి పిల్లలకు విద్యను బోధించు ద్రిమ్మరి పాఠశాలలును కొన్ని కలవు. ప్రజల మాతృభాషయగు అరబ్బీని, ఆధునిక శాస్త్ర విషయ బోధనకు అనువుగ చేయుటకు, కృషి జరుగుచున్నది. ఇస్లామిక శాస్త్రీయ విషయ బోధనకు ప్రత్యేక పాఠశాలలు కలవు. దేశమున విశ్వవిద్యాలయము ఏదియును లేదు; గ్రంథాలయములుగాని, మ్యూజియములుగాని లేవు. దైనిక ప్రతికలును లేవు. డాకర్‌నుండియు, పారిస్‌నుండియు వచ్చు పత్రికలే దేశమున ప్రచారమున ఉన్నవి. దేశమున 385 శయ్యాసంఖ్యగల 4 ఆసుపత్రులు కలవు. క్షయ, కుష్ఠు మొదలగు సాంక్రామిక రోగముల నిరోధించుటకై ప్రపంచ ఆరోగ్య సంస్థ వారి సాయమున ప్రభుత్వము కృషి చేయుచున్నది.

**12. యాత్రా సౌ. :** అదరార్ జిల్లాలోని చిన్‌గ్వెట్టి అనునది ఇస్లామిక పుణ్యక్షేత్రము. ఇస్లామిక దేశములనుండి యాత్రికులు ఇటకు వచ్చుచుందురు. దేశమున ప్రయాణసౌకర్యములు చాల తక్కువ. విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకై ఇట్టి సౌకర్యములను పెంపుచేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది.

---

# 36. మారిషస్

**ముఖ్యనగరము :** పోర్ట్‌లూయీ; **జెండా :** ఎరుపు, నీలము, పసిమి, ఆకుపసిమి రంగుల నాలుగు అడ్డుచారలు పైనుండి దిగువకు అమరినది; **జాతీయ గీతము :** మదర్‌లాండ్, ఓ మదర్‌లాండు ఆఫ్ మైన్ (మాతృభూమీ, ఓ నా మాతృభూమీ); **నాణెము :** మారిషస్ రూపాయి; ఒక మారిషస్ రూపాయి = భారతదేశపు రు. 1.35; **కొలతూతములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 4 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మలగాసీ దీవికి తూర్పున 880 కిమీ. దూరమున హిందూమహాసముద్ర పరివృతమై 19°58′ – 20°32′ ద. అక్షాంశ రేఖల మధ్యను, 57°17′ – 57°46′ తూ. తులారేఖల మధ్యను నెలకొనిన ఒక ద్వీపరాజ్యము. ఈ రాజ్యమున ప్రముఖ ద్వీపమగు మారిషస్ మాత్రమేగాక రోడ్రిగే అను అగ్నిశైలజ ద్వీపమును, అగలేగా ద్వీపమును, కార్గడస్, కరాజో అను పేర వ్యవహృతమగు చిన్నలంకల గుంపును చేరిఉన్నవి. మొత్తపు ద్వీపరాజ్యపు వైశాల్యము 1,843 చ. కిమీ. ఈ ద్వీపరాజ్యము మొత్తమును అగ్నిశైలజమనియే భూతత్త్వవేత్తల అభిప్రాయము. తీరము చుట్టును పపడపురాతి గుట్టలు విరివిగ కానవచ్చును. మారిషస్ ద్వీపపు ఉత్తరపు తీరమైదానము చాల వెడల్పుగ ఉండును. అటనుండి భూమి ఉబ్బెత్తుగ పైకిలేచి 450 మీ. ఎత్తుగల పీఠభూమిగ పరిణమించును. ఈ పీఠభూమికి అంచులందు మూడు పర్వతశ్రేణులు కలవు 'గ్రాండ్' అనునది ఉన్నవానిలోనెల్ల పొడవైన నది. దీని పొడవు 40 కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఆగ్నేయ పవనములు, దాదాపుగ సంవత్సరపు పొడవునను వీచుటవలన గాలియందు చెమ్మదనము ఎక్కువ. సముద్ర తీర

మున ఉష్ణత 75° ఫా.; పీఠభూమిపైన 60° ఫా. అక్టోబరునుండి మార్చివరకు, ఆగ్నేయ వ్యాపార పవనముల మూలమున, ద్వీప మధ్యభాగమున వానలు చాల విరివిగ కురియును; ఏప్రిల్‌నుండి సెప్టెంబరువరకు మందములగు ఆగ్నేయ పవనములవలన ప్రతిదినమున జల్లులు పడుచునే ఉండును. ఎండకాలము అనునది లేనేలేదని భావింపవచ్చును. ద్వీప మధ్యమున సాలుసరి వర్షపాతము 500 సెం మీ.; తీరమున 88 నుండి 150 సెం.మీ. వరకు వర్షపాతము మారుచుండును. డిసెంబరు-మేల మధ్య తరచుగ తుపానుల బాధ ఉండును.




పటము 36.

దేశమున తొలుత పీఠభూమియందు దట్టపు అడవులు ఉండెడివిగాని, ఇపుడు దాదాపుగ అదియంతయు కొట్టివేయబడి ఆ భూమి చెరకుతోటలుగ మార్పుచెందినది. ఎగురలేని 'డోడో' అను ఒక వింతపక్షియు, రెండు రకముల వింత సర్పజాతులును, ఈ ద్వీపరాజ్యమున మాత్రమే కాననగుచున్నవి. తక్కిన పందులు, లేళ్ళు, ముంగిసలు మొదలగునవి అచట వలస చేరినవారివలన గత రెండు శతాబ్దులలో అటకు తేబడినవి.

**3. జనసంఖ్య మొ. :** 1971 అంచనాలను అనుసరించి ఇందలి జనసంఖ్య 8,30,600 ఇందు దాదాపు 6 లక్షలకుపైగా, భారతీయ సంతతికి చెందినవారు. అందును తెలుగువారి సంతతికి చెందినవారు దాదాపు 70,000 ఉందురు. ఇక, తక్కిన ద్వీప వాసులలో క్రియోల్స్ అనబడు నీగ్రో - యూరపీయ సంకర జాతివారు 2 లక్షలును, యూరపీయులు 10 వేలును, చీనీయులు 20 వేలును ఉందురు. పోర్టులూయి (జ. సం. 1,38,140), రోజ్‌హిల్ (జ. సం. 70,700) పేర్కొనదగిన నగరములు. క్రియోలులును, యూరపీయులును సాంస్కృతిక రీత్యా ఫ్రెంచివారుగ పరిగణనీయులు. క్రియోల్ అని పిలువబడు అపభ్రంశపు ఫ్రెంచి, వారి మాతృభాష. ఈ భాషయే, ద్వీపవాసు లందరికి సామాన్య భాషగ ఉన్నది. అయినను భారతీయులలో, హిందీ, తమిళము, తెలుగు ఆంతరంగిక వ్యవహారములకు సంబంధించినంతవరకు వాడుక భాషలుగ వ్యాప్తిలో కలవు. ఆంగ్లభాష అధికార వ్యవహార భాషగ అమలులో కలదు. దేశీయులలో క్రియోలులును, యూరపీయులును, చీనీయులలో పలువురును క్రైస్తవులు; భారతీయ సంతతివారిలో దాదాపు 5 లక్షలు హిందువులు; తక్కినవారు ముస్లిములు.

**4. సమాచార సౌ. :** ద్వీపమున వివిధ భాగములమధ్య తపాలా, తంతి, టెలిఫోన్ వసతులు విరివిగ కలవు. టెలిఫోను స్టేషనుల సంఖ్య 19,113. ప్రపంచపు తక్కిన దేశముల పెక్కింటితో రేడియో టెలిఫోనుద్వారా సంబంధము కలదు. 1965 మొదలుగ టెలివిజన్ ప్రసార సౌకర్యము ఏర్పడి ఉన్నది.

**5. యాన సౌ. :** రాజ్యమున 1,310 కిమీ. రోడ్డు మార్గములు కలవు; ఇందు 900 కిమీ. తారు

వేసినది. 130 కిమీ ల పొడవుగల రైలుమార్గము కలదుగాని ఇది సరకుల రవాణాకు మాత్రమే విని యుక్తమగుచున్నది. పౌర ప్రయాణములు బస్సుల వలన మాత్రమే జరుగుచున్నవి. రాజ్యమునగల ఒకే ఒక రేవు పోర్ట్ లూయీ. ప్లయిసన్స్ విమా నాశ్రయమునుండి, ప్రపంచపు వివిధ ప్రాంతము లకు విమానయాన సౌకర్యము కలదు. దేశాంతర్గత మగు విమానయానవసతి లేదు.

**6. చరిత్ర :** ఇది తొలుత ఎట్టి జనావాసమును లేని ద్వీప ప్రాంతము. క్రీ. శ. 10 వ శతాబ్ది ప్రాంతమున సముద్రయానమును చేసెడి అరబ్బుల కును, మలేలకును దీనితో పరిచయము ఏర్పడినను, గణనీయములగు జనావాసములు ఏవియు అపుడు అట రూపొందలేదు. తరువాత 16 వ శతాబ్ది మొదలుగ పోర్చుగీజువారు మొదలగు యూరపీయ జాతులును, ఆ ద్వీపములతో పరిచితిని సాధించినను, కడకు 1598 లో డచ్చివారు మాత్రమే అట కాలూని, ద్వీపమునకు 'మారిషస్' అను పేరిడి వలసలను ఏర్పరచిరి. కాని 1710 లో వారు ఆ దీవిని వదలిపోయిరి. అంతట 1715 లో ఫ్రెంచి వారు అట చేరి, రియూనియన్ దీవినుండి ప్రజలను కొనివచ్చి ఇట చేర్చిరి. 1767 వరకు ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో ఈ ద్వీపరాజ్యము ఉండి, తరువాత ఫ్రెంచి ప్రభుత్వమునకు సంక్ర మించి 1810 వరకు దాని పాలనలో ఉండినది. ఫ్రెంచి విప్లవ కాలమున ఈ ద్వీపము స్వతంత్రతను ప్రకటించినను అది మూన్నాళ్ళ ముచ్చటయే అయి నది. ఫ్రెంచి వారికిని, బ్రిటిష్ వారికిని జరిగిన యుద్ధముల సందర్భమున ఇది బ్రిటిష్‌వారి వశ మైనది (1810). అయినను బ్రిటిష్ వలసలు ఏవియు ఏర్పడక, ఆర్థిక వ్యవస్థ ఫ్రెంచి ప్రజల వశముననే ఉండినది. చక్కెర చెరకు తోటల సేద్యము విరివిగ జరిగి అందు పనిచేయుటకు ఆఫ్రికన్ బానిసలు తేబడిరి. కాని బానిసత్వము రద్దయిన తరువాత ఈ ఆఫ్రికన్ జాతులు, వ్యవ సాయపు కూలీలుగ రానందున, భారతదేశమునుండి ఇండెంచరు పద్ధతిలో కూలీలను కొనివచ్చుట జరిగి నది (1835-1907). అపుడు భారతదేశమున, హిందీ, తెలుగు, తమిళ ప్రాంతములనుండి ఇటకు కూలీలుగా తేబడినవారి సంతతి, ఇండెంచరు పద్ధతి రద్దయిన తరువాత అట స్థిర స్థావరము ఏర్పరచు కొనుటవలన, జనానీకమున, వారు అత్యధిక సంఖ్యాకులయిరి. 1968 లో ఈ రాజ్యమునకు బ్రిటన్ స్వాతంత్ర్యమును కల్పించినది; తదాదిగ కామన్‌వెల్తున సభ్యత్వమును కలిగి ఈ దేశము స్వతంత్ర రాజ్యముగ వర్తించుచున్నది.

**7. పరిపాలన :** బ్రిటిష్ రాణి నియమించు గవర్నర్ పెద్దరికమున, ఇట పాలన నిర్వహింప బడుచున్నను, మంత్రివర్గపు సలహాను అనుసరించి గవర్నరు వర్తించును. 70 మంది సభ్యులుకల శాసనసభకు ఈ మంత్రివర్గము బాధ్యతను వహిం చును. అయిదేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ఈ శాసనసభయందలి 62 మంది సభ్యులు రోడ్రిగే ద్వీపమునుండి ఇరువురును, తక్కినవారు మారిషస్ ద్వీపమునుండి) ఎన్నుకొనబడెదరు. దేశమునందలి అన్ని జాతుల ప్రజలకు తగు ప్రాతినిధ్యమును కల్గించుటకై 8 మందిని గవర్నరు నియమించును. దేశమున 4 రాజకీయ పక్షములు కలవు. కాని వీనిలో మారిషస్ లేబర్ పార్టీయే అత్యధిక ప్రజా దరణ కలది దీని అధ్యక్షుడగు సర్ సేవాసాగర్ రామగులామ్ 1969 మొదలుగ దేశపు ప్రధాన మంత్రిగ ఉండి, సాంస్కృతిక రీత్యా, భారతదేశ ముతో ఎక్కువ సంబంధమును ఉంచుకొని, వివిధ జాతులమధ్య సామరస్యమును నెలకొల్పి, ప్రజా స్వామికముగ, పరిపాలనను నిర్వహించుచున్నాడు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దాదాపు 400 మందికల స్పెషల్ మొబైల్ ఫోర్సు, పోలీసు దళములును మాత్రమే కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా.స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, ఈ రాజ్యము నకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ యంతయు చక్కెర చెరకు తోటలపై ఆధారపడి ఉన్నది. 86,624 హెక్టేర్లలో చెరకు సాగగు చున్నది. ఈ పంటను వినియోగించి చక్కెరను తయారుచేయుటకు 25 ఫేక్టరీలు పనిచేయుచున్నవి. ఇందువలన మంచిరకపు చక్కెర 33,765 మెట్రిక్ టన్నులు, 5,87,322 టన్నులు తక్కువ రకపు చక్కెర తయారగుచున్నది (1972) తక్కిన వ్యావసాయికోత్పత్తులలో తేయాకు, పొగాకు, బంగాళాదుంప, ఉల్లిగడ్డ మొదలగునవి క్రమ ప్రాముఖ్యమును కలిగియున్నది. దేశపు ఎగు మతుల విలువ 36,07,56,311 రూ; దిగుమతుల విలువ 46,16,36,833 రూ; (ఎగుమతులలో చక్కెర ఎగుమతి విలువ 31,34,20,142 రూ.). దిగుమతుల విలువలో మూడవవంతు ఆహార పదార్థ ములకై వినియుక్తము. ఖనిజ సంపద ఎట్టిదియు లేదు; విద్యుదుత్పత్తి 10.8 కోట్ల కివా. (19ం8). బడ్జెటరీ వ్యయము 28,31,85,489 రూ. (1971-72).

**11. సాంఘిక రంగము :** ప్రాథమిక విద్య చాలవరకు మత సంస్థల అధీనమున ఉన్నది. అన్ని విధముల ప్రయిమరీ పాఠశాలలు 382 లో 1,52,736 మంది విద్యార్థులు; సెకండరీ పాఠ శాలలు 139 లో 47,.98 మంది విద్యార్థులు కలరు (1971). మారిషస్ విశ్వవిద్యాలయము 1967 లో స్థాపింపబడినది. అందలి విద్యార్థి సంఖ్య 260 (1 68). రాజ్యమున 7 గ్రంథాలయములు కలవు; వానిలో రాజధానియందలిది ప్రముఖము. మాహి బర్గ్‌లో ఒకటియు, పోర్ట్‌లూయిలో ఒకటియు మ్యూజియములు కలవు. ఫ్రెంచిలో 5, ఇంగ్లీషున 5, చీనీ భాషలో 3 దిన పత్రికలు కలవు. హిందీలో ద్వైవార పత్రిక ఒకటి కలదు (1968) దేశమున పెద్ద ఆసుపత్రులు 9, ప్రత్యేకపు ఆసుపత్రులు 3, ప్రయివేటు ఆసుపత్రులు 24 కలవు. వీని శయ్యా సంఖ్య 3,145.

**12. యాత్రా సౌ. :** హిందూ మహాసాగర యాత్రాసంస్థ అనునది, మలగాసీ, కొమోరో ద్వీప ములు, మారిషస్, రియూనియనులందలి యాత్రికు లకు ప్రోత్సాహమునిచ్చి, వసతులను కల్పించు చున్నది. విదేశీయులకు ప్యాస్‌పోర్ట్, వీసాలు ఉండవలయును.

---

# 37. మాలీ

**ముఖ్యనగరము :** బమాకో; **జెండా :** ఆకు పసిమి, పసిమి, ఎరుపు నిలువుచారలు కలది; **జాతీయ గీతము :** సౌందియతా సస్సా (సౌంది యతకు జయము): **నాణెము :** మాలీ ఫ్రాంక్ (100 ఫ్రాంకులు = రూ. 1.35) **కొలతూకములు:** మెట్రిక్ పద్ధతివే; **కాలగణన :** మ. 12 గం. = భారతదేశమున సా. 5. గం. 30 ని.

**1. ఉనికి మొ. :** పశ్చిమ ఆఫ్రికాలో రమా రమిగ $10^{\circ}$-$26^{\circ}$ ఉ. అక్షాంశ రేఖలమధ్యను, $4^{\circ}$-$12^{\circ}$ పశ్చిమ తులారేఖలమధ్యను నెలకొనిఉన్న

ఈ దేశమునకు ఉత్తర, ఈశాన్యములందు అల్‌జీరియా, తూర్పున నైగర్, నైరుతి-దక్షిణము లందు అప్పర్ వోల్టా, దక్షిణమున ఐవరీకోస్ట్, ఆగ్నేయ - పశ్చిమములందు గినీ, పశ్చిమమున సెనెగల్, పశ్చిమ-వాయవ్యములందు మారిటేనియా సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 12,04,021 చ. కిమీ. నైగర్, సెనెగల్ అనురెండు నదులు దేశమున ప్రవహించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** శీతోష్ణరీత్యా దేశపు ఉత్తర దక్షిణప్రాంతములు విభిన్నరీతిలో ఉన్నవి. ఉత్తర




పటము 37.

భాగమున ఎండకాలమున ఎండలును, చలికాలమున చలియు ఎక్కువ. దక్షిణభాగము సమశీతోష్ణ ప్రాంతము, దక్షిణ ప్రాంతమున సాలీనా 140 సెం. మీ. వర్షపాతము కలదు ; ఉత్తరమున అది 20 సెం. మీ. మించక, ఉత్తరపు కొనన ఎడారి పరిస్థితులు కనసగును. వృక్ష సంపదయు, జంతు సంపదయు, ఆ యా శీతోష్ణపరిస్థితులకు అనుగుణముగ ఉన్నవి.

**3. జనసంఖ్య మొ. :** 1969 అంచనాలను అనుసరించి దేశ జనసంఖ్య 48,81,000. దేశ ప్రజలలో 90% వ్యావసాయికులు. దేశనగరములలో ముఖ్యనగరమగు బమాకో (జనసంఖ్య 170 వేలు), కేయిాస్ (29,500) సీగొ (28,100) మోప్తి (32,000) పేర్కొనదగినవి. దేశమున బంబర మొదలగు వివిధ జాతుల ప్రజలు కలరు; వీరికి అందరికి వేర్వేరు మాతృభాష లున్నను, దేశపు వ్యావహారిక భాషగ ఫ్రెంచియే వాడబడుచున్నది. ప్రజలలో 90% ముస్లిములు, 1% క్రైస్తవులు, తక్కినవారు ప్రకృత్యారాధకులు. దేశమున చట్టరీత్యా మతస్వాతంత్ర్యము అమలున కలదు.

**4. సమాచార సౌ. :** దేశమున 116 పోస్టాఫీసులు (1966), 7,000 టెలిఫోనులు (1969) కలవు. బొమాకోకు పారిస్‌తో వైర్‌లెస్ టెలిగ్రాఫ్ సంబంధము కలదు. దేశమున పలుప్రాంతములలో రేడియో స్టేషనులును, 50,000 రేడియో సెట్లును ఉన్నవి.

**5. యాన సౌ. :** దేశమున 7,860 కిమీ. నిడివి గల రోడ్లు కలవు; ఇందు 1,064 కిమీ. మాత్రమే పక్కారోడ్లు. రైలుమార్గముల నిడివి 636 కిమీ. దేశమున 1,616 కిమీ. పొడవున ప్రవహించు నైగర్ నదియందు పడవలు చాలవరకు పయనింప గలుగుచున్నవి. సెనెగల్ నదిమీదను నౌకాయాన సౌకర్యము కలదు బమాకోవద్దను, దానికి దగ్గరనే ఉన్న సీనోవద్దను, విమానాశ్రయములు కలవు. యూరప్, ఆఫ్రికాలలోని పెక్కు ప్రముఖ నగరములకు వీనినుండి విమాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** క్రీ. శ. 4వ శతాబ్దినుండి లిఖితరూపమున ఈ దేశపు చరిత్ర తెలియనగుచున్నది. ఆ శతాబ్ది మొదలుగ 19వ శతాబ్దివరకు ఘానా, మాలీ, గావ్ మొదలగు పలు సామ్రాజ్యములలో అంతటంతట ఈ ప్రాంతము అంతర్భాగముగ ఉండినది. వీటి అన్నింట మాలీ

సామ్రాజ్యము అతి సమర్థవంతముగను, సుసంపన్నముగను, పేరొందినది. 11వ శతాబ్ది మధ్యకాలము మొదలుగ 17వ శతాబ్ది వరకు మనిన ఆ సామ్రాజ్యము 13వ శతాబ్ది ఆరంభకాలమున అత్యుచ్చదశను పొందినది. దాని పేరునే ఈ దేశము ఇపుడు స్వీకరించినది. 19వ శతాబ్దిలో ఫ్రెంచివారు ఇట కాలూన యత్నించి, దేశీయ ప్రభువుల ప్రతిఘటనను అంతరింపజేసి, 1898లో ఈ ప్రాంతమును వశపరచుకొనిరి. ఫ్రెంచివారి కాలమున ఈ దేశము సౌడాన్ అను పేరున వ్యవహరింపబడెడిది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఫ్రెంచి వలసలు స్వాతంత్ర్యమును ఆర్జించిన ఫలితముగ ఈ దేశమును స్వతంత్రమై, 1960లో మాలీ అను పేర సర్వస్వతంత్ర రాజ్యమైనది.

**7. పరిపాలన :** 14 మంది సభ్యులు కల సైనిక సంఘము దేశపరిపాలనను నిర్వహించుచున్నది. అధ్యక్షుడు ఆ సంఘమునకు బాధ్యతను వహించి పాలించుచున్నాడు. రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుట లేదు. దేశము 42 మండలములుగల 6 ప్రాంతములుగ విభక్తమైనది. జాతీయ ప్రభుత్వము ప్రాంతీయ పాలకుని నియమించుచున్నది సుప్రీంకోర్టు ఆధ్వర్యవమునకు లోబడిన న్యాయస్థానములు న్యాయనిర్వహణను సాగించుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశమున రెండేండ్ల నిర్బంధ సైనిక శిక్షణ అమలునందున్నది. రష్యా, తూర్పు యూరపు రాజ్యముల వలన దేశము సైనిక సామగ్రిని స్వీకరించుచున్నది; ఆ దేశములే మాలీ సైనికులకు శిక్షణను ఇచ్చుచున్నవి. దేశమునకు 3000 మంది కల సైనికదళము కలదు (1968); దేశపునర్నిర్మాణ కార్యక్రమములందు, అనగా వయోజనవిద్య, సమష్టి వ్యవసాయము మొదలగు కార్యక్రమములలో, సైనికులును పాల్గొను అవకాశమును ప్రభుత్వము కల్పించుచున్నది.

**9. అంతర్జాతీయ సం :** 1960 మొదలుగ ఐ. రా. స. యందు ఈ దేశము సభ్యత్వమును కలిగి ఉన్నది. పశ్చిమ ఆఫ్రికా సుంకముల యూనియన్‌లో మాలీకి సభ్యత్వము కలదు.

**10 ఆర్థిక రంగము :** దేశార్థిక వ్యవస్థకు, వ్యవసాయము, పశుపోషణ, మత్స్యపరిశ్రమ, మూలాధారములు. ఆహారవిషయికముగ దేశము స్వయంపోషకము. అయినను సేద్యమునకు అనుకూలమగు భూమి అంతయు దక్షిణ ప్రాంతముననే ఉన్నది. చీనా సహాయమున చెరకు సేద్యము కూడ ఇట మొదలిడబడినది. దేశమున పండెడు ప్రత్తిలో అధిక భాగము ఎగుమతి అగుచున్నది. దేశమున అన్నివిధముల పశుజాతియు కలసి మొత్తంమీద 51 లక్షల వరకు ఉన్నది. పరిసర విదేశములకు సజీవజంతువుల ఎగుమతి ఎక్కువగ జరుగుచున్నది; ఇందులకుతోడుగ దూరదేశములకు మాంసపు ఎగుమతియు సాగుచున్నది. చేపల ఎగుమతియు గణనీయము. దేశమునుండి రాతి ఉప్పు ప్రక్కదేశములకు ఎగుమతియగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 528 కోట్ల మా. ఫ్రాంకులు; దిగుమతుల విలువ 1,673 కోట్ల ఫ్రాంకులు. విదేశముల సహాయమువలన చెల్లింపుల లోటును దేశము సరిపెట్టగలుగుచున్నది. దేశ ప్రభుత్వాధ్వర్యవమున పనిచేయు మాలీ రిపబ్లిక్ బ్యాంక్ బ్యాంకింగు వ్యవహారముల కేంద్రము. దేశపు విద్యుదుత్పత్తి 348 లక్షల కి. వా. (1968). సెనెగల్‌నదిపై ఆనకట్టవలన ఈ ఉత్పత్తి ఇంకను పెరుగు అవకాశము కలదు. బడ్జెటరీవ్యయము 2,470 కోట్ల ఫ్రాంకులు.

**11. సాంఘిక రంగము :** గృహనిర్మాణము నగరములందు మాత్రమే, ఆధునికరీతిలో సాగుచున్నది. విద్యావిధానమున ఫ్రాన్సుదేశమును ఈ దేశము అనుకరించుచున్నది. మతవిషయిక పాఠశాలలకు ప్రభుత్వాదరణలేదు. తక్కిన వానిని

ప్రభుత్వమే నిర్వహించుచున్నది. ప్రజలలో విద్యా వ్యాప్తి గత ఇరువది ఏండ్లలో ఎక్కువైనది. చదువుకొను వయసుగలవారిలో 23% ప్రస్తుతమున పాఠశాలలో చదువుచున్నారు. ఫ్రాన్సు దేశీయులు పలువురు ఉన్నత విద్యాబోధకులుగ ఇట పనిచేయు చున్నారు. ప్రైమరీ పాఠశాలలలో 175, 538 మంది, సెకండరీ పాఠశాలలో 2,740 మంది, సాంకేతిక పాఠశాలలో 3,026 మంది విద్యార్థులు పఠించిరి (1966-67). దేశమున ఉన్నతస్థాయికి చెందిన గ్రంథాలయములును, మ్యూజియములును కనరావు. బొమాకోలో ఒక చిన్న గ్రంథాల యమును. మ్యూజియమును కలవు. దేశమున ప్రభుత్వమే రెండు దినపత్రికలను ఫ్రెంచిభాషలో నడపుచున్నది. బొమాకోలో 400 శయ్యాసంఖ్య గల ఆసుపత్రియు, ప్రాంతీయనగరములలో ప్రతి యొకట ఒక ఆసుపత్రియు పనిచేయుచున్నవి. ఇవిగాక ఆరోగ్య రక్షణ కేంద్రములు కొన్ని అట నట కలవు. వీటిలో కొన్నింటిని మతసంస్థలు నడుపుచున్నవి.

**12. విలాసయాత్రా సౌ. :** చారిత్రకముగ ఇస్లామిక విద్యా సంస్కృతులకు నెలవుగ పేరొందిన టింబక్టూను, దేశపు ప్రకృతి సంపదను దర్శించుటకు, మృగయావినోదమున పాల్గొనుటకు వచ్చు విదేశీయులకొరకై ప్రభుత్వము హోటళ్లు మొదలగు వసతులను, బొమాకో నగరమునను, కొన్ని ప్రముఖ ప్రదేశములందును విరివిగా కల్పించినది.

**13. ప్రసిద్ధ పౌరులు :** మాలీదేశ చరిత్రలో స్వాతంత్ర్యవీరులుగ పేరొందినవారు 1. సమోరీ తౌరీ 2. అల్‌హాజీ-ఉమేర్. వీరిలో తొలుతటి వాడు 1882-98 వరకు ఫ్రెంచివారిని ఎదుర్కొని పోరాడి ఆ యుద్ధమున వీరస్వర్గమందెను. రెండవ వాడు ఫ్రెంచివారిపై మతయుద్ధమును లేవదీసి, ఫ్రెంచివారిని కల్లోలపరచి, 1964 లో అంత రించెను. ఆధునికకాలమున ప్రసిద్ధ మాలీయుడుగ పేరొందిన మొదిబో కీటా (జననం. 1915) దేశపు రాజకీయరంగమున ప్రతిష్ఠను ఆర్జించి 1960 లో మాలీదేశపు ప్రథమ అధ్యక్షుడయ్యెను.

---

# 38. మొజాంబిక్

**ముఖ్యనగరము :** లోరెన్జో మార్క్విజ్; **జెండా :** తెలియరాలేదు; **జాతీయ గీతము :** తెలి యదు; **నాణెము :** ఎస్కుడో; 1000 ఎస్కుడోలు లేదా 1 కోంటో = రు. 260.75; **కొల తూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా తూర్పు తీరమున 10°27′ – 26°52′ ద. అక్షాంశరేఖలమధ్య, విస్త రించిఉన్న ఈ దేశమునకు తూర్పున హిందూమహా సముద్రము, దక్షిణమున స్వాజీలాండు, దక్షిణ మునను పశ్చిమమునను దక్షిణ ఆఫ్రికాదేశము. పశ్చిమమున రొడీసియా, వాయవ్యమున జాంబియా మలావీదేశములును మలావీసరస్సును సరిహద్దు లందున్నవి. దేశవైశాల్యము 7,83,030 చ. కిమీ., తీరరేఖ నిడివి 2,720 కిమీ. తీరము వెంబడి పల్లపు నేల, లోనికి పశ్చిమమునకు పోనుపోను ఎత్తుపెరిగి. 152 మీ – 610 మీ. ఎత్తుగల పీఠభూమిగ పరిణ మించును; ఇంకను పశ్చిమముగ పోగా సరిహద్దు ప్రాంతమున 2,430 మీ. వరకు ఎత్తుగల పీఠభూమి

రూపొందును. ఉత్తరమున ఒక పర్వతశ్రేణి కలదు; అందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 2,430 మీ. నదులలో, దేశమధ్యమున ఆగ్నేయ దిశగ ప్రవహించు జాంబెజీ, దక్షిణమునందలి లింపోపో, ఉత్తరమునందలి లుగెండా, ప్రముఖములు. నదులలోయలలోను, డెల్టాలలోను భూమి అతిసారవంతము. కాని దేశమున దక్షిణ, మధ్య ప్రాంతములు సారరహితములగు ఇసుకనేలలు.

**2. శీతోష్ణస్థితి మొ.:** తీరప్రాంతమున ఉత్తరభాగమందు ఎండలెక్కువ; అయినను గాలిలో చెమ్మదనము కలదు. పీఠభూములందును, జాంబెజీ




పటము 38.

నదికి దక్షిణప్రాంతమునను శీతోష్ణపరిస్థితి సౌమ్యముగ ఉండుచు అచటి ఉష్ణోగ్రత 54°–97° ఫా. మధ్య మాత్రమే మారుచుండును. అక్టోబరునుండి మార్చివరకు వానకాలముగ లెక్కింపదగియున్నది. దేశాంతర్భాగపు అడవులలో సింహము ఏనుగు, ఖడ్గమృగము, చిరుతపులి, మర్కటజాతులు, హరిణజాతులు కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ.:** 1970 సంవత్సరం లెక్కలను అనుసరించి జనసంఖ్య 82,33,034. ఇందులో దాదాపు రెండులక్షలమంది శ్వేతజాతీయులు. తక్కినవారందరు ఆఫ్రికన్ జాతులకు చెందినవారు. శ్వేతజాతులందును, తక్కినవారిలో అధిక సంఖ్యాకులయందును క్రైస్తవమతము వ్యాప్తి యందున్నది. తక్కినవారందరు ప్రకృతిదేవతారాధకులు. దేశపు నగరములలో లోరెంజో మార్క్వెజ్, బీరా, మొజాంబిక్ ప్రముఖములు. దేశీయులలో వివిధ ఆఫ్రికన్ భాషలును, శ్వేతజాతీయులకు మాతృభాషగ పోర్చుగీజును వ్యాప్తి యందున్నను పోర్చుగీజు భాషయే వ్యావహారిక భాషగ వాడుకయందున్నది.

**4. సమాచార సౌ.:** దేశమున ప్రభుత్వాధీనమున పనిచేయు పోస్టు ఆఫీసులు, తంతి-టెలిగ్రాఫ్ సర్వీసులు కలవు (సంఖ్యావివరములు లభించుటలేదు). దేశమున రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు ఏడు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** దేశమున రోడ్ల నిడివి 37,106 కిమీ; ఇందు 11,280 కిమీ. నిడివిగలవి పక్కారోడ్లు. 3,703 కిమీ. నిడివిగల రైలు మార్గములు కలవు. ఇవి దక్షిణ ఆఫ్రికా, రొడీసియా, మలావీ, జాంబియా దేశముల రైల్వేమండలములతో అనుసంధించి ఉన్నవి. అందువలన ఆయా దేశముల ఎగుమతి దిగుమతులు మొజాంబిక్ రేవులగుండా జరుగుటకు వసతి ఏర్పడినది. తీరమునందలి లోరెంజో మార్క్వెజ్, బీరా, మొజాంబిక్ అనునవి ప్రముఖరేవునగరములు. దేశమున వివిధ ప్రాంతముల మధ్యనేగాక, దక్షిణాఫ్రికాలోని జోహాన్నెస్‌బర్గ్, డర్బనులకును, రొడీసియాలోని సాలిస్‌బరీకిని, మలావీలోని బ్లాన్‌టైర్‌కును విమానయాన వసతి, దేశమునందలి ప్రముఖ నగరములనుండి, ఉన్నది.

**6. చరిత్ర :** 15 వ శతాబ్దికి పూర్వపు ఈ దేశపు చారిత్రక విశేషములు ఏవియు తెలియవచ్చుట లేదు. ఆ శతాబ్దినాటికి ఆఫ్రికన్ జాతులకు చెందిన ప్రజలు ఇచ్చట నివాసములను ఏర్పరచుకొనిరని మాత్రము తెలియవచ్చుచున్నది. భారతదేశమునకు సముద్రమార్గమును అన్వేషించు కృషిలో వాస్కో డి గామా అను పోర్చుగీజు నావికుడు ఇట మార్చి, 1498 న కాలిడెను. తరువాత పోర్చుగీజు వర్తకులు కొందరు తీరప్రాంతమునందు స్థావరములను ఏర్పరచుకొని కాలక్రమమున 1505 నాటికి దేశమున లోపలివైపునకు చొరబారిరి. తరువాత 19 వ శతాబ్దిలో యూరపీయులు ఆఫ్రికాయందలి తమతమ వలసలకు సరిహద్దులను నిర్ణయించుచు ఒడంబడికలను చేసికొనినపుడు మొజాంబిక్‌కు సరిహద్దులు గుర్తించుటయు, పోర్చుగీజుల వలసగ దానిని పరిగణించుటయు జరిగెను (1891). ఇటుల ఆ దేశము పోర్చుగీజుల వలసగ దాదాపు 500 సం. ఉండినది. అధికారము, ఐశ్వర్యము శ్వేతజాతుల వశమున ఉండగ, దేశీయుల పరిస్థితి కాలక్రమమున క్లిష్టతరమయ్యెను. ఫ్రెలిమో అను దేశీయ రాజకీయ పక్షము, ఈ దుస్థితిని ఎరుర్కొని, దాదాపుగ ఇరువది సంవత్సరములు, గెరిల్లా పద్ధతులతో, సామ్రాజ్య సేనలను ప్రతిఘటించి పోరాడినది. ప్రపంచమునందలి ప్రగతిశీలక రాజ్యములును, ఐ. రా. స. యు ఆ ఉద్యమమును సమర్థించినవి. కడకు పోర్చుగల్‌లో నిరంకుశ ప్రభుత్వము పతనమై, ప్రగతిశీలక ప్రభుత్వము ఏర్పడిన (ఏప్రిల్ 25, 1974) తరువాత, మొజాంబిక్‌కు స్వాతంత్ర్యమును కల్పించుటకు అంగీకరించి క్రమగతిలో తీసికొనిన చర్యలమూలమున ఈ దేశము స్వతంత్రము (జూన్ 25, 1975) కాగా, ఫ్రెలిమో పార్టీనాయకుడు సమోరా మెకేల్ దేశాధ్యక్షుడయ్యెను.

**7. పరిపాలన :** ఇప్పటివరకు దేశము వలస పరిపాలనలో ఉండినది; తత్ఫలితముగ శ్వేతజాతి ఆధిక్యముకొరకై కృషిచేయు దక్షిణ ఆఫ్రికా, రొడీసియాలను అనుకరించుచు ప్రభుత్వము ఇచ్చట వర్తించినది. స్వతంత్ర ప్రభుత్వము ఇంక నూత్న వ్యవస్థను రూపొందింపవలసి యున్నది.

**8. దేశరక్షణ :** ఇప్పటి వరకు దేశరక్షణ బాధ్యతను వహించినది పోర్చుగీజు ప్రభుత్వము. ఇపుడు దేశరక్షణ బాధ్యత స్వతంత్ర ప్రభుత్వమునకు లభించినది. ఫ్రెలిమో పార్టీకి చెందిన గెరిల్లాదళములు, దేశప్రభుత్వమునకు చెందిన సేనలుగ రూపొందవలసి ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** వలస రాజ్యముగ ఉండినందున ఇప్పటివరకు ప్రత్యక్ష అంతర్జాతీయ సంబంధములు ఏవియు లేవు. కాని స్వతంత్రతను ఆర్జించిన వెనువెంటనే కొన్ని ప్రముఖ రాజ్యములతో ఈ దేశమునకు దౌత్య సంబంధములు ఏర్పడినవి. వానిలో భారతదేశమును చేరియున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. కాని ప్రక్కనున్న దేశముల ఎగుమతి దిగుమతులకు ఈ దేశపు రేవులే ఆధారములగుటవలన, సరకుల రాకపోకల రుసుములవలనను సుంకములవలనను, దేశమునకు గణనీయమగు ఆదాయము లభించుచున్నది. వ్యవసాయోత్పత్తులలో చక్కెర, ప్రత్తి, కొబ్బెర, కలబందనార, జీడిపప్పు, తేయాకు పేర్కొనదగినవి. దేశమున పశుసంపదయు విస్తారముగ కలదు. దేశవైశాల్యమున 85% అటవీమయము అయినను వ్యాపారరీత్యా కలపను తగినంతగ వినియోగించుకొనుటలేదు; గనులలో రాక్షసిబొగ్గు, బాక్సయిట్ పరిమిత రీతిలో లభించుచున్నవి. వ్యావసాయిక పరిశ్రమలు మాత్రమే కొలదిగ ఉన్నవి. ఎగుమతులలో జీడిపప్పు, ప్రత్తి, కలబందనార, చక్కెర, కొబ్బరి, తేయాకు ప్రముఖములు. దేశపు ఎగుమతుల విలువ 46,12,831 కోంటోలు; దిగు

మతుల విలువ 96,38,749 కోంటోలు (1971). విద్యుదుత్పత్తి సమర్థత 2,70,000 కివా దేశపు బడ్జెటరీవ్యయము 88,83,870 కోంటోలు (1970)

**10. సాంఘిక రంగము :** 4,095 ప్రయిమరీ పాఠశాలలలో 4,96,381 మంది, 40 సెకండరీ సన్నాహక పాఠశాలలలో 7,307 మంది, 45 సెకండరీ పాఠశాలలలో 10,524 మంది, 12 నార్మల్ పాఠశాలలలో 1,124 మంది, 7 ఉన్నతపాఠశాలలలో 1,145 మంది పఠించిరి (1968-69). ఇవిగాక 14,902 మంది విద్యార్థులు కల 29 వృత్తి విద్యా పాఠశాలలు కలవు (1967-68). దేశమున ఒక విశ్వవిద్యాలయమును కలదు. వైద్యసంఖ్య 443. చిన్న, పెద్ద ఆసుపత్రులు మొత్తం 990.

---

# 39. మొరాకో

## (అల్ మగ్రెబ్)

**ముఖ్యనగరము :** రబాత్; **జెండా :** నలువైపుల నల్లని అంచుగల ఎర్రని భూమికపై అయిదు కోణముల ఆకుపచ్చని నక్షత్రము; **జాతీయ గీతము :**




పటము : 39.

స్వరమాత్రమే; సాహిత్య మిందులేదు; **నాణెము :** దరహం; 100 మొరాకో ఫ్రాంకులుగ ఇది విభక్తము; 1 దరహం = రు. 1.48. **కొలతూకములు :** మెట్రిక్ విధానమే అధికార పరిగణనను పొంది ఉన్నది. **కాలగణన :** మ. 12 గం. = భారతదేశమున సా 5 గ. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు వాయవ్యపు తీరమున నెలకొనియున్న ఈ దేశము 28°-36° ఉ. అక్షాంశ రేఖలమధ్యను, 1° - 11° పశ్చిమ తులా రేఖలమధ్యను విస్తరించియున్నది. ఈ దేశమునకు ఉత్తరమున మధ్యధరా సముద్రమును, తూర్పు ఆగ్నేయములందు ఆల్‌జీరియాయును, దక్షిణమున స్పానిష్ సహారాయును, పశ్చిమ వాయవ్యములందు అట్లాంటిక్ మహాసముద్రమును సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము 4,46,550 చ. కిమీ; మధ్యధరా సముద్ర, అట్లాంటిక్ మహాసముద్రములకు చెందిన 1,440 కిమీ. పొడవుగల తీరరేఖ కలదు. దేశము భౌతికరీత్యా ఈ క్రింది మూడు ప్రాంతములుగ విభజింపనగును : (1) మధ్యధరా తీరమును అనుకొనియున్న సారవంతపు మైదానము; ఇందే ఎర్ రిఫ్ పర్వతశ్రేణి కలదు; ఇందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 2,440 మీటర్లు. (2) అట్లాస్ పర్వతావళికి చెందిన మూడు సమాంతర శ్రేణులు వ్యాపించిన ప్రాంతము; ఇందు ఈ శ్రేణులను ఆశ్ర

యించిన పీఠభూములును, లోయలును కననగును, (3) దక్షిణ, తూర్పు మొరాకోలలో వ్యాపించిన మరుభూమి; ఇది క్రమముగ ముందునకు సాగి సహారా ఎడారిలో కలసిపోవుచున్నది. అట్లాస్ పర్వతములందు ఉత్తర ఆఫ్రికాలోని పర్వత శిఖరములందెల్ల అత్యున్నతములని భావింపదగు శిఖరములు కలవు; వీనిలోని తూబ్‌కల్ శిఖరపు ఎత్తు 4,165 మీ. అట్లాస్ పర్వత శ్రేణులలో దక్షిణపుది ఆంటీ అట్లాస్ అని అనబడుచున్నది; ఇందు అగ్ని పర్వతమని చెప్పదగు సిరోవా శిఖరము (3320 మీ.) కలదు.

మొరాకోలోని కొన్ని నదులు వాయవ్యపు మూలకు ప్రవహించి అట్లాంటిక్ సముద్రమున సంగమించుచున్నవి; మరికొన్ని ఆగ్నేయ దిక్కుగ, సహారా ఎడారిలోనికి ప్రవహించి అంతరించుచున్నవి. కాని మౌలోయా అనునది మాత్రము అట్లాస్ పర్వతములలో బయలుదేరి ఈశాన్యమునకు 560 కిమీ. పొడవున పయనించి మధ్యధరా సముద్రములో కలియుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ :** దేశపు పశ్చిమ తీరపు ప్రాంతములందు సరాసరి ఉష్ణోగ్రత 61.5° ఫా. నుండి 73.3° ఫా. వరకు మారుచున్నది: దేశ మధ్యభాగమున సరాసరి ఉష్ణోగ్రత ప్రాంతములను అనుసరించి 50° నుండి 80.6° ఫా. వరకు మారుచున్నది. అక్టోబరు, నవంబరు నెలలలో దేశమున వానలు కురియును. అత్యధిక వర్షము (75 నుండి 100 సెం. మీ. వరకు) దేశమున వాయవ్య భాగమున పడుచుండును. అట్లాంటిక్ తీరమును అనుసరించి జీలుగుజాతి పెద్ద వృక్షములును, అట్లాస్ పర్వత శ్రేణులను ఆశ్రయించి నిత్యశ్యామలపు దేవదారుజాతి వృక్షములును కననగుచున్నవి. దక్షిణ, తూర్పు ప్రాంతములందలి మరుభూమిలో చెట్టు చేమలు సాధారణముగ కనబడవు; ఆ మరుభూమిలో అటనటనుండు ఊటబావులను ఆశ్రయించి మాత్రము కొన్ని చెట్లు కననగును. ఒకప్పుడు ఈ దేశమున సింహములు ఉండెడివి; కాని ఇపుడు అవి అంతరించినవి. చిరుతలు, నక్కలు, లేళ్లు మొదలగు వన్యజంతువులు మాత్రము కలవు.

**3. జనసంఖ్య మొ. :** దేశమున నివసించు వివిధ జాతులలో అరబ్బులును, బర్బరులును ప్రముఖులు. బర్బరులు రిఫ్ ప్రాంతమునను, అట్లాస్ పర్వత మధ్యపు మైదానములందును సూస్ లోయలోను కననగుదురు; అట్లాంటిక్ తీరప్రాంతమున అరబ్బులు అధికముగ వసించుచున్నారు. ఈ ఉభయ జాతులలోను నీగ్రోల లక్షణములు కలగలుపు చెందినవి దేశపు మొత్తపు జనసంఖ్య 1,53,79,259. దేశపు నగరములలో ప్రముఖములైనవి : కాసాబ్లాంకా (జ సం 15,06,373), రబాత్ (జ. సం. 3,67,620); మరాకేష్ (జ. సం. 3,32,741); ఫెజ్ (జ. సం 3,25,327) (1971). దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు సున్నీశాఖకు చెందిన ముస్లిములు. దేశ ప్రజలలో అత్యధిక ప్రచారమున ఉన్నది అరబ్బీ భాష. బరర్బ భాష అటనట మాటాడబడుచున్నది; ఫ్రెంచి, స్పానిష్ భాషలతో విద్యావంతులలో పలువురకు పరిచితియున్నను 1964 మొదలుగ వాని వ్యాప్తి తగ్గిపోయినది.

**4. సమాచార సా. :** తంతి, తపాలా, టెలిఫోన్ సౌకర్యములను, ప్రభుత్వమే నిర్వహించుచున్నది. దేశమున వివిధ పట్టణములమధ్య తంతి, టెలిఫోన్ సౌకర్యములును, స్పెయిన్, ఫ్రాన్స్ జిబ్రాల్టరులతో కేబిల్ సౌకర్యమును కలవు. దేశమునగల 1,71,544 టెలిఫోనులలో నాలుగవవంతు కాసాబ్లాంకాలోను, ఆరవవంతు రబాత్‌లోను ఉన్నవి (1971). రబాత్, టాంజియర్, కాసాబ్లాంకాలలోను, ఇంకను మూడు నగరములలోను రేడియో ప్రసార కేంద్రములు కలవు. కాసాబ్లాంకా, రబాత్

నగరములలో టెలివిజన్ ప్రసార శాలలును ఉన్నవి.

**5. యాన సౌ. :** దేశమున రోడ్ల సౌకర్యము విరివిగ కలదు దేశపు రోడ్ల మొత్తపు నిడివి 52,000 కిమీ; ఇందు 42% ఉన్నత స్థాయికి చెందినవి (1972). ప్రస్తుతమున సరాసరిన సంవత్సరమున 300 కిమీ. చొప్పున క్రొత్త రోడ్లు వేయబడుచున్నవి. రైలు మార్గముల మొత్తపు నిడివి 1,756 కిమీ. 1963 నుండి ఇది జాతీయము చేయబడినది. రైలుమార్గమున ముఖ్యమైన శాఖ మర్రాకేష్‌నుండి కాసాబ్లాంకాకు పోవుచున్నది. అట్లాంటిక్ మహాసముద్ర తీరపు 2 రేవు పట్టణములలో ప్రముఖము కాసాబ్లాంకా. దేశపు సముద్ర వ్యాపారమున 70% ఈ రేవుద్వారా రవాణా అగుచున్నది. మధ్యధరా తీరపు రేవులలో టాంజియర్ ప్రముఖము. దేశమున 11 విమానాశ్రయములు కలవు; రబాత్, కాసాబ్లాంకాలలోని విమానాశ్రయములనుండి అంతర్జాతీయ విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** ఈ దేశమున అతి ప్రాచీన కాలమున నుండియు నివసించుచున్నది బర్బరజాతి. కాని అంతటంతట ప్రాచీనయుగము మొదలుగ క్రమమున ఫోనీషియనులు, కార్తజీనియనులు, రోమనులు (క్రీ. శ. 1వ శతాబ్ది); వేండలులు (క్రీ. శ. 5వ శతాబ్ది), బైజాంటైన్ పాలకులు (క్రీ. శ. 6వ శతాబ్ది) ఈ దేశముపై దండయాత్రలుచేసి వశపరచుకొని పాలించిరి. అంతట క్రీ. శ. 682 లో ఇస్లామ్ మతావేశ ప్రేరితములగు అరబ్బీ సేనలు ఈ దేశమును వశపరచుకొనినవి. అరబ్బు పాలకుల ఆధ్వర్యమున క్రమముగ ఇట ఇస్లామ్ మతమును, అరబ్బీ భాషయు సుస్థిర స్థానములను ఆర్జించినవి కాని క్రీ. శ. 974 లో బర్బర జాతికి చెందిన పాలకులే దేశ పరిపాలనను వశపరచుకొని కొనసాగించిరి. 16వ శతాబ్దిలో 'స అది' అను రాజవంశము దేశమున ఆధిపత్యమును వశపరచుకొనినది. ఈ వంశమునకుచెందిన అల్ మన్సూర్ పరిపాలించిన కాలము (1578-1603) సువర్ణయుగముగ ఈ దేశ చరిత్రలో పేరు గన్నది. ఇతని అనంతరపు పాలకులు బలహీనులగుటవలన, 1644 లో అలావీ రాజవంశము అధికారమునకు రాగలిగినది. ఈ రాజవంశికుడే, ఇపుడును దేశమున పాలనను నిర్వహించుచున్నాడు.

1844 లో అప్పటి రాజును లొంగదీసికొని ఫ్రెంచివారు దేశమున పలుకుబడిని ఆర్జించిరి. స్పెయిన్‌వారును, ఫ్రాన్సు సమ్మతితో ఉత్తర మొరాకోను ఆక్రమించిరి. కాని మొరాకోలో స్థానములను ఆర్జింపవలెనని యునైటెడ్ స్టేట్స్, జర్మనీ బ్రిటన్‌లును ఫ్రాన్సు, స్పెయినులతో పోటీకి వచ్చుటవలన ఈ అయిదు రాజ్యములును 1906 లో ఒక ఒడంబడికకు వచ్చినవి. అందువలన ఈ అయిదింటికిని దేశమున సమానముగ వ్యాపారావకాశములు ఉండవలెననియు, మొరాకో దేశపు రేవులు ఫ్రెంచి, స్పానిష్ సేనల కాపుదలతో ఉండునటులను ఏర్పాటులు జరిగినవి. తరువాత 1912 లో జర్మనీతో ఫ్రాన్స్‌కు కుదిరిన ఒడంబడిక మూలమున దేశముపై రక్షణాధికారమును ఫ్రాన్సు ఆర్జించినది. అందువలన నామమాత్రపు అధికారముతో సుల్తాన్, ఫ్రెంచివారి అదుపునకు లోబడి పాలింపవలసి వచ్చెను. ప్రజలు ప్రతిఘటించినను ప్రయోజనము లేకపోయినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున యునైటెడ్ స్టేట్స్ సేనలు ఈ దేశమును తమ స్థావరముగ ఉంచుకొని యూరప్‌పై దండయాత్రను సాగించినవి; మొరాకో సేనలును వానికి తోడ్పడినవి (1942-45). కాని యుద్ధానంతరమున ఇస్తికలాల్‌పార్టీ నాయకత్వమున ప్రజలు స్వాతంత్ర్యమునకై, సుల్తాన్ ప్రోత్సాహముతో ఆందోళన చేయగ,

ఫ్రెంచి ప్రభుత్వము సుల్తాన్‌ను దేశబహిష్కృతుని చేసినది; అయినను కడకు ప్రపంచాభిప్రాయమునకు లొంగి ఫ్రెంచివారు 1956 లో దేశమునకు స్వాతంత్ర్యమును ఇచ్చి సుల్తాన్‌తో రాజీపడిరి స్పెయిన్ వారు 1958 లో తమ హక్కులను వదలుకొనిరి. అంతర్జాతీయ ప్రదేశముగ ఉండిన టాంజియర్ కూడ 1960 లో దేశమున లీనమయ్యెను. అంతట మారిటేనియా దేశముకూడ తనకే రావలెనని మొరాకో పట్టుపట్టినను, ప్రయోజనము లేకపోయినది. కడకు మారిటేనియా స్వతంత్ర ప్రతిపత్తిని మొరాకో సైతము గుర్తించినది (1972). కాని 1964 మొదలుగ రాజరికమును ప్రతిఘటించు రాజకీయ పక్షములవలన అంతటంతట దేశము కల్లోలములకు గురియగుచున్నది.

**7. పరిపాలన :** వంశానుగతమగు రాజరికపు పెత్తనమున రాజ్యాంగ బద్ధము, ప్రజాస్వామికము అగు పాలన ఇట కలదు. ఈ దేశపు, ఇప్పటి పాలకుడగు హసన్ II, 1962 లో దేశమునకు ఒక రాజ్యాంగము నొసగగ, అది ప్రజామోదమును పొందెను. దీనిని అనుసరించి పార్లమెంటు ఏర్పడినది; కాని పార్లమెంటునకాదని, దానిని రద్దుచేసి, తన చర్యకు, జనాభిప్రాయ సేకరణ (రెఫరెండం) ద్వారా ఆమోదమును పొందు హక్కు రాజునకు కలదు. అందువలన రాజునకు పార్లమెంటుతో వైరుధ్యము ఏర్పడగ 1965 లో పార్లమెంటును రద్దుచేసి, వేరొక రాజ్యాంగమును కల్పించి, జనాభిప్రాయ సేకరణద్వారా తనకు అనుకూలమగు పార్లమెంటును రాజు రూపొందించెను. ఇందులో నాలుగవవంతు సార్వజనిక వోటింగువలనను, తక్కిన వారు ఆ యా ప్రత్యేక నియోజక వర్గములనుండియు ఎన్నుకొనబడెదరు. కాని కొన్ని పలుకుబడిగల రాజకీయ పక్షములు ఈ ఎన్నికలు ప్రజాభిప్రాయము సూచింపవని తిరస్కరించినవి. దేశమున సువ్యవస్థితములగు ఆరు రాజకీయ పక్షములు కలవు. అందువలన 1971, 1972, 1973 లలో రాజుపై సైన్యములోని వర్గములు రాజకీయ పక్షముల ప్రోద్బలముతో తిరుగుబాటులు జరిపినవి; కాని వానిని రాజు వెన్వెంటనే అడచివేయగల్గెను దేశమున స్థానిక పరిపాలనను ప్రజాప్రతినిధుల సాయమున ఉద్యోగులు నిర్వహించుచున్నారు. న్యాయ పరిపాలనా శాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. రబాత్‌లోని సుప్రీమ్‌కోర్టు అధికారమునకు లోబడి వివిధ న్యాయస్థానములు దేశమున పనిచేయుచున్నవి.

**8 దేశరక్షణ** దేశమునకు 48,000 సైనికులుకల భూతలసేనయు, 500 మందికల నావిక సేనయు, 4,000 మందికల వైమానిక సేనయు కలవు. వైమానిక దళమునకు విమానములును, ఆయుధములును సోవియట్ దేశపు సాయమున 1956 మొదలుగ సమకూరినవి.

**9. అంతర్జాతీయ సం. :** తొలుత స్వతంత్రతను ఆర్జించినపుడు, ఆల్‌జీరియాతో సరిహద్దు తగాదా ఉండెడిది; కాని తరువాత 1964 లో ఈ రెండు రాజ్యములమధ్య సామరస్యము ఏర్పడినది. 1956 మొదలుగ ఐ రా. స. యందును దాని ప్రత్యేకానుబంధ సంస్థలయందును, ఈ దేశమునకు సభ్యత్వము కలదు. 1958 లో ఈ దేశము అరబ్ లీగులో చేరినది. ఆఫ్రికా ఐక్యవ్యవస్థలోకూడ ఈ దేశమునకు సభ్యత్వము కలదు భారతదేశము మొదలగు ప్రముఖ రాజ్యములతో ఈ దేశమునకు దౌత్య సంబంధములు కలవు

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ యందు వ్యవసాయము కీలక స్థానమును వహించి ఉన్నది. దేశపు ప్రజలలో 75% పల్లెపట్టులందు వసించుచున్నారు; దేశపు కార్మిక శక్తిలో 65% వ్యవసాయము, పశుపోషణ, చేపల పరిశ్రమ, అను మూడింట వినియుక్తము. దేశమునకు కావల

సిన ఆహార ద్రవ్యములలో 90% దేశముననే ఉత్పత్తియగుచున్నవి. దేశపు మొత్తపు ఉత్పత్తిలో 30% వ్యవసాయమువలన లభించుచున్నది. గోధుమ, బార్లీ, చిక్కుళ్ళు, ఆలివ్ గింజలు, నిమ్మ జాతి ఫలములు వ్యవసాయోత్పత్తులలో పేర్కొన దగినవి. ఎస్పార్టో అను గడ్డికూడ దేశపు ఎగుమతులలో ప్రముఖ స్థానమును కలిగియున్నది; కాగితపు తయారీకి ఇది ఉపయోగించును. దేశపు ద్రాక్ష తోటలు, ద్రాక్ష సారాయపు తయారీకి ఉపకరించుచున్నవి. కాని 1967 మొదలుగ వీని విస్తీర్ణము క్రమముగ తగ్గుచున్నది. చేపల పరిశ్రమ పలువురకు జీవనాధారము; 1970 లో 12.73 కోట్ల దరహముల విలువగల చేపలు ఎగుమతి చేయబడినవి. 1973, మార్చి నెలలో భూమి సంస్కరణలను గురించిన శాసనమును ప్రభుత్వము ఆమోదించినది. విదేశీయుల వశమునఉన్న 250 వేల హెక్టేరుల భూమియు, ఈ శాసనమువలన దేశపు రైతులకు లభింపగలదు. ఇందులకు తోడుగ, ఆనకట్టలద్వారా నీటిపారుదల విస్తీర్ణమును ఎక్కువ చేయు కృషి 1968 నుండి మొదలైనది. దేశపు అటవీ ఉత్పత్తివలన అధికాదాయము లభించుచున్నది.

దేశపు ఖనిజములలోనెల్ల ముఖ్యమైనవి ఫాస్ఫేట్లు. మొత్తపు ఖనిజసంపదలో 50% దీని విలువ. యు. స్టే. తరువాత ఫాస్ఫేటుల ఉత్పత్తిలో లెక్కకు వచ్చునది ఈ దేశమే. ఇనుము, మాంగనీజు, రాక్షసిబొగ్గు, కొలది మొత్తములలో మాత్రమే ఉత్పత్తి అగుచున్నవి. దేశము చాలవరకు జలవిద్యుత్తుమీదనే ఆధారపడి యున్నది; దీని మొత్తపు ఉత్పత్తి 1971 లో 20 లక్షల కిలోవాట్లు. కాసాబ్లాంకాలో తాపవిద్యుదుత్పత్తి స్థావరము కలదు. దేశమున 16 బ్యాంకులు కలవు (1970). మొరాకో బ్యాంకు అనునది ప్రభుత్వపు ఆధ్వర్యమున, నోట్లను జారీచేయుచు కేంద్ర బ్యాంకుగ వ్యవహరించుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 663.2 కోట్ల దరహములు (1973). దేశపు ఎగుమతులవిలువ 295.3 కోట్ల దరహములు; దిగుమతుల విలువ 357.7 కోట్ల దరహములు. 1967 మొదలుగ యు. స్టే. నుండి ఆర్థిక సహాయమును ఈ దేశము పొందుచున్నది; అటులే పశ్చిమ జర్మనీ, ఇరాన్ దేశములును కొంత ఆర్థిక సహాయమును ఇచ్చినవి.

**11 సాంఘిక రంగము :** దేశమున కార్మికుల సంక్షేమమునకై జాతీయ సాంఘిక భద్రతా నిధిని, ప్రభుత్వము 1961 లో నెలకొల్పినది. దానివలన అస్వస్థత, వృద్ధాప్యము మొదలగు పరిస్థితులందు ధనసహాయము కార్మికులకు లభించు సౌకర్యము కలదు; 1960 మొదలుగ గృహనిర్మాణ కార్యక్రమమును ప్రభుత్వమే చేపట్టి అల్పాదాయ వర్గములకు సాయపడ కృషిచేయుచున్నది; కాని ధనాభావమువలన ఎక్కువ పురోగతిని సాధింపజాలకున్నది. దేశమున అక్షరాస్యత కొన్ని ప్రాంతములందు 15%నకు తక్కువ. 1965 మొదలుగ అరబ్బీయే ప్రభుత్వ వ్యవహార శాఖలందు అన్నింట వాడబడుచున్నది. 1971-72 లో ప్రాథమిక పాఠశాలలలో 12,31,436 మందియు, మాధ్యమిక పాఠశాలలలో 3,13 424 మందియు, ఉన్నత విద్యా సంస్థలలో 15,148 మందియు విద్యార్థులు కలరు. 7 ఏండ్ల నుండి 13 ఏండ్ల వయస్సువరకు నిర్బంధ విద్యావిధానము అమలునందు ఉన్నది. రబాత్‌లోను, ఫెజ్‌లోను విశ్వవిద్యాలయములు కలవు. అల్-కరవీయిన్‌లో ఇస్లామిక విద్యాపీఠము కలదు. విశ్వవిద్యాలయములందు 15,009 మంది విద్యార్థులు పఠించుచున్నారు (1971). దేశమున ఆసుపత్రులలోని శయ్యాసంఖ్య 20,192, డాక్టర్ల సంఖ్య 1,128 (1968). దేశపు గ్రంథాలయములందెల్ల ప్రముఖమైనది అల్-కరవీయిన్‌లోని గ్రంథాలయము. ఇది 13 వ శతాబ్దిలో

నెలకొల్పబడినది. అరబ్బీభాషలోని అత్యంత ప్రాచీన గ్రంథములలో కొన్నింటి తొలి ప్రతులను అందు కననగును. దేశమున కాసాబ్లాంకానుండి మూడును, రబాత్‌నుండి నాల్గును, టాంజియర్‌నుండి ఒకటియు దిన పత్రికలు వెలువడుచున్నవి. ఇందులో మూడు ఫ్రెంచిభాషలోను, ఒకటి స్పానిష్‌లోను ప్రచురితములు.

**12. యాత్రా సౌ. :** దేశమున ప్రాచీన నాగరికతలకు చెందిన పెక్కు అవశేషములును శిథిల నగరములును కలవు; వానిని దర్శించుటకు పలువురు దేశమును దర్శింతురు. దేశమునకు ఇందు వలన కొంత ఆదాయమును లభించుచున్నది. అందు వలన ప్రభుత్వము యాత్రికులకై ఉన్నత స్థాయికి చెందిన హోటళ్ళను, తదితర వసతులను ఏర్పాటు చేసినది. 1972 లో ఇట్టి హోటళ్ళలోని శయ్యా సంఖ్య 52,000. ఆ సంవత్సరమున దేశమును దర్శించిన యాత్రికులు దాదాపు 12 లక్షలు.

**13 ప్రసిద్ధ పౌరులు :** ఈ దేశమున పుట్టక పోయినను, ఈ దేశమునకు వచ్చిచేరి ఇచటి రాజాశ్రయమున తమ కృషిని సాగించిన మహా మేధావులలో అవిసెన్నా అని వ్యవహరింపబడు ఇబ్న్‌సినా (980-1037), అవెర్రోస్ అని వ్యవహరింపబడు ఇబ్న్ రషీద్ (1126 - 1198) ప్రముఖులు. ఇందులో ప్రథముడు వైద్యశాస్త్ర, తత్వశాస్త్ర నిష్ణాతుడై సమకాలిక ప్రపంచపు మన్ననలను పొందినవాడు; రెండవవాడు తత్త్వవేత్త; దార్శనికుడు. ఈ దేశీయుడగు ఇబ్న్ బతూతా (1304-1368) ఆఫ్రికా, యూరప్, ఆసియాలలోని పెక్కు దేశములను దర్శించి విశేషములను గ్రంథస్థము చేసెను. భారత దేశమునుకూడ అతడు దర్శించెను.

---

# 40. రియూనియన్ (బౌర్బన్)

## ( ఫ్రెంచి పాలనలో ఉన్న రాజ్యము )

**ముఖ్యనగరము :** సెయింట్-డెనిస్; **నాణెము:** సి. ఎఫ్. ఎ. ఫ్రాంక్; అట్టి 100 ఫ్రాంకులు = రూ. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా 3 గం. 45 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మలగాసీ (మడగాస్కర్) దీవికి తూర్పున దాదాపు 670 కిమీ. దూరమున, హిందూమహాసముద్ర పరివృతమై ఉన్న ఈ దేశపు వైశాల్యము 2,511.6 చ. కిమీ. మాస్కరీన్ ఆర్చిపెలగో అని వ్యవహరింపబడు ద్వీపజాలము లోని ద్వీపములందన్నింట ఇది పెద్ద ద్వీపము. దేశ భూతలము అగ్నిపర్వతముల మూలమున రూపుగొనినదని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. దేశము పర్వతమయ భూమి; పది పర్వత శిఖరములు కననగును; అందొకటి ఇప్పటికిని అగ్నిపర్వతముగ ఉన్నది; దాని ఎత్తు 1980 మీ. శిఖరములన్నింట పెద్దదియగు పీటాన్ డే సీగిన్ అనుదాని ఎత్తు 3.068 మీటర్లు ఉష్ణదేశమునందు కననగు చంద్ర మొదలగు వృక్షములు ఇచటి అడవులందును కననగును; అతివేగముతో ప్రవహించు వాగులు అనేకములు ఉన్నవి

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 68° ఫా.; శీతోష్ణపరిస్థితి ఉష్ణమండల పరిస్థితులను పోలినదియే అయినను

ఉన్నతి, సముద్ర సామీప్యము మొదలగు వాని వలన ప్రాంతములను అనుసరించి మార్పులను పొందుచున్నది. వర్షములు విరివిగ కురియును; అందును తుపానుల బెడద ఎక్కువ; దేశము ఎన్ని సారులో తుపానుల తాకిడి వలన నష్టము పొందినది. చుట్టునున్న సముద్రమున వేర్వేరు విధముల వింత జాతుల జలచరములు కాననగును.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 4,66,400. నగరములలో సెయింట్-డెనిస్ (జన సంఖ్య 85,992); సెయింట్‌పాల్ (43,186):




పటము 40.

సెయింట్ పియిరే (46,364) పేర్కొనదగినవి (1972). దేశప్రజలలో అయిదవ వంతు ఫ్రెంచి సంతతికి చెందినవారు; తక్కినవారిలో నీగ్రో, మలే, ఇండోచీనీ, చీనీయ, భారతీయ సంతతులవారు కననగుదురు. ప్రజలలో ఫ్రెంచియు, తదితర భాషలతో సమ్మిశ్రమొందిన ఫ్రెంచిభాషా అప భ్రంశరూపమై క్రియోల్ అనబడునవియు మాతృ భాషలుగ వ్యాప్తిలో ఉన్నవి. ఫ్రెంచి భాషయే అధికార భాష. ప్రజలలో 80% రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; తక్కినవారు ముస్లిములు.

**4. సమాచార సౌ.:** దేశమున 50 పోస్టాఫీసులు కలవు. దేశవ్యాప్తములుగ టెలిఫోను వసతులు ఉన్నవి. మారిషస్, మలగాసీ, ఫ్రాన్సులతో టెలిఫోన్, టెలిగ్రాఫ్ వసతులు ఏర్పడి ఉన్నవి.

**5. యాన సౌ.** దేశమున 2,060 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; ఇందు 1,400 కిమీ. తారు వేయబడినది. రైల్వేమార్గపు నిడివి 126.5 కిమీ. సముద్రపు రేవునగరములలో ముఖ్యమైనది పాయింటీ-డే-గేలెట్స్; సెయింట్ పియరే చేపల పరిశ్రమకు పేరొందినది. ముఖ్యనగరమునకు సమీపమున ఉన్న గిల్లో విమానాశ్రయమునుండి మలగాసీకి విమానయానపు వసతి కలదు.

**6. చరిత్ర:** పోర్చుగీజు నావికులు క్రీ. శ. 1526 లో ఈ ద్వీపమున కాలిడునాటికి ఇట జనా వాసములు ఎట్టివియులేవు. 16 వ శతాబ్ది మొదలుగ ఫ్రెంచివారు ఇట వలసజేర మొదలిడిరి; ఆనాడు వారు ఈ దీవిని బౌర్బన్ అను పేర వ్యవహరించిరి. ఫ్రెంచివారితో పాటుగ బానిసలుగ నీగ్రోలును, కార్మికులుగ మలేలును, ఇండో-చీనా వాసులును, చీనీయులును, భారతదేశపు కేరళీయులును ఇట చేరిరి. ఫ్రెంచి వారికి బ్రిటిష్ వారికి మధ్య సాగిన యుద్ధముల ఫలితముగ ఈ దీవి ఒకపుడు బ్రిటిష్ వారికి వశమైనది (1810). కాని తరువాత సంధి ఫలితముగ తిరిగి ఫ్రెంచివారికి లభించి నది (1815); అపుడు ఫ్రెంచివారు పూర్వపు పేరుకు బదులుగ దీనికి రియూనియన్ అను పేరును కల్పించిరి. ఆ సంవత్సరముననే బానిస వ్యాపారము రద్దగుటతో దేశమందలి నీగ్రోలకు స్వేచ్ఛ కలిగెను; కూలీలుగ వచ్చిన భారతీయాదుల సంతతివారును క్రమముగ ఇట పౌరులైరి. 1882 నుండి భారతీయులు వలసచేరుటను, భారత ప్రభుత్వము నిషేధించినది.

ఫ్రెంచి వలస రాజ్యముగ కడు దీర్ఘకాలము కొనసాగిన ఈ దేశము 1946 లో ఫ్రాన్స్ రాజ్యమున సముద్రోత్తర మండలపు ప్రతిపత్తిని పొందినది.

**7. పరిపాలన :** ఫ్రెంచి పార్లమెంటే ఈ దేశమునకు సంబంధించిన శాసన నిర్మాణాధికారము కలిగి ఉన్నది. సార్వజనికమగు వోటింగు హక్కు అమలున ఉన్నది. ప్రజలెన్నుకొనిన ముగ్గురు ప్రతినిధులు ఫ్రెంచి జాతీయశాసన సభ యందును, ఇద్దరు ప్రతినిధులు ఫ్రెంచి శిష్ట సభ యందును సభ్యత్వము వహించియుందురు. ఫ్రెంచి అధ్యక్షుడు నియమించు ఒక పాలకుడు, ప్రజలెన్నుకొనిన 36 మంది సభ్యులు కల సాధారణ సభ సాయముతో, దేశమున పరిపాలనను నిర్వహించుచున్నాడు. ఫ్రాన్సునందువలెనే ఇట కూడ స్థానిక పాలన, మండలము (కమ్యూను) లందు ఎన్నుకొనబడిన పరిషత్తులద్వారా సాగుచున్నది. మండలముల సంఖ్య 23.

**8. దేశరక్షణ :** దేశమును రక్షించు బాధ్యత ఫ్రెంచి ప్రభుత్వమునకు చెంది ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఫ్రాన్సు దేశమున అంతర్భాగముగ పరిగణింపబడుటవలన అంతర్జాతీయ సంబంధములు ఫ్రెంచి ప్రభుత్వము ద్వారానే సాగుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** ఆర్థికపు వ్యవస్థ అంతయు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. సేద్యమునకు తగిఉన్న మొత్తపు భూమిలో 70% న చక్కెరచెరకు పండింపబడుచున్నది. తక్కిన దానిలో కాఫీగింజలు, పొగాకు, కర్రపెండలము సాగగుచున్నవి. ఇవిగాక సుగంధ ద్రవ్యములకు ఉపయోగించు వట్టివేరు మొదలగు కొన్ని మొక్కలును ఇట పైరగుచున్నవి; వానిలో 'జెరేనియమ్' అనునది ప్రముఖము; దీని నూనె సువాసన కలది; ఈ నూనె ఉత్పత్తిలో ఈ దేశమే ప్రపంచమున అగ్రస్థానము పొందియున్నది. ఆహార వస్తువులలో అధిక భాగమును దేశము దిగుమతి చేసికొనుచున్నది; ఎగుమతులలో చక్కెర వలన అధికాదాయము లభించుచున్నది. మొత్తపు ఎగుమతుల విలువ 1.21 కోట్ల సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు; దిగుమతుల విలువ 4.71 కోట్ల సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు (1971). దేశపు బడ్జెటరీ వ్యయము 6.725 కోట్ల సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు (1972).

**11 సాంఘిక రంగము :** దేశమునందలి 398 ప్రయిమరీ పాఠశాలలలో 1,17,285 మంది, తక్కిన ఉన్నత విద్యాశాలలలో 27,286 మంది విద్యార్థులు కలరు. ఒక జనరల్ ఆసుపత్రియు కొన్ని చిన్న ఆసుపత్రులును, ఒక మాతాశిశు కేంద్రమును ప్రజలకు వైద్య సహాయము కల్పించుచున్నవి (1972).

---

# 41. రువండా

**ముఖ్యనగరము :** కిగాలీ; **జెండా :** ఎరుపు, పసుపు, ఆకుపసిమి నిలువుచారలు దండము కడ నుండి వరుసగ అమరగ అందు పసిమిచారమధ్యన 'R' అను అక్షరము కలది. **జాతీయగీతము :** రువండా రువాచూ...; **నాణెము :** రువండా ఫ్రాంకు; 1 రు. ఫ్రా. = రూ. 0.075; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి. మొ :** మధ్య ఆఫ్రికాలో తూర్పు భాగమున 1°4′-2°50′ ద. అక్షాంశరేఖలమధ్యను 28°51′-30°25′ తూ. తులారేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు, ఉత్తరమున ఉగాండా; తూర్పున టాంజానియా, దక్షిణమున బురుండి; పశ్చిమమున జయిరే సరిహద్దులందు ఉన్నవి. దేశవైశాల్యము 26,338 చ. కి. మీటర్లు, దేశము పర్వత పీఠభూములతో ఎగుడు దిగుడుగ ఉన్నది. పశ్చిమమున ఉన్న, కివూ సరస్సునుండి ఉత్తరప్రాంతపు అగ్నిపర్వత సీమకు పోవుసరికి భూమిఎత్తు 1,463 మీ. నుండి, 4,267 మీ. వరకు క్రమముగ వృద్ధియగును.




పటము 41.

ఉన్నత శిఖరమగు కరిసింబి ఎత్తు 4,535 మీ.; మధ్య పీఠభూమి (ఎత్తు 1,706 మీ.) ఒక శాద్వలభూమి. తూర్పు సరిహద్దు నందలి, కగేర, దేశమధ్యమున ప్రహించు న్యవరోంగో, నైరుతి సరిహద్దునందలి రుజీజి, దక్షిణపు సరిహద్దున ఆకాన్యారూ నదులు పేర్కొనదగినవి.

**2 శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండలపు ఉన్నత భూములందు, కననగు శీతోష్ణరీతియే ఈ దేశమున కననగును. పగటి-రాత్రుల తాపక్రమముల మధ్య వ్యత్యాసము 25° ఫా. వరకు ఉండును. నైరుతి భాగమున వానలెక్కువ; ఉత్తరమునను, తూర్పునను వానలు చాల తక్కువ. దేశము తరచుగ కరవు బాధకు గురియగు చున్నది.

**3. జనసంఖ్య :** అంచనాలను అనుసరించి, దేశపు జనసంఖ్య 55 లక్షలు (1969). ఆఫ్రికా ఖండపు దేశముల అన్నింటిలో, ఎక్కువ జనసాంద్రత కలది ఈ దేశము; జనసాంద్రత చ కిమీ. కు 128; ముఖ్యనగరపు జనసంఖ్య 15,000. దేశమున తుత్సీ, హూతూ, త్వా జాతుల వారు వసించుచున్నారు. ఇందులో తుత్సీ ప్రజలు 9%; వీరు పొడుగరి జాతిగను, యోధులుగను పేరొందినవారు. 1959-61 లో జరిగిన జాతి కల్లోలముల ఫలితముగ, ఈ జాతివారు, పలువురు, దేశమును వదలి పోయిరి. 90% ప్రజలు హూతూ జాతివారు. వీరు బంటూ జాతికి చెందిన వ్యావసాయికులు, త్వా జాతివారు అత్యల్ప సంఖ్యలో కలరు. వీరు చాలా పొట్టిరకపు మానవులు. ప్రజలలో పెక్కురి మాతృభాష కిన్యరువండా; కాని దానితోబాటుగ ఫ్రెంచియు అధికార భాషగ వాడుకలో ఉన్నది. ప్రజలలో 50% క్రైస్తవులు, తక్కిన వారియందు సాంప్రదాయిక మత భావన వ్యాప్తియందున్నది.

**4. సమాచార సౌ. :** తపాలా, తంతి, టెలిఫోనుల సౌకర్యములు కొలదిగ కలవు. సంఖ్యా వివరములు తెలియవు. కాని 10 వేల మందికి 4 టెలిఫోనులు కలవని మాత్రము తెలియవచ్చుచున్నది. రెండు రేడియో స్టేషనులు కలవు.

**5 యాన సౌ. :** దేశమున యాన సౌకర్యముల వసతి తక్కువ. 1922 నుండి మాత్రమే, దేశమున రోడ్లను వేయుట మొదలైనది. ప్రస్తుతమున 5,400 కిమీ. నిడివిగల రోడ్లు కలవు. కాని ఇందు 2,080 కిమీ. మాత్రమే పక్కారోడ్డుగ భావింపదగినది. దేశమున రైలు మార్గములులేవు.

కివుం సరస్సున నౌకాయాన సౌకర్యము కలదు. దేశపు ఎగుమతి దిగుమతులు బురుండీలోని బుజుంబురునుండి జరుగుచున్నవి. ఉగాండా ద్వార కూడ కొంత జరుగుచున్నవి దేశమున కిగాలి, బుతారే, సియాన్‌గూగూలలో విమానాశ్రయములు కలవు. ఇవిగాక హెలికాప్టర్లకు దిగువసతులు 25 చోట్ల ఉన్నవి. కిగాలిలో, అంతర్జాతీయ విమాన యానమునకు వసతులు కలవు.

**6. చరిత్ర :** తొలుత 'త్వా' అను పొట్టి మానవుల నివాసభూమిగ ఉండిన, ఈ ప్రాంతము నకు, హూతూజాతి ప్రజలు తరువాతి కాలమునవచ్చి చేరిరనియు. అంతట 12 వ శతాబ్దిలో ఎతియోపియా నుండి ఇటకు వచ్చిచేరిన, 'తుత్సీ' అను పొడగరి యోధజాతివారు పై రెండు జాతులను లోగొని, అధికారమును వశపరచుకొనిరనియు తెలియు చున్నది. ఈ తుత్సీ జాతివారు, సాధ్యమైనంతవరకు ఇతర జాతులతో మిశ్రమము కాకుండ ఉండుటకై ఒక విధపు వర్ణ భేదమును అమలులోనికి తెచ్చి, అధికారమంతయు తమచేతులలోనే ఉంచుకొని, తమ జాతి రాజు ఆధ్వర్యమున దేశమును పాలించిరి. అయినను వీరు హూతూ ప్రజల భాషా సంస్కృతులను, స్వీయములు చేసికొనిరి. 19 వ శతాబ్దిలో, ఈ ప్రాంతముతో యూరపియనులకు, పరిచయము ఏర్పడినది. అంతట తక్కిన యూరపియన్ జాతుల ఒప్పుదలతో జర్మనీ ఈ ప్రాంతమును, బురుండీని తనవశమునకు తీసికొని, సాంప్రదాయిక రాజపాలనమునకు, భంగము కలుగకుండ పాలించినది. మొదటి ప్రపంచ యుద్ధకాలమున బురుండితో పాటుగ ఇది బెల్జియను సేనల వశమై యుద్ధానంతరమున బెల్జియమ్ ప్రభుత్వమునకు మాండేటరీ ప్రాంతముగ దక్కినది. వీరును సాంప్రదాయిక రాజపరిపాలనను ఆమోదించి, రాజు ద్వారానే దేశమును పాలించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ఐ. రా. స. దీనిని బెల్జియం అధీనమున ఉన్న ధర్మకర్తృత్వ ప్రాంతముగ పరిగణించినది. ఇంతలో, దేశమున ప్రజలలో, స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చుపెరిగినది. ఈ అదనుననే బెల్జియమ్ ప్రభుత్వము హూతూ, తుత్సీ ప్రజల మధ్య వైషమ్యములను రెచ్చగొట్టగ, కల్లోలములు చెలరేగి (1959) తుత్సీ ప్రజలలో చాలమంది హతులైరి. రాజుతో కూడ పలువురు తుత్సీ ప్రజలు దేశమును విడిచి, ఉగాండా, టాంజానియా, జయిరేలకు శరణార్థులుగ పోయిరి. అంతట, హూతూ ప్రజల ఆమోదముతో ఒక గణరాజ్యము ఏర్పడగ (1960) బెల్జియం ప్రభుత్వము దానిని ఆమోదించినది. కాని ఐ. రా. స. మాత్రము పరిగణనకు నిరాకరించినది. అంతట ఐ. రా. స. సలహాతో దేశమున 'జనవాక్య' సేకరణ జరుగగ, ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రాజరికమును తొలగించి, గణరాజ్యమును నెలకొల్పుటను అంగీకరించిరి (1961). అంతట ఆ ప్రభుత్వమునకు పరిగణన ఏర్పడినది. ఈ విధముగ జులై 1, 1962 న దేశము స్వతంత్రము అయ్యెను.

**7. పరిపాలన :** కార్య నిర్వహణాధికారము అధ్యక్షునియందు కలదు. అతడే పరిపాలనలో తనకు సాయపడుటకై మంత్రులను, ఉద్యోగులను, నియమించుకొనును. దేశమున వయోజనులకు అందరికి ఓటుహక్కు కలదు. జాతీయ సభకు 4 ఏండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. శాసన సభలోని సభ్యులు 47. నైష్పత్తిక, ప్రాతినిధ్య విధానమున సభ్యులు ఎన్నుకొనబడెదరు. బెల్జియం దేశపు న్యాయసంహితను అనుసరించి, ఇచట న్యాయనిర్వహణ సాగుచున్నది. దేశమున మూడు రాజకీయ పక్షములు కలవు వీనిలో 'పర్మెహూతూ' అనునది బలవత్తమము.

**8. దేశరక్షణ :** 2,500 మందిగల పదాతి సేన దేశమునకు కలదు.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందు కొన్నింటను దేశమునకు సభ్యత్వము కలదు. బెల్జియం దేశముతో ప్రత్యేక సన్నిహిత సంబంధము కలిగి, ఆ దేశము వలన, దేశాభివృద్ధికై సాంకేతిక ధన సహాయములను, రువండా గ్రహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయ, పశుపోషణలపై ఆధారపడి ఉన్నది. ప్రకృతి సిద్ధములగు వనరులు చాల తక్కువ. వ్యవసాయోత్పత్తులలో, ముఖ్యమైనది కాఫీ; ప్రస్తుతమున దేశము ఆహారవిషయమున స్వయం పోషకము. అటవీ సంపద చాల తక్కువ; ఖనిజములలో తగరము మాత్రమే కొలదిగ లభించుచున్నది. విద్యుదుత్పత్తి 12.5 కోట్ల కి. వా. (1969). ఎగుమతుల విలువ 157.4 కోట్ల రు. ఫ్రా; దిగుమతుల విలువ 197.4 కోట్ల రు. ఫ్రా; (1967).

**11. సాంఘిక రంగము :** దేశమున 3,52, 406 మంది విద్యార్థులు ప్రయిమరీ పాఠశాలలలో పఠించుచున్నారు. 25 సెకండరీ పాఠశాలలు కలవు. అందలి విద్యార్థి సంఖ్య 7,300 (1969). బుతారేలో, దేశసంస్కృతి పరిణామమును వెల్లడించు ఒక మ్యూజియం ఉన్నది. దేశమున దిన పత్రికలు లేవు; వార మాసపత్రికలు మాత్రము కొలదిగ కలవు. 4,251 శయ్యాసంఖ్యకల 20 ఆసుపత్రులును, తక్కు విధముల వైద్యశాలలును కలవు; వైద్యసంఖ్య 50 (1968).

**12. యాత్రా సౌ. :** కివూ సరోప్రాంతపు ప్రకృతిరమణీయతను దర్శించి, దాని తీరభూములలో, కొంతకాలము గడపుటకును, కగేరా జాతీయ వనమున మృగయా వినోదమున పాల్గొనుటకును, యాత్రికులు పలువురు విదేశములనుండి, వచ్చుచుందురు బుతారే, కిగాలీ మొదలగు నగరములందు, యాత్రికులకు తగువసతులు కల్పింపబడినవి.

---

# 42. రొడీసియా

**ముఖ్యనగరము :** సాలిస్‌బరీ; **జెండా :** మధ్యన తెలుపును, దానికి ఇరువైపుల ఆకుపసిమి రంగును కల్గిన నిలువు చారలలో మధ్యన రొడీసియా యోధలాంఛనము (కోట్ ఆఫ్ ఆరమ్స్) చిత్రించబడియున్నది. **నాణెము :** రొడిసియన్ పౌండు; బంగారమున దాని విలువ 2.48828 మిల్లిగ్రాములు; ఒక రొ. పౌండ్ = రూ. 21.00. **కొలతూకములు :** బ్రిటిష్ విధానమే అమలున ఉన్నది. **కాలగణన :** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికాఖండమున దక్షిణ భాగమందు 15°'34'-22°25' ద. అక్షాంశరేఖల మధ్యను 25°14'-33°4' తూ. తులారేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున జాంబియా, తూర్పున మొజాంబిక్, దక్షిణమున దక్షిణఆఫ్రికా గణరాజ్యము, పశ్చిమమున బోట్స్వానా సరిహద్దులందున్నవి దేశవైశాల్యము 3,90, 622 చ. కిమీ. దేశపు భూతలము సర్వే సర్వత్ర మిట్టపల్లములతో నిండియున్నది. అందును 75% భూమి సముద్రమట్టమునకు పైన 305 మీ. కు మించి

యున్నది. ఇందును 'హైవెల్డ్' అని వ్యవహృత మగు పీఠభూమి 640 కిమీ. ల పొడవును, 80 కిమీ. ల వెడల్పును కలిగి ఈశాన్యమునుండి నైరుతికి వ్యాపించి ఎచటను 1200 మీ. ల ఎత్తునకు తగ్గకున్నది. ఈ పీఠభూమియే ఈశాన్య భాగమున 'ఇన్యంగా' పర్వతశ్రేణిగ పరిణమించుచున్నది. ఈ పర్వతశ్రేణిలోని అత్యున్నత శిఖరపు ఎత్తు 2596 మీ. ఈ శ్రేణినుండి పెక్కు నదులు పుట్టు




పటము 28.

చున్నవి. ఉత్తరమున ఉన్న జాంబెజీ నదియు, దక్షిణమున ఉన్న లింపోపో నదియు దేశపు నదులలో ప్రముఖములు.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశపు భూతలము ఎత్తుగ ఉన్నందున దేశమున అత్యధిక భాగమున శీతోష్ణస్థితి అతి సౌమ్యముగ ఉండును. సాలుసరిన అత్యధిక ఉష్ణోగ్రత 100°ఫా.; అత్యల్ప ఉష్ణోగ్రత 55 ఫా.; అక్టోబరు లేదా నవంబరునుండి మార్చి వరకు విపరీతముగ వానలు కురియును. తూర్పున నుండి పడమటికి పోవుకొలది వర్షపాతము క్రమేణ తగ్గిపోవును. పర్వత ప్రాంతములందు సాలీనా 100 సెం. మీ. వర్షమును, అత్యల్ప వర్షపాత ప్రాంతముగ పేరొందిన లింపోపో పరీవాహ భూమి యందు 37.5 సెం. మీ. వర్షమును కురియు చున్నది; తక్కిన ప్రాంతములలో వర్షపాతము ఈ రెండింటికి మధ్యస్థముగ ఉండును. వర్షపాతము విరివిగా గల ప్రాంతములందు నిత్యశ్యామలపు అడవులు కలవు. తక్కిన దేశమున సైతము వృక్ష సంతతి ఎక్కుగనే కన్పడును. అడవులలో ఏనుగు, సింహము, ఖడ్గమృగము మొదలగు పెద్ద జంతువులే కాక కోతులు, లేళ్ళు, రేచులు మొదలగునవియును కన్పడును

**3 జనసంఖ్య మొ. :** 1972 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య, 57,80,000. ఇందు శ్వేతజాతీయులు 2,67,000; ఆసియావాసుల సంతతికి చెందినవారును, రంగుజాతులవారును కలిసి 27,400; తక్కినవారందరు ఆఫ్రికావాసుల సంతతివారు. శ్వేత జాతీయులలో అత్యధిక సంఖ్యాకులు బ్రిటిష్‌సంతతివారు; డచ్చిసంతతివారు కొలదిగ కలరు. దేశపు నగరములలో సాలిస్‌బరీ (జ. సం. 3,84,530), బులవాయో (జనసంఖ్య 2,45,590) పేర్కొనదగినవి. శ్వేతజాతీయు లందరును క్రైస్తవమతానుయాయులు; ఆఫ్రికన్ ప్రజలలో 30,000 మాత్రమే క్రైస్తవులు; తక్కిన వారందరు ప్రకృతి దేవతారాధకులు; ఆసియా వాసుల సంతతివారిలో హిందూ, ముస్లిం మతములు ప్రచారమున ఉన్నవి. ఆఫ్రికన్ ప్రజలలో పలు విధముల ఆఫ్రికన్ భాషలు మాతృభాషలుగ వాడుకయందున్నను, శ్వేతజాతీయులలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాషయగు ఇంగ్లీషు భాషయే దేశమున సాధికార వ్యావహారిక భాషగ పరిగణింప బడుచున్నది.

**4. సమాచార సా. :** తపాలా, తంతి, టెలిఫోను వసతులు ప్రభుత్వపు ఆధ్వర్యమున నిర్వ

హింపబడుచున్నవి. 1971 లో 1,31,572 టెలిఫోనులును, 1,61,353 రేడియో లైసెన్సులును కలవు, సాలిస్‌బరీలో ప్రధాన రేడియో స్టేషను, దానికి సంబంధించిన రెండు స్టూడియోలు బులవాయో, కిత్వే నగరములందును పనిచేయుచున్నవి. సాలిస్‌బరీ, బులవాయో ప్రాంతములకు ఉపకరించు ఒక టెలివిజన్ కేంద్రము సాలిస్‌బరీలో కలదు.

**5. యాన సౌ.** : దేశమున ఉత్తమ శ్రేణికి చెందిన రోడ్ల నిడివి 8,568 కిమీ; దీని నిర్వహణ భారము కేంద్రప్రభుత్వముపై ఉన్నది.; ఇదిగాక స్థానిక సంస్థల అధీనమున ఉన్న తగ్గుస్థాయి రోడ్ల నిడివి 69,394 కిమీ. (1971).

దక్షిణ ఆఫ్రికా, మొజాంబిక్, జాంబియా దేశముల రైలుమార్గములతో సంధించు చక్కని రైలుమార్గములు దేశమున కలవు. వీని మొత్తపు నిడివి 3,250 కిమీ. (1971).

దేశము భూపరివృతమగుటవలన, మొజాంబిక్ దేశపు బీరా, లారెన్‌జో మార్క్వెస్‌లద్వారా ఈ దేశము తన సముద్రోత్తర విదేశవ్యాపారమును నిర్వహించుకొనుచున్నది,

సాలిస్‌బరీ, బులవాయోలలో విమానాశ్రయములు కలవు. మొజాంబిక్, దక్షిణ ఆఫ్రికా, మలావీలకు ఇటనుండి విమాన వసతి ఉన్నది.

**6. చరిత్ర** : క్రీ. శ. 19 వ శతాబ్దికి పూర్వపు ఈ దేశచరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు. 16 వ శతాబ్దిలోనే దీనిని గురించి, ముగ్గురు దేశాన్వేషకులద్వారా పోర్చుగీసు వారికి కొన్ని వివరములు తెలియవచ్చినటుల ఆధారములున్నను, వారుగాని, తదితర యూరపీయనులుగాని 19 వ శతాబ్ది మధ్యమువరకు ఇట కాలిడలేదు. అంతట తొలుతగ కొందరు యూరపీయులు ఇట ప్రవేశించి, దేశము బంటూ తెగల అధీనమున ఉన్నటులను ఆ తెగలపై సర్వాధిపత్యమును 'మతబేలే' అను తెగవారు నిర్వహించుచుండినటులను కనుగొనిరి. అటుల ఈ ప్రాంతమును తక్కిన ప్రపంచమునకు పరిచితము చేసినవారిలో ప్రముఖుడు **డేవిడ్ లివింగ్‌స్టన్** అను స్కాట్‌లాండ్ దేశపు మత ప్రచారకుడు.

ఈ దేశమున ఆంగ్లేయులకు తొలుతగ ప్రతిపత్తిని కల్పించినవాడు సిసిల్ రోడ్స్. దక్షిణ ఆఫ్రికాయందు వజ్రపుగనులపై ఆధిపత్యముకల ఆ ప్రముఖుడు, రొడీసియాలోని 'మతబేలే' తెగ నాయకునితో ఒక ఒడంబడికను కుదుర్చుకొని, దేశమును తద్వారా బ్రిటిష్ పలుకుబడిలోనికి తెచ్చెను (1888). అంతటనుండి రోడ్స్ నాయకత్వమున దేశమున బ్రిటిష్‌పౌరులు వలసచేరి భూమిని ఆక్రమించుకొనుట మొదలైనది. దీనిని ప్రతిఘటించుచు 1893, 1896-97 లో దేశీయులు జరిపిన తిరుగుబాటులు అణచివేయబడినవి. కాలక్రమమున ఈ ప్రాంతమేగాక, దీని ప్రక్కలనున్న, నేటి జాంబియా, మలావీ ప్రాంతములు బ్రిటిష్ వారికి దక్కినవి. ఆ కాలమున, జాంబియాను బ్రిటిష్‌వారు ఉత్తర రొడీసియా అనియు, మలావీని న్యాసాలాండ్ అనియు, రొడీసియాను దక్షిణ రొడీసియా అనియు వ్యవహరించిరి (రొడీసియా అను పేరు ఆ ప్రాంతమున బ్రిటిష్ అధిపత్యమును నెలకొల్పిన సిసిల్‌రోడ్స్ పేరును అనుసరించి రూపొందింపబడినది). 1923 మొదలుకొని ఈ మూడు ప్రాంతములును వేర్వేరుగ బ్రిటిష్ ఆధిపత్యమున ఉన్నను, 1953 లో బ్రిటిష్ ఆధిపత్యము క్రిందనే ఒక సమాఖ్యగ రూపొందినవి. 1963 లో సమాఖ్య రద్దై, ఉత్తర రొడీసియా (జాంబియా), న్యాసాలాండ్ (మలావీ) స్వతంత్ర రాజ్యములైనవి. అంతటినుండి ఈ దేశము రొడీసియా అని వ్యవహరింపబడుట మొదలైనది. తక్కిన పై రెండు రాజ్యములకన్న, దక్షిణ రొడీసియాలో శ్వేతజాతులు ఎక్కువ అధికారమును తొలుతనుండియు వహించి

యుండినవి. సంఖ్యలో ఆఫ్రికన్‌లు ప్రబలులైనను, రాజ్యాంగమున అధికారము మాత్రము శ్వేతజాతుల చేతులలోనే ఉండెను. అధిక సంఖ్యాకులకు అధికారము ఏమియులేని ఆ పరిస్థితిలో దేశమును స్వతంత్రముగ చేయుటకు బ్రిటిష్ ప్రభుత్వము నిరాకరించినది. ఆఫ్రికన్ ప్రజలు సార్వజనికమగు వోటింగ్ హక్కుగల స్వాతంత్ర్యము దేశమునకు కావలెనని ఆందోళనచేసిరి. ఆఫ్రికా, ఆసియా రాజ్యములు ఐ. రా. స. లో ఈ వాదమును బలపరచినవి. ఇట్టి పరిస్థితిలో రొడీసియా, స్వాతంత్ర్యమును ఏకపక్ష నిర్ణయముగ ప్రకటించినది (నవంబరు 11, 1965). దీనిని బ్రిటిష్ ప్రభుత్వము ఆమోదించక నిరాకరించినది. తరువాత, శ్వేతజాతులకు ప్రాబల్యముగల వోటింగ్ విధానమున, జరిపిన జనాభిప్రాయసేకరణలోని నిర్ణయమును అనుసరించి ఆ దేశ ప్రభుత్వము దేశమును గణరాజ్య ప్రభుత్వముగ ప్రకటించినది (3 మార్చి, 1970). దీనిని కూడ, దక్షిణ ఆఫ్రికా తప్ప, తక్కిన ప్రపంచ రాజ్యములు ప్రతిఘటించి, ఆంక్షలను, ఐ. రా. స. ద్వారా విధించినవి.

1975 లో మొజాంబిక్ మొదలగు పోర్చుగీజు వలసలు స్వతంత్రములైన తరువాత, దేశ ప్రభుత్వపు వైఖరిలో కొంత మార్పువచ్చి, శ్వేతేతర ప్రజలనాయకులతో సామరస్యయుతమగు సంభాషణల వలన దేశభవితవ్యమును, బ్రిటిష్ మధ్యవర్తిత్వముద్వార నిర్ణయించుకొనుటకు దేశ ప్రభుత్వము కృషిచేయుచున్నది. అయినను ప్రస్తుతమునకు మాత్రము అల్ప సంఖ్యాక శ్వేత జాతీయుల అధిపత్యముననే ఇచట పాలన సాగుచున్నది.

**7. పరిపాలన :** తక్కిన ప్రపంచదేశములలో దక్షిణ ఆఫ్రికా తప్ప-వేరుగ ఏదియు గుర్తించని గణరాజ్య ప్రభుత్వము దేశమున అమలునందున్నది. ఆ రాజ్యాంగమును అనుసరించి శాసన నిర్మాణాధికారము ఏకకక్ష్యగల శాసనసభయందు న్యస్తమైయున్నది. కార్య నిర్వహణాధికారము మంత్రివర్గ సమేతుడగు ప్రధాని యందున్నది. శాసన సభయందు అధికసంఖ్యాక బలముగలవాడు ప్రధానిగ నియమితుడగును. మంత్రివర్గమే అధ్యక్షుని నియమించును. శాసనసభకు సభ్యులను ఎన్నుకొను వోటర్లను తెలియజేయు పట్టికలు-ఎ, బి, అనునవి కలవు. 'ఎ' పట్టిక యందలి వోటరుకు ఉండవలసిన ఆస్తి, విద్య మొదలగు అర్హతలు అత్యున్నత స్థాయికి చెందినవి. అందువలన ఇందు సర్వసాధారణముగ శ్వేతజాతీయులు మాత్రమే చేరగలుగుదురు. 'బి' పట్టిక ఆఫ్రికన్ పౌరులకు ఉద్దేశించబడినది. ఇందు వోటరునకు విధించు అర్హతలు తక్కువ స్థాయిలో ఉండును. అందువలన ఆఫ్రికనులు కొంతవరకు ఇందు చేరు అవకాశము కలదు. శాసనసభయందలి 65 మంది సభ్యులలో 50 మందిని 'ఎ' పట్టిక వోటర్లును, 15 మందిని 'బి' పట్టిక వోటర్లును ఎన్నుకొనెదరు. అందువలన శ్వేతజాతీయులకు 50 కి తక్కువగాని స్థానములు లభించి, పరిపాలన వారి చేతులలోనే ఉండు అవకాశము ఏర్పడినది.

**8 దేశరక్షణ :** దేశమున 3,400 మంది సైనిక సంఖ్యకల పదాతి దళమును, 80 పోరాట విమానములు కలిగి 1,200 మంది యోధులు కల వైమానిక దళమును కలవు (1969). ఇదిగాక రిజర్వుదళములలోని వారి సంఖ్య 4,000. శ్వేత జాతీయులతో 12 నెలల సైనిక శిక్షణ పొందిన వారందరు విధిగ ప్రాంతీయ పటాలములందుచేరి మూడేండ్లు పాక్షికముగ శిక్షణను కొనసాగించవలసియున్నది. పేరామిలిటరీ దళములకు చెందినంతవరకు 6,800 మంది నిరంతర సైనికులును, 28,500 మంది రిజర్వులోను కలరు.

**9. అంతర్జాతీయ సం. :** దేశపు ప్రభుత్వమునకు పరిగణన లేకున్నందున, అంతర్జాతీయ ప్రతిపత్తి ఎట్టిదియులేదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ ఖనిజ పరిశ్రమపైనను, వ్యావసాయిక కృషిపైనను ఆధారపడియున్నది. ఖనిజ పరిశ్రమలందు ఆధిపత్యము శ్వేతజాతీయుల హస్తగతమై ఉన్నది. దేశమున ఉన్న భూమియు జాతులను అనుసరించి ఈ రీతిగ విభజింపబడి వేర్వేరు ప్రాంతములుగ ఉన్నది. శ్వేతజాతీయుల ప్రాంతము 4.495 కోట్ల ఎకరములు; ఆఫ్రికన్ ప్రాంతము 4.495 ఎకరములు; వన్యమృగముల రక్షణ, జాతీయ వనములు మొదలగువానికి ప్రత్యేకింపబడి జాతీయ ప్రాంతము అనబడునది 66 లక్షల ఎకరములు.

- శ్వేతజాతీయుల ప్రాంతమున పొగాకు ఎక్కువగ పండింపబడుచున్నది; దాని తరువాత అట క్రమ ప్రాముఖ్యము కలవి : బంగళాదుంపలు, వేరుసెనగ, తేయాకు. ఆఫ్రికన్ ప్రాంతములలో ముఖ్యమగు పంట మొక్కజొన్న; ఆ ప్రాంతమున పశుసంపత్తి అధికము; మత్స్య పరిశ్రమ అభివృద్ధి చేయబడుచున్నది.

ఖనిజ పరిశ్రమలో, ద్వితీయ ప్రపంచ యుద్ధము వరకు, బంగారమే ప్రముఖముగ ఉన్నను, తదనంతరమున ఆ స్థానమును రాతినార (ఆస్‌బెస్టస్) ఆక్రమించినది; తరువాత లెక్కకు వచ్చునది క్రోమ్. ప్రపంచమున క్రోమ్ ఉత్పత్తిలో ఈ దేశము మూడవ స్థానమును ఆక్రమించి ఉన్నది (1975). ప్రపంచపు బొగ్గుగనులన్నింటను పెద్దదిగ లెక్కింపబడు వంకీగని ఈ దేశమున ఉన్నది. మొత్తము మీద బంగారము, వివిధ రత్నములు మొదలగు 34 విధముల ఖనిజ ద్రవ్యములు ఇట గనులనుండి తీయబడుచున్నవి. 1965 లో తీయబడిన బంగారపు విలువ 3.2 కోట్ల రొడిసియా పౌనులు. ఆ సంవత్సరము మొదలుగ ప్రభుత్వపు రిజర్వుబాంకే బంగారమును అంతను కొనుగోలు చేయుచున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత దేశమున ప్రత్తి మొదలగు వ్యవసాయ ద్రవ్యములకును ధాతువులకును, ఎంజినీరింగ్ వస్తువులకును సంబంధించిన పరిశ్రమలు నెలకొల్పబడినవి. కాని 1970 మొదలుగ విధింపబడిన ఆంక్షలవల్ల అందలి పురోగతి కొంతవరకు స్తంభించినది. దేశమున విద్యుదుత్పత్తి చాలవరకు బొగ్గువలననే ఇదివరలో జరిగెడిది. కాని 1959 తరువాత, జాంబెజీనదిపై, జాంబియా రాజ్యముతో కలిసి నిర్మించిన జలవిద్యుత్ ప్రాజెక్టువలన. ఈ దేశపు వాటాకు విరివిగ విద్యుత్ లభించుచున్నది. 1960లో విద్యుదుత్పత్తి సామర్థ్యము 7,05,000 కివా.

దేశమునకు పరిగణన లేకపోవుటవలనను, విదేశవ్యాపారమంతయు, అంగోలా, దక్షిణ ఆఫ్రికా, మొజాంబిక్ దేశముల రేవులద్వారా నడుచుచున్నందువలనను ఎగుమతి దిగుమతుల సంఖ్యా వివరములు బాగుగ తెలియవు. అయినను ఎగుమతులను గ్రహించిన, దిగుమతులను పంపిన దేశముల లెక్కలద్వారా ఈ క్రింది విధముగ లెక్కతేలుచున్నది. ఎగుమతుల విలువ 14.7 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 8.8 కోట్ల అమెరికన్ డాలర్లు (1968) ఇందులో దక్షిణ ఆఫ్రికాద్వారా జరిగిన ఎగుమతి దిగుమతుల లెక్కలుగాని, బంగారపు ఎగుమతుల లెక్కలుగాని చేరలేదు.

దేశపు బడ్జెటరీ వ్యయము 2,87,891 వేల డాలర్లు (1972-73).

**11. సాంఘిక రంగము :** ఆయాజాతులకు వేర్వేరుగ విద్యావసతులను కల్పించుట తన విధానముగ గ్రహించి ప్రభుత్వము కృషిచేయు

చున్నది. విద్యాశాలలు కొన్ని ప్రభుత్వాధీనమునను, కొన్ని క్రైస్తవ మతప్రచార సంఘముల అధీనమునను పనిచేయుచున్నవి. తమ విద్యా కృషికై మతసంఘములు ప్రభుత్వమునుండి గ్రాంటులను పొందుచున్నవి. ఆఫ్రికనులకు 3,217 ప్రయిమరీ విద్యాలయములు కలవు; అందలి విద్యార్థి సంఖ్య 7,50,643; సెకండరీ స్థాయి పాఠశాలలు 108; తక్కురకముల పాఠశాలలు 640. మొత్తముమీద 6 నుండి 16 ఏండ్లవరకు వయసుగలిగిన ఆఫ్రికనులలో 70% బాలబాలికలు 5 ఏండ్లకు తగ్గని ప్రాథమిక విద్యాశిక్షణను, అందులో సగము మంది 8 ఏండ్ల విద్యా శిక్షణను పొందుచున్నారు. ఆఫ్రికన్‌లు కాని వారికి మొత్తము మీద 236 పాఠశాలలు కలవు; అందలి విద్యార్థి సంఖ్య 59,708 (1972).

సాలిస్‌బరీలోని రొడీసియా విశ్వవిద్యాలయమున విద్యార్థి సంఖ్య 978; ఇందు ఆఫ్రికన్‌లు 400 (1972).

బులవాయోలో, దేశమునందంతటను పెద్దదియగు గ్రంథాలయము కలదు; ఆ నగరముననే ఆకర్షణీయమగు మ్యూజియమ్ కూడా కలదు. ఆంగ్లమున మూడు దినపత్రికలు సాలిస్‌బరీ, ఉమ్తాలీ, బులవాయో నగరములనుండి వెలువడుచున్నవి.

యూరపీయులకు, యూరపీయేతరులకు వేర్వేరుగ వైద్య వసతులు కల్పింప బడినవి. ప్రభుత్వముచేత నడుపబడు వివిధ తరగతుల ఆసుపత్రులు, ఆరోగ్యకేంద్రములు మొదలగునవి మొత్తము మీద 112 ఉన్నవి; ఇతర సంస్థలు నడుపు అట్టి వసతుల సంఖ్య 105. 1000 మంది పౌరులకు 3 వైద్యశయ్యలును, 6,480 మందికి ఒక వైద్యుడును కలరని లెక్కతేలుచున్నది.

**12.** **యాత్రా సౌ.** : యు. స్టే; బ్రిటన్ మొదలగు కొన్ని యూరపీయదేశముల పౌరులు తప్ప తక్కిన దేశముల యాత్రికులు వీసా, పాస్‌పోర్టులను పొందవలెను. కాని ప్రస్తుతపు ఆత్యయిక పరిస్థితిలో, ప్రయాణములపై నిషేధములు అమలున ఉన్నవి. జాంబెజీ నదిమీద ఉన్న, విక్టోరియా జలపాతము, వేటకు ఉపకరించు వంకీ జాతీయ వనము, 'జింబాబ్వే'లు అని వ్యవహరింపబడు శిథిలదుర్గములు యాత్రికులను ఆకర్షించుచున్నది. ఈ జింబాబ్వేలను నిర్మించిన ప్రాచీన నాగరికతను గురించి ఎట్టి వివరములును తెలియవచ్చుటలేదు; కాని ఆ నాగరికతకును ప్రాచీన భారతీయ నాగరికతకును, ఏదియో సంబంధము ఉండితీరునని వాని లక్షణములవలన తేలుచున్నటుల చారిత్రకులలో కొందరి అభిప్రాయము. వీనిపేరనే తమ దేశమును 'జింబాబ్వే' అని వ్యవహరింపదగునని దేశపు ఆఫ్రికనులు భావించుచున్నారు.

**14.** **ప్రసిద్ధ పౌరులు** : పూర్వపు వారిలో సుప్రసిద్ధుడు లోబెన్‌గులా (1833-94)అను రాజు; మతబేలే తెగకు చెందినవాడు; తొలుత బ్రిటిష్ వారికి దేశపు ఖనిజ సంపత్తిపై అధికారమును కల్పించినవాడు ఇతడే; అయినను తన పొరపాటును గ్రహించిన తరువాత యూరపియన్ వలసదారులపై 1893 లో దేశ విమోచనకై తిరుగుబాటు జరిపి విఫలుడయ్యెను. ఆధునికులలో సార్వజనికమగు వోటింగ్ హక్కుకొరకును, దానిపై ఆధారపడిన స్వాతంత్ర్యమునకును పోరాడెడు ఆఫ్రికన్ జాతీయ నాయకులలో నేషనల్ కాంగ్రెస్ నాయకుడు జోషువా ఉన్‌కోమో (జ. 1917); జింబాబ్వే ఆఫ్రికన్ నేషనల్ యూనియన్ అధినేత ఉందాబనింగీ సితోల్ అనువారు ప్రముఖులు.

# 43. లిబియా

**ముఖ్యనగరము :** బెన్‌ఘాజీ, ట్రిపోలీ అను రెండు నగరములును ముఖ్యనగరములే. అయినను ఎల్‌బెదా అనుపేర ఒక నూతన ముఖ్యనగరము నిర్మితమగుచున్నది. **జెండా :** ఎరుపు, తెలుపు, నలుపు అడ్డచారలుకలది జాతీయ పతాకము. **జాతీయ గీతము :** అల్‌సషీద్ అల్‌వతన్ (మన జాతీయగీతం); **నాణెము :** లిబియన్ దీనార్;



పటము 43.

1000 దరహములుగ ఇది విభక్తము. 1 లి. దీనారు = రు. 21.00; **కొలతతూకములు :** మెట్రిక్ విధానమునకే అధికారక పరిగణన ఉన్నను స్థానికముగ సాంప్రదాయికపు కొలతతూకములును వాడబడుచున్నవి. **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర ఆఫ్రికా తీరమున 9-30°′ నుండి 25° తూ. తులారేఖల మధ్యను, 19°30′ నుండి 34° ఉ. అక్షాంశరేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున మధ్యధరా సముద్రమును, తూర్పున ఈజిప్ట్, సుడానులును, దక్షిణమున చాద్, నైగర్‌లును పశ్చిమమున టునీసియా, ఆల్జీరియాలును సరిహద్దులందున్నవి. అంచనాలను అనుసరించి దేశ వైశాల్యము 17,59,540 చ. కిమీ. అట్లాంటిక్ మహాసముద్రము మొదలుగ ఎఱ్ఱ సముద్రమువరకు వ్యాపించియున్న ఉత్తర ఆఫ్రికా పీఠభూమిలో ఈ దేశము ఒక అంతర్భాగము. ఇందలి అత్యున్నత ప్రదేశపు ఎత్తు 3,150 మీ. భౌతిక పరిస్థితులరీత్యా ఈ దేశము ట్రిపోలిటానియా, సిరెనికా, ఫెజ్జాన్ అను మూడు ప్రాంతములుగ విభజింప వీలుగ ఉన్నది. జఫరా ప్రాంతపు తీరభూమి మొదలుగ క్రమముగ సోపాన సరళిలో ఎత్తునకులేచు మైదానములు ట్రిపోలిటానియాలో కలవు; ఇవి చాల సారవంతములు. ట్రిపొలిటానియాలో తక్కిన భాగము ఇసుకయు, రాళ్ళును ఉండు పీఠభూమిగ కొంతవరకు ఉండును. దక్షిణపు కొనన అతి నిమ్నభూములు తూర్పునుండి పడమరకు విస్తరించి ఉన్నవి. ఇందు పెక్కు ప్రాంతములందు ఊటబావులును, పాతాళజలసారిణులును కలవు. సిరెనికాయందలి తీరభూమి క్రమమున 610 మీటరుల ఎత్తువరకు లేచుచు ఎగుడు దిగుడుగ ఉండును. ఈ ప్రాంతముననే లిబియా దేశపు మూడు పెద్ద పట్టణములు - బెన్‌ఘాజీ, ఎల్‌బీదా, దర్నా అనునవి-కలవు. దక్షిణ సిరెనికా ఒక ఎడారి; అపైన టిబెస్తీ పర్వతములు కలవు. ఎడారిలో పెక్కు ఊటబావులు కననగును. ఫెజ్జాన్ అనునది నిమ్నభూములమయమై ఊటబావులను అటనట కలిగియున్నది. దేశమున గణింపదగిన నదులు ఏవియులేవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఒకవైపు మధ్యధరా సముద్రమును, రెండవవైపున ఎడారియుఉన్న ఈ దేశము ఆ రెండింటి ప్రభావములకు లోనగు

చున్నది. త్రిపొలిటానియాలోని జఫరా ప్రాంత మున ఎండకాలమున ఉష్ణోగ్రత 105 - 115° ఫా. మధ్య మారుచుండును. దక్షిణమునకు పోయిన కొలది ఉష్ణోగ్రత ఎండకాలమున 120° ఫా. వరకు పోవును. ఉత్తర సిరెనికాలో ఉష్ణోగ్రత కొంత వరకు తక్కువగ ఉండి 80° - 90° ఫా. మధ్య ఉండును. అత్యుష్ణ ప్రదేశములే చలికాలమున హిమపాతమునకు లోనగుటయు కలదు. వర్ష పాతము ఒక్కొక్క ప్రాంతమున ఒక్కొక్క తీరుగ ఉండును. త్రిపొలిటానియాలోని జబల్ ప్రాంతమున సాలున సరాసరి వర్షపాతము 37.5 నుండి 50 సెం. మీ వరకు మారుచుండును. తక్కిన ప్రాంతములలో ఎటనైనను సాలున, సరా సరి వర్షపాతము 20 సెం. మీ. ను మించదు. ఈ వానలును శీతకాలమున పడును. దేశము తరచుగ అనావృష్టికి లోనగుట కలదు. ఖర్జూరజాతిచెట్లును, కొన్ని గుబురు మొక్కలును మాత్రమే దేశమున కననగును. ఒంటెలు, గొఱ్ఱెలు, మేకలు, తదితర పశుగణము మాత్రమే దేశమున కన్పట్టు జంతు జాతులు.

**3. జనసంఖ్య మొ. :** దేశపు ఆదివాసులు బర్బరజాతివారు; అనంతర కాలమున వచ్చిన అరబ్‌జాతి ఈ ఆదిమ జాతితో సమ్మేళనము చెంది నది. 1964 లెక్కలను అనుసరించి దేశపు జన సంఖ్య 15,64,369. నగరములలో పేర్కొనదగినవి. త్రిపోలీ (జ. సం. 3,79,925), బెన్‌ఘాజీ (జ. సం. 2,78,826). 1971 అంచనాలను అనుసరించి దేశ జనసంఖ్య 20,84,000. దేశ ప్రజల మాతృభాష అరబ్బీ; ఇంగ్లీషుతో పరిచితి విద్యావంతులలో పలువురకు కలదు; ఇటాలియన్‌కు కూడ కొంత ప్రచారము కలదు. బర్బర భాషను కొందరు అల్పసంఖ్యాకులు మాత్రమే మాటాడుదురు. సున్నీ సంప్రదాయపు ఇస్లామును అవలంబించిన వారు అత్యధిక సంఖ్యాకులు. క్రైస్తవులును యూదు లును అత్యల్ప సంఖ్యలలో కలరు.

**4. సమాచార సౌ. :** తంతి, తపాలా, టెలి ఫోను సౌకర్యములను ప్రభుత్వమే నిర్వహించు చున్నది. దూరవార్తా సౌకర్యములను పునర్వ్యవస్థీక రించు కృషి జరుగుచున్నది. తీరప్రాంతములమధ్య కేబుల్ లైనులద్వారా వార్తా సంబంధమును ఏర్పర చుట ఇందు తొలుతగ జరిగినది. యూరపులోని ప్రముఖ నగరములతో రేడియో టెలిఫోను సంబంధ ములు ఈ దేశమునకు కలవు. దేశమున విసరివేసి నటులున్న ఊటబావుల ప్రాంతములతో రేడియో వార్తా సౌకర్యముద్వారా ముఖ్యనగరములు సంబంధ మును కలిగియున్నవి. త్రిపోలీ, బెన్‌ఘాజీలలో రేడియో ప్రసార కేంద్రములు కలవు. 1968 నుండి టెలివిజన్ ప్రసార కేంద్రమును పనిచేయుచున్నది. 90,000 రేడియోలును, 2,000 టెలివిజన్ సెట్టు లును, 41,495 టెలిఫోనులును కలవు (1971).

**5. యాన సౌ. :** దేశమున రోడ్ల సౌకర్యము విరివిగ కలదు; తీరప్రాంతమున పశ్చిమపు సరి హద్దునుండి తూర్పుసరిహద్దువరకు పోవు 1,822 కిమీ. రోడ్డు ఇందు ప్రముఖము; రెండు ముఖ్య నగరములును ఈ రోడ్డుమీదనే ఉన్నవి. ఈ రోడ్డు ఉన్నతస్థాయికి చెందినది. రెండవ ముఖ్యమైన రోడ్డు అల్‌జీరియా సరిహద్దునందలి ఘాట్‌నుండి ఫెజ్జాన్‌లోని దక్షిణ ప్రాంతమునకు పోవుచున్నది. దీని నిడివి 1.250 కిమీ. ఇంకను శాఖా మార్గములు పెక్కు కలవు. మొత్తంమీద దేశములోని ఏ జన స్థావరమునకైనా కారులో పయనించుటకు వసతిగ రోడ్లు కలవని చెప్పవచ్చును; ఇందు కొన్ని కచ్చా రోడ్లును కలవు. త్రిపోలీనుండి జువారాకును (168 కిమీ.), బెన్‌ఘాజీనుండి సులూఖ్‌కును రెండు నేరో గేజి రైలుమార్గములు ఉండెడివి. కాని అవి ఇపుడు పనిచేయుటలేదు. త్రిపోలీ, బెన్‌ఘాజీ, తోబ్రుక్ అనునవి ముఖ్యములగు రేవు నగరములు. త్రిపోలీ

వద్దను, బెన్ ఘాజీవద్దను ఉన్న విమానాశ్రయములు అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించునవి.

**6. చరిత్ర :** అతి ప్రాచీన కాలమునుండియు ఈ దేశపు రేవుపట్టణములు వివిధజాతుల దృష్టిని ఆకర్షించినవి. వ్యాపారరీత్యా వాని ప్రాముఖ్యమును గుర్తించిన కార్తేజియనులును, గ్రీకులును, అందులకై పోటీపడి పోరాటములను సాగించిరి. తదనంతర కాలమున క్రీ. పూ. మూడవ శతాబ్దిలో రోమన్‌లును, కార్తేజియనులతో ఈ రేవులకొరకై పోరాడి కడకు వశపరచుకొనిరి. తొలుత రోమన్ సామ్రాజ్యమునను, అనంతరమున తూర్పు రోమన్ (బైజాంటియన్) సామ్రాజ్యమునను అంతర్భాగముగ ఈ ప్రాంతము క్రీ. శ. 7వ శతాబ్దివరకు ఉండినది. క్రీ. శ. 643 లో ఇస్లామిక సేనా వాహినులు ఈ దేశమును లోగొని ఇస్లాము మతమునే గాక, అరబ్బీభాషా సంస్కృతులను ఇట వ్యాపింపజేసినను దేశము సదా అంతఃకల్లోలములతో సతమతమగుచునే ఉండినది. 16వ శతాబ్దిలో యూరపీయ దేశములకు మరల ఈ దేశముతో పరిచితి ఏర్పడినను, వారెవరును ఇట పలుకుబడిని ఆర్జింపలేకపోయిరి. కడకు ఇది తుర్క్ సామ్రాట్టులకు వశమైనను సుస్థిర పరిపాలనకు నోచుకొనకపోయెను. ఇటలీ ఈ దేశమును 1911 లో వశపరచుకొనినది. తదాదిగ, ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలమున ఇటలీ సేనలను ఐక్యరాజ్య సేనలు తరిమివేయువరకు, ఈ దేశమును ఇటలీ పాలించినది. ఇటలీదేశపు నియంతయగు ముస్సోలినీ, వలస ప్రభుత్వపు పరిపాలనను లిబియా యందలి మారుమూల ప్రాంతములకు సైతము వ్యాపింపజేసెను. కాని 'సనూసీ' అను మత సంస్కరణానుయాయుల బృందము సంఘటితమై వలస ప్రభుత్వమును ఎదిర్చి పోరాడి ఎన్నియో త్యాగములను చేసినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఐ. రా. స. తీర్మానమును అనుసరించి లిబియా స్వాతంత్రతను ఆర్జించినది. (21 నవంబరు, 1949). సనూసీ నాయకుడు మహమ్మద్ ఇద్రిస్ అల్ మహదీ రాజయ్యెను. కాని 1969 లో సైనిక వర్గమునకుచెందిన ఉద్యోగ బృందము రాజును పదవీభ్రష్టునిచేసి గణతంత్ర రాజ్యముగ దేశమును ప్రకటించినది. అంతట ఒక నూతన రాజ్యాంగమును, దానిని అనుసరించి ఒక పౌర ప్రభుత్వమును ఏర్పడినను, ఆ ప్రభుత్వము అనతి కాలముననే రాజీనామాను ఈయవలసి వచ్చినది. అంతట కలనల్ అల్‌గద్దాఫీ నాయకత్వమున విప్లవ అధిపాలక సంఘము దేశ ప్రభుత్వమును వశపరచుకొనినది (1970). లిబియాను, ఇస్లామిక సోషలిజపు ప్రాతిపదికపై ఆధునిక రాజ్యముగ చేయుటయు, అరబ్ ప్రపంచమున ఏకీభావమును నెలకొల్పుటయు గద్దాఫీ సంకల్పములు. కాని ఈజిప్టు, సిరియాలతో తన దేశమును మేళవించి ఒక అరబ్ సమాఖ్యను ఏర్పరచుటకై అతడుచేసిన కృషి విఫలమైనది. పాలస్తీనా సమస్యపై తీవ్ర వైఖరిని అవలంబించి వ్యవహరించవలెనని ఇతని పట్టుదల. ఇస్లామిక సూత్రములను అనుసరించి ఒక సాంస్కృతిక విప్లవమును కొనితెచ్చి, ప్రజలే ప్రభుత్వమును నడుపుకొనునటుల చేయుటకై కొన్ని చర్యలను అతడు 1973 లో మొదలిడెను.

**7. పరిపాలన :** దేశపు పరిపాలనాధికారమంతయు, 1969 లో రూపొందింపబడిన ఒక తాత్కాలిక రాజ్యాంగ విధానమును అనుసరించి, విప్లవ అధిపాలన సంఘమున న్యస్తమైఉన్నది. దాని అధ్యక్షుడు గద్దాఫీ; ఆ అధిపాలన సంఘమున అతడుగాక 11 మంది సభ్యులు కలరు. ఈ సంఘము నియమించిన ఒక మంత్రివర్గము కలదు. ఆ మంత్రివర్గమున ప్రధానియు, 12 మంది మంత్రులును కలరు. దేశమున రాజకీయ పక్షములు ఏర్పడుటకు శాసనరీత్యా అవకాశములేదు. 1970 లో విప్లవ అధిపాలక సంఘము దేశమును

10 రాష్ట్రములుగను, ఒక్కొక్క రాష్ట్రమును క్రమముగ జిల్లాలుగను విభజించి స్థానిక పరిపాలనకు అవకాశములను కల్పించినది. ఈజిప్టున అమలునందున్న న్యాయశాస్త్ర సంహితలును, విధానములును, ఈ దేశమునకూడ న్యాయస్థానములందు పాటింపబడుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశమునకు 18,000 మంది కల భూతల సేనయు, 1 000 మందికల నౌకా సేనయు కలవు. ఫ్రెంచివారినుండి సంపాదించిన పోరాటపు విమానములుకల విమానదళము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను లిబియాకు సభ్యత్వము కలదు. అరబ్ లీగునను సభ్యత్వము కలదు. దౌత్య సంబంధములు పలు ప్రముఖ దేశముతో కలవు.

**10. ఆర్థిక రంగము :** 1958 కు పూర్వమున ప్రపంచపు పేద దేశములలో ఒకటిగ పేరొందిన ఈ దేశము ఆ సంవత్సరమున పెట్రోలియమ్ గనులు దేశమున కనుగొనబడుటతో, ఒక నూతన యుగమున ప్రవేశించినదని అనవచ్చును. 1950 లో తలసరి ఆదాయము 35 డాలర్లు ఉండగా, ఈ నూనె ఉత్పత్తివలన ఆ ఆదాయము 1967 నాటికి 926 డాలర్లకు పెరిగినది. ప్రస్తుతమున ఆ దేశమున రోజునకు 30 లక్షల పీపాల ముడిపెట్రోలు ఉత్పత్తి అగుచున్నది. 1967 లో సమష్టి జాతీయోత్పత్తిగ లెక్కింపబడిన 213.3 కోట్ల డాలర్ల సంపదలో 58.5% పెట్రోలు వలననే లభించినది. 1950 లో కార్మిక శక్తిలో 80% వ్యవసాయ, పశుపోషణలలో ఉండగ, 1964 లో 35 7%. మాత్రమే అందు పనిచేయుచుండినది. 1972 లో బ్రిటిష్‌వారి పెట్రోలియమ్ కంపెనీలను, 1973 లో అమెరికన్ ఆయిల్ కంపెనీలను ప్రభుత్వము జాతీయము చేసినది; తక్కిన కంపెనీలలో 51% వాటాలను ప్రభుత్వము ఆర్జించినది. దేశపు భూమిలో చాల అల్ప విస్తీర్ణము మాత్రమే వ్యవసాయ యోగ్యముగ ఉన్నది. అయినను ఉన్నదానికే నీటి పారుదలను పెంచుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది; తత్ఫలితముగ 1968 నాటికి దాదాపు 5,01,000 హెక్టేరులకు నీటిపారుదల వసతి లభించినది. పశుపోషణలో ఇచటి రైతులు ఎక్కువ శ్రద్ధ వహింతురు. వారికి ధనరూపకముగ ఎక్కువ ఆదాయమును అది కల్పించుచున్నది. ఆహార ధాన్యములలో బార్లీ ఎక్కువగ పండింపబడుచున్నది; కాని వర్షపాతపు మార్పులవలన దీని ఉత్పత్తియు హెచ్చుతగ్గులకు సాధారణముగ లోనగును. దేశపు పశ్చిమ ప్రాంతమున ఆలివ్, నిమ్మజాతి వృక్షముల తోటల పెంపకము ఎక్కువగ కలదు ఎడారులలో ఊటబావుల ప్రాంతమున ఖర్జూరచెట్లు పెంచబడుచున్నవి. ఎస్పార్టో అను గడ్డియు ఇచట పెంచబడుచున్నది. ఇది కాగితపు తయారీకి బాగుగ ఉపయోగించును. అయినను మొత్తముమీద వ్యవసాయపు ఉత్పత్తివలన దేశమునకు లభించునది చాల తక్కువ. అదియు అనిశ్చిత రీతిలో మారుచుండును. చేపల పరిశ్రమను శాస్త్రీయ రీతిలో అభివృద్ధిచేయు కృషి ఇపుడే మొదలైనది.

ఇచటి పరిశ్రమలు చాలవరకు వ్యావసాయిక వస్తువులకు సంబంధించినవియే అని చెప్పవచ్చును. 1972 నుండి 75 వరకు సాగిన త్రివర్ష ప్రణాళికను అనుసరించి గృహనిర్మాణాదులకు సంబంధించిన కొన్ని నూతన పరిశ్రమలను స్థాపించు కృషి జరిగినది. లిబియాకు జలవిద్యుత్ సౌకర్యములు లేవు. అందువలన రాక్షసిబొగ్గు సాయమున విద్యుదుత్పత్తి జరుగుచున్నది. 1968 లో మొత్తపు విద్యుదుత్పత్తి 25.66 కోట్ల కి. వాట్లు. 1962 లో విద్యుదుత్పత్తిసంస్థలు అన్నియు జాతీయములు చేయబడినవి. దేశపు బడ్జెటరీ వ్యయం 20.1 కోటి దీనార్లు. దేశపు (1971-72) ఎగుమతుల

విలువ 9,66,307 వేల దీనార్లు; దిగుమతుల విలువ 3,43,204 వేల దీనార్లు (1972). ఎగుమతుల విలువలో దాదాపు 99% పెట్రోలువలన లభించు చున్నది. దేశమున బ్యాంకింగు వ్యవహారముల నిర్వహణ ప్రభుత్వాధిపత్యమునఉన్న కేంద్ర బ్యాంకు (బెన్ ఘాజీ) ఆధ్వర్యవమున సాగుచున్నది. తక్కిన బ్యాంకులలో 51% లిబియా వాసులకు చెందియుండవలయునను నియమము కలదు.

**11. సాంఘిక రంగము :** సాంఘిక సంక్షేమ కృషిని తమ త్రివర్ష ప్రణాళికలో ఒక ముఖ్య భాగ ముగ ప్రభుత్వము పరిగణించి కృషిచేయుచున్నది. సంవత్సరమునకు 18,000 నూతన గృహములను నిర్మించవలెనను ఏర్పాటు అందు కలదు. దేశమున 6 ఏండ్లకు తగ్గని వారిలో అక్షరాస్యత 1951 లో 10% ఉండుగ, 1964 లో అది 29% కు పెరిగి నది. దేశమునగల 1,684 పాఠశాలలలో 4,70,423 విద్యార్థులు పఠించుచున్నారు (1971-1972). బెన్ ఘాజిలోను, త్రిపోలీలోను రెండు జనరల్ ఆసుపత్రులు కలవు. ఇవికాక 5 820 శయ్యలుకల 42 చికిత్సా కేంద్రములు పనిచేయు చున్నవి. ఆధునిక పరికర సమన్వితమగు ఒక పెద్ద వైద్యశాల బెన్ఘాజీలో వేరొకటి 2.35 కోట్ల వ్యయముతో నిర్మింపబడుచున్నది. త్రిపోలీ, బెన్ ఘాజీలలో గ్రంథాలయములు ఉన్నను, అవి పరి గణనీయ స్థాయికి చెందినవికావు : ప్రాచీన నాగరి కతావశేషములను ప్రదర్శించు మ్యూజియములు త్రిపోలీలో కొన్ని కలవు.

**12. యాత్రా సౌ. :** సిరీన్. అపోలోనియా అను రెండు ప్రాచీన నగరముల అవశేషములు విదేశ యాత్రికులను కొందరను, ఈ దేశమునకు ఆకర్షించుచున్నవి. వచ్చువారందరికి పాస్‌పోర్టు లును, వీసాలును విధిగా ఉండితీరవలయును. యాత్రికుల సంఖ్య అంతగ పరిగణనీయమైనది కాదు.

**13. ప్రసిద్ధ పౌరులు :** ఓటోమన్ సుల్తానుల సైన్యములను ప్రతిఘటించి పోరాడి, దేశ స్వాతం త్ర్యమును కాపాడి 1711 లో కరమనాలీ రాజ వంశమును సంస్థాపించిన అహమద్ కరమనాలీ ఒక ప్రసిద్ధ జాతీయ వీరుడు. 'సనూసీ' సౌభ్రా తృత్వ సంఘమును సంస్థాపించి, సిరినికా ఎడారుల లోని వివిధ జాతులను ఏకీకృత మొనర్చినవాడు సయ్యద్ మహమ్మద్ బిన్ అలీ అల్‌సనూసీ (1791-1851). ఈ సౌభ్రాతృత్వ సంఘమే తద నంతరమున, ఇటాలియన్ సామ్రాజ్య వాదమును ప్రతిఘటించి పోరాడినది.

---

# 44. లెసోతో

**ముఖ్యనగరము :** మసేరూ; **జెండా :** దండము వద్ద ఆకుపసిమి, ఎరుపు నిలువుచారలును, తక్కినది నీలభూమికయు కల్గి, ఆ భూమిక మధ్యన తెలుపురంగులో బసూటోజాతివాని టోపీ రూపము అమరియుండునది. **జాతీయ గీతము :** లెసోతో ఫాదే లా బో-నాతా...(మా తరతరముల మాతృభూమి లెసోతో......); **నాణెము :** దక్షిణాఫ్రికా దేశపు రాండ్; ఒక రాండు = రూ. 10.50 **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన ;** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** అన్నివైపులను దక్షిణ ఆఫ్రికా రాజ్యపు భూభాగముచే పరివృతమై ఉన్న ఈ దేశము 28°35'-30°40' ద. అక్షాంశరేఖల

మధ్యను, 27°-29°30′ తూ. తులా రేఖల మధ్యను విస్తరించియున్నది. దేశవైశాల్యము 30,344 చ. కిమీ దక్షిణ ఆఫ్రికాలోని డ్రాకెన్స్‌బర్గ్ పర్వత శ్రేణికి చెందిన మాలూతీ పర్వతములు ఉత్తరము నుండి దక్షిణమునకు వ్యాపించి ఉన్నవి. ఇందువలన ఒక పీఠభూమి రూపొందినది. అందలి అత్యున్నత ప్రాంతపు ఎత్తు 3,480 మీ. దక్షిణ ఆఫ్రికాలో ప్రవహించు ఆరంజినది ఈ దేశమున జన్మించినది.

**2. శీతోష్ణస్థితి మొ. :** పీఠభూమియందు తప్ప తక్కిన ప్రాంతమున గరిష్ఠోష్ణత 90° ఫా.; కనిష్ఠోష్ణత 20° ఫా.; కాని పీఠభూములందు కనిష్ఠోష్ణత 0°ఫా. వరకు పడిపోవుచుండును. సాలీనా సరాసరి వర్షపాతము 42 సెం. మీ; అయినను కొన్ని ఉన్నత ప్రాంతములందు 187 సెం. మీ; కొన్ని పల్లపు ప్రాంతములందు సరాసరికి చాల తక్కువ వర్షము సాలున కురియుచున్నది, ఎంత వాన కురిసినను నీరు, దేశపు వెలుపలికి, నేలతీరునుబట్టి, సులభముగ పోవుచున్నది. కావున దేశము తరచుగ కరువు బాధకు లోనగుచున్నది. దేశమున చిట్టడవులు కూడ చాల తక్కువ; పచ్చిగడ్డిమాత్రము అటనట కననగును. నీటికోతవలన పైరుపచ్చకు తావే లేకుండ ఉన్నది. పెద్ద వన్యజంతువులు ఏవియు లేవు. ఒకపుడు ఈ దేశపు తట్టుగుర్రములకు (పోనీలకు) విరివిగ పేరుండెడిది; కాని ఇప్పుడు వాని సంతతి దాదాపుగ అంతరించినది.




పటము 44

**3. జనసంఖ్య మొ. :** 1966 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 9,69,634. 1972 సంవత్సరం అంచనా 10,81,000; జనసాంద్రత చ. కిమీ. కు 30 మంది. ప్రజలందరును సెసేతో తెగకు చెందిన బంటూజాతివారు. ప్రజలభాష సెసేతో. అంగ్లమునకును సెసేతో పాటుగ సమానస్థాయిలో సాధికార పరిగణన కలదు. ప్రజలలో 70% క్రైస్తవులు; తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ. :** దేశమున 12 తపాలాఫీసులును, 52 తపాలా ఏజన్సీలును, 16 టెలిఫోను ఎక్స్ఛేంజీలును కలవు (1963).

**5. యాన సౌ. :** 213.8 కిమీ. ల నిడివిన తారురోడ్లును, 779.5 కిమీ. ల నిడివిన కంకర రోడ్లును, దేశపు పడమటి సరిహద్దున కలవు. పర్వతమయమగు అంతర్భాగమున గుర్రపు బాటలు మాత్రమే సాధారణముగ కన్పట్టును; అయినను ఆ ప్రాంతమునను 128 కిమీ. ల నిడివిన రోడ్లు వేయబడినవి. మసేరూనుండి, దక్షిణ ఆఫ్రికాలోని జోహానెస్‌బర్గ్‌కు విమానయాన వసతి ఉన్నది. దేశాంతర్భాగమునను, 29 ప్రదేశములందు, విమానములకు దిగువసతులు కలవు.

**6. చరిత్ర :** ఈ ప్రాంతమున తొలుత వసించిన జనులను గురించి వివరములు ఏవియు తెలియవు. కాని, 19 వ శతాబ్దిలో ఇచట బసూతో తెగకు చెందిన ఆఫ్రికన్ జాతి ప్రజలు వసించుచుండిరనియు, జూలూ, మతాబెలే తెగల దాడులవలన అందు

అనేకులు అంతరించిన తరువాత, మిగతా వారిని సుసంఘటిత పరచి మషోషే అను నతడు ఈ ప్రాంతమును ఒక రాజ్యముగ రూపొందించెనని తెలియవచ్చుచున్నది. ఈ రాజ్యమును 19 వ శతాబ్ది మధ్యభాగమున బోయర్లు (దక్షిణాఫ్రికాలోని డచ్చి సంతతివారు) ఆక్రమించుకొన యత్నించగా, మషోషె బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణను అర్థించెను. అంతట 1868 లో ఇది బసూటోలాండు అను పేరుతో బ్రిటిష్ రక్షిత రాజ్యమయ్యెను. మషోషే మరణించిన తరువాత (1870) ఈ రాజ్యమును బ్రిటిష్ ప్రభుత్వము కేప్ రాష్ట్రప్రభుత్వపు అధీనమున ఉంచెను. కాని ఆ రాష్ట్రములోని బోయర్ల దురాగతములను ప్రతిఘటించుటకు ఇచటి ప్రజలు మరల పోరాటములను సాగింపవలసి వచ్చెను. అంతట బ్రిటిష్ ప్రభుత్వము దీనిని మరల రక్షణ లోనికి తీసికొని (1884) దక్షిణ ఆఫ్రికాలోని తమ హైకమీషనరుద్వారా దేశమును పాలించినది. దేశము నందలి తెగల నాయకుల సహకారముతో ఇచట ప్రజా ప్రతినిధుల పరిపాలనను క్రమరీతిలో ప్రవేశ పెట్టి, కడకు దేశమునకు స్వతంత్రతను బ్రిటిష్ ప్రభుత్వము కలుగజేసినది (అక్టోబరు 4, 1966).

**7. పరిపాలన :** రాజ్యాంగబద్ధమగు రాజరికపు పాలన ఇట అమలున ఉన్నది. సార్వజనికమగు వోటుహక్కు కలదు. పార్లమెంటున నేషనల్ అసెంబ్లీ, సెనెట్ అను రెండు కక్ష్యలు కలవు. అసెంబ్లీలోని సభ్యసంఖ్య 60. వీరిని అయిదేండ్లకొకపర్యాయము ప్రజలు ఎన్నుకొనెదరు. సెనెట్‌లోని సభ్యులసంఖ్య 33. వీరిలో 22 మంది బసూతో తెగలోని వివిధ ముఠాలకు సంప్రదాయ సిద్ధముగా ఏర్పడిన నాయకులు. 11 మందిని రాజు నియామకముచేయును ఈ పార్లమెంటు సాయముతో రాజు పాలించును. రాజు మరణించినపుడు, క్రొత్త రాజును ముఠానాయకులు, తమ సంప్రదాయరీతిలో, ఎన్నుకొనెదరు. దేశపు 9 జిల్లాలను ప్రభుత్వాధికారులు ప్రజాప్రతినిధుల సాయముతో పాలింతురు. హైకోర్టు ఆధ్వర్యవమున న్యాయపరిపాలన నిర్వహింపబడుచున్నది.

**8 దేశరక్షణ :** 600 మందిగల పోలీసు బలగము మాత్రమే కలదు; సైన్యము లేదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును ఆఫ్రికా సమైక్యతా సంఘమునను దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయము దేశ ప్రజల ముఖ్య జీవనాధారము; పశుపోషణ అందలి ముఖ్యాంగము. భూమిని వేరొకనికి విక్రయించు హక్కు ఎవనికిని లేదు. భూమి అంతయు రాజునకు చెందినటులను, దానిని జాతి భద్రతకొరకై ధర్మకర్తగ అతడు పాలించుచున్నటులను ప్రజలు భావింతురు. ముఠానాయకులు భూమిని అంతటంతట, వ్యక్తులకు పంచి ఇచ్చెదరు. ఇటుల స్వామ్యపు హక్కులు లేనందువలననే వ్యవసాయము కుంటు వడుచున్నదని కొందరి భావన. వ్యవసాయ యోగ్యమగు భూమియంతయు పశ్చిమమున పల్లపు ప్రాంతమున ఉన్నది. దేశ వైశాల్యమున 12% మాత్రమే సేద్యమున ఉన్నది. దేశావసరములకు చాలవరకు, ఆహార ధాన్యములు - మొక్కజొన్న, గోధుమ మొదలగునవి - ఉత్పత్తి అగుచున్నవి. నేలకోతను నిరోధించి, భూసారమును కాపాడుటకై విదేశీయ నిపుణుల సాయముతో కృషి జరుగు చున్నది ఖనిజసంపద అంతగా లేదని సర్వేవలన తెలియవచ్చినది; వజ్రములు మాత్రము కొన్ని ప్రదేశములందు లభించుచున్నవి. ఎగుమతులలో పశువులు, వజ్రములు ముఖ్యముగ పేర్కొనదగినవి. ఎగుమతుల మొత్తపు విలువ 41.68 లక్షల రాండ్లు; దిగుమతుల విలువ 238 లక్షల డాలర్లు (1967). ఈ విధముగ దేశము ఎల్లపుడు చెల్లింపులలోటును ఎదుర్కొనుచున్నను, దక్షిణాఫ్రికాలో పనిచేయు

ఈ దేశపు కార్మికులవలనవచ్చు ఆదాయమువలన అది పూరింపబడుచున్నది. విద్యుదుత్పత్తి నామ మాత్రముగ ఉన్నది; దక్షిణాఫ్రికాపైననే విద్యుత్ సరఫరాకు ఈ దేశము ఆధారపడియున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 1.12 కోట్ల రాండ్లు (1968).

**11. సాంఘిక రంగము :** దేశమున తగినంత గృహవసతి కలదు. క్రైస్తవ మతప్రచార సంఘముల దీర్ఘకాలపు కృషి ఫలితముగ దేశమున విద్యావ్యాప్తి బాగుగ కలదు. అక్షరాస్యత 85%. 1,087 ప్రయిమరీ పాఠశాలలలో 1,75,355 మంది; 84 సెకండరీ పాఠశాలలలో 11,936; 7 ఉపాధ్యాయ శిక్షణ శాలలలో 510 మంది పఠించుచున్నారు. బోట్స్వానా, లెసోతో, స్వాజీలాండులకు సమష్టిగ ఒక విశ్వవిద్యాలయము ఈ దేశమున కలదు. ఆ విద్యాపీఠమున 218 మంది లెసోతో విద్యార్థులు చదువుచున్నారు (1972-73). మసేరూలో ఒక గ్రంథాలయము ఉన్నది. మ్యూజియములు లేవు. దినపత్రికలు లేవు. దేశమున 10 ప్రభుత్వ ఆసుపత్రులును, 9 మిషన్ ఆసుపత్రులును మొత్తము 1,749 శయ్యలతో పనిచేయు చున్నవి. దక్షిణాఫ్రికా ప్రభుత్వపు సంచారక వైద్యశాల ప్రతి వారాంతమున ఈ దేశమునకువచ్చి, వైద్య సహాయమును కల్పించుచున్నది.

**12. యాత్రా సౌ. :** కొండ ప్రాంతములందు అటనట కన్పట్టు పురాతన మానవుల చిత్రలేఖనములును, దృశ్య రమణీయతయు దేశమునకు కొందరు యాత్రికులను ఆకర్షించుచున్నవి. ప్రభుత్వము విదేశ యాత్రికులకు తగు వసతులను కల్పించినది.

---

# 45. లైబీరియా

**ముఖ్యనగరము :** మన్రోవియా; **జెండా :** ఏకాంతరరీతిలో అడ్డముగ 6 ఎరుపుచారలు 5 తెలుపు చారలు అమరియుండి, వాయవ్య భాగమున దండమువద్ద ఒక నీలిమపు చతురస్రమున నెలకొనిన పంచకోణపు నక్షత్రము కలది; **జాతీయ గీతము :** ఆల్ హెయిల్, లైబీరియా, హెయిల్... (జే అనుడు లైబీరియాకు, జే యనుడు...); **నాణెము :** డాలరు (అమెరికన్ డాలరుతో సమానము; సాధారణముగ అమెరికన్ డాలర్లే ఎక్కువగ చలామణిలో కనబడును) ఒక డాలరు = రు. 7.50; **కొలతూకములు :** యు. స్టే. లో ఉన్నవియే ఇచటను ఆదరింపబడుచున్నవి; **కాల గణన :** ఉ. 11 గం. 15 ని. = భారతదేశమున సా: 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** పశ్చిమాఫ్రికాయందు 4°13′ ఉ. అక్షాంశరేఖకు అనుకొని ఉత్తరమునఉన్న ఈ దేశమునకు ఉత్తరమున గినీ గణరాజ్యము, తూర్పున ఐవరీకోస్ట్, దక్షిణమున అట్లాంటిక్ మహాసముద్రము, పశ్చిమమున సియెర్రా లియోనీ సరిహద్దులందున్నవి. దేశపు తీరరేఖ నిడివి 560 కిమీ.; దేశపు వైశాల్యము 1,12,820 చ. కిమీ. దేశపు ఉత్తర ప్రాంతమున గినీ దేశపు సరిహద్దు నానుకొని 460 నుండి 610 మీటర్లవరకు ఎత్తుగల పీఠభూమి కలదు; ఇది క్రమముగ తీరమును చేరుసరికి సముద్ర మట్టమునకు దిగిపోవును. తీరప్రాంతమునకు పీఠభూమికిని మధ్య దట్టపు అటవీ ప్రాంతము కలదు. దేశమున ఆరు నదులు ప్రవహించి అట్లాంటిక్ మహాసముద్రమున చేరుచున్నవి. వీనిలో

కవల్లా నదియందు మాత్రమే కొంతవరకు నౌకలు పయనించగలవు. సాధారణముగ నదుల ముఖ ద్వారము లన్నింట ఇసుక దిబ్బలు విరివిగ కన నగును. గినీ సరిహద్దున నింబా పర్వతశ్రేణి యందును, వౌలే పర్వతములందును దాదాపు 1,280 మీ. ఎత్తుగల శిఖరములు కొన్ని కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఉష్ణమండల దేశముల శీతోష్ణస్థితి ఇచట కననగును. ఉష్ణోగ్రతలో




పటము 45.

మార్పులు చాల తక్కువ. సాలున సరాసరి ఉష్ణోగ్రత 82° ఫా. గరిష్ఠ ఉష్ణోగ్రత 100° ఫా. తీరమువద్ద సాలుసరి వర్షపాతము 500 సెం. మీ. ఈ వర్షపాతము క్రమముగ దేశాంతర్భాగమునకు పోవుకొలది తగ్గి, కడకు 175 సెం. మీ. ను చేరు కొనును. ఈ దేశపు అడవులు నిత్య శ్యామలవర్గము నకు చెందినవి. మహాగనీ మొదలగు ఉత్తమ జాతులు పెక్కు అందు కానవచ్చును. ఏనుగులును, కారెనుములును పూర్వకాలమున కానవచ్చెడివి; కాని ఇపుడు అంతరించినవి. చిరుతపులులు, వివిధ జాతుల కోతులు విరివిగ కననగును. పొట్టిరకపు నీటిగుర్రము ఈ దేశమున మాత్రమే కననగు చున్నది.

**3. జనసంఖ్య మొ.:** 1962 లెక్కలను అనుసరించి జనసంఖ్య 10,16,000 (1972 లోని అంచనాలను అనుసరించి 15 లక్షలు.) ఇందు 16 ఆఫ్రికన్ జాతులు చేరియున్నవి. దేశపు నగరము లలో మన్రోవియా, (జ. సం. ఒక లక్ష) పేర్కొన దగినది. దేశమున 28 ఆఫ్రికన్ భాషలు మాతృ భాషలుగ ప్రచారమునఉన్నను, ఇంగ్లీషే వ్యావ హారిక భాషగ ఆదరింపబడుచున్నది. ప్రజలలో 20% కు అది మాతృభాష. 20% ప్రజలు క్రైస్త వులు; కొలదిగ ముస్లిములు కలరు; తక్కిన వారం దరు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ.:** దేశమున వివిధ ప్రాంతములమధ్య 1964 మొదలుగ టెలిఫోను సౌకర్యమును 1968 మొదలుగ రేడియో వార్తా సౌకర్యమును నెలకొల్పబడినవి. యు. స్టే. తో కేబిల్ద్వారా వార్తా సౌకర్యము కలదు. యు. స్టే. నుండి ప్రసారితమగు వాయిస్ ఆవ్ అమెరికాకు ఒక రిలే కేంద్రము మన్రోవియాలో ఉన్నది. 1964 నుండి ఒక టెలివిజన్ స్టేషన్ పనిచేయు చున్నది.

**5. యాన సౌ.:** ఉత్తమ శ్రేణికి చెంది 1920 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; కాని, దేశాంత ర్భాగమున రోడ్ల వసతి చాల తక్కువ. రోడ్ల అభివృద్ధికై ఒక ప్రణాళిక (1972-77) అమలు జరుపబడుచున్నది. మన్రోవియాలో ఉత్తమస్థాయికి చెందిన హార్బరు కలదు. ఈ రేవు శుల్కరహితమై, స్వేచ్ఛా వ్యాపారమును ప్రోత్సహించుచున్నది. బుచనన్, గ్రీన్విల్లి, హార్పర్ అను చిన్న రేవు నగర ములును కలవు. ప్రపంచదేశములందన్నింట గొప్ప దిగ భావింపబడు వ్యాపార నౌకాదళము (1969) ఈ దేశమునకు కలదు. ఆ వ్యాపార నౌకల మొత్తపు

టన్నేజి 2,92,15,000 టన్నులు; నౌకల సంఖ్య 2,215 (1972). రిజిస్ట్రేషను రుసుము తక్కువగుట వలనను, కార్మిక చట్టముల అమలున నిర్బంధము తక్కువగుటవలనను విదేశీయ నౌకలు ఈ దేశపు లెక్కలలో రిజిస్టరగుటవలన ఈ నౌకాసంఖ్య ఇంతగ పెరిగినది. మన్రోవియాకు 80 కిమీ. దూర మున ఒక అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. దేశాంతర, ఖండాంతర ప్రయాణములకు ఇది ఉపక రించుచున్నది.

**6. చరిత్ర :** యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా లోని నీగ్రోలను దురవస్థనుండి తప్పించుటకై వారికి ఒక వలసను ఏర్పరచుట సముచితమని భావించిన ఒక అమెరికన్ సంస్థ సాగించిన కృషిమూలమున యు. స్టే. లో బానిసత్వమునుండి విముక్తిపొందిన కొందరు నీగ్రోలు వారి కుటుంబములతోసహా ఇటకు 1822 లో చేరుటద్వారా, ఈ దేశమునకు రూప కల్పన జరిగెనని చెప్పవచ్చును. అదివరకే అట నున్న నీగ్రోజాతులవారు వీరిని ప్రతిఘటించినను, కాలక్రమమున ఆ రెండు నీగ్రో వర్గములమధ్య సామరస్యము కొంతవరకు స్థాపింపబడినది. ఆ తరువాత 1847 లో ఈ దేశము ఒక గణరాజ్య ముగ రూపొంది, యు. స్టే. రాజ్యాంగ విధానమును అనుసరించిన రాజ్యాంగ విధానమును రూపొందించు కొనినది. తొలుతనుండియు యు. స్టే. రాజ్యమును, అందలి కొన్ని వైయక్తిక సంస్థలును ఈ దేశ ప్రభుత్వమునకు అండగ నిలిచినవి. 1930 లో ఆర్థిక సంక్షోభ ఫలితముగ ప్రభుత్వము దివాలా తీసినపుడు, ఒక అమెరికన్ రబ్బరు కంపెనీ, ఈ ఈ దేశమున రబ్బరుతోటలను నెలకొల్పి, రబ్బరు ఎగుమతిద్వారా దేశపు ఆర్థిక వ్యవస్థను పునరుద్ధ రించినది.

**7. పరిపాలన :** ప్రజాస్వామిక గణతంత్ర ప్రభుత్వ విధానము అమలున ఉన్నది. నిర్ణీత మగు కనీసపు ఆస్తిగల పౌరునకు మాత్రమే వోటు చేయు హక్కు కలదు; 1945 మొదలుగ స్త్రీల కును, ఓటు హక్కు ఈయబడినది. రెండు కక్ష్యల శాసనసభ కలదు; ఇందు ప్రతినిధుల సభలో 52 మంది, సెనెట్‌లో 18 మంది సభ్యులు కలరు. వీరిని, అధ్యక్షుని, ఉపాధ్యక్షుని దేశపు వోటరులే ఎన్నుకొనెదరు. సెనెట్‌కు ఆరేండ్ల కొకసారియు, ప్రతినిధులసభకు నాలుగేండ్ల కొకసారియు ఎన్ని కలు జరుగును. అధ్యక్ష, ఉపాధ్యక్షుల పదవీకాల పరిమితి 8 సంవత్సరములు; కాని మరల ఎన్నుకొన బడినచో నాలుగేండ్ల కాలము చొప్పున ఎంతకాల మైనను ఎన్నుకొనబడి పదవిలో ఉండవచ్చును. దేశమున రాజకీయ పక్షములు మూడున్నను, ట్రూ విగ్ పార్టీయే 1878 నుండి ఇప్పటివరకు అధి కారమును నిలుపుకొనగలిగి ఉన్నది. దేశము పరి పరిపాలనారీత్యా 9 కౌంటీలుగను, 4 మండలములు గను విభజింపబడినది. మండలములందు ఆ యా ప్రాంతపు జాతి నాయకులు, కేంద్ర ప్రభుత్వ పర్య వేక్షణకు లోబడి పాలన నిర్వహింతురు. కౌంటీలు, ప్రభుత్వాధికారుల పాలనలో ఉన్నవి. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున న్యాయపాలన జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమున నిర్బంధ సైనిక శిక్షణ అమలున ఉన్నది; 4,000 మంది సైనికులు గల 10 పటాలముల పదాతిదళమును, 200 మంది యోధులు కల ఒక అల్పపు నౌకాసేనయు కలవు.

**9 అంతర్జాతీయ సం. :** ఐ. రా స. సంస్థా పనా కాలమునుండియు, అందును తదనుబంధ సంస్థ లలో పెక్కింటను, ఆఫ్రికాఖండపు అంతర్దేశీయ వ్యవస్థలందు కొన్నింటను ఈ రాజ్యము సభ్యత్వ మును కలిగిఉన్నది.

**10. ఆర్థిక రంగము :** ప్రజలలో దాదాపు 90% కు వ్యవసాయమే జీవనాధారము; కాని వ్యావ సాయికోత్పత్తి దేశావసరములకు మించి జరుగుట లేదు. పంటలలో కర్ర పెండలము, కాఫీ, చెరకు,

కొబ్బరినూనె క్రమముగ పేర్కొనదగినవి. ముడి ఇనుము, రబ్బరు దేశపు ఎగుమతులలో ప్రముఖ ములు. ఎగుమతుల విలువ 22.4 కోట్ల డాలర్లు; దిగుమతుల విలువ 16.24 కోట్ల డాలర్లు (1971). విద్యుదుత్పత్తి సామర్థ్యము 1,52,100 కివా. (1960). దేశపు బడ్జెటరీ వ్యయము 6.52 కోట్ల డాలర్లు (1970).

**11. సాంఘిక రంగము :** మన్రోవియా యందు ఆధునిక గృహనిర్మాణమును ప్రభుత్వము విరివిగ ప్రోత్సహించినది; కాని పల్లెలందు పూర్వపు గుడిసెలే కన్పట్టును. దేశమున 1,084 పాఠశాల లలో 2,46,700 మంది విద్యార్థులు పఠించు చున్నారు; ఉపాధ్యాయ సంఖ్య 4,564 (1970). మన్రోవియాలో ఒక విశ్వవిద్యాలయము ఉన్నది; విద్యార్థి సంఖ్య దాదాపు 800. మన్రోవియాలోని మ్యూజియమున ఆఫ్రికాఖండపు పురాతన నాగరి కతావశేషములు కననగును. దేశమునందంతట ప్రముఖమగు గ్రంథాలయము కటింగ్టన్ కాలేజి (సుకోకో) లో ఉన్నది. రెండు దినపత్రికలు ప్రచురింపబడుచున్నవి. దేశమున 32 ఆసుపత్రులు (శయ్యాసంఖ్య 2,200) ను; 155 క్లినిక్కులును కలవు; వైద్యసంఖ్య 96 (11,200 మందికి ఒక వైద్యుడు.)

**12. యాత్రా సౌ. :** మన్రోవియాలో విదేశ యాత్రికులకు పెక్కు వసతులను ప్రభుత్వము కల్పించినది; కాని దేశాంతర్భాగమున మాత్రము వసతులు తక్కువ.

**13. ప్రసిద్ధ పౌరులు :** జోసెఫ్ జెన్‌కిన్స్ రాబర్ట్స్ (1809-76) దేశమునకు రూపకల్పన చేసినవాడు. తొలుత ఏర్పడిన అమెరికన్ నీగ్రోల వలసకు గవర్నరుగ ఉండి, తరువాత దేశమునకు రెండు పర్యాయములు (1848-56, 1872-76) అధ్యక్షుడై, స్వతంత్ర దేశముగ లైబీరియాకు, యూరపీయ దేశములనుండి పరిగణనను ఆర్జించెను; తన ప్రతిభచే యూరపీయ రాజనీతిజ్ఞుల ఆదరణను పొందెను.

---

# 46. సావోటోమీ - ప్రిన్సిపీ

**ముఖ్యనగరము :** సావో టోమీ; **జెండా, జాతీయ గీతముల** వివరములు తెలియరావు; ఎస్కుడో; 1,000 ఎస్కుడోలు లేదా 1 కోంటో = రు. 260.75; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 30 ని. = భారత దేశమున 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా ఖండపు పశ్చిమపు తీరమునకు కొలది దూరమున అట్లాంటిక్ మహా సముద్ర పరివేష్టితములై ఉన్న రెండు వేర్వేరు ద్వీప ములు రాజ్యాంగరీత్యా ఒక దేశముగ ఏర్పడిన ఈ రాజ్యమున సావో టోమీ అను ద్వీపము, ఆఫ్రికా తీరమునకు దాదాపు 200 కిమీ. దూరమున 1°44′ ఉ. 0°01′ ద. అక్షాంశ రేఖలకును, 6°28′ – 7°28′ తూ. తులారేఖలకును మధ్య విస్తరించి ఉన్నది; రెండవదియగు ప్రిన్సిపీ ద్వీపము, సావో టోమీకి ఉత్తరమున 120 కిమీ. దూరమున 13.6 కిమీ. పొడవున, 6 4 కిమీ.ల సరాసరి వెడల్పున ఉన్నది. ఈ ఉభయ ద్వీపముల మొత్తపు వైశాల్యము 964 చ. కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఎండ వేడిమి ఎక్కు

వగ, ద్వీపములందు అంతటను ఒకే తీరునఉన్నది. వర్షపాతము విరివిగ కలదు.

**3. జనసంఖ్య మొ.:** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 74,541. ఇందు అత్యధిక సంఖ్యాకులు ముఖ్యనగరమగు సావో టోమీలో నివసించుచున్నారు. పోర్చుగీజు సంతతికిని, నీగ్రో సంతతికిని చెందిన జాతులు దేశమున కననగును; ప్రజలలో పోర్చుగీజు భాషయే వ్యాప్తియందున్నది. అందరును క్రైస్తవులు.



పటము 46.

**4. సమాచార సౌ.:** టెలిఫోన్ సౌకర్యములు దేశమున విరివిగ కలవు; ఇవిగాక రెండు వైర్‌లెస్ స్టేషనులును పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** రోడ్డు మార్గముల నిడివి 288 కిమీ; దేశపు రేవులలో సావో టోమీ ద్వీపమునందలి ఆనాపానిన్, ప్రిన్సిపీ ద్వీపమందలి సోవో అన్‌తోనియో ప్రముఖములు. సావో టోమీలో ఒక విమానాశ్రయము ఉన్నది.

**6. చరిత్ర:** క్రీ. శ. 1471 లో పోర్చుగీజు నావికులు కాలిడునాటికి ఈ ద్వీపములందు మానవావాసములు లేకుండెను. అంతటినుండి పోర్చుగీజు వారును, బానిస వ్యాపారముద్వారా ఆ పోర్చుగీజుల వలన తేబడిన పలువురు ఆఫ్రికన్ జాతుల ప్రజలును ఇట చేరిరి. 1522 నుండి పోర్చుగల్ దేశపు ప్రభుత్వము నియమించు గవర్నరు ఇట పాలించుట మొదలైనది. ఇటుల నాలుగు శతాబ్దముల కాలము పోర్చుగీజు సామ్రాజ్యమున అంతర్భాగముగ వలస పాలనలో ఉండిన ఈ రాజ్యము, 1974 లో పోర్చుగల్‌న జరిగిన రాజకీయ పరిణామముల ఫలితముగ, స్వతంత్రతను చెందినది (జులై 12, 1975); అంతట మాన్యుయెల్ పింటొ డి కోస్టా అనునతడు అధ్యక్షుగ స్వతంత్ర ప్రభుత్వము ఏర్పడినది.

**7. పరిపాలన:** దేశము కొలదికాలము క్రిందటనే స్వతంత్రతను చెందినందువలన, క్రొత్తగ రూపొందిన పరిపాలనా విధానపు వివరములు తెలియవచ్చుటలేదు; కాని దేశము ప్రజాస్వామిక గణరాజ్యముగ ఉండగలదని ప్రకటింపబడినది.

**8. దేశరక్షణ:** 1975 జులై వరకు పోర్చుగల్ దేశమే రక్షణ బాధ్యతను వహించినది. తరువాత జరిగిన ఏర్పాటులు తెలియవచ్చుటలేదు.

**9. అంతర్జాతీయ సం.:** పలు ప్రముఖ రాజ్యముల పరిగణన దేశమునకు, స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన తరువాత, లభించినది.

**10. ఆర్థిక రంగము:** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమే మూలాధారము. వ్యవసాయపు భూములలో అత్యధిక భాగము సుసంపన్నములగు కంపెనీల వశమునఉన్నది; దేశీయులలో కూలివారు ఎక్కువగ దొరకరు; కావున మొజాంబిక్‌నుండియు, అంగోలానుండియు కూలీలను తెచ్చి, వారి సాయమున ఈ భూములందు కంపెనీ యజమానులు పంటలను పండింతురు. రొక్కపు పంటలే ఎక్కువగ పండింపబడుచున్నవి; వానిలో కోకో అగ్రస్థానము వహించి ఉన్నది. తరువాత లెక్కకు వచ్చునది కొబ్బరి; క్వైనా తయారుచేయుటకు ఉపయోగించు

సింకోనా చెట్లు విరివిగ పెంచబడుచున్నవి. పైవాని ఉత్పత్తులలో దాదాపుగ అన్నియు విదేశములకు ఎగుమతి అగుచున్నవి. నూనెలు, సబ్బులు, సున్నము పరిశ్రమలవలన ఉత్పత్తి అగుచున్నవి. దేశమున విద్యుదుత్పత్తి 58 లక్షల కివా. ఎగుమతుల విలువ 2,48,939 కోం ; దిగుమతుల విలువ 1,82,527 కోం. (1968). సాలుసరి బడ్జెటరీ వ్యయము 1,75,330 కోం. (1970).

**11. సాంఘిక రంగము :** దేశమునందలి 44 ప్రయిమరీ పాఠశాలలలో 9,018 మంది, ఒక మాధ్యమిక పాఠశాలలలో 1,103 మంది, 4 సాంకేతిక పాఠశాలలలో 106 మంది, ఒక ఉన్నత పాఠశాలలో 360 మంది విద్యార్థులు కలరు (1970-71). సావో-టోమీలో ఒక గ్రంథాలయము ఉన్నది.

మలేరియాయు, పోషకాహార లోపమును ప్రజారోగ్యమునకు ముఖ్యావరోధములు. దేశమున 32 ఆసుపత్రులు ఉన్నవి; వైద్యసంఖ్య 20 (1967).

---

# 47. సియెర్రా లియోనీ

**ముఖ్యనగరము :** ఫ్రీటౌన్; **జెండా :** ఆకుపసిమి, తెలుపు, నీలం, అడ్డుచారలు వరుసగ పైనుండి అమరినది; **జాతీయ గీతము :** హై వుయ్




పటము 47.

ఎగ్జాల్ట్ దీ (నిన్నెంతో గౌరవింతుము...) **నాణెము :** లియోనీ; ఒక లియోనీ = రు. 9.00 ; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** మ. 12 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** పశ్చిమఆఫ్రికా తీరమున 6°55'–10° ఉ. అక్షాంశలమధ్యను, 10°16' – 13°18' పశ్చిమ తులాంశల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు తూర్పునను, ఉత్తరమునను గినీదేశము ఆగ్నేయమున లైబేరియా, నైరుతిన అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశపు ఉత్తర, దక్షిణముల గరిష్ఠపు నిడివి 320 కిమీ. తీరమునకు సమీపమున ఉన్న షెర్‌బో మొదలగు కొన్ని లంకలును ఈ దేశమున చేరియున్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 72,326 చ. కిమీ. దేశమున పశ్చిమపు కొననున్న భూభాగము, పర్వతమయము; ఇచ్చటి అత్యున్నత శిఖరపు ఎత్తు 880 మీ. వీనినే సియెర్రా లియోని (సింహగిరులు) అని పోర్చుగీజులు వ్యవహరించిరి. క్రమముగ ఆ పేరే దేశమునకు లభించినది. దేశమున పశ్చిమ ప్రాంతమున, ద్వీపకల్ప భాగము తప్ప, తక్కినది అంతయు చిత్తడి నేలగా నుండు తీరమైదానము;

ఈ మైదానపు వెడల్పు 96 కిమీ. నుండి 160 కి. మీ. వరకు మారుచుండును. ఇచ్చట ప్రవహించు నదులు కొంతవరకు నౌకాయానమునకు ఉపకరించుచున్నవి. తూర్పు, ఈశాన్య ప్రాంతములు పీఠభూమి. ఇచ్చటి శిఖరముల ఎత్తు కొన్ని చోట్ల 1825 మీ. వరకు ఉండును

**2. శీతోష్ణస్థితి మొ. :** సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా. తీరమున, అందును పర్వతములందు, వర్షపాతము 575 సెం. మీ. కు పైబడి యుండును. దేశమున పలుతావులందు వర్షపాతము 310 సెం. మీ. కు తగ్గదు. దేశపు భూతలమున 35%, - 45% గరికమైదానము; 20%, - 25% చిట్టడవి; 20% – 25% (ఆగ్నేయ ప్రాంతమున) అటవీ ప్రాంతము; 10% - 20% చిత్తడి నేల; 3% - 5% దట్టపు అడవి. మరకత కోకిల (ఎమెరాల్డ్ కుక్కూ) అనబడు పక్షి ఈ దేశమున మాత్రమే (ఆఫ్రికా ఖండమున) కన్పట్టుచున్నది.

**3. జనసంఖ్య మొ. :** 1969 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 25,10,000, జన సాంద్రత చ. కిమీ. కు 35. వివిధ ఆఫ్రికా జాతులు ఇందు చేరియున్నారు. అందు మెందీ జాతి (32%) అత్యధిక సంఖ్యాకులు. దేశపు నగరములలో ఫ్రీటౌన్ (జ. సం. 16,300), బో (35,000) గణనీయములు. దేశ ప్రజలలో పల్లె ప్రజలు 89%. మోడీ, టెమ్నీ అను ఆఫ్రికన్ భాషలకు దక్షిణ, ఉత్తరములందు, క్రమముగ విపులవ్యాప్తి యున్నను, 'క్రియో' అనబడు సంకరభాష వ్యవహార భాషగ ప్రజానీకమున ప్రచారమున ఉన్నది. ఈ భాషయందు ఆంగ్ల పదములును, పశ్చిమ ఆఫ్రికన్ భాషలలోని పదములును సంకరములై ఉన్నవి. అధికార పత్రములందు, ఆంగ్లభాష మాత్రమే ఉపయోగింపబడుచున్నది. దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు సాంప్రదాయిక ప్రకృతి దేవతారాధకులు; దాదాపు 8 లక్షల ముస్లిములును, 150 వేల క్రైస్తవులును కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున 137 పోస్టాఫీసులును, ఏజన్సీలును పనిచేయుచున్నవి. తంతి, టెలిఫోను సౌకర్యములు విరివిగ కలవు. దూరదేశములకు కేబుల్, రేడియో, టెలిఫోను సౌకర్యములు ఫ్రీటౌనున లభించుచున్నవి. ఫ్రీటౌనున ఒక రేడియో ప్రసార కేంద్రమును, టెలివిజన్ ప్రసార కేంద్రమును పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున 8260 కిమీ. నిడివిన రోడ్లు కలవు; ఇందు 896 కిమీ. పొడవున మాత్రము తారువేయబడినది. ఫ్రీటౌన్ వద్ద నున్న హార్బరు ప్రకృతిసిద్ధమైనది. ప్రపంచమునందలి ప్రశస్తతమపు హార్బరులలో ఇది ఒకటి. పెపెల్, బెన్‌తో షెర్‌బ్రో అను చిన్న రేవులును కలవు. 92 కిమీ. పొడవున మాత్రమే ఒక రైలు మార్గము కలదు. పెపెల్ రేవుకు గనులవద్దనుండి, ముడి ఇనుమును చేర్చుటకు ఇది ఉపయోగపడుచున్నది. ఫ్రీటౌనుననే అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. ఇచ్చటి నుండి పెక్కు విదేశములకు పయనింప వీలగుచున్నది. దేశపు వివిధ నగరముల మధ్య విమానయాన సౌకర్యములు కలవు.

**6. చరిత్ర :** 16వ శతాబ్ది మొదలుగ 19 వ శతాబ్ది వరకు, బానిసలుగ విక్రయించుటకై ఆఫ్రికా ప్రజలను సేకరించుటకు అనువైన భూమిగ, యూరపీయ వర్తకులకు ఈ దేశము ఉపకరించినది. యూరపియనులేకాదు, పరిసర ఆఫ్రికా దేశముల వారును, ఈ దేశ ప్రజలపైబడి బానిసలను పట్టుకొనిపోయి, దూరదేశములందు విక్రయించెడివారు. అట్టి పరిస్థితిలో బానిసల విమోచనకొరకై కృషిసాగించిన ఒక ప్రముఖుడు, గ్రాన్‌విల్లీ షార్ప్. విమోచనపొందిన బానిసలకు నివాసభూమిగ ఈ

ప్రాంతమున కొంతభాగమును రూపొందించుట సమంజసమని భావించి, 1787 లో అట్టి విముక్తబానిసల దళమును ఒక దానిని ఇటకుచేర్చి దీనికి ప్రావిన్స్ ఆఫ్ ఫ్రీడమ్ (స్వేచ్ఛా రాష్ట్రము) అని అతడు పేరిడెను. తరువాత కొందరు ఆఫ్రికన్ నాయకుల వద్దనుండి కొనుగోలు చేసిన కొంత భూమియు దీనికి కలిసెను. 1799 లో గ్రాన్‌విల్లీ షార్ప్ కృషి వలన, బ్రిటిష్ ప్రభుత్వము ఈ ప్రాంతమునకు రక్షణ కల్పించి, క్రమముగ 1808 లో మకుటపు వలస (క్రౌన్ కాలనీ) గ గ్రహించెను. 1870 లో బ్రిటిష్ పార్లమెంటు బానిసత్వమును రద్దుచేసిన తరువాత వివిధ దేశములనుండి, విముక్తులైన బానిసలు పలువురు ఇట చేరిరి. అంతట పరిసర ప్రాంతములను కొన్నింటిని బ్రిటిష్‌ప్రభుత్వము తన రక్షణ క్రిందికి గ్రహించి, అట చేరినవారికి వసతులను కల్పించినది (1896). ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, బ్రిటన్ క్రమక్రమమున, స్వతంత్ర పాలనను అంచెలద్వారా ఇట నెలకొల్పినది. కడకు ఏప్రిల్ 27. 1961 న దేశము స్వాతంత్ర్యమును ఆర్జించినది.

**7. పరిపాలన :** స్వాతంత్ర్యమును పొందిన తరువాత 1964 మొదలుగ ఈ దేశ ప్రభుత్వము పలు పరివర్తనలకు లోనైనది. కడకు 1971 లో ఈ దేశమున గణరాజ్య ప్రభుత్వము నెలకొల్పబడినది. వయోజన ఓటింగ్ పద్ధతిన ఎన్నికలు జరుగుచున్నవి. శాసన సభయందు 80 మంది ఎన్నుకోబడిన సభ్యులును, వివిధ జాతుల నాయకులు 12 మందియు సభ్యత్వము వహించియున్నారు. దేశాధ్యక్షుని ప్రజలే ఎన్నుకొనెదరు. కార్యనిర్వహణాధికారము అతనియందు న్యస్తమై యున్నది. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 1,560 మంది సైనికులుకల ఒక పదాతిదళము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా స. యందును, తదనుబంధ సంస్థలయందును, 1961 మొదలుగ ఈ దేశమునకు సభ్యత్వము కలదు. కామన్‌వెల్తునను ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయ, ఖనిజ పరిశ్రమలపై ఈ దేశపు ఆర్థికవ్యవస్థ ఆధారపడి ఉన్నది. వరి పంటలో తప్ప, తక్కిన ఆహారపు పంటలందు దేశము స్వయంపోషకము. తాళజాతి వృక్షముల ఫలసాయమున ఎక్కువ భాగము ఎగుమతి అగుచున్నది. తక్కిన ఎగుమతి పంటలలో, కోకో, అల్లము, అరటిపండ్లు క్రమముగ పేర్కొనదగినవి. ఖనిజములలో వజ్రములు, ముడిఇనుము, బాక్సైట్ ఎగుమతి అగుచున్నవి మొత్తపు ఎగుమతుల విలువ 8,20,68,109 లియోన్‌లు; దిగుమతుల విలువ 9,42,67,571 లియోన్‌లు (1971). విద్యుదుత్పత్తి 14.44 కోట్ల కిలోవాట్లు (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 582 లక్షల లియోనులు (1972-73).

**11. సాంఘిక రంగము:** దేశమున ఇండ్లు చాలవరకు కొయ్యతో నిర్మింపబడి ఉన్నవి. కాని క్రమముగ కాంక్రీట్‌తో నిర్మించుటకు కృషి జరుగుచున్నది. దేశమున 1,39,418 మంది విద్యార్థులుకల 914 ప్రయిమరీ పాఠశాలలును, 25,207 మంది చదివెడు 72 సెకండరీ పాఠశాలలును, రెండు సాంకేతిక విద్యా సంస్థలును కలవు (1968-69). సియెర్రా లియోనీ యూనివర్సిటీ అనబడు ఒక విశ్వవిద్యాలయము మాత్రమే ఉన్నది. దీనికి అనుబంధితములై రెండు కళాశాలలు పనిచేయుచున్నవి. ఆ విశ్వవిద్యాలయమున ఒక పెద్ద గ్రంథాలయమును ఫ్రీటౌను నగరమున ఒక మ్యూజియమును కలవు. ఆంగ్లభాషలో వెలువడు నాలుగు దినపత్రికలు కలవు. ఇవి అన్నియు ఫ్రీటౌన్ నుండియే ప్రచురితములు. దేశమున 21 ఆసుపత్రులు (శయ్యా సంఖ్య

1,068) ను 63 డిస్పెన్సరీలును పనిచేయుచున్నవి. వైద్య సంఖ్య 144. (16,000 మంది ప్రజలకు ఒక వైద్యుడు).

**12 యాత్రా సౌ.** : దేశమునందలి రమ్యము లగు సముద్రతీర భూములను, ప్రకృతి రమణీయ తను దర్శించుటకు పలువురు విదేశీయ యాత్రికులు వచ్చుచుందురు. ఇట్టి వారికై ఫ్రీటౌను నగరమున హోటళ్లు మొదలగు వసతులను ప్రభుత్వము ఏర్పాటు చేసినది.

**13. ప్రసిద్ధ పౌ.** : సర్‌మిల్టన్ ఆగస్టస్ స్ట్రీబీ మార్గయ్ (1895-1964). తొలుత వైద్యవృత్తిని గ్రహించి, క్రమముగ రాజకీయములలో ప్రవేశించి, తన ప్రజాసేవ వలన, ప్రజల మన్ననను ఆర్జించి, ఇతడు దేశపు ప్రథమ ప్రధానమంత్రి యయ్యెను. ఈతని మరణానంతరమున, చాలకాలము వరకు, దేశము కల్లోలముల పాలయ్యెను.

---

# 48. సుడాన్

**ముఖ్యనగరము** : ఖార్టూమ్; **జెండా** : ఎరుపు, తెలుపు, నలుపు అడ్డుచారలును, వీనిని ఆనుకొని దండమువద్దనుండి చొచ్చుకొనివచ్చు ఒక ఆకు




పటము 48.

పచ్చని త్రిభుజమును కలది జాతీయ **పతాకము**; **జాతీయ గీతము** : జుందీ అల్ అల్లా (పరమేశ్వ రుని సైనికులము); **నాణెము** : సుడానీజ్ పౌండ్; ఒక పౌండు నూరు పియాస్త్రరులు (కురుష్‌లు) గ విభక్తము. ఒక సు. పౌ. = రు. 21.52; **కొల తూకములు** : మెట్రిక్ విధానము సాధికార పరి గణను పొందియున్నను, బ్రిటిష్ కొలతూకములును పలుతావులందు వ్యాప్తిలో ఉన్నవి; **కాలగణన** : సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి మొ.** : ఆఫ్రికా ఖండపు రాజ్యము లందెల్ల విస్తృతియందు మిన్నయగు **సుడాన్** దేశము 3° - 23° ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 22° నుండి 39° తూ. తులారేఖలమధ్యను విస్త రించి ఉన్నది. ఉత్తరమున ఈజిప్ట్ దేశమును; తూర్పున ఎతియోపియాయును ఎర్రసముద్రమును; దక్షిణమున కెన్యా, ఉగాండా దేశములును జయిరే యును; పశ్చిమమున లిబియా, చాడ్, సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్ దేశములును ఈ దేశమునకు సరిహద్దులందున్నవి దేశపు మొత్తపు వైశాల్యము 25,05,813 చ. కిమీ. దేశమున అత్యధికభాగము చదునైన మైదానము; అయినను దేశపు టంచుల యందు కొన్ని పర్వత శ్రేణులు కలవు; వీనిలో దక్షిణమునఉన్న ఇమతాంగ్, నుబా శ్రేణులును,

పశ్చిమమునందలి జెబెల్ మర్రా శ్రేణియు, ఈశాన్యమునందలి ఎఱ్ఱసముద్ర తీరపర్వతములును పేర్కొనదగినవి. ఈ శ్రేణులలోని అత్యున్నత శిఖరపు ఎత్తు 3,500 మీ మాత్రమే. దేశపు నదీ ప్రవాహములలో ముఖ్యమైనది నైలునది. దేశమున ఉత్తర భాగము ఎడారి. పశ్చిమమున భూమి యంతయు ఇసుక పఱ్ఱ.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉత్తరపు ఎడారి ప్రాంతమునను, ఎఱ్ఱసముద్రపు తీరమునను సంవత్సరమున అత్యధిక కాలము ఎండ వేడిమి 100° ఫా. ను మించి ఉండును. దేశపు మధ్యభాగమునను, దక్షిణ భాగమునను, ఋతు విభజన కొంత క్రమరీతిలో కననగుచున్నది. దక్షిణమున ఉష్ణమండలపు అటవీభూమి కననగుచున్నను, అది క్రమమున మధ్యదేశమును చేరుసరికి పచ్చిగడ్డి మైదానముగ పరిణమించుచున్నది. దక్షిణము నుండి ఉత్తరమునకు పోవునపుడు సాలుసరి వర్షపాతము క్రమరీతిలో తగ్గుట కననగును. దక్షిణమున సరాసరిన సాలుసరి వర్షపాతము 117 సెం. మీ; ఉత్తరమున అది 10 సెం. మీ. ను మించదు. ఎఱ్ఱసముద్రపు తీరభూమియందు మాత్రము, దేశపు మొత్తము మీద సమశీతోష్ణ పరిస్థితులు కొంతవరకు కలవు. జంతుసంపద ఉత్తర ప్రాంతమున తక్కువ; దక్షిణ ప్రాంతమున జంతువులు ఎక్కువగనే కననగుచున్నను, అందును 'చీచీ' అను ఈగ యొక్క బెడదవలన కొన్ని ప్రాంతములందు జంతుసంపద అంతరించుచున్నది. మధ్య ఆఫ్రికాయందు సహజముగ ఉండు వన్యజంతువులే ఈ దేశమునను కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ. :** దేశపు మొత్తపు జనసంఖ్య 1,64,89,000 (1972). జనసాంద్రత చ. కిమీ. కు దాదాపు 6 మాత్రమే. దేశ ప్రజలలో 10% నగరములందు నివసించుచున్నారు. నగరములలో ఖార్టూమ్ (జ. సం. 2 80,431), ఓమ్‌డర్‌మన్ (జ. సం. 2,73,268), సుడాన్ పోర్ట్ (జ. స. 1,16,366) పేర్కొనదగినవి. దేశ ప్రజలలో అరబ్ జాతికి చెందినవారు 40%; నీగ్రోజాతికి చెందినవారు 20%; తక్కినవారు తదితర ఆఫ్రికన్ జాతులకు, ఆఫ్రికేతర జాతులకును చెందినవారు. దేశప్రజలలో 51% ప్రజలకు మాతృభాష అరబ్బీ; దక్షిణ సుడాన్‌లోని నీగ్రోజాతులలో 32 ఆఫ్రికన్ భాషలు, మాతృభాషలుగ, ప్రచారము నందున్నవి; అయినను ఆ ప్రాంతమున అనుసంధాన భాషగ ఇంగ్లీషు చాలవరకు వాడుకయందున్నది. 1970 మొదలుగ ఫ్రెంచి భాషకూడ బోధింపబడుచున్నది. దేశప్రజలలో 72% ఇస్లాము మతానుయాయులు, దాదాపుగ వీరందరును ఉత్తర ప్రాంతపు ఆరు రాష్ట్రములలో నివసించుచున్నారు. దక్షిణ ప్రాంతపు నీగ్రోలలో (27%) వివిధ సాంప్రదాయిక మతవిశ్వాసములు ఆదరింపబడుచున్నవి. దేశప్రజలలో 1% మాత్రమే క్రైస్తవులు. కొలదిగ అటనట హిందువులును, యూదులును కననగుదురు. హిందువులందరును, ఇటకు భారతదేశమునుండి వ్యాపారార్థమై వలస వచ్చినవారు.

**4. సమాచార సా. :** తంతి, తపాలా, రేడియో సౌకర్యములన్నియు ప్రభుత్వాధీనమున పనిచేయుచున్నవి. దేశమున తంతి-తపాలా ఆఫీసులు 129; రేడియో టెలిఫోన్ స్టేషనులు 99; వైర్‌లెస్ టెలిగ్రాఫ్ ఆఫీసులు 27 కలవు (1966). ఓమ్‌డర్‌మన్‌లో ఒక రేడియో స్టేషన్, ఒక టెలివిజన్ కేంద్రము పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున తగినంత రోడ్డు వసతి లేదు; ఉన్నరోడ్లు సైతము సరియైనవి కావు; వానకాలమున ఆ రోడ్లపై ప్రయాణముచేయుట దుస్సాధ్యము. ఇదికాక, అంతర్యుద్ధ కాలమున దక్షిణ దేశముననున్న రోడ్లున్ను, వంతెనలును

అధిక భాగము నాశనమైనవి. దేశపు మొత్తము మీద 'మోటారు ప్రయాణానికి తగిన' రోడ్ల నిడివి 48,000 కిమీ. గ లెక్కింపబడుచున్నను, అందు 312 కిమీ. మాత్రమే తారువేయబడినది. రైలు మార్గపు నిడివి 4,756 కిమీ. ఇందులో ముఖ్యమైన రైలుమార్గము ఈజిప్టు సరిహద్దునందలి వాదీహల్ఫా నుండి ఖార్టూమ్‌ద్వారా ఎల్ ఒబీద్‌కు పోవుచున్నది. దేశాంతర్గత జలమార్గముల నిడివి 4,068 కిమీ; సముద్రపు రేవులలో ప్రముఖమైనది పోర్ట్ సుడాన్. ఖార్టూమ్‌లోని విమానాశ్రయమునుండి, వివిధ ఆఫ్రికన్, అరబ్ దేశముల ముఖ్యనగరములకు విమాన యానవసతి కలదు; అంతర్జాతీయ విమానయానము చేయు విమానములు ఖార్టూమ్‌న ఆగుచున్నవి.

**6 చరిత్ర:** ఈ దేశపు చరిత్రలో తొలుత నుండియు ఉత్తర ప్రాంతమే ప్రముఖపాత్ర వహించి వ్యవహరించినది. దక్షిణదేశము అనాదిగ, ఆదిమ జాతుల నివాసభూమిగ ఉండి, ఇరువదవ శతాబ్దినుండి మాత్రమే చరిత్ర గతిలో సముచిత పాత్రను నిర్వర్తించుచున్నది. అతి ప్రాచీన కాలమున ఈజిప్ట్ పాలకుల అధీనమున ఈ దేశము చాలకాలము ఉండినది. ఆ కాలమున ఈ దేశము 'కుష్' అను పేరున వ్యవహరింపబడెడిది. కాని క్రీ. పూ. 750 నుండి క్రీ. శ. 300 వరకు ఈ దేశమును 'మెరోపీయ' అని అనబడు దేశీయ రాజవంశము సమర్థతతో పాలించినది. క్రీ. శ. 4 వ శతాబ్దిలో ఇట క్రైస్తవము తావు కల్పించుకొని కొన్ని క్రైస్తవ రాజ్యములు రూపొందినవి. క్రీ. శ. 7 వ శతాబ్దినుండి అరబ్బులు ఇట చేరి క్రమముగ ఇస్లామును వ్యాపింపజేసిరి. అంతట దేశము క్రీ. శ. 16 వ శతాబ్దిలో కొన్ని ముస్లిం రాజ్యములుగ విభక్తమై 'ఫుంజ్' అను నీగ్రో రాజవంశపు నామమాత్రపు ఆధిపత్యమునకు లోబడియుండినది. క్రీ. శ. 1820 లో తుర్కీ సామ్రాట్టునకు ప్రతినిధిగ ఈజిప్టును పాలించుచుండిన మహమ్మద్ అలీ, ఈ దేశమును వశపరచుకొని, దానిని తుర్కీ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను. కాని 1885 లో, ముస్లిం మతానుయాయులను ఉద్ధరించుటకై తాను వచ్చితినని చెప్పుకొనిన మహమ్మద్ అహమ్మద్ అనువాడు, ప్రజల అండతో తిరుగుబాటును లేవదీసి రాజ్యమును వశపరచుకొనినను, బ్రిటిష్ సేనలు వానిని జయించి దేశమున ఆంగ్లో-ఈజిప్షన్ ద్వంద్వాధిపత్యము అను పేరుతో, వాస్తవమున బ్రిటిషీ ఆధిపత్యమును నెలకొల్పినవి. 1955 లో సుడాన్ స్వతంత్రతను ఆర్జించినను, తదాదిగ పలు రాజకీయ పరివర్తనలకు లోనైనది. కడకు 1969 లో నెమెరీ సేనాని అధికారమును గ్రహించి 1972 లో సుస్థిరపరచుకొని, ఎన్నికలు జరిపి, అధ్యక్షుడు కాగలిగెను. దక్షిణ రాష్ట్రములు (నీగ్రోజాతులు వసించునవి) స్వయం పరిపాలనా ప్రతిపత్తితో మనునటుల అతడు ఒక ఒడంబడికను సాధించి దక్షిణ రాష్ట్రముల అసంతృప్తిని కొంతవరకు ఉపశమింపజేయగలిగెను.

**7. పరిపాలన:** దేశము ప్రస్తుతమున అధ్యక్ష పాలనలో ఉన్నది. అధ్యక్షుడగు నెమెరీయే ప్రధానిగ సైతము వ్యవహరించుచున్నాడు. సుడానీస్ సోషలిస్ట్ యూనియన్ అను ఒకే ఒక రాజకీయ పార్టీ దేశమున పనిచేయుచున్నది. దాని అధ్యక్షుడును నెమెరీయే. పరిపాలనా సౌకర్యార్థము దేశము 9 రాష్ట్రములుగ విభజింపబడి ఉన్నది. దేశమున స్వతంత్ర ప్రతిపత్తికల న్యాయశాఖ కలదు. ఇస్లామిక వ్యక్తిగత విషయముల నిర్ణయమునకై న్యాయశాఖలో అంతర్భాగముగ 'షరియా శాఖ' పనిచేయుచున్నది.

**8. దేశరక్షణ:** దేశ ప్రభుత్వపు అధీనమున 18 పటాలముల పదాతిదళమును, ఒక కవచ దళమును, రెండు ఆయుధ దళములును, కొలది యుద్ధనౌకలుగల నౌకాదళమును, సోవియట్ ప్రభుత్వ

సాయమున నిర్మితమగుచున్న ఒక విమానదళమును కలవు. విమానదళ యోధుల సంఖ్య దాదాపు 700.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధ సంస్థలు అన్నింటను సుడాన్‌కు సభ్యత్వము కలదు. అరబ్‌లీగులోకూడ సుడాన్ సభ్యరాజ్యము. ప్రపంచ రాజ్యములలో ప్రముఖములగు అన్నింటితోడను సుడాన్‌కు దౌత్య సంబంధములు కలవు. ఇజ్రాయెల్‌తో మాత్రము దౌత్య సంబంధములు లేవు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక ప్రతిపత్తికి వ్యవసాయమే ముఖ్యాధారము. ఆహార ధాన్యములలో పేర్కొనదగినవి సజ్జ, జొన్న, గోధుమ, బార్లీ, కొన్ని రకముల పప్పుధాన్యములు. ఇవి దేశావసరములకు సరిపోవుచున్నవి. రొక్కపు పంటలలో అత్యంత ప్రముఖము ప్రత్తిపంట. పొడుగుపీచు ప్రత్తిలోను, పొట్టిపీచు ప్రత్తిలోను, ఉత్తమ శ్రేణికి చెందినవి ఈ దేశమున ఉత్పత్తి యగుచున్నవి. దేశపు ఎగుమతుల ఆదాయమున దాదాపు 60% ప్రత్తివలననే ఈ దేశమునకు లభించుచున్నది. 1969-70 లో మొత్తముమీద 7,72,000 బేళ్ళ ప్రత్తి ఎగుమతి అయినది. దేశమున 25,09,800 చ. కిమీ. విస్తీర్ణముగల వివిధ రీతుల అటవీ ప్రాంతము కలదు. ఇందు టేకు అడవులు విస్తృతముగ కలవు. దేశావసరములకు సరిపోవు కలప ఇందువలన లభించుచున్నది. ఈ అడవులలోని ఒక జాతి తుమ్మచెట్లనుండి తుమ్మ బంక విరివిగ లభించుచున్నది. ప్రపంచమున వాడబడుచున్న తుమ్మబంకలో 95% అనగా 50,000 టన్నులను ఈ దేశము సాలీనా ఎగుమతి చేయుచున్నది. ఎగుమతి సరకులలో ప్రత్తి తరువాత పేర్కొనదగినది, ఈ తుమ్మబంకయే. దేశమున బంగారము, ఇనుము, తుత్తునాగము మొదలగునవి అటనట లభ్యములగునని తెలియుచున్నను, వానిని వెలికిదీయు కృషి ఎక్కువగ జరుగుటలేదు. ప్రాచీన కాలమున ఈ దేశము ఇనుప పరిశ్రమకు పేరొందినది. ఆధునిక కాలమున 1965 లో మాత్రమే ఈ పరిశ్రమ సంస్థాపితమై కొలది మొత్తములలో ముడిఇనుము ఎగుమతి యగుచున్నది. 1972 లో దేశపు ఎగుమతుల విలువ 1,012 లక్షల సు. పౌ. లు; దిగుమతులు 1,082 లక్షల సు. పౌలు. దేశమును ప్రణాళికల ననుసరించి అభివృద్ధిపరచుటకు కృషి జరుగుచున్నది. 1961-71 వరకు ఒక పదిఏండ్ల ప్రణాళిక సాగినది; 1971-75 వరకు అయిదేండ్ల ప్రణాళిక ఒకటి అమలున ఉండినది. ఈ ప్రణాళికల వ్యయమునకై 1967 నుండి అరబ్ దేశములవలన విరివిగ ఈ దేశమునకు ధనసాహాయ్యము లభించుచున్నది. జాతీయోత్పత్తిని సాలీనా 7.6% చొప్పున అభివృద్ధి చేయుట ఈ ప్రణాళికల లక్ష్యము. అయినను ఈ ప్రణాళికలు సాధించిన ఫలితములనుగురించి సరియైన సంఖ్యా వివరములు లభ్యములగుటలేదు. దేశమున విద్యుదుత్పత్తి 31 కోట్ల కిలోవాట్లు (1969). 1960 లో ప్రభుత్వముచేత స్థాపింపబడిన సుడాన్ బ్యాంకు అనునదియే దేశపు ఆర్థిక వ్యవహారములకు మూలాధారము. దీనికి అనుబంధితములై వ్యవసాయ బ్యాంకు మొదలగునవి పనిచేయుచున్నవి. ఇవిగాక కొన్ని విదేశీయ బ్యాంకుల శాఖలును దేశమున, ప్రభుత్వ పర్యవేక్షణకు లోబడి, వ్యవహరించుచున్నవి. దేశపు బడ్జెటరీ వ్యయము 2,171 లక్షల సు. పౌనులు; మిగులుదల 37 సు. పౌనులు (1972-73).

**11. సాంఘిక రంగము :** దేశపు పురుషులందు 25%, స్త్రీలలో 5% మాత్రమే అక్షరాస్యులు. పాఠశాలలను, దాదాపుగ అన్నింటిని, ప్రభుత్వమే నిర్వహించుచున్నది. దేశమున అన్నివిధముల పాఠశాలలయందును చేరి 8,14,327 విద్యార్థులు పఠించుచుండిరి. ఉపాధ్యాయ సంఖ్య 28,080

(1969). ఖార్టూమ్‌న 1956లో ఒక విశ్వవిద్యాలయం నెలకొల్పబడినది (విద్యార్థులు 8,740). ఇది గాక కెయిరో విశ్వవిద్యాలయపు శాఖ ఒకటియు, ఓమ్‌డర్‌మన్ మత విద్యాపీఠమును దేశమున కలవు. వీనిలో తొలుతటిదానియందు 3,250 మందియు, రెండవదానియందు 500 మందియు విద్యార్థులు కలరు. దేశమునందలి ప్రముఖ గ్రంథాలయం ఖార్టూమ్ విశ్వవిద్యాలయమున కలదు. (సంపుటములు 70 వేలు). ఖార్టూమ్‌లోను మేరోలోను ప్రాచీన నాగరికతా విశేషముల మ్యూజియములు కలవు. దేశమున అత్యధిక భాగము పల్లె ప్రాంత మగుటవలన, ఆధునిక రీతిలో సాంఘిక సంసేవా కార్యక్రమములు, ఏవియు, అట వ్యాపింప కున్నవి. కొలది పట్టణములందు మాత్రమే అట్టి వసతులు కలవు గృహనిర్మాణమునకై కొలదిగ నిధులు ప్రత్యేకింపబడినను అవి ఏ కొలదిమందికో మాత్రమే సరిపోవుచున్నవి. ఖార్టూమ్ నగరమున మాత్రము ఆధునిక నివాసగృహములు చాల కలవు. అయినను దేశపు మొత్తముమీద ఆరోగ్యవసతులు చక్కగ ఉండుటకు ఈ శతాబ్ది తొలుతటి పాదము నుండియు కృషి జరిగినది. మలేరియా మొదలగు జాడ్యములు చాలవరకు నిర్మూలితములైనవి. వైద్య సదుపాయములను ఉచితముగ ప్రజలకు ప్రభుత్వము చేకూర్చుచున్నది. దేశపు మొత్తమున 13,439 శయ్యాసంఖ్యకల 72 ఆసుపత్రులు పనిచేయుచున్నవి (1969).

**12. యాత్రా సౌ. :** దేశమునందలి కీకారణ్యములలో వేటాడుటకును, ప్రకృతి సౌందర్యమును దర్శించుటకును, ప్రాచీన మేరో నాగరికతా శిథిలములను దర్శించుటకును, విదేశీయులు పలువురు దేశమును దర్శించుచుందురు. వీరికి సౌకర్యములను కలిగించుటకై పలువిధముల హోటళ్ళును, యాత్రా సంస్థలును పనిచేయుచున్నవి. వీసా, ప్యాస్‌పోర్టులు, మశూచి మొదలగు వానికి సంబంధించిన సర్టిఫికెట్లును యాత్రికులకు ఉండితీరవలయును.

**13. ప్రసిద్ధ పౌరులు :** ఆధునిక యుగమున ప్రపంచ ప్రసిద్ధిని పొందిన సుడానీయులలో ప్రముఖుడుగ పేర్కొనదగినవాడు మహమ్మద్ అహమ్మద్ బిన్ అబ్దుల్లా (1843-85). ఈతనికే 'మహదీ' అను ఉపనామము కలదు. ఇస్లామును ప్రపంచ వ్యాప్తముగ చేయుటకు 'మహదీ' ఒకడు జన్మించనున్నాడని సంప్రదాయానుయాయులగు ముస్లిముల విశ్వాసము. అట్టి 'మహదీ'ని తానేనని ప్రకటించుకొని సుడానీయుల ఆదరణను ఆర్జించి వారిని సమాయత్తపరచి బ్రిటిష్ సామ్రాజ్య ప్రభుత్వమును ఎదిర్చి పోరాడిన వీరుడితడు. ఇతనిని, ఇతని అనంతరమున ఇతని అనుచరులను బ్రిటిష్ వారు అంతరింపజేసినను, ఓమ్‌డర్‌మన్‌లో ఉన్న ఇతని గోరీని, ఈనాడును సుడానీయులు జాతీయ ఆలయముగ భావింతురు.

---

# 49. సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్

**ముఖ్యనగరము :** బంగ్వి; **జెండా :** నీలి, తెలుపు, ఆకుపసుపు, పసిమిరంగుల అడ్డుచారలును, వానికి అడ్డుగ ఎర్రని నిలువు చారయు, ఎడమవైపు పై భాగపు మూలన పసుపురంగున, అయిదు కోణముల నక్షత్రమును కలది; **జాతీయ గీతము :** 'లా రినై జాన్స్...' అను పేరుకలిగి 'బంటూల

జన్మభూమియగు దేశమా' అను అర్థము కల చరణముతో మొదలిడునది; **నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఎ ); మారకం విలువ అనిశ్చితము 100 సి. ఎఫ్. ఎ. ఫ్రాంకులు = రు. 2.60; **కొలతతూకములు :** మెట్రిక్ పద్ధతివి. **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. ౫ గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికా మధ్య భూభాగమున 2°16′ – 11°2′ ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 12°20′ – 27°45′ తూ. తులారేఖల




పటము 4౨.

మధ్యను విస్తరిల్లిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున చాడ్; తూర్పున సుడాన్; దక్షిణమున జయిరే, కాంగో; పశ్చిమమున కామెరూన్ దేశము సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 6,17,000 చ. కిమీ. దేశపు ఉపరితలము చాల వరకు ఎగుడు దిగుడుగ ఉండును; ఈశాన్య భాగమునందలి ఫెర్టిట్ పర్వత శ్రేణిలో అత్యున్నత శిఖరపు ఎత్తు 1,280 మీటర్లు; ఉత్తరమునఉన్న అవందాజాలే కొండలలో ఉన్నత శిఖరపు ఎత్తు 1,140 మీ. షరీ, ఉబాంగీ అనునవి దేశపు నదులలో ప్రముఖములు; అందు రెండవది కాంగోనదికి ఉపనది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశము ఉష్ణమండలమున ఉన్నందున, అందులకు అనుగుణమగు శీతోష్ణ పరిస్థితియే దేశమున కననగుచున్నది. వానల ఋతువున కొన్ని ప్రాంతములందు తుఫాను లెక్కువ; అయినను దేశమున అత్యధిక భాగమున, అందును తూర్పు, ఈశాన్య ప్రాంతములందు, వర్షపాతము చాల తక్కువ. దక్షిణ దేశమున దట్టపు అడవులు కలవు; ఇందలి కొన్ని వృక్షముల ఎత్తు 45 మీటర్లు. ఉష్ణమండలములందు సామాన్యముగ కననగు ఏనుగులు మొదలగు వన్యజంతువులు ఈ అడవులలో విస్తారముగ కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 15,18,000 (1969); ఏడాదికి 2.6% చొప్పున ఈ జనసంఖ్య పెరుగుచున్నటుల అంచనా; చ. కిమీ. కు జనసాంద్రత 2.7. దేశ జనులలో 85% ప్రజలు పల్లెపట్టులలో నివసించుచున్నారు. ముఖ్యనగరమగు బంగ్వీలోని జనసంఖ్య 1,50,000. ఆఫ్రికాలోని పెక్కు ఆదిమజాతుల ప్రజలు దేశమున విరివిగ కలరు; తత్ఫలితముగ వేర్వేరు ఆఫ్రికన్ భాషలు వివిధ ప్రాంతములందు వాడుకలో ఉన్నవి. అయినను ఫ్రెంచి భాషయే వ్యవహార భాషగను, బోధనా భాషగను వాడుకలో ఉన్నది. దేశపు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు; ఉత్తరమున, చాడ్ దేశపు సరిహద్దు ప్రాంతమున దాదాపు 50 వేల ముస్లిములు కలరు. క్రైస్తవుల సంఖ్య దాదాపు 2,76,000.

**4. సమాచార సౌ. :** ప్రభుత్వాధీనమున పని చేయు, రేడియో, తంతి సౌకర్యములు కలవు. బంగ్వీనుండి పారిస్ నగరమునకు రేడియో తంతి సదుపాయము కలదు; దేశమున టెలిఫోనుల సంఖ్య 2,800. బంగ్వీలో, ఒక రేడియో స్టేషన్ పని చేయుచున్నది.

**5. యాన సౌ. :** దేశమునందలి వివిధ ముఖ్య ప్రాంతములను ముఖ్యనగరములతో కలుపు రోడ్లు దేశమున కలవు; అట్టి రోడ్ల మొత్తపు నిడివి

19,200 కిమీ; ఇందులో నాల్గవ భాగము మాత్రమే ఉత్తమ స్థాయికి చెందినది. దేశమున రైలు మార్గములు లేవు; విమానయానమునకు ఉపకరించు విమానాశ్రయములు దేశమున బంగ్వీ, బెర్‌బెరాతీ, బవర్ అను చోటులందు ఉన్నవి.

**6. చరిత్ర:** 19 వ శతాబ్ది అంతమున ఫ్రెంచివారు ఇట కాలిడువరకు, ఈ దేశమున జరిగిన చారిత్రక సంఘటనలు ఏవియు తెలియవచ్చుటలేదు. తక్కిన యూరపియన్ రాజ్యములతో తమకు అంతటంతట జరిగిన ఒడంబడికలను అనుసరించి, ఫ్రెంచివారు ఈ దేశమునకు సరిహద్దులను ఏర్పరచి 'ఉబాంగీ - షరీ' అను పేరున దీనిని తమ విశాల ఆఫ్రికన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి. 1958 లో ఫ్రెంచి కమ్యూనిటీలో అంతర్భాగముగ ఈ దేశము స్వతంత్రతను ఆర్జించి, 1960 లో సర్వ స్వతంత్ర గణరాజ్యమయ్యెను. 1966, జనవరి 1 న సైనికవర్గము అప్పటి ప్రభుత్వమును కూలద్రోసి అధికారమును చేపట్టినది.

**7. పరిపాలన:** దేశమున సైనికవర్గపు ఆమోదముతో అధ్యక్షుడు ప్రభుత్వమును నిర్వహించుచున్నాడు. శాసనసభ ఎట్టిదియు లేకుండ అధ్యక్షుని ఫర్మానాలద్వారా పరిపాలన సాగింపబడుచున్నది. రాజకీయ పక్షములు నిషిద్ధములు.

**8. దేశరక్షణ:** దేశమునకు 2,800 మంది గల రెండు పటాలముల సైనిక బలము కలదు.

**9. అంతర్జాతీయ సం.:** 1960 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. చాద్, కాంగో, గేబన్‌లతో సుంకములకు సంబంధించిన ఒడంబడిక ఈ దేశమునకు కలదు; తత్ఫలితముగ ఆర్థిక వ్యవహారములందు ఈ నాలుగు రాజ్యములును ఒకే ప్రాంతముగ వ్యవహరింప గలుగుచున్నవి.

**10. ఆర్థిక రంగము:** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమును, పశుపోషణయు ముఖ్యాధారములు దేశపు రొక్కపు పంటలలో ప్రత్తి, కాఫీ ప్రముఖములు. ఆహారపు పంటలలో, సజ్జ, జొన్న, మొక్కజొన్న, చిరుగడదుంపలు ప్రముఖములు. అరటిపండ్లును, నిమ్మజాతి పండ్లును కూడ విరివిగ పండును. పశుసంపద విరివిగ కలదు; దేశమున 'చీ - చీ' అను ఒక ఈగచేత సంక్రమించు ఒక రోగమువలన పశుసంపద విరివిగ నష్టమగుచున్నను, ఆ రోగపు వ్యాప్తిని నిరోధించి పశుసంపదను ఎక్కువ చేయుటకు కృషి జరుగుచున్నది. దేశపు ఎగుమతులలో దాదాపు మూడవ భాగపు ఆదాయము వ్యావసాయిక వస్తువుల వలనను, పశువుల ఎగుమతి వలనను లభించుచున్నది. దేశమున ఖనిజ పరిశ్రమలలో అత్యంత ప్రముఖమైనది వజ్రసేకరణ. ఎగుమతుల ఆదాయమున సగభాగము వజ్రములవలన లభించుచున్నది. విద్యుదుత్పత్తి 246 లక్షల కి.వా. (1966). ఎగుమతుల విలువ 881.6 కోట్ల, ఫ్రాంకులు; దిగుమతుల విలువయు అంతియే (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 1253.93 కోట్ల ఫ్రాంకులు.

**11. సాంఘిక రంగము:** ఫ్రాన్స్ దేశపు విద్యా విధానమే ఈ దేశమున, కొలది స్థానికపు మార్పులతో, అమలునందున్నది. దేశమున కొన్ని ప్రాంతములందు అక్షరాస్యత 30% వరకు ఉన్నను, కొన్ని మారుమూల ప్రాంతములందు 23% ను మించకున్నది. నిధుల కొరతయు, ఉపాధ్యాయులు తగినంతమంది లేకుండుటయు విద్యావ్యాప్తికి ముఖ్యావరోధములు. ప్రైమరీ పాఠశాలలలో 1,53,324 మంది విద్యార్థులును, సెకండరీ పాఠశాలలలో 6,424 మందియు పఠించుచున్నారు (1967). ఉన్నత విద్యకై విద్యార్థులు ఫ్రాన్స్ దేశమునకు సాధారణముగ పోవుచుందురు. అట్టివారి సంఖ్య 540 (1967). బంగ్వీలో ఒక ఫ్రెంచి

దినపత్రిక కలదు. దేశమున 50 ఆసుపత్రులును, కొన్ని చిన్న వైద్యశాలలును కలవు; వానియందలి శయ్యా సంఖ్య 2,637 (1960). మొత్తముమీద దేశీయులలో 37,410 మందికి ఒక వైద్యుడు కలడని చెప్పవచ్చును. శిశు మరణసంఖ్య 1,000 పుట్టుకలకు 190.

**12. యాత్రా సౌ :** దేశపు అడవులను, అందలి ప్రకృతి సంపదను దర్శించుటకు, అందు వేటాడుటకు, విదేశీయులు పలువురు దేశమును దర్శించుచుందురు. యాత్రికుల సంఖ్యకు తగినంతగ నివాస సౌకర్యములు ప్రస్తుతమున లేవు.

**13. ప్రసిద్ధ పౌరులు :** బర్తెలోమీ బొగాండా (1910-59) ఈ దేశపు స్వాతంత్ర్యమునకై కృషి చేసిన వారితో ప్రముఖుడు.

---

# 50. సెనెగల్

**ముఖ్యనగరము :** డాకర్; **జెండా :** దండము కడనుండి నిలువున వరుసగ ఆకుపసిమి, పసుపు ఎరుపుచారలు కలిగి. నడిమిచారకు మధ్యన ఆకుపచ్చ నక్షత్రము కలిగినది; **జాతీయ గీతము :** పిన్సెజ్, తాస్...(మ్రోగింపుడు వాద్యములను...);




పటము 50.

**నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఏ.), అట్టి 100 ఫ్రాంకులు = రూ. 2.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలపరిగణన :** ఉ. 12 గం. = సా. 5-30 గం. భారతదేశమున.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికాఖండపు పశ్చిమ తీరమున 12°-17° ఉ. అక్షాంశ రేఖలమధ్యను, 11°-10° పశ్చిమ తులారేఖల మధ్యను, విస్తరించి యున్న ఈ దేశమునకు ఉత్తరమున మారిటేనియా; తూర్పున మాలీ; దక్షిణమున గినీ, గినీ-బిస్సావ్; పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 1,97,161 చ. కిమీ. తీరప్రాంతమున కొంతవరకు ఇసుకతిన్నెలు, మరి కొంతవరకు పంకమయములగు నదీముఖద్వారములు; తీరప్రాంతమునకు తూర్పున ఉత్తరమునుండి సెనెగల్ నదివరకు ఇసుక మైదానము; దక్షిణమున పల్లపుప్రాంతము; ఆగ్నేయమున ఫూటా జల్లాన్ పర్వతముల దిగువ గుట్టలు కననగును. ఈ గుట్టలలో అత్యున్నతపు ఎత్తు 488 మీ. సెనెగల్, సాలూమ్, గాంబియా, కాసామన్సీ అనునవి ముఖ్యములగు నదులు. ఇవి అన్నియు తూర్పు నుండి పడమరకు ప్రవహించును.

**2. శీతోష్ణస్థితి మొ. :** శీతోష్ణస్థితులందు వివిధ ప్రాంతములమధ్య వ్యత్యస్తత ఎక్కువ. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత ప్రదేశములను అనుసరించి 75° నుండి 100° ఫా. వరకు మారుచుండును. వర్ష

పాతమునకూడ వ్యత్యస్తతలు ఎక్కువ. కాసామన్‌సీ ప్రాంతమున వర్షపాతము, సాలీనా సరాసరిన 200 సె. మీ; ఉత్తరదేశమున వర్షపాతము 50 సె. మీ. ఇక తూర్పుప్రాంతమున సాధారణముగ, ఎండ కాలమున, నీరే దొరుకదు. దేశమున అత్యధిక భాగము పచ్చిక బయలుల చిట్టడవి. వర్షపాతము ఎక్కువగ ఉన్న స్థలములందు, కొన్ని అడవులు కలవు. అయినను పెద్దజాతి వృక్షములు తక్కువ. ఈశాన్యప్రాంతపు అడవులలో అటనట సింహము, చిరుత కననగును.

**3. జనసంఖ్య మొ.:** 1971 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 38 లక్షలు. నగరములలో డాకర్ (జ. సం, 5,81,000), కవోలాక్ (96,238), తీయిస్ (90,456) పేర్కొనదగినవి. వివిధ ఆఫ్రికన్ జాతులు ఇందు చేరియున్నను, ఔలోఫ్ తెగవారు, ఎక్కువగ కననగుదురు. వారి జనసంఖ్య 7 లక్షలు. వివిధ ఆఫ్రికన్ భాషలు ప్రచారమున కలవు. కాని ఫ్రెంచిభాషయే అధికార భాషగ ఎల్లెడల వాడుక యందున్నది. ఆఫ్రికన్ భాషలలో వోలోఫ్‌భాషకు, క్రమక్రమమున ప్రచారము పెరుగుచున్నది. దేశవాసులలో 75% ముస్లిములు, తక్కినవారు ప్రకృతి దేవతారాధకులు

**4. సమాచార సా.:** దేశమున 74 పోస్టాఫీసులు కలవు. ఫ్రెంచి ప్రభుత్వపు కేబుల్ మార్గమువలన డాకరుకు కాసాబ్లాంకా, కోనార్కి మొదలగువానితోను, బ్రిటిష్ ప్రభుత్వపు కేబుల్ మార్గమువలన, బ్రిటిష్‌వారి అధీనమున ఇదివరలో ఉండిన ఆఫ్రికన్ రాజ్యములతోను వార్తాసౌకర్యము కలదు. దేశమున వివిధ ప్రాంతముల మధ్య టెలిఫోను వసతి ఏర్పడియున్నది. డాకరున రేడియో ప్రసార కేంద్రమును, టెలివిజన్ ప్రసార కేంద్రమును పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 10,800 కిమీ. ఇందు దాదాపు 1600 కిమీ. మాత్రమే మేలిరకమునకు చెందినది (1969). 1304 కిమీ. నిడివిగల రైలుమార్గము కలదు, డాకరునందలి హార్బరు ఆఫ్రికాఖండపు హార్బరులలో ప్రముఖములగు వానిలో ఒకటి. డాకరునందలి యోఫ్ అంతర్జాతీయ విమానాశ్రయము నుండి పలువిదేశములకు విమానయాన సౌకర్యము కలదు. దేశమునందలి ప్రముఖనగరముల మధ్య విమానయానపు వసతులు ఏర్పడి ఉన్నవి.

**6. చరిత్ర:** 16వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్ర వివరముగ తెలియవచ్చుటలేదు. పశ్చిమ ఆఫ్రికాలో మధ్యయుగమున, అంతటంతట రూపుగొనిన తేగ్రూర్, ఘానా, మాలీ సామ్రాజ్యములలో ఈ దేశమునందలి కొన్ని భాగములు చేరియుండినటుల మాత్రము తెలియవచ్చుచున్నది. 15వ శతాబ్ది మధ్యమున పోర్చుగీజు నావికులు, కేప్ వర్డీ ప్రాంతమున, కాలిడినది మొదలుగ యూరపీయులకు ఈ ప్రాంతము పరిచితము అగుట మొదలైనది. 17వ శతాబ్ది ఉత్తరార్ధము మొదలుగ 18వ శతాబ్ది అంతమువరకు ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును పోటీపడి పశ్చిమాఫ్రికాను ఆక్రమించుటకు సాగించిన పోరాటములలో ఈ దేశమున పెక్కుప్రాంతములు చేతులు మారినవి. కడకు 1815 లో ఫ్రెంచివారికి ఈ దేశము లభించినది. 1902 లో సెనెగల్‌ను, తక్కిన ఫ్రెంచి ఆక్రమిత ప్రాంతములను వేరుపరచి, ఫ్రెంచివారు ఆ దేశమునకు ప్రత్యేక ప్రతిపత్తిని కల్పించి పాలించిరి. 1958 లో ఈ దేశము స్వతంత్రతను ఆర్జించి ఐచ్ఛికముగ ఫ్రెంచి కమ్యూనిటీలో ఉండుటకు అంగీకరించినది. 1960 లో మాలీ, దహోమీలతోకలసి, మాలీ ఫెడరేషనున ఈ దేశము చేరినను, త్వరలోనే, వైరుధ్యములు ఏర్పడుటవలన అందుండి వైదొలగినది.

**7. పరిపాలన :** 1970 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి పాలన నిర్వహింపబడుచున్నది. సార్వజనిక వయోజన వోటింగు పద్ధతిన దేశాధ్యక్షుడును, జాతీయ సభ యందలి 80 మంది ప్రతినిధులును అయిదేండ్ల కొక సారి ఎన్నుకొనబడెదరు. అధ్యక్షుడే ప్రధానిని నియమించును. శాసనసభ ఆమోదించిన బిల్లును అధ్యక్షుడు నిరాకరించి తిరిగి చర్చింపగోరిన సందర్భమున, మరల అయిదింట మూడు వంతుల సభ్యులు దానిని అమోదించిన పుడు మాత్రమే అది చట్టమగును. హైకోర్టు జడ్జీలను మొత్తం 16 మందిని శాసనసభచే ఎన్నుకొనును. వీరి ఆధ్వర్యమున దేశమున న్యాయస్థానములు పనిచేయును దేశమున పలురాజకీయ పక్షములు ఉన్నను. ప్రగతి వాద సెనెగలీయ పక్షము (యూనియన్ ప్రొగ్రెసివ్ సెనెగలీస్) మాత్రమే అధికారమును తన వశమున 1958 మొదలుగ ఉంచుకొన గలిగినది. దేశమున స్థానిక పరిపాలనను ప్రభుత్వోద్యోగులే నిర్వహించు చున్నారు.

**8. దేశరక్షణ :** కవచశకటయుత పదాతి దళములు నాలుగు కలవు. అందలి సైనికసంఖ్య 5,000. 200 మంది యోధులుకల వైమానికదళ మును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1960 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలు పెక్కింటను, పశ్చిమాఫ్రికా శుల్క సమ్మేళ నమునను, ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయమును, పశుపోషణయు దేశపు ఆర్థికవ్యవస్థకు ముఖ్యాధార ములు. వ్యవసాయమున ఉన్న భూమిలో 45% వేరుశనగ పంటకు వినియుక్తము. తరువాత చెప్పుకొనదగినవి చెరకు, ప్రత్తి. దేశపు ఎగుమతుల విలువలో 75% వేరుశనగవలన లభించుచున్నది. ఆహారవస్తువులను ఈ దేశము కొంతవరకు, దిగుమతి చేసికొనుచున్నది. అల్యూమినియమ్. ఫాస్ఫేటు గనులు విరివిగ ఉన్నటుల తెలియవచ్చుచున్నది. కాని ఉత్పత్తి 1965 నుండి మాత్రమే మొదలైనది. దేశపు ఎగుమతుల విలువ 4,218 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 5,855.8 కోట్ల ఫ్రాంకులు (1970). చెల్లింపుల లోటును ఫ్రెంచి ప్రభుత్వపు సాయమున దేశము పూరించుకొన గలుగుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 21 6 కోట్ల కిలోవాట్లు. (1969). దేశపు బడ్జెటరీ వ్యయము 5,704 కోట్ల ఫ్రాంకులు (1971–72).

**11. సాంఘిక రంగము :** డాకరు నగరమున గృహనిర్మాణరీతి యూరపులోని నగరములను గుర్తునకు తెచ్చును; కాని పల్లెపట్టులందు పూరిగుడి సెలే ఇప్పటికిని ఎక్కువగ కననగును. దేశమున ప్రయిమరీ తరగతులలో 2,57,708 మందియు, సెకండరీ పాఠశాలలో 49,526 మందియు విద్యార్థులు పఠించుచున్నారు (1970) డాకరులోని విశ్వవిద్యాలయమున వివిధ విద్యాశాఖలందు ఉన్నత విద్య లభించుచున్నది. ఇందలి విద్యార్థి సంఖ్య 5,561 (1972). ఇందు విదేశీయ విద్యార్థులును, పలువురు విద్యను అభ్యసించుచున్నారు. డాకరున ఒక పెద్ద మ్యూజియమును, ప్రముఖ గ్రంథాలయ మును కలవు. పత్రికా ప్రచారము మాత్రము చాల తక్కువ. రెండు దినపత్రికలు మాత్రము వ్యాప్తిలో ఉన్నవి. దేశమున ఉత్తమశ్రేణి ఆసుపత్రులు 5, తక్కువిధముల ఆసుపత్రులు 4, వైద్యసహాయ కేంద్రములు 42 పనిచేయుచున్నవి. 1968 లెక్కలను అనుసరించి దేశమున వైద్యసంఖ్య 217 (అనగా 17,000 మందికి ఒక వైద్యుడు).

**12. విలాస యాత్రా సౌ. :** దేశమునందలి హాయిగొలుపు శీతోష్ణస్థితి సాంస్కృతిక కార్యక్రమ ములు పశ్చిమ ఆఫ్రికా ప్రజలలో పెక్కురను ఆకర్షింప కలుగుచున్నవి. యాత్రికులకు చక్కని

సౌకర్యములను, ఒక ప్రత్యేక ప్రభుత్వశాఖద్వారా ప్రభుత్వము కల్పించుచున్నది.

**13. ప్రముఖ పౌరులు :** బ్లయసే డయానే (1872–1934); ఫ్రెంచిపార్లమెంటునకు ఎన్నుకొనబడిన తొలుతటి నీగ్రో; ఆఫ్రికాఖండము నందలి పలుదేశముల స్వాతంత్రోద్యమములకు, ఇతడు మూలపూరుషుడు. సెనెగల్ దేశపు ప్రస్తుతాధ్యక్షుడు లియోపాల్ట్ సీదర్ సెన్‌ఘోర్ (జననము 1906) : ఫ్రెంచిభాషా కవిగ ప్రశస్తిని పొందినవాడు ద్రావిడ భాషలకు నీగ్రో భాషలతో కనిపట్టు సామ్యమును పరిశోధించుటకై, ఈతడు డాకరున ఒక అన్వేషణా కేంద్రమును నెలకొల్పజేసెను.

---

# 51. సోమాలియా

**ముఖ్యనగరము :** మొగదీషు; **జెండా :** లేత నీలపు భూమికపై, మధ్యన పంచకోణపు తెలుపు నక్షత్రముకలది; **జాతీయ గీతము :** సోమాలియా




పటము 51.

హనోలతో (సోమాలియా చిరకాలము వర్ధిల్లుగాక.); **నాణెము ;** సోమాలీ షిల్లింగ్, ఒక సో. షి = రూ. 1.05; **కొలతతూకములు ;** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 3 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఈశాన్య ఆఫ్రికాయొక్క ఆగ్నేయభాగమున 12° ఉ-1°39′ ద. అక్షాంశ రేఖలకును, 41°30′-51° తూ. తూలారేఖలకును మధ్యన విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున ఏడెన్ సింధుశాఖ; తూర్పున హిందూమహా సముద్రము, పశ్చిమమున కెన్యా, ఇతియోపియా, అఫార్స్-ఇస్సాస్‌ప్రాంతము సరిహద్దులందు ఉన్నవి. దేశవైశాల్యము దాదాపుగ 7,00,000 చ. కిమీ. ఉత్తర ప్రాంతము పర్వతమయమగు పీఠభూమి. దాని ఎత్తు 915 మీ. నుండి 2135 మీ. వరకు మారుచుండును. ఈ పీఠభూమి దక్షిణమున వేబీ షెబ్లినదివరకును, పడమరకును పోవుకొలది దాని ఎత్తు తగ్గి దాదాపు 685 మీ. కు చేరుకొనును. షెబ్లీ, జూబానదుల మధ్యదేశము, ఎక్కువ ఎత్తు లేకుండ, వ్యవసాయయోగ్యముగ ఉన్నది. జూబా నదికి నైరుతిన కెన్యా సరిహద్దువరకు ఉన్న ప్రదేశము నిమ్నమగు పచ్చికభూమి. జూబా, వేబీ షెబ్లీ నదులు రెండును ఇతియోపియాలో జన్మించి,

ఈ దేశమున ప్రవహించి హిందూమహాసముద్రము వైపునకు పోవుచున్నవి. ఇవి నౌకాయానమునకు తగినవి కావు; కాని వీనివలన వ్యవసాయభూములకు నీటిపారుదల సౌకర్యము లభించినది. హిందూ మహాసముద్రమును చేరక పూర్వమే వేబీషెబ్లీనది భూమిలో ఇంకిపోవుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశమున ఉష్ణమండలపు శీతోష్ణపరిస్థితి కలదు; సంవత్సరము పొడవున ఎండవేడిమిలో, చెప్పుకొనదగినంతగ హెచ్చుతగ్గులు కన్పట్టవు. నిమ్న ప్రాంతములందు సరాసరి తాప క్రమము 76° నుండి 88° ఫా వరకు మారుచున్నది; పీఠభూమియందు ఈ తాపక్రమము చాలవరకు తగ్గును. నైరుతి, ఈశాన్య ఋతుపవనములవలన దేశమున వర్షములు కురియుచున్నవి. సాలున సరా సరి వర్షపాతము 27 సెం. మీ. ఉండునని అంచనా; ఇదియైనను అనిశ్చితము; అందును ముఖ్యముగ ఉత్తరభాగము తరచుగ అనావృష్టిబాధకు లోనగు చుండును.

దేశమున అడవులు ఎక్కువగ లేవు; ఎడారి ప్రాంతములందు తుమ్మ మొదలగు ముళ్లచెట్ల జాతు లును, నదీతటములందు బొప్పాయి మొదలగు చిన్న చెట్లును కననగును; ఏనుగు, సింహము, చిరుత, అడవిపంది మొదలగు వన్యజంతువులు కొన్ని ప్రాంతములందు కలవు; విషసర్పముల వివిధ జాతులు దేశమున కననగును.

**3. జనసంఖ్య మొ.:** అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 29 లక్షల 30 వేలు. నగరములలో మొగదీషు (జ. సం. 2 లక్షలు), హర్‌గీసా (50,000), కిస్మాయు (30,000) ముఖ్యముగ పేర్కొనదగినవి. దేశమున హమిటిక్, కుషిటిక్, బంటూజాతుల వివిధతెగలు కాననగుచున్నవి. ఈ తెగలలో సమాలీ తెగ ప్రముఖము; దేశీయులలో రమారమి 80% ఈ తెగకు చెందినవారు. పై తెగ లకు చెందని అరబ్బీలు 32,000; భారత-పాకిస్తాన్ ప్రజలు 1,300; ఇటాలియనులు 3,200 దేశమున వసించుచున్నారు. భారతీయులును, పాకిస్తానీలును, అరబ్బులును ఎక్కువగ చిల్లరవ్యాపారములను నిర్వ హించుచున్నారు. ఇటాలియనులు ప్రభుత్వోద్యోగు లుగను, ఉపాధ్యాయులుగను, వ్యాపారస్థులుగను జీవనము గడుపుచున్నారు.

దేశీయ ప్రజల మాతృభాష సోమాలీ; ఇది కుషిటిక్ భాషాకుటుంబమునకు చెందినదిగ లెక్కింప బడుచున్నది. దీనికి లిపిగాని, ఎట్టి సారస్వతము గాని లేదు. స్థానికముగ 'ఉస్మానియా' అనబడు లిపిలో ఈ భాష అటనట వ్రాయబడుచున్నను దానికి వ్యాప్తి తక్కువ. అందువలన ఇంగ్లీష్, ఇటాలియన్. అరబ్బీ బాషలే పాఠశాలలలో బోధన యందును వ్యవహార పత్రములందును వాడబడు చున్నవి. ప్రభుత్వపు ప్రచురణలు తరచుగ ఇంగ్లీషు, ఇటాలియనులలో వెలువడుచున్నవి; కాని అందు అత్యంతప్రముఖములైనవి అరబ్బీలో కూడ ప్రచురింపబడుచున్నది.

దేశీయులు అందరును సున్నీ సంప్రదాయమునకు చెందిన ముస్లిములు. జాతీయమతముగ ఇస్లామును ప్రభుత్వము గుర్తించినను, పౌరులకు మత స్వాతంత్ర్యము కలదు. యూరపీయులలో క్రైస్తవ మును, భారతీయులలో హిందూమతమును విరివిగ వ్యాప్తిలో ఉన్నవి.

**4. సమాచార సౌ.:** తంతి, తపాలా, టెలిఫోను వసతులు ప్రభుత్వపు అధీనమున పనిచేయుచున్నవి. టెలిఫోనుల సంఖ్య 4,740. మొగదీషు, హర్ గీసాలలో రేడియో స్టేషనులు కలవు.

**5. యాన సౌ.:** దేశమున రైలుమార్గములు లేవు. రోడ్డుమార్గముల నిడివి 12,985 కిమీ; ఇందు 597 కిమీ. మాత్రమే ఉత్తమశ్రేణికి చెందినది; 4,160 కిమీ. మార్గము మధ్యమపు తరగతికి

చెందినది; తక్కినవి మట్టిబాటలు. మొగదీషులోను, బెర్బెరాలోను మంచి హార్బరులు కలవు; వీనిలో రెండవది సోవియట్ ప్రభుత్వపు ఆర్థిక, సాంకేతిక సహకారముతో నిర్మితము. మొగదీషులోని విమానాశ్రయమునుండి వివిధ విదేశములకు యాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** ఈ దేశము ప్రాచీన కాలపు ఈజిప్టుదేశీయ వర్తకులకు, 'సుగంధసీమ' అను అర్థమొసగు పేరుతో సుపరిచితమై ఉండెడిది. సువాసనను వెదజల్లు వనస్పతి ద్రవ్యములు ఇట ఆనాడు విరివిగ లభించుచుండుట వలన ఆ పేరును అ వర్తకులు దేశమునకు కల్పించిరి. క్రీ. శ. 10 వ శతాబ్ది ఆరంభమున యెమెన్ మొదలగు ఎర్రసముద్రతీర ప్రాంతములనుండి అరబ్బులు ఇట చేరి, దేశపు తీరమున స్థావరములను ఏర్పరచుకొనిరి. 15, 16 శతాబ్దులలో పోర్చుగీజు దేశాన్వేషకులు పలువురు అంతటంతట దేశమునకు వచ్చి, తమ సామ్రాజ్యమున దీనిని కలుపుకొన యత్నించిరి కాని విఫలులైరి. 18 వ శతాబ్దమున ఈ తీరప్రాంతము ఓమన్‌దేశపు సుల్తానునకు వశమయ్యెను. అతనినుండి జాంజిబారు ద్వీపపు సుల్తానునకు ఈ అధికారము సంక్రమించినది. ఏడెన్‌ను 1839 లో బ్రిటిష్‌వారు ఆక్రమించిన తరువాత వారికి ఈ ప్రాంతముపై ఆసక్తి కలిగినది. అంతట దేశపు ఉత్తరప్రాంతమును అంతటిని తన రక్షణలోనికి బ్రిటిష్ ప్రభుత్వము తీసికొనినది (1886), మతావేశపూరితుడగు ఒక నాయకుని నాయకత్వమున దేశప్రజలు తిరుగుబాటు చేసినను ప్రయోజనము లేకపోయినది (1920). ఈ విధముగ ఉత్తరభాగము 'బ్రిటిష్ సోమాలీలాండు' అను పేరున బ్రిటిష్ సామ్రాజ్యమున చేరినది.

దక్షిణ భాగమున ఇటాలియనుల ఆక్రమణ 1885 లో మొదలైనది. అచట అధికారమున ఉన్న సుల్తానులతో కుదుర్చుకొనిన బడంబడికలకు ఫలితముగ 1925 నాటికి దక్షిణభాగమును అంతటిని ఇటలీ ప్రభుత్వము తన రక్షణలోనికి తీసికొనినది.

ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున ఇటలీసేనలు బ్రిటిష్ సోమాలీలాండును కూడ ఆక్రమించినవి. యుద్ధానంతరమున ఆ ప్రాంతము తిరిగి బ్రిటన్‌కు వశమైనది; కాని ఇటాలియన్ సోమాలీలాండ్‌పై ఐ. రా. స. ధర్మకర్తృత్వ సంఘము అధికారమును పొందినది. తరువాత ప్రజోద్యమముల ఫలితముగను, ఐ. రా. స సానుభూతివలనను, ఈ రెండు భాగములు స్వతంత్రములై, మేళనముచెంది ఒకే రాజ్యముగ రూపొందినవి (1960); ఇతియోపియాలోని ఓగడెన్ ప్రాంతము తమ రాజ్యమునకు చెందినదని, సోమాలియా ప్రభుత్వము వివాదము లేవదీసినను, ఆ సమస్య ఇప్పటికిని అపరిష్కృతముగ నిలిచియున్నది. కెన్యాతోను ఈ దేశమునకు సరిహద్దు తగవు కలదు.

**7. పరిపాలన :** 1969 అక్టోబరు వరకు, అధికార విభజన ప్రాతిపదికగ ఉన్న ప్రజాస్వామ్య పరిపాలనా వ్యవస్థ దేశమున అమలునందుండినది. కాని 16 అక్టోబరు, 1969 న సైన్యము తిరుగుబాటుచేసి, అధ్యక్షుని వధించి, అధికారమును వశపరచుకొనినది. అంతట 21 అక్టోబరున మహమ్మద్ సయ్యద్ బర్రే నాయకత్వమున క్రొత్త ప్రభుత్వము ఏర్పడి పార్లమెంటును, సుప్రీమ్‌కోర్టును, రాజ్యాంగ విధానమును రద్దుచేసినది. అధికారము అంతయు 25 సభ్యులుకల విప్లవ సంఘమున న్యస్తమైనది.

**8. దేశరక్షణ :** 11,200 మంది సైనికులు కల భూతలసేన, సోవియట్ ప్రభుత్వపు సర్వవిధ సహకారముతో వ్యవస్థితమైనది; నాలుగు టాంకు పటాలములు కలవు. ఇటలీసామ్రాజ్య ప్రభుత్వము వదలిపోయిన వాయుసేన, సోవియట్ నిపుణుల సాయముతో, పునర్నిర్మితమైనది. దాదాపు 20

పోరాటపు విమానములు కలవు, అందలి యోధ సంఖ్య 1,250.

**9. అంతర్జాతీయ సం.** : ఐ.రా.స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను ఈ దేశమున సభ్యత్వము కలిగి ఉన్నది. వివిధ ఆఫ్రికా రాజ్యసంఘములందును సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము** : దేశమున అత్యధిక సంఖ్యాక ప్రజలు ద్రిమ్మరి జీవితమునకు అలవాటు పడిన వారు; కొలదిమంది మాత్రమే వ్యవసాయ మును వృత్తిగ చేసికొని స్థిరస్థావరములు కలిగి మనుచున్నారు. ద్రిమ్మరిజాతులు, తమ పశువుల మందలనే, తమ సంపత్తిగ భావించుకొనెదరు. వాని మాంసము, పాలు వగైరాలే వారి జీవనాధారము. అయినను ఈ పశుజాతియు సరియైన పోషణను పొందుటలేదు. వ్యవసాయము కూడ పాతపడిన పద్ధతులలో జరుగుటవలన ఉత్పత్తియు తగినంత లేదు. ఇటాలియను వ్యవసాయదారులు అరటి, చెరకు, పండించుచున్నారు. అరటిపండ్లు ఎగుమతి అగుచున్నవి. ఎగుమతులలో 45% ఇవియే. తెలియ వచ్చినంతవరకు ఖనిజసంపద కొంత కలదు, కాని గనులలో పని జరుగుటలేదు. గుగ్గిలపు చెట్టు అడ వులు మిజెర్తీన్ అను ప్రాంతమున కలవు. వీని నుండి తయారుచేయబడు గుగ్గిలమును, తుమ్మచెట్ల నుండి లభించు బంకయు, దేశమునకు కొంత ధనమును సమకూర్చుచున్నవి. దేశమున విద్యు దుత్పత్తి జరుగుచున్నది. మొత్తపు విద్యుదుత్పత్తి 1.6 కోట్ల కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 21.2025 కోట్ల సో. షిల్లింగులు; దిగు మతుల విలువ 33.979 కోట్ల సో. షి. (1968). చెల్లింపులలోటు చాల ఎక్కువ. 20 సంవత్సర ములవరకు సంవత్సరమునకు 50 లక్షల డాలర్లు చొప్పున దేశమునకు సాయము సమకూరిన యెడల మాత్రమే దేశమున ఆర్థిక సుస్థిరత చేకూరు అవ కాశము ఏర్పడగలదని ప్రపంచ బ్యాంకు అభి ప్రాయము (1965). దేశపు సాలుసరి బడ్జెటరీ వ్యయిము 30.63 కోట్ల సో. షి. (1971)).

**11. సాంఘిక రంగము** : దేశమున 90% పైగా నిరక్షరాస్యులు. ప్రయిమరీ పాఠశాలలలో 23,770 మంది, సెకండరీ తదితర పాఠశాలలలో 10,390 మంది విద్యార్థులు కలరు. మొగదీషులో ఒక విశ్వవిద్యాలయము కలదు; అందలి విద్యార్థి సంఖ్య 800 (1967). ఒక ఉత్తమ గ్రంథాలయము మొగదీషులో ఉన్నది; అచటనే ఒక మ్యూజియ మును ఉన్నది; ఆఫ్రికాలోని ప్రాచీన నాగరికతా విశేషములు అందు కననగును. ఇటాలియన్-అరబ్బీ లలో ఒక దిన పత్రికను ప్రభుత్వము ప్రచురించు చున్నది. దేశమున క్షయ మొదలగు జబ్బుల వ్యాప్తి ఎక్కువ; త్రాగుటకు పరిశుభ్రపు జలము కూడ అన్నిచోట్ల లభింపదు. 4,330 శయ్యా సంఖ్యకల 15 ఆసుపత్రులు కలవు; వైద్యుల సంఖ్య 36; వీరిలో చాలామంది విదేశీయులు (1969).

**12. యాత్రా సౌ.** : పాస్‌పోర్టు, వీసాలు లేకుండ ఏ విదేశీయ పౌరుడును దేశమున ప్రవేశింప రాదు. యాత్రికులకు హోటళ్లు మొదలగు సౌకర్య ములను ప్రభుత్వము కల్పించినది; జూబానదీ ప్రాంతమున వేటకు వసతులు కలవు.

**13. ప్రసిద్ధ పౌరులు** : దేశచరిత్రలో అత్యంత ప్రఖ్యాతి పొందినవాడు మహమ్మద్ అబ్దుల్లా బిన్ హస్సన్ (1860-1920); దేశభక్తుడుగను, కవిగను ఇతడు పేరొందెను. దేశమున వివిధ ప్రాంతములను ఆక్రమించియున్న బ్రిటిష్, ఇటాలియన్, ఇతి యోపియన్ ప్రభుత్వసేనలను ప్రతిఘటించి కడు దీర్ఘకాలము, దేశీయుల సహాయ, ఆదరములతో, పోరాటమును ఇతడు సాగించెను. ఇతనినే ఇంగ్లీషు రచయితలు 'పిచ్చి ముల్లా' అని పేర్కొనిరి. దేశ స్వాతంత్ర్యమునకై కృషిని సాగించుచునే అతడు 1920 లో మరణించెను.

# 52. స్పానీయ సహారా

**ముఖ్యనగరము :** ఏల్ అయియూన్; **జెండా, జాతీయ గీతము :** ఈ నడుమనే స్వతంత్ర మగుట వలన వివరములు తెలియవు; **నాణెము :** స్పెయిన్ దేశపు నాణెమే; **కాలగణనరీతి :** సా. 1 గం. = సా. 5.30 భారత కాలమానము.

**1. ఉనికి మొ. :** ఆఫ్రికాఖండపు ఉత్తర భాగమున పశ్చిమతీరమున ఉత్తరమున మొరాకో సరిహద్దునుండి, దక్షిణమున మారిటేనియా సరి




పటము 52.

హద్దువరకు వ్యాపించిన ఈ దేశపు వైశాల్యము 266,000 చ. కిమీ. దేశము చాలవరకు ఇసుక ప్రాంతము, ఎడారి; చెప్పుకొనదగిన నదులు లేవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఎండకాలమున ఎండ లును, చలికాలమున చలియు ఎక్కువ వర్షపాతము ఎచటను సంవత్సరమున 10 సెం. మీ. మించదు. ఏదో అటనట వాగు వంకల ప్రాంతములందుతప్ప చెట్లు కనబడవు.

**3. జనసంఖ్య మొ. :** దేశమున జనసాంద్రత చాల తక్కువ. 1970 జనాభాలెక్కలను అను సరించి దేశపు జనసంఖ్య 76,425. ఇందులో వలస చేరిన యూరపీయులసంఖ్య 16,300; దేశీయు లందరును ముస్లిములు. వలసచేరిన యూరపీ యనులు కాతలిక్ శాఖకుచెందిన క్రైస్తవులు. దేశీయు లలో అరబ్బీకి సన్నిహితములగు భాషలు ప్రచా రమునందున్నను, పౌర వ్యవహారములకు స్పానిష్ ఉపయోగింపబడు చున్నది.

**4. సమాచార సౌ. :** ఎల్ అయియూన్‌లో ఒక రేడియోస్టేషన్, విల్లాసిస్ నెరోస్‌లో వేరొక రేడియోస్టేషన్, అల్ అయియూన్, స్మరాలలో టెలివిజన్ స్థావరములు కలవు.

**5. యాన సౌ. ;** 6,500 కిమీ. నిడివిగల వేర్వేరు తరగతుల రోడ్డుమార్గములు కలవు. ఎల్ అయియూన్, విల్లాసిస్ నెరోస్‌లలో సముద్రపురేవు సౌకర్యములు కలవు. ఆ నగరములందే వైమానిక యానస్థావరములును కలవు.

**6. చరిత్ర :** బానిసవ్యాపారమునకై బానిస లను సేకరించుటకు పోర్చుగీజువారు ఈ ప్రాంతమున 16 వ శతాబ్దిలో చేరినను, కాలక్రమమున 1884 లో ఈ ప్రాంతమున స్పెయిన్ తన ఆధిపత్యమును నెల కొల్పినది. మొరాకో స్వతంత్రతను అర్జించిన తరు వాత ఈ ప్రాంతమంతయు తనకే చేరవలెనని ఆ దేశము వాదించినది. ఐ. రా. స. యు ఈ విషయమై చర్చించి మొరాకో, మారిటేనియాలతో సంప్రతించి ఈ ప్రాంతమునకు స్వతంత్రతను కల్పింపవలెనని స్పెయినునకు సలహా ఇచ్చినది (1973). అయినను ఆ తీర్మానము కార్యరూపమును చాల కాలమువరకు పొందలేదు. కడకు స్పెయినున ఫ్రాంకోనియంతృత్వము అంతరించినపిదప అచటి నూత్న ప్రభుత్వము, స్పానిష్ సహారానుండి వైదొలగి, ఆ ప్రాంతమున దాదాపు మూడింట రెండు వంతుల ప్రదేశమును మొరాకోకును, తక్కిన దానిని మారిటేనియాకును సంక్రమింపజేసినది

(ఫిబ్రవరి 28, 1976). మొరాకోకు దక్కినదానిలో దేశపు ప్రజానీకమున నాలుగింట మూడు వంతులు నివసించుచున్నారు. కాని అల్జీరియా యను తనకు కొంత రావలెనని పట్టుపట్టి, కొన్ని చోట్ల గెరిల్లా పోరాటములను ప్రోత్సహించినది. తత్ఫలితముగ దేశమున ప్రభుత్వ స్థిరత నెలకొనకున్నది.

**7. పరిపాలన :** ప్రస్తుతమున స్పెయిన్ దేశపు వలస ప్రభుత్వము అంతరించి ఆయా ప్రాంతములు వేర్వేరు రాజ్యములకు కొలది కాలము క్రిందటనే దక్కుటవలన, పరిపాలనలో వచ్చిన మార్పులు తెలియవచ్చుటలేదు.

**8. దేశరక్షణ :** దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాత స్పానిష్ సైనికులు దేశమును వదలిపోయిరి. ప్రస్తుతపు ఏర్పాట్లు తెలియవచ్చుట లేదు.

**9. అంతర్జాతీయ సం** ప్రస్తుతమున వేరు రాజ్యములలో కలసిపోవుటవలన ఎట్టి అంతర్జాతీయ సంబంధములును ఉండనేరవు.

**10. ఆర్థిక రంగము :** పారిశ్రామికముగను, వ్యవసాయికముగను దేశము చాల పేదది దేశీయులు జంతువుల—ఒంటెలు, మేకలు, గొర్రెలు, అవులు, గాడిదలు—పెంపకంపలన జీవింతురు. దేశమునగల 700 ఖర్జూరపుచెట్లు మాత్రమే దేశపు వ్యావసాయిక సంపద. ఉత్తర ప్రాంతమున ఫాస్ఫేటు గనులు కనుగొనబడినప్పటినుండి (1963) వానిని పని చేయటలో స్పెయిన్ ప్రభుత్వపు కంపెనీలు కృషి చేయుచు, దేశీయులలో కొందరికి ఉద్యోగములను కల్పింపగలిగినవి. దేశమున విద్యుదుత్పత్తి 55 లక్షల కి. వా. దేశపు ఎగుమతులు దాదాపుగ శూన్యమని చెప్పవచ్చును; దిగుమతులలో ముఖ్యమైనవి ఆహారపదార్థములు. దిగుమతుల మొత్తపు విలువ 3 లక్షల 88 వేల పెసెతాలు (పెసెతా అనునది స్పెయిన్ దేశపు నాణెము. పెసెతా = రూ. 1.07.) స్పెయిన్ దేశము ఇచ్చు ఆర్థిక సహాయమువలన దేశపు ఆర్థికవ్యవస్థ ఇప్పటివరకు నడచినది. బడ్జెటరీ వ్యయము దాదాపు 25 కోట్ల పెసెతాలు (1969).

**11. సాంఘిక రంగము :** దేశీయులలో విద్యావ్యాప్తి చాల తక్కువ. ప్రైమరీ పాఠశాలలో చదువు దేశీయ విద్యార్థులసంఖ్య 614 మాత్రమే దేశమున రెండు ఆసుపత్రులు కలవు.

# 53. స్వాజీలాండ్

**ముఖ్యనగరము :** ఇంబాబేన్; **జెండా:** నీలము, పసిమి, శోణము (క్రింజన్), పసిమి, నీలము అడ్డు చారలు ఒకదాని దిగువన వేరొకటి అమరియుండగ, మధ్యనున్న శోణభూమికపై డాలును బల్లెములును చిత్రింపబడినది; **నాణెము :** దక్షిణ ఆఫ్రికా రాండ్; ఒకరాండ్ = రూ. 10.50; **కొలతతూకములు:** కొలది మార్పులతో బ్రిటిష్ విధానపువే; **కాలగణన :** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి మొ :** దక్షిణ ఆఫ్రికాఖండమున 25° 43′-27° 20′ ద. అక్షాంశల మధ్యను 30° 48′-32° 8′ తూ. తులారేఖల మధ్యను విస్తరించియున్న ఈ రాజ్యమునకు తూర్పున మొజాంబిక్ దేశమును తక్కిన అన్ని దిక్కుల

యందును దక్షిణ ఆఫ్రికా రాజ్యమును సరిహద్దు లందున్నవి. దేశవైశాల్యము 17,400 చ. కిమీ. పడమటినుండి తూర్పునకు భూమి ఏటవాలుగ ఉన్నదని చెప్పవచ్చును పశ్చిమమున ఉన్నత భూమి ఎత్తు 1830 మీ. వరకును ఉండును; మధ్య భాగము 610 మీ. ఎత్తును; తూర్పుప్రాంతము 300 మీటర్లు ఎత్తును కలిగియున్నవి, పడమటినుండి తూర్పునకు అనేక నదులు ప్రవహించుచున్నవి.




పటము 53.

అందువలన దక్షిణ ఆఫ్రికాఖండమున ఎక్కువ నీటి వసతి కల రాజ్యముగ ఇది లెక్కకు వచ్చుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ :** అత్యున్నత పశ్చిమ ప్రాంతమున సమశీతోష్ణమండల పరిస్థితులును, మధ్య భాగమున ఉపోష్ణమండలపు పరిస్థితియును, తూర్పుప్రాంతమున ఉష్ణమండల పరిస్థితులును కనసగును. వర్షపాతము పశ్చిమప్రాంతమున సాలీనా 100-225 సెం. మీ. ఉండును. తూర్పుప్రాంతమున 50—87 సెం. మీ. ను, మధ్యప్రాంతమున మధ్యస్థముగను ఉండును. పశ్చిమప్రాంతమున అడవులును, మధ్యప్రాంతమున పచ్చికమైదానములును, తూర్పుప్రాంతమున చిట్టడవులును కలవు. పశ్చిమప్రాంతపు అడవులలో నీటిగుర్రము వంటి పెద్ద జంతువులును కన్పట్టును; నదులలో మొసళ్లెక్కువ పక్షిజాతులు వివిధములు కన్పట్టును.

**3. జనసంఖ్య మొ. :** 1969 అంచనాలను అనుసరించి జనసంఖ్య 4,10,000; జనసాంద్రత చ. కిమీ. కు 23 మంది. దేశప్రజలలో శ్వేతజాతుల వారి సంఖ్య దాదాపు 8,000; రంగుజాతులవారు 12,820. తక్కినవారందరు ఆఫ్రికా (బంటూ) జాతిప్రజలు. ఇందు ఇంబాబానె, మాంజినీ తెగల వారు అత్యధిక సంఖ్యాకులు. బంటూప్రజల మాతృభాష 'సిస్వాతీ'; అయినను ఆంగ్లభాష సాధికార భాషగ పరిగణను పొందినది. ఆఫ్రికన్ ప్రజలలో దాదాపు 40% లో ఒక విధమగు సాంప్రదాయిక మతము ప్రచారమున ఉన్నది రాజే ఆ మతమునకు పీఠాధిపతి; 700 మంది ముస్లిములు ఉన్నారు. తక్కినవారందరును క్రైస్తవులు.

**4. సమాచార సా. :** దేశమున 32 తపాలా ఫీసులును, 2 తంతి—టెలిఫోను ఏజన్సీలును, 6 టెలిఫోను ఎక్స్చేంజీలును కలవు ఒక 10 కివా. ట్రాన్స్మిటర్ కల రేడియో ప్రసారకేంద్రము ఆంగ్లమునను, సిస్వాతీలోను ప్రసారములను నిర్వహించుచున్నది (1972).

**5. యాన సౌ. :** దేశమునందలి కంకరరోడ్ల నిడివి 1,488 కిమీ.; తారురోడ్ల నిడివి 162 కిమీ. తక్కువిధముల రోడ్లనిడివి 752 కిమీ. దేశమున 223 కిమీ. నిడివిగల రైలుమార్గము కలదు; దీనిపై రాకపోకల నిర్వహణను, ఒక ఒప్పందము మూలమున, మొజాంబిక్ దేశ ప్రభుత్వపు రైల్వే సంస్థ నిర్వహించుచున్నది. ఈ రైలు మార్గము ముందునకు పోయి మొజాంబిక్‌లోని లోరెన్కో మార్క్విస్

రేవును చేరుచున్నది. మటస్పావద్ద ముఖ్య విమానాశ్రయము కలదు. ఇటనుండి దక్షిణ ఆఫ్రికా, మొజాంబిక్‌లలోని వివిధ నగరములకు విమాన యాన సౌకర్యము కలదు ఇవిగాక దేశమున విమానపు మెట్టలు (ఏర్ స్ట్రిప్స్) 20 ఉన్నవి. ఇవి దేశమున విమానయానమునకు ఉపకరించుచున్నవి.

**6. చరిత్ర :** ఈ దేశపు ప్రాచీన, మధ్య యుగముల చరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియకున్నను, 19 వ శతాబ్ది ఆరంభమునకు ఇచటి ఆఫ్రికన్ ప్రజలు ఒక నిర్దిష్టపు వర్గముగ రూపొంది, ఎడనెడ జూలూ తెగవారితో పోరాటములు సలుపుచుండిరని మాత్రము తెలియవచ్చినది. అంతట దేశ ప్రభువు బ్రిటిష్ ప్రభుత్వ సహాయమును అర్థింపగ వారు జోక్యము కల్పించుకొని, ప్రక్కన ఉన్న జూలూ రాజ్యమునకును, ఈ రాజ్యమునకును మధ్యవర్తిత్వమును నిర్వహించి సంధి కుదిర్చి, అందులకు ప్రతిఫలముగ దేశమున పశువుల బీడులపై ఆధిపత్యమును సంపాదించి, ఇచటి రాజరికమును మాత్రము గుర్తించుచు వ్యవహరింప సాగిరి ప్రక్కనున్న ట్రాన్స్‌వాల్ ప్రభుత్వము కూడ కొన్ని పచ్చికబీడులపైనను, గనులపైనను, గుత్తాధికారమును రాజునుండి గ్రహించినది. కాని దక్షిణ ఆఫ్రికాలో వచ్చిన మార్పులవలన 1903 లో బ్రిటిష్ ప్రభుత్వమే, స్వాజీలాండ్‌పై పెత్తనమును వహించి, రాజరికమును మాత్రము గుర్తించుచు పాలించినది. క్రమక్రమముగ ప్రజాపాలనకు అందు వసతులు ఏర్పరచి, బ్రిటిష్ ప్రభుత్వము దేశమునకు సెప్టెంబరు 6, 1968 న స్వాతంత్ర్యమును కల్పించినది. అంతటినుండి సర్వస్వతంత్ర ప్రతిపత్తితో, కామన్‌వెల్తున సభ్యత్వము వహించి దేశము వ్యవహరించుచున్నది.

**7. పరిపాలన :** దేశము రాజ్యాంగబద్ధమగు రాజరికపు పాలనలో ఉన్నది. సార్వజనిక వోటు హక్కు అమలున ఉన్నది. పార్లమెంటున రెండు సభలు - అసెంబ్లీ, సెనెట్ అనునవి—కలవు. ఈ సభలకు ఎన్నికలు అయిదేండ్లకొకసారి జరుగును. అసెంబ్లీలోని 30 మంది సభ్యులలో 24 మందిని ప్రజలు ఎన్నుకొనెదరు. రాజు ఆర్గురను నియమించును. సెనెట్‌లోని 12 మంది సభ్యులలో ఆర్గురు ఎన్నుకొనబడగా, తక్కినవారిని రాజు నియమించును. శాసనసభను రద్దుచేయుటకు, సస్పెండు చేయుటకు రాజునకు అధికారము కలదు. రాజును, రాజమాతయు తెగలపెద్దలును కల ఒక జాతీయసమితి కలదు. అది తెగకు సంబంధించిన ఆచారవ్యవహారములను, గనుల వ్యవహారములను గురించి సలహాలను ఇచ్చును. కార్యవర్గమునకు రాజే అధ్యక్షుడు; అతడు ఎక్కువ సంఖ్యాబలము గల రాజకీయ పక్షనాయకుని ప్రధానిగ నియమించును. దేశమున రెండు రాజకీయపక్షములు కలవు.

**8. దేశరక్షణ :** 600 మందిగల పోలీసు బలగము మాత్రమే కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలందు కొన్నింటను, ఆఫ్రికా సమైక్య సంఘమునను ఈ దేశమునకు సభ్యత్వముకలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయ పశుపోషణలపైనను, ఖనిజముల ఎగుమతిపైనను ఆధారపడియున్నది. దేశమున 56% విస్తీర్ణము ఆఫ్రికన్ స్వాజీలకే ప్రత్యేకింపబడినది. ఈ భూములందు మొక్కజొన్న, సజ్జ ఎక్కువగ పండింపబడుచున్నవి. శ్వేతజాతులు తమ అధీనమున ఉన్న భూములలో రొక్కపుపంటలను ముఖ్యముగ చెరకు, నిమ్మ పండించుచున్నారు. అడవులనుండి మంచి కలపయు లభించుచున్నది. ఖనిజములలో ఉత్పత్తి విలువలనుబట్టి ముడి ఇనుము,

రాతినార పేర్కొనదగినవి. ఎగుమతులలో చక్కెర, కలప, ముడిఇనుము, రాతినార ప్రముఖములు. ఎగుమతుల విలువ 4.21 కోట్ల రాండ్లు; దిగుమతుల విలువ 3.41 కోట్ల రాండ్లు (1968). విద్యుదుత్పత్తి సమర్థత 10,000 కివా. (1969); కాని ఆనకట్టల నిర్మాణమువలన జలవిద్యుదుత్పత్తిని ఎక్కువచేయుటకు కృషి జరుగుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 1,64,14,200 రాండ్లు (1970-71);

**11. సాంఘిక రంగము :** గృహవసతిని, పట్టణములలోనేగాక. పల్లెలందును వృద్ధిచేయుటకు ప్రభుత్వము ఒక ప్రత్యేక కమిటీద్వారా కృషిచేయుచున్నది. 1963 నుండి వివిధజాతులమధ్య ఏకీభావమును అభివృద్ధిచేయుటకై, అన్నిజాతుల విద్యార్థులను ఒకే పాఠశాలలో చదువు విధానము ప్రవేశపెట్టబడినది. దేశమున పాఠశాలలలో అనేకములు క్రైస్తవ మతసంస్థలచే ప్రభుత్వసహాయముతో నిర్వహింపబడుచున్నవి. మొత్తం 408 పాఠశాలలలో 64,955 మంది ప్రయిమరీ తరగతులలోను, 6,911 మంది సెకండరీ తరగతులలోను పఠించుచున్నారు. బోచ్వానా, స్వాజీలాండు, లెసోతోల సమష్టి విశ్వవిద్యాలయపు విద్యాపీఠము ఈ దేశమున ఒకటి కలదు. అచట ఉన్నత విద్య బోధింపబడుచున్నది. అయినను స్వాజీ విద్యార్థులు కొందరు గ్రేట్‌బ్రిటన్‌కు యు. స్టే కు ఉన్నత విద్యకై పోవుచున్నారు. లెక్కింపదగిన గ్రంథాలయములుగాని, మ్యూజియములుగాని లేవు. ఒక ఆంగ్ల దినపత్రిక దేశమున ప్రచురింపబడుచున్నది. దేశమున 835 శయ్యాసంఖ్యకల 10 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. 8,000 మందికి ఒకరు చొప్పున డాక్టరులు కలరు.

**12. యాత్రా సౌ. :** మనోరంజకమగు దృశ్యవైవిధ్యము ప్రకృతి సిద్ధముగ దేశమున ఉన్నను, అందులకు తగినటుల విదేశయాత్రికులను ఆకర్షించుటకు ప్రభుత్వము కృషిచేయుట లేదు. గ్రేట్ బ్రిటన్‌తో పాస్‌పోర్ట్ ఒడంబడికలు గల రాజ్యముల వారు ఎవరైనను ఇటకు స్వేచ్ఛగ రావచ్చును. అయితే ప్రక్కనున్న మొజాంబిక్, దక్షిణ ఆఫ్రికాల ద్వారా పయనించుటకు మాత్రము అనుమతిపత్రములు కావలెను.



# 1. ఆఫ్ఘనిస్తాన్

**ముఖ్యనగరము :** కాబూల్; **జెండా :** నలుపు, ఎరుపు, ఆకుపసిమి వన్నెల నిలువు రేఖల భూమికపై మధ్యన తెలుపు వర్ణమున మసీదును, దానిని పరివేష్టించి గోధుమకంకులను, 'ఆఫ్ఘనిస్తాన్' అను పదమును కలది జాతీయపతాకము; **జాతీయ గీతము :** స్వరమాత్రముగ ఉన్నది; **నాణెము :** 'ఆఫ్ఘనీ' అనబడు అపరివర్తనీయపు కాగితపు కరెన్సీ ద్రవ్యప్రమాణముగ చెలామణిలో ఉన్నది; ఇది 100 'పుల్స్' గ విభక్తము, విదేశీమారకమున




పటము 2.

'ఆఫ్ఘనీ' విలువ అస్థిరముగ మార్పులను పొందుచున్నది; 100 ఆఫ్ఘన్‌లు = రు. 16.66 లుగ అధికారపు విలువ; **కొలత తూకములు :** మెట్రిక్ కొలతలును, తూకములును మాత్రమే సాధికార పరిగణను పొందినవి. అయినను కొన్ని స్థానిక ప్రమాణములును అమలులో ఉన్నవి; **దైనిక కాలగణనరీతి :** ఉ. 10 56 = భారతదేశమున మధ్యాహ్నము.

**1. ఉనికి మొ. :** మధ్య ఆసియాలో భూపరివేష్టితమై ఉన్న ఈ దేశము 29°–38° 35' ఉ. అక్షాంశరేఖలకును, 60°50'–71°50' తూ. తూలారేఖలకును మధ్యన నెలకొని ఉన్నదని చెప్పవచ్చును; అయినను ఈశాన్యప్రాంతమున ఒక చీలిక మాత్రము 75° తూ. తూలారేఖవరకు ముందునకు సాగి ఉన్నది. ఈ దేశమునకు ఉత్తరమున సోవియట్ దేశమునకుచెందిన తుర్క్‌మెన్, ఉజ్‌బెక్, తాజిక్ గణరాజ్యములును, ఈశాన్యపు కొనన చీనాయును; తూర్పున, పాకిస్తాన్‌చే ఆక్రమితమగు జమ్మూ-కాశ్మీర్ ప్రాంతమును, పాకిస్తాన్ దేశమును; దక్షిణమున పాకిస్తాన్; పశ్చిమమున ఇరాన్‌దేశమును సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము ఇప్పటివరకు సరిగ లెక్కింపబడకున్నను 6,47,500 చ. కిమీ గ అంచనా వేయబడినది; దేశపు తూర్పు–పడమరల గరిష్ఠపు నిడివి రమారమి 1,230 కిమీ; ఉత్తర-దక్షిణముల గరిష్ఠపు నిడివి దాదాపు 530 కిమీ.

ఈ దేశభూతలపు సరాసరి ఎత్తు దాదాపు 1 230 మీటర్లు; కాని 6 100 మీటరుల సరాసరి ఎత్తుగల హిందూకుష్ పర్వతశ్రేణి ఈశాన్యమూలనుండి నైరుతిదిశకు రమారమి 960 కిమీ. పొడవున దేశమున వ్యాపించి, ఉత్తరప్రాంతమును, తక్కిన భూభాగమునుండి వేరుచేయుచున్నది దేశమధ్య ప్రాంతము దాదాపు 1,850 మీటర్లు ఎత్తుగల పీఠభూమి. ఇందు పలుప్రాంతములందు కన్పట్టు సారవంతపు లోయలందలి పచ్చిగడ్డి బీడులు మేకలు గొర్రెలు మొదలగువానిని మేపుటకు ఉపకరించుచున్నవి. హిందూకుష్ పర్వతములకు ఉత్తరముననున్న ప్రాంతము క్రమముగ దిగజారుటవలన అట రమారమి 460 మీటరుల ఎత్తునకు మించని భూప్రదేశములును కననగుచున్నవి; అట్టివానియందు ధాన్యములు, ప్రత్తి, మొదలగువానిని పండించుటకు,

కొన్ని ఫలజాతివృక్షములను పెంచుటకు అవకాశము కలదు. దేశపు నైరుతిప్రాంతము ఒక ఎడారి; అట గ్రీష్మమున ఎండలును, శీతకాలమున చలియు దుర్భరములు. దేశమునందలి నదులలో ఉత్తర ప్రాంతమున ప్రవహించు అమూదరియా (ఆక్సస్) నదియు, పశ్చిమప్రాంతమున పారుచున్న హరిరుద్, ముర్ ఘబ్ నదులును, తూర్పుభాగమున ప్రవహించు కాబూల్ నదియు ప్రముఖములు. అటనట కొన్ని చిన్న సరస్సులును కలవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** కొండలు, లోయలు, పీఠభూములు విరివిగనుండి, తత్ఫలితముగ భూతలపు ఎత్తు, పలుప్రాంతములందు, విపరీతపు మార్పులకు లోనగుటవలన, దేశమున కొంతభాగమున సమశీతోష్ణమండల పరిస్థితులును, వేరొక భాగమున ఉష్ణమండల సన్నిహిత పరిస్థితులును కననగుచున్నవి. అంతేకాదు, ఒకేప్రాంతమున రాత్రింబవలుల శీతోష్ణస్థితులమధ్య విపరీతపు భేదముండుటయు కలదు కాబూల్ నగరమున కొన్ని సందర్భములందు రాత్రింబవళుల తాపక్రమముల మధ్య వ్యత్యాసము 70° ఫా. గ ఉండును. మొత్తము మీద దేశమున సూర్యకాంతి ఎక్కువగ ఉండుటయు, వాయువు పొడిగను స్వచ్ఛముగను ఉండుటయు చాలవరకు కననగును. వర్షపాతము సాలుసరిన 25 నుండి 30 సెం. మీ. వరకు ఉండును. శీతకాలమునను, వసంతమునను హిమపాతము ఎక్కువ.

దేశమున వృక్షసంపద అత్యధికము; అందు ఓషధివర్గమునకుచెందిన ఇంగువచెట్టు మొదలగునవియుకలవు. దేశమున ఎలుగులు, చిరుతపులులు, తోడేళ్లు, అడవిమేకలు అడవిగొర్రెలు మొదలగు వన్యజంతులు విరివిగ ఉన్నవి

**3. జనసంఖ్య మొ :** శాస్త్రీయరీతిలో జనసంఖ్యా పరిగణన ఇప్పటివరకు ఈ దేశమున జరుగకున్నది; అయినను 1968లో జరిపిన అంచనాను అనుసరించి దేశపు మొత్తం జనసంఖ్య 1,61,13 000; ఇందు దాదాపు 10 లక్షలమంది, స్థిరనివాసమెరుగని, సంచార జాతులకు చెందిన వారు. దేశప్రజలలో దాదాపు 7% పట్టణములలో నివసించుచున్నారు (పట్టణమనగ 3000 కు పైబడిన జనాభా కల ప్రదేశము). ముఖ్యనగరమగు కాబూలున 4,56,000, దక్షిణప్రాంతమునందలి కాందహారున 1,21,000, పశ్చిమమున, ఇరాన్ సరిహద్దున ఉన్న, హీరట్ నగరమున 62,000 ను జనులు నివసించుచున్నటుల అంచనా.

భారతదేశమునకు ముఖద్వారముననున్నటుల భావింపదగు ఈ దేశమున ఆర్యులు మొదలుగ, అంతటంతట, వివిధజాతులు, చేరియుండుట వలన దేశమున ప్రజల ముఖవైఖరులందు ఆయా జాతుల లక్షణములు కలగలుపు చెందుటయేగాక, వారు మాటాడు భాషలందును ఈ సంకీర్ణత కననగుచున్నది. కాని ప్రజలలో పఖ్తూన్‌లు (వీరికే పఠానులను పర్యాయ నామము కలదు) అని వ్యవహరింపబడు వారికే సంఖ్యాబలము కలదు. మొత్తపు జనసంఖ్యలో వీరు 55%; వీరి తరువాత లెక్కకు వచ్చు తాజిక్ జాతీయులు 30% ఉన్నారు; వీరుగాక అల్పసంఖ్యలలో మంగోలు జాతులకు చెందిన హజారాలును, తుర్కు, తుర్కో-మంగోలులును అటనట మధ్యప్రాంతపు పీఠభూమియందును, ఉత్తరప్రాంతమునను వసించుచున్నారు.

దేశమున పుష్తూ భాషయును, పారసీక భాషయును సాధికార భాషలుగ పరిగణ్యములు; అయినను సాంస్కృతికముగ పారసీకభాషకే ఎక్కువ మన్నన కలదు. ఇవిగాక బెలూచీ భాషయు, పారసీక భాషా మాండలికములు కొన్నియు, దర్దిక్, మంగోలు భాషా కుటుంబములకు చెందిన కొన్ని భాషలును, అటనట కొన్ని అల్ప సంఖ్యాక వర్గములందు ప్రచారమున ఉన్నవి.

దేశపు ప్రజలలో 99% ఇస్లామ్‌మతస్థులు; అందును 90% సున్నీ సంప్రదాయానుయాయులు. హిందువులును. యూదులును, పార్సీమతపువారును అటనట అత్యల్పసంఖ్యలో ఉన్నారు. దేశపు అధికారమతము ఇస్లామ్.

**4. సమాచార సౌ.:** దేశమున టెలిగ్రాఫ్ టెలిఫోన్ సౌకర్యములు ప్రభుత్వముచే నిర్వహింపబడుచున్నవి. ప్రముఖ నగరములకేగాక, కొన్ని చిన్న పట్టణములకును, కొన్ని ప్రముఖ గ్రామములకును ఈ సౌకర్యములు కలవు. రేడియో - టెలిగ్రాఫ్‌వలన ఈ దేశము తక్కిన ప్రపంచముతో సంబంధము కలిగియున్నది. కాబూలున ఒక రేడియో ప్రసారకేంద్రము పనిచేయుచున్నది.

**5. యాన సౌ:** ఈ దేశమున రైలుమార్గములు లేవు; రోడ్ల సౌకర్యము మాత్రము విరివిగ కలదని చెప్పవచ్చును. గత కొలది సంవత్సరములలో రోడ్ల నిర్మాణము విస్తారముగ జరిగినది. యు. స్టే. ప్రభుత్వ సాహాయ్యమున కాబూల్-కాందహారుల మధ్యను, హీరట్‌నుండి ఇరాన్ సరిహద్దువరకును; సోవియట్ ప్రభుత్వ సాహాయ్యమున పూల్-ఇ-కుమ్రినుండి షిబెర్‌ఘాన్‌వరకును చక్కని రోడ్లు నిర్మింపబడినవి. దేశపు మొత్తమున పక్కా-రోడ్ల నిడివి 2,000 కిమీ. దేశమునందలి నదులలో ఏదియు నౌకాయానమునకు ఉపకరింపకున్నది. కాబూల్, కాందహారులలో విమానాశ్రయములు కలవు. ప్రభుత్వమునకు చెందిన 'అరియాన ఆఫ్ఘన్ ఏరోలైన్స్' అనునది దేశ, విదేశ వైమానిక ప్రయాణములను నిర్వహించుచున్నది.

**6. చరిత్ర:** వైదికకాలమున ఆర్యావాసముగ ఈ దేశము ఉండెడిదనియు, భారతదేశమున సప్తసింధువున నెలకొనిన ఆర్యులకు, ఈ ప్రాంతము సుపరిచితమనియు, వైదికాధారములవలన తెలియవచ్చుచున్నది. భారతదేశమునకు ముఖద్వారముగ వ్యవహరించిన, ఖైబరుకనుమ ఈ దేశపు సరిహద్దుననే ఉండుటవలన, అనాది కాలమునుండియు వాయవ్య భారతమునకు వచ్చిన వివిధ జాతులవారును ఈ దేశముద్వారానే వచ్చియుందురని చారిత్రకుల భావన.

క్రీ. పూ. అయిదు, నాలుగు శతాబ్దులలో సింధునది పశ్చిమతటమువరకును వ్యాపించియుండిన విశాల పారసీక సామ్రాజ్యమున అంతర్భాగముగ కొంతకాలము ఈ దేశము ఉండినది. తదనంతరమున క్రీ. పూ. 326 లో మహావిజేతయగు అలెగ్జాండరు పారసీక సామ్రాజ్యమును తుదముట్టించిన తరువాత అతని సామ్రాజ్యమున ఈ దేశము చేరినది. కాలక్రమమున అట గ్రెకో-బాక్ట్రియనులును. శకులును, కుషానులును పరిపాలనను నెరపిరి. మౌర్యాశోకుని కాలమున ఇట స్థానమును ఆర్జించిన బౌద్ధమతము శక కుషాణాదులను సైతము లోగాని క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దివరకు అట మనగలిగినది కాని ఆ శతాబ్దిలో ఇస్లామిక సేనావాహినులు ఈ ప్రాంతమును వశపరచుకొని, ఇట ఇస్లామునకు సుస్థిరస్థానమును కల్పించి బౌద్ధమతమును అంతరింపజేసినవి.

క్రీ. శ. 1220 లో ఈ దేశము మంగోలుల వశమై, తదాదిగ దాదాపు ఒక శతాబ్దివరకు వారి పాలనలో ఉండినది. అనంతరమున ఈ దేశము తన అస్తిత్వమునే కోల్పోయి, ఇందలి వివిధ ప్రాంతములు వేర్వేరు రాజ్యములలో చేరిపోయినవి. అయినను ఈ కాలమున ఆఫ్ఘన్ సరదారులనేకులు తమ అనుయాయులతో, భారతదేశమున వివిధ ప్రాంతములను ఆక్రమించి, అచటి రాజకీయములలో క్రీ. శ. 16 వ శతాబ్దివరకు ప్రముఖ పాత్రను నిర్వహించిరి 17 వ శతాబ్దిలో, కొంత కాలము మొగల్ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఈ దేశము ఉండినది. మొగలులప్రతిష్ఠ సన్నగిల్లిన

తరువాత 18 వ శతాబ్దిలో. పారసీకరాజగు నాదిర్ షా, అఫ్ఘనిస్తాన్‌ను తన సామ్రాజ్యమున చేర్చెను కాని, అతని అనంతరమున, అతని అఫ్ఘన్ సర్దారులలో ఒకడగు అహమద్ షా దురానీ, స్వదేశమున, తన ఆధిపత్యమున స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పుటయేగాక, భారత రాజకీయములందును జోక్యము వహించి, మూడవ పానిపట్ యుద్ధమున (1761) మహారాష్ట్రులను ఓడించెను. కాని, అతని వంశీయుల కాలమున, భారతదేశమున వాయవ్యభాగమున, అఫ్ఘనుల పాలన అంతరించినది. అనంతరమున దుర్బలులగు దురానీ వంశీయుల పాలనను తుదముట్టించి, దోస్త్ మహ్మద్ అను అఫ్ఘన్ వీరుడు దేశపాలనను వశపరచుకొనెను (1826). దోస్తమహమ్మద్ పాలించుకాలమున, రష్యా, బ్రిటనులు, అఫ్ఘన్‌స్తాన్ వ్యవహారములలో, తమ సామ్రాజ్యముల సుస్థిరతకై జోక్యములను కలిగించుకొనినవి. ఈ జోక్యముల ఫలితముగ బ్రిటిష్‌వారితో, అఫ్ఘన్ సేనలు మూడు పర్యాయములు పోరాటములను జరిపినవి; కడకు బ్రిటిష్ సేనలు విజయమందిన ఫలితముగ అఫ్ఘనిస్తాన్ యొక్క విదేశాంగశాఖపై యాజమాన్యము బ్రిటిష్‌వారికి లభించినది (1879). కాని 1921 లో జరిగిన వేరొక సంధివలన ఈ అధికారమును బ్రిటన్ వదలుకొనినది. రెండు ప్రపంచయుద్ధములందును అఫ్ఘనిస్తాన్ తాటస్థ్యము వహించినది; కాని చాలవరకు మిత్రరాజ్యముల యెడనే సానుభూతిని ప్రదర్శించినది.

ఈ దేశమునకు పాలకుడుగ 1919 లో అధికారమును గ్రహించిన అమానుల్లా, ఆధునిక భావ ప్రేరేపితుడై, దేశమున సాంఘికాదిరంగములందు, అతిత్వరితగతిలో, సంస్కరణలను కొనివచ్చుటకు యత్నింపగ అది నచ్చని సనాతన మత సంప్రదాయానుయాయులు తిరుగుబాటులను జరిపి, అమానుల్లాను రాజ్యభ్రష్టునిగ చేసిరి (1929). అంతట బచ్చాయి-యి-సక్కో అను ఒక సాహసికుడు రాజ్యమును వశపరచు కొనగ, అతనిని అనతికాలముననే అంతరింపజేసి రాజవంశీకుడగు మహమ్మద్‌నాదిర్‌షా అమీర్ అయ్యెను. (అఫ్ఘనిస్తాన్ పాలకుల బిరుదనామము అమీర్). ఇతడును, ఇతని అనంతరమున ఇతని కుమారుడగు మహమ్మద్ జహీర్‌షాయును, తగు మెలకువతో, దేశమును ఆధునికముగ చేయుటకు కృషి సలిపిరి.

భారత భూఖండము స్వతంత్రతను ఆర్జించి భారత, పాకిస్తాన్ దేశములు రూపొందిన తరువాత (1947), వాయవ్యపాకిస్తాన్‌లో ఉన్న పఠాన్ నివాస ప్రాంతమునకు స్వయంనిర్ణయాధికారమును, అఫ్ఘనిస్తాన్ బలపరచినది; ఆ కారణమువలన పాకిస్తాన్‌తో అఫ్ఘనిస్తాన్‌కు విభేదములు చెలరేగి, వైమనస్యములు ఏర్పడినవి.

1973 లో, ఆరోగ్యకారణములవలన, మహమ్మద్ జహీర్‌షా ఇటలీలో ఉండగ, అతని బావమరిదియగు మహమ్మద్ దావూద్‌ఖాను, అఫ్ఘనిస్తాన్‌లో అధికారమును వశపరచుకొని, దేశమును గణరాజ్యముగ ప్రకటించెను. (జూలై 18, 1973).

**7. పరిపాలన :** పరంపరాగతముగ, దేశమున నిరంకుశ రాజ పరిపాలనమే అమలులో ఉండినను, ఆధునిక యుగ ధర్మమును అనుసరించి, ప్రజలకు పరిపాలనయందు భాగస్వామ్యమును కలుగజేయుటకై, 1961 లోను, తదనంతరమున 1964 లోను పాలకుడే కొన్ని రాజ్యాంగ సంస్కరణలను ప్రవేశపెట్టెను. 1964 లోని సంస్కరణలను అనుసరించి వయోజన వోటింగుహక్కు అమలునకు కొనిరాబడి, 1965 లో ఎన్నికలు జరిగి, క్రొత్త రాజ్యాంగము ఏర్పడినది. తత్ఫలితముగ రూపొందిన రెండు సభలలో వోల్సీజిర్గా (లోకసభ) అనుదానియందలి 216 మంది సభ్యులను ప్రజలే ఎన్నుకొనెదరు; దిగువసభ (మెషానో జిర్గా) యందలి 84 సభ్యులలో

28 మందిని ప్రజలును, 28 మందిని రాష్ట్ర సభలును ఎన్నుకొనగ, తక్కినవారిని రాజు నియమించును. రెండుసభలలో అధికసంఖ్యాకబలముగలవానిని రాజు ప్రధానిగ నియమించును. అయినను ఈ సభలకు కల అధికారములు చాల పరిమితములు. 1973 జులైలో గణరాజ్యము ప్రకటింపబడిన తరువాత, ప్రభుత్వాధినేతగను, ముఖ్యమంత్రిగను మహమ్మద్ దావూద్ ఖాన్ వ్యవహరించుచు, తాను నియమించుకొనిన 12 మంత్రులుకల మంత్రిమండలి సాయముతో పాలనను నిర్వహించుచున్నాడు. త్వరలోనే గణరాజ్య మూలసూత్రములకు అనుగుణమగు రాజ్యాంగము రూపొందింపబడగలదని, ప్రజలకు, దావూద్ ఖాన్ వాగ్దానము చేసినను, అది ఇప్పటికి (1976) కార్యరూపమును పొందకున్నది.

పరిపాలనాసౌకర్యమునకై ఈ దేశము 29 రాష్ట్రములుగ విభజితమైనది, రాష్ట్రములు మండలములుగను, అవి ఉపమండలములుగను విభక్తములు. రాష్ట్ర పాలనను, గవర్నరు నిర్వహించును; అతనికి, ప్రజలెన్నుకొనిన రాష్ట్రసభ పరిపాలనలో సాయపడుచున్నది.

దేశమున న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు; న్యాయనిర్వహణలో ఉచ్చతమాధికారము సుప్రీమ్‌కోర్టునకు కలదు; ఆ కోర్టునకు లోబడి తక్కిన న్యాయస్థానములు పనిచేయుచున్నవి. ముఖ్యన్యాయాధిపతి సలహాపై జడ్జీలను రాజు నియమించును. ఉరిశిక్ష అమలున మాత్రము రాజామోదము తప్పనిసరిగ పొందవలసియున్నది.

**8. దేశరక్షణ :** దేశమున 22-45 వయోపరిమితికల పురుషులు అందరును విధిగ సైనిక శిక్షణను రెండేండ్లు పొందవలెనను నియమము అమలున ఉన్నది. శాంతికాలమున సైనికసంఖ్య లక్షమంది వరకు ఉండునని అంచనా.

**9. అంతర్జాతీయ సం. :** పాకిస్తాన్‌తో తప్ప తక్కిన తన పొరుగు రాజ్యములతోను, భారత దేశముతోను, ఇజ్రాయెల్ తప్ప మిగిలిన ప్రపంచ రాజ్యములతోను ఆఫ్ఘనిస్తాన్‌కు సన్నిహిత దౌత్య సంబంధములు కలవు. పాకిస్తాన్‌తో వైమనస్యము ఏర్పడినను ఏదియో ఒక విధముగ దౌత్య సంబంధములను ఆ దేశము కలిగియుండి వ్యవహరించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** తొలుతనుండియు ఈ దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడియున్నది. దేశము పర్వతమయమేయయినను అచ్చటచ్చట సారవంతములగు మైదానములును లోయలును కలవు; అందువలన సేద్యమునకు అనువగు భూమి రమారమి 1.4 కోట్ల హెక్టేరులు లభింపగలదని అంచనా. ఇందు దాదాపు 80 లక్షల హెక్టేరులు మాత్రమే సాగగుచున్నది; అందును 53.4 లక్షల హెక్టేరులకు మాత్రమే నదులు, బావులు మొ. వానివలన నీటిపారుదల వసతి కలదు. ఆహారపదార్థములలో, గోధుమ, చక్కెర, తప్ప తక్కిన అన్నింటియందును దేశము స్వయంపోషకముగ ఉన్నది. రొక్కపు పంటలలో ప్రత్తి, ఆముదము మంజిష్ఠ, ఇంగువ ప్రముఖములు. దేశమున పండ్లచెట్ల పెంపకము విరివిగ ఉండుట వలన దేశీయులు తమ ఆహారమున పండ్లను ఎక్కుగ వాడెదరు. ఈ దేశపు ఉన్నిగొర్రెలు జగత్ప్రసిద్ధములు; ఇచటి ప్రజలు ఆహారమున ఈ గొర్రెల మాంసము ఎక్కువగ వినియుక్తము.

దేశమున ఖనిజసంపద తగినంతగ ఉన్నటుల తెలియవచ్చినను, ఆ వసతుల అభివృద్ధి సరిగ లేదు. పూల్-ఇ-కుమ్రి మొదలగు తావులందు బొగ్గుగనులు కలవు. 1967-68 లో ఇట ఉత్పత్తి 1,51,000 టన్నులు. షిబెర్‌ఘాన్, సరిపోల్ ప్రాంతములందు ఇంధనవాయువు (నేచురల్ గ్యాస్) లభించుచున్నది. ఇనుము, వెండి, రాగి, బంగారము మొ. ఖనిజముల ఉనికి తెలియుచున్నను వానిని వెలికితీయు కృషి మొదలిడబడకున్నది.

దేశమున, 1934 లో ఒక జవుళిమిల్లును స్థాపించుటతో పారిశ్రామికోత్పత్తి మొదలిడబడెనని చెప్పవచ్చును. ఆ జవుళి పరిశ్రమ క్రమముగ విస్తృతిచెంది ఈ నాడు దేశపరిశ్రమలలో అతి ప్రముఖ స్థానమును ఆర్జించినది; తోళ్లఊనకం, బూట్లు, ఊలు వస్తువులు. గ్లాసు మొ. వానికి చెందిన పరిశ్రమలును త్వరితగతిలో అభివృద్ధి చెందినవి. గతకొలది సంవత్సరములలో దేశమున విరివిగ భారీఎత్తున పరిశ్రమలను నెలకొల్పుటలో యు. స్టే., సోవియట్ దేశము, పశ్చిమ జర్మనీ, చీనీయ, బ్రిటిష్ ప్రభుత్వములు సాంకేతికముగను, ధన రూపముగను సాయమొసగినవి. దేశపు పరిశ్రమ లలో అత్యధికభాగము కాబూలున ఉన్నవి. కాంద హార్, పూల్-ఇ-కుమ్రి, సరోబి మొ. తావులందు జలవిద్యుదుత్పత్తి యంత్రముల మూలమున జరుగు చున్నది. మొత్తపు విద్యుదుత్పత్తి 42.26 కోట్ల కిలోవాట్లు (1971-72).

విదేశవ్యాపారము దేశీయప్రభుత్వపు పర్య వేక్షణకు లోబడి సాగుచున్నది. దేశమున ఉన్న మూడు బ్యాంకులలో ప్రముఖమైనది 'దా అఫ్ఘ నిస్తాన్ బ్యాంకు'. ఎగుమతులలో ఊలువస్తువులు, నిలువజేసినపండ్లు, తాజాపండ్లు, గింజలు, చర్మ ములు, ముడిప్రత్తి, ఇంధనవాయువు ప్రముఖములు, సోవియట్ రష్యాతో చేసికొనిన ఒక ఒడంబడికను అనుసరించి, గొట్టములద్వారా ఇంధనవాయువును ఆ దేశమునకు అఫ్ఘనిస్తాన్ ఎగుమతిచేయుచున్నది. దేశపు ఎగుమతుల విలువలో 15% ఈ ఇంధన వాయువును ఎగుమతి చేయుటవలన లభించుచున్నది. దిగుమతులలో పెట్రోలు, తదనుబంధ ఉత్పత్తులు, చక్కెర, సిగరెట్లు, పొగాకు, మోటారుబండ్లు ప్రముఖములు. ఈ దిగుమతుల విషయమున ప్రభుత్వము గుత్తాధిపత్యమును కలిగియున్నది. దేశపు మొత్తపు ఎగుమతుల విలువ 618 కోట్ల అఫ్ఘనీలు; దిగుమతుల విలువ 941 కోట్ల అఫ్ఘ నీలు (1971-72).

దేశమున ఉత్పత్తిని క్రమబద్ధము చేయుటకై ప్రభుత్వము 1956 మొదలుగ 1972 వరకు మూడు పంచవర్షప్రణాళికలను నిర్వహించినది. కాని కొన్ని అభ్యంతరములవలన – సాంకేతిక విజ్ఞానము, పరిపాలనాకౌశలము లేకుండుట మొద లగు వానివలన ఈ ప్రణాళికలు గమ్యమును చేర జాలకపోయినవి. ప్రస్తుతమున నాలుగవ ప్రణాళిక అమలున ఉన్నది.

దేశమున సమష్టి జాతీయోత్పత్తి (G. N. P. స. జా. ఉ.) ని నిర్ణయించుటకు సంఖ్యావివరములు సమగ్రముగ లేకున్నను, లభ్యములగు వానిని అను సరించి, స జా. ఉ. విలువ, 1970-71 లో 150 కోట్ల అమెరికన్‌డాలర్లుగ ఉండినదని అఫ్ఘన్ ప్రభుత్వాధికారులు లెక్కదేల్చిరి. ఈ లెక్కను అనుసరించి 1967-70 కాలమున సగటున జాతీ యోత్పత్తి సాలున 3% పెరిగెననియు, 1971 లో దేశమున తలసరి సాంవత్సరిక ఆదాయము 106 డాలర్లు ఉండెననియు తేలుచున్నది.

దేశప్రభుత్వపు బడ్జెటరీ వ్యయము (1972-73) 837 కోట్ల అఫ్ఘనీలు.

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక సంసేవా కార్యక్రమములలో అత్యధికభాగము మత సంస్థల అధీనముననో, వ్యక్తుల అధీనముననో ఉన్నది. పేదలకు సాయపడుటకై స్థానిక ప్రభుత్వ ములు తలసరి పన్నును ఒకదానిని విధించి, దానిని వెచ్చించి, దరిద్రులకై ధర్మశాలలను కొన్ని ప్రాంతములందు నిర్వహించుచున్నవి. ప్రారిశ్రామి కోత్పత్తి మొదలైన తరువాత కార్మికులకును ఉద్యో గులకును, క్రొత్తగ సాగుబడికి తెచ్చిన ప్రాంతము లందలి రైతులకును, గృహములను నిర్మించి, ఇచ్చుటలో ప్రభుత్వము శ్రద్ధవహించుట ఆరంభ మైనది.

దేశమున 30% అక్షరాస్యులని అంచనా. ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము సిద్ధాంతరీత్యా అమలులో ఉన్నను, 15 గురిలో ఒకరు మాత్రమే చివరవరకు ఆ శిక్షణనుపొందుచున్నారు. మాధ్యమిక విద్యయు దేశమున ఉచితముగ లభించుచున్నది; అయినను విద్యాసక్తి తగినంతగ లేదు. మాధ్యమిక పాఠశాలలలోని విద్యార్థుల సమష్టి సంఖ్య 84,152 మాత్రమే. (1968)

కాబూలున ఒక విశ్వవిద్యాలయము 1933 లోను, వేరొకటి జలాలాబాదున 1963 నను సంస్థాపితములై పనిచేయుచున్నవి, ఈ రెండింట మొత్తపు విద్యార్థులసంఖ్య 7,397 (1970).

గ్రంథాలయోద్యమము త్వరితగతిన దేశమున ఆదరణను ఆర్జించుచున్నది. కాబూలునందలి పబ్లిక్ లైబ్రరీలో 60,000 సంపుటములును, 433 వ్రాత గ్రంథములును కలవు. కాబూల్ పరిసరముననున్న మ్యూజియమున ప్రాచీనకాలపు బౌద్ధ, పౌరాణిక యుగములకు చెందిన అవశేషములు కననగుచున్నవి.

దేశమున పరిమిత స్వాతంత్ర్యముతో వార్తా పత్రికలు పనిచేయుచున్నవి. 10,500 పాఠకులు గల 20 దైనికపత్రికలు దేశమున ఉన్నవి (1967). వీనిలో 'అనిస్', 'హివాద్', 'ఇస్లాహ్' అనునవి ప్రముఖములు.

**12. యాత్రా సౌ.:** అతిపురాతన కాలము నుండియు వివిధనాగరికతల కూడలిగ పేరుగనిన ఈ దేశమున రమణీయ ప్రకృతి దృశ్యములేగాక బామియాన్ వంటి చారిత్రక స్థలములును కలవు. బామియాన్ వద్దనున్న ఉన్నత బుద్ధ విగ్రహముల పరిరక్షణలో భారతప్రభుత్వము ఆఫ్ఘన్ ప్రభుత్వమునకు సాయపడుచున్నది. యాత్రికులకు తగు సౌకర్యములను సమకూర్చుటకై ప్రభుత్వము ఒక ప్రత్యేక శాఖను ఏర్పరచినది. దేశమున సాలుసరి యాత్రికుల సంఖ్య 1,00,233 (1970)

**13. ప్రసిద్ధ వ్యక్తులు:** దేశపరిపాలకులలో మహావిజేతలుగ పేరొందినవారు 1. గజనీ మహమ్మద్ (971-1030); 2. మహమ్మద్ ఘోరీ (మ. 1206); 4. జహీరుద్దీన్ బాబర్ (1483-1530), వీరిలో మూడవవాడు మధ్య ఆసియాలోని ఫెర్ఘానాకు చెందినవాడైనను, ఆఫ్ఘన్ స్థాన్‌ను వశపరచుకొని, దానినుండియే, భారత దేశముపై దండెత్తి, లోడీవంశజులను అంతమొందించి మొగల్ సామ్రాజ్య ప్రతిష్ఠాపకుడయ్యెను (1526). అరబ్బీ, పారసీక సాంస్కృతిక చరిత్రలలో ఖ్యాతిని ఆర్జించిన ప్రముఖులలో కొందరు అఫ్ఘనిస్తాన్‌న జన్మించిరి; మరికొందరు వేరొక చోట జన్మించినను, ఈ దేశమునే తమ స్థావరముగ చేసికొనిరి. విజ్ఞాన ఖనియగు అల్-బెరూని (973-1048), వేరొకచోట జన్మించినను, ఆఫ్ఘనిస్తాన్‌లోని గజనీనగరమున వసించి తన గ్రంథములను రచించెను. పారసీక మహాకవియగు జలాలుద్దీన్ రూమీ (1207-73) ఈ దేశములోని బాల్ఖ్ నగరమున జన్మించి, యౌవనమున టర్కీకి పోయెను. వేరొక పారసీక మహాకవి, అబ్దుల్ రహమాన్ జామి (1414-92), తన జీవితమున అత్యధికభాగమును ఈ దేశమునందలి హీరట్ నగరమున గడపెను. ఈ కోవకు చెందినవాడే ప్రసిద్ధ పారసీక చిత్రకారుడు బిహ్‌జాద్ (1450-1520).

---

# 2. ఇండోనీసీయా

**ముఖ్యనగరము :** జకర్తా; **జెండా :** దిగువన తెలుపునను, ఎగువన ఎరుపునను అడ్డచారలు కలది; **జాతీయ గీతము :** ఇండోనీసియా రాయా...... (మహత్తమ ఇండోనీసియా); **నాణెము:** రూపాయి; ఇది 100 సేనులుగ విభక్తము; 50 ఇండోనీసియా రూ. = రూ 1 00 (భారత); **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** దేశము అతివిస్తృత మగుటవలన వివిధ ప్రదేశములందు కాలగణన మారుచున్నది. భారతదేశమున సా. 5 గం. 30 ని. అయినపుడు ఇండోనీసియా లోని పడాంగ్ (ఉత్తర సుమత్రాలో) సా. 6 గం. 30 ని; పాలెంబాగ్ (దక్షిణ సుమత్రాలో) సా. 7 గం; జావా, కలిమంతన్ ద్వీపములలో సా. 7 గం. 30 ని; శూలవేసిలో సా. 8 గం; మొలుక్కాస్‌లో సా. 8 గం. 30 ని.




పటము 3.

**ఉనికి మొ. :** ఇండోనీసియా యందు 6 పెద్ద ద్వీపములును, దాదాపు 3,000 అల్పద్వీపములును చేరి ఉన్నవి. ఆసియా, ఆస్ట్రేలియాలమధ్య ఒకవృత్తఖండమువలె విస్తరించియున్న ఈ ద్వీపరాజ్యము 95-140° (దాదాపు 5,240 కిమీ. పొడవున) తూ. తులారేఖల మధ్యను 6° ఉ-11° ద. అక్షాంశ రేఖల మధ్యను వ్యాపించి ఉన్నది. ఇందలి పెద్ద ద్వీపములు 1. బృహత్ సుందావర్గము, 2. అల్ప ద్వీపములు అను రెండు భాగములుగ లెక్కింపబడుచున్నవి. బృహత్ సుందావర్గమున 1. జావా, మదురా ద్వీపములు (1,32,090 చ. కిమీ.) సుమత్రా దీవి (4,24,760 చ. కిమీ.), 3. కలిమంతన్ (బోర్నియోద్వీపమందలి ఈ దేశపు భాగము-6,38,760, చ. కిమీ.), 4. శూలవేసి (ఇది సెలబిస్ అని ఇదివరలో వ్యవహృతము-1,89,070 చ.కిమీ.) 5. పైవాని పరిసరములలో ఉండు వివిధ అల్ప ద్వీపములు చేరి ఉన్నవి. అల్పసుందావర్గమున 1. మలక్కా ద్వీపములు (ఇదివరలో మొలుక్కాస్ అని వ్యవహృతములు) 2. పశ్చిమ ఇరియన్ (న్యూగినీ ద్వీపమున ఇండోనీసియాకుచెందిన పశ్చిమ భాగము-

ఇది ఇరియన్ బరాత్, అనియు పిలువబడుచున్నది. 4,12,781 చ. కిమీ.) 3. తైమర్ దీవిలో పశ్చిమ సగము చేరి ఉన్నవి. (తైమర్ దీవిలో తక్కిన సగము పోర్చుగీజువారి వలస రాజ్యము). పైవియు, తక్కిన వివిధ అల్పద్వీపములును చేరిన ఇండోనీసియా ద్వీపరాజ్యపు మొత్తపు వైశాల్యము 19,04,345 చ కిమీ. సముద్ర పరివృతమగు ఈ రాజ్యమునకు ఉత్తరమున దక్షిణ చీనా సముద్రము; ఉత్తరమునను తూర్పునను పసిఫిక్ మహాసముద్రము దక్షిణమునను పడమరను హిందూమహాసముద్రము కలవు.

పెద్ద ద్వీపములందు అన్నింట పర్వతశ్రేణులు మధ్యభాగమున ఉండుటయు అవి తీరముల వైపునకు దిగజారివిస్తృతములగు నిమ్నప్రదేశములుగను, తీరపు మైదానములుగను పరిణమించుటయు కననగును : ద్వీపములందు పెక్కింట, కొన్నియెడల ఆరిపోయిన అగ్నిపర్వతములును, కొన్నియెడల ఇప్పటికిని రగులుచున్న అగ్నిపర్వతములును కన్పట్టుచున్నవి. ఈ అగ్నిపర్వతములనుండి వెలువడిన మృత్తిక, నదుల మూలమున, మైదానములకు చేరి, భూమిని సారవంతము చేయుచున్నది. జావా, సుమత్రాలలోని కొన్ని పర్వత శిఖరములు 3,660 మీ. ఎత్తునకు లేచియున్నవి. జావా, బలి, లంబక ద్వీపములలో విస్తృతములగు నిమ్న భూములును, పర్వతపార్శ్వములందు సోపాన శ్రేణిలో సేద్యము చేయవీలగు ప్రాంతములును కలవు కలిమంతన్‌లో విస్తృతములగు చిత్తడి నేలలయందు అటవులును, అంతగ సారవంతములు కాని పర్వతభూములను ఉన్నవి. సుమత్రా ద్వీపపు తీరప్రాంతము కొంతవరకు వ్యవసాయ యోగ్యము; శూలవేసియందు పర్వతసీమలు ఎక్కువగ కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.** : భూమధ్యరేఖకు ఉభయ పార్శ్వములందును కుదురుకొని ఉన్న ఈ రాజ్యమున ఉష్ణమండల శీతోష్ణస్థితి లక్షణములు-అధికమగు వర్షపాతము, గాలిలో ఎక్కువ చెమ్మదనము, అత్యధికపు ఉష్ణత, మందపు గాలులు-కనవచ్చుచున్నవి. గాలిలో చెమ్మదనము 82%. ఋతువును బట్టికాక ప్రదేశపు ఉన్నతిని అనుసరించియే తాపక్రమమున మార్పులు కలుగుచున్నవని స్థూలముగ చెప్పవచ్చును. సముద్రమట్టమునకు సమానముగ ఉండు తీరప్రాంతమున సాలీనా సరాసరి తాపక్రమము 77° నుండి 81° ఫా. వరకు మారుచుండును. లోపలికి పోయిన కొలది పగలు-రాత్రుల మధ్య తాపక్రమ వ్యత్యాసము ఎక్కువగుచుండును. ఉన్నత ప్రాంతములందును ఈ వ్యత్యాసము ఎక్కువగనే ఉండును. జకర్తా నగరమున సాలీనా సరాసరి తాపక్రమము 78° ఫా. అచటి సాలీనా సరాసరి వర్షపాతము 200 సెం. మీ; నవంబరునుండి మార్చి వరకు ఈ రాజ్యమున వర్షకాలము. నిమ్నప్రాంతములందు సాలీనా సరాసరి వర్షపాతము 175 నుండి 310 సెం. మీ. వరకు మారుచుండును. ప్రదేశపు ఎత్తు పెరిగిన కొలది ఈ వర్షపాతపు ప్రమాణమును ఎదిగి, ఉన్నత పర్వత సీమలందు కొన్నింట 600 సెం. మీ. ను చేరుకొనును. సుమత్రా, కలిమంతన్‌ల లోని తీర భూములందు వర్షపాతము 300 నుండి 360 సెం. మీ. వరకు మారుచున్నది. దక్షిణమునకు పోవుకొలది, రాజ్యమున వర్షపాతము తగ్గుచు, ఆస్ట్రేలియాఖండపు ఎడారి పరిస్థితులకు, కడకు సన్నిహితమగుచున్నది.

ఈ రాజ్యపు వృక్షసంతతియందు ఆసియావృక్షజాతులును, ఆస్ట్రేలియా ఖండపు వృక్షజాతులును, మిశితములై కానవచ్చును. ఉత్తరప్రాంతపు నిమ్న భూములందు ఉష్ణమండలపు అడవులు కననగుచున్నను, దక్షిణమునకు పోవుకొలది వీనియందలి సాంద్రతయు, విలక్షణతయు క్రమముగ సన్నగిలి కడకు చిట్టడవులుగ పరిణమించును. ఇక జంతు వర్గమున సైతము, ఈ రాజ్యము ఆసియా-ఆస్ట్రేలియాల మధ్య ఒక సేతువుగ వర్తించుచున్నదా

అనుసటుల వివిధ జంతుజాతులు కలగాపులగముగ కలసియున్నవి. సుమత్రా, కలిమంతన్, జావాల లోని జంతుసంతతి మలయా ద్వీపకల్పపు సంతతికి అన్నివిధముల సజాతీయమే అయినను, ప్రతి ద్వీపము ఒక విలక్షణతను కలిగి ఉన్నదని చెప్ప వచ్చును. ఒరాంగ్-ఉటాన్ (కోతి మనిషి) అను బలీయ వానరజాతి సుమత్రా, కలిమంతన్‌ల లోనే కన్పట్టును; జావాలో అది కన్పట్టదు. పెద్దపులి సుమత్రా, జావాలలోనేగాని, కలి మంతన్‌న లేదు. ఏనుగు, రేచు సుమత్రాదీవి యందునను, అడవిఎద్దు జావాయందును, సివంగులు కలిమంతన్‌లో మాత్రమే కలవు, శూలవేసి, మొలు క్కాన్, తైమర్ దీవులలో, ఆస్ట్రేలియాజాతికి చెందిన వింత జంతువులు ఉన్నవి; ఆస్ట్రేలియాలోని కంగా రూకు సన్నిహితమగు వింత జంతువు (మర్సూ పియల్ అనబడునది) తైమర్ దీవిలో కననగు చున్నది. ఈ రాజ్యపు ద్వీపములందు అన్నింట, అందును ముఖ్యముగ మొలుక్కాన్‌లో, పక్షి, సరీ సృప, ఉభయచర జంతువులు అనేకములు కలవు.

**3. జనసంఖ్య మొ.:** జనసంఖ్యా ప్రాబల్య మును అనుసరించి ప్రపంచ రాజ్యములలో ఈ రాజ్యము అయిదవ స్థానమును ఆక్రమించి ఉన్నది. 1971 లెక్కల ప్రకారము రాజ్యపు జనసంఖ్య 11,92,32,499. ప్రాంతములవారీగా జావా, మదుర ద్వీపములు 7.6 కోట్లు; సుమత్రా 2.08 కోట్లు; శూలవేసి 85 లక్షలు; బలి, నూసా తెంగారా, పశ్చిమ ఇరియన్ 86 లక్షలు; కలిమంతన్ 52 లక్షలు జనసంఖ్య కలిగి ఉన్నవని స్థూలముగ చెప్పవచ్చును. దేశపు ప్రజలలో పెక్కుజాతుల వారు ఆయా ద్వీపములందు కననగుచున్నారు. అజనీ, బతక్. మినాంకాబూ జాతులు సుమత్రాలో; జవానా, సుందానీ జాతులు జావాలో; మదురీ జాతి మదురలో; బలీనీ జాతి బలిద్వీపమున; శసక్‌జాతి లంబక్ దీవియందు; మీనాదోనీ, బుగినీ జాతులు శూలవేసిలో; దాయక్ జాతి బోర్ని యోలో; ఇరియన్‌జాతి పశ్చిమ ఇరియాలో ప్రముఖ ముగ కన్పట్టును. మానవ విజ్ఞాన శాస్త్రరీత్యా పై జాతులు పేర్కొనబడినను, దేశపు 1930 జనాభా లెక్కలలో దేశీయులు జాతిరీత్యా ఇండోనీసియన్, చీనీయ, తదితర ఆసియావాసి, యూరపీయ జాతు లను నాలుగు జాతులుగ మాత్రమే పేర్కొనబడిరి. ఇండోనీసియన్ జాతి అనుదానిలో పైన చెప్పబడిన అజినీ మొదలగు జాతులు చేరియున్నటుల అందు లెక్కింపబడినది. కురుమట్టపు ఎత్తు, లేతనుండి ముదురు చామనచాయవరకు మారెడు దేహవర్ణము, దట్టమగు జుట్టు. విశాలమగు నుదురు, వెడల్పగు ముక్కు, లావు పెదిమలు ఈ జాతివారి రూప లక్షణములు. రాజ్యమున తూర్పుభాగమున వసించు వారిలో నీగ్రోలక్షణములు కొన్ని కననగును; ప్రస్తుతమున రాజ్యమున యూరపీయ సంతతివారి సంఖ్య చాల తగ్గిపోయినది.

దేశమునందలి జావా, మదుర ద్వీపములు జన సాంద్రతకు పేరొందినవి; ఇచటి జనసాంద్రత చ. కిమీ. కు 577; ప్రపంచమునందెల్ల ఇది అత్య ధికము. దేశపు నగరములలో జకర్తా (దాదాపు జ. సం 47,74,000), బాండుంగ్ (18,05,000), సురబాయా (7,90,000), సీమారంగ్ (5,96,000), మేదన్ (5,68,000), పాలెం బాంగ్ (5,63,000) మకస్సర్ (4,55,000), మలాంగ్ (4,04.000); జోక్జకర్తా (3,71,000) పేర్కొనదగినవి.

దేశమున వివిధ భాషలు ప్రచారమున ఉన్నను, మలే భాష సర్వజనులకు చాలవరకు విదితము; అందువలన దీనిని ప్రాతిపదికగ గ్రహించి, డచ్చి, ఇంగ్లీషు, అరబ్బీ, సంస్కృత, తదితర ఇండోనీ సీయ మాండలిక భాషా పదములను, అందు తగు రీతిలో మిశితము చేసి ప్రయత్న పూర్వకముగ రూపొందించిన 'భాషా ఇండోనీసియా' అనునది

దేశపు అధికార భాషగను, సామాన్య భాషగను ఇపుడు లెక్కింపబడుచున్నది. ఈ భాషకు విపుల వ్యాప్తిని అతిత్వరితముగ కల్పించుటకు జరిగిన కృషి, కొంత అవ్యవస్థతకు తొలుత కారణ భూత మైనను, క్రమముగ దేశమునకు అంతటికిని అది సామాన్యభాష కాగలుగుటయే గాక, విజ్ఞాన శాస్త్రాదులను విద్యాశాలలందు బోధించుటకు పాశ్చాత్య భాషలతో దీటుగ, బోధనభాషగ ఉపకరింపగలుగు చున్నది. పాఠశాలలందు ఇంగ్లీషును రెండవభాషగ బోధించుచున్నారు. 'భాషా ఇండోనీసియా'ను తగు రీతుల వికసనము పొందజేయుటకు ప్రభుత్వము ఒక ప్రత్యేకశాఖద్వారా కృషి చేయుచున్నది. ఈ భాష రోమన్ లిపిలో వ్రాయబడుచున్నది.

దేశపు ప్రజలలో 90% ముస్లిములు; అయినను రాజ్యాంగ విధానము మతస్వాతంత్ర్యమును గుర్తించు చున్నది హిందువులు దాదాపు 60 లక్షలు. ఇందు 25 లక్షలు బలిద్వీపమున నివసించుచున్నారు. క్రైస్తవుల సంఖ్య 30 లక్షలు; బౌద్ధులు దాదాపు పది లక్షలు కలరు. వీరిలో అత్యధిక సంఖ్యాకులు చీనీయులు.

**4. సమాచార సౌ.** : దేశమున 727 తపాలా ఆఫీసులును, 1,146 గ్రామీణ తపాలా ఏజన్సీలును, 515 టెలిగ్రాఫ్ ఆఫీసులును కలవు (1954); ఇప్పటి సంఖ్యా వివరముల తెలియవచ్చుటలేదు. దేశమునందలి ప్రముఖ నగరములను కలుపుచు రేడియో-టెలిఫోను సౌకర్యములను పంపుటకు వీలు కలుగుచున్నది. ప్రభుత్వాధీనమున ఉన్న రేడియో రిపబ్లిక్ ఇండోనీసియా అనునది, 69 ట్రాన్స్మిటర్లద్వారా దేశీయులకొరకు వివిధ మాండలిక ములలోను, జాతీయ భాషలోను ప్రసారములను నిర్వహించుచున్నది; విదేశములకొరకై ఇందుండి అరబ్బీ, చీని, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు, డచ్చి, ఫ్రెంచి, ఇండోనీసియన్ భాషలలో ప్రసారములు జరుగుచున్నవి. 1963 నుండి టెలివిజన్ సౌకర్యమును ఏర్పడినది. 1966 మొదలుగ రేడియో ప్రసార నిర్వహణ అంతయు, సైనిక సమాచార శాఖాధికారియొక్క పర్యవేక్షణకు లోబడి నడచు చున్నది.

**5. యాన సౌ.** : విస్తృత మహాసముద్రమున విసరివేసినటులున్న పలుదీవులు చేరియున్న ఈ రాజ్యమున యాన సౌకర్యమే దాని ఆర్థిక రాజకీయ ప్రతిపత్తికి ఒక మూలస్తంభమని చెప్ప వచ్చును. ద్వితీయ ప్రపంచయుద్ధమువలనను, తద నంతరపు పరిణామముల వలన, డచ్చివారి, యంత్ర సామగ్రియు, ఉద్యోగి బృందమును దేశము నుండి తరలింపబడుటవలన, దేశపు యానసౌకర్య ములు బాగుగా దెబ్బతినినవి.

అంచనాలను అనుసరించి దేశమున 80,000 కిమీ. రోడ్డుమార్గములు కలవు. ఇందు 28,800 కిమీ. జావా-మదుర దీవులందు, 28,800 కిమీ. సుమత్రాయందు ఉన్నవి. ఐ. రా. స. సహాయముతో రోడ్లను అభివృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది.

జావా, మదుర, సుమత్రా, శూలవేసి. బంకా, బిల్లితోన్ దీవులలో రైలు మార్గములు కలవు, అయినను అందు అత్యధిక భాగము జావాలోనే ఉన్నవి. వాని మొత్తపు నిడివి 6,600 కిమీ.

దేశాంతర్గతములగు నదులు సుమత్రా, కలిమంతన్ లలో నౌకాప్రయాణమునకు ఉపకరించుచున్నవి. విదేశీయ వ్యాపారమునకు ఉపకరించు సముద్రపు రేవులలో జావాలోని తంజుంగ్ ప్రియోక్ (జకర్తా), సురబాయా; సుమత్రాలోని బేలవాన్ (మేదన్) ప్రముఖములు. వానియంతగ కాకపోయినను జావా లోని జీరెబాన్, సీమారంగ్; సుమత్రాలోని పాలెంబాంగ్, పడంగ్; కలిమంతన్‌లోని బంజర్‌మాసిన్, బాలిక్‌పాపన్, పోంతియానక్; బిన్‌తాన్‌లోని తంజుంగ్ పినాంగ్; శూలవేసిలోని మకాసర్ ద్వితీయశ్రేణికి చెందిన రేవులుగ

లెక్కింపదగినవి. జకర్తాలోని కేమజోరన్ విమానా శ్రయము అంతర్జాతీయ స్థాయికి చెందినది. పలు విదేశీయ విమానయాన సంస్థలును, దేశప్రభుత్వ మునకు చెందిన గరుడ విమానయాన సంస్థయు నానాదేశములకు విమానయాన సౌకర్యములను కల్గించుచున్నవి; దేశాంతర్గతమగు విమానయాన ములను దేశీయమగు గరుడ విమానయాన సంస్థయే నిర్వహించుచున్నది.

**6. చరిత్ర :** అతిప్రాచీన కాలమునుండియు ఈ ద్వీపరాజ్యము మానవ నివాసముగ ఉండెననియు పసిఫిక్ మహాసముద్రమున చెల్లాచెదరుగ ఉన్న ద్వీపములలో వసించిన పొలినీసియన్ జాతికిచెందిన ప్రజలే ఇట తొలుత వసించిరనియు, అంతట మలేసియాద్వారా భారతీయ ప్రజలలో కొందరును, తీరప్రాంతములందు కొందరు చీనీయులును వలస చేరిరనియు, ఈ జాతుల మేళనము వలననే ప్రస్తుతపు ఇండొనీసియా ప్రజానీకము రూపొందె ననియు చారిత్రకుల భావన. క్రీస్తు శకారంభకాలము నుండియు చీనీయులకును భారతీయులకును ఈ ద్వీపములు సుపరిచితములు. క్రీ. శ. 78 లో అజశకుడను రాజు భారతదేశపు సౌరాష్ట్ర మునుండి తగు పరివారముతో జావాకు వలసవచ్చి అచట రాజ్యమును నెలకొల్పెనని జావాయందలి గాథల వలన తెలియవచ్చుచున్నది. హిందూ మతమును ఆ ద్వీపమున ప్రచారమునకు తెచ్చిన తొలుతటి వాడు అతడే క్రమక్రమముగ సుమత్రా మొదలగు దీవులందును ఆ మతము వ్యాపించినది క్రీ. శ. 5 వ శతాబ్దమునుండి బౌద్ధమత ప్రచారకులును ఇటకు చేరి తమ మతమును వ్యాపింపజేసిరి. ఈ రెండు మతములును సహన భావముతో అట మెలగినవి. రాజులును, ప్రజలును ఆ రెండింటియెడ సమానాదరమును ప్రదర్శించిరి. కాలక్రమమున హిందూమతము చాలవరకు బౌద్ధమతమును లోగొనెను.

క్రీ. శ. మొదటి శతాబ్ది మొదలుగ 15 వ శతాబ్ది అరంభము వరకు భారతీయ మత భాషా, సంస్కృతులచే ప్రభావితములైన రాజవంశములు అనేకములు ఈ ద్వీప రాజ్యమున పాలించినవి. వీనిలో క్రీ. శ. నాలుగవ శతాబ్దమున సుమత్రా యందు నెలకొనిన 'శ్రీవిజయ' రాజ్యమును, క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దమున మలయాయందు స్థాపితమై 9 వ శతాబ్దిలో ఇండొనీసియాను అంతటిని లోగొనిన శైలేంద్ర రాజ్యమును, క్రీ. శ. 10 వ శతాబ్దికి చెందిన, జావా తూర్పుభాగమున రూపొందిన మాతరరాజ్యమును, క్రీ. శ. 14 వ శతాబ్దిలో ఇండొనీసియా దీవులను అన్నింటిని పాలించిన మజాపహిత రాజవంశమును చారిత్రక ప్రశస్తిని ఆర్జించినవి. 13 వ శతాబ్దిలో చీనాపాలకుడగు కుబ్లయ్‌ఖాన్ ఈ ద్వీపరాజ్యమును జయించినను. మరల దేశీయ పాలకునికే రాజ్యమును ఇచ్చెను.

క్రీ. శ. 11 వ శతాబ్దివరకు చీనా, భారత దేశముల మధ్య ఆర్థిక, సాంస్కృతిక వినిమయ కేంద్రములుగ ఈ ద్వీపములందలి అనేకనగరములు విలసిల్లినవి. చీనానుంచి వచ్చెడు బౌద్ధయాత్రికులు ఇట కొంతకాలము నిలిచి, ఇచటి నగరములందలి విద్యాశాలలందు సంస్కృతమును అభ్యసించి, అందు పాండిత్యమును సంపాదించి, భారతదేశము నకు పయనించెడివారు.

శైలేంద్ర రాజులలో పలువురు భారతదేశమున సమకాలికులగు పాల, చోళరాజులతో సన్నిహిత సంబంధములను కలిగియుండిరి. దక్షిణ భారత పాలకుడగు రాజేంద్రచోళచక్రవర్తి (1013-42ప.) తన నౌకాబల సాహాయ్యమున శైలేంద్రరాజ్యముపై దండయాత్ర జరిపి కొంత రాజ్యమును వశపరచు కొనినను, అనతికాలముననే శైలేంద్రరాజులు స్వతంత్రులైరి.

దేశమును పాలించిన కడపటి ప్రముఖ రాజు రాజసనగరుడు (1350-1389 ప.). నేడు 'పాన

తరనమ్' అని వ్యవహరింపబడు ఒక పట్టణము నందలి దేవాలయపు గోడలపై రామాయణ, భాగవత విశేషములను శిల్పరూపమున అతడు ప్రదర్శింపజేసెను; ఆ శిల్పములు రమ్యతకు పేరొందినవి.

మలక్కాదీవిలో మొదట 15 వ శతాబ్ది అరంభ మున ఇస్లామ్, పారసీక వర్తకుల కృషివలన, కాలూని రాజాదరణ పొంది అటనుండి క్రమమున ఆ శతాబ్ది అంతమునకు దీవులందెల్ల వ్యాపించెను; హిందూమతము బలిద్వీపమునందునను జావాలో కొన్ని మారుమూల ప్రాంతములందును మాత్రమే అత్యల్పసంఖ్యాకులను ఆశ్రయించి నిలువగలిగినది.

ఇటుల దేశమున ఇస్లాము వ్యాపించినను, ఇస్లామిక రాజవంశమేదియు, దేశమునంతటిని ఏకీ కృతము చేయలేకపోయినది. దేశమంతయు, చిన్ని రాజ్యములుగ విభక్తమై సుల్తానుల పాలనలో ఉండినది ఇట్టి సమయమున 16 వ శతాబ్దిలో పోర్చుగీజువారు ఇట చేరి దేశమునంతటిని తమ వశములోనికి తెచ్చుకొనిరి; కాని అనతికాలముననే, 1696 లో ఒక డచ్చి వర్తక సంస్థ ఇచటికి వచ్చి పోర్చుగీజువారిని తరిమివైచి, దాదాపుగ దేశమును అంతటిని ఆక్రమించినది. తైమర్ దీవిలో తూర్పు సగము మాత్రము పోర్చుగీజువారి అధీనమున నిలిచినది. డచ్చి వర్తక సంస్థనుండి దేశపు పరి పాలనా బాధ్యతను 1800 లో డచ్చి ప్రభుత్వము గ్రహించినది.

1811 లో బ్రిటిష్ ప్రభుత్వము ఈ ద్వీప రాజ్యమును వశపరచుకొనినను, తరువాత కుదిరిన సంధిని అనుసరించి, 1816 లో డచ్చి ప్రభుత్వ మునకే తిరిగి అప్పజెప్పినది. డచ్చివారు, ఈ దేశపు సహజ సంపత్తిని, తమ మాతృదేశపు శ్రేయస్సునకై వినియోగించుటనే తమ లక్ష్యముగ ఇడుకొని తమ వలసపాలనను నిర్వహించిరి. 20 వ శతాబ్ది మొదలుగ, నామమాత్రముగ, ప్రజలకు పరిపాలనయందు ఏ కొలదిగనో భాగస్వామ్యము కల్గించినను అది ప్రజలను సంతృప్తి పరచినది కాదు. తత్ఫలితముగ అహమద్ సుకర్ణో, మహమ్మద్ హట్టాలను వారి నాయకత్వమున దేశీ యులు ఆందోళనను సాగించిరి. ఇంతలో ద్వితీయ ప్రపంచయుద్ధము ఆరంభమై ఈ ద్వీపరాజ్యము 1942, మార్చి 8 న జపానీయసేనల వశమైనది. 1946 లో జపానీయ సేనలను మిత్రరాజ్యసేనలు ఓడించిన వెనువెంటనే, సుకర్నో, హట్టాల నాయ కత్వమున ఒక జాతీయ ప్రభుత్వము ఏర్పడినది (17 ఆగస్టు,1 945). తిరిగి దేశమును ఆక్రమించు టకు డచ్చివారు యత్నించి విఫలులై, ఐ. రా. స. జోక్యమునకు ఫలితముగ, జాతీయవాదులతో ఒడంబడికను కుదుర్చుకొని పశ్చిమ ఇరియన్ ప్రాంతమును మాత్రము తమ అధీనమున ఉంచు కొని, తక్కిన దేశమునకు స్వతంత్రతను కల్పించిరి (7 డిసెంబరు, 1949). తరువాత ఐ. రా. స. కృషివలనను సంప్రతింపుల ఫలితముగను, పశ్చిమ ఇరియన్ ప్రజల అభిప్రాయమును అనుసరించియు, ఆ ప్రాంతము కూడ ఇండోనీసియాలో అంతర్భాగ మైనది (1 మే, 1963). 1976 లో తూర్పు తైమరున పోర్చుగీజు వలసరాజ్యము అంతరింపగ, ఆ ప్రాంతమును ఇండోనీసియా వశపరచు కొనినది.

**7. పరిపాలన :** దేశము స్వతంత్రతను పొందిన తరువాత 1950 లో రాజ్యాంగ విధానము ఆమోదింపబడి తదనుసారముగ నైష్పత్తిక ప్రాతి నిధ్యమున, ప్రజలచే ఎన్నుకొనబడిన ఒక ప్రతినిధి సభ 260 మంది సభ్యులతో ఏర్పాటయ్యెను; అహమద్ సుకర్ణో అధ్యక్షుడుగను, మహమ్మద్ హట్టా ఉపాధ్యక్షుడుగను ఎన్నుకొనబడిరి. కాని కాలపరిమితియగు నాలుగేండ్లును ముగియకమునుపే అధ్యక్షుడు ప్రతినిధిసభను రద్దుచేసి, మరల

రాజ్యాంగ పరిషత్తును ఎన్నికలద్వారా సమావేశ పర చెను (1950). కడకు ఈ పరిషత్తు రూపొందించిన రాజ్యాంగ విధానము సైతము అమలులోనికి రాలేకపోయినది. అధ్యక్షుడగు సుకర్ణో, తనకు ప్రజాసామాన్యమున ఉన్న అసాధారణమగు పలుకు బడిని ఉపయోగించుకొని, పార్లమెంటును లక్ష్య పెట్టక, తన ఇచ్చవచ్చిన రీతిలో సలహా సంఘ ములను ఏర్పరచుకొని, రాజ్యాంగ విధానమును పదే పదే మార్చుచు, నియంత్రిత ప్రజాస్వామ్యము (గైడెడ్ డెమొక్రసీ)ను, అమలుపరచి, దాదాపుగ నిరంకుశుడయ్యెను. ఇట్టి పరిస్థితులలో కమూనిస్టులు సేనలోని కొందరి సాయముతో, దేశమంతటా ఒక తిరుగుబాటును లేవదీసి అధికారమును వశ పరచుకొన యత్నించిరి (30 సెప్టెంబరు, 1965). దీనిని, సుహర్తో సేనాని నాయకత్వమున, సైనిక వర్గము నిశ్శేషముగ అడచివేసినది. ఆ సందర్భమున దాదాపు 80,000 కమ్యూనిస్టులు వధింపబడిరి; కమ్యూనిస్టుల వలన సైన్యమున పలువురు ప్రము ఖులు చంపబడిరి. అంతట, విద్యార్థుల దౌర్జన్య పూర్వకమగు ఆందోళనలకు లొంగి, సుహర్తోకు అధికారములను దత్తముచేసి, నామమాత్రపు అధ్య క్షుడుగ ఉండుటకు సుకర్ణో అంగీకరించెను (12 మార్చి, 1966) క్రమశః ప్రజాభీష్టమునకు లొంగి అతడు వైదొలగగ, సుహర్తో సేనాని దేశాధ్యక్షు డయ్యెను (మార్చి, 12, 1967). మార్చి 28, 1968 న ప్రజా సంఘము అతని అధ్యక్షపదవిని ధ్రువపరచి ఆమోదించినది.

దేశమునందలి రాజకీయ పక్షములలో కమ్యూ నిస్టుపార్టీ 1966 నుండి నిషేధితమైనది. పెక్కు రాజకీయ పక్షములు ప్రజలలో పనిచేయుచున్నను, ముస్లిమీన్ ఇండోనీసియా అనునదియే ప్రభుత్వపు ఆదరణతో 1968 మొదలుగ వ్యవహరించుచున్నది. దేశమునందలి 19 రాష్ట్రములలోను ప్రతియొక దానిని ప్రభుత్వనియమితుడగు గవర్నరు, ఎన్ను కొనబడిన సంఘపు సాయముతో, పాలించు చున్నాడు.

సుప్రీమ్‌కోర్టు అధ్వర్యమున పనిచేయు వివిధ శ్రేణుల కోర్టులద్వారా న్యాయనిర్వహణ సాగు చున్నది. దండన్యాయము పౌరులందరికి ఒకే ఒక తీరుగ ఉన్నను, పౌరన్యాయ వ్యవహారణ మాత్రము ఇండోనీసియనులు, యూరపియనులు, తదితర విదేశీయ ప్రాచ్యదేశవాసులు-అను మూడు తెగల వారికి వారి వారి సంప్రదాయములను అనుసరించి వేరువేరు తీరులుగ ఉన్నది అయినను వాది ప్రతి వారులు విభిన్నములగు తెగలకు చెందినపుడు వ్యవహారణకు అనువుగ ఒక సామాన్య పౌర న్యాయ సంహితయు అమలున ఉన్నది.

**8 దేశరక్షణ :** పదాతి, నౌకా, వాయు సేనలుగ దేశపు సేన మూడు విభాగములుగ ఉన్నది. 15 దళములును, 8 యాంత్రిక పటాల ములును కలిగిన పదాతిసేన కలదు; ఇందలి సైనిక సంఖ్య 2,50,000 (1973). నౌకాసేనయందు 4 డిస్ట్రాయర్లును, 6 జలాంతర్గాములును, 21 టార్పెడో బోట్లును, తదితర విధముల నౌకలు 201 కలవు; నావికయోధ సంఖ్య 25,000 (1972). వాయు సేనయందు 16 పోరాటపు జెట్ విమానములును, 2 దళముల బాంబర్లును, 2 వాహక విమానదళ ములును ఒక గస్తీ విమాన దళమును ఉన్నవి; అందలి సైనిక సంఖ్య 50,000.

**9. అంతర్జాతీయ సం. :** 1950 లో ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము లభించినది. కాని బోర్నియోలోని సారవాక్, సాబాలను చేర్చు కొని మలయా దేశము మలేసియాగ రూపొందుట, ఈ దేశమునకు ఇష్టము లేకపోవుటవలన, ఆ మలేసియాకు ఐ. రా. స. లో స్థానము లభించిన వెంటనే, ఆ అంతర్జాతీయ సంస్థనుండి ఈ దేశము వైదొలగినది (7 జనవరి 1965). మరల 1966 లో

దేశపు ప్రభుత్వ విధానమున మార్పువచ్చిన తదుపరి ఐ. రా. స. లో సభ్యత్వమును గ్రహించినది. కొలంబో ప్రణాళికయందును, కొన్ని తదితర అంతః ప్రభుత్వ సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. మలేసియాతో ఈ దేశము మైత్రీ ఒడంబడికను కుదుర్చుకొనినది (మార్చి, 1970). మలక్కా జలసంధియందు ఈ రెండు దేశయుల మధ్య ఉన్న సరిహద్దురేఖయు నిర్ధారితమైనది. చీనా ప్రజా గణరాజ్యముతోతప్ప తక్కిన అన్ని ప్రముఖదేశములతోను ఈ దేశమునకు దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయోత్పత్తులును పెట్రోలియమును ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు మూలాధారములు. దేశపు కార్మికబలమున నాలుగింట మూడువంతులు వ్యవసాయ, మత్స్య, అటవీ కృషులలో పనిచేయుచున్నారు. దాదాపు 1.7 కోట్ల హెక్టేరుల భూమి సేద్యమున ఉన్నది. ఇందు 35-40% భూమియందు ఎగుమతులకు ఉపయోగించు పంటలే పండింపబడుచున్నవి. వ్యవసాయ యోగ్యమగు భూమిలో 60% జావాద్వీపమున ఉన్నది దేశమునందు విదేశీయుల యాజమాన్యమున కొన్ని వ్యవసాయక్షేత్రములు కలవు; కాని వీని యందు ప్రభుత్వము సంయుక్త స్వామ్యమును కలిగియున్నది.

దేశపు ఎగుమతి ఆదాయమున దాదాపు 50% వ్యవసాయపు ఉత్పత్తుల ఎగుమతి వలన లభించుచున్నది. వానిలో రబ్బరు, వనస్పతి నూనెలు, కాఫీగింజలు. పొగాకు, మిరియాలు, తేయాకు, కొబ్బరి, క్రమరీతిలో ప్రముఖతను కల్గి ఉన్నవి. దేశీయుల ముఖ్యాహారపు పంటయగు వరి దాదాపు సాలున 155 లక్షల టన్నులు పండింపబడుచున్నను, దేశావసరములకు చాలకున్నది. నూనెల ఎగుమతియందు ప్రపంచ రాజ్యములలో గణ్యస్థానము ఈ దేశమునకు కలదు. పశుసంపద విరివిగ కలదు; పశువుల క్రొవ్వు దేశమునుండి ఎగుమతి యగుచున్నది. దేశీయుల ఆహారమున చేపలకు ప్రముఖస్థానము కలదు; లెక్కలను తేల్చిచెప్పుట కష్టమే అయినను, సామాన్యముగ సముద్రతీర, నదీతీర వాసులందు బెస్తవృత్తి ఎక్కువగ వ్యాప్తి యందున్నది. ప్రభుత్వపు అంచనాలను అనుసరించి 1968 లో 1,175 వేల టన్నుల చేపలు పట్టబడినవి.

దేశమున మూడింట రెండువంతుల వైశాల్యమున అడవులు కలవు: ఇందు 74% కలిమంతన్‌లోను, 24% సుమత్రాలోను, 2% జావా-మదుర ద్వీపము లందును ఉన్నది. లభ్యమగు కలపలో దాదాపు సగభాగము విదేశములకు ఎగుమతి యగుచున్నది. క్రమశః దేశపు ఎగుమతులలో పెట్రోలియమ్, రబ్బరు తరువాత కలపయే మూడవదిగ లెక్కకు వచ్చునటుల చేయుటకు అడవులను ప్రభుత్వము అభివృద్ధిచేయుచున్నది.

ఖనిజోత్పత్తులలో ముఖ్యముగ పేర్కొనదగినది పెట్రోలియం; దాని వలన మొత్తపు ఎగుమతుల విలువలో మూడవవంతు దేశమునకు లభించుచున్నది. 1968 లెక్కలను అనుసరించి, పెట్రోలియం ఉత్పత్తిచేయు ప్రపంచ రాజ్యములలో ఈ దేశము 11 వ స్థానమున ఉన్నది; ఆ సంవత్సరమున ఈ దేశపు ముడి పెట్రోలియపు ఉత్పత్తి 297 లక్షల మెట్రిక్ టన్నులు. దేశమున భూగర్భమున పెట్రోలియమ్ లభించు తావులు ఇంకను అనేకములు కలవని అంచనా. ఇప్పటికి తెలిసినంత వరకు ఉత్పత్తి సాగుచున్న ప్రాంతములలో అతి ప్రముఖము సుమత్రాదీవి. దేశపు ఉత్పత్తిలో 70% ఇచట లభించుచున్నది. తరువాత లెక్కింపదగినది కలిమంతన్. జావా, మదుర ద్వీపములలో చాల కొలదిగ మాత్రమే పెట్రోలియమ్ లభించుచున్నది.

విదేశీయ పెట్రోలియం కంపెనీలను దాదాపుగ అన్నింటిని, పరిహారమును చెల్లించి, ప్రభుత్వము వశపరచుకొనినది.

ఒక కాలమున తగరపు ఉత్పత్తిలో ఈ దేశము ప్రముఖస్థానమును కలిగియుండినది; కాని ప్రస్తుతమున దాని ఉత్పత్తి చాల తగ్గినది; బాక్సైట్ గనులు అనేకములు కలవని అంచనా; అందు కొన్నింటమాత్రమే త్రవ్వకము సాగుచున్నది. ఆ ఖనిజము అంతయు ఎగుమతి యగుచున్నది. దేశమున, దేశావసరములకు ఉపయోగించునంతవరకు, రాక్షసి బొగ్గు లభించుచున్నది. ఇక నికెల్, మాంగనీజ్, రాగి, వెండి, బంగారము, వజ్రముల గనులు కలవని పరిశీలనవలన తెలియుచున్నను, వానిని త్రవ్వటకు తగిన కృషి జరుగుటలేదు దేశమున విద్యుదుత్పత్తి 167.7 కోట్ల కివా. (1967). కాని తరువాత పెక్కు ప్రాజెక్టులు నిర్మింపబడినవి. కావున ఆ ఉత్పత్తి దాదాపుగ రెట్టింపు అయినది.

దేశమున ప్రాచీన కాలమునుండి సాగుచున్న కుటీర పరిశ్రమలు కలవు; ఆధునిక పరిశ్రమలు ఎక్కువగ అభివృద్ధి చెందలేదు. ప్రభుత్వము పారిశ్రామికముగ దేశమును అభివృద్ధి చేయుటకు కృషిచేయుచున్నది. వ్యవసాయ వస్తువులను, పెట్రోలియమును సంస్కరించు పరిశ్రమలును: సిమెంటు, నేతపరిశ్రమలును కాగితపు పరిశ్రమలును; కాగితపు పరిశ్రమయు; ఎరువులకు, నౌకా నిర్మాణమునకుచెందిన కొన్ని పరిశ్రమలును చిన్న స్థాయిలో దేశమున కలవు.

దేశపు ఎగుమతుల విలువ 120.4 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 120.7 కోట్ల అమెరికన్ డాలర్లు (1971). (1965 లో దేశము విపరీతపు ఆర్థికోల్బణ (ఇన్‌ఫ్లేషను) కు లోనైనది. అంతట దేశపు నాణెమునకు విలువను తగ్గించుట జరిగి 10,000 ఇండోనీసియ రూపాయలు = 1 అమెరికన్ డాలరుగ లెక్కించుట జరిగినది.)

దేశపు బడ్జెటరీ వ్యయము 34334.28 కోట్ల ఇండోనీసియా రూ. దేశపు బ్యాంకులలో బ్యాంక్ నాగర ఇండోనీసియా అనునది ప్రముఖము. విదేశీయ బ్యాంకులును కొన్ని పనిచేయుచున్నవి.

**11. సాంఘిక రంగము** · దేశమున పట్టణములలోను, పల్లెలలోను గృహవసతి చాల తక్కువ దేశమున కార్మికోద్యమము శక్తివంతము; కార్మిక సంఘములలో షరీకత్ ఆర్గనాసి కార్యవాన్ సేలూరా ఇండోనీసియా అనునది అత్యధిక సంఖ్య కలది.

దేశమున నిరక్షరాస్యత అంతరింపజేయబడినదని ప్రభుత్వము 1965 సంవత్సరారంభమున ప్రకటించినది. దేశమున, ప్రీ - ప్రయిమరీ విద్యార్థులు 3,26,218 మంది, 1,25,74,823 మంది ప్రయిమరీ విద్యార్థులు, 16,07,312 మంది జూనియర్ సెకండరీ విద్యార్థులు, 11,48,502 మంది సీనియర్ సెకండరీ విద్యార్థులు కలరు (1968). దేశమున 21 విశ్వవిద్యాలయములు (1 ఇండోనీసియా 2. గజమద 3. అయిర్‌లంగ 4. అందాలస 5. హసనుద్దీన్ 6. పంచచారణ 7. ఉత్తర సుమత్రా 8. శ్రీవిజయ 9 లంబక మంగరాట్ 10. షాకువల 11. దీపనగర 12. ఉత్తర మధ్య శూలవేసి 13. రియావూ. 14. మలూకు 15. తూర్పు నూసా తెంగర 16. పశ్చిమ నూసా తెంగర, 17. చంద్రవాసి 18. మూలవర్మన్, 19. బ్రవిజాజ, 20 పంచశీల, 21. బంద్‌కర్ణో) కలవు. ఇవిగాక బాండుంగ్‌లోను సురబాయాలోను సాంకేతిక విద్యా సంస్థలు రెండు ఉన్నవి. సురబాయాలో ఇస్లామిక విద్యాసంస్థ ప్రభుత్వాధ్వర్యమున పనిచేయుచున్నది. వీని అన్నింట విద్యార్థి సంఖ్య 1,92,416 (1968) విద్యాబోధన 'భాషా ఇండోనీసియా'లోనే సాగు

చున్నను, ఇంగ్లీషు ద్వితీయ భాషగ ఆదరింపబడు చున్నది.

జకర్తాలో ఒక ప్రముఖ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. వృక్ష విజ్ఞానమునకు ఉప కరించు నాలుగు ఉద్యానవనములు (జావాలో మూడు, సుమత్రాలో ఒకటి) ఉన్నవి. దేశమున 86 దిన పత్రికలు కలవు: ఇందు 79 భాషా ఇండోనీసియా లోను, 6 ఇంగ్లీషునను, 1 చీనీభాషలోను వెలువడు చున్నవి (1965).

**12. యాత్రా సౌ. :** దేశమున ప్రాచీన చారిత్రక నిర్మాణ విశేషములు-బౌద్ధ హిందూమత ములకు సంబంధించినవి - అనేకములుకలవు. బౌద్ధ నిర్మాణములలో ప్రముఖము బొరాబుదూర్‌లోని పర్వత స్తూపము. ఒక పర్వతమును ఆధారముగ గొని దిగువనుండి శ్రేణుల వరుసలో నిర్మించిన బౌద్ధ విహారములును, బుద్ధ విగ్రహములును, మధ్యన ఉన్నత శిఖరమున ఒక కేంద్రాలయమునుకలది ఈ స్తూపము. తక్కిన నిర్మాణములందు జావాలోని చండి సింహగిరి, చండీజాగో ఆలయములు ప్రముఖ ములు. బలిద్వీపము ప్రాచీన కళలకు పుట్టినిల్లు. వీనిని దర్శించుటకు యాత్రికులు పలువురు దేశమును దర్శించుచుందురు. విదేశీయ యాత్రికుడు పాస్ పోర్టు, వీసాలను విధిగ కలిగి ఉండవలెను. 1968 లో దాదాపు 40,000 మంది విదేశీయ యాత్రికులు దేశమును దర్శించిరి. వీరు దేశమున దాదాపు 90 లక్షల అమెరికన్ డాలర్లును వెచ్చించిరి.

**ప్రముఖ పౌరులు :** ప్రాచీనులలో మజాపహిత సామ్రాజ్యమును ఇండోనీసియా దీవులకు అన్నింటికిని వ్యాపింపజేసిన మహామంత్రి గజమద (క్రీ. శ. 1331-1365) అను నతడు సుప్రసిద్ధుడు. ఆధునికులలో, దేశమున మహిళోద్యమమును నెలకొల్పి, దానిని పరిపోషించి, మహిళావిమోచ నమునకై కృషిసల్పిన ఆబెంగ్ కర్తినీ రాకుమారి అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినది. దేశపు జాతీ యోద్యమమునకు నాయకుడై స్వాతంత్ర్యమును ఆర్జించి, దేశమును సాంస్కృతికముగ, రాజకీయ ముగ ఏకము చేయుటకు కృషి చేసినవాడు అహమద్ సుకర్ణో (1902-70). చివరి దినములలో ప్రజాదరణను ఈయన కోల్పోయి పదవీభ్రష్టుడైనను ఇతడు దేశమునకు ఎంతయో సేవజేసిన వాడుగను, ఆఫ్రో-ఆసియా రాజ్యములందు ఐకమత్యమును నెలకొల్పుటకు కృషిచేసిన వాడుగను గణనీయుడు. అఫందీ (జ. 1910) సుప్రసిద్ధ కళాకారుడుగ అంతర్జాతీయ కీర్తిని పొందెను.

---

# 3. ఇస్రాయెల్

**ముఖ్యనగరము :** జెరూసెలమ్ (యెరూష లాయిమ్). **జెండా :** తెల్లని భూమికపై, రెండు నీలపు అడ్డుచారలమధ్య, ఆరు కోణముల నీల నక్షత్రము; **జాతీయ గీతము :** హతిక్వా (ఆశ యము); **నాణెము :** ఇస్రాయిలీ పౌను; ఇది 100 అగరాట్‌లుగ విభక్తము ఒక ఇ. పౌ. = రు. 2 14 **కొలతతూకములు :** మెట్రిక్ విధానమునకే అధి కారిక పరిగణన కలదు; అయినను కొన్ని స్థానికపు మానములును వాడుకలో ఉన్నవి. **కాలపరిగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 నిమి.

**1. ఉనికి మొ. :** పశ్చిమాసియాలో మధ్య ధరా సముద్రపు తూర్పుతీరమున సన్నని చీలిక రూపమున, 33°15′ – 29°30′ ఉ. అక్షాంశ

రేఖలకును, 34°17′ – 35°41′ తూ. తులా రేఖలకును మధ్యన నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున లెబనాన్; ఈశాన్యమున సిరియా; తూర్పున జోర్డాన్; దక్షిణ - ఆగ్నేయములందు అకాబా సింధుశాఖయు, ఈజిప్టునకు చెందిన సినాయ్ ప్రాంతమును సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము 20,700 చ. కిమీ; కాని 1967 లో అరబ్




పటము 4.

రాజ్యములతో ఈ దేశము సాగించిన పోరాటపు ఫలితముగ సరిహద్దులు కొంతవరకు మార్పులను పొంది విస్తరించినవి; తత్ఫలితముగ, ఈజిప్టు దేశపు సినాయ్ ప్రాంతమును, జోర్డాన్ దేశపు పశ్చిమ తటభూమియు, సిరియా సరిహద్దున గోలాన్ ఉన్నత భూములును ఈ దేశపు ఆక్రమణ లోనికి వచ్చినవి. ఈ ఆక్రమిత భూముల వైశాల్యము 67,780 చ. కిమీ.

భౌతికముగ, ఉత్తర దక్షిణముల పొడవును అనుసరించి, మూడు ప్రాంతములుగ ఈ దేశమును విభజింపవచ్చును: 1. తీరమైదానము 2. పర్వత ప్రాంతము; ఇందు ఉత్తరపు గాలిలీ గుట్టలును, మధ్యదేశపు సమేరియా, జుడేలును, దక్షిణపు నెగెవ్ మండలమును చేరియున్నవి; 3. జోర్డాన్ లోయ. పర్వత ప్రాంతమున అత్యున్నత శిఖరపు ఎత్తు 1,208 మీ; నెగెవ్ మండలము ఎడారి ప్రాంతము; దేశమున దాదాపు సగపు భూమిని ఇది ఆక్రమించి ఉన్నది. జోర్డాన్ నది ఈ దేశమున 117 కి. మీ. ప్రవహించి, అంతట జోర్డాన్ దేశము లోనికి పోవుచున్నది. మృత సముద్రమునను నాలుగవవంతు హక్కు ఈ దేశమునకు కలదు. (చూ. జోర్డాన్); కిన్నెరెట్ అను వేరొక సరస్సు దేశపు ఉత్తర భాగమున ఉన్నది. ఇదియే గెలిలీ సముద్రమనియు పిలువబడుచున్నది. జోర్డాన్ నది దీని ద్వారా ప్రవహించుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశమున చాలవరకు మధ్యధరా ప్రాంతపు సమశీతోష్ణ పరిస్థితులు కన్పట్టును. ఎండకాలమున ఎండలు 100° ఫా. ను దాటవు. జనవరి మాసమున ఉష్ణత 40° - 50° మధ్య మారుచుండును. తీరమున సముద్రపు తడి గాడ్పులవలన ఉష్ణత గ్రీష్మమున చాల తగ్గియుండును. నవంబరునుండి ఏప్రిల్‌వరకు వర్ష ఋతువు. ఆ సమయమున గెలిలీ ప్రాంతమున సరాసరిన సాలున 106 సెం. మీ వర్షపాతము కలదు. కాని అకాబాసింధుశాఖ ప్రాంతపు ఎడారిలో వర్షపాతము మాత్రము ఏ సంవత్సరమున 2 సెం మీ. ను దాటదు; అయినను ఇట తుషార (Dew) పాతమువలన జలసదుపాయము కొన్ని అదనపు సెం. మీ వరకు లభించుచున్నది. ప్రాచీన కాలమున ఈ ప్రాంతమున పైరు పచ్చలు విరివిగ ఉండెడివని చెప్పబడినను ప్రస్తుతమున తీరమైదానమున మాత్రమే చెట్లు విరివిగ కన్పట్టుచున్నవి; వన్య

జంతువులు చాలవరకు నశించినవి; అచటచట నక్క లును రేచులును మాత్రమే కననగును.

**3 జనసంఖ్య మొ.:** 1961 లో జరిగిన జనాభా లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 21,79,491. కాని ఆ తరువాత వలసచేరిక మొద లగు వానివలన జనసంఖ్య విరివిగ పెరిగినది. 1971 లో ఈ సంఖ్య 32,00,500 కు పెరిగినది. ఇందు పాత జెరూసలేమ్ ప్రాంతపు 68,000 ప్రజా నీకమును చేరియున్నది. (ఈ ప్రాంతమును 1967 తరువాత, ఆక్రమణద్వారా, తన అధీనమున ఇస్రా యెల్ ఉంచుకొనినది). ఇదిగాక తక్కిన ఆక్ర మిత ప్రాంతమున వసించు 10,30,000 ప్రజలు ఇందు లెక్కకు రాలేదు. దేశపు ప్రముఖ నగరము లలో జెరూసెలమ్ (జ. సం. 3,04,500), తెల్ అవీవ్ (జాఫా; జ. సం 3,62,200), హైఫా (జ. సం. 2,17,400) పేర్కొనదగినవి. దేశపు జనసాంద్రత చ. కి. మీ. కు 153. దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు (1969 లెక్కలను అనుస రించి 85.5%) యూదులు. ఈ యూదులలో సాంస్కృతిక రీత్యా పశ్చిమ దేశములనుండి వలస చేరినవారు, తూర్పు దేశములనుండి వలసచేరినవారు అను విభేదములు కలవు; ఈ రెండు వర్గములకును సాంస్కృతిక ఐక్యము క్రమేణ చేకూరుచున్నది. తక్కిన వారందరును అరబ్బీజాతికి చెందినవారు. అరబ్బీ జాతివారిలో మూడింట రెండువంతులు ముస్లిములు; క్రైస్తవులును, తదితరులును, అత్యల్ప సంఖ్యలలో కనుగొననగుదురు. దేశభాష హీబ్రూ అయినను అల్పసంఖ్యాకుల అరబ్బీకి సైతము అధికారరీత్యా మన్నన కలదు; ఆంగ్లభాష, పై తరగతులలో, ఎల్లెడల బోధింపబడుచున్నది.

**4. సమాచార సౌ.** . తంతి, తపాలా మొద లగు సౌకర్యములు దేశమున విరివిగ కలవు. ప్రభుత్వపు యాజమాన్యమున ఇవి పనిచేయు చున్నవి. 1972 లో 525 తపాలాఫీసులును, 370 వేల టెలిఫోనులును దేశమున కలవు. దేశము నందలి ప్రముఖ నగరము లన్నింటిమధ్య రేడియో-టెలిఫోను సౌకర్యము ఉన్నది. 'కోల్ ఇస్రాయెల్' అని వ్యవహరింపబడుచున్న ఒక రేడియో ప్రసార కేంద్రమును, టెలివిజన్ ప్రసార కేంద్రమును జెరూసెలమున పనిచేయుచున్నవి. దాదాపు 6 లక్షల రేడియోలును, 5 లక్షల టెలివిజన్ సెట్లును దేశమున కలవు (1971).

**5. యాన సౌ.:** దేశమున రోడ్ల సౌకర్యము నానాట విస్తరించుచున్నది. దేశపు మొత్తపురోడ్ల నిడివి 9,280 కిమీ; ఇదియంతయు ఉన్నతపు తరగతికి చెందినదియే. ఎర్రసముద్రమును మధ్య ధరా సముద్రముతో సంధించు ఒక ముఖ్యమైన రోడ్డు ఉత్తరమునుండి దక్షిణమునకు పోవుచున్నది. 634 కిమీ. పొడవున ప్రధాన రైలుమార్గము ఒకటియు, మొత్తపు నిడివి 295 కిమీ. గల శాఖా రైలుమార్గములును దేశమున కలవు. హైఫా ప్రముఖమగు రేవునగరము; ఇందలి హార్బరున పెద్ద తరగతి స్టీమర్లుసైతము నిలుచుటకు వసతి కలదు; తక్కిన రేవునగరములలో తెల్ అవీవ్, అష్‌దాద్, ఈలత్ పేర్కొనదగినవి తెల్అవీవ్ నగరపు సమీపమున 'లోడ్'లో ఉన్న విమానాశ్ర యము ఉన్నతస్థాయికి చెందినది. ప్రపంచము నందలి పలుప్రముఖ దేశములకు ఇటనుండి విమాన యాన సౌకర్యము కలదు. దేశాంతర్గత విమాన యానమునకు ఉపకరించు చిన్న విమానాశ్రయములు దేశమున పలుతావులందు కలవు

**6 చరిత్ర:** 1948 వ సంవత్సరమున మే, 14 న, ఐ. రా. స. తీర్మానములను అనుసరించి రూపొందిన ఈ రాజ్యము, ప్రాచీన జాతియగు యూదుల మాతృభూమిగ ప్రాచీన కాలమున మని యుండి, క్రీ. శ. ఒకటవ శతాబ్దిమొదలుగ, వేరు

రూపమున చరిత్రగతిలో పాల్గొని, నేడు మరల యూదుల మాతృభూమిగ అవతరించి కొనసాగు చున్నది. యూదుమతము, యూదుజాతి అనునవి సమానార్థక పదములు. వారియందు జాతియు, మతమును విడదీయరాని రీతిగ పెనగొనినవి. ఒకపుడు, మెసపొటేమియాలో ఉర్ నగర ప్రాంత మున వసించిన ఈ జాతి 'అబ్రహమ్' అను కులపతి నాయకత్వమున, ఆ దేశమును వదలినదనియు, అటనుండి శతాబ్దముల కాలము వేర్వేరు భూములలో పయనించి, అట పెక్కు అవరోధములను ఎదు ర్కొనియు, తన ప్రత్యేకతను, మతవిధానరీతిని విడనాడక మని కడకు పాలస్తీనాను (అనగా నేటి ఇజ్రాయెల్‌ను, తత్పరిసరభూమియు చేరియున్న ప్రదేశమున) చేరి 'సాల్' అనువాని నాయకత్వమున ఇజ్రాయెల్ అను ఒకరాజ్యమును క్రీ. పూ. 11 వ శతాబ్దిలో అట నెలకొల్పినదనియు వారి పౌరాణిక గాథలు తెలుపుచున్నవి. ఇందు చారిత్రక సత్యమును చాలవరకు కలదనుట అటనట జరిపిన త్రవ్వ కములవలన స్పష్టమైనది. కొంతకాలము తరువాత ఈ రాజ్యము అస్సీరియనుల వశమై వారి అనంత రమున క్రీ. పూ. 6 వ శతాబ్దమున పారసీకు లకును, తరువాత క్రమముగ గ్రీకులకును, రోమ నులకును వశమైనది. రోమనుల పరిపాలనను భరింపజాలక యూదులు తిరుగుబాటుచేయగ ఆ ప్రభుత్వము ఆ తిరుగుబాటును నిర్దయతో అద చుటయే గాక జెరూసెలమునందలి యూదుల దేవాలయమును సర్వనాశనము చేసినది. (క్రీ. శ. 71). తత్ఫలితముగ దేశమునందలి యూదులలో అత్యధిక భాగము దేశమును విడిచి చెల్లాచెదరుగా ఉత్తర ఆఫ్రికా, చీనా, యూరప్, భారతదేశము, అరేబియా మొదలుగ పెక్కు ప్రాంతములకు వలస పోయిరి. భారతదేశమున కేరళరాష్ట్రమున నివ సించిన యూదవర్గము, ఈ కోవకు చెందినదియే. ఆయా దేశములందు, అత్యల్పసంఖ్యాకులుగ మను చునే వారలు, తమ చరిత్రను విస్మరింపక, తమ మత విధులను వదలక, ఏనాటికైనను, తమ మాతృభూమికి చేరుకొనునటుల చేయుటకై భగ వానుని వాగ్దానము కలదని నమ్మియుండిరి. తాము చేరిన ప్రాంతములందెల్ల, తను ప్రతిభా, కౌశల, విజ్ఞతల వలన వారు సంఘమున గణ్యతను ఆర్జింప గలిగిరి. యూరపున పారిశ్రామిక యుగము మొల కెత్తినప్పటినుండియు, అందు వారు నిరవధిక కృషి సలిపి, పెక్కు రాజ్యములందు పలుకుబడిని సంపాదించిరి. అయినను 'జీసస్ క్రీస్తు' ను శిలువ వేయించుటలో వారికి ప్రసక్తి కలదను మిషతో, అంతటంతట, యూదసంఘములను క్రూరముగ హింసించుట క్రైస్తవరాజ్యములందు జరుగుచుండెడిది. ఇట్టి పరిస్థితులలో ప్రపంచ యూదులకు అందరికిని మాతృభూమిగ, పూర్వపు ఇజ్రాయెల్ దేశమే కావలెనను ఆందోళన తొలుత రష్యాలో బయలు దేరి, 1897 లో తియోడర్ హెర్‌జెల్ అను రష్యన్ యూదుని నాయకత్వమున బలపడినది. అతడే 'జియోనిజమ్' (యూదవాదము) అను పదమును రూపొందించెను. అప్పటిలో పాలస్తీనా ప్రాంతము తుర్కిసుల్తాన్ అధీనమున ఉండెను ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున యు. స్టే. లోను, గ్రేట్ బ్రిటన్‌లోను వసించుచుండిన యూదప్రముఖులు మిత్రరాజ్యముల సానుభూతిని, యూదుల ఆశయ పూర్తికై పొందుటకు యత్నించిరి. ఇందు ప్రము ఖుడు వీజ్‌మన్.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున పాలస్తీనా ప్రాంతము మాండేటరీ రాజ్యముగ గ్రేట్‌బ్రిటన్‌కు దక్కినది. అంతట నానాజాతి సమితి తీర్మాన మును అనుసరించియు, అదివరకే 1917 లో యూదులకు బ్రిటన్ ఇచ్చిన వాగ్దానమునకు అను గుణముగను, పాలస్తీనాలో, అదివరకు నివసించు ప్రజల మత, లౌకిక స్వత్వములకు భంగము కలుగని రీతిలో ఆ దేశముననే యూదులకు మాతృభూమిని

నెలకొల్పుటకు ఏర్పాటులు జరిగి, తత్ఫలితముగ యూదులు పలుప్రాంతములనుండి అటకు రాదొడగిరి. అచటి అరబ్ ప్రజానీకము ప్రతిఘటించి పోరాడినను ఫలితము లేకపోయినది. అయినను యూదులసంఖ్యను 75,000ను దాటకుండ ఉంచి అరబ్బుల సంఖ్యాధిక్యమును కాపాడుట తన విధానమని బ్రిటన్ ప్రకటించినది (1939). ఇంతలో ప్రపంచ పరిస్థితులు యూదులకు సహకరించినవి; జర్మనీలో యూదుల నిర్మూలనమునకై హిట్లరు సాగించిన మారణహోమమువలన, యూదులయెడ ప్రపంచ ప్రజలకు సానుభూతి అతిశయించినది. అందువలన బ్రిటన్ అనుమతి లేకుండనే ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలమున లక్షలకొలదిగ యూద ప్రజలు దేశమున చేరిరి. మాండేటరీ అధికారపు ఆరంభమున 56,000 మంది యూదులు మాత్రమే దేశమున ఉండగ 1946 కు ఆ సంఖ్య 6,08,000ను దాటినది. ఆ పరిస్థితులలో బ్రిటన్ తన మాండేటరీ అధికారమును నిలుపుకొన జాలక, ఐ రా. స. కు నివేదించినది. అంతట పాలస్తీనా దేశము-అరబ్ ప్రాంతము, యూద ప్రాంతము-అను రెండు ప్రాంతములుగ విభజింపబడునటులను జెరూసలమ్‌కూడ అరబ్ ప్రాంతము, యూద ప్రాంతము అను రెండు భాగములుగ ఉండునటులను ఐ. రా. స. తీర్మానించినది. ఈ నిర్ణయమును ఒప్పుకొనక అరబ్బులు తిరుగుబాటుచేసిరి; తత్ఫలితముగ 1,700 మంది అరబ్బులను యూదులు అంతమొందించిరి; అరబ్బు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు దాదాపు 4 లక్షలమంది ప్రక్కనున్న అరబ్ దేశములకు పోయి అట తలదాచుకొనిరి. అంతట 1948 మే 14 న, ఐ. రా. స. నిర్ణయించిన ప్రాంతములనేగాక, మరికొన్ని ప్రాంతములను తమ అధీనమునకు తెచ్చుకొని 'ఇస్రాయెల్' రాజ్యము అవతరించినటుల యూదులు ప్రకటించిరి. అరబ్ రాజ్యములు అప్పటిలో సైనికరీత్యా జోక్యము వహించినను ప్రతిఫలము లేకపోయినది. 1949 లో ఒక యుద్ధ విరమణరేఖ, ఐ. రా. స సైనిక పర్యవేక్షణలో, రూపొందినను, శాంతి ఏర్పడలేదు.

తదాదిగ ఇస్రాయెల్ – అరబ్ రాజ్యములమధ్య ఏర్పడిన వివాదము ప్రపంచ సమస్యగ పరిణమించినది. 1949 నుండి మరల 3 లక్షలమంది అరబ్బులు, ఇస్రాయెల్‌నుండి, ప్రక్క-దేశములకు కాందిశీకులుగ తరలివచ్చిరి. వీరిలో అత్యధిక భాగము జోర్డాన్ రాజ్యమున పశ్చిమతట భూమిలోచేరి జోర్డాన్ రాజకీయములలో విషమ సమస్యలను తెచ్చిపెట్టిరి. తరువాత 1956, 1967, 1973 లలో ఇస్రాయెల్‌కు అరబ్ రాజ్యములతో యుద్ధములు సాగినవి. వీనిలో రెండవదాని ఫలితముగ ఈజిప్టునకుచెందిన సినాయ్ ప్రాంతమును, జోర్డాన్ లోని పశ్చిమ తటభూమియు, సిరియాకుచెందిన గోలాన్ ఉన్నతభూములును, జెరూసెలమున అరబ్ ప్రాంతమును, ఇస్రాయెల్‌కు దక్కినవి. కాని 1973 లో జరిగిన యుద్ధఫలితముగ సినాయ్‌లోని సూయెజ్ తూర్పుతట ప్రాంతమునుండి ఇస్రాయెల్ వెనుక వైపునకు పోయినది. ప్రస్తుతమున ఈ అన్ని దిక్కులయందును యుద్ధవిరమణ అమలునందున్నది; ఆక్రమిత ప్రాంతములనుండి వైదొలగవలనదిగ ఐ. రా. స. ఆదేశించినను ఇస్రాయెల్ అందు కొన్నింటినుండి మాత్రమే వైదొలగినది. అరబ్‌రాజ్యములతో యుద్ధవిరమణ అమలునందున్నను పాలస్తీనా కాందిశీకులు రూపొందించుకొనిన విమోచనదళములు అంతటంతట ఇస్రాయెల్ సేనలపై చెదరు దాడులు జరుపుటయు, వారి స్థావరముల నిర్మూలనపు నెపమున ప్రక్క అరబ్ రాజ్యముల, ముఖ్యముగ లెబనాన్, సరిహద్దులపై, దాడులను ఇస్రాయెల్ జరుపుటయు సాగుచునే యున్నది. పాలస్తీనా కాందిశీకుల సమస్య అతి తీవ్రమనుట ప్రపంచ రాజ్యములలో అనేకములు గుర్తించినవి; ఆ కాందిశీకుల నాయకుడుగ అరాఫత్ సేనానికి ఐ. రా. స. యు

పరిగణనను కల్పించినది (నవంబరు, 1974). ఈ సమస్యను విజ్ఞతతో పరిష్కరించినపుడే పశ్చిమాసియాయందు శాంతి నెలకొనగలదు.

**7. పరిపాలన :** దేశమున గణరాజ్య ప్రభుత్వ విధానము అమలునందున్నది. సుస్థిర రూపమున రాజ్యాంగ విధానము రూపొందింపబడకపోయినను నెస్సెత్ (జాతీయ శాసనసభ) అంతటంతట రాజ్యాంగరీతినిగురించి చేయు వివిధ శాసనములే క్రమముగ రాజ్యాంగ విధాన చట్టముగ క్రోడీకృతములు కాగలవని తీర్మానింపబడినది. 18 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతి పౌరునికి, స్త్రీ, పురుష వివక్షత లేకుండ, వోటుహక్కు కలదు. నెస్సెత్ యొక్క పదవీకాల పరిమితి 4 సంవత్సరములు. నెస్సెత్‌నకు ఎన్నికలు నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమును అనుసరించిన రహస్యపు వోటింగు ద్వారా జరుగును. నెస్సెత్‌లోని సభ్యులు రహస్యపు వోటింగులో అధ్యక్షుని ఎన్నుకొనెదరు అతని పదవీకాల పరిమితి 5 సంవత్సరములు. నెస్సెత్ సభ్యులలోనుండి ఒకనిని ప్రధానిగ అధ్యక్షుడు నియమించగ, ఆ ప్రధాని తన విశ్వాసపాత్రులగు వారిని కొందరిని మంత్రులుగ నియమించి మంత్రివర్గమును ఏర్పరచును ఈ మంత్రు లందరును నెస్సెత్‌లోని సభ్యులు కావలయునను నియమము లేదు. కాని మంత్రివర్గమును ఏర్పరచిన వెను వెంటనే, ప్రధాని దానిని నెస్సెత్‌కు తెలియపరచి నెస్సెత్‌యొక్క ఆమోద తీర్మానమును పొందినపుడే ఆ మంత్రివర్గమునకు పాలించు హక్కు కలుగును. దేశమున 12 రాజకీయ పక్షములు కలవు. ఇందులో మపాయ్ (ఇజ్రాయెల్ కార్మిక పక్షము), గహాల్ (మితవాద పక్షము), మిజ్‌రాచీ (జాతీయమత పక్షము) అనునవి ప్రముఖములు. నెస్సెత్‌లోని 120 మంది సభ్యులలో ప్రస్తుతమున 88 మంది సభ్యులు ఈ మూడు పక్షములకును చెందియున్నారు. కార్యనిర్వహణాధికారము మంత్రివర్గమున న్యస్తమై ఉన్నది. నెస్సెత్‌కు బాధ్యత వహించి దాని విశ్వాసమును కలిగియున్నంత కాలము, మంత్రివర్గము పాలించుచున్నది. పరిపాలనా సౌలభ్యమునకై దేశము ఆరు మండలములుగ విభక్తమైనది. మత విధులకు సంబంధించిన విషయముల నిర్ణయమునకై ఆయా మత సంప్రదాయములకు వేర్వేరు న్యాయస్థానములు ఉన్నను తక్కిన పౌర, దండ వ్యవహారముల పరిష్కారమును, ఆధునిక లౌకిక న్యాయశాస్త్ర సంప్రదాయమును అనుసరించి నిర్వర్తించు న్యాయస్థానములు, స్థాయీ భేదములతో దేశమున పనిచేయుచున్నవి.

**8. దేశరక్షణ :** పోరాటమున జన్మించి, పోరాటములోనే మనుచున్న ఈ దేశము తొలుతనుండియు ఆధునిక పరికర సమేతమగు సుశిక్షిత సైన్యమును సమకూర్చుకొనుటలో శ్రద్ధవహించినది. దేశములోని యూదు జాతీయులందరును, విధిగ సైనిక శిక్షణను పొందియుండవలయునను నియమము కలదు. 18 నుండి 26 ఏండ్ల మధ్య వయస్సుగల స్త్రీగాని, పురుషుడుగాని ఆ శిక్షణను పొంది తీరవలయును. దేశావసరము కలిగినపుడు వీరందరును సైన్యమున చేరి పనిచేయవలయును. స్త్రీలు పోరాటమునగాక, దక్కిన కార్యక్రమములందు విధి నిర్వహణను సాగింతురు. దేశమున శాంతి కాలమునందు 61,500 మందికల భూతలసేనయు, 2,200 మందికల నావికసేనయు, 11,000 మంది కల వైమానికసేనయు పనిచేయుచున్నవి. ఫ్రెంచి వారినుండియు యు. స్టే. నుండియు సేకరింపబడిన అత్యంతాధునిక యుద్ధ విమానములును, ఆయుధములును ఈ దేశమునకు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు ఈ దేశమునకు 1949 లో సభ్యత్వము లభించినది. అమెరికా, పశ్చిమయూరపునందలి రాజ్యములతోను, ఆఫ్రికా ఖండమున అరబ్బు రాజ్యములు తప్ప

తక్కిన వానితోను, ఆస్ట్రేలియా, న్యూజీలాండుల తోను ఈ దేశమునకు దౌత్య సంబంధములు కలవు. ఆసియాయందు ఫిలిప్పీన్ ద్వీపములు, జపాన్, తాయిలాండు అనువానికి మాత్రమే ఈ దేశముతో దౌత్య సంబంధములు కలవు. కమ్యూనిస్ట్ రాజ్యము లలో రుమేనియా మాత్రమే దౌత్యసంబంధము కలిగియున్నది. అరబ్బు రాజ్యములు, వైరుధ్య ఫలితముగను, తక్కిన దేశములు పాలస్తీనా సమస్యయెడగల సానుభూతి వలనను ఇస్రాయెల్‌తో దౌత్యసంబంధములను పెట్టుకొనకున్నవి. యూదుల ఎడ సానుభూతిని వహించిన భారతదేశము సైతము, పాలస్తీనా సమస్యయెడ ఇస్రాయెల్ వహించిన కఠోర వైఖరికి నిరసనగ, ఇస్రాయెల్‌తో దౌత్య సంబంధములను పెట్టుకొనకున్నది.

**10. ఆర్థిక రంగము :** ఇరువదియేడు సంవత్సరముల క్రితమున మాత్రమే రూపుగొని, తదాదిగ ఎడతెగని సరిహద్దు పోరాటములలో మునిగియున్న ఈ దేశము అవరోధములను అన్నింటిని ఎదుర్కొనుచు ఆర్థికరంగమున సాధించిన పురోగతి, మానవుని సంకల్పమునందలి పటుత్వమునకు ఒక నిదర్శనముగ భావింపదగును. ఇట్టి పురోగతికి, విదేశములనుండి అంతటంతట, వచ్చిచేరిన పెట్టుబడులు కారణమనుట కొంత నిజమేయైనను, అచటి ప్రభుత్వమును ప్రజలును సహకారముతో సాగించిన కృషికి అందు ఎక్కువ భాగస్వామ్యము కలదనుటను ఎవరును కాదనలేరు. ఇటుల విదేశములనుండి వచ్చిచేరిన పెట్టుబడులు 1967 నాటికి 930 కోట్ల డాలర్లుగ లెక్కతేలినవి.

దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి చాల తక్కువ; క్రొత్తభూమిని సాగునకు అనుకూలముగ చేయుటకు ప్రభుత్వము సాగించిన కృషిఫలితముగ 1971-72 లో దేశపు మొత్తమున 10 లక్షల ఎకరముల భూమి సాగయినది; ఇందు 480 వేల ఎకరములకు నీటిపారుదల వసతులు సమకూర్చబడినవి. ఎక్కువ భూమిని సాగునకు తెచ్చుటలో ముఖ్యమగు అవరోధము నీటి కరువు. దీనిని ఎదుర్కొనుటకై 'జల పరిపాలనా వ్యవస్థ' అనుదానిని ఒక ప్రత్యేకాధికారి ఆధ్వర్యవమున ప్రభుత్వము నియమించినది. ఉత్తరపు నదులనుండి నీటిని దక్షిణపు ఎడారులకు తరలించుట, జలాశయములను నిర్మించి నీటిని నిలువజేసి, అదనున ఉపయోగించుట, కొన్నియెడల సముద్రపు నీటిని యంత్రసాధనములద్వారా మంచినీటిగ, తక్కువ ఖర్చుతో, మార్చి, వినియోగించుట మొదలగు కార్యక్రమములను ఈ వ్యవస్థ నిర్వహించుచున్నది.

వ్యవసాయ రంగమున సహకార విధానమును ఇస్రాయెల్ చక్కగ ఉపయోగించుకొని, తక్కిన దేశములకు వరవడిని దిద్దగలిగినది. సహకార రీతిలో సమష్టిగ వ్యవసాయము ఇట పలు క్షేత్రములందు సాగుచున్నది. ఈ క్షేత్రములను 'కిబ్బుజ్'లు అని వ్యవహరింతురు. ఇందు వ్యవసాయికులందరును సమష్టి హక్కుకలిగి, ఆదాయ, వ్యయ, శ్రమలకు సమముగ హక్కు బాధ్యతలను కలిగియుందురు. గోధుమ, బార్లీ మొదలగు ఆహార ధాన్యముల విషయమున దేశము స్వయంపోషకముగ ఉన్నది; పండ్లు, అందును నిమ్మజాతి పండ్లు, విరివిగ దేశమున ఉత్పత్తియగుచున్నవి. 1971-72 లో 9,36,000 టన్నుల నిమ్మజాతి పండ్లు ఎగుమతి చేయబడినవి. పశుసంపద, ప్రభుత్వపు ప్రోత్సాహమున, విరివిగ అభివృద్ధిచెందినది. మాంసము, పాలు దేశవాసులకు అవసరమయినంత వరకు లభ్యములగుచున్నవి. సముద్ర తీరము లందును, సరస్సులందును చేపల పరిశ్రమయు విరివిగ అభివృద్ధి చెందినది. అయినను మొత్తముమీద జాతీయోత్పత్తిలో వ్యవసాయమువలన 6% మాత్రమే లభించుచున్నది; కార్మికశక్తియందు 8% మాత్రమే ఇందులకు వినియుక్తమగుచున్నది.

దేశమున జాతీయాదాయమున 27% పరిశ్రమల వలన లభించుచున్నది; నానాట ఈ శాతము పెరుగు చున్నది. ఈ ఉత్పత్తిలో అధికభాగము దేశావసర ములకే సరిపోవుచున్నను, దేశపు మొత్తము ఎగు మతులలో 50% పారిశ్రామిక ఉత్పత్తులే. పారి శ్రామికపు ఎగుమతులలో ప్రముఖమైనది సానబెట్టిన వజ్రముల ఎగుమతి. ముడివజ్రములను చౌకగా దిగుమతి చేసికొని వానిని సానబెట్టి ఎక్కువధరకు ఈ దేశము ఎగుమతి చేయుచున్నది. విద్యుత్పరి కరములు, వైద్యుతిక సామగ్రి, యాన సాధన యంత్ర పరికరములు, లోహ పరిశ్రమలు, తక్కిన పరిశ్రమలలో పేర్కొ నదగినవి. జవుళి పరిశ్రమయు చాల అభివృద్ధిని ఆర్జించినది; ఈ ఉత్పత్తిలో 15% ఎగుమతి యగుచున్నది. 1971 లో విద్యుదుత్పత్తి 676.9 కోట్ల కి. వాట్లు.

దేశమున పెట్రోలు గనులు విరివిగలేవు. ఉన్న వానియందలి ఉత్పత్తి సాలున లక్ష టన్నులు మాత్రమే; దేశపు ఆక్రమణలోఉన్న సినాయ్‌లో 1971 న కొన్ని పెద్ద వనరులు కనుగొనబడినవి. కాని ఈ ప్రాంతమును తిరిగి ఈజిప్టునకు 1975 లో ఇచ్చివేయుట జరిగినది. మృత సముద్రపు దాపున లభించు ఇంధనవాయువు, ఫాస్ఫేటు-పొటాష్ పరి శ్రమలకు వినియుక్త మగుచున్నది. దక్షిణ నెగెవ్‌లో రాగిగనులు కనుగొనబడి, ఉత్పత్తి 1972 లో మొదలైనది. దేశపు ఎగుమతుల విలువ 11,01,892 వేల డాలర్లు; దిగుమతుల విలువ 19,57,538 వేల డాలర్లు (1972). దేశము పారి శ్రామిక పథమున అభివృద్ధిని సాగించుటకు యంత్ర ములను దిగుమతి చేసుకొనుచున్నందున ఈ చెల్లిం పులలోటు తప్పని సరియగుచున్నది. విదేశముల వలన సహాయము, విదేశములలోని యూద ధని కులు పంపించు పెట్టుబడులు ఈ లోటును పూరించు చున్నవి. దేశమున సాలునకు తలసరి ఆదాయము 1,147 డాలర్లు (1968). బడ్జెటరీ వ్యయము 1,980 కోట్ల ఇజ్రాయెల్ పౌనులు. ఇందు అభి వృద్ధి కార్యక్రమములకు 467 కోట్ల పౌనులు ఖర్చగు చున్నది (1973-74). ఇజ్రాయెల్ బ్యాంకు అను నది కేంద్ర బ్యాంకుగ వ్యవహరించుచున్నది. వ్యాపా రపు బ్యాంకులు 8 కలవు.

**11. సాంఘిక రంగము:** సాంఘిక సంక్షే యమునకై ప్రభుత్వము శ్రద్ధతో కృషిచేయు చున్నది. అశక్తులు, వికలాంగులు, అనాథలు అయినవారికి పెన్షన్‌లను ప్రభుత్వము చెల్లించు చున్నది. హదస్సావంటి కొన్ని సాంఘిక సంస్థ లును, వలసవచ్చినవారు తొలుత ఎదుర్కొను, సమ స్యలను పరిష్కరించుటకు సాయపడుచున్నవి. దేశ మున గృహనిర్మాణము అతిత్వరితగతిలో ముందు నకు సాగుచున్నది. 1970 నాటికి దేశమున (1955 మొదలుగ) 5 లక్షల నూత్న గృహవస తులు కల్పింపబడినవి. వీనికి అయిన వ్యయమున మూడింట రెండువంతులను ప్రభుత్వమే భరించినది. 14 ఏండ్ల వయసువరకు బాలబాలికలకు నిర్బంధ ఉచిత విద్యాశిక్షణవసతి ఉన్నది. యూదులకు హిబ్రూలోను, అరబ్బులకు అరబ్బీలోను విద్య బోధింపబడుచున్నది. 1971 - 72 లో అన్ని తరగతుల విద్యాశాలలందును మొత్తముమీద 6,27,208 యూద విద్యార్థులును, 1,19,400 అరబ్బీ విద్యార్థులును పఠించుచుండిరి. ఉన్నత విద్యా సంస్థలు ఆరు కలవు. విదేశములనుండి వచ్చిన విద్యార్థులు సైతము వీనియందు కొన్నింట శిక్షణ పొందుచున్నారు. ఆ సంస్థలందు ప్రముఖ మైనవి: 1. జెరూసెలమ్‌లోని హిబ్రూ విశ్వ విద్యాలయము, 2. హైఫాలోని ఇజ్రాయెలీ టెక్ని యాన్. పై ఆరు సంస్థలలోని విద్యార్థి సంఖ్య 28,520 (1968-69). విద్యకై సాలు వ్యయము 143.33 కోట్ల ఇ. పౌనులు. దేశమున 26 దిన పత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో మూడు

తప్ప తక్కినవి తెల్-అవీవ్‌నుండి ప్రచురింపబడు చున్నవి. దినపత్రికలలో అత్యధికభాగము హిబ్రూ భాషకు చెందినవి. అరబ్బీకి చెందినవి రెండు కలవు; ఇంగ్లీష్, ఫ్రెంచి, జర్మన్, ఇద్దిష్, హంగేరియన్, పోలిష్ భాషలకు చెందినవి ఒక్కొక్క పత్రిక చొప్పున కలవు. జెరూసెలములోని జాతీయ గ్రంథాలయమును, ఇస్రాయెల్ మ్యూజియమును ప్రముఖములు. తెల్ అవీవ్‌లో ఒక ప్రసిద్ధమగు మ్యూజియమును, అరబ్బీ గ్రంథాలయమును కలవు

దేశమున వైద్య సహాయము, ప్రభుత్వ సంస్థల అధ్వర్యమునను, వైద్య వృత్తిసంస్థలవలనను విరివిగ లభించుచున్నది. 410 మంది ప్రజలకు 1 డాక్టరు కలడని లెక్కలవలన తెలియుచున్నది (1969) ప్రపంచమునందు వేరుగ ఎచటను ఇట్టి నిష్పత్తి సౌకర్యము కనబడదు. అన్ని విధముల డాక్టర్లను చేరి దేశమున 9,000 మంది కలరు; శయ్యాసంఖ్య 21 610; ఆసుపత్రులు 158; మాతా శిశు ఆరోగ్య రక్షా కేంద్రములు 600 (1969).

**12. యాత్రా సౌ. :** ప్రభుత్వాదాయమున గణనీయాంశము యాత్రికులవలన లభించుచున్నది. దేశపు పురోభివృద్ధిని కనుగొనుటకు, ప్రాచీన స్థలములను దర్శించుటకును, మత క్షేత్రములను సేవించుటకును పలువురు సాలుపొడవున దేశమునకు వచ్చుచుందురు. 1972 లో ఇట్టివారి సంఖ్య 7,27,582; వీరికి సౌకర్యములను చేకూర్చుటకు ఒక ప్రత్యేక ప్రభుత్వశాఖ పనిచేయుచున్నది.

**13. ప్రసిద్ధ పురుషులు :** ఇస్రాయెల్ నిర్మాణమున ప్రముఖపాత్ర వహించిన చెయిమ్ వీజ్‌మన్ (1874-1952) యూద వాదోద్యమపు నాయకుడు గనేగాక ప్రముఖ రసాయనికుడుగను సుప్రసిద్ధుడు; నోబెల్ బహుమతిని 1966 లో పొందిన హాలేవీ అగ్నాన్ (1888-1970) సుప్రసిద్ధ నవలా రచయిత

---

# 4. ఇరాక్

**ముఖ్యనగరము :** బాగ్దాద్; **జెండా :** ఎరుపు, తెలుపు, నలుపు వర్ణముల అడ్డుచారలలో, మధ్యనున్న తెలుపు చారలపై వరుసగ ఆకుపచ్చ వర్ణమున చిత్రితములగు మూడు నక్షత్రములు; **నాణెము:** ఇరాక్ దీనార్; 1000 ఫిల్లులుగ ఇది విభక్తము. 1. ఇరాక్ దీనార్ = రు.21.00 ; **కొలతూకములు :** మెట్రిక్ విధానమునకు సాధికారిక పరిగణన ఉన్నను, స్థానికమానములు చాల ప్రదేశములందు వాడుకలో ఉన్నవి. **కాలపరిగణన:** సా. 3-00 గం = సా. 5-30 భారతదేశమున.

**1. ఉనికి మొ. :** పశ్చిమాసియా యందు 29°-37°30′ ఉ. అక్షాంశరేఖల మధ్యను, 39°-48° తూ. తులారేఖల మధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున తుర్కీదేశమును, తూర్పున ఇరాన్; దక్షిణ నైరృతులందు పారసీక సింధుశాఖ, కువాయిట్, సాదీ అరేబియాలును: వాయవ్యమున సిరియాయును, సరిహద్దులందున్నవి. దేశపు మొత్తపు విస్తీర్ణము 4,34,924 చ. కిమీ. భౌతికముగ ఈదేశము మూడుమండలములుగ విభక్తము :— (1) పశ్చిమ నైరుతి దిశలందు ఉన్న ఎడారిభూమి (2) మైదానములు (3) ఈశాన్యమున ఉన్న ఉన్నతభూములు ఇందు ఎడారిభూమి ఎత్తు సముద్రమట్టముపై 610 మీ. నుండి 915 మీ. వరకు మారుచుండును;

కాని యూఫ్రటిస్‌నదిపై పునకు వచ్చుకొలది ఎత్తు తగ్గును: ఇచట నీటి సదుపాయము బావులవలనను, వెల్లువనీరు నిలిచి, 'వాడీలు' అని వ్యవహరింపబడు జలాశయములవలనను లభించుచున్నది. ఇక యూఫ్రటిస్, టైగ్రిస్ అను రెండు మహానదులను ఆశ్రయించిన మైదానపు ప్రాంతము, రెండు ప్రాంతములుగ ఒకచిన్న తిప్పలవరుస వలన విభక్తము. పైనదుల వండ్రుమట్టిచేత రూపొంది




పటము 5.

నదియే ఇందలి దిగువ భాగము. బస్రావద్ద ఈ రెండునదులు సంగమించి ఒకే ఒక ప్రవాహముగ, షత్ అల్ అరబ్ అనుపేర, పయనించి, సముద్రమున చేరును. ఈ ప్రవాహపు లోతు వెడల్పులు చాల గొప్పవి అగుటవలన సముద్రయానము చేయు పెద్ద స్టీమరులుసైతము ఇందు పయనించి బస్రా వరకు రాగలుగుచున్నవి. యూఫ్రటిస్, టైగ్రిస్ నదుల మహాప్రవాహమును నియమనము చేయుటకై ఆనకట్టలు కట్టి, సేద్యపుభూములకు పారించుట, ఇరాక్ చరిత్రలో తొలుతటినుండియు కనవచ్చుచున్నది. దేశమున ఈశాన్య ప్రాంతమున కనవచ్చు ఉన్నతభూములు, ఒక్కొకచోట 3000 మీ.ల ఎత్తును కూడ దాటుచున్నవి.

**2. శీతోష్ణస్థితి ము.:** ఇచట మేనుండి అక్టోబరువరకు ఎండలు కాయును; ఆ సమయమున అత్యధిక ఉష్ణోగ్రత 120° ఫా.; శీతకాలమున అత్యల్ప ఉష్ణోగ్రత 50° ఫా. సాధారణముగ అక్టోబరు – మే నెలల మధ్యకాలమున వానలు కురియును. అత్యధిక వర్షపాతము 37 5 సెం. మీ. అత్యల్ప వర్షపాతము 14 సెం, మీ.; అందువలన వ్యవసాయము నీటిపారుదల వసతులపై మాత్రమే ఆధారపడి ఉన్నది; యూఫ్రటిస్, టైగ్రిస్, నదీమండలముల దిగువ భాగమునను, వండ్రు నేలలందును రెల్లుజాతి మొక్కలే కాక, పెద్ద చెట్లును కననగుచున్నవి. రెండునదుల లోయకు తూర్పున ఉన్న జగ్రోస్ పర్వతశ్రేణిలో ఓక్ జాతి మహావృక్షములు కలవు; లేళ్లు, నక్కలు మొదలగు అల్పములగు వన్యజంతువులు మాత్రమే దేశమున కన్పట్టును

**3 జనసంఖ్య ము.:** 1965 లో జరిగిన జనాభా లెక్కల సేకరణను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య 80,97,230; 1971 అంచనాలను అనుసరించి ఆ సంఖ్య 97,50,000. దేశపు నగరములలో బాగ్దాదు (జనసంఖ్య 18,84, 151), మొసల్ (జ స. 3,43,121), బస్రా (జ. సం. 4,20,145) ముఖ్యముగ పేర్కొనదగినవి. ప్రజలలో సగము మంది పల్లెలలో నివసించుచున్నారు. ప్రజలలో దాదాపు 80% అరబ్‌జాతివారు; అల్పసంఖ్యాకులలో కుర్దు ముస్లిములు ప్రముఖులు; జాగ్రోస్ పర్వతపరిసరమునందు, క్రీ. పూ. 3000 నుండి ఈ జాతివారు నివసించుచున్నటుల తెలియుచున్నది. తుర్కొమన్‌లు మొదలగు ఇతర అల్ప సంఖ్యాక జాతులవారును కొలదిగ కలరు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిములు. దాదాపు 2,50,000

క్రైస్తవులు (వివిధ శాఖలవారు) కలరు. ప్రజలలో అరబ్బీని 79%, కుర్దిషీను 16% పారసీక భాషను 3% తుర్కీభాషను 2% మాతృభాషలుగ కలిగి యున్నారు. వ్యాపార వ్యవహారములందు ఇంగ్లీష్, ఫ్రెంచి భాషలకు బహుళవ్యాప్తి కలదు.

**4. సమాచార సౌ.** : దేశమున సువ్యవస్థిత మగు తంతి, తపాలా, టెలిఫోను వసతి కలదు. 1968 లెక్కలను అనుసరించి 322 తంతి, తపాలా ఆఫీసులు పనిచేయుచున్నవి. దేశమున గల దాదాపు 120 వేల టెలిఫోనులలో సగము బాగ్దాదున కలవు. బాగ్దాదున ఒక రేడియోప్రసారకేంద్రమును. టెలివిజన్ ప్రసార స్థావరమును, పనిచేయుచున్నవి.

**5 యాన సౌ.**: దేశపు భౌతిక పరిస్థితులవలన, రాక, పోకల వసతులకై రోడ్లనిర్మాణమును సాగించుట క్లేశకర సమస్యగ పరిణమించినది. నదీలోయలు వెల్లువలకు గురియగుచుండుట, నదులే కొన్ని యెడల గతులను మార్చుకొనుట ఇందులకు ముఖ్యకారణములు. పూర్వపు బిడారు మార్గములను అనుసరించి కచ్చారోడ్లు కొన్ని కలవు వీని అన్నింట ప్రముఖమైనది, జోర్డాను సరిహద్దునుండి బాగ్దాదు నగరముద్వారా ఇరాన్ సరిహద్దునకు పోవుచున్నది ఇట్టి రోడ్లను, అధునాతనరీతిలో చక్కబరచుటకు ప్రపంచబ్యాంకు సహాయముతో ప్రభుత్వము కృషి చేయుచున్నది. అన్నివిధముల పక్కా రోడ్లనిడివి. 7280 కిమీ బాగ్దాదునుండి సిరియా సరిహద్దునకు ఒక రైలుమార్గమును, దేశపు ఉత్తరప్రాంతము నందలి ఇర్బిల్నుండి కిర్కుక్, బాగ్దాదులద్వారా బస్రాకు వేరొక రైలుమార్గమును కలవు. మొత్తపు రైలుమార్గముల నిడివి 2528 కిమీ (1970). బస్రా ప్రముఖమగు రేవునగరము దేశపు అంతర్జాతీయ వ్యాపారము అంతయు ఈ రేవుద్వారా నడచును. బాగ్దాదు, బస్రాలందు అంతర్జాతీయ విమానమార్గమున ఉన్న ప్రముఖ విమానాశ్రయములు కలవు.

**6 చరిత్ర** : అతి సనాతన కాలమునుండియు మానవావాసభూమిగ పేరొందీ, మానవజాతికి సంస్కృతి భిక్షను ప్రసాదించిన ప్రాచీన నాగరికతా కేంద్రములలో ఇది యొకటి. క్రీ. పూ. 3500 లోనే ప్రౌఢతను ఆర్జించిన సుమేరు రాజ్యమునకును, దానిని అనుసరించి క్రమముగ వర్ధిల్లిన బాబిలోనియన్, అసీరియన్ నాగరికతలకును నిలయము ఈ దేశమే. ఈ దేశమే ప్రాచీనగ్రీకు చరిత్రకారుల చేత మెసపొటేమియా (రెండు జలప్రవంతుల మధ్యదేశము లేదా ద్వీపము) అను పేరుతో వ్యవహరింపబడి, తరువాత ఈ శతాబ్ది తొలిపాదము ముగియువరకు ఆ పేరుతోనే ప్రసిద్ధిని పొందినది. క్రీ శ. ఆరవశతాబ్దిలో ఈ ప్రాంతము పారసీక సామ్రాజ్యమున అంతర్భాగమై, అనంతరమున, ఆ సామ్రాజ్యమును అంతమొందించిన గ్రీకులకు వశమైనది. గ్రీకు విజేత అలెగ్జాండరు ఈ దేశము నందలి బేబిలన్ నగరమున మరణించెను (క్రీ పూ. 323). క్రీ పూ. 138 లో గ్రీకులను తరిమివైచి పార్థవులు (పార్థియన్లు) అను రాజవంశికులు దీనిని వశపరచుకొని పాలించిరి. క్రీ శ. 224 లో వారిని అంతమొందించి శశ (ససానియన్) వంశీయులగు పారసీక రాజులీ దేశమును తమ రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి. వీరి కాలమున రోమన్లతో పారసీకులు సాగించిన సరిహద్దు యుద్ధములకు ఈ దేశము నెలవైనది. క్రీ. శ. 637 లో పారసీకులను పదభ్రష్టులను చేసి ఇస్లామిక సేనావాహినులు తక్కిన పారసీక రాజ్యముతో పాటుగ దీనిని కైవసముచేసికొని ఇస్లామును ఎల్లెడల వ్యాపింపజేసినవి. వారి పరిపాలనలో కొంతకాలము వరకు (అబ్బాసీయ, కలీఫాల ఆధిపత్యమునందు) ఈ దేశపు బాగ్దాదు నగరము ఒక ఇస్లామిక సామ్రాజ్యమునకు ముఖ్య నగరముగ వర్ధిల్లినది. 13 వ శతాబ్దిలో మంగోలు సేనలు ఈ దేశముపై దండెత్తి ముఖ్యనగరమునే

గాక, దేశపు ఆర్థికవ్యవస్థనే సర్వనాశనము చేసినవి. 1534 లో ఇది తుర్కీ సామ్రాజ్యమున అంతర్గత మైనది. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున శాంతిసంధిని అనుసరించి, బ్రిటనుకు మాండేటరీ రాజ్యముగ ఈ దేశము దక్కినది. అయినను ప్రజల స్వాతంత్ర్య కాంక్షను అణగద్రొక్కజాలక అమీర్ ఫైజల్ అను అరబ్బీనాయకుని దేశ ప్రభువుగ బ్రిటిష్‌ప్రభుత్వము గుర్తించి (1921), క్రమముగ దేశమునుండి వైదొలగి, మైత్రి ఒడం బడికను చేసికొనెను (1930). 1932 లో ఇరాక్ సర్వ స్వతంత్రము కాగల్గెను. 1958, జులై 4 న సైన్యము కాశిమ్ నాయకత్వమున తిరుగుబాటుచేసి, రాజరికమును అంతముచేసినది. తరువాత వివిధ వర్గముల తిరుగుబాటుల వలన పలు మారు చేతులు మారిన ప్రభుత్వము 1968 లో జనరల్ అహమద్‌హసన్ అలీబకర్ వశమైనది. అతని అధ్యక్షతన ఏర్పడిన గణరాజ్య ప్రభుత్వము ఇప్పుడు పరిపాలనను సాగించుచున్నది.

ఇజ్రాయెల్‌తో అరబ్బులు సాగించిన అన్ని యుద్ధములందును ఇరాక్ యథోచిత సాహాయ్య మును అరబ్‌రాజ్యములకు అందజేసినది. ఇప్పటి గణరాజ్య ప్రభుత్వము దేశమునందలి కుర్ద్ అల్ప సంఖ్యాక సమస్యను, సామరస్యధోరణిలో పరిష్క రించుకొనగలిగినది.

**7. పరిపాలన :** 1958 లో రాజరికము అంతమైనప్పటినుండియు దేశమున గణరాజ్య ప్రభుత్వము అమలున ఉన్నది. 1968 లో జారీ అయిన తాత్కాలిక రాజ్య విధానమును అనుసరించి పరిపాలన నిర్వహింపబడుచున్నది. జాతీయ మతమగు ఇస్లామును అనుసరించు విధానములు ప్రాతిపదికగ ప్రజాస్వామ్యయుతమగు గణరాజ్య ప్రభుత్వము ఇరాకున అమలునందున్నటుల ఆ రాజ్యాంగ విధానము తెలుపుచున్నది. ప్రజలకు మత, అభిప్రాయ, సమావేశాది స్వాతంత్ర్యములు కలవు. జాతీయ శాసనసభ రూపొందు వరకు విప్లవ సమితికే పరిపాలన అప్పగింపబడినది. ఈ సమితియందు అధ్యక్షుడును, అతడు నియమించిన నలుగురు ఉపాధ్యక్షులును మాత్రమే కలరు. దేశమునందలి 16 రాష్ట్రములను, అధ్యక్షుడు, తాను నియమించు గవర్నర్లద్వారా పాలించును. సౌదీ అరేబియా సరిహద్దున, సమష్టిగ సగము హక్కుగల ప్రాంతమును, ఈ రాష్ట్రములలో చేరి ఉన్నది. దేశమున అరబ్‌బాత్ పక్షము, కుర్దిష్ ప్రజాస్వామిక పక్షము, కమ్యూనిస్ట్ పక్షము అను రాజకీయ పక్షములు కలవు. అరబ్ బాత్ పక్షమే ఇపుడు అధికారమున ఉన్నది. ప్రస్తుతపు దేశా ధ్యక్షుడే ఆ పక్షపు ప్రధాన కార్యదర్శి.

మత సంబంధ విషయములను నిర్ణయించుటకు మత న్యాయస్థానములు, వేర్వేరుగ ఆయా మతముల వారికి కలవు. తక్కిన అన్ని విధముల పౌర, దండ వ్యవహారములను సామాన్య న్యాయసంహిత వలననే కోర్టులు పరిష్కరించుచున్నవి.

**8. దేశరక్షణ :** 18 యేండ్ల వయసువచ్చిన ప్రతి పురుషుడును సైనిక శిక్షను విధిగ రెండేండ్ల కాలము పొందవలెననియు, ఆ తరువాత 18 ఏండ్లలో ఎపుడు సైన్యమున చేరవలసినదని కోరి నను వెంటనే చేరవలయుననియు చట్టరీత్యా విధింప బడినది. 90,000 సైనిక సంఖ్యకల సేన కలదు. ఇందు రెండు పదాతి దళములును, రెండు పార్వ తీయ దళములును, ఒక టాంకు దళమును చేరి యున్నవి. వీరి ఆయుధ సామగ్రిని, సోవియట్ రష్యానుండి, ప్రభుత్వము సేకరించినది. సోవియట్ ప్రభుత్వపు సాయముచే నిర్మింపబడిన చిన్న నౌకాదళమును, 225 పోరాటవిమానములు 7,500 మంది సైనికులును కల వైమానిక దళమును కలవు. సోవియట్ ప్రభుత్వము అధునాతన ఆయుధ సామగ్రిని వైమానిక దళమునకు సమకూర్చినది.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. ను సంస్థాపించిన తొలుతటి సభ్యరాజ్యములలో ఇరాక్ దేశమొకటి; ఐ రా. స. యొక్క అనుబంధ సంస్థల పెక్కింటను ఇరాక్‌కు సభ్యత్వము కలదు. అరబ్ లీగునను తొలుతటినుండియు ఈ దేశము సభ్యత్వమును కలిగిఉన్నది. బాగ్దాదు ఒడంబడిక అనబడు మధ్య ప్రాచ్యరాజ్య సంస్థయందు తొలుత ఈ దేశమునకు సభ్యత్వము ఉండెను. కాని, 1958 విప్లవము తరువాత అందుండి విరమించి ప్రయోజ నాత్మకమగు తటస్థ భావమును తన అంతర్జాతీయ విధానముకు ఆలంబనముగ ఈ దేశము గ్రహించి నది. భారతదేశముతోడను తక్కిన ప్రముఖ దేశ ములతోడను ఇరాక్‌కు దౌత్య సంబంధములు కలవు. కాని ఇజ్రాయెల్ యుద్ధమువలన యు. స్టే. తో 1967 లోను, గ్రేట్ బ్రిటన్‌తో 1971 లోను ఈ దేశము దౌత్య సంబంధములను విడనాడినది.

**10. ఆర్థిక రంగము :** ప్రాచీన కాలము నుండియు ఈ దేశము వ్యావసాయిక దేశమే అయి నను, 1925 లో దేశమున పెట్రోలు గనులు కనుగొనబడినప్పటినుండియు, క్రమముగ దేశ సంప దలో అత్యధిక భాగమునకు ఆ గనులే మూలా ధారము లగుచున్నవి. 1969 లో జరిగిన లెక్కల సేకరణవలన దేశమున ఆ సాలున ఉత్పత్తిఅయిన సంపత్తి విలువ 103.9 కోట్ల దీనారులు. అందు 32% పెట్రోలు ఉత్పత్తుల వలనను, 19% వ్యవ సాయమువలనను లభించినది; కాని నానాట పెట్రోలు ఆదాయము విపరీతముగ పెరుగుచున్నది. ప్రభుత్వాదాయమున మూడింట రెండు వంతులు పెట్రోలు గనులవలన లభించుచున్నది.

అయినను వృత్తిరీత్యా అత్యధిక సంఖ్యాకజనము (దాదాపు 50%) వ్యవసాయమునే ఆశ్రయించి జీవించుచున్నారు. దేశ వైశాల్యమున 46.2% సేద్య యోగ్యమైనను అందు నాలుగవవంతు మాత్రమే సేద్యము చేయబడుచున్నది 1959 లో సోషలిస్ట్ విధానమును అనుసరించి వ్యవసాయ సంస్కరణలు తొలుతగ ప్రవేశపెట్టబడి, 1970 లో అవి సుసంస్కరితములు చేయబడినవి. అయినను ఉత్పత్తిని పెంచవలయునన్నిన, నీటిపారుదల వసతు లను పెంపుచేయవలసిన ఆవశ్యకత కలదు; కావున అనేక ప్రాజెక్టులపై పని సాగుచున్నది. పంటలలో గోధుమ, వరి, బార్లీ ప్రముఖములు. ప్రత్తి పొగాకులును అటనట పండింపబడుచున్నవి. కాని పై పంటలన్నియు దేశపు వినియోగమునకే సరిపోవుచున్నవి ప్రపంచమున లభించు ఖర్జూరపు పంటలో అత్యధికభాగము ఈ దేశమున కలదు. ఇందు చాలవరకు ఇతర దేశములకు ఎగుమతి చేయబడును. పశుసంపద ఎక్కువగ కలదు. చేపల పరిశ్రమకు అవకాశములు తక్కువ. యుగ యుగములనుండి చేపలను పట్టుటవలన నదులలో మత్స్య సంపద సన్నగిల్లినది. దేశమున అటవీ సంపదను ఎక్కువగ వృద్ధిచేయుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది.

దేశపు ఖనిజసంపదలోనెల్ల ప్రముఖమైనది పెట్రోలు; వేరువిధపు లోహపు గనులు ఉన్నటుల సర్వేలవలన తెలియవచ్చినను వానిని వెలిదీయుటకు యత్నములు జరుగుటలేదు. 1970 లోని లెక్క లనుబట్టి పెట్రోలు ఉత్పత్తిని సాగించు దేశము లలో ఉత్పత్తి సామర్థ్యమునుబట్టి యెనిమిదవదిగ ఈ దేశము లెక్కకు వచ్చినది. 1972 జూన్ 1 వ తేదీన నూనె పరిశ్రమ జాతీయము చేయబడినది.

అప్పటినుండి ప్రభుత్వనియమునకు లోబడి కొన్ని కమ్యూనిస్ట్ దేశముల సహాయములతో ఉత్పత్తి సాగుచున్నది. అంచనాలను అనుసరించి 1976 నాటికి పెట్రోలు వలన ప్రభుత్వమునకు ఆదాయము 50 కోట్ల దీనార్లను అందుకొనగలదని

తెలుచున్నది. 1972 మార్చి అంతమునకు ఈ ఆదాయము 35.4 కోట్ల దీనార్లు. దేశమున ఇంధన తైలపు సాయమున విద్యుదుత్పత్తి జరుగుచున్నది; మొత్తము విద్యుదుత్పత్తి 191.4 కోట్ల కిలోవాట్లు. ఇందు దాదాపు సగము బాగ్దాదు నగరమున వినియుక్తము. తక్కిన పరిశ్రమలవలన 10% లోవుగ మాత్రమే జీవించుచున్నారు. అందు ప్రముఖమైనది నూనెశుద్ధి పరిశ్రమ. దేశపు ఎగుమతుల విలువ 5,45,971 వేల దీనార్లు; దిగుమతుల విలువ 2,47,870 వేల దీనార్లు (1971) దేశమున బ్యాంకులు జాతీయములు చేయబడినవి.

**11. సాంఘిక రంగము :** 1960 నుండియు దేశమున ఆధునికరీతిలో గృహముల నిర్మాణమును ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. సాలుసరిన, 15,596 నూత్న గృహముల నిర్మాణము జరుగుచున్నది. దేశమున అక్షరాస్యత చాల తక్కువ. దేశములోని మొత్తపు అన్నివిధముల పాఠశాలలు సంఖ్య 4651. విద్యార్థి సంఖ్య 16,65,723 (1972-73). బాగ్దాద్, మొసల్, బస్రా, సులేమానియా, ముస్తన్‌సిరియాలలో యూనివర్సిటీలు కలవు. ఇందలివిద్యార్థిసంఖ్య 48,073 (1971-72).

దేశమున 15,542 శయ్యలు కల 147 ఆసుపత్రులు వైద్యసహాయమును కల్పించుచున్నవి (1967). బాగ్దాదునుండి అయిదు దినపత్రికలు ప్రచురితములగుచున్నవి.

**12. యాత్రా సౌ. :** దేశమును దర్శించువారిలో అత్యధిక సంఖ్యాకులు, మత క్షేత్రములను దర్శించు ముస్లిములు. 1969 లో ఇటుల వచ్చిన వారి సంఖ్య 10,842.

**13. ప్రసిద్ధ పౌరులు :** బాగ్దాదుననుండి ముస్లిం ప్రపంచముపై ఆధిపత్యమును నెరపిన కలీఫాలలో హరూన్ అల్‌రషీద్(ప. 787-809), అల్‌మామూన్ (ప. 813-33), అల్‌ముతాసిమ్ (833-42) ప్రముఖులు. వీరి కాలమున అరబ్బీ సాహితికి బాగ్దాదు కేంద్రమైనది. ఆ సాహిత్యోద్యమమునకు పట్టుగొమ్మ హునాయిన్ ఇబ్న్ ఇషాక్ (మ. 873). అతని సమకాలికుడు యాకూబ్ అల్-కిండి గ్రీకు తత్వశాస్త్రమును, భారతీయ గణితశాస్త్రమును మథించి సారమును అరబ్బులకు అందజేసెను. ముస్లిం న్యాయశాస్త్రములలో ఒకదాని ఆవిష్కర్తయగు అబూ హనీఫా (మ. 767) ఈ దేశీయుడే.

---

# 5. ఇరాన్

## (కేష్వారే షాహిన్‌షాహే ఇరాన్)

**ముఖ్యనగరము :** తెహ్‌రాన్; **జెండా :** ఆకుపసిమి, తెలుపు, ఎరుపురంగుల అడ్డచారలలో మధ్యనున్న తెలుపు చాయయందు, పంజాలో కత్తిని చేపట్టియున్నటుల చిత్రింపబడిన సింహముపై ఉదయ సూర్యుని చిత్రము కలది జాతీయ పతాకము; **జాతీయ గీతము :** షాహిన్‌షా-ఇ-మా జిందాబాదా (చక్రవర్తి చిరకాలము మనుగాక) అను పల్లవితో మొదలిడును; **నాణెము :** 'రియల్' అను పేరుగల అపరివర్తనీయపు కాగితపు కరెన్సీ; దాని తుల్యమూల్యము 11.732 మిల్లిగ్రాముల బంగారముగ ప్రభుత్వ నిర్ణయముకలదు. వినిమయపు విలువ 101 రియాలులు = రు.10.00. వ్యవహార సౌకర్యార్థమై

ఒక రియాల్ 100 దీనార్లుగ విభక్తము. 5,10,25,50 దీనార్ల నాణెములును, 1,2,5,10 రియాలుల నాణెములును, 5,10,20 50,100, 200,500.1000 రియాలుల నోట్లున్ను చెలామణిలో ఉన్నవి. ఇవిగాక పహ్లవీ అనబడు బంగారు నాణెము, $\frac{1}{4}$, $\frac{1}{2}$, 1 $2\frac{1}{2}$, 5 పహ్లవీల ప్రమాణము లలో అమలునందు ఉన్నది. ఒక పహ్లవీ =7.232 గ్రాముల బంగారము; **కొలతతూకములు :** మెట్రిక్ కొలతలు సాధికారముగ అమలునందున్నను, స్థానిక




పటము 6.

ముగ సాంప్రదాయికపు వివిధరీతుల కొలతూక ములు అటనట వ్యాప్తియందు ఉన్నవి. **కాల పరిగణన :** సా. 3.30 ని. = భారతదేశమున సా. 5. 30. ని.

**1. ఉనికి మొ. :** పశ్చిమ ఆసియాలో హిందూ మహాసముద్ర తీరమున ఉన్న ఈ దేశము 25°-40° ఉ. అక్షాంశ రేఖలమధ్యను 44°-63° తూ. తులారేఖలమధ్యను నెలకొని ఉన్నదని చెప్ప వచ్చును ఈ దేశమునకు ఉత్తరమున కొంత వరకు కాస్పియన్ సముద్రమును, తక్కిన మేరన సోవియట్ దేశమునందలి ట్రాన్స్ కకేసియన్, టర్కిస్తాన్ ప్రాంతములును, తూర్పున ఆఫ్ఘ నిస్థాన్, పాకిస్తాన్ దేశములును, దక్షిణమున పారసీక, ఓమన్ సింధు శాఖలను పశ్చిమమున ఇరాక్, టర్కీ దేశములను సరిహద్దులందున్నవి. దేశపు విస్తృతి 16,48,000 చ. కిమీ.

దేశపు మధ్యభాగము ఒక ఉన్నతమగు పీఠ భూమి; ఈ పీఠభూమి సరాసరి **ఎత్తు** 1.230 మీటర్లు దీనిని పరివేష్టించి దాదాపు అన్నివైపుల పర్వత శ్రేణులు కలవు వీనిలోనెల్ల **అత్యున్నత** మైనది జగ్రోస్ పర్వతశ్రేణి. దీని అత్యున్నత శిఖరపు ఎత్తు 4,300 మీటర్లు. దేశపు వాయవ్యపు కొనన ఆరంభమైన ఈ శ్రేణి, తొలుత నైరుతి మూలగ పయనించి పారసీక సింధుశాఖయొక్క తూర్పు తీరమునుచేరి, అటనుండి తూర్పునకు తిరిగి బెలూచిస్తాన్ వరకు పోవును. వాయవ్యమననే జగ్రోస్ పర్వతశ్రేణి మొదలిడినచోటుననే ఆరంభ మగు వేరొక పర్వతశ్రేణి, 'ఎల్‌బర్జ్' అనబడునది, కాస్పియన్ సముద్రపు దక్షిణ తీరమును ఆశ్ర యించి పయనించుచున్నది. ఈ పర్వతశ్రేణి వెడ ల్పున జగ్రోస్ శ్రేణికన్న తక్కువగ నున్నను ఎత్తున మాత్రము దానికి సరిపోవును దేశపు తూర్పు సరిహద్దున అటనట చెదరియుండిన పర్వత శ్రేణులు కొన్ని కన్పట్టును. ఇవి జగ్రోస్, ఎల్ బర్జ్‌ల యంతగ ఉన్నతములు కాకపోయినను దేశమునకు ఒక అడ్డుగోడగ మాత్రము ఉపకరించు చున్నవి.

దేశపు మధ్యనున్న పై పీఠభూమియందు కొంత భాగము రాతి ఉప్పునేల; మరికొంత భాగము, గుల్ల రాతి ఇసుకపర్ర. అయినను పీఠభూమి అంచు లందు, అనగా పర్వతశ్రేణుల దిగువ ప్రాంతము లందు మాత్రము సేద్యమునకు అనుకూలించు ప్రాంతములు కననగును. ఈ ప్రాంతములందు మాత్రమే దేశపు మొత్తముమీద, వ్యవసాయము జరుగుచున్నది. ఇట్టి పర్వతశ్రేణీ పరిసర ప్రాంత మునసే దేశపు ముఖ్యనగరము సైతము నెలకొని

యున్నది. పీఠభూమి మధ్యనున్న ఉప్పునేలలును, ఇసుక పర్రలును చాలవరకు జనావాస రహితములై ఉన్నవి

ఈ దేశము అంతటంతట భూకంపములకు లోనగుచున్నది సన్నిహిత భూతకాలమున అట్టిది 1968 లో సంభవించి, 1920 చ కిమీ మేర భూమి సంక్షుభితమై, దాదాపు 20,000 ప్రజలు నశించిరి పర్వతశ్రేణులనుండి బయలుదేరిన అనేక నదులు దేశమున ప్రవహించుచున్నవి. వీనిలోనెల్ల ముఖ్యమైనది 'కరున్' నది ఇది పారసీక సింధు శాఖలో పడుచున్నది. నౌకాప్రయాణమునకు ఈ నది చక్కగ అనుకూలించుచున్నది.

**2 శీతోష్ణస్థితి మొ :** ఇచ్చటి శీతోష్ణ పరిస్థితి, ఆ యా ఋతుక్రమమున, విపరీతపు హెచ్చు తగ్గులకు లోనగుచున్నది. గ్రీష్మమున ప్రపంచమున ఎటను కనరాని ఉష్ణోగ్రత కన్పట్టును; ఆ సమయమున తాపక్రమము 130° ఫా ను అతిక్రమించును. శీతకాలమున సర్వసాధారణముగ దేశమున తాపక్రమము 0° ఫా. గ ఉండును; అయినను ఆ సమయమున వాయవ్యపు జగ్రోస్ పర్వత ప్రాంతమున మాత్రము తాపక్రమము - 20° ఫా వరకు పడిపోవును.

శీతోష్ణపరిస్థితిలోని ఈ విధపు వ్యత్యస్తతను మరింతగ తీవ్రతరము చేయునవి అచటి వడగాడ్పులు. ప్రతి సంవత్సరమునను గీష్మమున 120 రోజులు ఈ వడగాడ్పులు, తీవ్రవేగముతో, దేశమున, అందును తూర్పు ప్రాంతమున, ఒక్కొక్కసారి గంటకు దాదాపు 130 కిమీ వేగముతో వీచును. వీని తీవ్రతవలన కొన్ని సందర్భములందు కొన్ని భవనములే కూలిపోవును.

దేశమున అత్యధిక భాగము చాలవరకు అనావృష్టి ప్రాంతమే; అయినను ఉత్తరపు, వాయవ్యపు భాగములందు మాత్రము తగినంతగ వర్షము పడుచుండును. అందును ముఖ్యముగ కాస్పియన్ సముద్ర తీరమున సాలుసరిన 200 సెం. మీ వర్షపాతము కలదు. పీఠభూమియందు సాలున వర్షపాతము 30 సెం మీ లను మించదు. తక్కిన ప్రాంతములందు గరిష్ఠ వర్షపాతము 12.5 సెం మీ. మాత్రమే.

దేశ విస్తీర్ణమున పదవ భాగము అటవీభూమి; కాస్పియన్ సముద్రతీరపు పర్వతశ్రేణులందు ఈ అడవులు ఎక్కువగ కననగును ఇందు దేవదారు, ఓకు, భూర్జ వృక్షములు ఎక్కువగ ఉన్నవి. ఆ అడవులలో పెద్దపులులును, ఎలుగులును, తక్కిన అల్పజాతి వన్యమృగములును విశేషముగ కన్పట్టుచున్నను, పెద్దపులుల సంఖ్య అంతటంతట తగ్గిపోవుచున్నది.

**3. జనసంఖ్య మొ. :** దేశమున తగినంత వర్షపాతము ఉన్న కొలదిప్రాంతములందు మాత్రమే జనసాంద్రత విశేషముగ ఉన్నది. పీఠభూమి యందలి ఉప్పు పర్రలందును, ఇసుక ఎడారులందును జనావాసములు చాల కొలదిగ, చెదరవేసినటుల, అటనట కన్పట్టును. అట్టి ప్రదేశములందు ఉండువారిలో అత్యధికులు స్థిరనివాస మెరుగని ద్రిమ్మరిజాతులవారు కాని ఈ శతాబ్ది మధ్యకాలమున వీరు నివసించు ప్రాంతములందు పెట్రోలు నూనెగనులు ఎక్కువగ కనుగొనబడుటవలన, ఈ ద్రిమ్మరి జనులలో, పలువురు ఆ నూనెగనుల యంత్రశాలలలో పనివారుగ చేరుటవలన స్థిరనివాసమునకు అలవాటుపడుచున్నారు. ఈ ద్రిమ్మరి జాతులు దేశపు జానాభాలో 10% ఉందురని అంచనా.

చారిత్రక పరిణామములనుబట్టి ఇచటి ప్రజానీకమున ఇరానియన్, ఆఫ్ఘన్, తుర్కీ, అరబ్ జాతుల సంకీర్ణ లక్షణములు చాలవరకు కన్పట్టుచున్నవి. దేశపు మొత్తపు జనసంఖ్య, 1966

లెక్కలను అనుసరించి, 2,57,85 210. జన సాంద్రత చ. కిమీ. కు 16. ప్రజలలో 38% పట్టణములలో నివసించుచున్నారు. ఒక్కొక్క దానియందు లక్షకు పైబడిన జనాభాకల పట్టణములు దేశమున 14 వున్నవి. వానిలోనెల్ల మిన్నయైనది తెహ్‌రాన్ (జ. సం. 27,19 7ε0); తరువాత పేర్కొనదగినవి ఇస్ఫహాన్ (జ సం. 4,24,045); మెషద్ (జ. సం. 4,09,616); తాబ్రిజ్ (జ. సం. 4,03,818); అబదాన్ (జ. సం. 2,72 962 ; షిరాజ్ (జ సం. 2,69,865).

ఫారసీభాష సాధికార భాషగ, దేశమున పరిగణనను ఆర్జించినది 50% కు మించిన దేశప్రజలకు అది మాతృభాష దేశమున వాయవ్య నైరుతి భాగములందును, ఈశాన్యమున కొన్ని ప్రదేశములందును తుర్కీభాషకు సన్నిహితములగు మాండలిక భాషలు కొన్ని మాతృభాషలుగ ప్రచారమున ఉన్నవి. ఇవిగాక, పారసీకన్న విభిన్నములయ్యును, ఇండో-యూరపియన్ కుటుంబమునకే చెందిన కుర్దిష్, బెలూచి మొదలగు భాషలు వాయవ్య, ఆగ్నేయ ప్రాంతములందు విశేషముగ వ్యాప్తియందున్నవి. ద్రవిడభాషా కుటుంబమునకు చెందిన బ్రాహ్వీని మాటాడు అల్ప సంఖ్యాకులు కొందరు ఆగ్నేయ ఇరానున వసించుచున్నారు. అల్పసంఖ్యాక వర్గములకు చెందిన అరబ్బీలు, ఆర్మీనియనులు, అస్సీరియనులు, యూదులు తమ మాతృభాషలనే నిలుపుకొని నివసించుచున్నారు.

దేశప్రజలలో 98% ముస్లిములు. అందు అత్యధిక సంఖ్యాకులు షియా సంప్రదాయమునకు చెందినవారు. షియా సంప్రదాయపు ఇస్లామే దేశపు సాధికార మతము. ముస్లిముల తరువాత, అల్ప సంఖ్యాకులుగ, క్రైస్తవులు, యూదులు బహాయీలు, పార్సీలు, క్రమముగ లెక్కింపదగినవారు.

**4. సమాచార సౌ.:** దేశమున తపాలా, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రేడియో ప్రసార సాధనములు ప్రభుత్వాధీనమున పనిచేయుచున్నవి. తెహ్‌రాన్‌లోని రేడియో స్టేషను అత్యంత శక్తియుతము అహవాజ్, జెందాన్, కెర్‌మాన్‌షా నగరములందున్న రేడియో స్టేషనులు పరిమిత శక్తివంతములై స్థానికావసరములకొరకు కార్యక్రమములను నిర్వహించుచున్నవి 1956 లో దేశమున తొలుతగ టెలివిజన్ ప్రసారకేంద్రములు తెహ్‌రాన్, అబదాన్ నగరములందు సంస్థాపితములై పనిచేయ మొదలిడినవి.

**5. యాన సౌ.:** దేశమున, పలు విధములగు, రస్తాలు కలవు వీని మొత్తపు నిడివి 37,120 కిమీ. ఇందు సాంప్రదాయికముగ ఉన్న ఒంటె బిడారుల డొంకదారులును, ఆధునికయుగపు రోడ్లును చేరియున్నవి ఇందు 12,286 కిమీ మాత్రమే పక్కారోడ్లుగ పరిగణింపదగినది. ఆసియాలోని వివిధ దేశములను-టర్కీ మొదలుగ తాయిలాండువరకు - కలుపుచు నిర్మింప సంకల్పింపబడిన మహాపథమున, ఇరాన్ ప్రభుత్వము తన దేశమున వేయవలసిన రోడ్డు మార్గమును 1966 లోనే సక్రమముగ పూర్తిచేసినది. ఆ మహాపథము టర్కీలోని బాజర్‌గాన్‌వద్ద మొదలై ఇరాన్‌లోని తాబ్రిజ్, మెషద్ నగరములద్వారా పయనించి, క్రమమున అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, ఇండియా, బంగ్లాదేశ్, బర్మాలను అతిక్రమించి, తాయిలాండ్‌ను చేరుకొనును.

దేశమునగల 4,944 కిమీ. రైలుమార్గము ప్రభుత్వాధీనమున ఉన్నది. అందు ప్రధాన మార్గము, పారసీక సింధుశాఖనుండి కాస్పియన్ తీరమునకు తెహ్‌రాన్‌ద్వారా పయనించును. తెహ్‌రాన్‌నుండి ఉపమార్గములు బయలుదేరి దేశమున వివిధ ప్రాంతములకు పోవుచున్నవి.

ఇరాన్ దేశమునందలి ప్రముఖ రేవుస్థలము ఖొర్రమ్ షహర్; పారసీక సింధుశాఖ తీరమున ఇది ఉన్నది ఆ సింధుశాఖను ఆశ్రయించియే, బందర్ షాపూర్, బందర్ అబ్బాస్ అను రేవు నగరములును కలవు. కాస్పియస్ సముద్రతీరపు రేవులలో బందర్ పహ్లావీ, నవ్‌షహర్ అనునవి ప్రముఖములు. రిజయే సరస్సును, కరుణ్‌నదియు దేశాంతర్గత జలమార్గములుగ ఉపకరించుచున్నవి.

ప్రభుత్వాధీనమున ఉన్న ఇరానీయ జాతీయ విమానమార్గము దేశమున 15 నగరములమధ్య, విమానయానమును నిర్వహించుచున్నది. తెహ్రాన్, అబదాన్ నగరములందలి విమానాశ్రయములు అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించుచున్నవి.

**6. చరిత్ర :** అతి ప్రాచీన కాలమునుండియు మానవావాసముగ ఉండి, మానవ చరిత్రను తీర్చిదిద్దిన ప్రాచీన దేశములలో ఒకటిగ ఇరాన్ పేరొందినది. క్రీ పూ. 6,000 లోనే శిలాయుగపు మానవులు ఇట వసించి, నాగరికతా పథమున తొలుతటి అడుగులను వేయనేర్చిరని త్రవ్వకముల వలన విశదమగుచున్నది. చిత్రపు నగిషీపనిగల మృణ్మయ పాత్రలను, కంచు పరికరములను వాడ నేర్చిన మానవ నాగరికత క్రీ పూ. 3000 ప్రాంతమున ఈ దేశమున వ్యాప్తియందుండెననుట చారిత్రకుల కృషివలన వేద్యమైనది. క్రీ. పూ 1500 ప్రాంతమున, రెండు తెగల ఆర్యజాతులు-మీడులు, పారసీకులు అను వారలు - ఈ దేశమునకు చేరి పశ్చిమ, దక్షిణ ఇరాన్‌లను క్రమముగ తమ నివాస భూములుగ చేసికొనిరి ఏక్‌బతన్ (నేటి హమదాన్) ను రాజధానిగ చేసికొనిన, మీడు రాజులలో ప్రముఖుడగు క్షయార్ష,* పొరుగున నున్న అస్సీరియన్ రాజుల ప్రాభవమును అంతమొనర్చి, విశాల సామ్రాజ్యమునకు ప్రభువయ్యెను (క్రీ. పూ. 6 వ శతాబ్ది). కాని అనతికాలముననే పారసీకుల నాయకుడగు కురుష్, తిరుగుబాటు చేసి, మీడుల అధికారమును అంతమొనర్చి, మీడు పారసీక జాతులను సమ్మేళనమొనర్చి, సామ్రాజ్య పాలకుడై ఆసియా మైనరువరకు సామ్రాజ్యమును విస్తరింపజేసెను (క్రీ. పూ. 553). ఈతని వంశమే హఖమనీషి వంశమని పేరొందినది. ఈతని రాజధాని పార్సానగరము. ఈతని అనంతరమున క్రమముగ సింహాసనమును అధిష్టించిన కాంభోజ, దుర్యావ, క్షరక్ష I, బుతక్షరక్ష I అనువారలు అతి సమర్థులుగ పేరొందిరి. వీరు హఖమనీషి సామ్రాజ్యమున గ్రీసు ఈజిప్టులను చేర్చుటయేగాక, మధ్య ఆసియాలోని ఆక్సస్‌నదివరకును, తూర్పున సింధునది తటమువరకును సామ్రాజ్యపు ఎల్లలను విస్తరింపజేయగలిగిరి. హఖమనీషి సామ్రాట్టులు జరతుష్త్ర (జొరాష్ట్రియన్) మతమును ఆదరించి పరిపోషించిరి

ఇటుల నానా రాజ్యములను, జాతులను లోగొనిన హఖమనీషి సామ్రాజ్యము మహావిజేతయగు అలెగ్జాండరు ధాటికి ఆగలేక అంతరించినది (క్రీ. పూ 334 - 330). కాని అలెగ్జాండరు అనంతరమున గ్రీకులు ఇరానున ఎక్కువకాలము నిలువజాలక పోయిరి. క్రీ. పూ. మూడవ శతాబ్దమున శక జాతుల ద్రిమ్మరి మూకలు దేశమున చొరబడి, పార్థవ (పార్థియన్) అను నామముతో ఒక

* మీడు, పారసీక నామములగు క్షయార్ష, హఖమనీషి, కురుష్, దుర్యావ, క్షరక్షవంటి పదములు గ్రీకు చారిత్రకుల రచనలలో సియగ్జరస్, అకిమీనియన్, కైరస్ (సైరస్), దరయస్, జార్జెస్‌వంటి వికృత రూపములను పొంది పాశ్చాత్యుల మూలమున ఆ తీరుగనే ప్రచారములోనికి వచ్చినవి. కాని ఇట ఈ చారిత్రక కథనమున తొలుతటి మీడు, పారసీక నామములే స్వచ్ఛరూపమున వాడబడినవి

రాజవంశమును సంస్థాపించి, పాలింప నారంభించిరి. (క్రీ. పూ. 240). పారసీకభాషా మత సంస్కృతి సంప్రదాయములనే వీరును అవలంబించిరి. ఈ పార్థవరాజులు నిరంతరము, సమకాలిక రోమన్ ప్రభువులతో యుద్ధములుచేసి బలమును కోలుపోగా, వారిని తొలగించి, అచ్చపు పారసీకజాతికిచెందిన 'ససానీయ' పాలకులు రాజ్యమును వశపరచుకొనిరి (క్రీ. శ. 226). వీరి కాలమున సైతము రోమన్ ప్రభువులతో యుద్ధములు ఎడతెగక సాగినవి. అయినను సాంస్కృతికముగను, భాషా విషయికముగను ససావియన్ ప్రభువులు దేశమునకు విశేషముగ సేవచేసిరి; లలితకళలను పోషించి, ఇరాన్‌కు లలితకళా రంగమున అనశ్వరమగు ఖ్యాతిని కల్పించిరి. ఈ ప్రభువుల ఆస్థానము గ్రీకు, హిందూ, చీనీయ సంస్కృతులకు వినిమయ కేంద్రముగ ఉపకరించినది.

క్రీ. శ. 7వ శతాబ్ది తొలిపాదమున, ఇస్లామిక మతావేశప్రేరితములగు అరబ్బీ సేనలు ఇరాన్‌పై దండెత్తి ససానీయ రాజవంశమును అంతమొందించి, దేశమును వశపరచుకొని, ఇస్లామ్‌ను దేశమున వ్యాపింపజేసినవి. అంతట ప్రాచీన జరతుష్ట్ర మతానుయాయులలో కొందరు, తమకు దక్కిన మత గ్రంథములతో భారతదేశమును చేరి అట తలదాచుకొనిరి; వారి సంతతివారే 'పార్సీలు' అని నేడు భారతదేశమున వ్యవహృతులు.

క్రీ. శ. 9వ శతాబ్దివరకు ఇరాన్ దేశము అరబ్బుల అధీనమున ఉండినది ఈ మధ్య కాలమున దేశము ఇస్లామిక సంస్కృతికి పూర్తిగ లోనైనది. లిపి, భాష, కళలు మొదలగువానిపై సైతము అరబ్బులు తమ ప్రభావమును నెరపిరి. అయినను ఇరాన్ తన ప్రత్యేక వ్యక్తిత్వమును వీలైనంతవరకు, కాపాడుకొనుటకు యత్నించి కొంతవరకు సఫలతను ఆర్జించినది. ఇస్లామిక ప్రపంచమున మత, తత్త్వశాస్త్ర విషయములందు అరబ్బీకి ప్రాముఖ్యమున్నను, సాంస్కృతిక వ్యవహారములందు పారసీక భాషదే, దక్షిణ, మధ్య ఆసియాలందు, పైచేయి అయినది.

అరబ్బుల ప్రాభవము క్షీణదశ నొందినపుడు, ముస్లిమ్ రాజవంశములవారు పెక్కురు ముందునకు వచ్చి క్రమమున దేశమును పాలించిరి. ఇట్టివారిలో గజ్నవీ వంశమునకు చెందిన గజనీ మహమూద్ (11వ శతాబ్ది) ప్రముఖ విజేత. ఈతడార్జించిన సామ్రాజ్యము పశ్చిమ ఇరాన్ మొదలుకొని సింధు నది తటమువరకు వ్యాపించెను. కాలక్రమమున గజ్నవీ వంశీయులను తుదముట్టించి సెల్జుక్ రాజవంశము రాజ్యాధికారమును వశము చేసికొనెను. ఈ సెల్జుక్‌లు తుర్కీ జాతివారు; అయినను పారసీక భాషా సంస్కృతులను అవలంబించి పరిపోషించిరి. వీరి పాలనలో పారసీక సామ్రాజ్యము బాస్ఫరస్ జలసంధినుండి తుర్కిస్తాన్‌వరకు విస్తరించినది. ఈ సెల్జుక్‌ల అనంతరమున దేశమును ఖ్వారజమ్‌షా వంశికులు వశపరచుకొని కొంతకాలము పాలించిరి.

13వ శతాబ్దమున ఇరాన్ దేశము మంగోలుల హస్తగతమయ్యెను. మహావిజేతయగు చెంగిజ్‌ఖాన్ మనుమడగు హులగూ ఇరాన్‌ను ఆక్రమించి, అట, ఒక రాజవంశమునకు మూలపురుషుడయ్యెను. ఇతనికిగల ఒక బిరుదమునుబట్టి ఈ రాజవంశమునకు 'ఇల్‌ఖాన్' అనుపేరు కలిగెను. ఈ మంగోలులు ఇస్లామును స్వీకరించి, ఇరానీయుల భాషా సంస్కృతులను స్వీయములుగ చేసికొని పరిపోషించిరి. కాని 14వ శతాబ్దిలోని ఈ రాజవంశికులు అంతఃకలహములవలన బలహీనులుకాగా వారిని అంతమొనర్చి, తైమూర్ అను పేరొక మంగోలియన్ విజేత ఇరాన్‌ను తన విశాల సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనెను అయినను, అసమర్థ

లగు అతని వంశీయుల కాలమున మాండలికులు స్వతంత్రులై దేశము అల్పరాజ్యములుగ విభక్తమయ్యెను (16 వ శతాబ్ది). ఇట్టి, మాండలిక రాజ వంశములలో ఒకటి - 'సఫావీ' అనునది ప్రాబల్యమునకువచ్చి, ఇరాన్‌ను మరల ఏకీకృతము చేసి, తన ఆధిపత్యమును నెలకొల్పెను. ఇస్ఫహాను నగరమును తమ రాజధానిగ చేసికొని, ఈ సఫావీ రాజ వంశమువారు దేశమును పాలించి జాతీయ సంస్కృతికి పునరుజ్జీవనమును కల్పించిరి. ఈ పాలకులలో షా అబ్బాస్ (1587-1628) అతి ప్రసిద్ధుడు. కాని, 1722 లో, అఫ్ఘన్ సేనలు దేశమును వశపరచుకొనగ, నాదిర్‌కులీ అను జాతీయ వీరుడు దేశ ప్రజలను సమీకరించి, అఫ్ఘనులను పారద్రోలి, రాజ్యమును వశపరచుకొని, నాదిర్‌షా అను పేరుతో ప్రభువై అఫ్షర్ రాజవంశమునకు మూలపురుషుడయ్యెను (1736). 18 వ శతాబ్ది అంతమున దేశము మరల అరాజకము పాలుకాగా 'కజార్' రాజవంశము ముందునకువచ్చి, దేశమున వ్యవస్థిత పాలనను ఏర్పరచెను. ఈ రాజవంశికులే 1926 వరకు దేశమును పరిపాలించిరి.

కడపటి కజార్ పాలకునివద్ద ప్రధానిగ ఉండిన రిజాఖాన్, తన పాలకుని తొలగించి, రిజా షా అను పేరుతో తానే ఇరానునకు ప్రభువై పహ్లవీ రాజవంశమునకు మూలపురుషుడయ్యెను. దేశమున విదేశీయులకును, వారి ప్రభుత్వములకును, వారి వర్తక సంస్థలకును ఉన్న పలుకుబడిని అంతముచేసి రిజా షా కేంద్ర ప్రభుత్వమును బలవత్తరము చేసెను. కాని ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున అతడు జర్మనుల పలుకుబడికి దేశమును లోజేయుచున్నాడను అనుమానమువలన, తమ భద్రతకొరకై, బ్రిటిష్ సేనలును, సోవియట్ సేనలును దేశమున కీలక స్థానములను ఆక్రమించినవి. అంతట రిజా షా పదవీపరిత్యాగము చేసి తన కుమారుడగు మహమ్మద్ రిజాను రాజుగ చేసెను; 1942 లో కుదిరిన ఒక మైత్రి ఒడంబడికను అనుసరించి ప్రపంచ యుద్ధము ముగియుదనుక దేశమున అమెరికన్ - బ్రిటిష్ - సోవియట్ సేనలు అవసరమగు అధికారములతో మెలగుటకు ఇరాన్ ప్రభుత్వము అంగీకరించెను.

ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత 1946, జనవరిలో బ్రిటిష్ - అమెరికన్ సేనలు దేశము నుండి వెడలిపోయినను, సోవియట్ సేనలు అటుల చేయక, పైగా అజర్‌బైజాన్ రాష్ట్రమున స్వయం పరిపాలనోద్యమమును సమర్థించినవి. కాని, ఆ తరువాత భద్రతాసమితికి ఇరాన్ తన వివాదమును నివేదించిన అనంతరమున (1946, మే) సోవియట్ సేనలును వైదొలగినవి. అటనుండి క్రమమున ఇరాన్‌దేశ ప్రభుత్వము యు. స్టే. వైపునకు మొగ్గు చూపినది. ఇంతలో దేశమున జాతీయాభిమానము వెచ్చుపెరిగి, రాజవ్యతిరేకమగు తూ దే (ప్రజా) పక్షము మొసాదిక్ అనువాని నాయకత్వమున ఎన్నికలలో ప్రాబల్యమును సంపాదించినది; ఆ వెనువెంటనే ప్రధాని పదవిని పొందిన మొసాదిక్ నూనె గనులను జాతీయములుగ చేయుటయేగాక, రాజరికమునెడల వ్యతిరేకతను రెచ్చగొట్టెను; తత్ఫలితముగ రాజు దేశమును వదలిపోయెను. కాని ఆ వెనువెంటనే సైన్యము రాజపక్షమును అవలంబించి, మొసాదిక్‌ను, అతని అనుయాయులను తొలగించగ, రాజు దేశమునకు తిరిగివచ్చి పరిపాలనను వశపరచుకొనెను (1953).

దేశ ప్రజలలో వ్యాప్తియందున్న దారిద్ర్యమును, అజ్ఞానమును తొలగించుటవలన మాత్రమే వారియందలి అసంతృప్తియు, దేశమున తీవ్రవాదుల పలుకుబడియు, తొలగగలవని ప్రభువు గుర్తించి 1950 నుండియు తానే స్వయముగ చొరవతీసికొని భూసంస్కరణలు కొనివచ్చి, సాంఘిక సంసేవారంగమును పటిష్ఠతరము చేసెను.

మధ్య ప్రాచ్య ఒడంబడిక (సెంటో) లో తన దేశ మును భాగస్వామిగ చేసి యు. స్టే. వలనను, పశ్చిమ రాజ్యముల వలనను విరివిగ ధన సాహాయ్యమును అతడు పొంది దేశమున కొన్ని వసతులను చేకూర్చెను. కాలక్రమమున దేశము ఆర్థిక సుస్థిరతను చేకూర్చుకొని. ప్రస్తుతము విదేశీయ ధన సాహాయ్యమునుకూడ త్యజించినది. దేశపు నూనె గనులవలన వచ్చు విపరీతపు ఆదాయము ఇందులకు ఎంతయో తోడ్పడినది.

**7. పరిపాలన :** 1906 లో ఆమోదింపబడి, 1907, 1925, 1949, 1957 లో సవరణలను పొందిన ఒక రాజ్యాంగము అమలునందున్నది; కాని వంశానుగతమగు రాజరికమునకు విశేషాధి కారములు కలవు; రాజు ముస్లిము అయియుండ వలయునను నియమము కలదు; తన ఇచ్చవచ్చిన వానిని ప్రధానిగ నియమించుటకును, శాసనసభను రద్దుచేయుటకును రాజునకు సర్వాధికారములు కలవు. శాసనసభయందు మజ్లిస్, సెనెట్ అను రెండు కక్ష్యలున్నవి. మజ్లిస్‌న సభ్యసంఖ్య 220. నాలుగేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో వయో జన వోటింగు విధానమున, 21 ఏండ్లు వయసునకు తగ్గని ప్రజలవలన వీరు ఎన్నుకొనబడెదరు 1963 నుండి స్త్రీలకును వోటుహక్కు కల్పింపబడినది. సెనెట్‌లోని 60 మంది సభ్యులలో 30 మందిని రాజే నియామకము చేయును; తక్కిన సభ్యులను రెండు అంచెలలో ప్రజలు ఎన్నుకొనెదరు. ప్రజా విత్త వ్యవహారములను చర్చించు అధికారము మజ్లిస్ నకు మాత్రమే కలదు. తక్కిన అన్నివిధముల శాసన నిర్మాణమున రెండు కక్ష్యలును పాల్గొనును. మజ్లిస్‌నకు జరుగు ఎన్నికలకు నియోజకవర్గములు వృత్తులను అనుసరించి-రైతులు, వర్తకులు, న్యాయ వాదులు మొ. వర్గముల పద్ధతిలో-ఏర్పరుపబడినవి. సెనెట్‌న సభ్యత్వమునకు, ఉద్యోగవిరమణము చేసిన సేనానులు, ఉన్నతోద్యోగులు, మాజీ మంత్రులు మొ. ఉన్నత స్థాయివారలు అర్హులు. 1941 నుండి దేశమున రాజకీయ పక్షముల ఏర్పాటు అనుమతింపబడినది. వానిలో 'ఈరాదె మిల్లి' (ప్రజా సంకల్ప), తూ దే (ప్రజా సామాన్య) పక్షములు మాత్రమే విస్తృతముగ పలుకుబడిని ఆర్జింప గలిగి నవి. ఇందు రెండవది తీవ్రభావ ప్రేరితమై, రాజ రికమును వ్యతిరేకించునది. 1949 లో రాజరిక మును నిర్మూలించుటకు జరిగిన ఒక విఫల యత్న మునకు తూ దే పక్షపు ఆమోదము కలదను అభి ప్రాయము కలుగుటవలన, అంతటినుండి అది నిషేధింపబడినది. కాని ప్రజలలో ఏదియో ఒక మారురూపమున అది ఇప్పటికిని, పనిచేయుచునే ఉన్నది. 1957 నుండి ప్రభుత్వమే కొన్ని భిన్నాభి ప్రాయములుగల రాజకీయ పక్షములు రూపొందు నటులజేయ సంకల్పించి కృషిచేసినది. ఇటుల రూపొందించినవానిలో మిల్లూన్ (జాతీయ) పక్ష మును, మర్దమ్ (జన) పక్షములును కొంత ముందు నకు రాగలిగినవి. అయినను 1963 లో, ఈ రెండింటిని అధిగమించి, ఇరాన్-ఇ-నవీన్ (నవీన ఇరాన్) పక్షము రూపొంది ప్రజాదరణను ఆర్జించినది.

స్థానిక పరిపాలనకై దేశము 14 ఉస్తాన్‌లుగ విభక్తము; వానిలో ప్రతిదానిని ఒక గవర్నరు, ప్రజలెన్నుకొనిన 'అంజుమాను'ల సాయముతో పాలించును; ఈ అంజుమానుల అధికారములు చాల పరిమితములు. పరిపాలనా సౌకర్యమునకై ఉస్తాన్, షహరేస్తాన్‌లుగను; షహరేస్తాన్ ప్రతి యొకటి బక్ష్ (జిల్లా) లుగను విభజితములు.

ఫ్రాన్స్‌లోని న్యాయనిర్వహణ రీతిని అనుక రించు న్యాయ వ్యవస్థ దేశమున పనిచేయుచున్నది. తెహ్‌రాన్‌లోని సుప్రీమ్‌కోర్టు, న్యాయ నిర్వహణ మున ఉచ్చతమాధికారములను కలిగియున్నది. దానికి లోబడి ఉన్నత న్యాయస్థానములును, తక్కు

విధముల న్యాయస్థానములును దేశమున ప్రముఖ ప్రదేశములందు పనిచేయుచున్నవి. పౌర (సివిల్), దండ (క్రిమినల్). వ్యాపారిక (కమర్షల్) న్యాయ సంహితలు, ఫ్రెంచి, స్విస్ సంహితలు ఆధారము లుగ, 1930 లో రూపొందింపబడినవి.

**8. దేశరక్షణ :** దేశమున రెండేడ్ల నిర్బంధ సైనికసేవ అమలున ఉన్నది. దేశ సైన్యమును ఆధునికము చేయుటలో సాయపడుచు, యు. స్టే. సైనికసంఘము, దేశమున పనిచేయుచున్నది. అతి సమర్థమగు సైనికదళమును నిర్మించవలయు నని రాజు సంకల్పము. మొత్తముమీద 2 లక్షల మంది సైనికులుగల 8 సేనాదళములు కలవు. 1955 నుండి వైమానికసేన ప్రత్యేక ప్రతిపత్తిని ఆర్జించినది; అందు 20,000 మంది పనిచేయు చున్నారు, 180 పోరాట విమానములును, అందు లకు తగిన సంఖ్యలో హెలికాప్టరులు మొ. ఆ సేనకు కలవు. ఆధునిక రీతిలో నౌకాబలమును రూపొందించుటకు కృషి జరుగుచున్నది.

**9. అంతర్జాతీయ సం. :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఇరాన్, పాశ్చాత్య రాజ్యముల వైపు ఎక్కువగ మొగ్గుచూపి, మధ్యప్రాచ్య ఒడంబ డిక (సెంటో) లో సభ్యత్వము వహించినది. కాని ఆ ఒడంబడికనుండి ఇరాక్, పాకిస్తాన్‌లు వైదొల గుటతో ఇరాన్, ప్రాంతీయ సహకారమునకై తక్కువిధముల కృషిచేయుచు, సోవియట్ రష్యాతోకూడ సన్నిహితత్వమును పెంపొందించు కొనుచున్నది. తనకు పొరుగున ఉన్న బహరీన్‌పై తనకు హక్కు కలదను వివాదమువలన అరబ్ రాజ్యములతో వైమనస్యములు ఏర్పడినను, ఐక్య రాజ్య సమితి తీర్పును అనుసరించి, బహరీన్‌పై హక్కును ఇరాన్ వదలుకొనుటవలన (1970) ఆ వైమనస్యములు చాలవరకు అంతరించినవి. అయి నను ఇరాక్‌తోగల ఒక సరిహద్దు వివాదమువలన ఇరాన్ - ఇరాకులమధ్య కలతలు ఏర్పడి ఇప్పటికిని అపరిష్కృతముగ నిలిచియున్నవి. భారత - పాకిస్తాన్ సంఘర్షణలలో తొలుత ఇరాన్, పాకిస్తాన్ పట్టున సుముఖత చూపినను, బంగ్లాదేశ్ రూపొం దిన తరువాత భారతదేశముతో గాఢ సన్నిహితత్వ మును పెంపొందించుకొనుచున్నది. ఇరాన్‌కు, ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** ప్రాచీన కాలపు భూస్వామ్య విధానముపై ఆధారపడియుండి, చాల వెనుకబడియున్న, ఈ దేశపు ఆర్థిక పరిస్థితిని ఆధునికము చేయుటకు కృషి 1950 లో మొదలైన దని చెప్పవచ్చును. తదాదిగ ప్రభుత్వము కొన్ని నిర్ణీత అభివృద్ధి ప్రణాళికలకు అనుగుణముగ కృషిని సాగించుచున్నది. ఇట్టి ప్రణాళికలలో అయిదవది (1973-78) ప్రస్తుతమున అమలున ఉన్నది; ఈ అయిదవ ప్రణాళికావ్యయము 3,550 కోట్ల అమెరికన్ డాలర్లకు సమానము.

1950 లో తన స్వంత భూములను రైతులకు ఇచ్చివేయుటతో, భూసంస్కరణలకు రాజే మార్గ దర్శి అయ్యెను. తరువాత 1962 లో ఆమోదిత మగు భూసంస్కరణల చట్టమును అమలునకు తెచ్చుటవలన 1971 నాటికి దేశమున, సేద్యము చేయువానికే, ఎల్లయెడల భూమియందు హక్కు లభించినది. ఇందులకు తోడుగ ఆధునిక యంత్ర ములను, సాంకేతిక రీతులను పనిగొని వ్యవ సాయము చేయుటయు, సహకార సంఘములద్వారా వ్యవసాయ కృషియు ప్రోత్సహింపబడినవి.

దేశమున మొత్తపు భూమిలో 11.5% మాత్రమే సేద్యమునకు అనుకూలమయినది. నీటిపారుదల వసతులు పరిమితములు. అయినను భూసంస్కర ణలవలనను, వ్యవసాయము ఆధునికము చేయ బడుటవలనను ఎక్కువ ఉత్పత్తి సాధింపబడు

చున్నది. 1966 లో, ఇరాన్ దేశము, తనకు కావలసిన గోధుమలో 96% ను, బియ్యములో 100% ను, చక్కెరలో 40% ను, ఉత్పత్తిచేసి, దాదాపుగ స్వయంపోషకతను సాధించినది. రొక్కపు పంటలలో ప్రముఖము ప్రత్తిపంట; దాని తరువాత పొగాకు, జనుము లెక్కకు వచ్చును. ఇరాన్ దేశము ఫలసంపదకు చాల పేరుగనినది; ద్రాక్ష, ఖర్జూరము అందు ప్రముఖములు.

పశుపోషణయందు రైతులేగాక, ద్రిమ్మరిజాతుల ప్రజలును శ్రద్ధవహించుచున్నారు. గొర్రెల పెంపకము విరివిగ జరుగుచున్నది; సాలీనా దాదాపుగ 3,000 టన్నుల ఉన్ని ఎగుమతి యగుచున్నది. ప్రభుత్వాధీనమునన్నున్న జాతీయ మత్స్య సంస్థ, కాస్పియన్ సముద్ర తీరమునను, పారసీక సింధు శాఖయందును ఆ పరిశ్రమను వృద్ధిచేయుటకు కృషిచేయుచున్నది.

దేశభూమిలో 11.5% అటవీభూమి. దీనిని శాస్త్రీయరీతిలో పరిరక్షణచేసి, అటవికోత్పత్తిని పెంపొందించుటకు ప్రభుత్వము శ్రద్ధవహించినది. కాస్పియన్ తీరముననున్న 60 లక్షల ఎకరముల విస్తీర్ణముగల అడవి, ప్రపంచపు అత్యుత్తమ అటవీ భూములందు ఒకటిగ, పేరుగనినది.

దేశమున ఖనిజసంపద విరివిగ కలదు; రాగి గనులు విస్తారముగ పలుచోటుల ఉన్నటుల తెలియవచ్చుచున్నను, వానినుండి ఉత్పత్తి తగినంతగ సాధింపబడుటలేదు. సీసము, తుత్తునాగము కూడ లభ్యములగుటకు అవకాశములు కలవు. అల్ప ప్రమాణములందు ఇనుము, రాక్షసిబొగ్గు మొదలగునవియు కలవు. కాని అన్నింటికన్న ఎక్కువగ లబ్ధమై దేశసంపదకే కారణమైనది పెట్రోలియము; ఈ ఖనిజపు భూగర్భపు నిలువ మొత్తము 55 లక్షల కోట్ల పీపాలు ఉండునని అంచనా; నానాట ఇంకను క్రొత్తగనులు కనుగొనబడుచున్నవి. 1951 లో పెట్రోలియం పరిశ్రమ జాతీయము చేయబడినది; కాని అప్పటివరకు ఉత్పత్తిని సాగించుచుండిన ఆంగ్లో - ఇరానియన్ కంపెనీ మొదలగునవి లేవదీసిన వివాదములవలన కొంత కాలహరణము జరిగి కడకు కొన్ని ఒడంబడికలు జరిగినవి. అట్టివానిలో 24 మే, 1973 న జరిగిన కడపటి ఒడంబడిక ప్రస్తుతము అమలున ఉన్నది. దానిని అనుసరించి జాతీయ ఇరానియన్ ఆయిల్ కంపెనీ అను ప్రభుత్వ సంస్థ యొక్క ఆధిపత్యమును, అంగీకరించి దాని సమ్మతితో కొన్ని తావులందు కన్సార్షియమ్ అను సమష్టి ప్రతిపత్తితో ఉత్పత్తిని సాగించుటకు పూర్వపు కంపెనీలు, అనుమతిని ఆర్జించినవి. 1971 లో దేశమున మొత్తపు పెట్రోలియమ్ (క్రూడ్) ఉత్పత్తి 2,270 లక్షల మెట్రిక్ టన్నులు.

తక్కిన పరిశ్రమలలో ముఖ్యముగ పేర్కొనదగినవి వస్త్రపరిశ్రమ, తివాచీల పరిశ్రమ. ఇందు రెండవది ఈనాటికిని అచ్చముగ గృహపరిశ్రమగనే ఉన్నది. పారసీకపు తివాచీలు జగత్ప్రసిద్ధములు. దేశదేశములందును వీనికి గిరాకి కలదు. 1970 లో 6 కోట్ల అమెరికన్ డాలర్ల విలువగల తివాచీలు విదేశములకు ఎగుమతి చేయబడినవి.

ఇనుము, యంత్రముల పరిశ్రమలును దేశమున క్రమముగ అభివృద్ధి చెందుచున్నవి. సోవియట్ సహకారముతో ఇస్ఫహానున ఒక ఉక్కు కర్మాగారము నెలకొల్పబడినది. కొన్ని ఇతర దేశములు అల్యూమినియం మొదలగు పరిశ్రమల అభివృద్ధిలో ఇరాన్‌కు సాయపడుచున్నవి.

యంత్రశక్తికి పెట్రోలియమేకాక విద్యుచ్ఛక్తియు దేశమున వినియుక్తమగుచున్నది. విద్యుచ్ఛక్తిలో దాదాపు మూడవవంతు జలవిద్యుత్తు. మొత్తముమీద 1,089 వేల కి. వాట్ల విద్యుత్తు ఉత్పత్తి సామర్థ్యము దేశమునకు కలదు (1968).

అణుశక్తినుండి విద్యుత్తును పొందు కృషియు ఆరంభ దశలో ఉన్నది (1970).

దేశమున కార్మికోద్యమమునకు ప్రభుత్వ ప్రోత్సాహము లేదు. 1963 లో ట్రేడ్ యూనియనులు అన్నియు రద్దుచేయబడినవి. అంతటి నుండి ఆయా వృత్తుల కార్మికులు వేర్వేరు సంఘములుగ ప్రభుత్వానుమతితో ఏర్పడి వర్తించవలయునను నియమము ఏర్పడినది. 1959 లో సవరింపబడిన ఒక కార్మిక చట్టమును అనుసరించి పని కాలము, సెలవు, అదనపు పనికి ప్రత్యేక వేతనము మొదలగువాని విషయమున కార్మికులకు సదుపాయములు కల్పింపబడినవి; కాని వీనిని అమలునకు తెచ్చుటకు తగిన యంత్రాంగము నెలకొల్పబడలేదు.

ఈ దేశపు ఎగుమతులలో ముఖ్యమైనది పెట్రోలియమ్. ప్రపంచమున పెట్రోలియమును ఎగుమతి చేయు దేశములలో ఇరాన్ గణ్యస్థానమును పొంది యున్నది. 1972-73 లో ఈ దేశము 15,060 కోట్ల రియాలుల విలువగల పెట్రోలియమ్‌ను, తదనుబంధ ద్రవ్యములను ఎగుమతి చేయగలిగినది. తక్కిన ముఖ్యములగు ఎగుమతులు : తివాచీలు (478.5 కోట్ల రి.); ముడిప్రత్తి (276.1 కోట్ల రి.); పండ్లు (233.8 కోట్ల రి.) (1972-73). దిగుమతులలో మోటారు వాహనములు, యంత్ర పరికరములు, రసాయనములు, విద్యుత్ పరికరములు పేర్కొనదగినవి. 1972-73 న మొత్తపు ఎగుమతుల విలువ 17,262.4 కోట్ల రియాలులు; దిగుమతుల విలువ 13,421.4 కోట్ల రి.

దేశమున బ్యాంకింగు వ్యవహారములలో బ్యాంక్ మెల్లి ఇరాన్, బ్యాంక్ మర్కజాయ్ అను రెండు బ్యాంకులు ప్రముఖ స్థానములను ఆక్రమించి యున్నవి. నోట్లను జారీచేయుచు బ్యాంక్ మర్కజాయ్, కేంద్ర బ్యాంకుగ వ్యవహరించుచున్నది. ఇవిగాక, ప్రభుత్వాధీనముననే, వ్యవసాయాది ప్రత్యేక కార్యములకు ప్రోత్సాహము కల్పించు 9 విధముల బ్యాంకులు పనిచేయుచున్నవి. వీనితోపాటుగ ప్రయివేటు బ్యాంకులు 19 పనిచేయుచున్నవి. విదేశీయులకు చెంది, ద్రవ్య వినిమయమును నిర్వర్తించు బ్యాంకులు 6 కలవు.

దేశపు బడ్జెటరీ వ్యయము 69,615 కోట్ల రియాలులు (1972). ప్రభుత్వపు ఆదాయమున 27% ప్రత్యక్షపు పన్నులవలనను, తక్కినది పరోక్షపు పన్నుల వలనను లభించుచున్నది.

**11. సాంఘిక రంగము :** దేశమును ఆధునికముగచేయు కృషిలో సాంఘిక సంసేవనుకూడ, ఒక ముఖ్యాంగముగ, చేయుటకు ప్రభుత్వము 1961 నుండి కృషిచేయుచున్నది. 'పహ్లావీ రాజవంశ ధర్మనిధి' అనుదానిని 4,650 కోట్ల రియాలుల మూలనిధితో రాజు 1961 లో సంస్థాపించి, దాని ఆదాయమును ఇరానీయ ప్రజల సాంఘిక, విద్యా, ఆరోగ్య రంగములందు వినియోగించుటకు ఏర్పాటు చేయుటతో ఆ కృషి మొదలయ్యెనని చెప్పవచ్చును. దీనికి తోడుగ ప్రభుత్వమును ప్రణాళికలలో, సాంఘిక సంసేవకై, కొంత ధనమును ప్రత్యేకించి వినియోగించినది. మూడవ, నాలుగవ ప్రణాళికల అమలు కాలమున దాదాపు నాలుగు లక్షల గృహములు నూతనముగ, నిర్మితములైనవి.

పారసీక భాషా సాహిత్యములు ప్రపంచ విఖ్యాతములేయైనను, ఆ దేశమున విద్య తొలుతటి నుండియు కొన్ని ఉన్నతవర్గములలోనే కుదురుకొనినది. ఈ వ్యత్యస్తతను తొలగించుటకై జరుగుచున్న కృషిమూలమున దేశమున 1972 లో 40% ప్రజలు విద్యావంతులైరి. నిర్బంధ ఉచిత ప్రాథమిక విద్యావిధానము ఒక శాసనము మూలమున 1943 లో మొదలైనది. 1970-71 లో దేశమున

గల 28,884 పాఠశాలలలో 45 లక్షల విద్యార్థులు పఠించుచుండిరి.

తెహ్‌రాన్ విశ్వవిద్యాలయము 1935న స్థాపింప బడినది. తరువాత క్రమమున తాబ్రిజ్, మెషెద్, అహవాజ్, షిరాజ్, ఇస్ఫహాన్, రిజయేలలో విశ్వ విద్యాలయములు నెలకొల్పబడినవి. ఉన్నత విద్యా విధానము ఫ్రాన్స్‌దేశపు విధానమును వరవడిగ గ్రహించినది. 1970-71 లో విశ్వవిద్యాలయ శిక్షణ పొందిన విద్యార్థుల సంఖ్య 74,000.

తెహ్‌రాన్‌లోని మ్యూజియమున ఆ దేశపు ప్రాచీన సంస్కృతిని వెల్లడించు అనేకావశేషములు భద్రపరుపబడియున్నవి, గులిస్తాన్ రాజభవనము నందలి ప్రాచీనపు వ్రాతప్రతులును, రత్న సింహాస నములును, తక్కిన పెక్కు అమూల్య వస్తువులును యాత్రికులను విరివిగ ఆకర్షించుచున్న.వి

గ్రంథాలయములలో తెహ్‌రాన్‌లోని జాతీయ గ్రంథాలయమును, పార్లమెంట్ గ్రంథాలయమును, అమూల్యగ్రంథములకును, ప్రాచీనపు వ్రాతప్రతుల కును పేరొందినవి.

1955 లో ప్రభుత్వము జారీచేసిన ఒక చట్టము నకు లోబడి ఈ దేశమున వార్తాపత్రికలు పనిచేయు చున్నవి. దైనిక వార్తాపత్రికలు పెక్కున్నను, వాని ప్రచారము చాల తక్కువ. ఇత్తెలాత్, కయ్ హాన్ అనువానికి మాత్రమే లక్షకుమించిన పాఠ కులు కలరు. ముఖ్యనగరమున ఫ్రెంచి, ఇంగ్లీషు దినపత్రికలు రెండు ప్రచారమున ఉన్నవి. దేశ మున వైద్య వసతులు క్రమముగ అభివృద్ధి చెందు చున్నవి. 38,124 శయ్యలుగల వైద్యశాలలు కలవు. ఇందు సగము తెహ్‌రాన్ నగరమున ఉన్నవి. వైద్యసంఖ్య 8,970 (1971).

**12. యాత్రా సౌ.** : పార్సా, ఇస్ఫహాన్ వంటి ప్రాచీననగరావశేషములను, జగ్రోస్, ఎల్ బర్జ్ పర్వతశ్రేణులలోని రమ్యదృశ్యములను చూచుటకు యాత్రికులు దేశమును దర్శించుచుం దురు. కొన్నిదేశముల పౌరులకు ఉచితముగ ప్రభు త్వము వీసాలను ఇచ్చుచున్నది. యాత్రికులకు సదుపాయములను కల్పించు యాత్రిక ఏజన్సీలు పెక్కు పనిచేయుచున్నవి. 1972 లో 4,53,881 మంది విదేశీయ యాత్రికులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు.** : అతి ప్రాచీన చరిత్ర గల ఈ దేశమున పెక్కురు ప్రసిద్ధ పురుషులు జన్మించి ఖ్యాతిని ఆర్జించిరి. వారిలో ప్రప్రథమ ముగ పేర్కొనదగినవాడు జరతుష్ట్రుడు. (క్రీ. పూ. 6 వ శతాబ్ది ?). ఈతడు ప్రవచించిన జరతుష్ట్రమతము దాదాపు 1200 సంవత్సరముల కాలము ఇరాన్ సంస్కృతిలో ముఖ్యభాగముగ వర్ధిల్లినది. ఇరానీయ ప్రప్రథమ సామ్రాట్ కురుష్ (క్రీ. పూ. 6 వ శతాబ్ది); ఈతని పట్టాభిషేకపు 2,500 వ జయంతిని పారసీక ప్రభుత్వము మహా వైభవముతో 1971 అక్టోబరులో నిర్వహించినది. దేశమున ఇస్లాము వ్యాపించిన తరువాత జన్మించిన మహాకవులలో మొదట గణనీయుడు షానామా రచయితయగు ఫిర్దౌసీ (940-1020); 12 వ శతాబ్దపు వాడగు ఉమర్‌ఖయ్యామ్ తన రుబా యితులవలన ప్రపంచఖ్యాతిని ఆర్జించెను. సెల్జుక్‌ల పరిపాలనా కాలమున ప్రభవించిన మహనీయులలో ప్రముఖకవి నిజామీ (114-1202), మత్నవీ రచయిత జలాల్ అల్-దిన్ రూమి (1207-73), 'గులిస్తాన్' రచించిన సౌదీ (ముస్లిహ్ ఉద్-దిన్ 1184 ? - 1291), మధురతకు పేరొందిన 700 గజలులను రచించిన హాఫిజ్ (మ. 1389). లెక్కింపదగినవారు.

పారసీకపు ప్రాచీన చిత్రకారులలో ప్రపంచ ఖ్యాతిని ఆర్జించినవాడు బిహ్‌జాద్ (15 వ శతాబ్ది).

# 6. ఓమన్ (సుల్తనత్ ఓమన్)

**ముఖ్యనగరము** : మస్కట్; **జెండా** ; అరుణ వర్ణరంజితము: **జాతీయ గీతము** ; ఇంకను రూపొందింప బడలేదు; **నాణెము** : రియల్ ఓమానీ; ఒక రియల్ ఓమానీ = రు. 21-71); **కొలతతూకములు** : బ్రిటిష్, మెట్రిక్ మానములు రెండును వాడుకలో ఉన్నవి; వానికి తోడుగ సాంప్రదాయికముగ తూకముల విషయములు జరుగును. నిడివికొలతల విషయమున జేన,




పటము 7.

మూరలను ప్రభుత్వము గుర్తించుచున్నది. **కాల పరిగణన** : సా. 4 గం. భారతదేశమున సా. 5. 30 గం.

**1. ఉనికి మొ.** : అరేబియా ద్వీపకల్పమునందు ఆగ్నేయతీరభూమి ప్రాంతమున 53°-60° తూ. తులారేఖల మధ్యను, 16°-25° ఉ. అక్షాంశరేఖల మధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున కొంతవరకు సంయుక్త అరబ్ అమీరేట్లును, తక్కిన భాగమున సౌదీ అరేబియాకు చెందిన రబ్ అల్ ఖాలీయును, పశ్చిమమున చాలవరకు రబ్-అల్ ఖాలీయును, కొంతవరకు దక్షిణ యెమెన్ దేశమును సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము దాదాపు 2,12,500 చ. కిమీ. దేశమున అత్యధికభాగము ఎడారిభూమి; తీర ప్రాంతమును, ఆగ్నేయపుమూలన ఉన్న ధూఫార్ పీఠభూమియు కొంతవరకు సారవంతభూములు.

**2. శీతోష్ణస్థితి మొ.** : సంవత్సరమున అత్యధిక భాగము (మే నుండి అక్టోబరు వరకు) గ్రీష్మ ఋతువుగ ఇచ్చట పరిగణనీయము. ఆ కాలపు అత్యధికోష్ణత 130° ఫా; చలికాలమున సైతము తాపక్రమము 54° ఫా. కు తక్కువగ ఉండదు. దేశమున మస్కట్ ప్రాంతమున సాలుసరి వర్షపాతము సరాసరిన 10 సెం. మీ; ధూఫార్ ప్రాంతమున 62.5. సెం. మీ. ఎడారులందు కననగు ముళ్లపొదలు మాత్రమే ఇట సహజముగ కననగు వృక్షజాలము; ధూఫార్ ప్రాంతమునను, తీరప్రాంతమునను కొబ్బరిచెట్లు విరివిగ కననగును. చిరుతపులి, నక్క, లేడి మొదలగు చిన్న జంతువులు మాత్రమే అటనట కననగును.

**3. జనసంఖ్య మొ.** : దేశమున అత్యధిక సంఖ్యాకులు అరబ్బీ జాతికి చెందినవారు; మస్కట్ నగరమునను, తత్సమీపమునను మాత్రము భారత, పాకిస్తానీయ సంతతికి చెందినవారు గణనీయ సంఖ్యలో కననగుచున్నారు. దేశపు జనసంఖ్య 7,50,000 (అంచనా మాత్రమే); మస్కట్ నగరపు జనసంఖ్య 6,200; ప్రజలలో దాదాపుగ లక్షమంది సంచారజాతులకు చెందినవారు. దేశమున దాదాపుగ అందరును ఇస్లామ్ మతానుయాయులు; అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ అయి

నను మస్కట్, మట్రానగరములందలి భారతీయ, పాకిస్తానీయ సంతతివారిలో ఉర్దూ, తదితర భారతీయ భాషలు ప్రచారమున ఉన్నవి.

**4. సమాచార సౌ.** : మస్కట్‌లోని తంతి, తపాలా, టెలిఫోన్ సౌకర్యముల వలన ఈ దేశము తక్కిన ప్రపంచముతో సంబంధమును కలిగియున్నది.

**5. యాన సౌ.** : దేశపు తీరప్రాంతమునను, వేర్వేరు పట్టణ ప్రాంతములను కలుపుచును రోడ్లు నిర్మింపబడినవి; పక్కా రోడ్లనిడివి 160 కిమీ. దేశమున అత్యధిక ప్రాంతమున రాకపోకలకు ఒంటెలు ఉపకరించుచున్నవి. మస్కట్, మట్రా లలో హార్బరులు కలవు. మస్కట్‌లోని విమానాశ్రయము అతిప్రముఖమైనది, తక్కిన చోట్లను చిన్న విమానాశ్రయములు కొన్ని కలవు.

**6. చరిత్ర** : అతి ప్రాచీనకాలమునుండియు జనావాసముగ ఉండిన ఈ ప్రాంతము ఫొనీషియనులకును పారసీకులకును క్రైస్తవశకపు పూర్వ కాలముననే సుపరిచితము. క్రీ. శ. 7 వ శతాబ్దిలో ఇచటి ప్రజలు ఇస్లామును అవలంభించిరి. కాని అ మతమున 'ఇబా' అను సంప్రదాయమునకు ఇచట ఎక్కువ మన్నన లభించినది తమ ఇమామును తామే ఎన్నుకొనవలయుననుట ఈ సంప్రదాయపు ముఖ్యలక్షణము. క్రీ. శ. 1508 లో పోర్చుగీజువారు తమ సముద్రమార్గముల సంరక్షణకై మస్కట్ ప్రాంతమును వశపరచుకొని అట ఒక నౌకాస్థానమును నెలకొల్పిరి. 1650 లో దేశీయులు తిరుగుబాటుచేసి పోర్చుగీజువారిని తరిమివేసిరి; తదనంతరము ఆ అరబ్బునాయకులు ఆఫ్రికా తూర్పుతీరపు పోర్చుగీజువలసలను కూడ వశపరచుకొనిరి. కాలక్రమమున ఆ నాయకులలో ప్రముఖుడగు అల్ అబా సయ్యదు రాజరికమును నెలకొల్పెను (1775). 19 వ శతాబ్దిలో మస్కట్–ఓమన్' అను పేర ఈ దేశము యూరపీయులకు సుపరిచితమయ్యెను. అప్పటికి ఆఫ్రికా తీర ప్రాంతములన్నియు ఓమన్‌నుండి విడివడి వేరువేరు రాజ్యములైనవి; కాని బెలూచిస్థాన్ లోని గ్వాదూర్ రేవును, తత్సమీపభూమియు ఆ రాజ్యపు వశమున ఉండెను. ఓమన్ ప్రాంతమున విరివిగ సాగుచున్న బానిసవ్యాపారమును అరికట్టుమిషతో బ్రిటిష్ ప్రభుత్వము ఈ దేశవ్యవహారములలో లొలుతగ జోక్యము కలిగించుకొని (1822), కడకు సుల్తాన్‌పై అధికారమును ఆర్జించి, తమ సమ్మతి లేనిదే అతడు తన రాజ్యమున ఏ ప్రాంతమును అన్యాక్రాంతమును చేయరాదను ఒడంబడికకు ఒప్పించిరి (1891). 1951 లో ఈ ఒడంబడిక రద్దయినది. అంతట బ్రిటిష్ ప్రభుత్వముతో ఒక మైత్రి ఒడంబడికను మాత్రమే దేశ ప్రభువు కుదుర్చుకొని, సర్వసత్తాకతను ఆర్జించెను. తరువాత దేశమున మతాధిపతియగు ఇమామ్‌తో వైరుధ్యము ఏర్పడి, కొన్ని అరబ్ రాజ్యములు ఇమామ్‌ను సమర్థించినను, దేశ ప్రభువు తన ప్రభుత్వమునకే పరిగణను పొంది కడకు 1972 లో తన దేశమునకు ఐ. రా. స. యందు సభ్యత్వమును పొందెను. 1958 లో బెలూచిస్థాన్‌లో తనకు హక్కుగల గ్వాదూర్‌రేవును తత్పరిసర భూమిని, పాకిస్తాన్‌కు ఓమన్ ప్రభుత్వము అమ్మివేసెను.

**7. పరిపాలన** : దేశప్రభువు దేశమును సర్వ స్వతంత్రాధికారములతో పాలించుచున్నాడు. దేశమున రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుట లేదు. స్థానికపాలకులను (వలీలను) ప్రభువే నియమించును. దేశీయులకు సంబంధించినంతవరకు ఇస్లామిక న్యాయసంహిత (పరిషత్) ను అనుసరించియే న్యాయ నిర్వహణసాగుచున్నది.

**8. దేశరక్షణ** : దాదాపు 550 సైనికులు గల సేన కలదు; అదిగాక ఒక చిన్న వైమానిక దళమును కలదు.

**9. అంతర్జాతీయ సం.:** ప్రముఖదేశములు అన్నింటితోను ఈ దేశము దౌత్య సంబంధములను కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము:** 1937 లో దేశమున పెట్రోలియం గనులు కనుగొనబడినవి; కాని 1964 నుండి మాత్రమే వాని వలన ఉత్పత్తి విరివిగా జరుగసాగినది. వివిధ విదేశీయ కంపెనీలు ఈ ఉత్పత్తిని సాగించుచున్నవి. 1969 లో పెట్రోల్ నూనె వలన ఆదాయము 7.2 కోట్ల డాలర్లు. వ్యవసాయోత్పత్తులలో ముఖ్యమైనది ఖర్జూరఫలము. ఇందు అధిక భాగము భారత దేశమునకు ఎగుమతిచేయబడుచున్నది.

**11. సాంఘికరంగము:** దేశమున మత విషయిక పాఠశాలలు పెక్కున్నను, ఆధునిక విద్యాశాలలు మస్కట్, మట్రాలలో మాత్రమే కలవు. సెకండరీ స్థాయి విద్య వరకు మాత్రమే దేశమున లభ్యము. రెండు వారపత్రికలు-ఒకటి ఇంగ్లీషులోను, రెండవది అరబ్బీలోను-ప్రచారమున ఉన్నవి. మ్యూజియములు, లైబ్రరీలు ఎట్టివియును లేవు; 207 శయ్యలు కల 8 వైద్యశాలలు కలవు.

---

# 7. కటార్

**ముఖ్యనగరము:** దోహా; **జెండా:** దండము వద్ద తెలుపుచారయు, దానికి అభిముఖముగ 8 కొనలు గల కపిశవర్ణ పట్టికయు కలిగినది; **నాణెము:** కటార్ రియల్, వినిమయపు విలువ 1 క. రి = రు. 1-90; **కొలతూకములు:** బ్రిటిష్ మెట్రిక్ విధానములకు చెందినవియు, కొన్ని స్థానిక ప్రమాణములును వాడుకలో ఉన్నవి; **కాల పరి గణన:** సా. 3 గం. 20 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** పారసీక సింధుశాఖయొక్క పశ్చిమ తీరమున నెలకొని, చిన్న ద్వీపకల్పాకృతిలో ఉన్న ఈ దేశపు విస్తీర్ణము 10,000 చ. కిమీ; దేశపు గరిష్ఠపు నిడివి 160 కిమీ; గరిష్ఠపు వెడల్పు 80 కిమీ. ఈ దేశమునకు సౌదీ అరేబియా, అబూదభీలతోఉన్న సరిహద్దులు అనిర్ధారితములై వివాదమునకు లోనైనవి. దేశమున కొంత ఇసుకపర్ర; కొంత శిలామయము. మొత్తముమీద అంతయు ఒక ఎడారి. త్రాగుటకు నీరు సైతము అలభ్యము; అందువలన సముద్రపు నీటిని శుద్ధజలముగ మార్చి ఉపయోగించి, ప్రభుత్వము ప్రజలకు అందజేయు చున్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** దీర్ఘ గ్రీష్మమునకు ఈ ప్రాంతము పేరొందినది. సాధారణముగ మే నుండి అక్టోబరు వరకు ఎండకాలముగ లెక్కింప వచ్చును. ఆ సమయమున నీడలో సైతము 110° ఫా. తాపక్రమము ఉండును. సరాసరి తాపక్రమము, సంవత్సరము మొత్తముమీద ఆగస్టులో 90° ఫా. యును, జనవరిలో 60° ఫా. యును ఉండును. సాలీనా వర్షపాతము 5-10 సెం. మీ. వరకు ఉండును. అరేబియా ఎడారి పరిస్థితులే ఇచట కన్పట్టును; చెట్లు చేమలు దాదాపుగ శూన్యములు. ఒంటెల మేతకు ఉపయోగించు కంపచెట్లు, సముద్ర తీరపు ప్రక్కన కన్పట్టును; అటనట ఖర్జూరచెట్లు చూడనగును.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 1,70,000. ఇందు 1,30,000 ముఖ్యనగరమగు

దోహాలో వసించుచున్నారు. జనుల మాతృభాష అరబ్బీ; జనులందరు సున్నీశాఖకు చెందిన ముస్లిములు.

**4. సమాచార సా. :** కటారున టెలిఫోను, రేడియో-టెలిఫోను సౌకర్యములు మాత్రమే కలవు. యూరప్, అమెరికాలతో వీనిద్వారా ఈ దేశము సంబంధమును కలిగియున్నది.

**5. యాన సా. :** రైలు రోడ్లు దేశమున లేనే లేవు; 1960 మొదలుగ రోడ్డు నిర్మాణము కొంత జరిగినది; కటారును సౌదీ అరేబియాతో కలుపు ఒక పక్కా-రోడ్డు నిర్మింపబడినది (1970). ముఖ్య నగరమగు దోహా ఒక రేవు పట్టణము; ఇదిగాక ఉమ్మా సయ్యద్ అను వేరొక పెద్ద హార్బరును కలదు సముద్ర ప్రయాణమును నిర్వహించు కొన్ని కంపెనీల స్టీమరులు దోహా, ఉమ్మాసయ్యద్ రేవులవద్ద ఆగుచుండును. దోహాయందు ఒక విమానాశ్రయము కలదు. అంతర్జాతీయ విమాన యానమునకు ఇది ఉపకరించుచున్నది.

**6. చరిత్ర :** ప్రాచీన కాలమునుండియు ఇది అరబ్బులు నివసించు ప్రాంతములలో ఒకటిగ ఉండె ననుటకన్న 19వ శతాబ్ది పూర్వపు వివరములు ఏవియు దీనినిగురించి తెలియవచ్చుటలేదు. పార సీక సింధుశాఖలో తమ నౌకాయాన పరిరక్షణకై అచటి చిన్న షేకు రాజ్యములలో పలుకుబడిని ఆర్జించ సంకల్పించిన బ్రిటిష్ ప్రభుత్వము, అప్ప టిలో కటారును పాలించు షేకుతో ఒక ఒడంబ డికను ఏర్పాటు చేసికొని రాజ్యమును తన రక్షణ లోనికి తీసికొనినది (1668). ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున ఈ ప్రాంతపు షేకు, టర్కీ-రాజ్యపు రక్షణలోనికి పోయినను మరల 1916 ఒడంబడిక ద్వారా బ్రిటిష్ రక్షణను అంగీకరించెను. 1971, సెప్టెంబరు 1 న బ్రిటన్ ఈ ఒడంబడిక హక్కు-లను వదలుకొని, దేశమునకు స్వతంత్రమొసగి, వేరుగ ఒక మైత్రి ఒడంబడికను కుదుర్చుకొనెను. అంతట ఆ ప్రాంతపు షేకు తనకు దేశపు అమీరుగ ప్రకటించుకొనెను; కాని, అతని అసమర్థతను నెప ముగ గ్రహించి అతని సన్నిహిత జ్ఞాతియగు షేకు ఖలీఫా అహమ్మద్ అల్‌తాని, అతనిని రాజ్య భ్రష్టునిచేసి, తానే ప్రభువయ్యెను (ఫిబ్రవరి 22, 1972.)

**7. పరిపాలన :** రాజు తాను నియమించు కొనిన, 20 మంది సభ్యుల సలహాసంఘపు సాయ మున పరిపాలనను నెరపుచున్నాడు.

**8. దేశరక్షణ :** దేశపు భద్రతకై ప్రభుత్వము ఒక చిన్న వైమానిక దళమును కలిగియున్నది. ఇందు 6 పోరాట విమానములును, 3 హెలీకాప్టరు లును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** కటారునకు ఐ రా. స. యందు సభ్యత్వము కలదు. దేశమున పెట్రోలు పరిశ్రమవలన ఉద్యోగములు విరివిగ దొరకుచున్నందున, అందులకై పొరుగు అరబ్బీ దేశములనుండియు, ఇరాన్, పాకిస్తాన్, భారత దేశములనుండియు ప్రజలు తాత్కాలికముగ వలస వచ్చుచున్నారు.

**10. ఆర్థిక రంగము :** ఇరువదవ శతాబ్దికి పూర్వమున దేశప్రజలు, సాంప్రదాయికముగ, సముద్రమునుండి ముత్యములను సేకరించి, వానిని విదేశ వర్తకులకు విక్రయించి జీవించెడివారు; మత్స్యపరిశ్రమ అనుబంధ వృత్తిగ ఉండెడిది. కాని 1939 లో దేశమున పెట్రోలియమ్ గనులు కనుగొనబడుటతో దేశపు ఆర్థికవ్యవస్థ ఒక వింత పరిణామమును పొందినది. ఆ నూనెను త్రవ్వితీయు కంపెనీలవల్ల అధికాదాయము రాదొడగినది. 1972 లో అమీరు జారీచేసిన ఫర్మానావలన కటార్ జాతీయ పెట్రోలియమ్ కంపెనీ రూపొందినది; అంతటినుండి దాని సర్వాధిపత్యమునకు లొంగిన

నాలుగు కంపెనీలవలన ఉత్పత్తి జరుగుచున్నది. 1971 లో దీనివలన ఆదాయము 7.8 కోట్ల బ్రిటిష్ పౌనులు లభించినది. ఈ ఆదాయమున అత్యధిక భాగము అభివృద్ధి కార్యక్రమములకు వినియుక్తము. దేశమున ఇంధన వాయువు కూడ దొరకునని కనుగొనబడినది. దానిని వినియోగించి, సముద్రపు ఉప్పునీరును, మంచినీరుగ చేయుచున్నారు. మంచి నీటిని ఉపయోగించి తీర ప్రాంతములందు కూరలను, పండ్లను పండించుటయేగాక, దేశావసరములకు మించినవానిని ఎగుమతిచేయుట జరుగుచున్నది. ప్రభుత్వప్రోత్సాహమున మత్స్యపరిశ్రమ మొదలు వేసినది. 49,000 టన్నుల రసాయనిక ఎరువులను, సాలీనా ఉత్పత్తిచేయు కర్మాగారము ఉమ్మాసయ్యద్ వద్ద స్థాపింపబడినది. కట్టుబడి పనులకొరకై ఒక పెద్ద సిమెంట్ ఫ్యాక్టరీ అటనే స్థాపింపబడి, సాలీనా లక్షటన్నుల సరకును ఉత్పత్తి చేయుచున్నది.

**11. సాంఘికరంగము :** పెట్రోలియమ్ వలన లభించు ఆదాయము వలన సాంఘిక శ్రేయోకార్యక్రమములు విరివిగ సాగుచున్నవి. పాఠశాలలు నెలకొల్పబడుచున్నవి. మొత్తమున 1071 పాఠశాలలలో 18,531 మంది విద్యార్థులు పఠించుచున్నారు. విశ్వవిద్యాలయములు లేవు. ప్రపంచమున, అత్యంత ఆధునిక పరికరములుగల వైద్యశాలలలో ఒకటిగ పేరుగనిన వైద్యశాల దోహాలో ఉన్నది; అందు శయ్యాసంఖ్య 180; ఇదికాక మొత్తమున 491 శయ్యాసంఖ్యగల నాలుగు వేరువిధముల వైద్యశాలలును కలవు. ఒక జాతీయ బ్యాంకును, మూడు విదేశ బ్యాంకుల శాఖలును దేశమున పనిచేయుచున్నవి.

---

# 8. కాంబోడియా (ఖ్మేర్)

**ముఖ్యనగరము :** పనమ్ పెన్ ; **జెండా :** నీలభూమికపై వాయవ్య మూలన, ఎరుపుభూమికపై తెలుపున అంగోర్ వాట్ దేవళపు చిత్రమును, దానికి కుడిపైపు అడ్డముగ మూడు తెల్లని నక్షత్రములును కలది; **నాణెము :** రియెల్ ; 100 రియెల్‌లు = రూ. 13-64; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి: **కాలగణన :** సా. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఇండో-చీనా ద్వీప కల్పపు ఆగ్నేయ ప్రాంతమున 10°-15° ఉ అక్షాంశ రేఖలకును, 102° 31′-108° తూ. తులా రేఖలకును మధ్యన విస్తరించియున్న ఈ దేశమునకు ఈశాన్యమున లావోస్; తూర్పు ఆగ్నేయములందు వియెత్‌నామ్; దక్షిణమున సయామ్ సింధు శాఖ; పశ్చిమమున, ఉత్తరమున థాయిలాండ్ సరిహద్దులందు ఉన్నవి. దేశవైశాల్యము 1,72,511 చ. కిమీ. అటవీమయములగు పర్వతములును, జల ప్రవాహముల వసతి చక్కగ కలిగిన మైదానములును కలది ఈ దేశము. తోన్లెసాప్ (మహా సరస్సు), మీకాంగ్ నదులు నెలకొనినది ఇందలి మధ్య దేశము. మీకాంగ్ నది ఇటనుండి లావోస్ లోనికి పోవుచున్నది. తోన్లెసాప్, సయాం సింధు శాఖల మధ్య కర్దమం పర్వతములును, గజపర్వత శ్రేణియు కలవు. ఉత్తరమున థాయిలాండ్ సరిహద్దును అనుకొని 320 కిమీ. పొడవున దంగ్ రెక్ పర్వత శ్రేణి కలదు; దీని ఎత్తు 300-750 మీ. వరకు ఉండును. దేశపు తీరభూమి కొలది పొడవుగలదియే అయినను ప్రకృతి సిద్ధమగు

ఉత్తమమైన హార్బరును కంపాంగ్ సోమ్ (సింహానక్ విల్లీ)ను - కలిగియున్నది.

దేశీయుల ఆర్థిక జీవన వ్యవస్థకు మీకాంగ్ నదియు. తోన్లేసాప్ సరస్సును ఆధారములని చెప్ప వచ్చును. మీకాంగ్‌నది వెల్లువల వలన లభించు ఒండ్రుమట్టిచేత పరిసర భూములు సారవంతము లగుచున్నవి; ఆ వెల్లువ జలమే మహా-సరస్సును నింపుచున్నది; బాగుగ నిండినపుడు ఆ సరస్సు వైశాల్యము 2070 చ. కిమీ; సాధారణముగ దాని వైశాల్యము 260 చ. కిమీ.

దేశమున అధికభాగము పర్వతమయము; అందలి సాంద్రాటవులలో విభిన్న వృక్ష, జంతు




పటము 9.

సంతతులు కలవు. తాళజాతి. రబ్బరు, కొబ్బరి, మామిడి, అరటి, నారింజ వృక్షములును, ఎత్తుగ రెల్లుగడ్డియు అట కాననగును. ఏనుగులు, కారెనుములు, పులులు, చిరుతలు అడవులలో విరివిగ వసించుచున్నవి. పాములును, చేపలును, వివిధ కీటక జాతులును పలుప్రాంతములలో విస్తృతముగ కనబడుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండలపు శీతోష్ణస్థితి ఇట కలదు. జూన్ మొదలుగ నవంబరు వరకు వానలు కురియును. గరిష్ఠోష్ణత 90° ఫా. కనిష్ఠోష్ణత 70° ఫా; గాలిలో చెమ్మదనము చాల ఎక్కువ. దేశపు నిమ్నప్రాంతములందు వర్షపాతము సాలున 200 సెం. మీ; వానకాలమున ఈ ప్రాంతములు వెల్లువలకు గురియగుచుండును; దేశపు పశ్చిమ, ఉత్తర భాగములందు వర్షపాతము ఇంతకన్న కొలదిగ తగ్గియున్నది.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 68 లక్షలు (1970); అది సాలున 2.6% చొప్పున వృద్ధియగుచున్నది. నగరములలో ముఖ్యనగరమగు ఫణమ్ పెణ్ (జ నం. అందనా 18 లక్షలు), బత్తం బాంగ్ (60,000) పేర్కొనదగినవి. దేశమున 85% ఖ్మేర్ జాతీయులు. తక్కిన వారిలో వియత్నామీయులు (2 లక్షలు), చీనీయులు (4 లక్షలు), మలయో-పోలినీసియన్ వర్గములవారు (8 లక్షలు) కలరు. దాదాపు 6,000 యూరపీయులు పట్టణము లందు వసించుచున్నారు. పైలీన్‌నగర ప్రాంతమున కొందరు బర్మీయులును, వాకునే సాయి పరిసరము లందు లావో దేశీయులును వసించుచున్నారు.

దేశీయుల మాతృభాష ఖ్మేర్ (కాంబోజీ); ద్వితీయ భాషగ ఫ్రెంచి భాష విస్తృతముగ వ్యాప్తి కలిగియున్నది చీనీయులు మొదలగు అల్ప సంఖ్యాకజాతులు తమ మాతృ భాషలనే మాటాడు చున్నారు. హీనయానబౌద్ధము జాతీయ మతము; దేశీయులలో 90% ఈ మతమును అనుసరించు చున్నారు. ముస్లిముల సంఖ్య 85,000; దాదాపు 50,000 క్రైస్తవులు కలరు.

**4. సమాచార సా. :** దేశమున 58 పోస్టాఫీసులు పనిచేయుచున్నవి (1968). టెలిఫోను వసతులు విస్తృతముగ కలవు, ముఖ్యనగరమునుండి హాంగ్‌కాంగ్, పారిస్, టోకియోలకు టెలిఫోను సౌకర్యమును; హాంగ్‌కాంగ్. ఒసాకా, పారిస్, సైగానులతో టెలెగ్రాఫు సంబంధమును కలవు.

తంతి-టెలిఫోను సంబంధములు నేరుగ సింగపూరుతో ఏర్పడి ఉన్నవి.

**5. యాన సౌ.:** దేశమున 2,574 కిమీ. పొడవున తారురోడ్లును, 359 కిమీ. పొడవున కంకర రోడ్లును, 1,213 కిమీ. ల కచ్చారోడ్లును కలవు. 1970 నుండి సాగిన అంతర్యుద్ధ కాలమున ఈ రోడ్లయందలి వంతెనలు అనేకములు నాశనము లైనవి. ఫణమ్‌పెణ్‌నుండి తాయి సరిహద్దునందలి పోయిపేట్‌వరకు 385 కిమీ. నిడివిన మీటరుగేజి రైలుమార్గము ఉన్నది. ఫణమ్‌పెణ్‌నుండి కాంపాంగ్ సేమ్‌కు 552 కిమీ. పొడవున వేరొక రైలు మార్గము 1969 లో పూర్తి చేయబడినది. మీకాంగ్ నదితీరమున ఉన్న ముఖ్యనగరము ఒక రేవు నగరముగ కూడ ఉపకరించుచున్నది. కొలది పాటి సముద్రనౌకలు మీకాంగ్‌నది ఎగువకు పయనించి ఆ రేవునకు చేరుకొనగలిగెడివి. కాని కంపాంగ్ సోమ్ హార్బరును అభివృద్ధిచేసిన తరువాత, విదేశవ్యాపారమునకు ఆ రేవు ఎక్కువగ ఉపయోగపడుచున్నది. ఫణమ్‌పెణ్‌నగరమునకు సమీపమున ఉన్న పోచెన్‌టోంగ్ విమానాశ్రయము నుండి కొలంబో, న్యూఢిల్లీ, బొంబే, కరాచీ, ఏథెన్స్, టోకియో, వియెంతియేన్, సైగాన్, బాంగ్‌కాక్, సింగపూర్, హాంగ్‌కాంగ్, రోమ్, పారిస్‌లకు విమాన ప్రయాణ వసతి కలదు. సీమ్‌రీప్ వద్దను వేరొక అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. దేశమున వివిధ ప్రాంతీయ నగరముల మధ్య విమానయాన సౌకర్యము ఏర్పడి ఉన్నది.

**6. చరిత్ర:** క్రీ. శ. ఆరవ శతాబ్దివరకు ఈ దేశము, ఆగ్నేయ ఆసియాయందు ఆ కాలమున అధికభాగమును పాలించిన, చంపా (ఫూనాన్) రాజ్యమున దాదాపు 400 సంవత్సరములు అంతర్భాగముగ ఉండెను. ఆ చంపా రాజ్య పాలకులు భారతీయ మత సంస్కృతులను అవలంబించినవారు. వారి పాలనను అంతమొందించి క్రీ. శ. ఆరవ శతాబ్దిలో ఖ్మేరు జాతీయులు తమ దేశమునకు స్వతంత్రతను కల్పించిరి. అట్టి ఖ్మేర్ జాతి నాయకుల మూల పురుషుడు 'కంబు స్వయంభువ' అనియు వానినుండియే ఈ దేశమునకు 'కాంభోజ' అను పేరు కూడ కలిగెననియు దేశీయుల సాంప్రదాయిక కథనము. ఈ పేరే కడకు 'కాంబోడియా'గా మార్పొందినది.

ఖ్మేర్ పాలకులును భారతీయ మతసంస్కృతుల యెడ ఆదరము కలవారు. ఈ వంశమునకు చెందిన రెండవ జయవర్మ క్రీ. శ. 802 లో 'అంకారధామ' అను పేరున ఒక ముఖ్యనగరమును దాని పరిసరమున 'అంకారవాట్' అను దేవాలయమును నిర్మింపజేసెను. క్రీ. శ. 10, 11 శతాబ్దము లందు ఈ రాజుల సామ్రాజ్యము ఆగ్నేయ, ఆసియాయందు అత్యధిక భాగమును లోగొనినది. కాని 12వ శతాబ్దమున తాయి, వియెత్‌నామ్ సైన్యములు దండెత్తి వచ్చి దేశమును అరాజకము పాలు చేసినవి. తదాదిగ తాయి రాజ్య పాలకులకు సామంతులుగ ఈ దేశపు రాజులు అతిహీనస్థితిలో కాలమును గడిపిరి. ఈ దుస్థితి నుండి బయట పడుటకై 1863 లో అప్పటి రాజు ఫ్రెంచివారి రక్షణను అర్థించెను. అప్పటికే ఫ్రెంచివారు లావోస్, వియెత్నామ్‌లలో పలుకుబడిని కలిగి యుండుటవలన వారు కాంబోడియాను ఆ రాజ్యములతో చేర్చి ఫ్రెంచి ఇండో-చీనా అను పేర ఒక రక్షిత రాజ్యమును సంస్థాపించి పాలించిరి. ఈ ఫ్రెంచి వలసపాలనయు కాంబోడియావాసులకును తత్పాలకునికిని బాధాకరముగ పరిణమించెను. ఇంతలో ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాను సేనలు ఇండో-చీనాను ఆక్రమించిన సమయమున రాజగు సింహానక్, జపానీయుల పక్షమవలంబించెను. 1945 న జపాన్ సేనలు పరాజితములైన తరువాత, ఫ్రెంచివారు

ఇండో-చీనాను ఆక్రమించినను, అందలి దేశము ప్రజల జాతీయోద్యమముల వలన చాల ప్రతిబంధకములను ఎదుర్కొనవలసి వచ్చినది. ఆ అదనున, కాంబోడియా పాలకుడు తన దేశమును స్వతంత్రముగ ప్రకటించి (6 మే, 1947), కడకు ఫ్రెంచి వారి ఆమోదమును పొంది ఫ్రెంచి యూనియన్‌లో నియమిత స్వాతంత్ర్యముతో ఉండుటకు అంగీకరించెను. అయినను ఇండో చీనాలోని పరిస్థితులు ఫ్రెంచివారికి క్రమముగ అనకూలముగ పరిణమించినవి; అంతట కాంబోడియా 9 నవంబరు, 1953న పూర్ణ స్వతంత్ర రాజ్యముగ రూపొందినది.

కాంబోడియా పాలకుడగు సింహానక్ ఉదార భావ సంపన్నుడు; దేశమున శాసన బద్ధ వంశానుగత రాజరికపు పాలనను నెలకొల్పి దేశాభివృద్ధికై కృషిచేయుచు, పూర్వ పశ్చిమ అగ్ర రాజ్యములలో అన్నింటి సాయమును గ్రహించి, తాటస్థ్యపు విదేశనీతి అవలంబించెను. కాని దక్షిణ ఉత్తర వియెత్నాముల అంతర్యుద్ధమున దక్షిణ వియెత్‌నామీయ విమోచనసేనలు కాంబోడియాలో నెలవులను ఏర్పరచుకొనుట వలన అతని పరిస్థితి క్లిష్టమయ్యెను అంతట యు. స్టే. తో అతడు సంబంధములను దూరము చేసికొనక తప్పలేదు. ఈ పరిస్థితులలో 'లాన్ నోల్' అను సేనాని ఆధిపత్యమున సేనలో కొంతభాగము అతనిని పదచ్యుతుని చేసి అధికారమును గ్రహించినది. తత్ఫలితముగ దేశమునందలి కమ్యూనిస్ట్ వర్గమునకు రాజు చేయూత నిచ్చి, తాను పీకింగునకు పోయి అచట తలదాచుకొనెను (మార్చి, 1970). 1970 అక్టోబరులో దేశనామము ఖ్మేర్ రిపబ్లిక్‌గ మార్చబడినది. దేశీయ కమ్యూనిస్ట్ సేనలు, ఉత్తర వియెత్‌నమీస్ సేనల సాయముతో లాన్‌నోల్ ప్రభుత్వమును అంతరింపజెయుటకై యుద్ధమును సాగించి 1975 మార్చిలో విజయమును సాధించినవి. రాజగు సింహానక్ 1975 సెప్టెంబరులో దేశమునకు తిరిగి వచ్చి పాలకుడయ్యెను. కాని అనతికాలముననే అతడు స్వచ్ఛందముగ అధికారమును పరిత్యజించెను (మార్చి, 1976). తత్ఫలితముగ దేశమున కమ్యూనిస్ట్ ప్రభుత్వము నెలకొనెను.

**7. పరిపాలన :** దేశము కొద్దికాలము క్రిందటనే కమ్యూనిస్ట్ సేనల వశమయినది; అచటి నూత్న వ్యవస్థను గురించిన వివరములు తెలియ వచ్చుటలేదు.

**8. దేశరక్షణ :** సేనయందలి సంఖ్యా వివరములు తెలియవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు 1955 మొదలుగ ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది. కాంబోడియా, లావోస్, తాయిలాండ్, దక్షిణ వియత్నాం రాజ్యములు మీకాంగ్ నది యొక్క పరీవాహ ప్రదేశమున విద్యుదుత్పత్తి మొదలగు వానిలో పరస్పరము సహకరించుకొనుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. వరి, రబ్బరు ముఖ్యములగు ఉత్పత్తులు. దేశపు మొత్తపు వైశాల్యమున 2 కోట్ల ఎకరములు సేద్యమునకు అనుకూలము ఇందు 40 లక్షల ఎకరములు మాత్రమే సేద్యమగుచున్నది. అందును 85% వరికి, 3% రబ్బరునకు, తక్కినది నానా విధముల ఇతరపు పంటలకును వినియుక్తమగుచున్నది. దేశపు ఎగుమతుల విలువలో అత్యధిక భాగము బియ్యపు ఎగుమతివలన లభించుచున్నది. కాని అంతర్యుద్ధము వలన ఈ ఎగుమతులు చాల దెబ్బతినినవి; దేశమున 38 లక్షల హెక్టేరుల అటవీ ప్రాంతము కలదు. కాని రాకపోకల సదుపాయములు తగ్గుటవలన

వానిని ఫలవంతముగ ఉపయోగించుకొనుట జరుగకున్నది; ఆగ్నేయ, ఆసియాలోని తక్కిన దేశములతో పోల్చినప్పుడు, ఈ దేశమున మత్స్య పరిశ్రమకు అవకాశములు మెండుగ కలవు. కాని వానికి సరియగు వినియోగము లేకున్నది. దేశమున పశుసంపద అత్యధికము; అనేక పశువులు విదేశములకు ఎగుమతి అగుచున్నవి.

ఖనిజముల ఉనికి తక్కువగ ఉన్నది. ఇనుము, ఫాస్ఫేటులును ఎక్కువగ గనులందు కలవని అంచనా. ఫాస్ఫేటును విరివిగ పనిగొనుటకై యంత్రాగారములు సంస్థాపితములైనవి. విద్యుదుత్పత్తి 8.3 కోట్ల కివా (1964). దేశపు ఎగుమతుల విలువ 309,81,65,000 రియళ్ళు; దిగుమతుల విలువ 404,34,24,000 రి (1968). దేశపు బడ్జెటరీ వ్యయము 2,200 కోట్ల రి. (1972).

**11. సాంఘిక రంగము :** తక్కిన ఆగ్నేయ, ఆసియా దేశములతో పోల్చి చూచినపుడు ఈ దేశమున చాలవరకు చక్కని గృహవసతి కలదనియే చెప్పవచ్చును. దేశమున 45% అక్షరాస్యత కలదు. 8,87,290 మంది విద్యార్థులు కల 1,490 ప్రయిమరీ పాఠశాలలును; 81,611 మంది పఠించు 95 సెకండరీ పాఠశాలలును కలవు; 12,453 మంది ఉన్నత విద్యను పఠించువారు కలరు (1970-71). (అంతర్యుద్ధ కాలమున పాఠశాలలు అనేకములు మూసివేయబడినవి). 1959 లో ఖ్మేర్ విశ్వవిద్యాలయము సంస్థాపితమైనది. ఇందు 14,560 మంది విద్యార్థులు కలరు (1968); ఇచటి విద్యా విధానము ఫ్రెంచి విధానమును అనుసరించుచున్నది. 1964 లో సోవియట్ దేశపు సాయమున ఒక పాలీ-టెక్నిక్ సంస్థ, యు. స్టే. సాయముతో ఒక ఇంజనీరింగ్ పాఠశాల కొలకొల్పబడినవి. దేశమున ఖ్మేర్ భాషలో 8, చీనీయ భాషలో ఒకటి, ఫ్రెంచి భాషలో రెండు దినపత్రికలు ప్రచురింపబడుచున్నవి. 'ఫణమ్‌పెన్' లోని జాతీయ గ్రంథాలయము దేశమున అట్టివానిలో ప్రముఖము. ఆ నగరమునందలి మ్యూజియమును ఉన్నత శ్రేణికి చెందినదే, చారిత్రకుల దృష్టిలో ఈ దేశమే ఒక మ్యూజియము. ఖ్మేర్ సామ్రాజ్యపు దేవాలయములు, శాసనములు, స్తూపములు, విగ్రహములు దేశపు నానా ప్రాంతములందు కానవచ్చుచున్నవి. అన్నింటిలోను చారిత్రక ఖ్యాతిని ఆర్జించినది. 'అంకార వాట్' దేవాలయము; దీని బహిః ప్రాకారపు చుట్టుకొలత 5,540 మీ; ఈ ప్రాకారమున 50 గోపురములు కలవు. దేవాలయపు కుడ్యములపై రామాయణ, భాగవతముల గాథలు శిల్పకళా విశిష్టతతో మలచబడినవి.

దేశమున రోగబాధ ఎక్కువ; దేశీయ సామాన్య పౌరుని సరాసరి ఆయుః ప్రమాణము 32 సం. మాత్రమే. దేశము స్వతంత్రతను ఆర్జించిన తరువాత వైద్య వసతులు పల్లెపట్టులందును ఏర్పడినవి. ప్రజలలో 2,380 మందికి ఒక వైద్యుడు చొప్పున కలరు. మొత్తపు వైద్య సంఖ్య 400 (1969). దేశమున 58 ఆసుపత్రులును, 358 డిస్పెన్సరీలును, 26 ప్రసూతి శాలలును పనిచేయుచున్నవి (1968). 60 శయ్యలు కలిగిన ఒక వైద్యనౌక తోన్లేసాప్ సరస్సు తీరమున పయనించుచు తీరవాసులకు వైద్యసహాయమును కల్పించుచున్నది. ముఖ్య నగరమున యు. స్టే., సోవియట్ దేశము, ఫ్రాన్సు దేశముల ప్రభుత్వముల సాయమున నిర్మించిన మూడు ఉత్తమ వైద్యశాలలు కలవు.

**12. యాత్రా సౌ. :** దేశమును దర్శించు విదేశీయులు పాస్‌పోర్టు, వీసాలను విధిగ కలిగియుండవలెను. హోటల్ సదుపాయములు పరిమితముగ కలవు. ముఖ్యముగ 'అంకారవాట్'ను

దర్శించుటకై విదేశీయ యాత్రికులు ఈ దేశమునకు వచ్చెదరు.

**13. ప్రసిద్ధ పౌరులు :** ప్రాచీనులలో 'ఖ్మేర్' రాజవంశపు రెండవ జయవర్మ, ఏడవ జయవర్మ ప్రముఖులు. ఆధునికులలో అంతర్జాతీయముగ పేరొందిన వాడు నరోత్తమ సింహానక్ (జ.1922). ఫ్రెంచి వలస పాలనా కాలమునుండియు దేశ ప్రజల ఆశయములకు ప్రాతినిధ్యమును వహించి, 1970 లో పదచ్యుతుడైనను, మరల 1975 లో దేశపరిపాలకుడై, కడకు స్వచ్ఛందముగ రాజ్యమును పరిత్యజించి సన్యసించిన ఉదారభావుకుడు.

---

# 9. కువాయిట్

**ముఖ్యనగరము :** అల్-కువాయిట్. **జెండా :** పొడవు, వెడల్పులు 2 : 1 నిష్పత్తిలోనున్న భూమికపై సమాన భాగములలో రూపొందిన ఆకుపసిమి, తెలుపు అడ్డుచారలలోనికి, దండము ప్రక్కనుండి ముందునకు చొచ్చుకొని వచ్చిన నలుపురంగు పీఠాకృతి గలది. జాతీయ పతాకము.




పటము 10.

**నాణెము :** కువాయిట్ దీనార్ (కు. దీ;) దీని సమాన విలువ బంగారములో, 2.48828 గ్రాములుగ నిర్ణయితము. ఒక దీనార్ 1000 ఫిల్లులను చిల్లర నాణెములుగ విభక్తము (1 కు. దీ = రూ. 21.00 ) **కొలతూకములు :** మెట్రిక్ మానమునకే సాధికార పరిగణన ఉన్నను, తక్కినవియు వ్యాప్తిలో ఉన్నవి. **కాలపరిగణన :** సా 3 గం. = భారతదేశమున సా. 5.30 గం.

**1. ఉనికి, హద్దులు, పరిమాణము :** పారసీక సింధుశాఖయొక్క పశ్చిమ తటమున ఉన్న ఈ దేశమునకు ఉత్తర పశ్చిమములందు ఇరాక్ దేశమును, తూర్పున పారసీక సింధుశాఖయు, దక్షిణమునను పశ్చిమమున కొంతవరకును సౌదీ అరేబియాయు సరిహద్దులందున్నవి. సరిహద్దులను గురించి ప్రక్క దేశములతో ఏర్పడిన వివాదముల వలన సరిహద్దురేఖలు ఇదమిత్థములుగ నిర్ణయములు కాకున్నవి. దక్షిణమున సౌదీ అరేబియాతో గల సరిహద్దున తటస్థ ప్రాంతమని వ్యవహృతమగుచు, 5120 చ. కిమీ విస్తీర్ణముగల ప్రాంతము కలదు. ఇందు సౌదీ అరేబియాయు, కువాయిట్‌ను సమష్టిగ సమాన హక్కులు కలిగియుండి, ఎవరికివారు సగభాగమును, వారి రాజ్యమున అంతర్భాగముగ మాత్రము గ్రహించి పాలించుచున్నవి. పై సరిహద్దులలోని ప్రాంతముగాక సింధుశాఖలోని కొన్ని అల్పద్వీపములును రాజ్యమున చేరి ఉన్నవి. వీని అన్నింటితోడను, దేశపు విస్తీర్ణము దాదాపు 16,900 చ. కిమీ. ఉండునని అంచనా. దేశమంతయు దాదాపు సమతలముగఉన్న ఎడారి భూమి. దేశమున నదులు ఎట్టివియు లేవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** మే నుండి అక్టోబరు వరకు దేశమున ఎండలు కాయును; ఆ కాలమున మధ్యాహ్నపు తాపక్రమము దాదాపుగ 125° ఫా. ను చేరుకొనును. శీతకాలమున తాపక్రమము కొన్ని పట్టుల 0° కి పడిపోవును. సాలుసరి వర్షపాతము 2.5 సెం. మీ. నుండి 17.5 సెం. మీ. వరకు మారుచుండును. ఎడారులలో సహజముగ కన్పట్టు చిన్న పొదల చెట్లును, అల్ప మృగములును పక్షులును మాత్రమే ఇట కనబడును; అవియును తీర ప్రాంతముననే ఎక్కువగ ఉన్నవి; పచ్చిక భూములను తీరముననే కన్పట్టును.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య, 1970 లెక్కలను అనుసరించి 7,38,662. వీరిలో 50% నకు పైగా కువాయిట్ నగరమున నివసించుచున్నారు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ; అయినను ఇంగ్లీషుతో పరిచయము పలువురకు కలదు. దేశప్రజలలో 94% ముస్లిములు (వీరిలో అత్యధిక భాగము సున్నీ సంప్రదాయపు వారు); 5% క్రైస్తవులు; తక్కినవారు వివిధేతర మతములకు చెందిన భారతీయ సంతతి వారు.

**4. సమాచార సౌ.:** తంతి, తపాలా, టెలిఫోన్, రేడియో, టెలివిజన్ సదుపాయములను ప్రభుత్వమే నిర్వహించుచున్నది. దేశము చాల చిన్నదైయైనను అందు 66 097 టెలిఫోనులను, దాదాపు ఒక లక్ష టెలివిజన్ సెట్లును కలవు (1972).

**5. యాన సౌ.:** దేశమున రైలు మార్గములు లేవు; కాని రోడ్డు సౌకర్యమును మాత్రము ప్రభుత్వము విరివిగ కల్పించి, అందు వాహనముల సదుపాయమునుకూడ బాగుగ ఏర్పాటు చేసినది; పక్కారోడ్ల నిడివి 1,040 కిమీ. (1968). దేశమున యాంత్రిక వాహనముల (కార్లు, లారీలు, బస్సులు మొ.) వాని సంఖ్య 1 57 876 (1971).

కువాయిట్ నగరపు విమానాశ్రయము, అంతర్జాతీయ విమాన యాన మార్గమున కీలకస్థానమున ఉన్నది. కువాయిట్ నగరమును ఆనుకొనియున్న షువాయిక్‌న ఒక గొప్ప హార్బరు నిర్మితమై (1968) పనిచేయుచున్నది. అల్-అహమదీవద్ద వేరొక పెద్ద హార్బరు కలదు.

**6. చరిత్ర:** ఈ దేశపు ప్రాచీన చరిత్రను గురించిన వివరములు ఏవియు తెలియవచ్చుటలేదు; అయినను ఈ దేశమునకే చెందియున్న ఫయలకా ద్వీపమునందు పురాతత్త్వవేత్తలు కనుగొనిన అవశేషములను అనుసరించి చూడగ, క్రీ. పూ. ఆరవ శతాబ్ది ప్రాంతమునుండియు, అతి దీర్ఘకాలము, భారతదేశముతో పశ్చిమాసియా ప్రాంతమునకు సాగిన వర్తక వ్యాపారముల మార్గమునందు, ఆ ద్వీపము ఒక మజిలీగ ఉండెననుట విదితమైనది. కాని ఆనాడు ఇట వసించిన ప్రజల వివరములు ఏవియు తెలియరావు. క్రీ. శ. 7 వ శతాబ్దియందు ఇట ఇస్లాము వ్యాపించెను. ఆ తరువాత ఈ దేశము అంతటంతట వివిధ ముస్లిం రాజ్యముల వశమున నుంచి పలుమారు చేతులు మారినది. క్రీ. శ. 1716 లో అనీజా తెగకు చెందిన అరబ్బీ ప్రముఖులు ఇట వలసచేరి, 1756 లో అబ్దుల్ రహీమ్ అనువాని నాయకత్వమున ఒక చిన్న రాజ్యమును నెలకొల్పిరి. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున, తుర్కీ ప్రభుత్వము తన అధికారమును ఇట వ్యాపింప జేయ యత్నింపగ, అప్పటి దేశప్రభువు, బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణను పొందెను అందులకు బదులుగ తన దేశమున ఏ భాగమును, బ్రిటిష్‌వారి అనుమతి లేకుండ, అన్యాక్రాంతము చేయకుండుటకు ఆ ప్రభువు అంగీకరించెను (1899).

1961, జూన్ 19 న, బ్రిటిష్ ప్రభుత్వము తన హక్కులను వదలుకొనుటతో, ఈ దేశము స్వతంత్రమయ్యెను. 1922 లో సౌదీ అరేబియాతో సరిహద్దు పరిష్కారము జరిగి ప్రస్తుతపు తటస్థ ప్రాంతము ఏర్పాటయ్యెను. ఇరాక్‌తో గల సరిహద్దు వివాదము, 1963, అక్టోబరులో జరిగిన ఒడంబడికవలన సమసిపోయినది.

**7. పరిపాలన :** ప్రజలచే ఎన్నుకొనబడిన రాజ్యాంగపరిషత్తు రూపొందించిన రాజ్యాంగ విధానమే 1963, జనవరి 29 నుండి అమలులో ఉన్నది. నాలుగేండ్ల కొకసారి జరుగు ఎన్నికల వలన 50 మంది ప్రతినిధులుకల జాతీయసభ ఎన్నుకొనబడును. వంశానుగత పాలనాధికారము గల అమీరు కార్యనిర్వహణాధికారమును కలిగి యున్నాడు. అమీరే ప్రధానిని నియమించుటకు, తొలగించుటకు, అధికారమును కలిగియున్నాడు. దేశమున రాజకీయ పక్షములు ఏవియు పనిచేయుట లేదు. ముస్లిముల 'షరియత్' న్యాయ సంహిత మత విషయములందు అమలులో ఉన్నను, 1959 నుండి ఆధునిక రీతిలో న్యాయస్థానములు నెలకొల్పబడి, పౌర, దండ, వాణిజ్య వ్యవహారములలో ఆధునిక న్యాయ సంహితలు అమలులోనికి తేబడినవి.

**8. దేశరక్షణ :** దేశము చిన్నదైనందువలన, ఆత్మరక్షణకొరకై దాదాపు 3,500 మంది సైనికులు గల రక్షక దళము మాత్రమే ప్రభుత్వమునకు కలదు; సామాన్య రక్షక భటులును ఇందు చేరియున్నారు.

**9. అంతర్జాతీయ సం :** 1963 నుండియు ఈ దేశము ఐ. రా. స. యందు సభ్యత్వమును కలిగి, అందలి ప్రత్యేక ఏజన్సీలలో అన్నింట స్థానమును పొందినది. అరబ్‌లీగునను దీనికి సభ్యత్వము కలదు. అరబ్-ఇస్రాయెల్ తగాదాలో అరబ్ - రాజ్యములకు నైతికముగను ఆర్థికముగను సాయపడుచున్నది.

**10. ఆర్థిక రంగము :** కువాయిట్ సాధించిన ఆర్థిక ప్రగతికి మూలాధారము, ఆ దేశపు పెట్రోలియపు ఖనిజము. ప్రపంచమున ఇప్పటికి తెలియవచ్చిన పెట్రోలియమ్ ఖనిజ ద్రవ్యమున 16.6 % ఈ దేశమున కలదు. 1972-73 లో పెట్రోలియం ఉత్పత్తులవలన దేశమునకు 51 3 కోట్ల దీనార్ల ఆదాయము లభించినది.

ఈ ఆదాయమువలన వేరు విధపు పరిశ్రమలను నెలకొల్పుటకు కృషి జరుగుచున్నది. అందు ముఖ్యమయినది రసాయనిక ఎరువుల పరిశ్రమ. దేశమున ఇంధన వాయువుకూడ విరివిగ లభించును దేశము మొత్తము విస్తీర్ణమున 1% మాత్రమే సేద్యమునకు తగినది; దానిని సాగుచేయుటకు నీరు దొరకదు. కావున ధాన్యోత్పత్తి చాల తక్కువ. తన ఆహార ద్రవ్యములకై విదేశీయ దిగుమతులపైన దేశము ఆధారపడి ఉన్నది. పశుపోషణ - ఒంటెలు, గొర్రెలు, మేకల పెంపకము - విరివిగ సాగుచున్నది. సముద్ర తీరమున చేపల పరిశ్రమ నానాటికి అభివృద్ధి చెందుచున్నది; 1972 మొదలుగ చేపల ఎగుమతివలనను కొంత ఆదాయము లభించుచున్నది. దేశమున అడవులు లేవు. కావున, సంవత్సరమునకు 25,000 చొప్పున క్రొత్త చెట్లను నాటి పోషించుటకు ప్రభుత్వమే కృషిచేయుచున్నది. విద్యుదుత్పత్తి 563,000 కివా. (1969). 1972-73 బడ్జెట్ వ్యయము 31 కోట్ల కు. దీనార్లు. సమష్టి జాతీయోత్పత్తి 79.3 కోట్ల కు. దీ. (1969).

**11. సాంఘిక రంగము :** సాంఘిక సంసేవా రంగమున ప్రపంచమున ఏ దేశమును సాధింపని ప్రగతిని కువాయిట్ సాధించినదని చెప్పవచ్చును. అవసరమైన పట్టులందు, సముద్రపు జలమును

మంచినీటిగ మార్చి ప్రభుత్వమే ఉచితముగ ప్రజలకు అందించుచున్నది. అందరికిని చక్కని ఇండ్ల వసతిని కల్పించుట ప్రభుత్వధ్యేయము. స్థలమును, గృహనిర్మాణమునకై ఋణమును ఇచ్చి గృహముల కట్టుబడిని ప్రోత్సహించుటయేగాక ప్రభుత్వమే పేద ప్రజలకొరకై కొన్ని ఇండ్లను నిర్మించి ఉచితముగ ఇచ్చుచున్నది. శిశు శిక్షణ మొదలుకొని కాలేజి విద్య ముగియువరకు విద్యార్థుల భోజన, వేతన, నివాస సదుపాయముల వ్యయమును ప్రభుత్వమే భరించుచున్నది. ప్రతిభ కలవారు, తమ ఉన్నత విద్యను విదేశములలో కొనసాగించుటకు ప్రభుత్వమే కావలసిన ధనసహాయమును కల్పించుచున్నది. 1972-73 లో దేశమున అన్ని విధముల పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 1,56,877; కాలేజీ విద్యార్థి సంఖ్య 3,354. దేశమున వైద్య సమపాయము అందరికిని ఉచితముగ లభించు సౌకర్యము కలదు. దేశము మొత్తమున 3,331 శయ్యలుగల 12 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. కువాయిట్‌లోని మ్యూజియమున ఫయలకా దీవికి చెందిన పురాతనావశేషములు ప్రదర్శితములు. దేశమున అయిదు దినపత్రికలు (అరబ్బీ) కలవు.

---

# 10. కొరియా (ఉత్తర)

**ముఖ్యనగరము :** ప్యోంగ్యాంగ్; **జెండా :** వెడల్పయిన ఎర్రని అడ్డుచారకు అటునిటు సన్నని నీలి అడ్డుచారలు, ఈ చారలను ఎర్రచారనుండి వేరుచేయు తెల్లని చాల సన్నని అడ్డుచారలు, ఎర్రని అడ్డుచారలో ఎడమ సగమున దండము వైపున తెల్లని వృత్త భూమికపై కుదురుకొనిన అయిదు కోణముల నక్షత్రము కలది; **నాణెము :** వోన్; 100 చోంగ్‌లుగ ఇది విభక్తము; 1 వోన్ = రు. 0.28 ; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 9 గం. = భారత దేశమున సా. 5 గం. 30. ని.

**1. ఉనికి మొ. :** ఈశాన్య ఆసియాలో దాదాపుగ 43°1′ – 38° ఉ. అక్షాంశ రేఖలకును మధ్య నెలకొనిన ఈ దేశమునకు ఉత్తరమున చీనా యందలి మంచూరియా రాష్ట్రము, ఈశాన్యమున సోవియట్ దేశపు దూరప్రాచ్య ప్రాంతము; దక్షిణమున దక్షిణ కొరియా; తూర్పున జపాన్ సముద్రము; పశ్చిమమున కొరియా అఖాతము; సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 1,22,370 చ. కిమీ; దేశమంతయు పర్వతమయము; అందలి అత్యున్నతమగు పాయెక్తూ శిఖరపు ఎత్తు 2,745 మీ. దేశపు నదులలో ఉత్తరపు సరిహద్దు సమీపమున ఉన్న తూమెన్ (517 కిమీ.), యాలూ (786 కిమీ.), వాయవ్యమున ఉన్న చోంగ్‌చన్ (197 కిమీ ), ముఖ్యనగరమునకు దగ్గరగ ప్రవహించు తేదాంగ్ (435 కిమీ ) ప్రముఖములు. హాన్‌నది ముఖద్వారము ఈ దేశమును దక్షిణ కొరియానుండి వేరుచేయుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** సాలున సరాసరి ఉష్ణోగ్రత 70°–76° ఫా.కు. ప్రాంతములను అనుసరించి, మారుచున్నది. వసంత, శిశిర ఋతువులు ఆహ్లాదకరములుగ ఉండును; శీతకాలమున చలి ఎక్కువ. వర్షపాతము సాలున సరాసరిన 50 సెం. మీ. ఏప్రిల్‌నుండి సెప్టెంబరు వరకు మాత్రమే విరివిగ వానలు కురియును; అందువలన దేశపు పంటలు అనావృష్టి బాధకు తరచుగ లోనగుచున్నవి. వృక్ష

సంతతియందు వైవిధ్య మెక్కువ. చీనా, సైబీరి యాలలోని జంతు సంతతియే - తోడేళ్ళు, ఎలుగులు, అడవి పందులు, చిరుతలు - ఉత్తర ప్రాంతమున ఎక్కువగ కాననగును.

**3** జనసంఖ్య మొ. : దేశపు జనసంఖ్య 143 లక్షలు (1971); జనవృద్ధి సాలుకు 2.8%; జనసాంద్రత చ. కిమీ. కు 11. దేశపు నగరము లలో ప్యోంగ్యాంగ్ (1967 జ సం. 8,40,000), హామ్‌హంగ్ (4,20,000), చోంగ్‌జిన్




పటము 11.

(2,65,000), కిన్‌చేక్ (2,65,000), వోన్‌సాన్ (2,15,000) పేర్కొనదగినవి. దేశీయ ప్రజలు మంగోలాయిడ్ జాతికి చెందినవారు. దేశమున దాదాపు 50,000 చీనీయులు కలరు. 1944 కు పూర్వము దాదాపు 7 లక్షల జపానీయులును ఉండెడివారు. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత వారందరు జపానుకు పంపివేయబడిరి. దేశీయుల భాషయగు కొరియన్, ఆల్టాయిక్ కుటుంబమునకు చెందినది; ఆ కుటుంబమునకు చెందిన తుర్కీ, మంగోలియన్, జపానీయ భాషలకు ఇది కొంతవరకు సన్నిహితము. 14 హల్లులును, 10 అచ్చులును కల హాన్ - గుల్ లిపిలో ఈ భాష వ్రాయబడుచున్నది. 1945 నుండి అధికార వ్యవహారములందు కొరియన్ భాష ఈ లిపిలో వాడబడుచున్నది. అంతకు పూర్వమున 1910 వరకు చీనీయ భాషయు, 1910 నుండి 1945 వరకు జపానీయ భాషయు అధికార భాషలుగ ఉండినవి.

1945 కు పూర్వమున బౌద్ధమతము, కన్ఫ్యూషియన్ వాదము, క్రైస్తవము, ఛాందోగ్యమను దేశీయ మతమును, భూతపూజయు, దేశమున వివిధ ప్రాంతములందును, ప్రజా వర్గములందును ప్రచారమున ఉండెడివి. కాని 1945 నుండి దేశమున అధికారమును గ్రహించిన కమ్యూనిస్ట్ ప్రభుత్వము మత భావనయెడ నిరాదరణ వహించి ఉన్నది.

**4.** సమాచార సౌ. : తపాలా, టెలిఫోను, తంతి సౌకర్యములు ప్రభుత్వాధీనమున నడచుచున్నవి. ప్యోంగ్యాంగ్‌నుండి మాస్కో, పీకింగ్, ప్రేగ్, వార్సా, తూర్పు బెర్లిన్, బుడాపెస్ట్, సోఫియా, బుకారెస్ట్, ఉలాన్ బతోర్‌లకు టెలిఫోన్ సౌకర్యము, అంతర్జాతీయ మార్గములద్వారా, కలదు. ప్యోంగ్యాంగ్‌న ఒక రేడియో ప్రసార కేంద్రము కలదు. వ్యక్తులు రేడియో సెట్లను కలిగియుండుటను ప్రభుత్వము ఆదరింపదు; ప్రజలకు ప్రసారములు వినవచ్చుటకై వివిధ ప్రముఖ స్థావరములందు లౌడ్‌స్పీకర్లను ప్రభుత్వము ఏర్పాటు చేసినది; అట్టివాని సంఖ్య 8,66,000 (1963).

**5.** యాన సౌ. : జపానీయుల అధీనమున ఈ దేశము ఉండిన కాలమున రైలుమార్గములు విరివిగ నిర్మింపబడినవి. కాని ప్రస్తుతమున కొరియా దేశము రెండుగ విభక్తమైన తరువాత అందు కొన్ని

మార్గముల ఉపయోగము అంతరించినది. ప్రస్తుతమున 16,000 కిమీ. పొడవగు మార్గముల రైల్వే నడచుచున్నవి; ఇందు 835 మార్గమున విద్యుత్ సహాయమున రాకపోకలు నిర్వహింపబడుచున్నవి. రోడ్లుకూడ దేశమున విస్తారముగ కలవు. కాని వాని నిడివిని గురించిన సంఖ్యావివరములు తెలియవచ్చుటలేదు. సముద్రపు రేవులు దేశమునకు అనేకములు కలవు; అందును తూర్పుతీరమునవి ప్రముఖములు. అయినను ప్యోంగ్‌యాంగ్‌నకు సన్నిహిత దూరమున పశ్చిమ తీరమున ఉన్న నామ్‌పో హార్బరు బాగుగ పురోగమింపబడి, పెక్కు వసతులను కలిగియున్నవి. యాలూనదిలో నౌకలు దాదాపు 698 కిమీ. ప్రయాణింపగలవు; తక్కిన నదులలో కూడ పడవలవలన రాకపోకలు దేశమున సాగుచున్నవి. ప్యోంగ్‌యాంగ్ నుండి మాస్కో, పీకింగులకు విమానయాన వసతి కలదు. దేశము నందలి ప్రముఖ నగరముల మధ్య విమానముల ద్వారా ప్రయాణ సౌకర్యము ఏర్పడియున్నది.

**6. చరిత్ర :** అత్యంత ప్రాచీన చరిత్ర కలిగిన కొరియాదేశము రాజకీయ కారణములవలన ఉత్తర, దక్షిణ రాజ్యములుగ 1945 లో విభక్తమగుట వలన ఉత్తర కొరియాదేశము రూపొందినది; అందువలన 1945 వరకు ఈ దేశపు చరిత్ర కొరియా చరిత్రలో మిళితమై ఉన్నది. క్రీ. పూ. 2,333 లో ఈ కొరియాదేశమున ఒక రాజవంశము ఆధిపత్యమును స్థాపించి క్రీ పూ. 1122 వరకు అధికారమును నెరపెననియు, అంతట దేశమును 'కీజా' అను చీనీయ పండితుడు వశపరచుకొనెననియు, అతని వంశమువారిని అంతమొందించి 'వీమాన్' అను దేశీయ రాజవంశము క్రీ. పూ. 194 లో దేశమును ఆక్రమించి కొలదికాలము పాలించిన తరువాత దేశము మూడు స్వతంత్ర రాజ్యములుగ విభక్తము కాగా, క్రీ. పూ 57 లో 'సిల్లా' వంశపు రాజుల ఆధ్వర్యమున దేశము ఏకీకృతమయ్యెననియు దేశీయుల సాంప్రదాయిక కథనము పలు తెలియజేయుచున్నది. చారిత్రకావశేషములును వీనిని కొంతవరకు రుజువు చేయుచున్నవి. క్రీ. శ. 935 లో 'సిల్లా' వంశపు రాజును తొలగించి కోర్యో అను వంశపువాడును, ఆ కోర్యో వంశమునుండి క్రీ. శ. 1392 లో 'యీ' వంశపు వాడగు తేజో సేనానియు రాజ్యమును గ్రహించిరి. కోర్యోవంశీయులు పాలించు కాలమున చీనీయ సంస్కృతితో పాటుగ బౌద్ధమతమును దేశమున ప్రవేశించి, క్రమముగ జాతీయమతమైనది.

'యీ' రాజవంశపు 'సేజోంగ్' (క్రీ. శ. 1419-1450 వ.) ప్రపంచ ప్రసిద్ధ సార్వభౌములలో ఒకడు; ఈతడే కొరియన్ భాషకు 24 అక్షరముల ధ్వన్యాత్మక లిపిని, అక్షరముల ముద్రణను దేశమున ప్రవేశపెట్టెను. సారస్వతము, విజ్ఞానము ఈయన ఆదరణమున వికసిల్లినవి. 17 వ శతాబ్దమున 'మంచూ' సేనలు దేశమును కల్లోలితము చేసినవి; అయినను తదాదిగ చీనాలోని 'మంచూ' వంశపు సార్వభౌముని నామమాత్రమువు అధికారమును గుర్తించుచు దేశము మాత్రము స్వతంత్రముగ చాలకాలము మనగలిగినది; కాని 1876 మొదలుగ జపాను, యు. స్టే. బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, ఇటలీ, రష్యాదేశముల ప్రభుత్వములు వ్యాపార ఒడంబడికలను అంతటంతట కుర్చుకొని దేశమున వసతులను సంపాదించినవి. 1904 లో రష్యాపై విజయము సాధించిన జపాను, ఈ దేశమున పలుకుబడిని ఆర్జించి, క్రమముగ 1910 నాటికి దేశమున వలస ప్రభుత్వమును నెలకొల్పి 1945 వరకు పాలించినది.

ద్వితీయ ప్రపంచయుద్ధమున జపాను ఓడిపోయినపుడు (1945) దేశమున ఉత్తరభాగమును సోవియట్ రష్యాయు, దక్షిణభాగమును యు. స్టే. సేనలు ఆక్రమించి యుండునటులను అయిదేండ్ల తరువాత

వారు వైదొలగి దేశమును స్వతంత్రముగ చేయుటకును నిర్ణయముజరిగినది. కాని వేర్వేరు రాజ్యాంగ వ్యవస్థలగు ఈ ఉభయ భాగములును, 1964, మే నాటికి రూపొందినవి; తత్ఫలితముగ వాని సమ్మేళనము కష్టతరమైనది. అంతట ఈ సమస్య యుద్ధ మార్గమున పరిష్కరించుటకై నుటకు ఈ ఉభయ భాగముల ప్రభుత్వములును చేసిన కృషిలో దక్షిణ భాగమునకు ఐ. రా. స. ఆధ్వర్యమున కొన్ని ఇతర దేశములును, ఉత్తర భాగమునకు సోవియట్, చీనా దేశముల కమ్యూనిస్ట్ ప్రభుత్వములును సాయము చేసినవి. 1950 డిశంబరు మొదలుగ 1953 జులై వరకు సాగిన ఈ యుద్ధము భారతప్రభుత్వపు కృషివలన అంతమై, సంధికుదిరి తద్వారా ఈ ఉభయ కొరియాలును వేర్వేరు దేశములుగ, హాన్ నదీ ముఖ ద్వారమున మొదలిడి తరువాత 38 వ అక్షాంశరేఖను అనుసరించు ఒక రేఖ సరిహద్దుగ, మనునటులను తరువాత ఉభయ దేశములు సముచితమని భావించిన కాలమున ఏకమగునటులను ఏర్పాటు జరిగినది (27 జూలై, 1953). కాని ఆ ఉభయ రాజ్యములును ఏకమగు అవకాశములు ప్రస్తుతమున కన్పట్టుట లేదు.

**7. పరిపాలన :** 1972 రాజ్యాంగ విధానమును అనుసరించి దేశపు పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఉచ్చతమ ప్రజాసభ యందలి వారందరు 100% వోట్లతో ఎన్నుకొనబడినటుల ప్రకటింపబడినది. యదార్థమున పరిపాలనను నిర్వహించునది కొరియన్ కార్మిక (కమ్యూనిస్ట్) పార్టీ. దాని సాధారణసమితి ఒక రాజకీయ సమితి (పొలిట్ బురో) ని ఎన్నుకొనును ఆ పొలిట్ బురో కార్యదర్శియే దేశపరిపాలనా బాధ్యతను దేశప్రభుత్వపు అధ్యక్షుడుగ, నిర్వహించును. పొలిట్ బురోలోని తక్కిన సభ్యులు వివిధ మంత్రిత్వశాఖలను నిర్వహింతురు. 1972 లో ఆ కార్మిక పార్టీలోని సభ్యులసంఖ్య దాదాపు 15 లక్షలు; కమ్యూనిస్ట్ పార్టీగాక, అత్యల్ప సంఖ్యాబలముకల చిన్న పార్టీలు కలవు; ఇవి అన్నియు కమ్యూనిస్ట్ పార్టీ యొక్క సౌహార్దము వలన మనుచున్నవి. గ్రామ, నగర, రాష్ట్రస్థాయిలలో సైతము ఆయా ప్రజాసభల సాయముతో పరిపాలన నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** 17 ఏండ్ల వయస్సు వచ్చిన ప్రతిపౌరుడును 3 నుండి 4 సంవత్సరముల వరకు నిర్బంధముగ సైనిక శిక్షణను పొందవలయును. భూతలసేనయందు 4, 60,000 మంది; జలసేనయందు 9 000 మంది; వాయుసేనయందు 30,000 మంది యోధులు కలరు. ఈ వివిధ రక్షణ శాఖలును సోవియట్, చీనాదేశముల సాయమున ఆధునికాయుధ సమేతములు, సుశిక్షితములు అయి యున్నవి. భూతలసేనకు 800 టాంకులు, వాయుసేనకు 525 పోరాటపు విమానములు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము లేదు; 1975 సెప్టెంబరులో సాధారణసభ సిఫారసు చేసినను, భద్రతా సంఘమున యు. స్టే. వీటో చేసినందున ఈ దేశమునకు సభ్యత్వము లభించకపోయినది. అయినను కమ్యూనిస్ట్ రాజ్యములతోను, అలీన రాజ్యములలో పెక్కింటితోను దౌత్యసంబంధములను ఈ దేశము కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము :** ప్రణాళికలను అనుసరించి దేశమును సుసంపన్నము చేయుటకై కృషి జరుగుచున్నది ప్రస్తుతమున (1971-76) ఆరు సంవత్సరముల ప్రణాళిక అమలున ఉన్నది. దేశమున 20% భూమి సేద్యమునకు అనుకూలము; తక్కినది పర్వతమయము; 1946లో భూసంస్కరణలు అమలునకు వచ్చి 7,24,500 మంది పేద రైతులకు భూవసతి కల్పింపబడినది. సమష్టి వ్యవసాయక్షేత్రముల పద్ధతిలో వ్యవసాయము సాగు

చున్నది. మూడవవంతు భూమికి నీటిపారుదల సౌకర్యము కలదు. యాంత్రిక, శాస్త్రీయ వ్యవసాయ పద్ధతుల వలన ఉత్పత్తి చాల పెరిగినది. 1971 లో ఈ ఉత్పత్తి 60 లక్షలు టన్నులు; ఇందు అత్యధికభాగము వరిపంట. పశుపోషణము విరివిగ ప్రోత్సహింప బడుచున్నది. అడవులను పెంచుకృషి విరివిగ సాగుచున్నది మత్స్యపరిశ్రమయందు దేశము పురోగతిని సాధించినది; సాలున 12 లక్షల టన్నుల చేపల పట్టుబడి కలదు.

ఖనిజరీత్యా దేశము సుసంపన్నము. బొగ్గు, ఇనుము విరివిగ ఉత్పత్తి అగుచున్నవి. 1970లో 275 లక్షల మె. టన్నుల రాక్షసిబొగ్గు త్రవ్వ బడినది; 1969 లో 74లక్షల మె. టన్నుల ముడి ఇనుము, 12వేల మె. టన్నుల రాగి ఖనిజము త్రవ్వబడినవి. జపాన్ వలసపాలకులు దేశమున స్థాపించిపోయిన వివిధ పరిశ్రమలను - నూలునేత, విద్యుత్పత్తి,జవుళీ పరిశ్రమ, రసాయనకపు ఎరువులు మొ. పరిశ్రమలను — ఇప్పటి ప్రభుత్వము ఎంతో అభివృద్ధి చేసినది. మొత్తపు కార్మికులలో 40% పారిశ్రామిక కార్మికులై ఉన్నారు. విద్యుదుత్పత్తి సాలీనా 1 660 కోట్ల కివా. (1970) నానా దేశములతో జరుపు ఎగుమతి దిగుమతుల సంఖ్యా వివరములు తెలియవు, కాని అందు అత్యధికభాగము కమ్యూనిస్ట్ దేశములతోనే సాగుచున్నది. 1971లో సోవియట్ రష్యాకు ఎగుమతులు 12.22 కోట్ల రూబెల్‌లు; ఆ దేశమునుండి కొరియాకు దిగుమతులు 33.01కోట్ల రూబెల్‌లు. బడ్జెటరీ వ్యయము 737.5కోట్ల వోన్ (1972).

**11. సాంఘిక రంగము :** యుద్ధఫలితముగ దేశమున విపరీతముగ ఇండ్ల కొరత ఉండుట వలన ప్రభుత్వము 1960నాటికి 2.46కోట్ల చదరపు మీటరుల నేలవిస్తృతి కల ఇండ్లను నిర్మింప జేసినది.

దేశమున నిర్బంధ సాంకేతిక విద్యాబోధన పద్ధతి అమలునందున్నది. ఆరేండ్ల వయసునుండి 15 ఏండ్ల వరకు 10 ఏండ్లు ఈ నిర్బంధవిద్యాబోధన సాగుచున్నది. దేశమునందలి అన్ని విధముల పాఠశాలల మొత్తపుసంఖ్య 9,260; ఇందలి విద్యార్థిసంఖ్య 32లక్షలు; పై పాఠశాలల సంఖ్యలో ఉన్నత విద్యను బోధించు 569 సంస్థలును చేరి ఉన్నవి; వానిలోని విద్యార్థిసంఖ్య 2,14 000, వీరిలో మూడింట రెండువంతులు సాంకేతిక, ఇంజనీరింగు విద్యలను అభ్యసించుచున్నారు. శిశువులకై ప్రత్యేక శిశుశిక్షణ శాలలును, శిశుమందిరము (క్రెచీ) లును కలవు; ఇందలి ఉపాధ్యాయసంఖ్య ఒక లక్ష; వారి శిక్షణలో ఉన్న శిశు సంఖ్య 13.2 లక్షలు (1970—1971). పార్టీకి చెందిన "నోడోము" అను దినపత్రిక మాత్రమే ప్రచారమున ఉన్నది. ప్యోంగ్యాంగ్ లోని కేంద్ర గ్రంథాలయము చాల పెద్దదని పేరొందినది; దేశమున 16 మ్యూజియములు కలవు. ఆసుపత్రులు మొదలగు వైద్యసౌకర్యములను గురించిన సంఖ్యా వివరములను ప్రభుత్వము ప్రకటించుట లేదు. కాని, 1964లో చేసిన ఒక ప్రకటనను బట్టి 10 000 మంది పౌరులకు 19మంది వైద్యులు కలరని తెలియవచ్చుచున్నది ట్రేడ్‌యూనియన్ సభ్యులకు ఉచితవైద్యసౌకర్యములును సాంఘిక శ్రేయో సదుపాయములును ఏర్పడి వున్నవి.

**12. యాత్రా సౌ. :** కమ్యూనిస్ట్ దేశములనుండి మాత్రమే యాత్రికులు దేశమును దర్శించుటకు వచ్చుచున్నారు; యాత్రికులకు సౌకర్యములను ఒక ప్రభుత్వసంస్థ సమకూర్చుచున్నది.

**13. ప్రసిద్ధ పౌ. :** ఆధునిక యుగపువారిలో కిమ్-ఇల్-సుంగ్ సేనాని (జ. 1912) ప్రముఖుడు. దేశపు అధినేతగ 1948 నుండి ఇతడు వ్యవహరించుచు దేశపు అభివృద్ధికై కృషి చేయుచున్నాడు.

# 11. కొరియా (దక్షిణ)

**ముఖ్యనగరము:** సియోల్; **జెండా:** తెయ్‌క్కి అని వ్యవహృతమగు ఈ జెండాయందు కొరియన్ తంత్రశాస్త్రమున ఉత్తమ భావనలకు ప్రతీకము లని భావింపబడు కొన్ని ముద్రలు కలవు; తెల్లని భూమిక మధ్యన కుదురుకొనిన ఒక వృత్తమున ఎగువ భాగము ఎరుపునను, దిగువభాగము నీలిమమునను చిత్రితములు; ఆ వృత్తమునకు నాలుగుమూలల ప్రతిమూలన ఖండాఖండ రేఖలు




పటము 12.

ఒక క్రమరీతిన ఉన్నవి; **జాతీయగీతము :** సపాయెక్తు పర్వతము క్షయించుపోవు వరకు, అని అర్థమొసగు చరణముతో మొదలిడునది; **నాణెము :** వోన్; 100 వోన్‌లు = రు. 2.95; **కొలతూక ములు :** మెట్రిక్‌వానితో పాటుగ దేశీయములును వాడుక యందున్నవి; **కాలగణన :** సా. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఈశాన్య ఆసియా యందు దాదాపుగ 33° 7′ – 38°′ ఉ. అక్షాంశరేఖల మధ్య నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున ఉత్తర కొరియా; పశ్చిమమున పచ్చసముద్రము; దక్షిణమున తూర్పు చీనా సముద్రము; తూర్పున జపాన్ సముద్రము సరిహద్దులందు ఉన్నవి. దేశవైశాల్యము 98,431 చ. కిమీ. తూర్పు తీర మును అనుసరించి తేబక్ పర్వతశ్రేణి కలదు నైరుతి దిశకుపోవు సోబక్ పర్వతశ్రేణిలో 'చీరి' శిఖరపు ఎత్తు 1,910 మీ. దేశపు నదులలో హాన్ నది (512 కిమీ.) కుమ్ (398 కిమీ.), యోంగ్ సాన్ 115 కిమీ., సోమ్‌జిన్ (211 కిమీ), నక్తాంగ్ (522 కిమీ.) ప్రముఖములు.

**2. శీతోష్ణస్థితి మొ :** సాలున సరాసరి ఉష్ణో గ్రత 77°–80° ఫా వరకు ప్రాంతములను అనుస రించి మారుచుండును వర్షపాతము దక్షిణ తీరమున సాలున 150 సెం. మీ. వరకు ఉండును; కాని తక్కిన దేశమున 6 75 నుండి 100 సెం. మీ. వరకు మారుచుండును. పక్షిసంతతియు జంతు సంతతియు ఉత్తర కొరియాయందు ఉన్నరీతిగనే ఉండును (చూ: కొరియా, ఉత్తర).

**3. జనసంఖ్య మొ. :** దేశపు మొత్తపు జన సంఖ్య 3 కోట్లు 46 లక్షలు; జనసాంద్రత చ. కిమీ. కు 272. నగరములలో సియోల్ (జ. సం. 55,09, 993), పూసాన్ (18,78,785). దేశీ యుల మాతృభాష కొరియన్; 14 హల్లులు, 10 అచ్చులు, కలిగిన హల్ – గుల్‌లిపిలో ఈ భాష వ్రాయబడుచున్నది. ప్రజలందు బౌద్ధమతము, కన్ఫూషియన్ వాదము, క్రైస్తవము, ఛాందోగ్య అనబడు దేశీయమతము ప్రచారమున ఉన్నవి. భూతపూజయు అటనట వ్యాప్తియందు ఉన్నది. క్రైస్తవమతము దేశమున సువ్యవస్థితమై ఉన్నది; దాదాపు 150 లక్షల క్రైస్తవులు కలరు. క్రైస్తవ

మతమునకు తరువాత చక్కగా వ్యవస్థీకృతమైనది 'ఛాందోగ్య' మతము. ఇది 19వ శతాబ్దమున వివిధ మతముల ఉత్తమ లక్షణములను లోగొని జన్మించిన దేశీయమతము. కన్ఫ్యూషియస్, బౌద్ధ మతములకు ఎక్కువ వ్యాప్తిలో ఉన్నను తదనుయాయులు వ్యవస్థా పటాటోపము లేకుండ తమ ఆరాధనా విధులను కొనసాగించుచున్నారు.

**4. సమాచార సౌ.** : దేశమునందలి తపాలా ఆఫీసుల సంఖ్య 1,822; టెలిఫోనులు అన్నియు ప్రభుత్వపు వశమునవే ఉన్నవి (1971). 1956 నుండి దేశమున టెలివిజన్ సౌకర్యము ఏర్పడి యున్నది. ప్రభుత్వాధీనమున, సియోల్‌లో ఒక రేడియో ప్రసార కేంద్రమును, దానిశాఖలు వివిధ రాష్ట్రముల ముఖ్యనగరములందును కలవు.

**5. యాన సౌ.** : దేశమందలి రోడ్ల నిడివి 6,34,949 కిమీ.; రైలు మార్గముల నిడివి 5,879 కిమీ; సముద్రతీరమున ఓడల వలన వ్యాపారము సాగుచున్నది; అట్టి ఓడల సంఖ్య 2,285; వాని టన్నేజి 8,37,300 (1969). సియోల్ నుండి టోకియోకును, హాంకాంగ్‌కును విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర** : అతిప్రాచీన చరిత్ర కలిగిన కొరియాదేశము, 1945లో అగ్రరాజ్యముల అభిప్రాయభేదముల వలన ద్విధా విభక్తము కాగా రూపొందినది ఈ దేశము. అందువలన అంతవరకు ఈ దేశచరిత్రయు కొరియాచరిత్రలో అంతర్భాగము (కొరియా చరిత్రకై చూ: కొరియా, ఉత్తర).

1950-53 వరకు సాగిన ఉత్తర దక్షిణ కొరియాల సంగ్రామము తరువాత కుదిరిన సంధిని అనుసరించి ఉత్తర దక్షిణ కొరియాలు వేర్వేరు దేశములుగ మనుటకును, తదనంతరమున సముచితసమయమున ఉభయ రాజ్యములు ఇష్టపడినప్పుడు ఏక దేశముగ ఏర్పాటగుటకును నిర్ణయము జరిగినది (చూ కొరియా, ఉత్తర). తదాదిగ ఈ దేశము ఒక ప్రజాస్వామిక గణరాజ్యముగ పురోగమించుచున్నది. యు స్టేట్స్ ఇచ్చిన సహాయ సంపత్తి, ఈ దేశపు అభ్యుదయమునకు చాల ఉపకరించినది కాని 1960లో ప్రజాభిప్రాయమునకు లొంగి అధ్యక్షుడగు సింగ్మన్‌రీ పదవిని త్యజించి విదేశములకు పోయెను అంతట ఒక ప్రభుత్వము ఎన్నుకొనబడినను, సైనికవర్గము ఆ ప్రభుత్వమును కూలద్రోసి తమ నాయకుడగు చుంగ్ హీ పార్క్ సేనాని నాయకత్వమున ప్రభుత్వమును ఏర్పరచినది (16 మే, 1961). తరువాత 1962 లో ఒక నూత్న రాజ్యాంగ విధానము రూపొందింపబడి, ప్రజామోదము పొందినది. ఆ రాజ్యాంగవిధానమును అనుసరించి జరిగిన ఎన్నికలలో 1963, 1971 లలో పార్క్ సేనానియే అధ్యక్షుడుగ ఎన్నికై దేశమును పాలించుచున్నాడు.

**7. పరిపాలన** : అధ్యక్ష విధానపు ప్రభుత్వము దేశమున అమలున ఉన్నది. అధ్యక్షుని పదవీ కాలపరిమితి నాలుగేండ్లు; సార్వజనిక వోటింగు పద్ధతిలో అతని ఎన్నిక నాలుగేండ్లకు ఒకసారి జరుగును. పరిపాలన యందు అతనికి సాయపడు రాజ్యసమితి కలదు; ఇందు 10 నుండి 20 వరకు సభ్యులు ఉందురు; వీరందరు ప్రధాని నాయకత్వమున, అధ్యక్షునికి బాధ్యత వహించి పనిచేయుదురు. ప్రధానిని, రాజ్యసమితి సభ్యులను అధ్యక్షుడే నియమించును. శాసన నిర్మాణాధికారము జాతీయ శాసనసభయందు న్యస్తము. అందలి 175 స్థానములలో 131 ని, సాధారణ ఎన్నికలవలన నింపెదరు. ఆ ఎన్నిక యందు ఆ యా రాజకీయ పక్షములు సంపాదించిన వోట్ల నిష్పత్తిలో తక్కిన 44 స్థానములకు వివిధ రాజకీయ పక్షములు తమ సభ్యులను నిర్ణయించును. శాసన సభకు పోటిచేయు ప్రతి అభ్యర్థియు ఏదియో ఒక రాజకీయపక్షమునకు చెంది యుండవలయును.

రాజ్యసమితి సభ్యుని ఎవనినైన తొలగించుటకై అధ్యక్షునికి సిఫారసు చేయుటకు శాసనసభకు అధికారము కలదు; కాని ప్రభుత్వమును అధిశంసించుటకు ఆ సభకు అధికారములేదు.

దేశమున 5 రాజకీయ పక్షములు కలవు; వీనిలో ప్రజాస్వామ్య గణతంత్ర పక్షము బలవత్తమము.

దేశము పరిపాలనా సౌకర్యమునకై 10 రాష్ట్రములుగ విభక్తము. అందు ఎన్నుకొనబడిన స్థానిక సంస్థల సాయమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. న్యాయశాఖ స్వతంత్ర ప్రతిపత్తి కల్గియున్నది. సుప్రీమ్‌కోర్టు ప్రధాన న్యాయమూర్తిని అధ్యక్షుడు, జాతీయశాసన సభ ఆమోదముతో, న్యాయసలహా సంఘపు ప్రతిపాదనపై నియమించును. అతని సలహాతో తక్కిన న్యాయమూర్తులను నియమించును.

**8. దేశరక్షణ :** భూతలసేనయందు 5,60,000 మంది. జలసేన యందు 18,900 మంది; వాయుసేనయందు 23,000 మంది యోధులు కలరు (1973). యు. స్టే. ఇచ్చెడి సహాయమును, శిక్షణయు ఈ వివిధ శాఖలకు చక్కగ ఉపకరించుచున్నవి. వాయుసేనకు 220 పోరాట విమానములు కలవు.

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము లేదు. కాని కమ్యూనిస్టేతర రాజ్యములలో పెక్కింటితో దౌత్యసంబంధములు కలవు. ఆహార, వ్యవసాయ వ్యవస్థ, ప్రపంచ ఆరోగ్య వ్యవస్థవంటి అంతర్జాతీయ సంస్థలందును, పెక్కు అంతః ప్రభుత్వ వ్యవస్థలందును సభ్యత్వము ఈ దేశమునకు కలదు.

**10. ఆర్థిక రంగము:** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమే ముఖ్యధారము. 1962-66 సంవత్సరముల పంచవర్ష ప్రణాళిక, వ్యవసాయిక కృషిని వేగిరమొనర్చి స్వయం సంపూర్ణముగ చేయుటను లక్ష్యముగ గ్రహించెను. రెండవ పంచవర్ష ప్రణాళిక (1967-71) పారిశ్రామిక రంగమున 10% సాలీనా అభివృద్ధిని సాధించుటకై కృషి చేసినది. సేద్యమునకు అనుకూలమైన భూమి విస్తీర్ణము 224 లక్షల ఎకరములు. ఇందు 50 లక్షల ఎకరములు మాత్రమే సాగుచున్నది. వరి ప్రముఖమగు పంట; తరువాత బార్లీ, గోధుమ, చిక్కుళ్లు, ఇతర ఆహారధాన్యములు. పొగాకు, క్రమముగా పేర్కొనదగినవి. 1970 లో వరిపంట ఉత్పత్తి 40.5 లక్షల మెట్రిక్ టన్నులు; పొగాకు ఉత్పత్తి 1,13,700 మెట్రిక్ టన్నులు (1967). పశుసంపద ఒకప్పుడు అధికముగ ఉండెడిది; కాని ఇప్పుడు క్షీణించినది; దానిని తిరిగి వృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది; గో, మహిష సంతతికి చెందిన పశువులసంఖ్య 12.4 లక్షలు (1967).

మత్స్య పరిశ్రమయందు పట్టుబడి 8,62,800 మెట్రిక్ టన్నులు (1969); తీరమునకు దూరమున సముద్ర గర్భమున తిమింగిలముల వేటను జాలరులు కొనసాగించుచున్నారు.

ఖనిజములందు కృషి ఎక్కువగ జరుగుచున్నది. 1969 లో 1,13,000 మంది కార్మికులు ఆ రంగమున కృషిని సాగించిరి; అయినను, టంగ్‌స్టన్ తప్ప తక్కిన ధాతువులు అత్యల్పపు మొత్తములలోనే లభించుచున్నవి. ప్రపంచపు టంగ్‌స్టన్ గనులలో ఈ దేశమున సాంగ్‌డాంగ్ వద్దనున్న గని ఉత్తమశ్రేణికి చెందినదిగ లెక్కకు వచ్చినది; దీని ఉత్పత్తి 1,000 మె. టన్నులు (1969). తక్కినవానిలో తక్కువ రకపు రాక్షసి బొగ్గు (9,039 టన్నులు), ఇనుము (734 టన్నులు) పేర్కొనదగినవి. పరిశ్రమలందు 12.2 లక్షల కార్మికులు పనిచేయుచున్నారు; గృహావసర

వస్తువుల ఉత్పత్తి మాత్రమే ఇందు జరుగుచున్నది: జవుళీ సరుకులు, పత్రికల కాగితము, రసాయనిక ఎరువులు, సిమెంటు ఇందు ప్రముఖములు. దేశమున విద్యుదుత్పత్తి 353.58 కోట్ల కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 62.25 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 183.68 కోట్ల డాలర్లు. (1969). దేశపు బడ్జెటికి వ్యయము 52,320 కోట్ల వోన్‌లు (1971).

**11**. **సాంఘిక రంగము :** దేశమున పలు సారులు యుద్ధములు జరుగుటవలనను, 1945 కు పూర్వము పరపాలనలో ఉండుట వలనను, దేశమున గృహవసతి చాల తక్కువగ ఉన్నది. దానిని వృద్ధిచేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. 1969 లో దేశమున 5,810 ప్రాథమిక పాఠశాలలలో 56,22,816 మంది; 1,463 మధ్యమ పాఠశాలలలో 11,47,408 మంది; 861 ఉన్నత పాఠశాలలలో 5,30,101 మంది విద్యార్థులు పఠించిరి. దేశమున 13 జాతీయ విశ్వవిద్యాలయములు, 58 కళాశాలలు, 22 జూనియర్ కాలేజీలు, 703 సాంకేతిక పాఠశాలలు, ఉన్నత విద్యను బోధించుచున్నవి. వీనిలో మొత్తపు విద్యార్థి సంఖ్య 1,23,693. దేశమున 44 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. ఇందులో రెండు ఆంగ్ల దిన పత్రికలును చేరిఉన్నవి. సియోల్‌లో ఒక ఉత్తమ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. ఆ మ్యూజియవు శాఖలు పూయో, కోంగ్‌జూ నగరములందును కలవు. దేశ చరిత్రకు సంబంధించిన 4,000 కళాఖండములు, చారిత్రక అవశేషములు ఆ మ్యూజియములందేగాక, దేశమున పలు ప్రాంతములందును కానవచ్చుచున్నవి.

దేశమున 2,400 మంది పౌరులకు ఒక వైద్యుడు సరాసరిన కలడు. దేశమున వైద్యసంఖ్య 13,590.

**12**. **యాత్రా సౌ. :** యాత్రిక పరిశ్రమ ఇంకను బాల్యావస్థలోనే ఉన్నది. 1967 లో 90,000 మంది దేశమును దర్శించిరి. యాత్రికులకు సౌకర్యములను కలుగ జేయుటకై ప్రభుత్వము కృషిని మొదలిడినది. వీసాలేకుండ పాస్‌పోర్టుతో ఏ విదేశీ పౌరుడైనను 72 గంటలు ఉండవచ్చును. వీసాలు ఉన్నవారు 15 రోజులు ఉండవీలగును.

**13**. **ప్రసిద్ధ పౌరులు :** ఆధునికులలో సింగ్‌మన్‌రీ (1875-1965) ఒక్కడే అంతర్జాతీయముగ పేరును పొందినవాడు. దేశ స్వాతంత్ర్యమునకై కృషిచేసి, స్వతంత్ర దేశమున ప్రథమాధ్యక్షుడైన ఈతడు, జీవితచరమ కాలమున ప్రజాదరణను కోలుపోయి విదేశములకు ప్రవాసమేగి అట మరణించెను.



# 12. చీనా

**ముఖ్యనగరము :** పీకింగ్; **జెండా :** ఎఱ్ఱని భూమికపై ఎడమవైపు ఎగువమూలమున, దండము వద్ద, బంగారు వర్ణమున ఒక పెద్ద నక్షత్రమునకు కుడివైపున వృత్తఖండము రీతిలో అమరిన నాలుగు చిన్న నక్షత్రములు; **జాతీయ గీతము :** తుంగ్-ఫాంగ్ హుంగ్ (తూర్పు దిశ ఎఱ్ఱబారినది); **నాణెము :** రెన్‌మిన్‌బి = రు 3.13; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 8 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని. మంచూరియాలో మాత్రము సా. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** ఆసియా ఖండపు తూర్పు తీరమున విశాలభూమిని ఆవరించియున్న ఈ దేశము




పటము 13.

18°-54° ఉ. అక్షాంశ రేఖలకును, 73°-135° తూ. తులారేఖల మధ్యను నెలకొని ఉన్నది. ఉత్తర దక్షిణముల గరిష్ఠపునిడివి 4,800 కిమీ; తూర్పు పడమరల నిడివి 4,000 కిమీ. 11,200 కిమీ. నిడివిగల దేశపు తీరరేఖ ఈశాన్యపుమూలన యాలూనదీ ముఖద్వారమునుండి దక్షిణమున తాన్ కిన్ సింధుశాఖ వరకు విస్తరించి ఒక పెద్ద వృత్తరేఖవలె కుదురుకొని ఉన్నది. ఈ రేఖనుండి ముందునకు చొచ్చుకొనిపోయిన ద్వీపకల్పములు మూడు కలవు; వీనిలో ఉత్తరమున ఉన్న రెండు ద్వీపకల్పములు-లియావోతుంగ్, షాతుంగ్-పచ్చసముద్రములోనికిని దక్షిణమున ఉన్న లుయిచౌ ద్వీపకల్పము దక్షిణ చీనా సముద్రములోనికిని చొచ్చుకొని ఉన్నవి. రాజకీయముగ ఈ దేశమునకే చెందిన వివిధ ద్వీపములు కలవు. వానిలో అన్నింటికన్న పెద్దది తైవాన్‌దీవి. కాని ఈ ద్వీపము ప్రస్తుతమున ఈ రాజ్యపు ఆధీనమున ఉండక, ప్రభుత్వ వ్యతిరేకమగు వేరొక చీనీయ ప్రభుత్వపు వశమున ఉన్నది (చూ: తైవాన్). తక్కిన దీవులలో హైనాన్ అనునది పెద్దది; ఇది తీరపు దక్షిణభాగమునకు చేరువన ఉన్నది. మిగిలిన దీవులందు దక్షిణ చీనాసముద్రములోని లంకలు అనేకములు చేరి ఉన్నవి; దాదాపు 4° ఉ. అక్షాంశరేఖవరకు ఈ లంకల వరుస కన్పట్టును. ఇక భూతలపు సరిహద్దులందు ఈశాన్యపు దిక్కునుండి ఆగ్నేయమూల వరకు అప్రదక్షిణపు వరుసలో క్రమముగ ఉత్తర కొరియా, సోవియట్ యూనియన్, మంగోలియా, ఆఫ్ఘనిస్తాన్, భారతదేశము, నేపాల్, భారతదేశము, భూటాన్, మరల కొంతవరకు భారతదేశము; బర్మా, లావోస్, వియెత్‌నామ్ కుదురుకొని ఉన్నవి ఈ మొత్తపు భూతలపు సరిహద్దు నిడివి 14,400 కిమీ. మంగోలియా, బర్మా, లావోస్, వియెత్‌నామ్‌లతో సరిహద్దు నిర్ధారితమైనది. కాని తక్కిన దేశములతో సరిహద్దులు వివాదగ్రస్తములై ఉన్నవి. దేశములోని వివిధ ప్రాంతములు, అందలి

రాష్ట్రములు, జనసంఖ్య, ముఖ్యనగరముల పట్టిక రూపమున ఈ క్రింద ఇయ్యబడినది.

**భూతలపు** తీరునుబట్టి దేశమును, 1. తూర్పు ప్రాంతపు నిమ్నభూమి 2. పశ్చిమ ప్రాంతపు పర్వతమయ పీఠభూమి అని రెండు విభాగములుగా విభజింప వచ్చును. నిమ్నభూమిలో ప్రముఖము మంచూరియా మైదానము. ఇందు సుంగారీ, లియావ్ హో నదులు ప్రవహించుచున్నవి. వీనిలో మొదటిది అమూర్ (హీ-లుంగ్ కియాంగ్) నదికి ఉపనది; రెండవది కొరకు పచ్చ సముద్రమున కలియు చున్నది. ఉత్తరపు మైదానమున పచ్చ నదీ (హుయంగ్ హో) ప్రవాహపు దిగువభాగము కలదు. ఈ ప్రాంతముననే యాంగ్ట్జీ (ఛాంగ్ కియాంగ్) నదీలోయలు, డెల్టాయు చేరిఉన్నవి. క్వాంగ్‌చౌ (కాంటన్) నగరము వీనిచే పరివేష్టితము.

## చీనాదేశీయ రాష్ట్ర, వైశాల్య, జనసంఖ్యాదుల పట్టిక

| వరుస సంఖ్య | ప్రాంతము, రాష్ట్రము | వైశాల్యము 1000 చ. కమీ. | జనసంఖ్య 1953 (వేలలో) | జనసంఖ్య 1971 (లక్షలలో) | ముఖ్యనగరము |
|---|---|---|---|---|---|
| **I** | **ఈశాన్య ప్రాంతము** (షెన్యాంగ్) | | | | |
| 1. | హీలుంగ్ కియాంగ్ | 463.6 | 11,897 | 250 | హార్బిన్ |
| 2. | కిరిన్ | 187.0 | 11,290 | 200 | ఛాంగ్‌చున్ |
| 3. | లియావో నింగ్ | 150.0 | 18,545 | 280 | షెన్యాంగ్ |
| **II** | **ఉత్తర ప్రాంతము** (పీకింగ్) | | | | |
| 1. | హోపీ | 202.7 | 35,985 | 430 | షిహ్ చియాచుంగ్ |
| 2. | లోని మంగోలియా (స్వయం పాలనా ప్రా.) | 1177.5 | 6,100 | 60 | హులా హేహోత్ |
| 3. | పీకింగ్ (పురపాలక సంస్థ) | 7.1 | 2,768 | 70 | — |
| 4. | షాన్సీ | 157.1 | 14,314 | 200 | త్రైయువాన్ |
| 5. | టీన్‌స్టీన్ (పురపాలకసంస్థ) | 4.0 | 2,694 | 40 | — |
| **III** | **తూర్పు ప్రాంతము** (షాంగే) | | | | |
| 1. | షాంటుంగ్ | 153.3 | 48,877 | 570 | చీనాన్ |
| 2. | కియాంగ్సీ | 164 8 | 16,773 | 250 | నాన్‌చంగ్ |
| 3. | కియాంగ్సూ | 102.2 | 41,252 | 470 | నాన్‌కింగ్ |
| 4. | షాంగే (పురపాలక సంస్థ) | 5 8 | 6,204 | 100 | — |

| వరుస సంఖ్య | ప్రాంతము, రాష్ట్రము | వైశాల్యము 1000 చ. కమీ. | జనసంఖ్య 1953 (వేలలో) | జనసంఖ్య 1971 లక్షలలో | ముఖ్యనగరము |
|---|---|---|---|---|---|
| 5. | అన్‌వీ | 139.9 | 30,344 | 250 | హోఫీ |
| 6. | చేకియాంగ్ | 101.8 | 22,866 | 310 | హాంగ్ చౌ |
| 7. | ఫూకీన్ | 123 1 | 13,143 | 180 | ఫూ చౌ |
| 8. | తైవాన్* | 36.0 | 7,591 | 130 | తైపీ |
| IV | **కేంద్ర దక్షిణ ప్రాంతము** | | | | |
| 1. | హోనాన్ | 167 0 | 44,215 | 500 | చెంగ్ చౌ |
| 2. | హూపీ | 187 5 | 27,790 | 360 | వూహాన్ |
| 3. | హూనాన్ | 210 5 | 33,227 | 380 | చాంగ్‌షా |
| 4. | క్వాంగ్‌టుంగ్ | 231 4 | 34,770 | 430 | క్వాంగ్ చౌ |
| 5. | క్వాంగ్సీ-చువాంగ్ (స్వయం పాలనా ప్రా.) | 220 4 | 19,561 | 240 | నానింగ్ |
| V | **నైరుతి ప్రాంతము** (చుంగ్‌కింగ్) | | | | |
| 1. | షెక్వాన్ | 569.0 | 62,304 | 700 | చెంగ్‌టూ |
| 2. | క్వీ చౌ | 174.0 | 15,037 | 200 | క్వీయాంగ్ |
| 3. | యున్నాన్ | 436 2 | 17,473 | 230 | కున్‌మింగ్ |
| 4. | తిబెత్ (స్వ. ప్రా.) | 1221.6 | 1,273 | 10 | లాసా |
| VI | **వాయవ్య ప్రాంతము** | | | | |
| 1. | షెన్సీ | 195.8 | 15,881 | 210 | సియన్ |
| 2. | కాన్‌సూ | 366.5 | 12,928 | 130 | లాన్ చౌ |
| 3. | నింగ్‌సియా-హుయి(స్వ.ప్రా.) | 66.4 | | 20 | యిన్‌చువన్ |
| 4. | చింఘే | 721.0 | 1,677 | 20 | సీనింగ్ |
| 4 | సింకియాంగ్-ఉయ్‌గుర్ (స్వయం పా. ప్రాంతము) | 1,646.8 | 4,874 | 80 | ఉరుంచి |

* తైవాన్ దీవిపై ప్రస్తుతమున రాజకీయాధికారము చీనా ప్రభుత్వమునకు లేదు.

నిమ్న భూమినుండి పశ్చిమమునకు, భూతలపు ఎత్తు క్రమముగ ఎక్కువగుచు, 2400 నుండి 8,000 మీ. వరకు ఎత్తుగల పీఠ భూములుగ పరిణమించుచున్నది. ఉత్తరమున ఉన్న షెన్సీ, షెన్సీ పీఠభూములు; వాయవ్యమునందలి మంగోలియా పీఠభూమి ఇందలివే. దక్షిణమున టిబెత్ ప్రాంతపు పర్వత శ్రేణులును పీఠభూములును కలవు. టిబెటు ఉన్నత పీఠభూములకు ఉత్తర, దక్షిణ దేశములందు ఆవరించినవి హిమాలయ, కున్‌లూన్ పర్వత శ్రేణులు. టిబెత్‌కు ఉత్తరమున మధ్య ఆసియాకు చెందిన ఉన్నతములగు రెండు పరీవాహ భూములు కలవు; ఇవియే తారిమ్ పరీవాహభూమి, జుంగారిన్ పరీవాహభూమి అని వ్యవహృతములు. వీనిని వేరుచేయు టీన్‌షాన్ అను వేరొక ఉన్నత పర్వత శ్రేణి కలదు. ఈ పర్వత శ్రేణి చీనాలో కొంత దూరము పయనించి, అట నుండి సోవియట్ రష్యాలోనికి చొచ్చుకొని పోయి నది; చీనాయందలి భాగములోని అత్యున్నత శిఖరము తెన్‌గ్రీ ఖాన్; దీని ఎత్తు 7,200 మీ.

మధ్య ఆసియా యందలి పామీరులనుండి అల్‌టాయ్, టీన్‌షాన్, కున్‌లూన్, హిమాలయ పర్వత శ్రేణులు బయలుదేరి వివిధ దిశలలో చీనా దేశము వైపునకు పయనించి విస్తరించినవి. ఇందు ప్రతిదాని యందును సమాంతర శ్రేణులు అనేకములు ఉన్నవి వివిధ నదులకు జన్మస్థలములుగ ఇవి ఉపకరించు చున్నవి. పైవానిలో ఆల్‌టాయ్, హిమాలయములు క్రమముగ వాయవ్య, నైరుతి దిశలందు చీనాకు సరిహద్దులుగ ఉన్నవి. టీన్-షాన్ శ్రేణి సింకియాంగ్ ప్రాంతమును విభజించుచున్నది; కున్‌లూన్ శ్రేణి వివిధ శాఖలతో చీనాదేశమున వ్యాపించి, ఆ దేశపు భూతల రూపరేఖకు ఆలంబనముగ ఉన్నది.

దేశమునందలి పెద్దనదులు అన్నియును తూర్పున పసిఫిక్ మహాసముద్రము వైపునకు ప్రవహించుచున్నవి. ఈశాన్య ప్రాంతమున ఉన్న ఆమూర్ (హీ-లుంగ్ చియాంగ్) నది మంచూరియా పరీవాహ ప్రదేశపు వర్షజలమున అత్యధిక భాగమును కొనిపోవుచు 4,000 కిమీ. ప్రవహించు చున్నది. మంచూరియా ప్రాంతపు తక్కిన నదులలో లియావో హో, తూమెన్, యాలూ అనునవి ప్రముఖములు వీనిలో కడపటిది చీనాకును ఉత్తర కొరియాకును మధ్య సరిహద్దుగ ఉన్నది. ఉత్తర చీనాలోని నదులందెల్ల ప్రముఖముగను దేశపు నదులలో విస్తృతియందు రెండవదిగను లెక్కకు వచ్చునది హుయంగ్ హో. కాన్సూరాష్ట్రమున జన్మించిన ఈనది 4,800 కిమీ. తూర్పుగ ప్రవహించి, షాంటుంగ్ రాష్ట్రమునుచేరి, అట చిహ్‌లీ (పో హై) సింధుశాఖలో చేరుచున్నది. ఈ నదికి చెందిన లోయయొక్క వైశాల్యము 15,54,000 చ. కిమీ.

మధ్యచీనా యందలి వానిలో యాంగ్‌ట్‌జీ (ఛాంగ్ చియాంగ్) నదియు, దాని ఉపనదులును గణుతి కెక్కినవి. దేశపు నదులందెల్ల ఈ నది విస్తృతియందు మిన్న. సముద్రమున చేరుటకుముందు 5,120 కిమీ. ఈ నది ప్రవహించి 18,13,000 చ. కిమీ. లోని వర్షజలమును కొనిపోవుచున్నది. దక్షిణ చీనాలోని నదులలో మీన్, పెరల్ (చూ) నదులు ప్రముఖములు, మీకాంగ్, యూవన్ నదులును దక్షిణమున కొంత దూరము ప్రవహించి ఆ తరువాత ఇతర దేశములను చేరుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.:** చీనాదేశము, అంతయును, సమశీతోష్ణ మండలముననే ఉన్నను భూతల వైవిధ్యమును అనుసరించి శీతోష్ణపరిస్థితి ఆయా ప్రాంతములందు విభిన్న రీతులలో ఉన్నది. శీతకాలమున తాపక్రమము సాధారణముగ ఉత్తర మంచూరియా యందు – 17° ఫా. ఉండగా, ఆ కాలముననే ఉత్తరచీనాలో 30° ఫా., యాంగ్‌ట్జీ లోయలో 40° ఫా; ఇంకను దక్షిణమున 60° ఫా.

గా ఉండుట కననగును. ఎండకాలపు తాపక్రమమున ఇంత విపరీతముగ వైవిధ్యము కన్పట్టదు. దక్షిణ, మధ్యచీనాలయందు, ఎండకాలమున (జులై నెలలో) తాపక్రమము దాదాపు 80° ఫా. గ ఉండును; ఉత్తర చీనాలో ఆ కాలమున ఎండవేడిమి అటులనే ఉన్నను, అచట ఎండకాలపు నిడివి తక్కువ; రాత్రులందు వేడిమి చాల తగ్గిపోవును. సాలుసరిన, గరిష్ఠ తాపక్రమముల మధ్య అంతరము ఉత్తర మంచూరియాలో చాల ఎక్కువ; అచటి కనిష్ఠ తాపక్రమము -17° ఫా, గరిష్ఠ తాపక్రమము 70° ఫా.; అచటి చలికాలపు విస్తృతి ఆరునెలలకు పైగా ఉండును. ఉష్ణమండలమునకు చేరువనున్న హైనాన్ దీవిలో సాలుసరి తాపక్రమముల అంతరము 15° మాత్రమే.

గ్రీష్మ ఋతువుననే దేశమున వర్షములు కురియును; దక్షిణమునకు వచ్చినకొలది వర్షపాతము ఎక్కువగుట కననగును. మధ్య ఆసియా యందలి ఎడారి ప్రాంతములలో సాలున వర్షపాతము 10 సెం. మీ. పెరల్ నదిలోయలో వర్షపాతము 200 సెం. మీ.; సైబీరియా, మంగోలియాలలో శీతకాలమున కన్పట్టు బలవత్తమ వాయుపీడనము వలన చీనాయందు ఆ కాలమున చలితో పాటుగ పొడిగాలియు ఎక్కువగ రూపొందుచున్నది; అటులే ఎండకాలమున, పసిఫిక్, హిందూ మహాసముద్రముల ఎగువన రూపొంది దేశముపై వీచెడు అర్ద్ర ఋతుపవనములును, శీతోష్ణస్థితిపై, ప్రభావమును నెరపుచున్నవి.

వృక్ష, జంతు సంతతులును, ప్రాంతీయ విభేదములను అనుసరించి, వేర్వేరు తీరులుగ ఉన్నవి దక్షిణమున ఉష్ణమండలపు వనసంతతి కననగును. అచట సంవత్సరమున మూడుకారులు ధాన్యపు పంటలును, ఏడుకారులు కూరగాయల పంటలును పండించబడుచున్నవి. అచట పండు పంటలలో వరి, చెరకు, పొగాకు, ఉష్ణమండలపు పండ్ల జాతులు క్రమరీతిలో పేర్కొన దగినవి. హైనాన్‌లో పలు పాతములందు దట్టపు ఉష్ణమండలపు అడవులు కలవు. మధ్యదేశములోని యాంగ్‌ట్‌జీ నదిలోయయందు ముఖ్యపు ఆహారపు పంట వరియే అయినను, తేయాకునకును, సిల్కు ఉత్పత్తికిని ఆ ప్రాంతము పేరొందినది. ఇవిగాక 'తుంగ్' అనబడు తైలవిశేషము, నిమ్మజాతి పండ్లు, వెదురు అచట లభించుచున్నవి. ఉత్తర చీనాయందును దక్షిణ మంచూరియా యందును పూర్వకాలమున ఆకురాల్పు వృక్షముల అడవులు ఉండినవి. కాని అవి ఇప్పుడు అంతరించి, వాని స్థానమున గోధుమ, ప్రత్తి, జొన్న, సజ్జ సాగగుచున్నవి. దేశమునందు, ఉత్తర మంచూరియాలో మాత్రమే నల్ల రేగడనేల కననగుచున్నది; ఒకప్పుడట మంచి గడ్డిబీడులు ఉండెడివి; కాని ఇపుడచట చాల వరకు గోధుమ, సోయాచిక్కుళ్లు సాగగుచున్నవి. ఆ ప్రాంతపు పర్వతములను ఆవరించి సూచ్యగ్రజాతి వృక్షముల అడవులు కలవు; వీనిలో బొచ్చుకల జంతువుల సంఖ్య అత్యధికము. నైరుతి చీనాలోని పరిస్థితి దక్షిణప్రాంతము లోని దానిని పోలియే ఉన్నను, పర్వతములందు మాత్రము సూచ్యగ్ర జాతివృక్షములును, 'పండా' అనబడు పెద్దజాతి జంతువులును కలవు. లోని మంగోలియా, మధ్య ఆసియాయను చేరియున్న పశ్చిమచీనా యంతటను వర్షపాతము తక్కువగ ఉండు బెట్టభూమి కలదు. ఇచ్చట గరికపట్టులు కొన్నియెడల కన్పట్టును. వృక్ష, జంతు, సంతతులు అచట చాల కొలదిగ మాత్రమే కలవు; అచటచట ఊటనీటి పట్టులను ఆశ్రయించి, ఆ ప్రాంతమున, ప్రత్తిమొదలగు కొన్ని పైరులు సాగగుచున్నవి. టిబెటీపీఠభూములలో, తూర్పున చక్కని పైరుపచ్చ మైదానములు కలవుగాని, పశ్చిమమున మాత్రము దాదాపుగ అంతయు ఊషరభూమియే.

ఆ పీఠభూములలో టిబెట్‌కు సహజములని పరిగణింప దగు చమర మృగములను హిమాలయపు నల్ల ఎలుగుబంటులును కన్పట్టును.

**3. జనసంఖ్య** మొ. 1953 లో సేకరింపబడిన జనాభాలెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 60,19,38,035 ఇందులో తైవాన్ దీవికి చెందిన జనసంఖ్యయు చేరిఉన్నది. 1971 లో ప్రభుత్వము చేసిన ఒక ప్రకటనవలన ఆనాటికి దేశపు జనసంఖ్య 78,71,76,000ను చేరుకొనినది. (రాష్ట్రముల వారిగా జనసంఖ్యా వివరములు 302వ పుటలోని పట్టికవలన తెలియనగును). దేశపు జనవృద్ధిని ఒక పరిమితిలో ఉంచుటకు కుటుంబ నియంత్రణ మూలమున, ప్రభుత్వ ప్రోత్సాహముతో, కృషి జరుగుచున్నది.

1957 లెక్కలను అనుసరించి, ఒక లక్షకు మించిన జనసంఖ్యగల పట్టణములు 124 దేశమున ఉన్నవి; లక్షకు లోబడిన జనసంఖ్య కల పట్టణములు 52 ఉన్నవి. దేశమునందలి అత్యంత ప్రముఖ నగరములును 1968 లో వాని జనసంఖ్యలును ఈ తీరుగ ఉన్నవి: షాంగే (ఒకకోటి); పీకింగ్(70లక్షలు); చుంకింగ్ (44 లక్షలు); టీన్‌చిన్ (40లక్షలు).

పైవాని యంతగ ప్రముఖములుగాని కొన్ని నగరముల పేరులును, 1957 లోని వానిజనసంఖ్యలును ఈ రీతిగ ఉన్నవి; షెన్యాంగ్ (దీనికే ఇది వరలో ముక్డెన్ అనిపేరు; 24 లక్షలు); ఊహాన్ (21.5 లక్షలు); కాన్‌టిన్ (18.4 లక్షలు) హార్బిన్ (15.5 లక్షలు); పోర్ట్ ఆర్థర్ డైరెన్ (15 లక్షలు); నాన్‌కింగ్ (14.2 ల.); సియాన్ (13.1 ల.); చిన్‌గ్‌టూ (11.2ల); చెంగ్‌టూ (11ల.) త్రైయాపన్ (10.2 ల.)

అచ్చపు చీనీయజాతి 'హాన్' జాతి అని పేర్కొనబడుచున్నది. ఈ జాతికి చెందని ప్రజలు దేశీయులలో 6% కలరు. ఈ 6% ప్రజలును దాదాపు 52 వివిధ ఉపజాతులకు చెందినవారుగ లెక్కింపబడుచున్నారు. అయినను భాషారీత్యా వీరు రెండు ప్రముఖ కుటుంబములకు—సినో-టిబెతీ, అల్టాయ్ అనువానికి - చెందిన వారుగ పరిగణనీయులు. సినో-టిబెతీ ఉపజాతులలో చువాంగ్‌లును, టిబెతీలును, అల్టాయ్ కుటుంబపు వారిలో ఉయ్‌గుర్ లును, మంగోలులును ప్రముఖులు. ఆయా ఉపజాతులలో ప్రముఖము లైనవాని పేరులును, 1957 లోని వాని సంఖ్యా వివరములును దిగువ ఈయబడినవి.

1. చువాంగ్ (77,80,000;) తాయి ప్రజలకు సన్నిహితులగు వీరు క్వాంగ్సీ రాష్ట్రమునందు నివసించుచున్నారు, వీరు బౌద్ధులు, 2. ఉయ్‌గుర్ (39,00,000): తుర్కులకు సన్నిహితులగు ముస్లిములు; సికియాంగ్ వీరి నివాసభూమి. 3.హుాయీ (39,30,000); చీనీయ భాషనే మాటాడు ముస్లిములు; కాన్సూ, చింగ్‌హామ్ ప్రాంతములందును, వాయవ్య చీనాలోని తక్కిన కొన్ని ప్రాంతములందును వీరు కలరు. 4. యీ లో లో (32,60,000): టిబెతీయులకు సన్నిహితులై బౌద్ధమతానుయాయులగు వీరు నైరుతి చీనాలో ఉన్నారు. 5. టిబెతీ (27,70,00) : టిబెట్‌లోను, తదనుబంధ ప్రాంతములందును వసించుచున్న బౌద్ధప్రజలు. 6. మియావ్ (26,80,000): సినో టిబెతీ కుటుంబమునకుచెందిన ఒక ప్రత్యేకవర్గము; దక్షిణ, నైరుతి చీనాలలో వీరి నివాసభూములు కలవు. 7. మంగోల్ (16, 40. 000): లోనిమంగోలియా వీరి నివాసభూమి. 8. పూయీ (13,10;000): తాయ్ ప్రజలకు సన్నిహితులై, వారివలెనే బౌద్ధులగు ఈ ప్రజలు నైరుతిచీనాలో వసించుచున్నారు: 9. కొరియన్ (12,50, 000): ఉత్తరకొరియాకు దగ్గరగ ఉన్న చీనీయ ప్రాంతము వీరి నివాసభూమి. 10. మంచూ (24,30,000); చీనాను 13 వ శతాబ్దిలో, జయించి పాలించిన మంచూల జాతికి చెందినవారు

తామని వీరు చెప్పుకొనెదరు కాని, హాన్‌జాతి ప్రజలనుండి ఏవిధముగను వీరు వేరుగ కన్పట్టరు.

చీనాదేశీయులయ్యును, తక్కిన దేశములలో నివసించు చీనీయులసంఖ్య దాదాపు 16.34 లక్షలు ఉండునని అంచనా (1962); ఇందు తైవాన్‌కు చెందిన దాదాపు 76 లక్షలును చేరియున్నది. తాయిలాండ్‌లోని 38 లక్షలు, హాంగ్-కాంగ్‌లోని 32 లక్షలు, ఇండొనీసియాలోని 25 లక్షలు, మలేసియాలోని 25 లక్షలు, సింగపూరులోని 12.5 లక్షలు, యు.స్టే. లోని 2.37 లక్షలు, కెనడాలోని 52,000, గ్రేట్ బ్రిటన్ లోని 12 వేలు చీనీయప్రజలు ఈ లెక్కలో చేరి ఉన్నారు.

దేశమునందలి చీనీయ (హాన్‌జాతి) ప్రజలును, తక్కిన ఉపజాతులలో కొన్నియు 'చీనీయ' భాషనే మాతృభాషగ కలిగియున్నను, ఆ భాషవివిధ మాండలిక వికృతులను కలిగియున్నది. అయినను ఆ భాష వ్రాయబడులిపి, చిత్రలిపి ఆగుటవలనను, ఆ లిపి దేశమంతట ఒకే తీరుగ ఉండుటవలనను, పలుకుబడిలో వ్యత్యాసములు ఎన్నియున్నను, లిఖితభాష మాత్రము అందరకును ఒకే తీరుగ వేద్యమగుచున్నది. మాటాడు భాషవిషయమున సైతము, పీకింగ్ పరిసరములందలి మాండలికమునే ప్రామాణిక భాషగ 'పూతోన్‌ఘువా' అనుపేర ప్రభుత్వము ఆదరించి ప్రోత్సహించుచున్నది. దేశపు చిత్రలిపిని సరళతరము చేయుటకు కృషిజరుగుటయే గాక, చీనీయ భాషను రోమన్ లిపిలో బోధించు యత్నమును 1958 లో మొదలైనది.

ఉపజాతుల ప్రజలలో హూయీ, మంచూ, షే ప్రజలు మాత్రమే చీనీయ భాషను మాతృభాషగ గ్రహించిరి; తక్కినవారికి వేర్వేరు మాతృభాషలు కలవు. అందు 20 కి పైబడిన భాషలకు ప్రత్యేకపు లిపులును, సారస్వతములును ఉన్నవి. అయినను ఈ ఉపజాతుల వారికి అందరికి చీనీయభాషతో పరిచితిని కల్పించుట ప్రభుత్వపు ధ్యేయము.

ప్రాచీన కాలమునుండియు కన్‌ఫ్యూషియన్, తావో మతములును, క్రీస్తు శకారంభము మొదలుగ బౌద్ధమును దేశమున ప్రజలందు తావు కల్పించుకొని వర్ధిల్లినవి. ప్రజలు ఈ మూడు మతముల మేలిలక్షణములయెడ సమానాదరణ వహించి, వానిని అనుసరించిరి. కన్‌ఫ్యూషియన్ మతమును మతమని చెప్పుటకన్న ఒక సాంఘిక సంప్రదాయమని చెప్పదగును. మాతాపితృభక్తి, సచ్ఛీలము, న్యాయనిరతి, ధర్మబద్ధత ఈ సంప్రదాయము బోధించు ముఖ్యధర్మములు. లావో జూ అను చీనీయ దార్శనికునిచే క్రీ. పూ. 6 వ శతాబ్దిలో నెలకొల్పబడినది తావోమతము. ఈ మతమును, బౌద్ధమతమును ఆరాధనా తంత్రమునకు ప్రజలందు వ్యాప్తి కల్గించినవి. చీనీయ ప్రజలలో 1948 నాటికి దాదాపు 15 కోట్ల బౌద్ధులును, 30 కోట్ల తావోమతస్థులును కలరని అంచనా. వీరిలో జ్ఞానపిపాసాయుతులగు పలువురు, మతప్రమేయము లేకుండ, కన్‌ఫ్యూషియన్ బోధలను ప్రమాణములుగ గ్రహించి నడచెడువారు. 1953 నాటికి దేశమున ముస్లిములు ఒక కోటి ఉన్నటుల అంచనా. రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు దాదాపు 30 లక్షలు ఉన్నను, వాటికన్‌లోని పోపుతో తమకుగల సంబంధములను వారు తెంచుకొని, అచ్చపు దేశీయ మతముగ వ్యవహరించుట 1957 లో మొదలైనది. ప్రొటెస్టంటు సంప్రదాయపు క్రైస్తవుల సంఖ్య దాదాపు పదిలక్షలు. ప్రస్తుతపు కమ్యూనిస్ట్ ప్రభుత్వపు విధానములను అనుసరించి మతప్రచారము నిషిద్ధము.

1966 సంవత్సరపు మధ్యకాలమున, కమ్యూనిస్ట్ పార్టీ సహకారముతో సాంస్కృతిక విప్లవము మొదలైనది. దానిని కొనసాగించిన అరుణ రక్ష

కులు (రెక్ గార్డ్స్) మతవిశ్వాసములపైనను, మతసంస్థలపైనను తీవ్రములగు దండయాత్రలను సాగించిరి. తత్ఫలితముగ మత సంస్థలు, సర్వే సర్వత్రా దెబ్బతినినవి; అవి మరల తల ఎత్తినట్టుల కనబడ్డదు. ఈ దండయాత్ర, ఈనాడును, కన్‌ఫ్యూషియన్ సంప్రదాయముపై సాగుచున్నది. కన్‌ఫ్యూషియన్ భావములు మానవ జాతిని, అందును ముఖ్యముగ స్త్రీజాతిని, శృంఖలా బద్ధము చేసి పురోగతిని అడ్డుకొనునవి యని నేటి చీనా పాలకుల విశ్వాసము.

**4. సమాచార సౌ.:** 1959 లెక్కలను అనుసరించి దేశమున 64,000 తంతి తపాలా ఆఫీసులు కలవు. తదాదిగ ఎంతయో అభివృద్ధి జరిగినది. సంఖ్యా వివరములు తెలియకున్నను ప్రతి గ్రామీణ సమష్టి క్షేత్రము (కమ్యూను) న తపాల ఆఫీసును, తంతి టెలిఫోన్ సదుపాయములును కల వని తెలియుచున్నది తపాలాఫీసులందే వార్తాపత్రి కలును, తదితర పత్రికలును విక్రయింపబడును. దేశము మొత్తమున టెలిఫోను వసతి విరివిగ కలదు. దేశము అతి విశాలమగుటవలన మారుమూల ప్రాంతములతో సన్నిహిత సంబంధమును కలిగి ఉండుటకు టెలిఫోనులు చాల ఉపకరించుచున్నవి. అయినను ఏ వ్యక్తియు, స్వతః వ్యక్తిహోదాలో, టెలిఫోనువసతిని కలిగిఉండుటకు ప్రభుత్వము అవకాశమును కల్పించుట లేదు. 673 కేంద్రము లలో వైర్‌లెస్ టెలిగ్రాఫ్ వసతులు ఉన్నవి.

దేశమున 122 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు (1959), 28 టెలివిజన్ స్టేషనులు కలవు (1960). దాదాపు ఒకకోటి రేడియోసెట్లును ఒక లక్షకుపైగా టెలివిజన్ సెట్లును ఉన్నవి (1965). బ్రాడ్ కాస్టింగ్ విషయమున ముఖ్య కేంద్రము పీకింగ్ నగరమున ఉన్నది. దాని ప్రసార ములను, స్థానికపు స్టేషనులు రిలే చేయుచున్నవి.

1970 లో రేడియో పీకింగు నుండి వారమున 1,400 గంటలు ప్రసారములు, 33 విదేశీయ భాషలలోను 5 చీనీయ మాండలికములలోను నిర్వ హింపబడినవి. ఈ సంఖ్యలో పీకింగ్ రేడియోను అధిగమింప గలిగినది మాస్కో రేడియో మాత్రమే. పైన తెలుపబడిన పీకింగ్ ప్రసారపు గంటలలో 100 గంటలు ఆఫ్రికాకును, 40 గం. పశ్చిమ ఆసియా కును, 120 గం. అమెరికా రాజ్యములకును; 100 గం. ప్రాచ్యఆసియా దేశములకును, 530 గం. యూరపీయ దేశములకును (ఇందు 420 పైగా రష్యన్ భాషలో) ఉద్దేశితములైనవి.

**5. యాన సౌ.** ప్రభుత్వపు నివేదికను బట్టి దేశమున ఉత్తమ శ్రేణికి చెందిన రోడ్లు 3 లక్షల కిమీ. పొడవునను ద్వితీయ శ్రేణికి చెందినవి 5 లక్షల కిమీ పొడవునను వ్యాపించి ఉన్నవి (1968). దేశపు రైల్వే మార్గముల నిడివి 31,193 కిమీ. (1958). ఆ తరువాత దాదాపు 6,400 కిమీ. నిడివి కల క్రొత్త మార్గములు నిర్మింపబడినటుల తెలియవచ్చుచున్నది. ఉత్తర–దక్షిణములకు పయ నించు రైలు మార్గములలో పీకింగ్–కాన్‌టన్ (క్వాంగ్‌చౌ) రైలుమార్గము(2,300కిమీ); టీన్‌చిన్–షాంగే రైలుమార్గము (1500 కిమీ.) పావ్‌చీ–చుంకింగ్ రైలుమార్గము (1,174 కిమీ.) ముఖ్యములై నవి. తూర్పు-పడమరలకు పయనించు వానిలో లీన్‌యువన్–లాన్‌చౌరైలుమార్గము (1,500కిమీ.) లాంచో–సింకియాంగ్ రైలుమార్గము (1,800కిమీ); షాంఘె–యుయికువాన్ (వియెత్‌నామ్ సరిహద్దు) రైలుమార్గము; పీకింగ్-లాన్‌చో రైలుమార్గము ప్రముఖములు. మంచూరియాలోని మార్గములలో చీనీయ తూర్పు రైలుమార్గము (సోవియట్ సరి హద్దులోని మంచౌలీనుండి తూర్పున సోవియట్ సరిహద్దునఉన్న వ్లాడివాస్టక్ వరకు–2,370 కిమీ); దక్షిణ మంచూరియా రైలుమార్గము (1,120కిమీ);

చాంగ్‌చున్—షెన్యాంగ్ (ముక్డెన్) రైలుమార్గము (1,350 కిమీ.) గణింపవగినవి.

దేశాంతర్గత ప్రయాణములకు నదీ మార్గములును చాలవరకు ఉపకరించు చున్నవి. వీని మొత్తపు నిడివి 1,67,040 కిమీ (1960). యాంగ్‌ట్జీనదియు, సుంగారీనదియు, ఔగువ పశ్చిమనదియు(కాంటన్‌వద్ద) ఇందులకు ఎక్కువగ సముచితములు. ఈ మార్గములందు చాలవరకు చిన్న నౌకలు మాత్రమే నడువగలవు. దేశమునకు 10,22,456 టన్నుల ప్రమాణముగల 265 ఓడల వర్తక నౌకాదళము కలదు (1971). డైరెన్, టీన్‌చిన్, షాంగే, చిన్‌గ్‌తావ్, వాంపో, కాన్‌టన్ నగరములవద్ద దేశపు ముఖ్యములగు హార్బరులు కలవు.

దేశీయము, అంతర్జాతీయమునగు విమాన యానము ప్రభుత్వాధీనమున నిర్వహింప బడుచున్నది. ఇట్టి పౌరవిమానమునకు ఉపకరించు విమానముల సంఖ్యా వివరములు సరిగ తెలియవు; కాని 350 మొదలుగ 500 వరకు వాని అంచనా మారుచున్నది. బర్మా, వియెత్‌నామ్, మంగోలియా, సోవియట్ సైబీరియా, ఆఫ్ఘనిస్తాన్, ఉత్తరకొరియాదేశములకు ఈదేశమునుండి విమానయాన వసతి కలదు. కాన్‌టన్, షాంగేలలో జెట్‌విమానములకు వసతులు కలవు. దేశాంతర్గతములగు 70 నగరములమధ్య విమానయాన వసతులు ఏర్పడి పనిచేయుచున్నవి (1964). పాకిస్తాన్ విమానయానసంస్థ కరాచీనుండి పీకింగునకును; ఫ్రెంచి విమానయాన సంస్థయును, ఇతియోపియన్ విమానసంస్థయు, తమ దేశముల ముఖ్యనగరముల నుండి షాంగేకును ప్రయాణములను నిర్వహించు చున్నవి. విమానప్రయాణములను గురించిన ఒడంబడికలను ఇటలీ గ్రీకులతోకూడ చీనా ప్రభుత్వము 1973లో కుదుర్చుకొనినది.

**6. చరిత్ర :** సృష్టి పరిణామగతిలో ఆదిమ మానవుడు తొలుతగ రూపొందిన ప్రాంతములలో ఈ దేశమును చేర్చియున్నదని చారిత్రకుల భావన. అంతేకాదు; ప్రాచీన మానవ నాగరికతా కేంద్రములలో యాంగ్‌ట్‌జీ నదీప్రాంతమును ఒకటిగ లెక్కకు వచ్చినది. చీనీయుల సాంప్రదాయిక కథనమును అనుసరించిచూడ, క్రీ.పూ. 2,000 సంవత్సరములకు పూర్వముననే ఈ దేశమున రాజరికము నెలకొన గలిగెననియు అట్టి రాజవంశములలో తొలుటిది యగు 'శియా' వంశము క్రీ పూ.2200 నుండి 1700 వరకు దేశమున ఒక ప్రాంతమును పాలించెననియు తెలియనగుచున్నది. తరువాతి షాంగ్ రాజవంశము (క్రీ. పూ 1700-1200) హుయాంగ్ హోనదీ పరిసర భూమిని అంతటిని పాలించుటయేగాక లిఖిత రూపమున కొన్ని ప్రామాణిక పత్రములను కూడ రూపొందించినది; కంచున పోతపోసియో, లేదా తాబేటి చిప్పలపైనను, ఎముకలపైనను చెక్కబడియో ఈ లిఖిత ఆధారములు లభించుచున్నవి. షాంగ్ వంశమును అంతమొందించి, ప్రభుత్వమును వశపరచుకొనినది పశ్చిమ చౌ రాజవంశము (క్రీ. పూ. 1200-800). వీరి కాలమున సంఘము, వ్యావసాయిక భూస్వామి విధానమున, సువ్యవస్థితమై సుసంపన్నమై వర్ధిల్లినది. అప్పటివరకు తమకు రాజధానిగా ఉండిన సియాన్ నగరమును వదలి, ఈ రాజవంశపువారు క్రీ. పూ. 770 లో లోయాంగ్‌ను రాజధానిగ చేసిరి. అంతటినుండి ఈ రాజవంశమే తూర్పు చౌ రాజవంశమను పేరును వహించి క్రీ. పూ. 249 వరకు దేశమును పాలించినది. వీరి పరిపాలనా కాలముననే ప్రముఖ దార్శనికులు-కన్ఫూషియస్, లావో జీ-దేశమున ఉద్భవించి సంఘవ్యవస్థను సుసంస్కరితము చేయుటకు కృషిచేసిరి.

ఇంతలో, క్రీ. పూ. 475లో ఒక చిన్న మండలమును పాలించుచుండిన 'చిన్' వంశము క్రమశః

బలమును ఆర్జించి, కడకు దేశపరిపాలనను క్రీ.పూ. 3వ శతాబ్దిలో వశపరచుకొని, దేశమున మాండలికుల నిరంకుశాధికారములను అంతరింపజేసి, చీనాను ఏకీకృతము చేయగలిగినది. ఈ వంశపు ప్రభువులలో అతి ప్రసిద్ధికలవాడు షిహ్.హువంగ్ టీ (క్రీ. పూ. 246-210 వ.). చీనాదేశపు ప్రప్రథమ చక్రవర్తిగ ఈతడు పేరొందెను. దేశ పరిపాలనను సువ్యవస్థితము చేయుటకు అతడు కృషిచేసి అందులకు తగిన యంత్రాంగమును నెలకొల్పెను. దేశముపైకి అంతటంతట దండెత్తి వచ్చి, కల్లోలములను కల్గించుచున్న మంగోల్ జాతులను నిరోధించుటకై దేశపు ఉత్తర, పశ్చిమ సరిహద్దుల వరుసన ఒక పెద్దగోడను నిర్మించు కృషిని ఇతడు మొదలిడెను. ఆ గోడ ఆ తరువాత పూర్తియై, ఈనాటికిని నిలిచియుండి 'చీనీయ మహా కుడ్యము' అని వ్యవహృతమగుచున్నది.

'చిన్' వంశీయుల అనంతరమున దేశమును పాలించిన 'హాన్' రాజవంశపు (క్రీ. పూ. 206-క్రీ శ. 220) కాలమున, ఆ పాలకులు హూణుల దండయాత్రలను త్రిప్పగొట్టి, దేశపు పశ్చిమపు సరిహద్దును, ఇంకను పశ్చిమమునకు కొనిపోవ గలిగిరి. సమకాలీనములగు రోమక సామ్రాజ్యము మొదలగు ప్రపంచ ప్రసిద్ధ రాజ్యములతో ఈ పాలకులు దౌత్య సంబంధములను కలిగియుండిరి. హాన్ వంశీయుల ప్రతిష్ఠ సన్నగిలిన తరువాత దేశమున మూడు మాండలిక రాజ్యములు ముందునకు వచ్చి ఆధిపత్యమునకై పెనగులాడినవి. దేశము ఇటుల రాజకీయముగ ఏకతను కోల్పోయినను, సాంస్కృతికముగ మాత్రము ఏకతను కోల్పోవక మనగలిగినది. హాన్ వంశకాలమున దేశమున తావును ఆర్జించిన బౌద్ధ మతము ఈ కాలమున పలువురు మాండలికుల ఆదరణను ఆర్జించి ప్రబలినది; యాంగ్‌ట్జీ నదీ పరిసరములందు వివిధ కళలును, విజ్ఞానశాస్త్రములును వికసిల్లినవి. కడకు సూయీ రాజవంశీయుల (581-618) ఆధ్వర్యవమున సామ్రాజ్యము మరల ఏకీకృతమైనది. వారినుండి ఆధిపత్యమును లాగుకొనిన టాంగ్ వంశమును (618-907) దేశపు రాజకీయైకతను కాపాడగలిగినది. టాంగ్ వంశీయుల కాలమున, అందును ముఖ్యముగ టాయ్ చుంగ్ చక్రవర్తి కాలమున (627-49), చీనాదేశము ఒక బలవత్తమ రాజ్యముగ రూపొందుటయే గాక వాణిజ్యమున, కళావికసనమున, వైజ్ఞానిక విషయములందు ప్రాచ్య ఆసియాకే కేంద్రభూమిగ రాజించినది. క్రీ. శ. 907 మొదలుగ దేశమున అరాజకత ఏర్పడి, అయిదు రాజవంశములు వేర్వేరు ప్రాంతములను వశపరచుకొని పాలించినవి; అయినను దేశమును మరల సుంగ్ రాజవంశము (960-1279) ఏకీకృతముచేసి, సమర్థతతో అతి దీర్ఘకాలము పాలించగలిగినది. ఈ రాజవంశపు పరిపాలనాకాలమున సారస్వతము, తత్త్వశాస్త్రము, లలితకళలు పలురీతుల వికసనము పొందినవి; విజ్ఞానశాస్త్రమునను చీనాదేశము ఆ కాలమున ముందంజ వేసినది. అక్షరముల అచ్చుకూర్పును, తుపాకి మందును, నావికా దిక్సూచిని చీనీయులు ఆకాలమున కనుగొనిరి. వారినుండియే తక్కిన దేశములవారికి తరువాత ఇవి లభించినవి.

క్రీ. 1126 మొదలుగ చీనాదేశముపై మంగోలుల, తార్తారుల దండయాత్రలు పదింబదిగ సాగినవి; వాని ధాటికి ఆగజాలక ప్రభుత్వము తన రాజధానిని పలుమారులు వేర్వేరు దిక్కులకు మార్చినది. కాని కడకు చెంగిస్‌ఖాన్ అను మహానాయకుని ఆధ్వర్యమున సాగిన మంగోలుల దండయాత్రకు చీనాదేశము, క్రీ. శ. 13వ శతాబ్దమున, లొంగినది; తత్ఫలితముగ దేశమును వశపరచుకొని పాలించిన, మంగోలుజాతికి చెందిన, యూవాన్ రాజవంశము (క్రీ. శ. 1279-1368)న సుప్రసిద్ధుడు కుబ్లయ్‌ఖాన్ (1279-1294). ఇతని కాలమున దేశము ఆర్థికరంగమున పురోగమించు

టయే గాక, అంతర్జాతీయఖ్యాతిని ఆర్జించి పలువురు యూరపీయ సాహసికులను, మతప్రచారకులను ఆకర్షింపగలిగినది. అట్టి సాహసికులలో ఎక్కువ పేరొందినవాడు మార్కోపోలో. ఆ కాలమున చీనీయ సారస్వతమున నాటకమునకును నవలకును ఎక్కువ ఆదరణ చేకూరినది.

మంగోలుల పరిపాలనను దేశీయులు తుదముట్టించిన తరువాత దేశీయమగు మింగ్ రాజవంశము (1368-1644) చాలకాలము పాలించినది. వీరి కాలముననే పోర్చుగీజు (1516), స్పానిష్ (1557), డచ్చి (1606), ఇంగ్లీష్ (1637) నావికులు చీనాదేశమున కాలిడిరి. ఇంతలో ఈశాన్య ప్రాంతమునుండి 'మంచూ' అను విదేశీయజాతి దండయాత్రచేసి, మింగ్‌రాజవంశమును కూలద్రోసి, ప్రభుత్వమును వశపరచుకొనినది (1644). ఇదియే చీనాదేశపు చివర రాజవంశము. ఈ వంశము విదేశీయమే అయినను చీనీయ సంస్కృతిని స్వీయము చేసికొని, ప్రాచీన పరిపాలనా విధానపు రీతులను, చట్టములను యథాతథముగ కాపాడి, పరిపాలన నెరపినది. వీరి పరిపాలనా కాలముననే మంగోలియా, మంచూరియా, టిబెత్, తైవాన్, మధ్యఆసియాలోని తుర్కిస్తాన్ ప్రాంతములు చీనీయ సామ్రాజ్యమున అంతర్భాగములు చేయబడినవి.

18వ శతాబ్ది అంతమున కాంటన్‌రేవు మాత్రమే విదేశీయ వ్యాపారమునకు అనుమతింపబడినది. కాని అటనుండి నల్లమందు వ్యాపారమును సాగించు బ్రిటిష్‌వారిని దండించుటకై చీనా ప్రభుత్వముచేసిన యత్నము కడకు 1839లో బ్రిటిష్ కంపెనీతో యుద్ధముగ పరిణమించి, అందు చీనా ప్రభుత్వ సేనలు ఓడిపోవుటయు (1842), కాన్టన్‌కు తోడుగ ఆమోయ్, ఫూచూ, నింగ్‌పో, షాంగేలను కూడ విదేశీయుల వ్యాపారపు రేవులుగ అనుమతించుటయు, హాంగ్‌కాంగ్ దీవిని దీర్ఘకాలపు కౌలు పద్ధతిని బ్రిటిష్‌వారికి చీనాప్రభుత్వము దత్తము చేయుటయు జరిగినవి. ఈ విధముగా చీనీయ ప్రభుత్వపు బలహీనత స్పష్టమైనంతనే తక్కిన యూరపియన్ రాజ్యములను జపాన్ దేశమును ఒత్తిడిచేసి దేశమున వసతులను ఆర్జించినవి. రష్యా విజృంభించి ఈశాన్యచీనాలోని కొన్ని భాగములను వశపరచుకొనినది; జపాన్, తైవాన్ దీవిని వశపరచుకొని (1895), దేశపు తీరమున రేవువసతులను ఆర్జించి, కొరియాపై పెత్తనమును గ్రహించినది. విదేశీయులను ఎదుర్కొనుటకు దేశీయులు చేసిన తిరుగుబాటు (బాక్సర్ తిరుగుబాటు-1900) విఫలమైనది. కడకు దేశీయులు తమ సామ్రాజ్య ప్రభుత్వమును కూలద్రోసి రాజరికమును పదవినుండి తొలగించిరి. (ఫిబ్రవరి, 1912) అంతట చీనీయ గణరాజ్య ప్రభుత్వము సన్యత్‌సేన్ నాయకత్వమున నెలకొల్పబడినది.

పుట్టినదిమొదలుగ చీనీయ గణరాజ్యప్రభుత్వము పలు అవరోధములను ఎదుర్కొనినది. కడకు ప్రభుత్వమంతయు 1916 మొదలుగ సేనానుల వశమైనది. ప్రథమ ప్రపంచయుద్ధమున మిత్రమండలిపైపుననే చీనా పోరాడినది; కాని వెర్సెయిల్సు సంధికాలమున, చీనాలోని అన్యాక్రాంత భూములను చీనాకు పూర్తిగ ఇచ్చుటకు మిత్రరాజ్యములే నిరాకరించినవి; ఏవియో కొలదిగ హక్కులను విదేశరాజ్యములు వదలుకొనుటకును, షాంటుంగ్ ద్వీవకల్పమునుండి జపాను, బ్రిటిష్ సేనలు వైదొలగుటకును మాత్రమే అంగీకారము కుదిరినది (1922).

సన్యత్‌సేన్ మరణానంతరమున (1925), అతని అనుయాయియగు చియాంగ్ కే-షేక్, దేశమున, నాంకింగ్ రాజధానిగ, ఏకీకృత ప్రభుత్వమును నెలకొల్పెను (1928). తొలుత ఇతనిని

కమ్యూనిస్టులును బలపరచిరి. కాని త్వరలోనే వైమనస్యములు కలిగినవి; అంతట కమ్యూనిస్టులు, దేశవాయవ్యభాగమున యేనాన్‌ను తమ స్థావరముగ చేసికొని పోటీప్రభుత్వమును నెలకొల్పిరి. ఈ అంతఃకలహములను అదనుగ గ్రహించి జపాన్, చీనాయందలి మంచూరియాను వశపరచుకొని, దేశముపై తన పలుకుబడిని ఎక్కువ చేయుటకు కృషిచేసినది; తత్ఫలితముగ 1937 మొదలుగ చీనా, జపానులమధ్య యుద్ధము సాగినది. అంత దేశమున అధికభాగము జపానీయుల వశముకాగా చీనీయ ప్రభుత్వము తన రాజధానిని చుంకింగ్‌నకు తరలించి పోరాటమును కొనసాగించినది; కమ్యూనిస్ట్ సేనలు, జాతీయ ప్రభుత్వముతో సహకరించి జపాన్‌దేశపు సేనలతో పోరాడినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాన్‌దేశపు ప్రభుత్వము మిత్రరాజ్య సేనలపై యుద్ధము ప్రకటించినంతనే (డిశంబరు, 1941) మిత్రరాజ్యములు చీనాపక్షమున చేరినవి. ఆ యుద్ధము ముగిసిన తరువాత, జపాన్‌సేనలు దేశమునుండి వైదొలగగ చీనా దేశమునందలి అన్ని ప్రాంతములందును చీనా జాతీయ ప్రభుత్వపు అధికారము సుస్థాపితమై, విదేశీయులకు గల రేవువసతులు మొదలగునవి అన్నియు రద్దయినవి. పోర్చుగీజు వారి వశమున మకావో, బ్రిటిష్‌వారి ఆధీనమున హాంగ్‌కాంగ్ మాత్రము నిలిచియున్నవి.

ఇంతలో కమ్యూనిస్ట్‌లతో జాతీయప్రభుత్వమునకు కలతలు ఏర్పడి కడకు అంతర్యుద్ధమునకు దారితీసినవి. ఈ అంతర్యుద్ధపు ఫలితముగ దేశపు ముఖ్య భూభాగమున కమ్యూనిస్ట్ ప్రభుత్వము నెలకొనగలిగినది (1949). చియాంగ్ కే-షేక్ నాయకత్వమున ఉన్న జాతీయప్రభుత్వము తన సేనలతో తైవాన్ దీవికి తరలిపోయి, యు. స్టే- సహకార సానుభూతులతో అట నిలువగలిగినది.

చీనా సామ్రాజ్యమునకు చారిత్రకరీత్యా చెందియు దాదాపుగ స్వతంత్ర ప్రతిపత్తితో ఉన్న తిబెత్‌ను కేంద్రాధికారమును నెలకొల్పుటకు 1950 లో చీనాను పాలించు కమ్యూనిస్ట్ ప్రభుత్వము పూనుకొని విజయమునందినది; తరువాత అచటి సాంప్రదాయిక పాలకుడగు దలైలామాతో వైమనస్యములు కలుగుటయు, అంతట దలైలామా, కొంతమంది తన అనుచరులతో, దేశమును వదలి భారతదేశమున తలదాచుకొనుటయు జరిగినవి (1959). భారత-చీనాదేశముల సరిహద్దు విషయమున చీనా అవలంబించిన వైఖరి 1962 లో ఆ ఉభయదేశముల మధ్య సరిహద్దుపోరాటమునకు దారితీసినది. కడకు ఏకపక్షముగ నిర్ణయమును తీసికొని తాను ఆక్రమించిన ప్రాంతములనుండి వైదొలగి, యుద్ధఖైదీలను చీనా ప్రభుత్వము విడుదల చేసినది. అయినను ఈనాటికిని ఆ సరిహద్దు సమస్య అపరిష్కృతముగ నిలిచియే ఉన్నది. అటులే సోవియట్ రష్యాతోను ఉత్తర సరిహద్దు విషయమున ఈ దేశమునకు వివాదము కలదు. 1969 లో ఈ వివాదము ఉభయపక్షముల మధ్య ఆయుధ సంఘర్షణను దారితీసినది. ఆ పోరాటము త్వరలోనే విరమింపబడినను ఆ వివాదము మాత్రము పరిష్కృతము కాలేదు.

చీనీయ మానవ సమాజమును సోషలిస్టు సమాజముగ నిర్మించుట ప్రభుత్వపు ధ్యేయము. ఈ కృషిలో తొలుత సోవియట్ రష్యాయు ఈ దేశమునకు సహకరించినది. కాని తరువాత, విధానమునందు ఏర్పడిన అభిప్రాయ భేదములవలన, సోవియట్ సహకారము ఉపసంహరింపబడినది (1960). దేశమును అతి త్వరితగతిలో పారిశ్రామికము చేయుటకు జరిగిన కృషి 1950-59 లో 'పెను ముందంజ' అను కార్యక్రమముగ పరిణమించినది. సమష్టి వ్యవసాయమును అభివృద్ధిచేసి, దేశమున పెద్ద పరిశ్రమలను నెలకొల్పి ఆర్థిక వ్యవస్థా

సౌధమునకు తగు పునాదులను అతి స్వల్పకాలములో నిర్మించుట ఈ కార్యక్రమపు లక్ష్యము. 1960-62 లో దేశము ఆర్థిక సంక్షోభమును ఎదుర్కొనవలసి వచ్చినది; అయినను 1965 నాటికి లక్ష్యమున కొంత సాధింపగలిగినది. 1966-69 లో 'సాంస్కృతిక విప్లవపు' ఉద్యమము, దేశమున చెలరేగి పౌరుల జీవితవిధానమునను, భావములందును విప్లవకర పరివర్తనలను కొనివచ్చుటకు కృషిచేసినది. ఈ అన్నింట చీనీయ కమ్యూనిస్టుపార్టీ అధినాయకుడగు మావ్ సేతుంగ్ వ్రాతలును, బోధలును, నాయకత్వమును దేశీయులకు మార్గదర్శకత్వము వహించినవి.

ఐక్యరాజ్య సమితిలోని శాశ్వత సభ్యరాజ్యములలో చీనాదేశము ఒకస్థానమును కలిగియున్నది. కాని, చీనా భూభాగమున తన అధికారమును నెలకొల్పిన చీనా ప్రజాగణతంత్ర ప్రభుత్వమును కాదని, ఆ స్థానము తైవాన్‌లోని చీనీయ ప్రభుత్వమునకు చెందవలెనని యు. స్టే. ప్రభుత్వము పట్టుదల పట్టుటవలనను, ఆ ప్రభుత్వమునకు ఐ.రా.స. యందున్న పలుకుబడి మూలముననను, ఈ దేశపు ప్రభుత్వమునకు ఆ స్థానము చాలాకాలము వరకు దక్కలేదు. కాని ప్రపంచరాజ్యములందు చీనీయ ప్రజాగణతంత్ర ప్రభుత్వ ప్రతిష్ఠ పెరిగినకొలది, యు. స్టే. సైతము క్రమముగ తన పట్టును వదలుకొని, చీనీయ ప్రభుత్వముతో సామరస్యమును నెలకొల్పుకొనుటకు ఇచ్ఛగించినది. తత్ఫలితముగ 26 అక్టోబరు, 1971 న ఐ. రా. స. యందు సభ్యత్వమును, భద్రతాసంఘమున శాశ్వత సభ్యత్వమును, ఈ దేశమునకు లభించినవి

**7. పరిపాలన :** 1949వ సంవత్సరమున చీనా ముఖ్యభూభాగము, కమ్యూనిస్టుల వశమయ్యెను; 1950 లో తీరప్రాంతమున ఉన్న హైనాన్ మొదలగు కొన్ని దీవులును వారి వశమైనవి.

21 సెప్టెంబరు, 1949న చీనా ప్రజారాజకీయ సంప్రతింపుల సంఘమును పీకింగ్ నగరమున చీనీయ కమ్యూనిస్టు పార్టీ సమావేశపరచినది. ఆ సంఘము ఒక 'సాధారణ కార్యక్రమము'ను 'ప్రజా కేంద్ర ప్రభుత్వ మూలశాసనము'ను ఆమోదించినది. తరువాత ఈ రెంటిని ఆధారములుగ గ్రహించియే దేశపు రాజ్యాంగవిధానము రూపొందింపబడి, ప్రథమ జాతీయ ప్రజాపరిషత్‌చేత 20 సెప్టెంబరు 1945 న ఆమోదింపబడినది సంప్రతింపుల సంఘము, అంతటి నుండి, సలహా సంఘముగ పరిగణనను పొందినది.

ఆ సంఘము దేశాధ్యక్షుడుగ మావ్ సే తుంగ్‌ను ఎన్నుకొనినది. చీనీయ ప్రజాగణతంత్ర ప్రభుత్వము సంస్థాపితమైనటుల అతడు 1 అక్టోబరు, 1949 న ప్రకటించెను. ఈనాడును అతడే దేశాధ్యక్షుడు.

'జాతీయ ప్రజాపరిషత్' అను అర్థమొసగు పేరుగల సంస్థయందు రాజ్యాంగ విధానమువలన పరిపాలనాధికారము న్యస్తమై ఉన్నది. ఈ సంస్థయందు రాష్ట్రములకు, స్వయంపాలిత ప్రాంతములకు, కేంద్రపాలనలోని పురపాలకసంస్థలకు, సేనానివహములకు, విదేశములందలి చీనీయులకు ప్రాతినిధ్యము కలదు. 8 డిసెంబరు, 1963 న సవరింపబడిన ఎన్నికల చట్టమును అనుసరించి రాష్ట్రములును, స్వయంపాలిత ప్రాంతములును 4 లక్షల ప్రజలకు ఒక ప్రతినిధి చొప్పున (ఏరాష్ట్రమునకును 10 మంది ప్రతినిధులకు తగ్గకుండ) ఈ సంస్థయందు ప్రతినిధులను కలిగియుండును; ఇక రెండు లక్షలకు తగ్గక మూడు లక్షలజనసంఖ్యకు మించని నగరములు, కేంద్రపాలిత నగరములు, పారిశ్రామిక నగరములు, పారిశ్రామిక ప్రాంతములు-50,000 మందికి ఒకరుచొప్పున ప్రతినిధులను ఈ పరిషత్తున కలిగియుందురు. వీరుగాక ఉపజాతులపక్షమున 300, సేనానివహములకొరకై 120, విదేశము

లందలి చీనీయుల పక్షమున 30 ప్రతినిధులు ఇందు ఉందురు. 1964, సెప్టెంబరులో ఎన్నుకొనబడిన మూడవ కాంగ్రెస్‌కు 3,040 ప్రతినిధులు కలరు. 1965 లో ఇది ఒక సమావేశమును జరిపినది. నాలుగవ కాంగ్రెస్ ఇంక ఎన్నుకొనబడవలసి ఉన్నది.

'రాజ్యసభ' అనునది కాంగ్రెస్ యొక్క కార్య నిర్వాహక వర్గముగ వ్యవహరించును. ప్రధానియు, కొందరు ఉపప్రధానులును, కొన్ని ఉపసంఘముల అధ్యక్షులును ఇందు సభ్యులు. దేశపు ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, విదేశీయ పాలనావ్యవహార ములపై నిర్దేశాధికారమును అది కలిగి ఉన్నది.

దేశమున పరిపాలనా యంత్రాంగమును, కమ్యూనిస్ట్ పార్టీయంత్రాంగమును విడదీయరాని రీతిలో కలిసిమెలసి వ్యవహరించుచున్నవి. కొన్ని సందర్భములందు ఈ రెండు యంత్రాగముల మధ్య సీమారేఖను నిర్ణయించుట సాధ్యముకాదు. తొలుత కమ్యూనిస్ట్‌పార్టీ ఆమోదముతో కొన్ని చిన్న పార్టీలును పనిచేసినవి; కాని 'సాంస్కృతిక విప్లవ' కాలమున అవి అడచివేయబడినవి. సాంస్కృతిక విప్లవకాలమున చెలరేగిన ఆందోళనల ఫలితముగ కమ్యూనిస్ట్ పార్టీయందును, పాలనాయంత్రాంగము నందును పలువురు ప్రముఖులు సైతము పదవులను కోల్పోయిరి. ఆ విప్లవపు కాలమునుండి పార్టీ యంత్రాంగముపై కమ్యూనిస్ట్ పార్టీకే చెందిన 'ప్రజా విమోచన సేన' యొక్క పలుకుబడి ఎక్కువైనది.

దేశము పరిపాలనా రీత్యా 21 రాష్ట్రములు, 5 స్వయంపాలిత ప్రాంతములు. 3 కేంద్రపాలిత నగరములు-అనురీతిగ విభక్తమైనది. రాష్ట్రములు స్వయంపాలిత ప్రాంతములుగను, అవి మండలములుగను, మండలములు కమ్యూనులుగను విభజింపబడినవి. రాష్ట్రస్థాయిలో పరిపాలనను ప్రజాసమితులు ఇదివరలో నిర్వహించెడివి; కాని 1967-68 లో వీనికి బదులుగ విప్లవ సమితులు ఏర్పడినవి. ఆ స్థాయికిచెందిన ప్రజాసంఘముచేత అవి ఎన్నుకొనబడి ఆ సంఘమునకు బాధ్యత వహించి, పీకింగ్‌లోని రాజ్యసభకును జవాబుదారీని కలిగి పరిపాలించును. 1970 లోని ఏర్పాటును అనుసరించి న్యాయనిర్వహణాధికారము, ఉచ్చతమ ప్రజాన్యాయస్థానమునను, విభిన్న స్థాయిలందు పనిచేయు స్థానిక న్యాయస్థానములందును, ప్రత్యేక ప్రజాన్యాయస్థానములందును కలదు. ఉచ్చతమ న్యాయస్థానపు అధ్యక్షుడును, తక్కిన సభ్యులును జాతీయ ప్రజాపరిషత్తుచేత ఎన్నుకొనబడుదురు. వీరి పదవీకాల పరిమితి 4 సంవత్సరములు. స్థానిక ప్రజాసంఘములు స్థానిక న్యాయస్థాన సభ్యులను ఎన్నుకొనుచున్నవి. న్యాయ నిర్వహణ చర్యలో సామాన్య ప్రజానీకమును పాల్గొనవలయుననుట ఈ న్యాయస్థానముల కార్యనిర్వహణమున లక్ష్యము.

**8 దేశరక్షణ:** దేశరక్షణరీత్యా దేశము 11 ప్రాంతములుగ విభక్తము ఒక్కొక్క ప్రాంతము ఒక్కొక్క సేనానాయకుని ఆధ్వర్యమున ఉండును; అచటి భూ, జల, వాయు సేనలపై అతనికి అధికారము కలదు. 1955 మొదలుగ నిర్బంధసైనికశిక్షణ అమలున ఉన్నది. 18 వ ఏట అది మొదలై, 4 ఏండ్లు భూతలసేనలోను, వాయుసేనలో 5 ఏండ్లును, నౌకా సేనలో 6 ఏండ్లును సాగుచున్నది. సైనికులందు స్థాయీ భేదము 1965 లో రద్దుచేయబడినది. విధినిర్వహణ విభేదము మాత్రమే అమలున ఉన్నది.

దేశరక్షణకై అణవికశక్తిని పనిగొను విషయమున దీక్షవహించి చీనా కృషిచేయుచున్నది; కాని ఎట్టి దురాక్రమణకును అది వినియోగించబడదని ఆ దేశప్రభుత్వము పలుమారు ప్రకటించినది. 1964 మేలో తన తొలుతటి అణవిక సాధ

సమును చీనా ప్రేల్చినది; 1967 లో తొలుతటి ఉదజనిబాంబు శోధితమైనది; మొదటి కృత్రిమ ఉపగ్రహము 1970 ఏప్రిల్‌లోను, రెండవది 1971 మార్చిలోను ప్రయుక్తములైనవి.

చీనీయ భూతలసేనలందు 138 డివిజనులు కలవని తెలియుచున్నది. సంఖ్యావివరములు విపులముగ తెలియవచ్చుటలేదు. కాని నానావిధ ఆధునికాయుధ సుసంపన్నమగు ఈ సేనయందలి మొత్తపు సైనికుల సంఖ్య 25-26 లక్షల మధ్య ఉండునని అంచనా (1969); ఇదికాక 'ప్రజాసేన' అనబడునది వేరొకటి కలదు; ఇందు సైనికవృత్తి నుండి విరమించినవారు ఎక్కువగ కలరు; ఈ సేనలోని సైనికసంఖ్య దాదాపు ఒక కోటి.

నావిక సేనయందు 1, 65, 000 మంది పని చేయుచున్నారు (1972). చింగ్ తావ్, లూషాన్, షాంగే, చౌషాన్, వాంపావ్, చాంకాంగ్-అను తావులందు నౌకా స్థావరములు కలవు. పెద్ద యుద్ధ నౌకలను చీనా ప్రస్తుతమున నిర్మించుట లేదు; కాని తక్కువిధముల వానిని త్వరితగతిలో నిర్మించు చున్నది. 42 జలాంతర్గాములు, 4 డిస్ట్రాయర్లు, 815 గన్‌బోట్లు, 200 టార్పెడోబోట్లు, తక్కినవి 568 ప్రస్తుతమున ఆ సేనావిభాగమున ఉన్నవి (1972).

అంచనాలను అనుసరించి వాయుసేన యందలి యుద్ధోచిత విమానసంఖ్య 2,750 (1972). ఇందు బాంబర్ల సంఖ్య 300. ఈ సేన 40 దళములుగ విభక్తము. విమానముల యంత్రరీతి సోవియట్ దేశపు ప్రమాణములను అనుసరించి నిర్మితము. వాయుసేనయందు 2,50,000 మంది సైనికులు కలరు (1972).

**9. అంతర్జాతీయ సం :** చీనాలోని నూత్న పరిణామమును యు.స్టే. యు., దానిని అనుసరించిన కొన్ని రాజ్యములును పరిగణించని కారణమున చీనా దేశపు ఐ. రా. స. సభ్యత్వమును, భద్రతాసంఘ శాశ్వత సభ్యత్వమును తైవాన్‌లోని చీనా ప్రభుత్వపు వశమునందే తొలుత ఉండెనవి. కాని 1970 అంత మునకు ప్రపంచ ప్రజాభిప్రాయమునకు లొంగి యు.స్టే.యు. సుముఖతను వహించుటవలన అక్టోబరు 25, 1971న చీనాదేశపు ముఖ్య భూభాగపు కమ్యూనిస్ట్ ప్రభుత్వమునకు ఆరెండుపదవులును దక్కినవి. ప్రపంచపు ప్రముఖ రాజ్యములలో దాదాపుగ అన్నింటితోను ఇపుడు ఆ రాజ్యమునకు రాజకీయ సంబంధములు ఏర్పడినవి. సరిహద్దు సమస్యనుబట్టి భారతదేశముతో సామరస్యము లేకుండ, దౌత్య సంబంధములు ఇదివరలో కొంత తగ్గుస్థాయిలో ఉన్నను, 1976 జూన్ మొదలుగ అవి పూర్ణస్థాయిని అందుకొన్నవి; సోవియట్ దేశముతో సరిహద్దు విషయమునను, కమ్యూనిస్ట్ సిద్ధాంత వివరణ యందును కలిగిన విభేదములను అనుసరించి ఏర్పడిన విభేదములు అటులనే నిలిచియున్నవి.

**10. ఆర్థిక రంగము :** ప్రాచీన కాలము నుండియు చీనా వ్యావసాయికదేశముగ పేరుగనినది; కాని ఇప్పటి కమ్యూనిస్ట్ ప్రభుత్వము దేశమును త్వరితగతిలో పారిశ్రామికముగ చేయుటకు దీక్ష వహించి కృషిచేయుచున్నది. అయినను వ్యవసాయమునెడల నిర్లక్ష్యతను వహించుటలేదు. దేశమున పనిచేయగలుగువారిలో 75% ఇప్పుడును వ్యవసాయ రంగముననే కృషి చేయుచున్నారు. 1960 నుండి 1970 వరకు జరిగిన పురోగతిని గురించి ప్రభుత్వపు సంఖ్యావివరములు తెలియ వచ్చుటలేదు. ఆ తరువాత కొన్ని వివరములను ప్రభుత్వము ప్రకటించినను అవి సమగ్రములు కావు. అయినను చాలవరకు వానిని ఆధారములుగ గ్రహించి రూపొందించిన సంఖ్యా వివరములు మాత్రమే ప్రస్తుతమున లభ్యములు.

1958 అంతమునకు దేశమునందలి వ్యావసాయిక కృషియంతయు సాంఘికము చేయబడినది. దాదాపు 50 కోట్ల సంఖ్యాబలముగల రైతాంగము

74,000 కమ్యూనులుగ వ్యవస్థితమైనది. ఒక కమ్యూనున కొన్ని గ్రామములు చేరియుండును; అందు మొత్తముమీద రైతుకుటుంబముల సంఖ్య 5,000 వరకు ఉండును. ఈ కమ్యూనుకు చెందిన ఉత్పత్తి, వ్యాపారము, సంఘశ్రేయము, భద్రత మొదలగువాని విషయమున కమ్యూన్ సంఘము బాధ్యత వహించును.

దేశమున దాదాపు 11 కోట్ల హెక్టేరుల వ్యవసాయయోగ్య భూమి ఉన్నది (1964). దాదాపు లక్ష ట్రాక్టర్ల సహాయముతో ఇందు వ్యవసాయము సాగుచున్నది. ప్రపంచ ఆహారవ్యవసాయ వ్యవస్థ వారి అంచనాలను అనుసరించి దేశమున 1969లో ఉత్పత్తి, మెట్రిక్ టన్నులలో, ఈ రీతిగ కలదు. ఉరలగడ్డలు 312 లక్షలు; గోధుమ 310 లక్షలు; సోయా చిక్కుళ్ళు 115 లక్షలు; వేరుసెనగ 27 లక్షలు; పొగాకు 7,85,000; తేయాకు 1,78,000; ప్రత్తివిత్తులు 30 లక్షలు.

పశుసంపద విరివిగ కలదు. ప్ర. ఆ. వ్య. వారి అంచనాలను బట్టి 1970 లో గొర్రెజాతి 706 లక్షలు; గో, మహిషజాతి 632 లక్షలు; పందులు 232 లక్షలు కలవు.

దేశమునందలి అడవుల విస్తీర్ణము 120 లక్షల హెక్టేరులు. ఇందు అత్యధికభాగము హీలుంగ్ కియాంగ్, షెచ్వాన్, యున్నాన్ ప్రాంతములందు ఉన్నవి. వృక్షములన్నింట ముఖ్యముగ ఉపయోగ కారియైనది 'తుంగ్ వృక్షము; దీనినుండి తైలము లభించుచున్నది. క్రొత్తగా కొన్ని ప్రాంతములను అటవీమయములుగ చేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. అడవులలో బహు విధముల కలప లభించుచున్నను, అందు టేకు ముఖ్యము.

దేశమున ఖనిజ సంపద విరివిగ కలదు. అన్ని రాష్ట్రములందును రాక్షసిబొగ్గు, గనులు కలవు. 1971 లో రాక్షసిబొగ్గు, లిగ్నయిటు మొత్తపు ఉత్పత్తి 3,570 లక్షల మె. టన్నులు. ఇనుప ఖనిజము పలు రాష్ట్రములందు లభించుచున్నను అందు అధికభాగము షాన్సీ రాష్ట్రమున ఉన్నది. 1970 లో దాని ఉత్పత్తి 270 లక్షల మె. టన్నులు.

పెట్రోలియం దేశమున పలుతావుల కలదు. టాచింగ్, యూమెన్, కరమాయ్ అను ప్రాంతములు అందులకు పేరొందినవి. ముడి పెట్రోలియపు ఉత్పత్తి 1971 లో 254 లక్షల టన్నులు; ఇంధనపు వాయువు ఉత్పత్తి 10,000 లక్షల ఘన మీటర్లు (1967).

చీనాదేశము తొలుతటి నుండియు తగరపు ఉత్పత్తికి పేరొందినది; యున్నాన్ రాష్ట్రమున అది ఎక్కువగ లభించును. దాని ఉత్పత్తి 20,000 మె. టన్నులు (1967). విద్యుత్ పరిశ్రమలో విరివిగ వాడబడు టంగ్‌స్టన్ ధాతువు విరివిగ లభించు దేశములలో చీనాయు ఒకటి; యూనాన్, క్వాంగ్-టుంగ్, యున్నాన్ రాష్ట్రములలో దీని వ్యాప్తి ఎక్కువ. దీని ఉత్పత్తి 20,000 మె. టన్నులు. (1964). తక్కిన ధాతువులలో అంచనాను అనుసరించి 1967 న ఉత్పత్తి: బాక్సయిట్ (4 లక్షల టన్నులు); మాంగనీజు (8 లక్షల టన్నులు): సీసము (ఒక లక్ష ట.); రాగి (90,000 ట.)

దేశమున విద్యుదుత్పత్తి జలవిద్యుత్ యంత్రముల వలనను, రాక్షసి బొగ్గు వలనను సాగుచున్నది. గ్రామసీమలకు విద్యుత్‌ను అందుబాటులోనికి తెచ్చుటకై ప్రభుత్వము నిరంతర కృషిని సాగించుచున్నది. మొత్తపు విద్యుదుత్పత్తి అంచనాలను అనుసరించి 4700 కోట్ల కి. వా (1960).

దేశమున గత ఇరువది యేండ్లలో పారిశ్రామికోత్పత్తి విరివిగా పెరిగినది. భారీ యంత్రముల ఉత్పత్తికి ప్రభుత్వము ప్రాధాన్యము ఇచ్చుచునే సామాన్య వస్తూత్పత్తిని కూడ విరివిగ సాగించినది. ముఖ్యముగ ఉక్కు ఉత్పత్తులు, రసాయనిక ద్రవ్య

ములు, జవుళీ వస్తువులందు ఈ పురోగతి ఎక్కువగ కనబడుచున్నది. 1963 మొదలుగ వాహన శకటముల ఉత్పత్తి యందు ఎక్కువశ్రద్ధ చూపబడుచున్నది. విమానములనుకూడ, సోవియట్ నమూనాలను అనుసరించి, చీనా నిర్మించుచున్నది.

దేశపు ఎగుమతుల విలువ 230 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 215 కోట్ల అ. డాలర్లు (1971). బడ్జెట్‌ను ప్రభుత్వము ప్రస్తుతమున ప్రకటించుట లేదు. 1960 లో ప్రకటింపబడిన దానిని బట్టి ఆ సాలున బడ్జెటరీ వ్యయము 7,002 కోట్ల రెనిమిన్‌బి (యువాన్) లు. ప్రభుత్వము దేశీయముగ గాని, విదేశీయముగగాని చెల్లించవలసిన ఋణములను అన్నింటిని చెల్లించి వేసినది (1969). దేశమున బ్యాంకింగ్ నిర్వహణ ప్రభుత్వమునకు చెందిన ప్రజాబ్యాంకు అధీనమున ఉన్నది; ఆ బ్యాంకునకు చెందిన 34,000 శాఖా కార్యాలయములు దేశమున పనిచేయుచున్నవి.

**11.** సాంఘిక రంగము :- ప్రభుత్వోద్యోగములందును, ప్రభుత్వ నిర్వహితములగు సకల పరిశ్రమలందును పనిచేయువారికి అందరికిని సాంఘిక సంశ్రేయ కార్యక్రమము వలన భద్రత చేకూర్చబడుచున్నది. ఈ కార్యక్రమము వలన రోగమున, ప్రమాదమున, జీవనవసతియు, వైద్య సహాయమును ప్రతి వానికి లభించుచున్నవి; పెన్షనులు, మరణానంతరము సన్నిహితులకు ధన సహాయము, ప్రసూతికాలపు సహాయము కూడ లభించుచున్నవి. కమ్యూనుల విషయమున అచటి నిర్వాహక సంస్థలు సభ్యులలో అంగవికలులు, రోగబాధితులు అయిన వారికి నివాస, ఆహార వసతులను ఏర్పరచును; వృద్ధులకు ఆశ్రయములను కల్పించును.

1959 లో ప్రాథమిక విద్యాశాలలందు 9 కోట్లును, మాధ్యమిక, సాంకేతిక పాఠశాల లందు 129 లక్షలును విద్యార్థులు ఉండినటులను, 1965 లో ఉన్నత పాఠశాలలలో 150 లక్షల విద్యార్థులు ఉండినటులను తెలియవచ్చుచున్నది. సైన్సు అకాడమీకి చెందిన 20 రాష్ట్రీయశాఖలు పనిచేయు చున్నవి. ఉన్నత విజ్ఞాన సంస్థలలోనికి చేరగోరు విద్యార్థులు వ్యవసాయమున గాని, కర్మాగారమున గాని, 2-3 ఏండ్లు పనిచేసి యుండవలెను. ఉన్నత విద్యాబోధనకు 61 విశ్వవిద్యాలయములు; 271 ఇంజనీరింగు కళాశాలలు; 118 అటవీకృషి, వ్యవసాయ కళాశాలలు; 142 వైద్య కళాశాలలు ఉపకరించుచున్నవి (1961). దాదాపు 1,70,000 విద్యార్థులు 1962 లో పట్టభద్రులైరి. వీరిలో మూడవవంతు సాంకేతిక శాస్త్రములకు చెందిన వారు. పీకింగు, ముక్డెన్, షాంగే నగరములలో సుప్రసిద్ధ గ్రంథాలయములు కలవు; వీనిలో తొలుతటి దాని యందు దాదాపు 25 లక్షల గ్రంథములు కలవు. పీకింగ్‌లోని సామ్రాజ్య సౌధము, జాతీయ విప్లవ భవనము చెప్పదగిన మ్యూజియములను కలిగియున్నవి. పత్రికాప్రచురణ ప్రభుత్వాధీనమున ఉన్నది. జెన్ మిన్-జీహ్‌పో (ప్రజా పత్రిక), చీహ్-ఫాంగ్ చున్ పావ్ (విమోచన సైన్యము) అను దైనిక పత్రికలకు ఎక్కువ వ్యాప్తి కలదు; అందు తొలుతటి దాని పాఠకసంఖ్య 35 లక్షలు (1972).

ప్రభుత్వ ఆరోగ్యశాఖ ఆధ్వర్యవమున, ప్రాశ్చాత్య, చీనీయ వైద్యశాస్త్రముల సాయముతో, వైద్య సహాయము ప్రజలకు కల్పింపబడుచున్నది. దేశమునందలి వైద్యశాలలలో శయ్యా సంఖ్య 5,70,000 (1959). శిశు మరణసంఖ్యా చాల తగ్గి 1957 నాటికి 1000 మందికి 7.03 గ ఉండినది. చీనీయ సంప్రదాయపు వైద్యులు 4,70,000; పాశ్చాత్య సంప్రదాయపు వైద్యులు 80,000 కలరు (1958). వైద్యులలో 30-50% పల్లె సీమలందు పనిచేయునటుల ప్రభుత్వము చేయగలిగినది. వీరుగాక, మాధ్యమిక విద్యను పఠించి,

వైద్యమున సముచిత శిక్షణ పొందిన కృషిక యువకులు 'కాలినడక వైద్యులు' అను పేరున పల్లె సీమలందు చరించుచు ప్రజలకు సాయపడు చున్నారు.

**12. యాత్రా సౌ.:** విదేశీయుల యాత్రలు ప్రభుత్వ వ్యవస్థద్వారా మాత్రమే నిర్వహింపబడ వలెను. ప్రభుత్వము అందులకు తగిన ఏర్పాటు లను చేసినది. 1964 లో 2,000 కు పైగా విదేశీయులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు.:** అతి ప్రాచీన చరిత్ర కలిగిన ఈ దేశమున మహాపురుషులు ఎందరో జన్మించిరి. అందు అంతర్జాతీయ ప్రశస్తి పొందిన కొందరి పేరులు ఈ దిగువ ఈయబడినవి.

1. కన్‌ఫూషియస్ (551-479 క్రీ. పూ.): ఇతని అచ్చపు చీనీయ నామము కుంగ్ ఫూ జూ. ఈతడు ప్రబోధించిన భావ పరంపర చీనీయ సంస్కృతికి, సాంఘిక వ్యవస్థకు, ఆలంబనముగ ఆధునిక కాలముపరకు నిలువగలిగినది. నేటి కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఈతని వాదములను నిరసించుచున్నది.

2. లావో జూ (ర. 604 క్రీ. పూ.): తావో మత సంస్థాపకుడు.

3. మెన్షియస్ (మెన్‌గ్ - జూ; 385-289 క్రీ. పూ.): సచ్ఛీలత మానవ సహజమనియు, దుష్పరిపాలకుని ప్రజలు తొలగించవచ్చుననియు వాదించిన తత్వవేత్త.

4. మో తీ (ర. 465-390 క్రీ. పూ.): విశ్వ మానవ ప్రేమను బోధించిన విజ్ఞాని.

5. చూ యువాన్ (340-278 క్రీ. పూ.). లీ సావ్ అను ఇతని కావ్యము విశ్వ ప్రశస్తిని ఆర్జించినది.

6. స్సూ-మా చీన్ (145-87 క్రీ. పూ.). చీనీయ చరిత్రను తొలుతగ రచించినవాడు.

7. చాన్‌గ్ హెంగ్ (క్రీ. శ. 78-139). భూకంప యంత్రమును తొలుతగ నిర్మించిన ఖగోళవేత్త.

8. చాంగ్ చుంగ్‌చింగ్ (క్రీ. శ. 152-219). సుప్రసిద్ధ వైద్యుడు.

9. చూ చుంగ్ - చిహ్ (క్రీ. శ. 429-500). వృత్తమునకును, తన్మధ్య రేఖకునుగల సంబంధమును అనగా $\pi$ అను దానిని 3.14159265 గ నిర్ణయించిన గణిత శాస్త్రవేత్త.

10. లూ - సిన్ (క్రీ. శ. 1881-1936). ఆధునిక సుప్రసిద్ధ కవి.

11. ఆధునికులలో తొట్టతొలుతగ పేర్కొన బడవలసినవాడు సన్‌యత్ సేన్ (క్రీ. శ. 1867-1925). చీనాలో ప్రజాస్వామ్య వ్యవస్థను నెలకొలుపు కృషిని తొలుతగ బయలుదేరదీసి, సమకాలిక చీనీయ యువకలోకముపై తన ప్రభావమును నెరపినవాడు.

12. ఆధునికులలో ప్రపంచ ప్రఖ్యాతినిపొందిన చీనీయ రాజ్య తంత్రవేత్త మావ్ చీ - తుంగ్ (జ. 1893). చీనీయ కమ్యూనిస్ట్ విప్లవమును తీర్చిదిద్దిన ప్రజ్ఞాశాలి. 80 ఏండ్ల వయసునకు పైబడియు దేశపు రాజకీయ భవితవ్యమును రూపొందించుటలో, దేశ ప్రజలకు మార్గదర్శకుడుగ ఉన్నాడు.

---

# 13. జపాన్ (నిప్పాన్)

**ముఖ్యనగరము :** టోకియో; **జెండా :** సూర్య పతాకమను పేరున ప్రసిద్ధిచెందిన ఈ పతాకమున తెల్లని భూమికపై ఎర్రని వృత్తము కలదు; **జాతీయ గీతము :** కిమి గాయో (మా సార్వభౌముని పరిపాలన); **నాణెము :** యెన్; 100 సేనులుగ ఇది విభక్తము; 360 యెన్‌లు = రూ. 7.50; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.




పటము 13.

**1. ఉనికి. మొ :** జపాన్ ద్వీప సమూహ రాజ్యము, ఆసియా ఖండమునకు తూర్పుటంచున కొలది దూరమున, పసిఫిక్ మహా సముద్రమున ఒక వృత్తరేఖవలె ఈశాన్యమునుండి నైరుతికి వంక దీరి 45°30′ – 30°20′ ఉత్తర అక్షాంశ రేఖల మధ్య 2,240 కిమీ. పొడవున ఉన్నది. ఈ ద్వీపములు కుదురుకొనిఉన్న ఈ విశాల ప్రాంతమునకు ఉత్తరమున ఓకటస్క్ సముద్రము; తూర్పు, దక్షిణములందు పసిఫిక్ మహా సముద్రము, పశ్చిమమున జపాను సముద్రము; నైరుతిని తూర్పు చీనా సముద్రము కలవు. ఈ ద్వీపరాజ్యమున చేరియున్న పలుదీవుల మొత్తపు వైశాల్యము 3,77,384 చ. కిమీ. అందు ముఖ్యమైనవి నాలుగు ద్వీపములు. 1. హొక్కయిడో (78,513 చ.కిమీ.) 2. హోన్‌షూ (2,30,722 చ. కిమీ.), 3. షికోకూ (18,772 చ. కిమీ.), 4. క్యూషూ (41,993 చ. కిమీ.).

ఈ ద్వీపమాలయొక్క భూతలరీతి అతి సంక్లిష్టము. భూతత్త్వ శాస్త్రజ్ఞులు, ఆగ్నేయాసియా మొదలుగ, జపాను, అల్యూషియన్ దీవులద్వారా,

యు. స్టే. లోని అలాస్కా వరకు వ్యాపించియున్న 'పసిఫిక్ చంక్రమణ పర్వతోత్పాదక మండలము'న ఈ జపాన్ ద్వీపమాల ఒక భాగమని నిర్ణయించిరి. వీని ఉత్పత్తి ఇట్టిదగుటవలన, ఈ ద్వీపముల తీరరేఖలు పర్వత మయములై, తత్ఫలితముగ చక్కని నౌకాశ్రయములకు వసతులు ఏర్పడినవి; ఆ పర్వతములను ఆశ్రయించి అసంఖ్యాకములగు లోయలును, అతి వేగముగ ప్రవహించు నదులును, స్వచ్ఛజల పూరితములగు సరస్సులును రూపొందినవి. ఈ దేశపు మొత్తపు భూతలమున 80% వైశాల్యము పర్వతావరితమని చెప్పవచ్చును. ఈ పర్వతములలో 580 కి పైగా, 2,000 మీ. ఎత్తునకు పైబడి ఉన్నవి. వీని అన్నింట అత్యున్నతమగు ఫూజీ పర్వతపు ఎత్తు 3,776 మీ; భూమిపైనుండి ఒక చక్కని శంకువు వలె సౌష్ఠవ రీతిలో రూపుగొని ఉన్నది ఈ పర్వతము.

ఫూజీ పర్వతము సుప్తావస్థలోఉన్న ఒక అగ్ని పర్వతము; 1707 లో ఇది ఒకసారి విజృంభించినది. మొత్తముమీద జపాను దీవులందు అన్నింట కలసి 196 అగ్నిపర్వతములు ఉన్నవి; వీనిలో 30 ఈనాడును నిప్పులను క్రక్కుచునే ఉన్నవి. ఈ అగ్నిపర్వతముల వలననే దేశమున అటనట వేడినీటి ఊటబావులు ఉండుటయు, ఆ ప్రాంతములందు జనానీకము అంతటంతట విశ్రాంతి కొరకు చేరి కొంతకాలము హాయిగ గడపుటకును అవకాశములు లభించినవి.

భూగర్భ శాస్త్రజ్ఞుల అభిప్రాయమును అనుసరించి, ఈ అగ్నిపర్వతముల ఉనికివలన, జపాను భూతలము సన్నిహిత భూతకాలమున రూపుగొని యుండినదనియు, తక్కిన దేశముల భూతలముల వయస్సుతో పోల్చినపుడు ఈ దేశపు భూతలపు వయసు చాల తక్కువ అనియు, అందువలన భూతలము స్థిరముగ కుదురుకొనుటకు లోపుగ, కొన్ని వికృతులను పొందవలసి ఉన్నదనియు తెలుచున్నది. అట్టి వికృతులు భూగర్భమున సాగుచున్నందువలననే నేల తిమ్మిరులు అంతటంతట దేశమున అనుభవవేద్యము లగుచుండును. జపానీయ ప్రజలు ఇట్టివానికి అలవాటు పడుటవలన వానిని అంతగ లక్ష్యపెట్టరు; కాని ఇట్టి నేలతిమ్మిరియే ఒక్కొక్కప్పుడు భూకంపముగ పరిణమించి నష్ట సంజనకము అగుచుండును. ప్రపంచమున తెలియవచ్చినంతవరకు భూకంపములందెల్ల అత్యంత నష్టదాయకమైనది జపానున 1923 లో సంఘటిల్లినది. ఆ సమయమున టోకియో - యోకహామా ప్రాంతము సర్వనాశనమై, 40,000 కు పైగా జననష్టమైనది.

దేశమున మైదానపు భూమి చాల తక్కువ. ఆ మైదానములు, చాలవరకు, తీరప్రాంతములందే కనవచ్చుచున్నవి. వానిలోనెల్ల పెద్దది కాంటో మైదానము. టోకియో అఖాతమును ఆశ్రయించి యున్న ఈ మైదానపు వైశాల్యము 6,475 చ. కిమీ. చదునగు ప్రాంతము తక్కువగుటవలన, జనసాంద్రతయు చాల ఎక్కువగ ఉన్నది; తమ సంఖ్యకు తగినంతగ తావు తమకు లేదని జపానీయుల అభిప్రాయము.

నదుల పొడవు చాల తక్కువ; వేగము అధికము. ఉన్న నదులలో పొడవైన నది షినానోగవా (366 కిమీ.); హోన్షూ ద్వీపమున ఉత్తర-మధ్యప్రాంతమున ప్రవహించి ఈ నది సముద్రమున చేరుచున్నది. సరస్సులలోకెల్ల అతి విస్తృతమైనది బీవా; క్యోటోనగర సమీపమున ఉన్న ఈ సరస్సు వైశాల్యము 673. చ. కిమీ. హొక్కయిడో దీవిలోని అకాన్ జాతీయవనమున నెలకొని ఉన్న మన్షూ సరస్సు జలస్వచ్ఛతకు ప్రపంచమంతట పేరొందినది. నీటి ఉపరి

తలమునకు 41 మీ. దిగువ ఉన్న వస్తువుకూడ పైనుండి చూచువారికి ఇందు కానవచ్చుచున్నది.

**2 శీతోష్ణస్థితి మొ.:** సమశీతోష్ణ మండలమున ఋతుపవన ప్రాంతపు ఈశాన్యపు మూలన కుదురుకొని ఉన్న ఈ దేశపు శీతోష్ణస్థితి చాల వరకు సౌమ్యమని చెప్పవచ్చును. శీతకాలమున, ఆసియా భూభాగమునుండి వచ్చు వేడిగాడ్పుల స్రవంతులును, ఎండకాలమున పసిఫిక్ మహా సాగరమునందలి వాయుస్రవంతులును, ఈ దేశపు శీతోష్ణస్థితిపై ప్రభావమును నెరపుచున్నవి. దేశమున నాలుగు ఋతువులు–గ్రీష్మ, శీత, హేమంత, వసంతములు – విస్పష్ట క్రమరీతిలో ప్రవర్తించును. ఎండకాలము జులై మధ్యన మొదలిడును. ఆ ఋతువున వెచ్చదనము ఎక్కువ యైనను, గాలిలో చెమ్మదనము ఎక్కువ. సాలున సరాసరి ఉష్ణోగ్రత దక్షిణ ద్వీపములందు 61°ఫా.; ఉత్తర ద్వీపములందు అది 48° ఫా. ఎండకాలము మొదలిడుటకు ముందుగ దాదాపు ఒక నెలవరకు వర్షములు కురియును. ఆ కాలమున అంతటంతట తుఫానుల బాధయును ఉండును. సాలున మొత్తపు వర్షపాతము 100 నుండి 250 సెం. మీ. వరకు ప్రాంతములను అనుసరించి మారుచున్నది. హొక్కయిడోలో తప్ప తక్కిన దేశమున శీతకాలము బాధాసంజనకముగ ఉండదు; ఆ కాలమున సైతము పలుదినములందు సూర్యకాంతి తగినంతగ ఉండును హొక్కయిడోలో మాత్రము శీతకాలము దీర్ఘతరము; హిమపాతమును విరివిగ ఉండును. తక్కిన దేశమున కొన్ని పర్వతప్రాంతములందలి ఉన్నత భాగములు మంచుచేత, శీతకాలమున కప్పబడును. శీతకాలపు క్రీడా వినోదములకొరకు ఇట్టి తావులు చక్కగ ఉపకరించుచున్నవి

శీతోష్ణస్థితిలోని మార్పులను అనుసరించి వృక్ష, జంతు సంతతులును, ఆయా ప్రాంతములను బట్టి మారుచున్నవి. హొక్కయిడోలో ఉన్నత ప్రాంతములందు సూచ్యగ్రజాతి వృక్షములును, తక్కిన ప్రాంతములందు ఓకు జాతి వృక్షములును కన నగును. హోన్‌షూ దీవి యందు సమశీతోష్ణ మండలపు వృక్ష సంతతి కననగును. షికోకూ, క్యూషూ దీవులు నిత్యశ్యామలపు అడవులకును, సస్యసంపదకును పేరొందినవి; అట చెరకు, అరటి, నిమ్మ జాతి ఫలములు సాగగును; ఎల్లెడల వెదురు పొదల కదుపులు కనబడును. దాదాపు 140 రకముల జంతు సంతతులు దేశమున కలవు; వీనిలో నెల్ల పెద్దది ధూసరపు భల్లూకము; 'మకాకి' అను చిన్నజాతి వానరము ఈ దేశమున మాత్రమే కాననగుచున్నది. 450 పక్షిజాతులును, 30 రకముల గౌళిజాతులును కలవని తద్‌జ్ఞుల లెక్క.

**3. జనసంఖ్య మొ.:** 1970 లో సేకరింపబడిన లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 10,37,20,060. ఇందులో విదేశీయులు–అమెరికన్లు 19,199; బ్రిటిష్ 3,107; జర్మనులు 2,668; కెనడియనులు 1,578; కొరియనులు 6,22,690; చీనీయులు 52,333 చేరిఉన్నారు. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 280; జనసాంద్రత లెక్కలో ప్రపంచమున ఈ దేశము మూడవ స్థానము కలిగి యున్నది; అయినను సాగున ఉన్న నేలను మాత్రమే లెక్కకు తీసికొనిన యెడల ఈ దేశపుదే అగ్రస్థానము. జపానీయులు పలువురు విదేశములలో నివసించుచున్నారు. వీరి మొత్తపు సంఖ్య 12.1 లక్షలు (1966). అందు బ్రెజిల్ 5,95,053; యు స్టే 4,64,332; కెనడా 29,157; ఆర్జెంటీనా 19,200; బొలీవియా 8,100 జపానీ ప్రజలను కలిగిఉన్నవి. హొక్కయిడోలో జనసాంద్రత చాల తక్కువ; హోన్‌షూ దీవిలో జన సాంద్రత అత్యధికము. దేశమున నగరముల సంఖ్య 565; వీనిలో లక్షకు మించిన జనసంఖ్య కలవి 131. అన్నింట జనసంఖ్యాబలమును అనుసరించి టోకియో (8,841 వేలు); ఒసాకా (2,980 వేలు);

యోకహామా (2,235 వేలు); నగోయా (2,036 వేలు); క్యోటో 1,418 వేలు పేర్కొనదగినవి.

ఆసియానుండి అంతటంతట వచ్చి దేశమున చేరిన వివిధ మానవజాతి వర్గముల కలయిక వలన జపానీయ జాతి రూపొందియుండునని పండితుల అభిప్రాయము. రూపరేఖను అనుసరించి మంగోలియన్ వర్గమునకు జపానీయులు సన్నిహితులు. క్రీ. శ. 2 లేదా 3వ శతాబ్దములందు ఆసియా నుండి చేరిన 'యమాటో' తెగ, నారా ప్రాంతమున తొలుత రాజరికమును నెలకొలిపి, క్రమముగ తక్కిన ప్రాంతములకు ఎగబ్రాకి, అచటి తత్పూర్వపు జాతులతో మేళనము చెందినదని కొందరి భావము. ఇండోనేసియా మొదలగు దూరప్రదేశముల నుండియు ప్రాచీన కాలమున ప్రజ లిటకు వలస వచ్చిరనుటకు నిదర్శములు కలవు. కాని హొక్కయిడోలో ప్రత్యేక ప్రాంతమున వసించు 'అయినూ' అను ఒక ఆదిమజాతి, జపానీయ జాతికన్న విభిన్నమని తెలియవచ్చుచున్నది; వీరియందు ఆర్యజాతి లక్షణములు కన్పట్టును. వీరే జపాను దేశపు అతి ప్రాచీన వాసులని కొందరనుచున్నను, ఇందు ఏకాభిప్రాయము కన్పట్టదు.

మలయో-పొలినీసియన్ భాషా వర్గపు ఛాయలు కొన్ని జపానీయ భాషయందు కన్పట్టుట నిజమే యైనను, జపానీయభాషను దానితో ముడివెట్టక దానిని ఒక ప్రత్యేక విశిష్ట భాషగ పరిగణించుటయే సముచితమని భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయము. విజ్ఞాన శాస్త్రీయ బోధనకు ఉపయోగించు పదములు తక్కువగనే ఉన్నను, తక్క విధముల ఈ భాష సుసంపన్నము. జపానీయ భాష తొలుత చీనీయ చిత్రలిపిలో వ్రాయబడెడిది; కాని వ్యాకరణపు మార్పులు అవసరమగునెడల వాడుటకై కతాగణ, హిరగణ అను రెండు రీతుల అక్షరములను వారు తరువాత రూపొందించిరి; ప్రస్తుతమున ఈ మూడు విధముల లిపులను కలిసికట్టుగ జపానీయులు వాడుచున్నారు. క్రమముగ చిత్రలిపి సంకేతముల సంఖ్యను తగ్గించి లిఖిత భాషను ఎక్కువగ సుగమము చేయుటకై కృషి జరుగుచున్నది. ఆ కృషిలో అంతర్భాగముగ ప్రభుత్వమే 1850 చిత్రలిపి అక్షరములను ప్రకటించి వానిని మాత్రమే ప్రభుత్వ వ్యవహారములందు ఉపయోగింపవలెనని ఉత్తరువు చేసినది. వార్తా ప్రతికలును ఈ అక్షరముల పట్టికనే అనుసరించుచున్నవి. విజ్ఞాన శాస్త్రీయ, సాంకేతిక పదములను యూరపీయ భాషలనుండి యథాతథముగ గ్రహించి, వానిని కతాగణ అక్షరమాల ద్వారా వ్రాయుదురు

దేశమున షింటో, బౌద్ధ, క్రైస్తవ మతములు ప్రజలందు ప్రచారమున ఉన్నవి. షింటో అనునది తొలుత ప్రకృతి దేవతారాధనలో రూపొంది, చీనా నుండి వచ్చిన కన్ఫ్యూషియస్ వాదముచే ప్రభావితమై, పితృదేవతారాధనను, పూర్వ సార్వభౌముల ఆరాధనను ముఖ్యాంగములుగ గ్రహించి, 1868 నుండి పాలకుల ప్రోత్సాహముతో జాతీయ మతముగ పరిగణనపొంది, జాపనీయులందరు షింటో ఆరాధనకు బద్ధులై యుండవలెనను స్థితికి చేరుకొనినది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధమున జపానుదేశము పరాజితమైన తరువాత ఇందలి సార్వభౌమారాధన మొదలగునవి తొలగింపబడి, అదియును తక్కిన మతములవలెనే వ్యక్తి అభిరుచిని అనుసరించి ఆదరించదగునదిగ లెక్కకు వచ్చినది. బౌద్ధము క్రీ. శ. 552లో చీనా, కొరియాలద్వారా జపానుదేశమున చేరి దేశమున అత్యధిక ప్రజానీకపు ఆదరణమును పొందినది. దేశమున షింటో, బౌద్ధమతములు రెండును ఇటుల ఆదరణీయములగుటవలన ఒకే వ్యక్తి తాను షింటో వాదిననియు, బౌద్ధుడననియు చెప్పుకొనుట సంభవించుచున్నది. తత్ఫలితముగ 1970 లెక్కలలో 833 లక్షల షింటో అనుయాయులును, 849

లక్షల బౌద్ధులును ఉన్నటుల లెక్క తెలిసెను. దేశమున క్రైస్తవుల సంఖ్య 8,04,339. దేశమున మత స్వాతంత్ర్యము రాజ్యాంగ విధానమున ఆమోదితమైనది.

**4. సమాచార సౌ. :** జపాను దేశమునందలి తపాలా ఆఫీసుల సంఖ్య 19,726; తపాలాఫీసులందు, తంతి టెలిఫోన్ సౌకర్యములు కలవు; దేశపు మొత్తమున 1.82 కోట్ల టెలిఫోనులు కలవు (1967) రేడియో ప్రసారములును, టెలివిజన్ ప్రసారములును, ప్రభుత్వాధ్వర్యమున మాత్రమే గాక, కొన్నియెడల ప్రయివేటు యాజమాన్యముననను నిర్వహింపబడుచున్నవి. దేశపు మొత్తమున 501 రేడియో స్టేషనులును, 1,758 టెలివిజన్ కేంద్రములును పనిచేయుచున్నవి; టెలివిజన్‌లో ప్రసారమంతయు వర్ణ చిత్రములలో నిర్వహింపబడుచున్నది.

**5. యాన సౌ. :** దేశము దాదాపుగ పర్వతమయమైనను యాన సౌకర్యములు విరివిగ ఏర్పడి ఉన్నవి. జాతీయ ప్రభుత్వమును, మండల పరిషత్తులును నిర్వహించు రోడ్ల మొత్తపు నిడివి దాదాపు 960 వేల కిమీ; ఇందు 272 వందల కిమీ. కాంక్రీటు వేయబడినది. అతిప్రముఖములగు రోడ్లు ఒసాకా కేంద్రముగ విస్తరించి ఉన్నవి; రోడ్డు మార్గములను ఇంకను విస్తరించుటకు ప్రణాళిక (1970-75) ను అనుసరించి కృషి జరుగుచున్నది. టోకియో, ఒసాకా, నగోయా, కోబేనగరములలో, నేలపైన ప్రయాణపు ఇబ్బందిని తగ్గించుటకై, నేలదిగువ సొరంగపు మార్గములు ఏర్పడి ఉన్నవి. టోకియో నగరమందలి ఇట్టి సొరంగపు మార్గముల మొత్తపు నిడివి 277.8 కిమీ (1975).

ప్రభుత్వాధ్వర్యమున పనిచేయు జాతీయ రైల్వే సంస్థకు చెందిన రైలుమార్గముల నిడివి 20,987 కిమీ; ప్రయివేట్ సంస్థలు నిర్వహించెడు స్థానిక రైలుమార్గముల పొడవు 6,5?3 కిమీ; (1969). ప్రపంచమునందు అత్యంత వేగముగ రైలుబండ్ల ప్రయాణములను నిర్వహించుటలో జపానీయ జాతీయ రైల్వేసంస్థ పేరొందినది. టోకియో నుండి ఒసాకాకు పోవు ఎక్స్‌ప్రెస్‌రైలు 3గం.10ని లలో 515 కిమీ. దూరము పయనించుచున్నది. ఒక్కొక్కపుడు ఇట్టి వర్గమునకు చెందిన బండ్లు గంటకు 210 కిమీ. వేల వేగమున కూడ పయనించుట కలదు. హోన్‌షూ దీవిలోని ఒసాకా నుండి, క్యూషూ దీవిలోని హకాటాకు రైలుమార్గమును పొడిగించుపని అములున ఉన్నది. ఇది పూర్తియైనపుడు టోకియోనుండి హకాటాకు (1,069 కిమీ.) 6 గం. 10 ని. లలో ఎక్స్‌ప్రెస్ బండ్లు పయనింపగలవు.

జపాన్ దేశపు వర్తక నౌకాదళము, యుద్ధమునకు పూర్వమున, సంఖ్యాబలమున ప్రపంచ దేశములలో మూడవ స్థానమును ఆక్రమించినది; కాని యుద్ధమున విరివిగ నష్టములకు లోనై, 1946 నాటికి సముద్రయాన సమర్థములగు ప్రయాణ నౌకలు 17 మాత్రమే మిగిలినవి. కాని తరువాత ప్రభుత్వము, ప్రజల సహకారముతో సాగించిన పునర్నిర్మాణ కృషి ఫలితముగ, వర్తక నౌకాదళము, సంఖ్యాబలమున, ప్రపంచ రాజ్యములలో రెండవస్థానమును ఆక్రమించినది. అయినను దేశపు ఎగుమతి, దిగుమతి వ్యాపారము విపరీతముగ పెరుగుటవలన దేశీయ వర్తక నౌకలు ఎగుమతి వ్యాపారమున 37.4%, దిగుమతి వ్యాపారమున 47% వరకు మాత్రమే నిర్వహించు చున్నవి. తక్కిన ఎగుమతి దిగుమతి వ్యాపారమున విదేశీయ వర్తక నౌకలు పాల్గొనుచున్నవి (1968). దేశపు మొత్తపు వర్తకనౌకల సంఖ్య 8,434 (1970); ఇందు 100 టన్నుల ప్రమాణమునకు తగ్గని నౌకలు మాత్రమే చేరి ఉన్నవి; అన్నింటి మొత్తపు

టన్నేజి 2,66,47,000 టన్నులు; వీనిలో ప్రయాణిక నౌకలు 551 (3,98,000 టన్నులు), సరుకు నౌకలు 5619 (1,59,49,000 టన్నులు), నూనెనౌకలు 2,264 (1.03 కోట్ల టన్నులు) చేరి ఉన్నవి. దేశమున పెక్కు రేవులును, హార్బరులును కలవు; వాని అన్నింట కిటక్యూషూ, కీవాన్ హార్బరులు ప్రముఖములు; ఇందు రెండవది టోకియో, యోకహామా ప్రాంతములు రెండింటికి ఉపకరించుచున్నది.

జాపనీయ విమానయాన సంస్థ (జాల్) దేశీయ, విదేశీయ విమానయానమున అత్యధికాంశమును నిర్వహించుచున్నది. టోకియో లోను, ఒసాకా లోను అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. జపానునుండి యు. స్టే, యూరప్, పశ్చిమ ఆసియా, ఆగ్నేయ ఆసియాలకు విమానయాన సౌకర్యములు కలవు. టోక్యోనుండి ఉత్తరధ్రువము మీదుగా లండనునకు నిర్వహింపబడు విమాన యానము ఈ లెక్కలో చేరినదియే.

**6. చరిత్ర :** జపాను దేశపు ప్రామాణిక చరిత్ర క్రీ. శ. 3, 4 శతాబ్దములలో యమాతో జాతివారు తక్కిన యోధజాతులను లోగొని దేశమున ఆధిపత్యమును నెలకొల్పుటతో ఆరంభ మయ్యెనని, చారిత్రకుల అభిప్రాయము. ఆ 'యమాతో' జాతికి తొలుతగ ఆధిపత్యమును చేకూర్చిన ప్రముఖుని రాజసంతతికి చెందినవాడే నేటి జపానీయ సార్వభౌముడని జపాను దేశీయుల అభిప్రాయము.

క్రీ. శ. నాలుగవ శతాబ్దిలో కొరియాదేశముతో జపానునకు పరిచయము ఏర్పడినది. అప్పటికే, హాన్ రాజవంశపు కాలమున, చీనాలో సర్వతో ముఖ వికసనము పొందిన కళాకౌశలములు కొరియాద్వారా జపానునకు లభించినవి. చీనీయ చిత్రలిపినికూడ జపాను, అంతట, స్వీయము చేసికొని తమ్మూలమున చీనీయుల గణిత, ఖగోళ, వైద్యశాస్త్రములను, కన్‌ఫూషియస్ సంప్రదాయ మును గ్రహించినది. ఆ విధముగనే తదనంత రమున చీనా, కొరియాల ద్వారా మహాయాన బౌద్ధమతమును జపానున క్రీ. శ. 538 లో కాలిడి త్వరలో దేశమున వ్యాపించినది. చీనీయ ప్రభుత్వ విధానమునే జపానీయ పాలకులును గ్రహించిరి. అంతవరకు రాజధానిగ ఉండిన 'నారా'ను త్యజించి, చీనీయ రాజధానిని అనుక రించుచు క్యోటోనగరమును నిర్మించి దానిని తమ రాజధానిగ జపానీయ సార్వభౌముడు గ్రహించెను (794). తరువాత దాదాపు 1,000 ఏండ్లవరకు అదియే దేశరాజధానిగ ఉండినది.

క్రీ. శ. 794 నుండి 1192 వరకుగల కాలమున జపాను తాను స్వీకరించిన విదేశీయ కళా విజ్ఞా నములను స్వీయములుగ చేసికొనుటకు వానికి ఒక జాతీయ ప్రత్యేకతను సంతరించుటకు కృషి చేసినది. 9వ శతాబ్దమున చీనాతో సంబంధములు తెగిపోవుటయు ఇందులకు కొంత సహకరించినది. చీనీయ చిత్రలిపికి బదులుగ దేశీయములగు రెండు విధముల అక్షరమాలలు నిర్మింపబడుటయు, అచ్చపు జపానీయ సారస్వతము రూపొందుటయు ఈ కాలముననే జరిగినది. ఈ సమయముననే జపాను చరిత్రను వేరొక మలుపునకు త్రిప్పిన వేరొక సంఘటనయు జరిగినది. తాము పూర్వపు రాజవంశపు సంతతి వారమనియే చెప్పుకొను రెండు కుటుంబములు ప్రధాని (షోగను) పదవికై పోరాటములు సాగించినవి; కడకు 1195 లో మినమోతో కుటుంబము ఆ పోరాటమున నెగ్గి పదవిని వశపరచుకొని, రాజును నామమాత్ర ముగ అధికారమున ఉంచి పరిపాలనను సాగించి నది. ఆ కుటుంబ నాయకునియందే, వంశాను క్రమమున షోగను పదవిఉండు ఏర్పాటు జరిగి నది. తరువాత అంతటంతట పోరాటముల వలన

ఈ పదవి చేతులుమారి పలువంశములకు క్రమముగ సంక్రమించినది. అయినను ఈ కాలమందంతట, ఒక అయిదు సంవత్సరముల కాలము (1333-1338) మాత్రమే రాజరికము అధికారమును స్వీయము చేసికొనగలిగినది. తక్కిన కాలమున అంతట (1192-1867) షోగనులే అధికారమును కలిగి, నామమాత్రముగ రాజును అధికారమున ఉంచి పరిపాలనను నిర్వహించిరి.

ఈ షోగనుల పరిపాలనా కాలమున 'బుషిడో' అను క్షాత్రధర్మమునకు ప్రభుత్వాదరణ లభించినది. కళా కౌశలములపై సైతము దానికే పలుకుబడి లభించినది. సైనిక శిక్షణకు ప్రముఖత చేకూరినది. చీనాపాలకుడగు కుబ్లయ్ ఖాన్ 1274 లోను 1281 లోను ఈ దేశమును జయించుటకు నావిక బలమును పంపి విఫలుడయ్యెను. ఆ సమయమున తుఫానులు అతని నౌకాదళమును నాశనము చేసినవి: మిగిన చీనీయ యోధులను నిర్మూలించుటలో జపాను సేనలును కొంత పాల్గొనినవి. షోగను పదవిని స్వీకరించిన వంశములలో కడపటిది తోకుగావా వంశము (1603-1867). ఈ వంశపు తొలుతటి షోగనుల కాలమున పోర్చుగీజు నావికులును, మత బోధకులును దేశమున కాలిడిరి (1543); వీరి వలననే తుపాకులతో పరిచయము జపానువారికి కలిగినది. తరువాత స్పానిష్, డచ్చి, బ్రిటిష్ వర్తకులును అట కొలదిగ చేరిరి. ఈ విదేశీయులు సాగించు క్రైస్తవ మతబోధ క్రమముగ రాజరికమునకును, జపానీయ సాంఘిక వ్యవస్థకును ముప్పు కలిగించునని భావించి, షోగనులు క్రైస్తవ మతబోధను నిషేధించి, విదేశీయులు దేశమున చొరకుండ నిషేధించిరి; అయినను డెజిమా అను చిన్న దీవియందు మాత్రము డచ్చి, చీనీయ వర్తకులు ఉండుటకు వారు ఆ సమయమున అనుమతించిరి (1614); జపానీయులు ఎవరును దేశమును విడచి పోరాదను శాసనమును కూడ ఆ సమయముననే ప్రభుత్వము అమలుపరచినది.

దాదాపు 250 సంవత్సరములు, బాహ్య ప్రపంచమునుండి వేరుపడి, జపాను దేశము పై రీతిగ ఉండినది. ఈ కాలమున సైతము డెజిమా దీవికి వచ్చిపోయెడి వారివలన పాశ్చాత్యులు - వైజ్ఞానిక, వైద్యశాస్త్రములందు - సాధించిన ప్రగతి జపానీయ పండితులకు కొంతవరకు తెలియ వచ్చినది; తత్ఫలితముగ బాహ్యప్రపంచముతో సంబంధము ఏర్పరచుకొనుట సముచితమని వారు ప్రభుత్వముపై ఒత్తిడి చేయసాగిరి. ఇందులకు తోడుగ చీనాకు పోవు నౌకలు, జపానులో ఒక మజిలీని నెలకొల్పుకొనుట సౌకర్యముగ ఉండునని యు. స్టే. భావించి, 'పెర్రీ' అను నావికసేనాని ఆధ్వర్యమున ఒక నౌకాదళమును పంపినది. ఆ నౌకా దళము, దేశీయ ప్రభుత్వపు ప్రతిఘటనను తిరస్కరించి, టోకియో అఖాతమున లంగరు వేసినది (1853). తరువాత 1854 లో యు.స్టే.తో ఒక సౌహార్దపు ఒడంబడికను జపాన్ ప్రభుత్వము కుదుర్చుకొని, క్రమముగ రష్యా, గ్రేటుబ్రిటన్, హాలండులతో కూడ, అట్టి ఒడంబడికలను ఆ సంవత్సరముననే కుదుర్చుకొనినది. తత్ఫలితముగ దేశమునకు విదేశీయులతోడను, వారి సాంఘిక వైజ్ఞానిక ప్రతిపత్తితోను పరిచయము కలిగి, దేశపు రాజకీయములపై ఆ ప్రభావము కన్పడ సాగినది. కడకు ప్రజల ఆందోళనకు లొంగి 1867 లో తోకుగావా వంశము షోగన్ పదవిని త్యజించగ, 'మీజీ' చక్రవర్తి సర్వాధికారములను వహించి, ప్రజామోదముతో, దేశమును అతి త్వరితగతిలో ఆధునికము చేయుటకు కృషిచేసెను.

1868-1912 వరకు సాగిన ఈ మీజీ ప్రభువు పాలనమున, దేశమున రాజ్యాంగబద్ధమగు రాచరికము నెలకొల్పబడినది. పాశ్చాత్యనాగరికతను,

విజ్ఞాన శాస్త్రమును దేశము స్వీయము చేసికొన గలిగినది. 1894-95 న సాగిన చీనా-జపాన్ యుద్ధమునకు, 1904-1905 న నడచిన రష్యో-జపాన్ యుద్ధమునను జపాను విజయములను ఆర్జించి, కొరియా, తైవాన్, రియుక్యూ దీవులను, దక్షిణ సఖాలిన్ దీవిని వశపరచుకొని, మంచూరియా యందు కొన్ని హక్కులను ఆర్జించగలిగినది.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున మిత్రరాజ్యముల పక్షమున జపాన్ పోరాడి, తత్ఫలితముగ శాంతి ఒడంబడిక కాలమున, పసిఫిక్ మహా సముద్రములోని కొన్ని దీవులపై ఆధిపత్యమును ఆర్జించి, ప్రముఖ ప్రపంచ రాజ్యములలో ఒకటిగ గణనకు రాగలిగినది. దేశము పారిశ్రామికముగ, ప్రముఖ పాశ్చాత్య రాజ్యములవలె, అభ్యుదయమును సాధించినది.

1930 లో ప్రపంచమును సంక్షుభితము చేసిన ఆర్థిక క్లిష్టత జపానున రాజకీయ పక్షముల ప్రాబల్యమును తగ్గించి, అధికారము సైనిక వర్గపు హస్తగతమగుటకు తోడ్పడినది. అంతట జపానునకు ఒక మహా సామ్రాజ్యమును సమకూర్చుటకు కృషి, 1931లో మంచూరియాను ఆక్రమించుటతో, మొదలైనది. 1933 లో నానాజాతి సమితి నుండి జపాను వైదొలగినది. 1936 లో జర్మనీ, ఇటలీలతో మైత్రిని కుదుర్చుకొని చీనా యందు దురాక్రమణకు జపాను పూనుకొని, రెండవ ప్రపంచ యుద్ధకాలమున అక్షరాజ్యముల పక్షమును అవలంబించి తూర్పు ఆసియా, ఆగ్నేయ ఆసియాలను, పసిఫిక్ దీవులను కొన్నింటిని ఆక్రమించినది. కాని కడకు యు. స్టే. జపాను దీవులపైననే వాయు మార్గమున దండయాత్రలను నిర్వహించి, హిరోషిమా, నాగసాకి నగరములపై అణుబాంబులను ప్రయోగించగ, జపాను దేశపు రాజరిక ప్రతిపత్తికి భంగము రానీయని షరతుతో, మిత్రసేనలకు జపాను సేనలు లొంగినవి (14 ఆగస్టు, 1945).

1945 మొదలుగ 1951 వరకు ప్రభుత్వము, దేశమును ఆక్రమించిన, యు. స్టే. సేనల అదుపు ఆజ్ఞలలో ఉండినది. 1951 లో కుదిరిన శాంతి ఒడంబడికను అనుసరించి 1952 ఏప్రిల్‌లో ఈ దేశము సర్వసత్తాక స్వతంత్రతను ఆర్జించి, తదాదిగ దేశ పునర్నిర్మాణ కృషిలో నిమగ్నమై ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవితముచేసి ప్రపంచ సుసంపన్న రాజ్యములలో ఒకటిగ ఈనాడు పేరొందినది.

**7. పరిపాలన:** 1946, నవంబరు 3 న ప్రకటితమై మరుసటి సంవత్సరపు నవంబరు 3 న అమలునకు వచ్చిన రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున అధికార సర్వసత్తాకత ప్రజల యందు న్యస్తమై ఉన్నది. రాజ్యపు ప్రభుతకును, ప్రజానీకపు ఐక్యతకును ప్రతీకముగ సార్వభౌముడు వ్యవహరించును. యుద్ధ ప్రయత్నములకును, దౌర్జన్యమార్గమున ఒక దేశము వేరొక దేశమును లొంగదీయు విధానమునకును ఈ రాజ్యాంగ విధానము స్వస్తి చెప్పినది.

శాసన నిర్మాణాధికారము పార్లమెంటు (డయట్) నందు కలదు. అందు లోకసభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. తొలుతటి దానిలోని సభ్య సంఖ్య 491; రెండవదానిలో సభ్యసంఖ్య 252. లోకసభకు సభ్యుల ఎన్నిక నాలుగేండ్లకు ఒకసారి జరుగును; కాని నాలుగేండ్లు ముగియక ముందే శాసనసభను రద్దుచేసి, ఎన్నికలు జరుపుటకు అవకాశము కలదు. ఈ దేశమునకే చెందిన ఓకినావా దీవితో కలిపిన మొత్తపు దేశము, ఈ ఎన్నికలకై 123 నియోజక వర్గములుగ విభక్తమైనది. వీనిలో ఒకటి తప్ప తక్కినవి అన్నియు అనేక సభ్య నియోజక వర్గములగుట వలన, ఆయా నియోజక వర్గపు విస్తృతి, జనసాంద్రతలను అనుసరించి 3 మొదలుగ 5 వరకు లోకసభాసభ్యులు అట ఎన్నుకొన బడుదురు. 20 ఏండ్ల వయసునకు

తగ్గని పౌరులకు అందరికిని వోటుహక్కు కలదు: శిష్ట సభకు జరుగు ఎన్నికల సందర్భమున దేశ మంతయు ఒకే ఒక నియోజక వర్గముగ సంభావితమై అందుండు వోటరులవలన 100 మంది శిష్ట సభా సభ్యులు ఎన్నుకొనబడుదురు. తక్కిన 152 మంది శిష్ట సభాసభ్యులను ఎన్నుకొనుటలో దేశము నందలి 46 మండలములును ఓకినావా దీవియు నియోజక వర్గములుగ వ్యవహరించు చున్నవి. శిష్టసభా సభ్యుల పదవీకాల పరిమితి 6 సంవత్సరములు; మూడేండ్లకు ఒకసారి శిష్టసభ లోని సగము మంది సభ్యుల ఎన్నిక జరుగు ఏర్పాటు కలదు

కార్యనిర్వహణాధికారము మంత్రివర్గమున న్యస్తము. ఈ మంత్రివర్గము తన విధినిర్వహణ మున పార్లమెంటునకు, సమష్టిగ బాధ్యత వహించి వర్తించును. ప్రధాని కాదగువాని పేరును పార్ల మెంటు అమోదించిన తరువాత అతడు అధికార మును గ్రహించి, తక్కిన మంత్రివర్గ సభ్యులను నియమించును; వారిని, అవసరమగు నెడల, తొలగించుటకును అతనికి అధికారము కలదు. లోక సభ అవిశ్వాసమును వెల్లడించునెడల ప్రధాని రాజీనామా చేయవలయును, లేదా 10 దినముల లోపల లోకసభను రద్దుచేసి తిరిగి ఎన్నికలు జరుపవలెను. ప్రధానియు, తక్కిన మంత్రులును పార్లమెంటున సభ్యులై ఉండవలెను. రాజ్యపు ఆయవ్యయములను సరిచూచి పర్యవేక్షించుటకు, ఒక గణక మండలి (ఆడిట్ బోర్డ్) స్వతంత్రాధి కార ప్రతిపత్తితో వ్యవహరించుచున్నది; దీనిపై మంత్రి వర్గమునకు ఎట్టి అధికారమును లేదు.

పరిపాలనకై దేశము 46 మండలములుగ విభక్తమైనది; టోకియో నగరమును ఒక మండల ముగ ఇందు లెక్కకు వచ్చుచున్నది. ఈ మండలము పాలకులను, ప్రతినిధుల సభలను మండలపు వోటర్లే ఎన్నుకొనెదరు. ప్రతినిధుల సభల సాయముతో పాలకుడు మండలమున స్థానిక పరిపాలన నిర్వహించును

దేశమునందలి రాజకీయ పక్షములలో మిత వాది-ప్రజా స్వామిక పక్షమునకు ఎక్కువ బలము కలదు; తరువాత లెక్కకు వచ్చునది సోషలిస్ట్ పార్టీ; కమ్యూనిస్ట్ పార్టీకి కొన్ని కార్మిక సంఘములందు కొంత పలుకుబడి కలదు; కాని దేశము మొత్తమున అది అల్పసంఖ్యాక పక్షముగ మాత్రమె లెక్కకు వచ్చుచున్నది.

న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. సుప్రీమ్ కోర్టు, 8 హైకోర్టులు, మండల న్యాయ స్థానములు ఈ శాఖకు చెందియున్నవి. సుప్రీమ్ కోర్టు నందలి ప్రముఖ న్యాయాధీశులను, మంత్రి వర్గపు సంహాతో సార్వభౌముడు నియమించును. తక్కిన న్యాయాధీశులను మంత్రి వర్గమే, అర్హులగు వారి పట్టికనుండి, నిర్ణయించి నియ మించును

**8. దేశరక్షణ :** 1950 వరకు దేశరక్షణ బాధ్యత, దేశమును అప్పటిలో ఆక్రమించిన, యు.స్టే. మొదలగు రాజ్యముల సేనలదిగ ఉండెను. కాని తదనంతరమున యు స్టే. తో కుదుర్చుకొనిన పరస్పర రక్షణ విధానమునకు అనుకూలముగ దేశరక్షణకే గాని, విదేశములపై దండయాత్రకు ఏ విధముగను అనువుపడని రీతిలో దేశపు సైనిక బలము క్రమశః నిర్మింపబడినది. 1972 లో భూతల దేశరక్షక సేనలో 1,79,000 యోధులు కలరు; వీరుగాక 36,000 మూలబలము కలదు. దేశరక్షక నావిక సేనయందు 44,000 మంది యోధులు కలరు; వాయుసేనయందు 41,000 సైనికులు కలరు. దేశరక్షణ మాత్రమే ఈ సేనకు ధ్యేయ మగుటవలన, భూతల సేనయందు ఒక యాంత్రిక దళము మాత్రమే కలదు; నావిక సేనకు 232

వివిధ నౌకలున్నను, వానిలో యుద్ధనౌక ఏదియు లేదు; డెస్ట్రాయరులు మాత్రమే కలవు. వాయుసేన యందు 970 విమానములున్నను, దూరమునకు పోగలుగు బాంబరు ఏదియులేదు. యు. స్టే. తో కుదిరిన రక్షణ ఒడంబడికను అనుసరించి, ఆ దేశపు సేనలు జపాను దేశమున కొన్ని స్థావరములందు, జపాను రక్షణకు సాయపడుటకై నిలిచి ఉన్నవి.

**9. అంతర్జాతీయ సం.** : 1956 వ సంవత్సరమున జపానునకు ఐ.రా.స. సభ్యత్వము లభించినది. తదనుబంధ ప్రత్యేక సంస్థలందు అన్నింట ఈ దేశము ఇపుడు సభ్యత్వము కలిగియున్నది. కొలంబో ప్రణాళిక యందును, ఆసియా అభివృద్ధి బాంకునను ఈ దేశమునకు సభ్యత్వము ఉన్నది. వర్ధమాన దేశములలో పెక్కింటికి ఆర్థిక, సాంకేతిక సహాయములు ఈ దేశము వలన లభించుచున్నవి. యు. స్టే. తో ఈ దేశమునకు అత్యంత సన్నిహిత సంబంధములు కలవు; యుద్ధకాలమున యు. స్టే. ఆక్రమించిన ఆమామీ ద్వీపములు 1953 లోను, బోనిన్ ద్వీపము 1967 లోను, ఒకినావా ద్వీపము 1972 లోను తిరిగి జపానునకు ఈయబడినవి. సోవియెట్ రష్యాతో ఇప్పటికి శాంతిసంధి కుదురలేదు; ఆ దేశము యుద్ధకాలమున ఆక్రమించిన ప్రాంతముల విషయమున కలిగిన అభిప్రాయ భేదములు ఇందులకు అవరోధములుగ ఉన్నవి; అయినను సోవియట్ రష్యాతో జపాను సౌహార్దముతో మెలగుచున్నది. తొలుత తైవాన్‌లోని చీనీయ ప్రభుత్వమును పరిగణించి దానితో శాంతి ఒడంబడికను ఈ రాజ్యము కుదుర్చుకొనినది. కాని 1974 లో ఐ. రా. స. సభ్యత్వము చీనీయ భూభాగపు కమ్యూనిష్టు ప్రభుత్వమునకు లభించిన తరువాత దానినే గుర్తించినది; అందులకు అనుగుణముగ శాంతిసంధిని కుదుర్చుకొనుటకును కృషిచేయుచున్నది.

**10. ఆర్థిక రంగము :** ఆసియా రాజ్యము లందెల్ల ఎక్కువ ఆర్థికాభివృద్ధిని సాధించిన రాజ్యముగ ఈ దేశము పేరుగన్నది. పారిశ్రామిక వ్యవస్థకు తగిన పట్టణవాస మధ్య తరగతి ఈ దేశమున ఎక్కువగా కలదు. కుటుంబనియంత్రణను కట్టుదిట్టముగ అవలంబించి జనసంఖ్యా అదుపులో ఉంచుకొనిన ఏకైక ఆసియా రాజ్యము ఈ దేశము.

దేశపు కార్మిక వర్గమున ఒక ముఖ్యాంశము ఈనాడును వ్యవసాయముననే పనిచేయుచున్నను, మొత్తము మీద దేశము పారిశ్రామిక వర్గమునకు చెందినదిగ లెక్కకు వచ్చుచున్నది. వ్యవసాయమున పనిచేయువారి శాతము క్రమశః క్షీణించుచున్నది. వ్యావసాయికులలో పలువురు అదనపు ఆదాయములకై తీరిక కాలమును పరిశ్రమలకు వినియోగించుచున్నారు.

దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి 58 లక్షల హెక్టేరులు. ఇందులో 29 లక్షల ఎకరము లందు, వరి పండింపబడుచున్నది తేయాకు, జనుము, మల్బరీ మొదలగు పారిశ్రామికపు పంటలు 2,56,500 హెక్టేరులలో సాగగుచున్నవి. శాస్త్రీయ విజ్ఞానమును ఉపయోగించి వ్యవసాయోత్పత్తులను పెంచుటయందు వ్యావసాయికులు కుశలతను పొంది యున్నారు. దేశావసరములకు మించి వరిపంట ఇపుడు సాగగుచున్నది. చక్కెరకై బీటుదుంప పండింపబడుచున్నను, దాని వలన ఉత్పత్తియగు చక్కెర దేశావసరములందు 20% కు మాత్రమే సరిపడుచున్నది; తక్కిన చక్కెరను విదేశముల నుండి - అందును ముఖ్యముగ క్యూబా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాలనుండి - దిగుమతి చేసికొనుచున్నది. వరిగాక తక్కిన ఆహారపు పంటలలో బార్లీ, గోధుమ, సోయా చిక్కుళ్లు, చిరుగడ దుంపలు, బంగాళా దుంపలు క్రమప్రాముఖ్యమును కలిగినవి. పండ్లతోటలును విరివిగ కలవు; అందు ఆపిల్,

మందారిన్ పండ్లు ఎక్కువగ ఉత్పత్తి అగు చున్నవి.

పశుసంపద పరివిగ కలదు; గోసంతతికి చెందిన పశుసంఖ్య 36.4 లక్షలు; పాలు దేశావసరములకు సరిపోవుచున్నది.

ప్రపంచమున చేపలను అధికముగ సేకరించు రాజ్యములలో పెరూదేశము తరువాత లెక్కకు వచ్చునది జపాన్. 1970 లో మొత్తపు మత్స్య సేకరణ 93 లక్షల మెట్రిక్ టన్నులు; అయితే సముద్ర మధ్యమున పట్టు చేపలును, తిమింగముల సేకరణమును ఈ లెక్కలలో చేరలేదు. 1970-71 లో 16,877 తిమింగిలములు పట్టువడినవి; వీనినుండి తీయబడిన తిమింగలపు నూనె 72,606 మెట్రిక్ టన్నులు.

ఖనిజములలో ఇమము, తుత్తునాగము, మాంగనీజు, అల్యూమినియం, రాగి క్రమముగ ప్రాముఖ్యమును కలిగి యున్నవి 1970 లో ఇనుము 8,62,000 టన్నులు; తుత్తునాగము 2,79,679 టన్నులు ఉత్పత్తి అయినవి. వెండి, బంగారము చాల కొద్ది మొత్తములలో లభించుచున్నవి. దేశావసరములకొరకై ముడి ఇనుప ఖనిజమును భారత దేశము మొదలగు వానినుండి జపాను దిగుమతి చేసికొనుచున్నది; హోన్‌షూదీవిలో ముడిపెట్రోలు కొలదిగ లభించుచున్నది; 1970 లో అచటి ఉత్పత్తి 8,99,179 కిలో మీటర్లు; దేశావసరములకు ఇది ఏ విధముగను సరిపోవదు; కావున అందులకై ఇతర దేశములపై ఈ దేశము ఆధారపడి ఉన్నది. 1970 లో ఇటుల దిగుమతి అయిన పెట్రోలియం 19.6 కోట్ల కిలో మీటర్లు; దేశమున ఇంధనవాయువు ఉత్పత్తి 24 లక్షల ఘ. మీటర్లు (1970).

దేశమున విద్యుదుత్పత్తి 35,95,380 లక్షల కివా (1970). దేశమున వేర్వేరు తీరుల పారిశ్రామిక యంత్రముల మొత్తపు సంఖ్య 6,45,928 (1969). ఇందలి పనివారి సంఖ్య 114 లక్షలు. భారీ యంత్ర పరిశ్రమలును సామాన్య వస్తూత్పాదక పరిశ్రమలును సమానాదరముతో పెంపొందింపబడుచున్నవి. 1970 మొదలుగ వైద్యుతిక పరికరములను, ఎలక్ట్రానిక యంత్రములను ఉత్పత్తి చేయుట ఎంతయో ముందంజ వేసినది. దేశపు పారిశ్రామిక ఉత్పత్తుల విలువల క్రమమున జవుళీ, ఇనుము, ఉక్కు వస్తువులు, రసాయనిక ద్రవ్యములు క్రమ ప్రాముఖ్యము కలిగి ఉన్నవి. ప్రపంచమునందలి నౌకానిర్మాణమున దాదాపు 50% నౌకలు ఈ దేశమున నిర్మింపబడు చున్నవి. ప్రపంచపు నూనె-నౌకలలో ఆయతనమున మిన్న యని పేరొందిన 'గ్లోబ్‌టిక్ టోక్యో' నౌక 1972 అక్టోబరులో ఈ దేశపు నౌకా నిర్మాణకేంద్రము నుండి వెలువడినది.

వివిధములగు మోటారు వాహనముల నిర్మాణమున యు. స్టే. తరువాత పేరొందిన ప్రముఖ రాజ్యము జపాన్. 1969 లో 47 లక్షల శకటముల ఉత్పత్తి జరిగినవి. ఆయా శకటముల వేర్వేరు యంత్ర భాగములను ఎగుమతి చేసి వానిని బిగ్గుగ కూర్చుటకు ఆగ్నేయ ఆసియా దేశములందును, దక్షిణ అమెరికా, ఆఫ్రికా దేశములందును వసతులను, ఈ దేశము సమకూర్చుకొనినది. రైలు ఇంజనులను, రైలు పెట్టెలును దేశమునందు ఉత్పత్తి అగు చున్నవి; దేశావసరములకుపోను తక్కినవి ఆసియా ఆఫ్రికా, దక్షిణ అమెరికాలలోని కొన్ని దేశములకు ఎగుమతి అగుచున్నవి.

విమాన పరిశ్రమయందును దేశము పురోభివృద్ధిని సాధించినది. ప్రస్తుతమున ప్రయాణికుల విమానములు, వ్యక్తులును వర్తకసంస్థలును ఉపయోగించు చిన్న విమానములు మాత్రమే దేశమున ఉత్పత్తి అగుచున్నవి. కొన్ని రకముల

ప్రయాణిక విమానములు అంతర్జాతీయముగ ఖ్యాతిని పొందినవి. అట్టివి విదేశములకు ఎగుమతి అగుచున్నవి. 1965–70 మధ్యకాలమున ఇట్టి విమానములు 183 ఎగుమతియైనవి.

పారిశ్రామికాభివృద్ధితో పాటుగ దేశమున బ్యాంకింగు విధానమును ఎంతో వృద్ధిచెందినది. దేశమంతట నియంత్రణాధికారము కలది జపాన్ కేంద్ర బ్యాంక్; తక్కిన బ్యాంకులు దీని పర్యవేక్షణకు లోబడి పనిచేయుచున్నవి.

దేశపు ఎగుమతుల విలువ 1,931.8 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 1,882.1 కోట్ల అ. డాలర్లు (1970).

దేశపు బడ్జెటరీ వ్యయము 9,41 431.5 కోట్ల యెన్నులు (1971–72).

**11. సాంఘిక రంగము :** దేశపు ప్రజానీకమున దాదాపు 70% పట్టణములలో నివసించుచున్నారు. వీరియందును 58% టోకియో, ఒసాకా, నగోయా నగరములందు కలరు. అందువల్ల ఇట్టి పట్టణములందు ప్రజలకు గృహవసతి సౌకర్యములను కల్పించుట ప్రభుత్వము తన విధిగ భావించి కృషి చేయుచున్నది. ద్వితీయ యుద్ధకాలమున నష్టములైన గృహముల పునర్నిర్మాణమునకు, స్థానిక సంస్థలద్వారా, ప్రభుత్వము చేసిన కృషి చాలవరకు గ్రామీణ ప్రాంతములందు సఫలమై ఈ సమస్య పరిష్కృతమైనను, పట్టణములందు మాత్రము ఈ సమస్య, అందరికిని సంతృప్తిని కలిగించు రీతిగ పరిష్కృతము కాకున్నది. 1969 లో ప్రభుత్వము జరిపిన ఒక సర్వేవలన 37% ప్రజలు తమకు గల గృహవసతి వలన సంతృప్తి చెందకున్నారని తెలియవచ్చుచున్నది. కావున 1989 నాటికి ఈ సమస్య చక్కగ పరిష్కరింపబడుటకు అనువుగ ప్రభుత్వము ఒక ప్రణాళికను తయారుచేసినది.

దేశపు జనసాంద్రత ఎక్కువయైనను, కుటుంబ నియంత్రణ కార్యక్రమములను చక్కగా అమలు పరచి, ప్రభుత్వము జనసంఖ్య పెంపుదలను నియమబద్ధము చేయగలిగినది. జనాభా పెంపుదల ప్రస్తుతమున సాలున 1.2% మాత్రమే. అందువలన ప్రణాళికా రీతిలో ప్రజల జీవనవ్యయ ప్రమాణమును పెంచుటకు ప్రభుత్వమునకు వసతి లభించినది దేశమున సామాన్య పౌరుని దైనికాహారము 2,454 కేలరీల పుష్టిని కలిగిఉన్నది.

యుద్ధానంతరమున సాంఘిక సంక్షేమ కార్యక్రమము అతి విస్తృతిని సాధించినది; ప్రభుత్వ సంస్థలేగాక కొన్ని మత సంస్థలును, పౌరసంస్థలును ఈ రంగమున కృషిని సాగించుచున్నవి. ఈ కార్యక్రమము వలన సాంఘిక భీమా, అవసరమగు పట్టుల ప్రభుత్వ సాహాయ్యము, వృద్ధులకు జీవన సౌకర్యము, అనాథ శిశురక్షణ, రోగబాధితులకు, వికలమనస్కులకు అంగవికలులకు కావలసిన సాహాయ్యము లభించుచున్నవి.

కార్మిక శ్రేయస్సునకై ప్రభుత్వము చట్టముల ద్వారా కృషిని సాగించుచున్నది. యుద్ధానంతరమున కార్మికోద్యమము చాల ముందంజ వేసినది. మొత్తము మీద 1,11,43,382 మంది సభ్యులుకల 58,812 కార్మిక యూనియనులు కలవు (1969 జూన్). నిరుద్యోగిత చాల తక్కువ; 1.1% మాత్రమే అచ్చపు నిరుద్యోగపు తరగతికి చెందినవారు (1969). నిరుద్యోగులకు ప్రభుత్వము భృతిని ఇచ్చుచున్నది.

6 నుండి 15 ఏండ్ల వయసుగలవారికి నిర్బంధ ఉచిత విద్యాబోధన వసతి దేశమున ఏర్పడి యున్నది. దేశమున శిశుశాలల, ప్రాథమిక విద్యాశాలల మొత్తము 35,486 లో 1,11,08,110 మంది; 11,040 మాధ్యమిక పాఠశాలలలో 47,16,833 మంది; 4,798 ఉన్నత పాఠశాలలలో 42,31,542 మంది; 479 జూనియర్

కళాశాలలో 2,63,319 మంది విద్యార్థులు కలరు (మే, 1970) ఇవిగాక అంగవికలురకై ఉద్దేశింప బడినవి 417 ప్రత్యేక వర్గపు పాఠశాలలు కలవు; వీనిలోని విద్యార్థి సంఖ్య 50,786.

దేశమున ప్రభుత్వపు ఆధ్వర్యమున పనిచేయు 7 ప్రముఖ విశ్వవిద్యాలయములు (టోకియో, క్యోటో, తోహూకూ, క్యూషూ, హొక్కయిడో, ఒసాకా, నగోయా) కలవు. ఇవిగాక స్థానిక సంస్థలును, పౌర సంస్థలును నిర్వహించు విశ్వవిద్యాలయములు కలవు; వీనిలో కీయో విశ్వవిద్యాలయము సుప్రసిద్ధము. వీని అన్నింటికి చెందిన కళాశాలలు, ఉన్నత విద్యా సంస్థలు మొత్తము మీద 442 కలవు; వీనియందలి విద్యార్థి సంఖ్య 14,50,835 (1970)

ఆణవిక విద్యా బోధనకు, పరిశోధనకు దేశమున వసతులు కలవు; అయినను అణవిక విజ్ఞానమును మానవ సౌభాగ్యమునకు మాత్రమే ఉపయోగించి, యుద్ధ సాధనములకై దానిని వినియోగింపకుండుటకు జపాన్ ప్రభుత్వము కృత నిశ్చయత వహించి కృషిచేయుచున్నది. రోదసీ పరిశోధనయందు దేశము పురోగమించినది. ఫిబ్రవరి 11,1970 న తొట్టతొలుతగ ఒక కృత్రిమోప గ్రహమును జపాన్ దేశము రోదసిలోనికి పంపినది. దేశమున గ్రంథాలయోద్యమము 1950 నుండి క్రమేణ అభివృద్ధియగుచున్నది. జపాను జాతీయ జీవనమున మ్యూజియములు తొలుత నుండియు ఆనంద, విజ్ఞాన సాధకములుగ పేరొందినవి. పెద్దవియు, చిన్నవియు కలసి దేశమున 239 మ్యూజియములు కలవు. దేశమున స్థానిక, జాతీయ దినపత్రికల మొత్తపు సంఖ్య 116 (1969). వీనిలో అసాహీ, యొమియూరి, మయినీచి, సాంకీ, నిక్కీ-అను అయిదు జాపనీయ జాతీయ దిన పత్రికలు ఎక్కువ ఖ్యాతిని ఆర్జించినవి. వీనిలో తొలుతటి దాని పాఠక సంఖ్య 92,20,000 (1969). దేశపు ప్రముఖ నగరములలో ఆంగ్ల భాషలో కొన్ని దినపత్రికలు ప్రచురితములగు చున్నవి.

జపానీయ పౌరుని సరాసరి జీవితకాలము 74 (1969). సరియగు వైద్య కృషి వలన దేశమున టైఫస్ మొదలగు సాంక్రామిక వ్యాధుల వ్యాప్తి అంతరించినది; కాని 'నాగరికతకు' అనుబంధములుగ భావింపబడు రక్తపుపోటు, ఉన్మాదము, కేన్సరు వంటివి ఎక్కువైనవి. దేశమున 898 మందికి ఒక వైద్యుడు చొప్పున వైద్య సంఖ్య కలదు. దేశమునందలి ఆసుపత్రులలో శయ్యా సంఖ్య 10,03,000 కు పైగా ఉన్నది. 100 మందికి ఒకటి చొప్పున ఈ శయ్యా సంఖ్య లెక్క తేలుచున్నది (1969). మొత్తపు ఆస్పిటలులు ఆసుపత్రుల సంఖ్య 7,703; వైద్య సంఖ్య 1,13,680 (1969).

**12. యాత్రా సౌ.:** యాత్రా కార్యక్రమము జాతీయ జీవనమున ఒక పరిశ్రమగ రాణకెక్కినది విదేశీయులేగాక, దేశీయులలో పలువురు సైతము దేశమునందలి ప్రసిద్ధ ప్రాంతములను సందర్శించు చుందురు. వీసా, పాస్‌పోర్టులను విదేశీయ యాత్రికులు విధిగ కలిగియుండవలెను. అట్టి యాత్రికుడు దేశమున ఉండదగు గరిష్ఠ కాలపరిమితి 60 దినములు. 1969 లో 6,08,774 మంది విదేశీయులు జపానును దర్శించిరి. జాపనీయులు విదేశములను దర్శించుటకు గల నిర్బంధములను ప్రభుత్వము 1964 లో తొలగించినది. అందువలన 7,12,080 మంది జాపనీయులు విదేశములను దర్శించిరి.

**13 ప్రసిద్ధ పౌరులు :** 1 హిడెయో నోగూచి (1876–1928) : పచ్చజ్వరము అనబడు దాని మూలకారణపు, సూక్ష్మజీవులను కనుగొనిన శాస్త్ర

వేత్త. 2. హిదేకీ యుకావా (జ. 1907): ప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త, అణవిక విజ్ఞానమున అనేక నూతన విషయములను కనుగొనినవాడు; ఇతనికి 1949లో నోబెల్ బహుమానము లభించెను. 3. షినిచిరో తోమొనాగ (జ. 1906); వైద్యుతికగతి శాస్త్రమున ఆతనికి 1960లో నోబెల్ బహుమానమున భాగము లభించినది. 4. హిరోషిగే (1797–1858): ప్రకృతి దృశ్య చిత్రణమున అంతర్జాతీయఖ్యాతిని ఆర్జించినవాడు. 5. యసువారీ కనబాతా (జ 1899): సారస్వత సేవకై 1968లో నోబెల్ బహుమతిని ఆర్జించెను

---

# 14. జోర్డాన్

**ముఖ్యనగరము** : అమ్మాన్; **జెండా** : నలుపు, ఆకుపచ్చ అడ్డచారలు వానిలో దండముకడ నుండి చొచ్చుకొనివచ్చు ఎర్రని త్రిభుజముపై, ఏడు కోణముల తెల్లని నక్షత్రము కలది జాతీయ పతాకము; **జాతీయ గీతము** : అష్ అల్ - మాలిక్ (రాజు చిరంజీవి యగుగాక); **నాణెము** : జోర్డాన్ దీనార్, 1000 షిల్లులుగ ఇది విభక్తము. (ఒక జో. దీనార్ = రూ. 21 00); **కొలతూకములు** : మెట్రిక్ విధానమునకే అధికారిక పరిగణ ఉన్నను,




పటము 15.

పల్లెపట్టులందు స్థానిక మానములు వాడుకలో ఉన్నవి. **కాలపరిగణన** : సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : పశ్చిమాసియాయందు 35°–39° తూ. తులారేఖలమధ్యను, 29°30′ – 32° 45′ ఉ. అక్షాంశాలమధ్యను నెలకొనిన ఈ దేశమునకు ఉత్తరమున సిరియాయును తూర్పున ఇరాక్, సౌదీ అరేబియాలును, దక్షిణమున సౌదీ అరేబియాయును, నైరుతిమూలన 14.5 కిలో మీటర్ల పొడవున అకాబా సింధుశాఖయు, పశ్చిమమున ఇస్రాయెల్ రాజ్యమును సరిహద్దులందున్నవి. దేశపు వాయవ్య భాగమున ఉత్తర-దక్షిణములకు ప్రవహించుచున్న జోర్డాన్‌నది దేశమును రెండు భాగములుగ విభజించుచున్నది. దేశపు మొత్తపు విస్తీర్ణము 93,990 చ. కిమీ; కాని జోర్డాన్ నదికి పశ్చిమ తటమున నున్న 5,542 చ. కిమీ విస్తీర్ణము కల ప్రాంతము, ప్రస్తుతమున ఇస్రాయెల్ దేశపు ఆక్రమణలో ఉన్నది. దేశమున అత్యధిక భూభాగము, 600 నుండి 900 మీటర్ల వరకు ఎత్తుగల ఒక పీఠభూమి. ఈ పీఠభూమి యొక్క పశ్చిమపు అంచును, జోర్డాన్ నదీలోయనుండి వేరు చేయు ఒక పర్వతశ్రేణి కలదు; ఈశ్రేణి, పీఠభూమి మట్టముపై 300 నుండి 600 మీ. వరకు

ఎత్తున మారుచుండును. జోర్డాన్ నదికి పడమట నైతము ఇట్టి పీఠభూమియే తొలుతయుండి, భూపరిస్థితుల మార్పువలన క్రుంగుదల ఏర్పడిన ఫలితముగ లోతగు జోర్డాన్ నదీలోయ రూపొందినదని శాస్త్రజ్ఞుల అభిప్రాయము. జోర్డాన్ లోయయందు ఉత్తరభాగము సముద్రమట్టమునకు దిగువన 200 మీటర్ల మట్టమున నుండి దక్షిణమునకు పోయిన కొలది ఇంకను లోతునకు పడిపోయి మృతసముద్రము (డెడ్ సీ)ను చేరునప్పటికి 400 మీటర్ల దిగువమట్టమునకు చేరుకొనును. 'మృతసముద్రము' అనునది నాల్గువైపుల భూభాగము కలిగిన ఉప్పునీటి జలాశయము. ఉత్తర దక్షిణములందు దీని పొడవు 88 కిమీ; వెడల్పు 16 కిమీ. ప్రపంచమందంతటను అత్యంత నిమ్నతమమగు ప్రదేశమని ఈ సముద్రము పేరొందినది. ఇందలి నీటి మట్టము సముద్రపు మట్టమునకు 393 మీ. దిగువ ఉండును. మృతసముద్రమున ఎక్కువలోతున ఉండు ప్రదేశము సముద్రమట్టమునకు 792 మీ. దిగువన కలదు. ఈ మృతసముద్రమున వివిధములగు ఖనిజ లవణములు మొత్తపు జలమున 30% వరకు కలవు. మృతసముద్రమును దాటిన తరువాత నిమ్నత తగ్గి, భూతలము క్రమేణ అకాబా సింధుశాఖను చేరుటకు పూర్వముననే సముద్రమట్టమును అందుకొనును. దేశమున అత్యధికభాగము ఎడారి.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున, అందును ముఖ్యముగ పీఠభూమియందు, ఎండకాలమున ఎండలును, శీతకాలమున చలియు ఎక్కువ. అత్యధిక ఉష్ణోగ్రత 120° ఫా. పీఠభూమి యందు, అందును పర్వత ప్రాంతములందు సాలున 32 సెం. మీ నుండి 62 సెం. మీ వరకు వర్షపాతము కలదు. తక్కిన ప్రాంతములందు 20 సెం.మీ మించి ఉండదు. జోర్డాన్ లోయయందు వృక్ష విశేషములు కొన్ని కానవచ్చినను, ఎడారులందు ముండ్లపొదలు మాత్రమే కననగును. నక్క మొదలగు చిన్న జంతువులేగాని పెద్ద వన్యజంతువులు కానరావు.

**3. జనసంఖ్య మొ :** జనాభా లెక్కలు తొట్టతొలుత 1961 లో సేకరించబడినవి. దేశపు మొత్తము జనసంఖ్య 17,06,226. ఇందులో దాదాపుగ 35% దేశపు వాయవ్య భూభాగమున, దేశపు 10 పదిస్త్రీక్షమున నివసించుచున్నారు. 1967 లో ఇస్రాయెల్‌తో యుద్ధము జరిగిన తరువాత కాందిశీకులు పలువురు జోర్డాన్ తూర్పుతటమున చేరుటవలన, జనసంఖ్యలో మార్పులు చాలా కలిగియుండుటకు అవకాశము ఏర్పడినది. 1968 అంచనాలను అనుసరించి, నగరములందు అమ్మాన్‌లో 3,50,000 ను, ఇర్బిడ్‌లో 62,000 ను, జర్కాలో 1,32,000ను జనులు నివసించుచున్నారు. ప్రపంచమున పుట్టుకరేటు ఎక్కువగా ఉండు దేశములలో జోర్డాన్ కూడ లెక్కకు వచ్చును. ఇచటి పుట్టుక రేటు సాలుసరిన 1000 కి 47 మంది. తూర్పుతటపు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు స్వచ్ఛపు సెమిటిక్ జాతికి చెందినవారు; పశ్చిమతటమున అర్మజాతి సెమిటిక్ జాతితో సమ్మిశ్రితమైనది. కాకసస్ ప్రాంతముల నుండి వచ్చి వలస చేరిన అర్మజాతులవారును అటనట కొన్ని మారుమూల ప్రాంతములందు కననగుదురు దేశప్రజలలో అత్యధిక సంఖ్యాకులు ముస్లిములు; క్రైస్తవులు 6.4% కలరు. దాదాపుగ ప్రజలందరికిని, అరబ్బీ మాతృభాష; కొన్ని అల్పసంఖ్యాక వర్గముల మాతృభాషలు వేరైనను, వారు కూడ అరబ్బీని మాటాడుదురు. పట్టణములందు ఆంగ్లభాషా పరిచయము కలవారు కననగుదురు.

**4. సమాచార సౌ.:** ప్రభుత్వాధ్వర్యవమున నిర్వహింపబడు తంతి, తపాలా, టెలిఫోను, టెలివిజన్, సౌకర్యములు దేశవ్యాప్తముగ కలవు; విదేశములతోను తంతి, తపాలా వసతులు చక్కగా నిర్వ

హింప బడుచున్నవి. అమ్మాన్‌లోను, పశ్చిమ తటపు జెరూసెలెమ్‌లోను రేడియో ప్రసార కేంద్రములు కలవు. ఇందు రెండవది ప్రస్తుతమున ఇజ్రాయెల్ ఆక్రమణలో ఉన్నది.

**5 యాన సౌ.** : దేశమున రాకపోకల సౌకర్యములు చాల తక్కువ. డమాస్కస్ నుండి అమ్మాన్ ద్వారా నకబ్ ఇష్త్రాక్‌కు పోవు 360 కి.మీ. పొడవు గల ఒక రైలు మార్గము కలదు. దేశమునందలి ప్రముఖనగరములను కలుపుచు, అటనుండి ప్రక్క దేశములగు ఇరాక్, సిరియా, సౌదీ అరేబియాలకు పోవు రోడ్డు మార్గములు మొత్తము 5,568 కిమీ. పొడవున ఉన్నవి. ఇందు తారువేసినది 3.534 కిమీ. (1968). దేశపు ఒకే రేవు నగరమగు అకాబా, అకాబాసింధు శాఖయొక్క ముఖ ప్రదేశమున ఉన్నది. అంతర్జాతీయ విమాన యానమునకు ఉపయోగించు విమానాశ్రయములు అమ్మాన్, జెరూసెలములలోను, సాధారణ విమానాశ్రయములు దేశమున తక్కు ప్రాంతములందు ఏడు చోట్లను కలవు.

**6. చరిత్ర** : ఇందలి పశ్చిమ తట భూమియందు ఉన్న జెరికో ప్రాంతము, క్రీ పూ. 6000 ప్రాంతమునుండియు, జనావాసితమై ఉన్నటుల అచటి త్రవ్వకములవలన తెలియవచ్చినది. క్రీ పూ. 16 వ శతాబ్దిలో ఈజిప్ట్ దేశపు ప్రభువులు ఈ దేశమును జయించిరి. క్రీ. పూ. 13 వ శతాబ్ది యందు ఇచట సెమిటిక్ జాతి ప్రజలు వలసచేరిరి; 12 వ శతాబ్దమున హిబ్రూ తెగలును ఇట నివాసము ఏర్పరచుకొనినవి; కాలక్రమమున దేశపు పశ్చిమ భాగమంతయు యూదు రాజ్యమున అంతర్భాగమై కొంతకాలము ఉండినది. క్రీ. పూ. 4 వ శతాబ్దమున అలెగ్జాండరు నాయకత్వమున గ్రీకులు ఈ దేశమును తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొని, దాదాపు 300 సంవత్సరములు తమ పాలనలో ఉంచుకొనిరి, తదనంతరమున రోమన్‌ల వశమైనది. గ్రీక్-రోమన్ పరిపాలనా కాలము లందు ఇట వర్తక వ్యాపారములలో ప్రపంచ ఖ్యాతిని ఆర్జించిన అనేక నగరములు రూపొందినవి. క్రీ. శ. 400 ప్రాంతమున ఈ దేశము నందు క్రైస్తవమతము విరివిగ వ్యాపించెను; కాని క్రీ. శ. 633 లో దీనిని అరబ్ సేనలు వశపరచుకొని ఇస్లామును ఎల్లెడల వ్యాపింప జేసినవి. తరువాత వివిధ ముస్లిం రాజవంశముల పాలనలలో చేతులు మారి ఈ ప్రాంతము క్రీ. శ. 16 శతాబ్దిలో తుర్కీ సామ్రాజ్యమున అంతర్గతమయ్యెను. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున జోర్డాన్ నదికి తూర్పునఉన్న ప్రాంతమును, బ్రిటిష్‌వారు, 'ట్రాన్స్ జోర్డాన్' అను పేర ఒక దేశముగ నిర్మించి, హషమైట్ వంశీయుడగు అబ్దుల్లా అను అరబ్ రాజవంశికుని అట అమీరుగ చేసిరి (1923); ఆ సమయముననే పశ్చిమ ప్రాంతమును, పాలస్తీనా అను తమ మాండేటరి రాజ్యమున అంతర్భాగముగా చేసిరి. 1946 లో ట్రాన్స్‌జోర్డాన్ సర్వస్వతంత్రము అయ్యెను. అంతట పాలస్తీనా యుద్ధమును (1948) అవకాశముగ తీసికొని పశ్చిమతటమున, పాలస్తీనాలోని కొంత భాగమును, అబ్దుల్లా వశ పరచుకొని, ప్రజామోదమును పొంది, రెండు ప్రాంతములను 'జోర్డాన్' అనుపేర ఏకదేశముగ చేసెను (1950). ఆ వంశికుడగు హుస్సేన్ ఇప్పటిపాలకుడు; ఇతని కాలమున ఇజ్రాయెల్‌తో 1967 లో అరబ్బులకు జరిగిన యుద్ధమున, ఇజ్రాయెల్ సేనలు పశ్చిమతట భూమిని వశము చేసికొని, ఐ.రా.స. తీర్మానములను కాదని, ఇప్పటికిని తమ స్వాధీనముననే ఉంచుకొనినవి.

**7. పరిపాలన** : రాజ్యాంగ బద్ధమగు ఏకరాజ పాలన ఇటసాగుచున్నది. జాతీయ శాసన సభ యందు రెండు కక్ష్యలు కలవు. అందలి ప్రతినిధి సభయందలి 60 మంది సభ్యులు నాలుగేండ్ల

కొక యూరి ప్రజలలో మగవారివలన, వయోజన వోటు పద్ధతిన, ఎన్నుకొనబడెదరు. ఎగువసభ యందలి 30 మంది సభ్యులను ప్రముఖ జాతీయుల నుండి, రాజు నియమించును. కాని 1967 తరువాత, అత్యయిక పరిస్థితి ఏర్పడి, రాజు తాను నియమించు కొనిన 30 మంది సభ్యులుకల సలహాసంఘపు సాయమున పాలనను నిర్వహించుచున్నాడు. స్థానిక పరిపాలనను, తాబేదారులద్వారా, ఒక మంత్రి నిర్వహించుచున్నాడు ముస్లిం, క్రైస్తవ న్యాయ సంహితలు వేర్వేరుగ ఆయా వివాదములకు సంబంధించిన వారినిబట్టి న్యాయ నిర్వహణమున వినియోగింపబడుచున్నవి.

**8. దేశరక్షణ :** రెండు పదాతి దళములును రెండు కవచిత దళములును దేశమున కలవు. సైనిక సంఖ్య 58,000. అకాబా ఆశ్రయముగ చిన్న నౌకా సేనయు కలదు. రెండు పోరాటపు దళముల వైమానిక సేన కలదు. ఇందలి సైనిక సంఖ్య 4,000. యు. స్టే. నుండి ఆర్జించిన ఆధునిక పోరాటపు విమానములును, ఆయుధ సామగ్రియు ఈ దళములకు కలదు.

**9. అంతర్జాతీయ సంబంధములు :** భారత దేశముతోను, తక్కిన ప్రముఖదేశములలో పెక్కింటితోను, ఈ దేశము దౌత్య సంబంధములను కలిగియున్నది. ఐ.రా.స. యందును, అరబ్ లీగునను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఇస్రాయెల్‌తో దౌత్య సంబంధములు లేవు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక ప్రతిపత్తికి వ్యవసాయమే ముఖ్యాధారము. అయినను దేశపు భూమిలో మొత్తమున 10% మాత్రమే సేద్యమునకు యోగ్యము. నీటివసరులను కల్పించి పంటల ఉత్పత్తిని ఎక్కువ చేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. బియ్యము తప్ప, తక్కిన గోధుమ, బార్లీ మొదలగు ఆహార ధాన్యముల విషయమున దేశము స్వయం పోషకము, సహకార వ్యవసాయ క్షేత్ర కృషి, ప్రభుత్వము చేత ఆదరితమై క్రమముగ ముందంజవేయుచున్నది. ఒంటెలును, మేకలును, గొర్రెలును ఎక్కువగ కలవు. మాంసాహారము విరివిగ లభించుటకు అవకాశమును ఇవి కల్పించుచున్నవి. ఒంటెలు సామాన్యుల రాక-పోకలకు ఉపయోగపడుచున్నవి. అటవీ సంపద చాలా తక్కువ; చేపల పరిశ్రమయు అకాబా సింధుశాఖా తీరమున ఏ కొంచెముగనో సాగుచున్నది. మృతసముద్రపు నీటి యందలి గాఢపు ఉప్పదనము వలన అందు చేపలు జీవింపజాలవు. దేశపు ఖనిజములలో ఫాస్ఫేటును, మృత సముద్రమునుండి తీయబడు పొటాష్‌యును ప్రముఖములు. దేశమున విద్యుదుత్పత్తి 1557 లక్షల కి. వా (1968). దేశపు పారిశ్రామికాభివృద్ధి 1948, 1967 లలో జరిగిన యుద్ధముల వలన చాల కుంటుపడినది. 1972 లో దేశపు ఎగుమతుల విలువ 17,000 వేల జో. దీనార్లు; దిగుమతుల విలువ 95,310 వేల జో. దీనార్లు. చెల్లింపుల లోటును, కువాయిట్, సౌదీ అరేబియాలు ఇచ్చు ఆర్థిక సహాయము వలనను, ఋణముల వలనను ప్రభుత్వము పూడ్చుకొనుచున్నది. దేశపు సమష్టి జాతీయోత్పత్తి 28 66 కోట్ల జో. దీనార్లు (1971).

**11 సాంఘిక రంగము :** దేశమున వయోజనులలో విద్యావ్యాప్తి చాల తక్కువ. కాని ప్రస్తుతపు ప్రభుత్వము, ప్రతి బాలుడును, బాలికయు 9 ఏండ్లు విధిగ పాఠశాలలలో విద్యను అభ్యసించవలెయునను చట్టము చేసినది. అయినను మారుమూల ప్రాంతము లందు ఈ చట్టము సరిగ అమలు పరుపబడలేదు. లభ్యములైన లెక్కలను అనుసరించి ఉభయ తటములందు 6,30 235 మంది విద్యార్థులు పఠించుచున్నారు (1971-72). అమ్మాన్ వద్ద ఒక విశ్వవిద్యాలయము కలదు అందలి విద్యార్థి సంఖ్య 2,207 (1967-68). దేశమున

పత్రికలకు స్వాతంత్ర ప్రతిపత్తి దాదాపుగ సిషిద్ధము. ప్రభుత్వపు సహాయముతో వెలువడు రెండు దినపత్రికలు కలవు. వైద్యసహాయము పట్టణములందు పరిపెగ కలదు. దేశమున వచ్చి చేరిన కాందిశీకులకై ఐక్యరాజ్య కాందిశీక సహాయ సంస్థ కొన్ని వైద్యశాలలను నిర్వహించుచున్నది. దేశపు మొత్తమున ప్రభుత్వముచేత నిర్వహింపబడుచు 1,783 శయ్యలుకల 27 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. దేశమునందు అంతటను ప్రముఖముగ భావింపదగిన మ్యూజియమ్ జెరూసెలమున కలదు. కాని ఆ నగరము ఇపుడు ఇజ్రాయెల్ అధీనమున ఉన్నది. అమ్మాన్‌లో పురావస్తు మ్యూజియమ్ ఒకటియు, ఇస్లామిక మ్యూజియము వేరొకటియు కలవు. అమ్మాన్ మ్యూజియంతో చేరి 30,000 సంపుటములుకల ప్రసిద్ధ గ్రంథాలయము ఉన్నది.

**12. విలాస యాత్రా సౌకర్యములు :** 1967 యుద్ధమునకు పూర్వమున సాధారణ యాత్రికులకలననేమి, క్రైసవ, ముస్లిం మత యాత్రికుల వలననేమి, దేశమునకు మంచి ఆదాయము లభించెడిది. క్రీస్తు జన్మభూమిగను, ఆ మహాపురుషుని కార్యక్షేత్రముగను జెరూసెలము పేరొందినది అదియును తత్పరిసరములును క్రైస్తవులకు పుణ్యక్షేత్రములు; జెరూసెలము లోని అల్-అక్సా మసీదును, శిలాహర్మ్య శిఖరము (డోమ్ ఆఫ్ ది రాక్) ను ముస్లిములకు పుణ్యస్థలములు. అటులనే జెరికో మొదలగునవి మానవ చరిత్రతో ముడివడినవి. ఇవి అన్నియు ఇపుడు ఇజ్రాయెల్ వశమున ఉండుట వలన వానిని దర్శించు [వారితో జోర్డాన్ ప్రభుత్వమునకు ఎట్టి సంబంధమును లేకున్నది. కాని తూర్పుతటమున చారిత్రాత్మక స్థలములను దర్శించుటకు పెక్కురు ఇప్పటికిని వచ్చుచునే ఉన్నారు. ఇట్టివారి సంఖ్య 1972 లో 2,92,041. పూర్వపు సెమిటిక్ రాజ్యమునకు ముఖ్యనగరమగు సబాతే, గ్రీక్ రోమన్ కాలపు జరాష్‌లోని అవశేషములును తూర్పుతీరపు చారిత్రక స్థలములలో ప్రముఖములు.

---

# 15. తాయిలాండ్ (ప్రదేశ్ తాయ్)

**ముఖ్యనగరము :** బాంగ్‌కాక్ (క్రుంగ్ తెప్); **జెండా :** పై నుండి దిగువకు ఎరుపు, తెలుపు, నీలము, తెలుపు, ఎరుపు అడ్డు చారలు; అందు మధ్యనున్న నీలిచార తక్కిన ప్రతిదానికి రెట్టింపు వెడల్పు కలిగి ఉండునది. **జాతీయ గీతము :** మూడు విధముల జాతీయ గీతములు, సమయ ప్రాముఖ్యమునుబట్టి, అమలున ఉన్నవి. అవి 1. ఫ్లైన్‌శాసన్ ప్రాబరామి (చక్రవర్తిని స్తుతించునది) 2. ఫ్లైంగ్ చార్ట్ తాయ్ (తాయి జాతీయ గీతము) 3. ఫ్లైంగ్ మహాజాతి (విజయ గీతము) **నాణెము :** 100 శతాంగములుగ విభక్తమైన 'బహ్త్'; ఒక బహ్త్ = రు. 0.36; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 7 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆగ్నేయ ఆసియాయందు 6°-21° ఉ. అక్షాంశ రేఖలకును, 97-106° తులా రేఖలకును మధ్య విస్తరించి ఉన్న ఈ దేశమునకు పశ్చిమ వాయవ్యములందు బర్మా; తూర్పు, ఈశాన్యములందు లావోస్, కాంబోడియా; దక్షిణ, ఆగ్నేయములందు మలేసియా సరిహద్దులందు ఉన్నవి. ఈ దేశమున కొంత భాగము మలయా ద్వీపకల్పము లోనికి చొచ్చుకొని పోయి

మూడింట రెండు వంతుల భూమిని ఆక్రమించినది. దేశ వైశాల్యము 5,14,000 చ. కిమీ; దేశము దాదాపుగ అన్ని వైపుల భూపరివేష్టితమే అయినను నైరుతిన బంగాళాఖాతమును, ఆగ్నేయమున తాయిలాండ్ (సయామ్) సింధు శాఖను తగిలియున్న




పటము 16.

కొలది పాటి తీరప్రాంతము కలదు. ఆ తీరరేఖ పొడవు 2,720 కి. మీ.

భౌతిక లక్షణములను బట్టి దేశము 1. మధ్య లోయ 2. ఉత్తర వాయవ్య ఉన్నత భూములు 3. ఈశాన్య ప్రాంతము 4. ఆగ్నేయ తీరభూమి. 5 ద్వీపకల్పము అను అయిదు ప్రాంతములుగ విభజింపవచ్చును. ఇందు తొలుతటి దానిని దేశపు హృదయసీమగా భావింపవచ్చును. ఒక వైపున సయామ్ సింధుశాఖను ఆనుకొని, తక్కిన మూడు వైపుల పర్వత శ్రేణులచే పరివేష్టితమైన ఈ లోయ యందు జావో ప్రాయానదికి చెందిన ఒండ్రుమట్టి మైదానము కలదు. దీని ఉత్తర దక్షిణముల నిడివి 450 కిమీ; తూర్పు పడమరల కొలత 160 నుండి 240 కిమీ. వరకు మారుచుండును. దేశమునందలి జనాభాయందును వ్యవసాయక సంపత్తియందును అత్యధిక భాగము ఇట కననగుచున్నది.

ఉత్తర ప్రాంత ఉన్నత భూములందు అత్యున్నత ప్రాంతపు ఎత్తు 2530 మీ.; ఇట దక్షిణమునకు పారెడు వివిధ నదులు కడకు జావోప్రాయానదిగ, మేళవించుచున్నవి; ఉత్తరమునకు మీకాంగ్ నదియు పశ్చిమమునకు సాల్వీన్ నదియు ఇటనుండియే బయలుదేరుచున్నవి. వాయవ్యప్రాంతమును బర్మా నుండి వేరుచేయుచు, పెట్టనికోటవలెనుండు దుర్గమ పర్వతశ్రేణి కలదు; ఈ పర్వతశ్రేణి ద్వారా పయనించుటకు 'మూడు ఆలయముల' కనుమ అన బడు దాని ద్వారా మాత్రమే సాధ్యమగు చున్నది; వాయవ్య ప్రాంతము 'కోరాత్' అని వ్యవహరింప బడుచున్నది; ఉత్తర, పశ్చిమములందు సముద్రపు మట్టమునకు ఎగువ 120-210 మీ. ఎత్తు కలిగి ఉన్న ఈ ప్రాంతము క్రమముగా ఆగ్నేయమునకు పయనించి 60 మీ ఎత్తునకు దిగిపోవుచున్నది. ఈశాన్య ప్రాంతమును, అటువైపు కాంబోడియా నుండియు ఇటువైపున మధ్యలోయనుండియు, చిన్న కొండ వరుసలు, గుట్టలు వేరు చేయుచున్నవి. దాని తూర్పు సరిహద్దును ఆనుకొనియే ప్రవహించు మూన్‌నది మీకాంగ్‌నదిలో చేరుచున్నది; ఈ ప్రాంతమున వర్షపాతము చాల తక్కువ; నీటి కరువు ఎక్కువ; నేల చాలవరకు ఊషర భూమి.

సయామ్ సింధుశాఖను ఆనుకొనియున్న ఆగ్నేయ తీరభూమి వైశాల్యమునందు చాల చిన్నది. దీనిని మధ్యలోయనుండియు, కాంబోడియా నుండియు పర్వతముల వరుసలు వేరుచేయుచున్నవి; ఆ పర్వతములందు 1,525 మీటర్లు ఎత్తుకల శిఖరములును కలవు; ఇచ్చట వర్షపాతము, వృక్ష సంతతి ఎక్కువ.

మధ్యలోయనుండి 960 కిమీ. దిగువకు ద్వీపకల్ప ప్రాంతము వ్యాపించి, దక్షిణమున మలేసియా దేశపు సరిహద్దును చేరుచున్నది. ఒక వైపు అందమాన్ సముద్రమును, వేరొక వైపున సయామ్ సింధుశాఖను కలిగియున్న ఈ ద్వీపకల్పపు వెడల్పు 16 నుండి 216 కిమీ. వరకు మారుచున్నది 'క్రా' భూసంధి ప్రాంతమున ఈ వెడల్పు 24 కిమీ. మాత్రమే. ఇందలి జనావాసములందు అధికభాగము తీరభూములందును, ఇందలి వివిధ నదుల లోయలందును కలవు. చావోప్రయ, పింగ్, వాంగ్, నాన్, మూన్, చీ నదులు ఇందు ప్రవహించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున సాలున మూడు ఋతువులు—ఎండకాలము, వానకాలము, చలికాలము — స్పష్టముగ అనుభవ వేద్యములగుచున్నవి. మార్చినుండి మే వరకు ఎండకాలము; జూన్ నుండి అక్టోబరు వరకు ఋతుపవనముల వలన వానలు కురియును; నవంబరు నుండి మార్చి వరకు చలికాలము. దేశమున ఏ ప్రాంతమునను కనిష్ఠోష్ణత 55° ఫా. తగ్గదు; గరిష్ఠోష్ణత 95° ఫా. మించదు. బాంగ్‌కాక్ నగరమున సాలున కనిష్ఠోష్ణత 77° ఫా; గరిష్ఠోష్ణత 86° ఫా

దేశమున సాలున సగటు వర్షపాతము 100 సెం. మీ. బ్యాంగ్‌కాక్ నగరమున ఆ వర్షపాతము 148 సెం. మీ; గాలిలో చెమ్మదనము 73%.

దేశమునందలి భూతలమున 70% అటవీక్షయము; టేకు మొదలగు మేలిజాతి కలప రకములును, వెదురును కొబ్బరిచెట్లును, ఇందు కలవు; తీరప్రాంతములందు పేమురకపు తుంగ పొదలు విరివిగ కలవు. దేశమున వైవిధ్యముకల జంతు సంతతి కలదు; అందు తెల్ల ఏనుగు ప్రముఖముగ పేర్కొనదగినది. మర్కట జాతులును విశేషముగ కలవు; శాస్త్రజ్ఞుల లెక్కలను అనుసరించి 1000 రకముల పక్షిజాతులు కలవు. అనేక విధముల మత్స్యజాతులును, మొసళ్లను, తాబేళ్లను జలాశయములందును సముద్ర జలములందును కానవగును

**3. జనసంఖ్య మొ. :** 1970 లెక్కలను అనుసరించి దేశపు సంఖ్య 3,41,52,000; వీరిలో 16% చీనీయులు; దాదాపు 10,000 మంది భారతీయులు కలరు; వీరు చాలవరకు వర్తక వ్యాపారములను ఆశ్రయించి జీవించుచున్నారు. మలే, ఖ్మేర్, మోన్, కరెన్స్, వియత్‌నమీస్ కూడ అల్పసంఖ్యలలో కొన్ని ప్రాంతములందు కలరు. దేశీయుల మాతృభాష తాయిభాష; పదరూపమున చీనీయభాషకు ఇది సన్నిహితమైనను, సంస్కృతము నుండి, పాళీనుండి పెక్కుపదములను ఈ భాష గ్రహించినది. చీనీయులు మొదలగు అల్పసంఖ్యాక వర్గములకు వేర్వేరు మాతృభాషలు ఉన్నను వారికి తాయిభాషయు సుపరిచితము. వ్యాపార, వాణిజ్యములందు, ఇంగ్లీషు భాషకు వ్యాప్తి ఎక్కువ. దేశమునందలి ఉన్నత పాఠశాలలందును, కళాశాలలందును ఇంగ్లీష్ విధిగ బోధింపబడుచున్నది. దేశీయులందు హీనయాన బౌద్ధము విపులప్రచారమున ఉన్నది; చీనీయులు మాత్రమే మహాయాన బౌద్ధమతానుయాయులు; వీరుగాక 10,25,569 ముస్లిములును; 1,50,053 క్రైస్తవులును; 4,61,317 కన్ఫూషియన్ సంప్రదాయపు వారును; 3,483 హిందువులును; 35,238 తదితరమతముల వారును; ఏమతమునకు చెందనివారు 13,979 మంది కలరు (1960).

దేశపు ప్రముఖ నగరములలో ముఖ్యనగరమగు బ్యాంగ్‌కాక్ (1968 లో జ. సం. 20.4 లక్షలు), ధనపురి (5,40,300); చీంగ్‌మాయ్ (66,000) పేర్కొనదగినవి. చావో ఫ్రియానదికి తూర్పు తటమున బ్యాంగ్‌కాక్ నగరము, దానికి అభిముఖముగ ఆ నది యొక్క పడమటి తటమున ధనపురి ఉన్నవి.

**4. సమాచార సౌ. :** దేశమున 425 పోస్ట్ ఆఫీసులు కలవు. ఇవిగాక కంట్రాక్టు పద్ధతిపై పనిచేసే ఆఫీసులు 315, రైల్వే పోస్ట్-ఆఫీసులు 462 ఉన్నవి (1971). ముఖ్య వాణిజ్య కేంద్రములగు నగరముల మధ్య టెలిగ్రాఫ్, టెలిఫోను వసతులు కలవు; టెలిఫోనులలో నాలుగింట మూడు వంతులు ముఖ్యనగరమున ఉన్నవి.

శ్రీ రాజ చోనపురి అనుచోట అంతరిక్షమున ఒక ఉపగ్రహపు స్థావరము 1968 లో నెలకొల్పబడినది; దాని ద్వారా ప్రపంచమునందలి పలు ప్రాంతములతో సమాచార సౌకర్యము దేశమునకు ఏర్పడి ఉన్నది. 1970 లో అచట నెలకొల్పబడిన వేరొక ఉపగ్రహము ద్వారా హిందూమహాసముద్ర ప్రాంత దేశములతో వార్తా సంబంధ సౌలభ్యము విస్తృతము చేయబడినది. రేడియో టెలిగ్రాఫ్, రేడియో-టెలిఫోను వసతులు ప్రభుత్వపు కార్య నిర్వహణకు మాత్రమే ఉపయోగపడుచున్నవి.

బ్యాంగ్‌కాక్ నగరమున రేడియో ప్రసార వసతియు, టెలివిజన్ ప్రసార వసతియు ఏర్పడి ఉన్నవి.

**5. యాన సౌ. :** దేశమున అన్నివిధముల రోడ్ల మొత్తపు నిడివి 15,612 కిమీ ; ఇందు 8,735 కిమీ. పొడవున కాంక్రీటు చేయుటయో లేదా తారువేయుటయో జరిగినది (1969), రైలు మార్గముల మొత్తపు నిడివి 3,765 కిమీ.; బాంగ్ కాక్ నగరము వివిధ రైలుమార్గములకు కూడలి, అటనుండి ఆ మార్గములు మలేసియా సరిహద్దునకు, కాంబోడియా సరిహద్దునకు వ్యాపించుచున్నవి. ఆ మార్గములను ప్రభుత్వమే నిర్వహించుచున్నది.

చావో ఫ్రియా నదీ ముఖద్వారమునకు 30 కిమీ. ఎగువన ఉన్న బ్యాంగ్‌కాక్ రేవునకు సముద్ర ప్రయాణపు నౌకలు వచ్చు వసతి కలదు; లావోస్ దేశపు ఎగుమతి దిగుమతులును ఈ రేవు ద్వారానే, ఒక ఒడంబడిక ద్వారా, నిర్వహింపబడుచున్నవి. దేశపు అంతర్గత వ్యాపారమున అధిక భాగము నదీ మార్గములందు పయనించు నౌకల ద్వారా సాగుచున్నది. అట్టి నదులందు చావో ఫ్రియా నదియు, దాని ఉపనదులును ముఖ్యములు.

బ్యాంగ్‌కాక్‌లోని విమానాశ్రయము అంతర్జాతీయ విమానయానమున ప్రసిద్ధిని పొందినది. 33 విదేశీయ విమానయాన వ్యవస్థలు ఈ విమానాశ్రయమును, ప్రపంచ విస్తృతములగు తమ ప్రయాణములకు, ఒక మజిలీగా వాడుకొనుచున్నవి.

**6. చరిత్ర :** ఈ దేశమున తొలుతగ క్రీ. శ. 6వ శతాబ్ది మొదలుగ మోన్-ఖ్మేర్ జాతుల పాలకుల రాజులు కొందరు, వివిధ ప్రాంతములందు చిన్న చిన్న రాజ్యములను సంస్థాపించి వంశానుగతముగ పాలనను సాగించినటుల తెలియవచ్చుచున్నది. ఈ పాలకుల కాలమునకు ఈషత్పూర్వముననే బౌద్ధమతము అటనెలకొనెననియు, వీరి కాలమున అది దేశమంతట వ్యాపింపగలిగెననియు చారిత్రకుల అభిప్రాయము. బౌద్ధమతముతో పాటుగ భారతదేశమునుండి ఇటకు హిందూమత ప్రచారకులును వచ్చిచేరిరి. వారి కృషియు కొంత వరకు ఆనాడు సఫలమయ్యెననుట, దేశమున ఇపుడు కన్పట్టు దేవాలయావశేషముల వలన స్పష్టమగుచున్నది. క్రీ. శ. 13వ శతాబ్దిలో చీనా పాలకుడగు కుబ్లయ్‌ఖాన్‌చే, తరుమబడిన దక్షిణ చీనీయ తాయ్‌జాతులవారు, ఈ దేశముపైబడి,

మోన్-ఖ్మెర్ పాలకులను అంతమొందించి, దేశమును వశపరచుకొని, అచటి ప్రజలను తమలో లీనము చేసికొని, దేశమున తాయ్‌జాతికి ప్రాముఖ్యమును కల్పించిరి; అయినను వీరు కూడ భారతీయ మత సంస్కృతులనే ఆదరించి పరిపోషించిరి. ఇటు లేర్పడిన తాయ్ రాజ్యములలో తూర్పు ప్రాంతపు సుఖోదయ రాజ్యమును, పశ్చిమమునందలి అయోధ్య రాజ్యమును ఎక్కువగ పేరొందినవి క్రమశః అయోధ్య రాజ్యము బలవత్తరమై తాయిలాండ్‌లోని తక్కిన రాజ్యములపైననేగాక కాంబోడియా మొదలగు పరిసర రాజ్యములపై ఆధిపత్యమును నిర్వహింప గలిగినది. 16 వ శతాబ్దిలో పోర్చుగీజువారికి ఈ రాజ్యముతో పరిచితి లభించినది. ఇంతలో బర్మా, పెగూ రాజ్యముల దండయాత్రలను అయోధ్య రాజ్యము ఎదుర్కొనవలసి వచ్చినది; అంతట పోర్చుగీజుల సాయముతో అయోధ్య పాలకుడు ఆ దండయాత్రలను తిరుగగొట్టి, పెగూను జయించ గలిగెను కాని కడకు 19 వ శతాబ్దిలో అయోధ్య రాజ్యమున అంతఃకలహములు చెలరేగగ ఆ అవకాశమును ఉపయోగించుకొని, బర్మా పాలకులు ఆ రాజ్యముపై దండెత్తి ముఖ్యనగరమైన అయోధ్యను నాశనము చేసిరి.

కాని అనతికాలముననే దేశీయ సైనికులు, శత్రువులను తరిమివేయగలుగుటవలన బ్యాంగ్ కాక్ నగరము రాజధానిగ ఫియాచక్రి అనునతడు దేశమున సువ్యవస్థిత పాలనను నెలకొల్పెను ఇతని వంశపు వారే నేడును తాయిలాండ్‌ను పాలించు చున్నారు.

19 వ శతాబ్దమున ఆగ్నేయ ఆసియాలో వివిధ ప్రాంతములు బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వముల వశమయినపుడు, తమ దేశమున పశ్చిమ ప్రాంత మున కొంత భాగమును ఫ్రెంచివారికిని, దక్షిణ మున కొంత భాగము బ్రిటిష్‌వారికిని తాయిలాండ్ పాలకులు ఇచ్చివేయవలసి వచ్చినది. బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వముల మధ్యగల వైరుధ్యములవలన, తాయిలాండ్‌లోని తక్కిన భాగము మాత్రము స్వతంత్రముగ ఎటులో నిలువగలిగినది.

దేశమున చూలాలంకరణ ప్రభువు పాలించు కాలమున (1868-1910) ఆధునిక పరిపాలనా విధానము ప్రవేశ పెట్టబడినది; కాని ప్రభుత్వపు సర్వాధికారములు రాజువశముననే ఉండినవి. తుదకు 1932 లో ప్రజాందోళనకు లొంగి, రాజ్యాంగ బద్ధ డగు పాలకుడుగ ఉండుటకు రాజు అంగీకరించుట వలన ప్రజా ప్రాతినిధ్య సంస్థలు ఏర్పడినవి. కాని స్థిరమైన ప్రభుత్వములు లేకుండుటయు అంతటం తట నిరంకుశ ప్రభుత్వములు ఏర్పడుటయు ఈ దేశమున పరిపాటి అయినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధపు కాలమున, పరి స్థితులను బట్టి జపానుతో సహకరించినను, తరు వాతి కాలమున యు. స్టే. తో సహకార భావము వహించి, కమ్యూనిస్ట్ చీనాకు వైదొలగి, ఈ రాజ్యము వ్యవహరించినది. కాని 1975 లో దక్షిణ వియెత్‌నామ్, కాంబోడియాలలో కమ్యూనిస్ట్ రాజ్య ములు ఏర్పడిన తరువాత, తన వైఖరిని మార్చు కొని, దేశమునుండి సైనిక స్థావరములను యు. స్టే. ఎత్తివేసికొనునటుల దేశ ప్రభుత్వము ఒత్తిడి చేయగలిగినది.

**7. పరిపాలన:** దేశమున వంశానుగతము, రాజ్యాంగ బద్ధము అగు రాజరికపుపాలన కలదు. 1959 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధాన మును అనుసరించి 1969 న ఎన్నికలు జరిగి, 'సహ ప్రజా తాయ్' అను పక్షము అధికారమును గ్రహించగలిగినది; కాని 1971 లో అప్పటి ప్రధాన మంత్రియగు ధనం కిత్తికాచరణ్ సేనాని, రాజ్యాంగ విధానమును నిలుపుదల చేసి, సైనిక ప్రభుత్వమును నెలకొల్పెను; కాని 1974 లో విద్యా

ర్థుల ఆందోళనకు లొంగి అతడు దేశమును విడిచి పోవలసి వచ్చెను. అంతటినుండి రాజు సహకారముతో ప్రజాస్వామిక పరిపాలనను నెలకొల్పుటకు కృషి జరిగి, 1975 లోని ఎన్నికల ఫలితముగ ప్రజాస్వామిక రీతిలో మంత్రివర్గము ఏర్పడినది. దేశమున 71 రాష్ట్రములు కలవు. ఎన్నుకొనబడిన ప్రజా ప్రతినిధుల సాయమున ప్రభుత్వ నియమిత కార్య నిర్వహకోద్యోగులు రాష్ట్రపాలనను నిర్వహించుచున్నారు.

న్యాయ నిర్వహణ 'డీకా' అనబడు ఉచ్చతమ న్యాయస్థానపు ఆధిపత్యమునకు లోబడి వివిధ శ్రేణుల న్యాయస్థానముల ద్వారా కొనసాగింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** 21 నుండి 30 ఏండ్ల వరకు వయసు కలిగిన ప్రతి సమర్థ పురుషుడును సేన యందు, అవసరమగు నెడల, విధిగ పనిచేసి తీర వలయునను నియమము కలదు. దేశపు పదాతి సేనలో శాంతి కాలమున సైనిక సంఖ్య ఒక లక్ష; ఇందు మూడు టాంకు పటాలములు కలవు; నౌకా సేన యందు సైనిక సంఖ్య 21,600; ఇందు డిస్ట్రాయరుకు పైబడిన యుద్ధ నౌకలు లేవు, యు. స్టే. సాయమున వ్యవస్థితమైన వాయుసేన కలదు. అందు యుద్ధరంగ ప్రథమశ్రేణికి ఉపకరించు విమానములు 140 కలవు; మొత్తపు అన్ని విమానముల సంఖ్య 250; యోధ సంఖ్య 25,000 (1972).

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా.స. యందును, కొలంబో ప్రణాళికా రాజ్య సంఘమునను, ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. మీకాంగ్ నది దిగువ పరీవాహ ప్రదేశమును అభివృద్ధి చేయు విషయమున కాంబోడియా, లావోస్, తాయిలాండ్, వియెత్‌నామ్‌ల మధ్య సహకారపు ఒడంబడిక కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయము ముఖ్యాధారము. దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి 3 కోట్ల ఎకరములు కలదు. అందు 2.5 కోట్ల ఎకరములు సేద్యమున కలదు. వ్యవసాయము ప్రాచీన సంప్రదాయపు పరికరములతోనే సాగుచున్నను, వరి ఉత్పత్తిలో ఈ దేశము పేరు గడించినది. 1.8 కోట్ల ఎకరములలో వరి సాగగుచున్నది. వేల టన్నులలో, 1969 న, ముఖ్యములగు పంటల ఉత్పత్తి ఈ తీరుగ ఉన్నది; వరి (13,346); మొక్కజొన్న (1,407); చక్కెర చెరకు (3,847), కొబ్బరికాయలు (1,111); వేరుసెనగ (160.5), ప్రత్తి (128.3), పొగాకు (71.1). పశుసంపద విరివిగ కలదు. టేకు కలపను తెచ్చుటకు ఏనుగులు విరివిగ వాడబడుచున్నవి. 1967 లో అట్టి ఏనుగుల సంఖ్య 11,500.

దేశమున దాదాపు 60% అటవీమయము. ఇందు ఉత్తరపు అడవులందు టేకు లభించుచున్నది. రబ్బరు ఉత్పత్తి 1969 లో 2,81,800 టన్నులు. మత్స్య పరిశ్రమయు విరివిగ ఆదరింపబడుచున్నది. దేశీయుల భోజనమున చేపలకు ఎక్కువ ప్రాముఖ్యము కలదు. దేశావసరములకు పోగా మిగిలిన చేపలు జపాను మొదలగు విదేశములకు ఎగుమతి అగుచున్నవి. మొత్తపు చేపల పట్టుబడి 8 లక్షల టన్నులు (1969).

ఖనిజ ద్రవ్యములు దేశమున చాల తక్కువ. ఉన్నవానిలో ముఖ్యమైనది తగరము. తగరపు ఉత్పత్తిలో ఈ దేశమునకు ప్రపంచమున మూడవ స్థానము లభించుచున్నది. లిగ్నైటుకూడ ఉన్నను, దానిని త్రవ్వుట తగురీతిగ జరుగుట లేదు. దేశమున విద్యుదుత్పత్తి 133.95 కోట్ల కి.వా (1965). పింగ్ నది మీద ఉన్న భూమిపాల్ ఆనకట్ట వద్ద ఉన్న జలవిద్యుత్ కేంద్రము

దేశము నందలి కేంద్రములం దన్నింట ప్రముఖము.

దేశపు ఎగుమతులలో బియ్యము, రబ్బరు క్రమ ప్రాముఖ్యములను కలిగియున్నవి. దిగుమతులలో మోటారువాహనములు, తక్కిన యంత్ర పరికర ములు ముఖ్యములు. దేశపు ఎగుమతుల విలువ 1,479.2 కోట్ల బహ్తులు, దిగుమతులు 2624.8 కోట్ల బహ్తులు (1969) దేశపు బడ్జెటరీ వ్యయము 2,864.5 కోట్ల బహ్తులు (1970-71).

**11. సాంఘిక రంగము :** దేశమున 16 నుండి 60 ఏండ్ల వయసుకల వారికి సాంఘిక భీమా వసతి 1954 మొదలుగ అమలున ఉన్నది. మాతాశిశు సంరక్షణ, ఆరోగ్యసేవ, వార్ధక్య సహాయము, వికలాంగ సాహాయ్యము ఇందువలన లభించుచున్నవి; కార్మికుల సంక్షేమమునకై తగు శాసనములు అమలున ఉన్నవి.

దేశమున అక్షరాస్యత 70% (1970). 7 నుండి 14 ఏండ్ల వరకు వయసు కలిగిన బాల బాలికలకు నిర్బంధ, ఉచిత, విద్యావసతి కలదు. దేశమున 69 శిశురక్షణ శాలలలో 22,624 మంది; 25,887 ప్రయిమరీ పాఠశాలలలో 43,08,194 మంది 464 సెకండరీ పాఠశాలలలో 1,87,659 మంది విద్యార్థులు కలరు (1968). ప్రయివేటు పాఠశాలల సంఖ్య ఇందు చేరలేదు. దేశమున 9 విశ్వవిద్యాలయములు (చూలాంలకరణ, దమ్మసాత్, రామకమాంగ్, ఖీంగ్‌మాయ్, కోన్‌కన్, సాంగ్ల రాకుమార, వైద్య, లలితకళా, వ్యవసాయ విశ్వ విద్యాలయములు) కలవు. ఇవిగాక 201 వృత్తి విద్యాశాలలు ఉన్నవి; వీనిలోని విద్యార్థులసంఖ్య 63,922. బాంగ్‌కాక్‌లోని జాతీయ గ్రంథాలయము దేశమునందలి గ్రంథాలయాలలో ప్రముఖము; ఆ నగరమున ఉన్న జాతీయ మ్యూజియంలో తాయి సంస్కృతికి చెందిన కళాఖండములు అనేకములు కననగును. దేశమున 15 దినపత్రికలు తాయి భాష లోను, ఇంగ్లీషున 2, చీనీయ భాషలో 8 దిన పత్రికలు ప్రచురింపబడుచున్నవి; ఇవి అన్నియు బ్యాంగ్‌కాక్ నుండియే వెలువడుచున్నవి. దేశమున మలేరియా మొదలగు ఉష్ణమండల జాడ్యముల వ్యాప్తి నిర్మూలింపబడినది. రోగులకు సాయము చేయుటకై 28,257 శయ్యాసంఖ్యకల 171 ఆసుపత్రులు పని చేయుచున్నవి. వైద్యసంఖ్య 3,823; అనగా 8,550 మంది ప్రజలకు ఒక వైద్యుడు చొప్పున కలరని తెలుచున్నది.

**12. యాత్రా సౌ. :** దేశమున దర్శనీయ స్థలములు పెక్కు కలవు; బ్యాంగ్‌కాక్‌లోని వజ్ర బుద్ధ విగ్రహము, రామాయణ చిత్రములు, చలువ రాతి దేవాలయము పలువురను ఆకర్షించుచున్నవి. విదేశీయ యాత్రికులకు అందరికి పాస్‌పోర్టు విధిగ ఉండవలెను. 1970 లో 4,85,366 మంది విదే శీయులు దేశమును సందర్శించిరి.

**13 ప్రముఖ పౌరులు :** దేశపు ప్రాచీన పాలకులలో పలువురు అత్యంత ఖ్యాతిని ఆర్జించిరి; 1. రామ కంహెగ్ (13 వ శతాబ్ది): తాయి భాషకు లిపిని తొలుతగ ఇతడు రూపొందింపజేసెను. 2. మంగకూట (1851-1868 ప), 3. అతని కుమారుడు చూలాలంకరణ (1866-1910 ప) : వీరిరువురును అధునిక పరిపాలనారీతులను, నాగరిక తను, దేశమున ప్రవేశపెట్టిరి.

---

# 16. తుర్కీ (టర్కీ)

**ముఖ్యనగరము** : అంకారా; **జెండా** : ఎర్రని భూమికపై దండమునకు వెన్ను చూపియున్న తెల్లని నెలవంకయు, ఆ వంకకు ఎదురుగ తెల్లని నక్షత్రమును కలది జాతీయ పతాకము **నాణెము** : తుర్కీ లీరా, ఇది 100 కురులుగ విభక్తము. 1 లీరా = రు 0.50. **కొలతూకములు** : మెట్రిక్ విధానమే శాసనబద్ధము. **కాలపరిగణన** : సా 2 గం. = భారతదేశమున సా. 5 30 ని.

**1. ఉనికి మొ.** : యూరపు - ఆసియాల కూడలి యందు, ఆసియాయందలి ఆసియామైనరును, యూరపులోని త్రేస్ భూభాగమును కలిసి ఏకదేశముగా వ్యవహరింపబడుచున్న ఈ దేశము 25°40-44°43 తూ. తులారేఖలమధ్యను 35°49 42°5 ఉ. అక్షాంశరేఖల మధ్యను విస్తరించి యున్నది తూర్పుపడమరల నిడివి 1,664 కిమీ ; ఉత్తర-దక్షిణముల పొడవు 658 కిమీ. మధ్య



ధరా, ఈజియన్, నల్ల సముద్ర తీరరేఖలను అలముకొనిన ఈ దేశమునకు పశ్చిమమున బల్గేరియా, గ్రీస్ దేశములును; దక్షిణమున ఇరాక్, సిరియాలును; తూర్పున సోవియట్ రష్యా, ఇరాన్ దేశములును సరిహద్దులందున్నవి. దేశ భూతలమున 97% ఆసియాలోను, 3% యూరపునను ఉన్నది. దేశపు మొత్తపు వైశాల్యము 7,79,452 చ. కిమీ. యూరపునందలి తుర్కీ ప్రాంతమును ఆసియా యందలి ప్రాంతమునుండి వేరుచేయుచు బాస్ఫరస్ జలసంధియు, మర్మరాసముద్రమును, డార్డనల్స్ జలసంధియు కలవు. ఈజియన్ సముద్రమున తీరమునకు కొలదిదూరమున ఉన్న అల్పద్వీపములు కొన్నియు తుర్కీరాజ్యమున చేరియున్నవి.

ఆసియామైనరున సముద్రముల తీరప్రాంతము తప్ప తక్కినదంతయు పర్వతమయమగు పీఠభూమి. ఈ పీఠభూమి 'అనటోలియా' అని వ్యవహృతము. అందలి పర్వతములందలి 113 శిఖరములు 3,000 మీ.కు పైబడిన ఎత్తుకలవి. తక్కిన వాని సరాసరి ఎత్తు పశ్చిమమున 600 మీ నుంచి తూర్పున 1,800 మీ. వరకు మారుచున్నది. తూర్పు తుర్కీలో జన్మించి, ఇరాక్‌లోనికి ప్రవహించిన యూఫ్రటిస్, టైగ్రిస్ నదులు తప్ప తక్కిన నదులు ప్రమాణమున చాల చిన్నవి. పీఠభూమిలో తూర్పు ప్రాంతమున వాన్ సరస్సు (3715 చ.కిమీ.) మధ్యప్రాంతమున ఉన్న తుజ్ (ఉప్పు) సరస్సును సరస్సులలో చెప్పుకొనదగినవి. దేశపు

సముద్రతీరరేఖ 5,300 కిమీ. పౌనపున్నను అందు సహజమగు నౌకాశ్రయము నకిలైనది ఏదియులేదు. త్రేసు ప్రాంతము చిన్న గుట్టలవరుసంతో నిండి యున్నది. తుర్కీ-దేశమున అత్యధికభాగము భూకంపమండలమున ఉన్నది; కావున అంతటంతట భూకంపములు సంభవించున్నవి. 1939, డిసెంబరు 29 న ఎరిజియన్ ప్రాంతమున సంభవించిన ఘోర భూకంపపు ఫలితముగ దాదాపు 30,000 జనులు మరణించిరి.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశమధ్యపు అనటోలియా పీఠభూమియందు ఉష్ణోగ్రత 54° ఫా. నుండి 64° ఫా. కు మారుచుండును. నల్ల సముద్రతీరము కొంతవరకు మేలుగ (57° నుండి 59° వరకు) ఉండును. ఉత్తర ఈజియన్-మర్మరా ప్రాంతమున 63° ఫా. నుండి 57° ఫా. వరకు ఉష్ణోగ్రత మారుచుండును. తక్కిన సముద్ర తీరములందు సరాసరి ఉష్ణోగ్రత 68°–63°ఫా. మధ్య ఉండును; అచట సాలుసరి వర్షపాతము 69 నుండి 108 సెం. మీ. వరకు ఉండును. ఉత్తర ఈజియన్-మర్మరా ప్రాంతమున 54–49 సెం. మీ. మధ్యను, నల్ల సముద్రపుతీరమున 69–246 సెం మీ. మధ్యను; అనటోలియా పీఠభూమియందు 29 5–63.75 సెం.మీ. మధ్యను వర్షపాతము కలదు. తుర్కీ-దేశమున తూర్పున ఉన్న మూడవవంతు భూతలము దేశమంతట అధిక శీతల ప్రాతముగ పేరుగన్నది. అచటి సరాసరి ఉష్ణోగ్రత 48°–39° ఫా మధ్యను; వర్షపాతము 39.25–49.25 సెం. మీ. మధ్యను ఉండును. దేశమున వృక్షసంతతి, ప్రాంతములను అనుసరించి, వివిధరీతుల మారుచున్నది. దక్షిణ, నైరృతి, ఉత్తర తుర్కీ-ప్రాంతము లందలి పర్వత సీమలలో సూచీ పత్ర వృక్షజాతియు, ఆకురాల్పు తరగతికి చెందిన పెద్దరకపు వృక్షములును కననగును. వీని కలప చాల విలువగలది. వన్య జంతువులలో నల్ల లేళ్లు, అడవిపందులు. చిరుత పులులు పెద్దవిగ లెక్కింపదగినవి. నానా విధముల పక్షిజాతులును, సర్పజాతులును కననగుచున్నవి.

**3. జనసంఖ్య మొ.:** ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు అర్మినాయిడ్, మధ్యధరాజాతుల సమ్మేళనముగ భావింపదగియున్నారు; 1970 జనాభా లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 3,56,66,549. దేశపు నగరములలో ఇస్తాన్‌బుల్ (జ. సం. 22,47,630), అంకారా (జ. సం. 12,08,791) పేర్కొనదగినవి. ఈ దేశపు పౌరులు గనే లెక్కింపబడుచు పశ్చిమజర్మనీ, ఆస్ట్రియా, బెల్జియం, నెదర్‌లాండ్సు, స్విజర్‌లండులలో కార్మికులుగ ఉన్నవారు 6,36 800 (1972) మంది కలరు. దాదాపు 92% ప్రజల మాతృభాష తుర్కీ. ఊరల్ - అల్టాయిక్ భాషా కుటుంబమునకుచెందిన ఈ భాష అరబ్బీ - పార్సీలచే ప్రభావితమై 1930 ప్రాంతమువరకు అరబ్బీలిపిలో వ్రాయిబడెడిది కాని అంతట జరిగిన లిపి, భాషా సంస్కరణలను అనుసరించి, అప్పటినుండి ఇది రోమన్ లిపిలో వ్రాయబడుచు, అరబ్బీ పార్సీల ప్రభావమునుండి విడివడినది. కుర్దిష్‌ను మాతృభాషగా కలవారు దాదాపు 6% కలరు. వీరు, సిరియా, ఇరాకులతో ఈ దేశమునకు గల సరిహద్దు ప్రాంతమున వసించుచున్నారు. అరబ్బీ మొదలగు భాషలను మాటాడువారు చాల అత్యల్ప సంఖ్యలలో ఉన్నారు. అయినను ప్రజలలో దాదాపుగ అందరికిని తుర్కీ-భాష తెలియును. దేశ ప్రజలలో 99.5% ప్రజలు ముస్లిములు. దేశమున మతప్రసక్తిలేని ప్రభుత్వము ఉండుటవలన, మత, ఆరాధనా స్వాతంత్ర్యములు ప్రజలకు కల్పింపబడినవి. అల్పసంఖ్యాకమతము లందు క్రైస్తవము ప్రముఖము.

**4. సమాచార సా.:** ప్రభుత్వపు పర్యవేక్షణకు లోబడిన ఒక అర్థాధికార సంస్థ దేశమందలి తంతి,

తపాలా, రేడియో టెలిఫోన్ సౌకర్యములను నిర్వహించుచున్నది. దేశమునందలి దాదాపు 6 లక్షల టెలిఫోనులలో మూడవవంతు ఇస్తాన్‌బుల్ నగరమునను, ఆరవవంతు అంకారా నగరమునను ఉన్నవి. దేశమున 12 నగరములలో రేడియో ప్రసార కేంద్రములున్నను, అంకారా నగరమున ఉన్నదియే అతిసమర్థత కలది. అంకారా లోనే ఒక టెలివిజన్ ప్రసారకేంద్రము కలదు. దేశమున దాదాపు నలుబదిలక్షల రేడియోసెట్లును, ఒకటిన్నర లక్ష టెలివిజన్ సెట్లును కలవు (1972).

**5 యాన సౌ.** : దేశము మిట్టపల్లముల భూమి యగుటవలన ప్రయాణమార్గముల నిర్మాణము అతివ్యయ ప్రయాసలను కలిగించుచున్నది; అందువలన ఆ కార్యక్రమము త్వరితగతిలో నడచుట లేదు. దేశమున అన్ని విధముల రోడ్ల మొత్తపు నిడివి 1,24.790 కిమీ.; త్రేస్‌ను తక్కిన తుర్కీతో భూమార్గముద్వారా కలుపుటకై బాస్ఫరస్ జలసంధిపై 1560 మీ. పొడవుగల విశాలమగు వంతెనను నిర్మించు కృషి 1970 లో మొదలై సాగుచున్నది. దేశమున మొత్తపు రైలు మార్గముల నిడివి 9,831 కిమీ.; అంకారా, ఇస్తాన్‌బుల్ నగరములును, నల్లసముద్ర మధ్యధరా సముద్ర తీరపట్టణములును దేశమునందలి తక్కిన ప్రాంతములతో ఈ రైలు మార్గమువలన కలుపబడినవి. సముద్రపురేవులలో ఇస్తాన్‌బుల్, ఇజ్‌మిర్, సమ్‌సున్, మెర్సిన్, ఇస్కందరున్, త్రబ్జాన్ ప్రముఖములు. మొత్తము 76.6 లక్షల టన్నేజి కల వ్యాపారనౌకలను దేశము కలిగియున్నది (1969). ప్రభుత్వపు ఆధ్వర్యమున నిర్వహింపబడు విమానయానసంస్థ కలదు. ఇస్తాన్‌బుల్, అంకారాలలోని విమానాశ్రయములనుండి, ప్రపంచపు పలుదేశములకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర** : యూరప్-ఆసియాల కూడలిలో ఉన్న ఈ దేశము అతి ప్రాచీన కాలమునుండియు అనగా క్రీ పూ 7000 ప్రాంతమునుండియు జనావాసితముగ ఉండినటుల త్రవ్వకముల వలన తెలియవచ్చుచున్నది. చారిత్రక కాలమున క్రీ పూ. 2500 మొదలుగ హిట్టైట్, ఉరర్తు, ఫ్రిజియన్ జాతుల ప్రజలు క్రమముగ అంతటంతట రాజ్యములను నెలకొల్పి, పాలించి, నాగరికతలను పోషించిరి. క్రీ పూ. 546 లో ఈ ప్రాంతము పారసీకుల వశమై, తదనంతరము అలెగ్జాండరు దండయాత్ర వలన గ్రీకుల వశమై, పిదప క్రీ.పూ. 30 లో రోమన్ సామ్రాజ్యమున భాగమైనది. రోమన్ సామ్రాజ్యము క్రీ.శ. 395 లో ద్విధా విభక్తమైనపుడు, ఈ ప్రాంతము ప్రాచ్య రోమన్ రాజ్యమున అంతర్భాగమైనది. ప్రాచ్యరోమక ప్రభువులు ఈ దేశమునందు, ప్రాచీనకాలమున ఉండి శిథిలమైన బైజాంటియమ్ నగరపు స్థానమున కాన్‌స్టాంటినోపిల్ నగరమును నిర్మించి, దానిని ముఖ్యనగరముగ చేసికొని రాజ్యమును పాలించిరి. (ఈ నగరము ఇపుడు 'ఇస్తాన్‌బుల్' అను పేరున వ్యవహృతము). రోమన్ పాలనలో దేశమున క్రైస్తవ మతము ఎల్లెడల వ్యాపించినది. క్రీ.శ. 1071 లో ఈ దేశమునందలి అనటోలియా, సెల్జుక్‌శాఖకు చెందిన, తుర్కులకు వశమైనది. ఈ తుర్కులు ఈశాన్య ఆసియాలోని ఒక సంచార యోధజాతికి చెందినవారు. ఇందలి వివిధపు తెగలు క్రీ.శ. 7 వ శతాబ్ది మొదలుగ ఆసియాలోని పలు ప్రాంతములకు పయనించి అటనట పెక్కు రాజ్యములను వశపరచుకొనినవి. అనటోలియాలోని సెల్జుక్ తుర్కులు, అటకు చేరుటకు ముందుగనే, ఇస్లామును అవలంభించిరి. కాని 13వ శతాబ్దిలో మంగోలులు ఆసియాలోని వివిధ ప్రాంతములను జయించినపుడు అనటోలియాలోని సెల్జుక్ తుర్కులను సైతము నిర్మూలించిరి. ఆ తరువాత

లట ఓటోమన్ తుర్కులు అధికారమును నెలకొల్పిరి. వీరును ముస్లిములే. ఆ విధముగ ఒక వైపున అరబ్ ముస్లిముల నుండియు, వేరొకవైపున తుర్కీ ముస్లిములనుండియు జరుగు దండయాత్రలను ఎదుర్కొని ప్రాచ్యరోమక సామ్రాజ్యము నాలుగు శతాబ్దములు మనుగడను సాగించినది కడకు క్రీ.శ. 1453 లో ఓటోమన్ తుర్కులు కాన్‌స్టాంటినోపుల్‌ను వశ పరచుకొనుటతో ఆ సామ్రాజ్యము అంతరించినది. దేశమందలి క్రైస్తవ జనాసీకమున అత్యధికభాగము యూరపులోని వివిధదేశములకు తరలిపోయినది. దేశమంతయు అంతట తుర్కుల నివాసభూమి అయినది. కాలక్రమమున 16 వ శతాబ్ది అంతమునకు పరిసరభూములను పెక్కింటిని జయించి ఓటోమన్ పాలకులు, యూరప్, ఆసియా, ఆఫ్రికా ఖండములలో వ్యాపించిన ఒక విశాల సామ్రాజ్యమునకు అధిపతులైరి. ఓటోమన్ సామ్రాట్, ముస్లిం మత పీఠాధిపతిగ, కలీఫా అను బిరుదును వహించెను. అయినను 16వ శతాబ్ది మొదలుగ యూరపీయ దేశములు ఆధునిక విజ్ఞాన సాహాయ్యమున పురోగమింపగ, ఈ సామ్రాజ్యము మాత్రము మతాధారపు మధ్యయుగపు నాగరికతతో మనినది.

ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున ఓటోమన్ సుల్తాన్, జర్మన్ పక్షమున పోరాడి, విజితుడయ్యెను (1918). తత్ఫలితముగ సామ్రాజ్యమునందలి పాలిత దేశములు తుర్కీనుండి వేరుపరుప బడుటయేగాక, తుర్కీ సైతము మిత్రరాజ్యముల ఆక్రమణకు లోనయ్యెను. గ్రీకు సేనలు దేశముపైకి దండెత్తినవి. ఇట్టి సమయమున ముస్తఫా కెమాల్ అను యోధుడు జాతిని సమీకరించి, సేనలను సమాయత్తపరచి, గ్రీకు సేనలను ఓడించి తరిమివైచెను (1922) అనంతరమున అతడు ఒక జాతీయ ప్రభుత్వమును ఏర్పరచి, నామమాత్రపు అధికారముతో మిత్రరాజ్యముల చేతి కీలుబొమ్మగ ఉన్న, సుల్తాన్‌ను పదవినుండి తొలగించి మిత్ర రాజ్యములతో రాయబారములు సలిపి, తుర్కీ దేశపు స్వతంత్ర ప్రతిపత్తిని వారు గుర్తించునటుల చేసెను (1923). అంతట దేశము గణతంత్ర రాజ్యముగ ప్రకటితమై కలీఫాపదవియు, రాజవంశపు హక్కులును రద్దుచేయబడినవి. ముస్తఫా కెమాల్, తుర్కీ గణతంత్రరాజ్యపు ప్రథమ అధ్యక్షుడయ్యెను. అతడు దేశపు దుస్థితిని గ్రహించి, దేశమును ఆధునికము చేయుతలంపుతో, త్వరితగతిలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ, భాషా, సాంస్కృతిక రంగములందు పలుసంస్కరణలను ప్రవేశపెట్టి, ఆనతికాలమున జనసమాజపు స్వరూపమునే మార్చివేసెను. అతడు మరణించిన (1938) తదుపరి సైతము అతడు పెట్టిన వరవడిలోనే నడచి మత ప్రసక్తిలేని లౌకిక ప్రజా తంత్ర గణరాజ్యముగ, ఈ దేశము పురోగమించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈ దేశము తటస్థత వహించి వర్తించినది. ఆ యుద్ధము ముగిసిన వెనుక యు స్టే. వైపునకు మొగ్గి నేటో, సెంటోలను సైనిక ఒడంబడికలలో భాగస్వామినియై తదాదిగ యు.స్టే. వలన సైనిక, ఆర్థిక, సాహాయ్యములను విరివిగ పొందుచున్నది. 1960 లో, అడ్నాన్ మెండరిస్ అనువాని నాయకత్వమున ఉన్న ప్రభుత్వము ప్రజానీకపు వివిధ స్వాతంత్ర్యములను అరికట్టినందున, సైన్యము తిరుగుబాటుచేసి ప్రభుత్వమును కూలద్రోసి, 1961 లోని ఎన్నికలద్వారా వేరొక ప్రభుత్వమును నెలకొల్పినది. మరల 1971 లో కూడ సైన్యము జోక్యము వహించి అప్పటి ప్రధానిని తొలగించి, వేరొక ప్రధాని మంత్రివర్గమును ఏర్పరచునటుల చేసినది.

**7. పరిపాలన :** 1961 లో రూపొందింపబడి, తదనంతరమున 1971 లో కొన్ని సవరణలను పొందిన రాజ్యాంగవిధానమును అనుసరించి ఇట పాలన నిర్వహింపబడుచున్నది. శాసన నిర్మాణాధికారము జాతీయ మహాసభయందు న్యస్తము. ఈ

మహాసభయందు ప్రతినిధుల సభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధుల సభయందలి 450 మంది సభ్యులును, నాలుగేండ్లకు ఒక మారి ఎన్నుకొనబడుదురు, శిష్టసభలోని 150 మందిని ప్రజలు ఎన్నుకొనగ 15 మందిని అధ్యక్షుడు నియమించును. శిష్టసభా సభ్యుని పదవీ పరిమితి 6 సంవత్సరములు. అయినను మూడవవంతు సభ్యులు రెండేండ్లకు ఒకతూరి ఎన్నుకొనబడురీతిగ అది వ్యవస్థితము. సార్వజనిక, అపరోక్ష, రహస్య, వయోజన వోటింగు పద్ధతిని, నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమును అనుసరించి దేశమున ఎన్నికలు జరుగును. పార్టీ పట్టికలపై, బహునిర్ణాయిక రీతిలో రాష్ట్రముల వరుసన ఎన్నికలు నిర్వహింపబడును. జాతీయ మహాసభ దేశాధ్యక్షుని ఎన్నుకొనును. ఆతని పదవీకాల పరిమతి 7 ఏండ్లు. అసెంబ్లీ సభ్యులనుండి ప్రధానిని అధ్యక్షుడు నియమింపగ, ప్రధాని మంత్రివర్గమును నియమించుకొని, జాతీయ మహాసభకు బాధ్యత వహించి పాలించును. దేశమున పరిగణనపొందిన 10 రాజకీయ పక్షములు పనిచేయు చున్నవి. వీనిలో జస్టిస్ పార్టీ, రిపబ్లికన్ పీపుల్స్ పార్టీ, ఎక్కువగా ప్రజాదరణను పొందినవి. న్యాయశాఖ స్వతంత్రతతో వర్తించుచున్నది. 1926 కు పూర్వమున కొరానును అనుసరించిన న్యాయపరిపాలన జరుగుచుండెడిది కాని అపుడు ముస్తఫా కెమాల్ ప్రవేశపెట్టిన సంస్కరణలను అనుసరించి పౌరన్యాయమునకై స్విజర్లండ్ దేశపు పౌర న్యాయసంహితయు, దండ (క్రిమినల్) న్యాయమున ఇటలీ దేశపు దండన్యాయ సంహితయు, దేశపరిస్థితులకు అనుగుణములగు కొలదిమార్పులతో జాతీయ మహాసభచే ఆమోదితములై అమలులోనికి వచ్చినవి. స్థానిక పరిపాలన, ఎన్నుకొనబడిన సంస్థల సహాయమున గవర్నరులవలన నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** ప్రస్తుతమున దేశమునకు 4 లక్షల మందిగల భూతలసేనయు; 40,000 మందిగల నావికసేనయు, 50,000 మందిగల వైమానిక సేనయు కలదు. అన్ని విధములైన సేనలును ఆధునిక ఆయుధములను కలిగియున్నవి. యు. స్టే. సహాయమున అతినవీనములగు విమానములను, కవచీకృత శకటములను, ఆయుధ సామగ్రిని ఈ దేశము ఆర్జింపగలిగినది (1972).

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. వ్యవస్థాపక సభ్యదేశములలో ఈ దేశమును కలదు. నేటో అను అట్లాంటిక్ రాజ్యముల కూటమియందును, సెంటో అనబడు మధ్యప్రాచ్య రాజ్య కూటమియందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. భారతదేశముతోను, తక్కిన ప్రముఖ ప్రపంచ రాజ్యములతోను దేశమునకు దౌత్య సంబంధములు కలవు.

**10 ఆర్థికరంగము :** దేశపు ఆర్థికరంగమున వ్యవసాయము ప్రధానస్థానమును ఆక్రమించి ఉన్నది. దేశమున ఉన్న 1.375 కోట్ల కార్మికులలో 72.8% వ్యవసాయమును, ఆశ్రయించి జీవించు చున్నారు (1970). వ్యవసాయయోగ్యమగు భూమి యంతయు సేద్యమున ఉన్నదని చెప్పవచ్చును. దేశపు మొత్తము వైశాల్యమున దాదాపుగ మూడవ వంతు వ్యవసాయమున ఉన్నది. వ్యావసాయిక ఉత్పత్తులలో ఆహారధాన్యములకు, అందును గోధుమకు, ప్రాధాన్యము కలదు. పంటలు సరిగా ఉన్న సంవత్సరములందు, ఈ దేశము ఆహార ధాన్యములలో కొంతభాగమును ఎగుమతి చేయు చున్నది. పొగాకు, ప్రత్తి ముఖ్యపు రొక్కపంటలు. దేశము ఎగుమతుల విలువలో అయిదింట రెండు వంతులు పొగాకు, ప్రత్తి వలన లభించుచున్నది. సీమబాదము మొదలగు పప్పుకాయలను, ఫలములను తుర్కీ ఎగుమతి చేయుచున్నది. సాలుసరి ఎగుమతుల విలువలో అయిదవవంతు ఇందువలన లభించును పశుసంపద, సంఖ్యారీత్యా, విరివిగ

కలదు; కాని వాని పోషణ సక్రమైన రీతిలో జరుగుట లేదు. గొర్రెలును, మేకలును కలసి దాదాపు 6 కోట్లు కలవు. శ్రేష్ఠమగు ఉన్ని ఉత్పత్తికి ఈ దేశము పేరొందినది. తీరములందు చేపల పరిశ్రమ విరివిగ సాగుచున్నది. దేశ వైశాల్యమున 13% ఆక్రమించిన అడవుల వలన విలువగల కలప లభించుచున్నది. 1967 లో కలపవలన దేశపు సంపదలో 1.66 కోట్ల డాలర్ల విలువగల ఆదాయము లభించినది. ఖనిజ సంపదను గురించిన శాస్త్రీయాన్వేషణ చక్కగ జరుపబడలేదు. తెలియ వచ్చి. ఉత్పత్తి సాగుచున్నవానిలో ప్రముఖమైనది రాక్షసిబొగ్గు. ప్రపంచమున ఉత్పత్తినిబట్టి, రాక్షసి బొగ్గునకు సంబంధించినంతవరకు, మూడవ స్థానమును ఈ దేశము ఆక్రమించుచున్నది. 1971 లో 78,48,000 టన్నుల బొగ్గు ఉత్పత్తి జరిగినది. పెట్రోలుకై జరిగిన అన్వేషణకు ఫలితముగ కొన్ని చోట్ల చిన్నబావులు కనుగొనబడి, 34,56,000 టన్నుల పెట్రోలు ఉత్పత్తి అయినది (1971); కాని దేశావసరములకు ఇది సరిపోదు. దేశమున విద్యుదుత్పత్తి సమర్థత 1086.17 కోట్ల కి. వాట్లు (1970). తలసరి విద్యుద్వినియోగము 207 కివా. (1968). పరిశ్రమలలోనెల్ల ప్రముఖమైనది జవుళి పరిశ్రమ. ఆహార పరిశ్రమలలో ప్రముఖము బీటు చక్కెర పరిశ్రమ; దేశావసరములకు తగినంతగ చక్కెర ఇందువలన లభించుచున్నది. తక్కిన వానిలో సిమెంటు, కాగితపు పరిశ్రమలు గణనీయములు. దేశమున ప్రభుత్వరంగమున పెద్ద పరిశ్రమలు ఉన్నను, పారిశ్రామికోత్పత్తిలో మూడింట రెండువంతులు ప్రయివేటు సంస్థల వలన జరుగుచున్నది. దేశపు కార్మిక శక్తి యందు 10.4% పరిశ్రమలను ఆశ్రయించి జీవించుచున్నది. దేశపు వెరసి జాతీయోత్పత్తి 9,400 కోట్ల తుర్కీలీరాలు (1970). విదేశములలో పనిచేయు తుర్కీవారు దేశమునకు పంపించు మొత్తముల వలన దేశమునకు విదేశీయ వినిమయ ద్రవ్యము ఎక్కువగ సమకూరుచున్నది దీని విలువ 27.3 కోట్ల డాలర్లు (1970). దేశపు ఎగుమతుల విలువ 909 కోట్ల తు. లీ; దిగుమతుల విలువ 1772.5 కోట్ల తు. లీ (1971), చెల్లింపులలోటు వలన దేశము విదేశములనుండి, ముఖ్యముగ యు. స్టే. నుండి, ఋణములను చేయవలసి వచ్చుచున్నది. బడ్జెటరీవ్యయము 3847.2 కోట్ల తు. లీ. (1971-72). దేశమున ప్రభుత్వమునకు చెందిన ఒక కేంద్రబ్యాంకును, 50 తక్కువిధముల బ్యాంకులును, ప్రయివేటు రంగమున 33 బ్యాంకులును పనిచేయుచున్నవి

**11. సాంఘిక రంగము :** అంతర్జాతీయ నియమములను అనుసరించిన కార్మిక శాసనములు దేశమున అమలునందున్నవి. గృహవసతి పట్టణములందు ఆధునిక రీతిలో ఉన్నను పల్లెపట్టులందు ప్రాతపడిన పద్ధతులను అనుసరించియే ఉన్నది. అచట గృహవసతి ఆధునికము చేయుటకు దేశపు పంచవర్ష ప్రణాళికలలో వసతి కల్పింపబడినది. ఇప్పుడు మూడవ పంచవర్ష ప్రణాళిక (1973-77) అమలున ఉన్నది. దేశమున అక్షరాస్యత (ఏడు ఏండ్లపై వయస్సువారిలో) 50% (1969). దేశమున 51,32,786 విద్యార్థులతో 39,100 ప్రాథమిక విద్యాశాలలును; 11,47,957 విద్యార్థులతో 2,467 మాధ్యమిక విద్యాశాలలును; 2,62,701 విద్యార్థులతో 838 వృత్తి విద్యాశాలలును కలవు. దేశమున తొమ్మిది విశ్వవిద్యాలయములు కలవు; వీనిలో 3 అంకారాలోను, 3 ఇస్తాన్‌బుల్‌లోను, ఒకటి ఎర్‌జురమ్‌లోను, ఒకటి ఇజ్‌మిర్‌లోను, ఒకటి త్రబ్‌జోనులోను ఉన్నవి. వీనికి సంబంధించిన 156 కళాశాలలలోను 1,69,672 విద్యార్థులు పఠించుచున్నారు (1971-72). దేశమున ప్రచారమున ఉన్న 443 తుర్కీభాషా దినపత్రికలలో ఇస్తాన్‌బుల్‌నుండి 55, అంకారానుండి 22 వెలువడుచున్నవి. గ్రీకు

భాషలో రెండును, ఆర్మీనియన్‌లో రెండును, ఫ్రెంచిలో ఒకటియు, ఇంగ్లీషులో ఒకటియు దిన పత్రికలు వెలువడుచున్నవి. ఇస్తాన్‌బుల్‌లోను, అంకారాలోను అతి ప్రాచీన వస్తువులును వ్రాత ప్రతులును గల మ్యూజియములు కలవు. ఇస్తాన్‌బుల్‌లోని తోప్‌కాపీ రాజభవనపు మ్యూజియమ్‌లోని గ్రంథాలయము సుప్రసిద్ధము.

**12.** **యాత్రా సౌ.:** దేశమునందు ఎఫీసస్, పెర్‌గామమ్, ఇలియమ్, హాలీకర్నాసస్, మొదలగు ప్రాచీనగ్రీకు నాగరికతా కేంద్రములందలి అవశేషములను, ఇస్తాన్‌బుల్‌లోని రోమన్ భవనములను దర్శించుటకు యాత్రికులనేకులు దేశమును దర్శించుచున్నారు. ఇట్టి వారి సంఖ్య 9,35,628; వీరి వలన ఆదాయము 7.56 కోట్ల డాలర్లు (1972). 'నేటో' రాజ్యములలో పోర్చుగల్ తప్ప తక్కిన వానినుండి వీసాలేకనే యాత్రికులు ఈ దేశమునకు వచ్చి మూడునెలలవరకు ఉండవచ్చును. తక్కిన దేశములవారు వీసాను పొందవలెను. ప్రభుత్వము యాత్రికుల సౌకర్యమునకై, అవసరమగు తావులందెల్ల వసతి సదుపాయములను కల్పించినది.

**14.** **ప్రసిద్ధ పౌరులు :** 1. సుల్తాన్ సులేమాన్ I (1499-1566) తుర్కీ సామ్రాజ్యమునకు పునాదులను వేసినవాడు; 2. ముస్తఫా కెమాల్ పాషా (1881-1938) : తుర్కీ దేశమును గణతంత్ర రాజ్యముగను, ఆధునికముగను తీర్చిదిద్ది, 'అటా తుర్క్' అను ఉపనామమున ప్రసిద్ధిని వహించినవాడు.

---

# 17. నేపాల్

**ముఖ్యనగరము :** కాట్మండూ; **జెండా :** నడుమన కలిసియున్న రెండు అరుణ త్రిభుజములకు, కడయంచులు నీలిరేఖలో అలంకరింపబడగ పై త్రిభుజమున చంద్రరేఖయు, దిగువ దానిపై,




పటము 18.

సూర్యబింబమును చిత్రింపబడినది; **జాతీయగీతము :** 'జయ నేపాల భూమీశా, మహావీరా, .....' అను అర్థము కలది; **నాణెము :** నేపాలీ రూపాయి (ఒక నే. రు. = రూ. 0.74); **కొలతతూకములు :** భారతదేశపు విధానపువే ఇట వాడుకలో కలవు; **కాలపరిగణన :** భారత కాలమానమే ఇట అవలంబింపబడినది.

**1.** **ఉనికి మొ. :** హిమాలయ పర్వత సానువులందు 26°20′ - 30°10′ ఉ. అక్షాంశరేఖల మధ్యను, 80°15′ - 88°15′ తూ. తులారేఖల మధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున చీనాదేశపు తిబెట్ ప్రాంతమును; తూర్పున భారతదేశమునందలి సిక్కిం, పశ్చిమ బెంగాల్ రాష్ట్రములును; దక్షిణ, పశ్చిమములందు భారతదేశపు బీహార్, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రములును సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 1,41,400 చ. కిమీ. దేశపు తూర్పు - పడమరల నిడివి 840 నుండి 880 కిమీ. ల వరకును, ఉత్తర దక్షిణముల

వెడల్పు 96 నుండి 200 కిమీ. ల వరకును మారు చుండును. హిమాలయ పర్వతశ్రేణియందు 800 కిమీ. నిడివిగల భాగము ఈ దేశమున ఉన్నది. దేశమునను, దేశపు సరిహద్దులందును, ప్రపంచమునందెల్ల ఉన్నతములుగ పేరొందిన పర్వతములు పెక్కు కలవు.

దేశము, భౌతికరీత్యా మూడు విభిన్న ప్రాంతములుగ విభజింపదగి యున్నది: ఇందు తొలుతటిది దక్షిణముననున్న తెరాయ్ దేశ వైశాల్యమున ఇది నాలుగవ ప్రాంతమును ఆక్రమించి. దేశపు జనసంఖ్యలో మూడవవంతును కలిగియున్నది. ఉత్తర హిందూస్థానపు మైదానమును ఆనుకొని యుండు ఈ ప్రాంతమున ఆ మైదానపు లక్షణములే అనేకములు కన్పట్టును. ఈ తెరాయ్‌లో ఏనుగులు, పెద్దపులులు మొదలగు భారతదేశీయ వన్యజాతి జంతువులు విరివిగ వసించుచుండును. ఈ అడవులు వేటకొరకే కాక. కలప మొదలగు వన్య ఫలసాయ సేకరణకును ఉపయోగపడుచున్నవి.

ఇక రెండవది, తక్కిన రెంటికన్న విస్తృతి యందు మిన్న. ఇందు చురియా, మహాభారత్, హిమాలయ పర్వతశ్రేణులు తూర్పు పడమరలకు వ్యాపించిఉన్నవి. ఈ పర్వతములు ఉత్తరమునకు పోనుపోను ఎత్తున పెరుగుచు, కడకు నేపాల్ దేశము సరిహద్దున ఎవరెస్టు (గౌరీ శంకర) శిఖరమున అత్యున్నత స్థాయిని చేరుకొనుచున్నవి. ఈ శిఖరపు ఎత్తు 8847.7 మీ. ఈ పర్వతశ్రేణుల నుండి పెక్కునదులు ప్రవహించుచున్నవి. వీనిలో మూడునదులు, టిబెట్‌న జన్మించి, ఈ పర్వత శ్రేణులగుండా దక్షిణమునకు ప్రవహించి క్రమముగ కర్నాలీ గండక్, కోసీనదుల పరీవాహ ప్రదేశములకుచేరి, నేపాల్‌లోని, తక్కునదులవలెనే, భారత భూమిని చేరి గంగానదీ మండలమున ఉపనదులుగ పరిణమించుచున్నవి.

ఇక మూడవ ప్రాంతము కాట్మండూలోయ; దీనినే నేపాల్‌లోయ అనియు వ్యవహరింతురు. హిమాలయ, మహాభారత పర్వతశ్రేణులమధ్య నెలకొనియున్న ఈ ప్రాంతపు వైశాల్యము 598 చ. కిమీ. మాత్రమే. అయినను భూమి అత్యంత సారవంతము దేశమునందంతట అత్యున్నత జన సాంద్రతకల ప్రదేశముగ ఇది పేరొందినది. ఈ లోయలోనే ముఖ్యనగరమగు కాట్మండూ, సముద్ర మట్టమునకు 1,433 మీ. ఎత్తున, నెలకొని ఉన్నది.

ఈ దేశపు సరిహద్దుననుండి ప్రపంచమున ఉన్నతతమమని పేరొందిన ఎవరెస్టు శిఖరమును ప్రప్రథమముగ 29 మే, 1953 న, న్యూజీలాండు వాని ఎడ్మండ్ హిల్లరీయు, తెన్‌జింగ్ నోర్కే అను షెర్పాయు ఆరోహింపగలిగిరి.

**2. శీతోష్ణస్థితి మొ.:** నేపాల్ లోయకు దిగువను, తెరాయ్‌లోను, ఉష్ణమండలపు శీతోష్ణస్థితి కననగును. తక్కిన ప్రాంతములందు ఎండకాలమున సైతము ఉష్ణోగ్రత 90° ఫా. ను మించదు. లోయయందు వర్షపాతము సాలీనా 150 సెం. మీ. వరకు ఉండును; జూన్‌నుండి అక్టోబరు వరకు వర్షర్తువు. లోయకు ఉత్తర భాగమున ఉష్ణత క్రమక్రమముగ తగ్గి అత్యుత్తర ప్రాంతమున సంవత్సరమున అత్యధిక భాగమునందు, పర్వతములు మంచుతో నిండియుండును. దేశమునందంతట తుపానుల బెడద ఎక్కువ; భూకంపములవలన భయమును అంతటంతట కలదు. అత్యుత్తర ప్రాంతమున సూచ్యగ్రజాతి వృక్షపు అడవులును; వివిధ పుష్పజాతుల మొక్కలను కననగును. అచటి కొండలలో చమరమృగములు, కస్తూరిమృగములు విరివిగ కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1969 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,08,45,000. దేశపు నగరములలో కాట్మండూ (జ. సం.-2

ంక్షలు), పటన్ (జ. సం. 60 వేలు), భట్‌గాంవ్ (జ. సం 45 వేలు) పేర్కొనదగినవి. తూర్పు ప్రాంతమునుండి వచ్చిన మంగోలియన్ జాతులును, భారతదేశమునుండి వచ్చిన ఆర్యజాతులును ఈ దేశ ప్రజానీకమున చాలవరకు సమ్మిశ్రణము చెందినవి. దేశప్రజలలో 55% కు మాతృభాష నేపాలీ: మాతృభాషగ కాకపోయినను, ఇంకను 30% కు ఇది సుపరిచితమగు భాష. అందువలన నేపాలీయే సాధికార భాషగ పరిగణనను ఆర్జించినది. ఇక ఉత్తరప్రాంతపు భుటీయాలలో తిబెతీ భాషయు, తక్కినవారిలో నేపాలీయు మాతృభాషలుగ ప్రచార మున ఉన్నవి. ఇవిగాక హిందీ, పహాడీ, నేవారీ మొదలగునవియు కొన్ని అల్పసంఖ్యాక వర్గములలో ప్రచారమున నున్నవి.

దేశపు రాజవంశము హిందూమతమునకు చెంది యున్నది. ప్రజలలో బౌద్ధ, హిందూమతములు కలగాపులగముగ ఆదరింపబడుచున్నవి సామాన్య ప్రజలకు సంబంధించినంతవరకు ఈ రెండు మత ములమధ్య విభేదము కన్పట్టదు. దేశ ప్రజలలో 1% ముస్లిములు క్రైస్తవమత సంఘములు నిషేధింప బడకున్నను, క్రైస్తవమత ప్రచారము నిషిద్ధము.

**4. సమాచార సౌ** : దేశమునందలి పోస్టు, తంతి, టెలిఫోను వసతులను భారత ప్రభుత్వము 1965 వరకు నిర్వహించినది. ఏప్రిల్ 13, 1965 న ఆ వసతులను నేపాల్ ప్రభుత్వము వశ పరచుకొని తదాదిగ నిర్వహించుచున్నది. భారత సరిహద్దు ప్రాంతపు వీరగంజ్‌తోను, తయ్‌లోని కొన్ని పట్టణములతోను కాట్మండూకు టెలిఫోను వస తులుకలవు. భారత, యు. స్టే. దేశములతో కుదుర్చు కొనిన ఒక ఒడంబడికను అనుసరించి 56 వైర్ లెస్ స్టేషనులతో ఒక సమాచార మండలమును నెలకొల్పుటకు కృషి జరుగుచున్నది కాట్మండూలో, ఒక రేడియో ప్రసార కేంద్రము కలదు. ఇటనుండి ఇంగ్లీషు, హిందీ, నేపాల్, నేవారీలలో ప్రసార ములు జరుగుచున్నవి.

**5. యాన సౌ.** : దేశపు భూతల పరిస్థితిని బట్టి రోడ్డు నిర్మాణము అతికష్ట సాధ్యము. భారత, యు. స్టే. సహకారముతో 1,440 కిమీ. పొడవున రోడ్ల నిర్మాణమునకై కృషి జరుగుచున్నది. దేశపు తూర్పు పడమర ప్రాంతములను కలుపు హైరోడ్డు ఇందులో ముఖ్యముగ పేర్కొనదగినది. తిబెత్ సరిహద్దునుండి కాట్మండూవరకు చైనీయ ప్రభుత్వ సహాయముతో రోడ్డు నిర్మింపబడినది. ఇప్పటివరకు మైళ్లపింగా మొత్తంమీద 600 కిమీ. నిడివిగల చక్కని రోడ్డుమార్గములు తయారైనవి. ఒక చిన్న నేరోగేజి రైలుమార్గము కలదు; దీని నిడివి 48 కిమీ. మాత్రమే. భారత సరిహద్దునందలి రక్షాల్‌ను, తెరాయ్‌లోని అంలేక్‌గంజ్‌కు ఇది కలుపుచున్నది. అచటినుండి సరకులను కాట్మండూకు (అనగా 1,372 మీ. ఎత్తునకు చేరవేయుటకు) విద్యుత్తుతో పనిచేయు ఒక ఉయ్యాల మార్గము (రోప్-వే) ఏర్పరుపబడినది.

దేశమున రైలుమార్గములకు, రోడ్డులకు ఎక్కువ అవకాశము లేనందున సాంప్రదాయికపు గుర్రపు మార్గముల వెంబడిన చమరమృగములు, మేకలు, గొర్రెలు, గుర్రముల సాయమున ప్రయాణములును, సామానులను చేరవేయుటయు జరుగుచున్నవి. కావున ఈ వివిధ ప్రాంతముల మధ్య యాన సౌకర్యమునకై విమానములను ఉపయోగించుటకు కృషి జరుగుచున్నది. దేశమున వివిధ కేంద్ర ములలో విమానక్షేత్రములు ఇందులకై నెలకొల్ప బడినవి. కాట్మండూలోని త్రిభువన్ విమానాశ్ర యమునుండి ఈ క్షేత్రములకు ప్రభుత్వపు విమాన ములు రాకపోకలను నిర్వహించుచున్నవి ఆ విమానాశ్రయమునుండి ఇండియా, పాకిస్తాన్, బంగ్లాదేశ్, తాయిలాండులకు విమానయాన సౌకర్య ములు కలవు.

**6. చరిత్ర :** ప్రాచీన కాలమునుండియు, ఈ దేశచరిత్రను తెలియజేయు 'వంశావళి' అను ఒక గ్రంథము ఈ దేశమున లభించుచున్నను, అందలి ఉదంతములన్నియు చాలవరకు అలౌకిక పౌరాణిక విషయములతో ముడిపడి ఉన్నందున, అందుండి ఐతిహాసిక విషయములను వేరుపరుప వీలులేకున్నది. కాని, క్రీ. శ. 1326 నుండి మాత్రము కొన్ని చారిత్రక సత్యములను తెలిసికొనవీలుకలుగుచున్నది. ఆ సంవత్సరమున ఈ దేశము, హరిసింహదేవుడను మాండలికుని వలన ఏకీకృతమయ్యెను. తరువాత దానిని మల్లవంశీయులు పాలించిరి. అంతకు పూర్వమే ఇట హిందూ, బౌద్ధమతములు తావు కల్పించుకొనినవి. కాలక్రమేణ రాజ్యము ఛిన్నాభిన్నమై 46 చిన్న రాజ్యములుగ విభక్తము కాగా, ఆ రాజ్యములలో 'గూర్ఖా' అనుదాని అధిపతియగు పృథ్వీనారాయణ షా అనునతడు తొలుతగ కాట్మండూలోయను 1769 లో వశపరచుకొని క్రమముగ రాజ్యమును విస్తృతపరచి, దేశమునకు ప్రస్తుతపు సరిహద్దులను ఏర్పరచి, నేటి రాజవంశమునకు మూలపురుషు డయ్యెను.

భారతదేశమున బ్రిటిష్ ప్రభుత్వము నెలకొనిన తరువాత, సరిహద్దుల విషయమై వచ్చిన ఒక తగాదాను పురస్కరించుకొని బ్రిటిష్ ప్రభుత్వము నేపాల్‌పై 1814 లో దండెత్తి, 17 నెలలు పోరాటము సాగించినది. కడకు మార్చి, 1816 లో కుదిరిన ఒక ఒడంబడికను అనుసరించి కొంత భూభాగమును నేపాల్ వదలుకొని, బ్రిటిష్ రెసిడెంటును కాట్మండూలో ఉంచుకొనుటకు అంగీకరించినది. అంతకు పూర్వమున, 1792 లో నేపాల్ సేనలు టిబెట్‌పై దండెత్తిన ఫలితముగ, చీనీయ సేనలు నేపాల్‌లోనికి చొరుచుకొనిరాగా, చీనీయ ప్రభుత్వపు షరతులకు అనుగుణముగ నేపాల్ దేశము తన ఉత్తర సరిహద్దులను నిర్ణయించుకొనినది.

1816 మొదలుగ నేపాల్‌కు బ్రిటిష్ ప్రభుత్వముతో గల సంబంధములు చాలవరకు మైత్రీ భావమున సాగినవి. భారత ప్రథమ స్వాతంత్ర సంగ్రామ కాలమున (1857) నేపాల్ ప్రభుత్వము తన సేనలను పంపి బ్రిటిష్ ప్రభుత్వమునకు సాయము చేసినది. 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున నేపాల్ ప్రభుత్వమున రాజరికపు అధికారము సన్నగిలి, మంత్రుల అధికారము ఎక్కువయైనది. జంగ్ బహదూర్ అను అప్పటి ప్రధానమంత్రి, రాచరికమును నామమాత్రముగ అధికారమున ఉంచి, అధికారమును తానే వశపరచుకొని, మంత్రిత్వము తన వంశ పారంపర్యా సంక్రమించునటుల చేసెను. ఈ మంత్రి వంశమే 'రాణా' వంశము అను పేర ప్రసిద్ధి వహించినది. ఈ రాణాలు ఇటుల, పేరున తప్ప తక్కిన అన్ని విధముల, రాజాధికారములను వహించి, రాజరికమును నామమాత్రముగ కొనసాగనిచ్చిరి.

భారతదేశము స్వాతంత్ర్యమును ఆర్జించగనే, దాని ఫలితములు నేపాల్‌నను కానరా మొదలిడినవి. దేశ ప్రజలలో స్వాతంత్ర్యాకాంక్ష బయలుదేరి 1948 లో నేపాలీ కాంగ్రెస్ ఉద్భవించెను. దేశమున ఆందోళనలు చెలరేగగ రాణాల పరిపాలనను అంతము చేయుటకు కృషిజరిగెను. దేశపు రాజగు త్రిభువన వీరవిక్రమ, ప్రజల యెడల సానుభూతి వహించి, రాణాలయెడ నిరసనగ, భారతదేశము నకువచ్చి కొంతకాలము తలదాచుకొనెను. కడకు ప్రజల ఉద్యమము విజయవంతమై, రాణాలపాలన అంతరించి, త్రిభువన వీరవిక్రముని రాజరికపు ఆధ్వర్యమున క్రొత్త ప్రభుత్వము ఏర్పడెను (ఫిబ్రవరి 15, 1951). ప్రజాతంత్ర ప్రభుత్వమును ఏర్పరచుటకు రాజు సుముఖత వహించినను, దేశ పరిస్థితులవలన, ఆ ప్రయత్నము విఫలమయ్యెను. 1959 లో ఒక ప్రజాతంత్ర రాజ్యాంగము ఏర్పడినను పనిచేయలేకపోయినది. ఇప్పటిరాజు, వీరేంద్ర

వీరవిక్రమ్ షా దేవ, ఒక నూతన రాజ్యాంగమును 1963 నుండి అమలులోనికి తెచ్చెను.

పెద్దరాజ్యములగు చీనా భారతదేశముల మధ్య నెలకొనియున్న ఈ దేశము ఆ రెండు రాజ్యముల యెడ సమాన మైత్రీభావము వహించి. వాని తగవులలో తాటస్థ్యము వహించి వ్యవహరించుచున్నది.

**7. పరిపాలన :** 1963 లో అమలునకు కొని రాబడిన రాజ్యాంగమును అనుసరించి నేపాల్‌న, 'రాజ్యాంగబద్ధమై హిందూ మతానుయాయియగు రాజరికము' పాలనను నిర్వహించుచున్నది; నాలుగు సోపానముల పంచాయతీ రాజ్యవిధానముగ ఇచటి పరిపాలన పేర్కొనబడుచున్నది గ్రామ (పట్టణ) పంచాయత్, జిల్లా పంచాయత్, ప్రాంతీయ పంచాయత్, జాతీయ పంచాయత్ అనునవి ఈ నాల్గు సోపానములు. దేశము మొత్తమున 3,588 గ్రామపంచాయతులు, 14 నగరపంచాయతులు, 75 జిల్లా పంచాయతులు, 14 ప్రాంతీయ పంచాయతులు కలవు. గ్రామ, నగర పంచాయతుల సభ్యులను ఆయా గ్రామీణవోటరులును, నగరవోటరులును ఎన్నుకొనెదరు. అంతటనుండి పై సోపానమునకు దిగువ సోపానమునుండి ఎన్నికలు జరుగును. జాతీయపంచాయత్‌లోని సభ్య సంఖ్య 125 వీరిలో 90 మందిని ప్రాంతీయ పంచాయతులు ఎన్నుకొనును; 15 మందిని వివిధ ఆర్థికసంస్థలును నలుగురను పట్టభద్ర నియోజకవర్గమును ఎన్నుకొనును; తక్కిన 16 మందిని రాజే నియమించును. కార్యనిర్వహణాధికారము రాజునందు న్యస్తమై ఉన్నది. మంత్రివర్గమును, జాతీయపంచాయత్ సభ్యులనుండి రాజే నియమించుకొనిన ఒక జాతీయ మార్గదర్శక సంఘమును 1973 నుండి పనిచేయు చున్నవి. అవసరమైనపుడు ఆత్యయిక పరిస్థితిని ప్రకటించి, రాజ్యాంగమును తాత్కాలికముగ అమలునుండి తొలగించి, సర్వాధికారములను చేపట్టుటకు రాజునకు అధికారమును రాజ్యాంగము కల్పించినది

1946 మొదలుగ నేపాలున అనేక రాజకీయ పక్షములు—నేపాలీ కాంగ్రెస్, ప్రజాపరిషత్ మొదలైనవి — పనిచేసినవి. కాని 1963 లో ప్రభుత్వము రాజకీయ పక్షముల ఏర్పాటును నిషేధించినది. న్యాయనిర్వహణకై 1956 మొదలుగ ఆధునికరీతిలో ఏర్పాటులు జరిగినవి.

**8 దేశరక్షణ :** 20,000 పదాతిదళము కలదు. యు. స్టే; బ్రిటన్‌ల సాయముతో ఆయుధ సంపత్తి ఆధునికము చేయబడుచున్నది. నేపాల్ దేశపు గూర్ఖా సైనికులు క్రమశిక్షణకు, వీరత్వమునకు పేరొందినవారు. పూర్వము భారత సైన్యమున సైతము, బ్రిటిష్ ప్రభుత్వపు కాలమున గూర్ఖాలు చేర్చుకొనబడెడివారు. ప్రస్తుతమున కూడ బ్రిటిష్ ప్రభుత్వము తన సేనలో కొన్ని గూర్ఖాదళములను కలిగియున్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా.స యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను. కొలంబో ప్రణాళికా వ్యవస్థయందును నేపాల్ సభ్యత్వము వహించి ఉన్నది

**10. ఆర్థిక రంగము :** దేశప్రజలలో 80% వ్యవసాయముపై ఆధారపడి ఉన్నారు. దేశవైశాల్యమున వ్యవసాయయోగ్యమగు భూమి 55 లక్షల ఎకరములు మాత్రమే అందును 10 లక్షల ఎకరములు సాగగుటలేదు వ్యవసాయయోగ్యపు భూమిలో 4% కు మాత్రమే నీటిపారుదల వసతి కలదు. దేశమున 3 566 వేల టన్నుల ఆహార ధాన్యములును 286 వేల రొక్కపు పంటలును పండింప బడుచున్నవి. ఆహారధాన్యములలో ప్రముఖము వరి (2,322 వేల టన్నులు). తక్కిన ఆహారధాన్యములలో జొన్న, గోధుమ క్రమముగ ప్రాముఖ్యము కలవి; రొక్కపు పంటలలో చెరకు,

నూనెగింజలు, జనుము, పొగాకు క్రమముగ ప్రముఖత కలవి. బంగాళాదుంపలు, తేయాకు కూడ కొన్ని ప్రాంతములందు కొద్దిస్థాయిలలో పండింపబడుచున్నవి (1964-65). పశుపోషణయు ఆర్థికరంగమున చాల ప్రముఖము. చమరమృగములు, గోజాతి, కోళ్లు అందు పేర్కొనదగినవి. జున్ను తయారుచేయు పరిశ్రమను ప్రభుత్వము ప్రోత్సహించుచున్నది. నేపాలీ జున్నుకు విదేశములలో పెద్దగిరాకీ కలదు.

దేశమున మూడవవంతు వైశాల్యము అటవీమయము. ఇందలి కలప కొంత భాగము విదేశములకు ఎగుమతియగుచున్నది. ఆ ఎగుమతి సాలీనా 20 లక్షల ఘ. అడుగులు. ఓషధీవనములు అనేకములు ప్రభుత్వప్రోత్సాహమున పనిచేయుచున్నవి.

ఖనిజములు భూగర్భమున విరివిగ ఉన్నటుల లెక్కతేలుచున్నను, గనులను పనిచేయించుటకు తగిన కృషి మొదలిడబడలేదు. 1970 నుండి, ఇనుము, రాగి, గనులలో పని మొదలైనది. అభ్రకము కొలదిగ త్రవ్వబడుచున్నను, దానిని భారతదేశమునకు ముడిసరకుగ పంపి అచట చక్కబరచుట జరుగుచున్నది. వ్యవసాయవస్తువులకు సంబంధించిన పరిశ్రమలును, రంపపు మిల్లులును కొన్నికలవు.

ఎగుమతులలో జనపనారయు, జంతువులును, ప్రముఖములు. మొత్తపు ఎగుమతుల విలువ 3951 లక్షల నే. రూ; దిగుమతుల విలువ 4,447 లక్షల నే. రూ. (1967-68). దేశపు విదేశ వ్యాపారము చిరా, భారతదేశములతోనే సాంప్రదాయికముగ జరుగుచున్నను, గత కొలది సంవత్సరములనుండి సోవియట్ రష్యా, యుగోస్లావియా, పాకిస్తాన్‌లతో కూడ వస్తువినిమయపు పద్ధతిలో సాగుచున్నది. అయినను ఈ వ్యాపారము సైతము భారతదేశముద్వారానే జరుగుచున్నది. భారతదేశము, తన భూభాగములనుండి నేపాలునకుపోవు వస్తువులపై ఎగుమతి సుంకములు లేకుండచేసి సాయపడుచున్నది.

దేశమున విద్యుదుత్పత్తికి చాల అవకాశములున్నను, తగిన కృషి జరుగుటలేదు. దేశమున మొత్తమున ఉన్న విద్యుదుత్పత్తి సమర్థత 1968లో 37,700 కి. వా. మాత్రమే.

దేశపు బడ్జటరీ వ్యయము 97.3 కోట్ల నే. రూ; ఇందు అభివృద్ధి కార్యక్రమములకు సంబంధించినది 63.3 కోట్ల నే. రూ; బడ్జెటరీ ఆదాయము 49.4 కోట్ల నే. రూ. (1970-71). ఇందలి లోటును, చెల్లింపులలోటును, విదేశముల సహాయమువలన దేశము పూరించుకొనుచున్నది. అట్టి విదేశీయ సహాయమున దాదాపు సగము (రు. 15 కోట్లు) భారతదేశమువలన లభించుచున్నది.

దేశపు ఆర్థిక వ్యవహారములను నిర్వహించు బ్యాంకులలో రాష్ట్రబ్యాంక్, నేపాల్ బ్యాంక్ అనునవి ప్రముఖములు.

**11. సాంఘికరంగము :** 1962 లో జరిగిన అంచనాలను అనుసరించి దేశప్రజలలో 6% అక్షరాస్యులు. 1966 లో ప్రయిమరీ స్థాయియందు 3,94,700 మంది విద్యార్థులకు బోధించు 13,960 ఉపాధ్యాయులును, ఉన్నత విద్యలో 10,235 మందికి బోధించు 751 మంది ఉపాధ్యాయులును కలరు. భారతదేశపు విద్యావిధానమునే నేపాల్ అనుసరించుచున్నది. జాతీయ భాషతో పాటుగ ఆంగ్లభాషకును ప్రాముఖ్యము కలదు. 1959 లో త్రిభువన విశ్వవిద్యాలయము నెలకొల్పబడినది; దీనికి అనుబంధితములై వివిధ కళాశాలలు పనిచేయుచున్నవి. కాట్మండూలోని 7 ప్రముఖ గ్రంథాలయములలో. అతిప్రాచీన సంస్కృత గ్రంథములు కలవు. దేశమున 11 దినపత్రికలు

(9 నేపాలీలో, రెండు ఇంగ్లీషులో వెలువడు చున్నవి. వీని అన్నింట 'గూర్ఖాపత్ర' అను నేపాలీ దినపత్రికకు ఎక్కువ ప్రచారము కలదు; పత్రికా స్వాతంత్ర్యము, రాజ్యాంగరీత్యా, గుర్తింపబడి అమలున ఉన్నది.

దేశమున 2,046 శయ్యాసంఖ్యగల 57 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. అయినను వీనియందు అత్యధికభాగము కాట్మండూ లోయలోనే కలవు.

**12. యాత్రా సౌ. :** దేశము ప్రకృతి రమణీయతకు నెలవగుటవలన పలువురు విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకు అవకాశమున్నను, విదేశీయులరాకను, తొలుతటి ప్రభుత్వములు నిషేధించినవి. 1956 మొదలుగ, ఈ నిషేధమును సడలించుటవలన, పలువురు దేశమును దర్శించుట మొదలైనది. 1965 లో ఇట్టివారి సంఖ్య 28,000 వీరిలో 60 అమెరికావాసులు. విదేశీయ యాత్రికుల సౌకర్యమునకై కాట్మండూలో 3 ఉత్తమస్థాయీ హోటళ్లను, వృక్షోపరి నివాసము (మంచె) లను ప్రభుత్వము నెలకొల్పినది.

**13 ప్రసిద్ధ పౌరులు :** బౌద్ధమతమును నెలకొల్పి మానవజాతి సుఖజీవనమునకై పాటుపడిన ప్రపంచ ప్రసిద్ధుడు, బుద్ధదేవుడు (సిద్ధార్థ గౌతమ బుద్ధుడు) జన్మించిన ప్రదేశము ఈ దేశమునందలి తరాయ్‌లో కలదు.

---

# 18. పాకిస్తాన్

**ముఖ్యనగరము :** ఇస్లామాబాద్, **జెండా :** దండమువద్ద తెలుపుచారయు, తక్కినదానిలో శ్యామ హరితవర్ణము పైన తెలుపున బాలేందురేఖయు, పంచకోణపు నక్షత్రమును కలది. **జాతీయగీతము :** 'జయతు పవిత్రభూమీ; పాకిస్తాన్ ! మతవిశ్వాసమునకు పెట్టనికోట !' అను అర్థముకలిగిన ఉర్దూ గీతము. **నాణెము :** రూపాయి (పాకిస్తానీ); ఇది 100 పైసలుగ విభక్తము (ఒక పాకిస్తానీ రూపాయి = రూ. 1.57); **కొలతతూకములు :** మెట్రిక్ విధానము 1966, డిసెంబరునుండి వాడుకలోనికి కొనిరాబడినది. **కాలపరిగణన :** సా. 5 గం. = భారతదేశమున సా. 5. 30).

**1. ఉనికి మొ. :** భారత ఉపఖండమున, పశ్చిమోత్తర భాగమున ఉన్న ఈ దేశమునకు పశ్చిమమున ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్; ఈశాన్యమున, తూర్పున, ఆగ్నేయమున భారతదేశమును; దక్షిణమున అరేబియా సముద్రమును సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 8,01,408 చ. కిమీ. (భారతదేశమున అంతర్భాగమగు కాశ్మీరున దాదాపు మూడవవంతునకు పైగా ప్రస్తుతమున పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్నది. దాని వైశాల్యము ఇందు చేర్చబడలేదు). దేశమున ఉత్తరభాగమందలి అటవీమయములగు పర్వత శ్రేణులు క్రమక్రమముగ ఉత్తరమునకు పోనుపోను ఎత్తునకు లేచుచున్నవి. వానియందు 6,700 మీ. ఎత్తునకు మించిన శిఖరములు 60 కలవు; దేశపు దక్షిణ, పశ్చిమ ప్రాంతములు, సింధు–బెలూచీస్థానములందలి బెట్టభూములు మొత్తమున పాకిస్తాన్ దేశమున మూడింట రెండువంతులకు మించినప్రాంతము, ఊషరభూమిగనో, దాదాపుగ ఊషరసమానముగనో ఉన్నది దేశపు నదులలో కెల్ల ప్రముఖము సింధునది.

**2 శీతోష్ణస్థితి మొ.:** దేశమున ఏప్రిల్ మొదలుకొని జూన్‌వరకు విపరీతముగ ఎండలు కాయును; అపుడు ఉష్ణోగ్రత కొన్ని సమయము లందు 120° ఫా. వరకు పోవును. జులై నుండి సెప్టెంబరువరకు వానలు కురియును; సాలీనా వర్ష పాతము నదీపరీవాహ ప్రదేశములలో 38 సెం. మీ, ఉత్తర ప్రాంతములలో 150 సె. మీ. గను ఉన్నది. దేశపు దక్షిణ ప్రాంతము చిరుపొదల భూమిగ ఉన్నను, ఉత్తరపు పర్వతారణ్యములలో ఓకు మొదలగు పెద్దజాతి వృక్షములు కననగును.




పటము 1౭.

లేడి, అడవి పంది, ఎలుగు వంటివియే వన్యజంతు వులలో పెద్దవి.

**3 జనసంఖ్య మొ.:** 1972 సెప్టెంబరు అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 6,48,92,000. జనసాంద్రత చ. కిమీ. కు 118. దేశపు ప్రముఖ నగరములలో జనాభా 1968 అంచనాల ప్రకారము ఈ దిగువ రీతిలో ఉన్నది. కరాచీ 28,86,000; లాహోర్ 17,47,000; హైదరాబాద్ 6,58,000; రావల్పిండి 4,39,000; పెషావర్ 2,85,000; క్వెట్టా 1,27,000; ఇస్లామాబాద్ 50,000. దేశపు జనసంఖ్య సాలు సరిన 2.1% చొప్పున పెరుగుచున్నది. దేశపు పశ్చిమప్రాంతమున బెలూచీ వర్గము కలదు; ఇది అరబ్ జాతి సంతతికి చెందినది. ఇందు 12 తెగలు కలవు. సింధునది డెల్టాప్రాంతమున సింధీప్రజలును, అందులకు ఉత్తరమున ఉన్న ప్రాంతమున 'బ్రాహ్వీ' అనబడు ఒక తెగయు ఉన్నారు. ఈ ఈ 'బ్రాహ్వీ' ప్రజలు ద్రావిడజాతికి చెందినవారు. ఇక దేశపు ఉత్తరభాగమున ఇండో-ఆర్యన్ తెగకు చెంది ఇస్లామ్‌మతమును అవలంబించిన జాట్, రాజపుత్రతెగలును, వాయవ్యప్రాంతమున దృఢ కాయులు, యుద్ధప్రియులుఅగు పఠాన్ జాతిప్రజలును వసించుచున్నారు. ఈ పఠాన్ తెగలలో చాలమంది స్థిరనివాసములకు అలవడనివారు.

దేశప్రజలలో 97.2% ఇస్లామ్ మతానుయాయులు; అందును ఎక్కువమంది సున్నీశాఖకు చెందిన వారు; షియాలును, ఇస్మెయిలీలును, అహమ్మ దీయులును పరిమితసంఖ్యలలో ఇందు కలరు: అయినను అహమ్మదీయులను, ఇస్లామునకు చెందిన వారుగ ప్రభుత్వము పరిగణించుటలేదు. హిందువులు 1.5% కలరు. క్రైస్తవులును, పార్సీ లును అత్యల్పసంఖ్యలలో ఉన్నారు.

సింధీ, పంజాబీ, పుష్తూ అను ప్రాంతీయ భాషలు సింధు, పంజాబ్, సరిహద్దు-బెలూచిస్తాన్ ప్రాంతములలో క్రమముగ మాతృభాషలుగ వాడుకలో ఉన్నను, ఉర్దూ జాతీయ భాషగ అధికారరీత్యా, పరిగణింపబడుచున్నది; దేశ ప్రజలలో దాదాపు సగముమంది ఆ భాషను మాటాడెదరు; తక్కిన వారిలో అత్యధికసంఖ్యాకులు దానిని అర్థము చేసికొనెదరు. ఇవిగాక ఆస్ట్రియన్, ద్రవిడియన్, ఇండో-ఆర్యన్ టిబెటో-చీనీజ్ మొదలగు వర్గములకుచెందిన వివిధభాషలు అత్యల్ప సంఖ్యాక వర్గములందు అటనట ప్రచారమున ఉన్నవి.

**4. సమాచార సౌ. :** 1970 లెక్కలను అనుసరించి 14,266 కు పైగా తపాలాఫీసులును, 1241 తంతి ఆఫీసులును, 1,88,000 టెలి ఫోనులును కలవు. కరాచీలో ఒక రేడియో ప్రసార కేంద్రమును, దాని శాఖలు హైదరాబాదు, క్వెట్టా, లాహోరు, రావల్‌పిండి, పెషావరులలోను పనిచేయు చున్నవి. విదేశములతో రేడియో - టెలిఫోను, రేడియో-టెలిగ్రాఫ్ సౌకర్యములు కలవు. కరాచి, లాహోర్, రావల్పిండీలలో టెలివిజన్ ప్రసార కేంద్రములు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున ఉత్తమశ్రేణి రోడ్ల నిడివి 17,070 కిమీ. అన్నిగేజీల రైలు మార్గముల నిడివి 8,582 కిమీ. (1972). కరాచి యందు ప్రకృతిసిద్ధమగు హార్బరు ఉన్నది. బెలూచిస్తాన్ రాష్ట్రపు మక్రాన్ తీరమున వేరొక నౌకాశ్రయమును నెలకొల్పు యోచన కలదు. దేశీయ నౌకాసంస్థ 25 విదేశములకు నౌకాయానములను నిర్వహించుచున్నది. కరాచీయందు ఉత్తమ స్థాయికి చెందిన విమానాశ్రయము ఉన్నది; అచటి దేశీయ, విదేశీయ విమానయాన సంస్థలు లండన్, ఫ్రాంక్ ఫర్ట్, మాస్కో, టెహరాన్-అంకారా, జెడ్డా, దేరా ఇస్ సలామ్, కాబూలు నగరములకు ప్రయాణములను నిర్వహించుచున్నవి.

**6. చరిత్ర :** భౌగోళికముగ భారత ఉపఖండమున ఒక భాగమగు ఈ దేశపు చరిత్ర భారతదేశ చరిత్రతో ఆగస్టు 14, 1947 వరకు ముడివడి యుండినది. ఆ తేదీన భరత ఖండమునుండి రాజ్యాంగరీత్యా విడివడి పాకిస్తాన్, మహమ్మదాలీ జిన్నా నాయకత్వమున, స్వతంత్ర రాజ్యమైనది. [వివరములకు చూ : భారతదేశ (ఇండియా) చరిత్ర]. స్వతంత్రతను పొందినపుడు, ఈ దేశము పశ్చిమ పాకిస్తాన్, తూర్పు పాకిస్తాన్ అను రెండు భాగములుగ ఉండినది. (అప్పటి పశ్చిమ భాగమే నేటి పాకిస్తాన్; తూర్పు భాగము నేటి బంగ్లాదేశ్). ఇటుల రూపొందిన పాకిస్తాన్, తొలుతనుండియు, ఈ రెండు దూర ప్రాంతములను రాజకీయముగ, సాంస్కృతికముగ ముడివైచి యుంచుటలో సతమతమగుటయేగాక, భారతదేశముతో విరుద్ధ తనే తన వైదేశిక నీతిగ గ్రహించి 'జమ్మూ - కాశ్మీర్' ప్రాంతమును వశపరచుకొను సంకల్పముతో 1947-48 లోను, 1965 లోను భారత దేశముతో యుద్ధములను సాగించినది. మొదటి యుద్ధపు పర్యవసానముగ, ఐ. రా. స. జోక్యము వహించి, ఆ ప్రాంతపు రాజకీయ భవిష్యత్తును జన వాక్యముద్వారా నిర్వహించుట సమంజసమని ఉభయ పక్షములను అంగీకరింపజేసినను, అందులకు ప్రాతిపదికగ తన సేనలను కాశ్మీర భూమి నుండి ఉపసంహరించుటకు పాకిస్తాన్ నిరాకరించుట వలన ఆ ఒప్పుదలకు కాలదోషము పట్టినది. తదనంతరమున కాశ్మీరముకొరకే 1965 లో భారత దేశముపై పాకిస్తాన్ దండయాత్ర జరిపి, విఫల యత్నతను చెందగ సోవియట్‌రష్యా జోక్యము వహించి ఉభయ రాజ్యములమధ్య యుద్ధ పూర్వ స్థితి కుదురుకొనునటుల చేసినది.

1970 లో పాకిస్తాన్‌న జరిగిన ఎన్నికలందు తూర్పు పాకిస్తాన్ (బంగ్లా రాష్ట్రము)న అవామీలీగ్ పార్టీ ఆధిక్యమును ఆర్జించి, గరిష్ఠతమమగు ప్రాంతీయ స్వాతంత్ర్యమును వాంఛించినది. అప్పటి పాకిస్తాన్‌కు అధ్యక్షుడగు యాహ్యాఖాన్ అందులకు నిరాకరించి, ఆ పార్టీకి నాయకుడగు షేక్ ముజిబుర్ రహమాన్‌ను పశ్చిమ పాకిస్తానున నిర్బంధించి, దమన నీతిని అవలంబించి ప్రజోద్యమమును అడచివేయ యత్నించగ దాదాపు కోటి మంది భారతదేశమునకు పారిపోయి తలదాచు కొనిరి. దేశమునందు స్వాతంత్ర్యమునకై యుద్ధము కొనసాగెను; భారతదేశము బంగ్లా రాష్ట్ర పు ప్రజల ఆశయములపై సానుభూతిని ప్రకటించి

కృషిచేసినది. తత్పర్యవసానముగ పాకిస్తాన్ భారతదేశముపై యుద్ధము ప్రకటించుటయు, భారత సేనలు రంగమునడిగి బంగ్లా రాష్ట్రములోనికి చొచ్చుకొనిపోయి, పాకిస్తాన్ సేనలను ఓడించగ, ఆ సేనలు లొంగుటయు, బంగ్లాదేశ్ అను పేర తూర్పు పాకిస్తాన్ స్వతంత్ర రాజ్యముగ రూపొందుటయు జరిగినది (జనవరి 12, 1972).

1971 లో, బంగ్లాయుద్ధ పర్యవసానముగ యాహ్యాఖాన్ రాజీనామాను ఈయగ జుల్‌ఫికర్ అలీ భుట్టో దేశాధ్యక్షుడయ్యెను. భారతదేశము అవలంబించిన సామరస్యపు పైఖరివలన ఈ ఉభయ దేశములమధ్య సంభాషణలు కొనసాగి సిమ్లా ఒడంబడిక రూపొందినది (1974). తత్ఫలితముగ పాకిస్తాన్‌కు చెందిన యుద్ధఖైదీలను భారతదేశము విడుదల చేసినది. 1976, జూన్‌లో దౌత్య సంబంధములును భారతదేశముతో మరల ఏర్పడి, రాకపోకలు పునరుద్ధరితములైనవి

**7 పరిపాలన :** పాకిస్తాన్ ఏర్పడినప్పటి నుండియు ఆ దేశపు రాజ్యాంగ వ్యవస్థ ఎన్నిసార్లో మార్పొందినది; తొలుత అది కామన్‌వెల్తునందు అంతర్భాగముగ డొమీనియన్ ప్రతిపత్తితో వ్యవహరించినది; 1956 లో ఒక రాజ్యాంగ విధానమును రూపొందించుకొని ఇస్లామిక గణతంత్ర విధానపు సమాఖ్యగ పరిణమించినది. 1958 లో అధ్యక్షుడగు సికందర్ మీర్జా రాజ్యాంగమును రద్దుచేసి అధ్యక్షపాలనను ప్రవేశపెట్టెను; అనతికాలముననే అతనిని తొలగించి అయూబ్‌ఖాన్ అధ్యక్షుడయ్యెను. 1963 లో వేరొక రాజ్యాంగమును ప్రవేశపెట్టినను, దేశపు పూర్వ, పశ్చిమ భాగములలోని రాజకీయ కల్లోలములవలన దేశమున సైనికపాలన ఏర్పడి యాహ్యాఖాన్ అధ్యక్షుడయ్యెను ఈతని కాలమున 1970 లో ఎన్నికలు జరిగినవి. కాని, తూర్పు భాగము అధికతర ఆంతరంగిక స్వాతంత్ర్యము కోరుటవలన, అంతర్యుద్ధము చెలరేగి, తత్ఫలితముగ బంగ్లాదేశ్ స్వతంత్రమగుట జరిగినది. అంతట భుట్టో అధ్యక్షుడైన తరువాత ఏప్రిల్ 10, 1973 న వేరొక రాజ్యాంగము ఆమోదింపబడుట జరిగినది. ఈ రాజ్యాంగరీత్యా, కామన్‌వెల్తునుండి విడివడిన స్వతంత్ర ఇస్లామిక గణతంత్ర సమాఖ్యగ దేశము రూపొందినది. దేశమున సింధు, పంజాబ్, బెలూచిస్తాన్, సరిహద్దు రాష్ట్రము అను నాలుగు రాష్ట్రములందు ప్రాంతీయ శాసనసభలును, కేంద్రమున జాతీయ సభయు పరిపాలనను నిర్వహించుచున్నవి. అయినను, కేంద్రమునకు బలవత్తమాధికారములు కలవు. దేశమున పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ, పాకిస్తాన్ ముస్లింలీగ్, కౌన్సిల్ ముస్లిం లీగ్, జమాయత్-ఇ-ఇస్లామీ అను నాల్గు ప్రముఖ రాజకీయ పక్షములు కలవు. ఇందులో తొలుతటి దాని నాయకుడు దేశాధ్యక్షుడగు భుట్టో. కేంద్రమునను, పంజాబ్, సింధులలోను ఈ పార్టీకి అధిక బలము కలదు. సరిహద్దు, బెలూచిస్తాన్ రాష్ట్రములలోని పుష్తూ మాటాడు ప్రజలలో, అధికతర స్వాతంత్ర్య ప్రతిపత్తి వాంఛ ప్రకటీకృత మగుట వలన ఆత్యయిక పరిస్థితిని కొనసాగించి, కేంద్రమే సర్వాధికారములను వహించి పాలనను నిర్వహించుచున్నది.

**8. దేశరక్షణ :** దేశము తన ఆదాయమున 60% ను సైన్యమునకును, యుద్ధ పరికరముల కొరకును వినియోగించుచున్నది రక్షక బలమునందు 10 పదాతి దళములు, 2 కవచ దళములు, ఒక వైమానికయోధ దళము చేరియున్నవి. సైనికుల మొత్తపు సంఖ్య 3 95,000 (బంగ్లా యుద్ధ పర్యవసానముగ భారత సేనకు ఖైదీలుగ చిక్కి, తదనంతరమున విముక్తిపొందిన 95,000 ఇందు చేరియున్నారు) మూడు జలాంతర్గాములు, నాలుగు డిస్ట్రాయరులు మొదలుగాగల ఒక పరిమిత నౌకా

దళమును కలదు. కరాచీలో ఒక నౌకా స్థావరము కలదు. నౌకాదళమున 950 ఉద్యోగులును, 9,550 నావికయోధులును కలరు. వైమానిక దళపు ముఖ్య స్థావరము పెషావర్. ఆ దళమున 200 పోరాటపు విమానములు కలవు. అన్ని తరగతులకు చెందిన వైమానిక యోధులు 15,000 మంది ఉన్నారు (1972).

**9. అంతర్జాతీయ సం :** ఐ.రా.స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును 1947 మొదలుగ పాకిస్తాన్ సభ్యత్వము వహించియున్నది. ఆఫ్రో - ఆసియా దేశముల వ్యవస్థలందును, ఇస్లామిక రాజ్యముగ ముస్లిము దేశముల రాజకీయ, సాంస్కృతిక వ్యవస్థలందును ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది. అఫ్ఘనిస్తాన్‌తో, పుష్టూ ప్రజల రాజకీయ ప్రతిపత్తిని గురించిన వివాదముల వలన, వైమనస్యములు కలవు కాని దౌత్యసంబంధములు మాత్రము కొనసాగుచునే ఉన్నవి. వైమనస్యములు త్యజించి బంగ్లాదేశ్‌తోకూడ పాకిస్తాన్ దౌత్య సంబంధములను ఏర్పరచుకొనినది. ఇక తక్కిన వానిలో, ఇస్రాయెల్, దక్షిణ ఆఫ్రికా తప్ప మిగిలిన అన్ని ప్రముఖ దేశములతో ఈ దేశమునకు దౌత్యసంబంధములు కలవు. చీనా, యు. స్టే., ఇరాన్‌లనుండి ఆర్థిక సైనిక పరికర సాహాయ్యమును, సౌదీ అరేబియావంటి ముస్లిం రాజ్యములనుండి ఆర్థిక సాహాయ్యమును ఈ దేశము స్వీకరించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశ ప్రజలలో 75% వ్యవసాయమును ఆశ్రయించి జీవించుచున్నారు. ఆహార వస్తువులకు సంబంధించినంతవరకు దేశము స్వయంపోషకమగుటయేగాక, కొన్ని సంవత్సరములందు ఆహార ధాన్యములను ఎగుమతి చేయగలిగినది. దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి 630 లక్షల ఎకరములు. ఇందు 110 లక్షల భూమి బీడుభూమి; తక్కినది వ్యవసాయమున ఉన్నది. పశ్చిమ, ఉత్తర ప్రాంతములందుతప్ప మిగిలిన దేశమున నీటిపారుదల వసతులు బాగుగ కలవని చెప్పవచ్చును. 1960 లో భారత - పాకిస్తాన్ దేశములమధ్య కుదిరిన ఒడంబడికను అనుసరించి సింధునదిలోను, దాని ఉపనదులలోను ఉన్న జలమున ఒక నిశ్చిత భాగము పాకిస్తాన్‌కు దక్కినది. అంతట ఆ జలమును సద్వినియోగము చేసికొనుటకై, అంతర్జాతీయ బ్యాంకు సహాయమున, 740 కిమీ. పొడవున కాలువలను నిర్మించుటకు కృషిజరిగి అందు కొంత భాగము పూర్తియైనది; సింధునదిమీద, బ్రిటిష్ పరిపాలనా కాలమున నిర్మింపబడిన లాయిడ్ బారేజివలన సింధ్ రాష్ట్రమున 36 లక్షల ఎకరములకు నీటి పారుదల సౌకర్యము లభించుచున్నది. సింధునది మీదనేఉన్న ఇతరములగు ఆనకట్టల వలనను పాకిస్తాన్‌నందలి వ్యావసాయిక భూమిలో ఎక్కువ భాగమునకు నీటిపారుదల వసతి ఏర్పడి ఉన్నది.

దేశమున పండు ఆహార ధాన్యములలో ప్రముఖముగ గోధుమపంట. రొక్కపు పంటలలో ముఖ్యముగ పేర్కొనదగినది ప్రత్తి. 1971-72 లెక్కలను అనుసరించి దేశమున వేల టన్నులలో ఈ దిగువ రీతిగ ఉత్పత్తి జరిగినది: గోధుమ 6,500; వరి 2,165, మొక్కజొన్న 694, చెరకు 21,624; ప్రత్తి 650. ప్రత్తిని ఎగుమతి చేయు దేశములలో పాకిస్తాన్ ప్రముఖతను వహించియున్నది. దేశమున ఖనిజసంపద తగినంతగ లేదు; తక్కువరకపు రాక్షసిబొగ్గు కొంత లభించుచున్నది; అందువలన బొగ్గును విశేషముగ దిగుమతి చేసికొనవలసి వచ్చుచున్నది. పెట్రోలియంకూడ కొలదిగ మాత్రమే లభించుటవలన, అందులకై విదేశములపై దేశము ఆధారపడి

యున్నది. 'సూయీ' అనుచోట ఇంధన వాయువు (నేచురల్ గ్యాస్) లభించుచున్నది. అది కరాచీకి, ముల్తాన్‌కు గొట్టములద్వారా పంపబడి పరిశ్రమల కొరకును, గృహావసరముల కొరకును వినియుక్త మగుచున్నది. ఈ వసతి వలన 1968-69 లో 10 కోట్ల ఘ. అడుగుల ఇంధన వాయువు ఉత్పత్తి అయినది.

పాకిస్తాన్ రూపొందునాటికి అటనున్న పారిశ్రామిక సంపత్తి చాల తక్కువ. కాని 1947 తరువాత జరిగిన నిర్విరామ కృషివలన గుడ్డల మిల్లులును, యంత్ర పరికరముల ఉత్పత్తి మిల్లులును నెలకొల్పబడినవి. పారిశ్రామిక కార్మిక వర్గమున 80% కుటీర పరిశ్రమలందును, చిన్నతరహా పరిశ్రమలందును పనిచేయుచున్నారు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 1963 నాటికి 288.18 కోట్ల కివా. తరువాత మంగ్లా ఆనకట్టవలన, ఆ ఉత్పత్తి సామర్థ్యమున 30 లక్షల కి. వా. లు వచ్చి చేరినవి (1968). 1977 నాటికి పూర్తికానున్న తర్బేలా ఆనకట్టవలన ఆ సామర్థ్యమున 21 లక్షల కివా. పెంపుదల ఉండగలదు.

దేశపు ఎగుమతుల విలువ 280 కోట్ల పా. రూ; దిగుమతుల విలువ 320 కోట్ల పా రూ. (1971-72). దేశపు బడ్జెటరీ వ్యయము 718 కోట్ల పా. రూ. (1972-73).

**11.** **సాంఘిక రంగము** : దేశమున సాంఘిక సంసేవా కార్యక్రమములందు కృషి పౌరసంస్థల వలన మాత్రమే ఎక్కువగ జరుగుచున్నది. కాని పాకిస్తాన్ రూపొందిన కాలమున మత కలహముల వలన భారత, పాకిస్తాన్‌లమధ్య భారీఎత్తున కొనసాగిన జనాసీకపు తరలింపులో, భారత దేశము నుండి వచ్చిచేరిన ముస్లిము శరణార్థుల నివాసము నకై పెక్కు నగరములందు వలసలను నిర్మించి గృహవసతిని కల్పించుటలో మాత్రము ప్రభుత్వము సమధిక కృషి చేసినది. ఈ విధముగ 1,36,000 కుటుంబములకు నివాస వసతులు ఏర్పడినవి. తక్కిన విధముల గృహనిర్మాణము పట్టణములందు మాత్రమే కొంతవరకు సాగినను, పల్లెపట్టులందు వ్యవస్థిత రీతిలో ఆ కృషి సాగుటలేదు.

దేశమున అక్షరాస్యులు 13.6% (1961). జాతీయభాషగ ఉర్దూ బోధింపబడుచున్నను, అధికారభాషగ ఇంగ్లీషే వాడుకయందున్నది. దేశమున 42 లక్షల విద్యార్థులుగల 40 వేల ప్రయిమరీ పాఠశాలలును, 12 లక్షల 70 వేల విద్యార్థులతో 5,660 సెకండరీ పాఠశాలలును కలవు. దేశమున అయిదు విశ్వవిద్యాలయములు, (పంజాబ్, సింధ్, పెషావర్, కరాచీ, లైలాపూర్) సామాన్య కళాశాలలు 351, యింజనీరింగ్ కళాశాలలు 5, తదితర సాంకేతిక సంస్థలు 25 కలవు. వీనియందలి విద్యార్థి సంఖ్య 2,30,700 (1969-70).

దేశమున దైనిక పత్రికలలో 19 పత్రికలు ఇంగ్లీషునను, 83 పత్రికలు దేశీయ భాషలందును వెలువడుచు ప్రచారమున ఉన్నవి. దేశమందంతట పెద్దదిగ భావింపదగు గ్రంథాలయము లాహోరునందలి పంజాబ్ విశ్వవిద్యాలయమున ఉన్నది. పాకిస్తాన్ జాతీయ మ్యూజియమున ప్రాచీన సింధు నాగరికతావశేషములను, బౌద్ధ విగ్రహములును, ఇస్లామిక సాంస్కృతిక విశేషములును కననగును. పెషావరులోని మ్యూజియమున గాంధార సంప్రదాయమునకు చెందిన బౌద్ధ శిల్పావశేషములు కలవు.

దేశమున అనారోగ్య పరిస్థితులను, సాంక్రామిక జాడ్యములను అరికట్టుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. అన్ని విధముల ఆసుపత్రుల సంఖ్య 2,262; శయ్యా సంఖ్య 33,309 (1967).

**12. యాత్రా సౌ :** పాకిస్తాన్‌తో వీసా - ఒడంబడికలుఉన్న దేశములనుండి గాక, తక్కిన విదేశములనుండి పాకిస్తాన్‌కు వచ్చువారికి వీసాలు విధిగ ఉండితీరవలయును. మొహెంజోదారో మొదలగు సింధు నాగరికతా కేంద్రములను, పెషావరు దగ్గరనున్న తక్షశిలావశేషములను, ఉత్తర ప్రాంతపు అటవీ సీమలను దర్శించుటకు విదేశీయ యాత్రికులు వచ్చుచుందురు. యాత్రికులకు తగు సౌకర్యములను ప్రభుత్వము ఏర్పరచినది.

**13 ప్రసిద్ధ పౌరులు.** మహమ్మద్ అలీ జిన్నా (1876-1948). భారతదేశపు రాజకీయములలో తొలుత ప్రముఖపాత్ర వహించి, కడకు భారతదేశమునందలి ముస్లిము ప్రాంతములు స్వతంత్ర రాజ్యముగ రూపొందవలయునను వాదమునకు విస్తృత ప్రచారమును కల్పించి, తన రాజకీయ చతురత మూలమున 'పాకిస్తాన్'ను ఒక స్వతంత్ర ఇస్లామిక రాజ్యముగ రూపొందించిన ధీశాలి.

---

# 19. ఫిలిప్పీన్స్

**ముఖ్యనగరము :** క్వెజాన్ సిటీ; **జెండా :** దండమువద్ద తెలుపురంగున ఒక సమభుజ త్రిభుజము; ఆ త్రిభుజపు భుజములను ఆనుకొని ఎగువ సగమున నీలి అడ్డచార, దిగువ సగమున ఎరుపు అడ్డచార; త్రిభుజపు కోణములలో ప్రతిదానియందు పసిమిరంగున ఒక పంచకోణపు నక్షత్రము, త్రిభుజ మధ్యమున ఎనిమిది కిరణముల సూర్యచిత్రము పసిమిరంగున కలది; **జాతీయ గీతము :** తియెర్రా అదోరాద, వాజాదెల్ - సోల్ ఎ ఓరియంటే ...... (ఉదయ భూమీ, పునరుత్థాన సూర్య తనూజా......) అను గీతపాదముతో మొదలగు నది; **నాణెము :** పేసో; ఇది 100 సెంటవోలుగ విభక్తము. ఒక పేసో = రు. 1.92; **కొలత తూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 8 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దాదాపు 7,100 దీవులు చేరియున్న ఈ ద్వీప సమూహ రాజ్యము, ఆసియా ఖండపు ముఖ్య భూభాగమునకు ఆగ్నేయ దిశన, ఆ భూభాగమునుండి దక్షిణ చీనా సముద్రముచేత వేరుచేయబడి ఉన్నది. అన్నివైపుల జలపరివృతమగు ఈ ద్వీప సమూహ రాజ్యమునకు ఉత్తరమున బాషీ కాలువ, తూర్పున పసిఫిక్ మహాసముద్రము, దక్షిణమున సెలిబిస్ సముద్రము, పశ్చిమమున దక్షిణ చీనా సముద్రము సరిహద్దులందు ఉన్నవని భావింపదగును. ప్రాదేశిక రీత్యా 21°20' - 4°30' ఉ. అక్షాంశ రేఖలమధ్యను, 110°55' - 126°36' తూ. తులారేఖలమధ్యను ఈ ద్వీప రాజ్యము విస్తరించి ఉన్నది. కాని ఈ ప్రదేశమున ఉన్న ఒక్క దీవి — పాల్మాన్ అనబడునది — మాత్రము ఇండోనీసియాకు చెందిఉన్నది. రాజ్యమునందలి అన్నిదీవుల మొత్తపు వైశాల్యము దాదాపు 3 లక్షల చ. కిమీ. ద్వీపములందు ప్రముఖము లగునవి 12 మాత్రమే; వాని పేరులును, చ. కిమీ. లో వైశాల్యములును ఈ దిగువరీతిగ కలవు; లూజాన్ (1,08,800 చ. కిమీ.), మిందనావ్ (93,590), సమర్ (13,478), నెగ్రోస్ (12,553), పాలవాన్ (14,952), పానే (12,347), మిందోరో

(10,387), లైటే (6,034), సెబూ (5,006), బోహోల్ (4,131), మస్బాతే (4,031), కతండ్వానిస్ (1,513). తక్కిన దీవులలో 2.5 చ. కిమీ ల వైశాల్యమును మించినవి 357 మాత్రమే కలవు

ఈ దీవులు, చాలావరకు అగ్నేయము, అగ్నిపర్వత సముద్ఘాతములని భావింప బడుచున్నవి.




పటము 20.

పూర్వపు అగ్నిపర్వతముల అవశేషములు పలు దీవులందు కాననగుచున్నను, లూజాన్‌లోని పూలోగ్ పర్వతము (ఎత్తు 2,931 మీ.), మిందనావ్‌లోని ఆపో పర్వతము (ఎత్తు 2,954 మీ.) ప్రముఖములు. చాల దీవులందు తీరమైదానముల వెడల్పు చాల తక్కువ; కాని లూజాన్, మిందనావ్ దీవులలో విశాలములగు మైదానపు భూములు దేశ మధ్యమున, తీరమున కాననగుచున్నవి. నదుల నిడివి చాల తక్కువ. ఉన్నవానిలో లూజాన్‌లోని కగాయన్, అగ్నో, అబ్రా, బైకోల్, పాంపంగా నదులును, మిందనావ్‌లోని కోతబాతో, అగూసాన్ నదులు ప్రముఖములు. పెక్కు దీవుల తీరభూముల లోనికి సముద్రము చొచ్చుకొనుటవలన అఖాతములు ఏర్పడినవి; ఇట్టి వానిలో మనిలా అఖాతము పేరొందినది. దేశాంతర్గత జలాశయములలో లూజాన్‌లోని లాగునా డీ బే, మిందనావ్‌లోని లానావ్ సరస్సు ప్రముఖములు

**2. శీతోష్ణస్థితి మొ :** ద్వీప సమూహమునం దంతట, అత్యున్నత పర్వత సీమలందు తప్ప తక్కిన అన్ని ప్రాంతములందును, సాలున తాప క్రమము 70° ఫా. – 80° ఫా. పరిమితిలోనే ఉండును. రెండు తీరుల ఋతుపవనముల ప్రభావము ఈ ద్వీపములపై కలదు; అందువలన ద్వీపము లందలి తూర్పు తీరములలో శీతకాలమున 200 – 350 సె. మీ. వర్షపాతమును, పశ్చిమ తీర భూము లలో ఎండకాలమున 200 – 350 సెం. మీ వర్షపాతమును కలవు; కొన్ని ద్వీపముల మధ్యభాగము లందును, దక్షిణ ప్రాంతములందును వర్షపాతము 100 – 200 సెం. మీ. మధ్య ఉండును. లూజాన్ దీవియందలి పర్వత సీమలలోని బాగ్వివో అను ప్రదేశమున 1911 లో 24 గంటలలో 115.51 సెం. మీ. వాన పడినది; ప్రపంచమున ఒక ప్రదేశమున దినమున వర్షపాతమున, తెలిసినంతవరకు, ఇదియే గరిష్ఠతమము. తుఫానుల బెడద, దీవులందు, చాలఎక్కువ. ఆగ్నేయ ఆసియాలోను, ఇండోనీసియా యందును కననగు వృక్షసంతతియే చాలవరకు ఈ దీవులందును కలదు; గడ్డిబీడులు ఎక్కువ;

ఈ గడ్డి సాధారణముగ 2.4 మీటరుల ఎత్తునకు, ఎదుగుచున్నది. వన్యజంతువులలో అడవిపంది, లేడి, కోతి ప్రముఖములు; దాదాపు 1000 జాతుల పక్షులు కననగును; మొసళ్ల అధికము; కొండ చిలువలు, నాగుపాములు మొదలగు సర్పజాతులు విశేషముగ కలవు.

**3** జనసంఖ్య మొ. : 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 3,66,84,433. దేశపు ప్రాత ముఖ్యనగరమగు మనిలా నగరపు జనసంఖ్య 13,30,788; ప్రస్తుతపు ముఖ్యనగరమగు క్వెజాన్ సిటీ జనసంఖ్య 7,54,452. తక్కిన నగరములలో పానే దీవియందలి ఇలాయిలో (జ. సం. 2,09,738); సేబూ దీవిలోని సేబూ (3,47,116 ; మిందనావ్‌లోని జంబోంగా (1,99,901); ఆ దీవిలోనే ఉన్న దవావ్ (3,92,473 ; బాసిలాన్ దీవిలోని బాసిలాన్ (1,43,829); నెగ్రోస్ లోని బేకొలాడ్ (1,87,300 ; పశ్చిమ నెగ్రోస్ లోని సాన్‌కార్లోస్ (90,558); రిజాల్ లోని పాసే (2,06,283) ప్రముఖములు. సరాసరిన దేశ జనసాంద్రత చ. కిమీ. కు 120; జనవృద్ధి సాలున రమారమి 3.5%

మలయా-ఇండోనేసియన్ మానవజాతికిచెందిన వారు దేశమున 99.057% కలరని అంచనా; తక్కినవారిలో చీనీయ, భారతీయ, నీగ్రో, యూరపియన్, అమెరికన్ సంతతులవారు చేరియున్నారు. చీనీయులు చాలవరకు, వివాహములద్వారా, దేశీయ జాతిలో మిళితమగుచున్నారు.

దేశమున దాదాపు 70 దేశీయ భాషలు మాతృభాషలుగ వివిధ ప్రాంతములందు ప్రచారమున ఉన్నవి; ఈ భాషలన్నియు మలే-ఇండోనేసియన్ భాషా కుటుంబమునకు చేరినవి. వీనిలో 'తగలాగ్' అనబడునది దేశీయులలో 37%కు పరిచితము. దీనినే ప్రభుత్వము జాతీయ భాషగ 1946 నుండి లెక్కించుచున్నది; అయినను దేశీయులలో 39%కు సుపరిచితమగు ఇంగ్లీషు భాషయే అనుసంధాన భాషగ, ప్రభుత్వ వాణిజ్య వ్యవహారములందు అమలున ఉన్నది 1.6 ప్రజలు స్పానిష్‌భాషను మాతృభాషగ కలిగిఉన్నారు.

దేశమున మత స్వాతంత్ర్యపు హక్కు రాజ్యాంగ విధాన మూలమున కల్పింపబడినది. ప్రజలలో 82.[illegible]% ప్రజలు రోమన్ కేతలిక్ శాఖకు చెందిన క్రైస్తవులు; ముస్లిములు 4.[illegible] కలరు, వీరు మిందనావ్, సూలూస్ దీవులలో మాత్రమే కాననగుదురు. ప్రొటెస్టంటుశాఖా క్రైస్తవులు 2.9 ; లూజాన్, మిందనావ్ దీవులలోని పర్వత ప్రాంతపు గహన భూములందు ప్రకృతి దేవతారాధకులు కొందరు కలరు; దేశ ప్రజలలో రమారమి 0.2% మాత్రము బౌద్ధులు.

**4.** సమాచార సా. : దేశమున 1,458 తపాలా ఆఫీసులు 1,346 టెలీ-కమ్యూనికేషన్ స్థావరములు కలవు (1970). దేశమున రేడియో ప్రసార కేంద్రములు 178; టెలివిజన్ స్థావరములు 7 కలవు (1968).

**5.** యాన సౌ. : దేశపు రోడ్ల నిడివి 73,532 కిమీ; ఇందు దాదాపు 10% అత్యుత్తమ స్థాయికి చెందినది; రోడ్ల నిడివిలో దాదాపు 45% లూజాన్ దీవిలో ఉన్నది (1971). రైలు మార్గములు మొత్తపు నిడివి 1,354 కిమీ; ఇందులో 1 140 కిమీ. లూజాన్ దీవియందును, తక్కినది పానే దీవిలోను కలవు (1970). దేశమునచేరి ద్వీపములు అనేకములు ఉన్నందున జలమార్గములకు ఎక్కువ ప్రాధాన్యము కలదు. ఇటుల దేశాంతర్గత ప్రయాణమునకు ఉపయోగించు నౌకల మొత్తపు టన్నేజి 9,29,000 (1969). దేశమున వివిధ ద్వీపములందు కలసి మొత్తమున 351

రేవులు కలవు; వీనిలో 20 రేవులు మాత్రమే విదేశీయ వ్యాపారమునకై నియమితములు. రేవులలో నెల్ల మనిలా నగరపు రేవు, అంతర్జాతీయముగ పేరొందినది; తరువాత సేబూ, ఇలాయిలో రేవులు క్రమముగ లెక్కింపదగినవి.

దేశమున 74 విమానాశ్రయములు కలవు; మనిలాలోని విమానాశ్రయము పలు విదేశీయ విమానయాన సంస్థలకు మజిలీగా ఉపయోగపడు చున్నది; ప్రభుత్వమునకు చెందినవిగాక, వైయక్తిక యాజమాన్యమున 39 విమానాశ్రయములు దేశమున కలవు.

**6. చరిత్ర:** ఈ దేశపు పూర్వ చరిత్రను గురించిన వివరములు బాగుగ తెలియరాకపోయినను క్రీస్తు శకారంభమున ఇట దేశీయులందు ఒక నాగరిక వ్యవస్థ నెలకొన గలిగెననియు, ఆ ప్రజలపై మలయా, జావా ద్వీపములద్వారా భారతీయ సంస్కృతియు తన ప్రభావమును నెరపగలిగెననియు, ఆ ప్రాచీనుల లిపి భారతీయ లిపులకు సన్నిహితముగ ఉండెననియు తెలియవచ్చుచున్నది. ఈ దేశమునందలి వివిధ భాషలలో కన్పట్టు సంస్కృత తత్సమములు, తద్భవములు ఇందులకు ప్రబల నిదర్శనములు.

ప్రపంచ చరిత్రలో తొలుతటి భూప్రదక్షిణ యాత్రను నిర్వహించినవాడుగ పేరొందిన ఫెర్డినాండ్ మెజెల్లాన్ అను పోర్చుగీజు నావికుడు క్రీ. శ. 1521 మార్చి 6 న ఈ దేశమున కాలిడుటతో పాశ్చాత్యులకు ఈ దేశముతో తొలుతగ పరిచితి లభించినది. ఆ నావికుడు స్పెయిన్‌దేశపు పాలకుని ఆదర, ప్రోత్సాహములతో తన యాత్రను నిర్వహించుచున్నందున ఈ ద్వీపములు స్పెయిన్ దేశపు పాలకునకు చెందినవిగ ప్రకటించెను. అది మొదలుగ స్పెయిన్ పాలకుల సేనలు అటచేరి, దేశీయుల ప్రతిఘటనను నిర్మూలించి ద్వీపములను వశపరచుకొని, తమ దేశపాలకుడగు ఫిలిప్ పేర దేశమునకు ఫిలిప్పీన్స్ అను పేరు కల్పించిరి. (క్రీ. శ. 1600). స్పెయిన్ ప్రభుత్వపు ప్రోత్సాహమున దేశమున క్రైస్తవమతము, మిందనావ్ సూలూ ద్వీపముల ముస్లిములందు తప్ప, తక్కిన ప్రజలందు వ్యాపించినది. స్పెయిన్‌దేశపు వలస పాలన దాదాపుగ ఇట నాలుగు శతాబ్దములు సాగినది. 1820 లో దక్షిణ అమెరికాలోని స్పానిష్ వలసలు తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యమును గడించినవి; ఆ సందర్భమున ఫిలిప్పినో ప్రజలును ఆందోళన సలుపగ స్పెయిను ప్రభుత్వము దేశీయులకు కొలది అధికారములను కల్పించినను మొత్తముమీద, ఈ నాలుగు శతాబ్దములలోను, దేశ ప్రజలు స్పెయినుదేశపు నిరంకుశపాలనలో అడగియుండవలసివచ్చినది. దేశప్రజలు స్వాతంత్ర్యమునకై సాగించిన పోరాటములు నిర్దాక్షిణ్యముగ అడచివేయబడినవి. కడకు స్పెయిన్ దేశమునకును, యు. స్టే. కును మధ్య సాగిన పోరాటమున స్పెయిన్ పరాజితమగుటవలన ఈ రాజ్యము యునైటెడ్ స్టేట్స్‌కు వశమయ్యెను (1898). తరువాత ప్రజల ఆందోళనను ఆదరించి యు. స్టే. ప్రభుత్వము అంచెలవారీగా దేశీయులకు ప్రభుత్వమున అధికారమును కల్పించి 1944 కు స్వపరిపాలన దేశమున రూపొందింపజేయుటకు 1934 లో చట్టమూలకముగ ఆమోదించినది. ఇంతలో ద్వితీయ ప్రపంచయుద్ధ సందర్భమున ఈ దేశము జపాను సేనల వశమైనది (డిశెంబరు 9, 1941). కాని కడకు జపాను దేశము ఓడిపోయిన ఫలితముగ యు. స్టే. ఈ రాజ్యమును మరల వశపరచుకొని, తన పూర్వపు వాగ్దానమును అనుసరించి, 1946 జులై 4 వ తేదీన దేశము స్వతంత్ర గణరాజ్యముగ రూపొందుటకు సహకరించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధఫలితముగ ఈ దేశము విపరీతముగ దెబ్బతినినది: ప్రజలయందు పేద

రికను ఎక్కువగ వ్యాపించినది ఆ అవకాశమును గ్రహించి హుక బలహాప్ అను కమ్యూనిస్ట్ గెరిల్లాలు ప్రభుత్వమును వశపరచుకొనుటకై దౌర్జన్య మూలమున కృషిసల్పిరి. ఇట్టి పరిస్థితులలో స్వతంత్రప్రభుత్వమును చతురతతో నిర్వహించి యు. స్టే. ఇచ్చిన ఆర్థిక, సాంకేతిక సహకారమును సక్రమముగ వినియోగించుకొని, సముచితములగు భూమిసంస్కరణలను ప్రవేశపెట్టి దేశపు ఆర్థికా భ్యుదయమునకై రామోన్ మగ సేసే కృషిచేసెను. ఇతడు 1953 నుండి 1957 వరకు దేశాధ్యక్షుడుగ ఉండెను.

**7. పరిపాలన :** 1973 జనవరి 17 న ఆమోదింపబడిన నూతన రాజ్యాంగవిధానమును అనుసరించి దేశమున ప్రస్తుతమున పాలన నిర్వ హింపబడుచున్నది. దేశాధ్యక్షుడే ప్రధానిగ సైతము వ్యవహరించుచు తనకు పరిపాలనయందు సాయపడుటకై అతడు 13 మంది కార్యదర్శులను నియమించుకొని వారి ద్వారా వివిధ శాఖలను నిర్వ హించును. అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును, నాలు గేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ఎన్నుకొన బడుదురు. శాసననిర్మాణాధికారము కాంగ్రెస్‌కు కలదు; కాంగ్రెస్‌లో సెనెట్, ప్రతినిధుల సభ అను రెండు కక్ష్యలు కలవు. సెనెట్‌లోని సభ్యసంఖ్య 24; ప్రతినిధి సభలోని సభ్యసంఖ్య 120. ఈ సభ్యులను నాలుగేండ్లకు ఒకసారి ప్రజలు ఎన్ను కొనెదరు. 21 ఏండ్ల వయసునకు తగ్గక, ఇంగ్లీషు గాని, స్పానిష్‌గాని, ఏదియైన దేశీయభాషనుగాని చదువుటయో, వ్రాయుటయో నేర్చి, కొన్ని నివా సార్హతలు కలిగిన ప్రతిపౌరునికీ వోటుహక్కు కలదు. దేశమునందలి రాజకీయపక్షములలో నేష నలిస్ట్ పార్టీ, లిబరల్ పార్టీ అనునవి ముఖ్యములు. దేశమున 68 రాష్ట్రములు, 61 ప్రముఖనగరాలు, 1433 మ్యునిసిపాలిటీలు, 21 స్థానికపాలనా మండలములు కలవు. ప్రజాప్రతినిధులే వీనియందు స్థానికపాలనను నిర్వహించుచున్నారు.

సుప్రీమ్‌కోర్టు అధ్వర్యమున, వివిధ శ్రేణుల న్యాయస్థానములద్వారా న్యాయపాలన నిర్వహింప బడుచున్నది న్యాయశాఖకు స్వతంత్రప్రతిపత్తి కలదు. జడ్జీలను, ఒక ప్రత్యేక కమీషన్ యొక్క సలహాలను అనుసరించి అధ్యక్షుడు నియమించును.

**8. దేశరక్షణ :** యు. స్టే తో ఈ దేశమునకు రక్షణ ఒడంబడిక కలదు అందువలన దేశమున భూతల, నౌకా, వైమానిక స్థావరములను 99 సంవత్సరముల కౌలుమీద కలిగియుండు అధికారము 1947 లో యు. స్టే. కు కల్పింపబడెనది; 1966 వ సంవత్సరమున ఈ ఒడంబడికలో మార్పు జరిగి ఆ కౌలుకాలము అది మొదలుగ 25 సంవత్సరములు మాత్రమే ఉండునటుల నిర్ణయింపబడెనది. దేశ రక్షణవ్యవస్థను పటిష్ఠము చేయుటకును యు. స్టే. సాయపడుచున్నది.

భూతలసేనయందు 18,000 యోధులు కలరు; టాంకుదళములును కలవు. నౌకాసేనయందలి యోధసంఖ్య 18,000; ఇందు డిస్ట్రాయర్లను మించిన పెద్ద పోరాటపు నౌకలు లేవు. వాయుసేన యందలి యోధసంఖ్య 9,000; విమాన సంఖ్య 160 (1972).

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా.స. సంస్థాపన కాలమునుండియు అందు ఈ దేశము సభ్యత్వమును కలిగి ఉన్నది; దాని ప్రత్యేక సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. కమ్యూనిస్ట్ దేశ ములతో దౌత్యసంబంధములు లేకుండ ఈ దేశము చాల కాలము వైదొలగి ఉండినది; కాని 1974 లో ఐ. రా. స. యందు చీనాకు సభ్యత్వము లభించి ఆగ్నేయాసియాలో యు. స్టే. పలుకుబడి తగ్గిన తరు వాత ఈ దేశము తన వైఖరిని మార్చుకొని 1975 మొదలుగ, చీనా మొదలగు కమ్యూనిస్ట్ రాజ్య

ములతో మైత్రీసంబంధములను ఏర్పరచుకొనుట ఆరంభించినది

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది; దేశపు భూమిలో 37% వ్యవసాయమున ఉన్నది; ఇదిగాక, 25% వ్యవసాయయోగ్యముగ చేయబడుటకు అనుకూలముగ ఉన్నది. వ్యవసాయమున ఉన్న భూమిలో నాలుగింట మూడువంతులు ఆహార ధాన్యోత్పత్తికై వినియోగింపబడగా, తక్కినది వ్యాపారపు పంటలకై వినియుక్తమగుచున్నది. దాదాపు 40% వ్యావసాయిక భూమిలో వరి పండింపబడుచున్నది; వరి తరువాత చెప్పుకొనదగిన ఆహార ధాన్యము మొక్కజొన్న. వ్యాపారపు పంటలలో జనపనార, చక్కెర, కొబ్బరి ముఖ్యములు. 1970 లో ఆయా పంటల ఉత్పత్తి, టన్నులలో ఈ దిగువరీతిగ ఉన్నది; వడ్లు, 52.3 లక్షలు; కొబ్బరి 17.3 లక్షలు; చక్కెర 25 9 లక్షలు; మొక్కజొన్న 20.1 ల; పొగాకు 61,200; జనపనార 1,22,400, ఇవిగాక కొలది ప్రమాణములలో కాఫీ, కోకో, రబ్బర్, పండ్లు, కూరగాయలు ఉత్పత్తి అగుచున్నవి.

దేశపు వైశాల్యమున 53% అటవీమయము. దేశమునుండి 1969-70 లో 86 లక్షల ఘ. మీటరుల కలప ఎగుమతి అయినది; తక్కిన అటవీ ఉత్పత్తులలో బెంక, వెదురు, యక్షధూపం, వనస్పతినూనెలు, పేము, రంగుకలప పేర్కొనదగినవి. చేపల పరిశ్రమయు విరివిగ ఆదరింపబడుచున్నది; పశుపోషణకు ఎక్కువ ఆదరము కలదు. దేశీయులలో మాంసాహారము అంతగా వ్యాప్తిలో లేదు.

దేశపు ఆర్థికవ్యవస్థలో, వ్యవసాయము తరువాత లెక్కకు వచ్చునది ఖనిజకృషి. రాగి మాంగనీజు ఇనుము, బంగారము అందు క్రమ ప్రాముఖ్యము కలిగి ఉన్నవి. దేశమున ఇదివరలో ప్రముఖ పరిశ్రమలు ఏవియులేవు; కాని ప్రస్తుతమున వ్యావసాయిక వస్తువులపై ఆధారపడిన పరిశ్రమలు కొన్ని నెలకొల్పబడినవి. దేశమున విద్యుదుత్పత్తి సామర్థ్యము 1968 లో 12,43,000 కివా. దేశపు ఎగుమతులలో నార, ఆహారధాన్యములు, కలప ముఖ్యములు. దేశపు ఎగుమతుల విలువ 749 82 కోట్ల పేసోలు (1971); దిగుమతుల విలువ 801.85 కోట్ల పేసోలు.సాలుసరి బడ్జెటరీ వ్యయము 319.7 కోట్ల పేసోలు (1969-70).

**11. సాంఘిక రంగము :** దేశమున గృహవసతి చాలా తక్కువ; కార్మికశ్రేయస్సునకై తగు కార్మికశాసనములు అమలునందున్నవి. ఉచితము, నిర్బంధమునగు ప్రయిమరీ విద్యాబోధన అమలున ఉన్నది. జాతీయ భాషయగు తగలాగ్ బోధింపబడుచున్నను, విద్యాబోధనలో ఇంగ్లీషే ముఖ్య మాధ్యమంగా వాడుకలో ఉన్నది. 10 ఏండ్ల వయసుకు తగ్గని ప్రజలలో 83.37% అక్షరాస్యులు (1970). దేశమున ప్రాథమిక పాఠశాలలలో 69,09 989 మంది, సెకండరీ పాఠశాలలలో 13,37,535 మంది, కాలేజీస్కూళ్లలో 5,73,865 మంది పఠించిరి (1967—68). ఫిలిప్పీన్ విశ్వవిద్యాలయము 1908 లో స్థాపింపబడినది. ఇందలి విద్యార్థి సంఖ్య 21,776 (1966-67).

దేశమున 400 గ్రంథాలయములు కలవు. అందు ఫిలిప్పీన్స్ విశ్వవిద్యాలయ గ్రంథాలయము ప్రముఖము; మనిలాలోని జాతీయమ్యూజియం ప్రముఖత చెందినది. దేశమున పత్రికా స్వాతంత్ర్యము అమలున ఉన్నది. ఆరు దిన పత్రికలు ఇంగ్లీషునను ఒకటి తగలాగునను, రెండు చీనీయ భాషలోను వెలువడుచున్నవి.

దేశమున 47,856 శయ్యాసంఖ్యాకల ఆసుపత్రులును, మాతాశిశు కేంద్రములును కలిసి మొత్తం 761 కలవు; వైద్యసంఖ్య 24,921

.1360 ప్రజలకు ఒక వైద్యుడు కలడని ఇంచుమించు లెక్క తేలుచున్నది (1967).

**12. యాత్రా సౌ.:** ప్రభుత్వము యాత్రికులకు తగు సౌకర్యములను కలిగించి యాత్రా పరిశ్రమను ప్రోత్సహించుచున్నది. విదేశీయ యాత్రికులకు పాస్‌పోర్టు అవసరమే అయినను, 15 రోజులు మాత్రమే ఉండుటకు వీసా అవసరములేదు.

**13. ప్రసిద్ధ పౌ.:** ప్రముఖ ఫిలిప్పీనోలలో 1. రామోన్ మెగసెసే 1907-57 సుప్రసిద్ధుడు దేశమునకు ఆతడు ప్రజాస్వామిక తగు పునాదులను ఏర్పరచగలిగెను. 2. కార్లోస్ పి. రోములో (జ. 1899) రచయితగ, రాజకీయవేత్తగ అంతర్జాతీయఖ్యాతిని ఆర్జించినవాడు.

---

# 20. బంగ్లాదేశ్

**ముఖ్యనగరము:** ఢాకా; **జాతీయ గీతము:** అమర్ సోనార్ బంగ్లా (మా సువర్ణ వంగ భూమి) అను పాదముతో మొదలగునది; **నాణెము:** టాకా;




పటము 21.

ఒక టాకా = రూ. 0 60; **కొలతూకములు:** బ్రిటిష్ విధానపువే గతమున ఉన్నను మెట్రిక్ విధానమునకు మార్చబడుచున్నవి **కాలపరిగణన:** సా 6 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని

**1 ఉనికి మొ.:** భారత ఉపఖండమున బంగాళాఖాత తీరమును ఆనుకొని ఉన్న ఈ దేశమునకు ఉత్తర ఈశాన్యములందు భారతదేశపు అస్సాము రాష్ట్రమును, తూర్పున భారతదేశపు త్రిపుర రాష్ట్రమును ఆగ్నేయమున బర్మాదేశమును, దక్షిణమున బంగాళాఖాతమును పశ్చిమమున భారతదేశపు పశ్చిమ బెంగాల్ రాష్ట్రమును సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 1,42,797 చ కిమీ. దేశమున నదులు అనేకములు ప్రవహించుచున్నవి. భారతదేశమున ప్రవహించు గంగా, బ్రహ్మపుత్రా నదీ మండలములకు, చెందినవిగ ఇవి పరిగణనీయములు. నదులవలన ఏర్పడిన డెల్టాలలో బ్రహ్మపుత్రా నదియొక్క డెల్టా ముఖ్యమైనది. దేశమున ఎచటను భూతలము సముద్ర మట్టముపైన 150 మీ. ను ఎత్తున మించి ఉండదు. దేశ భూతలమున దాదాపు 8,300 చ. కిమీ. నీటి మునకలో ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** సాధు పొడవున దేశమున ఉష్ణత ఎక్కువగ ఉన్నను, గాలిలో చెమ్మదనముకూడ ఎక్కువగనే ఉండును. వర్షపాతము

విరివిగ కలదు; ఏ ప్రాంతమునందు సాలుసరి వర్ష పాతము 125 సెం మీ. కు తగ్గదు. కాక్స్‌బజారు, సిల్‌హెట్ ప్రాంతములలో ఆ వర్షపాతము 375 సెం. మీ. నుండి 500 సెం. మీ. వరకు ఉండును. దేశమున వన్యసంతతి అధికము; ఏనుగులు, పెద్ద పులులు మొదలగు పెద్దజంతువుల రకములును గణనీయ సంఖ్యలో అడవులందు కలవు. దాదాపుగ స్తనజాతి జంతువుల రకములు 200, పక్షి జాతులు 750, సరీసృప జాతులు 150, మత్స్య జాతులు 200 కలవని లెక్కలవలన తెలియు చున్నది.

**3. జనసంఖ్య మొ.:** 1961 లెక్కలను అనుసరించి, ఈ దేశపు జనసంఖ్య 5,08,53,721; 1972 లోని అంచనాలనుబట్టి ఆ సంఖ్య 7.5 కోట్లు. జనసాంద్రత చ. కిమీ కు 525. దేశపు నగరము లలో ఢాకా (1961 జ. స. 7,89,000); చిట్ట గాంగ్ (7,79,000); నారాయణ గంజ్ (4,27,000); ఖుల్నా (2,86,000) పేర్కొన దగినవి. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు బెంగా లీలు. వీరిలో ద్రావిడ, మంగోల్ జాతుల లక్షణ ములు మిశ్రితములైనటుల శాస్త్రజ్ఞుల భావన. చిట్ట గాంగ్ ప్రాంతమున మాత్రము అల్పసంఖ్యాకులగు మంగోలాయిడ్ జాతుల కొండజాతి ప్రజలు కలరు. దేశీయులలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష బెంగాలీ; బీహరీలు ఇదివరలో కొంతమంది ఉన్నను, ప్రస్తుతమున వారి సంఖ్య చాల తగ్గిపోయినది. దేశీయులలో 80.4% ప్రజలు ముస్లిములు; 17.4% హిందువులు; తక్కినవారు బౌద్ధులు, క్రైస్తవులు (1961).

**4. సమాచార సా.:** దేశమున ప్రభుత్వాధ్వ ర్యమున పనిచేయు తంతి తపాలా వసతులు కలవు (సంఖ్యా వివరములు తెలియవు); రేడియో టెలి ఫోను రేడియో టెలిగ్రాఫ్ వసతులును కలవు. ఢాకాలో ఒక రేడియో ప్రసార కేంద్రమును, దాని శాఖలు చిట్టగాంగ్, రాజషాహీ, సిల్‌హెట్‌లలోను కలవు. ఢాకాలో ఒక టెలివిజన్ కేంద్రము పని చేయుచున్నది.

**5. యాన సౌ.:** దేశమున రోడ్ల వసతి చాల తక్కువ: ప్రస్తుతమున 3,820 కిమీ. పొడవున రోడ్లు కలవు. రైలుమార్గపు నిడివి 3,246 కిమీ దేశాంతర్గత ప్రయాణములకు, సరకుల రవాణాకు నదీ మార్గములు ఎక్కువగ ఉపయోగపడుచున్నవి. సముద్ర తీరమునఉన్న చిట్టగాంగ్ రేవుద్వారా విదేశ వ్యాపారమున అధిక భాగము సాగుచున్నది; దానికి సమీపమునఉన్న చాల్నా రేవు సైతము కొల దిగ ఇందు సాయపడుచున్నది.

**6. చరిత్ర:** ఈ దేశపు చరిత్ర 1948 వరకు భారతదేశ చరిత్రతో ముడివడియున్నది. 1948 లో ఆ ఉపఖండము రాజకీయముగ విభక్తమైనపుడు పాకిస్తాన్‌న ఈ దేశము అంతర్భాగముగ ఉండి తూర్పు పాకిస్తాన్ అని వ్యవహరింపబడినది. కాని ప్రాదేశిక, భాషా సమస్యలవలన చెలరేగిన విభేద ముల ఫలితముగ, ఆంతరంగిక స్వపరిపాలనకై షేకు ముజిబుర్ రహమాన్ నాయకత్వమున, అవామీలీగు అను రాజకీయ పక్షము ఆందోళన ప్రారంభించి 1970 డిశెంబరున జరిగిన ఎన్నికలలో అత్యధిక స్థానములను అసెంబ్లీలో ఆర్జించినది; అంతట ప్రజల ఆకాంక్షను దౌర్జన్య మార్గమున అడచుటకై పాకిస్తాన్ కేంద్ర ప్రభుత్వము కృషి చేయగ, అది కడకు తూర్పు, పశ్చిమ పాకిస్తాన్‌ల మధ్య యుద్ధముగ పరిణమించుటయు, అంతట పాకిస్తాన్ దుశ్చర్యలవలన భారతదేశము కూడ యుద్ధమున దిగవలసి వచ్చుటయు కడకు 1972 జనవరి 12 స్వతంత్ర బంగ్లాదేశము అవతరించి షేక్ ముజిబుర్ రహమాన్ ప్రధాని అగుటయు జరిగినవి. ఆ సంవత్సరపు అంతమున ఒక నూతన

రాజ్యాంగ విధానము అమలులోనికి కొనిరాబడి, షేకు ముజిబుర్ రహమాన్ ప్రధానిగనే నూత్న ప్రభుత్వము ఏర్పడినది. కాని దేశపు ఆర్థిక, రాజకీయ పరిస్థితి ఆందోళనాజనకము కాగా షేక్ ముజిబుర్ రహమాన్, రాజ్యాంగ విధానమును రద్దుచేసి, తానే అధ్యక్షుడై, దేశమున బంగ్లాదేశ్ కృషిక్ శ్రామిక అవామీలీగు అను ఒకే ఒక రాజకీయ పక్షమును ఏర్పరచి, తక్కిన పక్షములను నిషేధించి, పాలనను తన మంత్రివర్గ సాయమున, తాను నియమించుకొనిన జాతీయ సంఘపు సలహాతో కొనసాగింప మొదలిడెను (1965 జనవరి 6). కాని దేశపు ఆర్థికవ్యవస్థ నానాటికి దిగజారుటవలన దానిని అరికట్టుటకై, ఆయన 100 టాకాల నోట్లను రద్దుచేసెను (ఏప్రిల్ 7, 1975); ఇంధన వాయు భూములను జాతీయము చేసెను. కాని ఇంతలో కొన్ని ఆంతరంగిక కల్లోలముల ఫలితమున సైన్యము తిరుగుబాటుచేసి, షేక్ ముజిబుర్ రహమాన్‌ను సకుటుంబముగ వధించి, దేశమున క్రొత్త ప్రభుత్వమును, ముస్తాక్ అహమ్మదు అధ్యక్షతన నెలకొనజేసినది (ఆగస్టు 15, 1975). కాని అనతికాలముననే అతడును, సైన్యమున వేరొక వర్గమువారి జోక్యమువలన పదవీ భ్రష్టుడు కాగా, వేరొక ప్రభుత్వము ఏర్పడినది.

**7. పరిపాలన :** దేశమున ప్రజాస్వామ్య, లౌకిక, గణతంత్ర రాజ్యాంగ విధానమే ఇకముందు, ఆచరణలో ఉండగలదని క్రొత్త ప్రభుత్వము ప్రకటించినది; కాని ప్రస్తుతమున సైన్యపు సహాయముతో అధ్యక్షుడు తన మంత్రి వర్గముద్వారా పాలనను నిర్వహించుచున్నాడు.

**8. దేశరక్షణ :** దేశ స్వాతంత్ర సంగ్రామ కాలమున ప్రముఖపాత్రను నిర్వహించిన ముక్తి వాహినిని ప్రాతిపదికగ గ్రహించి భూతల సైన్యమును, అటులే పాకిస్తాన్ ప్రభుత్వము వదలిపోయిన కొన్ని చిన్న నౌకలు ఆధారముగ ఒక నౌగా సేనయు, అట్టివేయగు కొలది విమానములతో వాయు సేనను నెలకొల్పి వానిని పటిష్ఠతరములు చేయుటకు కృషి జరుగుచున్నది. సంఖ్యావివరములు తెలియ వచ్చుటలేదు.

**9. అంతర్జాతీయ సం :** దేశమునకు ఐ.రా.స. యందును, పెక్కు తదనుబంధ సంస్థలయందును సభ్యత్వము కలదు. తొలుత చీనాయు, పాకిస్తాన్ దేశమును ఈ దేశముతో దౌత్యసంబంధములు నెలకొల్పుకొనకున్నను. ముజిబుర్ రహమాన్ మరణానంతరమున అవియు అట్టి సంబంధములను మొదలిడినవి. అయినను ఆస్తి, అప్పులపంపకమును గురించి పాకిస్తాన్‌తో ఈ దేశమునకు కల వివాదము ఇంకను పరిష్కృతము కాకున్నది. కామన్‌వెల్తున ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ముజిబుర్ రహమాన్ మరణానంతరమున, భారతదేశమునెడల, ఈ దేశ ప్రభుత్వము కొంత వైమనస్యము వహించినది. సామరస్య పూర్వకముగ సాధింపదగు ఫరక్కా బారేజి వంటి నీటివసరుల సమస్యల విషయమున బంగ్లాదేశ్ మొండి పట్టుదలబట్టి, ఆ సమస్యను అంతర్జాతీయము చేయుటకై కృషి చేయుచున్నది.

**10. ఆర్థికరంగము :** దేశపు ఆర్థికవ్యవస్థకు వ్యవసాయమే ముఖ్యాధారము దేశపు మొత్తపు వైశాల్యమున 63% అనగా దాదాపు 224 లక్షల ఎకరములు సేద్యమున ఉన్నది. ఉత్పత్తియగు ముఖ్యమగు ఆహారపు పంట వరి. సాలున దాదాపు ఒక కోటి టన్నుల ఉత్పత్తి ఇందు జరుగుచున్నది. అయినను దేశమున జనసంఖ్య అధికమగుటవలన, దేశావసరములకు ఇది సరిపోకున్నది. రొక్కపు పంటలలో ప్రముఖత వహించినది జనపనార. ప్రపంచమున ఉత్పత్తియగు ఈ పంటలో 80% ఈ దేశమున పైరగుచున్నది; దాదాపు 105 వేల ఎకరములలో తేయాకు ఉత్పత్తి జరుగుచున్నది. దేశమున పశుసంఖ్య విస్తారము; వ్యవసాయమునకు, రాకపోకలకు పాలు వగైరా ఆహారద్రవ్యములకు

గో మహిష సంతతులు దేశమున ఎరిపిగ వాడుక యందున్నను సంఖ్యా వివరములు తెలియవు. దేశమున 22,165 చ. కిమీ. వైశాల్యముగల అటవీ భూమి కలదు. ఇందలి కలప దేశావసరములకు సరిపోవుచున్నది. అడవులలోని కొయ్యను ముడి సామగ్రిగ గ్రహించి, కర్ణపులివద్ద ఒక కాగితపు ఫ్యాక్టరీ పనిచేయుచున్నది. ఇందలి ఉత్పత్తి రోజునకు 100 టన్నులు. దేశము పారిశ్రామికముగ పురోగతిని సాధింపకున్నది. జవుళి, చక్కెర. అల్లకం, అల్యూమినములకు సంబంధించిన కొన్ని పరిశ్రమలు మాత్రము కలవు. దేశమున విద్యు దుత్పత్తి సామర్థ్యము 160 వేల కివా.; తీతాస్‌వద్ద ఇంధనవాయువు లభించుచున్నది; ఇది ఢాకాకు పైపులద్వారా పంపబడుచున్నది. దేశపు ఎగుమతు లలో అత్యంత ప్రముఖత చెందినది జనపనార. ఎగుమతుల సంఖ్యావివరములు తెలియవచ్చుట లేదు. కాని దాని ఎగుమతివలన 1972-73 లో విదేశీయద్రవ్యము, 375 కోట్ల టాకాల విలువకు లభించినదని తెలియవచ్చుచున్నది.

**11. సాంఘిక రంగము :** స్వాతంత్ర్య సంగ్రామపు అనంతరమున దేశము ఆర్థికముగ కల్లోలితమయినది; వివిధ సాంఘిక రంగములందు సాధించిన పురోగతిని గురించి వివరములు తెలియవు. విద్యాబోధన ప్రభుత్వపు ఆధ్వరమున నిర్వహింపబడుచున్నది. దేశమున అక్షరాస్యత 17.6% (1961); విద్యాబోధన బెంగాలీయందు నిర్వహింపబడుచున్నది; ఇంగ్లీషునకు ద్వితీయ భాషగ ప్రాముఖ్యము కలదు. ఢాకా, రాజషాహి, మైమెన్‌సింగ్, చిట్టగాంగ్‌లలో విశ్వవిద్యాలయ ములు కలవు. దేశమున 1975 జూన్‌లో దిన పత్రికలు ప్రచారమునందుండి నిలిపివేయబడి ఇత్తిఫాక్ (బెంగాలీ): బంగ్లాదేశ్‌టయిమ్స్, (ఇంగ్లీషు) అనునవి మాత్రమే ప్రభుత్వపు ఆధిపత్యమున వెలువడు వసతి కల్పింపబడినది ఢాకాలోని విశ్వ విద్యాలయమున ప్రముఖ గ్రంథాలయమును, దర్శ నీయమగు మ్యూజియమును కలవు. దేశమున 6,668 శయ్యాసంఖ్యకల వైద్యశాలలు కలవు.

**12 యాత్రా సౌ. :** కామన్‌వెల్తునందు సభ్యత్వముకల దేశములవారికి వీసాలు అవసరము లేదు; ప్యాస్‌పోర్టులు కావలయును. ఈ సదుపాయము కొన్ని తక్కిన దేశములకును కలదు. ఈ సౌకర్యములేని తక్కిన దేశీయులు ప్యాస్‌పోర్టు, వీసాలను విధిగ పొందియుండవలయును. యాత్రికుల సంఖ్యా వివరములు తెలియవచ్చుటలేదు.

**13. ప్రసిద్ధ పౌరులు :** ఆధునికులలో అత్యంత ప్రఖ్యాతిని ఆర్జించినవాడు షేక్‌ముజిబుర్ రహమాన్ (1917-1975); దేశ స్వాతంత్ర్యమునకై పోరాడి సఫలతను ఆర్జించిన ఈతడు, కడకు దుర్మరణము పాలయ్యెను.

# 21. బర్మా

**ముఖ్యనగరము :** రంగూన్; **జెండా** . ఎరుపు రంగున ఉన్న భూమికపై ఎగువమూలన దండమువద్ద, అమరిన ముదురునీలపు చిన్న దీర్ఘ చతురస్రపు భాగమున కుదురుకొనిన పంచకోణపు పెద్ద నక్షత్రమును పరివేష్టించి కోణముల మధ్య నుండు అయిదు చిన్ననక్షత్రములు (తెలుపున) కలది. **జాతీయ గీతము :** కాబా మక్యే...... (మా మాతృభూమి......) అనునది. **నాణెము :** కియాత్; ఇది 100 పయాన్‌లుగ విభక్తము; ఒక కియాత్ = రూ. 1 40; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 6-30 గం. = భారతదేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి మొ. :** ఆగ్నేయ ఆసియాలో 92°-101° తూ. తులారేఖలమధ్యను, 10°-28°

ఉ. అక్షాంశ రేఖలమధ్యను, నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున ఇండియా, చైనాలును; తూర్పున థాయిలాండ్, లావోస్, చైనాలును; నైరుతిన బంగాళాఖాతమున అంతర్భాగమగు అండమాన్ సముద్రమును, పశ్చిమమున ఇండియా, బంగ్లాదేశ్ లును సరిహద్దులందున్నవి. దేశపు




పటము 22.

తూర్పు-పడమరల గరిష్ఠపు నిడివి 920 కిమీ; ఉత్తర-దక్షిణముల గరిష్ఠపు నిడివి 1,920 కిమీ; దేశపు వైశాల్యము 6,78,034 చ. కిమీ; తీరరేఖ నిడివి 1,920 కిమీ. భూతలరీత్యా, ఈ దేశము నాలుగు సహజసిద్ధ ప్రాంతములుగ విభజింపదగి యున్నది. 1. పశ్చిమమునను, ఉత్తరమునను ఉన్న పర్వతమయభూమి. ఇందలి శిఖరముల ఎత్తు 1,830 మీ. నుండి 6,100 మీ. వరకు కలదు. అరకాన్ యోమా పర్వత శ్రేణికిని బంగాళాఖాతమునకును మధ్యనున్న చీలికభూమి ఇందే చేరియున్నది. 2. తూర్పున ఉన్న షాన్ ఉన్నత భూములు. దాదాపు 900 మీ. సరాసరి ఎత్తుగల ఈ పీఠభూమి, దక్షిణమునకు చీలికగ కొనసాగి మలేదీపకల్పములోనికి, ఆగ్నేయదిశగ 800 కిమీ. చొచ్చుకొని పోవుచున్నది. 3. మధ్యబర్మా తూర్పున ఉన్న సాల్వీన్ నదికిని, పశ్చిమమున ఉన్న ఐరావతి, దాని ఉపనది చింద్విన్‌నది అనువానికిని మధ్యగఉన్న ఈ ప్రాంతము వ్యవసాయమునకు అనువైన భూమి. 4. ఐరావతీ, సిట్టాంగ్ నదుల మధ్యప్రదేశమును అత్యంత సారవంతమగు ఐరావతి డెల్టామండలమును చేరిన ప్రాంతము. ఆసియా యందెల్ల అతిసారవంతమని పేరొందిన ఈ ప్రాంతము, వరిపండుటకు ప్రపంచఖ్యాతి పొందినది. దీని వైశాల్యము 25,900 చ. కిమీ.

దేశపు తీరరేఖను ఆశ్రయించియు, సమీపపు అల్పద్వీపములందును, సహజ సిద్ధములగు, ఓడ రేవులు పెక్కు కలవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండల సహజమగు శీతోష్ణపరిస్థితులను కలిగియున్న ఈ దేశమున సంవత్సరమునందు, మూడు ఋతువులు-వర్ష, గ్రీష్మ శీత ఋతువులు మాత్రమే అనుభవ వేద్యములగుచున్నవి. మే మధ్యనుండి, అక్టోబరు మధ్యవరకు వర్షఋతువు; ఇక ఎండలు, రెండు పర్యాయములు. ఏప్రిల్‌నుండి, మే మధ్యవఱకును, అక్టోబరు మధ్య నుండి, నవంబరు నెలయంతటనూ, కాయును. ఇక తక్కిన కాలమును శీతకాలముగ లెక్కింపదగును. ఎగువ బర్మాలో సాలీనా వర్షపాతము

500 సెం. మీ; దిగువ బర్మాలోను, రంగూన్ ప్రాంతమునను, వర్షపాతము 250 సెం. మీ. ఇక మధ్యబర్మా, అనగా అరకాన్ యోమాకు, పశ్చిమ ప్రాంతమున సాలుసరి వర్షపాతము 60 సెం. మీ. 115 సెం. మీ. వరకు ఉండును ఈ ప్రాంతముననే మాండలే నగరము ఉన్నది. మధ్య బర్మాయందు ఎండలెక్కువ; ఎండకాలమున తాప క్రమము 100°ఫా. ను, అతిక్రమించును. శీతకాలమున 60° ఫా. గా ఉండును. దిగువ బర్మాలో కనిష్ఠోష్ణత 60° ఫా.: గరిష్ఠోష్ణత 100° ఫా. ఎగువబర్మాలో సమశీతోష్ణత కననగును.

దేశమున వృక్ష సంపద అత్యధికము; దాదాపు 60 విభిన్న జాతుల వృక్షములు కలవు. అటవీ వైశాల్యమున, దాదాపు నాల్గవవంతు భూమియందు టేకు వృక్షములు కలవు. ఈ టేకు అడవులు సాధారణముగ ఉన్నత పర్వత సీమలందు కననగుచున్నవి. ఏనుగులు, పెద్దపులులు, మొదలగు వన్య జంతువులు విరివిగ కలవు

**3. జనసంఖ్య మొ :** 1972 అంచనాలను అనుసరించి, దేశపు జనసంఖ్య 288.7 లక్షలు. దేశపు ప్రముఖ నగరములలో రంగూన్ (1971 జ. సం. 19,27,000), మాండలే (1969 జ. సం; 3,60,000 కు పైగా), మౌల్మీన్ (1971 జ. సం: 1,63,553). ప్రముఖములు దేశమందలి ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు (75%) టిబెటీయ జాతికి సన్నిహితులు; చీనీయజాతితో సాన్నిహిత్యము కలవారు షానులు, కరెనులు, కచిన్‌లు, కాయాలు, చిన్‌లు తక్కినవారిలో అత్యధిక సంఖ్యాకులు. వీరుగాక బర్మాలోని ఆదిమవాసులుగ భావింపదగిన మోన్, ప్యూ జాతుల ప్రజలు అల్పసంఖ్యలలో కలరు. భారత, పాకిస్తాన్ ప్రజల సంతతికి చెందిన వారు 1965 లో 7 లక్షల వరకు ఉండిరి కాని వారిలో అత్యధిక సంఖ్యాకులు మాతృదేశములకు తిరిగి పోయిరి. యూరపీయుల సంఖ్య చాల స్వల్పము.

ప్రజలలో 80% బర్మీయ భాషను మాతృభాషగ కలవారు. తక్కిన వారియందు వివిధ మాతృ భాషలు ప్రచారమున ఉన్నవి బర్మీయ లిపి దక్షిణ భారతీయ భాషల లిపులకు సన్నిహితము. బర్మా భాషయే, జాతీయభాషగ పరిగణనను అందినను, ఇంగ్లీషును వాడుట ఆమోదితమైనది రాజ్యాంగ విధానము ఆంగ్లమునను, బర్మీయ భాషలోను రచింపబడినది.

బర్మీయులలో 85% థేరవాద (హీనయానపు) బౌద్ధులు. రాజ్యాంగ విధానమున మతస్వాతంత్ర్యమునకు పరిగణన ఉన్నను, బుద్ధశాసన వ్యవస్థ అనుదానిని ప్రభుత్వమే చట్టము మూలమున నిర్మించి వివిధ బౌద్ధ సంఘముల మధ్య సమన్వయతను ప్రోత్సహించుచు, మారుమూలప్రాంతపు ప్రజలు సైతము బౌద్ధమతమును అవలంభించునటుల చేయుటకు కృషిచేయుచున్నది చీనీయసంతతికి చెందిన బర్మీయులలో. మహాయానబౌద్ధము ప్రచారమున ఉన్నది. పర్వతప్రాంత ప్రజలలో కరెన్‌లు, కాయాలు, కచ్చిన్‌లు, చిన్‌లు అను తెగలవారిలో కొంతవరకు క్రైస్తవమతము వ్యాపింపగలిగినది.

**4. సమాచార సౌ. :** దేశమున 1,092 పోస్టాఫీసులు, 27 865 టెలిఫోనులు. 283 తంతి అఫీసులు కలవు. టెలిఫోనులలో దాదాపుగ సగము రంగూనుననే ఉన్నవి. రేడియో-టెలిఫోను, లేదా వైర్‌లెస్ టెలిగ్రాఫ్‌వలన యు. స్టే: సో. రష్యా; బ్రిటన్ డెన్‌మార్క్, స్వీజర్‌లండ్, ఆస్ట్రియా కెనడా, ఇటలీలతో ఈ దేశమునకు వార్తా సంబంధము కలదు. దేశమునను కొన్ని దూరప్రాంతముల మధ్య వైర్‌లెస్ వార్తాసౌకర్యము అమలున ఉన్నది. రంగూనున రేడియో ప్రసారకేంద్రము ఒకటి పనిచేయుచున్నది (1972).

**5. యాన సౌ. :** దేశమున 3,925 కిమీ. పొడవున ప్రధానములగు రోడ్లును, 9,630 కిమీ.

నిడుపున తక్కువిధముల రోడ్లును కలవు (1970-71). 4,280 కిమీ. పొడవుగల మీటరు గేజి రైలుమార్గములు దేశమున కలవు. ఇందు రంగూన్‌నుండి ప్రోముకు (259 కిమీ.), రంగూన్ నుండి మాండలేకు (618 కిమీ.) అటనుండి మియిత్‌కియినాకు (1,157 కిమీ) పోవుమార్గములు ముఖ్యములైనవి. కొలది పరిమితిగల నౌకల పయనమునకు అనుకూలించు జలమార్గములు దేశమున పెక్కుకలవు. ఐరావతి డెల్టాలో 3,200 కిమీ. నిడివియు, సాల్విన్ మొదలగు నదులలో 400 కి. మీటర్ల నిడివియుగల జలమార్గములు కలవు. రంగూన్‌న అన్ని వసతులు కల హార్బరు కలదు. దేశపు సముద్ర వాణిజ్యమున 85% దీనివలననే సాగుచున్నది. తక్కినరేవులలో అక్యాబ్, బస్సీన్, మౌల్మీన్, తవాయ్, మెర్గ్వి పేర్కొనదగినవి.

రంగూన్‌కు సమీపమున ఉన్న మింగలదాన్ విమానాశ్రయము అత్యుత్తమస్థాయికి చెందినది. ఇటనుండి 9 విదేశీయ విమానయాన సంస్థలు, ప్రపంచపు, పలుదేశములకు ప్రయాణములను నిర్వహించుచున్నవి. పై విమానాశ్రయముగాక, తగ్గు స్థాయికి చెందిన 86 విమాన క్షేత్రములు, దేశమున ఆయా ప్రాంతములందు కలవు. దేశమున మారుమూల ప్రాంతములను కలుపుచు, ప్రభుత్వపు విమానయాన సంస్థ ప్రయాణములను నిర్వహించుచునద్ని.

**6. చరిత్ర :** క్రీస్తు శకారంభమునకు పూర్వము నుండియే ఈ దేశమున భారతదేశీయ మత సంస్కృతులు, నెలవు కల్పించుకొని, అనేక రాజ్యములు రూపుగొనుటకు కారణభూతమైనను, వానిని గురించిన వివరములు అసమగ్రముగ మాత్రమే తెలియనగుచున్నవి క్రీ. శ 1044 లో అనువ్రతరాజు పాగన్ నగరము కేంద్రముగ, ఒక రాజ్యమును సంస్థాపించుటతో ఈ దేశమున చారిత్రక యుగము ఆరంభమయ్యెనని చెప్పవచ్చును. క్రీ. శ. 1287 వరకు ఈ రాజ్యము వైభవోపేతముగ మన గలిగినది. అంతట అది, మంగోలు దండయాత్రల వలన అంతరించగ, దేశము నామమాత్రముగ చీనా సామ్రాజ్యమున, అంతర్భాగమైనను, యథార్థమున అరాజకముపాలై, నాయుగు శతాబ్దములు ఆస్థితిలోనే ఉండినది. 1754 లో అలంగపాయ అనురాజు ఉత్తర-దక్షిణ ప్రాంతముల పాలకులను నిర్జించి, బర్మాను అంతటిని పాలించు ఒక రాజవంశమునకు మూల పురుషుడయ్యెను.

1824-26 లో బ్రిటిష్‌వారు, భారతదేశమునుండి బర్మాకై, సాగించిన దండయాత్రలో బర్మీయులు ఓడిపోగా ఆరకాన్, తెన్నాసెరిమ్ ప్రాంతములు బ్రిటిష్‌వారికి దక్కినవి. తరువాత 1852 లోను, 1886 లోను జరిపిన దండయాత్రల మూలమున, అంచెల వారీగా, తక్కిన రాజ్యమును బ్రిటిష్‌వారికి లభించినది ఆదేశమును అంతటినుండి 1937 వరకు, తమ భారత సామ్రాజ్యమున, అంతర్భాగముగ బ్రిటిష్‌వారు పాలించిరి. 1937 నుండి బర్మాను ప్రత్యేక ప్రాంతముగ ఉంచి, బ్రిటిష్‌వారు తమ పాలనను కొనసాగించిరి. అయినను, జాతీయ వాదుల ఆందోళనకు లొంగి, అంతటంతట పరిపాలనయందు కొలదిగ భాగస్వామ్యమును, ప్రజా ప్రతినిధులకు కల్పించిరి.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలమున జపాను సేనలు, దేశముపై దండెత్తగ, జాతీయవాదులు జపాను సేనలతో సహకరించి, బ్రిటిష్ సేనలను తరిమివైచిరి. తదనంతరమున జపానీయుల అధికారమును, తొలగించుటకై, ఆ జాతీయవాదులే జపాను సేనలను ఎదిరించి, మిత్రమండలి సేనలకు, సాయము చేసిరి. తత్ఫలితముగ 4 జనవరి, 1948 లో దేశము స్వతంత్ర రాజ్యమైనది.

స్వతంత్రతను ఆర్జించినపిదప దేశము వివిధ ఆంతరంగిక సంక్షోభములను ఎదుర్కొని రాజ్య

వ్యవస్థయందు పెక్కు మార్పులకు లోనైనది. 1962 లో అప్పటి ప్రజాతంత్ర గణరాజ్య సమాఖ్యా ప్రభుత్వమును అంతరింపజేసి, సైనిక విప్లవ సంఘము అధికారమును కైవసము చేసికొనినది. ఆ సమితికి అధ్యక్షుడగు సేనాని నే విన్, ప్రస్తుతము ఆధిపత్యము వహించి, పరిపాలన నెరపుచున్నాడు.

**7. పరిపాలన :** ఇప్పుడు దేశమును పరిపాలించునది విప్లవసమితి. దీనియందే సర్వాధికారములును న్యస్తములై ఉన్నవి. పార్లమెంటు రద్దయినది. రాష్ట్రములందు మాత్రము రాష్ట్ర మహా సమితులను, వాని అధ్యక్షులను ప్రభుత్వము నియమించి వారిద్వారా పాలనను నిర్వహించుచున్నది. 1962 మొదలుగ విప్లవసంఘము తన అధికారములను, అధ్యక్షుడగు నే విన్‌కు దత్తము చేసినందున, చట్టములన్నియు అతనిపేరనే జారీ యగుచున్నవి. ఒక మంత్రిమండలిని నియమించు కొని తద్వారా దేశపాలనను, అధ్యక్షుడు నిర్వర్తించుచున్నాడు. న్యాయశాఖయు, అతని ఆధ్వర్యముననే పనిచేయుచున్నది. తగు సమయమున, దేశమున ప్రజాతంత్ర పరిపాలన నెలకొల్పబడగలదని నే విన్ పలుమారులు పేర్కొనినాడు. పెక్కు రాజకీయ పక్షములు దేశమున ఇదివరలో ఉండినను, 1962 మొదలుగి విప్లవసమితి స్థాపించిన బర్మా సోషలిస్టు ప్రోగ్రాం పార్టీలోనే తక్కిన పార్టీలు చేరవలెనని ఆదేశింపబడి, ఆ పక్షమునకు మాత్రమే పరిగణన కల్పింపబడినది.

**8. దేశరక్షణ :** దేశపు పదాతిదళమున దాదాపుగ 1,30,000 మంది సైనికులు కలరు. దేశ భద్రతలకు మాత్రమే ఉద్దేశితమగు ఈ సేనకు అందులకు తగిన ఆయుధ, శకట సంపత్తిని, బ్రిటన్, యు. స్టే., యుగోస్లావియా సమకూర్చినవి. నౌకాదళమున 6,000 నావికయోధులును, కోస్తా రక్షణకు ఉపయోగించు పలురకముల నౌకలు 60 ను కలవు. వైమానిక దళమున యోధసంఖ్య 6,500. ఆ దళమునకు 21 పోరాటపు విమానములు తక్కు రకముల విమానములు 51, హెలికాప్టర్లు 40 కలవు. ఆంతరంగిక భద్రతకొరకు పనికివచ్చు ఆయుధ సామగ్రి మాత్రమే వీనికి కలదు.

**9. అంతర్జాతీయ సం. :** 1948 మొదలుగ, ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది. ఆఫ్రో–ఆసియా సంస్థలందును, తదితర అంతః ప్రభుత్వ సంస్థలందును, దీనికి సభ్యత్వము కలదు. కొలంబో ప్రణాళికద్వారా యు. స్టే., బ్రిటన్, ఆస్ట్రేలియా, కెనడా, న్యూజీలండులనుండి ఆర్థిక సాంకేతిక, సహాయము లభించుచున్నది. అంతేగాక ద్వైపాక్షిక ఒడంబడికలద్వారా పశ్చిమ జర్మనీ, ఇండియా, సోవియట్ రష్యా, చీనా జపానులనుండియు ఈ దేశము ఆర్థిక సహాయము పొందుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. సాగుబడిలో ఉన్న భూమియందు 70% కు పైగా (12,302 వేల ఎకరములు 1971-72), వరి సాగున ఉన్నది. 1963 లెక్కల ప్రకారము దేశావసరములకు పోగా, 15 లక్షల టన్నుల బియ్యము విదేశములకు ఎగుమతి చేయబడినది. దేశమున వరిపంట తరువాత లెక్కకువచ్చునది చక్కెర చెరకు. అల్ప విస్తృతిలో వేరుశనగ, పప్పుధాన్యములు నూవులు, ప్రత్తి క్రమ ప్రాముఖ్యమున ఉత్పత్తి అగుచున్నవి. 1958 లో అమలునకు కొనిరాబడిన భూమి సంస్కరణలను, అనుసరించి 33,46,911 ఎకరముల భూమియందు పేదరైతులకు స్వామ్యము కల్పింపబడినది. ప్రస్తుతము అధికారమునఉన్న ప్రభుత్వము, వ్యవసాయమునకు అత్యధిక, ప్రాధాన్య

మును కల్పించి, యంత్ర సామగ్రి, మొదలగు వానిని సమకూర్చి రైతులను ప్రోత్సహించు చున్నది.

తెన్నాసెరిమ్, ఐరావతీ డెల్టా ప్రాంతములో రబ్బరు తోటల పెంపకము చిన్నస్థాయిలో జరుగు చున్నది. 1968 లో రబ్బరు ఉత్పత్తి 9,100 టన్నులు. దేశమున వ్యవసాయోత్పత్తుల పంప కము ప్రభుత్వ సంస్థలద్వారా మాత్రమే నిర్వహింప బడుచున్నది. దేశమున పశుసంపదయు, విస్తృత ముగ కలదు.

వ్యావసాయిక కృషికి తరువాత ప్రముఖముగ పేర్కొనదగినది మత్స్య పరిశ్రమ. ఈ పరిశ్రమ విరివిగ నదీ ప్రాంతములందే వ్యాప్తి పొంది యున్నది. సముద్రమునందలి చేపలను పట్టు టకు బర్మీయులు అంతగా ఇచ్చగింపరు. కాని కొలది సంవత్సరములనుండి, జపానీయ, తాయి సంస్థల సహకారముతో సముద్ర ప్రాంతమునకూడ, మత్స్య సేకరణ విరివిగ జరిపించుటకు, ప్రభు త్వము కృషిచేయుచున్నది.

దేశమున 57% భూమి అటవీమయము. అడ వుల ఉత్పత్తులలో, ముఖ్యముగ పేర్కొనదగినది టేకు కలప. ప్రపంచపు మార్కెటులలో కావలసిన, టేకు కలపలో 75% బర్మా ఎగుమతి చేయు చున్నది. 1971-72 లో 72,360 టన్నుల, టేకు కలప ఉత్పత్తి అయినది. దీని విలువ 1209 లక్షల కియాత్‌లు; తక్కిన విధముల కలప 9,72,000 టన్నులు. దీని విలువ 982 లక్షల కి.

దేశమున విభిన్న రీతుల ఖనిజసంపద విరివిగ కలదు. సీసము, తుత్తునాగము, వెండి, రాగి, నికెల్, కోబాల్ట్ ధాతువులు అందు ముఖ్యములు. చౌక్, లనీవా ప్రాంతములలో, పెట్రోలు బావులు కలవు. ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వ మున, ఖనిజముల ఎగుమతిచేయు దేశములలో, ప్రముఖ శ్రేణికి చెందిన దేశముగ బర్మా పేరొం దెను. యుద్ధమువలనను, తదనంతరపు ఆంతరంగిక కల్లోలములవలనను వీని ఉత్పత్తి మందగించినది. 1952 నుండి, ప్రభుత్వాధ్వర్యమున, ఈ గనులను పనిచేయించుటకు కృషి మొదలైనది. తొలుత ఒక బ్రిటిష్ కంపెని ఆధిపత్యమున పనిచేయు చుండిన పెట్రోలియం పరిశ్రమను 1963 లో ప్రభుత్వము జాతీయము చేసినది. తరువాత 1964 లో వ్యక్తి స్వామ్యమున పనిచేయు తక్కిన పెట్రోలియం సంస్థలనుకూడ ప్రభుత్వము జాతీయ మొనర్చినది. 1971-72 లో 74.1 లక్షల, పీపాల ముడి పెట్రోలియం ఉత్పత్తి జరిగినది. అయదా అను ప్రదేశమున, ఇంధన వాయువు లభించుచున్నది దేశమున విద్యుదుత్పత్తి 6,540 లక్షల కివా. దేశపు ఎగుమతుల విలువ 5,691 లక్షల కి; దిగుమతుల విలువ 5 342 లక్షల కి. (1970-71). దేశమున బ్యాంకు లన్నియు 1969 లో జాతీయములు చేయబడి అన్నియును, ఒకే ఒక ప్రజాబ్యాంకుగా రూపొందినవి. దీని వివిధ శాఖలద్వారా దేశ-విదేశ వ్యాపారము నిర్వహింపబడుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 970.2 కోట్ల కి. (1972-73).

**11. సాంఘిక రంగము :** ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున, ఆగ్నేయ, ఆసియా దేశములందు అన్నిటను గృహవసతికి సంబంధించి నంతవరకు ఈ దేశపుడే పైచేయిగ ఉండినది. కాని యుద్ధ ఫలితముగ పరిస్థితి తారుమారైనది. ప్రస్తుత ప్రభుత్వము 1970 మొదలుగ ఒక ప్రణాళికను అనుసరించి, చౌకధర గృహవసతిని ప్రజలకు సమ కూర్చుటకు కృషి జరుపుచున్నది. అయినను ఇప్పటివరకు రంగూన్ నగరమున, తక్కిన జిల్లా నగరములును మాత్రమే ఈ కృషివలన లాభపడ గలిగినవి.

దేశమున అక్షరాస్యత 57% (1954). 1964 మొదలుగ వృత్తి ప్రాముఖ్యము కలిగిన విద్యావిధానమును విప్లవసమితి ప్రవేశ పెట్టినది. విద్యాబోధన, బర్మీయ భాషలో సాగుచున్నను, ఇంగ్లీషుభాష సెకండరీ స్థాయి నుండి, విధిగ బోధింపబడుచున్నది. విద్యాబోధన ఉచితముగనే జరుగుచున్నను, నిర్బంధ విద్యావిధానము అమలున లేదు.

1971-72 లో దేశవు మొత్తమున 35,28,500 మంది విద్యార్థులుకల 17,309 ప్రయిమరీ పాఠశాలలును, 7,38,700 మంది విద్యార్థులుకల 1,142 మాధ్యమిక పాఠశాలలును, 1,82,000 మంది పఠించు, 561 ఉన్నత పాఠశాలలును పని చేసినవి. వాని మొత్తమున ఉపాధ్యాయ సంఖ్య 82,500.

దేశమునందలి విశ్వవిద్యాలయములు (రంగూన్, మాండలే) వికేంద్రీకరింపబడినవి తత్ఫలితముగ విశ్వవిద్యాలయ ప్రతిపత్తికల 10 సంస్థలు రూపొందినవి (1967). ఆ సంస్థలలో చదువు విద్యార్థుల సంఖ్య, 51,074 (1970-71).

గణనీయములగు గ్రంథాలయములుగాని, మ్యూజియములుగాని దేశమున కన్పట్టవు. కాని దేశమంతట విరివిగ కన్పట్టుచు, 'పగోడా'లు అను పేరున వ్యవహరింపబడు, రమ్య బౌద్ధాలయములు, బర్మీయ కళాభిరతికి నిదర్శనములుగ నిలిచియున్నవని చెప్పవచ్చును.

విప్లవ ప్రభుత్వము రాజ్యాంగ విధానమును, అమలునుండి తొలగించినను, పత్రికా స్వాతంత్ర్యమును మాత్రము సాగనిచ్చినది. అయినను, ఒక ప్రభుత్వ వార్తాకేంద్రమే దేశీయ వార్తలను అందజేయు, గుత్తాధికారమును కలిగియున్నది. దేశమున 12 దినపత్రికలు వెలువడుచున్నవి. ఇందు మాండలేనుండి వెలువడు ఒక బర్మీయభాషా దినపత్రికతప్ప, తక్కినవి అన్నియు—5 బర్మీయ భాషలోను, 3 చీనీయ భాషలోను, 2 ఇంగ్లీషునను, 1 తమిళముననను, రంగూనునుండియే ప్రచురింపబడుచున్నవి (1969).

1963 నాటికి దేశమున, అందును పల్లెలందు వైద్య సదుపాయమునకు తగిన వసతులు లేకుండినవి. కాని తదాదిగ, ప్రభుత్వపు కృషివలన పరిస్థితి కొంత మెరుగైనది. దేశమున 21,671 శయ్యాసంఖ్యకల 315 ఆసుపత్రులును, 65 డిస్పెన్సరీలును కలవు. వైద్య సంఖ్య 2,685. అనగా 12,500 మందికి ఒక వైద్యుడు కలడని లెక్క తేలుచున్నది.

**12 యాత్రా సౌ.** : విదేశీయులు దేశమున పర్యటించుటను, ప్రభుత్వము అంతగా ప్రోత్సహించుటలేదు. దేశమున పర్యటింప గోరువారు తగిన 'వీసా' పాస్‌పోర్టులను, తక్కిన విధముల ఆవశ్యక పత్రములను కల్గియుండవలెను.

**13. ప్రసిద్ధ పౌరులు :** తొలుతగ క్రీ. శ. 1044 లో పాగన్ కేంద్రముగ, ఒక రాజ్యమును నెలకొల్పి, బౌద్ధమతమునకు ప్రముఖ స్థానమును కల్పించిన అను వ్రత రాజు.

2. బర్మాను ఏకీకృతము కావించి, దాదాపు 130 సంవత్సరములు దేశమును పాలించగలిగిన ఒక రాజవంశమును నెలకొల్పిన అలవంగపాయ (1752-60 ప.).

3. దేశ స్వాతంత్ర్యమును ఆర్జించుటలో, ప్రముఖపాత్ర వహించి, ఆధునిక బర్మా జనకుడుగ పేరొంది, అల్ప వయసుననే దుర్మరణముపాలైన ఆంగ్‌సాన్ (1916-47).

4. బర్మాదేశపు ప్రప్రథమ ప్రధాని యూనూ (జ. 1907). పదవీభ్రష్టుడై ఇతడు ప్రస్తుతమున భారతదేశముననుండి, ఆధ్యాత్మిక విషయములందు కృషి చేయుచున్నాడు.

# 22. బహరీన్

**ముఖ్యనగరము :** అల్ మనమా; **జెండా :** ఎఱ్ఱని రంగునకుండి, దండమునద్ద మాత్రము తెల్లచారను కలిగియున్నది; **నాణెము :** బహరీన్ దీనార్, దీని వినిమయపు విలువ = రు. 7 50; **కొలతూకములు :** బ్రిటిష్, మెట్రిక్ ప్రమాణములును, స్థానిక ప్రమాణములును వ్యాప్తిలో ఉన్నవి; **కాలగణన :** సా. 3 గం. 20 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఈ దేశము 33 చిన్న ద్వీపముల కూటమి; ఈ ద్వీపములు పారసీక సింధుశాఖలో కటార్, సౌదీ అరేబియా భూభాగములమధ్య నెలకొనిఉన్నది. వీనిలోనెల్ల పెద్ద ద్వీపము బహరీన్ (26° ఉ; 50°50′ తూ.); దీని గరిష్ఠపు నిడివి 48 కిమీ; గరిష్ఠపు వెడల్పు 19 కిమీ; అన్ని ద్వీపముల మొత్తపు వైశాల్యము 369.6 చ. కిమీ. దాదాపుగ అన్ని ద్వీపములును కొంతవరకు ఇసుక పఱ్ఱలు, కొంతవరకు సున్నపు రాతినేలలు; నేల చదునుగఉన్నను, బహరీన్‌లో మాత్రము 140 మీ. ఎత్తుగల ఒక చిన్న గుట్ట ఉన్నది. కటారు ద్వీపకల్పమున తనకు చెందిన భూమి కొంత కలదను బహరీన్ ప్రభుత్వపు వాదము వివాదమున ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఇందు గ్రీష్మఋతువు అతి దీర్ఘము; సాధారణముగ మేనుండి అక్టోబరు వరకు విరివిగ ఎండలు కాయును; అవుడు నీడన సైతము 110° - 120° ఫా. తాపక్రమము ఉండును. దేశపు సరాసరి ఉష్ణోగ్రత ఆగస్టున 90° ఫా; జనవరిలో రమారమి 60° ఫా. గను ఉండును. దేశపు సరాసరి సాలీనా వర్షపాతము 5-10 సెం. మీ. ఇదియు చాలవరకు అనిశ్చితపు మార్పులకు లోనగును. తీరభూములందు కన్పట్టు మునుగ్గచెట్లు, ఖర్జూరపు వృక్షములుతప్ప వేరు విధపు వృక్షసంతతి లేదు; జంతువులలో లేళ్లు-నక్కలు మాత్రము అటనట కనబడుచున్నవి

**3. జనసంఖ్యా మొ. :** దేశపు మొత్తపు జనసంఖ్య 2.16.315; ముఖ్యనగరపు జనసంఖ్య 89,728 (1971 లెక్కలు) ప్రజల మాతృభాష అరబ్బీ; దాదాపుగ అందఱును ముస్లిములు; వలస వచ్చిన అల్పసంఖ్యాకులగు భారత, యూరపీయ సంతతులలో మాత్రము వేరు మతములవారు కొలదిగ కన్పట్టుదురు; ముస్లిములలో షియా సంప్రదాయమువారు 50 .

**4. సమాచార సౌ. :** దేశపు వివిధ ద్వీపములమధ్యను, విదేశములతోను తంతి, టెలిఫోను సౌకర్యములు విరివిగ కలవు; ఒక రేడియో స్టేషను, టెలివిజన్ కేంద్రము పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** రైలుమార్గములు దేశమున లేనేలేవు; ద్వీపములలోను, నగరములలోను రోడ్లు కలవు. బహరీన్‌ను ప్రక్కద్వీపముతో కలుపుచు ఒక వంతెన 1974లో నిర్మింపబడినది. ద్వీపముల మధ్య ప్రయాణములకు 'ధో' అనబడు చిన్ననౌకలు పనికివచ్చుచున్నవి. విమానయానము దేశమున చాల విస్తృతముగ అభివృద్ధిచెందినది. మహర్రఖ్ అను నగరమున ఉన్న విమానాశ్రయము పలు అంతర్జాతీయ విమానమార్గముల కూడలిగ ఉపకరించుచున్నది.

**6. చరిత్ర :** బహరీన్ ద్వీపసముదాయము తొలుతనుండియు అరబ్బుల ఆవాసప్రాంతములలో ఒకటిగ ఉండి, ఇస్లామిక మతచరిత్రలో సైతము గణనీయపాత్రను నిర్వహించినది. ఇస్లామిక మతమున ఒక మార్పునకు కారణభూతులయిన

కర్మేతియనులనువారు ఇట కొంతకాలము పాలనను నెరపిరి. వారి ప్రాభవము క్షీణించిన తరువాత ఈ ప్రాంతము దోపిడిగాండ్రకు, సముద్రపు దొంగలకు నిలయమయ్యెను; కడకు తమ సముద్రయాన మార్గముల రక్షణకై పోర్చుగీజువారు బహరీన్‌ను వశపరచుకొని (1521) అట 1602 వరకు అధికారమును నెరపిరి. తరువాత ఇరాన్ ప్రభుత్వము దానిని వశపరచుకొని 1782 వరకు పాలించినది. అంతట అరేబియానుండి వలసవచ్చిన ఉతుబ్ తెగ నాయకుడు బహరీన్‌ను జయించి దానికి, షేక్ అను బిరుదముతో, పాలకుడయ్యెను. అప్పటినుండియు, మధ్యకాలమున కొలది సంవత్సరములందు తప్ప ఇప్పటివరకు ఆ వంశపువారే ఇచట ఆధిపత్యమును నెరపుచున్నారు. 1861 లో అప్పటి షేకు, టర్కీ, ఇరానుల బెదరనుండి తప్పించుకొనుటకై, బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణను పొందెను; క్రమముగ బ్రిటన్ అచట తన స్థానమును, 1880 లోను 1892లోను ఒడంబడికలద్వారా సుస్థిరము చేసికొనగలిగినది. ద్వితీయ ప్రపంచయుద్ధానంతరమున అరబ్ ప్రపంచమునందు అంతట చెలరేగిన స్వాతంత్ర్యాకాంక్షను గుర్తించి, దేశప్రజలకు, షేకు ఆధ్వర్యముననే, ప్రభుత్వమున భాగస్వామ్యమును కలుగజేయుటకు కృషిమొదలిడె, కడకు ప్రజాభిప్రాయములకు లొంగి, 1971 లో దేశమునుండి, బ్రిటిష్ ప్రభుత్వము వైదొలగెను. అంతట షేకు దేశమును స్వతంత్రముగ ప్రకటించి, తన్ను అమీరుగ ప్రకటించుకొనెను. ఇంతలో బహరీన్‌న తనకు హక్కుకలదని ఇరాన్‌ప్రభుత్వము వివాదమును లేవదీసినను, ఐ. రా. స. తీర్పును శిరసావహించి వివాదమును వదలుకొనెను.

**7. పరిపాలన :** దేశమున రాజపాలన నిరంకుశమే అయినను, రాజకుటుంబమునుండియు, తక్కినవారినుండియు, కొందరు ప్రముఖులను మంత్రివర్గముగ నియమించి రాజు పరిపాలనను నిర్వహించుచున్నాడు. 1972లో రాజ్యాంగ పరిషత్తునకు ఎన్నికలు జరిగినవి; ఆ రాజ్యాంగ పరిషత్తు ఒక రాజ్యాంగ విధానమును రూపొందించినను అది ఇంకను అమలునకు రాలేదు (1974).

**8 దేశరక్షణ :** సైనికవ్యవస్థ ఇంకను చక్కగ రూపొందింపబడలేదు; పోలీసు దళములతో పాటుగ సుశిక్షితములగు స్కౌటుదళములు కొన్ని దేశభద్రతకై పనిచేయుచున్నవి, 1971 లో కుదిరిన ఒక మైత్రి ఒడంబడికను అనుసరించి, బహరీన్‌పై జరుగు దురాక్రమణను నిరోధించు బాధ్యత బ్రిటనుకు కలదు.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స.యందును తదనుబంధ సంస్థలయందు పెక్కింటను బహరీన్‌కు సభ్యత్వముకలదు

**10. ఆర్థికరంగము :** తొలుత ముత్యముల సేకరణపైనను, చేపలను పట్టుటమీదను ఆధారపడియున్న ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ, పెట్రోలియం గనులు 1932 లో దేశమున కనుగొనబడుటవలన, అద్భుతము గొలుపురీతిగ పరివర్తనము చెందినది. దేశమున ప్రభుత్వపు ఏర్పాటులకు లోబడి రెండు కంపెనీలు పెట్రోలియమ్ ఉత్పత్తిని సాగించుచున్నవి. మధ్యప్రాచ్యమునందెల్ల పేరొందిన నూనె శుద్ధి కర్మాగారములలో రెండవదిగ లెక్కకు వచ్చునది ఇట కలదు. 1971 లో 9 4 కోట్ల పీపాల నూనె శుద్ధి చేయబడినది. దేశమున ఇంధన వాయువు చౌకగ లభించుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 66,400 కి. వాట్లు (1968) 1970 లో ఒక అల్యూమినియమ్ ఉత్పత్తి కర్మాగారము, సంవత్సరమునకు 1,20,000 టన్నుల సరుకును తయారుచేయునది, పని మొదలిడినది. దేశమున చేపల పరిశ్రమయు, ముత్యముల సేకరణయు శాస్త్రీయరీతిలో కొనసాగింపబడుచున్నవి. సారవంత

ప్రదేశములున్నచోట కూరగాయల పంటలు విస్తృతముగ సాగుచున్నవి. దేశపు సాలుసరి ఆదాయమున 80% పెట్రోలియమ్‌వలన లభించుచున్నది. దేశపు బడ్జటరీవ్యయము 3.25 కోట్ల బహరీన్ దీనారులు బ్యాంకింగు వ్యవహారములు బహరీను బ్యాంకులవలనను, విదేశీబ్యాంకులశాఖల వలనను నిర్వర్తింపబడుచున్నవి.

**11.** సాంఘికరంగము : ప్రాథమిక విద్య దేశమున ఉచితముగ బోధింపబడుచున్నది. విద్యార్థుల మొత్తపు సంఖ్య 51,224 (1972). విశ్వవిద్యాలయములు లేవు. దేశమున ప్రతిపౌరునికి ప్రభుత్వము ఉచితముగ వైద్యసహాయమును కల్పించుచున్నది. 970 శయ్యలుకల ప్రభుత్వ వైద్యశాలలు కలవు. దేశమునందలి ఒకే ఒక దైనిక పత్రిక అరబ్బీ ఇంగ్లీషులలో ముఖ్యనగరము నుండి వెలువడుచున్నది.

---

# 23. భూటాన్
## (డ్రుక్ - యూల్)

**ముఖ్యనగరము :** తింపూ (తాషి ఛో జోంగ్); **జెండా :** ఎత్తు, వెడల్పులు నాలుగింటికి అయిదుగ నిష్పత్తి కలిగిన భూమికను, నైరృతి-ఈశాన్యరేఖ రెండుగ విభజించగ, పైవైపున నారింజ పసిమి




పటము 23.

వర్ణమును. కిందివైపున లోహితవర్ణమును కలిగియుండగ, వీని రెంటిని అక్రమించుచు, మధ్యన ఒక 'మహానాగ'పు చిత్రము కలది; **నాణెము :** భారతదేశపు నాణెములే ముఖ్యముగ వాడుకయందున్నవి. చీనీయనాణెములును అటనట చెలామణిలో ఉన్నవి; ఇవిగాక దేశీయ ప్రభుత్వపు వెండి, రాగి నాణెములు కొన్ని ఉన్నను వాని వాడుక చాల తక్కువ. **కాలపరిగణన :** భారత దేశపు కాలగణనయే ఇట అవలంబింపబడినది.

**1. ఉనికి మొ. :** హిమాలయ పర్వత మధ్యమున, భూపరివృతమై దాదాపుగ 26°30' 28°30' ఉ. అక్షాంశరేఖలమధ్యను, 88°45' 92°15' తూ. తులారేఖలమధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు వాయవ్య, ఉత్తర, ఈశాన్య దిక్కులందు చీనాదేశపు తిబెత్ ప్రాంతమును, తక్కిన దిక్కులందు భారతదేశపు ప్రాంతములును సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము (అంచనాలను అనుసరించి) 47,000 చ. కిమీ. తూర్పు పడమరల గరిష్ఠపు నిడివి 304 కిమీ.; ఉత్తర దక్షిణముల గరిష్ఠపు కొలత 144 కిమీ. దేశమంతయు అత్యున్నతములగు పర్వతములతో నిండి

యుండి భూతలము ఎగుడుదిగుడుగా ఉండును. మొత్తముమీద దక్షిణమునుండి ఉత్తరమునకు నేల మట్టము పైకిలేచుచున్నటుల భావింపవచ్చును. ఉత్తర-దక్షిణములకు సాగుచు పర్వతశ్రేణులు సమానాంతరముగ తీరియుండి వానిమధ్య లోతు చరియలు కన్పట్టును ఉత్తర సరిహద్దున ఉన్న కూలా కాంగ్రి (7553 కిమీ.); చోమో శారి (7,319 మీ.) అనునవి అత్యున్నత శిఖరములు. దక్షిణ మునకు ప్రవహించు నదులు దేశమున పెక్కు కలవు; అవియన్నియు బ్రహ్మపుత్రానదిలో కడకు చేరుచున్నవి.

**2 శీతోష్ణస్థితి మొ.:** భూతలపు ఎత్తు విప రీతపు హెచ్చుతగ్గులకు లోనగుచుండుటవలన, శీతోష్ణస్థితియు వివిధప్రాంతములందు వేర్వేరు రీతులుగ ఉన్నది. మొత్తముమీద ఉన్నత పర్వత భూములందు సంవత్సరము పొడవునను అత్య ల్పోష్ణతయే ఉండును. భారతదేశపు మైదాన ప్రాంతమునకు దాపున ఉన్న ఈ దేశపు ప్రాంత మున సాలీనా సరాసరిన వర్షపాతము 500-625 సెం. మీ. వరకు మారుచుండును. ఉన్నత భూములకు పోవుకొలది వర్షపాతము క్రమేపి తగ్గి పోవును. 1520 మీ. ఎత్తునకు తగ్గిన ప్రాంతము లందు దట్టపుటడవులును, ఆ పై ఎత్తున భూర్జ వృక్షజాతి అడవులను కననగును. వన్యజంతువులు విరివిగ అందు తిరుగుచుండును. తగ్గుఎత్తుగల ప్రాంతపు అడవులలో ఏనుగు మొదలుకొని పొట్టి పందివరకు వివిధజాతులును, ఆ పై ప్రాంతపు అడవులలో కస్తూరిమృగమును, తక్కుజాతుల లేళ్లును కనబడును.

**3. జనసంఖ్య మొ.:** జనాభాలెక్కలు దేశ మున ఏనాడును సేకరింపబడలేదు; అయినను ఐ. రా. స. 1968 లో జరిపిన అంచనాను అను సరించి దేశ జనసంఖ్య 7,50,000. జనసాంద్రత చ. కిమీ. కు 16. కుగ్రామములు విశేషముగ కలవు. తింపూ నగరము ముఖ్యనగరమే యైనను, ప్రభుత్వకార్యాలయములు అనేకములు పేరో జోంగ్‌లో కలవు ప్రజలలో అత్యధిక సంఖ్యా కులు భుటియా జాతివారు; తిబెతియన్‌వారికి వీరు రూపురేఖలందు అతిసన్నిహితులు. ఇక దేశ ప్రజ లలో 20% నేపాలీయులు. వీరందరును దేశపు పశ్చిమప్రాంతమున ఛిరాంగ్ మండలమున వసించు చున్నారు. పహాడియాలును, సిక్కిమ్‌నుండి ఇటకు వచ్చి చేరిన లెప్చాలును కొద్ది సంఖ్యలలో కలరు. నేపాలీల వలస 1966 నుండి నిషేధింపబడినది. ఈ దేశపు నేపాలీయులు నేపాలీ భాషనే మాటాడె దరు; తక్కిన వారిలో జొంకా, బుంతంకా, సర్ చప్‌కా అను భాషలు ప్రచారమున ఉన్నను జొంకా అనునదియే సాధికార భాషగ మన్నన పొందినది. నేపాలీయులు తప్ప తక్కినవారందరు లామా విధానపు బౌద్ధమతమునకు చెందినవారు; నేపాలీ యులు హిందూ మతానుయాయులు.

**4. సమాచార సౌ.:** 1963 అక్టోబరు మొదలుగ దేశమున తపాలా సౌకర్యము ఏర్పరుప బడినది. 1969 లెక్కలను అనుసరించి దేశమున 30 పోస్టాఫీసులు పనిచేయుచున్నవి; 480 కిమీ. నిడివిన టెలిఫోను మార్గమును. 9 టెలిఫోను ఎక్స్ఛేంజీలును కలవు.

**5. యాన సౌ.:** భారత ప్రభుత్వపు సాయ ముచే 1961 మొదలుగ నిర్మింపబడిన 1,600 కిమీ. పొడవుగల రోడ్డు మార్గము కలదు. పేరోవద్ద విమాన క్షేత్రము కలదు; ఇటనుండి కలకత్తాకు విమానమున పయనించవచ్చును. తొలుతనుండియు ఈ దేశమునకు, కొండకనుమలద్వారా, తిబెత్‌తో రాకపోకల వసతులు ఉండెడివి కాని 1959 తరు వాత, చీనాలోని ప్రభుత్వపు వైఖరివలన, ఆ మార్గములు మూతబడినవి.

**6. చరిత్ర :** క్రీ. శ. 18 వ శతాబ్దికి పూర్వపు ఈ దేశ చరిత్రను గురించిన వివరములు అంతగ తెలియవచ్చుటలేదు 9 వ శతాబ్దమున టిబెటీయులు ఈ దేశమును వశపరచుకొని, ఇచటి ఆదిమవాసు లను మారుమూల ప్రాంతములకు తరిమినటులను, టిబెత్‌లోని బౌద్ధలామాల మూలముననే ఈ దేశమున 12 వ శతాబ్దిలో బౌద్ధమతము వ్యాపించి నటులను మాత్రము తెలియవచ్చుచున్నది. 1772 లో ఈ దేశపు దండుమూకలు, భారతదేశము నందలి కూచ్-బీహార్‌పై దండయాత్రను జరుపగ, బ్రిటిష్‌వారు ఆ దండయాత్రను తిరుగగొట్టిరి; అంతట 1774 లో ఉభయపక్షములమధ్య శాంతి ఒడంబడిక కుదిరినది. కాని తదనంతరమున సైతము భూటానీయ సాయుధదళములు, 'ద్వార్'లు అనబడు కొండచరియలద్వారా భారతదేశపు మైదాన ప్రాంతమునుచేరి, అస్సాము బెంగాల్‌లలోని, సరిహద్దు మండలములను అంతటంతట దోపిడి చేయసాగినవి. అంతట బ్రిటిష్‌వారు భూటానీ మూక లను తరిమివేసి, 'ద్వార్'లను వశపరచుకొనిరి (1866). ఈ సమయమున కుదిరిన ఒక ఒడంబ డికవలన, మైదాన ప్రాంతములకు దండ యాత్రలను నడపుటకు భూటానీయులు మానుకొని నందులకు ప్రతిఫలముగ సాలీనా రు. 50,000 భృతిని, భూటాన్ ప్రభుత్వమునకు చెల్లించుటకు బ్రిటిష్ ప్రభుత్వము అంగీకరించెను. తరువాత భూటాన్ దేశమున జరిగిన కొన్ని రాజకీయపు మార్పులవలన ఉగెయిన్ దోర్జీ వాంగ్‌చుక్ అను మాండలికుడు దేశపు మహారాజుగ 1907 లో ఎన్నుకొనబడెను. కాలక్రమమున 1910 లో భూటాన్‌తో బ్రిటిష్‌వారు వేరొక ఒడంబడికను కుదుర్చుకొనిరి. ఇదియే పునఖా ఒడంబడిక అని వ్యవహృతము. దీనిని అనుసరించి, భూటాన్‌దేశపు ఆంతరంగిక వ్యవహారములలో బ్రిటిష్ ప్రభుత్వము జోక్యము కల్పించుకొనకుండునటులను, విదేశ వ్యవహార నిర్వహణమున బ్రిటిష్ ప్రభుత్వపు మార్గదర్శకత్వముతో భూటాన్ నడచునటులను, భూటాన్‌కు సాలీనా చెల్లింపబడు భృతి రు. 1 లక్షకు పెంచబడునటులను ఏర్పాట్లు జరిగెను.

బ్రిటిష్ ప్రభుత్వము భారత భూమినుండి 1948 లో వైదొలగినంతట, ఆ ప్రభుత్వమునకు పునఖా ఒడంబడికవలన చేకూరిన అధికారములు స్వతంత్ర భారత ప్రభుత్వమునకు సంక్రమించినవి. అంతట భారత ప్రభుత్వము, భూటాన్‌కు చెల్లించ దగు వార్షిక భృతిని రు. 5,00,000 కు పెంచు టయేగాక, 1866 లో బ్రిటిష్ ప్రభుత్వము వశ పరచుకొనిన 'ద్వార్'ల ప్రాంతమును (83 చ.కిమీ.) భూటాన్‌కు దత్తముచేసెను. తదాదిగ ఈ రెండు దేశములును మైత్రీ భావమున మెలగుచున్నవి. భూటాన్ దేశమును ఆధునికము చేయుటలో భారత దేశము సహకరించుటయేగాక, ఐ. రా. స. లో భూటాన్‌కు సభ్యత్వమును కల్పించుటకును కారణ భూతమైనది.

**7. పరిపాలన :** రాజ్యాంగ చట్టబద్ధమగు, రాజరికపు పాలన దేశమున అమలున ఉన్నది. 'చాంగ్ డూ' అని వ్యవహరింపబడు ఒక శాసన సభ కలదు. ఇందలి సభ్యసంఖ్య 130. ఇందు 32 మందిని మహారాజు నియమించును; తక్కిన వారిని వివిధ గ్రామముల పెద్దలు ఎన్నుకొనెదరు; ఈ గ్రామ పెద్దలను ఆయా గ్రామీణులు, ఇంటి కొక వోటు లెక్క పద్ధతిన జరుగు ఎన్నికలలో, ఎన్నుకొనెదరు. ఈ శాసనసభ తింపూలో ఏడాదికి రెండుసార్లు సమావేశమగును. మహారాజుమీద విశ్వాసమున్నటుల మూడేండ్లకు ఒక పర్యాయము శాసనసభ తీర్మానించిననే మహారాజు తన పదవిలో కొనసాగగలడు. శాసనసభ, మూడింట రెండు వంతుల ప్రాబల్యముతో, ఒక తీర్మానముద్వారా మహారాజును తొలగింపవచ్చును. మహారాజపదవి

ఖాళీ అయినపుడు, రాజవంశీకులలో ఒకనిని మహా రాజుగ నిర్ణయించు అధికారము శాసనసభకు కలదు. ప్రభుత్వము ప్రవేశపెట్టు బిల్లులను కాదను టకు ఆ సభకు అధికారమున్నది. 1969 నుండి ఇట్టి విశేషాధికారములు శాసనసభకు కలుగజేయ బడినవి. గ్రామ పంచాయతీలే న్యాయపాలనను నిర్వహించును; అపీలున తుది పరిష్కారపు అధి కారము మహారాజునకు కలదు. దేశమున రాజకీయ పక్షమని చెప్పుకొనదగినది భూటాన్ నేషనల్ కాంగ్రెస్. దీని సభ్యులలో దాదాపుగ అందరును నేపాలీయులే; నేపాలీయ హక్కులను కాపాడుట దీని సంకల్పము. కాని 1950 నుండి ఇది అక్రమ సంస్థగ ప్రకటితము.

**8. దేశరక్షణ :** భూటాన్ దేశపు రక్షణ భారము, ఒడంబడికద్వారా, భారతదేశమునకు చెంది ఉన్నది. అయినను భూటానునకు 5000 సైనికబలము కలదు. సైనికులకు ఆయుధములు, వాహనములు మొదలగువానిని భారతదేశము సమ కూర్చుచున్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, కొలంబో ప్రణాళికా వ్యవస్థయందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. కలకత్తాలో భూటాన్‌కుచెందిన ఒక వ్యాపార కమీషనరు కలడు. వివిధ దేశములతో దౌత్యసంబంధములను, భారత దేశ రాయబారులద్వారా, భూటాన్ నిర్వహించు చున్నది.

**10 ఆర్థిక రంగము :** వ్యవసాయమును, పశుపోషణయు దేశప్రజల జీవనాధారములు. వ్యవ సాయమునకు అనుకూలమగు భూవసతి చాల తక్కువ. లోయలలోని సారవంతపు భూములందు వరి ఎక్కువగ పండింపబడుచున్నది. కుటుంబము నకు 30 ఎకరములకు మించి ఉండగూడదను నియ మము కలదు. రైతులందరు స్వంత వ్యవసాయ దారులే; కౌలుదారులు చాల అరుదు. వరిగాక మిగి లిన పంటలలో మొక్కజొన్న. గోధుమ, బార్లీ పేర్కొనదగినవి.

ప్రభుత్వ తోటలలో ఫలవృక్షములవలన నిమ్మ జాతి ఫలములును, ఆపిల్‌పండ్లును విరివిగ ఉత్పత్తి అగుచున్నవి. దేశమున విరివిగ దొరకు 'దఫ్నే' మొక్కనుండి కాగితమును తయారుచేయుట ఒక పరిశ్రమగ దేశమున వ్యాప్తియందున్నది. మొత్తము మీద ఆహార విషయమున దేశము స్వయం పోష కమే అయినను, సంపత్తి రీత్యా, ప్రపంచమునందలి పేద దేశములలో ఇది ఒకటిగ లెక్కకు వచ్చినది. విద్యుదుత్పత్తికిగల అవకాశములనుగురించి సర్వే జరుగుచున్నది. ప్రస్తుతమున తింపూ, పేరో, వంగ్‌డూ, ఫుడ్రాంగ్‌ల వద్దనున్న స్టేషనులనుండి కొలదిగ, స్థానికావసరములకు మాత్రమే, విద్యు దుత్పత్తి జరుగుచున్నది.

ఖనిజములలో రాగి, ఇనుము, జిప్సం మొదలగు నవి దొరకు అవకాశములు కలవు; కాని అందు కృషి జరుగుటలేదు; సాలీనా 30,000 టన్నుల బొగ్గు మాత్రము త్రవ్వబడుచున్నది. దేశము నందలి అడవులనుండి లభ్యమగు కలపను ఆశ్ర యించి పరిశ్రమలను స్థాపించుటకు కృషి జరుగు చున్నది. కొయ్య, రాగి, ఇనుము, ఇత్తడి మొద లగు వానివలన చేతిపనులద్వారా తయారగు వస్తు వులు ఈ దేశమునుండి భారతదేశమునకు ఎగుమతి యగుచున్నవి. బడ్జెటరీవ్యయము రు. 1,95,40,000 (1968-69). బడ్జెటులోని లోటును పూడ్చుటకు భారతదేశము సాయపడుచున్నది.

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రయిమరి స్థాయిలో 12,542 మంది, సెకండరీ స్థాయిలో 2,288 మంది, వృత్తి విద్యాశాలలో 105 మంది విద్యార్థులు పఠించుచున్నారు; పాఠశాలలసంఖ్య 112 (1967). ప్రభుత్వపు ఖర్చుపై 430 మంది

విద్యార్థులు భారతదేశమున ఉన్నతవిద్యను అభ్యసించుచున్నారు. దేశమందలి కొన్ని బౌద్ధ విహారములలో, అమూల్యములగు ప్రాచీన బౌద్ధమత గ్రంథములు కలవు. వీనిని సేకరించి తింపూలో ఒక జాతీయ గ్రంథాలయమును నెలకొల్పుటకు కృషి జరుగుచున్నది. దిన పత్రికలుగాని వార పత్రికలుగాని ప్రచారమున లేవు. దేశమున ప్రజల ఆరోగ్య రక్షణకై 4 ప్రభుత్వ ఆసుపత్రులును, 30 డిస్పెన్సరీలును సాయపడుచున్నవి (1969).

---

# 24. మంగోలియా

**ముఖ్యనగరము :** ఉలాన్ బతోర్; **జెండా :** రెండు ఎరుపు నిలువుచారలమధ్య అమరిన లేత నీలపు నిలువు చారయు, దండమువద్దఉన్న ఎరుపు చారలో ఎగువన సువర్ణ ఛాయలో ఒక పంచ కోణపు నక్షత్రమును ఆ దిగువన ఆ ఛాయలోనే సోయంబూ అనబడు తాంత్రిక చిహ్నమును కలది: **జాతీయ గీతము :** నయిరాంచక్ మంగోల్ అర్ద్




పటము 24.

ఉల్ సిన్...... (మా మంగోలు విప్లవ స్వతంత్ర భూమి......); **నాణెము :** తుగ్రిక్; ఇది 100 మంగోలులుగ విభక్తము; ఒక తుగ్రిక్ = రు. 1 88; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా 8 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆసియాఖండ మధ్యమున, 41°31′–52°16′ ఉ. అక్షాంశ రేఖలమధ్యను 87°27′–119°54′ తూ. తులారేఖలమధ్యను కుదురుకొనిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున సోవియట్ సంయుక్త గణరాజ్యమును; తూర్పు, దక్షిణ, పశ్చిమములందు చీనాయు సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యము 15,31,000 చ. కిమీ. దేశమంతయు విశాలమగు పీఠభూమి; భూతలపు ఎత్తు 915 మీ. నుండి 1,215 మీ. వరకు మారుచుండును. పశ్చిమపు అంచును అనుకొని ఒక పర్వతశ్రేణి కలదు; అందలి తాబూన్ బోగో శిఖరపు ఎత్తు 4,653 మీ. ఉత్తరపు సరిహద్దును అనుకొని ఖెంటీ పర్వతశ్రేణియు, మధ్య పశ్చిమ దేశమున ఖంగై శ్రేణియు కలవు. దేశపు దక్షిణ భాగము గోబి యెడారి; కాని ఆ ఎడారి నేలమట్టమునకు దిగువ పెద్ద జలాశయములు ఉన్నటుల ఈ నడుమ జరిగిన పరిశోధనలవలన వెల్లడైనది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున తాపక్రమము ఋతువులను అనుసరించి విపరీతపు హెచ్చుతగ్గులకు లోనగుచున్నది; వర్షపాతము చాల తక్కువ. జనవరిలో ఈ దేశమున కొన్ని ప్రాంతములందు ఉష్ణోగ్రత 25.6° ఫా. వరకు పడిపోవును. కొన్ని ప్రాంతములందు 5° ఫా.గ ఉండును. ఎండ కాలమున వానలు కురియును. సాలున సరాసరి వర్ష

పాతము ప్రాంతములను అనుసరించి 25 నుండి 38 సెం. మీ. వరకు మారుచుండును. గోబి యెడారిలో సాలున వర్షపాతము 7.0 సెం. మీ.కు తగ్గియుండును. దేశమున శీతోష్ణత ప్రాంతములను అనుసరించి మారుచున్నటులనే వృక్ష, జంతు సంతతులును ప్రాంతములను అనుసరించి మార్పునొందుచున్నవి. ఉత్తరమున పైను, వృక్షముల అడవులందు ఎలుగుబంటి, ఎఱ్ఱలేడి, మంచుచిరుత, అడవిపంది, తోడేలు కననగుచున్నవి. మధ్య ప్రాంతమున అడవి గుఱ్ఱములు దుప్పులు విరివిగ కన్పట్టును.

**3. జనసంఖ్య మొ. :** 1971 లెక్కలను అనుసరించి దేశ జనసంఖ్య 12,27,800; ఇందు పట్టణవాసులు 40%; జనసాంద్రత చ. కిమీ. కు 0.73. నగరములలో ఉలాన్ బతోర్ (జ. సం. 2,70,000) ప్రముఖము. తక్కిన వానిలో దాదాపు 20 వేల జనసంఖ్యకు మించనివి అయిదు నరములు 40 వేలు జనసంఖ్యగలవి 4 నగరములు కలవు. ప్రజలలో 15.6% మంగోలాయిడ్ జాతిలో ఉత్తర శాఖకు చెందినవారు; తక్కినవారు తక్కిన శాఖలకు చెందినవారు. ప్రజలలో వివిధ మంగోలియన్ మాండలిక భాషలు ప్రచారమున ఉన్నను, ఖాల్కా మంగోలియన్ అనబడునది అధికారభాషగ పరిగణనను పొందినది ఈ భాషకు పూర్వము నుండియు ఒక లిపి ప్రచారమున ఉన్నను, 1946 మొదలుగ కొలది మార్పులతో రషియన్ లిపియే ప్రస్తుతమున, అధికారరీత్యా, ఆదరణపొంది వ్యవహారమున ఉన్నది. దేశీయులు లామా సంప్రదాయపు బౌద్ధమతానుయాయులు; కాని దేశపు కమ్యూనిస్ట్ ప్రభుత్వము 1937-39 లో బౌద్ధ విహారములను మూసివేసి, వాని ఆస్తులను స్వాధీనము చేసికొనినది; లామాలు అనబడు బౌద్ధ సన్యాసులు ఏదియైన ఒక శ్రామికవృత్తిని అవలంబించునటుల ప్రోత్సహించినది. అందువలన దేశమున మతమునెడ ఆదరణ సన్నగిలినది; ముఖ్యనగరమున మాత్రము ప్రస్తుతమున ఒక బౌద్ధ విహారము కలదు.

**4. సమాచార సౌ. :** దేశమున 370 తపాలాఫీసులును, 25 తంతి ఆఫీసులును, 31 టెలిఫోను కేంద్రములును కలవు (1964). ఉలాన్ బతోర్‌లోను ఓల్‌జియాలోను రేడియో ప్రసార కేంద్రములు కలవు; 1970 నుండి ఒక టెలివిజన్ కేంద్రమును పనిచేయుచున్నది.

**5. యాన సౌ. :** దేశమున దాదాపు 8,000 కిమీ. పొడవుగల రోడ్లు కలవు; ఇవి అన్నియు కంకర చేయబడినవి; ఇవిగాక కచ్చారోడ్లు 80,000 కిమీ. పొడవున ఉన్నవి. ఉలాన్ బతోర్‌ను సోవియట్ యూనియన్‌తోను చీనాతోను కలుపుచు, 1,423 కిమీ. పొడవున రైలుమార్గము కలదు; ముఖ్యనగరమునుండి మాస్కో, పీకింగ్, హనోయ్‌లకు విమాన ప్రయాణవసతి కలదు.

**6. చరిత్ర :** మంగోల్ జాతికి ప్రపంచ చరిత్రలో తొలుతగ ఒక ప్రతిపత్తిని చేకూర్చినవాడు మహా విజేతయగు చెంఘిజ్‌ఖాన్. వివిధ మంగోల్ తెగలను ఏకీకృతమొనర్చి, క్రీ. శ. 13 వ శతాబ్ది తొలిపాదమున తన విజయ యాత్రలను మొదలిడి క్రీ. శ. 1227 నాటికి పశ్చిమమున యుక్రెయిన్ లోని నీపర్‌నది మొదలుగ, తూర్పున పసిఫిక్ మహాసముద్రమువరకు అన్ని దేశములను లోగొని, ఆనాటివరకు ప్రపంచము కనివిని ఎరుగని మహాసామ్రాజ్యమును ఆతడు నెలకొల్ప గలిగెను ఆతని అనంతరమున అతని పుత్రపౌత్రులు ఆ రాజ్యపు ఎల్లలను పశ్చిమమునను దక్షిణమునను విస్తరింపజేసిరి. కాని ఆ కాలమున, ఆ సామ్రాజ్యమును, ఆ కుటుంబ సభ్యులు విభక్తము చేసికొనుటలో చీనా సామ్రాజ్యము కుబ్లయ్‌ఖాన్ అనువానికి దక్కినది. మంగోలియన్ జాతికి జన్మభూమియగు మంగోలియాయు అంతట ఆ సామ్రాజ్యమున అంతర్భాగమైనది. ఆ కాలముననే బౌద్ధమతమునకు మంగోల్

లందు స్థానము లభించి, జాతీయ మతమైనది. తరువాత చీనాయందు మంగోల్ రాజవంశము అంతమైన తరువాత మంగోలియా వేరుపడినను, అంతఃకలహములకు లోనై తత్ఫలితముగ కడకు 1698 నాటికి ఆ దేశము చీనా సామ్రాజ్యమున అంతర్భాగమైనది. 1911 లో చీనాలో రాజరికము అంతమైనపుడు, ఖాల్కా మంగోలులు తమ ప్రధాన మత గురువు (లామా) నాయకత్వమున తమ దేశమునకు స్వతంత్రతను కల్పించగ రూపొందినదియే నేటి మంగోలియా. మంగోలియాను మరల 1919 లో చీనాసేనలు ఆక్రమించినను 1923 లో సోవియట్ ప్రభుత్వపు సాయముతో దేశము విముక్తమై కమ్యూనిస్ట్ విధానపు రాజ్యాంగ విధానముతో ప్రజాగణ రాజ్యముగ రూపొందినది (నవంబరు 26, 1924). చీనా తొలుత ఈ స్వతంత్ర ప్రతిపత్తిని గుర్తించుటకు నిరాకరించినను, 1946 లో జనవాక్య నిర్ణయమును కడకు ఆమోదించి, 1950 లో సోవియట్ ప్రభుత్వముతో చేసికొనిన ఒడంబడికద్వారా మంగోలియా స్వాతంత్ర్యమును గుర్తించినది.

**7. పరిపాలన :** 1960 లో ఆమోదితమగు రాజ్యాంగ విధానమును అనుసరించి సర్వాధికారములును 'కురల్' అనబడు ప్రజాసభయందు న్యస్తములు. 18 ఏండ్ల వయసునకు పైబడినవారికి అందరికి ఓటుహక్కు కలదు. ఏకపట్టికా విధానమున 2,500 పౌరులకు ఒక ప్రతినిధి చొప్పున 'కురల్'కు సభ్యుల ఎన్నిక జరుగును; ఈ సభ్యులు తమనుండి 9 మందిగల పాలకసభ (ప్రెసిడియం)ను ఎన్నుకొనెదరు; ఈ పాలక సభయే పరిపాలనకు బాధ్యత వహించును; కాని యథార్థమున అధికారమంతయు కమ్యూనిస్ట్ పార్టీయందు కలదు.

**8. దేశరక్షణ :** రెండేండ్ల నిర్బంధ సైనిక శిక్షణ అమలున ఉన్నది. సోవియట్ ప్రభుత్వపు సహాయమున లభించిన అత్యంత ఆధునిక ఆయుధములుకల భూతలసేన కలదు; అందలి సైనికసంఖ్య అంచనాలనుబట్టి 17,500 (1967). కొద్దిపాటి వాయుసేనయు కలదు; అందు పోరాటపు విమానములు లేవు; తక్కువ విధముల విమానములు మాత్రము కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1961 మొదలుగ ఐ. రా. స. యందును తదనుబంధ సంస్థలలో కొన్నింటను ఈ దేశము సభ్యత్వము వహించి ఉన్నది. చీనా, సోవియట్ రష్యాలమధ్య వైరుధ్యములు తలఎత్తినది మొదలుగ ఈ దేశముతో చీనాకుగల సంబంధములును సన్నగిలినవి.

**10. ఆర్థిక రంగము :** పశుపోషణ, దేశపు ఆర్థిక వ్యవస్థకు, ముఖ్యాలంబనము. ఇపుడది సహకార సంఘముల ప్రాతిపదికపై వ్యవస్థీకృతమైనది. దేశపు మొత్తపు పశుసంఖ్య 226 లక్షలు; వ్యావసాయిక భూమియందును, పశుసంపత్తియందును 80% సమష్టి క్షేత్రములకు చెందియున్నది. సేద్యమునఉన్న 455 వేల హెక్టేరులలో దాదాపు 93% భూమియందు ఆహారధాన్యముల ఉత్పత్తి జరుగుచున్నది. గోధుమ ముఖ్యమగు ఆహారపు పంట. 1970 మొదలుగ దేశము ఆహార విషయమున స్వయంపోషకమై, కొలదిగ ధాన్యమును ఎగుమతి చేయగలిగిఉన్నది. పారిశ్రామిక ఉత్పత్తి చాల తక్కువ. సిమెంటు, ఉన్ని, తోళ్లు, జవుళీలకు సంబంధించిన కొన్ని పరిశ్రమలు, ముఖ్యముగ ఉలాన్-బతోర్ ప్రాంతమున కలవు. ఖనిజములలో వుల్‌ఫ్రామ్, ఫ్లోర్‌స్పార్ అనునవి ముఖ్యములు; ఇందలి ఉత్పత్తియందు అధికభాగము ఎగుమతి అగుచున్నది. రాక్షసిబొగ్గు పరిమిత స్థాయిలో లభించుచున్నది; అడవులు దేశమున 8% భూతలమును ఆక్రమించినవి; దేశావసరములకు కావలసిన కలప ఇందువలన లభించుచున్నది. విద్యుదుత్పత్తి

44 కోట్ల కివా. (1970). దేశపు ఎగుమతుల విలువ 7.5 కోట్ల రూబుల్‌లు (సోవియట్ నాణెములు); దిగుమతుల విలువ 10.4 కోట్ల రూబుల్‌లు (1970). బడ్జెటరీవ్యయము 191.2 కోట్ల తుగ్రిక్‌లు (1970).

**11. సాంఘిక రంగము :** దేశమున అధిక సంఖ్యాక ప్రజలు ద్రిమ్మరి జీవనమునకు అలవాటు పడినవారు కావున నివాసమునకు డేరాలవంటివానిని ఎక్కువగ ఉపయోగింతురు; కాని ప్రస్తుతమున స్థిరనివాసపు వసతులను, ముఖ్యనగరముననేగాక, తక్కిన ప్రాంతములందును, కల్పించుటకు కృషి జరుగుచున్నది. 8 ఏండ్ల వయసునుండి విద్యాభ్యాసము మొదలగుచున్నది. శిశు విద్యాశాలలందు 32,000 మంది; 504 సాధారణ పాఠశాలలలో 2,27,600 మంది, సాంకేతిక పాఠశాలలలో 11,240 మంది విద్యార్థులు కలరు; విదేశములందు పఠించు విద్యార్థి సంఖ్యయు ఈ సాంకేతిక విద్యార్థులలో చేరిఉన్నది (1970). ముఖ్యనగరమున ఒక విశ్వవిద్యాలయము కలదు; ఇదిగాక వేరుగ వివిధ శాస్త్రములకుచెందిన కొన్ని ఉన్నత విద్యా సంస్థలు కలవు; వీని అన్నింటిలోని విద్యార్థి సంఖ్య 8,280; సోవియట్ రష్యాకును, తూర్పు యూనియన్ దేశములకును, ఉన్నత విద్యకై సాలీనా పంపబడు విద్యార్థిసంఖ్య 3,000 (1970). కమ్యూనిస్ట్ పార్టీకి చెందిన ఒక దినపత్రిక మాత్రము కలదు; తక్కు విధముల వార్తా పత్రికల సంఖ్య 35. ముఖ్య నగరమునందలి ప్రభుత్వ గ్రంథాలయము దేశమున అట్టి సంస్థలందు ప్రముఖము. ఆ నగరముననే ఒక మ్యూజియం కలదు.

దేశమున 10 వేల ప్రజలకు 94.3 వైద్య శయ్యల చొప్పున ఆసుపత్రులందు శయ్యలు కలవు. వైద్యసంఖ్య 2 300. వృద్ధులకును, వికలాంగులకును జీవనభృతి వారివారి అర్హతలను అనుసరించి నెలసరిన 125 నుండి 800 తుగ్రిక్‌ల వరకు మారుచున్నది.

**12. యాత్రా సౌ. :** ఇదివరలో విదేశ యాత్రికులకు ప్రోత్సాహము లేకున్నను, ప్రస్తుతమున ప్రభుత్వము విదేశీయ యాత్రికులను కొంత వరకు ప్రోత్సహించి సదుపాయములను సమకూర్చుచున్నది. పాస్‌పోర్టు, వీసా, మొదలగునవి యాత్రికులు విధిగ కలిగిఉండవలెను.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. దేశ చరిత్రలోనేగాక ప్రపంచ చరిత్రయందును మహా విజేతగ, పేరొందినవాడు తాముజిన్ అను నిజనామముగల చెంఘిజ్ ఖాన్ (క్రీ. శ. 1206–27 ప.). చెంఘిజ్‌ఖాన్ అను బిరుదమునకు 'మహా విజేత' అని అర్థము.

---

# 25. మలేసియా

**ముఖ్యనగరము :** కౌలాలంపూరు; **జెండా :** దండమువద్ద, నాలుగవవంతు జెండాను ఆక్రమించిన, నీలపు దీర్ఘ చతురస్రమున అమరిన సువర్ణచ్ఛాయలో వెలసిన నెలవంకయు, 14 కోణముల నక్షత్రమును ఉండగ తక్కిన భాగమున, ఏకాంతర రీతిలో, 7 ఎరుపు అడ్డుచారలును, 7 తెలుపు అడ్డు చారలును కలిగినది. **జాతీయ గీతము :** నెగరాకూ ...... (మా దేశము...) అనునది; **నాణెము :** మలేసియా డాలరు; 100 సెంట్లుగ ఇది విభక్తము. 1 మ. డాలరు = రు. 2.45; **కొలతూకములు :** బ్రిటిష్

విధానపువి. కాలగణన : సా. 7-30 = భారతదేశ మున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఈ సమాఖ్యా రాజ్యమున. ప్రాదేశికముగ, ఒకదానితో వేరొకటి, ఏరీతిగను కలియని మూడు విభిన్నప్రాంతములు - పశ్చిమ మలేసియా, సారవాక్, సాబా అనునవి చేరిఉన్నవి. (ఇందు తొలుతటిది పశ్చిమ మలేసియా అనియు కడపటి రెండును తూర్పు మలేసియా అనియు




పటము 25.

రాజ్యాంగ రీత్యా, వ్యవహరింప బడుచున్నవి). వీనిలో పశ్చిమ మలేసియా అనునది, ఆసియా ఖండపు ముఖ్య భూభాగమునకు చేరిన ఒక ద్వీప కల్పము; 100°–119° తూ. తులారేఖల మధ్యను, 1°–7° ఉ. అక్షాంశరేఖల మధ్యను (744 కిమీ.) విస్తరించియున్న ఈ ద్వీపకల్పపు వైశాల్యము 1,31,587 చ. కిమీ. తూర్పు-పడమరల కొలత, ఎచటను 320 కిమీ. కు పైగా ఉండదు. ఈ ప్రాంతమునకు సరిహద్దులందు తూర్పున, దక్షిణ చీనా సముద్రమును; దక్షిణమున జోహోర్ జల సంధి; పశ్చిమమున మలాకా జలసంధి, అండమాన్ సముద్రము; ఉత్తరమున థాయిలాండు దేశపు భూమియు ఉన్నవి.

సారవాక్, సాబా అనునవి, బోర్నియో ద్వీపమునందలి, ఉత్తర భాగములోని విభిన్న ప్రాంతములు. ఆ ద్వీపమున వాయవ్య భాగమున 720 కిమీ. పొడవున, విస్తరించియున్నది సారవాక్. దీని వైశాల్యము 1,21,400 చ. కిమీ. సాబా అనునది బోర్నియో ద్వీపపు ఉత్తర భాగమునఉన్న ప్రాంతము. దీని వైశాల్యము 80,520 చ. కిమీ.

పైవిగాక, పశ్చిమ మలేసియా తీరమునకు సమీపమున ఉన్న, కొన్ని అల్పద్వీపములును, ఈ రాజ్యమున చేరిఉన్నవి.

పశ్చిమ మలేసియా భూతలమున అయిదింట నాలుగు భాగములు అడవులతోను, చిత్తడి నేలల తోను నిండియున్నది. అందు ఉత్తర ప్రాంతము పర్వతశ్రేణిమయము; అందలి అత్యున్నత శిఖరములు గునాంగ్ తాహన్ (2190 మీ.), గునాంగ్ కోర్బూ (2185 మీ) అనునవి. పశ్చిమ తీరమునకు సమాంతరముగ 80 కిమీ. దూరమున, ఉత్తర-దక్షిణములకు పయనించు ఒక పర్వతశ్రేణి జలమండల విభజన రేఖగ వర్తించు చున్నది. ఇటనుంచి తూర్పు, పశ్చిమ దక్షిణములకు కొన్నినదులు ప్రవహించుచున్నవి. పశ్చిమ సముద్ర తీరముననే, పశ్చిమ మలేసియాలోని, అత్యధిక సంఖ్యాక జనము నివసించుచున్నారు. ముఖ్యములగు సముద్రపు రేవులును ఇటనే ఉన్నవి.

సారవాక్ అంతయు ఒక తీరమైదానము. ఒండ్రుమట్టి కలిగిన చిత్తడినేల విశేషముగ కన్పట్టును. దేశమును ఆవరించి చిందరవందరగ పెక్కు పర్వతశ్రేణులు పయనించుచున్నవి. అటవీ

ప్రాంతము ఎక్కువ, పెక్కునదులు నౌకాయాన మునకు అనుకూలముగ ఉన్నవి.

సాబా ప్రాంతము చాలవరకు అటవీమయము. పశ్చిమతీరము మాత్రము, ఒండ్రుమట్టి గలిగిన సమతలము. ఇటనే దేశపు రబ్బరు తోటలును, వరి సాగుభూమియు ఉన్నవి. పశ్చిమ తీరమునకు 50 కిమీ. దూరమున, బయలుదేరి, ఉత్తర-దక్షిణ ములకు పోవు క్రాకర్ పర్వతశ్రేణి, ఈ ప్రాంత మును, రెండుగ విభజించుచున్నది. ఇందలి అత్యున్నత శిఖరము కినబాలూ (4,100 మీ.)

**2. శీతోష్ణస్థితి మొ. :** పశ్చిమ మలేసియా యందలి శీతోష్ణస్థితి, భూమధ్య రేఖా ప్రాంతపు రీతికి చెందినది. సాలుసరిన అత్యధికోష్ణత 87° ఫా. అత్యల్పోష్ణత 74° ఫా. వర్షపాతము సాలున సరా సరిన 250 సెం. మీ. తూర్పు మలేసియా, భూమధ్య రేఖపైననే ఉన్నను, చాలవరకు సౌమ్య మగు శీతోష్ణస్థితిని, కలిగియున్నది. పశ్చిమ మలేసియా యందలి అరణ్యములలో, టేకు, చందనవృక్షము మొదలగు నిత్యహరిత జాతికి చెందిన వృక్ష విశేషములు కననగును. ఏనుగులు, ఖడ్గమృగములు మొదలగు వన్యజంతువులును కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1970 జనాభా లెక్క లను అనుసరించి జనసంఖ్య 1,04,34,000; ఇందులో దాదాపు 16 లక్షలమంది మాత్రమే తూర్పు మలేసియా (సారవాక్-సాబా) లో వసించుచున్నారు. దేశపు మొత్తము మీద జనసాంద్రత, చ. కిమీ. కు 48. దేశపు ప్రముఖనగరములలో, 1969 అంచ నాలను అనుసరించి, ఈ క్రింది రీతిగ జనసంఖ్య కలదు : కౌలాలంపూర్ (5 లక్షలు); జార్జిటౌన్, (250 వేలు); జోహోర్ బాహ్రూ (80 వేలు); కుచింగ్ (70,000); కోటకినబాలు (22,000). ఇందులో చివర రెండును క్రమముగ సారవాక్, సాబాలలోని నగరములు. దేశప్రజలలో, మలే, చీనీయ, భారత, పాకిస్తానీ సంతతుల ప్రజలు చేరి ఉన్నారు; దాదాపుగ 52 లక్షల మలేలును, 38 లక్షల చీనీయ సంతతివారును, 9 లక్షల భారత, పాకిస్తాని సంతతివారును కలరని చెప్పవచ్చును; వీరుగాక తాయి, సింహళీయ, యూరపీయ, యూరేసియను, ఆదిమ వాసులును అల్ప సంఖ్యలలో కలరు. అత్యధిక సంఖ్యాకులగు మలేజాతీయుల మాతృభాషయగు, మలే (భాషా మలేసియా) అనునది జాతీయ భాషగ లెక్కింప బడుచున్నది. చీనీయ, అరబ్బీ, తమిళ్, హిందూస్తానీ భాషలును, మాతృభాషలుగ ఆయా వర్గములందు ప్రచారమున ఉన్నవి. ఇంగ్లీషునకును బహుళముగ వ్యాప్తిగలదు.

మలేలలో అత్యధిక సంఖ్యాకులు పల్లెపట్టు లందును, చీనీయులు వ్యావసాయిక గ్రామీణ, ఖనిజ ప్రాంతములందును, భారత-పాకిస్తానీ సంతతివారు కొంతవరకు పట్టణములందును, కొంతవరకు రబ్బరు తోటలలో పనివారుగను వసించుచున్నారు.

ఇస్లాము ప్రభుత్వాదరిత మతముగ పరిగణింప బడుచున్నది. పశ్చిమ మలేసియాలో 50% కు పైగా ముస్లిములు, చీనీయులలో బౌద్ధమతమును, భారత సంతతి వారిలో హిందూ, సిక్కుమత ములును, ఎక్కువగా వ్యాప్తియందు ఉన్నవి. తూర్పు మలేసియాలో కొలదిగ క్రైస్తవులు ఉన్నను అత్యధిక సంఖ్యాకులు ప్రకృతి దేవతారాధకులు.

**4. సమాచార సౌ. :** దేశమున సువ్యవస్థిత మగు, తపాలా-తంతి వ్యవస్థయు, దూరవార్తా వ్యవస్థయు, ప్రభుత్వపు ఆధ్వర్యమున పనిచేయు చున్నవి. ఆసియాలో వేరెచటను కనరానిరీతిగ (1000 మందికి 12 టెలిఫోనులు) టెలిఫోను సౌకర్యము పశ్చిమ మలేసియాలో కలదు. దేశమున అయిదు రేడియో స్టేషనులు పనిచేయుచున్నవి.

**౫. యాన సౌ.:** పశ్చిమ మలేసియాలో ముఖ్యమగు రోడ్డుమార్గము, ఉత్తర-దక్షిణ రేఖను అనుసరించి, ఉన్నది. మొత్తపు ఆ ప్రాంతపు రోడ్ల నిడివి 15,280 కిమీ. ఇదియంతయు ఉన్నత స్థాయికి చెందినదియే. సారవాక్‌లో 3,170 కిమీ. పొడవునను, సాబాలో 2,480 కిమీ. పొడవునను రోడ్లు కలవు. పశ్చిమ మలేసియాలో ఉత్తర దక్షిణ ప్రాంతములను కలుపుచు, 2,085 కిమీ. నిడివిన మీటరుగేజి రైలుమార్గము కలదు. ఈ రైలు మార్గము, అందలి బండ్లు, స్టేషనులు, అత్యుత్తమ రీతిలో నిర్వహింప బడుచున్నవి. రైలు బండ్ల న్నియు, 1964 మొదలుగ, డీజెలు-విద్యుత్ సాయ మున, నడచుచున్నవి. తాయిలాండులోని రైలు మార్గముతో ఈ దేశపు రైలుమార్గము, కలియు చున్నది. తూర్పు మలేసియాలో, సాబా పశ్చిమ తీరము నందలి ప్రాంతములను కలుపుచు, ఒక రైలుమార్గము కలదు.

పశ్చిమ మలేసియాలో కౌలాలంపూరునను, పెనాంగ్‌నను, అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. ఇటనుండి ఆగ్నేయ ఆసియాదేశములకును ఆస్ట్రేలియాకు, ఇండియాకు, పశ్చిమ ఆసియాకు, యూరపునకు ప్రయాణవసతి కలదు. పశ్చిమ, తూర్పుమలేసియాలలో వివిధ ప్రాంతములను కలుపుచు విమాన ప్రయాణములను, దేశీయ విమానయాన వ్యవస్థ, నిర్వహించుచున్నది. అందు లకు అనుగుణముగ, పశ్చిమ ప్రాంతమున పలు తావులందును, సాబాలో కిన్‌బాలునను, సారవాక్‌లో కుచ్చింగ్‌నను చిన్న విమానాశ్రయములు కలవు.

మలేసియాయొక్క అంతర్జాతీయ వ్యాపారమున 70% ను సింగపూరు రేవు నిర్వహించుచున్నది (ఇది మలేసియాకు చెందినదికాదు). ఇదికాక దేశపు పశ్చిమ తీరమునందలి పెనాంగ్, స్వెట్టెన్ హామ్, మలక్కా రేవులును, తూర్పుతీరపు తుంపాత్, దుంగున్ రేవులును, కొలదిగ వ్యాపారమును నిర్వహింప గలుగుచున్నవి.

సారవాక్‌లో సముద్రతీరమునను, నదులలోను, పయనించు నౌకలే ముఖ్యములగు యానసాధ నములు. ఈ నౌకా సంస్థలు, చాలవరకు, చీనీ యుల అధీనమున ఉన్నవి.

**6. చరిత్ర:** మలేజాతి ప్రజల పూర్వీకులు దక్షిణ చీనానుండి క్రీ. పూ 2000 ప్రాంతమున ఈ దేశమునకు చేరియుందురని చారిత్రకుల భావన. క్రీ. శకారంభ కాలము మొదలుగ ఈ ప్రాంత మునకు మత, సంస్కృతుల రీత్యా భారతదేశముతో సాన్నిహిత్యము ఏర్పడినది. ఆనాటి తక్కిన ఆగ్నేయ. ఆసియా రాజ్యములందు జరిగిన రీతిగనే, ఇటసైతము భారత సంస్కృతిచేత, ప్రభావితము లైన, పెక్కు స్వతంత్రరాజ్యములు రూపుగొనినవి. అట్టివానిలో క్రీ.శ 600 ప్రాంతమున రూపుగొని ఈ దేశమును, ఇండోనీసియాను లోగొని అత్యంత ప్రాభవమును ఆర్జించిన శ్రీ విజయరాజ్యము ముఖ్యముగ పేర్కొనదగినది. ఆ రాజ్యము కాల గర్భమున కలిసిన తరువాత 15 వ శతాబ్దిలో ఇట అరబ్బు వ్యాపారుల మూలమున ఇస్లాము మతము వ్యాపించి, హిందూ-బౌద్ధమతములను దాదాపుగ అంతము జేసినది. క్రీ.శ 1511 లో పోర్చుగీజు వారు, మలక్కాను వశపరచుకొనిరి. కాని, 1641 లో డచ్చివారు వారిని తరిమివైచి, దేశమున పలుకుబడిని ఆర్జించిరి. 1786 లో బ్రిటిష్‌వారి ఈస్ట్ ఇండియా కంపెనీ, కొలుమీద, పెనాంగ్ (కేడా) అను ప్రాంతమును ఆర్జించినది. తదనంతర కాలమున, మలక్కా ప్రాంతము 1829 లోను, తక్కినవి అంతటంతటను బ్రిటిష్‌వారికి, దేశపాల కులతో కుదిరిన ఒడంబడికలను అనుసరించి, లభించినవి. తాయిలాండ్‌తో కుదిరిన ఒక ఒడం బడికను అనుసరించి ఉత్తర రాష్ట్రములు

లభించినవి (1909). ఈ విధముగ బ్రిటిష్‌వారి అధికారము క్రిందకు కొంత భాగమును, రక్షిత ప్రాంతముగ కొంతప్రాంతమును 1914 నాటికి వచ్చుటద్వారా దేశమంతట ఏదియో ఒక విధముగ బ్రిటిష్ పరిపాలన ఏర్పడినది.

1941 లో జపానీయ సేనలు, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, దేశమును వశపరచుకొనినను, 1945 లో బ్రిటిష్ సేనలు, ఈ ప్రాంతమును తిరిగి వశపరచుకొనినవి. ఆ తరువాత 1948 లో దేశమున సమాఖ్యారాజ్యమును, బ్రిటిష్ ప్రభుత్వము ఏర్పరచినది. కడకు 31 ఆగస్టు, 1957 న ఆ సమాఖ్య (నేటి పశ్చిమ మలేసియా) మలయా అను పేర, కామన్‌వెల్తున సభ్యత్వముగల స్వతంత్ర రాజ్యమయ్యెను.

సారవాక్ అను ప్రాంతమును 1841 లో ఒక బ్రిటిష్ సాహసికుడు, బోర్నియోలోని, బ్రూనీ పాలకునినుండి స్వీకరించి, అచట ఒక రాజరికమును స్థాపించెను. 1888 లో అది బ్రిటిష్ రక్షిత రాజ్యమైనది. జపానీయ సేనలకు 1941 లో వశమైన దీనిని మరల బ్రిటిష్ సేనలు, 1945 లో ఆక్రమించెను. అంతట పూర్వపు రాజవంశికుడు, సారవాక్‌ను, బ్రిటిష్‌వారికి దత్తము చేసెను. సాబాయు, తొలుత బ్రూనీ పాలకుని నుండి, బ్రిటిష్ వర్తక సంస్థకు ఒక దానికి దత్తమై (1872). 1941 లో జపాన్ వశమై, 1945 లో తిరిగి బ్రిటిష్‌వారికి వశమైన తరువాత, మకుటపు వలసగ రూపొందినది.

16 సెప్టెంబరు, 1963 న బ్రిటిష్ ప్రభుత్వపు సమ్మతితో, మలయా, సారవాక్, సాబా, సింగపూరులు మలేసియా అనుపేర ఏకసమాఖ్యగ రూపొందినవి. కాని తదనంతర కాలమున సింగపూరు అందుండి విడివడినది (7 ఆగస్టు, 1965). తదాదిగ తక్కిన మూడు ప్రాంతములును మలేసియా అనుపేర సమాఖ్యారాజ్యముగ, వ్యవహరించుచున్నవి.

**7. పరిపాలన :** దేశమున సమాఖ్యా రాజ్యాంగము అమలున ఉన్నది. అయినను దేశాధ్యక్షుడు (యాంగ్ దీ ప్రధాన్ అగంగ్) మలే రాజ్యములోని ప్రాచీనములగు మాండలిక రాజ్యముల పారంపర్య పాలకులలో ఒకడై ఉండవలెనను నియమము కలదు. ఉపాధ్యక్షుడును వారినుండియే ఎన్నుకొనబడవలెను. వీరిరువురిలో ప్రతివాని పదవీకాల పరిమితి 5 ఏండ్లు. అయిదేండ్లకు ఒకసారి సమావేశమై తొమ్మిదిమంది మాండలిక రాజులును, ఈ అధ్యక్ష, ఉపాధ్యక్షులను తమనుండి ఎన్నుకొనెదరు. అధ్యక్షుడును, రెండు ప్రతినిధి సభలును కలిసి, పార్లమెంటుగ భావింపబడుదురు. ఇందు ఒక ప్రతినిధి సభకు 'దివాన్ నెగర్' అనియు, రెండవదానికి 'దివాన్ రియాయత్' అనియు పేరులు కలవు. తొలుతటి దానిలో 58 మంది, రెండవ దానిలో 144 మంది సభ్యులు కలరు. 9 మంది సభ్యులుకల పారంపర్య పాలక మండలికి, దేశపు భవితవ్యమును గురించిన ప్రముఖ సమస్యల విషయమున సలహాలనిచ్చు అధికారము కలదు.

దివాన్ నెగర్‌లోని సభ్యులలో 16 మందిని, వారివారి పరిపాలనానుభవము, విద్వత్తు మొదలగు వానిని పరిగణనకు తీసికొని, అధ్యక్షుడు నియమించును. తక్కినవారిని దేశమునందలి, 13 రాష్ట్రములు ఎన్నుకొనును. దీని పదవీకాల పరిమితి 6 సంవత్సరములు. దివాన్ రియాయత్‌లోని 144 మంది సభ్యులను, దేశపు మొత్తమునఉన్న 144 ఏకసభ్య నియోజక వర్గములు ఎన్నుకొనును. వీరి పదవీకాల పరిమితి 5 సంవత్సరములు. అయినను అంతకు పూర్వముననే, అవసరమగు నెడల, ఆ సభను రద్దుచేసి, మరల ఎన్నికలు జరుపు అధికారము, అధ్యక్షునికి కలదు. దివాన్ రియా

యత్‌లో, అత్యధిక సంఖ్యాక బలము కలవానిని, ప్రధాన మంత్రిగ అధ్యక్షుడు నియమించును. ఆ ప్రధానియే తన మంత్రి వర్గమును నియమించు కొనును. కార్యనిర్వహణాధికారము, మంత్రివర్గ సహితుడగు ప్రధానియందు కలదు. దేశమున అలయన్స్‌పార్టీ, మలయన్ సాలిడారిటీ కన్వెన్షన్, పాన్‌మలయన్ ఇస్లామిక పార్టీ, సోషలిస్టు ఫ్రంట్ అను రాజకీయ పక్షములు క్రమ ప్రాముఖ్యమును కలిగియున్నవి. అలయన్స్ పార్టీ, ప్రస్తుతమున అధికారమున ఉన్నది.

దివాన్ రియాయత్‌లోని 144 సభ్యులలో సారవాక్‌కు 24, సాబాకు 16 స్థానములు కలవు. తక్కినవి పశ్చిమ మలేసియాకు చెందినవి. దేశపు రాష్ట్రములలో, ఎన్నుకొనబడిన శాసనసభలు కలవు.

**8. దేశరక్షణ :** దేశమునకు 38,750 సైనిక సంఖ్యకల పదాతిదళము కలదు (1969). ఇది సర్వాయుధ సమన్వితము. ఇందులకు తోడుగ దేశరక్షణకు సంబంధించినంతవరకు గ్రేట్‌బ్రిటన్‌తో ఈ దేశము ఒక రక్షణ ఒడంబడికను కుదుర్చు కొనినది. దేశమునకు, ఒక స్వల్పపు నావిక దళ మును కలదు. ఇందలి యోధసంఖ్య 3,000. 20 పోరాట విమానములును, 110 తక్కు విమానము లునుకల వైమానిక దళము కలదు. అందలి యోధసంఖ్య 3,000 (1969).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలయందును, కామన్ వెల్తునను, కొలంబో ప్రణాళికయందును, ఆగ్నేయ, ఆసియా రాజ్య సంఘమునందును, ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఇజ్రాయెల్‌తోతప్ప తక్కిన ప్రముఖ ప్రపంచ రాజ్యములతో, దౌత్య సంబంధ ములు ఉన్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ, రబ్బరు తోటలు, కొబ్బరిజాతి తోటలు, తగరపు గనులు - అనువానిపై ఆధారపడి ఉన్నదని స్థూలముగ చెప్పవచ్చును. ఆసియా దేశముల తలసరి ఆదాయపు లెక్కలలో, జపాను, సింగపూరుల తరు వాతి స్థానమును, ఈ దేశము ఆక్రమించినది. ఆ తలసరి ఆదాయము 396 మ. డాలర్లు (1968).

దేశమున ఆరపవంతు వైశాల్యము మాత్రమే వ్యవసాయమున ఉన్నది. ఇటుల సాగగుచున్న 65 లక్షల ఎకరాలలో, 48 లక్షలు రబ్బరు తోటల క్రిందను, 12 లక్షలు వరి సాగునను, 5 లక్షలు కొబ్బరిజాతి నూనె చెట్ల క్రిందను ఉన్నది, దేశపు ప్రధానాహార వస్తువగు వరిపంటలో, దేశావసర ములకు అవసరమైన దానియందు, 60 మాత్రమే దేశమున ఉత్పత్తి అగుచున్నది; తక్కినది దానికి ఈ దేశము తాయిలాండ్‌నుండి వచ్చు బియ్యపు దిగుమతులపై ఆధారపడి ఉన్నది.

దేశమున రబ్బరుతోటలలో, అధికభాగము యూరపీయ, చీనీయ, భారతీయ సంతతుల వారి వశమున ఉన్నవి. సాలుసరి రబ్బరు ఉత్పత్తి 1,089 వేల టన్నులు; కొబ్బరిజాతినూనె (పామాయిల్) ఉత్పత్తి 2,81093 టన్నులు (1969). చేపల పరిశ్రమను, జపానీయ సహాయముతో, అభివృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది.

దేశమున అటవీ ప్రాంతము ఎక్కువ అయినను, లభించెడు కలప అంతగ నాణ్యమైనది కాదు. అయినను దేశపు పరిశ్రమలలో, రంపపు పరిశ్రమ మూడవ స్థానమును ఆక్రమించి ఉన్నది. దుంగల రూపమునను, కోతచెక్కల రూపమునను. ఈ కలప విదేశములకు ఎగుమతి అగుచున్నది.

దేశమున ఖనిజసంపద విరివిగ కలదని సర్వే వలన తెలియుచున్నను, తగరపు ఉత్పత్తి మాత్రమే ప్రస్తుతమున విరివిగ సాగుచున్నది. ప్రపంచావసర ములకు కావలసిన తగరమున 40% ఈ దేశము సమకూర్చు చున్నది. తరువాత లెక్కకు వచ్చునది

బాక్సైట్. ఉత్పత్తి అయిన ఈ ఖనిజము అంతయు (దాదాపు 9 లక్షల టన్నులు-1967) విదేశములకు ఎగుమతి అగుచున్నది.

సాబాలో విరివిగ గనులున్నను, ఉత్పత్తి అంతగ జరుగుటలేదు; సారవాక్‌లో పెట్రోలియం ద్రవ్యములు లభించుచున్నవి. 1968 లో వాని ఉత్పత్తి 3,170 వేల టన్నులు. దేశమున వ్యావసాయికోత్పత్తులకు సంబంధించిన పరిశ్రమలు మాత్రమే కొన్ని కలవు.

దేశపు ఎగుమతుల విలువలలో దాదాపు అయిదింట రెండు భాగములు రబ్బరువలనను, ఒక భాగము తగరము వలనను లభించుచున్నదని చెప్పవచ్చును. దేశపు ఎగుమతుల విలువ 510 కోట్ల మ. డాలర్లు.

దేశమున విద్యుదుత్పత్తి 264.15 కోట్ల కి. వా. (1967). ఇందు 30% మాత్రమే జలవిద్యుత్తు. దేశపు బడ్జెటరీ వ్యయము 273.5 కోట్ల మ. డా.

**11. సాంఘిక రంగము :** దేశమున పట్టణములలోనేగాక, పల్లెపట్టులందును, గృహనిర్మాణమును, ప్రభుత్వము విరివిగ ప్రోత్సహించుచున్నది. ప్రభుత్వమే గృహములను నిర్మించి, 17 సంవత్సరములలో, నెలసరి వాయిదాలమీద క్రయధనమును చెల్లించు పద్ధతిలో, ప్రజలకు గృహములను ఇచ్చుట పట్టణములందు అమలున ఉన్నది. ఋణములను ఇచ్చి తద్వారా పల్లెలందు, గృహనిర్మాణమునకు ప్రభుత్వము సహాయము చేయుచున్నది.

దేశమున దాదాపు 30 లక్షల సంఖ్యాబలముగల కార్మికులకు, వసతులను చేకూర్చు విషయమున, ప్రభుత్వము శ్రద్ధతో కృషిచేయుచున్నది. దేశమున కార్మిక యూనియన్ ఉద్యమము సుసంఘటితము. యూనియన్ సభ్యులలో దాదాపు 65% భారతీయ సంతతివారు. కార్మిక భద్రతా శాసనముల విషయమున, తక్కిన ఆసియా దేశములకన్న, ఈ దేశము చాల పురోగమించినదని చెప్పవచ్చును. పరిశ్రమలందు, వారమున 46 గంటల పనిమాత్రమే జరుగవలెనను నియమము ఇచ్చుట అమలున ఉన్నది.

దేశమునందంతటను, ఆరేండ్ల ప్రయిమరీ విద్య, ఆయా జాతులవారి మాతృభాషలలో, ఉచితముగ బోధింపబడుచున్నది. 1980 నాటికి ప్రయిమరీ, సెకండరీ విద్యలలో, జాతీయ భాషయగు మలే బోధనాభాషగ రావలెనని ప్రభుత్వపు సంకల్పము. ఐనను అప్పటిలో సైతము, ఇంగ్లీషునకు ద్వితీయ భాషగ ప్రాముఖ్యము ఉండగలదు; ప్రస్తుతమున ఉన్నతవిద్య ఇంగ్లీషుననే బోధింపబడుచున్నది.

1969 లో ప్రయిమరీ పాఠశాలలలో విద్యార్థి సంఖ్య 13,90,000; సెకండరీ పాఠశాలల విద్యార్థి సంఖ్య 4,89,969. ప్రయిమరీ పాఠశాలలు 4,459; సెకండరీ పాఠశాలలు 879.

దేశమున మూడు విశ్వవిద్యాలయములు (కౌలాలంపూరులోని మలయా విశ్వవిద్యాలయము, జాతీయ విశ్వవిద్యాలయము; పెనాంగ్‌లోని పెనాంగ్ విశ్వవిద్యాలయము) ఉన్నవి. వీని యందలి విద్యార్థి సంఖ్య 6,772 (1969-70). ఇస్లామిక మతశాస్త్ర బోధనకు, ఒక ప్రత్యేక కళాశాల కలదు. తూర్పు మలేసియాలో విశ్వవిద్యాలయములు లేవు. 1970 మొదలుగ సాంకేతిక, వృత్తి విద్యలకు దేశమున ప్రాముఖ్యము కల్పింపబడినవి.

సెలాంగర్‌లోను, పెరావ్‌లోను పేరొందిన మ్యూజియములు ఉన్నవి. కౌలాలంపూరులోని మలయా విశ్వవిద్యాలయపు గ్రంథాలయము దేశపు గ్రంథాలయములలో ప్రముఖము.

దేశమున పత్రికా స్వాతంత్ర్యము కలదు. పత్రికా ప్రచురణయు, సాంకేతికముగ ఉత్తమ స్థాయికి చెందినది. దేశపు మొత్తమున 32 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. ఇందులో 7 ఇంగ్లీషునను,

9 మలేభాషలోను, 11 చీనీయ భాషలోను, 4 తమిళ మునను, 1 పంజాబీలోను వెలువడుచున్నవి. స్ట్రెయిట్స్‌టైమ్స్ అను ఆంగ్ల పత్రికకు విశేష వ్యాప్తి కలదు; అ తరువాత పేర్కొనదగినది 'ఉతుసన్ మెలయు' అను మలే భాషాపత్రిక (1969).

దేశమున ఆరోగ్య వసతులను ప్రభుత్వము శ్రద్ధతో నిర్వహించుచున్నది. అయినను డాక్టర్లకై కొంతవరకు విదేశములపై ఆధారపడి యున్నది. దేశపు మొత్తముమీద 20,343 శయ్యాసంఖ్యకల పలు తరగతుల ఆసుపత్రుల సంఖ్య 72 (1971). క్షయ మొదలగు రోగములను అరికట్టుటకై ప్రభుత్వము ప్రత్యేక వైద్య సదుపాయములను కల్పించుచున్నది. పల్లెపట్టులందు 1400 ఆరోగ్య కేంద్రములు (హెల్త్ క్లినిక్కులు) పనిచేయుచున్నవి.

**12. యాత్రా సౌ :** కామన్‌వెల్త్ సభ్యత్వము కల దేశముల పౌరులును, యు. స్టే. పౌరులును మలేసియాకు వీసాలేకుండ దర్శింపవచ్చును. వీరు గాక ఇంకను, 15 దేశముల పౌరులకును ఈ వసతిని ప్రభుత్వము ఒడంబడికలద్వారా కల్పించినది. యాత్రికులకై కౌలాలంపూరు, పెనాంగ్ మొదలగు వానియందు ప్రభుత్వము సౌకర్యములను కల్పించినది. కేమెరాన్ పీఠభూములు, ఫ్రేజర్సు కొండ, పెనాంగ్ కొండ, తీరప్రాంతమునందలి కొన్ని ద్వీపములు యాత్రికులను ఆకర్షించుచున్నవి.

**13. ప్రసిద్ధ పౌరులు :** మున్షీ అబ్దుల్లా బిన్ అబ్దు్ అల్-కబీర్ (1796-1854) మలే సాహిత్యమున పేరుగన్న ప్రసిద్ధరచయిత; మలే సారస్వత జనకుడుగ ఇతడు సంభావితుడు.

---

# 26. మాల్ దీవులు

**ముఖ్యనగరము :** మాలే; **జెండా :** అరుణ భూమికలో కుదురుకొనిన హరిత దీర్ఘ చతురస్రపు మధ్యనున్న తెల్లని నెలవంక; **నాణెము :** మాల్ దీవియా రూపాయి; ఒక మా. రూపాయి = రు. 1.60; **కొలతూకములు :** స్థానికపువి; **కాలపరిగణన :** సా. 5 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** భారత, శ్రీలంకలకు నైరుతి దిశన, 7°7′ ఉ - 0°43′ ద. అక్షాంశ రేఖలకును, 72°31′ – 73°46′ తూ. తులారేఖలకును మధ్యన అటనట చెదరియున్న 19 అతలము*లలో చేరిన 1,087 దీవులుకల ద్వీపసమూహము ఈ రాజ్యము. ఈ దీవులలో 195 మాత్రమే జనావాసితములు. ఈ ద్వీపములలో అత్యుత్తరమున ఉండునది భారత దేశపు కన్యాకుమారి అగ్రమునకు 480 కిమీ. ల దూరమున నైరుతిదిశన ఉన్నది. భారతదేశమునకు చెందిన 'మిన్నికాయ్' అను అతల ద్వీపము, ఈ మాల్‌దీవులలోని అత్యుత్తరపు దీవికి 112 కిమీ. ల దూరమున ఉన్నది. మాల్‌దీవుల మొత్తపు వైశాల్యము 298 చ. కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** భూమధ్యరేఖా ప్రాంతపు దేశముల శీతోష్ణస్థితి ఇందు కననగును. సరాసరి ఉష్ణోగ్రత 81° ఫా. నైరుతి ఋతుపవనములవలన, వర్షములును, తుపానుతో కూడిన వానలును పడుచున్నవి. మధ్యభాగపు దీవులందు కన్నను, ఉత్తర దక్షిణ దీవులలో వృక్షసంతతి

---

* అతలము, లేదా అతల ద్వీపము (Atoll) అనగా మధ్యను, వెలుపలను జలరాశి కలిగిన కంకణమువంటి భూభాగము. ఈ మధ్యనున్న జలరాసిలో అటనట చిన్న చిన్న ద్వీపములు ఉండును.

ఎక్కువ; జంతువులలో సహజ సిద్ధముగ నుండే ఎల్లను, ఎలుకలును మాత్రమే కలవు. జలచర పక్షులు ఎక్కువగ ఉన్నవి. సముద్ర జలాలలో సొరచేప మొదలగు పెద్దచేపలు కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1969 లెక్కలను అనుసరించి జనసంఖ్య 1,10,000. తాజా అంచనాలను అనుసరించి 122 వేలు. దేశమున ఆ యా




పటము 26.

చారిత్రక కాలములందు వచ్చిచేరిన పశ్చిమ భారత వాసులు, చీనీయులు, అరబ్బులు, ఆఫ్రికనులు మొదలగువారు దేశీయులతో సంకరత చెందుట వలన ఇచటి ప్రజలలో ఈ విభిన్నజాతుల లక్షణములు కలగాపులగముగా కననగును. ప్రజల మాతృభాష దివేహీ; ఇది ప్రాచీన సింహళీ భాషకు సన్నిహితము; అరబిక్, ఉర్దూల ప్రభావమునకును ఇది లోనైనది. దాదాపుగ ప్రజలందరును సున్నీ సంప్రదాయానుయాయులగు ముస్లిములు.

**4. సమాచార సౌ. :** ఆయా అతలములమధ్య రేడియో టెలిఫోను సంబంధము ఏర్పడి ఉన్నది. ముఖ్యనగరమున 60 కివా. రేడియో స్టేషను ఒకటి ప్రసారములను నిర్వహింపబడుచున్నది. తక్కిన ప్రపంచముతో ఈ దేశమునకు వార్తా సౌకర్యము శ్రీలంకద్వారా మాత్రమే కలదు.

**5. యాన సౌ. :** ముఖ్యనగరమునను, కొన్ని పెద్ద దీవులందును మంచిరకపు రోడ్లు ఉన్నవి. దేశీయములగు చిన్న పడవలవలన మాత్రమే ద్వీపములమధ్య రాకపోకలు జరుగుచున్నవి. మాలే హార్బరుకు సమీపమున ఒక విమాన క్షేత్రము, కొలంబో ప్రణాళికా సాహాయ్యమున నిర్మితమైనది.

**6. చరిత్ర :** క్రీ. శ. ఆరంభ కాలమునుండియు చీనీయులకును, భారతీయులకును ఈ ద్వీపములు సుపరిచితములై ఉండినటుల తెలియవచ్చుచున్నది. ఆ కాలమున అచటి ప్రజలు బౌద్ధులు; పశ్చిమ భారత ప్రభువులకు ఇచటి పాలకులు ఆ కాలమున కప్పములను చెల్లించుచుండిరి. 1153 లో అరబ్బుల వలన ఇచటి ప్రజలు ఇస్లామును అవలంబించిరి. క్రీ. శ. 1507 లో పోర్చుగీజువారు ఇట కాలూని, దాదాపు ఒక శతాబ్ది కాలము ఆధిపత్యమును నెరపిరి. తరువాత 17 వ శతాబ్దిలో శ్రీలంక యందలి డచ్చి పాలకులు, ఈ దీవుల సుల్తానుతో ఒక ఒడంబడిక కుదుర్చుకొని, అతనిని తమ సామంతునిగ చేసికొనిరి. 1887 లో ఈ దీవులు బ్రిటిష్ ప్రభుత్వపు రక్షణలోనికి వచ్చినవి. కాల్రక్రమమున 1965 లో ఆ దీవులకు బ్రిటిష్ ప్రభుత్వము స్వాతంత్ర్యము కల్పించినది. అనంతరమున నవంబరు 11, 1968 న ఆ రాజ్యమున గణ ప్రభుత్వము ఏర్పడినది. ఈ దేశమునకు చెందిన గాన్ దీవిలో మాత్రము, ఒక ఒడంబడికను అనుసరించి సైనిక స్థావరమును నెలకొల్పుకొని యుండుటకు కొలు హక్కును గ్రేట్ బ్రిటన్ కలిగియున్నది.

**7.** పరిపాలన : నాలుగేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ప్రభుత్వాధ్యక్షుడు ఎన్నుకొనబడును; 54 మంది ఎన్నుకొనబడిన సభ్యులుకల 'మజిలిస్' కలదు. అధ్యక్షునిచే నియమితుడై ప్రధాని, తన మంత్రివర్గపు సాయమున మజిలిస్‌కు బాధ్యత వహించి పాలించును.

**8.** **దేశరక్షణ :** అంతఃకల్లోలములను అడచుటకు సమర్థమగు పోలీసుదళము కలదు. ద్వీపముల తీరరక్షణకు సాయుధములగు చిన్న రక్షక నౌకలు ఉన్నవి.

**9.** అంతర్జాతీయ సం. : 1965 నుండి ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10.** **ఆర్థిక రంగము :** ఈ రాజ్యపు ఆర్థిక వ్యవస్థ చేపల పరిశ్రమపై ఆధారపడి ఉన్నది. ఎగుమతులలో 90% చేపలే; ఇక కొబ్బరి, తాబేలు చిప్పలు మొదలగునవియు కొలదిగ ఎగుమతి అగుచున్నవి. దేశీయుల ముఖ్యాహార వస్తువగు బియ్యమును అంతటిని ఈ రాజ్యము దిగుమతి చేసికొనుచున్నది; జొన్న, గుమ్మడి, అనాస, చక్కెర చెరకు, మామిడిపండ్లు దేశావసరములకు చాలినంతగ పండింపబడుచున్నవి. అడవులు ఎట్టివియు లేవు. మాలే దీవిలోను హులులూలే దీవిలోను మాత్రమే విద్యుత్ సరఫరా అవకాశములు కొలదిగ కలవు. ఎగుమతుల విలువ 1.467 కోట్ల మా. రూ; దిగుమతుల విలువ 1.176 కోట్ల మా. రూ. (1969). బడ్జెటును గురించిన వివరములు తెలియవు.

**11.** **సాంఘిక రంగము :** ప్రజలలో 62% విద్యావంతులు; కాని వీరిలో అత్యధిక సంఖ్యాకులు ప్రయిమరీ స్థాయివారే. దేశమున ఉన్నవానిలో దాదాపుగ అన్నియు ప్రయిమరీ పాఠశాలలే; భారత దేశపు ప్రభుత్వము 3 హైస్కూలులను నెలకొల్పుటకు పూనుకొనినది (1975). ప్రస్తుతమున, మేధావులగు విద్యార్థులను, భారత, పాకిస్తాన్ లకు పంపి ప్రభుత్వము చదివించుచున్నది. బ్రిటిష్ ప్రభుత్వపు సాయమున నిర్మింపబడిన ఒక ఆసుపత్రి (42 శయ్యలు కలది) మాలేలో కలదు. వివిధ ద్వీపములందలి ప్రజలకొరకై సంచారక వైద్యశాల కలదు. మాలేలో ఒక గ్రంథాలయమును మ్యూజియమును కలవు రెండు దిన పత్రికలు కలవు.

**12.** **యాత్రా సౌ. :** ప్రకృతి సౌందర్యమును దర్శించుటకు పలు దేశముల యాత్రికులు ఇటకు వచ్చుచుందురు. కాని నివాస వసతులు తక్కువ.

---

# 27. యెమెన్ అరబ్ గణరాజ్యము

**ముఖ్యనగరము :** సనా; **జెండా :** ఎరుపు, తెలుపు, నలుపు అడ్డచారలలో, నడుమనున్న తెలుపు చారన కుదురుకొనిన ఆకుపచ్చ నక్షత్రము కలది; **జాతీయ గీతము :** అల్-వతన్... (శాంతి కలుగు దేశమునకు); **నాణెము :** రియాల్; ఒక రియాల్ 40 బుక్‌షలుగ విభక్తము. రియాల్ = రు. 7.00; **కొలతూకములు :** తూకపు ప్రమాణము వకియా (దాదాపు 3 గ్రాములు); నిడివికి స్థానిక ప్రమాణము కలదు. (అది రమారమి 65 సెం. మీ. కు సమానము).

**1.** **ఉనికి మొ. :** అరేబియన్ ద్వీపకల్పపు నైరృతిమూలన ఈ దేశము నెలకొనియున్నది.

దీనికి పశ్చిమమున ఎర్రసముద్రమును, దక్షిణమున యెమెన్ జనతా ప్రజాస్వామ్య గణరాజ్యమును, తక్కిన వైపుల సౌదీ అరేబియాయును సరిహద్దు లందు ఉన్నవి. దేశవైశాల్యము 192,000 చ. కిమీ. (అంచనా). భౌతికముగ తీరప్రాంతపు సమభూమి, లోపలవైపు పీఠభూమి అని ఈ దేశమును రెండు ప్రాంతములుగ విభజింపవచ్చును. పీఠభూమిలో కొన్ని చిన్న నదులున్నను, అవి సముద్రము వరకును చేరక అంతరించుచున్నవి. తీరప్రాంతము




పటము 27.

దాదాపుగ ఎడారి. పీఠభూమిన, ఒకపుడు, పెద్ద అడవులు ఉండినను సేద్యమునకై కొట్టివేయ బడినవి. ఇపుడు చాల కొలదిగ మాత్రమే అడవి భూమి కన్పట్టుచున్నది. పీఠభూమియందు పెక్కు ఫలవృక్షజాతులును, అల్పమృగములును విరివిగ కన్పట్టును.

**2. శీతోష్ణస్థితి మొ. :** తీరప్రాంతమున వేడి విపరీతము. ఎండకాలమున సగటు ఉష్ణోగ్రత 130° ఫా వరకు పోవును; చలికాలమున మాత్రము అది 68° ఫా, కు పడిపోవును. పీఠభూమియందలి శీతోష్ణపరిస్థితి చాల బాగుగ ఉండి సౌమ్యతకు పేరొందినది. సాలుపొడవున అత్యధికోష్ణత అట 71° ఫా. మాత్రమే; అల్పోష్ణత 57° ఫా. వర్ష పాతమును పీఠభూమియందు ఎక్కువ; అట సాలున 40 సెం. మీ. నుండి 80 సెం. మీ. వరకు అది మారుచుండును. తీరప్రాంతమున సాధారణముగ వర్షపాతము సాలుసరిన 12.5 సెం.మీ. ను మించదు.

**3. జనసంఖ్య మొ. :** అంచనాల ననుసరించి దేశపు జనసంఖ్య 60 లక్షలు; వీరిలో 96% పల్లె పట్టులలోనే జీవించుచున్నారు. రాజధాని సనాలో 120 వేలు, తయిజ్ నగరమున 80 వేలు ప్రజలు నివసించుచున్నటుల అంచనా. ప్రజలందరును ముస్లిములు; మాతృభాష అరబ్బీ.

**4. సమాచార సౌ. :** పట్టణములందు మాత్రమే తంతి, టెలిఫోను సౌకర్యములు కలవు. పల్లెప్రాంతములందు తపాలా సౌకర్యములు సైతము చాల తక్కువ. కైరో, రోమ్, ఏడెన్‌లతో రేడియో సంబంధము కలదు. సనా నగరమున రేడియో ప్రసార కేంద్రము కలదు.

**5. యాన సౌ. :** 1961 వరకు దేశమున సాధారణపు డొంకబాటలు మాత్రమే ఉండినవి. ఆ తరువాత చీనా, యు. స్టేట్స్, సోవియట్‌రష్యా ప్రభుత్వముల సాయముతో పెద్ద నగరములను కలుపుచు పక్కారోడ్లు నిర్మింపబడినవి. పక్కా రోడ్ల మొత్తపు నిడివి 1,038 కిమీ; దేశమున రైలుమార్గములు లేవు. సోవియట్ ఇంజనీర్ల సాయముతో అల్‌హుదయిదావద్ద ఒక హార్బరు నిర్మింపబడినది. సనా నగరమున అంతర్జాతీయ విమానయానమునకు ఉపయోగించు విమానాశ్రయము కలదు. దేశమున వివిధ ప్రముఖ నగరముల మధ్యను, ప్రక్కనున్న ఆఫ్రికాదేశపు నగరములతోను విమానయానమునకు వసతి కలదు.

**6. చరిత్ర :** క్రీ. పూ. వేయి సంవత్సరములకు పూర్వమునుండియు స్వచ్ఛ సెమిటిక్

జాతికి ఆవాసమై సబా మొదలగు పలు ప్రాచీన రాజ్యములు నెలకొని అంతరించిన ఈ ప్రాచీన దేశమున, ఇస్లామ్ క్రీ. శ. 7వ శతాబ్దిలో స్థానమును ఆర్జించినది. అంతట ఇట 'ఇమామ్' అనబడు ఎన్నుకొనబడిన అధినేత పాలించు సంప్రదాయము రూపుగొనినది. కాని ఈ ఇమామ్‌ల ఎన్నికలలో వచ్చిన వైరుధ్యములవలన దేశము పలుమారులు విదేశీయుల పాలనలో – ఈజిప్టును పాలించిన ఫాతిమేయుల పాలనలో కొంతకాలమును, మరికొంత కాలము టర్కిష్ పాలకుల అధీనమునను – ఉండవలసివచ్చెను. 16వ శతాబ్దిలో తక్కిన అరబ్బీ రాజ్యములతో పాటుగ ఈ దేశము టర్కీ సామ్రాజ్యమున అంతర్భాగమై, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున స్వాతంత్ర్యమును ప్రకటించినది. 1962లో అప్పటి ఇమామ్ మరణించగ, సైనికోద్యోగులు ప్రభుత్వమును వశపరచుకొని గణరాజ్య ప్రభుత్వమును సంస్థాపించిరి.

**7. పరిపాలన :** 1970లో ఆమోదింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి పరిపాలన జరుగుచున్నది; 179 సభ్యులుకల సంప్రతింపు సభయందు పరిపాలనాధికారము న్యస్తమై ఉన్నది. వీరిలో 159 మందిని నాలుగేండ్ల కొకసారి జరుగు ఎన్నికలలో ప్రజలు ఎన్నుకొనెదరు. తక్కినవారిని అధ్యక్షుడు నియమించును. అధ్యక్షుని సంప్రతింపు సభ ఎన్నుకొనును. ఇస్లామిక న్యాయ సంహితను అనుసరించి న్యాయనిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** ఈజిప్ట్, జెక్, సోవియట్ ప్రభుత్వముల సాయిముతో నిర్మింపబడిన ఒక చిన్న వైమానికదళము కలదు. చిన్నదైనను, సుశిక్షితమగు సేన కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, దాని అనుబంధ సంస్థలయందు పెక్కింటను, అరబ్ లీగునను ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** వ్యావసాయికోత్పత్తిపై ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉన్నది. కాఫీయు, ప్రత్తియు, 'కాట్' అను మాదక ద్రవ్యమును ఈ దేశపు ముఖ్య ఎగుమతులు. ఆహార విషయమున ఈ దేశము స్వయంపోషకమగుటయే గాక అందు కొంత భాగమును ఎగుమతి చేయ గలుగుచున్నది. కాని తలసరి ఆదాయము చాల తక్కువగ ఉండు దేశములలో ఇది యొకటి.

**11. సాంఘిక రంగము :** సాంఘిక పురోగతి సాధింపబడని దేశములలో ఇది యొకటియని చెప్పవచ్చును. పల్లెపట్టులందు సాంప్రదాయిక మత విద్యావిధానమే ఇప్పటికిని సాగుచున్నది. పట్టణ ప్రాంతములందు ఆధునికరీతిలో విద్యా విధానము కొంత తావు కల్పించుకొనినది. తయిజ్ నగరమున ఒక విశ్వవిద్యాలయము కలదు. ఉన్నతవిద్యను అభ్యసింపగోరువారు విదేశములకు, ముఖ్యముగ ఈజిప్టునకు, పోయి అట చదువుచున్నారు. 1966లో ఇట్టివారి సంఖ్య 930. సనానగరమున ఒకటియు, తయిజ్ నగరమున వేరొకటియు అరబ్బీ దిన పత్రికలు కలవు.

# 28. యెమెన్ జనతా ప్రజాస్వామ్య గణరాజ్యము (దక్షిణ యెమెన్)

**ముఖ్యనగరము :** మదీనత్ అష్-షాబ్; **జెండా :** ఎరుపు, తెలుపు, నలుపు అడ్డచారల లోనికి దండమువద్దనుండి ముందునకు త్రోసికొని వచ్చిన నీలవర్ణపు త్రిభుజమున అరుణవర్ణపు నక్షత్రము కలది జాతీయ పతాకము; **జాతీయ గీతము :** అన్-సలామ్ అల్-గుమూరి (మహా ప్రణామము); **నాణెము :** యెమెనీ దీనార్; ఇది వేయి ఫిల్లులుగ విభక్తము; ఒక దీనార్ = రు. 18.00;




పటము 28.

**కొలతూకములు :** స్థానికపు కొలతూకములే పరిగణనలో ఉన్నవి; **కాలగణన :** సా. 3 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** అరేబియా ద్వీపకల్పపు దక్షిణపు అంచున ఉన్న ఈ దేశమునకు తూర్పున ఓమెన్, దక్షిణమున ఏడెన్ సింధుశాఖ; ఉత్తరమున యెమెన్ అరబ్ గణరాజ్యమును, సౌదీ అరేబియాయును; పశ్చిమమున ఎర్రసముద్రము సరిహద్దులందున్నవి. దేశపు మొత్తపు వైశాల్యమును గురించిన అంచనాలు 2,87,300 నుండి 2,94,400 చ. కిమీ. వరకు మారుచున్నవి; ప్రక్క దేశములతో సరిహద్దుల నిర్ధారణ సరిగ జరుగక పోవుటయే ఇందులకు కారణము. ఎర్ర సముద్రము నందలి కమరాన్ ద్వీపము (180 చ. కిమీ.)ను, పెరిమ్ ద్వీపము (13 చ. కిమీ.)ను, శోకోత్ర ద్వీపము (3,600 చ. కిమీ.)ను ఈ రాజ్యమున చేరి ఉన్నవి. భౌతికముగ ఈ దేశమును నాలుగు ప్రాంతములుగ - (1) పర్వతమయమగు పశ్చిమ ప్రాంతము; ఇట 2,440 మీ. ఎత్తుకల శిఖరములు సైతము కలవు. (2) తీరప్రాంతపు ఎడారిభూమి, (3) సముద్రపు మట్టమునకు 762 మీటరుల సరాసరి ఎత్తుననున్న ఉత్తర ప్రాంతపు ఎడారి. (4) జోల్ అని వ్యవహృతమగు ఉన్నత పీఠభూమి (ఇట భూమి ఎత్తు 915 మీ. నుండి 1,525 మీ. వరకు మారుచుండును) — విభజింపనగును. పై నాలుగవ ప్రాంతముననే వాడి హద్రమావత్ అను దీర్ఘమగు లోయ కలదు. దేశమందలి లోయలలో సారవత్తమమని ఇది పేరొందినది. దేశమున నదులు ఎట్టివియు లేవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** పశ్చిమపు పర్వతసీమయందును, పీఠభూమియందును శీతకాలమున ఉష్ణోగ్రత 32° ఫా. ఉండును; కాని అచట ఎండకాలమునను, తక్కిన ప్రాంతములందు సాలు పొడవునను ఉష్ణోగ్రత 100° ఫా. ను మించియే ఉండును. అయినను గాలిలో చెమ్మదనము ఎక్కువ. పశ్చిమపు ఉత్తర భూములందు శీతకాలమున పడెడు వర్షము తప్ప, తక్కిన దేశమున వర్షపాతము దాదాపుగ శూన్యమనియే చెప్పవచ్చును. ఉన్నత భూములందు వర్షపాతము వేర్వేరు తావు

లను అనుసరించి 12.50 సెం. మీ. నుండి 75 సెం. మీ. వరకు మారుచుండును. ఉన్నత ప్రాంతములందు సైతము, చిన్నచిన్న పొదలుతప్ప పెద్ద వృక్షములు కనరావు; తక్కిన ప్రాంతమున ఏ విధపు చెట్లును కనరావు.

**3. జనసంఖ్య మొ. :** దేశమున జనసంఖ్యా గణన, ఏడెన్‌లోతప్ప, తక్కిన ప్రాంతమున జరుగలేదు; ఏడెన్‌లోనైనను 1955 లోనే కడపటి జనాభా లెక్కలు తేల్చబడినవి. అంచనాలను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య 14,75,000. నగరములలో ఏడెన్ (జ. సం. 1,50,000; మదీనత్ అష్‌షాబ్ (జ. స. 29,000) లెక్కింపదగినవి. దేశ ప్రజలలో 90% అరబ్బీజాతికి చెందినవారు; తక్కిన జాతులవారు ఏడెన్‌వంటి రేవునగరములలో కననగుదురు. ఇందు భారత, పాకిస్తానీ సంతతులవారు ప్రముఖముగ పేర్కొనదగుదురు. ప్రజలలో 90% ముస్లిములు; తక్కిన వారిలో క్రైస్తవాది తదితర మతములు ప్రచారమున ఉన్నవి. అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ; తూర్పు ప్రాంతపు మారుమూలలందు మహ్రి అనబడు ఒక భాష మాటాడబడుచున్నది. ఈ భాష ప్రపంచమునందలి భాషా కుటుంబములలో దేనికిని చెందినటుల కన్పట్టదు.

**4. సమాచార సౌ. :** అత్యంతాధునిక సామగ్రి కలిగిన తంతి, టెలిఫోను సౌకర్యములును, తపాలా వసతులును ఏడెన్‌లో మాత్రము కన్పట్టును. తక్కిన ప్రాంతములందు పెక్కింట సాధారణపు తపాలా వసతులును పరిమితముగనే ఉన్నవి. ఒక రేడియో ప్రసార స్థావరము ఏడెన్‌లో పనిచేయుచున్నది.

**5. యాన సౌ. :** దేశమున రైలుమార్గములు లేవు; డొంకబాటలును, కచ్చారోడ్లును దేశమున వివిధ ప్రాంతములకు పోవుటకు ఉపకరించుచున్నవి. ఇట్టివాని నిడివి 5,800 కి. మీ. ఏడెన్‌లో మాత్రము 200 కి. మీ. తారురోడ్లు ఉన్నవి. ఖోర్ మక్సర్ వద్దనున్న విపులమగు విమానాశ్రయము అంతర్జాతీయ విమానయాన మార్గమున ఒక ప్రసిద్ధ కేంద్రముగ పేరొందినది. దేశమునందలి ముఖ్య నగరములను అనుసంధించు విమానయాన సౌకర్యము కలదు; ఏడెన్‌న సుప్రసిద్ధమగు హార్బరు ఉన్నది.

**6. చరిత్ర :** ప్రపంచ చరిత్రలో ప్రాచీన జనావాస కేంద్రములుగ పేరొందినవానిలో ఏడెన్ ప్రాంతమును ఒకదానిగ లెక్కింపదగును. క్రీ. పూ. 1200 ప్రాంతమున సెమిటిక్ జాతి ప్రజలు కొందరు ఇటచేరి నాగరికతా పథమున కొంత పురోగమింపగలిగిరి. ప్రాక్పశ్చిమ దేశములమధ్య వ్యాపార మార్గమునఉన్న ఏడెన్ ప్రాముఖ్యమును గుర్తించి రోమనులు క్రీ. పూ. 24 ప్రాంతమున దానిని వశపరచుకొనిరి. రోమనుల ప్రతిష్ఠ సన్నగిలిన తరువాత, స్థానిక పాలకులు స్వతంత్రులైరి. క్రీ. శ. 7వ శతాబ్దిలో ఇచటి ప్రజలు ఇస్లామును అవలంబించిరి. అంతటినుండి, తక్కిన అరేబియాతోపాటుగ, ఇదియు క్రమముగ వివిధ ముస్లిం సామ్రాజ్యములలో అంతర్భాగముగ మనుగడను సాగించినది. 1735 లో దేశమునందలి మాండలిక ప్రభువులలో ఒకడై లాహెజ్‌ను పాలించు షేకు, విదేశీయులను పరిమివైచి, తన వంశపు రాజరికముతో ఒక స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించెను. 1839 లో బ్రిటిష్‌వారు ఏడెన్‌ను వశపరచుకొని, తమ నౌకలకు బొగ్గునింపుకొను స్థావరముగ దానిని ఉపయోగించుకొనసాగిరి; ఆ సమయముననే ఏడెన్ పరిసరములనున్న మాండలిక రాజ్యములు బ్రిటిష్‌వారి రక్షిత రాజ్యములుగ ఉండుటకు అంగీకరించినవి. 1932 వరకు బొంబాయి రాష్ట్రమున, పరిపాలనారీత్యా, అంతర్భాగముగ దీనినిఉంచి, ఆ తరువాత దానిని 'మకుటపు వలస' (క్రౌన్ కాలనీ)గ

బ్రిటిష్ ప్రభుత్వము పాలించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశప్రజలలో స్వాతంత్ర్యా కాంక్ష పెచ్చుపెరిగి ప్రజల పక్షమున జాతీయ విమోచనదళము పోరాడి రక్షిత రాజ్యములలో అధికారమును కైవసము చేసికొనినది (1967); అంతట బ్రిటిష్ ప్రభుత్వము ఆ దళముతో సమాధానపడి ఏడెన్‌ను వారికి వశమొనర్చినది. అంతట దక్షిణ యెమెన్ అను పేరుతో రూపొందిన ఈ రాజ్యము, 1970 లో యెమెన్ జనతా ప్రజాస్వామ్య గణరాజ్యము అను క్రొత్త పేరును పొందినది. ఉత్తరమునఉన్న యెమెన్ అరబ్ గణరాజ్యముతో కలిసి ఒకే ఒక రాజ్యమగుటకు సంప్రతింపులు జరిగినను అవి ఫలింపకున్నవి.

**7. పరిపాలన :** 1970 లో ఆమోదింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి ఒక తాత్కాలిక ప్రజావిధాన సమితి రూపొందినది. ఇందలి 101 మంది సభ్యులను జాతీయ విమోచక దళమును, సేనాదళములును, వివిధ వృత్తుల వారును, కార్మిక సంఘములును ఎన్నుకొనిరి. ఈ సమితి నిర్ణయములను అనుసరించి అధ్యక్షుడు పరిపాలనను నిర్వహించుచున్నాడు. ఏడెన్‌లో మాత్రము, మతముతో సంబంధములేని, పౌర, దండ న్యాయశాస్త్రములును అనుసరించి న్యాయ నిర్వహణ సాగుచున్నది. తక్కిన ప్రాంతములందు ముస్లిమ్ న్యాయసంహితయు, స్థానిక సంప్రదాయములును మన్నింపబడుచున్నవి.

**8. దేశరక్షణ :** స్థానిక ప్రజలనుండి, స్వాతంత్ర్య పోరాటపు కాలమున, సమీకరింపబడిన 9 పటాలముల సేనయు, ఒక చిన్న వైమానిక దళమును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** అరబ్ లీగునను, ఐ. రా. స. యందునను, తదనుబంధ సంస్థలలో పెక్కింటను ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశమున 75% ప్రజలు వ్యవసాయముపై ఆధారపడి జీవించుచున్నారు. కాని దేశ సంపదలో 8% మాత్రమే వ్యవసాయమువలన లభించుచున్నది. వ్యవసాయ యోగ్యముగ పరిగణింపదగు 15 లక్షల ఎకరములలో దాదాపు అయిదవవంతు మాత్రమే సాగున ఉన్నది. ఉన్నత ప్రాంతములలో కురియు వానల వెల్లువచే వలన లోయలలోని భూమిని సాగుచేయుట సాంప్రదాయికముగ జరుగుచున్నది. ఈ నీరును నిలువజేసి ఎక్కువ భూమిని సేద్యములోనికి తెచ్చుటకు కృషి జరుగుచున్నది. జొన్న, సజ్జ, గోధుమ, బార్లీ ధాన్యములు, దేశపు ఉపయోగమునకు మాత్రమే, పండింపబడుచున్నవి ఎగుమతి పంటలలో ప్రత్తి ప్రముఖము. చేపల పరిశ్రమకు ఎక్కువ అవకాశములు కలవు. కావున దీని అభివృద్ధికి ప్రభుత్వము కృషిచేయుచున్నది. ఏడెన్‌లోని జనులందరును పరిశ్రమలపై ఆధారపడి ఉన్నారు. అచటి పరిశ్రమలలో నూనెశుద్ధి పరిశ్రమ ప్రముఖము. 1971 లో దేశపు ఎగుమతుల విలువ 4.4 కోట్ల దీనారులు. దిగుమతుల విలువ 6.5 కోట్ల దీ; ఈ చెల్లింపుల లోటును నివారించుటకు కమ్యూనిస్టు దేశములనుండియు, కొన్ని అరబ్ రాజ్యముల నుండియు, సహాయమును ప్రభుత్వము గ్రహించుచున్నది. 1971 లో దేశపు బడ్జెట్ వ్యయము 1.756 కోట్ల దీనారులు.

**11. సాంఘిక రంగము :** ఏడెన్‌లోతప్ప తక్కిన ప్రాంతములందు సాంఘిక సేవా వసతులు దాదాపుగ శూన్యములు; అట్టివానిని అట సంస్థాపించుటకు ప్రభుత్వము తన కృషిని ఆరంభించినది. ఏడెన్‌లో చక్కని గృహవసతి కలదు; కార్మిక శ్రేయస్సునకై కృషియు అచట సువ్యవస్థితము. దేశమునందలి 477 విద్యా సంస్థలలో అత్యధిక భాగము ఏడెన్‌నందే కలవు. ఏడెన్‌లోతప్ప తక్కిన ప్రాంతములందు వైద్య వసతులు కదా చిత్తుగ కనబడును. అరబ్బీ భాషలో మూడు దిన పత్రికలు ఏడెన్‌నుండి ప్రచురితము లగుచున్నవి.

# 29. లావోస్

**ముఖ్యనగరము :** వియెంటియేన్ (పరిపాలనకు); లవంగ్ ప్రబంగ్ (అధ్యక్షుడు నివసించునది); **జెండా :** ఎర్రని భూమికపై తెల్లని రంగున చిత్రిత మగు మూడు శిరముల ఏనుగు; **జాతీయ గీతము :** ఫెంగ్ సత్ లోవో; **నాణెము :** కిప్; ఇది 100 సెంటులుగ విభక్తము; 100 కిప్పులు = రు. 3.12; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 7 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని




పటము 29.

**1. ఉనికి మొ. :** ఆగ్నేయ ఆసియాలో, ఇండో-చీనీయ ద్వీపకల్పమున, భూపరివృత్తమై 13°41′ – 22°40′ ఉ. అక్షాంశరేఖల మధ్యను, 100°-107° తూ. తులారేఖల మధ్యను కుదురు కొనిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున చీనా; తూర్పున, ఆగ్నేయమున వియెత్‌నామ్ దక్షిణమున కాంబోడియా; దక్షిణ, పశ్చిమములందు థాయిలాండ్; పశ్చిమమున బర్మా సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 2,36,800 చ. కిమీ; ఉత్తర దక్షిణముల నిడివి 1,280 కిమీ. భూతలమున మిట్టపల్లములను పర్వతములును విశేషముగ కన్పట్టును; అందును ముఖ్యముగ ఉత్తర ప్రాంతమున పర్వతములు ఎక్కువ. ఇందలి శిఖరములు కొన్ని దాదాపు 2,440 మీ. ఎత్తు కలవి. ఈ పర్వతములందును దేశపు తూర్పు ప్రాంతమునను సాంద్రాటవులు కలవు. దేశమున కొలది ప్రాంతముతప్ప తక్కినది అంతయు మీకాంగ్ నదివలనను, దాని ఉపనదులవలనను లాభపడుచున్నది. దేశపు ప్రముఖ నగరములు అన్నియు ఈ నదీతటములందుననో, వానికి సమీప ముననో కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఏప్రిల్ నెలలో ఎండలు అత్యధికము. సాగున గరిష్ఠోష్ణత 93° ఫా; కనిష్ఠోష్ణత 57° ఫా. మే నుండి సెప్టెంబరు వరకు వానలు ఎక్కువగ కురియును, ఆ కాలమున నెలకు సరాసరిన 25 నుండి 30 సెం. మీ. వరకు వర్షపాతము ఉండును. నవంబరునుండి మార్చివరకు అంతటంతట వానలు కురిసినను, ఆ వర్షపాతము నెలసరిన ఒక సెం. మీ. మాత్రమే.

దేశమున మూడింట రెండు భాగములు అటవీ ప్రాంతము. వెదురు, పేము, తాళజాతి వృక్షములు ఇందు ఎక్కువగా కలవు. ఈ అడవులలో ఏనుగులు, చిరుతలు, పెద్దపులులు సంచరించుచుండును. దేశమున సరుకుల మోతకు, ప్రయాణములకు ఏనుగులు ఎక్కువగ వాడబడుచున్నవి. వివిధ సరీసృప జాతులును, నానావిధముల పక్షిసంతతులును, మత్స్య జాతులును ఇచట కలవు.

**3. జనసంఖ్య మొ.:** దేశమున శాస్త్రీయ రీతిలో జనసంఖ్యా గణన ఇప్పటికి జరిగినదికాదు; అయినను అంచనాలనుబట్టి దేశ జనసంఖ్య 29 లక్షలు. దేశపు నగరములలో వియెంటియేన్ (జ. సం. 150 వేలు); లవంగ ప్రబంగ్ (22 వేలు); సవణ్ణఖేత్ (36 వేలు) పేర్కొనదగినవి. ప్రజలయందు అత్యధిక సంఖ్యాకులు లావోజాతికి చెందినవారు; వీరు తాయ్‌జాతికి సన్నిహితులు; దేశమున దాదాపు 27 వేల వియెత్‌నమీయులు, 15 వేలు చీనీయులు, ఇతర దేశీయులు దాదాపు 9,000 నివసించుచున్నారు. 'లావో' భాష అధికార జాతీయ భాషగ పరిగణన పొందినది; ఇది తాయ్‌భాషకు సన్నిహితము; ఇందు సంస్కృత, పాళీ, పారసీక పదములు అనేకములు కలిసియున్నవి. దేశమున పర్వత సీమలందు నివసించు కొన్ని తెగలలో మాన్-ఖ్మేర్ మాండలికములు కొన్ని వ్యాప్తియందు ఉన్నవి. దేశమున ఫ్రెంచిభాషకు సాధికారమ్ముగ ద్వితీయ భాషగ పరిగణన కలదు; పరిపాలనయందును, వ్యాపారమునను దీనికి విశేష వ్యాప్తి కలదు; ఇపుడు ఆంగ్లభాషకూడ ఎక్కువగ అభ్యసింపబడుచున్నది.

దేశీయులందరును హీనయాన సంప్రదాయపు బౌద్ధమతానుయాయులు. ఈ మతము జాతీయ మతముగ ఆదరణ పొందినది. బౌద్ధ విహారములు పల్లె పల్లెను, నగరాలలో విశేషముగ కలవు; ఇవియే ప్రజల మత, సాంస్కృతిక, విద్యా కేంద్రములుగ ఉపకరించుచున్నవి.

**4. సమాచార సౌ.:** తంతి తపాలా సౌకర్యములు అన్నియు ప్రభుత్వాధీనమున పనిచేయుచున్నవి. టెలిఫోను ద్వారా ప్రపంచమునందలి వివిధ ప్రాంతములతో ఈ దేశము వార్తా సదుపాయములను 1968 మొదలుగ కలిగి యున్నది. వియెన్‌టియేన్‌లో ఒక రేడియో ప్రసార కేంద్రము కలదు.

**5. యాన సౌ.:** దేశమున 2,700 కి మీ. పొడవుగల పక్కా రోడ్లును, 4,500 కిమీ. పొడవున కచ్చా రోడ్లును కలవు (1971). దేశమున రైలుమార్గము ఏదియులేదు. దేశమున వివిధ ప్రాంతములను అనుసంధించు దేశీయ విమానయాన సంస్థలు రెండు పనిచేయుచున్నవి. వియెన్‌టియేను నుండి సైగాన్, బాంగ్‌కాక్, హాంగ్‌కాంగ్, ఫణమ్ పెణ్, హానోయ్‌లకు విమానయానముద్వారా రాకపోకల వసతులు కలవు. మీకాంగ్‌నదియు, దాని ఉపనదులును కొంతవరకు నౌకాయానమునకు అనుకూలములై, ప్రయాణికుల రాకపోకలకును, సరకులను చేర్చుటకును ఉపకరించుచున్నవి.

**6. చరిత్ర:** క్రీ. శ. 14 వ శతాబ్దిలో, దక్షిణ చీనానుండి తరుమబడిన తాయ్‌జాతి ప్రజలలో కొందరు ఇటచేరి, ఫాన్‌గౌమ్ అనువాని నాయకత్వమ్మును 'లాన్‌షాంగ్' అను రాజ్యమును సంస్థాపించు

టతో ఈ దేశపు చరిత్ర మొదలయ్యెనని చెప్పవచ్చును. పరిసర రాజ్యముల దండయాత్రలను ఎదుర్కొని, వానిని తిరుగగొట్టి, దేశమున సంఘ వ్యవస్థను చక్కగ తీర్చిదిద్ది, ఈ రాజ్యము దాదాపు నాలుగు శతాబ్దములు నిరంతరాయముగ మనగలిగినది. 1707 లో అంతఃకలహములవలన ఈ రాజ్యము, వియెంటియేన్, లవంగ ప్రబంగ్ అను రెండు రాజ్యములుగ చీలినది. ఈ అవకాశమును వినియోగించుకొని తాయిలాండ్ పాలకులు దేశముపై దండెత్తి వియెంటియేన్ రాజ్యమును ఆక్రమించిరి (1828); చీనీయులును, వియెత్నామీయులును లవంగ ప్రబంగ్‌పై ఆధిపత్యమును నెలకొల్పిరి. కడకు వీరిని అందరిని, ఆవలకునెట్టి, 1893 లో ఫ్రెంచివారు ఈ రాజ్యమును తమ రక్షణలోనికి తీసికొనిరి.

1945 లో జపాను సేనలు ఆగ్నేయ ఆసియాను ఆక్రమించినపుడు, జపాను పాలకుల ప్రోత్సాహముతో లవంగ ప్రబంగ్ ప్రాంతపు వంశానుగత రాజ్యపాలకుడు 'లావోస్' దేశము స్వతంత్రతను ఆర్జించినటుల ప్రకటించెను (1946); తదనంతరము ఫ్రెంచివారు ఈ ప్రాంతపు రాజ్యములను తిరిగి వశపరచుకొనినపుడు, ఈ రాజరికమును గుర్తించుచునే తమ సర్వాధిపత్యమును నెలకొల్పిరి. కాలక్రమమున, ప్రపంచమునందలి నూతన పరిస్థితుల వలన, 1953 లో ఈ దేశపు సర్వతంత్ర స్వాతంత్రతను ఫ్రెంచివారు గుర్తించి, తమ అధికారములను అన్నింటిని త్యజించిరి. కాని తదాదిగ దేశము అంతఃకల్లోలములకు లోనైనది. దేశమున ప్రజలు మూడు రాజకీయ పక్షములుగ ఏర్పడి, రాజకీయ సమస్యను ఆయుధములద్వారా పరిష్కరించుకొనుటకు యత్నించుట ఇందులకు మూలకారణమని చెప్పవచ్చును. కడకు 1974 లో మధ్యస్థ పక్షపు సువణ్ణ ఫౌమా నాయకత్వమున వామ, దక్షిణ పక్షముల ప్రతినిధులుకల నూత్న ప్రభుత్వము ఏర్పడి దేశమున శాంతి నెలకొననది. ఇంతలో కాంబోడియాయందును, దక్షిణ వియెత్నామునందు కమ్యూనిస్టు సేనలు విజయమును పొందిన తరువాత (1975), దేశమున ప్రభుత్వమునుండి దక్షిణ పక్షపు ప్రతినిధులు వైదొలగవలసి వచ్చినది. అనంతరమున రాజరికము నెరవలనే వామపక్షములు ప్రముఖ్యమును వహించినందువలన, రాజు సవంగ్ వత్తన పదవి పరిత్యాగమును చేయగా, దేశమున వామపక్షపు నియంతృత్వమున గణరాజ్య ప్రభుత్వము ఏర్పడినది (డిసెంబరు 3, 1975).

**7. పరిపాలన :** వంశానుగత రాజరికపు పాలన అంతమైన తరువాత ఇచట ఏర్పడిన ప్రభుత్వము ఇంకను క్రొత్త రాజ్యాంగ విధానమును స్థిరపరుపలేదు. ప్రస్తుతమున ప్రభుత్వము దాదాపుగ కమ్యూనిస్ట్ ప్రభుత్వపు రీతిలో వ్యవహరించుచున్నది. పూర్వపు శాసనసభయందలి దిగువ సభయే ఇపుడును శాసనసభగ ఉన్నది. ఇందలి సభ్యసంఖ్య 59. ఇందు ఇపుడు అత్యధిక సంఖ్యాకులు వామపక్ష సభ్యులు.

**8. దేశరక్షణ :** దేశమున ఇదివరలో వేర్వేరు రాజకీయ పక్షములు ప్రత్యేక సేనలను కలిగియుండినవి. ప్రస్తుతమున గణరాజ్య ప్రభుత్వము ఏర్పడిన తరువాత ఈ సేనలన్నియు ఒకే ప్రభుత్వము క్రిందకు కొనిరాబడినవి. వీటి అన్నింట కలిసి మొత్తముమీద 1,35,000 ఘాతల సేనయు, 1 750 యోధసంఖ్యాకల వాయుసేనయు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1955 మొదలుగ ఈ దేశము ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును సభ్యత్వమును కలిగిఉన్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపైననే చాలవరకు ఆధారపడి ఉన్నది; ఆంతరంగిక కల్లోలములవలన, ఈ వ్యవసాయము

సైతము కొన్ని ప్రాంతములందు దెబ్బతినినది; అందువలన ఆహార పదార్థములను సైతము కొంత వరకు, థాయిలాండు మొదలగు వానినుండి దిగుమతి చేసికొనవలసి వచ్చినది; అయినను మామూలు పరిస్థితులలో దేశము ఆహార విషయమున స్వయం పోషకము. వరి ముఖ్యమగు పంట; ఇది దాదాపు 550 వేల హెక్టేరులలో సాగగుచున్నది; తరువాత మొక్కజొన్న, పొగాకు, ప్రత్తి, నిమ్మజాతి ఫలములు, తేయాకు, కాఫీ, క్రమరీతిలో పేర్కొనదగినవి; పశుసంతతి విశేషముగ కలదు. దేశమునందు అధిక భాగమును ఆవరించిన అడవులనుండి కలప విశేషముగ లభించుచున్నది. దీని సేకరణలో ఏనుగులును, దిగువకు కొనిపోవుటలో నదులును ఎక్కువగ ఉపకరించుచున్నవి; ఈ కలపలో కొంత భాగము విదేశములకు ఎగుమతి అగుచున్నది. ఖనిజోత్పత్తులలో ప్రముఖముగ పేర్కొనదగినది తగరము; ఇందు అధికభాగము ఎగుమతి అగుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి చాల తక్కువ; దానిని వృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 148.5 కోట్ల కిప్పులు; దిగుమతులవిలువ 1973.9 కోట్ల కిప్పులు (1971); చెల్లింపుల లోటును పూర్తిచేయుటకు ప్రభుత్వము విదేశముల సాయముపై ఆధారపడి ఉన్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 2,280 కోట్ల కిప్పులు (1972-73).

**11. సాంఘిక రంగము :** దేశమున గృహవసతి చాల తక్కువ; సాధారణపు ఇండ్ల నిర్మాణమున కొయ్యయు, వెదురును విరివిగ ఉపయోగింపబడుచున్నవి. దేశమున దాదాపు 2,50,000 విద్యార్థులు కల 3,312 ప్రాథమిక పాఠశాలలు కలవు; 20 కళాశాలలు ఉన్నవి; 4 ఉన్నత పాఠశాలలు, 3 సాంకేతిక పాఠశాలలు ఉన్నవి; వీనిలోని విద్యార్థి సంఖ్య దాదాపు 8,700. ఇవిగాక ఒక వైద్యశాస్త్ర పాఠశాల, ఒక న్యాయశాస్త్ర సంస్థ, ఒక పాళీ విద్యాసంస్థ పనిచేయుచున్నవి (1970-71). దేశమున ఏడు దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. అయినను వాని మొత్తపు పాఠక సంఖ్య 8,000 మాత్రమే. దేశమున పెద్దనగరములందు మాత్రమే ఆసుపత్రులు కలవు; తక్కిన చోటులందు సంచారక వైద్య దళములును, గ్రామీణ వైద్య సహాయ కేంద్రములును పనిచేయుచున్నవి. దేశమున మొత్తపు వైద్య సంఖ్య 110; అనగా 25,000 ప్రజలకు ఒక వైద్యుడు సరాసరిన కలడు.

**12. యాత్రా సౌ. :** విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకు ప్రభుత్వము పెక్కు సౌకర్యములను కల్గించుచున్నది. ప్రకృతి రమణీయకతను పేరొందిన స్థలములును, కళాకుశలతకు పేరొందిన విహారములును దేశమున అనేకములు కలవు. లవంగ్ ప్రబంగ్‌లోని ఆలయమున బుద్ధుని వక్షస్థలపు అస్థిశకలము కలదు; అందువలన అది ప్రపంచపు బౌద్ధులకు సమ్మాన్యమైనది. విదేశీయ యాత్రికులు పాస్‌పోర్టులను, వీసాలను కలిగియుండవలెను.

---

# 30. లెబనాన్

**ముఖ్యనగరము :** బీరూట్; **జెండా :** రెండు ఎర్రని అడ్డుచారల మధ్య ఒక తెల్లచారయు, ఆ తెల్లచారపై ఆకుపసిమి, గోధుమవన్నెలతో దేవదారు వృక్షమును ఉండును; తెల్లచార వెడల్పు, ఎర్రచారలలో ప్రతియొకదానికి, రెట్టింపు ఉండును. **జాతీయగీతము :** 'కుల్లూనా లిల్ వతన్ లిల్ ఉళా

లిల్ అలమ్' (మనమందరమును దేశముకొరకు, కీర్తికొరకు, పతాకముకొరకు) **నాణెము :** లెబనీజ్ పౌను; ఇదియే లివెర్ లిబనాయిస్ (లి. లి) అని వ్యవహృతము; 1 లి. లి = రూ. 3.42; ఇది 100 పియాస్త్రులుగ విభజితము. **కొలతూకములు :** మెట్రిక్ విధానము సాధికారిక పరిగణన పొందినది;




పటము 30.

కాని స్థానికములగు కొన్ని మానములును అటనట వాడుకలో ఉన్నవి. **కాలపరిగణన** ; సా. 2 గం. =భారతదేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి :** పశ్చిమాసియాయందు మధ్యధరా సముద్రపు తూర్పుతీరము వెంబడి 240 కిమీ. పొడవునను, 48 నుండి 80 కిమీ. వెడల్పునను వ్యాపించియున్న ఈ దేశమునకు ఉత్తరమునను తూర్పునను సిరియాదేశమును, దక్షిణమున ఇస్రాయెల్‌ను సరిహద్దులందున్నవి. దేశవైశాల్యము 10,400 చ. కిమీ. సముద్రతీరముననుండి భూమి ఎత్తు క్రమముగ పైకిలేచి 40 కిమీ. దూరము పోవునప్పటికి లెబనాన్ పర్వతశ్రేణిగ పరిణమించును; ఈ పర్వతశ్రేణియందు 2100 మొదలుకొని 3,000 మీటరుల ఎత్తువరకు ఉన్న పర్వత శిఖరములు కలవు. తీరమునకు సమానాంతరముగ పయనించిన ఈ శ్రేణియందు, కాలగతిలోని మార్పులవలన, లోయలు అనేకములు రూపొందినవి. ఈ పర్వత శ్రేణికి తూర్పువైపున 'బికా' లోయ అనబడు చదును ప్రాంతము కలదు. దీని ఉత్తర దక్షిణముల పొడవు 125 కిమీ; వెడల్పు 16 కిమీ. ఈ లోయకు తూర్పుటంచున ఆన్‌టీ-లెబనాన్ పర్వత శ్రేణి సిరియానుండి లెబనాన్‌ను వేరుచేయుచున్నది. దేశమున నదులు ఏవియును లేవు. పర్వత భూములందు, 1200-1500 మీ. ఎత్తున కననగు ఊట బావుల నీటివలన, వ్యవసాయమును కొనసాగింప వీలగుచున్నది.

**2. శీతోష్ణస్థితి** మొ.: దేశము చిన్నదియేయైనను, ఇందలి వివిధ ప్రాంతములందు వేర్వేరు తీరుల శీతోష్ణ పరిస్థితులు కాననగును. మధ్యధరా ప్రాంతము సమశీతోష్ణతకు పేరొందినది; ఇచ్చట అత్యధికోష్ణత 81.5° ఫా; అత్యల్పోష్ణత 55.6° ఫా; లెబనాన్ పర్వతశ్రేణియందు శీతకాలము దుర్భరముగ ఉండి, పర్వత శిఖరములు మంచు గడ్డతో కప్పివేయబడును, బికాలోయలో ఎండకాలమున విపరీతపు ఎండలును, చలికాలమున ఎక్కువ చలియు ఉండును. వర్షపాతమునను ఈ విభేదములే కననగును. తీరభూమిన సాలుసరి వర్షపాతము 75 నుండి 100 సెం. మీ. వరకు ఉండును; పర్వతశ్రేణియందు 125 సెం. మీ. ను అందుకొనును. బికా లోయయందు 87.5 సెం. మీ. ను మించి వర్షపాతముండదు. ఎండకాలమున సముద్రతీరమున విపరీతముగ చెమటపట్టును; గాలిలోని ఎక్కువ చెమ్మదనమే ఇందులకు కారణము. కొండలపై దేవదారుచెట్లు, ఓకు చెట్లు మొదలగు పెద్ద వృక్షములును, తీరభూమియందు ఆలివ్,

అత్తి మొదలగు సామాన్య వృక్షములును కననగును, వన్య మృగజాతి అంతరించినదనియే చెప్పవచ్చును. కొండలోయలలో అటనట నక్కలును, తోడేళ్లను అల్ప సంఖ్యలలో వసించుచున్నవి.

**3. జనసంఖ్యా మొ.:** 1932 మొదలుగ దేశమున జనాభా లెక్కలు సేకరింపబడలేదు. 1972 అంచనాలను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య 26 లక్షలు; దేశమందలి నగరములలో బీరూట్ (జ. సం. 8 లక్షలు), ట్రిపోలీ (జ. సం. 150 వేలు) పేర్కొనదగినవి. దేశము ప్రాక్పశ్చిమ ముల కూడలిలో ఉన్నందున ఇందు వివిధ జాతులును, రూపరేఖలలో కలగలుపు చెందినవి. పశ్చిమాసియాయందలి వివిధ జాతులకును ఇందు ప్రాతినిధ్యము కలదని చెప్పవచ్చును. దేశపు జన సంఖ్యలో క్రైస్తవులు 53% ఉన్నటుల అంచనా; దాదాపుగ తక్కిన వారందరును ముస్లిములు. కాని క్రైస్తవులందును, ముస్లిములందును పెక్కు సంప్రదాయములవారు కలరు. ఈ సంప్రదాయ ముల పద్ధతిలో లెక్కించినపుడు 30% మరొనైట్ క్రైస్తవులు, 20% సున్నీ ముస్లిములు, 19% షియా ముస్లిములు. తక్కిన వేర్వేరు క్రైస్తవ, ముస్లిం సంప్రదాయములలో ఏదియు 11% ను మించదు. దేశభాష అరబ్బీ; అయినను 6% ప్రజలు ఆర్మీనియన్ భాషను మాటాడువారు కలరు. ద్వితీయ భాషగ ఫ్రెంచికి ప్రాముఖ్యము ఉన్నను, కొలది సంవత్సరములనుండి ఇంగ్లీషునకు వ్యాప్తి ఎక్కువగు చున్నది.

**4. సమాచార సా.:** దేశమున సువ్యవస్థితమగు తంతి, తపాలా వసతియు, దేశమునందలి అన్ని ముఖ్య కేంద్రముల మధ్యను సరాసరి టెలిఫోను సౌకర్యమును కలదు. బీరూట్‌నుండి ఫ్రాన్సులోని మార్సెయిల్స్‌కు కేబిల్ సదుపాయము ఉన్నది. 1970 లో ఉపగ్రహమూలక వార్తా సౌకర్యమును కల్పించు స్థావరము నెలకొల్పబడినది. దీని ద్వారా ప్రపంచమునందలి అన్ని ప్రాంతములతో లెబనాన్ వార్తా సౌకర్యమును సంపాదించినది.

**5. యాన సౌ.:** దేశమున, అత్యున్నత స్థాయికి చెంది, 570 కిమీ. నిడివిగల అంతర్జాతీయ మహాపథములు (హైవేస్) ను, 1,420 కిమీ. పొడవున పెద్దరోడ్లును, 4,310 కిమీ. పొడవున చిన్నరోడ్లును కలవు. ఇవి అన్నియు తారువేసినవే. అంతర్జాతీయ మహాపథములు యూరపునుండి అరబ్ రాజ్యములకు నేల మార్గమున పోవువారికి బాగుగ ఉపకరించుచున్నవి. దేశమున మోటారు వాహన ముల సంఖ్యను లెక్కింపగ, 16 మంది ప్రజలకు ఒక మోటారువాహనము ఉన్నటుల తెలియనైనది. బీరూట్‌నుండి, సిరియాలోని డెమాస్కస్‌కుపోవు నేరోగేజి రైలుమార్గమును, బీరూట్ త్రిపోలీల మధ్య ప్రామాణికగేజిన వేరొక రైలుమార్గమును, ట్రిపోలీనుండి సిరియాలోని హోమ్స్, అలెప్పోలకు పయనించు మరియొక ప్రామాణికగేజి రైలుమార్గ మును 668 కిమీ. పొడవున ఈ దేశమున కలవు. బీరూట్ పేరొందిన రేవునగరము; ట్రిపోలీ, సైదా, జూనియాలలో కూడ చిన్న హార్బరులు కలవు. అంతర్జాతీయ విమానమార్గమునందు కీలక స్థానమున బీరూట్‌లోని విమానాశ్రయము ఉన్నది. ట్రిపోలీ, రయాక్‌లలో కూడ చిన్న విమానాశ్రయములు కలవు.

**6. చరిత్ర:** సిరియాయును, లెబనాన్ దేశ మును క్రీ. పూ. 1200-1000 వరకు, ఫినీషియనుల మాతృభూములందు భాగములుగ ఉండి, వారి వర్తక వ్యాపార వైభవములకు నెలవులై వర్ధిల్లినవి. క్రీ. పూ. 1 వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగమై, క్రీ. శ. 7 వ శతాబ్దివరకు ఆ విధముగనే మనినది. ఆ కాలమున ఇట క్రైస్తవమతము తావు కల్పించు

కొనినవి. క్రీ. శ. 7 వ శతాబ్దిలో అరబ్బులు ఈ ప్రాంతమును జయించి ఇస్లామునకు స్థానమును కల్పించిరి. కాని దుర్గమయములగు లెబనాన్ పర్వతశ్రేణిని ఆశ్రయించి, క్రైస్తవ జనసంఘము తన మనుగడను సాగింపగలుగుటవలన, క్రైస్తవుల ప్రాముఖ్యము అట అంతరింపక నిలిచినది మత యుద్ధముల (క్రూసేడులు) కాలముననుు, మంగోలుల దండయాత్రల కాలముననుు ఈ ప్రాంతము సంక్షోభితమై, వర్తక వ్యాపారములు అంతరించుట వలన పేదవడినది. క్రీ. శ. 16 వ శతాబ్దిలో ఈ ప్రాంతమును అంతటిని తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ తుర్కీపాలకులు చేసికొనుటతో, ఇట పరిస్థితులు కొంత కుదుటపడినవి. తమ పన్నులు తమకు చెల్లించుచు, కల్లోలములను కలిగింపకుండ ఉన్నయెడల ప్రజల మత విశ్వాసములతో జోక్యము వహింపకుండుటను, తుర్కీపాలకులగు ఓటోమన్ సామ్రాట్టులు సామాన్యముగ పాటించుచుండిరి. అందువలన లెబనాన్ పర్వత ప్రాంతమున, ఒక ఆంతరంగిక స్వయంపాలనా ప్రతిపత్తిగల, ఏకీకృత క్రైస్తవ రాష్ట్రమును సృజించుటకు అచటి కొందరు ప్రముఖులు కృషి చేసిరి. వీరిలో 16 వ శతాబ్దివారగు మాన్ వంశికులును, 17 వ శతాబ్దివారగు షిహాబ్ వంశీయులును ప్రముఖులు. కాని మధ్యధరా సముద్రప్రాంతమున 19 వ శతాబ్ది మధ్యభాగమున బ్రిటన్, ఫ్రాన్సులు అవలంబించిన విధానమువలన లెబనాన్ వ్యవహారములందు యూరపియనులు జోక్యము వహించుట సంభవించినది. అంతట ముస్లిం-క్రైస్తవ సంఘముల మధ్య వైషమ్యములు చెలరేగినవి; ఆ అదనున యూరపియన్ రాజ్యముల జోక్యపు ఫలితముగ లెబనాన్ పర్వతమండలమును ఒక క్రైస్తవ గవర్నరు ద్వారా పాలించుటకు తుర్కీ ప్రభుత్వము అంగీకరించినది (1864). ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున, తుర్కీ సామ్రాజ్య మంతరింపగ సిరియా రాష్ట్రము ఫ్రెంచివారికి మాండేటరీ ప్రాంతముగ దక్కినది. అప్పటి ఆ రాష్ట్రమున ఒక భాగముగ ఉన్న లెబనాన్ పర్వతమండలమునకు ప్రక్కనున్న ముస్లిం ప్రాంతమును కూడ చేర్చి ఫ్రెంచివారు ప్రస్తుతపు లెబనాన్‌ను నిర్మించి పాలించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున 1946 లో ఈ ప్రాంతము స్వాతంత్ర్యతను ఆర్జించినది. 1952 మొదలుగ యు. స్టే. మొదలగు పశ్చిమ రాజ్యముల ఆర్థిక, సాంకేతిక సాహాయ్యముతో ఈ దేశము పురోగమించి, పశ్చిమాసియాయందెల్ల కల్లోలమెరుగని రాజ్యముగ పేరుగాంచినదికాని పాలస్తీనా సమస్య ఈ దేశమున 1976 మొదలుగ అశాంతికి కారణభూతమైనది. ఇస్రాయెల్ నుండి నిర్వాసితులగు అరబ్బులు పలువురు లెబనాన్‌న చేరి, కాందిశీకులుగ స్థానమును ఆర్జించి, దేశపు రాజకీయములపై పలుకుబడిని సంపాదించిరి. వీరికి దేశమందలి లెబనీయ జాతీయోద్యమ వామపక్షపు వారి సానుభూతి కలదు. వీరు ఇస్రాయెల్‌తో సాగించు పోరాటమున లెబనాన్‌ను కేంద్రముగ చేయ తలపెట్టిరి. దీనిని దక్షిణ పక్షములును, దేశపు ప్రభుత్వమును నిరోధించగ అంతఃకల్లోలములు మొదలైనవి. ఈ పరిస్థితులలో, దక్షిణ పక్షములయెడ సానుభూతి వహించి సిరియా ప్రభుత్వము తన సేనలను దేశమున దింపి వామ పక్షముల ఉద్ధృతిని అడచినది. ఈ విధముగ దేశమున ప్రస్తుతమున (అక్టోబరు, 1976) అస్తవ్యస్త పరిస్థితి ఏర్పడి శాంతి అంతరించినది.

**7. పరిపాలన :** ఈ దేశమున అమలునందున్నది గణరాజ్య ప్రభుత్వము. 1926 లో ఫ్రెంచివారి వలన రూపొందింపబడి, తదనంతరమున కాలానుగుణముగ 1927, 1929, 1943 లలో సవరింపులను పొందిన రాజ్యాంగవిధానమును అనుసరించి పరిపాలన, నిర్వహింపబడుచున్నది. మత, అభిప్రాయ వాక్స్వాతంత్ర్యములును, సమానస్వత్వ

ములను ప్రజలకు కలవు. దేశపు పరిస్థితులను అనుసరించి శాసనసభా నిర్మాణము మత ప్రాతిపదికపై రూపొందినది. శాసనసభలోని 99 స్థానములలో 54 స్థానములు క్రైస్తవులకును, 45 స్థానములు ముస్లిములకును ప్రత్యేకింపబడినవి, నాలుగేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికవలన, రహస్య వోటింగు పద్ధతిలో, ఈ ప్రతినిధులు ఎన్నుకొనబడుదురు. స్త్రీ పురుష విభేదము లేకుండ, 21 ఏండ్ల వయసునకు తగ్గని, ప్రతి పౌరునికి వోటుహక్కు కలదు. దేశాధ్యక్షుని శాసనసభా సభ్యులు ఎన్నుకొనెదరు. అతని పదవీకాలము ఆరేండ్లు. ఒకసారి ఎన్నికైనవాడు, మరల రెండవ పర్యాయము వెనువెంటనే అధ్యక్షుడుగ ఎన్నిక కాగూడదు. రాజ్యాంగ విధానమున స్పష్టముగ లేకున్నను, అధ్యక్షుడు మరొనైట్ శాఖకు చెందిన క్రైస్తవుడుగను, ప్రధాన మంత్రి సున్నీ ముస్లిముగను, శాసన సభాధ్యక్షుడు షియా ముస్లిముగను ఉండవలయునను సంప్రదాయము ఫ్రెంచివారి పరిపాలనా కాలమున ఏర్పడి నేటికిని పాటింపబడుచున్నది. అధ్యక్షుడే ప్రధానిని, మంత్రులను నియమించును. వీరు శాసనసభా సభ్యులై ఉండనవసరములేదు; కాని శాసనసభకు బాధ్యతవహించి నడచుకొనుచు, అందలి చర్చలలో పాల్గొనెదరు. దేశమునందలి అయిదు రాష్ట్రములలోను స్థానిక పరిపాలన అధికారులద్వారా నిర్వహింపబడుచున్నది. స్థానిక పరిపాలనా సంఘములలో, బీరూట్‌లోని పురపాలక సంఘమునకుతప్ప, తక్కినవానికి అధికారములు నామమాత్రముగ కలవు. పెండ్లి, చావు, వారసత్వము మొదలగు వ్యక్తిగత వివాదముల పరిష్కరణకు ఆ యా సంప్రదాయములకు చెందిన మత న్యాయస్థానములు కలవు; తక్కిన పౌర, దండ వ్యవహార పరిష్కరణకు స్థాయీ భేదములతో ఏర్పాటైన న్యాయస్థాన శ్రేణి కలదు.

**8. దేశరక్షణ :** భూతలసేనయందు 13,000 మందియు, నావిక సేనయందు 250 మందియు, వైమానిక దళమున 1,000 మందియు సైనికులు కలరు సైనికసేవ ప్రస్తుతమున ఐచ్ఛికము; అయినను దానిని నిర్బంధసేవగ మార్చు ప్రతిపాదన ఆలోచనలో ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు సంస్థాపనా సభ్యులలో లెబనాన్ ఒకటి; తదనుబంధ సంస్థలందును పెక్కింట దీనికి సభ్యత్వము కలదు. ఐ. రా. స. కాందిశీక సహాయ సంఘపు కార్యాలయము బీరూట్‌న కలదు. శాంతియుత సామరస్య ధోరణిలో సంప్రతింపుల మూలమున అంతర్జాతీయ సమస్యల పరిష్కారమునకు కృషిచేయుట ఈ దేశపు వైదేశిక నీతి. ఇజ్రాయెల్ సంస్థాపనవలన సర్వస్వమును కోల్పోయిన పాలస్తీనా కాందిశీకుల సమస్యను సానుభూతితో సహేతుకముగ పరిష్కరించినపుడే పశ్చిమాసియాలో శాంతి నెలకొనగలదని ఈ దేశ ప్రభుత్వపు ఆశయము. కాందిశీకులయెడ ఈ దేశము వహించిన సానుభూతివలన పలుమారులు ఇజ్రాయెల్‌నుండి వైమానిక దాడులకు సరిహద్దు ప్రాంతము గురియగుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశ సంపత్తికి ముఖ్యాధారము వ్యాపారము; తరువాత పరిశ్రమలును, వ్యవసాయమును క్రమముగ లెక్కకు వచ్చును. దేశపు ఆదాయమున 32.1% వ్యాపారము వలనను, పరిశ్రమలవలన 14.8%, వ్యవసాయమువలన 12% లభించుచున్నది (1968). దేశమున నాలుగవవంతు భూమి సేద్యమున ఉన్నది. దేశ ప్రజలలో దాదాపు 60% వ్యవసాయమును ఆశ్రయించియే జీవించుచున్నారు. నీటి పారుదల వసతులుకల తీరభూములందును, పర్వత భూములందును, నారింజ, ఆపిల్, నిమ్మ, ద్రాక్ష ఫలములు విరివిగ పండుచున్నవి. చక్కెరబీటు దుంపయు ఇచట పండింపబడుచున్నది; ఆహార

ధాన్యములలో గోధుమ, బార్లీ ప్రముఖములు; రొక్కపు పంటలలో పొగాకు గణనీయము. కాని ఆహార ధాన్యముల విషయమున దాదాపు 60% వరకు ఈ దేశము విదేశములపై ఆధారపడి ఉన్నది. పండ్లు మాత్రము విరివిగ యూరపీయ దేశములకును, అరబ్ దేశములకును ఎగుమతి అగుచున్నవి. పశుసంపద చాల తక్కువ; దాని అభివృద్ధికై కృషి జరుగుచున్నది. మాంసాహార మున దాదాపు 58% నకు దేశము విదేశములపై ఆధారపడి ఉన్నది. దేశపు ఎగుమతి-దిగుమతి వ్యాపారమున లెక్కలను అనుసరించి, లోటే ఎక్కువ కన్పట్టును; కాని ఈ లోటును దేశము 'కనబడని' ఆదాయ మార్గములవలన పూరించు చున్నది. విదేశములందు, ముఖ్యముగ యు.స్టే. లో, నివసించు లెబనీజ్ పౌరులవలన దేశమునకువచ్చి ప్రతి ఏటా చేరు రాబడి, ఈ 'కనబడని' ఆదాయము లలో ఒకటి. ఇక రెండవది స్వేచ్ఛా విపణి సౌక ర్యము. బీరూట్‌న ఈ సౌకర్యము కలదు. అందు వలన విదేశములనుండి పెట్టుబడులు విపరీతముగ దేశమునకుచేరి దేశ సంపత్తికి సహాయపడుచున్నవి. ఇవియునుగాక కువాయిట్, యు. స్టే., ప్రపంచ బ్యాంకులనుండి ఈ దేశము ఆర్థిక సహాయమును పొందుచున్నది. దేశమున తలసరి ఆదాయము 570 డాలర్లు. దేశమున విద్యుదుత్పత్తి సమర్థత 4,22,100 కివా. దేశపు బడ్జెటరీ వ్యయము 107.7 కోట్ల లి. లి.

**11. సాంఘిక రంగము :** దేశమున అక్ష రాస్యత 80%. 1970 లో పాఠశాలలందు చదువు చున్న విద్యార్థుల సంఖ్య 6,80,000; అనగా ప్రజ లలో 25% పాఠశాలలలో ఉన్నటుల తేలుచున్నది. ఉన్నతవిద్యను బోధించు సంస్థలు ఏడు కలవు; వీనియందు 32,000 విద్యార్థులు పఠించుచున్నారు. లెబనీజ్ విశ్వవిద్యాలయము, అరబ్ విశ్వవిద్యాల యము, అమెరికన్ విశ్వవిద్యాలయము, సెయింట్ జోసెఫ్ విశ్వవిద్యాలయము అనునవి బీరూటునందు కలవు; హానిక్‌న సెం. ఎస్ప్రిట్ డి కాస్లిక్ విశ్వ విద్యాలయము కలదు. వీని అన్నింటికలసి దాదాపు 44,000 మంది విద్యార్థులు పఠించుచున్నారు. దేశ మున 31 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. ఇవి అన్నియు బీరూట్‌నుండియే ప్రచురింపబడుచున్నవి. ఇందు ఒకటి ఇంగ్లీషునను, రెండు ఫ్రెంచి భాష లోను, ఒకటి ఆర్మీనియన్ భాషలోను, తక్కినవి అరబ్బీలోను ముద్రితములు. దేశమున 15 సుప్ర సిద్ధ గ్రంథాలయములు కలవు; ఇందు అధిక భాగము బీరూటునందే ఉన్నవి. ఫోన్‌చారాలోఉన్న ప్రాచీన గ్రంథాలయము 1696 లో సంస్థాపితము; ఇందు 1,57,000 సంపుటములు కలవు. బీరూట్ లోని జాతీయ, పురావస్తు మ్యూజియమును, అమె రికన్ విశ్వవిద్యాలయ మ్యూజియమును చాల విలువ గల పురావస్తువులను సేకరింపగలిగినవి. దేశమున 7,649 శయ్యలుగల వైద్యశాలలును, 1,430 మంది వైద్యులును కలరు 1963 న జాతీయ భద్రతానిధి నెలకొల్పబడినది. ప్రతి పౌరునికి అనారోగ్య సమయమునను, ప్రమాదముల సమయ మునను, ద్రవ్య సహాయ నష్టపరిహారములను సమ కూర్చుట ఈ నిధియొక్క ధ్యేయము.

**12. యాత్రా సౌ. :** లెబనాన్ దేశము తన జాతీయాదాయమున 9 5% ను యాత్రికులవలన సేకరించుచున్నది (1968). యాత్రికులకు దేశ మున పెక్కు సౌకర్యములను సమకూర్చుటలో ప్రభుత్వము శ్రద్ధ వహించుచున్నది. అరబ్ దేశ ములవారికి తప్ప తక్కినవారికి ప్రవేశపు వీసాలు కావలెను; మూడు నెలలకుమించి దేశమున వసించు వారు మాత్రమే నిర్గమనపు వీసాలను పొందవలెను.

**13. ప్రముఖ పౌరులు :** లెబనాన్ దేశవాసి యగు ఖలీల్ జిబ్రాన్ (జెబ్రాన్ 1883-1931) చిత్రకారుడుగను, కవిగను లోకప్రసిద్ధిని ఆర్జించెను.

---

# 31. వియెత్నామ్

**ముఖ్యనగరము :** హనోయ్; **జెండా :** ఎర్రని భూమికపై మధ్యన బంగారురంగున పంచ కోణపు నక్షత్రము కలది; **జాతీయ గీతము :**




పటము 31.

తీన్ క్వాన్ చా (పదండి ముందుకు యోధుల్లారా...) అను చరణముతో మొదలగునది; **నాణెము :** దోంగ్; 1 దోంగ్ = రు. 2.12; **కొలతతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆసియా భూభాగపు ఆగ్నేయ ప్రాంతమున, 23°0′ – 8°30′ ఉ అక్షాంశ రేఖలకును, 102°15′ – 109°30′ తూ. తులారేఖలకును, మధ్యనఉన్న ఈ దేశమునకు తూర్పున, దక్షిణమున దక్షిణ చీనా సముద్రము; పశ్చిమమున లావోస్, కాంబోడియా; ఉత్తరమున చీనా సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 3,29,012 చ. కిమీ. దేశమున ఉత్తర భాగమున, తాంకిన్ రాష్ట్రమునందలి ఎర్రనది డెల్టాయందు ఉత్తర దేశపు ప్రజానీకమున అత్యధిక భాగము వసించు చున్నారు; ఈ డెల్టాలో అధిక ప్రాంతము భూమి సముద్ర మట్టమునకు 3.04 మీ. ఎత్తున మాత్రమే ఉన్నది. ఒకే ఒక పర్వతశ్రేణి, 'అన్నామీ కార్డిలేరా' అని వ్యవహరింపబడునది దేశపు పశ్చిమ సరిహద్దును అనుకొని ఉన్నది. దానిని ఆశ్రయించి తూర్పున అగ్నిపర్వతావశేషములగు కొండలును, పీఠభూము లును కలవు. ఈ పీఠభూములు గుల్లరాతితోను, సున్నపురాతితోను కప్పబడి ఉన్నవి; ఇట్టి ప్రాంత ములు తాంకిన్ రాష్ట్రమున అధికముగ కలవు. దేశపు నైరృతి ప్రాంతము మీకాంగ్ మహానదికి చెందిన డెల్టా. ఇది అత్యంత సారవంతము. దక్షిణ దేశమున అత్యధిక సంఖ్యాకులు ఇట వసించు చున్నారు. ఈ డెల్టాకే కొచ్చిన్ - చీనా అనియు పేరు కలదు. ప్రపంచమున వరి పైరునకు ప్రసిద్ధి చెందిన ప్రాంతములలో ఇది ఒకటి. ఈ డెల్టాకు ఉత్తరమునఉన్న వైకో–సైగాన్ డెల్టాయు, దేశ మధ్యపు 'అన్నామ్'న తూర్పు తీరప్రాంతమును కూడ సారవంత భూములుగ పేరొందినవి.

**2 శీతోష్ణస్థితి మొ.:** ముఖ్యనగరమగు హనోయ్‌లో జూన్ నెలన సరాసరి ఉష్ణోగ్రత 82° ఫా; జనవరిలో ఆ ఉష్ణోగ్రత 63° ఫా; శీతకాలపు మధ్యలో ఆ ఉష్ణోగ్రత 43° ఫా. వరకు పడిపోవును. దక్షిణ దేశమున సైగాన్‌న ఉష్ణోగ్రత 64° నుండి 92° వరకు పోవుచుండును. ఏప్రిల్ మధ్యనుండి అక్టోబరు మధ్య వరకు వానలు కురియును. హనోయిలో సరాసరిన సాలుసరి వర్షపాతము 170 సెం మీ పశ్చిమపు పర్వత శ్రేణిలో సాలున వర్షపాతము 400 సెం. మీ. మధ్య దేశమున హుయీ నగరమున 290 సెం. మీ, సైగాన్‌లో 180 సెం. మీ. వర్షపాతము కలదు. జులై మొదలు కొని నవంబరు అంతమువరకు, అంతటంతట తుపానుల బెడద తీవ్రముగ ఉండును. ఉత్తర, పశ్చిమ ఉన్నత ప్రాంతములందు నిత్య శ్యామలపు అడవులు కలవు. తీరమును ఆనుకొని చెట్లపొదలు అధికముగ కన్పట్టును. కొచ్చిన్ చీనా ప్రాంతమున గరికపట్టులు కలవు. అడవులందు, ఏనుగులు, పులులు, చిరుత పులులు, లేళ్లు, అడవి ఎద్దులు, కారెనుములును తక్కిన కొన్ని అల్పజంతువులును కననగును. పక్షి జాతులును, క్రిమి జాతులును, పెక్కు విధములవి ఉన్నవి. తీరప్రాంతముననను, దేశాంతస్థ జలాశయములందును వివిధ మత్స్య జాతులు కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1970 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 383 లక్షలు; సాలుసరి జనవృద్ధి 3.4%; సరాసరి జనసాంద్రత చ. కిమీ. కు 125. నగరములలో హనోయ్ (జ. సం. 644 వేలు); హైఫాంగ్ (369 వేలు), హుయీ (210 వేలు), సైగాన్ (1764 వేలు), దానాంగ్ (428 వేలు) ప్రముఖములు. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు (18.1%) చీనీయ-తాయి జాతుల సమ్మిశ్రణ జాతికి చెందినవారు; వీరుగాక మలయో-పోలినిసియన్ జాతులు మొదలయవానికి చెందిన పర్వత జాతులవారు కలరు: అల్పసంఖ్యాకులకు చీనీయులును కొందరు కలరు. పాకిస్తానీలును, భారతీయులును అత్యల్ప సంఖ్యలలో కలరు. దేశీయులలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష వియెత్నామీయ భాష. ఇది తాయి, ఖ్మేరు భాషలను పోలినది; ఇందలి పదజాలమున దాదాపు మూడవవంతు చీనీయ భాషకు చెందినది. తొలుత ఇది చీనీయ లిపిలోనే వ్రాయబడుచుండెను, ప్రస్తుతమున రోమన్ లిపిలోనే వ్రాయబడుచున్నది. చీనీయులు తమ తమ మాతృభాషా, లిపులనే అనుసరించుచున్నారు. పర్వత జాతులవారును వేర్వేరుగ మాతృభాషలను, లిపులను కలిగిఉన్నారు. దేశీయులందు కన్‌ఫ్యూషియన్, తావో, బౌద్ధమత సంప్రదాయములు కలగాపులగముగా ఆదరింపబడుచున్నవి. పర్వత జాతులలో ప్రకృతి దేవతారాధన వ్యాప్తియందున్నది. క్రైస్తవులు కొలదిగ కలరు. కాని దేశమున కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడిన తరువాత, మతమునకు ప్రజలందు ఆదరణ నానాట సన్నగిలుచున్నది.

**4. సమాచార సౌ.:** తంతి, తపాలా, టెలిఫోన్ సౌకర్యములు ప్రభుత్వాధీనమున ఉండి పని చేయుచున్నవి. చీనాతో పైవానిద్వారా 1955 నుండి ఈ దేశమునకు సంబంధము కలదు. తక్కిన దేశములతో చాలవరకు, చీనా ద్వారానే, ఈ దేశమునకు వార్తా సౌకర్యము కలదు. హనోయ్, సైగాన్‌లలో అతి సమర్థమగు రేడియో ప్రసార కేంద్రములు కలవు. రేడియో టెలిఫోనుద్వారా పారిస్, సాన్ ఫ్రాన్సిస్కోలకు వార్తా సౌకర్యము కలదు.

**5. యాన సౌ.:** దేశమున 33,527 కిమీ. పొడవుగల రోడ్లు కలవు (1965). ఇందు అత్యధిక భాగము ఎండకాలమున మాత్రమే రాకపోకలకు అనుకూలించునది 1946-54 యుద్ధమువలన నష్టపడిన వంతెనలు మొదలగువానిని, చీనా దేశము

నుండి లభించిన సహాయమువలన, ప్రభుత్వము త్వరలోనే బాగుచేయగలిగెనది. రైలుమార్గముల నిడివి 780 కిమీ. (1969); 1965-68 కాలమున యు. స్టే. ప్రభుత్వపు విమానముల దాడులవలన రైలుమార్గములు నష్టపడినను, అవి 1968 తరువాత బాగుచేయబడినవి. జలమార్గములద్వారా రాకపోకలు విరివిగ సాగుచున్నవి. దేశపు ఎగుమతి దిగుమతులలో 90 ఈ మార్గములో నడుచుచున్నవి. ఇట్టి నీటిదారుల సామాన్యపు నిడివి 5,292 కిమీ; నిండు ప్రవాహముల కాలమున 5,592 కిమీ. వరకు చిన్న నౌకలు పయనింపగలవు. నీటిదారులవలన సరకుల రాకపోకలు చాలవరకు జరుగుచున్నవి. సముద్రపు రేవులలో ముఖ్యమైనవి సైగాన్, దానాంగ్, హైఫాంగ్. 10 వేల టన్నేజికల నౌకలు హైఫాంగ్ రేవును సులభముగ చేరగలవు. సాధారణముగ పోలండ్ దేశమునకు చెందిన నౌకలద్వారా మాత్రమే వ్యాపారము సాగుచున్నది.

**6. చరిత్ర :** క్రీస్తు పూర్వము 4 వ శతాబ్దిలో, చీనాదేశపు దక్షిణ భాగమునందు ఉండిన 'వియెత్' జాతివారు, తమ పొరుగుజాతులవలన తరుమబడి ఈ దేశముచేరి, ఇచటి ఆదిమవాసులతో మేళనమందుటవలన వియెత్‌నామీయ జాతి రూపొందినది. క్రీ. పూ. 111 లో చీనీయ సామ్రాట్టు ఈ ప్రాంతమును జయించి తన దేశమున ఒక రాష్ట్రముగ చేసెను. దాదాపు వేయి సంవత్సరముల కాలము, ఇటుల చీనీయుల వశమున ఉండి, కడకు ఈ దేశము క్రీ. శ. 939 లో స్వతంత్రతను పొందినది. అంతట దేశీయ పాలకులు దేశపు ఎల్లలను విస్తరింపజేయ యత్నములు చేసిరి. ఆ కాలమున దక్షిణ వియెత్‌నామ్ దేశము 'చంపా' దేశము అను పేరన, భారతీయ సంస్కృతిని అవలంబించిన ఒక రాజవంశపు పాలనలో ఉండెను. వియెత్‌నామ్ పాలకులు ఆ చంపా రాజ్యమును అంతమొందించి దానిని వియెత్‌నామ్‌న భాగముగ చేయగలిగిరి. కాని రాజవంశమున చెలరేగిన అంతఃకలహములవలన దేశము పలుమారులు అల్పరాజ్యములుగ విభక్తమగుట సామాన్యముగ జరుగుచుండెను.

16 వ శతాబ్దిలో ఈ దేశముతో పాశ్చాత్యులకు పరిచయము లభించినది. తరువాత, రాజవంశమున అంతఃకలహములు చెలరేగిన కాలమున, దక్షిణ దేశమును పాలించు ఒక రాజవంశికుడు ఫ్రెంచివారి సాయమును పొంది, తద్ద్వారా రాజ్యమునంతటిని కైవసము చేసికొనెను (1786). ఇందువలన క్రమముగ ఫ్రెంచివారి రక్షిత రాజ్యముగ దేశము పరిణమించి, రాజు నామమాత్రపు పాలకుడయ్యెను (1883). లావోస్, కాంబోడియాలలో అదివరకే తాము అధిపత్యమును స్థాపించినందువలన ఈ విధముగ మొత్తం ఇండో-చీనీయ ద్వీపకల్పమును ఫ్రెంచివారు వశపరచుకొని తమ వలస పాలనను నెలకొల్పి, దేశసంపదను కొల్లగొట్టిరి. ప్రజలు సాగించిన ప్రతిఘటనను వారు దమననీతితో అడచివేసిరి.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, ఫ్రాన్సు దేశము శక్తిని కోల్పోయిన సమయమున, ఫ్రెంచి పాలకులను త్రోసిరాజని, జపాను సేనలు ఇట కాలూని, ఆధిపత్యమును వహించి (1940), బావోడాయ్ అను రాజవంశికుని దేశపు నామమాత్రపు పాలకునిగచేసి, పరిపాలనను నిర్వహించినవి. 1945 లో జపాను సేనలు ఓడిపోయిన తరువాత, అంతకు పూర్వముననే హోచిమిన్ అను నాయకుని ఆధ్వర్యమున సుసంఘటితములైన కమ్యూనిస్ట్ సేనలు, బావోడాయ్‌ని తొలగించి అధికారమును వశపరచుకొనినవి. బావోడాయిని మరల సింహాసనమున ఉంచుటకై ఫ్రెంచి ప్రభుత్వము తన సేనల సాయమున చేసిన ప్రయత్నము విఫలమై 1954 లో ఒక సంధి కుదిరినది. జెనీవా

ఒడంబడిక అనబడు ఈ సంధివలన వియెత్‌నామ్ దేశము, ఉత్తర దక్షిణ దేశములుగ 17వ అక్షాంశను అనుసరించి తాత్కాలికముగ విభక్తమగుటకును, ఉత్తర వియెత్నామ్‌న హోచిమిను నాయకత్వపు ప్రభుత్వమును, దక్షిణ వియెత్‌నామ్‌న ఫ్రెంచివారికి అనుకూలమగు దేశీయ ప్రభుత్వము, సైగాన్ నగరము రాజధానిగ వ్యవహరించుచు, ఉండునటులను నిర్ణయములు జరిగినవి. ఆ తరువాత జరుగగల ఎన్నికలవలన దేశమున ఏకీకృత ప్రభుత్వము ఏర్పడవలయునను ఏర్పాటును జరిగినది. ఈ ఏర్పాటువలన ఇటుల రెండు దేశములు రూపొందినను, తరువాతి పరిణామముల ఫలితముగ అట్టి ఎన్నికలు జరుగలేదు.

జెనీవా ఒడంబడిక తరువాత లావోస్, దక్షిణ వియెత్‌నామ్‌లలోని కమ్యూనిస్టుపార్టీ యోధులకు ఉత్తర వియెత్‌నామ్ సహాయము చేయుచు, తన దేశ పునర్నిర్మాణమును కొనసాగించినది. దక్షిణ వియెత్నాంలోని వియెత్‌కాంగ్ (కమ్యూనిస్ట్) సేనలకు ఉత్తర వియెత్‌నామ్ చేయు సాయమును అరికట్టుటకై అమెరికా యు. స్టే. అచట రాజకీయములలో సైనికబలముతో, దక్షిణ వియెత్‌నామ్ పక్షమున జోక్యము వహించి, కడకు ఉత్తర వియెత్‌నామ్‌పై తీవ్రముగ విమానములద్వారా బాంబులను కురిపించి (1965–68) నది. కాని సోవియెట్ రష్యా-చీనాల సాయముతో ఈ చర్యను ప్రతిఘటించి ఉత్తర వియెత్‌నామ్ నిలువగలిగినది. తుదకు ప్రపంచ ప్రజాభిప్రాయమునకును, యు. స్టే. లోని పౌరుల ఒత్తిడికిని లొంగి యు. స్టే. బాంబులను వర్షించుటను విరమించుటయేగాక, కడకు దక్షిణ వియెత్‌నామ్‌నుండి తన సేనలను అన్నింటిని తీసికొనిపోయినది (1973). తరువాతి కాలమున, దక్షిణ దేశపు విప్లవ సేనలు అతి త్వరితగతితో పురోగమించి, దేశమున అత్యధిక భాగమును వశపరచుకొని కడకు సైగాన్ నగరమును వశపరచుకొనినవి (ఏప్రిల్ 30, 1975). అంతట ఉత్తర దక్షిణ ప్రాంతములను రెండింటిని ఏకము చేయుటకు యత్నములు కొనసాగి, ఎన్నికలు జరిగి. తత్ఫలితముగ, మరల ఏకీకృత రాజ్యముగ వియెత్‌నామ్ రూపుగొన్నది.

**7. పరిపాలన :** ఏకీకృతమగు వియెత్‌నామ్‌న రాజ్యాంగ నూత్న పరిపాలనా వ్యవస్థలను ఏర్పరచుటకు ప్రాతిపదికగ ఏప్రిల్ 25, 1976 న ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుపబడి, 492 మంది ప్రతినిధులు ఎన్నుకొనబడిరి ఎన్నికలు సార్వజనిక, సమస్వత్వ, రహస్య పద్ధతిలో జరిగినవి. జాతి, మత, లింగాది విభేదములతో నిమిత్తము లేకుండా 18 ఏండ్లకు పైబడిన వియెత్‌నామీయ పౌరులందరును వోటుహక్కుతో ఈ ఎన్నికయందు పాల్గొనిరి. ప్రతి లక్షమంది ప్రజలున్న ప్రాంతమునకు ఒక ప్రతినిధి చొప్పున ఇందు ప్రతినిధుల సంఖ్య నిర్దేశితము; కాని ఆపైన ఒక ప్రాంతమున 50,000 కు తగ్గనివారు ఉండినపుడు, వారు అదనముగ ఇంకొక ప్రతినిధినికూడ ఎన్నుకొనవచ్చును. ఎన్నికకు నిలుచువాడు 21 ఏండ్లకు లోబడి ఉండకూడదు. పూర్వపు దక్షిణ వియెత్‌నామ్‌న, అమెరికన్ సేనలతో సహకరించిన ప్రముఖులు మాత్రము ప్రతినిధులుగ నిలుచుట నిషేధింపబడినది. ఇప్పటి ప్రతినిధులలో దాదాపుగ అందరును 'లావ్ దోంగ్' అనబడు కమ్యూనిస్ట్‌పార్టీకి చెందినవారలే. ఆ పార్టీని సమర్థించు రెండు అల్ప సంఖ్యాక పక్షములకు–ప్రజాస్వామిక పక్షము, సోషలిస్ట్ పక్షము అనువానికి-చెందిన ప్రతినిధులు మాత్రము చాల కొలదిగ కలరు. ఈ ప్రతినిధులకు బాధ్యత వహించిన ప్రభుత్వము ప్రస్తుతమున అధికారమును నిర్వహించుచున్నది.

**8. దేశరక్షణ :** భూతల సేనయందు 480,000 మంది, నౌకాసేనయందు 4,000 మంది,

వాయుసేనయందు 10,000 మంది యోధులు కలరు. భూతలసేనకు 400 కవచ శకటములును, 6,000 విమాన వ్యతిరేక శతఘ్నులును, ఆధునికా యుధములును కలవు; నౌకాసేనయందు టార్పెడో బోట్లు మొదలుగ వివిధ నౌకలు, 204 కలవు. వాయుసేనయందు 200 విమానములు కలవు. సోవియెట్ రష్యా సాయమువలన రక్షణ బలము సమర్థముగ రూపొందింపబడినది (1972).

**9. అంతర్జాతీయ సం. :** యు. స్టే. ప్రతి ఘటనవలన ఈ దేశమునకు ఐ. రా. స. యందు స్థానము లభించకున్నను, ఈ దేశమునకు కమ్యూనిస్ట్ రాజ్యములతోను, యు. స్టే. అదుపులోలేని తక్కిన కొన్ని రాజ్యములతోను దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ యందు ప్రస్తుతమున వరిపంట అధిక ప్రాధాన్యము వహించి ఉన్నది; ఖనిజ సంపత్తి విరివిగ కలదని పరిశోధనవలన తెలియవచ్చినది. కావున ముమ్ముందు పారిశ్రామికముగ సైతము దేశము పురోగమించుటకు అవకాశములు కలవు. వ్యవసాయమంతయు, సమష్టి క్షేత్రములద్వారా నిర్వహింపబడుచున్నది. దాదాపు 55 లక్షల హెక్టేరుల భూమి వ్యవసాయమున ఉన్నది. ఇందు అత్యధిక భాగమున (48 లక్షల హెక్టేరులలో) వరి పండింపబడుచున్నది. కొన్ని ప్రాంతములందు రెండు పంటలును, కొలది ప్రాంతములలో మూడు పంటలును సాలున పండించబడుచున్నవి 1972 మొదలుగ దేశము ఆహార విషయమున స్వయంపోషకముగ ఉన్నది; వ్యవసాయమున ఆధునిక పద్ధతులు అన్ని రంగములందును ప్రవేశపెట్టబడినది. వరి తరువాత క్రమక్రమముగ చక్కెర చెరకు, మొక్కజొన్న, చిరుగడదుంప, ప్రత్తి పేర్కొనదగినవి. పట్టు పరిశ్రమయు కొన్ని ప్రాంతములందు వ్యాప్తియందున్నది; పశు సంపత్తి ఎక్కువ. దేశమున 50% భూమియందు అడవులు కలవు; వీని కలప దేశావసరములకు సరిపోవుచున్నది. రాక్షసి బొగ్గుగనులు విరివిగ కలవు. వానిలో 34 లక్షల టన్నుల ఉత్పత్తి జరిగినది (1964); తీరప్రాంతమున కొన్ని ఖనిజములు లభించుచున్నవి. అందు బోంగ్ మియా వద్దనున్న బంగారుగనియు, నాంగ్‌సాన్ వద్దనున్న బొగ్గుగనియు పేర్కొనదగినవి. తక్కిన ఖనిజముల విషయమున కృషి ఇంకను ఎక్కువగ మొదలిడ బడలేదు. కాలిమైట్, అపటైట్ అనునవి మాత్రము కొలదిగ త్రవ్వబడుచున్నవి. వ్యవసాయిక పరిశ్రమలును. జవుళీ పరిశ్రమలును మాత్రమే పరిశ్రమలందు ముఖ్యములు. దేశీయ కార్మిక జనమున 3% మాత్రమే పరిశ్రమలలో పని చేయుచున్నారు. పారిశ్రామికోత్పత్తి చాలవరకు కుటీర పరిశ్రమలమీదనే ఆధారపడి ఉన్నది. విద్యుదుత్పత్తి 168.29 కోట్ల కివా. (1970). దేశపు విదేశీయ వ్యాపారమున 85% కమ్యూనిస్ట్ దేశములతో సాగుచున్నది. ఎగుమతుల విలువ 10 కోట్ల రుబుళ్ళు (సోవియట్ - నాణెములు); దిగుమతుల విలువ 21.7 కోట్ల రూబుళ్ళు (1965). చీనా, సోవియట్ రష్యాల వలనను, స్వీడన్‌వంటి తక్కిన కమ్యూనిస్టేతర రాజ్యముల వలననూ ఆర్థిక సహాయమును ఈ దేశము గ్రహించుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 172,51,52,000 దోంగ్‌లు; ఇందు 62.5% ఆర్థిక పునర్నిర్మాణమునకు వినియుక్తము (1962).

**11 సాంఘిక రంగము :** తక్కిన ఆగ్నేయాసియా దేశములతో పోల్చి చూచినపుడు ఇచ్చటి గృహవసతి, కొంత బాగుగనే ఉన్నదని చెప్పవచ్చును; అందును పట్టణములకంటెను పల్లెలయందు ఎక్కువని చెప్పవచ్చును. అయినను యుద్ధము, బాంబుల దాడులు ఈ వసతులకు కొంత నష్టము కల్గించినవి. దేశమున 12 ఏండ్ల వయసు

దాటిన వారిలో 65 అక్షరాస్యులుగా అంచనా (1967). 1968-69 లో 58,66,000 విద్యార్థులు సామాన్య పాఠశాలలయందును, 37,000 మంది సాంకేతిక పాఠశాలలయందును శిక్షణను పొందిరి. హానోయి విశ్వవిద్యాలయమునను, సైగాన్, హుయి, దలాత్ నగరముల విశ్వవిద్యాలయముల లోను తదితరములగు ఉన్నత విద్యా సంస్థల యందును 66,000 విద్యార్థులు కలరు (1970). 2,100 మంది దేశీయ విద్యార్థులు విదేశములలో ఉన్నత విద్యలను అభ్యసించిరి (1967). అధికార భాషగ వియెత్‌నామీజ్ కే పరిగణన ఉన్నను, చాల వరకు ఫ్రెంచియే బోధనా భాషగ ఉన్నది. హానోయ్‌లో రెండు ప్రముఖ గ్రంథాలయము లును, ఒక సుప్రసిద్ధ మ్యూజియమ్‌ను కలవు. మూడు దిన పత్రికలు ప్రచారమున యున్నవి. లావోదోంగ్ పార్టీయొక్క ముఖపత్రమగు నాన్ దాన్ (ప్రజానీకం) అను దానికి విశేషవ్యాప్తి కలదు. దేశమున వైద్యుల సంఖ్య 8,120 (1965).

**12 యాత్రా సౌ.:** దేశమున చారిత్రకా వశేషములును, ప్రకృతి రమణీయమునకు పేరొందిన ప్రదేశములును ఎక్కువగ ఉండుటవలన దేశము యాత్రికులను ఆకర్షించుచుండెడిది. కాని 1965 తరువాతి పరిస్థితులవలన విదేశీయులు దేశమున సంచరించుట ఆగిపోయినది.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1. ట్రాన్ హూంగ్ దావ్ (13 వ శతాబ్ది; చీనా సామ్రాజ్యాధిపతుడగు కుబ్లయ్‌ఖాన్ దండయాత్రను తిరుగగొట్టి దేశ స్వాతంత్ర్యమును కాపాడిన మహావీరుడు.

2. హోచి మిన్ (1890-1969) ఆధునిక వియెత్‌నామీయులలో అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జిం చినవాడు. ఇతని నిజనామము గూయెన్ అయి క్వాక్; హోచిమిన్ అనునది మారుపేరు (భాస మానుడు అని దాని అర్థము). దేశమున కమ్యూనిస్ట్ పార్టీని సుసంఘటితముచేసి, అధికారమును వశ పరుచుకుని దేశమును పునర్నిర్మించి, ప్రక్క దేశ ముల కమ్యూనిస్ట్ పార్టీలకును బలమును సమ కూర్చిన ప్రజ్ఞాశాలి.

---

# 32. శ్రీలంక

## (సింహళము, సిలోన్)

**ముఖ్యనగరము:** కొలంబో; **జెండా:** దండమువద్ద ఆకుపసిమి, కాషాయ వర్ణముల రెండు నిలువు చారలును, వానికి ప్రక్కన కుసుంభవర్ణపు దీర్ఘ చతురస్ర భూమికపై ఖడ్గధారిణియగు ఒక సింహపు చిత్తరువు పసిమిరంగున ఉండగ, మొత్తము పతాకమును, దీర్ఘ చతురస్రమును పసిమి అంచులను కలిగియుండునది; **జాతీయ గీతము:** 'శ్రీలంకా మాతా!' అను పదములతో మొదలగునది; **నాణెము:** రూపాయి (శ్రీలంక) ఇది 100 సెంటులుగ విభక్తము; ఒక (శ్రీలంక) రూపాయి = రు. 1 26; **కాలపరిగణన:** భారత దేశపు కాలగణనకు సరియగునదియే.

**1. ఉనికి మొ.:** హిందూ మహాసముద్ర మున, భారతదేశపు దక్షిణాగ్రమునకు కొలది దూర మున దక్షిణమున, తూర్పునకు మొగ్గి, సన్నని పాక్ జలసంధిచే, భారత భూమినుండి విడివడిఉన్న

ఈ ద్వీపరాజ్యము 79°42′ – 81°53′ తూ. తులా రేఖలమధ్యను (224 కిమీ.), 5°55′ – 9°50′ ఉ. అక్షాంశరేఖలమధ్యను (432 కిమీ.) విస్తరించి యున్నది. దేశ వైశాల్యము 65,610 చ. కిమీ. దేశపు దక్షిణ భాగమున మధ్యప్రాంతము హెచ్చు తగ్గుల పీఠభూమి. ఈ పీఠభూమియందు పెక్కు పర్వతశ్రేణులు కలవు. వీని శిఖరముల ఎత్తు




పటము 32.

2,100 మీ. నుండి 2,450 మీ. మధ్య ఉండును; అన్నింట పెద్దదగు పిదురుతాలగల శిఖరపు ఎత్తు 2,440 మీ. పీఠభూమికిని సముద్రమునకును మధ్య అన్నివైపులను తీరపు మైదానములు కలవు. కాని ఇందు తూర్పు, దక్షిణ పశ్చిమములందలి మైదానములు చాల సన్ననివి; ఉత్తరపు దిక్కున మైదానము మాత్రము అతి విశాలమై ముందునకు సాగి, తూర్పు పడమరల సముద్రతీరములమధ్య వ్యాపించి ఉన్నది. దేశమున ఆరింట అయిదువంతుల భూమి 300 మీ. ఎత్తునకు తగ్గియే యున్నది. పీఠభూమి నుండి నలువైపులకు నదులును, వాగులును ప్రవహించి సముద్రమును చేరుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశము ఉష్ణమండలమున ఉండుటవలన, అందులకు తగిన శీతోష్ణ పరిస్థితులే ఉండవలసియున్నను, తీరప్రాంతము లందలి ఉష్ణత, పర్వత ప్రాంతములకు పోవునప్పటికి సమశీతోష్ణముగ పరిణమించును. దేశము నందలి నైఋతి ప్రాంతము అత్యధిక వర్షపాతమునకు లోనగుచున్నది; ఇందు తీరభూమిన 185 సెం. మీ ను పర్వతభూమిన 500 సెం. మీ. ను సాలీనా సరాసరిన వర్షపాతము కలదు. తక్కిన దేశమున సాలీనా సరాసరి వర్షపాతము 40 నుండి 185 సెం. మీ. వరకు ప్రదేశములను అనుసరించి మారును. భూమధ్యరేఖకు దగ్గరగ ఉండుటవలన దేశమున గ్రీష్మ, హేమంత ఋతువులు లేవు; తక్కిన ఋతువులు మాత్రమే అనుభవవేద్యములగును. దేశమున సాలున సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా.

దక్షిణ భారతదేశమున కన్పట్టు వృక్షసంతతియు జంతు సంతతియు ఈ దేశమున కన్పట్టుటయేగాక కొన్ని క్రొత్తరకములును కన్పట్టుచున్నవి. ఏనుగులు, కారెనుములు, చిరుతపులులు లెక్కింపదగిన వన్యజంతువులు. ఏనుగుల సంఖ్య క్రమక్రమముగ తగ్గిపోవుచున్నది సంబార్ జాతికిచెందిన ఒక మృగవిశేషమును, పోలోంగొ అను ఒక సర్ప జాతియు, ఈ దేశమున మాత్రమే కన్పట్టుచున్నవి.

**3. జనసంఖ్య మొ.:** 1971 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,30,00,000 దేశపు జనసంఖ్య సాలీనా 2.7% చొప్పున పెరుగుచున్నది. జనసాంద్రత చ. కిమీ. కు 189. పారిశ్రామికముగ అభివృద్ధిచెందక అధిక జనసాంద్రత కలిగిన దేశములలో ఇది ఒకటి. దేశమునందలి ప్రజానీకమున నాలుగింట మూడువంతులు నైఋతి ప్రాంతమున వసించుచున్నారు. ఇచటి జనసాంద్రత

చ. కిమీ.కు 310. దేశపు నగరములలో కొలంబో (జ. సం. 5 63,705), జాఫ్నా (99,800); కాండీ (75,900) పేర్కొనదగినవి.

దేశ ప్రజలలో సింహళీయులు 71 ; దేశీయ తమిళులు 11%; భారతదేశీయ తమిళులు 10 ; మూరులనబడు ముస్లిములు 5% కలరు. వీరుకాక శ్వేతజాతీయుల సంతతివారు (బర్గరులు 45,900 మంది; వెడ్డలు దాదాపు 5,000 మంది ఉన్నారు. వెడ్డలు దేశపు ఆదిమవాసులు; వీరిపుడు అరణ్య ప్రాంతములందు మాత్రమే వసించుచున్నారు.

మతరీత్యా ప్రజలలో 64% కు పైబడి బౌద్ధులు, 20% హిందువులు, క్రైస్తవులు 9%, ముస్లిములు దాదాపు 7% కలరు. దేశమున ఈ మతములు దాదాపుగ ఆయా జాతులను అనుసరించి ఉన్నవని చెప్పవచ్చును. దాదాపుగ సింహళీయులు అందరును బౌద్ధులు. తమిళులలో హిందూమతము; బర్గరులలో క్రైస్తవము, మూరులందు ఇస్లాము అత్యధికముగ వ్యాప్తినంది ఉన్నవి.

అత్యధిక సంఖ్యాకుల మాతృభాష సింహళీ. దీనిని ఏకైక జాతీయభాషగ ప్రభుత్వము గుర్తించినది. కాని ఈ నిర్ణయమును నిరసించుచు, తమ మాతృభాషయగు తమిళమునకును సమాన ప్రతిపత్తిని కల్పించవలెనని తమిళ ప్రాంతములవారి ఆందోళన సాగినది. తత్ఫలితముగ తమిళ ప్రాంతములందు కొన్ని నిర్దిష్ట ప్రభుత్వ వ్యవహారములందు తమిళ భాషయు కొనసాగుటకు ఏర్పాటు జరిగినది. 'సింహళీ' అనునది సంస్కృత భాషా కుటుంబమునకు చెందినది; బౌద్ధుల మత గ్రంథముల భాషయగు 'పాళీ' కి సన్నిహితము. ఇంగ్లీషునకు దేశమున విపులవ్యాప్తి కలదు.

**4. సమాచార సౌ.:** 1969 లెక్కలను అనుసరించి దేశమున 278 తపాలాఫీసులు, 2,159 సబ్ తపాలాఫీసులు కలవు; టెలిగ్రాఫ్ ఆఫీసుల సంఖ్య 1,5[illegible]; టెలిఫోనుల సంఖ్య 64,333 (1972). కేబుల్ ద్వారా, ప్రపంచపు పలు ప్రాంతములతో టెలిగ్రాఫ్, టెలిఫోన్ సంబంధములు దేశమునకు కలవు. కొలంబోలో శక్తిమంతమగు ఒక రేడియో ప్రసార కేంద్రము పనిచేయుచున్నది. సింహళీ, తమిళ, ఇంగ్లీషులలో ఇందు ప్రసారములు నిర్వహింపబడుచున్నవి.

**5 యాన సౌ.:** దేశమున 21,00[illegible] కిమీ నిడివిగల రోడ్డు మార్గములును, 1,530 కి.మీ. నిడివిగల రైలుమార్గములును కలవు. ఆసియాలో వాణిజ్యరీత్యా పేరొందిన సుప్రసిద్ధపు రేవునగరములందు ఒకటిగా ఉన్నది కొలంబో. ప్రకృతి సిద్ధముగ ఇట ఏర్పడిన నౌకాశ్రయమునే, తగు నిర్మాణములద్వారా విస్తృతపరచుటవలన, అత్యంత విస్తృతపు హార్బరులలో ఒకటిగా పేరొందిన నౌకాశ్రయము రూపొందినది. దేశపు ఉత్పత్తి స్థావరములకు అత్యంత సన్నిహితమగు ఈ రేవునుండి దేశపు విదేశవాణిజ్యమున 90 నిర్వహింపబడుచున్నది. ఇందులకు తోడుగ ప్రకృతి సిద్ధపు రేవులు – దేశపు తీరమునఉన్న ట్రింకోమలీ, గాలే, బట్టికాలవా, కన్‌కేశనతురాయ్, జాఫ్నా, కయిట్ అనునవి వాణిజ్యమున పాల్గొనుచున్నవి.

అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించు నాలుగు విమానాశ్రయములు – కొలంబోవద్ద ఉన్న రత్మలానా, కొలంబోకు 40 కిమీ. దూరమున ఉత్తరమున ఉన్న కాతు నాయకా, జాఫ్నావద్ద కన్‌కేశనతురాయ్, అంపరాయ్ – కలవు. దేశీయమగు 'ఎర్ సిలన్' అను సంస్థయు, భారతదేశము మొదలగువానికిచెందిన విదేశీయ వైమానిక యాన సంస్థలును, ఇటనుండి ప్రయాణములను ప్రపంచమున పలుప్రాంతములకు నిర్వహించుచున్నవి.

**6. చరిత్ర :** పాక్ జలసంధిచే వేరుపడియు భారతదేశమునకు అత్యంత సమీపమున ఉన్న ఈ

దేశమునకు క్రీ. పూ. 6వ శతాబ్దిమొదలుగ వివిధ సమయములలో ఔత్తరాహ, దాక్షిణాత్య భారతీయ ప్రజలును, మత, భాషా, సాంస్కృతిక రీతులును, వచ్చిచేరుటవలన ఈ దేశపు ప్రాచీన చరిత్ర రూపు గొనినదని భావింపవచ్చును. ఈ దేశపు ప్రాచీన చరిత్రను తెలియుటకు, దేశపు ప్రాచీన నిర్మాణావశేషములేగాక, మహావంశము, దీపవంశము మొదలగు పాళీగ్రంథములును ఉపకరించుచున్నది. క్రీ. పూ. ఆరవశతాబ్దిలో ఇటకు ఉత్తర హిందూస్థానము నుండి ఆర్యజాతీయులు వచ్చిచేరిరి. క్రీ. పూ. 3వ శతాబ్దిలో అశోకుని కృషిమూలమున ఇట బౌద్ధ మతము ప్రవేశపెట్టబడి, ప్రజలచేతను, ప్రభువుల చేతను ఆదరితమయ్యెను. ఆ ప్రాచీన ఆర్య సంతతికి చెందినవారే నేటి సింహళీయులు. క్రీ.పూ. 1, 2 శతాబ్దముల ప్రాంతమునుండి ఈ దేశపు ఉత్తర ప్రాంతమునకు దక్షిణ భారతమునుండి ద్రావిడులు వలసవచ్చి, రాజ్యములను స్థాపించిరి. ఆ ద్రావిడుల సంతతికి చెందినవారే నేటి శ్రీలంక లోని దేశీయ తమిళులు. అతి దీర్ఘమగు ఈ దేశపు చరిత్రలో ఉజ్జ్వల ఘట్టములు పెక్కుకలవు. అనూరాధపుర, పోలోన్నారువ మొదలగు కేంద్రములను ఆశ్రయించి పెక్కు మహారాజ్యములు నెలకొల్పబడి నాగరికతకు నెలవులుగ వర్ధిల్లినవి.

క్రీ. శ. 1505 లో పోర్చుగీజువారు ఇట అడుగిడునప్పటికి, ఉత్తరప్రాంతమున జాఫ్నా కేంద్రముగ ఒక తమిళ రాజ్యమును, తక్కిన ప్రాంతములందు సింహళీయ ప్రభువుల స్వతంత్ర రాజ్యములును పాలనను నెరపుచుండినవి. వీనిలో 'కాండీ' అను సింహళీయ రాజ్యమును దప్ప, తక్కిన వానిని అన్నిటిని పోర్చుగీజువారు లోగొని క్రైస్తవ మతమును వ్యాపింపజేయుటకు కృషి చేసిరి. కాని 1656 లో వారిని డచ్చివారు తరిమివైచి, దేశమును వశపరచుకొని సువ్యవస్థిత పరిపాలనను నెలకొల్పుటకు కృషిచేసిరి. వారు ప్రవేశపెట్టిన 'రోమన్ - డచ్చి' న్యాయసంహిత ఇప్పటికిని కొన్ని వ్యవహారశాఖలందు దేశమున ఆదరితమై ఉన్నది. 18వ శతాబ్ది అంతమున డచ్చివారి మాతృదేశమే స్వతంత్రతను కోల్పోవుటతో, బ్రిటిష్‌వారి ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వమునకు, డచ్చివారు దీనిని వశపరచిరి (1796); అంతట 1798 లో బ్రిటిష్ ప్రభుత్వపు మకుటపు వలసగ ఇది గ్రహింపబడినది. 1815 లో, పరిస్థితులకు లొంగి, కాండీరాజ్యపు ప్రభుపు స్వైతము తన రాజ్యమును బ్రిటిష్‌వారికి దత్తము చేయుటతో దేశమంతయు బ్రిటిష్ సామ్రాజ్యమున అంతర్గతమయ్యెను.

బ్రిటిష్‌వారు ఇచట కాఫీ, తేయాకు, రబ్బరు, పంటలను ప్రవేశపెట్టి దేశపు ఆర్థికవ్యవస్థలో కొంతమార్పును తెచ్చిరి. రాజకీయముగను దేశీయులకు భాగస్వామ్యమును కల్పించుటకు 1910 మొదలుగ కొంత కృషిజరిగినది; దీనికి తోడుగ జాతీయోద్యమమును బలబడినది, వీని ఫలితముగ కడకు 1948 లో దేశమున బాధ్యతాయుత ప్రభుత్వము కల్పింపబడి, దేశము (బ్రిటిష్) కామన్‌వెల్తున స్వయంపాలక, అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించినది. 19 జులై 1970 న ఈ దేశము బ్రిటిష్ పార్లమెంటుతోను, మకుటముతోనుగల సంబంధములను రద్దుచేసికొని, అధ్యక్షపాలనగల గణతంత్ర రాజ్యముగ రూపొంది, కామన్‌వెల్తున సభ్యత్వమును మాత్రము ఉంచుకొనినది.

**7. పరిపాలన :** 1972 లో అమలునకు వచ్చిన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున పాలన నిర్వహింపబడుచున్నది. దేశపు సర్వసత్తాకత జాతీయ శాసనసభయందు నెలకొని ఉన్నది. ఈ సభయొక్క పదవీకాల పరిమితి ఆరు సంవత్సరములు. సభయందుకల 157 స్థానములలో 151 ఎన్నికలవలన నింపబడును;

తక్కిన వానికి నియామకము జరుగును. ఎన్ను కొనబడు స్థానములలో ఆరుస్థానములు స్త్రీలకై ప్రత్యేకింపబడినవి. దేశమున 18 ఏండ్ల వయసునకు తగ్గని స్త్రీ, పురుషులకు అందరికిని దేశమున వోటుహక్కు కలదు.

జాతీయ శాసనసభకే శాసననిర్మాణ, కార్య నిర్వహణాధికారములు రెండును కలవు. శాసన సభయందు అత్యధిక బలముకల పక్షము లేదా సంయుక్తపక్షపు నాయకుడు ప్రధానియగును; ప్రధానియే దేశాధ్యక్షుని నియమించును. దేశాధ్యక్షుని పదవీ కాలపరిమితి నాలుగేండ్లు. ఇప్పటి ప్రధానియగు శ్రీమతి సిరిమావో బండారనాయకే మరల ఎన్నికలు జరుగువరకు (1977 మధ్య వరకు) ప్రధానిగ వ్యవహరింపగలదు.

పరిపాలనా సౌలభ్యమునకై దేశము 22 మండలములుగ విభక్తమైనది. ప్రతి మండలమును ఒక ప్రభుత్వప్రతినిధి తన సహాయకుల సాయముతో పాలించును. మండలమునందలి వివిధ ప్రాంతములందు 'ప్రజాసమితులు' నెలకొల్పబడినవి. వీనిలో ప్రతిదానియందును 11 మంది సభ్యులుందురు. సహకారసంఘములు, కార్మిక యూనియనులు, గ్రామీణ అభివృద్ధి సంఘములు; స్థానిక పరిపాలనా సంస్థలు అనువానినుండి ఈ సభ్యులను తీసికొనెదరు. స్థానిక ప్రభుత్వపు పరిపాలనయందలి లోటుపాటులను కనిపెట్టు పర్యవేక్షక కృషిని ఈ ప్రజాసమితులు నిర్వహించును.

దేశమున పెక్కు రాజకీయ పక్షములు కలవు. వీనిలో ప్రస్తుతమున జాతీయ శాసనసభయందు అత్యధిక సంఖ్యాక (90) బలముకలది, శ్రీలంకా ఫ్రీడం పార్టీ; తరువాత సంఖ్యాబలమునుబట్టి పేర్కొనదగినవి: లంకా సమసమాజ పార్టీ, యునైటెడ్ నేషనల్ పార్టీ, ఫెడరల్ పార్టీ, కమ్యూనిస్ట్ పార్టీ, తమిళకాంగ్రెస్ అనునవి. ఫెడరల్ పార్టీ అనునది దేశము, తమిళ, సింహళ ప్రాంతములను రెండు రాష్ట్రముల సమాఖ్యగ రూపొందవలెయునని వాదించునది; లంకా సమసమాజ్ అనునది ట్రాట్స్కీ పద్ధతిని అనుసరించు కమ్యూనిస్ట్ పార్టీ.

దేశమున న్యాయశాఖకు స్వతంత్రప్రతిపత్తి కలదు; అయినను జాతీయసభచేయు ఏ చట్టమును గాని, చర్యనుగాని, చెల్లదని తీర్మానించు హక్కు న్యాయస్థానమునకు లేదు. వ్యక్తి స్వామ్యమునకు సంబంధించిన వివాదములలో దేశమున కాండీయ, దేశవలమై, షరియత్, రోమన్ - డచ్చి న్యాయ సంహితలు క్రమముగ సింహళీయ, తమిళ, ముస్లిం, క్రైస్తవుల విషయములలో అనుసరింపబడు చున్నవి; వ్యాపార, సముద్రవాణిజ్య విషయములందు ఇంగ్లీషు న్యాయసంహితయు, దండవ్యవహారములకు సంబంధించినంతవరకు అందరికి ఒకే తీరు న్యాయసంహితయు అమలున ఉన్నవి. సుప్రీమ్‌కోర్టునకు పౌరవ్యవహారములందు అప్పీళ్ళను పరిష్కరించు అధికారముకలదు. దండవ్యవహారములందు స్వయముగనే కొన్నితీరుల వివాదములను పరిష్కరింపవచ్చును. ఈ కోర్టు అధికారమునకు లోబడి జిల్లాలందు సివిల్ క్రిమినల్ కోర్టులు పనిచేయుచున్నవి. దండవ్యవహారములందు, సుప్రీంకోర్టు తీర్పుపై, అప్పీళ్ళను పరిష్కరించు అధికారము కోర్టు ఆఫ్ క్రిమినల్ అప్పీల్స్ అనుదానికి కలదు.

**8. దేశరక్షణ :** దేశమున సైన్యమును ఏర్పాటుచేయుట 1949 నుండి మాత్రమే మొదలైనది. పదాతిదళమునుగురించిన సంఖ్యా వివరములు తెలియవచ్చుటలేదు 1950 నుండి నావిక దళము రూపుగొనుట ఆరంభమైనది. అందు 27 గస్తీ బోట్లును, కొలదిగ తక్కిన అల్పనౌకలును కలవు. నావికయోధులసంఖ్య 1840, అధి

కారులసంఖ్య 160 (1972). 1950 లోనే వైమానిక దళమును ఏర్పరచుట జరిగినది. వైమానిక యోధుల మొత్తపుసంఖ్య 1,600. 8 ఆయుధ విమానములు, శిక్షక విమానములు 9, అంతరంగిక భద్రతకు ఉపయోగించు తక్కువరకపు విమానములు 25, 6 హెలికాప్టరులు కలవు. (1972).

**9. అంతర్జాతీయ సం. :** అగ్రరాజ్య కూటములలో దేనికిని ముడిపడక, సైనిక ఒడంబడికలలో చేరక, తక్కువిధముల అంతర్జాతీయ సహకార విధానమును శ్రీలంక ప్రోత్సహించి అందు పాల్గొనుచున్నది. 1955 మొదలుగ, ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది. కామన్ వెల్తునందును, కొలంబో ప్రణాళికా రాజ్యము లందును సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ చాలవరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. తేయాకు, రబ్బరు, కొబ్బరి అనునవి ఎక్కువగా ఉత్పత్తియగు పంటలు. 1971 లో రబ్బరు తోటలు, చాలవరకు జాతీయములు చేయబడినవి. ఈ పై మూడువిధముల ఉత్పత్తులలోను అధిక భాగము ఎగుమతి అగుచున్నవి. అందును అగ్ర స్థానము తేయాకుది. దేశపు ఎగుమతులలో ఎనిమిదింట అయిదుభాగముల ఆదాయము దానివలన లభించుచున్నది. దేశప్రజలకు ముఖ్యాహారపు వస్తువగు బియ్యమును, గోధుమను కొంతవరకు ఈ దేశము ప్రతి సాలున దిగుమతి చేసికొనుచున్నది.

దేశపు ఖనిజములలోనెల్ల ప్రముఖమైనది గ్రాఫైట్. ఆ ఖనిజపు ఉత్పత్తిలో ప్రపంచమున అగ్రస్థానము శ్రీలంకదే. దేశమునందలి రత్నపుర జిల్లాలో వివిధములగు రత్నములు విరివిగ దొరకుచున్నవి. దేశమున విద్యుదుత్పత్తి 65 కోట్ల కివా. (1968).

దేశమున చెప్పుకొనదగిన పెద్దపరిశ్రమలు ఏవియులేవు. 1956 నుండి పారిశ్రామికాభివృద్ధి కొరకై ప్రభుత్వపు ఆధ్వర్యవమున కృషిజరుగు చున్నది. ఒక నూనెశుద్ధి కర్మాగారము నిర్మింప బడినది. సిమెంటు ఉత్పత్తి యంత్రాగారములు కొన్నియు, ఒక ఉక్కువస్తువుల కర్మాగారమును కలవు. దేశపు ఎగుమతుల విలువ 203.3 కోట్ల శ్రీ. రూ: దిగుమతుల విలువ 231.3 కోట్ల శ్రీ. రూ. శ్రీలంక కేంద్రబ్యాంకు దేశపు బ్యాకింగునకు ప్రముఖ కేంద్రము. 1970 లో బ్యాంకులు జాతీయము చేయబడినవి. దేశపు బడ్జెటరీ వ్యయము 308.9 కోట్ల శ్రీ. రూ. (1970-71).

**11. సాంఘిక రంగము :** దేశప్రజలలో 65% అక్షరాస్యులు. శిశువిద్య మొదలుకొని విశ్వవిద్యాలయ స్థాయిని అతిక్రమించుకొరకు విద్యాబోధన ఉచితముగ నిర్వహింపబడుచున్నది. 6 మొదలుకొని 14 ఏండ్లవరకు వయసు కలిగిన బాలురకు నిర్బంధవిద్య అమలున ఉన్నది. అయినను పాఠశాల ఏదియైన తగినంత సమీపమున లేనపుడు మాత్రము ఈ నియమము సడలింపబడు చున్నది. 1వ తరగతినుండి 12వ తరగతి వరకు బోధించు పాఠశాలలు దేశమున 9,701 కలవు; ఇందుబోధించు ఉపాధ్యాయుల సంఖ్య 1,00,595; విద్యార్థి సంఖ్య 26.4 లక్షలు. ప్రభుత్వాదాయమున 19.6% విద్యాబోధకై వినియుక్తము (1969). 1942 లో తొలుతగ సింహళ విశ్వవిద్యాలయము స్థాపింపబడినది; తదనంతరమున నెలకొనిన నాలుగు విశ్వవిద్యాలయములును, సాంకేతిక కళాశాలయు సింహళ విశ్వవిద్యాలయముతో 1972 లో మేళనము చేయబడినవి. ఇవిగాక విద్యోదయ, విద్యాలంకార విద్యాలయములు కలవు. పై మూడు విశ్వవిద్యాలయములందలి విద్యార్థి సంఖ్య 15,039.

తమిళుల కొరకై ప్రత్యేకముగ ఒక విశ్వవిద్యాలయము కలదు. 1970 నుండి సింహళీభాషయే విద్యాబోధనయందు మాధ్యమికముగ ఉండునటుల ప్రభుత్వము నిర్ణయించినను, ఇంగ్లీషును బోధించు సదుపాయములు మాత్రము సముచితముగ కల్పింపబడినవి.

దేశమున పత్రికా స్వాతంత్ర్యము కలదు. కొలంబోనుండి 13 దినపత్రికలు — ఇంగ్లీషున మూడును, సింహళీభాషలో ఆరును, తమిళమున నాలుగును — వెలువడుచున్నవి. వీని అన్నింట ఎక్కువ ప్రచారము 'దినమిన' అను సింహళీ పత్రికకు కలదు. జాఫ్నానుండి ఒక తమిళ దిన పత్రిక ప్రకటింపబడుచున్నది. కొలంబో, కాండీ, రత్నపుర, జాఫ్నాలలో జాతీయ మ్యూజియములు కలవు. సింహళచరిత్రకు సంబంధించిన పురావస్తు సంపద వీనియందు కననగును, కొలంబోయందు, మూడు పెద్ద గ్రంథాలయములు కలవు.

దేశమున ప్రతివానికిని ప్రభుత్వమే వైద్య సహాయమును, చాలవరకు ఉచితముగను, కొన్ని సందర్భములందు నామమాత్రపు చెల్లింపుపైనను, కల్పించుచున్నది. కాని శిక్షితులగు వైద్యులసంఖ్య తగినంతగ లేదు. 1967 లో దేశమున 37,135 శయ్యాసంఖ్యకల 426 ఆసుపత్రులు కలవు. వైద్యసంఖ్య 2,880 (అనగా 4,060 మందికి ఒక వైద్యుడు కలడని అర్థము).

**12. యాత్రా సౌ. :** అనూరాధపురము నందలి ప్రాచీన బౌద్ధకళావశేషములు ప్రపంచ ప్రసిద్ధిగాంచినవి. వానిని దర్శించుటకై, ప్రపంచపు నలుమూలలనుండి బౌద్ధులేగాక తదితరులును విరివిగ వచ్చుచుందురు. 1967 లో 23,700 మంది విదేశీయులు ఇటుల దేశమును దర్శించిరి. యాత్రికుల సౌకర్యముకొరకై ప్రభుత్వము తగు ఏర్పాటులను చేసినది.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. క్రీ. పూ. ఒకటవ శతాబ్దిలో దేశమును పాలించిన దుత్తగామణి దేశమును శత్రుభీతినుండి రక్షించుటయేగాక, బౌద్ధమత పరిరక్షణకై విశేషకృషిచేసెను. 2. క్రీ. శ. మూడవ శతాబ్దిలో దేశమును పాలించిన మహాసేనప్రభువు బౌద్ధమత పోషణకై కృషి చేసి, పెక్కు చైత్యములను, విహారములను నిర్మింపజేసెను; ఆ కట్టడములు ఈనాడును చూపరులను ఆకర్షించుచున్నవి. 3. అయిదవ శతాబ్దివాడగు కస్సపుని కాలమున లలితకళలకు ఎక్కువ ఆదరణ చేకూరినది. 4. మధ్యయుగపు రాజులందెల్ల అసమానుడుగ పేరొందినవాడు పరాక్రమబాహు I (1153 - 1186); సింహళమును ఒక ప్రభుత్వము క్రిందకు కొనివచ్చిన ఖ్యాతి ఇతనికి దక్కినది. 5. ఆధునికులలో స్వాతంత్ర్యోద్యమ నాయకుడు, డాన్ స్టీఫెన్ సేనానాయకే (1884-1952) తొలుతగ పేర్కొనదగినవాడు. స్వతంత్ర సింహళపు తొలి ప్రధానమంత్రిగ ఇతడు వ్యవహరించెను. 6. సింహళమును సామ్యవాదరాజ్యముగ రూపొందించుటకై కృషిని మొదలిడినవాడు సాలమన్ వెస్ట్‌రిడ్జ్‌వే డయజ్ బండారనాయికే (1899-1959).

# 33. సంయుక్త అరబ్ ఎమిరేట్స్

పూర్వము బ్రిటిష్ సామ్రాజ్యమున చేరియుండి, 'పారసీక సింధుశాఖలోని షేక్ రాజ్యములు' అని వ్యవహరింపబడిన వానిలో అబూ ధబీ, దుబాయి, షర్జా, రాస్‌అల్‌ఖైమా, ఉమ్‌అల్‌కువాయిన్, అజమన్, పూజయిరా అనునవి ఒక సమాఖ్యగ 1971 లో ఏర్పడిన ఫలితముగ రూపొందిన నూతన రాజ్యము ఇది. ఇందలి ప్రతిరాజ్యపు పాలకుడును (షేకు) తన రాజ్యమున తానే, ఆంతరంగిక పాలనను నిర్వహించుచున్నను, కేంద్ర పాలకుడుగ అబూ ధబీ రాజ్యపు షేకే వ్యవహరించునటుల అంగీకారము కుదిరినది. అందువలన అబూ ధబీ నగరమునే దేశపు ముఖ్యనగరముగ పాటింపవచ్చును. సమాఖ్యయందలి సభ్య షేకు రాజ్యములకు అన్నింటికి వేరువేరుగ పతాకములు కలవు. సమాఖ్య పతాకము నిర్ధారితము కాలేదు; జాతీయగీతమును రూపొందలేదు. అంతవరకు బహరీన్ కటార్ ప్రాంతపు రియాల్ నాణెములు చెల్లుచున్నను, 1973, 20 మే నుండి సం. అ. ఎ. దర్‌హమ్ అను నాణెము ప్రవేశపెట్టబడినది. (ఒక దర్‌హమ్ = రు. 1.90); స్థానిక సాంప్రదాయిక ప్రమాణములతో పాటుగ బ్రిటిష్, మెట్రిక్ కొలతూక ప్రమాణములు పరిగణనను పొందియున్నవి.

**1. ఉనికి మొ.:** అరబ్ ద్వీపకల్పపు ఆగ్నేయ భాగమున, ఓమన్‌దేశపు సరిహద్దు మొదలుకొని కటార్ ద్వీపకల్పమునందలి ఖోర్ – అల్ – ఒడాయిద్ వరకు దాదాపు 650 కిమీ. పొడవున తీరరేఖ కలిగిన ఈ దేశము, దాదాపుగ అంతయు, లోతులేని సముద్రపు పడియలు, చిన్న చిన్న ద్వీపములు, పవడపు గుట్టలు, ఇసుక తిన్నెలు. సర్వత్ర వ్యాపించిన భూమియని చెప్పవచ్చును. అంచనాలను అనుసరించి దేశపు వైశాల్యము 82000 చ. కిమీ; దేశమున నదులుగాని అడవులుగాని లేవు.

**2. శీతోష్ణస్థితి మొ:** మే నుండి అక్టోబరు వరకు విపరీతముగ ఎండలు కాయును; అత్యధిక ఉష్ణోగ్రత 110° ఫా; అల్పోష్ణత 60°ఫా; సాలున సరాసరి వర్షపాతము 5 సెం మీ. నుండి 10 సెం. మీ. వరకు మారుచుండును. ఎడారిలో సహజముగనుండు ముండ్లపొదలును, అల్పజంతువులును మాత్రమే ఇట కననగును.

**3. జనసంఖ్య మొ.:** దేశమున అత్యధిక సంఖ్యాకులు అరబ్బీజాతికి చెందినవారు. తీరపు రేవు పట్టణములలో భారత, పాకిస్తానీ, పారసీక, నీగ్రో సంతతులవారు కననగుదురు. దేశపు మొత్తపు జనసంఖ్య, అంచనాలను అనుసరించి, 2,10,000. ఇందులో సగభాగము పైగా అబూ ధబీ ప్రాంతమునను, మూడవవంతు దుబాయిలోను నివసించుచున్నారు. అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ; ప్రజలలో దాదాపుగ అందరును ఇస్లాము మతానుయాయులు; దుబాయిలో మాత్రము భారతీయ సంతతికి చెందిన ముస్లిమేతరులు కొందరు కలరు.

**4. సమాచార సా.:** దేశమున అన్ని ప్రాంతముల మధ్య టెలిఫోను సౌకర్యము కలదు.

**5. యాన సౌకర్యములు:** అబూ ధబీ, దుబాయిలలో రోడ్ల సౌకర్యము కలదు. అన్ని రాష్ట్రకేంద్రములనుండియు విమానయాన సౌకర్యము కలదు. దుబాయ్, షర్జా, అబూ ధబీలలోని విమానాశ్రయములు అంతర్జాతీయ విమానయాన మార్గమున ఉన్నవి; దుబాయ్‌లోని రేవు ఉత్తమ స్థాయికి చెందినది; అబూ ధబీలోని రేవును

1972 లో పునర్నిర్మించి పెద్ద స్టీమర్లు వచ్చుటకు వసతులను కల్పించిరి.

**6. చరిత్ర :** క్రీ. శ. 7వ శతాబ్దిలో ఇచటి ప్రజలు ఇస్లామును అవలంబించినది మొదలుగ మాత్రమే ఈ దేశపు చరిత్ర కొంతవరకు తెలియ వచ్చుచున్నది. అది మొదలుగ సమీప ప్రాంతము లను పాలించిన వివిధ ముస్లింరాజవంశముల వశ మున 16వ శతాబ్దివరకు ఈ ప్రాంతము ఉండినది. ఆ శతాబ్దమున పోర్చుగీజువారు, తమ సముద్ర మార్గ సంరక్షణకై, ఈ ప్రాంతమును తమ వశ మున ఉంచుకొనిరి. పోర్చుగీజుల ప్రతిష్ఠ సన్న గిలిన తరువాత ఈ ప్రాంతమంతయు ఓడదొంగల నివాసభూమిగ మార్పొందినది. అంతట బ్రిటిష్ ప్రభుత్వము తమ సముద్ర ప్రయాణమును సుర క్షితము చేసికొనుటకై ఈ ప్రాంతపు వ్యవహారము లలో జోక్యము వహించి, కడకు, 1853 లో ఇచటి వివిధ షేక్ ప్రభువులతో కుదుర్చుకొనిన ఒడంబడికను అనుసరించి, సముద్రపు దొంగలను అరికట్టుటలో షేకుప్రభువులు బ్రిటిషు ప్రభుత్వపు చర్యలను సమర్థించుచు మెలగునటుల నిర్ణయము జరిగెను. కాలక్రమేణ, తమ రాజ్యమునందలి ఏ భాగమును బ్రిటిష్ ప్రభుత్వపు అనుమతిలేనిదే అన్యాక్రాంతము చేయకుండుటకును షేక్ ప్రభు వులు అంగీకరించిరి (1892). ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున రూపొందిన నూత్నపరిస్థితులను గమనించి, 1971 లో ఆ ప్రాంతమునుండి వైదొలగుటకు బ్రిటన్ నిర్ణయించుకొనినది. అంతట షేక్ రాజ్యములన్నియు, ఒక సమాఖ్యగా రూపొం దుటకు సంకల్పించినవి. కాని, కటార్, బహ రీనులు వేరుగ స్వతంత్రరాజ్యములుగ అవత రించుటవలన, తక్కినవియే ఒక సమాఖ్యగ అవతరించినవి. ఈ సమాఖ్యకు అబూ ధబీ పాల కుడు అధ్యక్షుడు; దుబాయ్ పాలకుడు ఉపా ధ్యక్షుడు.

**7. పరిపాలన :** రాష్ట్రముల ఆంతరంగిక పాలనను, ఆ యా షేకులే తాము నిర్మించుకొనిన సలహా సంఘముల సాయముతో నిర్వహించు చున్నారు. సమాఖ్య పాలనలో అధ్యక్షునికి సాయము చేయుటకై ఒక సభ కలదు. ఆ సభలో రాష్ట్రముల షేకులకు అందరికిని సభ్యత్వము కలదు. సంవత్సరమున రెండు సారులైన తప్పని సరిగ సమావేశమై ఈ సభ కేంద్ర వ్యవహారములపై నిర్ణయములను తీసికొనును. ఇస్లామిక షరియత్‌ను అనుసరించి న్యాయ నిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమున దాదాపు పది వేలమంది సైనికులుగల ఒక సేనయు, చిన్న వైమానిక దళమును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఈ దేశమునకు ఐ. రా. స. లోను, అరబ్‌లీగులోను సభ్యత్వము కలదు, వివిధ ప్రముఖ రాజ్యములతో దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** పెట్రోలు గనులు 1958 లో అబూ ధబీలోను, 1970 లో దుబాయ్ లోను కనుగొనబడినప్పటినుండి, ఆర్థికముగ ఈ దేశము చాల పురోగమించినది. పెట్రోలు రాబడి వలననే అబూ ధబీ ప్రపంచమంతటిలోను తలసరి ఆదాయమున అత్యున్నత స్థానమును ఆక్రమించి నది. మొత్తముమీద పెట్రోలువలన దేశపు సాలుసరి రాబడి 20 కోట్ల బ్రిటిష్ పౌనులను మించినదని అంచనా (1972). ఈ ఆదాయము నానాట పెరుగుచున్నది. దుబాయ్‌లో సుంకములు చాలా తక్కువగుటవలన ప్రపంచమునందలి వివిధ దేశముల సరకులును, బంగారమును తొలుత ఇటకు చేర్చబడి తరువాత రహస్యముగ భారత, పాకిస్తాన్ లకు చేరవేయుట జరుగుచున్నది. దేశమున సిమెంటు పరిశ్రమ, మొదలగు వానిని పెంపొం దించుటకు ప్రభుత్వము భారతదేశము మొదలగు

వివిధ విదేశ ప్రభుత్వముల సాయముతో కృషి చేయుచున్నవి. ఖర్జూరఫలములు మాత్రమే చెప్పుకొనదగు వ్యవసాయోత్పత్తి.

**11. సాంఘిక రంగము :** పెట్రోలియముకు లభించిన సంపత్తిని వినియోగించి దేశమున సాంఘిక పురోగతిని సాధించుటకు కృషి మొదలయినది. ప్రస్తుతమున సెకండరీ విద్యాపరకే బోధనా సదుపాయములు కలవు. వైద్య సదుపాయములు క్రమముగ విస్తృతి చెందుచున్నవి. దేశమున అబూ ధబిలో మాత్రమే రెండు దినపత్రికలు (అరబ్బీ) కలవు. వీనిలో ఒక దానికి ఇంగ్లీషు అనుబంధమును ప్రచురితమగుచున్నది.

---

# 34. సింగపూర్

**ముఖ్యనగరము :** సింగపూరు; **జెండా :** పైన ఎర్రని అడ్డుచారయు, దిగువన తెల్లని అడ్డుచారయు సమానపు వెడల్పులలో అమరి, అందు ఎగువదానిలో ధ్వజముచెద్ద, దండమునకు వెన్ను చూపిన, తెల్లని నెలవంకయు, ఐదు తెల్లని నక్షత్రములును కలవి; **జాతీయగీతము:** మజులా సింగపూర్ (సింగపూర్ చిరంజీవియగుగాక); **నాణెము:** సింగపూర్ డాలరు; 100 సెంట్లుగ ఇది విభక్తము 1 సింగపూర్ డా = రు. 2.45; **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువి **కాలగణన :** సా. 7 గం. 30 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.




పటము 34.

**1. ఉనికి మొ. :** ఆగ్నేయ ఆసియాయందు మలయా ద్వీపకల్పపు కొననుండి జోహోర్ జల సంధిచేత వేరుపడి ఉండిన ఈ ద్వీపరాజ్యము 1° 19′ అక్షాంశరేఖయందు, 103° 51′తు. తులా రేఖన కుదురుకొని, హిందూమహాసముద్ర పరివేష్టితమై 1.2 కిలోమీటర్ల నిడివిన నిర్మింపబడిన సేతువుచే మలయాద్వీపకల్పపు అగ్రమునకు కలుపబడి ఉన్నది. ఈ రాజ్యమున సింగపూర్ ద్వీపమును, మరికొన్ని అల్పద్వీపములును చేరి ఉన్నవి. సింగపూరు ద్వీపపు వైశాల్యము 542.6 చ. కిమీ; తక్కిన అల్పద్వీపముల మొత్తపు వైశాల్యము 39.9 చ. కిమీ. సురక్షితమై లోతుకలిగిన పెద్ద హార్బరు సింగపూరున ఉన్నది. ఈ ద్వీపపు తూర్పు పడమరల నిడివి 41.8 కిమీ. ఉత్తర దక్షిణముల పొడవు 22.5 కిమీ. భూతలపు ఎత్తు చాల తక్కువ; ద్వీపమధ్యమున మాత్రము కొన్ని గుట్టలున్నవి. వీనియందలి గరిష్ఠపు ఎత్తు 177మీ. మాత్రమే; అచ్చటచ్చట చిట్టడవులు కలవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండలపు శీతోష్ణ పరిస్థితులు ఇచట కననగును; వర్షపాతము ఎక్కువ. గాలి తేమ అధికము; సాలున గరిష్ఠోష్ణత

87° ఫా.; కనిష్ఠోష్ణత 75°. సాలున వర్షపాతము రాదాపు 238 సెం.మీ; సంవత్సరము పొడవున ఋతుభేదము లేకుండ వానలు పడుచుండును; మొత్తమున రెండురోజులకు ఒకసారి వానకురియు నని చెప్పవచ్చును. ఒకపుడు సాంద్రాటవి ఉండి నను ఇపుడు అది యంతయు అంతరించినది; తీరము వెంబడిన పొదలు మాత్రము విరివిగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1970 లో జనసంఖ్య 20,74,507; ఇందు చీనీయులు 15,79,866; మలేలు 3,11,379; భారతీయులు 1,45,169, తదితరులు 38,093. మలేభాష జాతీయభాషగ లెక్కింపబడుచున్నది; అయినను, దానికి తోడుగ ఇంగ్లీషు, చీనీయ భాషలోని మండారిన్ మాండలికము, తమిళముకూడ అధికారభాషలుగ ఆదరింపబడుచున్నవి. దేశమున మతప్రసక్తిలేని ప్రభుత్వము కలదు; మతస్వేచ్ఛ అమలున ఉన్నది. మలేలును దేశమునందలి పాకిస్తానీలును ముస్లి ములు; భారతీయులలో అత్యధిక సంఖ్యాకులు హిందువులు; తక్కిన భారతీయులలో సిక్కు, క్రైస్తవ, ఇస్లాంమతములు వ్యాప్తిలో ఉన్నవి. చీనీయులలో 2% క్రైస్తవులు; తక్కిన చీనీయు లలో బౌద్ధ, తావో, కన్ఫ్యూషియన్ మతములు వ్యాప్తికలిగి ఉన్నవి.

**4. సమాచార సౌ. :** దేశమున 42 తపా లాఫీసులును, 24 తపాలా ఏజన్సీలును పని చేయుచున్నవి. తంతి, టెలిఫోను వసతులు కలవు. కేబుల్, వైరులెస్‌ల ద్వారా విదేశము లతో వార్తాసంబంధము కలదు. సింగపూరున ఒక రేడియో ప్రసారకేంద్రము ఇంగ్లీష్, మలే, తమిళ్, చీనీయ భాషలలో ప్రసారములను నిర్వ హించుచున్నది.

**5. యాన సౌ. :** దేశమున 1,945 కిమీ. నిడివిగల రోడ్లుకలవు. 25.6 కిమీ. పొడవుగల రైలుమార్గము కలదు. మలయానుండి బ్యాంగ్ కాక్‌నకు పోవు రైలుమార్గముతో ఇది కలియు చున్నది. ఇండియా, ఆఫ్రికా యూరప్, అమెరికా ఉభయఖండములమధ్య జరుగు సముద్రయాన మునకు సింగపూరు హార్బరు చక్కగ ఉపక రించుచున్నది; ప్రపంచపు ప్రముఖ హార్బరులలో ఇది అయిదవది. సింగపూరునా పాయా లేబర్ వద్దనున్న అంతర్జాతీయ విమానాశ్రయము, ఆగ్నేయ, ఆసియాయందలి ఇట్టివానిలో అత్యుత్తమ మని పేరొందినది. సముద్రోత్తర దేశయానమును నిర్వహించు 20 విమానయాన సంస్థలు దీనిని ఉపయోగించుకొనుచున్నవి.

**6. చరిత్ర :** సింగపూరు నగర నిర్మాణమును గురించి తొలుతటి చారిత్రక వివరములు అంతగ తెలియవచ్చుటలేదు; కాని క్రీ. శ. 13, 14 శతా బ్దుల నాటికి అది ఒక ప్రముఖమగు రేవు నగర ముగ పేరొందెననియు, 1377 లో జావా పాల కులు దండెత్తి దానిని ధ్వంసము చేసిరనియు తెలియుచున్నది. 1819 లో సర్ స్టాఫర్డు రాఫిల్స్ అను ఆంగ్లేయుడు, ఇందు ఒక వర్తక స్థావరము నెలకొల్పునప్పటికి ఇది నిర్జనమై ఉండి, జోహోరు పాలకుని రాజ్యమున చేరి ఉండెను 1824 లో ఇది బ్రిటిష్‌వారికి దత్తమై, అంతటినుండి వ్యాపార స్థావరముగ వృద్ధిచెందినది. ఆ నాడది బ్రిటిష్‌వారి వలసరాజ్యమగు స్ట్రెయిట్స్ సెటిల్ మెంటులో చేరి ఉండినది. 1942 లో జపాను వారు దీనిని వశపరచుకొనినను, 1945 లో తిరిగి బ్రిటిష్‌వారికి వశమైనది. 1946 లో దీనిని తక్కిన వలసనుండి వేరుచేసి మకుటపు వలసగ బ్రిటిష్‌వారు ఏర్పరచిరి. క్రమమున 1963 లో మలేసియా సమాఖ్యలో అంతర్భాగముగ ఈ దేశము స్వయంపాలక ప్రాంతమై, కడకు ఆ సమాఖ్యనుండియు విడివడి ఆగస్టు, 1965 న

సర్వస్వతంత్రమగు గణరాజ్యముగ రూపొందె, కామన్‌వెల్తున సభ్యత్వము కలిగి ఉన్నది.

**7. పరిపాలన :** దేశమున వయోజనులకు, అనగా 21 ఏండ్ల వయస్సుకు తగ్గనివారికి, వోటు హక్కు కలదు. ఐదుయేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ఏకసభ్య నియోజకవర్గముల వలన, పార్లమెంటునందలి 58 మంది సభ్యులు ఎన్నుకొనబడెదరు. దేశాధ్యక్షుని పార్లమెంటు ఎన్నుకొనును; అధ్యక్షుని పదవీకాల పరిమితి నాలుగు సంవత్సరములు. అధిక సంఖ్యాక పక్షమునుండి ప్రధానిని, ప్రధాని సలహాతో తక్కిన మంత్రులను అధ్యక్షుడు నియమించును. పార్లమెంటునకు బాధ్యత వహించి మంత్రివర్గము పాలనను నిర్వహించును. దేశములోని రాజకీయ పక్షములలో పీపుల్స్ యాక్షన్ పార్టీ అనునది బలవత్తమము'; తరువాత లెక్కకు వచ్చునది బరిసాన్ సోషలిస్ట్ పార్టీ.

**8. దేశరక్షణ :** చిన్నదియైనను సమర్థవంతములగు భూ, నౌకా, వాయు సేనలు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** 1965 మొదలుగ ఈ దేశమునకు ఐ. రా. స. లో సభ్యత్వమును, దాని అనుబంధ సంస్థలలో పెక్కింట సభ్యత్వమును కలవు.

**10. ఆర్థిక రంగము :** ఆసియా ఖండపు రాజ్యములలో తలసరి ఆదాయరీత్యా ప్రథమ శ్రేణికి చెందిన రాజ్యములలో ఇదియొకటి. అయినను ఈ దేశమున వ్యాపసాయికముగ గాని, పారిశ్రామికముగ గాని ఉత్పత్తి లెక్కింపదగినంతగ లేదు ఆహారపదార్థములలో అత్యధిక భాగమునకై విదేశీయులపైన ఈ రాజ్యము ఆధారపడియున్నది. కోళ్ళు, గ్రుడ్లు, పందిమాంసము అనువానిని మాత్రమే దేశావసరములకు మించి ఈ దేశము ఉత్పత్తిచేసి, అందు మిగిలిన దానిని మలేసియాకు ఎగుమతి చేయుచున్నది. 1819 మొదలుగ స్వేచ్ఛా వాణిజ్యపు రేవుగ సింగపూరు ఉండుటవలన, నానాదేశముల వస్తువులకు వినిమయ కేంద్రముగ, ఓడల రాకపోకలకును, అందువలన ధనాదాయమునకును ఇట వసతులు ఏర్పడినవి. ఇట్టి పరిస్థితికి తగినటుల ఓడల నిర్మాణము, మరమ్మతులు, ముడివస్తువులను చక్కబరుచుట, హోటళ్ళు మొదలగు వసతుల ఏర్పాటు వంటివి ఇచట ప్రముఖ పరిశ్రమలుగ రూపొంది వర్ధిల్లుచున్నవి. దేశమున విద్యుదుత్పత్తి 187.61 కోట్ల కివా (1969). ఎగుమతుల విలువ 587.13 కోట్ల సిం. డాలర్లు; దిగుమతుల విలువ 865.5 కోట్ల సిం. డాలర్లు (1971). బడ్జెటరీ వ్యయము 144,86,92,350 సిం. డాలర్లు (1972-73).

**11. సాంఘిక రంగము :** జనసంఖ్య విరివిగ వృద్ధియగుటవలన, తగిన గృహవసతిని కలుగజేయుటకు, ప్రభుత్వము కృషిచేయుచున్నను, లోటు ఎక్కువగనే ఉన్నది. వయోజనులలో 55 - 60% అక్షరాస్యులు. పిల్లలకు ఉచిత ప్రాథమిక విద్యాసౌకర్యము కలదు. రాజ్యమునందలి 558 పాఠశాలలో 5,21,652 మంది విద్యార్థులు కలరు. సింగపూరు విశ్వవిద్యాలయమున విద్యార్థి సంఖ్య 5,226. ఇవి గాక వేరుగ ఉన్న ఉన్నత విద్యాసంస్థలలోని విద్యార్థుల మొత్తము 8,654 (1972). సింగపూరున వివిధభాషా గ్రంథములు గల రెండు ప్రసిద్ధ గ్రంథాలయములును, ఒక మ్యూజియమును కలవు. సింగపూరునుండి మలే, చీనీజ్, ఇంగ్లీష్, తమిళ్, మలయాళములలో భాషకు ఒకటి చొప్పున దినపత్రికలు ప్రచురింపబడుచున్నవి.

ప్రభుత్వ వ్యయమున గణనీయాంశము ఆరోగ్య, వైద్య, సదుపాయములకై వినియోగింపబడుచున్నది; 7,004 శయ్యా సంఖ్య కల 11 ప్రభుత్వ ఆసుపత్రులు పనిచేయుచున్నవి. ఇవి

గాక రెండు ప్రయివేటు ఆసుపత్రులు కలవు; రాజ్యమున వైద్యసంఖ్య 1159 (1750 పౌరులకు ఒక వైద్యుడు) (1968).

**12. యాత్రా సౌ.:** విదేశీయ యాత్రికులకు ప్రభుత్వము పెక్కుసదుపాయములను సమకూర్చినది; దక్షిణ ఆఫ్రికా తప్ప తక్కిన కామన్‌వెల్తు రాజ్యముల వారికిని తక్కిన కొన్ని దేశముల వారికి వీసాలు అవసరము. 1971 లో దేశమును 6,32,149 మంది దర్శించిరి. వీరివలన దేశమునకు 30 కోట్ల సిం. డాలర్లకు సరియగు విదేశీయ ద్రవ్యము లభించినది.

---

# 35. సిరియా

**ముఖ్యనగరము:** డెమాస్కస్; **జెండా:** పైనుండి దిగువకు అడ్డముగ క్రమముగ అమరిన ఎరుపు, తెలుపు, లేతనలుపు అడ్డుచారలలో, తెలుపు చారపై అడ్డముగ, ప్రక్కప్రక్కనఉన్న మూడు ఆకుపసిమి నక్షత్రములు కలది; **నాణెము:** సిరియన్ పౌండ్; ఇది నూరు పియాస్తరులుగ




పటము 35.

విభక్తము. 1. సిరియన్ పౌండ్ = రు. 1.96; **కొలతతూకములు:** మెట్రిక్ విధానమునకు 1935 నుండి అధికారిక పరిగణన కలదు; కాని దూర ప్రాంతములందు సాంప్రదాయికపు కొలతతూకములకు మన్నన ఇప్పటికిని కలదు; **కాలపరిగణన:** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** పశ్చిమాసియాలో 32°20′ – 38°30′ ఉ. అక్షాంశరేఖలమధ్యను, 35°50′ – 40° తూ. తులారేఖల మధ్యను, నెలకొనియున్న ఈ దేశమునకు ఉత్తరమున తుర్కీయు; పశ్చిమమున మధ్యధరా సముద్రమును, లెబనాన్ గణరాజ్యమును; దక్షిణమున ఇస్రాయెల్, జోర్డాన్ దేశములును; తూర్పున తుర్కీయు సరిహద్దులందున్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 1,85,180 చ. కిమీ. భౌతికరీత్యా దేశము పశ్చిమ ప్రాంతమనియు, తూర్పు ప్రాంతమనియు విభజింపనగును. పశ్చిమ ప్రాంతము ఒక సన్నని పీఠికవలె ఉన్నది; ఇందే ప్రముఖ పర్వత శ్రేణులును లోయలును కలవు; తూర్పు ప్రాంతము విశాలతరమైనది; ఈ ప్రాంతము తూర్పునకు వాలుగ దిగిపోవును. ఈ ప్రాంతముననే వాయవ్యమునుండి ఆగ్నేయమునకు యూఫ్రెటిస్‌నది ప్రవహించుచున్నది. పశ్చిమ ప్రాంతపు పర్వతములలో అత్యున్నతమైనది హెర్మన్ శైలము. ఆ ప్రాంతపు లోయలలో కొన్ని అతి సారవంతములైనవని పేరొందినవి. తూర్పు ప్రాంతమున కొంతభాగము పచ్చికబయళ్లుగను, తక్కినది ఎడారిగను ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** శీతోష్ణస్థితియందు రెండు ప్రాంతములమధ్య గొప్ప వ్యత్యాసము కన్పట్టును. తూర్పు ప్రాంతమున ఎండకాలమున ఎండలును, శీతకాలమున చలియును ఎక్కువగ ఉన్నవి. అట అత్యధిక ఉష్ణోగత 100° ఫా. దాటును; శీతకాలమున మంచు విపరీతముగ కురియును; పశ్చిమ ప్రాంతమున సమశీతోష్ణపు పరిస్థితులు కన్పట్టును; ఇచట శీతకాలమున, కొండల పైభాగములతప్ప తక్కినచోటుల, మంచు కురియదు. పశ్చిమ ప్రాంతమున వర్షపాతము చాల ఎక్కువ; అందును ఉన్నత భూములందు మరెంత ఎక్కువగ ఉండును. తూర్పు ప్రాంతమున, వర్షపాతము, తూర్పునకు పోయిన కొలది తగ్గుచుండును; కాని అట ఏ ప్రదేశమునను సాలుసరిన 25 సెం. మీ. ను అది మించదు. పశ్చిమమున వర్షపాతము 75-100 సెం. మీ. ఉండును.

**3. జనసంఖ్య మొ.:** పశ్చిమ ప్రాంతమున అచ్చపు మెడిటరేనియన్ జాతివారు అధికముగ కన్పట్టినను, తూర్పు ప్రాంతమున వేర్వేరు జాతుల ప్రజలు విరివిగ కన్పట్టెదరు. అందు కుర్ద్ జాతికి చెందినవారు అధిక సంఖ్యాకులు. దేశ ప్రజానీకమున 80% పశ్చిమ ప్రాంతముననే నివసించుచున్నారు. దేశపు జనసంఖ్య 63,03,452 (1970). పట్టణములలో డెమాస్కస్ (జ. సం. 8,36,000), అలెప్పో (జ. సం. 6,39,000) ప్రముఖములు. ఈ రెండు నగరములును పశ్చిమ ప్రాంతమునందే ఉన్నవి. ప్రజలలో 86% ముస్లిములు. తక్కిన వారిలో క్రైస్తవులు సగమునకు మించిఉన్నారు. కాల్దియనులు, యజిదీలు మొదలగు తక్కిన మతానుయాయులు అత్యల్ప సంఖ్యలలో కన్పట్టుదురు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల మాతృభాష అరబ్బీ; ఉత్తరపు సరిహద్దు ప్రాంతమున కుర్దుభాషను మాటాడు అల్పసంఖ్యాకవర్గము విరివిగ కన్పట్టును. అతి ప్రాచీనమై, జీసస్ క్రీస్తునకు మాతృభాష యని పేరొందిన అరమాయిక్ భాషను మాతృభాషగ కలవారు మూడు గ్రామములందు వసించుచున్నారు.

**4. సమాచార సౌ.:** ప్రభుత్వపు యాజమాన్యమున పనిచేయు తపాలా, తంతి, టెలిఫోను, రేడియో, టెలివిజన్ సౌకర్యములు దేశవ్యాప్తములై పనిచేయుచున్నవి. టెలిఫోనులలో 75% డెమాస్కస్, అలెప్పో నగరములలో ఉన్నవి. దేశమున దాదాపు 15 లక్షల రేడియో రిసీవరులును ఒక లక్ష టెలివిజన్ సెట్లును కలవు. డెమాస్కస్‌నుండి బీరూట్‌నకును, తుర్కీకిని, పశ్చిమ యూరప్‌కును వార్తలనుపంపు సౌకర్యము కలదు. డెమాస్కస్‌లో ఒక రేడియో ప్రసార కేంద్రమును, టెలివిజన్ ప్రసార స్థావరమును కలవు.

**5. యాన సౌ.:** 1971 లో దేశమున 8,688 కిమీ. తారురోడ్డును, 2,364 కిమీ. తక్కువిధముల పక్కా రోడ్లును కలవు. 1963 మొదలుగ రోడ్ల నిర్మాణము విరివిగ సాగుచున్నను, దేశావసరములకు తగిన రీతిగ రోడ్డువసతి ఇంకను అభివృద్ధి చెందకున్నది. దేశమునుండి ఇరాక్, జోర్డాన్, లెబనాన్, తుర్కీలకు పయనించుటకు రోడ్డువసతి కలదు. ఇజ్రాయెలుకు పయనించుటకును అట్టి వసతి ఉన్నను ఉభయ దేశములమధ్య ఏర్పడిన వైరుధ్యమువలన ఆ రోడ్డు ఉపయోగింపబడకున్నది. అలెప్పోనుండి తుర్కీ సరిహద్దువరకును, అలెప్పోనుండి ఇరాక్ సరిహద్దునకును, డమాస్కస్ నుండి ఇరాక్ సరిహద్దునందలి ఎల్‌హమ్మీకును, అకారినుండి తార్తస్‌కును, అలెప్పోనుండి తబకాకును రైలుమార్గములు కలవు. రైలుమార్గముల మొత్తపు నిడివి 1,150 కిమీ. లట్టాకియా, తార్తాస్, బనియాస్ అను రేవునగరములు కలవు. వీనిలో తొలుతటిదానిని లోతు హార్బరుగ పునర్నిర్మించుట జరుగుచున్నది. ఇరాక్‌నుండి పైపుద్వారా వచ్చు నూనె, బనియాస్‌వద్ద, పడవలలోనికి చేర్చబడు

చున్నది. అంతర్జాతీయ విమాన మార్గమున ఒక కీలకముగ, డెమాస్కస్‌లోని విమానాశ్రయము ఉపయోగపడుచున్నది. అలెప్పోలోను, తదితర ప్రాంతములందును ఉండు చిన్న విమానాశ్రయములు దేశమునందలి ప్రయాణములకును, తక్కిన అరబ్ దేశముల ప్రయాణములకును ఉపయోగపడు చున్నవి.

**6. చరిత్ర :** సిరియా దేశమునకు ముఖ్య నగరమగు డెమాస్కస్, ప్రపంచమున నిరంతరాయముగ మనగలిగిన ప్రాచీన నగరములలోనెల్ల ప్రాచీనతమమని పేరొందినది. ఈ దేశపు పశ్చిమ ప్రాంత తీరభూములు ప్రాచీన కాలముననే ఫినీషియనుల ఆధ్వర్యవమున నాగరికతకును, సంపదలకును నిలయములై, అంతటంతట హిట్టైట్, ఈజిప్షన్, అస్సీరియన్, పారసీక, తదితర విదేశీయుల దండయాత్రలకు క్రమమున లోనైనవి. క్రీ. పూ. నాలుగవ శతాబ్దిలో అలెగ్జాండర్ నాయకత్వమున గ్రీకులు ఈ ప్రాంతమును వశపరచుగొనగ, అలెగ్జాండరు మరణాంతరమున అది సెల్యూసిడుల రాజ్యమున అంతర్భాగముగ కొంతకాలము ఉండి, క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యమున చేరెను. వారి పరిపాలనా కాలమున అట క్రైస్తవ మతము వ్యాపించెను. క్రీ. శ. 637 లో డెమాస్కస్‌ను, తక్కిన దేశమును అరబ్ సేనలు వశపరచుకొని అట ఇస్లామును వ్యాపింపజేయుటయేగాక, అరబ్ భాషకును అట స్థానమును కల్పించినవి. ఉమ్మాయిద్ కలీఫాల కాలమున డమాస్కస్ నగరము ముస్లిం సామ్రాజ్యమునకు రాజధానిగ ఉండినది. క్రీ. శ. 750 లో బాగ్దాదును ముఖ్య నగరముగ అప్పటి కలీఫాలు చేసికొనినప్పటినుండి, సిరియా ప్రాముఖ్యముతగ్గి, 13 వ శతాబ్దిలో మంగోలు దండయాత్రలవలనను, తరువాత క్రైస్తవ ముస్లింమత యుద్ధములవలనను సంక్షోభితమై సర్వనాశనమైనది. క్రీ. శ. 16 వ శతాబ్దమున తక్కిన పశ్చిమాసియాతోపాటుగ ఇదియు టర్కీ సామ్రాజ్యమున అంతర్భాగమై, సిరియా రాష్ట్రమనుపేర ఉండినది. కాని ఆ సిరియా రాష్ట్రమున, ఇప్పటి సిరియాయేగాక, లెబనాన్, ఇస్రాయెల్, జోర్డాన్ చేరి ఉండెనవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున, ఫ్రాన్సునకు మాండేటరీ ప్రాంతముగ సిరియా, లెబనానులు లభించినవి. దేశప్రజలు ఆ మాండేటరీ ప్రభుత్వమును తిరస్కరించినను, తన బలముతో ఫ్రెంచి ప్రభుత్వము అట చాలకాలము నిలువగలిగినది. కడకు ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున 1946 లో ఫ్రెంచి ప్రభుత్వము దేశపు స్వాతంత్ర్యమును గుర్తించినది. స్వాతంత్ర్యము లభించినప్పటి నుండియు, పాలస్తీనా సమస్య మొదలగు వాని వలన, దేశమున అసంతృప్తి అంతటంతట చెలరేగుటయు విప్లవములుగ పరిణమించుటయు పెక్కుమారులు సంభవించినది. 1958 లో అప్పటి సిరియా ప్రభుత్వము, ఈజిప్టుతో తమ దేశమును రాజకీయముగ ఏకముచేయుటకు నిర్ణయించి, ఆ నిర్ణయమును అమలుపరచినది. కాని అనతికాలముననే రెండు దేశములమధ్య విభేదములేర్పడినవి. అంతట 1961 లో, సైనిక వర్గము జోక్యము వహించి, ప్రభుత్వమును వశపరచుకొని, ఈజిప్టునుండి దేశమును వేరు చేసినది. తరువాత పలుసారులు విప్లవములవలన అధికారము చేతులు మారినది. కడకు 1970, నవంబరు 13న హాఫేజ్ అల్ అసద్ అను సేనాని, అప్పటి అధ్యక్షుని తొలగించి, ప్రభుత్వాధికారమును వశపరచుకొనెను. 1967 లోను, 1973 లోను, ఇస్రాయెల్‌తో, తక్కిన కొన్ని అరబ్ రాజ్యములతో పాటుగ, సిరియాయును పోరాడినది. 1967 లో ఇస్రాయెల్ వశపరచుకొనిన గోలాన్ ఉన్నతభూములు ఇప్పటికిని ఇస్రాయెల్ వశముననే ఉన్నవి.

ఐ. రా. స. జోక్యము ఫలితముగ అట ఇపుడు యుద్ధవిరమణ అమలునందున్నది.

**7. పరిపాలన :** 1973 లో ఒక రాజ్యాంగ విధానము రూపొందింపబడి, ప్రజామోదమును పొందినది. అధ్యక్షుడు విధిగ ముస్లిం అయి యుండవలయునను నియమము కలదు; ఇస్లామిక న్యాయసంహితయే శాసన నిర్మాణమునకు మూల స్రోతస్సుగ వినియుక్తము కాగలదను నిర్ణయమును అంగీకరించు. అయినను ప్రజలకు అందరకు మతస్వాతంత్ర్య స్వత్వము కల్పింపబడినది. ఆ రాజ్యాంగమును అనుసరించి 1973, మే నెలలో జరిగిన ఎన్నికలందు, ప్రజాసభ యందలి 186 స్థానములలో 140 స్థానములు అభ్యుదయ వర్గమునకు దక్కినవి. అభ్యుదయ వర్గమనునది అరబ్ బాత్ పక్షము, సిరియన్ అరబ్ సోషలిస్ట్ యూనియన్, సోషలిష్టు యూనియన్, అరబ్ సోషలిస్టుపార్టీ, సిరియాకమ్యూనిస్ట్ పార్టీ అనువాని కలయికవలన రూపొందినది; తక్కిన స్థానములు స్వతంత్ర అభ్యర్థులకు లభించినవి. కార్యనిర్వహణాధికారము అధ్యక్షుని యందు న్యస్తమైయున్నది. అతడే బహుళసంఖ్యాక పక్షము నుంచి ఉపాధ్యక్షుని, మంత్రివర్గమును నియమించుకొని, పాలించును. మతవిషయిక వ్యక్తి స్వత్వముల నిర్ణయమునకై ముస్లిములకును, తదితరులకును వేర్వేరుగ కోర్టులు కలవు. తక్కిన పౌర, దండవ్యవహారముల పరిష్కారము ఆధునిక న్యాయ నిర్వహణ విధానమును అనుసరించి వివిధ స్థాయిలందు నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమునందలి యూదులు తప్ప, తక్కిన వారిలో ఉచిత వయస్కులగు పురుషులలో ప్రతివాడును, 30 నెలల సైనిక శిక్షణను పొందవలయునను నియమము కలదు. ఇస్రాయెల్‌తో సాగుచున్న వైరుధ్యమువలన దేశమును ఎల్లప్పుడు సైనికముగ సమాయత్తము చేసి యుంచుటకు, సోవియట్ రష్యా సాయమును ఈ దేశము, ఆయుధసామగ్రి సేకరణ విషయమునను, సైనిక శిక్షణయందును పొందుచున్నది. ఒక లక్షమంది సైనికులుకల భూతలసేనయు, 1,750 మందికల నావికసేనయు, 10,000 మంది యోధులతో, అత్యంతాధునిక విమానములను, ఆయుధములను కలిగియున్న వైమానిక దళమును దేశమునకు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు, దాని సంస్థాపనా కాలముననే, ఈ రాజ్యమునకు సభ్యత్వము లభించినది; కాని 1958 లో ఈజిప్టుతో ఈ దేశము రాజకీయముగ మేళనము చెందినపుడు, ఆ సభ్యత్వము అంతరించినది. తరువాత 1961 లో ఆ మేళనము రద్దయినటుల ఉభయదేశములును అంగీకరించిన వెనువెంటనే ఐ. రా. స. సభ్యత్వము సిరియాకు పునరుద్ధరితమైనది. భారతదేశముతోను, తక్కిన ప్రముఖ దేశములు అన్నింటితోను, ఈ దేశమునకు దౌత్య సంబంధములు కలవు. కాని ఇస్రాయెల్‌తో సాగిన యుద్ధమున ఆ దేశములు అనుసరించిన వైఖరియెడల నిరసనగ యు. స్టే. తోను, గ్రేట్ బ్రిటన్‌తోడను ఈ దేశము తన దౌత్యసంబంధములను తెగత్రెంపులు చేసికొనినది. (జూన్ 6, 1967).

**10. ఆర్థిక రంగము :** ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది; దేశవైశాల్యమున 45% వ్యవసాయ యోగ్యమైనది; కాని ఇందు మూడింట రెండు వంతులు మాత్రమే ప్రస్తుతమున సాగగుచున్నది. దేశమునందలి కార్మికజనమున మూడింట రెండు వంతులకు వ్యవసాయమే ఆధారము. 1958, 1963 లలో జారీ అయిన చట్టములను అనుసరించి

దేశమున వ్యవసాయిక సంస్కరణలును, భూస్వామ్యమున పరిమితియు అమలులోకి తేబడినవి. అంతేగాక నీటిపారుదలవసతులను అభివృద్ధి చేయుటకై యూఫ్రటీస్‌పైనను, పశ్చిమ ప్రాంతమునకు సమీపమున ఉన్న ఓరాన్‌టిస్ నదిపైనను క్రొత్తగ ఆనకట్టలు నిర్మింపబడుచున్నవి. ఇవి పూర్తిఅయినపుడు నీటివసతుల సౌకర్యము ఇప్పటి దానికి రెట్టింపు వైశాల్యమునకు (12 లక్షం హెక్టారులకు) లభింపగలదు. పంటలలో ఆహార ధాన్యములగు గోధుమ, బార్లీ, జొన్నలును, రొక్కపు పంటలగు ప్రత్తి, పొగాకులును, బీటు దుంపయు ప్రముఖములు. దేశము ఆహారధాన్యముల ఉత్పత్తి విషయమున స్వయంపోషకము; సస్యానుకూల వత్సరములందు, ఆహారధాన్యములను కూడ కొంతవరకు సిరియా ఎగుమతి చేయగలుగుచున్నది. ప్రత్తి ఎగుమతివలన దేశపు ఎగుమతుల మొత్తమున 34% లభించుచున్నది (1972-73). ఫలోత్పత్తియు, ముఖ్యముగ ద్రాక్ష, ఆలివ్ ఫలముల ఉత్పత్తి, గణనీయము.

దేశమున ఖనిజసంపత్తి ఎక్కువగలేదు; పెట్రోలుగనులను గనుగొనుటకై జరిగిన కృషి సఫలమై షవీదియా, కారాచుక్, రుమేలియాల నుండి ఉత్పత్తి 1968 మొదలుగ ఏ కొలదిగనో జరుగుచున్నను, దేశపు ఆర్థికవ్యవస్థపై దాని ప్రభావము గణనీయముగ కన్పట్టదు. అయినను ఇరాక్‌నుండి మధ్యధరాసముద్రతీరపు రేవునకు పెట్రోలును కొనిపోవు 'గొట్టము' (పైపులైను) ఈ దేశముద్వారా పయనించుచున్నది. ఈ సౌకర్యమునకై ప్రభుత్వము, ఇరాక్ ప్రభుత్వమునుండి సాలీనా 40 కోట్ల సిరియన్ పౌనులను రాబట్టుకొనుచున్నది. ఆహారవస్తువులకును, పొగాకునకును, ప్రత్తికిని సంబంధించిన పరిశ్రమలే దేశమునందలి ముఖ్య పరిశ్రమలని చెప్పదగును. కార్మికులలో 16% మాత్రమే వీనిని ఆశ్రయించి జీవించుచున్నారు. జలసహాయమున ఇచట విద్యుదుత్పత్తి జరుగుచున్నది; విద్యుదుత్పత్తి సమర్థత 216 వేల కి. వాట్లు. నదులపైన ఆనకట్టలు పూర్తియైన తరువాత ఈ సమర్థత విరివిగ పెరిగి 170 కోట్ల కి. వా. ను అందుకొనగలదు. దేశపు ఎగుమతుల విలువ 10,97,611 వేల సి. పౌనులు; దిగుమతుల విలువ 20,60,648 వేల సి. పౌనులు (1972). లోటును విదేశీయ ప్రభుత్వముల సాయమువలనను, పెట్రోలుపైపు లైనుపైని సుంకమువలనను ప్రభుత్వము పూరించుచున్నది. దేశమున ఎగుమతి దిగుమతుల వ్యాపారమును, బ్యాంకులును జాతీయములు చేయబడినవి. దేశపు బడ్జెటరీ వ్యయము 318.8 కోట్ల సి. పౌనులు (1972).

**11. సాంఘిక రంగము :** బాలబాలికలకు 14 వ సంవత్సరమువరకు 6 ఏండ్ల నిర్బంధ విద్యావిధానము అమలునందున్నది. ప్రాథమిక, ఉన్నత విద్యారంగమున క్రమేణ అభివృద్ధి సాధింపబడుచున్నది. విద్యాబోధన అరబ్బీలో జరుగుచున్నను, ఆంగ్ల, ఫ్రెంచి భాషలును బోధింపబడుచున్నవి. దేశపు మొత్తమున 12,47,399 మంది విద్యార్థులు పాఠశాలలలో చదువుచున్నారు (1970 - 71). అలెప్పోలోను, డెమాస్కస్‌లోను యూనివర్సిటీలు కలవు. ఈ రెండింట పఠించు విద్యార్థులసంఖ్య 38,734. అలెప్పో విశ్వవిద్యాలయమున ఆంగ్ల, ఫ్రెంచి భాషలలో బోధన నిర్వహింప బడుచున్నది. అలెప్పోనుండి 4ను, డెమాస్కస్‌నుండి 2 ను, హమానుండి ఒకటియు దిన పత్రికలు ప్రచురితములగుచున్నవి.

**12. యాత్రా సౌ. :** దేశమునందలి ప్రముఖ, చారిత్రక స్థలములను, క్రైస్తవ పవిత్ర భూములను దర్శించుటకు యాత్రికులు గణనీయ సంఖ్యలో దేశమును దర్శించుచున్నారు. 1971 లో అట్టివారి

మొత్తపుసంఖ్య 9,48,011. యాత్రికులకు సౌకర్యములను సమకూర్చుటకై ఒక ప్రభుత్వశాఖ పనిచేయుచున్నది.

**13**. **ప్రసిద్ధ పురుషులు :** 1. ఉమ్మాయిద్ కలీఫాలలో ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ (ప. 717-720) ముస్లిం ప్రపంచమునందు అంతటను, ఇస్లాంమత స్వచ్ఛతను పరిరక్షించినవాడుగా, సమ్మాన్యుడు; 2. మతయుద్ధముల కాలమందు వీరుడుగనే గాక, విజ్ఞుడుగను ఖ్యాతినిపొందిన సాలా అల్ దీన్ (క్రీ. శ. 1138 - 93) యొక్క మృతదేహము డెమాస్కస్ నగరమున ఖననము చేయబడి ఉన్నది.

---

# 36. సైప్రస్

**ముఖ్యనగరము :** నికోసియా, **జెండా :** తెల్లని భూమికపై ఆకుపచ్చరంగున చిత్రింపబడిన ఆలివ్‌శాఖలపై ఉన్న సైప్రస్ దేశపటము. **నాణెము :** సైప్రస్‌పౌను; ఇది 1000 మిల్లులు. **విభక్తములు :** 1. సైప్రస్ పౌను = రు. 18-00. **కొలతూకము :** బ్రిటిష్ పద్ధతి అమలులో ఉన్నను, క్రమముగ మెట్రిక్ పద్ధతి ముందునకు వచ్చుచున్నది. **కాలగణన :** సా. 2 గం. = భారత కాలమానమున 5 గం. 30 ని.



పటము : 36.

**1. ఉనికి మొ. :** మధ్యధరా సముద్రమున ఈశాన్య ప్రాంతమున ఉన్న ఈ ద్వీపరాజ్యము 34° 35' - 35' 41 ఉ. అ. మధ్యను, 32° 20 - 34° 35' తూ. తు. మధ్యను విస్తరించి యున్నది. ముఖ్యమగు సైప్రస్ ద్వీపమేగాక 'క్లిథిస్' అను అల్పద్వీప సమూహమును ఈ రాజ్యమునచేరి యున్నది; దేశపు మొత్తపు వైశాల్యము 9,251 చ. కి. మీ. సైప్రస్ ద్వీపము టర్కీతీరమునకు 70.5 కి మీ. దక్షిణమునను, ఈజిప్టుతీరమునకు ఉత్తరమున 368 కిమీ. దూరమునను ఉన్నది. ద్వీపపు గరిష్ఠపు నిడివి 225 కిమీ; గరిష్ఠపు వెడల్పు 96 కిమీ. ద్వీపపు ఈశాన్య కొన పొడవుసాగి, ద్వీపకల్పరూపమున, 73 కిమీ. పోవుచున్నది; ఆ ద్వీపకల్పపు వెడల్పు ఎక్కడను 16 కిమీ. ను మించదు. నైరుతి యందున్న ట్రూడోస్ మాసిఫ్ పర్వతశ్రేణియందలి అత్యున్నతమగు ఒలింపస్ శిఖరపు ఎత్తు 195 కిమీ. ఈ శ్రేణినుండి చీలిన గుట్టలవరుసలు వాయవ్య, ఉత్తర, దక్షిణ తీరములను చేరుచున్నవి ఉత్తరమున ఉన్న కైరీనియా పర్వతశ్రేణి తీరము వెంబడిన 160 కిమీ. పయనించును; ఇందు అటనట కొలది ఎత్తుగల శిఖరములు కననగును. ఈ ఉభయ శ్రేణులును ద్వీపమున అధికభాగమును ఆక్రమించినవి. ఈ రెండుశ్రేణులమధ్య, పడమటనున్న మార్ఫూ అఖాతమునుండి తూర్పున ఉన్న ఫమగుస్తా అఖాతమువరకు వ్యాపించిన, సన్నని మైదానము కలదు. ఈ మైదానపు వెడల్పు 16

నుండి 32 కిమీ. వరకు మారుచుండును. ద్వీపమున ఉన్న సారవంతభూమిలో అధికభాగము ఈ మైదానముననే కలదు; చెప్పుకొనదగిన పరిమాణముగల నదులుగాని, సరస్సులుగాని, ఆ ద్వీపమున లేవు. అపుడపుడు స్వల్పముగ భూకంపములకును దేశము లోనగుచుండును.

**2. శీతోష్ణస్థితి** మొ. : ఎండకాలమున ఎండలు కొన్ని ప్రాంతములందు 100° ఫా. వరకు పోయినను, సముద్రపు సాన్నిహిత్యమువలన వేడి దుర్భరముగ ఉండదు. శీతకాలము సమశీతోష్ణముగ ఉండును. దేశమున సరాసరి ఉష్ణోగ్రత 68° ఫా. వర్షపాతము ప్రదేశములను అనుసరించి సాలుసరిన పశ్చిమమున 30 సెం. మీకు తక్కువగను, దక్షిణమున పర్వతశ్రేణులందు 112.5 సెం మీ. పైబడియు ఉండును. దేశము సహజముగ వృక్షమయము, పర్వతశ్రేణులందు దట్టములగు అడవులు - దేవదారు వృక్షములు కలవి-కననగును. మైదానమున వేసి పెంచబడిన యూకలిప్టస్ వృక్షములు విరివిగ కలవు. తుర్కీలో కన్పట్టు వన్యజంతువుల కోవకు చెందినవియే ఈ దేశమున కన్పట్టును.

**3. జనసంఖ్య** మొ. : దేశపు జనసంఖ్య 6,45,000 (1972 అంచనా); ఇందు గ్రీకులు 5,28,000; తుర్కులు 1,17,000 దేశమందలి నగరములలో నికోసనియా (జ.సం. 1,18,100), లీమాసోల్ (జ. సం. 44,000), ఫమగుస్తా (జ. సం 44,000) ప్రముఖములు. జనులలో 77.2% గ్రీక్ అర్తొడాక్సు చర్చికి చెందిన క్రైస్తవులు, 18.2% సున్నీ ముస్లిములు, తక్కినవారు అత్యల్ప సంఖ్యలలో 4.6% ఉన్నారు. గ్రీకులకు గ్రీకుభాషయు, తుర్కులకు తుర్కీభాషయు మాతృభాషలుగ వ్యాప్తియందున్నను, ఇంగ్లీషు భాషకు విరివిగ ప్రచారము కలదు. గ్రీకు, తుర్కీభాషలు రెండును అధికార భాషలుగా పరిగణింపబడు చున్నవి.

**4. సమాచార సౌ.** : దేశమున 30 తపాలా ఆఫీసులును, 587 తపాలా ఏజెన్సీలును కలవు. నగరములందును, కొన్ని పెద్ద గ్రామములందును, టెలిఫోను సౌకర్యములు కలవు. 12 టెలిగ్రాఫ్ ఆఫీసులు కలవు. నికోసియాలో ఒక రేడియో ప్రసార కేంద్రమును, ఒక టెలివిజన్ ప్రసార కేంద్రమును పనిచేయుచున్నవి. దేశమున 1,70.500 రేడియోసెట్లును, 70,000 టెలివిజన్ సెట్లును వాడుకలో కలవు (1972, డిసెంబరు).

**5. యాన సౌ.** : దేశమున 5,888 కిమీ. నిడివిగల రోడ్డుమార్గములు కలవు ఇందు 623 కిమీ, ఉత్తర స్థాయికి చెందినవి. దేశమున రైలు మార్గములులేవు; బస్సు, కార్ల సౌకర్యము విస్తారముగ కలదు. దేశపు రేవులలో అత్యంత ప్రముఖమైనది ఫమగుస్తా; సహజముగ రూపొందిన విశాల నౌకాశ్రయము ఇచట కలదు. ఆ తరువాత లెక్కకువచ్చునవి లార్నకా, లీమాసోల్ నగరములందలి నౌకాశ్రయములు. నికోసియాలో ఉత్తమశ్రేణికి చెందిన విమానాశ్రయము కలదు; అటనుండి పలుదేశములకు పయనించు సౌకర్యము కలదు.

**6. చరిత్ర** : క్రీ. పూ. 1500 ప్రాంతమున గ్రీకులకు వలస ప్రాంతముగ వర్తిల్లినది ఈ ద్వీపము. అటనుండి క్రమముగ చారిత్రకగతిలో పారసీక, రోమక, ప్రాచ్యరోమక సామ్రాజ్యములలో అంతర్భాగమైనది; క్రీ. శ. 1571 లో, తుర్కులు దీనిని జయించి వశపరచుకొనిరి. తదనంతరమున 1878 లో ఒక ఒడంబడికద్వారా బ్రిటిష్‌వారి పరిపాలనకు ఈ ద్వీపము అప్పగింపబడగ, 1925 లో దానిని సంపూర్ణముగా బ్రిటన్ వశపరచుకొనినది. రోమనుల పరిపాలనా కాలమున

ఇట క్రైస్తవమతము వ్యాపించినది; తుర్కుల పరిపాలనా కాలమున ఉద్యోగ వ్యాపారముల నిమిత్తమై తుర్కీముస్లిములు పలువురు ఇట స్థిరనివాసము ఏర్పరచుకొనిరి. వారి సంతతివారే ఈ దేశమునందలి ఇప్పటి తుర్కులు. ద్వీపమునందలి గ్రీకు సంతతివారు తొలుతటి నుండియు గ్రీసునే తమ మాతృదేశముగ భావించి, ఆ గ్రీసురాజ్యమున సైప్రస్ చేరవలెనని ఆందోళనను సాగించగ, తుర్కులు దానిని ప్రతిఘటించిరి. బ్రిటన్ ఈ సమస్యను పరిష్కరించుటకు ఎంతయో కృషి చేసినది; గ్రీకుల పక్షమును గ్రీసు దేశమును, తుర్కులపక్షమును తుర్కీయును అవలంబించుటవలన సమస్య క్లిష్టతరమైనది. కడకు ఈ ద్వీపము ప్రత్యేక ప్రతిపత్తిగల ఒక స్వతంత్రరాజ్యముగ ఏర్పాటగుటకు ఒడంబడిక జరిగి, దేశమునకు 1960, ఆగస్టు 16 న స్వాతంత్ర్యము లభించినది. ద్వీపపు స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుటకు బాధ్యతవహించిన బ్రిటన్, గ్రీస్, తుర్కీదేశములు తమ సైనిక దళములను ఉపయోగించి చర్యలను తీసికొనుటకు అధికారము పై ఒడంబడికద్వారా లభించినది. అంతట మకారియోస్ అను క్రైస్తవ మత పీఠాధిపతి ఆధ్వర్యవమున గణతంత్ర ప్రభుత్వము ఏర్పడినది. రాజ్యాంగవిధానమున తుర్కులకు తగు రక్షణ లున్నను, ఉభయజాతుల మధ్యగల వైషమ్యముల వలన అంతసుంతట కలతలు తప్పలేదు. కడకు వైషమ్యములు పెచ్చుపెరిగి, 1963 నుండి తుర్కు ప్రతినిధులు శాసనసభను బహిష్కరించిరి. అంతట తుర్కీ అభ్యర్థనపై, సైప్రస్ సమ్మతితో, దేశమును ఐ. రా. స. తన భద్రతా దళములను నిలిపినది (1964). దీనివలనను ఫలితము కన్పట్టలేదు. అందులకు తోడుగ గ్రీసులో ఏర్పడిన సైనికప్రభుత్వము సైప్రస్‌లోని గ్రీకు తీవ్రవాదులకు ప్రోత్సాహమొసగినది. అంతట, మకారియోస్‌ను పదభ్రష్టునిజేసి ద్వీపమును గ్రీసున కలుపవలయునను తీవ్రవాదులు, సైనికుల సహాయముతో మకారియోస్ ప్రభుత్వమును కూలద్రోయగ (1974, జులై 15) మకారియోస్ విదేశములకు పోవలసివచ్చెను. పరిస్థితులు అంతటి నుండి త్వరితగతిలో విషమించినవి; తుర్కీ తన సైన్యములను దేశమున దింపి తుర్కులు నివసించు భూభాగమును వశపరచుకొనినది. ఐ. రా. స. జోక్యము వహించి యుద్ధవిరమణను సాధించినది. ఇంతలో గ్రీసున సైనిక ప్రభుత్వము పతనమగుట వలన సైప్రస్‌లోను తీవ్రవాదుల ప్రతిష్ఠ సన్నగిల్లి దేశమునకు మకారియోస్ తిరిగి వచ్చుటకు పరిస్థితులు అనుకూలించినవి (1974, డెసెం, 7). కాని దేశ రాజకీయ పరిస్థితి మాత్రము కుదుటబడలేదు.

**7. పరిపాలన :** 1960 లో అమలునకు వచ్చిన రాజ్యాంగ విధానమును అనుసరించి శాసన నిర్మాణాధికారము 50 మంది సభ్యులుకల ప్రతినిధి సభయందు న్యస్తము. ఈ సభ్యులలో 35 మందిని గ్రీకులును, 15 మందిని తుర్కులును ఎన్నుకొనెదరు. అధ్యక్షుడు గ్రీకుపౌరుడుగను. ఉపాధ్యక్షుడు తుర్కు పౌరుడుగను ఉండవలయునను నియమము కలదు. కాని 1963 నుండి తుర్కులు శాసనసభలను బహిష్కరించుటవలనను, 1974 లో దేశమే పోరాటమువలన కల్లోలిత మగుటవలనను ప్రస్తుతమున రాజ్యాంగము ఎట్టిదియు అమలున లేదని చెప్పవచ్చును.

**8. దేశరక్షణ :** 1964 లో ఆరుమాసముల నిర్బంధ సైనిక శిక్షణ ప్రవేశపెట్టబడి, 1967 లో దాని పరిమితి 24 నెలలకు పెంచబడినది. 1964 లోనే ఒక జాతీయ రక్షకదళము, ఆధునికరీతి ఆయుధ పరికరములతో రూపొందింపబడినది. 1960 ఒడంబడికను అనుసరించి 21000 సైనికులు గల సేనను ఈ దేశము కలిగియుండు ఏర్పాటు

కలదు. అందు 60% గ్రీకులును 40% తుర్కులును ఉండవలయును. కాని 1963 మొదలుగ తుర్కుల సహాయ నిరాకరణవలన గ్రీకులే 15,000 మందిగల సైన్యము రూపొందినది; తుర్కులును స్వయముగ 5,000 మందిగల సేనను రూపొందించుకొనిరి.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు దేశమునకు సభ్యత్వము కలదు; భారత దేశముతోను తక్కిన ప్రముఖ దేశములతోను దౌత్యసంబంధములు కలవు.

**10. ఆర్థికరంగము :** దేశమున ఉత్పత్తిలో వ్యవసాయ, మత్స్యపరిశ్రమలు, అటవీసంపత్తుల వలన 21.3%, ఖనిజోత్పత్తి, విద్యుత్తు పరిశ్రమల వలన 19.7%; వ్యాపారమువలన 14.4%, తక్కిన సేవాపసతులవలన మిగిలిన శాతము లభించుచున్నది. ఎగుమతులలో ముఖ్యమైనవి ఇనుప, రాగి ముడిఖనిజములు. దేశపు ఎగుమతుల విలువ 51,305 వేల పౌనులు; దిగుమతుల విలువ 121,480 వేల పౌన్లు; వెరశి జాతీయోత్పత్తి 26.74 కోట్ల పౌనులు. బడ్జెటరీవ్యయము 4,22,95,093 పౌనులు (1972). తలసరి అదాయము 222.2 పౌ. (1968). దేశమున ప్రభుత్వమునకు చెందిన ఒక కేంద్రబ్యాంకును, దాని శాఖలును, విదేశములకు చెందిన నాలుగు పెద్ద బ్యాంకులును పనిచేయుచున్నవి.

**11. సాంఘికరంగము :** గ్రీకులకు చెందిన 555 ప్రాథమిక పాఠశాలలలో 63,605 విద్యార్థులును, తుర్కులకు చెందిన 167 ప్రాథమిక పాఠశాలలలో 16,014 విద్యార్థులును కలరు. మాధ్యమిక పాఠశాలలు గ్రీకులకు 58 సు, తుర్కులకు 18 కలవు. ఇందు గ్రీకువిద్యార్థుల సంఖ్య 43,374; తుర్కులు 7,190; వృత్తిపాఠశాలలు గ్రీకులకు 5 (విద్యార్థి సంఖ్య 4,465), తుర్కులకు 7 (విద్యార్థి సంఖ్య 766) కలవు (1972 - 73). దేశమున 2,946 శయ్యలుకల 107 ఆసుపత్రులు కలవు. ఉద్యోగములలో ఉన్నవారికిని, స్వయం ఉపాధివలన జీవించువారికిని వర్తించు నిర్బంధ సాంఘిక భద్రతా భీమా విధానము అమలున ఉన్నది. దేశమునందలి 14 దినపత్రికలలో 10 గ్రీకునకు, రెండు తుర్కీభాషలోను, ఇంగ్లీషన రెండును వెలువడుచున్నవి. నికోసియాయందలి ప్రాచీనావశేషముల మ్యూజియం గణనీయము.

**12. యాత్రా సౌ. :** దేశమునందలి చారిత్రాత్మకములగు చర్చిలను దర్శించుటకు అనేకులు దేశమును దర్శించుచున్నారు, 1972 లో ఇట్టివారి సంఖ్య 2,28,309 యాత్రికులవలన దేశమునకు ఆదాయము 1 36 కోట్ల పౌనులు.

---

# 37. సైషెల్లిస్

**ముఖ్యనగరము :** విక్టోరియా; **జెండా, జాతీయ గీతము :** కొలది కాలము క్రిందటనే దేశము స్వతంత్రమగుటవలన వివరములు తెలియవు; **నాణెము :** సైషెల్లిస్ రూపాయి, ఒక సై. రూపాయి. = రు. 1-35; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 4 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** హిందూ మహాసముద్ర

మున 3°40'—6°5' ద. అక్షాంశ రేఖల మధ్యను, 53°55'-59°10' తూ. తులారేఖల మధ్యను నెల కొన్న ఈ ద్వీపజాలపు రాజ్యమున. మొత్తము మీద 89 చిన్న ద్వీపములు చేరి ఉన్నవి. వీనిలో మాహీ (146 చ. కిమీ). అనునది అన్నింట పెద్ద ద్వీపము; దీనియందే ముఖ్యనగరము ఉన్నది. ద్వీపముల మొత్తపు వైశాల్యము 277 చ. కిమీ. ఈ ద్వీపములన్నియు అగ్నిశైలజములు.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఆగ్నేయ వ్యాపార పవనముల ప్రభావమువలన ఇచట శీతోష్ణస్థితి సంవత్సరమున చాల కాలము (మే నుండి నవంబరు వరకు) సౌమ్యముగ ఉండును. గ్రీష్మఋతువున విరివిగ వానలు కురియును (నవంబరు-ఏప్రిల్).

**3. జనసంఖ్య మొ. :** 1971 లోని లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 52,650. ఇందు దాదాపు 85% మాహీద్వీపమున వసించుచున్నారు. అత్యధిక సంఖ్యాక ప్రజలు క్రియోల్ అను మిశ్రజాతికి-యూరపియనులు. ఆఫ్రికనులు సంకరత చెందిన జాతికి—చెందినవారు. యూరపియనులును. చీనీయులును, భారతీయులును, చాల కొలది సంఖ్యలలో కలరు, ముఖ్యనగరమగు విక్టోరియా యందలి జనసంఖ్య దాదాపు 14 వేలు. ప్రజలలో సంకరపు ఫ్రెంచిభాష (క్రియోల్) వ్యాప్తియందు విరివిగ ఉన్నను విద్యాబోధన ఆంగ్లముననే సాగుచున్నది.

**4. సమాచార సౌ. :** దేశమునకు మారిషస్, టాంజానియా, ఏడెన్, శ్రీలంకలతో సరాసరిన టెలిగ్రాఫ్ సంబంధము కలదు. దేశమున టెలిఫోనుద్వారా వార్తాసౌకర్యము కలదు; లండన్ ద్వారా టెలెక్స్ సంబంధము ప్రపంచపు ప్రముఖ రాజ్యములు అన్నింటితో ఏర్పడి ఉన్నది.

**5. యాన సౌ. :** మాహీయందు 173 కి. మీ. ల నిడివిగల రోడ్డువసతి కలదు. ఇందు 117 కిమీ. సిమెంట్ చేయబడినది; తక్కిన దీవులలో ప్రాస్లిన్: లాడిగూ అను వాని రెండింట కలసి 417 కి, మీ. రోడ్డుమార్గములు కలవు; విక్టోరియాయందు చక్కని హార్బరు కలదు; ప్రాచ్య, దక్షిణ ఆఫ్రికా దేశములనుండి, భారత ప్రాచ్య ఆసియా దేశములకు పయనించు వ్యాపార, ప్రయాణిక నౌకలకు ఈ హార్బరు ఒక మజిలీగ ఉపకరించుచున్నది. విక్టోరియాయందే అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. దీనివలన ఈ రాజ్యమునుండి తక్కిన ప్రపంచ రాజ్యములకు విమానయాన సౌకర్యము లభించినది.

**6. చరిత్ర :** తొలుత జనావాస రహితముగ ఉండిన ఈ ద్వీప సముదాయమును 1505 లో పోర్చుగీజు నావికులు కనుగొనిరి. కాని వారచట స్థిర నివాసమును ఏర్పరచుకొనక పోయినందు వలన, కాలక్రమమున అది ఓడదొంగలకు శరణ్యముగ పరిణమించినది. 18 వ శతాబ్ది మధ్యభాగమున ఫ్రెంచివారు దీనిని వశపరచుకొని ఇట మసాలా ద్రవ్యముల పంటను అభివృద్ధి చేయుటకై నీగ్రో బానిసలను చేర్చిరి. 1794 లో బ్రిటిష్‌వారు దీనిని వశపరచుకొని, 1810 లో తమ అధీనమున ఉన్న మారిషస్ రాజ్యమున పరిపాలనారీత్యా అంతర్భాగముగ చేసిరి. 1814 లో ఒక ఒడంబడికవలన ఫ్రెంచివారు లాంఛనముగ తమ హక్కులను బ్రిటిష్‌వారికి సంక్రమింపజేసిరి. 1903 లో, మారిషస్‌నుండి విడివరచి, ఈ ద్వీపరాజ్యమును ప్రత్యేక వలసగా బ్రిటిష్‌వారు చేసిరి. 1965 లో ఈ ద్వీప సముదాయమునుండి మూడు ద్వీపములను వేరుపరచి 'చాగోస్ ద్వీపరాజ్యము' అను వేరొక వలసను ఏర్పరచి, తక్కిన 89 ద్వీపములను సైషెలిస్ రాజ్యముగ పునర్నిర్మించిరి. తొలుత బ్రిటిష్ గవర్నరు పాలనలో ఉండిన ఈ రాజ్యము, కాలక్రమేణ ప్రపంచపు రాజకీయ పరిణామముల ఫలితముగ, జూన్ 28, 1976 న స్వతంత్రతను

పొంది, కామన్‌వెల్తున సభ్యత్వమును మాత్రము నిలుపుకొనినది.

**7. పరిపాలన :** 15 మంది ఎన్నిక సభ్యులు కల ఒక శాసనసభ కలదు. వలసగ ఉన్నపుడు ప్రధాన మంత్రిగా ఉండిన, జేమ్స్ మంచన్ ప్రస్తుతమున స్వతంత్రదేశమునకు అధ్యక్షుడై, శాసన సభకు బాధ్యతవహించి పాలించుచున్నాడు. దేశమున సైషెల్లిస్ డెమొక్రాటిక్ పార్టీ, సైషెల్లిస్ పీపుల్స్ యునైటెడ్ పార్టీ అను రెండు రాజకీయ పక్షములు కలవు. బ్రిటిష్ విధానమును అనుసరించి న్యాయపాలన నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** దేశపు ఆంతరంగిక శాంతి భద్రతలంకై ఒక పోలీసు దళము కలదు. ఇందలి జనసంఖ్య 362.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. సభ్యత్వమునకై కృషి చేయుచున్నది.

**10. ఆర్థిక రంగము :** కొబ్బరి చెట్ల పెంపకముపై దేశపు ఆర్థిక వ్యవస్థ అంతయు ఆధారపడి ఉన్నదని చెప్పవచ్చును, దేశపు ఎగుమతులలో దాదాపు 70% కొబ్బరి పంటకు సంబంధించినవియే, ఆ తరువాత లెక్కకు వచ్చునవి దాసానిచెక్క, యాలకులు, ఆహారధాన్యములను విదేశములనుండి ఈ దేశము దిగుమతి చేసికొనుచున్నది. పశుసంపదను వృద్ధిచేయుటకై కృషి జరుగుచున్నది. పరిశ్రమలును కొబ్బరి ఉత్పత్తుల పైననే ఆధారపడి ఉన్నవి. చేపల పరిశ్రమను అభివృద్ధి చేయుటకు ప్రత్యేక కృషి జరుగుచున్నది. విద్యుత్ సరఫరా. ముఖ్యనగరమున మాత్రమే కలదు. దేశపు ఎగుమతుల విలువ రు. 79,15,770; దిగుమతుల విలువ రూ. 5,40,03,246 (1971). బడ్జెటరీవ్యయము రూ. 5,31,08,341; ఇందు దాదాపు 40% అభివృద్ధి కార్యక్రమాలకు వినియుక్తము.

**11. సాంఘిక రంగము :** ప్రాథమిక విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. దేశపు మొత్తమున 10,073 మంది విద్యార్థులు ప్రయిమరీ విద్యను, 2,512 మంది సెకండరీ విద్యను, 389 మంది వృత్తివిద్యను, 77 మంది విదేశములందు ఉన్నత విద్యను పఠించుచున్నారు. (1972). వైద్యసహాయమునకై 5 ఆస్పత్రులు కలవు. వీనిలో శయ్యాసంఖ్య 348; డాక్టర్ల సంఖ్య 16.

**12. యాత్రా సౌ. :** ప్రకృతి రమణీయతకు, ఈ ద్వీపములు చాల పేరొందినవి; కావున విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకై ప్రభుత్వము కృషిని మొదలిడినది; అందులకై పెక్కు వసతులను కలిగించినది. 1971 లో 3,175 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

---

# 38. సౌదీ అరేబియా

**ముఖ్యనగరము :** రియధ్; **జెండా :** ఆకుపచ్చ భూమికపై తెల్లని అరబ్బీ అక్షరములతో 'లా ఇల్లాల్లాహ్...' అను కురాన్ సూక్తియు, ఆ సూక్తి క్రింద ఒక తెల్లని ఖడ్గపు చిత్రమునుకలది జాతీయ పతాకము; **జాతీయ గీతము :** స్వరము మాత్రమే కలదు; **నాణెము :** సౌదీ రియాల్, సౌకర్యార్థమై 20 కర్షలుగ ఇది విభక్తము (రియాల్ = రు. 1.67); **కొలతూకములు :** మెట్రిక్ విధానమునకు

సాధికారక పరిగణన కలదు. **కాలగణన :** సా. 3 గం. 30 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** అరేబియన్ ద్వీపకల్పమున, అత్యధిక భూభాగమును లోగొనిన ఈ దేశము 16°23′ – 32°14′ ఉ. అక్షాంశరేఖల మధ్యను, 34°30′-56°22′ తూ. తులారేఖలమధ్యను నెల కొని యున్నది. ఉత్తరమున జోర్డాన్, ఇరాక్‌లును; ఈశాన్యమున కువాయిట్‌ను; తూర్పున పారసీక సింధుశాఖయు, కటారును; ఓమన్ రాజ్యమును; దక్షిణమున ఓమన్, యెమెన్ జనతా ప్రజాస్వామ్య గణరాజ్యమును; నైఋతిన యెమెన్ అరబ్ గణ




పటము 37.

రాజ్యమును; పశ్చిమమున ఎర్రసముద్రమును, అకాబా సింధుశాఖయు సరిహద్దులందున్నవి. పారసీక సింధుశాఖవైపున 480 కిమీ. పొడవునను, ఎర్రసముద్రమువైపున 1,760 కిమీ. పొడవునను తీరరేఖ కలదు. దేశపు వైశాల్యము, ప్రభుత్వపు అంచనాను అనుసరించి, 21,24,800 చ. కిమీ; కువాయిట్ వైపునను, ఇరాక్ వైపునను రెండు తటస్థమండలములు కలవు; ఇందు ప్రతిదానిలోను సమష్టిన సగముపై సౌదీ అరేబియా - అధికారమును నిర్వహించుచున్నది. భౌతికముగ ఈ దేశమును అయిదు ప్రత్యేక ప్రాంతములుగ విభజింప వచ్చును : (1) తిహమా అని వ్యవహరింపబడుచు ఎర్రసముద్రపు తీరము పొడవుననున్న సన్నని మైదానపు భూమి (2) తిహమాకు సమాంతరముగ నడచెడు హిజాజ్ పర్వతశ్రేణి; దీనియందలి అత్యున్నత శిఖరము దక్షిణమున 'ఆశిర్'లో ఉన్నది (ఎత్తు 2,640). (3) నజద్ అనబడు పీఠభూమి; దీనికి ఉత్తరమున అల్ నఫూద్ అనబడు ఎడారియు పశ్చిమమున దహన్ అనబడు ఎడారియు, దక్షిణమున రుబ్-అల్-ఖాలీ అనబడు ఎడారియు కలవు. (4) 'హసా' అనబడుచు, దహని ఎడారికి తూర్పున, అంతగ ఎత్తుగనుండని పీఠభూమి వేరొకటి. (5) పై భూభాగము క్రమముగ దిగజారుటచే, పారసీక సింధుశాఖ తీరమున ఏర్పడిన నిమ్నభూమి. మొత్తపు దేశమున మూడవవంతు ఎడారి భూమి. ఈ ఎడారులలో పెద్దదియగు రుబ్-అల్-ఖాలీ వైశాల్యము 6,40,000 చ. కిమీ. అటనట తూర్పు ప్రాంతములందు కన్పట్టు పాతాళగంగ (ఊట) ధారలుతప్ప, నిరంతరముగ పారెడు జలాధారములు వేరుగ ఎట్టివియు లేవు.

**2 శీతోష్ణస్థితి మొ. :** దేశమున సర్వే సర్వత్ర ఎండలు ఎక్కువ; ఎండకాలమున దేశ మధ్యభాగమున అత్యధిక ఉష్ణోగ్రత 130° ఫా. వరకు పోవును; తీరప్రాంతమున మాత్రము కొంత తక్కువ; శీతకాలమున అత్యల్ప ఉష్ణోగ్రత 60°—70° ఫా. మధ్య ఉండును. రాత్రింబవళుల ఉష్ణోగ్రతలమధ్య విపరీత వ్యత్యాసము కన్పట్టును. ఇసుక తుపానులు, ధూళిపాతములు తరచుగ కన్పట్టును. దేశమున సాలుసరి సరాసరి వర్షపాతము 10 సెం. మీ; ఆశిర్‌లోని పర్వతసీమయందు మాత్రము 25 నుండి 50 సెం. మీ. వరకు వర్షము పడుచుండును. దేశమున ఎక్కువ భాగమున చెట్టు చేమలు కన్పట్టవు; ఉన్నచోటుననైన ఖర్జూరజాతి చెట్లు మాత్రమే కననగును; వన్యజంతువులలో

చినతపులికన్న పెద్దవి ఏవియుకనపట్టవు. అరేబియా దేశపు ఒంటెలును, గుర్రములును నాణ్యతకు పేరొందినవి.

**3. జనసంఖ్య మొ.** : దేశమున జనాభా లెక్కల సేకరణ ఏనాడును జరుగలేదు ఐ. రా. స. అంచనాలను (1972) అనుసరించి దేశపు జన సంఖ్య 81,99,000. దేశపు ప్రముఖ నగరము లలో రియధ్ (జ. సం. 2,25,000), జెడ్డా (జ. సం. 1,94,000), మక్కా (జ. సం. 1,85,000) పేర్కొనదగినవి. దాదాపుగ ప్రజ లందరును అరబ్బీ జాతివారు; నీగ్రో జాతివారు అటనట మొత్తముమీద పదిలక్షలలోపున ఉన్నారు. ప్రజలందరి మాతృభాష అరబ్బీ దేశీయులందరును ముస్లిములు; అందును అత్యధిక సంఖ్యాకులు సున్నీ సంప్రదాయమువారు; వీరందరును, వాహబీ అను పేర 18 వ శతాబ్దాన తేబడిన ఒక సంస్కరణను అనుసరించుచు, ఇస్లామున సనాతన సిద్ధాంతము లను ఆదరించుచున్నారు.

**4. సమాచార సౌ.** : ప్రభుత్వపు ఆధ్వర్య వమున తపాలా, తంతి, టెలిఫోను, కేబిల్, వైర్ లెస్ సౌకర్యములు అధునాతన రీతిలో ఇట నిర్వ హింపబడుచున్నవి. తక్కిన అరబ్ దేశముల తోను, పశ్చిమ యూరప్‌తోను, యు. స్టే. తోను, ఈ దేశము రేడియో టెలిఫోను సంబంధమును కలిగియున్నది. దేశపు నగరములమధ్య సైతము సాధారణ టెలిఫోను మాత్రమేగాక రేడియో టెలి ఫోను సౌకర్యముకూడ కల్పింపబడినది. రియధ్, జెడ్డా నగరములలో రేడియో ప్రసార స్థావరములు పనిచేయుచున్నవి. జెడ్డాలోను, తూర్పు రాష్ట్రము నందును టెలివిజన్ ప్రసార కేంద్రములు కలవు. జనసంఖ్య ఎక్కువగా ఉండకపోయినను దేశమున దాదాపు 15 లక్షల రేడియో సెట్టులును, 10 లక్షల టెలివిజన్ సెట్టులును కలవు.

**5. యాన సౌ.** : దేశ మధ్యమున రాకపోక లకు, కొలదికాలము క్రిందటివరకు, ఒంటెయే ముఖ్య సాధనముగ ఉండినను, క్రమక్రమముగ దేశ మున పలు ప్రాంతములందు రోడ్లు వేయబడి, అందు నడచు మోటారు వాహనముల సంఖ్య నానాటి పెరుగుచున్నది. పక్కారోడ్ల మొత్తపుపొడవు 7,528 కి. మీ; కచ్చారోడ్ల పొడవు 8,320 కి.మీ. పారసీక సింధుశాఖా తీరమునఉన్న అల్‌దమ్మామ్‌నుండి రియధ్‌కు 560 కి.మీ. పొడవున రైలుమార్గము కలదు. ఎర్రసముద్రపు తీరమునఉన్న జెడ్డా, యన్ బూలును, పారసీక సింధుశాఖా తీరమునఉన్న దమ్మామ్ పేరొందిన పెద్ద రేవుపట్టణములు. ధరన్, జెడ్డా, రియాధ్‌లలోను, ఇంకను 19 కేంద్రము లందును విమానాశ్రయములు కలవు. అరబ్ దేశ ములతోను, ఇస్తాన్‌బుల్, కరాచి, బొంబాయిలతోను ఈ దేశమునకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర** : వేలకొలది సంవత్సరములనుండి సెమిటిక్ జాతికి నిలయముగఉన్న ఈ దేశము క్రీ. శ. ఆరవ శతాబ్దపు చరమ పాదమున అవత రించిన మహమ్మద్ ప్రవక్తవలన, ప్రపంచ చరి త్రలో ఒక ప్రముఖ పాత్రను నిర్వహింపగలిగినది. ప్రవక్త ప్రవచించిన ఇస్లామ్‌మతము అనతికాలము ననే దేశమున ఎల్లెడల వ్యాపించుటయేగాక, ఆ మతానుయాయుల కృషివలన ఏడవ శతాబ్ది తొలి పాదము గడచుటకు పూర్వమే ఆఫ్రికా పశ్చిమ తీరము మొదలుగ తూర్పున సింధునదివరకు వ్యాపించినది. అటుల మత వ్యాప్తితోపాటుగ రూపుగొనిన అరబ్ సామ్రాజ్యము నాగరికతా వ్యాపనమున ఎంతయో కృషిచేసినది. కాని, ఆ సామ్రాజ్యపు కలిఫాలు అనతికాలముననే తమ రాజ ధానులను వేరుదేశములకు తరలించుటవలనను, తరువాత వచ్చిన తక్కిన ముస్లిం సామ్రాట్టులకు అరేబియా దేశపు అభివృద్ధిలో ఆసక్తి లేకపోవుట వలనను, ముస్లిం పుణ్యక్షేత్రములగు మక్కా, మదీ నాలుతప్ప, తక్కిన అరేబియా భూభాగమునకు

ప్రాముఖ్యము అంతరించినది. తరువాత 18వ శతాబ్దిలో సౌదీ కుటుంబపువాడగు మహమ్మద్ ఇబ్న్ సౌద్ దేశమును సమైక్యము చేయుటకు కృషి చేసెను. ఇస్లాముని సనాతనాచారములను పునరుద్ధరించి దానిని సంస్కరించుటకు పూనుకొనిన మహ్మద్ బిన్ అబ్ద్ అల్ వాహబ్ అతనికి తోడయ్యెను. వీరిరువురి కృషివలన రాజ్యము క్రమముగ విస్తృతి చెందుటయేగాక, వాహబీ సంస్కరణ వాదమును దానిని వ్యాపించెను. మహ్మద్ ఇబ్న్ సౌదీ తరువాత అతని వంశీకుల దౌర్బల్యమువలన దేశము మరల విచ్ఛిన్నమైనను ఆ వంశీకుడేయగు అబ్దుల్ అజీజ్ (ఇబ్న్ సౌద్) మరల దేశమున తన ప్రభుత్వమును నెలకొల్పుటయేగాక, మక్కా మదీనాల పాలకుని తొలగించి ఆ ప్రాంతములనుకూడ వశపరచుకొనెను. 1915, డిసెంబరులో బ్రిటిష్ ప్రభుత్వముతో అతడు ఒక ఒడంబడికను కుదుర్చుకొని దాని మూలమున తన దేశపు విదేశీ వ్యవహారములపై అధికారమును బ్రిటిష్ ప్రభుత్వమునకు దత్తము చేసెను. 20 మే, 1927 న ఈ ఒడంబడికలోని హక్కులను బ్రిటన్ వదలుకొనుటతో దేశము సర్వ స్వాతంత్రము కాగలిగెను. ఇబ్న్‌సౌద్ మరణించి, అతని జ్యేష్ఠపుత్రుడు సౌద్ రాజయ్యెను. కాని, 1964 లో అనారోగ్య కారణమువలన అతడు రాజ్యాధికారమును తన తమ్ముడగు ఫైజలుకు అప్పగించెను (1964). ఫైజలు రాజు దేశమున కొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టెను. అందు అతి ముఖ్యమైనది బానిసతనమును రద్దుచేయుట అని చెప్పదగును.

**7.** పరిపాలన : దేశమున ఏకరాజక పాలన అమలునందున్నది : ముస్లిం న్యాయసంహితయు, సాంప్రదాయికాచారములును, ఈ పరిపాలనకు ఆధారములు. రాజే ప్రధానిని నియమించి, అతని సలహాపై, ఉపప్రధానిని తక్కిన మంత్రులను నియమించును: కాని ప్రస్తుతమున రాజే ప్రధానిగ అధికార బాధ్యతలను కలిగియున్నాడు. రాజరికము పుత్ర పారంపర్యముగ సంక్రమించవలయునను నియమము లేదు. రాజ కుటుంబపు సభ్యుల సమావేశము చర్చించి తమ కుటుంబములో సమర్థుడుగ తాము నిర్ణయించువానిని రాజుగ చేయుదురు. దేశము పరిపాలనా సౌలభ్యమునకై నాలుగు ముఖ్య మండలములుగ విభక్తమైనను, వాని సరిహద్దుల నిర్ణయము జరుగకున్నది. రాజు తన సన్నిహిత బంధువులలో, సమర్థులను మండల పాలకులుగ నియమించును. ఇస్లామిక న్యాయసంహితయే న్యాయపరిపాలనకు ఆధారమైనను, వేర్వేరు తెగల సంప్రదాయములు కూడ మన్నించబడుచున్నవి. ఆర్థిక, కార్మిక రంగములకు, సంబంధించిన ఆధునిక వ్యవహారములందు ప్రభుత్వమే తుది నిర్ణయపు అధికారమును కలిగియున్నది.

**8.** దేశరక్షణ : అరబ్ దేశములకును, ఇస్రాయిల్‌కును మధ్య వైరుధ్యములు చెలరేగినప్పటి నుండియు దేశరక్షణకై ఆధునిక సామగ్రికల సేనను రూపొందించుటకు ప్రభుత్వము కృషిచేయు చున్నది. దేశమున 36,000 మంది సైనికులుగల సేనయు, 1,000 మందిగల నావికదళమును, 3,500 మందిగల వైమానిక దళమును కలవు (1972-73). వైమానిక దళమునకు, అత్యంతాధునికములగు పోరాటపు విమానములను, ఆయుధములను యు. స్టే. నుండియు, పశ్చిమ యూరపియన్ దేశముల నుండియు ప్రభుత్వము కొనుగోలు చేసినది.

**9.** అంతర్జాతీయ సం. : ఐ. రా. స. సంస్థాపనా కాలమునుండియు, అందు సౌదీ అరేబియాకు సభ్యత్వము కలదు; ఆ సంస్థకుచెందిన అనుబంధ సంస్థలలో పెక్కింటకూడ అది సభ్యత్వమును కలిగి ఉన్నది. అరబ్‌లీగును స్థాపించిన రాజ్యములలో ఈ దేశము ప్రముఖము.

**10. ఆర్థిక రంగము :** 1938 లో దేశమున పెట్రోలుగనులు కనుగొనబడినవి; అంతకు పూర్వము దేశాదాయమున అత్యధికభాగము మక్కాను దర్శించు ముస్లిం యాత్రికులపై విధించు సుంకముల వలన లభించెడిది. ప్రస్తుతమున అట్టి సుంకములు రద్దయినను, ప్రపంచపు నాలుగు చెరగులనుండి ఇటకు వచ్చు ముస్లిం యాత్రికులవలన తక్కువ మార్గములవలన 1,140 లక్షల అమెరికన్ డాలర్లకు సమమగు ఆదాయము ప్రభుత్వమునకు లభించు చున్నది (1971). అయినను ఈ కాలమున ప్రభుత్వపు మొత్తపు ఆదాయమున 81% పెట్రోలుపై పన్నులవలనను. రాజభాగములవలనను లభించు చున్నది. 1971 లో ఈ మార్గమున లభించిన మొత్తపు ఆదాయము 870 కోట్ల అమెరికన్ డాలర్లకు సమానము. మొత్తపు జాతీయోత్పత్తి విలువ 1593 కోట్ల డాలర్లు. అత్యంత అనుకూలమగు చెల్లింపుల నిలువ ఉండుటవలన, ఇస్రాయెల్‌తో జరిగిన యుద్ధమువలన నష్టపడిన ఈజిప్ట్, జోర్డాన్ దేశములకు 1967 మొదలుగ 14.4 కోట్ల డాలర్ల సహాయమును ఈ దేశ ప్రభుత్వము సాలీనా అంద జేయుచున్నది; పెట్రోలు పరిశ్రమగాక, తక్కువిధ ముల పరిశ్రమలను నెలకొల్పి ప్రోత్సహించుటకు ప్రభుత్వము 'పెట్రోమిన్' అను సంస్థద్వారా కృషి చేయుచున్నది. దేశమున గృహ నిర్మాణమును అధికముగ ప్రోత్సహించుటకై సిమెంటు ఉత్పత్తి విరివిగ కొనసాగింపబడుచున్నది.

పెట్రోలు నూనెగనుల ప్రాంతముననే ఇంధన వాయువును లభించుచున్నది (1972). ఈ దేశము నందు గవార్‌వద్దనున్న పెట్రోలుగని ఉత్పత్తి రీత్యా, ప్రపంచపు నూనెగను లన్నింట గొప్పది. వ్యవసాయమువలన దేశాదాయమున 3% మాత్రమే లభించుచున్నది. ఈ వ్యవసాయము సైతము పాతాళగంగ ఊటలవలన కొన్ని ప్రత్యేక ప్రాంతములందు సాగుచున్నది. గోధుమ, జొన్న, మొక్కజొన్న, ముఖ్యములగు పంటలు. ఖర్జూర ఫలములు ఊటబావుల ప్రాంతములందు విరివిగ పండుచున్నవి. వ్యవసాయమును ఇంకను ఎక్కువగ ఫలవంతముగ చేయుటకు కృషి జరుగు చున్నది.

దేశమున బ్యాంకింగు వ్యవహారములు ప్రభుత్వ కేంద్ర బ్యాంకు ద్వారా నిర్వహింపబడుచున్నవి. వ్యాపారవ్యవహారములు జాతీయ వ్యాపార బ్యాంకు ద్వారా జరుగుచున్నవి. వివిధ ప్రముఖ కేంద్రము లందు దీని శాఖలు కలవు.

దేశమున జలవిద్యుదుత్పత్తికి అవకాశములు శూన్యము. అందువలన పెట్రోలు సాయమువలన జనరేటర్లు విద్యుచ్ఛక్తిని సృజించుచున్నవి. మొత్తపు విద్యుదుత్పత్తి 1,50,100 కి. వాట్లు. (1967). జిద్దావద్ద ఉప్పునీటినుండి మంచినీరు తయారుచేయుటకై యు. స్టే. సాయమున నిర్మింప బడిన ప్రాజెక్టులోని నీటిని విద్యుదుత్పత్తికిని వినియోగించుటకు యత్నములు సాగుచున్నవి.

**11. సాంఘిక రంగము :** పెట్రోలు గనులు కనుగొనబడుటకు పూర్వము మధ్య యుగపు స్థాయిలో ఉన్న ఇచటి సాంఘిక పరిస్థితులు, 1958 మొదలుగ, త్వరితగతిలో పరివర్తన చెంది ఆధునికతను సంతరించుకొనుచున్నవి అయినను పూర్వ సంప్రదాయములందలి మంచిని విడనాడక ఈ కృషిని సాగించుట పాలకుల అభిమతము. కావున ఇస్లాము నియమములను అనుసరించి ధూమపానమును, మద్యపానమును దేశమున సర్వత్ర నిషిద్ధములు. గృహనిర్మాణమును, ఆధునిక రీతులలో, నిర్వహించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. గనులవద్ద పనిచేయువారికి, పారిశ్రామిక యజమానులే, ఇండ్లను నిర్మించి వసతి కల్పించుచున్నారు. ఇస్లామిక సంప్రదాయ మును అనుసరించి, అనాథశిశువులకు, వితంతు

వులకు, వికలాంగులకు, అస్వస్థులకు సాలీనా 360 రియాల్‌కు మించని మొత్తమును ఇచ్చుటకు ప్రభుత్వము వసతి కల్పించినది. ఈ విధముగ 1967 - 68 లో ప్రభుత్వము 489 వేల డాలర్లను వెచ్చించినది. ఇవి గాక గనులలో పనిచేయు వారి సాంఘిక భద్రతకు యజమానులే బాధ్యత వహించి కృషి చేయుచున్నారు.

దేశమున ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత విద్యాబోధన ఉచితముగ విద్యార్థులకు కల్పింపబడు చున్నది. రియాధ్‌న ఒక విశ్వవిద్యాలయము కలదు. వివిధ విషయములకు చెందిన 7 కళాశాలలు దీని ఆధ్వర్యమున పనిచేయుచున్నవి. మదీనాలో మతవిషయిక విద్యాపీఠము ఒకటియు, జెడ్డాలో అజీజ్ విశ్వవిద్యాలయమును కలవు.

దేశమున వైద్యసహాయమును విరివిగ కల్పించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. దేశమున 63,000 శయ్యలు కల 49 ఆసుపత్రులు కలవు. మక్కా, మదీనా, జెడ్డాలను సందర్శించు వివిధ విదేశీయ ముస్లిం యాత్రికుల ఆరోగ్యరక్షణకును, వారి వలన దేశములోనికి సాంక్రామిక జాడ్యములు వ్యాపింపకుండుటకును ప్రభుత్వము నిరంతర కృషిని సాగించుచున్నది. 1972 - 73 లో ఈ యాత్రలను నిర్వహించిన విదేశీయ ముస్లిముల సంఖ్య 6,45,182. వీరి ఆరోగ్య పరిరక్షణకై ప్రపంచ ఆరోగ్య వ్యవస్థవారి సాయముతో ప్రభుత్వము జెడ్డాయందు నిర్మింపజేసిన వైద్యశాలయందు 2400 మందికి శయ్యా, చికిత్సా సదుపాయముల వసతి కలదు. జెడ్డానుండి మూడు దినపత్రికలును, మక్కా, రియధ్‌ల నుండి ఒక్కొక్క దినపత్రికయు ప్రచురింపబడుచున్నవి; కాని దేనికిని 15 వేలకు మించిన పాఠక సంఖ్య లేదు. వారపత్రికలును కొలది సంఖ్యలో ఆ నగరము నుండియే ప్రచురితములగుచున్నవి. మక్కా, మదీనా, జెడ్డాలలో ఇస్లామునకు చెందిన అమూల్యములగు మతగ్రంథముల వ్రాతప్రతులను కలిగియున్న గ్రంథాలయములు కలవు.

**12. యాత్రా సౌ.:** దేశమున విలాస యాత్రకు ఎట్టి ప్రోత్సాహమును లేదు; కాని ముస్లిం మతవిధులలో అత్యంత ప్రముఖమగు మక్కాయాత్రను నిర్వహించుటకు సాలీనా లక్షల కొలది విదేశీయ ముస్లిములు వచ్చి, మక్కా, మదీనా, జెడ్డాలను విధిగ దర్శింతురు. 1972 - 73 లో ఇటుల ఈ స్థలములను దర్శించిన విదేశీయ ముస్లిములలో భారతీయ ముస్లిములు 18,306 మంది కలరు. యాత్రికుల సదుపాయములకై ప్రభుత్వము పెద్దమొత్తములను వ్యయము చేయుచున్నది.

**13. ప్రసిద్ధ పౌరులు :** సౌదీ అరేబియా యందు జన్మించిన మహాపురుషులలో తొలుతగ పేర్కొనదగినవాడు పైగంబరు మహమ్మద్ (ర. క్రీ. శ. 570 - 632). ఇస్లాం మతానుయాయులచేత పరమేశ్వరుని కడపటి ప్రవక్తగ ఈయన సంభావితుడు. తరువాత క్రమముగ కలీఫా పదవులను ఆక్రమించి ఇస్లామ్ వ్యాపనమునకు సమధిక కృషిని సాగించిన అబూబెకర్, ఓమర్ అనువారలును సౌదీ అరేబియాలోనే జన్మించి కృషిచేసిరి.

# 39. హాంగ్‌కాంగ్
## (బ్రిటిష్ వలస ప్రాంతము)

**ముఖ్యనగరము:** విక్టోరియా; **నాణెము:** హాంగ్‌కాంగ్ డాలరు; ఒక హాం. **డాలరు** = రు 1.20; **కొలతతూకములు:** బ్రిటిష్ విధానపువి; వానితో పాటుగ చీనీయ సాంప్రదాయికపు కొల తూకములును అమలున ఉన్నవి; **కాలగణన:** సా. 9 గం. 30 ని = భారతదేశమున సా. 5గం. 30 ని.

**1. ఉనికి** మొ.: చీనా భూభాగపు ఆగ్నేయ ప్రాంతమున కొలది చీలికయు, అందుండి వేరు పడియున్న కొన్ని ద్వీపములును చేరి ఉన్న ఈ రాజ్యము 22°9′ – 22° 37′ ఉ. అక్షాంశ రేఖలకును 113° 52′ – 114° 36′ తూ. తులా రేఖలకును మధ్యన విస్తరించి ఉన్నది. ఇందు హాంగ్‌కాంగ్ ద్వీపము (75 చ. కిమీ); కౌలూన్ ద్వీప కల్పము (7 – 8) చ. కిమీ. నవ్య ప్రాంతములు (న్యూటెర్రిటరీస్) అని వ్యవ హృతములగునవి కలవు. ఈ నవ్యప్రాంతము లందు ముఖ్యభూభాగమున ఒక అల్పప్రాంతమును, కొన్ని అల్పద్వీపములును చేరియున్నవి; ఈ నవ్య ప్రాంతముల మొత్తపు వైశాల్యము 985 చ కిమీ. హాంగ్‌కాంగ్ ద్వీపరాజ్యమున అధికభాగము శిలా మయము; ఇందు 18 చ. కిమీల వైశాల్యము నివాసప్రాంతములకు, పారిశ్రామిక వ్యాపార భవనములకు అనుకూలముగ అభివృద్ధి చేయబడి నది; 130 చ.కిమీ. యందు వ్యవసాయము జరుగు చున్నది; తక్కినది అంతయు అనుపయుక్తము; కొండలు, చిత్తడినేలలు ఇందుకలవు.

**2. శీతోష్ణస్థితి:** ఉపోష్ణమండలపు పరి స్థితులు ఇట కాననగును. ఎండకాలమున వేడియు, గాలితేమయు అధికము. వర్షకాలమున వాన లెక్కువ; అంతటంతట తుఫానుల బాధయు కలుగుచుండును; చలికాలమున సమశీతోష్ణముగ ఉండును.

**3. జనసంఖ్య** మొ.: 1971 లెక్కల ప్రకారము జనసంఖ్య 39,48,179. ఇందు 98% చీనీయ సంతతికి చెందినవారు; మొత్తపు ప్రజలలో 88% హాంగ్‌కాంగ్ ద్వీపమునందలి పట్టణప్రాంతముననే వసించుచున్నారు; ఈ పట్టణప్రాంతపు జనసాంద్రత చ. కిమీకు 25,100; రాజ్యపు మొత్త మున జనసాంద్రత చ. కిమీకు 3,797. దేశీయుల ప్రప్రధాన భాష చీనీయ భాషయే యైనను, ఇంగ్లీషు సాధికారభాషగ ఉన్నది. హాంగ్‌కాంగ్ నందలి పట్టణప్రాంతమునకు విక్టోరియా అని పేరు; కాని కొన్ని సందర్భములందు ఈ నగరము కూడ హాంగ్‌కాంగ్ అనియే పిలువబడుచున్నది.

**4. సమాచార సౌ.:** దేశమున 64 పోస్టు ఆఫీసులు కలవు. కేబుల్, వైర్‌లెస్ సదుపాయ ముల ద్వారా ప్రపంచపు ప్రతి ప్రాంతముతోను ఈ దేశమునకు సంబంధము కలదు; హాంగ్‌కాంగ్‌న ఒక రేడియోస్టేషను కలదు; ఇంగ్లీష్, చీనీయ భాషలలో ఇటనుండి ప్రసారములు సాగుచున్నవి. టెలివిజన్ ప్రసారకేంద్రములు పనిచేయుచున్నవి. ఇందును ఇంగ్లీషు, చీనీయ భాషలే వాడబడు చున్నవి. దీనికి తోడుగ ఉపగ్రహముల సాయ మునను వార్తాసౌకర్యము ఏర్పరపబడినది (1972).

**5. యాన సౌ.:** దేశమున రోడ్లనిడివి 997 కిమీ.; ఇందు హాంగ్‌కాంగ్‌లోని 328 కిమీ.; కౌలూన్‌లోని 294 కిమీ.; నవ్య ప్రాంతములలోని

375 కిమీ చేరియున్నవి. కౌలూన్ నుండి చేనియ సరిహద్దును చేరుటకు 35 కిమీ. నిడివిగల రైలు మార్గము కలదు; విక్టోరియాలో రాకపోకలకు అనువుగ ఒక ట్రాముమార్గము (31 కిమీ) పని చేయుచున్నది. హాంగ్‌కాంగ్‌లోను, కౌలూనులోను సముద్రపు ఓడల రాకపోకలకు చక్కని వసతులు కలవు. 1972 లో మొత్తముమీద 15,698 నౌకలు ఇచట విదేశీయ వ్యాపారమున పాల్గొన్నవి. కౌలూన్ అఖాతమునకు ఉత్తరతీరమున ఉన్న హాంగ్‌కాంగ్ అంతర్జాతీయ విమానాశ్రయమును 31 విదేశీయ విమానయాన సంస్థలు ఉపయోగించు కొనుచున్నవి. ఇటనుండి తక్కిన తూర్పు ఆసియా దేశములకు, యూరప్, ఉత్తర అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ దేశములకు విమాన యాన వసతి కలదు. ద్వీపములందు వివిధ ప్రాంత ములకు హెలికాప్టరు వసతులు ఏర్పడి ఉన్నవి.

**6. చరిత్ర :** చీనా సామ్రాజ్యమునకు చెంది, చేపలు పట్టువారి నివాసముగ ఉండిన హాంగ్‌కాంగ్ ద్వీపమున 1841 లో బ్రిటిష్‌వారు ఒక వర్తక స్థావరమును నెలకొల్పగ, 1842 లో చీనా ప్రభు త్వమువారికి దానిని దత్తముచేసినది; తరువాత 1860 లో కౌలూన్ ప్రాంతములును, తత్పరిసర ద్వీపములును బ్రిటిష్‌వారికి ఈయబడినవి; 1898లో నవ్యప్రాంతములు వారికే 99 ఏండ్ల కౌలుమీద చీనీయ ప్రభుత్వము ఇచ్చినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాన్ సేనలు దీనిని వశపరచు కొనినను, మరల 1946 లో ఇది బ్రటిష్‌సేనల వశమైనది.

**7. పరిపాలన :** బ్రిటిష్ ప్రభుత్వము నియ మించెడు గవర్నరు, ఒక సలహాసంఘపు సాయ ముతో పరిపాలనను నిర్వహించుచున్నాడు; అచటి బ్రిటిష్ సేనల సేనాపతి, సలహా సంఘమునకు అధ్యక్షుడుగ వ్యవహరించును. ప్రభుత్వనియమితు లగు సభ్యులుకల శాసనమండలి కలదు.

**8. దేశరక్షణ :** దేశరక్షణ బాధ్యతను బిటిష్ ప్రభుత్వమే నిర్వహించుచున్నది.

**9. అంతర్జాతీయ సం :** వలస రాజ్యమగుట వలన అంతర్జాతీయ సంబంధములు బ్రిటిష్ ప్రభుత్వముద్వారా నిర్వహింపబడుచున్నవి.

**10. ఆర్థికరంగము :** ప్రపంచ వర్తక మార్గముల కూడలిలో ఉన్న ఈ రాజ్యము, స్థానపు బలిమివలన, వర్తక, వ్యాపార, పారిశ్రామిక కేంద్రముగ ముందుకు రాగలిగినది. నౌకల నిర్మా ణము, వాని మరమ్మతు, ఇనుము, ఉక్కు పరి శ్రమలు మొదలగు భారీపరిశ్రమలే గాక, తేలిక రకపు పరిశ్రమలును ద్వితీయ ప్రపంచ యుద్ధా నంతరమున వికసనము పొందినవి. దేశపు ఆర్థి కోత్పత్తిలో 87% పరిశ్రమలవలన జరుగుచున్నది. (1969); మొత్తముమీద పనిజేయు పారిశ్రామిక సంస్థల సంఖ్య 20,408; ఇందలి పనివారిసంఖ్య దాదాపు 6,08,721 (1972). పరిశ్రమలలో ముఖ్యమైనది జవుళీ పరిశ్రమ. ఇందు 20% కార్మికులు పనిచేయుచున్నారు. పారిశ్రామికోత్ప త్తిలో 92% ఎగుమతి అగుచున్నది.

వ్యవసాయము కూడ అభివృద్ధి చెందుచున్నది. రాజ్యవైశాల్యమున 13% సాగున ఉన్నది; పశు పోషణయు విరివిగ సాగుచున్నది : అయినను పంటలలో కూరగాయలే అత్యధికము; తక్కిన ఆహారావసరములకై చాలవరకు దిగుమతులమీద దేశము ఆధారపడి ఉన్నది. దేశమున 51 బ్యాంకు లును, 80 భీమా కంపెనీలును పనిజేయుచున్నవి. దేశపు ఎగుమతుల విలువ 1375 కోట్ల హాం. డాలర్లు; దిగుమతుల విలువ 2025.6 కోట్ల హాం. డాలర్లు (1971). దేశపు బడ్జెటరీ వ్యయము 365,68,78,420 హాం. డాలర్లు (1972-73).

**11. సాంఘిక రంగము :** 1971 మొద లుగ ఉచిత ప్రాథమిక విద్యాసౌకర్యము కల్పింప

బడినది. శిశుశిక్షణశాలలలో 1,41,466 మంది, ప్రయిమరీ పాఠశాలలలో 7,57,152 మంది, సెకండరీ స్కూళ్లలో 2,90,574 మంది, ఉన్నత పాఠశాలలలో 68,057 మంది విద్యార్థులు కలరు. మొత్తముమీద అన్నివిధముల పాఠశాలల సంఖ్య 2,565 (1972) హాంగ్‌కాంగ్ విశ్వవిద్యాలయమున 3,876 మంది విద్యార్థులు కలరు; ఇది గాక చీనీయ విశ్వవిద్యాలయమున 2,552 మంది చదువుచున్నారు. దినపత్రికల సంఖ్య తెలియవచ్చుటలేదు. కాని మొత్తముమీద 88 వార్తాపత్రికలు ప్రచారమున ఉన్నవి; వీనిలో 4 మాత్రమే ఇంగ్లీషునను తక్కినవి చీనీయ భాషలోను ప్రచురింపబడుచున్నవి. దేశమున వైద్యసంఖ్య 1,844 (1969).

**12. యాత్రా సౌ.:** దేశమున విదేశీయ యాత్రికుల పర్యటనకు అన్నివిధముల వసతులును కలవు. 1971 లో 9,07,295 మంది యాత్రికులు దేశమున పర్యటించిరి. 158 కోట్ల హాం. డాలర్లను వారు దేశమున వెచ్చించిరి.



# 1. ఆస్ట్రేలియా

**ముఖ్యనగరము :** కాన్‌బెర్రా; **జెండా :** జెండాయందు మూడు విశిష్ట భాగములు కలవు. దండమువద్ద ఎగువన ఉన్న నాలుగవ భాగమున, బ్రిటిష్ పతాకమును అనుకరించు యూనియన్ జాక్ కలదు; ఇది కామన్‌వెల్తు సభ్యత్వమును సూచించును; దీనికి దిగువన ఏడుకోణముల తెల్లని నక్షత్రము కలదు. ఇక మిగిలిన కుడి సగమున 'సదరన్ క్రాస్' అని వ్యవహృతమగు అయిదు నక్షత్రముల సమూహాము తెలుపురంగున కలదు;




పటము 2.

ఈ నక్షత్రములలో ఒకదానికి అయిదు కోణములును, తక్కినవానిలో ప్రతిదానికి ఏడుకోణములును కలవు. మొత్తము పతాకము నీలి భూమికను కలిగి ఉన్నది; **జాతీయగీతము :** గాడ్ సేవ్ ది క్వీన్ (రాణిని పరమేశ్వరుడు రక్షించుగాక); **నాణెము :** ఆస్ట్రేలియన్ డాలరు; ఇది 100 సెంట్లుగ విభక్తము; ఒక ఆ. డాలరు = రు. 8.40; **కొలతూకములు :** బ్రిటిష్, మెట్రిక్ విధానములవి; **కాలగణన :** భారతదేశమున సా. 5 గం.30ని. అయినపుడు పశ్చిమ ఆస్ట్రేలియాలో రా. 8 గం; దక్షిణ ఆస్ట్రేలియాలో రా. 9 గం. 30 ని; తక్కిన రాష్ట్రములలో రా. 10 గం.

**1. ఉనికి మొ. :** ఆసియాఖండ ముఖ్య భూభాగమునకు ఆగ్నేయ మూలగ, సుదూరమున సముద్ర పరివృతమై ఉన్న ఈ రాజ్యపు ముఖ్య భూభాగమునకు ఉత్తరమున హిందూమహా సముద్ర భాగములగు కోరల్, అరాఫురా, తైమర్ సముద్రములును; దక్షిణమున తూర్పున పసిఫిక్ మహాసముద్రమును; పశ్చిమమున హిందూమహా సముద్రమును కలవు; 113°9' నుండి 153°39' తూ. తులాంశరేఖలకును, 10°41' నుండి 39°8' ద. అక్షాంశరేఖలకును మధ్య ఈ దేశపు ముఖ్య భూభాగము విస్తరించి ఉన్నది. ఈ భూభాగము నుండి ఒక జలసంధిచే వేరుపడి, దక్షిణమున ఉన్న టాస్మేనియా ద్వీపము (68,897 చ. కిమీ) పరిపాలనారీత్యా ఈ రాజ్యమున చేరిఉన్నది. ఆ ద్వీపముతో కలిసి ఈ రాజ్యపు మొత్తపు వైశాల్యము 13,37,525 చ. కిమీ.

భూతల వైవిధ్యమునుబట్టి ఈ దేశము నాలుగు విభిన్న ప్రాంతములుగ – (1) తీరమైదానము (2) తూర్పుదేశపు ఉన్నత భూములు (3) మధ్యమైదానములు (4) పశ్చిమదేశపు పీఠభూమి అనునవిగ – లెక్కింపదగి ఉన్నది. తీరమైదానము వెడల్పు తక్కువయై ఎత్తులేని ఇసుకభూమి; తూర్పుదేశపు ఉన్నత భూములు ఉత్తరమునుండి దక్షిణపు కొనవరకును తూర్పున వ్యాపించి, 300 నుండి 2100 మీ. వరకు ఎత్తున మారుచున్నవి;

మధ్యమైదానములు ఎత్తు తక్కువవై, లోతు తక్కువ పళ్లెములవలె దేశ మధ్యభాగమున నెల కొని ఉన్నవి; పశ్చిమదేశపు పీఠభూమి అనునది విస్తృతములగు ఎడారులును, ఇసుక తిప్పలును, గులకరాతి మైదానములును కలిగిన ఊషరభూమి; ఈ ప్రాంతపు ఎత్తు 300 నుండి 600 మీ. వరకు మారుచున్నది. దేశపు ఆగ్నేయ ప్రాంతమున ఆస్ట్రేలియన్ ఆల్ప్సు అను పర్వతశ్రేణిలో ఉన్న కోశ్చిస్కో శిఖరము (ఎత్తు: 2,228 మీ.) దేశపు అత్యున్నత శిఖరము. ఆగ్నేయ ప్రాంతమున ప్రవహించు ముర్రే, డార్లింగ్, ముర్రుంబిడ్జీ నదులలో మాత్రమే సంవత్సరము పొడవున నీరు ఉండును; తక్కిన ప్రాంతముల నదులలో వర్ష కాలమున మాత్రమే నీరు ప్రవహించును. దేశపు తూర్పుతీరమునకు కొలదిదూరమున ఒక వృత్త రేఖవలె 1,920 కిమీ. పొడవున అమరి ఉన్న పగడపు దీవులమాల (గ్రేట్ బారియర్ రీఫ్) ప్రపంచమున అట్టివానియందు ప్రముఖమగుటయే గాక రమ్యతకును పేరొందినది.

**2. శీతోష్ణస్థితి** మొ.: శీతోష్ణస్థితి, ప్రాంత ములనుబట్టి, పలురీతులుగ మారుచున్నను మొత్తము మీద సౌమ్యమనియే చెప్పదగియున్నది. ఎండ గాని, చలిగాని దుర్భరములుగ ఉండవు; హిమ వర్షము ఎచటను కనరాదు; తీరభూములందు తుపానుల బెడద అంతటంతట ఉన్నను, తక్కిన దేశమున, వాయుప్రసారము తీవ్రపు హెచ్చు తగ్గులకు లోనుగాక వర్తించుచున్నది. వర్షపాతము ప్రాంతములను అనుసరించి విపరీతపు మార్పులకు లోనగుచున్నది. మొత్తముమీద దేశమున తగి నంతగ వర్షపాతము లేదనియే చెప్పవచ్చును దేశవైశాల్యమున 40% ఎడారి భూమి; ఇంకొక 40% భూమియందు చెమ్మదనము చాల తక్కువ; ఇక 20% భూమియందు మాత్రమే సాలున 75 సెం. మీ.కు మించిన వర్షపాతముకలదు. సంవత్స రము పొడవున, దేశపు ఆగ్నేయ రాష్ట్రములందు మాత్రమే వానలు అంతటంతట కురియుచున్నవి. దేశమున విస్తృతప్రాంతములు అనావృష్టి బాధకో, వెల్లువల బాధకో తరచుగ లోనగుచున్నవి.

దేశమున సహజమగు వృక్షసంతతి, తక్కిన ప్రపంచపు వృక్షసంతతికన్న విభిన్నము; ఈ వృక్షములు శిశిరఋతువున, ఆకురాల్చుటకు బదు లుగ బెరడులను రాల్చుచున్నవి. ఈ వృక్షములకు తోడుగ తక్కిన ప్రాంతములనుండి తెచ్చిన యూకలిప్టస్ మొదలగునవియు ఇచట బాగుగ వృద్ధియైనవి. ఇచటి దేశీయజంతువులలో కొన్ని, తక్కిన ప్రపంచమున ఎచటను కనరానివి పొట్టకు దిగువన ఒక సంచిలో బిడ్డను పెట్టుకొని దుము కుచు పోవు కంగారూ, బాతుముక్కు కలిగిన ఒక విధపు వింతజంతువు ఈ దేశమున మాత్రమే కననగుచున్నవి. ఇట్టివే పక్షిజాతులందును విచి త్రపు కోవకు చెందినవి కన్పట్టుచున్నవి. ఇచ్చట సహజముగ ఉన్న జంతు, పక్షి సంతతులకు తోడుగ, తక్కిన ప్రపంచమునుండి ఇటకు కొని రాబడిన జంతు, పక్షి సంతతులును చాల బాగుగ వృద్ధి చెందినవి. దేశమున కుందేళ్ళబాధ అధికము; అందును తూర్పుప్రాంతమున ఇవి విపరీతముగ కలవు; వీనివలన పశ్చిమప్రాంతపు గొర్రెలకు బాధ కలుగకుండ, తూర్పు పడమర దేశముల మధ్య దాదాపు 1600 కిమీ. పొడవున ఒక తీగ తడిక నిర్మింపబడినది (1907).

**3. జనసంఖ్య** మొ.: 1972 లెక్కలను బట్టి దేశపు జనసంఖ్య 1,29,59,084; జన సాంద్రత 100 చ. కిమీ. కు 161. దేశమున 25% మాత్రమే పల్లెపట్టులందు నివసించుచున్నారు. నగరములలో సిడ్నీ (జ. సం. 28,07,828), మెల్బోర్న్ (25,03,450), బ్రిస్బేన్ (8,67, 784), అడెలైడ్ (8,42,693), పెర్త్ (7,03,

199), హోబర్ట్ (1,53,216) ప్రముఖములు. ముఖ్యనగరమగు కాన్‌బెర్రాలోని జనసంఖ్య 1,59,815 (1971). దేశమున అత్యధిక సంఖ్యాకులు బ్రిటిష్ సంతతికి చెందినవారు. 1961 లెక్కలను బట్టి దేశమున యూరపియేతరులు 41,580 మాత్రమే కలరు; వీరిలో చీనీయులు 20,382; భారత - పాకిస్తాన్‌లకు చెందినవారు 3,532; తక్కినవారు వేర్వేరు దేశములకు చెందినవారు. వీరుగాక దాదాపు 1,30,000 ఆదిమవాసి సంతతివారు కలరు. (1958); ఇందు కొందరు అచ్చపు ఆదిమజాతివారు; మరికొందరు తెల్లజాతులతో సంకరమొందినవారు; స్థిరనివాసమునకు అలవాటు పడక వీరు మనుగడను సాగించుచున్నారు; వీరిలో 'ఆరందా' అను వర్గము కొంత పురోగతిని ఆర్జించినది; ఈ ఆదిమజాతులు, భారత, సింహళ, సుమత్రా, న్యూగినీలలో కననగు ఆస్ట్రిలాయిడ్ జాతులకు సన్నిహితములు కావచ్చునని మానవశాస్త్రజ్ఞుల భావన. 1963 మొదలుగ ఈ ఆదిమజాతుల వారికిని పౌరస్వత్వములు సంపూర్ణముగ ఏర్పడి ఉన్నవి.

దేశములో 99% కు మాతృభాష ఇంగ్లీషు. ఆదిమవాసులందు పలుభాషలు, మాండలికములు ప్రచారమున ఉన్నవి. వీనిలో దేనికిని లిపిలేదు; కాని ఒక విధపు సంకేతములను కర్రలపై లిఖించి పంపి, తమ అభిప్రాయములను దూరబంధువులకు వారు తెలియజేసెదరు. ఆ సంకేతముల భావములు ఆ ఆదిమజాతులలో పలువురకు సుగ్రాహ్యములు.

దేశప్రభుత్వము జాతీయమతముగ ఏ మతమును గుర్తించుటలేదు; కాని దాదాపుగ అందరును క్రైస్తవులే; అందు ప్రొటెస్టంటు సంప్రదాయమువారు ఎక్కువ (33.6%). ప్రజలలో 1% కు కొలదిగ తక్కువగ యూదులు ఉన్నారు.

**4. సమాచార సౌ.** : 1971 లో దేశమున తపాలా ఆఫీసులసంఖ్య 8,920; వీనియందు పెక్కింట తంతి, టెలిఫోను వసతులు కలవు. కేబుల్, రేడియో టెలిఫోనుద్వారా సముద్రోత్తర దేశములతో వార్తాసంబంధము ఏర్పడి ఉన్నది. దేశపు రాష్ట్రముల రాజధానులందు అన్నింటను రేడియో ప్రసారకేంద్రములు కలవు; మొత్తము మీద మీడియమ్ వేవ్ ప్రసారకేంద్రములు 78, పై స్థాయికి చెందిన కేంద్రములు 15 పనిచేయుచున్నవి; ఇవిగాక వ్యాపార విషయ ప్రసారము లను 116 కేంద్రములు నిర్వహించుచున్నవి. టెలివిజన్ సదుపాయములు ప్రతి రాష్ట్రమున ఏర్పడియున్నవి. మొత్తముమీద 43 టెలివిజన్ కేంద్రములు సాధారణ జాతీయ విషయముల కొరకును, 49 టెలివిజన్ కేంద్రములు వ్యాపార విషయముల కొరకును ప్రసారములను నడపుచున్నవి.

**5. యాన సౌ.** : దేశమున మొత్తపు రోడ్ల నిడివి దాదాపు 8,80,000 కిమీ. ఇందు 1,92,000 కిమీ. అత్యుత్తమ శ్రేణికి చెందినది; 2,11,200 కిమీ. సాధారణశ్రేణికి చెందినది; తక్కినది కచ్చామార్గము, దేశమున 40,240 కిమీ. ల మొత్తపు రైలుమార్గము కలదు. ఇందు దాదాపు 8% మాత్రము కేంద్ర ప్రభుత్వమునకు చెందినది; తక్కినమార్గములు, ఆయా రాష్ట్రములకు చెంది ఉన్నవి. దేశమునందలి వివిధ రాష్ట్రములను కలుపుచు ఇటుల రైలుమార్గములు ఉన్నను గేజీలు ఒకే రీతిగ ఉండకపోవుట వలన ప్రయాణికులు తరచుగ ఒక బండినుండి వేరొక బండికి మారవలసి వచ్చుచున్నది. గేజీలలో ఏకరూపతను కల్పించుటకు కృషి జరుగుచున్నను అది ఇప్పటికి సంపూర్ణముగ నెరవేరకున్నది.

దేశపు తీరప్రాంతమున వివిధ కేంద్రముల మధ్యను, దేశపు రేవులనుండి విదేశములకును

ప్రయాణములను సాగించుటకు నౌకలు ఎక్కువగ ఉపకరించుచున్నవి. దేశపు వర్తక నౌకాదళమున 136 నౌకలు కలవు. (1971); ఇందు 124 నౌకలు (టన్నేజి: 10,25,748) తీరవ్యాపారమునకును, తక్కినవి (టన్నేజి: 1,00,298) దూరదేశములతో జరుగు వ్యాపారమునకును ఉపకరించునవి. సిడ్నీ, హోబర్ట్ నగరముల సమీపమున సహజసిద్ధములై లోతు, వైశాల్యములను విరివిగ గల హార్బరులు కలవు; వీనికి తోడుగ తీరమున పలుప్రాంతములందు కృత్రిమరీతిలో హార్బరులును నిర్మింపబడినవి

ప్రభుత్వ వైమానిక సంస్థయు, తొమ్మిది ప్రయివేటు సంస్థలును, దేశాంతర్గతమగు విమానయానమును నిర్వహించుచున్నవి. దేశమున ప్రముఖ నగరముల మధ్య సువ్యవస్థితమగు విమానయాన వసతి ఏర్పడి ఉన్నది. దేశమున 300 కు పైబడిన విమానక్షేత్రములు కలవు. బ్రిస్‌బేన్, డార్విన్, మెల్‌బోరన్, పెర్త్, సిడ్నీ నగరములలో అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. వీనినుండి విదేశములకు విమానప్రయాణములను, దేశీయవైమానిక సంస్థలును, విదేశీయ సంస్థలును నడపుచున్నవి.

**6. చరిత్ర:** ఆస్ట్రేలియాలో ఆదివాసి ప్రజలు తొలుతటినుండియు ఉన్నను, తక్కిన ప్రపంచముతో ఆ దేశమునకు ఎట్టి సంబంధమును తొలుత లేకుండినది; ఆ ఖండపు ఉనికిని గురించియు తక్కిన ప్రపంచమునకు చాలకాలము వరకు తెలియదు. 17వ శతాబ్దమున దేశాన్వేషకులగు డచ్చి, పోర్చుగీజు, స్పానిష్ నావికులు కొందరు ఈ ఖండపు దక్షిణమున ఉన్న టాస్మేనియా మొదలగువానిని కనుగొనినను అచట స్థావరములను నెలకొల్పకుండిరి. తరువాత 1770 లో బ్రిటిష్ సైనికుడగు కుక్ ఈ ఖండపు తూర్పుతీరమున పర్యటించి, దానికి రేఖాకల్పనము చేసి, గ్రేట్‌బ్రిటన్ రాజ్యమునకు ఆ ఖండము చెందినటుల ప్రకటించెను.

1788 లో బ్రిటనునందలి ఖైదీలకు ఒక స్థావరమును, ఈ దేశమున ప్రస్తుతపు సిడ్నీ నగరమున్న తావున, సంస్థాపించుటతో ఈ దేశమున బ్రిటిష్‌వారి వలస ఆరంభమయ్యెనని చెప్పవచ్చును. తరువాత అంతటంతట ఇట్టి ఖైదీల గుంపులనే ఇచటికి చేర్చుటవలన వలసల సంఖ్య పెరుగసాగినది; కాని 1840 మొదలుగ గ్రేట్ బ్రిటన్ నుండి స్వతంత్ర పౌరులును విరివిగ చేరుటయు జరిగినది. అంతట ఖైదీల స్థావరముగ దీనిని నిర్మించు విధానము అంతరించి, స్వేచ్ఛాయుత ప్రజల వలసల నిర్మాణము మొదలైనది. 1851 లో బంగారము లభించు గనులు కనుగొనబడుటతో ఈ వలస విపరీతముగ పెరిగినది; ఇందులకు తోడుగ ఇచటి పచ్చిక బయలులందు గొర్రెలపెంపకమునకును, తద్వారా ఉన్ని పరిశ్రమకును అవకాశములు ఎక్కువగ ఏర్పడుటవలన, ఆ కృషిని చేపట్టుటకై బ్రిటిష్‌పౌరులు ఎక్కువగ వచ్చుట జరిగినది. ఆ విధమున 1863 నాటికి ఆ ఖండమున అయిదు విడివిడి వలసలు రూపొందినవి; టాస్మేనియా ద్వీపము వేరొక వలసగ పరిణమించినది. ఈ వలసలలో ప్రతియొక్కటియు దేనికది ఒక స్వతంత్ర వలసరాజ్యముగ, బ్రిటిష్ ప్రభుత్వముతో, సంబంధమును కల్పించుకొని వేర్వేరుగ కొంతకాలము మనినవి. కడకు బ్రిటిష్ ప్రభుత్వపు ప్రోత్సాహముపైనను, పరస్పర భద్రత కొరకును 'ఆస్ట్రేలియా కామన్‌వెల్త్' అను సమాఖ్యారాజ్యముగ ఇవి మేళనమై ఏకరాజ్యముగ రూపొందినవి (1901). కాలక్రమమున 1914 నాటికి అధినివేశప్రతిపత్తిని, అంతట కామన్‌వెల్తున సభ్యత్వముతో పాటుగ స్వతంత్రరాజ్య ప్రతిపత్తిని ఈ సమాఖ్యారాజ్యము ఆర్జించినది.

రెండు ప్రపంచయుద్ధములకాలమునను గ్రేట్ బ్రిటనును సమర్థించుచు, ఆస్ట్రేలియా సేనలు వివిధ రంగములందు పోరాడినవి.

**7. పరిపాలన :** దేశమున రాజ్యాంగ విధానమున నిర్ణయింపబడిన రీతిగ సమాఖ్యా విధానపు ప్రభుత్వము అమలున ఉన్నది. ఇందు కేంద్ర ప్రభుత్వమునకు నిర్దిష్టములును, పరిమితములును అగు అధికారములు మాత్రమే కలవు. గ్రేట్ బ్రిటన్ రాజ్యపు సార్వభౌముని ప్రతినిధి రాజ్యాధినేతగ, 'గవర్నర్ - జనరల్' అను హోదాతో వర్తించును. అతని ఆధిపత్యమున ఒక కార్యనిర్వాహకసమితి దేశపరిపాలన నిర్వహించును; కాని యధార్థమున ఈ అధికారమును ప్రధానమంత్రి నాయకత్వమున పనిచేయు మంత్రిమండలియే పార్లమెంటునకు బాధ్యతవహించి కొనసాగించును. పార్లమెంటున ప్రతినిధిసభ, శిష్టసభ అనదగు రెండు కక్ష్యలుకలవు. నిర్దిష్టములగు నివాసాది అర్హతలతో పాటుగ 21 ఏండ్ల వయస్సునకు తగ్గని ప్రతిపౌరునికి వోటుహక్కు కలదు. ప్రతినిధి సభయందలి సభ్యసంఖ్య 125. ఈ సభకు సాధారణముగ మూడేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును; జనసంఖ్యను అనుసరించిన నిష్పత్తిలో, వివిధ నియోజక వర్గములనుండి, రాష్ట్రమునకు కనీసము అయిదుగురు సభ్యులుండురీతిగ, క్రమప్రాముఖ్యపు (ప్రెఫెరెన్షల్) వోటింగు పద్ధతిలో ప్రతినిధి సభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు; ఈ సందర్భమున ప్రతిరాష్ట్రము ఒక నియోజక వర్గముగ వ్యవహరించును. శిష్టసభాసభ్యుని పదవీకాల పరిమితి ఆరుసంవత్సరములు; అయినను మూడేండ్లకొకసారి సగముమంది సభ్యులు పదవీ విరమణ చేయురీతిగ ఈ పరిమితి వర్తించుచున్నది.

రాజ్యాంగమున కేంద్రమునకు నిర్దేశింపబడని అవశిష్టాధికారములు అన్నియు రాష్ట్రములకే కలవు; అయినను ఇందు కొన్నిటిని కేంద్రమును రాష్ట్రములును సంయుక్తముగ నిర్వహించుచున్నవి. ఒక్క క్వీన్సులాండు రాష్ట్రమున తప్ప తక్కిన అయిదు రాష్ట్రముల (న్యూ సౌత్ వేల్సు, విక్టోరియా, దక్షిణ ఆస్ట్రేలియా, పశ్చిమ ఆస్ట్రేలియా, టాస్మేనియాల) లో రెండు కక్ష్యల శాసనసభలు కలవు. క్వీన్సులాండున ఒకే కక్ష్య కల శాసనసభ కలదు; ఈ శాసనసభలకు గాని, పార్లమెంటు సభలకుగాని జరుగు ఎన్నికలలో వోటు జేయుట ప్రతి వోటరునకు శాసనబద్ధ విధిగ నిర్ణయించబడినది. లేబర్, లిబరల్, కంట్రీపార్టీలు దేశమునందలి రాజకీయపక్షములలో ప్రముఖములు. అధికారము లేబర్‌పార్టీకిని, తక్కిన పార్టీల కూటమికిని మధ్యచేతులు మారుచున్నది. ఈ రాజకీయ పక్షముల మధ్య దేశపు ఆర్థిక, సాంఘిక వ్యవస్థను గురించిన అభిప్రాయభేదములు ఎట్టివి ఉన్నను, దేశమును శ్వేతజాతీయుల రాజ్యముగనే ఉంచుట యందును, వర్ణజాతులవారి వలసను చాలవరకు నిరోధించుట యందును ఏకాభిప్రాయత మాత్రము కలదు.

**8. దేశరక్షణ :** భూతలసేనయందలి స్థిర సైనిక సంఖ్య 42,273. ఇవిగాక యుద్ధ సమయమున పిలిచినంతనే సైన్యమున చేరగల సుశిక్షిత పౌర సైనికసంఖ్య 26,577. నౌకాసేనయందలి సైనికసంఖ్య 17,000; నౌకాసేనకు చెందిన వైమానిక సంఖ్య 1,600. నౌకాసేనకు 2 విమానవాహక నౌకలును, 7 డిస్ట్రాయరులును, 4 జలాంతర్గాములును మొదలుగ నానావిధముల యుద్ధోపయోగి నౌకలును కలవు. వాయుసేనలోని యోధసంఖ్య 22,720; ఇందు 16 పోరాట విమాన దళములును, ఒక బాంబరు దళమునుచేరి ఉన్నవి.

**9. అంతర్జాతీయ సం. :** కామన్‌వెల్తునను, ఐ. రా. స. యందును, దాని అనుబంధ ప్రత్యేక సంస్థలందు పెక్కింటను ఈ రాజ్యమునకు సభ్య

త్వము కలదు. కొలంబో ప్రణాళికా రాజ్యములలో సభ్యత్వమువహించి, ఈ దేశము ఆ ప్రాంతపు వర్ధమాన దేశములకు సాయపడగలుగుచున్నది.

**10. ఆర్థిక రంగము :** ఆహార ద్రవ్య విషయమున ఈ దేశము స్వయంపోషకమగుటయేగాక, అందు కొంతభాగమును విదేశములకు ఎగుమతి చేయగలుగుచున్నది. ఈ దేశమునందు లభ్యములగు ఉన్ని, ఆహారవస్తువులు, ఖనిజములు ఇచటి సంస్కారక (ప్రాసెసింగ్) పరిశ్రమలకు ముడి పదార్థములుగ ఉపకరించి, విదేశీయ ద్రవ్యమును సమకూర్పగలుగు చున్నవి.

ఉన్ని ఉత్పత్తిలో ప్రపంచమున అగ్రస్థానమును ఈ దేశము ఆర్జించినది. ప్రపంచపు ఉన్నిలో 30% ఈ దేశమున ఉత్పత్తియగుచున్నది. గోధుమ, మాంసము, పాడి ఉత్పత్తులు ఈ దేశపు ఎగుమతులలో ప్రముఖ స్థానములను ఆర్జించినవి. అయినను దేశపు కార్మికసంఖ్యలో 14% మాత్రమే వ్యవసాయమున పనిచేయుచున్నారు; 32% పరిశ్రమలలో కృషిచేయుచున్నారు. భారీపరిశ్రమలును, అందును ముఖ్యముగ ఉక్కుకు సంబంధించినవి, త్వరిత గతిలో అభివృద్ధి చెందుచున్నవి. దేశమున తలసరి ఆదాయము సాలున 2,041 అమెరికా డాలర్లు. రాక్షసిబొగ్గు, ముడిఇనుము విషయమున దేశము స్వయంపోషకము. బాక్సైట్ ఖనిజపు నిలువల విషయమున ప్రపంచమున అగ్రస్థానము ఈ రాజ్యమునకు కలదు; యురేనియము కొంత లభ్యమగుచున్నది. తక్కిన ఖనిజములలో రాగి ప్రముఖము. బంగారము ఇదివరలో ఎక్కువగ లభించుచున్నను, క్రమముగ దాని లభ్యత తగ్గుచున్నది. 'ఓపల్' అనబడు స్ఫటికము ఈ దేశమున, ప్రపంచమున తక్కిన ఏ దేశమునందు కన్నను, ఎక్కువగ లభ్యమగుచున్నది. పెట్రోలియమ్, ఇంధనవాయువు దేశావసరములలో ఎక్కువ భాగమును తీర్చునంతవరకు దొరకుచున్నవి. దేశమున విద్యుదుత్పత్తి సమర్థత 117.7 లక్షల కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 489.6881 కోట్ల అ. డాలర్లు; దిగుమతుల విలువ 400.8365 కోట్ల అ. డాలర్లు (1971 - 72). దేశపు సాలీనా బడ్జెటరీ వ్యయము 916.6748 కోట్ల అ. డాలర్లు (1971 - 72).

**11. సాంఘిక రంగము :** సాంఘిక సంక్షేమ కార్యక్రమము, ప్రభుత్వపు ఆధ్వర్యమున, ఎంతయో పురోగతిని సాధించినది. గృహనిర్మాణపు వసతి చక్కగ ఏర్పరుపబడుటయేగాక, ఆ గృహములలో తగ్గు తరగతికి చెందినవి సైతము చాల వసతులను కలిగియుండునటుల నిర్మింపబడినవి. 1947 లో సవరింపబడిన సాంఘిక సంసేవా చట్టమువలన వికలాంగులకు వృద్ధులకు పెన్షన్ల వసతి కల్పింపబడినది. 16 ఏండ్ల వయసునకు మించి, దేశమున అయిదేండ్ల నివాసార్హత కలిగి, పనిచేయుటకు శాశ్వతముగ అశక్తులైన గ్రుడ్డివారు మొదలగు వికలాంగులును, ఇరువది ఏండ్ల నివాసార్హత కలిగి 65 ఏండ్లను దాటిన వృద్ధపురుషులకును, 60 ఏండ్ల వయసు మించిన వృద్ధ స్త్రీలకును ఈ పెన్షనులు చెల్లింపబడుచున్నవి; అటులే మాతాశిశు సంరక్షణభృతి, బాలబాలికా పోషణభృతి, వితంతువులపెన్షను, మొదలగు వసతులును, జాతీయవైద్యచట్టమును అనుసరించి రోగులకు దినసరి భృతియు కల్పింపబడినవి. ఈ విధపు పెన్షన్ మొత్తము వారమునకు ఒక వ్యక్తికి 17.25 అ. డాలర్లు నుండి 20 అ. డాలర్లు వరకు మారుచున్నది; దినసరి భృతి ఇచ్చు సందర్భములందు అది సాధారణముగ దినమునకు 2 నుండి 5 అ. డాలర్ల వరకు మారుచున్నది. విద్యావసతులను తగినంతగ కల్పించు బాధ్యతను ప్రభుత్వము వహించి నిర్వర్తించు

చున్నది. మొత్తముమీద దేశమున ప్రయిమరీ, సెకండరీ పాఠశాలలు 9,583 ఉన్నవి. ఇందలి విద్యార్థిసంఖ్య 28,07,645 (1971); దేశమున 15 విశ్వవిద్యాలయములు (న్యూసౌత్ వేల్సున 5, విక్టోరియాలో 3, క్వీన్స్‌లాండ్‌లో 2, దక్షిణ ఆస్ట్రేలియాలో 2, పశ్చిమ ఆస్ట్రేలియాలో 1, టాస్మేనియాలో 1, కాన్‌బెర్రాలో 1) కలవు. ఇందలి విద్యార్థి సంఖ్య 1,23,776. దేశమున 44 కళాశాలలలో అత్యున్నత విద్యాబోధనకు అవకాశములు కలవు. ఇందలి విద్యార్థిసంఖ్య 44.468 (1971). దేశమున జాతీయ దినపత్రికలు రెండు, ప్రాంతీయ దినపత్రికలు 15 కలవు. వీని మొత్తపు పాఠకసంఖ్య 39 లక్షలు. మెల్బోర్న్‌లోని సన్ న్యూస్ – పిక్టోరియల్ అనుదానికి ప్రచారము (634 వేలు) అత్యధికము (1969). రాష్ట్రముల ప్రధాన నగరములందును, దేశపు ముఖ్యనగరమునను ప్రముఖ గ్రంథాలయములు ఉన్నవి. పెద్ద మ్యూజియములు 8 కలవు; వీనిలో సిడ్నీయందు 2, మెల్బోర్న్‌లో 2, తక్కినవి తక్కిన రాష్ట్రముల ప్రధాననగరములందు ఉన్నవి.

ప్రపంచమున ఆరోగ్యస్థాయిలో ఉన్నతశ్రేణికి చెందిన దేశములలో ఈ దేశమునకు స్థానము కలదు. వైద్యశాలలు అన్నియు, సాధారణముగ ఆధునిక పరికర సమన్వితములు. 63,424 శయ్యాసంఖ్య కల 750 పబ్లిక్ ఆసుపత్రులును, 21,299 శయ్యాసంఖ్యకల 1,030 ప్రయివేటు ఆసుపత్రులును ఉన్నవి. వైద్యోద్యోగుల సంఖ్య 12 వేలకు పైగా ఉన్నది.

**12.** యాత్రా సౌ.: విదేశీయ యాత్రికులు, పాస్‌పోర్టులను వీసాలను కలిగియుండవలెను. 1970 లో 4,16,128 మంది విదేశీయులు దేశమును పర్యటించిరి; వీరు వెచ్చించిన మొత్తము 13.3 కోట్ల అ. డాలర్లు ఉండవచ్చునని అంచనా.

**13.** ప్రసిద్ధ పౌరులు : 1. సర్ ఫ్రాంక్ మెక్‌ఫర్‌లేన్ బర్నెట్ (జ. 1899) : సుప్రసిద్ధ సూక్ష్మజీవశాస్త్రవేత్త; వైద్యవిజ్ఞానమునకై ఇతడు 1960 లో నోబెల్ బహుమతిని, వేరొకరితో పాటుగ, గ్రహించెను. 2. డోనాల్డ్ బ్రాడ్‌మన్ (జ. 1908) : క్రికెట్ ఆటలో ప్రపంచఖ్యాతిని ఆర్జించినవాడు. 3. కేన్నెత్ రోజ్‌వాల్ (జ. 1934) : టెన్నిస్ ఆటలో అంతర్జాతీయ ప్రఖ్యాతిని పొందినవాడు.

**14.** పాలిత ప్రాంతములు : (i) అంటార్కిటికా : దక్షిణ ధ్రువమును పరివేష్టించియున్న ఈ భూమియంతయు తనదేనని ఈ దేశపు వాదము. కాని ఈ వాదము వివాదగ్రస్తమై ఉన్నది.

(ii) క్రిస్టమస్ దీవి : 10° 30′ ద. అక్షాంశరేఖన, 105° 40′ తూ. తులారేఖయందు హిందూమహాసముద్రమున నెలకొన్న ఈ దీవి పొడవు కిమీ; వెడల్పు 16.5 నుండి 16.5 కిమీ. వరకు మారుచున్నది. దీని వైశాల్యము 155 చ.కిమీ. జనసంఖ్య 3.524 (1966); వీరిలో మూడింట రెండువంతులు చీనీయ సంతతివారు. 1888 లో బ్రిటిష్ వారివశమై, తదాదిగ మకుటపు వలసగ ఉండిన ఈ దీవి, ఆస్ట్రేలియా ప్రభుత్వమునకు 1958 లో అప్పగింపబడినది. దేశమున దొరకు ఫాస్ఫేటును త్రవ్వుట మాత్రమే ఇక్కడ జరుగుచున్న కృషి. ఆస్ట్రేలియా, న్యూజిలాండు ప్రభుత్వములు రెండును ఈ కృషిపై పెత్తనము వహించుచున్నవి. సాలున 7,60,000 టన్నుల ఫాస్ఫేటు త్రవ్వితీయబడుచున్నది.

(iii) కోకోస్ (కీలింగ్) దీవులు : పవడపు కంకణ ద్వీపము (అతోల్) ల సమూహమగు ఈ ద్వీపప్రాంతమున 27 దీవులు కలవు; వీని మొత్తపు వైశాల్యము 13 చ. కిమీ. హిందూమహా

సముద్ర మధ్యమున 12°5′ ద. అక్షాంశ రేఖన, 96′53 తూ. తులారేఖయందు నెలకొనియున్న ఈ ద్వీపసమూహము ఆస్ట్రేలియాకు వాయవ్యమున ఉన్నది. 1971 లో ఈ ప్రాంతమున జనసంఖ్య 625; ఇందు 128 మంది యూరపీయులు. ఈ ప్రాంతపు దీవులలో ప్రముఖములు : 1 వెస్ట్‌దీవి; ఈ దీవియందు విమానాశ్రయము కలదు; యూర పీయులలో ఎక్కువమంది ఇట వసించుచున్నారు. 2. హోమ్‌దీవి; దేశీయులందు అత్యధిక సంఖ్యా కులు ఇట నివసించుచున్నారు. తక్కిన కొన్ని దీవులందు జనావాసములే లేవు. దీవులందు కొబ్బరి చెట్లు ఎక్కువగ కలవు. శీతోష్ణస్థితి సౌమ్యము; సాలున దాదాపు 9 నెలల కాలమున ఆగ్నేయ వ్యాపార వాయువులు వీచును; అయినను ఈ వాయువులు అంతటంతట అనుకొనని రీతిగ మారును. ఈ మార్పువలన హిందుమహాసముద్రపు తూర్పుభాగమున రాగల పరిణామములను ముందుగ తెలియ వీలగును. కావున ఈ మార్పులను వెను వెంటనే దూరప్రాంతములకు తెలియజేయు వాతా వరణ విజ్ఞానకేంద్రము ఒకటి ఈ ద్వీపములలోని డైరెక్షన్ దీవియందు పనిచేయుచున్నది. ప్రాంత మున ఉష్ణోగ్రత సాలున 70° – 80°ఫా. మధ్య మారుచుండును; వర్షపాతము పరిమితము; అంత టంతట తుఫానుల బాధయు కలదు.

ఈస్ట్ ఇండియా కంపెనీకి చెందిన కెప్టెన్ విలియమ్ కీలింగ్ ఈ ద్వీపములను 1609 లో కనుగొనెను. 1826 వరకు జనవాసమే లేదు; 1826 లో తొలుతగ అచట అలెగ్జాండర్ హేర్ అనునతడు ఒక స్థావరమును నెలకొల్పెను. తద నంతరమున మరికొన్ని స్థావరములు ఏర్పడి 1857 లో బ్రిటిష్‌ప్రభుత్వపు మకుటపు వలసగ పరిగణనను ఈ ప్రాంతము పొందినది. తరువాత దాని ప్రతిపత్తిలో కొన్నిమార్పులు జరిగి, కడకు 1955 లో ఈ దీవులు ఆస్ట్రేలియా ప్రభుత్వము నకు వశపరచబడినవి. ఆస్ట్రేలియా ప్రభుత్వము నియమించు ప్రతినిధి ఇచట స్థానిక పాలనను నిర్వహించుచున్నాడు.

(iv) **యాష్‌మోర్ - కార్టియర్ దీవులు** : పగ డపు తిప్పలచే పరివృతములై జనావాసమెరుగని ఈ ద్వీపములు పశ్చిమ ఆస్ట్రేలియా తీరమునకు 480 కిమీ. ల దూరమున హిందూమహాసముద్ర పరివృతములై ఉన్నవి. 1938 లో ఇవి ఆస్ట్రే లియా యందలి ఉత్తర ప్రాంతమున, పాలనము రీత్యా, మేళనము చెందినవి.

(v) **హర్డ్ – మేక్డొనాల్డ్ దీవులు** : ఆస్ట్రేలి యాలో నైరుతి తీరమున ఉన్న పెర్త్ నగరము నకు నైరుతిన 4,000 కిమీ. ల దూరమున సముద్ర పరివృతమై ఉన్న హర్డ్‌దీవియు, దానికి పశ్చిమమున 41 కిమీ. గల దూరమున ఉన్న మెక్డొనాల్డ్ దీవులును, హర్డ్ దీవికి కొలదిగ ఉత్తరమున ఉన్న షాగ్ దీవియు ఇందుచేరి ఉన్నవి. దీవులు శిలామయములు; హర్డ్‌దీవిలో ఇప్పటికిని రగులుచున్న 'బిగ్‌బిన్' అను అగ్ని పర్వతము కలదు. దాని ఎత్తు 2,743 మీ. 1947 లో బ్రిటిష్ ప్రభుత్వము ఈ దీవుల పాల నను ఆస్ట్రేలియాకు అప్పగించినది. దీవులు జనా వాసరహితములు; ఇందు హర్డ్‌దీవి పొడవు 43 కిమీ; వెడల్పు 20 కిమీ; తక్కినవి దానికన్న చాల చిన్నవి.

(v) **మెక్వేరీ దీవి** : టాస్మానియా దీవిలోని హోబర్ట్ నగరమునకు 1600 కిమీ. ల ఆగ్నేయమున సముద్రపరివృతమై ఉన్న ఈ దీవి 54°30′ ద. అక్షాంశ రేఖన, 158°40′ తూ. తులారేఖపై ఉన్నది. దీనిపొడవు 34 కిమీ. వెడల్పు 3 నుండి 5 కిమీ. ల వరకు మారును. 19వ శతాబ్దినుండి ఇది ఆస్ట్రేలియా ప్రభుత్వపు పాలనలో ఉన్నది. మానవావాసములు ఏవియు ఇట లేవు; పెంగ్విన్

పక్షులు మాత్రమే వేలకొలది ఇట వసించుచున్నవి. 1948 మొదలుగ ఈ ద్వీపపు దక్షిణాగమున ఒక ప్రయాణకేంద్రము పనిచేయుచున్నది.

(vi) **నార్ ఫక్ దీవి :** ఆస్ట్రేలియా యందలి సిడ్నీ నగరమునకు ఈశాన్యమున 1,500 కిమీ. ల దూరమున, సముద్ర పరివృతమై 29°3′ ద. అక్షాంశ రేఖను, 167°57′ తూ తులాంశ రేఖలపై ఉన్న ఈ దీవిపొడవు 8 కిమీ.; వెడల్పు 5 కిమీ ; జనసంఖ్య 1,440 (1968). 1774 లో కెప్టెన్ జేమ్సు కుక్ ఈ దీవిని కనుగొనెను. తదాదిగ బ్రిటిష్ ప్రభుత్వపు పాలనలో నేరస్థుల స్థావరముగ కొంతకాలము ఈ ప్రాంతము ఉండినది. 1914 న ఆస్ట్రేలియా ప్రభుత్వమునకు అప్పగింప బడినది. దీవిలోని జనసంఖ్య 1,440 (1968).

ఈ దీవిలో 24 కిమీ. పొడవుగల రోడ్లు కలవు; రైలుమార్గములు లేవు; రాకపోకలు మోటారు బండ్లవలన జరుగుచున్నవి. నేల సారవంతము: పైరు పంటల అభివృద్ధికి అచటి శీతోష్ణస్థితి అనుకూలము. పండ్లును, చిక్కుడు గింజలను విరివిగ ఉత్పత్తి చేయుచున్నవి. తిమింగిలముల వేటయు ఒక పరిశ్రమగ కొనసాగుచున్నది; యాత్రికులవలనకూడ స్థానిక ప్రభుత్వమునకు ఆదాయము లభించుచున్నది. ద్వీపపు ఎగుమతుల విలువ 1,59,865 ఆ. డాలర్లు; దిగుమతుల విలువ 12,63,480 ఆ. డాలర్లు; (1963-64); నిర్బంధ ఉచిత విద్యావిధానము (15 ఏండ్ల వయసువరకు) అమలున ఉన్నది.

---

# 2. కాంటన్ - ఎండర్బరీ దీవులు

## (యు. స్టే. బ్రిటనుల సంయుక్త పాలనలోని ద్వీపములు)

పై వానిలో కాంటన్‌దీవి (2°50′ ద - అ; 171°40′ ప. తు), మధ్యపసిఫిక్ మహాసముద్రమున, హానోలూలూకు 3200 కిమీ. ల దూరమున పశ్చిమముగ, ఉన్న ఒక అతల దీవి. పొడవు 13 కిమీ. వైశాల్యము 9 చ. కిమీ. ఈ దీవికి ఆగ్నేయముగ ఎండర్బరిదీవి (3°8′ ద. అ; 171° 5′ ప. తు) ఉన్నది. దాని వైశాల్యము 5 చ. కిమీ. ఈ రెండు దీవులలో సముద్రపు పక్షుల ఎరువు విరివిగ లభించుటవలన వీనిని యు. స్టే. 1856 లో వశపరచుకొనినది. కాని తమకు చెందిన ఫోనిక్సు ద్వీపసమూహములోనివే ఈ ద్వీపములని వాదించి 1937 లో బ్రిటన్ కాంటన్ దీవిపై ఒక రాడారు స్టేషనును నెలకొల్పినది. ఉభయ దేశములవారును 1938 లో తమ తమ దేశములకు చెందిన కొందరిని అటకు వలస పోవునటుల చేసిరి. కడకు 1939 లో ఈ ఉభయ రాజ్యముల మధ్య ఒక ఒడంబడిక జరిగి, తద్వారా ఈ దీవులు ఆ రెండు రాజ్యముల సంయుక్తాధిపత్యమున 1989 వరకు ఉండునటుల నిర్ణయము జరిగినది.

---

# 3. కుక్ ద్వీపములు

## (ఆంతరంగిక స్వపరిపాలన కలిగి న్యూజీలాండ్ వశమున ఉన్న రాజ్యము)

**ముఖ్యనగరము :** రారోతోంగా; **నాణెము :** న్యూజిలాండ్ దేశపు నాణెము. **కాలగణన :** ఉ. 2 గం. = భారతదేశమున ముందురోజున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** న్యూజిలాండునకు ఈశాన్యమున దాదాపు 3,200 కిమీ. కు పైబడిన దూరమున పసిఫిక్ మహాసాగర పరివృతములై, 8° — 23° ద. అక్షాంశరేఖలకును, 156°–167° పశ్చిమ తులారేఖల మధ్యను చెదరియున్న 15 ద్వీపములు ఈ రాజ్యమున చేరి ఉన్నవి. వీనిలో పెద్దదియగు రారోతోంగా ద్వీపపు చుట్టుకొలత 32 కిమీ; అన్నిదీవుల మొత్తపు వైశాల్యము 241 చ. కిమీ. రారోతోంగాలో తప్ప తక్కిన దీవులలో వాగులుగాని, బావులుగాని లేవు. పసిఫిక్ సాగరపు తుఫాను ప్రాంతమున ఈ దీవులున్నవి. అందువలన పలుమారులు తుపానుల వలన నష్టపడుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** పైరు పంటలకు తగిన సౌమ్య శీతోష్ణస్థితి ఇచట కలదు.

**3. జనసంఖ్య మొ. :** ద్వీపముల మొత్తపు జనసంఖ్య 21,227 (1971). ఇందులో రారోతోంగా జనసంఖ్య 11,388. ఇందు దాదాపు 300 పైగా యూరపీయులు; తక్కినవారు మయోరి జాతివారు; న్యూజిలాండులోని మయోరీలకు వీరితో భాషా, సంప్రదాయములందు సాన్నిహిత్యము కలదు. ప్రజలందరును క్రైస్తవులు.

**4. సమాచార సౌ. :** జనవాసములున్న దీవులందు అన్నింట వైర్‌లెస్ స్టేషనుల వసతి కలదు.

**5. యాన సౌ. :** న్యూజిలాండ్ – రారోతోంగాల మధ్య నెలకొకసారి స్టీమరు ప్రయాణ వసతి కలదు. రారోతోంగాలో ఒక అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. ఫిజీలోని నాంది నగరమునకును, రారోతోంగాకును మధ్యను 15 దినముల కొకసారియు, న్యూజీలాండ్ రారోతోంగాల మధ్య వారమునకు ఒకసారియు విమానయాన వసతి కలదు.

**6. చరిత్ర :** 1773 లో కెప్టెన్ కుక్ ఈ దీవులను కనుగొనెను. 1888 లో ఈ ద్వీపసమూహమును రక్షితప్రాంతముగ గ్రేటుబ్రిటన్ ప్రభుత్వము గ్రహించి, 1901 లో న్యూజీలాండ్ ప్రభుత్వపు పాలనకు అప్పగించినది. 1965, ఆగష్టు 4న ఈ ద్వీపరాజ్యమునకు ఆంతరంగిక స్వపరిపాలనా ప్రతిపత్తిని న్యూజీలాండ్ ప్రభుత్వము కలిగించినది.

**7. పరిపాలన :** న్యూజీలాండ్‌లో అమలున ఉన్న పార్లమెంటరీ పాలనయే ఇచటను అనుకరింపబడినది. న్యూజీలాండ్‌తో పాటుగ ఇదియు ఒకే ఒక గవర్నర్ జనరల్ ఆధిపత్యమున ఉన్నది; కామన్ వెల్తులోను భాగస్వామ్యము కలదు. ఇచటి ప్రజలకును న్యూజీలాండ్‌న పౌరస్వత్వములు కలవు. వయోజనులచే ఎన్నుకొనబడిన 22 మంది సభ్యులు కల శాసనసభ కలదు. శాసన సభకు బాధ్యత వహించి, ప్రధాని ఆధ్వర్యమున మంత్రివర్గము పాలనను నిర్వహించుచున్నది. అవసరమైన యెడల సర్వస్వతంత్ర రాజ్యముగ తమ రాజ్యమును ప్రకటించుటకు దేశ ప్రభుత్వమునకు హక్కు కలదు.

**8 దేశరక్షణ :** దేశ రక్షణ బాధ్యత ప్రస్తుతమున న్యూజీలాండ్ ప్రభుత్వమునకే కలదు.

**9. అంతర్జాతీయ సం. :** సర్వ స్వాతంత్రము కాకపోవుట వలన అట్టి సంబంధములు, న్యూజీలాండ్ ప్రభుత్వము ద్వారా నిర్వహింపబడుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. ఎగుమతులలో నిమ్మపండ్లు, వానిరసములు, అరటిపండ్లు, టొమాటోలు, అనాసపండ్లు ముఖ్యములు. కొబ్బరి, ముత్యపు చిప్పలును. తరువాత పేర్కొనదగినవి. ఎగుమతుల వ్యాపారము చాలవరకు న్యూజీలాండుతోనే సాగుచున్నది. న్యూజీలాండున ఈ దేశపు వస్తువులపై సుంకములు ఎట్టివియు విధింపబడవు. దేశపు ఎగుమతుల విలువ 23,95,000 డాలర్లు, దిగుమతుల విలువ 34,01,000 డాలర్లు (1969). న్యూజీలాండ్ ప్రభుత్వము వారి సాలీనా ఈ దేశము ధనసహాయము పొందుచున్నది; 1970–71 లో ఆ విధముగ 23.3 లక్షల డాలర్లు సహాయము లభించినది.

**11. సాంఘిక రంగము :** దీవులందు అన్నింటి కలసి 61 ప్రయిమరీ పాఠశాలలు కలవు; 6 ఉన్నత పాఠశాలలు రారోతుంగాలో మాత్రమే ఉన్నవి. క్రింది తరగతులలో మయోరీ భాషలోను, పై తరగతులలో దానికి తోడుగ ఇంగ్లీషు భాషలోను బోధన జరుగుచున్నది. మొత్తం అన్ని పాఠశాలలోను కలసి విద్యార్థిసంఖ్య 7,215 (1971). విద్యాబోధన ఉచితముగ జరుగుచున్నది. దేశీయులకు ఉచిత ఔషధ, శస్త్ర చికిత్సా వసతులను ప్రభుత్వము, వారి వారి గ్రామములందు, ఏర్పరచినది.

---

# 4. గిల్బర్ట్ - ఎల్లిస్ దీవులు

## (బ్రిటిష్ ప్రభుత్వపు పాలనలో ఉన్న ద్వీపరాజ్యము)

**ముఖ్యనగరము :** బైరికి; **నాణెము :** ఆస్ట్రేలియా దేశపు డాలరు; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి. **కాలపరిగణన :** రాత్రి 11 గం–30ని. = భారతదేశమున సా. 5 గం – 30 ని.

**1. ఉనికి. మొ. :** పసిఫిక్ మహాసముద్రమున 4° ఉ.–11° ద. అక్షాంశరేఖలకును, 172°–180° తూ. తులారేఖలకును మధ్యనున్న విస్తృత ప్రాంతమున అటనట చెదరియున్న 37 అతల ద్వీపములును, మరికొన్ని ద్వీపములును చేరి ఈ రాజ్యముగ వ్యవహరింపబడుచున్నవి. ఈ వివిధములగు దీవులును చెదరియున్న సముద్ర ప్రాంతము దాదాపు అయిదు లక్షల చ. కిమీంకు మించియున్నను ఈ ద్వీపముల అన్నింటి మొత్తపు వైశాల్యము 955 చ. కిమీ. మాత్రమే. ఈ దీవులను నాలుగు వర్గములుగ విభజింపనగును; (1) గిల్బర్ట్ ద్వీపములు; ఇందు 16 ద్వీపములు కలవు; వీనిలోని తరావా దీవియందే రాజ్యపు ముఖ్యనగరము ఉన్నది. (2) ఎల్లిస్ ద్వీపములు; ఇవి 16 దీవులు (3) ఫోనిక్స్ ద్వీపములు; ఇందు దీవుల సంఖ్య 8. (4) లైను ద్వీపములు; ఇవి మూడు దీవులు. ఇవిగాక గిల్బర్ట్ దీవులకు 400 కిమీ. దూరమున (0°52′ ద; 169°35′తూ).

ఉన్న ఓషన్‌దీవియు ఈ రాజ్యమున అంతర్భాగము. లైను ద్వీపములలోని క్రిస్టమస్‌దీవి ఈ ద్వీపరాజ్యమునందెల్ల పెద్దదీవి; దాని వైశాల్యము 359 చ. కిమీ. ఓషన్‌దీవి అగ్నిశైలజము; అందు నున్నపు ఫాస్ఫేటులు విరివిగ లభించు చున్నవి. తక్కిన దీవులన్నియు సముద్ర గర్భమున మునిగియున్న పర్వతముల పుటాదులపై పేరుకొనిన పగడపు గవ్వల తిప్పలవలన రూపొందినవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణత కొంత సౌమ్యముగనే ఉండును. సంవత్సరమున ఉష్ణోగ్రత 70° – 90° ఫా. మధ్య ఉండును. భూమధ్య రేఖవద్ద వర్షపాతము సాలున రమారమి 100 సెం. మీ; ఎల్లిస్ దీవులను చేరుసరికి ఆ వర్షపాతము 300 సెం. మీ. కు పెరుగును. అయినను అంతటంతట అనావృష్టిబాధయు కలదు.

**3 జనసంఖ్య :** 1968 లో ఈ రాజ్యపు జనసంఖ్య 53,517; వీరిలో మైక్రోనీసియన్ జాతివారు ఎక్కువ; పొలినీసియన్ జాతీయులు అల్పసంఖ్యాకులు. యూరపియనులును చీనీయులు కొలదిగ అటనట కన్పట్టుదురు. దేశమున వనరులనుబట్టి జనసంఖ్య ఒత్తిడి చాల ఎక్కువ; అందువలన పలువురు తక్కిన ద్వీపరాజ్యములకు పనివారుగ పోవుచుందురు. కొన్ని మలేసియన్ భాషా మాండలికములు మాతృభాషలుగ ప్రచారమున ఉన్నను, ఇంగ్లీషు, చాలవరకు వాడుకయందున్నది. ప్రజలందరును క్రైస్తవులు.

**4. సమాచార సౌ. :** తంతి – టెలిఫోను వసతులు ద్వీపముల మధ్యకలవు.

**5. యాన. సౌ :** ద్వీపములమధ్య నౌకాయాన సౌకర్యము కలదు. ఫిజీకిని ఈ దీవులకును మధ్య వారమునకు రెండు సారులు విమాన ప్రయాణ వసతి ఉన్నది.

**6. చరిత్ర :** స్పెయిన్ దేశపు నావికుడగు మెండాణా అనునతడు 1567 – 68 లో ఈ దీవులను తొలుతగ కనుగొనెనని భావించుటకు అవకాశములు ఉన్నను, బ్రిటిష్ వారి నౌకాసేనయే 1764 – 1824 మధ్య కాలమున వీనిని క్రమరీతిలో కనుగొనినటుల స్పష్టమగు లిఖితాధారములు కలవు. అచటి దేశీయుల అభ్యర్థనను అనుసరించి 1915 లో, బ్రిటిష్ ప్రభుత్వము ఈ దీవులను, గిల్బర్ట్ – అండ్ – ఎల్లిస్ ఐలాండ్స్ కాలనీ అను పేర, తన రక్షితరాజ్యముగ ప్రకటించెను. 1970 లో ప్రజాస్వామిక పద్ధతులలో కొంతవరకు అంతరంగిక స్వపరిపాలన ఈ రాజ్యమునకు కల్పింపబడినది.

**7. పరిపాలన :** 1970 లో బ్రిటిష్ ప్రభుత్వము చేసిన ఉత్తరువులను అనుసరించి, ఆ ప్రభుత్వము నియమించు గవర్నర్ – కార్యనిర్వాహక వర్గము, శాసనసభ అను రెండింటి సాయముతో – రాజ్యపాలన జరుపు చున్నాడు. కార్యనిర్వాహక వర్గమున నలుగురు ఎన్నుకొనబడిన సభ్యులును, 5 గురు అధికారసభ్యులును ఉందురు. శాసన సభయందలి సభానాయకుని, ప్రతిపక్ష నాయకుని సంప్రతించి ఇందలి ఎన్నికసభ్యులను గవర్నర్ నియమించును. శాసనసభకు, రాజ్యపు 27 నియోజక వర్గములలో ఒకదాని నుండి ఇరువురును, తక్కినవానిలో ప్రతిదానినుండి ఒక్కొక్క సభ్యుడును ఎన్నుకొనబడుదురు. ఈ సభకు మూడేండ్లకు ఒకసారి సాధారణ ఎన్నికలు జరుగును. ప్రతి దీవియందు ఎన్నుకొనబడిన సభ్యులసాయమున స్థానికపాలన సాగుచున్నది.

**8. దేశరక్షణ :** పోలీసు బలము మాత్రమే కలదు. దానియందలి పోలీసుల సంఖ్య 139.

**9. అంతర్జాతీయ సం. :** రక్షణ, అంతర్జాతీయ వ్యవహారముల బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వము పైననే ఉన్నది.

**10. ఆర్థికరంగము :** ఓషన్ దీవిలోని ఫాస్ఫేటుల ప్రత్యేకముపైనను, అన్నిదీవులందు లభించు కొబ్బరిచెట్ల ఫలసాయముపైనను ఈ రాజ్యపు ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉన్నది. కొబ్బరి తప్ప తక్కువిధముల వృక్షజాతులుగాని, పైరులుగాని, అంతగ పెరుగవు; కొన్ని విధముల దుంపలు మాత్రము ఆహారార్థమై, పండింపబడు చున్నవి. పందులు, కోళ్లు విరివిగ కలవు; అవసర అవసరములకు సరిపోవురీతిగ మత్స్యపరిశ్రమ సాగుచున్నది. ఫాస్ఫేటు, కొబ్బరి ఉత్పత్తులవలన దేశపు ఎగుమతుల విలువలో 99 % లభించు చున్నది. ఎగుమతుల విలువ 64,82,965 ఆ. డాలర్లు; దిగుమతుల విలువ 89,16,747 ఆ. డాలర్లు (1970). రాజ్యపు సాలుసరి బడ్జెటరీ వ్యయము 33,28,944 ఆ డాలర్లు (1970).

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రజల సహకారమువలన సాంఘికశ్రేయోభివృద్ధి చక్కగ సాగుచున్నది. రాజ్యమున భిక్షుకులు లేరు. ప్రతిపట్టణమునకు కొంత భూవసతియు, గృహమును కలవు. దేశమున ఉన్న 287 ప్రయిమరీ పాఠశాలలలో 18,212 మంది విద్యార్థులు కలరు; ఈ పాఠశాలలలో ఏడు క్రైస్తవ మత సంస్థలు నడుపు చున్నవి. ఇవిగాక తరావాలో ప్రభుత్వము నడుపు ఉన్నత పాఠశాల కలదు; విద్యార్థులకు అందే భోజనవసతి కలదు. అందు 155 బాలురు, 107 బాలికలు కలరు (1970). ఇవిగాక 51 మంది విద్యార్థులు విదేశములలో పఠించుచున్నారు. వీరి వ్యయమంతయు రాజ్యపు ప్రభుత్వమేగాక, ఆస్ట్రేలియా, న్యూజీలాండు ప్రభుత్వములును భరించి సాహాయ్యము చేయు చున్నవి.

ప్రజలకు వైద్యసాహాయ్యమునకై, జనావాసము కల ప్రతి దీవియందును ఒక ఆసుపత్రి కలదు. ఇవిగాక తరావా దీవియందు 142 శయ్యాసంఖ్య గల ఒక జనరల్ ఆసుపత్రి ఉన్నది.

---

# 5. గ్వామ్

## (యు. స్టే. పాలనలోని ఒక అస్వతంత్ర ద్వీపరాజ్యము)

**ముఖ్యనగరము :** అగానా; **నాణెము :** అమెరికన్ డాలరు; **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువి. కాలగణన : సా. 10 గం = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** పశ్చిమ పసిఫిక్ మహా సముద్రమున, మేరియానా దీవులని వ్యవహరింప బడువానిలో ఒకటియగు ఈ దీవి 13° 30′ ఉ. అక్షాంశరేఖపై, 144° 40′ తూ. తులారేఖన నెలకొని ఉన్నది. దీని వైశాల్యము 450 చ. కిమీ. ద్వీపపు నిడివి దాదాపు 48 కిమీ.; వెడల్పు 7 నుండి 16 కిమీ. ల వరకు మారుచుండును. ద్వీపము అగ్నిశైలీయమగు ఉత్పత్తి కలది. దక్షిణప్రాంతము పర్వత మయము. ఉత్తరప్రాంతము ఒక పీఠ భూమి; ఇచట నేల సారవంతము. మధ్యభాగము హెచ్చుతగ్గుల భూమి; ఇచటనే ముఖ్యనగరమగు అగానా ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** పశ్చిమ పసిఫిక్ తుఫానుల మండలమున ఈ దీవి ఉన్నది. ఉష్ణమండల

శీతోష్ణస్థితి ఇందు కననగును, సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 78° ఫా. సాలున సరాసరి వర్షపాతము 200 సెం. మీ.

**3. జనసంఖ్య మొ.:** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 84,993; ఇందు దేశీయులగు **చామోరో** జాతివారు దాదాపు 52,000; తక్కిన వారిలో యు. స్టే. వాసులును, ఫిలిప్పీనోలును, తదితరులును చేరి ఉన్నారు. చామోరో అను జాతివారు 18 వ **శతాబ్దికి** పూర్వము అంతటంతట ఇటచేరిన స్పానీయులు, ఫిలిప్పీనోలు. మెక్సికనులు, చీనీయులు, జపానీయులు మొదలగు వివిధ జాతుల సాంకర్యమువలన రూపొందినవారు. 'చామోరో' అను దేశీయ మాతృభాష వ్యాప్తియందు ఉన్నను, ఇంగ్లీషే అధికారభాషగ అన్ని ప్రాంతములందు **వాడుకలో** ఉన్నది. దాదాపుగ ప్రజలందరును **రోమన్ కేతలిక్** సంప్రదాయమునకు చెందిన క్రైస్తవులు.

**4. సమాచార సౌ.:** టెలిఫోను సౌకర్యములు విరివిగ కలవు. రేడియోగ్రామ్ ద్వారా **వార్తలను** అందజేయు సౌకర్యము ఉన్నది. **దూరదేశములతో** రేడియో టెలిఫోను సంబంధము కలదు. ఒక రేడియోస్టేషను, మూడు టెలివిజన్ కేంద్రములు కలవు.

**5. యాన సౌ.:** దేశమున 73 కిమీ. ల పొడవున సిమెంటు రోడ్లును, 293 కిమీ. ల కంకరరోడ్లును కలవు. ఇట నుండి హాంగ్‌కాంగ్, యు. స్టే., జపాన్, ఓకినావా, ఫిలిప్పీనులకు విమాన యాన సంబంధము కలదు.

**6. చరిత్ర :** 1523 లో మెగల్లాన్ అను స్పానీయ నావికునిచే ఈ దీవి కనుగొనబడినది. 1696 మొదలుగ 1898 వరకు ఇది స్పెయిన్ **దేశపు** పాలకుల **అధీనమున ఉండినది. యు. స్టే.కు** స్పెయినుతో సాగిన యుద్ధమున స్పెయిన్ పరాజితమగుటవలన 1898 లో ఈ రాజ్యము యు. స్టే. కు వశమైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాను సేనలు దీనిని ఆక్రమించినవి (1942); కాని 1944 లో యు. స్టే. ఈ దీవిని వశపరచుకొని, తన పరిపాలనను పునరుద్ధరించినది.

**7. పరిపాలన :** యు స్టే. అధ్యక్షుడు నియమించు గవర్నరు ఇట పాలనను నిర్వహించును. అతని పదవీ కాలపరిమితి నాలుగు సంవత్సరములు. ఇచటి పౌరులకు యు. స్టే. పౌరస్వత్వములు కలవు. ప్రజలు రెండేండ్లకొకసారి ఎన్నుకొను 21 సభ్యుల శాసనసభకు, స్థానిక విషయములకు సంబంధించినంతవరకు, శాసన నిర్మాణాధికారము కలదు. కాని ఈ సభ చేయు శాసనమును త్రోసివేయుటకు యు. స్టే. లోని కాంగ్రెస్‌కు అధికారము కలదు. ఇచటి కోర్టులపై, యు. స్టే. లోని ఉన్నత న్యాయస్థానములకు అప్పీలు అధికారము కలదు.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం :** యు. స్టే. తో ముడివడిన ప్రాంతమగుటవలన దేశరక్షణకు, అంతర్జాతీయ సంబంధములకు యు. స్టే. ప్రభుత్వమే బాధ్యతవహించియున్నది.

**10 ఆర్థిక రంగము :** దేశపు సారవంతపు లోయలలో వరి, కొబ్బరి, కాఫీ, కోకో, పొగాకు, అనాస సాగగుచున్నవి. అయినను ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, వ్యవసాయమునకు ప్రాముఖ్యము తగ్గినది. కోళ్ళపెంపకము విరివిగ సాగుచున్నది. యు. స్టే. కు చెందిన ప్రముఖ సైనిక స్థావరములలో ఈ దీవి ఒకటియగుటవలన సైనిక స్థావర నిర్మాణ, పోషణలకై యు. స్టే. ప్రభుత్వము ఇట వెచ్చించు పెద్ద మొత్తములు ఈ

దీవియొక్క ఆర్థికవ్యవస్థలో మంచి మార్పును కొనివచ్చినవి. దేశీయులలో పలువురు ఈ సైనిక సంబంధ వ్యవస్థలందు పనిచేయుచున్నారు. సైనికావసరములకై వర్తక వ్యాపారములను పెరుగుట వలన, ఇందు పాల్గొనిన దేశీయులు ఎక్కువగ లాభపడగలిగిరి. ఈ దీవిని స్వేచ్ఛావ్యాపార ప్రాంతముగ యు. స్టే. ప్రకటించుటవలన విదేశ వ్యాపారము అతిశయించినది. ఎగుమతుల విలువ 17 లక్షల డాలర్లు; దిగుమతుల విలువ 1039 లక్షల డాలర్లు (1970).

**11.** **సాంఘికరంగము :** నిర్బంధరీతిలో ప్రాథమిక విద్య బాలబాలికలకు బోధింపబడుచున్నది. దేశమున 23 ప్రాథమిక పాఠశాలలు, 5 జూనియర్ హైస్కూళ్లు, 3 సీనియర్ హైస్కూళ్ళు, ఒక వృత్తి విద్యా పాఠశాల కలవు; ఇందలి విద్యార్థి సంఖ్య 21 వేలు. ఇవిగాక ప్రయివేటు ఉన్నత పాఠశాలలలో 5178 మంది విద్యార్థులు పఠించుచున్నారు. దేశమందు ఒక విశ్వవిద్యాలయము కలదు. ఇందలి విద్యార్థి సంఖ్య దాదాపు 6,000 (1970). 255 శయ్యలు కల ఒక ఆసుపత్రి కలదు. ఇవిగాక ప్రయివేటుగా పనిచేయు వైద్యులును కొందరు కలరు. సైనిక స్థావరపు వైద్యులును, ప్రజలకు అంతటంతట, ఒక నిర్ణీతకాలమున వైద్యసహాయము చేయుదురు.

**12.** **యాత్రా సౌ. :** యాత్రికులు అనేకులు దేశమును దర్శించుచున్నారు. 1971 లో అట్టి వారిసంఖ్య 10 వేలు. వీరివలన 335 లక్షల డాలర్లు దేశమున వెచ్చింపబడినవి.

---

# 6. జాన్‌స్టన్ దీవి

## (యు. స్టే. పాలనలోని పసిఫిక్ ద్వీపరాజ్యము)

ఉత్తర పసిఫిక్ మహాసముద్రమున హోనూలూలూకు నైరుతిన 1145 కిమీ ల దూరమున ఉన్న రెండు ద్వీపములు ఇందుచేరి ఉన్నవి. ఇవి జాన్‌స్టన్‌దీవి (16° 44′ ఉ. అ; 169° 31′ ప. తు). సాండ్‌దీవి (16°45 ఉ. అ; 169°30′ ప. తు). అని వ్యవహరింపబడుచున్నవి. వీని మొత్తపు వైశాల్యము దాదాపు 2 చ. కిమీ. 1807 లో ఇంగ్లీషు నావికులు దీనిని కనుగొనిరి; కాని 1858లో యు. స్టే. దీనిని తనదిగ లెక్కించి, చాలకాలమువరకు దానిని సముద్రపక్షుల ప్రత్యేకావాసముగ ఉంచినది. 1941 లో ఒక నౌకాఘట్టముగ దానిని మార్పొందించుట జరిగినది; కాని కొలది సంవత్సరములనుండి అణ్వస్త్రాయుధముల పరిశోధనకు మాత్రమే అది వినియుక్తమగుచున్నది.

---

# 7. టోంగా

**ముఖ్యనగరము :** నుకూఅలోఫా; **జెండా :** శోణవర్ణపతాకమందు వాయవ్యపు నాలుగవ భాగమున తెల్లని భూమికపై శోణవర్ణపు సిలువ కలదు; **జాతీయ గీతము :** 'ఏ ఒతువా మఫిమాఫీ కొ హోమా ఈ కో' (పరమేశ్వరా, నీవే మా రక్షకుడవు) అను పాదముతో మొదలగునది; **నాణెము :** టోంగా డాలరు; దీనికే పాంగా అనియు పేరు కలదు, 100 సెనీతీలుగ ఇది విభక్తము.




పటము 3.

1 టోంగా డాలరు = రు. 8 40; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** ఉదయం 1 గం. (మరునటిరోజు) = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ పసిఫిక్ మహాసముద్రమున ఫిజీకి తూర్పుగ 15° – 23°5′ ద. అక్షాంశరేఖలకును, 173° – 177° ప. తులారేఖలకును మధ్య చెదరియున్న వివిధ ద్వీపములు చేరియున్న ఈ రాజ్యపు మొత్తపు వైశాల్యము 700 చ. కిమీ. ఇందు 169 ద్వీపములు కలవు. ఇవి మూడు వర్గములుగ – తొంగతాపూ, హవాపై, వవావూ అను పేరులతో – పరిపాలనారీత్యా ఉత్తరమునుండి దక్షిణమునకు వర్గీకరింపబడినవి. తొంగతాపూ వర్గమున ఒక దీవిపై ముఖ్యనగరము కలదు. ఈ దీవులలో పడమట ఉన్న 11 దీవులును అగ్నిశైలజములు; తూర్పువి పగడపు దీవులు; వీని చుట్టూ చిన్న చిన్న తిప్పలు పరివేష్టించుట కననగును అగ్నిశైలజములగు ద్వీపముల భూతలపు ఎత్తు 107 మీ. నుండి 1033 మీ. వరకు మారుచుండును ఈ దీవిలో ఫాల్కన్ దీవి అనునది అంతటంతట సముద్రమున మునిగి, మరల కొంతకాలము తరువాత పైకి లేచుటవలన. భూశాస్త్రజ్ఞులకు సుపరిచితమైనది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున ఉష్ణోగ్రత చలికాలమున 50° ఫా. గను, గ్రీష్మర్తువున 90° ఫా. గను ఉండును. సరాసరిన సాలుసరి వర్షపాతము 165 సెం. మీ.; కొబ్బరిచెట్లును, పూల పొదలును విరివిగ కన్పట్టును; కబోత పక్షులకు ఈ రాజ్యము పేరొందినది.

**3. జనసంఖ్య మొ. :** 1966 లెక్కల ప్రకారము దేశపు జనసంఖ్య 77,429. వీరిలో 76,121 టోంగో దేశీయులు, 402 యూరపీయులు, 512 సంకరజాతివారు, తదితరులు 394 (1962). అంచనాలను అనుసరించి దేశపు ప్రస్తుత జనసంఖ్య 92,360. దేశీయులందరు పొలినీసియన్ జాతికి చెందినవారు; దేశీయుల మాతృభాష టోంగన్; 19వ శతాబ్దివరకు దీనికి లిపిలేదు; అంతటినుండి రోమన్‌లిపిలో వ్రాయబడుచున్నది. టోంగన్ జాతీయభాషగ పరిగణన పొందినను, అధికార ప్రకటనలు టోంగన్‌తో పాటుగ ఇంగ్లీషునను

వెలువడుచున్నవి. ప్రజలందరు క్రైస్తవ మతానుయాయులు.

**4. సమాచార సౌ. :** ముఖ్యనగరమున ఒక రేడియో టెలిగ్రాఫ్ స్టేషన్ కలదు; దీని శాఖలు రాజ్యమున వివిధ కేంద్రములందు పని చేయుచున్నవి. సముద్రోత్తర తంతి విధానమున ఈ దేశమునకు న్యూజిలాండు, ఫిజీ, పశ్చిమ సామోవ్‌లతో సంబంధము కలదు.

**5. యాన సౌ. :** దేశమున రైలుమార్గములు లేవు. టోంగా తాపూలో 136 కిమీ. ల పొడవునను, వవావూ దీవిలో 45 కిమీ. ల నిడివినను, పక్కారోడ్లు కలవు ఇవిగాక మట్టిరోడ్లు 400 కిమీ. పొడవున ఉన్నవి. నుకూఅలోఫా వద్దను, వవావూ దీవిలోని నియాఫూ వద్దను చక్కని హార్బరులు కలవు. వివిధ వర్గముల దీవుల మధ్య నౌకల ద్వారా ప్రయాణపు వసతులు ఏర్పడి యున్నవి. ముఖ్యనగరమునకు కొలది దూరమున ఒక విమాన క్షేత్రము ఉన్నది: సముద్ర విమానములు ముఖ్యనగరపు రేవున దిగుటకు వసతులు కలవు న్యూజీలాండు నుండి ఫిజీ ద్వారా టోంగాకు నెలకు రెండుసార్లు నౌకాయానము చేయుటకు వసతి కలదు. ఫిజీ, టోంగాల మధ్య వారమునకు రెండు మార్లును, టోంగా, పశ్చిమసామోవ్‌ల మధ్య వారమున ఒకసారియు విమానములు నడచుచున్నవి.

**6. చరిత్ర :** పారంపర్యముగ దేశీయులందు ప్రచారమున ఉన్న గాథలను అనుసరించిచూడ 10వ శతాబ్ది మొదలుగ ఈ దేశము వంశానుగతమగు నిరంకుశపు రాజరికపు పాలనలో ఉండినటుల తెలియవచ్చుచున్నది. 1616 లో తొలుతగ డచ్చి నావికులు ఈ ద్వీపరాజ్యమున కొన్ని దీవులను దర్శించిరి. 1643 లో ఆబెల్ టాస్మన్ టోంగాతాపూను కనుగొనెను. కాని ఆ తరువాత చాలకాలము వరకు యూరపీయులు ఎవరును అచట కాపురముండలేదు. 1775, 1777 లలో జేమ్సుకుక్ అను బ్రిటిష్ నావికుడు ఇట సముద్రమున పర్యటించి, పలుదీవులను దర్శించుటయేగాక అందొక దీవికి ఫ్రెండ్లీ ద్వీపము అని పేరిడెను. అందువలననే ఈ ద్వీపరాజ్యమునకును ఫ్రెండ్లీ అయిలాండ్స్ అనుపేరు చాలకాలము అమలున ఉండినది. 19వ శతాబ్దమున అట పాలించిన దేశీయ ప్రభువు క్రైస్తవ మతమును స్వీకరించి ప్రజలందు ఆ మతము వ్యాపించుటకు కృషి చేయుటయేగాక తాను జార్జి I అను పేరును గ్రహించెను. దేశమునకు ఒక రాజ్యాంగ విధానమును తొలుతగా అతడు కల్పించెను (1875). అతని వంశీయుల కాలమున, వారి అంగీకారముతో, బ్రిటన్ ఈ దేశమును తన రక్షిత రాజ్యముగ గ్రహించినది (1900); అయినను బ్రిటిష్‌వారి రక్షణతో దేశమున రాజరికము కొనసాగినది. తరువాత జరిగిన కొన్ని ఒడంబడికల వలన దేశపు ప్రతిపత్తిలో కొన్ని మార్పులు జరిగి కడకు జూన్ 4, 1970న దేశము కామన్‌వెల్తున సభ్యత్వముకల స్వతంత్ర రాజ్యముగ రూపొందినది.

**7. పరిపాలన :** దేశమున రాజ్యాంగ బద్ధమగు రాజరికపు పాలన అమలున ఉన్నది. ప్రివీ కౌన్సిల్, మంత్రివర్గముల సాయమున రాజు కార్యనిర్వహణాధికారమును నిర్వర్తించును; దైనందిన సామాన్య కార్యనిర్వహణను మంత్రివర్గము నిర్వహించును. శాసన నిర్మాణాధికారము శాసన సభకు కలదు. ఈ సభయందు 14 గురు సభ్యులు కలరు; ఇందు ఏడుగురు ప్రివీకౌన్సిల్ సభ్యులు; వీరిని దేశపు జమీందారులు ఎన్నుకొనెదరు; తక్కిన ఏడుగురను ప్రజానీకము ఎన్నుకొనును; వీరి పదవీకాల పరిమితి మూడు సంవత్సరములు. దేశమున రాజకీయ పక్షములు లేవు. స్థానిక పరిపాలనను, ఆయా ప్రదేశముల ప్రివీకౌన్సిలర్లు నిర్వహింతురు; సువ్యవస్థితమగు న్యాయశాఖ కలదు.

**8. దేశరక్షణ :** సేనాదళమును నిర్మించు కృషి ప్రాథమిక దశలో ఉన్నది; 208 మంది రక్షకభటులు కల పోలీసుదళము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐక్యరాజ్య సమితి యందు ఈ దేశమునకు సభ్యత్వము లేకపోయి నను, ఆ సమితికి చెందిన పలుసంస్థలవలన ఈ దేశము సహాయమును గ్రహించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయోత్పత్తు లగు కొబ్బరి, అరటి, కర్బూజా, అనాసపండ్ల ఎగుమతిపైననే ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు ఆధారపడి ఉన్నది. ప్రజలలో 96% కు వ్యవసాయమే జీవనాధారము. దేశపు భూతలమున 1,21,492 ఎకరములు సేద్యమున ఉన్నది. చట్టరీత్యా భూమియంతయు రాజునకు చెందిఉన్నది; కాని ఇందులో కొంత భాగమును రాజు, స్వచ్ఛంద ముగ, జమిందారులకు చెందజేసినాడు. అయినను ఈ జమీందారులు సైతము రాజువలెనే వ్యవసాయపు భూమిని, నామమాత్రముగ ఎకరాకు సాలున ఒక డాలరు చొప్పున రైతులకు కౌలునకు ఇచ్చు చున్నారు. దేశావసరములకు తగినంతగ ఆహార ధాన్యములును, ఎగుమతి పంటలతోపాటుగ, పండింప బడుచున్నవి. పశుసంపద కొంత ఉన్నను, మాంస మును ఇచటివారు కొంతవరకు దిగుమతి చేసికొను చున్నారు. దేశావసరములకు తగినంతగ అడవుల నుండి కలప లభించుచున్నది. చెప్పదగిన ఖనిజ సంపద లేదు. 900 కివా. ఉత్పత్తి సామర్థ్యము కల ఒక విద్యుదుత్పత్తి కేంద్రము 1966 మొద లగ దేశమున పనిచేయుచున్నది. దేశపు ఎగు మతుల విలువ 22 లక్షల టో. డాలర్లు; దిగు మతులవిలువ 63.05 లక్షల టో. డాలర్లు (1971). దేశపు బడ్జెటరీ వ్యయము 31,62,000 టో. డాలర్లు (1971 – 72).

**11. సాంఘిక రంగము :** దేశమున ఉచిత విద్యాబోధనకు వసతులను ప్రభుత్వము ఏర్పర చినది. దేశమునందలి 129 ప్రయిమరీ పాఠ శాలలలో 16,416 మంది; తక్కిన 52 పాఠ శాలలలో 10,164 మంది విద్యార్థులు కలరు (1971). దేశమునందలి ఒకే ఒక దినపత్రికను ప్రభుత్వము టోంగన్, ఇంగ్లీషులలో ప్రచురించు చున్నది. దేశమున వాక్స్వాతంత్ర్యములు కలవు. తక్కిన పసిఫిక్ ద్వీపరాజ్యములతో పోల్చినపుడు ఈ రాజ్యమున రోగబాధ తక్కువ యని చెప్పవచ్చును. వైద్యసహాయము ప్రజలకు ఉచితముగ లభించుచున్నది. 197 శయ్యలుకల మూడు ఆసుపత్రులు దేశమున కలవు; 3600 మంది ప్రజలకు ఒక వైద్యుడు కలడు.

**12. యాత్రా సౌ. :** యాత్రికులకు తగు వసతులను ప్రభుత్వము కల్పించినది; కాని ఈ ఆదాయ మార్గముపై ప్రభుత్వము అంతగ ఆధార పడకున్నది.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. జార్జి I (1797 – 1893); దేశమున క్రైస్తవమత వ్యాపనకు తోడు పడి, తొలుతటి రాజ్యాంగమును రూపొందింప జేసిన రాజు.

---

# 8. నౌరూ

**ముఖ్యనగరము :** యారెన్ జిల్లాలో ప్రభుత్వ కేంద్రము పనిచేయుచున్నదియే కాని నిర్దిష్టముగ ముఖ్యనగరమనునదియే లేదు. **జెండా :** నీలి భూమికపై అడ్డముగ మధ్యన సువర్ణపు చార కలదు: భూమధ్యరేఖకు ఇది సంకేతము; దీనికి దిగువన 12 కోణములుగల తెల్లని నక్షత్రము కలదు; ఈ 12 సంఖ్య దేశపు తెగల సంఖ్యను తెలియజేయును. **జాతీయ గీతము :** స్వరమేగాని సాహిత్యము లేదు. **నాణెము :** ఆస్ట్రేలియా డాలరు; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన ;** సా. 11 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** భూమధ్యరేఖకు దక్షిణమున 0'32' ద. అక్షాంశరేఖన, 166°55' తూ. తులారేఖలపైఉన్న ఈ రాజ్యము సముద్ర పరివృతమగు ఏకైక ద్వీపము. సాలమన్, గిల్బర్ట్ ద్వీపవర్గముల మధ్యఉన్న ఈ ద్వీపరాజ్యపు వైశాల్యము 21.37 చ. కిమీ. (2137 హెక్టేరులు). అండవృత్తాకారముగ కుదిరియున్న ఈ పగడపు దీవి చుట్టుకొలత 19 కిమీ. మాత్రమే. గులక తిప్పలు తీరమున ఎక్కువగ ఉండును; మధ్యన 61 మీ. ఎత్తుగల పీఠభూమి కలదు. వాగులుకాని నదులుగాని లేవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** సంవత్సరము పొడవున ఉష్ణోగ్రత 70° - 75° మధ్య మారుచుండును. సాలీనా సరాసరి వర్షపాతము 202 సెం. మీ; అయినను అంతటంతట అనావృష్టి బాధయు కలదు. తీరములందు ఎక్కువగను, మధ్యభాగమున అచ్చటచ్చటను, కొబ్బరిచెట్లు కలవు. ఇవిగాక చిన్న చిన్న పొదలుతప్ప తక్కువిధముల చెట్లు ఏవియు అంతగా కానరావు. దేశమున సహజమగు జంతుసంపదలేదు; పక్షిజాతులును చాల తక్కువ. ఇతర స్థలములనుండి కొని రాబడిన పందులు, కోళ్లు కొంతవరకు వృద్ధియైనవి. పరిసర సముద్ర జలములందు చేపలు విరివిగ కలవు.

**3 జనసంఖ్య మొ. :** 1972 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 6,768; వీరిలో 3,471 మంది దేశీయులు; 883 చీనీయులు; 627 యూరపీయులు; తక్కినవారు వివిధ పసిఫిక్ దీవులకు చెందినవారు. దేశీయులు పొలినీసియన్ మానవజాతికి సన్నిహితులు; వీరు 12 తెగల వారు ఈ దేశమున వసించుచున్నారు, తక్కిన చీనీయులు మొదలగువారు ఇచటి ఫాస్ఫేటుల త్రవ్వకమునకై ఇచట చేరినవారు, నౌరువన్‌భాష దేశీయుల మాతృభాష; అయినను పాఠశాలలందును, పరిపాలనయందును ఇంగ్లీషు ఉపయోగింపబడుచున్నది ప్రజలందరు క్రైస్తవులు.

**4. సమాచార సా. :** రేడియో టెలిఫోను ద్వారా తక్కిన ప్రపంచముతో ఈ దీవికి సంబంధము కలదు. రాజ్యమున వార్తా సాధనముగ టెలిఫోను విరివిగ వాడబడుచున్నది.

**5. యాన సౌ. :** దేశమునుండి పరిసర ద్వీపములకు, ఆస్ట్రేలియా, న్యూజిలాండులకు నౌకాయాన సౌకర్యము కలదు. దేశమున ఒక చుట్టు రోడ్డు కలదు; ఫాస్ఫేటును కొనిపోవుటకు ఒక చిన్న రైలుమార్గమును కలదు. విద్యార్థులను పాఠశాలకు కొనిపోవు ఒక బస్సు తప్ప తక్కువిధముల బస్సులు లేవు. జపాన్, ఆస్ట్రేలియా, ఫిజీలకు ఇచటి విమానాశ్రయమునుండి రాకపోకల వసతి కలదు.

**6. చరిత్ర :** 1798 లో జాన్ ఫెరన్ అను నావికుడు ఈ దీవిని కనుగొనెను. తదాదిగ ఓడలనుండి తప్పించుకొని వచ్చిన నావికులు అనే కులు అటక్రమముగ చేరి ప్రజలకు తుపాకులతో పరిచయము కల్పించిరి. దీనివలన ఆచటి తెగ లలో అంతఃకల్లోలములు చెలరేగి ఎక్కువ రక్త పాతము జరిగెను. ఈ సమయముననే బ్రిటిష్ వారును, జర్మన్‌లును చేసికొనిన ఒక ఒడంబడికను అనుసరించి పశ్చిమసామోవ్ మొదలగు వానితో పాటుగ నౌరూదీవియు జర్మనుల పరిధిలోనికి వచ్చినది. అంతట కొన్ని వర్తక సంఘముల కోరికపై జర్మనీ ఈ దీవిని వశపరచుకొని, దేశీయు లను నిరాయుధులుగ చేసినది (1888). తరువాత క్రైస్తవ మతప్రచారకులు అటచేరి దేశమున క్రైస్తవమతమును వ్యాపింపజేసిరి. 1901 లో ఇచట పాస్ఫేటుగనులు కనుగొనబడి, 1907 నుండి అట త్రవ్వకము మొదలైనది. ఆ ఫాస్ఫేటే దేశప్రజల బ్రతుకునకు ముఖ్యాధారమైనది. ఈ శతాబ్ది అంతమువరకు ఈ గనులలో పనికి అవ కాశములు కలవని తెలియుచున్నది. 1914 లో, ప్రథమ ప్రపంచయుద్ధ కాలమున, ఆస్ట్రేలియన్ సేనలు ఈ దీవిని ఆక్రమించినవి. యుద్ధానంత రమున నానాజాతి సమితి అనుమతితో మాండేటరీ ప్రాంతముగ దీనిని బ్రిటన్ గ్రహించి, పరిపాలన బాధ్యతను ఆస్ట్రేలియాకు ఒప్పగించినది. తరువాత 1947 లో ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జపాను సేనలు ఈ దీవిని ఆక్రమించి (1942) దేశమును సర్వనాశనము చేసినవి. 1945 లో ఆస్ట్రేలియన్ సేనలు మరల ఈ దీవిని వశపరచు కొని, జనులకు పునరావాస సౌకర్యములను కల్పిం చినవి. 1947 మొదలుగ దీని ధర్మకర్తృత్వ పాలనకు బాధ్యులుగ బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండులను ఐ. రా. స. నిర్ణయించగ, ఆ ధర్మకర్తల పక్షమున ఆస్ట్రేలియాయే పాలనను నిర్వహించినది. కడకు ప్రజాందోళనకు, ఐ. రా. స. ధర్మకర్తృత్వ సంఘపు ఆదేశమునకు లొంగి ఆస్ట్రేలియా వైదొలగగ నౌరూ స్వతంత్రమైనది (1968 జనవరి 31). ప్రపంచపు గణరాజ్యము లందెల్ల వైశాల్య, జనసంఖ్యలయందు కనిష్ఠతమము ఈ రాజ్యము.

**7. పరిపాలన :** ప్రాతిపదిక స్వత్వములును, వివిధ స్వాతంత్ర్యములును ఇచటి రాజ్యాంగ విధానమువలన రక్షితములు. శాసన నిర్మాణాధి కారము 18 మంది సభ్యులుకల శాసన సభయందు కలదు. 20 ఏండ్లకు తగ్గని పౌరులకు వోటుహక్కు కలదు. వీరివలన శాసన సభ్యులు, మూడేండ్ల కొకసారి జరుగు ఎన్నికలలో ఎన్నుకొనబడెదరు. ఈ శాసనసభ దేశాధ్యక్షుని ఎన్నుకొనును. ఇతడు నలుగురు లేదా అయిదుగురు మంత్రులను నియ మించుకొని వారి సాయమున పాలనను నిర్వ హించును. దేశమున వోటుహక్కు మాత్రము నౌరూదేశీయ సంతతి వారికిని, వారితో సంకర మొందిన పసిఫిక్ ద్వీపజాతులవారికిని మాత్రమే కలదు. రాజకీయ పక్షములు ఏవియు దేశమున లేవు.

**8. దేశరక్షణ :** సైనిక బలము ఎట్టిదియు దేశమునకు లేదు; 94 మందిగల పోలీసుబలము కలదు.

**9 అంతర్జాతీయ సం. :** కామన్‌వెల్తున ఈ దేశమునకు ఒక విధపు 'ప్రత్యేక' సభ్యత్వము కల్పింపబడినది: ఐ రా. స. యందు దీనికి సభ్యత్వము లేదు.

**10. ఆర్థిక రంగము :** ఈ రాజ్యపు ఆర్థిక వ్యవస్థ ఫాస్ఫేటుపై ఆధారపడి ఉన్నది. తొలుత ఈ గనులు బ్రిటిష్, ఆస్ట్రేలియన్, న్యూజీలాండ్ కంపెనీల వశముననే ఉన్నను 1970 లో దేశీయులే వీనిని కొనుగోలుచేసి వశపరచుకొనిరి. చేపల పరి

ప్రమను వృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 1 67,94,325 ఆ. డాలర్లు; దిగుమతులవిలువ 63,69,541 ఆ. డాలర్లు (1966-67). బడ్జెటరీ వ్యయము 77,21,890 ఆ డాలర్లు (1971 - 72).

**11. సాంఘిక రంగము :** పౌరులకు గృహ వసతిని కల్పించుటలో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధను కనబరుచుచున్నది. దేశీయులకొరకై 426 నివాసములు, యూరపియనులకు 216 నివా సములు, తక్కిన వారికి 100 నివాసములు నిర్మింప బడినవి (1968). వీని అన్నింటికి విద్యుత్తు వసతి మొదలగునవి కలవు. 6 నుండి 16 ఏండ్ల వరకు పిల్లలకు దేశీయులకు నిర్బంధముగ విద్యాబోధించబడుచున్నది. 9 ప్రథమిక పాఠశాలలలో 1,4[illegible]5 మంది; 2 సెకండరీ - పాఠశాలలలో [illegible]05 మంది విద్యార్థులు కలరు (1970). ఇచటి విద్యార్థులకు ఉన్నత విద్యాభ్యాసమునకై ఆస్ట్రేలియాయందును, పాపువా-న్యూగినీలోను ఉన్న విశ్వవిద్యాలయములందు సౌకర్యములు లభించు చున్నవి. దేశమున దినపత్రికలు లేవు. ప్రభుత్వమే ఒక వారపత్రికను ప్రచురించుచున్నది. చెప్పదగిన గ్రంథాలయములుగాని మ్యూజియములుగాని లేవు. 175 శయ్యాసంఖ్య కల రెండు ఆసుపత్రులు ప్రజలకు వైద్యసహాయమును కల్పించుచున్నవి

---

# 9. న్యూ కెలడోనియా (నౌవెల్లీ కెలడోనీ)

## (ఫ్రెంచి పాలనలోని సముద్రోత్తర ప్రాంతము)

**ముఖ్యనగరము :** నౌమీయా; **నాణెము :** ఫ్రాంకు (సి. ఎఫ్. పి.); 100 ఫ్రాంకులు = రు. 2.70; **కొలతూకములు :** మెట్రిక్ విధాన పువి; **కాలపరిగణన :** సా. 11 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ పసిఫిక్ మహాసము ద్రమున 20°-22°25′ ద. అక్షాంశ రేఖలకును, 164°-167° తూ. తులారేఖలకును మధ్యనుఉన్న ఈ ద్వీపపు వైశాల్యము 16,112 చ. కిమీ. పరి పాలనా రీత్యా ఈ దిగువవియు ఈ ద్వీపముతోచేరి ఉన్నవి. (1) పైన్స్‌దీవి; న్యూ కెలడోనియాకు ఆగ్నేయమున 48 కిమీ. ల దూరమున ఇది ఉన్నది; దీని వైశాల్యము 153 చ. కిమీ. (2) లాయల్టీ దీవులు; న్యూ కెలడోనియాకు 96 కిమీ. దూరమున తూర్పున ఉన్నవి; మేరీ, లూఫీ, ఊవీ అను మూడు పెద్ద దీవులును, కొన్ని చిన్న లంకలును ఇందు చేరిఉన్నవి; వీని మొత్తపు వైశాల్యము 2 072 చ. కిమీ. (3) హువాన్ దీవులు; ఇవి న్యూ కెలడోనియాకు 272 కిమీ. వాయవ్యమున ఉన్నవి; జనావాస మిందు లేదు. (4) బెలెఫ్ ద్వీపజాలము; న్యూ కెలడోనియాకు 11 కిమీ. దూరమున ఈశాన్యమున ఉన్నది. (5) చెస్టర్ ఫీల్డ్ దీవులు; 20° ద. అక్షాంశరేఖపై న్యూ కెలడోనియా ద్వీపపు ఉత్తరాగ్రమునకు పశ్చిమ మున 547 కిమీ. దూరమున ఉన్నవి. (6) వాల్ పోల్ దీవి; లోయల్టీ దీవులలోని మేరీ దీవికి ఆగ్నే యమున 145 కిమీ. ల దూరమున ఉన్నది. ఈ అన్ని ప్రాంతములతో కలిసిన న్యూ కెలడోనియా వైశాల్యము 18,998 చ. కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ :** సాలున సరాసరి ఉష్ణోగ్రత 71.6° ఫా; గాలిలో చెమ్మదనము తక్కువ; దాదాపుగ సంవత్సరము పొడవున వ్యాపార వాయువులు వీచుచుండును. వాతావరణము సౌమ్యముగ నుండి హాయి గొల్పుచుండును. దేశమున సహజములగు రెండు ప్రత్యేక వృక్ష జాతులు కలవు. అటులే 'కేగన్' అనబడు ఒక రమ్యమగు పక్షియు ఇచట కననగును; ఇది ఎగుర జాలదు; దీనిని దేశీయులు జాతీయ విహంగముగ లెక్కించుచున్నారు. అడవి పందులు, లేళ్లు ప్రముఖములగు వన్యజంతువులు.

**3. జనసంఖ్య మొ. :** 1969 లెక్కలను అనుసరించి న్యూ కెలడోనియా దీవిలోని జనసంఖ్య 1,00,580; ఇందులో యూరపియులు 32,120 (యూరపీయులలో ఫ్రెంచివారు ఎక్కువ); మెలనీసియనులు 47,110; వియెత్నామీయులు-ఇండోనీసియనులు కలసి 6,020; పొలినీసియనులు - తదితరులు 9,330. ముఖ్యనగరమగు నౌమీయాలోని జనసంఖ్య 50 490 తక్కిన దీవులలో పైన్స్ దీవియందు 925 మంది, లోయల్టీ దీవులలో 13,617 మంది నివసించుచున్నారు. అందరికిని ఫ్రెంచిభాష సుపరిచితము.

**4. సమాచార సా. :** రాజ్యమున తపాలాఫీసుల సంఖ్య 50; తంతి - టెలిఫోను వసతులు బాగుగ కలవు.

**5. యాన సౌ. :** రోడ్ల నిడివి 5,030 కిమీ; ఇందు 1500 కిమీ. ఉత్తమశ్రేణికి చెందినది. నౌమీయాలో మంచి హార్బరు కలదు. నగరము నుండి నౌకామార్గము వలనను, విమానయానము వలనను ఫ్రాన్సు, ఆస్ట్రేలియా, న్యూ హెబ్రైడిన్, వాలిస్ ద్వీపజాలము, తాహితీలకు రాకపోకల వసతి కలదు.

**6. చరిత్ర :** 1768 లో లూయీ ఆన్టోనీ డి బోగన్‌విల్లి అను ఫ్రెంచి దేశీయుడు ఈ దీవిని కనుగొనెను. తరువాత దీనిని జేమ్స్ కుక్ అను ఇంగ్లీషు నావికుడును కనుగొనినటుల తెలియుచున్నది. అచటి స్థానిక ప్రజలలో తెగలనాయకులు ఫ్రాన్సుదేశపు అధికారమును మన్నించుటకు 1844 లో అంగీకరించిరి. అంతట ఫ్రెంచి వలసగ కొంతకాలముండి 1946 లో ఫ్రెంచి దేశపు సముద్రోత్తర ప్రాంతముగ మారినది. 1958 లో దేశీయులు ఈ ప్రతిపత్తికి తమ అమోదమును తెలిపిరి.

**7. పరిపాలన :** ఫ్రాన్సు దేశపు ప్రభుత్వము నియమించిన గవర్నరు, అయిదుగురు సభ్యులు కల పాలక సంఘపు సాయమున, ఇట పాలనను నిర్వహించును. ఈ పాలక సంఘ సభ్యులను ప్రాంతీయసభ ఎన్నుకొనును. ప్రాంతీయ సభయందు 35 సభికులుందురు; వీరిని దేశప్రజలు, సార్వజనిక వోటుపద్ధతిన ఎన్నుకొనెదరు. ఫ్రాన్సునందలి జాతీయ శాసన సభయందు ఒక ప్రతినిధియు, సెనెట్‌లో ఒక ప్రతినిధియు ఈ రాజ్యమునకు కలరు.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఫ్రాన్సుదేశమే బాధ్యత వహించి నిర్వర్తించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయ, ఖనిజోత్పత్తులు ఈ రాజ్యపు ఆర్థిక వ్యవస్థకు ఆధారములు. కాఫీ, కొబ్బరి, మొక్కజొన్న, పండ్లు, కాయగూరలు ముఖ్యములగు వ్యవసాయోత్పత్తులు; పశుసంపద విరివిగ కలదు. ఖనిజ సంపద ఎక్కువ; అందు ముఖ్యమైనది నికెల్. ఈ ఖనిజమును ఆశ్రయించియు, వ్యవసాయోత్పత్తులను ఆశ్రయించియు కొన్ని పరిశ్రమలు కలవు. ఎగుమతుల విలువలో 90% నికెల్‌వలన లభించుచున్నది; కాఫీ, కొబ్బరి,

ఇనుము, క్రోమియమ్ తక్కిన ఎగుమతి వస్తువులు. ఎగుమతుల విలువ 70,990 లక్షల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 70,670 లక్షల ఫ్రాంకులు (1967). రాజ్యపు బడ్జెటుకీ వ్యయము 21,140 లక్షల ఫ్రాంకులు (1967).

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రయిమరీ పాఠశాలలలో 21,755 మంది; సెకండరీ పాఠశాలలలో 2,748 మంది; సాంకేతిక వృత్తి పాఠశాలలలో 1 123 మంది విద్యార్థులు కలరు. (1967).

---

# 10. న్యూజీలాండ్

**ముఖ్యనగరము :** వెల్లింగ్‌టన్; **జెండా :** జెండాయందు రెండు విశిష్టభాగములు కలవు; దండమువద్ద ఎగువ నాలుగవ భాగమున యూనియన్ జాక్; కుడివైపు సగమున ఎరుపురంగున,




పటము 4.

'సదరన్ క్రాస్' అని వ్యవహరింపబడు నాలుగు నక్షత్రముల సమూహము, ఈ మొత్తమును నీలి భూమికపై అమరియున్నవి. **జాతీయ గీతము :** గాడ్ సేవ్ ది క్వీన్ (రాణిని పరమేశ్వరుడు రక్షించుగాక); **నాణెము :** న్యూజీలాండు డాలరు అను దశాంశపు నాణెము; ఒక న్యూ. డాలరు = రు. 8.40; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** అర్ధరాత్రి 12 గం = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** అనేక ద్వీపములు చేరియున్న ఈ రాజ్యమున ప్రముఖ ద్వీపములు 162° తూ. - 173° ప; తులారేఖలమధ్యను, 33°- 53° ద. అక్షాంశ రేఖల మధ్యను విస్తరించి ఉన్నవి. టోకెలో ద్వీపములు 8°-10° ద. అ. రేఖలమధ్యను, 171° - 173° ప. అక్షాంశ రేఖల మధ్యను ఉన్నవి. ఇవిగాక నివే అను వేరొక ద్వీపము 18° ద. అక్షాంశరేఖన 169° ప. తులాంశరేఖయందు కలదు. ఈ అన్నిద్వీపముల మొత్తపు వైశాల్యము 2,68,676 చ. కిమీ. (ఇందు నార్తు ద్వీపము 1,14,688 చ. కిమీ; సౌత్‌ద్వీపము 1,50,461 చ. కిమీ; స్టీవార్డ్ ద్వీపము 1,735 చ. కిమీ; చాతమ్ ద్వీపములు 963 చ. కిమీ; తక్కిన ద్వీపముల వైశాల్యము 829 చ.కి మీ )

దేశపు భూతలమున దాదాపు నాలుగవవంతు 184 మీ. ఎత్తునకు లోపుగనే ఉన్నది. నార్తుద్వీపమున పర్వత శ్రేణులలో ఏ శిఖరమును 1830 మీ. ఎత్తును మించదు; కాని ఆ ద్వీపమునందే ఉన్న

ఎగ్మాంట్, రువపేహూ, గారుహో, తోంగారిరో అను నాలుగు అగ్నిపర్వత శిఖరములు మాత్రము, ఈ ఎత్తును అధిగమించి ఉన్నవి; వీనియందు అత్యున్నతమగు రువపేహూ ఎత్తు 2797 మీ. వీనిలో ఎగ్మాంట్ తప్ప తక్కినవి ఇపుడును మండుచునే ఉన్నవి. ఈ అగ్నిపర్వతముల ఉనికి వలన ఆ ప్రాంతమున ఉష్ణగుండములును, వేడినీటి బుగ్గబావులును ఎక్కువగ రూపొందుచున్నవి. నార్తుద్వీపము కన్నను సౌత్ ద్వీపమున పర్వత శ్రేణులు ఎక్కువగ కలవు; అయినను అగ్నిపర్వతములు మాత్రము లేవు. ఆ ద్వీపమున ఉత్తరముననుండి దక్షిణమునకు బారుతీరియున్న సదరన్ ఆల్ప్సు పర్వతశ్రేణిలో అత్యున్నతమగు కుక్ (అవురాంగి) శిఖరపు ఎత్తు 3.764 మీ. ఈ పర్వతశ్రేణిలో విపరీత విస్తృతికల హిమశిల (గ్లేషియరు)లును కలవు; వానియందు తాస్మన్ గ్లేషియర్ అనునది ప్రముఖము; దీని పొడవు 29 కిమీ.; వెడల్పు 2 కిమీ. నదులు అతివేగముగ ప్రవహించును; కాని లోతు తక్కువ; అందువలన నౌకాయానమునకు అవి ఉపకరింపవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున సమశీతోష్ణపు, సాగరిక శీతోష్ణస్థితి కాననగుచున్నది. ఋతువులతో నిమిత్తములేని రీతిగ ఉష్ణతయు, వర్షపాతమును దేశమున కలవు. పర్వతప్రాంతములందు మాత్రము వర్షపాతము ఎక్కువ. నార్తు ద్వీపమున సముద్రమట్టపు ప్రదేశమున ఉష్ణత 58° ఫా. గను సాలుసరి వర్షపాతము 98 సెం. మీ. గను ఉన్నవి. సౌత్‌ద్వీపమున అవియే 50° ఫా. గను 188 సెం.మీ. గను ఉన్నవి. సౌత్ ద్వీపమున పశ్చిమ తీరమునందున్న మిల్‌ఫర్డ్‌సౌండ్‌వద్ద సాలుసరిన అత్యధిక వర్షము – 650 సెం. మీ. – పడుచున్నది.

తక్కిన ప్రపంచమునుండి అతిదీర్ఘ కాలము వేరుపడియుండిన ఈ ద్వీపములందు, ప్రపంచమున వేరొకచోట కనరాని, ప్రత్యేక లక్షణములుగల వృక్షసంతతి రూపొందినది. ఇందు 250 జాతులు ఆస్ట్రేలియాలో మాత్రమే కననగుచున్నవి; దక్షిణ అమెరికాలోను దానికి దక్షిణమున ఉన్న ద్వీపములలోను ఉన్న వృక్షసంతతులకు సన్నిహితములగునవియు కొన్ని జాతులు కలవు; ఈ విధముగ ఈ దేశపు వృక్షసంతతి వృక్షశాస్త్రజ్ఞులకు చక్కని పరిశోధన భూమిగ ఉపకరించుచున్నది. దేశీయములగు సస్తనజాతులు రెండుమాత్రమే – సీలు మృగములు, గబ్బిలములు – కలవు. సముద్రపు సస్తన జాతులందు తిమింగిలములును, జలనాగములు (డాల్ఫిన్‌లు)ను ప్రముఖములు. దేశమున వింత జాతుల పక్షులు అనేకములు కలవు. తువతరా అనబడు ఒక వింతబల్లి ఈ దేశమున మాత్రమే కననగుచున్నది. ప్రపంచపు ఇతర ప్రాంతములందుండి గత రెండు శతాబ్దములలో ఇచటికి చేర్చబడిన జంతుజాతులు – కుందేలు, లేడి, పంది మొ. – బాగుగ వృద్ధి చెందినవి.

**3. జనసంఖ్య మొ. :** 1972 లెక్కలనుబట్టి దేశపు జనసంఖ్య 29,09,916. జనసాంద్రత చ. కిమీ కు 11. ప్రజానీకమున 70% నార్తు ద్వీపమున, దాదాపు 30% సౌత్‌ద్వీపమున వసించుచున్నారని భావింపవచ్చును. దేశప్రజలలో మూడింట రెండువంతులు పట్టణములందు నివసించుచున్నారు. దేశపు ప్రముఖనగరములలో ఆక్‌లాండ్ (జ. సం : 7,19,128); వెల్లింగ్‌టన్ (3,28,800); క్రైస్ట్ చర్చ్ (3,07,500); హట్ (1,19,800); హామిల్టన్ (1,39,000), డునేడిన్ (1,18,000) అనునవి ప్రముఖములు.

దేశప్రజలలో అత్యధిక సంఖ్యాకులు బ్రిటిష్ సంతతికి చెందినవారు; బ్రిటిష్‌వారు ఇట వలస చేరుటకు పూర్వమున, ఒక సుస్థిరసాంఘిక వ్యవస్థను నెలకొల్పి, సభ్యతాపథమున కొంత పురోగ

మించిన మయోరీ జాతివారు ఇచట నివసించు చుండిరి. ఆ సంతతివారు క్రమముగ సంఖ్యా బలమునను, ఆర్థికపరిస్థితి యందును క్షీణస్థితికి వచ్చిరి. ప్రస్తుతమున ఆ సంతతికి, స్వచ్ఛముగ గాని సంకరముగగాని, చెందినవారు 2,27,714 మంది కలరు. పై జాతులవారుగాక, అత్యల్ప సంఖ్యలలో ఏసియ, భారతీయ, డచ్చి, యుగొస్లావ్, గ్రీకు, పోల్ ప్రజలును కిననగుచున్నారు.

దేశీయులందరును ఇంగ్లీషు భాషనే మాటాడు చున్నారు; అయినను మయోరీలందు మయోరి భాష వ్యాప్తియందు ఉండుటయేగాక, వారి పాఠ శాలలందును, తొలుతటి తరగతులందు, మయోరి బోధింపబడుచున్నది.

ప్రభుత్వాదరితమగు మతము ఏదియును లేదు; కాని ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు.

**4. సమాచార సౌ. :** ప్రభుత్వముచేత నిర్వహింపబడు తపాలా, తంతి టెలిఫోను వసతులు దేశమున విరివిగ కలవు. తలసరి టెలిఫోనుల లెక్కలో, ప్రపంచదేశములందు, ఈ దేశము నాలుగవ స్థానమును ఆక్రమించినది. ఈ దేశమున 100 మంది పౌరులకు 40 చొప్పున టెలిఫోనులు కలవు. రేడియో ప్రసారమును, టెలివిజన్ ప్రసారమును ప్రభుత్వాధ్వర్యమున పనిచేయుచున్నది. ఉపగ్రహము వలనను, వార్తా సౌకర్యము, కలదు.

**5. యాన సౌ. :** 1972లో మొత్తపు రోడ్ల నిడివి 94,896 కి. మీ. రైలుమార్గముల నిడివి 4,779 కి. మీ. దేశమున 772 నౌకలు వివిధ ద్వీపముల మధ్యప్రయాణములకు, సరకుల చేరవేతకు ఉపకరించుచున్నవి. దేశపు హార్బరులలో ఆక్‌లాండ్, వెల్లింగ్‌టన్ ప్రముఖములు. డునేడిన్, లిటిల్‌టన్, న్యూప్లిమత్ రేవులును విదేశవ్యాపారమునకు కొంతవరకు ఉపకరించుచున్నవి. దేశాంతర్భాగమున వివిధ కేంద్రముల మధ్య విమానయాన వసతి, ప్రభుత్వపు సంస్థవలన, లభించుచున్నది. ఆక్‌లాండ్, వెల్లింగ్‌టన్, క్రైస్ట్ చర్చిలలో అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. సింగపూర్, లాస్ ఏంజిలెస్, హాంగ్‌కాంగ్‌లకు వీనినుండి విమానయాన వసతి కలదు.

**6. చరిత్ర :** క్రీ. శ. 14వ శతాబ్దిలో పసిఫిక్ మహాసముద్రపు కొన్నిదీవులనుండి మయోరి జాతి ప్రజలు ఇచటకు వచ్చి వేరి రాజ్యములో ఒక సువ్యవస్థిత సాంఘిక వ్యవస్థను ఏర్పరచుకొనిరి. డచ్చి ఈస్టిండియా కంపెనీకి చెందిన ఏబెల్ టాస్మన్ అను సాహసిక నావికుడు ఈ రాజ్యమున సౌత్ ద్వీపపు పశ్చిమ తీరమును 1642 లో కనుగొనెను; కాని మయోరీల ప్రతిఘటన వలన ఇట కాలిడజాలక తిరిగిపోయెను. తరువాత చాలకాలమువరకు యూరపువాసు లెవరును అటుపోలేదు. 1769 లో బ్రిటిష్ ప్రభుత్వపు నౌకాదళమునకు చెందిన జేమ్సు కుక్ ఇట కాలిడుటయేగాక, ఆ తరువాత 1773, 1774, 1777 లలో అటకు పదింబడిగ వచ్చి దేశపు తీరములను చుట్టి తీరపటమును తయారు చేసెను.

1790 లో తిమింగిలముల వేటకొరకై తీర ప్రాంతములందు బ్రిటిష్ స్థావరములు కొన్ని నెలకొల్పబడినవి. 1814 లో తొలుతటి క్రైస్తవమత ప్రచారకుడు దేశమున దిగెను.

1840 లో మయోరీజాతి నాయకులు, బ్రిటిష్ ప్రభుత్వపు బలిమిని గుర్తించి, తమ దేశముపై ఆధిపత్యమును ఒక ఒడంబడిక ద్వారా బ్రిటిష్ దేశపు రాణియగు విక్టోరియాకు దత్తము చేసిరి. ఈ ఒడంబడికయే 'వైతంగీ ఒడంబడిక' అని పేరొందినది. దీని ద్వారా తమ భూములందు మయోరీలకుగల హక్కులను గౌరవించుటకు బ్రిటన్ అంగీకరించినది. కాని ఆ వెనువెంటనే ఆ ఒడంబడిక షరతులను విస్మరించి బ్రిటిష్‌వారు దేశమున 1841 మొదలుగ వలసలను ఏర్పరచి,

క్రమముగ మయోరీల భూములను ఆక్రమింప మొదలిడిరి. దీనిని ప్రతిఘటించుచు మయోరీలు సాగించిన యుద్ధముల (1860-1870) వలన మయోరీల పరిస్థితి మరింతగ అధోగతికి చేరుకొనినది. 1852 న ప్రజాప్రతినిధుల సంస్థలు ఏర్పడుట ఈ దేశమున మొదలైనది. 1907 లో దేశము అధినివేశ ప్రతిపత్తిని ఆర్జించినది; 1947 న కామన్‌వెల్తు సభ్యత్వముతో పరిపూర్ణ పరిపాలనా స్వతంత్రతను పొందినది. రెండు ప్రపంచ సంగ్రామములందును గ్రేట్‌బ్రిటన్‌కు అండగ ఈ దేశపు సేనలు వివిధ రంగములందు పోరాడినవి.

**7.** పరిపాలన : కామన్‌వెల్తున సభ్యత్వము కలిగిన ఈ రాజ్యము, యునైటెడ్ కింగ్‌డమ్ వలెనే రాజ్యాంగబద్ధపు రాజరికపు పాలనను కలిగి, యు. కిం. రాజ్యపు అధిపతియొక్క ప్రతినిధినే ప్రభుత్వాధినేతగ అంగీకరించుచున్నది; ఈ అధినేత గవర్నర్ అని వ్యవహరింపబడును; ఇతని పదవీకాల పరిమితి అయిదేండ్లు. శాసన నిర్మాణాధికారము 80 మంది సభ్యులుకల ప్రతినిధి సభయందు న్యస్తము. దేశమున సార్వజనికమగు వోటుహక్కు కలదు. మూండేండ్లకొకసారి జరుగు ఎన్నికలలో వోటర్లు ప్రతినిధి సభయందలి సభ్యులను ఎన్నుకొనెదరు. మయోరీలకై, ప్రతినిధి సభయందు, 1867 మొదలుగ నాలుగు స్థానములు ప్రత్యేకింపబడినవి. ప్రతినిధి సభయందు అత్యధిక సంఖ్యాక బలముగలవాడు ప్రధానమంత్రిగ గవర్నరుచేత నియమితుడై మంత్రివర్గమును ఏర్పరుచును. మంత్రివర్గమును, గవర్నరును కలిసి కార్యనిర్వాహక వర్గముగ ఏర్పడి చట్టబద్ధముగ పరిపాలనకు బాధ్యతను వహించును. దేశమున వివిధ రాజకీయ పక్షములు కలవు; వానిలో నేషనల్ పార్టీ, లేబర్ పార్టీ ప్రముఖములు, ప్రభుత్వము ఆ రెండు పార్టీల మధ్యనే చేతులు మారుచున్నది.

**8.** దేశరక్షణ : భూతల సైన్యమున స్థిర సైనిక సంఖ్య 5,499; వీరుగాక తక్కువిధముల సైనికుల సంఖ్య 21,058; నౌకాసేనయందు 2,966 యోధులును 4 ఫ్రిగేట్లు మొదలుగ యుద్ధోపయోగి నౌకలును కలవు. వాయుసేనయందు స్థిరయోధ సంఖ్య 4,222; తక్కిన వారిసంఖ్య 1,628; 7 విమాన దళములు కలవు

**9.** అంతర్జాతీయ సం. : ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, కామన్‌వెల్తునను ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. కొలంబో ప్రణాళికద్వారా ప్రాంతీయ వర్ధమాన దేశములకు పెక్కింటికి ఈ దేశము ఆర్థిక సాంకేతిక సహాయమును సమకూర్చుచున్నది.

**10.** ఆర్థిక రంగము : దేశపు ఆర్థిక వ్యవస్థ ఇదివరలో చాలవరకు పశుపోషణపై ఆధారపడియున్నను 1955 మొదలుగ పరిశ్రమలును చాలవరకు వృద్ధి చెందినవి. దేశపు జనసంఖ్యలో 38% పనిచేయుశక్తి కలవారు. ఇందు దాదాపు రెండువంతులు వస్తూత్పాదక పరిశ్రమలందును, తక్కినవారు వ్యవసాయము మొదలగు ముడిపదార్థముల ఉత్పత్తి కృషియందును పాల్గొనుచున్నారు. దేశవైశాల్యమున మూడింట రెండువంతులు భూమి వ్యవసాయ, పశుపోషణములకై వినియుక్తమగుచున్నది. ఇందు అయిదింట రెండువంతులు ప్రభుత్వమునకు చెంది రైతులకు కౌలుకు ఈయబడుచున్నది. ఉత్పత్తియగు ఆహారధాన్యములలో ప్రముఖము గోధుమపంట; తరువాత ఓటు ధాన్యమును, బార్లీయును క్రమముగ పేర్కొనదగినవి. పండ్ల ఉత్పత్తి అధికము; ఇందున కొన్ని, అందును ముఖ్యముగ ఆపిల్‌పండ్లు, తేనె, విదేశములకు ఎగుమతి చేయబడుచున్నవి.

వర్షపాతమును ఉష్ణస్థితియు సరికుదరి, దేశమున పశుపోషణకు తగిన చక్కని పచ్చిక భూములు ఏర్పడియున్నవి. దేశమున గోజాతి

పశుసంఖ్య 88,18,902; గొర్రెలు 5,59,18,000; పందులు 6,17,183 (1971). దేశపు ఎగుమతులలో విలువలనుబట్టి మాంసము, ఉన్ని, పాడి ఉత్పత్తులు (జున్ను, గడ్డపాలు మొ.), క్రమ ప్రాముఖ్యమును కలిగి యున్నవి.

దేశమున 23% వైశాల్యము అటవీమయము: ఇందలి కలప దేశావసరములకును కొయ్యగుజ్జు కాగితముల పరిశ్రమకును వినియోగింపబడు చున్నవి. ఖనిజ సంపత్తి తగినంతగ లభ్యమగు చున్నది; దేశావసరములకు సరిపోవు రాక్షసిబొగ్గు కలదు; ఇందు అంతటంతట కొంత ఎగుమతి యగు చున్నది; ఇంధన వాయువును, పెట్రోలును కొన్ని చోటులందున్నటుల పరిశీలనవలన తేలినది. ఇవి దేశావసరములను దాదాపు సగమువరకు తీర్చగల వని అంచనా. ఉక్కు, కాగితము, జవుళీ మొదలగు వానికి సంబంధించిన కొన్ని పరిశ్రమలు ఉన్నను పాల ఉత్పత్తుల పరిశ్రమయే అన్నింట ప్రముఖము. దేశమున విద్యుదుత్పత్తి 1231.5 కోట్ల కివా (1969). సాలుసరి దిగుమతుల విలువ 107.5109 కోట్ల న్యూ. డాలర్లు; ఎగుమతుల విలువ 113.1719 కోట్ల న్యూ. డాలర్లు (1970 - 71). సాలీనా బడ్జెటరీ వ్యయము 186.23 కోట్ల న్యూ. డాలర్లు (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక సంక్షేమ వ్యవస్థ ప్రభుత్వాధ్వర్యవమున పురోగతి ఆర్జించినది. గృహనిర్మాణము, ప్రభుత్వ సహాయమున, సువ్యవస్థిత రీతిలో కొనసాగుట వలన, గృహవసతిలో లోటు చాలవరకు తగ్గినది. 1938 లో సమగ్ర రూపతను పొందిన సాంఘిక భద్రతా చట్టమువలన, దేశమున ప్రజలందరకు, వార్ధక్య, రోగ, నిరుద్యోగ, వైధవ్యబాధల బారి నుండి ఆర్థికముగ సంరక్షింపబడుటకు తగిన వసతులును ద్రవ్యసహాయమును సమకూరుచున్నవి. ఈ ద్రవ్యసహాయము, ఆయా బాధితుల పరిస్థితిని బట్టి వారమునకు 10 నుండి 25 న్యూ. డాలర్ల వరకు మారుచున్నది.

6 ఏండ్లనుండి 15 ఏండ్లవరకు వయసు కలిగిన వారికి అందరికి, ఉచితము, మతాతీతము, నిర్బంధమునగు విద్యాబోధనకు వసతి ఏర్పడియున్నది. 3 - 4 ఏండ్ల మధ్యవయసుకుల పిల్లల సౌకర్యమునకై 521 ఉచిత శిక్షణ శాలలు కలవు. దేశమున 5,08,057 మంది చదువు 2,594 ప్రయిమరీ పాఠశాలలును, 1,93,116 మంది చదువు 336 సెకండరీ పాఠశాలలును కలవు. ఇవిగాక సాంకేతిక పాఠశాలలవలన శిక్షణపొందువారు 96,801 మంది కలరు (1971). దేశమున ఆరు విశ్వవిద్యాలయములు (ఆక్‌లాండు, వైకాటో, వెల్లింగ్‌టన్, మాసీ. కాంటెర్‌బరీ, ఒటాగో) కలవు; ఇవిగాక వ్యవసాయ విశ్వవిద్యాలయ కళాశాల ఒకటి కలదు. వీని అన్నింట కలసి విద్యార్థి సంఖ్య 32,257 (1971).

దేశమున 41 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి; వీనిలో 'న్యూజీలాండ్ హెరాల్డ్' అనునది అధిక ప్రచారము (2,10,000) కలిగియున్నది. దేశమున 351 గ్రంథాలయములు కలవు; వానిలో ప్రముఖమైనది ఆక్‌లాండ్ నగరమున ఉన్నది. 48 చిత్రాగారములు (గేలరీలు), 27 మ్యూజియములు ఉన్నవి. ఇందు ప్రముఖములైనవి ఆక్‌లాండ్, కాంటెర్‌బరీ, డునేడిన్, ఒటాగో, వెల్లింగ్‌టన్ నగరములలో కలవు (1971).

దేశమున వేర్వేరు తరగతులకు చెందిన మొత్తపు ఆసుపత్రుల సంఖ్య 209; శయ్యాసంఖ్య 16,212; ఇవిగాక 3,012 శయ్యాసంఖ్యకల 150 ప్రయివేటు ఆసుపత్రులు కలవు. వైద్యసంఖ్య 4,345; అనగా 640 మందికి ఒక వైద్యుడు చొప్పున కలరు (1968).

**12. యాత్రా సౌ.:** దేశమున యాంత్రిక పరిశ్రమ సువ్యవస్థితమై ఉన్నది. ఆస్ట్రేలియా నుండి వచ్చు బ్రిటిషు పౌరులకు తప్ప తక్కిన వారికి పాస్‌పోర్టులు విధిగా ఉండి తీరవలయును. బ్రిటిష్ పౌరులకు, కొన్ని నిర్దిష్టదేశముల పౌరులకు వీసాలు కలిగియుండవలసిన అవసరము లేదు. 1971 – 72 లో దేశమును 30,024 మంది విదేశీయులు సందర్శించిరి.

**13. పాలిత ప్రాంతములు:** కుక్ ద్వీపములు, నివీద్వీపము, రాస్ డిపెండెన్సీ అనునవి ఈ దేశముచే పాలింపబడు ప్రాంతములు. వీనిలో తొలుతటివి ఆంతరంగిక స్వపరిపాలనను 1965 మొదలుగ అనుభవించు చున్నది. (చూ. పు. 448) నివీద్వీపము ప్రస్తుతము న్యూజిలాండు పాలనలోనే ఉన్నది. రాస్‌డిపెన్‌డెన్సీ అనబడునది అంటార్కిటికా యందు భాగము. **నివీ:** నివీ ద్వీపపు వైశాల్యము 259 చ. కిమీ; జనసంఖ్య 5,258 (1968). వీరందరును పాలినీసియన్ జాతికి చెందినవారు 1961 లో ఈ ద్వీపము బ్రిటిష్ రక్షిత ప్రాంతమై 1901 లో న్యూజిలాండుకు కలుపబడినది. న్యూజిలాండ్ ప్రభుత్వము నియమించు ఒక రెసిడెంట్ కమీషనరు, 14 మంది సభ్యులుకల శాసనసభ సాయముతో పాలనను నిర్వహించును. ఈ సభ్యులను ద్వీపప్రజలు సార్వజనికమగు వోటు పద్ధతిన ఎన్నుకొనెదరు. భూమి సారవంతమే అయినను నదులు ఎట్టివియును లేనందున వర్షాధారమున వ్యవసాయము సాగుచున్నది. కొబ్బరి, అరటిపండ్లు, చిలగడ దుంపలు ముఖ్యములగు పంటలు. గ్రామముల మధ్య టెలిఫోను సౌకర్యము కలదు. 115 కి. మీ. నిడివికల రోడ్లుకలవు. న్యూజిలాండ్ నుండి నెలకొకసారి ఒక స్టీమరు వచ్చిపోవుట ద్వారా తక్కిన ప్రపంచముతో ఈ దీవికి యాన సౌకర్యము కలదు. బడ్జెటున లోటును, అభివృద్ధికి అవసరమగు ఖర్చును న్యూజీలాండ్ ప్రభుత్వము భరించుచున్నది. వైద్య సహాయమును, 5 – 14 ఏండ్ల వయసు పిల్లలకు విద్యాసౌకర్యమును ఉచితముగ పౌరులకు లభించు చున్నవి 1968 లో 1754 మంది విద్యార్థులు పాఠశాలలలో కలరు.

**14. ప్రసిద్ధ పౌరులు:** 1. లార్డ్ ఎర్నెస్ట్ రూథర్‌ఫర్డ్ (1871–1937). సుప్రసిద్ధ అణవిక విజ్ఞానియగు ఈతడు ఈ దేశమున జన్మించెను. 1908 లో నోబెల్ బహుమతిని ఇతడు ఆర్జించెను. 2. సర్ ఎడ్మండ్ పెర్సివల్ హిల్లరీ (జ. 1919). ఎవరెస్ట్ శిఖరమును తొలుతగ ఎక్కినవారిలో ఒకడు.

---

# 11. న్యూ హెబ్రియుడిస్ (నోవెల్లే హెబ్రియుడిస్)

## (ఫ్రెంచి, బ్రిటిష్ ప్రభుత్వముల సంయుక్త పాలిత ప్రాంతము)

**ముఖ్యనగరము:** విలా; **నాణెము:** ఆస్ట్రేలియా ప్రభుత్వపు డాలరు; **కొలతూతములు:** బ్రిటిష్, మెట్రిక్ విధానములు; **కాలగణన:** రాత్రి 11 గం. 30 ని. = భారతదేశమున సా. 5 గం. 3 ని.

**1. ఉనికి మొ.:** ఫిజీకి పశ్చిమమున 800

కిమీ. ల దూరమునను, న్యూకెలిడోనియాకు ఈశాన్యమున 400 కిమీ. ల దూరమునను దక్షిణ పసిఫిక్ మహాసముద్రమున 13° - 21° ద. అక్షాంశరేఖలకును, 166° - 170° తూ. తులారేఖలకును మధ్య అటనట చెదరియున్న దాదాపు 70 ద్వీపములు ఈ రాజ్యముగ వ్యవహరింపబడుచున్నవి ఇందు 12 పెద్దద్వీపములు-ఎస్పిరుతూ సాంతో, మాలేకులా, ఏపీ, పెంటెకాస్ట్, అయోబా, మేవా, పామా, అంబ్రిమ్, ఎఫాతే, యెర్రోమాంగా, తనా, అనీతియమ్-కలవు; తక్కినవి చాల చిన్న దీవులు రాజ్యపు మొత్తపు వైశాల్యము 14,760 చ. కిమీ. ద్వీపములలో అనేకములు పర్వతమయములు; అందలి ఉన్నతశిఖరములు 1880 మీ ఎత్తుకు పైబడి ఉన్నవి; మూడు అగ్నిపర్వతములును అందు కలవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** విలానగరమున సరాసరిన సాలుసరి వర్షపాతము 225 సెం. మీ.

**3. జనసంఖ్య మొ. :** 1967 లోని తొలుతటి జనాభా లెక్కను అనుసరించి రాజ్యపు జనసంఖ్య 77,988; వీరిలో దేశీయులు 72,243; తక్కినవారు యూరపీయులు మొదలగువారు. 1972 లో అంచనాలను అనుసరించి రాజ్యపు జనసంఖ్య 86,000; దాదాపుగ అందరును క్రైస్తవులు; ఫ్రెంచి, ఇంగ్లీషుభాషలు వాడుకలో ఉన్నవి.

**4. సమాచార సౌ. :** వైర్‌లెస్ ద్వారా, సూవా, నౌమియా, సిడ్నీలతో వార్తాసంబంధము కలదు. విలా నగరమున ఒక రేడియో ప్రసార కేంద్రము వారమున అయిదు దినములందు నిర్ణీతకాలములలో ప్రసారములను నిర్వహించుచున్నది.

**5. యాన సౌ. :** ప్రభుత్వముచే వేయబడిన కొలది నిడివిగల రోడ్లు ఎఫాతే, సాంతో, తనా, పెంటెకాస్ట్, మాలేకులా దీవులలో ఉన్నవి. తక్కినచోట్ల వేయబడిన పొలకబాటలే మోటారుబండ్ల రాకపోకలకు పనికివచ్చుచున్నవి. రాజ్యమునందలి వివిధ ద్వీపముల మధ్య చిన్న నౌకలు నడుపుచున్నవి; ఆస్ట్రేలియా, యూరప్, ఉత్తరఅమెరికా, దక్షిణ అమెరికా, ఉత్తర ఆఫ్రికా ప్రాచ్యఆసియా, ఫిజీ, న్యూకెలెడోనియాలకు ఇట నుండి నౌకాయానసౌకర్యము: ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, తాహితి, [illegible], న్యూకెలెడోనియాలకు విమానయానసౌకర్యము కలవు.

**6. చరిత్ర :** 1606 లో ఫెడ్రో ఫెర్నాండెస్ డి క్విరోస్ అనునతడు ఈ దీవులను కనుగొనెను; తరువాతి రెండు శతాబ్దములందును యూరపీయులు కొందరు అంతటింతట ఈ ద్వీపములను దర్శించిరి. 19వ శతాబ్దిలో క్రైస్తవమత ప్రచారకులును, వర్తకులును, వ్యవసాయకులును కొంతమంది యూరపునుండి ఇటకు చేరిరి. వీరిలో బ్రిటిష్ వారును, ఫ్రెంచివారును అధికసంఖ్యలో ఉండిరి. 1887 లో గ్రేట్ బ్రిటన్, ఫ్రెంచి ప్రభుత్వములు ఒక ఒడంబడికను కుదుర్చుకొని, ఈ రాజ్యమునందలి తమతమ దేశీయుల ప్రయోజనముల రక్షణకై ఒక సంయుక్త నావికసంఘమును నియమించినవి. 1902 లో ఈ రెండు ప్రభుత్వములలో ప్రతియొకటియు ఈ రాజ్యమున ఒక రెసిడెంట్ కమీషనర్‌ను నియమించినవి. 1906 లో ఆ ప్రభుత్వములు వేరొక ఒడంబడికద్వారా ఈ రాజ్యమును తమ సంయుక్త ప్రభుత్వము (Condominium) వశమున ఉంచి, సక్రమ పాలనవ్యవస్థను ఏర్పరచుటకు, నిర్ణయించి ఆ విధముగ ఇప్పుడు పాలనను నిర్వహించుచున్నవి.

**7. పరిపాలన :** రాజ్యపాలనలో ఆయాజాతులకు సంబంధించిన విషయములందు ప్రత్యేక రీతిలోను, తక్కిన అన్ని విషయములందు ఏక రీతిలోను పాలన నిర్వహింపబడుచున్నది. ఈ విధముగ బ్రిటిష్ సంతతి, ఫ్రెంచిసంతతి, దేశీయులు,

అను మూడు వర్గములకును భద్రత చేకూరుటకు మార్గములు ఏర్పడినవి. భూమియందు స్వామ్యము నను, దేశీయులనుండి కార్మికులను తీసికొనుటలోను ఈ దృష్టితోనే నియమములు రూపొందింపబడినవి. న్యూకెలిడోనియాలోని ఫ్రెంచిగవర్నరు, ఫిజీలోని బ్రిటిష్ గవర్నర్ ఆయా ప్రభుత్వముల పక్షమున ఇట అధికారమును కలిగియుండి, ఈ రాజ్యమున తాము నియమించిన రెసిడెంట్ కమీషనర్లద్వారా తమ విధులను నిర్వర్తించుచున్నారు.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం.:** బ్రిటిష్-ఫ్రెంచి ప్రభుత్వములే ఈ బాధ్యతలను నిర్వహించుచున్నవి

**10. ఆర్థిక రంగము:** వ్యవసాయ, పశు పోషణలే రాజ్యపు ఆర్థికవ్యవస్థకు ఆధారములు. రొక్కపు పంటలలో కొబ్బరి, కోకో, కాఫీ ప్రముఖములు. అరటి మొదలగు పండ్లు ఉత్పత్తి అగుచున్నను అవి దేశావసరములకు సరిపోవుచున్నవి. పశువులు అధికముగ కలవు; మాంసపు పరిశ్రమ తీవ్రగతిలో అభివృద్ధి యగుచున్నది. అనీతియం దీవిలోని అడవుల ఆధారమున కలప పరిశ్రమయు కొంత అభివృద్ధిని సాధించుచున్నది. చేపలపరిశ్రమ జపానీయుల సాయమున ముందంజవేయుచున్నది. సాంతోవద్ద ఒక నౌకానిర్మాణకేంద్రము కలదు. దేశపు ఎగుమతుల విలువ 1,28,49,000 ఆ. డాలర్లు; దిగుమతుల విలువ 1,81,42,000 ఆ. డాలర్లు (1971). దేశమున సంయుక్త ప్రభుత్వపు సాలీనా బడ్జెట్‌వ్యయము 40,21,362 ఆ. డా. (1970); ఇదిగాక బ్రిటిష్ జాతీయ సంసేవా బడ్జెటరీ వ్యయము 39,10,715 ఆ. డాలర్లు (1971-72); ఫ్రెంచి జాతీయ సంసేవా బడ్జెటరీ వ్యయము 49,75 470 ఆ. డా. (1971).

**11. సాంఘిక రంగము:** సంయుక్త ప్రభుత్వము విద్యాశాఖపై పెత్తనము వహించుటలేదు; కాని ఆయా జాతీయులకై కొంత ధనమును సహాయరూపమున అందులకై ఇచ్చుచున్నది. ఆయా జాతీయ సంస్థలును క్రైస్తవ మతప్రచార సంస్థలును విద్యాశాలలను నిర్వహించుచున్నవి. మొత్తముమీద 130 కి పైబడిన ప్రయిమరీ పాఠశాలలును, అయిదు సెకండరీ స్కూలులును కలవు (1972). విదేశములలో ఉన్నతవిద్యకు ఆయా జాతీయ పరిపాలనా సంస్థలు విద్యార్థివేతనములను ఇచ్చి సాయపడుచున్నవి

రాజ్యమున శ్వాసకోశ జాడ్యములును మలేరియాయు విరివిగ కలవు. వీని నివారణకై సంయుక్త ప్రభుత్వము 1972 మొదలుగ తీవ్ర కృషి జరుపుచున్నది. విలానగరమున బ్రిటిష్ వారును, ఫ్రెంచివారును వేర్వేరుగ నిర్వహించు రెండు పెద్ద ఆసుపత్రులు ప్రజలకు చాల ఉపకరించుచున్నవి.

---

# 12. పాపువా - న్యూగినీ

## (1975 సెప్టెంబరులో స్వాతంత్ర్యమును పొందిన వలస రాజ్యము)

**ముఖ్యనగరము:** పోర్ట్ మార్స్‌బీ; **జెండా:** ఎరుపు, నలుపు అడ్డుచారలపై బంగారు చాయతో దివ్య విహంగము కలది; **జాతీయగీతము:** తెలియదు; నాణెము: ఆస్ట్రేలియా రాజ్యపు నాణెములే ప్రస్తుతమున వాడుకలో ఉన్నవి; **కొలతూకములు:** ఆస్ట్రేలియాలోనివే; **కాలగణన:**

సా. 10 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** న్యూగినీ అనునది ప్రపంచము నందలి ద్వీపములందెల్ల వైశాల్యమున రెండవ దిగ పేరొందినది. ఈ ద్వీపమున ఇండోనీషియాకు చెందిన పశ్చిమప్రాంతము (పశ్చిమ ఇరియన్) పోగా మిగిలినదియు, కొన్ని పరిసరద్వీపములును కలిసి పాపువా-న్యూగిని అని వ్యవహరింపబడుచున్నవి. ఈ రాజ్యము భూమధ్య రేఖనుండి 11° 40′ ద. అక్షాంశరేఖవరకును, పశ్చిమ ఇరియన్ సరిహద్దునుండి 160° తూ. తులారేఖ వరకును




పటము 6.

వ్యాపించి ఉన్నదని స్థూలముగ చెప్పవచ్చును. ద్వీపములును ముఖ్యభూభాగమును కలసి మొత్తపు వైశాల్యము 4,75,524 చ. కిమీ; ఇందు పాపువా ప్రాంతపు వైశాల్యము 2,34,654 చ కిమీ. మొత్తపు వైశాల్యమున 4,09,236 చ. కిమీ. న్యూగినీ ద్వీపమున ఉన్నది; తక్కినది మిగిలిన వివిధ ద్వీపముల వైశాల్యము. ఈ తక్కిన ద్వీపములలో, మనుస్, న్యూబ్రిటన్, న్యూ ఐర్‌లాండ్, బోగన్‌విల్లీ, బూకా ద్వీపములు ప్రముఖములు. ముఖ్యభూభాగమునను, ద్వీపములందును పర్వతశ్రేణులు విరివిగ కలవు. వీనిలో కొన్నింటి ఎత్తు 4,420 మీ పైగా ఉన్నది. ముఖ్యభూభాగమున సెపిక్, రామూ, మార్‌ఖామ్ నదులు ప్రవహించుచున్నవి. వీనిలో తొలుతటిదానియందు 480 కిమీ. ల వరకు నౌకలు పయనింపగలుగుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** మొత్తముమీద దేశమున ఎండలు ఎక్కువయే అయినను, గాలిలో చెమ్మదనము ఎక్కువగనే ఉండును. ఈ ఎండల తీక్ష్ణతయు ఉన్నతభూములందు చాల తగ్గుచున్నది. ఆగ్నేయ వ్యాపార వాయువులు మే నుండి అక్టోబరు వరకును, వాయవ్య ఋతుపవనములు డిసెంబరునుండి మార్చివరకును ఇట వీచుచున్నవి. సాలీనా సగానరి వర్షపాతము ప్రదేశములను అనుసరించి 112 సెం. మీ. నుండి 615 సెం. మీ. వరకు మారుచున్నది. ఆస్ట్రేలియాలోని వృక్ష, జంతు సంతతులను పోలినవియే ఈ ప్రాంతమునను కనవచ్చుచున్నవి. దేశమున అడవులు ఎక్కువ.

**3. జనసంఖ్య మొ. :** 1971 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 24,68,986. వీరిలో పాపువా ప్రాంతమున 6,71,334 మంది నివసించుచున్నారు. ముఖ్యనగరము పోర్ట్‌మార్స్‌బీలోని జనసంఖ్య 66,244. తక్కిన నగరములలో లే (జ. సం. 34,699), రాబాల్ (జ. సం. 24,778). పేర్కొనదగినవి. దేశీయులలో వివిధ మాతృభాషలు ప్రచారమున ఉన్నను, ఇంగ్లీషు అధికారభాషగ వ్యాప్తియందు ఉన్నది. విద్యాబోధనయు ఇంగ్లీషునందే సాగుచున్నది.

**4. సమాచార సా. :** దేశమున టెలిఫోను వసతులు ప్రముఖకేంద్రములందున్నవి. రేడియో ప్రసార కేంద్రములు ముఖ్యనగరము మొదలగు పలునగరములలో కలవు.

**5. యాన సౌ. :** దేశమున రోడ్లనిడివి 12,109 కిమీ; ముఖ్యభూభాగమునకును వివిధ ద్వీపములకును మధ్య నౌకలద్వారా రాకపోకలు సాగుచున్నవి. ఆస్ట్రేలియాతో ఓడల మూలముననే గాక, విమానయానము వలనను ఈ దేశమునకు ప్రయాణవసతికలదు. పోర్ట్‌మార్స్‌బీలోని విమానాశ్ర

యమునుండి ఆస్ట్రేలియా, హాంగ్‌కాంగ్, మనీలా, ఫిజీ, బ్రిటిష్ సాలమన్ దీవులకు విమాన ప్రయాణ వసతులు కలవు.

**6. చరిత్ర :** ఈ దేశమున అంతర్భాగములగు పాపువా, న్యూగినీ ప్రాంతములు తొలుత వేర్వేరుగ ఉండినవి. 1883 లో ఆస్ట్రేలియా యందలి క్వీన్స్‌లాండ్ రాష్ట్ర ప్రభుత్వము పాపువాను వశపరచుకొని, 1888 లో బ్రిటిష్ ప్రభుత్వమునకు అప్పగించినది. 1901 లో దాని పాలనా బాధ్యతను, బ్రిటిష్ ప్రభుత్వము, ఆస్ట్రేలియాకు చెందజేసినది. న్యూగినీ ప్రాంతమును 1884 లో జర్మన్ ప్రభుత్వము రక్షిత ప్రాంతముగ ప్రకటించి వశపరచుకొనినది. ప్రథమ ప్రపంచయుద్ధము జర్మను సేనలు పరాజితములైన తరువాత, దీనిని నానాజాతి సమితివారు, ధర్మకర్తృత్వ (మాండేటరీ) ప్రాంతముగ ఆస్ట్రేలియాకు అప్పగించిరి (1921). అంతటినుండి పాపువా-న్యూగినీలను మేళవించి ఒకే ప్రాంతముగ వలసపాలనను ఆస్ట్రేలియా నిర్వహించినది. దాదాపుగ శిలాయుగనాగరికతా స్థాయిలోఉన్న అచటి దేశీయులను, నాగరికతా పథమున పురోగమింప జేయుటకు, 1950 మొదలుగ ఆస్ట్రేలియా ప్రభుత్వము కొంత కృషి చేసినది. క్రమముగి కొన్ని ప్రాతినిధ్య సంస్థలను ఏర్పరచి, ప్రజలకు పరిపాలనలో భాగస్వామ్యమును ఏర్పరచినది. ఇంతలో మైకేల్ సోమరే అను దేశీయుని నాయకత్వమున ప్రజలయందును స్వాతంత్ర్యాకాంక్ష అతిశయించినది. అంతట 1975, సెప్టెంబరు 16న పాపువా-న్యూగినీ స్వతంత్రమగుటకు ఆస్ట్రేలియా ప్రభుత్వము సహకరించినది.

**7. పరిపాలన :** ఆస్ట్రేలియా ప్రభుత్వము నియమించిన గవర్నర్ - జనరల్, స్వాతంత్ర్య సిద్ధి తరువాత, ఇచట రాజ్యాంగబద్ధుడగు ప్రభుత్వాధినేతగ ఉండునటుల ఏర్పాటు జరిగినది. శాసనసభయందు అధికసంఖ్యాక బలము కలవారిని ప్రధానమంత్రిగ నియమించును. ఇప్పటి ప్రధానమంత్రి మైకేల్ సోమరే. శాసనసభయందలి సభ్యసంఖ్య 94. ఇందు 69 మందిని సాధారణ నియోజక వర్గములును, 15 మందిని కనీస విద్యార్హతకల నియోజక వర్గములును ఎన్నుకొనుచున్నవి. 10 మందిని గవర్నరు-జనరల్ నియమించును. దేశమునందలి 18 మండలములందును స్థానికపాలన ఎన్నుకొనబడిన సభ్యులుకల సంఘముల సాయమున జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** 1973 మొదలుగ దేశీయ సేనను రూపొందించుటకు ఆస్ట్రేలియా ప్రభుత్వము పూనుకొని పనిచేసినది; కాని ప్రస్తుతమున అది ప్రాథమిక దశలోనే ఉన్నది. దేశీయులు ఎక్కువగ కల పోలీసుదళము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందు ఈ దేశమునకు 1975 అక్టోబరులో స్థానము లభించినది.

**10. ఆర్థిక రంగము :** ఆర్థిక వ్యవస్థ యంతయు రొక్కపు పంటల ఎగుమతిపై చాల వరకు ఆధారపడి ఉన్నది. భూమియందు ఎవరికిని సంపూర్ణ స్వామ్యము లేదు. దీర్ఘకాలపు కౌలులపై భూమిని సేద్యము చేసికొనుటకు ప్రభుత్వానుమతిని పొందవలెను. మొత్తము దేశవైశాల్యమున 4,05,000 ఎకరములు సేద్యమునకు వినియుక్తము. పంటలలో కొబ్బరి, కోకో, కాఫీ, రబ్బరు ప్రముఖములు. తక్కినవానిలో అరటి, చెరకు, జనుము, వరి, తేయాకు, వేరుసెనగ పేర్కొనదగినవి. పశుపోషణకు అవకాశములు ఎక్కువ; పశుసంపదను వృద్ధిచేయుటకు కృషి జరుగుచున్నది. ఖనిజములు దేశమున విరివిగ కలవని తెలియుచున్నది రాగి, బంగారు గనులలో మాత్రమే పనిసాగుచున్నది. పెట్రోలు గనులును కనుగొనబడినవి (1958); అయినను పెట్రోలును,

సహజవాయువుపు కొలదిగ మాత్రమే ఉత్పత్తి అగుచున్నవి. కొలదిగ కలప ఎగుమతి అగు చున్నది. దేశపు ఎగుమతుల విలువ 101,882 వేల ఆ. డాలర్లు, దిగుమతుల విలువ 2,15,8?? వేల ఆ. డాలర్లు (1971). ఆస్ట్రేలియా ప్రభుత్వము ఈ దేశమునకు విరివిగ ధనసహాయముచేసి సాయపడుచున్నది. దేశము స్వాతంత్ర్యము పొందిన తరువాతకూడ ఈ సహాయము సాగ గలదని ఆ ప్రభుత్వము వాగ్దానమిచ్చినది. దేశపు సాలుసరి బడ్జెటరీవ్యయము 190 576 వేల ఆ. డాలర్లు (1971). ఇందు దాదాపు 45% ఆస్ట్రేలియా ప్రభుత్వపు గ్రాంట్లవలన లభించినది.

**11. సాంఘిక రంగము :** దేశమునందలి ప్రాథమిక, సెకండరీ పాఠశాలలలో 2,38,799 మంది విద్యార్థులు కలరు (1971). 1966 న ఒక విశ్వవిద్యాలయము నెలకొల్పబడి, తదాదిగ పని చేయుచున్నది. దేశమున దినపత్రికలు ఏవియు లేవు. తక్కిన విధముల పత్రికలు మాత్రము కొన్ని కలవు. దేశమున 2,000 కు పైగా ఆసుపత్రులును వైద్యసహాయ కేంద్రములును ఉన్నవి.

---

# 13. పిట్ కైరన్ దీవి

## (బ్రిటన్ పాలనలోని ఒక ద్వీప రాజ్యము)

ఆగ్నేయ పసిఫిక్ మహాసముద్రమున 25°4' ద. అ. రేఖపై, 130°5' ప. తులారేఖన ఉన్న ఈ ద్వీపపు వైశాల్యము దాదాపు 4.6 చ కిమీ. ఈ ద్వీపము అగ్నిశైలజము; శీతోష్ణస్థితి చాల సౌమ్యముగ ఉండును. ఈ ద్వీపమున ఒకే ఒక గ్రామము ఆడమ్స్‌టౌన్ అనబడునది కలదు. పరిపాలనారీత్యా, దీనికి సమీపమున ఉన్న హెన్‌డర్‌సన్ దీవి (30 చ. కిమీ); దూసీ (6.5 చకిమీ); ఈనో (5 చ. కిమీ). ఈ ద్వీపముతో ముడిపడి ఉన్నను, ఆ మూడు ద్వీపములు నిర్జనములు. పిట్‌కైరన్ దీవిలో 92 మంది వసించుచున్నారు. (1972); అందరును క్రైస్తవులు; మాతృభాష ఇంగ్లీషు.

1767 లో కార్టరెట్ అను నావికునివలన పిట్‌కైరన్ దీవి కనుగొనబడినది; అయినను అందు చాలకాలము వరకు మనుజులు ఎవరును చేరలేదు. 1790 లో ఆ దీవి సమీపమున పయనించిన 'బౌంటీ' అను బ్రిటిష్‌నౌకలోని నావికులలో 9 మంది తిరుగుబాటుచేయగ, ఆ నౌకలోని అధి కారులు వారిని ఈ ద్వీపమున దించిపోయిరి. అటుల చేరిన బ్రిటిష్ నావికులు, తాహితినుండి పొలినీసియన్ జాతివారగు 12 మంది స్త్రీలను, 6 గురు పురుషులను కొనివచ్చిరి. ఇటుల అట జేరిన శ్వేతజాతీయుల, పొలినీసియన్ జాతీయుల వివాహబంధముల మూలమున వృద్ధియైన సంతతి 1856 నాటికి 194 అయినది; జీవనపు వసతులు తక్కువ అగుటవలన అంత కొంతమందిని నార్‌ఫక్ దీవికి తరలించుట జరిగినది. అయినను 1856 నాటినుండి ఈ దీవియందలి జనసంఖ్య క్రమముగ క్షీణించుచున్నది; కొందరు యువకులు న్యూజిలాండుకు వలస పోయిరి.

న్యూజిలాండులోని బ్రిటిష్ హై కమీషనరే ఇచట గవర్నరుగ వ్యవహరించును. గవర్నరు పక్షమున ఒక మేజస్ట్రీటు పదిమంది సభ్యులుకల

ఒక సమితి సాయముతో పాలనను నిర్వహించును, ఈ సమితియందు నలుగురను ప్రజలు ఎన్ను కొనెదరు; ఈ ఎన్నుకొనబడిన సభ్యుల ఆమోద ముతో మరి ముగ్గురు సభ్యులను, తాను స్వయముగ ఇరువురు సభ్యులను గవర్నరు నియమించును. ప్రభుత్వకార్యదర్శి పదవసభ్యుడుగ ఉండును. మేజిస్ట్రీటును మూడేండ్లకు ఒకసారి ప్రజలు ఎన్ను కొనెదరు. ఇతడు సమితికి అధ్యక్షత వహించును. సమితిలోని తక్కిన సభ్యుల పదవీకాల పరిమితి ఒక సంవత్సరము మాత్రమే

వ్యవసాయము ప్రజల ముఖ్య జీవనాధారము; ద్వీపపు అవసరములకు పోను మిగిలిన పండ్లు మొదలగునవి, ద్వీపమును ఆనుకొని ప్రయాణము సాగించు నౌకల ప్రయాణికులకు విక్రయింప బడును. అల్లిక బుట్టలు, వింతబొమ్మలు మొద లగునవియు ఇటుల అమ్మబడుచున్నవి. బ్రిటన్, న్యూజీలాండుల మధ్య పయనించు స్టీమరులు ఈ దీవికి కొలది దూరమున సముద్ర మధ్యమున ఆగును; చిన్నపడవలలో వస్తువులు ఆ నౌకల వద్దకు చేర్చబడును

దీవియందు ఒక పాఠశాల కలదు, ఇందు చది వినవారిలో ప్రతిభకలవారిని న్యూజిలాండు, ఆస్ట్రేలి యాలకు ఉన్నత విద్యకై పంపుచున్నారు. దేశీయు లందు రోగబాధ చాల తక్కువ.

---

# 14. ఫిజీ దీవులు

**ముఖ్యనగరము :** సూవా; **జెండా:** నీలపు భూమి కపై దండమువద్ద నాలుగవ భాగమున ఎరుపు, తెలుపు, నీలిరంగులలో యూనియన్ జాక్ కలది; **నాణెము :** ఫిజియన్ డాలరు; 100 సెంట్లుగ ఇది విభక్తము. 1 ఫి. డాలరు = 8.60, **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువే అయినను మెట్రిక్ విధానమునకు మార్చు యోచనకలదు; **కాలగణన :** అర్ధరాత్రి 12 గం = భారతదేశ మున సా. 5. గం. 30 ని.

**1. ఉనికి మొ :** దక్షిణ పసిఫిక్ మహా సముద్రమునందలి దాదాపు 850 దీవులు ఈ ద్వీప రాజ్యమున చేరి ఉన్నవి; ఇందు 100 దీవు లలో మాత్రమే ప్రజలు నివసించుచున్నారు. ఇందు రోతుమా దీవి తప్ప తక్కిన అన్ని దీవులును 15°-22° ద. అక్షాంశ రేఖలకును, 174°-177° తూ. తులాంశరేఖలకును మధ్య చెల్లాచెదరుగ ఉన్నది. రోతుమా దీవి మాత్రము 12°30′ ద. అక్షాంశరేఖన, 177°5′ తూ. తులాంశ రేఖపై ఉన్నది. అన్ని దీవుల మొత్తపు వైశాల్యము 18,272 చ.కిమీ. అన్నింట పెద్దదియగు వీతీ లేవూ దీవి వైశాల్యము 10,386 చ. కిమీ; దాని తరు వాత పేర్కొనదగినది వనువా లేవూ దీవి; దీని వైశాల్యము 5,535 చ. కిమీ. ముఖ్యనగరమగు సూవా, వీతీ లేవూ ద్వీపపు దక్షిణతీరమున ఉన్నది. పెద్ద ద్వీపములన్నియు అగ్నిపర్వతజములు; అచ్చ టచ్చట తిప్పలున్నను, నేల చదరముగ ఉండును. ద్వీపముల చుట్టును పవడపు తిప్పలు ఎక్కువగ కన్పట్టును, వీతీ లేవూలోని అత్యున్నత శిఖరపు ఎత్తు 1323 మీ. ఆ దీవిలోని ముఖ్యమగు నది రేవా. దీనిలో 112 కిమీ. వరకు చిన్నపడవలు పయనించగలవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** సముద్రపు మట్టమున ఉష్ణత 60°-90° ఫా. మధ్య, సాలుపొడవున, మారుచుండును. సాలున అధిక భాగమున తూర్పు

దక్షిణమునుండి వ్యాపారవాయువులు వీచును. వర్షపాతము ద్వీపములందు అన్నింటను దాదాపుగ ఒకే రీతిగ ఉన్నది. సూవా నగరమున సాలీన సగాసరి వర్షపాతము 308 సెం. మీ. దేశమున పశ్చిమ సాలీన వర్షపాతము 175 సెం. మీ. కు తగ్గును. దేశమున సగము భాగము అటవీమయము. తీర భూములందు కొబ్బరి చెట్లును, చిరుపొదలును విరివిగ కన్పట్టును. పాములు, బల్లులు, ఎలుకలు మొదలగు అల్పజంతువులేగాని పెద్దజంతువులు ఏవియు అడవులలో లేవు; వివిధ జాతుల పక్షులు కలవు.

**3.** జనసంఖ్య మొ. : 1966 లో జరిగిన లెక్కింపునుబట్టి దేశపు జనసంఖ్య 4,70,727. వీరిలో ఫిజీ సంతతివారు 2,02,176; భారతీయ సంతతివారు 2,40,960; యూరపియనులు 6,590; సంకర యూరపీయులు 9,687; చీనీయులు 5,149; రోతుమాలు 5,797; తక్కిన పసిఫిక్ ద్వీపజాతుల వారు 6,095; వీరుగాక ఇతరులు 273. సూవా నగరపు జనసంఖ్య దాదాపు 60,000. 1971 అంచనాలను అనుసరించి దేశము మొత్తపు జనసంఖ్య 5,35,357, జాతులరీత్యా భారతీయులు 49%; ఫిజీయన్లు 41.7%; 2.7% అచ్చపు యూరపియనులు; 1.9% సంకరపు యూరపియనులు; చీనీయులు 1%; తక్కినవారు 2.8% కలరని తేలుచున్నది (1965). ఫిజియనులు మలయో-పొలినీసియన్ జాతికి చెందినవారు; వీరియందు పెక్కు మాతృభాషలు వ్యాప్తియందు ఉన్నను, బావూ భాష, రోతుమా దీవిలో తప్ప, తక్కిన అన్నిదీవులందు విరివిగ ఉపయోగింపబడుచున్నది. రోతుమా దీవిలో రోతుమన్ భాష వ్యాప్తియందు కలదు. భారతీయులలో, పలు భారతీయభాషలు ప్రచారమున ఉన్నను, హిందీయే సామాన్యభాషగ ఆదరణను పొందినది. ఇంగ్లీషు అధికార భాషగ పరిగణనను పొందినది; అయినను దానితో పాటు హిందీ, ఫిజీ భాషలను పార్లమెంటులో వాడుకయందున్నవి. ఫిజియనులును యూరోపియనులును దాదాపుగ అందరును క్రైస్తవులే: భారతీయులలో 80% హిందువులు 15.4% ముస్లిములు, 1.3 సిక్కులు, తక్కినవారు ఇతర మతములకు చెందినవారు.

**4.** సమాచార సౌ. : దేశమున తపాలా ఆఫీసులును, ఏజెన్సీలును కలసి మొత్తముమీద 186 ఉన్నవి. తపాలాతో తంతి, టెలిఫోను వసతులును కలవు. కామన్‌వెల్త్ రాజ్యములను అనుసంధించు కేబుల్ పద్ధతిలో ఫిజీ ఒక ముఖ్య కేంద్రముగ పేరొందినది. ప్రపంచపు ప్రముఖ రాజ్యములలో దాదాపుగ అన్నింటితోను విమానముల ద్వారాను, సముద్ర నౌకలద్వారాను తపాలావసతి ఈ దేశమునకు కలదు; తక్కిన పసిఫిక్ రాజ్యములతో రేడియో-టెలిఫోను ద్వారా సంబంధము ఏర్పడి ఉన్నది.

**5.** యాన సౌ. : వీతీలేవూ ద్వీపపు కోస్తా తీరమును ఆశ్రయించి చుట్టివచ్చు 516 కిమీ. రోడ్డు మార్గము, దేశపు మార్గములలో ప్రముఖము దేశపు ప్రముఖ కేంద్రములను అన్నింటిని ఇది కలుపుచున్నది. వనువా లేవూ దీవిలో 277 కిమీ. నిడివి కల రోడ్లు కలవు. తక్కిన దీవులందు కొన్నింట కూడ తగుమాత్రపు రోడ్లు కలవు. మొత్తపు రోడ్ల నిడివి 2,302 కిమీ. ఇందులో 1932 కిమీ. రోడ్లు ఉత్తమశ్రేణికి చెందినవి. 2 అడుగుల గేజి కలిగిన ఒక రైలుమార్గము కలదు; దీని పొడవు 579 కిమీ. ఇది చెరకు వ్యవసాయపు క్షేత్రములకు మాత్రమే ఉపకరించుచున్నది. ద్వీపముల మధ్య ప్రయాణమునకు నౌకలు ఉపకరించుచున్నవి; మొత్తమున 3,160 టన్నేజి కలిగిన 126 నౌకలు ఇందులకు ఉపకరించుచున్నవి. సూవాలో నౌకల మరమ్మతులకు, రాకపోకలకు తగు వసతులు కలవు.

సూవాకు 160 కిమీ. దూరమున ఉన్న నాండీ (నాడీ) నగరపు అంతర్జాతీయ విమానాశ్రయము నుండి, యూరప్, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, మెక్సికో, యు. స్టే. లకు నేరుగ విమానయాన వసతులు కలవు. రాజ్యము నందలి వేర్వేరు ద్వీపముల మధ్య రాకపోకలకును విమానయానపు సౌకర్యము ఏర్పడి ఉన్నది

**6. చరిత్ర :** ఈ రాజ్యమునందలి కొన్ని దీవులను, డచ్చి నావికుడగు టాస్మన్ 1643 లో తొలుత కనుగొనెను; తరువాత కెప్టెన్ కుక్ మొదలగు బ్రిటిష్ నావికులును వానిని, తక్కిన వానిని కనుగొనిరి. 1804 లో అచటి తొలుతటి యూరపీయ స్థావరము లెవికా ప్రాంతమున నెల కొల్పబడినది. క్రమముగ యూరపునుండి మత ప్రచారకులును అట చేరి దేశీయులను క్రైస్తవులుగ మార్చిరి. కాని వివిధ తెగల మధ్య నిరంతరము అట పోరాటములు చెలరేగి రక్తపాతము జరుగుట, విదేశీయ మారణాయుధముల సాయమున ఎక్కు వైనది. అంతట ఆయా తెగల నాయకుల అభ్య ర్థనపై 10 అక్టోబరు 1874 న ఈ దేశమును బ్రిటన్ వశపరచుకొని మకుటపు వలసగ ప్రక టించినది. అంతట, అచటి చెరుకుతోటలలో పని చేయుటకై భారతదేశమునుండి, గుత్తషరతుపై, కూలీలను బ్రిటిష్ ప్రభుత్వము కొనివచ్చినది. ఇటుల 1916 వరకు సాగినది. ఇటుల వచ్చిన కూలీలు, షరతుకాలము దాటిన వెనుక సైతము అచటనే స్థిరనివాసము ఏర్పరచుకొనుటవలన క్రమముగ దేశీయుల కన్నను వారి సంఖ్యయే ఎక్కువైనది; యూరపీయ భూస్వాములును కొందరు అచట చేరిరి. తొలుత యూరపీయులకు మాత్రమే భాగస్వామ్యముకల ప్రాతినిధ్యసంస్థలు దేశమున 1904 లో ఏర్పరుపబడినవి. క్రమముగ అందు మార్పులు జరిగి భారతీయులకును ఫిజి యనులకును, తక్కిన వారికిని అందు ప్రాతి నిధ్యము కల్పింపబడి 10 అక్టోబరు, 1970 న కామన్‌వెల్తున భాగస్వామ్యముకల సర్వసత్తాక స్వతంత్ర రాజ్యముగ ఫిజీ రూపొందుటకు బ్రిటన్ అవకాశము కల్పించినది.

**7. పరిపాలన :** బ్రిటిష్ రాణి నియమించు గవర్నర్ - జనరల్ రాజ్యాంగ బద్ధుడగు అధి నేతగ ఇట వ్యవహరించును. పార్లమెంటునందు అధికసంఖ్యాక బలము కలవానిని ప్రధానిగను, అతని అభీష్టప్రకారము తక్కిన మంత్రులను గవర్నర్ జనరల్ నియమించును. ఈ మంత్రి వర్గము పార్లమెంటుకు బాధ్యత వహించి పాలనను నిర్వహించును. పార్లమెంటున ప్రతినిధిసభ, శిష్టసభ అనదగు రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభయందలి 52 మంది సభ్యులలో 22 మంది భారతీయులును, 22 మంది ఫిజియనులును, 8 మంది తక్కినవారును ఎన్నుకొనబడు అవ కాశము కల్పింపబడినది, శిష్టసభలో 22 మంది సభ్యులు కలరు; వీరిలో 8 మందిని ఫిజియన్ తెగల నాయకులును, 7 మందిని ప్రధానియు, 6 మందిని ప్రతిపక్ష నాయకుడును, ఒకరిని రోతుమా దీవిలోని స్థానిక సంఘమును నియ మించును. దేశమునందలి రాజకీయ పక్షములలో అలయన్స్ పార్టీ, నేషనల్ ఫెడరేషన్ పార్టీ అను నవి ప్రముఖములు. ఇందు తొలుతటిది అధినివేశ ప్రతిపత్తిని మాత్రమే కోరగా రెండవది జాతు లతో నిమిత్తములేని వోటింగు పద్ధతిన గణతంత్ర రాజ్యము ఏర్పడవలెనని కోరుచున్నది. ఈ రెండవ దానియందు ఎక్కువగ భారతీయులు కలరు. దేశపు 14 రాష్ట్రములలో ఎన్నుకొనబడిన ప్రతి నిధుల సాయమున పాలన జరుగుచున్నది. సువ్యవ స్థితమగు న్యాయనిర్వహణ వ్యవస్థ కలదు.

**8. దేశరక్షణ :** ప్రస్తుతము 3 కంపెనీల పదాతి దళముమాత్రమే కలదు. వివిధజాతుల

వారున్న పోలీసు దళము కలదు; ఇందు 896 మంది పనిచేయుచున్నారు (1970).

**9. అంతర్జాతీయ సం.:** 1970 మొదలుగ ఐ. రా. స. యందును, దక్షిణ పసిఫిక్ కమీషన్ లోను ఈ దేశము సభ్యత్వము కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము:** వ్యవసాయము పైనను, విదేశవ్యాపారము పైనను ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ ఎక్కువగ ఆధారపడి ఉన్నది. దేశీయుని తలసరి ఆదాయము 315 డాలర్లు (1969). దేశపు భూమిలో 4,56,000 ఎకరములు వ్యవసాయమున ఉన్నది. దేశావసరముల కొరకు మాత్రమే వరి పండింపబడుచున్నది. చక్కెర, కొబ్బరి, అరటి, కోకో, అల్లము ఎగుమతి కొరకై పండింపబడుచున్నవి. దాదాపు 159 వేల ఎకరముల భూమి చెరకు సాగున ఉన్నది (1967). ఆకృషిలో పాల్గొను 14,790 మందిలో భారతీయ కృషికుల సంఖ్య 4,218; దాని తరువాత లెక్కకు వచ్చు ఎగుమతి పంట కొబ్బరి. అరటి పండ్ల ఉత్పత్తిలో ఫిజియనులు మాత్రమే పాల్గొను చున్నారు. దేశమున 150 వేల పశువులు కలవు (1969); కాని దేశము విదేశములనుండి మాంసమును దిగుమతి చేసికొనుచున్నది. మత్స్య పరిశ్రమ ఆధునిక పద్ధతులలో కొనసాగుచున్నది. దేశమున అటవీసంపద ఎక్కువ; అయినను అది దేశావసరములకు మాత్రమే వినియుక్తము. ఖనిజములు ఎక్కువగ లేవు. బంగారము, మాంగనీజు మాత్రము కొన్ని ప్రాంతములందు త్రవ్వబడు చున్నవి. చక్కెర, కొబ్బరి, బంగారములకు సంబంధించిన పరిశ్రమలు కొన్ని కలవు. దేశమున విద్యుదుత్పత్తి డీజెల్ యంత్రములచే దేశావసరములకు చాలునంతగ జరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 4.88,55,000 డాలర్లు; దిగుమతుల విలువ 11,15,50,000 డాలర్లు (1971). చెల్లింపుల లోటును పూరించుటకు విదేశీయ యాత్రికుల వలన వచ్చు ఆదాయమును, విదేశీయుల పెట్టుబడులును తోడుపడుచున్నవి. దేశపు సాలీనా బడ్జెటు వ్యయము 4,65,06,723 డాలర్లు (1971).

**11. సాంఘిక రంగము:** పట్టణ ప్రాంతములందు ఆధునిక గృహవసతిని సమకూర్చుటకు ప్రభుత్వము కొంత కృషి చేయుచున్నను, పల్లె పట్టులందు అట్టివి కన్పట్టవు. ప్రైమరీ తరగతి మొదలుగ యూనివర్సిటీ స్థాయివరకు ఫిజీయందు విద్యాబోధనకు సౌకర్యములు కలవు. దేశమునందలి మొత్తపు 700 పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 1,45,955; వీరిలో ఫిజియన్లు 56,657; భారతీయులు 78,881; యూరపీయులు 3789; చీనీయులు 1,555; తదితరులు 3 6.3. పై పాఠశాలలేకాక 73 శిశువిద్యాశాలలు, ఒక వైద్య శాస్త్ర పాఠశాల; ఒక వ్యవసాయ పాఠశాల పని చేయుచున్నవి (1971). 1965 లో సూవా నగరమున దక్షిణ పసిఫిక్ విశ్వవిద్యాలయము నెలకొల్పబడినది. లవుతోకాలో ఒక గ్రంథాలయము కలదు. ఇంగ్లీషున ఒక దినపత్రిక వెలువడు చున్నది.

**12. యాత్రా సౌ.:** ప్రభుత్వ ఆదాయమున కొంతభాగము యాత్రికులవలన లభించుచున్నది. అందువలన యాత్రికులను ఆకర్షించుటకు తగిన వసతులను ప్రభుత్వము సమకూర్చినది. పాస్‌పోర్టు కల కొన్ని నిర్దిష్టదేశముల వారికి, వీసాతో నిమిత్తములేకుండ నాలుగునెలల నివాసమునకు పర్మిటు లభించును. తక్కిన దేశముల వారు పాస్‌పోర్టు, వీసాలను కలిగియుండవలెను. యు. స్టే., ఆస్ట్రేలియా, న్యూజిలాండులనుండి యాత్రికులు ఎక్కువగ ఈ దేశమునకు వచ్చుచుందురు. 1969 లో 185,163 మంది ఈ దేశమును దర్శించిరి.

# 15. ఫ్రెంచి పొలినీసియా (పొలినీసియా ఫ్రాంకాయిస్)

## (ఫ్రెంచి కమ్యూనిటిలోని పసిఫిక్ ద్వీప రాజ్యము)

**ముఖ్యనగరము :** పపీతే, **నాణెము :** ఫ్రాంక్ (సి. ఎఫ్. ఫ); 100 ఫ్రాంకులు : రు. 2.70; **కొలతతూకములు** = మెట్రిక్ విధానపుపే; **కాలపరిగణన :** వివిధ ద్వీపవర్గములందు వివిధ రీతులుగ ఉన్నది.

**1. ఉనికి మొ. :** పసిఫిక్ మహాసముద్రమున ఒక విస్తృత ప్రాంతమున చెదరియున్న ఆరు ద్వీపవర్గములు చేరి ఫ్రెంచి పొలినీసియా అని వ్యవహరింపబడుచున్నవి: (1) సొసైటీ ద్వీప వర్గము; ఇందు తాహితీ ద్వీపము (17°40′ ద; 149°20′ప)ను, మూరియా, రియాటియా ద్వీపములును చేరిఉన్నవి. (2) మార్క్వెసాస్ ద్వీప వర్గము; ఇందలి ద్వీపములు 8°–11° ద. అక్షాంశ రేఖలకును, 138°–141° ప. తులారేఖలకును మధ్యనున్న ప్రాంతమున చెదరి ఉన్నవి. (3) తువమోతూ ద్వీపవర్గము; మార్క్వెసాస్ ద్వీపములకు 480 కి. మీ. పశ్చిమ నైరుతిన ఉన్నది. (4) గాంబియర్ ద్వీపవర్గము; తువమోతూకు ఆగ్నేయమున ఉన్న ఈ ద్వీపములలో మంగరేవా, తరవాయి, అకమారూ అను మూడు ద్వీపములందు మాత్రమే జనులు నివసించుచున్నారు. (5) తుబువాయ్ (ఆస్ట్రల్) ద్వీపవర్గము; సొసైటీ దీవులకు దక్షిణమున ఉన్నవి (6) క్లిప్పర్టన్ దీవి (10°18′ ఉ. 109°12′ ప.); ఇది జనావాసము లేని అతల ద్వీపము; ఉత్తర అమెరికాలోని మెక్సికోకు నైరుతిన, పనామాకు 2080 కి. మీ. ల దూరమున ఇది ఉన్నది. పై ఆరు ద్వీపవర్గముల మొత్తపు వైశాల్యము 3,988 చ. కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** పసిఫిక్ మహాసముద్రమున తూర్పుభాగమున అతి విశాల ప్రాంతమునఉన్న ఆయా ద్వీపములందు శీతోష్ణస్థితులు విభిన్నములుగ ఉన్నవి.

**3. జనసంఖ్య మొ. :** 1971 లెక్కలను అనుసరించి ఈ ద్వీపములందలి మొత్తపు జనసంఖ్య 1,19,168. జనులలో దాదాపు 85 వేల మంది తాహితీ దీవియందు వసించుచున్నారు. ముఖ్యనగరమగు పపీతే ఈ దీవియందే ఉన్నది; ముఖ్యనగరపు జనసంఖ్య 79,494. జనులలో కొన్ని అలిఖితములగు మాతృభాషలు ప్రచారమున ఉన్నను, ఫ్రెంచి భాషయే సర్వత్ర వాడుకలో ఉన్నది. అత్యధిక సంఖ్యాక ప్రజలు క్రైస్తవులు; కొలదిగ బౌద్ధులును, ప్రకృతి దేవతారాధకులును కలరు.

**4. సమాచార సౌ. :** టెలిఫోనుల సౌకర్యము విరివిగ కలదు.

**5. యాన సౌ. :** వివిధ ద్వీపముల మధ్య కొంతవరకు నౌకాయాన సంబంధము కలదు. తాహితీనుండి ఫ్రాన్సు, సాన్‌ఫ్రాన్‌సిస్కో, న్యూజీలాండ్, ఆస్ట్రేలియాలకు స్టీమర్లవలన రాకపోకల వసతి కలదు; తాహితీనుండి తక్కిన కొన్ని దీవులతో విమానయాన సంబంధము కలదు; పారిస్, హోనూలూలూ, యు. స్టే., మెక్సికో, న్యూజీలాండులకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** వీనిలో సొసైటీ దీవులను బ్రిటిష్ నావికులు 1767 లో కనుగొనిరి; కాని 1844

లో ఫ్రెంచివారు వీనిని తమ రక్షిత ప్రాంతముగ చేసికొనిరి. మార్క్వెసాస్ దీవులను స్పెయిన్ దేశపు నావికులు 1595 లో కనుగొనిరి; వారి నుండి ఫ్రెంచివారు వీనిని 1842 లో వశపరచు కొనిరి. తువమోతూ దీవులను స్పెయిన్‌వారే 1606 లో కనుగొనగ, 1881 లో ఫ్రెంచివారు స్వాధీనపరచుకొనిరి. గాంబియర్ దివులను బ్రిటిష్ వారు తొలుత 1797 లో కనుగొనినను తరువాత 1881 లో అవి ఫ్రెంచివారికి లభించినవి. ఆస్ట్రల్ దీవులను ఆంగ్లేయుడగు కెప్టాన్ కుక్ 1777 లో కనుగొనెను; ఫ్రెంచివారు వీనిని 1880 లో వశ పరచుకొనిరి. క్లిప్పర్టన్ దీవిపై 1858 లో, మెక్సికోను కాదని, తన అధికారమును ఫ్రెంచి ప్రభుత్వము నెలకొల్పినది. ఇది ప్రస్తుతము పరిపాలనారీత్యా ఫ్రెంచి పొలినీసియాలో ఉన్నను, ఫ్రెంచి రాజ్యాంగ రీత్యా ఫ్రాన్సుతో నేరుగ ముడి వడి ఉన్నది.

**7. పరిపాలన :** తొలుత ఫ్రెంచి ప్రభుత్వపు వలస పాలనలో ఈ రాజ్యము ఉండినది. ఫ్రెంచి కమ్యూనిటీలో అంతర్భాగముగ, సముద్రోత్తర ప్రాంతపు హోదాలో ఈ ప్రాంతము ఉండుటకు ఇచటి ప్రజలు 1958, నవంబరులో స్వేచ్ఛాపూర్వకముగ తమ అంగీకారమును తెలిపిరి. తదాదిగ ఫ్రెంచి ప్రభుత్వము నియమించు ఒక గవర్నర్, ఇచటి ప్రజ లెన్నుకొనిన ఒక పాలక సంఘమునకు బాధ్యత వహించి, అంతరంగిక పాలనను, నిర్వహించు చున్నాడు. 30 మంది సభ్యులను దేశీయ ప్రజలు వయోజన వోటింగు పద్ధతిన 5 ఏండ్లకొకసారి ప్రాంతీయ సభకు ఎన్నుకొనెదరు; ఈ ప్రాంతీయ సభచే ఎన్నుకొనబడు ఏడుగురును పాలక సంఘ మున సభ్యత్వమును కలిగి ఉందురు. ఫ్రాన్సు దేశపు జాతీయ సభలో ఒక ప్రతినిధిని, సెనెట్‌లో ఒక ప్రతినిధిని, ఆర్థిక సాంఘిక సంఘమున ఒక ప్రతినిధిని ఈ దేశము ఎన్నుకొనును.

**8 దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఫ్రాన్స్‌దేశపు ప్రభుత్వమే బాధ్యత వహించి నిర్వ రించుచున్నది.

**10. ఆర్థిక రంగము ;** వ్యవసాయోత్పత్తుల ఎగుమతులును, యాత్రికులవలన ఆదాయమును ఈ ద్వీపముల ఆర్థికవ్యవస్థకు ఆధారములు. చెరకు, పండ్లు' కాఫీ, కొబ్బరి, ముఖ్యములగు పంటలు. ఈ దీవులను 23,575 మంది విదేశీ యులు దర్శించిరి (1967); యాత్రికులకు వస తులను చేకూర్చు పెద్ద హోటళ్ళు కలవు. దేశపు ఎగుమతుల విలువ 18,400 లక్షల ఫ్రాంకులు, దిగుమతుల విలువ 13,642 లక్షల ఫ్రాంకులు (1970). దేశపు బడ్జెటరీ వ్యయము 31,124 లక్షల ఫ్రాంకులు (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున 30,600 మంది విద్యార్థులు కల 157 ప్రయిమరీ పాఠశాలలును, 5,547 విద్యార్థులున్న 15 సెకండరీ పాఠశాలలును, 876 మంది విద్యార్థులు కల 3 సాంకేతిక పాఠశాలలును కలవు (1971).

# 16. మిడ్‌వే దీవులు

## (యు. స్టే. పాలనలోని ఒక ద్వీప వర్గము)

పసిఫిక్ మహాసముద్రమున 28°12′–28°17′ ఉ. అ. రేఖలకును, 177°19′–177°26′ ప. తులారేఖలకును మధ్య కుదురుకొనియున్న రెండు చిన్నద్వీపములు (ఈస్టరన్ ద్వీపము, సాండ్ ద్వీపము)ను, ఒక అతలద్వీపమును కలిసి మిడ్‌వే దీవులుగ వ్యవహరింపబడుచున్నవి. వాని మొత్తపు వైశాల్యము దాదాపు 1 చ. కిమీ. జనసంఖ్య 2,356 (1960).

1859 లో యు. స్టే. దేశపు నావికులు ఈ ద్వీపములను కనుగొనిరి; 1867 లో అధికార పూర్వకముగ యు. స్టే. ప్రభుత్వము ఈ ద్వీపములను వశపరచుకొనినది. ద్వీపవాసులలో దేశీయులు పొలినీసియన్ జాతివారు; ఇంగ్లీషు బోధన భాషగను, అధికారభాషగను వ్యాప్తియందున్నది; ప్రజలందరు క్రైస్తవులు. యు. స్టే. దేశపు నాణెములును కొలతూకములును ఇట అమలున ఉన్నవి.

20వ శతాబ్ది ఆరంభమున ఇట సముద్రపు అడుగున పోవు కేబుల్–స్టేషన్ ఒకటి నెలకొల్పబడి, తదాదిగ అది పనిచేయుచున్నది. 1935 లో విమానయానపు మజిలీయు ఇట స్థాపింపబడినది. 1941 లో యు. స్టే. నౌకాసేనలకు ఒక స్థావరము ఏర్పరుపబడినది. ఈ స్థావరమును నిర్మూలించుటకై జపానీయ నౌకాదళము 1941 డిసెంబరులోను, 1942 జనవరిలోను, దండయాత్రలను జరిపినది. 1942 జూన్ 3–6 మధ్య ఇట జపాన్–యు. స్టే. నౌకాదళముల మధ్య ఘోర సంగ్రామము సాగి, తుదకు జపానీయ దండయాత్ర తిరుగగొట్టబడినది. 1970 నుండి ఈ దీవులు యు. స్టే. ప్రభుత్వపు నౌకాసైన్యపు అధీనమున ఉన్నవి. పసిఫిక్ మహాసముద్రమును అధిగమించు విమానములకు ఇప్పటికిని ఇందలి విమానాశ్రయము ఒక మజిలీగ ఉపకరించుచున్నది.

---

# 17. యు. స్టే. ధర్మకర్తృత్వపు పసిఫిక్ దీవులు

**1. ఉనికి మొ. :** యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వపు ధర్మకర్తృత్వపు పాలనలోని పసిఫిక్ సాగర ద్వీపముల సంఖ్య, అందలి అతలద్వీపములతో కలసి, మొత్తము 2,141. వీని మొత్తపు వైశాల్యము 1,779 చ. కిమీ. దాదాపు 77 లక్షల చ. కిమీ. వైశాల్యముగల పసిఫిక్ మహాసాగర భాగమున అటనట ఈ దీవులు కననగుచున్నవి. అయినను వీనియందు 64 దీవులలో మాత్రమే జనులు నివసించుచున్నారు. ఈ దీవులున్న సాగర ప్రాంతము 1°–20°–ఉ. అక్షాంశ రేఖలకును, 130°–172° తూ. తులారేఖలకును మధ్య విస్తరించి యున్నది. ఈ ద్వీపసమూహమున దాదాపుగ కేంద్ర స్థలమున 'ట్రక్' దీవి ఉన్నది. ఈ దీవి సాన్ ఫ్రాన్సిస్కోకు 8,000 కిమీ. నైరుతి భాగమునను, ఫిలిప్పీనులకు 3,200 కిమీ. లు తూర్పునను ఉన్నది. ఈ ద్వీపములందు మూడు వర్గములు కలవు; (1) కెరోలిన్ ద్వీపములు. ఇవి పశ్చిమ, దక్షిణ భాగములందు ఉన్నవి; ఇందు

పలావ్ (487 చ.కిమీ; 7°30′ ఉ.-138°8′ తూ.), ట్రక్ (101 చ. కిమీ; 7°25′ ఉ -151°47′తూ.), పొనాపే (334 చ. కిమీ; 6°55′ ఉ.-158°15′ తూ.) ప్రముఖములు. (2) మార్షల్ దీవులు : ఇవి తూర్పుభాగమున ఉన్నవి. ఇందు క్వాజలీన్ (8°43′–9°15′ అ. ఉ. 6-167°30′తూ) అను అతలద్వీపము అతి ప్రముఖము (3) మరియానా ద్వీపములు : ఇవి ఉత్తర భాగమున ఉన్నవి. ఇందు రోటా (85.5 చ.కిమీ; 14°7′ నుండి 12′ ఉ. అ.-145°8-18′ తూ.), సైపాన్ (121 చ.కిమీ; 15° నుండి 17′ ఉ అ-145°41′ నుండి 50′ తూ.), తినియన్) 101 చ.కిమీ; 14°58′ ఉ. అ-145°38′ తూ). పరిపాలనా కేంద్రము సైపాన్. మరియానా దీవులు అన్నియును అగ్నిశైలజములు. పశ్చిమ కెరోలిన్ వర్గమునను, అట్టివి కలవు. తూర్పు కెరొలిన్ వర్గపు ట్రక్, పొనాపే, కుశేదీవులలోను కూడ అటనట అగ్నిశైలీయపు తిప్పలు కలవు. తక్కిన దీవులన్నియు పవడపు తిప్పల అతల ద్వీపములు.

**2. శీతోష్ణస్థితి మొ.:** మొత్తముమీద దీవులందన్నింట ఉష్ణమండలపు శీతోష్ణపరిస్థితులు కననగును. ఉష్ణోగ్రత సాలున 70° నుండి 85° ఫా. వరకు మారుచుండును. వర్షపాతము దీవులందు విభిన్న రీతులలో ఉన్నది. మరియానా దీవులలో వర్షపాతము సాలున 205 సెం. మీ. కాగా, తూర్పు కెరోలిన్ ద్వీపములలో అది 464 సెం.మీ. కు పోవుచున్నది. పెక్కుదీవులకు జులై నుండి నవంబరు అంతము వరకు తుఫానుల బెడద తరచుగ ఉండును; కాని తూర్పుకొననున్న దీవులకు ఆ బాధలేదు.

దీవులందన్నింట దట్టములని చెప్పదగు అడవులు కలవు. అతల ద్వీపపు కంకణ భూములందు కొబ్బరిచెట్లు చాల ఎక్కువగ ఉన్నవి. గబ్బిలము తప్ప తక్కిన జంతువులు ఏవియు ఇట తొలుత ఉండెడివి కావు; కాని విదేశముల నుండి ఇటకు తేబడిన మహిష సంతతి, లేళ్ళు, మేకలు, ఎలుకలు బాగుగ వృద్ధియైనవి. చేపలు పలురీతులవి విరివిగ ఉన్నవి. పక్షిసంతతియు ఎక్కువ.

**3 జనసంఖ్య మొ.:** 1972 నాటి లెక్కలను బట్టి ఈ దీవుల మొత్తపు జనసంఖ్య 1,14,645. వీరిలో 32,732 మంది ట్రక్ దీవియందు, 23,722 మంది పొనాపేదీవియందు, 24,243 మంది మార్షల్ దీవులందును వసించుచున్నారు. ఇచటి దేశీయులు మైక్రోనీసియన్ మానవజాతికి చెందినవారు; మలేసియా దేశీయుల పోలికలు వీరియందు కలవు. తొమ్మిది విధముల మైక్రోనీసియన్ భాషలు వేర్వేరు దీవులందు ప్రచారమున ఉన్నవి; జపానీయ భాషను మాటాడువారు ఎక్కువ. అయినను ఇంగ్లీషే అధికారభాషగ ఆదరణ పొందినది. ప్రజలలో క్రైస్తవ మతము చాలవరకు వ్యాపించినను, పురాతన ప్రకృతి దేవతారాధనకు సంబంధించిన విశ్వాసములు కొంతవరకు నిలిచియే ఉన్నవి.

**4. సమాచార సా.:** యు. స్టే. దేశపు తపాలాశాఖయే ఇచటి తపాలా వసతులను నిర్వహించుచున్నది ద్వీపములలో ప్రముఖము లగు వానియందు టెలిఫోను వసతులు ఉన్నవి. వేర్వేరు ద్వీపముల మధ్య చాలవరకు రేడియో వలననే సమాచార సంబంధమునకు వసతులు కలవు.

**5. యాన సౌ.:** ప్రభుత్వము నిర్వహించు విమానయాన సంస్థ వివిధ ద్వీపముల మధ్య విమానయానమును నిర్వహించుచున్నది. అటులే నౌకాయాన సంస్థలు కొన్ని వేర్వేరు దీవులమధ్య పడవలను నడపుచున్నవి.

**6. చరిత్ర :** 1521 లో మెగెల్లాన్ అను స్పెయిన్ దేశపు నావికుడు ఇందలి మరియానా దీవులను కనుగొని వానికి 'లాడ్రోన్' దీవులని పేరిడెను; అందలి గ్వామ్ దీవియందు 1565 లో స్పెయిన్‌వారు ఒక కోటను సైతము నిర్మించిరి. అయినను తక్కిన ప్రపంచమునకు 19వ శతాబ్ది వరకు ఈ ద్వీపసమూహమును గురించి తెలియ దనియే చెప్పవచ్చును. 19వ శతాబ్ది ఉత్తరార్థమునకు, స్పెయిన్ ప్రభుత్వము తన అధికారమును ఈ ద్వీపసమూహపు మూడు వర్గములకును వ్యాపింప జేసినది. కాని 1885 లో మార్షల్ దీవులను జర్మనీ బలప్రయోగమువలన వశపరచుకొనినది. ఇంతలో 1898 లో జరిగిన యుద్ధమున స్పెయిను దేశము యు. స్టే. వలన ఓడింపబడినది. అందు వలన మరియానా దీవులలోని గ్వామ్ దీవిని యు. స్టే. కు స్పెయిన్ వశపరచినది (చూ. గ్వామ్‌దీవి); తక్కిన మరియానా దీవులను, కెరోలిన్ దీవులను స్పెయిన్ జర్మనీకి అమ్మివేసినది. ప్రథమ ప్రపంచ యుద్ధకాలమున జపాన్ ఈ దీవులను అన్నింటిని జర్మనీనుండి వశపరచుకొనినది. తరువాత నానా జాతిసమితి అనుమతితో జపానే ఈ దీవులను మాండేటరీ ప్రాంతముగ పాలించినది. 1935 లో నానాజాతి సమితినుండి వైదొలగిన తరువాత, జపాను ప్రభుత్వము ఈ దీవులను సైనిక స్థావరములుగ చేసినది. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున జపాను సేనలకు ఈ స్థావరములు ఉపకరించగ యు. స్టే. సేనలకును జపాను సేనలకును మధ్య ఘోరసంగ్రామములు ఇట చెలరేగినవి. కడపట ఒకటివెనుక వేరొకటిగ ఈ దీవులను యు. స్టే. సేనలు వశపరచుకొనినవి. 18 జులై, 1947 న ఈ ప్రాంతము ఐ. రా. స. కు సంబంధించిన ధర్మకర్తృత్వ ప్రాంతముగ యు. స్టే పాలనకు ఈయబడినది. ఈ దీవుల లోని బికినీ, ఇనీవితోక్ అతలద్వీపములు యు. స్టే. నిర్వహించిన అణుబాంబు పరిశోధనలకు ఆటపట్టులై ప్రపంచమున పేరొందినవి. అటుల ఆ బాంబులను ప్రేల్చుటకు ముందుగ ఆ ద్వీపముల లోని 304 మందికి తక్కిన దీవులలో నివాసము లను ఏర్పరుచుట జరిగినది.

ఈ దీవులలోని ప్రజలకు సోపానక్రమమున పాలనయందు భాగ స్వామ్యమును కల్పించి, సర్వ స్వతంత్ర ప్రాంతముగ ఈ ద్వీపసమూహమును రూపొందించుట ఐ. రా. స. ఉద్దేశము. తదనుగుణముగ యు. స్టే. తగు చర్యలను తీసికొనుచున్నది. ప్రస్తుతమున కొన్ని అవధులకు లోబడిన అంతరంగిక స్వపరిపాలన 1965 మొదలుగ అమలున ఉన్నది.

**7. పరిపాలన :** యు. స్టే. దేశపు అధ్యక్షుడు నియమించిన హైకమీషనరు ఇచటి ప్రజాప్రతినిధుల కాంగ్రెస్ సాయమున ఇచటి పాలనను నిర్వహించుచున్నాడు. ప్రతినిధుల సభ, సెనెట్ అను రెండు కక్ష్యలు కాంగ్రెస్‌న కలవు. ఇందు తొలుతటి దాని యందు 21 మంది, రెండవదాని యందు 12 మంది సభ్యులు కలరు. ప్రతి సంవత్సరమున జనవరి 1 మొదలుగ 50 దినములు ఈ సభలు సమావేశమై బడ్జటు, పన్నుల విధింపు మొదలగు వానిని నిర్ణయించును. శాసన నిర్మాణాధికారము దీనికి కలదు; కాని హైకమీషనరు దానిని త్రోసివేయుటకు అతనికి అధికారము కలదు. కాంగ్రెస్ రెండు పర్యాయములు అమోదించిన దానిని హైకమీషనరు త్రోసివైచిన యెడల కాంగ్రెస్ దానిని యు. స్టే. ప్రభుత్వపు కార్యదర్శికి నివేదించవచ్చును. ఆ కార్యదర్శి చేయు నిర్ణయము తుది తీర్పుగ పరిగణింపబడును ఈ రాజ్యము ఆరు మండలములుగ విభక్తము. ఎన్నుకొనబడిన ప్రతినిధుల సాయమున స్థానిక పరిపాలన సాగుచున్నది. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు.

**8.** దేశరక్షణ : దేశీయమగు పోలీసు బలము మాత్రమే కలదు.

**9.** **అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. పర్య వేక్షణకు లోబడి యు. స్టే నిర్వహించుచున్నది.

**10.** **ఆర్థిక రంగము :** వ్యవసాయ, పశు పోషణ, మత్స్య పరిశ్రమలు దేశీయులకు జీవనాధారములుగ ఉపకరించుచున్నవి. కొబ్బరి, చేపలు, కుటీరపరిశ్రమల ఉత్పత్తులు, మాంసము, కూరలు, పండ్లు ఎగుమతి అగుచున్నవి. ఎగుమతులలో అధికభాగము జపానునకు పోవుచున్నవి. ఆహార పదార్థములను మద్యములను, కట్టుబడి సామగ్రిని యు. స్టే., జపానుల నుండి ఈ రాజ్యము దిగుమతి చేసికొనుచున్నది. మొత్తపు ఎగుమతుల విలువ 2[illegible] లక్షల డాలర్లు; దిగుమతుల విలువ 3 కోట్ల డాలర్లు ([illegible]) యు. స్టే ప్రభుత్వము దేశపు ఆర్థిక వ్యవస్థను పరిపోషించుటకు గ్రాంట్ల మూలమున సాయపడుచున్నది.

**11.** **సాంఘిక రంగము :** రాజ్యమునందలి 238 ప్రాథమిక పాఠశాలలలో 23,917 మంది, 15 ఉన్నత పాఠశాలలలో 5,447 మంది విద్యార్థులు కలరు. 778 మంది విద్యార్థులు విదేశములలో ఉన్నత విద్యను అభ్యసించుచున్నారు (1971-72). దేశీయులకు వైద్య సహాయమును కల్పించుటకై 3 పెద్ద ఆసుపత్రులును, 6 జిల్లా ఆసుపత్రులును 158 డిస్పెన్సరీలును పనిచేయుచున్నవి.

---

# 18. అమెరికన్ సామోవ్

## (యు. స్టే. వలస పాలనలోఉన్న ద్వీప రాజ్యము)

**ముఖ్యనగరము :** పగోపగో, **నాణెము :** అమెరికన్ డాలర్; ఒక డాలరు = రు. 7.50; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాల గణన :** ఉదయం 1 గం. భారతదేశమున సా 5 గం. 30 ని. (ముందురోజున).

**1.** **ఉనికి మొ. :** దక్షిణ పసిఫిక్ మహా సముద్రమున 11°-16 ద. అక్షాంశరేఖలకును, 167°-171° ప. తులారేఖలకును మధ్యన చెదరియున్న 7 చిన్నద్వీపములు ఈ రాజ్యమున అంతర్భాగములు. అన్ని ద్వీపముల మొత్తపు వైశాల్యము 197 చ. కిమీ. ఇందు 5 ద్వీపములు అగ్ని శైలీయములు; తక్కిన రెండును పగడపు అతలములు [కంకణాకారమున కుదురుకొని నడుమ అల్ప ద్వీపములుకల దీవికి 'అతలము' (Atoll) అనిపేరు]. అగ్నిశైలీయములగు వానియందు భూతలము చాలవరకు శిలామయము.

**2.** **శీతోష్ణస్థితి మొ. :** ఎండలెక్కువ; వానలును విరివిగ కురియును; ఆగస్టున ఉష్ణోగ్రత 75° ఫా; డిసెంబరు నుండి ఫిబ్రవరివరకు ఉష్ణోగ్రత 90°ఫా. సాలున సరాసరి వర్షపాతము 475 సెం. మీ. డిసెంబరునుండి మార్చివరకు వానలు కురియును. తరచుగ తుఫానుల బాధ కలదు. కొబ్బరి, చంద్ర, రబ్బరుచెట్లు ఎక్కువగ కననగును; వన్యజంతువులు లేనేలేవని చెప్ప వచ్చును.

**3.** **జనసంఖ్య మొ. :** రాజ్యపు జనసంఖ్య 27,159 (1970). వీరిలో 24,973 మంది 'తుత్విలా' అను దీవిలో నివసించుచున్నారు;

ప్రజలందరు పొలినీసియన్ జాతివారు; దాదాపు అందరును క్రైస్తవ మతానుయాయులు; ప్రజల మాతృభాష సామోవ్; అయినను ఇంగ్లీష్ అధికార భాషగా ఎల్లెడ ఆదరింపబడుచున్నది.

**4. సమాచార సౌ.:** తంతి - తపాలా సౌకర్యములు పరిమితముగ ఉన్నవి. అయినను రేడియో గ్రామ్‌ద్వారా ప్రపంచపు వివిధ ప్రాంతములకు సమాచారములను పంపు సౌకర్యము కలదు. వివిధ ద్వీపములమధ్య టెలిఫోను వసతి ఉన్నది.

**5. యాన సౌ.:** దేశమున రోడ్లనిడివి 61 కిమీ.; ఇవిగాక 53 కిమీ నిడివిగల కచ్చారోడ్లు కలవు. దక్షిణ పసిఫిక్ ప్రాంతమునందంతటను ప్రముఖమని పేరొందినది పగోపగో హార్బరు. ఇటనుండి యు. స్టే., జపానులకు, న్యూజీలాండునకు, తక్కిన దక్షిణ పసిఫిక్ రేవులకు నౌకాయాన వసతులు కలవు. పసిఫిక్‌లోని వివిధ రాజ్యములకు పయనించు విమానములలో అనేకములు ఈ దీవులందు ఆగుచున్నవి.

**6. చరిత్ర:** 1722లో ఈ దీవులతో యూరపియనులకు పరిచయము ఏర్పడినది. 1900 లో గ్రేట్‌బ్రిటన్, జర్మనీ, యు. స్టే. లకు మధ్య కుదిరిన ఒక ఒడంబడికవలన సామోవ్ ద్వీపజాలమున 171° ప. తు. రేఖకు తూర్పున ఉన్న దీవులు యు. స్టే. కును, తక్కినవి జర్మనీకిని చెందవలయునను ఏర్పాటు జరిగినది. ఆ విధముగ యు. స్టే. కు దక్కిన దీవులే అమెరికన్ సామోవ్ అని వ్యవహరింపబడుచున్నవి. అంతట తన అధికారమునకు, ఆయా దీవులందలి తెగల నాయకుల ఆమోదములను 1900–1904 మధ్య యు. స్టే. ఆర్జించినది. 1925 లో స్వాయిన్‌దీవి అనునది వీనికి చేర్చబడినది.

**7. పరిపాలన:** ఇచటి దేశీయులు యు. స్టే. జాతీయులుగనే లెక్కింపబడుచున్నారు; వీరిలో ఎవరైనను యు. స్టే. కు వెళ్ళి అట నివసించి కొన్ని అర్హతలను ఆర్జించిన తరువాత పౌరసత్వమును పొందవచ్చును. యు. స్టే. ప్రభుత్వము నియమించు గవర్నరు దేశమున పరిపాలనను నిర్వహించును. ఈతనికి సాయము చేయుటకు ప్రతినిధి సభ, శిష్టసభ అనునవి రెండు కలవు. తొలుతటి దానిలోని సభ్యసంఖ్య 20; వీరి పదవీకాలపరిమితి రెండేండ్లు. రెండవదాని సభ్యసంఖ్య 14, వీరిని 14 జిల్లాలలోని ప్రజలు ఎన్నుకొనెదరు; వీరి పదవీకాలపరిమితి 4 సంవత్సరములు. దైనందిన పరిపాలనను నిర్వహించు ఒక కార్యదర్శిని గవర్నరు నియమించును. యు. స్టే. చట్టములకు వ్యతిరేకములుగాని సామోవ్ దేశీయ సంప్రదాయములు న్యాయశాస్త్ర విహితములుగ లెక్కింపబడుచున్నవి.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం.:** వలసరాజ్య మగుటవలన దేశరక్షణ బాధ్యతను, అంతర్జాతీయ సంబంధములను యు. స్టే. ప్రభుత్వమే నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** వ్యవసాయమే ఆర్థిక వ్యవస్థకు మూలాధారము. దేశభూతలమున 31% సాగున ఉన్నది. అరటి, బొప్పాయి, అనాస, చిరుగడదుంప, కర్రపెండలము, కాఫీ, కోకోలు ముఖ్యములగు పంటలు. పందులు, కోళ్లు విరివిగ పెంచబడుచున్నవి. తక్కిన పశువులు చాల తక్కువ. ముఖ్యమగు రొక్కపుపంట కొబ్బరి. ఫలరసముల పరిశ్రమలో దాదాపు 1000 మంది పనిచేయుచున్నారు. ఫలరసముల ఎగుమతివలన ఎక్కువ ఆదాయము లభించుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 4,13,69,235 డాలర్లు; దిగుమతుల విలువ 1,95,56,873 డాలర్లు (1970–71) ప్రభుత్వమునకు ఎగుమతి దిగుమతి సుంకములు మొదలగు వాని వలన లభించు దానికన్న ఎక్కువగ యు. స్టే. ప్రభుత్వపు గ్రాంటులవలన ఆదాయము లభించుచున్నది.

**11.** **సాంఘిక రంగము :** దేశమున 6 నుండి 18 ఏండ్లమధ్య వయసుకలవారు విధిగ విద్యను అభ్యసించవలెనను నియమము కలదు. విద్యాబోధన ఉచితము. 10 ఏండ్లకు మించిన వారిలో 99% అక్షరాస్యులు. దేశమున ప్రభుత్వాధీనమున 138 గ్రామీణపాఠశాలలు, 27 ప్రాథమిక పాఠశాలలు, 4 ఉన్నత పాఠశాలలు, ఒక కమ్యూనిటీ కాలేజి కలవు; మొత్తపు విద్యార్థిసంఖ్య 5,267. ఇవిగాక 8 ప్రయివేటు పాఠశాలలలో 1600 మంది విద్యార్థులు కలరు (1972). టెలివిజన్‌ద్వారా కూడ విద్యాబోధనకు వసతి కల్పింపబడినది. వైద్యసహాయము ప్రతివారికి ఉచితముగ లభించుచున్నది. 200 శయ్యాసంఖ్యకల ఒక వైద్యకేంద్రము కలదు.

# 19. పశ్చిమ సామోవ్ (సామో ఇ సిసిఫో)

**ముఖ్యనగరము :** ఆపియా ; **జెండా :** దండమువద్ద పైభాగమున, జెండాలోని నాలుగవ భాగము నీలవర్ణముకలిగి, అందు తెల్లని అయిదు నక్షత్రములుండును; జెండాయందలి తక్కిన భాగము ఎరుపురంగున ఉండును. **జాతీయ గీతము :** 'స్వాతంత్ర్య పతాక' గీతము; **నాణెము :** పశ్చిమ సామోవ్ డాలరు; దీనికే తాలా అనియు పేరు కలదు; 100 సేనీలుగ ఇది విభక్తము; 1 ప. సా. డాలరు = రు. 8-40, **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి. **కాలగణన :** ఉదయం 1 గం = భారతదేశమున సా. 5 గం. 30 నిమిషములు.

**1.** **ఉనికి మొ. :** పసిఫిక్ మహాసముద్రమున 13°-15° ద. అక్షాంశరేఖలకును, 171°-173° ప. తులారేఖలకును మధ్యన చెదరియున్న వివిధ ద్వీపముల సమూహమగు పశ్చిమ సామోవ్ రాజ్యమున సవాయీ, ఉపోలూ అను రెండు ప్రముఖ ద్వీపములును మరికొన్ని అల్పద్వీపములును చేరి ఉన్నవి. ఈ అల్పద్వీపములలో మనోనో, అపోలిమా అను రెండు దీవులలో మాత్రమే జనావాసములు కలవు. అన్ని ద్వీపముల మొత్తపు వైశాల్యము రమారమి 2,842 చ. కిమీ. సవాయీ, ఉపోలో దీవులను 16.5 కిమీ. ల వెడల్పుకల ఒక జలసంధి వేరు చేయుచున్నది ఈ రెండు దీవులలో ప్రతిదాని పొడవు రమారమి 44 కిమీ. లును, వెడల్పు దాదాపుగ 24 కిమీ. లును ఉండును. అగ్నిపర్వతజములగు ఈ ద్వీపముల భూతలము ఎగుడుదిగుడుగ ఉండును; కొండల వరుసలు విరివిగ కన్పట్టును ఉపోలో దీవిలో అత్యున్నతపు శిఖరపు ఎత్తు 1100 మీ; సవాయీలో అట్టిదాని ఎత్తు 1857 మీ ఇప్పటికిని కొన్ని దీవులందు అగ్నిపర్వత విజృంభణ అంతటంతట కలదు. 1911 లో సవాయిలో ఇట్టి విజృంభణ కొంత కాలము సాగెనది.

**2.** **శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండలపు శీతోష్ణస్థితి ఇట కననగును; కాని చుట్టున ఉన్న సముద్రమువలన సౌమ్యత అందు ఏర్పడుచున్నది. జులై నెలలో ఎండలెక్కువ. డిసెంబరులో చలి ఎక్కువ. సాలున సరాసరి దైనికోష్ణత 80 ఫా. మే నుండి అక్టోబరువరకు వానలు కురియును. సాలున సరాసరి 282 సెం. మీ. వర్షపాతము కలదు. గాలిలో చెమ్మదనము ఏ కాలమునను 80% కు తగ్గదు. దీవులందన్నింట వృక్షసంతతి

ఎక్కువ. దేశమున సహజముగ ఎలుకను మించిన పెద్దజంతువులు లేవు; కాని తక్కిన దేశములనుండి గోజాతి మొదలగునవి ఇటకు చేర్చబడినవి. రాదాపు 50 రకముల పక్షిజాతులు కలవు; వీనిలోని 'బాతుముక్కు పావురము' ఈ దేశమున తప్ప వేరొక చోట కనరాదు; వివిధములగు సర్పజాతులును, బల్లులును కలవు.

**3. జనసంఖ్యా మొ.:** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,46,635; వీరిలో 1,06,635 మంది ఉపోలో దీవియందు నివసించుచున్నారు. ఉపోలో దీవియందున్న ముఖ్యనగరము (ఆపియా) లోని జనసంఖ్య 28,880; ప్రజలందరు క్రైస్తవులు. సామోవ్, ఇంగ్లీషు భాషలు అధికార భాషలుగ ఉన్నవి.

**4. సమాచార సౌ.:** ముఖ్యనగరమున ఉన్న పెద్ద తపాలాఫీసే గాక, దేశమున 18 చిన్న తపాలాఫీసులును కలవు. తంతి, టెలిఫోను సౌకర్యములును ప్రముఖకేంద్రముల మధ్యకలవు. రేడియో టెలిఫోను ద్వారా అమెరికన్ సామోవ్, ఫిజీ, న్యూజీలాండ్, ఆస్ట్రేలియా, కెనడా, యు. స్టే., బ్రిటన్‌లతో ఈ దేశమునకు వార్తాసంబంధము కలదు.

**5. యాన సౌ.:** దేశమున పక్కారోడ్లు 390 కిమీ. నిడివిన కలవు; ఇవిగాక 162 కిమీ. పొడవున మధ్యతరగతి రోడ్లును, 312 కిమీ. పొడవున డొంకబాటలును కలవు. వివిధ ద్వీపముల మధ్యను, ఆపియానుండి న్యూజీలాండు, ఫిజీలకును, జపాను, బ్రిటనులకును నౌకాయాన వసతికలదు. ఉపోలో-సవాయీలమధ్యను, ఈ దేశమునుండి అమెరికన్ సామోవ్‌కును దైనికముగను, ఫిజీ, టోంగోలతో వారమున రెండుసార్లును విమానయాన వసతి ఏర్పడియున్నది.

**6. చరిత్ర:** ఈ దేశమున జనావాసములు అతి ప్రాచీనకాలముననే ఏర్పడినటుల అచటి ప్రత్యేకములవలన తెలియుచున్నను, 13 వ శతాబ్ది నుండి అట పరిపాలించిన కొన్ని దేశీయ రాజవంశములను గురించి మాత్రమే అచటి ప్రాచీన పారంపర్యగాథలవలన తెలియవచ్చు చున్నది. 1722 లో తొలుతగ ఇది యూరపీయ నావికులకు విదితమైనది. కాని 1832 లో అచట ఒక మతప్రచార కేంద్రమును లండన్ మిషన్ సొసైటీ స్థాపించినప్పటినుండియే తక్కిన ప్రపంచమునకు ఆ దేశపు ఉనికి బాగుగ తెలియనైనది. అంతట యు. స్టే., బ్రిటన్, జర్మనీలు అచటి తెగలనాయకుల రాజకీయములలో జోక్యము వహింప మొదలిడినవి. తత్ఫలితముగ దేశము దీర్ఘకాలము అంతఃకల్లోలములకు లోనైన తరువాత 1899 లో దేశీయపు రాజరికమును రద్దుచేసి, పై మూడు పాశ్చాత్య రాజ్యములును ఒక ఒడంబడికకు వచ్చి ఈ రాజ్యమును జర్మనీ అధీనమున రక్షిత రాజ్యముగ ఉంచుటకు నిర్ణయించినవి. 1914 లో మొదటి ప్రపంచ యుద్ధకాలమున న్యూజీలాండు సేనలు ఈ రాజ్యమును ఆక్రమించినవి. 1919 నుండి 1946 వరకు నానాజాతి సమితియొక్క అనుమతిపై మాండేటరీ ప్రాంతముగ ఈ రాజ్యమును న్యూజీలాండు పాలించినది. తదుపరి ఐ. రా. స. అనుమతిపై న్యూజీలాండే ధర్మకర్తృత్వపాలనను నిర్వహించి క్రమముగ ప్రజలకు ప్రభుత్వమున భాగస్వామ్యమును కల్పించినది. 1961 లో ఐ. రా. స. పర్యవేక్షణలో జరిగిన జనాభిప్రాయ సేకరణలో స్వాతంత్ర్యాకాంక్షను ప్రజలు వెల్లడింపగ, జనవరి 1,1962 న ఈ దేశము స్వతంత్రమైనది.

**7. పరిపాలన:** రాజ్యాంగ విధానమును అనుసరించి, రాజ్యాంగబద్ధుడగు దేశాధినేత ఒకడు ఉండవలెనను నియమముకలదు. దేశీయ రాజవంశమునకు చెందిన తనుమాఫిలి II అను నతడు ప్రస్తుతమున దేశాధినేతగ ఉన్నను, ఈతని

మరణానంతరమున ఆ పదవియందుండు వానిని శాసనసభయే ఎన్నుకొనగలదనియు, అతని పదవీ కాలపరిమితి అయిదేండ్లుగ ఉండగలదనియు నియమము ఏర్పరుపబడినది. శాసన నిర్మాణాధికారము శాసనసభయందు కలదు; ఇందలి సభ్యసంఖ్య 47; వీరిలో ఇరువురు సభ్యులు మాత్రము సార్వజనికమగు వోటుపద్ధతిన ఎన్నుకొనబడుదురు; తక్కిన వారిని తెగలనాయకులు (దాదాపు 11 వేల మంది) ఎన్నుకొనెదరు. శాసనసభ్యులలో అధిక సంఖ్యాక బలము కలవానిని ప్రధానిగను, అతని ఆమోదమున తక్కిన మంత్రులను దేశాధినేత నియమించును. మంత్రివర్గము శాసనసభకు బాధ్యత వహించి, కార్యనిర్వాహణాధికారమును నిర్వహించును. దేశమున రాజకీయ పక్షములు ఏవియు లేవు.

**8 దేశరక్షణ :** సైనికబలము ఎట్టిదియు లేదు.

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. లో ఈ దేశమునకు సభ్యత్వములేదు; కాని ఐ. రా. స కు చెందిన పలుసంస్థల సాయమును ఈ దేశము పొందుచున్నది; ఈ దేశపు అంతర్జాతీయ సంబంధములను, ఒక ఒడంబడికను అనుసరించి న్యూజీలాండు ప్రభుత్వమే, నిర్వర్తించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయమే ముఖ్యజీవనాధారము; కొబ్బరి. కోకో, అరటిపండ్లు ఎగుమతులపైననే దేశపు ఆర్థికవ్యవస్థ ఆధారపడి ఉన్నది; తక్కిన పంటలు దేశావసరములకు సరిపోవువరకే పండింపబడుచున్నవి; పశుపోషణయు విరివిగ కొనసాగుచున్నది. అడవులలోని కలపలో అధికభాగము ఎగుమతియగుచున్నది. ఖనిజ సంపద తెలియవచ్చినంతవరకు, దాదాపుగ శూన్యమని చెప్పవచ్చును. విద్యుదుత్పత్తి 90.8 లక్షల కి.వా. (1965). దేశపు ఎగుమతుల విలువ 44,84,145 ప. సా. డాలర్లు; దిగుమతుల విలువ 32,14,321 ప. సా. డాలర్లు 1971. సాధారణ బడ్జెటరీ వ్యయము 38,24,520 ప. సా. డాలర్లు (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున ప్రజలలో అధికసంఖ్యాకులు పల్లెలలో నివసించుచున్నారు. కొబ్బరియాకుల పూరిగుడిసెలు మాత్రమే అట కన్పట్టును. పట్టణములలో సైతము గృహవసతి చాల తక్కువ. దేశమున విద్యాబోధనకై ప్రభుత్వమును మతసంస్థలును నిర్వహించు పాఠశాలలు కలవు. దేశీయ పౌరుడు సామోవ్, ఇంగ్లీషు భాషలను రెండింటిని నేర్చియుండునటుల చేయుట ఈ విద్యా విధానమున ఒక ప్రముఖ లక్ష్యము. దేశమునందలి ప్రయిమరీ పాఠశాలలలో 26,261 మంది, మధ్యతరగతి పాఠశాలలలో 5,784 మంది, ఉన్నతపాఠశాలలలో 3,264 మంది విద్యార్థులు కలరు (1965). ఆపియాలో ఒక గ్రంథాలయము కలదు; మ్యూజియములులేవు; దినపత్రికలు లేవు. వారపత్రికలు రెండు, పక్షపత్రిక ఒకటి కలవు. ఆపియాలో 309 శయ్యలుకల ఒక పెద్ద ఆసుపత్రి, తక్కిన ప్రాంతములలో మొత్తముమీద 318 శయ్యలుకల చిన్న ఆసుపత్రులు కలవు; వైద్యసంఖ్య 46. బోదకాలు జ్వరము తప్ప, తక్కిన ఉష్ణమండల జాడ్యములు ఇట కానరావు.

**12. యాత్రా సౌ :** విదేశీయ యాత్రికులను, తద్వారా విదేశీయద్రవ్యమును ఆకర్షించుటకు ప్రభుత్వము 1965 మొదలుగ కృషిచేయుచున్నది. 1969 లో 12,000 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. హోటళ్లు మొదలగు వానిలో వసతి చాల తక్కువ.

# 20. సొలమన్ దీవులు
## (బ్రిటిష్ పాలనలోని రక్షిత రాజ్యము)

**ముఖ్యనగరము :** హోనియారా, **నాణెము :** ఆస్ట్రేలియన్ డాలరు; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** సా. 10 గం.–30 ని. = భారతదేశమున సా. 5 గం–30 ని.

**1. ఉనికి** మొ : దక్షిణ పసిఫిక్ మహా సముద్రమున 5°–12°30′ ద. అ. రేఖలకును, 155°–170° తూ. తు. రేఖలకును మధ్యన గొలుసువలె అమరియున్న 8 పెద్ద దీవులును, కొన్ని చిన్నదీవులును కలిసి ఈ రాజ్యముగ వ్యవహరింపబడుచున్నవి. ఆస్ట్రేలియాకు ఉత్తర దిక్కున న్యూగినీకి 450 కిమీ. లు తూర్పున ఈ ద్వీపసమూహము ఉన్నది. ఈ దీవులలోనెల్ల పెద్దది గ్వడల్‌కనాల్ (వైశాల్యము దాదాపు 6,475 చ. కిమీ); మలైతా, సాన్ క్రిస్టోబల్, తూలగీ, ఫ్లోరిడా. రెన్నెల్, న్యూ జార్జియా, సాంతా క్రజ్ అనునవి తక్కిన పెద్ద ద్వీపములు. ద్వీప సమూహపు మొత్తము వైశాల్యము 29,785 చ. కిమీ ఇందు దాదాపు 90% అటవీమయము గ్వడల్‌కనాల్‌లో 2400 మీ. కు పైబడిన శిఖరములు కలవు. ఇక కొన్నిచోట్ల సముద్ర మట్టమునకు సరియగు అతల ద్వీపములును కలవు.

**2. శీతోష్ణస్థితి** మొ. : సాలున ఉష్ణోగ్రత 72° నుండి 95° ఫా. వరకు మారుచుండును; కాని వ్యాపారవాయువులు ఆగ్నేయమునుండి రాజ్యముపై వీచుటవలన ఎండవేడిమి చాలతగ్గియుండును. సాలున సరాసరి వర్షపాతము 300 సెంమీ.

**3. జనసంఖ్య** మొ. : 1971 అంచనాలను అనుసరించి రాజ్యపు జనసంఖ్య 1,52,000. ఇందు 1,41,000 మైక్రోనీసియన్ జాతికి చెందినవారు; 7,540 పొలినీసియన్, మెలనీసియన్ జాతులవారు; తక్కినవారు ఇతర జాతులవారు. దట్టమగు అడవులు దుర్గమములగుటవలన జనసంఖ్యలో అధికభాగము తీరప్రాంతములందే వసించుచున్నారు. మలైతాదీవియందు జనసంఖ్య అత్యధికము (56,000). ముఖ్యనగరము, రేవు నగరమునగు హోనియారాలోని జనసంఖ్య దాదాపు 9,000. వివిధభాషలు వివిధ పరిమిత ప్రాంతములందు మాతృభాషలుగ ఉన్నవి. అయినను ఇంగ్లీషే అధికారభాషగ ఆదరణ పొందినది. 'పిడ్జిన్ ఇంగ్లీషు' అనబడు అపభ్రంశపు ఇంగ్లీషు బజారుభాషగ ఎల్లెడల మాటాడబడుచున్నది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు.

**4. సమాచార సౌ.** తంతి–టెలిఫోను సదుపాయములు కలవు; తక్కిన వివరములు తెలియవు.

**5. యాన సౌ. :** ద్వీపములందు రాకపోకల వసతులు చాల తక్కువ; హోనియారా నగరమున 22 కిమీ.ల రోడ్లును, తక్కిన అన్ని ద్వీపములందు కలసి 234 కిమీ. ల రోడ్లును కలవు; అయినను ఈ రోడ్లు ఉత్తమ శ్రేణికి చెందినవి. ద్వీపముల మధ్య రాకపోకలు ప్రభుత్వపు నౌకల వలన సాగుచున్నవి. అంతర్జాతీయ విమానయానపు మజిలీలుగ ఉపకరించు నాలుగు విమాన క్షేత్రములు ఉన్నవి.

**6. చరిత్ర :** మెందానా అను స్పెయిన్ దేశీయ నావికుడు ఈ దీవులను 1567 లో కనుగొనెను. అచటి ప్రజల కోరికపై అందలి కొన్ని దీవులను బ్రిటిష్ ప్రభుత్వము తన రక్షణలోనికి తీసికొనినది (1893); 1898 లో మరికొన్ని దీవులు ఇందు చేరినవి. మిగిలిన వానిని 1900 లో

జర్మనీ నుండి, ఒక ఒడంబడికవలన, బ్రిటన్ గ్రహించినది.

**7 పరిపాలన :** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు హైకమీషనరు ఇట పాలనను నిర్వహించుచున్నాడు. అతనికి 23 మంది సభ్యులు కల శాసనసభయు, ఒక కార్యవర్గమును పాలనయందు సాయపడుచున్నవి. శాసనసభలోని సభ్యులలో 14 మందిని ప్రజలు ఎన్నుకొనెదరు; 12 మందిని హైకమీషనరు నియమించును. దేశమునందలి 21 మండలములందును స్థానికపాలన ప్రజల ప్రతినిధుల సాయమున నిర్వహింపబడుచున్నది. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. ప్రజలయందు, ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామము తరువాత స్వాతంత్ర్యముకొరకై ఆకాంక్ష ఎక్కువైనది. తత్ఫలితముగ ప్రజల ప్రతినిధులతో బ్రిటిష్ ప్రభుత్వము చర్చలను జరపి ఈ రాజ్యమునకు 1977 మధ్యలో స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించుటకు అంగీకరించినది (23 మే, 1975).

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ప్రస్తుతమున ఈ రెండు బాధ్యతలను బ్రిటిష్ ప్రభుత్వమే నిర్వర్తించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయమే దేశపు ఆర్థికవ్యవస్థకు ఆధారము. ఆహారపుపంటలు చాల తక్కువగానే ఉన్నను, కొబ్బరి తోటలు ఎక్కువ. వానియందలి ఉత్పత్తిలో అధికభాగము ఎగుమతి అగుచున్నది. అడవులందలి కలపను చక్కజేసి ఎగుమతిచేయుట చాలమందికి జీవనాధారముగ ఉన్నది. దేశపు ఎగుమతుల విలువలో 55% కొబ్బరి ఉత్పత్తుల వలన, 39 కలపవలన లభించుచున్నది. బంగారము చాల చిన్నమొత్తములలో గనులనుండి తీయబడుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 55,47,000 ఆ. డా.; దిగుమతుల విలువ 1.88,88,000 ఆ డా. ప్రభుత్వాదాయమున అధికభాగము ఎగుమతి సుంకముల వలన లభించుచున్నది (1971).

**11. సాంఘిక రంగము :** క్రైస్తవమత ప్రచార సంఘములు విద్యారంగమున ఎక్కువగ కృషి చేయుచున్నవి. రాజ్యమునందలి 405 పాఠశాలలలో 26,256 మంది విద్యార్థులు కలరు; ఇందు 897 మంది మాత్రమే ఉన్నతపాఠశాలావిద్యార్థులు; తక్కినవారు ప్రయిమరీ పాఠశాలలలోనివారు. విదేశములలో ఉన్నత విద్యను, ప్రభుత్వ సాహాయ్యమున 112 మంది అభ్యసించుచున్నారు. దేశమున 6 జనరల్ ఆసుపత్రులు కలవు. రాజ్యమున మలేరియా, క్షయలవలన బాధ ఎక్కువ (1971).


ఉత్తర అమెరికా
రాజకీయ విభాగములు
ఆర్కటిక్ మహా సముద్రము
అలాస్కా
కెనడా
యునైటెడ్ స్టేట్స్
మెక్సికో
హాండురాస్
నికరాగువా
పనామా
దక్షిణ అమెరికా

# 1. ఎల్ సాల్వడార్

**ముఖ్యనగరము :** సాన్ సాల్వడార్; **జెండా :** రెండు నీలి అడ్డుచారల మధ్య ఉన్న తెలుపు అడ్డుచార మధ్యన దేశీయ యోధలాంచనము; **జాతీయగీతము :** సాల్యూదిమస్ లా పాత్రియా ఓర్గులాసన్ (జనకభూమికి గర్వముతో జేకొట్టుము) **నాణెము :** కొలోన్; ఒక కొలోన్ = రు. 3.00;




పటము 2.

**కొలతూకములు :** మెట్రిక్ విధానమునకు సాధికార పరిగణన కలదు; **కాలగణన :** ఉ. 6 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** లాటిన్ అమెరికన్* రాజ్యములందెల్ల చిన్నదియగు ఈ రాజ్యము 13°9′-14°26′ ఉ. అక్షాంశరేఖలకును, 87°41′-90°8′ తూ. తులారేఖలకును మధ్యనున్నది. ఉత్తర, తూర్పుదిక్కుల హొండూరాస్; దక్షిణమున పసిఫిక్ మహాసముద్రము, ఫొనెస్కా సింధుశాఖ; పశ్చిమమున గ్వాతెమాలా ఈ దేశపు సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము అంచనాలను అనుసరించి 20,935 చ. కిమీ. భౌగోళికముగా దేశమును మూడు ప్రాంతములుగ విభజింపదగును : 1. పసిఫిక్ తీరభూమి; ఇది 258 కిమీ. పొడవున ఉన్నది; దీని వెడల్పు ఎచటను 24 కిమీ. ను మించదు. 2. మధ్యదేశపు పీఠభూమి; దీని సరాసరి ఎత్తు 610 మీ. దీనియందు తూర్పు పడమరలకు వ్యాపించిన రెండు పర్వత శ్రేణులు కలవు. 3. ఉత్తరప్రాంతపు పల్లపు భూములు; ఇవి లెంపా నదీలోయవలన రూపొందినవి. వీని సరిహద్దున ఒక పర్వతశ్రేణి కలదు; హొండూరాస్ దేశపు సరిహద్దువరకు క్రమరీతిలో ఆ పర్వతశ్రేణియందు ఎత్తున పెరుగుదల కన్పట్టును. మధ్యదేశపు పీఠభూమి, వ్యావసాయికముగ, పారిశ్రామికముగ ప్రముఖత వహించినది. ఇందే అత్యధిక సంఖ్యాకజనము నివసించుచున్నారు. ముఖ్యనగరమును, ఇతర నగరములలో ముఖ్యములగు కొన్నియు ఈ ప్రాంతముననే ఉన్నవి. దీనిని పరివేష్టించి అగ్నిపర్వతములు పెక్కు కలవు; వానిలో ఇజల్కో (1920 మీ.) అనునది 'పసిఫిక్ ప్రాంతపు దీపగృహము' అని పేరొందినది. దేశపు మొత్తమున పెక్కు సరస్సులు కలవు. వీనిలో ఇలోపాంగో, గ్వీజా, కొతేపెక్కే అనునవి ప్రముఖములు. దేశమునందలి 150 నదులలో లెంపా నదియే గణనీయము. ఇది గ్వాతమేలా దేశమున జన్మించి, ఈ దేశమున ప్రవహించి, కడకు పసిఫిక్ సముద్రమున చేరుచున్నది.

---

*ఉత్తర, దక్షిణ అమెరికాలలోఉన్న రాజ్యములలో స్పానిష్, పోర్చుగీజు భాషలు మాతృభాషలుగాగల ప్రజానీకము అత్యధికముగా వసించు రాజ్యములను లాటిన్ అమెరికన్ రాజ్యములు అని వ్యవహరింతురు.

**2. శీతోష్ణస్థితి మొ.:** ఉష్ణమండల ప్రాంతమున ఉన్న ఈ దేశమున స్పష్టరీతిలో రెండు ఋతువులు మాత్రమే అనుభవ వేద్యములు: నవంబరు నుండి ఏప్రిల్ వరకు ఎండకాలము; ఈ కాలమున కొలదిగ వర్షములును పడును. మే నుండి నవంబరు వరకు వర్షకాలము; ఆ కాలమున వర్షములు విరివిగ కురియును. వర్షపాతము తీర ప్రాంతమున అత్యధికము. మధ్యప్రాంతమున కొన్ని పరగణాలలో వానలు చాల తక్కువ. సగటున సాలుసరి వర్షపాతము 180 సెం. మీ. ప్రాంతముల ఎత్తునుబట్టి ఉష్ణోగ్రతలలో వ్యత్యాసములు కననగును. తీరప్రాంతములలో ఉష్ణోగ్రత కొంత ఎక్కువయేయైనను, గాలిలో చెమ్మదనం ఎక్కువ.

మధ్యప్రాంతపు ఉన్నత ప్రాంతములలో ఉష్ణోగ్రత తక్కువ. మొత్తముమీద దేశమున సాలున అత్యధికోష్ణోగ్రత 89.6 ఫా. దేశ వైశాల్యమున 10% అటవీమయము: రబ్బరు చెట్లు మొదలగు పెద్దవృక్షములును, ఓషదులును, కోతులు మొదలగు చిన్న జాతి జంతువులును అందు కలవు; సర్ప జాతులును, పక్షిజాతులును పలుతీరులవి కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1972 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 36,85,000; నగరములలో ముఖ్యనగరమగు సాన్‌సాల్వడార్ (జ. సం. 3,80,000). సాంతా ఆనా (జ. సం. 1,72,300), సాన్ మిగ్వేల్ (జ. సం. 1,10,966) ప్రముఖములు; జనసాంద్రత చ. కిమీ. కి 158; జనులలో 39.8% పట్టణములందు వసించుచున్నారు. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు (90.3%), దేశీయ జాతులును శ్వేతజాతులును సంకరమొందగ రూపొందిన వారు; అచ్చపు దేశీయ జాతివారు 5.6%; అచ్చపు శ్వేతజాతీయులు 2.1%. దేశమున అధికార భాష స్పానిష్; కొలదిమంది దేశీయులు మాత్రము నహ్వాత్ల అనబడు ప్రాచీన అమెరికన్ భాషను మాటాడెదరు. దేశవాసులతో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు, కొలదిగ తక్కిన సంప్రదాయముల క్రైస్తవులును, యూదులును కలరు. దేశమున మత స్వాతంత్ర్యము రాజ్యాంగరీత్యా కల్పింపబడినది.

**4. సమాచార సౌ.:** ఒక స్వయంపాలనా ప్రతిపత్తిగల సంస్థ, ప్రభుత్వ పర్యవేక్షణకు లోబడి, పెక్కు సమాచార సాధనములను నిర్వహించుచున్నది: తంతి, టెలిఫోనుల వసతి విరివిగ కలదు. 1972 మొదలుగ టెలివిజన్ వసతి కొన్ని ప్రాంతములందు ఏర్పడినది; సాన్ సాల్వడార్‌లో రేడియో స్టేషను కలదు.

**5 యాన సౌ.:** దేశమున 10,733 కిమీ. నిడివిగల రోడ్డుమార్గములు కలవు; ఇందు 1,243 కి. మీ. ఉత్తమ శ్రేణికి చెందినవి. 795 కిమీ. నిడివిగల రైలుమార్గము ఉన్నది. అకజట్ల రేవును ముఖ్యనగరముతోను, తక్కిన ప్రముఖ నగరములతోను ఇది కలుపుచున్నది. లా యూనియన్, లా లిబెర్తాడ్, అకజట్ల అనునవి ముఖ్యములగు సముద్రపు రేవులు. ఇవి అన్నియు పసిఫిక్ సముద్రతీరముననే ఉన్నవి. అట్లాంటిక్ మహాసముద్రపు వ్యాపారమునకు సంబంధించినంత వరకు, గ్వాతమాలా దేశపు ప్యోర్టొబారియన్ రేవునే, ఒక ఒడంబడికను అనుసరించి, దేశీయులు వాడుకొనుచున్నారు. ఇలోపాంగోలో అత్యంతాధునికపు పరికరములును వసతులును కలిగిన ఒక విమానాశ్రయము ఉన్నది; ఇటనుండి పలు విదేశములకు విమాన ప్రయాణ వసతులు కలవు.

**6. చరిత్ర:** క్రి. శ. పదునారవ శతాబ్దికి పూర్వమున ఇట 'కస్కట్లాన్' అను పేరుగల అమెరికన్ - ఇండియన్ రాజ్యము ఉండెడిది. స్పెయిన్ దేశపు సాహసికులు, 1524 లో

ఈ రాజ్యమును అంతరింపజేసి, ఈ ప్రాంతమును స్పెయిన్ పాలకుల సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసిరి. 1821 మొదలుగ ఈ మధ్య అమెరికా ప్రాంతపు రాజ్యములు స్వాతంత్ర్యమునకై పోరాటములు సలిపి, ఒక దానివెనుక వేరొకటిగ స్వాతంత్ర్యమును పొందినవి. ఇట్టి స్వతంత్ర రాజ్యములు-గ్వాతెమాలా, ఎల్ సాల్విడార్, హోండూరాస్, నిగరాగ్వా, కోస్టారికా అనునవి-తొలుత ఒక సమాఖ్యగ రూపొందినను, కాలక్రమమున వేరుపడగ, 1841 లో ఒక స్వతంత్ర రాజ్యముగ ఎల్‌సాల్వడార్ ఏర్పడినది. కాని దేశమున రాజకీయ స్థిరత మాత్రము లేకుండుట దేశపు ముఖ్యలక్షణముగ పరిణమించినది. సైనికనాయకులు ప్రభుత్వములను కూలద్రోసి పరిపాలనను వశపరచుకొనుట ఒక సామాన్య సంఘటనగ లెక్కకు వచ్చినది. ఇటుల ఎన్నియో విపర్యయములు జరిగిన తరువాత 1962 నుండి దేశమున కొంత స్థిరపరిపాలన నెలకొనినది.

**7. పరిపాలన :** 1962 జనవరిలో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి ఇట గణరాజ్య ప్రభుత్వపాలన నిర్వహింపబడుచున్నది. దేశాధ్యక్షుడు దేశప్రజలలో వోటు హక్కు కలిగిన వారందరివలన ఎన్నుకొనబడును; అతని పదవీకాలపరిమితి అయిదేండ్లు; కార్యనిర్వహణాధికారము అతనియందే న్యస్తము. ఏక కక్ష్యకల శాసనసభ కలదు. ఇందలి సభ్య సంఖ్య 52; దేశపు వివిధమండలముల వోటర్లు వీరిని ఎన్నుకొనెదరు; వీరి పదవీకాల పరిమితి రెండేండ్లు. శాసన సభతోపాటుగ, అధ్యక్షునకు శాసన నిర్మాణాధికారము కలదు; కాని అధ్యక్షుడు చేసిన శాసనమును, మూడింట రెండువంతుల ప్రాబల్యముతో శాసనసభ త్రోసివేయవచ్చును. 18 ఏండ్ల పైబడిన ప్రతి పౌరునికి వోటుహక్కు కలదు. రాష్ట్రములను ప్రభుత్వ నియమితులగు గవర్నర్లు పాలింతురు. పట్టణములకు, స్థానిక పరిపాలనా సంఘములు కలవు. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున దేశమున వివిధ న్యాయస్థానముల ద్వారా న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 9 పదాతి దళములు, ఒక ఆయుధ దళము, ఒక ఆశ్వికదళము కలవు; ఇందలి మొత్తపు సైనిక సంఖ్య 4,500.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. యందును, దాని అనుబంధిత ప్రత్యేక సంస్థలందును, మధ్య అమెరికా దేశముల సామాన్య విపణిలోను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ప్రపంచ బ్యాంకు వలనను, ప్రపంచ ఆరోగ్య వ్యవస్థ వలనను ఈ దేశము సహాయమును విరివిగ గ్రహించినది.

**10. ఆర్థిక రంగము :** మధ్య అమెరికా దేశములందెల్ల ఈ దేశము పారిశ్రామికముగ అతి ప్రముఖస్థానమును ఆర్జించినది. అయినను పరిశ్రమలన్నియు చాలవరకు వ్యవసాయముతో ముడిపడి ఉన్నవి. దేశాదాయమున వ్యవసాయమువలన 30%, పరిశ్రమలవలన 17%, వాణిజ్యము వలన 24% లభించుచున్నది. దేశపు ఎగుమతులలో కాఫీ, ప్రత్తి వలన 53% ఆదాయము వచ్చుచున్నది; అందును కాఫీ ఎక్కువ ప్రాముఖ్యము కలది. కాని ఆహారధాన్యముల ఉత్పత్తి చాల తక్కువ. దేశపు అవసరములకు కావలసిన గోధుమలో 90% ను దేశము దిగుమతి చేసికొనుచున్నది; మాంసము, పాల ఉత్పత్తుల విషయమున కూడ దేశము ఇతర దేశములపై చాలవరకు ఆధారపడి ఉన్నది. దేశపు తలసరి ఆదాయము 284 అమెరికన్ డాలర్లు; దేశపు విద్యుదుత్పత్తి 73.54 కోట్ల కివా. (1971). దేశపు ఎగుమతుల విలువ 57.1 కోట్ల కొ; దిగుమతుల విలువ 53.4 కోట్ల కొ. దేశపు బడ్జెటరీ వ్యయము 25.6677 కోట్ల కొ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున నగరములలో సైతము గృహవసతి చాల తక్కువ. దేశమున నిర్బంధ, ఉచిత విద్యకు వసతిని ప్రభుత్వము కలిగించినది. ప్రాథమిక పాఠశాలల సంఖ్య 2,937. అందలి విద్యార్థి సంఖ్య 5,62,854; సెకండరీ పాఠశాలల సంఖ్య 860. అందలి విద్యార్థి సంఖ్య 86,858; దేశమున రెండు విశ్వ విద్యాలయములు కలవు, అందలి విద్యార్థిసంఖ్య 12,092 (1972). 6813 శయ్యాసంఖ్యాగల ఆసుపత్రులు వైద్య సహాయమునకు ఉపకరించు చున్నవి. సాన్ సాల్వడార్, మెజికానోస్ నగరములలో ప్రముఖ గ్రంథాలయములు కలవు సాన్ సాల్వడార్‌లోని మ్యూజియమున చారిత్రక పత్రములును, ప్రాచీన చారిత్రకావశేషములును కలవు. పత్రికా స్వాతంత్ర్యము రాజ్యాంగరీత్యా పరిగణితము. సాన్ సాల్వడార్‌లో 4 దినపత్రికలును, సాంతా అనా, సాన్ మిగ్వెల్ నగరాలలో ప్రతి యొకట ఒక్కొక్క దినపత్రికయు ప్రచారమున ఉన్నవి.

**12. యాత్రా సౌ. :** 90 దినముల వరకు దేశమున పర్యటించు విదేశీయునకు టూరిస్టు పత్రము ఒకటి ఉన్న చాలును; ఆపైన ఉండ దలచునెడల పాస్‌పోర్టును, వీసాను పొంద వలయును. ఇజల్కో అగ్నిపర్వతమును, ప్రాచీన చారిత్రకావశేషములును విదేశీయులను పలువురను ఆకర్షించుచున్నవి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. దేశమున తొలుత స్వాతంత్ర్యమునకై ఆందోళనను లేవదీసిన జోసీ మతియస్ డెల్‌గాడో (1768-1833) అను క్రైస్తవమత ప్రచారకుడు ఈ దేశచరిత్రలో అజరామర స్థానమును ఆర్జించెను.

---

# 2. కెనడా

**ముఖ్యనగరము :** ఒట్టావా; **జెండా :** తెల్లని భూమికకు ఇరువైపుల, ఎరుపున రెండు నిలువు చారలును, తెల్లని భూమికకు మధ్యన మేపెల్ పత్రపు చిత్రమును కలది; **జాతీయ గీతము :** గాడ్ సేవ్ ద క్వీన్ (పరమేశ్వరుడు రాణిని రక్షించుగాక); **నాణెము :** కెనడియన్ డాలరు; ఇది 100 సెంటులుగ విభక్తము; ఒక కె. డాలరు = రూ. 6.84; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి : **కాలగణన :** భారతదేశమున సా. 5 గం. 30 ని. అయినపుడు కెనడాలోని న్యూ ఫౌండ్‌లాండ్‌న ఉ. 8 గం. 30 ని; న్యూబ్రన్స్ విక్, నోవా స్కోటియా, ప్రిన్స్ ఎడ్వర్డ్‌దీవి, క్విబెక్‌లలో ఉ. 8 గం; అల్బెర్టా. సస్కాచెవాన్ లలో ఉ. 5 గం; బ్రిటిష్ కొలంబియాలో ఉ. 4 గం; యూకాన్‌లో ఉ. 3 గం.

**1. ఉనికి మొ. :** యునైటెడ్ స్టేట్స్‌నకు ఉత్తరమున ఉన్న ఉత్తర అమెరికాలోని ప్రాంతమున అలాస్కాయు, ఫ్రెంచివారికి చెందిన సెయింట్ పియెర్రే-మెక్విలాన్ దీవులును తప్ప మిగిలినది అంతయు కెనడా దేశమే. దేశపు తూర్పుకొన అగు స్పియర్ అగ్రము 52°37′ ప. తులారేఖపై ఉన్నది. పశ్చిమపు కొనయగు సెయింట్ ఎలియస్ 141° ప. తులారేఖయందు కలదు; ఉత్తరపు అంచు 83°7′ ఉ. అక్షాంశ రేఖను, దక్షిణపు అంచు 41°41′ ఉ. అక్షాంశ రేఖను తాకుచున్నవి. దేశపుమొత్తపు వైశాల్యము

99,78,794 చ. కిమీ. వైశాల్యరీత్యా ప్రపంచ రాజ్యములందు ఇది రెండవదిగ లెక్కకు వచ్చు చున్నది. ఉత్తరమున ఆర్కటిక్ మహాసముద్రము; తూర్పున బఫ్ఫిన్ బే, దావీస్ జలసంధి, అట్లాంటిక్ మహాసముద్రము; దక్షిణమున యునైటెడ్ స్టేట్స్; పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును అలాస్కాయు, దేశపు సరిహద్దులందున్నవి.

తూర్పు పడమరలకు దేశపు నిడివి దాదాపు 6,400 కిమీ; ఉత్తర-దక్షిణముల పొడవు సుమారమి 4,500 కిమీ. (దేశపు వివిధ రాష్ట్రముల వైశాల్యము జనసంఖ్యా పట్టికలో కనవచ్చును.

దేశమున అత్యధిక భాగము అనగా దాదాపుగ సగము భూమి, కెనడియన్ కంచుకము (కెనడియన్ షీల్డు) అను పేరున వ్యవహృతమగు ఒక




పటము 3.

విశిష్ట భౌతిక లక్షణము. భూమి రూపుగొన్న తొలి కాలమున, మంచు ప్రవాహముల ధాటికి నుగ్గునూచయిన శిలాతలము ఇది అని భూగర్భశాస్త్రజ్ఞులనెదరు. హడ్సన్ అఖాతము అనుసముద్ర శాఖకు ఇరువైపుల ఈ కంచుకము ఏర్పడి ఉన్నది. దేశమునందలి అటవీ, ఖనిజ జలవిద్యుత్ సంపదలో అత్యధిక భాగము ఈ కంచుక ప్రదేశముననే కుదురుకొని ఉన్నది. ఈ కంచుక భూమికి తూర్పున తీరభూమి ఉన్నది. ఈ తీర భూమిని కంచుకము నుండి వేరుచేయుచున్న పర్వతముల వరుసలును, ఈ వరుసలను చీల్చుకొని ప్రవహించు నదుల లోయలును కననగును. ఈ ప్రాంతముననే తీరమును ఆశ్రయించి న్యూ ఫౌండ్‌లాండ్, ప్రిన్స్ ఎడ్వర్డు ద్వీపము కలవు.

కంచుక భూమికి దక్షిణమునను, ఆగ్నేయమునను మహా సరోవరములు కలవు: వీనిని ఆశ్రయించి అందు సెయింట్ లారెన్సు నిమ్నభూములును, ఒక సారవంతపు త్రిభుజాకార సమతలమును ఉన్నవి; ఈ సమతలమును పరివేష్టించి సెయింట్ లారెన్సు నది, ఒంటారియో సరస్సు, జార్జియన్ అఖాతము కలవు.

కంచుకభూమికి పశ్చిమమున, దేశపు వ్యవసాయ భూములును, గడ్డి బీడులును కలవు ఈ ప్రదేశ మంతయు మధ్యమైదానము అని వ్యవహృతము. ఈ మైదానము, యు. స్టే. సరిహద్దువద్ద దాదాపు 1,280 కిమీ. ల వెడల్పు కలిగి, ఉత్తరమునకు పోనుపోను వెడల్పు తగ్గి కడకు మెకంజీ నదీ ముఖ ద్వార ప్రాంతమున 160 కిమీ. ల. వెడల్పును మాత్రమే కలిగి ఉన్నది. ఈ మైదానమునకు ఉత్తరమున ఖనిజ సంపన్న భూములును, ఇంకను ఉత్తరమున మెకంజీ నదీతట నిమ్నభూమియు కలవు. ఈ నిమ్నభూమియందు పెక్కు నదులును సరస్సులును కననగును. దేశపు పశ్చిమపుకొనన పశ్చిమ అల్బెర్టానుండి పసిఫిక్ మహాసముద్ర తీరమువరకు వ్యాపించిన రాకీపర్వతములును, వానిని ఆశ్రయించిన పీఠభూమియు, తీరమును అనుకొన్న వేరొక పర్వతశ్రేణియు, తీరప్రాంతము నుండి సమీపద్వీపములను వేరుపరచు సముద్ర శాఖయు కననగును. అలాస్కా సరిహద్దునకు దగ్గరగ, సెయింట్ ఎలియస్ పర్వత శ్రేణిలో ఉన్న లోగాన్ శిఖరము, దేశపు పర్వత శిఖరములందెల్ల అత్యున్నతము (6.050 మీ). దేశపు ఉత్తరపు తీరమును ఆశ్రయించి చెదరియున్న ద్వీపులు అనేకములు కలవు; వైశాల్యమునను, భూతలరీతియందును, వీనియందు వైవిధ్యము విపరీతము; ఉత్తర ధ్రువానికి 880 కిమీ. ల దక్షిణం వరకు ఈ ద్వీపులు కననగును. ఈ ద్వీపులన్నియు కెనడా దేశపు అంతర్భాగముగనే లెక్కింపబడుచున్నవి.

కెనడియన్ కంచుకభూమియందలి జలము, నెల్సన్ - సస్కాచెవన్, చర్చిల్, సెవెర్న్, అల్బనీ నదుల మూలమున హడ్సన్ అఖాతమునకు చేరుచున్నది; దేశపు నదులలోనెల్ల పెద్దదియగు మెకంజీనది నిడివి 4,216 కిమీ; దాదాపు 25 లక్షల చ. కిమీ. ల విస్తృతికల భూమియందలి వర్షజలమును, ఈ నది, తన మూడు ఉపనదుల సాయమున కొనిపోయి కడకు ఆర్కిటిక్ మహాసముద్రమున సంగమించుచున్నది. ఇక యూకాన్, బ్రిటిష్ కొలంబియాలలో కొలంబియా, ఫ్రేజర్, యూకాన్ నదులు ప్రవహించుచున్నవి. మహాసరస్సులందలి జలము సెయింట్ లారెన్సు నదిలోనికి చేరి, అటనుండి సెయింట్ లారెన్సు అఖాతమున పడుచున్నది.

**2 శీతోష్ణస్థితి మొ.:** దేశ భూతలమున అత్యధిక భాగము (90%) 50° ఉ. అక్షాంశ రేఖకు ఉత్తరముననే ఉన్నందున, దేశమున ఉపధ్రువ ప్రాంత, ధ్రువప్రాంత శీతోష్ణపరిస్థితులు, ప్రాంతములను బట్టి, వేద్యములగుచున్నవి. కొన్ని ప్రాంతములందు ఎండకాలమున ఎండలు కొంత తీవ్రముగ ఉన్నను, మొత్తముమీద చలికాలమున శీతబాధ అతి తీవ్రముగ ఉండును. దక్షిణప్రాంతమున చలికాలపు నిడివి సంవత్సరమున 7 నెలలు; ఉత్తరమునకు పోయినకొలది అది సాలున 11 నెలలుగ పరిణమించును. పసిఫిక్ తీరమున మాత్రము సమోష్ణపు గ్రీష్మమును, శీతబాధ తక్కువయగు చలికాలమును కననగును. పైరుల పెంపుదలకు సహకరించు ఋతుకాలపు నిడివి చాల తక్కువ. దేశ మధ్యపుమైదానములలో, పైరులను చెట్లను పెరుగుటకు తగినంత వర్షపాతము లేదు.

రాకీపర్వతముల తూర్పుప్రదేశమున, మూడు దిక్కులనుండి వచ్చువాయువులు తరుచుగ సంఘర్షణ చెందుటవలన, వాతావరణము సంక్షుభితమై తుఫానులుగ మారుటవలన కొంత వర్షము పడుచున్నది; హిమపాతమునకును ఈ పరిస్థితి సహకరించుచున్నది. అందువలన ఆ తీరప్రాంతమున నేల కొంతవరకు చెమ్మదనము కలిగియుండును. వాయవ్య ప్రాంతములలోను పశ్చిమపు గడ్డిబీడుల లోను ఈ తుఫానుల సహకారము లేకపోవుట వలన, అటభూమి బెట్టగ ఉండును. సముద్ర వాయువులు తగులు పర్వత పార్శ్వములందు వానలు విరివిగ కురియును; అవి తగులని పార్శ్వములందు వానలు అరుదుగ పడును. అందువలన రాకీ పర్వతముల పశ్చిమపు తీర ప్రాంతమున సాలున 150-360 సెం. మీ. వర్షపాతము ఉండగ, తూర్పున ఉన్న మధ్యదేశపు గడ్డిబీడుల ప్రాంతమున 50 సెం. మీ. లోపుగనే వర్షము పడుచున్నది. విన్నిపెగ్‌కు తూర్పున ఉన్న సమభూమియందలి సాలీనా వర్షపాతము 50-100 సెం. మీ. ఇక తూర్పుతీరపు మైదానములలో ఆ వర్షపాతము 112 – 150 సెం. మీ.

దేశమున వృక్ష, జంతుసంపదయందు వైవిధ్యము విపరీతముగ కన్పట్టును. మహాసరస్సుల ప్రాంతమున యు. స్టే. లోని వృక్షసంపదయే – భూర్జవృక్షములు, ఓక్, పైన్ వృక్షములు మొ. – కనబడును. తూర్పు తీరభూమియందు సూచ్యగ్ర వృక్షజాతి కన్పట్టును. ఉత్తరమున సైతము సూచ్యగ్ర వృక్షములే కనబడును; గడ్డిమైదానములు మొదలుగ ధ్రువప్రాంతభూములవరకు ఒకరాల్లు తరగతి చెట్లు కలవు. పశ్చిమ తీరమున పెద్ద యెత్తుగల, సూచ్యగ్రజాతి వృక్షములు విరివిగ చూడనగును. ధ్రువప్రాంతమున చిన్న చిన్న చెట్లును, ఎత్తైదగని గరిక జాతియు మాత్రమే కనవచ్చును.

దేశపు మొత్తమున ఎలుగుబంటును మించిన పెద్ద జంతువు కానరాదు. ఉత్తర సముద్ర తీర జలములందు తిమింగిలములు మొదలగు పెద్ద జలచరములు కలవు. పక్షిజాతులలో అనేకములు అతిశీతల కాలమున ఉష్ణప్రాంతములకు పయనించి, మరల ఉచితకాలమున దేశమును చేరుకొనును. ఇట్టి పక్షిజాతుల సంరక్షణకై పశ్చిమ ఆర్క్టిక్ దీవులలో కొన్ని ఆశ్రయములు స్థాపింపబడినవి.

**3 జనసంఖ్య మొ.:** ఈ క్రింది పట్టిక వలన ఆయా రాష్ట్రముల, ముఖ్యనగరముల జనసంఖ్యా వివరములు (1971), రాష్ట్రముల వైశాల్యములు విశదములు కాగలవు.

## కెనడాదేశ జనసంఖ్యా వివర పట్టిక

| వరుస సంఖ్య | రాష్ట్రము పేరు | రాష్ట్ర వైశాల్యము చ. కిమీ. | రాష్ట్ర జనసంఖ్య (1971) | ముఖ్యనగరము | ముఖ్యనగర జనసంఖ్య (1971) |
|---|---|---|---|---|---|
| 1. | న్యూఫౌండ్‌లాండ్ | 3,83,300 | 5,22,104 | సెయింట్ జాన్స్ | 1,01,161 |
| 2. | ప్రిన్స్ ఎడ్వర్డ్ ఐలాండ్ | 5,656 | 1,11,641 | షార్లెట్ టౌన్ | 19,133 |
| 3. | నోవా స్కోటియా | 55,000 | 7,88,960 | హాలీఫాక్స్ | 1,22,035 |
| 4. | న్యూ బ్రన్స్‌విక్ | 72,000 | 6,34,557 | ఫ్రెడెరిక్టన్ | 40,480 |
| 5. | క్విబెక్ | 15,40,668 | 60,27,764 | క్విబెక్ సిటీ | 1,93,984 |

| వరుస సంఖ్య | రాష్ట్రము పేరు | రాష్ట్ర వైశాల్యము చ. కిమీ. | రాష్ట్ర జనసంఖ్య (1971) | ముఖ్యనగరము | ముఖ్యనగర జనసంఖ్య (1971) |
|---|---|---|---|---|---|
| 6. | ఓన్‌టారియో | 10,72,300 | 77,03,106 | టోరాంటో | 7,12,786 |
| 7. | మనిటోబా | 6,52,219 | 9,88,247 | విన్నిపెగ్ | 2,60,000 |
| 8. | సస్కాచెవాన్ | 6,52,000 | 9,26,242 | రెజీనా | 1,39,000 |
| 9. | ఆల్బెర్టా | 6,63,486 | 16,27 974 | ఎడ్మాన్‌టన్ | 4,50,641 |
| 10. | బ్రిటిష్ కొలంబియా | 9,51,897 | 21,84,621 | విక్టోరియా | 1,93,512 |
| 11. | యూకాన్ | 5,33,000 | 18,388 | వైట్‌హార్స్ | 12,000 |
| 12. | వాయవ్య ప్రాంతములు | 33,79,700 | 34,807 | యెల్లోనైఫ్ | 7,000 |
| | | | 2,15,68,311 | | |

పై రీతిగ దేశపు మొత్తపు జనసంఖ్య 2,15,68,311. నగరములలో పైన పేర్కొనబడినవిగాక మాంట్రీల్ (జ. సం. 12,14,352), వాంకోవర్ (జ. సం. 10,71,081), కాల్గరీ (జ. సం. 4 03,319); దేశపు ముఖ్యనగరమగు ఒట్టావా (జ. సం. 3,02,341) గణనీయములు. దేశపు మొత్తమున నగర వాసుల సంఖ్య 1,64,10,780 (1971). చదరపు కి. మీ. కు జనసాంద్రత 2.2. దేశ జనులలో దాదాపు 2,50,000 ప్రాచీన అమెరికన్ ఇండియన్ జాతులవారు; ఉత్తర భూములందు వసించు, ఎస్కిమోలు దాదాపు 17,000. తక్కిన వారందరును యూరపీయ జాతులకును చెందిన వారని చెప్పవచ్చును. అందు ఫ్రెంచి సంతతి వారు 30%; దాదాపు 40% నకు మించి బ్రిటిష్ సంతతివారు; తక్కినవారిలో జర్మనులు అధిక సంఖ్యాకులు; యుక్రేనియనులు మొదలగు తక్కిన యూరపియను జాతులవారు అల్పసంఖ్యలలో కానవచ్చుదురు; భారత పాకిస్తానీ సంతతులు వారును, అత్యల్ప సంఖ్యలలో కలరు.

ఫ్రెంచి, ఆంగ్ల సంస్కృతులు రెండును దేశమున స్థిరముగ నెలవు ఏర్పరచుకొని యుండుట వలన, రాజ్యాంగ విధానమున ఈ రెండు భాషా సంస్కృతులకును రక్షణ కల్పింపబడినది. కెనడా పార్లమెంటులోను, కోర్టులలోను, క్వెబెక్ రాష్ట్రపు శాసనసభలోను ఈ రెండు భాషలలోను ప్రతి వ్యవహారములు అంగీకృతములు. దేశము ద్విభాషా ప్రాంతముగ సిద్ధాంతరీత్యా పరిగణింపబడు చున్నను, క్విబెక్ రాష్ట్రమునందలి ప్రజలలో దాదాపుగ అందరును ఫ్రెంచినే మాటాడెదరు; తక్కిన రాష్ట్రములలో ఆంగ్లమే ఎక్కువగ వ్యవహారమున ఉన్నది. మొత్తముమీద ప్రజలలో ఆంగ్లభాష మాతృభాషగ కలవారు 67.4% అని, ఫ్రెంచి మాతృభాషగ కలవారు 19.1% అని, అంచనా (1961). తక్కినవారిలో మాతృభాషలుగ జర్మన్, యుక్రేనియన్, ఇటాలియన్ మొదలగునవి క్రమప్రాముఖ్యమును కలిగియున్నవి.

ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు; అందును రోమన్‌కేతలిక్ సంప్రదాయపు వారు దాదాపు 83 లక్షలు కలరు. తక్కిన మతముల వారిలో యూదులు (2,54,368) అత్యధికులు. తదితర మతముల వారి సంఖ్య 7,67,374 (1961).

**4. సమాచార సౌ.:** దేశపు మొత్తమున 9,023 పోస్టు ఆఫీసులును, 5,123 గ్రామీణ బట్వాడా సంస్థలును కలవు. తంతిమార్గపు నిడివి 8,85,830 కిమీ: టెలిఫోను తంతి నిడివి 9 కోట్ల కిమీ. దేశమున 100 మందికి 47.6 టెలిఫోనులు కలవని అంచనా. రేడియో ప్రసారపు స్టాండర్డ్ బాండ్ స్టేషనుల సంఖ్య 331, ఇందు 36 మాత్రమే ప్రభుత్వమునకు చెందినవి; తక్కినవి వైయక్తిక యాజమాన్యమున నడచుచున్నవి. ఇవికాక 22 షార్ట్‌వేవ్ స్టేషనులును పని చేయుచున్నవి. టెలివిజన్ స్టేషనుల సంఖ్య 453. రేడియో టెలివిజన్‌లకు లయిసెన్సు ఫీజులు లేవు (1971).

గ్రేట్ బ్రిటన్‌తోను, ఆస్ట్రేలియాతోను సంబంధము కల నిస్తంత్రీ స్థావరములు మాంట్రీల్‌లో కలవు. సముద్ర మధ్యమున అతిదూరమున ఉన్న నౌకలకు వార్తా సంకేతములను పంపగలుగు నిస్తంత్రీ స్థావరము ఒకటి లూయిస్‌బర్గ్‌లో ఉన్నది (1971).

**5. యాన సౌ.:** దేశపు మొత్తపు రోడ్లనిడివి 8,25,975 కి. మీ. ఇందు 6,33,757 కి. మీ. ఉత్తమ స్థాయికి చెందినది; అన్నివిధముల గేజీల ముఖ్య రైలుమార్గముల మొత్తపు నిడివి 72,305 కి. మీ; ఇందు జంటమార్గముల అదనపు నిడివి చేరలేదు. ఆ విధముగ అన్నివిధముల మార్గముల నిడివిని కలుపుకొనినపుడు ఆ నిడివి 1,01,907 కి. మీ. దేశమున తూర్పుపడమరలకు పయనించు రైలు మార్గములు రెండు కలవు. దేశమున అనేక మహత్తర సరస్సులును, మూడువైపుల సముద్రములును ఉండుట వలన, జలమార్గముల ద్వారా ప్రయాణము దేశమున విరివిగ జరుగుచున్నది. సముద్రపు రేవులలో నెల్ల మాంట్రీల్ అతి ప్రముఖము; పసిఫిక్ సముద్ర తీరపు రేవులలో వాంకోవర్ గణనీయము; సరస్సుల తీరములందలి రేవులలో టోరెంటో, హామిల్టన్, ఫోర్ట్‌విలియమ్, పోర్ట్‌ఆర్థర్ లెక్కింపదగినవి. విమానయానము రెండు ప్రముఖ కంపెనీల నిర్వహణలో ఉన్నది. దేశమునుండి ప్రాచ్య, పాశ్చాత్య దేశములలో అన్నింటితోను విమానయాన సౌకర్యము కలదు. మొత్తముమీద 52 విమానాశ్రయములు పని చేయుచున్నవి

**6. చరిత్ర:** ప్రాచీన కాలమున ఆసియా, నుండి, అప్పటిలో భూసంధిగా ఉండిన బేరింగ్ ప్రాంతము ద్వారా, ఈ దేశమునకు వేర్వేరు తెగల ప్రజలు వలసవచ్చి చేరిరనియు, వారి సంతతివారే నేటి అమెరికన్ ఇండియన్‌లును, ఎస్కిమోలును అనియు పండితుల అభిప్రాయము. క్రీ.శ. 1497 లో జాన్ కేబట్ అను దేశాన్వేష నావికుడు, ఆంగ్లదేశపు పక్షమున, ఒక నౌకాయాత్రను నిర్వహించి న్యూఫౌండ్‌లాండును కనుగొని, అది ఆంగ్లదేశమునకు చెందినదిగ ప్రకటించెను. కాని 1534 మొదలుగ ఫ్రెంచి నావికులును, వర్తకులును, మతప్రచారకులును ఇట చొరబారి, దేశీయుల పోరాటములలో జోక్యమును కల్పించుకొని, విశాలప్రాంతములను, దేశమున, కైవసము చేసికొనిరి. ఆ కాలమున ఇచటినుండి బొచ్చుచర్మముల ఎగుమతి విరివిగ జరిగి అతిలాభదాయకముగ ఉండెను. దానిని గమనించి, ఆంగ్లేయులును, పూర్వపు కేబట్ అన్వేషణ ద్వారా తమకు ఈ దేశమున హక్కుగలదని, వాదించి, చొరబార యత్నించిరి. తత్ఫలితముగ ఫ్రెంచి, ఇంగ్లీషు సంతతుల మధ్య చెలరేగిన పోరాటములలో కడకు ఆంగ్లేయులదే పైచేయి అయినది (1759). అంతట 1763 లో ఆంగ్ల ఫ్రెంచిదేశముల మధ్య జరిగిన ఒడంబడికకు ఫలితముగ దేశము ఆంగ్లదేశమునకే దక్కినను, ఫ్రెంచి భాషా సంస్కృతులకు, మతసంప్రదాయములకు సంపూర్ణరక్షణ కల్పింపబడినది. దేశమునకు యు. స్టే. తో కల సరిహద్దు 49° ఉ. అక్షాంశ

రేఖగ ఉండవలెనను ఏర్పాటు 1846 లో జరిగినది.

దేశము బ్రిటిష్‌వారి వశమైనప్పటినుండి ఆంగ్లేయుల వలస ఎక్కువగ జరిగినది. ఇందులకు తోడు, యు. స్టే. దేశము స్వాతంత్ర్యమునకై పోరాడుకాలమున, బ్రిటిష్ మకుటముపట్ల భక్తిగల ప్రజలు పలువురు, వెలకొలదిగ, కెనడాకు చేరుట వలన ఆంగ్లభాషను మాట్లాడువారి సంఖ్య మరింతగ వృద్ధిఅయ్యెను. దేశమున ప్రజానీకపు సంఖ్య పెరిగిన కొలది, రాజకీయ సంస్కరణలకై ఆందోళన చెలరేగెను. ఆంగ్లదేశమునందలి ప్రభుత్వము, వలస ప్రజల ఆకాంక్షలకు లొంగి సోపాన క్రమమున జరిపిన మార్పుల ఫలితముగ 1848 లో దేశమునందలి వేర్వేరు వలసలు, గవర్నరు జనరలు యొక్క పరిమితాధికారములకు లోబడి స్వతంత్ర ప్రభుత్వములను నెలకొల్పుకొనుటకు అనుమతి లభించినది. తరువాత ఆ వలసలు జరిపిన సంప్రదింపుల ఫలితముగ కెనడా దేశము వివిధ రాష్ట్రముల సమాఖ్యగ రూపొందుటకు ఒడంబడిక జరిగి, ఆ ఒడంబడిక 1867 లో ఉత్తర అమెరికా చట్టము అనుపేర, బ్రిటిష్ పార్లమెంటులో ఆమోదితమై, కెనడా దేశము అధినివేశ ప్రతిపత్తి హోదాను పొందినది. తదాదిగ, బ్రిటిష్ దేశముతో సన్నిహితమైత్రితో వర్తించుచు, కామన్‌వెల్తున సభ్యత్వము కలిగి, రెండు ప్రపంచ యుద్ధములందును. బ్రిటనుకు అండగ నిలచి, తన పారిశ్రామిక, వ్యావసాయిక సంపత్తి వలన, ప్రపంచమున పలుకుబడి కలిగిన సంపన్న ప్రజాస్వామిక రాజ్యములలో ఒకటిగ కెనడాదేశము రాణించుచున్నది.

**7. పరిపాలన :** సమాఖ్యా విధానపు ప్రజాస్వామిక రాజ్యాంగము దేశమున అమలున ఉన్నది. దేశమునందలి పదిరాష్ట్రములును, వాయవ్యమండలములు రెండును ఈ సమాఖ్యలో భాగస్వామ్యము కలిగి ఉన్నవి. ఇందు కేంద్రమునకు బలవత్తరాధికారములు కలవు. అవశిష్టాధికారములు కేంద్రమునకే చెందునని రాజ్యాంగ విధానమున స్పష్టము చేయబడినది. బ్రిటిష్ రాణియే లాంఛన ప్రాయముగ కెనడా దేశమును పాలించునని గుర్తింపబడినది; కెనడా దేశపు ప్రధాని సలహాను అనుసరించి గవర్నర్-జనరల్‌ను బ్రిటిష్‌రాణి నియమించును. ఇతని అధికార పరిమితి సాధారణముగ అయిదేండ్లు.

పార్లమెంటునందు లోకసభ (హౌస్ ఆఫ్ కామన్స్), శిష్టసభ (సెనెట్) అను రెండు కక్ష్యలు కలవు. లోకసభ యందలి సభ్య సంఖ్య 264. దీని పదవీకాల పరిమితి సాధారణముగ అయిదేండ్లు. వయోజనులగు దేశీయులును, బ్రిటిష్ పౌరస్వత్వము కలిగి దేశమున ఎన్నిక తేదీకి పూర్వమున 12 నెలలనుండి వసించుచున్న వయోజనులును ఈ లోక సభాసభ్యులను, నియోజక వర్గములను అనుసరించి, ఎన్నుకొనెదరు. ఆయా రాష్ట్రములకు, జనసంఖ్యా నిష్పత్తిలో, లోకసభాసభ్యుల సంఖ్య నిర్ణయింపబడినది. లోకసభలో అత్యధిక సంఖ్యాక పక్షపు నాయకుని ప్రధానిగ గవర్నర్ - జనరల్ నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియామకము చేయును. సభావిశ్వాసమును కోల్పోయిన మంత్రివర్గము రాజీనామాను ఇచ్చుటయో, లేదా సభను రద్దుచేయవలసినదిగ గవర్నరు — జనరలుకు సలహా ఇచ్చి, కొత్త ఎన్నికలు జరుగునటులనో చేయవలయును.

శిష్టసభయందలి సభ్యసంఖ్య 102. ప్రధాని సలహాను అనుసరించి, అన్ని ప్రాంతములకు తగు ప్రాతినిధ్యము కలుగురీతిలో వీరిని గవర్నర్ - జనరల్ నియమించును. ఒకసారి శిష్టసభా సభ్య

డుగ నియమింపబడినవాడు 75 ఏండ్ల వయసు ముగియువరకు ఆ సభ్యత్వమును కలిగియుండును.

రాష్ట్రములందలి ప్రభుత్వములను ప్రభుత్వము నియమించు లెఫ్టనెంట్ గవర్నరులు, ఎన్నుకొన బడిన రాష్ట్ర శాసనసభల సాయముతో, నిర్వ హింతురు. ప్రధాని సలహాపై ఈ గవర్నరులు నియమింపబడుదురు. అయితే యూకాన్, వాయవ్య ప్రాంతములలో గవర్నరులకు బదులుగ ప్రభుత్వ నియమితులగు కమీషనర్లు, స్థానికముగ ఎన్నుకొన బడిన కౌన్సిలర్ల సాయముతో, పాలనను నిర్వ హింతురు.

దేశమున ప్రస్తుత లోకసభయందు లిబరల్ పార్టీ, ప్రొగ్రెసివ్ కన్‌సర్వేటివ్ పార్టీ, న్యూ డెమో క్రాటిక్ పార్టీ, లే రేలీమెంట్ దే క్రీడీటిస్టిస్ – అను నాలుగు రాజకీయ పక్షములకు ప్రాతినిధ్యము కలదు.

క్విబెక్ రాష్ట్రమునతప్ప తక్కిన రాష్ట్రములందు ఇంగ్లీష్ కామన్‌లాయే న్యాయ విధానమున పాటింప బడుచున్నది; క్విబెక్‌లో ఫ్రాన్స్‌దేశపు నెపోలియా నిక్ చట్టము ఆదరితము. దేశమున న్యాయ నిర్వ హణ సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున వివిధ స్థాయీ లలో జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమునకు నాలుగు బ్రిగే డుల పదాతిదళము కలదు; ఇందు ఒకటి యూర పున నేటో సైనిక దళములలో పనిచేయుచున్నది. నౌకాసేనయందు 22 డెస్ట్రాయరు ఎస్కార్టులు, 2 సరఫరా ఓడలు, 4 జలాంతర్గాములు, 6 చిన్న తరహా శిక్షణ నౌకలు కలవు; ఈ నౌకాసేనకు సాయపడు ప్రత్యేకవిమానదళములు 11 ఉన్నవి. ఇక విమానదళమున 9 స్క్వాడ్రనులు కలవు. భూ, జల, వాయు సేనలన్నియు ఆధునిక ఆయుధ సమేతములు. క్షిపణులు, రాడారులు మొదలగు నవ్యసాధన సంపత్తి వీనికి అమరియున్నది. అన్ని విధముల సేనలలోను స్థిరముగ పనిచేయువారి మొత్తపు సంఖ్య [illegible].414.

**9 అంతర్జాతీయ సం. :** బ్రిటిష్ మకుటపు పెద్దరికమును వ్యవహరించు కామన్‌వెల్తు సభ్య త్వము కలిగి, ఈ దేశము అందు ప్రముఖపాత్రను నిర్వహించుచున్నది. ఐ. రా. స మితిలోను, తదను బంధ సంస్థలలో పెక్కింటను, ఈ దేశము సభ్య త్వమును కలిగియున్నది. నేటో రాజ్యకూటమియందును, కొలంబో ప్రణాళికా సమితియందును సభ్యత్వము కలదు. ఇందు కొలంబో ప్రణాళికద్వారా ఈ దేశము ఆగ్నేయాసియా దేశములకును, దక్షిణ ఆసియా దేశములకును చాలగ ధన, సాంకేతిక సాహాయ్యమును కల్పించినది. ఇందు ఎక్కువ సాహాయ్యము భారత, పాకిస్తాన్, శ్రీలంక, మలే సియా దేశములకు లభించినది. ప్రపంచ రాజ్యము లన్నింటితోడను కెనడాకు దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** కెనడా దేశపు ఆర్థిక వ్యవస్థలో వస్తూత్పాదక పరిశ్రమలకే ప్రాముఖ్యము ఎక్కువగ ఉన్నను, వ్యవసాయము సైతము గణ నీయ పాత్రను నిర్వహించుచున్నది. దేశపు కార్మిక శక్తిలో 7 ం వ్యవసాయమున వినియుక్తము. వ్యవ సాయమునఉన్న భూమి వైశాల్యము 17.4 కోట్ల ఎకరములు; వ్యవసాయ కమతముల సంఖ్య 4,31,000. వ్యవసాయము ఆధునిక యంత్ర పరికర సాహాయ్యమున జరుగుచున్నది. వ్యవ సాయమున ఆహార ధాన్యములేగాక, పాడి పశువుల పెంపకము, కోళ్ళ పెంపకము, గొర్రెల మేకల అభివృద్ధి, పండ్లతోటల పెంపకము, పొగాకు, తేనెల ఉత్పత్తి, బొచ్చు చర్మముల తయారీ మొదలగునవియు చేరిఉన్నవి. ఆహార ధాన్యము లలో విరివిగ ఉత్పత్తి చేయబడునది గోధుమ. దేశపు శీతోష్ణపరిస్థితియు, సాంకేతిక పరిజ్ఞానమును

ఇందులకు సహకరించుచున్నవి. 1970 లో మొత్తపు గోధుమ ఉత్పత్తి 32.3 కోట్ల బుషెలులు (1 బుషెల్ = 36.4 లీటర్లు ; ఇక తక్కిన ఆహార పదార్థములలో బార్లీ, ఓట్లు, బంగాళా దుంపలు, మొక్కజొన్న క్రమ ప్రాముఖ్యము కలవి. పండ్ల ఉత్పత్తి విలువ దాదాపు 58 కోట్ల కె. డాలర్లు (1970). ఇందు ఆపిల్‌పండ్ల పంట అత్యధికము. 1970 లో అది 2.1 కోట్ల బుషెలులు. పొగాకు ఉత్పత్తి విలువ 14.4 కోట్ల కె. డాలర్లు (1971). పాడి పరిశ్రమం ఉత్పత్తి తూకం 1830 కోట్ల పౌనులు 1971).

దేశపు మొత్తమున 57% భూతలమున అడవులు కలవు. ఇందు 48% న మంచి కలప లభించుచున్నది. ఈ కలప ఉత్పత్తి విలువ 113, 53,77,000 కె. డాలర్లు (1970). ఇందు కొంత కాగితపు గుజ్జుకై వినియుక్తము. ఇందుండి సాధారణపు కాగితమే గాక వార్తాపత్రికలకు పనికివచ్చు కాగితమును ఉత్పత్తి అగుచున్నది. మత్స్య పరిశ్రమ చాల అభివృద్ధిని సాధించినది. 1971 లో లభించిన చేపల మొత్తపు విలువ 16.2 కోట్ల కె. డాలర్లు.

ఖనిజపరిశ్రమ ముఖ్యమగు ప్రాతిపదిక పరిశ్రమ. ప్రపంచపు ప్రముఖ ఖనిజములలో 40% అస్‌బెస్టస్ (రాతినార), 23% తుత్తునాగం, 16% వెండి, 15% మోలిబ్డినియము, 14% పొటాష్ కెనడాలో లభించుచున్నవి ప్రపంచమున అల్యూమినియమును ఉత్పత్తిచేయు కొలుములలోనెల్ల పెద్దదియగు కొలిమి, కెనడాలోని అర్విదా (క్విబెక్ రాష్ట్రము) లో ఉన్నది. అల్యూమినియం ఉత్పత్తిలో ప్రపంచమున మూడవస్థానము కెనడా దేశపుది. పాశ్చాత్య ప్రపంచమునకు కావలసిన నికెల్ లోహములో 70% కెనడానుండి వచ్చుచున్నది : ముడి పెట్రోలు ఉత్పత్తి 49 కోట్ల పీపాలు (1971); ఇనుమును పెక్కుచోట్ల కనుగొనబడినది. ఈ గనులలో ఉత్పత్తి మొదలైనపుడు ఇనుప ఖనిజమును ఎగుమతిచేయు దేశములలో ఈ దేశమునకు స్థానము లభింపగలదు. ఇంధన వాయువును విరివిగ కలదు. విద్యుదుత్పత్తిలో 78% జలశక్తి వలన జరుగుచున్నది. అందువలన విద్యుత్తునకు ఖర్చు చాల తక్కువ. అణవిక శక్తి, రాక్షసిబొగ్గు, ఇంధనవాయువు మొదలగునవియు విద్యుదుత్పత్తికై వినియుక్తములు. 1971 లో మొత్తపు విద్యుదుత్పత్తి 21,147 కోట్ల కివా.

విదేశవ్యాపారము దేశపు ఆదాయమార్గములలో ఒక గణనీయ స్థానమును ఆర్జించినది. వ్యాపారపు మొత్తపు విలువనుబట్టి చూచినపుడు ప్రపంచ రాజ్యములలో ఆరవ స్థానము కెనడాకు లభించును. (తొలుతటి అయిదు స్థానములు యు. స్టే., పశ్చిమ జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సు, జపానులకు క్రమముగ చెందును). దేశపు దిగుమతులలో 63% కు పైగా, తయారీ వస్తువులు. ఎగుమతులలో తయారీ పూర్తికాని వస్తువులు, ముడి పదార్థాలు, ఆహార వస్తువులు, కొన్ని తయారీ వస్తువులు చేరిఉన్నవి. దేశపు ఎగుమతులలో మోటారు వాహనాలు, న్యూస్‌ప్రింట్, కాగితపు గుజ్జు, కలప, రాగి, అల్యూమినియం, గోధుమ, నికెల్ క్రమ ప్రాముఖ్యము వహించినవి. దిగుమతులలో యంత్ర సామగ్రులు, ముడిపెట్రోలు, విద్యుత్ సామగ్రి పేర్కొనదగినవి. ఎగుమతుల మొత్తపు విలువ 1,785 కోట్ల కె. డా; దిగుమతుల విలువ 1,561 కోట్ల కె. డా.; బడ్జెటరీ వ్యయము 14,84,08,65, 151 కె. డా. (1971-72).

**11. సాంఘిక రంగము :** దేశమున చక్కని గృహవసతి కలదు. ప్రభుత్వము వివిధ సంస్థల ద్వారా గృహ నిర్మాణ కృషికి తగు సాయమును చేయుచున్నది. దేశపు ఇండ్లలో మూడింట ఒకటి

కేంద్రప్రభుత్వపు సాయమున నిర్మితము. అటులే రాష్ట్రప్రభుత్వములును గృహనిర్మాణ కృషికి సాయము చేయుచున్నవి. అంతర్జాతీయ కార్మిక సంస్థానియమములకు అనుగుణములగు కార్మిక శాసనములు అమలులో ఉన్నవి. నిరుద్యోగ భీమా మొదలగు వసతులు 1965 మొదలుగి ఏర్పడినవి. పెన్షన్ ప్రణాళికల వలన 64 ఏండ్ల వయసు దాటిన వారికెల్ల పెన్షన్ సౌకర్యము లభించినవి. ఇది ఎవరికిని నెలకు 85 కె. డా. కు తగ్గిఉండదు.

దేశమున రాష్ట్రప్రభుత్వములే విద్యావిధానమున బాధ్యత వహించుచున్నవి. మొత్తముమీద సెకండరీ విద్య ముగియువరకు విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. అంతేకాదు; 10 లోపు వయసుగలిగి, పాఠశాలలలో చదువు విద్యార్థుల కుటుంబములకు నెలకు 6 కె. డాలర్లు చొప్పునను, 10-16 మధ్య వయస్సుగల విద్యార్థుల కుటుంబములకు నెలకు 8 కె. డా. చొప్పునను, 16,17 ఏండ్ల వయస్సుగల విద్యార్థులకు నెలకు 10 కె.డా చొప్పునను ప్రభుత్వము భృతిని ఏర్పాటు చేసినది. దేశపు మొత్తమున ప్రాథమిక, సెకండరీ పాఠశాలల మొత్తపు సంఖ్య 16,552; అందలి ఉపాధ్యాయ సంఖ్య 2,65, 056; విద్యార్థి సంఖ్య 58,25,298. (1970-71).

దేశమున 216 యూనివర్సిటీలు కలవు ఇందలి కళాశాలలలో మొత్తపు విద్యార్థి సంఖ్య దాదాపు 3.06 లక్షలు. కాలేజీలలో పఠించు విద్యార్థులు, తీరిక కాలమున ధన సంపాదన చేయుటకు వసతులను ప్రభుత్వము విరివిగ కల్పించినది; అంతేగాక ఋణసదుపాయములను కూడ ఏర్పరచినది. పట్టపరీక్షకై కాలేజిలో చదువు విద్యార్థి, తన చదువు ముగియులోపల, 5,000 కె. డా. లను అప్పుగా ప్రభుత్వమునుండి పొందవచ్చును.

వివిధ లలితకళల ప్రోత్సాహమునకై ప్రత్యేక పాఠశాలలును, కళాసంస్థలును, నాటకశాలలును విరివిగ కృషిచేయుచున్నవి. పబ్లిక్ గ్రంథాలయములు దేశమున పలు ప్రాంతములందు కలవు. దాదాపు 1.8 కోట్ల పాఠకులకు ఇందలి గ్రంథములు పఠించు అవకాశము లభించుచున్నవి. ఒట్టావాలో జాతీయ గ్రంథాలయము కలదు. ఒట్టావా, మాంట్రీల్, క్విబెక్, టోరెంటో, సెయింట్ జాన్, లండన్, విండ్సర్, విన్నిపెగ్, రెజినా, ఎడ్మాన్టన్, వాంకోవర్, విక్టోరియాలలో పెద్ద మ్యూజియములు, కళాగారములు కలవు. దేశము నందలి దైనిక వార్తాపత్రికల సంఖ్య 120; ఇందులో 102 ఆంగ్లమునను, 13 ఫ్రెంచి భాషలోను, తక్కినవి వివిధేతర భాషలలోను వెలువడుచున్నవి. వాంకోవర్‌నుండి వెలువడు ఆంగ్లపత్రిక 'ప్రావిన్స్ అండ్ సన్' అనుదానికిని, ఫ్రెంచి పత్రికలలో మాంట్రీల్‌నుండి వెలువడు 'లా ప్రెసీ' అనుదానికిని ప్రచారము అధికము (1970.

ఆరోగ్య ప్రణాళికా నిర్వహణ బాధ్యత రాష్ట్రములకు కలదు. ఆరోగ్య భీమా ప్రణాళిక, రోగ నిర్ధారణా సేవ అమలులో ఉండి 98.4% ప్రజలకు లభించుచున్నవి మొత్తపు అన్నివిధముల వైద్యశాలల సంఖ్య 1,424; అందలి శయ్యా సంఖ్య 2,11,422 (అనగా 1000 మంది ప్రజలకు 10 శయ్యలు కలవని తెలుచున్నది). ఇవిగాక ఉన్మాద చికిత్స మొదలగు ప్రత్యేక చికిత్సా పద్ధతులకు చెందిన వైద్యశాలలు 108 కలవు.

**12. యాత్రా సౌ.:** ప్రభుత్వముచే నియమితమగు యాత్రా సంస్థ (ట్రావెల్ బ్యూరో) విదేశయాత్రికుల సౌకర్యములకై కృషిచేయుచున్నది యు. స్టే. దేశీయులు ప్యాస్‌పోర్టుతో నిమిత్తం లేకుండా, గుర్తుచీటీతో దేశమున పర్యటించవచ్చును; పశ్చిమార్ధగోళపు తక్కిన దేశముల వారికి వీసాలు అవసరము లేదు. బ్రిటిష్ పౌరులు కాని తక్కిన దేశముల వారు విధిగ ప్యాస్‌పోర్టు, వీసాలను తదితర పత్రములను కలిగియుండవలెను.

**13.** ప్రసిద్ధ పౌరులు : 1. జాన్ అలెగ్జాండర్ మేక్డొనాల్డ్ (1815-91): దేశపు ప్రథమ ప్రధానమంత్రి. 2. లెస్టర్ బౌల్స్ పియర్‌సన్ (జ. 1897). ప్రధానమంత్రిగ పని చేసినవాడు; శాంతి కృషికై నోబెల్ శాంతి బహుమానమును 1957 లో ఆర్జించెను. 3&4. ఇన్‌సులిన్‌ను కనుగొనిన ఫ్రెడరిక్ గ్రాంట్ బాంటింగ్ (1891-1941), జాన్ జేమ్స్ రిచర్డు మెక్‌లియడ్ (1876-1935): వీరిరువురికి సమష్టిగ వైద్యశాస్త్ర నోబెల్ బహుమతి లభించినది (1923).

---

# 3. కేమన్ దీవులు

## (ఆంతరంగిక స్వపరిపాలన కలిగిన కామన్‌వెల్త్ రాజ్యము)

**ముఖ్యనగరము :** జార్జిటౌన్; **జెండా, జాతీయగీతము :** బ్రిటిష్ ప్రభుత్వపువే; **నాణెము :** చట్టరీత్యా బ్రిటిష్ నాణెములే అయినను, జమైకా రాజ్యపు డాలర్లు ఎక్కువగ వ్యాప్తియందున్నవి. **కొలతతూకములు :** బ్రిటిష్ ప్రభుత్వపువే. **కాలగణన :** ఉ. 5 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** వెస్ట్ ఇండీస్* దీవులలో 19°15′-19°45′ ఉ. అ. రేఖలకును, 79°44′-81°27′ ప. తు. రేఖలకు మధ్యనున్న కరిబ్బియన్ సముద్ర ప్రాంతమున నెలకొనియున్న ఈ ద్వీప రాజ్యమున గ్రాండ్ కేమన్, లిటిల్ కేమన్, కేమన్ బ్రాక్ అను మూడు ద్వీపములు చేరిఉన్నవి. వీని మొత్తపు వైశాల్యము 260 చ కిమీ. గ్రాండ్ కేమన్ చదునుగానుండి, చిన్నగుట్టలచే పరివేష్టితమై, తీరసమీపమున పవడపు తిప్పలను కలిగియున్నది. దీని పొడవు 32 కిమీ; వెడల్పు 7 నుండి 11 కిమీ.ల వరకు మారుచుండును. తక్కిన రెండు దీవులును ఈ దీవికి ఈశాన్యమున 96 కిమీ. ల దూరమున ఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశము ఉష్ణమండలముననే ఉన్నను, సముద్రపు గాలులవలన అందు **శీతోష్ణస్థితి** చాల సౌమ్యముగ ఉండును. గరిష్ఠోష్ణత 80° ఫా.; కనిష్ఠోష్ణత 74° ఫా. వర్షపాతము సాలీనా సరాసరిన 125 సెం మీ. అంతటంతట తుపానుల బాధయు కలదు.

**3. జనసంఖ్య మొ. :** 1970 లోని లెక్కలను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య

---

* 'వెస్ట్ ఇండీస్' అనునది పశ్చిమార్ధ గోళమునందలి ఒక ద్వీపజాలము. దీనికే 'ఆంటిల్లీస్' అనియు పేరు కలదు. ఉత్తర అమెరికా తూర్పు తీరమునందలి ఫ్లోరిడా ద్వీపకల్పాగ్రమునకు కొలది దూరమున బయలుదేరి, దక్షిణ అమెరికాయందలి వెనిజ్యులా తీరమువరకు చంద్రరేఖా రూపమున ఈ ద్వీపజాలము విస్తరించియున్నది. అట్లాంటిక్ మహాసముద్రమునుండి కరిబ్బియన్ సముద్రమును, మెక్సికో సింధుశాఖను ఈ ద్వీపములు వేరుపరచుచున్నవని చెప్పవచ్చును. ఈ ద్వీపములందు చారిత్రక పరిణామములను అనుసరించి, కొన్ని బ్రిటిష్ వారికిని, కొన్ని నెదర్‌లాండ్స్ వారికిని, కొన్ని ఫ్రెంచివారికిని, కొన్ని యునైటెడ్ స్టేట్స్‌నకును లభింపగ క్యూబా, డొమినికన్ రిపబ్లిక్, హాయిటీ అనునవి మాత్రము చిరకాలమునుండి స్వాతంత్ర్యముతో మనగలిగినవి. బ్రిటిష్, నెదర్‌లాండ్స్, ఫ్రెంచి, యు. స్టే. ల అధీనమున ఉన్నవానిలో సైతము ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున రాజకీయపు మార్పులు సంఘటిల్లి, వివిధ స్థాయీ భేదములతో స్వాతంత్ర్యము పెక్కింటికి లభించినది. వివరములు ఆయా శీర్షికల క్రింద కననగును.

10,241. ఇందులో 8,982 మంది గ్రాండ్ కేమన్ దీవిలో వసించుచున్నారు. రాజధానియగు జార్జిటౌను ఈ దీవిలోనే ఉన్నది; దాని జనసంఖ్య 3,975. దేశప్రజలలో ఆఫ్రికేయ సంతతివారు 17%; యూరపీయ సంతతి 33%; సమిశ్రిత సంతతి 50%. దేశీయుల మాతృభాష ఆంగ్లము; దేశీయులందరును క్రైస్తవులు.

**4. సమాచార సా. :** వివరములు తెలియవు.

**5. యాన సౌ :** ద్వీపములమధ్య రాకపోకలు చిన్న బోట్ల సాయమున జరుగుచున్నవి. జమైకా, ఫ్లోరిడాలకు, క్రమరీతిలో ఇటనుండి మోటారు నౌకల ప్రయాణ వసతులు కలవు. గ్రాండ్ కేమన్‌నుండి కోస్టారికా, మియామీలతో విమాన యానవసతి ఉన్నది.

**6. చరిత్ర :** ఈ ద్వీపములను, వెస్ట్ ఇండీస్ లోని కొన్ని తక్కిన దీవులతో పాటుగ, 1503 లో కొలంబస్ అను ప్రముఖ దేశాన్వేషకుడు స్పెయిన్ దేశపు ప్రోత్సాహముతో కనుగొనెను. ఈ ద్వీపములకు అతడు 'తోర్తుగస్' అని పేరిడెను. కాని స్పెయిన్‌వారు ఎవరును ఇట వలసచేరలేదు. తదనంతర కాలమున, ఈ దీవులకు కొలది దూరమునఉన్న జమైకా దీవిని బ్రిటిష్‌వారు ఆక్రమించి, అటనుండి ఈ దీవులనుకూడ వశపరుచుకొనిరి (1713). తదాదిగ బ్రిటిష్‌వారి వశముననే అతి దీర్ఘకాలము వలస పాలనలో ఉండినది. బ్రిటిష్‌వారే ఇచట పనిపాటలకై నీగ్రోలను చేర్చిరి. ఈ నీగ్రోలును, యూరపియనులును సంకర మొందిన సమ్మిశ్రజాతి దేశమున ఇపుడు అధికముగ కానవచ్చుచున్నది. పరిపాలనారీత్యా 1962 వరకు ఈ ద్వీపములు జమైకాతో ముడివడి ఉండినవి. అంతట జమైకా స్వతంత్రతను పొందుటవలన, ఈ ద్వీపములు బ్రిటిష్ మకుటపు వలసలుగ పరిణమించి, ఆంతరంగిక స్వపరిపాలనను అనుభవించుచున్నవి.

**7. పరిపాలన :** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, ఇచటి శాసనసభ సాయమున ఆంతరంగిక పాలనను నిర్వహించుచున్నాడు. శాసనసభయందు గవర్నరు, అతడు నియమించిన ఇద్దరు లేక ముగ్గురు అధికారులు, ఇద్దరు లేదా ముగ్గురు అనధికార సభ్యులు, ఎన్నుకొనబడిన సభ్యులు 12 మంది చేరియుందురు. కార్యనిర్వాహక సంఘమున సభ్యులుగ శాసనసభలోని అధికార సభ్యులనుండి ఒకరిని, తాను నియమించిన అనధికార సభ్యులనుండి ఒకరిని, ఎన్నుకొనబడిన సభ్యులనుండి ఇద్దరను గవర్నరు నియామకము చేయును. గవర్నరే కార్యనిర్వాహక సంఘమునకు అధ్యక్షుడు; ఈ సంఘము దేశపు దైనందిన పరిపాలనను నిర్వహించును.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఈ రెండింటి బాధ్యతయు, బ్రిటన్ దేశపు ప్రభుత్వము నందే కలదు.

**10 ఆర్థిక రంగము :** దేశము సారవంతమగుటవలన, వ్యవసాయ పరిశ్రమ కొంత ఆదరణ పొందినను మొత్తముమీద సాగర పరిశ్రమలే (అనగా పెద్ద తాబేళ్లను, సొరచేపలను, స్పాంజి మొదలగువానిని పట్టి పరిరక్షించుట మొదలగునవి) దేశ ప్రజలలో పలువురకు జీవనాధారములుగ ఉన్నవి. ఇటీవలలో ఫాస్ఫేట్లు, కొబ్బరికాయలు, కలబందనార విరివిగ ఎగుమతి అగుచుండినను, ఇపుడు వాని ఉత్పత్తి చాల పడిపోయినది. తాబేటి చిప్పలు, తాబేటి మాంసము మొదలగునవియే ఇపుడు ఎగుమతులలో ప్రముఖములు. దేశపు ఎగుమతుల విలువ 4,75,229 జమైకా డాలర్లు; దిగుమతుల విలువ 77,66,578 జ డా (1970). దిగుమతులలో ఆహార ధాన్యాలు, వస్త్రాలు ప్రముఖములు. కేమన్ దీవుల ప్రజలలో పలువురు విదేశీయ నౌకలలో పనిచేసి ఆర్జించి, తమ దేశ

మునకు పంపెడు ప్రకము, దేశపు ఆర్థిక వ్యవస్థకు ప్రబలాధారముగా ఉన్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 31 27,064 జ. డా. (1971).

**11. సాంఘిక రంగము :** ప్రభుత్వమునకు చెందిన 9 ప్రయిమరీ పాఠశాలలు కలవు; వీనిలోని విద్యార్థి సంఖ్య 1,184. ప్రయివేటు యాజమాన్యమున 5 ప్రాథమిక పాఠశాలలును, 2 సెకండరీ పాఠశాలలును, ఒక ఉన్నత విద్యాసంస్థయు పని చేయుచున్నవి. ఇవిగాక ప్రభుత్వము 739 మంది విద్యార్థులతో నిర్వహించు ఒక సమగ్ర విద్యాశాలయు, వ్యాపార విద్యల బోధించు ఒక కళాశాలయు కలవు.

**12 యాత్రా సౌ. :** దేశపు ఆర్థిక వ్యవస్థలో యాత్రికులవలన వచ్చు ఆదాయము కొంత ప్రాముఖ్యమును కలిగియున్నది.

---

# 4. కోస్టారికా

**ముఖ్యనగరము :** సాన్ జోసె; **జెండా :** నీలిమ, తెలుపు, ఎరుపు, తెలుపు, నీలిమ రంగుల వరుసలో అమరిన అయిదు అడ్డచారలు కలిగి, అందులో నడుమనున్న ఎరుపు అడ్డచార ఎక్కువ వెడల్పు కలిగియుండునది; **జాతీయ గీతము :** నోబిల్ పాట్రియా, తూ హెర్మోసా బాందేరా (ఉదాత్త జన్మభూమీ, నీ మనోహర పతాకము) అను చరణముతో మొదలిడునది; **నాణెము :** కోలోన్; ఇది 100 సెంటిమోలుగ విభక్తము; 1 కోలోన్ = రు. 1.13; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 6 గం. = భారతదేశమున సా. 5 గం. 30. ని

**1. ఉనికి మొ. :** మధ్య అమెరికా* యందలి ఈ దేశము 8°2′-11°14′ ఉ. అ. రేఖలకును 83°-86° ప తు. రేఖలకును మధ్య నెలకొని ఉన్నది. ఉత్తరమున నికరాగ్వా, దక్షిణమున పనామా, తూర్పున కరిబ్బియన్ సముద్రము, పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రము దేశపు సరిహద్దులందున్నవి. పశ్చిమ తీరరేఖ పొడవు 997 కి.మీ; తూర్పుతీరరేఖ పొడవు 210 కిమీ. దేశపు మొత్తపు వైశాల్యము 50,900 చ. కిమీ; రాజ్యాంగరీత్యా ఈ దేశమున చేరియున్న, కొన్ని చిన్న ద్వీపముల విస్తీర్ణమును ఇందు చేరిఉన్నది. దేశపు తూర్పు-పడమరల వెడల్పు 118 కిమీ. నుండి 292 కి. మీ వరకు మారుచుండును దేశమున నాలుగు అగ్నిపర్వతములు, అందును రెండు ముఖ్యనగరపు సమీపమున, ఉన్నవి. దేశమధ్యమున 900-1200 మీ. ఎత్తుకల ఒక ఉన్నత పీఠభూమి కలదు; దాదాపుగ చదునుగ ఉన్నదని చెప్పదగు ఈ ప్రాంతము అతి సారవంతము. దీని వైశాల్యము 2,000 చ. కిమీ; దేశపు జనానీకమున అర్ధభాగము, పరిపాలనా, సాంస్కృతిక కేంద్రములు, ప్రముఖములగు నాలుగు నగరములు, కాఫీ పరిశ్రమలో అత్యధిక భాగము ఈ ప్రాంతముననే కలవు. కరిబ్బియన్ సముద్ర తీరమున దేశపు 30% ప్రాంతము కలదు; ఇది అంతయు ఉష్ణప్రాంతమగు పల్లపు చిత్తడి నేల; అడవులు, ఇచ్చట ఎక్కువగ కలవు. పసిఫిక్

---

* ఉత్తర అమెరికాలో యునైటెడ్ స్టేట్స్‌కు దక్షిణమునఉన్న రాజ్యముల ప్రాంతమును అంతటినీ మధ్య అమెరికా అని వ్యవహరింతురు.

తీరమును దాదాపుగ ఈ తీరుగనే ఉన్నను, అందు వాయవ్య ప్రాంతము మాత్రము కొంత మెరకనేలను కలిగియున్నది; అచట వ్యవసాయము, పశుపోషణ కొంతవరకు సాగుచున్నవి. దేశమున 18 చిన్న నదులు ఉన్నవి. వీనిలో పెద్దదాని పొడవు 149 కిమీ. మాత్రమే.

**2. శీతోష్ణస్థితి మొ:** శీతోష్ణస్థితి రీత్యా, ఈ దేశమును అత్యుష్ణమండలము, సమోష్ణమండలము, శీతల మండలము అను మూడు విభిన్న ప్రాంతములుగ విభజింప వీలున్నది. సముద్ర తీర భూములును 900 మీ. ఎత్తునకు లోబడిన ఉత్తరపు మైదానములును అత్యుష్ణమండలమునకు చెందినవి ఇచట ఉష్ణోగ్రత 77°-100 ఫా. ల మధ్య ఉండును, వానలు అత్యధికము; దాదాపుగ నిరంతరాయముగ వానలు పడుచునే ఉండునని చెప్పవచ్చును. మధ్యదేశపు లోయలును, 900-1800 మీ. మధ్య ఎత్తు కలిగిన పీఠభూములును సమోష్ణమండలమునకు చెందినవి; ఇచటి ఉష్ణోగ్రత 59°-77° ఫా. మధ్య ఉండును; ఏప్రిల్ నుండి నవంబరు వరకు వానలు కురియును. 1800 మీ. ఎత్తునకు




పటము 4.

మించిన ప్రాంతములు శీతలమండలమునకు చెందినవి; ఇచట ఉష్ణోగ్రత 41°-59° ఫా. మధ్య ఉండును; సమోష్ణమండలము నందు కన్న ఇట వానలు తక్కువ; అయినను గాలులు మాత్రము ఎక్కువ వేగముతో వీచుచుండును. దేశపు మొత్తమున సాలీనా సరాసరి వర్షపాతము 250 సెం. మీ.

దేశమున 50% భూమి అటవీప్రాంతము. వృక్ష జంతు సంతతియందు గణనీయమగు వైవిధ్యము కననగును. మహాగనీ మొదలగు మహావృక్షములును, పలు విధముల ఫలజాతి వృక్షములును కలవు దుప్పి, కోతి మొదలగు అల్పజంతువులు మాత్రమే కననగును. పక్షి జాతులును, సర్ప జాతులును బహుళసంఖ్యలో కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1972 లోని అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 18.3 లక్షలు; జన సాంద్రత చ. కిమీ. కు 34; జనాభా పెంపుదల రేటు సాలునకు 4.2%; ప్రపంచమున ఇట్టి పెంపుదల విపరీతముగ ఉండువానిలో ఈ దేశము ఒకటిగ పేరొందినది. నగరములలో సాన్ జోసీ

(జ. సం. 2 17,772, అలాజ్వెలా (జ. సం. 84,866, పుంతరేనస్ (జ. సం. 74,776) లీమాన్ (జ. సం. 63,863, హెరేడియా (జ. సం. 33,984), కార్టగో (61,565) పేర్కొన దగినవి. దేశీయులలో పలువురు యూరపీయ సంతతి వారు, (ఇందులో స్పెయిన్ దేశీయుల సంతతి చాల ఎక్కువ; ఆదిమ అమెరికనుల యూరపీయుల సంకరజాతి అల్పసంఖ్యాక వర్గములలో ప్రముఖము. నీగ్రోలు కూ; అచ్చపు ప్రాచీన అమెరికన్ సంతతివారు దాదాపు 1200 మంది ఉన్నను, ఆ సంతతి క్రమముగా అంత రించుచున్నది. జాతీయ భాష స్పానిష్ అయినను మధ్యతరగతులలో ఆంగ్లభాషకును ప్రచారము కలదు; ఈ ఆంగ్లభాష మాటాడువారి పూర్వికులు జమైకా నుండి ఇచటికి వచ్చిచేరిరి. రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము, ప్రభుత్వాదరితమై, దాదాపుగ దేశమంతట వ్యాపించినది; అయినను రాజ్యాంగరీత్యా మత స్వాతంత్ర్యము కలదు.

**4. సమాచార సౌ. :** టెలిగ్రాఫ్, టెలిఫోను, రేడియో సౌకర్యములు ప్రభుత్వాధ్వర్యవమున పనిచేయుచున్నవి. 202 టెలిగ్రాఫ్ ఆఫీసులును, 86 టెలిఫోన్ స్టేషనులును, 28 లాంగ్‌వేవ్ రేడియో స్టేషనులును పనిచేయుచున్నవి. 1960 నుండి టెలివిజన్ సౌకర్యము సైతము ఏర్పాటైనది. నికరాగ్వా, హొండూరాస్, మెక్సికో, సాన్‌సాల్వడార్‌లతో ఈ దేశమునకు రేడియో-టెలిగ్రాఫ్ ద్వారా సంబంధము కలదు.

**5. యాన సౌ. :** దేశమున, అన్ని ఋతువుల లోను ప్రయాణమునకు అనువుగ ఉండి, 3,250 కిమీ. ల నిడివి గల రోడ్డుమార్గములు కలవు. 6838 కిమీ. నిడివిగల రైలుమార్గములు ఉన్నవి. కరిబ్బియన్ తీరపు రేవులను, పసిఫిక్ తీరపు, దేశ మధ్యపు నగరములతో ఈ మార్గములు కలుపుచున్నవి. కరిబ్బియన్ తీరమున లీమాన్, పసిఫిక్ తీరమున పుంతరేనస్ ప్రముఖ రేవునగరములు. పసిఫిక్ తీరముననే ఉన్న గోల్ఫిటో, క్విపాస్ రేవులును లెక్కింప దగినవియే. దేశపు విదేశపు వ్యాపారము ఈ రేవులద్వారా సాగుచున్నది. దేశమున వివిధ నగరముల మధ్య విమానయాన సౌకర్యము కలదు. జాన్ సాంతామారియా అను చోట ఒక అంతర్జాతీయ విమానాశ్రయము పని చేయుచున్నది.

**6. చరిత్ర :** క్రీ. శ. 1502 లో కొలంబస్ అను దేశాన్వేషకుడు ఇట దిగువరకు, ఈ ప్రాంత మున వసించిన వారి చరిత్రను గురించిన వివరములు తెలియవచ్చుట లేదు. కాని ఆనాటికి అచట జనావాసములు ఏర్పడి, నాగరికతా పథమున అచటి మానవులు కొంత పురోగమించిరనుట మాత్రము తథ్యము. దేశవాసులలో పలువురు, బంగారు ఆభరణములను ధరించియుండుటచూచి కొలంబస్, దేశమునకు కోస్టా రికా (సంపన్న తీర భూమి) అని పేరిడెను. స్పెయిన్‌వారు వెంటనే ఈ దేశమును జయించి తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనిరి. 1821 లో మధ్య అమెరికా రాజ్యములు స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడిన తరువాత ఈ ప్రాంతము మెక్సికో దేశమున తొలుత అంతర్భాగముగ ఉండి, తరువాత వేరొక సమాఖ్యలో చేరి, కడకు 1838 లో స్వతంత్ర రాజ్యమయ్యెను.

**7. పరిపాలన :** 1871 లో ఈ దేశమున ఒక రాజ్యాంగ విధానము ఆమోదితమైనను, 1949 లో అది రద్దుచేయబడి దాని స్థానే వేరొక రాజ్యాంగ విధానము ఆమోదితమై తదాదిగ పరిపాలన దానిని అనుసరించి జరుగుచున్నది. దేశమున పరిపాలనకై ఒక అధ్యక్షుడును, ఇద్దరు ఉపాధ్యక్షులును, 45 మంది సభ్యులుకల శాసన సభయు, సార్వజనికమగు రహస్యపు ఎన్నిక పద్ధతిని, వయోజనులగు ప్రజలచేత నాలుగేండ్లకు ఒకతూరి ఎన్నుకొనబడుదురు. ఈ రాజ్యాంగ

విధానమున, ఒక ప్రత్యేక లక్షణము కలదు. ఆంతరంగిక స్వపరిపాలనము కలిగిన కొన్ని సంస్థలు రాజ్యాంగవిధానము మూలముననే దేశమున రూపొందింపబడినవి. ఎన్నికల నిర్వహణసంస్థ, బ్యాంకింగ్ సంస్థ, విద్యుత్ సంస్థ మొదలగునవి ఇట్టివి. సుప్రీమ్ కోర్టులోని 17 మంది జడ్జీలను శాసనసభయే నిర్ణయించును; వీరిలో ప్రతియొకని పదవీ కాలము 8 ఏండ్లు; వీరు ఇచ్చు పట్టికనుండి తగిన వారిని క్రింది కోర్టుల జడ్జీలుగ శాసనసభయే నిర్ణయించును; సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున దేశమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమున సైన్యము 1948లో రద్దు చేయబడినది; తదాదిగ 1200 మందిగల పౌరరక్షక దళము దేశభద్రతకు బాధ్యత వహించి పనిచేయుచున్నది. తీరమున సుంకముల వసూలున సహకరించుటకై 2 మోటారు లాంచీలు మాత్రమే కలవు.

**9. అంతర్జాతీయ** సం. : ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను, కొన్ని అమెరికా ఖండ రాజ్యముల సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ చాల వరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. కాఫీ గింజలు, చక్కెర, అరటిపండ్లు వ్యవసాయపు ఉత్పత్తులలో అతిప్రముఖములు. కాని విదేశీయ మార్కెటులలో ఈ ఎగుమతుల ధరలు అంతటంతట విపరీతపు వడిదుడుకులకు లోనగుట వలన, పారిశ్రామికముగ సైతము దేశమును సుసంపన్నము చేయుటకు 1961 మొదలుగ కృషి సాగినది. అయినను ఇప్పటికిని దేశపు ఉత్పత్తిలో 31% వ్యవసాయము వలననే లభించుచున్నది; 15% మాత్రమే పరిశ్రమల వలన లభించుచున్నది; దేశమున మొత్తముమీద 10 లక్షల ఎకరముల భూమి సేద్యమున ఉన్నది; ఇంకను వ్యవసాయానుకూలమగు భూమి ఎంతయో ఉన్నది. దేశపు ఎగుమతుల విలువలో 50 కాఫీగింజలవలన లభించుచున్నవి. ఆ తరువాత క్రమముగ ఎగుమతుల విలువలలో అరటి, కోకో, తేనె, పశువులు, చక్కెర ప్రాముఖ్యములు కలిగియున్నవి. బంగారము, పెట్రోలియం మొదలగు ఖనిజములు ఉన్నను, వాని ఉత్పత్తిచాల తక్కువ. 1971 నుండి బాక్సైట్ మాత్రము విరివిగ త్రవ్వబడి ఎగుమతియగుచున్నది. పరిశ్రమలలో మధ్య తరగతికి చెందినవే ఎక్కువ. వీనిలో అనేకములు వ్యవసాయ వస్తువులపై ఆధారపడినవే. రసాయనిక ఎరువుల ఉత్పత్తి చాల అభివృద్ధిపొంది అందు కొంత ఎగుమతియగుచున్నది. విద్యుదుత్పత్తి 10 లక్షల కివా. (1971). ఎగుమతుల విలువ 22,53,62,981 అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 34,97,42,579 (1971) దేశపు బడ్జెటరీ వ్యయము 1 24,28 97,000 కోలోన్లు (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున జనసంఖ్యాభివృద్ధి రేటు చాల ఎక్కువయే యైనను, దేశ సంపత్తియు విరివిగ పెరుగుచుండుటవలన, మధ్య అమెరికా దేశములందెల్ల తలసరి ఆదాయము విషయమున ఈ దేశము ఉచ్చతమ స్థానమున ఉన్నది. సాలీనా తలసరి ఆదాయము 422 అమెరికన్ డాలర్లు. కార్మిక సంక్షేమమునకై తగు శాసనములు అమలులోఉండి, రోగము, నిరుద్యోగము, వార్ధక్యము మొదలగువాని విషయమున తగు సహాయ పథకములు క్రమేణ విస్తృతముగ అమలు పరచబడుచున్నవి. గృహ వసతిని తగురీతిలో అభివృద్ధి చేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. దేశమున నిరక్షరాస్యత చాల తక్కువ. ప్రాథమిక విద్య నిర్బంధము, ఉచితము. 3,56,152 మంది విద్యార్థులుకల 2,574 ప్రయిమరీ పాఠశాలలును; 85,381 మంది విద్యార్థులతో 121 సెకండరీ పాఠశాలలును కలవు.

(1971). సాన్‌జోసీలో 1843 లో స్థాపితమై తదాదిగ పనిచేయుచున్న కోస్టారికా విశ్వవిద్యాలయమున 15,700 మంది పఠించుచున్నారు. 1944 మొదలుగ ఇంగ్లీషుకూడ సెకండరీ పాఠశాలలలో బోధింపబడుచున్నది. సాన్‌జోసీలోని జాతీయ గ్రంథాలయము, దేశపు గ్రంథాలయాలలో ప్రముఖము. అందు దాదాపు లక్ష గ్రంథములు కలవు. ఆ నగరముననే ఒక మ్యూజియం కలదు.

పత్రికా స్వాతంత్ర్యము దేశమున అమలున ఉన్నది. దేశపు ప్రముఖమైన పత్రికలగు నాల్గింటిలో 'లా నేషన్' అనునది ప్రముఖము; దాని పాఠక సంఖ్య దాదాపు 60 వేలు.

ప్రముఖ నగరము లందన్నింట వైద్యశాలలు కలవు. సాన్‌జోసీలోని వైద్యశాల, మధ్య అమెరికాలోని వానిలో అన్నింట, ప్రముఖము. 1860 మందికి ఒక డాక్టరు చొప్పున కలరని చెప్పవచ్చును; శయ్యాసంఖ్య 5,529. కాని పల్లెపట్టులలో వైద్యశాలల వసతి చాల తక్కువ.

**12. యాత్రా సౌ:** ఆరు నెలలకు మించని కాలము దేశమున ఉండదలచిన విదేశీయులు, 'టూరిస్ట్ కార్డు'ను మాత్రమే పొందవలసి ఉన్నది. 1970 లో 1,54,867 మంది యాత్రికులు దేశమును సందర్శించిరి.

**13 ప్రముఖ పౌరులు :** 1. జోసీ మేరియా కాస్ట్రో (19 వ శతాబ్ది) : దేశపు ప్రప్రథమాధ్యక్షుడు. 2. జోసి ఫిగరన్ ఫెర్రర్ (జ 1906); లాటిన్ అమెరికా రాజ్యములందన్నింట సుప్రసిద్ధుడు; దేశపు ప్రస్తుత రాజ్యాంగ విధానమునకు జనకుడుగ ఇతడు సంభావితుడు.

---

# 5. క్యూబా

**ముఖ్యనగరము :** హవానా; **జెండా :** ఏకాంతర రీతిలో తెలుపు, నీలిమలు అయిదు అడ్డచారలుగ అమరగ, దండమును అనుకొనియున్న ఒక రక్తవర్ణపు త్రిభుజమున అయిదు కోణముల తెల్లని నక్షత్రము కలది; **జాతీయ గీతము :** 'ఆల్ కంబాటే'...... (యుద్ధానికి పదండి...) అను పదములతో మొదలగునది; **నాణెము :** పేసో; ఇది నూరు సెంటవోలుగ విభక్తము; ఒక పేసో = రు. 7.50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ. 7 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఒక విశాల ద్వీపమును, కొన్ని అల్ప ద్వీపములను చేరియున్న ఈ ద్వీపరాజ్యము కరిబ్బియన్ సముద్రపు ఉత్తరాంచలమున, ఫ్లోరిడాకు దక్షిణమున 160 కిమీ. ల దూరమున 74°8'–84°5' ప. తు. రేఖల మధ్యను, 19°48' – 23°12' ఉ అ. రేఖలమధ్యను నెలకొని ఉన్నది. ప్రముఖ ద్వీపమగు క్యూబా ద్వీపపు తీరరేఖ నిడివి 3,472 కిమీ దేశపు వైశాల్యము 1,10,921 చ. కిమీ. ద్వీప వైశాల్యమున దాదాపు సగమునకు మించిన ప్రాంతము సమతలము; తక్కినది పర్వతమయము. పికో టర్క్వినో అనునది సియెర్రా మేస్ట్రా పర్వతశ్రేణియందలి అత్యున్నత శిఖరము (2,000 మీ). దేశపు నదులందెల్ల పెద్దదియగు కవుతో నది, సియెర్రా మేస్ట్రా పర్వతశ్రేణికి ఉత్తరమున, పశ్చిమదిశగా 320 కిమీ. లు ప్రవహించుచున్నది; నౌకాయానమునకు ఇది అననుకూలము.

**2. శీతోష్ణస్థితి మొ.** : కొంతవరకు అర్ధోష్ణ మండలపు పరిస్థితియు, కొంతవరకు సమశీతోష్ణ మండలపు పరిస్థితియు ఈ ద్వీప రాజ్యమున కన నగును. సరాసరి సాలీనా గరిష్ఠ ఉష్ణోగ్రత 88° ఫా; కనిష్ఠ ఉష్ణోగ్రత 70°; కాని సముద్ర పవనాలవలన పరిస్థితి సౌమ్యముగ ఉండును. మే నుండి అక్టోబరు వరకు వానలు కురియును. పర్వత




పటము 5.

ప్రాంతములందు సాలీనా సరాసరిన 135 సెం. మీ, తక్కిన దేశమున 82 నుండి 140 సెం. మీ. వరకు వర్షము పడును; అయినను అంతటంతట తరచుగ అనావృష్టి బాధయు కలదు. పర్వతో పరిభూములందు సాంద్రాటవులు కలవు; తక్కిన ప్రాంతములందు కొబ్బరిజాతి చెట్లుగల గరికపట్టులు ఎక్కువ. గ్వాంతనామో అఖాతపు పరిసర భూము లందు మాత్రము ఎడారుల రకపు చెట్లు కన నగును. జంతువులలో చిన్న తరగతికి చెందినవి మాత్రమే కలవు; వివిధ పక్షిజాతులును, సరీసృప జాతులును కననగును.

**3. జనసంఖ్య మొ.** అంచనాలను అనుస రించి జనసంఖ్య 91.7 లక్షలు. జనసాంద్రత చ. కిమీ. కు 70. ఇందులో స్పానిష్ సంతతికి చెందిన శ్వేతజాతీయులు 73%, నీగ్రోలు 12%, సమ్మిశ్రజాతి 15%. ప్రాచీన ఆదిమ అమెరికన్ జాతి తొలుత అల్పసంఖ్యలో ఉండినను, అందు ఒక భాగము అంతరించినది; తక్కినది తక్కిన జాతులలో కలసిపోయినది. దేశభాష స్పానిష్; దేశ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయమునకు చెందిన క్రైస్తవులు; తక్కిన కొన్ని క్రైస్తవ సంప్రదాయములవారు అత్యల్ప సంఖ్యలలో కలరు. దేశపు నగరములలో హవానా (జ. సం. 9,30,00), సాంటియాగో డి క్యూబా (జ. సం. 2,40,000), మరియానావో (జ. సం. 2,22,600), హోల్ గూయిన్ (జ. సం. 2,26,500) ప్రముఖములు.

**4. సమాచార సౌ.** : 654 పోస్టాఫీసులును, 558 టెలిగ్రాఫ్ ఆఫీసులును, 150 రేడియో, రేడియో-టెలిగ్రాఫ్ స్టేషనులును కలవు. బ్రాడ్ కాస్టింగ్ స్టేషనుల సంఖ్య 103; టెలివిజన్ స్టేషనులు రెండు కలవు. ఇవి అన్నియు ప్రభుత్వాధీన మునసే పనిచేయుచున్నవి.

**5 యాన సౌ.** : దేశమున 13,266 కిమీ. నిడివిగలిగి ఉన్నత శ్రేణికి చెందిన రోడ్లు కలవు. తీరమును ఆశ్రయించి 15 హార్బరులు ఉన్నవి. వానిలో హవానా, సాంటియాగో డి క్యూబా, న్యూవైటస్, మతంజాస్, సీన్‌ఫూగోస్, మరియెల్ పేరెన్నిక గనినవి. సోవియెట్ దేశపు నౌకల ద్వారానే, ఎక్కువగ, ఇటనుండి వ్యాపారము సాగుచున్నది. హవానాలోని జాసీ మార్టీ అంత ర్జాతీయ విమానాశ్రయమునుండి స్పెయిన్, మెక్సికోలకును, మాస్కో, ప్రేగ్ నగరములకును విమాన యాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర** : క్రీ. శ. 1492 లో క్రిస్టఫర్ కొలంబస్ ఈ దీవిని కనుగొని దీనిపై స్పెయిన్ దేశపు ప్రభుత్వమును సంస్థాపించెను. 1523 మొద లుగ బానిస వ్యాపారమునకు ఈ దీవి ఒక కేంద్ర ముగ ఉండి, అందువలన సుసంపన్నమైనది. కాల క్రమమున, సమీపమునఉన్న యునైటెడ్ స్టేట్స్

స్వతంత్రతను ఆర్జించిన తరువాత, ఈ దేశపు ప్రజలందును స్వాతంత్ర్యాకాంక్ష పెచ్చు పెరిగెను. అంతట స్పెయిన్ సామ్రాజ్య ప్రభుత్వముపై తిరుగుబాటులు చెలరేగినవి. యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము, ఇందులకు ఆర్థికముగ, నైతికముగ, ప్రోత్సాహమును కల్పించి, కడకు స్వాతంత్ర్య యోధుల పక్షమున స్పెయిన్‌పై యుద్ధమును ప్రకటించినది (1818). తత్ఫలితముగ స్పెయిన్ సేనలు ఓడిపోగా, కుదిరిన ఒక ఒడంబడికను అనుసరించి క్యూబాకు స్వతంత్రత లభించినది.

స్వాతంత్ర్యము చేకూరిన తదనంతరమున సైతము దేశము ఆర్థికముగ పరాధీనమై చాలకాలము మనవలసివచ్చినది. యు. స్టే. దేశపు కంపెనీలు, దేశమున వ్యావసాయిక భూమిలో దాదాపుగ సగమును చేజిక్కించుకొనినవి; తత్ఫలితముగ, తమ ప్రతిపత్తికి రాజకీయముగ భంగము ఏర్పడునని తోచినపుడెల్ల యు. స్టే. సైనికముగ జోక్యము వహించుచుండెను. ప్రభుత్వములు, ఎన్ని మారినను, దాదాపుగ అవి అన్నియును యు. స్టే. ప్రభుత్వమును అనుసరించి వ్యవహరించి, ప్రజల హక్కులను హరించుట పరిపాటి అయినది. అట్టి పరిస్థితిలో ఫిడెల్ కాస్ట్రో అను ప్రజానాయకుడు సాయుధపు తిరుగుబాటును లేవదీసి (1953) ప్రజా సహకారముతో అప్పటి అవినీతియుత ప్రభుత్వమును కూలద్రోసి, విప్లవ ప్రభుత్వమును సంస్థాపించెను (1959). అంతట క్యూబా దేశీయులలో కొందరు యు. స్టే. చేరి, మరల సైనిక సహాయముతో, క్యూబాపై దండెత్తిరి కాని ఆ ప్రయత్నము విఫలమయ్యెను (1961). యు. స్టే కు క్యూబాకు మధ్య అదివరకే అప్రశుతిలో ఉండిన సంబంధములు ఇంకను అంతట విషమించినవి. తన ధ్యేయము సోషలిస్ట్ రాజ్య స్థాపనయేయని కాస్ట్రో ప్రకటించెను; తన భద్రతకై సోవియెట్ దేశమును ఆశ్రయించి వారి సాయమున రాకెట్ మిసిలీలను తన దేశమున నెలకొల్పెను. ఈ చర్య తన భద్రతకు భంగకరమని ప్రకటించి యు. స్టే. యుద్ధ చర్యలకు పూనుకొనెను. కాని అంత సోవియెట్ రష్యా తన మిసిలీలను తొలగించికంతట, ప్రపంచమునకు యుద్ధ ప్రమాదము తప్పినది. తదాదిగ, యు. స్టే. జోక్యము లేకుండ, క్యూబా, కాస్ట్రో నాయకత్వమున, పురోగమించుచున్నది.

**7. పరిపాలన :** 1959 లో అధికారమును గ్రహించిన వెంటనే కొన్ని మౌలిక సంస్కరణలను సామాజిక వ్యవస్థలో కొనివచ్చువరకు, ఎట్టి ఎన్నికలును లేకుండ, ఫర్మానాలచేతనే పరిపాలనను కొనసాగింపవలసిన అవసరము ఉన్నదని కాస్ట్రో ప్రకటించెను. కమ్యూనిస్ట్ వ్యతిరేక భావములుగల రాజకీయ పక్షములు నిషిద్ధములు. అట్టివి కాని మూడు రాజకీయ పక్షములు మాత్రము, కాస్ట్రో విధానములను ఆమోదించి పనిచేయుచున్నవి. 1976 లో ప్రభుత్వము ఏకిపట్టికా విధానమున ఎన్నికలను జరుపగ 481 ప్రతినిధులుగల శాసన సభ ఎన్నుకొనబడినది. ఆ శాసనసభ, దేశాధ్యక్షుడుగ కాస్ట్రోను ఎన్నుకొనినది (డిసెంబరు 2, 1976).

**8. దేశరక్షణ :** 1963 మొదలుగ దేశమున నిర్బంధ సైనిక శిక్షణ అమలులోనికి కొనితేబడినది. భూతల సైనిక సంఖ్య 90 వేలు; రిజర్వు బలపు అంచనా 90,000. పదాతిదళమున 2 మోటారు బ్రిగేడులును, 1 సాయుధ శకట దళమును కలవు; సోవియెట్ దేశము ఇచ్చిన 600 టాంకులు కలవు. నావిక సేనలోని సైనిక సంఖ్య 6,000; 3 ఫ్రిగేట్లును, అందులకు తగిన తక్కిన వివిధ నౌకలును కలవు. దేశమునందలి గ్వాంతనామో నౌకాస్థావరము ఇప్పటికిని యు. స్టే. అధీనమునకే ఉన్నది. సోవియెట్ దేశపు సహాయముతో పరిమిత బలసంపన్నమగు వైమానిక సేనను దేశము రూపొందించుకొనగలిగినది; అందలి

విమాన సంఖ్య 275; వైమానిక యోధులసంఖ్య 12,000. ప్రపంచమునందలి వలస రాజ్యములలో స్వాతంత్ర్యోద్యమములను ప్రోత్సహించుటకు తన విధానముగ ఈ దేశము గ్రహించి, తదనుగుణముగ అంగోలా దేశము తన స్వాతంత్ర్యమును సుస్థిరము చేసికొనుటకై పోరాడు కాలమున అచటకు తన సైనికులను, స్వచ్ఛంద సేవకులుగ పంపినది (1975).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధ సంస్థలలో, ప్రపంచ బ్యాంకుతప్ప తక్కిన అన్నింటియందును, ఈ దేశమునకు సభ్యత్వము కలదు. యు. స్టే. తోను, మెక్సికోతప్ప తక్కిన లాటిన్ అమెరికన్ రాజ్యములతోను ఈ దేశమునకు దౌత్య సంబంధములు లేవు. అవిగాక మిగిలిన ప్రపంచ రాజ్యము లన్నింటితోను ఈ దేశమునకు దౌత్య సంబంధములు కలవు. కమ్యూనిస్ట్ రాజ్యములగు చీనా, సోవియెట్ రష్యాలమధ్య కలిగిన నైరుధ్యములలో ఈ దేశము తటస్థ భావము వహించి వ్యవహరించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** దేశ సంపదకు, ప్రస్తుతమున, వ్యవసాయమే ముఖ్యాలంబనము. ప్రపంచమున చక్కెర పంటలో ఈ దేశమునకు అగ్రస్థానము కలదు. దేశ వైశాల్యమున దాదాపు 80% వ్యవసాయాను కూలము; ఇందు 25.5% మాత్రమే సాగున ఉన్నది. తక్కిన దానిలో ఎక్కువ భాగము గడ్డి బీడులుగ ఉపకరించు చున్నది. సాగున ఉన్న భూమిలో 52% న చక్కెర చెరకు సాగగుచున్నది. దేశమున ప్రస్తుత ప్రభుత్వము క్రమేణ భూమిని జాతీయము చేయుట వలన, ఏ కొలదిగనో తప్ప తక్కినది అంతయు ప్రభుత్వ క్షేత్రములుగ మారినది; తక్కిన వ్యవసాయానుకూల భూమిలో కూడ చక్కెరచెరకును పండించుటకై ప్రభుత్వము కృషి చేయుచున్నది. చక్కెర తరువాత పొగాకు, వరి, మొక్కజొన్న, కాఫీ క్రమ ప్రాముఖ్యమును కలిగి ఉన్నవి. ఎగుమతుల విలువలో 55% చక్కెరవలన లభించు చున్నది. ఖనిజములలో ఎక్కువగ లభించునది నికెల్; రాగి, క్రోమైట్, మాంగనీజులును కొలదిగ లభించుచున్నవి; పరిశ్రమలు చాలవరకు వ్యవసాయవస్తువుల పైననే ఆధారపడి ఉన్నవి. దేశపు అడవులలో మంచి జాతి కలప విరివిగ లభించుచున్నను, అది దేశావసరములకు మాత్రమే వినియోగపడుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 225 8 కోట్ల కి.వా. దేశపు ఎగుమతుల దిగుమతుల సంఖ్యా వివరములు 1935 తరువాత లభ్యమగుట లేదు. 1965 లో ఎగుమతుల విలువ 63 5క కోట్ల పెసోలు; దిగుమతుల విలువ 86.6 కోట్ల పెసోలు. 1965 తరువాతి బడ్జెటు వివరములు తెలియవచ్చుటలేదు.

**11. సాంఘిక రంగము :** దేశమున పరిశ్రమలును, వ్యవసాయమును జాతీయములు చేయబడుట వలన కార్మిక సంఘము ప్రభుత్వపు అదుపు ఆజ్ఞలలో వర్తించుచున్నది. ప్రస్తుతపు ప్రభుత్వము అల్పాదాయవర్గముల గృహావసరముల పరిపూర్తికై సమధిక కృషిని సాగించు చున్నది. ఇండ్లను అద్దెలకు ఇచ్చు విధానము నిర్మూలితమైనది. 1961 మొదలుగ నిరక్షరాస్యతా నిర్మూలనమునకై ప్రభుత్వము నిరంతర కృషి చేసినది; తత్ఫలితముగ 1964 కు నిరక్షరాస్యత సంపూర్ణముగ అంతరించినది. ప్రయిమరీ పాఠశాలలలో 15,60,193 మంది; సెకండరీ పాఠశాలలలో 1,60,857 మంది; సాంకేతిక పాఠశాలలో 42,507 మంది విద్యార్థులు కలరు. దేశపు మూడు (హవానా, ఓరియెంటే, సెంట్రల్) విశ్వవిద్యాలయములలోని విద్యార్థి సంఖ్య 30,705 (1969–70), దేశమునందలి గ్రంథాలయములలో క్యూబా జాతీయ గ్రంథాలయము ప్రశస్త

తమము; అందలి గ్రంథ సంఖ్య 250 వేలు. దేశమున మ్యూజియములు అనేకములు కలవు; వానిలో హవానాయందలి జాతీయ మ్యూజియం ఉత్తమము. పత్రికా ప్రచురణ ప్రభుత్వాధీనమున ఉన్నది; రెండు దినపత్రికలు వెలువడుచున్నవి; అందు 'రెవల్యూషన్' అనుదానికి ప్రచారము ఎక్కువ. దేశమున రోగబాధ తక్కువ. ఇప్పటి వైద్యశాలల సంఖ్యావివరములు తెలియవు. 1964 లో 47,861 శయ్యాసంఖ్యగల 154 వైద్యశాలలు ఉండినవి; వైద్యసంఖ్య 4,265.

**12. యాత్రా సౌ:** విప్లవ ప్రభుత్వము ఏర్పడిన తరువాత, యాత్రికులు తూర్పుయూరపు నుండి మాత్రమే ఎక్కువగా వచ్చుచున్నారు. సంఖ్యావివరములు తెలియవు.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1 జోసీ మార్తీ (1853-95); దేశస్వాతంత్ర్య కృషిని తన రచనలచేతను, తక్కువిధముల కృషివలనను ప్రోత్సహించిన దేశభక్తుడగు రచయిత. 2. గెవేరా (1928-67); అంతర్జాతీయ ఖ్యాతిని పొందిన విప్లవోద్యమ నాయకుడు; బొలీవియాలో విప్లవ సాధనకై కృషిచేయుచు అట హతుడయ్యెను. 3 ఫిడెల్ కాస్ట్రో (జ 1925); దేశమున విప్లవ సైనిక పోరాటమును నిర్వహించి, విజయియై, దేశపు ప్రభుత్వమును ప్రస్తుతమున నడుపుచున్న ప్రజ్ఞాశాలి.

---

# 6. గ్వాడెలోప్

## (ఫ్రెంచి సముద్రోత్తర ప్రాంతము)

**ముఖ్యనగరము:** బాస్సే టెర్రే; **జెండా, జాతీయ గీతము, నాణెము, కొలతూకములు:** ఫ్రాన్సు దేశపువే. **కాలగణన:** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** వెస్ట్ ఇండీస్‌లో అంతర్భాగమగు లిటిల్ యాంటిల్లీస్‌లో 15°-16° ఉ. అ. రేఖలకును, 60-62° ప. తు రేఖలకును మధ్యనున్న రెండు ప్రముఖ ద్వీపములును, రాజ్యాంగరీత్యా వానితో ముడివడిఉన్న కొన్ని అల్పద్వీపములును చేరి గ్వాడెలోప్ రాజ్యముగ వ్యవహృతములు. రెండు ప్రముఖ ద్వీపములలో పశ్చిమపు దానికి గ్వాడెలోప్ అనియు, తూర్పుదానికి గ్రాండేటెర్రే అనియు పేరులు కలవు. రెండు ద్వీపముల మొత్తపు వైశాల్యము 1575 చ. కిమీ; అల్ప ద్వీపములు అయిదు కలవు; వాని పేర్లు 1. మేరీ జలాంటీ, లే సెయింటీ, డేసిరాడే, సెయింట్ బార్తెలెమీ, సెయింట్ మార్టిన్. కడపటి దానిలో మూడవవంతు మాత్రము డచ్చి వారికి చెందినది. ద్వీపములతో కలసి మొత్తపు వైశాల్యము 1780 చ. కిమీ. గ్వాడెలోప్‌దీవి అగ్నిశైలీయము. గ్రాండెటెర్రే సున్నపు రాతిమైదానము. తీరమును ఆశ్రయించి పవడపు తిన్నెలు కలవు; నదులు లేవు.

**2. శీతోష్ణపరిస్థితి మొ.:** దేశము ఉష్ణమండలమునసే ఉన్నను, సముద్రపు వాయువుల వలన సౌమ్యశీతోష్ణత కననగును. బాస్సేటెర్రేలో సాలున 500-1000 సెం. మీ. వర్షపాతము

కలదు. దీసీరాడే దీవిలో సాలుసరి వర్షపాతము చాల తక్కువ (95 సెం. మీ.). వెదురు, ఉష్ణమండల పు పెద్దవృక్షములు విరివిగ కననగును.

**3. జనసంఖ్యా మొ. :** 1972 లోని లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 3 34,000 లే సెయింటీ, సెయింట్ బార్తెలేమీ దీవులలో మాత్రము అచ్చపు శ్వేతజాతివారు వసించుచున్నారు (జ. సం. 5,620). తక్కిన దీవులలో నీగ్రోలును, సమ్మిశ్రజాతులవారును కలరు. గ్వాడ్‌లోప్ దీవిలో ఉన్న ముఖ్యనగరపు జనసంఖ్య 15,690. తక్కిన నగరములలో గ్రాండె టేర్రెలోని పాయింటీ – ఎ – పిత్రే (జ. సం 29,538) ప్రముఖము.

**4 సమాచార సా. :** దేశమున 42 తపాలాఫీసులును, 7 వైర్‌లెస్ స్టేషనులును, 14 374 టెలిఫోనులును కలవు (1971)

**5. యాన సౌ. :** 323 కిమీ. నిడివిగల జాతీయ పథములును 1373 కి మీ. నిడివిగల తక్కువిధముల రోడ్లును కలవు. రైలుమార్గములు లేవు. పాయింటీ-ఎ–పిత్రే వద్దను, బాస్సెటేర్రె వద్దను హార్బర్లు కలవు. ఇటనుండి వెస్ట్ ఇండీస్ లోని తక్కిన దీవులకును, ఉత్తర దక్షిణ అమెరికా రాజ్యములకును, ఫ్రాన్సునకును నౌకాయాన వసతి కలదు. సెయింట్ మార్టిన్ దీవిలో మారిగాట్ రేవు స్వేచ్ఛా వ్యాపారకేంద్రముగ ఉన్నది. పాయింటీ-ఎ-పిత్రేలోని విమానాశ్రయము అంతర్జాతీయ నౌకాయానమున ఒక మజిలీగా ఉన్నది.

**6. చరిత్ర :** 1493 లో కొలంబస్ ఈ దీవులను కనుగొనెను. 1635 లో ఫ్రెంచివారు వీనిని ఆక్రమించిరి. నెపోలియన్ కాలపు యుద్ధములలో ఇవి పలు తడవులు చేతులు మారినను కడకు ఫ్రెంచివారి వశముననే నిలిచినవి.

**7. పరిపాలన :** కడు దీర్ఘకాలము ఇందు ఫ్రెంచివారి వలసపాలన కొనసాగినది. కాని 1946 మొదలు ఫ్రాన్సుదేశపు సముద్రోత్తర మండల ప్రతిపత్తి లభించినది. ఫ్రెంచి పార్లమెంటునకు ముగ్గురు సభ్యులను, సెనెట్‌కు ఇరువురు సభ్యులను ఈ దేశ ప్రజలు ఎన్నుకొనెదరు. స్థానిక పాలనను, మాండలికాధికారి 36 మంది ఎన్నుకొనబడిన సభ్యులుకల ప్రజాసమితి సాయముతో నిర్వహించును.

**8. దేశరక్షణ. 9. అంతర్జాతీయ సం :** ఈ రెండును ఫ్రెంచి ప్రభుత్వపు బాధ్యతనే నిర్వహింపబడుచున్నవి

**10. ఆర్థిక రంగము :** ఆర్థిక వ్యవస్థ అంతయు వ్యవసాయముపై ఆధారపడియున్నది. చక్కెర, అరటి పండ్లు ముఖ్యములగు ఎగుమతి పంటలు. విదేశ వ్యాపారమున 70% ఫ్రాన్సుతో సాగుచున్నది; తరువాత లెక్కింపదగినది, యు. స్టే. తో వ్యాపారము. చక్కెర శుద్ధిచేయుట, సారాయి తయారీ ముఖ్యములగు పరిశ్రమలు మొత్తపు ఎగుమతుల విలువ 2.3 కోట్ల ఫ్రాంకలు : దిగుమతుల విలువ 6.4 కోట్ల ఫ్రాంకులు (1971). బడ్జెటరీ వ్యయము 36,28,49,675 ఫ్రా. (19 9).

**11. సాంఘిక రంగము :** దేశమున విద్యావ్యాప్తి విస్తారముగ కలదు. ప్రాథమిక పాఠశాలలలో 78,031 మంది, సెకండరీ పాఠశాలలలో 4,625 మంది, సాంకేతిక పాఠశాలలలో 4,157 మంది విద్యార్థులు కలరు. కొన్ని వందల మంది, విద్యార్థి వేతనముల సౌకర్యముతో, ఫ్రాన్సు దేశమున ఉన్నతవిద్యను అభ్యసించుచున్నారు. దేశమున 20 ఆసుపత్రులును 169 మంది వైద్యులును కలరు (1967).

**12. యాత్రా సౌ. :** యాత్రికుల వలనను దేశమునకు కొంత ఆదాయము లభించుచున్నది; సంఖ్యా వివరములు తెలియవు.

# 7. గ్వాతెమాలా

**ముఖ్యనగరము** : గ్వాతెమాలా సిటీ; **జెండా:** రెండు నీలి నిలువు చారల మధ్యనున్న తెలుపు నిలువు చారపై జాతీయ యోధలాంఛనము కలది; **జాతీయ గీతము :** గ్వాతెమాలా ఫెలిజ్ క్వె తూ సిరాస్ (గ్వాతెమాలా స్తవనీయము) అను చరణముతో మొదలిడునది; **నాణెము :** క్వెజ్జాల్; ఇది నూరు సెంటవోలుగ విభక్తము. ఒక క్వెజ్జాల్




పటము 6.

= రు. 7.50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 6 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య అమెరికా యందు 13°42′–17°49′ ఉ. అ. రేఖల మధ్యను, 88° 10′–92°30′ ప. తు. రేఖల మధ్యను నెలకొని ఉన్న ఈ రాజ్యమునకు ఉత్తర, పశ్చిమములందు మెక్సికో, తూర్పున బ్రిటిష్ హాండూరాస్, ఎల్ సాల్వడార్ రాజ్యము, కరిబ్బియన్ సముద్రము; దక్షిణమున పసిఫిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. కరిబ్బియన్ తీరరేఖ పొడవు 112 కిమీ; పసిఫిక్ తీరరేఖ పొడవు 352 కిమీ. దేశపు మొత్తపు వైశాల్యము 1,08,889 చ. కిమీ. పసిఫిక్ తీరమును ఆశ్రయించి సమాంతరముగ 48 కిమీ ల వెడల్పుగల ఒక ఉష్ణమండల మైదానమును, దాని కడయంచునుండి క్రమముగా 90 మీ. నుండి 1370 మీ. వరకు ఎత్తుగల ఒక పీఠభూమియు, దాని యావల, దేశమున దాదాపు మూడింట రెండు వంతుల భూమిని ఆక్రమించుచు, వాయవ్య ఆగ్నేయములకు వ్యాపించి, అగ్నిపర్వతములు కలిగిన ప్రాంతమును. ఈ దేశపు భూతలమున ముఖ్య భాగములు కరిబ్బియన్ సముద్రతీరమున మొంటగ్వా, పోలోచిక్, సర్స్టూన్ నదుల లోయల సారవంత భూమికలందు. దీనికి ఉత్తరమున పేటెన్ అను నిమ్నతలాటవీప్రాంతము కలదు. ప్రాచీన 'మాయా' నాగరికతకు ఇది నెలవని తెలియుచున్నది. సరస్సులలో ఇజాబెల్, పేటేన్, అతిట్లాన్ అనునవి ప్రముఖములు దేశమునందున్న 30 అగ్నిపర్వతములలో రెండు ఇప్పటికిని రగులుచునే ఉన్నవి

**2 శీతోష్ణస్థితి మొ.** · భూతలపు ఎత్తునగల మార్పులను అనుసరించి, ఉష్ణోగ్రతయు మారుచున్నది. సముద్రతీరమున సాలున ఉష్ణోగ్రత 77° నుండి 86° ఫా. వరకు పోవును. మధ్య దేశపు ఉన్నత భూములలో అది 68° ఫా; అత్యున్నత ప్రాంతములలో 59° ఫా. మే నుండి అక్టోబరు వరకు దేశ మధ్యమునను, మే నుండి డిసెంబరు వరకు తీరప్రాంతమునను వానలు పడును. మొత్తముమీద దేశమున ఎచటచూచినను శీతోష్ణస్థితి ఎక్కువ విపరీతపు మార్పులకు లోనగాక

సాలు పొడవునను దాదాపుగ సౌమ్యముగ ఉండుట వలన గ్వాటెమాలా నిత్యవసంత భూమి అనియు పిలువబడుచున్నది. ఉష్ణమండల పుష్పజాతులును, ఫలవృక్షములును, ఓషధులును ఇట విరివిగ కన్పట్టును. వన్యజంతువులలో ఎలుగునకు మించిన పెద్ద జంతువులు లేవు క్వెట్జాల్ అనబడు ఒక వింతపక్షి జాతీయపక్షిగ పరిగణింపబడు చున్నది; అది వనములలో మాత్రమే బ్రతుకగలదు; ఇండ్లలో సాకినచో త్వరలోనే మరణించును; కావున అది స్వాతంత్ర్యాకాంక్షకు సంకేతముగ పరిగణ్యము.

**3. జనసంఖ్య మొ.** : దేశపు జనసంఖ్య 54 లక్షలు (1970) వీరిలో 45% అచ్చపు ఆదిమ అమెరికన్ జాతులకు చెందినవారు; తక్కినవారు స్పానిష్ వారితో సంకరమొందిన అమెరికన్ సంతతికి చెందిన సమ్మిశ్ర జాతివారు. ఈ సమ్మిశ్ర జాతివారే దేశమున రాజకీయాధికారమును కలిగియున్నారు. దేశపు నగరములలో గ్వాటెమాలా సిటీ (జ. స. 7 90 311), క్వెజల్ తెనాంగో (54,500) ప్రముఖములు. దేశపు జనసాంద్రత చ. కిమీ.కు 18; సాధికార భాష స్పానిష్; ఆదిపు అమెరికనులలో 6 విధముల ఆదిమభాషలు ప్రచారమున ఉన్నవి. రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతము అత్యధిక ప్రజానీకమున వ్యాప్తి కలిగి ఉన్నది; తక్కిన సంప్రదాయముల వారును, యూదులును అల్పసంఖ్యలలో కలరు. రాజ్యాంగరీత్యా దేశమున మత స్వాతంత్ర్యము కలదు.

**4 సమాచార సా.** : దేశమున తపాలా, తంతి, మొదలగు సమాచార సాధనములు చాలవరకు ప్రభుత్వాధీనమున పని చేయుచున్నవి. రేడియో-టెలిగ్రాఫ్, రేడియో టెలిఫోన్ సౌకర్యములు కలవు. 70 బ్రాడ్ కాస్టింగ్ స్టేషనులు కలవు. వ్యాపార సంస్థలు నడుపు 3 టెలివిజన్ స్టేషనులు ఉన్నవి.

**5 యాన సా.** : దేశమున 12,000 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; వీనిలో 2000 కిమీ. ఉత్తమ శ్రేణికి చెందినవి. గ్వాటెమాలా సిటీని ఉభయ తీరములకు కలుపు ఒక జాతీయ పథము కలదు. కరిబ్బియన్ తీరమునందలి పోర్టోబర్రియోస్, సాంతో తోమస్ డి కాస్టిల్లీ నగరములును, పసిఫిక్ తీరపు సాన్‌జోసీ, చాంపెరికో నగరములును మంచి హార్బరులను కలిగియున్నవి. రైలు మార్గముల మొత్తపు నిడివి 800 కిమీ. ప్రభుత్వాధీనమున పనిచేయు ఒక విమాన ప్రయాణ సంస్థ వలన దేశాంతర్గతముగను అంతర్జాతీయముగను విమాన ప్రయాణ సౌకర్యము ఏర్పడి యున్నది. అదిగాక ఇతర దేశముల విమాన సంస్థలును అంతర్జాతీయ విమానయానమున పాల్గొనుచున్నవి.

**6. చరిత్ర** : క్రీ. శ. 1524 లో స్పెయిన్ దేశపు సాహసికులు ఇట కాలిడునాటికి, అతి పూర్వకాలమునుండియు, దేశీయ సంస్కృతి ఒకటి ఈ దేశమున వర్ధిల్లినది. దానినే 'మాయా' నాగరికత అని వ్యవహరింతురు గణితాది విజ్ఞాన రంగములందును, లలితకళలందును, వాస్తు నిర్మాణ కుశలత యందును వారు ఎంతయో పురోగమించిరి. ఆ ప్రాచీనులు నిర్మించిన భవనాదులవలను, చిత్ర లిపిలో వారు నెలకొల్పిన లిఖితాధారముల వలనను ఆ నాగరికతా విశేషములు ఇపుడు చాల వరకు తెలియవచ్చుచున్నవి. ఆ మాయా నాగరికత 12 వ శతాబ్దినాటికే తన పటుత్వమును కోల్పోయి, 16 వ శతాబ్దివరకు ఎటులనో మనుగడను సాగించి, కడకు స్పానిష్ వారి ధాటికి ఆగలేక అంతరింపగ దేశము 1550 నాటికి స్పెయిన్ పాలకుల విశాల సామ్రాజ్యమున అంతర్భాగమై, దాదాపు మూడు శతాబ్దములు వలస పాలనలో ఉండినది తరువాత 19 వ శతాబ్ది ప్రథమపాదమున అమెరికాయందలి స్పెయిన్ వలసలు స్వతంత్రతను ఆర్జించిన సందర్భమున ఈ

దేశమును తక్కిన మధ్య అమెరికన్ రాజ్యములతో పాటుగ స్వతంత్రమై (1821), కొంతకాలము ఒక సమాఖ్యలో భాగస్వామిగ ఉంచి కడకు 1838 లో సర్వస్వతంత్ర రాజ్యమైనది. కాని అది మొదలుగ దేశమున పలుమారులు నియతృత్వములు ఏర్పడి ప్రజాస్వామిక రాజ్యాంగము కుదురుగ నడచుటకు అవకాశమే లేకపోయింది. కాని 1966 మొదలుగ కొంతవరకు సువ్యవస్థితమగు ప్రజాపరిపాలన ఏర్పడినదని చెప్పవచ్చును.

**7. పరిపాలన :** ఏక కక్ష్యగల ఒక జాతీయ శాసనసభకు బాధ్యత వహించుచు ఒక మంత్రివర్గపు సాయమున, అధ్యక్షుడు పాలనను నెరపు గణరాజ్య విధానము దేశమున అమలున ఉన్నది. అధ్యక్షుని దేశ ప్రజలు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నుకొనెదరు; అతనితో పాటుగనే ఒక ఉపాధ్యక్షుని, జాతీయ శాసన సభయందలి సభ్యులను, సామాన్యముగ జిల్లాకు ఇరువురు చొప్పున, ప్రజలు ఎన్నుకొనెదరు; వీరి పదవీకాల పరిమితి 4 సంవత్సరములు. 14 మంది సభ్యులుకల రాజ్యసభ కలదు. ఇది ఉపాధ్యక్షుని అధ్యక్షతన సమావేశమై అధ్యక్షునికిని, శాసనసభకును సలహాలు ఇచ్చును. ప్రభుత్వపు మూడు విభాగములనుండి-న్యాయ, కార్యనిర్వాహక, శాసన నిర్మాణ విభాగములనుండి - రాజ్యసభ సభ్యులు నియమింపబడెదరు. సువ్యవస్థితములైన రాజకీయ పక్షములు లేనేలేవని చెప్పవచ్చును. వ్యక్తుల ప్రతిపత్తిపైననే రాజకీయ పక్షములు తరచుగా రూపుగొనుచున్నవి. కమ్యూనిస్ట్ పార్టీ నిషిద్ధము. దేశపు 32 జిల్లాలలో ప్రతిదానియందు, అధ్యక్షుడు నియమించు గవర్నరు స్థానిక పాలనను నిర్వహించును. న్యాయశాఖ, సుప్రీమ్‌కోర్టు అధ్వర్యమున పనిచేయును. సుప్రీమ్ కోర్టులోని జడ్జీలను, జాతీయ శాసనసభయే ఎన్నుకొనును

**8. దేశరక్షణ :** రెండేండ్ల నిర్బంధ సైనిక శిక్షణ దేశమున అమలున ఉన్నది; 18 నుండి 50 ఏండ్లమధ్య వయసుకల వారికి ఇది వర్తించును. భూతల సైన్యమున యోధ సంఖ్య 7000 నుండి 9,000 వరకు ఉండును; ఈ సైన్యము వివిధ ఆధునిక కవచశకటములను, ఆయుధసామగ్రిని కలిగియున్నది. ఒక గన్‌బోటు, నాలుగు చిన్న గస్తీనౌకలుకల నౌకాసేనయు, 1000 మంది యోధులుకల వైమానిక దళమును కలవు; విమాన దళమున విమానసంఖ్య 55.(1972).

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికా రాజ్యముల వ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. బ్రిటిష్ హొండూరాస్ న్యాయతః తనకే చెందవలెనని ఈ దేశపు వాదము. దీని ఫలితముగ 1963 లో బ్రిటన్‌తో ఈ దేశప్రభుత్వము దౌత్యసంబంధములను రద్దు చేసికొనినది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడిఉన్నది. 1968 మొదలుగ ఎగుమతి పంటలలో కాఫీ అగ్రస్థానమును పొందినది. తరువాత అరటిపండ్లును, ప్రత్తియు క్రమముగ లెక్కింపదగినవి. దేశమున భూమి సంస్కరణలను ప్రవేశపెట్టిన (1966) ఫలితముగ చిన్నరైతులకు పలువురకు భూములపై స్వామ్యమును, వ్యవసాయమునకై పరపతియు లభించినవి. పై రొక్కపుపంటలతో పాటుగ దేశావసరములకై మొక్కజొన్న, గోధుమ, చక్కెర, పొగాకు పండింపబడుచున్నవి. దేశమున 14 లక్షల పశుసంతతి కలదని అంచనా. చేపల పరిశ్రమకు అవకాశములు ఎక్కువగ ఉన్నను, అది తగినంతగ అభివృద్ధి చెందకున్నది. పరిమితమగు ఖనిజసంపద కలదు. సీసము, తుత్తు నాగము, క్రోమ్, వెండి కొద్ది ప్రమాణములలో ఎగుమతి యగుచున్నవి. పరిశ్రమలన్నియు చాల

పరకు వ్యవసాయవస్తువులపై ఆధారపడినవే. దేశ సంపదలో 13.7% మాత్రమే పరిశ్రమల వలన లభించుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 63 కో. కిలోవాట్లు కి.వా. దేశపు ఎగుమతుల విలువ 25,53, 55,000 క్వెట్జాల్; దిగుమతుల విలువ 25,01, 65,000 క్వె (1969). బడ్జెటరీ వ్యయము 25.09 కోట్ల క్వె (1972).

**11 సాంఘికరంగము :** 1939 నుండి, దేశమున గృహ సమస్యను పరిష్కరించుటకై కృషి జరుగుచున్నను, అది అంతగ ఫలప్రద మైనటుల కన్పట్టదు. సాంఘిక భద్రత కొరకును కొంత కృషి జరుగుచున్నది; కాని ఇప్పటికి ప్రజానీకమున 367 వేల కార్మికులకు మాత్రమే నిరుద్యోగము, రోగ బాధ మొదలగు సందర్భ మున ఆర్థిక భద్రతకొరకై ఏర్పాటులు జరిగినవి. దేశమునందలి 5,875 ప్రయిమరీ పాఠశాలలలో 5,44,653 మంది; 398 సెకండరీ పాఠశాలలలో 74.449 మంది విద్యార్థులు కలరు (1970). దేశమున నాలుగు విశ్వవిద్యాలయములు పనిచేయు చున్నవి. వానియందలి విద్యార్థి సంఖ్య 16,103 (1969). దేశమున అక్షరాస్యత 37% (1964). గ్వాతమాలా సిటిలో ఉత్తమశ్రేణికి చెందిన గ్రంథా లయములు మూడు ఉన్నవి. ఆ నగరముననే ఉన్న పురావస్తు మ్యూజియమున 'మాయా' నాగరికతకు చెందిన అవశేషములు పెక్కు కాన నవి. దేశమున ప్రచారమగుచున్న ఒకే దిన పత్రికలలో 'ఎల్ ఇంపార్షల్' అనునది విశేష వ్యాప్తికలది. దేశమున మలేరియా, క్షయ మొదలగు రోగముల వలన బాధ ఎక్కువ. దేశమున మొత్తమున 14,525 శయ్యా సంఖ్యగల 57 ఆసు పత్రులు కలవు; వైద్య సంఖ్య 1,1[illegible] అనగా 10 వేల ప్రజలకు నలుగురు వైద్యులు).

**12. యాత్రా సౌ :** మధ్య అమెరికా వాసులకును, యు. స్టే. వాసులకును వీసాలు అక్కరలేదు; దేశ పర్యటనకు యాత్రికపత్రము మాత్రమే సరిపోవును; దీనితో వారచట మూడు నెలలు ఉండవచ్చును. తక్కిన విదేశీయులకు పాస్‌పోర్టు, వీసాలు విధిగా ఉండవలయును. 1967 లో దేశమును దర్శించిన యాత్రికుల సంఖ్య 171 వేలు; 1969 లో యాత్రికుల వలన వచ్చిన ఆదాయము 70 లక్షల క్వె.

**13 ప్రసిద్ధ పౌరులు :** 1. జుస్టో రూఫినో బ్రరియోస్ (1835-85); తాను దేశాధ్యక్షుడుగ ఉండినపుడు ప్రవేశపెట్టిన ఉదార, సాంఘిక సంక్షేమక, సంస్కరణల వలన, ఇతడు ప్రజల మన్ననలను విరివిగ ఆర్జించి, జాతీయ మహా నాయ కుడుగ పేరొందెను. 2. మైగేల్ యేన్‌జెల్ అస్టూరియస్ (జ 1899); ఇతడు తన రచనలకై నోబెల్ బహుమానమును 1967 లో ఆర్జించెను.

---

# 8. జమైకా

**ముఖ్యనగరము :** కింగ్‌స్టన్; **జెండా :** ఎదు రెదురు మూలలను కలుపు రెండు బంగారు వర్ణపు వెడల్పు రేఖల వలన ఏర్పడిన నాలుగు త్రిభు జములలో పైన దిగువన ఉన్నవి ఆకుపసిమి రంగున, ప్రక్కన ఉన్నవి నలుపు రంగున చిత్రింపబడగ ఏర్పడినది; **జాతీయ గీతము :** ఎటెర్నల్ ఫాదర్ బ్లెస్ అవర్ లాండ్ (అమరజనక, మా భూమి నాశీర్వదింపుము) అను చరణముతో

మొదలిడునది; నాణెము : జమైకా డాలర ; నూరు సెంట్లుగ ఇది విభక్తము, ఒక జ. డాలరు = రు. 9-00; **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువి, **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** వెస్ట్ ఇండీస్ ద్వీప సముదాయమున, కరిబ్బియన్ సముద్ర పరివృతమైన ఈ ద్వీపరాజ్యము, 17°43'-18°32' ఉ. అ.




పటము 7.

రేఖల మధ్యను, 76°11'-78°21' ప. తు. రేఖల మధ్యను నెలకొని ఉన్నది. ద్వీపపు గరిష్ఠపు నిడివి 234 కిమీ.; గరిష్ఠపు వెడల్పు 82 కిమీ. ద్వీప రాజ్యపు మొత్తపు వైశాల్యము 11,424 చ. కిమీ. ద్వీపమున అత్యధిక భాగము సున్నపురాతి పీఠభూమి; ఆ పీఠభూమి సరాసరి ఎత్తు 460 మీ. దేశాంతర్భాగము చాలవరకు ఉన్నత పర్వతమయము; తూర్పు ప్రాంతపు 'బ్లూ' పర్వతములలో కొన్ని శిఖరముల ఎత్తు 2,200 మీ. కు పైబడి ఉన్నది. తీరమైదానములు చాలవరకు వండ్రు మట్టివలన రూపొందినవి; వీనిలో దక్షిణ తీరపుది అత్యంత విస్తృతము నదులు అనేకములు ఉన్నవి; అవి చాల చిన్నవై అతిద్రుత గమనమున, ఎక్కువ ఎత్తులనుండి క్రిందికి దూకుచు పయనించును; అందువలన అవి నౌకాయానమునకు సరికుదురవు.

**2. శీతోష్ణస్థితి మొ. :** సముద్ర సమభూములందు ఉష్ణమండలపు పరిస్థితియు, ఉన్నత భూములందు సమశీతోష్ణ మండలపు పరిస్థితియు ఇట కానవగును. కాని మొత్తముమీద ఎండకాలపు, శీతకాలపు ఉష్ణోగ్రతల మధ్య వ్యత్యాసము చాల తక్కువ; ఎండకాలపు సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా; చలికాలపు సరాసరి ఉష్ణోగ్రత 75° ఫా. సాలున సరాసరి వర్షపాతము 180 సెం. మీ; కాని ఉత్తరపు కోస్తాన సాలుసరి వర్షపాతము 500 సెం.మీ; ఆగ్నేయ ప్రాంతమున అది 80 సెం మీ. మాత్రమే. మే నుండి జూన్ వరకును, మరల సెప్టెంబరు నుండి నవంబరు వరకును వానలు కురియును. ఆగస్టునుండి నవంబరు వరకు తుపానుల బెడద చాల ఎక్కువ. పూర్వమున అడవులు ఎక్కువగ ఉండెడివి; కాని ఇప్పుడు జనావాసములకై అవి కొట్టివేయబడినవి. ఉత్తర, ఈశాన్య ప్రాంతములలో మాత్రము ఇప్పటికిని కొన్ని సాంద్రాటవులు కలవు. వానిలో మహాగనీ మొదలగు పెద్ద వృక్షములును వెదురు వనములును కాననగును తక్కిన ప్రాంతములందు పచ్చిక పట్టులును, చిన్న చెట్లును కలవు దేశీయములగు జంతువులలోనెల్ల పెద్దది అడవి పంది; సరీసృప జాతులు విరివిగ కలవు; పక్షిజాతులును బహుళ సంఖ్యలో ఉన్నవి.

**3. జనసంఖ్య మొ. :** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 18,61,300; ముఖ్య నగరమగు కింగ్‌స్టన్‌లోని జనసంఖ్య 3,76,520. దేశపు జనసాంద్రత చ. కిమీకు 170. ప్రజలలో 40% మంది 15 ఏండ్ల లోపువారలు. మానవ జాతుల రీత్యా ప్రజానీకమున 76.3% నీగ్రోజాతికిని, 15.1% యూరపియన్-నీగ్రో సమ్మిశ్రిత సంతతికిని, 3.4% భారత-పాకిస్తానీ సంతతికిని, 1.2% చీనీయ సంతతికిని, 0 8% యూరపీయజాతికిని చెందినవారు. అయినను ఈ వివిధ జాతులవారు సమరసభావముతో దేశమున వసించుచున్నారు. ఆంగ్లము దేశీయుల

మాతృభాషయైనది; అయినను నీగ్రోభాషల పదములును, ఆంగ్లపదములును మిశ్రితమైన 'పటోయిస్' అను అపభ్రంశమునకు కొంత విరివిగ వ్యాప్తికలదు. దేశీయ రచయితలలో పలువురు తమ ఆంగ్లరచనలలో 'పటోయిస్' పదములను విరివిగ వాడెదరు. దేశీయులలో వివిధ సంప్రదాయములకు చెందిన క్రైస్తవమతము విరివిగ వ్యాప్తియందున్నది; అత్యల్ప సంఖ్యలో యూదులు కలరు.

**4. సమాచార సౌ :** దేశమున 309 పోస్టాఫీసులును, 443 పోస్టల్ ఏజెన్సీలును, 34 సబ్ ఏజెన్సీలును కలవు (1969). టెలిఫోను సౌకర్యము విరివిగ కలదు; టెలిఫోనుల సంఖ్య 71,823 (1971). యు స్టే. తో జలాంతర్గత తంతి ద్వారా టెలిఫోను సంబంధము ఈ దేశమునకు కలదు. రెండు బ్రాడ్ కాస్టింగు స్టేషనులు, ఒక టెలివిజన్ స్టేషను కలవు.

**5. యాన సౌ. :** ద్వీపపు మొత్తమున 4,291 కిమీ. ల పొడవుగల రోడ్లుకలవు రైలు మార్గముల నిడివి 360 కిమీ. దేశపు తీరమున సముద్ర వ్యాపారమునకు అనువగు రేవులు 11 ఉన్నవి. వీనిలో కింగ్‌స్టన్ వద్దది ప్రముఖము. పాలిసాడోస్, మాంటెగో బే అను ప్రదేశములందు అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించు విమానాశ్రయములు ఉన్నవి. ఉత్తర, మధ్య, దక్షిణ అమెరికా రాజ్యములకు వీనినుండి ప్రయాణముచేయు అవకాశములు కలవు.

**6. చరిత్ర :** క్రిస్టఫర్ కొలంబస్ 1494 లో, ఈ దీవిని కనుగొనెను; అంతట 16 వ శతాబ్ది ప్రథమ పాదమున స్పెయిన్ దేశీయులు అట వలస చేరి, అదివరలో అట నివసించుచుండిన ఆదిమ అమెరికన్ జాతులవారిని అంతమొనరించిరి. అంతట దేశమున పనిపాటులకై, స్పెయిన్‌దేశీయులే నీగ్రోబానిసలను విరివిగ ఇటకు చేర్చిరి. 1665 లో స్పెయిన్‌దేశీయులు దేశమునుండి తరలిపోయిరి. 1665 లో బ్రిటిష్‌వారు ఈ దీవిని వశపరచుకొనిరి. అప్పటిలో దేశపు జనసంఖ్య 3,000 మాత్రమే. అందువలన చక్కెర చెరకు మొదలగువాని సేద్యమునకై, పశ్చిమ ఆఫ్రికానుండి నీగ్రో బానిసలను విరివిగ బ్రిటిష్‌వారును కొనివచ్చిరి. 1834 లో బానిస విధానము రద్దగుటతో తోటలలో పనికై, నీగ్రోవారికి బదులుగ చీనీయ, భారతీయ కూలీలను కొనివచ్చుట జరిగినది. క్రమేణా దేశమున పలు రాజ్యాంగ సంస్కరణలను బ్రిటన్, ప్రజలు యొత్తిడికి లొంగి, ప్రవేశపెట్టినది. కడకు ఆగస్టు 6, 1962 న కామన్‌వెల్తున సభ్యత్వము గల స్వతంత్ర రాజ్యముగ జమైకా అవతరించినది.

**7. పరిపాలన :** 1962 లో ఆమోదితమగు రాజ్యాంగ విధానమును అనుసరించి బ్రిటిష్‌రాణికి ప్రతినిధిగ నియమితుడైన గవర్నర్ జనరల్, ప్రజలెన్నుకొనిన పార్లమెంటునకు బాధ్యత వహించిన మంత్రిమండలి సాయమున పరిపాలనను నిర్వహించును. ప్రజాసభ, శిష్టసభ అనదగు రెండు కక్ష్యలు పార్లమెంటున కలవు. సార్వజనికమగు వోటింగు హక్కువలన ఎన్నుకొనబడిన 53 మంది సభ్యులు శాసనసభలో కలరు; అయిదేండ్లకు ఒకసారి ఈ సభకు ఎన్నికలు జరుగును. శిష్టసభ యందలి సభ్యసంఖ్య 21; వీరిలో 13 మందిని ప్రధానమంత్రి సలహాపైనను, 8 మందిని ప్రతిపక్షనాయకుని సలహాపైనను గవర్నర్-జనరల్ నియమించును. ప్రజాసభలో అత్యధిక సంఖ్యాకబలముగల నాయకుని ప్రధానిగ గవర్నర్ జనరల్ నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. దేశపు రాజకీయ పక్షములలో పీపిల్స్ నేషనల్ పార్టీ, జమైకా లేబర్‌పార్టీ అనునవి ప్రముఖములు. దేశపు 14 మండలములలో స్థానిక పాలన, ఎన్నుకొనబడిన కౌన్సిలుల సాయ

ముతో ఉన్నదియున్నది. బ్రిటిష్ విధానమును అనుసరించి న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 1962 మొదలుగ భూతల, వాయుసేనలు రూపొంది పనిచేయుచున్నవి. బ్రిటిష్‌వారి సాయమున వీనికి ఆధునిక సామగ్రియు, ఆయుధములును, శిక్షణయు సమకూడినవి. 1965 లో భూతల సేనయందలి మొత్తపు యోధసంఖ్య 3,002.

**9. అంతర్జాతీయ సం :** 1962 మొదలుగ ఐ. రా. స యందును తదనుబంధ సంస్థలందు పెక్కింటను ఈ దేశము సభ్యత్వమువహించి ఉన్నది; కరిబ్బియన్ కమీషన్‌లోను, కామన్‌వెల్తు నను సభ్యత్వము కలదు. యు. స్టే., బ్రిటన్, కెనడాలతో సన్నిహిత సంబంధము ఉంచుకొని, వానివలన పలురీతుల ఆర్థిక, సాంకేతిక సహాయ మును ఈ దేశము ఆర్జించుచున్నది.

**10. ఆర్థికరంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ ఇదివరలో అచ్చముగ వ్యవసాయము పైననే ఆధార పడియున్నను, 1945 నుండి ఖనిజముల ఉత్పత్తికి, పరిశ్రమలకు కూడా ప్రాముఖ్యము కల్పింపబడినది. 1957 నాటికి, ప్రపంచపు బాక్సైటు ఎగుమతిచేయు దేశములలో ప్రముఖముగ ఈ దేశము లెక్కకు రాగలిగినది. వ్యవసాయపు ఉత్పత్తులలో ప్రధానమైనది చక్కెర; తరువాత అరటిపండ్లు, కోకో, కాఫీ, నిమ్మజాతిపండ్లు క్రమముగ లెక్కింప దగి నవి. ఖనిజములలో బాక్సైట్ తరువాత అల్యూ మినా, జిప్సమ్ లెక్కింపదగినవి. సాలీనా చక్కెర ఉత్పత్తి 379 వేలటన్నులు; బాక్సైట్ ఉత్పత్తి 75,89,775 టన్నులు (1971). దేశమున విద్యుదుత్పత్తి 106.8 కోట్ల కివా. (1968). ఎగు మతుల విలువ 23.58 కోట్ల జ. డాలర్లు: దిగు మతుల విలువ 45.87 కోట్ల జ డా. (1971) బడ్జెటరీ వ్యయము 37,42,30,283 జ. డా.

**11. సాంఘిక రంగము :** దేశమునందలి జనసంఖ్య త్వరిగతిలో పెరుగుట వలన గృహ వసతి సౌకర్యము చాలతక్కువ; అందును అల్పా దాయవర్గముల పరిస్థితి చాల హీనము. ఈ పరిస్థితిని చక్కజేయుటకు 1970 మొదలుగ ప్రభుత్వము కృషిచేయు చున్నది. కార్మికశాసనములు, చక్కగ అమలుపరుపబడుచున్నవి. సరాసరిన ఫేక్టరీలోని సాధారణపు కార్మికుడు నెలకు 77 జ. డాలర్లను ఆర్జించును. ప్రభుత్వము తన బడ్జెటున దాదాపు 15% విద్యాభివృద్ధికై వెచ్చించుచున్నది. ప్రయి మరీ, జూనియర్ సెకండరీ విద్యశాలలందు 6 నుండి 15 వరకు వయస్సుగల విద్యార్థులకు విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. దేశమునందలి అట్టి 721 పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 4,77, 621. ఇవిగాక ఉన్నత పాఠశాలలు 3, సాంకేతిక పాఠశాలలు 5, వృత్తి శిక్షణశాలలు 2, సాంకేతిక విద్యబోధించు ఉన్నత పాఠశాలలు 6, వ్యవసాయ పాఠశాల 1 కలవు. వెస్ట్‌ఇండీస్ దీవుల వారి కందరికి సమష్టిగ ఏర్పాటైన మోనా కాంపస్ విశ్వ విద్యాలయమునను ట్రినిడాడ్‌లోని వ్యవసాయ ఇంజనీరింగు కళాశాలలోను, బార్బడోస్‌లోని న్యాయ కళాశాలలలోను ఈ దేశపు విద్యార్థులు పఠించు చున్నారు. సువ్యవస్థిత రీతిలో గ్రంథాలయోద్య మము దేశమున ఆదరణ పొందినది. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ జమైకా యనుదానియందు వెస్ట్ ఇండీస్ సంస్కృతికి చెందిన ఆధారసామగ్రి ఎక్కువగ కలదు. దేశమున రెండు దినపత్రికలు ప్రచా రమున ఉన్నవి. 6,544 శయ్యా సంఖ్యగల 27 ఆసుపత్రులు దేశమున కలవు; దేశమున వైద్య సంఖ్య 1,259 (1967).

**12. యాత్రా సౌ :** యాత్రికుల వలన దేశమునకు ఆదాయము విరివిగ లభించుచున్నది. ప్రభుత్వము యాత్రిక సౌకర్యములను విరివిగ కల్పించినది. క్రమేణ ఈ యాత్రిక సంఖ్య సంప

త్సరమునకు 20% చొప్పున పెరుగుచున్నది. యు. స్టే. నుండియు, యూరపునుండియు ఇచటికి యాత్రికులు వచ్చుచుందురు. 1971 లో 4,48,554 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. వీరు దేశమునందు దాదాపు 20.03 కోట్ల జ. డాలర్లను వెచ్చించిరి.

---

# 9. టర్క్స్ అండ్ కైకోస్ దీవులు

## (ఆంతరంగిక స్వపరిపాలన కలిగిన కామన్‌వెల్తు రాజ్యము)

**ముఖ్యనగరము :** గ్రాండ్ టర్క్; **జెండా, జాతీయ గీతము, కొలతూకములు, నాణెము** బ్రిటన్‌కు చెందినవియే; **కాలగణన :** గ్రాండ్ టర్క్సన ఉ 7 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** వెస్ట్‌ఇండీస్ ద్వీపసముదాయమున అంతర్భాగమై ఉన్న ఈ ద్వీపరాజ్యమున పెద్దవియు చిన్నవియు కలసి 50 ద్వీపములు కలవు. ఇవి క్యూబాకు తూర్పున కరిబ్బియన్ సముద్రమున అటనట చెదరి ఉన్నవి. ఈ ద్వీపములను టర్క్స్ దీవవర్గము, కైకోస్ ద్వీపవర్గము అని రెండుగ విభవించవచ్చును. 21°30′ ఉ. అ. రేఖన 71°10′ ప. తు. రేఖపైన నెలకొన్న టర్క్స్ ద్వీపవర్గమున 8 ద్వీపములు కలవు. వీనిలో ముఖ్యనగరమగు గ్రాండ్ టర్క్ (24 చ. కిమీ), సాల్ట్ కే (14 చ. కిమీ.) మాత్రమే జనావాసములు కలవి. 21°40′ ఉ. అ. రేఖన, 72° ప. తు. రేఖపై ఉన్న కైకోస్ దీవులలో 6 దీవులు మాత్రమే లెక్కింపదగినవి; అందును సౌత్ కైకోస్, నార్త్ కైకోస్ అనునవి అతి ప్రముఖములు. ఈ ద్వీపరాజ్యపు మొత్తపు వైశాల్యము 430 చ. కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ. :** సరాసరిగ దైనిక ఉష్ణోగ్రత 82° ఫా; అయినను సముద్రపు వాయువుల వలన సౌమ్యము ఏర్పడి ఉష్ణపు తీవ్రత కన్పట్టదు. తుఫానుల బెడద తరుచుగా ఉండును. వర్షపాతము సాలీనా సరాసరి 76 సెం. మీ; త్రాగు నీటికి కరవు పలు ప్రదేశములందు కలదు.

**3. జనసంఖ్య మొ. :** 1965 అంచనాలను అనుసరించి రాజ్యపు జనసంఖ్య 6,000; దాదాపుగ వీరందరును నీగ్రోసంతతికి చెందినవారలే; యూరపియనుల సంఖ్య 100 ను మించదు. ప్రజల మాతృభాష ఇంగ్లీషు ప్రజలందరు క్రైస్తవులు.

**4. సమాచార సా. :** వివరములు తెలియరాలేదు.

**5. యాన సౌకర్యములు :** జమైకాతోను, బహామాస్‌తోను నౌకాయాన సంబంధము విరివిగ కలదు. గ్రాండ్‌టర్క్‌లో యు. స్టే. అధీనమున ఉన్న ఒక సైనిక విమానాశ్రయము కలదు. దీనిని పౌరవిమానములును ఉపయోగించుకొనుచున్నవి. ఇది గాక ద్వీపములందు కొన్నింట విమానములకు దిగు వసతులు కలవు. వీనివలన దీవులమధ్య, నౌకాయానమునకు తోడుగ, విమానయాన సౌకర్యమును ఎర్పడినది.

**6. చరిత్ర :** జాన్ పొన్స్ డి లియాన్ అనువానిచే 1512 లో ఈ దీవులు కనుగొనబడినవి. కాని 1678 వరకు ఇవి నిర్జనములుగనే ఉండినవి.

ఆ తరువాత బెర్మ్యూడా నుండి నీగ్రోలు వచ్చిచేరిరి. తరువాత బ్రిటిష్‌వారు ఈ దీవులను ఆక్రమించి, రాజ్యాంగరీత్యా, జమైకాతో వీనిని చేర్చి, వలస పాలనను నిర్వహించిరి. 1952 లో బ్రిటిష్ ప్రభుత్వపు సమ్మతితో గ్రాండ్ టర్క్‌లో, ఒక నియంత్రిత క్షిపణి (గైడెడ్ మిసిలీ) కేంద్రమును యు. స్టే. నెలకొల్పినది. 1962 లో స్వతంత్రమైన తరువాత, ఈ దేశము జమైకా బ్రిటిష్ ప్రభుత్వపు మకుటపు వలసగ మారి, అనంతరమున ఆంతరంగిక స్వపరిపాలన కలిగిన కామన్‌వెల్త్ రాజ్యమైనది (1965).

**7 పరిపాలన:** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, ఒక స్టేట్ కౌన్సిల్ సాయముతో ఇచట పరిపాలనను నిర్వహించును. స్టేటు కౌన్సిలున ఒక స్పీకరు, ముగ్గురు అధికార సభ్యులు, రెండుకు తగ్గక మూడుకు మించక ఉండెడు నామినేటెడ్ సభ్యులు, తొమ్మిదిమంది ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. 'బహామాస్' ద్వీపరాజ్యపు గవర్నరే, ఈ ద్వీపరాజ్యమునకును గవర్నరుగ ఉన్నాడు.

**8. దేశరక్షణ. 9. అంతర్జాతీయ సం.:** ఈ రెండింటి బాధ్యతలను బ్రిటిష్ ప్రభుత్వమే నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** దేశమున ముఖ్యమగు పరిశ్రమ ఉప్పుసేకరణ; తరువాత శంఖముల, శంఖపు చిప్పలసేకరణ చెప్పదగినది. మత్స్య పరిశ్రమయు కొంత సాగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 63,133 పౌనులు; దిగుమతుల విలువ 4,42,793. బడ్జెటరీ వ్యయము 5 32, 173 పౌ. (1971).

**11. సాంఘిక రంగము:** దేశమున 7నుండి 14 వరకు వయసు కలిగిన బాలబాలికలకు ప్రభుత్వమునకు చెందిన పాఠశాలలలో విద్య ఉచితముగ బోధింపబడుచున్నది; అందలి విద్యార్థి సంఖ్య 1,665 (1968).

**12 యాత్రా సౌ.:** యాత్రిక పరిశ్రమను ఒక ఆదాయ మార్గముగ చేయుటకై ప్రస్తుతమున ప్రభుత్వము కృషిచేయుచున్నది.

---

# 10. ట్రినిడాడ్ అండ్ టొబాగో

**ముఖ్యనగరము:** పోర్ట్ - ఆఫ్ - స్పెయిన్; **జెండా:** వాయవ్య, ఆగ్నేయ కోణభాగములను కలుపుచు గీయబడిన నలుపుచార, దానికి ఇరువైపుల తెలుపుచారలు కలిగి, తక్కిన పతాక భాగము ఎరుపుగ ఉండునది; **జాతీయగీతము:** ఫోర్జ్‌డ్ ఫ్రం ది లవ్ ఆఫ్ లిబర్టీ......(స్వాతంత్ర్య ప్రేమలో రూపొంది......) అను చరణముతో మొదలిడునది; **నాణెము:** ట్రినిడాడ్ అండ్ టొబాగో డాలరు; ఇది 100 సెంట్లుగ విభక్తము; ఒక ట్రి. డాలరు = రు. 3.75; **కొలతూకములు:** బ్రిటిష్ విధానపువి; **కాలగణన:** ఉ. 8 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఇండీస్ ద్వీపసమూహమున, లెస్సర్ ఆంటిల్లీస్ అనబడు ఉపవర్గపు దక్షిణపు కొట్టకొనన, $10°2'$-$11°21'$ ఉ. అ. రేఖల మధ్యను $60°30'$-$61°56'$ ప. తు. రేఖల మధ్యను నెలకొనియున్న ఈ ద్వీపరాజ్యము పశ్చిమమున కరిబ్బియన్ సముద్రము చేతను, తూర్పున అట్లాంటిక్ మహాసముద్రముచేతను పరివృతమై ఉన్నది. ఈ ద్వీపరాజ్యమున ప్రముఖమగునది ట్రినిడాడ్

ద్వీపము; దాదాపుగ దీర్ఘ చతురస్రాకారమున ఉండు ఈ దీవియొక్క ఉత్తర దక్షిణముల నిడివి సరాసరిన 82 కిమీ.; తూర్పు పడమరల కొలత సరాసరి 61 కిమీ.; వైశాల్యము 4846 చ. కిమీ.; ఆ దీవి తరువాత లెక్కకు వచ్చునది టొబాగో; పొగాకు చుట్టవలె రూపుగొనియున్న ఈ దీవినిడివి 30 కిమీ.; వైశాల్యము 201 చ. కిమీ. ఇవిగాక 16




పటము 8.

అల్పద్వీపములు ఈ రాజ్యమున చేరి ఉన్నవి. రాజ్యపు మొత్తపు వైశాల్యము 5,148 చ. కిమీ. ట్రినిడాడ్ దీవిలో తూర్పు పడమరలకు పయనించు పర్వతశ్రేణిలో 910 మీ. ఎత్తును మించిన శిఖరములు కలవు. తూర్పు, దక్షిణ, పశ్చిమతీరములందు చిత్తడినేలలు కలవు తక్కినది చాలవరకు సమతలము. టొబాగో దీవియందు భూతలము ఎగుడుదిగుడులుగ ఉండును; అచట ఒక అగ్ని పర్వతమును కలదు. సమతల భూమి ద్వీపపు ఆగ్నేయ ప్రాంతమున మాత్రమే కొలదిగ కాననగుచున్నది. ట్రినిడాడ్‌లో సెలయేరులు కొన్ని కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.** : ఏడాది పొడవున ఉష్ణోగ్రతల మధ్య వ్యత్యాసము చాల తక్కువ. ఎల్లెడల సరాసరిన సాలీనా ఉష్ణోగ్రత 70° ఫా. కు అటునిటుగ ఉండును. అధికోష్ణ, అల్పోష్ణతల మధ్య వ్యత్యాసము 35° ను మించదు. ట్రినిడాడ్ లోని పర్వత సీమలందును, టొబాగోలోను సాలీనా సరాసరిన వర్షపాతము 250–570 సెం. మీ. మధ్య ఉండును. తక్కిన ప్రాంతములందు ఆ వర్షపాతము 125–200 సెం. మీ. మధ్య మారుచుండును. జూన్ నుండి డిసెంబరువరకు వర్షఋతువు; అయినను తక్కిన కాలమున సైతము అంతటంతట జల్లులు పడుచుండును. అటవీ ప్రాంతము ఎక్కువగ ఉన్నను, విలువగల వృక్షసంతతి అధికముగ లేదు; వన్యజంతువులలో పెద్దవి కోతులు మాత్రమే; సరీసృపజాతులును, పక్షిజాతులును విరివిగ కలవు. 'బర్డ్ ఆఫ్ పారడైజ్' అనబడు ఒక వింతపక్షిజాతికై ఒక ఆశ్రయమును ప్రభుత్వము నడుపుచున్నది.

**3. జనసంఖ్య మొ.** : 1960 అంచనా లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 10,40,000. రాజ్యపు నగరములలో ముఖ్యనగరమగు పోర్ట్ ఆఫ్ స్పెయిన్ (జ. సం. 2,50,000), సాన్ ఫెర్నాండో (జ. సం. 50,000) ప్రముఖములు. జనసాంద్రత చ. కిమీ కు 195%; ప్రజానీకమున 43% నీగ్రో సంతతికి; 36% భారత పాకిస్తానీ సంతతికి, 3% యూరపీయ సంతతికి, 2% చీనీయ సంతతికి, 16% సమ్మిశ్ర జాతికి చెందినవారు. వ్యవసాయిక ప్రాంతములలో భారత పాకిస్తానీ సంతతివారు ఎక్కువ; వ్యాపారరంగమునను వారికి సముచిత స్థానము కలదు. ఆంగ్లము సాధికార భాష; అయినను వివిధ విదేశీయ భాషా పదములతో కలసి, అపభ్రంశరూపమున, వింత ఉచ్చారణతోఉండు ఆంగ్లము సర్వేసర్వత్రా దైనిక వ్యవహారములందు వాడబడుచున్నది. భారత - పాకిస్తానీ సంతతివారిలో, అందును, ముఖ్యముగ పూర్వపు తరమునకు చెందినవారిలో, అత్యధి

కముగ హిందీయు. అప్పటప్పట ఉర్దూ, తమిళ్, తెలుగులును మాతృభాషలుగ ప్రచారమున ఉన్నవి. ప్రజానీకమున 71% క్రైస్తవులు; అందు రోమన్ కేతలిక్కులు అధిక సంఖ్యాకులు; 23 హిందువులు; 6 ముస్లిములు.

**4. సమాచార సౌ.:** రాజ్యమున 203 పోస్టు ఆఫీసులును తగినంతగ తంతి, టెలిఫోను వసతులును కలవు. ప్రయివేటు యాజమాన్యమున మూడు రేడియో స్టేషనులు పనిచేయుచున్నవి; టెలివిజన్ ప్రసారమును కలదు; ముఖ్యముగా విద్యాబోధనకు అది వినియుక్తము. ప్రపంచ రాజ్యములన్నిటితోను కేబుల్ ద్వారాను, రేడియో-టెలిఫోను ద్వారాను వార్తా సంబంధము దేశమున కలదు.

**5. యాన సౌ.:** రాజ్యమున 4,166 కిమీ. నిడివిగల రోడ్లు కలవు; ట్రినిడాడ్‌లో రోడ్లవసతి బాగుగా ఉన్నను, టొబాగోలో చాల తక్కువ. 175 కిమీ. నిడివిగల రైలుమార్గములు కలవు; నగరమునకు సమీపమున ఉన్న పియార్కోలోని అంతర్జాతీయ విమానాశ్రయము వలన పలు ప్రముఖ దేశములకు విమానయానపు వసతి ఏర్పడినది. ఇదిగాక ద్వీపములందు అటనట ఉన్న 12 విమాన క్షేత్రములవలన ద్వీపముల మధ్యను, వెస్ట్ఇండీస్ దీవులలోని తక్కిన దీవులతోను ప్రయాణ సౌకర్యము ఏర్పడినది.

**6. చరిత్ర:** క్రిస్టఫరు కొలంబస్ ఈ దీవులను 1498 లో కనుగొని 'లా ట్రినిడాడ్' అని పేరిడెను. కాని స్పెయినువారు 1552 నుండి మాత్రమే అట చేరిరి. తదనంతరమున పనిపాటులకై నీగ్రో బానిసలను అటకు కొనివచ్చుట జరిగినది. 1797లో బ్రిటిష్‌వారు ఈ ద్వీపరాజ్యమును ఆక్రమించిరి. 1845 మొదలుగ ఇట చక్కెర-చెరకు పొలములలో పనిచేయుటకు భారతదేశమునుండి కూలీలను బ్రిటిష్ ప్రభుత్వము కొనివచ్చినది. వీరి సంతతి వారే అచట ఇపుడున్న భారత-పాకిస్తానీ సంతతివారు. కాలక్రమమున అచటి ప్రజలకు ప్రభుత్వమున భాగస్వామ్యమును కల్పించగ, ఆగస్టు 31, 1962న దేశము సర్వస్వతంత్రమై, కామన్‌వెల్తున సభ్యత్వమును కలిగి యున్నది

**7. పరిపాలన:** బ్రిటిష్‌రాణి నియమించు గవర్నర్ జనరల్, ఇచట రాజ్యాంగబద్ధ అధినేతగ ఎన్నుకొనబడిన ప్రజాసభకు బాధ్యత వహించుమంత్రి వర్గపు సాయమున పాలనను నిర్వహించుచున్నాడు. సార్వజనిక వోటుహక్కున (సాధారణముగ అయిదేండ్ల కొకసారి) ఎన్నుకొనబడిన, 36 మంది సభ్యులుగల ప్రతినిధిసభ కలదు; శిష్టసభ అనునది వేరొకటి కలదు; అందలి సభ్యసంఖ్య 24; వీరిలో 13 మందిని ప్రధానమంత్రి సలహాను అనుసరించి, నలుగురను ప్రతిపక్ష నాయకుని సలహాపైనను, ప్రధాని సలహాపై తనకు తోచినరీతిలో ఏడుగురను-ఆర్థిక, ధార్మిక, సాంఘిక విషయములందు నిపుణులను-గవర్నర్ జనరల్ నియమించును. ప్రతినిధి సభయందు అత్యధిక సంఖ్యాక బలముకలవానిని ప్రధానిగను, అతని సలహాపై తక్కిన మంత్రులను గవర్నర్-జనరల్ నియమించును. పీపుల్స్ నేషనల్ మువుమెంట్, డెమోక్రాటిక్ లేబర్‌పార్టీ అను రెండు రాజకీయ పక్షములు కలవు. తొలుతటిది అచ్చముగా నీగ్రోల పార్టీ; రెండవ దానియందు భారతీయ-పాకిస్తానీ సంతతి వారు అత్యధిక సంఖ్యాకులు. బ్రిటిష్ విధానమును అనుసరించి న్యాయనిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ:** నామమాత్రపు సైన్యము కలదు.

**9. అంతర్జాతీయ సం.:** 1962 మొదలుగ ఐ. రా. స. లోను, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను, అమెరికా రాజ్యవ్యవస్థలోను,

కరిబ్బియన్ స్వేచ్ఛా వాణిజ్యప్రాంతపు ఒడంబడిక యందును సభ్యత్వమునను ఈ రాజ్యము కలిగి యున్నది.

**10. ఆర్థిక రంగము :** తొలుత ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపైన మాత్రమే ఆధార పడియుండినను, 1950 తరువాత దేశమున పరి శ్రమలకు కలిగిన ప్రోత్సాహమువలన పారిశ్రామిక రంగముకూడ, చాల ముందునకు రాగలిగినది. వ్యవసాయోత్పత్తులలో చక్కెర, కోకో, కాఫీ, నిమ్మజాతిపండ్లు, అరటిపండ్లు క్రమప్రాముఖ్యము కలిగి ఉన్నవి. పాడిపరిశ్రమ, కోళ్ళపెంపకము విరివిగ వ్యాప్తియందు ఉన్నవి. ఆహారవస్తువులకు మాత్రము చాలవరకు దేశము ఎగుమతులపై ఆధారపడి ఉన్నది. దేశపు భూతలమున 50% సేద్యమున ఉన్నది. ముడి పెట్రోలియమ్ లభించుచున్నది. దీనినిమాత్రమేగాక, సమీపదేశ ముల నుండి ఇటకు కొనివచ్చు ముడి పెట్రోలును కూడ ఈ దేశపు రిఫైనరీలు శుద్ధిచేసి, అందు అత్యధిక భాగమును విదేశములకు ఎగుమతి చేయు చున్నవి. అందువలన ఎగుమతులలో పెట్రోలు నకు ప్రముఖస్థానము లభించినది; తరువాత లెక్కకు వచ్చునది చక్కెర. మొత్తముమీద దేశము చిన్నదేయైనను వ్యాపార ప్రమాణము చాల ఎక్కువ. దేశమున విద్యుదుత్పత్తి సమర్థత 2,53,000 కివా. దేశపు ఎగుమతుల విలువ 89, 88,70,500 ట్రి. డాలర్లు; దిగుమతుల విలువ 96,53,99,600 ట్రి. డా. (1969). బడ్జెటరీ వ్యయము 32,53,30,000 ట్రి. డా.

**11 సాంఘిక రంగము :** దేశమున, గృహ వసతి చాల తక్కువ. దేశమున పదేండ్లకు పైబడిన వారిలో అక్షరాస్యత 80%; ఉచిత వైద్యసౌకర్యము కలదు. దేశమున 601 ప్రయిమరీ పాఠశాలలలో 2,19,679 మంది; 112 సెకండరీ పాఠశాలలలో 27,465 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక 5 ట్రెయినింగ్ కళాశాలలు, 4 సాంకేతిక పాఠశాలలు కలవు. 1962 లో ఒక ఒప్పం దమును అనుసరించి జమైకాలోని వెస్ట్ఇండీస్ విశ్వవిద్యాలయమునందు ఈ రాజ్యపు విద్యార్థులకు ఉన్నత విద్యాభ్యాసమునకు అవకాశములు కలవు. ముఖ్యనగరమునందలి గ్రంథాలయము, మ్యూజి యము, జంతువనము గణనీయములు. దేశమున ప్రచారమున ఉన్న మూడు దినపత్రికలలో 'గార్డి యన్' అనునది ప్రముఖము. దేశమున వైద్య వసతులు క్రమేణ అభివృద్ధి అగుచున్నవి. ముఖ్య నగరమున ఒకటియు, సాన్ ఫెర్నాండోలో వేరొ కటియు పెద్ద ఆసుపత్రులు కలవు; చిన్న ఆసు పత్రులు తక్కిన ప్రముఖ కేంద్రములందు కలవు.

**12. యాత్రా సౌ. :** దేశపు ప్రకృతి సౌందర్యమును, వివిధ మతానుయాయుల ఆరాధనా స్థలములను దర్శించుటకు పలువురు విదేశీయులు దేశమును దర్శింతురు, ప్రభుత్వము పలు సౌకర్య ములను వీరికి సమకూర్చుచున్నది. యు. స్టే., కెనడా, బ్రిటిష్ పౌరులు, ఆరునెలల వరకు, పాస్ పోర్టు లేకుండానే, ఇట ఉండవచ్చును, తక్కిన వారికి వీసా, పాస్‌పోర్టులు విధిగా ఉండవలెను. 1971 లో 140,000 విదేశీయులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. ఎరిక్ యుస్టేస్ విలియమ్స్ (జ. 1911): దేశ స్వాతంత్ర్యకృషిలో ప్రజలకు నాయకత్వము వహించి,స్వతంత్ర్య ప్రసిద్ధి అనంతరమున, ప్రప్రథమ ప్రధాని అయినవాడు. 2. విద్యాధర్ సూర్యప్రసాద్ నయపాల్ (జ 1924) అంతర్జాతీయ ప్రఖ్యాతి పొందిన ఆంగ్ల నవలా రచయిత; దేశపు భారతీయ సంతతివారి జీవిత విధానమును రమ్యరీతిలో ప్రదర్శించుట ఈతని రచనలలో పెక్కింటియందలి విశిష్టత.

# 11. డొమినికన్ రిపబ్లిక్

**ముఖ్యనగరము :** సాంతో డొమింగో; **జెండా:** తెల్లని రేఖలచే చిత్రితమగు సిలువవలన నాలుగు సమవైశాల్యపు దీర్ఘచతురస్రములుగ పతాకతలము విభజితముకాగా, అందు వాయవ్య, ఆగ్నేయ దీర్ఘ చతురస్రములు నీలిమలోను, తక్కినవి ఎరుపు లోను అమరియుండి సిలువ మధ్యభాగమున జాతీయ యోధలాంఛనము శ్వేత, నీల, స్వర్ణ, హరిత వర్ణములలో అమరియుండునది; **జాతీయ గీతము :** క్విస్క్వె యానోస్ వేలియెన్టెస్' (దేశీయ వీరులారా)




పటము 9.

అను పదములతో మొదలిడునది; **నాణెము :** దొమినకన్ పెసో; 100 సెంటవోలుగ ఇది విభక్తము; ఒక డొ. పెసో = 7.56; **కొలతూతములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ. 7 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర అమెరికా మధ్య భూమికి తూర్పున, అట్లాంటిక్ మహాసముద్ర పరివృతమగు హిస్పానియోలా దీవియందు మూడింట రెండువంతుల భూమిని ఆక్రమించిన ఈ దేశము 17°36′22″–19°56′9″ ఉ. అక్షాంశ రేఖల మధ్యను, 68°19′24″–72°0′4′8″ ప. తులా రేఖల మధ్యను విస్తరించియున్నది; దేశమునకు ఉత్తరమున అట్లాంటిక్ మహాసముద్రమును, దక్షిణమున కరిబ్బియన్ సముద్రమును, తూర్పున 'మోనా పాసేజి' అను జలసంధియు, పశ్చిమమున హాయిటీ దేశమును సరిహద్దులందున్నవి; పోర్టోరికో నుండి ఈ దేశమును మోనా పాసేజి వేరుచేయుచున్నది. దేశమునకు కొలది దూరమున ఉన్న కొన్ని అల్పద్వీపములును రాజ్యాంగరీత్యా దేశమున చేరి ఉన్నవి దేశపు మొత్తపు వైశాల్యము (48, 734 చ. కిమీ; తూర్పు పడమరల గరిష్ఠపు పొడివి 384 కిమీ; ఉత్తరదక్షిణముల గరిష్ఠపు కొలత 272 కిమీ. దేశము చాలవరకు పర్వతమయము; పడమటి కొననున్న ప్రాంతములు ఎడారిభూములు. తూర్పునుండి పడమరకు వ్యాపించిన మధ్య కోర్డిల్లేరా పర్వతశ్రేణిలో పైన్ వృక్షముల అడవులు కలవు పర్వతశ్రేణుల మధ్యఉన్న సిబావో లోయ (224 కిమీ. పొడవు; సరాసరి వెడల్పు 23 కిమీ.) అతి సారవంతమని పేరు గన్నది. తక్కిన దేశమున కన్పట్టు లోయలును కొంతవరకు సారవంతములే వెస్ట్ ఇండీస్ ద్వీపసమూహము నందెల్ల అత్యున్నతమని పేరొందిన 'దువర్తి' శిఖరము ఈ దేశపు పర్వతశ్రేణిలో కలదు; అటులే అతి నిమ్నతకు పేరొందిన ఎన్‌రిక్విలో సరస్సునుకలదు. (ఇది సముద్ర మట్టమునకు 44 మీ. దిగువన ఉన్నది). యాకీ డెల్ నార్తీ, యాకీ డెల్ సూర్, యూనా అనునవి దేశపు ప్రముఖనదులు.

**2 శీతోష్ణస్థితి మొ. :** ప్రాంతములను బట్టి, వాని ఉన్నతినిబట్టి శీతోష్ణస్థితి మారుచున్నది. మొత్తముమీద గ్రీష్మర్తువున 73°-95′ ఫా. వరకును; శీతకాలమున 65°–85′ ఫా. వరకును, సరాసరిన, ఉష్ణోగ్రత మారుచుండును; సాలున

తూర్పుదేశమున వర్షపాతము 132 సెం. మీ; ఈశాన్యప్రాంతమున 205 సెం. మీ; పశ్చిమ ప్రాంతమున 43 సెం. మీ. మే నుండి నవంబరు వరకు వర్షర్తువు. తుఫానులబాధ ఎక్కువ. పర్వత శ్రేణులందు మాత్రమే సాంద్రాటవులు కలవు: వీనిలో లభించు మహాగనీ కలప ప్రశస్తమమని పేరొందినది; వన్యజంతువులలో పెద్దవిగా లెక్కింపదగినవి అడవిపందులు; సరస్సులలో మొసళ్లు, వివిధ జలచరములు కలవు; పక్షిజాతులును పలుతీరులవి కన్పట్టును.

**3. జనసంఖ్య మొ :** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 40,11,589. నగరములలో సాంతో డొమింగో (జ. సం. 5;29,396), సాంతియాగో డెలోస్ కబల్లెరోస్ (జ. సం. 3 29,808), సాన్ క్రిస్టోబల్ (జ.సం. 2,84,094), లా వేగా (జ. సం. 2,84,139) పేర్కొనదగినవి. జనసాంద్రత చ. కిమీ. కు 85. దేశ ప్రజలలో 70% పల్లెపట్టులందు నివసించుచున్నారు ప్రజానీకమున 15% అచ్చపు శ్వేతజాతికిని, 15% అచ్చపు నీగ్రో జాతికిని, తక్కినవారందరును, సమ్మిశ్ర జాతికిని చెందినవారు. స్పానిష్ భాష సాధికార భాషగ లెక్కింపబడుచున్నది; ముఖ్యనగరమున కొంతవరకు ఆంగ్లమును, పశ్చిమపు సరిహద్దు ప్రాంతమున క్రియోల్ అనబడు సంకరపు భాషయు వ్యాప్తియందున్నవి. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు; అందును రోమన్ కేతలిక్ సంప్రదాయపువారు ఎక్కువ; కొలదిగ యూదులు కలరు.

**4. సమాచార సా. :** రాజ్యమున 155 పోస్టాఫీసులును, 76 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 36 రేడియో టెలిగ్రాఫ్ ఆఫీసులును పనిచేయుచున్నవి (1970). 1972 లో టెలిఫోనుల సంఖ్య 55,982; వీనిలో 42,291 ముఖ్యనగరముననే కలవు. రేడియో టెలిగ్రాఫ్ద్వారా, దూర దేశములతో కేబుల్, సంబంధమును, ఈ రాజ్యమునకు కలదు. 70 రేడియో స్టేషనులు కలవు; 1965 మొదలుగ టెలివిజన్ సౌకర్యము ఏర్పడియున్నది.

**5. యాన సౌ. :** దేశపు మొత్తపు రోడ్లనిడివి 6,250 కిమీ. ఇందు 4,250 కిమీ ఉత్తమ శ్రేణికి చెందినది. 1,444 కిమీ. నిడివికల రైలు మార్గములు కలవుగాని, చక్కెర తోటల పనిపాటులకు మాత్రమే, అవి ఉపయోగపడుచున్నవి అందువలన పౌరుల ప్రయాణము మోటారు బండ్లవలన మాత్రమే జరుగుచున్నది. దేశపు సముద్రపు రేవులలో సాంతో డొమింగో ప్రముఖము; ఆ తరువాత లెక్కకు వచ్చునది పోర్టోప్లాటా. సాంతో డొమింగోకు సమీపమున ఉన్న పుంతా కాసెడో విమానాశ్రయమునుండి వివిధ విదేశములకు విమానయాన సౌకర్యము కలదు. ఇదిగాక దేశమధ్యమున 15 చిన్న విమానాశ్రయములు కలవు.

**6. చరిత్ర .** ఈ దేశమును, హయిటీ దేశమును అంతర్భాగములుగనున్న హిస్పానియోలా దీవియందే, పశ్చిమార్ధ గోళమునకు సంబంధించినంతవరకు, యూరపీయులు తొలుత కాలిడిరి (1492). 1503 నాటికి స్పెయిన్ వారిట వలస చేరి, అచటి ఆదిమ అమెరికనులను అంతమొనరించి, పశ్చిమార్ధగోళపు తక్కిన ప్రాంతములను జయించుటకు దీనిని ఒక స్థావరముగ చేసికొనిరి. నీగ్రోలను బానిసలుగ వారు ఇచటికి కొనివచ్చిరి. 1697 లో ఫ్రెంచివారికి ఈ దీవిలోని హయిటీయు, తరువాత 1759 లో డొమినికన్ రాజ్యమును వశమైనవి. 1804 లో హయిటీ స్వతంత్రతను ఆర్జించి, 1822 లో ఈ దేశమునుకూడ వశపరచుకొనినది. కాని దేశ ప్రజలు తిరుగుబాటుజరిపి 1844 లో స్వాతంత్ర్యమును ఆర్జించిరి. అయినను దేశమున అంతః కల్లోలములు చెలరేగి, స్థిర ప్రభుత్వమేలేని పరిస్థితి అతిదీర్ఘకాలము కొనసాగెను. కడకు 1905 నాటికి దేశ ప్రభుత్వము యు. స్టే. కు విప

రీతముగా ఋణపడినది; అంతట సుంకముల వసూలు అధికారమును యు. స్టే. కు ఈ దేశపు ప్రభుత్వము వశము చేసినది; ప్రజలు దీనిని అంగీకరింపక తిరుగుబాటుచేయగ, యు. స్టే. ప్రభుత్వము తన సేనలను దింపి. దేశమును వశపరచుకొని (1916), 1924 వరకు పాలించెను. అంతట మరల దేశము స్వతంత్రమైనను, ప్రభుత్వమున సుస్థిరత లేకుండెను. కాని 1930 లో అధికారమును గ్రహించిన రఫేల్ లియోనిడస్ త్రుజిల్లో మోలినా అను సేనాని, నియంతృత్వ పద్ధతిలోనే పాలించి నను, దేశమునకు సుస్థిర ప్రభుత్వమును కల్పించెను అతని అనంతరమున 1961 మొదలుగ దేశమున మరల అస్తవ్యస్తత ఏర్పడి అంతర్యుద్ధమునకు దారితీసినది. అంతట అమెరికన్ రాజ్య వ్యవస్థ జోక్యము వహించగ శాంతి ఏర్పడి (1965) ఒక రాజ్యాంగ విధానమును రూపొంది, సక్రమ ప్రభుత్వము నెలకొనగలిగినది

**7. పరిపాలన :** వయోజనులగు ప్రజలచే, సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ఎన్నుకొనబడు అధ్యక్షుడు, శాసన సభకు బాధ్యతవహించు మంత్రివర్గపు సాయముతో, దేశమును పాలించును. దేశమును 26 రాష్ట్రములును, ఒక జాతీయ మండలమును ఎన్నుకొనిన 27 మంది సభ్యులుకల ఒక శాసనసభయు, 50,000 ప్రజలకు ఒక సభ్యుడు చొప్పున ఎన్నుకొనబడిన 74 సభ్యులుకల శిష్టసభయు కలదు. ఈ సభలలోని సభ్యుని పదవీకాల పరిమితి 4 ఏండ్లు. 9 మంది జడ్జీలుగల సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** భూతల సేనయందు 9,000 మంది సైనికులు గలరు; ఈ సేనలో 4 పదాతి దళములును ఒక సాయుధ శకట దళమును, విమానఘ్నదళమును, చిన్నతరహా టాంకులును, కలవు. నౌకాసేనలోని యోధసంఖ్య 3,400; ఇందు 2 ఫ్రిగేట్లు, 3 పహరా నౌకలు, 5 తీర రక్షక నౌకలు; 3 మోటారు బోట్లు, 14 తక్కు విధముల పడవలు కలవు. రెండు పటాలముల వాయుసేన కలదు; ఇందలి యోధసంఖ్య 3,500; విమాన సంఖ్య 110.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికన్ రాజ్య వ్యవస్థయందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10 ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. దేశపు సమష్టి జాతీయోత్పత్తిలో 41% వ్యవసాయమువలన, 17% వ్యాపారమువలన, 15% వస్తునిర్మాణ కృషివలన, 27% తక్కువానివలన లభించుచున్నది. తలసరి ఆదాయము 238 అమెరికన్ డాలర్లు (1967). దేశ భూతలమున సగము వ్యవసాయానుకూలము. కార్మికశక్తిలో 70% వ్యవసాయమున కృషిచేయుచున్నది. చక్కెర చెరకు ఉత్పత్తిలో ప్రథమ శ్రేణికిచెందిన రాజ్యములలో ఈ దేశము ఒకటి. చక్కెర తరువాత కాఫీ, కోకో, పొగాకు క్రమరీతిలో లెక్కింపదగినవి. పశుపోషణయు, శాస్త్రీయ రీతిలో, సాగుచున్నది. వెన్న, జొన్న, గడ్డపాలు, ఎగుమతి యగుచున్నవి. తీరమున మత్స్య పరిశ్రమవలన, చేపల ఎగుమతియు విరివిగ వృద్ధిచెందుచున్నవి. దేశమున 18.8% భూమి అటవీమయము; ఇందలి కలప చాలవరకు దేశముననే వినియుక్తమై కొలదిగ మాత్రమే ఎగుమతి యగుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 70.1 కోట్ల కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 21.32 కోట్ల డా. పెసోలు; దిగుమతుల విలువ 26.68 కోట్ల డా. పే. (1970). ఎగుమతుల విలువలో సగమునకు పైగా చక్కెరవలన లభించు

చున్నది. దేశపు వ్యయము 23.03 కోట్ల పె. పె. (1969).

**11. సాంఘిక రంగము :** గృహవసతి ప్రజలందరికిని కల్పించుటకు 1962 మొదలుగ ప్రభుత్వము కృషిచేయుచున్నను, తగిన వసతి ఇప్పటికిని ఏర్పడకున్నది. 15 ఏండ్లకు పైబడిన వారిలో నిరక్షరాస్యత 40 % (1961). నిర్బంధ, ఉచిత ప్రయిమరీ విద్యావిధానము అమలున ఉన్నది. దేశమున 4,360 ప్రయిమరీ పాఠశాలలును, 59 సెకండరీ పాఠశాలలును పనిచేయుచున్నవి; వీనిఅన్నింట కలసివిద్యార్థి సంఖ్య 5,42,579 (1962 సాంతో డొమింగో విశ్వవిద్యాలయము 1538 లో స్థాపితము; ఇందలి విద్యార్థి సంఖ్య 5,503 (1964) దేశమున 100 గ్రంథాలయములు కలవు; వీని అన్నింట, సాంతో డొమింగో విశ్వవిద్యాలయమునందలిది ప్రముఖము; ఆ గ్రంథాలయమున దాదాపు 5 లక్షల గ్రంథములు కలవు. దేశమున ప్రచారమునఉన్న ఆరు దినపత్రికలలో, ముఖ్యనగరమునుండి వెలువడుచున్న ఎల్ కరిబీ అనునది ప్రముఖము. దేశమున 1,776 శయ్యాసంఖ్యకల 30 ఆసుపత్రులును, సాంఘిక భద్రతా వైద్యశాలలును, 105 ప్రయివేటు వైద్యశాలలును కలవు (1964).

**12. యాత్రా సౌ :** పాస్‌పోర్టు, వీసాలు అవసరము లేకుండా, గుర్తింపు కార్డు సహాయమున మాత్రమే ఈ దేశమున విదేశీయులు పర్యటించవచ్చును. 1968 లో యాత్రికులవలన ఒక కోటి పెసోల ఆదాయము దేశమునకు లభించినది.

**13 ప్రసిద్ధ పురుషులు :** 1. జాన్ పాబ్లో దువార్తె (1813-76); హయితి రాజ్యపు సేనలను నిర్జించి దేశమునకు స్వాతంత్ర్యమును కల్పించుటలో నాయకత్వము వహించిన జాతీయ వీరుడు.

---

# 12. నికరాగ్వా

**ముఖ్యనగరము :** మనాగువా; **జెండా :** రెండు నీలి అడ్డుచారల నడుమ అమరిన తెలుపు అడ్డుచార మధ్యన చిత్రితమగుజాతీయయోధ లాంఛనము కలది; **జాతీయ గీతము :** ప్రాత్రియా అమదా (ప్రేమిత జన్మభూమి) అనబడునది **నాణెము :** కోర్డోబా; ఇది 100 సెంటవోలుగ విభక్తము; ఒక కోర్డోబా = రు 1 07, **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 6 గం. = భారత దేశమున సా 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య అమెరికా రాజ్యములందెల్ల విస్తృతియందు మిన్నయగు ఈ దేశము 10°-15° ఉ. అ. రేఖల మధ్యను, 83°-87° ప తు. రేఖల మధ్యను నెలకొని ఉన్నది. దేశమునకు ఉత్తరమున హొండూరాస్, దక్షిణమున కోస్టా రికా, తూర్పున కరిబ్బియన్ సముద్రము, పశ్చిమమున పసిఫిక్ సముద్రము సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 1,48,000 చ. కిమీ. ఈ వైశాల్యమున దేశపు పెద్దసరస్సుల – నిగరాగ్వా, మనాగువా సరస్సుల – వైశాల్యము (9,000 చ. కిమీ) కూడ చేరి ఉన్నది. కరిబ్బియన్ సముద్రపు వెంబడి తీరమైదానము 80 మొదలుగ 160 కి. మీల వెడల్పు కలిగిన అతి నిమ్నపు సమతలము అందు చిత్తడి నేలలును, ఉష్ణమండలపు అడవులను, చిట్టడవులును కననగును. ఈ తీరమైదానము క్రమముగ పైకి లేచి దేశాంతర్భాగమున ఒక పీఠభూమిగ పరిణమించును; ఈ పీఠభూమి

దేశభూతలమున దాదాపు మూడవవంతును ఆక్రమించినది. పీఠభూమిలో పడమటినుండి తూర్పునకు పర్వత శ్రేణులు అటనట వ్యాపించి కరిబ్బియన్ తీరపు దరిదాపులను చేరును. ఈ పర్వత శ్రేణులలోనే దేశపు అత్యున్నత పర్వత శిఖరము 'మెలయా' (2,000 మీ. ఎత్తు) కననగును. పశ్చిమమున పసిఫిక్ తీరమైదానములకును సరస్సుల




పటము 10.

ప్రాంతమునకును అడ్డముగ ఒక అగ్నిపర్వత శ్రేణికలదు. ఈ ప్రాంతముననే సముద్ర మట్టమునకు 40 మీ. ఎత్తున మనాగువా సరస్సు కలదు. ఈ సరస్సునుండి వెలికివచ్చు నీరు క్రిందికి ప్రవహించి, సముద్ర మట్టమునకు 32 మీ. ఎత్తున ఉన్న నికరాగ్వా సరస్సున చేరగి, అటనుండి వెలికి వచ్చు ప్రవాహము సాన్‌జువాన్‌నది ద్వారా తూర్పున కరిబ్బియన్ సముద్రమును చేరును. దేశపు నదులలో ప్రముఖము సెగోవియా; ఇది 240 కిమీ. ల వరకు నౌకాయానమునకు ఉపకరించును.

**2. శీతోష్ణస్థితి మొ. :** సాలున సరాసరి ఉష్ణోగ్రత 68° నుండి 80° ఫా. వరకు మారును; మధ్య దేశపు ఉన్నత భూములందు ఈ ఉష్ణోగ్రత తక్కువ. మే నుండి జనవరి వరకు వానలు కురియును మనాగువా ప్రాంతమున వర్షపాతము 112 సెం. మీ; పసిఫిక్ తీరమున 200 సెం. మీ; కరిబ్బియన్ తీరమున 300 నుండి 625 సెం. మీకు వర్షపాతము కలదు. కరిబ్బియన్ తీరభూములందును, మధ్యదేశపు ఉన్నత భూములందును సాంద్రాటవులు కలవు. లేడిని మించిన పెద్ద వన్య జంతువులు కన్పించవు.

**3 జనసంఖ్య మొ. :** 1971 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 2.21 కోట్లు. ఇందు దాదాపు 80% దేశమునందలి మహాసరస్సుల ప్రాంతమునను పసిఫిక్ తీరభూమియందును వసించుచున్నారు నగరములలో మనాగువా (జ. సం. 3,10,067), లియాన్ (71,777), మతగల్పా (66,414) ప్రముఖములు. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 13.3 అంచనాలను అనుసరించి దేశీయులలో అచ్చపు శ్వేతజాతి 17%, సమ్మిశ్రజాతి 70%; ఇక తక్కినవారిలో నీగ్రోలు, అమెరికన్ ఇండియనులు చేరి ఉన్నారు. స్పానిష్ అధికార భాష; దాదాపు 96% కు ఇది సుపరిచితము. ప్రాచీన అమెరికన్ భాషల పదములు ఇందు కొన్ని చేరినవి ఇంగ్లీషునకు, వ్యవహార రంగమున, ద్వితీయ భాషా ప్రతిపత్తి కలదు దేశీయులందరును క్రైస్తవులు; అందును రోమన్‌కేతలిక్ సంప్రదాయమునకు అత్యంతాదరణ కలదు.

**4. సమాచార సా. :** దేశమున 233 పోస్ట్ ఆఫీసులు, 221 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 208 టెలిఫోన్ స్టేషనులు కలవు. మనాగువాలో శక్తివంతమగు ఒక రేడియో - టెలిగ్రాఫ్ స్టేషన్, దేశమున 47 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు కలవు. మనాగువాలో ఒక టెలివిజన్ కేంద్రము పని చేయుచున్నది.

**5. యాన సౌ. :** దేశమున 6,124 కిమీ. ల నిడివిగల రోడ్లుకలవు. వీనిలో 800 కిమీ. లు ఉత్తమ శ్రేణికి చెందినది. 349 కిమీ. ల రైలుమార్గము దేశపు ప్రముఖ నగరములను కలుపుచున్నది. మనాగువాలోని మెర్సిడెజ్ విమానాశ్రయము నుండి అమెరికా యందలి పలుదేశములకు విమానయాన వసతులు కలవు. పసిఫిక్ తీరపు రేవులలో కొరింతో, కరిబ్బియన్ తీరపువానిలో ఎల్‌బ్లఫ్ ప్రముఖములు.

**6 చరిత్ర :** పాశ్చాత్యులు ఈ దేశమున కాలిడుటకు పూర్వమే ఇచట ఒక అమెరికన్ ఇండియన్ రాజ్యము సువ్యవస్థితమై ఉండినది. నికరావో అనునతడు ఆరాజ్యమును స్థాపించిన వాడగుటవలన దానికి నికరాగ్వా అను పేరు కలిగినది. 1502 లో కొలంబస్ ఈ ప్రాంతమును దర్శించి స్పెయిన్ వారికి ఇందు ప్రతిపత్తిని చేకూర్చెను. కాలక్రమమున దేశమును అంతటిని స్పెయిన్‌వారు, 1520 నాటికి జయించి వశపరచుకొనిరి. అంతట 300 సంవత్సరముల కాలము, స్పెయిన్ దేశపు సామ్రాజ్యమున ఈ దేశము అంతర్భాగముగ ఉండి, 1821 లో తక్కిన మధ్య అమెరికన్ రాజ్యములతో పాటుగ స్వతంత్రమై, కొంతకాలము అచటి సమాఖ్యా రాజ్యమున చేరియుండి, కడకు ఏప్రిల్ 30, 1838 న స్వతంత్ర రాజ్యమైనది. కాని తదాదిగ దేశపు రెండు ప్రముఖ రాజకీయ పక్షముల మధ్య చెలరేగిన సంఘర్షణలు నిరంతర కల్లోలములములుగ పరిణమించినవి: అందువలన పలుమారులు యు. స్టే. ప్రభుత్వపు సేనలు దేశమున శాంతి రక్షణకు తోడ్పడినవి. కడకు 1936 లో ఉభయ రాజకీయ పక్షముల మధ్య ఒక ఒడంబడిక జరిగి, మొత్తముమీద, తదాదిగ కొంత సువ్యవస్థితమగు పరిపాలన కొనసాగుచున్నది.

**7. పరిపాలన :** 1950 లో ఆమోదింపబడిన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి ఒక ప్రాతినిధ్య గణరాజ్య ప్రభుత్వము ఈ దేశమున పాలనను నిర్వహించుచున్నది. సార్వత్రిక ప్రాతినిధ్యరీతిలో ప్రజలచే ఎన్నుకొనబడిన ప్రతినిధి సభయు శిష్టసభయు కలవు. ప్రతినిధి సభలోని సభ్యసంఖ్య 54; శిష్టసభ సంఖ్య 18. సభ్యుని పదవీకాల పరిమితి 4 ఏండ్లు. అధ్యక్షుడును ప్రజల చేతనే ఎన్నుకొనబడును; అతని పదవీకాలపరిమితి 4 ఏండ్లు; ఒకసారి ఎన్నుకొనబడిన అధ్యక్షుడు. ఆ పదవికి వెనువెంటనే మరల ఎన్నుకొనబడ కూడదు. మంత్రివర్గమును అధ్యక్షుడే నియమించుకొని పాలనను సాగించును. శాసనసభ చేసిన చట్టమును అధ్యక్షుడు తిరస్కరింపవచ్చును గాని, దానినే మరల శాసనసభ మూడింట రెండువంతుల ప్రాబల్యముతో ఆమోదించిన యెడల ఆ శాసనము అమలులోనికి వచ్చును. లిబరల్ పార్టీ, కనసర్వేటివ్ పార్టీ అనునవి దేశపు ప్రముఖ రాజకీయ పక్షములు. దేశపు 16 రాష్ట్రములలో ప్రతిదానిని ప్రభుత్వము నియమించు ఒక గవర్నరు పాలించును. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యవమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** భూతల సేనయందు 5,350 మంది యోధులు కలరు. నామమాత్రపు నావిక దళము కలదు; విమాన దళమున యోధ సంఖ్య 1,000; విమాన సంఖ్య 40.

**9 అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో కొన్నింటను ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థికరంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై చాలవరకు ఆధారపడి ఉన్నది. ప్రజలలో 58.8% వ్యవసాయ రంగమున కృషి చేయుచున్నారు. దేశపు భూతలమున 13% వ్యవసాయమున కలదు. ఆహారధాన్యముల విషయమున ఈ దేశము స్వయం పోషకము రొక్కపు

పంటలలో ప్రత్తి, కాఫీ ప్రముఖములు. తక్కిన మధ్యఅమెరికా దేశములతో పోల్చినపుడు ఈ దేశపు పశుసంపత్తి అత్యధికము. చేపల పరిశ్రమ యందలి ఉత్పత్తులలోకొంత ఎగుమతి అగుచున్నది. దేశపు భూతలమున 50 అటవీమయము. ఖని జోత్పత్తులలో రాగి, బంగారము, వెండి, టంగ్‌స్టన్, ప్రముఖములు విద్యుదుత్పత్తి 15.59 కోట్ల కివా, దేశపు ఎగుమతుల విలువ 14.6 కోట్ల అమెరికన్ డాలర్లు: దిగుమతుల విలువ 20.4 కోట్ల అ. డా. (1967). బడ్జెటరీ వ్యయము 68. 62 కోట్ల కోర్డోబాలు.

**11. సాంఘిక రంగము :** దేశమున 50% నిరక్షరాస్యులు. రాజ్యమునందలి 2,031 ప్రాథమిక పాఠశాలలలో 1,72,413 మంది; 102 సెకండరీ పాఠశాలలలో 12,267 మంది విద్యార్థులు గలరు (1962—63). లియాన్‌లోని జాతీయ విశ్వవిద్యాలయమందలి విద్యార్థిసంఖ్య 1,621 (1963 - 64). దేశమున 20 గ్రంథాలయములు కలవు, కాని అవి అంతగ ప్రముఖములు కావు. 10 దైనిక పత్రికలు కలవు;వానిలో 'లా ప్రెన్సా' అనుదానికి అత్యధిక ప్రచారము కలదు. 3,822 శయ్యాసంఖ్యగల 40 ఆసుపత్రులు కలవు; వైద్య సంఖ్య 647.

**12. యాత్రా సౌ. :** యు. స్టే. పౌరులు గుర్తు చీటీతో 30 దినములు ఈ దేశమున పర్యటించవచ్చును. తక్కిన విదేశీయులు పాస్‌పోర్ట్, వీసాలను పొందవలెను.

---

# 13. నెదర్‌లాండ్స్ యాంటిల్లీస్

## (ఆంతరంగిక స్వపరిపాలనకల ప్రాంతము)

**ముఖ్యనగరము :** కురకావో; **జెండా : జాతీయగీతము :** నెదర్‌లాండ్స్ (హాలండ్) రాజ్యపువే; **నాణెము :** నెదర్‌లాండ్స్ యాంటిలీస్ గిల్డర్; ఒక గిల్డరు = రు 3.99;**కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ 7 గం. 30 ని. = భారతదేశమువ సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా యందలి వెనిజ్యులా దేశపు తీరప్రాంతమునకు కొంత దూరమున కరిబ్బియన్ సముద్రమున, అటనట చెదరి యున్న వివిధ ద్వీపములు చేరియున్న ఈరాజ్యమున బెండన్‌విండ్ వర్గము, బోవెన్‌విండు వర్గము అను రెండు వర్గముల ద్వీపములు కలవు. తొలుతటి వర్గమున కురుకావో (444 చ కిమీ ఆరుబా (193 చ. కిమీ; బోనైర్ (288 చ. కిమీ). అను దీవులును; రెండవ వర్గమున సెయింట్ మార్టెన్ (34 చ. కిమీ) సె యూస్టేటియస్ (21 చ కిమీ ) సబా (13 చ.కిమీ) అను లంకలను కలవు (వీనిలో మార్టెన్ దీవిలో దక్షిణ భాగము ఫ్రాన్స్‌నకు చెంది ఉన్నది). బెండెన్‌విండ్ వర్గపు ద్వీపములు ఎక్కువగ పర్వతమయములు. సబా యను లంక అన్నింట సారతమము; అది ఒక ఆరిపోయిన అగ్నిపర్వత భూమి. ఏ దీవియందును నదులు ఎట్టివియు లేవు.

**2 శీతోష్ణస్థితి మొ ·** ద్వీపముల యందలి సాలుసరి ఉష్ణోగ్రత సరాసరిన 76 8°–86.6° ఫా మధ్య మారుచుండును పైరు పంటలకు తగినంతగ వర్షపాతము కలదు.

**3. జనసంఖ్యా మొ.:** దేశపు జనసంఖ్యా 2,23,246 (1971). ద్వీపముల వారీగా కురకావోలో 1,49,091; అరుబాలో 60,811; బోనైర్‌లో 8,212; సె. మార్టిన్‌లో 7,775; సె. యూస్టేటియస్‌లో 1,363; సబాలో 968 మంది ప్రజలు కలరు. కురకావో దీవిలో 15 అచ్చపు శ్వేత జాతివారు; తక్కినవారు వర్ణజాతులవారు. అరుబాలో సగముపైగా ఆదిమ అమెరికన్-శ్వేతజాతుల సమ్మిశ్రజాతి; తక్కిన రాజ్యపు ప్రజలలో ఆఫ్రికన్ సంతతివారలు మొదలగు పలుజాతులవారు కలరు. సాధికారభాష డచ్చిభాష; కాని పాపియామెంతో అనబడు సంకరభాష దేశమున సామాన్య వ్యవహార భాషగ ఉన్నది. ఇందు స్పానిష్, డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషు, ఆఫ్రికన్ భాషలు కలగాపులగముగా కలసి ఉన్నవి. ఆంగ్ల, ఫ్రెంచి భాషలును అటనట వ్యాప్తిలో కలవు. ప్రజలందరును క్రైస్తవులు.

**4. సమాచార సౌ.:** ద్వీపముల మధ్య టెలిఫోను సౌకర్యము విరివిగ కలదు. రేడియో - టెలిఫోను ద్వారా కురకావోనుండి వివిధ ప్రముఖ విదేశములతో వార్తా సంబంధము ఉన్నది. ఆరు రేడియో స్టేషనులును, ఒక టెలివిజన్ కేంద్రమును పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** మొత్తముమీద 1183 కిమీ. నిడివిగలిగి ఉత్తమ స్థాయికి చెందిన రోడ్లు కలవు; రైలుమార్గములు లేవు. కార్లు, బస్సులు, లారీలు ప్రయాణమునకు, సామానుల తరలింపునకు ఉపయోగ పడుచున్నవి. దాదాపు 40,000 మోటారు వాహనములు కలవు. కురకావోలోని హార్బరు, తీరపు రేవులన్నింట ప్రముఖము వివిధ ద్వీపముల మధ్యను, ద్వీపములనుండి సమీపస్థ విదేశములకును విమానయాన సౌకర్యము కలదు.



**6. చరిత్ర:** అమెరిగో వెస్పూచీ అను ప్రసిద్ధ దేశాన్వేషకునితో పాటుగ పయనించిన అలోన్సో డి ఓజెడో అను స్పానిష్ సాహసికుడు ఈ ద్వీపములందలి కురకావోలో తొలుత కాలిడెను (1499). అంతట స్పెయిన్ దేశపు ప్రభుత్వమునకు ఇందు హక్కు ఏర్పడినది. కాని కాలక్రమమున డచ్చి (నెదర్లాండ్స్) ప్రభుత్వపు సేనలు స్పెయిన్ వారిని ఓడించి ఈ ద్వీపములను వశపరచుకొనినవి (1634). తరువాత డచ్చి ప్రభుత్వపు వలసపాలన ఇట కొనసాగినది. 1954 లో డచ్చి ప్రభుత్వము, ఈ రాజ్యమునకు అంతరంగిక స్వపరిపాలనా ప్రతిపత్తిని కలిగించినది.

**7. పరిపాలన:** చట్టరీత్యా నెదర్లాండ్స్ దేశపు రాణియే ఈ రాజ్యమునకు అధిపతి. ఆమెకు ప్రతినిధిగా, ఆమె నియమించు గవర్నరు, ఇట, శాసనసభకు బాధ్యత వహించిన మంత్రివర్గపు సాయముతో పాలనను నిర్వహించును. శాసనసభయందలి సభ్యసంఖ్య 22; వీరిని ప్రజలు, సార్వజనిక రహస్యవోటింగు పద్ధతిన ఎనుకొనెదరు. ప్రతి ద్వీపమునను స్థానిక పాలనను ఎన్నుకొనబడిన స్థానిక సమితి సాయమున ఒక ప్రభుత్వోద్యోగి నిర్వహించును.

**8. దేశరక్షణ: 9. అంతర్జాతీయ సం:** ఈ రెండింటి విషయమున నెదర్లాండ్స్ ప్రభుత్వమే హక్కు బాధ్యతలను కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము:** దేశపు ఆర్థిక వ్యవస్థ అంతయు, అందును ముఖ్యముగ కురకావో, అరుబా ద్వీపములకు సంబంధించి నంతవరకు, పెట్రోలియమ్ ముడితైలమును చక్కబరుచు కృషిపై ఆధారపడి యున్నది. వెనిజ్యులానుండి ఇచటికి పంపబడు ముడిపెట్రోలియమ్, ఇచటి రిఫైనరీలలో శుద్ధిచేయబడి విదేశములకు ఎగుమతి యగుచున్నది. ఈ రిఫైనరీలలో ఉద్యోగముల

వలస దేశపు ప్రజానీకమున అత్యధిక భాగము జీవించుచున్నారు; తక్కిన పరిశ్రమలును ఈ కృషి పైననే ఆధారపడి ఉన్నవి. వ్యవసాయమును, మత్స్య పరిశ్రమయు కొంత వ్యాప్తిలో ఉన్నను, వాని ఉత్పత్తి దేశావసరములకు సరిపోదు. ఖనిజములలో కాల్షియమ్ ఫాస్ఫేటు మాత్రమే చెప్పదగినది. మొత్తముమీద వ్యాపార వాణిజ్యముల ద్వారా దేశము సుసంపన్నము. సాలుసరిన తలసరి ఆదాయము దాదాపు 1000 అమెరికన్ డాలర్లు. మొత్తపు ఎగుమతుల విలువ 127.4 కోట్ల గిల్డర్లు; దిగుమతుల విలువ 149.3 కోట్ల గిల్డర్లు; (1971). బడ్జెటరీ వ్యయము 8,61,20,742 గి. (1970).

**11. సాంఘిక రంగము :** దేశమున నిరక్షరాస్యత 5% మాత్రమే. దేశమున ఉన్న 277 పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 65,439. 1,830 శయ్యా సంఖ్యగల 9 ఆసుపత్రులు కలవు వైద్య సంఖ్య 97 (1971).

**12. యాత్రా సౌ :** దేశపు ప్రకృతి రామణీయకత పలువురిని ఆకర్షించుచున్నది. 1971 లో 2,17,477 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

---

# 14. పనామా

**ముఖ్యనగరము :** పనామా సిటీ; **జెండా :** నిలువుగను, అడ్డముగను సమద్విఖండన చేయుచు గీచిన రెండు రేఖల వలన ఏర్పడిన నాలుగు భాగములలో వాయవ్యభాగము తెలుపుగ ఉండి, ఒక నీలి నక్షత్రమును, ఆగ్నేయభాగము తెలుపుగ ఉండి ఒక ఎర్ర నక్షత్రమును కలిగియుండగ, ఈశాన్య భాగము ఎరుపుగను, నైరుతిభాగము నీలముగను ఉండునది; **జాతీయ గీతము :** 'అల్‌కాన్‌జమోస్ పోర్ ఫిన్‌లా విక్టోరియా' (చివరకు విజయము మనదే) అను చరణముతో మొదలిడునది; **నాణెము :** బాల్బో; ఇది 100 సెంటిసిమోలుగ విభక్తము, ఒక బాల్బో = రు 7.50; కాగితపు కరెన్సీ చలామణిలో లేదు; కాని, యు. స్టే. కు చెందిన డాలరు నోట్లు చెలామణి అగుచు, బాల్బో ఒక యు. స్టే. డాలరుగ లెక్కింపబడుచున్నది; **కొలతూకములు :** మెట్రిక్ విధానమునకు సాధికార పరిగణన కలదు. **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర అమెరికా ఖండపు కొట్టకొనన, పనామా భూసంధిపై 7°15′ - 9°39′ ఉ. అ. రేఖలకును, 77°15′-83°30′ ప. తు.

రేఖలకును మధ్యన నెలకొనిన ఈ దేశమునకు ఉత్తరమున కరిబ్బియన్ సముద్రము; తూర్పున కొలంబియా; దక్షిణమున పనామా సింధుశాఖ, పసిఫిక్ మహాసముద్రము; పశ్చిమమున కోస్టారికా సరిహద్దులందున్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 76,650 చ. కిమీ (పనామా కాలువ వైశాల్యం ఇందు చేరదు). తూర్పు - పడమరల నిడివి 763 కిమీ.; ఉత్తర దక్షిణముల కొలత [illegible] కిమీ.




పటము 11.

నుండి 132 కిమీ. వరకు మారుచుండును. దేశపు కరిబ్బియన్ సముద్రతీర రేఖ పొడవు 763 కిమీ; పసిఫిక్ తీరరేఖ నిడివి 1,227 కిమీ. అటవీమయములగు పర్వత శ్రేణులున్న దేశమిది. తూర్పున, పశ్చిమమున ఉన్న పర్వతశ్రేణుల మధ్య పీఠభూములు, లోయలు, చిన్నగుట్టల వరుసలు కాననగును. దేశమున చిన్నవి, పెద్దవి కలసి దాదాపు 500 నదులు కలవు; వీనిలో అధికభాగము పసిఫిక్ మహాసముద్రమున కలియును. తీరములకు సమీపముననే ఉన్న 1621 చిన్న లంకలును రాజ్యాంగరీత్యా ఈ దేశమున చేరి ఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.** : ఉష్ణమండల శీతోష్ణస్థితి ఇందు కననగును. తీరప్రాంతమున సరాసరి ఉష్ణోగ్రత రమారమి 80° ఫా.; పర్వత ప్రదేశము లందు 50°-66° వరకు మారును. సగటున వర్షపాతము సాలున, కరిబ్బియన్ తీరభూమిని 291 సెం. మీ; పసిఫిక్ తీరమున 157 సెం. మీ: పసిఫిక్ నుండి డిసెంబరువరకు విరివిగ వర్షములు కురియును. కరిబ్బియన్ - తీరపు అడవులు సత్తాహరిత వర్గమునకు చెందినవి; పసిఫిక్ తీరపు కొంతవరకు ఆకురాల్చు వర్గములోనివి. పెద్ద వన్యజంతువులు లేవు; ఉన్నవానిలో జింక మాత్రమే పెద్దదిగ లెక్కింపదగినది. తీర ప్రాంతములందు మొసళ్ళు ఎక్కువగ కలవు; పక్షిజాతులును, సముద్రమున వివిధ మత్స్యజాతులును కననగును.

**3. జనసంఖ్య మొ.** : 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 14,14,737. నగరములలో పనామా సిటీ (జ. సం. 4,11,956), కొలోన్ (67,641). డేవిడ్ 35,4[illegible] లెక్కింపదగినవి. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 18.7. ప్రజలలో [illegible] సమ్మిశ్ర జాతివారు (ఆదిమ అమెరికనులు, శ్వేతజాతులు, నీగ్రోలు సంకరమొందగ రూపొందిన జాతివారు; 13% అచ్చపు నీగ్రోలు; 11 శ్వేతజాతివారు; 11% అచ్చపు ఆదిమ అమెరికనులు; 1% ప్రాచ్యదేశీయులు (వీరిలో చీనీయ సంఖ్య అత్యధికము) ఆదిమ అమెరికనులు మాత్రము తక్కినవారితో కలియక తూర్పు పనామాయందును, సాన్ బ్లాస్ దీవులలోను వసించుచున్నారు. సాధికార భాష స్పానిష్, 91.8% ప్రజలకు అది మాతృభాష; 7.5% ఆంగ్లమును మాటాడెదరు; 0.2% చీనీయ భాషలో వ్యవహరింతురు. ఆదిమ అమెరికనులలో ప్రాచీన అమెరికన్ భాషలు ప్రచారమున ఉన్నవి. దేశీయులందరు క్రైస్తవులు; అందును రోమన్ కేథలికుల సంఖ్య అత్యధికము.

**4. సమాచార సా.** : టెలిగ్రాఫ్ సౌకర్యము దేశమంతట విరివిగ కలదు. కేబిల్‌ద్వారా యు. స్టే., మధ్య అమెరికా దేశములు, దక్షిణ అమెరికా దేశములు యూరపు దేశములతో సంబంధము కలదు. 84 రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులును, 9 టెలివిజన్ కేంద్రములును పనిచేయుచున్నవి (1966).

**5. యాన సౌ.:** దేశమున 6806.7 కిమీ. ల నిడివిగల రోడ్లు కలవు, అమెరికా దేశములను అనుసంధించు మహాపథము ఈ దేశము ద్వారా పయనించుచున్నది. 279 కిమీ. ల నిడివిగల రైలుమార్గములు కలవు. అల్‌మిరాన్‌టి రేవు విదేశ వర్తక వ్యాపారములకు ఉపయోగపడుచున్నది. పనామాసిటీ సమీపమున ఉన్న ప్రముఖ విమానాశ్రయము నుండి విదేశములకు విమానయాన సౌకర్యమును, దేశమున వివిధ ప్రాంతముల మధ్య విమానయానముల వసతియు కలదు.

**6. చరిత్ర:** 1510 లో రోడ్రిగో డి బస్తి డెస్ అను సాహసిక పాశ్చాత్య నావికుడు ఈ ప్రాంతమును కనుగొనెను. మరుసటి సంవత్సరమున క్రిస్టఫర్ కొలంబస్ అట కాలిడి, ఆ ప్రాంతమును స్పెయిన్ సామ్రాజ్యమునకు చెందినదిగా ప్రకటించెను, అంతట, అచటి ప్రాచీన అమెరికనుల నిరోధమును నిర్మూలించి, స్పెయిన్‌వారు అట వలస చేరిరి. 1821 లో స్పెయిన్ సామ్రాజ్యము నుండి మధ్య, దక్షిణ అమెరికా దేశములు విడివడినపుడు, ఈ దేశమును స్వాతంత్ర్యమును ప్రకటించి ఒక సమాఖ్యారాజ్యమున భాగముగ కొంతకాలము ఉండి, తరువాత అందుండి కొలంబియాతో పాటుగ తొలగి, కొలంబియాలో చేరి కొంతకాలము మనుగడను సాగించినది. కొలంబియా నుండి విడివడుటకు దేశీయులు చేసిన యత్నములు తొలుత విఫలములైనవి. ఇంతలో పసిఫిక్, అట్లాంటిక్ మహాసముద్రములను అనుసంధించుచు, ఒక కాలువను పనామా భూసంధి ద్వారా త్రవ్వుటకై ఫ్రెంచివారు పూనుకొని, దానిని సాగింపజాలక, అందు తమకుగల అధికారములను యు. స్టే. కు విక్రయించిరి. ఈ విక్రయమును ధ్రువీకరించుటకు కొలంబియా ప్రభుత్వము నిరాకరించినది. అంతట యు. స్టే. ప్రభుత్వపు ప్రోత్సాహబలముతో పనామా, కొలంబియా నుండి విడివడి స్వాతంత్ర్యమును ప్రకటించి (1903), పనామా కాలువ ప్రాంతమును, కొన్ని షరతులపై యు. స్టే. కు స్వాధీనము చేసినది (వివరములకు చూ: యు. స్టే. శీర్షిక క్రింద పాలితములు). పనామా స్వాతంత్ర్యమునకు అంతట యు. స్టే. హామీ ఇచ్చినది. ఈ అధికారము వలన దేశపు రాజకీయములలో యు. స్టే. ప్రభుత్వము 1908, 1917, 1918 లలో జోక్యము వహించినది. కాని 1936 మొదలుగ అట్టి జోక్యమునకు స్వస్తి జరిగి పనామా సర్వతంత్ర స్వతంత్ర ప్రభుత్వముగ వ్యవహరించుచున్నది.

**7. పరిపాలన:** దేశము ప్రజాస్వామ్యయుత గణరాజ్యమే అయినను 1968 లో అప్పటి అధ్యక్షుని పదవీచ్యుతునిగచేసి సైన్యము ప్రభుత్వమును వశపరచుకొనినది. 1969లో సైన్యము పౌరప్రభుత్వమునకు అధికారమును అప్పగించుటకు అంగీకరించినది. అంతట 1972 లో జరిగిన ఎన్నికలలో ఒక రాజ్యాంగ పరిషత్ ఏర్పడి ఒక రాజ్యాంగ విధానమునుఆమోదించినది. దానిని అనుసరించి, 505మంది సభ్యులుకల ఒక శాసనసభయు, పరోక్షరీతిలోఎన్నుకొనబడిన అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడును ఉండు ఏర్పాటుజరిగినది. కాని ప్రస్తుతమున 1978 వరకు, అధ్యక్షుటగు టారిజ్జోస్ సేనానియే సర్వాధికారములను వహించి పాలించుటకు ఆ శాసనసభ ఆమోదించినది. దేశమున రాజకీయ పక్షములు ఉన్నను అవి సువ్యవస్థితములు కావు. ప్రస్తుతమున రాజకీయ పక్షములు దేశమున నిషిద్ధములు; ఎన్నుకొనబడిన సమితుల సాయముతో స్థానికోద్యోగులు స్థానిక పాలనను నిర్వహించుచున్నారు. 9 మంది జడ్జీలు కల సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయ పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఉరిశిక్ష నిషిద్ధము.

**8. దేశరక్షణ:** గార్డియా నేషనల్ అనబడు ఒక సుశిక్షిత దళము సైనిక విధులను నిర్వర్తించు

చున్నది. అందలి యోధసంఖ్య 6,000; తీర రక్షక వర్గమును, ఒక వైమానిక శాఖయు అందు అంతర్భాగములు.

**9.** అంతర్జాతీయ సం. : ఐ.రా.స.యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను, అమెరికా రాజ్యవ్యవస్థలోను ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. పాతవైరమును మరచి, కొలంబియా సైతము 1924 మొదలుగ ఈ రాజ్యముతో దౌత్య సంబంధములను కలిగియున్నది. ప్రముఖ ప్రపంచ రాజ్యములన్నిటితోను దేశమునకు దౌత్య సంబంధములు కలవు.

**10. ఆర్థిక రంగము :** దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి 23% ఉన్నను 4.3% మాత్రమే సాగగుచున్నది. ఇందు ఎక్కువ భాగమున వరి పండింపబడుచున్నది. కాని దేశావసరములకు కావలసిన ఆహారపదార్థములలో 60% విదేశముల నుండి దిగుమతియగుచున్నది. వ్యవసాయోత్పత్తుల ముఖ్యపు ఎగుమతి సరకు అరటిపండ్లు. దేశపు ఆర్థికవ్యవస్థకు మూలాధారము, పనామా కాలువపై దేశమునకు యు. స్టే. చెలించు అద్దె మొత్తము. ఇది సాలునకు 19,30,000 డాలర్లు. ఇదిగాక దేశము వ్యాపారరీత్యా కీలక ప్రాంతమున ఉండుటవలన, అంతర్జాతీయ వ్యాపారమున ఒక వినిమయ స్థానముగ ఉపకరించి తద్వారా ఎక్కువ ఆదాయము దేశమునకు లభించుచున్నది. కొలోనురేవు స్వేచ్ఛా వాణిజ్య కేంద్రమగుటవలన, అచట వివిధ దేశముల వర్తక సంస్థలు పనిచేయుటకు వసతి చిక్కినది. చెప్పుకొనదగిన ఖనిజ సంపత్తి లేదు; వెండి, బంగారములు, మాత్రము కొలదిగ లభించుచున్నవి. దేశపు విద్యుదుత్పత్తి 48.5 కోటి కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 11,01,18,000 డాలర్లు; దిగుమతుల విలువ 32,25,51,000 డా. (1967). బడ్జెటు వ్యయము 18.6 కోట్ల డా. (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున బలము గల కార్మికోద్యమము లేదు; గృహవసతి చాల తక్కువ; ప్రభుత్వము వివిధ సంస్థల ద్వారా గృహవసతిని చక్కబరుచుటకు కృషిచేయుచున్నది. నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము 7 నుండి 15 ఏండ్ల వయసుగల వారికై అమలున ఉన్నది. 1,764 ప్రయిమరీ పాఠశాలలలో 2,55,287 మంది, 199 సెకండరీ పాఠశాలలలో 79,342 మంది విద్యార్థులు కలరు. పనామా సిటీలోని పనామా విశ్వవిద్యాలయమున విద్యార్థి సంఖ్య 7,553 (1970). ముఖ్యనగరమునందలి నేషనల్ లైబ్రరీ, దేశపు గ్రంథాలయములన్నింట ప్రముఖము; ఆ నగరముననే ఉన్న మ్యూజియమున ప్రాచీన అమెరికన్ నాగరికతావశేషములు కననగుచున్నవి. ప్రచారమున ఉన్న 8 దినపత్రికలలో లా ఎస్ట్రెల్లా డి పనామా అనునది ప్రముఖము. దేశమున 89 ఆసుపత్రులు కలవు. (1967).

**12. యాత్రా సౌ. :** పలు సౌకర్యములను కల్పించి విదేశ యాత్రికులను ఆకర్షించుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. యు. స్టే. పౌరులు గుర్తుచీటితో మాత్రమే ఇట పర్యటించవచ్చును. తక్కిన విదేశీయులకు పాస్‌పోర్ట్, వీసాలు ఉండవలెను. 1971 లో 2,43,084 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. తామస్ హెర్రేరా (1804-54); దేశమున గణతంత్ర ప్రజాస్వామిక స్వతంత్ర ప్రభుత్వమును నెలకొల్పుటకై ఉద్యమమును ప్రారంభించిన జాతీయ నాయకుడు.

---

# 15. బహామాస్

**ముఖ్యనగరము :** నస్సావ్; **జెండా , జాతీయ గీతము**: తెలియవు; **నాణెము:** బహామియన్ డాలరు; ఇది 100 సెంట్లుగ విభక్తము; యు. స్టే. నాణెములును చలామణిలో ఉన్నవి; ఒక బహామియన్ డాలరు = రు. 7.35; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యు. స్టే. లోని ఫ్లోరిడా ద్వీపకల్పపు ఆగ్నేయతీరభూమికిని, క్యూబా, హయిటీ దేశముల తీరభూములకును మధ్య అట్లాంటిక్ మహాసముద్రమున 1215 కిమీ. ల పొడవునగల జలప్రదేశమున ఎడనెడ చెదరియున్న ద్వీపసమూహమే బహామాస్ అని వ్యవహృతము. ఇందు పెద్దవి, చిన్నవి కలసి దాదాపు 700 ద్వీపములు కలవు; ఇందు 22 ద్వీపములందు మాత్రమే ప్రజలు నివసించుచున్నారు. భూతల వైశాల్యము 13,590 చ. కిమీ. ఈ ద్వీపములందు న్యూప్రావిడెన్స్ (వైశాల్యము 150 చ. కిమీ.) అనునది వైశాల్యమున గాకపోయినను తక్కిన విధముల ప్రముఖముగ లెక్కకు వచ్చినది. ముఖ్యనగరము ఈ దీవియందే ఉన్నది. దీవులన్నియు చాలవరకు సమతల నిమ్న భూములు. 120 మీ. ఎత్తునకుమించిన ప్రదేశము కన్పట్టదు. అందు అటనట చిన్న సరస్సులును, చిత్తడి నేలలును, పవడపు తిప్పలును కననగును.

**2. శీతోష్ణపరిస్థితి మొ. :** ఉపోష్ణమండలపు పరిస్థితి ఇందు కానవచ్చును. సాలున గరిష్ఠ ఉష్ణోగ్రత 80° ఫా.; కనిష్ఠ ఉష్ణోగ్రత 70° ఫా. సాలున సరాసరి వర్షపాతము 125 సెం. మీ ; అంతటంతట తుఫానుల బాధ కలదు.

**3. జనసంఖ్య మొ. :** రాజ్యపు మొత్తపు జనసంఖ్య 1,68,812; ఇందులో 1,01,503 మంది న్యూప్రావిడెన్స్ దీవిలో వసించుచున్నారు. వీరిలో సైతము అత్యధిక భాగము నస్సావ్ నగరముననే వసించుచున్నారు తక్కిన వానిలో అత్యధిక జనసంఖ్యగల ద్వీపము అబాకొ (జ. సం 6,501); అత్యల్ప జనసంఖ్యగల ద్వీపము రాగెడ్ దీవి (జ. సం. 203). దేశీయులలో నీగ్రోజాతివారు 75%; శ్వేత జాతీయులు 14%; సమ్మిశ్రజాతివారు 11%. దేశీయుల మాతృభాష ఆంగ్లము; ప్రజలందరు క్రైస్తవులు.

**4 సమాచార సా. :** దేశమున టెలిఫోనుల సంఖ్య అత్యధికము; 36 వేలకు పైబడిన టెలిఫోనులు కలవు. నస్సావ్‌లో ఒక రేడియో స్టేషన్, ఒక టెలివిజన్ స్థావరము పనిచేయుచున్నవి. యు. స్టే. ద్వారా, రేడియో – టెలిఫోను వలన ప్రపంచపు వివిధ భాగములతో వార్తాసంబంధము ఈ దేశమునకు కలదు.

**5. యాన సౌ. :** న్యూప్రావిడెన్స్ దీవిలో ఉత్తమశ్రేణికి చెందిన 480 కిమీ. ల రోడ్లు కలవు. ఎలుత్రా, గ్రాండ్ బహామా దీవులలో 480 కిమీ. ల పొడవున మంచి రోడ్లును తక్కిన దీవులలో కచ్చారోడ్లును కలవు. రైలుమార్గములు లేవు. నస్సావ్ వద్దనున్న ఉత్తమపు హార్బరువలన విదేశీయ వ్యాపారము నౌకామార్గమున సాగుచున్నది. గ్రాండ్ బహామాస్ దీవిలో ఫ్రీపోర్ట్ అను హార్బరు క్రమేణ ప్రాముఖ్యమునకు వచ్చుచున్నది. నస్సావ్ లోని అంతర్జాతీయ విమానాశ్రయము వలన వివిధ దేశములతో విమానయాన సౌకర్యము కలదు. అదిగాక, దేశమున 12 సాధారణ విమానక్షేత్రములు కలవు; వీనివలన వేర్వేరు ద్వీపముల మధ్య విమానయానపు వసతి కలిగినది.

**6. చరిత్ర :** ఈ దీవులలో, సాన్ సాల్వడార్ అని వ్యవహృతమగు దీవియందు అక్టోబరు 12,

1492 న క్రిస్టఫర్ కొలంబస్ కాలిడెనని తెలియ వచ్చుచున్నది. కాని స్పెయిన్‌వారు ఎవరును ఇట వలసలను ఏర్పరుపలేదు. 17 వ శతాబ్ది ప్రథమ పాదమున బెర్మూడా దీవినుండి, కొందరు బ్రిటిష్ వారు ఇటకు వలసవచ్చి చేరిరి. ఆ బ్రిటిష్ వారే ఇటకు నీగ్రోలను బానిసలుగ కొనివచ్చిరి. తరువాత 1718 లో స్పెయిన్‌వారు ఈ దీవులను వశపరచుకొనినను, అనతికాలముననే అవి మరల బ్రిటిష్‌వారి వశమైనవి (1783). 1940 లో ఇందలి దీవులలో కొన్నింటిని యు. స్టే. కు సైని కాశ్రయములుగ కౌలుకు ఇచ్చుట జరిగినది 1729 నుండి 1964 వరకు ఈ రాజ్యము బ్రిటిష్‌వారి వలసపాలనలోనే ఉండినది. 1964 మొదలుగ ప్రజలకు పరిపాలనలో క్రమముగ భాగస్వామ్య మును కల్పించి కడకు జులై 10, 1973 న ఈ రాజ్యమునకు, కామన్ వెల్త్‌లో భాగస్వామ్యముగల, స్వతంత్రరాజ్య ప్రతిపత్తిని బ్రిటన్ కల్పించినది; తదాదిగ 'కామన్ వెల్తు ఆఫ్ బహామాస్' అను పేరున ఇది వ్యవహృతము.

**7. పరిపాలన :** బ్రిటిష్‌రాణి, ఇచటి ప్రధాన మంత్రిని సంప్రతించి నియమించు గవర్నరు, ఇట శాసనసభకు బాధ్యత వహించిన మంత్రివర్గపు సాయమున, రాజ్యాంగబద్ధుడైన అధినేతగ పాలనను నిర్వహించును. 18 ఏండ్లవయస్సునకు మించిన ప్రజలచే సార్వజనిక రహస్య వోటింగ్ పద్ధతిలో, నియోజక వర్గముల వారీగా, సాధారణముగ అయిదేండ్లకు ఒక పర్యాయము ఎన్నుకొనబడు 38 మంది సభ్యులుగల ప్రతినిధిసభ కలదు. 16 మంది సభ్యులుకల శిష్టసభ కలదు. ఇందు 9 మందిని ప్రధాని సలహాను అనుసరించియు, నలువురను ప్రతిపక్ష నాయకుని సలహాను బట్టియు, ముగ్గురిని తన విచక్షణను ఉపయోగించియు గవర్నరు నియమించును. ప్రతినిధి సభయందు అధికసంఖ్యాక బలము గలవానిని ప్రధానిగను అతని సలహాపై తక్కిన మంత్రులను గవర్నరు నియమించును. దేశమున ప్రోగ్రెసివ్ లిబరల్ పార్టీ, ఫ్రీ నేషనల్ మువ్‌మెంట్ అను రెండు రాజకీయ పక్షములు పనిచేయుచున్నవి. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున బ్రిటిష్ పద్ధతిని అనుసరించి న్యాయ నిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** పోలీసు బలము మాత్రమే ప్రస్తుతమున కలదు; అందలి భటసంఖ్య 630; ఉద్యోగి సంఖ్య 276 (1971).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, కామన్‌వెల్తునందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశమున వ్యవసాయానుకూలమగు భూమి చాల తక్కువ. అటనట కూరగాయలు, ఉల్లిగడ్డలు, టొమాటోలు పండింపబడుచున్నవి. టొమాటోలలో అత్యధిక భాగము ఎగుమతి అగుచున్నవి. కోళ్ళపెంపకము, మత్స్య పరిశ్రమ దేశమునకు కొంతవరకు సహాయకారులుగ ఉన్నవి. చిన్న పరిశ్రమలకై ఎగుమతి దిగుమతి సుంకముల సడలింపుతో ప్రభుత్వము పెక్కు వసతులను కల్పించుటవలన సిమెంట్, పెట్రోలియమ్ పరిశుద్ధి మొదలగువానికి సంబంధించిన పరిశ్రమలు కొన్ని ఏర్పడినవి. విదేశీయ యాత్రికుల వలన అధిక ఆదాయము లభించుచున్నది. ఇచటి కార్మికులలో పలువురు యు. స్టే. లో వ్యవసాయ రంగమున కొంతకాలము ప్రతిసాలున పనిచేయుట వలనకూడా దేశమునకు కొంత ఆర్థికలాభము కలుగుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 12 కో. కివా. (1971). మొత్తపు ఎగుమతుల విలువ 26,48,90,000 బ. డాలర్లు; దిగుమతుల విలువ 50,82,46,748 బ. డా. (1971). బడ్జెటరీ వ్యయము 10.65 కోట్ల బ. డాలర్లు (1971).

**11. సాంఘిక రంగము :** 6 మొదలుగ 14 ఏండ్ల వయసుగల వారికి నిర్బంధ, ఉచిత విద్యా

విధానము అమలున ఉన్నది. ప్రభుత్వాధ్వర్యవమున పనిచేయు 169 ప్రయిమరీ పాఠశాలలలో 27,971 మంది; 13 సెకండరీ పాఠశాలలలో 13,667 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక ప్రయివేటు యాజమాన్యమున పనిచేయు 40 పాఠశాలలలో 13,107 మంది విద్యార్థులు ఉన్నారు (1971). స్థానికముగ ఉన్నత విద్యకు వసతులు లేవు. 815 శయ్యాసంఖ్యకల 4 ఆసుపత్రులు పనిచేయుచున్నవి; వైద్యసంఖ్య 93 (1966).

**12. యాత్రా సౌ. :** దేశపు ఆదాయ మార్గములలో యాత్రికులవలన లభించున్నది ముఖ్యతమము అగుటవలన ప్రభుత్వము యాత్రికులకై పెక్కు సౌకర్యములను ఏర్పరచినది. 1971 లో 14,63,591 మంది విదేశీయులు దేశమున దర్శించిరి; వీరు దేశమున 27.8 కోట్ల బహామా డాలర్లు వెచ్చించిరి.

# 16. బార్బడోస్

**ముఖ్యనగరము :** బ్రిడ్జిటౌన్; **జెండా :** నీలిమ, బంగారు, సాగరనీలిమ అను మూడు రంగుల నిలువు రేఖలలో మధ్యనున్న బంగారు వర్ణపు రేఖపైన త్రిశూలపు పైభాగము కలది; **జాతీయగీతము :** ''ఇన్ ప్లెంటీ అండ్ ఇన్ టైమ్ ఆఫ్ నీడ్''... (మంచికాలమున, చెడ్డకాలమున... ...) అను పదములతో ఆరంభితమగునది; **నాణెము :** ఈస్ట్ కరిబ్బియన్ డాలరు; ఇది 100 సెంట్లుగ విభక్తము; ఒక ఈ. క. డాలరు = రు. 3.75; **కొలతూకములు :** బ్రిటిష్ విధానపువి. **కాలగణన :** ఉ. 8 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ. : కరిబ్బియన్ సముద్రమునందలి దీవులందెల్ల తూర్పు కొనన ఉన్న ఈ ద్వీపరాజ్యము 13°2′-13 - 20′ ఉ. అ. రేఖల మధ్యను, 59°25′-59°39° ప. తు. రేఖల మధ్యను నెలకొని ఉన్నది. దీని వైశాల్యము 430 చ. కిమీ. తీరభూమిని పరివేష్టించి పవడపు తిన్నెలు కననగును. ద్వీపపు ఉత్తర మధ్య ప్రాంతము పర్వతమయము; అందు హిల్లబీ అను నది ఉన్నత శిఖరము (ఎత్తు 376 మీ.) అటనుండి భూమి క్రమముగ, సోపాన తలములలో ఎత్తు తగ్గుచు తీరమును చేరుసరికి సమతలముగ పరిణమించును.

**2. శీతోష్ణస్థితి** మొ. : దేశము ఉష్ణమండలముననే ఉన్నను, శీతకాలమున ఈశాన్యము నుండియు, గ్రీష్మమున ఆగ్నేయమునుండియు వీచు సముద్ర మందవాయువుల వలన ఉష్ణోగ్రతయందు సౌమ్యము కలుగుచున్నది. దేశపు గరిష్ఠ ఉష్ణోగ్రత 85° ఫా.; కనిష్ఠ ఉష్ణోగ్రత 75° ఫా. జూన్ నుండి డిసెంబరు వరకు వర్షములు ఎక్కువ; అయినను సాలున తక్కిన కాలములందున ఎడనెడ తరుచుగ వానలు కురియును. తీరప్రాంతమున సాలున వర్షపాతము 100 సెం. మీ.; పర్వతప్రాంతములందు 225 సెం. మీ.; మహాగనీ వృక్షములు, సీమబాదం చెట్లు; తాళజాతి వృక్షములు ద్వీపమున ఎదుగుచున్నను, అటవీప్రాంతములు లేవు. వన్యజంతువులు లేవని చెప్పవచ్చును; పక్షిసంతతులు కొలదిగ కలవు.

**3 జనసంఖ్యా మొ.:** దేశపు జనసంఖ్య అంచనాలను బట్టి 2,43,741 (1971); ముఖ్య నగరపు జనసంఖ్య 15,769; అత్యధికజనసాంద్రత కల ప్రపంచ రాజ్యములలో ఒకటిగ ఈ దేశము, లెక్కింపబడుచున్నది; జనసాంద్రత చ. కిమీ. కు 579. నీగ్రోలును, వారితో బాగుగ సంకరమొందిన ఇతర జాతులును కలిసి ప్రజలలో 95% కలరు. తక్కిన వారిలో ఎక్కువగ యూరపీయ సంతతియు, కొలదిగ ఆసియావాసుల సంతతియు కనగుదురు. ఆంగ్లము దేశభాష; ప్రజలందరు క్రైస్తవులు.



పటము 12.

**4. సమాచార సా.:** టెలిగ్రాఫ్ వసతి లేదు; కాని టెలిఫోనుల వసతిమాత్రము కలదు. టెలెక్స్ విధానమున గ్రేట్‌బ్రిటన్‌తోను, వైర్‌లెస్ టెలిఫోను ద్వారా కొన్ని తదితర ప్రముఖ రాజ్యములతోను ఈ దేశమునకు వార్తా సంబంధము కలదు. ఒక రేడియో స్టేషను, ఒక టెలివిజన్ స్టేషన్ పనిచేయుచున్నవి.

**5. యాన సౌ.:** ద్వీపమున 1641 కిమీ ల నిడివిగల రోడ్లు కలవు; ఇందు 1,157 కి. మీ. ఉత్తమ శ్రేణికి చెందినవి, రైలుమార్గములు లేవు. బ్రిడ్జిటౌన్ వద్ద అన్ని వసతులు కల హార్బరు కలదు. ముఖ్యనగరమునకు సమీపమున సీవెల్‌లో ఉన్న అంతర్జాతీయ విమానాశ్రయము ద్వారా ప్రముఖ రాజ్యములతో విమానయానవసతి ఏర్పడి ఉన్నది.

**6. చరిత్ర:** తొలుత ఈ దీవియందు ఒక ఆదిమ అమెరికన్‌జాతి వసించి యుండెనని భావించుటకు తగిన ఆధారములు ఉన్నను, 1627 లో బ్రిటిష్‌వారు దీనిని ఆక్రమించుకొనునాటికి ఇందు జనావాసము ఏదియు లేకుండెను. చక్కెర తోటలలో పని చేయుటకై బ్రిటిష్‌వారు, ఇచటికి నీగ్రోలను విరివిగ కొనివచ్చిరి. 1834 లో బానిస పద్ధతి రద్దయిన తరువాత నీగ్రోసంతతి ప్రజలు, తక్కిన వారితోపాటు స్వతంత్ర పౌరులైరి; కాని దేశము బ్రిటిష్ ప్రభుత్వపు వలసపాలనలోనే ఉండెను. విండ్‌వర్డ్ దీవుల సమాఖ్యలో ఈ ప్రాంతమును చేర్చుటకై 1876 లో బ్రిటన్ యత్నించినను, ఇచటి నీగ్రోసంతతి ప్రజలు అందులకు అంగీకరింపక కల్లోలములను లేవదీసిరి; అంతట ఈ ద్వీపమును ఒక ప్రత్యేక పాలిత ప్రాంతముగనే ఉండనిచ్చి, క్రమముగ ప్రజలకు పరిపాలనలో భాగస్వామ్యమును కల్పించి, కడకు 1958 లో ఆంతరంగిక స్వపరిపాలనను ఈ దేశమునకు బ్రిటన్ దత్తము చేసినది. అంతట కొలది కాలము వెస్ట్‌ఇండీస్ సమాఖ్యలో ఈ దేశము ఉండినను, 1962 లో ఆ సమాఖ్య రద్దుకాగా, ఆంతరంగిక స్వపరిపాలనగల స్వతంత్ర రాజ్యముగ రూపొంది తుదకు 1966 లో సర్వ స్వతంత్ర రాజ్యమైనది.

**7. పరిపాలన :** రెండు కక్ష్యలు - ప్రతినిధి సభ, శిష్టసభ అనునవి - కలిగిన శాసనసభ కలదు. ప్రతినిధి సభయందలి సభ్యసంఖ్య 24. సాధారణముగ అయిదేండ్లకు ఒక పర్యాయము జరుగు ఎన్నికలలో సార్వజనికము, రహస్యమునగు వయోజనుల వోటింగుపద్ధతిలో, 12 నియోజక వర్గముల నుండి, ప్రతినిధి సభలోని సభ్యులు ప్రజలవలన ఎన్నుకొనబడెదరు. బ్రిటిష్‌దేశపు రాణి నియమించు గవర్నరు - జనరల్ ఇచట రాజ్యాంగబద్ధ అధినేతయై వ్యవహరించును. ప్రతినిధి సభయందు అధికసంఖ్యాక బలము కలవానిని ప్రధానిగను, ఆతని సలహాపై తక్కిన మంత్రివర్గ సభ్యులను గవర్నరు - జనరల్ నియమించును. శిష్టసభలోని సభ్య సంఖ్య 21. ప్రతినిధి సభలోని అత్యధిక సంఖ్యాక పక్షమునకు చెందిన వారిని 12 మందిని; ప్రతిపక్షమునకు చెందినవారిని ఇరువురను; ఆర్థిక, సాంఘిక, మతధర్మాదులందు ప్రవీణులగు వారిని 7 మందిని ఈ శిష్టసభాసభ్యులుగ గవర్నరు నియమించును. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయపాలన నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** ఒక పటాలపు భూతలసేన మాత్రమే కలదు; ఇదియు బ్రిటనుకు చెందిన ఒక సేనాదళమున అంతర్భాగముగ పరిగణితము.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. యందును అమెరికన్ రాజ్యవ్యవస్థ యందును, బ్రిటిష్ కామన్ వెల్తునను ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** చక్కెర ఉత్పత్తి పైనను, చక్కెరతో సంబంధముగల తక్కిన ఉత్పత్తుల పైనను దేశపు ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉన్నది. దేశమున ఉన్న వ్యవసాయానుకూల భూమి అంతయు (94 వేల ఎకరములు) సాగున ఉన్నది. దేశాదాయమున కొంత ప్రముఖ భాగము విదేశయాత్రికుల వలన లభించుచున్నది. మత్స్య పరిశ్రమ కొంతవరకు మంచిస్థితిలో ఉన్నది. ఎగుమతుల విలువలో 46% చక్కెరవలన లభించుచున్నది. పరిశ్రమలలో చాల భాగము వ్యవసాయముతో ముడివడి ఉన్నవి. సబ్బు, గ్లిసరీన్,మందులు, దుస్తులు చెప్పదగిన తక్కిన పారిశ్రామికోత్పత్తులు. ఇందు అధికభాగము ఎగుమతి అగుచున్నది. విద్యుదుత్పత్తి 11 కోట్ల కివా. (1968). దేశపు ఎగుమతుల విలువ 8,61,74,972 ఈ. క. డాలర్లు; దిగుమతుల విలువ 24,36,51,386 ఈ క. డాలర్లు, బడ్జెటరీ వ్యయము 9,88,37,729 ఈ. క. డాలర్లు (1971-72).

**11. సాంఘిక రంగము:** ప్రయిమరీ విద్యయు సెకండరీ విద్యయు, నిర్బంధములుగ గాకపోయినను, ఉచితముగ లభించుచున్నవి. ప్రభుత్వపు 117 ప్రయిమరీ పాఠశాలలలో 42,465 మంది; 7 సమగ్ర పాఠశాలలలో 9,160 మంది; 10 సెకండరీ పాఠశాలలలో 5,239 మంది విద్యార్థులు కలరు. ఇవి గాక ప్రభుత్వ సాయమున పనిచేయు 19 ప్రయివేటు పాఠశాలలలో 7,259 మంది విద్యార్థులు కలరు (1971). ఒక దినపత్రిక మాత్రమే ప్రచారమున ఉన్నది. దేశమున 2,806 శయ్యాసంఖ్యగల పలుతీరుల ఆసుపత్రులు కలవు.

**12. యాత్రా సౌ. :** దేశమున రమ్యములగు సముద్ర తీరములు, సముద్ర స్నానమునకు అనువగు చక్కని రేవులు, సౌమ్యమగు శీతోష్ణస్థితి ఉండుటవలన యు. స్టే. మొదలగు దేశములనుండి పలువురువచ్చి ప్రతియేటా ఈ దేశమున తమ విశ్రాంతికాలమును గడపెదరు, యాత్రికులకు తమ వసతులను ప్రభుత్వము ఏర్పరచినది. 1970 లో 1,56,417 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. ఈ యాత్రికులవలన వచ్చు ఆదాయము దేశసంపదకు ఒక ప్రముఖాధారము.

# 17. బెర్మ్యూడా

**ముఖ్యనగరము** : హామిల్టన్; జెండా, జాతీయ గీతము : బ్రిటిష్ ప్రభుత్వపువే: **నాణెము** : బెర్మ్యూడా డాలరు; ఒక డాలరు = రు. 7.50; **కొలతూకములు.** బ్రిటిష్ విధానపువి. **కాలగణన** : ఉ. 7 గం. 30 ని = భారతదేశమునసా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర అమెరికా ముఖ్య భూఖండమునకు తూర్పున 928 కిమీ. ల దూరమున అట్లాంటిక్ మహాసముద్రమున 32° 15′ ఉ. అ. రేఖమీదను, 64°31′ ప. తు. రేఖపైనను నెలకొనివ ఈ ద్వీపరాజ్యమున దాదాపు 300 అల్ప ద్వీపములు కలవు. వీనిలో 20 ద్వీపములందు మాత్రమే జనావాసములు కలవు, ఆ ద్వీపములందన్నింట వైశాల్యమునను, తక్కిన రీతులను ప్రాముఖ్యము కల బెర్మ్యూడా ద్వీపపు పేరుననే ఈ రాజ్యము వ్యవహృతము. ద్వీపముల మొత్తపు వైశాల్యము 53.3 చ. కిమీ. బెర్మ్యూడా దీవియొక్క పొడవు 22 కి, మీ; సరాసరి వెడల్పు 1.68 మీ. దేశపు దీవులలో రెండు దీవులు (6 చ. కిమీ) యు. స్టే. కు, నౌకా, సైనికా స్థావరముల కొరకై, 99 ఏండ్ల కౌలుకు, 1941 లో ఈయబడినవి. దీవులన్నియు చాలవరకు సమతలపు రాతినేలలు.

**2. శీతోష్ణస్థితి మొ :** సౌమ్యమగు శీతోష్ణ పరిస్థితి ఇట కననగును. సాలున సరాసరి ఉష్ణోగ్రత 70° ఫా.;సరాసరి వర్షపాతము 145 సెం.మీ.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 53,100 (1970). ముఖ్యనగరమగు హామిల్టన్ లోని జనసంఖ్య 3,000. ప్రజలలో 60% నీగ్రో జాతికి చెందినవారు, 40% శ్వేత జాతీయులు. దేశ భాష ఆంగ్లము; జనులందరు క్రైస్తవులు.

**4. సమాచార సా. :** 12 పోస్టు ఆఫీసులును, టెలిఫోను వసతులును కలవు. కేబుల్ ద్వారా యు. స్టే. తోను, కెనడాతోను సంబంధము కలదు. రేడియో స్టేషన్, టెలివిజన్ కేంద్రము ముఖ్యనగరమున పనిచేయుచున్నవి.

**5. యాన సా. :** ద్వీపములందు పెక్కింట రోడ్ల వసతులు కలవు. రైలుమార్గము ఒకపుడు ఉండినది; కాని ఇపుడు ఎత్తివేయబడినది. బస్సులు, లారీలే దేశమున యాన సౌకర్యములకు ఆధారములు. హామిల్టన్ వద్దను, జార్జిటౌన్ వద్దను హార్బరులు కలవు. కైండ్లీ ఫీల్డు అనుచోట ఉన్న అంతర్జాతీయ విమానాశ్రయము 10 అంతర్జాతీయ విమాన సంస్థల విమానములకు మజిలీగా ఉపకరించుచున్నది. అందువలన యూరప్‌కు, ఉత్తర, దక్షిణ అమెరికాలకు, కరిబ్బియన్ సముద్ర ప్రాంత రాజ్యములకు ఇటనుండి విమానయాన వసతి ఏర్పడినది.

**6. చరిత్ర :** జాన్ బెర్ముడెజ్ అను స్పెయిన్ దేశీయ నాయకుడు ఈ దీవులను 1515 లో కనుగొనెను. అందువలన అతని పేరుననే ఈ ద్వీప రాజ్యమునకు పేరు కలిగినది. కాని అట స్పెయిన్ వారెవరును చేరలేదు. 1609 లో బ్రిటిష్‌వారు కొందరు ఇట వలస చేరిరి. క్రమేణ ఈ ద్వీప రాజ్యము బ్రిటిషు ప్రభుత్వపు మకుటపు వలసగ పరిణమించినది (1684). బ్రిటిష్‌వారే పనిపాటులకై నీగ్రోలను ఇటకు కొనివచ్చిరి. 1968 లో ఇచట ప్రజలకు ప్రభుత్వమున భాగస్వామ్యమును బ్రిటిష్ ప్రభుత్వము కల్పించుటవలన అంతరంగిక స్వపరిపాలనా ప్రతిపత్తి గల రాజ్యముగ ఈ దేశము రూపొందినది.

**7. పరిపాలన :** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, ప్రజా ప్రతినిధి సంస్థల సహకారముతో ఆంతరంగిక పాలనను నిర్వహించుచున్నాడు. శాసన సభయందు రెండు కక్ష్యలు-ప్రతినిధి సభ, విధాన సమితి అనునవి-కలవు. ప్రతినిధి సభయందలి సభ్య సంఖ్య 40. వీరిని సార్వజనిక, వయోజన, రహస్య పద్ధతిన జరుగు ఎన్నికలో 20 నియోజక వర్గముల ప్రజలు ఎన్నుకొనెదరు: విధానసభలోని సభ్య సంఖ్య 11. వీరిలో నలుగురిని అధికారపక్షనాయకుని సలహాపైనను, యిరువురను ప్రతిపక్షపు సలహాపైనను, అయిదుగురుని తన ఇచ్చను అనుసరించియు గవర్నరు నియమించును. అత్యధికబలము కల పక్షమునుండి కొందరిని, ప్రతిపక్షమునుండి కొందరిని. కార్యవర్గ సభ్యులుగ గవర్నరు నియమించుకొని వారి సాయమున పాలనను నిర్వహించును. అంతరంగిక పాలనకు సంబంధించినంత వరకు, పాలనయంతయు, శాసనసభకు బాధ్యతవహించి సాగును. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఈ రెండింటి విషయమున బ్రిటిష్ ప్రభుత్వమే బాధ్యత వహించి ఉన్నది. ఈ రాజ్యపు దీవులలో ఒకటియగు ఐర్లండు దీవియందు బ్రిటిష్ స్థావరము ఒకటి ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థకు విదేశ యాత్రికులవలన వచ్చు ఆదాయమే ప్రముఖాధారము. వ్యవసాయము వలన కొలదిగ అరటి పండ్లు, నిమ్మజాతి పండ్లు, బంగాళా దుంపలు, తక్కిన కూరగాయలు దేశావసరములకై పండింపబడుచున్నవి; మొత్తముమీద 761 ఎకరములు మాత్రమే సాగున ఉన్నది. కొన్ని చిన్నపరిశ్రమల వలన ఔషధద్రవ్యములు, ఎస్సెన్సులు ఉత్పత్తియై, అందు అధికభాగము ఎగుమతి అగుచున్నవి. అమెరికన్, బ్రిటిష్ సైనిక స్థావరముల వారికి సంబంధించిన పని పాటులవలన పలువురు జీవింపగలుగుచున్నారు. దేశపు ఎగుమతుల విలువ 7,93,06,313 బె. డాలర్లు; దిగుమతులవిలువ 10,84,78,219 బె. డాలర్లు (1971). బడ్జెటరీ వ్యయము 4,83,93,205 బె.డాలర్లు (1972-73).

**11. సాంఘిక రంగము :** 5 నుండి 16 ఏండ్లవరకు వయసు గలవారికి నిర్బంధముగ విద్య బోధింపబడుచున్నది. ప్రభుత్వ సహాయమున పనిచేయు 41 పాఠశాలలలో 13,242 మంది విద్యార్థులు కలరు (1971). దేశమున ప్రయివేటు ఆసుపత్రులు మాత్రమేకొలదిగి కలవు. వైద్యసంఖ్య 66 (1967).

**12. యాన సౌ. :** దేశపు ఆర్థిక వ్యవస్థకు యాత్రికుల వలన వచ్చు ఆదాయమే ముఖ్యాధారమగుట వలన, ప్రభుత్వము యాత్రికులకై పలు సౌకర్యములను సమకూర్చినది. 1971 లో 4,12,947 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

---

# 18. బ్రిటిష్ హొండూరాస్

**ముఖ్యనగరము** : బెలిజే సిటీ; **జెండా** : కొలది మార్పులతో బ్రిటిష్ పతాకమే ఈ దేశపు జాతీయ పతాకముగ ఉన్నది, **జాతీయ గీతము** : గాడ్ సేవ్ ది క్వీన్ (పరమేశ్వరుడు రాణిని రక్షించు గాక); **నాణెము** : బ్రిటిష్ హొండూరాస్ డాలరు. ఇది 100 సెంట్లుగ విభక్తము; ఒక బ్రి. హొ. డాలరు




పటము 13.

= రు. 4.58. **కొలతూకములు** : బ్రిటిష్ విధానపువి; **కాలగణన** : ఉ.6 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : కరిబ్బియన్ సముద్రతీరమున 15°53′-18°31′ ఉ. అ. రేఖలకును, 87° 16′-99°8′ ప.తు. రేఖలకునుమధ్య నెలకొని ఉన్న ఈ రాజ్యమునకు ఉత్తరమున మెక్సికో; దక్షిణ పశ్చిమములందు గ్వాతమేలా; తూర్పున కరిబ్బియన్ సముద్రము సరిహద్దులైయున్నవి. దేశవైశాల్యము 22,963 చ. కిమీ. ముఖ్యనగరమునకు ఉత్తరమున ఉన్న దేశభాగము సమతల భూమి. మనాతీ పర్వతశ్రేణికి చెందిన గుట్టలు మాత్రమే అటనట కననగును. ముఖ్యనగరమునుండి దక్షిణమునకు పోవుకొలది, భూతలపు ఎత్తు క్రమముగ పెరిగి. కడకు పర్వతమయ భూమిగ పరిణమించును. మాయా, కాక్స్‌కూంబ్ పర్వతశ్రేణులు దేశమునకు వెన్నెముకవలె రూపుగొనియుండ, అందుండి 17 నదులు ప్రవహించుచున్నవి. తీరమునకు సమీపమున సముద్ర పరివృతములైన పవడపు తిన్నెలును వాని తరువాత కొన్ని చిన్నద్వీపములును లంకలును కలవు. వీనిలో టర్నిఫ్ ద్వీపము, అంబెర్‌గ్రిస్ లంక అనునవి పెద్దవి.

**2 శీతోష్ణస్థితి మొ.** : ఉపోష్ణమండలపు శీతోష్ణస్థితియు, గాలిలో ఎక్కువగ తెమ్మదనమును ఇచట కన్పట్టును; అయినను సముద్రపు వాయువుల వలన ఉష్ణతీవ్రత కొంత తగ్గుచున్నది. తీరభూమిన సాలున ఉష్ణోగ్రత 60°-90° ఫా. మధ్య ఉండును. దేశమధ్యమున ఉష్ణోగ్రత కొంత ఎక్కువగ ఉండును. రెండు గ్రీష్మరుతువులు-ఫిబ్రవరినుండి మే వరకు, ఆగస్టు నుండి సెప్టెంబరు వరకు ఇట కననగును. ఉత్తరప్రాంతమున సాలుసరిన వర్షపాతము 125 సెం.మీ.; దక్షిణమున 438 సెం.మీ. జులై నుండి అక్టోబరువరకు సామాన్యముగ తుఫానుల వలన బాధ ఉండును. తీరభూమియందు తప్ప, తక్కిన దేశమున అడవులు ఎక్కువగ కలవు; మహాగనీ మొదలగు ఉత్తమజాతి వృక్షములు అందు ఎక్కువగ ఉన్నవి; వన్యజంతువు

లలో పెద్దవి ఏవియు లేవు; పాములు మొదలగు పలురకముల సరీసృపములు కలవు.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 1,19,645 (1970); ముఖ్యనగరపు జనసంఖ్య 39,257. ప్రజలలో 40% నీగ్రోసంతతివారు; 40% సమ్మిశ్రజాతివారు (యూరపీయులు, ఆదిమ అమెరికనులు, నీగ్రోలు సంకరమొందగ రూపొందినవారు); తక్కిన వారిలో ఆదిమ అమెరికనులును, భారతీయులు మొదలగు ఆసియావాసుల సంతతివారును చేరియున్నారు. సాధికారభాష ఇంగ్లీషు; ప్రజలలో దాదాపు 60% కు ఇది మాతృభాష. 22% ప్రజలు స్పానిష్ భాషను, 10% మాయా భాషను, 8% కరిబ్బియన్ భాషను, దాదాపు 1300 మంది జర్మన్‌భాషను మాటాడుచున్నారు. దాదాపు 50% ప్రజలు రోమన్‌కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన వారిలో అత్యధిక సంఖ్యాకులు ఇతర సంప్రదాయముల క్రైస్తవులు; హిందువులును, ముస్లిములును అత్యల్ప సంఖ్యలలో కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున 8 పోస్ట్ ఆఫీసులును, 44 గ్రామీణ సబ్‌పోస్ట్ ఆఫీసులును పనిచేయుచున్నవి. దేశపు ప్రముఖకేంద్రముల మధ్య టెలిఫోను వసతులును, రేడియో – టెలిఫోను సౌకర్యములును కలవు. రేడియో టెలిగ్రాఫ్, టెలిఫోను ద్వారా జమైకా దేశపు ముఖ్యనగరముతో వార్తా సౌకర్యము ఏర్పడియున్నది. బెలిజే సిటీ యందు ఒక బ్రాడ్‌కాస్టింగ్ స్టేషను పనిచేయుచున్నది.

**5. యాన సౌ. :** 1 728 కిమీ.ల నిడివిగల రోడ్లు కలవు; అందు 469 కిమీ. లు ఉత్తమశ్రేణికి చెందినది. ఒక రైలుమార్గము కలదు; కాని అది ప్రయివేటు యాజమాన్యమున, అడవి కలపను నదీతీరములకు చేర్చుటకు మాత్రమే ఉపయోగపడుచున్నది. సముద్రతీరపు రేవులలో, ఉన్నవానిలో, బెలిజే హార్బరు ప్రముఖము; ఇచట సైతము లోతునీటి సదుపాయము తక్కువ. బెలిజే యందే ఒక అంతర్జాతీయ విమానాశ్రయము కలదు. ఇటనుండి యు. స్టే. హొండూరాస్, జమైకా, గ్వాతెమాలా దేశములకు విమానప్రయాణ వసతి ఉన్నది. దేశమున ఇదిగాక 13 చిన్న విమానక్షేత్రములు కలవు. వీని వలన దేశపు వివిధ ప్రాంతముల మధ్య విమానయానమునకు వసతి ఏర్పడినది.

**6. చరిత్ర :** ఈ దేశపు పూర్వచరిత్రను గురించిన వివరములు తెలియవచ్చుట లేదు. కాని ప్రాచీన కాలమున ఇట మాయా నాగరికతకు చెందిన ఒక రాజ్యము వర్ధిల్లెననియు, క్రీ. శ. 900 ప్రాంతమున అది అంతరించెననియు, అచటి చారిత్రకావశేషముల వలన తెలియవచ్చుచున్నది. జమైకాను బ్రిటిష్‌వారు 1655 లో వశపరచుకొనిన తరువాత కొందరు బ్రిటిషు నావికులు, బానిసలతోకూడ అటకు చేర మొదలిడిరి తొలుత స్పెయిన్ వారికిని, బ్రిటిష్‌వారికిని దీనిపైని స్వామ్యమును గురించి తగవులు ఏర్పడినను, కడకు బ్రిటిష్‌వారే ఈ ప్రాంతమున స్థిరవాసములను ఏర్పరచుకొన గలుగుటవలన 1862 లో ఇది బ్రిటిష్ వలసగ పరిగణన పొందినది. 1968 లో ఈ తగవును మరల పైకి లేవదీసి, ఈ ప్రాంతము తనదే యని గ్వాతమేలా రాజ్యము వాదించినది. ప్రస్తుతమున ఈ దేశము స్వయం పాలనా ప్రతిపత్తిని కలిగియున్నది.

**7. పరిపాలన :** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు – జనరలు, ఇచట రాజ్యాంగబద్ధ అధినేతగ వ్యవహరించును. పాలనాధికారము ఇతనియందును, ప్రధాని ఆధ్వర్యవమున పనిచేయు మంత్రిమండలి యందును, జాతీయ శాసనసభ యందును న్యస్తము. శాసనసభలో ప్రతినిధిసభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. తొలుతటి

దాని సభ్యసంఖ్య 15; వీరందరును సార్వజనిక వయోజన పద్ధతిని జరుగు రహస్యపు ఎన్నికలో ఎన్నుకొనబడెదరు; శిష్టసభా సభ్యులను గవర్నరు నియమించును. రెండు రాజకీయ పక్షములు పని చేయుచున్నవి. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున ఇట న్యాయపాలన బ్రిటిష్ సంప్రదాయానుగుణముగ తగు స్థానికపు మార్పులతో, నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ, 9 అంతర్జాతీయ సం.:** ఈ రెండింటి విషయమున బ్రిటిష్ ప్రభుత్వమే బాధ్యత వహించి వ్యవహరించుచున్నది. ప్రత్యక్షముగ ఐ. రా. స. **తో** సంబంధము లేకపోయినను ఆ సంస్థనుండియు, తదనుబంధ సంస్థల నుండియు ఈ దేశము విరివిగ సాయమును గ్రహించినది.

**10. ఆర్థిక రంగము :** ఆర్థిక వ్యవస్థ, వ్యవసాయము పైనను, అటవీ సంపత్తి పైనను ఆధారపడి ఉన్నది. వ్యవసాయోత్పత్తులలో చక్కెర, నిమ్మజాతి పండ్లు ప్రముఖములు; ఇందు అత్యధిక భాగము ఎగుమతి అగుచున్నది. అడవులలోని మహాగనీ కలపసామగ్రి విదేశములకు ఎగుమతియగుటవలన దేశమునకు అధికాదాయము లభించుచున్నది. పశుసంపద తగినంతగ కలదు. మత్స్య పరిశ్రమ వలని ఉత్పత్తిలో కొంతభాగము ఎగుమతి యగుచున్నది. ఖనిజములు ప్రముఖమైనవి ఎట్టివియు కనరావు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 5,420 కివా. (1968). ఎగుమతుల విలువ 2.085 కోట్ల బ్రి. హా. డాలర్లు; దిగుమతుల విలువ 4,93,50,562 బ్రి. హా. డాలర్లు: దిగుమతుల విలువలో నాలుగవ వంతు ఆహారపదార్థమువకు చెందినది (19[illegible]). ఇప్పటికి ఋణము 2,85,45,[illegible] బ్రి. హా. డాలర్లు (19[illegible]).

**11. సాంఘిక రంగము :** దేశమున గృహవసతి పలుతావులందు చాల తక్కువ. తుఫానుల బెడదవలన ఈ పరిస్థితి క్లిష్టతరమగుచున్నది. ప్రయిమరీ విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. 6 నుండి 14 ఏండ్లవరకు వయసుగలవారికి నిర్బంధ విద్యాబోధ అమలున ఉన్నది. 1971 లో దేశమునందలి 152 ప్రయిమరీ పాఠశాలలలో 32 022 మంది, 1[illegible] సెకండరీ పాఠశాలలలో [illegible] మంది, సాంకేతిక పాఠశాలలో 267 మంది, ప్రభుత్వ జూనియర్ కళాశాలలో 250 మంది విద్యార్థులు కలరు. పైవానిలో సాంకేతిక పాఠశాల తప్ప తక్కిన వానిలో పెక్కు సంస్థలు క్రైస్తవమత వర్గముల ఆధ్వర్యమున పనిచేయుచు ప్రభుత్వ సాహాయ్యమును పొందుచున్నవి. ఒక దైనిక పత్రిక మాత్రమే దేశమున ప్రచారమున ఉన్నది. బెలిజేయందు ఒక కేంద్ర గ్రంథాలయ సంస్థ పని చేయుచు, 68 శాఖా గ్రంథాలయములను పలుతావులందు నిర్వహించుచున్నది. పూర్వపు మాయా నాగరికతకు చెందిన అవశేషములను ప్రదర్శించు ఒక మ్యూజియము కలదు. సాంక్రామిక వ్యాధుల బాధ దేశమున చాల తక్కువ. 572 శయ్యా సంఖ్యగల 12 ఆసుపత్రులు దేశమున పనిచేయుచున్నవి: వైద్యసంఖ్య 38 (1967).

**12. యాత్రా సౌ.:** 1967 మొదలుగ, ప్రభుత్వము దేశమునకు విదేశ యాత్రికులను ఆకర్షించుటకై కృషి చేయుచున్నది.

# 19. మార్టినిక్

## (ఫ్రెంచి సముద్రోత్తర మండలము)

**ముఖ్యనగరము :** ఫోర్ట్ - డి - ఫ్రాన్స్; **జెండా, జాతీయ గీతము, నాణెము, కొల తూకములు :** ఫ్రాన్సు దేశపువే; **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** కరిబ్బియన్ సముద్రమున 14° ఉ. అ., 63° ప. తు. రేఖలపై ఈ ద్వీప రాజ్యము ఉన్నది. ద్వీపపు మొత్తపు వైశాల్యము 1,102 చ. కిమీ. అందు అత్యధికభాగము పర్వత మయము. ఆ పర్వతములలో అత్యున్నతములగు నవి రెండును - పీలీ (1,350 మీ.) కార్‌బెట్ (1,189 మీ.) అనునవి-అగ్నిపర్వతములు. వీనిలో తొలుతటిది 8 మే, 1902 న విజృంభించి, సమీపముననున్న సెయింట్ - పియెర్రే నగరమును సర్వనాశనము చేయగ 30 వేల మంది చనిపోయిరి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ద్వీపము ఉష్ణమండలముననే ఉన్నను, సముద్రవాయువుల వలన ఉష్ణపుతీవ్రత చాల తగ్గుచున్నది. వర్షపాతము విరివిగ కలదు. 25% దేశము అటవీమయము.

**3. జనసంఖ్య మొ. :** 1967 లెక్కలనుబట్టి దేశపు జనసంఖ్య 3,20,030; 1972 అంచనాలను బట్టి 3,39,000 ముఖ్యనగరమున జనసంఖ్య 99, 051. నీగ్రో, ఆదిమ అమెరికన్, యూరపీయ సంతతుల ప్రజలు ఇందు చేరిఉన్నారు. దేశభాష ఫ్రెంచి; ప్రజలందరును క్రైస్తవులు.

**4. సమాచార సా. :** 43 పోస్ట్ ఆఫీసులు (1971) కలవు; యూరపుతో రేడియో-టెలిఫోన్ వలన వార్తాసంబంధము ఏర్పడి ఉన్నది. ద్వీపమున టెలిఫోనుల వనతి ఎక్కువగ కలదు.

**5. యాన సౌ. :** 268 కిమీ. ల పొడవున జాతీయ రహదారులును, 350 కిమీ ల జిల్లా రోడ్లును, 716 కిమీ. ల స్థానిక రోడ్లును కలవు; రైల్వేలు లేవు. ముఖ్యనగరమువద్ద సహజ సిద్ధమై. 40 చ. కిమీ. ల విస్తృతి కలిగిన హార్బరు కలదు. దీనివలన ఉత్తర, దక్షిణ అమెరికాలతోను, ఫ్రాన్సుతోను జలమార్గమున ప్రయాణవసతి ఏర్పడినది. ముఖ్యనగరమునకు సమీపమున ఉన్న లామెంటీన్ విమానాశ్రయము ప్రపంచ ప్రసిద్ధ విమానయాన సంస్థలలో పెక్కింటికి మజిలీగా ఉన్నది.

**6. చరిత్ర :** 1502 లో కొలంబస్ ఈ దీవిని కనుగొనెను; కాని స్పెయిన్‌వారు ఎవరును ఇట వలస చేరలేదు. 1635 లో ఫ్రెంచివారు ఇట వలసచేరి, చక్కెర తోటలలో పనిచేయుటకై నీగ్రోలను కొనివచ్చిరి. సప్తవర్షసంగ్రామ కాలమునను (1762-63), ఫ్రెంచి విప్లవ సందర్భమునను (1794-1802), నెపోలియన్ సామ్రాజ్య సమయమునను (1809-15) ఈ ద్వీపమును బ్రిటిష్ వారు వశపరుచుకొనినను, ఆ తరువాత మరల ఇది ఫ్రెంచివారికే లభించి, తదాదిగ వారి ఆధీనముననే ఉన్నది. 1946 వరకు వలసపాలనలో ఉండిన ఈ ద్వీపము, తదాదిగ ఫ్రాన్స్‌దేశపు సముద్రోత్తర మండలముగ ప్రతిపత్తిని ఆర్జించినది.

**7. పరిపాలన :** ఇచటి మాండలిక పాలనను, ఫ్రెంచి ప్రభుత్వము నియమించు ఒక ప్రెఫెక్ట్ (మాండలికుడు), ఎన్నుకొనబడిన స్థానిక ప్రజా సమితియొక్క సహకారముతో, నిర్వహించును. స్థానిక ప్రజాసమితిలోని సభ్యసంఖ్య 36. ఈ ద్వీప రాజ్యపు పక్షమున ఫ్రాన్సుదేశపు జాతీయ శాసన

సభలో ముగ్గురును. శిష్టసభలో ఇరువురును ఎన్నుకొనబడిన సభ్యులు కలరు. ఫ్రెంచి న్యాయశాస్త్రమును అనుసరించి, న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం :** ఈ రెండింటి బాధ్యతయు ఫ్రాన్సుదేశపు ప్రభుత్వమునకే చెందియున్నది.

**10. ఆర్థిక రంగము:** ఆర్థిక వ్యవస్థ అంతయు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. చక్కెర, అరటిపండ్లు ముఖ్యములగు వ్యవసాయోత్పత్తులు. వీనికి అనుబంధముగ సారాయి తయారీ విరివిగ సాగుచున్నది. ఎగుమతులలో ఈ మూడింటికే అత్యధిక ప్రాధాన్యము. ఆహార ధాన్యములను ఈ రాజ్యము దిగుమతి చేసికొనుచున్నది. పశుసంపద విరివిగ కలదు; దానివలన లభించు మాంసము దేశావసరములలో 30 కు సరిపోవుచున్నది. ఎగుమతుల విలువ 16.683 కోట్ల ఫ్రాం.; దిగుమతుల విలువ 81.051 కోట్ల ఫ్రాంకులు (1970). బడ్జెటరీ వ్యయము 39.2 కోట్ల ఫ్రాం. (1972).

**11. సాంఘిక రంగము : ఉచిత** నిర్బంధ విద్యావిధానము ద్వీపమున అమలులో ఉన్నది; 6 నుండి 16 ఏండ్లవరకు వయసు కలిగినవారికి ఇది వర్తించును. ప్రయిమరీ పాఠశాలలలో 85,087 మంది, సెకండరీ పాఠశాలలలో 25,250 మంది విద్యార్థులు కలరు (1970-71). ఉన్నతవిద్యకై ఏర్పడిన ఇన్‌స్టిట్యూట్ హెన్రీ విజియోజ్‌లో న్యాయ, ఆర్థిక, రాజకీయశాస్త్ర విద్యార్థుల సంఖ్య 510 (1967). ద్వీపపు మొత్తమున 19 ఆసుపత్రులు పనిచేయుచున్నవి; వైద్యసంఖ్య 177.

---

# 20. మెక్సికో

**ముఖ్యనగరము :** మెక్సికో సిటీ; **జెండా :** నిలువుగ సమానపు వెడల్పులలో అమరిన మూడు రంగుల – ఆకుపసిమి, తెలుపు, ఎరుపు రంగుల – చారలును, అందు మధ్యనున్న తెలుపు చారకు నడుమ సర్పమును ముక్కున ఉంచుకొని, కాక్టస్ శాఖపైఉన్న గరుడపక్షి చిత్రమును కలది; **జాతీయ గీతము :** మెక్సికనోస్, అల్ గ్రితో దేగ్వె ర్రా (మెక్సికో వాసులారా, యుద్ధ నినాదమదే...) అను చరణముతో ఆరంభితమగునది; **నాణెము :** పెసో; 100 సెంటవోలుగ ఇది విభక్తము; ఒక పెసో = రు. 0.60; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన : ఉ.** 6 గం = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా రాజ్యమునకు దక్షిణపు సరిహద్దున 14° 33′-32° 43′ ఉ. అ. రేఖలకును, 86°46′-117° 80′ ప. తు. రేఖలకును మధ్యన ఉన్న ఈ దేశమునకు తూర్పున కరిబ్బియన్ సముద్రమును, మెక్సికో సింధుశాఖయు, పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును ఆగ్నేయపు మూలన గ్వాతెమాలా, బ్రిటిష్ హొండూరాస్‌లును సరిహద్దులందున్నవి. ఉత్తరప్రాంతమున ముఖ్య భూతలమునుండి ఒక ద్వీపకల్పము – బాజా కాలిఫోర్నియా అనబడునది – ముందునకు, ముఖ్యభూభాగమునకు సమాంతరముగ పసిఫిక్ మహాసముద్రములోనికి చొచ్చుకొని ఉన్నది. దేశపు పసిఫిక్ తీరరేఖ పొడవున

కొనియు, మాండలికులలో కొందరిని తమ పక్ష మునకు త్రిప్పుకొనియు, స్పెయిన్‌వారు దేశము నంతటిని వశపరచుకొని, దానిని స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసిరి (1519). తమ మత భాషా సంస్కృతులను, దేశమున స్పెయిన్ వారు ప్రవేశపెట్టిరి. ఇటుల మూడు శతాబ్దములు వలసపాలనలో ఉండిన తరువాత 1810 మొదలుగ దేశమున స్వాతంత్ర్యాకాంక్ష అతిశయించి కడకు 1821 లో దేశము స్వతంత్రమై ఇతుర్‌బిదే అను నతడు పాలకుడయ్యెను. 1823 లో ఇతనిని పదవి నుండి తొలగించి, దేశమున గణరాజ్య ప్రభుత్వము ఏర్పడినది. కాని రాజకీయముగ దేశమున అస్థిరత్వము ఒక జాడ్యముగ ఏర్పడి, 1823 నుండి 1848 వరకు 30 ప్రభుత్వములు మారినవి. 1835 లో దేశమునుండి టెక్సాస్ రాష్ట్రము విడివడి, యు. స్టే. లో కలసినది. దానిపై యు. స్టే. తో సాగించిన యుద్ధమున మెక్సికో పరాజయమును పొందుటయేగాక, తన భూభాగమున దాదాపు సగమును (న్యూ మెక్సికో, అరిజోనా, కేలిఫోర్నియా, రాష్ట్రాలను, ఊటా, కొలరాడో రాష్ట్రాలలో కొన్ని భాగాలను) యు. స్టే. కు 4.5 కోట్ల డాలర్లకు అమ్మివేయవలసి వచ్చినది (1848). 1855 లో ఒక నూత్న ప్రభుత్వము ఏర్పడి 1857 లో ఒక క్రొత్త రాజ్యాంగ విధానము ఏర్పడి, దేశమున కొన్ని పరిపాలనా సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. కాని ఇంతలో దేశమున అంతఃకల్లోలము బయలుదేరగ, ఈ అవకాశమును వినియోగించుకొని ఫ్రెంచి సేనలు దేశమున దిగి, మాక్సిమిల్లన్ అనువానిని దేశపు ప్రభువుగచేసినవి (1865). 1866 లో ఫ్రెంచి సేనలు వెడలిపోయిన వెంటనే ప్రజలు మాక్సిమిల్లనును వధించి, మరల గణరాజ్య ప్రభుత్వమును ఏర్పరచిరి (1867). పేరునకు దేశమున ఉన్నది గణరాజ్య ప్రభుత్వమే అయినను, 1876 మొదలుగ నియంతృత్వ ప్రభుత్వము దేశమున పదిం బదిగ ఏర్పడుటయు, విప్లవమువలన దానిని కూలద్రోయుటయు జరిగినది. అట్టి విప్లవ ఫలితముగ 1917 లో ఒక రాజ్యాంగ విధానము ఆమోదితమై సువ్యవస్థితపాలన సాగుచున్నది.

**7. పరిపాలన :** దేశమున 21 ఏండ్లకు పైబడిన పౌరులకు (పెండ్లి అయినవారి సందర్భమున 18 ఏండ్లకు పైబడిన వారికి) వోటుహక్కు కలదు. ఇట్టి వోటరుల వలన దేశాధ్యక్షుడు ఎన్నుకొనబడును; అతని పదవీకాల పరిమితి ఆరేండ్లు; ఒకసారి ఎన్నుకొనబడిన వాడు అధ్యక్షపదవికి మరల ఎన్నుకొనబడగూడదను నియమము కలదు. రాజ్యాంగ విధానమున అధికార విభజన నిర్ధారితమైనను యథార్థమున దేశాధ్యక్షుడే శాసన నిర్మాణ, న్యాయ నిర్వహణ, కార్యనిర్వాహక శాఖల మూడింటి పైన అధికారము కలిగి ఉన్నాడని చెప్పవచ్చును.

శాసనసభ (కాంగ్రెస్) లో రెండు కక్ష్యలు- ప్రతినిధిసభ, శిష్టసభ అనునవి - కలవు. దేశపు ప్రతిరాష్ట్రమునుండి ఇరువురి చొప్పునను, ముఖ్య నగరమండలము నుండి ఇరువురును, మొత్తమున 60 మంది ఎన్నుకొనబడిన సభ్యులు శిష్టసభలో కలరు; ప్రతినిధి సభలోని సభ్యసంఖ్య 210. ప్రజలలో 2 లక్షలమందికి, ఇద్దరు ప్రతినిధుల చొప్పున ఈ సభ్యులు వోటరుల వలన ఎన్నుకొనబడెదరు. శిష్టసభలోని సభ్యుని పదవీకాల పరిమితి 6 ఏండ్లు; ప్రతినిధి సభాసభ్యుని పదవీకాల పరిమితి మూడేండ్లు. ఒకసారి ఎన్నుకొనబడిన సభ్యుడు, ఆ వెనువెంటనే జరుగు ఎన్నికలో సభ్యుడుగ ఎన్నుకొనబడరాదు. 1928 మొదలుగ పార్టీదో రివల్యూషనరీయో ఇన్‌స్టిట్యూషనల్ అను పార్టీయే అధికారమున ఉన్నది. తక్కిన అల్పసంఖ్యాక పక్షములకు ప్రాతినిధ్యమును, ఇచ్చుటకై దేశమున జరిగిన ఎన్నికలో 2.5% వోట్లు వచ్చిన ప్రతి పార్టీకి అయిదు సీట్లును సభలో కల్పించు వసతి కలదు; కాని అట్టి సభ్య

సంఖ్య 20 ని మించరాదు. దేశపు 29 రాష్ట్రముల లోను, ప్రతిదానిలోను, ఎన్నుకొనబడిన స్థానిక శాసనసభా సాహాయ్యమున గవర్నరు పాలనను నిర్వహించును. న్యాయనిర్వహణ సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున సాగుచున్నది; సైనిక న్యాయ స్థానములందు తప్ప, తక్కిన వానియందు మరణ శిక్ష రద్దు చేయబడినది.

**8.** **దేశరక్షణ :** భూతల సేనయందలి సైనిక సంఖ్య (శాంతి-కాలమున) 50,000; ఇందు పదాతి దళము 50 పటాలములు, అశ్వికదళము 21 రెజిమెంటులు, యాంత్రిక బలదళము 1 రెజిమెంటు, ఫిరంగులదళము 2 రెజిమెంటులు, 2 పదాతి బ్రిగేడులు, తీరపు బేటరీలు 2 కలవు (1965). నౌకా సేనలోని సైనిక సంఖ్య 11,600; ఈ నౌకాసేనకు 10 ఫ్రిగేటులు, 10 రక్షక నౌకలు, ఒక రవాణా నౌక కలవు. వాయుసేనలోని యోధసంఖ్య 5,000, విమాన సంఖ్య 160 (1972).

**9.** **అంతర్జాతీయ సం. :** ఐ. రా. స తో సహా 31 అంతర్జాతీయ సంస్థలందు మెక్సికోకు సభ్యత్వము కలదు. లాటిన్ అమెరికా రాజ్యములలో క్యూబాను మెక్సికో మాత్రమే గుర్తించుచున్నది.

**10.** **ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు వ్యవసాయము మీదనే ఆధారపడి ఉన్నది. ఆహార విషయమున, ధాన్యములకు కూరగాయలకు సంబంధించినంతవరకు, ఈ దేశము స్వయంపోషకము; మాంసమునకు, పాడి ఉత్పత్తులందునుకూడ దాదాపు స్వయం సమర్థముగ ఉన్నదని చెప్పవచ్చును. వ్యవసాయోత్పత్తులలో మొక్కజొన్న, వరి, గోధుమ, చక్కెర, కాఫీ, ప్రత్తి ప్రముఖములు. వీనిలో ప్రత్తి, చక్కెర, కాఫీలలో కొంత ఎగుమతి అగుచున్నది. మొత్తపు దేశపు భూతలమున 12% మాత్రమే సాగునకు అనుకూలము. తక్కిన దానియందు అత్యధిక భాగము గడ్డిబీడులు. అందువలన పశుపోషణ కొందరికి ముఖ్య వృత్తిగ ఉన్నది. మొత్తపు గోజాతి పశు సంఖ్య 3.77 కోట్లు. ఇవిగాక 67 లక్షల గొర్రెలు, 52 లక్షల గుర్రములు, 182 లక్షల మేకలు, 145 లక్షల పందులు కలవు (1967). దాదాపు 10 లక్షల పశువులు మధ్య అమెరికాకు ఏటా ఎగుమతి అగుచున్నవి. పశువుల భీమాపద్ధతి అమలున ఉన్నది. మత్స్య పరిశ్రమ, చాలవరకు, సహకార సంఘములద్వారా సాగుచున్నది; ఇందలి ఉత్పత్తిలో అధికభాగము దేశావసరములకు మాత్రమే సరిపోవుచున్నది. 1967 లో 3,50,300 మెట్రిక్ టన్నుల చేపలు పట్టబడినవి. దేశమున అటవీ ప్రాంతము దాదాపు 1,50,000 చ. కిమీ. ల భూములను ఆక్రమించి ఉన్నది. ఇందు మంచి జాతి వృక్షసంపద కలదు. కాని కలప పరిశ్రమ ఎక్కువగ పురోగమించుటలేదు. ఖనిజ సంపదలో, ప్రపంచపు మొత్తమున, వెండియందు రెండవ స్థానమును, బెరైటులో 3 వ స్థానమును, గంధకమున 4 వ స్థానమును, రాగియందు 13 వ స్థానమును, సీసమున 5 వ స్థానమును, తుత్తునాగమున 5 వ స్థానమును, బంగారమున 10 వ స్థానమును, ఈ దేశమునకు చెందునని అంచనా (1969). ఈ ఖనిజ సంపత్తిలో అధికభాగము సియెర్రా మాద్రీ ఆక్సిడెంటేల్ పర్వతశ్రేణిలో కలదు. ఇనుప ఖనిజము (60% ఇనుము కలది) 50 కోట్ల మెట్రిక్ టన్నులు ఉండునని అంచనా. ప్రభుత్వ సంస్థ యొకటి ఇనుము ఉత్పత్తిని నిర్వహించుచున్నది. రాక్షసి బొగ్గును విరివిగ కలదు. 1970 లో దీని ఉత్పత్తి 20 లక్షల మెట్రిక్ టన్నులు.

1938 లో పెట్రోలియం పరిశ్రమ జాతీయము చేయబడినది. లాటిన్ అమెరికా రాజ్యములందు అన్నింట అతి విస్తృతమగు పెట్రో - కెమికల్ పరిశ్రమ ఈ దేశమున మాత్రమే కననగుచున్నది. ఈ పరిశ్రమకు సంబంధించిన కర్మాగారముల

సంఖ్య 188 (1969); ఇంధన వాయువు (నాచురల్ గ్యాస్)ను ఇనుప పరిశ్రమలో వినియోగ, వ్యాపార రీతిలో, వినియోగించిన మొదటి దేశము మెక్సికో. పెట్రో-కెమికల్స్ తరువాత లెక్కకు వచ్చునది ఉక్కుపరిశ్రమ. ఉక్కు ఉత్పత్తి 32 85,000 మె. టన్నులు (1968). దేశపు విద్యుదుత్పత్తి 3.154 కోట్ల కివా. (1970).

దేశపు ఎగుమతుల విలువ 1,843.1 కోట్ల పెసోలు; దిగుమతుల విలువ 3,009.1 కోట్ల పె. (1971). బడ్జెటరీ వ్యయము 5,474 4 కోట్ల పెసోలు (1972).

**11. సాంఘిక రంగము :** దేశపు ప్రజలలో పనిచేయు వారియందు వ్యవసాయమున 49%; ఖనిజ పరిశ్రమలో 15.2% పరిశ్రమలలో 17.3%, వ్యాపారమున 10%, తక్కిన వృత్తులలో 8.5% కలరు. కార్మిక శాసనములు, అంతర్జాతీయ ప్రమాణ స్థాయిలో, అమలున ఉన్నవి. గృహవసతిని చక్కజేయుటకు, ఒక ప్రణాళికను అనుసరించి, 1938 మొదలుగ ప్రభుత్వము కృషిచేయుచున్నది. 15 ఏండ్ల వయసులోపల బాలబాలికలకు నిర్బంధ ఉచిత విద్యావిధానపు సౌకర్యము కలదు. మత సంస్థలు ప్రయిమరీ విద్యాశాలలను నడుపగూడదను నియమము అమలులో ఉన్నది. 18 ఏండ్ల వయస్సునకు లోబడిన బాలురందరు మిలిటరీ డ్రిల్లును విధిగ పొందవలయును. 2,910 కిండర్‌గార్టెన్ (శిశువిహార) పాఠశాలలలో 3,78,098 మంది; 42,815 ప్రయిమరీ పాఠశాలలలో 87,66,081 మంది; 2,437 సెకండరీ పాఠశాలలలో 7,86,105 మంది; 334 ప్రి-యూనివర్సిటి విద్యాశాలలలో 96,408 మంది; 705 వ్యాపార విద్యాశాలలలో 92,415 మంది; 778 వివిధ వృత్తి విద్యాశాలలలో 1,98,201 మంది విద్యార్థులు కలరు (1969-70). విశ్వవిద్యాలయములుగ పరిగణింపబడదగిన సంస్థలు దేశమున 42 ఉన్నవి. వీనిలో యూనివర్సిదాద్ నేషనల్ ఆటోనమా డి మెక్సికో అనునది ప్రముఖము. ఇందలి విద్యార్థి సంఖ్యా 96,050. యూనివర్సిటీలందు అన్నింట ప్రశస్త గ్రంథాలయములు కలవు మెక్సికో సిటీలోని నేషనల్ లైబ్రరీ అతి ప్రముఖ గ్రంథాలయము; ఇందలి సంపుట సంఖ్యా 5,70,000. ఆ నగరముననేఉన్న పురావస్తు మ్యూజియమున మాయా మొదలగు ప్రాచీన నాగరికతలకు చెందిన పురావస్తువులు కననగును; అట్టి వానిలో అజ్‌టెక్ నాగరికతకుచెందిన ఒక పంచాంగము ప్రపంచ ప్రసిద్ధము. ఈ పంచాంగము రాతిపై చిత్రలిపిలో చెక్క బడినది.

దేశమున 208 దిన పత్రికలు ప్రచారమున ఉన్నవి; వీనిలో దాదాపు సగము, మెక్సికో సిటీ నుండి ప్రచురితములు. అన్నింట 'ఎస్తో' అనుదాని, ప్రచారము అత్యధికము. దేశమున ఆరోగ్యవసతుల విషయమున ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధవహించి కృషిచేయుచున్నది. అందువలన కలరా, పచ్చ జ్వరము, ప్లేగు నిర్మూలింపబడినవి. మశూచికము, టైఫస్ చాలవరకు అరికట్టబడినవి. దేశపు మొత్తమున 86,151 శయ్యా సంఖ్యగల 3,055 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. వైద్యసంఖ్య 21 298 (1969).

**12. యాత్రా సౌ. :** దక్షిణ మెక్సికోలోని మాయా నాగరికతావశేషములును, మధ్యదేశము నందలి అజ్‌టెక్ నాగరికతా కాలపు పిరమిడ్లును, దేశపుప్రకృతి రమ్యతయు యాత్రికులను పలువురును ఆకర్షించుచున్నవి యు. స్టే పౌరులు 'టూరిస్టు కార్డు' సహాయమున దేశమున ఆరునెలలు ఉండవచ్చును. తక్కిన దేశములవారికి పాస్‌పోర్టు, వీసాలు కావలెను. యాత్రికులకు పలు సౌకర్యములను ప్రభుత్వము ఏర్పరచినది. యాత్రికులవలన దేశమునకు లభించు ఆదాయము, దేశపు చెల్లింపుల

లోటును పూడ్చుటకు, చాలవరకు ఉపకరించుచున్నది. 1970 లో 24,93,648 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. వీరు దేశమున 145 79 కోట్ల పెసోలను వెచ్చించిరి.

**13** **ప్రసిద్ధ పౌరులు :** 1 కివాటెమోక్: అజ్ టెక్ చరిత్రలో సుప్రసిద్ధుడు; ఆ సామ్రాజ్యపు చక్రవర్తులలో ఇతడు కడపటివాడు. 2 హెర్నాన్ కార్టెస్ 1485-1547 ; అతి సాహసికుడగు ఈ స్పెయిన్ దేశీయ సేనాని, తన చాతుర్యమును, రాజనీతి ప్రజ్ఞను, ఆయుధ బలమును వినియోగించి, మెక్సికో ప్రాంతపు అజ్ టెక్ సామ్రాజ్యమును నిర్మూలించి, ఆ దేశమున స్పెయిన్ రాజకీయ వలసపాలనను నెలకొల్పెను.

# 21. యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా*

**ముఖ్యనగరము :** వాషింగ్టన్; **జెండా :** ఏకాంతర వర్ణరీతిలో అడ్డముగ అమర్చబడిన ఏడు ఎరుపు చారలను ఆరు తెలుపు చారలును కలవు అయినను జెండా యందలి పైభాగమున దండమునకు దగ్గరగ ఉండు నాలుగవ భాగము మాత్రము చారలు లేకుండా నీలిరంగు భూమికతో ఉండగ దానిపై 50 పంచకోణపు నక్షత్రములు – బేసి వరుసన 6, సరి వరుసన 5 గ మొత్తము 9 వరుసలలో అమరియుండును. ఇందలి 13 చారలును, ఆ రాజ్యము స్వతంత్రతను ఆర్జించినపుడు అందుండిన రాష్ట్రముల సంఖ్యను తెలుపును; 50 నక్షత్రములు ఇప్పుడు ఆ దేశమున ఉన్న 50 రాష్ట్రములను తెలియజేయును. **జాతీయ గీతము:** 'ది స్టార్-స్పాన్గిల్డ్ బేనర్' (నక్షత్ర మండిత పతాక); **నాణెము :** డాలరు ($); డాలరు చిల్లరన 100 సెంట్లుగ విభక్తము. ఒక డాలరు = రు. 7.50 **కొలతూకములు :** బ్రిటిష్ మానములె వాడుకయందున్నవి. అనేక శాస్త్రీయ రంగములందు మెట్రిక్ విధానమునకూడ పరిగణన కలదు. **కాలగణన :** భారతదేశమున సాయంకాలమున 5 గం. 30 ని. అయినపుడు తూర్పు అమెరికాలో ఉ. 7 గం ; మధ్య అమెరికాలో ఉ. 6 గం ; పశ్చిమ అమెరికాలో ఉ 5 గం., అలాస్కా-హవాయిలలో ఉ 2 గం గను పరిగణన జరుగుచున్నది.

**1. ఉనికి మొ. :** పశ్చిమార్ధ గోళమున ఉత్తర అమెరికాయందు ఈ విశాల రాజ్యము నెలకొనియున్నది. దేశమునందలి 50 రాష్ట్రములలో 48 రాష్ట్రములు ఏక భూభాగముగ ఉత్తర అమెరికా మధ్య భూమియందు ఉండగ, 49 వ రాష్ట్రమగు 'అలాస్కా'. ఈ భూభాగముతో ముడివడక, వేరుగ ఉత్తర అమెరికాయందే వాయవ్యపు మూలన

* ఈ పేరు చివరగల 'అమెరికా' అను పదమునుబట్టియే ఈ దేశమునకు చెందిన ప్రజలు మొదలగువారి విషయమున 'అమెరికన్' అను పదమును మాత్రమే వాడుట పరిపాటి అయినది. (ఉదా : అమెరికన్ సేనలు, అమెరికన్ రాజ్యాంగము మొ.) ఇక దేశపు పేరును సైతము కొన్ని యెడల సంక్షిప్తముగ యునైటెడ్ స్టేట్స్ అని అనుటయు కలదు. అందువలననే ఈ గ్రంథమున ఆ దేశపు పేరును కొన్ని యెడల పొడి అక్షరములలో యు. స్టే. అని వాడుట జరిగినది. కొన్ని తెలుగు గ్రంథములందు ఈ దేశపు నామము 'అమెరికా సంయుక్త రాష్ట్రములు' అని ఆంధ్రీకరింపబడుటయు కలదు.

ఉన్నది. ఇక 50 వ రాష్ట్రమగు 'హవాయీ' అమెరికా పశ్చిమ తీరమునకు కడుదూరమున పసిఫిక్ మహా సముద్ర పరివృతమగు ద్వీపసమూహ ప్రాంతముగ ఉన్నది. దేశపు ముఖ్య భూభాగమునకు ఉత్తరమున కెనడా; తూర్పున అట్లాంటిక్ మహా సముద్రము; దక్షిణమున మెక్సికో దేశమును, మెక్సికో సింధు శాఖయు, పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును సరిహద్దులందున్నవి. 'అలాస్కా'కు ఉత్తరమున ఆర్కిటిక్ మహాసముద్రమును; తూర్పు దక్షిణము లందు కెనడా, పసిఫిక్ మహా సముద్రములును, పశ్చిమమున బేరింగ్ జలసంధియు కలవు. అలాస్కా, వాహాయిలతోచేరిన దేశపు మొత్తపు




పటము 15.

వైశాల్యము 93,63,169 చ. కిమీ. [ఈ లెక్కలో దేశమునందలి చిన్న జలాశయముల విస్తీర్ణములు చేరినను, ఉత్తరపు సరిహద్దున ఈ దేశమునకే చెందియున్న గ్రేట్ లేక్స్ (మహా సరస్సుల) విస్తీర్ణము చేరలేదు]. ఈ దేశపు విస్తృత భూతల మైన వివిధ దిక్కులనున్న ఈ దిగువ నాలుగు స్థలముల అక్షతులారేఖల లెక్కలు ఈ దేశపు విస్తృతిని కొంత తెలియజేయగలవు.

| స్థలము | ఉన్న దిక్కు. | అక్షాంశ రేఖ | తులా రేఖ |
|---|---|---|---|
| పాయింట్ మారో, అలాస్కా | ఉత్తరము | 71°23′ ఉ. | 156°29′ ప. |
| వెస్ట్ కాడీ హెడ్, ఈస్ట్‌పోర్ట్, మెయినీ | తూర్పు | 44°49′ ఉ | 66°57′ ప. |
| కేప్‌రాంగెల్, అట్టూదీవి, అలాస్కా | పశ్చిమము | 52°55′ ఉ. | 172°27′ తూ. |
| సౌత్ కేప్, హవాయీ | దక్షిణము | 18°56′ ఉ. | 155°41′ ప. |

దేశపు మొత్తపు ఉత్తర – దక్షిణముల నిడివి 2,560 కిమీ; తూర్పు – పడమరల కొలత 4,480 కిమీ. దేశపు భూతల వైవిధ్యమునకు, అందలి పర్వత శ్రేణులే మూలకారణములని చెప్పవచ్చును. ఈ శ్రేణులు ఉత్తరమునుండి దక్షిణమునకు పయనించినవి. ఇందు పడమటి భాగమునఉన్న రాకీ పర్వతశ్రేణులును, తూర్పునఉన్న అప్పలేచియన్ శ్రేణియు ప్రముఖములు. తూర్పున అట్లాంటిక్ మహా సముద్రమును ఆనుకొనియున్న సన్నని తీర మైదానము, ఉత్తరమున వెడల్పు తక్కువగ ఉన్నను, దక్షిణమునకు చేరుకొలది విస్తృతినిపొంది, మెక్సికో సింధుశాఖా ప్రాంతమున పెద్ద మైదానముగ రూపొందుచున్నది. ఈ తీరమైదానమునుండి పశ్చిమమునకు పోవుకొలది భూమి క్రమగతిలో ఎత్తున పెరుగుచు కడకు అప్పలేచియన్ పర్వత శ్రేణిని చేరుకొనును. ఈశాన్యమున 'అలబామా' రాష్ట్రము మొదలుగ నైఋతి దిక్కునకు కడు దూరము పయనించిన ఈ శ్రేణియందలి కొండలకు, ఆయా రాష్ట్రములలో వేర్వేరు నామములు కలవు. భూగర్భ శాస్త్రరీత్యా ఇవి చాల పురాతన శైలములు; శిఖరములందు మాత్రమే చెట్టు చేమలు కన్పట్టును. ఈ కొండలలో కొన్ని మాత్రమే ఎత్తున 1060 మీ. ను మించి ఉన్నవి. నార్త్ కెరోలినా రాష్ట్రమునందలి మిచ్చెల్ శిఖరము (2,032 మీ.) వీని అన్నింట పెద్దది.

అప్పలేచియన్ పర్వతశ్రేణికిని, రాకీ పర్వత పర్వతశ్రేణికిని మధ్య దాదాపు 1600 కి. మీ. వెడల్పుగల దేశమధ్యపు సమభూమి కలదు. చూచుటకు సమభూమిగనే కన్పట్టుచున్నను తూర్పున నుండి రాకీ పర్వతశ్రేణికి చేరుసరికి క్రమముగా భూమి ఎత్తు దాదాపు 1060 మీ. పెరుగుచున్నది. ఈ సమభూమి మధ్యన ఉత్తరమునుండి దక్షిణమునకు మిస్సిసిపీనది ప్రవహించుచున్నది దేశపు భూతలమున మూడింట రెండువంతుల భూమిపై బడు నీరు ఈ నదిలో చేరుచున్నది. ఈ నదిలో తొలుతగా పశ్చిమమునుండి వచ్చిన మిస్సోరీయు, తరువాత తూర్పుననుండి వచ్చిన ఓహియోనదియు కలియుచున్నవి. వీని అన్నింటితో కలసి సాధారణముగ మిస్సోరీ–మిస్సిసిపీ అనుపేరున వ్యవహృతమగు ఈ మహానది, పుట్టినచోటునుండి 6,400 కి. మీ. పయనించి కడకు మెక్సికో సింధుశాఖలో పడుచున్నది. దేశమధ్యపు సమభూమికి ఉత్తరపు సరిహద్దున తూర్పువైపున మహాసరస్సులు (గ్రేట్ లేక్స్) ఉన్నవి. అయిదు సరస్సులు; సుపీరియర్ (82,414 చ.కిమీ.), హురాన్ (59,570 చ కిమీ),

మిచిగన్ (58,016 చ కిమీ.), ఈరీ (25,719 చ. కిమీ.), ఓన్‌టారియో (19,529 చ. కిమీ.) అనునవి ఈ పేరున సంయుక్తముగ వ్యవహరింప బడుచున్నవి. ప్రపంచపు మంచినీటి రాసిలో దాదాపు సగభాగము ఈ సరస్సులందే కలదని అంచనా. అట్లాంటిక్ మహాసముద్రమున ప్రయాణము సాగించు గొప్పస్టీమర్లు సయితము, సెయింట్ లారెన్స్ సముద్రమార్గముద్వారా మహాసరస్సులను చేరుటకు ప్రస్తుతమున వసతులు కల్పింపబడినవి.

రాకీ పర్వతశ్రేణిని దేశపు జలవిభజనరేఖగ పరిగణింపవచ్చును. దానికి తూర్పున పడు వర్షపు నీరంతయు మెక్సికో సింధుశాఖ వైపునకు పోగా, పశ్చిమమున పడెడు వర్షజలము పసిఫిక్ మహాసాగరము వైపునకు పయనించుచున్నది. అట్టి పశ్చిమవాహినులగు నదులలో దక్షిణమున ఉన్న కొలొరాడో నదియు, వాయవ్యమున ఉన్న కొలంబియా నదియు గణనీయములు; వీనిలో తొలుటిది కాలిఫోర్నియా సింధుశాఖలోను, రెండవది పసిఫిక్ మహాసముద్రమునను చేరుచున్నవి. వీనిలో ప్రతియొకటియు దాదాపు 1920 కిమీ పొడవుగలవి.

రాకీ పర్వతములు, భారతదేశపు హిమాలయముల వలె, భూగర్భశాస్త్రరీత్యా యువకశైల జాతికి చెందినవి. రాకీశ్రేణులవంటివే యగు కొన్ని చిన్న పర్వతశ్రేణులు రాకీశ్రేణికి పసిఫిక్ సాగరతీరమునకును మధ్యన ఉత్తర దక్షిణములకు వ్యాపించి ఉన్నవి. వీనిలో సియెర్రా నెవడా. కాస్కేడ్, కోస్ట్‌రేంజి అనునవి ప్రముఖములు. రాకీశ్రేణికిని, సియెర్రా నివెడా - కాస్కేడులకును మధ్య గ్రేట్ బేసిన్ అనబడు ప్రాంతము కలదు. ఇందే యు స్టే. యందలి తక్కువ వర్షపాతము కల పీఠభూములును ఎడారులును, శిథిల పర్వతములును కలవు. పసిఫిక్ సముద్రతీరపు మైదానము చాలవరకు సన్నని చీలికవలె కన్పట్టును. కొన్నియెడల అట్టి మైదానము ఏదియులేకుండా పర్వతశ్రేణి సరాసరిన సముద్రములోనికే చొరబారును. సియెర్రా నివెడా కును కోస్ట్‌రేంజికిని మధ్యన కాలిఫోర్నియాలోయ కాననగును ఇది అతి విస్తృతమగు నిమ్నభూమి. పశ్చిమ పర్వతశ్రేణులలో 4,250 మీటరుల ఎత్తునకు మించిన శిఖరములు 71 ఉన్నవి. వీనియందెల్ల అత్యున్నతమైనది విట్నీ శిఖరము (4,405 మీ.).

దేశముననే రాజ్యాంగరీత్యా అంతర్భాగమగు అలాస్కా, దేశపు ముఖ్య భూతలమునుండి, కెనడా వలన వేరుచేయబడి ఉన్నది ఈ అలాస్కాయందు తూర్పు పడమరలకు, దాదాపు సమానాంతరముగ పయనించు పర్వతశ్రేణులు రెండు కలవు. వీనిలో ఉత్తరముననుండు బ్రూక్స్ రేంజి క్రమముగ ఆర్కిటిక్ మహాసముద్రములోనికి దిగజారుచున్నది; దక్షిణమున నుండు పర్వతశ్రేణులకును పసిఫిక్ మహా సముద్రమునకును మధ్య తీరమైదానము కలదు ఉత్తర-దక్షిణ పర్వతశ్రేణుల మధ్యనుండు పరీవాహ భూమియందు యూకాన్‌నది ప్రవహించు చున్నది. ఈ నది కెనడాలో జన్మించి, అలాస్కాలో ప్రవహించి, పశ్చిమమున బేరింగు సముద్రములో పడుచున్నది అలాస్కా ప్రాంతపు ద్వీపకల్పమును, దానివద్దనుండి సముద్రములోనికి చొరబారిన ద్వీపముల వరుసయు, అగ్నిపర్వతమయములు. వీనిలో కొన్ని ఇప్పటికినీ మండుచునే ఉన్నవి.

ఇక దేశాంతర్భాగముగ లెక్కకు వచ్చియు, దూరమున పసిఫిక్ మహాసముద్ర పరివృతమై ఉన్న హవాయీ అనునది ఒక ద్వీపసమూహము. వీనిలో హవాయీ అనునది పెద్దది.

యు. స్టే. దేశమునందెల్ల అత్యున్నతమగు మెక్‌కిన్లీ శిఖరము (6177 మీ.) అలాస్కాలో ఉన్నది; అతి నిమ్నమగునది కాలిఫోర్నియాలోని డెత్ వేలీ; ఇది సముద్రమట్టమునకు 86 మీ. దిగువన ఉన్నది.

దేశపు ముఖ్యభూభాగపు తీరభూమి పొడవు 7,990 కిమీ.; అలాస్కా ప్రాంతపు తీరపు పొడవు 10,625 కిమీ.; హవాయీ ద్వీపసమూహపు తీరపు నిడివి 1200 కిమీ. మొత్తపు దేశపు తీరభూమి పొడవు 19,815 కిమీ.

**2. శీతోష్ణస్థితి** మొ. : దేశము అతివిస్తృత మగుటవలన, శీతోష్ణ పరిస్థితులును ప్రాంతములను అనుసరించి వేర్వేరు రీతులుగ ఉన్నవి. సాలీనా సరాసరి ఉష్ణోగ్రతలు ఉత్తర దక్షిణములమధ్య చాల మార్పులను పొందుచున్నవి. న్యూయార్క్ నగర మున అది సరాసరి 54°ఫా.; చార్లాట్టి (ఉత్తర కెరోలినా) యందు 60.8° ఫా; జాక్సన్‌విల్లీ (ఫ్లోరిడా) యందు 69.5°. ఈ ప్రాంతములందు వానలును ఎక్కువయే; వర్షపాతము సాలీనా 100 సెం. మీ. దీనికి పశ్చిమమున మైదానమున గాలిలో చెమ్మదనము తక్కువ; వానలును ఒక క్రమపద్ధతిలో కురియవు; కావున అచ్చట అతివృష్టిబాధ కన్నను అనావృష్టి బాధయే తరుచుగ ఎక్కువగ ఉండును. అత్యుత్తరమున మిన్నెసోటా, ఉత్తర దకోటాలలో శీత కాలపు కనీసపు ఉష్ణోగ్రత 9° ఫా.; అచట జులై నెలలో సరాసరి ఉష్ణోగ్రత 65°కు దరిదాపున ఉండును. దక్షిణమున టెక్సాస్ రాష్ట్రపు మైదానములందు జనవరి నెలలోని సరాసరి ఉష్ణోగ్రత 50° నుండి 55° ఫా. వరకు మారుచుండును. ఇక అచ్చట జులై నెలలో ఆ ఉష్ణోగ్రత 80° నుండి 85° వరకు మార్పొందును. మైదానపు ఉత్తరపు అంచుపొడవున. ఉత్తరమున 45 సెం. మీ; దక్షిణమున 62 5 సెం. మీ. కు సాధారణముగా సాలీనా వర్షపాతము పైబడి ఉండదు అయినను ఈ వర్షమున అత్యధిక భాగము ఎండకాలమున వర్షించును; కావున ధాన్యముల పంటకు విరివిగ అది సాయపడ గలుగుచున్నది. ఆ ప్రాంతమున, ముఖ్యముగ దక్షిణభాగమున, వానలుపడని సంవత్సరములందు నేలమీది దుమ్ము గాలికి పైకి లేచి, తూర్పుదిశకు పయనించుచు సూర్యకాంతిని సైతము మసకపరచు చుండును. రాకీపర్వతముల తూర్పున 480 కిమీ. వెడల్పున, 1600 కిమీ. పొడవున ఉత్తర దక్షిణములకు వ్యాపించిన విశాల సమభూమిని దాదాపుగ బెట్టభూమిగ పరిగణించవచ్చును. ఇందు దక్షిణభాగమున సాలీనా సరాసరి వర్షపాతము 50 సెం. మీ.; ఉత్తరమున అది 25 సెం మీ అదియైనను ఒక రీతిలో ఉండదు. ఒక సాలున అతివృష్టియు, మరియొక సాలున అనావృష్టియు అచట తరచుగ కననగును. ఇచటకు వానను కొనివచ్చు ఉష్ణమండలపు వాయువులు మెక్సికో పీఠభూముల ఉన్నత ప్రదేశములనుండి బయలు దేరును; వానియందలి నీటియావిరి సాధారణముగ కొలదిగ మాత్రమే ఉండును. అందువలన ఈ సమభూమియందు ఒక్కొకపుడు అతిదీర్ఘకాలము అనగా కొన్ని సమయములందు 120 రోజుల వరకు వానలే లేకుండుట సంభవించుచున్నది. కాని కురిసినపుడు మాత్రము విపరీతముగ కుంభవృష్టిగ వర్షించును. సంవత్సరపు వర్షపాతమున మూడవభాగము, ఒకే దినమున పడుటయు కలదు. ఇచట ఎండకాలపు, చలికాలపు ఉష్ణోగ్రతల మధ్య విపరీతపు వ్యత్యాసము కలదు ఎండ కాలమున ఆ ఉష్ణోగ్రత 110° ఫా. ను దాటుట తరచుగ కననగును. మిన్నెసోటా రాష్ట్రమున జనవరియందలి కనీసపు ఉష్ణోగ్రత 4° ఫా. వరకు పడిపోవును. ఈ సమభూమియందు శీతకాలమున విపరీతపు చల్లని గాలులును తక్కిన ఋతువులందు తుఫానులును అతిసాధారణ సంఘటనలు

రాకీపర్వత పరిసర భూములును, పసిఫిక్ మహాసముద్రమునకు సమాంతరముగ పయనించు తక్కిన పర్వత సీమలును సౌమ్యశీతోష్ణతకు పేరు గన్నవి. ఈ పర్వతముల పశ్చిమపు వాలుతలము లందు వర్షపాతము చాల ఎక్కువ. కాని పర్వత శ్రేణుల నడుమ ఉన్న ప్రాంతమున వర్షపాతము

ఎక్కువ; ఇచ్చట ఉత్తర, దక్షిణప్రాంతముల మధ్య ఉష్ణోగ్రతలందు వ్యత్యాసమును ఎక్కువయే. న్యూమెక్సికో, అరిజోనా, ఆగ్నేయ కాలిఫోర్నియా లలో జులై, ఆగస్టు, సెప్టెంబరు నెలలందు వర్షము లెక్కువ; అయితే ప్రాంతములను అనుసరించి ఆటసయితము అది మారుచున్నది. అందు యూమాలో ఆకాలమున సరాసరి వర్షపాతము 7 5 సెం. మీ. ఉత్తర అరిజోనా, న్యూమెక్సికోలలో అది 75 సెం. మీ. ఇక, అరిజోనాలో సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 69° ఫా.; అట జులైలో గరిష్ఠ ఉష్ణోగ్రత 89.8° ఫా.; జనవరిలో కనీసపు ఉష్ణోగ్రత 49.7° ఫా. ఊటా-అరిజోనా రేఖకు ఉత్తరమున ఉన్న ప్రదేశమున ఎండకాలమున గాలిలో చెమ్మదనము చాల తక్కువ; అట శీతకాలమున, వసంతఋతువు ఆరంభమున మాత్రమే ఎక్కువగ వానలు కురియును. గ్రేట్ సాల్ట్ సరస్సునకు పశ్చిమమున ఉన్న ఎడారి లోయలలో సాలీనా సరాసరి వర్షపాతము 10 సెం. మీ. మాత్రమే. ఉత్తరపు పీఠభూములు మొత్తముమీద బెట్టభూములే అయినను ఇడాహోరాష్ట్రమును వాషింగ్‌టన్ రాష్ట్ర మధ్యప్రాంతములందును సంవత్సరమున 150 సెం. మీ. లేదా అంతకుమించి వర్షము పడుచుండును. పర్వతశ్రేణుల మధ్యనున్న భూమి యందు అంతటను నీరు కొన్నియెడల అంతగా లభ్యముకాదు; అందువలన అట మానవ వ్యవహారములును ఆ పరిస్థితికి అనుగుణముగనే రూపొందుచున్నవి.

పసిఫిక్ తీరమునఉన్న ఉన్నత పర్వతశ్రేణులు, తూర్పుననుండి వచ్చు భూతలపు బెట్ట పరిస్థితుల నుండి, ఆ తీరమును వేరుపరచుచున్నవి; అందువలన అచట శీతకాలములు సమశీతోష్ణముగను, గ్రీష్మము నులివెచ్చగను ఉండును. అట దక్షిణమున ఉన్న లాస్‌ఏన్‌జెలెస్ వద్ద జనవరిలో ఉష్ణోగ్రత 56° ఫా.; జులైలో 73° ఫా. ఉత్తరమున సీటిల్ నగరమున జనవరినెల వేడి 38° ఫా. జులై నెలలో 65° ఫా. ఆ తీరమున దక్షిణముననుండి ఉత్తరమునకు పోవుకొలది వర్షపాత ప్రమాణము త్వరిత గతిలో పెరుగుచుండును. దక్షిణపు కాలిఫోర్నియా లోని గ్రీన్‌లాండ్ రాంచ్ (ఇన్యో జిల్లా) వద్ద సాలీనా వర్షపాతం 3.70 సెం. మీ. కాగా ఉత్తరమున ఓరెగాన్ రాష్ట్రమున గ్లెనోరా (తిల్లమూక్ జిల్లా) వద్ద ఆ వర్షపాతము 324.7 సెం. మీ.

దేశపు ముఖ్యభూభాగముతో చేరక విడిగాఉన్న అలాస్కా రాష్ట్రమున శీతోష్ణపరిస్థితులు ప్రాంతములను అనుసరించి మారుచున్నవి. రాష్ట్రపు ముఖ్యనగరమగు జునేవో ఉన్న అలాస్కా-సింధుశాఖా ప్రాంతము చేరియున్న తీరభూమి యందును, అల్యూషియన్ దీవులందును, సముద్రతీర సహజమగు సౌమ్య శీతోష్ణత ఉండును. జునేవోలో జనవరి యందు సరాసరి ఉష్ణోగ్రత 25° ఫా.; ఇక రాష్ట్రాంతర్భాగమున ఎండకాలమున ఎండలును, చలికాలమున చలియు ఎక్కువ. అయితే ఎండకాలపు నిడివి చాలతక్కువ; చలికాలము అతి దీర్ఘకాలికము. రాష్ట్రాంతర్భాగ ప్రదేశమున సరాసరి ఉష్ణోగ్రత జనవరిలో 11.6 ఫా. గను, జులైలో 60° ఫా. గను ఉండును. అచటి వర్షపాతము 25 సెం. మీ.

ఇక హవాయీ యందు సౌమ్యమగు, శీతోష్ణస్థితి సదా కాననగును; అచటి హోనూలూలూ నగరమున సరాసరి తాపక్రమము జనవరిలో 72.5° ఫా.; జులైలో 78.8° ఫా. అచటి వర్షపాతము సాలీనా రమారమి 42 సెం. మీ.

అతి విస్తృతమగు ఈ దేశమున ఆయా ప్రాంతముల భూలక్షణ, వర్షపాతాదులకు అనుగుణముగ అడవులు, గడ్డిబీడులు, ఎడారి పొదలు అటనట కానవచ్చుచున్నవి. మధ్యదేశపు సమతలభూమి ఒకానొకపుడు పొడవు గడ్డిగల బీడులకు పేరొంది

రది; కాని దాదాపుగ ఆ భూమియంతయు ఇపుడు సేద్యమున ఉన్నది. తూర్పుదేశమున అటనట అడవులు కలవు; ఇందు పైన్, ఓకు, భూర్జ, మొదలగు వృక్షములు కలవు. పసిఫిక్ తీరపు అటవీప్రాంతము మహత్తమ వృక్షములకు పేరొంది దర్శనీయముగ ఉండును. టెక్సాస్‌లోను, న్యూ మెక్సికోలోని దక్షిణ పశ్చిమభాగములందును, అరిజోనా, లూయీసియానా, అలబామా, ఫ్లోరిడాల లోను మంచి పచ్చిగడ్డి బీడులు కలవు. పసిఫిక్ తీరమునను ఇడాహో, వాషింగ్‌టన్, ఓరెగాన్, కాలిఫోర్నియాలలో కూడ ఇట్టివియే కననగును. పశ్చిమపు శైలశ్రేణుల మధ్యనున్న కొన్ని ప్రదేశములందును, గ్రేట్‌సాల్ట్ సరస్సు, డెత్‌వేలీల పరిసరములందును ఎడారిపొదలు విరివిగ ఉన్నవి. అలాస్కాయందలి పర్వతసానువులందు సూచీపత్రజాతి వృక్షములుకల దట్టపు అడవులు కలవు. హవాయీ యందు వెదురుటడవులు చాలగ కన్పట్టును. అయినను ప్రస్తుతము వానిలో ఎక్కువ భాగము కొట్టివేయబడి, అట చక్కెరచెరకు సాగు చేయబడుచున్నది.

దేశమున కన్పట్టు వివిధ వృక్షజాతుల మొత్తపు అంచనా 4,600 నుండి 8,300 వరకు మారుచున్నది. సస్తన జంతుజాతుల సంఖ్య 1,500 ఉండునని అంచనా. వివిధ వర్ణముల ఎలుగులును, జింకలును, అడవి మేకలును ఇందు చేరి ఉన్నవి. పూర్వమున కారెనుములు విపరీతముగ ఉండెడివి. కాని ఇపుడవి పరిరక్షిత వనములందు మాత్రమే కన్పట్టును. ఎలుగుల వేటకు అలాస్కా పేరొందినది. అచట కన్పట్టు గోధుమరంగు ఎలుగుబంటి బరువు 550 కి. గ్రా. నుండి 650 కి. గ్రా. ల వరకు ఉండును.

మెత్తని బొచ్చునకు పేరొందిన సీలు, బీవరు మొదలగు జంతువులు విరివిగ కొన్ని ప్రదేశములందు కన్పట్టును. పక్షిజాతులును దేశమున విరివిగ కలవు. సర్పములలో విషజాతులును, విషహీన జాతులును అచ్చటచ్చట కన్పట్టును. మత్స్యసంపద సముద్రతీరముననే గాక, దేశాంతర్గతములగు మంచి నీటి సరస్సులందును విరివిగ కలదు. దక్షిణదేశపు కొన్ని నదులలో మొసళ్ళు తరచుగ కన్పట్టుచున్నవి.

**3 జనసంఖ్య :** ఈ దేశపు జనసంఖ్యా గణనము తొలుతగ 1790 లో జరిగినది. అప్పటిలో అందు పదమూడు రాష్ట్రములే ఉండినవి. అప్పటి జనసంఖ్య 39,29,214. తదనంతర కాలమున క్రొత్త రాష్ట్రములు అంతటంతట వచ్చిచేరుటవలనను, వివిధ దేశములనుండి ప్రజలు కొత్తగ వలసవచ్చుట వలనను, సహజరీతిలోను జనసంఖ్య ఎంతయో పెరిగినది. 1790 మొదలుగ పదియేండ్ల కొకసారి జరిగిన ఈ జనాభా లెక్కలలో ఆ విస్తరణ ప్రతిఫలించినది. 1970 లో ఆ జనసంఖ్య 20,32,11,926 ను చేరుకొనినది. ఈ దిగువన ఆ జనసంఖ్యా వివరములు రాష్ట్రములవారీగా, తక్కిన కొన్ని వివరములతో పాటుగ ఈయబడినవి.

| వరుస సంఖ్య | రాష్ట్రము | చ. కిమీ. వైశాల్యము | 1970 జనసంఖ్య | ముఖ్యనగరము | ముఖ్యనగర జనసంఖ్య 1970 |
|---|---|---|---|---|---|
| 1. | అయోవా | 1,45,791 | 28,25,041 | డెస్‌మయోనిన్ | 2,00,587 |
| 2. | అలబామా | 1,33,637 | 34,44,165 | మాంట్‌గోమెరి | 1,33,386 |
| 3. | అలాస్కా | 15,18,778 | 3,02,173 | జునేవో | 13,338 |
| 4. | ఆర్‌కాన్సస్ | 1,37,539 | 19,23,295 | లిటిల్‌రాక్ | 1,32,483 |

| వరుస సంఖ్య రాష్ట్రము | చ కిమీ. వైశాల్యము | 1970 జనసంఖ్య | ముఖ్యనగరము | ముఖ్యనగర జనసంఖ్య 1970 |
|---|---|---|---|---|
| 5. ఆరిజోనా | 2,95,024 | 17,72,482 | ఫోనిక్స్ | 8,63,357 |
| 6. ఇండియానా | 93,994 | 51,93,669 | ఇండియానా-పోలిస్ | 7,44,624 |
| 7. ఇడాహో | 2,16,413 | 7,13,008 | బొయిసీ | 74,990 |
| 8. ఇలినాయ్ | 1 46,076 | 1,11,13,976 | స్ప్రింగ్‌ఫీల్డ్ | 91,753 |
| 9. ఊటా | 2,19,932 | 10,59,273 | సాల్ట్‌లేక్ సిటీ | 5,57,635 |
| 10. ఓక్లహోమా | 1,81,080 | 25,59,253 | ఓక్లహోమా సిటీ | 3,87,693 |
| 11. ఓరెగాన్ | 2,51,181 | 20,91,385 | సేలెమ్ | 68,296 |
| 12. ఓహియో | 1,60,765 | 1,06,52,017 | కొలంబస్ | 5,40,025 |
| 13. కాన్‌సాస్ | 2,13,064 | 22,49,071 | టొపెకా | 1,36,407 |
| 14. కాలిఫోర్నియా | 4,11,015 | 1,99,53,134 | సాక్రెమెంటో | 2,57,105 |
| 15. కెంటకీ | 1,04,623 | 32,19,311 | ఫ్రాంక్‌ఫర్ట్ | 21,902 |
| 16. కెరోలినా, ఉత్తర | 1,36,524 | 50,82,059 | రాలీ | 1,52,289 |
| 17. కెరోలినా, దక్షిణ | 80,432 | 25,90,516 | కొలంబియా | 3,22,830 |
| 18. కొనెక్టికట్ | 12,973 | 30,32,217 | హార్ట్‌ఫోర్డ్ | 1,58,017 |
| 19. కొలరాడో | 2,70,000 | 22,07,259 | డెన్వర్ | 12,27,529 |
| 20. జార్జియా | 1,52,489 | 45,89,575 | అట్లాంటా | 13,70,164 |
| 21. టెక్సాస్ | 6,92,407 | 1,11,96,730 | ఆస్టిన్ | 2,51,808 |
| 22. టెన్నెస్సీ | 1,09,412 | 39,24,164 | నాష్‌విల్లి | 5,41,108 |
| 23. డకోటా, ఉత్తర | 1,83,022 | 6,17,761 | బిస్మార్క్ | 34,703 |
| 24. డకోటా, దక్షిణ | 1,99,552 | 6,66,257 | పియెర్రే | 9,700 |
| 25. డిలావేర్ | 5,328 | 5,48,104 | డోవర్ | 17,165 |
| 26. నెబ్రాస్కా | 2,00,018 | 14 83,791 | లింకన్ | 1,49,518 |
| 27. నెవాడా | 2,86,299 | 4,88,738 | కార్సన్ సిటీ | 15,468 |
| 28. న్యూజెర్సీ | ,20,295 | 71,68,164 | ట్రెంటన్ | 1,04,638 |
| 29. న్యూ మెక్సికో | 3,15,115 | 10,16,000 | సాంటా ఫే | 41,167 |
| 30. న్యూయార్క్ | 1,28,402 | 1,82,41,266 | ఆల్బనీ | 1,15,781 |
| 31. న్యూహాంప్‌షైర్ | 24,097 | 7,37,681 | కన్‌కార్డ్ | 30,022 |
| 32. పెన్సిల్‌వేనియా | 1,17,412 - | 1,17,93,909 | హారిస్‌బర్గ్ | 68,061 |

| వరుస సంఖ్య | రాష్ట్రము | చ. కిమీ. వైశాల్యము | 1970 జనసంఖ్య | ముఖ్యనగరము | ము. ఖ్యనగర జనసంఖ్య 1970 |
|---|---|---|---|---|---|
| 33. | ఫ్లారిడా | 1,51,670 | 67,89,443 | తల్లహస్సీ | 71,897 |
| 34. | మస్సాచుసెట్స్ | 21,386 | 56,89,170 | బోస్టన్ | 27,53,700 |
| 35. | మాంటనా | 3,81,087 | 6 94,409 | హెలీనా | 22,730 |
| 36. | మిచిగాన్ | 1,50,779 | 88,75,083 | లాన్సింగ్ | 3,73,474 |
| 37. | మిన్నెసోటా | 2,17,736 | 38,05 069 | సెయింట్ పాల్ | 3,09,980 |
| 38. | మిస్సిసిపీ | 1,28,584 | 22,16,912 | జాక్సన్ | 1,90,060 |
| 39. | మిస్సోరీ | 1,80,487 | 46,77,399 | జెఫర్సన్ సిటీ | 32,407 |
| 40. | మెయినీ | 86,027 | 9,93,663 | అగస్టా | 21 945 |
| 41. | మేరీలాండ్ | 27,394 | 39,22,399 | అన్నపొలిస్ | 25,592 |
| 42 | రోడ్ ఐలాండ్ | 3,144 | 9,49,723 | ప్రావిడెన్స్ | 1,79,116 |
| 43. | లూయీసియానా | 1,25,675 | 36,43,180 | బాటన్‌రోగ్ | 1,65,963 |
| 44. | వర్జీనియా | 1,05,711 | 46,48,494 | రిచ్‌మాండ్ | 2 48,074 |
| 45. | వర్జీనియా, పశ్చిమ | 62,629 | 17,44,237 | చార్లెస్‌టన్ | 1,57,662 |
| 46. | వాషింగ్‌టన్ | 1,76,617 | 34,09,169 | ఒలింపియా | 23,111 |
| 47. | విస్కాన్సిన్ | 1,45,439 | 44,17,933 | మాడిసన్ | 1,73,258 |
| 48. | వెర్‌మాంట్ | 24,887 | 4,44,732 | మాంట్ పెలియర్ | 8,609 |
| 49. | వ్యోమింగ్ | 2,53,597 | 3,32,416 | చెయెన్నె | 40,914 |
| 50. | హవాయీ | 16,638 | 7,69,913 | హానొలూలూ | 3,21,871 |
| 51. | కొలంబియా జిల్లా* | 179 | 7,56,510 | — | — |

1970 లెక్కలను అనుసరించి ఒక లక్ష ప్రజలకు మించిన జనసంఖ్యగల పట్టణములు 396 కలవు. అందును 10 లక్షలకు పైబడిన జనసంఖ్య కలవి 30. వీనిలో పై పట్టికలో పేర్కొనబడినవి గాక తక్కినవి : న్యూయార్క్ (1,14,48,480,) లాస్ ఏంజలెస్ బీచి (69,74,103) చికాగో (68,92,509), ఫిలడెల్ఫియా (47,77,414), సాన్ ఫ్రాన్సిస్కో ఓక్‌లాండ్ (30,69,797, వాషింగ్‌టన్ (28,35,737), పిట్స్‌బర్గ్ (23,83,753), సెయింట్ లూయీ (23,31,016), బాల్టిమోర్ (20,45,200) క్లీవ్‌లాండ్ (20,43 389), హూస్టన్ (19,58,491), నెవార్క్ (18,47,542),

* దేశపు సమాఖ్యా (ఫెడరల్) ప్రభుత్వపు ముఖ్యనగరమగు వాషింగ్‌టన్ నగరము ఈ జిల్లాయందున్నది. తొలుత ఈ ప్రాంతము మేరీలాండ్ రాష్ట్రమున ఉండెడిది; కాని దేశపు ముఖ్యనగరపు నిర్మాణమునకై ఇది ఆ రాష్ట్రము చేత 1791 లో దత్తము చేయబడినది. ఈ జిల్లా రాష్ట్రముల లెక్కలోనికి రాదు.

మిన్నియాపోలిస్ - సెం. పాల్ (18,95,018), డల్లాస్ (15,39 372), అనాహీమ్ - సాంతా ఆనా గార్డెన్ గ్రవ్, కాలిఫోర్నియా (14,09,335) సీటిల్ - ఎవరెట్ (14,04,432), మిల్‌వాకీ (13, 93,260), సిన్సిన్నాటీ (13,73,225), పాటెర్‌సన్ క్లిఫ్టన్ - పాస్సాయిక్, న్యూజెర్సీ(13,69,374), బఫలో (13.34,485), సాన్ డీగో (13,18,022), మియామీ (12,59,176), కాన్సాస్ సిటీ (12,40, 575), సాన్ బెర్‌నార్డినో రివర్ - సైడ్ - ఓన్ టారియో, కాలిఫోర్నియా (11,22,041), ఇండి యానాపోలిస్ (10,99,628), సాన్‌జోస్, కాలి ఫోర్నియా (10,57,032), న్యూ అర్లియన్స్ (10,34,316).

దేశప్రజలలో 14,93,24.930 మంది (దాదాపు 70%) పట్టణవాసులు; 5,38,86,996 మంది మాత్రమే పల్లెపట్టులందు వసించుచున్నారు. ప్రజ లలో, యూరపీయ శ్వేతజాతుల సంతతివారు అత్యధి కముగ కలరు; 11% నీగ్రో సంతతివారు; వీరిలో అత్యధిక సంఖ్యాకులు దక్షిణ రాష్ట్రములందు వసించుచున్నారు. దేశపు ఆదిమవాసులగు అమెరి కన్ - ఇండియనులు (వీరినే ఎర్రఇండియనులు అనియు వ్యవహరింతురు) చాలవరకు నశించిరి; ప్రస్తుతమున (1970) వారి సంఖ్య 6,68,700 మాత్రమే: వీరి నివాసమునకై కొన్ని ప్రాంతములు ప్రత్యేకింపబడినవి. ఆసియాకు చెందిన ఫిలిప్పై యిన్‌వాసులు, జపానీయులు, చీనీయులు, భార తీయులు, పాకిస్తానీయులు, వియెత్‌నమీయులు మొదలగువారు అత్యల్పసంఖ్యలలో కలరు. వీరిలో ఫిలిప్పైయిన్‌వాసుల సంఖ్య అత్యధికము. దేశపు ప్రజలందరికిని ఆంగ్లమే మాతృభాషగ లెక్క తేలు చున్నది. విదేశములనుండి వలసవచ్చి చేరినవారిలో మొదటి రెండు తరములవారు, ఆంగ్లముతో పాటుగ మాతృభాషతో సయితము పరిచితిని కల్గియుందురు; కాని సాధారణముగ మూడవతరమువారు ఆంగ్ల మునే మాతృభాషగ గ్రహింతురు. ఇచటి ఇంగ్లీషు భాషలో డచ్చి, జర్మన్, అమెరికన్ ఇండియన్ పదములును చేరియున్నవి; అంతియేగాక, కొన్ని పదముల అర్థము, ఇంగ్లండునందలి ఇంగ్లీషు పదములకన్న వేరుగ ఉండును.

దేశమునందలి ప్రజానీకమున ప్రొటెస్టంటు సంప్రదాయపు క్రైస్తవమతము విరివిగ వ్యాప్తిని పొందియున్నది; తరువాత రోమన్‌కేతలిక్ సంప్ర దాయపు క్రైస్తవమును, యూదమతమును క్రమ ప్రాముఖ్యమును కలిగియున్నవి. ఆసియానుండి వలసవచ్చిన పలువురిలో వారి సాంప్రదాయిక మతములు వ్యాప్తిలో ఉన్నవి. ప్రభుత్వమునకు, మతముతో ఎట్టి ప్రసక్తియు లేదనుట 1962 లో నిర్ధారితమై, పాఠశాలలందు ప్రార్థనలను నిర్వ హించుట మానివేయబడినది.

**5. సమాచార సా.** : దేశమున తంతి, తపాలా, టెలిఫోను, టెలివిజన్, రేడియోవసతులు, దేశ విస్తీర్ణమునకు తగినటుల, విపరీతముగ అభివృద్ధి చెందినవి. దేశమునందలి తపాలాఫీసుల సంఖ్య 32,064. తంతి, టెలిఫోన్, రేడియోలపై ఈ దేశము సమాచార సౌకర్యమునకు ఎక్కువగ ఆధారపడి ఉన్నది. ప్రపంచమునందలి మొత్తపు టెలిఫోనుల సంఖ్యలో దాదాపు సగము ఈ దేశ మున కలవు. 1969 లో దేశపు టెలిఫోనుల సంఖ్య 11.5 కోట్లు. రేడియోద్వారా వార్తా సమా చారసేకరణ వివిధ రంగములందు వాడుకలో ఉన్నది. రేడియోద్వారాగాని కేబిల్ ద్వారాగాని ఈ దేశమునకు దాదాపు 100 విదేశములతో వార్తా సౌకర్యము కలదు. 1969 లో దేశమున వివిధ తరగతుల బ్రాడ్‌కాస్టింగు స్టేషనులు 6,055 ను, 655 టెలివిజన్ స్టేషనులును కలవు. విద్యార్థు లకు బోధించుటకై 195 టెలివిజన్‌లు పనిచేయు చున్నవి. దేశపు గృహములలో 95%కు టెలి

విజన్ సెట్లుకలవు. తపాలాఫీసులు తప్ప, తక్కిన సమాచార సాధనములలో అత్యధికభాగము, ఫెడరల్ కమీషన్ పర్యవేక్షణకు లోబడి, ప్రయివేటు రంగపు అధీనమున పనిచేయుచున్నవి. 1962 మొదలుగ ఉపగ్రహ సహాయమున వార్తలను పంపుట విరివిగ వ్యాప్తిలోనికి వచ్చినది.

**5. యాన సౌ. :** అతి విశాలమగు ఈ దేశమున రాకపోకల సదుపాయములే, ఆర్థిక, సాంఘిక జీవితమునకు మూలములు. దేశమున, పట్టణ, గ్రామములందలి మొత్తపు రోడ్లనిడివి 60,14,307 కిమీ.; ఇందు 47,72,915 కిమీ. చక్కగ సిమెంటు చేయబడినవి. వీనిలో కేంద్ర ప్రభుత్వమునకు, రాష్ట్రప్రభుత్వములకు సంబంధించిన రోడ్లేగాక, వైయక్తిక సంస్థలకు సంబంధించిన రోడ్లును చేరి ఉన్నవి (1972). ప్రపంచమున వేరెచటను కన రాని సంఖ్యావిస్తృతిలో ఇచట మోటారు వాహనములు కలవు. మోటారుకార్ల సంఖ్య దాదాపు 9.6 కోట్లు (అనగా ఇరువురికి ఒక కారు చొప్పున కలదు.) రైలుమార్గపు మొత్తపు నిడివి 3 27,394 కిమీ. ప్రపంచపు మొత్తపు రైలుమార్గపు నిడివిలో 29% ఈ దేశమున కలదని అంచనా. దేశాంతర్గతము లగు నదులపై పయనించు నౌకలును రాకపోకలకు అనుకూలించుచున్నవి. ఇట్టి జలమార్గముల మొత్తపు నిడివి 47,000 కిమీ దేశమున విమానయాన సౌకర్యము విస్మయ సంజనకమగు రీతిలో వృద్ధి పొందినది. మొత్తపు పౌర విమానముల సంఖ్య 1,34,539 (1971). పలుతీరుల విమానాశ్రయములు దేశమున విరివిగ కననగును. వీని మొత్తపు సంఖ్య 12,070; ఇందులో హెలికాప్టర్లు మాత్రమే వాడునవి 963; సాగరవిమానములవి 465 (1971). దేశపు ఉభయ సాగర తీరములందును ప్రముఖము లగు ఓడరేవులు కలవు; వీనిలో న్యూయార్క్, దిలావర్ రివర్ ఏరియా (ఫిలడెల్ఫియా), చేసాపీక్ బే యేరియా, న్యూ ఆర్లియన్స్, హూస్టన్, సాన్ ఫ్రాన్సిస్కో బే యేరియా పేర్కొనదగినవి. దేశాంతర్గతమగు సుపీరియర్ సరస్సు తీరపు డులుత్ రేవుకూడ వ్యాపార దృష్టిలో సాగర తీరపు రేవులతో సరిపోవుచున్నది. 1959 లో లారెన్స్ సీవే అను కాలువ త్రవ్వబడిన తరువాత చికాగో, డెట్రాయిట్ రేవులును వ్యాపారరీత్యా ప్రసిద్ధికి రాగలిగినవి. వర్తక నౌకాసంఖ్యలో, ప్రపంచమున, ప్రథమ స్థానమును ఈ దేశము ఆక్రమించి యున్నది. వానిలో 1000 టన్నేజికి తగ్గని నౌకల సంఖ్య 1,579; వానిమొత్తపుటన్నేజి 2.195 కోట్లు.

**6. చరిత్ర :** యూరపియనులు వలస చేరుటకు పూర్వమే ఈ దేశమున ఒక నాగరిక సంఘము వర్ధిల్లినటుల నిదర్శనములు ఉన్నను, ఆ సంఘపు చారిత్రక వివరములు తెలియవచ్చుటలేదు. క్రీ. శ. 1000 ప్రాంతమున లీఫ్ ఎరిక్సన్ అను యూరపీయ సాహసిక నావికుడు ఇచటి ఈశాన్య ప్రాంతమున కాలిడెనని కొందరు చారిత్రకు లనెదరు; కాని తదనంతరమున 15 వ శతాబ్ది అంతమువరకు తదితర యూరపీయులు ఎవరును అచట చేరినటుల తెలియవచ్చుటలేదు. 1492 లో కొలంబస్, ఈ దేశమునకు కొలది దూరమునఉన్న కొన్ని దీవులను, స్పెయిన్ దేశపు పక్షమున కను గొనినను, స్పెయిన్ దేశీయులు ఇట విరివిగ చేరలేదు. తరువాత ఫ్లారిడా ప్రాంతమునను, మిస్సిసిపీ నదీ ప్రాంతమునను కొందరు స్పెయిన్ దేశీయులు పర్యటించినను, వారిట స్థిరనివాసమును ఏర్పరచు కొనలేదు. 1496 లో ఇంగ్లండు దేశపు ప్రభువు ఇచ్చిన అనుమతిని అనుసరించి, కేబట్ అనువాడు లాబ్రడార్‌న పర్యటించినను, అట స్థిరనివాసములు ఏవియు ఏర్పడలేదు; తరువాత వలసలను స్థాపించుటకై ఆంగ్లేయులుచేసిన మరొక యత్నమును విఫలమైనది. కడకు 1607 లో జరిపిన వలస ప్రయత్నము సఫలమై 'వర్జినియా' అను వలస ఏర్పడినది. ఆ తరువాత, ఇంగ్లండు దేశమున మత ఛాందసుల దురంతముల బారినుండి తప్పించు కొను

టక్లై, ప్యూరిటన్ సంప్రదాయపు క్రైస్తవులు, ప్రస్తుతపు మస్సాసుషెట్స్ రాష్ట్రమున వలస చేరుటతో (1620) ఈ వలసలసంస్థాపనము ద్రుతగతితో ముందునకు సాగినది. ఈ రీతిగ 10 వలసలను తొలుత ఆంగ్లేయులు స్థాపించిరి; అంతట దచ్చివారి రెండు వలసలను, స్వీడెస్ దేశీయుల వలసను ఒక దానిని ఆంగ్లేయులు వశపరచుకొనిరి. ఈ విధముగ 18 వ శతాబ్ది మధ్యభాగమునకు ప్రస్తుతపు దేశపు తూర్పు తీరమందలి 13 వలసలు ఆంగ్లేయుల అధీనమున ఉండినవి; పశ్చిమ భాగము మాత్రము ఫ్రెంచి వారి అధీనమున ఉండినది. ఈ 13 వలసలలోని భూమియు అతి సారవంతము; తొలుత అచటి ఆదిమ అమెరికన్ నాయకులు, ఆంగ్లేయులను ఎదిరించినను ఫలితములేక, మారుమూల ప్రాంతములకు తరలిపోయిరి. అంతట పొలములలో పనిపాటులకై నీగ్రోలను, ఆఫ్రికానుండి, బానిసలుగ ఆంగ్లేయులు కొనివచ్చిరి. ఇట్టి బానిసల జట్టులో తొలుతటిది వర్జీనియాయందు 1619 లో చేరినది. వలసలు క్రమేణ సంపన్నములు కాగలుగుటతో యూరపు నందలి రాజకీయముల ఫలితముగ ఈ వలసలును పలుమారులు ఆంగ్లదేశపు పక్షమున పెక్కు యుద్ధములలో పాల్గొనవలసి వచ్చినది. వీని ఫలితముగ వలసల వారిలో ఆత్మవిశ్వాసము ఎక్కువయై, తమ ప్రతిపత్తికి అధికతర మాన్యతను ఆర్జించు కృషికి వారిని ప్రేరేపించినది. అప్పటిలో గ్రేట్ బ్రిటన్ లోని ప్రభుత్వము, ముడిపదార్థములను పండించి పంపు భూములుగ మాత్రమే వలసలను పరిగణించి, అచటి ప్రజలకు, లండన్‌లోని పార్లమెంటున ఎట్టి అధికారమును లేకుండ ఉంచినది. అంతియేగాక ఆర్థికముగ వలసలకు నష్టము కలిగించి, బ్రిటన్ లోని వర్తకులకు గుత్తాధికారమును కలిగించుటకును, వలసలపై పన్నును విధించుటకును పూనుకొనినది (1764-67). వలస ప్రజలు దీనిని ప్రతిఘటించిరి; బ్రిటిష్ ప్రభుత్వము ఈ ప్రతిఘటనను అణచుటకు పూనుకొనిన చర్యల ఫలితముగ, వలసలన్నియు ఏకమై, జార్జి వాషింగ్‌టన్ ఆధిపత్యమున సేనను నిర్మించుకొని యుద్ధమునకు పూనుకొనినవి. అంత జులై 4, 1776 న ఈ వలసలు స్వాతంత్ర్యమును ప్రకటించినవి. ఈ స్వాతంత్ర్య యుద్ధము పారిస్ సంధితో (సెప్టెంబరు 3, 1783) ముగిసి, దేశ స్వాతంత్ర్యమును గ్రేట్ బ్రిటన్ గుర్తించినది అంతట ఒక రాజ్యాంగ విధానము రూపొందింపబడి 1790 నాటికి అన్ని వలసలచే ఆమోదితమైనది.

ఈ వలసలకు పశ్చిమమునఉన్న లూజియానా ప్రాంతము అప్పటిలో తొలుత ఫ్రెంచివారి అధీనమున ఉండినది. దానిని ఈ వలసల సమాఖ్యా ప్రభుత్వము 1803 లో ఫ్రెంచివారినుండి కొనుగోలు చేసి, దేశపు విస్తృతిని పెంచినది. తరువాత మెక్సికోలోని రాజకీయముల ఫలితముగ, ఆ దేశము నుండి టెక్సాస్ రాష్ట్రము విడివడి ఈ దేశముతో చేరినది (1845). అంతట మెక్సికోతో సాగిన యుద్ధపు ఫలితముగ కాలిఫోర్నియా, ఊటా రాష్ట్రములును, న్యూ మెక్సికో, అరిజోనా, కొలరాడో రాష్ట్రములలోని కొన్ని ప్రాంతములును యు. స్టే. కు దక్కినవి (1853).

1852 నుండి బానిసత్వము ఒక ముఖ్య సమస్యగ యు. స్టే. రాజకీయములందు పరిణమించినది. బానిసత్వ వ్యతిరేకతను బలపరచిన రిపబ్లికన్ పార్టీ 1860 లో జరిగిన ఎన్నికలందు, విజయమును సాధించగ, ఆ పార్టీ అభ్యర్థి అగు అబ్రహామ్ లింకన్ దేశాధ్యక్షుడయ్యెను. అంతట బానిసత్వమును బలపరచు దక్షిణ రాష్ట్రములు విడివడ యత్నింపగ దేశమున అంతర్యుద్ధము ఆరంభమై, 1861, ఏప్రిల్ 12 నుండి 1865 ఏప్రిల్ 26 వరకు సాగి, అబ్రహామ్ లింకన్‌కు విజయము లభించి జాతీయైక్యమును బానిసత్వపు నిర్మూలనమును సాధితములైనవి. 1867 లో అలాస్కాను

రష్యానుండి ఈ దేశము కొనుగోలు చేసినది. 1869 లో దేశపు ఉభయ తీరములను కలుపు రైలుమార్గము నిర్మింపబడి సమైక్య సాధనకు మార్గము సుగమమై, తత్ఫలితముగ వివిధ ప్రాంతములందు పెక్కు పరిశ్రమలు నెలకొనినవి. 1898 హవాయీ ద్వీపము ఈ దేశమునకు వశమైనది. ఆ సంవత్సరముననే స్పెయిన్‌తో ఈ దేశమునకు తటస్థించిన యుద్ధపు ఫలితముగ స్పెయిన్ పరాజితమై ఈ దేశమునకు పోర్టోరికో అధీనమగుటయు; ఫిలిప్పీన్స్ దీవులపై ఆధిపత్యము లభించుటయు జరిగినవి. ఈ విధముగ సైనికముగ, ఆర్థికముగ, పారిశ్రామికముగ బలవత్తరమగుటతో, పశ్చిమార్థగోళ రాజ్యములలో ప్రబల స్థానమును ఈ దేశము ఆక్రమించి, ఆ అర్ధగోళములో యూరపీయ రాజ్యముల వారెవరు, అటమీదట వలసల స్థాపింపగూడదని నిషేదింప గలిగినది (1923); ఇదియే అప్పటి అధ్యక్షునిపేర 'మన్రో సిద్ధాంతము' అని వ్యవహరింపబడుచున్నది; కడకు 1904 లో 'యునైటెడ్ స్టేట్స్ ప్రభుత్వము అమెరికా ఖండమంతటికిని అంతర్జాతీయ పోలీసు సిబ్బంది' అని అప్పటి అధ్యక్షుడు ఉద్ఘాటించెను.

ఇరువదవ శతాబ్ది మొదలుగ ఆర్థిక, పారిశ్రామిక, వ్యావసాయిక రంగములలో ఈ దేశము సాధించిన ప్రగతి, మానవేతిహాసమున ఏ కాలమునను జరిగియుండలేదని చెప్పవచ్చును. పాశ్చాత్యుల విజ్ఞానశాస్త్రము, బహుళసాధన సమన్వితమగు విశాలదేశము, యూరపునుండి వలసచేరిన కుశలురగు పనివారల కృషి, నీగ్రోప్రజల కాయకష్టము ఈ అభ్యుదయమునకు మూలస్తంభములని చెప్పదగును.

యూరపుఖండ దేశముల జోక్యమును పశ్చిమార్థగోళమున నిషేధించిన తరువాత యు. స్టే. స్వీయాభివృద్ధిలోనే నిమగ్నమై, పూర్వార్ధగోళపు రాజకీయములకు దూరముగ, వైదొలంగి చాల కాలము ఉండినది. కాని ప్రథమ ప్రపంచయుద్ధ కాలమున, జర్మను జలాంతర్గాములు తన నౌకలకు కలిగించిన నష్టమువలనను, ప్రజాస్వామ్యమునకు జర్మన్ విజయమువలన నష్టము కలుగునను భయమువలనను ఈ దేశము మిత్రరాజ్యముల పక్షమున ఆ యుద్ధమున చేరి (ఏప్రిల్ 6, 1917) ఆ రాజ్యముల విజయమునకు తోడ్పడినది. అంతట ప్రజాస్వామ్య నియమములకు ప్రాబల్యముగల నూత్న వ్యవస్థను రూపొందించు కృషిని అప్పటి యు. స్టే. అధ్యక్షుడగు వుడ్రో విల్సన్ సాగించి విఫలత పొందగ, యు. స్టే. మరల యూరపీయ రాజకీయములనుండి వైదొలగినది.

1929 అంతమున వచ్చిన ఆర్థిక సంక్షోభము యు. స్టే. ను చాలగ కల్లోలపరచినది. అప్పటిలో అధ్యక్షుడైన ఫ్రాన్క్లిన్ డి. రూజ్‌వెల్టు, ఆ సవాలును 'న్యూ డీలు' అనబడు తన నూత్న మార్గమును అవలంబించి పరిష్కరించెను. వ్యక్తిగత స్వామ్యములను కుంచింపజేసియైనను, సామాజిక శ్రేయస్సును కాపాడుట ప్రభుత్వ బాధ్యతయని, అతడు తన విధానములవలన స్పష్టముచేసి దేశీయుల భావనలోనే విప్లవకరమగు మార్పును తేగలిగెను.

రూజ్‌వెల్టు అధ్యక్షుడుగఉన్న కాలముననే ద్వితీయ ప్రపంచ యుద్ధము మొదలైనది. మొదట ఈ దేశము తటస్థభావము వహించి, ఇరుపక్షముల మధ్య సామరస్యమునకై కృషిచేసినది. కాని అక్ష రాజ్యముల విజయమువలన ప్రజాస్వామ్య పద్ధతికే భంగము ఏర్పడునటుల 1940 తరువాత ద్యోతకమైనంతట, మిత్రరాజ్యములయెడ సానుభూతి వహించి వానికి అరువు – కౌలుపద్ధతిమీద ఆయుధాదులను ఇచ్చి సాయమును మాత్రము తొలుత చేసినది. కాని 1941, డిసెంబరు 7 న జపాన్ విమానములు, ఆకస్మికముగ యు. స్టే. యందలి

హవాయీ రాష్ట్రములోని పెరల్‌హార్బరుపై దాడి జరిపి నౌకాదళమునకు విశేషనష్టమును కలిగింపగ, ఈ దేశము మిత్రరాజ్యముల పక్షమున యుద్ధమున దిగి, తదాదిగ యుద్ధము అంతమగువరకు, తన సైనిక బలమును, అపార పారిశ్రామిక సంపత్తిని, అమోఘ పాటవమును అన్ని రంగములందును మిత్రరాజ్యములకు అందజేసి విజయ సాధనకు సాధన భూతమైనది. యుద్ధానంతరమున, ప్రపంచమును యుద్ధముల బారినుండి రక్షించుటకై ఐ. రా. స. ను సంస్థాపించుటకు ముందునకు వచ్చుటయేగాక, ఆ సంస్థయొక్క మనుగడకును, ఆ సంస్థయొక్క ఆశయముల సాఫల్యమునకును యు. స్టే. కృషిచేయుచున్నది.

ద్వితీయ యుద్ధానంతరమున ప్రపంచ రాజకీయములందు ఈ దేశము ప్రముఖపాత్రను వహించినది; యుద్ధఫలితముగ ఆర్థికముగ కుంగిపోయిన, పశ్చిమ యూరపీయ దేశములకును, జపానువంటి కొన్ని ప్రాచ్యదేశములకును ప్రణాళికల మూలమున ఎంతయో సాయపడి, ఈ దేశము వాని పునరుజ్జీవనమునకు కృషిచేసినది. అంతియేకాదు; భారత్, పాకిస్తాన్, శ్రీలంక వంటి రాజ్యములకును ఆర్థికముగను సాంకేతికముగను సాయపడి వాని పురోగతికి తోడ్పడినది. కాని ఈ కార్యక్రమమున అంతటను, ప్రపంచమున కమ్యూనిస్టుల పలుకుబడిని తగ్గించుటయే తన ప్రధానాశయముగ ఇది కొని ఈ దేశము వ్యవహరించినది. కమ్యూనిస్ట్ సిద్ధాంతము ప్రజాస్వామ్యమునకు సరికుదురదని ఈ దేశపు నాయకుల అభిప్రాయము.

తాను వహించిన కమ్యూనిస్ట్ వ్యతిరేకతవలన, ఈ రాజ్యము కొన్ని అవాంఛనీయ పరిస్థితుల లోనికిని, చొరబారవలసి వచ్చినది. అట్టివానిలో వియెత్‌నామ్‌న ఈ దేశము వహించిన పాత్ర ప్రముఖము. అచటి ఉత్తర ప్రాంతపు కమ్యూనిస్ట్‌ల పలుకుబడిని, దక్షిణ ప్రాంతమునకు వ్యాపించకుండ నిరోధించుటకై ఈ దేశము దక్షిణ ప్రాంతపు నాయకులను సమర్థించి, తన సేనలను పంపి, యుద్ధ చర్యలలో పాల్గొనినది. ఈ చర్య యు. స్టే. యందలి ప్రజలలోనే విరసతను కల్పించినది; కడకు వియెత్‌నామ్‌నుండి ఈ దేశము తన సేనలను తొలగించి ప్రపంచ ప్రజాభిప్రాయమునకు లొంగినది. ఇది ఎటులున్నను, ఈ దేశమును సోవియట్ రష్యాయును నేడు ప్రపంచమున బలపత్తమ రాజ్యములై యుండుటయు, ఈ రెండు రాజ్యముల నాయకుల చర్యలపైననే, ప్రస్తుతమున ప్రపంచపు భవితవ్యము ఆధారపడి ఉండుటయు మరుపరాని యథార్థ విషయములు.

**7. పరిపాలన :** 1789 లో ఆమోదింపబడి, తదనంతరమున అంతటంతట 22 సవరణలను పొందిన, రాజ్యాంగ విధానమును అనుసరించి ఇట పరిపాలన సాగుచున్నది. ప్రపంచపు లిఖిత రాజ్యాంగ విధానములలో, ఇది తొలుతటిది; ఆ తరువాత పలుదేశముల రాజ్యాంగవిధానములకు అది మార్గదర్శిని అయినది. ఇది ఒక సమాఖ్యా (ఫెడరల్) ప్రభుత్వ విధానము. కేంద్రమునకును, రాష్ట్రములకును మధ్య అధికార విభజన, ఇందు ఒక నిర్దిష్ట విధానమున జరిగినది. కేంద్రమునకు నిర్దిష్టముగ చెందజేయబడని అధికారములు, (రాజ్యాంగ విరుద్ధము కానంతవరకును) రాష్ట్రములకును ప్రజలకును చెందునను నియమము అందు కలదు. కేంద్ర ప్రభుత్వపు శాసన నిర్మాణాధికారములు అన్నియు కాంగ్రెసున న్యస్తములు. ఈ కాంగ్రెస్‌న ప్రతినిధిసభ (హౌస్ ఆఫ్ రిప్రజెంటిటివ్స్), శిష్టసభ (సెనెట్) అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభయందలి సభ్యసంఖ్య 435; ఇందు ప్రతి రాష్ట్రమునకు జనసంఖ్యా నిష్పత్తిని బట్టి ప్రాతినిధ్యము కలదు. పదియేండ్లకు ఒకసారి జరుగు జనాభా లెక్కల ప్రాతిపదికన ఆ యా రాష్ట్రముల ప్రతినిధి సంఖ్య ఇందు నిర్ధారితమగును.

రెండేండ్లకు ఒకసారి ఈ ప్రతినిధుల ఎన్నిక జరుగును. శిష్టసభలో రాష్ట్రమునకు ఇద్దరు చొప్పున ప్రతినిధులు ఉందురు. వీరిలో ఒక్కొక్కని పదవీకాల పరిమితి ఆరేండ్లు. అయినను రెండేండ్ల కొకసారి మూడవవంతు సభ్యుల పదవీ విరమణచెందేది. కొత్తవారు ఆ స్థానములకు ఎన్నుకొనబడు రీతిగ ఈ సభ వ్యవస్థితము. రాజ్యాంగమున నిర్ణయింపబడిన ఒక ప్రత్యేక క్లిష్ట విధానమును అనుసరించి ప్రజలవలన దేశాధ్యక్షుడు (ప్రెసిడెంటు) ఎన్నుకొనబడును. ఈ ఎన్నిక నాలుగేండ్లకు ఒకసారి (లీపు సంవత్సరమున) నవంబరు నెలలో మొదటి సోమవారమునకు తరువాత వచ్చు మంగళవారమున జరుగును. అధ్యక్షుని ఎన్నిక కాలముననే ఉపాధ్యక్షుడును ఎన్నుకొనబడును అధ్యక్షుడుగ ఎన్నుకొనబడునాటికి అభ్యర్థి దేశమున జన్మించిన పౌరుడై యుండి, 35 ఏండ్ల వయసుకలిగి, 14 ఏండ్లకు తగ్గని కాలము దేశమున వసించి ఉండవలెనను నియమము కలదు 1951లో ఆమోదింపబడిన ఒక సవరణను అనుసరించి ఒకడు, అధ్యక్షుడుగ, రెండుతడవలకుమించి ఎన్నుకొనబడకూడదు. అధ్యక్షుడు మరణించినను, లేదా వేరుకారణముల వలన పదచ్యుతుడైనను ఉపాధ్యక్షుడే కడమ కాలమున, అధ్యక్షుడుగ వ్యవహరించును. అధ్యక్షుడే దేశమునకు సర్వసేనాపతి. ప్రతినిధి సభలోని సభ్యుడు 25 ఏండ్ల వయసునకును, శిష్టసభలోని సభ్యుడు 30 ఏండ్ల వయసునకును తగ్గక ఉండవలయును. ప్రజలలో 18 ఏండ్లకు తగ్గనివారికి అందరికిని, వోటుహక్కు 26వ సవరణవలన 1970 లో కల్పింపబడినది.

రాష్ట్రములందు, నెబ్రస్కాయందుతప్ప, తక్కిన అన్నింట రెండు కక్ష్యలుకల శాసనసభలు కలవు. నెబ్రస్కాలో మాత్రము ఏకకక్ష్యకమగు శాసనసభ పని చేయుచున్నది. వాని అధికారములను, రాజ్యాంగ విహితములైనంతవరకు, రాష్ట్రములు నిర్వహించుటకో, కేంద్ర ప్రభుత్వము జోక్యము వహింపదు.

దేశాధ్యక్షుడు, సెనేట్‌యొక్క ఆమోదముతో మంత్రులను, రాయబారులను, సుప్రీమ్‌కోర్టు జడ్జీలను నియమించును. సాధారణముగ అతడు తన రాజకీయపక్షపు సలహాపై, ఇట్టి నియామకములను చేయుట పరిపాటి. ఎప్పుడో ఒకప్పుడు తప్ప, సర్వసాధారణముగ సెనెట్ ఈ నియామకములను ఆమోదించుచునే ఉండును. కార్యనిర్వహణాధికారము అధ్యక్షునియందే కలదు; మంత్రివర్గము అతనికి మాత్రమే బాధ్యతవహించి పరిపాలనను నిర్వర్తించును. అయినను అతని అధికారము ప్రతినిధిసభ, శిష్టసభల అదుపులో ఉండునటుల రాజ్యాంగ విధానమున నిబంధనలు కలవు. అధ్యక్షుడు, దేశపు పక్షమున, ఇతర దేశముతో చేసికొను ఏ ఒడంబడికయైనను, సెనెట్ సభ్యులలో మూడింట రెండువంతుల ఆమోదమును పొందకున్న యెడల అది అమలులోనికి రాజాలదు. ప్రతినిధి సభలోనే ధనసంబంధపు బిల్లులన్నియు బయలుదేరుటవలన, దానితో సౌహార్ద భావనతో మెలగినపుడు మాత్రమే అధ్యక్షుని దేశీయ విదేశీయ విధానములు ప్రజామోదితములు కాగలుగును. కాంగ్రెస్ ఆమోదించిన చట్టమును అమలుజరుపుటలో దీక్ష వహించి అధ్యక్షుడు పనిచేయవలయుననను నియమము రాజ్యాంగ విధానమున కలదు. అయినను, ఆ సమయమున తగు రీతిలో తన విచక్షణను సైతము అధ్యక్షుడు వినియోగింపవచ్చును. లంచగొండితనము, దేశద్రోహము, అనుచితవర్తన మొదలగు మహాదోషములకై, అధ్యక్షునిగాని, ఉపాధ్యక్షునిగాని అభిశంసించి పదవినుండి తొలగించు అధికారము కాంగ్రెసునకు కలదు.

దేశమున ఫెడరల్ విషయములకు సంబంధించినంతవరకు, న్యాయనిర్వహణ సుప్రీమ్‌కోర్టు అధ్య

ర్యమున, జిల్లాకోర్టు మొదలుగ వివిధ సోపాన శ్రేణులలో నిర్వహింపబడుచున్నది. కాని రాష్ట్రము లకు సంబంధించిన అధికార నిర్వహణలో న్యాయ స్థానములు ఆ యా రాష్ట్రములలో కలవు ఏ రాష్ట్ర న్యాయ నిర్వహణలోనైనను ఆ రాష్ట్రపు సుప్రీమ్ కోర్టుదే తుది నిర్ణయము.

దేశమున ప్రముఖ రాజకీయ పక్షములు – డెమో క్రాటిక్ పార్టీ, రిపబ్లికన్ పార్టీ అనునవి – కలవు. దేశీయవిషయములలో వీనికి అభిప్రాయభేదము లున్నను విదేశీయ నీతికి సంబంధించినంతవరకు చాలవరకు సామరస్యము కలదని చెప్పవచ్చును.

మొత్తముమీద ఈ ప్రజాస్వామిక రాజ్యాంగ విధానము, వడిదుడుకులను తట్టుకొని 200 సంవత్స రములుగ, కాలానుగుణములగు కొలది మార్పులతో, పని చేయుచుండుట ప్రజాస్వామిక చరిత్రలోనే ఒక విశిష్టవిషయము. ప్రజావాణికి అందు అధి కారము కలదనుట సన్నిహిత చరిత్రలోని ఒక సంఘటన రుజువు చేసినది అప్పటి అధ్యక్షుడగు నిక్సన్, తన రాజకీయ ప్రతిపక్షమునెడ అవినీతి చర్యకు పూనినటుల, తెలియనైనంతనే, ప్రజాభి ప్రాయమునకు అతడు తలయొగ్గి రాజీనామాచేసెను. (ఆగస్టు 9,1974).

**8. దేశరక్షణ :** ప్రపంచమున అత్యాధునిక ఆయుధ సంపత్తిలో బలవత్తమములుగ పేరొందిన రెండు ప్రముఖ రాజ్యములలో ఇది ఒకటి (వేరొ కటి సోవియెట్ రష్యా). ఈ విషయమున సైనిక సంఖ్య కన్నను ఎక్కువ ప్రాముఖ్యము గడించినవి అందలి ఆధునిక ఆయుధసంపత్తి. విజ్ఞానశాస్త్ర మును చక్కగ పనిగొని, అణవికాయుధములతో పాటుగ పెక్కునవీనాయుధములను ఈ దేశము సమకూర్చుకొన్నది. రెండవ ప్రపంచ యుద్ధానంత రమున, ప్రపంచ రాజకీయములలో ప్రముఖపాత్రను నిర్వహించుచున్న ఈ రాజ్యము ఆ బాధ్యతల నిర్వ హణకై తన దేశముననే గాక విదేశములందును ఆయా రాజ్యముల అనుమతితో తన సేనలను నిలిపియుంచినది. ఇటుల యూరపున ఒకసైనిక దళమును, దక్షిణ కొరియాయందు వేరొక దళ మును కలవు. మొత్తముమీద యు. స్టే దేశపు భూతల సేనలో 46% విదేశము – లందు కలదని తెలియుచున్నది.

దేశపు పౌరులలో 18 ఏండ్ల వయసురాగానే ప్రతి పురుషుడును సైనిక సేవకై విధిగ రిజిస్టరు చేయించుకొనవలెనను నియమము కలదు. వీరిలో 18½ ఏండ్లనుండి 26 ఏండ్ల వరకు వయసు కలవారు సేనలో అవసరము వచ్చినపుడు చేరి పోరాటము లందు పాల్గొనుటకు సన్నద్ధులై ఉండవలయును. ఆ తరువాత 35 ఏండ్ల వయసు వచ్చువరకు, పోరా టమున గాకపోయినను సేనకు సంబంధించిచ తక్కిన కార్యములందు అవసరమైనప్పుడు పాల్గొన వలసి ఉండును. 1970 లో భూతలసేన యందలి వారి మొత్తపు సంఖ్య 13,63,210. ఈ సేనకు, సాంప్రదాయికపు ఆయుధములేగాక వివిధ రీతుల క్షిపణులును కలవు; వీనిలో కొన్ని 640 కిమీ. దూరమున ఉన్నవానినికూడ నాశనముచేయ సమర్థములు. నౌకా సేనయందలి మొత్తపు సైనిక సంఖ్య 6,93,705; ఇదిగాక నౌకాసేనకు సన్నిహితముగ పనిచేయు సాగరదళము (మెరైన్ సేన)లోని వారిసంఖ్య 2,94,105 (1970). నౌకా దళమునకు అత్యంత ఆధునికములగు యుద్ధనౌక లును, అనుబంధ నౌకలును, జలాంతర్గాములును కలవు. ఇవిగాక అణుశక్తిచేత నడుపబడు జలాంత ర్గాములును కలవు. మొత్తముమీద వివిధములగు 567 యుద్ధ నౌకలు కలవని తెలియుచున్నది. వీనిలో 15 పెద్ద విమానవాహక నౌకలు, 10 చిన్న విమాన వాహకములు, 103 అణవిక జలాం తర్గాములు, 39 సాధారణపు జలాంతర్గాములు, 4 యుద్ధనౌకలు, 23 క్రూయిజర్లు, 177 డెస్ట్రా

యర్లు చేతి ఉన్నవి (1972). వాయుసేనయందలి సైనిక సంఖ్య 8,09,627. మొత్తపు పోరాటపు విమానముల సంఖ్య 13,480.

పై సైనికులు గాక అవసరము వచ్చినపుడు యుద్ధమునకు రాగలిగిన రిజర్వుదళమున 3,26,000 మంది కలరు (1970). దేశపు ఆదాయమున, తక్కిన ఏ ఒక పరిపాలనా వ్యయశాఖ కన్నను రక్షణ శాఖకే ఎక్కువగ ఖర్చగుచున్నది. 1973లో రక్షణ శాఖకై 2354.9 కోట్ల డాలర్లు వెచ్చింప బడినది.

**9. అంతర్జాతీయ సం.** : ఐ. రా. స నిర్మాణ సభ్యులలోను ఆ సంస్థయందు పీటోహక్కు కలి గిన అయిదు ప్రముఖ రాజ్యములలోను ఈ రాజ్య మొకటి. ఐ. రా. స కు అగు వ్యయమున దాదాపు మూడవభాగమును ఈ దేశము భరించు చున్నది. అంతేగాక అమెరికా ఖండమునకు సంబం ధించిన వివిధ రాజ్యసంస్థలలోను, పెక్కు అంత ర్జాతీయ సంస్థలలోను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఆర్థికముగ అత్యంత బలవత్తమమగు ఈ రాజ్యము పలుతీరులుగ ఆర్థిక, సైనిక సాహాయ్య మును విదేశములకు సమకూర్చుచున్నది.

**10. ఆర్థిక రంగము** : ఈ దేశమునకు ఉన్న సహజ సాధన సంపత్తి, ప్రపంచమున సోవియెట్ రష్యాకు తప్ప, వేరొక యే దేశమునకును లేదనుట యథార్థము. ఇక వ్యవసాయ, పారిశ్రామిక రంగ ముల రెండింట ఈ దేశము అత్యుచ్చ స్థానమున ఉన్నది. ప్రపంచపు గోధుమపంటలో 13%, పొగా కులో 16% ఈ దేశమున ఉత్పత్తి యగుచున్నవి. ఇక మొక్కజొన్న సోయాబీనులు, ఖాద్యశాక తైలముల మొత్తపు ప్రపంచపు ఉత్పత్తిలో 40% ఈ దేశమున లభ్యమగుచున్నది. 1967 లో ఈ దేశమునుండి విదేశములకు ఎగుమతియైన వ్యవసా యోత్తుల విలువ 677 కోట్ల డాలర్లు; ప్రపంచ వ్యవ సాయోత్పత్తి వ్యాపారమున ఇది అయిదవవంతుగ లెక్కకు వచ్చినది. వ్యవసాయమున ఉన్న మొత్తపు భూమి 111.4 కోట్ల ఎకరములు (1972). ఇందు దాదాపు 40 కోట్ల ఎకరములకు నీటి పారుదల వసతి కలదు. దేశపు పంటలలో ఉత్పత్తి క్రమ మును అనుసరించి మొక్కజొన్న, గోధుమ, సోయాచిక్కుళ్లు, ఓట్లు, జొన్న, బార్లీ, వరి పేర్కొనదగిన ఆహారధాన్యములు. రొక్కపు పంటలలో పొగాకు, ప్రత్తి లెక్కింపదగినవి.పండ్లలో ఆపిల్స్, టొమాటోలు ఎక్కువగ ఉత్పత్తి అగు చున్నవి. 1969 లో మొక్కజొన్న 45,78,000 బుషెలులు, గోధుమ 14,58,000 బుషెలులు, ఆపిల్ పండ్లు 67,61,900 పండింపబడినవి.

అరణ్యముల మొత్తపు వైశాల్యము 75.9 కోట్ల ఎకరములు. దేశావసరములకు సరిపోవు కల పకేగాక, కాగితపు ఉత్పత్తికిని ఈ ఆరణ్యములు సహకరించుచున్నవి. వార్తాపత్రికల కాగితపు ఉత్పత్తిలో ఈ దేశము రెండవస్థానమున ఉన్నది. 1969 లో ఈ దేశము 58.5కోట్ల డాలరు విలువగల కాగితమును, కాగితపు గుజ్జును ఎగుమతి చేసినది. మత్స్యపరిశ్రమ వలన 51.8 కోట్ల డా. విలువగల చేపలు బట్టువడుచున్నవి (1969). దాదాపు 1,35,000 మంది ఈ పరిశ్రమను ఆశ్రయించి జీవించుచున్నారు. దేశమున విరివిగ పశుసంపద కలదు. దాదాపు 180 లక్షల ఆవులును, 120 లక్షల తక్కిన పశుజాతులును, 180 లక్షల గొర్రెలును, 620 లక్షల పందులును కలవు (1972). గొర్రెల వలన ఉన్నిపరిశ్రమకు తావేర్పడినది. ఇక ఖనిజ విషయమున అల్యూమినం, సిమెంటు, రాగి, ముడి ఇనుము, సీసము, ఫాస్ఫేటు, పొటాష్, రాతి ఉప్పు, గంధకము, యురేనియం, తుత్తునాగము అనువానిలో ప్రపంచమున ఈ దేశపుదే అగ్ర స్థానము. ఇనుము విరివిగ ఉన్నను, దేశపరిశ్రమ లకు సరిపోవకుండుటచేత, విదేశముల నుండి కొంత

ఈ దేశము దిగుమతి చేసికొనుచున్నది. పెట్రోలియమును, ఇంధనవాయువును విరివిగ లభ్యములగుచున్నను, దేశపరిశ్రమలకై పెట్రోలియం కొంత దిగుమతి జరుగుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 1936 శతకోట్ల కివా. ఇందులో జలవిద్యుదుత్పత్తి 222 శతకోట్లు (1968). అణవిక శక్తివలన కూడ విద్యుదుత్పత్తి జరుగుచున్నది. షిప్పింగ్ పోర్ట్ వద్దనున్న కేంద్రము, అట్టి అణవిక విద్యుత్ కేంద్రములలో ప్రముఖము.

యు. స్టే దేశము వ్యావసాయికముగ సుసంపన్నమే అయినను ఆర్థికరీత్యా దానిని పారిశ్రామిక దేశమనియే ముఖ్యముగా లెక్కింపవలసి ఉన్నది. తక్కిన ఏ ఒక ఆర్థిక రంగమునందు కన్నను పారిశ్రామిక రంగముననే అత్యధిక సంఖ్యాకులు పాల్గొనుచున్నారు. కార్మికబలమున 29% శాతము ఈ రంగమున వినియుక్తము; జాతీయాదాయమున 30% దీనివలన లభించుచున్నది (1968). దేశమున పలు పారిశ్రామిక కేంద్రములు ఉన్నను వాని అన్నింట న్యూయార్క్ ప్రముఖము. పరిశ్రమలందు ఎక్కువ మూలధనము కలిగిన వర్తక సంస్థలు క్రమముగ ముందునకు వచ్చి తక్కిన వానిని లోగొనుచున్నవి. దేశపు పారిశ్రామిక సంపత్తిలో దాదాపు సగభాగము 200 కార్పొరేషనుల (వ్యాపార సంస్థల)వశమున ఉన్నది మొత్తపు వ్యాపార సంస్థల ఆస్తుల విలువ 554 శతకోట్ల డాలరులుగ లెక్కదేలినది (1970). ఆధునిక విజ్ఞానమును చక్కగ పనిగొని ఈ పరిశ్రమలు అంతకంతకు నూత్నవిధానములను అవలంబించి, వస్తూత్పత్తిని పెంచగలుగుచున్నవి.

దాదాపు 21 కోట్ల జనసంఖ్య కలిగిన ఈ దేశపు సాంవత్సరిక సమష్టి జాతీయ వస్తూత్పత్తి విలువ లక్షకోట్ల డాలర్లకు పైగా ఉండునని అంచనా. తలసరి సాంవత్సరిక ఆదాయము దాదాపు 5,000 డాలర్లు (1970). ప్రపంచపు జనసంఖ్యలో 5% మాత్రమే ఉన్న ఈ దేశమున ప్రపంచపు సమష్టి వస్తూత్పత్తిలో 25% ఉత్పత్తి అగుచున్నది. ఆర్థిక వ్యవస్థయంతయు వైయక్తిక స్వామ్యము పైననే ఆధారపడి ఉన్నను, 1930 మొదలుగ, సాంఘిక శ్రేయమునకు ప్రాధాన్యము క్రమక్రమముగ ఎక్కువగుచున్నది. వస్తూత్పాదక పరిశ్రమలలో దాదాపు 2 కోట్లమంది కార్మికులు పనిచేయుచున్నారు. అందు ముఖ్యముగ పేరుగనినది, కార్లు మొదలగు స్వయంచాలక (ఆటోమొబైల్) శకటముల ఉత్పత్తి. 1969 వరకు ప్రపంచమున ఈ దేశపుదే ఆ విషయమున అగ్రస్థానమైనను ఆ తరువాత జపాను వలన వచ్చిన పోటీని ఎదుర్కొనవలసి వచ్చినది. అన్ని పరిశ్రమలందును క్రొంగ్రొత్త సాధనములను కనుగొనుటకు అవేక్షణాకృషిని నిరంతరాయముగ సాగించుట పెద్దయెత్తున ఈ దేశమున జరుగుచున్నది. అట్టి కృషిలో 3 లక్షలమంది పనిచేయుచున్నారు. దేశపు ఎగుమతులలో విలువలను అనుసరించి పారిశ్రామిక, వ్యావసాయిక యంత్ర సామగ్రి, కార్లు మొదలగు యాంత్రిక శకటములు, వైద్యుతిక పరికరములు, రసాయనిక ద్రవ్యములు, గోధుమ మొదలగు ధాన్యములు క్రమప్రాముఖ్యములను కలిగియున్నవి. దిగుమతులలో కార్ల విడిభాగములు, పెట్రోలియం - తత్సంబంధ ఉత్పత్తులు. కాఫీ, చక్కెర, ఉక్కుమిల్లుల ఉత్పత్తులు క్రమముగ లెక్కకు వచ్చును. మొత్తపు ఎగుమతుల విలువ 4413.7 కోట్ల డాలర్లు; దిగుమతుల విలువ 4554.6 కోట్ల డా. బడ్జెటరీ వ్యయము 25,003.5 కోట్ల డా. (1973).

**11. సాంఘిక రంగము :** దేశపు మొత్తపు కార్మికబలము 820 లక్షలు ఉండునని అంచనా. ఇందు 91.4% వ్యవసాయేతర వృత్తులందును, 4.3% వ్యవసాయముననను, 4.3% నిరుద్యోగులుగను ఉన్నారు (1970). వ్యవసాయేతర వృత్తులలో, వస్తూత్పత్తి పరిశ్రమలందు 27.7%, వ్యాపార

వృత్తిలో 21%, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వోద్యోగము లలో 18.1%, రహదారీ పరిశ్రమలలోను, ప్రజా సౌకర్య వృత్తులలోను 6.3%, బ్యాంకింగు మొద లగు వానిలో 5.2%, భవన నిర్మాణ కృషిలో 4.6%, తదితర వృత్తులలో 16.2% పనిచేయు చున్నారు (1970). కార్మికుని జీతపు మొత్తము ప్రాంతములను అనుసరించి మారుచున్నది; కాని ఏ రాష్ట్రమునను అది వారమునకు 95 డాలర్లకు తగ్గదు; అలాస్కాలో ఆ జీతము వారమునకు 185 డాలర్లు. వారమున పనికాలము ఏ రాష్ట్రము నను 43.5 గంటలను మించదు; కొన్ని రాష్ట్రము లందు ఆ కాలము 39 గంటలు మాత్రమే. వివిధ వృత్తులకు సంబంధించిన కార్మిక యూనియనులు చట్టబద్ధరీతులలో. పనిచేయుచున్నవి. కొన్ని నియ మములకులోబడి సమ్మెచేయు హక్కు కార్మికులకు కలదు. వివిధ రీతుల భీమాపద్ధతి అమలున ఉన్నది. దేశమునందలి కుటుంబములలో 86% కుటుంబ ములు జీవితభీమా సౌకర్యములను అనుభవించు చున్నవి. నిరుద్యోగపు భృతి విషయమున రాష్ట్రము లను అనుసరించి ఏర్పాటులును మారుచున్నవి. సగటున నిరుద్యోగభృతి వారమునకు 43 డాలర్లు. కొన్ని విధములైన భీమా పద్ధతుల ఏర్పాటువలన వార్ధక్యమున ఉన్నవారికి, సంపాదించువారు చని పోయిన కుటుంబములకు, అస్వస్థ శరీరులగువారికి సాహాయ్యము లభించుచున్నది. 1969 లో ఇట్టి సహాయమును పొందుచుండినవారి సంఖ్య 3.5 కోట్లు.

దేశమున గృహవసతి విస్తృతముగ కలదు. మొత్తము 607 లక్షల కుటుంబములకు 657 లక్షల గృహవసతులు కలవని అంచనా (1963). ఇందులో 64% పట్టణ ప్రాంతములందు కలవు; అద్దె ఇండ్లును అచటనే ఎక్కువ.

దేశమున నిరక్షరాస్యత 2.2% మాత్రమే. 14 ఏండ్ల వయసునకు పైబడిన వారందరు చదువను, వ్రాయను నేర్చియున్నారు. నీగ్రోలలో తొలుత విద్యాభ్యాసనము తక్కువగనే ఉన్నను క్రమ క్రమ ముగ వృద్ధియైనది. ఈ క్రింది పట్టికవలన 1971 లోని విద్యాసంస్థల పరిస్థితి విశదమగును.

| పాఠశాలల రీతి | పాఠశాలల సంఖ్య | ఉపాధ్యాయులు | విద్యార్థి సంఖ్య |
|---|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు | 80,200 | 12,79,000 | 3,15,88,000 |
| సెకండరీ పాఠశాలలు | 29,152 | 9,96,000 | 1,96,93,000 |
| ఉన్నత విద్యా సంస్థలు | 2,605 | 6,30,000 | 81,08,000 |
| | 1,11,957 | 29,05,000 | 5 93 89,000 |

ప్రాథమిక, సెకండరీ విద్యావిధానము, రాష్ట్ర ముల అధీనమున ఉన్నది. తొలుత నీగ్రో విద్యార్థు లకు వేరే పాఠశాలలు ఉండినవి. కాని 1957 లో చేసిన ఒక చట్టమువలన విద్యావిధానమున ఈ వర్ణ విచక్షణ రద్దు చేయబడినది.

పై పట్టికలో ఉన్నత విద్యాశాలలు అని పేర్కొన బడిన వానియందు యూనివర్సిటీలును, ఉన్నత విద్యను బోధించు కొన్ని ప్రత్యేక కళాశాలలును చేరియున్నవి. ఈ సంస్థలలో దేశీయులేగాక విదే శీయులును పలువురు విద్యను అభ్యసించుచున్నారు. న్యూయార్కులో అట్టి సంస్థలు 214. ఉన్నత విద్యా సంస్థలలో మూడింట రెండువంతులు వైయక్తిక సంస్థల యాజమాన్యమున పనిచేయు చున్నవి.

దేశమునఉన్న 22,581 గ్రంథాలయములలో అత్యుత్తమము కాంగ్రెస్ లైబ్రరీ; ఇందలి పుస్తక సంఖ్య 5.8 కోట్లు (1969). వివిధ భాషలకుచెందిన గ్రంథములు ఇందు కలవు. దేశమున మ్యూజియ ముల సంఖ్య 3,500. వీనిలో న్యూయార్కులోని మ్యూజియమ్ ఆఫ్ నేచురల్ హిస్టరీ, మెట్రో పాటి టన్ మ్యూజియములును, వాషింగ్టన్‌లోని నేషనల్ గేలరీ ఆఫ్ ఆర్ట్, స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూషను లును, బోస్టన్‌లోని మ్యూజియమ్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్, చికాగోలోని ఆర్ట్ ఇన్‌స్టిట్యూట్, ఫిలడెల్ఫియాలోని మ్యూజియమ్ అంతర్జాతీయ ప్రసిద్ధిని పొందినవి.

దేశమున 1,758 దైనిక పత్రికలు ఆంగ్లమున ప్రచురింపబడుచున్నవి. దాదాపు 3,68,000 మంది వార్తా పత్రికా పరిశ్రమను ఆశ్రయించి జీవించు చున్నారు. ఈ పరిశ్రమ కొన్ని శృంఖలాసంస్థల ఆధీనమున ఉన్నది. అనగా కొన్ని వార్తా పత్రికలు ఒకే ఒక సంస్థ యాజమాన్యమున వివిధ ప్రదేశ ములనుండి వేర్వేరు పేరులతో, వేర్వేరు రీతులలో ప్రచురింపబడును. అట్టి యాజమాన్యపు సంస్థలలో హర్‌స్ట్, స్క్రిప్స్ హవర్డ్, గానెట్, న్యూహౌస్ ప్రముఖములు. వార్తాసేకరణకై పత్రికలకు స్వీయ విలేఖరులు ఉన్నను, వార్తలను సేకరించి పంపు ఏజన్సీలును కొన్ని కలవు. వానిలో అసోసియేటెడ్ ప్రెస్, యునైటెడ్ ప్రెస్ ఇంటర్‌నేషనల్ అనునవి ప్రముఖములు. ప్రపంచపు పలుదేశములనుండి అతి శీఘ్రకాలమున వార్తలను సేకరించి, పత్రిక లకు అందజేయు వసతులు వీనికి కలవు. దైనిక పత్రికలలో న్యూయార్కు డైలీన్యూస్, వాల్‌స్ట్రీట్ జర్నల్, న్యూయార్కు టైమ్స్, లాస్ ఏంజిలెస్ టైమ్స్, చికాగో ట్రిబ్యూన్ అత్యధిక ప్రచారము కలవి.

దేశమున వైద్య సదుపాయములును, జీవిత సౌకర్యములును, చక్కగ కుదిరియుండుటవలన దేశీయుని ఆయుఃప్రమాణ అపేక్షత సరాసరిన 70 ఏండ్లకు మించిఉన్నది. అన్ని విధముల ఆసు పత్రుల సంఖ్య 7,123; ఇందలి శయ్యాసంఖ్య 16.2 లక్షలు, మొత్తపు వైద్యుల సంఖ్య 3,60,000.

**12. యాత్రా సౌ. :** కెనడా దేశీయులుతప్ప తక్కిన విదేశీయులు ఎవరైనను ఈ దేశమును దర్శించుటకు పాస్‌పోర్ట్, వీసాలను విధిగ పొంద వలయును. ఈ దేశపు ప్రకృతి సంపదయు, ఐశ్వ ర్యమును, వ్యాపార ప్రతిష్ఠయు, పలువురు విదేశీయు లను ఆకర్షించుచున్నవి. 1969 లో ఇట్టివారి సంఖ్య 23,82,198 (ఇందు కెనడానుండి వచ్చిన వారి సంఖ్య చేరలేదు). దేశమున వీరు 2 శతకోట్ల డాలర్లను వెచ్చించిరి. అటులే ఈ దేశవాసులలో పలువురు విదేశములను దర్శించి తమ తీరిక కాల ములను అట గడపుచున్నారు. వారు ఆ దేశములలో 4.7 శతకోట్ల డాలర్లను వెచ్చించిరి (1969).

**13. ప్రసిద్ధ పౌరులు :** ఒక దేశముగ రూపు గొని రెండువందల సంవత్సరములు మాత్రమే గడ చినను, ఈ దేశమున పలువురు వివిధ రంగములందు ప్రపంచ ప్రఖ్యాతిని ఆర్జించిరి. అట్టివారిలో రాజ కీయ రంగమునందుకన్నను, విజ్ఞాన శాస్త్రీయ రంగమున పేరొందినవారి సంఖ్య అత్యధికము. తొలుతనుండియు ఇచటి ప్రజాస్వామ్య వ్యవస్థయు, సంపత్తియు, సుఖజీవనావకాశములును యూరపు నుండి సమర్థులు, కుశలురునగు వారలను పెక్కు రను ఆకర్షించినవి. వారిటజేరి పౌరతను స్వీక రించిరి. 20 వ శతాబ్దమున ఆసియానుండియు కొందరు ధీమంతులు, వృత్తికుశలురు అట చేరి పౌరస్వత్వములను పొందిరి. ఇందువలన విజ్ఞానశాస్త్ర రంగమున పేరు ప్రఖ్యాతులుపొందిన అనేకులకు ఈ దేశము నిలయమైనది. 1976 వ సంవత్సరమున ఈయబడిన 6 నోబెల్ బహుమానములును ఈ దేశీ

యులకే దక్కినదనుట ఈ దేశము సాధించిన పురోగతికి ఒక నిదర్శనము. అట్టి ప్రముఖుల పేరులను అన్నింటిని ఇట ఇచ్చుట అశక్యము. అందువలన ప్రపంచమున రాజకీయ, సారస్వత, వైజ్ఞానిక రంగములందు విశిష్ట ఖ్యాతిని పొందిన కొందరి నామమాత్ర ప్రశంస మాత్రమే ఇట చేయబడినది.

1. జార్జి వాషింగ్టన్ (1732-99): దేశ జనకుడుగ సంభావింపబడిన స్వాతంత్ర్యయోధుడు, ప్రథమ దేశాధ్యక్షుడు. 2. బెంజమిన్ ఫ్రాన్క్లిన్ (1706-90): అచ్చుకూర్పు పనివాడుగ జీవితమును అతి దీనదశలో ఆరంభించి, కడకు స్వాతంత్ర్యయోధుడుగ, వైజ్ఞానికుడుగ, రాజకీయ వేత్తగ పేరెన్నికగన్నవాడు. 3. థామస్ జెఫర్సన్ (1743-1826): అమెరికన్ స్వాతంత్ర్య ప్రకటనను రూపొందించిన ధీమంతుడు; రాజకీయ పక్ష విధానమునకు రూపరేఖలను కల్పించినవాడు. 4 అబ్రహామ్ లింకన్ (1809-65): అంతర్యుద్ధమున దేశాధ్యక్షుడై దాసత్వపు నిర్మూలనమును సాధించిన ప్రగతిశీలుడు. 5. వుడ్రూ విల్సన్ (1856-1924): ప్రథమ ప్రపంచయుద్ధ కాలమున మిత్రరాజ్యముల విజయమునకు తోడ్పడి, నానారాజ్యసమితి ఏర్పడుటకు తొలుత కారణభూతుడైన దేశాధ్యక్షుడు. 6. ఫ్రాంక్లిన్ డెలాన్ రూజ్వెల్ట్ (1882-1945): దేశమును తన నవ్య విధానముద్వారా ఆర్థిక సంక్షోభమునుండి కాపాడిన దేశాధ్యక్షుడు; ద్వితీయ ప్రపంచ యుద్ధమున మిత్ర రాజ్యముల విజయమునకు కారకులగు అగ్రనాయకులలో ఒకడు; ఐ. రా. స. రూపుగొనుటకు కారణభూతులైనవారిలో ఒకడు. 7. సామ్యూల్ ఫిన్లీ బ్రీజ్ మోర్స్ (1791-1872): టెలిగ్రాఫ్‌ను కనిపెట్టిన వైజ్ఞానికుడు. 8. అలెగ్జాండర్ గ్రాహమ్ బెల్ (1847-1922): టెలిఫోనును కనిపెట్టిన వాడు. 9. థామస్ ఆల్వా ఎడిసన్ (1847-1931): వందలకొలది నూతన వైజ్ఞానిక పరికరములను కనుగొనినవాడు; వీనిలో విద్యుద్దీపము, గ్రామోఫోను, సినిమా కెమేరా, ప్రొజెక్టరు, ప్రముఖములు. 10. లి డి ఫారెస్ట్ (1873-1961): "రేడియో జనకుడు" అని పేరొందిన వైజ్ఞానికుడు; ఆడిషన్ వాక్యూమ్ మొదలగు పెక్కు పరికరములను కనుగొనెను. 11. రైటు సోదరులు (విల్బర్ రైట్ 1867-1912; ఆర్విల్లీ రైట్ 1871-1948): మొదటి విమానమును నడపినవారు; ఆ విమానమును వారే రూపొందించిరి. 12. ఆల్బెర్ట్ అబ్రహామ్ మైకెల్సన్ (1852-1931) కాంతి వేగమును లెక్కించినవాడు: ఈ దేశమున నోబెల్ బహుమతిని పొందిన బహుసంఖ్యాకులలో తొలుతటివాడు. ఈతనికి ఆ బహుమతి 1907 లో లభించెను. 13. ఆల్బర్ట్ ఐన్స్టీన్ (1879-1955): జన్మతః జర్మన్ దేశీయుడైనను, నాజీ బెడదనుండి తప్పించుకొనుటకై, ఈ దేశమున చేరి పౌరస్వత్వమును గ్రహించిన ప్రసిద్ధ వైజ్ఞానికుడు. సాపేక్ష సిద్ధాంతమును రూపొందించి విస్తృతీకరించి, నోబెల్ బహుమతిని 1921 లో పొందిన ప్రజ్ఞాశాలి.

**14. పాలిత ప్రాంతములు :** 1898 లో స్పెయిన్‌తో యుద్ధమున విజయమును ఈ దేశము సాధించిన ఫలితముగ ఫిలిప్పీన్స్, గ్వామ్, పోర్టోరికోలు ఈ దేశమునకు వశమైనవి. పనామా కాలువవంటి వానిని ఈ దేశము కొనుగోలు చేసినది. ఇవిగాక ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కొన్ని ధర్మకర్తృత్వరీతిలో ఈ దేశమునకు దక్కినవి. పైవానిలో ఫిలిప్పీన్స్‌దీవులు స్వతంత్రములైనవి (చూ పు. 361). ఇక తక్కినవానిలో పసిఫిక్ సాగర ప్రాంతమునఉన్న అమెరికన్ సామోవ్, కాన్టన్ - ఎండర్‌బరీ దీవులు, గ్వామ్, జాన్‌స్టన్‌దీవి, మిడ్‌వే దీవులు, యు స్టే. ధర్మకర్తృత్వ ప్రాంతముల వివరములు IV వ విభాగమున ఈయబడినవి. పశ్చిమార్ధ గోళమునఉన్న పాలిత ప్రాంతములు మాత్రము ఇట ఈయబడినవి.

i. కారన్ దీవులు : కరిబ్బియన్ సముద్రమున, నికరాగ్వాదేశ తీరమునకు 64 కిమీ. ల దూరమున, తూర్పుగ ఈ దీవు లున్నవి. వీనిలో గ్రేట్ కారన్ అను దీవి 12°9′ ఉ. అ; 83°4′ ప. తు. రేఖలపై ఉన్నది; దీనికి 16 కిమీ ల ఈశాన్యమున లిటిల్ కారన్‌దీవి ఉన్నది. రెండు దీవుల మొత్తపు వైశాల్యము 10 చ. కిమీ. జనసంఖ్య 1,572 (1960). 1916 లో నిగరాగ్వా చేత యు స్టే కు ఈ దీవులు కౌలుకు ఈయబడినవి.

ii. పనామా కాలువ ప్రాంతము : పనామా భూసంధియందు, పనామాదేశముద్వారా అట్లాంటిక్, పసిఫిక్ మహాసముద్రములను అనుసంధించుచు 60.43 కిమీ. ల పొడవున, త్రవ్వబడిన కాలువయు, దానికి ఇరుపైపుల ఉండు ప్రాంతమును పనామా కాలువ ప్రాంతము (పనామా కెనాల్ జోన్)అని అనబడుచున్నవి. ఇది రమారమిన 8°50′-9°25′ ఉ. అ. రేఖలకును 79°30′-80′ ప. తు. రేఖలకును మధ్యన ఇమిడి ఉన్నదని చెప్పవచ్చును. దీని వైశాల్యము 1,6763 చ. కిమీ. ఇందు జలమయ ప్రాంతము 702.91 చ. కిమీ.

ప్రాంతపు మొత్తపు జనసంఖ్య 50,344 (1970). ఇందు 39.084 మంది యు. స్టే. పౌరులు. తక్కిన వారిలో అధిక సంఖ్యాకులు పనామా పౌరులు; చీనీయులు అల్పసంఖ్యలో కలరు. మొత్తపు రోడ్లనిడివి 216 కిమీ. 76.8 కిమీ. ల నిడివిగల రైలుమార్గము కలదు. 10,000 టెలిఫోనులు, ఒక టెలివిజన్ స్టేషను కలవు.

పనామాభూసంధిద్వారా ఒక కాలువను త్రవ్వవలయునను సంకల్పము తొలుత ఫ్రెంచివారికి కలిగి 1897 నుండి 1899 వరకు వారాకృషిని సాగించి కొనసాగింపలేకపోయిరి. ఆ పరిస్థితిలో యు. స్టే. దేశము ఫ్రెంచివారి హక్కులను 4 కోట్ల డాలర్లకు కొనుగోలు చేసినది. కాని అప్పటిలో పనామాదేశముపై ఆధిపత్యమును వహించిన కొలంబియా ఈ కొనుగోలును ధ్రువీకరించుటకు నిరాకరించినది. అంతట పనామాదేశము స్వాతంత్ర్యమును పొందుటకు యు. స్టే. సాయముచేసి, స్వతంత్ర పనామాతో ఒక ఒడంబడికను నవంబరు 18, 1903 న కుదుర్చుకొని తద్వారా, అట్లాంటిక్, పసిఫిక్ సాగరములను కలుపు పనామా కాలువను నిర్మించి. దానిపై రాకపోకలను నిర్వహింపజేయుటకు అధికారమును పొందినది. అందులకు ప్రతిఫలముగ ఒకకోటి డాలర్లను అంతట చెల్లించుటయే గాక, సాలీనా 2,50,000 డాలర్లను పనామా దేశపు ప్రభుత్వమునకు చెల్లించుటకు యు. స్టే. అంగీకరించినది. ఈ వార్షికపు మొత్తపు ప్రమాణము అంతటంతట మార్పుచెందె. 1955 మొదలుగ అది 19.3 లక్షల డాలర్లుగా ఉండునటులను, పనామాదేశపు అధికారమును కాలువప్రాంతమున యు. స్టే. లాంఛన ప్రాయముగ గుర్తించునటులను అంగీకారము కుదిరినది. 1962 లో ఆ కాలువ యొక్క పసిఫిక్ ముఖద్వారముపైన నిర్మితమైన వంతెనపై యు. స్టే. దేశపు జెండాతో పాటుగ పనామాదేశపు జెండాయు ప్రతిష్ఠితమైనది. కాని ఈ కాలువను తమకు వదలి వేయవలసినదిగ పనామా ప్రభుత్వము ప్రస్తుతమున వాదించుచున్నది.

కాలువప్రాంతమున సాధారణ పరిపాలనకై ఒక ప్రభుత్వమును, కాలువను నిర్వహించుటకై ఒక కంపెనీయు పనిచేయుచున్నవి. ఈ రెండింటి పైనను యు. స్టే. ప్రభుత్వము పర్యవేక్షణాధికారమును కలిగియున్నది.

ఇచటి ఆర్థికవ్యవస్థ అంతయు కాలువలోని రాకపోకల వ్యవహారములపై ఆధారపడియున్నది. ఆ రాకపోకలను ఆశ్రయించి కొన్ని వ్యాపార సంస్థలును పనిచేయుచున్నవి. చీనీయులు అటనట

కొంచెంగ కూరగాయలను పండించుచున్నను మొత్తము మీద ఆహారపదార్థములకై ఇచటివారు దిగుమతుల పైననే ఆధారపడవలసి ఉన్నది. 1972 లో కాలువలో పయనించిన 13 766 ఓడలవలన సుంకపురూపమున 9,87,64,959 డాలర్ల ఆదాయములభించినది

ఆంగ్లమునను స్పానిష్‌నను విద్యను బోధించు పాఠశాలలు కలవు. 4 ఆసుపత్రులు పనిచేయుచున్నవి.

iii. **పోర్టోరికో** : వెస్ట్ ఇండీస్ దీవులలో తూర్పు కొనన ఉన్న ఈ ద్వీపము 17°55'-18°3' ఉ. అ. రేఖలకును, 65°35'-67°17' ప. తు. రేఖలకును నడుమ ఉన్నది. దీని వైశాల్యము 8,891 చ. కిమీ. ద్వీపమున పర్వతశ్రేణులు ఎక్కువగ కలవు; వీనిలో కార్డిలేరా సెంట్రల్ అను శిఖరము అత్యున్నతము (341 మీ.) సరాసరి ఉష్ణోగ్రత 75.4 నుండి 81° వరకు మారుచుండును. వర్షపాతము సాలీనా 88 సెం. మీ నుండి 154 సెం. మీ వరకు మారును. ఉష్ణప్రాంతపు పండ్లును, కూరగాయలును విరివిగ పండును.

దేశపు జనసంఖ్య 27,16,000 (1970). దేశీయులలో అధిక సంఖ్యాకుల మాతృభాష స్పానిష్; కాని ఆంగ్లముతో కూడ పలువురికి పరిచితి కలదు. దేశపు ముఖ్యనగరమగు సాన్ జువాన్ లోని జనసంఖ్య 4,55,421. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 307. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు నీగ్రోలతో శ్వేతజాతులు సంకరమొందగ రూపొందిన మిశ్రసంతతికి చెందినవారు. సాధికార భాష స్పానిష్; ఆంగ్లముకూడ రెండవ భాషగ పైతరగతులందు బోధింపబడుచున్నది. ప్రజలందరు క్రైస్తవులు; అందు రోమన్‌కేతలిక్ సంప్రదాయమునకు అత్యధిక వ్యాప్తి కలదు.

దేశపు రోడ్లనిడివి 57[illegible]0 కిమీ. 1[illegible] కిమీ. ల నిడివిగల రైలుమార్గము కలదు; ఇది చెరకును మిల్లులకు చేర్చుటకు మాత్రమే వినియుక్తము. ప్రజల ప్రయాణమునకు, వస్తువుల తరలింపుకు మోటారుబండ్లే ముఖ్యాధారములు. సాన్‌జువాన్, పోన్స్, మాయాగ్వెజ్ అనునవియు, పోర్టోరికోకే చెందిన సమీపముననే ఉన్న కులెబ్రా దీవియు చక్కని సముద్రపురేవులు. సాన్ జువన్‌లో వ్యాపారరీత్యా ప్రాముఖ్యముగల విమానాశ్రయము కలదు. ఇటనుండి న్యూయార్క్‌నకు, మియామీకి, కరిబ్బియన్ ప్రాంతపు ప్రముఖ కేంద్రములకు విమానయాన వసతికలదు. దేశమున [illegible]3 బ్రాడ్‌కాస్టింగు స్టేషనులు. 11 టెలివిజన్ స్థావరములు కలవు.

1493 లో కొలంబస్ ఈ దీవిని కనుగొనెను. అంతట స్పెయిన్‌వారు ఇట వలసచేరి, అప్పటికే అచట వసించుచుండిన బోరిన్ క్వినోల్ అను ఆదిమ జాతిని అంతమొందించిరి. 1513 లో, వ్యవసాయపు పనులకై నీగ్రో బానిసలను కొనితెచ్చుటకు స్పెయిన్ వారు మొదలిడిరి. 1898 లో యు.స్టే.తో స్పెయిన్ సాగించిన యుద్ధపు ఫలితముగ, ఈ ద్వీపరాజ్యము యు. స్టే. కు, సంధి ఒడంబడిక మూలమున లభించి తదాదిగ యు. స్టే. పాలనలో ఉన్నది. 1900 వరకు యు. స్టే. ప్రభుత్వము నియమించిన సైనికాధికారి పాలనలోనే ఈ దీవి ఉండినది. తదనంతరము న ప్రజలకు సోపానసరళిలో హక్కులు లభించి కడకు 1953 లో, ఈ దేశము యు.స్టే. తో స్వచ్ఛందముగ కలసియుండు ఒక స్వతంత్రరాజ్యముగ, రూపొంది కామన్‌వెల్త్ హోదాతో వ్యవహరించుచున్నది.

యు. స్టే. ప్రభుత్వము ఇప్పటికిని దేశరక్షణ. వైదేశిక వ్యవహారములు, రేవు సుంకములు, పోస్ట్ సౌకర్యములు - అనువానిలో అధికారము కలిగి

యున్నను, తక్కిన రంగములందు పరిపాలన, ప్రజాప్రతినిధులచేత నిర్వహింపబడుచున్నది. ముఖ్య కార్యనిర్వహణాధికారి గవర్నరు. ఇతనిని 4 ఏండ్ల కొకసారి ప్రజలు ఎన్నుకొనెదరు. 38 మంది సభ్యులుగల శాసనసభయు, 62 మంది సభ్యులుగల శిష్టసభయు శాసన నిర్మాణాధికార మును కలిగియున్నవి. వీనిలోని సభ్యులును 4 ఏండ్లకొకతూరి ప్రజలచే ఎన్నుకొనబడెదరు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున, వివిధ న్యాయస్థాన ముల ద్వారా న్యాయనిర్వహణ సాగుచున్నది. రెండు ప్రముఖ రాజకీయ పక్షములు కలవు; వీనిలో న్యూప్రోగ్రెసివ్ పార్టీ అనునది ఈ దేశము, యు. స్టే. లో ఒక రాష్ట్రముగ చేరవలెనని వాంఛించు చున్నది. ఇండిపెండెన్స్ పార్టీ, పరిపూర్ణ దేశ స్వాతంత్ర్యమును కోరుచున్నది.

1947 వరకు ఈ దేశపు ఆర్థికవ్యవస్థ యంతయును చక్కెర ఎగుమతి పైననే ఆధారపడి ఉండినది; కాని అది మొదలుగ వస్తు నిర్మాణ పరిశ్రమలును దేశమున ప్రోత్సహింపబడినవి; యాంత్రిక పరిశ్రమయు పెంపొందింపబడినది. అందు వలన చక్కెర ఎగుమతివలన ఆదాయము, ఆర్థికపు వనరులలో, మూడవస్థానమునకు వచ్చినది. ఇవి గాక యు. స్టే. లో పనిచేయు ఈ దేశవాసులు ఇండ్లకు పంపు మొత్తములును దేశపు సంపత్తికి సహకరించుచున్నవి. దేశపు ఎగుమతుల మొత్తము 1,79,68,46,000 డాలర్లు; దిగుమతుల విలువ 2,87,91,29,000 డాలర్లు (190-71). ఇందు అధికవ్యాపారము యు. స్టే. తో నడచుచున్నది. బ్యాంకింగు వ్యవస్థయు, యు. స్టే. లోని దానితో ముడివడి ఉన్నది.

దేశమున నిరక్షరాస్యత 12.8% (1968). విద్యావ్యాప్తిని ఎక్కువచేయుటకై ప్రభుత్వము కృషి చేయుచున్నది; మొత్తపు పాఠశాలలోని విద్యార్థుల సంఖ్య 6,87,877 (1970-71). ముఖ్యనగరమునకు సమీపమున రియోపీడ్రాస్‌వద్ద, పోర్టోరికో విశ్వవిద్యాలయము ఉన్నది; ఇదిగాక వేరుగ రెండు విశ్వవిద్యాలయములును, మరికొన్ని కళాశాలలును కలవు. ఈ ఉన్నత విద్యను అభ్య సించెడివారి సంఖ్య64,581 (1970-71) దేశమున నాలుగు దినపత్రికలు ప్రచారమున ఉన్నవి ప్రజా రోగ్యమునకై ప్రభుత్వము చాలధనమును వినియో గించుచున్నది 125 పెద్ద ఆసుపత్రులు, తక్కు- విధముల 10 ఆసుపత్రులును కలవు; వైద్యసంఖ్య 2,313 (1969). 1967-68 లో 9,30,000మంది విదేశీయ యాత్రికులు దేశమును సందర్శించిరి; వీరివలన దేశమునకు 20.2 కోట్ల డాలర్లు ఆదా యము లభించినది.

**iv. వర్జిన్ దీవులు** (యు. స్టే.) : పోర్టోరికోకు తూర్పున 64 కిమీ. ల దూరమున ఉన్న 68 దీవులు చేరిన ఒక రాజ్యము. ఈ దీవు లలో మూడు మాత్రమే వైశాల్యా రీత్యా ప్రముఖ ములు; తక్కినవి చిన్నలంకలు. ఆ మూడు ద్వీప ముల — (సెయింట్‌క్రాయ్ (212 38 చ కిమీ). సెయింట్ జాన్ (49.21 చ. కిమీ), సెయింట్ తామస్ (82.88 చ. కిమీ) - లో మాత్రమే అత్యధిక జనావాసములు కలవు. కొన్ని చిన్నలంకలలో జనులే లేరు. మొత్తపు రాజ్యవైశాల్యము 350 చ. కిమీ. దేశపు ముఖ్యనగరమగు షార్లెట్టీ అమాలీ, తామస్ దీవియందు ఉన్నది. ఉష్ణోగ్రత 75°-84° పా. గ ఉండును, వర్షము వలన మాత్రమే త్రాగు నీరు లభించుచున్నది. అనావృష్టి బాధ తరచుగ ఉండును.

రాజ్యపు మొత్తపు జనసంఖ్య 63,200 (1970). జనసాంద్రత చ. కిమీ. కు 94. ముఖ్యనగరపు జనసంఖ్య 12,740 (1960). ప్రజలలో దాదాపు మూడవవంతు నీగ్రోలు; 5,373 మంది శ్వేతజాతీ యులు; తక్కినవారు సమ్మిశ్రజాతికి చెందినవారు. ఆంగ్లము సాధికార భాష; ప్రజలందరు క్రైస్తవులు.

రాజ్యపు రోడ్లనిడివి 506 కిమీ. మూడు ప్రముఖ ద్వీపముల మధ్య విమాన తపాలాయు, విమాన ప్రయాణ వసతులును కలవు. కేబుల్ ద్వారా పోర్టో రికో, యు. స్టే. లతో సంబంధము కలదు. రేడియో టెలిగ్రాఫ్ద్వారా ప్రపంచపు పలుప్రాంతములతో వార్తాసౌకర్యము ఉన్నది. 3 రేడియో స్టేషనులు, 2 టెలివిజన్ స్టేషనులు కలవు.

1493 లో కొలంబస్ వర్జిన్ ద్వీపసముదాయమును కనుగొనెను. తరువాత కొన్ని చారిత్రక పరిణామములవలన ఇందు కొన్ని బ్రిటిష్వారికి దక్కినవి (చూ : లీవర్డు దీవులు) మిగిలినవి డేనులకు (డెన్మార్క్ దేశీయులకు) లభించి డేనిష్ వెస్టిండీస్ అను పేర వ్యవహృతము లయినవి. డేనులనుండి యు. స్టే. ప్రభుత్వము వీనిని 1917 లో 2.5 కోట్ల డాలర్లకు కొనుగోలుచేసి, వర్జినియా దీవులు (యు స్టే.) అను పేరిడి, తన పరిపాలనలోనికి తీసికొనినది. యుద్ధతంత్ర రీత్యా వీనికిగల ప్రాముఖ్యమువలన తొలుత వీనిని యు. స్టే. ప్రభుత్వము తన నౌకాసేనయొక్క పాలనలో ఉంచినది. 1927 లో ఇచటి ప్రజలకు యు. స్టే. పౌరస్వత్వమును కల్పించినది. 1931 లో నౌకాశాఖనుండి తప్పించి యు. స్టే. ప్రభుత్వము తన దేశీయశాఖకు ఈ రాజ్యపు పరిపాలనను వశపరచినది. 1936 నుండి పరిమితమగు ఆంతరంగిక స్వపరిపాలనను ఈ దేశీయులు అనుభవించుచున్నారు.

దేశపు ముఖ్య కార్యనిర్వహణాధికారి గవర్నరు. 1970 నుండి ఇతనిని ప్రజలే ఎన్నుకొనుచున్నారు. తత్పూర్వమున యు. స్టే. ప్రభుత్వము అతనిని నియమించెడిది. 15 మంది ఎన్నుకొనబడిన సభ్యులుగల శాసనసభ కలదు; ఈ శాసనసభ చేయు శాసనములను వీటోచేయు అధికారము గవర్నరుకు ఉన్నది. ఆంతరంగికములుకాని తక్కిన అన్ని విషయములందును యు. స్టే. శాసనములే ఇట వర్తించును. యు. స్టే. లోని ఫెడరల్ న్యాయశాఖయొక్క ఆధిపత్యమున ఇట కోర్టులు పనిచేయుచున్నవి.

వ్యవసాయమును, యాత్రిక పరిశ్రమయు దేశ సంపదకు మూలాధారములు. దాదాపుగ వ్యవసాయమునకున్న భూమి అంతయు ఇదివరలో చెరకు సాగుననే ఉండెడిది; కాని ప్రస్తుతమున ఆహారధాన్యముల సాగుబడియు ప్రోత్సహింపబడుచున్నది. కొన్ని చిన్న పరిశ్రమలు కలవు. అందు సారాయి ముఖ్యోత్పత్తి. సముద్రపు నీటిని మంచినీటిగ చేయు యంత్రాలయములు నాలుగు ఉన్నవి; వీని వలననే విద్యుదుత్పత్తియు జరుగుచున్నది. సెయింట్ జాన్ దీవిలో సగభాగము 'జాతీయ వనముగ' ప్రత్యేకింపబడి, ప్రకృతిరామణీయకతకు పేరొందినది. ఇట్టివానిని దర్శించుటకు యాత్రికులు పలువురు వచ్చుచుందురు. ఇట్టివారు పయనించు విలాస నౌకలకు తగు వసతులు సె. తామస్ దీవిలో కలవు. 1968-69 లో 11,07,000 మంది విదేశీయులు ఈ రాజ్యమున పర్యటించిరి. ఎగుమతుల విలువ 15,37,82,838 డా. దిగుమతుల విలువ 26,01,60,366 డాలర్లు (1968). బడ్జెటరీ వ్యయము 5,95,76,266 డా. (1969); ఇందు దాదాపు సగభాగము యు. స్టే. ప్రభుత్వపు గ్రాంటుల వలన లభించుచున్నది.

$5\frac{1}{2}$ మొదలుగ 16 ఏండ్ల వయసు కలవారికి నిర్బంధ విద్యావిధానము అమలున ఉన్నది. పాఠశాలలలో విద్యార్థిసంఖ్య 10,594 (1966-67); ఒక కాలేజి కలదు. అందలి విద్యార్థి సంఖ్య 1,400 (1969). ప్రభుత్వము నిర్వహించెడు మూడు పెద్ద ఆసుపత్రులు కలవు.

v. **స్వాన్ దీవులు** : 17°73′ ఉ. అ; 83′56′ ప. తు. రేఖలపై ఉన్న రెండు సున్నపురాతి

లంకలు. వీనిలో బిగ్‌స్వాన్ దీవి 3.2 కిమీ. ల పొడవు 0.8 కిమీ. వెడల్పు కలిగినది. లిటిల్ స్వాన్ దీవి 1.6 కిమీ. పొడవు, 0.8 కిమీ. వెడల్పు కలది. ఈ దీవులందు గ్వానోయను ఎరువు దిబ్బలు విరివిగ కలవు; ఇవి యు. స్టే. కు కొంతకాలము ఉపకరించినవి. ప్రస్తుతమున ఈ దీవులందు ఒక రేడియోస్టేషను, ఒక దీపగృహము కలవు బిగ్ స్వాన్‌లోని జనసంఖ్య 34 (1960); లిటిల్ స్వాన్‌లో జనావాసములే లేవు. 16 వ శతాబ్దిలో కనుగొనబడిన ఈ దీవులు 1863 నుండి యు. స్టే. వశమున ఉన్నవి. ఈ దీవులు తనకు న్యాయతః చెందునని హొండూరాస్ దేశము వాదించుచున్నది.

---

# 22. లీవర్డు దీవులు

## (బ్రిటిష్ పాలిత ద్వీపరాజ్యములు)

కరిబ్బియన్ సముద్రమున పోర్టోరికో ద్వీపమునకు ఆగ్నేయదిశన మొదలిడి అటనుండి దక్షిణముగ వ్యాపించియున్న ద్వీపముల శ్రేణి లీవర్డ్ దీవులు అని వ్యవహృతమగుచున్నది. వీనికి దక్షిణమున విండ్‌వర్డ్ ద్వీపముల శ్రేణి వ్యాపించి ఉన్నది. ఈ లీవర్డ్ శ్రేణియందు 1. ఆంటిగ్వా ద్వీపము (రెడోండా మొదలగు లంకలతోసహా), 2. సె. కిట్స్ (క్రిస్టఫర్) నెవిస్ - ఆంగ్విల్లా ద్వీపములు, 3 మాంట్ సెర్రాట్ 4. బ్రిటిష్ వర్జిన్ దీవులు అను ప్రత్యేక ద్వీపరాజ్యములు చేరి ఉన్నవి.

ఈ ద్వీపములను 1493 లో కొలంబస్ కనుగొనెను; కాని 17 వ శతాబ్దివరకు యూరపీయులు ఎవరును అట వలసలను స్థాపింపలేదు. తరువాత 1623 మొదలుగ ఇంగ్లీషువారును, ఐరిష్‌వారును ఈ దీవులలోచేరి, అచటి ఆదిమవాసులను నిర్మూలించిరి. అంతట పనిపాటులకై నీగ్రోబానిసలను కొందరిని ఇటకు వారే చేర్చిరి. ఈ నీగ్రోసంతతియే ఈ ద్వీపములందు ఇపుడు ఎక్కువగ కననగును. 1833 లో బానిసత్వము రద్దయిన తరువాత, ఇచటి ప్రజలకు వోటుహక్కు మొదలగునవి కొంతవరకు కలిగినవి; అయినను పాలనాధికార బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వపు చేతిలోనే ఉండెను. 1956 న ఈ ద్వీపములు లీవర్డు దీవులు అనుపేర ఒక ప్రత్యేక పాలనామండలముగ ఏర్పడి, 1958 లో ఆ ప్రాంతము వెస్ట్ ఇండీస్ ఫెడరేషన్‌లో అంతర్భాగమయినది. కాని 1962 లో ఈ ఫెడరేషను రద్దయినది. అంతకు ముందుగనే (1960), ఈ వివిధ ద్వీపరాజ్యములకు వేర్వేరు రాజ్యాంగ విధానములు ఏర్పడి వానికి ఆంతరంగిక స్వపరిపాలనా ప్రతిపత్తులు కలిగినవి. బ్రిటిష్ ప్రభుత్వమే వైదేశిక, సైనిక వ్యవహారములందు బాధ్యతలను కలిగియున్నది.

అయినను ఫెడరేషన్‌లో అంతవరకు ఉండిన జమైకా, ట్రినిడాడ్ మొదలగు వానితో కలసి, ఇప్పటికిని ఈ రాజ్యములకు సమష్టిగ ఈ దిగువ సంస్థలు కలవు. (i) జమైకాలోని మోనావద్దనున్న విశ్వవిద్యాలయము, బార్బడోస్‌లోని విశ్వవిద్యాలయము (ii) బ్రిటిష్ కరిబ్బియన్ కోర్ట్ అనుపేర ఒక అత్యున్నత న్యాయస్థానము, (iii) కరిబ్బియన్ స్వేచ్ఛా వాణిజ్యమండలము, (iv) వెస్ట్ ఇండీస్ షిప్పింగ్ కార్పొరేషన్ అను సమష్టి నౌకాప్రయాణ సంస్థ, (v) ఈస్ట్ కరిబ్బియన్ కరెన్సీ అను సామా

న్యపు ద్రవ్యప్రమాణము. ఇందు ఒక డాలరు = రు. 3.50; బ్రిటిష్ వర్జిన్ దీవులలో మాత్రము యు. స్టే. డాలరు చలామణిలో ఉన్నది.

ఈ దీవులలో ఆంటిగ్వా, సె. కిట్స్‌లలో చక్కెరయు, తదనుబంధపు ఉత్పత్తులును; ఆంటిగ్వా, మాంట్ సెర్రాట్, సె. కిట్స్ - నెవిస్‌లలో ప్రత్తియు; మాంట్ సెర్రాట్‌లో నిమ్మ, తదితర ఫలములు. కూరగాయలును; ఆంగ్విల్లా, సె. కిట్స్‌లో ఉప్పును; బ్రిటిష్ వర్జిన్ దీవులలో పశువులు, చేపలు, కూరగాయలు, పండ్లు, కర్రబొగ్గులును ప్రముఖోత్పత్తులుగ గణనీయములు.

ఈ ద్వీపముల భూతల పరిస్థితియందు చాల వైవిధ్యము కలదు. సె. కిట్స్ ఒకపుడు అగ్ని పర్వతముగ ఉండి చల్లారినదని తెలియుచున్నది. దీనియందును, మాంట్ సెర్రాట్‌లోను 915 మీ. పైబడిన ఎత్తుగల ప్రదేశములు కలవు. ఆంటిగ్వా దీవి ఎగుడు దిగుడుల నేల. ఈ ద్వీపములలో దేనియందును అనువైన నౌకాశ్రయము కన్పట్టదు. ఉష్ణమండలపు శీతోష్ణస్థితి ఎల్లెడల కననగును. సాలున సరాసరి ఉష్ణోగ్రత 75° ఫా. ఎండకాలము శీతకాలముల మధ్య ఉష్ణోగ్రతయందు భేదము తక్కువ; గాలిలో చెమ్మదనము ఎక్కువ. అయినను భూమి ఎత్తునుబట్టి ఉష్ణతయు, వర్షపాతమును మారుచున్నవి. అంటిగ్వాయందు అంతటంతట అనావృష్టిబాధ కలదు.

ఇక ఆయా ద్వీపరాజ్యముల వైశాల్యాదులును తక్కిన వివరములును ఈ దిగువన వరుసగ ఈయబడినవి.

**1. అంటిగ్వా :** అంటిగ్వా దీవియొక్క వైశాల్యము 280 చ. కిమీ; బర్బుడా (160 చ కిమీ) రెండోండా (2.59 చ. కిమీ) అను ద్వీపములును రాజ్యాంగరీత్యా ఇందుచేరి ఉన్నవి. జనసంఖ్య 62,000 (1968). ముఖ్యనగరమగు సెయింట్ జాన్‌లోని జనసంఖ్య 13,000; సాధికార భాష ఆంగ్లము; ప్రజలందరు క్రైస్తవులు.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించెడు పరిపాలకుడు, 10 మంది ఎన్నుకొనబడిన సభ్యులుకల శాసనసభాసాహాయ్యమున పాలనను నిర్వహించును. అయిదేండ్లకు ఒకసారి సాధారణముగ ఎన్నికలు జరుగును. బడ్జెటరీ వ్యయము 3.095 కోట్ల డాలర్లు (1972). ఎగుమతుల విలువ 57.8 లక్షల డా; దిగుమతుల విలువ 382.5 లక్షల డా; (1968); చక్కెర, ప్రత్తి, ముఖ్యపు ఎగుమతులు. దేశమును దర్శించు విదేశీయ యాత్రికుల వలన విశేషాదాయము లభించుచున్నది. 1970 లో ఇట్టి వారి సంఖ్య 89,911. పాఠశాలల సంఖ్య 56; విద్యార్థిసంఖ్య 22,000 (1971).

**2. సెయింట్ కిట్స్-నెవిస్-ఆంగ్విల్లా :** ఈ ద్వీపరాజ్యపు మొత్తపు వైశాల్యము 396 చ. కిమీ. (ఇందు సె. కిట్స్—235 చ. కిమీ. నెవిస్–130 చ. కిమీ; ఆంగ్విల్లా-23 చ. కిమీ; సోంబ్రెరో అను అల్పద్వీపము—7 చ. కిమీ). సెయింట్ కిట్స్‌కే సెయింట్ క్రిస్టఫర్ అనియు పేరు కలదు. మొత్తపు జనసంఖ్య 57,617 (1968). సెయింట్ కిట్స్‌లో బస్సే టెర్రే (జ. సం. 15,897), నెవిస్‌లో చార్లెస్‌టౌన్ (జ. సం. 1,530) ప్రముఖ నగరములు. భాష ఆంగ్లము; ప్రజలందరు క్రైస్తవులు.

దేశమునకు ఆంతరంగిక స్వపరిపాలన కలదు. బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, 10 మంది ఎన్నుకొనబడిన శాసనసభ్యులుకల శాసనసభా సాహాయ్యమున పాలనను నిర్వహించును. ఎన్నికలు సాధారణముగ 5 ఏండ్లకు ఒకసారి జరుగును. చక్కెర, చెరకు పిప్పి, ప్రత్తి, ఉప్పు ముఖ్యపు ఎగుమతులు. ఎగుమతుల మొత్తపు విలువ 86,14,875 డా; దిగుమతుల విలువ 1,58,17,508 డా. (1966). బడ్జెటరీ వ్యయము

80,23,284 డా. (1966). మొత్తపు పాఠశాలల సంఖ్య 51; విద్యార్థి సంఖ్య 18,952 (1966).

**3. మాంట్‌సెర్రాట్ :** ఈ దేశపు వైశాల్యము 101 చ. కిమీ. జనసంఖ్య 11,458; ముఖ్య నగరమగు ప్లిమత్‌లోని జనసంఖ్య 1,230 (1970). భాష ఆంగ్లము; జనులందరు క్రైస్తవులు.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, ఎన్నుకొనబడిన సభ్యులు ఏడుగురును, గవర్నరు నియమించు సభ్యుడు ఒకడును, ఇరువురు అధికార సభ్యులును కలిగిన శాసనసభా సాహాయ్యమున పాలనను నిర్వహించును. ఎన్నికలు అయిదేండ్ల కొకసారి జరుగును. కాయగూరలు, పండ్లు, ప్రత్తి, టైరులు ముఖ్యపు ఎగుమతులు. ఎగుమతుల మొత్తపు విలువ 1,00,371 డా. దిగుమతుల విలువ 85,57,642 డా. (1971). బడ్జెటరీ వ్యయము 50,11,324 డా. (1971). విదేశీయ యాత్రికుల వలన విశేషాదాయము దేశమునకు లభించుచున్నది; 1971 లో అట్టి యాత్రికుల సంఖ్య 9,073. మొత్తపు పాఠశాలల సంఖ్య 18; విద్యార్థి సంఖ్య 2,916.

**4. బ్రిటిష్ వర్జిన్ దీవులు :** ఇవి వర్జిన్ ద్వీప సమూహమున ఒక ప్రత్యేక వర్గము. ఇందలి వేరొక వర్గము యు. స్టే. అధీనమున ఉండుటవలన, వీని ప్రత్యేకతను సూచించుటకై ఇవి బ్రిటిన్‌వర్జిన్ దీవులు అనుపేర పిలుబడుచున్నవి (చూ. వర్జిన్ దీవులు, యు. స్టే.; పు. 590).

ఈ బ్రిటిష్ వర్జిన్ దీవులందు 36 వివిధ ప్రమాణముల చిన్న ద్వీపములు చేరి ఉన్నవి; ఇందులో 16 లో మాత్రమే జనావాసములు కలవు. (ఈ 36 గాక, ఇంకను అప్రధానములగు చిన్న లంకలును ఉన్నవి). దీవులలో తోర్తోలా, వర్జిన్ గోర్డా, అనెగాడా, జోస్ట్‌వాన్ డైక్ అనునవి ప్రముఖములు. ద్వీపరాజ్యపు మొత్తపు వైశాల్యము 130 చ. కిమీ. జనసంఖ్య 9,000 (1968). తోర్తోలా దీవిలోని రోడ్‌టౌన్ (జ. సం. 2,000) ముఖ్యనగరము.

దేశమున 24 కిమీ. ల పొడవుగల రోడ్లుకలవు; విమానములు దిగగలుగు చిన్నవసతులును కలవు. బ్రిటిష్‌ప్రభుత్వము నియమించు గవర్నరు, ఎన్నుకొనబడిన సభ్యులు ఏడుగురును, ముప్వురు నియమింపబడిన సభ్యులును కలిగిన, శాసనసభా సాహాయ్యమున పాలనను నిర్వర్తించును. ఈ రాజ్యపు ఆర్థికవ్యవస్థ వర్జిన్‌దీవులు (యు. స్టే.) తో ముడివడి ఉన్నది. వర్షపాతము తక్కువగుట వలన వ్యవసాయము లాభదాయకముగలేదు. పశుపోషణ, చేపల పరిశ్రమ, కర్రబొగ్గు తయారీ, కూరగాయల పండించుట ఇచటి ప్రజలలో పలువుర ముఖ్యవృత్తులు. సారా తయారీ,చిన్నపడవల నిర్మాణము మొదలగు లఘు పరిశ్రమలును కలవు. దేశీయులు పలువురు విదేశములలో పనిచేసి పంపెడు ధనము దేశమునకు సాయపడుచున్నది. మొత్తపు ఎగుమతుల విలువ 42.608 యు. స్టే. డాలర్లు; దిగుమతుల విలువ 1,02,23,574 యు. స్టే. డాలర్లు (1971). బ్రిటిష్ ప్రభుత్వము ఇచ్చు ధన సాహాయ్యము, యాత్రికుల వలన వచ్చు ఆదాయము చెల్లింపుల సర్దుబాటునకు ఉపకరించుచున్నవి. బడ్జెటరీ వ్యయము 79,84.895 డాలర్లు (1971). ప్రాథమిక పాఠశాలల సంఖ్య 17; విద్యార్థిసంఖ్య 1,913. సెకండరీ పాఠశాల 1; విద్యార్థిసంఖ్య 745 (1970). 39 శయ్యలు కలిగిన ఒక అసుపత్రి కలదు; వైద్యసంఖ్య 5 (1967).

---

# 23. విండ్‌వర్డు దీవులు

## (బ్రిటిష్ పాలిత ద్వీపరాజ్యములు)

పోర్టో రికోకు ఆగ్నేయమున, లీవర్డు దీవులకు దక్షిణమున వరుసదీరియున్న నాలుగు ద్వీపరాజ్యములు సమష్టిగ విండ్‌వర్డు దీవులు అని వ్యవహృతములు. ట్రినిడాడ్ అండ్ టొబాగో ద్వీపరాజ్యమునకు ఉత్తరమున ఈ ద్వీపశ్రేణి ఉన్నది. గ్రెనడా, సెయింట్ విన్‌సెంట్, గ్రెనడైన్, సెయింట్ లూసియా, డొమినికా అను ఈ ద్వీపరాజ్యములలో గ్రెనడైన్‌లో సగము గ్రెనడాకును, తక్కిన సగము సెయింట్ విన్‌సెంట్‌కును పరిపాలనరీత్యా చెందియుండుట వలన, అవి మొత్తము నాలుగు రాజ్యములుగనే లెక్కకు వచ్చుచున్నవి.

ఈ ద్వీపరాజ్యముల భూతలరీతిలో వైవిధ్యము కన్పట్టుచున్నను, మొత్తముమీద అవి అన్నియును అగ్నిశైలీయములు. డొమినికా దీవియందలి డయాబ్లోటిన్ పర్వతశిఖరము అన్నింట అత్యున్నతము (1483 మీ). నదులు చాల చిన్నవై, అతిద్రుత గమనము కలిగి, చాల కాలము నీరు లేకుండ ఉండును. ఉష్ణమండలపు శీతోష్ణస్థితి ఇట కననగును; సాలున సరాసరి ఉష్ణోగ్రత 75° ఫా. జూన్‌నుండి అక్టోబరు వరకు విరివిగ వర్షములు కురియును; కొన్ని ప్రదేశములందు సాలీనా వర్షపాతము 750 సెం. మీ. వరకు ఉండును. గాలిలో చెమ్మదనము ఎక్కువ. గ్రీష్మ-శీతకాలముల మధ్య ఉష్ణోగ్రతల భేదము చాల తక్కువ. సస్తనజాతులు కొలదిగ కన్పట్టును; సరీసృపములు పక్షిజాతులును విరివిగ కలవు. సె. లూసియాకు ముఖ్యనగరమగు కాస్ట్రీస్‌లోని బ్రాడ్‌కాస్టింగ్ స్టేషను ఈ రాజ్యములకు అన్నింటికి ఉపకరించుచున్నది. గ్రెనడా నుండి వెలువడు దినపత్రిక ఒకటి మాత్రమే ప్రచారమున ఉన్నది. ఈ రాజ్యములందలి ప్రజలలో నీగ్రో, శ్వేత, ఆదిమ అమెరికన్ (కరిబ్) జాతులు సమ్మిశ్రితము చెందినవి. ప్రజలందరును క్రైస్తవులు; ఆంగ్లభాష ప్రజల మాతృభాష.

కొలంబస్ 1498 లోనే ఈ దీవులను కనుగొనినను యూరపీయులు ఎవరును ఇచట తొలుత వలస చేరకుండిరి. 17 వ శతాబ్దిలో బ్రిటిష్‌వారును, ఫ్రెంచివారును అటచేరి, ఆ రాజ్యములపై హక్కు కొరకు పోరాటములను సాగించిరి. వీరిరువురిని, అచటి ఆదిమవాసులగు కరిబ్ ప్రజలు ప్రతిఘటించగా, ఆ ఆదిమవాసులలో పలువురను, హొండూరాస్ దేశపు గహన భూములకును, ఇతర విదేశములకును శ్వేతజాతులవారు తరలించిరి. తక్కిన కరిబ్ ప్రజలు అచటి శ్వేతజాతులతోను, శ్వేతజాతులు పనిపాటులకై కొనివచ్చిన నీగ్రోలతోను సంకరత చెందిరి. 1814 నాటికి ఈ ద్వీపరాజ్యములందు ఫ్రెంచివారి అధికారము అంతరించి, రాజ్యములు అన్నియు బ్రిటిష్‌వారి వశమైనవి. ఇచటి పనిపాటులకై నీగ్రోలేకాక- భారతీయులును పోర్చుగీజు వారును అల్పసంఖ్యలలో ఇటకు కొనిరాబడిరి. పరిపాలనారీత్యా ఇందలి సెయింట్ లూసియా బార్బడోస్‌తోను, డొమినికా లీవర్డు దీవులతోను కొంతకాలము కలసి యుండినవి. 1956 లో ఈ నాలుగు రాజ్యములును విండ్‌వర్డు ద్వీపరాజ్యముగ రూపొందింపబడి, 1958 లో ఆ రాజ్యము వెస్టిండీస్ సమాఖ్యలో అంతర్భాగము అయినది. 1960 లో ఈ ద్వీపరాజ్యములలో ప్రతి యొకదానికి ఒక రాజ్యాంగ విధానము రూపొందింపబడి ఆంతరంగిక స్వపరిపాలనాధికారము ఈయబడినది. తక్కిన విదేశవ్యవహార, రక్షణశాఖలు బ్రిటిష్ ప్రభుత్వపు వశముననే ఉన్నవి. 1962 లో

వెస్ట్ ఇండీస్ ఫెడరేషన్ రద్దయినది. వెస్ట్ఇండీస్ ఫెడరేషన్ రద్దయినను, అందలి జమైకా మొదలగు వానితో, లేవర్డ్ దీవులవలెనే (చూ: పు.592)విద్యా, న్యాయస్థాన, నౌకాయాన, స్వేచ్ఛా వ్యాపారము లందును, నాణెపు చలామణీలోను కొన్ని సమష్టి ఏర్పాటులను ఈ దేశములు కలిగియున్నవి. వీని యందును ఈస్ట్ కరిబ్బియన్ డాలర్ చలామణి అగుచున్నది.

పై ద్వీపరాజ్యములలో ఒక్కొక్క దానికి సంబంధించిన వైశాల్య, జనసంఖ్యాదులగు తక్కిన వివరములు దిగువ ఈయబడినవి.

**1.** గ్రెనడా : ఈ ద్వీపపు వైశాల్యము 344 చ. కిమీ. జనసంఖ్య 1,03,000 (1968). ముఖ్యనగరమగు సెయింట్ జార్జెస్‌లోని జనసంఖ్య 26,843. గ్రెనడైన్స్ దీవిలో ఈ ద్వీపరాజ్యము నకు చెందిన భూమి 6,500 ఎకరములు; జనసంఖ్య 8,179. రోడ్ల నిడివి 923 కిమీ;. ఇందు తారు వేసినది 603 కిమీ.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించెడు గవర్నరు, 10 మంది ఎన్నుకొనబడిన సభ్యులును ఇరువురు నియమిత సభ్యులును, ఒక అధికార సభ్యుడును కలిగిన శాసనసభా సాహాయ్యమున, ఆంతరంగిక పరిపాలనను నిర్వహించును. ఎన్నికలు సాధారణముగ అయిదేండ్ల కొకసారి జరుగును. కోకో, నట్‌మెగ్, అరటిపండ్లు, కొబ్బరికాయలు, నిమ్మ జాతి ఫలములు, చక్కెర ప్రముఖ వ్యవసాయోత్పత్తులు. ఇందు అధికభాగము ఎగుమతి అగుచున్నవి. దిగుమతులలో ఆహారపదార్థములు అత్యధికముగ ఉన్నవి. ఎగుమతుల విలువ 99,62,319 డా.; దిగుమతుల విలువ 2,63,46,011 డాలర్లు(1968). విలాస యాత్రికుల వలన లభించు ఆదాయము చెల్లింపుల సర్దుబాటుకు కొంతవరకు ఉపకరించు చున్నది; 1969 లోని అట్టి యాత్రికుల సంఖ్య 29,627; వీరు 2.29 కోట్ల డాలర్లను దేశమున వెచ్చించిరి. దేశపు బడ్జెటరీ వ్యయము 2,67,35,388 డాలర్లు (1969).

దేశపు 45 ప్రయిమరీ పాఠశాలలలో 29,883 మంది, 11 సెకండరీ పాఠశాలలలో 2,912 మంది విద్యార్థులు కలరు (1969). చేతిపనుల శిక్షణ కేంద్రములు 26 కలవు. వైద్య, పారిశుద్ధ్య వసతులు చాల తక్కువ.

**2. సెయింట్ విన్‌సెంట్ :** ఈ ద్వీపపు వైశాల్యము 389 చ. కిమీ. జనసంఖ్య 93,000 (1968); ముఖ్యనగరము కింగ్స్‌టౌన్ (జ. సం. 20,440). 226 కిమీ. నిడివిన ఉత్తమపు రోడ్లును, 314 కిమీల. సాధారణపు రోడ్లును, 323 కిమీ. పొడవున డొంక బాటలును కలవు. ముఖ్యనగరము వద్ద లోతునీటి హార్బరు కలదు.

ఎన్నుకొనబడిన సభ్యులు 9 మందియు,ఇరువురు నియమిత సభ్యులును, ఒక అధికార సభ్యుడును ఉన్న శాసనసభా సాహాయ్యమున బ్రిటిష్ ప్రభుత్వము నియమించెడు గవర్నరు పాలనను నిర్వహించును. ఎన్నికలు సాధారణముగ అయిదేండ్లకు ఒకసారి జరుగును. అరటిపండ్లు, యారోరూటు, కొబ్బరి, ప్రత్తి, చిరుగడదుంప ముఖ్యములగు వ్యవసాయోత్పత్తులు. ఇందు అధికాంశము ఎగుమతి అగుచున్నవి.విద్యుదుత్పత్తి3, 266కివా.ఎగుమతుల విలువ 63,19,979 డా. దిగుమతుల విలువ 1,58, 08,406. డా.; బడ్జెటరీ వ్యయము 1,06,07,355 డాలర్లు(1968); దేశపు 58 ప్రయిమరీ పాఠశాల లలో 26,992 మంది, రెండు సెకండరీ పాఠశాల లలో 724 మంది విద్యార్థులు కలరు.

**3. సెయింట్ లూసియా :** ఈ ద్వీపపు వైశాల్యము 616 చ. కిమీ. జనసంఖ్య 1,08,000 (1968). ముఖ్యనగరము కాస్ట్రీస్ (జ. సం. 40,000) రోడ్ల నిడివి 669 కిమీ. ముఖ్యనగరము

వద్ద అన్నివసతులు కల హార్బరు కలదు; వాక్స్ ఫోర్డు అనురేవుకూడ వ్యాపారమునకు కొంత ఉపక రించుచున్నది.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించెడు గవర్నరు, ఎన్నుకొనబడిన సభ్యులు 10 మందియు, ఇద్దరు నియమిత సభ్యులును, ఒక అధికార సభ్యుడును కల శాసనసభా సాహాయ్యమున పాలనను నిర్వ హించును. దేశపు వ్యవసాయోత్పత్తులలో అరటి, కోకో, కొబ్బరి ప్రధానములు. వీనియందు అధి కాంశము ఎగుమతి అగుచున్నవి. ఎగుమతుల విలువ 1,21,08,770 డా.; దిగుమతుల విలువ 2,83,79,884 డా. (1966) బడ్జెటరీ వ్యయము 1 02 కోట్ల డాలర్లు (1966).

ఉచిత నిర్బంధ ప్రయిమరీ విద్యావిధానము అమలున ఉన్నది, దేశమునందలి 58 ప్రయిమరీ విద్యాశాలలలో 23,120 మంది; 3 సెకండరీ పాఠ శాలలలో 939 మంది విద్యార్థులు కలరు (1965). 1964 లో 17,716 మంది విదేశీయ యాత్రికులు దేశమును సందర్శించిరి; వీరు దేశమున 15,77,000 డాలర్లను వెచ్చించిరి.

**4. డొమినికా :** ద్వీపపు వైశాల్యము 728 చ. కిమీ.; జనసంఖ్య 70,302 (1970). ముఖ్య నగరము రోసో (జ. సం. 10,157). రోడ్ల నిడివి 272 కిమీ.

బ్రిటిష్ ప్రభుత్వము నియమించెడు గవర్నరు, ఎన్నుకొనబడిన సభ్యులు 11 మందియు నియమింప బడిన సభ్యులు నలుగురును, ప్రతిపక్ష నాయకుని సలహాపై నియమింపబడిన ఒక సభ్యుడును కలిగిన శాసనసభా సాహాయ్యమున పాలనను నిర్వర్తించును. అరటి, నిమ్మజాతిపండ్లు, కొబ్బరి, కోకో ముఖ్యము లగు వ్యవసాయోత్పత్తులు పండ్లరసములు, నూనెలు, సారా ముఖ్యములగు పారిశ్రామికోత్పత్తులు. ఇందు అధికభాగము ఎగుమతి అగుచున్నవి. ఎగుమతుల విలువ 1,18,09,931 డాలర్లు; దిగుమతుల విలువ 3,15,13,530 డా. (1970). బడ్జెటరీ వ్యయము 1,75,41,493 డా. (1970).

---

# 24. సెయింట్ పియెర్రే-మిక్విలాన్

## (ఫ్రెంచి సముద్రోత్తర ద్వీపరాజ్యము)

**ముఖ్యనగరము :** సెయింట్ పియెర్రే; **జెండా, జాతీయగీతము :** ఫ్రాన్సు దేశమునకు చెందినవియే; **నాణెము :** సి. ఎఫ్. ఏ. ఫ్రాంకు; 100 ఫ్రాంకులు = రు. 3.03; **కొలతూకములు :** ఫ్రాన్సుదేశపువే; **కాలగణన :** ఉ. 8.30 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఉత్తర అట్లాంటిక్ మహా సముద్రమున న్యూఫౌండ్ లాండునకు దక్షిణమున 24 కిమీ. ల దూరమున 46°25′-47°10′ ఉ. అ. రేఖలకును, 56°5′-56°25′ ప. తు. రేఖ లకును మధ్యన కుదిరియున్న ఈ ద్వీపరాజ్యమున సెయింట్ - పియెర్రే, మిక్విలాన్, లాంగ్ లేడ్ అను మూడు పెద్ద ద్వీపములును, అవిగాక 5 అల్పదీపములును కలవు. ద్వీపముల మొత్తపు వైశాల్యము 240 చ. కిమీ. ఈ ద్వీపములు ఉత్పత్తి రీత్యా అగ్నిశైలీయములే అయినను, ఎచ టను భూతలపు ఎత్తు 274 కి మీ. లను మించదు.

**2. శీతోష్ణస్థితి మొ. :** సాలున కనిష్ఠ ఉష్ణోగ్రత 14° ఫా.; గరిష్ఠ ఉష్ణోగ్రత 68°ఫా. సంవత్సరమున దాదాపుగ 100 రోజులు వర్షపాతమును, 50 దినములు హిమపాతమును ఉండును. వర్షపాతము సాలుసరిన 147 సెం. మీ. వృక్షసంపద చాల తక్కువ; సముద్ర పక్షులు ఎక్కువగ కలవు.

**3 జనసంఖ్య మొ. :** రాజ్యపు జనసంఖ్య 5,235 (1971); ముఖ్యనగరపు జనసంఖ్య 4,614. అందరును ఫ్రాన్సుదేశమునుండి వలస వచ్చినవారి సంతతికి చెందినవారు. భాష ఫ్రెంచి; అందరును రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతానుయాయులు.

**4. సమాచార సౌ. :** రాజ్యమున టెలిఫోనుల సంఖ్య దాదాపు 1,000 (1971). యూరపుతోడను, అమెరికాఖండముతోడను, రేడియో - టెలి కమ్యూనికేషన్ ద్వారా వార్తా సంబంధము కలదు.

**5 యాన సౌ. :** నోవా స్కోటియా, ప్రిన్స్ ఎడ్వర్డు దీవి, ఫ్రాన్సులకు విమానయాన, నౌకాయాన సౌకర్యములు ఇట నుండి కలవు.

**6. చరిత్ర :** కెనడా దేశము ఫ్రెంచివారి అధీనమున ఉన్న కాలమున, 1604 లో ఈ ద్వీపమున ఫ్రెంచివారు తొలుతగ చేరిరి. కెనడా బ్రిటిష్ వారికి వశమైన తరువాత అట ఈ ప్రాంతము మాత్రమే ఫ్రెంచివారికి మిగిలినది. 1946 లో ఈ ద్వీపరాజ్యమునకు ఫ్రాన్సు దేశపు సముద్రోత్తర ప్రాంతపు ప్రతిపత్తి చేకూరినది.

**7. పరిపాలన :** ఫ్రెంచి ప్రభుత్వము నియమించు గవర్నరు, 14 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కల, సంఘపు సాహాయ్యమున పాలనను నిర్వహించును. ఫ్రాన్సు దేశపు జాతీయ సభలో ఒక ప్రతినిధియు, శిష్టసభలో ఇరువురు ప్రతి నిధులును ఈ దేశమునకు కలరు.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఈ రెండింటి బాధ్యతలును ఫ్రెంచి ప్రభుత్వమునకే చెంది ఉన్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశమంతయు ఎక్కువగ శిలామయ మగుటవలన, వ్యవసాయమునకు వసతియే లేకున్నది. కాడ్ చేపలను పట్టుట, అచటి ప్రజల ముఖ్యవృత్తి. ఈ చేపల ఉత్పత్తులకు చెందిన చిన్న పరిశ్రమలు కొన్ని కలవు. ఎండు చేపలు, చేప పిండి ఇచటి ముఖ్యపు ఎగుమతులు. మింక్, సిల్వర్ ఫాక్స్ అను బొచ్చుజంతువుల చర్మములును ఎగుమతి అగుచున్నవి. ఖనిజ సంపద కొంత ఉన్నటుల తెలియుచున్నను అచట పని జరుగుటలేదు. మొత్తపు ఎగుమతుల విలువ 71.2 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 311.7 కోట్ల ఫ్రాం. (1971). బడ్జెటరీ వ్యయము 83,10,85,000 ఫ్రాం. (1971). ఇందు 10% ఫ్రాంసు భరించుచున్నది.

**11. సాంఘిక రంగము :** ప్రయిమరీ విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. దేశమున నర్సరీ, ప్రయిమరీ పాఠశాలల మొత్తపు సంఖ్య 10; అందలి విద్యార్థి సంఖ్య 1,297; సెకండరీ పాఠశాలలు 6 కలవు; వీని యందలి విద్యార్థి సంఖ్య 421 (1971). దేశమున 2 ఆసుపత్రులును, ఆర్గురు వైద్యులును కలరు. వైద్యసేవ ఉచితము (1966).

# 25. హయిటీ

**ముఖ్యనగరము :** పోర్ట్ - అఫ్ - ప్రిన్స్; **జెండా :** దండమువద్ద నలుపున, కడమన ఎరుపున ఉన్న రెండు నిలువు చారలు కలయు మధ్య భూమిలో, కేంద్రమున జాతీయ యోధలాంఛనము; **జాతీయ గీతము :** లా డెస్సాలిని యెన్నే (డెస్సాలినీయ గీతము); **నాణెము :** గోర్దే; ఇది 100 సెంటిమోలుగ విభక్తము; ఒక గోర్దే = రు. 1.50;




పటము 16.

**కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; యు. స్టే. కొలమానములకును పరిగణన కలదు; **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** అట్లాంటిక్ మహాసముద్రమున 17°30′ – 19°58′ ఉ. అ. రేఖలకును, 68°20′–74°30′ ప. తు. రేఖలకును మధ్యన ఈ ద్వీప రాజ్యమున ముఖ్య భూభాగము,హిస్పానియోలా దీవియందు పశ్చిమపు మూడవ భాగమును ఆక్రమించియున్నది. (ఆ దీవియందు తూర్పు భాగమునుఆక్రమించి డొమినికన్ రిపబ్లిక్ ఉన్నది.) డొమినికన్ రిపబ్లిక్‌తో ఈ రాజ్యమునకు 192 కిమీ. ల సరిహద్దు కలదు. దేశవైశాల్యము 27,750 చ. కిమీ. ముఖ్యభూభాగమునకు సమీపముననే సముద్రమున అటనట చెదరియుండి, పాలన రీత్యా, ఈ రాజ్యమున భాగములగు తోర్తుగా, లే గానైవిస్, లే కేమెమైట్స్, ఇలీయా వాచీ, నవస్సా ద్వీపముల వైశాల్యమును పై లెక్కలోచేరి ఉన్నది. మూడు పర్వతశ్రేణులు దేశమున వరుస దీరిఉన్నవి. వీనిలోని అత్యున్నత శిఖరపు ఎత్తు 2,680 మీ. శ్రేణులమధ్యన సారవంత భూములు కలవు. చిన్ననదులు అనేకములు కలవు; వానిలో ఆర్టిబొనైట్ (235 కిమీ.) లెస్త్రేరే (45 కిమీ.) అనునవి కొంత దూరముపరకు నౌకాయానమునకు ఉపకరించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉష్ణమండలపు శీతోష్ణ పరిస్థితి ఇట కలదు. కనిష్ఠ ఉష్ణోగ్రత 68°; గరిష్ఠ ఉష్ణోగ్రత 94° ఫా. పర్వతశ్రేణుల సానువులందును, కొన్ని నిమ్నభూములందును వర్షపాతము ఎక్కువ. ముఖ్యనగర ప్రాంతమున సాలుసరి వర్షపాతము 135 సెం. మీ. ఏప్రిల్‌నుండి జూన్ వరకును,అక్టోబరునుండి నవంబరువరకును వర్షములు కురియును. ఉష్ణమండల, ఉపోష్ణమండల వృక్ష, జంతుసంతతులు కననగును. పర్వతోన్నత భూములందు మహాగనీ, పైన్ మొదలగు వృక్షముల అటవులు ఉన్నవి. కాఫీ, నారింజ, కకావో, నిమ్మ, మామిడి, కొబ్బరిచెట్లు సహజరీతిలో కొన్నిచోట్ల పెరుగుచున్నవి. పెద్ద జంతువులుగాని, విష సర్పములుగాని లేవు. పక్షిజాతులు విరివిగ కలవు. సరీసృపములును, జలచరములును వివిధ జాతులవి ఉన్నవి.

**3. జనసంఖ్య మొ. :** లాటిన్ అమెరికా దేశములందెల్ల జనసాంద్రత ఈ దేశమున ఎక్కువ.

అంచనాలను అనుసరించి జనసంఖ్య 49 6 లక్షలు. జనసాంద్రత చ. కిమీ. కు 172. ప్రజలలో 88% పల్లెలలో వసించుచున్నారు. నగరములలో పోర్ట్-అవ్-ప్రిన్స్ (జ. సం. 240 వేలు), కాప్‌హైటీన్ (30,000) పేర్కొనదగినవి. సాధికార భాష ఫ్రెంచి; అయినను క్రియోల్ అనబడుచు నీగ్రో భాషల పదములతో విరివిగ సమ్మిశ్రితమైన సంకరపు ఫ్రెంచిభాష ప్రజలలో విరివిగ వ్యాప్తియందు ఉన్నది. ఇంగ్లీషునకును ముఖ్యనగర ప్రాంతమున కొంత వ్యాప్తి కలదు. అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్కులు; అయినను చట్టరీత్యా మత స్వాతంత్ర్యము అమలున ఉన్నది. వూడూ అనబడు ప్రాచీన నీగ్రో తాంత్రికారాధనయు కొన్ని కొన్ని ప్రాంతములందు ఆదరితము.

**4. సమాచార సౌ.:** తంతి టెలిఫోనుల సౌకర్యము విరివిగ కలదు. 17 రేడియో ట్రాన్స్మిటరులును, ఒక టెలివిజన్ కేంద్రమును కలవు.

**5. యాన సౌ.:** దేశమున 664 కిమీ. ల నిడివిన ఉత్తమస్థాయికిచెందిన రోడ్లును, 2,980 కిమీ. ల తక్కువ విధముల రోడ్లును కలవు. 299 కిమీ. ల పొడవుగల రైలుమార్గములు ఉన్నవి; కాని ఇపుడు వాని వాడకము చాల తక్కువ. తీరమును ఆశ్రయించి వర్తక నౌకలు తిరుగు వసతులు కలవు. అమెరికా యందలి ఒక విమానయాన సంస్థద్వారా మాత్రమే ఇచట వాయుయానపు వసతి ఏర్పడి ఉన్నది.

**6. చరిత్ర:** క్రీ. శ. 1492 లో క్రిస్టఫర్ కొలంబస్ హిస్పానియోలా దీవిని కనుగొని, నేటి కాప్ హైటీన్ నగరపు ప్రాంతమున ఒక వలసను ఏర్పరచెను. 1697 లో ఈ దీవి ఫ్రెంచివారికి దత్తము చేయబడినది. అంతకు పూర్వమున స్పెయినువారు, అచటి ఆదిమవాసులను అంతము చేసి, పనిపాటులకై, ఆఫ్రికానుండి నీగ్రో బానిసలను కొనితెచ్చి అట చేర్చిరి. ఈ నీగ్రోల సంతతియే బాగుగ వృద్ధిచెంది దేశమునందు అంతట వ్యాపించినది. ఫ్రెంచివారు ఈ దేశమునకు సెయింట్ డొమింగ్ అను పేరును కల్పించి పాలించిరి. వారి పాలనా కాలమున దేశము కరిబ్బియన్ రాజ్యములందెల్ల సంపన్నతమముగ పేరొందెను. 1789 న ప్రాన్సుదేశమున విప్లవము చెలరేగినపుడు, ఆ భావములు ఇచటి నీగ్రో ప్రజలకును వ్యాపించినవి. తిరుగుబాటులు చెలరేగినవి. తొలుత ఇవి అడచివేయబడినవి. కాని 1801 లో తూసే లా వోవర్చర్ అను నీగ్రో సేనానిని ఈ దేశమునకు గవర్నరుగ ఫ్రెంచి ప్రభుత్వము నియమించినది; అతడు ప్రజలతోచేరి, బానిసత్వమును రద్దుచేసి, రాజ్యాంగ విధానమును ఒకదానిని ఏర్పరచగ, ఫ్రెంచి ప్రభుత్వము అతనిని తొలగించినది. అంతట వేరొక సేనాని జేక్విస్ డెస్సాలైన్ నాయకత్వమున ప్రజలు పోరాటమును సాగించిరి. 1803 లో ఫ్రెంచి సేనలు పరాజితములుకాగా, జనవరి 11,1804 దేశమును డెస్సాలైన్ స్వతంత్రరాజ్యముగ ప్రకటించి, తొలుతగ ఆ దేశమునకు ఆదిమ అమెరికనులు వాడిన 'హయిటీ' (పర్వత భూమి) అను పేరునే తిరిగి ఏర్పరచి, తనను ఆ దేశపు తొలుతటి సార్వభౌముడుగ ప్రకటించుకొనెను. తరువాత అతనిని చంపి వేరొకడు రాజయ్యెను (1806). దేశము కొంతకాలము రెండుగ చీలియుండెను.కడకు 1822న దేశము మరల ఐక్యమయి గణరాజ్య ప్రభుత్వముగ రూపొందుటయేగాక ప్రక్కనున్న డొమినికన్ రాజ్యమునుకూడ వశపరచుకొని పాలింపగలిగినది. 1844 లో డొమినికన్ రాజ్యము చీలిపోయినది. అంతట కొన్ని కల్లోలముల అనంతరమున రాజరికము ఒకటి ఏర్పడి కడకు 1859 లో దేశమున మరల గణరాజ్య ప్రభుత్వము ఏర్పడినది. కాని రాజకీయ అస్థిరత ఒక జాడ్యముగ పరిగణమించినది. అందు

వలన 1915 లో యు. స్టే. ఈ దేశమును ఆక్ర మించి 1934 వరకు పాలన నిర్వహించినది. 1935 నుంచి దేశము స్వతంత్రమైనను, రాజకీయ స్థిరత్వము కరవైనది. 1957లో దువాలియర్ అను వాడు అధ్యక్షుడై అధికారమునంతను చేజిక్కించు కొని, జీవితకాలమంతయు తానే అధ్యక్షుడుగ ఉండుటకు ప్రజలు అంగీకరించినటుల ప్రకటించు కొనెను (1964). అతడు 1971 లో చనిపోవుచూ తన కుమారుడగు క్లాడీ దువాలియెర్‌ను దేశాధ్యక్షు డుగ నియమించెను.

**7. పరిపాలన :** నామమాత్రముగ 1964 లో ఒక రాజ్యాంగ విధానమున ఆమోదితమైనను అధ్య క్షుడే ప్రభుత్వమున సర్వాధికారి. 58మంది సభ్యులు గల ఒక శాసనసభ కలదు. ఎన్నికలలో వీరే మరల ఎన్నుకొనబడవచ్చునను ఏర్పాటు కలదు.

**8 దేశరక్షణ :** 5,780 మంది సైనికులుగల భూతలసేనయు, 400 మంది యోధులుకల నౌకా సేనయు, 180 మంది యోధులున్న వాయుదళ మును కలవు. నౌకలసంఖ్య 6; విమానముల సంఖ్య 20.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును అమెరికన్ రాజ్య వ్యవస్థయందును, తక్కిన అంతరమెరికన్ వ్యవస్థ లందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10 ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది దేశపు భూతలమున మూడవవంతు మాత్రమే వ్యవసాయాను కూలము. వ్యవసాయోత్పత్తులలో ప్రముఖము కాఫీ. 1970-71 లో కాఫీ గింజల ఉత్పత్తి 5,44,000 బస్తాలు (1 బస్తా =60 కి. గ్రా); రెండవ ప్రముఖ వ్యవసాయోత్పత్తి చక్కెర; తరువాత క్రమమున కలబందనార, ప్రత్తి, కోకో, పొగాకు, మొక్కజొన్న, వరి లెక్కకు వచ్చును. గోజాతి పశువుల, గుర్రముల పెంపకము కొంతవరకు కలదు. ఖనిజసంపద భూగర్భమున కలదని తెలియుచున్నది; కాని దానిని వెలికితీయు యత్నము జరుగుటలేదు. వస్త్రములు, చర్మములు, సారా, పండ్లరసములకు సంబంధించిన పరిశ్రమలు కొన్ని కలవు. విద్యుదుత్పత్తి సమర్థత 31 లక్షల కివా. (1971) ఎగుమతులలో ముఖ్యమైనది కాఫీ. మొత్తపు ఎగుమతుల విలువ 4.71 కోట్ల అమెరికన్ డా.; దిగుమతుల విలువ 6.25 కోట్ల అ. డా. (1971). బడ్జెటరీ వ్యయము 2.12 కోట్ల అమెరికన్ డాలర్లు.

**11. సాంఘిక రంగము :** సుప్వవస్థితము లగు కార్మిక సంఘములు లేవు. గృహవసతియు చాల తక్కువ. దేశమున అయిదవవంతు కుటుంబ ములు మాత్రమే తగు గృహవసతులు కలిగి ఉన్నవి. ఈ లోపమును పూరించుటకై ప్రస్తుతమున ప్రభుత్వము కృషి చేయుచున్నది. దేశమున నిరక్ష రాస్యత చాల ఎక్కువ (90%). విద్యాబోధ ఫ్రెంచిలో జరుగుచున్నది 1959 మొదలుగ అక్షరతా వ్యాప్తికై ప్రభుత్వము కృషి చేయు చున్నను, అభివృద్ధి చాల తక్కువగా ఉన్నది. దేశమున 292 ప్రయిమరీ పాఠశాలలు కలవు; వీని యందలి విద్యార్థి సంఖ్య 1,70,975. సెకండరీ పాఠశాలలు 117; విద్యార్థిసంఖ్య 31,000; వృత్తి విద్యాశాలలు 69; విద్యార్థి సంఖ్య 13,000; ఒక విశ్వవిద్యాలయము కలదు. 6 దినపత్రికలు ప్రచా రమున ఉన్నవి. ముఖ్యనగరమున ఒక ప్రముఖ గ్రంథాలయమును, మ్యూజియమును కలవు. 11 ఆసుపత్రులు, 160 గ్రామీణ వైద్యశాలలు, 20 ఆరోగ్యాశ్రమములు ఉన్నవి ఆసుపత్రులలోని శయ్యాసంఖ్య 2600. మొత్తపు వైద్యసంఖ్య 300 (1971).

**12. యాత్రా సౌ. :** యు స్టే ; కెనడా దేశీయులు గురుతు చీటీతో దేశమున పర్యటింప వచ్చును; తక్కిన విదేశీయులకు పాస్‌పోర్ట్, వీసాలు ఉండవలయును. 1971 లో 87,440 మంది విదే శీయులు దేశమున పర్యటించిరి.

**13 ప్రసిద్ధ పౌరులు :** జీన్ జేక్విస్ డెస్సాలైన్స్ (1758-1806); నెపోలియన్ పంపిన సైన్యమును ఓడించి, దేశమునకు స్వాతంత్ర్యమును కల్పించిన సేనాని.

---

# 26. హాండూరాస్

**ముఖ్యనగరము :** తెగూచిగల్పా; **జెండా :** రెండు నీలి అడ్డుచారల మధ్య ఉన్న తెలుపు అడ్డు చారకు మధ్యన అయిదు నీలి నక్షత్రములు; **జాతీయ గీతము :** తూ బందేరా ఎస్ ఉన్ లాంపో ది సీలో (దివ్యతేజమున తేలియాడు నీ పతాకము); **నాణెము :** లెంపీరా; 100 సెంటవోలుగ ఇది




పటము 17.

విభక్తము; ఒక లెంపీరా = రు. 3.75; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 6 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య అమెరికాయందు 13°-16° ఉ. అ. రేఖలకును, 83'10'-89°20' ప. తు. రేఖలకును మధ్యన కుదురుకొని ఉన్న ఈదేశమునకు ఉత్తరమున కరిబ్బియన్ సముద్రము, తూర్పు దక్షిణములందు నికరాగ్వా, నైరృతిని ఎల్‌సాల్వడార్, పశ్చిమమున గ్వాతెమాలాదేశము, సరిహద్దులందు ఉన్నవి. దేశపు వైశాల్యము 1,12,088 చ. కిమీ. ఉత్తరమున ఉన్న ఉలూవా, అగువాన్ నదులలోయలును, దక్షిణమున ఉన్న తీరమైదానమును తప్ప తక్కిన దేశము అంతయు పర్వతమయము. నదులలో పటూకా, ఉలూవా అనునవి పెద్దవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉత్తరపు కరిబ్బియన్ ప్రాంతమును, దక్షిణపు తీరమైదానమును ఉష్ణ మండల శీతోష్ణ పరిస్థితులను కలిగి ఉన్నవి. దేశ మధ్యభాగమున చల్లదనము ఎక్కువ; గాలిలో చెమ్మదనము తక్కువ. తీర నిమ్న భూములందు సరాసరి ఉష్ణోగ్రత 88°ఫా. 770 కిమీ. ఎత్తుగల ప్రాంతములందు సరాసరి ఉష్ణోగ్రత 73° ఫా. రెండే ఋతువులు కలవు; మే నుండి అక్టోబరు వరకు వానకాలము; తక్కిన కాలమున ఎండ లెక్కువ. సాలీనా సరాసరి వర్షపాతము ఉత్తర తీరమున 250 సెం. మీ.; ముఖ్యనగర ప్రాంతమున 82 సెం. మీ. అతివైవిధ్యముగల వృక్ష, జంతు సంతతులు దేశమున కలవు. ఆర్‌చిడ్‌చెట్లు ఎక్కువ. జంతువులలో లేడియే పెద్దది. తాబేళ్ళు, చేపలు జలాశయములందు ఎక్కువగ కననగును. సరీసృపజాతులును, వివిధ పక్షిసంతతులును కలవు

**3. జనసంఖ్య మొ. :** 1970 లో అంచనాలను అనుసరించి దేశమున జనసంఖ్య 25 లక్షలు; జనసాంద్రత చ. కిమీ. కు 22.4; నగరములలో తెగూచిగల్పా (జనసంఖ్య 2,43,570), సాన్ పెడ్రో

సూలా (జ. సం. 1,02,129) గణనీయములు. ఆదిమ అమెరికనులును, స్పానిష్ ప్రజలును సంకర మొందిన మిశ్రజాతికి చెందినవారు దేశమున అత్యధిక సంఖ్యాకులు; అచ్చపు ఆదిమ అమెరికన్ సంతతివారు 7%;నీగ్రో సంతతివారు 2% కలరు. అధికారభాష స్పానిష్; ఆంగ్లమునకు విరివిగ దేశమంతటను, అందును ముఖ్యముగ ఉత్తరప్రాంతమునను, వ్యాప్తికలదు. జాంబో మొదలగు ఆదిమ అమెరికన్ భాషలును అటనట ప్రచారమున ఉన్నవి. 97% ప్రజలు రోమన్‌కేతలిక్ క్రైస్తవులు; తక్కిన వారిలో ఇతర సంప్రదాయముల క్రైస్తవులేగాక యూదులు, బౌద్ధులు, ముస్లిములు కలరు.

**4. సమాచార సౌ.:** తంతి, టెలిఫోను వసతులు విరివిగ కలవు. వాని కేంద్రముల మొత్తపు సంఖ్య 441. పోస్టుఆఫీసుల సంఖ్య 421. వ్యాపారపు బ్రాడ్‌కాస్టింగు స్టేషనుల సంఖ్య 100. ముఖ్య నగరమున టెలివిజన్ ప్రసారకేంద్రము కలదు. రేడియో, టెలిగ్రాఫ్, రేడియో-టెలిఫోను, కేబులుల ద్వారా విదేశములతో వార్తా సంబంధము కలదు

**5. యాన సౌ. :** గ్వాతెమాలా, ఎల్ సాల్వడార్, నికరాగ్వాలద్వారా పోవు అమెరికన్ మహాపథము ఈ దేశమున సైతము పోవుచున్నది. దేశపు రోడ్ల నిడివి 5,600 కిమీ.; ఇందు 1,168 కిమీ. ఉత్తమ స్థాయికి చెందినది. ఉత్తరతీరమైదానమున మాత్రమే మూడు రైలుమార్గములు కలవు. ముఖ్య నగరమునకు చేర్చు రైలు మార్గము ఏదియు లేదు. రైలు మార్గముల మొత్తపు నిడివి 555 కిమీ. అరటిపండ్ల రవాణాకు, ముఖ్యంగా ఈ రైలు మార్గములు ఉపకరించుచున్నవి. కరిబ్బియన్ సముద్రతీరమున మూడు రేవులు - లా సీబా, పోర్టో కోర్టిస్, తేలా అనునవి - కలవు; పసిఫిక్ తీరమున ఆమపాలా అను ఒకే ఒక రేవునగరము ఉన్నది. సముద్రవ్యాపారమునకు ఇవి ఉపకరించుచున్నవి. దేశమున విమానయానపు వసతి ప్రయాణికులకును, సరకుల రవాణాకును ఎక్కువగ ఉపయోగపడుచున్నది. మొత్తముమీద దేశమున అటనట 100 కు పైగా విమానముల మిట్టలు (లాండింగ్ ఫీల్డులు) కలవు. ముఖ్యనగరపు విమానాశ్రయమునుండి విదేశములకు ప్రయాణ వసతి ఉన్నది.

**6. చరిత్ర :** కొలంబస్. తన నాలుగవ సముద్రయాత్రా సందర్భమున 1502 లో ఈ దేశ ప్రాంతమును కనుగొనెను. అంతకు పూర్వమున 8 వ శతాబ్ది ప్రాంతమున అట మాయా నాగరికత పరిఢవిల్లి అంతరింపగ ఆ నాగరికతావశేషములను, యుద్ధప్రియులగు కొన్ని ఆదిమజాతులవారిని మాత్రమే స్పెయిన్‌వారు కనుగొనిరి. ఆదిమ జాతులను అడచి, స్పెయినువారిట క్రమముగ వలస చేరిరి. 1539 లో ఈ ప్రాంతము గ్వాతెమాలాలోని స్పెయిన్ సామ్రాజ్యాద్యోగియొక్క పాలనలో చేర్చబడినది. 1821 లో మధ్య అమెరికాలోని తక్కిన ప్రాంతములతో పాటుగ ఈ దేశమును స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడినది. 1838 వరకు ఇది మధ్య అమెరికా రాష్ట్ర సమాఖ్యలో చేరి ఉండి, అంతట వెలికివచ్చి, స్వతంత్ర రాజ్యమైనది. కాని అది మొదలుగ రాజకీయ పక్షముల మధ్య చెలరేగిన వివాదములవలన దేశము చాల కాలమువరకు కల్లోలితముగ ఉండినది. 1932 లో అధ్యక్షతను ఆర్జించిన జనరల్ టిబర్షియో కేరియస్ యాండినో అనునతడు నియంతయై 1948 వరకు పాలించెను. తుదకు ఒక వైమానిక దళోద్యోగి ఆధ్వర్యమున సేనాదళములును, కొన్ని రాజకీయపక్ష నాయకులును అధికారమును గ్రహించి (1963) ఎన్నికలు జరపి, రాజ్యాంగ విధానమును రూపొందింపజేయుట జరిగినది (1965). కాని 1972 లో ఎన్నికలు జరిగి, ఒక అధ్యక్షుడు

ఎన్నుకొనబడగ, ఆ అధ్యక్షుని తొలగించి, అంతకు పూర్వపు అధ్యక్షుడగు లోపెజ్ సేనాని బల వంతముగ రాజ్యాధికారమును గ్రహించుటతో, ప్రస్తుతము దేశమున నిరంకుశ ప్రభుత్వము ఏర్పడినది. (డిసెంబరు 4,1972).

**7. పరిపాలన :** దేశము ప్రస్తుతమున లోపెజ్ సేనానియొక్క నిరంకుశపు పాలన యందు ఉన్నది. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున వివిధ న్యాయస్థానముల మూలమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 18-50 ఏండ్ల మధ్యవయసు గల ప్రతి పురుషుడును సైన్యమున, అవసరమైన పుడు, విధిగ చేరి తీరవలయునను నియమము కలదు. సాధారణ సైన్యమున, దాదాపు 11 వేల మంది సైనికులు కలరు; చిన్న నౌకాసేనయు కలదు; 34 విమానములును, 900 మంది యోధు లును కల వాయుసేన ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికన్‌రాజ్య వ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. నిగరాగ్వా ఈ దేశము నకు లామస్క్వీషియా అను ప్రాంతమున సరి హద్దు వివాదము కలదు; అది ఇప్పటికిని అపరి ష్కృతము.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. అరటిపండ్ల ఎగుమతిలో, ప్రపంచమున అగ్రశ్రేణికి చెందిన, మూడు రాజ్యములలో ఇది ఒకటి, ఆ తరువాత కాఫీ, ప్రత్తి, మొక్కజొన్న, చిక్కుళ్లు, పొగాకు క్రమమున లెక్కింపదగినవి. దేశపు ఎగుమతుల విలువలో దాదాపు సగము అరటిపండ్ల వలనను, నాలుగవవంతు కాఫీగింజల వలనను లభించుచున్నది. 45% భూమి అటవీమయము. మహాగనీ మొదలగు ఉత్తమజాతి వృక్షములు అందు కలవు. కలపలో కొంతభాగము ఎగుమతి అగుచున్నది. మత్స్య పరిశ్రమవలన లభించు ఫలసాయమునకూడ కొంత విదేశములకు అమ్మబడుచున్నది. కొన్ని జవుళీ పరిశ్రమలును,పనామా టోపీల పరిశ్రమలును అట నట కలవు. విద్యుదుత్పత్తి 23.3 కోట్ల కివా. (1968). ఖనిజ సంపద ఉన్నటుల తెలియు చున్నను, దానిని వెలికితీయు కృషి విరివిగ జరు గుటలేదు. 1968 నుండి పెట్రోలు గనులలో కొంత పని జరుగుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 36.44 కోట్ల లెంపీరాలు; దిగుమతుల విలువ 38.78 కోట్ల లెం (1971). బడ్జెటరీ వ్యయము 24.08 కోట్ల లెం.(1971).

**11. సాంఘిక రంగము :** గృహవసతి దేశమునందు, అందును ముఖ్యముగ పల్లెపట్టులందు చాల తక్కువ. 1957 మొదలుగ ప్రభుత్వము ఈ విషయమున కొంత శ్రద్ధ వహించి పని చేయు చున్నను పురోగతి ఎక్కువగ లేదు. 9 ఏండ్లవయసు దాటిన వారిలో నిరక్షరాస్యత 55%.పట్టణ ప్రాంత మున మాత్రము విద్యావ్యాప్తి 65%.7 నుండి 15 ఏండ్లవరకు వయసుకలిగిన వారికినిర్బంధోచితవిద్యా విధానము అమలున ఉన్నది. దేశమునందలి 4,117 ప్రయిమరీ పాఠశాలలలో 3,92,658 మంది; 145 సెకండరీ పాఠశాలలలో 44,551 మంది విద్యార్థులు ఉన్నారు (1971). ముఖ్యనగరమునందలి విశ్వ విద్యాలయమున 7,287 మంది వివిధ విద్యాశాఖ లందు ఉన్నత శిక్షణను పొందుచున్నారు (1972). ముఖ్యనగరమునందలి గ్రంథాలయమును, మ్యూజి యమును, దేశమునందలి అట్టివానిలో కొంతవరకు లెక్కింపదగినవి. 19 దైనికవార్తా పత్రికలు ప్రచా రమున ఉన్నవి. దేశమున 6,554 శయ్యాసంఖ్య కలిగిన 27 ఆసుపత్రులు కలవు. వైద్యసంఖ్య 491 (1967)

**12. యాన సౌ.:** యు. స్టే. మధ్య అమెరికా రాజ్యముల పౌరులు యాత్రిక పత్రపు సాయముతో దేశమున పర్యటించవచ్చును. తక్కిన దేశముల వారికి పాస్‌పోర్ట్, వీసాలు తప్పక ఉండవలయును. మాయానాగరికతావశేషములను, దేశమునందలి ప్రకృతి సంపదను గురించి విదేశములందు తగు ప్రచారములేక విదేశీయులు ఈ దేశమునకు తగినంతగ వచ్చుటలేదు. ఈ లోపమును చక్కజేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. జోసీ సిసీలియో దెల్ వల్లే (1780-1834); ఫ్రెంచి సైన్స్ దమీ సభ్యుడు, మేధావి, రాజనీతివేత్త. మధ్య అమెరికా రాజ్యముల స్వాతంత్ర్య ప్రకటన పత్రమును ఈతడే రచించెను.

**14. పాలిత ప్రాంతములు :** కరిబ్బియన్ సముద్రమునందలి స్వాన్‌దీవులు తనవియే యని ఈ దేశము వాదించుచున్నది. కాని ఇవి ప్రస్తుతమున యు. స్టే. దేశపు పాలితప్రాంతములలో చేరి ఉన్నవి (చూ : పు. 592).

---

# 1. అంటార్కిటికా

## (నిర్జనమగు ఒక విశాల భూఖండము)

**1.** ఉనికి మొ.: భూగోళపు దక్షిణధ్రువమును లోగొని, ఆ ధ్రువమును పరివేష్టించి అంటార్కిటిక్ మహాసముద్రముచేత పరివృతమగు ఈ భూఖండము సదా హిమావృతము. హిందూ, పసిఫిక్, అట్లాంటిక్ మహాసముద్రములే దక్షిణపు కడన అంటార్కిటిక్ మహాసముద్రముగ పరిణమించుటవలన, ఈ అంటార్కిటికా ప్రాంతమును పరివేష్టించి, పై హిందూ, పసిఫిక్, అట్లాంటిక్




పటము 2.

మహాసముద్రములే ఉన్నవనియు ఒక తీరుగ చెప్పవచ్చును.

60° ద. అక్షాంశరేఖకు దిగువనున్న ప్రాంతమునంతటిని, ఈ అంటార్కిటికా ప్రాంతమునకు చెందినదానినిగ, **స్థూలరీతిలో** ప్రస్తుతమున లెక్కించుచున్నారు. ఈ ప్రాంతపు భూతలమును, జలరాశియు మంచుగడ్డలలో నిండియుండును. సీలు, తిమింగిలము మొదలగు కొన్ని జలచరములు మాత్రమే ఇట సముద్రమున మనగలవు.

దాదాపుగ వృత్తాకారముగ కుదిరియున్న ఈ భూఖండపు వైశాల్యము, అంచనాలను అనుసరించి, 1,55,40,000 చ. కిమీ. కాని భూమిని ఆవరించి ధ్రువప్రాంతమున దాదాపుగ 1.6 కిమీ. మందమున మంచుగడ్డ కలదు; ఆ మందము క్రమక్రమముగా తీరప్రాంతములను చేరుసరికి కొంత తగ్గి, అందలి మంచు, గడ్డల రూపమున సముద్రములోనికి దిగజారుచుండును.

ఈ ఖండమున పర్వతశ్రేణులు కొన్ని కలవనియు, ఆ శ్రేణులును, పరిసర భూమియు హిమావృతములగుటవలన వాని శిఖరములు మాత్రమే చిన్న గుట్టలరూపమున అటనట కనబడుచున్నవనియు, భూగర్భశాస్త్రజ్ఞుల నిర్ణయము. ఇట్టి శ్రేణులలో ఒకటి (4,570 మీ. సరాసరి ఎత్తు కలది) ఆ భూఖండమునకు దాదాపు మధ్యగ, పసిఫిక్ సాగరపువైపున ఉన్న విక్టోరియాలాండ్ నుండి, అట్లాంటిక్ సాగరపువైపున ఉన్న కోట్స్ లాండ్‌వరకు, పయనించి, ఆ ఖండమును రెండు భాగములుగ చేయుచున్నది. ఈ పర్వతశ్రేణి అంటార్కిటిక్ కార్డిలేరా అని వ్యవహృతము.

ఇచటి శీతోష్ణస్థితి, ప్రాంతములను, కాలములను అనుసరించి, 68° ఫా. నుండి–125° ఫా. వరకు మారుచున్నది. ఇందులకు **తోడుగ** మంచుతుఫానుల బెడద విపరీతము.

**2** చరిత్ర : దక్షిణ ధ్రువప్రాంతమున భూఖండము ఒకటి ఉండవచ్చునని ప్రాచీన గ్రీకులు భావించిరనుటకు కొన్ని నిదర్శనము లున్నను, అది ఊహామాత్రముగనే ఉండినది. పసిఫిక్ మహాసాగరమధ్యవు ఫిజీదీవుల ప్రాంతపు ఆదిమవాసి ప్రజలలో కొందరు, తమ ప్రాచీనులు నౌకలలో దక్షిణ ధ్రువప్రాంతములకు వెళ్ళి వచ్చుచుండెడివారని కొన్ని సాంప్రదాయిక గాథ లను చెప్పెదరుకాని వానికి తగిన చారిత్రక నిదర్శ నములు కన్పట్టవు. 15వ శతాబ్ది ప్రారంభమున స్పెయిన్‌దేశపు రాకుమారుడగు హెన్రీ అనునతడు, దేశాన్వేషణకై నావికులను పంపునపుడు, ఇట్టి దక్షిణ భూఖండము ఒకటి ఉండునని సూచించెనే గాని, దాని యథార్థ పరిజ్ఞానము అప్పటిలో వారి కెవరికిని లేదు. వివిధదేశములను కనుగొనుటలో నిరంతర కృషి చేసిన కుక్‌వంటి నావికులుసైతము, సముద్రముపై తేలియాడు మంచుపర్వతములకును, ధ్రువప్రాంతముల తుఫానులకును భయపడి 60° ద. అక్షాంశరేఖదాటి దిగువకు పోజాలకపోయిరి. అందువలన దాదాపుగ 18వ శతాబ్ది అంతమువరకు ఈ ఖండమునుగురించిన పరిజ్ఞానము ఊహామాత్ర ముగనే ఉండినది.

18వ శతాబ్ది అంతమున సీలుజంతువుల వేట యందలి ఆసక్తి పలుదేశముల నావికులను 60° దక్షిణ అక్షాంశరేఖను దాటుటకు ప్రేరేపించినది. ఈ సీలుజంతువులు, మాంసపు దృష్టిలోనేగాక, వాని ఉన్నినిబట్టియు చాల విలువగలవి. ఉష్ణజల ప్రాంతములందు ఈ జంతువులసంఖ్య క్రమేణ తగ్గుటవలన, వీని కొరకై అంటార్కటిక్ ప్రాంతపు శీతలజలములకు నావికులు ఎగబ్రాకిరి. ఇందులకు తోడుగ జ్ఞానపిపాసయు కొన్ని దేశ ముల వారిని ప్రేరేపించినది. ఇట్టివారిలో నార్వే దేశీయుడగు అమున్‌డ్‌సెన్, ఆంగ్లేయుడగు స్కాట్ గణనీయులు. వీరిలో మొదటివాడు, దక్షిణధ్రువ మున కాలిడిన (డిసెంబరు 14,1911) తొలుతటి మానవుడు. ఆ తరువాత వేరొకవైపునుండి పయ నించి స్కాట్, దక్షిణధ్రువమును జనవరి 17, 1912న చేరెను. తిరుగు ప్రయాణమున తన అనుచరులతోగూడ స్కాట్, దుర్భర శీతబాధ వలన మరణించెను.

ఇటుల వివిధదేశీయులు ఈ దేశపు అవిష్కర ణకై కృషిచేయుటవలన ఆయా దేశముల ప్రభు త్వములలో కొన్ని, అంటార్కటికా యందలి కొన్ని ప్రాంతములు రాజ్యాంగరీత్యా తమకే చెందు నని వాదించి, తమ రాజ్యాంగములందు వానిని తమ ప్రాంతములుగ చేర్చుకొనినవి. కాని జనా వాసమునకు తగిన పరిస్థితులు లేనందున వారెవ రును ఇట చేరలేదు. సరిహద్దురేఖల నిర్ణయమునకై వారొక వింత సిద్ధాంతమును లేవదీసిరి. ఆ సిద్ధాం తమే, వృత్తఖండ సిద్ధాంతము (సెక్టర్ ప్రిన్సిపుల్) అనబడుచున్నది. అంటార్కటిక్ ఖండమునకు సన్ని హిత దూరమున తమ రాజ్యభాగములు కలిగి ఉన్న రాజ్యములు, ఆ రాజ్యభాగముల తూర్పు-పడమర కొన అంచుల తులారేఖలను దక్షిణధ్రువము వరకు పొడిగింపగ అంటార్కటికాయందు ఏర్పడు వృత్త ఖండములు క్రమరీతిలో ఆయా రాజ్యములకు చేర వలయుననుట ఇందలి నియమము. ఈ నియమ మును, కొన్ని అపవాదములతో తొలుత ఆమో దించి యునైటెడ్ కింగ్‌డమ్, ఆస్ట్రేలియా, న్యూజీ లాండ్, నార్వే, ఫ్రాన్సు, ఆర్‌జెన్‌టీనా, చిలీ దేశ రాజ్యములు తమ తమ ప్రాంతములను 1930 మొదలుగ నిర్ధారణ చేసికొనినవి. ఇటులవారు నిర్ణ యములు చేసికొనిన వృత్తఖండములు, సరిహద్దు రేఖలు పటములో (పు. 609) చూపబడినవి. ఇటుల చాల భాగమునకు హక్కులను చూపించుట జరిగి నను కొంతభాగము మాత్రము మిగిలియే పోయి నది; 1947లో దక్షిణ ఆఫ్రికాయు ఈ వివాద మున తలదూర్చి, అంటార్కటికాకు సన్నిహిత

దూరమున ఉన్న ప్రిన్స్ ఎడ్వర్డ్ దీవిని ఆక్రమించి, తద్వారా తనకును ఒక వృత్తఖండమున హక్కు కలదని వాదించుచున్నది.

అగ్రరాజ్యములగు యు. స్టే., సోవియెట్ రష్యాలు, ఈ భూఖండపు అన్వేషణలో తొలుత నుండియు తమ నావికులద్వారా పాల్గొనినను, ఆ ఖండముపై, ఏ భాగమునను, ఒక ప్రత్యేకరాజ్యమునకు స్వామ్యము ఏర్పడకూడదని పట్టుబట్టి, పై రాజ్యముల హక్కులను, వాదములను అంగీకరింపకున్నవి. అందువలన పైరాజ్యముల హక్కులకు సార్వజనికమగు పరిగణన లభింపకున్నది.

1957 ను ఐ. రా. స. ఆధ్వర్యమున భూగర్భ భౌతికశాస్త్ర సంవత్సరముగ పరిగణించిన సందర్భమున, స్వామ్యములు కలవని చెప్పు రాజ్యములే గాక, మరి అయిదు రాజ్యములు (యు. స్టే., సోవియెట్ రష్యా, బెల్జియం, దక్షిణ ఆఫ్రికా, జపాన్) ఈ భూఖండమున అటనట పరిశోధనా కేంద్రములను ఏర్పరచి, పరిశోధనలను సాగించినవి. ఆ తరువాత 1959, డిశెంబరు 1 న ఈ 12 రాజ్యముల మధ్య ఒక ఒడంబడిక కుదిరినది. ఆ ఒడంబడికను అనుసరించి, అంటార్కటికా భూఖండము శాంతియుత ప్రయోజనములకొరకు మాత్రమే వినియోగింపబడవలెననియు, పరిశోధనకై పర్యటన స్వేచ్ఛ ప్రతిదేశమునకును అందు కలదనియు, అట్టి పర్యటనవలన ఏ దేశమునకును అందు హక్కు ఏర్పడదనియు నిర్ణయములు జరిగినవి.

---

# 2. ఆర్జెంటీనా

**ముఖ్యనగరము :** బ్యూనో అయిర్స్; **జెండా:** లేతనీలపు రెండు అడ్డుచారల మధ్యనున్న తెల్లని అడ్డుచారపై నడుమన బంగారు చాయలో 32 కిరణములుగల సూర్యబింబపు చిహ్నము కలది; **జాతీయ గీతము :** 'ఓయిద్, మోర్తేలెస్ ఎల్ గ్రితో సగ్రదో లిబెర్తాద్' (వినుడు, ఓమర్త్యులారా, స్వాతంత్ర్య పవిత్ర నినాదము) అను చరణము తొలుత కలది: **నాణెము :** పెసో; ఇది 100 సెంటవోలుగ విభక్తము; 4 పెసోలు = రు. 7.50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా యందలి దక్షిణప్రాంతమున, ఆ ఖండపు దక్షిణాగ్రమువరకు భూమధ్యరేఖకు 22° నుండి 55° ద. అక్షాంశరేఖవరకు విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున బొలీవియా; తూర్పున ఉరుగ్వే, బ్రెజిల్, పరాగ్వే దేశములును, అట్లాంటిక్ మహాసముద్రమును; పశ్చిమమున చిలీదేశమును సరిహద్దులందున్నవి దక్షిణపుకొన అట్లాంటిక్ - పసిఫిక్ మహాసముద్రముల కూడలిలోనికి చొచ్చుకొనిపోయినది. ఉత్తర దక్షిణములకు దేశపు నిడివి 3,672 కిమీ.; దేశపు తూర్పు-పడమరల గరిష్ఠపు కొలత 1,488 కిమీ.; తీరరేఖనిడివి 2,650 కిమీ. లకు పైబడి ఉన్నది. దేశపు విస్తృతి 27,89,241 చ. కిమీ కాని అంటార్కటికాయందు కొంతభాగమును, ప్రస్తుతమున బ్రిటిష్ ప్రభుత్వపు పాలనలో ఉన్న ఫాక్‌లాండు ద్వీపరాజ్యమును తనవియేయని ఈ

దేశ ప్రభుత్వము వాదించుచున్నది. వీనితో కలసి దేశపు వైశాల్యము 40,24,455 చ. కిమీ అగునని ప్రభుత్వపు లెక్కలు తెలుపుచున్నవి.

పశ్చిమమున ఉన్న కొలదిపాటి పర్వతమయ ప్రాంతమును మినహాయించినయెడల, ఈ దేశమున అత్యధిక భాగము నిమ్నతల భూమిగనే లెక్కింప




పటము 3.

దగి ఉన్నది. భూతత్వరీతినిబట్టి దేశమును నాలుగు ప్రాంతములుగ-1. ఆండీస్ పర్వత ప్రాంతభూమి 2. పటగోనియా ప్రాంతము 3. ఉత్తరభాగపు ఉపోష్ణ సమతలము 4. పంపాలు అనబడు మైదానములు అనురీతిగ-విభజింపనగును. ఇందు ఆండీస్ పర్వతప్రాంతభూమి దేశమున 30% వైశాల్యమును ఆక్రమించియున్నది. ఉత్తరమున బొలీవియా దేశపు సరిహద్దున బయలుదేరి దక్షిణమునకు పయనించి, దేశపు పశ్చిమభాగమునకు మలుపు తిరిగి ఈ పర్వతసీమ వ్యాపించియున్నది రియో నీగ్రో అను నదిమొదలుకొని దక్షిణపు కొనవరకు వ్యాపించిన పటగోనియా ప్రాంతపు వైశాల్యము 7,77,000 చ. కిమీ. తీరమైదానమున బయలు దేరిన ఈ ప్రాంతము క్రమక్రమముగ సోపాన శ్రేణిగ ఉండు పీఠభూములుగ పైకిలేచి పశ్చిమమునకు పురోగమించినది ఇందలి భూతలపు ఎత్తు 90 మీ. నుండి క్రమరీతిలో 488 మీ. వరకును, కొన్ని ప్రాంతములందు 1525 మీ. కును పోవుచున్నది. ఈ ప్రాంతమున వర్షపాతము చాల తక్కువ. దీనికి సమీపముననే తీరమును అంటియున్న తియెర్రా దెల్ ఫ్యూగో అను లంకయందు కొంతభాగమును ఈ దేశమునకే చెందియున్నది (తక్కినభాగము చిలీదేశపు అధీనమున ఉన్నది). తూర్పు తీరమున రియో డి లా ప్లాటా యను నది యొక్క ముఖద్వారసీమ మొదలుగ, ఒక అర్ధ వృత్తాకారమున, ముఖ్యనగరపు దరిదాపులనుండి ఆండీస్ పర్వతప్రాంతమువరకు వ్యాపించిన మైదానములే పంపాలు అని వ్యవహరింపబడుచున్నవి. దేశపు హృదయసీమగ దీనిని పేర్కొనవచ్చును. మంచి నీటివసతులు కలిగిన నిత్యశ్యామల భూమి ఇది.

పశ్చిమమున ఆండీస్ పర్వతశ్రేణి యందు, దేశపు నదులు జన్మించి తూర్పునకు ప్రవహించి అట్లాంటిక్ మహాసముద్రమున చేరుచున్నవి. నదులలోనెల్ల పెద్దది పరానా నది; ఇదియు ఉరుగ్వే నదియు కొంతవరకు (దాదాపు 1,600 కిమీ. లకు పైగా) నౌకాయానమునకు అనుకూలములు. దేశమునందలి పర్వత శిఖరములందు అకోన్కాగువా

(7,020 మీ), మెర్సిడేరియో (6,670 మీ.), తుపున్ గాతో (6,800 మీ.) అనునవి అత్యున్నత ములు. ఆండీస్ పర్వత పాదభూమిని అనుసరించి, పశ్చిమ పటగోనియాలో, సరస్సులు కొన్నికలవు. కొండలలోని మంచుకరగిన నీరు వీనియందు చేరు చున్నది. బ్యూనో అయిర్స్, లాపంపా, కోర్డోబా రాష్ట్రములలో కొన్ని ఉప్పునీటి మడుగులు కలవు.

**2 శీతోష్ణస్థితి** మొ.: మొత్తముమీద దేశము సమశీతోష్ణ పరిస్థితినే కలిగియున్నదని చెప్పవచ్చును; కాని ప్రాంతములను అనుసరించి అందు కొంత హెచ్చుతగ్గులను కనవచ్చుచున్నవి. ఉత్తరమున చాకో ప్రాంతమున ఎండవేడిమి ఎక్కువ; దక్షిణ పటగోనియాలో శీతబాధ అత్యధికము; మధ్యనున్న పంపాలలో హాయిగొలుపు శీతోష్ణస్థితి కననగును. దేశపు గరిష్ఠ ఉష్ణోగ్రత, 120 ఫా.; ఇది ఉత్తర ప్రాంతమున మాత్రమే వేద్యము; కనిష్ఠ ఉష్ణోగ్రత 3° ఫా.; ఈ పరిస్థితి అత్యంత దక్షిణాగ్రమున మాత్రమే కననగును. తూర్పునుండి పశ్చిమమునకు పోవుకొలది వర్షపాతము తగ్గుచుండును. ముఖ్యనగర మున సాలున సరాసరి వర్షపాతము 92.5 సెం. మీ.; అచటి సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 61° ఫా. ప్రపంచపు వివిధ వృక్షజాతులలో 10% ఈ దేశ మున కలవు. పచ్చిక బయళ్లు ప్రపంచ ప్రసిద్ధి పొందినవి; వీనివలననే పశుపాలనా పరిశ్రమతో ఈ దేశము పేరెన్నిక పొందగలిగినది. ఉష్ణమండ లపు జంతువులలో అనేకములు ఇచట మనగలుగు చున్నను, పెద్దతరగతికి చెందిన క్రూర జంతువులు కనరావు. ఉష్ట్రపక్షి మొదలగు పక్షిజాతులు కలవు; సరీసృపములు, తాబేళ్ళు, జలచరములు వివిధజాతులవి కన్పట్టును.

**3. జనసంఖ్య** మొ.: 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,33,64,431. జనసాంద్రత చ. కిమీ. కు 9. ప్రజలలో 26% పల్లె పట్టులందును, 74% పట్టణములందును వసించు చున్నారు (ఇచట పట్టణమనగా 2,000 కుపైగా జనసంఖ్య కలిగిన జనావాసము). జనసంఖ్యావృద్ధి సాలున 1 5%. యూరపునుండి-అందును ముఖ్య ముగ స్పెయిన్ ఇటలీలనుండి-ఇటకు వలసవచ్చి చేరిన వారి సంతతియే దేశమున అత్యధికముగ కలదు. అమెరికాలోని ఆదిమవాసులతో జరిగిన జాతిసంకరత ఇచట చాల తక్కువ ప్రజలలో 94% యూరపీయ సంతతికి చెందినవారు; 6% మాత్రము ఆదిమ అమెరికన్ జాతికిగాని, సమ్మి శ్రిత జాతికిగాని చెందినవారు. దేశపు నగరములలో బ్యూనో అయిర్స్ (జ. సం. 59 లక్షలు), కోర్డోబా (జ. సం. 8,46,000), రోసారియో (జ. సం. 7,50,000) ప్రముఖములు. దేశభాష స్పానిష్; కాని యూరపులోని స్పానిష్ కన్న ఇది కొన్ని మార్పులను ఉచ్చారణలోను, పదరూపములలోను పొందినది. దేశీయులలో 99% రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతమునకు చెందినవారు; అయినను దేశమున మతస్వాతంత్ర్యము చట్టరీత్యా అమలున ఉన్నది. యూదుమతానుయాయుల సంఖ్య 4,50,000. ఉత్తర, దక్షిణ అమెరికా రాజ్యములందన్నింట, యు. స్టే. తరువాత ఎక్కువ యూద సంఖ్య ఈ దేశమున మాత్రమే కలదు.

**4. సమాచార సా.:** దక్షిణ అమెరికా రాజ్యములందు అన్నింట ఎక్కువ టెలిఫోనులు ఈ దేశమున కలవు. 1971 లో అట్టివాని సంఖ్య 17,46 015; ఇందు దాదాపుగ సగము ముఖ్యనగర మునను, దాని ప్రాంతమునను కలవు. పోస్ట్ ఆఫీ సుల సంఖ్య 4,382 (1945). 90 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులును 10 టెలివిజన్ స్థావరములును పని చేయుచున్నవి (1964). తక్కిన లాటిన్ అమెరి కన్ రాజ్యములతోను యు. స్టే. తోను వార్తా సంబంధము ఆల్ అమెరికా కేబుల్స్ అను సంస్థ ద్వారా ఏర్పడియున్నది.

**5. యాన సౌకర్యములు :** దేశమున 9,39,500 కిమీ. ల పొడవున రోడ్డుకలవు; వీనిలో 14% ఉత్తమ స్థాయికి చెందినవి. అమెరికాఖండ మహా పథమునకు చెందిన 4 ప్రముఖమార్గములును ఇందు చేరియున్నవి. దేశపు రైలుమార్గపు నిడివి 41,600 కిమీ. దేశమున ఉన్న ఇరువదిరెండు రాష్ట్రములను ఈ రైలుమార్గములు అనుసంధించుచున్నవి. దేశమున జలమార్గములద్వారా కొంత యానసౌకర్యము కలదు. రియో డి లా ప్లాటా నదియు, దాని ఉపనదు లగు పరానా, ఉరుగ్వే, ఆల్టో పరానా నదులును ఇందు ప్రముఖపాత్ర వహించుచున్నవి. ఈ జల మార్గముల మొత్తపు నిడివి 2,976 కిమీ. బ్యూనో అయిర్స్‌వద్దనున్న సముద్రపురేవు, పశ్చిమార్ధ గోళ మున వ్యాపారరీత్యా, న్యూయార్క్ తరువాత, ప్రముఖ స్థానమును ఆర్జించినది. దేశపు ఎగుమతి దిగుమతి వ్యాపారమున అయిదింట నాలుగువంతులు ఈ రేవుద్వారా సాగుచున్నది. దేశపు వ్యాపార నౌకల మొత్తపు సంఖ్య 315; వాని టన్నేజి 11,96,817 (1969). దక్షిణ అమెరికా యందలి విమానాశ్రయములందెల్ల చాల పేరొందినది బ్యూనో అయిర్స్‌లోని విమానాశ్రయము. దేశీయములు, విదేశీయములునగు విమానయాన సంస్థలు పెక్కింటికి ఇది మజిలీగా ఉపకరించుచున్నది.

**6. చరిత్ర :** స్పెయిన్ దేశపు నావికులు 1516 లో ఈ దేశపు తీరభూమిపై తొలుత కాలి డిరి. అందులో ఒకడు పరానానదీ ముఖద్వార మును చేరి దేశమున వెండిగనులు అపరిమితముగ కలవని విని ఆ నదికి రియో డి లా ప్లాటా (వెండి నది) అని పేరిడెను ఆ పేరును అనుసరించియే దేశమునకు ఆర్జెంటీనా అని పేరు కలిగెను (లాటిన్ భాషలో ఆర్జెంటమ్ అనగా వెండి). 1535 లో ఇచటి బ్యూనో అయిర్స్ ప్రాంతమున స్పానీయుల వలస ఒకటి ఏర్పడినది. అది క్రమముగా దేశాంతర్భాగ మునకు ఎగబాకి, దేశీయమగు ఇన్‌కా నాగరికతను లోగొని దేశమును అంతటిని ఆక్రమించినది. ఈ విధముగ 1600 నాటికి దేశము స్పానీయ సామ్రా జ్యమున అంతర్భాగమైనది

1809 లో ఫ్రాన్స్ దేశపు పాలకుడు స్పెయి నును ఆక్రమింపగా, ఆర్జెంటీనా మాతృదేశము నుండి విడివడి స్వతంత్రమైనది. అంతట పలు అంతఃకలహముల తరువాత దేశము 1862 లో ఒక సమాఖ్యారాజ్యముగ రూపొందినది; కాని ఈ అంతఃకలహములు అంతటంతట చెలరేగుట ఆ దేశమున ఒక సామాన్య విషయముగ పరిణ మించినది.

1910 ప్రాంతమున దేశమున కార్మికోద్యమము బలపడి రాజ్యాంగమున కొన్ని మార్పులు జరిగినవి. రెండు ప్రపంచ యుద్ధముల కాలములలో ఈ దేశము తటస్థభావము వహించి, తన ఎగుమతులను వృద్ధి చేసికొని, పరిశ్రమలను పెంపొందించుకొనినది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, అక్ష రాజ్యముల పట్ల సానుభూతికల సైనికవర్గము తిరుగుబాటుచేసి అధికారమును గ్రహించినది (1943). అయినను యు. స్టే. పలుకుబడివలన ఆ ప్రభుత్వము త్వరలోనే పతనమై వేరొక ప్రభుత్వమేర్పడినది. తదాదిగ త్వరత్వరగ ప్రభుత్వములు మారుచు, కడకు 1946 లో జరిగిన ఎన్నికలవలన కల్నల్ జువాన్ డొమింగో పెరాన్ అనువాని అధ్యక్షతన ఒక సుస్థిరప్రభుత్వము ఏర్పడి నది. సైన్యమును, కార్మిక వర్గమును అతనితో సహకరించినవి. అందువలన పెరాన్, నియంతృత్వ ధోరణిలో, ఆర్థిక, రాజకీయ, సాంఘిక సంస్క రణలను పెక్కింటిని అమలులోనికి కొనిరాగలి గెను. కాని సైన్యమున ఒక ప్రబల వర్గము, కాల క్రమమున అతనికి వ్యతిరేకమై సెప్టెంబరు, 1955లో

అతని ప్రభుత్వమును కూలద్రోసి అతనిని దేశ భ్రష్టుని చేసినది. తరువాత దేశము సుస్థిర ప్రభుత్వమునకు నోచుకొనలేక పోయినది. అంతట 1973 లో ప్రజాప్రతినిధుల అభీష్టమును అనుసరించి పెరాన్ దేశమునకు మరలవచ్చి అధ్యక్షుడయ్యెను. అతని మరణానంతరమున (జులై 2,1974) అతని భార్య ఇజబెల్ పెరాన్ అధ్యక్ష పదవిని గ్రహించినది. కాని ఆమెయెడల సైనిక వర్గమున అసంతృప్తి క్రమముగ అధికమైనది. అంతట ఆమెను పదవినుండి తొలగించి, పార్లమెంటును రద్దుచేసి, సైనికవర్గము పాలనను చేపట్టినది. (మార్చి 24, 1976).

**7. పరిపాలన :** 1853 లో ఈ దేశపు పరిపాలనకై ఒక రాజ్యాంగ విధానము ఆమోదితమైనది. అది 1860, 1866, 1869 లలో కొన్ని మార్పులను పొందినది. కాని 1949 లో వేరొక రాజ్యాంగ విధానము ఆమోదితమై అమలులోనికి వచ్చినది. అయినను పెరాన్‌ను పదవీ భ్రష్టుని చేసిన తరువాత 1853 నాటి రాజ్యాంగమే, తరువాత వచ్చిన మార్పులతో అనుసరింపబడినది. కాలక్రమమున దీని యందును 1957 లో రాజ్యాంగ విధాన పరిషత్తు కొన్ని సవరణలను చేసినది. దీనిని అనుసరించి దేశమున ఒక సమాఖ్యాప్రభుత్వమును, వివిధ రాష్ట్రములకు రాష్ట్రప్రభుత్వములును కలవు. అవశిష్టాధికారములు రాష్ట్రములకేచెందును. 1962 మొదలుగ నైష్పత్తిక ప్రాతినిధ్య విధానము అవలంబితమైనది. 18 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులకు అందరికి వోటు అధికారము కలదు. కేంద్రమున శాసన నిర్మాణాధికారము, రెండు కక్ష్యలుకల కాంగ్రెస్‌న కలదు. అధ్యక్షుడును, ఉపాధ్యక్షుడును పరోక్షపు రీతిలో ఎన్నుకొనబడెదరు. వారిలో ప్రతియొకని పదవీకాల పరిమితి ఆరేండ్లు. కార్యనిర్వాహాధికారి అధ్యక్షుడు; కాని ప్రస్తుతము ఈ రాజ్యాంగ విధానము అమలునలేదు. సైనిక వర్గము, తన విచక్షణను ఉపయోగించి, ఉత్తరువులద్వారా పాలనను నిర్వహించుచున్నది. దేశపు 22 రాష్ట్రములకును, ముఖ్యనగరమునకును తమ పాలనాధికారములకు సంబంధించినంతవరకు వేర్వేరు రాజ్యాంగ విధానములు కలవు. కాని ఇవి అన్నియు ఇపుడు నిలుపుదల చేయబడినవి. సైనిక వర్గము నియమించిన అధికారులే రాష్ట్రములందు పాలనను నిర్వహించుచున్నారు. సమాఖ్యా ప్రభుత్వమునకును రాష్ట్రప్రభుత్వములకును వేర్వేరుగ తగు సోపానశ్రేణిలో న్యాయస్థానములు కలవు.

**8. దేశరక్షణ :** 20 నుండి 45 వరకు వయసుగల పౌరులు అవసరమగునెడల విధిగ సైనిక సేవలో పాల్గొనవలయునను శాసనము దేశమున అమలులో ఉన్నది. దేశపు భూతల సైనిక సంఖ్య 85,000; ఇదిగాక అవసరమైనపుడు పోరాటమున దిగుటకు తగిన శిక్షణ కలిగిన వారి సంఖ్య 2,50,000. నౌకాసేనలోని సైనిక సంఖ్య 37,700; సముచితమగు యుద్ధనౌకా దళము కలదు; ఇందు ఒక విమాన వాహననౌకయు, మూడు క్రూయిజరులును, రెండు జలాంతర్గాములును, 8 డిస్ట్రాయర్లును, ఇంకను తక్కిన సహాయక నౌకలు 132 కలవు. వాయుసేనలోని సైనికసంఖ్య 21,000; యుద్ధ విమానసంఖ్య 375 (1973).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికా రాజ్యవ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయ, పారిశ్రామిక రంగముల రెండింట, పురోగమించి. అట్టి పురోగతిని తీవ్రతరము చేయుటకు ప్రకృతి సహజ సిద్ధములగు అవకాశములు కలిగిన, కొలది ప్రపంచ రాజ్యములలో అర్జెంటీనా ఒకటిగ లెక్కకు వచ్చును. కాని రాజకీయ అస్థిరత, అడుగడుగున ఇందులకు

అడ్డు తగులుటవలన, ఆశించినంతగ దేశము ముందునకు పోలేకున్నది. ప్రపంచమున విరివిగ ఆహారోత్పత్తిని సాధించి, అందు సముచిత భాగ మును విదేశములకు ఎగుమతిచేయు రాజ్యములలో స్థానము ఈ దేశమునకు కలదు. వ్యవసాయమును, పశుపోషణయు, ఈ దేశపు ఎగుమతుల విలువలో 70% వరకు మూలాధారములు.

దేశమున 11% భూమిమాత్రమే (763 లక్షల ఎకరములు) సాగున ఉన్నది. తగు సాధన సంపత్తులతో, ఈ విస్తృతిని పెంచుటకు అవకాశ ములు కలవు. దేశమున "పంపాలు" అనబడు భూభాగము అతి సారవంతముగ పేరుగన్నది. వ్యవసాయోత్పత్తులలో గోధుమపంట ప్రముఖము. ప్రపంచమున గోధుమను ఎగుమతిచేయు దేశ ములలో మూడవ స్థానము ఈ దేశమునకు కలదు. తరువాత క్రమముగా మొక్కజొన్న, బంగాళా దుంపలు, వరి, అవిసవిత్తులు, ప్రత్తి, పొగాకు లెక్కకు వచ్చును. నారింజ, నిమ్మ, యాపిల్ పండ్లు విరివిగ పండుచున్నవి. ఇందు అధిక భాగము బ్రజిల్ దేశమునకు ఎగుమతి అగు చున్నది.

ప్రపంచపు పశుసంపత్తిలో 5% ఈ దేశమున కలదు. ఎగుమతులలో పశుమాంసమును, పశు వులును గణనీయ పాత్రను వహించుచున్నవి. గోజాతి పశుసంఖ్య 5.14 కోట్లు, దేశమునందలి గడ్డిబీడుల వైశాల్యము 58.589 కోట్ల ఎకరములు. పాలపరిశ్రమ విరివిగ వృద్ధిచెందినది; ఎక్కువ పాలనొసగు హాలండో-అర్జెంటినో అను గోజాతి ఇచట ఎక్కువగ కలదు. గొర్రెలనుండి ఉన్ని విరివిగ లభించుచున్నది. దేశమునందలి పట గోనియా ప్రాంతమున గొర్రెలెక్కువ. అశ్వ సంపత్తియు దేశమున అత్యధికము; వాని సంఖ్య 37 లక్షలు; ఈ విషయమున సోవియెట్ రష్యా, బ్రజిల్, మెక్సికోల తరువాత నాలుగవదిగ ఈ దేశము లెక్కకు వచ్చును.

ప్రపంచపు తక్కిన దేశముల లెక్కలతో పోల్చగా, ఈ దేశపు పౌరుడు భుజించు మాంసా హారము అత్యధికము. తగినంతగ ఆ ఆహారము లభించుట వలన మత్స్య పరిశ్రమపట్ల పౌరులు శ్రద్ధ వహించుట లేదు. కాని ప్రభుత్వము కొలది సంవత్సరములనుండి మత్స్య పరిశ్రమకు ప్రోత్సాహ మును కల్పించుచున్నది.

దేశపు అడవుల వైశాల్యము అంచనాలను అనుస రించి 12.3 కోట్ల ఎకరములు. ప్రపంచమున మంచి కలపకు పేరొందిన 570 వృక్షజాతులలో 370 జాతుల వృక్షములు ఈ అడవులలో కలవు; కాని 4,5 జాతుల కలపమాత్రమే వాడుకలో ఉన్నది, అందువలన కలప పరిశ్రమను, ఎగు మతిని వృద్ధిజేయుటకు అవకాశము చాల కలదు.

ఖనిజ సంపత్తి దేశమున విరివిగ కలదని పరిశోధనలవలన తెలియుచున్నను దానిని వెలికి తీయుటకు తగిన కృషి జరుగుటలేదు. ముడిఇనుము, సీసము, తుత్తునాగము, తగరము కొలది ప్రమా ణములలో ఉత్పత్తి అగుచున్నవి. బొగ్గుగనులు ఎక్కువగ ఉన్నను, చాల కొలదిగ దేశావసరము లకు తగినంతగ మాత్రమే త్రవ్వబడుచున్నది. 1907 నుండి పెట్రోలు గనులలో పని సాగు చున్నది. కాని దేశావసరములకు ఇది సరిపో కున్నది; ఇంధన వాయువును లభ్యమగుచున్నది. దేశపు పరిశ్రమలు అన్నియు ముఖ్యనగరపు దరి దాపులలోనే ఉన్నవని చెప్పవచ్చును. ఉక్కు పరిశ్రమ, నూనెశుద్ధి కర్మాగారములు, చక్కెర మిల్లులు చెప్పుకొనదగిన పరిశ్రమలు. 1968 నుండి పరిశ్రమల అభివృద్ధి గణనీయ స్థాయిలో జరుగు చున్నది.

రేడియో ధార్మికత కలిగిన యురేనియంవంటి ధాతువులు ఈ దేశమున ఖనిజరూపమున కలవని

తెలియుచున్నది. లాటిన్ అమెరికన్ దేశములందు యురేనియం ఉత్పత్తిలో ఈ దేశపుది ద్వితీయ స్థానము. దేశపు విద్యుదుత్పత్తి 1,34,96,559 కివా. (1968). దేశపు ఎగుమతులవిలువ 161.2 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 157.6 కోట్ల అ. డా. (1969). దేశపు బడ్జెటరీ వ్యయము 1,02,050 కోట్ల పెసోలు (1969).

**11. సాంఘిక రంగము :** దేశమున వస్తూత్పత్తియందు పాల్గొను కార్మికబలము దాదాపు 75 లక్షలు. ఇందు 19.2% వ్యవసాయ, అటవీ పరిశ్రమలందును, 25.2% కర్మాగారములలోను, 5.6% భవననిర్మాణ కృషిలోను, 20% ఉద్యోగముల లోను 11.9% వ్యాపారమునను, 6.3% రహదారీ పరిశ్రమలందును, 11.8% తక్కువిధముల వృత్తులందును కలరు; నిరుద్యోగులు 5.6% (1968). కార్మికోద్యమము సుసంఘటితము; రాజకీయము లందు కార్మిక సంఘములకు ఎక్కువ పలుకుబడి కలదు. గృహవసతిని ప్రజలందరికిని కలుగజేయుటకై ప్రభుత్వము కృషి చేయుచున్నను, ఆ సమస్య పరిష్కృతము కాలేదు. లాటిన్ అమెరికా దేశములందు అన్నింట ఈ దేశమున అక్షరాస్యతఎక్కువ; 6% ప్రజలు మాత్రమే నిరక్షరాస్యులు (1969). మతాతీతము, లౌకికమునగు విద్యావిధానము, అమలున ఉన్నది. 6 నుండి 14 ఏండ్లవయసుగల వారికి ఉచిత, నిర్బంధ విద్యాబోధన లభించుచున్నది. 25,609 ప్రయిమరీ పాఠశాలలలో 34,08,534 మంది, 3,906 సెకండరీ–సాంకేతిక పాఠశాలలలో 8,87,236 మంది విద్యార్థులు కలరు. ఉన్నతవిద్యను బోధించు విశ్వవిద్యాలయములు గాని, కళాశాలలుగాని మొత్తముమీద 461 కలవు; వీనియందలి విద్యార్థిసంఖ్య 2,65,313 అభివృద్ధి చెందిన పెక్కుదేశములలో ఎచటను లేనంత తక్కువగ విద్యార్థి–ఉపాధ్యాయ నిష్పత్తి ఇచట కలదు; 19 మంది విద్యార్థులకు ఒక ఉపాధ్యాయుడు కలడని లెక్కలవలన తెలియవచ్చుచున్నది (1969). ముఖ్యనగరమునందలి జాతీయ గ్రంథాలయము, ప్రముఖత కలది; అందలి గ్రంథసంఖ్య 5 లక్షలు; ఇవిగాక 10 వేల వ్రాతప్రతులు కలవు. ఆ నగరముననే ఉన్న నేషనల్ గేలరీ కళాచారిత్రక దృష్టిలో గణ్యత పొందినది. దేశము వ్యాప్తి యందున్న దినపత్రికల సంఖ్య 400 కు పైబడి ఉన్నది. ఇందులో దాదాపు 75 ముఖ్యనగరమున ప్రచురితములు; అన్నింట 'లా ప్రెన్సా' అను దానికి అత్యధిక ప్రచారము కలదు.

దేశమున వైద్య, రోచ సదుపాయములు విరివిగ కలవు. 10,000 మంది ప్రజలకు 14.6 డాక్టర్లు, 13.5 నర్సులు, 6 దంతవైద్యులు కలరని అంచనా. జీవితకాలపు అపేక్షిత వ్యవధి పురుషులకు 64; స్త్రీలకు 70. ఆసుపత్రులందలి శయ్యాసంఖ్య 1,42,900 (అనగా పదివేలమందికి 64 శయ్యలు). అకాల మరణములలో అత్యధికములు క్షయవలన కలుగుచున్నవి. కుష్ఠురోగము ఉత్తరప్రాంతమున కొన్నియెడల కొంత విరివిగ కననగుచున్నది.

**12. యాత్రా సౌ. :** యు. స్టే. పౌరులు తప్ప తక్కిన విదేశీయ యాత్రికులు, పాస్‌పోర్ట్, వీసాలు కలిగియుండవలెను; యు. స్టే. వారికి వీసా అక్కరలేదు. యాత్రికులకు సౌకర్యములను కలుగజేయుటకు ప్రభుత్వపు ఒక ప్రత్యేక కార్యాలయము పనిచేయుచున్నది. పరానా నదీ ముఖద్వారపు విలాస నౌకాయాత్రలు, కోర్డోబా నగరమునందలి వలసకాలపు ఆలయములు, ఇగ్వాజా జలపాతము, ఆండీస్ పర్వత ప్రాంతపు జాతీయవనము పలువురు విదేశీయులను ఆకర్షించుచున్నవి. 1966లో 3,23,159 మంది విదేశీయ యాత్రికులు దేశమున పర్యటించి 5 23 కోట్ల డాలర్లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. జోసీ డి సాన్ మార్టిన్ (1778–1850); స్పానిష్ సామ్రాజ్యపు

పరిపాలననుండి దక్షిణ అమెరికా రాజ్యములకు విముక్తి చేకూర్చుటలో ప్రముఖపాత్ర వహించి దక్షిణదేశ సంరక్షకుడని పేరొందిన ధీశాలి. 2. బెర్నార్డో ఆల్బెర్టో హౌసే (జ. 1887); మధుమేహ రోగమును గురించి చేసిన పరిశోధనకు ఫలితముగ నోబెల్ బహుమతిని 1947 లో ఆర్జించెను. 3. కార్లోస్ సవేద్రా లామాన్ (1878-1959); అంతర్జాతీయ న్యాయ శాస్త్రమున ప్రామాణికుడుగ పేరుపొందినవాడు; శాంతి కృషికై నోబెల్ బహుమతిని 1936 లో పొందెను.

---

# 3. ఈక్వడార్

**ముఖ్యనగరము :** క్విటో; **జెండా :** ఎగువ భాగమున, జెండాలో సగమును ఆక్రమించిన పచ్చని అడ్డుచారయు, దిగువన సమాన




పటము 4.

ప్రమాణములలో నీలి, ఎరుపు అడ్డుచారలును అమరి యుండునది; **జాతీయగీతము :** సాల్వే ఓ పాత్రియా (జయతు హే జన్మభూమీ) అను చరణముతో మొదలిడబడునది; **నాణెము :** సూక్రే; ఇది 100 సెంటవోలుగ విభక్తము; ఒక సూక్రే = రు.0.30; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరిగా ఖండపు పశ్చిమ తీరమున 1°26'30'' ఉ. అ. నుండి 5°1' ద. అ వరకును, 75°11'44'' ప. తు. నుండి 81°1' ప. తు. వరకును విస్తరించిన ఈ దేశము భూమధ్యరేఖపై ఉన్నది. ఆ భూమధ్యరేఖ (ఈక్వేటరు)ను బట్టియే ఈ దేశమునకు ఈక్వడార్ అను పేరు కల్పింపబడినది. ఈ దేశమునకు తూర్పు దక్షిణదిశలందు పెరూ దేశమును; ఉత్తరదిశన కొలంబియాయు; పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును కలవు. ఈ దేశపు సముద్ర తీరమునకు పశ్చిమమున 900 నుండి 1,150కిమీ. ల మధ్య సముద్ర పరివృతములై, భూమధ్యరేఖపై 89°-92' ప. తు. యందున్న గలపగోస్ దీవులును పరిపాలనా రీత్యా ఈ దేశమువ అంతర్భాగములు. మొత్తపు రాజ్యవైశాల్యము 2,70,670 చ. కిమీ. (ఇందు గలపగోస్ దీవుల వైశాల్యము 7,832 చ. కిమీ.). భూతల రీత్యా దేశమును తీరభూమి, పీఠభూములు, తూర్పుప్రాంతపు అరణ్య

సీమలు అని మూడు ప్రాంతములుగ విభజింప వచ్చును. తీరప్రాంతము దాదాపుగ అంతయు వంద్రుమట్టితో నిండిన నిమ్నభూమి; దీని వెడల్పు 30 కిమీ. నుండి 185 కిమీ. వరకు ఉన్నది; దేశ వైశాల్యమున దాదాపు నాలుగవవంతును ఈ ప్రాంతము ఆక్రమించియున్నది. పీఠభూముల ప్రాంతము సియెర్రా అని వ్యవహృతము. ఇదియు దేశవిస్తీర్ణమున నాల్గవవంతును ఆక్రమించి యున్నది. ఆండీస్ పర్వతమాలకు చెందిన రెండు శ్రేణులు ఇందు వ్యాపించియున్నవి. ఈ పర్వత శ్రేణుల వెడల్పు 110 కిమీ. నుండి 290 కిమీ. వరకు మారుచుండును. ఈ శ్రేణుల మధ్యన దాదాపు 650 కిమీ.ల నిడివిగల పీఠభూమి ఉన్నది. ఈ పీఠభూమి 10 పరీవాహభూములుగ విభక్తము. ఇందు కొన్నింటి జలప్రవాహము తూర్పునకును, మరికొన్నింటిది పశ్చిమమునకును కలవు. ఆండీస్ పర్వతములందు అంతటంతట హిమావృతములగు ఉన్నత అగ్నిపర్వత శిఖరములు కలవు. ఇందు అత్యున్నతమైన చింబోరాజో శిఖరపు ఎత్తు 6,267 మీ. కోటోపాక్సి (5,797 మీ.) అను శిఖరము ఇప్పటికిని అంతటంతట నిప్పులను వెలిగ్రక్కుచునే ఉన్నది. ప్రపంచమున, ఇప్పటికిని రగులుచునుండు అగ్నిపర్వతములందన్నింట ఇది ఎత్తున మిన్న.

తూర్పుప్రాంతపు అరణ్యసీమ 'ఓరియెన్టే' అని వ్యవహృతము. అమెజాన్‌నదీ పరీవాహభూమియందు ఎగువన ఇది కలదు. ఆండీస్ పర్వతపు దిగువ భూమిన 1,220 కిమీ. ఎత్తున బయలుదేరిన ఈ అరణ్యసీమ ద్రుతగతిలో ఎత్తు తగ్గుచు దిగువకు వచ్చును; అందువలన ఇందుండి సెలయేరులు విపరీతవేగముతో ప్రవహించుచుండును. ఇటుల ముందునకు సాగిన ఆ అరణ్యసీమ 280 కిమీ. ఎత్తును చేరినప్పటినుండి సమతలముగ మారగ, అందలి నదులు వెడల్పైన లోతులేయుల్లి మందగమనముతో ప్రవహించసాగి, కడకు అమెజాన్ నదీ మంచముద్వారా అట్లాంటిక్ సముద్రమును చేరును. ఉత్తరప్రాంతపు యెస్మెరాల్డస్ నదియు, దక్షిణ ప్రాంతపు గ్వాయాస్ నదియు, పడవల రాకపోకలకు అనుకూలములై జనులకు ఉపకరించుచున్నవి. ఈ నదులలో ప్రతియొకదానికి అనేక ఉపనదులు కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** దేశమున శీతోష్ణ పరిస్థితియు వర్షపాతమును ప్రాంతములను అనుసరించి మారుచున్నవి. సముద్రమట్టమునకు 2,836 మీ. ఎత్తున ఉన్న క్విటో నగరమును నిత్యవసంతర్తు ప్రాంతమని అనవచ్చును. ఇచటి సాధారణ సరాసరి ఉష్ణోగ్రత 55° ఫా; వర్షపాతము 137 సెం మీ. పీఠభూములలోని లోయలందు ఉపోష్ణ మండలపు పరిస్థితులు అనుభవ వేద్యములగును. అత్యున్నత భూములందు శీతబాధ ఎక్కువ. 5,180 మీ.కు పైబడిన పర్వత శిఖరములు నిరంతరముగ హిమాచ్ఛాదితములై ఉండును.

దేశపు పశ్చిమ తీరపు దక్షిణపు సగమున వర్షపాతము తక్కువగుటవలన అచట చిన్న పొదలును, ముండ్ల చెట్లును మాత్రమే కననగును. కాని తీరపు ఉత్తరభాగమునను, దేశాంతర్భాగమునను ఉష్ణమండలపు సాంద్రాటవులు విరివిగ కననగును. ఆండీస్ పర్వత సానువులందు 2430 మీ. ఎత్తు వరకును ఇట్టి అడవులే, కొలదిమార్పులతో, వ్యాపించియున్నవి. ఆ పర్వతములలో అంతకు మించిన ఉన్నతభూములందు 'పారమో'అను ఒక రకపు గడ్డి విపరీతముగ కనవచ్చును. దేశీయ వృక్ష జాతులలో వైవిధ్యము చాల తక్కువ. విదేశముల నుండి కొనిరాబడిన యూకలిప్టస్ వృక్షములు ఈ దేశమున చాల బాగుగ వృద్ధిచెందినవి. సస్తనజాతి మృగములలో చిన్నజాతులుమాత్రమే కననగు

చున్నవి. దక్షిణ ఈక్వడారున ఇలామా అను జంతువు, ఆదిమ అమెరికనులచేత, బరువులమోత మొదలగు వానికి వినియుక్తమగుచున్నది.

**3. జనసంఖ్య మొ. :** 1970 సం. పు అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 61,77,127. జనసాంద్రత చ. కిమీ. కు 15.5; దాదాపు 65% ప్రజలు పల్లెపట్టులందు నివసించుచున్నారు. దేశపు నగరములలో క్విటో (జ. సం. 5,28,094), గ్వయాక్విల్ (7,94 301) ప్రముఖములు. పుట్టుకల రేటు 1000 కి 47; మరణములరేటు 1000 కి 13; ఇందువలన ప్రజానీకమున 48% ప్రజలు 15 ఏండ్ల వయస్సునకు మించనివారు. ప్రజలలో 60% అచ్చపు ఆదిమఅమెరికన్ జాతివారు; 30% సంకర జాతివారు (శ్వేతజాతులును ఆదిమ అమెరికనులును సంకరమొందగ రూపొందినవారు); 7% అచ్చపు శ్వేతజాతివారు; తక్కినవారు, నీగ్రోలు మొదలగు జాతులవారు. సాధికారభాష స్పానిష్; 93% ప్రజలకు ఇది మాతృభాష; 7% ప్రజలకు క్వెచువా అను ప్రాచీన అమెరికన్ భాష మాతృభాషగ ఉన్నది. 92.4% ప్రజలందు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము వ్యాప్తియందున్నది. ఓరియెంట్ ప్రాంతపు ఆదిమ అమెరికనులలో సాంప్రదాయికపు ప్రకృతి దేవతారాధన అమలున ఉన్నది.

**4. సమాచార సౌ. :** కొలంబియా, పెరూ దేశములలో తంతివార్తా సౌకర్యమును, తక్కిన ప్రపంచ రాజ్యములతో కేబుల్ ద్వారా వార్తా సంబంధమును ఈ దేశమునకు కలవు. దేశపు ప్రముఖ నగరముల మధ్య రేడియో-టెలిఫోను ఏర్పాటులు ఉన్నవి; 4 టెలివిజన్ స్టేషనులును, 312 రేడియో స్టేషనులును కలవు.

**5. యాన సౌ. :** అన్ని విధముల రోడ్ల మొత్తపు నిడివి 17,195 కిమీ.; కాని ఇందు అత్యధిక భాగము సరియైనవికావు. అమెరికా ఖండదేశములలో పెక్కింటిద్వారా పోవు అమెరికన్ మహాపథముతో ముడివడు రీతిలో, ఒక ఉత్తమపు రోడ్డు తీరపు వెంబడిన నిర్మితమగుచున్నది. మొత్తపు రైలుమార్గముల నిడివి 990 కిమీ. సముద్రపు రేవులు 7 కలవు. వీనిలో గ్వయాక్విల్ వద్దనున్న హార్బరు అత్యంత ప్రాముఖ్యము కలది. నగరములన్నింటిమధ్య విమానయానమునకు వసతులు ఏర్పడి ఉన్నవి. క్విటో నగరమునుండి పనామా, కొలంబియా, న్యూయార్క్, యూరపులకు విమానయానపు వసతి కలదు.

**6. చరిత్ర :** క్రీ. శ. 1000 ప్రాంతమున, ఇచటి ఆదిమ అమెరికన్ జాతులు సువ్యవస్థితములై, ఒక సమాఖ్యారాజ్యముగ రూపొందినటుల తెలియవచ్చుచున్నది; ఆ రాజ్యము క్విటో అను పేర వ్యవహృతమైనది, కాని పొరుగున దక్షిణమున ఉండిన ఇన్కా సామ్రాజ్యపు సేనలు 15వ శతాబ్ది నాటికి ఈ సమాఖ్యారాజ్యమును జయించి, తమ సామ్రాజ్యమున అంతర్భాగముగ జేసికొనినవి. కాని అప్పటికే దక్షిణ అమెరికాయందు కాలూనిన స్పెయిన్ దేశీయులు పెరూ సామ్రాజ్యమును అంతటిని తమ అధీనమునకు, 1534 నాటికి తెచ్చుకొనిరి. తదనంతరమున ఈ ప్రాంతము దాదాపు మూడుశతాబ్దములు స్పెయిన్‌వారి సామ్రాజ్యమున భాగముగ ఉండి, 1822 లో తక్కిన దక్షిణ అమెరికన్ రాజ్యములతోపాటుగ ఆ సామ్రాజ్యము నుండి విడివడినది. అంతట ఇది తొలుత కొలంబియా రాజ్యమున అంతర్భాగముగ కొంతకాలము ఉండినది; కాని అనతికాలముననే అందుండి వైదొలగి స్వతంత్రరాజ్యమైనది. అయినను దేశము సువ్యవస్థిత ప్రభుత్వమునకు నోచుకొనలేక పోయినది. గత 150 ఏండ్లలో ఆ దేశమున 16 రాజ్యాంగ విధానములు రూపొందినవి; 52 మంది అధ్యక్షులుగ అంతటంతట ఎన్నికైరి. వీరిలో 13 మంది

మాత్రమే తమ పదవీకాల పరిమితిని కడవరకు చూడగలిగిరి. దేశము స్వతంత్రతను ఆర్జించిన వెంటనే అధ్యక్షుడైన జువాన్ జోసీ ఫ్లొరెస్, నిరంకుశరీతిలో 15 ఏండ్లు పరిపాలించెను. తరువాత 1860 నుండి 1875 వరకు గేబ్రియెల్ గార్షియా మోరెనో అను అధ్యక్షుడును నిరంకుశ రీతిలోనే పాలనను నెరపి, రోమన్ కేతలిక్ సంప్రదాయమునకు, దేశీయుల జీవితరంగములందు అన్నింట ప్రముఖతను కల్పించెను. తరువాత దేశమున కల్లోలములు చెలరేగుట పరిపాటి అయినది. 1948 నుండి మాత్రము, దేశమున ఏకొలదిగనో సుస్థిరస్థిత కుదురుటయు, సాంఘిక, ఆర్థికాది రంగములందు పురోగతి కొంత కలుగుటయు జరిగినవి. 1970 లో అప్పటి అధ్యక్షుడగు వెలాస్కో ఇబెర్రా నియంతృత్వాధికారములను గ్రహింపగ, విద్యార్థిసంఘముల ఆధ్వర్యమున తిరుగుబాటులు చెలరేగినవి. అంతట సైన్యము జోక్యము వహించి అధికారమును గ్రహించి, 1945 లో ఆమోదితమగు రాజ్యాంగవిధానమును పునరుద్ధరించినది (ఫిబ్రవరి 15,1972).

**7. పరిపాలన :** 1945 లో ఆమోదితమగు రాజ్యాంగవిధానమును అనుసరించి దేశపు పరిపాలనలో కీలకస్థానమును కౌన్సిల్ ఆఫ్ స్టేట్ ఆక్రమించి ఉన్నది. అధ్యక్షుని మంత్రిమండలి సభ్యులును, కాంగ్రెస్, సుప్రీమ్‌కోర్టుల ప్రతినిధులును ఇందు సభ్యత్వము కలిగి ఉందురు. అధ్యక్షుని, నాలుగేండ్లకు ఒకసారి ప్రజలు ఎన్నుకొనెదరు. అధ్యక్షుడు తన ఇచ్చవచ్చిన తొమ్మిదిమందిని మంత్రిమండలి సభ్యులుగ నియమించును; ఈ మంత్రులు అధ్యక్షునికి బాధ్యతవహించి పనిచేయుదురు. కాంగ్రెస్‌లో ప్రతినిధిసభ, శిష్టసభ అనదగు రెండు కక్ష్యలుకలవు. ఇందు తొలుతటి దాని సభ్యసంఖ్య 73. వీరిని ప్రజలు రెండేండ్లకు ఒకసారి ఎన్నుకొనెదరు. శిష్టసభలోని సభ్యసంఖ్య 47; వీరిలో 35 మందిని వివిధరాష్ట్రములును, 12 మందిని వివిధవృత్తి సంఘములును ఎన్నుకొందురు. 18 ఏండ్ల వయసునకు తగ్గక, విద్యావంతుడైన ప్రతి పౌరునకు వోటుహక్కు కలదు; వోటుచేయుట పురుషులకు అనుల్లంఘనీయ విధి; స్త్రీలకు ఐచ్ఛికము. అధ్యక్షుడు నియమించు పాలకుడు, ఎన్నుకొనబడిన రాష్ట్రసభాసాహాయ్యమున, రాష్ట్రపాలనను నిర్వహించును. రాజకీయపక్షములలో కన్‌సర్వేటివ్, రేడికల్ లిబరల్ పార్టీలు ప్రముఖములు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున, వివిధశ్రేణులలో న్యాయనిర్వహణ సాగుచున్నది. సుప్రీమ్‌కోర్టులోని జడ్జీలను, కాంగ్రెస్ ఎన్నుకొనును; జడ్జీ యొక్క పదవీ కాలపరిమితి ఆరుసంవత్సరములు.

**8. దేశరక్షణ:** సైనికసేవయందు, అవసరమైనపుడు, ప్రతిపౌరుడును విధిగ పాల్గొనవలయునను నియమము కలదు. ఆరుడివిజనుల భూతలసేన కలదు; ఇది ఆధునికాయుధ సమన్వితము; నౌకాసేనయందు పనిచేయు సైనికుల సంఖ్య 4,500; వాయుసేనలోని సైనికసంఖ్య 3,500; సముచితమగు విమానబలమును, డిస్ట్రాయర్లకు మించని యుద్ధనౌకలును కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. అమెరికా రాజ్యముల వ్యవస్థయందును ఈ రాజ్యము సభ్యత్వము వహించి యున్నది. పెరూతో ఈ దేశమునకు ఉన్న సరిహద్దు వివాదము అపరిష్కృతము.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. అయినను వ్యవసాయమున ఉన్నభూమి చాలతక్కువ. దాదాపు 2,33,000 చ. కిమీ. ప్రాంతము అడవిగానే ఉన్నది. దేశపు ఎగుమతులలో 82% వ్యావసాయిక వస్తువులు; వానిలో అరటిపండ్లు, కకావో, కాఫీ

ప్రముఖములు; ఆహారధాన్యోత్పత్తులలో వరి, మొక్కజొన్న, గోధుమ క్రమ ప్రాముఖ్యము కలిగి ఉన్నవి; అయినను దేశావసరములకై కొంత గోధుమను దిగుమతి చేసికొనవలసి ఉన్నది: క్రమముగా వ్యవసాయోత్పత్తులలో చక్కెరకును ప్రాముఖ్యము హెచ్చుచున్నది; దేశమున 24 లక్షల గోజాతి పశుసంతతి కలదు; అరణ్యములు విరివిగ ఉన్నను, అందలి ఫలసాయమును లాభదాయకముగ వినియోగించుకొనుటకు కృషి జరుగుటలేదు. ఖనిజసంపత్తి చాల తక్కువ; పెట్రోలు లభించుచున్నను, దేశావసరములకై కొంత దిగుమతి తప్పుటలేదు. దేశపు విద్యుదుత్పత్తి 8,50,000 కివా. (1969). దేశపు ఎగుమతుల విలువ 23.28 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 29.64 కోట్ల అ. డా (1970). బడ్జెటరీ వ్యయము 514.7 కోట్ల సూక్రేలు (1969).

**11 సాంఘికరంగము :** దేశమున గృహవసతి చాలతక్కువ. 1961 మొదలుగ ఆ వసతిని చక్కజేయుటకై కృషి జరుగుచున్నను తగినంతగ ప్రగతి కన్పట్టుటలేదు; దేశపు పట్టణములలో 60% ప్రజలకు, పల్లెపట్లులందు 75% కు తగు నివాసవసతి లేదని అంచనా (1965). దేశమున 15 ఏండ్లకు పైబడిన వయసుకల వారిలో అక్షరాస్యత 68% (1968). దేశమునందలి 7,472 ప్రయిమరీ పాఠశాలలలో 9,75,480 మంది; 720 సెకండరీ పాఠశాలలలో 1,94,662 మంది: 10 విశ్వవిద్యాలయములలో 31 330 మంది విద్యార్థులు కలరు (1968-69). క్విటోలోని జాతీయ గ్రంథాలయము 1792 లో సంస్థాపితము. ఇందలి గ్రంథసంఖ్య 50 వేలు. సుయెన్కా నగరసమీపమున ఉన్న ఒక మ్యూజియమున ఇన్కా సామ్రాజ్య కాలమునకును, అంతకు వెనుక కాలమునకును చెందిన వస్తువులు కననగును. దేశమున 24 దైనిక పత్రికలు ప్రచారమున ఉన్నవి. గ్వయాక్విల్ నగరమునుండి వెలువడు ఎల్ యూనివర్సో అను పత్రికకు అత్యధిక ప్రచారము కలదు. పట్టణములందు మాత్రమే వైద్యవసతులు ఎక్కువగ కలవు; మొత్తముమీద 12,507 శయ్యా సంఖ్యకల 161 వైద్యశాలలు ఉన్నవి. వైద్య సంఖ్య 2,075 (1965).

**12. యాత్రా సౌ. :** పశ్చిమార్ధ గోళమునందలి దేశముల పౌరులు గురుతు చీటీలతో ఈ దేశమున పర్యటించవచ్చును. తక్కిన దేశముల వారికి పాస్‌పోర్టు, వీసాలు ఉండవలయును. ప్రకృతి రమణీయత, ప్రాచీన అమెరికన్ రాజ్యముల అవశేషములు, గలపగోస్ దీవులందలి వింతజంతువులు యాత్రికులను విరివిగ ఆకర్షించుచున్నవి. 1967లో దేశమును 55,945 మంది విదేశీయ యాత్రికులు సందర్శించిరి; వీరిలో దాదాపు సగము మంది యు. స్టే. వాసులు. ఈ యాత్రికులు దేశమున దాదాపు 43 లక్షల అమెరికన్ డాలర్లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. ఈ దేశమునకు చెందిన ఆదిమ అమెరికన్ సామ్రాట్టులలో ప్రముఖుడు అతహ్వాల్పా (మ. 1533); ఈక్వడారును కేంద్రముగా ఇడుకొని విశాల ఇన్కా సామ్రాజ్యమును అతడు పాలించెను.

**14. పాలిత ప్రాంతములు :** ఈ దేశపు పాలన క్రింద ఉన్న ఒకే ఒక పాలితప్రాంతము గలపగోస్ ద్వీపసమూహము దీనికే కోలోన్ ద్వీప సమూహము అనియు పేరు కలదు. దీని వైశాల్యాదులు ఇది వరకే ఈయబడినవి; (చూ. పు. 618) ఈ దీవులలో నాలుగింట మాత్రమే జనావాసములు కలవు; అందలి మొత్తపు జనసంఖ్య 3,300 (1968). ద్వీపప్రాంతపు ముఖ్యనగరము సాన్ క్రిస్టోబల్. దీవులలోనెల్ల పెద్దది ఇజబెల్లాదీవి; ఇందు ఉన్నతమగు అగ్నిపర్వతము ఒకటి కలదు

(1690 మీ.). దీవులందలి సరాసరి ఉష్ణోగ్రత సాలున 70°ఫా.

ఈ దీవులు, అందలి వింత జంతు, పక్షి, జలచర సంతతివలన, పేరొందినవి. 'రాక్షసి తాబేళ్ళు' అనబడు పెద్ద తాబేళ్ళలో 15 జాతులు ఇట కలవు. ఇవి సృష్టిక్రమమున అతి సనాతన జంతుసంతతికి చెందినవని భావన. వీనిలో ఒక జాతి తాబేటి జీవిత కాలము 200 ఏండ్లు; బరువు 250 కి. గ్రా. ఇగ్వానా అనబడు పెద్దగౌళి (బల్లి)యు ఇట కన్పట్టును; ఇంతేకాక 85 వింతజాతుల పక్షులు ఈ ద్వీపములలో నివసించుచున్నవి. జంతుపరిణామ సిద్ధాంతమునకు బలమును సమకూర్చిన చార్లెస్ డార్విన్ పండితుడు 1835 లో ఈ దీవులను దర్శించి, తన వాదపుష్టికరమైన ఈ వింతజంతువుల పరిశీలనను గ్రహించెను

1935 న, ఈ ద్వీపసముదాయమును జాతీయ వనముగ ప్రభుత్వము ప్రకటించి, తదాదిగ దానిని ఒక యాత్రాకేంద్రముగ రూపొందించి. అందులకు తగు వసతులను కల్పించుచున్నది.

---

# 4. ఉరుగ్వే

**ముఖ్యనగరము :** మాంటివిడో; **జెండా :** నాలుగు సాగరనీలిమపు అడ్డురేఖలు సమమూరములలో అమరియుండగ, వానిలో పైరెండింటిని దండమువద్ద కొంత తగ్గించి, అందు గ్రీష్మసూర్యుని చిత్రము అమర్చబడినది; ఈ చిత్రపు 16 కిరణములలో, ఏకాంతరరీతిగ కొన్ని సరళరేఖారూపమున, కొన్ని తరంగ రేఖారూపమున ఉండును; **జాతీయ గీతము :** 'ఓరియెంటేల్స్ లా పాత్రియా ఓ లా తుంబా' (ప్రాచ్యవాసులారా, జన్మభూమి శ్రేయమో లేదా మరణమో) అను చరణముతో మొదలిడబడునది. **నాణెము :** పెసో ఓరో; ఇది 100 సెంటిసిమోలుగ విభక్తము; 100 పెసోలు = రు 1-20; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ. 9 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు తూర్పుతీరమును ఆశ్రయించి ఉన్న ఈ దేశమునకు ఉత్తరమున బ్రజిల్‌దేశము; తూర్పున అట్లాంటిక్ మహాసముద్రము, దక్షిణమున రియో డి లా ప్లాటా నదీ ముఖద్వారము; పశ్చిమమున అర్జెంటీనా సరిహద్దులున్నవి; దేశవైశాల్యము 1,86,926 చ. కిమీ. ఉరుగ్వేనదియు, రియో డి లా ప్లాటా నదియు ఈ దేశమును అర్జెంటీనానుండియు; కువారీమ్, యగువారోన్ నదులు ఈ దేశమును బ్రజిల్‌నుండియు వేరుచేయుచున్నవి; తూర్పున అట్లాంటిక్ మహాసముద్రతీరపు నిడివి 192 కిమీ ఈ విధముగ దేశపు సరిహద్దుల నిడివిలో సగభాగమునకు పైగా నౌకాయానమునకు అనుకూలించుచున్నది. లా ప్లాటానదీ ముఖద్వారమునుండి ముందునకు పొడుచుకొనివచ్చిన ఒక భూఖండముపై. దేశపు ముఖ్యనగరమగు మాంటివిడో ఉన్నది.

దేశపు భూతలము ఎగుడుదిగుడులుగ ఉండును; వాగుల సంఖ్య చాల ఎక్కువ; అడవుల సంఖ్య చాల తక్కువ. దక్షిణదేశమున సమతల భూములు అధికముగ కలవు; అర్జెంటీనాలోని పంపా మైదానములే ఈ దేశమునకు విస్తరింపగ రూపొందినవి ఈ సమతలములు. ఉత్తరదేశమున అటనట పర్వతములు కలవు; కాని వీనియందేదియు 600 మీ.

ఎత్తును మించదు. బ్రజిల్‌లో పుట్టిన నీగ్రోనది, ఉరుగ్వేదేశమున ప్రవేశించి, కొంతదూరము ప్రవహించి, ఉరుగ్వేనదిలో చేరుతున్నది.

**2. శీతోష్ణస్థితి** మొ. : జూన్‌నెలలో సరాసరి ఉష్ణోగ్రత 50 ఫా.; జనవరిలో 74° ఫా. బ్రజిల్, ఆర్జెంటీనా దేశముల శీతోష్ణస్థితులకు మధ్యస్థముగ




పటము 5.

ఈ దేశపు శీతోష్ణస్థితి ఉండునని చెప్పవచ్చును. సాలుపొడవున అంతటంతట సమస్థాయిలో వర్షములు కురియును. దేశమున సాలీనా సరాసరి వర్షపాతము 108 సెం. మీ. దేశమున పచ్చిక భూములు ఎక్కువ; అడవుల వైశాల్యము చాల తక్కువ; ఉన్న అడవులలో, శ్రేష్ఠమగు కలపనిచ్చు జాతులు తక్కువ; పొడుగుగడ్డి, ఎక్కువగ కన్పట్టును. పెద్దజంతువులు కానరావు, రేచు, నక్క వంటివే పెద్దజంతువులుగ చెప్పదగినవి; కొన్ని నదుల ముఖద్వారములందు మొసళ్లు కలవు. తీరప్రాంతపు కొన్ని లంకలలో సీలుజంతువులు కననగును. పక్షులలో చిన్నరకపు ఉష్ట్రపక్షి, హంస, పెద్దబాతు పేర్కొనదగినవి.

**3. జనసంఖ్య** మొ. : 1970 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 28,86.100 జనసాంద్రత చ. కిమీ కు 15. నగరములలో మాంటివిడో (జ. సం. 11 లక్షలు), సాల్టో (జ. సం. 57,958) పేర్కొనదగినవి. దేశీయులలో 95% యూరపీయ సంతతివారు (ఇందు స్పానిష్ సంతతివారు 60%); ఆదిమ అమెరికన్, ఆఫ్రికన్ సంతతులవారు 5%. తొలుత దేశమున వసించియుండిన చర్రువా జాతికిచెందిన ఆదిమ అమెరికనులు నిశ్శేషముగ శ్వేతజాతీయులచేత నిర్మూలింపబడిరి దేశభాష స్పానిష్; లోకవ్యవహారమున ఇందు ఇటాలియన్ భాషాప్రభావము ఎక్కువగ ఉన్నను, గ్రాంథిక భాషమాత్రము యూరపునందలి స్పానిష్‌భాషనే అనుసరించును. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవులు; అందు రోమన్‌కేథలిక్‌లు 62%; కొలదిగ యూదులు ముఖ్యనగరమున కననగుదురు. రాజ్యాంగరీత్యా దేశమున మతస్వాతంత్ర్యము పౌరులకు కలదు.

**4. సమాచార సౌ** : దేశమున 1,277 పోస్టు ఆఫీసులు 12,083 కిమీ.ల తంతినిడివిగల తంతి వార్తా సౌకర్యములు కలవు ముఖ్యనగరమున ప్రభుత్వాధ్వర్యముననే టెలిఫోనులు పనిచేయుచున్నను, తక్కినదేశమున ఆ సౌకర్యము ప్రయివేటు సంస్థల అధీనమున ఉన్నది. 71 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు కలవు; టెలివిజన్ కేంద్రములు 3 పనిచేయుచున్నవి.

**5. యాన సౌ** : రోడ్ల మొత్తపు నిడివి 7,820 కిమీ; ఇందు 5,000 కిమీ. ఉత్తమశ్రేణికి చెందినది. రైలుమార్గముల మొత్తపు నిడివి 2,975 కిమీ. దేశపు సముద్రపు రేవులందెల్ల

మాంటివిడో అత్యంత ప్రముఖము. దేశపు ఎగుమతి దిగుమతుల వ్యాపారమున 90% దీనిద్వారా సాగుచున్నది. నదులపైన నౌకాయానపు వసతులు 1,120 కిమీ. నిడివి వరకు కలవు. ముఖ్యనగరమునకు సమీపమున కర్రాస్కో వద్దనున్న విమానాశ్రయమునుండి యూరప్, బ్రజిల్, అర్జెంటీనాలకు ఈ దేశమునుండి విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** 16 వ శతాబ్దిలో కొంతమంది స్పానిష్ సాహసికులకు ఈ దేశముతో పరిచితి లభించినను, అచటి ఆదిమ అమెరికనుల ప్రతిఘటనవలన వారచట కాలూనజాలకపోయిరి. కడకు 1624 లో స్పెయిన్‌కు చెందిన కొందరు క్రైస్తవ మత ప్రచారకులు మాత్రము, దేశీయుల ఆదరణను ఆర్జించి దేశమున నిలువగలిగిరి. అంతట క్రమముగ స్పెయిన్-పోర్చుగల్ సామ్రాజ్యములు ఈ దేశమును ఆక్రమించుటకై చేసిన వివిధ యత్నములలో కడకు స్పెయిన్‌దే పైచేయి అయినది (1726). అయినను ఈ దేశపు విషయమున స్వామ్యముకొరకై ఆ ఉభయసామ్రాజ్యముల మధ్య అంతటంతట వివాదములు చెలరేగుచునే ఉండినవి. కడకు 1830 లో దేశవాసులు స్వతంత్రతను ఆర్జించిరి. కాని తదనంతరమున 22 సంవత్సరములవరకు, అంతఃకల్లోలముల వలన దేశము సంక్షుభితమైనది. 1852 నుండి స్థిరప్రభుత్వము ఏర్పడినను, రాజకీయ పక్షముల వైరుధ్యముల ఫలితముగ దేశమున ప్రగతి కుంటువడినది. ఈ పరిస్థితిలో 1911 న, జోసీ బాటిల్లీ యి అర్డోనెజ్ అను ప్రముఖుడు అధ్యక్షుడై, ఆర్థిక సాంఘిక రంగములందు విప్లవకర పరివర్తనలను కొని వచ్చి, దేశమును ఒక పురోగామి రాజ్యముగ రూపొందింపగలిగెను. అతని తరువాత అధ్యక్షపదవిని వహించిన వారును అతని పరవడిని అనుసరించి దేశపు అభివృద్ధికి తోడ్పడిరి.

**7. పరిపాలన :** 1830 లో ఆమోదితమై తదనంతరమున 1917, 1934, 1952, 1966 లలో సంస్కరితమైన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి ఇట పరిపాలన నిర్వహింపబడుచున్నది. అయిదేండ్లకు ఒకసారి, సాధారణముగ, ప్రజలచే ఎన్నుకొనబడు అధ్యక్షుడు, తాను నియమించుకొనిన 12 మంది మంత్రుల సాయమున పాలనను నిర్వహించును. శాసననిర్మాణాధికారము శాసనసభయందు న్యస్తము. ఈ సభయందు ప్రతినిధిసభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. రాష్ట్రములనుండి ఎన్నుకొనబడిన 99 మంది ప్రతినిధులు ప్రతినిధి సభయందును, దేశపు మొత్తమునుండి ఎన్నుకొనబడిన 30 మంది సభ్యులు శిష్టసభయందును కలరు. వీరి పదవీకాల పరిమితి అయిదేండ్లు. 18 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులకు అందరికిని వోటుహక్కు కలదు. ప్రజోపయోగ కార్యక్రమములకు సంబంధించిన వివిధ సంస్థలును, రాజ్యాంగ విధానము ద్వారానే, ఇందు ఏర్పడి పనిచేయుచున్నవి. రాష్ట్రపాలనను నిర్వహించు ఉద్యోగికి సాయపడుటకు, ఎన్నుకొనబడిన రాష్ట్ర శాసనసభలు పనిచేయుచున్నవి. శాసనసభచే ఎన్నుకొనబడిన, అయిదుగురు న్యాయాధీశులు సుప్రీమ్ కోర్టుద్వారా, న్యాయనిర్వహణను దేశమున, క్రమస్థాయీలలో సాగింతురు. ఈ న్యాయాధీశులలో ప్రతియొకని పదవీకాల పరిమితి 10 ఏండ్లు.

**8. దేశరక్షణ :** నిర్యుద్ధకాలమున భూతలసేనయందలి సైనిక సంఖ్య 12,000 మాత్రమే. ఇందు రెండు కవచశకట దళములును , నాలుగు పదాతి దళములును చేరియున్నవి; ఇవిగాక సుశిక్షితులై , అవసరము వచ్చినపుడు యుద్ధమున చేరగలవారి సంఖ్య 1,20,000. రెండు డిస్ట్రాయర్లును,

తదనుబంధములగు ఇతర విధముల యుద్ధనావలును కల నౌకాసేన కలదు; అందలి యోధసంఖ్య 2,740. యు. స్టే. సాయమున వ్యవస్థితమగు వాయుసేన కలదు; ఇందలి విమాన సంఖ్య 75.

**9. అంతర్జాతీయ సం.:** సంస్థాపించినది మొదలుగ ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము కలదు. అమెరికా రాజ్యములకు సంబంధించిన పెక్కు వ్యవస్థలందును ఈ రాజ్యము ప్రముఖ పాత్రను నిర్వహించుచున్నది. లాటిన్ అమెరికా రాజ్యముల స్వేచ్ఛా వ్యాపార సంఘపు ముఖ్య కార్యాలయము మాంటివిడో నగరమున ఉన్నది.

**10. ఆర్థిక రంగము:** వ్యవసాయమును, పశుపోషణమును, వ్యవసాయ వస్తువులపై ఆధారపడిన పరిశ్రమలును ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు ఆధారములు. దేశపు భూతలమున 75% పశుపోషణకును, 15% వ్యవసాయమునకును వినియుక్తములు. పంటలలో గోధుమ, మొక్కజొన్న, ఓట్లు, అవిసెవిత్తులు, వరిక్రమ ప్రాముఖ్యములను కలిగిఉన్నవి. దాదాపు 60 లక్షల ఫలవృక్షములు కలవు; వీనివలన నారింజ మొదలగు వివిధ ఫలములు విరివిగ లభించుచున్నవి. గోజాతికి చెందిన పశువుల సంఖ్య 88 లక్షలు. ఎగుమతులలో మాంసము, మాంస సంబంధపు ఉత్పత్తులు, చర్మములు, ఉన్ని పేర్కొనదగినవి. భారీ పరిశ్రమలు దేశమున లేవు; జవుళి, అల్యూమినియమ్, ఉక్కు, సంబంధములు అగు చిన్న పరిశ్రమలు కొన్ని కలవు; మాంసమును ఎగుమతి చేయుటకై తయారు చేయు పరిశ్రమవలన పలువురు జీవించుచున్నారు. ఖనిజ సంపద చాల తక్కువ. విద్యుదుత్పత్తి 193 కోట్ల కివా. (1970). దేశపు ఎగుమతుల విలువ 20.57 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 22.21 కోట్ల అ. డాలర్లు (1971). బడ్జెటరీ వ్యయము 11,673 6 కోట్ల ఉరుగ్వే డాలర్లు.

**11. సాంఘిక రంగము:** తక్కిన లాటిన్ అమెరికన్ దేశములందుకన్న ఈ దేశమున గృహవసతి సౌకర్యము చాల విరివిగ కలదని చెప్పవచ్చును. నలుగురు ప్రజలకు ఒక ఇల్లు చొప్పున కలదని అంచనా. ప్రాథమిక విద్య నిర్బంధము; నిరక్షరాస్యత 7% మాత్రమే. అన్ని స్థాయిలందును విద్యాబోధనకు ఎట్టి జీతములను చెల్లింపనక్కరలేదు. 1,950 ప్రయిమరీ పాఠశాలలలో 3,31,754 మంది విద్యార్థులు కలరు (1971). 249 సెకండరీ పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 1,89 204 (1968). మాంటివిడోలోని విశ్వవిద్యాలయమున విద్యార్థి సంఖ్య 16,200. దేశమునందలి దైనిక వార్తాపత్రికల సంఖ్య 8; ఇవి అన్నియు ముఖ్యనగరమునుండియే వెలువడుచున్నవి; వానిలో ఎల్ డియారియో అనుదానికి అత్యధిక ప్రచారము కలదు. ముఖ్యనగరములోని జాతీయ గ్రంథాలయము, చారిత్రక వస్తువుల మ్యూజియము చాల ప్రసిద్ధిపొందినవి ఆ గ్రంథాలయమున పుస్తక సంఖ్య 2 లక్షలు. వైద్య సదుపాయములు, తక్కిన లాటిన్ అమెరికన్ దేశములతో పోల్చినపుడు విరివిగ కలవనియే చెప్పవచ్చును. ఆసుపత్రులందలి శయ్యాసంఖ్య 15,250; వైద్యసంఖ్య 4 434 (1971).

**12. యాత్రా సౌ.:** యాత్రికులవలన వచ్చు ఆదాయము దేశపు వనరులలో ఒక ముఖ్య స్థానమును ఆక్రమించి ఉన్నది. 1968 లో 6,04.189 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. యాత్రికులకై ప్రభుత్వము పెక్కు సౌకర్యములను సమకూర్చినది. విదేశీయులకు వీసాలు అక్కరలేదు; పాస్‌పోర్టు మాత్రమే చాలును.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1. జోసీ బాటిల్లీ యి అర్డోనెజ్ (1856-1929); ఇతడు దేశాధ్యక్షుడుగ రెండు తడవలు పనిచేసెను. దేశపు సాంఘిక పురోగతికి మార్గదర్శిగ అతడు పేరొందెను.

# 5. కొలంబియా

**ముఖ్యనగరము:** బొగోటా; **జెండా:** పై సగభాగమున పసిమిరంగు అడ్డుచారయు, తక్కిన సగమున సమాన ప్రమాణములలో నీలి, ఎరుపు రంగుల రెండు అడ్డుచారలును కలది; **జాతీయ గీతము:** ఓ గ్లోరియా, ఇన్‌మార్సెసిబుర్, జూబిలో ఇమోర్టల్' (హే నిత్యనూతన తేజోమూర్తీ, నిరంతరానందమయీ) అను చరణముతో ఆరంభితమగు




పటము 6.

నది; **నాణెము:** పెసో; ఇది 100 సెంటవోలుగ విభక్తము. ఒక పెసో = రు. 0.51; **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** దక్షిణ అమెరికా ఖండపు రాజ్యములలో వైశాల్యరీత్యా నాలుగవదిగ లెక్కకు వచ్చు కొలంబియా దేశమున. ఖండమునందలి ముఖ్య భూభాగమేగాక, తీర జలావధిలోనున్న కొన్ని చిన్న ద్వీపములును, నికరాగ్వాదేశ తీరమునకు 203 కిమీ.ల దూరమున కరిబ్బియన్ సముద్ర పరివృతములై ఉన్న సాన్ ఆండ్రీస్, ప్రావిడెన్షియా ద్వీపములును, పసిఫిక్ మహాసాగరమునందున్న మాల్పెలో దీవియు చేరియున్నవి. ముఖ్యభూభాగమునకు వాయవ్యమున పనామా; ఈశాన్యమున వెనిజ్యులా; ఆగ్నేయమున బ్రజిల్; నైరుతిన పెరూ, ఈక్వడార్ దేశములు సరిహద్దులందున్నవి. ఈ ముఖ్య భూభాగము 12°30'40'' ఉ. అ. నుండి 4°13'30'' ద. అ. వరకును, 66°50'54'' ప. తు. నుండి 79°1'23'' ప. తు. వరకును విస్తరించియున్నది. అన్ని ద్వీపములతో కలిసి దేశపు మొత్తపు వైశాల్యము 11,38,338 చ. కిమీ. దక్షిణ అమెరికాలో, పసిఫిక్, అట్లాంటిక్ మహాసముద్రములను అంటిన తీరభూములుకల ఏకైక రాజ్యము కొలంబియాయే. ఈ దేశపు పసిఫిక్ తీరపు నిడివి 1,293 కిమీ; అట్లాంటిక్ తీరపు నిడివి 1,590 కిమీ.

ఈక్వడార్‌తో ఈ దేశమునకుగల సరిహద్దువద్ద ఆండీస్‌పర్వతశ్రేణి మూడుసమాంతరపు వరుసలుగ చీలి ఈ దేశమున ప్రవేశించి, ఆ రీతిగనే ముందునకు సాగినది. వీనిలో మధ్యనున్న శ్రేణి అత్యున్నతము. ఇందలి శిఖరములలోనెల్ల అత్యున్నతమయినది హుయిలా (5,750 మీ.). ఇవిగాక సెర్రేనియా డి బాడో అను వేరొక పర్వతశ్రేణి పసిఫిక్ తీరమును ఆశ్రయించి వ్యాపించియున్నది. ఆండీస్ పర్వతశ్రేణులమధ్య జన్మించిన నదులలో కౌకా, మాగ్డలీనా అనునవి ప్రముఖములు. పర్వత శ్రేణులను దాటిన తరువాత ఇవి రెండును ఒకే నదిగ సంగమించి, తీర నిమ్నభూములకు దిగి కడకు

కరిబ్బియన్ సముద్రమున చేరుచున్నవి. పసిఫిక్ తీరపు నదులలో సాన్ జువాన్, బాడో, పాటియా, ప్రముఖములు. పర్వతశ్రేణుల నానుకొని దిగువన మైదానములు కననగును. ఆ పర్వతశ్రేణులనుండి విడివడి దూరమునకు పయనించినకొలది మైదానపు భూములు క్రమక్రమముగ సాంద్రాటవులుగ మారుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** భూతలపు ఎత్తున వచ్చు మార్పులను అనుసరించి ఇచటి వివిధ ప్రాంతముల శీతోష్ణస్థితులలో వైవిధ్యము కనవచ్చుచున్నది. అత్యున్నత భూములందు సాలున గరిష్ఠ ఉష్ణోగ్రత 55° ఫా.; కనిష్ఠ ఉష్ణోగ్రత సున్నకన్న తక్కువగ ఉండును. సముద్ర మట్టము మొదలుకొని 1,100 మీటరులవరకు ఎత్తుగల ప్రదేశములందు సాలున సరాసరి ఉష్ణోగ్రత 75-80 ఫా. ల మధ్య ఉండును. పశ్చిమ తీరమున వర్షపాతము అత్యధికము, ఉత్తరప్రాంతమున సాలున మే నుండి అక్టోబరు వరకు వానలు పడుచునే ఉండును.

దేశపు అడవులలోనికి చొరబారి పరిశీలకులు ఎవరును తగిన పరిశోధన చేయకపోవుటవలన అందలి వృక్షజాతుల సంఖ్య సిక్కచ్చిగా తెలియకపోయినను, 7,000 జాతులవరకు ఇప్పటికి తెలియవచ్చినవి. ఉష్ణమండలపు అడవులు ఇందు అధికములు. వీనిలో అత్యుత్తమజాతికి చెందిన కలప దొరకును. జంతు సంతతియు ఇందు విరివిగ కలదు. మాంసాహారులగు జంతువులలో నెల్ల 'పూమా' అను మార్జాలజాతి జంతువు పెద్దది మర్కటజాతులు అనేకములు కలవు. పక్షిజాతులు 500 కలవని అంచనా.

**3 జనసంఖ్య మొ. :** 1972 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,32,10,000. జన సాంద్రత చ. కిమీ. కు 18. దేశపు ప్రజానీకమున 97.7%, దేశపు తూర్పుసగపు పర్వతమయ భూమియందు వసించుచున్నారు. దేశపు నగరములలో ముఖ్యనగరమగు బొగోటా (జ. సం. 28,18 300), మెడెల్లిన్ (12,07,800), కాలీ (10,22,200) బర్రాన్‌కిల్లా (6,93,900), కార్తజేనా (3 47,600) ప్రముఖములు. జనానీకమున 52% పట్టణములందు వసించుచున్నారు. జాతులరీత్యా 68% మిశ్రజాతికిని, 20% శ్వేతజాతికిని, 7% ఆదిమ అమెరికన్ జాతికిని, 5% నీగ్రో జాతికిని చెందినవారు. దేశభాష స్పానిష్; కొందరు ఆదిమ అమెరికనులు మాత్రము స్వీయభాషలలో మాటాడెదరు. ప్రజలలో 96% రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతమునకు చెందినవారు. కొలదిగ ఇతర క్రైస్తవసంప్రదాయములవారును, యూదులును కలరు. అధికారరీత్యా, రోమన్ కేతలిక్ సంప్రదాయము జాతీయ మతముగ పరిగణన పొందినది. చట్టరీత్యా మత స్వాతంత్ర్యము ఆమోదితమైనను, రోమన్ కేతలికులకు తప్ప, తక్కినవారికి మతరీత్యా రక్షణ తక్కువయే అని చెప్పదగును.

**4. సమాచార సౌ. :** దేశమున తంతి టెలిఫోన్ సౌకర్యములు విరివిగ కలవు. పల్లెపట్టులలో సైతము ఈ సౌకర్యములు ఉన్నవి. రేడియో స్టేషనుల సంఖ్య 223 (1968). 1954 మొదలుగ టెలివిజన్ వసతియు కలదు.

**5. యాన సౌ. :** దేశము పర్వతమయమగుటవలన రోడ్ల నిర్మాణము అతివ్యయమూలము. మొత్తపు రోడ్లనిడివి 45,000 కిమీ (1960); ఇందు 7,200 కిమీ, చక్కగ సిమెంటు చేయబడినది. కొండల దిగువభాగమునుండి పైనున్న పట్టణమునకు చేరవేయుటకు. ఒకచోట రోడ్డునకు బదులుగ ఒక ఉయ్యాలమార్గము (రోప్-వే) నిర్మింపబడినది. మారిక్విటా అనెడు ప్రదేశమును మునిజెలెస్‌తో కలుపు ఈ ఉయ్యాల మార్గపు నిడివి 72 కిమీ. ప్రపంచము నందలి అట్టివానిలో నిడి

వీన అది మిన్న. రైలుమార్గముల మొత్తపు నిడివి 3,431 కిమీ. (1971). వాయుయాన సౌకర్యమున దక్షిణ అమెరికా దేశములలో బ్రెజిల్ తరువాత లెక్కకువచ్చునది ఈదేశమే. విమానములు దిగుటకు ఉపయోగించు స్థావరముల సంఖ్య 426. దేశపు సముద్రపురేవులలో కరిబ్బియన్ సముద్రతీరపు బర్రన్‌కిల్లా, కార్తజేనా, సాంతామార్తా రేవులును పసిఫిక్‌తీరపు బూనా వెంతురాయు ప్రముఖములు. దేశాంతర్గతములగు నదులయందు నౌకాయాన సౌకర్యము 8,000 కిమీ. ల వరకు కలదు. ఇట్టి నదులందు మాగ్డలీనా ప్రముఖము.

**6. చరిత్ర :** క్రీ. పూ. 5,000 సంవత్సరముల కాలప్రాంతముననే ఈ దేశము జనావాసితమై ఉండినటుల పరిశోధనలవలన తెలియవచ్చుచున్నను, ఆనాటి ప్రజల సాంఘిక జీవనవిధములను గురించిన విశేషములు తెలియవచ్చుటలేదు. స్పెయిన్‌దేశీయులు ఇట కాలిడునాటికి (1525), ఇట, ఆండీస్ పర్వతముల తూర్పుశ్రేణికి సమీపమున, చిబ్చా అను ఆదిమ అమెరికన్ వ్యావసాయికజాతి వసించుచుండినది. ఈ ప్రాంతమున బంగారము విరివిగ కలదను ఆసచేత స్పెయిన్ దేశపు సాహసికులు పలువురు అంతట దేశాంతర్భాగమునకు చొరబారి, దేశీయులను నిర్జించి (1538), బొగోటా నగరమును నెలకొల్పిరి. తదాదిగ స్పెయిన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ ఈ దేశము దాదాపు మూడు శతాబ్దములు ఉండినది. ఆ కాలమున ఆ సామ్రాజ్యమునకు కావలసిన బంగారమునకు ఒక ప్రముఖ ఉత్పత్తిస్థానముగ ఈ దేశము ఉపకరించినది. అంతట దేశీయుల భావనలలో కలిగిన పరివర్తన వలన, తిరుగుబాటులు చెలరేగి, దేశము జులై 20,1810న స్వాతంత్ర్యమును ప్రకటించినది; ఆ స్వాతంత్ర్యము ఆగష్టు 7,1819 న ధ్రువీకృతమైనది. అంతట కొంతకాలము వెనెజ్వెలా, ఈక్వడార్‌లతో కలసి ఏకరాజ్యముగా ఈ ప్రాంతము కొంతకాలము మనినది. తరువాత ఆ రెండును విడివడగ, 1831 లో కొలంబియా ఒక ప్రత్యేక రాజ్యముగ అవతరించినది.

రూపొందినది మొదలుగ ఈ దేశమున రాష్ట్ర కేంద్రములమధ్య జరుగవలసిన అధికార విభజనను గురించి రాజకీయపక్షములమధ్య చెలరేగిన వివాదములు అంతటంతట అంతర్యుద్ధములకు దారి తీసి దేశమున సుస్థిర ప్రభుత్వము ఏర్పడుట కరవైనది. దీనికితోడుగ వ్యావసాయికులలోని అసంతృప్తియు సాంఘిక సుస్థిరతకు భంగము కలిగించినది. ఇట్టి కల్లోలముల ఫలితముగ 1946-1958 మధ్య కాలమున దాదాపు 2 లక్షలు మరణించిరని ప్రభుత్వపు అంచనా. కడకు 1957 లో మితవాదియగు ఒక అధ్యక్షుని ఆధ్వర్యమున దేశమున కొంత సుస్థిరత చేకూరి, తదాదిగ దేశమున, శాంతియుతములగు ఎన్నికలు జరుగుటయు, ఆర్థిక సాంఘిక రంగములందు ప్రగతిని సాధించుటయు జరిగినది.

**7. పరిపాలన :** 1886 లో ఆమోదితమై అంతటంతట 1910, 1936, 1945, 1957, 1959 లలో పెక్కు సవరణలను పొందిన రాజ్యాంగవిధానమును అనుసరించి దేశమున గణతంత్ర ప్రభుత్వవిధానము అమలున ఉన్నది. 21 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతిపౌరునికి వోటు హక్కు కలదు. శాసన నిర్మాణాధికారము రెండు కక్ష్యలుగల కాంగ్రెసున న్యస్తము. ప్రతినిధుల సభ, శిష్టసభ, అనబడు ఈ రెండు కక్ష్యలలో తొలుతటిదాని సభ్యసంఖ్య 204; రెండవదాని సభ్యసంఖ్య 106. ఈ సభ్యసంఖ్యను క్రమరీతిలో 162 నకును, 90 కిని తగ్గించవలెనను సవరణ 1968 లో ఆమోదితమైనది. ఉభయకక్ష్యలలోని

సభ్యులను, సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ప్రజలు ఎన్నుకొనెదరు. అధ్యక్షుని ప్రజలే ఎన్నుకొనెదరు. అతని పదవీకాల పరిమితి నాలుగేండ్లు. కాంగ్రెసే సుప్రీమ్ కోర్టులోని న్యాయాధీశుని ఎన్ను కొనును. ఈ న్యాయాధీశులలో ప్రతియొకని పదవీకాలపరిమితి అయిదేండ్లు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున వివిధ సోపానములలో పనిచేయు న్యాయస్థానముల మూలమున న్యాయనిర్వహణ సాగుచున్నది. దేశపు రాజకీయపక్షములలో కన్స ర్వేటివ్, లిబరల్, నేషనల్ పాపులర్ అలయన్స్ అనునవి ప్రముఖములు. వీనిలో తొలుతటి రెండు ఒక ఒడంబడిక మూలమున కలసి, ప్రస్తుతమున ప్రభుత్వపక్షముగ వ్యవహరించుచున్నవి.

**8. దేశరక్షణ :** యు. స్టే. తో ఈ దేశ మునకు సైనిక సహాయపు ఒప్పందము 1952 లో కుదిరినది. సైనికసేవ, 18-30 వయసుకల ప్రతి పౌరునికి నిర్బంధమను నియమము కలదు. 30 నుండి 45 వయసుకల పౌరులు ప్రభుత్వపు రిజర్వు సేనా పట్టికలో చేరినవారుగ పరిగణింపబడుదురు; అవసరమైనపుడు వీరు సేనలో విధిగ చేరవల యును. శాంతికాలపు భూతల సైనికసంఖ్య 50,000, 7 డిస్ట్రాయర్లును, తదనుబంధములగు ఇతర సైనిక నావలును, 6500 మంది సైనికులును కలిగిన నౌకా సేన కలదు. 200 యుద్ధ విమానములును, 6,000 సైనికులును కలిగిన వాయుసేన కలదు (1973).

**9 అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికా రాజ్యవ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. యు. స్టే. తో సన్నిహిత సంబంధము కలిగి ఈ దేశము వర్తించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** పారిశ్రామికముగ సైతము కొంతప్రగతి కన్పడుచున్నను, మౌలి కముగ ఈ దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి ఉన్నదని చెప్పవచ్చును. అయినను దేశపు భూతలమున 2% మాత్రమే సేద్యమున ఉన్నది; అదియు అత్యున్నత సమశీతోష్ణ ప్రాంతము లందే ఉన్నది. దేశము పర్వతమయమగుటయు, నీటిపారుదల వసతులు తక్కువయగుటయు, సేద్యపుభూమిని విస్తృతము చేయుటకు ఆటంక ములుగ ఉన్నవి. కొండలోయలలోని సారవంత భూమి యంతయు. పశుపోషణకు అవసరమగు గడ్డిబీడులుగ మాత్రమే ఉపయోగపడుచున్నది. దేశపు వ్యవసాయోత్పత్తులలో కాఫీ ప్రముఖము. దేశపు ఎగుమతులవలని ఆదాయమున 65% దీని వలన లభించుచున్నది. ప్రపంచమున కాఫీగింజల ఉత్పత్తిలో ఈ దేశము రెండవదిగ లెక్కకు వచ్చుచున్నది. కాఫీ తరువాత చెప్పదగిన వ్యవసా యోత్పత్తి చక్కెర. తక్కినవానిలో అరటిపండ్లు, గోధుమ, వరి, కోకో, ప్రత్తి, పొగాకు క్రమముగ లెక్కింపదగినవి. గోజాతి పశుసంపద 63 లక్షలు కలదని అంచనా (1970). తోళ్ళను పదును చేయుట ఒక ముఖ్యపరిశ్రమ. దీని ఉత్పత్తిలో అధికభాగము ఎగుమతి అగుచున్నది ఖనిజ సంపద విరివిగ కలదు. అందు ఎక్కువ ప్రాము ఖ్యము పొందినది బంగారము; తరువాత వెండి, సీసము, పాదరసము, ప్లాటినము క్రమరీతిలో లెక్కకు వచ్చుచున్నవి. వజ్రముల గనులు కలవు; వీనిని సానబట్టి ఎగుమతిచేయుదురు. నేల బొగ్గు విరివిగ కలదు. పెట్రోలియం లభించు చున్నది; ఇందు కొలదిభాగము ఎగుమతి అగు చున్నది. విద్యుదుత్పత్తి 783.8 కోట్ల కివా. (1971). దేశపు ఎగుమతుల విలువ 63.57 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతులవిలువ 90.19 కోట్లు. అ. డాలర్లు (1971). బడ్జెటరీ వ్యయము 1,491.4 కోట్ల పెసోలు (1969).

**11. సాంఘిక రంగము :** దేశమున వస్త్రోత్పత్తికై పనిచేయువారిసంఖ్య దాదాపు 60 లక్షలు ఉండునని అంచనా. ఇందు 50% వ్యవసాయమునను, 16% పరిశ్రమలందును, 4 వ్యాపారమునను, 3.5% సర్వజనోపయోగ సంస్థలందును, 26.5% ప్రభుత్వోద్యోగములు మొదలగువాని యందును కలరు. కార్మిక శాసనములు చక్కగ అమలులో ఉన్నవి అయినను దాదాపు 14% జనులకు నిరుద్యోగబాధ కలదు. గృహవసతి చాల తక్కువ; దీనిని చక్కజేయుటకై 1970 మొదలుగ ప్రభుత్వము కృషి సాగించుచున్నది. దేశమున నిరక్షరాస్యత 35%; విద్యాబోధన ఉచితముగ జరుగుచున్నది. ప్రయిమరీ విద్య ప్రస్తుతమున నిర్బంధరీతిలో 7 నుండి 11 ఏండ్లవయసు కల వారికి బోధింపబడుచున్నది. దేశమునందలి ప్రయిమరీ పాఠశాలలలో 27,33,432 మంది; సెకండరీ పాఠశాలలలో 6,44,365 మంది, ఉన్నత పాఠశాలలలో 5,50,000 మంది విద్యార్థులు కలరు (1968). 25 విశ్వవిద్యాలయములు కలవు; వానిలో బొగోటాలోని జాతీయ విశ్వవిద్యాలయము ప్రాచీనతమము. ఇది 1572 లో సంస్థాపితము; విశ్వవిద్యాలయములందలి విద్యార్థి సంఖ్య 62,844 (1968). దేశపు గ్రంథాలయములలో ముఖ్యనగరమునందలి జాతీయ గ్రంథాలయము ప్రముఖము; అందలి గ్రంథసంఖ్య 2,50,000 పైగా ఉన్నది (1957). మ్యూజియములలో బొగోటాలోని జాతీయ మ్యూజియము, పురావస్తువుల మ్యూజియము ప్రముఖములు. దేశమున 40 దైనిక వార్తాపత్రికలు ప్రచారమున ఉన్నవి. వానిలో ఎల్ టింపో అనునవి స్పానిష్ భాష ప్రచారమున ఉన్న దేశములన్నింటి, విపుల వ్యాప్తిని పొందినవి. ఆరోగ్యపు వసతులు దేశమున చాల తక్కువ. మలేరియా విస్తారముగా, నిమ్మ భూములందు వ్యాప్తిలో ఉన్నది. పచ్చజ్వరము అను అంటుజాడ్యము సైతము ఎక్కువగ ప్రజలను బాధించుచున్నది. 39,117 శయ్యా సంఖ్య గల 641 ఆసుపత్రులు కలవు (1967)

**12. యాత్రా సౌ :** యు. స్టే. వాసులు గుర్తు చీటీలతో దేశమున పర్యటింపవచ్చును. తక్కిన దేశములవారు పాస్‌పోర్టు వీసాలను కలిగి యుండవలెను. ప్రభుత్వము యాత్రిక పరిశ్రమాభివృద్ధికి పెక్కు సదుపాయములను కల్పించినది.

**13. ప్రసిద్ధ పౌరులు :** ఫ్రాన్సిస్కో డి పౌలా సాంతాండర్ (1792-1840); స్వాతంత్ర్య యుద్ధమున సేనానిగ పనిచేసి, స్వతంత్ర కొలంబియాకు ప్రథమాధ్యక్షుడయ్యెను. 2. ఫ్రాన్సిస్కో జోసీ డి కాలదాస్ (1770-1816); వృక్షశాస్త్రజ్ఞుడు; నీటి బాష్పీకరణ బిందువునందలి మార్పుల వలన భూమి ఉన్నతిని లెక్కించు పద్ధతిని ఇతడు కనుగొనెను.

---

# 6. గైయానా

**ముఖ్యనగరము :** జార్జిటౌన్; **జెండా :** దండమువద్ద భూరేఖయు జెండామధ్య శీర్షమును కలిగియున్న ఎర్రని త్రిభుజము. దాని ఇరు ప్రక్కల నల్లని సన్నని అంచు తీర్చబడగ, ఆ త్రిభుజమునుండి ముందునకు బాణమువలె సాగిన సువర్ణరేఖ, జెండా కొనతట్టున మధ్యభాగమును చేరు

కొనును. ఈ సువర్ణరేఖకు ఇరువైపుల సన్నని తెల్లని రేఖలు కలవు; **జాతీయ గీతము :** 'డియర్ లాండ్ ఆఫ్ గైయానా, ఆఫ్ రివర్స్ అండ్ ప్లయిన్స్ (నదీ, సమతల సమేతవగు ప్రియ గైయానా దేశమా) అను చరణము పల్లవిగ కలది; **నాణెము :** గైయానీ డాలరు; ఇది 100 సెంట్లుగ విభక్తము. ఒక గైయానీ డాలరు = రు. 3.75; **కొలతతూకములు :** బ్రిటిష్ విధానపువి; **కాలగణన :** ఉ. 7 గం. 45 ని. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు ఈశాన్యతీరమున నెలకొనిఉన్న ఈ దేశమునకు




పటము 7.

తూర్పున సురినామ్; దక్షిణమున బ్రజిల్; పశ్చిమమున బ్రజిల్, వెనిజ్యులా దేశములు; ఉత్తర, ఈశాన్యములందు అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దులందున్నవి. దేశపు వైశాల్యము 2,10,000 చ. కిమీ. దేశపు భూతలమును తీరప్రాంతము, అరణ్యభూమి, పర్వతభూమి అను ప్రాంతములుగ విభజింపవచ్చును. తీరప్రాంతభూమి దాదాపు 432 కిమీ. ల పొడవును 16 మొదలుగ 65 కిమీ. ల వరకు వెడల్పును కలిగినది; ఇది అంతయు చాల పల్లపుభూమి; సముద్రపుపోటు వచ్చినపుడు ఇందు అధిక భాగము మునిగిపోవు ప్రమాదము కలదు. ఇక పర్వతభూమి అనదగునది దేశపు పశ్చిమ, దక్షిణ భాగములందు ఉన్నది. ఇందు పర్వతములకు తోడుగ ఎడనెడ గడ్డిబీడులును విరివిగ కలవు. దేశమున పెద్దవని భావింపదగు నదులు చాల కలవు; వానిలో ఎస్సెక్విబో, దమెరారా, బెర్బిసి అనునవి ప్రముఖములు. ఇందు ఏదియు నౌకాయానమునకు ఉపకరించదు.

**2. శీతోష్ణస్థితి మొ. :** తీరభూమిన ఉపోష్ణమండలపు శీతోష్ణపరిస్థితి కాననగును; ఇచటి సరాసరి ఉష్ణోగ్రత 80° ఫా. ఇచట వర్షర్తువులు రెండు కలవు; ఏప్రిల్‌నుండి ఆగస్టువరకును, నవంబరు నుండి జనవరి వరకును వర్షించును. ఆ వర్షపాతము సాలీనా 150-200 సెం. మీ. ఉండును. దేశపు నైరుతి భాగమున మాత్రమే సాలున ఒకే వర్షర్తువు కలదు; అచటి సాలీనా వర్షపాతము 150 సెం. మీ. దేశమున 87% భూతలమున అడవులు కలవు. చిన్నవియగు సస్తనజాతి జంతువులు మాత్రమే కననగు చున్నవి.

**3. జనసంఖ్య మొ. :** 1971 అంచనాలను అనుసరించి దేశపు మొత్తపు జనసంఖ్య 7,42,000. జనసాంద్రత చ. కిమీ. కు 3.2. ప్రజానీకమున 90% కు పైగా అట్లాంటిక్ మహాసముద్రతీరపు ప్రాంతమున – అనగా దేశపు భూతలములో 5% న – నివసించుచున్నారు. దేశమధ్యమున జనావాసములేవియు లేవని చెప్పవచ్చును. దేశపు నగరములలో జార్జిటౌను (జ. సం. 1,62,000), న్యూ ఆమ్‌స్టర్‌డమ్ (జ. సం. 15,000) ప్రముఖములు. దేశీయులలో 50% ప్రజలు 14 ఏండ్ల వయసును దాటనివారు. ప్రజలలో 50.16% భారతీయ సంతతికి చెందినవారు; 43.2% ఆఫ్రికేయ సంతతివారు, 4.6% ఆదిమ అమెరికన్ సంతతి

వారు; తక్కినవారిలో చీనీయులును, పోర్చుగీజు మొదలగు యూరపీయ సంతతులవారును కలరు. మతరీత్యా 57% క్రైస్తవులు, 34% హిందువులు, 9% ముస్లిములు కలరని తెలియుచున్నది. దేశపు సాధికార భాష ఇంగ్లీషు. అయినను భారతీయ సంతతివారిలో భారతీయ భాషలును, ఆఫ్రికనులలో పటోయిస్ అనబడు సంకర భాషయు ప్రచారమున ఉన్నవి.

**4. సమాచార సౌ. :** దేశమున 147 పోస్టు ఆఫీసులు కలవు (1970). టెలిగ్రాఫ్, టెలిఫోన్, రేడియో సమాచార సౌకర్యములును విరివిగ ఉన్నవి. విదేశములతో రేడియో టెలిఫోన్, టెలిగ్రాఫ్‌లద్వారా వార్తా సంబంధము కలదు.

**5. యాన సౌ. :** దేశమున మొత్తపు రోడ్ల నిడివి 3,011 కిమీ.; ఇందు 479 కిమీ. అత్యుత్తమ శ్రేణికి చెందినది. తీరమును ఆశ్రయించి 127 కిమీ.ల పొడవుగల రైలుమార్గము కలదు. ఇదిగాక బాక్సైట్ ఖనిజపు రవాణాకై, దేశపు వాయవ్య ప్రాంతమున 130 కిమీ. ల పొడవున ఒక రైలు మార్గము కలదు. జార్జిటౌనువద్ద ఒక హార్బరు కలదు. ఇటనుండి విదేశములలో పెక్కింటికి సముద్రమార్గమున నౌకాయాన సౌకర్యము ఉన్నది. సురినామ్‌నకు రాకపోకలను జరుపుటకు కోరెన్ టెయిన్ నదీతీరపు స్ప్రింగ్‌లాండ్స్ రేవు ఉపకరించుచున్నది. జార్జిటౌన్ వద్దనున్న ఒక ప్రముఖ విమానాశ్రయము, అనేక విదేశీయ వాయుయాన సంస్థల విమానములకు మజిలీగ ఉపకరించు చున్నది.

**6. చరిత్ర :** క్రీ. శ. 1499 లో స్పెయిన్ దేశపు నావికులు, ఈ దేశతీరమును దర్శించిరి. అప్పటిలో ఇచట ఆదిమ అమెరికనులు నివసించు చుండిరి. 1746 లో డచ్చివారు ఈ దేశపు నదులగు ఎస్సెక్విబో, దమెరారా, బెర్బిసీల ప్రాంతమున జన స్థావరములను నెలకొల్పి, అట వసించి, దేశమును ఆక్రమింపదలచిన స్పెయిన్, ఆంగ్లదేశముల కృషిని చాలకాలము నిరోధింపగలిగిరి. కడకు 1796 న ఇంగ్లీషువారు ఇట కాలూని, 1814 నాటికి దేశమును అంతటిని స్వాధీనపరచుకొనిరి. వారు అచటి జన స్థావరములను ఏక పరిపాలనలోనికి కొనివచ్చి, 1831 మొదలుగ బ్రిటిష్ గయానా అను పేరిడి, దానిని పాలించిరి. అంతకు పూర్వమే అచటికి డచ్చివారి వలన కొనిరాబడిన నీగ్రోబానిసలు పలువు రుండిరి. 1837 లో బానిసత్వము రద్దుచేయబడగ నీగ్రోలు స్వతంత్రపౌరులై పట్టణములను చేరి, కార్మికులుగ జీవింపసాగిరి. ఇందువలన చెరకు తోటల పనులకు ఇబ్బంది కలుగగా, బ్రిటిష్ ప్రభుత్వము భారతదేశమునుండి కూలీలను కొనివచ్చినది. వారి సంతతివారు నేడు దేశపు ప్రజలలో సగము నకు పైబడియున్నారు; వీరి ముఖ్యవృత్తి వ్యవసాయము. 1928 మొదలుగ అచటి ప్రజలకు ప్రభుత్వమున భాగస్వామ్యము కల్పించుట ఆరంభిత మైనది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున అచట జాతీయోద్యమము చెడ్డీ జగన్, బరన్ హామ్ అనువారి నాయకత్వమున బలపడినది. వీరిలో తొలుతటివాడు భారతీయ సంతతికి చెందినవాడు; రెండవవాడు నీగ్రోజాతీయుడు. 1961 లో బ్రిటిష్ ప్రభుత్వము ఈ దేశమున పరిమిత స్వయం పరిపాలనను కల్పించినది. ఎన్నికలవలన ఏర్పడిన ప్రభుత్వమున చెడ్డీ జగన్ ప్రధాని అయ్యెను. కాని దురదృష్టవశమున చెడ్డీ జగన్, బరన్‌హాములమధ్య వైమనస్యము ఏర్పడి కడకవి భారతీయ, నీగ్రో సంతతులమధ్య కలహములుగ పరిణమించినవి (1963). అంతట బ్రిటిష్ ప్రభుత్వము జోక్యము కల్పించుకొని శాంతిని సంస్థాపించి, ఎన్నికల విధానమున కొన్ని మార్పులను చేసినది. అంతట జరిగిన ఎన్నికలవలన ఏర్పడిన ప్రభుత్వమున బరన్‌హామ్ ప్రప్రథమముగా ప్రధానియై, తదాదిగ,

ఆ పదవియందే ఎన్నికల మూలమున కొనసాగ గలుగుచున్నాడు. ఫిబ్రవరి 23, 1970 న దేశము గైయానా అనుపేర స్వతంత్ర గణరాజ్యమై కామన్ వెల్తులో సభ్యత్వము కలిగియున్నది.

**7. పరిపాలన :** ఈ దేశమున అమలునడున్న రాజ్యాంగ విధానము సహకార గణతంత్ర విధాన మని వ్యవహరింపబడుచున్నది. అట్టి తొలుతటి విధానము ఇదియే. దీనిని అనుసరించి దేశమంతయు ఎన్నికలకై ఒకే ఒక నియోజకవర్గముగ భావింప బడుచున్నది. శాసనాధికారము ఏకకక్ష్యగల శాసన సభయందు న్యస్తము. ఇందలి సభ్యసంఖ్య 53. సాధారణ రీతిలో ఎన్నికలు అయిదేండ్లకు ఒకసారి జరుగును. ఏకపట్టికా విధానమున, నైష్పత్తిక ప్రాతినిధ్యపద్ధతిలో ఎన్నికలు జరుగును. ప్రతి పార్టీయు తన అభ్యర్థుల ఒక పట్టికను ప్రచు రించును. వోటరు ఆ పట్టికలలో ఏదియో ఒకదానికి వోటు చేయవలెను. పార్టీలకువచ్చిన వోట్లనుబట్టి శాసనసభా స్థానములు నిర్ణయింపబడును. అధ్య క్షుని ప్రజలే ఎన్నుకొనెదరు. అతని పదవీకాల పరిమితి ఆరేండ్లు. అతడు ప్రభుత్వమునకు లాంఛ నపు అధినేతగ మాత్రమే వ్యవహరించును. కార్య నిర్వహణాధికారము ప్రధానిది. శాసనసభలోని అధికసంఖ్యాక పక్షపు నాయకుని ప్రధానిగ అధ్య క్షుడు నియమించును. అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. దేశమున పీపుల్స్ నేషనల్ కాంగ్రెస్, పీపుల్స్ ప్రోగ్రెసివ్‌పార్టీ అనునవి ప్రముఖ రాజకీయ పక్షములు. యునైటెట్ ఫోర్సు అను ఒక అల్పసంఖ్యాక పక్షమును పనిచేయు చున్నది. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయ నిర్వహణ సాగుచున్నది. భూస్వామ్య విషయమున రోమన్-డచ్చి న్యాయసంహితయు, తక్కిన వివాద ముల విషయమున ఇంగ్లీష్ న్యాయసంహితయు ఇట అనుసరింపబడుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశపు భూతల సేనయందలి సైనికసంఖ్య 1300; ఇందు ఒక మహిళాయోధ దళమును కలదు. రెండు యుద్ధవిమానములుకల వాయుసేన కలదు.

**9. అంతర్జాతీయ సం :** ఐ.రా.స. యందును, కామన్‌వెల్తునందును, కరిబ్బియన్ స్వేచ్ఛా వాణిజ్య ప్రాంతపు ఒడంబడిక యందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. వ్యావసాయిక, విద్యారంగము లందు అభివృద్ధిని సాధించుటకై ఈ దేశము ఐ. రా. స. నుండియేగాక యు. స్టే., బ్రిటన్, కెనడాల నుండి సాహాయ్యమును గ్రహించినది.

**10. ఆర్థిక రంగము :** వ్యావసాయికోత్ప త్తులలో చక్కెరయు, ఖనిజములలో బాక్సైట్‌ను, ఈ దేశపు ఆర్థికవ్యవస్థకు ముఖ్యాధారములని చెప్పవచ్చును. వ్యవసాయపు ఉత్పత్తులలో చక్కెర తరువాత లెక్కకు వచ్చునది వరిపంట. ఎగుమతు లలో 60% ఆదాయము వ్యావసాయిక వస్తువుల వలననే లభించుచున్నది. అయినను దేశపు భూతల మున 6.5% మాత్రమే సేద్యమున ఉన్నది. ఈ వైశాల్యమును పెంచుటకు అవకాశములు విస్తృ తముగ కలవు. దేశపు భూతలమున దాదాపు 75% అటవీమయము; కాని అడవులను పనిగొని కలపవ్యాపారమును విరివిగ సాగించు కృషి జరు గుట లేదు. ఖనిజములలో బాక్సైట్ అతి ప్రము ఖము. ఆ ఖనిజమును విరివిగ త్రవ్విదీయు ప్రపంచరాజ్యములలో ఈ దేశమునకు మూడవ స్థానము లభించుచున్నది. ఈ ఖనిజమున చాల భాగము విదేశములకు ఎగుమతి యగుచున్నది. బంగారము, మాంగనీజు, వజ్రములు అల్పప్రమా ణములలో లభ్యములగుచున్నవి. దేశపు విద్యు దుత్పత్తి 26.7 కోట్ల కివా (1968). దేశపు ఎగుమతుల విలువ 29,83,68,579 గై. డాలర్లు; దిగుమతుల విలువ 26,46,31,709 గై. డాలర్లు

(1971). దేశపు బడ్జెటరీ వ్యయము 3,18,784 వేల గ్రె. డాలర్లు (1973).

**11. సాంఘిక రంగము :** దేశమున గృహ వసతి చాల తక్కువ; దీనిని చక్కజేయుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. దేశమున అక్షరాస్యత 86%; విద్యాస్థాయి ఉన్నతప్రమాణములు కలది. 6 నుండి 14 వరకు వయసుగల బాలబాలికలు విధిగ విద్యను అభ్యసించి తీరవలెను; విద్యాబోధన ఉచితముగ జరుగుచున్నది. దేశపు 388 ప్రయిమరీ పాఠశాలలలో 1,30,484 మంది, 45 సెకండరీ పాఠశాలలలో 57,093 మంది విద్యార్థులు కలరు (1971). దేశమున ఉన్న ఒకే ఒక విశ్వవిద్యాలయమున విద్యార్థిసంఖ్య 1,112 (1972). ముఖ్యనగరమున ఒక ప్రముఖ గ్రంథాలయమును. మ్యూజియమును కలవు. నాలుగు దైనికవార్తా పత్రికలు ప్రచారమున ఉన్నవి. 1,515 శయ్యాసంఖ్యగల 15 ఆసుపత్రులు కలవు. ఇవిగాక, క్షయ, కుష్ఠరోగము మొదలగు వానికై ప్రత్యేకపు ఆసుపత్రులు పనిచేయుచున్నవి. మలేరియా చాలవరకు నిరోధింపబడినది. కాని బోదకాలు జ్వరపుబాధ తగ్గకున్నది.

**12. యాత్రా సౌ. :** దేశమునందలి ప్రకృతి దృశ్యముల పై విభ్యమును, కైతూర్ జలపాతమును విదేశములనుండి యాత్రికులను పలువురను ఆకర్షించుచున్నవి. కెనడా, యు. స్టే. వాసులకు పాస్‌పోర్టు, వీసాలు అక్కరలేదు. నేటో రాజ్యముల పౌరులకును; స్విజర్లండ్, స్వీడెన్, సాన్ మారినో, లిక్టెన్‌స్టీన్ రాజ్యముల పౌరులకును వీసాలు మాత్రము అక్కరలేదు. తక్కిన దేశముల వారికి పాస్‌పోర్టు, వీసాలు కావలెను.

---

# 7. చి లీ

**ముఖ్యనగరము :** సాంతియాగో; **జెండా :** దిగువ సగము ఎర్రగ ఉండగ, పైదానిలో చివర రెండు భాగములు తెలుపుగను, దండమువద్దనున్న కడమ మూడవభాగమున నీలి భూమికపై పంచకోణముల తెల్లని నక్షత్రమును కలది; **జాతీయ గీతము :** 'కాన్‌సియన్ నేషనల్' అని వ్యవహృతమగునది; **నాణెము :** ఎస్కుడో; ఇది 100 సెంటిసిమోలుగ విభక్తము; ఒక ఎస్కుడో = రు. 7.12; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ. 8 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు నైరుతి తీరమున దాదాపు 17°25′ ద. అ. మొదలు 55°59′ ద. అ. రేఖవరకు ఒక చీలికవలె విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున పెరూ; తూర్పున 1,600 కిమీ. పొడవున అర్జెంటీనాయు, తక్కిన భాగమున బొలీవియాయు; దక్షిణమున డ్రేక్ జల మార్గమును, పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును సరిహద్దులందు ఉన్నవి. ఉత్తర దక్షిణములకు దేశపు నిడివి 4,203 కిమీ; తూర్పు పడమరల నిడివి ఎచటను 354 కిమీ. లను మించదు. ఆగ్నేయపుమూలన కొంతవరకు అట్లాంటిక్ మహాసముద్రమును ఈ దేశమునకు తగులుచున్నది. ఈ హద్దుల మధ్యనున్న దేశపు వైశాల్యము 7,41,167 చ. కిమీ. ఈ ముఖ్య భూతలముగాక, పసిఫిక్ మహాసముద్ర పరివృతములై జాన్ ఫెర్నాండేజ్ మొదలగు దీవులును, ఈస్టర్ దీవియు రాజ్యాంగరీత్యా ఈ రాజ్యమున చేరిఉన్నవి. అంటార్కిటికా (చూ) లోని పామర్ ద్వీపకల్ప

మును తనకే చెందునని ఈ దేశపు వాదము. అర్జెం టీనాతో ఈ దేశమునకుగల కొన్ని సరిహద్దు సమ స్యలు ఇప్పటికిని అపరిష్కృతములుగ నిలిచి యున్నవి.

భూతలరీతినిబట్టి 1. ఆండీస్ పర్వతశ్రేణి 2. తీరప్రాంత శైలశ్రేణి, 3. పై రెండింటి మధ్యనున్న లోయ అని దేశమును విభజింపవచ్చును. దేశపు



పటము 8

వెడల్పున కొన్ని ప్రాంతములందు మూడవవంతును, కొన్ని యెడల దాదాపుగ అంతటిని ఆక్రమించుచు ఉత్తరమునుండి దక్షిణమునకు ఆండీస్ పర్వతశ్రేణి వ్యాపించియున్నది. దీని సరాసరి ఎత్తు 4,500 మీ; దీనియందే, పశ్చిమార్ధగోళపు అత్యున్నత శిఖర మగు అకంకాగువా (7,305 మీ.) కలదు. దేశ మధ్యభాగమువరకు క్రమమున ఎత్తుపెరుగుచు పయనించు ఈ పర్వతశ్రేణి అంతటినుండి ఎత్తు తగ్గుచు దక్షిణమునకు సాగి, దేశపు సరోవర భూమిని చేరి, అగ్నిపర్వతములుగను, హిమాచ్ఛా దిత శైలములుగను పరిణమించుచున్నది. పై పర్వతశ్రేణికన్న సరాసరి ఎత్తున చాల తక్కువది తీరప్రాంత శైలశ్రేణి. దీని ఎత్తు ఎచటను 2,130 మీ. ను మించదు. ఈ రెండు పర్వత శ్రేణుల మధ్యనున్న వంద్రుమట్టి లోయ, రూప రేఖలో క్రమరీతిగ లేకున్నను దాదాపు 960 కిమీ.ల పొడవుదీరి ఉన్నది. దానివెడల్పు ఎచటను 72 కిమీ. లను మించదు. ఇదే దేశపు వ్యవసాయ మునకు ముఖ్యస్థావరము; ప్రజానీకమున అధిక భాగము ఇటనే వసించుచున్నారు. ఆండీస్ పర్వత శ్రేణిలో అటనట జన్మించి, పసిఫిక్ మహాసముద్ర మున చేరు నదులు దాదాపు 30, దేశమున, ఉన్నవి. ఇవి అన్నియు అతిద్రుత గమనము కలిగి, జల పాతమయములై ఉండుటవలన నౌకాయానమునకు ఉపకరింపకున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.** : దాదాపు 40 అక్షాంశల దూరము వ్యాపించియున్న ఈ దేశమున ప్రాంత ములనుబట్టి శీతోష్ణస్థితులందు విపరీతపు వైవిధ్యము కననగుచున్నది. ఉష్ణరీతులనుబట్టి దేశమును, మొత్తముమీద, మూడు విభిన్నప్రాంతములుగ విభజింపవచ్చును, 1. ఉత్తరప్రాంతము; ఇందే ప్రపంచపు ఎడారులలోనెల్ల రూక్షతకు పేరొందిన వానిలో ఒకటియగు గ్రేట్ అటకామా ఎడారి ఉన్నది. ఈ ప్రాంతపు నిమ్నభూములందు అతి తీవ్రపు ఎండలును, పొడిగాలులును ఉండును; పర్వతప్రాంతములందు అంతటంతట గ్రీష్మపు జల్లులు మాత్రము పడుచుండును. 2. మధ్య ప్రాంతము: 30° నుండి 43° ద. అ. వరకు 1440 కిమీ. ల పొడవున వ్యాపించిన ఈ ప్రాంతమున గరిష్ఠోష్ణత 84° ఫా.; కనిష్ఠోష్ణత 37° ఫా. ఎండ కాలము అతిదీర్ఘము. 3. దక్షిణప్రాంతము: ఇది అంతయు పర్వతమయము. విపరీతపు గాలులును,

అత్యంత వర్షపాతమును ఇట కలవు. సాలున సరాసరి వర్షపాతము, దక్షిణ మధ్యదేశమున 50 నుండి 100 సెం. మీ. వరకును, కడమ దక్షిణ దేశమున కొంతభాగమున 500 సెం మీ. ను, ఉండును. బయో-బయో నదికి దక్షిణమునఉన్న దేశమున సాలుపొడవున వానలు కురియుచునే ఉండును. ఆండీస్ పర్వతములందలి ఉన్నత భూములలో, ఉత్తరపు ఉష్ణమండలములందు సైతము, అతి శీతలతయు, హిమావరణమును కననగును. భూతల రీతిని, శీతోష్ణస్థితిని అనుసరించి వృక్షజాలమున సైతము వైవిధ్యము కలదు. ఆండీస్ పర్వత సానువులందు ముండ్లపొదలు, సన్నగడ్డి మాత్రమే ఉన్నవి; మధ్యలోయలో పైను మొదలగు వృక్షములు కలవు. బయోబయో నదికి దక్షిణమున సాంద్రాటవులు కలవు; వీనిలో సూచ్యగ్రజాతి వృక్షములు ఎక్కువ. అత్యంత దక్షిణమునకు పోవుకొలది అడవులు పలుచబడి, గడ్డిమైదానములుగ మారును. తోడేలు, పూమా మొదలగు చిన్న రకపు సస్తనజాతి జంతువులును, చిన్నజాతుల కొన్ని పక్షులును కలవు. తీరజలములందు చేపలు, తిమింగిలములు, సీలుజంతువులు విరివిగ కాననగును.

**3. జనసంఖ్య మొ.:** 1972 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,00,44,940. జనసాంద్రత చ.కిమీ. కు 13.54. ప్రజలలో 68.2% పట్టణములందు వసించుచున్నారు. దేశపు నగరములలో సాంతియాగో (జ. సం. 17,59,007), వాల్పరైజో (2,96,000), కన్‌సెప్సియాన్ (1,78,000) ప్రముఖములు. దేశవాసులలో సమ్మిశ్రజాతివారు(ఆదిమ అమెరికనులును స్పెయిన్ దేశీయులును సంకరత చెందగ రూపొందినవారు) 68%; అచ్చపు యూరపీయ సంతతి 30%; ఆదిమ అమెరికన్ సంతతి 2%. దేశభాష స్పానిష్. కొన్ని ఆదిమ అమెరికన్ జాతులవారు, దేశభాషకు తోడుగ, తమ మాతృభాషలను కూడ మాట్లాడెదరు. యూరపీయులలో కొన్నివర్గములందు జర్మన్ భాష ప్రచారమున ఉన్నది. ప్రజలలో 89.5 రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన వారిలో, ఇతర సంప్రదాయముల క్రైస్తవులును, యూదులును కలరు. ఆదిమ అమెరికన్ జాతులలో దేశీయమగు ఒక ఆరాధనా విధానము ప్రచారమున ఉన్నది.

**4. సమాచార సా.:** ఏజన్సీలతో కలసి పోస్ట్‌ఆఫీసుల సంఖ్య 1,463. తంతి, టెలిఫోనుల సౌకర్యము కలదు. మూడు టెలివిజన్ కేంద్రములు పనిచేయుచున్నవి. 1968 మొదలుగ ఉపగ్రహ సాహాయ్యమున యు. స్టే., యూరపుల నుండి టెలివిజన్ ప్రసారముల స్వీకరించు ప్రక్రియ అవలంబితమైనది.

**5 యాన సౌ.:** దేశపు రోడ్ల మొత్తపు నిడివి 63,433 కిమీ; ఇందు 6,280 కిమీ. బాగుగ సిమెంటు చేయబడినది. రైలుమార్గముల మొత్తపు నిడివి 9,757 కిమీ. దేశమున విమాన స్థావరములు, చిన్నవి పెద్దవి కలసి, 237 కలవు. ఇందు అయిదు స్థావరములు అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించుచున్నవి. దేశపు రేవులలో వాల్పరైజో ప్రముఖము. దక్షిణదేశపు మెగల్లానెజ్, చిలోయీ, అయిసీన్ రేవులు ఆ ప్రాంతపు వ్యాపారమునకు ఉపకరించుచున్నవి; ఇవి మూడును స్వేచ్ఛా వ్యాపారపు రేవులు.

**6. చరిత్ర:** యూరపీయులు దక్షిణ అమెరికాయందు అడుగిడక పూర్వమే అట అతి ప్రాభవముతో మనిన ఇన్‌కా సామ్రాజ్యమున, చిలీ ప్రాంతము అంతర్భాగముగ ఉండినది. 16వ శతాబ్దిలో స్పెయిను సామ్రాజ్యపు సేనలు, ఇన్‌కా సామ్రాజ్యమును అంతమొందించి, ఆ ప్రాంతమును వశపరచుకొనినపుడు సైతము, ఈ దేశపు దక్షిణ

ప్రాంతపు ప్రజలు స్పెయిను సేనలను ప్రతిఘటించి, కొంతకాలము స్వతంత్రులుగ మనగలిగిరి. కడకు ఆ శతాబ్ది అంతమునకు దేశమంతయు స్పెయిన్ వారి సామ్రాజ్యమున అంతర్భాగమైనది. 1810 నుండి దేశమున స్వాతంత్ర్యోద్యమము చెలరేగి, కడకు 1818 లో దేశము స్వతంత్రతను ఆర్జించినది. అంతట దేశాధ్యక్షతను గ్రహించిన బెర్నార్డో ఓ హిగ్గిన్స్ నియంతృత్వరీతిలో దేశమును అయిదేండ్లు పరిపాలించి, వ్యవసాయ వాణిజ్యాదులను ప్రోత్సహించి, తగు సైనిక, నౌకాబలమును నిర్మించెను. తరువాత దేశమున రెండు రాజకీయ పక్షములు – కన్సర్వేటివ్, లిబరల్ పార్టీలు–దేశమున పలుకుబడిని ఆర్జించినవి. అంతట దేశమున కావలసినది ఏకదేశీయ (యూనిటరీ) రాజ్యాంగమా, సమాఖ్యా (ఫెడరల్) రాజ్యాంగమా అను విషయమున వివాదము లేర్పడి, దేశము కల్లోలమయమైనది. అంతట పదింబదిగ రాజ్యాంగములు భగ్నమగుట, నియంతలు ఏర్పడి కొంతకాలము పరిపాలించుట ఆ దేశమున పరిపాటియైనది. అయినను ఈ అంతఃకల్లోల సమయముననే దేశము సరిహద్దుల విషయమై పెరూ, బొలీవియాలతో పోరాటములను సాగించి విజయమును ఆర్జించినది. 1890 లో జార్జిమాంట్ అను నావికోద్యోగి, ఒక తిరుగుబాటును లేవదీసి, 8 మాసముల అంతర్యుద్ధపు పరిణామముగ, దేశమున సుస్థిర రాజకీయ వ్యవస్థకు మార్గమును ఏర్పరచెను. తత్ఫలితముగ దాదాపు 30 సంవత్సరములు పార్లమెంటరీ పరిపాలన నిరాటంకముగ సాగినది. ప్రథమ ప్రపంచయుద్ధానంతరమున పేదప్రజలలో అసంతృప్తియు, అప్పటి రాజ్యాంగమునెడ అసంతృప్తియు ఎక్కువైనవి తత్ఫలితముగ 1925 లో వేరొక రాజ్యాంగవిధానము అమలులోనికి తేబడినది. కాని అది పేదప్రజలకు సంతృప్తిని కలిగించకపోయినది; తదాదిగ దేశము మరల కల్లోలముల పాలైనది. దీనికితోడు సాంఘిక సమస్యలును దేశమును వేధించినవి; 1960 లోని భూకంపము, ఉప్పెన ఈ పరిస్థితులను మరింత విషమింపజేసినవి. పూర్వ రాజకీయ పక్షములు అంతరించి వాని స్థానమున, క్రిస్టియన్ డెమోక్రాటిక్, సోషలిస్ట్, నేషనల్ పార్టీలు ముందునకు రాగలిగినవి. కడకు 1970 లో జరిగిన అధ్యక్ష ఎన్నికలలో సోషలిస్ట్ పక్షము తక్కిన పార్టీలలో ప్రతి ఒకదానికన్నను ఎక్కువగ స్థానములను ఆర్జించినను, మెజారిటీని పొందలేక పోయినది; అంతట క్రిస్టియన్ డెమోక్రాటిక్‌పార్టీ సహకారముతో సోషలిస్ట్‌పార్టీ నాయకుడగు అల్లెండీ దేశాధ్యక్షుడయ్యెను. దేశమునందలి బహుపక్ష వ్యవస్థను, న్యాయ, శాసన విధాయక, కార్యనిర్వాహక వ్యవస్థల స్వాతంత్ర్యమును మన్నించి పాలించుటకు అతడు క్రిస్టియన్ డెమోక్రాట్లకు వాగ్దానమొసగెను. ఈ విధముగ దక్షిణ అమెరికా రాజ్యములందు ఒక రాజ్యమునకు, ప్రప్రథమముగ కమ్యూనిస్ట్ భావములుగల ఒక నాయకుడు అధ్యక్షుడయ్యెను. కాని క్రమేణ అతనియెడ కొన్ని వర్గములందు అసంతృప్తి ప్రబలినది. తుదకు సైనికవర్గము యు. స్టే. ప్రభుత్వపు సాహాయ్యముతో అల్లెండీని తదనుచరులను దారుణముగ వధించి ప్రభుత్వమును వశపరచుకొనినది (సెప్టెంబరు 1973).

**7. పరిపాలన :** 1925 నుండి ఈ దేశమున అమలున ఉండిన రాజ్యాంగ విధానము ప్రస్తుతమున నిలుపుదలచేయబడి దేశమున సైనికపాలన సాగుచున్నది. దేశమునందలి 25 రాష్ట్రములలో ప్రతిదానిని ప్రభుత్వ నియమితుడగు ఉద్యోగి పాలించుచున్నాడు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 20 మొదలుకొని 45 ఏండ్ల వరకు వయసుగలవారు అందరును అవసరమైనపుడు విధిగ సైనిక సేవలో పాల్గొనవలయునను నియమము కలదు. శాంతికాలమున భూతల సైనిక సంఖ్య 24,000. ఇందు 10 కవచిత శకట దళ

ములను కలవు. పటిష్ఠమగు నౌకాసేన కలదు; అందు రెండు యుద్ధ నౌకలును, 2 జలాంతర్గాములును, 4 డిస్ట్రాయరులును, తదితర అనుబంధ నౌకలును కలవు; నౌకాసేనయందలి సైనికసంఖ్య 19,500. వాయుసేనయందు విమానముల సంఖ్య 200; సైనికసంఖ్య 8,5000.

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. సంస్థాపక సభ్యరాజ్యములలో ఈ దేశమొకటి. అమెరికా రాజ్యముల వ్యవస్థయందును సభ్యత్వము ఈ దేశమునకు కలదు.

**10. ఆర్థిక రంగము :** పరిశ్రమలును, వ్యాపారమును ఈ దేశపు ఆర్థికరంగమున ప్రముఖపాత్ర వహించుచున్నవి. అయినను ఖనిజములు - ముఖ్యముగ రాగి, ఇనుము ముడిఖనిజములు-దేశపు విదేశీయ వినిమయ ధనార్జనమునకు ఎక్కువగ తోడుపడుచున్నవి. లాటిన్ అమెరికా దేశములందన్నింట ఈ దేశమున మొత్తపుభూమికిని, సాగునందున్న భూమికిని మధ్యగల నిష్పత్తి కనిష్ఠతమము. మొత్తపుదేశపు భూవైశాల్యము 7,41,77,000 హెక్టేర్లు; ఇందు దాదాపు 3 కోట్ల హెక్టేరులు మాత్రమే సాగునకు అనుకూలము. ఇందు $2\frac{1}{2}$ కోట్ల హెక్టేరులు పశువుల బీడులుగ మాత్రమే వినియుక్తము. పంటలలో గోధుమ ప్రముఖము తరువాత లెక్కింపదగినది చక్కెర బీటు దుంప. 2,77,944 హెక్టేరులు పెంపకపు అటవీభూమి కలదు; ఇందు యూకలిప్టస్ చెట్లు ఎక్కువగ కలవు. ఇదిగాక సహజమగు అటవీ భూమి వైశాల్యము 32,550 చ. కిమీ. ఇందు లభించు కలపలో కొంత విదేశములకు ఎగుమతి యగుచున్నది. కొంత కలప కాగితపు ఉత్పత్తికి వినియుక్తము. చేపలపరిశ్రమ పలువురికి జీవనాధారము. దాదాపు 2 కోట్ల అ. డాలర్ల విలువ గల మత్స్యసంపద విదేశములకు ఎగుమతి అగుచున్నది. ఎగుమతులలో 80 విలువ రాగివలన లభించుచున్నది. ఈ పరిశ్రమ జాతీయము చేయబడినది. సురేకారము ఈ దేశమునుండి విరివిగ ఎగుమతి అగుచున్నది; అటకామా ఎడారిలో ఇది విస్తారముగ లభించును. రాగి తరువాత విరివిగ లభించు ఖనిజము ముడిఇనుము. బొగ్గుగనులనుండి దేశపు అవసరములకై బొగ్గులభించుచున్నది. 1971 నుండి పెట్రోలుగనులలో పనిజరిగి ఉత్పత్తిక్రమేణ పెరుగుచున్నది;దీనివలన లభించు ద్రవితవాయువు, ఇంధనముగ విదేశములకు ఎగుమతి అగుచున్నది. బంగారము, వెండి, మోలిబ్డినియమ్, తుత్తునాగము, మాంగనీజు, గంధకము, సీసము అల్పప్రమాణములలో లభించుచున్నవి. విద్యుదుత్పత్తి 845 కోట్ల కివా. ఎగుమతుల విలువ 125 8 కోట్ల అమెకన్ డాలర్లు; దిగుమతుల విలువ 98 కోట్ల అ. డాలర్ల (1970). బడ్జెటరీవ్యయము 40,68,94,47,000 ఎస్కుడోలు (1972).

**11. సాంఘిక రంగము :** సువ్యవస్థితములగు సాంఘిక శ్రేయోవిధానములు కలిగిన కొలది దేశములలో ఒకటిగ పేర్కొనదగినది ఈ దేశము. 1880 నుండియు ఈ దేశమున ట్రేడ్‌యూనియన్ ఉద్యమము సువ్యవస్థితమై ఉన్నది. కార్మికుని కనీసజీతము,ముఖ్యనగరమున, 2082ఎస్కుడోలుగ ఉండవలయునను చట్టము 1972 లో చేయబడినది. వార్ధక్య. నిరుద్యోగ, రోగ బాధలనుండి రక్షణకై కార్మికులకు తగు భీమావిధానములు అమలున ఉన్నవి. అయినను ఇండ్లవసతి చాల తక్కువ. కార్మికులలో 86% మంది, ఒకేగదిగల ఇండ్లలో నివసించుచున్నారు. 1920 మొదలుగ నిర్బంధోచిత, ప్రాథమిక విద్యావిధానము అమలున ఉన్నది. ప్రయిమరీ పాఠశాలలలో20,43,032 మంది విద్యార్థులు. సెకండరీ పాఠశాలలలో 3,02,064 మంది విద్యార్థులు కలరు. ఎనిమిది విశ్వవిద్యాలయములు కలవు; వీనిలోని విద్యార్థి

సంఖ్య 96,000 (1970). ముఖ్యనగరమున మూడు ప్రముఖ గ్రంథాలయములు కలవు; వీనిలో ఒకటియగు జాతీయ గ్రంథాలయమున పుస్తకసంఖ్య 7 లక్షలు. సాంతియాగోలో రెండు ప్రముఖ మ్యూజియములును, వాల్పరైజోలో ఒక నావిక మ్యూజియమును కలవు. 64 దైనికవార్తా పత్రికలు ప్రచారమున ఉన్నవి. వానిలో ముఖ్య నగరమునుండి వెలువడు 'అల్టిమా హోరా' అను దానికి అత్యధిక ప్రచారము కలదు. 46,099 శయ్యాసంఖ్యకల 671 ఆసుపత్రులు కలవు(1967), వైద్యసంఖ్య 4,094 (1969).

**12. యాత్ర సౌ. :** ఈ దేశముతో దౌత్య సంబంధములుకల విదేశముల పౌరులు పాస్‌పోర్టుతో, లేదా గుర్తు చీటీతో ఈ దేశమున పర్యటించవచ్చును. తదితర దేశములవారికి పాస్‌పోర్టు, వీసాలు ఉండవలయును. ఆండీస్ పర్వతములందలి సరస్సులు, సముద్రతీరపు విహారకేంద్రములు, ప్రాచీనశిలామూర్తులు కలిగిన ఈస్టరుదీవి, ఆండీస్ పర్వతముపైన నెలకొల్పబడిన క్రీస్తుదేవుని బృహద్విగ్రహము పలువురు యాత్రికులను ఆకర్షించుచున్నవి. 1968లో 2,61,214 మంది విదేశీయులు దేశమును సందర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. పెడ్రో డి వల్‌దీవియా (1500-50); స్పెయిన్‌దేశపు పక్షమున ఈ దేశమును జయించి, 1541 లో సాంతియాగో నగరమును నెలకొల్పిన వీరుడు. 2 లౌతరో (1525-57); వల్‌దీవియావద్ద పనివాడుగ ఉండి, అటనుండి విడివడి తన దేశీయులకు నాయకత్వము వహించి స్పెయిన్‌వారి సేనలను ఎదుర్కొనిన ఆదిమ అమెరికన్ వీరుడు. 3. గేబ్రియెలా మిస్ట్రాల్ (1889-1957); 1945 లో నోబెల్ బహుమతిని అర్జించిన మహాకవి. 4. పాబ్లో నెరూడా (జ. 1904); కమ్యూనిస్టు భావప్రేరితుడగు కవి; స్టాలిన్ బహుమతిని పొందెను.

**14. పాలిత ప్రాంతములు :** i. ఈస్టర్‌దీవి; దేశపు పశ్చిమతీరమునకు 3,680 కిమీ. ల దూరమున 27°3'-12' ద. అ. రేఖలకును, 109°14'-25' ప. తు. రేఖలకును మధ్య ఉన్న ఒక ద్వీపము; ఇది అగ్నిశైలీయము; పొడవు 24 కిమీ; వెడల్పు రమారమి 3 కిమీ.; జనసంఖ్య 600; వీరందరును పొలినీసియన్‌జాతికి చెందినవారు అరటిపండ్లు, ఉరలగడ్డలు, చక్కెరచెరకు ఇచటి ప్రముఖ వ్యవసాయోత్పత్తులు. 1680 లో దీనిని ఎడ్వర్డు డేవిస్ అను ఆంగ్లేయుడు కనుగొనెను; చిలీదేశము 1888 లో దీనిని స్వీయము చేసికొనెను. ఇచటి ప్రాచీన బృహత్ శిలామూర్తులును కొన్ని ప్రాచీన శాసనములును ప్రజలను ఆకర్షించుచున్నవి. ఈ శాసనములందలి లిపికిని, భారతదేశములోని ప్రాచీన సింధునాగరికతయందలి లిపికిని కొన్ని సామ్యములు కన్పట్టుచున్నవని విజ్ఞుల అభిప్రాయము.

ii **చిలియన్ అంటార్కిటికా :** (చూ. అంటార్కటికా)

iii. **జాన్ ఫెర్నాండెజ్ :** దేశతీరమునకు పశ్చిమమున 580 కిమీ.ల దూరమున 33°36-48° ద. అ. మధ్యను, 78°45'-80°47' ప తు. మధ్యను ఉన్న ఒక అల్పద్వీపరాసి. మత్స్యపరిశ్రమ ఇచటి ముఖ్యవృత్తి.

iv. **డీగో రామిరాజ్ దీవి :** దేశ దక్షిణ ప్రాంతమున ఉన్న కేప్ హారన్‌కు నైరుతిన 100 కిమీ. ల దూరమున, జనావాసరహితమగు ద్వీపరాశి.

v. **సాన్ ఆంబ్రోసియా దీవి :** దేశతీరమునకు పశ్చిమమున 26°21' ద. అ; 79°54' ప. తు. రేఖలపై ఉన్న ఒక ద్వీపము. ఇది అగ్నిశైలీయము; జనావాస రహితము.

vi. **సాన్ ఫెలిక్స్ దీవి :** పై దీవికి ప్రాగా గ్నేయమున, 20 కిమీ. ల దూరమున ఉన్న జనావాస రహితమగు ద్వీపము; వైశాల్యము 8 చ. కిమీ.

vii. **సాలా యి గోమెజ్ దీవి.** ఈస్టర్ దీవికి 400 కిమీ. ల ప్రాగీశాన్యమున, 26°25′ ద. అ., 105°28′ ప. తు. రేఖలపై ఉన్న ఒక నిర్జన ద్వీపము. అగ్నిశైలీయము.

---

# 8. పరాగ్వే

**ముఖ్యనగరము :** అసన్‌సియన్; **జెండా :** ఎరుపు, తెలుపు, నీలిమపురంగుల అడ్డచారలు సమాన ప్రమాణమున పైనుండి క్రిందికి అమరి యుండగ, మధ్యనున్న తెలుపుచారకు నడుమ జాతీయ యోధ లాంఛనము ఒకవైపునను, మరొక




పటము 9.

వైపున కోశాగారముద్రయు కలది; **జాతీయగీతము :** పరాగ్వయోస్, రిపబ్లికా ఓ మురుతే (పరాగ్వే వాసులారా, గణరాజ్యమో లేక మృత్యువో) అను గీతపాదముతో ఆరంభితమగునది; **నాణెము :** గురానీ, ఇది 100 సెంటిమోలుగ విభక్తము, 100 గురానీలు = రు. 5.[illegible]; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 8 గం= భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండమున, అన్ని దిక్కుల భూపరివృతములగు రెండు రాజ్యములలో ఒకటియగు ఈ దేశము 19°17′ నుండి 27°30′ ద. అ. వరకును, 54°30′ నుండి 62°28′ ప. తు. వరకును విస్తరించియున్నది. ఉత్తరమున బ్రజిల్, బొలీవియా దేశములు, తూర్పున అర్జెంటీనా, బ్రజిల్; దక్షిణమున అర్జెంటీనా; పశ్చిమమున బొలీవియా, అర్జెంటీనా దేశములు సరిహద్దులందున్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 2,46,925 చ. కిమీ. ఇందు పశ్చిమ ప్రాంతము 'చాకో' అని వ్యవహృతమగు బెట్ట ప్రాంతము; దేశపు విస్తృతిలో $\frac{2}{3}$ వంతును ఈ ప్రాంతము ఆక్రమించియున్నది. ఇందు జనావాసములు అరుదుగ మాత్రమే కన్పట్టును. ఇక తూర్పున ఉన్న ప్రాంతము సస్యశ్యామలము. దేశపు జనానీకమున అత్యధికభాగము ఇట వసించుచున్నది. దేశపు నదులలో ప్రముఖము పరాగ్వేనది. కాని దేశపు దక్షిణ భాగమును చేరుసరికి దీనిలో అల్టో పరానానది సంగమించుచున్నది; అటనుండి ఇది పరానానది అని వ్యవహృతము. అర్జెంటీనానుండి ఈ దేశమును వేరుపరచుచు ప్రవహించు పిల్కొ-

మాయో నది కడకు పరాగ్వే నదిలోనే చేరు చున్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున మూడింట రెండువంతుల భూమి సమోష్ణమండలమునను, తక్కినది ఉష్ణమండలమునను ఉన్నది. గరిష్ఠోష్ణత 70° ఫా. నుండి 90° ఫా. వరకును. అరుదుగ కొన్ని ప్రాంతములందు 110° ఫా. వరకును పోవును. కనిష్ఠోష్ణత 50° ఫా. నుండి 70° ఫా. వరకును ఉండును. బ్రజిల్‌వైపునుండి అత్యుష్ణ వాయువులును, దక్షిణ ధ్రువప్రాంతమునుండి అతి శీతల వాయువులును ఈ దేశమున విచ్చలవిడిగ వీచుటవలన ఉష్ణోగ్రతలలో విపరీతపు మార్పులు అత్యల్పకాలములోనే కలుగుచుండును. కొన్ని సందర్భములందు ఒక అరగంటలోనే ఉష్ణోగ్రత యందు 30° మార్పు వచ్చుచుండును. దేశపు తూర్పుప్రాంతమున సాలీనా వర్షపాతము 200 సెం. మీ. కాని పడమటికి పోవుకొలది వర్షపాతము క్రమేణ తగ్గి 'చాకో' ప్రాంతమున 80 సెం.మీ.ను చేరుకొనును. తూర్పుప్రాంతమున వృక్షసంపద విరివిగ కలదు. చాకోప్రాంతమున ముండ్లపొదలు, గడ్డిబీడులు కననగును. సస్తన జంతువులలో లేడి, అడవిపంది, నక్క, రేచు ప్రముఖములు. నదులందు మొసళ్ళు ఎక్కువగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1972 అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 23,28,780. ముఖ్య నగరమగు ఆసన్‌సియాన్‌లోని జనసంఖ్య 3,87,676. జనసాంద్రత చ. కిమీ. కు 5. ఆదిమ అమెరికన్ జాతులలో ఒకటియగు గురానీజాతితో స్పానిష్ సంతతి సంకరమొందగ రూపొందిన సమ్మిశ్రజాతికి చెందినవారు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు. అచ్చపు ఆదిమ అమెరికన్ జాతుల వారు దాదాపు 40 వేలు ఉన్నారు. 1959 మొదలుగ ప్రభుత్వపు అనుమతితో దేశమున వలస చేరిన జపానీయ సంతతివారు దాదాపు 80,000 కలరు. దేశమున స్పానిష్, గురానీ భాషలు రెండును అధికారభాషలుగ పరిగణను పొంది ఉన్నవి. విద్యాబోధనలో స్పానిష్ భాషదే పై చేయిగ ఉన్నను, దేశవాసులలో అత్యధిక సంఖ్యాకులు గురానీనే సాధారణముగ దైనిక వ్యవహారము లందు ఉపయోగింతురు. ఈ భాష ఆదిమ అమెరికన్ భాషల కుటుంబమునకు చెందినది. ఇందు సారస్వత సంపదయు విరివిగ కలదు. పశ్చిమార్ధ గోళపు దేశములలో పరాగ్వేయందు మాత్రమే ఒక ఆదిమ అమెరికన్ భాష అధికార భాషగ పరిగణనను ఆర్జించినది. రోమన్‌కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము అధికారమతముగ గుర్తింప బడినది; అయినను తక్కిన సంప్రదాయముల క్రైస్తవులును తక్కినమతములవారును మతస్వాతంత్ర్యమును కలిగియున్నారు.

**4. సమాచార సౌ. :** అర్జెంటీనా ద్వారా ఈ దేశమునకు తక్కిన ప్రపంచ రాజ్యములతో తంతి వార్తా సంబంధము కలదు; ఇదిగాక జర్మనీ, యు. స్టే., బొలీవియా, చిలీలతో నేరుగ తంతి సౌకర్యము ఏర్పడియున్నది. రేడియో - టెలిగ్రాఫ్ ద్వారాకూడా విదేశములతో వార్తాసంబంధము కలదు. టెలిఫోను సౌకర్యము దేశమంతట బాగుగ ఉన్నది. 8 రేడియో స్టేషనులు, ఒక టెలివిజన్ స్టేషన్ పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశపు రోడ్లనిడివి 6 490 కిమీ; ఇందు 846 కిమీ. మాత్రమే ఉత్తమ స్థాయికి చెందినది. 438 కిమీ. ల నిడివిగల రైలు మార్గము కలదు. ముఖ్యనగరమందలి విమానాశ్రయమున ప్రయాణికుల విమానములలో గరిష్ఠ ప్రమాణమునకు చెందినవి సైతము దిగుటకు వసతులు కలవు. పెక్కు అంతర్జాతీయ విమానయాన సంస్థలకు ఇది ఒక మజిలీ. దేశమున వివిధ

ప్రాంతములముఖ్య విమానయాన వసతులు కలవు. నదులపై నౌకల మూలమున రాకపోకలకు వసతులు కొన్ని ప్రాంతములందు కలవు. పరాగ్వే నదియందు చాలదూరము వరకు నౌకాయానమునకు వసతి కలదు.

**6. చరిత్ర :** స్పెయిన్‌వారిట 1537 లో కాలిడి, అసన్‌సియాన్‌ను నెలకొల్పుటకు పూర్వము నుండియే, ఈ దేశమున గురానీజాతి ప్రజలు వసించి, స్వతంత్రులై మనుచుండిరి. ఆ పరిస్థితులలో స్పెయిన్ దేశమునకు చెందిన జెస్విట్ శాఖవారగు క్రైస్తవమతబోధకులు గురానీ ప్రజలలో చొరబారి వారికి వివిధవృత్తి విద్యలను కళలను నేర్పి, దేశమును సుసంపన్నముగ చేసిరి. ఆ మతబోధకుల పలుకుబడివలన గురానీ ప్రజలు స్వతంత్రముగనే చాలకాలము మనగలిగిరి. కాని స్పెయిన్ దేశపు వలస పాలకులుమాత్రము దేశమును ఎటులనైన తమ సామ్రాజ్యమున కలుపుకొనవలయునను పట్టుదల వహించి, మతబోధకులపై స్పెయిను దేశపు ప్రభువునకు కొండెములు చెప్పి, ఆ మతబోధక సంఘమును నిషేధింపజేసి, దేశముపై దండెత్తి, కొల్లగొట్టి వశపరచుకొనిరి (1767). అయినను దేశీయులతో స్పెయిన్‌దేశీయులగు వారును సంబంధ బాంధవ్యములను ఏర్పరచుకొనుట వలన ఒక సమ్మిశ్రజాతి రూపొందినది. 1810 లో అర్జెంటీనాతో కలసి ఈ దేశము స్పెయిన్ సామ్రాజ్యమునుండి విడివడినను తన స్వతంత్రతకై మరల అర్జెంటీనాతో పోరాడి కడకు 1811 లో స్వతంత్రము కాగలిగినది. కాని తదాదిగ ఈ దేశమున ప్రజాప్రభుత్వము నిలదొక్కుకొనుటకు పరిస్థితులు అనుకూలించినవికావు, ఒక నియంత తరువాత వేరొక నియంత దేశమున నియంతృత్వము నిర్వహించుట పరిపాటి అయినది. వీరిలో కొందరు దేశపు ఆర్థిక వ్యవస్థకు బలమును చేకూర్చిన వారును లేకపోలేదు. కాని 1870 లో, అర్జెంటీనా, బ్రెజిల్, ఉరుగ్వే దేశముల సేనలు ఈ దేశముపై సమష్టిగా సాగించిన దండయాత్రను విజయవంతముగ ఎదుర్కొని ఈ దేశీయులు సాగించిన అయిదేండ్ల పోరాటమున దేశపు పురుషులలో సగము మంది అంతరించిరి. ఇందువలన దేశము పలు సాంఘిక కల్లోలముల పాలయ్యెను. మరల 1932లో చాకో ప్రాంతమునుగురించి బొలీవియాతో ఈ దేశమునకు యుద్ధము సంఘటిల్లినది. ఇందులో పరాగ్వే దేశమే విజయమును సాధించినను, దేశము అధికకష్టముల పాలైనది. ఇందువలన నియంతృత్వ ప్రభుత్వములు పదింబదిగ మారుచు ఒక పరిపాటిగ పరిణమించినది. 1940 లో ఒక రాజ్యాంగ విధానము ఏర్పడినను అది సరిగ అమలు జరుపబడ లేదు. కడకు 1967 లో ఒక రాజ్యాంగ విధానము ఆమోదితమై దానిని అనుసరించి ప్రస్తుతమున పాలన సాగుచున్నది.

**7. పరిపాలన :** దేశమున 18 ఏండ్లకు పైబడిన వారికి అందరికి వోటుహక్కు కలదు. వోటు కలిగిన ప్రతి వ్యక్తియు, ఎన్నికల కాలమున విధిగ వోటువేసి తీరవలయునను నియమము కలదు. అధ్యక్షుడు పౌరులచే అయిదేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో ఎన్నుకొనబడును. అధ్యక్షుడే దేశ పాలకుడు. ఇతడే 11 మంది సభ్యులుగల మంత్రి వర్గమును, సుప్రీమ్‌కోర్టు న్యాయాధిపతులను, ఉన్నతాధికారులలో పెక్కురను స్వయముగ నియమించును. శాసనసభయందు రెండు కక్ష్యలు – శిష్టసభ, ప్రతినిధిసభ అనునవి – కలవు. ఇందులో తొలుతటి దానిలో 30 మంది, రెండవదానిలో 60 మంది సభ్యులు కలరు. కాని ఈ సభలలో ప్రతి దాని యందు $\frac{2}{3}$ వంతు కొలొరాడోస్ అనబడు అధికార పక్షమునకును, తక్కినవి ప్రతిపక్షమునకును చెందవలయునను ఒక విచిత్ర నియమము కలదు. 1947 నుండియు కొలరాడో పార్టీయే అధికారమునందు ఉన్నది. అయిదుగురు న్యాయాధిపతులు

కలసుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశ రాజకీయములందు సైన్యమునకు అధికమగు పలుకుబడి కలదు అధ్యక్షుడే దేశసేనలకు సర్వసైన్యాధిపతిగ వ్యవహరించును. భూతలసేనయందు 11,000 మంది, నౌకాసేనయందు 1,700 మంది, వాయుసేనయందు 1 900 మంది సైనికులు కలరు. నౌకాసేనలకు 5 ఆయుధ నౌకలును, తదనుబంధ నౌకలును కలవు. దేశమునకు సముద్రతీరము లేకపోవుట వలన ఈ నౌకలు నదులందు మాత్రమే చరించుటకు అనువుగ ఉన్నవి. వైమానిక సేనయందు,యు. స్టే. నుండి ఆర్జించిన యుద్ధవిమానములు కొన్ని కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ.రా.స.యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికా రాజ్య వ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. అమెరికా ఖండదేశముల రాజకీయ వివాదములలో యు. స్టే. ను పరాగ్వే సమర్థించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ పశుపోషణలపై చాలవరకు ఆధారపడి ఉన్నది. ఖనిజసంపత్తి అత్యల్పము. వ్యవసాయ పశుపోషణల తరువాత వ్యాపారము లెక్కకు వచ్చుచున్నది. దాదాపు పదిలక్షల హెక్టేరుల భూమి వ్యవసాయమున ఉన్నది. పంటలలో గోధుమ, సోయాచిక్కుడు, ప్రత్తి, చక్కెర. పొగాకు, కాఫీ, నూనెగింజలు క్రమప్రాముఖ్యములను కలిగి ఉన్నవి. దేశమున గోజాతి పశుసంఖ్య 56 లక్షలు; వీనికి తోడుగ 6 లక్షల గుర్రములును, 6.25 లక్షల పందులును, 4.15 లక్షల గొర్రెలును కలవు (1971). ఈ పశువుల వలన మాంసోత్పత్తియు, చర్మముల ఎగుమతియు ఎక్కువగ సాగుచున్నవి. దేశపు తూర్పుప్రాంతమున అటవీసంపద అత్యధికము; నూనెను ఉత్పత్తి చేయు కొబ్బరివంటి కొన్ని జాతుల చెట్లును ఇందు కలవు. ఈ అటవీప్రాంతములందు కొన్ని యెడల పట్టుపరిశ్రమను ప్రోత్సహించుటకై, జపానీయ సంతతివారు మల్బరీ చెట్లను పెంచి ప్రయోగములను నిర్వహించుచున్నారు. మాంసమును బంగీలతో భద్రపరచుట, నూనెతయారీ, జవుళి పరిశ్రమ, రంపపు మిల్లులు, సిమెంటు తయారీ – అనునవి మాత్రమే చెప్పుకొనదగిన పరిశ్రమలు. దేశపు విద్యుదుత్పత్తి 10.86 కోట్ల కివా. (1969). దేశపు ఎగుమతుల విలువ 650 లక్షల అమెరికన్ డాలర్లు; దిగుమతులవిలువ 83.2 లక్షల అ. డాలర్లు; (1971). బడ్జెటరీ వ్యయము 1301.9 కోట్ల గురానీలు (1972).

**11. సాంఘికరంగము :** దేశమున గృహవసతి చాల తక్కువ. వార్ధక్యము, రోగము మొదలగు వానికి చెందిన సాంఘికభీమా సౌకర్యములు ఉద్యోగములందు పనిచేయువారికి మాత్రమే కలవు. దేశమున 15 ఏండ్లకు పైబడిన వారిలో నిరక్షరాస్యత 25% (1969). 7 నుండి 14 ఏండ్ల వయసు కలవారికి నిర్బంధోచిత విద్యను బోధించు నియమము ఉన్నను తగినన్ని పాఠశాలలు లేక అది అమలు జరుపబడుట లేదు. దేశపు 2,587 ప్రయిమరీ పాఠశాలలలో 4,44,894 మంది; 1508 సెకండరీ పాఠశాలలలో 58,666 మంది విద్యార్థులు కలరు (1971). రెండు విశ్వవిద్యాలయములు కలవు. అందలి విద్యార్థిసంఖ్య 11,071 (1972). ముఖ్యనగరము నందలి జాతీయ గ్రంథాలయమును, ఆదిమజాతుల కళా మ్యూజియమును ప్రముఖములు. దేశమున నాలుగు దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో లా ట్రిబ్యూనా అత్యధిక ప్రచారము కలిగియున్నది; కాని తక్కిన లాటిన్ అమెరికన్ రాజ్యములతో పోల్చినపుడు ఈ దేశపు వార్తాప్రతికా ప్రచారము చాల తక్కువ అని చెప్పదగును. నగరములందు

మాత్రమే వైద్యవసతులు చాలవరకు ఉన్నవి. దేశమున 4,254 శయ్యాసంఖ్య కలిగిన 147 ఆసుపత్రులు కలవు; వైద్యసంఖ్య 1,344 (1968).

**12. యాత్రా సౌ.:** దేశపు ఆర్థికపు వనరులలో యాత్రికులవలన వచ్చు ఆదాయముకూడ సముచితపాత్రను నిర్వహించుచున్నది. 1971 లో దేశమును 1,28,676 మంది విదేశీయులు, సందర్శించిరి. యు. స్టే. పౌరులకుదప్ప తక్కిన విదేశీయులకు పాస్‌పోర్టు, వీసాలు విధిగ ఉండితీరవలయును. 90 రోజులకు మించిఉండని యు.స్టే పౌరులకు వీసామాత్రము అక్కరలేదు.

**13. ప్రసిద్ధ పౌరులు:** దేశము స్వాతంత్ర్యము ఆర్జించిన తరువాత వరుసగ పాలించిన పాలకులు ముగ్గురును నియంతలేయైనను దేశాభివృద్ధికి చాల కృషిచేసిరి. వారు 1. జోసీగాస్పర్ రోడ్రిగెజ్ డి ఫ్రాన్సియా (1761-1840) ii. అతని మేనల్లుడు కార్లోస్ ఆన్‌టోనియో లోపెజ్ (1790-1862) iii. పైవాని కుమారుడు ఫ్రాన్సిస్కో సోలానో లోపెజ్ (1827-70).

---

# 9. పెరూ

**ముఖ్యనగరము:** లీమా; **జెండా:** ఎరుపు, తెలుపు, ఎరుపు నిలువుచారలు అమరియుండగ అందు మధ్యనున్న తెలుపుచార నడుమన జాతీయ యోధలాంఛనము కలది. **జాతీయ గీతము:** 'సోమోస్ లైబ్రెస్ సీమోసౌ సీంప్రే' (మనము స్వతంత్రులము, కలకాల మిటులనే ఉండెదము గాక) అను చరణము తొలుత కలది. **నాణెము:** సోలో డివోరో; ఇది 100 సెంటవోలుగ విభక్తము; 10 సోలో డివోరోలు = రు. 1.95; **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి. **కాలగణన:** ఉ. 7 గం = భారతదేశమున సా. 5. గం 30 ని.

**1. ఉనికి మొ.:** దక్షిణ అమెరికా రాజ్యరాజ్యములలో విస్తృతియందు మూడవదిగ లెక్కకు వచ్చు ఈ దేశము 2° నుండి 18°21′ ద. అక్షాంశరేఖలవరకును, 69° నుండి 80° ప. తు. రేఖలవరకును విస్తరించి 12,85,215 చ. కిమీ. ల వైశాల్యమును కలిగి ఉన్నది. పశ్చిమమున పసిఫిక్ మహాసముద్రమును; ఉత్తరమున ఈక్వడార్, కొలంబియా దేశములును; తూర్పున బ్రజిల్, బొలీవియా దేశములును, దక్షిణమున చిలీ దేశమును, ఈ దేశపు సరిహద్దులందు ఉన్నవి. ఈ దేశమునకు ఈక్వడార్‌తోగల సరిహద్దు తగవు 1942 లో చాలవరకు పరిష్కరింపబడినను, 72 చ. కిమీ. ల విస్తృతినిగురించిన తగవు నిలిచియే ఉన్నది. దేశపు తూర్పుపడమరల గరిష్ఠపు నిడివి 1280 కిమీ.; కనిష్ఠపు కొలత 560 కిమీ. పసిఫిక్ మహాసముద్ర తీరపు నిడివి 2,266 కిమీ దేశమును ప్రాదేశికరీతినిబట్టి తీరభూమి, పీఠభూమి, తూర్పుప్రాంతపు అటవీభూమి అనెడు మూడు ప్రాంతములుగ విభజింపవచ్చును. తీరభూమి సన్నని చీలికవలె ఉండి ఎచటను వెడల్పున 160 కిమీ. లకు మించదు; కొన్ని తావులందు దాని వెడల్పు 16 కిమీ. మాత్రమే. ఇచట వర్షపాతము తక్కువ. దేశపు విస్తృతిలో ఇది 12% మాత్రమే అయినను, దేశపు ప్రముఖ నగరములును, రేవు పట్టణములును ఇచటనే కలవు. ఇందు దాదాపు 50 నదులు ప్రవహించుచున్నను, ఇందులో కొన్ని

మాత్రమే సముద్రమును చేరుచున్నవి. తక్కినవి ఊటబావులుగ పరిణమించుచున్నవి. ఈ తీరభూమి లోనికిపోయిన కొలది క్రమముగ ఎత్తుపెరిగి ఆండీస్ పర్వతమాలలో ఒక శ్రేణిగ పరిణమించును; ఇందులకు తోడుగ ఆ పర్వతమాలయందలి ఇతర శ్రేణులును పై శ్రేణిలో చేరుటవలన ఉన్నత పీఠ భూములు రూపొందినవి. ఈ శ్రేణుల మధ్యనే

పటము 10.

టిటికాకా సరస్సు కలదు; ఇది 3,810 మీ. ఎత్తున ఉన్నది. ఇంత ఎత్తున ఉన్న ఇంత సరస్సు, ప్రపంచమున వేరొకటిలేదు. ఈ దేశపు పర్వత శిఖరములలో 5,800 మీ. ఎత్తునకు మించినవి పది శిఖరములు కలవు. ఈ పర్వతమయమగు పీఠ భూమి దేశమున 27% విస్తృతిని ఆక్రమించి ఉన్నది. ఇచటి ఆండీస్ పర్వతశ్రేణిలో జన్మించి అట్లాంటిక్ మహాసముద్రపు వైపునకు పయనించు నదులు తొలుత ఉత్తరమునకో, దక్షిణమునకో పయనించి, అటనుండి తూర్పునకు మరలి అమెజాన్ నదీ పరీవాహ ప్రాంతమున చేరుచున్నవి. ఇక తూర్పుప్రాంతపు అటవీప్రాంతము దేశమున 61% భాగమును ఆవరించినది. ఇచట సాంద్ర వర్షాటవులును ఉష్ణమండలపు జాంగల భూములును కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** తీరప్రాంతమున సాలున గరిష్ఠోష్ణత 90° ఫా. ఇచట వర్షపాతము తక్కువ. పీఠభూమియందు దినరాత్రుల మధ్య ఉష్ణ వ్యత్యాసము చాల ఎక్కువ. అక్టోబరు నుండి ఏప్రిల్ వరకు బాగుగ వర్షములు కురియును, 4725 మీ. ఎత్తునకు మించిన ప్రాంతములు చాల కాలము హిమావృతములై ఉండును. తూర్పుప్రాంతమున సాలీనా వర్షపాతము 180 సెం. మీ. నుండి 320 సె. మీ. వరకు కలదు. అక్టోబరు నుండి ఏప్రిల్ వరకు నియంతరాయముగ వర్షము కురియుచునే ఉండునని చెప్పవచ్చును. ఇట సాలున గరిష్ఠ ఉష్ణోగ్రత 95° ఫా.; కనిష్ఠపు ఉష్ణోగ్రత 75° ఫా. భూమ్యుపరితలపు ఎత్తున కననగు వైవిధ్యమువలన, వృక్షజంతు సంతతులందును వైవిధ్యము ప్రాంతములనుబట్టి కననగుచున్నది. విదేశములనుండి తెచ్చి ప్రవేశపెట్టబడిన యూకలిప్టస్ జాతివృక్షములు, ఇచట బాగుగా ఎదుగ గలిగినవి. పర్వతభూములందు గడ్డిబీడులు ఎక్కువ. తూర్పుప్రాంతపు అడవులందు నానా విధపు వృక్షజాతులు విరివిగ కలవు; రబ్బరు చెట్లును సహజముగనే ఎదిగి అడవులుగ విస్తరించినవి. తీరప్రాంతమున జలములందు వివిధ మత్స్య జాతులు కలవు. గవానో అను వింతపక్షులు తీరమున విరివిగ కననగును. పెద్ద జంతువులు ఏవియు లేవు, ఇలామా, పూమా మొదలగు చిన్న జంతువులుమాత్రమే కననగును.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 1,35,86,300 (1972). ఇందు 13% మాత్రమే

తూర్పు ప్రాంతమున వసించుచున్నారు. జనసాంద్రత చ. కిమీ. కు 10. దేశపు నగరములలో లీమా (జ. సం. 31,58,500), కల్లావో (జ. సం. 3 06,976) ప్రముఖములు. ప్రజలలో 50% ఆదిమ అమెరికన్ జాతికి చెందినవారు. 33 సమ్మిశ్ర జాతివారు; 12 , అచ్చపు యూరపీయ సంతతికి చెందినవారు; చీనీయులును, జపానీయులును అత్యల్ప సంఖ్యలలో కననగుదురు. దేశపు సాధికారభాష స్పానిష్. అయినను, ఆదిమ అమెరికన్ సంతతులలో కొన్ని ఆదిమ భాషలు ప్రచారమున ఉన్నవి. ప్రజలలో 95 రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; తక్కినవారు ఇతర సంప్రదాయముల క్రైస్తవులు. దేశమున మత స్వాతంత్ర్యము చట్టరీత్యా అమలున ఉన్నది. ఆదిమ అమెరికనులలో క్రైస్తవమతముతో పాటుగ, కొన్నియెడల సాంప్రదాయిక ఆరాధనా తంత్రమును అనుసరింపబడుచున్నది.

**4. సమాచార సౌ. :** దేశమున తపాలా ఆఫీసుల సంఖ్య 1,179; తంతి, రేడియోతంతి కార్యాలయముల సంఖ్య 316. కృత్రిమోపగ్రహ సాహాయ్యమున యూరప్, యు. స్టే. లతో ఈ దేశమునకు వార్తాసంబంధము కలదు. టెలిఫోనుల సౌకర్యమును విరివిగ ఏర్పడిఉన్నది. రేడియో-టెలిఫోనులద్వారా వార్తా - సంబంధము దేశపు వివిధప్రాంతముల మధ్యకలదు. దేశమున 153 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశపు రోడ్లనిడివి 45, 549 కిమీ. (1966). ఇందులో 17,114 కిమీ. ఉత్తమశ్రేణికి చెందినది. రైలుమార్గముల నిడివి 2,880 కిమీ. లీమా నుండి, తక్కిన దక్షిణ అమెరికన్ రాజ్యముల ముఖ్యనగరములకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** యూరోపీయులు దేశమున కాలిడుటకు పూర్వమే, ఒక ఆదిమ అమెరికన్ రాజ్యము ఈ దేశమున సువ్యవస్థితమై ఉండినది. ఆ రాజ్యమును 12 వ శతాబ్దమున క్వెచువా జాతివారు సంస్థాపించిరి; ఆ రాజ్యపాలకునకు 'సాపా ఇంకా' (సూర్యపుత్రుడు) అను బిరుదు ఉండుటవలన ఆ రాజ్యమునకు ఇంకా రాజ్యము అను పేరు కలిగినది. తరువాతి 300 సంవత్సరములలో ఆ రాజ్యము ప్రక్క రాజ్యములను లోగొని, ఒక విశిష్ట నాగరిక వ్యవస్థను నెలకొల్పినది. చక్రపు వాడుక అచటివారికి తెలియకపోయినను, దాని సాయములేకనే జంతువుల మూలమున రాకపోకల సౌకర్యమును నెలకొల్పి, వ్యావసాయిక క్షేత్రముల సమష్టి కృషిని ప్రోత్సహించి, ఒక విశేషపు లిపిని రూపొందించి, కళా సారస్వతములను వారు పరిపోషించిరి. దశాంశ గణనమును వారు కనుగొనిరి; కాలగణనకై ఒక విధపు పంచాంగమును వారు రూపొందించిరి. 16 వ శతాబ్ది ప్రథమ పాదమున ఆ రాజ్యపు పాలకుల మధ్య అంతఃకలహములు చెలరేగగ, దానిని అవకాశముగ గ్రహించి, స్పెయిన్ దేశపు సాహసికులు అట కాలిడి, భేదతంత్రమువలన దేశమునంతటిని లోగొని 1535 లో లీమానగరమును రూపొందించిరి. అంతటినుండి దక్షిణ అమెరికాయందలి స్పానీయ సామ్రాజ్యమున, వెనిజ్యులా తప్ప తక్కినదానికి అంతటికిని లీమాయే ముఖ్యనగరమయ్యెను. దేశపు బంగారపు గనులనుండి తీయబడిన బంగారము స్పెయిన్‌నకు తరలింపబడుచుండెడిది. కడకు సైమన్ బొలీవర్ నాయకత్వమున దక్షిణ అమెరికాయందు చెలరేగిన స్వాతంత్ర్యయుద్ధపు ఫలితముగ 1824లో దేశము స్పానీయ సామ్రాజ్యమునుండి విడివడి స్వతంత్రమైనది. 1879 లో స్పెయిన్ దేశము పెరూ దేశపు స్వాతంత్ర్యమును గుర్తించినది. 1879-85 వరకు చిలీతో సాగిన యుద్ధపు ఫలితముగ ఈ దేశము, రెండు రాష్ట్రములను చిలీకి

దత్తము చేసినది; ఈ రాష్ట్రములు అందలి సురే కారపు గనులకు ప్రసిద్ధి చెందినవి.

**7. పరిపాలన :** 20 వ శతాబ్ది ఆరంభమున ఈ దేశమున ఒక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యాంగ విధానము నెలకొనినను, అది పెక్కు పడిదుడుకులకు లోనైనది. అంతటంతట సైనిక పాలనలు ఏర్పడుట పరిపాటియైనది. 1963 లో ఏర్పడిన ప్రజాప్రభుత్వము కొన్ని ప్రజాశ్రేయపు సంస్కరణలను ప్రవేశపెట్టి, పరిశ్రమలను ప్రోత్స హించినను కమ్యూనిస్టులవలన బెడద ఎక్కువైనది. ఆ పరిస్థితులలో సైన్యము ప్రభుత్వమును వశపరచు కొనినది (అక్టోబరు 3, 1968). తదాదిగ దేశ మున సైనికపాలన సాగుచున్నది. లీమాయందలి సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున దేశమున న్యాయ పరిపాలన నిర్వహింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమున నిర్బంధసైనిక శిక్షణ అమలున ఉన్నది. భూతల సేనయందలి సైనికసంఖ్య 35,000; ఈ సేనకు 150 టాంకు లును, అనుబంధ వాయుదళమును, నవీనాయుధము లును కలవు. రెండు క్రూయిజరులును, నాలుగు జలాంతర్గాములును తదనుబంధ నౌకలునుగల నౌకా సేన కలదు; అందలి యోధసంఖ్య 8,000. వాయు సేనయందలి సైనికసంఖ్య [illegible],000; విమానసంఖ్య 240 (1972).

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందు అన్నిం టను, అమెరికా రాజ్య వ్యవస్థయందును ఈ రాజ్య మునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపైనను, ఖనిజములపైనను, ఆధార పడి ఉన్నది. తీరప్రాంతమున అత్యధిక భాగమున ఉత్పత్తియగు రొక్కపు పంటలు ఎగుమతి చేయ బడుచున్నవి. పీఠభూములందలి ఆహారపు పంటలు, చాలవరకు దేశావసరములకు వినియుక్తములు. దేశ మున భూమి సంస్కరణలవలన చిన్న కమతములు రూపొందినవి (1972). ప్రత్తి, చక్కెర, వరి, పప్పుధాన్యాలు, పండ్లు, పొగాకు, దేశపు ముఖ్యపు పంటలు. పశుపోషణకు అవకాశములు ఎక్కువగ ఉన్నను తగినంత కృషి జరుగుటలేదు; పశు మాంసము దేశావసరములకు సైతము సరిపోకున్నది. తీరమున మత్స్యపరిశ్రమ అభివృద్ధి చెందినది. చేప పిండి ఎక్కువగ ఎగుమతి అగుచున్నది అడవు లలో మంచిరకపు కలప లభించుచున్నది; ఇందు సముచితభాగము ఎగుమతి అగుచున్నది. ఖనిజము లకు ఈ దేశము తొలుతనుండియు పేరొందినది. రాగి, ఇనుము, సీసము, తుత్తునాగము విరివిగ లభించుచున్నవి. ఇవిగాక, చలువరాయి, రాతి ఉప్పు, విరివిగ దొరకుచున్నవి. పెట్రోలు లభించుచున్నను దేశావసరములకు సరిపోవుటలేదు. ఖనిజములలో అధికభాగము ఎగుమతి అగుచున్నవి. దేశపు సాలీనా విద్యుదుత్పత్తి 500.3 కోట్ల కివా. (1970). దేశపు ఎగుమతుల విలువ 89.3 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 75.3 కోట్ల అ. డాలర్లు. (1971). బడ్జెటరీ వ్యయము 11,560.5 కోట్ల సోల్‌దివోరేలు (1971-72).

**11. సాంఘిక రంగము :** 1933 మొదలుగ దేశమున సాంఘిక భద్రతా శ్రేయములకు అను వగు వసతులు క్రమాభివృద్ధి చెందినవి. దేశమున తగు గృహవసతిని కల్పించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నను అభివృద్ధి అంతగ కన్పట్టుట లేదు. దీనికి తోడుగ 1970 లో వచ్చిన భూకం పమువలన ఈ సమస్య క్లిష్టతరమైనది. ఐ. రా. స. సహాయమున దీనిని పరిష్కరించుటకు కృషి జరుగుచున్నది. నిర్బంధోచిత ప్రాథమిక విద్యా విధానము అమలున ఉన్నది. దేశమున నిరక్ష రాస్యత 32% (1969). దేశమున 20,034 ప్రయి మరీ పాఠశాలలలో 27.5 లక్షలు; 1,452 సెకం

దరీ పాఠశాలలలో 6,74,000 మంది, 414 సాంకేతిక పాఠశాలలలో 2,23,300 మంది విద్యార్థులు కలరు; విశ్వవిద్యాలయ విద్యార్థుల సంఖ్య 1,05,600 (1970). లీమాయందలి జాతీయ గ్రంథాలయము సుప్రసిద్ధము. ప్రాచీనావశేషములను సంరక్షించు బాధ్యతను ప్రభుత్వము వహించి యున్నది. లీమాలోని మ్యూజియమున క్వెచువా నాగరికతకును, స్పెయిన్ సామ్రాజ్యమునకును, సంబంధించిన సాంస్కృతికావశేషములు కాననగును. దేశమునందలి దినపత్రికలలో ప్రముఖము లయినవి తొమ్మిది; అందును లా క్రానికా అనునది అత్యధిక ప్రచారమును కలిగియున్నది. దేశమున సాంక్రామిక రోగనివారణలో ప్రభుత్వము చాల వరకు విజయము సాధించినది. 29,510 శయ్యా సంఖ్యగల 282 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. వైద్యసంఖ్య 6,223 (1967).

**12. యాత్రా సౌ. :** పాస్‌పోర్టుగాని, గుర్తు కార్డుగాని కలిగియున్న విదేశీయుడు దేశమున 150 దినములు పర్యటించవచ్చును. దేశపు చారిత్రకావశేషములు పలువురు విదేశీయులను ఆకర్షించుచున్నవి. ప్రభుత్వము యాత్రికులకు పెక్కు వసతులను ఏర్పరచినది.

**13. ప్రసిద్ధ పౌరులు :** i. ఇంకా హువైనా కపక్ (1450-1525); ఇన్‌కా సామ్రాజ్యమును విస్తరింపజేసిన ప్రభువు; లలితకళా పరిపోషకుడు. ii. రికార్డో పాల్మా (1833-1919); దేశీయ కవులలో అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినవాడు. iii. జార్జి షావెజ్ (1887-1910); ఆల్ప్స పర్వతములను అధిగమించి, తొలుతగ విమానమును 1910 లో నడిపించినవాడు.

---

# 10. ఫాక్‌లాండ్ దీవులు

## (బ్రిటిష్ పాలిత ప్రాంతము)

**ముఖ్యనగరము :** స్టాన్లీ; **జెండా, జాతీయ గీతము, నాణెము, కొలతూకములు :** గ్రేట్ బ్రిటన్‌వే; **కాలగణన :** ఉ. 9 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు దక్షిణపు కొనయగు కేప్ హారన్‌కు ఈశాన్యమున 768 కిమీ. ల దూరప్రాంతమున దక్షిణ అట్లాంటిక్ మహాసముద్ర పరివృతములై, 51° నుండి 53° ద. అ. వరకును, 57° నుండి 62° ప. తు. వరకును విస్తరించియున్న ద్వీపముల సమూహము ఫాక్‌లాండ్ దీవులు అని వ్యవహృతము. ఇందు అనేక ద్వీపములు కలవు. వీనిలో ఈస్ట్ ఫాక్‌లాండ్, వెస్ట్ ఫాక్‌లాండ అను దీవులు ముఖ్యముగ పేర్కొనదగినవి. ఇందు తొలుతటిదాని వైశాల్యము 5,206 చ. కిమీ; రెండవదాని వైశాల్యము, ప్రక్కనున్న చిన్న దీవులను కలుపుకొని 5,413 చ. కిమీ. ఇవిగాక సౌత్ జార్జియా అని వ్యవహృతమై, ఫాక్‌లాండ్ దీవులకు ఆగ్నేయమున 1,280 కిమీ. ల దూరమున ఉండి, 3,755 చ. కిమీ. ల వైశాల్యము కల ద్వీపవర్గమును, దానికి ఆగ్నేయమున 750 కిమీ. ల దూరమున ఉండి, 337 చ. కిమీ. ల వైశాల్యముకల సౌత్ సాండ్‌విచ్ ద్వీపవర్గమును పరిపాలన రీత్యా, ఈ ద్వీపప్రాంతమున చేరిఉన్నవి. దీవులన్నియు చిన్న గుట్టలతో నిండియున్నవి.

**2 శీతోష్ణస్థితి మొ.:** సాలీనా సగటు దైనిక ఉష్ణోగ్రత 42° ఫా; విపరీత వేగముతో గాలులు వీచును; సంవత్సరము పొడవున ఒకేరీతిగ వానలు కురియును. మొత్తముమీద దినమున సరాసరిన నాలుగుగంటలు మాత్రమే సూర్యకాంతి ఉండునని చెప్పవచ్చును. గడ్డిమైదానములు, జలచర సంతతి మాత్రమే దేశపు సహజ సంపత్తి అని అనదగును.

**3. జనసంఖ్య మొ.:** మొత్తపు ద్వీపరాజ్యపు జనసంఖ్య 2,045 (1970). రాజ్యపు ముఖ్యనగరమగు స్టాన్లీయందలి జనసంఖ్య 1,100. సౌత్ జార్జియా దీవులలోని స్థిరనివాసుల సంఖ్య 11 మాత్రమే. కొన్ని దీవులలో జనావాసములే లేవు. ప్రజలందరు ఆంగ్లేయ సంతతికి చెందినవారు; దేశ భాష ఆంగ్లము; ప్రజలందరు క్రైస్తవులు.

**4. సమాచార సౌ.:** రేడియో - టెలిఫోను ద్వారా గ్రేట్ బ్రిటన్, న్యూజీలాండ్, ఆస్ట్రేలియా మొదలగు ప్రముఖ దేశములతో ఈ ప్రాంతమునకు వార్తా సంబంధము కలదు.

**5 యాన సౌ.:** ముఖ్యనగరమునను తత్ప్రాంతమునను మాత్రమే రోడ్డువసతి కలదు. కొన్ని దీవులమధ్య విమానయాన వసతి కలదు. నౌకాయానముద్వారా గ్రేట్ బ్రిటన్‌తోను, విమానయానమువలన ఆర్జెంటీనాతోను సంబంధము ఈ దేశమునకు కలదు. ప్రాంతపు వివిధ ద్వీపముల మధ్యను, స్టాన్లీ నుండి, బ్రిటిష్ అంటార్కిటికా ప్రాంతమునకును విరివిగ నౌకాప్రయాణ వసతి ఏర్పడియున్నది.

**6. చరిత్ర:** క్రీ శ. 1592లో జాన్ డేవిస్ అను ఆంగ్లేయ నావికుడు ఈ ద్వీపములను కనుగొనెను. కాని 1764 లో ఫ్రెంచివారు ఈస్ట్ ఫాక్‌లాండులో తొలుత ఒక స్థావరమును ఏర్పరచిరి; దానిని 1766 లో వారు స్పెయినువారికి ఇచ్చిరి. 1765 లో బ్రిటిష్‌వారు వెస్ట్ ఫాక్‌లాండును వశపరచుకొనిరి. కాని అనతికాలముననే ఈ దీవులను బ్రిటిష్‌వారును, స్పెయిన్‌వారును వదలివేసి పోగా, ఆర్జెంటీనా వీనిని వశపరచుకొనినది. (1820). అంతట బ్రిటిష్ సేనలు 1832-33 లో బలప్రయోగమువలన ఈ దీవులనన్నింటిని ఆక్రమించుకొనగలిగినవి కాని ఆర్జెంటీనా మాత్రము ఈ దీవులు తనకే న్యాయతః చెందుసని వాదించుచునే ఉన్నది.

**7. పరిపాలన.:** బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, ఒక కార్యవర్గపు సాయముతో పరిపాలనను ఇట నిర్వహించుచున్నాడు; శాసనసభయు ఒకటి కలదు; అందలి 11 మంది సభ్యులలో నలుగురిని ప్రజలు ఎన్నుకొనెదరు.

**8 దేశరక్షణ: 9. అంతర్జాతీయ సం:** ఈ రెండింటి బాధ్యతలను బ్రిటిష్ ప్రభుత్వము నిర్వహించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** పశు, జలచర సంపదపై దేశపు ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉన్నది. వ్యవసాయమును వృత్తిగా అవలంబించువారు ఎవరును లేరు; సొంతవాడుకకై కూరగాయల తోటలు మాత్రము అటనట కలవు. దేశమున గొర్రెల దొడ్ల సంఖ్య అత్యధికము. ఇందులకు తోడుగ గోజాతి పశువులును, గుర్రములును కలవు. 6,34,161 గొర్రెలు, 10,163 గోజాతి, 3,094 గుర్రములు కలవు (1971-72). ఉన్ని, చర్మముల ఎగుమతి పలువురకు జీవనాధారము. సీలు, తిమింగలములను వేటాడి వాని చర్మ, మాంసములను చక్కగ పనిగొనుట ఒక ముఖ్య పరిశ్రమ. ఆహారధాన్యములకొరకు, తక్కిన దైనికావసరముల కొరకు, ఈ ద్వీపరాజ్యము విదేశములపై ఆధారపడిఉన్నది. దేశపు ఎగుమతుల విలువ 7,31,036 పౌనులు; దిగుమతుల విలువ 6,06,976 (1971). బడ్జెటరీ వ్యయము 4,79,000 పౌ. (1972-73).

**11. సాంఘిక రంగము :** 5 నుండి 15 ఏండ్ల వరకు వయసు కలవారికి నిర్బంధ విద్యాబోధన అమలున ఉన్నది. రెండు ప్రభుత్వపు పాఠశాలలు కలవు. అందలి విద్యార్థి సంఖ్య 199; సంచారోపాధ్యాయులవలన 162 మందికి విద్యాబోధ జరుగుచున్నది. ఇవిగాక ఈస్ట్ ఫాక్‌లాండ్‌లో 58 మంది విద్యార్థులుగల ఒక బోర్డింగ్ స్కూలు కలదు (1971). బ్రిటిష్, యూరపీయ వైజ్ఞానిక సంస్థలు నెలకొల్పిన అవేక్షణా కేంద్రములు స్టాన్లీ నగరమున పనిచేయుచున్నవి. వార్ధక్యభృతి, బాలల భృతి మొదలగు సాంఘికసేవా సౌకర్యములు అమలున ఉన్నవి. 32 శయ్యలుకల ఒక ఆసుపత్రి కలదు; వైద్యసంఖ్య 4 (1966).

---

# 11. ఫ్రెంచి గయానా

## (ఫ్రాన్స్‌దేశపు సముద్రోత్తర మండలము)

**ముఖ్యనగరము :** కాయెన్నీ; **జెండా, జాతీయ గీతము, నాణెము, కొలతూకములు :** ఫ్రాన్స్ దేశపువే; **కాలగణన :** ఉ. 7 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు ఈశాన్యతీరమున, అట్లాంటిక్ మహాసముద్రమును అనుకొనిఉన్న ఫ్రెంచి గయానా దేశపు వైశాల్యము 91,000 చ. కిమీ సురినామ్‌నుండి మరోనీనదియు, బ్రజిల్ దేశమునుండి తూర్పున ఓయపోక్‌నదియు దక్షిణమున తుమక్ – హూమక్ పర్వతములును ఈ దేశమును వేరుచేయుచున్నవి. తీరమునకు దరిదాపులలో ఉన్న కొన్ని ద్వీపములును రాజ్యాంగరీత్యా ఈ దేశమున చేరి ఉన్నవి. దేశపు తీరప్రాంతపు వెడల్పు 16 కిమీ. ల నుండి 48 కిమీ. ల వరకు మారుచుండును. ఇది అంతయు చాలవరకు చిత్తడినేల; ఇందు కొంతభాగమున జనులెవరును ఈనాటికిని చొరబారలేదు. తక్కిన భాగమున పర్వతములు, గడ్డబీడులు, నిరక్షరేఖాటవులు కలవు.

**2 శీతోష్ణస్థితి మొ. :** సాలీనా సరాసరి ఉష్ణోగ్రత, తీరప్రాంతమున 80° ఫా. జనవరి నుండి జూనువరకు వర్షఋతువు.

**3. జనసంఖ్య మొ. :** 1967 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 44,392. ఇందు అయిదింట నాలుగువంతులు తీరప్రాంతమున వసించుచున్నారు. అందును దాదాపు సగము ముఖ్యనగరమున ఉన్నారు. దేశీయులలో పలువురు నీగ్రో శ్వేతజాతుల సమ్మిశ్రజాతికి చెందినవారు. దేశాంతర్భాగమున, ఆదిమమానవ నాగరికతా స్థాయిలో ఉన్న ఆదిమవాసులు కలరు; వీరు దాదాపు 3,000 ఉందురు. దేశభాష ఫ్రెంచి; దాదాపుగ ప్రజలందరు క్రైస్తవులు.

**4. సమాచార సౌ. :** తంతి, టెలిఫోను సౌకర్యములు ముఖ్యకేంద్రముల మధ్య కలవు. కాయెన్నీయందును, ఇంకను మరి ఆరు కేంద్రములందును వైర్‌లెస్ స్టేషనులు పనిచేయుచున్నవి.

**5. యాన సౌ. :** ముఖ్యనగరమునుండి తీరప్రాంతపు పలుకేంద్రములకు రోడ్ల వసతికలదు.

మొత్తపు రోడ్లనిడివి 738 కిమీ. దేశాంతర్భాగమున చిన్న పడవలద్వారా నదీమార్గములందు ప్రయాణ వసతులు కలవు. తీరప్రాంతపు వివిధ కేంద్రముల మధ్యను, ముఖ్యనగరమునుండి ఫ్రాన్స్‌దేశమున కును నౌకాయానపు వసతికలదు. దేశాంతర్గతములగు వివిధ ప్రదేశములమధ్యను, ముఖ్యనగరమునుండి ఫ్రాన్స్‌దేశమునకును క్రమపద్ధతిలో విమానయాన సౌకర్యము ఏర్పడియున్నది.

**6. చరిత్ర :** 1604 లో ఫ్రాన్స్ దేశీయులు ఇట కాలిడిరి. 1667 లో జరిగిన ఒక ఒడంబడిక వలన తక్కిన యూరపీయ రాజ్యములు, ఫ్రాన్స్ నకు ఈ ప్రాంతము చెందునని అంగీకరించినవి. 1946 మొదలుగ ఈ ప్రాంతము రాజ్యాంగరీత్యా ఫ్రాన్స్‌దేశముననే సముద్రోత్తర మండలముగ పరిగణింపబడి ఉన్నది. ఫ్రాన్స్‌దేశమున ద్వీపాం తరవాస శిక్ష విధింపబడిన నేరస్తులకు ఇది 1938 వరకు స్థావరముగ ఉండెడిది. కాని ఆ తరువాత ఆ అలవాటు మానివేయబడుటయేగాక, అప్పటికి ఉండిన నేరస్తులును ఫ్రాన్స్‌దేశమునకు పంపివేయ బడిరి (1945).

**7. పరిపాలన :** ఫ్రెంచి ప్రభుత్వము నియ మించు పాలకుడు ఇట పాలనను నిర్వహించును. ఎన్నుకొనబడిన సభ్యులు 16 మందిఉన్న శాసన సభ ఆతనికి సాయము చేయును. ఫ్రాన్స్‌దేశపు జాతీయ శాసనసభయందును, శిష్టసభయందును ఒక్కొక్క ప్రతినిధిచొప్పున ఈ దేశమునకు ప్రాతి నిధ్యము కలదు. కాయెన్నిలో ఒక సుపీరియర్ కోర్టు కలదు; దాని ఆధ్వర్యమున దేశమున న్యాయపరి పాలన సాగుచున్నది.

**8. దేశరక్షణ, 9. అంతర్జాతీయ సం. :** ఈ రెండింటికిని ఫ్రాన్స్‌దేశపు ప్రభుత్వమే బాధ్యత వహించి ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయానుకూల మగు భూమి చాల తక్కువ; సేద్యమునకు తగిన కుశలతయు తక్కువ. అందువలన వ్యవసాయము, ప్రాతవడిన పద్ధతులలో సాగుచున్నది. బేడిస చేపలు, సారా, బంగారము, టాంటలైట్, కలప–వీని ఎగుమతియే దేశపు ఆర్థికవ్యవస్థకు మూలాధారము. దేశావసరములకు దాదాపుగ సరిపోవునటుల వరి, మొక్కజొన్న, అరటిపండ్లు, చక్కెర పండింపబడు చున్నవి. దేశపుఅడవులలో మంచిరకపుకలప దొరకు చున్నది; ఖనిజములలో బంగారము, బాక్సయిటు, టాంటలైటు ముఖ్యములు. ఇందు మూడవదాని విషయమున ఉత్పత్తిలో, ప్రపంచమున ద్వితీయ స్థానము ఈ దేశమునకు కలదు. దేశపు ఎగుమతుల విలువ 2.381 కోట్ల ఫ్రాంకులు; దిగుమతులవిలువ 25.204 కోట్ల ఫ్రాం. (1970). బడ్జెటరీ వ్యయము 14,36,42,611 ఫ్రా. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున ఉచిత ప్రాథమిక విద్యా సౌకర్యము కలదు. ప్రయిమరీ స్కూళ్ళలోని విద్యార్థిసంఖ్య 8,886; సెకండరీ పాఠశాలలలో 3,154 మంది, సాంకేతిక పాఠ శాలలలో 781 మంది, ప్రయివేటు పాఠశాలలలో 2,783 మంది విద్యార్థులు కలరు (1972). వైద్య సౌకర్యములు విరివిగ కలవు. మూడు పెద్ద ఆసు పత్రులు దేశమున కలవు. వైద్యసంఖ్య 23 (1966).

# 12. బొలీవియా

**ముఖ్యనగరము :** సూక్రే (న్యాయతః రాజధాని), లా పాజ్ (యథార్థతః రాజధాని); **జెండా :** ఎరుపు, బంగారు, ఆకుపసిమి రంగుల అడ్డుచారలు సమప్రమాణములలో అమరియుండగ అందు మధ్యనున్న తెలుపు అడ్డుచారలో మధ్యన జాతీయ యోధలాంఛనము కలదు; **జాతీయ గీతము :** బొలీవియానోస్ ఎల్ హేండో ప్రొపీషియో......



పటము 11.

(బొలీవీయులారా, మన ఆశలు ఫలించినవి) అను చరణము తొలుతకలది ; **నాణెము :** పెసో; ఇది 100 సెంటవోలుగ విభక్తము; 1 పెసో = రు. 1.21; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** ఉ. 8 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండము నందలి భూపరివృత దేశములలో ఒకటియగు బొలీవియా 9°3' 50'' నుండి 22°12' ద. అ. వరకును, 57°29'40'' నుండి 69°38'36'' ప. రే. వరకును విస్తరించి ఉన్నది. తూర్పు ఉత్తరములందు బ్రెజిల్, దక్షిణమున పరాగ్వే అర్జెంటీనాలు, పశ్చిమమున చిలీ, పెరూలు ఈ దేశమునకు సరిహద్దులైయున్నవి. దేశపు వైశాల్యము 10,98,580 చ. కిమీ. ప్రాదేశికరీత్యా దేశమును ఆండీస్ పర్వతభూమి, ఆండీస్ ప్రాచ్యభూమి, తూర్పు ప్రాంతపు నిమ్నభూమి - అను మూడు ప్రాంతములుగ విభజింపవచ్చును. ఆండీస్ పర్వతములు ఈ దేశమున రెండు శ్రేణులుగా ఉత్తరము నుండి దక్షిణమునకు వ్యాపించి, ఒక్కొక్కచోట 640 కిమీ. ల వెడల్పును సైతము కలిగియున్నవి. ఈ శ్రేణుల రెండింటిమధ్య 4,000 మీ. ఎత్తుగల పీఠభూమి కలదు. ఈ పీఠభూమియొక్క ఉత్తర భాగమున టిటికాకా సరస్సుకలదు. దక్షిణమున చవిటి పర్రలు ఉన్నవి. ఆండీస్ ప్రాచ్యభూమియే యుంగాస్ అని వ్యవహృతము; దేశపు ప్రముఖ నదులు ఈ ప్రాంతముననే జన్మించుచున్నవి. వానిలో గ్వాపోరీ, మామోరీ, బేనీ, మాద్రీ ది డయోస్ పేరు గన్నవి. అవి అన్నియు కడకు బ్రెజిల్ దేశమున ఒకే ఒక నదిగ సంగమించుచున్నవి. తూర్పు ప్రాంతపు నిమ్నభూమి, దేశమున అయిదింట మూడువంతుల భూమిని ఆక్రమించి ఉన్నది. ఇందలి ఆగ్నేయప్రాంతము చిట్టడవి. ఈ చిట్టడవులలో జన్మించి ముందునకు సాగినది రియో పిల్కొమాయో నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశము ఉష్ణమండలముననే ఉన్నను, భూమ్యున్నతులందును, వర్షపాతమునందును కననగు వైవిధ్యమువలన, శీతోష్ణ పరిస్థితులును మారుచున్నవి. లా పాజ్ ప్రాంతము 3,700 మీ. ఎత్తున ఉండుటవలన అట సాలీనా

సరాసరి ఉష్ణోగ్రత 47° ఫా. మాత్రమే; ఇక తూర్పుప్రాంతపు నిమ్నభూమి యందలి ట్రిని డాడ్‌లో ఆ ఉష్ణోగ్రత 79° ఫా. పశ్చిమపు అత్యున్నత పీఠభూములలో సాలుపొడవున చల్లగాలులు వీచుచునే ఉండును; పగలు ఎండలు తీవ్రముగ ఉన్నను, రాత్రివేళ, ఉష్ణోగ్రత 0° ఫా. కు తగ్గి యుండును. డిసెంబరునుండి ఫిబ్రవరివరకు వానలు కురియును; అయినను పర్వత పీఠభూమి యందు మాత్రము వర్షము చాల తక్కువ. ఆండీస్ ప్రాచ్య భూమిలోని లోయలు సారవంతములు; అట శీతోష్ణ స్థితి సౌమ్యముగ ఉండును; వానలును తగినంతగ కురియును. ప్రదేశములను అనుసరించి ఇట వృక్ష జాతులును మారుచున్నవి. ఉన్నతభూములందు గడ్డిమైదానములును, రెల్లుమడుగులును కలవు. దిగువ ఉష్ణమండలపు అడవులలో క్వినైను తయారీకి ఉపయోగించు సింకోనా చెట్లును, మంచి కలప నొసగు ఉత్తమజాతి వృక్షములును కలవు. బరువులను మోయు ఇలామా యను జంతువు, ఉన్ని నొసగు అల్పాకా ఈ దేశమున విశేషముగ కననగు చున్నవి; చిన్నజాతి మొసళ్ళు నదులందు కలవు.

**3. జనసంఖ్య మొ.:** అంచనాలను అనుసరించి దేశపు జనసంఖ్య 46 58,000 (1970). జనసాంద్రత చ. కిమీ. కు 4. ప్రజలలో 76% పల్లెపట్టులందు వసించుచున్నారు. జనసంఖ్యలో అయిదింట నాలుగువంతులు ఆండీస్ ప్రాచ్యభూమి యందు కలరు. దేశపు నగరములలో లా ప్లాజా (జ. సం. 6,79,000), కొచబంబా (1,49,900), సాంతాక్రజ్ (1,24,900), ఒరూరో (1,19,700), పొతోసీ (96,800), సూక్రే (84 900) ప్రముఖములు. దేశపు ప్రజలలో ఆదిమ అమెరికన్ సంతతివారు 52% నుండి 70% వరకును, మిశ్ర జాతి 10% నుండి 32% వరకును, శ్వేతజాతి 5 నుండి 14.8% వరకును, 2% నీగ్రోజాతియు, అనిశ్చితజాతి 1% వరకు కలరని అంచనాలవలన తెలియుచున్నది. అధికారభాష స్పానిష్; విద్యావంతులందు మాత్రమే ఇది ప్రచారమున ఉన్నది. తక్కిన వారలు ఆదిమ అమెరికన్ భాషలగు క్వెచువా, అయమారా భాషలలో ఏదియో ఒక దానిని మాటాడెదరు. అత్యధిక సంఖ్యాకులు రోమన్‌కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన క్రైస్తవ సంప్రదాయముల వారును, యూదులును అల్పసంఖ్యలలో కలరు.

**4. సమాచార సా.:** దేశమున 418 పోస్టు ఆఫీసులు కలవు; వీనిలో 205 లో తంతి, టెలిఫోను వసతులును కలవు. ఇవిగాక అచ్చముగ తంతి, టెలిఫోనులకు మాత్రమే ఉపకరించునవి 245 పనిచేయుచున్నవి. 40 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు కలవు (1969).

**5. యాన సౌ.:** మొత్తపు రోడ్లనిడివి 25,637 కిమీ.; రైలుమార్గముల నిడివి 3,524 కిమీ. (1971). లా పాజ్‌నుండి అమెరికా ఖండరాజ్యముల ముఖ్యనగరములలో పెక్కింటికిని, దేశాంతర్గత ప్రముఖ నగరములకును విమానయానపు వసతి కలదు.

**6. చరిత్ర:** దక్షిణ అమెరికాయందు యూరపీయులు కాలిడుటకు పూర్వమున అతి వైభవముతో మనిన ఇన్‌కా సామ్రాజ్యమున అంతర్భాగముగ ఈ ప్రాంతము క్రీ. శ. 16వ శతాబ్దివరకు ఉండినది. 1532 న స్పెయిన్ దేశీయులు ఇన్‌కా సామ్రాజ్యముపై దండయాత్ర మొదలిడి 1539 నాటికి దానిని వశపరచుకొనిరి. సూక్రేనగరమును వారే నిర్మించిరి. ఆ కాలమున బొలీవియా దేశము ఆల్టోపెరూ అని వ్యవహృతమయ్యెడిది. 1545 లో ఇట వెండి గనులు బయలుపడుటతో, ఈ దేశముపై స్పెయిన్ వారికి ఆసక్తి అతిశయించినది. తదాదిగ దక్షిణ అమెరికాయందలి విశాల స్పానీయ సామ్రాజ్యమున ఒక భాగముగ దాదాపు మూడు శతాబ్దములు ఈ దేశము మనినది; ఆదిమ అమెరికన్ సంతతివారు

దాదాపు బానిసలుగ నీచజీవితమును ఆకాలమున గడపిరి; ఆ దుర్భరపరిస్థితి నుండి వెలివడుటకై వారు జరిపిన తిరుగుబాటులు నిర్దాక్షిణ్యాముగ అడచివేయబడినవి. కడకు దక్షిణ అమెరికా యందలి శ్వేత జాతీయులే, స్పెయిన్‌దేశపు సామ్రాజ్యముపై, సైమన్ బొలీవర్ నాయకత్వ మున తిరుగుబాటుచేయగ, ఈ దేశపు ప్రజలును సూక్రే నాయకత్వమున అతనికి సాయపడిరి. తత్ఫలితముగ 1824 లో ఈ ప్రాంతము స్వతం త్రమై, బొలీవర్‌యెడ కృతజ్ఞతను సూచించుటకై బొలీవియా అను పేరును గ్రహించినది. సూక్రేయే తొలుతటి అధ్యక్షుడైనను అతడు 1828 లో పద భ్రష్టుడయ్యెను; తదాదిగ దేశమున సువ్యవస్థిత పరి పాలన కరవై, ఒకనిని కాదని వేరొక సేనాని అధ్యక్షతను గ్రహించి, సాధ్యమైనంతకాలము, దేశ మును పాలించుట పరిపాటి అయినది. ఈ కాలము ననే పొరుగు రాజ్యములతో సాగిన యుద్ధముల ఫలితముగ, తన భూతలమున విశాల ప్రాంతము లను చిలీ, పెరూలకు ఈ దేశము చెందజేయవలసి వచ్చినది. అయినను 1899 నుండి 1920 వరకు అప్పటి అధ్యక్షుల దక్షతవలన దేశము కొంత పురోగమించి, తగరపు ఖనిజపు ఉత్పత్తిలో గణ నీయ స్థానమును ఆర్జించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున తగరపు ఎగుమతి అతిశయిల్లి దేశము సుసంపన్నమైనది. కాని ఆ తరువాత దానికి గిరాకీతగ్గి, దేశమున ఆర్థిక సంక్షోభమేర్పడి, పదింబదిగ తిరుగుబాటులు చెలరేగినవి. అయినను 1953 మొదలుగ ఏర్పడిన ప్రభుత్వములు భూసంస్కరణలు, విద్యావ్యాప్తి మొదలగు కొన్ని కార్యక్రమములను చేపట్టుటయేగాక, దేశమున వివిధజాతులమధ్య గాఢ సామరస్యమును నెలకొల్పు టకు కృషిచేయుచున్నవి.

**7. పరిపాలన :** 1825 లో ఈ దేశమునకై ఒక గణరాజ్య ప్రభుత్వ విధానము ఆమోదిత మైనను, అది తరచుగ నిలుపుదల చేయబడి, బలముగలవాడే పాలకుడుగ దేశమున రాజ్యపాలన దీర్ఘకాలము సాగినది. మరల 1945 లో వేరొక రాజ్యాంగవిధానము ఆమోదితమైనది; ఇదియు చక్కగ అమలు జరుపబడలేదు. 1967 లో ఇందుకు తోడుగ వామపక్షపు తిరుగుబాటులు ఎర్నెస్టో చే గ్వెవారా అనువాని నాయకత్వమున చెల రేగినవి. 1967 లో గ్వెవేరాను బొలీవియన్ సేన వధించినను, దేశమున సుస్థిర ప్రభుత్వము ఏర్పడ లేదు. వెనువెంట సైన్యమున వివిధవర్గములు అధి కారమును గ్రహించుటకు యత్నించినవి. ఇట్టి పరి ణామముల మూలమున ఆగస్టు, 1971 లో అధికార మును గ్రహించిన బేంజర్ అను సేనాని ఇపుడు దేశమును పాలించుచున్నాడు. సూక్రేయందలి అత్యున్నత న్యాయస్థానపు ఆధ్వర్యవమున దేశ మున న్యాయపాలన సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశపు భూతల సైనికసంఖ్య 17,000 (1969). 19 నుండి 49 వరకు వయసు గల పురుషులు విధిగ సైనిక సేవయందు శిక్షణను పొందవలయును. వాయు సేనయందలి సైనిక సంఖ్య 2,200; 10 ఫైటర్లును, తదనుబంధ విమాన ములను వాయు సేనకు కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధ సంస్థలయందును, అమెరికా రాజ్య వ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ప్రపంచ బ్యాంకువలన ఈ రాజ్యమునకు 1942-1969 మధ్యచేరిన తలసరి ధనసహాయము, ఆ కాలమున వేరొక దేశమునకు దేనికిని లభించలేదు.

**10. ఆర్థిక రంగము :** సేద్యమునకు అను వగు విస్తారభూమి, అపార ఖనిజసంపద కలిగియు, వానిని సరిగ వినియోగించుకొనలేక దారిద్ర్యమును అనుభవించు ఒక విచిత్ర దేశముగ ఈ దేశము పేరుగన్నది. అందువలననే పలువురు ఈ దేశమును ‘సువర్ణ సింహాసనముపై కూర్చొనిన బిచ్చగాడు’ అని అభివర్ణించిరి. జాతీయ సంపదుత్పత్తిలో వ్యవ సాయోత్పత్తియే అధికాంశమును ఆక్రమించినను

అది అంతయు దేశావసరములకే సరిపోవుచున్నది. దేశపు ఎగుమతుల విలువలో దాదాపు 96% ఖని జోత్పత్తుల ఎగుమతులవలన లభించుచున్నది. దేశపు వ్యవసాయోత్పత్తులలో బంగాళదుంపలు, బార్లీ, జొన్న, చిక్కుళ్ళు, గోధుమ ప్రముఖములు. ఖనిజ సంపత్తికి పేరొందిన ప్రముఖ రాజ్యములలో ఈ దేశమునకు స్థానము కలదు. తగరపు ఉత్పత్తిని విస్తృతముగ సాగించు మూడు దేశములలో ఇది ఒకటి. ఎగుమతియగు ఖనిజముల విలువలో దాదాపు సగము తగరమువలన లభించుచున్నది; ఆల్టోబేసీ ప్రాంతమున ఒంద్రుతోకలసి బంగారము కొలదిగ లభించుచున్నది; దాదాపుగ నెలకు 100 కి. గ్రాముల బంగారము తీయబడుచున్నటుల అంచనా. పెట్రోలియం లభించుచున్నను అది దేశావసరములకే సరిపోవుచున్నది. ఇంధన వాయువును లభించుచున్నది; ఇందు కొంత ఆర్జెంటీనాకు గొట్టములద్వారా ఎగుమతి అగుచున్నది. పరిశ్రమలు గణనీయరీతిలో అభివృద్ధి చెందకున్నవి; దేశపు విద్యుదుత్పత్తి 83.2 కోట్ల కివా. (1971). ఎగుమతుల విలువ 22.8 కోట్ల అమెరికన్ డాలర్లు; దిగుమతుల విలువ 15.85 కోట్ల అ. డాలర్లు (1970). దేశమునకు సముద్రపు రేవు ఏదియు లేకపోవుటవలన ఎగుమతి దిగుమతులు, ఒడంబడికల మూలమున చిలీ, పెరూ దేశముల రేవుల ద్వారా సాగుచున్నవి. దేశపు బడ్జెటరీ వ్యయము 126.53 కోట్ల పెసోలు (1969).

**11. సాంఘిక రంగము :** సమగ్రములు, అత్యంత లాభదాయకములునగు సాంఘిక శ్రేయో విధానములు అమలునందున్న దేశములలో బొలీవియా ఒకటిగ పేరొందినది; కాని ఇందువలన గనులు, ఫేక్టరీలు, రహదారీ శాఖలలో పనిచేయు వారికి మాత్రమే లాభము చేకూరుచున్నది. మొత్తపు కార్మిక సంఖ్యలో వీరు 25% మాత్రమే. పల్లెపట్టులందు తగిన గృహవసతి లేదు. 5 ఏండ్ల వయసునకు పైబడిన వారిలో 63% నిరక్షరాస్యులు. 6 నుండి 14 ఏండ్ల వయసు కలవారికి నిర్బంధోచిత విద్యావిధానము ప్రస్తుతమున అమలున ఉన్నది. పాఠశాలలలో చదువు మొత్తపు విద్యార్థి సంఖ్య 5,81,994 (1968). ఇదిగాక పయోజనులందు విద్యావ్యాప్తికై ప్రభుత్వము కృషిచేయుచున్నది. దేశమున 8 విశ్వవిద్యాలయములు కలవు; అందు లా పాజ్ లోనిది ప్రముఖము; ఇది 1624 లో సంస్థాపితము. దేశమున 12 దైనిక పత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో లా పాజ్ నుండి వెలువడు 'ప్రెజెన్షియా' కు అత్యధిక వ్యాప్తి కలదు (1972). విశ్వవిద్యాలయములందు అన్నింట పెద్ద గ్రంథాలయములు ఉన్నను సూక్రేలోని క్సేవియర్ విశ్వవిద్యాలయమందలిది ప్రముఖము. లా పాజ్ లోని జాతీయ తియాహ్వానాకో మ్యూజియము, అట్టివాని యన్నింట, ప్రశస్తతమము. దేశమున వైద్య వసతులు చాల తక్కువ; మలేరియా, క్షయ, సుఖరోగముల బాధ ఎక్కువ. దేశపు మొత్తమున 10,120 శయ్యాసంఖ్యకల 404 వైద్యశాలలు కలవు. 16,000 ప్రజలకు ఒక డాక్టరు చొప్పున కలడని అంచనా (1966).

**12. యాత్రా సౌ. :** యు. స్టే., కెనడా, స్విజర్లండు దేశముల పౌరులు వీసా లేకుండ, పాస్ పోర్టు మొదలగు వానితోనే దేశమున పర్యటించవచ్చును ఆర్జెంటీనా వాసులకు పాస్‌పోర్టుగాని, గుర్తు చీటిగాని కావలెను. తక్కిన దేశములవారికి పాస్‌పోర్టు వీసాలు, ప్రభుత్వానుమతి ఉండవలయును. యాత్రికులవలన దేశమునకు లభించు ఆదాయము చాల స్వల్పము.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. పెడ్రో డొమింగో మురిల్లో (1757-1810); బొలీవియా స్వాతంత్ర్యోద్యమ వైతాళికుడు; 'ఆండీస్ ప్రాంతపు నెపోలియన్' అని తనను అతడు వ్యవహరించుకొనెను.

# 13. బ్రజిల్

**ముఖ్యనగరము :** బ్రసీలియా; **జెండా :** ఆకు పచ్చ భూమికపై పసుపుపచ్చని వజ్రాకృతియు, ఆ వజ్రాకృతియందు నీలిరంగున అమరిన భూగోళ రూపమును, ఆ గోళమున దక్షిణాకాశపు నక్షత్ర రాశియు కలది; ఈ నక్షత్రరాసియందు సదరన్ క్రాస్ అనబడు నక్షత్రవర్గము సుస్పష్టముగ కన్పట్టును; **జాతీయ గీతము :** 'ఔవిరమ్ దో ఇపిరాంగా



పటము 12.

(ఇపిరాంగా నిస్వనాన్ని ఆలకించండి) అను చరణముతో మొదలిడబడునది; **నాణెము :** క్రుజీరో; ఇది 100 సెంటవోలుగా విభక్తము; ఒక క్రుజీరో = రు. 1.65; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికాలో తూర్పు భాగమున, 5°16′ ఉ. అ. నుండి 33°45′ ద. అ. వరకును, 34°45′ నుండి 74°3′ ప. తు. వరకు విస్తరించియున్న బ్రజిల్ దేశమునకు ఈశాన్యమున, తూర్పున, ఆగ్నేయమున అట్లాంటిక్ మహాసముద్రము సరిహద్దున ఉన్నది; ఈ తీరరేఖ పొడవు దాదాపు 7,840 కిమీ. తక్కిన దిక్కులందు, దక్షిణ అమెరికా దేశమునందలి మిగిలిన రాజ్యములలో చిలీ, ఈక్వెడారు దేశములుతప్ప తక్కినవి అన్నియు ఏదియో ఒకతీరుగ ఈ దేశపు సరిహద్దున ఉన్నవని చెప్పవచ్చును. దేశపు మొత్తపు వైశాల్యమునుబట్టి చూడ ప్రపంచ రాజ్యములలో - సోవియెట్ రష్యా, కెనడా, చీనాల తరువాత-నాలుగవదిగ ఈ రాజ్యము లెక్కకు వచ్చుచున్నది. ఈ విశాల దేశమున ఉత్తర భాగమంతయు అమెజాన్ నదీ పరీవాహ ప్రదేశము. ఈ భాగము దేశ విస్తృతిలో అయిదింట రెండువంతులను ఆక్రమించియున్నది. ఆ అమెజాన్ నది ప్రపంచపు నదులన్నింటిలో పొడవునను, విస్తృతియందును మిన్న. ఈ నది మొత్తపు పొడవు 6,240 కిమీ.; వెడల్పు 3 కిమీ. నుండి 6 కిమీ. వరకు మారుచుండును. అనేకములగు ఉపనదులు ఇందులో వచ్చి చేరుచున్నవి. ఈ పరీవాహ ప్రదేశమంతయు ఒక కారడవి. దీనికి ఉత్తరపుటంచున గ్వియానా ఉన్నత భూములనబడు పర్వతశ్రేణులు కలవు. అమెజాన్ నదీ లోయకు దక్షిణమున బ్రజిలియన్ ఉన్నత భూములని వ్యవహరింపబడు విస్తృతమగు పీఠభూమి కలదు; దీని ఎత్తు సముద్ర మట్టమునకు పైన 400 మీ. నుండి 1,100 మీటరులకు మారుచుండును. ఈ పీఠభూమి ఉత్తరమున బాహియా నగరమును, దక్షిణమున పోర్టో అలెగ్రేను చేరిన వెంటనే ఒకసారిగ ఎత్తుతగ్గి అట్లాంటిక్ తీరమును చేరుటవలన ఒక పెద్ద గోడవలె పరిణమించి మహా ప్రవణము (గ్రేట్ ఎస్కార్ప్‌మెంటు) అని అర్థమొసగు పేరుతో పిలువబడుచున్నది. ఈ ప్రవణమున దక్షిణ బ్రజిల్‌లో 2,100 మీ. నుండి 2,400 మీ. వరకు (సముద్రపు మట్టమునకు పైన) ఎత్తుకలిగిన పర్వత శిఖరములు కలవు; అట్లాంటిక్ తీరమును అనుసరించిన తీరమైదానము ఏదియు కన్పట్టదు; కాని ఈశాన్యప్రాంతమున మాత్రము

ఎడనెడ నిమ్నభూములు కలవు. తీరములోనికి అట్లాంటిక్ మహాసముద్రము అచటకచట లోనికి చొచ్చుకొని వచ్చుటవలన కొన్ని చిన్న అఖాతములు అటనట రూపుగొనినవి. ఈ అఖాతములను ఆశ్రయించియే దేశపు ప్రముఖ నగరములు నిర్మితములు. దక్షిణ బ్రజిల్‌లో పరాగ్వే, పరానా, ఉరుగ్వే నదులు కొంతదూరము ప్రవహించుచున్నవి. కాని అమెజాన్ తరువాత పేర్కొనదగిన నది సావో ఫ్రాన్సిస్కో మాత్రమే. ఇది ఈ దేశమున 1,900 కిమీ. ల దూరము ప్రవహించుచున్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** మొత్తముమీద దేశము ఉష్ణమండలమునకు చెందినదిగ లెక్కింపబడదగి ఉన్నను, సమశీతోష్ణ మండలములును కొన్ని కలవు. అమెజాన్ నదీలోయయందు వేడిగాలుల, ఉష్ణమండల పరిస్థితులు వేద్యములు. బ్రజిలియన్ ఉన్నత భూములందు ఉపోష్ణమండల పరిస్థితులు ఉన్నవి. ఈ భూములు దేశపు వైశాల్యమున దాదాపుగ సగమును ఆక్రమించినవి. దక్షిణపు ఉన్నత మైదానములందు సమశీతోష్ణ పరిస్థితి కలదు. తీరప్రాంతమున ఉత్తరభాగమున ఉష్ణమండల రీతియు, దక్షిణ భాగమున సమోష్ణరీతియు కన్పట్టును. మే నుండి సెప్టెంబరువరకు చలికాలము; డిసెంబరునుండి మార్చివరకును ఎండాకాలము. అక్టోబరునుండి మే వరకు వర్షములు కురియును. అమెజాన్ లోయలో ఎగువ భాగమునను, ఉత్తర తీరమునను, తూర్పు తీరమున కొన్ని తావులందును, దక్షిణ దేశాంతర్భాగమునను, నిమ్నభూములందును వర్షపాతము అత్యధికము. ఈశాన్య ప్రాంతము తరచు అనావృష్టిబాధకు లోనగుచుండును. దేశపు ఉత్తర ప్రాంతమున సాలున సరాసరి ఉష్ణోగ్రత 75° ఫా.; దక్షిణ ప్రాంతమున 64° ఫా. సాలున వర్షపాతము ఈశాన్య ప్రాంతమున 50 సెం. మీ.; ఉండగా, అది అమెజాన్ ప్రాంతమున 300 సెం. మీ. ను చేరుకొనుచున్నది. ప్రపంచమున తెలియనగు వృక్షజాతులలో దాదాపు నాలుగవ వంతు – అనగా రమారమి 50,000 జాతులు – బ్రజిల్‌లో కలవని వృక్షశాస్త్రజ్ఞుల అంచనా. ప్రపంచపు వర్షాధారపు అడవులలోకెల్ల విస్తృతియందు మిన్నయని పేరొందినది అమెజాన్‌నదీ పరిసరపు అటవీభూమి. మంచి కలపకు పేరొందిన వృక్షజాతులు అందు ఎన్నో ఉన్నవి. రబ్బరుచెట్లు అడవులుగ అట పెరుగును. ఇక అమెజాన్ నదీ లోయకు దక్షిణమున ప్రశస్త వృక్షసంతతి అంతగ కన్పట్టదు. చిట్టడవులు, పొదలు, గడ్డిబీళులు ఎక్కువ. అటనే విచిత్రములగు పుష్పజాతులును అటనట కలవు. సస్తనజాతి మృగములలో పెద్దవి కన్పట్టవు; ఉన్నవానిలో బ్రజిలీయ వ్యాఘ్రము, రేచువంటివి ప్రముఖములు. దేశపు నదులలో తాబేళ్లు, వింతచేపలు విరివిగ కన్పట్టును; మాంసాహారియగు ఒక విధపు చేప, 'పిరానా' అనబడునది, ఆ నదులలో పలుతావులందు చూడనగును. మొత్తముమీద వేటకు అనువగు జంతు సంపద చాల తక్కువయని చెప్పవచ్చును.

**3. జనసంఖ్య మొ.:** అతి విశాలమగు ఈ దేశమున 1970 లెక్కలను అనుసరించి జనసంఖ్య 9,32,15,301 మాత్రమే. జనసాంద్రత చ. కిమీ.కు 11. ప్రజానీకమున దాదాపు 39% తీరప్రాంతపు రాష్ట్రములలోను, 22% ఈశాన్య ప్రాంతపు రాష్ట్రములలోను, తక్కినవారు మిగిలిన వివిధ రాష్ట్రములందును కలరు. దేశ నగరములలో సావోపౌలో (జ. సం. 63 లక్షలు), రియో డి జనీరో (జ. సం. 44 లక్షలు), బెలో హోరిజాంటీ (13 లక్షలు), పోర్టో అలెగ్రే (10 లక్షలు) పేర్కొనదగినవి. ముఖ్యనగరమగు బ్రసీలియా యందలి జనసంఖ్య 4 లక్షల 40 వేలు మాత్రమే (1970). (ఈ నగరము అధునాతన రీతిలో 1956 మొదలుగ నిర్మితమై, 1960 లో దేశపు రాజధాని అటకు తరలింపబడినది; అంతకు పూర్వమున రియోడి జనీరో నగ

రము దేశమున ముఖ్యనగరముగ ఉండెడిది. దేశీయులలో యూరపీయ సంతతివారు 60%, నీగ్రో జాతివారు 10%, సమ్మిశ్రజాతివారు 20%, ఆదిమ అమెరికన్ జాతివారు 9%, ఆసియాజాతులవారు 1% కలరని అంచనా. దేశభాష పోర్చుగీజు. దక్షిణ రాష్ట్రములలో కొన్ని ప్రాంతములందు ఇటాలియన్, జర్మన్ భాషలను మాటాడువారు లక్షల సంఖ్యలలో కలరు. విద్యావంతులందు పలువురికి ఫ్రెంచితోగాని, ఇంగ్లీషుతోగాని పరిచయము సర్వసామాన్యముగ ఉండును. ప్రజలలో దాదాపు 90% రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. జపానీయ సంతతిలో బౌద్ధమతము చాలవరకు ప్రచారమున కలదు. ప్రొటెస్టంటు సంప్రదాయపు క్రైస్తవులు దాదాపు 30 లక్షలు, యూదులు 125 వేలు కలరు. కొన్ని నీగ్రోవర్గములందు ప్రకృతి దేవతారాధన ప్రచారమున ఉన్నది. మొత్తముమీద దేశమున మత సామరస్యము బాగుగ కుదురుకొని ఉన్నది.

**4. సమాచార సౌ.:** దేశమున 5,601 స్థానిక పోస్ట్ ఆఫీసులును, 1,393 టెలిగ్రాఫ్ ఆఫీసులును కలవు. ఇవిగాక ప్రాంతీయ పోస్ట్ ఆఫీసులు 33, తంతి కార్యాలయములు 47 పనిచేయుచున్నవి (1968). టెలిఫోనుల సంఖ్య 20 లక్షలకు మించినది. 1,008 బ్రాడ్‌కాస్టింగు స్టేషనులును, 49 టెలివిజన్ స్థావరములును కలవు (1971). ఇదిగాక 1969 మొదలుగ కృత్రిమ ఉపగ్రహ మూలమున, దేశీయముగ, అంతర్దేశీయముగ వార్తా సంబంధ సౌకర్యము విరివిగ ఏర్పడినది.

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 12,17,725 కిమీ. ఇందు జాతీయ ప్రభుత్వపు రోడ్ల నిడివి 40 వేల కిమీ; రాష్ట్ర ప్రభుత్వముల రోడ్ల నిడివి 1,13,600 కిమీ. తక్కిన రోడ్లు స్థానిక సంస్థల అధీనమున ఉన్నవి. జాతీయపు రహదారులలో 40%, రాష్ట్రముల వానిలో 20% కు లోపుగ, సిమెంటు చేయబడినవి (1971). రైలు రోడ్ల నిడివి 32,364 కిమీ. (1936). దేశపు నదులలో 25,110 కిమీ. ల నిడివిన నౌకాయాన సౌకర్యము కలదు. దేశపు తీరమున పెద్ద రేవు నగరములు 15 కలవు. వీనిలో రియో డి జనీరో, సాంతోస్ నగరములవద్ద ఉన్న హార్బరులు అత్యుత్తమ స్థాయికి చెందినవి. దేశపు దిగుమతులలో మూడింట రెండువంతులు రియో డి జనీరోద్వారా దేశమునకు చేరుచున్నవి. సాంతోస్ రేవున బొలీవియా, పెరూ దేశములకు రేవు వసతులను ఈ దేశము కల్పించినది. పెద్దరేవులుగాక, 930 చిన్న రేవులును కలవు. దేశపు వర్తక నౌకాదళపు మొత్తపు టన్నేజి 12,94,000. దేశమున విమానయాన సౌకర్యము సువ్యవస్థితము. దేశీయములగు 20 కంపెనీలును, విదేశీయములగు 6 కంపెనీలును విమానయాన వసతులను దేశమునకు కల్పించుటలో పాల్గొనుచున్నవి

**6. చరిత్ర:** తొలుత ఆదిమ అమెరికనులలో కొన్ని తెగలవారికి నివాసముగఉన్న ఈ ప్రాంతమున యూరపీయులు వశపరచుకొనుటకు పెడ్రో అల్వరెజ్ డ కాబ్రల్ అను పోర్చుగీజు నావికుడు మార్గదర్శకుడయ్యెను. ఇతడు మే 3, 1500 న ఈ దేశపు తీరముపై కాలిడెను. ఆ సంవత్సరముననే అమెజాన్ నదీ ముఖద్వారమున విసెంట్ పింజాన్ అను స్పెయిన్ దేశీయ సాహసిక నావికుడు కాలిడి, ఈ ప్రాంతమంతయు స్పెయిన్ దేశమునకే చెందవలయునని వాదించెను. స్పెయిన్, పోర్చుగల్ దేశములమధ్య ఈ ప్రాంతపు స్వామ్యమునకై చెలరేగిన ఈ వివాదము అప్పటి పోపుయొక్క మధ్యవర్తిత్వమువలన పరిష్కృతమై తద్ద్వారా ఈ ప్రాంతము పోర్చుగల్‌కు దక్కినది. దేశపు తీర ప్రాంతమున ఉండు ఎర్ర చంద్రకొయ్య తొలుత పోర్చుగల్‌కు విరివిగ ఎగుమతియైనది. ఆ కొయ్యకు

స్థానికముగఉన్న 'పావ్ - బ్రసిల్' అను పేరును బట్టి దేశమునకును బ్రజిల్ అను పేరు కలిగినది. బ్రజిల్ దేశమున పోర్చుగీజులు వలసచేరుట 1502 లో మొదలైనది. క్రమముగ దేశమున పలు ప్రాంతములందు పోర్చుగీజు సంతతివారు చేరుటతో 1549న పోర్చుగల్‌దేశపు రాచరికపు ఆధిపత్యమున, ఇట వ్యవస్థిత పరిపాలన నెలకొల్పబడెను. ఆ సంవత్సరముననే 'జెసూయిట్' అనబడు మతప్రచార సంస్థవారు దేశమున చేరి క్రైస్తవమత ప్రచారమును మొదలిడిరి. క్రమముగ దేశమందంతట పోర్చుగీజుల మత భాషా సంస్కృతులు వ్యాపించినవి. ఇటుల అతి దీర్ఘకాలము ఈ దేశము పోర్చుగీజు సామ్రాజ్యమున ఉండి, ఆ సామ్రాజ్యమున ఒక ముఖ్యభాగముగ, ప్రముఖతను పొందెను. 1693 లో బంగారపు గనులును, 1720 లో వజ్రపు గనులును కనుగొనబడిన తరువాత పోర్చుగీజులు పూర్వము కన్న మిన్నగ వచ్చి దేశమున వలసచేరిరి. ఆ గనులలో పనిపాటులకై నీగ్రో బానిసలును కొనిరాబడిరి ఫ్రాన్స్‌దేశపు ప్రభుత్వము పోర్చుగల్‌పై దండెత్తి ఆక్రమించినపుడు పోర్చుగల్‌దేశపు రాజకుటుంబమే బ్రజిల్‌కు తరలివచ్చి, 14 సంవత్సరములు అట ఉండి, పోర్చుగల్ విముక్తిచెందిన తరువాత అటకు మరలిపోయినది. కాని అప్పటికే దేశవాసులలో పలువురు ప్రముఖులందు స్వాతంత్ర్యకాంక్ష పెరిగినది. తత్ఫలితముగ, పెడ్రో అనువాని నాయకత్వమున ప్రజలు తిరుగుబాటుచేసి, రక్తపాతము దాదాపు ఏదియు లేకుండగనే, దేశమునకు స్వాతంత్ర్యమును కల్పించిరి (1821). పెడ్రో అంతట దేశమునకు రాజయ్యెను. కాని అనతికాలమున అతడు పదవీచ్యుతుడుకాగా, అతని కుమారుడు పెడ్రో II రాజై (1840), విజ్ఞాన శాస్త్రములను కళలను పరిపోషించి, జనరంజకముగ పరిపాలించెను. కాని అతడు బానిసతనమును రద్దు చేయుటవలన ఆర్థికవ్యవస్థ సంక్షోభితమైనది; తత్ఫలితముగ అతడు పదవీభ్రష్టుడుకాగా, 1881 లో దేశమున గణతంత్ర ప్రభుత్వము ఏర్పడినది. ఇటుల నామమాత్రముగ గణతంత్ర ప్రభుత్వము ఏర్పడినను తొలుత ఆ ప్రభుత్వము కొంతకాలము వరకు సైనిక పాలనలోనే ఉండినది. 1894 లో తుదకు దేశమున రాజకీయ సుస్థిరత ఏర్పడినది. దేశమున ఉత్పత్తియగు రబ్బరునకు, ఆగ్నేయాసియా దేశముల పోటీవలన, ధరపడిపోయినను. కాఫీగింజల ఉత్పత్తిలో దేశము ఈ శతాబ్ది ఆరంభమునకు ప్రపంచమున ప్రథమ స్థానమును ఆక్రమించినది. కాని 1930 లో ఆర్థిక సంక్షోభము వలన దేశము దెబ్బతినినది. అంతట నియంతృత్వరీతి ప్రభుత్వము ఏర్పడినది. ఈ పరిస్థితులలో ప్రజల ఆందోళనకు ఫలితముగ ఒక నూతన రాజ్యాంగముతో గణతంత్ర ప్రభుత్వము ఏర్పడుట జరిగినది. 1961 లో ఈ రాజ్యాంగము సవరింపబడినది. కాని ఆర్థిక కారణములవలన రాజకీయ సుస్థిరత చాలకాలమువరకు నెలకొనజాలక పోయినది. అయినను 1970 అనంతరమున ఏర్పడిన ప్రభుత్వములు పరిస్థితిని అదుపులోనికి కొనివచ్చి, ప్రణాళికా బద్ధముగ దేశ పురోగతిని సాధించుటకు కృషిచేయుచున్నవి.

**7. పరిపాలన :** ప్రస్తుతపు రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున గణతంత్ర ప్రభుత్వ విధానము అమలున ఉన్నది. పెద్దవియు, చిన్నవియు కలసి దేశమున 22 రాష్ట్రములు కలవు. ఇవిగాక 4 ప్రాంతీయ మండలములును, ఒక సమాఖ్యా మండలమును ఉన్నవి. అధ్యక్షుడు, కాంగ్రెసునకు బాధ్యతవహించి పాలనను నెరపును. అధ్యక్ష ఉపాధ్యక్షులలో ప్రతియొకని పదవీకాల పరిమితి అయిదేండ్లు. వారు ఇరువురును ఒక ప్రత్యేక నియోజకవర్గముచేత, బహిరంగపు వోటింగు పద్ధతిన ఎన్నుకొనబడుదురు. ప్రత్యేక పరిస్థితులలో పౌరుల రాజకీయాధికారములను పది

యేండ్లకాలము స్తంభింపజేయుటకును. అధ్యక్షునికి అధికారము కలదు. కాంగ్రెసున ప్రతినిధులసభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధుల సభలోని సభ్యసంఖ్య 273. ఈ సభకు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. శిష్టసభలోని సభ్యసంఖ్య 69. వీరిలో ప్రతియొకని పదవీ కాల పరిమితి ఎనిమిదేండ్లు. అయినను శిష్టసభలోని సభ్యులలో వంతువారిగా సగముమంది నాలుగేండ్లకు ఒకసారి పదవీ విరమణచేయు ఏర్పాటు కలదు. సాధారణ పరిస్థితులలో ప్రతిసాలున మార్చి 15 నుండి డిసెంబరు 15 వరకు కాంగ్రెసు సమావేశమగును. 18 ఏండ్లనుండి 65 ఏండ్లవరకు వయసుగలవారిలో పురుషులందరును, ఉద్యోగములు చేయు స్త్రీలును విధిగ వోటుచేసి ఎన్నికలందు పాల్గొని తీరవలయునను చట్టము కలదు. 65 ఏండ్లకు పైబడిన పురుషులకును, నిరుద్యోగినులగు స్త్రీలకును, సైన్యమున పనిచేయువారికిని వోటు చేయుట ఐచ్ఛికము. రాజ్యాంగము ఇంత కట్టుదిట్టముగ ఉన్నను, 1964 మొదలుగ కాంగ్రెసు, రాష్ట్రములలోని శాసనసభలు సైనికవర్గపు పెత్తనమునకు లోబడి పనిచేయుచున్నవని పలువురి అభిప్రాయము. దేశమున తొలుత పెక్కు రాజకీయ పక్షములు ఉండినను 1966 మొదలుగ జాతీయ పునరుద్ధరణకూటమి, బ్రజిలీయ ప్రజాతంత్ర ఉద్యమము అని అర్థమొసగు పేరులుగల రెండు పక్షములు మాత్రమే పనిచేయుచున్నవి. కమ్యూనిస్ట్ పార్టీ నిషిద్ధము. రాష్ట్రములందును, మండలములందును ఎన్నుకొనబడిన సభలు ఉన్నను, వానికి గల అధికారములు చాల తక్కువ. 16 మంది జడ్జీలుగల ఫెడరల్ సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున సమాఖ్యకు చెందిన విషయములందును, ఆ యా రాష్ట్రములందలి కోర్టులవలన రాష్ట్రములకు చెందిన విషయములందును న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** 21 నుండి 45 వరకు వయసు కలిగిన పురుషులు సైనిక సేవలో కావలసినపుడు విధిగ పాల్గొని తీరవలయునను నియమము కలదు. భూతల సేనయందలి సైనిక సంఖ్య 120 వేలు; ఇందు ఏడు పదాతి పటాలములును, 4 యాంత్రిక దళములును, 1 కవచశకట దళమును, 1 సంచార దళమును కలవు. నౌకా సేనయందు 42.120 మంది సైనికులు కలరు; ఇందు ఒక విమానవాహకనౌకయు, రెండు క్రూయిజర్లును, 11 డిస్ట్రాయర్లును, 2 జలాంతర్గాములును, 40 తదితర సహాయక నౌకలును కలవు; ఈ నౌకా సేనకు అనుబంధముగ వేరుపరచని నిర్వహించు ఒక వాయుదళము కలదు. వాయుసేనయందలి సైనిక సంఖ్య 30,000. పోరాటపు విమానముల దళములు మూడును, తదనుబంధ విమానములును కలవు; ఇవి అన్నియు నవీనాయుధ సంపన్నములు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందు అన్నింటను, అమెరికా రాజ్యముల వ్యవస్థయందును, లాటిన్ అమెరికన్ స్వేచ్ఛా వ్యాపార మండలియందును ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది. అమెరికా రాజ్యముల బ్యాంకునుండియు, యు. స్టే. నుండియు, ఈ దేశము విరివిగ ధనసాహాయ్యమును గ్రహించినది. సంవత్సరమునకు 25 కోట్ల డాలర్ల చొప్పున యు. స్టే. నుండి ఈ దేశమునకు 1964 నుండి సహాయము లభించుచున్నటుల తెలియుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశము పారిశ్రామికముగ పురోగమించుచున్నను వ్యవసాయము, ఆర్థిక రంగమున ప్రముఖపాత్రను వహించుచునే ఉన్నది. 1971 లోని దేశపు ఎగుమతుల విలువలో 57% వ్యావసాయిక ఉత్పత్తులవలన లభించినది. దేశపు ప్రజానీకమున 51.39% పల్లెపట్టులందు వసించుచు, వ్యవసాయమున పాల్గొనుచున్నారు. కార్మిక

శక్తిలో 44% వ్యవసాయరంగమున వినియుక్తము. సాగునఉన్న భూమి వైశాల్యము 10.7 కోట్ల ఎకరములు; 36.2 కోట్ల ఎకరముల భూమి గడ్డి బీడులుగ వినియుక్తము; సాగునకు అనువుగ ఉండియు సేద్యమునలేనిది 36.7 కోట్ల ఎకరములు. వ్యావసాయిక ఉత్పత్తులలో చక్కెర చెరకు, మొక్కజొన్న, వరి, కాఫీ, చిక్కుళ్లు, ప్రత్తి, గోధుమ, నారింజపండ్లు క్రమప్రాముఖ్యములను కలిగిఉన్నవి. 1971 లో దేశమున 246 లక్షల బస్తాల (ఒక బస్తా =60 కి. గ్రా.) కాఫీగింజలు ఉత్పత్తి అయినవి. ప్రపంచపు మొత్తపు కాఫీగింజల ఉత్పత్తిలో ఇది మూడవవంతు. దేశపు ఎగుమతుల విలువలో 28.3% కాఫీగింజల ఎగుమతివలన లభించినది (1971). దేశమున గోజాతి పశువులు 97,864 వేలు, పందులు 65,374 వేలు, గొర్రెలు 24,724 వేలు, మేకలు 14,609 వేలు, గుర్రములు 9,114 వేలు, కలవని అంచనా (1970). పశుమాంసమున అత్యధికభాగము దేశావసరములకే సరిపోవుచున్నది; చాలకొలదిగ మాత్రమే ఎగుమతి అగుచున్నది. దేశపు వైశాల్యమున 40% అటవీమయము; ఇందు అత్యుత్తమజాతికి చెందిన కలప లభించుచున్నది. రబ్బరుచెట్లును విరివిగ కలవు. దేశపు రబ్బరు అవసరములకు ఇందలి ఉత్పత్తి చాలవరకు సరిపోవుచున్నది. దేశపు ఖనిజోత్పత్తులలో ముడిఇనుము, మాంగనీజు, రాక్షసిబొగ్గు, రాతిఉప్పు, తగరము, బాక్సైటు, సీసము, బంగారము, వజ్రములు ప్రముఖములు. భూగర్భపు ఇనుప ఖనిజముల నిలువల దృష్టిలో, ఈ దేశమునకు ప్రపంచమున నాలుగవ స్థానము కలదని అంచనా. పెట్రోలియము లభించుచున్నను దేశావసరములకు అది సరిపోవకున్నది. వ్యావసాయికోత్పత్తుల విలువలలో వచ్చు హెచ్చుతగ్గులవలన, ఆ ఉత్పత్తులను నమ్ముకొనియుండుట ప్రమాదకరమని భావించి, దేశమున పారిశ్రామికోత్పత్తిని పెంచుటకు సమధిక కృషి జరుగుచున్నది. దేశపు ఆగ్నేయ, దక్షిణ ప్రాంతములందు పరిశ్రమలు విరివిగ కలవు. ఉక్కు, సిమెంటు, యాంత్రిక శకటములు, రబ్బరు వస్తువులు, కొయ్యపని – అనువానికి సంబంధించిన పరిశ్రమలు విరివిగ అభివృద్ధి చెందుచున్నవి. నౌకానిర్మాణ పరిశ్రమయు కొంత పురోగతిని ఆర్జించినది. ఇక తక్కిన పరిశ్రమలలో రసాయనిక పదార్థములు, జవుళి, ఆహార వస్తువులు–అనువానికి చెందినవి పేర్కొనదగినవి విద్యుదుత్పత్తి 7,190 కోట్ల కి. వా. (1971). మొత్తము దేశమున వస్తూత్పత్తి ప్రతిసాలున 9.1% చొప్పున అభివృద్ధి చెందుచున్నదని అంచనా. దేశపు ఎగుమతుల విలువ 1,53,73,766 వేల క్రుజీరోలు; దిగుమతుల విలువ 1,92,16,071 వేల క్రుజీరోలు (1971). దేశపు బడ్జెటరీ వ్యయము 3217.7 కోట్ల క్రు. (1972).

**11. సాంఘిక రంగము :** 1930 మొదలుగ సాంఘిక భద్రతా చట్టము అమలునఉన్నను, అందువలన 40 లక్షలమంది పట్టణ కార్మికులకు మాత్రమే ప్రయోజనము లభించుచున్నది. గృహవసతిని ప్రజలకు కలిగించుటకై ప్రభుత్వము నిరంతర కృషిని సాగించుచున్నది. ప్రజలలో 54.5% కు తగిన శౌచ వసతులుకల ఇండ్లు లేవు. దేశమున అక్షరాస్యత 61.56% అయినను గత కొలది సంవత్సరములనుండి విద్యావ్యాప్తిని విస్తృతము చేయుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము అమలునఉన్నది. 1,46,136 ప్రయిమరీ పాఠశాలలలో 1,28,12,029 మంది (1970), 14,779 మాధ్యమిక పాఠశాలలలో 45,62,126 మంది (1971), 2,620 ఉన్నత పాఠశాలలలో 5,61,397 మంది (1971) విద్యార్థులు కలరు. విశ్వవిద్యాలయముల సంఖ్య 54 అందలి విద్యార్థి సంఖ్య 5,61,397 (1971). గ్రంథాలయములందు, రియో డి జనీరో

లోని జాతీయ గ్రంథాలయమును, మ్యూజియము లలో అచటి జాతీయ మ్యూజియమును ప్రముఖములు. జాతీయ గ్రంథాలయమున గ్రంథసంఖ్య 6 లక్షలు; అందు అపురూపపు వ్రాతప్రతులు అనేకములు కలవు. దేశమున విపుల ప్రచారము కలిగిన 25 ప్రముఖ దినపత్రికలలో ఓ డియా అనునది అత్యంత వ్యాప్తి పొందినది. నగరములందు వైద్య వసతులు విరివిగ ఉన్నను, పల్లెపట్టులందు వాని సంఖ్య పరిమితము. ప్రభుత్వపు ఆసుపత్రులు 530, ప్రయివేటు ఆసుపత్రులు 3,070 పనిచేయు చున్నవి; వైద్యసంఖ్య 42,827.

**12. యాత్రా సౌ. :** దేశమునకు విదేశీయ యాత్రికులను ఆకర్షించుటకు 1966 మొదలుగ ప్రభుత్వము కృషిచేయుచున్నది. యాత్రికులకై పలు ప్రదేశములందు వసతులు కల్పింపబడినవి. దేశపు ఆగ్నేయ ప్రాంతమున పరానా నదిపైఉన్న ఇగ్వాస్సూ జలపాతము, బాహియా నగరపు చర్చిలు, అమెజాన్ నదీలోయల దృశ్యములు, కొపకబానా బీచి (సముద్రతీరము) యాత్రికులను విరివిగ ఆకర్షించుచున్నవి. అమెరికా ఖండపు దేశములవారు పాస్‌పోర్టు, వీసా లేకుండ వీటితో దేశమున పర్యటించవచ్చును. 1976 లో 1,77,263 మంది విదేశీయులు దేశమును సందర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. బ్రెజిల్ దేశపు స్వాతంత్ర్యోద్యమమునకు మూలస్తంభముగ పేరెన్నికగనిన జోసెబోనిఫేసియో అండ్రాడా ఇ సిల్వా (1763-1838); ఇతడు రాజకీయ వేత్తయేగాక, భూగర్భ శాస్త్రవేత్తగను, కవిగనుకూడ ప్రసిద్ధి గాంచెను. 2. పెడ్రో II (1825-1891) దేశపాలకుడు; 1840 నుండి 1889 వరకు పాలించెను; జాతీయైక్యమునకు, విజ్ఞానశాస్త్ర, కళావికసనమునకు సమధిక కృషిచేసెను; బానిసతనమును నిర్మూలించెను. 3. జోవాక్విమ్ నబూకో (1849 - 1910); బానిసతనపు నిర్మూలనమునకు కృషి చేసినవాడు.

---

# 14. వె ని జ్యు లా

**ముఖ్యనగరము :** కరకాస్; **జెండా :** అడ్డముగ అమరియుండు పసుపు, నీలి, ఎరుపు చారలలో, నడుమనున్న నీలిచారయందు వక్రరేఖాకృతిలో వరుసదీరిన ఏడు తెల్లని నక్షత్రములును, పసుపుచారపై జాతీయ యోధ లాంఛనము కలది. **జాతీయ గీతము :** 'గ్లోరియా అల్ బ్రేవో పూబ్లో' (ధీర ప్రజానీకానికి విజయోస్తు) అను చరణము తొలుత కలది; **నాణెము :** బొలివర్; 100 సెంటిమోలుగ ఇది విభక్తము; ఒక బొలివర్ = రు. 1.67; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 7 గం. 30 ని. = భారత దేశమున సా 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ అమెరికా ఖండపు ఉత్తర తీరమున, 0°45′ నుండి 12°12′ ఉ. అ కును, 59°45′ నుండి 73°09′ ప. తు. కును విస్తరించియున్న వెనిజ్యూలాకు తూర్పున గైయానా, దక్షిణమున బ్రజిల్ కొలంబియాలు, పశ్చిమమున కొలంబియా, ఉత్తరమున కరిబ్బియన్ సముద్రము సరిహద్దులందు ఉన్నవి. తీరప్రాంతమునఉన్న

కొన్ని చిన్నలంకలును, రాజ్యాంగరీత్యా దేశమునకు చెందిఉన్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 9,12,050 చ. కిమీ. రాజ్యపు తూర్పు - పడమరల గరిష్ఠపు నిడివి 1,485 కిమీ.; ఉత్తర-దక్షిణముల గరిష్ఠపు కొలత 1,265 కిమీ. కరిబ్బియన్ తీరరేఖ నిడివి 2,800 కిమీ. దేశము భౌగోళికరీత్యా నాలుగు ప్రాంతములుగ విభజింప వలనుపడుచున్నది. అవి : 1. ఉత్తర ప్రాంతపు ఆండీస్ పర్వతశ్రేణి, 2. పశ్చిమ ప్రాంతమున ఉన్న మరకైబో సరోవరపు



పటము 13.

పరీవాహభూమి, 3. ఆగ్నేయ ప్రాంతమున సుదూరమునకు విస్తరించిన మైదానముల అడవులు, 4. ఓరినోకో నదికి దక్షిణమున, దేశమున దాదాపు సగభాగమును ఆక్రమించి, ఇప్పటికిని సరిగ వివరములు తెలియరాని జనరహితమగు పీఠభూమి. దేశమున పడు వర్షజలమున దాదాపు అయిదింట నాలుగువంతులను కొనిపోవు ఓరినోకో నది 2,560 కిమీ.ల నిడివిని కలిగియున్నది. దీని ముఖద్వారపు డెల్టాయొక్క వైశాల్యము 23,400 చ. కిమీ. ఈ నదిగాక చిన్ననదులు దాదాపు వేయి కలవు. ఈశాన్యప్రాంతమునఉన్న ఆండీస్ పర్వత పీఠభూమికిని, పశ్చిమమునేఉన్న ఆ పర్వతపు వేరొక శాఖకును మధ్యగల దేశభాగమున దేశీయ ప్రజలలో 90% నివసించుచున్నారు. ఈ భాగపు వైశాల్యము దేశమున నాలువవంతు మాత్రమే. ఇందే, ఆండీస్ పర్వత పీఠభూమియందు, ముఖ్య నగరమగు కరకాస్ ఉన్నది. మరకైబో సరస్సులోనికి సముద్రమునుండి నౌకలు పయనింపగలుగుచున్నవి. ఆ సరస్సు నిడివి 203 కిమీ , వెడల్పు 80 కిమీ. దేశపు పర్వత శిఖరములందెల్ల పికో బొలివర్ (5,000 మీ.) అత్యున్నతము. దేశపు ఆగ్నేయ ప్రాంతమున ఉన్న ఏన్‌జెల్ జలపాతము (980 మీ.) ఉన్నతియందు, ప్రపంచపు జలపాతములందెల్ల మిన్న.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమునందలి శీతోష్ణస్థితితో ప్రాంతముల ఉన్నతి మొదలగువానిని అనుసరించి, ఉష్ణమండల, ఉపోష్ణమండల, సమోష్ణమండల పరిస్థితులు వేర్వేరు ప్రాంతములందు కననగుచున్నవి. దేశమున సాలున గరిష్ఠోష్ణోగ్రత 106.5 ఫా. ముఖ్యనగరమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 68.9 ఫా. మే నుండి అక్టోబరు వరకు వానలు కురియును; ఆ కాలమున హరిత వృక్ష, సస్య సంపత్తి ఎల్లెడల దేశమున కన్పట్టును. కాని తక్కిన కాలమున దేశపు భూతలము బీటలువారి, నిర్జలమై, రంగుమాసి ఉండును. దేశపు అత్యున్నత పర్వత ప్రాంతములు మాత్రము సదా హిమావరితములు. మరకైబో ప్రాంతమున సాంద్రాటవులున్నను, క్రమముగ తక్కిన ప్రాంతములకు వచ్చునరికి వృక్షసంపద తగ్గి, పచ్చిగడ్డి మైదానములు మాత్రమే కననగును. వన్యజంతువులు పెక్కు జాతులవి కలవు. అందు అడవి గుర్రములు, రేచులు, గాడిదలు, మచ్చలఎలుగులు ఎక్కువగ కననగును. పక్షిజాతులును పెక్కు కలవు; నదులలో పెక్కింట మొసళ్ళు ఉన్నవి. మత్స్య సంపద బహుళము.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 1,07,21,522 (1971). అడవులలో వసించు

ఆదిమ - అమెరికనుల సంఖ్య ఇందు చేరకున్నది; నగరములలో కరకాస్ (జ. స. 20 లక్షలు), మరాకైబో (655 వేలు), బార్క్విసిమెతో (272 వేలు) ప్రముఖములు. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు (65%) మిశ్రమజాతికి చెందినవారు; 21% అచ్చపు శ్వేతజాతివారు; 7% నీగ్రోసంతతి; 7% ఆదిమ అమెరికన్ జాతులవారు. సాధికారభాష స్పానిష్. అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. దేశమున చట్టరీత్యా మత స్వాతంత్ర్యము కల్పింపబడినది. దాదాపు 26,000 ప్రాటెస్టంటు శాఖవారును, పదివేలమంది యూదులును కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున విస్తృతముగ తంతి సౌకర్యమును, పట్టణములలో టెలిఫోను వసతులును కలవు. ఇందులకు తోడుగ నిస్తంత్రీ విధానపు తంతి, టెలిఫోను వసతులును ఉన్నవి. తంతి టెలిఫోను స్థావరముల సంఖ్య 72. జలాంతర్గతమగు టెలిఫోను సాధనపు వసతి యు. స్టే. తో కలదు. రేడియో స్టేషనుల సంఖ్య 72. ముఖ్యనగరమున 3 టెలివిజన్ స్టేషనులు పని చేయుచున్నవి.

**5. యాన సౌ. :** దేశపు రోడ్లనిడివి 28,198 కిమీ. ఇందు 13,220 కిమీ. సిమెంటు చేయబడినది. రైలురోడ్ల నిడివి 475 కిమీ. దేశాంతర్గతమగు విమానయానమున 100 విమానములు పాల్గొనుచున్నవి. అమెరికా ఖండపు దేశములతోను, యూరపీయ దేశములలో పెక్కింటితోను విమానయాన సౌకర్యము దేశమునకు కలదు. సముద్రతీరపు రేవులలో లా గ్వైరా, మరకైబో, పోర్టో కాబెల్లో, పోర్టో అర్గాజ్, గ్వాన్టా ప్రముఖములు. అనుమతి లేనిదే విదేశీయ నౌకలు ఏవియు వ్యాపారమున పాల్గొనరాదు. దేశపు వర్తక నౌకాదళమున 100 నౌకలు కలవు; వాని టన్నేజి 2,16,734. దేశపు నదులలో కొన్నింట - ముఖ్యముగా ఓరినోకో నదియందును, దాని ఉపనదులందును - పడవలద్వారా రాకపోకల సౌకర్యములును, వ్యాపారపు వసతులును ఏర్పడి ఉన్నవి

**6. చరిత్ర :** ప్రముఖ దేశాన్వేషకుడగు క్రిస్టఫర్ కొలంబస్, 1498 ఆగస్టు 1 న, ఈ దేశమును కనుగొనెను. తదాదిగ ఈ ప్రాంతము కొంతకాలము స్పెయిన్‌దేశపు రాజునకు చెందియుండెను. కాని జర్మనీదేశపు ఒక వర్తకసంస్థకు, స్పెయిన్ దేశపు రాజు ఋణపడియుండి, దాని పరిహారమునకై ఈ ప్రాంతమున వలసలను నెలకొల్పు అధికారమును ఆ వర్తక సంస్థకు దత్తముచేసెను (1528). ఈ వర్తకసంస్థయొక్క అధీనమున దేశము 18 ఏండ్లు ఉండినది. ఆ కాలమున ఆ సంస్థ దేశమును కొల్లగొట్టుటయేగాక, దేశపు ఆదిమవాసులను చాల హింసించినది. అంతట 1546 లో వర్తకసంస్థ నుండి ఈ ప్రాంతమును స్పెయిన్‌దేశపు ప్రభుత్వమే వశపరచుకొని, దేశమును చిన్న జమీలుగ విభజించి, సాహసికులగు స్పెయిన్ దేశీయులకు కొందరికి పంచిపెట్టినది. ఏబదియేండ్ల తరువాత ఈ జమీల పద్ధతియు రద్దుచేయబడినది. అప్పటికి దేశమున ఒక సమ్మిశ్రజాతి అత్యధికముగ రూపొంది, జాతీయత నెలకొనినది. అంతట దేశమును స్వతంత్రము చేయుటకై యత్నములు సాగి కడకు, సైమన్ బొలివర్ (చూ. బొలీవియా) సాహాయ్య ఫలితముగ స్వాతంత్ర్యము లభించినది (జులై, 1819). తత్ఫలితముగ కొలంబియా, ఈక్వడారు, వెనిజ్యులాలు కలసి, బొలీవర్ అధ్యక్షతన గ్రాండ్ కొలంబియా అను ఒక సమాఖ్యరాజ్యముగ రూపొందినవి. ఆ సమాఖ్యనుండి 1829 లో వెనిజ్యులా విడివడినది. కాని దేశమున అంతఃకలహములు చెలరేగి అధ్యక్షులు పదింబదిగ మారుట చాలకాలమువరకు సాగినది. ఈ నడుమ ఎన్నియో రాజ్యాంగములు రచింప

బడి అంతరించినవి. కడకు 1908 నుండి 1936 వరకు దేశాధ్యక్షత వహించిన జాన్ విన్‌సెంటీ గోమెజ్ ఆధిపత్యకాలమున దేశమున వ్యవసాయము అభివృద్ధి చెందినది; పెట్రోలియమ్ గనులును కనుగొనబడినవి. తదాదిగి పెట్రోలియపు ఆదాయ మువలన సుసంపన్నమై దేశము పురోగమించినది. కాని రాజకీయ సుస్థిరత మాత్రము దేశమునకు కరవైనది; దేశపు వామపక్షీయులు పరిస్థితిని మరింతగ కల్లోలపరచిరి. కడకు 1961 లో ఒక నూత్న రాజ్యాంగము రూపొందింపబడి దానిని అనుసరించి పాలన సాగుచున్నది.

**7. పరిపాలన :** 1961 వ సంవత్సరపు రాజ్యాంగ విధానమును అనుసరించి దేశమున గణతంత్ర విధానము అమలున ఉన్నది. 18 ఏండ్ల వయసునిండిన పౌరులకు అందరికి వోటుహక్కు కలదు. దేశాధ్యక్షుని, అయిదేండ్లకు ఒకసారి జరుగు ఎన్నికలలో, ప్రజలు ఎన్నుకొనెదరు. ఉపాధ్యక్ష పదవిలేదు. అధ్యక్షుడు మరణించినను, లేదా అశక్తుడైనను, ఆ వెంటనే 30 దినములలోపల కాంగ్రెసు సమావేశమై వేరొక అధ్యక్షుని ఎన్నుకొనును. కాంగ్రెసున శిష్టసభ, ప్రతినిధుల సభ అను కక్ష్యలు కలవు. తొలుతటి దానియందు రాష్ట్రమునకు ఇరువురు చొప్పున ప్రతినిధులు కలరు (రాష్ట్ర సంఖ్య 20; సమాఖ్యామండలము అదనపు రాష్ట్రముగ లెక్కకు వచ్చును). వీరుగాక అల్ప సంఖ్యాక వర్గముల ప్రతినిధులుగ కొందరిని శిష్టసభలో సభ్యులుగ అధ్యక్షుడు నియమించును; పదవీ విరమణచేసిన అధ్యక్షుడును శిష్టసభయందు సభ్యుడుగ ఉండును. దేశమునందలి 50,000 మంది ప్రజలకు ఒక్కొక్కరు చొప్పున ప్రతినిధుల సభయందు సభ్యులుందురు. రెండు సభలలోని సభ్యుల పదవీ కాలపరిమితి 5 ఏండ్లు. అధ్యక్షుడే మంత్రివర్గమును నియమించుకొనును; శాసనసభా తీర్మానములను త్రోసివేయుటకు అతనికి అధికారము కలదు. అయినను కాంగ్రెస్‌లో మూడింట రెండు వంతులు అందులకు అభ్యంతరము తెలిసినపుడు మాత్రము అతడటుల చేయజాలడు. రాష్ట్రము లందును రాష్ట్రపాలకునికి పరిపాలనలో సాయపడుటకు ఎన్నుకొనబడిన రాష్ట్ర శాసనసభలు కలవు. రాజకీయ పక్షములు 13 ఉన్నను, పాపులర్ డెమోక్రాటిక్ ఫ్రంట్ అనునది సుసంఘటితము. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యవమున న్యాయనిర్వహణ సాగుచున్నది. ఆ కోర్టునందలి జడ్జీలను కాంగ్రెస్ ఎన్నుకొనును.

**8 దేశరక్షణ :** 18 ఏండ్లు నిండిన పౌరుడు రెండు సంవత్సరములు విధిగ సైన్యమున పనిచేయ వలయునను నియమము కలదు. దేశపు భూతల సేనలో దాదాపు 20 వేలమంది సైనికులు కలరు; ఆ సేనలో ఒక అశ్వికదళము, 12 పదాతి దళములు, 2 టాంకు దళములు, వీనికి తగిన అనుబంధ దళములు, విమానఘ్నదళము కలదు. నౌకా సేనలో మొత్తపు యోధసంఖ్య 7,500; ఆ సేనకు 3 పెద్ద డిస్ట్రాయర్లు, 6 చిన్న డిస్ట్రాయర్లు, ఒక జలాంతర్గామి, అనుబంధ నౌకలు 35 కలవు (1972). వాయుసేనయందు సైనికసంఖ్య 9,000; మొత్తపు విమానసంఖ్య దాదాపు 200 (1973). ఆంతరంగిక భద్రతలకై 10 వేలమంది యోధులుకల జాతీయ భద్రతాదళము పనిచేయుచున్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును, అమెరికా రాజ్య వ్యవస్థయందును, పెట్రోలియపు ఎగుమతి రాజ్యముల వ్యవస్థలోను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. గైయానా దేశమున దాదాపు సగభాగము తనకు చెందవలయునని ఈ దేశపు వాదము. ఈ వివాదము అపరిష్కృతము

**10. ఆర్థిక రంగము:** లోలుత ఈ దేశపు ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయమే ఆధారముగ ఉండినను, ప్రస్తుతమున పెట్రోలియమునకు ప్రముఖ స్థానము లభించినది. అయినను దేశపు ప్రజానీకమున 40%, ప్రస్తుతకాలమున సైతము, వ్యవసాయ పైననే ఆధారపడి ఉన్నారు. వ్యవసాయ సంస్కరణములవలన, రైతులందరికి భూస్వామ్యము ఏర్పడినది. వ్యవసాయమునకున్న భూవైశాల్యము 55,30,398 ఎకరములు. కరకాస్ నగరమునకు పశ్చిమమునఉన్న వేలెన్సియా సరోవరపు ప్రాంతము వ్యావసాయికముగ చాల అభివృద్ధి చెందినది. మొక్కజొన్న, కాఫీగింజలు, వరి, చక్కెర, అరటి పండ్లు వ్యవసాయోత్పత్తులలో ప్రముఖములు. ఆహార విషయమున దేశము చాలవరకు స్వయం పోషకము. అడవులు అనేకములు ఉన్నను వాని ఉత్పత్తిని సక్రమమున వినియోగించుకొనుటకు తగిన కృషి జరుగుటలేదు. గడ్డిమైదానములు విరివిగ ఉండుటవలన పశుపోషణ చాలమందికి వృత్తిగ ఉపకరించుచున్నది. గోజాతి పశువులు 13.6 లక్షలు, పందులు 759 వేలు, మేకలు 266 వేలు కలవు. పశు మాంసము దేశావసరములకు సరిపోవుచున్నది.

పెట్రోలియమును ఉత్పత్తిచేయు దేశములలో, ఉత్పత్తినిబట్టి, ఈ దేశమునకు మూడవ స్థానము కలదు. ప్రభుత్వపు ఆదాయమున 60%, విదేశీయ ద్రవ్యమున 90% పెట్రోలియంవలన దేశమునకు లభించుచున్నది; ఇంధనపు వాయువును, పెట్రోలియం ఉత్పత్తిలో లభించుచున్నది. పెట్రోలియమ్ తరువాత ఇనుమును, వజ్రములును లెక్కింపదగినవి. పారిశ్రామికముగ ఇంకను దేశము అంతగ అభివృద్ధిని చెందలేదు. కాని ఆ రంగమున అభివృద్ధిని సాధించుటకు ప్రస్తుతమున కృషి జరుగుచున్నది. ఆహారమునకు, వస్త్రములకు, రసాయనములకు చెందిన పరిశ్రమలు కొన్ని బాగుగ పనిచేయుచున్నవి. దేశపు విద్యుదుత్పత్తి 5.3 బిలియన్ల కివా. (1965). దేశపు ఎగుమతుల విలువ 1,124.3 కోట్ల డాలర్లు; దిగుమతుల విలువ 512.1 కోట్ల డా. (1966). దేశపు బడ్జెటరీ వ్యయము 273.8 కోట్ల డాలర్లు (1970).

**11 సాంఘిక రంగము:** సాంఘిక భద్రతకు సంబంధించిన చట్టములు 16 రాష్ట్రములలో అమలున ఉన్నవి. అవసి కార్మికులకు అందరికి అపాయము, మాతృత్వము, రోగము, వార్ధక్యము మొదలగు వానికి చెందిన భీమాసౌకర్యములు కలవు. పల్లెలందు సైతము మంచి గృహవసతిని కల్పించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. దేశమున నిరక్షరాస్యత 9.5% మాత్రమే (1969). దేశపు 10,733 ప్రయిమరీ పాఠశాలలలో 17,26,000 మంది, 932 సెకండరీ-సాంకేతిక పాఠశాలలలో 365,100 మంది విద్యార్థులు కలరు (1968). విశ్వవిద్యాలయముల సంఖ్య 9. వీనిలోని విద్యార్థి సంఖ్య 31,094 (1961-62). దేశపు గ్రంథాలయములలో జాతీయ గ్రంథాలయము ప్రముఖము. అందలి గ్రంథసంఖ్య 3 లక్షలు. మ్యూజియములలో మ్యూజియో బొలీవరియానో విశ్వవిఖ్యాతిని పొందినది. దక్షిణ అమెరికా రాజ్యములకు స్వాతంత్ర్యము కల్పించిన సైమన్ బొలివర్‌కు సంబంధించిన వస్తువులు ఇందు కననగును. దేశమున పత్రికాస్వాతంత్ర్యము చాల తక్కువ. వామపక్షపు పత్రికలు అణచివేయబడినవి. ఉన్న దినపత్రికలలో ఎల్ నేషనల్ అత్యంతవ్యాప్తి కలది. వైద్యవసతుల అభివృద్ధికై ప్రభుత్వము ప్రత్యేక కృషిని సాగించుచున్నది. సాంక్రామికరోగములు అరికట్టబడినవి. సర్వపరికర సమన్వితములగు ఆసుపత్రులు 320 కలవు. వీనియందలి శయ్యా సంఖ్య 30 వేలు. ఇవిగాక 462 గ్రామీణ వైద్య కేంద్రములు కలవు. వైద్యసహాయము ఉచితము; వైద్యసంఖ్య 7.951 (1968).

**12. యాత్రా సౌ. :** యాత్రికుల సౌకర్యము లకై ప్రభుత్వము ఒక ప్రత్యేకశాఖను నిర్వహించు చున్నది. గురుతుచీటీలతో విదేశీయులు దేశమున ఒక నెలదినములు పర్యటించవచ్చును. 99,755 మంది విదేశీయ యాత్రికులు 1969 లో దేశమును సందర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1 సైమన్ బొలివర్ (1783-1830) ; దక్షిణఅమెరికా దేశములకు విముక్తిని కల్పించిన యోధుడు, రాజ్యతంత్రజ్ఞుడు; కవి.

---

# 15. సురినామ్

**ముఖ్యనగరము :** పరమారిబో ; **జెండా, జాతీయగీతము :** వివరములు తెలియవు. **నాణెము :** సురినామీ ఫ్లొరిన్; ఒక ఫ్లొరిన్ = రు. 3·97;




పటము 13.

**కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాల గణన :** ఉ. 9 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణఅమెరికా ఖండమున ఈశాన్యపుతీరమున 2′ నుండి 6° ఉ.అ. వరకును, 54° నుండి 58° ప తు. వరకును విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున అట్లాంటిక్ మహాసముద్రము, దక్షిణమున బ్రజిల్, తూర్పున ఫ్రెంచి గయానా, పశ్చిమమున గైయానా సరిహద్దులందు ఉన్నవి. దేశపు వైశాల్యము 1,81,455 చ. కిమీ. దేశమున అత్యధికభాగము సాంద్రాటవీ ప్రాంతము. తీరప్రాంతము మాత్రము చదునైన, సారవంత భూమి.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 81° ఫా.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 3,84,900 (1971). ముఖ్యనగరమగు పరమారిబోలోని జనసంఖ్య 1,02,300. నీగ్రో-శ్వేతజాతుల సమ్మిశ్ర సంతతివారు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు; తరువాత లెక్కకువచ్చు వర్గము భారతీయసంతతికి చెందినది; వీరుగాక అచ్చపు నీగ్రోలు దాదాపుగ 39 000 లు, ఆదిమ అమెరికన్లు రమారమిన 8 వేలు కలరు. అధికారభాష డచ్చిభాషయే అయినను, దానికితోడుగ హిందీ, జావానీస్, చీనీయ భాషలు ప్రచారమున ఉన్నవి. ఆంగ్లభాష విద్యావంతులకు సుపరిచితము. ఇవిగాక 'స్రనన్‌తోంగో' లేక 'సురినామీస్' అని వ్యవహృతమగు సంకరభాష బజారుభాషగ దేశమున ప్రచారమున ఉన్నది. దేశీయులలో రోమన్‌కేత

లిక్కులు 71,166; తదితర క్రైస్తవ సంప్రదాయముల వారు 71,067; హిందువులు 57,575; ముస్లిములు 63,809, కన్ఫ్యూషియన్‌లు 147, తదితర మతములవారు 3,650 ఉన్నారు.

**4. సమాచార సౌ.** : టెలిఫోన్, వైర్‌లెస్ టెలిఫోన్ సౌకర్యములు విరివిగ కలవు. నెదర్‌లాండ్స్, యు. స్టే, గైయానా, ఫ్రెంచి గయానా, ట్రినిడాడ్‌లతో ఈ దేశమునకు వైర్‌లెస్-టెలిఫోన్ ద్వారా వార్తాసంబంధము కలదు. 5 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు, 1 టెలివిజన్ స్టేషను పనిచేయు చున్నవి.

**5 యాన సౌ.** : దేశపు రోడ్ల నిడివి 1,355 కి.మీ. ఇవిఅన్నియు ముఖ్యనగరము నుండి వివిధ ప్రాంతములకు పోవుచున్నవి. 86 కి.మీ. ల రైలు మార్గము కలదు. దేశమునందలి వివిధ కేంద్రముల మధ్య విమానయాన వసతి కలదు. ముఖ్యనగరమునకు సమీపమున ఉన్న జండెర్జీ విమానాశ్రయము, పెక్కు అంతర్జాతీయ విమానయానములకు మజిలీగా ఉపకరించుచున్నది. పరమారిబో వద్ద పేరొందిన హార్బరు కలదు. అట నుండి అమెరికా, యూరపు ఖండముల ప్రముఖ తీరనగరములకు నౌకాయాన వసతి కలదు.

**6. చరిత్ర** : సురినామ్‌ను తొలుత 16 వ శతాబ్దిలో స్పెయిన్‌దేశపు నావికులు కనుగొనిరి. కాని వారాశించినటుల బంగారము అట లభింపక పోవుటచేత వారు దానిని వదలివేసిరి. అంతట 1615 మొదలుగ బ్రిటిష్, ఫ్రెంచి, డచ్చి (నెదర్‌లాండ్స్) దేశీయులు ఈ ప్రాంతమును వశపరచుకొనుటకు జరిపిన సంఘర్షణలలో ఈ ప్రాంతము పలుమారులు చేతులుమారినది. కడకు పారిస్ ఒడంబడిక వలన ఈ ప్రాంతమును డచ్చివారికి చెందజేయుటకు తక్కినవారు అంగీకరించిరి. ఇచటి చక్కెర తోటలలోను, వరిపొలములోను, గనుల లోను పనిచేయుటకై ఫ్రెంచివారు నీగ్రోలను, బ్రిటిషువారు భారతీయులను, డచ్చివారు ఇండోనేసియావాసులను కొందరిని కూలీలుగ ఇటకు చేర్చిరి. వారి సంతతులవారే అత్యధికముగ ప్రస్తుతము అట కానవచ్చుచున్నారు. 1815 మొదలుగ ఈ ప్రాంతము డచ్చి సామ్రాజ్యమున అంతర్భాగముగ చాలకాలము ఉండినది. 1950 మొదలుగ దేశమునకు స్వపరిపాలనముకల్పించుటకు డచ్చి ప్రభుత్వము చొరవచేసికొనిన ఫలితముగ కడకు నవంబరు 25, 1975న సురినామ్ స్వతంత్రరాజ్యమైనది. అయినను నెదర్‌లాండ్స్‌తో సన్నిహిత సంబంధము కలిగి ఈ దేశము వర్తించుచున్నది.

**7. పరిపాలన** : దేశమున ప్రజాతంత్ర పరిపాలన అమలున ఉన్నది. అధ్యక్షుని, శాసనసభను ప్రజలు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నుకొనెదరు. శాసనసభలోని సభ్యసంఖ్య 39. అధ్యక్షుడు తాను నియమించుకొనిన 13మంది మంత్రుల సాయముతో శాసనసభకు బాధ్యత వహించి పాలనను నిర్వర్తించు చున్నాడు. ఏడు రాజకీయపక్షములు కలవు. మూడు మాండలిక న్యాయస్థానములును, ఒక ఉచ్చన్యాయ స్థానమును న్యాయనిర్వహణను కొనసాగించు చున్నవి.

**8. దేశరక్షణ :, 9 అంతర్జాతీయ సం.** : కొలదికాలము క్రిందటనే స్వాతంత్ర్యమును ఆర్జించి నందువలన వివరములు తెలియవచ్చుటలేదు.

**10. ఆర్థిక రంగము** : ప్రస్తుతమున దేశపు ఆర్థికవ్యవస్థ చాలవరకు బాక్సైట్ ఎగుమతిపై ఆధారపడిఉన్నది. వ్యవసాయపు ఉత్పత్తులధరలలో వచ్చు విపరీతపు హెచ్చుతగ్గులవలన వ్యవసాయముపై మక్కువ చాలవరకు తగ్గినది. అయినను దేశమున 49,060 హెక్టేరులభూమి సాగున ఉన్నది (1970). ఇందు దాదాపు అయిదింట నాలుగువంతుల భూమి యందు వరి సాగగుచున్నది. తక్కిన ఉత్పత్తులలో

చక్కెర, అరటిపండ్లు, నారింజపండ్లు ప్రముఖములు. పశుసంపద తగినంతగ కలదు ; గోజాతి పశుసంఖ్య 39,803 (1950). అడవుల నుండి మంచిరకపు కలప లభించుచున్నది ; ఇందు కొంత విదేశములకు ఎగుమతి అగుచున్నది. తీరమున చేపల పరిశ్రమ వలన పలువురు జీవించుచున్నారు. ఖనిజములలో బాక్సైట్ ప్రముఖము ; బంగారము చాలకొలదిగ లభించుచున్నది. ఎగుమతుల విలువలో పదింట తొమ్మిదవంతులు బాక్సైట్ - అల్యూమినియముల వలన లభించుచున్నది. ఎగుమతుల విలువ 30·88 కోట్ల సురినామ్ ఫ్లొరిన్‌లు ; దిగుమతుల విలువ 22.53 కోట్ల సు.ఫ్లొ (1971). బడ్జెట్ వ్యయము 21·9 కోట్ల సు.ఫ్లొ. (1973).

**11. సాంఘిక రంగము :** 7నుండి 12ఏండ్ల వరకు వయసుకలిగినవారికి నిర్బంధవిద్యావిధానము అమలున ఉన్నది. దేశమున 584 పాఠశాలలో 1,49,000 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక ఒక విశ్వవిద్యాలయము, 2 సాంకేతిక పాఠశాలలు కలవు. 13 ఆసుపత్రులు వైద్యసహాయమునకు ఉపకరించుచున్నవి.



# 1. ఆన్‌డొర్రా

**ముఖ్యనగరము :** ఆన్‌డొర్రా లా వెల్లా; **జెండా :** నీలి, పసుపు, ఎరుపు నిలువుచారలలో. పసిమిచారపై జాతీయ యోఫలాంఛనము కలదు; **జాతీయ గీతము :** 'ఎల్ గ్రాన్ కార్లెమనీ మాన్ పారే' (నా తండ్రీ, షార్లమేన్ మహనీయా) అను చరణము తొలుత గలది; **నాణెము :** దేశీయమగు నాణెపు విధానము లేదు; స్పెయిన్‌దేశపు పెసెటాయు, ఫ్రాన్స్‌దేశపు ఫ్రాంకునాణెమును దేశమున చలామణిలో ఉన్నవి; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.




పటము 2.

**1. ఉనికి మొ. :** అన్నివైపుల భూపరివృత మగు ఈ దేశము పశ్చిమయూరపు నందలి **పిరనీజ్ పర్వత**పు దక్షిణ సానువులందు, ఫ్రాన్సుదేశమునకును స్పెయిన్‌కును మధ్య ఉన్నది. దాదాపు 1° 30′ తూ. **తులారేఖపై** 43°30′ ఉ. అ. యందు ఈ దేశము నెలకొనినది. దేశపు ఉత్తర-దక్షిణముల గరిష్ఠపు నిడివి 28 కిమీ. ; తూర్పు-పడమరల గరిష్ఠపు కొలత 29 కిమీ. దేశపు వైశాల్యము 465 చ. కిమీ. ఈ దేశమునంతటిని రియూ వలీరా నదీలోయ ఆక్రమించిఉన్నదని చెప్పవచ్చును. దేశ భూతలము ఎగుడుదిగుడుగ పర్వతమయము. పర్వత శిఖరములలో అత్యున్నతమగుదాని ఎత్తు 3,100 మీ. ; లోయలు సైతము 1,880 మీ. ఎత్తునకు సగాసరిన తగ్గకున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** భూతలపు ఎత్తు ఎక్కువగుట వలన, శీతకాలము ఇచ్చట దుస్సహముగ ఉండును ; ఆ కాలమున ఉత్తర ప్రాంతములు మంచుతో నిండియుండును. ఏప్రిల్‌లోను, అక్టోబరులోను వర్షపాతము అత్యధికము, ఎండకాలము చాల ప్రాంతములందు సౌమ్యముగ ఉండును. పగటి, రాత్రి ఉష్ణోగ్రతల మధ్య విభేదము అత్యధికము.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 20,550 (1971); జనసాంద్రత చ. కిమీ. కు 40. ముఖ్యనగరపు జనసంఖ్య 7,664 ఇదిగాక అయిదు జనావాసములుమాత్రమే కలవు. దేశభాష కేటలాన్; ప్రజలందరు రోమన్ కేతలిక్కులు.

**4. సమాచార సా. :** ఫ్రాన్సుదేశమును, స్పెయిన్‌దేశమును చెరియొక పోస్టాఫీసును ఈ దేశమున నిర్వహించుచున్నవి. దేశమున టెలిఫోనులు విరివిగ కలవు ; రెండు రేడియోస్టేషనులు ప్రసారములను నిర్వహించుచున్నవి ; అందొకటి ఫ్రాన్స్ దేశమునకు చెందినది.

**5. యాన సౌ. :** దేశమునందలి రోడ్ల మొత్తపు నిడివి 56 కిమీ. మాత్రమే. అయినను ఇది ఉత్తమ శ్రేణికి చెందినది. ఫ్రాన్సు, స్పెయిను దేశములతో

దేశమును అనుసంధించురీతిగ ఈ రోడ్లు నిర్మింప బడినవి. ఇవిగాక డొంకబాటలు కొన్ని కలవు.

**6. చరిత్ర :** యూరపీయ చరిత్రలో ప్రసిద్ధిని ఆర్జించిన షార్లమేన్‌చక్రవర్తి (768-814) ముస్లిము లను నిర్జించుటలో, తనకు సాయముచేసిన ఒక యోధవర్గమునకు ఈ ప్రాంతమును జాగీరుగ ఇచ్చె ననియు, ఆ యోధవర్గపు సంతతియే తామనియు ఈ దేశవాసులు అనెదరు. దీనికి చారిత్రకాధారములు కనపట్టవు. క్రీ.శ. 1278 లో జరిగిన ఒక ఒడం బడిక వలన ఈ ప్రాంతముపైన, ఫ్రాన్సుదేశపు ఒక మాండలికునికిని, స్పెయిన్‌లోని ఉర్గెల్ నగరపు మతాచార్యునకును సంయుక్తాధికారము ఏర్పడినటుల మాత్రము స్పష్టముగ తెలియవచ్చుచున్నది. కాల క్రమమున మాండలికుని అధికారము ఫ్రెంచిప్రభుత్వ మునకు సంక్రమించినది. ఈ సంయుక్తాధికారము ఇప్పటికిని నామమాత్రముగ మన్నింపబడుచున్నది. రెండేండ్లకు ఒకసారి 960 ఫ్రాంకులను ఫ్రాన్సు దేశపు ప్రభుత్వమునకును, 460 పెసెటాలను ఉర్గెల్ నగర మతాచార్యునకును ఆన్‌డొర్రా ప్రభుత్వము ఇప్పటికిని చెల్లించి పూర్వసంప్రదాయ మును గౌరవించుచున్నది. ఫ్రాన్సుదేశపు అధ్యక్షు డును, ఉర్గెల్‌నగర మతాచార్యుడును చెరియొక అధికారిని ఇట నియమింతురు. లాంఛనప్రాయముగ వీరే దేశపాలకులైనను, యథార్థమున ప్రభుత్వాధి కారము ప్రజాసభయందు న్యస్తము.

**7. పరిపాలన :** పాలనను నిర్వహించు ప్రజా సభయందు 24 మంది సభ్యులు కలరు. వీరు ప్రజలచే నాలుగేండ్లకు ఒకసారి సాధారణముగ ఎన్నుకొనబడెదరు. అయితే సభలో సగముమంది రెండేండ్లకు ఒకసారి పదవీవిరమణ చేయు ఏర్పాటు కలదు. ఈ సభ ప్రథమోద్యోగి, ద్వితీయోద్యోగి అను అధికారులను ఇరువురను నియమించును. వీరి వివిధశాఖల పాలనను నిర్వహింతురు. 1970 నుండి స్త్రీలకు కూడ ఇచట వోటుహక్కు ఈయబడినది. రాజకీయపక్షములు లేవు. ఇరువురు న్యాయాధీశుల అధ్వర్యమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమునకు ఎట్టి సైన్యమును లేదు ; 20 మంది రక్షకభటులు మాత్రము కలరు.

**9. అంతర్జాతీయ సం. :** ఏ విదేశములతోను ఈ దేశమునకు దౌత్యసంబంధములు లేవు. ఫ్రాన్సు, స్పెయినులతోను, వానిద్వారా తక్కిన దేశముల తోను రాకపోకల సంబంధములు మాత్రమే కలవు.

**10. ఆర్థిక రంగము :** దేశమున వ్యవసా యానుకూలమగు భూమి 4% మాత్రమే. గడ్డిబీడులు ఎక్కువగ కలవు. ఆహారధాన్యములు, బంగాళా దుంపలు, పొగాకు వ్యవసాయోత్పత్తులలో ప్రముఖ ములు. పశుసంఖ్య అత్యధికము; 25,000 గొర్రెలు, 3.000 గోజాతి. 1,000 గుర్రములు కలవని అంచనా. పశుపోషణ పలు కుటుంబములకు జీవనా ధారము. అడవులందలి కలప దేశావసరములకు సరిపోవుచున్నది. కొలది ప్రమాణములలో ఇనుము, సీసము దొరకుచున్నవి. దేశసంపద చాలవరకు యాత్రిక పరిశ్రమపైన ఆధారపడియున్నది. ఇది గాక, ఈ దేశమునకు ఫ్రాన్సు, స్పెయిను దేశముల రెండింటితో సరిహద్దు కలసిఉండుటవలన దొంగ చాటుగ సుంకములేకుండ విదేశవస్తువులను ఆ దేశ ములకు చేర్చి విక్రయించుట ఈ దేశీయులలో పలు వురికి జీవనాధారమనుట ఒక ప్రసిద్ధ విషయము. దేశమున జల విద్యుదుత్పత్తికి అవకాశములు ఎక్కువ. దేశమునుండి పశుమాంసము, పొగాకు, చేతిపరిశ్రమల ఉత్పత్తులు ఎగుమతియగుచున్నవి. దిగుమతులలో ఆహార పదార్థములును, యంత్రము లును ప్రముఖములు. 1969 లో దిగుమతుల విలువ 3.89 కోట్ల అమెరికన్ డాలర్లు. దేశమున ఆదాయపు పన్ను, రేవుసుంకములు, మరణసుంకము లేవు.

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక భద్రతా సౌకర్యములు ఎట్టివియు లేవు; గృహవసతి బాగుగ కలదు ; కాని అది ప్రాతపద్ధతులను అనుస రించియున్నది. విద్యాశాలల నిర్వహణకగు వ్యయ మును ఫ్రెంచిప్రభుత్వమును, ఉర్గెల్‌నగర మతా చార్యుడును చాలవరకు భరించుచున్నారు. దేశపు 22 ప్రయిమరీ పాఠశాలలలో 3,376 మంది విద్యార్థులు కలరు (1969). ఉన్నత విద్యకై ఫ్రాన్సు, స్పెయిన్ దేశములలోని విద్యాలయములకు ఇచటి విద్యార్థులు పోయెదరు. 150 శయ్యా సంఖ్య కల రెండు వైద్యశాలలు కలవు (1971). దిన, వారపత్రికలు దేశమున వెలువడునవి లేవు. స్పెయిన్. ఫ్రాన్సుల పత్రికలే ఇట ప్రచారమున ఉన్నవి.

**12. యాత్రా సౌ. :** యాత్రిక పరిశ్రమ దేశపు వనరులలో ప్రముఖము ; ప్రభుత్వము యాత్రికులకై పెక్కు సౌకర్యములను సమకూర్చి నది. క్రైస్తవ యాత్రాస్థలములను, ప్రకృతి దృశ్య ములను దర్శించుటకు సరాసరిన సాలున పదిలక్షల మంది విదేశీయులు దేశమును దర్శింతురు. ఇందు ఫ్రాన్సు, స్పెయిన్ దేశములవారి సంఖ్య అత్యధి కము. ఈ విదేశీయ యాత్రికులకై దేశమున 60 హోటల్లు కలవు.

---

# 2. ఆల్ బే ని యా

**ముఖ్యనగరము :** తిరానే; **జెండా :** ఎర్రని భూమికకు మధ్యగ నల్లని ద్విశీర్షపు గరుడపక్షి చిత్రమును, దానికి ఎగువన బంగారువర్ణపు అయిదు శిఖలు కల ఎర్రని నక్షత్రమును కలది ; **జాతీయ గీతము :** 'రేత్ ఫ్లమూరిత్ తే పేర్ బష్కువార్' (పోరాటమున మనలకు పొందిక కూర్చిన పతాకం) అను చరణముతో ఆరంభితమగునది ; **నాణెము :** లేక్ ; ఇది 100 క్విన్‌దార్కులుగ విభక్తము ; 1 లేక్ = రు 1.50 ; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి ; **కాలగణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** యూరపుఖండమున బాల్కన్ ద్వీపకల్పపు పశ్చిమతీరమున 39°38′-42°39′ ఉ అ. లకును, 19°16′-21°04′ తూ. తు.లకును మధ్య విస్తరించియున్న ఆల్బేనియాకు ఉత్తరము నను తూర్పునను యుగోస్లావియా, ఆగ్నేయమున గ్రీస్, తక్కిన దిశలందు అడ్రియాటిక్ సముద్ర మును సరిహద్దులందు ఉన్నవి. దేశ వైశాల్యము 28,748 చ. కిమీ. దేశము చాలవరకు పర్వత మయము ; భూతలమున దాదాపు 70% సముద్రపు మట్టమునకు పైన 300 మీ. ఎత్తున ఉన్నది. తక్కి నది తీరప్రాంతమునను, నదుల డెల్టాలందును కన నగు నిమ్నభూమి. పర్వత శిఖరములలో అత్యు న్నతమగునది కొరాబీ శిఖరము (2,750 మీ.) ; ఇది తూర్పుప్రాంతమున యుగోస్లావియా సరిహద్దున ఉన్నది. నదులలో డ్రీన్. మాత్, ష్కుంబి, విజోసీ- అనునవి ప్రముఖములు. ఇవిఅన్నియు అడ్రి యాటిక్ సముద్రమున కలియుచున్నవి. దేశపు సరస్సులలో ష్కోదర్, ఓహ్రిద్ అనునవి ప్రముఖ ములు ; దేశపు సరిహద్దులందున్న ఈ సరస్సు లలో యుగోస్లావియాకును కొంత మేర వరకు హక్కు కలదు. అటులే ప్రెస్‌పీ అను వేరొక సరస్సున ఈ దేశముతో పాటుగ యుగోస్లావియా, గ్రీస్‌లకును హక్కు ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ. :** ప్రాంతములను బట్టి శీతోష్ణస్థితి యందు వైవిధ్యము కలదు తీరప్రాంతమున శీతకాలమునందు వానలు కురియును ; ఎండ కాలము దుర్భరముగ ఉండును. పర్వతభూమి యందు ఎండకాలమున వానలు తరచుగ కురియును; శీతకాలమున చలి చాల ఎక్కువ. సాలున సరాసరి




పటము 3.

వర్షపాతము తీరప్రాంతమునందలి 100 సె. మీ. నుండి పర్వతప్రాంతవు 250 సెం.మీ. వరకు క్రమేణ మారును. పర్వతప్రాంతమున వృక్షసంపద అత్యధికము ; నిమ్నభూములందు ముండ్లపొదలు మాత్రమే కననగును. వన్యజంతువులు లేనేలేవని చెప్పవచ్చును. పక్షిసంతతి కొంతవరకు కలదు.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 21,35,600 (1970). జనసాంద్రత చ. కిమీ. కు 76.5. నగరములలో తిరానే (జ. సం. 171వేలు), స్కుటారీ (55 వేలు), దుర్రెజ్ (53 వేలు) ప్రముఖములు. యూరపునందలి ప్రాచీనజాతులలో ఒకటియగు ఇల్లీరియన్ జాతికి చెందినవారు దేశీయులలో 97% కలరు. అల్పసంఖ్యాకవర్గములలో గ్రీకులు (2.4%) గణనీయులు. బల్గేరియనులు, సెర్బులు అత్యల్పసంఖ్యలలో కలరు. దేశభాష ఆల్బేనియన్; దీనికే 'షిక్వెప్' అను పేరుకలదు. ఇండో - యూరపీయ భాషాకుటుంబమునకు చెందిన ఈ భాషపై తుర్కీభాషా ప్రభావమును కొంత కనపట్టును. దేశ ప్రభుత్వము మతమును నిషేధించి, దేశమును నాస్తిక రాజ్యముగ ప్రకటించినది (1967). కాని పూర్వపు లెక్కలను అనుసరించి దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు (70% కు పైగా) ముస్లిములు; తక్కినవారు క్రైస్తవులు. ముస్లిములలో సున్నీలు అత్యధికముగ కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున తంతి - తపాలాఫీసుల సంఖ్య 292. టెలిఫోనులసంఖ్య 10,150; 17 బ్రాడ్‌కాస్టింగు స్టేషనులు కలవు (1970). టెలివిజన్ సౌకర్యము 1971 నుండి అమలులోనికి వచ్చినది.

**5. యాన సౌ. :** రోడ్లనిడివి 3,200 కిమీ. (1968); కొన్ని పర్వతప్రాంతములందు రోడ్లు లేనే లేవు. జంతువులవలన సరకుల తరలింపు అటసాగుతున్నది. 1947 లో రైలుమార్గముల నిర్మాణము మొదలైనది. 1968 నాటికి రైలుమార్గముల నిడివి 190 కిమీ. తీరపు రేవులలో దుర్రెజ్ ప్రముఖము, విదేశీయ వ్యాపారము అంతయు ఈ రేవు ద్వారానే సాగుచున్నది. దేశపు ముఖ్యనగరమునుండి పలు విదేశములకు విమానయాన సౌకర్యము కలదు.

**6. చరిత్ర :** క్రీస్తుశకారంభకాలమునుండియు ఈ దేశమును గురించిన చారిత్రిక విషయములు తెలియనగుచున్నవి. ఆ కాలమున ఈ ప్రాంతము రోమనుల విపుల సామ్రాజ్యమున భాగముగ ఉండినది. రోమనులు ఇట క్రైస్తవ మతమునకు తావు కల్పించిరి. రోమన్ సామ్రాజ్యము విచ్ఛిన్నమైన తరువాత ప్రాచ్యరోమక సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగమైనది (క్రీ.శ. 4వ శతాబ్ది). అంతట 7 వ శతాబ్ది మొదలుగ 1041 వరకు దేశము సెర్బుల, బల్గేరియనుల దండయాత్రలకు పదింబదిగ లోనై పలుమారులు చేతులు మారినది. కడకు ప్రాచ్యరోమక సామ్రాట్టుల వంశికుడగు ఒకడు ఒక స్వతంత్ర రాజవంశమును నెలకొల్పెను (1204). ఈ వంశము 1318 వరకును పాలించినను, ఆ తరువాత మరల దేశమున కల్లోలపరిస్థితి ఏర్పడగ సెర్బుజాతులవారు దేశమును వశపరచుకొనిరి. వీరిలో స్టెఫాన్ దూషన్ అనువాని ఆధిపత్యమున దేశమున సువ్యవస్థిత పరిపాలన ఏర్పడినది. ఇంతలో తుర్కు సేనలు దేశముపై దండెత్తి దేశమును వశపరచుకొనినవి (1571). వారిట ఇస్లామునకు వ్యాప్తిని కలిగించిరి. తుర్కి సామ్రాజ్యముపై గ్రీసు మొదలగునవి తిరుగుబాటుచేసినపుడు ఈదేశము వారితో కలసి స్వతంత్రమైనది; కాని ఇరుగుపొరుగు రాజ్యములగు గ్రీస్ మొదలగునవి దేశమును కబళింపజూచినవి. అంతట అగ్ర రాజ్యములు జోక్యమువహించి, దేశమునకు స్వాతంత్రతను కలిగించి, విలియమ్ అను విదేశీయుని రాజ్యపాలకునిగ చేసినవి (1918). 1925 లో రాజరికము రద్దుకాగా గణరాజ్యము ఏర్పడి అహ్మద్ బే జోగూ అనునతడు అధ్యక్షుడై, తుదకు ప్రజామోదముతో రాజయ్యెను. ఇతని కాలమున దేశమున శాంతి ఏర్పడినను 1939 లో ఇటలీ ఈ దేశమును ఆక్రమించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున ఈప్రాంతము పలుమారులు చేతులు మారినది. ఆకాలమున ఎన్వర్ హోక్సా అను కమ్యూనిస్టు నాయకుని ఆధ్వర్యమున దేశీయులు ప్రతిఘటనను సాగించిరి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కమ్యూనిస్టు రాజ్యముగ ఆల్బేనియా అవతరించినది (1944).

**7. పరిపాలన :** 1950 లో ఆమోదితమై, 1955, 1960, 1963 లలో సవరణలను పొందిన రాజ్యాంగవిధానమును అనుసరించి ఇట పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఏకకక్ష్యకము, 264 మంది సభ్యులు కల ప్రజాసభయందు శాసన నిర్మాణాధికారము కలదు. సార్వజనికమగు వోటింగు పద్ధతిలో, 18 ఏండ్ల వయసునకు తగ్గని వోటరుల వలన ఈ సభ నాలుగేండ్లకు ఒకపర్యాయము ఎన్నుకొనబడును. ఎన్నిక ఏకపట్టికా పద్ధతిన జరుగును. ఈ ప్రజాసభలోని సభ్యుల వలన ఒక అధ్యక్షుడును, ముగ్గురు ఉపాధ్యక్షులును, ఒక కార్యదర్శియు, పది మంది సభ్యులును కల అధిమండలి (ప్రెసిడియం) ఎన్నుకొనబడును. ఈ అధిమండలి ప్రజాసభకు బాధ్యతవహించి దైనందిన పరిపాలనను నిర్వహించును. దేశమున యథార్థతః రాజకీయాధికారమంతయు కమ్యూనిస్టుపార్టీకే చెందియున్నది. దాని ఆమోదమును అనుసరించియే కొన్ని చిన్నపార్టీలు మనుచున్నవి. ఈ కమ్యూనిస్టుపార్టీయొక్క పెద్దరికమున ఉన్న ప్రజాస్వామిక కూటమి అనునది ప్రజాసభకు ఎన్నుకొనదగు సభ్యుల ఏకపట్టికను తయారుచేయును. ఈ పార్టీయందలి సభ్య సంఖ్య 68,858 (1971). ప్రజాసభలోని సభ్యులు ఎన్నుకొనిన జడ్జీలు కల సుప్రీమ్‌కోర్టు యొక్క ఆధ్వర్యమున న్యాయపరిపాలన సాగును. దిగువకోర్టుల జడ్జీలను, ఆ యా స్థానికసమితులు ఎన్నుకొనును.

**8. దేశరక్షణ :** దేశపు త్రివిధ సేనలందును హోదాలను అనుసరించిన తరతమభేదము లేకుండ విధినిర్వహణలోని భేదము మాత్రమే పాటింపబడుచున్నది. భూతల సైనిక సంఖ్య 35,000 ; ఇందు

ఆరు పటాలములును, 100 టాంకులును కలవు. ఇదిగాక దీనికి సాయపడుటకై 12,500 మంది సైనికులు గల భద్రతాదళము కలదు. నౌకాసేన యందు సైనికసంఖ్య 2,300; 4 జలాంతర్గాములు, 2 మైన్ సీపర్లు, 12 టార్ పెడొబోట్లును, 61 సహాయ నౌకలును అందు కలవు. వాయుసేన యందలి సైనిక సంఖ్య 4,000; పోరాటపు విమానముల సంఖ్య 75. తొలుత ఈ రాజ్యము సైనికముగ వార్సారాజ్యముల ఒడంబడికలో చేరియుండినది. కాని సోవియెట్ రష్యా. జెకోస్లోవాకియాపై దాడి చేసినపుడు అందుండి విడివడినది (1968). తదాదిగ చీనాతో సైనికమైత్రితో మెలగుచున్నది.

**9. అంతర్జాతీయ సం.:** 1955 మొదలుగ ఈ దేశము ఐ.రా.స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో కొన్నింటను సభ్యత్వము కలిగియున్నది. కమ్యూనిస్టు రాజ్యములందు ప్రముఖములగు సోవియెట్ రష్యా, చీనాల మధ్య చెలరేగిన వివాద ములో చీనాను ఈ రాజ్యము బలపరచుచున్నది.

**10. ఆర్థిక రంగము:** దేశము తొలుత నుండియు వ్యావసాయికముగ గాని, పారిశ్రామిక ముగ గాని అభివృద్ధి చెందినదికాదు; పశుపోషణ వలన వ్యావసాయికాదాయమున సగము లభించుచుండెడిది. కమ్యూనిస్టులు ఆధిపత్యమును గ్రహించిన తరువాత ఖనిజోత్పత్తి, పరిశ్రమ, విద్యు దుత్పత్తి, రవాణాసౌకర్యములను బాగుగ అభివృద్ధి చేయుటకు కృషిజరిగినది. దేశపు భూతలమున 40% వ్యవసాయమున ఉన్నది. వ్యవసాయోత్పత్తులలో గోధుమ, మొక్కజొన్న, చక్కెరబీటు, ప్రత్తి, పొగాకు ప్రముఖములు. పశువుల సంఖ్య అత్యధి కము. గొర్రెలు 16.7 లక్షలు కలవని అంచనా (1967); మత్స్యపరిశ్రమ చాల అభివృద్ధిని సాధించినది. 1964 లో చేపల పట్టుబడి 3600 మెట్రిక్ టన్నులు. దేశపు భూతలమున 47% అటవీ మయము; ఈ అడవులను ఆశ్రయించి కలప పరిశ్రమ వృద్ధియైనది. ఖనిజోత్పత్తులలో రాక్షసి బొగ్గు. పెట్రోలు, క్రోము, రాగి, నికెల్, ప్రముఖ ములు; వీనిలో క్రోము విరివిగ విదేశములకు ఎగుమతి అగుచున్నది. దేశమున వ్యవసాయము సమష్టి క్షేత్ర పద్ధతిన సాగుచున్నది. పరిశ్రమ లన్నియు జాతీయములు చేయబడినవి. చక్కెర, జవుళీ, ప్రత్తి, పొగాకు, పెట్రోలియంలకు సంబం ధించిన పరిశ్రమలు బాగుగ అభివృద్ధిని సాధించినవి. సహజరీతిలో భూమియందు తారు (అస్ఫాల్టు) లభించు కొలది దేశములలో ఆల్బేనియా ఒకటి. ఎగుమతులలో క్రోము, రాగి, జవుళీఉత్పత్తులు, పండ్లు, ఉన్ని క్రమప్రాముఖ్యములు కలిగిఉన్నవి. దిగుమతులలో యంత్రసామగ్రి, రసాయనిక వస్తువులు చెప్పదగినవి. దేశపు విద్యుదుత్పత్తి 57.8 కోట్ల కివా. (1967); ఇందు అధికాంశము జలవిద్యుత్తు. ఎగుమతుల విలువ 29.96 కోట్ల లేకులు; దిగుమతుల విలువ 49.66 కోట్ల లే. (1964). బడ్జెటరీ వ్యయము 493.7 కోట్ల లే. (1970).

**11. సాంఘిక రంగము:** కార్మిక వర్గము, కమ్యూనిస్టుపార్టీఆధ్వర్యమున సంఘమున బలవత్తర ప్రతిపత్తిని ఆర్జించియున్నది. కార్మికులకు, ఉద్యో గులకు, సైనికులకు, వార్ధక్య, రోగ, వికలాంగ తాదులకు సంబంధించిన సాంఘిక భీమావసతులు కట్టుదిట్టముగ ఏర్పరుపబడినవి. దేశమున తలసరి ఆదాయము 300 అమెరికన్ డాలర్లు (1967). ద్వితీయ ప్రపంచ యుద్ధపు ఫలితముగ గృహ ములు ఈ దేశమున అనేకములు నాశనమైనవి. ప్రణాళికలను అనుసరించి వాని పునర్నిర్మాణము సాగుచున్నను, ఇప్పటికిని గృహవసతి తగినంతగ లేదు. 7 నుండి 15 వరకు వయసుకలవారికి నిర్బం ధోచిత ప్రాథమికవిద్యావిధానము అమలునఉన్నది. దేశపు 1,423 శిశుపాఠశాలలలో 47,500 మంది;

1,374 ప్రయిమరీపాఠశాలలలో 2,60,645 మంది; 46 సెకండరీ పాఠశాలలలో 80,400 మంది; 84 సాంకేతిక-వృత్తిపాఠశాలలలో 50,072 మంది; 36 ఉన్నత విద్యాసంస్థలలో 36,525 మంది విద్యార్థులు కలరు (1970–71). ఈ ఉన్నత విద్యాసంస్థలలో తిరానే విశ్వవిద్యాలయము ప్రముఖము. గ్రంథాలయములలో తిరానేలోని జాతీయ గ్రంథాలయము ప్రముఖము; ఇందు 4,80,090 సంపుటములు కలవు. మ్యూజియములలో తిరానేలోని పురావస్తు ప్రదర్శనశాల, ప్రకృతితత్త్వ ప్రదర్శనశాల, లెనిన్-స్టాలిన్ మ్యూజియం ప్రముఖములు. దేశపు 22 దినపత్రికలలో కమ్యూనిస్టుపార్టీకి చెందిన జీరీ-యీ-పాపుల్లిట్ ఎక్కువ ప్రచారమును కలిగియున్నది. 15,100 శయ్యాసంఖ్యగల వైద్యశాలలు కలవు; అందలి వైద్యసంఖ్య 1880 (1973).

**12. యాత్రా సౌ.:** యాత్రిక పరిశ్రమను ప్రోత్సహించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నను, యాత్రికులు ఎక్కువగ దేశమును దర్శించుటలేదు.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1. అహ్మద్ బే జోగూ (1895–1960). తొలుత గణరాజ్యపు అధ్యక్షుడై (1925), తదనంతరమున ప్రజల సమ్మతితో రాజై దేశపురోగతికి కృషిచేసినవాడు; ఇటలీసేనలు దేశమును ఆక్రమించినపుడు (1939) అతడు దేశమును వదలి పారిపోయి, కడకు ప్రవాసమున మరణించెను.

---

# 3. ఆస్ట్రియా

**ముఖ్యనగరము:** వియెన్నా; **జెండా:** ఎరుపు రంగున రెండు అడ్డుచారలు ఇరుప్రైపులను కలిగిన తెల్లని అడ్డుచార; **జాతీయగీతము:** ల్యాండ్ డెర్




పటము 4.

బెర్జే. ల్యాండ్ ఆమ్ స్ట్రోమీ (పర్వతమయ భూమీ, నదీమహిత భూమీ) అను చరణముతో మొదలిడబడునది; **నాణెము:** షిల్లింగ్; ఇది 100 గ్రోషెన్లుగ విభక్తము; ఒక షిల్లింగ్ = రు. 0.29; **కొలతతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 1 గం = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** మధ్యయూరపున భూపరివృతమై, 46°22′ - 49°1′ ఉ. అ. రేఖలకును, 9°22′–17°10′ తూ. తు. రేఖలకును మధ్యను నెలకొనియున్న ఆస్ట్రియాదేశమునకు ఉత్తరమున పశ్చిమ జర్మనీ, జెకోస్లోవాకియా; తూర్పున హంగరీ; దక్షిణమున యుగోస్లావియా, ఇటలీ; పశ్చిమమున లిక్టిన్‌స్టీన్, స్విజర్లాండ్ సరిహద్దులుగ నున్నవి. దేశపు తూర్పు - పడమరల గరిష్ఠపు కొలత రమారమి 575 కిమీ.; ఉత్తర-దక్షిణముల గరిష్ఠపు కొలత దాదాపు 295 కిమీ.; దేశవైశాల్యము 83,849 చ. కిమీ. దేశమున మధ్య, పశ్చిమ ప్రాంతములు

పర్వతమయములు. తూర్పున ఉన్న సమతలభూమి యందు సైతము చిన్నకొండలు చాల కలవు; అయినను పర్వతముల మధ్య లోయల వలన రాక పోకలకు తగు సదుపాయములు ఏర్పడిఉన్నవి. దేశపు పర్వతశ్రేణులలో ప్రముఖమగు ఆస్ట్రియన్ ఆల్ప్సులో గ్రాస్ గ్లోక్‌నర్ శిఖరము అత్యున్నతము (3,770 మీ.). దేశమునందలి నదులలో డాన్యూబ్ ప్రముఖము; ఇది ఈ దేశపు ఈశాన్యప్రాంతమున 347 కిమీ. దూరము ప్రవహించుచున్నది; ప్రవహించినంతమేరన, నౌకాయానమునకు ఇది అనుకూలము; ఉపనదులు కొన్ని- ఇన్, ఎన్స్, డ్రౌ, మురా అనునవి- ఈ దేశముననే ప్రవహించి, డాన్యూబ్‌లో చేరుచున్నవి. ఆల్ప్సు పర్వతపు సరస్సులలో కొన్ని, కొంతవరకు ఈ దేశపు సరిహద్దులలో ఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఉనికి, ఎత్తులను బట్టి శీతోష్ణస్థితి యందును ఆ యా ప్రాంతములలో వైవిధ్యము కలదు. కొన్ని ప్రాంతములందు శీతకాలమున తాపక్రమము 9° ఫా. వరకు పడిపోవును. కొన్ని తావులలో జులై మాసమున అది 68° ఫా. వరకు పోవును. వర్షపాతము సాలున ప్రదేశములను అనుసరించి 67 సెం.మీ. నుండి 173 సెం. మీ. వరకు మారును. దేశమున అడవు లెక్కువ; అందు ఆకురాల్పు తరగతివియు, సూచ్యగ్రజాతివియు వృక్షములు కలగాపులగముగఉన్నను, 1200 మీ.కు పైన పర్వతభూములందు సూచ్యగ్యజాతివి మాత్రమే కననగును. వైవిధ్యముకల వన్యజంతుసంతతియు, పక్షిసంతతియు కలదు. ఈ వైవిధ్యము అంతరింపకుండుటకై వేటవిషయమున ప్రభుత్వము కట్టుదిట్టములను ఏర్పరచినది.

**3. జనసంఖ్య మొ. :** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 74,56,403 ; జనసాంద్రత చ. కిమీ.కు 89. దేశపు నగరములలో వియెన్నా (జ. సం. 16,14,341), గ్రాజ్ (2,48,500), లిన్‌జ్ (2,02,874), సాల్‌జ్‌బర్గ్ (1,28,845), ఇన్స్‌బ్రక్ (1,15,197) ప్రముఖములు. ప్రజలలో 30% పల్లెలందు వసించుచున్నారు (2,000 లోపుగ జనసంఖ్య కలిగినది పల్లె). ప్రజలలో 99% కు మాతృభాష జర్మన్. హంగేరియన్, క్రోషియన్ భాషలను మాటాడువారు తూర్పున సరిహద్దు రాష్ట్రములలో అత్యల్ప సంఖ్యలలో కలరు. జనులందు 88.9% రోమన్‌కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు ; 7.11% తక్కిన సంప్రదాయముల క్రైస్తవులు ; 3.76% నాస్తికులు. యూదులు దాదాపు పదివేల మంది కలరు. మతస్వేచ్ఛ, చట్టరీత్యా, పౌరులకు కలదు.

**4. సమాచార సా. :** తంతి, తపాలా, టెలిఫోను, రేడియో, టెలివిజన్ సంస్థలు ప్రభుత్వాధీనమున పనిచేయుచున్నవి. దేశమున 15,46,719 టెలిఫోనులు కలవు(1972). టెలివిజన్ సౌకర్యము 1955 నుండి కలదు.

**5. యాన సౌ. :** దేశమున కేంద్రప్రభుత్వపు రోడ్ల నిడివి 9,260 కిమీ; రాష్ట్రప్రభుత్వముల రోడ్ల నిడివి 22,594 కిమీ. రైలుమార్గముల నిడివి 5,910 కిమీ. ఇందు 2,357 కిమీ. ల దూరము వరకు రైళ్లు విద్యుత్‌సహాయమున నడచుచున్నవి; ఇవిగాక ప్రయివేటు సంస్థల ఆధిపత్యమున ఉన్న రైలు రోడ్ల నిడివి 636 కిమీ. (1970). దేశమున ఉన్నతస్థాయికి చెందిన 6 విమానాశ్రయములు- వియెన్నా, లిన్‌జ్, సాల్జ్‌బర్గ్, గ్రాజ్, క్లాగ్‌న్‌ఫర్ట్, ఇన్స్‌బ్రక్ నగరములందు - కలవు. దేశీయమగు విమానయాన సంస్థయేగాక, పెక్కు అంతర్జాతీయ విమానయాన సంస్థలును వీనిని తమ మజిలీలుగ వాడుకొనుచున్నవి. డాన్యూబ్‌నది ద్వారా సరకులను, ప్రయాణికులను తరలించుటకు 13,663 నౌకలు ఉపయోగపడుచున్నవి. ఈ దేశపు విదేశ

వ్యాపారము, ఒక ఒడంబడికను అనుసరించి, ఇటలీ దేశపు ట్రిస్టీ రేవు ద్వారా సాగుచున్నది.

**6. చరిత్ర :** చరిత్ర పూర్వయుగముననైతము ఈ దేశమున మానవావాసములు ఉండినటుల అవశేషముల వలన తెలియవచ్చుచున్నది. చారిత్రక యుగమున క్రీ.పూ. 15లో ఈ ప్రాంతమును రోమక సామ్రాజ్య సేనలు వశపరచుకొనినవి. అంతకు పూర్వమే కెల్టులు మొదలగు కొన్ని ప్రాచీనజాతుల వారు అట ఆవాసములను ఏర్పరచుకొని ఉండిరి. రోమనులు దేశమున సువ్యవస్థితపాలనను ఏర్పరచి, నగరములను నిర్మించిరి. ప్రస్తుతపు వియెన్నా మొదలగు పెక్కునగరములు తొలుత వారి వలన నెలకొల్పబడినవియే. రోమన్ సామ్రాజ్యము విచ్ఛిన్నతచెందగా (క్రీ. శ. 800), ఈ ప్రాంతము షార్లమేన్ అను ప్రముఖ సార్వభౌముని సామ్రాజ్యమున సరిహద్దుసీమయైనది. తదనంతరమున 10 వ శతాబ్దమున పవిత్ర రోమక సామ్రాజ్యమున అంతర్భాగమైనది. ఆ కాలమున ఓస్టర్‌రీచ్ (తూర్పు రాజ్యము) అని ఇది వ్యవహృతము. ఆ పేరే వికృతిచెంది ఆస్ట్రియా అయినది. రోమక సామ్రాజ్యమును 13 వ శతాబ్దమున పాలించిన రుడాల్ఫ్ ఫాన్ హాబ్స్‌బర్గ్, ఆస్ట్రియాను తన కుమారులలో ఇరువురకు ఇచ్చెను (1282). ఆటనుండి హాబ్స్‌బర్గ్ అనబడిన ఆ వంశపువారి అధీనమున ఈ రాజ్యము అతి దీర్ఘకాలము ఉండినది. ఆ వంశపు ప్రతిష్ఠ చార్లెస్ I (1516–1556) కాలమున పతాకస్థాయిని అందుకొనినది. ఈతడు మాతృసంబంధము వలన స్పెయినునకును, ఎన్నుకొనబడుటవలన పవిత్ర రోమక సామ్రాజ్యమునకును అధిపతియై ఆస్ట్రియా, స్పెయిన్, నెదర్‌లాండ్స్‌లను, ఇటలీలో అత్యధిక భాగమును, అమెరికా ఖండమున విశాలప్రాంతమును పరిపాలించెను. అతడు రాజ్య పరిత్యాగమును చేయుచు, ఆస్ట్రియాను తనసోదరుడగు ఫెర్డినాండ్‌కు దత్తముచేసెను. అదిపరకే హంగరీ, బొహీమియా దేశములకు ఫెర్డినాండ్ ప్రభువు; కావున ఆస్ట్రియాయు, వానితో పాటుగ ఫెర్డినాండ్‌కు దక్కి, ఆ విశాలరాజ్యమంతయు అతని వంశీకుల అధీనముననే 1918 వరకు ఉండినది. ఈ మధ్యకాలమున యూరపీయరాజ్యముల చరిత్రలో కలిగిన పలు సంఘటనల ప్రభావము వలన ఆస్ట్రియాయు పలు విపర్యయములకు లోనైనది.

1701 నుండి 1714 వరకు సాగిన స్పానిష్ వారసత్వ సంగ్రామమున ఆస్ట్రియా పాల్గొనిన ఫలితముగ బెల్జియం, ఇటలీలోని కొన్ని ప్రాంతములు ఆస్ట్రియాకు దక్కినవి. ఇటలీలోని ఆ ప్రాంతములలో కొన్నిటిని 1735 లోను, తక్కినవానిని, బెల్జియమును, నెపోలియన్‌తో సాగించిన యుద్ధముల ఫలితముగను (1797–1805) ఈదేశము పోగొట్టుకొనినది. నెపోలియన్ పతనముచెందిన తరువాత, మెట్టర్‌నిక్ అను ప్రధాని నాయకత్వమున ఈదేశము 1815 నుండి 1848 వరకు యూరపీయ రాజకీయములలో ప్రముఖపాత్ర వహించినది. 1848 లో సామ్రాజ్యమున విప్లవములు చెలరేగగ మెట్టర్‌నిక్ దేశభ్రష్టుడయ్యెను. విప్లవములు అడచివేయబడినను ప్రభుత్వము బలహీనమయ్యెను. జర్మన్‌రాజ్యములందు ప్రష్యా అగ్రస్థానమును చేపట్టి, జర్మను రాజకీయరంగము నుండి ఆస్ట్రియా వైదొలగునటుల చేసినది (1866). హంగరీ యందలి జాతీయవాదులు తిరుగుబాటుచేసి, ఆస్ట్రియాతో పాటుగ హంగరీయు సమానప్రతిపత్తితోమనుటకు చక్రవర్తిని అంగీకరింపజేసిరి (1867). రాజ్యము అంతటినుండి ఆస్ట్రియా-హంగరీ అనుపేరున వ్యవహృతమైనది. కాని సామ్రాజ్యమునందలి సెర్బులు మాత్రము అసంతృప్తులైయుండిరి. ఈ పరిస్థితిలో దేశపు సింహాసనమునకు వారసుడగు ఫ్రాన్సిస్ ఫెర్డినాండ్, సెర్బ్ జాతీయవాదులచేత చంపబడెను (జూన్ 28, 1914). సెర్బియాదేశపు ప్రోత్సాహము ఇందులకు కలదని భావించి, ఆస్ట్రియా సెర్బియాపై యుద్ధము

ప్రకటించినది. ఇదియే ప్రథమ ప్రపంచయుద్ధముగ పరిణమించి నవంబరు 11, 1918 వరకు సాగినది. ఆ యుద్ధమున ఆస్ట్రియాయు, దానికి సాయపడిన జర్మనీ, తుర్కీలును ఓడిపోయినవి. తత్ఫలిత ముగ ఆస్ట్రియా యందలి జర్మన్ ప్రాంతములు మాత్రమే ఆ రాజ్యమున ఉండునటులను, తక్కినవి స్వతంత్రములగు నటులను నిర్ణయము జరిగినది (1919).

తరువాత జర్మనీలో నాజీనియంతయగు హిట్లరు అధికారమును గ్రహించినతరువాత, అతడు జర్మను ప్రజలను సమీకరించుటకు చేసిన దుస్సాహసపు కృషికి ఫలితముగ ఈదేశము జర్మనీలో లీనమైనది (1938). ద్వితీయ ప్రపంచయుద్ధపు ఫలితముగ జర్మనీ పరాజితమైన తరువాత, ఈ దేశము మిత్ర రాజ్యముల వశమైనది (ఏప్రిల్, 1945). అంతట దేశము యు.స్టే., ఫ్రాన్స్, బ్రిటన్, సోవియట్ సేనల వశమున వివిధ మండలములుగ విభక్తమైనది. 1956 లో దేశమున ఆక్రమణరాజ్యముల అను మతితో ఒక తాత్కాలిక ప్రభుత్వము ఏర్పడినది. ఈ ప్రభుత్వము ఆ ఆక్రమణరాజ్యములతో జరిపిన సంప్రతింపుల ఫలితముగ మే, 1955 లో దేశము స్వతంత్రమైనది. ఆ స్వేచ్ఛకు ప్రతిఫలముగ యూరపీయ రాజకీయములందు శాశ్వతముగ తటస్థత వహించి వ్యవహరించుటకు ఈదేశము అంగీక రించినది.

**7. పరిపాలన :** ప్రథమ ప్రపంచ యుద్ధానంత రమున ఈదేశము గణరాజ్యముగ రూపొంది, 1920 లో ఒక రాజ్యాంగమును ఆమోదించినది. ఇది 1929 లో కొన్ని సవరణలను పొందినది. ఆ సవరణపొందిన రాజ్యాంగమే ప్రస్తుతమున అమలున ఉన్నది. దీనిని అనుసరించి దేశమున సమాఖ్యాపద్ధతిన ప్రభుత్వ పాలన సాగుచున్నది. దేశమున తొమ్మిదిరాష్ట్రములు కలవు. దేశాధ్యక్షుడు ఆరేండ్లకొకసారి ప్రజలచేత ఎన్నుకొనబడును. కేంద్రమున శాసన నిర్మాణాధికారము పార్లమెంటున న్యస్తము. ఈ పార్లమెంటున జాతీయసభ (నేషనల్ రాట్), సమాఖ్యాసభ (బందేస్‌రాట్) అను రెండు కక్ష్యలు కలవు. ఇందు తొలుతటిదాని సభ్యసంఖ్య 165. వీరు నాలుగేండ్లకు ఒకతూరి 65 నియోజక మండలముల నుండి, నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతిన ఎన్నుకొనబడెదరు. సమాఖ్యాసభ యందలి సభ్య సంఖ్య 50. రాష్ట్ర శాసనసభల వలన, ఆ యా రాష్ట్ర ముల జనసంఖ్యా నిష్పత్తిని అనుసరించి వీరిఎన్నిక జరుగును. పార్లమెంటున బలముకలవానిని ప్రధాని (చాన్సెలర్)గ అధ్యక్షుడు నియమించి, అతని సలహాను అనుసరించి తక్కిన మంత్రులను నియ మించును. మంత్రులు పార్లమెంటున సభ్యులై ఉండ వలయునను నియమములేదు. రాష్ట్ర, కేంద్రముల మధ్య అధికార విభజన రాజ్యాంగము ద్వారా సునిశ్చితము. దేశమున ప్రజాపక్షము, సోషలిస్టు పార్టీ అనునవి ప్రముఖ రాజకీయపక్షములు. 1971 మొదలుగ ప్రభుత్వము సోషలిస్టుపార్టీ వశమున ఉన్నది. వియెన్నా యందలి సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్య వమున దేశమున వివిధ స్థాయిలలో న్యాయ నిర్వ హణ సాగుచున్నది. రాజ్యాంగ వ్యవహారముల విష యమున, పరిపాలనావిషయమున వచ్చు వివాదముల నిర్ణయమునకు ప్రత్యేక ఉచ్చతమ న్యాయస్థానములు కలవు. జడ్జీలను కేంద్రప్రభుత్వమే నియమించును; ఒకసారి నియమితుడగు జడ్జీని తొలగించుటయు. బదిలీచేయుటయు నిషిద్ధములు. ఉరిశిక్ష రద్దుచేయ బడినది.

**8. దేశరక్షణ :** దేశమునకు మూడుబ్రిగేడుల భూతలసేన కలదు. అందలి సైనికసంఖ్య 14,200. ఇదిగాక కోరినవెనువెంటనే సైన్యమున చేరగల శిక్షితుల సంఖ్య 33,000 (1968). భూతలసేన యందు అంతర్భాగముగనే వాయుసేన కలదు.

రెండు దళముల పోరాటపు బాంజరులుమ, తదను బంధ వివిధ విమానములును కలవు ; అందలి సైనిక సంఖ్య 4,000.

**9. అంతర్జాతీయ సం :** 1955 మొదలుగ ఈ దేశము ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందు పెక్కింటను సభ్యత్వముకలిగి యున్నది. యూరపీయ సమితి (కౌన్సిల్ ఆఫ్ యూరప్)న ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. 100కు పైబడిన అంతర్జాతీయసంస్థలలో సభ్యత్వము ఆస్ట్రియాకు కలదని 1970 లోని లెక్కల వలన తెలియవచ్చుచున్నది.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయము, పరిశ్రమలు, యాత్రికుల వలని ఆదాయము- అను మూడింటిపైన ఈ దేశపు ఆర్థికవ్యవస్థ ఆధారపడి ఉన్నది. దేశపు తలసరి ఆదాయము 1,573 అమెరికన్ డాలర్లు (1969). దేశపు భూమియందు 47.2% వ్యవసాయభూమిగను, 38.9% అటవీ భూమిగను ఉన్నవి. వ్యవసాయోత్పత్తులలో గోధుమ, రై ధాన్యము, ఓట్లు, బార్లీ, ఉరలగడ్డ, చక్కెరబీటు క్రమముగ గణనీయములు. ఆహార విషయమున దేశము స్వయంపోషకముగ ఉండుటయేగాక, కొంత భాగమును ఎగుమతిచేయుచున్నది. దేశపు ఎగుమతుల విలువలో 4 6% శాతము ఆహార వస్తువుల ఎగుమతివలన లభించుచున్నది(1968). వ్యవసాయోత్పత్తులలో విలువనుబట్టి మూడింట రెండువంతులు పాడిపరిశ్రమ వలన వచ్చుచున్నది. బీడుభూములు, గడ్డిమైదానములు విరివిగ ఉండుటవలన పశుపోషణ బాగుగ అభివృద్ధిచెందినది. పాలిచ్చు ఆవులు 11,28,100; మాంసమునకు పనికివచ్చు గోసంతతి 24,33,100 ; దాదాపు 31 లక్షల పందులు ; 126,300 గొర్రెలు; 76,900 మేకలు; 58,900 గుర్రములు కలవని అంచనా. దాదాపు 70,000 పశువులు సాలున విదేశములకు ఎగుమతి అగుచున్నవి. మత్స్యపరిశ్రమకు అవకాశములు తక్కువ. అడవులలో 78% న వ్యక్తిగత స్వామ్యములు కలవు; 22% మాత్రమే కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వముల వశమున ఉన్నది. కలపవ్యాపారమున ప్రపంచరాజ్యములలో నాలుగవదిగ (కెనడా, స్వీడెన్, ఫిన్‌లాండుల తరువాత) ఈ రాజ్యము లెక్కకు వచ్చుచున్నది. దేశపుఎగుమతుల విలువలో 7% కలప వలన లభించుచున్నది. అడవులు అంతరించిపోవుటను నిరోధించుటకై ప్రభుత్వము తగు శాసనములను చేసి అమలుచేయుచున్నది. ఖనిజోత్పత్తులలో మాగ్నసైట్, గ్రాఫైట్, పెట్రోలియం ప్రముఖములు. ప్రపంచపు మాగ్నసైట్‌లో సగము ఈ దేశమున లభించుచున్నది. అత్యుత్తమపు గ్రాఫైట్‌ను విరివిగ త్రవ్వితీయుటలో ఈదేశపుదే అగ్రస్థానము. పెట్రోలియము లభించు యూరపీయ దేశములలో రుమేనియా తరువాత లెక్కకువచ్చునది ఈ దేశమే. తక్కిన ఖనిజములలో సీసము, తుత్తునాగము, రాగి, రాతిఉప్పు, కయోలిన్ లెక్కింపదగినవి. దేశపు పరిశ్రమలలో ప్రముఖములైనవి జాతీయములు చేయబడినవి. దేశపు విద్యుదుత్పత్తి 2.57 కోట్ల కివా. (1968); ఇందు అధికాంశము జలవిద్యుత్తు. సమష్టి జాతీయోత్పత్తిలో సగమునకు పైగా, పరిశ్రమల వలన లభించుచున్నది. ఉక్కు, ఇనుములకు సంబంధించినవి దేశమున ముఖ్యపరిశ్రమలు. యాంత్రిక శకటముల ఉత్పత్తి అందు ప్రముఖము. జవుళీ పరిశ్రమ యందు పలువురు కార్మికులు జీవించుచున్నారు. వైద్యుతిక పరికరముల, రసాయనికవస్తువుల పరిశ్రమలును బాగుగ అభివృద్ధిచెందినవి. దేశపు ఎగుమతుల విలువ 7,899.1 కోట్ల షిల్లింగులు. దిగుమతుల విలువ 10,447.6 కోట్ల షిల్లింగులు (1971). బడ్జెటరీ వ్యయము 12,282 కోట్ల షిల్లింగులు (1972).

**11. సాంఘిక రంగము :** అత్యంతాధునికము, సుసంస్కరితము, శ్రేయోదాయకము, అత్యు

త్తమమునగు సాంఘిక భద్రతావ్యవస్థ కలిగిన దేశములలో ఆస్ట్రియా ఒకటి. అప్పటికి అమలులో ఉండిన సాంఘికభీమా శాసనములన్నియు 1956లో క్రోడీకరింపబడి, తదాదిగ అమలులో ఉన్నవి. రోగము, అంగవైకల్యము, అశక్తత, వార్ధక్యము, నిరుద్యోగము అనువానికి సంబంధించిన వివిధ భీమాపద్ధతులు అమలున ఉన్నవి. నిరుద్యోగభృతి, సాధారణముగ ఉద్యోగమున సంపాదించగలుగు జీతమున 50% ఉండును. ఇట్టి సాంఘిక పింఛనులకును. భద్రతాచర్యలకును సంవత్సరమున 4 శత కోట్ల షిల్లింగులు వెచ్చింపబడుచున్నది (1969). గృహవసతి చక్కగ కలదు ; అయినను ఇంకను అందు అభివృద్ధి సాధింపబడుచున్నది. దేశమున నిరక్షరాస్యత 2% కు లోపుగ ఉండును. 6 నుండి 15 ఏండ్ల వయసువరకు ఉచితముగ నిర్బంధరీతిలో విద్యబోధింపబడుచున్నది. దేశపు 5,741 ప్రయిమరీ పాఠశాలలలో 9,74.510 మంది, 567 సెకండరీ పాఠశాలలలో 2,72,417 మంది విద్యార్థులు కలరు (1971-72). ఇవిగాక వ్యాపార పాఠశాలలు 54లో 11.646 మంది (1970-71), 147 సాంకేతిక పాఠశాలలలో 31,539 మంది చదువుచున్నారు (1971-73). దేశమున 17 విశ్వవిద్యాలయములు కలవు. వీనిలో వియెన్నాలోనిది అత్యంతఖ్యాతిని పొందినది. అన్ని విశ్వవిద్యాలయములలోని మొత్తపు విద్యార్థి సంఖ్య 60,170. ఆస్ట్రియాదేశము తొలుత నుండియు లలితకళలకు- ఇందును ప్రముఖముగ సంగీతమున- పేరుగన్నది. దేశమున అయిదు లలిత కళా కళాశాలలు కలవు ; అందలి విద్యార్థి సంఖ్య 3,711. దేశమున మొత్తపు గ్రంథాలయముల సంఖ్య రమారమి 3,000. వీనిలో ఆస్ట్రియాజాతీయ గ్రంథాలయము చాల పేరొందినది ; అందలిగ్రంథ సంఖ్య 18,31,176. దేశమున మ్యూజియములు 105 కలవు. వియెన్నా యందలి లలితకళా మ్యూజియం వీనిలో ప్రముఖము ; దీనిలో 17వ శతాబ్దికి చెందిన యూరపీయ కళాఖండములే గాక, ప్రాచ్య దేశీయ సుప్రసిద్ధ కళాఖండములు అనేకములు కలవు. 32 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో వియెన్నా నుండి వెలువడు 'కురియెర్' అత్యంతప్రచారము కలది (1971). దేశమున వైద్యసౌకర్యములు విరివిగ కలవు. ఆసుపత్రుల, నర్సింగుహోముల సంఖ్య 305 ; అందలి శయ్యాసంఖ్య 76,494; వైద్యసంఖ్య 13,747 (1969). వియెన్నాయందలి వైద్యశాస్త్రకళాశాలలు జగత్ ప్రసిద్ధములు. దేశపు ఆరోగ్యాశ్రమములు, ఉష్ణజల కుండములు, దేశీయులనేగాక విదేశీయులను సైతము ఆకర్షించుచున్నవి.

**12.** యాత్రా సౌ.: దేశపు విదేశీయ వినిమయ ద్రవ్యపు వనరులలో యాత్రికుల వలని ఆదాయము ప్రముఖము. సంవత్సరము పొడవున యాత్రికులు దేశమును దర్శింతురు. ఎండాకాలమున క్రీడోత్సవములును, సాంస్కృతిక ప్రదర్శనలును, ప్రకృతి దృశ్యములును యాత్రికులను ఆకర్షించును. చలికాలమున మంచునేలపై విహారము (స్కయింగ్) ను, గానసభలును, వారిని ఆకర్షించుచున్నవి. దేశపు 4000జనావాసములలో 1730 యాత్రాప్రాముఖ్యము కలవిగ గణనీయములు. 1968 లో 73,43,584 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

**13.** ప్రసిద్ధ పౌరులు : ఆస్ట్రియా దేశము కళాకారులకు, రచయితలకు, వైజ్ఞానికులకు నెలవుగ తొలుతనుండియు పేరుగన్నది. పాశ్చాత్య సంగీతమునకు ప్రసిద్ధిని సమకూర్చిన వాగ్గేయకారులు పలువురు అట జన్మించిరి. వారిలో 1. ఫ్రాన్జ్ జోసెఫ్ హైడెన్ (1732-1809), 2. వుల్ఫ్‌గాంగ్ అమాడియస్ మోజార్ట్ (1756-91), 3. ఫ్రాంజ్ షూబర్ట్ (1797-1828) విశ్వవిఖ్యాతిని ఆర్జించిరి. ఆస్ట్రియాలో జన్మించకపోయినను ఆ దేశమున నెలవును ఏర్పరచుకొనిన వాగ్గేయకారులలో 4.

లడ్విగ్‌ఫాన్ బీథోవెన్ (1770-1827), 5. యోహా నెస్ బ్రామ్స్ (1833-97) గణనీయులు. మనో విశ్లేషణాశాస్త్ర జనకుడుగ ప్రశంసితుడగు 6. సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939) ఆస్ట్రియా వాసియే. ఆస్ట్రియాదేశీయులలో పలువురు నోబెల్ బహుమానములను ఆర్జించిరి. వీరిలో భౌతికశాస్త్ర పండితులు 7. ఎర్విన్ షోడింగర్ (1887-1961) 8. విక్టర్‌హెస్ (1883-1964), రసాయనశాస్త్ర పండితులు 9. ఫ్రిజ్‌ప్రీగెల్ (1889-1930), 10. రిచర్డ్ సిగ్మండీ (1865-1925), 11. రాబర్ట్ కూన్ (జ. 1900), 13. వుల్ఫ్‌గాంగ్ పౌలీ (జ. 1900), శారీరకశాస్త్రపండితులు 13. రాబర్ట్ బరానీ (1876-1936), 14. జూలియస్ వాగ్నర్-జహ్‌రెగ్గ (1857-1940), 15. కారల్ లాండ్ స్టీనర్ (1868-1943), 16. టో ఓలోవీ (జ. 1873), 17. కారల్ ఫెర్డినాండ్‌కోరీ (జ.1896), అతని భార్య 18. జెర్తి తెరేసా రానిజ్‌కోరీ (జ. 1896). శాంతిసాధకులు 19. శ్రీమతి బెర్తా కిన్‌స్కీ-ఫాన్ సత్నర్ (1843-1914), 20. ఆల్‌ఫ్రెడ్ హెర్‌మన్ ఫ్రీడ్ (1864-1921) కలరు. ప్రసిద్ధ జన్యుశాస్త్రవేత్త 21. గ్రెగర్ యోహన్ మెండెల్ (1822-84) ఈ దేశీయుడే.

---

# 4. ఇటలీ

**ముఖ్యనగరము :** రోమ్ (రోమా); **జెండా :** ఆకుపసిమి, తెలుపు, ఎరుపురంగుల నిలువురేఖలు కలది; **జాతీయగీతము :** 'ఫ్రతెల్లీ డి ఇటాలియా' (ఇటాలీయ సోదరులారా) అను పదములతో ఆరంభితమగునది; **నాణెము :** లీరా; ఇది 100 సెంటిసిమోలుగ విభక్తము; 100 లీరాలు = రు. 1-20; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాల గణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యూరపు ఖండపు దక్షిణ భాగమున 47°5'30'' నుండి 35°47' ఉ. అ. రేఖలకును, 6°32'59'' నుండి 18°31'18'' తూ. తు. రేఖలకును మధ్యన విస్తరించియున్నది ఈ రాజ్యము. ఇటాలియన్ ద్వీపకల్పముతోపాటుగ ఈ అవధులలోనే ఇమిడిఉన్న ప్రముఖ ద్వీపములగు సిసిలీ, సార్డీనియాలును, మరికొన్ని అల్పద్వీపములును, ఇటలీ రాజ్యమున అంతర్భాగములుగ పరిగణనీయములు [కాని ఇటలీయ ద్వీపకల్పమునందలి రెండు ప్రాంతములు - సాన్ మారినో (99 చ. కిమీ ), వాటికన్ నగరరాజ్యము (108.7 చ. ఎకరములు) అనునవి - స్వతంత్ర రాజ్యములుగ ప్రతిపత్తిని కలిగియున్నవి]. బూటు తొడిగిన కాలివలె రూపుగొనిఉన్న ఇటలీయ ద్వీపకల్పపు వాయవ్య - ఆగ్నేయముల నిడివి 1,160 కిమీ. ఇది మధ్యధరా సముద్రములోనికి చొచ్చుకొని ఉన్నది. ఆ ద్వీపకల్పపు తూర్పు - పడమరల గరిష్ఠపు కొలత 216 కిమీ.; కనిష్ఠపు కొలత 128 కిమీ. ఫ్రాన్స్, స్విజర్‌లాండ్, ఆస్ట్రియా, యుగోస్లావియాలు ఈ దేశమునకు ఉత్తరపు సరిహద్దున ఉన్నవి. ద్వీపకల్పపు తీరరేఖనిడివి 4,160 కిమీ. ఈ ద్వీపకల్పమునకు తూర్పున అడ్రియాటిక్ సముద్రము, దక్షిణమున అయోనియన్ సముద్రము, పశ్చిమమున తిరేనియన్ సముద్రము కలవు. ద్వీపకల్పపు దక్షిణాగ్రమునకు, దరిదాపులలో సిసిలీ ద్వీపము (25,709 చ. కిమీ.) ను, సిసిలీకి వాయవ్యమున 320 కిమీ. ల దూరమున

సార్డీనియా ద్వీపము (24,809 చ. కిమీ.)ను కలవు. రాజ్యపు మొత్తపు వైశాల్యము 3,01,195 చ. కిమీ.

ఉత్తర ప్రాంతమునందలి పో నదీలోయయు, దక్షిణపు సన్నని తీరమైదానములునుతప్ప మిగిలిన ఇటలీదేశమంతయు పర్వతమయభూమిగ లెక్కింపదగి ఉన్నది. ఫ్రాన్స్, స్విజర్‌లాండు దేశములను




పటము 5.

తగిలెడు ఉత్తరపు సరిహద్దునఉన్న ఆల్ప్సు పర్వత ప్రాంతమున ప్రసిద్ధ సరోవరములు - కోమో, మాగియోర్, గర్డా అనునవి - కలవు. వీనినుండి వెలువడిన ఆరు చిన్ననదులు దక్షిణముగ ప్రవహించి, పో నదిలో కలియుచున్నవి. ఆల్ప్సు పర్వతభూమిని ఆశ్రయించి, ఇటలీదేశపు ప్రముఖ నదియగు, పో నది, పశ్చిమమునుండి తూర్పునకు ప్రవహించుచున్నది. ఇటలీదేశపు విస్తృతిలో 17% శాతపు భూమియందలి వర్షజలము ఈ నదిలో చేరుచున్నది. ఈ నదిలోయ, వ్యావసాయికముగను, పారిశ్రామికముగను, దేశమునకు హృదయసీమగ పేరొందినది.

ఆల్ప్సు పర్వతపు శిఖరములందెల్ల మాంటి రోసా (4,635 మీ.) ఉచ్చతమము. పో నదికి దక్షిణమున అప్పెనైన్ పర్వతశ్రేణి మొదలిడి, ఉత్తర దక్షిణములకు వ్యాపించి, ఇటలీదేశపు వెన్నెముకగ ప్రసిద్ధిని ఆర్జించినది. ఈ పర్వతశ్రేణియందు జనించి, పశ్చిమమునకు ప్రవహించు పెక్కు చిన్ననదులు కలవు; వానిలో ఆర్నో, టైబర్ అనునవి పేరొందినవి. అప్పెనైన్ పర్వతశ్రేణియందలి శిఖరములలో ఎత్తున మిన్నయైనది గ్రాన్ సస్సో (2,810 మీ.) ద్వీపకల్పపు తూర్పుతీరమున, నేపిల్స్ అఖాతమును అనుకొని వెసూవియస్ అగ్ని పర్వతము కలదు. ఇది ఇప్పటికిని రగులుచునే ఉన్నది. యూరపు ఖండపు ముఖ్యభూభాగమున కననగు రగులుచున్న అగ్నిపర్వతము ఇది ఒక్కటియే. తీరమైదానములు చాల సన్నముగఉన్నను, అందు అపూలియా, నేపిల్స్, రోమ్, లివర్నో పరిసరముల మైదానములు లెక్కింపదగినవి. పశ్చిమ తీరమున పర్వతభూమిలోనికి సముద్రము చొచ్చుకొని వచ్చుటవలన సహజముగ రూపొందిన నౌకాశ్రయములు - నేపిల్స్, లివర్నో, లా స్పేజియా, జెనోవా, సవోనా అనునవి - సుప్రసిద్ధములు. ఇవిగాక అడ్రియాటిక్ సముద్రతీరపు నిమ్నభూములందును వెనిస్, బారీ, బ్రిందిసీ, తరంతో నగరములవద్ద సహజనౌకాశ్రయములు రూపుగొన్నవి.

ద్వీపకల్ప భాగమునుండి సన్నని మెస్సీనా జలసంధిచేత వేరుచేయబడిఉన్న సిసిలీ ద్వీపమున మడోనీ పర్వతశ్రేణియు, కటానియా మైదానమును గణనీయములు. ఈ ద్వీపమునందున్న ఎత్నా (3,279 మీ.) అను ఒకే ఒక అగ్నిపర్వతము ఈనాడును రగులుచునే ఉన్నది.

తిర్రేనియన్ సముద్ర పరివృతమగు సార్డీనియా ద్వీపము చాలవరకు పర్వతమయము. ఇందలి శిఖరములలో అత్యున్నతము జెన్నార్ జెంటూ

(1,834 మీ.). ద్వీపపు మైదానములలో ఉత్తర ప్రాంతపు ఓజియేరీయు, దక్షిణ ప్రాంతపు కాంపిడానోయు, వైశాల్యా సారతలను అనుసరించి, ప్రముఖములు.

**2. శీతోష్ణస్థితి మొ :** ప్రాదేశికరీతిని, ఉన్నతిని అనుసరించి దేశపు వివిధ ప్రాంతముల శీతోష్ణత లందు మార్పులు కననగుచున్నవి. అయినను గరిష్ఠోష్ణత, జులై – అగస్టులలోను, కనిష్ఠోష్ణత డిసెంబరు – జనవరులలోను దేశమున వేద్యములగు చున్నవని చెప్పవచ్చును. పో నదీ పరిసరపు మైదానమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 55° ఫా.; సిసిలీ యందు 64°; తీరమైదానములందు 58°. పో నదీ లోయయందును, ఆల్ప్స్ పర్వత భూములందును అతి శీతపు చలికాలములును, కవోష్ణపు గ్రీష్మర్తువులును, వసంత శిశిరములలో గణనీయమగు వర్షపాతమును వేద్యములు; అచటి పర్వతములు హిమమయములు ఇక తక్కిన ద్వీపకల్పమునను, పరిసర ద్వీపములందును మధ్యధరా సముద్రప్రాంతపు శీతోష్ణస్థితులు కననగును. శీతకాలము చల్లగ నుండినను, అపుడే వానలును కురియును; గ్రీష్మము తీవ్రమై, తాపకారిగ ఉండును. సరాసరి సాలీనా వర్షపాతము, ఆగ్నేయపు తీరమునను, సిసిలీ యందును, సార్డీనియాలోను 50 సెం. మీ. గ ఉండగ, ఆల్ప్స్ పర్వత ప్రాంతమునను, అప్పినైన్ పర్వతపు పశ్చిమపు సానువులందును అది 200 సెం. మీ. కు పోవుచున్నది.

పెద్ద వన్యజంతువులు దేశమున లేనేలేవని చెప్పవచ్చును. ఆల్ప్స్ పర్వతములలో ఎలుగులును, ద్వీపకల్పమున తోడేళ్ళును, సార్డీనియాలో అడవి దుప్పులును, లేళ్ళును కననగుచున్నవి. పక్షిజాతికి సంబంధించినంతవరకు గద్దలును, పిచ్చుకలును విశేషముగ కలవు. తీరసముద్ర జలములందు మత్స్య సంతతి విరివిగ కలదు.

ఉన్నతిని అనుసరించి వృక్షసంపత్తియందు విభేదములు కననగుచున్నవి. ఆల్ప్స్ పర్వతము లందు 2,000 మీ. ఎత్తునకుపైనను, అప్పెనైన్ పర్వతములందు 2,300 మీ. కు పైనను, సాంద్ర సూచ్యగ్రజాతి వృక్షసంపద కలదు. ఆ ఎత్తులకు దిగువన ఆ పర్వతములందు భూర్జజాతియు, ఓకు చెట్లును విరివిగ కలవు. పో నదీ పరిసరములలో పోప్లార్, విల్లో వృక్షములు ఉన్నవి. ద్వీపకల్ప భూమియందును, పరిసర ద్వీపములందును మధ్యధరా ప్రాంతీయమగు వృక్షసంపద – నిత్యహరిత జాతివృక్షములు, జీలుగచెట్లు మొదలగునవి – కన్పట్టును.

**3. జనసంఖ్య మొ. :** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 5,40,25,211. జనసాంద్రత చ. కిమీ. కు 179. దేశపు నగరములలో రోమ్ (జ. సం. 28,00,439), మిలాన్ (17,25,663), నేపిల్స్ (12,34,228), తురిన్ (11,78,376), జెనోవా (8,12,491), పాలెర్మో (6,51,628), బోలోనా (4,90,256), ఫ్లారెన్స్ (4,61,737), వెనిస్ (3,64,003) గణనీయములు. ఇవిగాక లక్షకు పైబడిన జనసంఖ్య కలిగిన నగరములు 36 ఉన్నవి. చారిత్రక గతిలో పలువిధముల జాతులు – ఎట్రస్కన్‌లు, లాటిన్‌లు, గ్రీకులు, లొంబార్డులు, గాతులు, అరబ్బీలు, స్పెయిన్ దేశీయులు – అటనట ఈ దేశమున తావులను ఆర్జించి వసించినను, కాలక్రమమున వీరందరును సమ్మిళితమైన ఒకేఒక విధపు ఇటలీయజాతి రూపొందినది. ఆల్టో – అడిగో ప్రాంతపు 250 వేల జర్మనులును, ట్రీస్టీప్రాంతపు 2 లక్షల స్లావ్ ప్రజలును మాత్రమే ప్రముఖ అల్పసంఖ్యాక వర్గములుగ నేడు లెక్కింపబడుచున్నారు. దేశపు అత్యధిక సంఖ్యాకుల మాతృభాష ఇటాలియన్; ఇదియే సాధికారభాష. ఇందు వివిధ మాండలికములు ప్రచారమున ఉన్నను, టస్కనీరాష్ట్రపు మాండలికమే ప్రామాణికభాషగ

పరిగణనకు వచ్చినది. ఫ్రెంచి, జర్మన్ భాషలు క్రమముగ పీడ్‌మాంట్, అయోస్టా లోయలలో కొలది అల్పసంఖ్యాకులందును, వెనిస్ ప్రాంతమున కొలది అల్పసంఖ్యాకులందు స్లావీన్ భాషయు ప్రచారములందు ఉన్నవి. ప్రజలలో 99% రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవమతమునకు చెందిన వారు. తక్కిన సంప్రదాయముల క్రైస్తవులు లక్షకు లోపుగను, యూదులు రమారమిన 50,000 కు మించకను ఉన్నారు.

**4. సమాచార సౌ.:** దేశమున 13,119 తపాలాఫీసులు పనిచేయుచున్నవి; తంతి ఆఫీసుల సంఖ్య 11,648. సాగరిక రేడియో - టెలిగ్రాఫ్ స్టేషనులు 22, తీరప్రాంతములందు, పనిచేయుచున్నవి; విరివిగ దేశాంతర్గతమగు టెలిఫోనువసతి కలదు. మూడు రేడియో స్టేషనులును, రెండు టెలివిజన్ స్థావరములును కలవు (1971).

**5. యాన సౌ.:** దేశమున 2,86,784 కిమీ.ల నిడివిగల రోడ్లు కలవు; ఫ్రాన్సును ఈ దేశమునకు కలుపుచు మౌంట్ బ్లాంక్ పర్వతమున సొరంగమును త్రవ్వి దానిద్వారా ఒక రోడ్డు (11.6 కిమీ.) 1965 లో నిర్మితమైనది. దేశపు రైలుమార్గముల నిడివి 20,239 కిమీ.; ఇందులో దాదాపు 8,000 కిమీ.ల దూరమున విద్యుత్ సహాయమున బండ్లు నడచుచున్నవి (1972). దేశపు తీరమునఉన్న సహజములగు హార్బరులలో జెనోవా, సవోనా, వెనిస్, నేపిల్స్, లివర్నో ప్రముఖములు వర్తక నౌకాదళ ప్రమాణపు లెక్కలో ప్రపంచ రాజ్యములలో 11 వ స్థానము ఈ దేశమునకు కలదు; దాని విస్తృతి 80,60,760 గ్రాస్ టన్నులు; అందలి నౌకల సంఖ్య 4,235 (1971). దేశమునందలి నదులందును, కాలువలందును 1,933 కిమీ.ల నిడివిన నౌకాయాన సౌకర్యము కలదు (1969). దేశపు ప్రభుత్వమునకు చెందిన అల్ - ఇటాలియా అను విమానయానసంస్థ, ప్రపంచమునందలి ప్రముఖ కేంద్రములకు అన్నింటికిని ఇటలీనుండి విమానయాన వసతిని కల్పించుచున్నది. దేశమున అంతర్జాతీయ యానమునకై 21, జాతీయ యానమునకు 30, క్లబ్బులకై 75 విమానాశ్రయములు కలవు.

**6. చరిత్ర:** అతి ప్రాచీన చరిత్ర కలిగిన యూరపీయ దేశములలో గ్రీసు తరువాత లెక్కకు వచ్చునది ఈ దేశమే. దాదాపుగ 2,500 సంవత్సరములకు పూర్వమునుండియు, ఈ దేశపు చారిత్రక వివరములు తెలియవచ్చుచున్నవి. క్రీ. పూ. 9 వ శతాబ్ది మొదలుగ క్రమముగ లిగూరియన్, సాబైన్, ఎట్రుస్కన్, ఫినీషియన్, గ్రీకు జాతులవారు అంతటంతట వేర్వేరు తావులందు రాజ్యములను నెలకొల్పి ఆధిపత్యమునకై పోరాడిరి. కడకు రోమ్ నగరమును, కేంద్రముగ గ్రహించిన లాటిన్ జాతివారు, అప్పటిలో తమకు ప్రతి స్పర్ధులుగఉండిన గ్రీకులను, ఎట్రుస్కన్‌లను నిర్జించి, ఇటలీ ద్వీపకల్పమును అంతటిని తమ ఆధిపత్యములోనికి తీసికొని రాగల్గిరి (క్రీ. పూ. 272). తరువాత, ఆఫ్రికా ఉత్తరతీరమున ఆధిపత్యము వహించియున్న కార్తేజిని నిర్మూలించి (క్రీ. పూ. 146), లాటిన్ జాతివారు సిసిలీ, సార్డీనియా, కార్సికాలను ఆక్రమించి, మధ్యధరా ప్రాంతమునందంతటను రోమ్‌నగర రాజ్యపు ప్రతిష్ఠను పెంపొందింపజేసిరి. నెలకొల్పబడినదాదిగ రోమ్ ఒక గణతంత్ర నగరముగ చాల కాలము ఉండినది. అటులనుండియే, అపుడా గణ రాజ్యము, పాంపీ, జూలియస్ సీజర్, మార్క్ ఆంటోనీ, ఆక్టేవియన్ మొదలగు నాయకుల ప్రతిభ వలన ఒక విశాల సామ్రాజ్యమును నెలకొల్ప గలిగినది. కాని ఈ నాయకులమధ్య సాగిన అంతర్యుద్ధముల ఫలితముగ, కడకు ఆక్టేవియన్ సర్వాధిపత్యమును ఆర్జించగలిగెను (క్రీ. పూ. 31). ఇతనికి, అప్పటి సెనెట్ (శిష్టసభ), ఆగస్టస్ (వర్ధిష్ణు దివ్య

పురుషుడు) అను బిరుదమును కల్పింపగ, అతడే కడకు తొలుతటి రోమన్ సామ్రాట్టుగ పరిణమించెను. అటనుండి సాగిన సామ్రాట్టుల పరిపాలనలలో, అట్లాంటిక్ మహాసముద్రము మొదలుగ రైన్‌నదివరకు (బ్రిటిష్ దీవులతో సహా) యావత్ యూరపీయ భూభాగమేగాక, ఉత్తర ఆఫ్రికాయు, యూఫ్రటిస్ నదివరకు పశ్చిమ ఆసియాయు రోమన్ సామ్రాజ్యమున అంతర్భాగములైనవి. రోమన్ న్యాయశాస్త్రము, రోమక పరిపాలనావ్యవస్థ ఈ విశాల భూమియందు సువ్యవస్థితములై నెలకొని 'రోమక శాంతి' అనబడు ఒక శాంతియుత వ్యవస్థను ఏర్పరుప గలిగినవి. రెండు శతాబ్దములు ఇటుల వైభవోపేతముగ మనిన ఈ సామ్రాజ్యమున, క్రీ. శ. మూడవ శతాబ్దమున, ఆంతరంగిక కల్లోలములకు తోడుగ అనాగరికజాతుల దండయాత్రలును విజృంభించి, సామ్రాజ్య భద్రతకు భంగమును కలిగించినవి. అంతట పరిపాలనా సౌకర్యమునకై సామ్రాజ్యము, తూర్పు పశ్చిమ భాగములుగ విభక్తమైనది. క్రీ. శ. 4 వ శతాబ్ది తొలి పాదమున, ఆ సామ్రాజ్యమును పాలించిన కాన్‌స్టాన్‌టైన్ చక్రవర్తి క్రైస్తవమతమును అవలంబించిన ఫలితముగ, ఆ మతమునకు సామ్రాజ్యమున ఆధిక్యము చేకూరినది. ఆ చక్రవర్తియే, సామ్రాజ్యపు రాజధానిని రోమ్‌నుండి, ఆసియామైనరులోని కాన్‌స్టాంటినోపిల్‌కు తరలించుటవలన, రోమ్‌నగర ప్రశస్తియు, ఇటలీదేశపు ప్రాముఖ్యమును సన్నగిలినవి. ఇందులకుతోడుగ అనాగరకజాతుల దండయాత్రలకును ఈ ప్రాంతము విరివిగ లోనగుటవలన 4-6 శతాబ్దముల మధ్యకాలమున ఇటలీదేశపు ఏకత అంతరించినది. తూర్పుభాగపు సామ్రాట్టులు ఏ కొలదిగనో ఈ ప్రాంతమునకు తొలుత కొంత సాయపడిరి; కాని రోమ్ నగరమును తన స్థావరముగ గ్రహించిన క్రైస్తవ మతాధిపతి (పోపు) తో, ఆ చక్రవర్తులకు పొడమిన వైరుధ్యములవలన 8 వ శతాబ్ది మధ్యకాలమునకు ఆ సంబంధము అంతరించినది.

క్రీ. శ. 6 నుండి 13 వ శతాబ్దముల మధ్యకాలమున వివిధ అంతరంగిక, బాహ్య సంఘర్షణల మూలమున ఇటలీదేశము అల్పరాజ్యములుగ విభక్తమై నిరంతరపు పోరాటములతో సతమతమైనది; ఈ కాలముననే, పవిత్ర రోమక సామ్రాజ్యమను పేర జర్మను చక్రవర్తులు నెలకొల్పిన ఒక రాజ్యమును ఇందలి కొన్ని భాగములను ఆక్రమించినది; పోపుసైతము, ఈ ఆధిపత్యపు పెనగులాటలలో ఒకడుగ పాల్గొనెను. వెనిస్, మిలాన్, ఫ్లారెన్స్, బొలోనా నగరములు ప్రత్యేక నగరరాజ్యములుగ రూపొంది ప్రాభవమును ఆర్జించినవి. తూర్పు రోమక సామ్రాజ్యము అంతరించిన తరువాత 15 వ శతాబ్దిలో, ఈ పట్టణములకు, ఆ సామ్రాజ్యపు మేధావులును, కళాకారులును, వర్తకులును విరివిగ వచ్చిచేరిరి. తత్ఫలితముగ ఈ నగరములు విజ్ఞాన శాస్త్రములకును, కళలకును నెలవులుగ రూపొంది, సాంస్కృతిక పునరుజ్జీవనము ఇటలీయందేగాక, తక్కిన యూరపునసైతము విజృంభించుటకు కారణభూతములైనవి. 16 వ శతాబ్దివరకు ఇటుల ఇటలీదేశము సాంస్కృతికముగ ముందునకు రాగలిగినను, తదనంతరమున మరల అందలి అత్యధిక భాగము స్పెయిన్, ఫ్రాన్సు మొదలగు అన్యదేశముల వశమైనది.

ఫ్రెంచి విప్లవపు కాలమున, తక్కిన యూరపీయ దేశములందు రీతిగనే, స్వాతంత్ర్య సమానత్వ భావనలకు ఈ దేశమునసైతము వ్యాప్తికలిగినను, నెపోలియన్ పతనమైన తరువాత, పూర్వపు వ్యవస్థయే మరల కుదురుకొనినది. ఈ పరిస్థితులలో దేశమునందలి స్వాతంత్ర్యాకాంక్షను సువ్యవస్థితము చేయుటలో 'మేజ్జీనీ' అను నాయకుడు ప్రముఖ పాత్ర వహించెను. అప్పటిలో దేశమందలి పీడ్

మాంట్ మండలపాలకునివద్ద మంత్రిగ ఉండిన కావూర్ అనునతడును తన రాజకీయ చతురతను దేశ స్వాతంత్ర్య సంపాదనకై వినియోగించెను. 1860 లో గేరిబాల్డీ అను స్వాతంత్ర్యవీరుని నాయకత్వమున ఈ ఉద్యమము ఇంకను తీవ్రతరమయినది. తత్ఫలితముగ దేశీయ సేనలు విదేశీయ పాలకులను దేశమునుండి తరిమివేయగలిగినవి. అంతట దేశమున అత్యధిక భాగము, పీడ్‌మాంట్ మండల పాలకుడగు విక్టర్ ఎమాన్యుయెల్ ప్రభుని రాచరికమున సర్వస్వతంత్రమైనది (1861, మార్చి). 1866 లో వెనిషియా అను భాగమును, 1870 లో లాటియమ్ అను భాగమునుకూడ ఈ ప్రభుత్వమునకు వశమగుటతో దేశమంతయు ఏకీకృత పాలనలోనికి వచ్చినది. (కాని క్రైస్తవమత పీఠాధిపతియగు పోపునకు లాటియమ్ నివాసమగుటవలన, తదనంతర కాలమున దానికి మరల స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించుట జరిగినది. చూ : వాటికన్).

ప్రథమ ప్రపంచయుద్ధకాలమున, తొలుత జర్మనీ పక్షమునే అవలంబించినను, కడకు ఇటలీ దేశము మిత్రరాజ్యముల పక్షమున చేరినది. అయినను శాంతి సంధికాలమున ఈ దేశమునకు ప్రాదేశికముగ ఏమియు లభించినదికాదు; ఇందులకు తోడుగ దేశమున ఆర్థిక పరిస్థితియు అస్తవ్యస్తమై ప్రజలలో నిరాశా నిస్పృహలు ఏర్పడినవి. దానిని అదనుగ గ్రహించి, బెనిటో ముస్సోలినీ అను నాయకుడు తన ఫాసిస్టు పక్షమునకు బలమును ఆర్జించి, అధికారమును కైవసము చేసికొని, నామమాత్రముగ రాచరికమును గౌరవించుచు, నియంతృత్వపు పాలనను నెలకొల్పెను. నిరుద్యోగము మొదలగువానిని తొలగించుటలో ఇతడు చాలవరకు కృతకృత్యుడైనను, ఇటలీకి ఒక సామ్రాజ్యమును ఆర్జించవలెనను అతని ఆకాంక్ష దేశమును పెడమార్గమునకు లాగినది. అంతట ఎతియోపియాను, దౌర్జన్యమార్గమున ఇటలీ ఆక్రమించినది (1935-36). తరువాత ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున అక్షరాజ్యముల పక్షమున ఇటలీదేశము పోరాడునటుల ముసోలినీ చేయగలిగెను. తొలుత ఇందువలన ఆల్బేనియా మొదలగు కొన్ని ప్రాంతములు ఇటలీకి దక్కినను, కడకు ఉత్తర ఆఫ్రికాయందు పెక్కు పరాజయములకు ఇటలీసేనలు లోనైనవి కడకు ముస్సోలినీ అరెస్టు చేయబడి, యుద్ధము ముగియనున్న కాలమున, విప్లవసేనలచే చంపబడెను. ఇటలీయంతయు మే 28, 1945 నాటికి మిత్రరాజ్యముల వశమైనది. తుదకు కుదిరిన శాంతి సంధిమూలమున తన వలసలను అన్నింటిని ఇటలీ వదలుకొనినది; కొన్ని సరిహద్దు ప్రాంతములు ఫ్రాన్సునకును, యుగోస్లావియాకును వశము చేసినది; 36 కోట్ల నష్టపరిహారమును సోవియెట్‌రష్యాకు ఈ దేశము చెల్లించు ఏర్పాటు జరిగినది. 1946 లో జరిగిన జనాభిప్రాయ సేకరణను అనుసరించి, దేశమున్న రాచరికము అంతరించి గణరాజ్యము ఏర్పడినది.

**7. పరిపాలన :** దేశమున గణతంత్ర పరిపాలన 1948 మొదలుగ అమలులో ఉన్నది. 21 ఏండ్ల వయసునకు పైబడిన పౌరులలో ప్రతివానికిని వోటుహక్కు కలదు. శాసన నిర్మాణాధికారము పార్లమెంటున న్యస్తము. ఇందు ప్రతినిధి సభ, శిష్టసభ అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధి సభయందలి సభ్యసంఖ్య 630; ఇందలి సభ్యుని వయస్సు 25 ఏండ్లకు తగ్గిఉండకూడదు. 80,000 మంది పౌరులకు ఒక ప్రతినిధిచొప్పున ప్రతినిధి సభకు సభ్యులు ఎన్నుకొనబడుదురు (అందులకు అనుగుణముగనే ఆ సభయందలి సభ్యసంఖ్య నిర్ణయింపబడినది) శిష్టసభయందలి సభ్యసంఖ్య 322; ఇందలి సభ్యుని వయస్సు 40 ఏండ్లకు తగ్గి ఉండగూడదు. ప్రాంతములను అనుసరించి, 2 లక్షలమందికి ఒక ప్రతినిధి చొప్పున ఏ ప్రాంతమునకును ఆరుగురు సభ్యులకన్న ఎక్కువ ఉండని రీతిలో, ఇందులకు ఎన్నికలు జరుగును. కాని

దీనికి వోటుచేయువారివయసు 25 కు తగ్గకూడదను నియమము కలదు సాధారణరీతిలో, ఈ ఉభయ కక్ష్యలకును ఎన్నికలు అయిదేండ్లకు ఒకసారి జరుగుచుండును. అధ్యక్షులుగ పనిచేసి, ఉద్యోగ విరమణ చేసినవారును; అధ్యక్షుడు నియమించు విశిష్టపౌరులు అయిదుగురును శిష్టసభయందు సభ్యులుగ ఉందురు. దేశాధ్యక్షుడు పార్లమెంటువలన ఎన్నుకొనబడును. అతని పదవీకాలపరిమితి 7 సంవత్సరములు. పార్లమెంటున అత్యధికబలము కలిగినవానిని ప్రధానిగ అధ్యక్షుడు నియమించును. పార్లమెంటు ఆమోదముతో తక్కిన మంత్రులను ప్రధాని నియమించును. అధ్యక్షుడు రాజ్యాంగబద్ధ అధినేతగ మాత్రమే వ్యవహరించును.

దేశమున 9 రాజకీయ పక్షములు కలవు. వీనిలో క్రిస్టియన్ డెమోక్రాటిక్ పార్టీ అత్యధిక బలము కలది; తరువాత కమ్యూనిస్టు పార్టీయు, సోషలిస్ట్ పార్టీలు లెక్కింపదగినవి. కాని ఈ పార్టీలలో ఏదియు స్వయముగ సగమునకుపైగా స్థానములను ఆర్జింపలేకపోవుటవలన తక్కినవానిలో కొన్నింటిని కలుపుకొని క్రిస్టియన్ డెమోక్రాటిక్ పార్టీ ప్రభుత్వమును ఏర్పరచుట ఆ దేశమున పరిపాటియైనది. అట్టి మిశ్రమ ప్రభుత్వములు దీర్ఘకాలము నిలువజాలవు; కావున పదింబదిగ నూతన ప్రభుత్వములు అచట ఏర్పడుచున్నవి. 1948–1970 మధ్య కాలమున అట 33 ప్రభుత్వములు ఏర్పడినవి. దేశమున 5 స్వయంపాలిత ప్రాంతములు – సిసిలీ, సార్డినియా, ఓస్టా, దక్షిణ టెరల్, ఫ్రూలీ వెనిజియా, గ్విలియా అనునవి – కలవు. వీనికి వేర్వేరు పార్లమెంటులు కలవు; వీనికిగల ప్రత్యేకాధికారములు రాజ్యాంగవిధానమువలన నిర్దేశితములు. ఇవిగాక ఆంతరంగిక స్వయంపాలన కలిగిన 15 రాష్ట్రములు కలవు. వీనికి ఎన్నుకొనబడిన ప్రాంతీయ సభలు కలవు. రోమ్‌లోని కోర్ట్ ఆఫ్ కాసేషన్ అను ఉచ్చతమ న్యాయస్థానపు ఆధిపత్యమున మాండలిక న్యాయస్థానములు 272 పనిచేయుచున్నవి. రాజ్యాంగ విధానమునకు సంబంధించిన వివాదముల పరిష్కారమునకు ఒక ప్రత్యేక న్యాయస్థానము పనిచేయుచున్నది.

**8. దేశరక్షణ :** ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరపు శాంతి సంధికాలమున ఈ దేశపు రక్షణ బలముల సంఖ్యాదులనుగురించి కొన్ని నిర్బంధములు విధింపబడినను, 1951 లో ఆ నిర్బంధముల తొలగింపునకు, సోవియెట్ రష్యా తప్ప తక్కిన మిత్రరాజ్యములు అంగీకరించినందువలన, తదాదిగ ఈ దేశము తన రక్షణ బలమును చాలవరకు పెంచగలిగినది. భూతల సేనలోని సైనికసంఖ్య 3,06,600. ఈ సైన్యము సర్వ నవీనాయుధ సమన్వితము; నాలుగు కవచశకట దళములును, నాలుగు క్షిపణి ప్రయోగదళములును ఇందు కలవు. నౌకా సేనయందలి సైనిక సంఖ్య 41,800. ఈ సేనకు రెండు క్రూయిజర్లును, 9 జలాంతర్గాములును, నాలుగు డిస్ట్రాయర్లు, ఒక పెద్ద డిస్ట్రాయరు, 238 తదితర యుద్ధవ్యవహార నౌకలు కలవు. వాయు సేనయందలి సైనిక సంఖ్య 70,000. పోరాటపు విమానముల సంఖ్య 300.

**9. అంతర్జాతీయ సం. :** 1955 మొదలుగ ఈ దేశము ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును సభ్యత్వము వహించియున్నది. యూరపీయ కామన్ మార్కెటునను, నేటో (ఉత్తర అట్లాంటిక్ రాజ్యవ్యవస్థ) యందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ఆహార వ్యవసాయ వ్యవస్థ యొక్క ముఖ్య కార్యాలయము రోమ్‌నగరమున ఉన్నది. పశ్చిమ యూరపీయ రాజ్యములతోనేగాక, సోవియెట్ యూనియన్ తోడను సామరస్యముతో ఈ రాజ్యము వ్యవహరింపగలుగుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ యందు వ్యవసాయమునకు సముచిత ప్రాముఖ్యము ఇప్పటికిని ఉన్నను, ప్రస్తుతమున పారిశ్రామిక కృషియే ఆధిక్యమును పొంది ఉన్నది. దేశపు 301 లక్షల హెక్టేరులలో 250 లక్షల హెక్టేరులు వ్యవసాయమున ఉన్నది. దేశపు కార్మిక శక్తిలో 22% వ్యవసాయమున వినియుక్తమైనను, సమష్టి జాతీయోత్పత్తిలో 11% మాత్రమే దీని వలన లభ్యమగుచున్నది (1968). 1962 ప్రాంతమున జరిగిన భూసంస్కరణల వలన చిన్న కమతములు దేశమున ఏర్పడినవి. వ్యవసాయోత్పత్తులలో గోధుమ అతి ప్రముఖము. అయినను తన ఆహారావసరములకై ఈ దేశము గోధుమను కొంత దిగుమతి చేసి కొనుచున్నది. ఆయా వ్యవసాయోత్పత్తుల ప్రమాణములు, వేల మెట్రిక్ టన్నులలో, ఈ దిగువరీతిగ కలవు (1971): గోధుమ 1.00,703; బార్లీ 3,671; ఓట్లు 5,008; రై 545; మొక్కజొన్న 44,688; చక్కెర బీటుదుంప 87,762; ఉరలగడ్డ 32,675; టామాటోలు 33,611; వరి 8,923; ఆలివ్‌నూనె 6, 157; నారింజ 14,624; నిమ్మ 7,793; తక్కిన నిమ్మజాతి ఫలములు 401. ఇవిగాక పొగాకు ఉత్పత్తి 79,274 టన్నులు; ద్రాక్ష సారాయవు ఉత్పత్తి 62,27,100 లీటర్లు. దేశమున పశుసంపద విరివిగ కలదు. 1968 అంచనాలనుబట్టి గోజాతి 95,03,000; పందులు 52, 92,000; గొర్రెలు 82,12,000; మేకలు 11, 40,000; గుర్రములు 9,21,000 కలవని తెలియుచున్నది. చేపల పరిశ్రమలో 18,958 మోటారు బోట్లు, 27,580 తెరచాప పడవలు పాల్గొనుచున్నవి; చేపల పట్టుబడి 3,63,400 మెట్రిక్ టన్నులు (1968). ఆల్ప్సు పర్వత ప్రాంతములందు మాత్రమే సాంద్రములగు అడవులు కలవు. దేశావసరములకు తగినంతగ మాత్రమే కలప లభించుచున్నది. ఖనిజసంపత్తి చాల తక్కువ. సమష్టి జాతీయోత్పత్తిలో 1% మాత్రమే ఖనిజముల వలన లభించుచున్నది. పాదరసము, గంధకము మాత్రము దేశావసరములకు మించి లభించుటవలన, అందు కొంతభాగము ఎగుమతి యగుచున్నది. పోనదీ లోయలో ఇంధన వాయువును, దేశావసరములకు తగినంతగ లభించుచున్నది. సిసిలీలో పెట్రోలియమ్ విరివిగనే లభించుచున్నను, దేశావసరములకు అది సరిపోవుటలేదు. యుద్ధానంతరమున పరిశ్రమలు విరివిగ అభివృద్ధి చెందినవి. ఉక్కు యంత్రములు, మోటారుకార్లు, రసాయనములు, వస్త్రములు పారిశ్రామికోత్పత్తులలో ప్రముఖములు: కార్ల ఉత్పత్తిలో ప్రముఖత వహించిన ఫియట్ కంపెనీ ఈ దేశమునందలిదే. ఇంకను, భవన నిర్మాణ, నౌకా నిర్మాణములలో సైతము ఈ దేశము చాల కుశలతను ఆర్జించి, విదేశములలో పెక్కింటి నుండి కాంట్రాక్టులను ఆర్జించుచున్నది. దేశపు కార్మికశక్తిలో 42% పరిశ్రమలందు వినియుక్తమై సమష్టి జాతీయోత్పత్తిలో 34% ను ఉత్పత్తి చేయుచున్నది. దేశమున కార్ల ఉత్పత్తి 15 లక్షలు; ఇందు మూడవవంతు ఎగుమతి యగుచున్నది (1968). రసాయనికోత్పత్తిలో గంధకద్రావకము ఎక్కువగ ఎగుమతి యగుచున్నది. దేశమున విద్యుదుత్పత్తి 12,436 కోట్ల కివా. (1971); ఇందు దాదాపు మూడవవంతు జలవిద్యుత్తు. దేశపు ఎగుమతుల విలువ 9,36,169.4 కోట్ల లీరాలు; దిగుమతుల విలువ 9,90,130.8 లీ. (1971). దేశపు బడ్జెటరీ వ్యయము 16,90,521 కోట్ల లీ. (1971).

**11. సాంఘిక రంగము :** సాంఘిక శ్రేయమునకు సంబంధించిన వివిధ శాసనముల అమలు 1898 మొదలుగ దేశమున సాగుచున్నది. 1952 లో ఈ శాసనములు చాల అభ్యుదయకరరీతిలో మార్పులను పొందినవి. వార్ధక్యము, వికలాంగత, నిరుద్యోగము మొదలగు సాంఘిక దురవస్థలలో ఆదు

కొనుటకు తగిన భృతుల ఏర్పాట్లు అమలులో ఉన్నవి. యుద్ధమువలన దేశమున గృహవసతి చాలవరకు విచ్ఛిన్నమైనను యుద్ధానంతరపు ప్రభుత్వముల కృషి వలన ఆ లోటు చాలవరకు నింపబడినది. 6 నుండి 14 ఏండ్లవరకు వయసుకలిగిన బాలబాలికలకు నిర్బంధ, ఉచితవిద్యావిధానము అమలున ఉన్నది. దేశమున 23,391 శిశు విద్యాశాలలలో 14,66,374 మంది; 37,085 ప్రాథమిక పాఠశాలలలో 49,54,341 మంది; 15,442 సెకండరీ పాఠశాలలలో 40,00,687 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక యూనివర్సిటీలు లేదా ఆ స్థాయికే చెందిన ఉన్నత విద్యాసంస్థల మొత్తపుసంఖ్య 43; వీనిలో కొన్ని సంస్థలు అతి ప్రాచీనములు. బోలోనా విశ్వవిద్యాలయము క్రీ. శ. 1200 లో, పడోవా విశ్వవిద్యాలయము 1222 లో, రోమా విశ్వవిద్యాలయము 1303 లో సంస్థాపితములు. ఈ 43 ఉన్నత విద్యాసంస్థలలోని విద్యార్థి సంఖ్య 7,59,872 (1971-72); దేశమున దినపత్రికల సంఖ్య 75; ఇందులో 14 రోమునుండి, 8 మిలాన్ నుండి వెలువడుచున్నవి. 'కొర్రియేరే డెల్లాసేరా' అను పత్రిక అత్యధిక ప్రచారము కలిగియున్నది. అతి ప్రాచీన సాంస్కృతిక సంపత్తికి పేరొంది, యూరపు ఖండమునకు అంతటికిని సాంస్కృతిక భిక్షను ప్రసాదించిన ఈ దేశమున ప్రాచీనములగు గ్రంథాలయములును, కళామందిరములును అనేకములు కలవు. వందలకొలదిగఉన్న ఆ గ్రంథాలయములో ఫ్లారెన్స్, రోమ్, పాలెర్మోలలోని జాతీయ గ్రంథాలయములును, మోడెనాలోని ప్రభుత్వ గ్రంథాలయమును, బోలోనాలోని విశ్వవిద్యాలయ గ్రంథాలయమును అతి ప్రసిద్ధములు. కళామందిరములలో రోమ్, నేపిల్స్, పాలెర్మోల లోని జాతీయ మ్యూజియములు; ఫ్లారెన్స్‌లోని అయిదు కళా భాండాగారములు; మిలాన్, సీనా, సిరాకూస్, అర్బినో, వెనిస్ నగరములలోని మ్యూజియములు గణనీయములు. దేశమున వైద్య వసతులు విరివిగ కలవు. 580 మంది ప్రజలకు ఒక డాక్టరు చొప్పున కలడని అంచనా (1968). దేశమున 5,28,276 శయ్యా సంఖ్యకల 2,451 ఆసుపత్రులు కలవు. వైద్యసంఖ్య 93,537 (1967). జాతీయ ఆరోగ్య భీమా విధానము అమలున ఉన్నది. దానివలన దాదాపు 3 కోట్లమంది దేశీయులకు వైద్య సౌకర్యములు 1966 లో లభించినవి.

**12.** యాత్రా సౌ. : అతి ప్రాచీన చరిత్ర కలిగిన ఈ దేశమున చారిత్రకముగ, సాంస్కృతికముగ, మత విషయికముగ విశిష్టత కలిగిన తావులు అనేకములు కలవు. వీనిని దర్శించుటకు విదేశీయ యాత్రికులు విరివిగ దేశమునకు వచ్చుచుందురు. ఇట్టి వారికి ప్రభుత్వము వసతులను పెక్కింటిని సమకూర్చినది. యు. స్టే. వాసులును, యూరపీయ రాజ్యములలో కొన్ని రాజ్యముల వారును పాస్ పోర్టుతో మాత్రమే దేశమున పర్యటించ వచ్చును. ఫ్రెంచివారికి పాస్‌పోర్టు సైతము అక్కరలేదు. 1971 లో 332 లక్షల విదేశీయులు దేశమును సందర్శించిరి. వీరిలో అయిదింట ఒకపాలు జర్మనులు. వీరందరు దేశమున 1,17,640 కోట్ల లీ. వెచ్చించిరి.

**13.** ప్రసిద్ధ పౌరులు : చారిత్రక ఖ్యాతిని ఆర్జించిన ఈ దేశమున వివిధ రంగములందు పేరెన్నికగాంచిన ప్రముఖులెందరో జన్మించిరి. యూరపీయ సాంస్కృతిక చరిత్రలో ప్రఖ్యాతి వహించిన వారిలో దాదాపు సగమునకు పైగా ఇటలీ వాసులే కలరని విజ్ఞుల అభిప్రాయము. కావున అట్టి వారి పట్టికను, నామమాత్రముగనైన ఇచట ఇచ్చుటకు అవకాశములేదు. ఆయా రంగములందు అత్యంత ప్రముఖతను పొందిన కొందరి నామమాత్రప్రసక్తి మాత్రమే ఇట సాధ్యము.

ఇటలీని కేంద్రముగ గ్రహించి రోమక మహా సామ్రాజ్యమును నిర్మించిన వారిలో జూలియస్ సీజర్ (క్రీ పూ. 101-44), ఆగస్టస్ అను బిరుదు కలిగిన ఆక్టేవియన్ (క్రీ. పూ. 63 - క్రీ. శ. 14) ప్రముఖులు; క్రైస్తవమత వ్యాపనమునకై కృషిచేసిన చక్రవర్తి కాన్‌స్టాన్‌టైన్ (274-337).

13 నుండి 16వ శతాబ్దము వరకు సాగిన పునరుజ్జీవన యుగమున సర్వతోముఖ ప్రజ్ఞకు పేరొందిన లియొనార్డో డా వించి (1452-1519), శిల్ప, చిత్రకళా, వాస్తు, కవిత్వములందు పేరొందిన మైకేల్ ఏంజెలో (1475-1564); చిత్రకళావేత్త రేఫేల్ (1483-1520) గణనీయులు.

ఆ యుగముననే సంగీతమున పేరెన్నిక గాంచిన వారు: పాలెస్ట్రీనా (1525-1594); లూరా మేరెన్జియో (1533-99).

ఇటలీయ సారస్వతమున పేరొందినవారు. డాంటీ అలిఘిరీ (1265-1321); పెట్రార్క (1304-74); రాజనీతిశాస్త్ర రచయితగ విశ్వ విఖ్యాతిని పొందినవాడు నిక్కొలో మెక్కెవెల్లి (1469-1527).

దేశ స్వాతంత్ర్య సంగ్రామమున నాయకత్వము వహించినవారు: జియుసెప్పి మేజ్జినీ (1805-72); కేమిల్లో బెన్సో డి కావూర్ (1810-61); జియుసెప్పి గేరిబాల్డీ (1807-82).

ఫాసిస్టు నియంతృత్వకాలమున దేశమునకై ఒక సామ్రాజ్యమును నిర్మింపదలచి విఫలత చెందిన నియంత బెనిటో ముస్సోలినీ (1883-1945).

ఆధునిక యుగమున నోబెల్ బహుమతి పొందిన వారు; జియోసీ కార్డూచి (1835-1907), ఎన్‌రికో ఫెర్మి (1901-54); గూగెలిమో మార్కోనీ (1847-1937); గులియో నత్తా (జ. 1903).

---

# 5. ఐర్లాండు

**ముఖ్యనగరము** : డబ్లిన్ (బైలీ అథా చాల్); **జెండా** : సమాన ప్రమాణములలో నిలువుగ అమరిన ఆకుపసిమి, తెలుపు, నారింజరంగు చారలు; **జాతీయగీతము** : అమ్‌హరన్ నాభ్‌ఫియన్ (యోధ గీతము) అని వ్యవహృతమగునది; **నాణెము** : ఐరిష్ పౌండ్; ఇది 100 పెన్నీలుగ విభక్తము; ఒక ఐరిష్ పౌండ్ = రు. 18.00; **కొలతూకములు** : బ్రిటిష్ విధానపువి; **కాలగణన** : మధ్యాహ్నము 12 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : ఉత్తర అట్లాంటిక్ మహా సముద్రమున 51°30′ నుండి 55°30′ ఉ. అ. వరకును, 5°30′ నుండి 10°30′ ప. తు. వరకును విస్తరించియున్న ఐర్‌లాండు ద్వీపమున అత్యధిక భాగమును ఆక్రమించి ఐర్లాండ్ గణరాజ్యము నెలకొనియున్నది. ఈ ద్వీపమున 70,282 కి. మీ. వైశాల్యముకల భూమి ఐర్లాండ్ గణరాజ్యమునకు చెందినది. ఉత్తర ఐర్లాండ్ అని వ్యవహృతమగు తక్కిన భాగము యునైటెడ్ కింగ్‌డమ్ (గ్రేట్ బ్రిటన్) రాజ్యమున అంతర్భాగముగ లెక్కింపబడుచున్నది.

దేశమంతయు ఒక సున్నపురాతి పీఠభూమి; దీని కడయంచులందు, తీరప్రాంతమును ఆశ్ర

యించి వేర్వేరు తీరుల ఉన్నత భూములు కలవు. దాదాపు మైదానముగ కుదిరియున్న దేశమధ్యమున సరసులు, మడుగులు, చెదరుమదురుగ కొండ గుట్టలు విశేషముగ కలవు. ఈ మైదానము సముద్ర మట్టమునకు సరాసరిన 91 మీ. ఎత్తున ఉన్నది. దేశపు ఈశాన్యమున, తూర్పున, నైఋతిన కొన్ని పర్వతశ్రేణులు కలవు. పర్వత శిఖరములలో ఎక్కువ ఎత్తుగలది కర్రాంతుహిల్ (1,040 మీ.). దేశపు తీరరేఖ పొడవు 3,360 కిమీ. సముద్రము తీరములోనికి పలుతావుల చొచ్చుకొని వచ్చుటవలన,




పటము 6.

తూర్పునతప్ప, తక్కిన అన్ని దిశలందును సహజ సిద్ధ నౌకాశ్రయములు అనేకములు రూపుగొనినవి. నదులలోనెల్ల ప్రముఖము షన్నాన్. ఉత్తరపు సరిహద్దున జన్మించిన ఈ నది, మధ్యదేశమున దాదాపు 400 కిమీ. దూరము ప్రవహించి, దేశపు నైఋతి తీరమున, అట్లాంటిక్ మహాసముద్రమున కలయుచున్నది. తక్కిన నదులలో బాయ్నీ, సూయిర్, లిఫ్ఫీ, స్లానీ, బారో, బ్లాక్‌వాటర్, లీ, నోరే పేర్కొనదగినవి.

**2. శీతోష్ణస్థితి మొ.:** సమశీతోష్ణతకు ఈ దేశము పేరొందినది. సాలున సరాసరి ఉష్ణోగ్రత 50° ఫా.; ఎండకాలపు ఉష్ణోగ్రత 60° ను దాటదు; శీతకాలమున అది 40 ఫా. కు తగ్గదు. సాలున సరాసరి వర్షపాతము తూర్పు, ఉత్తర ప్రాంతము లందు 75 సెం. మీ.; నైఋతి ప్రాంతమునమాత్రము 125 సెం. మీ. వృక్షజాతులలో ఓకు. దేవదారు, భూర్జ, బీచి వృక్షములు విరివిగ కననగును; గరిక పట్టులు విస్తారముగ కలవు. నైఋతి తీరమున తాళ జాతి వృక్షములు కన్పట్టును. పెద్ద జంతువులు ఏవియు లేవు గుర్రపు తట్టులు, రేసుకుక్కలు, గోజాతి జంతువులు మాత్రమే లెక్కింపదగినవి. సర్పజాతి ఎచటను కన్పట్టదు.

**3. జనసంఖ్య మొ.:** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 29,78,248; జన సాంద్రత చ.కిమీ.కు41.దేశపు నగరములలో డబ్లిన్ (జ. సం. 6,50,113), కార్క్ (1,25,183) గణ నీయములు. దేశమున చారిత్రక గతిలో అంతటంతట కెల్టు, నార్స్‌మెన్, ఫ్రెంచినార్మన్ జాతులవారు చేరినను, వీరందరును ఏకజాతిగ ఇపుడు రూపొం దిరి. దేశమున ఐరిష్ (గేలిక్), ఇంగ్లీష్ భాషలు మాతృభాషలుగ ప్రచారమున ఉన్నవి. తొలుత దేశీయుల భాష ఐరిష్ మాత్రమే; కాని ఆంగ్లేయులు దేశమును కడు దీర్ఘకాలము పాలించినందువలన, ఇంగ్లీషే, పెక్కు ప్రాంతములందు, మాతృభాషగ ముందునకు రాగలిగినది; పశ్చిమ ప్రాంతమున మాత్రము, ఆ కాలమున, ఐరిష్‌భాష అంతరించ కుండ నిలువగలిగినది. దేశము స్వాతంత్ర్యమును ఆర్జించిన తరువాత ఐరిష్‌నే దేశీయుల మాతృభాషగ చేయుటకు ప్రభుత్వము కృషిచేసినది. అయినను ఐరిష్‌తోపాటుగ ఇంగ్లీషు సైతము సామాన్యభాషగ

నేడు వ్యాప్తియందున్నది. దేశీయులలో 95% రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన సంప్రదాయములవారు అత్యల్ప సంఖ్యలలో కలరు.

**4. సమాచార సౌ. :** దేశపు తపాలా ఆఫీసుల సంఖ్య 2,205; తంతి కార్యాలయాలు 1,360; టెలిఫోన్ ఎక్స్చేంజీలు 1,058. ఒక ప్రభుత్వసంస్థ వలన రేడియో, టెలివిజన్ స్టేషనులు నిర్వహింప బడుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున మొత్తపు రోడ్ల నిడివి 86,685 కిమీ; ఇందు ట్రంకురోడ్ల నిడివి 15,822 కిమీ. (1970). నదీజల మార్గములందు 361 కిమీ.ల నిడివిన నౌకాయాన సౌకర్యము కలదు. సముద్రతీరపు రేవులలో కార్క్, ద్రోఘెడా, డబ్లిన్, డండాక్, దూన్ లావగైర్, గాల్వే, లైమ్‌రిక్, రాస్‌లేర్, వాటర్‌ఫర్డ్ గణనీయములు. వర్తక నౌకాదళమున నౌకల సంఖ్య 1,930 (1971). రైలుమార్గముల మొత్తపు నిడివి 2,175 కిమీ. దేశపు విమానాశ్రయములలో డబ్లిన్, షన్నాన్, కార్క్ నగరములందలివి ప్రముఖములు. దేశీయము లగు రెండు విమానయాన సంస్థలును, కొన్ని ఇతర దేశీయ సంస్థలును ఈ దేశమునకు యూరప్, అమెరికా రాజ్యములతో విమానయాన సౌకర్యమును కల్పించుచున్నవి.

**6. చరిత్ర :** క్రీస్తు శకారంభమునకు చాల పూర్వముననే ఇచట జనావాసములు ఉండినటుల పురాశాస్త్రవేత్తల కృషివలన తెలియనైనను, అప్పటి ప్రజలను గురించిన చారిత్రక విశేషములు ఏవియు తెలియవచ్చుటలేదు. క్రీ. పూ. 4 వ శతాబ్దమున, కెల్టు జాతీయులు ఈ దేశమున కాలిడి, అచటి ఆదిమవాసులను లోగొని క్రమముగ క్రీ. శ. మూడవ శతాబ్దికి అయిదు రాజ్యములను దేశమున నెలకొల్పిరి. క్రీ. శ. 432 లో క్రైస్తవమత ప్రచారకుడగు సెయింట్ పాట్రిక్ దేశమున కాలిడి అట క్రైస్తవమతమునకు విరివిగ వ్యాప్తిని కలిగించెను. అంతటినుండి అచట గేలిక్ భాషతోపాటుగ లాటిన్ భాషయు విపులాదరణను సాధించినది; ఐర్లాండును కేంద్రముగ గ్రహించి మత ప్రచారకులు పలువురు తక్కిన యూరపీయ దేశములందు క్రైస్తవమునకు తావు కల్పించిరి. 8 వ శతాబ్ది మొదలుగ దాదాపు మూడు శతాబ్దములు ఈ దేశము 'వైకింగు' లన బడు సాహసిక నావికయోధుల దాడులకు గురియై నష్టపడినది. క్రీ. శ. 1014 లో ఈ వైకింగులను దేశీయ ప్రభువులు ఓడింపగలిగిరి. కాని పండ్రెండవ శతాబ్ది మధ్యభాగమునుండియు ఆంగ్లదేశమునుండి ఆంగ్లో - నార్మనులు ఈ దేశముపై దండయాత్రల జరిపి దేశమును వశపరచుకొనిరి. వీరు దేశీయ భాషా సంప్రదాయములను అవలంబించి, దేశీయులు గనే కడకు రూపొందినను, దేశముపై, ఆంగ్లదేశపు ప్రభువే రాచరికమును నిర్వహించెను. ఇది ప్రజలకు గిట్టినదికాదు; ఆంగ్లదేశపు ఆధిపత్యమును త్రోసిరాజనుటకై దేశీయులు అంతటంతట తీవ్ర ప్రతిఘటనను సాగించిరి. ఈ ప్రతిఘటన దాదాపు 800 సంవత్సరములు సాగినదని చెప్పవచ్చును. ఈ దీర్ఘకాలమున పలుసంఘటనలు జరిగినవి. దేశ సేవకులెందరో తమ ప్రాణములను కోల్పోయిరి. ఆంగ్ల ప్రభుత్వము, ఈ దేశమును తమ దేశమున అంతర్భాగముగ గ్రహించి, ప్రజలకు తమ పార్లమెంటున ప్రాతినిధ్యమును కల్పించినను (1800), ఐర్లాండులోని జాతీయవాదులకు తృప్తికలుగక, వారు తమ ప్రతిఘటనను సాగించిరి. కడకు 1921 లో దేశమునకు అధినివేశ ప్రతిపత్తిని ఆంగ్ల ప్రభుత్వమును కల్పించినది. కాని ఆ సమయముననే దేశపు ఉత్తరప్రాంతపు 6 జిల్లాలను ప్రత్యేక స్వతంత్ర మండలముగ రూపొందించిరి. 1949 లో ఉత్తరప్రాంతపు స్వతంత్రమండలముగాక మిగిలిన భాగమంతయు గణరాజ్యముగ సర్వస్వతంత్రతను

ఆర్జించినది. 1957 మొదలుగ ఈ ప్రాంతమే ఐర్లాండు అను పేరున వ్యవహృతమగుచున్నది.

**7. పరిపాలన :** ఈ దేశమున, 1937 న ఆమోదితమైన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి పరిపాలన సాగుచున్నది. శాసన నిర్మాణాధికారము అధ్యక్షునియందును, రెండు కక్ష్యలు కలిగిన శాసనసభయందును న్యస్తము. అధ్యక్షుడు ఏడేండ్లకు ఒకసారి ప్రజలచేత ఎన్నుకొనబడును. శాసనసభలో ప్రతినిధుల సభ (డయల్ ఈరియన్), శిష్టసభ (సీనద్ ఈరియన్) అను రెండు కక్ష్యలు కలవు. ప్రతినిధుల సభలోని సభ్యసంఖ్య 144. చట్టప్రకారము నిర్ణయితములగు ప్రాదేశిక నియోజకవర్గములనుండి వీరు ఎన్నుకొనబడెదరు. శిష్టసభయందలి సభ్యసంఖ్య 60. వీరిలో 43 మందిని అయిదు నియోజకవర్గములు — 1. విద్యా సాంస్కృతిక వర్గము 2. వ్యవసాయాదిక సంస్థలు, మత్స్య పరిశ్రమ, 3. కార్మికరంగము, 4. పారిశ్రామిక వ్యాపారరంగము, 5. ప్రజాపరిపాలనా, సాంఘిక సేవా సంస్థలు - ఎన్నుకొనును; ఆరుగురను విశ్వవిద్యాలయములు ఎన్నుకొనును; 11 మందిని ప్రధాని నియమించును. జాతీయ ప్రాముఖ్యము కలిగిన కొన్ని చట్టముల విషయమున తుది నిర్ణయమునకై జనాభిప్రాయ సేకరణ (రిఫరెండం) జరుపు సంప్రదాయము, రాజ్యాంగ విధానము ఏర్పరచినది. ఎన్నికలు నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతిన జరుగును. రాజకీయ పక్షములలో ఫియన్నా ఫెయిల్, ఫెయిన్ గేల్, కార్మిక పక్షము ప్రముఖములు. ఎన్నుకొనబడిన పరిషత్తుల సాయముతో స్థానిక పరిపాలన సాగుచున్నది. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున, వివిధ స్థాయిలలో న్యాయనిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** అన్ని విధముల భూతల, నౌకా, వాయుసేనల మొత్తపు సైనికసంఖ్య 13,000. రిజర్వు సైనికసంఖ్య 23,700 (1973).

**9. అంతర్జాతీయ సం. :** 1955 మొదలుగ ఈ దేశము ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను సభ్యత్వము కలిగి యున్నది. ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యవమున మధ్య ప్రాచ్యమునను, సైప్రస్‌నను ఒక ఐరిష్ సేనాదళము శాంతి సంరక్షక కృషిలో పాల్గొన్నది.

**10. ఆర్థిక రంగము :** 1950 వరకు ఈ దేశపు ఆర్థికవ్యవస్థ వ్యవసాయముపైననే ఆధారపడి ఉన్నను, తదాదిగ ప్రభుత్వపు కృషివలన పరిశ్రమలును చాల ముందునకు రాగలిగినవి. దేశమున 1,13,47,800 ఎకరములు వ్యవసాయమునను, పశుపాలనమునను ఉన్నది. ధాన్యపు పైరులలో గోధుమ, బార్లీ, ఓట్లు ప్రముఖములు; దుంప పంటలలో ఉరలగడ్డ ప్రముఖము. పశుపాలనము దేశమున ఒక ముఖ్యవృత్తి; గోజాతి పశువులు 5,960 వేలు; గొఱ్ఱెలు 40,82,300; పందులు 11,92,500; గుర్రములు 1,24,300; కోళ్లు 1,12,30,600 కలవని తెలియుచున్నది (1970) పశూత్పత్తులలో 80% విదేశములకు ఎగుమతియగుచున్నవి. మత్స్య సంపద విరివిగ సేకరింపబడుచున్నది. 1969 లో సముద్రమున లభించిన మత్స్యముల విలువ 30 లక్షల పౌనులు. అరణ్యములు ఒక కాలమున విరివిగ ఉండినను ప్రస్తుతమున అవి చాలవరకు అంతరించినవి. అడవులను పెంచుటకై ప్రభుత్వము ప్రస్తుతమున చాలకృషి జరుపుచున్నది. ఖనిజ సంపద గణనీయ స్థితిలోలేదు. ఉన్నవానిలో రాక్షసి బొగ్గు ప్రముఖము. తరువాత లెక్కింపదగినవి సీసము, రాగి, తుత్తునాగము, వెండి, ఇనుము. వ్యవసాయిక ఉత్పత్తులపై ఆధారపడిన పరిశ్రమలును ఉక్కు, ఎరువులకు సంబంధించిన పరిశ్రమలును కొలదిగ కలవు. కాని ప్రభుత్వపు ప్రోత్సాహమువలన పరిశ్రమలు త్వరితముగ అభివృద్ధిని సాధించుచున్నవి. దేశమున విద్యుదుత్పత్తి 524.6 కోట్ల కివా. (1969-70). దేశపు ఎగుమతుల

విలువ 52,79,00,290 పౌ.; దిగుమతుల విలువ 75,49,13,123 పౌ. (1971). బడ్జెటరీ వ్యయము 57.16 కోట్ల పౌ. (1971-72).

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక భద్రతకు సంబంధించిన భీమా విధానము అమలున ఉన్నది. వృద్ధులకు, అంధులకు, నిరుద్యోగులకు, వితంతువులకు, అనాథ శిశువులకు ఇందువలన భద్రత లభించుచున్నది. దేశమున తొలుత గృహవసతి చాల తక్కువగనే ఉన్నను ప్రభుత్వ కృషివలన ఈ సమస్య చాలవరకు పరిష్కరింపబడినది (1969). ప్రయిమరీ విద్య నిర్బంధముగ, ఉచితముగ బోధింప బడుచున్నది. మాధ్యమిక విద్యయు చాలవరకు ఉచితముగనే లభించుచున్నది. ప్రయిమరీ పాఠశాల లలో 5,10,225 మంది, ప్రయిమరీ తరువాతి తర గతులలో 1,85,600 మంది విద్యార్థులు కలరు (1969). దేశమున ఉన్నతవిద్యను బోధించు విశ్వవిద్యాలయ స్థాయిగల సంస్థలు 5 కలవు. వీనిలో డబ్లిన్‌లోని విశ్వవిద్యాలయ కళాశాల ప్రము ఖము. ఈ సంస్థలలో అన్నింటకలసి 19,746 మంది విద్యార్థులు కలరు (1970-71). దేశపు గ్రంథాలయములందు అన్నింట డబ్లిన్‌లోని గ్రంథాల యము పేరొందినది. ఆ నగరముననేఉన్న నేషనల్ మ్యూజియమును, నేషనల్ గేలరీయు పురాతత్త్వ శాస్త్ర, లలితకళా వికసనముల దృష్టిలో గణనీయ ములు. దేశమున 7 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. ఇవి అన్నియు ఆంగ్లముననే వెలువడు చున్నవి. వీనిలో ప్రో-ఫైన్‌గేల్ అనుదానికి అత్య ధిక ప్రచారము కలదు. తక్కువ ఆదాయముల వారికి ఉచితవైద్య సౌకర్యమును ప్రభుత్వము ఏర్పరచినది. వైద్యవసతులు విరివిగ కలవు. వైద్య శాలల మొత్తపు సంఖ్య 273; శయ్యాసంఖ్య 38,468; వైద్యసంఖ్య 3,011 (1966).

**12. యాత్రా సౌ.** · దేశపు ఆదాయపు వనరు లలో యాత్రికులవలన లభించునది ప్రముఖము; చెల్లింపులోటును పూరించుటకు ఈ ఆదాయము చాల సహకరించుచున్నది. ప్రభుత్వము యాత్రికులకు పెక్కు సౌకర్యములను సమకూర్చి ప్రోత్సహించు చున్నది. 1971 లో 94,17,000 మంది విదేశీ యులు దేశమును దర్శించిరి; వారు దేశమున దాదాపు 772 లక్షల పౌనులను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** దేశపు ప్రసిద్ధ పౌరు లలో, ప్రాచీనులందు తొలుతగ లెక్కింపదగినవాడు సెయింట్ పాట్రిక్ (ర. 385-461). ఈతడు ఈ దేశమున జన్మింపకపోయినను, ఇటచేరి దేశ మున క్రైస్తవమతమునకు సుస్థిర స్థానమును కల్పిం చెను. దేశమున 16 వ శతాబ్ది మొదలుగ స్వాతం త్ర్యమునకై పోరాటములు సాగించినవారలు పలు వురు కలరు. వారిలో చార్లెస్ స్టీవార్ట్ పార్నెల్ (1846-91), ఈమన్ డివెలెరా (1842-1975) ప్రముఖులు. ఇందు కడపటివాడు స్వాతంత్ర్యమును సాధించి, స్వతంత్ర ఐర్లాండున దీర్ఘకాలము పాలకుడుగ పనిచేసెను.

దేశమున జన్మించిన వైజ్ఞానికులలో రాబర్ట్ బాయిల్ (1627-91); గణిత, ఖగోళశాస్త్రవేత్త లలో విలియమ్ రోవాన్ హేమిల్టన్ (1805-65) ప్రముఖులు. ఎడ్వర్డ్ హింక్స్ (1792-1866) ప్రాచీనమగు సుమేరియన్ లిపిని తొలుతగ చదువ గల్గెను. రచయితలలో జోనాథన్ స్విఫ్ట్ (1667-1745); ఆలివర్ గోల్డ్‌స్మిత్ (1730 ? - 1774); రిచర్డ్ బ్రిన్‌స్లీ షెరిడన్ (1751-1816), ఓస్కార్ విల్డ్ (1854-1900), జార్జి బెర్నార్డ్‌షా (1856-1950) ప్రముఖులు. నాటక రచయితగను కవిగను నోబెల్ బహుమతిని ఆర్జించిన విలియమ్ బట్లర్ యీట్స్ (1865-1939) ఈ దేశీయుడే.

# 6. ఐస్‌లాండ్

**ముఖ్యనగరము :** రిక్‌జవిక్; **జెండా :** నీలి భూమికపై అమరిన శోణవర్ణపు సిలువ; ఇందలి అడ్డుగీత కుడివైపునకు ఎక్కువగ పొడుగు సాగియుండగ, సిలువయొక్క భుజముల అంచులందు తెలుపురంగు కన్పట్టును; **జాతీయ గీతము :** ఓ గుడ్ వోర్స్ లాండ్స్ (హే మాతృదేశ ప్రభూ) అను పదముతో మొదలిడునది. **నాణెము :** క్రోనా;



పటము 7.

ఇది 100 ఆరర్లుగ విభక్తము; 100 క్రోనాలు = రు. 8.50 పైసలు; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** ఉ. 11 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యూరపు ఖండపు పశ్చిమపు కడయంచున, ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రమున, ఆర్కిటిక్ వలయమునకు ఆనుకొని దిగువన ఉన్న ఈ ద్వీపరాజ్యము 13°13′ నుండి 24°32′ ఉ. అ. రేఖలమధ్యను (రమారమి 480 కిమీ.), 63°24′ నుండి 66°32′ ప. తు. రేఖల మధ్యను (రమారమి 304 కిమీ.) నెలకొని ఉన్నది. ద్వీప వైశాల్యము 1,03,000 చ. కిమీ. తీరరేఖ మొత్తపు నిడివి 5,920 కిమీ. తీరసమీపమునఉన్న కొన్ని చిన్న దీవులును, రాజ్యాంగరీత్యా ఈ దేశమున అంతర్భాగములు. అట్టి దీవులలో వెస్ట్‌మన్ దీవి ప్రముఖము. దేశ మధ్యభాగము అగ్ని శైలజమగు ఒక పీఠభూమి; దీనిని పరివేష్టించి పర్వతములు కలవు. వీనియందలి అత్యున్నత శిఖరము వన్నాదల్ష్నుకుర్ (2,119 మీ.). లావామయము లగు భూములు దేశమున తొమ్మిదవ భాగమును ఆక్రమించి ఉన్నవి; దేశపు ఎనిమిదవ భాగము హిమశిలావృతభూమి (గ్లేసియర్స్). అగ్ని పర్వతములు అనేకములు కలవు. ఇందొకటి 1947 లో విజృంభించినది. ఉష్ణగుండములు, ఉష్ణస్రోతస్సులు (గైజర్స్), సరసులు విరివిగ కననగును. దేశపు ఆగ్నేయ ప్రాంతమున 8,400 చ. కిమీ ల వైశాల్యము కలిగిన హిమశిలావృత భూమి కలదు. యూరపు ఖండమున వేరెచటను ఇంత హిమశిలావృతభూమి కన్పట్టదు. చిన్ననదులు మాత్రమే కలవు అవి నౌకాయానమునకు పనికిరావు కాని జలపాతములు ఎక్కువగ ఉండుటవలన విద్యుదుత్పత్తికి అవి అనుకూలించుచున్నవి. నైరృతి తీరమున అటనటను, కొన్ని లోయలందును, వ్యవసాయానుకూలములగు చీలిక భూములు కన్పట్టును. పశ్చిమ, ఉత్తర, తూర్పు కోస్తాలలో సహజసిద్ధములగు హార్బరులు ఏర్పడి ఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ధ్రువప్రాంతమునకు దగ్గరలోనే ఉన్నను, ఈ రాజ్యపు శీతోష్ణ పరిస్థితి చాల సౌమ్యముగ ఉన్నది. గల్ఫ్‌స్ట్రీమ్ అను సముద్ర ఉష్ణజల ప్రవాహము ఈ ద్వీపరాజ్యమును దాదాపుగ చుట్టుముట్టి ఉండుటవలన ఈ సౌమ్యత లభ్యమైనది. ముఖ్యనగరమున సాలున అత్యధికోష్ణత 52° ఫా.; అత్యల్పోష్ణత 30° ఫా. సాలుసరి వర్ష

పాతము ఉత్తర ప్రాంతమున 30 సెం. మీ. నుండి 68 సెం. మీ. వరకు మారును; దక్షిణమున ఆ వర్ష పాతము 125 సెం. మీ.; పర్వత భూములందు 200 సెం. మీ. శీతకాలము, గ్రీష్మ ఋతువుకన్న, అతి దీర్ఘము. కొలదిగ చిన్న జాతి వృక్షములు అట నట కన్పట్టును. చిన్న పొదలును, గరికపట్టులును ఎక్కువగ కలవు. గుంటనక్కలును, రైన్‌డీరులు (హిమప్రాంతపు లేళ్ళు) ను మాత్రమే కన్పట్టు వన్య జంతువులు. తీరప్రాంతపు సముద్రమునందు తిమింగిలము, సీలు మొదలగు పెద్ద జలచరములేగాక పలువిధముల చేపలును కలవు. 100 రకముల పక్షిజాతులు కలవు. కప్పలు, సరీసృపములు, కీటక జాతులు కన్పట్టవు.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 2,07,174 (1971). ముఖ్యనగరమగు రిక్‌జవిక్ లోని జనసంఖ్య 82,892 జనసాంద్రత చ. కిమీ. కు రమారమి 2. దేశీయభాష ఐస్‌లాండిక్; పూర్వమున నార్వేదేశమున ప్రచారమునఉండిన నార్స్‌భాషనుండి ఇది జన్మించినది. దేశీయులందరు లూథరన్‌శాఖకు చెందిన క్రైస్తవులు

**4. సమాచార సౌ.:** తపాలాఫీసుల సంఖ్య 229; టెలిఫోన్, టెలిగ్రాఫ్ ఆఫీసులు 187; రేడియో, టెలివిజన్ సౌకర్యములు కలవు.

**5. యాన సౌ.:** దేశమున 11,200 కిమీ. ల పొడవున కంకరరాతి రోడ్లు కలవు. రైలుమార్గములు లేవు. రిక్‌జవిక్ ప్రాంతమున మంచి హార్బరు కలదు. దేశమున ఎగుమతి వ్యాపారమున 60% దీనిద్వారా సాగుచున్నది. ఉత్తర తీరమున ఉన్న అకుర్యేరి రేవునుండియు విరివిగ వ్యాపారము జరుగుచున్నది. ఇంకను చిన్నరేవులు అనేకములు కలవు. దేశపు వర్తక నౌకాదళపు టన్నేజి 1,45,000 టన్నులు (1969). దేశాంతర్గతముగను, విదేశములకును విమానయాన సౌకర్యము బాగుగ కలదు. దేశీయమగు ఒక విమానసంస్థ విమానయానమును విదేశములకును, దేశమునందలి పలుతావులమధ్యను నిర్వహించుచున్నది.

**6. చరిత్ర:** క్రీ. శ. 874 లో, నార్వే దేశీయుడగు ఇంగోల్ఫర్ ఆర్‌నార్సన్ అనువాడు ఈ ద్వీపమున కాలిడినది మొదలుగ, నార్వే దేశీయులు పలువురు ఇట చేరుట ఆరంభమయ్యెను. క్రీ. శ. 1000 లో క్రైస్తవమతము ఇట ప్రవేశపెట్టబడెను. దేశీయులు 930 లోనే ఆల్‌తింగ్ అనుపేర ఒక శాసనసభను నిర్మించుకొని స్వపరిపాలనమునకు అలవడినను 1262 లో నార్వేదేశపు పాలకుడగు హాకన్ IV యొక్క సర్వాధిపత్యమును వారు అంగీకరించిరి. 1381 లో నార్వే దేశమును డెన్మార్క్ దేశపురాజు వశపరచుకొనగ, ఐస్‌లాండ్ కూడ డెన్మార్క్ పాలకునికి దక్కినది. డేనులు ఈ దేశమును కొల్లగొట్టిరి; అందులకు తోడుగ 1783 లోని అగ్నిపర్వత విజృంభణము, రోగబాధ, కరువు దేశప్రజలను పీడింపగ జనసంఖ్య 1800 నాటికి 38,000 కు పడిపోయినది. ఈ సమయముననే, దేశీయ శాసనసభను, డెన్మార్క్ దేశపురాజు రద్దుచేసెను. 1830 మొదలుగ, స్వాతంత్ర్యము కొరకై దేశీయులు ఆందోళనను సాగించిరి. తరువాత 1918 లో దేశము స్వతంత్రముగఉండి, విదేశ వ్యవహారములందు మాత్రము డెన్మార్క్ దేశపు ప్రభుపాలనను అంగీకరించుటకు ఏర్పాటు జరిగినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జర్మన్‌సేనలు డెన్మార్క్‌ను ఆక్రమించగ, ఐస్‌లాండ్‌న, ఆ దేశపు సమ్మతితో బ్రిటిష్ సేనలు 1940 లో దిగి, దేశమును తమ రక్షణలోనికి తీసికొనినవి. ఆ తర్వాత బ్రిటిష్ సేనలకు బదులుగ అమెరికన్ సేనలు అట చేరినను యుద్ధానంతరమున అవి వైదొలగినవి. అంతట 1944 లో జరిగిన ప్రజాభిప్రాయ సేకరణలో డెన్మార్క్‌తోగల సంబంధమును త్రెంచుకొనుటకు 97% ప్రజలు అంగీకరించిరి.

తత్ఫలితముగ జూన్ 17, 1944న దేశము సర్వ స్వతంత్రమైనది.

**7. పరిపాలన :** దేశమున గణతంత్ర పరిపాలన వ్యవస్థితము. అధ్యక్షుని సార్వజనిక వోటు పద్ధతిన ప్రజలు ఎన్నుకొనెదరు. అధ్యక్షుని పదవీ కాల పరిమితి నాలుగేండ్లు. ఆల్ తింగ్ అను పేరున వ్యవహృతమగు శాసనసభకలదు. అందలి సభ్య సంఖ్య 60. వీరిని నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమున, 8 నియోజకవర్గములనుండి, నాలుగేండ్లకు ఒకసారి జరుగు, ఎన్నికలో ప్రజలు ఎన్నుకొనెదరు. ఈ సభ్యులు తమలోనుండి మూడవవంతు మందిని ఎఫేర్ డీల్డ్ అను ఎగువ సభకు ఎన్నుకొనెదరు. మిగిలినవారు నియోర్ డీల్డ్ అను దిగువ కక్ష్యగా ఏర్పడెదరు. బడ్జెటును, తక్కిన ఆర్థిక విషయిక వ్యవహారములను ఉభయ కక్ష్యలును కలసిన ఆల్ తింగ్ సభయే చర్చించి నిర్ణయించవలయును. తక్కిన విషయములందు వేరువేరుగనే ఈ కక్ష్యలు వ్యవహరించును. రాజ్యాంగ విధానమును మార్పు సవరణను చర్చింపవలసినపుడు ఆల్ తింగ్ మొత్తమునకు తిరిగి ఎన్నికలు జరుపబడును. 21 ఏండ్ల వయసువచ్చిన ప్రతి పౌరునికి వోటుహక్కు కలదు. దేశమున నాలుగు రాజకీయ పక్షములు కలవు. దేశమున 16 జిల్లాలు కలవు; వీనియందు ఎన్నుకొనబడిన సమితుల సాయమున ప్రభుత్వనియమితుడగు పాలకుడు పాలనను నిర్వహించును. ముఖ్యనగరమునందలి సుప్రీమ్ కోర్టుయొక్క ఆధ్వర్యమున 26 దిగువ కోర్టులద్వారా న్యాయనిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమునకు భూతల, నౌకా, వాయు సేనలు ఎట్టివియులేవు. తీరపు మత్స్య పరిశ్రమను రక్షించుటకై కొన్ని ఆయుధనౌకలను విమానములను మాత్రము ఈ రాజ్యము కలిగియున్నది. ఉత్తర అట్లాంటిక్ ఒప్పందమును అనుసరించి యు. స్టే. దేశపు సేనలు ఈ దేశమున నిలిచియున్నవి.

**9. అంతర్జాతీయ సం. :** 1946 మొదలుగ ఐ. రా. స. యందును తదనుబంధ సంస్థలలో పెక్కింటను ఈ దేశము సభ్యత్వమును కలిగియున్నది.

**10. ఆర్థిక రంగము :** తొలుత ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపైననే ఆధారపడి ఉండినను, ప్రస్తుతమున మత్స్యపరిశ్రమ ప్రాముఖ్యమునకు రాగలిగినది. దేశపు భూతల వైశాల్యమున 1% మాత్రమే సేద్యమున ఉన్నది. అందువలన వ్యావసాయికులు పశుపాలనమునకై ఎక్కువ శ్రద్ధ వహించుచున్నారు. మాంసము, కోడిగ్రుడ్లు, పాల ఉత్పత్తుల విషయమున దేశము స్వయం సమృద్ధము; కాని ఆహార ధాన్యములను చక్కెరను దిగుమతి చేసికొనుచున్నది. ఖనిజసంపద ఎట్టిదియు లేదు; చిన్న పరిశ్రమలుఉన్నను వానికొరకై ముడి పదార్థములను విదేశములనుండి దిగుమతి చేసికొనవలసిఉన్నది. దేశమునకు కావలసిన విదేశీయ వినిమయ ద్రవ్యమున అధికభాగము చేపల ఎగుమతి వలన, లభించుచున్నది. దేశపు ఎగుమతులలో 87% విలువకలవి చేపలే. చేపలను పట్టుటకై ఉపయోగించు నౌకల మొత్తపు సంఖ్య 755; వాని పరిణామము 77,463 టన్నులు. 1969లో పట్టుబడిన చేపలబరువు 6,85,899 టన్నులు. దేశపు విద్యుదుత్పత్తి 160.2 కోట్ల కివా. దేశపు ఎగుమతుల విలువ 1,31,75,341 వేల క్రో.; దిగుమతులు 1,93,61,994 వేల క్రో (1971). బడ్జెటరీ వ్యయము 1,65,49,552 వేల క్రో. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక భద్రతా భీమా పథకము ప్రభుత్వపు ఆధ్వర్యమున పనిచేయుచున్నది. దీనివలన రోగబాధ, వార్ధక్యము, నిరుద్యోగము, ప్రమాదమువంటివాని సందర్భమున

తగు సహాయము లభించుచున్నది. గృహవసతిని ప్రభుత్వము చాలవరకు సమకూర్చినను, ఇంకను చేయవలసినది కొంత కలదు. ఉన్న గృహములలో 95% కు విద్యుత్ సౌకర్యము కలదు. దేశమున నిరక్షరాస్యత లేనేలేదు. 7 నుండి 15 ఏండ్ల వరకు వయసు గలవారికి ప్రయిమరీ విద్య నిర్బంధ రీతిలో బోధింపబడుచున్నది. దేశపు 206 ప్రయిమరీ పాఠశాలలలో 26,976 మంది; 113 సెకండరీ పాఠశాలలలో 11,818 మంది, 96 సాంకేతిక ప్రత్యేక పాఠశాలలలో 11,534 మంది; 4 కళాశాలలలో 1,778 మంది విద్యార్థులు కలరు (1966-67). ముఖ్యనగరమున ఐస్‌లాండ్ యూనివర్సిటీ కలదు. 1911 లో ఇది నెలకొల్పబడినది. ఇందలి విద్యార్థి సంఖ్య 1,180 (1967). దేశీయ విద్యార్థులలో పలువురు అత్యున్నత విద్యకై విదేశములకు పోవుచున్నారు. విద్యాసంస్థ లన్నింటను విద్యాబోధన ఉచితముగ జరుగుచున్నది. ప్రవేశపు రుసుమును, పరీక్ష రుసుమును మాత్రమే విద్యార్థి చెల్లించవలయును. రిక్‌జవిక్‌లోని జాతీయ గ్రంథాలయము దేశపు గ్రంథాలయములలో అత్యుత్తమము. మ్యూజియములలో ఐస్‌లాండ్ జాతీయ మ్యూజియం గణనీయము. అయిదు దిన పత్రికలు ప్రచారమున ఉన్నవి. ఇవి అన్నియు ముఖ్యనగరమునుండియే ప్రచురితములు. వీనిలో మోర్గన్ బ్లాదియో అనునది ఎక్కువ ప్రచారము కలది. దేశమున వైద్యశాలలు 50 కి మించి ఉన్నవి: ముఖ్యనగరమందలి జాతీయ వైద్యశాల వీని అన్నింట పెద్దది; వైద్యశాలలన్నింటి శయ్యాసంఖ్య 2,000 పైగా ఉన్నది. వైద్యసంఖ్య 264 (1966).

**12. యాత్రా సౌ. :** ఆసియా, యూరపు, ఆఫ్రికా ఖండములందలి కొన్ని కమ్యూనిస్టేతర దేశములవారును కెనడా దేశీయులును వీసా లేకుండ దేశమును దర్శింపవచ్చును. 1968 లో 40,400 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** యోన్ సిగురోసన్ (1811-79) అనునతడు ఈ దేశపు జాతీయ యోధుడు; స్వాతంత్ర్య యుద్ధము అతని నాయకత్వమున విజయమును పొందినది. ఈతని జన్మదినము జాతీయ స్వాతంత్ర్య జయంతిగ దేశమున పాటింపబడుచున్నది. నీల్స్ రైబెర్గ్ ఫిన్‌సెన్ (1860-1904) అనునతడు వైద్యశాస్త్రమున నిష్ణాతుడై కాంతికిరణ చికిత్సా విధానమును కనుగొని నోబెల్ బహుమతిని 1903 లో ఆర్జించెను.

---

# 7. గ్రీస్

**ముఖ్యనగరము :** ఏతెన్స్ (ఎతేనై); **జెండా :** లేత నీలిచారలు అయిదును, నాలుగు తెలుపు చారలును ఏకాంతర రీతిలో అమరియుండగ, ఎడమవైపు పైమూలన తెల్లని సిలువచిహ్నము కలది; **జాతీయ గీతము :** ఎత్నికోస్ హిమ్నస్ (స్వాతంత్ర్య గీతము); ఇది 'సె గ్నొరిడో అపో తిన్ కాప్సీ' (నీ పారయొక్క చురుకుదనముచేత నిన్ను నేను గుర్తింతును) అను చరణముతో మొదలిడబడునది; **నాణెము :** ద్రక్మా; ఇది 100 లెప్తాలుగ విభక్తము; 30 ద్రక్మాలు = రు 7.50; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం 30 ని.

**1. ఉనికి మొ. :** యూరపున ఆగ్నేయ భాగమునఉన్న బాల్కన్ ద్వీపకల్పమున దక్షిణపు

కొనన కుదురుకొని 19°22'41'' నుండి 29°38'27'' తూ. తు. రేఖల మధ్యను, 34°48'02'' నుండి 41°44'59'' ఉ. అ. రేఖల మధ్యను విస్తరించియున్న ఈ దేశమునకు ఉత్తరమున ఆల్బేనియా, యుగోస్లావియా, బల్గేరియా దేశములును; తూర్పున ఈజియన్ సముద్రమును, తుర్కీదేశమును; దక్షిణమున మధ్యధరా సముద్రమును; పశ్చిమమున అయోనియన్ సముద్రమును సరిహద్దులందున్నవి. దేశ వైశాల్యమున దాదాపు అయిదవవంతును వందలకొలదిగ ఉన్న ద్వీపములు



పటము 8.

ఆక్రమించి ఉన్నవి. వీని అన్నింటితోకలసి దేశపు మొత్తపు వైశాల్యము 1,31,944 చ. కిమీ. ఈ దేశపు భూతలపు సరిహద్దు నిడివి 994 కిమీ.; తీర రేఖ నిడివి 14,936 కిమీ.

దేశమున అయిదింట నాలుగువంతుల భూమి పర్వతమయము. పర్వత శ్రేణులలో గణనీయము పిందుస్ శ్రేణి. ఉత్తర గ్రీసును తూర్పు-పడమర భాగములుగ ఈ శ్రేణి విభజించుచున్నది. ఇందు పశ్చిమ భాగము తేమనేల కలది; గుట్టలతో నిండినది; తూర్పుభాగము పొడిమైదానము; గుట్టలు చాల తక్కువ. పిందుస్ పర్వత శ్రేణిలో అత్యున్నత శిఖరము ఒలింపస్ (2,912 మీ.). మధ్య గ్రీస్ చారిత్రక ప్రాముఖ్యము కలిగిన పురాతన పట్టణములకు నెలవు. దక్షిణ గ్రీస్ పలుదీవులు కలది. దేశపు నదులు అంతగ లెక్కింపదగినవి కావు, అందు నౌకాయానమునకు వసతిలేదు. ఎండకాలమున వీనిలో పెక్కింట నీరుండదు.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశపు ఉత్తరభాగమున చలికాలమున శీతబాధ ఎక్కువ. దక్షిణ గ్రీసున, మధ్యధరా సముద్ర ప్రాంతపు శీతోష్ణస్థితి కననగును. ఎండకాలమున ఎండలెక్కువ, గాలిలో తేమ చాల తక్కువ; చలికాలము హాయిగా నుండినను, వానలు కురియును. మొత్తముమీద సముద్రములనుండియు పర్వతములనుండియు వచ్చు చల్లగాలులు ఎండల వేడిమిని చాల తగ్గించుచున్నవి. ముఖ్యనగరమున సాలీనా గరిష్ఠోష్ణత 99° ఫా; కనిష్ఠోష్ణత 35° ఫా. దక్షిణ దేశమున అవి 106°, 35° ఫా. గను; ఉత్తరదేశమున 95°, 16° ఫా. గను ఉన్నవి.

భూతలపు ఉన్నతియందలి వైవిధ్యమును అనుసరించి వృక్షసంతతియు మార్పొందుచున్నది. 460 మీ. కు పైబడిన ఎత్తుగల భూములందు ఓకు, దేవదారు జాతుల వృక్షములు, భూర్జ వృక్షములును కలవు; అంతకు దిగువనఉన్న ప్రాంతములలో ఖర్జూరజాతి, దానిమ్మ, నారింజ, ఆలివ్, అత్తి కననగుచున్నవి. ఇట్టి ప్రాంతములలో పొగాకు, ప్రత్తి, వరిపైరులును బాగుగా పండుచున్నవి. వన్య జంతువులు విశేషముగ లేవు. ఎలుగుగొడ్డు, అడవి పిల్లి, నక్క, గుంటనక్క అటనట కొన్ని చిట్టడవులలో కన్పట్టుచున్నవి. అడవిమేక అనబడు ఒక విధపు వన్యజంతువు, యూరపున, ఈ దేశపు అడవులలో మాత్రమే ఇప్పుడు కననగుచున్నది. పక్షి సంతతియు, 250 రకముల జలచర సంతతియు కలవు

**3. జనసంఖ్య మొ. :** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 87,68,641. నగరములలో ఏతెన్స్ (జ. సం. 25,40,241), సలోనికా (3,45,799), పత్రాస్ (1,11,607) పేర్గాంచదగినవి. ప్రజలలో 53.2% పట్టణములందు వసించుచున్నారు. జనసాంద్రత చ కిమీ. కు 67. ప్రజలలో 97% గ్రీకు జాతికి చెందినవారు తక్కిన వారు తుర్కులు, యూదులు మొదలగు అల్పసంఖ్యాక వర్గములకు చెందినవారు. గ్రీకు భాష దేశీయుల మాతృభాష. 98% ప్రజలు దీనిని మాట్లాడెదరు. విద్యాధికులలో ఆంగ్ల, ఫ్రెంచి భాషలుకూడ విరివిగ ప్రచారమున ఉన్నవి. అల్ప సంఖ్యాక వర్గములందు తుర్కీభాష మొదలగునవి వాడుకలో ఉన్నవి. ప్రజలలో 98%, తూర్పు ఆర్థడాక్స్ చర్చి అను క్రైస్తవ సంప్రదాయమునకు చెందినవారు. తక్కినవారిలో రోమన్ కేతలిక్కులును, ప్రొటెస్టంటులును, యూదులును, ముస్లిములును కలరు.

**4. సమాచార సౌ. :** పోస్టు, తంతి, టెలిఫోనుల వసతి దేశమున విరివిగ కలదు. రేడియో, టెలివిజన్ ప్రసార కేంద్రములును తగు సంఖ్యలో కలవు.

**5. యాన సౌ. :** దేశమున రోడ్ల నిడివి 35,257 కిమీ. (1970) ; ఇందు 8,004 కిమీ. ఉత్తమశ్రేణికిచెందిన జాతీయ పథము. రైలుమార్గముల నిడివి 2,571 (1970). ఏతెన్స్ నగర ప్రాంతపు పిరేయస్ రేవునుండి దేశపు ఎగుమతి వ్యాపారమున 40%, దిగుమతి వ్యాపారమున 80% రవాణా అగుచున్నది. దీని తరువాత సలోనికా, పత్రాస్ నగరముల హార్బరులు క్రమరీతిలో ప్రాముఖ్యములను కలిగియున్నవి. వర్తక నౌకాదళ ప్రమాణముల లెక్కలో ప్రపంచ రాజ్యములందు ఆరవదిగ ఈ దేశము లెక్కకు వచ్చుచున్నది. దేశపు వర్తక నౌకాదళమున 1,945 నౌకలు కలవు; వీని మొత్తపు పరిమాణము 85,81,000 టన్నులు. ఇవిగాక విదేశములలో రిజిస్టరు చేయబడి ప్రయాణముచేయు గ్రీకు నౌకలు 1,069 కలవు. వీని మొత్తపు పరిమాణము 1,45,57,000 టన్నులు.

ముఖ్యనగరపు సమీపమునఉన్న హెల్లెనికాన్ విమానాశ్రయము, పెక్కు అంతర్జాతీయ విమాన యాన సంస్థలకు మజిలీగా ఉపకరించుచున్నది. వీనితోపాటుగ ఒక దేశీయ విమానయానసంస్థయు యూరప్, పశ్చిమ ఆసియా, ఉత్తర అమెరికాలతో ఈ దేశమును అనుసంధించుచున్నది.

**6. చరిత్ర :** పాశ్చాత్య నాగరికతకు ప్రాతిపదిక రూపమును కల్పించిన ప్రాచీన దేశముగ ఈ దేశము చారిత్రక ఖ్యాతిని పొందినది. అతి పురాతన కాలమునుండియు ఇచట జనావాసములు ఉండినటుల తెలియవచ్చుచున్నను, క్రీటు-ఆసియా మైనరులలో ప్రాచీన నాగరికతలకు చెందినవారు, క్రీ. పూ. రెండవ సహస్రాబ్దిలో, ఇట చేరుటతో నాగరిక సంఘము రూపుగొనుట ఆరంభితమైనదని చెప్పవచ్చును. తరువాత అట చేరిన ఆర్యజాతుల వారు ఆ నాగరికతను స్వీయము చేసికొని పరిపోషించిరి. ప్రజాతంత్ర పాలనకు ప్రథమమున రూపురేఖలను దిద్దినవి ఇచటి ఆ కాలపు నగరములే. క్రీ. పూ. ఒకటవ శతాబ్దిలో గ్రీకులు పలువురు ఫ్రాన్స్, స్పెయిన్‌లవరకు పయనించి వలసలను పెక్కింటిని నెలకొల్పి, అచట తమ నాగరికతకు స్థానములను ఏర్పరచిరి.

ఆ ప్రాచీన కాలమున గ్రీకులు సామ్రాజ్యములను నెలకొల్పక చిన్నచిన్న నగర రాజ్యములను నిర్మించుకొనిరి. కాని ఏకభాష, ఏక వాఙ్మయము, ఏక సంప్రదాయము, గ్రీకులు అందరును పాల్గొను ఒలింపిక్ పందెములు, ఆ వివిధ రాజ్యముల మధ్యగల

ఏకతను స్ఫురింపజేయుచుండినవి. అట్టి నగర రాజ్యములలో స్పార్టా, ఏతెన్సు రాజ్యములు తక్కిన వానికన్న మిన్నగ ముందునకు రాగలిగి, చరిత్రలో విశిష్టతను గడించినవి. అయినను ఏతెన్సు నగర రాజ్యము, రాజ్యాంగ విధానమున, సారస్వత రంగమున, కళాకౌశలములందున స్పార్టాకన్న మిన్నగ రాణింపునకు వచ్చినది.

క్రీ. పూ. 546 మొదలుగ గ్రీకు రాజ్యములు పారసీక సామ్రాజ్యపు దాడులను ఎదుర్కొనవలసి వచ్చినది. కడకు క్రీ. పూ. 490 లో ఏతెన్సు నగరరాజ్యము, పారసీక సేనలను ఓడించినది. కాని పారసీకులు అంతట తమ ప్రయత్నమును విరమింపక క్రీ. పూ. 480 లో మరల యత్నించిరి. ఆ యుద్ధమున ఏతెన్సు సర్వనాశనమైనది. అయినను తుదకు గ్రీకులే జయించిరి. ఆ యుద్ధానంతరమున ఏతెన్సుకు గ్రీకు రాజ్యములందు అగ్రస్థానము లభించినది. ఏతెన్సు నగరము పునర్నిర్మితమై వాస్తు, శిల్పాది లలితకళలందును, తత్త్వ, విజ్ఞానశాస్త్రములందును ముందునకు రాగలిగినది. అంతట ఆ నగర పాలక సంఘము ఏతెన్సు ఆధ్వర్యమున ఒక గ్రీకు సామ్రాజ్యమును నెలకొల్పుటకు కృషిచేసినది. కాని ఆ కృషిలో విఫలమైనది (క్రీ. పూ. 405).

ఏతెన్సు సామ్రాజ్యము శిథిలమైన తరువాత, మేసిడోనియా అను ఒక చిన్న గ్రీకురాష్ట్రపు ప్రభువగు ఫిలిప్, గ్రీకురాష్ట్రములపై ఆధిపత్యమును ఆర్జించెను (క్రీ.పూ. 338). ఇతని కుమారుడే జగత్ ప్రసిద్ధిని ఆర్జించిన అలెగ్జాండరు. ఈ మహా విజేత పారసీక సామ్రాజ్యమును జయించి, భారత దేశమున వాయవ్యభాగమును ఆక్రమించి నైలునది మొదలుకొని సింధునది వరకును వ్యాపించిన విశాల సామ్రాజ్యమునకు అధిపతి అయ్యెను. ఇతని మరణానంతరమున ఈ సామ్రాజ్యమును అతని సేనాపతులును, వారి వంశీయులును పాలించగ వారి మూలమున గ్రీకు సంస్కృతి ఎల్లెడల వ్యాపించినది. కాని ఇంతలో పశ్చిమ యూరపున రూపుగొనిన రోమన్ సామ్రాజ్యము, గ్రీక్‌సామ్రాజ్యమున పశ్చిమభాగమును, కడకు గ్రీసును లోగొనినది (క్రీ. పూ. 146).

రోమన్ సామ్రాజ్యము క్రీ. శ. 395 లో ద్విధా విభక్తమైనపుడు, తూర్పున నున్న బైజాంటెయిన్ సామ్రాజ్యమున గ్రీసు అంతర్భాగమైనది. దేశము ఇట్లు దాస్యమున ఉన్నను గ్రీకుల విజ్ఞాన శాస్త్రములును కళలును రోమన్‌ల నాగరికతపై అసమాన ప్రభావమును నెరపి, దానికి మూల స్రోతస్సులుగ ఉపకరించినవి.

క్రీ. శ. 1453 లో ఓటోమన్ తురుష్కులు (చూ : పు. 346) బైజాంటెయిన్ సామ్రాజ్యమును వశపరచుకొనినపుడు గ్రీసుదేశమును వారికి వశమయ్యెను. తమ సర్వంసహాధికారమునకు భంగము కలుగని రీతిలో గ్రీకుప్రాంతమునకు కొంత స్థానిక స్వపరిపాలనను వారు కల్పించిరి. అయినను ఈ దాస్యమునకు ఇచ్చగింపక 1770 మొదలుగ స్వాతంత్ర్యమునకై పోరాటములను గ్రీకులు సాగించిరి. కడకు బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాల సానుభూతి సహకారముల వలన ఈ ఉద్యమము విజయవంతమై 1830 లో గ్రీకుల స్వాతంత్ర్యమును తుర్కీ అంగీకరించినది.

స్వాతంత్ర్య సిద్ధికాలమున బ్రిటన్ మొదలగు రాజ్యములు, బవేరియా దేశీయుడగు ఒక మాండలికుడు ఇట పాలకుడగుటకు, గ్రీకులను అంగీకరింపజేసినవి. కాని అతడు ప్రజామోదమును పొందక పోవుట వలన, అతనిని తొలగించి డెన్మార్కు దేశపు రాజవంశమునకు చెందిన జార్జి I అనువానిని రాజుగ గ్రీకులు గ్రహించిరి (1862). అంతట గ్రీకులున్న కొన్ని సమీపస్థ ద్వీపములను బ్రిటన్ గ్రీసునకు దత్తము చేసినది ; తుర్కీనుండి తెస్సలీ దీవిని, క్రీటు మొదలగు దీవులను 1913 లోను,

ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత ఇటలీనుండి డొడకనీస్, రోడ్స్ దీవులను ఈదేశము వశరపచు కొనినది. ఈ విధముగ 1944 నాటికి గ్రీకు జాతీయులందరు ఒక రాజ్యమున చేరగలిగిరి.

ఇరువదవ శతాబ్దము మొదలుగ గ్రీసుదేశము పలు కల్లోలముల పాలయినదని చెప్పవచ్చును. 1923-36 వరకు టర్కీతో సంఘర్షణలు, పోరాట ములు సాగినవి. కొన్నిసంవత్సరములు(1924-35) రాచరికము లేకుండ గణరాజ్య విధానమున దేశము ఉండినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున దేశ మును జర్మన్, ఇటాలియన్ సేనలు ఆక్రమించినవి. ఆ యుద్ధానంతరమున దేశీయమగు కమ్యూనిస్ట్ పార్టీ బలవత్తరమై దేశమును ఆక్రమించుటకు చేసిన కృషితో అంతర్యుద్ధము మొదలై అయిదేండ్లు సాగినది (1944-49). 1946 లో రాజరికము పునరుద్ధరింపబడినను, 1967 లో సైనికవర్గము దేశమున పరిపాలనను వశపరచుకొనుటతో, రాజు దేశభ్రష్టు డయ్యెను. కడకు జూన్ 1, 1973న రాజరికము రద్దుచేయబడి దేశమున అధ్యక్ష పాలన నెలకొల్పబడినది,

**7. పరిపాలన :** దేశమున పార్లమెంటరీ విధా నము నెలకొల్పబడగలదను వాగ్దానమును పాలక వర్గము ఇచ్చియున్నను రాజ్యాంగ విధానము ఏదియు రూపొందింపబడలేదు. అధ్యక్షుడే ప్రధానిగ కూడ వ్యవహరించుచు, ఉత్తరువుల ద్వారా, సైన్యపు సాయముతో పాలనను నిర్వహించు చున్నాడు. రాజకీయ పక్షములు ఏవియు పని చేయుటలేదు. సుప్రీమ్‌కోర్టు అధ్వర్యమున, వివిధ శ్రేణుల న్యాయస్థానముల ద్వారా న్యాయనిర్వహణ సాగుచున్నది.

**దేశరక్షణ :** దేశమున నిర్బంధసైనిక శిక్షణ విధానము అమలున ఉన్నది. 21 ఏండ్లకు పైబడి 50 ఏండ్లకు మించని పౌరులకు ఇది వర్తించును. శాంతికాలపు భూతలసేన యందలి సైనికుల సంఖ్య 1,18,000. నౌకా సేనయందు సైనికసంఖ్య 17,900; ఈ సైనిక విభాగమునకు 4 జలాంత ర్గాములును, 8 డిస్ట్రాయరులును, తక్కిన సహాయక నౌకలు 101 కలవు; వాయుసేన యందలి సైనిక సంఖ్య 23,000. పోరాటపు విమానములు రమా రమి 200 కలవు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలలోను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. 1951 మొదలుగ ఉత్తర అట్లాంటిక్ ఒప్పందపు వ్యవస్థయందు సభ్యత్వమును, 1962 మొదలుగ యూరోపియన్ కామన్ మార్కెటున అనుబంధిత సభ్యత్వమును ఈ దేశము కలిగియున్నది.

**10. ఆర్థికరంగము :** వ్యవసాయము దేశపు ఆర్థిక వ్యవస్థకు ముఖ్యాధారము. మొత్తము మీద దేశమున ప్రకృతి సహజపు వనరులు తక్కువ యగుట వలన, ప్రతియేటా రమారమి 60,000 మంది కార్మికులు, పనిపాటలకై ఉత్తరయూరపీయ దేశములకు వలసపోవుచున్నారు. దేశమున సమష్టి జాతీయోత్పత్తిలో అయిదవవంతు వ్యవసాయమున లభించుచున్నది. ప్రజలలో 50% దానిపై ఆధార పడి జీవించుచున్నారు. వ్యవసాయోత్పత్తులలో 60% ఎగుమతి యగుచున్నవి. దేశపు భూతల మున 32% మాత్రమే సేద్యమునకు అనుకూలము. దేశము ఆహారధాన్యముల విషయమున స్వయం పోషకము. ఆహారధాన్యముల ఉత్పత్తిలో గోధుమ అతిప్రాముఖ్యము కలది. తరువాత బార్లీ, మొక్క జొన్న లెక్కకు వచ్చును. రొక్కపు పంటలలో పొగాకు ప్రముఖము. ఎగుమతుల విలువలో 21%. దీనివలన లభించుచున్నది. పశుసంపద సముచిత ప్రమాణమున కలదుగాని, దేశావసరములకై, మాంసము మొదలగువాని కొరకై, కొంతవరకు

దిగుమతులపై ఈ దేశము ఆధారపడి ఉన్నది. మత్స్య పరిశ్రమ వలన దాదాపు 20 వేల మంది జీవించుచున్నారు. భూతలమున 21.4% అటవీ మయము. అయినను కలపను కొంతవరకు దేశము దిగుమతి చేసికొనుచున్నది. ఖనిజసంపద కొంత కలదు. అందు బాక్సైటు ప్రముఖము. ఇనుము, నికెల్ లోహముల ఉత్పత్తియు క్రమముగ వృద్ధి యగుచున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతర మున లిగ్నైటును విరివిగ త్రవ్వి తీసి, విద్యు దుత్పత్తికై వినియోగించుట జరుగుచున్నది. చలువరాయియు విరివిగ లభించుచున్నది. వస్తూ త్పత్తి పరిశ్రమకు, వ్యవసాయమునకు తరువాత, ప్రముఖ స్థానము కలదు. దీనివలన జాతీయ సంప త్తిలో అరవవంతు లభ్యమగుచున్నది ఏతెన్స్ సమీపమున ఈ పరిశ్రమ చాలవరకు కేంద్రీకృత మైనది. ఆహారధాన్యములు, పానీయ ద్రవ్యములు, పొగాకు, జవుళీ, ఇంజనీరింగు పరికరములు, రసా యనిక ద్రవ్యములు, కుట్టుపనులు - అనువానికి సంబంధించిన పరిశ్రమలు కలవు. దిగుమతులపై హెచ్చు సుంకములను విధించి, ఆయా వస్తూత్పత్తి పరిశ్రమలను ప్రభుత్వము రక్షించుచున్నది. దేశ మున విద్యుదుత్పత్తి 88910 లక్షల కి. వా. ఇందు 25% మాత్రమే జలవిద్యుత్తు. దేశపు ఎగు మతుల విలువ 2,463.8 కోట్ల ద్ర.; దిగుమతుల విలువ 6,207.8 ద్ర. (1971). బడ్జెటరీవ్యయము 8,622.9 కోట్ల ద్ర. (1972)

**11. సాంఘిక రంగము :** సాంఘిక భీమా వ్యవస్థ వలన వైద్యసదుపాయములు, వార్ధక్యమున జీవన భృతి, వితంతువులకు మనుగడ, అనాథ లకు రక్షణ చాలవరకు లభించుచున్నవి. దేశమున గృహవసతిని తగినంతగ సమకూర్చుటకు 1964 మొదలుగ కృషి జరుగుచున్నది. దేశమున నిరక్ష రాస్యత 18%. 6 నుండి 12 ఏండ్ల వయసువారికి నిర్బంధోచిత విద్యావిధానము అమలున ఉన్నది. 32,884 మంది బాలబాలికలు కల 5,047 శిశు పాఠశాలలును; 9,46,271 మంది పఠించు 10,663 ప్రయిమరీ పాఠశాలలును, 4,55,904 మంది విద్యార్థులు కల 1,152 సెకండరీ పాఠశాలలును ; 28,912 మంది శిక్షణపొందుచున్న 305 సాంకేతిక, వృత్తివిద్యా పాఠశాలలును కలవు (1970). అయిదు విశ్వవిద్యాలయములును, ఉన్నత విద్యను బోధించు సంస్థలు అయిదును కలవు. వీనియందలి మొత్తపు విద్యార్థి సంఖ్య 86,471 (1969). దేశ మున గ్రంథాలయములు అనేకములు కలవు. వానిలో ఏతెన్స్‌లోని జాతీయ గ్రంథాలయము అతి ప్రముఖము; అయినను గ్రంథ సంఖ్యలో మాత్రము శాసనసభా గ్రంథాలయము పెద్దది. దేశమున ఇరు వది మ్యూజియములుకలవు. కాని వీనికన్న మిన్నగ ఏతెన్స్ కొరిన్త్, క్నాసస్ మొదలగు నగరముల యందు కననగు ప్రాచీన ఆలయ, ప్రాసాదావ శేషములే, చూపరులను ఆకర్షించుచున్నవి. దేశ మున 81 దైనిక పత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో 9 ఏతెన్స్ నుండి ప్రచురితములు. వీని యన్నింట 'అక్రోపోలిస్' అనుదానికి అతి విస్తృత ప్రచారము కలదు. ద్వితీయ ప్రపంచయుద్ధము ముగిసినప్పటినుండియు, ప్రజలకు వైద్యసదుపాయ ములను కల్పించువిషయమున ప్రభుత్వము శ్రద్ధతో కృషిచేయుచున్నది. 54,633 శయ్యా సంఖ్యగల 852 ఆసుపత్రులును, ఆరోగ్యశాలలును కలవు; వైద్యసంఖ్య 14,623 (1970).

**12. యాత్రా సౌ. :** అతి ప్రాచీన నాగరిక తావశేషములకు నిలయమగు ఈ దేశమును సంద ర్శించుటకు విదేశీయ యాత్రికులు అనేకులు వచ్చు చుందురు. అట్టి యాత్రికులకు పాస్‌పోర్టు మాత్రమే చాలును; వీసాఅక్కరలేదు. 1971లో 28,13,925 మంది దేశమును సందర్శించిరి. వీరు దేశమున 30.5 కోట్ల అమెరికన్ డాలర్లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** అతి ప్రాచీన చరిత్ర కలిగి, పాశ్చాత్య దేశములకు నాగరికతను ప్రసాదించిన ఈ దేశమున ప్రాచీన యుగమున వివిధ రంగములందు పేరొందిన ప్రముఖులు ఎందరో జన్మించిరి. వీరిని అందరిని ఇట పేర్కొనుట అశక్యము. ఇలియడ్, ఒడిస్సీ అను మహాకావ్యములను రచించిన హోమరు (క్రీ. పూ. 300); జంతువులే పాత్రలుగ నీతికథలను రచించిన ఈసప్ (క్రీ. పూ. 620-560 ర.); నాటక రచయితలగు ఈస్కిలస్ (525-456 క్రీ. పూ.), సోఫోకిల్స్ (ర. 495-406 క్రీ. పూ.), యూరిపిడిస్ (483-407 క్రీ. పూ.); చరిత్రకారులగు తూసిడైడ్స్ (ర. 460-400 క్రీ. పూ.), హెరొడోటస్ (ర 484 - 425 క్రీ. పూ.); తత్త్వవేత్తలగు సోక్రటీస్ (469-399 క్రీ. పూ.), ప్లేటో (ర. 427-347 క్రీ. పూ.), అరిస్టాటిల్ (384-322 క్రీ. పూ.); వైద్యశాస్త్ర రచయిత హిపోక్రటీస్ (ర. 460-357 క్రీ. పూ.); గణిత శాస్త్రవేత్త యూక్లిడ్ (ర. 300 క్రీ. పూ.) ఖగోళ శాస్త్రజ్ఞుడు హిప్పార్కస్ (ర.160-125 క్రీ పూ.); వైద్యశిఖామణి గెలెన్ (క్రీ. శ. 130-200): శిల్పవేత్త ఫిడియస్ (500-432 క్రీ. పూ.); న్యాయశాస్త్రవేత్త సోలన్ (ర. 638-558 క్రీ. పూ.); పరిపాలకుడై ఏతెన్స్‌కు సర్వతోముఖ ప్రశస్తిని సమకూర్చిన పెరిక్లీస్ (ర. 490-424 క్రీ. పూ.), మహావిజేత అలెగ్జాండరు (356-323 క్రీ. పూ.); మహావక్త డెమొస్తనీస్ (384-322 క్రీ. పూ.) అనువారలు ఆ ప్రాచీన గ్రీకు మహాపురుషులలో విశ్వవిఖ్యాతిని అందినవారు.

అధునిక యుగపు గ్రీకులలో చిత్రకళావేత్త ఎల్‌గ్రెకో (ర. 1545-1614), రచయితగ నోబెల్ బహుమతిని 1963 లో గ్రహించిన జార్జి సెఫెరిస్ (జ. 1900) గణనీయులు.

---

# 8. తూర్పు జర్మనీ

## (జర్మన్ ప్రజాతంత్ర గణరాజ్యము)

**ముఖ్యనగరము :** తూర్పు బెర్లిన్, **జెండా :** పైనుండి దిగువకు నలుపు, ఎరుపు, బంగారుచాయ అడ్డుచారలు క్రమముగ అమరియుండగి మధ్యనున్న దానిపై యోధలాంఛనము కలది; **జాతీయ గీతము :** 'ఆఫెర్ స్టాన్‌డెన్ అవుస్ రూయినేన్' (శిధిలముల నుండి పునరుద్ధరిత) అను చరణముతో ఆరంభమగునది. **నాణెము :** డూష్క్‌మార్. ఇది 100 ఫెన్నింగులుగ విభక్తము; ఒక డూష్‌మార్క్ = రు.3.38; **కొలతూతములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యూరవు ఖండపు మధ్య భూమియందు 9°54′-15°2′ తూ. తు. రేఖల మధ్యను విస్తరించి యున్న ఈదేశమునకు ఉత్తరమున బాల్టిక్ సముద్రమును, దక్షిణమున జెకోస్లోవాకియాయు, తూర్పున పోలండును, పశ్చిమమున పశ్చిమ జర్మనీయు సరిహద్దులందు కలవు. కాని ఈ దేశమున మధ్యనున్న బెర్లిన్ నగరమున పశ్చిమభాగము మాత్రము రాజ్యాంగరీత్యా పశ్చిమ జర్మనీకి చెందియున్నది. ఈ పశ్చిమ బెర్లిన్ పోను, మిగిలిన మొత్తపు దేశవైశాల్యము 1,07,834 చ. కిమీ. బాల్టిక్ సముద్రతీర భూమి

యందు విరివిగ ఇసుకదిబ్బలు, చిన్నగుట్టలు, అటనట సరస్సులు కలవు. మధ్యదేశము సారవంతమగు మైదానము; అటనట అందును కొన్ని పర్వతములును, ఇసుకపర్రలును కలవు. దక్షిణదేశమున ప్రకృతి వైవిధ్యమెక్కువ. అందు మిట్టెల్ బెర్గ్ పర్వతశ్రేణి వ్యాపించియున్నది. ఉత్తరజర్మన్ నిమ్నభూములును ఇందు కొంతవరకు వ్యాపించి




పటము 9.

యున్నవి ; సాంద్రాటవీ భూమియు ఇందు కననగును. దక్షిణదేశమున ఉన్న ఫిక్‌టెల్‌బెర్గ్ శిఖరము, మొత్తవు పర్వతశ్రేణిలో అత్యున్నతము (1197మీ.). తీర సమీపమున బాల్టిక్ సముద్రమున ఉన్న కొన్ని అల్పద్వీపములను రాజ్యాంగరీత్యా ఈ దేశమున అంతర్భాగములు; వానిలో రీగెన్ అను నది విశాలతమము.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశమున సమశీతోష్ణస్థితి కననగును. బెర్లిన్ నగరమున జనవరి నెలలో 34°ఫా, జులై నెలలో 63°ఫా. సరాసరి ఉష్ణోగ్రత కలదు. సాలున సరాసరి వర్షపాతము 59 సెం. మీ. దేవదారు, ఓకు, బీచి వృక్షములు ఎక్కువగ కననగును. లేడి, అడవిపంది, గుంటనక్క, బీవరు జంతువులు మాత్రమే అడవులలో ఉండు పెద్ద జంతువులు. స్థిరనివాసమెరుగని పక్షిసంతతి కలదు. ఋతువుల మార్పున ఇందు అధికభాగము విదేశములకు పయనించి, అనుకూల ఋతువులలో తిరిగివచ్చును. మత్స్యసంపద తక్కువ.

**3. జనసంఖ్య మొ :** 1970 లెక్కలనుబట్టి దేశపు జనసంఖ్య 1,70,56,983. జనసాంద్రత చ. కిమీకు 160. నగరములలో తూర్పుబెర్లిన్ (జ. సం. 10,87,982), లీప్‌జిగ్ (5,80,711), డ్రెస్‌డెన్ (5,04,209) ప్రముఖములు. సాధికార దేశభాష జర్మన్. ఇందు అనేక మాండలికములు ప్రచారమున ఉన్నను, హైజర్మన్ మాండలికము ప్రామాణికముగ లెక్కకువచ్చినది. 82% ప్రజలు ప్రొటెస్టెంటు సంప్రదాయపు క్రైస్తవమతమునకు చెందినవారు; 12% రోమన్ కేతలిక్కులు; తక్కిన మతములవారు 6%; దేశమున మతస్వాతంత్ర్యము రాజ్యాంగరీత్యా గుర్తింపబడినది; కాని నాస్తికతయే ఆలంబనముగ ఉండు సమాజమును నిర్మించుట ప్రస్తుత ప్రభుత్వపు ధ్యేయము.

**4. సమాచార సౌ.** : 1971లో దేశమున 11,606 తపాలా ఆఫీసులు కలవు. తంతి టెలిఫోను సదుపాయములు విస్తృతరీతిలో కలవు. ప్రముఖములగు రేడియోస్టేషనులు తూర్పుబెర్లిన్‌లోనే ఉన్నను, దేశమందలి తక్కిన అన్ని నగరములందును ట్రాన్స్మిటర్లు కలవు. టెలివిజన్ స్టేషనుల సంఖ్య 15 ; ఇవిగాక 63 టెలివిజన్ కన్‌వర్టర్లు పని చేయుచున్నవి. విదేశీయులకొరకై వివిధ విదేశీయ భాషలలో సైతము, రేడియో బెర్లిన్ ఇంటర్‌నేషనల్ నుండి ప్రసారములు జరుగుచున్నవి.

**5. యాన సౌ. :** విస్తృత యాన సౌకర్యములు కల ప్రపంచదేశములలో ఇది ఒకటి. రోడ్లనిడివి 45,620 కిమీ. ; రైలుమార్గముల నిడివి 14,525

కిమీ. ; ఇందు 1,370 కిమీ. దూరమున విద్యుత్సహాయమున బండ్లు నడుచును. ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున తూర్పుజర్మనీయందు చెప్పుకొనదగిన సముద్రపురేవు ఏదియు లేకుండెను. క్రొత్తగా నిర్మితమగు రోస్టాక్-పీటర్స్‌డార్ఫ్ హార్బరు, దేశపు ఎగుమతి దిగుమతి వ్యాపారమును అంతటిని నిర్వహించుటకు అనువుగ రూపొందింపబడినది; విస్మర్ వద్దనున్న హార్బరుద్వారా సైతము కొలదిగ వ్యాపారము సాగుచున్నది. తూర్పు బెర్లిన్‌లోని షోనెఫెల్డ్ సెంట్రల్ విమానాశ్రయము, దేశపు దేశీయ, అంతర్జాతీయ విమాన యానములకు ప్రముఖ కేంద్రము. ఇచటి నుండి దేశీయ విమానయాన సంస్థలును, విదేశీయ సంస్థలును వ్యవహరించుచున్నవి. విదేశీయ ప్రముఖ నగరములగు ప్రేగ్, వార్సా, బుడాపెస్ట్, బుకారెస్ట్, మాస్కో, సోఫియా, బెల్‌గ్రేడ్, తిరానా, కైరో, బాగ్దాద్, బీరుట్, కీవ్ లకు ఇచటనుండి విమాన యాన సౌకర్యము కలదు. దేశమున వివిధ ప్రదేశముల మధ్య విమానయానమునకు వసతులు కలవు.

**6 చరిత్ర.** :1945 వరకు జర్మనీయందు అంతర్భాగమున ఉండిన ఈ దేశపుచరిత్ర అంతవరకు జర్మనీ చరిత్రతో ముడిపడి ఉండినది (వివరములకు చూ : పశ్చిమజర్మనీ). ద్వితీయ ప్రపంచ యుద్ధమున జర్మనీ పరాజయమును పొందినంతట విజేతలగు బ్రిటిష్, ఫ్రాన్సు, యు.స్టే. సోవియట్ రష్యాలు, ఒక ఒడంబడికను అనుసరించి దేశమున, ఒక్కొక్క ప్రత్యేక ప్రాంతమును క్రమరీతిలో వశపరచుకొనినవి (1945). ఆ తీరుగ జరిగిన ఆక్రమణలో జర్మనీదేశపు తూర్పుభాగమును, తూర్పుప్రష్యా అని వ్యవహరింపబడుదానిని, సోవియెట్ రష్యా ఆక్రమించినది. జర్మనీదేశపు జనానీకమున 14%ను, భూతలవైశాల్యమున 24%ను ఇందు చేరినది. అయినను ఈ ప్రాంతపు మధ్యనున్న బెర్లిన్ నగరమున పశ్చిమభాగము మాత్రము ఫ్రాన్సు, బ్రిటన్, యు. స్టే. సేనల వశమున ఉండుటకును, తూర్పుబెర్లిన్ మాత్రమే తమ వశమున ఉండుటకును సోవియెట్ రష్యా అంగీకరించినది. తరువాత 1949లో తన ఆక్రమణను వదలి సోవియట్ రష్యా, ఈ ప్రాంతమునకు ఒక గణతంత్ర ప్రజాస్వామిక రాజ్యమును ఏర్పరచినది. అదియే తూర్పుజర్మనీ అనియు వ్యవహృతము. 1955లో ఈ దేశమునకు సోవియట్ రష్యాతో శాంతిసంధి కుదిరినది. ఏర్పడినది మొదలుగ ఈ దేశము కమ్యూనిస్ట్ రాజ్యముల పరస్పర ఆర్థిక సాహాయ్యక సమితి (కోమెకాన్) లో సభ్యత్వమును కలిగియున్నది. 1964లో సోవియట్ రష్యాతో ఈ దేశము స్నేహ, పరస్పర సాహాయ్యకపు ఇరువది యేండ్ల ఒడంబడికను ఏర్పరచుకొనినది.

**7. పరిపాలన.** : సోవియట్ దేశపు పరిపాలనా విధానమును అనుసరించు ప్రజాగణరాజ్య పద్ధతి ఈ దేశమున అమలున ఉన్నది. 18ఏండ్ల వయస్సునకు తగ్గని ప్రతి పౌరునకు వోటుహక్కు కలదు. 1968న ఆమోదింపబడిన, రాజ్యాంగ విధానమును అనుసరించి ప్రస్తుతమున ఇట పాలన జరుగుతున్నది. 500 మంది సభ్యులుకల ప్రజా సమితి (వోల్క్స కమ్మర్) యందు సర్వాధికారములు న్యస్తములు. దీనికి సభ్యులను ప్రజలు ఎన్నుకొనెదరు. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును ఈ ప్రజాసమితియే రాజ్యపాలక మండలి (కౌన్సిల్ ఆఫ్‌స్టేట్)ని మంత్రిమండలిని, జాతీయరక్షణ సమితిని, సుప్రీమ్‌కోర్టు జడ్జీలను ఎన్నుకొనును. పాలకమండలి యందు ఒక అధ్యక్షుడు, 6గురు ఉపాధ్యక్షులు, 16 మంది సభ్యులు, ఒక కార్యదర్శి కలరు. ఉత్తరువులను జారీ చేయుటకు, శాసనములకు తగు వివరణలను ఇచ్చుటకు, వానిని అమలుజరుపుటకు ఈ మండలికి అధికారము కలదు. జర్మన్ సోషలిస్ట్ ఐక్యపక్షము అనునది రాజకీయ పక్షములన్నింటిలో ప్రముఖము.

అప్పటి కమ్యూనిస్ట్‌పార్టీతో తక్కిన చిన్న చిన్న సోషలిస్ట్‌పార్టీలను మేళవించుటవలన 1946లో ఈ పక్షము రూపొందింది, తదాదిగ దేశరాజకీయ, ఆర్థికాధికారమును అంతటిని తన చేతియందు ఉంచుకొనినది. ఇంకను కొన్ని చిన్న పార్టీలు ఈనాడును ఉన్నను, అవి లెక్కింపదగినవికావు. వాని మనుకడ, ఐక్యపక్షపు సౌహార్దభావనపై మాత్రమే ఆధారపడియున్నది. ఎన్నిక కావలసిన అభ్యర్థుల ఏక పట్టికను ఐక్యపక్షమే తయారుచేయును. అయిదు రాష్ట్రములు దేశమున కలవు. వీని యందు ఎన్నుకొనిన బడిన సభల సాయమున స్థానిక పాలన సాగుచున్నది. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున వివిధస్థాయీలలో న్యాయనిర్వహణ జరుగుచున్నది

**8. దేశరక్షణ :-** 1962 మొదలుగ నిర్బంధ సైనిక విధానము ఈ దేశమున అమలున ఉన్నది. దేశపు భూతలసైనిక సంఖ్య 90,000 (1973); ఇదిగాక సుశిక్షితులగు వారు దేశమున 3,50 000 కలరు ; ఈ సేనకు 2 వేల టాంకులు, క్షిపణులు కలవు. నౌకాసేన యందలి సైనికసంఖ్య 16,000. పెద్ద యుద్ధనౌకలు లేవు; ఉన్నవానిలో ఎస్కార్ట్ నౌకలు మాత్రమే పెద్దశ్రేణివి. మొత్తముమీద యుద్ధమునందు ఉపయోగపడు వివిధరీతుల నౌకలు 248 కలవు (1972). వాయుసేనయందలి సైనికసంఖ్య 25,000 ; పోరాటవు విమానముల మొత్తం 300.

**9. అంతర్జాతీయ సం. :** 1973 మొదలుగ ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము కలదు. వార్సా ఒడంబడిక వ్యవస్థయందును, కమ్యూనిస్టుదేశములకు సంబంధించిన కొన్ని అంతర్జాతీయ సంఘములందును ఈ దేశము సభ్యత్వము వహించియున్నది. 1970లో పశ్చిమజర్మనీ అధ్యక్షుడు తూర్పుజర్మనీని, తూర్పుజర్మనీ అధ్యక్షుడు పశ్చిమజర్మనీని సందర్శించిన తరువాత ఈ రెండు దేశముల మధ్య సంబంధములు చాల మెరుగు పడినవి.

**10. ఆర్థికరంగము :** తొలుత నుండియు ఈ దేశము పారిశ్రామికముగ చాల పురోగతికి పేరొందినది రెండవ ప్రపంచయుద్ధము ముగిసినప్పటి నుండి, పశ్చిమజర్మనీతో ముడిపడని ఒక స్వతంత్ర రాజ్యముగ తన ఉనికిని రూపొందించుకొనుటకు పారిశ్రామికాది రంగములందు అన్నింట ఈ దేశము కృషిని సాగించినది. దేశపు జాతీయాదాయమున పరిశ్రమల వలన 50 8 ; వ్యవసాయిక, అటవీ కృషులవలన 8.7%; కట్టుబడిపనుల వలన 7.8%; తక్కిన కృషుల వలన 32.7% లభ్యము మొత్తపు దేశపు భూతలమున 43% (1,08,30,379 హె.) వ్యవసాయానుకూలము. ఇందు 13.4% గడ్డిబీడులుగ వినియుక్తము. సేద్యమున ఉన్న భూమిలో ఆహార వస్తువులును, పశు పోషణకు పనికివచ్చునవియును, విరివిగ పండింపబడుచున్నవి. వీనిలో ఉరలగడ్డ, చక్కెర, బీటు దుంప, రై ధాన్యము, గోధుమ, ఓట్లు, బార్లీ క్రమ ప్రాముఖ్యములను కలిగిఉన్నవి. పరిశ్రమలకు ఉపయోగించు పంటల సేద్యము క్రమేణ అభివృద్ధి అగుచున్నది. సమష్టి వ్యవసాయమునకు ప్రభుత్వాదరణ కలదు. 1963 నాటికి దేశమున సేద్యపు భూమి అంతయు సమష్టి వ్యవసాయము క్రిందికి తేబడినది. 1971 నాటికి దేశమున గోజాతి 5,293 వేలు, పందులు 9,995వేలు, గొర్రెలు 1,607 వేలు, మేకలు 113 వేలు, గుర్రములు 106 వేలు, కోళ్లు 43,343 వేలు కలవు. లిగ్నైటు ఉత్పత్తిలో ఈ దేశమునకు, ప్రపంచ రాజ్యములందు, ప్రథమ స్థానము కలదు. అరుదు ధాతువులగు యురేనియమ్, కోబాల్ట్, బిస్మత్, ఆర్సెనిక్, యాంటిమనీ అటనట సేకరింపబడుచున్నవి. మత్స్యముల పట్టుబడి 3,31,528 మె. టన్నులు మాత్రమే (1971). 1972 ఆరంభమునకు 11,253 పారిశ్రామిక సంస్థలు దేశమున పనిచేయుచుండినవి. వీనిలో 5.4% మాత్రమే ప్రయివేటు రంగమున ఉన్నవి. ధాతు సంస్కార పరిశ్రమలును, మౌలిక

పరిశ్రమలును పరిశ్రమలలో ప్రముఖములు. ఉక్కు తయారీ క్రమేణ ఎక్కువగుచున్నది. రాసాయనిక పరిశ్రమలలో నత్రజని ఎరువులు, గంధక ద్రావకము, సింతెటిక్ రబ్బరు ప్రముఖములు. తక్కినవానిలో సిమెంటు, జవుళీ, తోలుచెప్పులు గణనీయములు. పరిశ్రమలలో పనిచేయువారి సంఖ్య 28,25,397 (1972). విద్యుత్పత్తి 6,942 కోట్ల కివా (1971). ఎగుమతుల విలువ 2132 05 కోట్ల మా.; దిగుమతుల విలువ 2,083.05 కోట్ల మా. (1971). బడ్జెటరీ వ్యయము 7,914.1 కోట్ల మా. (1971)

**11. సాంఘిక రంగము** : నిర్బంధసాంఘిక భీమాపద్ధతి అమలున ఉండి, అన్ని రంగములందలి పనివారలకు వర్తించుచున్నది. 60 ఏండ్ల వయస్సు వచ్చిన స్త్రీలును, 65 ఏండ్ల వయస్సు వచ్చిన పురుషులును వార్ధక్య భృతికి అర్హులు. నిరుద్యోగ భీమా, పనివారలకు పరిహారము, రోగములందు సాహాయ్య భృతి వసతులు కలవు. యుద్ధమువలన గృహవసతి విరివిగ దెబ్బ తినినది. దానిని చక్కజేయుటకు ప్రభుత్వము ఎక్కువగ కృషిని సాగించుచున్నది. దేశమున నిరక్షరాస్యత లేనేలేదని చెప్పవచ్చును. విద్యాబోధన ఉచితముగ జరుగుచున్నది. మౌలిక విద్యకు పాలిటెక్నిక్ పాఠశాలలు (10 తరగతులు)ను, విస్తృత విద్యకు పాలిటెక్నిక్ ఉన్నత పాఠశాలలును (రెండు తరగతులు) కలవు. వీనిలో పాలిటెక్నిక్ పాఠశాలల సంఖ్య 6,198 ; ఇందలి విద్యార్థిసంఖ్య 25,70,504 ; పాలిటెక్నిక్ ఉన్నత పాఠశాలల సంఖ్య 295 ; ఇందలి విద్యార్థి సంఖ్య 57,278 ; ఇవిగాక 4,28,650 మంది విద్యార్థులు కల 1,070 వృత్తిపాఠశాలలును ; 1,74,360 మంది చదివెడు 192 సాంకేతిక పాఠశాలలును కలవు ; ఉన్నత విద్యను బోధించు విశ్వవిద్యాలయములును, కొన్ని ప్రత్యేక సంస్థలును ఉన్నవి ; వీని మొత్తపు సంఖ్య 54; అందలి విధ్యార్థుల సంఖ్య. 1,52,315 (1971). బెర్లిన్, లీవ్‌జిగ్‌లలోని గ్రంథాలయములు ప్రముఖములు. 500 పైగా మ్యూజియములు కలవు. వీనిలో బెర్లిన్‌లోని చారిత్రక మ్యూజియమ్, డ్రెస్‌డెన్‌లోని జాతీయ చిత్రాగారము ప్రముఖములు. 34 దైనిక పత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో న్యూస్ డ్యూష్‌లాండ్ అనునది ఎక్కువ ప్రచారము కలది. వైద్యకృషి జాతీయము చేయబడినది. 1,87,756 శయ్యలుకల 620 ఆసుపత్రులు పని చేయుచున్నవి ; అందలి వైద్యసంఖ్య 27.925.

**12. యాత్రా సౌ.** : పాస్‌పోర్టు, వీసాలు విదేశీయ యాత్రికులకు విధిగ ఉండితీరవలయును. సోవియెట్ వర్గమునకు చెందిన యాత్రికులే ఎక్కువగ దేశమును దర్శించుచున్నారు. సోవియట్ వర్గపు దేశముల నుండి 4,36,000 మంది, తదితర దేశముల నుండి 68,000 మంది సరాసరిన సాలీన దేశమును పర్యటించుచున్నారు.

**13. ప్రసిద్ధ పౌరులు.** : సమష్టి జర్మనీకి చెందిన ప్రముఖపౌరులు, పశ్చిమ జర్మనీని గురించి తెలుపునపుడు పేర్కొనబడెదరు. తూర్పుజర్మనీ రూపొందిన తరువాత అందు గణనీయ నాయకుడుగ పేరొందినవాడు వాల్టర్ ఉల్‌బ్రిక్ట్ (మ. 1976) దేశము సోషలిస్టు మార్గమున పురోగమించుటకు ఇతడు సమధిక కృషి చేసెను.

# 9. పశ్చిమ జర్మనీ

## (జర్మన్ సమాఖ్యా గణరాజ్యము)

**ముఖ్యనగరము : బాన్** ; **జెండా** : నలుపు, ఎరుపు, బంగారు రంగుల అడ్డుచారలు క్రమముగ పైనుండి దిగువకు అమరియుండునది. **జాతీయ గీతము** : సాధికార జాతీయగీతము ఏదియు లేదు; కాని ప్రాచీన దేశభక్తి గీతావళియగు 'డూష్‌లాండ్ లీక్'న మూడవగీతము సర్వేసర్వత్ర జాతీయ గీతముగ ఆదరితము ; నాణెము. డూష్‌మార్క్ ; ఇది 100 ఫెన్నింగులుగ విభక్తము. 1 డూష్ మార్క్ = రు 2.09 ; కొలతూకములు మెట్రిక్ విధానపువి ; కాలగణన : సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి** మొ : మధ్య యూరపున 47°-55° ఉ. అ. రేఖల మధ్యను, 6°-14°తూ. తు. రేఖ మధ్యను విస్తరించియున్న పశ్చిమజర్మనీకి ఉత్తరమున డెన్మార్క్ ; తూర్పున జెకోస్లొవాకియా, తూర్పుజర్మనీ దేశములు ; దక్షిణమున స్విజర్లండు, ఆస్ట్రియాలు; పశ్చిమమున నెదర్‌లాండ్స్, బెల్జియం, లక్సెంబర్గ్, ఫ్రాన్స్ దేశములు సరిహద్దులందున్నవి. ఈ దేశపు వాయవ్యభాగము నార్తు సముద్రమును, ఈశాన్యభాగము బాల్టిక్ సముద్రమును కొలదిగ తగిలియున్నవి. ఉత్తర-దక్షిణముల పొడవు 827 కిమీ. తూర్పు పడమరల నిడివి 450 కిమీ. తూర్పుజర్మనీకి మధ్యయుండి, పశ్చిమజర్మనీతో ప్రాదేశికముగి కలసియుండని బెర్లిన్ నగరమునందలి పశ్చిమభాగము (పశ్చిమ బెర్లిన్) రాజ్యాంగరీత్యా ఈ దేశముననే చేరియున్నది. దేశమున పశ్చిమ బెర్లిన్‌గాక 10 రాష్ట్రములు కలవు. దేశపు మొత్తపు వైశాల్యము 2,48,572 చ. కిమీ. దేశపు ఉత్తరప్రాంతము ఒక నిమ్నభూమి ; ఇసుకపర్రలు ఇందు విశేషముగ గలవు. ఇటనుండి దేశములోనికి పోవుటలో భూతలపు ఎత్తు క్రమముగ పైకిలేచి మధ్యదేశపు పర్వతభూమిగ పరిణమించును. ఈ ఉన్నత పర్వతభూమి రైనునదినుండి తూర్పుజర్మనీ సరిహద్దువరకు వ్యాపించియున్నది. ఇందలి ఉన్నతి




పటము 10.

సముద్రమట్టము మీద 1060 మీటర్లనుండి 1,525 మీ. వరకు మారుచుండును. పడమట ఒక నెరియలోయయు, అందు ఇరుకగు చరియయు కలవు ; ఇదియే రైనునదీ దుస్సాహసపు లోయ (Heroic valley of the Rhine) అనబడుచున్నది. ఇక దక్షిణదేశమున కొన్ని పీఠభూములపరుసలును, చిన్న కొండలును, నల్ల అడవియు,

ఓడెన్‌వాల్ట్ పర్వతములును కలవు. ఆ పర్వతము లందలి ఉన్నత శిఖరమగు ఫెల్డ్‌బెర్గ్ ఎత్తు 1523 మీటర్లు అవి క్రమముగ ముందునకుసాగి బవేరియన్ ఆల్ప్సు పర్వతములతో మేళవించి (ఎత్తు 2435—2740 మీ) ఈ దేశమును స్విజర్లండు, ఆస్ట్రియాలనుండి వేరుచేయును. దేశమందలి అత్యున్నత స్థలమగు జుగ్స్‌పిట్‌జీ ఎత్తు 2965 మీ. దేశపు సరస్సులలో నెల్ల ప్రముఖమైనది కాన్‌స్టాన్‌జ్ సరస్సు (440 చ. కిమీ.) ఈ సరస్సున స్విజర్లండు, ఆస్ట్రియాలకును భాగములు కలవు. దక్షిణదేశపు చివర తప్ప తక్కిన దేశమున పడు జలమంతయు నదులద్వారా నార్తు సముద్రమును చేరును. రైనునదియు, దాని ఉపనదులగు మోసెల్, మైన్ నదులును, పశ్చిమదేశమున చెప్పదగినవి. దేశపు తూర్పుభాగమున ప్రవహించు నదులలో ఎమ్స్, వీసర్, ఎల్బే ప్రముఖములు. వీని ముఖద్వారముల వద్దనున్న రేవు నగరముల వలన వీనికి దేశపు ఆర్థిక వ్యవస్థలో చాల ప్రాముఖ్యము కలిగినది. దక్షిణదేశమున డాన్యూబ్ నది 647 కి. మీ. దూరము పడమటినుండి తూర్పునకు ప్రవహించును. సముద్రతీరమును ఆశ్రయించియున్న ఫ్రిజియన్ మొదలగు చిన్న దీవులును, ఎల్బీనదీ ముఖద్వారమునకు ఎదురుగఉన్న హెలిగోలాండు దీవియు ఈదేశమునకే చెందిఉన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశమున సమశీతోష్ణత ఎక్కువని చెప్పదగును. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 48° ఫా. గరిష్ఠోష్ణోగ్రత 61° నుండి 68° వరకును; కనిష్ఠోష్ణోగ్రత 21° నుండి 34° వరకును ప్రదేశములను అనుసరించి మారును. సాలీనా వర్షపాతము ఉత్తర నిమ్నభూములలో 50 నుండి 70 సెం. మీ. వరకును, మధ్యదేశపు పర్వతభూమిలో 67.5 నుండి 100 సెం.మీ. వరకును, బవేరియన్ ఆల్ప్సులో 195 సెం. మీ. కు పైబడియు ఉండును. ఉన్నత పర్వత భూములు జనవరినుండి మార్చి వరకు హిమావృతములై ఉండును. బీచి, ఓకు మొదలగు ఆకురాల్పు తరగతి వృక్షములు, అడవులలో మూడింట ఒకవంతున కననగును; సూచ్యగ్ర జాతి వృక్షములును అడవుల ప్రస్తుతపు పునరుద్ధరణవలన ఎక్కువగుచున్నవి. ఇసుక నేలలందు పైన్ వృక్షములు కలవు. అడవి జంతువులు లేనేలేవని భావింపవచ్చును. వసంత, శిశిర ఋతువులలో వివిధ దేశసంచారక పక్షిజాతులు దేశముపై పయనించి పోవుట కనవగును.

**3. జనసంఖ్య మొ** : 1971 అంచనాలను అనుసరించి దేశపుమొత్తపుజనసంఖ్య6,15,02,500. అందలి రాష్ట్రములు, వాని జనసంఖ్య, వైశాల్యము మొదలగు వివరములు దిగువ ఈయబడినది.

| రాష్ట్రము. | వైశాల్యము చ. కిమీ. | జన సంఖ్య | ముఖ్య నగరము | ముఖ్యనగరపు జనసంఖ్య |
|---|---|---|---|---|
| ష్లెస్‌విగ్-హాల్‌స్టీన్ | 15,678 | 25,43,200 | కీల్ | 2,71,042 |
| హామ్‌బర్గ్ | 753 | 17,81,600 | హామ్‌బర్గ్ | —— |
| దిగువ శాగ్జనీ | 47,405 | 71,80,500 | హేనోవర్ | 5,21,003 |
| బ్రెమెన్ | 404 | 7,39,100 | బ్రెమెన్ | 5,92,533 |
| ఉత్తర రైన్-వెస్ట్‌ఫేలియా | 34,054 | 1,71,37,100 | డిస్సెల్‌డార్ఫ్ | 6,60,963 |
| హెస్సెన్ | 21,112 | 54,89,700 | వీస్‌బేడెన్ | 2,50,715 |
| రైన్‌లాండ్-పలాటినెట్ | 19,844 | 36,78,500 | మైన్‌జ్ | 1,74,858 |

| రాష్ట్రము | వైశాల్యము చ. కిమీ. | జన సంఖ్య | ముఖ్య నగరము | ముఖ్యనగరము జనసంఖ్య |
|---|---|---|---|---|
| బేడెన్-వర్టుంబర్గ్ | 35,750 | 90,55,100 | స్టట్‌గార్ట్ | 6,34,202 |
| బవేరియా | 70,547 | 1,06,91,000 | మ్యూనిచ్ | 13,11,978 |
| సార్‌లాండ్ | 2,567 | 11,22,000 | సార్‌బ్రికెన్ | 1,28,251 |
| పశ్చిమ బెర్లిన్ | 480 | 20,84 400 | బెర్లిన్ (పశ్చిమ) | — |

దేశమున చ. కి మీ. కు జనసాంద్రత 247. లక్షకు పైబడిన జనసంఖ్య గల పట్టణములు 60 కలవు. రాష్ట్ర ముఖ్యనగరములుగాక కోలోన్ (జ. సం. 8,49,451) ఫ్రాన్క్‌ఫర్ట్ (6,66,179), డోర్ట్‌మండ్(6.40,642),న్యూరెంబర్గ్(4 73,181), బాన్ (2.75,722) గణనీయములు. 99% ప్రజలు జర్మన్ జాతీయులు; ష్లెస్‌విగ్ - హాల్‌స్టీన్‌న మాత్రమే అల్పసంఖ్యాక వర్గమగు డేనిష్ ప్రజానీకము కన్పట్టుచున్నది. 1950-1962 మధ్య తూర్పు జర్మనీ నుండియు, తక్కిన ప్రాచ్య యూరపీయ దేశములనుండియు దాదాపు అయిదు లక్షల జర్మనులు ఇటకు తరలి వచ్చి స్థిరనివాసములను ఏర్పరచుకొనిరి. సాధికారభాష జర్మన్. ఇందు అనేక మాండలికములు ఉన్నను హై జర్మను అను మాండలికమే ప్రామాణిక భాషగ పరిగణనీయము. మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కల్పింపబడినది. దాదాపుగ ప్రజలందరును క్రైస్తవులు; ఇందు ప్రొటెస్టంటు, కేతలిక్ శాఖలవారు సరిసమానముగ ఉన్నారు. 26 వేలమంది యూదులు కలరని అంచనా.

**4. సమాచార సౌ.:** దేశమున తపాలా ఆఫీసులు, ఏజన్సీలును కలసి మొత్తము మీద 25,536 కలవు. టెలిగ్రాఫ్, టెలిఫోను ఆఫీసుల సంఖ్య 10,843. రేడియో, టెలివిజన్ సంస్థలు విరివిగ కలవు. ఉచ్చతమ పౌనఃపున్యము కల రేడియో జాలికలు (High Frequency Networks) ఈ దేశమునందు ఉన్నంత విరివిగ యూరపున మరి యే యితర దేశమున కన్పడవు.

**5. యాన సౌ.:** దేశమునందలి మొత్తపు రోడ్లనిడివి 1,64,469 కిమీ. ; ఇందు 1,02,444 కిమీ. అత్యున్నత స్థాయికి చెందినది. రైలుమార్గముల నిడివి 33,123 కిమీ ; ఇందు 8,883 కిమీ.ల దూరమున బండ్లు విద్యుత్ సహాయమున నడచుచున్నవి. దేశమధ్యస్థములగు నదులందును, కాలువలందును నౌకాయాన సౌకర్యము 6,030 కిమీ.ల వరకుకలదు. అందును రైనునదికిని, దాని ఉపనదులకును ఈ విషయమున అధిక ప్రాముఖ్యము కలదు. యూరపున తక్కిన ఏ నదీమార్గమున ఇంత నౌకా సంరంభము కనబడదు. ఇచటి దేశాంతర్గత నదీ మార్గముల రేవులలో డీస్‌బర్గ్ ప్రముఖము. విదేశీయమగు ఎగుమతి దిగుమతి వ్యాపార విషయమున హాంబర్గ్, విల్‌హెల్మ్‌స్‌హేవెన్, బ్రెమెన్ క్రమ ప్రాముఖ్యములను కలిగియున్నవి. దేశపు సముద్రవ్యాపార నౌకాదళమున నౌకల సంఖ్య 2,510. వాని మొత్తపు ప్రమాణము 84,27,500 టన్నులు. దేశమున పలుతావులందు విమానాశ్రయములు కలవు ; వానిలో హామ్‌బర్గ్, హేనోవర్, బ్రెమెన్, డిస్సెల్‌డార్ఫ్, కోలోన్-బోన్, ఫ్రాంక్‌ఫర్ట్, స్టట్‌గార్ట్, న్యూరెంబర్గ్, మ్యూనిచ్, బెర్లిన్ నగరములందలివి అత్యుచ్చ స్థాయికి చెందినవి, దేశీయములగు విమానయాన సంస్థలలో అతి ప్రముఖము డూషీ లఫ్తాంసా. ఇది

జర్మనీనుండి యూరప్, ఆఫ్రికా, పశ్చిమఆసియా, ప్రాచ్య ఆసియాలకు, ఉత్తర దక్షిణ అట్లాంటిక్ దేశములకు విమానయాన సౌకర్యములను కల్పించుచున్నది. దేశమునందలి వివిధ ప్రదేశములమధ్య చక్కని విమానసౌకర్యము దీనివలన లభించుచున్నది. ఈ సంస్థకు చెందిన విమానముల సంఖ్య 3,248 (1968).

**6. చరిత్ర :** చరిత్రకు అందని పూర్వకాలమున జర్మనీ మొదలగు దేశములను లోగొనిన ఉత్తరయూరప్ ఆటవీమయముగా ఉండి, అందు ట్యూటన్ జాతికి చెందినవారు సంచరించెడివారు. రోమన్ చక్రవర్తియగు అగస్టస్ క్రీ. పూ. 9న ఈ అటవీజాతులను కొంతవరకు అణచి, కొన్ని ప్రాంతములను వశపరచుకొనగలిగెను. రోమనుల బలము క్షీణించిన తరువాత ఈ ట్యూటన్ జాతులు ఇటలీ, స్పెయినులకు, ఫ్రాన్సునకు వ్యాపించి ఒక విశాల రాజ్యమును స్థాపింపగలిగినవి. ఈ తెగలలో ఫ్రాంకు తెగకు చెందిన క్లోవిస్, క్రైస్తవ మతమును స్వీకరించి తన ప్రజలకు రోమన్ నాగరికతతో పరిచయము ఏర్పరచెను. ఆ ఫ్రాంకు రాజుల వంశపువాడగు షార్లమేన్ క్రీ. శ. 768న రాజై తన రాజ్యమును జర్మన్ ప్రాంతములకు అన్నింటికిని విస్తరింపజేసి, అచట క్రైస్తవ మతమునకు వ్యాప్తిని కలిగించెను. అప్పటి పోపు (క్రైస్తవ మతపీఠాధిపతి) ఇతనిని రోమన్ చక్రవర్తిగ చేసెను (800). అంతటినుండి ఆ సామ్రాజ్యము, పవిత్ర రోమన్ సామ్రాజ్యము అను పేరున వ్యవహృతమైనది. దాదాపుగ పశ్చిమ యూరప్ అంతయు అపుడు ఆ సామ్రాజ్యమున చేరిఉండినది. షార్లమేన్ అనంతరమున ఆ సామ్రాజ్యము విచ్ఛిన్నమైనది. అంతటంతట కొందరు పాలకులు తిరిగి దానిని ఏకీకృతము చేయుటకు యత్నించి కొంతవరకు సఫలతను ఆర్జించినను, ఆ సమగ్రత ఎక్కువకాలము నిలువగలిగినదికాదు.

కొంతకాలమునకు పవిత్ర రోమన్ సామ్రాజ్య చక్రవర్తులకును పోపులకును మధ్య వైరుధ్యములు కలిగి కడకు, యుద్ధమునకు దారితీసినవి. దీనిని ఎదుర్కొని ఫ్రెడరిక్ II చక్రవర్తి (1212-50) నిలువగలిగినను, అతని మరణానంతరమున సామ్రాజ్యము విచ్ఛిన్నమై 1273న హాబ్స్‌బర్గ్ వంశపు వాడగు రుడాల్ఫ్ అనువానిని చక్రవర్తిగ ఎన్నుకొనుటతో పునరుద్ధరితమైనది. అటనుండి ఆ సామ్రాజ్యము దీర్ఘకాలము మనగలిగినది. అందలి జర్మనీలో వర్తక వ్యాపారములును కళలను పెంపొందినవి. కాని చక్రవర్తిని నామమాత్రముగ మన్నించి వర్తక సంఘములును, సామంతులును అధికారమును కైవసము చేసికొనుట తటస్థించినది. ఇంతలో 1517 మొదలుగ పోపు అధికారమును మతరీత్యా తిరస్కరించెడు ఒక క్రైస్తవ సంప్రదాయమును జర్మన్ దేశీయుడగు మార్టిన్ లూథర్ ప్రవచించెను. ఈ మత విభేదములు కడకు ముప్పదేండ్ల సంగ్రామమునకు (1618-48) దారి తీసినవి. తత్ఫలితముగ జర్మనీ, 300కు పైబడిన మాండలిక రాజ్యములుగ, విభక్తమైనది. దాదాపు 200 సంవత్సరములు ఇటుల గడచిన తరువాత, అట్టి మాండలిక ప్రభువులో ఒకడును, ప్రష్యా రాష్ట్రపాలకుడును అగు ఫ్రెడరిక్ II (1740-86ప.) ఆ మాండలికులలో నెల్ల ప్రముఖుడుగ ముందునకు రాగలిగెను.

ఫ్రెంచి విప్లవము జర్మన్ ప్రజల జాతీయ భావోదయమునకు దోహదము చేసినది. జాతికి అంతటికిని ఒక పార్లమెంటును 1848లో జర్మన్ ప్రజలు ఏర్పరచుకొనగలిగిరి. అయినను ఒక చక్రవర్తిని మాత్రము నిర్ణయించుకొనలేక పోయిరి. కడకు 1861లో అప్పటి ప్రష్యారాష్ట్రపు ప్రధానియగు బిస్మార్క్ యొక్క రాజనీతి నిపుణతవలన, ప్రష్యా రాజగు విలియమ్ I ని తమ దేశము అంతటికిని చక్రవర్తిగ దేశపు మాండలికులు అంగీకరించిరి.

అతని అనంతరము రాజైన విలియమ్ II, బిస్మార్క్‌ను పదవీభ్రష్టుని చేసి సర్వాధికారములను గ్రహించి, వలసలను ఆర్జించుకాంక్షతో సేనా నౌకా దళములను అభివృద్ధిపరచెను ఇది కడకు ప్రథమ ప్రపంచయుద్ధమునకు (1914-1918) దారితీసినది. ఇందు జర్మని పరాజితముకాగా, చక్రవర్తి పదభ్రష్టుడై, దేశమున మితవాద రాజ్యాంగబద్ధమగు ప్రజాస్వామ్యము ఏర్పడినది. 1930లో యూరప్‌ఖండమున వ్యాపించిన ఆర్థిక మాంద్యము వలన జర్మని విపరీతముగ దెబ్బ తినినది. అంతట అసంతృప్త ప్రజానీకము, హిట్లర్ నాయకత్వమున ఉన్న నాజీపక్షపు వాగ్దానములను నమ్మి, ఆ పక్షమును సమర్థించినది. 1934లో అధికారమునకు వచ్చిన హిట్లర్ నియంతయై, తక్కిన పక్షములను రూపుమాపి, సర్వాధికారములను తన పక్షమునకు వశపరచి, దేశమున నిర్బంధసైనిక శిక్షణను పునరుద్ధరించి ఆస్ట్రియా, జెకోస్లొవాకియాలను, వశపరచుకొనెను. అంతట పోలండుపై అతడు జరిపిన దండయాత్ర రెండవ ప్రపంచ యుద్ధమునకు(1939-1945) దారితీసినది. ఇందు జర్మనీ పరాజితమై, మిత్రసేనలు జర్మనీని ఆక్రమించగ, హిట్లర్ ఆత్మహత్య చేసికొనెను. 1945, మే 7న జర్మనీ నిర్నిబంధముగ లొంగినది. అంతట జర్మనీదేశమును నాలుగు సైనిక మండలములుగ విభజించి, యునైటెడ్‌స్టేట్స్, బ్రిటిష్, ఫ్రెంచి, సోవియట్ సేనలు తలకొక మండలముగ ఆక్రమించినవి. సోవియట్‌సేన ఆక్రమించిన తూర్పు జర్మనీలో ఉన్న బెర్లిన్ నగరమున పశ్చిమ భాగమును యు. స్టే., బ్రిటిష్, ఫ్రెంచి సేనలు వశపరచుకొనుటకు సోవియెట్ దేశము అంగీకరించినది. సోవియట్ రష్యా తప్ప తక్కిన మూడు రాజ్యములును తమ ఆక్రమణలో ఉన్న భాగములను ఐక్యపరచి, ఒకే విధపు ప్రభుత్వమును ఏర్పరచి 1949లో తమ ఆక్రమణ సైన్యములను చాలవరకు తొలగించి జర్మన్ ప్రజలకు ఆమోదయోగ్యమైన స్వాతంత్ర ప్రభుత్వమును ఏర్పరచినవి. ఇదియే పశ్చిమ జర్మని. సోవియెట్ ఆక్రమణలో ఉన్న భాగమున కమ్యూనిస్టు విధానపు ప్రభుత్వమును సోవియెట్ పాలకులు ఏర్పరచి, దానినుండి క్రమముగ తమ ఆక్రమణసేనలను చాలవరకు తొలగించి తూర్పుజర్మనీ అను ప్రత్యేకదేశముగ దానికి స్వతంత్రను కల్పించిరి (చూ : తూర్పు జర్మనీ).

పశ్చిమజర్మనితో ప్రాదేశికముగ ముడివడియుండని పశ్చిమబెర్లిన్ నగరపు పరిస్థితి ఒక ప్రచ్ఛన్న యుద్ధమునకు దారితీసినది. కడకు పశ్చిమ బెర్లిన్, తూర్పుబెర్లిన్‌లమధ్య సన్నిహిత సంబంధము లేకుండచేయుటకు వాని మధ్య ఒక గోడ నిర్మించబడినది. కాని 1970 మొదలుగ ఈ ఉభయ రాజ్యాలమధ్య కొంత సామరస్యము ఏర్పడి సాంస్కృతికముగ కలసిమెలసి వ్యవహరించుట జరుగుచున్నది. ఈ ఉభయ జర్మనీలును ఏకమై ఒక రాజ్యముగ రూపొందుట, పశ్చిమజర్మనీ ప్రజల అభీష్టమైనను, దానిని భావికాలగతికి వదలి, సామరస్యమున మెలగుటయే మంచిదను నిర్ణయమునకు వారిపుడు రాగలిగిరి.

**7. పరిపాలన :** 1949, మే 23న ఆమోదితమైన మూల శాసనమును అనుసరించి ఇచ్చటి రాజ్యపాలన నిర్వహింపబడుచున్నది. దేశమునందలి పది రాష్ట్రములను సమైక్యపరచు సమాఖ్యా విధానపు గణరాజ్య ప్రభుత్వము ఈ శాసనము వలన నెలకొల్పబడినది. ఆక్రమణ రాజ్యముల మూడు బాధ్యతలకు - 1. జర్మనీ ఏకీకరణకై తుది శాంతి సంధి 2. బెర్లిన్ 3. నిలిచియున్నకొలది ఆక్రమణ దళముల భద్రత అనువానికి - లోబడి ఈ గణరాజ్య విధానము సాగుచున్నది. దేశపు పాలనాధికారము రెండు కక్ష్యలు కలిగిన శాసన సభయందు న్యస్తము; అందొకటి సమాఖ్యా సభ

(బుందేస్టాగ్); ఇందు 497 మంది వోటు చేయు సభ్యులును, పశ్చిమ బెర్లిన్‌కు మాత్రము ప్రాతినిధ్యము వహించి, వోటు హక్కు లేకుండ, చర్చలలో మాత్రమే పాల్గొను సభ్యులు 22 మందియు కలరు. వీరు నాలుగేండ్లకు ఒకసారి ప్రజల వలన ఎన్నుకొన బడెదరు, రెండవ కక్ష్య సమాఖ్యాసమితి (బుందేరాట్); దీని యందును రాష్ట్రప్రభుత్వము లకును పశ్చిమ బెర్లిన్‌కును ప్రాతినిధ్యము కలదు. ఇరువది లక్షల జనసంఖ్యకు మించని ప్రతిరాష్ట్రము నకు ముగ్గురు సభ్యులును, 20 లక్షల నుండి 60 లక్షల వరకు జనసంఖ్య గల రాష్ట్రమునకు నలుగురు సభ్యులును, అంతకు పైబడిన జనసంఖ్యగల రాష్ట్రమునకు ఒక్కొకదానికి అయిదుగురు సభ్యులును ఇందు కలరు. ఆ సమితి యందలి ప్రస్తుత సభ్య సంఖ్య 41. పశ్చిమ బెర్లిన్ ప్రతినిధులకు చర్చ లలో పాల్గొను హక్కు మాత్రమే కలదు; వారికి వోటు చేయు హక్కు లేదు. శాసన నిర్మాణాధికారము, ముఖ్యముగ సమాఖ్యా సభకే చెంది యున్నను, సమితి ఆమోదము లేనిదే అది శాసనము కానేరదు. ఏ విషయముననైనను ఈ రెండు కక్ష్యల మధ్య విభేదము ఏర్పడిన యెడల సామరస్య సమితి దానిని పరిశీలించి చక్కజేయును. ఈ సామరస్య సమితి యందు ఉభయ కక్ష్యలకు ప్రాతినిధ్యము కలదు. దేశాధ్యక్షుడు అయిదేండ్లకు ఒకసారి సమాఖ్యా పరిషత్తుచే ఎన్నుకొనబడును. ఈ పరిషత్తునందు సమాఖ్యా సభాసభ్యులును, వారితో సమాన సంఖ్య కలుగునటుల రాష్ట్రశాసన సభల చేత జనసంఖ్యా నిష్పత్తిలో ఎన్నుకొనబడిన సభ్యులును సభ్యత్వము కలిగి యుందురు. సమాఖ్యా సభలో అధిక సంఖ్యాక బలముగల వానిని ప్రధాని (చాన్సెలరు)గ అధ్యక్షుడు నియమించును. ఈ చాన్సెలరుచేత సూచింపబడిన వారిని ఫెడరల్ జడ్జీలు మొదలగు ఉన్నత పదవులకు అధ్యక్షుడు నియమించును. ఈ చాన్సెలరు తన సహచరులను తానే నియమించుకొని కార్యవర్గమును ఏర్పరచుకొని, శాసన సభకు బాధ్యతవహించి పాలించును. మూల శాసనమును శాసన సభవారు మూడింట రెండు వంతుల ఆమోదముతో సవరించవచ్చును. రాష్ట్రములందు ఎన్నుకొనబడిన శాసన సభల సాయమున పరిపాలన సాగును. రాష్ట్రముల అధికార పరిధులు నిర్ణయింపబడినవి. రాజకీయ పక్షములలో సోషల్ డెమోక్రాటిక్/పార్టీ, క్రిస్టియన్ డెమోక్రాటిక్ యూనియన్, క్రిస్టియన్ సోషల్ యూనియన్, ఫ్రీ డెమోక్రాటిక్ పార్టీ ప్రముఖములు. 18 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతిపౌరునకు వోటు హక్కు కలదు. ఎన్నికలు సార్వజనిక, అపరోక్ష, స్వచ్ఛంద రీతిలో జరుగును. ఫెడరల్ కోర్టు ఆధ్వర్యవమున దేశమున న్యాయనిర్వహణ జరుగుచున్నది.

**8. దేశరక్షణ:** 1955 లో జరిగిన పారిస్ ఒడంబడికలను అనుసరించి, ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థా, పశ్చిమ యూరపీయ సమ్మేళనముల బాధ్యతలకు లోబడి రక్షణకై బలమును సమకూర్చుకొనుటకు పశ్చిమ జర్మనీకి వసతి ఏర్పడినది. 1956లో నిర్బంధ సైనిక శిక్షణ శాసనము రూపొందింపబడినది. ప్రతి మూడు నెలలకు పది వేల మందికి శిక్షణ ఇచ్చుట తదాదిగా అమలు జరుగుచున్నది. 1973లో దేశపు భూతల సేన యందలి సైనిక సంఖ్య 3,27,000; ఇందు 13 కవచిత శకటదళములు, 12 కవచిత పదాతి దళములు తక్కిన విధములవి 8 దళములు కలవు; నౌకాసేన యందలి సైనికుల మొత్తము 40,000; ఈ సేనకు 12 జలాంతర్గాములు, 3 నియంత్రిత క్షిపణులుకల డిస్ట్రాయర్లు, 8 తక్కు విధముల డిస్ట్రాయరులు, ఇవి గాక 233 ఇతర విధములు యుద్ధోపయోగ నౌకలు కలవు. వాయుసేన యందలి యోధ సంఖ్య 1,01,000; ఈ సేనకు 10 బాంబరు దళములు,

19 క్షిపణి దళములు, తక్కువిధముల 18 పోరాట విమానదళములు కలవు.

**అంతర్జాతీయ సం.:** 1973 మొదలుగ ఈ రాజ్యము ఐ. రా. స. యందు సభ్యత్వమును కలిగి యున్నది; అంతకు పూర్వము నుండియే ఐ. రా స. అనుబంధిత సంస్థలలో పెక్కింట సభ్యత కలిగి వ్యవహరించుచున్నది. ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ యందును, పశ్చిమ యూరపీయ సమ్మేళనమునను, కామన్ మార్కెటునను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ద్వితీయ ప్రపంచ యుద్ధ కాలపు వైమనస్యములను మరచి అన్ని రాజ్యములతో సమరస భావమున వర్తించుటకు ఈ దేశము కృషి చేయుచున్నది. తొలుత కమ్యూనిస్టు రాజ్యములతో వైరుధ్యములు ఏర్పడినను 1970లో రుమేనియా యుగోస్లావియాలతో దౌత్యసంబంధములను ఏర్పరచుకొనియు, సోవియెట్ రష్యాతో నిరాక్రమణ సంధిని కుదుర్చుకొనియు, పోలండుతో ఒడంబడికద్వారా ఆ దేశపు పశ్చిమ సరిహద్దును గుర్తించియు, తూర్పు జర్మనీ యొక్క ఉనికిని న్యాయ శాస్త్రరీత్యా పరిగణించియు, ఈ దేశము కమ్యూనిస్ట్ రాజ్యములతో గూడ సామరస్యమును సాధించినది.

**10. ఆర్థిక రంగము:** ద్వితీయ ప్రపంచ యుద్ధ ఫలితముగ సర్వనాశనము చెందిన ఆర్థిక వ్యవస్థ, యు. స్టే. ఇచ్చిన ధనసహాయముతో పాటుగ, దేశీయుల కృషి వలన పునరుద్ధరితమైనది. నేడు ప్రపంచ రాజ్యములందు అతి సంపన్నములని పేరొందిన దేశములలో ఇది ఒకటి. దేశపు తలసరి ఆదాయము 5,791 డూ. మా. (1968). దేశపు ఉత్పత్తిలో పరిశ్రమలవలన 51.2%, రహదారీ సమాచార సంబంధ కృషుల వలన 5.9%, బ్యాంకింగు మొదలగు సేవా కృషి రంగమున 24.6%, వ్యవసాయ, మత్స్యపరిశ్రమ, అటవీపరిశ్రమలందు 4%, తక్కినవాని వలన 14.3%. లభించుచున్నది. సమష్టి జాతీయోత్పత్తిలో 57.9% దేశీయుల పోషణకు వినియుక్తము. 15.7% ప్రభుత్వ వ్యవహారములకై ఖర్చగునది. 24.7% పెట్టుబడులకై వినియుక్తము (1968). దేశపు భూతలమున 55% వ్యవసాయమునకు అనుకూలము. అట్టి! 35 కోట్ల హెక్టేరులలో పంటలకై వినియుక్తమైనది 75,48,000 హె.; పశువుల గడ్డి బీడులు 54,17,000 హె.; పండ్ల తోటలు 5,38,000 హె. పంటలలో గోధుమ, రై, బార్లీ, ఓట్లు, ఉరలగడ్డ, చక్కెరబీటుదుంప ప్రముఖములు; ఫలసంపద అత్యధికము; ద్రాక్షసారాయము 60 లక్షల హెక్టోలీటర్లు ఉత్పత్తి అగుచున్నది (1971). ఆహార ధాన్యములు విరివిగ పండుచున్నను, కొన్ని ఆహార ద్రవ్యములను ఈ దేశము దిగుమతి చేసి కొనుచున్నది. పశుసంతతి విస్తారము. గోజాతి 1,36,37,700; గుర్రములు 2,65,300; గొర్రెలు 8,50,200; పందులు 1,99,85,000, మేకలు 43,200; కోళ్లు 10,21,81,000 కలవు (1971). అటవీ పరిశ్రమకు ఎక్కువ ప్రాముఖ్యము కలదు. దేశపు అడవుల వైశాల్యము 70 లక్షల హె. 1970-71లో అడవుల నుండి 2.8 కోట్ల ఘనమీటరుల కలప లభించినవి. మత్స్యపరిశ్రమకు చాల ఆదరము కలదు. ఈ పరిశ్రమలో కృషిని సాగించు పడవల సంఖ్య 102; వీటి పరిమాణము 1,12,548 టన్నులు. చేపల పట్టుబడి 4,92,660 మెట్రిక్ టన్నులు; దాని విలువ 35.6 కోట్ల డూ. మా. (1971). దేశపు ఖనిజ సంపత్తిలో అత్యధిక భాగము నార్త్‌రైన్ – వెస్ట్‌ఫేలియా ప్రాంతమున కలదు. తరువాత మధ్యజర్మనీ, దిగువ శాక్సనీ, హార్జ్ ప్రాంతములు లెక్కింపదగినవి. పెట్రోలు గనులలో ప్రముఖములైనవి దిగువ శాక్సనీలో ఉన్నవి. రాక్షసిబొగ్గు, లిగ్నైటు, ముడిఇనుము, పొటాష్, ముడిపెట్రోలు ముఖ్యములగు ఖనిజములు.

దేశమున పరిశ్రమలలో పాల్గొను సంస్థలు 56,145 కలవు; ఇందులో దేనియందును కార్మిక సంఖ్య 10 మందికి తగ్గదు; వీని అన్నింట పనిచేయు కార్మికుల మొత్తము 85,23,093; వీరిలో 11,13,399 మంది యంత్ర నిర్మాణమునను; 4,79,863 మంది జవుళీ పరిశ్రమ యందును, 10,64,200 మంది విద్యుత్ ఇంజనీరింగు పరిశ్రమ లందును; 3,06,109 మంది ఖనిజముల త్రవ్వకమునను, 5,86,722 మంది రాసాయనిక పరిశ్రమ యందును పని చేయుచున్నారు (1971) దేశమున 1971లో 3,699 వేల కార్లును; లారీలు, బస్సులు కలసి 275 వేలును; బైసికిళ్లు 2,260 వేలును ఉత్పత్తియైనవి. దేశపు విద్యుదుత్పత్తి 25,963.3 కోట్ల కివా. (1971); దేశమున ఉత్పత్తికి కావలసినంత మంది కార్మికులు తక్కువగుట వలన విదేశీయులును (తుర్కీవారు, యుగోస్లావ్‌లు, ఇటాలియనులు, గ్రీకులు, స్పానీయులు) ఇచట కార్మికులుగ పనిచేయుచున్నారు. వీరి మొత్తపు సంఖ్య 23,17,000 (1972). దేశపు ఎగుమతులలో యంత్రములు, కార్లు, విమానములు, రాసాయనికోత్పత్తులు, వైద్యుతిక సామగ్రి ప్రముఖములు. దిగుమతులలో ఆహార ద్రవ్యములు, పెట్రోలు, తారు, కొన్ని ముడివస్తువులు ప్రముఖములు. దేశపు ఎగుమతుల విలువ 11,445 కోట్ల డూ. మా.; దిగుమతుల విలువ 10,062 కోట్ల డూ. మా. (1971). బడ్జెటరీ వ్యయము 10,928 కోట్ల డూ. మా. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున సువ్యస్థితమగు కార్మికోద్యమము కలదు. బొగ్గు, ఉక్కు పరిశ్రమలకు సంబంధించినంతవరకు, పరిశ్రమ నిర్వహణలో, కార్మిక సంఘములకు కూడ భాగస్వామ్యము కల్పింపబడినది. వారమునకు 44 గంటలు మాత్రమే పనికాలముగ ఉండవలయు ననుట క్రమముగ అన్ని పరిశ్రమలందును ఆదరితమగుచున్నది. సాంఘిక భీమా విధానము సువ్యవస్థిత మగుటవలన అన్నివిధముల కార్మికులకు రోగము, అంగవైకల్యము, ప్రమాదము, వార్ధక్యము, నిరుద్యోగము మొదలగు ఇబ్బందుల విషయమున తగిన జీవన భృతికి ఏర్పాటు కలదు. దేశమున నిరుద్యోగత చాల తక్కువ. 1971 లో అట్టి వారి సంఖ్య 2,06,000 మాత్రమే. దేశమునందలి దాదాపు 6కోట్ల ప్రజానీకమునకు మొత్తము మీద 2 కోట్ల 8 లక్షలగృహములు కలవు(1971); అయినను వీనిలో ప్రాతవడిన వానికి బదులుగను, పెరుగుచున్న జనాభాకు తగినటులను గృహవసతిని చేకూర్చుటకు ప్రతి యేటా 5 లక్షల నూతనగృహములు నిర్మింపబడుతున్నవి. ఇందు దాదాపు సగపు సంఖ్య గృహములను ప్రభుత్వమే ఋణములు మొదలగు వాని సాయమున నిర్మింపజేయుచున్నది.

దేశమున నిరక్షరాస్యత లేనేలేదని అనదగును. దేశమునందలి 21,501 ప్రయిమరీ పాఠశాలలలో 63,59,300 మంది; 2381 ప్రత్యేక పాఠశాలలో 3,19,430 మంది; 2,114 మాధ్యమిక పాఠశాలలలో 8,51,091 మంది; 2,314 ఉన్నత పాఠశాలలో 13,82,244 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక వృత్తిపాఠశాలలు కొన్ని వేరుగ కలవు. వీనిలో నిండుకాలము పనిచేయు 3,595 పాఠశాలలలో 2,67,714 మంది; సగకాలము పనిచేయు 1,702 పాఠశాలలో 15,99,840 మంది; ఉన్నత వృత్తి పాఠశాలలు 1,162 లో 94,749 మంది. ఆనుషంగికముగ ఉన్నత వృత్తి విద్యను బోధించు 595 సంస్థలలో 40,382 మంది, ప్రజాశౌచరక్షణ విద్యను బోధించు 1,664 పాఠశాలలో 61,433 మంది విద్యార్థులు కలరు. 315 సాంకేతిక శిక్షణ సంస్థలో 35,826 మంది శిక్షితులు కలరు. దేశమున ఇంజనీరింగు శిక్షణకై 149 కళాశాలలు కలవు. వీనియందలి విద్యార్థి సంఖ్య 77,420 (1971).

27 విశ్వవిద్యాలయములును, ఆ స్థాయికే చెందిన ఉన్నత విద్యాసంస్థలు 27 కలవు. వీనియందలి విద్యార్థి సంఖ్య 3,61,401. (1970-71). సంగీత కళాశాలలు 15; లలితకళాబోధక కళాశాలలు 10; వ్యాయామ కళాశాల, ఫిల్ము టెలివిజను కళాశాల కలవు. వీనియందు 11,172 విద్యార్థులు కలరు. హైడెల్‌బెర్గ్‌నను, మ్యూనిచ్‌నను ఉన్న విశ్వ విద్యాలయములు అతి ప్రాచీనములు. జర్మన్‌భాషా బోధనకై విదేశములందు ఈ దేశము 240 పాఠశాలలను నడపుచున్నది; వయోజన విద్యకొరకై 1,242 సంస్థలు కలవు. ఇవి వయోధికులకు నూతన శాస్త్రీయ విషయములతో పరిచయమును కల్గించును. దేశమున దాదాపు 310 పెద్దగ్రంథాలయములు కలవు. అందు మ్యూనిచ్‌లోనిది అతి ప్రముఖము; అందలి సంపుట సంఖ్య 25 లక్షలు. మ్యూజియములలో బెర్లిన్‌లోని స్టేట్ మ్యూజియం, న్యూరెంబర్గ్, మ్యూనిచ్‌లలోని మ్యూజియములు చాల పేరుగనినవి. దేశమున 1,529 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. వాని రోజువారీ ప్రతుల సంఖ్య 22 లక్షలు, ఆ పత్రికలలో హామ్‌బర్గర్ మోర్గన్ పోస్టు అనుదానికి అత్యధిక ప్రచారము కలదు.

తక్కిన పశ్చిమ యూరపీయ దేశములతో ఎచటను కనరాని ఆరోగ్య ప్రమాణములు ఈదేశమున కననగుచున్నవి. సరాసరిన అపేక్షిత జీవితకాల వ్యవధి 66సం. 669 మంది ప్రజలకు ఒకవైద్యుడు చొప్పున దేశమున కలరు. అట్టి వైద్యుల మొత్తపు సంఖ్య 90,982 (1968); 6,33,284 శయ్యలు కల 3,587 ఆసుపత్రులు కలవు (1970). మరణ కారణములలో హృద్రోగము, కేన్సరు, రక్త ప్రవాహదోషములు ప్రముఖములు.

**12. యాత్రా సౌ.** : జాతీయాదాయమున ఒక విశిష్ట భాగము విదేశీయ యాత్రికుల వలన లభించుచున్నది. యు. స్టే. పౌరులకు పాస్‌పోర్టు మాత్రమే చాలును. తక్కిన దేశీయులకు పాస్‌పోర్టు వీసాలు ఉండవలెను. రైనునదీ లోయయందును, నదులయందును విలాసయాత్రలు, దక్షిణ పర్వతము లందలి ఏకాంత నివాసములు, నార్తు సముద్రపు తీరపు చదును భూములు యాత్రికులను ఆకర్షించుచున్నవి. 1969 లో 92 లక్షల విదేశీయులు దేశమును దర్శించిరి. వారివలన దేశమునకు 560 కోట్ల డూ. మా. ఆదాయము లభించినది. యాత్రికుల సౌకర్యములకై ప్రభుత్వము పెక్కు వసతులను కల్పించినది.

**13. ప్రసిద్ధ పౌరులు** : వైజ్ఞానికులకు, యంత్ర నిర్మాతలకు, కవులకు సంగీత వేత్తలకు, చిత్ర కళా నిపుణులకు జర్మనీ పేరు గనినది. క్రీ. శ. 1400 మొదలుగ ఆయారంగములందు పేరుగనిన ప్రముఖులు ఎందరో జన్మించి, ప్రపంచపు విజ్ఞాన, సంస్కృతులకు పరిపుష్టతను చేకూర్చి, జర్మనీకి పేరు ప్రతిష్ఠలను కొనివచ్చిరి. వారి పేరుల పట్టికను అంతటిని ఇచట ఇచ్చుటకు అవకాశములేదు. కొందరు విశ్వవిఖ్యాతులు మాత్రమే దిగువపేర్కొనబడిరి :

యోహాన్ గూటెన్‌బెర్గ్ (15 వ శతాబ్ది) : కదలించు టైపులు కలిగిన ముద్రా యంత్రమును తొలుత కనుగొనినవాడు; మార్టిన్ లూథర్ (1483-1546); పోపును ధిక్కరించి క్రైస్తవమతమున ప్రొటెస్టెంట్ సంప్రదాయమునకు శ్రీకారము చుట్టినవాడు. జాన్ వుల్ఫ్‌గాంగ్ ఫాన్ గెటే (1749-1832) : జర్మన్ సాహిత్యమున పేరుగనిన మహాకవి; ఈతని రచనలు పలు ప్రపంచ భాషలందు అనూదితములు; కార్ల్‌ఫిలిప్ ఎమాన్యూల్ బాక్ (1714-88) : ప్రసిద్ధ వాగ్గేయకారుడు; క్రిస్టోఫ్ విల్లిబాల్డ్ ఫాన్ గ్లూక్ ( 1714 - 87 ) ఇంకొక ప్రసిద్ధ వాగ్గేయకారుడు; లుడ్విగ్ ఫాన్ బీతోవెన్ (1770-1827) : బధిరుడయ్యు మధుర సంస్వనములను (సింఫనీలను) ప్రసాదించి పాశ్చాత్య

సంగీతమునకు ఉదాత్తతను చేకూర్చిన ప్రజ్ఞాశాలి; కడమ వాగ్గేయకారులలో రిచర్డు వాగ్నర్ (1813-83); యోహానేస్ బ్రామ్స్ (1833-97) ప్రముఖులు.

**తత్వశాస్త్రజ్ఞులలో** గాట్‌ఫ్రీడ్ విల్‌హెల్మ్ లీబ్నిజ్ (1646-1716); ఇమాన్యూల్ కాంట్ (1724-1804); జార్జ్ విల్‌హెల్మ్ ఫ్రెడెరిక్ హెగెల్ (1770-1831); ఆర్థర్ షోపెన్‌హార్ (1804-72); ఫ్రెడెరిక్ విల్‌హెల్మ్ నీషి (1844-1900) విశ్వవిఖ్యాతిని ఆర్జించిరి.

చిత్రకళా విశారదులలో ఆల్‌బ్రెక్ట్ డీరరు (1471-1528) గణనీయుడు.

వైజ్ఞానికులలో ఎక్స్‌కిరణములను కనుగొనిన విల్‌హెల్మ్ కోన్‌రాడ్ రాంజెన్ (1845-1923), సాపేక్ష సిద్ధాంత ఆవిష్కర్త ఆల్‌బర్ట్ ఐన్‌స్టీన్ (1879-1955) ప్రపంచ వైజ్ఞానికుల కందరికి మాననీయులుగ లెక్కకు వచ్చినవారు (ఇందు రెండవవాడు తన ఉత్తరవయఃకాలమున యు. స్టే. పౌరస్వత్వమును స్వీకరించెను.)

రాజనీతి చరిత్రలో పేరుగనినవారిలో జర్మనీ ఏకీకరణను సాధించిన లియోపాల్డ్ ఫాన్ బిస్మార్క్ (1815-98); ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ప్రధానిగఉండి దేశమును పునర్నిర్మించిన కోన్‌రాడ్ అడెనోయిర్ (1876-1967) పేర్కొనదగినవారు.

జర్మన్ జాతిలో సామ్రాజ్య దురహంకారమును రేకెత్తించి, రెండవ ప్రపంచ యుద్ధమునకే కారణభూతుడై, ప్రపంచ చరిత్రగతినే మార్చివేసి, తుదకు విఫల మనోరథుడై ఆత్మహత్యకు లోనైన వాడు నియంతయగు అడాల్ఫ్ హిట్లర్ (1889-1945).

---

# 10. జెకోస్లోవాకియా

**ముఖ్యనగరము :** ప్రేగ్ (ప్రాహా); **జెండా :** ఎఱ్ఱ అడ్డుచారపై అమరిన తెలుపు అడ్డుచారయు, దండమువద్దనుండి ఈ చారలలోని మధ్యబిందువు వరకు త్రోసికొనివచ్చిన నీలపు త్రిభుజమును కలది; **జాతీయ గీతము :** దేశపు ప్రముఖజాతులగు జెక్కుల 'క్డే దోమోవ్ మూజ్' (నా మాతృభూమి ఎచట) అను గీతమును, స్లోవాకుల 'నద్ తత్రౌ స బ్లిస్కా' (తత్రాపై తుపాను రేగినది)అను గీతమును ఒకదానివెనుక మరియొకటి అమరియుండునది. **నాణెము :** కొరూనా; ఇది 100 హలేజూలుగ విభక్తము; ఒక కొరూనా = రు. 1.04; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి :** ఈ దేశమున జెక్కుల మాతృభూమియు, స్లోవాకుల మాతృభూమియగు స్లోవాకియాయు చేరియుండుటవలన ఈ దేశము జెకోస్లోవాకియా అని వ్యవహృతము. అన్నిదిక్కులందును, భూపరివృతమై 47°44′ నుండి 51°03 ఉ. అక్షాంశరేఖలవరకును; 12°5′ నుండి 22°34′ తూ. తు. రేఖలవరకు విస్తరించిన యీ రాజ్యమునకు పశ్చిమ, వాయవ్యములందు పశ్చిమ, తూర్పు జర్మనీలు; ఈశాన్యమున పోలండు; తూర్పున సోవియెట్ రష్యా; దక్షిణ, ఆగ్నేయములందు హంగరీ సరిహద్దులందు ఉన్నవి. దేశపు తూర్పు పడమరల గరిష్ఠపు నిడివి 674 కిమీ.; ఉత్తర దక్షిణముల గరిష్ఠపు కొలత 276 కిమీ. దేశ వైశాల్యము 1,28,000 చ. కిమీ. దేశపు సరిహద్దుల

చుట్టుకొలత 3,472 కిమీ. దేశము చిన్నదైనను ప్రకృతి వైవిధ్యము ఎక్కువ. ఎడారి, చిట్టడవి, సముద్రతీరముతప్ప తక్కిన అన్నివిధముల ప్రకృతి దృశ్యములు తమ దేశమున కలవని ఆ దేశీయులు అనెదరు. మొత్తము 93 పర్వత శ్రేణులు, 19 పెద్ద నదులు; సరస్సులు, తటాకములు కలసి 2,220; పాతాళగంగలు (ఊటపట్టులు) 900; 45 లక్షల హెక్టేరుల సాంద్రాటవి దేశమున కలదని లెక్కలవలన తెలియుచున్నది. కాని పర్వత శ్రేణులందెల్ల గొప్పదియగు తత్రా పర్వతశ్రేణి




పటము 11.

యందలి అత్యున్నత శిఖరపు ఎత్తు 2,656 మీ. మాత్రమే. స్లోవాకియాలోని డాన్యూబ్‌నది, జెక్ భూమిలోని ఎల్బ్, మాల్డావ్, ఓడర్ నదులు నదులలో ప్రముఖములు; ఇవి ఈ దేశమున కొలది దూరము మాత్రమే ప్రవహించి, ఆ తరువాత ఇతర ప్రాంతములద్వారా సముద్రములను చేరుచున్నవి. ఆరిపోయిన అగ్నిపర్వతములు దేశమున కననగును.

**2. శీతోష్ణస్థితి మొ.:** మధ్య యూరపు నందలి శీతోష్ణస్థితియే ఇచట ఉన్నను, ప్రకృతి వైవిధ్యమునుబట్టి అందు మార్పులు కననగుచున్నవి. ఉన్నతమగు తత్రా పర్వతభూమియందు చలికాలమున ఉష్ణత 38.6° ఫా. వరకు పడిపోవును. దక్షిణమునఉన్న స్తురోవో నగరమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 50.7 ఫా. వరకు పోవును. తత్రా పర్వతములందు అత్యధిక వర్షపాతము కలదు. మొత్తముమీద ప్రాంతములనుబట్టి సాలీనా వర్షపాతము 55 సెం. మీ. నుండి 125 సెం. మీ. వరకు మారుచుండును. దక్షిణ మొరేవియాలోను, పశ్చిమ బొహీమియాలోను వర్షపాతము 57.5 సెం. మీ. లోపుగనే ఉండును. అడవులలో, సూచ్యగ్రజాతి వృక్షములు 85% వరకు బొహీమియాలోను, 62% వరకు మొరేవియా-శైలీసియాలలోను, 31% వరకు స్లోవాకియాలోను కలవు. గోదుమవర్ణపు ఎలుగుబంట్లు, తోడేళ్ళు, గుంటనక్కలు మొదలగునవి మాత్రమే పెద్ద వన్యజంతువులు. వైవిధ్యముకల పక్షిసంతతి కలదు; నదులు మత్స్య సంపదకు పేరొందినవి.

**3. జనసంఖ్య మొ.:** 1972 సం. లెక్కలను బట్టి ఈ దేశపు జనసంఖ్య 1,44,81,304. ఇందు జెక్కు ప్రాంతమునకు (బొహీమియా, మొరేవియా, శైలీసియాలకు) చెందినవారు 98,79,481 మంది; స్లోవాకియా ప్రాంతమునకు చెందినవారు 46,01,823. దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 113. పట్టణములలో ప్రేగ్ (జ.సం. 10,82,015), బ్రనో (3,38,272), స్లోవాకియాకు ముఖ్యనగరమగు బ్రాటిస్లావా (2,91,144), ఓస్ట్రావా (2,83,531), పిల్సెన్ (1,49,366), కోశిసీ (1,52,054) ప్రముఖములు. దేశమున జనావాసముల మొత్తపు సంఖ్య 10,665; వీనిలో నగరములు 221. ప్రజలలో జెక్కులు 65%, స్లోవాకులు 29,2%; వీరుగాక హంగేరియన్, జర్మన్, పోలిష్, రషియన్ మొదలగు వారలు 5.8%. జెక్కులకు జెక్‌భాషయు, స్లోవాకులకు స్లోవాకు భాషయు మాతృభాషలు; ఇవి ఒకే భాషా కుటుంబమునకు చెందినవియై, అతి సాన్నిహిత్యము కలిగి యున్నవి. అందువలన ఒక భాషను ఎరిగినవాడు రెండవదానిని చాలవరకు అర్థము చేసికొనగలడు. ఈ రెండు భాషలును సాధికార భాషలుగ పరిగణ

నను పొందినవి. జర్మన్, హంగేరియన్ భాషలతో పలువురకు సుపరిచితి కలదు. 75% ప్రజలు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవమునకు చెందినవారు; తక్కినవారిలో ప్రొటెస్టంటు, రషియన్ ఆర్థడాక్స్ క్రైస్తవులు చాలవరకు కలరు. యూదులును అల్పసంఖ్యలో కలరు. మత స్వాతంత్ర్యము రాజ్యాంగ విధానముద్వారా కల్పింపబడి, మత పీఠములు రద్దుచేయబడినవి. ప్రస్తుతపు కమ్యూనిస్టు ప్రభుత్వము మతసంస్థలపై అధికారమును కలిగి, వానిని ప్రజాశ్రేయమునకై వినియోగించుచున్నది.

**4. సమాచార సౌ.:** తపాలా, తంతి, టెలిఫోను సౌకర్యములు విరివిగ కలవు. టెలిఫోనుల సంఖ్య 2,232 వేలు (1972); 93 బ్రాడ్ కాస్టింగు స్టేషనులు, 32 టెలివిజన్ స్టేషనులు కలవు. 4.5 మందికి ఒక టెలివిజన్ సెట్టు, 4.6 మందికి ఒక రేడియోసెట్టు కలవు. విదేశీయులకొరకై 10 భాషలలో రేడియో ప్రసారములు జరుగుచున్నవి (1972).

**5. యాన సౌ.:** దేశమున రోడ్లనిడివి 73.3 వేల కిమీ. రైలురోడ్ల నిడివి 13,299 కిమీ.; ఇందులో 2,789 కిమీ. జంట మార్గము; 2,631 కిమీ. లలో బండ్లు విద్యుత్సహాయమున నడచుచున్నవి. నదీ మార్గమున 3,866 కిమీ.ల వరకు నౌకాయాన సౌకర్యము కలదు. పశ్చిమ జర్మనీయందలి ఎల్బీనదీ ముఖద్వారపు హాంబర్గ్ రేవునను, ఓడర్ నదీ ముఖమున పోలండునకుచెందిన షెజెసిన్ రేవునను, ఈ దేశమునకు సముద్ర వ్యాపారమునకై స్వేచ్ఛామండలములు కలవు. డాన్యూబ్ నదిద్వారా జరుగు వ్యాపారమునకు నల్లసముద్రపు రేవులలో సౌకర్యములు కలవు. సముద్ర వ్యాపారపు నౌకలు 11 ఈ దేశమునకు కలవు. వీని మొత్తపు టన్నేజి 115,000. ప్రేగ్ నగరమునకు సమీపమునఉన్న రుజైనీ విమానాశ్రయము, అంతర్జాతీయ విమానయానమునకు ఉపకరించుచున్నది. విదేశములకే గాక, దేశాంతర్గతపు పలుతావులమధ్యను విమానయానపు వసతులు కలవు. దేశీయమగు విమానయానసంస్థ కలదు. విదేశీయ విమానయాన సంస్థలకు సేవావసతులు రుజైనీయందు విరివిగ కలవు (1972).

**6. చరిత్ర :** ఈ దేశమున జెక్కులు మాతృభూమియగు జెక్ ప్రాంతమును, స్లోవాకుల మాతృభూమియగు స్లోవాకియాయును వేర్వేరు చారిత్రక గతులకు లోనైనను, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఏకరాజ్యముగ ఉభయ ప్రాంతముల సమ్మతితో రూపొందినవి.

జెక్ ప్రాంతపు చరిత్ర 5 వ శతాబ్దినుండి తెలియవచ్చుచున్నది 7 వ శతాబ్దిలో ఇట ఒక దేశీయరాజ్యము ఏర్పడినను అది 10 వ శతాబ్దమున అంతరించినది. ఈ మధ్యకాలమున ఆ ప్రాంతమున క్రైస్తవమతము వ్యాపించినది. 14 వ శతాబ్దిలో లక్జెంబర్గు రాజవంశము అట ఒక రాచరికమును స్థాపించినది. ఆ వంశీయుడగు చార్లెస్ IV పవిత్ర రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తిగ ఎన్నుకొనబడెను. ఆ కాలమున ప్రేగ్ నగరము, మధ్యయుగపు నగరములలో ప్రముఖముగ రాణకెక్కెను. అపుడే (1328) అట ఒక విశ్వవిద్యాలయము స్థాపితమైనది. 15 వ శతాబ్ది ఆరంభమున జాన్ హస్ అను సంస్కర్త పోపును ధిక్కరించి మత సంస్కరణకై పూనుకొనగ, అతడు మతాధికారులచే శిక్ష విధింపబడి, సజీవముగ దహనము చేయబడెను. కాని తదనంతరమున హస్ భావములు ప్రజలలో, అందును ముఖ్యముగ పేద ప్రజలలో, విరివిగ వ్యాపించి, తిరుగుబాటులకు దారితీసినవి. 16 వ శతాబ్దిలో, ఆస్ట్రియా-హంగరీ చక్రవర్తి ఈ ప్రాంతమును వశపరచుకొనెను. అంతకు

పూర్వముకనే 10వ శతాబ్దినుండి స్లోవాకియా ప్రాంతము హంగరీ ప్రభువుల వశమున ఉండినది. 19వ శతాబ్దిలో ఈ ఉభయ జాతులును స్వాతంత్ర్యమునకై ఆందోళన సాగించినవి. కడకు 20వ శతాబ్దిలో ప్రథమ ప్రపంచయుద్ధానంతరమున 1918, అక్టోబరు 28న ఈ జాతులు స్వాతంత్ర మొంది, జెకోస్లోవాకియా అను ఏకరాజ్యముగ రూపొందినవి. జర్మనీలో హిట్లర్ ఆధిపత్యమునకు వచ్చి, నాజీవాదము ప్రబలిన తరువాత, ఆ దేశము 1938 లో, జెకోస్లొవియాను బలవంతముగ ఒప్పించి, సుడెటన్‌లాండ్ అను ప్రాంతమును వశపరచుకొని, కడకు 1939, మార్చి 15న దేశము నంతటిని వశరచుకొనినది. ఆరేండ్ల నాజీ పరిపాలనా కాలమున దేశము తీవ్ర నష్టములకు గురియైనది. దేశీయుల స్వాతంత్ర్యాకాంక్షను అడచుటకు నాజీలు అనేక దురాగతములను చేసిరి. కడకు ద్వితీయ ప్రపంచ యుద్ధపు కడపటి దినములలో సోవియెట్ సేనల సాయమున దేశము విముక్తమై స్వతంత్రమైనది. కాని ఒక ఒడంబడికను అనుసరించి దేశపు తూర్పుకొననఉన్న కార్పతో-రుతీనియా ప్రాంతము సోవియెట్ రష్యాకు దత్తము చేయబడినది. తొలుత కమ్యూనిస్టు పార్టీయు తక్కిన పార్టీలును కలిసి ఒక ప్రభుత్వమును ఏర్పరచినను, 1946 న జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ బలవత్తరమై, ఉప్పటి అధ్యక్షుడగు బెనెస్‌ను కాదని, రక్తపాతములేకుండ ఆధికారమును అంతటిని కైవసము చేసికొనినది. 1960 లో కమ్యూనిస్టు పద్ధతిన రాజ్యాంగ విధానము దేశమున ప్రవేశపెట్టబడి ప్రస్తుతమున అమలున ఉన్నది.

**7. పరిపాలన :** శాసన నిర్మాణాధికారము సమాఖ్యా శాసనసభయందు కలదు; ఇందు ప్రజాసభ, జాతిసభ అను రెండు కక్ష్యలు కలవు. మొదటిదానిలోని సభ్యసంఖ్య 200; జనసంఖ్యను అనుసరించి, నియోజకవర్గములద్వారా, వీరు ఎన్నుకొనబడెదరు. జాతి సభలో 150 మంది సభ్యులు కలరు. ఇందు జెక్కులకును, స్లోవాకులకును సమాన సంఖ్యలో సభ్యత్వము కలదు. 18 ఏండ్లకు తగ్గని వయసుగల పౌరులకు వోటుహక్కు కలదు. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును. ఆ పట్టికను కమ్యూనిస్టుపార్టీ తయారుచేయును. సమాఖ్యా శాసనసభా సభ్యులచే అధ్యక్షుడు ఎన్నుకొనబడును. ప్రధానిని, ఇతర మంత్రివర్గసభ్యులను నియమించి, రాజ్యాంగపు అధినేతగ అతడు వ్యవహరించును. జెక్కు ప్రాంతమునకును, స్లోవాకియాకును వేర్వేరుగ స్థానిక గణరాజ్య ప్రభుత్వములు కలవు. స్థానిక విషయములందు వానికి అధికారములు కలవు. దేశమున అయిదు రాజకీయ పక్షములు – కమ్యూనిస్ట్, పీపుల్స్, స్లోవాక్ పునర్నిర్మాణ, స్లోవాక్ స్వాతంత్ర్య, సోషలిస్టు పక్షములు – ఉన్నను కమ్యూనిస్ట్ పార్టీదే పైచేయి. తక్కిన పక్షములు కమ్యూనిస్ట్‌పార్టీయొక్క సౌహార్ద భావనపై ఆధారపడి ఉన్నవి. మండలములందును ఎన్నుకొనబడిన స్థానిక సమితులు పనిచేయుచు, స్థానిక సౌకర్యములపట్ల శ్రద్ధవహించుచున్నవి. సమాఖ్యా శాసనసభయే సుప్రీమ్‌కోర్టు జడ్జీలను ఎన్నుకొనును; స్థానిక సంస్థలు స్థానిక జడ్జీలను ఎన్నుకొనును. సామ్యవాదమునెడ భక్తిశ్రద్ధాయుత ఆచరణయే న్యాయశాస్త్రపు మూలసూత్రము.

**8. దేశరక్షణ :** 17 నుండి 60 ఏండ్లవరకు వయసుగల పౌరులు, ప్రభుత్వము కోరినపుడు, విధిగ సేనలో చేరవలయునను శాసనము అమలున ఉన్నది. ఒక ఒడంబడికద్వారా సైన్యపు శిక్షణయంతయు సోవియెట్ పద్ధతిని అనుసరించునటుల ఏర్పాటై, సోవియెట్ సేనలతో ఈ సేనలు సహకరించవలయునను నియమము కలదు. భూతల సేనలోని సైనికసంఖ్య 185 వేలు; ఇందు పది పటాలములు కలవు. వాయుసేనయందు యోధ

సంఖ్య 55,000; పోరాట విమానముల సంఖ్య 600 (1969).

**9. అంతర్జాతీయ సం. :** 1945 నుండి ఈ దేశమునకు ఐ. రా. స. యందును, కొన్ని ప్రముఖ ప్రత్యేక అనుబంధ సంస్థలందును సభ్యత్వముకలదు. కమ్యూనిస్ట్ రాజ్యముల ఆర్థికాభివృద్ధి సంఘము (CEMA) లోను, వార్సా ఒడంబడికయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము ఉన్నది. తూర్పు యూరపీయ రాజ్యములలో పెక్కింటి పారిశ్రామికీకరణకు ఈ దేశము సాయము చేసినది. ఐ. రా. సాంకేతిక సహాయసమితిలో సభ్యత్వమువలన, బడుగుదేశములలో పెక్కింటికి ప్రవీణులను, యంత్రసామగ్రిని, పరికరములను, విద్యార్థి వేతనములను ఇచ్చి ఈ దేశము సాయము చేయుచున్నది.

**10. ఆర్థిక రంగము :** ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వముననే పారిశ్రామికముగను, వ్యావసాయికముగను పురోగతిని సాధించిన యూరపీయ దేశములలో ఒకటిగ ఈ దేశము పేరుపొందినది. కాని నాజీ ఆక్రమణవలన దేశము చాలవరకు పేదవడి, పారిశ్రామిక, వ్యావసాయికోత్పత్తులు రెండును సగమునకు పడిపోయినవి. 1945 తరువాత దేశమును పునర్నిర్మించు కృషిమొదలై ద్రుతగతిన సాగినది. ద్వివార్షిక, పంచవార్షిక ప్రణాళికల మూలమున క్రమపద్ధతిలో దేశమున పునర్వికసము సాధితమై, యుద్ధపూర్వపు ప్రమాణములను అన్ని రంగములందు దేశము అధిగమించినది. దేశమున మొత్తపు వ్యావసాయికభూమి 7,077 వేల హెక్టేరులు; ఇందు 591 వేల హె. మాత్రమే ప్రయివేటు వ్యక్తుల ఆధీనమున ఉన్నది; తక్కినది అంతయు సమష్టి వ్యవసాయమునను, సహకార వ్యవసాయమునను ఉన్నది. 1,017 వేల మంది ప్రజలు వ్యవసాయ రంగమున కృషిచేయుచున్నారు. వ్యావసాయికోత్పత్తులలో గోధుమ, బార్లీ, రై, మొక్కజొన్న, ఉరలగడ్డ, చక్కెరదుంప ప్రముఖములు. యుద్ధమునకు పూర్వముకన్న 19.5% అధికోత్పత్తి జరుగుచున్నది, దేశావసరములకు ఈ ఉత్పత్తి చాలని కారణమున, ఆహార వస్తువులను కొంతవరకు దేశము దిగుమతి చేసికొనుచున్నది (1972). అటవీ భూమి వైశాల్యము 44.55,350 హె., ఇందు దాదాపు 80% ప్రభుత్వాధీనమున ఉన్నది. కలప ఉత్పత్తి 15,397 వేల ఘ. మీ. పశుసంపద విరివిగ కలదు. వేలలో గోజాతి 4,466; పందులు 6,093; గొఱ్ఱెలు 889; గుర్రములు 100; కోళ్లు 39,170 కలవు. ఖనిజ సంపత్తి అంత విరివిగ లేకున్నను, ఉన్నవానిలో బొగ్గు, యాంటిమనీ, పాదరసము, యురేనియము, గ్రాఫైటు, కయోలిన్, గాజుయిసుక, సున్నపురాయి, వెండి, మెగ్నీజియం, పైరైట్ పేర్కొనదగినవి. వీనిలో కొన్ని దేశావసరములకు తగినంతగ ఉన్నవి. పారిశ్రామికరంగము సంపూర్ణముగ జాతీయము చేయబడినది. పరిశ్రమలను దేశమంతట అన్నిభాగములందు క్రమరీతిలో నెలకొల్పి ఏ భాగమును వెనుకబడినదిగ లేకుండచేయుట ప్రస్తుత ప్రభుత్వపు లక్ష్యము. ఇందువలన స్లోవాకియాయు జెక్ ప్రాంతముతో పాటుగ అభివృద్ధిలోనికి రాగలిగినది. జాతీయాదాయమున పరిశ్రమలవలన 60.5%, నిర్మాణ కృషివలన 12.2%, వ్యవసాయమువలన 10%, తక్కిన కృషులవలన 17.8% లభించుచున్నవి. దేశపు మొత్తపు కార్మిక శక్తియగు 8,686 వేలలో 2,758 వేలు పరిశ్రమలందు వినియుక్తము. ఖనిజోత్పత్తి, ఉక్కు, రసాయనిక, రబ్బరు, ఇంజనీరింగు, నిర్మాణ పరికర, గ్లాసు, జవుళి, బూట్ల పరిశ్రమలందు దేశము ఎంతయో పురోగతిని సాధించినది. దేశపు ఎగుమతులలో 50% ఇంజనీరింగు ఉత్పత్తులు. వానిలో యంత్ర పరికరములు, ట్రాక్టరులు, కార్లు ప్రముఖములు. వ్యాపారమున అత్యధికభాగము కమ్యూనిస్ట్ దేశములతో (ఎగుమతులలో 70%, దిగుమతులలో

72%) సాగుచున్నది. దిగుమతులలో ఇంధన సామగ్రి, ముడిపదార్థములు ప్రముఖములు. పారిశ్రామికముగ, ఇండియావంటి వర్ధమాన దేశములు అభివృద్ధి చెందుటకు ఈ దేశము ఎంతో సాయపడు చున్నది. దేశమున విద్యుదుత్పత్తి 3,288.3 కోట్ల కివా. (1972). దేశపు ఎగుమతుల విలువ 6,350 కోట్ల కొరూనాలు; దిగుమతుల విలువ 3,091.2 కోట్ల కొ. (1972). బడ్జెటరీ వ్యయము 21,263.2 కోట్ల కొ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున కార్మిక రంగము సువ్యవస్థితము; వారమున 40 గంటలు (అయిదు దినములు) మాత్రమే పనికాలము; ఆరోగ్యవసతులు, ఉచిత విద్యా సౌకర్యములు, మాతృత్వ సహాయము, వార్ధక్యభృతి మొదలగు సౌకర్యములను ప్రభుత్వము కార్మికులకు కలుగజేయుచున్నది. కార్మికుల బిడ్డలకు ప్రత్యేక సహాయ భృతి వసతులు కలవు. ఇట్టి భృతులకై సాలున 2,844.2 కోట్ల కొరూనాలను ప్రభుత్వము వెచ్చించుచున్నది (1972). గృహవసతి సౌకర్యమును ప్రతికుటుంబమునకును కలుగజేయుటలో ప్రభుత్వము నిరంతరకృషిని సాగించుచున్నది. ఏటేటా క్రొత్త ఇండ్ల నిర్మాణము అభివృద్ధి అగుచు, 1971 లో 29,551 క్రొత్త ఇండ్లు నిర్మితములైనవి. ప్రభుత్వపు సర్వాధిపత్యమున విద్యా విధానము కొనసాగుచున్నది. 5 నుండి 15 ఏండ్లవరకు వయసు కలిగినవారు విధిగ పాఠశాలలలో 9 సంవత్సరములు విద్యను అభ్యసించవలెను. ఉచితముగ విద్య బోధింపబడుటయేగాక, పాఠ్య గ్రంథములను, బోధనకు కావలసిన పరికరములను ప్రభుత్వమే విద్యార్థులకు ఇచ్చును. ఆ తరువాత స్థాయిలో మాధ్యమిక పాఠశాలలును వృత్తి విద్యాశాలలును కలవు. 10,831 ప్రాథమిక పాఠశాలలలో 19,66,448 మంది; 343 మాధ్యమిక పాఠశాలలలో 1,10,038 మంది; 706 వృత్తి విద్యాశాలలలో 2,86,407 మంది విద్యార్థులు కలరు (1970-71). ఇవిగాక ఉన్నత విద్యను బోధించు యూనివర్సిటీలును, ఉన్నత విద్యా సంస్థలును కలవు. వాని మొత్తపు సంఖ్య 37. దేశమందలి 6 యూనివర్సిటీలలో ప్రేగ్‌లో 1303 న స్థాపింపబడిన చార్లెస్ యూనివర్సిటీ అతి సనాతనము; విదేశీయ విద్యార్థులకై '17 నవంబరు యూనివర్సిటీ' అనునది ప్రేగ్‌లో సంస్థాపితమైనది. జర్మన్‌లు, 17 నవంబరు, 1939 న ఈ దేశమునందలి విద్యాలయములను మూసివేసిన దురంతమునకు స్మారకముగ ఇది స్థాపితము. ఉన్నత విద్యా సంస్థలలోను, యూనివర్సిటీలలోను పఠించు విద్యార్థి సంఖ్య 21 997 (1971-72). దేశమున 10,937 గ్రంథాలయములు కలవు. అందు ప్రేగ్‌లోని జాతీయ గ్రంథాలయము, స్లోవాకియాలో మార్టిన్ నగరమున ఉన్న స్లోవాక్ జాతీయ గ్రంథాలయము ప్రముఖములు. దేశమునందలి 262 మ్యూజియములలో ప్రేగులోని జాతీయ మ్యూజియం, జాతీయ చిత్రాగారము పేరునకెక్కినవి. దినపత్రికల మొత్తపు సంఖ్య 28. పత్రికా స్వాతంత్ర్యము చట్టరీత్యా కల్పింపబడినను, పత్రికలు అన్నియు ప్రభుత్వ పంథానే ఎల్లపుడు బలపరచును. వానిలో 'రూదీ ప్రావో' అనునది అత్యధిక ప్రచారము కలిగి యున్నది; ఇది కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యవమున ప్రచురితము. దేశమున 1,15,322 శయ్యలు కలిగిన 247 ఆసుపత్రులును; 7,408 శయ్యలు గల 32 క్షయాసుపత్రులును కలవు. వైద్యము ఉచితముగ చేయబడుచున్నది. వైద్యసంఖ్య 35,832 (1972).

**12. యాత్రా సౌ. :** దేశమున పర్యటించు విదేశీయులకు అందరికిని పాస్‌పోర్టు, వీసాలు విధిగ ఉండితీరవలయును. దేశమునందలి ప్రాచీన నగరములును, ప్రాచీన రాజభవనములును, ప్రకృతి వైవిధ్యపు రమణీయతయు విదేశీయ యాత్రికులను ఆకర్షించుచున్నవి. యాత్రికులకొరకై ప్రభుత్వము

తగు వసతులను ఏర్పరచినది. 1972 లో దేశమును 5,499 వేల విదేశీయులు దర్శించిరి; అటులే ఈ దేశమునుండి విదేశములను దర్శించుటకై 2,323 వేల మంది పయనించిరి.

**13.** **ప్రసిద్ధ పౌరులు :** ఈ దేశీయులలో చారిత్రక ఖ్యాతిని ఆర్జించిన ప్రముఖుడు జాన్‌హస్ (1369 ?-1415); మత సంస్కరణకై, ఇతడు పోరాటమును సాగించి, తత్ఫలితముగ కొఱతన కాల్చబడెను; తామస్ జి. మాసరిక్ (1850-1937): ఆధునిక జెకోస్లొవాకియాను నిర్మించిన రాజనీతి వేత్త, తాత్త్వికుడు; ఎడ్వర్డ్ బెనిస్ (1887-1948): మాసరిక్‌తో సహకరించి, దేశమున గణరాజ్యమును ఏర్పరచి విదేశాంగమంత్రిగ, ప్రధానిగ, అధ్యక్షుడుగ అంతటంతట పనిచేసిన ప్రముఖుడు; జరోస్లావ్ హెయ్‌రోవిస్కీ (1890-1967); పదార్థ విశ్లేషణకు ఉపయోగించు విద్యుద్రాసాయనిక పద్ధతిని కనుగొని, నోబెల్ బహుమతిని 1959 లో గ్రహించెను.

---

# 11. డెన్మార్క్

**ముఖ్యనగరము :** కోపెన్ హేగన్; **జెండా :** ప్రపంచపు జాతీయ పతాకములందెల్ల ప్రాచీనతమమగు ఈ పతాకము మధ్యయుగములందు రూపుగొని అటనుండి మార్పులేకుండ ఉన్నది. అడ్డ భుజము కుడివైపునకు ఎక్కువగ పొడుగుసాగిన తెల్లని సిలువ, ఎఱ్ఱని భూమికపై, ఇందు అమరియుండును. **జాతీయ గీతము :** రెండు జాతీయ గీతములు కలవు; అందొకటి 'కాంగ్ క్రిస్టియన్ స్టోద్‌వేద్ హోజెన్ మాస్ట్' (రాజగు క్రిస్టియన్ నౌకా స్తంభమును ఆని ధీరతతో నిలబడెను); రెండవది 'దేర్ ఎర్ ఎట్ ఇండిక్ట్ లాండ్' (అదే ఒక రమ్యభూమి ఉన్నది); **నాణెము :** క్రోన్; ఇది 100 ఓరులుగ విభక్తము; ఒక క్రోన్ = రు. 1 00; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5. గం. 30 ని.

**1.** **ఉనికి మొ. :** ఈ దేశమున జట్‌లాండ్, ఫారో దీవులు, గ్రీన్‌లాండు ద్వీపము అనునవి ప్రాదేశికముగ సాన్నిహిత్యము లేకున్నను రాజ్యాంగ రీత్యా చేరిఉన్నవి. ఇందు జట్‌లాండు, యూరపు ఖండ ముఖ్య భూభాగమున, ఈశాన్య ప్రాంతమున ఉన్న ఒక ద్వీపకల్పము; దీనికి అతి సన్నిహితముగ సముద్రమున అటనట చెదరియున్న 500 అల్పద్వీపములు కలవు. (ఈ దీవులలో, షెల్లాండ్ అనెడు ద్వీపముపై దేశపు ముఖ్యనగరమగు కోపెన్ హేగన్ ఉన్నది); ద్వీపకల్పమునకు అతిదూరమున ఉత్తర అట్లాంటిక్ సముద్రమున, ఆర్కిటిక్ సముద్రపు చేరువన గ్రీన్‌లాండ్, ఫారో దీవులు కలవు. జట్‌లాండ్ ద్వీపకల్పమునకు దక్షిణమున, పశ్చిమ జర్మనీతో 68 కిమీ. నిడివిన మాత్రమే భూతలపు సరిహద్దు కలదు; తక్కిన అన్నివైపులను - ఉత్తరమున స్కగెర్రాక్ సముద్రము; తూర్పున కట్టెగాట్, ఓరిసుంద్, బాల్టిక్ సముద్రములు; పశ్చిమమున నార్త్ సముద్రము అనెడు - సముద్రములు కలవు. ద్వీపకల్పము 8°4′-15°12′ తూర్పు తులారేఖల మధ్య (400 కిమీ.) ను, 54°33′-57°45 ఉ. అ. రేఖల మధ్య (352 కిమీ.) ను వ్యాపించి యున్నది. ద్వీపకల్పపు వైశాల్యము 30,095 చ. కిమీ.

తక్కిన ద్వీపములతో కలసి ద్వీపకల్పపు వైశాల్యము 43,069 చ. కిమీ; ఇదిగాక ఫారోస్ దీవుల వైశాల్యము 1,399 చ. కిమీ; గ్రీన్‌లాండ్ వైశాల్యము 21,75,600 చ. కిమీ.

సముద్ర మట్టముపై దేశపు సరాసరి ఎత్తు 30 మీ. మాత్రమే. దేశపు అత్యున్నత స్థలపు ఎత్తు 172 మీటరులను మించదు. సముద్ర తీరమునకు సమీపమునందలి కొన్ని ప్రదేశములు సముద్రపు మట్టమునకు తగ్గి ఉండుటవలన, వానిని సముద్రపు పోటునుండి కాపాడుటకు తీరపు పొడవున గోడలు, అట్టి తావులందు, నిర్మింపబడినవి. భూతలమున చిన్నచిన్న గుట్టలు, గడ్డిభూములు, పశ్చిమ తీరప్రాంతమున చిత్తడి నేలలు కన్పట్టును. చిన్న చిన్న నదులు అనేకములు కలవు; దేశమధ్యపు సముద్రములు (ఉప్పునీటి మడుగులు)ను అటనట కలవు. సముద్రము పలు ప్రాంతములందు తీరములోనికి చొచ్చుకొని వచ్చుటవలన సహజసిద్ధములగు పెక్కు హార్బరులు ఏర్పడినవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశమున సమశీతోష్ణస్థితి కననగును. పగటికిని రాత్రికిని మధ్యగల ఉష్ణ వ్యత్యాసము చాల తక్కువ; అయినను వాయు గమనదిశ ఒక్కొకపుడు అకస్మాత్తుగ మారుట వలన దైనందిన శీతోష్ణస్థితులందును విపరీతపు మార్పులు సంభవించుట అంతటంతట కలదు. సంవత్సరము పొడవున, అంతటంతట, దాదాపుగ ఒకే రీతిలో వానలు పడుచుండును. సాలీనా సరాసరి వర్షపాతము 36 సెం. మీ. మధ్య యూరపున కననగు వృక్ష, జంతు సంతతులే ఇచటకూడ కలవు. వన్యజంతువులు ఏవియు కన్పట్టవు. వివిధ పక్షిసంతతులున్నను, శిశిర, హేమంతములలో అవి ఉష్ణదేశములకు తరలిపోయి, తక్కిన ఋతువులందు ఇటకు వచ్చిచేరును. మత్స్య కీటక సంతతులు విరివిగ కలవు.

**3. జనసంఖ్య మొ. :** 1970 సం. లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 50,22,997; (ఇందు గ్రీన్‌లాండు దీవియందలి జనసంఖ్య 46,532; ఫారోస్ దీవుల జనసంఖ్య 36,681 చేరియున్నవి) ద్వీపకల్ప, తత్పరిసర ద్వీపములకు సంబంధించినంతవరకు జనసాంద్రత చ. కిమీ. కు 116. నగరములలో కోపెన్‌హేగన్ (జ. సం. 8,02,226). ఓడెన్సే (1,37,288), ఆర్హస్ (1,90,000), ఆల్‌బర్గ్ (1,00,255) లెక్కింపదగినవి; దేశీయులందరు ఉత్తర యూరపీయజాతికి చెందినవారు జాతిరీత్యా ఏకరూపత ఈ దేశమున ఉన్నటుల వేరొక యూరపీయ దేశమున కన్పట్టదు. దేశీయుల మాతృభాష డేనిష్. ఇదియే సాధికార భాషయైనను దేశీయులలో పలువురకు ఇంగ్లీషు, జర్మన్ భాషలతో చాల పరిచితి కలదు. దేశమున చట్టరీత్యా మత స్వాతంత్ర్యము కలదు. 97% ప్రజలు లూథరన్ చర్చియను క్రైస్తవ సంప్రదాయమునకు చెందినవారు; దేశపాలకుడే ఈ మత వ్యవస్థకును పెద్ద. అత్యల్పసంఖ్యలలో రోమన్ కేథలిక్కులును, యూదులును, తదితరులును కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున 1,140 తపాలాఫీసులు కలవు (1971). టెలిఫోను వసతులు, బ్రాడ్‌కాస్టింగు, టెలివిజన్ సౌకర్యములు విరివిగ కలవు.

**5. యాన సౌ. :** దేశమున 61,630 కిమీ. ల పొడవున రోడ్లవసతి కలదు (1968). ఇవి చక్కగ నిర్వహింపబడుచున్నవి. కొన్ని తావులందు ద్వీపములను కలుపుచు వంతెనలును నిర్మింపబడినవి. 3 కిమీ. ల నిడివిగలిగిన స్టార్‌స్ట్రామ్ వంతెన, యూరపునందలి వంతెనలన్నింటిలో పొడవున మిన్న. రైలు మార్గముల పొడవు 2,890 కిమీ. (ఫారోస్, గ్రీన్‌లాండ్‌లలో రైలుమార్గములు లేవు) దేశమున చక్కని హార్బరులు ఉండుటవలన,

వర్తకనౌకా దళము విస్తృతముగ పెంపొందినది. దాని ప్రమాణము 38,58,023 టన్నులు; నౌకల సంఖ్య 3,239 (1972). ఇవిగాక ద్వీపముల మధ్య పయనించు పడవలు అనేకములు ఉన్నవి. కోపెన్‌హేగన్‌కు సమీపముననున్న కస్త్రూప్ విమానాశ్రయము అంతర్జాతీయ విమాన యానమునకు ఒక ప్రముఖ కేంద్రముగ ఉపకరించుచున్నది. దేశీయములగు విమానయాన సంస్థలును పనిచేయుచున్నవి.

**6. చరిత్ర:** క్రీ. శ. 10వ శతాబ్దినుండి మాత్రమే ఈ దేశపు చరిత్ర తెలియవచ్చుచున్నది. ఆర్యజాతికి చెందిన వైకింగులను సాహసికులు ఇట ఆ కాలమున ఒక రాజ్యమును నెలకొల్పిరి. ఆ రాజ్య పాలకులలో ఒకడగు హెరాల్డ్ బ్లూటూత్ (మ. 985) నార్వేను, అతని కుమారుడగు స్వెయిన్, ఇంగ్లండు దేశమును జయించిరి. కెన్యూట్ (1018–35) ప్రభుని రాజరికమున డెన్మార్క్, నార్వే, ఇంగ్లండులు ఏకరాజ్యముగ ఉండినవి. అతని అనంతరమున అవి విడివడినను, తరువాత జరిగిన రాజకీయ పరిణామములవలన కడకు 14వ శతాబ్దపు అంతమున డెన్మార్క్, నార్వే, స్వీడెన్ దేశములు ఏక రాజ్యముగ పరిణమించినవి. 1523లో ఈ ఏకత విచ్ఛిన్నమై స్వీడెన్ విడిపోయినను, డెన్మార్క్ నార్వేలు ఏకరాజ్యముగ 1814 వరకు ఉండినవి. నెపోలియన్ పతనానంతరమున యూరపున జరిగిన ఒడంబడికలను అనుసరించి నార్వే, డెన్మార్క్‌నుండి విడివడి, స్వతంత్ర రాజ్యమైనది. 17, 18వ శతాబ్దులలో, తక్కిన పశ్చిమ యూరపీయ జాతులతో పాటుగ, పాచ్య ఖండములకు, వ్యర్తక వ్యాపారములకై డేనులును కృషిచేసి, భారతదేశము మొదలగు వానియందు కొన్ని కేంద్రములను నెలకొల్పినను, తక్కినవారి పోటీకి ఆగజాలక, అటనుంటి వైదొలగిరి. 1848లో రష్యాతోసాగిన పోరాటముల ఫలితముగ దక్షిణపు సరిహద్దున ఉన్న మూడు రాష్ట్రములను ఈ దేశము పోగొట్టుకొనినది. తదాదిగ దేశము విదేశీయ రాజ్యములతో ఎట్టి ఘర్షణకు పోవక, దేశాభివృద్ధికై కృషిచేసి, పాడి పరిశ్రమను ఎంతయో వృద్ధిపరచి, చిన్నరైతుల సంపన్నదేశముగ పేరునకు రాగలిగినది. జర్మనీతో ఈ దేశమునకు నిరాక్రమణ సంధి ఉండినను, దానిని కాదని, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, జర్మనీ ఈ దేశమును ఆక్రమించినది. ఆ యుద్ధమున జర్మనీ పరాజితముకాగా, 1945లో ఈ దేశము మరల స్వతంత్రతను ఆర్జించి తదాదిగ వ్యావసాయిక, వస్తు నిర్మాణ కృషులందు ఎంతయో పురోగమించినది.

**7. పరిపాలన:** రాజ్యాంగ బద్ధమగు రాచరికపు పాలన ఈ దేశమున అమలునందు ఉన్నది. 1953 రాజ్యాంగ విధానమును అనుసరించి శాసన నిర్మాణాధికారము రాజునందును, ప్రజాసభ (ఫోకేటింగ్) యందును న్యస్తము. రాచరికము వంశానుగతము; రాజు లూతరన్ చర్చికి చెందినవాడై ఉండవలయును. నాలుగేండ్లకు ఒకసారి ప్రజాసభకు ఎన్నికలు జరుగును. 23 ఏండ్ల వయసునకు తగ్గనివారికి అందరికి వోటుహక్కు కలదు. ప్రజాసభలోని సభ్యసంఖ్య 179. ఇందులో 134 మందిని వివిధ నియోజక వర్గములు ఎన్నుకొనును; ఎన్నికలలో మొత్తముమీద ఎక్కువవోట్లు సంపాదించియు, అందులకు తగినటుల స్థానములను ఆర్జించని పక్షముల వారిని 40 స్థానములకు క్రమరీతిలో నియమించు ఏర్పాటు కలదు. ఇది ఈ దేశపు రాజ్యాంగ విధానపు ఒక ప్రత్యేక విశిష్టత. ఇక తక్కినవారిలో, ఇరువురను ఫారో దీవులవారును, ఇరువురను గ్రీన్‌లాండ్ ప్రజలును, అల్ప సంఖ్యాకులగు జర్మనులు ఒకరిని ఎన్నుకొనెదరు. ప్రజాసభయందు అత్యధిక బలముకలవానిని ప్రధానిగ ప్రభువు నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. దేశమున స్థానిక పరి

పాలన, ఎన్నుకొనబడిన సంస్థల సాయమున జరుగుచున్నది. ఫారో దీవులలో స్థానికపాలనకై ఒక ప్రత్యేకపు పార్లమెంటు కలదు. రాజకీయ పక్షములలో సోషల్ డెమోక్రాటిక్ పార్టీ బలవత్తమము; తక్కినవానిలో లిబరల్, కన్సర్వేటివ్, సోషల్ లిబరల్ పార్టీలు లెక్కింపదగినవి. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** అవసరమైనపుడు యుద్ధమున పాల్గొనుటకు అనువుగ ప్రతి పౌరుడును సుశిక్షితుడై ఉండవలయునను నియమము కలదు. $18\frac{1}{2}$ ఏండ్ల వయసునకు పైబడినవారికి అందరికి ఇది వర్తించును. భూతలసేనయందలి సైనిక సంఖ్య 23,300. నౌకాసేనయందు 7000 మంది సైనికులు కలరు; ఈ సేనకు 6 జలాంతర్గాములు, 6 ఫ్రిగేట్లు, 16 టార్పెడో బోట్లు, యుద్ధోపయోగములగు తక్కిన చిన్నతరగతి నౌకలు 56 కలవు. వాయుసేనలోని యోధసంఖ్య 10 వేలు; ఇందు పోరాటపు బాంబరు దళములు 5, తక్కిన విధముల యుద్ధవిమాన దళములు 12 కలవు. ఉత్తర అట్లాంటిక్ ఒడంబడిక వ్యవస్థ (నేటో) కు ఈ వాయుసేన అనుబద్ధమై ఉన్నది.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ప్రపంచ ఆరోగ్య వ్యవస్థకుచెందిన యూరపీయ ప్రాంతీయ కేంద్రము కోపెన్‌హేగన్‌లో ఉన్నది. గ్రీన్‌లాండ్ రక్షణ కొరకై డెన్మార్క్-యు. స్టే. ల మధ్య ఏప్రిల్ 27, 1951 లో ఒక ఒడంబడిక కుదిరి తదాదిగ అమలులో ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ సాంప్రదాయికముగ వ్యవసాయముపై ఎక్కువగ ఆధారపడి ఉండినను, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరకమున వస్తు నిర్మాణ కృషియు ఎక్కువగ ఆదరితమై ప్రస్తుతమున వ్యవసాయముకన్న ఎక్కువగ జాతీయోత్పత్తికి సమకూర్చుచున్నది. దేశపు కార్మిక శక్తిలో 14% వ్యవసాయ, అటవీ, మత్స్య పరిశ్రమలందును, 29% పరిశ్రమలు, చేతివృత్తులు, ప్రజోపయోగకృషులందును; 15% వ్యాపారమునను, 8% నిర్మాణ కృషిలోను, 7% యాన సౌకర్యములలోను, 24% ప్రభుత్వ సేవయందును పనిచేయుచున్నారు (1968) దేశపు భూతలమున 70% వ్యవసాయమునకే వినియుక్తమైనను, అందు అధిక భాగము గడ్డిబీడులకు ఉపయోగపడుచున్నది. కమతముల వైశాల్యము చాల తక్కువ; ఎచటను అది 60 హె. ను మించదు. అందువలన చిన్నరైతులు ఎక్కువ. వీరు సహకార సంస్థల సాయమున వ్యవసాయమును పశుపాలనను నిర్వహించుచున్నారు. దేశపు మొత్తపు కమతముల సంఖ్య 1,35,588 (1971). సాగుభూమిలో దాదాపు 60% న ధాన్యములు, తక్కిన దానిలో దుంపపంటలు మొదలగునవి పండింపబడుచున్నవి. పంటలలో బార్లీ. రై, ఓట్లు, ప్రముఖములు. దుంపపంటలలో చక్కెరబీటు, ఉరల గడ్డలు పేర్కొనదగినవి. వ్యవసాయోత్పత్తులలో మూడింట రెండువంతులు ఎగుమతి అగుచున్నవి. దేశమున పశుపోషణ పతాకస్థాయిని అందుకొనినది. ప్రపంచమున వేరెచటను పశుపోషణ ఇంత శ్రద్ధాసక్తులతో జరుపబడుటలేదు. అత్యుత్తమ జాతి పశువులు ఇట విరివిగ కననగును. పోషణతోపాటు, వైజ్ఞానికశాస్త్ర పరిజ్ఞానమువలన పాడిపరిశ్రమ చక్కగ వికసనము చెందినది. పశుసంపదవలన లభించు వెన్న మొదలగు ఉత్పత్తులలో మూడింట రెండువంతులు ఎగుమతి అగుచున్నవి. దేశమున గోజాతి పశువులు 27,22,871; 86,25,544 పందులు; గొర్రెలు 56,674, గుర్రములు 46,598; కోళ్లు 1,62,19 845 కలవు. అటవీ పరిశ్రమ యందు 1.25% ప్రజలు జీవించుచున్నారు; భూతల

మున 10% అటవీమయము. అడవుల రక్షణలో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ వహించుచున్నది. 1967 లో 9 లక్షల ఘ. మీటరుల కలప లభించినది. మత్స్య కృషి పలువురకు జీవనాధారము; ఈ కృషిలో 7,288 మోటారు బోటులు, 3,650 సాధారణపు పడవలు పనిచేయుచున్నవి. దేశావసరములకు పోగా మిగిలినది ఎగుమతి అగుచున్నది. ఈ ఎగుమతివలన 77.31 కోట్ల క్రోనరులు లభించినది (1969). విలువగలిగిన ఖనిజ సంపద అంతగ లేదు; ఉన్నవానిలో లిగ్నైటు, కయోలిన్, రాతి ఉప్పు పేర్కొనదగినవి. వస్తు నిర్మాణ కృషిలో దేశమున పలువురు పాల్గొనుచున్నారు. ఆహార, పానీయముల పరిశ్రమలు రసాయనిక, ఔషధ, నౌకానిర్మాణ పరిశ్రమలు చాల ముందంజవేసినవి. జవుళీ పరిశ్రమయు కొంత పురోగమించినది. ఈ దేశపు చేతిపని కుశలత జగత్ ప్రసిద్ధము. మట్టి, రాయి, గాజు, కొయ్య, వెండి - అను వాని సాయమున వీరు రూపొందించు వస్తు సామగ్రికి ప్రపంచమున ఎక్కువ గిరాకి కలదు. ఎగుమతి వస్తువులు మాత్రమే పెద్ద ఫాక్టరీంలో తయారుకాగా, దేశావసరములకు పనికివచ్చునవి కుటీర పరిశ్రమలందే తయారగుచున్నవి. ఎగుమతుల విలువలో 50% పారిశ్రామికపు ఎగుమతులవలన లభించుచున్నవి. సిమెంటు ఉత్పత్తి, పాడిపరిశ్రమలకు సంబంధించిన యంత్రపరికరములును, డీజెల్ యింజనులు మొదలగునవియు ఈ దేశమునుండి ఎగుమతియగు యంత్రములు. దేశపు విద్యుదుత్పత్తి 1,705.2 కోట్ల కివా. (1969-70); ఇది యంతయు తాపవిద్యుత్తు; జల విద్యుదుత్పత్తికి దేశమున అవకాశములులేవు. ఎగుమతుల విలువ 26,71,60,04,000 క్రో; దిగుమతుల విలువ 34,01,28,00,000 క్రో. (1971). ఫారోస్, గ్రీన్‌లాండ్ దీవులు రాజ్యాంగ రీత్యా, దేశముతో ముడివడి ఉన్నను, వాని ఎగుమతి దిగుమతుల ఆదాయము, సుంకములు, ఆ ప్రాంతములకే చెందుచున్నవి. అవి ఈ లెక్కలో చేరలేదు. బడ్జెటరీ వ్యయము 42,90,17 44,000 క్రో. (1972-73).

**11. సాంఘిక రంగము :** సువ్యవస్థితమగు సాంఘిక సేవా విధానములను తొలుతగ నెలకొల్పిన రాజ్యములలో ఈ దేశము ఒకటి. వార్ధక్యము, రోగ బాధ, నిరుద్యోగము, మాతృత్వము అనువాని సందర్భమునను; దిక్కులేని పేదలకును, అంగ వికలత చెందినవారికిని జీవితవసతికి తగిన భృతులను ప్రభుత్వము ఏర్పరచినది. యుద్ధమున విపరీతముగ దేశపు గృహవసతి దెబ్బతినినను ప్రభుత్వపు కృషివలన అది చాలవరకు పునరుద్ధరితమైనది. 1000 మంది ప్రజలకు 294 ఇండ్లు కలవని అంచనా (1968). దేశమున నిరక్షరాస్యత లేదు. 1814 మొదలుగ దేశమున నిర్బంధ విద్యా విధానము అమలున ఉన్నది. ప్రయిమరీ, లోయర్ సెకండరీ పాఠశాలల మొత్తము 2,455 లో 7,05,030 మంది; 160 అప్పర్ సెకండరీ పాఠశాలలలో 34,570; మంది 64 సాంకేతిక పాఠశాలలలో 60,754 మంది, 57 వ్యాపార పాఠశాలలలో 25,721 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక వయోజన విద్యాసంస్థలు (వయోజనులకు నూత్న వైజ్ఞానిక విషయములను బోధించు సంస్థలు) 130 కలవు; ఇందు చదువువారు 12,193. దేశమున మూడు విశ్వవిద్యాలయములును, ఆ స్థాయికే చెందిన ఉన్నత విద్యాసంస్థలు 14 కలవు. వీనిలోని విద్యార్థి సంఖ్య 56,928 (1970-71) దేశపు 1,350 గ్రంథాలయములలో కోపెన్ హేగన్‌లోని రాయల్ లైబ్రరీ ప్రముఖము; 1660 లో ఇది స్థాపితము. దేశమునందలి 156 మ్యూజియములలో కోపెన్ హేగన్‌లోని నేషనల్ మ్యూజియం, గ్లిప్ టోటెక్ (శిల్ప మందిరము), స్టేట్ ఆర్ట్ మ్యూజియం, తార్‌వాల్‌స్డెన్ మ్యూజియం, ఫ్రెడెరిక్స్‌బర్గ్ కోటలోని జాతీయ చారిత్రక మ్యూజియం

పేరెన్నికగనినవి. పత్రికా స్వాతంత్ర్యము రాజ్యాంగ రీత్యా కలదు. దేశమున ప్రచారమునఉన్న 53 దిన పత్రికలలో బి. టి. అనుదానికి ఎక్కువ ప్రచారము కలదు. దేశమున వైద్య వసతులు విస్తృతముగ కలవు. దేశపు మొత్తమున 43,504 శయ్యలుకల 173 ఆసుపత్రులు కలవు. వైద్య సహాయము చాలవరకు ఉచితముగ జరుగుచున్నది. వైద్యసంఖ్య 6,829 (1968). 700 మందికి ఒక డాక్టరు చొప్పున కలరని అంచనా. పాఠశాలలలో విద్యార్థులకు ఉచితముగ పాలు, పండ్లు కలిగిన ఆహారమును ఇచ్చుటవలన తగిన పోషకాహారము వారికి లభించుచున్నది.

**12. యాత్రా సౌ.:** స్కాండినేవియన్ దేశముల (నార్వే, స్వీడెన్‌ల) వారికి పాస్‌పోర్టు అక్కరలేదు. కెనడా; యు. స్టే.; దక్షిణ, మధ్య అమెరికా దేశములకు, కొన్ని పశ్చిమయూరపీయ రాజ్యములకు, కామన్‌వెల్తు రాజ్యములలో పెక్కింటికి సంబంధించిన పౌరులకు వీసా అక్కరలేదు. 1971 లో 123 లక్షల విదేశీయులు దేశమును దర్శించిరి; వీరు దేశమున 286.7 కోట్ల క్రో.లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు:** ఈ దేశము విస్తృతియందు చిన్నదియే యైనను, వివిధ రంగములందు పేరుగాంచిన ప్రముఖులలో పలువురకు జన్మభూమిగ పేరొందినది. ఖగోళ శాస్త్రజ్ఞుడగు టైకో బ్రాహీ (1546-1601), భాషాతత్త్వవేత్త ఓటో జెస్పర్‌సన్ (1860-1943), వైద్యుతిక కాంతశాస్త్రమును కనుగొనిన హన్స్ క్రిస్టియన్ ఆర్‌స్టెడ్ (1777-1851), అణవిక భౌతిక శాస్త్రమున నోబెల్ బహుమతిని ఆర్జించిన నీల్స్ హె. డి. బోర్ (1885-1962), వైద్యశాస్త్రమున నోబెల్ బహుమతులను ఆర్జించిన ప్రముఖులు - ఆగస్ట్ క్రోగ్ (1874-1949), నీల్స్ రైబర్ట్ ఫిన్‌సెన్ (1860-1904, ఫారోస్ ద్వీపవాసి), జోహనెస్ ఎ. జి. ఫిబిజెర్ (1867-1928), సి. పి. హెన్రిక్ డామ్ (జ. 1895) అనువారును, శాంతి సాధనకై నోబెల్ బహుమతిని ఆర్జించిన ఫ్రెడరిక్ బేజర్ (1857-1922), మానవ విజ్ఞానవేత్తగను, దేశాన్వేషకుడుగను, ఎస్కిమోలను గురించిన రూపలక్షణ శాస్త్ర విషయములందు ప్రామాణికుడుగను పేరుగనిన నూద్ జోహన్ విక్టర్ రాస్‌ముస్సెన్ (1879-1933, గ్రీన్‌లాండ్‌వాసి) ఈ దేశీయులే. పై వారిలో నీల్స్‌బోర్, ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున యు. స్టే కు పోయి అచటి పౌరస్వత్వమును గ్రహించెను.

---

# 12. నార్వే

**ముఖ్యనగరము:** ఆస్లో; **జెండా:** ఎర్రని భూమికపై నీలపు సిలువ; దాని ఎడమచేయి పొడవు సాగి ఉండును; **జాతీయ గీతము:** 'జా. వి. ఎల్ స్కర్ దెత్తే లాండెట్' (అవును, ఈ దేశమును మేము ప్రేమింతుము); **నాణెము:** క్రోన్, 100 ఆర్లుగ ఇది విభక్తము; ఒక క్రోన్ = రు. 1.05; **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి. **కాలగణన:** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** యూరపీయ దేశములలో వైశాల్యపు లెక్కను అనుసరించి అయిదవదిగ లెక్కకు వచ్చు ఈ దేశము, స్కాండినేవియా ద్వీప

కల్పపు పశ్చిమపు, కడభూములను లోగొని, 57°57–71°11′ ఉ. అ. రేఖలమధ్యను (దాదాపు 1,600 కిమీ.), 4°30′–10° తూ. తు రేఖల మధ్యను విస్తరించి ఉన్నది. ఈ దేశమునకు తూర్పున స్వీడెన్; ఈశాన్యమున ఫిన్‌లాండు దేశమును, సోవియెట్ యూనియన్‌కు చెందిన ఒక చీలిక భూమియు; దక్షిణమున నార్త సముద్రము;




పటము 12.

పశ్చిమమున అట్లాంటిక్ సముద్రాంతర్భాగమగు నార్వీజియన్ సముద్రము కలవు. దేశమున దాదాపు మూడవవంతు ఉత్తర ధ్రువరేఖకు ఉత్తరమున ఉన్నది. ఎచటను దేశపు వెడల్పు 427 కిమీ. లను మించదు. ఆర్కిటిక్ మహాసముద్ర పరివృతమును, జనావాసరహితమును అయిన స్వాల్‌బార్డ్ (స్పిట్స్ బెర్గెన్) ద్వీపజాలముపై ఈ దేశపు స్వామ్యమును 1920 లో నానాజాతి సమితి గుర్తించినది. ఈ ద్వీప జాలముగాక దేశపు వైశాల్యము 3,23,958 చ. కిమీ.; స్వాల్‌బార్డ్ వైశాల్యము 62,050 చ. కిమీ. దేశము పర్వతమయము; భూతలమున దాదాపు 60% ను పర్వతములు ఆక్రమించి ఉన్నవి; ఈ పర్వతములు కాలరీత్యా అతి సనాతనములని భూతత్వశాస్త్రజ్ఞుల అభిప్రాయము. ఈ పర్వతము లందు చెట్టుచేమలు అరుదుగ మాత్రమే కన్పట్టును. దేశపు 20% భూమి అటవీమయము. కొండలుగాక మిగిలిన భూమియంతయు సరాసరిన సముద్ర మట్టముపై 149 మీటరుల ఎత్తున ఉన్నది. పర్వతము లందు అత్యున్నతమగునది గ్లాడాపిగ్గెన్ (2,469 మీ ). దేశమున హిమాశిలా భూములు (గ్లేసియర్ ఫీల్డ్స్) అనేకములు కలవు. వానిలో అతి విస్తృతమైనవి జోస్టే డాల్స్ బ్రీన్ (815 చ. కిమీ ). దేశపు తీరభూమిలోనికి సముద్రము పలుతావుల చొచ్చుకొనివచ్చి చీలుకయ్యలు (ఫోర్డులు) ఏర్పడుటవలన, తీరభూమి రంపపు వాదరవలె రూపుతీరియున్నది. ఈ చీలుకయ్యలలో ఎక్కువ పొడవైనది సోగ్నీ ఫోర్డు (204 కిమీ.), ఈ చీలుకయ్యలవలన తీరమును ఆశ్రయించి అసంఖ్యాకములగు లంకలు రూపుగొనినవి. వానిలో అత్యంత విస్తృతమైనది హిన్నాయ్ (2,196 చ. కిమీ.).

**2. శీతోష్ణస్థితి మొ. :** ధ్రువప్రాంతములోనికి చొచ్చుకొనిపోయిన ఈ దేశము అతి శీతలముగ ఉండవలసియున్నను, తీరమునకు అతి సమీపము ననే ప్రవహించు సముద్రాంతర్గత ఉష్ణప్రవాహము వలన దేశమున సమశీతోష్ణస్థితి నెలకొని ఉన్నది. ధ్రువప్రాంతమునఉన్న ఈ దేశభాగమున ఎండ కాలము అంతయు పగలుగనే ఉండును; అనగా సంవత్సరమున ఆరునెలలు పగలుగను. ఆరునెలలు రాత్రిగను ఉండును. దేశపు దక్షిణ భాగముతో పోల్చినపుడు ఉత్తర భాగమున ఎక్కువ చల్లదన మును, పశ్చిమ తీరమునందున్న దేశమధ్యమున ఎక్కువ శీతలతయు వేద్యములు. ఆస్లో నగరమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 43° ఫా. సాలున ఆ నగరమున గరిష్ఠోష్ణత 63° ఫా.; కనిష్ఠోష్ణత

24° ఫా. తూర్పునఉన్న పర్వతపు లోయలలో సంవత్సరమున సరాసరి వర్షపాతము 29.5 సెం.మీ. ఆస్లో నగరమునకు ఉత్తరమున సముద్ర తీరమున ఉన్న హాకేలాండ్‌లో సాలుసరి వర్షపాతము 325 సెం. మీ. తుపానుల బాధకు దేశము తరచుగ లోనగుచుండును. ఆస్లోఫోర్డు పరిసరములందు వృక్షసంతతి బహుసాంద్రముగ కన్పట్టును. అందలి వృక్షములలో సూచ్యగ్రజాతి వృక్షముల సంఖ్యయే ఎక్కువగ ఉన్నను, భూతలోన్నతియందలి మార్పును అనుసరించి కొన్ని భూర్జవృక్షములను కన్పట్టుచున్నవి. ఉత్తరమునకు పోయినకొలది ధ్రువప్రాంతపు చిన్నచెట్లు, గుబురులు కననగును. లేడి జాతికి చెందినవియు, తోడేళ్ళును, ఎలుగు బంటులును మాత్రమే పెద్దరకపు వన్యజంతువులు. పక్షిసంతతి విరివిగ కలదు. నదీ జలములందు మత్స్యసంపద విశేషముగ ఉన్నది.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 39,17,773; జనసాంద్రత చ. కిమీ. కు 12.1 (1972). నగరములలో ఆస్లో (జ. సం. 4,75,563), ట్రాన్డ్‌హీమ్ (1,29,133), బెర్గెన్ (2,11,970), స్టావన్‌జెర్ (82,450) ప్రముఖములు. దేశప్రజలలో 21,57,754 మంది పల్లెపట్టులందును, 17,60,019 నగరములందును నివసించుచున్నారు. ప్రజలందరును చాలవరకు నార్వీజియన్ జాతికి చెందినవారు; లాప్పులను జాతి వారు దాదాపు 20,000 ను, ఫిన్‌లాండ్ దేశపు ప్రజల సంతతివారు 7,000 మాత్రమే అల్పసంఖ్యాక వర్గములుగ లెక్కింపబడుచున్నారు. దేశీయ భాష నార్వీజియన్; అయినను ఇందలి రెండు మాండలిక ములును - బోక్‌మాల్, లాండ్స్‌మాల్ అనునవి - అధికార భాషలుగ పరిగణింపబడుచున్నవి. ఇందు తొలుతటిది గ్రాంథికభాషపై ఆధారపడి, పట్టణము లందు ప్రచారమున ఉన్నది; రెండవది పల్లెపట్టుల వ్యవహారములలో వ్యాప్తియందున్నది. ఆంగ్లభాషతో పరిచయము దేశీయులలో పలువురకు కలదు. లాప్పులందు వారి లాప్‌భాషయే ప్రచారమున ఉన్నది; ఆ భాష ఫిన్నో - ఉగ్రియన్ భాషా కుటుంబములోనిది. క్రైస్తవ మతమునందలి ఎవాన్ జెలికల్ లూతరన్ చర్చి సంప్రదాయము, ఇచట ప్రభుత్వాదరిత మతముగ ఉన్నది. ప్రజలలో 96% ఈ సంప్రదాయమునకు చెందినవారు. తక్కిన ప్రజలందు ఇతర క్రైస్తవ సంప్రదాయములు ప్రచారమున ఉన్నవి. అయినను మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కల్పింపబడినది.

**4. సమాచార సౌ.:** దేశమున తపాలా వసతులును, తంతి టెలిఫోను వసతులును విరివిగ కలవు. సంఖ్యా వివరములు తెలియవు. 171 రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు కలవు (1970); 1960 మొదలుగ టెలివిజన్ సౌకర్యములు పని చేయుచున్నవి.

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 73,112 కిమీ. (1972); ఇందులో 54,260 కిమీ. అత్యుత్తమ శ్రేణికిచెందిన ప్రధాన మార్గములు. రైలుమార్గముల నిడివి 4,292 కిమీ; ఇందు 4,240 కిమీ. ప్రభుత్వాధీనమున ఉన్నది. మొత్తము మీద 2,455 కిమీ. ల దూరమున బండ్లు విద్యుత్ సహాయమున నడుచుచున్నవి. తీరభూమియందు చీలుకయ్యలవలన, సముద్రపు రేవులు ఎన్నియో సహజముగ రూపొందుటవలన విదేశ వ్యాపారమున పాల్గొను వర్తక నౌకాదళమును ఈ దేశము విరివిగ పెంపొందించుకొనినది. అట్టి వర్తక నౌకాదళ ప్రమాణమున ఈ రాజ్యము ప్రపంచరాజ్యములలో నాలుగవదిగ లెక్కకు వచ్చుచున్నది. ఈ దళమున 2,993 నౌకలు కలవు. వీని మొత్తపు ప్రమాణము 1,96,79,000 టన్నులు. ఇవిగాక నూనె మొద లగువానిని చేరవేయు టాంకర్లు 404 కలవు. వీని ప్రమాణము 90,95,000 టన్నులు. అయినను

ఈ నౌకలలో అత్యధిక భాగము (వర్తక నౌకలలో 90%, టాంకర్ నౌకలలో 98%) ప్రపంచపు వివిధ ఇతర రాజ్యములమధ్య జరుగు వ్యాపారమున పాల్గొనుచున్న వేగాని, దేశపు వ్యాపారమున పాల్గొనుటలేదు. అయినను అవి సంపాదించు ధనము దేశమునకే చేరుచున్నది. ఇవిగాక మత్స్య కృషి మొదలగు తక్కిన రంగములందు పనిచేయు నౌకలు 755 కలవు; వీని ప్రమాణము 2,38,000 టన్నులు.

ఆస్లో వద్దనున్న ఫోర్నెబూ విమానాశ్రయము, స్టావెంజర్‌వద్దఉన్న సోలా విమానాశ్రయము విమానయానపు ముఖ్య కేంద్రములు. స్వీడెన్, డెన్మార్క్, నార్వేలకు భాగస్వామ్యముగల స్కాండినేవియన్ విమానయానసంస్థ విమానయానములను నిర్వహించుచున్నది.

**6 చరిత్ర :** ఈ దేశమున 10,000 సంవత్సరములకు పూర్వమునుండియే జనావాసములు ఉన్నటుల తెలియవచ్చుచున్నను, క్రీ. శ. 9 వ శతాబ్ది ఆరంభమున ఇట వసించిన వైకింగులను ఆర్య జాతియే ఈ దేశమున చారిత్రక యుగమును మొదలిడినది. సాగరయానమున వారు అతి సమర్థులు. నార్వే దేశమునుండి తమ పడవలలో పయనించి, విశాల సాగరములనుదాటి ఫ్రాన్సులోని నార్మండీని, బ్రిటిష్ దీవులలోని కొన్ని భాగములను వారు వశపరచుకొనిరి; ఐస్‌లాండ్, గ్రీనులాండ్‌లలోను వారు వలసలను ఏర్పరచిరి. 872 లో నార్వేయందు ఒక సమగ్ర సుస్థిర రాజ్యము ఏర్పడినది. 1030 లో క్రైస్తవమతము ఇట వ్యాపించినది. ఆ కృషిలో ప్రముఖపాత్ర వహించినవాడు సెయింట్ ఓలావ్. ఆ కాలమున దేశము సుసంపన్నమై, సాహసిక నావికయోధుల జన్మభూమిగ పేరొందినది. ఆ యోధులు ఆ కాలమున ఉత్తర అమెరికాలోని కొన్ని ప్రాంతములందు సైతము కాలిడిరని, ఆ దేశపు చారిత్రకుల కథనము. కాని అంతలో భూస్వాముల దురాగతములవలన దేశము అంతర్యుద్ధములకు లోనైనది; అందులకు తోడుగ ప్లేగు జాడ్యము దేశమును సర్వనాశనము చేసినది. వ్యవసాయము, చేతి పరిశ్రమలు పోషణలేక సన్నగిల్లినవి. ఇంతలో నార్వేదేశపు రాజవంశపు వారసుడుగ డెన్మార్క్ దేశపు రాజే రెండు దేశములకు రాజుకాగా (1380), తదాదిగా దేశము 400 ఏండ్ల కాలము అస్వతంత్రముగ ఉండినది. అయినను ఆ కాలమున సైతము, దేశపు వ్యావసాయికులు, భూస్వామ్య వ్యవస్థ దేశమున నెలకొనకుండచేసి, తమ వ్యక్తిగత స్వాతంత్ర్యమును కాపాడుకొనిరి. 1814 లో దేశము స్వాతంత్ర్యమును ప్రకటించి, క్రిస్టియన్ ఫ్రెడరిక్ అనువానిని రాజుగ ఎన్నుకొని ఒక రాజ్యాంగమును ఆమోదించినది. ప్రపంచపు రాజ్యాంగములలో ప్రాచీనతమములగు వానిలో ఒకటియగు ఈ రాజ్యాంగ విధానమే, ఇప్పుడును ఆ దేశమున అమలున ఉన్నది. నెపోలియన్ పతనాంతరమున, యూరప్‌ఖండ పటమును తీర్చిదిద్దిన విజేతలు, స్వీడెన్‌తో నార్వేను కలిపి ఏకరాజ్యముగ చేసిరి. కాని 1905 లో జరిగిన జనాభిప్రాయ సేకరణను అనుసరించి, ఆ రెండు రాజ్యములు మరల విడివడినవి. తదాదిగ రాజ్యాంగబద్ధపు రాచరికపు పాలనలో నార్వే ఉన్నది. 1814 మొదలుగ 125 సంవత్సరములు. ఈ దేశము, యూరపీయ దేశముల మధ్య సాగిన ఏ యుద్ధమునను పాల్గొనక, శాంతితో మనగలిగినది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జర్మన్ సేనలు ఈ దేశమును ఆక్రమించినవి (ఏప్రిల్, 1940). అంతట రాజు తన మంత్రి వర్గముతోకూడ బ్రిటనునకుపోయి, అట ప్రవాస ప్రభుత్వమును స్థాపించి, పోరాటమును సాగించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, దేశము స్వతంత్రమై, రాజు స్వదేశమునకు చేరుకొనెను. అంతట ఈ దేశము తాటస్థ్యమును మానుకొని,

మార్షల్ ప్లానును ఆమోదించి, నేటోలో సభ్యత్వ మును గ్రహించినది.

**7. పరిపాలన :** దేశమున అనువంశికము, రాజ్యాంగ బద్ధము అగు రాచరికపు పాలన అమలునందున్నది. రాజకీయాధికారము 150 మంది సభ్యులున్న ప్రజాసభ (స్టోర్టింగ్) లో న్యస్తము. మంత్రులను నిర్ణయించి నియమించు అధికారము, రాజ్యాంగరీత్యా, రాజునకే ఉన్నను, యథార్థమున 1884 మొదలుగ ప్రజాసభయే వీరిని ఎన్నుకొనుచున్నది. దేశము నందలి 20 నియోజక వర్గములు ప్రజాసభయందలి సభ్యులను ఎన్నుకొనుచున్నవి; ఆ సభ్యులలో ఆస్లో నగరమునకు ఒక ప్రతినిధియు, బెర్గెన్‌కు ఒక ప్రతినిధియు కలరు. ఎన్నిక ముగిసిన తరువాత ఆ 150 మంది సమావేశమై తమలో నాలుగవవంతు సభ్యులను ఎన్నుకొని, శిష్టసభ (లాగ్‌టింగ్)గ రూపొందించి, తక్కినవారలు సామాన్యసభ (ఓడెల్ స్టింగ్) గ వ్యవహరింతురు. ఆర్థిక, రాజకీయాధి ప్రముఖ విషయములకుచెందిన బిల్లులను ఉభయ సభలు కలసి చర్చించి నిర్ణయించును. తక్కిన వానిని సామాన్యసభ నిర్ణయించగ, శిష్టసభ ఆమో దించినపుడు చట్టములగును. రెండు సభలమధ్య అభిప్రాయభేదము ఏర్పడినపుడు, మొత్తపు ప్రజా సభ ఆ విషయమును చర్చించి, మూడింట రెండు వంతుల సభ్యుల ఆమోదమునకు అనుగుణముగ నిర్ణయించును. దేశమున అధికార దుర్వినియోగము మొదలగువానిని విచారించుటకు, చట్టముల సక్రమ నిర్వహణను సరిచూచుటకు ఒక లోకాయుక్తుడు (ఓంబడ్స్‌మన్) చట్టరీత్యా ఏర్పడియున్నాడు. ఇది ఈ రాజ్యాంగమందలి ఒక విశిష్టత. దేశపు రాజ కీయ పక్షములలో లేబర్‌పార్టీ, కన్‌సర్వేటివ్‌పార్టీ, లిబరల్‌పార్టీ, సెంటర్‌పార్టీ ప్రముఖములు. దేశపు నగర స్థానిక సంస్థలు 404 ను, గ్రామీణ స్థానిక సంస్థలు 404 ను ఎన్నుకొనబడిన సమితుల సాయ మున పాలింపబడుచున్నవి. ఇవి అన్నియు పరి పాలనా సౌకర్యముకొరకై 20 జిల్లాలుగ సమీకృత ములు. ప్రతి జిల్లాయందు చిన్న తగాదాల పరి ష్కారమునకై ఎన్నుకొనబడిన న్యాయసంఘములు కలవు. ఇవిగాక ఆస్లో నగరమునందలి సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున వివిధ శ్రేణులందు న్యాయ స్థానములు పనిచేయుచున్నవి.

**8. దేశరక్షణ :** దేశమున నిర్బంధ, సార్వ జనీన సైనిక శిక్షణ అమలున ఉన్నది. 20 నుండి 44 ఏండ్లవరకు వయసు కలిగినవారు, అవసరమై నపుడు, విధిగ సైన్యములో చేరవలయును. దేశపు భూతల సైనికసంఖ్య 19,000. నౌకాసేనయందలి యోధసంఖ్య 8,000; ఈ సేనకు 15 జలాంతర్గా ములు, 5 ఫ్రిగేట్‌లు, 26 క్షిపణి టార్పెడో బోట్లు, 54 తక్కు విధముల యుద్ధోపయోగ నౌకలు కలవు. వాయు సేనయందు 9,400 మంది యోధులు కలరు. దాదాపు 130 పోరాటపు విమానములు కలవు (1972).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును నేటోలోను, యూరపీయ స్వేచ్ఛా వాణిజ్య సంఘమునను ఈ దేశ మునకు సభ్యత్వము కలదు. జయిరేలో ఐ. రా. స. ఆధ్వర్యమున శాంతి సంరక్షణలో ఈ దేశపు సేనలు పాల్గొనినవి. నార్వే, స్వీడెన్, డెన్మార్క్, ఫిన్‌లాండులు కలసి నార్డిక్ కౌన్సిలుగ రూపొంది నవి. ఆర్థిక, సాంస్కృతికాది విషయములందు ఇవి సమష్టిగ కృషిచేయుటకు ఈ కౌన్సిలు ఉప యోగపడుచున్నది. వర్ధమాన దేశములలో పెక్కిం టికి ఈ దేశము ఆర్థిక, సాంకేతిక సాహాయ్యమును ఇచ్చుచున్నది.

**10. ఆర్థిక రంగము :** తొలుత ఈ దేశపు వ్యవస్థ వ్యవసాయ, మత్స్య, అటవీ కృషులపై ఆధారపడి యుండినది; కాని ప్రథమ ప్రపంచ

యుద్ధము ముగిసినది మొదలుగ క్రమముగ ఇచట వస్తు నిర్మాణ కృషికి ప్రాముఖ్యము కలిగినది. వ్యవసాయమువలన సమష్టి జాతీయోత్పత్తిలో 3.4% మాత్రమే ప్రస్తుతమున లభించుచున్నది; ఈ కృషిలో ప్రజానీకమున 8.6% పాల్గొనుచున్నారు. భూతల వైశాల్యమున 3% (34,89,000 ఎకరములు) మాత్రమే సేద్యమునకు అనుకూలము; ఆధునిక యంత్రములను ఉపయోగించి, ఇందు సాధ్యమైనంత అధికోత్పత్తిని రైతులు సాధించుచున్నారు. వ్యవసాయోత్పత్తులలో ఓట్లు, రైధాన్యము, ఉరలగడ్డలు ప్రముఖములు. వ్యావసాయికులందరును, చాలవరకు, అదనపు రాబడికై మత్స్య పరిశ్రమను పాల్గొనుచున్నారు. వ్యవసాయభూములు చిన్నరైతుల వశమున కలవు. సరాసరిన కమతపు వైశాల్యము 12.5 ఎకరములు మాత్రమే. మత్స్య పరిశ్రమను వ్యావసాయికులేగాక, దానిని ఒక ముఖ్యవృత్తిగ 2% ప్రజలు అవలంబించియున్నారు. దేశమునకు కావలసిన విదేశీయ వినిమయ ద్రవ్యమున, 14% మత్స్య పరిశ్రమవలన లభించుచున్నది. చేపలను, శీతలీకరణచేసి, నిలువజేయు వసతులు విరివిగ కలవు; అందువలన సంవత్సరము పొడవున నానా దేశములకు చేపలను ఈ దేశము ఎగుమతి చేయగలుగుచున్నవి. అటవీకృషికి చాల ప్రాముఖ్యము కలదు. లభించు కలపలో అత్యధిక భాగము కాగితముగ తయారుచేయబడుచున్నది. ఇదియును, కాగితపు గుజ్జును చాలవరకు విదేశములకు ఎగుమతియగుచున్నవి దేశపు ఎగుమతుల విలువలో 15% దీనివలన లభించుచున్నది. అటవీ కృషివలన అడవులు అంతరించుపోకుండ ఉండుటకు ప్రభుత్వమే ప్రత్యేక కృషిచేయుచున్నది. అంతటంతట క్రొత్త మొక్కలను నాటుట విరివిగ జరుగుచున్నది. 1964 లో దాదాపుగ పదికోట్ల మొక్కలు నాటబడినవి. దేశమున జలపాతమువలన విద్యుదుత్పత్తి విరివిగ జరిగి, చౌకగ దొరకుచున్నది. విద్యుదుత్పత్తి సాలున 5,760.6 కోట్ల కివా. (1978). దీనిలో అత్యధిక భాగము పరిశ్రమలకు వినియుక్తము. దేశమున ఖనిజసంపద తగినంతగ కలదు. వెండి, ఇనుము, రాగి తొలుత ఈ దేశపు ఎగుమతులలో ప్రముఖములుగ ఉండెడివి. ప్రస్తుతమున అల్యూమినియమును ఉత్పత్తి చేయు ప్రపంచ దేశములలో ఈ దేశమునకు ఆరవ స్థానము కలదు. గంధక శిలలనుండి గంధకము తామ్‌షేవెన్ అనుచోట తయారగుచున్నది. ముడి ఇనుము, బొగ్గు లభించుచున్నది; అయినను బొగ్గును ఎక్కువగ దిగుమతి చేసికొను ఆవశ్యకత కలదు. వస్తునిర్మాణ పరిశ్రమవలన సమష్టి జాతీయోత్పత్తిలో 29% లభించుచున్నది. 35% కార్మికులు దీనివలన జీవించుచున్నారు. ఈ పరిశ్రమలో 92% ప్రయివేటు యాజమాన్యమునను, $4\frac{1}{2}$% సహకార వ్యవస్థలక్రిందను, $3\frac{1}{2}$% ప్రభుత్వాధీనమునను ఉన్నది. దేశపు ఎగుమతులలో అల్యూమినియం, ఉక్కు, తక్కిన ధాతూత్పత్తులు, రసాయనిక ఉత్పత్తులు, రసాయనిక ఎరువులు ప్రముఖములు. దేశపు ఎగుమతుల విలువ 1,80,03,138 వేల క్రోనులు; దిగుమతుల విలువ 2,87,15,001 వేల క్రో. (1971). దిగుమతులు ఎక్కువగ ఉన్నందువలన కలుగు లోటును ఈ దేశము తన వర్తక నౌకాదళమువలన ఆర్జించిన ధనపు సాయమున పూరించుచున్నది. ఈ నౌకాదళము అంతయు వ్యక్తిగత స్వామ్యమున పనిచేయుచున్నది. ప్రభుత్వపు సాయము ధనరూపమున దానికి ఏదియు లభింపదు. దేశపు బడ్జెటరీ వ్యయము 2,76,25,219 వేల క్రో. (1972).

**11. సాంఘిక రంగము :** గత ఇరువది సంవత్సరములుగ దేశమున సువ్యవస్థిత సాంఘిక పరిస్థితులు దేశమున నెలకొన్నవి. కార్మికులకును, యాజమాన్యములకును మధ్య సౌహార్దము, సామరస్యము కలవు. నిరుద్యోగము లేనేలేదని చెప్ప

వచ్చును. సమగ్రమయిన సాంఘిక భద్రతా ప్రణాళిక అమలున ఉన్నది. ఇందువలన రోగబాధ, వార్ధక్యము, అంగవికలత, నిరుద్యోగమువంటి విపత్తులయందు పౌరులతో ప్రతియొకనికి భద్రత చేకూరుచున్నది. వితంతువులకు, అనాథ శిశువులకు తగు భృతులు కలవు. ఈ భృతి ఏ పరిస్థితి యందును ఒక వ్యక్తికి రోజునకు 8 క్రోనులకు తగ్గదు. ఇట్టి భృతులవలన దేశాదాయమున 17.2% వ్యయమగుచున్నది (1970). గృహవసతి బాగుగ కలదు. అయినను పాతవానికి బదులుగ ప్రతియేటా క్రొత్త గృహములు ప్రభుత్వ, వైయక్తిక, సహకార సంఘ యాజమాన్యములద్వారా నిర్మింపబడు చున్నవి. ప్రజలలో 70%కు సొంత యిండ్లు కలవు; తక్కినవారు అద్దె ఇండ్లలో వసించు చున్నారు. దాదాపుగ ప్రతి ఇంటికి విద్యుత్ సౌకర్యము కలదు.

దేశమున 1739 మొదలుగ నిర్బంధోచిత విద్యా విధానము అమలున ఉన్నది. నిరక్షరాస్యతలేదని చెప్పవచ్చును. దేశమునందలి 2,579 ప్రాథమిక పాఠశాలలలో 5,55,337 మంది, 220 మాధ్యమిక పాఠశాలలలో 72,464 మంది విద్యార్థులు కలరు (1971); ఇవిగాక జానపద ఉన్నత పాఠశాలలలో 7,078 మంది; వృత్తి విద్యాశాలలలో 66,867 మంది; 20,552 మంది తదితర పాఠశాలలలో చదువు సాగించిరి (1971-72). దేశమున 4 విశ్వ విద్యాలయములును, ఆ స్థాయికే చెందిన ఆరు విద్యా సంస్థలును కలవు. వీనిలోని విద్యార్థి సంఖ్య 32,989 (1971). వీరుగాక విదేశములలో ఉన్నత విద్యను అభ్యసించువారు 2,790 మంది కలరు (1971-72). దేశమున పేరొందిన గ్రంథాలయములు అనేకములు కలవు. వానిలో ఆస్లో యూనివర్సిటీ లైబ్రరీ ప్రముఖము - ఆస్లో, స్టావెంజర్, బెర్గెన్, ట్రాండ్‌హీమ్, త్రాంసోలలో. ప్రకృతి చారిత్రక మ్యూజియములు కలవు. దేశమున 81 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో ఆఫ్టెన్ పోస్టెన్ అనునది అధిక ప్రచారము కలది. ఆరోగ్య క్షేమ ప్రతి పౌరునికి అమలున ఉన్నది. అందువలన తాను కోరిన వైద్యునివలన ఉచిత వైద్య సాహాయ్యము, ఆసుపత్రి ఖర్చులు ప్రతి పౌరునకు లభించుచున్నవి. దేశమున 741 మందికి ఒక వైద్యుడు చొప్పున ఉన్నటుల అంచనా. 34,347 శయ్యలుగల 352 ఆసుపత్రులు కలవు. వైద్య సంఖ్య 5,175 (1968).

**12. యాత్రా సౌ.:** దేశపు ప్రకృతి రమణీయత, హిమ భూములలో కొయ్య పలకల సాయముతో పరువిడుట (స్కీయింగు), ధ్రువప్రాంతపు రాత్రింబవళుల నిడివి యాత్రికులను విరివిగ ఆకర్షించుచున్నవి. ప్రభుత్వము యాత్రికులకు బాగుగ వసతులను కల్పించినది. స్కాండినేవియన్ దేశములవారికి పాస్‌పోర్టు వీసాలు అక్కరలేదు. పశ్చిమ యూరపీయ దేశములవారికిని, యు. స్టే. వాసులకును పాస్‌పోర్టు మాత్రము ఉండవలెను. దాదాపు 40 లక్షల మంది విదేశీయ యాత్రికులు దేశమును 1969 లో దర్శించిరి. నార్వేజియనులును పెద్ద సంఖ్యలలోనే విదేశములను దర్శించు చున్నారు.

**13. ప్రసిద్ధ పౌరులు:** ఈ దేశము జన సంఖ్యారీత్యా చిన్నదయే అయినను పలువురు ప్రముఖులకు జన్మభూమిగ రాణించినది నీల్స్ హెన్రిక్ ఆబెల్ (1802-29): అల్పకాలమే జీవించినను, గణితశాస్త్రమున, తౌల్యసిద్ధాంతము (తియరీ ఆఫ్ ఈక్వేషన్స్) న పెక్కు సమస్యలను సాధించి, ప్రపంచ ఖ్యాతిని ఆర్జించెను; రోవాల్డ్ ఆమున్‌డ్సెన్ (1872-1928): దక్షిణధ్రువ ప్రాంత భూములను కనుగొనిన సాహసికుడు; జోర్న్ సెర్నీ జోర్న్‌సన్ (1832-1910): జాతీయ మహాకవి; ఓల్ బుల్ (1810-1880): ప్రసిద్ధ

వాగ్గేయకారుడు, ఫిడేలు వాదకుడు; జి. హెచ్. ఆర్మేర్ హాన్సెన్ (1841-1912) : కుష్ఠరోగ క్రిమిని కనుగొన్నవాడు; హెన్రిక్ ఇబ్సెన్ (1828-1906) : ప్రపంచ ఖ్యాతిని ఆర్జించిన నాటక రచయిత; ఎడ్వర్డ్ మంచ్ (1863-1944): ప్రసిద్ధ చిత్రకారుడు; గస్టావ్ విగెలాండ్ (1869-1943) : ప్రసిద్ధ శిల్పి, నట్ హేమ్సన్ (1859-1952) : నోబెల్ బహుమతిని పొందిన రచయిత; ఫ్రిజోఫ్ నాన్సెన్ (1861-1930) : దేశాన్వేషకుడుగ, విజ్ఞానిగ, మానవతావాదిగ పేరొందిన నోబెల్ బహుమతిని ఆర్జించినవాడు; సిగ్రిడ్ అండ్సెట్ (1882-1949) : నోబెల్ బహుమతిని ఆర్జించిన రచయిత్రి; తోర్ హైయర్డాల్ (జ 1914) : దేశాన్వేషకుడు, విజ్ఞాని; రెల్లు పడవలో పయనించి, ఆఫ్రికాను చుట్టి వెస్ట్ ఇండీస్ చేరిన సాహసికుడు

**14. పాలిత ప్రాంతములు :** దురాక్రమణ ద్వారా సంపాదించిన పలు వలస ప్రాంతములు దేశమునకు లేకున్నను, ఈ దేశపు సాహసిక దేశాన్వేషకులు తొలుత కాలిడుటవలన దేశమునకు చెందినవిగ ఈ దిగువ ప్రాంతములు లెక్కింపబడు చున్నవి :

1. స్వాల్బర్డ్ ద్వీపజాలము : నిర్జనము (దీనిని గురించి ఇదివరకే తెలుపబడినది); ఇందు రాక్షసి బొగ్గు లభించుచున్నది.

2. జాన్‌మెయిన్ ద్వీపము : నార్వే సముద్రమున ఉన్నది; వైశాల్యము 372 చ. కిమీ; జనావాసములు లేవు; వాతావరణ పరిశోధనశాల పని చేయుచున్నది

3. బోవెట్ ద్వీపము : దక్షిణ అట్లాంటిక్ లోనిది; వైశాల్యము 58 చ. కిమీ; నిర్జనము.

4. పీటర్‌దీవి, క్వీన్‌మాడ్‌లాండ్ ప్రాంతము : ఇవి అంటార్కిటికాకు చెందినవి. నార్వేదేశపు సాహసికులు తొలుతగ కాలిడుటవలన ఈ దేశము తనవిగ వీనిని పరిగణించినను కొన్ని రాజ్యములు ఇందులకు అంగీకరించుటలేదు (చూ : అంటార్కిటికా); పీటర్ దీవి వైశాల్యము 250 చ. కిమీ; క్వీన్‌మాడ్‌లాండ్ ప్రాంతపు వైశాల్యము అనిర్ధారితము : 20° ప. - 45° తూ. తులారేఖలమధ్య అంటార్కిటికా యందున్న వృత్త ఖండమిది. ఇవి నిర్జనములు.

# 13. నెదర్‌లాండ్స్

## (హాలండ్)

**ముఖ్యనగరము :** రాజకీయ రీతిగ ప్రధాన స్థానము ఆమ్‌స్టెర్‌డామ్; ప్రభుత్వ స్థావరము హేగ్ (దెన్ హాగ్); **జెండా :** ఎరుపు, తెలుపు, లేత నీలిమ రంగుల అడ్డుచారలు కలది; **జాతీయ గీతము :** విల్‌హెల్‌మస్ ఫాన్ నస్సావెన్ (నస్సావ్ నగరపు విలియమ్) అనునది; **నాణెము :** గిల్డర్; ఇది 100 సెంట్లుగ విభక్తము. ఒక గిల్డర్ = రు. 2.08; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30. ని.

**1. ఉనికి మొ. :** యూరప్ ఖండమున వాయవ్య ప్రాంతమున 3°22′-7°13′ తూ. తు.

రేఖల మధ్యను 50°46'–53°32' ఉ. అ. రేఖల మధ్యను నెలకొనియున్న ఈ దేశమునకు పశ్చిమమున, ఉత్తరమున ఉత్తర సముద్రము, తూర్పున పశ్చిమ జర్మనీ; దక్షిణమున బెల్జియం సరిహద్దులందు ఉన్నవి. దేశమునందున్న నదీ ముఖద్వారములు, సరసులు మొదలగువానితోసహా భూభాగపు వైశాల్యము 43,000 చ. కిమీ; ఇందు పైవి పోగా మిగిలిన అసలు భూప్రాంతము 33,612 చ. కిమీ; అయినను నీటిమడుగులను, సముద్ర తీర ప్రాంత నిమ్నభూములను పూడ్చి భూతలముగ మార్చివేయు




పటము 13.

కార్యక్రమమువలన భూమియొక్క వైశాల్యము క్రమేణ వృద్ధియగుచున్నది.

భూతలరీత్యా దేశమును మెరకదిబ్బలు, నిమ్న భూములు, ప్రాచ్యభాగపు ఉన్నతభూమి అని మూడు భాగములుగ విభజింపనగును. దేశమున అయిదింట రెండువంతుల భూమి సముద్ర మట్టమునకు దిగువన ఉన్నది. పశ్చిమ తీరమున ఇసుక మెరకదేరిన దిబ్బలు. నిమ్నభూములను సముద్రపు పోటునుండి కాపాడుచు కొన్ని ప్రాంతములందు ఆ దిబ్బలున్నవి. ఇవిగాక కృత్రిమముగ నిర్మింపబడిన కట్టగోడలు (డైక్స్) ఇట్టి ప్రాంతములను వెల్లువల బారినుండి రక్షించుచున్నవి. తూర్పున, ఆగ్నేయమున ఇసుక కలసిన మట్టితో కూడిన ఉన్నతభూమి కలదు. ఇచట సైతము భూమి ఎత్తు ఎచటను 323 మీటరులను మించదు. ఇక నిమ్న భూములందలి కొన్ని ప్రాంతములు సముద్రపు మట్టమునకు 6 మీటరుల దిగువన ఉన్నవి. దేశపు నదులలో రైన్, మాస్ నదులు ప్రముఖములు; కాలువలు అనేకములు కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** చల్లని గ్రీష్మఋతువులు, వెచ్చని శీతకాలములు కలిగి, సమశీతోష్ణతకు పేరొందినది ఈ దేశము. జనవరిలో సరాసరి ఉష్ణోగ్రత 37° ఫా.; జులైలో 63° ఫా; సాలున సరాసరి ఉష్ణోగ్రత 50° ఫా. ప్రతిదినమున ఆకాశము చాల వరకు మేఘావృతమై ఉండును. శీతకాలమున పొగమంచు ఎక్కువ; ఆ కాలమునందే ఎక్కువగ వానలు కురియును. సాలున సగటు వర్షపాతము 74 సెం. మీ. ఓక్, పైన్, బీచి వృక్షములు ఎక్కువగ ఉన్నవి. పుష్పజాతులకు ఈ దేశము పేరుపొందినది. సముద్రమునను, నదీ సరస్సులందును మత్స్యసంపద విశేషముగ కలదు. మధ్య, పశ్చిమ యూరపులలోని పక్షిజాతులే ఇట సైతము కనవచ్చుచున్నవి.

**3. జనసంఖ్య మొ.:** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,32,69,563. జన సాంద్రత చ. కిమీ. కు 394. దేశపు నగరములలో ఆమ్‌స్టర్‌డామ్ (జ. సం. 8,07,742), రోటర్‌డామ్ (6,70,060), హేగ్ (5,25,368), ఉట్రెక్ట్ (2,74,974) ప్రముఖములు. ఇవిగాక లక్షకు పైబడిన జనసంఖ్య కలిగిన నగరములు

11 కలవు. మొత్తముమీద దేశ ప్రజలలో 65%, పట్టణములలో (అనగా 10 వేలకు పైబడిన జనులుండు జనావాసములలో) వసించుచున్నారు. ప్రజానీకమున 47% పశ్చిమ ప్రాంతపు మూడు రాష్ట్రములలోనే కలరు; ఇచటి జనసాంద్రత చ కిమీ కు 2 170. ప్రజలలో నార్డిక్, ఆల్పైయిన్ జాతులు సమ్మేళనము చెందినవి. సాధికారభాష డచ్చి (హాలండ్స్); దేశపు 11 రాష్ట్రములలో పదింట ప్రజలకు ఇది మాతృభాష; ఫ్రీస్‌లాండ్ రాష్ట్రమున మాత్రము ప్రాచీన ఫ్రిజియన్‌భాష ప్రజలలో అత్యధిక సంఖ్యాకులందు మాతృభాషగ ప్రచారమున ఉన్నది; ఇది డచ్చికి సన్నిహితము. ప్రజలలో పలువురు ఇంగ్లీష్. జర్మన్, ఫ్రెంచి భాషలను చక్కగ మాటాడగలరు. సెకండరీ పాఠశాలలలో మాతృభాషతోపాటు ఈ భాషలును బోధింపబడుచున్నవి. ప్రజానీకమున 40.5% రోమన్ కేథలిక్కులు; తక్కినవారిలో ఇతర క్రైస్తవ సంప్రదాయములు ప్రచారమున ఉన్నవి. మత స్వాతంత్ర్యము చట్టరీత్యా అమలున కలదు.

**4. సమాచార సౌ.:** తపాలా, తంతి, టెలిఫోన్ వసతులు దేశమున విరివిగ కలవు. టెలిఫోనుల సంఖ్య 24 లక్షలు (1972). రేడియో బ్రాడ్‌కాస్టింగ్‌ను అయిదు ప్రయివేటు సంస్థలు నిర్వహించుచున్నవి. టెలివిజన్ సౌకర్యములు విస్తృతముగ కలవు. దేశమున 32 లక్షల టెలివిజన్ సెట్టులు కలవు (1972).

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 47,777 కిమీ; ఇది అంతయు ఉచ్చస్థాయికి చెందినది. సముద్ర వ్యాపారమున పాల్గొను నౌకల సంఖ్య 1,034; వాని ప్రమాణపు మొత్తము 4,899 వేల టన్నులు. దేశాంతర్గత జలమార్గములలో పయనించు పడవలు 19,943 కలవు; వాని మొత్తపు ప్రమాణము 6,896 వేలు. అట్టి దేశాంతర్గత జలమార్గముల మొత్తపు నిడివి 5,700 కిమీ; దేశపు సముద్రతీరపు హార్బరులలో ప్రముఖము రోటర్‌డామ్; 'యూరపునకు ద్వారమార్గము' అని ఇది పేరుగన్నది. రైలుమార్గముల నిడివి 3,148 కిమీ ; ఇందు 1,646 కిమీ. లలో బండ్లు విద్యుత్ సాయమున నడచుచున్నవి (1972). దేశపు విమానయాన సంస్థ (రాయల్ డచ్ ఎయిర్‌లైన్స్-కె ఎల్ ఎమ్) ప్రపంచ విమాన సంస్థలలో తొలుతటిది. ఇది 7 అక్టోబరు, 1919 న వ్యవస్థితమైనది. విదేశములందలి 130 ప్రముఖ నగరములతోను, దేశాంతర్గత వివిధ నగరములమధ్యను విమానయాన సౌకర్యము కలదు. ఆమ్‌స్టర్‌డామ్ సమీపమున ఉన్న షిఫాల్ విమానాశ్రయము అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినది.

**6. చరిత్ర:** 16 వ శతాబ్దివరకు ఈ దేశము, పవిత్ర రోమక సామ్రాజ్యమున భాగముగ ఉండెడిది. 1568 మొదలుగ దేశవాసులలో స్వాతంత్ర్యాకాంక్ష ప్రబలి, కడకు ఆరంజి కుటుంబమునకు చెందిన విలియమ్ అను రాకుమారుని నాయకత్వమున సాగిన తిరుగుబాటులవలన 1648 లో ఒక ఒడంబడికద్వారా ఒక గణరాజ్యముగ ఈ దేశము అవతరించినది. 17 వ శతాబ్దమున ఈ దేశపు ప్రసిద్ధ నావికులు సముద్రాంతర దూరదేశములకు పయనించి అట వ్యాపార స్థావరములను నెలకొల్పిరి. తత్ఫలితముగ వ్యాపారరంగమున ఈ దేశము ఎంతయో పురోగమించి, నౌకాబలముగల దేశములలో ఒకటిగ రాణకెక్కినది. దూరప్రాచ్యమున ఇండోనీసియాలోను, భారతదేశమునను, దక్షిణ ఆఫ్రికాయందును, వెస్ట్‌ఇండీస్‌లోను ఈ దేశమునకు వలసలు ఏర్పడినవి. ఈ వలసలను, వ్యాపారమును రక్షించుకొనుటకై పలుమారులు తక్కిన కొన్ని యూరపీయ రాజ్యములతో-అందును ముఖ్యముగ ఇంగ్లండుతో - ఈ దేశము యుద్ధములను సాగించినది; వలసలవలనను వ్యాపారము

చేతను సుసంపన్నమై, సాంస్కృతికముగ వికసించి, ప్రసిద్ధ లలితకళాకారులకు నిలయమైనది. ఇంతలో నెపోలియన్ ఫ్రాన్సు దేశమునకు పాలకుడై యూరపు నంతటిని జయించు కృషిని సాగించినపుడు, ఈ రాజ్యమును లోగొని తన సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసికొనెను. 1815 లో, నెపోలియన్ పతనానంతరమున, ఈ రాజ్యము మరల అవతరించినది కాని గణరాజ్యమునకు బదులుగ, ఒక రాజరికము అట నెలకొల్పబడెను. ఆ రాజవంశమున తొలుతటి రాజు ఆరంజి నస్సావ్ నగరమునకు చెందిన ఒకటవ విలియమ్. ఆనాడు బెల్జియం దేశముకూడ, దక్షిణ నెదర్లాండ్స్ అను పేర, ఈ రాజ్యమున భాగముగ ఏర్పడినది. కాని 1830 లో ఆ ప్రాంతము విడిపోయినది. 1848 లో దేశమున పార్లమెంటరీ ప్రభుత్వము ఏర్పడి, రాజు రాజ్యాంగబద్ధ పాలకుడయ్యెను. తక్కిన పశ్చిమ యూరపీయ రాజ్యములతో సాగిన యుద్ధములవలన దేశము కొన్ని వలసలను కోల్పోయినను, ఇండోనీసియాయును, పశ్చిమార్ధ గోళమందలి సురినామ్, నెదర్లాండ్స్ ఏంటిల్లీస్‌ను ఈ దేశపు వలసలుగనే దీర్ఘకాలము ఉండినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ఇండోనీసియా విడివడి స్వతంత్ర రాజ్యమైనది. తక్కినవియు దాదాపుగ స్వతంత్రములై సౌహార్దరీతిలో ఈ దేశముతో సన్నిహిత సంబంధములను కలిగియున్నవి (చూ. పు. 544, 668).

**7. పరిపాలన :** దేశమున ఆనువంశికము, రాజ్యాంగబద్ధము అగు రాచరికపు పాలన అమలున ఉన్నది. కార్య నిర్వహణాధికారము మంత్రి మండలితోకూడిన పాలకునియందే న్యస్తమై ఉన్నను, పార్లమెంటునందలి అధిక సంఖ్యాకుల ఆమోద బలమును అది కలిగియుండవలయును. పార్లమెంట్ (స్టేట్స్ జనరల్) న ప్రథమ కక్ష్య (ఎర్‌స్టీ కెమెర్), ద్వితీయ కక్ష్య (ట్వీడీ కెమెర్) అనబడు రెండు కక్ష్యలు కలవు. ప్రథమ కక్ష్యయందలి సభ్యసంఖ్య 75; వీరిని రాష్ట్ర శాసనసభలు ఎన్నుకొనును; ఈ కక్ష్యలోని సభ్యుల పదవీకాల పరిమితి ఆరేండ్లు; అయినను మూడేండ్ల కొకసారి వంతువారీగా సగముమంది సభ్యులు పదవీవిరమణ చేయుటకును, ఆ స్థానములకు తిరిగి ఎన్నికలు జరుగుటకును వసతి కల్పింపబడినది. ద్వితీయ కక్ష్యలోని సభ్యసంఖ్య 150; వీరిని సార్వజనికమగు వోటు హక్కుతో, ప్రజలు నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతిన ఎన్నుకొనెదరు. ఈ కక్ష్యకు ఎన్నికలు సాధారణ రీతిలో నాలుగేండ్లకు ఒకసారి జరుగును. పాలకుడు రెండు కక్ష్యలనుగాని, ఒక కక్ష్యనుగాని రద్దుచేయవచ్చునుగాని, ఆ వెనువెంటనే 40 దినములలోపల ఎన్నికలనుజరిపి వానిని విధిగ పునర్నిర్మించవలయును. మంత్రిమండలిలోని సభ్యులు పార్లమెంటున సభ్యులై ఉండవలయునను నియమములేదు. 18 ఏండ్ల వయసునకు తగ్గని ప్రజలకు వోటుహక్కు కలదు. ద్వితీయ కక్ష్యయందు మాత్రమే బిల్లులు ప్రవేశపెట్టబడుట, సవరణలను ప్రతిపాదించుట జరుగును. ప్రథమ కక్ష్య వానిని ఆమోదించుటయో, తిరస్కరించుటయో చేయును. రాజునకు సలహా ఇచ్చుటకు ఒక స్టేట్ కౌన్సిల్ కలదు. ఇది పరిపాలనా విషయములకు సంబంధించినంతవరకు ఉచ్చతమ న్యాయస్థానముగ వ్యవహరించును. రాష్ట్రములందలి పాలనను ఎన్నుకొనబడిన రాష్ట్ర సభల సాయమున కమీషనరులు నిర్వహింతురు. ప్రముఖ రాజకీయ పక్షములు ఏడు కలవు. అందు కేథలిక్ పార్టీకి సంఖ్యాబలము ఎక్కువ. 20 జడ్జీలుకల ఉన్నత న్యాయస్థానపు ఆధ్వర్యవమున దేశమున న్యాయ నిర్వహణ వివిధ శ్రేణులలో జరుగుచున్నది

**8. దేశరక్షణ :** ఇరువదవ శతాబ్ది ఆరంభమున నుండియు సార్వజనికమగు సైనిక శిక్షణ అమలున ఉన్నది. 20 ఏండ్ల వయస్సువచ్చి, స్వస్థ శరీరముగల ప్రతి మగవాడును 16 నెలల సైనిక

శిక్షణను పొందవలయును. శాంతికాలపు భూతల సైనికసంఖ్య 83,700. నౌకాసేనలోని సైనిక సంఖ్య 20,000. భూతల సేనలో ఒక పటాలము ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థా కార్యక్రమము లకు వినియుక్తమై పశ్చిమ జర్మనీయందు ఉన్నది. నౌకాసేనయందు రెండు క్రూయిజర్లు, 6 జలాంత ర్గాములు, తక్కిన తీరుల యుద్ధోపయోగ నౌకలు 100 నకు మించి కలవు. దేశమునందలి డెన్ హెల్డర్ వద్దనేగాక, నెదర్లాండ్స్ యాంటిల్లీస్‌లోని విల్లెమ్ స్టాడ్‌వద్దకూడ ఈ నౌకాసేనకు ఒక స్థావరము కలదు. వాయుసేనయందలి సైనికసంఖ్య 22,000. అందు 145 పోరాట విమానములును, సముచిత సంఖ్యలో తక్కు రకముల సహాయక విమానము లును కలవు (1970). ఈ మూడు విధముల సేనలలోని సైనికులును ఆధునిక రీతిలో సుశిక్షితులు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. సంస్థాపక సభ్యరాజ్యములలో ఈ దేశమును చేరిఉన్నది. బ్రస్సెల్స్ ఒడంబడిక (బెల్జియం, నెదర్లాండ్స్, లక్జెంబర్గ్, ఫ్రాన్స్, గ్రేట్ బ్రిటన్‌లమధ్య ఒడంబడిక) లోను, ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలోను, యూరపీయ కామన్ మార్కెట్‌నను, ఇంక ఇతర యూరపీయ, అంతర్జాతీయ వ్యవస్థలందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. అంతర్జాతీయ న్యాయస్థానము హేగ్ నగరమున పనిచేయుచున్నది. లక్జెంబర్గ్, బెల్జియములతో ఈ దేశమునకు సుంకముల ఒడంబడిక కలదు. వర్ధమాన దేశములలో అనేకములు ఈ దేశమువలన ఆర్థిక, సాంకేతిక సాహాయ్యమును పొందుచున్నవి. వానిలో కొలంబియా, శ్రీలంక, భారతదేశము, నైగీరియా, సుడాన్, పాకిస్తాన్ ప్రముఖములు.

**10. ఆర్థిక రంగము :** వ్యవసాయోత్పత్తి యందు ఈ దేశము ఎంతో పురోగతిని ఆర్జించినను, జాతీయోత్పత్తిలో అత్యధిక భాగము పరిశ్రమల వలననే లభించుచున్నది. వ్యవసాయోత్పత్తిలో మూడవభాగము విదేశములకు ఎగుమతి అగుచున్నది. అత్యాధునిక సాంకేతిక విజ్ఞానమును పనిగొనుటవలన దేశమున వ్యవసాయోత్పత్తి చాల అధికమైనది. దేశపు భూతలమున (77%-దాదాపు 22 లక్షల హెక్టేరులు) వ్యవసాయమున ఉన్నది. ఇందు 63% పశువుల మేతబీడులకును; 31% సేద్యమునను, 6% ఉద్యానవన కృషికిని చెందిఉన్నవి. ఇచటి సేద్యమున మానవశ్రమకన్నను యంత్ర కృషికే ఎక్కువ ప్రాముఖ్యము కలదు. అందువలన దేశపు కార్మిక శక్తిలో 7% మాత్రమే వ్యవసాయమున వినియుక్తము. వ్యయసాయము శీతోష్ణ వ్యత్యాసముల బాధకు లోనుగాకుండ ఉండుటకై గాజు పైకప్పుల దిగువన వ్యవసాయమును సాగించు ప్రక్రియ ఈ దేశమున 68,000 హెక్టేరులలో అమలున ఉన్నది. అందు విద్యుత్ సహాయమున పంటకు తగిన ఉష్ణతను కల్పింతురు. వ్యవసాయకుడు సేద్యమునేగాక పశుపాలనను సైతము అవలంబించి కృషిచేయును వ్యవసాయోత్పత్తులలో ఆహార ధాన్యములు, దుంపలు, పప్పుగింజలు, చక్కెర, పశుగ్రాసము, నార, ప్రముఖములు. ఆ ఉత్పత్తుల ఎగుమతులలో బంగాళాదుంపలు, పప్పుగింజలు, విత్తనాలు, నార పేర్కొనదగినవి. దేశమున పశుసంపద విస్తారముగ కలదు. 1971 లెక్కలను అనుసరించి గోజాతి 42,00,553; గుర్రములు 35,894; గొర్రెలు 5,72,153; కోళ్లు 610 లక్షలు కలవు. ప్రపంచపు గోజాతులలో అత్యుత్తమ శ్రేణికిచెందిన జాతి ఇట కలదు. ఒక్కొక పాడిఆవు వలన 4,250 కి. గ్రా. పాలు లభించునని అంచనా. ఇటుల లభించు పాలలో 30% పాలుగను, 30% వెన్నగను, 20% జున్నుగను, 10% గడ్డపాలుగను, 10% పాలపొడిగను వినియుక్తము లగుచున్నవి. ఈ ఉత్పత్తులలో అధిక

భాగమును, ఉద్యానవన కృషికిచెందిన పుష్పజాతులును విరివిగ ఎగుమతి అగుచున్నవి. 1970 లో జరిగిన ఎగుమతులలో వ్యవసాయోత్పత్తులవలన 409.3 కోట్ల గిల్డర్లును; పాల ఉత్పత్తులవలన 552.8 కోట్ల గి. లును; ఉద్యాన కృషియందలి ఉత్పత్తులవలన 267.3 కోట్ల గి. లభించినవి. దేశమున మత్స్య పరిశ్రమయు పలువురకు జీవనాధారముగ ఉన్నది. దేశమున కోళ్ళ పరిశ్రమ అధునాతన రీతిలో సాగుచున్నది. దాదాపు 3,000 కోళ్ళ ఫారములు కలవు. సాలున దాదాపు 300 కోట్లగుడ్ల ఉత్పత్తి జరుగును. ఇందు అధికభాగము ఎగుమతియగును. దేశపు రేవు నగరములను ఆశ్రయించి ఈ కృషి సాగుచున్నది. 1971 లో 29.34 కోట్ల విలువగల చేపల పట్టుబడి సాగినది. అడవులు తక్కువగుటవలన అటవీ పరిశ్రమ లెక్కింపదగినంతగ జరుగుటలేదు. లభించు ఖనిజములలో రాక్షసిబొగ్గు, పెట్రోలియం, ఉప్పు, ఇంధన వాయువు మాత్రమే గణనీయములు. బొగ్గు ఉత్పత్తి క్రమేణ తగ్గిపోవుచున్నది. పెట్రోలియం దేశావసరములలో 10% కు మాత్రమే సరిపోవుచున్నది. ఇంధనవాయువు దేశావసరములకు వినియుక్తము. దేశపు విద్యుదుత్పత్తి 2,043 కోట్ల కివా. (1971). పరిశ్రమలలో దేశపు కార్మికబలమున 42% వినియుక్తము. ఇందు 33% లోహపరిశ్రమలలోను, 18% దుస్తుల కుట్టుపని పరిశ్రమలలోను 15% ఆహార సంబంధ పరిశ్రమలందును, 7 రాసాయనిక పరిశ్రమలందును, 27% తక్కురీతుల పరిశ్రమలందును పనిచేయుచున్నారు. ఈ పరిశ్రమలకై ముడిసరుకులు చాలవరకు విదేశములనుండి దిగుమతి అగుచున్నవి. విదేశములనుండి దిగుమతి అయిన ముడిపెట్రోలియం, సంస్కరితమయి మరల చాలవరకు ఎగుమతి అగుచున్నది. దేశపు ఎగుమతులలో ఇంధన తైలములు, సంస్కరిత లోహములు, రాసాయనికములు, జవుళి, పాల ఉత్పత్తులు ప్రముఖములు. దిగుమతులలో యంత్రజాలము, పెట్రోలియం, ఇనుము, ఉక్కు ఉత్పత్తులు గణనీయములు. దేశపు ఎగుమతుల విలువ 4,18,14,715 వేల గి.; దిగుమతుల విలువ 4,49,40,584 వేల గి. (1971). చెల్లింపులలోటును, విదేశములందలి పెట్టుబడులవలన, సేవాకృత్యములవలనను ప్రభుత్వము సర్దుకొనగలుగుచున్నది. బడ్జెటరీ వ్యయము 3,815.1 కోట్ల గిల్డర్లు (1972).

**11. సాంఘిక రంగము :** ద్వితీయ ప్రపంచ యుద్ధమున ఈ దేశము ఎక్కువగ నష్టపడినను, 1950-1965 మధ్యకాలమున ఎంతయో అభివృద్ధిని సాధించి పూర్వముకన్న మిన్నగ సంపన్నమైనది. దేశపు సమష్టి జాతీయోత్పత్తి 9,133 కోట్ల గి; తలసరి ఆదాయము 5,800 గి. (1968) యుద్ధకాలమున నష్టమైన గృహవసతిని పునర్నిర్మించుటకును, పెరిగెడు జనమునకు తగిన నూత్న గృహములకు నిర్మించుటకును 1953 మొదలుగ ప్రభుత్వము కృషిచేయుచున్నది. అయినను ఆ వసతి ఇప్పటికిని తగినంతగ లభింపకున్నది. దేశమున సువ్యవస్థితమగు కార్మికోద్యమము కలదు. వివిధ సాంఘిక భద్రతా పథకములు - పిల్లల పోషణకై భృతి, వృత్తి విరమణ తరువాత పెన్షను, ఆరోగ్య భీమా, వికలాంగులకు భృతి, నిరుద్యోగ భృతి, వార్ధక్య భృతి, వితంతు భరణభృతి, అనాథ శిశు సంరక్షక భృతి, జాతీయ సహాయ్య భృతి - అమలున ఉన్నవి. వారమున అయిదు దినములు - 45 గంటలు - మాత్రమే కార్మికుల పనికాలము. కార్మికుని కనీసపు నెలసరి వేతనము 985.40 గిల్డర్లు. నిరుద్యోగికి అతని పనికాలమున సంపాదించదగుదానిలో 80% భృతిగ ఇవ్వబడును. 6 నుండి 15 ఏండ్లవరకు వయసు కలవారికి నిర్బంధోచిత విద్యావిధానము అమలున ఉన్నది. 6,613 శిశువిద్యాశాలలలో 4,91,505 మంది; 8,288 ప్రయిమరీ పాఠశాలలలో 14 64,484 మంది;

819 ప్రత్యేక పాఠశాలలలో 76,306 మంది; సాధారణ సెకండరీ పాఠశాలలు 1,528 లో 6,26,442 మంది; సాంకేతిక సెకండరీ పాఠశాలలు 2,068 లో 1,84,546 మంది; వివిధ ఉన్నత పాఠశాలలు 136 లో 33,050 మంది విద్యార్థులు కలరు (1970-71). విశ్వవిద్యాలయములును, అట్టి స్థాయికే చెందిన ఉన్నత విద్యా సంస్థలును కలసి మొత్తముమీద 12 ఉన్నవి. అందలి విద్యార్థిసంఖ్య దాదాపు 120 వేలు (1971). దేశమునందలి ఉత్తమ గ్రంథాలయములు హేగ్, ఆమ్‌స్టర్ డామ్, లీడెన్, ఉట్రెక్ట్, గ్రోనింజెన్ నగరములందు కలవు. వీని అన్నింట హేగ్‌నందలిది ప్రముఖము; అందు 9 లక్షల సంపుటములును, 30 వేల వ్రాతప్రతులును కలవు. దేశమున 325 మ్యూజియములు కలవు. అందు ప్రముఖములగు 28 లో హేగ్‌న 5, లీడెన్‌న 4, రోటర్‌డామ్‌లో 3, ఉట్రెక్ట్‌లో 2 కలవు. దినపత్రిక అనునది ప్రపంచమున తొలుతగ ఈ రాజ్యముననే వెలువడినది. అటుల 1656 లో వెలువడిన ఓప్రెక్తే హార్‌లెమిస్కె కౌరాంట్ అనునది, ఇపుడు హార్‌లెమిస్కె కౌరాంట్ అనుపేరున ప్రచారమున ఉన్నది. దేశమున పత్రికా స్వాతంత్ర్యము కలదు. 84 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి; వాని పాఠకసంఖ్య 41 లక్షలు. దినపత్రికలలో ఆమ్‌స్టెర్‌డామ్‌నుండి వెలువడు డి టెలిగ్రాఫ్ అనుదానికి ఎక్కువ ప్రచారము కలదు. దేశమున ఆరోగ్య రక్షణకై ప్రభుత్వముచేయు నిరంతర కృషివలనను, పౌష్టికాహారములవలనను జీవిత కాలవ్యవధి క్రమేణ పెరుగుచున్నది. అపేక్షిత జీవితకాల వ్యవధి పురుషునకు 71.1 సంవత్సరములు; స్త్రీకి 74.7 సం. (1965). సాలున మరణములసంఖ్య 1,000 కి 8.2 (1968). 67,250 శయ్యా సంఖ్యగల 265 ఆసుపత్రులుకలవు; అందలి వైద్యసంఖ్య 14,774. 850 మంది ప్రజలకు ఒక డాక్టరు చొప్పున కలరు (1967).

**12. యాత్రా సౌ.** : దేశపు ఆర్థిక వ్యవస్థలో యాత్రికులవలన వచ్చు ఆదాయమునకు ప్రముఖ స్థానము కలదు. విదేశములలో పెక్కింటికి చెందిన వారికి వీసాలు అక్కరలేదు; పాస్‌పోర్టులు చాలును. 1968 లో యాత్రికులవలన దేశమునకు 116.6 కోట్ల గిల్డర్ల ఆదాయము లభించినది; ఆ సంవత్సరమున 19,28,900 మంది విదేశీయులు దేశమును దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** క్రీ. శ. 15 వ శతాబ్దిలో రూపొందిన ఈ దేశము తదాదిగ రాజకీయ, సాంస్కృతిక రంగములందు ప్రపంచ ఖ్యాతిగాంచిన పలువురు ప్రముఖులకు జన్మభూమియైనది : 1. ఆధునిక నెదర్‌లాండ్స్ సంస్థాపకుడుగ పేరొందిన విలియమ్ ఆఫ్ ఆరంజి (1533-1584); 2. డెసిడేరియస్ ఎరాస్మస్ (1465-1536): మానవతావాద జనకుడుగను, రచయితగను పేరొందినవాడు; 3. హ్యూగో గ్రోషియస్ (1583-1645) : న్యాయశాస్త్రవేత్త, రాజనీతిజ్ఞుడు, అంతర్జాతీయ న్యాయశాస్త్రమునకు తొలిరూపమును కల్పించినవాడు; 4. రెంబ్రాంట్ (1606-1669): విశ్వవిఖ్యాతిని ఆర్జించిన చిత్రకారుడు; 5. క్రిస్టియాన్ హుయ్‌గెన్స్ (1629-1695) : భౌతిక శాస్త్రవేత్త; గణితజ్ఞుడు; 6. విన్సెంట్ వాంగో (1853-1890): సుప్రసిద్ధ చిత్రకారుడు; 7. జాన్ పీటర్‌సన్ స్వీన్‌లిక్ : వాగ్గేయకారుడు, సంగీత శాస్త్రాధ్యాపకుడు; 8. జోహాన్ రుడాల్ఫ్ థార్‌బెక్ (1798-1872): రాజనీతివేత్త; రాజ్యాంగ విధాన రచయిత.

ఈ దేశవాసులలో 10 మంది 1901 మొదలుగ ఇప్పటివరకు నోబెల్ బహుమతిని ఆర్జింపగలిగిరి. 1911 లో శాంతిసాధన కృషికై తోబియస్ మైకెల్ కేరెల్ అస్సర్ (1838-1913) నోబెల్ బహుమతిని ఆర్జించెను.

# 14. పోర్చుగల్

**ముఖ్యనగరము :** లిస్బన్; **జెండా :** మొత్తమున అయిదింట మూడువంతులు, దండమువద్ద, ఆకుపసిమి రంగును, తక్కినది ఎరుపు రంగును




పటము 14.

కలిగియుండగ అవి రెండును కలయుచోట, నడుమన పసిమి, ఎరుపు, నీలి, తెలుపు వన్నెలతో అలంకృతమగు జాతీయ యోధలాంఛన చిత్రము కలది; **జాతీయ గీతము :** 'ఆ పోర్చుగీసే' అను నది; **నాణెము :** ఎస్కుడో; ఇది 100 సెంటావోలుగ విభక్తము; 23.75 ఎస్కుడోలు = రు 7.50; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి. **కాలగణన :** పగలు 12 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1 ఉనికి మొ :** యూరపు ఖండమున అత్యంత పశ్చిమ ప్రాంతమున, 6°11′–9°30′ ప. తు. రేఖల మధ్యను (224 కిమీ.), 36°58′–42°9′ ఉ. అ. రేఖలమధ్యను (579 కిమీ.) కుదురుకొనియున్న ఈ దేశమునకు పశ్చిమ, దక్షిణములందు అట్లాంటిక్ మహాసముద్రము; తూర్పు, ఉత్తరములందు స్పెయిన్ దేశము సరిహద్దులందు ఉన్నవి. ఐబీరియన్ ద్వీపకల్పపు పశ్చిమ తీర ప్రాంతమున అధికభాగమును లోగొనిన ఈ దేశపు సముద్రతీరపు నిడివి 800 కిమీ. ఇదిగాక దేశ తీరమునకు పశ్చిమమున 1,280 కిమీ ల దూరమున నెలకొని అజోర్స్ ద్వీపసముదాయము అని వ్యవహృతమగు 9 దీవుల గుంపును (వైశాల్యం 1,273 చ. కిమీ.); తీరమునకు నైరుతిన 960 కిమీ. ల దూరమునఉన్న మదీరా, పోర్టో సాంటో దీవులు (728 చ. కిమీ.) ను రాజ్యాంగరీత్యా ఈ దేశమున చేరిఉన్నవి. వీని అన్నింటితోకలసి దేశపు మొత్తపు వైశాల్యము 91,631 చ. కిమీ.

దేశ భూతలమున 71.4% వైశాల్యము 396 మీటరుల ఎత్తునకు తగ్గియున్నది; 12% భూమి 700 మీటరుల ఎత్తునకు మించి ఉన్నది. దేశమునందలి నదులలో మిన్హో, దౌరో, తాగస్, గ్వాడియానా నదులు ప్రముఖములు; ఇవి అన్నియు స్పెయిన్‌లో జన్మించి, ఈ దేశమున ప్రవహించుచున్నవి. వీనిలో ఈ దేశమున ఎక్కువదూరము (320 కిమీ.) ప్రవహించునది దౌరో. తాగస్‌నదికి ఉత్తర భూమియందు దేశపు పర్వతశ్రేణులు

(పెనేదా, గెరెజ్, మారావ్, మాంటిమూరో, అకోర్, లౌసా) కలవు. ఈ శ్రేణులు ఉత్తరమునుండి దక్షిణదిశకు వ్యాపించినవి. దేశమునందలి అత్యున్నత పర్వత శిఖరము ఎస్ట్రేలా (1990 మీ.).

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశము మొత్తముమీద సమశీతోష్ణ పరిధిలోనే ఉన్నను ప్రాంతములనుబట్టి ఇందు మార్పులు కననగుచున్నవి. ఉత్తర ప్రాంతమున సాగరిక శీతోష్ణస్థితి కలదు; అచట గ్రీష్మర్తువు సైతము చల్లగ ఉండును. శీతకాలమున వానలు (సాలున సరాసరిన 125 నుండి 150 సెం. మీ. వరకు) కురియును; అచట అంతటంతట హిమపాతమును కలదు. మధ్యదేశమున ఎండకాలము బాధాసంజనకముగ ఉండును; శీతకాలము మాత్రము హాయిగ ఉండి, వానలు (సాలుసరాసరి 50 నుండి 75 సెం. మీ. వరకు) కురియును. దక్షిణ ప్రాంతమున గాలి పొడిగా ఉండి, తీరప్రాంతమున మాత్రము సాలున 50 సెం. మీ. కు మించి వర్షించును. మొత్తముమీద సరాసరిన జులైలో 60° ఫా.; జనవరిలో 40° ఫా. ఉష్ణోగ్రత ఉండును. ఉత్తర ప్రాంతమున ఓక్, బీచి, పైన్, చెస్ట్‌నట్ వృక్షముల అడవులు కలవు; మధ్యదేశమున గరికపట్టులును, అటనట జీలుగు మొదలగు నిత్యహరిత వృక్షజాతులును కననగును. ఓరుపొదలును, గరికపట్టులును కడమ భూమియందు కలవు. వన్యజంతువులు లేనేలేవు. తీరజలములందు మత్స్య సంపద అధికముగ కలదు.

**3. జనసంఖ్య మొ.** : దేశపు జనసంఖ్య 86,68,267 (1970); జనసాంద్రత చ. కిమీ. కు 94 6. దేశపు నగరములలో లిస్బన్ (జనసంఖ్య 10,34,141), ఒపోర్టో (3,10,437) లెక్కింపదగినవి. దేశమున చారిత్రక గతిలో అంతటంతట వచ్చిచేరిన ఫినీషియన్, రోమన్, జర్మన్, మూర్, యూద, బర్బర, కెల్టు జాతులు సమ్మిశితము చెందుటవలన ఇచటి ప్రజానీకము రూపొందినది. దేశమున అల్పసంఖ్యాకవర్గము ఏదియు లేదు. దేశభాష పోర్చుగీజు. 97% ప్రజలు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు, కడమ వారిలో ప్రొటెస్టంట్ సంప్రదాయపు క్రైస్తవులును, యూదులును కలరు; వీరిలో యూదులు లిస్బన్, ఒపోర్టో నగరములందు మాత్రమే వసించుచున్నారు.

**4. సమాచార సా.** : దేశమున తపాలా, తంతి, టెలిఫోనుల వసతి తగినంతగ కలదు. తంతి ఆఫీసుల సంఖ్య 1,702; టెలిఫోనుల సంఖ్య 8,09,380. బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు 34, టెలివిజన్ స్టేషనులు 18 పనిచేయుచున్నవి. పోర్చుగల్ ముఖ్యభూభాగమును, అజోర్సు, మదీరాలతోను గ్రేట్ బ్రిటన్, ఉత్తర దక్షిణ అమెరికాలతోను, పశ్చిమ దక్షిణ ఆఫ్రికాలతోను అనుసంధించు కేబుల్ వసతి కలదు (1971).

**5. యాన సౌ.** దేశపు రోడ్ల నిడివి 30,501 కిమీ.; ఇందు 1,648 కిమీ. అజోర్స్ దీవులలో ఉన్నది. రోడ్లలో దాదాపు సగభాగము అత్యున్నత స్థాయికి చెందినది. రైలుమార్గముల నిడివి 3,563 కిమీ. లిస్బన్, ఒపోర్టోలలో ఉత్తమములగు హార్బరులు కలవు. దేశపు వర్తక నౌకాదళమున నౌకల సంఖ్య 152; వాని ప్రమాణము 8,22,833 టన్నులు. లిస్బన్‌నుండి వివిధ పశ్చిమ యూరపీయ రాజధానులకును న్యూయార్క్, బాస్టన్, మాంట్రీల్, రియో డి జనీరోలను విమానయాన వసతి కలదు. ప్రాదేశికరీతినిబట్టి లిస్బన్‌లోని పోర్టెలాకు, అజోర్సులోని సాంతామారియా విమానాశ్రయమునకు, అంతర్జాతీయ విమానయానమున ఎక్కువ ప్రాముఖ్యము కలదు.

**6. చరిత్ర** : ప్రాచీన కాలమున ఈ దేశమును తత్పరిసరములును కలసి లూసిటేనియా అని వ్యవహరింపబడెడివి. ఈ దేశవాసులపై అంత

టంతట కెల్టులు, గాతులు, రోమనులు, మూరులు దండయాత్రలు జరపి, వలసలను నెలకొలిపి క్రమముగ దేశీయులలో కలయుటవలన దేశప్రజల జాతి మత సంస్కృతులందు విపరీతమగు మార్పుకలిగి, పండ్రెండవ శతాబ్ది మధ్యభాగమునకు ఒక క్రొత్త జాతి అవతరించినది. అప్పటిలో ఆ ప్రాంతమున ప్రముఖతను ఆర్జించిన పోర్టస్ కేలే (ప్రస్తుతపు ఓపోర్టో) ను బట్టి పోర్చుగల్ అనుపేరు దేశమునకు కలిగినది. క్రీ. శ. 1139 లో ఆల్ఫన్సో అను ప్రభువు పాలనమున దేశము స్వతంత్ర రాజ్యముగ ఏర్పడి, 13 వ శతాబ్ది మధ్య భాగమున దేశమునకు నిర్దిష్టములగు సరిహద్దులు ఏర్పడినవి. 1385 లో ఈ దేశపాలకులు స్పెయిన్‌ను ఓడించిరి. ఇంగ్లాండుతో రాజకీయ మైత్రి 1386 లో ఈ దేశమునకు కుదిరినది. ఆ ఒడంబడిక ఈనాటికిని అమలున ఉన్నది. 15 వ శతాబ్దిలోని పాలకుని కుమారుడగు హెన్రీ సుప్రసిద్ధ నౌకాయానశాస్త్ర నిష్ణాతుడు అతడు ఆనాటి యూరపునందలి ప్రముఖ భౌగోళిక, ఖగోళ విజ్ఞానులను, నౌకాయాన వేత్తలను తన ఆస్థానమున సమీకరించి, దేశాన్వేషణకై తగు విజ్ఞాన ప్రతిపత్తి కలిగిన నావికులతో నౌకాదళములను పెక్కుదిశలకు సముద్రములపై పంపెను. ఆ దళముల కృషివలననే పూర్వ, పశ్చిమార్ధ గోళములందలి పలు ప్రాంతములకు పోర్చుగల్‌నుండి రాకపోకల తెరువులు రూపుగొనుటయు, ప్రపంచ వివిధ ఖండములందు అటనట పోర్చుగీజుల వలసల స్థాపన వలన పోర్చుగీజు సామ్రాజ్యము రూపుగొనుటయు జరిగినవి. 15, 16 శతాబ్దములు ఈ దేశ చరిత్రలో సువర్ణ యుగముగ పేరుగన్నవి. విశాల సామ్రాజ్యపు నలుమూలలనుండి సంపద, మాతృదేశమగు పోర్చుగల్‌కు ఆ కాలమున వచ్చిచేరినది 1580 లో వారసత్వరీత్యా స్పెయిన్ దేశపు పాలకునికి పోర్చుగల్ సంక్రమించినను, 1640 లో జరిగిన విప్లవము వలన వేరొక రాజవంశపు ఆధ్వర్యవమున దేశము స్వతంత్రమైనది. 17, 18 శతాబ్దములు దేశ చరిత్రలో రజతయుగముగ లెక్కకు వచ్చినవి. ఆనాడు కొంతవరకు దేశము సువర్ణయుగ కాలపు వైభవమును సంతరించుకొనగలిగినది. బ్రజిల్ నుండి వచ్చిచేరిన సంపదవలన లిస్బన్ నగరము, యూరపీయ రాజధానులలో ప్రముఖ శ్రేణియందు స్థానమును ఆర్జించినది. నెపోలియన్ విజృంభణ కాలమున, ఇంగ్లండునకు ఈ దేశము అండగ నిలిచినది. ఇటనుండియే బ్రిటిష్ సేనలు ఫ్రెంచివారిపై దండయాత్రలను సాగించినవి. కాని 1822 లో సామ్రాజ్యమునుండి బ్రజిల్ విడివడి స్వతంత్రమగుటతో దేశపు ఆర్థిక ప్రగతి దెబ్బతినినది.

1910 లో రాజరికమును తొలగించి, ప్రజలు గణతంత్ర ప్రభుత్వమును ఏర్పరచుకొనిరి. కాని ప్రభుత్వమున స్థిరత లేకపోవుటవలన 1926 లో సైనిక నియంతృత్వము ఏర్పడినది. 1932 లో ప్రధానమంత్రి కాగలిగిన ఆన్‌టోనియో డి ఆలివీరా సాలజార్ అనునతడు ఒక నూతన రాజ్యాంగ విధానమును 1933 లో వెలయించి దేశమున సమాహార గణతంత్ర (కార్పోరేటివ్ రిపబ్లిక్) ప్రభుత్వమును నెలకొల్పెను. ఇందువలన కేంద్రీకృతాధికారము గలిగ దాదాపుగ ఏకపక్ష ప్రభుత్వమని అనదగు ఒక పరిపాలనా వ్యవస్థ రూపుగొనినది. 1968 వరకు సాలాజార్ ప్రధానిగ, ప్రభుత్వమును తన అధీనమున ఉంచుకొని నిరంకుశుడుగ పాలించెను. ద్వితీయ ప్రపంచ యుద్ధమున మిత్రరాజ్యములను ఈ దేశము బలపరచినది. యుద్ధానంతరమున తక్కిన సామ్రాజ్యములందువలెనే, పోర్చుగీజు సామ్రాజ్యమున సైతము పలుస ప్రజల స్వాతంత్ర్య ఉద్యమములు చెలరేగినవి. వీనిని దౌర్జన్య మార్గమున అడచుటకై సాలాజార్ కృషిచేసి, ఐ. రా. స. యొక్క నిరసనకు గురిఅయ్యెను. భారతదేశమునందలి గోవా, డయ్యూ (దివ్), దామన్ వలస స్థావరముల ప్రజలకు భారతదేశము సాయపడుట

వలన వారు మాత్రము విముక్తినందిరి (1961). సాలాజార్, అస్వస్థతవలన, 1968 లో పదవినుండి విరమించి 1970 లో మరణించెను. అతని తరువాత ప్రధానియైన మార్సిలో చేతానో తన పూర్వీకుని పంథానే అనుసరించెను. అంతట దేశప్రజలలో నిరంకుశత్వమునెడల విముఖత ప్రబలి కల్లోలములు చెలరేగగ, సైన్యము అధికారము గ్రహించి (1973) రాజకీయ పక్షముల సలహా సంప్రతింపులతో క్రమముగ వలసరాజ్యములకు స్వాతంత్ర్యమును కలుగ చేసినది. (చూ : అంగోలా, మొజాంబిక్, గినీ - బిస్సావ్, కేప్‌వర్డీ, సావోటామీ - ఇల్‌ప్రిన్సిపీ); చీనా తీరమున పోర్చుగీజులకున్న ఒక స్థావరమగు మకావో (16 చ. కిమీ.) ను, చీనా కోరినపుడు వశపరచుటకు పోర్చుగల్ సన్నద్ధతను వెల్లడించినది. తైమరు దీవిలోని పోర్చుగీజు వలస ఇండోనేసియాకు వశమైనది. ఇటుల సామ్రాజ్య బాధనుండి దేశము విడివడినను, ప్రభుత్వమున తగు స్థైర్యము లేక పదింబదిగ ప్రభుత్వములు మారినవి. కడకు 1976 ఏప్రిల్‌లో దేశమున ప్రజాస్వామిక రీతిలో ఎన్నికలు జరిగి ప్రజాస్వామిక ప్రభుత్వము ఏర్పడినది.

**7. పరిపాలన :** చేతానోను పదవినుండి తొలగించిన తరువాత ఏర్పడిన నూత్న రాజ్యాంగ విధానమును అనుసరించి, దేశపు ప్రభుత్వాధికారము అధ్యక్షునియందును, 258 సభ్యులుకల శాసనసభ యందును న్యస్తము. అధ్యక్షుని పదవీకాల పరిమితి ఏడేండ్లు; శాసనసభకు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. దేశమున 4 రాజకీయ పక్షములు - సోషలిస్ట్, పాపులర్ డెమోక్రాట్స్, సోషల్ సెంటర్ డెమోక్రాట్స్, కమ్యూనిస్ట్ పక్షములు - పనిచేయుచున్నవి. లిస్బన్‌లోని సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున వివిధ సోపానరీతులను అనుసరించి న్యాయ నిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** పౌరులలో 21 నుండి 45 ఏండ్ల వయసుకలవారు త్రివిధ సేనలలో కొంత కాలము తప్పక శిక్షణను పొందవలయునను నియమము కలదు. దేశపు భూతల సైనికసంఖ్య 1 79,000 (1973); నౌకాసేనలోని సైనికసంఖ్య 19,000 (1972); ఈ సేనకు 4 జలాంతర్గాములును, 8 ఫ్రిగేట్లును, తక్కువిధముల యుద్ధ సహాయక నౌకలు 156 కలవు. వాయుసేనలో 21,000 యోధులు కలరు; అందలి వివిధ విమానముల సంఖ్య దాదాపు 800 (1973).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, దాని ప్రత్యేక అనుబంధ సంస్థలందు దాదాపుగ అన్నింటను, ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థ యందును, ఈ దేశమునకు సభ్యత్వము ఉన్నది. పరస్పర ఆర్థిక సహకారపు ఒడంబడికను ఒకదానిని 1964 లో ఈ దేశము దక్షిణ ఆఫ్రికాతో కుదుర్చుకొనినది. భారతదేశమునందలి పోర్చుగీజు స్థావరములు భారతదేశముతో సంలీనమయినది (1961) మొదలుగ ఆ దేశముతో పోర్చుగల్ దౌత్య సంబంధములను రద్దుచేసికొనినది; కాని 1974 లో పోర్చుగల్‌న ఏర్పడిన నూత్న ప్రభుత్వము దౌత్య సంబంధములను పునరుద్ధరించుకొనినది.

**10. ఆర్థిక రంగము :** ద్వితీయ ప్రపంచ యుద్ధము తరువాత దేశపు ఆర్థిక వ్యవస్థ కొంత పురోగమించినను 44% కార్మికశక్తి ఇప్పటికిని వ్యవసాయముననే వినియుక్తమగుచున్నది. పెట్టుబడి, యంత్రములు, ఎరువులు తగినంతగ లేక పోవుటవలన ఆ రంగమున ఆశించినంతగ అభివృద్ధి కన్పట్టుటలేదు. దేశపు తలసరి సాలీనా ఆదాయము 479 యు. స్టే. డాలర్లు (1966) దేశ భూతలమున 45% వ్యవసాయమున ఉన్నది. వ్యవసాయోత్పత్తులలో గోధుమ, మొక్కజొన్న, ఓట్లు, బార్లీ, రై, వరి, చిక్కుళ్ళు, ఉరలగడ్డలు ప్రముఖములు;

ఇవి దేశావసరములకు తగినంతగ చాలకున్నందున, కొలదిగ ఆహార వస్తువులను దేశము దిగుమతిచేసి కొనుచున్నది. పండ్లలో ఆలివ్, అత్తి, సీమబాదం, ద్రాక్ష ప్రముఖములు. మదీరాయు, దౌరానదీ ప్రాంతమును ద్రాక్ష సారాయపు ఉత్పత్తికి పేరొందినవి; ఇందు అధిక భాగము ఎగుమతి అగు చున్నది. పశుసంపద తగినంతగ కలదు; అందు వలన లభించు ఉత్పత్తులు దేశావసరములకు సరిపోవు చున్నవి. మత్స్యపరిశ్రమను అవలంబించి 33,531 మంది జీవించుచున్నారు. ఆ కృషిలో 9,347 బోట్లు పాల్గొనుచున్నవి. 1971 లో 25,279 టన్నుల చేపలు ఎగుమతియైనవి. అటవీకృషి పలు వురకు జీవనాధారము. బిరడాలకు పనికివచ్చు జీలుగుమాను (కార్కు) ఈ దేశమున విరివిగ కలదు. ప్రపంచదేశములం దన్నింట ఈ మానును ఎగుమతి చేయుటలో ఈ దేశపుది అగ్రస్థానము. ఎగుమతుల విలువలో 10% దీనివలన లభించును; యక్షధూపము (రెజిన్) టర్పెన్‌టెయిన్ తక్కిన వృక్షోత్పత్తులలో ప్రముఖములు. ఖనిజములు విరి విగ లేవు; కాని ఉన్నవానిలో టంగ్‌స్టన్, తగరము ముడిఇనుము, బొగ్గు, లిగ్నైట్, రాగి పేర్కొన దగినవి. టంగ్‌స్టన్, తగరము ఎగుమతి అగు చున్నవి. దేశపు విద్యుదుత్పత్తి 793.3 కోట్ల కివా. (1971). పరిశ్రమలందు కార్మిక శక్తిలో 20 3% మాత్రమే వినియుక్తము. అయినను జాతీయ సమష్టి సంపత్తికి దీనివలన ఎక్కువ సమకూరుచున్నది. జవుళీ పరిశ్రమ, దేశపరిశ్రమలలో అతి ప్రాచీనము; గాజు, సిమెంటు కాగితము, రబ్బరు, రసాయన ములు, జీలుగు ఉత్పత్తులు, ఆహారము - అనువానికి చెందిన పరిశ్రమలును కలవు. భారీ పరిశ్రమలు లేవు. ఎగుమతులలో జవుళీ, ద్రాక్ష సారాయము, జీలుగుమాను ఉత్పత్తులు, చేపలు, ముఖ్యములు; దిగుమతులలో యంత్రములు, మోటారు వాహన ములు, వైద్యుతిక యంత్ర సామగ్రి, ముడిప్రత్తి, ఇనుము, ఉక్కు, పెట్రోలియం ముఖ్యములు. ఎగు మతుల విలువ 3,02,48,315 వేల ఎస్కుడోలు; దిగుమతుల విలువ 5,24,16,220 వేల ఎస్కుడోలు (1971) బడ్జెటరీ వ్యయము 1,96,50,082 వేల ఎస్కుడోలు (1971).

**11. సాంఘిక రంగము :** ప్రజలకు తగినంత గృహవసతి లేదు. 1945 మొదలుగ ఈ లోటును పూరించుటకు కృషి జరుగుచున్నను తగినంత పురో గతి కన్పట్టదు. ఉన్న గృహములలో 30% కు లోపుగ మాత్రమే నీటి వసతులను, 40% మాత్రమే విద్యుత్ వసతులను కలిగిఉన్నవి. ప్రజలలో 70% అక్షరాస్యులు (1970). దేశపు 17,018 ప్రయిమరీ పాఠశాలలలో 9,92,446 మంది; 1,150 మాధ్య మిక పాఠశాలలలో 1,53,710 మంది విద్యార్థులు కలరు మూడు విశ్వవిద్యాలయములు కలవు; వీనిలో అతి సనాతనమగు కోయింబ్రా విశ్వవిద్యాలయము 1,290 లో సంస్థాపితము. విశ్వవిద్యాలయములందు అన్నింటకలసి విద్యార్థిసంఖ్య 33 860 (1970-71). ఇవిగాక 9,331 విద్యార్థులుకల సాంకేతిక విశ్వవిద్యా లయము కలదు. దేశమునందలి 200 గ్రంథాలయము లలో లిస్బన్‌లోని నేషనల్ లైబ్రరీ, అకాడమీ లైబ్రరీ; కోయింబ్రాలోని యూనివర్సిటీ లైబ్రరీ, ఓపోర్టోలోని మునిసిపల్ లైబ్రరీ ప్రముఖములు. 105 మ్యూజియములు కలవు; వానియందు లిస్బన్ లోని లలితకళల మ్యూజియం, బెలోమ్‌లోని చర్చి మ్యూజియమ్, బతల్‌హాలోని మ్యూజియం గణ నీయములు. 31 దినపత్రికలు దేశమున ప్రచార మున ఉన్నవి. వానిలో 9 లిస్బన్‌నుండి వెలువడు చున్నవి. వానియందు లిస్బన్‌లోని దయారియో డి నోటిసియస్ విపుల ప్రచారము కలది 1967 లో దేశమున 55,528 శయ్యలుకల 663 ఆసుపత్రులు కలవు; వైద్యసంఖ్య 7,838 (1,200 మంది పౌరు లకు ఒక వైద్యుడు).

**12. యాత్రా సౌ.:** విదేశీయ యాత్రికుల వలన దేశమునకు విశేషాదాయము లభించుచున్నది. 1971 లో దేశమును 39 లక్షల విదేశీయులు దర్శించిరి; దేశమున వారు 636.8 కోట్ల ఎస్కుడోలను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1. హెన్రీ రాకుమారుడు (1394-1460): పోర్చుగీజు సామ్రాజ్యమునకు పునాదులనువేసిన ప్రతిభావంతుడు, విజ్ఞాన శాస్త్రవేత్త. 2. బార్తలోమ్యూ డయస్ (1450-? 1500): గుడిహోప్ అగ్రమును చుట్టిన తొలుతటి పాశ్చాత్యుడు; 3. వాస్కో డ గామా (ర. 1460-1524). ఇండియాకు సముద్రపు బాటను కనుగొని, ఆ దేశమున పోర్చుగీజు సామ్రాజ్యమునకు అంకురార్పణ చేసినవాడు; 4. ఫెర్డినాండ్ మెజెల్లాన్ (1480-1521): నౌకలో ప్రపంచమునుచుట్టిన తొలుతటి నావికుడు; 5. ఆల్ఫోన్సో డి అల్బుకర్క్ (1453-1515): దూరప్రాచ్యమున పోర్చుగీజు సామ్రాజ్యమును విస్తరింపజేసినవారిలో ప్రముఖుడు; 6. ఆన్టోనియో డి ఆలివీరా సాలజార్ (1889-1970): పోర్చుగలును నిరంకుశముగ 35 సంవత్సరములు పాలింపగలిగిన ప్రధాని; రాజనీతిజ్ఞుడు.

---

# 15. పోలండ్

**ముఖ్యనగరము:** వార్సా; **జెండా:** తెలుపు, ఎరుపు అడ్డుచారలు సమాన ప్రమాణములలో పైనుండి దిగువకు అమరినది; **జాతీయ గీతము:**




పటము 15.

జెషెజె పోల్స్కా నీ జిన్స్లా (పోలండు ఇంకను అంతరించలేదు) అనునది; **నాణెము:** జలోటీ; ఇది 100 గ్రాస్ జీలుగ విభక్తము; 4 జలోటీలు = రు. 7.50; **కొలతతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** తూర్పు, పశ్చిమ యూరపుల మధ్యన 49°-54°50′ ఉ. అ. రేఖల మధ్యను, 14°07′-24°08′ తూ. తు రేఖల మధ్యను కుదురుకొనిఉన్న ఈ దేశమునకు తూర్పున సోవియెట్ రష్యా, దక్షిణమున జెకోస్లోవాకియా, పశ్చిమమున తూర్పు జర్మనీ, ఉత్తర దిశన బాల్టిక్ సముద్రము సరిహద్దులందు ఉన్నవి. భూతలపు సరిహద్దు నిడివి 3,014 కిమీ.; బాల్టిక్ తీరపు నిడివి 524 కిమీ. దేశపు వైశాల్యము 3,12,700 చ. కిమీ. దేశ భూతలము చాలవరకు చదునుగనుండి, అడవులు విశేషముగ కలవు. మొత్తపు వైశాల్యమున 27% ను అడవులు ఆక్రమించి ఉన్నవి. అసంఖ్యాకములుగఉన్న చిన్నవియు,

పెద్దవియునగు సరసులును నదులును దేశపు ప్రకృతికి రమణీయతను కల్పించుచున్నవి. ఒక హెక్టేరు వైశాల్యమునకు పైబడిన సరసులు 9,300 కలవు. వానిలో స్నియర్ ద్వీ అనునది వైశాల్యమున మిన్న (110 చ. కిమీ); హన్స్జా అనునది లోతున గొప్పది (103 మీ.); నదులలో విస్తులా, ఓడర్, వార్తా, బగ్, నారూ, సాన్ నదులు ప్రముఖములు; ఇవి అన్నియు బాల్టిక్ సముద్రమున చేరుచున్నవి. దక్షిణపు సరిహద్దున రెండు పర్వత శ్రేణులు - కార్పేతియన్, సుదేతెన్ శ్రేణులు - కలవు. వీనిలో తొలుతటిదానికి చెందిన తత్రాస్ పర్వతమునందలి రీసీ (2,499 మీ) శిఖరము, దేశపు అత్యున్నత శిఖరము. దేశమున అత్యధికభాగపు ఎత్తు చాల తక్కువ; సరాసరిన భూమి ఎత్తు 173 మీ. దక్షిణపు మెరకభూములు సారవంతమగు వండ్రుమట్టికి, ఖనిజ నిక్షేపములకు పేరుగన్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశము సమశీతోష్ణ మండలమున ఉన్నది. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 45° ఫా.; ఎండకాలపు సరాసరి ఉష్ణోగ్రత 60° ఫా ; చలికాలమున అది 43° ఫా. వానలు ఎండకాలమున పడును. సాలీనా వర్షపాతము నిమ్నభూములందు 49 సెం. మీ ; పర్వత ప్రాంతములందు 132 సెం. మీ. సాలీనా సరాసరి వర్షపాతము 60 సెం. మీ. నుండి 80 సెం. మీ. వరకు మారు చుండును. పశ్చిమ, ఉత్తర, మధ్యయూరపులందలి వృక్ష, జంతు సంతతులే ఇచట ఉన్నను ప్రాంత వైవిధ్యమునుబట్టి వానియందును మార్పు కననగు చున్నది వృక్షజాతులలో 70% సూచ్యగ్ర జాతికిని, తక్కినవి ఆకురాల్పు జాతికిని చెందినవి; తొలుతటి వానిలో పైన్ వృక్షములును, రెండవ జాతిలో భూర్జ, బీచి, ఎల్మ్ వృక్షములును విరివిగ కన్పట్టును. అడవిపిల్లి, కారెనుము, అడవి గుర్రము, అడవి మేకతప్ప తక్కిన వన్యజంతువులు లేవు. పక్షి, మత్స్య, కీటకజాతులు విరివిగ కలవు.

**3. జనసంఖ్య మొ** : దేశపు జనసంఖ్య 3,25,89,000 (1970, డిసెంబరు). జనసాంద్రత చ. కిమీ. కు 105. ఇందు 53% నగరములలో వసించుచున్నారు. నగరములలో వార్సా (జ సం. 13,56,000), లోడ్జ్ (7,74,000), క్రాకో (6,10,000), రోక్లా (5,42,000), పోజ్నాన్ (4,36,000); గ్డాన్స్క్ (3,78,000); షజెసిన్ (3,50,000), కటోవిచ్ (3,09,000) ప్రముఖములు. పైవానితోచేరి లక్షకు పైబడిన జనసంఖ్య కలిగిన నగరములు 24 కలవు. పోల్ జాతికిచెందని అల్పసంఖ్యాకవర్గములు 2% మాత్రమే కలవు. దేశీయభాష పోలిష్. ఇది స్లావ్‌భాషా కుటుంబమునకు చెందినది. దేశీయులలో పలువురకు జర్మన్, రషియన్, ఇంగ్లీష్ భాషలతోడను, తక్కిన స్లావిష్ భాషలతోడను, తర తమ భేదములతో పరిచితి కలదు. దేశీయులలో మతముల వ్యాప్తిని గురించి సాధికార సంఖ్యా వివరములు లేవు; కాని 95% ప్రజలు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; తక్కినవారిలో రషియన్ ఆర్తడాక్స్ చర్చివారును, దాదాపు 31,000 యూదులును కలరు. మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కలిగింపబడినను, మతప్రసక్తి ఎట్టిదియులేని సమాజమును నిర్మించుటయే ప్రస్తుత ప్రభుత్వపు ధ్యేయము.

**4. సమాచార సా** : 1971 లో దేశమున 7,656 తపాలాఫీసులు కలవు; తంతి టెలిఫోను సౌకర్యములును విరివిగ కలవు. ప్రభుత్వము 24 తరంగ ప్రమాణములపై రేడియో ప్రసారములను నిర్వహించుచున్నది. 19 టెలివిజన్ స్టేషనులు పని చేయుచున్నవి.

**5. యాన సౌ.** : దేశమున ఉత్తమ శ్రేణికి చెందిన రోడ్లు 1,32,806 కిమీ. ల నిడివిన కలవు. రైలుమార్గముల నిడివి 23,421 కిమీ.; ఇందు 4,010 కిమీ. ల దూరమున విద్యుత్ సహాయమున

బండ్లు నడచును. దేశాంతస్థ జలమార్గముల నిడివి 4,068 కిమీ. తీరపు రేవులలో గ్డినియా, గ్డాన్స్క్ (డాంజిగ్), షెజెసిన్ ప్రముఖములు. దేశపు వ్యాపార నౌకాదళమున 278 నౌకలు కలవు; వాని మొత్తపు ప్రమాణము 14,94,300 టన్నులు. గ్రేట్‌బ్రిటన్, చీనా, ఇండోనేసియా, ఆస్ట్రేలియా, వియెత్‌నామ్ దేశములతోను, కొన్ని ఆఫ్రికా, లాటిన్ అమెరికా రాజ్యములతోను క్రమబద్ధరీతిలో నడచు సముద్రయాన వసతులు కలవు. వార్సా యందలి ఓకేసీ విమానాశ్రయమును కేంద్రముగ ఇడుకొని 'లాట్' అను దేశీయ విమానయానసంస్థ, దేశపు పలు ప్రాంతములకును, విదేశములకును విమానయాన వసతులను కల్పించినది. ఇదిగాక కొన్ని ప్రముఖ విదేశీయ విమానయాన సంస్థలును, ఓకేసీని అంతర్జాతీయ విమానయానమున ఒక మజిలీగా వాడుకొనుచున్నవి. 1972 మొదలుగ వార్సానుండి న్యూయార్కునకు నేరుగ విమాన యాన వసతి ఏర్పడియున్నది

**6. చరిత్ర :** పోలిష్ ప్రజలు పియాస్ట్ రాజ వంశపు ఆధిపత్యమున విస్తులా, ఓడర్ నదీ పరీవాహ ప్రాంతమున, పదవశతాబ్ది మధ్యభాగమున సువ్యవస్థీకృతులైరి. ఆ శతాబ్ది చరమభాగమున దేశీయులందు క్రైస్తవమతము వ్యాపించినది; 11 వ శతాబ్దిలో పవిత్ర రోమక సామ్రాట్టువలన ఒక సర్వ స్వతంత్ర క్రైస్తవ రాజ్యముగ పరిగణనను దేశము ఆర్జించినది. తరువాతి మూడు శతాబ్దములలో జర్మనులు, తూర్పు స్లావులు, మంగోలులు ఈ రాజ్యముపై అంతటంతట దండయాత్రలను జరపి, కొన్ని భాగములను వశపరచుకొనిరి. అందులకు తోడుగ రాజ వంశికులు తగవులాడుకొని, దేశమును విభజించుకొనిరి. ఇట్టి పరిస్థితిలో, 14 వ శతాబ్దియందు కాసిమర్ యను రాజవంశికుడు తక్కినవారిని జయించి, జర్మనులు మొదలగువారిని తరిమి, దేశమునకు సమగ్రతను చేకూర్చెను. న్యాయ, పరిపాలనా వ్యవస్థలను అతడు సుసంస్కరితములుగ చేసెను. ఆ శతాబ్దాంతమున వైవాహిక బంధము వలన, పోలిష్, లితూనియన్ రాజవంశములు ఏకములై, తత్ఫలితముగ ఆ రెండు దేశములును ఏక రాజ్యముగ ఒక రాచరికపు పాలనలోనికి వచ్చినవి. ఈ విశాల సామ్రాజ్యము బలవత్తరమై, సాంస్కృతికముగ, ఆర్థికముగ ఎంతయో పురోగమించినది. 16 వ శతాబ్ది ఆ దేశ చరిత్రలో స్వర్ణయుగముగ పేరొందినది. కాని ఆ కాలముననే దేశపు జమీందారులు బలవత్తరులైరి. వారొక సమష్టి కూటమిని, సెజ్మ్ అనుదానిని, ఏర్పరచుకొని, రాజును నామమాత్రముగ పదవిలో ఉంచి, అధికారమును అంతటిని కైవసము చేసికొనిరి. తరువాత రాజును ఎన్నుకొను సంప్రదాయమును వారు ప్రవేశపెట్టిరి. కడకు ఈ విభేదముల మూలమున దేశము బలహీనముకాగా, రషియా, ప్రషియా, ఆస్ట్రియాల సేనలు 1772 లో దేశమును వశపరచుకొని మూడు ముక్కలుచేసి పంచుకొనినవి. ఆ తరువాత వారిలో బలవ్యవస్థల మార్పులను అనుసరించి 1793 లోను, 1795 లోను దేశపు పునర్విభజనలు సాగినవి; కడకు పోలండ్ అనునది నామమాత్రావశిష్టమైనది. తమ జాతీయతను పునరుద్ధరించుకొనుటకు పోలులు చేసిన తిరుగుబాటులు నిర్దాక్షిణ్యముగ అడచివేయబడినవి. గెలిషియా అను ప్రాంతము మాత్రము కొలదిపాటి ఆంతరంగిక స్వపరిపాలనతో ఆస్ట్రియా పాలకులకు లోబడి మనినది. ప్రథమ ప్రపంచ యుద్ధమువరకు పరిస్థితులు ఆ విధముగనే ఉండినవి.

ప్రథమ ప్రపంచయుద్ధమున పోలులు మిత్ర రాజ్యముల పక్షమున సానుభూతి వహించి వర్తించిరి. తత్ఫలితముగ ఆ యుద్ధానంతరమున జరిగిన శాంతి ఒడంబడిక వలన పోలండ్ మరల ఒక స్వతంత్ర రాజ్యముగ అవతరించినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, నిష్కారణముగ జర్మనీ ఈ దేశముపై పశ్చిమ దిశనుండి దండెత్తినది.

(సెప్టెంబరు 1, 1939); ఆ వెనువెంటనే సెప్టెంబరు 17 న, సోవియెట్ రష్యాయు ఈ దేశముపై తూర్పుదిశన దండెత్తినది. పోలు జాతీయులు అల్పసంఖ్యాకులుగ ఉండు ప్రాంతమును సోవియెట్ రష్యాయు, తక్కినదానిని జర్మనీయు ఆక్రమించి ఒక ఒడంబడికకు రాగలిగినవి. పోలిష్ ప్రభుత్వము, అంతట గ్రేట్‌బ్రిటన్‌కుపోయి అట ప్రవాస ప్రభుత్వమును ఏర్పరచినది. పోలిష్ ప్రజలు లక్షల సంఖ్యలో దేశమును విడిచి మిత్రరాజ్యముల సాయముతో సైనిక దళములుగ సమాయత్తులై పోరాటమున పాల్గొనిరి. లక్షలకొలది ప్రజలు జర్మనుల హింసకు లోనై అంతరించిరి.

తరువాత యుద్ధగతిలో వచ్చిన మార్పులవలన సోవియెట్ రష్యాతో మిత్రరాజ్యములును చేరి జరిపిన పోరాటపు ఫలితముగ కడకు 1945, జనవరి 17 న వార్సా నగరము సోవియెట్-పోలిష్ సేనల సమష్టి కృషివలన విముక్తమై, క్రమముగ దేశమంతయు స్వతంత్రమైనది. ఆదివరకే విముక్త ప్రాంతమున సోవియెట్ రష్యా సాయముతో పోలిష్ విముక్త సమితి ప్రభుత్వము ఏర్పడినది తరువాత జరిగిన చర్చల ఫలితముగ, లండనునందలి ప్రభుత్వ ప్రతినిధులకు తగు ప్రాతినిధ్యముతో ఈ ప్రభుత్వము సర్వాధికారములను గ్రహించినది. మిత్రరాజ్యముల నిర్ణయపు ఫలితముగ ఓడర్, నీసీ నదీ రేఖ జర్మనీకిని, పోలండునకు మధ్య సరిహద్దుగ నిర్ణయింపబడినది. ఈ సరిహద్దును తూర్పు జర్మనీ 1953 లోను, పశ్చిమ జర్మనీ 1970 లోను గుర్తించినవి.

దేశాధికారమున, క్రమగతిలోవచ్చిన మార్పుల వలన 1947 న కమ్యూనిస్ట్‌పార్టీ దేశమున సర్వాధికారములను చేపట్ట గలిగినది. ఆ పార్టీ ఆధ్వర్యపు ప్రభుత్వమువలన దేశము వ్యావసాయికముగను, పారిశ్రామికముగను ఎంతయో పురోగమించినది.

**7. పరిపాలన :** 1952 లో ఆమోదితమైన రాజ్యాంగ విధానమును అనుసరించి పాలనాధికారము సెజ్మ్ అనబడు శాసనసభయందును, ప్రభుత్వ మండలియందును న్యస్తము. సెజ్మ్‌నకు నాలుగేండ్లకు ఒకసారి ఎన్నికలుజరుగును. 18 ఏండ్ల వయసునకు పైబడినవారికి అందరికి వోటుహక్కు కలదు. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును. ఆ పట్టికను జాతీయ ఐక్యతా సంఘము రూపొందించును; ఆ సంఘము కమ్యూనిస్ట్‌పార్టీ అధీనమున ఉన్నది. సెజ్మ్ సమావేశముకాని ఘట్టములందు శాసన నిర్మాణాధికారము ప్రభుత్వమండలియందు ఉండును. దీనిని సెజ్మ్ ఎన్నుకొనును. ఈ మండలియందలి అధ్యక్షుడే దేశాధినేతగ వ్యవహరించును. మొత్తముమీద ఈ మండలిపై సైతము అధికారము కమ్యూనిస్ట్ పార్టీకిచెందిన పొలిట్‌బ్యూరోకు ఉండును. ఈ మండలి సభ్యులలో పలువురు పొలిట్‌బ్యూరోలో కూడా సభ్యులుగ ఉందురు. సెజ్మ్‌లోని సభ్య సంఖ్య 460; 1972 లో జరిగిన ఎన్నికలో ఇందు 73 మంది స్త్రీ సభ్యులు ఎన్నుకొనబడిరి. దేశమున కమ్యూనిస్ట్‌పార్టీ, రైతుపార్టీ, ప్రజాస్వామికపార్టీ అనునవి ఉన్నను, చివరవి రెండును బలహీనములై కమ్యూనిస్ట్‌పార్టీ యెడల సౌహార్ద భావముతో మనుచున్నవి. సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యమున వివిధ న్యాయస్థానములద్వారా న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** భూతల సైనిక సంఖ్య 1,85,000; అందలి టాంకుల సంఖ్య 3,000; 5 కవచ దళములు, 9 మోటారు దళములు, ఒక విమాన సహాయకదళము అందు చేరిఉన్నవి. నౌకా సేనయందు 20,000 మంది సైనికులు కలరు; ఇందు నాలుగు జలాంతర్గాములు, 4 డెస్ట్రాయర్లు, తక్కిన విధముల సహాయక నౌకలు 178 కలవు. (1972). వాయుసేనయందలి యోధసంఖ్య 55,000; విమానములు 700 కలవు. ఒక ఒడంబ

డికను సోవియెట్‌రష్యా మొదలగు కొన్ని తూర్పు యూరపీయ సోషలిస్టు రాజ్యములతో ఏర్పడిన వార్సా ఒడంబడికలో ఈ రాజ్యముకూడ చేరి యున్నది. ఆ ఒడంబడికను అనుసరించి ఈ దేశమున 30,000 సోవియెట్ సైనికులు నిలిచి యున్నారు (1969).

**9. అంతర్జాతీయ సం.** : ఐ రా. స యందును తదనుబంధ ప్రత్యేక సంస్థలలో పెక్కింటను, వార్సా ఒడంబడిక వ్యవస్థలోను, కమ్యూనిస్ట్ రాజ్యముల ఆర్థిక ప్రణాళికా సమన్వయ వ్యవస్థయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** సాంప్రదాయికముగ ఈ దేశము వ్యావసాయిక దేశమేయైనను, ద్వితీయ ప్రపంచయుద్ధ ఫలితముగ, కొన్ని పారిశ్రామిక ప్రాంతములు పశ్చిమమున దేశమునకు దక్కుట వలనను, ఆ యుద్ధానంతరమున ప్రభుత్వము అనుసరించిన పారిశ్రామికీకరణ విధానమువలనను, ఈనాటి జాతీయాదాయమున దాదాపు సగము పారిశ్రామికోత్పత్తులవల్లను, కుటీర పరిశ్రమలద్వారాను లభించుచున్నది. దేశమున 193 లక్షల హెక్టేరుల భూమి వ్యవసాయమున ఉన్నది. ఇందు 162 లక్షల హె. రైతువారీ సేద్యమున ఉన్నది; 29 లక్షల హె. ప్రభుత్వ క్షేత్రములుగను, 2 లక్షల హె. సహకార వ్యవసాయ క్షేత్రములుగను ఉన్నది. రైతువారీ కమతముల సరాసరి వైశాల్యము 8 హె.; అందు ఏ కమతమును 50 హె. కు మించినదిలేదు (1971). వ్యావసాయికోత్పత్తులలో గోధుమ, రై, బార్లీ, ఓట్లు, ఉరల గడ్డలు, చక్కెరబీటు ప్రముఖములు. ఉరలగడ్డ ఉత్పత్తి ప్రమాణమున ప్రపంచ రాజ్యములలో ఈ దేశమునకు రెండవ స్థానము కలదు. గోజాతి 110 లక్షలు, 152 లక్షలు పందులు, 32 లక్షలు గొర్రెలు, 25 లక్షల గుర్రములు, 889 లక్షల కోళ్ళు కలవు. సాలున పాల ఉత్పత్తి 1,460 కోట్ల లీటరులు వ్యవసాయమున వాడుకయందున్న ట్రాక్టర్ల సంఖ్య 2,98,300 (1971). మత్స్య పరిశ్రమయందు 665 నౌకలు పనిచేయుచున్నవి; వాని ప్రమాణము 2,43,900 టన్నులు; చేపల పట్టుబడి 4,98,600 టన్నులు. దేశమున అటవీ వైశాల్యము 80 లక్షల హె ; ఇందుగల వృక్షజాతిలో 82% సూచ్యగ్రజాతికి చెందినవి. 183 లక్షల ఘనమీటర్ల కలప సాలున లభించుచున్నది (1971)

దేశపు ఆర్థిక వ్యవస్థ అంతయు కేంద్రీకృత ప్రణాళికా బద్ధరీతిలో ప్రభుత్వాధ్వర్యవమున నడచుచున్నది. దేశపు ఖనిజములలో బొగ్గు, రాగి, తుత్తునాగము, సీసము ప్రముఖములు; ఇనుము కొలదిగా లభించినను దేశావసరములకు సరిపోకున్నది. యురేనియమ్, ఉప్పు, గంధకముకూడ తగు ప్రమాణములలో లభించుచున్నవి. రాగి ఉత్పత్తిలో ఈ దేశమునకు గణనీయ స్థానము కలదు; రాగి నిక్షేపములు కోటి టన్నులవరకు ఉన్నటుల అంచనా. దేశపు విద్యుదుత్పత్తి 765 లక్షల కివా. (1972). పారిశ్రామికోత్పత్తులలో ఉక్కు, సిమెంటు, గంధక ద్రావకము, నత్రజని ఎరువులు, భాస్వరపు ఎరువులు, అల్యూమినియపు రాగి, సీసపు, తుత్తునాగపు ఉత్పత్తులు, చక్కెర, నౌకలు ప్రముఖములు. 1971 లో 57 నౌకలు నిర్మింపబడినవి; వాని ప్రమాణము 6 లక్షల టన్నులు. తేలిక పరిశ్రమలలో వివిధములగు జవుళి ఉత్పత్తులు, చెప్పులు, గాజు వస్తువులు, కాగితము పేర్కొనదగినవి. ఎగుమతులలో బొగ్గు, మాంసపు ఉత్పత్తులు, జింకురేకులు, నౌకలు, నౌకా పరికరములు లెక్కింపదగినవి. దిగుమతులలో ముడిఇనుము, ఇనుపరేకు, పెట్రోలియం ప్రముఖములు. ఎగుమతుల విలువ 1,548.9 కోట్ల జలోతీలు; దిగుమతుల విలువ 1,615.1 కోట్ల జ. (1972). ఈ వ్యాపారమున అధికభాగము (33%)

స్రోవియెట్ రష్యాతో సాగుచున్నది. సాలుసరి బడ్జెటరీ వ్యయము 39,200 కోట్ల జ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశపు కార్మికులలో 38% వ్యవసాయమునను, తక్కినవారు సమాజ పరమగు ఆర్థిక వ్యవస్థయందును కృషి చేయుచున్నారు (1969). తలసరి ఆదాయము సాలున 1,000 యు. స్టే. డాలరులు ఉండునని అంచనా. నిరుద్యోగములేదని ప్రభుత్వ నివేదిక వలన తెలియుచున్నది. కార్మికోద్యమము, కేంద్రీకృతమై, ప్రభుత్వాదరణమువలన సువ్యవస్థితము. వారమునకు ఆరు దినములు (48 గం. లు) పని కాలము; కాని గనులు మొదలగు కొన్నింట పని కాలము ఇంతకు తగ్గియుండును. అనారోగ్యము, జాడ్యము మొదలగువానికి ప్రత్యేక భృతులును కలవు. గృహవసతిని కల్పించుటకు కృషి సాగుచున్నది; కాని తగినంతగ ఏర్పడకున్నది. ఒక్కొక గదికి 1.4 మంది వసించుచున్నటుల లెక్కలవలన తేలుచున్నది.

7 నుండి 15 ఏండ్ల వరకు వయసు కలవారికి ప్రాతిపదిక విద్య నిర్బంధముగను, ఉచితముగను బోధింపబడుచున్నది. 9,026 శిశుశాలలలో 5,11,400 మంది; 26,145 ప్రయిమరీ పాఠశాలలలో 50,99,200 మంది; 862 సెకండరీ పాఠశాలలలో 4,38,100 మంది; 10,603 సాంకేతిక పాఠశాలలలో 17,53,100 మంది పఠించుచున్నారు (1971-72) 10 విశ్వవిద్యాలయములతో కలసి 88 ఉన్నత విద్యాసంస్థలు పనిచేయుచున్నవి. వీని లోని విద్యార్థిసంఖ్య 3,46,900. ఇవిగాక వికలాంగులకు 579 పాఠశాలలు (విద్యార్థులు 87,900); వయోజనులకై 724 పాఠశాలలు (వి. 1,86,500) పనిచేయుచున్నవి. దేశమున 8,451 గ్రంథాలయములు కలవు; వానిలో వార్సాయందలి 'బిబ్లియోతెకా నారోదోవా' గ్రంథాలయము ప్రముఖము; ఇందలి గ్రంథసంఖ్య 16 లక్షలు. దేశపు 311 మ్యూజియములలో ముఖ్యనగరమందలి 'మ్యూజియం నారోదోవా' పేరుగన్నది. దినపత్రికల సంఖ్య 56 (1971); ఇందు ఎక్స్‌ప్రెస్ వీక్‌జోర్నీ అధిక ప్రచారము కలది.

**12. యాత్రా సౌ. :** పాస్‌పోర్టు, వీసాలు విదేశీయ యాత్రికులకు విధిగ ఉండితీరవలయును. 1968 లో 19,83,400 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. ఆ సంవత్సరమున దేశీయులలో 15 లక్షలమంది విదేశ యాత్ర చేసిరి

**13. ప్రసిద్ధ పౌరులు .** 1. నికలస్ కొపెర్నికస్ (1473-1543) : భూభ్రమణ సిద్ధాంతమునకు ఖగోళశాస్త్రమున సుస్థిర స్థానమును సమకూర్చిన విశ్వవిఖ్యాత వైజ్ఞానికుడు; 2. మేరీయా స్లోక్లడవస్కా - క్యూరీ (1867-1934) : ఈ దేశమున జన్మించి, ఫ్రాన్సున నివాసమేర్పరచుకొనిన ఈమె రేడియమును కనుగొనుటలో పాలుపంచుకొని, నోబెల్ బహుమతులను రెండింటిని ఆర్జించినది; 3. ఫ్రెడెరిక్ చోపిన్ (1810-49) : పాశ్చాత్య సంగీత లోకమున ప్రసిద్ధిని ఆర్జించిన వాగ్గేయకారుడు; 4. హెన్రీ సీన్‌కీవిజ్ (1846-1916) : 'కో వాడిస్' అను ప్రపంచ ప్రసిద్ధ గ్రంథమును రచించి నోబెల్ బహుమతిని పొందినవాడు; 5. వ్లాడిస్లావ్ రెయ్‌మాంట్ (1867-1925) : రచయితగ నోబెల్ బహుమతిని పొందినవాడు; 'రైతులు' అను అర్థమొసగు పేరుగల అతని రచన పెక్కు భాషలలో అనూదితము.

# 16. ఫిన్ లాండ్

**ముఖ్యనగరము :** హెల్ సింకి; **జెండా :** సముద్ర నీలపు రంగులోని సిలువ; దీని అడ్డు రేఖలో కుడిభాగము పొడవుదీరి ఉండును; **జాతీయ గీతము :** మామ్మెలౌలు (మా మాతృభూమి); **నాణెము :** మర్కా; ఇది 100 పెన్నీలుగ విభక్తము; 21 మర్కాలు; = రు. 37.50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.




పటము 16.

**1. ఉనికి మొ. :** యూరపు ఖండమున ఈశాన్య ప్రాంతమున 58°30′ - 70°5′ ఉ. అ. రేఖల మధ్యను (1,158 కిమీ.), 19°7′-31°35′ తూ. తు. రేఖల మధ్యను (దాదాపు 540 కిమీ.) నెలకొన్న ఈ దేశపు నిడివిలో దాదాపు మూడవ భాగము ఉత్తర ధ్రువ వృత్త పరిధిలో ఉన్నది. ఈ దేశమునకు తూర్పున సోవియెట్ రష్యా; ఉత్తరమున నార్వే; పశ్చిమమున స్వీడెన్ దేశము కొంత వరకు, తక్కిన భాగమున బోత్నియా సింధుశాఖ; దక్షిణమున ఫిన్‌లాండ్ సింధుశాఖ సరిహద్దులందు కలవు ఈ హద్దులమధ్యఉన్న దేశ వైశాల్యము 3 37,009 చ కిమీ.; ఇందు 9% (31,534 చ. కిమీ.) జలమయము. వైశాల్యరీత్యా యూరపు నందలి పెద్ద రాజ్యములలో ఇది లెక్కకు వచ్చు చున్నది. దేశపు దక్షిణ, పశ్చిమ ప్రాంతముల తీర భూమిలోనికి పలుతావులలో సముద్రములోనికి చొచ్చు కొనినందువలన తీరభూమి రంపపు వాదరవలె రూపుగొనినది; ఆ తీరరేఖ సమీపముననే, ఈ రాజ్యములోనికే లెక్కకువచ్చు పలుద్వీపములు, ఆలండు దీవులవరకు, వరుసదీరి ఉన్నవి. దేశ మధ్యమున పలు సరోవరములుగల పీఠభూమి; అందు దాదాపు 60,000 సరస్సులు కలవు; ఇక దేశపు దక్షిణప్రాంతపు మిక్కేలీ రాష్ట్రమున 40% జలమయము. ఉత్తర ఫిన్‌లాండ్ సాంద్రాటవీ మయమగు పీఠభూమి; నార్వేతో ఉన్న సరిహద్దున దేశపు అత్యున్నత ప్రదేశములు కలవు; అందు ఒక దాని ఎత్తు సముద్ర మట్టముపైన 1,324 మీ.

**2 శీతోష్ణస్థితి మొ. :** దేశపు ప్రక్కనున్న సింధుశాఖయందలి ఉష్ణ ప్రవాహమువలనను,

వాయు ప్రవాహరీతివలనను, దేశము అతి సౌమ్య శీతోష్ణస్థితిని కలిగియున్నది. దేశపు గరిష్ఠోష్ణోగ్రత 55° నుండి 63° ఫా వరకును, కనిష్ఠ ఉష్ణోగ్రత 26° నుండి – 7° ఫా. వరకును మారుచుండును. శీతకాలమున కొన్ని ప్రాంతములు 250 దినముల వరకు హిమావరితములై ఉండును. సాలీనా వర్ష పాతము 50 సెం. మీ. నుండి 69 సెం. మీ. వరకు ప్రదేశములను అనుసరించి మారును.

**3. జనసంఖ్య మొ.:** 1971 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 45,98,336. జన సాంద్రత చ. కిమీ. కు 15.1 నగరములలో హెల్ సింకి (జన సంఖ్య: 7,94,746), తాంపేరే (2,17,423); తుర్కూ (2,20,920) ప్రముఖ ములు. అల్పసంఖ్యాక వర్గములలో లాప్పులు, జిప్సీలు ప్రముఖములు. దాదాపు 2,200 లాప్పు లును, 3,000-4,000 జిప్సీలును కలరు. దేశము తొలుత స్వీడెన్‌న అంతర్భాగముగ ఉండినందున స్వీడిష్‌భాష ఆ కాలమున అధికారభాషగ ఉండెడిది. కాని 1863 మొదలుగ ఫిన్నిష్ అధికారభాషగ ముందునకువచ్చి విపులాదరణను ఆర్జించినది. ప్రస్తు తమున ప్రజలలో 92.4% ఫిన్నిష్ భాషను, 7.4% స్వీడిష్‌భాషను మాటాడుచున్నారు. లాప్పు, జిప్సీ లలో వారి మాతృభాషలే ప్రచారమున ఉన్నవి. అయినను లాప్ భాషకు వ్యాప్తి పడిపోవుచున్నది. దీనిని అరికట్టి, లాప్పుభాషా సంస్కృతులను కాపా డుటకు కొన్ని ప్రత్యేక సంఘములు కృషిచేయు చున్నవి. స్వీడిష్‌కు రెండవ ప్రముఖ భాషగ, ప్రత్యేక రక్షణలు కల్పింపబడినవి. ప్రజలలో 92% ఎవాన్‌జెలికల్ లూథరన్ చర్చికిచెందిన క్రైస్తవులు; 2% గ్రీకు ఆర్థడాక్స్ చర్చికి చెందిన వారు; తక్కినవారిలో ఇతర సంప్రదాయముల క్రైస్తవులును, ఏ మతమునకు చెందనివారు 5% ను కలరు. పౌరులకు మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కల్పింపబడినది.

**4. సమాచార సౌ.:** 4,655 పోస్ట్ ఆఫీసు లును, 843 తంతి ఆఫీసులును కలవు; టెలిఫోనుల సంఖ్య 12,89,592 (1971). రేడియో బ్రాడ్ కాస్టింగ్ వసతులును, 1958 మొదలుగ టెలివిజన్ వసతియు కలవు.

**5. యాన సౌ.:** దేశమున మొత్తపు రోడ్ల నిడివి 72,745 కిమీ; ఇందు 40,044 కిమీ. నిడివి చాల ప్రశస్తమైన రాజపథము. రైలుమార్గముల నిడివి 5,902 కిమీ. సముద్ర యానమునకు ఉప యోగించు వర్తక నౌకాదళమున నౌకల సంఖ్య 490; వాని మొత్తపు టన్నేజి 14,17,011 టన్నులు (1971). దేశాంతర్గతములగు సరసులను అనుసం ధించుటవలన ఏర్పడిన జలమార్గముల నిడివి 41,500 కిమీ. ఇందు 6,600 కిమీ. వరకు నౌకా యానమునకు అనుకూలము. దేశపు సముద్రతీరపు రేవులలో నాన్తాలి, హెల్‌సింకి, కోట్కా, తుర్కూ, హమీనా, పోరీ, కేమీ, ఔలూ ప్రముఖములు. విదేశములతోను, దేశమున వివిధ ప్రాంతముల మధ్యను విమానయాన సౌకర్యము, 'ఫినైర్' అను వైమానిక సంస్థవలన లభించుచున్నది.

**6. చరిత్ర:** మధ్యయుగకాలమున క్రీ. శ. 1150 లో, స్వీడెన్ దేశపాలకులు ఈ దేశమును వశపరచుకొని, తమ రాజ్యమున ఒక భాగముగ దీనిని 1809 వరకు పాలించిరి. 1809 లో ఈ ప్రాంతమును రషియాదేశపు పాలకుడు వశపరచు కొనెను. 1917 లో రషియాయందు కమ్యూనిస్టు విప్లవము బయలుదేరినపుడు, ఈ దేశము స్వాతం త్ర్యమును ప్రకటించి స్వతంత్రమైనది.

తొలుత వేటగాండ్రుగను, వ్యావసాయికులుగను ఉండిన ఫిన్నిష్ ప్రజలు, ఆరు శతాబ్దములు స్వీడెన్ ప్రజలతో కలసియుండుటవలన స్వీడుల రాజకీయ విధానమును, ఆర్థిక విధానమును, సాంఘిక వ్యవ స్థను స్వీయములుగ చేసికొనిరి.

1919 జులైలో ఫిన్‌లాండున ప్రజాస్వామిక గణతంత్ర ప్రభుత్వము ఏర్పడినది. తదాదిగ రెండు దశాబ్దములు ఈ దేశము శాంతిని అనుభవించి, తత్ఫలితముగ ఆర్థిక సాంఘిక రంగములందు పురోగమించినది. కాని 1939 లో ద్వితీయ ప్రపంచ సంగ్రామము మొదలైన తరువాత, తన సరిహద్దుల భద్రతకొరకై, సోవియెట్ రష్యాదేశము, తన సరిహద్దును ఆనుకొనిఉన్న ఫిన్‌లాండ్ దేశపు భాగ మును, తనకు అప్పగించవలసినదిగా ఫిన్‌లాండ్‌ను కోరినది. ఇందులకు ఫిన్‌లాండ్ నిరాకరించగా, నవంబరు 30, 1939 న సోవియెట్ సేనలు ఫిన్ లాండ్‌పై దండెత్తినవి; ఫిన్‌లాండ్ సేనలు వీరోచిత ముగ దీర్ఘకాలము ప్రతిఘటించినను, అసంఖ్యాకము లగు శత్రుసేనల ధాటికి ఆగలేక పోయినవి. కడకు మార్చి 12, 1940 న కుదిరిన సంధిని అనుసరించి, సరిహద్దునందలి 32,806 చ. కిమీ. ల వైశాల్యము గల భూభాగమును, సోవియెట్ రష్యాకు ఫిన్‌లాండ్ దత్తము చేసినది. తరువాత జర్మన్ సేనలు జూన్, 1941 లో సోవియెట్ రష్యాపై దండయాత్రను సాగించినపుడు ఫిన్‌లాండ్ సేనలును రష్యాతో తల పడినవి. కడకు జర్మన్ సేనలతోపాటుగ ఫిన్ లాండ్ సేనలును పరాజితములుకాగా కుదిరిన సంధిని (ఫిబ్రవరి 10, 1947) అనుసరించి; ఇదివరకు దత్తము చేసినదికాక, పెటాస్మో ప్రాంతమును (10, 128 చ. కిమీ.) రష్యాకు దత్తము చేయుట కును, పోర్కాలా ప్రాంతమును 50 ఏండ్ల కౌలుకు రష్యాకు ఇచ్చుటకును, 30 కోట్ల డాలర్ల నష్టపరి హారమును రష్యాకు 8 సంవత్సరములలోపల చెల్లించుటకును ఫిన్లాండు అంగీకరించినది. 1952 సెప్టెంబరుకు నష్టపరిహారమును ఈ దేశము చెల్లించి వేసినది; ఆ తరువాత సుహృద్భావ సూచకముగ పోర్కాలాను ఫిన్లాండ్‌కు రష్యా స్వాధీన పరచినది (జనవరి 26, 1956). 1948 లో సోవియెట్ రష్యా - ఫిన్లాండుల మధ్య మైత్రీ, నిరాక్రమణ, పరస్పర సాహాయ్యకపు ఒడంబడిక, పదేండ్ల కాల మునకు, కుదిరినది. ఈ ఒడంబడిక అంతటంతట పొడిగింపబడుటవలన 1990 వరకు అమలున ఉండుటకు అంగీకారము కుదిరినది.

**7. పరిపాలన.** : 1919, జులై 17 న ఆమో దితమైన రాజ్యాంగ విధానమును అనుసరించి దేశ మున ప్రజాస్వామిక గణరాజ్య ప్రభుత్వ విధానము అమలున ఉన్నది. 20 ఏండ్ల వయసువచ్చిన ప్రతి పౌరునికిని వోటుహక్కు కలదు. యూరపీయ దేశ ములలో తొలుతగ (1906) స్త్రీలకు వోటుహక్కు కల్పించినది ఈ దేశమే. ఏక కక్ష్యకమగు శాసన సభ కలదు. అందలి సభ్యసంఖ్య 200. వీరిని ప్రజలు సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి ఎన్నుకొనెదరు. అధ్యక్షుడు ఒక ప్రత్యేక నియోజక మండలిచేత ఎన్నుకొనబడును. ఆ నియోజక మండలియందలి సభ్యసంఖ్య 300; వీరిని ప్రజలు, శాసనసభా సభ్యులను ఎన్నుకొనిన రీతిగనే ఎన్ను కొనెదరు. అధ్యక్షుని పదవీకాల పరిమితి ఆరు సంవత్సరములు. అధ్యక్షుడే ప్రధానిని, తక్కిన మంత్రులను నియమించును. శాసనసభకు బాధ్యత వహించి మంత్రివర్గము పాలనను నిర్వహించును. దేశమున 9 రాజకీయ పక్షములు కలవు వీనిలో సోషల్ డెమోక్రాట్, నేషనల్ కొయలిషన్, సెంటర్, కమ్యూనిస్ట్ పార్టీలు ప్రముఖములు. దేశపు 12 రాష్ట్రములందును, ఎన్నుకొనబడిన కమ్యూనుల సాయమున, ప్రభుత్వ ప్రతినిధులు పాలనను సాగించుచున్నారు. ఆలండ్ దీవికి అంత రంగిక స్వపరిపాలనాధికారము కలదు. హెల్సింకీ లోని సుప్రీమ్‌కోర్టు ఆధ్వర్యవమున, వివిధ న్యాయ స్థానములద్వారా, న్యాయనిర్వహణ జరుగును; న్యాయపాలన స్వీడెన్‌దేశపు పద్ధతిని చాలవరకు అనుసరించుచున్నది.

**8. దేశరక్షణ :** 1947 లో జరిగిన శాంతి ఒడంబడికను అనుసరించి ఈ దేశపు సైనిక సంఖ్య

34,400 మించకూడనియు, ఆంతరంగిక భద్రతకును, సరిహద్దుల రక్షణకును మాత్రమే అవి సమర్థములై ఉండవలయుననియు నియమములు విధింపబడినవి. ప్రస్తుతపు భూతల సైనికసంఖ్య 30,000; నౌకాసేనయందలి యోధసంఖ్య 2,500; సోవియెట్ దేశపు సాయముతో రూపొందిన మూడు దళముల వైమానిక సేన కలదు (1972). దేశమున సైనిక శిక్షణను పొందినవారి సంఖ్య 6,50,000

**9. అంతర్జాతీయ సం.:** 1955, డిసెంబరు 14 మొదలుగ ఐ. రా. స. యందును, తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. కాశ్మీర్, సైప్రస్, పశ్చిమ ఆసియాలలో ఐ రా. స. ఆధ్వర్యవమున శాంతిరక్షణకై నిలుపబడిన సేనాదళములలో కొన్నింటిని ఈ దేశము సమకూర్చినది.

**10. ఆర్థిక రంగము:** ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ తొలుత వ్యవసాయ, అటవీ కృషులపైననే ఎక్కువగ ఆధారపడియున్నను, 1952 మొదలుగ వస్తునిర్మాణ పరిశ్రమలును విరివిగ వృద్ధియైనవి. దేశపు ఆదాయమున వస్తునిర్మాణ కృషివలన 27%, వ్యవసాయ, అటవీకృషి, మత్స్య పరిశ్రమలవలనను వేటవలనను 16%, వ్యాపారమువలన 14%, ప్రభుత్వ సేవలవలన 13%, భవననిర్మాణ కృషివలన 10%, రహదారులవలన 7%, తక్కినవాని వలన 13% లభించుచున్నది (1969). దేశమున సేద్యమునకు అనువైన భూమి 9% (26,67,800 హె.) మాత్రమే. 1922 మొదలుగ సాగిన భూమి సంస్కరణలవలన కమతములలో అత్యధిక భాగము 50 హె. కు తక్కువవి. వ్యవసాయమునకు తోడుగ, అటవీకృషిని, పశుపాలనను రైతులు సాగించుచున్నారు. దేశమున తగినంతగ పశుసంపత్తి కలదు. 1971 లో 84,112 టన్నుల వెన్న, 43,923 టన్నుల జున్ను ఉత్పత్తియైనది. వ్యవసాయోత్పత్తులలో బార్లీ, గోధుమ, ఓట్లు, ప్రముఖములు. ఆహార విషయమున ఈ దేశము స్వయం పోషకము. దేశమున 71% (266.7 లక్షల హె.) అటవీభూమి కలదు 1971 లో 62,75,283 ఘ. మీటరుల కొయ్య ఎగుమతి అయినది. మత్స్యముల పట్టుబడి తక్కువయే యైనను దేశీయుల ఆహారమున అది అతి ముఖ్యము. ఖనిజములలో రాగి, తుత్తునాగము, సీసము, నికెల్ ముఖ్యములు. విద్యుదుత్పత్తి 2,345.4 కోట్ల కివా. (1971). ఇందు 45% జలవిద్యుత్తు. పరిశ్రమలలో ఆహారమునకు, కాగితమునకు, కాగితపు గుజ్జుకు, కొయ్య సామగ్రికి, వైద్యుతికేతరమగు యంత్ర సామగ్రికి, జవుళికి సంబంధించిన పరిశ్రమలు ప్రముఖములు. ఎగుమతులలో కొయ్య, కాగితము, కాగితపు గుజ్జు, జవుళి ముఖ్యములు; దిగుమతులలో ఖనిజతైలములు, ముడిపదార్థములు, దారము, ఉక్కు, యానసాధన పరికరములు ముఖ్యములు. ఎగుమతుల విలువ 989.7 కోట్ల మర్కాలు; దిగుమతుల విలువ 1,173.8 కోట్ల మ. (1971). బడ్జెటరీ వ్యయము 1,496.1 కోట్ల మ. (1972).

**11. సాంఘిక రంగము:** దేశమున సాంఘిక సంక్షేమమునకై జాతీయ పెన్షను పద్ధతిని ప్రభుత్వము ఏర్పరచినది. దీనివలన 65 ఏండ్లకు పైబడిన వృద్ధులకును, యువకులలో వికలాంగులైన వారికిని జీవిత భృతి లభించుచున్నది. ఇది గాక ఆరోగ్య భీమా వసతి అందరికిని కలదు. నిరుద్యోగ భృతియు కలదు యుద్ధముల వలన విపరీతముగ ఈ దేశమున గృహవసతి నష్టమైనది; అందులకు తోడుగ సోవియట్ దేశమునకు దత్తముచేసిన భూమి నుండి తరలివచ్చిన 4,20,000 మందికిని గృహవసతిని కల్పింపవలసి వచ్చినది. ఇందులకై ప్రభుత్వము కృషి చేసిన ఫలితముగ 1976 అంతమునకు ఆ సమస్య చాలవరకు పరిష్కృతమైనది. దేశమున నిరక్షరాస్యత 0.2% మాత్రమే.

7 నుండి 16 ఏండ్ల వరకు వయసు కలిగినవారికి నిర్బంధ ఉచిత విద్యా విధానము అమలున ఉన్నది. దేశపు 4,626 ప్రాథమిక పాఠశాలలో 4,16,966 మంది, 457 సెకండరీ పాఠశాలలలోను, 206 మాధ్యమిక పాఠశాలలలోను కలసి 3 23,615 మంది, వృత్తి విద్యాశాలలలో 1,03,230 మంది విద్యార్థులు కలరు (1970-71). ఆరు విశ్వవిద్యాలయములును, ఆ స్థాయికి చెందిన ఉన్నత విద్యా సంస్థలు 9 కలవు వీని యందలి విద్యార్థి సంఖ్య 57,093 (1970-71). 539 కేంద్ర గ్రంథాలయములును, 2,659 శాఖా గ్రంథాలయములును 300 మ్యూజియములును కలవు. హెల్‌సింకీ, తుర్క్యులలోని మ్యూజియములు అందు ప్రముఖములు. 58 దినపత్రికలు (అందు 10 స్వీడిష్‌లో) ప్రచారమున ఉన్నవి. వానిలో హెల్‌సింగిన్ సానోమాత్ అనునది అధిక ప్రచారము కలది. దేశపు ఆసుపత్రులందలి శయ్యా సంఖ్య 69,754; వైద్య సంఖ్య 5,112 (1971).

**12. యాత్రా సౌ. :** స్కాండినేవియన్ దేశముల యాత్రికులకు పాస్‌పోర్టు అక్కరలేదు; ఇంకను 20 దేశాల వారికి వీసా మాత్రము అవసరం లేదు. ప్రభుత్వము యాత్రికులను ఆకర్షించుటకు ప్రత్యేక కృషి చేయుచున్నది 7,50,000 మంది విదేశీయులు దేశమును 1964 లో దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. మార్షల్ కార్ల్ గస్టావ్ ఎమిల్ మానర్‌హిమ్ (1867-1951) : దేశపు స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకై సాగిన అన్ని సంగ్రామములందును ఫిన్నిష్ సేనలకు నాయకత్వము వహించిన సేనాని; 2. ఏ .ఐ. విర్తనేన్ (జ. 1895) : 1945లో రసాయనిక శాస్త్ర కృషికై నోబెల్ బహుమతిని ఆర్జించినవాడు; 3. ఫ్రాన్స్ ఈమిల్ సిల్లాన్‌పా (1889-1964) : 1939 లో నోబెల్ బహుమతిని ఆర్జించిన రచయిత.

---

# 17. ఫ్రాన్స్

**ముఖ్యనగరము :** పారిస్; **జెండా :** నీలిమ, తెలుపు, ఎరుపు రంగుల నిలువు చారలు దండము వద్ద నుండి క్రమముగ అమరియుండునది; **జాతీయ గీతము :** 'లా మార్సెలిస్' అనబడునది; **నాణెము :** ఫ్రాంక్; ఇది 100 సెంటిమీలుగ విభక్తము; 100 ఫ్రాంకులు = రు. 167.00; **కొలతూకములు :** మెట్రిక్ విధానవువి; **కాల గణన :** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ :** పశ్చిమ యూరపున 42°20′ నుండి 51°5′ ఉ. అ. రేఖ వరకును (960 కిమీ.), 7°8′ ప. తు. నుండి 4°52′ తూ. తు. రేఖ వరకును (928 కిమీ.) వ్యాపించి యున్న ఫ్రాన్స్ దేశమునకు ఉత్తరమున ఇంగ్లీష్ చానెల్, నార్తు సముద్రము, బెల్జియం, లగ్జెంబర్గ్ లును; తూర్పున జర్మనీ, స్విజర్లాండ్, ఇటలీ లును; దక్షిణమున మధ్యధరా సముద్రము, స్పెయిన్‌లును, పశ్చిమమున అట్లాంటిక్ మహాసముద్రమును సరిహద్దులందు ఉన్నవి. మధ్యధరా సముద్రమందలి కార్సికాదీవియు, తీరప్రాంతపు వివిధ అల్పద్వీపములును రాజ్యాంగరీత్యా ఈ దేశమునందు చేరినవిగనే లెక్కింపబడుచున్నవి. వీని అన్నింటితో కలసి దేశ వైశాల్యము 5,51,208 చ. కిమీ.

భూతల రీతిలో వైవిధ్యమునకు పేరొందినది ఈ దేశము. సముద్ర మట్టమునకు సరియగు ఎత్తున ఉన్న భూతలము మొదలుగ, యూరపు ఖండమున అత్యున్నతము లనదగు పర్వత శ్రేణుల వరకు ఇట కనవచ్చుచున్నవి. భూతలమున అత్యధిక భాగము పర్వత పరివ్యాప్తము. ఈశాన్య ప్రాంతమున ఆర్డెనీస్ పర్వతశ్రేణి కలదు; ఇది ఇట




పటము 17.

మండి బెల్జియం, లక్సెంబర్గ్ దేశముల లోనికిని వ్యాపించినది దేశపు తూర్పు ప్రాంతమున వాస్గెస్, ఆల్ప్సు, జూరా పర్వత శ్రేణులు కలవు; ఆల్ప్సు లోని 'బ్లాంక్' పర్వత శిఖరము యూరపు ఖండపు పర్వత శిఖరము లందెల్ల అత్యున్నతము (4,807 మీ.). స్పెయిన్ దేశముతో ఈ దేశమునకు ఉన్న సరిహద్దున పిరెనీస్ పర్వతశ్రేణి కలదు; ఇది ఎత్తున, రూపరేఖన, ఆల్ప్సు పర్వత శ్రేణిని పోలి ఉన్నది.

దేశమునకు హృదయమని చెప్పదగినది పారిస్ పరీవాహ ప్రదేశము. దీనికి నైరుతిన దీనితో జతపడి అక్వాటైన్ నిమ్నతలము కలదు. బ్రిటానీ, నార్మండీ రాష్ట్రములందు అధిక భాగమున గుట్టల వరుసలు కలవు. దేశ మధ్యపు దక్షిణ భాగమున ఉన్న పీఠభూమి యందు ఆరిపోయిన అగ్ని పర్వతముల అవశేషములు విరివిగ కననగును. పారిస్ పరీవాహ భూమి యందును, తూర్పు ఫ్రాన్సునను పడు వర్ష జలము రోన్ నదీలోయ ద్వారాను, దాని ఉపనదియగు సాయోన్ నదీలోయ మూలమునకు మధ్యధరా సముద్రమును చేరుచున్నది. ఇవి గాక వేరుగ మూడు నదీ మండలములు — ఇంగ్లీషు చానెల్‌లో సంగమించు సీన్ నది, మధ్య దేశమున ప్రవహించి అట్లాంటిక్‌న కలియు లాయిర్ నది, దక్షిణమున ప్రవహించి అట్లాంటిక్‌న చేరు గరోనీ నది — కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.** : మూడుతీరుల శీతోష్ణ పరిస్థితులు దేశమున, ప్రాంతములను అనుసరించి కననగుచున్నవి. దేశపు పశ్చిమ ప్రాంతమున సాగర రీతి శీతోష్ణస్థితి కలదు; అందువలన తగ్గుస్థాయిలో ఉష్ణ వ్యత్యయ పరిమితి, విస్తృత వర్షపాతము, చల్లని గ్రీష్మఋతువులు, అంతగ శీతబాధలేని చలికాలములు వేద్యమగుచున్నవి. మధ్య ప్రాచ్య ప్రాంతములందు ముఖ్య భూరీతికిచెందిన శీతోష్ణస్థితి వలన వెచ్చని గ్రీష్మఋతువులు, శీతబాధ ఎక్కువగ నుండు చలికాలములు, విస్తృత వర్షపాతము శీతకాలమున - ముఖ్యముగ ఉన్నత భూములందు - హిమపాతము అనుభవనీయము లగుచున్నవి. దక్షిణ దేశమున (నైరుతి భాగపు పీఠభూమి గాక తక్కిన) విస్తృత ప్రాంతమున మధ్యధరా రీతి శీతోష్ణ పరిస్థితి వలన శీతబాధ తగుస్థాయిలో ఉండు చలికాలములు, వేడి గ్రీష్మములు, పరిమిత వర్షపాతము కననగును. పారిస్ నగరమున సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 50° ఫా.; నైస్ నగరమున అది 57° ఫా. మధ్య దేశమునను, దక్షిణ ప్రాంతమునను వర్షపాతము 56 సెం.మీ. నుండి 77 సెం. మీ. వరకు

మారుచున్నది. బ్రిటానీ రాష్ట్రమునను, ఉత్తర తీర ప్రాంత భూములందును వర్షపాతము అత్యధికము; అట, కొన్ని యెడల అది 138 సెం. మీ. వరకు కలదు.

వృక్ష సంతతియు, జంతు జాలమును భూతల రీతి యందును. శీతోష్ణత యందును కన్పట్టు వైవిధ్య ములను అనుసరించి వివిధ రీతులుగ ఉన్నవి. ఉత్తర, మధ్య ప్రాంతము లందు అటవీ సీమలలో ఓకు, బీచి వృక్షములును; మధ్య ప్రాంతపు ఉన్నత సీమలలో చెస్ట్‌నట్, బీచి వృక్షములును; దక్షిణ ప్రాంతమున పైన్ చెట్లును, వివిధ జాతుల ఓకు వృక్షములును కలవు. ప్రావెన్స్ రాష్ట్రమున యూకలిప్టస్, పొట్టిజాతి పైన్ వృక్షములు కన్పట్టును. మధ్యధరా తీరమున ఆలివ్, మల్బరీ, అత్తి చెట్లును, చిరుపొదలును విరివిగ ఉన్నవి.

పిరెనీస్, ఆల్ప్స్ పర్వత శ్రేణులలో గోధుమ రంగు ఎలుగు, కొండ కుందేలు; తక్కిన అడవు లలో అడవి పంది, వివిధ జాతుల జింకలు కలవు. పక్షిజాతి దేశమున స్థిరముగ ఉండక, ఋతువులను అనుసరించి వచ్చిపోవు చుండును. ఆల్సేస్ ప్రాంత మున దూడ జాతులు; పర్వత సీమలలో గద్దలు, సాళువ డేగలు; దక్షిణ ప్రాంతమున అడవి చిలు కలు, గండు పిచ్చుకలు విశేషముగ కలవు. నదు లందును, మధ్యధరా సముద్రమునను మత్స్య సంపద విరివిగ కలదు.

**3. జనసంఖ్య మొ.** : దేశమునందలి 95 డిపార్టుమెంటుల (జిల్లాల) లోను కలసి, మొత్తపు జనసంఖ్య 4,97,78,540 (1968 జనాభాలెక్క); 1972 లోని అంచనాలను అనుసరించి 5,15,00,000. జనసాంద్రత చ. కిమీ. కు 90 (1968). నగరములలో పారిస్ (జ. సం. 25,90,771). లియోన్ (5,27,800), మార్సె లిస్ (8,89,029), లిలీ (1,90,546), బోర్డో (2,66,662), తౌలోస్(3,70,796), నాన్‌టీస్ (2 59 208), నైస్ (3,22,442), రూయెన్ (1,20,471), తౌలోన్ (1,74,746), స్ట్రాస్‌బర్గ్ (2,49,396), గ్రెనోబిల్ (1,61,616), సెయింట్ ఎటీనీ (2,13,468), నాన్సీ (1,23,428), లీ హావ్రే (1,99,509), క్లెర్ మోంట్ ఫెర్రాండ్ (1,48,896), టూర్స్ (1,28,120), ప్రముఖములు. వీనిలో పెక్కింటికి ముడివడి ఉపనగరములు అనేకములు కలవు. అట్టి ఉపనగరములతో కలసి లెక్కించినపుడు పారిస్ లోని జనసంఖ్య 81,96,746; అనగా దేశపు జనులలో 18.4 % ఆ నగరముననే వసించు చున్నారు. లక్షకు పైబడిన జనసంఖ్య కలిగిన నగరములు దేశపు మొత్తమున 32 ఉన్నవి. ప్రజ లలో 90 % దేశీయ జాతికి చెందిన వారలే. విదే శీయ జాతులకు చెంది దేశమున స్థిరపడిన తక్కిన వారిలో ఇటాలియన్‌లు (దాదాపు పది లక్షలు), స్పానీయులు, పోర్చుగీజులు, ఉత్తర ఆఫ్రికాకు చెందిన ముస్లిములు కలరు. దేశభాష యగు ఫ్రెంచితో దేశీయ జాతుల వారికే గాక, తక్కిన వారికిని బాగుగ పరిచితి కలదు; అయినను బ్రిటా నీలో బ్రెట్టన్ అనునదియు; ఆల్సేస్ -లొరైన్‌లో ఒక విధపు జర్మన్ మాండలికమును; ఈశాన్య ప్రాంతమున ఫ్లెమిష్ భాషయు; నైరుతి ప్రాంత మున స్పానిష్, కాటలాన్, బాస్క్ భాషలును; కార్సికా దీవి యందును, ఆగ్నేయ ప్రాంతమునను ఇటాలియన్ భాషయు కొన్ని అల్ప సంఖ్యాక వర్గములందు మాతృభాషలుగ వ్యవహారమున ఉన్నవి. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవులు; దాదాపు 10 లక్షల ప్రొటెస్టంటు క్రైస్తవులును, అత్యల్ప సంఖ్యాకులగు యూదులును, ముస్లిము లును కలరు. దేశమున ప్రభుత్వము, మతమును,

దేనిని గుర్తించక, 1905 మొదలుగ, ప్రజలకు అందరికిని మత స్వేచ్ఛను కలిగించినది.

**4. సమాచార సౌ. :** తపాలా, తంతి, టెలిఫోను వసతులు విరివిగ కలిగిన దేశమిది. తపాలాఫీసులలో పెక్కింట తంతి సౌకర్యములను కలవు. టెలిఫోనుల సంఖ్య 95,46,173 (1972); రేడియో బ్రాడ్‌కాస్టింగ్, టెలివిజన్ సౌకర్యములు విస్తారముగ కలవు. టెలివిజన్ సెట్ల సంఖ్య 117 లక్షలు (1971).

**5. యాన సౌ. :** దేశమున జాతీయ, రాష్ట్ర, స్థానిక రోడ్ల మొత్తపు నిడివి 15,20,805 కి.మీ; ఇందు 2,440 కి మీ. ల రోడ్డు అచ్చముగ మోటారు వాహనముల కొరకే ప్రత్యేకింపబడి ఉన్నది (1974). దేశపు రోడ్డు మార్గములకన్నిటికిని కేంద్రము పారిస్ నగరము. యూరపీయ దేశములందన్నింట అత్యంతాభివృద్ధి చెందిన రోడ్లు కలదిగ ఈ దేశము పేరొందినది. రైలు మార్గముల నిడివి 35,620 కి. మీ (1972); ఇందు 9,320 కి.మీ. విద్యుతీకరింప బడినది. పారిస్ నగరమున భూగర్భమున నడచు రైలుమార్గము కలదు. దాని నిడివి 244 కి.మీ. (1971). దేశపు వర్తక నౌకా దళమున 550 నౌకలు కలవు; వీని మొత్తపు ప్రమాణము 698 లక్షల టన్నులు. దేశాంతర్గతములగు నదు లందును, కాలువ లందును పెక్కింట నౌకాయాన సౌకర్యము కలదు. ఇట్టి జల మార్గముల నిడివి 8.622 కి మీ. ఫ్రాన్సును యునైటెడ్ కింగ్డమ్ (గ్రేట్ బ్రిటను) తో కలుపు ఒక సొరంగపు రైలుమార్గము ఇంగ్లీషు చానెల్ దిగువన ప్రస్తుతమున నిర్మాణమున ఉన్నది. దేశపు సముద్రతీరపు నౌకాశ్రయములలో మార్సెలిస్, లే హావ్రే, డంకర్క్, రూయెన్, బోర్డో, చెర్‌బర్గ్ ప్రముఖములు. దేశమున విమానయానమునకు ఉపయోగించు విమానాశ్రయములు అనేకములు కలవు. వానిలో పారిస్‌నందలి ఓర్లీ, లే బోర్గే, పారిస్ నోర్డ్ విమానాశ్రయములు అంతర్జాతీయ విమానయానమునకు ఎక్కువగ ఉపకరించుచున్నవి. ఎయిర్ ఫ్రాన్స్ అను ప్రభుత్వాధీనపు విమానయాన సంస్థ, అట్టి యూరపీయ సంస్థలలో కెల్ల పెద్దది. - ప్రయాణికుల లెక్కలో మిన్నగను, అట్టి ప్రపంచ సంస్థలలో ఆ విషయమున మూడవదిగను లెక్కకు వచ్చుచున్నది. దేశపు విమాన ప్రయాణికులందు 80% ను ఇది కొనిపోవుచున్నది; ప్రపంచపు అన్ని ప్రముఖదేశములకును ఇది ప్రయాణములను నిర్వహించుచున్నది. ఇదిగాక దేశమున రెండు ప్రయివేటు విమానయాన సంస్థలును పనిచేయుచున్నవి. వీనివలన దేశాంతర్గత వివిధ ప్రదేశములమధ్యను, దేశమునుండి ఆఫ్రికా, దక్షిణ పసిఫిక్‌లకును విమానయాన వసతి లభించుచున్నది.

**6. చరిత్ర :** ఈ దేశమున అతి ప్రాచీన కాలముననే జనావాసములు ఉండినటుల త్రవ్వకముల వలన తెలియవచ్చుచున్నది; దక్షిణ ప్రాంతమున తీరభూమియందు క్రీ. పూ. 600 నాటికే గ్రీకుల వలసలు కొన్ని ఏర్పడినటులకూడ తెలియవచ్చుచున్నది. కాని ప్రసిద్ధ రోమక విజేత జూలియస్ సీజరు (క్రీ. పూ. 58-51) ఈ ప్రాంతమును జయించినప్పటినుండి మాత్రమే చారిత్రక విషయములు తెలియవచ్చుచున్నవి. ఆ కాలమున దేశమున కెల్టిక్ జాతుల ప్రజలు వసించుచుండిరి; వారిని రోమనులు 'గాలు'లు అని వ్యవహరించిరి. రోమనుల పరిపాలనా కాలమున ఈ గాలిక్ రాష్ట్రములు, వారి సామ్రాజ్యమునందలి సంపన్న నాగరిక ప్రాంతములలో లెక్కకు రాగలిగినవి. రోమనులు ఆ కాలమున నిర్మించిన రోడ్ల గురుతులు ఈ నాడును దేశమున అటనట కానవచ్చుచున్నవి. క్రీ శ. 1వ శతాబ్దియందే గాలుల రాష్ట్రములందు క్రైస్తవము కొంతవరకు స్థానమును ఆర్జింపగలిగినది. రోమన్ సామ్రాజ్యము శిథిలమైన తరువాత క్రీ. శ. 5వ

శతాబ్ది ఆరంభమున జర్మనీనుండి ట్యూటానిక్ జాతులవారు దేశముపై దండెత్తి కొన్ని ప్రాంతము లందు స్థిరనివాసములను ఏర్పరచుకొనిరి. ఆ తెగల లోని 'ఫ్రాంకు' తెగనుబట్టియే దేశమునకు 'ఫ్రాన్స్' అను పేరు ఏర్పడినది.

ఫ్రాంకులను అందరిని సుసంఘటిత పరచి, 'క్లోవిస్' అనునతడు తొలుతగ రాజు కాగలిగెను. అతడు క్రీ. శ. 486 లో రోమన్ ప్రభుత్వపు ప్రతి నిధిని, అతని సేనలను దేశమునుండి తరిమివైచెను. 496 లో అతడు క్రైస్తవుడయ్యెను అతని తరువాత ఆ రాజ్యము విచ్ఛిన్నమైనను, చార్లెస్ మార్టెల్ అను నతడు ఫ్రాంకులను మరల సమీకరించి, ఒక సుస్థిర రాజ్యమును ఏర్పరచి, తానే రాజై (732), స్పెయిన్ నుండి ఫ్రాన్స్ దేశముపై దండెత్తిన ముస్లిములను ఓడించి తరిమివేయగలిగెను అతని మనుమడగు షార్లమేన్ (768-814) యూరపీయ చరిత్రలో సుప్రసిద్ధుడు. తన విజయ యాత్రలవలన అతడు ఇప్పటి ఫ్రాన్స్, పశ్చిమ జర్మనీ, హాలండ్, బెల్జియం, ఉత్తర ఇటలీ ప్రాంతములు చేరినవనదగు విశాల రాజ్యమునకు సామ్రాట్టు కాగలిగెను. క్రీ. శ. 800 లో అతనిని పవిత్ర రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తిగ పోపు ప్రకటించెను.

షార్లమేన్ తరువాత అతని సామ్రాజ్యము అనతి కాలముననే విచ్ఛిన్నమైనది. పవిత్ర రోమక సామ్రా జ్యపు సామ్రాట్ పదవి అటనుండి జర్మన్ ప్రభు వులకు దక్కినది. ఫ్రాన్స్‌దేశము, ఉత్తరమున స్కాండినేవియా ప్రాంతమునుండి తరలివచ్చిన ఆయుధోపజీవుల, దండయాత్రలకు లోనై క్షోభించి నది ఆ పరిస్థితిలో పారిస్ నగర మాండలికుడు ఒకడు ఆ దండయాత్రలను అరికట్టి (885), శత్రు వులను తరిమివేయగలిగెను. అంతట అతని తమ్ముని మనుమడగు హగ్ కేపెట్ (987-996) దేశమున ఒక రాజరికమును నెలకొల్పి దానికి మూలపురుషు డయ్యెను. ఆ రాజవంశమే తదాదిగ 800 సంవత్స రములవరకు దేశమును పరిపాలించెను.

ఆ రాజవంశపు పరిపాలనా కాలమున తొలుతగ భూస్వామ్య వ్యవస్థ దేశమున నెలకొనగలిగినది. రాజరికమునకు నామమాత్రపు మన్ననను చూపుచునే భూస్వాములలో పలువురు దాదాపుగ స్వతంత్రులు గనే వ్యవహరించుచుండిరి. ఆ కాలముననే ఇంగ్లండు నను, ఫ్రెంచి దేశపు మాండలికులలో కొందరు విలియమ్ అనువాని నాయకత్వమున, విజేతలుగ చేరి, అచ్చట ఒక రాజవంశమును నెలకొల్పిరి. ఫ్రెంచి రాజవంశమునకు, ఆంగ్లదేశపు రాజవంశ ముతోగల సంబంధ బాంధవ్యములవలన ఫ్రెంచి దేశమున కొన్ని ప్రాంతముల ఆధిపత్యము విష యముపైనను, కొన్ని సందర్భములలో ఫ్రెంచి సింహాసనపు వారసత్వపు విషయమునను వివాద ములు చెలరేగి యుద్ధములకు దారితీసినవి. ఆ యుద్ధములలో శతవర్ష సంగ్రామము (1337-1453) అనబడునది ప్రముఖము. నిరంతరాయముగ కాక పోయినను అంతటంతట జరిగిన పోరాటములతో నూరేండ్ల పైకాలము ఈ యుద్ధము సాగినది. 1420 నాటికి దేశమున అత్యధికభాగము ఆంగ్ల దేశపు రాజులకు దక్కినది. కాని, అనతికాలము ననే, జోన్ ఆఫ్ ఆర్క్ అను గ్రామీణ సాహసిక యువతియొక్క నాయకత్వమున, ఫ్రెంచి జాతీయత రూపుగొని ఆంగ్లేయ సేనలను ఎదుర్కొనినది. యుద్ధకాలము జోన్ ఆఫ్ ఆర్క్, ఆంగ్లసేనలకు చిక్కి కొరతన దగ్ధము చేయబడినను, ఆమె చూపిన మార్గమును అవలంబించి ఫ్రెంచిసేనలు 1461 నాటికి ఫ్రాన్స్‌నుండి ఆంగ్లసేనలను తరిమివేసినవి.

15 వ శతాబ్ది తుదినుండియు నగర వ్యాపార సంఘములు రాజకీయములందు పలుకుబడిని ఆర్జింప మొదలిడినవి క్రమముగ భూస్వాముల పలుకుబడి క్షీణించినది. ఫ్రాన్సుదేశము దక్షిణ, మధ్యయూరపు

దేశముల రాజకీయములలో జోక్యమును కలిగించు కొనుట అంతటినుండి మొదలయినది తత్ఫలిత ముగ ఇటలీలోని పునరుజ్జీవనోద్యమము ఫ్రాన్సున నెలవు కల్పించుకొని, కళా, సాంస్కృతిక రంగము లందు వికసనమునకు తోడ్పడినది. అయినను ఆ కాలముననే బయలుదేరిన మత సంస్కరణోద్యమము, రోమన్ కేతలిక్కు - ప్రొటెస్టంటు శాఖల మధ్య అంతర్యుద్ధమునకు దేశమున కారణభూత మైనది. కడకు దేశమున రోమన్ కేతలిక్ శాఖకే ప్రాబల్యము లభించినది. అయినను జర్మను రాజ్యము లందు చెలరేగిన ముప్పదేండ్ల సంగ్రామ కాలమున స్వీయ ప్రయోజనములను మాత్రమే దృష్టియం దుంచుకొని, ప్రొటెస్టంటు రాజ్యముల పక్షము వహించి, ఆస్ట్రియా పాలకుల ప్రాబల్యమును అంత రింపజేసి యూరపున ప్రముఖ రాజ్యముగ ఫ్రాన్స్ ముందునకు రాగలిదినది (1659).

17 వ శతాబ్దపు చివరిపాదము మొదలుగ రాజు తన నిరంకుశత్వమును స్థిరపరచుకొని, వాణిజ్య సంస్థల అండతో దేశమునకు సుసంపన్నతను సాధింపగలిగెను. ఆ కాలముననే ఫ్రాన్స్‌దేశపు సాహసిక వర్తకసంఘముల ఆధ్వర్యవమున ఫ్రెంచి యోధులు, ప్రపంచపు పెక్కు ప్రాంతములను - ఇండియాలో పలు స్థావరములను, కెనడా, లూసి యానాలను - ఫ్రెంచి సామ్రాజ్య భాగములుగ చేయగలిగిరి. ఆ కాలమున దేశమును పాలించిన లూయీ XIV ఫ్రాన్స్ దేశమును తక్కిన యూర పీయ దేశములకు వరవడిగ దిద్దెను; పారిస్ నగరపు సమీపమున వెర్సెయిల్స్ అనుచోట అతడు నిర్మింప జేసిన రాజప్రాసాదాదులు, ఆనాటి వాస్తుశిల్ప కళ లలో పరాకాష్ఠను అందుకొనగలిగినవి. అతని పాలనాకాలము స్వర్ణయుగముగ ఫ్రాన్స్‌దేశపు చరిత్రలో పేరుపొందినది. కాని అతని అంత్యకాల మున, పలు యుద్ధములవలన దేశము పేదవడినది. ఈ పేదరికమునకు, ఆనాటి ఫ్రెంచి పండితులు సామాజిక ప్రగతిని నిరూపించుచు ప్రవచించిన నూత్న విప్లవ భావములు తోడై కడకు ప్రపంచమున చారిత్రక ప్రసిద్ధిగాంచిన ఫ్రెంచివిప్లవమునకు దారితీసి నవి (1789). ఈ విప్లవ ఫలితముగ లూయీ XVI పదభ్రష్టుడగుటయేగాక మరణశిక్షకు లోనయ్యెను (1793). అంతట విప్లవకారుల ఆధ్వర్యవమున ఏర్ప డిన ఫ్రెంచి గణతంత్ర ప్రభుత్వము, వారిలో ఏర్పడిన వైరుధ్యముల ఫలితముగ అయిదుగురు ప్రముఖుల సమష్టి ప్రభుత్వముగ రూపుగొని, తుదకు నెపోలి యన్ అను యోధాగ్రణికి చేజిక్కినది. 1804 లో ఇతడు తనను ఫ్రాన్స్‌దేశపు చక్రవర్తిగ ప్రకటించు కొనెను అయినను విప్లవమునకు మూలభావములగు స్వాతంత్ర్య, సమానత్వ, సౌభ్రాతృత్వములను అతడు ఆదరించి, వానికి తన విజయ యాత్రల వలన యూరపు ఖండమునందు అంతటను వ్యాప్తిని కల్పింప యత్నించెను.

నెపోలియన్ సాగించిన విజయ యాత్రలవలన ఫ్రెంచి పతాకము, యూరప్ ముఖ్య భూభాగమున, సలువిక్కులకు పురోగమింపగలిగినది. కాని రష్యాపై అతడు జరిపిన దండయాత్ర, రషియన్ సైనికుల పట్టుదలవలనను, భౌగోళిక పరిస్థితుల వలనను విఫలమై (1812) అతని ప్రతిష్ఠ దెబ్బతిని నది. అంతట రషియా, ప్రషియా, స్వీడెన్, ఇంగ్లాం డుల సమష్టి సేనలు లీప్‌జిగ్ వద్ద అతని సేనలను ఓడించి (1813) అతనిని ఇటలీదేశ తీరసమీపపు ఎల్బాదీవికి ప్రవాసము పంపి, ఫ్రాన్స్‌న రాజరికపు పాలనను నెలకొల్పినవి కాని ఎల్బానుండి నెపోలి యన్ తప్పించుకొనివచ్చి, మరల ఫ్రెంచి సేనలను సమీకరించి, శత్రువులను ఎదుర్కొనెను; అయినను బ్రిటిష్, ప్రషియన్ సేనలు వాటర్లూ రంగమున అతనిని ఓడించి అతనిని దక్షిణ అట్లాంటిక్ యందలి సెయింట్ హెలీనా దీవిలో నిర్బంధించినవి. అతడు అటనే అంతరించెను.

అంతట ఫ్రాన్స్‌దేశమున ఏర్పడిన రాజరికపు ప్రభుత్వము 1830 లో ప్రజల తిరుగుబాటువలన పదభ్రష్టముకాగా, వేరొక రాజరికము ఏర్పడినది. దీనిని 1848 లోని విప్లవము కూలదోసినది. అంతట ద్వితీయ గణరాజ్యము ఏర్పడినది; దానికి, నెపోలియన్ యొక్క సోదరునిపుత్రుడగు లూయీ నెపోలియన్ అధ్యక్షుడయ్యెను. అతడు తనను తాను 1852 లో నెపోలియన్ III అనుపేర చక్రవర్తిగ ప్రకటించుకొనెను. 1852-71 వరకు సాగిన ఈ ద్వితీయ సామ్రాజ్యకాలమున, దేశపు వలస సామ్రాజ్యము విస్తరించినది; దేశము సుసంపన్నమైనది. కాని నెపోలియన్ III అనుసరించిన దురాక్రమణ విధానము కడకు, జర్మన్ రాజ్యముల నాయకత్వము వహించిన, ప్రష్యాతో యుద్ధమునకు దారితీసినది. ఆ యుద్ధమున ఫ్రాన్స్ పరాజితముకాగా, ఆ దేశపు ఆల్సేయిస్ - లారేన్ రాష్ట్రములు జర్మనులకు వశపడినవి (1871). అంతట పారిస్‌లో జరిగిన ప్రజల తిరుగుబాటుకు ఫలితముగ మూడవ గణరాజ్యము రూపుగొని, 1875 లో ఒక రాజ్యాంగ విధానమును ఆమోదించినది. తదాదిగ దేశము పురోగమించి, ఆఫ్రికా ఖండమున పెక్కు వలసలను ఆర్జించి, 1914 నాటికి ప్రపంచపు ప్రముఖ రాజ్యములలో ఒకటిగ పేరును ఆర్జించినది.

ప్రథమ ప్రపంచయుద్ధమున, పశ్చిమ రంగమున జరిగిన యుద్ధములలో చాలవరకు అన్నియు ఫ్రాన్సుననే సాగినవి. యుద్ధమున హతులైనవారి సంఖ్య విషయమున, రష్యా తరువాత ఎక్కువగ నష్టపడినది ఈ దేశమే. కడకు ఈ దేశము, తన మిత్రరాజ్యములగు యు. స్టే., బ్రిటన్, రష్యాలతో పాటుగ జర్మనీ మొదలగు రాజ్యముల సేనలను ఓడించిన తరువాత జరిగిన శాంతిసంధి, పారిస్ సమీపమునఉన్న వెర్సెయిల్స్‌లో జరిగినది (1919). దీనివలన ఆల్సేస్, లారేన్‌లు ఫ్రాన్సునకు దక్కుటయేగాక, పశ్చిమ ఆసియాయందు మాండేటరీ ప్రాంతములుగ కొన్ని వలసలును ఫ్రాన్స్‌కు దక్కినవి (చూ : సిరియా, లెబనాన్). కాని యుద్ధ ఫలితముగ కలిగిన నష్టమును పూడ్చుకొనుటకు దేశము ఎంతయో శ్రమింపవలసివచ్చినది. ఇందులకు తోడుగ 1930 లో వచ్చిన ఆర్థిక సంక్షోభము దేశమును క్రుంగదీసినది. ఇట్టి పరిస్థితులలో జర్మనీయందు నాజీలు అధికారమునకువచ్చి, హిట్లర్ నాయకత్వమున, యూరపు ఖండమున జర్మన్ జాతికి ప్రాబల్యమును చేకూర్చుటకు యత్నించిరి. తొలుత గ్రేట్‌బ్రిటన్‌లోని ప్రభుత్వముతోపాటుగ ఫ్రెంచి ప్రభుత్వమును హిట్లరును సంతృప్తి పరచుటకై యత్నించినను ఫలితము లేకపోయినది. కడకు హిట్లరు, పోలండ్‌పై దండయాత్రను జరుపగ, ఫ్రాన్సుదేశమును, గ్రేట్‌బ్రిటన్‌తోపాటుగ జర్మనీపై యుద్ధమును ప్రకటించినది (సెప్టెంబరు, 1939) అదియే రెండవ ప్రపంచ యుద్ధముగ పరిణమించినది.

ఆ యుద్ధమున తొలుత జర్మన్‌లు, హాలండ్ బెల్జియములద్వారా సాగించిన దండయాత్రవలన, ఫ్రెంచివారి రక్షణశ్రేణి నిష్ఫలమై, జర్మన్‌సేనలు ఫ్రాన్సుదేశమున ముందునకు త్రోసుకొని రాగలిగినవి. అంతట ఫ్రెంచి ప్రభుత్వము పతనముకాగా, మార్షల్ పెటేన్ అను వృద్ధయోధుని నాయకత్వమున ఒక ప్రభుత్వము ఏర్పడి జర్మనులను శాంతికై అర్థించినది. ఆ తాత్కాలికపు శాంతిసంధి ఫలితముగ, పారిస్‌తోకూడిన దేశపు ఉత్తరభాగమంతయు (దేశమున అత్యధిక భాగము) యుద్ధకాలమున జర్మన్ సేనల వశమున ఉండుటకును, 'వీచి' అను నగరము స్థావరముగ ఒక అల్పవిస్తీర్ణపు ప్రదేశమున ఫ్రెంచి ప్రభుత్వము పాలనను నెరపుటకును, ఆ ప్రభుత్వము మిత్రరాజ్యములతో సహకరించకుండుటకును ఒడంబడిక కుదిరినది (మే, 1940). కాని కొన్ని సేనలు, డీ గాలీ అనువాని నాయకత్వమున, స్వతంత్ర ఫ్రెంచి జాతీయ సమితిగ రూపొంది,

ఫ్రెంచి వలసలలో ఉండి జర్మనులను ప్రతిఘటించి మిత్రరాజ్యములకు సాయపడినవి.

ద్వితీయ ప్రపంచ యుద్ధమున, జర్మన్ సేనలు పరాజితములుకాగా, ఫ్రాన్స్ విముక్తమై అచట డీ గాలీ ఆధ్వర్యవమున నూత్న ప్రభుత్వము ఏర్పడినది (అక్టోబరు, 1944). తదాదిగ ఫ్రాన్స్‌దేశము, మార్షల్ ప్రణాళికద్వారా యు. స్టే. అందించిన సహాయమువలన ఆర్థికముగ పురోగమించినను, ఇంటను, బయటను పలు ప్రతిరోధములను ఎదుర్కొనవలసి వచ్చినది. 1946లో కొన్ని అభిప్రాయ భేదముల ఫలితముగ డీ గాలీ రాజీనామా చేసెను. ఆ సంవత్సరముననే నాలుగవ గణరాజ్యము నూతన రాజ్యాంగ విధానమును ఆమోదించినను, అందలి లోపములవలన ప్రభుత్వములు పదేపదే మారుట అచట పరిపాటియైనది. వలసలలో స్వాతంత్ర్యము నకై అచటి ప్రజలు పోరాటములను సాగించిరి. వానిని అణచుటకై సాగించిన కృషిలో దేశమున అంగబలమును, ఆర్థిక బలమును చాలవరకు నష్టమైనవి. అంతట ప్రజల కోరికపై డీ గాలీ ఆధ్వర్యవము వహించి ఒక నూతన రాజ్యాంగమును ప్రతిపాదించెను. దానిపై జరిగిన జనాభిప్రాయ సేకరణలో ప్రజామోదము దానికి లభించినది. అంతట అయిదవ గణరాజ్యము అవతరించి దానికి డీగాలీ తొలుతటి అధ్యక్షుడయ్యెను (1958, డిసెంబరు) 1969 లో డీ గాలీ, తాముచేసిన కొన్ని ప్రతిపాదనలకు ప్రజలు ఆమోదమును తెలుపకపోగా పదవి నుండి వైదొలగెను. ఈ మధ్యకాలమున ఇండోచీనా (వియెత్‌నామ్, లావోస్, కాంబోడియా) ఆల్జీరియా మొదలగు పెక్కువలసలు స్వతంత్రములైనవి (చూ : 14 వ ఉపశీర్షిక).

**7. పరిపాలన :** 1958 లో ఆమోదింపబడి 1962 లో కొన్ని మార్పులను పొందిన అయిదవ గణరాజ్యపు రాజ్యాంగవిధానము ప్రస్తుతమున అమలున ఉన్నది. ప్రభుత్వపు కార్యనిర్వహణాధికారము గణరాజ్యపు అధ్యక్షునియందును, ప్రధాని ఆధ్వర్యవమున నడచు ప్రభుత్వమునను న్యస్తము. 21 ఏండ్లకు పైబడిన ప్రతి పౌరునికి వోటుహక్కు కలదు. అధ్యక్షుడు సార్వజనిక వయోజనుల వోటింగు పద్ధతిన ప్రజలచేత అపరోక్షరీతిలో ఎన్నుకొనబడును. అతని పదవీకాల పరిమితి ఏడు ఏండ్లు. ఇతడు రాష్ట్రపతిగ వ్యవహరించుచు ప్రధానిని, అతని సలహాపై తక్కిన మంత్రివర్గ సభ్యులను నియమించును. అతడు, దేశక్షేమమునకు అవసరమని తోచినపుడు, జాతీయ శాసనసభను రద్దుపరచవచ్చును; కాని ఆ వెనువెంటనే 20 నుండి 40 దినములలోపల ఎన్నికలను జరిపి తీరవలెను. దేశమున సువ్యవస్థిత పరిపాలన సాగని పరిస్థితి ఏర్పడినపుడు, ప్రధానితోడను, జాతీయ శాసనసభా, శిష్టసభల అధ్యక్షులతోడను, రాజ్యాంగవిధాన సమితితోను సంప్రతించి ప్రత్యేక చర్యలను అవలంబించుటకు దేశాధ్యక్షునకు అధికారము కలదు; సర్వ సేనాపతిగను అతడు వ్యవహరించును.

పార్లమెంటున జాతీయ శాసనసభ, శిష్టసభ (సెనెట్) అను రెండు కక్ష్యలు కలవు. జాతీయ శాసన సభ యందలి సభ్య సంఖ్య 487; ఇందు 470 మందిని అచ్చపు ఫ్రాన్సు దేశమును, 10 మందిని సముద్రోత్తర మండలములును, ఏడుగురిని సముద్రోత్తర ప్రాంతములును ఎన్నుకొనును. ఏ కారణమువలననైన శాసనసభ రద్దుచేయబడని పక్షమున, ఆ సభయందలి సభ్యుల పదవీ కాల పరిమితి అయిదేండ్లు. శిష్టసభ యందలి సభ్య సంఖ్య 302. వీనిలోని ప్రతి సభ్యుని పదవీ కాల పరిమితి 9 ఏండ్లు; అయినను మూడేండ్లకు ఒకసారి వంతు వారీగా మూడవ వంతు సభ్యులు విరమించి ఆ స్థానములకు క్రొత్తవారు ఎన్నుకొనబడు పద్ధతి కలదు. జాతీయ శాసనసభా సభ్యులును, మునిసిపల్ సంఘముల సభ్యులును, ప్రతినిధులును కలసిన

ఒక నియోజక వర్గము శిష్టసభలోని 296 మంది సభ్యులను ఎన్నుకొనును; ఇందు అచ్చపు ఫ్రాన్స్ దేశమునకై 283 మంది, సముద్రోత్తర మండలము లకై 7 మంది, సముద్రోత్తర ప్రాంతములకై 6 మంది ప్రతినిధులు ఉందురు; విదేశములలో నివ సించు ఫ్రెంచి వారికి ప్రాతినిధ్యమును సమకూర్చు టకై శిష్టసభయే ఆర్గురు శిష్టసభా సభ్యులను ఎన్నుకొనును

పార్లమెంటునకే శాసన నిర్మాణాధికారము కలదు; కాని కొన్ని నిర్దిష్ట ప్రాతిపదిక విషయములకు మాత్రమే ఆ అధికారము వర్తించుచున్నది. తక్కిన వాని విషయమున ప్రభుత్వమే ఫర్మానాల ద్వారా శాసనములను చేయవచ్చును. అయినను ఈ నిర్దిష్ట విషయముల పట్టికను విస్తృతపరచి, అందు శాసనాధికారమును గ్రహించుటకు పార్లమెంటునకు అధికారము కలదు. ఆర్థిక బిల్లులు తప్ప తక్కిన వానిని ఏ కక్ష్యయందైనను తొలుత ప్రవేశపెట్ట వచ్చును: కాని ఆర్థికపు బిల్లులను మాత్రము జాతీయ శాసన సభలోనే ప్రవేశపెట్టవలయును.

ప్రధానియు, అతని మంత్రివర్గ సభ్యులును పార్లమెంటునగాని, రాజ్యాంగ విధాన సమితి యందుగాని, వేరొక సార్వజనిక సంస్థయందు ఎట్టి దావిలోగాని సభ్యులుగ ఉండగూడదనుట ఫ్రెంచి రాజ్యాంగ విధానమందలి ఒక విశిష్ట నియమము. ప్రధానిగ గాని, మంత్రివర్గ సభ్యుడుగ గాని నియ మితుడైన వెంటనే, పార్లమెంటు సభ్యుడు తన పద విని కోల్పోవును; అంతట ఒక ప్రత్యామ్నాయ ప్రతినిధి ఆ స్థానమును ఆక్రమించును. ఇందువలన ప్రభుత్వమున స్థిరత నెలకొనగలదని అచటి రాజ్యాంగవేత్తల అభిప్రాయము.

పైవిగాక శాసన, కార్యనిర్వాహక వర్గములకు సహకరించుటకై కొన్ని ప్రత్యేక సంస్థలు కలవు. వానిలో రాజ్యాంగ విధాన సమితి, ఉన్నత ధర్మ పీఠము అను రెండు సంస్థలు ప్రముఖములు. దేశపు అధ్యక్షులుగ పనిచేసి విశ్రాంతి తీసికొన్నవారు, 9 మంది ఇతర ప్రముఖులును రాజ్యాంగ విధానసమితి యందు సభ్యులు; ఆ తొమ్మిది మందిలో ముగ్గురను జాతీయ శాసన సభాధ్యక్షుడును, ముగ్గురను శిష్ట సభాధ్యక్షుడును, ముగ్గురను దేశాధ్యక్షుడును నియ మింతురు. పార్లమెంటు చేసిన చట్టములు రాజ్యాంగ విధాన విహితములు అగునా అను విషయమును, శాసన సభల నియమములను ఆ సమితి పర్యవే క్షించి తగు నిర్ణయములను ఇచ్చును; ఎన్నిక తగా దాలను పరిష్కరించును; జనాభిప్రాయ సేకరణ సందర్భమున పర్యవేక్షణ జరుపును.

శాసన సభను రద్దుచేయకనే, కొన్ని శాసనము లను, లేదా నిర్ణయములను జనాభిప్రాయ సేకర ణకై నివేదించు అధికారము దేశాధ్యక్షునకు కలదు.

దేశాధ్యక్షుడు ద్రోహమునకు తలపడినటుల పార్లమెంటులోని ఉభయ కక్ష్యలు ఆరోపించినపుడు ఆ అధ్యక్షుని, అట్టి సందర్భముననే మంత్రివర్గ సభ్యులను విచారించి న్యాయ నిర్ణయముచేయు అధి కారము ఉన్నత ధర్మపీఠమునకు కలదు. ఇందుండు న్యాయమూర్తులలో సగము మందిని జాతీయ శాసన సభయు, తక్కిన వారిని శిష్ట సభయు ఎన్నుకొనును.

దేశమునందలి డిపార్టుమెంటులలోను, అందలి ప్రాతిపదికాంగములగు కమ్యూనులలోను ఎన్నుకొన బడిన సభ్యులుకల స్థానిక సంస్థల సహాయమున ప్రభుత్వ ప్రతినిధులు స్థానిక పాలనను నిర్వహించు చున్నారు.

దేశమున ప్రముఖ రాజకీయ పక్షములు ఆరు కలవు. వీనిలో ఒకటియగు కమ్యూనిస్టుపార్టీ, కార్మిక నియంతృత్వ విధానమునకు స్వస్తిచెప్పి, ఈ దేశమున ప్రజాస్వామిక సిద్ధాంతములకు బద్ధమై వర్తించుచున్నది. ఎన్నికలలో ఏ పక్షమును అత్య

ధిక సంఖ్యా ప్రాబల్యమును ఆర్జింపకుండుట ఈ దేశపు రాజకీయములలో సాధారణముగ కననగు ఒక విషయము. అందువలన మిశ్ర పక్ష ప్రభుత్వములు ఎర్పడుచుండును.

పారిస్‌లోని 'కోర్ డి కా సేషన్' అను ఉన్నత న్యాయస్థానపు పర్యవేక్షణకు లోబడి దేశమున పౌర, దండ వ్యవహారములకు చెందిన కోర్టులు పనిచేయు చున్నవి. ఇవిగాక ప్రభుత్వమునకును, ఉద్యోగులకును మధ్య వచ్చు వివాదములను పరిష్కరించు న్యాయస్థానములు కలవు. ఇవి పారిస్‌లోని 'కౌన్సిల్ డి ఇటాట్' అను ఉన్నత న్యాయస్థానపు చరమాధికారమునకు లోబడి వ్యవహరించును; ఈ న్యాయస్థానపు న్యాయమూర్తుల మండలికి, ఫ్రెంచి ప్రభుత్వపు ప్రధాని అధ్యక్షుడుగ వ్యవహరించును.

**8. దేశరక్షణ :** దేశాధ్యక్షుని ఆధ్వర్యవమున పనిచేయు రక్షణసమితి దేశపు రక్షణ విధానమును నిర్ణయించుచున్నది. 18 నుండి 50 వరకు వయసు కలిగిన పౌరులలో పురుషులు అందరును జాతీయ సేవా కృషిలో 16 నెలలు విధిగ పనిచేయవలయునను శాసనము అమలున ఉన్నది. ఈ జాతీయ సేవయందు నాలుగు అంగములు సైనిక సేవ, స్వరక్షణ కృషి, సాంకేతిక సాహాయ్య సేవ, అంతర్జాతీయ సహకార సంసేవ అనునవి - కలవు. దేశపు భూతలసేనలో 3,31,000 మంది; నౌకా సేనలో 68,000; వాయుసేనలో 1,02,000 మంది, ఈ త్రివిధ సేనలకుచెందిన సామాన్య సేనలో 12,000 మంది సైనికులు కలరు (1974). భూతలసేనకు యుద్ధ కార్యక్రమములందు సాయపడుటకై ఒక ప్రత్యేక వాయుసేన కలదు; ఇందు తేలికరకపు విమానములు 600 కు పైగాను, 300 కు మించి హెలీకాప్టరులును కలవు. నౌకాసేనకు 4 విమానవాహక నౌకలు, 22 జలాంతర్గాములు, 2 క్రూయిజర్లు, 16 డిస్ట్రాయరులు, 30 ఫ్రిగేటులు కలవు; ఇవిగాక యుద్ధమున సాహాయ్యపడు తక్కిన చిన్న తరగతుల నౌకలు 357 కలవు; వీనిలో అణుశక్తిదోదిత క్షిపణివంతములగు జలాంతర్గాములును చేరియున్నవి; నౌకాసేనకు సాయపడు 350 విమానములు కలవు; 200 పోరాటమునకు ఉపకరించునవి. వాయుసేనయందు 32 విమానదళములు కలవు; ఇవి 66 స్థావరములనుండి పనిచేయు చున్నవి; మొత్తపు విమానముల సంఖ్య 2,150; అందు పోరాటపు విమానములు 425 (1974).

అణుశక్తినికూడ స్వీయరక్షణకు ఉపయోగించుకొనుటకై ఫ్రాన్స్ కృషిచేయుచున్నది. అగ్రరాజ్యములగు యు. స్టే., సోవియెట్ రష్యాల అభిప్రాయములను కాదని ఈ దేశము స్వయముగ అణు ప్రస్ఫోటనమును, అణుబాంబు ప్రయోగమును నిర్వహించి, 1964 మొదలుగ ఆణవిక అయుధములను ఉపయోగించు రక్షణ దళమును వృద్ధిచేయుచున్నది. ఈ దళమును ఏ సందర్భమునందు వాడదగునను విషయమును నిర్ణయించు అధికారము అధ్యక్షునకు మాత్రమే కలదు. ఫ్రెంచి పొలినీసియాలో ఈ దేశమునకు ఆణవికాయుధ పరిశోధనా కేంద్రము కలదు.

విమానములు, యుద్ధనౌకలు మొదలుగ యుద్ధావసరములగు సర్వవిధముల పరికరములను, ఆయుధములను రూపొందించుకొను శక్తి ఈ దేశమునకు కలదు. అంతియేకాదు; కొన్ని ఆయుధములను, కొన్ని తరగతుల యుద్ధవిమానములను ఈ దేశము ఇతర దేశములకు ఎగుమతి చేయుచున్నది.

ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థకు సైనికముగ తన వంతు సాయమును చేయుటకు కొన్ని దళములను ఈ దేశము ప్రత్యేకించుచుండెడిది. కాని 1964లో, కొన్ని అభిప్రాయభేదములవలన, ఆ దళములను ఈ దేశము ఉపసంహరించినది.

**9. అంతర్జాతీయ సం**: ఐ. రా. స. సంస్థాపక సభ్య రాజ్యములలో ఈ దేశము ఒకటి.; అందలి ప్రత్యేక సంస్థలలో ప్రతియొక దానితోను ఈ దేశము సహకరించుచున్నది. యూరపీయ కామన్ మార్కెట్ సంస్థాపక రాజ్యముగ అందు ఈ రాజ్యము ప్రముఖ పాత్రవహించుచున్నది. ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థకు సైనిక సాహాయ్యమును ఈ దేశము ఉపసంహరించినను, ఆ వ్యవస్థయందలి సభ్యత్వమును వదలుకొనకున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున మిత్రమండలి రాజ్యములలో ప్రముఖతను కల్గిన ఈ దేశము, తన మిత్రులను వదలుకొనకయే, వైదేశిక నీతి యందు ఒక స్వతంత్ర పంథాను అవలంబించి వ్యవహరించుచున్నది. బడుగు దేశములకు సహాయము చేయుటలో, ప్రముఖ స్థానము, యు. స్టే. తరువాత, ఈ దేశమునకు లభించుచున్నది.

**10. ఆర్థిక రంగము**: భౌతిక సాధన సంపత్తి, చక్కగ సరికుదిరియుండు, యూరపీయ దేశములలో ఈ దేశము ఒకటి. అనుకూలమగు శీతోష్ణ పరిస్థితి, సారవంతపు భూమి, సాంప్రదాయికముగ వ్యవసాయికులకు లభించిన కుశలత, వ్యవసాయము లాభదాయక మగుటకు సహకరించినవి. ఇందులకు తోడుగ విరివిగ లభించు ముడి ఇనుము, విద్యుత్‌శక్తి, ఇంధన వాయువు, పనివారి నేర్పరితనము పారిశ్రామిక పురోగతికి తోడ్పడినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున 'మానే ప్రణాళిక'ను అనుసరించి, యు. స్టే. ఇచ్చిన ధన సహాయముతో తగు కృషిచేసి, యుద్ధనష్టమునుండి కోలుకొనుటయేగాక, పారిశ్రామికోత్పత్తిలో పూర్వమెన్నడు ఎరుగని ఉన్నతస్థాయిని ఈ దేశము చేరుకొనినది.

దేశపు కార్మికశక్తిలో 13% (దాదాపు 28 లక్షలు) మాత్రమే వ్యవసాయమున వినియుక్తము; కమతముల సంఖ్య 15 లక్షలు; కమతపు సరాసరి వైశాల్యము 15.2 హె. వ్యవసాయమునకున్న భూమి 167 లక్షల హెక్టేరులు (1970). దేశపు సమష్టి ఉత్పత్తిలో 12% వ్యవసాయమువలన లభించుచున్నది. యూరపీయ దేశములలో ఆహారోత్పత్తియందు స్వయంపోషకత కలిగిన దేశము ఇది ఒక్కటియే; అంతేకాదు; వ్యావసాయికోత్పత్తులను – ముఖ్యముగా గోధుమ, చక్కెర, ద్రాక్ష సారాయము, గోమాంసములను – ఈ దేశము ఇతర దేశములకు ఎగుమతి చేయగలుగుచున్నది. అయినను ప్రత్తి, పొగాకు, శాకతైలములను తనకు అవసరమైనమేరకు, ఉష్ణమండల దేశములనుండి దిగుమతి చేసికొనుచున్నది. వ్యవసాయమున యంత్రముల వాడకము ఎక్కువ. గడ్డిబీడులకు ఉపయోగించు భూమి 139 లక్షల హె. కలదు; అందువలన పశుపోషణ విరివిగ సాగుచున్నది. దేశమున గోజాతి 21,764 వేలు, గొర్రెలు 10,115 వేలు, గుర్రములు 524 వేలు కలవు (1971). మత్స్య కృషిని ఆశ్రయించి 34,776 మంది జీవించుచున్నారు; ఈ కృషిలో వివిధ రకముల పడవలు 14,016 పాల్గొనుచున్నవి; చేపల పట్టుబడి 575 వేల టన్నులు (1971). అటవీభూమి వైశాల్యము 127 లక్షల హె. (1968); ఇందు అత్యధిక భాగము వ్యక్తిగత స్వామ్యమున కలదు; అడవులను క్రొత్తగా పెంచుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. సాలీనా లభించు కలప 452 లక్షల ఘన మీ. (1967).

ముడి ఇనుప నిక్షేపముల లభ్యతలో ప్రపంచమున ఆరవ స్థానమును, రాక్షసిబొగ్గు విషయమున 9 వ స్థానమును ఈ దేశము ఆక్రమించి ఉన్నది. తక్కిన ఖనిజములలో బాక్సైట్, లిగ్నైట్, పొటాష్ లవణములు పేర్కొనదగినవి. అయినను తనకు కావలసిన ఖనిజములలో అయిదవవంతును ఈ దేశము దిగుమతి చేసికొనుచున్నది. కొలదిగ

పెట్రోలియమ్ లాండీస్ ప్రాంతముననుు, ఇంధన వాయువు పిరెనీస్ పర్వతపాదపు ప్రాంతమున దొరకుచున్నది. 1971 లో ఇంధనవాయువు ఉత్పత్తి 1,078 కోట్ల ఘ. మీటరులు. దేశమున విద్యుదుత్పత్తి 14,879.7 కోట్ల కివా. (1971); ఇందు 33% జలవిద్యుత్తు పరిశ్రమలలో ఇనుము-ఉక్కు పరిశ్రమ, మెకానికల్ ఇంజనీరింగ్ పరిశ్రమ, కార్ల నిర్మాణ పరిశ్రమ, విమాన నిర్మాణ పరిశ్రమ, వైద్యుతిక పరిశ్రమ, రాసాయనిక పరిశ్రమ, జవుళీ పరిశ్రమ ప్రముఖములు. ఇనుము - ఉక్కు పరిశ్రమలలో 160,000 మంది జీవించుచున్నారు; దీనివలన సమష్టి జాతీయోత్పత్తిలో 2% ఉత్పత్తి అగుచున్నది. మెకానికల్ ఇంజనీరింగు పరిశ్రమలలో 6 లక్షల మంది కార్మికులు పనిచేయుచున్నారు; ఇందువలన సమష్టి జాతీయోత్పత్తిలో 11% లభ్యము; ఉత్పత్తి అయినవానిలో - వ్యవసాయ పరికరములు, యంత్రములు, రైలుపట్టాలు, యంత్ర పరికరములు మొదలగువానిలో - ఎక్కువ భాగము ఎగుమతి అగుచున్నవి. ఫ్రాన్సుదేశపు ఆర్థిక వ్యవస్థలో అగ్రశ్రేణి పరిశ్రమలలో కార్ల పరిశ్రమ ఒకటి. ఇందు సాలీనా అభివృద్ధి రేటు 9.9%. ప్రపంచమున తయారగు 10 కార్లలో ఒక కారు ఫ్రాన్స్‌లో నిర్మితము (1970). సంవత్సరమున 15 లక్షల కారులు దాదాపు 100 విదేశములకు ఎగుమతి అగుచున్నవి ఇంతేగాక 41 విదేశములలో ఫ్రెంచి పారిశ్రామికులు మోటారుకార్లను సమకూర్చు కార్ఖానాలను, తయారీ కార్ఖానాలను నెలకొల్పిరి. 1973 లో తయారయిన కార్ల సంఖ్య 32,02,400. ఇందులో 57% సాధారణపు కారులు; తక్కినవి బస్సులు, కోచీలు, ట్రాక్టర్లు, లారీలు మొదలగునవి. విమాన నిర్మాణ పరిశ్రమ దేశమున చాల పురోగతిని ఆర్జించినది. 1970 లో 3 శత కోటి ఫ్రాంకుల విలువగల విమానములును, విమానపు అస్థిభారములును, 60 కోట్ల ఫ్రాంకుల విలువగల హెలికాప్టర్లను, 82 కోట్ల విలువగల ఇంజనులును, 44.4 కోట్ల ఫ్రాంకుల పరికరములును, విమానయానమునకు ఉపకరించు వైద్యుతిక సామగ్రి 30 కోట్ల ఫ్రాంకుల విలువగలదియు ఎగుమతి అయినవి. ప్రపంచ ప్రసిద్ధమగు కారవెల్లీ విమానము ఈ దేశముననే తయారగుచున్నది. వైద్యుతిక పరిశ్రమ రంగమున రేడియో, టెలివిజన్ రిసీవర్ల పరికరములను, కంప్యూటర్లను, తయారు చేయుటలో ఈ దేశము చాల ముందంజ వేసినది. రాసాయనిక రంగమున ఉత్పత్తియగు వానిలో గంధక ద్రావకము, కార్బన్ సల్ఫేట్, కాస్టిక్‌సోడా, గంధకము, మెతనాల్, ఫార్మాలిన్, ఫినాల్, సింతెటిక్ రబ్బరు ప్రముఖములు. ఇందులో చివరదాని ఉత్పత్తిలో జపాన్, పశ్చిమ జర్మనీల తరువాత ఈ దేశమే ప్రముఖముగ లెక్కకు వచ్చుచున్నది. ప్లాస్టిక్కు సరుకులను విరివిగ ఉత్పత్తి అగుచున్నవి ఇందు సాలీనా 4 లక్షల టన్నులు విదేశములకు ఎగుమతి అగుచున్నవి. క్రమేణ ఈ ప్లాస్టిక్ సామగ్రి కారు పరిశ్రమయందును, గృహోపకరణ సామగ్రియందును, ముందునకు రాగలుగుచున్నది. జవుళీ పరిశ్రమ, తక్కినవానికన్న ఎక్కువ ప్రాచీనము. దీనియందును, దీనికి అనుబద్ధములగు కృషులందును కలసి మొత్తముమీద 650 వేల కార్మికులు కృషిచేయుచున్నారు. దీని ఉత్పత్తిలో అధికభాగము ఎగుమతి అగుచున్నది. 1970 లో దీని ఎగుమతివలన 7.5 శతకోట్ల ఫ్రాంకులు లభించినది. భవన నిర్మాణ పరిశ్రమయందు 12 లక్షలమంది కార్మికులు బ్రతుకుచున్నారు. దేశపు ఎగుమతుల విలువ 16,246.1 కోట్ల ఫ్రాంకులు; దిగుమతుల విలువ 15,533.3 కోట్ల ఫ్రాం. (1973). సాలీనా బడ్జెటరీ వ్యయము 22,852.1 కోట్ల ఫ్రాంకులు (1974).

**11. సాంఘిక రంగము :** దేశమున ఉత్పత్తి కృషియందు పాల్గొను కార్మికసంఖ్య దాదాపు 216

లక్షలు (1973). ఇందు దాదాపు 132 లక్షలు మగవారు. మొత్తపు కార్మికులలో 5.7% విదేశీయులు; వీరిలో స్పానీయులు, ఇటాలియనులు, ఆల్జీరియావాసులు, పోర్చుగీజువారు చేరియున్నారు. కార్మిక యూనియనులలో దాదాపు 32 లక్షల సభ్యత్వము కలదని అంచనా. ప్రభుత్వము శాసనముద్వారా ప్రతి రంగమున కనీస వేతనమును నిర్ణయించినది. చట్టప్రకారము వారమున 40 గంటలు మాత్రమే పనికాలము; అయినను గంటలను అనుసరించి అధికకాలమునకు ఎక్కువ వేతనము చెల్లించు పద్ధతిలో ఇంకను 20 గంటలు వారమున పనిచేయవచ్చును. సరాసరిన ఈ దేశపు కార్మికుడు 45.6 గంటలు మాత్రము పనిచేయుచున్నాడు. వారమున అయిదు రోజులు మాత్రమే పనిరోజులుగ ఉండు పద్ధతిని క్రమేణ ప్రవేశపెట్టుటకు గాఢకృషి జరుగుచున్నది (1975). ప్రతి వారమున వచ్చు సాధారణపు సెలవుగాక, సంవత్సరమున నాలుగు వారములు జీతముపై సెలవును పొందు హక్కు కార్మికునికి కలదు.

దేశమున గృహవసతి యుద్ధానంతరమున చాల క్లిష్టతకు లోనైనది. ప్రభుత్వము ఈ కొరతను పూరించుటకు సంవత్సరమున 546 వేల క్రొత్త ఇండ్లను నిర్మించుచున్నను, ఆ సమస్య పూర్తిగ పరిష్కరింపబడకున్నది. అయినను ఉన్న ఇండ్లలో 91%కు నీటివసతులు మొదలగునవి బాగుగ కలవు. దేశమున దాదాపు 166 లక్షల కుటుంబములు కలవని అంచనా. వీనిలో 62%కు స్వంత కారు, 78.5%కు స్వంత టెలివిజన్ సెట్టు కలవు. వాడుకలోఉన్న ప్రయివేటు కార్ల సంఖ్య 139 లక్షలు (1973).

దేశమున సాంఘిక సంక్షేమ పథకములు దాదాపుగ అందరికి అందుబాటులో ఉన్నవి. ఇందు ప్రభుత్వ సంస్థలును, పరస్పర సహకార సంస్థలును పాల్గొనుచున్నవి. నెలసరి జీతములవారికి, తక్కిన విధముల పనివారికి, వికలాంగులకు, మానసిక బలహీనులకు, వృద్ధులకు, గర్భిణులకు, శిశువులకు వర్తించు అనేక పథకములు కలవు. నిరుద్యోగి భృతివసతి ఉన్నను, దేశమున నిరుద్యోగము చాల తక్కువ. ఈ రీతిగ ప్రజలకు 1970 లో ముట్టిన మొత్తము 112 శతకోట్ల ఫ్రాంకులు. తలసరిన నెలసరి కనీస వేతనము (వారమునకు 40 గం. పనికాలమునకు) 1094 ఫ్రాంకులు (1974). దేశమున నిరక్షరాస్యత లేదని చెప్పవచ్చును. 6 నుండి 11 ఏండ్ల వరకు నిర్బంధ ప్రాథమిక విద్యా విధానము అమలున ఉన్నది. ప్రయిమరీ, సెకండరీ విద్యలు ఉచితముగ బోధింపబడుచున్నవి. యూనివర్సిటీ స్థాయిలో కొలదిగ జీతము చెల్లించవలసియున్నను అటసైతము, తగిన ఆదాయము లేనివారి బిడ్డలకు విద్యార్థి వేతనపు వసతులు కలవు. దేశపు కిండర్‌గార్టెన్, ప్రాథమిక పాఠశాలల మొత్తం 71,764 లో 68,34,000 మంది; 10,760 సెకండరీ స్థాయి పాఠశాలలలో 39,83,000 మంది విద్యార్థులు కలరు (1971-72). దేశమున 23 విశ్వవిద్యాలయములు కలవు; వానిలో పారిస్ విశ్వవిద్యాలయము అతి ప్రాచీనము; అది క్రీ శ. 1150 లో సంస్థాపితము. విశ్వవిద్యాలయములందన్నింట పఠించువారి సంఖ్య 6,95,791; అందు పాయిటియెర్స్ విశ్వవిద్యాలయమున అత్యధిక సంఖ్యాక విద్యార్థులు (2,18,010) కలరు (1971-72). ఇవిగాక విశ్వవిద్యాలయ స్థాయికే చెంది, వివిధ శాస్త్రీయ విషయములను బోధించు ఉన్నత విద్యాసంస్థలు అనేకములు కలవు; వానిలోని విద్యార్థి సంఖ్య 6,47,918 (1970-71). ఇంకను సాంకేతికశాస్త్ర, లలితకళాదులను బోధించు ప్రత్యేక సంస్థలు అనేకములు కలవు. దేశమున 12 వేధశాలలు కలవు. మొత్తముమీద విద్యా, సంస్కృతులకై ప్రభుత్వము తన సాలుసరి బడ్జెటున

24.9% ఖర్చుచేయుచున్నది. దేశముకను, అందును పారిస్ నగరమున, మ్యూజియములు, గ్రంథాలయములు అనేకములు కలవు. పారిస్‌లోని బిబ్లియోథికా నేషనలే గ్రంథాలయము, ప్రపంచ ప్రముఖ గ్రంథాలయములలో ఒకటిగ పేరుగన్నది; అది 1480 లో సంస్థాపితము; అందలి గ్రంథసంఖ్య 120 లక్షలకు పైబడి ఉన్నది. దేశపు 652 సార్వజనిక గ్రంథాలయములలో, పారిస్‌లోనే 78 ఉన్నవి. 23 యూనివర్సిటీల గ్రంథాలయములలో మొత్తమున 140 లక్షల గ్రంథములు కలవు. పారిస్‌లోని లౌవ్రే మ్యూజియము ప్రపంచ ప్రసిద్ధము. 155 దిన పత్రికలు ప్రచారమున ఉన్నవి వానిలో 14 పారిస్ నుండి వెలువడుచున్నవి; అన్నింట, ఫ్రాన్స్-సాయిర్ అనుదానికి ఎక్కువ ప్రచారము కలదు. దేశమున వైద్య, శౌచ వసతులు బాగుగ కలవు. అపేక్షిత జీవితకాల వ్యవధి పురుషులకు 68, స్త్రీలకు 76 (1970). దేశమున 5,82,273 శయ్యాసంఖ్య కలిగిన 3,805 ఆసుపత్రులును, 1,32,236 శయ్యాసంఖ్యకల 274 మానసిక చికిత్సా శాలలును కలవు. వైద్యసంఖ్య 73,955 (1972) 1000 మంది ప్రజలకు 103 శయ్యలు ఆసుపత్రులందు కలవని అంచనా.

**12. యాత్రా సౌ. :** యు. స్టే., కెనడా దేశముల పౌరులును, పశ్చిమ యూరపీయ దేశములలో పెక్కింటి పౌరులును వీసా లేకుండ పాస్‌పోర్టుతో మాత్రమే దేశమున పర్యటించవచ్చును. 1970 లో 137 లక్షలకు పైగా విదేశీయులు దేశమున పర్యటించిరి; వీరు దేశమున ఒక శతకోటి డాలర్లకు పైగా వెచ్చించిరి. యాత్రికుల వసతి కొరకై ఆయా దర్శనీయ స్థలములందు హోటళ్ళు మొదలగు వసతులను ప్రభుత్వము సమకూర్చు చున్నది. విదేశీయ యాత్రికులే గాక దేశీయులు సైతము దర్శనీయ స్థలములను దర్శించుటకై కొంత కాలమును గడుపుట ఇచటి ఒక సాధారణ విషయము.

**13. ప్రసిద్ధ పౌరులు :** యూరపు నందలి తక్కిన దేశముకు కళాది రంగములందు వరవడిని దిద్ది, తీవ్ర రాజకీయ భావనలకు, పుట్టినిల్లుగ పేరొందిన ఈ దేశమున విఖ్యాతులగు వారలు పెక్కురు జన్మించిరి. వారిలో అత్యంతముగ విశ్వవిఖ్యాతిని పొందిన వారి పేరులు మాత్రమే ఈ దిగువ ఈయబడినవి: 1. జోన్ డి ఆర్క్ (1412-31) : లారైన్ రాష్ట్రమున జన్మించిన ఈ గ్రామీణ బాలిక, ఫ్రెంచి వారిని ఒక జాతిగ తీర్చి దిద్దుటకు కారణభూతమైనది. 2. ఫ్రాంకోయిస్ రెబేలే (1490-1442) : ఫ్రెంచి సారస్వత జనకుడు. 3. లూయీ XIV (1638-1715) : ఫ్రెంచి చరిత్రలో స్వర్ణయుగమును రూపొందించిన పాలకుడు: 4. డక్ డీ రిచ్లూ (1585-1642), 5 జూలెస్ మేజరిన్ (1602-61) : వీరిరువురు అసమాన రాజతంత్ర వేత్తలుగ ఫ్రాన్స్‌నకు ఆధిక్యమును సమకూర్చుటయేగాక, ఫ్రెంచి అకాడమీని నెలకొల్పి విజ్ఞాన శాస్త్ర ప్రగతికిని తోడ్పడిరి; 6. రేనె డెకార్టే (1596-1650), 7. బ్లెయిస్ పాస్కల్ (1623-62) : వీరిరువురు గణిత, తత్త్వశాస్త్రముల వికసనమునకు తోడ్పడిరి; 8. జీన్-జేక్విస్ రూసో (1712-78) : ప్రసిద్ధ తత్వశాస్త్రవేత్త; 9. డెనిస్ డిడెరో (1713-84), 10. జీన్ లె డి ఆలంబెర్ట్ (1717-83) : వీరిరువురు ఫ్రెంచి విజ్ఞాన సర్వస్వమునకు తొలిరూపమును కల్పించినవారు. 11. కామ్టే డి బఫన్ (1707-88): జంతు శాస్త్రవేత్త, పారిస్ మ్యూజియమును నెలకొల్పిన వాడు. 12. వాల్టేర్ (1694-1778) : భావుకుడు, రచయిత, ఫ్రెంచి సారస్వతమును తన ప్రతిభచే రాణింపజేసిన ప్రజ్ఞాశాలి. 13. నెపోలియన్ బోనపార్టీ (1769-1821): విప్లవ కాలమున తొలుత యోధుడుగ ఉండి, కడకు చక్రవర్తియై, విప్లవా

దర్శములను యూరపు నందంతట తన విజయ యాత్రల వలన వ్యాపింపజేసి, కడకు తన అధికార వాంఛకు బలియై ప్రవాసమున అంతరించిన ప్రతిభా వంతుడు. 14. లూయీ పాశ్చర్ (1882-95) : సూక్ష్మజీవి విజ్ఞానమున విఖ్యాతిని పొందినవాడు. 15. ఎడ్వర్డ్ మానే (1832-83) : ప్రసిద్ధ ఆధునిక చిత్రకారుడు.; పాల్ సిజానే (1839-1906) : చిత్రలేఖనమున నవ్యవాదములకు మార్గదర్శి; 16. అగస్టే రాడిన్ (1840-1917) : సుప్రసిద్ధ శిల్పకారుడు. 17. పియెరీ క్యూరీ (1859-1906), అతని భార్య 18. మేరీ స్లోక్లోడోవస్కా క్యూరీ (1867-1934) : వీరిరువురు 1903 లో, భౌతిక శాస్త్రపు నోబెల్ బహుమతిని ఆర్జించిరి; 19. హెన్రీ బెర్గ్‌సన్ (1859-1941) : తత్త్వశాస్త్ర పండితుడు, 1927 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను; 20. ఆల్బెర్ట్ ష్వీజర్ (1875-1965) : సంగీతవేత్త, తాత్త్వికుడు, వైద్యుడు, మానవతా వాదావలంభి; శాంతి కృషికై 1952 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను.

**14. పాలిత ప్రాంతములు :** ఫ్రెంచి సామ్రాజ్యము ఒక కాలమున ఆఫ్రికా యందు అత్యధిక భాగమునను, తక్కిన ఖండములందు అటనటను వ్యాపించియుండినది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున ప్రపంచమున బలపడిన జాతీయ స్వాతంత్ర్యేచ్ఛకు ఫలితముగ, ఫ్రాన్స్ దేశపు సహకారము తోడనే, లేదా ఆ దేశమును ధిక్కరించియో అనేకములు స్వతంత్రములైనవి. వానిలో ఇండోచీనా యందలి దేశములు (కాంబోడియో, లావోస్, వియెత్‌నామ్) ఫ్రాన్స్ నుండి సంపూర్తిగ విడివడినవి. భారతదేశము నందలి ఫ్రెంచి స్థావరములు భారతదేశమున అంతర్లీనములైనవి. ఇక ఆఫ్రికా యందు స్వతంత్రతను ఆర్జించిన వానిలో సెంట్రల్ ఆఫ్రికన్ రిపబ్లిక్, కాంగో, గేబన్, మలగాసీ, సెనెగల్, చాద్ ఫ్రెంచి కమ్యూనిటీలో అంతర్భాగములై, తమ స్వతంత్రతకు భంగము కలుగవి రీతిలో, ఫ్రాన్స్‌తో సన్నిహితత్వమును కలిగి యున్నవి; ఐవరీకోస్ట్, దహోమీ, అప్పర్ వోల్టా, మారిటేనియా, నైగర్, కామెరూన్ ఫ్రాన్స్‌తో ప్రత్యేక సంబంధము కలిగి, ఆర్థిక రీత్యా, ఫ్రాంక్ నాణెముతో ముడివడి, స్వతంత్రముగనే వర్తించుచున్నవి; మాలీ, టోగో దేశములు ఫ్రాన్స్‌తో సహకరించి స్వతంత్రముగ మెలగుచున్నవి. ఆల్జీరియాతో ఫ్రాన్సునకు ఒక ఒడంటటిక ద్వార సన్నిహితత్వము నామమాత్రముగ ఏర్పడినది. తక్కిన వానిలో మార్టినిక్, గ్వాడలోప్, రియూనియన్, ఫ్రెంచి గయానాలు ఫ్రాన్స్ దేశపు సముద్రోత్తర మండలములుగను, ఫ్రెంచి పొలినీసియా, న్యూకెలిడోనియా, అఫార్స్ & ఇస్సాస్, కొమొరో ద్వీప జాలము, సెయింట్ పియెరీ-మిక్విలాన్, అంటార్కిటిక్ ప్రాంతములు, వల్లీస్ - ఫతుగరా దీవులు ఫ్రాన్స్‌దేశపు సముద్రోత్తర ప్రాంతములుగ ఉండునటులుగ 1968 లో అంగీకారము కుదిరినది కాని ఆ తరువాత 1976 లో కొమొరో ద్వీపజాలమును, 1977 లో అఫార్స్ -ఇస్సాస్ ప్రాంతమును స్వతంత్రములైనవి. (వివరములకు చూ : ఆయా దేశములకు సంబంధించిన శీర్షికలు).

---

# 18. బల్గేరియా

**ముఖ్యనగరము :** సోఫియా; **జెండా :** తెలుపు, ఆకుపసిమి, ఎరుపు రంగుల అడ్డు చారలు పైనుండి దిగువకు అమరియుండగ, తెలుపు చార యందు, దండమునకు సమీపమున, బంగారు, ఆకు పసిమి, ఎరుపు, తెలుపు రంగులలో జాతీయ యోధ




పటము 18.

లాంఛనము కలది; **జాతీయ గీతము :** బల్గేరియా మిలా- జెమియా నాగెరాయ్ (ప్రియ బల్గేరియా, యోధుల జన్మభూమి) అను చరణముతో మొదలిడ బడునది; **నాణెము :** లేవ్; ఇది 100 స్టేటింకులుగ విభక్తము; 117 లేవాలు = రు. 750; **కొలతూక ములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 2 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** యూరపు ఖండమున, ఆగ్నేయ భాగమున, బాల్కన్ ద్వీప కల్పమున తూర్పు ప్రాంతమున అత్యధిక భాగమును ఆక్ర మించి 41° 14′ నుండి 44° 13′ ఉ. అ. రేఖ వరకును (రమారమి 240 కిమీ.), 22°22′ నుండి 28°37′ తూ. తు. రేఖవరకును (400 కిమీ.) విస్తరించిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున రుమే నియా, తూర్పున నల్లసముద్రము, ఆగ్నేయమున తుర్కీ, నైరుతిన గ్రీసు సరిహద్దులందు ఉన్నవి. నల్లసముద్రపు తీరరేఖ నిడివి 378 కిమీ. దేశపు మొత్తపు వైశాల్యము 1,10,912 చ. కిమీ. భూతల రీతినిబట్టి తూర్పు-పడమరలకు సాగిన అయిదు సమాంతర మండలముగ ఈ దేశమును విభజింప వీలగును. అవి 1. ఉత్తరమునఉన్న డాన్యూబియ ఉన్నత సమభూమి, 2. మధ్యనున్న బాల్కన్ పర్వతములు, 3 దక్షిణపు థ్రేసియన్ మైదానము, 4. నైరుతినఉన్న రోడోప్, రిలా పర్వతములు, 5. ఆ దిశనేఉన్న పిరిన్ పర్వతశ్రేణి దేశ భూత లపు సరాసరి ఉన్నతి 840 మీ. రిలా పర్వతముల లోని మౌస్సాలా శిఖరము అత్యున్నతము (2 925 మీ.). నదులు అల్లిబిల్లిగ అల్లుకొని అనేక ములు ఉన్నను, దేశము పర్వతమయ మగుటవలన, పెద్ద నదులు ఏవియు అందు కన్పట్టవు. ఈ దేశ మును రుమేనియానుండి విడదీయుచు మధ్య సరి హద్దుగా ప్రవహించు డాన్యూబ్‌నది మాత్రమే నౌకాయానమునకు అనుకూలము.

**2. శీతోష్ణస్థితి మొ :** మధ్య యూరపు, తూర్పు యూరపుల శీతోష్ణ పరిధిలోనే ఈ దేశమున అత్యధిక భాగము చేరిఉన్నను, స్థానికములగు కొన్ని మార్పులు డాన్యూబ్ నదీ పరిసరపు ఉన్నత సమభూములందును, థ్రేసియన్ మైదానమునను కననగును. అందు తొలుతటిది ఉత్తర దిశనుండి వచ్చు చలికాలపు శీతవాయువులకు ఎక్కువగ లోనగును; థ్రేసియన్ మైదానమున మధ్యధరా ప్రాంత శీతోష్ణస్థితి కలదు. మొత్తముమీద దేశ మున జనవరిలో 32° - 36° ఫా. మధ్యను, జులై నెలలో 72° - 75° ఫా. మధ్యను ఉష్ణోగ్రత

ఉండునని చెప్పవచ్చును. అయినను పర్వతసీమ లందు మాత్రము చలికాలమున ఉష్ణోగ్రత, పైన సూచితమైనదానికన్న ఎక్కువగ పడిపోవును. ఏడాది పొడవున అంతటంతట వానలు పడుచునే ఉండును; సగటున సాలుసరి వర్షపాతము 62 సెం. మీ.

దేశపు ఈశాన్య ప్రాంతమున గరికపట్టుల మండలము కలదు. ఇది క్రమముగ ఉత్తరమునకు సాగిన కొలది చిట్టడవుల సీమగ, డాన్యూబ్ నదీ పరిసరములందు, మార్పొందును. అయినను ఇచట అడవి చాలవరకు నిర్మూలితమై, వ్యవసాయమునకు అనువుగ చేయబడినది. బాల్కన్ పర్వతములందలి దిగువ ప్రాంతముల వెడల్పు ఆకుల చెట్ల అడవులును, ఎగువ ప్రాంతములందు, కొనదేలిన ఆకుల చెట్ల అడవులును కలవు. థ్రేసియన్ మైదానమున మధ్యధరా ప్రాంతపు లక్షణములుగల అడవులు కొన్ని కాననగును. అడవులు చాలవరకు కొట్టివేయ బడుటవలన వన్యజంతు సంతతి చాల తగ్గినది; అటనట ఎలుగులు, గుంటనక్కలు, అడవిపిల్లులు కనబడుచున్నవి. నల్లసముద్రమున మత్స్యసంపద, చెప్పుకొనదగినంత విస్తృతముగ, లేదు.

**3. జనసంఖ్య మొ. :** దేశపు 28 రాష్ట్రములలోను మొత్తముమీద 85,14,900 జనులు కలరు (1971). జనసాంద్రత చ. కిమీ. కు 76.9 దేశ ప్రజలలో 88% బల్గేరియన్ జాతికి చెందినవారు; 8.6% తుర్కులు; తక్కినవారిలో జిప్సీలు, యూదులు, రుమేనియనులు, ఆర్మీనియనులు చేరియున్నారు; తుర్కులు క్రమముగ తుర్కీకిని, యూదులు ఇజ్రాయెల్ కును తరలిపోవుచున్నారు. దేశపు నగరములలో సోఫియా (జ సం. 8,85,700), ప్లొవ్‌దివ్ (2,52,500), వర్నా (2,30,500), రూసీ (1,53,600), బర్గాస్ (1,36,300); స్తారా జగోరా (1,12,600) ప్రముఖములు; మొత్తమున దేశమునందు 183 నగరములును, 973 గ్రామీణ కమ్యూనులును కలవు. దేశమున సాధికారభాష బల్గేరియన్, ప్రజలలో 88% కు ఇది మాతృభాష; తక్కినవారిలో వారివారి మాతృభాషలు ప్రచారమునఉన్నను, బల్గేరియన్ భాషతో వారికి సుపరిచితి కలదు. సిరిలిక్ లిపియందు ఇది వ్రాయబడుచున్నది; గ్రీకులిపిని స్థానికావసరములకు అనుగుణముగ మార్చి క్రీ. శ. 9 వ శతాబ్దిలో ఇది రూపొందింపబడినది. ప్రజలలో 80% ఈస్టరన్ ఆర్థడాక్స్ చర్చి అను ఒక ప్రత్యేక క్రైస్తవ సంప్రదాయమునకు చెందినవారు. వీరుగాక దాదాపు 50 వేల రోమన్ కేతలిక్కులును, 20 వేల ప్రొటెస్టంటులును, రమారమి 6 లక్షల ముస్లిములును కలరు; కొలదిగ యూదులును కలరు. దేశమున మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కలదు; ప్రభుత్వము మతమునెడ అవలంబించిన వైఖరివలన, క్రమముగ దేశమున నాస్తికసంఖ్య ప్రబలినది. ప్రజలలో, ప్రస్తుతమున, మూడింట రెండువంతులు నాస్తికులని ప్రభుత్వపు అంచనా (1972).

**4. సమాచార సా. :** దేశమున 2,370 తపాలా, తంతి కార్యాలయములు; 4,73,047 టెలిఫోనులు, 26 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు, 7 టెలివిజన్ స్టేషనులు కలవు. 'తూర్పు యూరప్ టెలివిజన్ లింకు'లో బల్గేరియా చేరియున్నది (1970).

**5. యాన సౌ. :** దేశపు రోడ్ల నిడివి 30,336 కిమీ.; ఇందు నిరాఘాటముగ మోటారులు మాత్రమే పయనించు రోడ్ల నిడివి 2,384 కిమీ. రైలు మార్గముల నిడివి 6 053 కిమీ; ఇందు 956 కిమీ. ల దూరమున బండ్లు విద్యుత్ సాయమున నడచుచున్నవి (1970). దేశపు వర్తక నౌకాదళమున 23 ప్రయాణిక నౌకలు; 115 సరుకు నౌకలు కలవు; వీని మొత్తపు పరిమాణము 8,42,800 టన్నులు. బర్గాస్, వర్నా నగరములు ప్రసిద్ధపు

రేవు పట్టణములు; వీనిలో తొలుతటిది మత్స్య వ్యాపారమునకు, పెట్రోలు రవాణాకు పేరొందినది; సోఫియానుండి దేశమునందలి వివిధ ప్రాంతములకును, పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా. పశ్చిమ యూరప్, తూర్పు యూరపుల ప్రముఖ నగరములకును విమానయాన వసతి కలదు. సోఫియాలోనే గాక, వర్నా, బర్గాస్‌లలో అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. విమానయానమున, దేశీయ విమానయాన సంస్థయగు 'బాల్కన్' ప్రముఖపాత్ర వహించుచున్నది.

**6 చరిత్ర :** క్రీ. శ. 7 వ శతాబ్దికి పూర్వమువనే ఈ దేశమున 7 స్లావ్ తెగలు నివాసములను ఏర్పరచుకొనినటుల తెలియవచ్చుచున్నది. క్రీ. శ. 681 లో ఒక తుర్కీజాతి తెగ, ఇచటి స్లావ్ తెగలతో ఒక ఒడంబడిక మూలమున చేరి ఏక రాజ్యముగ దేశమును రూపొందించినది. క్రీ. శ. 9 వ శతాబ్దిలో దేశమున క్రైస్తవమతము రాజాదరణవలన వ్యాప్తి చెందినది. ఆ సమయముననే 'సిరిల్ సోదరులు' అనువారి కృషివలన సిరిలిక్ లిపి దేశభాషకై రూపొందింపబడినది. 10 వ శతాబ్దికి తుర్కీ - స్లావ్ తెగలు చక్కగ సమ్మిశితమై దేశమున ఏకజాతి రూపొందినది. క్రీ. శ. 1018 లో ఈ దేశము తూర్పు రోమక (బైజాంటెయిన్) సామ్రాజ్యమున అంతర్భాగమైనది. 13 వ శతాబ్ది అంతమున దేశీయ కృషికవర్గము తిరుగుబాటుచేసి విదేశీయ సేనలను తరిమివేసినను 1396 లో దేశము ఓటోమన్ తుర్కుల వశమైనది. తుర్కీ సామ్రాట్టుల పాలననుండి విడివడుటకై దేశీయులు పలు బాధలకోర్చి పోరాటములను సాగించిరి. ఈ పోరాటముల ఫలితముగ 1885 నాటికి దేశము సంపూర్ణముగ స్వతంత్రమైనది; దేశీయమగు రాజరికపు పాలన అట ఏర్పడినది.

ప్రథమ ప్రపంచ సంగ్రామ కాలమున జర్మనీ మొదలగు వానితో బల్గేరియా సహకరించినది. తత్ఫలితముగ దేశమున కొన్ని ప్రాంతములను కోల్పోయినది. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున సైతము ఈ దేశము జర్మనీతో సహకరించి, రుమేనియానుండి కొంత భూభాగమును పొందగలిగినది. అయినను, ఆ కాలమున ఈ దేశము గ్రేట్ బ్రిటన్, యు. స్టే. లపై యుద్ధమును ప్రకటించినదిగాని, సోవియట్ రష్యాపై యుద్ధమును ప్రకటించుటకు నిరాకరించినది. యుద్ధము, నాజీలకు వ్యతిరేకముగ పరిణమించు సూచనలు కనబడినంతటనే, దేశపు కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యవమున కొన్ని రాజకీయ పక్షములు విప్లవమును లేవదీసినవి (సెప్టెంబరు, 1944). ఆ నెలలోనే సోవియెట్ దేశపు సేనలు బల్గేరియాలో ప్రవేశించినవి. అంతట జన్మభూమి సంఘటన (ఫాదర్ లాండ్ ఫ్రంట్) అను రాజకీయ పక్షముల కూటమియొక్క ఆధ్వర్యవమున ప్రభుత్వము ఏర్పడి, జర్మనీపై యుద్ధమును ప్రకటించి, విజయ సాధనలో పాల్గొనినది.

1946 లో జరిగిన జనాభిప్రాయ సేకరణకు ఫలితముగ రాజరికము తొలగింపబడి ప్రజా గణ రాజ్యము ఏర్పడినది. కమ్యూనిస్ట్ పార్టీ నాయకుడగు జార్జి దిమిత్రోవ్ ఆధ్వర్యవమున ఏర్పడిన ఆ ప్రభుత్వము సోషలిస్ట్ మార్గమున దేశ పురోగతికి కృషిచేసినది.

**7. పరిపాలన :** కార్మిక వర్గపు ఆధిపత్యమున పనిచేయు ప్రజాగణతంత్రపు రాజ్యాంగ విధానము దేశమున అమలులో ఉన్నది. ఈ విధానము మే 16, 1971 న ప్రజామోదితమైనది. ప్రభుత్వపు కార్య నిర్వహణాధికారము అధిమండలి (ప్రెసిడియం) యందును, శాసన నిర్మాణాధికారము జాతీయ శాసనసభ (నరోణో సుబ్రణీ) యందును నెలకొని ఉన్నవి. అధిమండలియందు ఒక అధ్యక్షుడు, ఒక వరిష్ఠ ఉపాధ్యక్షుడు, ఒక కార్యదర్శి, 17 మంది సభ్యులు ఉండెదరు. దీనిని జాతీయ శాసనసభ

ఎన్నుకొనును; అధిమండలియొక్క అధ్యక్షుడే, దేశాధ్యక్షుడుగ వ్యవహరించును. జాతీయ శాసన సభయందలి సభ్యసంఖ్య 400. ఈ సభ్యులు సమాన జనసంఖ్యగల వివిధ ప్రాంతములనుండి అపరోక్ష, రహస్య. సార్వజనికపు వోటింగు పద్ధతిన ప్రజలచే ఎన్నుకొనబడెదరు ఈ సభకు ఎన్నికలు 5 ఏండ్లకు ఒకసారి జరుగును. ప్రజలలో 18 ఏండ్లకు పైబడిన వయసు కలిగిన ప్రతి పౌరునికి వోటుహక్కు కలదు. దేశమున రెండు రాజకీయ పక్షములు - కమ్యూనిస్ట్ పార్టీ, వ్యావసాయిక సమ్మేళనము అనునవి - కలవు కాని కమ్యూనిస్ట్ పార్టీ బలవత్తరము; దానిని ఆశ్రయించి సౌహార్ద మున రెండవపార్టీ వర్తించుచున్నది. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును. ఆ పట్టిక ఉభయ పక్షముల ఆమోదముతో రూపొందును. ఇట్టి ప్రజాస్వామిక విధానమును అనుసరించియే స్థానిక పాలనయు నిర్వహింపబడుచున్నది సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యవమున న్యాయనిర్వహణ సాగుచున్నది. సుప్రీమ్ కోర్టులోని జడ్జీలను జాతీయ శాసన సభయు, దిగువ కోర్టుల న్యాయమూర్తులను, అందులకు సంబంధించిన ప్రాంతీయ ప్రజాసంస్థలును ఎన్నుకొనుచున్నవి.

**8. దేశరక్షణ :** ప్రతి పౌరుడును దేశరక్షణ కృషిలో కనీసము రెండేండ్లైనను శిక్షణ పొందవలయునను చట్టము అమలున ఉన్నది, అంచనాలనుబట్టి దేశపు భూతలసేనయందలి సైనికసంఖ్య 125 వేలు; ఇందు 8 మోటారు శకట దళములు కలవు. నౌకాసేనయందలి యోధసంఖ్య 7,000; ఈ సేనకు 8 జలాంతర్గాములు, 34 ఎస్కార్ట్-తీర రక్షణ నావలు కలవు; వాయుసేనలో 22 000 సైనికులు కలరు; సోవియెట్ దేశమున నిర్మితములగు 250 పోరాట విమానములును, క్షిపణి ఆయుధములును వాయుసేనకు కలవు (1969).

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలలో పెక్కింటను వార్సా ఒడంబడిక వ్యవస్థయందును, డాన్యూబ్ కమీషన్‌లోను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. బల్గేరియా, సోవియెట్ రష్యాలు రెండవసారిగ 20 ఏండ్ల పరస్పర సాహాయ్యక ఒడంబడికపై 1967 లో సంతకములు చేసినవి. బల్గేరియాలోని సోవియెట్ పౌరులకు బల్గేరియా పౌరులతోపాటుగ సమాన స్వత్వములు కలవు.

**10. ఆర్థిక రంగము :** రెండవ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయముపై ఆధారపడి యుండినది. కాని ఆ తరవాత పారిశ్రామికముగ దేశము త్వరితముగ పురోగమించినది. 1972 లో జాతీయాదాయము 1,100 కోట్ల లెవా.; ఇందు 51% పరిశ్రమలవలన లభించుచున్నది. తలసరి సాలీనా ఆదాయము 1971 లో 1,518 లె. వ్యవసాయ యోగ్యమగు భూమి వైశాల్యము 48 లక్షల హె. సోషలిస్టు పద్ధతిని అనుసరించిన సమష్టి వ్యవసాయము 1958 కి దేశమంతట కుదురుకొనగలిగినది. పెద్ద యంత్రముల సాయముతో విశాల క్షేత్రములందు సాగుబడి జరుగుచున్నది. వ్యావసాయికోత్పత్తుల ప్రమాణములు 1971 లో (వేల మెట్రిక్ టన్నులలో) ఈ దిగువ రీతిగ కలవు; గోధుమ (3,032); రై (28); మొక్కజొన్న (2,375); బార్లీ (1,167); ఓట్లు (98); పొద్దుతిరుగుడు గింజలు (407), ముడిప్రత్తి (36); పొగాకు (120); చక్కెరదుంప (1,714), ఉరలగడ్డలు (374); ద్రాక్ష (884). సేద్యపు భూములలో 4.2% పండ్ల తోటలకు వినియుక్తము. దేశమున 1,070 వేల ఎకరములకు నీటి పారుదల వసతులు కృత్రిమరీతిలో కల్పితములు. ప్రపంచమున గులాబీ అత్తరును తయారుచేయు దేశములందు ఈ దేశము ప్రథమ స్థానమున ఉన్నది. 1.5 హె. వైశాల్యముగల పొలమునందలి గులాబి

పూలనుడి ఒక కి. గ్రా. అత్తరు తయారగుచున్నది. సాలీనా అత్తరు ఉత్పత్తి 1,200 కిగ్రా. (1970). వ్యవసాయమున పశుపోషణకును ప్రాముఖ్యము కలదు. వ్యవసాయపు ఆదాయమున 35 9% ఇందు వలన లభించును. గోజాతి 14,40,000; 99 లక్షల గొర్రెలు; 26 లక్షల పందులు కలవని అంచనా (1972); పాడిగోవులవలన సాలీనా పాల ఉత్పత్తి 2,159 లీటర్లు మత్స్య పరిశ్రమ ఇంకను బాగుగ అభివృద్ధి చెందకున్నది; 50 ఆధునిక నౌకలు ఈ కృషిలో పాల్గొనుచున్నవి; అందలి చేపల పట్టుబడి సాలీనా 54,846 టన్నులు; వర్నా, బర్గాస్ రేవులు కేంద్రములుగ ఈ పరిశ్రమ సాగు చున్నది.

దేశపు భూతలమున 35% న అడవులు కలవు. 1968 లో 51 లక్షల ఘ. మీ. ల కలప లభించి నది. అడవులు అంతరింపకుండుటకై ప్రభుత్వము తగు చర్యలను అవలంబించినది. ఖనిజములలో రాక్షసిబొగ్గు, ఇనుము, రాగి, సీసము, తుత్తు నాగము, మాంగనీజు పేర్కొనదగినవి. వాని ఉత్పత్తి 1970 లో వేల టన్నులలో ఈ క్రింది రీతిగ కలదు : బొగ్గు 397; ఇనుము 1,321; రాగి 179; సీసము 86 3; తుత్తునాగము 76.4; మాంగనీజు 10 3; లిగ్నైట్ 28,800. నల్ల సముద్రపు తీరమున పెట్రోలు లభించుచున్నది; 1970 లో ముడినూనె ఉత్పత్తి 334 వేల టన్నులు. 1947 లో పరిశ్రమలు అన్నియును జాతీయములు చేయబడినవి. దేశపు విద్యుదుత్పత్తి 1,951.3 కోట్ల కివా. (1970); ఇందు 33 లక్షల కివా. మాత్రమే తాపవిద్యుత్తు. సోవియెట్‌దేశపు సాహాయ్యమున కోజ్లోసీ వద్ద నిర్మితమగు ఆణవిక విద్యుత్కేంద్రము 1974 నుండి పనిచేయ మొదలిడినది. దాని సామర్థ్యము 8 లక్షల కివా. పరిశ్రమలలో ముడి ఉక్కు, ముడ ఇనుము, సీసము, తుక్కు నాగము, సిమెంటు, గంధక ద్రావకములకు చెంది నవి ప్రముఖములు. ఎరువులును, జవుళీ దినుసులును, సిల్కు గుడ్డలును పరిమిత రాసులలో ఉత్పత్తి అగుచున్నది. విద్యుత్ శకటములు, విద్యుత్ యంత్రములు, ఓడలు, రాసాయనికోత్పత్తులు, పొగాకు, ద్రాక్షసారాయము, పండ్లు ఎగుమతులలో ముఖ్యములు; దిగుమతులలో యాంత్రిక, పారిశ్రామిక సామగ్రి, పెట్రోలియము, రాసాయనిక వస్తువులు, ప్రత్తి, మోటారుకారులు, గడియారములు పేర్కొనదగినవి ఎగుమతి వ్యాపారమున 79.4%, దిగుమతి వ్యాపారమున 77.5% సోషలిస్టు రాజ్యములతో అందును ముఖ్యముగ సోవియెట్ రష్యాతో జరుచుచున్నది. సిగరేట్ల ఎగుమతిలో ఈ దేశపుది అగ్రస్థానము. సోషలిస్టు రాజ్యముల పరస్పర సాహాయ్య సంస్థయందు ఈ దేశము భాగస్వామి. ఎగుమతుల మొత్తపు విలువ 234.45 కోట్ల లె.; దిగుమతుల విలువ 214.23 కోట్ల లె. (1970). బడ్జెటరీ వ్యయము 651.4 కోట్ల లె. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున సోషలిస్టు సిద్ధాంతానుగుణముగ సామాజిక వ్యవస్థ నిర్మితము. పనిచేయగలుగువారికి అందరికి పనిని కల్పించుట ప్రభుత్వపు విధి. సహజ అంగవైకల్యాదులవలన పనికి అసమర్థులైనవారికి, మనుగడకై సౌకర్యములు కలవు. కార్మికులలో 60 ఏండ్లు దాటిన పురుషులకు, 55 ఏండ్లు దాటిన స్త్రీలకు పెన్షన్ సౌకర్యములు కలవు. వ్యవసాయ సహకార సంఘములందలి రైతులకును పెన్షన్ సౌకర్యములు కల్పింపబడినవి. రోగబాధ, ప్రమాదము, మాతృత్వములందు ఉచిత భృతి ఏర్పాటులు కలవు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున అందరికిని గృహవసతిని కల్పించుటకై ప్రభుత్వము సాగించిన కృషివలన పల్లెలలో ఆ సమస్య పరిష్కరింపబడినది; కాని పట్టణములందు ఇంకను గృహవసతి తగినంతగ అమరకున్నది. కార్మికులును,

వ్యావసాయికులును సెలవు దినములను హాయిగ గడపుటకు విశ్రాంతి గృహములు పెక్కు కేంద్రము లందు నిర్మింపబడినవి. వారమున పనికాలము అయిదు దినములు (42.5 గంటలు) మాత్రమే. విద్యాశాలలును అన్నింటిని ప్రభుత్వమే నిర్వహించు చున్నది. 6 నుండి 16 ఏండ్లవరకు విద్య నిర్బంధ ముగ బోధింపబడుచున్నది. శిశు విద్యాశాలలు 3,037 లో 3,31,960 మంది; ప్రాథమిక, మాధ్య మిక పాఠశాలల మొత్తము 4,197 లో 11,54,630 మంది; 338 వృత్తి పాఠశాలలలో 1,30,291 మంది; 246 సాంకేతిక కళాశాలలలో 1,52,919 మంది; 20 ఉన్నత పాఠశాలలలో 10,265 మంది; 26 ఉన్నత విద్యా సంస్థలలో 89,331 మంది విద్యార్థులు కలరు. రెండు విశ్వవిద్యాలయములు - క్లిమెంట్ ఓహ్రిద్, కిరిల్ ఇ మెటోడి - కలవు; వీనిలోని విద్యార్థి సంఖ్య 14,480 (1970-71). బల్గేరియిన్ సైన్సు అకాడమీ, ఆధ్వర్యమున వైజ్ఞా నిక పరిశోధనలు 207 అవేషణా సంస్థలలో సాగు చున్నవి (1972). సోఫియాలోని సిరిల్-మెథ డియన్ జాతీయ గ్రంథాలయము, దేశపు 11 వేల గ్రంథాలయములలో ప్రముఖము; ఇందు 888 వేల ఆధునిక గ్రంథములు; 13,000 అతి ప్రాచీనగ్రంథ ములు కలవు. దేశమున మ్యూజియముల సంఖ్య 145; వీనిలో జాతీయ కళా మ్యూజియమ్, జాతీయ పురాతన వస్తుశాల ప్రముఖములు; ఈ రెండును సోఫియాలోనే ఉన్నవి. 13 దైనిక వార్తా పత్రి కలు ప్రచారమున కలవు. వానిలో 'రాబట్ నిస్కో దేలో' అను కమ్యూనిస్ట్ పార్టీ పత్రిక ఎక్కువ ప్రచారము కలది. దేశమున ఆరోగ్య వసతులను, వైద్యశాలలందలి చికిత్సను ప్రభుత్వమే ఉచితముగ పౌరులకు అందజేయుచున్నది; మొత్తముమీద 67,000 శయ్యలు కలిగిన 201 ఆసుపత్రులు పని చేయుచున్నవి; ఇందలి వైద్యసంఖ్య 16,500 (1971). డాక్టర్లు సొంతముగ చికిత్సచేసి ధన మార్జించుట 1972 మొదలుగ నిషిద్ధమైనది. దేశ మున మగవాని జీవితకాల అపేక్షిత వ్యవధి 68 సం.; స్త్రీకి 72 సం.

**12. యాత్రా సౌ.** : దేశపు ప్రకృతి సంపద విదేశీయ యాత్రికులను పలువురిని ఆకర్షించు చున్నది; ప్రభుత్వము యాత్రికులకు తగిన సౌకర్య ములను కల్పించినది. నల్లసముద్ర తీరపు విలాస నివాసములు అతి రమ్యములు. పాస్‌పోర్టు, వీసాలు విదేశీయులు విధిగ కలిగియుండవలెను. 1972 లో దేశమును 30,06,991 మంది విదేశీయులు దర్శించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు** : 1. జార్జి రకోవస్కీ (1821-67); 2. పెట్కో స్లావీకొవ్ (1827-95); 3. క్రిస్టో బొతేవ్ (1848-76) - వీరు మువ్వురును బల్గేరియన్ సారస్వతమున పేరొందిన మహాకవులు.

---

# 19. బెల్జియం

**ముఖ్యనగరము** : బ్రస్సెల్స్ : **జెండా** : నలుపు, పసిమి, ఎరుపు, నిలువు చారలు, దండము వద్దనుండి క్రమముగ అమరి ఉండినది; **జాతీయ గీతము** : **లా** బ్రాబన్ కోనీ (బ్రాబన్ గీతము) అనబడునది; **నాణెము** : బెల్జియన్ ఫ్రాంకులు = రు. 15.00; **కొలతూకములు** : మెట్రిక్ విధానపువి; **కాలగణన** : సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** వాయవ్య యూరపున 49°30′-51°30′ ఉ. అ. రేఖల మధ్యను, 2°35′-6°25′ తూ. తు. రేఖల మధ్యను కుదిరియున్న ఈ దేశమునకు ఉత్తరమున నెదర్‌లాండ్స్, నార్తు సముద్రములును; తూర్పున పశ్చిమ జర్మనీ, లక్జెంబర్గ్ దేశములును; దక్షిణ, నైరుతులందు ఫ్రాన్స్




పటము 19.

దేశమును సరిహద్దులందు ఉన్నవి. దేశపు తీరరేఖ పొడవు 65 కిమీ.; గరిష్ఠపు నిడివి 280 కిమీ.; గరిష్ఠపు వెడల్పు 145 కిమీ దేశ వైశాల్యము 30,508 చ. కిమీ.

దేశములోనికి 16 నుండి 48 కిమీ. ల వరకు చొచ్చుకొని వచ్చుచున్న తీరప్రాంత భూమియందు ఇసుక దిబ్బలు, గడ్డిబీడులు, సముద్రమును పూడ్చి మెరక తేల్చిన భూములు కలవు; వానిలో చివర వానిని మరల సముద్రము ముంచకుండ కరగోడలు (డైక్స్) రక్షించుచున్నవి. ఈ తీరభూమి ఎత్తు ఎచటను సముద్ర మట్టమునకు పైన 15 మీటరులను మించదు. ఇది తూర్పునకు సాగి మధ్యదేశపు విశాల మైదానముగ పరిణతి చెందును. ఈ మైదానమునందలి లోయలు సారవంతములు; సేద్యమునకు సహకరించి చక్కని సిటివసతిని కలించు కాలువలు ఇట అల్లిబిల్లిగ పెనగొనియున్నవి. ఇచటి భూమి ఎత్తు 60 నుండి 180 మీటరులవరకు మారును. దేశపు ఆగ్నేయ ప్రాంతమున ఆర్డెన్నిస్ అనుపేర వ్యవహృతమగుచు సాంద్రాటవులు కలిగిన ఒక పీఠభూమి కలదు; అది ఫ్రాన్సు దేశములోనికిని వ్యాపించినది; దాని సరాసరి ఎత్తు 450 మీ.; దేశమునందెల్ల అత్యున్నతమగు సిగ్నల్ డి బోట్ రేంజి (693 మీ.) ఇందే కలదు. ఫ్రాన్స్ దేశమున జన్మించిన షెల్ట్, మ్యూజ్ (మాస్) నదులు ఈ దేశమున కొంతదూరము ప్రవహించి, నెదర్‌లాండ్స్ ద్వారా నార్తు సముద్రమును చేరుచున్నవి. లీస్, డీడర్, రూపెల్ అనునవి షెల్ట్ నదియొక్క ఉపనదులు; సాంబ్రే, ఔర్తేనదులు, మ్యూజ్‌నదిలో చేరుచున్నవి.

**2 శీతోష్ణస్థితి మొ.:** తీర ప్రాంతమున సౌమ్యము, ఆర్ద్రమునగు శీతోష్ణత కలదు. లోనికి పోయినకొలది ఇందు పెక్కు మార్పులు కననగును. ఆగ్నేయ ప్రాంతపు ఉన్నత భూములలో ఎండ కాలమున ఎండలును, శీతకాలమున చలియు ఎక్కువ; అచట వర్షపాతమును ఎక్కువయే. తక్కిన ప్రాంతములందు వర్షపాతము అంతగ లేకున్నను పొగమంచు, మంచు వర్షము తరచుగ పడుచుండును. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 47° ఫా.; బ్రసెల్స్‌లో సరాసరి ఉష్ణోగ్రత 50° ఫా. దేశమున సాలీనా సరాసరి వర్షపాతము 70 సెం. మీ.

**3. జనసంఖ్య మొ.:** దేశమునందలి తొమ్మిది రాష్ట్రముల మొత్తపు జనసంఖ్య 96,90,991 (1970). జనసాంద్రత చ. కిమీ. కు 320. దేశపు నగరములలో బ్రసెల్స్ (జ. సం : 10,71,194), ఆంట్‌వెర్ప్ (2,26,576), ఘెంట్ (1,49,265). లీగ్ (1,47,277) ప్రముఖములు. దేశీయులందరు ఫ్రాంక్ జాతికి చెందినవారే అయిన భాషారీతిగ విభే

దములు కలవు. దేశమున మూడు భాషలకు - ఫ్రెంచి, డచ్, జర్మన్ భాషలకు - చెందిన వర్గములు కలవు. ఫ్రెంచి మాటాడువర్గము వాలూనులనియు, డచ్ మాటాడువర్గము ఫ్లెమింగులనియు వ్యవహరింపబడుచున్నారు. ఇచటి డచ్‌భాష, నెదర్లాండ్స్‌లోని డచ్‌భాషకన్న కొంత విలక్షణత, కలిగి, ఫ్లెమిష్ అనియు వ్యవహృతము. జర్మన్ భాషను మాటాడువారు 61 వేలు మాత్రము కలరు. తక్కిన వారిలో ఫ్రెంచి. డచ్ భాషల వారు 3:5 నిష్పత్తిలో ఉన్నటుల అంచనా. ప్రాదేశికముగ ఉత్తరపు నాలుగు రాష్ట్రములందు డచ్ మాటాడు వారును, నాలుగు దక్షిణ రాష్ట్రములందు ఫ్రెంచి మాటాడువారును కలరని చెప్పవచ్చును. తక్కిన ఒక రాష్ట్రమున, కొంత భాగమున డచ్చి, వేరొక భాగమున ఫ్రెంచి, ముఖ్యనగరమున ఆ రెండు భాషలు వాడుకలో ఉన్నవి. తూర్పు సరిహద్దున అల్ప ప్రాంతమున మాత్రమే జర్మన్ భాష వాడుకయందు ఉన్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగిసిన తరువాత ఫ్రెంచి-డచ్చి భాషా వర్గముల మధ్య విభేదములు మరింత ప్రబలినవి ప్రభుత్వము ఉభయ భాషలకు సమానాదరణ కల్పించి, దేనికి ప్రాబల్యము కలచోట విద్యాబోధనా, పరిపాలనాది వ్యవహారములందు ఆ భాషయే మాధ్యమముగ ఉండునటులను, ముఖ్యనగరమున అన్ని రంగములందు ఆ రెండు భాషలకు సమానాదరణ కలుగునటులను, శాసించినను, ఈ భాషా వివాదము అంతటంతట చెలరేగుచున్నది. 1970 లో ఫ్లాండర్స్ (డచ్చి భాషా ప్రాంతము), వాలోనియా (ఫ్రెంచి ప్రాంతము) లకు సాంస్కృతిక, రాజకీయ వ్యవహారములందు కొంత స్థాయివరకు ఆంతరంగిక స్వతంత్ర ప్రతిపత్తి కల్పింపబడినది. దేశమున మత స్వాతంత్ర్యము చట్టరీత్యా అమలున ఉన్నది. జనాభా లెక్కలలో మతమును ఒక ప్రాతిపదికగ గుర్తించరు. కాని ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవులు. తక్కిన సంప్రదాయములవారు అల్పసంఖ్యలలో కలరు.

**4. సమాచార సౌ.:** 1801 తపాలాఫీసులును, తంతి ఆఫీసులు 1067, టెలిఫోనులు 20 18,827, రెండు బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులు (1 ఫ్రెంచి, 1 డచ్చి), 8 ప్రాంతీయ స్టేషనులు (3 ఫ్రెంచి 5 డచ్చి), రెండు టెలివిజన్ స్టేషనులు (1 ఫ్రెంచి, 1 డచ్చి) కలవు (1970).

**5. యాన సౌ :** మొత్తపు రోడ్ల నిడివి 12,099 కిమీ.; ఇందు అత్యధిక భాగము మంచి స్థాయికి చెందినది. దేశ విస్తీర్ణమునకు, రైలు మార్గముల నిడివితో కల నిష్పత్తిని లెక్కలోనికి తీసికొనినపుడు ప్రపంచ రాజ్యములందు అగ్ర స్థానము ఈ దేశమునకు కలదు. రైలు మార్గముల నిడివి 17,040 కి.మీ.; అందు ప్రధాన మార్గముల నిడివి 4,144 కి.మీ నౌకాయానమునకు పనికి వచ్చు దేశాంతర్గత జలమార్గముల నిడివి 1,568.7 కి మీ. దేశపు వర్తక నౌకాదళమున 80 నౌకలు కలవు; వాని పరిమాణము 10,76,330 టన్నులు; 23 వర్తక సంస్థలకు ఈ నౌకలు చెంది యున్నవి. ఇవిగాక దేశాంతర్గత జలమార్గములందు 5,000 చిన్న నౌకలు పాల్గొనుచున్నవి. వాని ప్రమాణము దాదాపు 30 లక్షల టన్నులు. సముద్రపు రేవులలో ప్రముఖము ఆంట్‌వెర్ప్. దేశీయమగు విమానయాన సంస్థ ఒకటి కలదు. దీని వలన నాలుగు ఖండములలో 38 దేశములకు చెందిన 64 ప్రముఖ నగరములకు ఈ దేశము నుండి విమానయాన సంబంధము కలదు.

**6. చరిత్ర:** క్రీస్తునకు పూర్వమున ఈ ప్రాంతమున బెల్జే అను ఒక కెల్టిక్ జాతి ప్రజానీకము నివసించుచుండినది. క్రీ. శ. 57లో దీనిని రోమనులు జయించి, తమ సామ్రాజ్యమున ఒక

రాష్ట్రముగ చేసికొనిరి. కాని వారి పరిపాలనా కాలమున, వారిని ప్రతిఘటించిన కెల్టిక్ ప్రజ సమూలముగ నాశనమయినది. రోమన్ సామ్రాజ్యము నామావశిష్టమైన తరువాత క్రీ. శ. 5 వ శతాబ్దిలో ఫ్రాంకులను ఒక తెగవారు ఈ దేశమును ఆక్రమించి ఇట నివాసమును ఏర్పరచుకొనిరి. నేడు ఫ్రెంచి, డచ్చి భాషల మాటాడు ఉభయ వర్గములును ఈ ఫ్రాంకుల నుండి రూపు గొనినవియే. క్రీ. శ. 8 వ శతాబ్దమున షార్లమేన్ ప్రభుని సామ్రాజ్యమున ఈ దేశము భాగమైనది. ఆ సామ్రాజ్యము అంతరించిన తరువాత దేశము విభిన్న మాండలిక రాజ్యములుగ చీలి, పరిసర ప్రాంతములతో పాటుగ కడకు 15 వ శతాబ్దిలో హాబ్స్‌బర్గ్ సామ్రాజ్యమున భాగమైనది. ఆ సామ్రాజ్యము విభజితమైనపుడు (1555), ఇది స్పెయిను దేశపు ప్రభువునకు దక్కినది. అనాడు ఈ రాజ్యమును, ప్రక్కన ఉన్న హాలండ్ మొదలగునవియు కలసి నెదర్‌లాండ్స్ అని వ్యవహృతము లగుచుండెడివి. అంతట మత సంప్రదాయ విభేదముల వలన దేశము భిన్నభిన్నమై, వేర్వేరు ప్రాంతములు వేర్వేరు కాలములందు చేతులు మారినవి. 1713 లో ఆస్ట్రియా సామ్రాజ్యమునకు ఈ దేశము ఒక ఒడంబడిక ద్వారా లభించినది. 1792 లో ఫ్రెంచి సేనలు ఈ ప్రాంతమును వశపరచుకొనినను, 1815 లో ఈ ప్రాంతము విముక్తమై, తొలుత నెదర్‌లాండ్స్‌తో చేరియుండి కడకు 1839 లో స్వతంత్ర దేశముగ అవతరించినది. అంతట తక్కిన యూరపీయ రాజ్యములు ఈ దేశపు స్వాతంత్ర్య ప్రతిపత్తిని గౌరవించి, దానిని శాశ్వత తటస్థ రాజ్యముగ మన్నించుటకు అంగీకరించినవి. దేశమున ప్రజల అభీష్టమును అనుసరించి వంశానుగతము, రాజ్యాంగ బద్ధమునగు రాజరికపు పాలన ఏర్పడినది. ఈ రాజవంశమునకు చెందిన లియొపొల్డ్ II (1835-1909), ఆఫ్రికా యందలి కాంగో నదీలోయ యందు నూత్న దేశాన్వేషణను తన ధన సహాయము వలన ప్రోత్సహించి, దేశపు వలస సామ్రాజ్యమునకు తొలిమెట్టును వేసెను. తరువాత, బెల్జియన్ కాంగో (ఇప్పటి జయిరే) బెల్జియపు వలసయైనది.



ప్రథమ ప్రపంచ యుద్ధ కాలమున, జర్మన్ సేనలు నిష్కారణముగ, బెల్జియంపై దండెత్తి, ప్రతిఘటనను నిర్మూలించి దేశమున అత్యధిక భాగమును ఆక్రమించినవి. అంతట బెల్జియం సేనలు మిత్ర రాజ్యములతోచేరి ఆ యుద్ధమున పాల్గొనినవి. యుద్ధానంతరమున జరిగిన శాంతి సంధి మూలమున ఆఫ్రికా యందలి రువండా-బురుండీ ఈ దేశమునకు మాండేటరీ ప్రాంతముగ దక్కినది. యుద్ధనష్టము నుండి దేశము త్వరలోనే కోలుకొనినను, రెండవ ప్రపంచ యుద్ధకాలమున మరల జర్మనుల ఆక్రమణకు లోనైనది (మే 10, 1940). అంతట రాజు జర్మన్ సేనలకు లొంగి బంధితుడయ్యెను. కాని ప్రభుత్వము, సేనలతో లండనుకు చేరి ప్రవాస ప్రభుత్వమును ఏర్పరచి, మిత్ర రాజ్యములతోచేరి యుద్ధమును కొనసాగించినది. కడకు అక్షరాజ్య సేనలు పరాజితములైన తరువాత, ప్రభుత్వము స్వదేశమును చేరినది. తరువాత ప్రజలలో కొందరికి తన యెడల ఏర్పడిన అయిష్టతను గమనించి, రాజు పదవి నుండి వైదొలగగ, అతని కుమారుడు బేడోయిన్ రాజయ్యెను (జులై 17, 1951). ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున పీడిత ప్రజలందు చెలరేగిన స్వాతంత్ర్య వాంఛకు ఫలితముగ బెల్జియమునకు చెందిన ఆఫ్రికా ఖండపు వలసలు స్వతంత్రములైనవి (చూ : జయిరే, రువండా, బురుండి). భాషా వివాదములు ఇపుడు దేశమునకు కొంత ఆందోళనను కలుగజేయుచున్నవి.

**7. పరిపాలన :** వంశానుగతము, రాజ్యాంగ బద్ధమునగు రాజరికపు పాలన దేశమున అమలున

ఉన్నది. కార్య నిర్వహణాధికారము రాజునందు న్యస్తము; కాని రాజుచేయు ప్రతి ఉత్తరువునను అందులకు సంబంధించిన మంత్రి యొక్క ఎదిరి సంతకము ఉండి తీరవలయును. మంత్రి వర్గము పార్లమెంటునకు బాధ్యత వహించి పనిచేయును. శాసన నిర్మాణాధికారము రెండు కక్ష్యలు కలిగిన పార్లమెంటునను, రాజునను న్యస్తము. అందొక కక్ష్యయగు లోకసభయందు 212 మంది, శిష్టసభ యందు 178 మంది సభ్యులు కలరు. ప్రతి కక్ష్య కును ఎన్నికలు సాధారణరీతిలో నాలుగేండ్లకు ఒక సారి జరుగును. 21 ఏండ్లకు తగ్గని వయసు కలి గిన ప్రతి పౌరునికిని వోటుహక్కు కలదు. లోక సభా సభ్యులు నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమున, అపరోక్ష రీతిలో, ప్రాదేశిక నియోజక వర్గములను అనుసరించి ఎన్నుకొనబడెదరు. శిష్టసభా సభ్యులలో 106 మంది ప్రాదేశిక నియోజక వర్గములవలన, 40 మంది రాష్ట్రీయ సభలవలన ఎన్నుకొనబడగ, ఈ 154 మందియు కలసి 24 మంది శిష్టసభా సభ్యులను ఎన్నుకొనెదరు; రాజసోదరుడు శిష్టసభ యందు ఒక సభ్యుడుగ ఉండును. రెండు కక్ష్య లకు సమాన హక్కులు కలవు. రాజు ఈ కక్ష్య లలో ఒకదానినిగాని, రెండింటినిగాని రద్దుచేయ వచ్చును; కాని ఆ వెనువెంటనే 40 దినములలోపల ఎన్నికలు జరిగి క్రొత్త పార్లమెంటు విధిగ సమా వేశము కావలయును. భాషావర్గములను అనుసరించి నిర్మితములగు ఫ్లాండర్స్, వాలూన్ ప్రాంతములకు 1970 మొదలుగ సాంస్కృతిక, రాజకీయ విషయ ములకు సంబంధించిన పరిపాలనా స్వాతంత్ర్య మును, అందులకు అనుగుణముగ ఎన్నుకొనబడిన సభలను మంత్రులను కలిగియుండు అధికారములును కల్పింపబడినవి. దేశపు రాజకీయ పక్షములలో క్రిస్టియన్ సోషల్‌పార్టీ, బెల్జియన్ సోషలిస్ట్‌పార్టీ, లిబరల్ పార్టీ ప్రముఖములు. న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి కలదు. ఒక ఉన్నత న్యాయ స్థానపు అధ్వర్యవమున దేశమున న్యాయనిర్వహణ సాగుచున్నది.

**8. దేశరక్షణ :** భూతల సేనయందు 2 యాంత్రిక దళములు, 2 రిజర్వు దళములు, 1 పేరాకమాండు దళము కలరు; మొత్తపు సైనిక సంఖ్య 69 వేలు. నౌకాసేనయందలి యోధసంఖ్య 5,006; ఈ సేనకు గని తొలగింపు నౌకలు మొద లగు చిన్నరకపు రక్షణ నౌకలు 52 కలవు. వాయు సేనలో 20,000 సైనికులు కలరు; 450 విమాన ములు కలవు నెదర్‌లాండ్స్‌తో ఈ దేశమునకు కుదిరిన ఒక ఒడంబడికను (మే 10, 1948) అనుస రించి యుద్ధపరికర నిర్మాణ, సాంకేతిక శిక్షణాదు లలో సన్నిహితత్వము ఏర్పడినది.

**9 అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, తదనుబంధ సంస్థలందును, నేటోయందును. యూర పీయ కామన్ మార్కెటునను ఈ దేశమునకు సభ్య త్వము కలదు. నెదర్‌లాండ్స్, లక్సెంబర్గ్‌లతో ఆర్థిక సమ్మేళనము కలదు; ఇందువలన ఈ మూడు దేశములు సరిహద్దు సుంకముల విషయమున కలసి మెలసి వర్తించుచున్నవి. నేటో రాజ్యముల ముఖ్య కార్యాలయము 1967 మొదలుగ బ్రస్సెల్స్‌లో పనిచేయుచున్నది.

**10. ఆర్థిక రంగము :** దేశపు అల్ప వైశా ల్యము, అల్ప జనసంఖ్యను దృష్టిలో ఉంచుకొని చూచినపుడు యూరపునందలి దేశములందు అన్నింట పారిశ్రామికముగ ఎక్కువగ అభివృద్ధి చెందినదిగ ఈ దేశమును పరిగణింపవచ్చును. రాక్షసిబొగ్గు తప్ప తక్కిన ఖనిజము లంతగా లేక, ముడిపదార్థములను విరివిగ దిగుమతి చేసి కొనుచునే, ఈ దేశము పారిశ్రామికోత్పత్తిలో ముందంజవేసి, తన ఉత్పత్తులలో 40% ను ఏటా ఎగుమతి చేయగలుగుచున్నది. దేశపు తలసరి సాలీనా ఆదాయము 1,07,000 బె. ఫ్రాంకులు

(1968). జాతీయోత్పత్తిలో వ్యవసాయమువలన 4% మాత్రమే లభించుచున్నది (1970). సేద్యమునఉన్న 15,29,467 హెక్టేరులలో 7,81,941 హె. గడ్డిబీడులుగ వినియుక్తము. 1971 లో వివిధ ఉత్పత్తుల వివరములు మెట్రిక్ టన్నులలో ఈ దిగువ రీతిగ కలవు: గోధుమ 8,77,865; బార్లీ 5,88,197; ఓట్లు 2,78,218; రై 81,968; బంగాళా దుంపలు 13,73,446; చక్కెర బీటు దుంప 48,73 032; పొగాకు 2,247. ఉద్యానవన కృషియు సాగుచున్నది. సమశీతోష్ణ మండలము లందు ఉత్పత్తి కాగలుగు పండ్లరకములు అన్నియు ఇట లభించును. వానిలో ఆపిల్, పియర్, చెర్రీలు ప్రముఖములు. అయినను దేశావసరములకై ఆహార ధాన్యములను దేశము దిగుమతి చేసికొనుచున్నది. దేశమున గోజాతి 26,42,970; గొర్రెలు 66,341; పందులు 39,24,806; గుర్రములు 60,050 కలవు (1971). దేశమునకు కావలసిన పాలు, పాల ఉత్పత్తులు, మాంసము ఇందువలన లభించుచున్నవి. దేశ వైశాల్యమున 21.8% అటవీ మయము; దీనివలన 25,65,000 ఘ మీటరుల కలప లభించినది (1969). చేపల పరిశ్రమలో మొత్తమున 24,061 టన్నుల ప్రమాణముగల పడవలు పాల్గొనుచున్నవి; 99.97 కోట్ల బె. ఫ్రా. విలువగల 50,170 టన్నుల చేపలు పట్టుబడినవి (1971). దేశమున విద్యుదుత్పత్తి 3,159.2 కోట్ల కివా ; ఇంధనవాయువు 178 3 కోట్ల ఘ. మీటర్లు (1971). ఇనుము, ఉక్కుల ఉత్పత్తిలో ప్రపంచరాజ్యములందు ఈ దేశమునకు ప్రముఖ స్థానము కలదు. భారీ యంత్రములు, ఉక్కు దూలములు, పారిశ్రామిక పరికరములు, రైలురోడ్ల నిర్మాణ పరికరములు, నౌకా నిర్మాణము, ఇంజనీరింగు పరికరములు, చక్కెర తయారీ, సారా తయారీ, జవుళీ ఉత్పత్తులు ఇచటి పరిశ్రమలలో ప్రముఖములు. దేశపు ఎగుమతుల విలువ 60,38,68,240 వేల బె. ఫ్రా.; దిగుమతుల విలువ 62,63,38,717 వేల బె. ఫ్రాం. (1971). బడ్జెటరీ వ్యయము 42,560 కోట్ల బె. ఫ్రాం. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున కార్మికు లందరి, వివిధ వర్గములవారికి సాంఘిక భద్రతా సౌకర్యములు చట్టమూలమున అమలులో ఉన్నవి. నిరుద్యోగము, ప్రమాదము, వార్ధక్యములకు, స్త్రీల మాతృత్వకాలమునకు ఇవి వర్తించును. అంగ వికలులకు, అనాథ శిశువులకు, కొన్ని భృతులను ప్రభుత్వము కల్పించినది. గృహవసతి తగినంతగ కలదు. ప్రభుత్వము నూత్న గృహముల నిర్మాణమును ప్రోత్సహించుచున్నది. నిరక్షరాస్యత దేశమున లేనేలేదని చెప్పవచ్చును. 6 నుండి 14 ఏండ్ల వరకు వయసు కలిగినవారికి నిర్బంధోచిత విద్యాబోధన కలదు. ఆ యా భాషా వర్గములవారికి వారి మాతృభాషలలో విద్యను బోధించు వసతులు ఏర్పడి యున్నవి. దేశపు 5,327 శిశుశాలలలో 4,59,467 మంది; 8,819 ప్రాథమిక పాఠశాలలలో 10,02 611 మంది; 1,143 మాధ్యమిక పాఠశాలలలో 3,33,537 మంది; 2,564 సాంకేతిక పాఠశాలలలో 3,37,164 మంది విద్యార్థులు కలరు. లోవైన్, బ్రస్సెల్స్, ఘెంట్, లీగేలలోని విశ్వవిద్యాలయములందు 61,485 మంది విద్యార్థులు, తక్కిన 11 ఉన్నత విద్యాసంస్థలందు 13,621 మంది విద్యార్థులు కలరు (1970-71). దేశమున ప్రముఖ గ్రంథాలయములు అనేకములు వివిధ నగరములలో కలవు; వానిలో బ్రస్సెల్స్ లోని రాయల్ లైబ్రరీ అతి ప్రముఖము (స్థాపితము 1837); ఇందలి గ్రంథసంఖ్య 21 లక్షలు. దేశపు 214 మ్యూజియములలో ఆంట్వెర్ప్‌లోని రాయల్ మ్యూజియమ్ ప్రముఖము 45 దిన పత్రికలు (ఫ్రెంచి 25, డచ్చి 15, జర్మన్ 1) దేశమున ప్రచారమున ఉన్నవి. వానిలో డెల్ స్టాండర్డ్ అను డచ్చి పత్రికయు, లే సాయిర్ అను ఫ్రెంచి

పత్రికయు ప్రముఖములు ప్రభుత్వ వైద్యశాల లును, ప్రయివేటు సంస్థల అధీనపు వైద్యశాలలును ప్రజలకు వైద్యసహాయమును కల్పించుచున్నవి. ఆసుపత్రులందలి మొత్తపు శయ్యాసంఖ్య 45,828; వైద్య సంఖ్య 14,991 (1970).

**12. యాత్రా సౌ.:** విదేశీయ యాత్రికులకు ప్రభుత్వము పెక్కు సౌకర్యములను కలిగించి, ప్రోత్సహించుచున్నది. పశ్చిమ యూరప్, ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికాలలోని దేశములవారికిని, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, జపానులనుండి వచ్చు వారికిని వీసా అక్కరలేదు; పాస్‌పోర్టు చాలును. తక్కినవారికి పాస్‌పోర్టు, వీసాలు ఉండవలయును.

**13. ప్రసిద్ధ పౌరులు:** కళా రంగమున ప్రపంచ ప్రసిద్ధిని ఆర్జించిన ప్రముఖులు పలువురు ఈ దేశమున జన్మించిరి. వారిలో అతి ప్రముఖుల పేరులు మాత్రమే ఈ దిగువ ఈయబడినవి. 1. పీటర్‌పాల్ రూబెన్స్ (1577-1640); 2. ఆన్ తోనీ వాన్ డైక్ (1599-164 ) - వీరిరువురు ప్రసిద్ధ చిత్రకారులు; 3 జోహానెస్ ఓకేఘెమ్: పాశ్చాత్య సంగీతమున స్వరసామరస్య (హార్మనీ) రీతికి కల్పనను చేసినవాడు.

నోబెల్ బహుమతిని ఈ దిగువవారు ఆయా శాస్త్రములందు ఆర్జించిరి: 4. మారిస్ మేటర్ లింక్ (1862-1949) - సారస్వతము; 5. జూలిస్ బోర్డే (1870-1961) - క్రిమి విజ్ఞానము; 6. కార్నీలీ జె. యఫ్ హైమన్స్ (1892-1968). వైద్యశాస్త్రము.

శాంతి కృషికై ఈ దిగువ ముగ్గురు నోబెల్ బహుమతిని ఆర్జించిరి: 7. ఆగస్టీ బీర్‌నేర్ట్ (1829-1912); 8. హెన్రీ లాఫన్ టయిన్ (1854-1943); 9. ఫాదర్ డొమినిక్ పిరే (1910-69).

---

# 20. మాల్టా

**ముఖ్యనగరము:** వలెట్టా; **జెండా:** తెలుపు; ఎరుపు నిలువు చారలు దండముకడనుండి క్రమముగ అమరియుండగ, తెల్లదానియందు పైభాగమున దండమువద్ద 'జార్జి క్రాస్' అను ఒక విధపు సిలువ చిహ్నమును ఎర్రని కడయంచులతో కలిగినది; **జాతీయ గీతము:** 'ఇల్ ఇన్నూ మాల్టీ' (మాల్టీయ గీతము) అని వ్యవహృతమగునది; **నాణెము:** మాల్టా పౌండు; ఇది 20 షిల్లింగులుగ విభక్తము; ఒక మాల్టా పౌండు = రు. 18-00; **కొల తూతములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** మధ్యధరా సముద్ర మధ్య భాగమున, సిసిలీ ద్వీపమునకు దాదాపు 93 కిమీ. ల దక్షిణమున నెలకొనిన మూడు ద్వీపములు - మాల్టా, కొమినో, గోజో - సమష్టిగ చేరుటవలన ఈ రాజ్యము రూపుగొనినది. అవిగాక, నిర్జనములగు రెండు చిన్న లంకలును - కొమినోట్టో, ఫిల్‌ఫ్లా - ఇందు చేరి ఉన్నవి. దేశపు మొత్తపు వైశాల్యము 316 చ. కిమీ. (ఇందు మాల్టా దీవి వైశాల్యము 253 చ. కిమీ.). ముఖ్యనగరమగు వలెట్టా, మాల్టా దీవియందు ఉన్నది. దీవులన్నియు శిలామయములు; అందు సున్నపురాయి ఎక్కువగ కన్పట్టును. నేలవాలు వాయవ్యమునుండి తూర్పునకు దిగజారును;

అత్యున్నత ప్రాంతపు ఎత్తు 240 మీ. తీరములోనికి పలుప్రాంతములందు సముద్రము చొచ్చుకొని వచ్చుటవలన సహజ సిద్ధములగు నౌకాశ్రయము లును, ఉప్పునీటి కయ్యలును ఏర్పడినవి. ద్వీపము లలో దేనియందును కొండలుగాని, నదులుగాని, సరసులుగాని కన్పడవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** మధ్యధరా ప్రాంత సహజమగు శీతోష్ణస్థితి ఇచట కననగును. ఎంత కాలమున ఎండలు కొంత ఎక్కువగనే ఉండి, పొడి గాలులు వీచును; చలికాలమున వానలు కురిసి, శీత బాధ అంతగ లేకుండును. గ్రీష్మర్తువున సరాసరి ఉష్ణోగ్రత 87° ఫా.; శీతకాలమున అది 49° ఫా. నవంబరు - జనవరి మధ్యకాలమున సాధారణముగ వర్షములు ఎక్కువ; సాలీనా వర్షపాతము 50 సెం. మీ. ద్వీపములందు వృక్షసంతతి చాల తక్కువ; చిన్నరకపు అత్తిచెట్లు మాత్రమే సహజ రీతిలో కన్పట్టును. ద్రాక్ష, ఆలివ్ జాతులు మానవ కృషివలన పెరుగుచున్నవి. అడవిపందివంటి చిన్న వన్యజంతువులు మాత్రమే అటనట కొలదిగ కలవు. తీరజలములందు మత్స్యసంపద అధికము.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 3,14,216 (1971); 1971 అంచనాలనుబట్టి ఆ సంఖ్య 3,22,070. వలెట్టా నగరపు జనసంఖ్య 15,401 (1971); ప్రాచీన జాతియగు కార్తజీని యనుల సంతతివారు ప్రజలలో అధికముగ కలరు; అయినను ఇటాలియన్ మొదలగు మధ్యధరా జాతులవారును కొలదిగ ఉన్నారు. మాల్టీస్ అనునది దేశీయుల మాతృభాష; ఇది సెమిటిక్ భాషా కుటుంబమునకు చెందినది; కోర్టులలో ఈ భాషయే వాడబడుచున్నది. అయినను మాల్టీజ్ తోపాటుగ ఇంగ్లీషు భాషయు అధికారభాషగ పరిగణనపొందినది. రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవమతము దేశీయ మతముగ సాధికార పరిగణన పొందినది; అయినను మత స్వాతంత్ర్యము చట్టరీత్యా అమలున ఉన్నది.

**4. సమాచార సౌ.:** దేశమున తపాలా తంతి సౌకర్యములు విరివిగ ఉన్నవి. టెలిఫోను సౌకర్యములు మాల్టా, గోజో దీవులలో కలవు. మాల్టీజ్ ఇంగ్లీషులలో రేడియో ప్రసారములు నిర్వహింపబడుచున్నవి; టెలివిజన్ సౌకర్యములు కలవు; దేశీయమగు ఒక స్టేషనుండియు, ఇటలీ లోని స్టేషనుల నుండియు, జరుగు టెలివిజన్ ప్రసారములు ఇట కననగుచున్నవి.

**5. యాన సౌ.:** దేశమున రైలుమార్గములు లేవు. 960 కి మీ. కు పైబడిన నిడివి కలిగిన రోడ్లు కలవు; ఇవి ఉత్తమ శ్రేణికి చెందినవి. దేశము నందలి ప్రతి జనావాసమునకును బస్సుల సౌకర్యము కలదు. దీవుల మధ్య నౌకాయానపు వసతి కలదు; ఈ నౌకల వలన మనుష్యులను, సరకులనే గాక, కార్లను సైతము ఒక దీవి నుండి మరొక దీవికి చేర్చవచ్చును. వలెట్టా యందలి నౌకాశ్రయము అత్యుత్తమ స్థాయికి చెందినది; వాయవ్య యూరపును పశ్చిమ ఆసియాతో అనుసంధించు నౌకా ప్రయాణములకు ఒక ముఖ్య మజిలీగ ఈ హార్బరు ఉపకరించుచున్నది. దేశీయ వర్తక నౌకా దళమున 120 నౌకలు కలవు; వాని ప్రమాణము 43,812 టన్నులు. దేశము నుండి ఇటలీ. లిబియాలకు విమానయాన వసతి కలదు. దేశీయనుగు విమానయాన సంస్థతో పాటుగ ఇటాలియన్, లిబియన్ విమానయాన సంస్థలును ఇందు పాల్గొనుచున్నవి. విమానాశ్రయములలో ప్రముఖమైనది లుకా వద్ద ఉన్నది.

**6. చరిత్ర:** మధ్యధరా సముద్ర ప్రాంతమున ఒక కీలక స్థానమున ఉండుట వలన, ఈ దేశము ఫినీషియనుల కాలమున నుండియు వివిధ జాతుల ఆక్రమణలకు అంతటంతట గురియైనది. క్రమముగ గ్రీకులు, కార్తజీనియనులు, రోమనులు అట ఆధిపత్యములను నెలకొల్పిరి. క్రీస్తుయొక్క

సాక్షాచ్ఛిష్యులలో ఒకడగు పాల్, క్రీ. శ. 58 లో నౌకాయానము చేయుచు, తన నౌక భగ్నముకాగా, ఈ దేశ తీరమును చేరి ఇచటి ప్రజలందు క్రైస్తవ మతమునకు వ్యాప్తిని కలిగించెనను గాథ ప్రచార మున ఉన్నది. రోమన్ సామ్రాజ్యము ద్విధా విభిన్నమైనపుడు (క్రీ. శ. 395), ఈ రాజ్యము ప్రాచ్య సామ్రాజ్యమునకు దక్కినది. తదనంతర మున 840 లో అరబ్బులకును, వారి నుండి 1090 లో సిసిలీని పాలించు ప్రభువులకును ఇది లభించినది. పవిత్ర రోమక సామ్రాజ్యమును పాలించు చార్లెస్ V, దీనిని సెయింట్ జాన్ యోధ వర్గమునకు దత్తముచేసెను (1530); ఈ యోధ వర్గము 1798 లో నెపోలియనునకు లొంగినది 1800 లో ఫ్రెంచివారి ఆధిపత్యమును తొలగించి బ్రిటిష్ ప్రభుత్వము దీనిని, దేశీయుల సహకారముతో, వశపరచుకొనినది. 1814 లో జరిగిన పారిస్ ఒడంబడిక వలన బ్రిటిష్ వారికి ఈ ద్వీప రాజ్యము పైన ఉన్నహక్కు ధ్రువపరుప బడినది. 19 వ శతాబ్దము నందు ఈ రాజ్యము, బ్రిటిష్ ప్రభుత్వము నియమించు మిలిటరీ గవర్న రుల పాలనలో ఉండినది. ప్రథమ ప్రపంచ యుద్ధా నంతరమున నుండి క్రమరీతిలో ప్రజలకు పరిపాలన యందు భాగస్వామ్యమును కల్పించుట మొదలిడి, కడకు 1962 లో దేశమునకు ఆంతరంగిక స్వపరి పాలనాధికారమును బ్రిటన్ కల్పించినది. అంతట ప్రజల అభీష్టానుసారముగ 1964 లో దేశము స్వతంత్రమై, తుదకు 1974, డిసెంబరు 13 న దేశమున గణతంత్ర ప్రభుత్వము ఏర్పడెను; అయినను కామన్‌వెల్తున సభ్యత్వము మాత్రము ఈ దేశము కలిగియున్నది.

**7. పరిపాలన :** దేశమున 1974, డిసెంబరు 13 మొదలుగ గణతంత్ర ప్రభుత్వము అమలున ఉన్నది. దేశమున 18 ఏండ్లు నిండిన ప్రతి పౌరు నికి వోటు హక్కు కలదు. అధ్యక్షుడు ప్రజలచేత ఎన్నుకొనబడును; అతని పదవీ కాలపరిమితి అయిదేండ్లు. శాసన నిర్మాణాధికారము 50 మంది సభ్యులుగల శాసన సభయందు న్యస్తమై ఉన్నది. ఈ సభకు సాధారణముగ అయిదేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. 10 నియోజక వర్గముల నుండి నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమున శాసన సభా సభ్యులు ఎన్నుకొనబడెదరు. శాసన సభ యందు అత్యధిక సంఖ్యాక బలముగల రాజకీయ పార్టీ యొక్క నాయకుని ప్రధానిగ అధ్యక్షుడు నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రివర్గ సభ్యులను నియమించును. శాసనసభకు బాధ్యత వహించి, ఈ మంత్రివర్గము ప్రభుత్వమును నిర్వ హించును. అధ్యక్షుడు రాజ్యాంగబద్ధ అధినేతగ వ్యవహరించును. దేశమున అయిదు రాజకీయ పక్ష ములు కలవు; వానిలో నేషనలిస్టు, లేబర్ పక్ష ములు ప్రముఖములు. గోజో దీవియందు పరిమిత మగు స్థానికపరిపాలన అమలున ఉన్నది. సుప్రీమ్ కోర్టులో రాజ్యాంగ సంబంధమగు న్యాయస్థానము, సాధారణ ఉచ్చతమ న్యాయస్థానము అను రెండు శాఖలు కలవు. రెండవదాని ఆధ్వర్యవమున దిగువ న్యాయస్థానములద్వారా న్యాయ నిర్వహణ సాగు చున్నది

**8. దేశరక్షణ :** దేశపు రక్షణ బాధ్యత ఒక ఒడంబడికద్వారా బ్రిటనునకు దత్తము చేయబడినది. ఆంతరంగిక రక్షణకై 1,379 మందిగల పోలీసు బలము కలదు. మార్చి, 1979 తరువాత విదేశీయ సైనిక స్థావరములు దేశమున ఉండగూడదని ప్రస్తు తపు ప్రభుత్వము నిర్ణయించినది; అప్పటికి బ్రిటన్‌తోగల రక్షణ ఒడంబడికకు కాలదోషము పట్టును.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. యందును, కామన్‌వెల్తునను, అలీన రాజ్యవర్గము నను ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశమున సహజ సిద్ధములగు వనరులు చాల తక్కువ. భూతలము శిలామయ మగుటవలన వ్యవసాయమునకు చాల వరకు అననుకూలము. ఆహార ధాన్యములను విరివిగ దిగుమతి చేసికొనుట దేశమునకు అత్యావశ్యకము. బ్రిటిష్‌వారి సైనిక స్థావరములందలి పని పాటులవలన మాత్రమే దేశమున పలువురకు జీవితము గడచుచున్నది. ఈ పరిస్థితికి 1979 నాటికి స్వస్తిచెప్పి, వేరువిధపు జీవనోపాధులను దేశీయులకు కల్పించుటకై ప్రభుత్వము కృషిచేయు చున్నది. వ్యవసాయమునఉన్న భూమి 37,998 ఎకరములు (1969-70). గోధుమ, బార్లీ, ద్రాక్ష ముఖ్యములగు పంటలు. ఉరలగడ్డలు, ఉల్లిగడ్డలు, కొన్ని ఫలజాతులు పండుచున్నను అందు అత్యధిక భాగము ఎగుమతి అగుచున్నవి. వ్యవసాయోత్పత్తుల మొత్తపు విలువ 97 లక్షల పౌనులు (1969-70). దేశావసరములకు తగినంతగ చేపల పరిశ్రమ సాగుచున్నది; ఆ కృషిలో 788 మోటారు బోట్లును. 160 తక్కురకముల పడవలును పాల్గొనుచున్నవి; 500 మంది అందు కృషిచేయుచున్నారు; చేపల పట్టుబడి 24,496 హండ్రడవెయిట్లు (1971) పెట్టుబడిదారులకు పెక్కు వసతులను కల్పించి, దేశమున పరిశ్రమలను ప్రభుత్వము ప్రోత్సహించు చున్నది. కృత్రిమోపగ్రహములకు సంబంధించిన వైద్యుతిక పరికరములు, విద్యుత్ పరిశ్రమలు, కొన్ని తేలికరకపు ఇంజనీరింగు పరిశ్రమలును కలవు; వీనికి ముడిపదార్థములను దేశము దిగుమతి చేసికొనుచున్నది. ప్రముఖ పరిశ్రమలలో నౌకా నిర్మాణము పేర్కొనదగినది; తక్కిన పారిశ్రామికోత్పత్తులలో చక్కజేయబడిన ఆహార వస్తువులు, సారాయములు, పొగాకు, జవుళీ వస్తువులు, రబ్బరు, రాసాయనికములు చెప్పదగినవి. దేశపు విద్యుదుత్పత్తి 28.1 కోట్ల కివా. (1971). దేశమునందలి ప్రతి జనావాసమునకును, పరిశ్రమకును విద్యుత్ సౌకర్యము కలదు. దేశపు ఎగుమతుల విలువ 1,88,15,000 పౌ.; దిగుమతుల విలువ 6,53,77,000 పౌ. (1971). చెల్లింపుల లోటును విదేశీయ యాత్రికులవలన వచ్చు ఆదాయము వలనను, విదేశీయుల పెట్టుబడులవలనను, బ్రిటిష్ ప్రభుత్వపు ధనసాహాయ్యమువలనను దేశము పూరించుకొను చున్నది. బడ్జెటరీ వ్యయము 4,41,41,730 పౌ. (1972-73).

**11. సాంఘిక రంగము :** పెరుగుచున్న జన సంఖ్యకు తగినటుల జీవితోపాధులు పెరుగకుండుట వలన ప్రజానీకమున ప్రతియేటా కొంతమంది విదేశములకు వలసపోవుచున్నారు; ప్రభుత్వమే అట్టి వలసను ప్రోత్సహించుచున్నది. 1949-68 మధ్య 1,12,109 మంది అటుల వలసపోయిరి; వారిలో దాదాపు 60 వేలు ఆస్ట్రేలియాకు వెళ్ళిరి. దేశమున తగినంత గృహవసతి కలదు. దాదాపు సాలీనా 2 వేల క్రొత్త ఇండ్లు నిర్మితము లగు చున్నవి. 1965 నుండి అమలునఉన్న జాతీయ భీమా పద్ధతిని అనుసరించి రోగబాధ, నిరుద్యోగము, వార్ధక్యము, అశక్తత, పరిశ్రమలందు ఘటిల్లు అపాయములు మొదలగునట్టి వాని సందర్భములందును, వితంతువులు, అనాథ శిశువులు మొదలగు వారి విషయమునను తగు ఆదాయము ప్రతివానికి లభించు సౌకర్యములు కలవు. దేశమున 109 ప్రయిమరీ పాఠశాలలలో 31,755 మంది; 40 సెకండరీ పాఠశాలలలో 22,268 మంది; 3 సాంకేతిక పాఠశాలలలో 1,457 మంది; ఒక కళాశాలలో 1,672 మంది; పారిశ్రామిక శిక్షణా కేంద్రములో 160 మంది; 5 వృత్తి విద్యాశాలలలో 700 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక 21 ప్రయివేటు విద్యాశాలలలో 15,843 మంది చదువు చున్నారు (1972). దేశపు గ్రంథాలయములలో వలెట్టాలోని మాల్టా గ్రంథాలయము, మ్యూజియము లలో ఆ నగరముననే ఉన్న నేషనల్ మ్యూజియము

ప్రముఖములు. ఆరు దినపత్రికలు (మూడు మాల్టీజ్ లోను, మూడు ఇంగ్లీషులోను) వ్యాప్తిలో కలవు (1971). 3,554 శయ్యాసంఖ్య కలిగిన 15 ఆసుపత్రులు పనిచేయుచున్నవి. అందలి వైద్యసంఖ్య 468; 720 మంది ప్రజలకు 1 వైద్యుడు కలడని అంచనా (1969).

**12. యాత్రా సౌ.:** విదేశీయ యాత్రికుల వలన వచ్చు ఆదాయము ప్రభుత్వపు వనరులలో ఒక ముఖ్యభాగము అగుటవలన, ప్రభుత్వము యాత్రికులకు పెక్కు వసతులను కల్పించి ఆ పరిశ్రమను ప్రోత్సహించుచున్నది. 1971 లో 1,78,704 మంది విదేశీయ యాత్రికులు దేశమును సందర్శించిరి; వారు దేశమున 128.5 లక్షల పౌనులను వెచ్చించిరి.

**13. ప్రముఖ పౌరులు:** 1. జెహాన్ పరిసోట్ డి లా వలెట్టా (1494-1568); సెయింట్ జాన్ యోధవర్గపు అధినాయకుడు; 1565 లో దేశమును ముట్టడించిన తుర్కీ సేనలను ప్రతిఘటించి తరిమివేయుటలో దేశపు సేనలకు నాయకత్వము వహించెను. ఈతని పేరనే దేశపు ముఖ్యనగరమునకు వలెట్టా అను పేరు కలిగినది.

---

# 21. మొనాకో

**ముఖ్యనగరము:** మొనాకో-విల్లీ; **జెండా:** ఎరుపు, తెలుపు అడ్డుచారలు సమాన ప్రమాణములలో పైనుండి దిగువకు అమరినది; **జాతీయ గీతము:** హిమ్నే మొనేగాస్క్ (మొనాకో గీతము) అని వ్యవహృతమగుచు, "ప్రిన్సిపాతే మొనాకో, మా ప్యాత్రీ" (మొనాకో మండలమా, మా జన్మభూమీ) అను చరణము తొలుత కలది; **నాణెము:** ఫ్రాన్స్‌దేశపు ఫ్రాంక్ నాణెమే, ఫ్రాన్స్‌దేశమున అమలున ఉండు అన్ని విధి నియమములతో, ఇట చలామణి అగుచున్నది; **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** ఫ్రాన్స్‌దేశపు ఆల్ప్స్-మేరీటైమ్ జిల్లాలో ఆగ్నేయ ప్రాంతమున ఇమిడి స్వతంత్ర భూమిగ వర్తించు ఈ రాజ్యమునకు దక్షిణమున మధ్యధరా సముద్రమును, తక్కిన అన్నివైపుల ఫ్రాన్సుదేశమును సరిహద్దులందు కలవు. దేశ వైశాల్యము 150 హెక్టేరులకు పైగా కొలదిగ (రమారమి 372 ఎకరములు) మాత్రమే; అనగా దాదాపు 1.5 చ. కిమీ. సముద్రతీరపు చిత్తడి నేలను మెరకచేయుటవలన ఇంకొక 30 హెక్టేరులు వైశాల్యమున పెరుగుటకు అవకాశము కలదు; తీరభూమి పొడవు 3,500 మీ. తీరమును అనుసరించి దేశపు వెడల్పు 146 మీ. నుండి 1,000 మీ. వరకు మారుచుండును. ఈ అల్ప రాజ్యము లా కాండమైన్, మాంటికార్లో, మొనాకో-విల్లీ అను మూడు ప్రాంతములుగ విభక్తము. లా కాండమైన్ అనునది హార్బరును ఆశ్రయించిఉన్న వ్యాపార ప్రాంతము; మాంటీ కార్లోలో ప్రపంచ ప్రసిద్ధమగు విలాస జీవన కేంద్రమగు 'కేసినో' ఉన్నది. మొనాకో-విల్లీ అనునది రాజభవనము; 60 మీ. ఎత్తుగల ఒక గుట్టపై ఆ రాజభవనము నెలకొని ఉన్నది.

**2. శీతోష్ణస్థితి మొ.:** శీతకాలమున జనవరి నెలలో సరాసరి ఉష్ణోగ్రత 50° ఫా. ఎండకాలమున ఎండలు కొంత ఎక్కువగనే ఉన్నను సము

ద్రపు గాలులవలన వేడిమి తక్కువగును. జులై, ఆగస్టు నెలలో ఎండవేడిమి ఏనాడును 85° ఫా. కు పైబడదు. సాలీనా సరాసరి వర్షపాతము 72 సెం. మీ.; సంవత్సరమున 300 దినములందు వర్షమే ఉండదు. తాళజాతి వృక్షములు మొదలగు మధ్యధరా ప్రాంత వృక్షజాతి ఇట అటనట కన నగును. దేశమంతయు ఒకే ఒక నగరమగుట వలన వన్యజంతువులు ఏవియు లేవు.

**3. జనసంఖ్య మొ. :** జనసంఖ్య 23,400 (1970); ఇందు దాదాపు 14 వేలమంది ఫ్రెంచి సంతతివారు, 3 వేలమంది ఇటాలియన్ సంతతికి, తక్కినవారు దేశీయమగు మొనెగాస్క్ సంతతికి చెందినవారు. ప్రజలలో దాదాపు 50% లా కాండ మైన్‌లో వసించుచున్నారు; మొనాకో - విల్లీలో 1,649 మాత్రమే కలరు. జనసాంద్రత చ. కిమీ.కు 13.7. ఫ్రెంచిభాష సాధికార భాషగ పరిగణన పొందినది. పలువురు మొనెగాస్క్ అను మాండలిక భాషను మాటాడెదరు; ఇది అపభ్రంశపు లాటిన్ భాషనుండి జన్మించినది. రోమన్ కేతలిక్ క్రైస్తవ సంప్రదాయమునకు ప్రభుత్వాదరిత మతముగ పరిగణన కలదు.

**4 సమాచార సా. :** దేశపు తపాలా, తంతి వసతులను ఫ్రాన్స్‌దేశపు ప్రభుత్వము నిర్వహించుచున్నది; అయినను మొనాకో ప్రభుత్వమే తపాలా స్టాంపులను జారీచేయుచున్నది. స్థానికమగు టెలిఫోను వ్యవస్థ, దేశ ప్రభుత్వపు వశమునను, విదేశములతో టెలిఫోను వసతి ఫ్రాన్స్‌దేశపు ప్రభుత్వపు వశమునను ఉన్నవి. 1954 మొదలుగ దేశమున రేడియో, టెలివిజన్ కేంద్రములు పనిచేయుచున్నవి. దేశీయ ప్రసారములు ఫ్రెంచిలోను, విదేశ ప్రసారములు 16 విదేశ భాషలలోను సాగుచున్నవి. 15,000 టెలివిజను సెట్లును, 7,500 రేడియో రిసీవరులును, 15 వేల టెలిఫోనులును దేశమున కలవు.

**5. యాన సౌ. :** ఫ్రాన్సు దేశపు రెండు జాతీయ మార్గములు ఈ రాజ్యమును ఫ్రాన్స్‌లోని నైస్ నగరమునకును, ఇటలీలోని రివీరాకును అనుసంధించుచున్నవి; అటులే ఫ్రాన్స్‌దేశపు రైలుమార్గమొకటి ఈ దేశమున కొంతదూరము పోవుటవలన ఇచటి ప్రజలకు రైలు ప్రయాణవసతి, సరుకులకు రవాణా వసతి కలిగినది. నైస్ నగరములోని విమానాశ్రయమే ఈ రాజ్యపువారికిని ఉపకరించుచున్నది. లా కాండమైన్‌ను ఆనుకొనిఉన్న హార్బరు విదేశ ప్రయాణములకు, సరుకుల ఎగుమతి దిగుమతులకు పనికివచ్చుచున్నది. దేశపు వర్తక నౌకాదళమున మూడు సముద్ర నౌకలు కలవు; వాని ప్రమాణము 19,000 టన్నులు.

**6. చరిత్ర :** తొలుత ఇటలీ యందలి జెనోవా రాజ్యమునకు చెందియుండిన ఈ ప్రాంతము 13 వ శతాబ్ది ఉత్తరార్ధమున 'గ్రిమాల్డీ' అను రాజ కుటుంబమునకు దత్తమైనది. 1489 లో ఈ రాజ్యపు స్వతంత్రతత గుర్తింపబడినది. 1793 లో ఫ్రాన్స్ ఈ రాజ్యమును వశపరచుకొనినను, 1814 లో మరల దేశము స్వతంత్రము కాగలిగినది. అయినను ఒక ఒడంబడికను అనుసరించి 1815 లో ఈ రాజ్యము సార్డీనియా అను వేరొక రాజ్యపు రక్షణలోనికి పోయినది. తరువాత మొనాకోపై ఫ్రాన్స్‌కు ఆధిపత్యము ఏర్పడినది (1861). అంతట ఫ్రాన్స్‌తో సౌమనస్య రీతిలో దేశము స్వతంత్రముగ వ్యవహరించుట ఆరంభమైనది.

**7. పరిపాలన :** రాజ్యాంగబద్ధము, వంశానుగతము అగు రాచరికము ఇట పాలనను నిర్వహించుచున్నది. రాజునకు పురుషసంతతిలేని సందర్భమున, ఆ రాజు మరణానంతరమున, ఫ్రాన్స్ దేశమున మొనాకో అంతర్లీనము కావలయునను

ఏర్పాటు కలదు. 1962 లో వెలువరింపబడిన రాజ్యాంగ విధానమును అనుసరించి, శాసన నిర్మాణాధికారము రాజునందును, 18 మంది ఎన్నుకొనబడిన సభ్యులు కలిగిన శాసనసభయందును న్యస్తము అయిదేండ్లకొకతూరి ఈ శాసనసభకు ఎన్నికలు జరుగును. ఒక మంత్రిని ముగ్గురు సలహాదారులను రాజు నియమించగ, వారు శాసన సభకును, రాజునకును బాధ్యత వహించి రాజ్య పరిపాలనను నిర్వహింతురు.

**8. దేశరక్షణ :** 200 మంది కలిగిన మిలిటరీ పోలీసు దళము కలదు; నిర్బంధ సైనిక శిక్షణ నియమము ఈ రాజ్యమున లేదు. ఒక ఒడంబడిక (1918) ను అనుసరించి దేశరక్షణ బాధ్యత ఫ్రాన్స్‌నకు అప్పగించబడినది.

**9 అంతర్జాతీయ సం :** ఈ దేశపు విదేశ వ్యవహారముల బాధ్యత ఫ్రాన్స్‌నందు కలదు; ఫ్రాన్స్‌తోపాటుగ యూరపీయ కామన్ మార్కెట్‌న ఈ రాజ్యము చేరిఉన్నది. ఐ. రా స. లో ఈ దేశమునకు సభ్యత్వము లేకున్నను అంతర్జాతీయ అణుశక్తి సంస్థ, అంతర్జాతీయ వ్యాపార సమ్మేళనము, యునెస్కో, అం. తపాలా యూనియన్, ప్రపంచ ఆరోగ్య వ్యవస్థలలో సభ్యత్వము కలదు. అంతర్జాతీయ సంస్థలలో అంతర్జాతీయ హైడ్రోగ్రాఫిక్ బ్యూరో మొదలగు పెక్కింటి ముఖ్య కార్యాలయములు ఇట కలవు ఈ దేశము అంతర్జాతీయ వివాదములకు దూరముగ ఉండుటవలనను, శీతోష్ణ స్థితి ఎల్లపుడు అనుకూలముగ ఉండుటవలనను అంతర్జాతీయ వ్యవస్థలు అనేకములు తమ వార్షిక సమావేశములను ఇట జరుపుచున్నవి.

**10. ఆర్థిక రంగము :** దేశమున వ్యవసాయ, పశుపోషణ, అటవీ పరిశ్రమలకు అవకాశములే లేవు. దేశావసరములకు సరిపోవునంత మేరకు చేపల పరిశ్రమ సాగుచున్నది. దేశపు ఆర్థిక వ్యవస్థయంతయు యాత్రికులవలన వచ్చు ఆదాయముపై ఆధారపడి యున్నది. ఈ యాత్రికులకు వసతులను సౌకర్యములను సమకూర్చుటకు ఒక వర్తక సంస్థ పనిచేయుచున్నది (ఇది యస్‌బియం అను సంక్షిప్త నామముతో వ్యవహృతము; సముద్ర స్నాన సంస్థ అని దాని పూర్తిపేరును అనువదింపవచ్చును). మాంటికార్లోలో 'కేసినో' అను సుప్రసిద్ధ ద్యూతశాలను, పెక్కు హోటళ్లను, సినిమా హాలులను ఈ సంస్థ నిర్వహించుచున్నది. తన వ్యాపారమును, పోటీలేకుండ సాగించు వసతిని కలిగినందులకై, ప్రభుత్వమునకు ఈ సంస్థ ప్రతియేటా కొంత పన్నును చెల్లించుచున్నది. ఈ పన్ను 1939 లో 10 లక్షల యు. స్టే. డాలరులుగ ఉండినది. కొన్ని చిన్న పరిశ్రమలు కలవు. వానివలన ఆదాయము మొదలగువానిని గురించియు, విదేశీయ వ్యాపారమును గురించియు సంఖ్యా వివరములు తెలియవచ్చుటలేదు. దేశీయులు చెల్లించదగు ప్రత్యక్షపు పన్నులు ఏవియు లేవు. అమ్మకపు పన్ను మొదలగు పరోక్షపు పన్నులు కొన్ని కలవు. దేశపు బడ్జెటరీ వ్యయము 17,60,83,000 ఫ్రాంకులు (1970).

**11. సాంఘిక రంగము :** పౌరులకు తగినంత గృహవసతి కలదు. వృద్ధులకు ప్రభుత్వ సహాయక సంస్థవలన ఆశ్రయము లభించుచున్నది. తక్కు విధముల సాంఘిక శ్రేయో కార్యక్రమములను వైయక్తిక సంస్థలు నిర్వహించుచున్నవి. 6 నుండి 16 ఏండ్ల వయసు కలవారికి నిర్బంధ విద్యాబోధన పద్ధతి అమలున ఉన్నది. ప్రయిమరీ పాఠశాలలలో 1,151 మంది; సెకండరీ పాఠశాలలలో 1,032 మంది; సాంకేతిక పాఠశాలలలో 615 మంది విద్యార్థులు కలరు (1970). ఈ నగర రాజ్యపు సార్వజనిక గ్రంథాలయమున 120 వేల గ్రంథములు కలవు. ఓషియానో గ్రాఫిక్ (సాగర విషయిక) మ్యూజియం అను పేరున ఈ నగరమున

1910 నుండి ఒక శాస్త్రీయ ప్రదర్శనశాల, సముద్రమునకు సంబంధించిన పెక్కు జంతువులను, వస్తువులను, విషయములను ప్రదర్శించుచున్నది దినపత్రికలు లేవు; విదేశములకు, అందును ముఖ్యముగ ఫ్రాన్సుకు, చెందిన దిన పత్రికలే ఇట ప్రచారమున ఉన్నవి. 206 శయ్యలు కలిగిన ఒక వైద్యశాల కలదు; వైద్యసంఖ్య 32 (1969).

## 22. యుగోస్లావియా

**ముఖ్యనగరము :** బెల్‌గ్రేడ్; **జెండా :** నీలి, తెలుపు, ఎరుపు అడ్డుచారలు పైనుండి దిగువకు అమరియుండగ, మధ్యన పంచకోణపు ఎర్రని నక్షత్ర చిహ్నము బంగారు కడయంచులతో కలది; **జాతీయ గీతము :** హేజ్ స్లావేని (ఓ స్లావులారా)




పటము 20.

అను పదములతో ఆరంభితము; **నాణెము :** దీనార్ : 12.5 దీనారులు = రు. 7.50; **కొలతతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దక్షిణ యూరపున 40°51′ - 46°53′ ఉ. అ. రేఖల మధ్యను, 13°23′ - 23°02′ తూ. తులారేఖల మధ్యను నెలకొనియున్న ఈ గణతంత్ర సమాఖ్యా రాజ్యమునకు ఉత్తరమున ఆస్ట్రియా, హంగరీ దేశములు; ఈశాన్యమున రుమేనియా; తూర్పున బల్గేరియా; దక్షిణమున గ్రీస్; నైరుతిన ఆల్బేనియా; పశ్చిమమున ఆడ్రియాటిక్ సముద్రము; వాయవ్యమున ఇటలీ సరిహద్దులందు ఉన్నవి. దేశమున అంతర్భాగములుగ ఆరు గణరాజ్యములు : సెర్బియా (88,361 చ. కిమీ.); క్రోషియా (56,538 చ. కిమీ.); స్లోవేనియా (20,251 చ. కిమీ.), బోస్నియా - హెర్జెగోవినా (51,129 చ. కిమీ.); మేడిడోనియా (25,713 చ. కిమీ.), మాంటెనీగ్రో (13,812 చ. కిమీ.) కలవు; ఇవిగాక, దేశాంతర్భాగములుగ రాజ్యాంగరీత్యా పరిగణనపొంది, ఆడ్రియాటిక్ సముద్రమున నెలకొని, తీరప్రాంతమునకు దరిదాపులలోఉన్న 1,050 దీవులు కలవు. ఇందు ఆరు మాత్రమే 100 చ. కిమీ. వైశాల్యమును మించినవి. వీని అన్నింటితో కలసి దేశపు మొత్తపు వైశాల్యము 2,55,804 చ. కిమీ. ఆడ్రియాటిక్ సముద్రతీరపు నిడివి 2,092 కిమీ. దేశభూతలమున అయిదింట నాలుగువంతులు పర్వతమయము; అందలి అత్యున్నత ప్రాంతమగు ట్రిగ్లావ్ (ఎత్తు 2,863 మీ.), స్లోవేనియా రాష్ట్రమున వాయవ్య ప్రాంతమున జూలియన్ ఆల్ప్సు పర్వతములందు ఉన్నది. తూర్పు స్లోవేనియానుండి రుమేనియా సరి

హద్దువరకు వ్యాపించిన పన్నోనియన్ మైదానము మాత్రమే వ్యవసాయమునకు అనుకూలించు ప్రదేశము. తీరప్రాంతమున సహజసిద్ధములగు హార్బరులును, కయ్యలును కలవు. నదులలో సావా, డాన్యూబ్, డ్రీనా, ద్రావా నదులు ప్రముఖములు. వానిలో కొన్ని అడ్రియాటిక్ సముద్రమునుచేరగ, మరికొన్ని ఇటనుండి విదేశములద్వారా ప్రవహించి నల్లసముద్రమున, ఈజియన్ సముద్రమున చేరుచున్నవి. మూడు సరస్సులు - మాంటెనీగ్రోలోని స్కాదర్ (391 చ. కిమీ.); మేసిడోనియాలోని ఓహ్రిడ్ (348 చ. కిమీ.), ప్రెస్పాన్ (274 చ. కిమీ.)-కలవు.

**2 శీతోష్ణస్థితి మొ.** : ప్రాంతములనుబట్టి ఇట శీతోష్ణ పరిస్థితి మారుచున్నది. అడ్రియాటిక్ తీర ప్రాంత భూములందు మధ్యధరా ప్రాంత శీతోష్ణ పరిస్థితి (పొడి, నునువెచ్చని గ్రీష్మర్తువులు, వర్షములు పడుచు కొంతవరకు సౌమ్యములై ఉండు శీతకాలములు) కననగును. మధ్య, ఉత్తర, ఈశాన్య ప్రాంతములందు వెచ్చని గీష్మములును, శీతబాధ ఎక్కువగ ఉండు చలికాలములును అనుభవ వేద్యములు. వాయవ్యమున నైరుతిన వర్షపాతము ఎక్కువ; తూర్పున, ఆగ్నేయమున తక్కువ. ఉష్ణమండలపు వృక్ష, పుష్పజాతులు ఇట సముద్రతీర ప్రాంతమున కలవు. పర్వతసీమలందును, అడవులలోను ఎలుగు, లేడి, అడవిపంది, తోడేలు, గుంటనక్క కననగుచున్నవి. నదులలోను, సరోవరములందును, సముద్ర జలములందును చేపలు - ముఖ్యముగ సాల్మనాయిడ్స్ అను రకపుచే - విశేషముగ కలవు.

**3. జనసంఖ్య మొ.** : 1971 లోని జనాభా లెక్కలను అనుసరించి ఆ యా రాష్ట్రముల జనసంఖ్యలును, వాని ముఖ్యనగరములును, వాని జనసంఖ్యలును, ఈ దిగువరీతిగ కలవు.

| వరుస సంఖ్య | రాష్ట్రము పేరు | జనసంఖ్య 1971 | జనసాంద్రత చ. కిమీ. కు | ముఖ్యనగరము | ముఖ్యనగరపు జనసంఖ్య 1971 |
|---|---|---|---|---|---|
| 1. | సెర్బియా | 84 32,108 | 95.5 | బెల్‌గ్రేడ్ | 12,04,271 |
| 2. | క్రోషియా | 43,46,376 | 78.2 | జగ్రెబ్ | 6,02,058 |
| 3. | స్లోవేనియా | 16,97,499 | 85.2 | ల్జుబ్ల్జానా | 2,57,640 |
| 4. | బోస్నియా-హెర్జెగోవినా | 37,16,786 | 73.2 | సరాజెవో | 2,92,241 |
| 5. | మేసిడోనియా | 16,11,069 | 67.1 | స్కోవ్జే | 3,87,889 |
| 6. | మాంటెనీగ్రో | 5,31,213 | 38.4 | టిటోగ్రాడ్ | 98,437 |

దేశపు మొత్తపు జనసంఖ్య 2,03,35,054; జనసాంద్రత చ. కిమీ. కు 80.3. పై నగరములు గాక సెర్బియాలోని నోవీసాద్ (జ. సం. 2,14,408), ప్రిస్టీనా (1,52,733) పేర్కొనదగినవి. బహుజాతుల ప్రజలు వసించు దేశములలో ఈ దేశము ఒకటి. ఇచటి జాతులలో సెర్బులు, క్రోటులు, స్లోవేనులు, మేడిడోనీయనులు, మాంటెనీగ్రోలు అను అయిదు జాతులు ప్రముఖములు. బోస్నియా - హెర్జెగోవినా ప్రజలు తాము 'యుగోస్లోవ్' జాతివారలమని చెప్పుకొనెదరు; వీరిలో ముస్లిములు అత్యధిక సంఖ్యాకులు. ఆల్బేనియన్, హంగేరియన్ జాతుల సంతతికిచెందిన అల్పసంఖ్యాకులు దేశప్రజలలో 11% కలరు. సెర్బియా, క్రోషియాలలోని ప్రజలు సెర్బ్-క్రోషియన్ అన

బడు ఒక భాషను (స్లావ్ కుటుంబమునకు చెందిన దానిని) మాటాడెదరు; కాని దానికి సెర్బులు సిరిలిక్ లిపిని, క్రోటులు లాటిన్ లిపిని వాడెదరు. స్లొవేనియా, మేసిడోనియాలలో విభిన్నములైన, స్లావ్ భాషలు మాతృభాషలుగ ఉన్నవి; ఇందులో తొలుతటివారు లాటిన్ లిపిని, రెండవవారు సిరిలిక్ లిపిని వాడెదరు. ఇంకను కొన్ని మాండలిక భాషలును అటనట వ్యాప్తియందున్నవి. ప్రభుత్వము ప్రముఖ భాషలకు అన్నింటికి ప్రభుత్వ వ్యవహారములందు సమాన గౌరవము కల్పించినది ఒకే ఒక యుగోస్లావ్ భాషను రూపొందించుటకై చేసిన ప్రయత్నములు ఇప్పటికి సఫలములు కాకున్నవి. ప్రజలందు 75.1 శాతము క్రైస్తవులు; 12.3% ముస్లిములు; 12.6% ఏ మతమునకు చెందనివారు కలరు (1971). కాని క్రైస్తవులలో పలు సంప్రదాయములు వ్యాప్తియందు ఉన్నవి. అందు ఆర్తడాక్స్ చర్చి (41.2%), రోమన్ కేతలిక్ (31.7%) సంప్రదాయములకు అధికాదరణ కలదు.

**4. సమాచార సౌ.** : 3,341 తంతి, తపాలా ఆఫీసులును, తగు టెలిఫోను వసతులును కలవు. పెద్దవి 8, చిన్నవి 141 బ్రాడ్‌కాస్టింగు స్టేషనులు పనిచేయుచున్నవి. 4 టెలివిజన్ స్టేషనులు ఉన్నవి (1971).

**5 యాన సౌ.** : దేశమున తారురోడ్ల నిడివి 27,345 కిమీ ; కంకరరోడ్ల పొడవు 41,436 కిమీ. రైలుమార్గముల నిడివి 10,332 కిమీ. దేశాంతర్గతపు జలమార్గముల నిడివి 2,035 కిమీ. ఆ మార్గములందు పడవల సంఖ్య 1,413. స్కాడర్, ఓహ్రిడ్ సరసులలో నౌకాయానపు వసతులు ఉన్నవి. సముద్ర యానమునకు ఉపయోగించు వర్తక నౌకల సంఖ్య 386; వాని మొత్తపు ప్రమాణము 15,20,000 టన్నులు (1971), దేశపు విమానాశ్రయములలో బెల్‌గ్రేడ్, జగ్రెబ్, ల్జుబ్ల్జానా, సరాజెవో, స్కోప్జే డుబ్రోవినిక్, స్ప్లిట్, టిటోగ్రాడ్, పూలా, జదర్‌లలోనివి ప్రముఖములు. దేశీయమగు విమానయానసంస్థ దేశాంతర్గత ప్రయాణములను నిర్వహించుటయేగాక, విదేశీయ విమానయాన సంస్థలతో పాటుగ అంతర్జాతీయ విమానయానమున పాల్గొనుచున్నది.

**6. చరిత్ర** : వివిధ స్లావ్ జాతులు చేరిన ఈ దేశము తొలుత విభిన్న రాజ్యములుగ ఉండెడిది. క్రీ. శ. 6 వ శతాబ్దిలో ఇందలి ఉత్తర ప్రాంతములు ఫ్రాంకుల రాజ్యమునను, దక్షిణ ప్రాంతములు ప్రాచ్య రోమక సామ్రాజ్యమునను అంతర్భాగములయినవి, క్రీ. శ. 8, 9 శతాబ్దాలలో ఈ ప్రజలందు క్రైస్తవ మతము వ్యాపించినది. 1054 లో ఆర్తుడాక్సు, రోమన్ కేతలిక్ శాఖలుగ క్రైస్తవ మతము చీలినపుడు, ఇచట సైతము ఆ ద్వివిధ సంప్రదాయములు తావు కల్పించుకొనినవి. ఆ సంప్రదాయముల మధ్యనున్న వైరుధ్యములు రాజకీయ, సంస్కృతు లందును ప్రతిఫలించినవి. ఈ జాతులలో క్రోటులు తొలుత ఒక స్వతంత్ర రాజ్యమును ఏర్పరచుకొనగలిగిరి (925); కాని 1102 లో ఆ ప్రాంతము హంగరీ దేశపు ప్రభువులకు వశమయ్యెను. ప్రాచ్య రోమక సామ్రాజ్యము పటుత్వమును కోలుపోయిన తరువాత 12 వ శతాబ్దిలో సెర్బులు స్వతంత్రరాజ్య మేర్పరచుకొనిరి. దీనిని పాలించిన రాజవంశములో స్టెఫాన్ దూషన్ (1331-55) అను వాని కాలమున మేసిడోనియా మొదలగు ప్రాంతములును ఈ రాజ్యమున అంతర్భాగములైనవి. కాని 1389 లో సెర్బియాను, దాని అధీనమున ఉన్న ప్రాంతములను తుర్కులు వశపరచుకొనిరి. తుర్కుల పరిపాలనా కాలమున పలు ప్రాంతములలో - అందును ముఖ్యముగ బోస్నియా - హెర్జెగోవినాలో - ఇస్లాం మతము వ్యాపించినది. తుర్కుల వశమున ఈ ప్రాంతము దాదాపు 500 సంవత్సరములు ఉండినది.

19 వ శతాబ్దమున, స్లావ్ ప్రజలు స్వాతంత్ర్యమునకై సాగించిన తిరుగుబాటుల ఫలితముగ సెర్బియా తొలుత స్వతంత్రతను ఆర్జించినది (1877-78). 1913 లో బాల్కను యుద్ధముల ఫలితముగ మేసిడోనియా సెర్బియాకు వశమైనది. సెర్బియాలోని సరాజెవో నగరమున ఆస్ట్రియా-హంగరీ రాజవంశపు వారసుడు చంపబడుటయే ప్రథమ ప్రపంచ యుద్ధమునకు కారణమైనది. ఆ యుద్ధకాలమున మిత్రరాజ్యముల సహాయ సంపత్తి సెర్బియాకు లభించినది. తత్ఫలితముగ యుద్ధానంతరమున ఆస్ట్రియా-హంగరీ నుండి క్రోషియా, డాల్మేషియా, బోస్నియా, హెర్జెగోవినా, స్లోవేనియా, మాంటెనిగ్రోలు, అచటి ప్రజల కోర్కెలను అనుసరించి సెర్బియాకు దక్కినవి, ఈ ప్రాంతములన్నియు కలసిన ఈ రాజ్యమునకు యుగోస్లోవియా అను పేరు 1929 లో కలిగినది. సెర్బియా దేశపు రాజవంశమే ఈ రాజ్యమును పాలించినది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జర్మనీ సేనలు దేశముపై దండెత్తగ రాజగు పీటరు II, లండనునకు పారిపోయెను. అంతట సెర్బియాలో జర్మనులు ఒక కీలుబొమ్మ ప్రభుత్వమును ఏర్పరచిరి; తక్కిన రాష్ట్రములను ఇటలీ హంగరీ జర్మనీ బల్గేరియాలు పంచుకొనినవి. అంతట 1941 నుండి 45 వరకు దేశపు ప్రజానీకము పరప్రభుత్వములను ఎదిర్చి విమోచనోద్యమమును, గెరిల్లా పద్ధతులలో సాగించినది. ఆ పోరాటమున జోసిప్ బ్రోజ్ అను నతడు నాయకత్వము వహించెను. అతడే 'టిటో' అను ఉపనామముతో జగత్ ప్రసిద్ధిని ఆర్జించెను. అంతట ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున దేశము విముక్తము కాగా, రాజరికము రద్దుచేయబడి మార్షల్ టిటో నాయకత్వమున ప్రజా గణరాజ్య సమాఖ్య ఏర్పడినది. టిటో కమ్యూనిస్ట్ వాదావలంబియే యైనను, తన దేశమున సోషలిస్ట్ వ్యవస్థను నెలకొల్పు విషయమున సోవియట్ రష్యా యందలి కమ్యూనిస్ట్ నాయకుల చెప్పుచేతలలో ఉండుటకు నిరాకరించెను. అంతట ఆ నాయకుల అధీనమున ఉన్న కొమిన్‌ఫారము (ప్రపంచ కమ్యూనిస్ట్ సంఘటన) నుండి అతడు బహిష్కృతుడయ్యెను. కాని పశ్చిమ రాజ్యముల నుండి ఆర్థిక, సైనిక సామగ్రి సాహాయ్యమును టిటో గ్రహించి స్వతంత్ర పంథాను అవలంబించి దేశమున సోషలిస్టు వ్యవస్థను పటిష్ఠము చేయుటకు కృషి చేయుచున్నాడు. స్టాలిన్ మరణానంతరమున సోవియట్ కమ్యూనిస్ట్ నాయకులు కూడా అతని యెడల సుహృద్భావముతో వర్తించుచున్నారు. చీనా, సోవియట్ దేశముల వైరుధ్యముల ఫలితముగ రెండుగ చీలిన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమమున ఏ పక్షమును అవలంబింపక, సౌహార్ద వాతావరణమును నెలకొల్పుటకు యుగోస్లోవియా కృషి చేయుచున్నది. అలీన రాజ్యవర్గ వ్యవస్థాపనలో భారత, ఈజిప్టులతోపాటుగ యుగోస్లావియాయు టిటో నాయకత్వమున ప్రముఖ పాత్రను నిర్వహించినది.

**7. పరిపాలన :** 1963 న ఆమోదితమై, తరువాత 1967, 68 లలో సవరణలను పొందిన రాజ్యాంగ విధానమును అనుసరించి సోషలిస్ట్ సమాఖ్యా గణతంత్ర ప్రభుత్వ విధానము దేశమున అమలున ఉన్నది. దేశాధినేతగ అధ్యక్షుడు వ్యవహరించును; ఇతనిని సమాఖ్యా విధానసభ ఎన్నుకొనును. అధ్యక్షుని పదవీకాల పరిమితి నాలుగేండ్లు. అయినను ప్రస్తుతపు అధ్యక్షుడగు మార్షల్ టిటో మాత్రము, తన జీవితాంతమువరకు ఆ పదవిలోనే కొనసాగునటుల, రాజ్యాంగ విధానమున ఒక నిబంధన 1963 లోనే చేర్చబడినది. సమాఖ్యా విధాన సభయందు జాతుల సభ, కార్యనిర్వహణ సమాజములు అను రెండు ప్రముఖ కక్ష్యలు కలవు. యుగోస్లావియా యందలి వివిధ జాతులకు సమాన

ప్రాతినిధ్యము కలదు. విదేశ నీతి, ఆర్థిక నీతి, సాంఘిక వ్యవస్థ, జాతీయ విధానములనుగురించి చర్చించి తగు ప్రాతిపదిక సూత్రములను నిర్ణయించు అధికారము ఈ కక్ష్యకు కలదు. 'కార్య నిర్వాహణ సమాజము' అను కక్ష్యయందు నాలుగు విభిన్న సంస్థలు - ఆర్థిక సంస్థ, విద్యా - సంస్కృతుల సంస్థ, సాంఘిక శ్రేయోస్వస్థతల సంస్థ, సాంఘిక-రాజకీయ సంస్థ అనునవి-కలవు. ఆ యా సంస్థలు తమకు సంబంధించిన విషయములపై నిర్ణయములను తీసుకొనును. ఈ విధముగ ఏర్పడిన మొత్తము ఐదు భాగములు గలిగిన సమాఖ్యా విధాన సభయందలి సభ్యసంఖ్య 620. ఇందులో 140 మంది జాతుల సభకు చెందినవారు; తక్కినవానిలో ప్రతియొకదానియందు 120 మంది సభ్యులు కలరు. జాతుల సభలోని సభ్యులను, రాజ్యమునకు 20 చొప్పున దేశపు ఆరు గణతంత్ర రాజ్యములును ఎన్నుకొనగ, సెర్బియాలోనే చేరియున్న వోజ్ వోదీనా, కొసోవా రాష్ట్రముల విధాన సభలు ఒక్కొక్కటి 10 మంది చొప్పున ఎన్నుకొనును. సాంఘిక-రాజకీయ సంస్థలోని సభ్యులను దేశపు వోటర్లు అందరును ఎన్నుకొనెదరు. తక్కినవాని సభ్యులను ప్రాతిపదిక గ్రామీణ, నాగరిక సంఘములు ఎన్నుకొనును. నాలుగేండ్లకు ఒకసారి సమాఖ్యా విధానసభకు ఎన్నికలు జరుగును. కార్య నిర్వహణాధికారము దేశపు అధ్యక్షునియందును, సమాఖ్యా కార్యనిర్వాహక సమితియందును న్యస్తము. సమాఖ్యా విధాన సభయందలి సభ్యులలో ఒకనిని సమాఖ్య కార్యనిర్వాహక సమితికి అధ్యక్షుడుగ దేశాధ్యక్షుడు ప్రతిపాదించగ, విధానా సభామోదమును పొందిన తరువాత అతడు సమితికి అధ్యక్షుడగును. ఆ అధ్యక్షుడుగాక సమితియందు 20 మంది సభ్యులను దేశాధ్యక్షుడు నియమించును. సాధారణముగ ప్రతి గణరాజ్యమునకు ముగ్గురును, రాష్ట్రమునకు ఒక్కొకదానికి ఒకరును ఉండునట్టుల ఈ నియామకము జరుగును. సమాఖ్యా విధాన సభ ఆమోదించిన రీతిలో ప్రభుత్వ కార్యకలాపములను నిర్వర్తించుట కార్యనిర్వాహక సమితియొక్క బాధ్యత. ఇటులే గణరాజ్యములందును, సెర్బియాలోని రెండు రాష్ట్రములందును విధానసభలు కలవు. దేశమున 18 ఏండ్లకు తగ్గని ప్రతి పౌరునికి వోటు హక్కు కలదు. దేశమున తొలుత కమ్యూనిస్ట్ పార్టీతోపాటుగ, కొన్ని చిన్న రాజకీయ పక్షములును నాజీ వ్యతిరేక పోరాటమున పాల్గొనినను, 1945 లో ఏకపట్టికా విధానమున జరుగు ఎన్నికలలో తక్కిన రాజకీయ పక్షములు పాల్గొనుటకు నిరాకరించినవి. అంతటినుండి కమ్యూనిస్ట్ పార్టీయే ఒకే ఒక రాజకీయ పక్షముగ వ్యవహరించుచున్నది. 1969 లో జరిగిన ఎన్నిక మొదలుగ కమ్యూనిస్ట్ పార్టీ అభ్యర్థులతో పాటుగ స్వతంత్రముగ పోటీచేయుటకు వ్యక్తులకు మాత్రము అనుమతి ఇవ్వబడినది. అయినను తుదకు కమ్యూనిస్ట్‌పార్టీ బలపరచిన అభ్యర్థులు మాత్రమే ఎన్నికైరి. కమ్యూనిస్ట్‌పార్టీ ప్రముఖ నాయకులే ప్రభుత్వపు అన్ని కీలక పదవులందును ఉన్నారు. దిగువ స్థాయినుండి పైస్థాయివరకు సోపానక్రమమున న్యాయస్థానములు కలవు. దేశపు మొత్తమునకు ఒక సుప్రీముకోర్టు, ప్రతి గణరాజ్యమున ఒక సుప్రీమ్‌కోర్టు, న్యాయ నిర్వహణను పర్యవేక్షించుచున్నవి. వివిధ స్థాయిలలోని న్యాయమూర్తులను, ఆ యా ప్రదేశముల ప్రజా సంస్థలు ఎన్నుకొనుచున్నవి.

**8. దేశరక్షణ:** దేశపు భూతలసేనయందు 13 పదాతిదళములు, 3 కవచిత శకట దళములు, 4 పర్వత దళములు కలవు. అందు మొత్తమున 2,20,000 మంది సైనికులు కలరు. నౌకాసేనయందు 5 జలాంతర్గాములు, 1 డిస్ట్రాయరు, 100 టార్పెడో బోట్లు, 132 తక్కు విధముల చిన్న రకపు సైనికోపయోగ నౌకలు కలవు; అందలి యోధసంఖ్య 27,000 వాయుసేనయందు ఉత్తమ

శ్రేణికిచెందిన 350 పోరాటపు విమానములును, అందులకు తోడుగ సముచిత సంఖ్యలో సైనిక రవాణా విమానములును కలవు. వీనిలో కొన్ని దేశముననే నిర్మితములు. తక్కినవానిని యు. స్టే. నుండియు, సోవియెట్ రష్యానుండియు ఈ దేశము ఆర్జించినది. వాయుసేనలోని యోధుల సంఖ్య 20,000 (1972).

**9. అంతర్జాతీయ సం :** ఐ. రా. స. యందు ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఆ సమితికి చెందిన 14 ప్రత్యేక సంస్థలలోను, దానికి చెందని 37 అంతర్జాతీయ ప్రభుత్వ వ్యవస్థలలోను, ప్రభుత్వేతరములగు 300 అంతర్జాతీయ సంస్థలందును సభ్యత్వముకలిగి ఈ దేశము ప్రపంచ ప్రజలమధ్య సదవగాహనకు కృషిచేయుచున్నది. గ్రీస్, తుర్కీ, ఇటలీలతో కలసి, ఐ. రా. ఆర్థిక సంఘపు సంప్రదింపుతో దక్షిణ యూరపున ఆర్థిక వికసనమును సాధించుటకు ఈ దేశము సహకరించుచున్నది.

**10. ఆర్థిక రంగము :** ఒకపుడు వ్యావసాయికముగ మాత్రమే ఆర్థికపు మనుగడను సాగించిన ఈ దేశము 1945 మొదలుగ స్వీయకృషి మూలమున వస్తూత్పత్తి పరిశ్రమలలోకూడ చాల అభివృద్ధిని సాధించి, సుసంపన్నతను ఆర్జించినది. యుద్ధాత్పూర్వము తలసరి సాలీనా ఆదాయము 200 యు. స్టే. డాలరులు; 1969 లో అది 698 డాలరులు. దేశపు భూతలమున 57% (150 వేల చ. కిమీ.) వ్యవసాయమున ఉన్నది; ఆ కృషిలో దేశ ప్రజానీకమున 50% మంది పనిచేయుచున్నారు. భూసంస్కరణలవలన రైతువారీ భూస్వామ్యము అమలులోనికి తేబడినది; ఏ కమతమును 10 హెక్టేరులను మించి ఉండగూడదని శాసనరీత్యా విధింపబడినది. 1970 అంతమునకు దేశమున 1,102 వ్యవసాయ సహకార సంఘములు కలవు; అందలి సభ్యసంఖ్య 8,70,767. 1971 లో దేశమున ఉత్పత్తియయిన వేర్వేరు పంటల ప్రమాణము వేల టన్నులలో ఈ దిగువరీతిగ కలదు : మొక్కజొన్న 74; గోధుమ 5,604, బార్లీ 299; రై 134; పొగాకు 44; జనుము 913; పొద్దుతిరుగుడు గింజలు 347; ఉరలగడ్డలు 2,952. పండ్ల ఉత్పత్తి ఆ సంవత్సరమే వేల మెట్రిక్ టన్నులలో ఈ రీతిగ ఉన్నది : యాపిల్ 327; పియర్స్ 112; ద్రాక్ష 1,096; ప్లమ్ 817; ఆలివ్ 16; ఇవిగాక 55 లక్షల హెక్టో లీటరుల ద్రాక్షసారాయము; 3,50,000 మెట్రిక్ టన్నుల చక్కెర బీటుదుంప ఉత్పత్తి అయినవి. ఆహార ధాన్యముల ఉత్పత్తిలో దేశము స్వయంపోషకస్థాయిని, దాదాపుగ అందుకొనినది. యుద్ధమునకు పూర్వమున పశుసంపదల లెక్కింపులో యూరపీయ దేశములందు నాలుగవ స్థానమును ఈ దేశము ఆక్రమించినది; కాని యుద్ధమువలన ఆ సంపద విరివిగ నష్టమైనది. 1972 లో 10 లక్షల గుర్రములు; 50 లక్షల గోజాతి; 83 లక్షల గొర్రెలు; 62 లక్షల పందులు కలవు. ఈ వివిధ జాతుల పశువులలో కొన్ని, ఆహారార్థమై విదేశములకు సాలీనా ఎగుమతి అగుచున్నవి. ఇవేగాక పశుమాంసము, గ్రుడ్లు, చర్మములుకూడ చెప్పదగిన ముఖ్యపు ఎగుమతులు. మత్స్య పరిశ్రమవలన కొలదిమంది మాత్రమే జీవించుచున్నారు; ఆ కృషిలో 185 మోటారు బోట్లు (పరిమాణము 7,190 టన్నులు), 2,318 చిన్నపడవలు పాల్గొనుచున్నవి. మొత్తపు చేపల పట్టుబడి 49,291 మెట్రిక్ టన్నులు. యూరపీయ దేశములందు సీసము, యాంటిమనీ, బాక్సయిట్, పాదరసము, రాగి, క్రోము, ముడిఇనుము, తుత్తునాగము - అను ఖనిజముల ఉత్పత్తిలో ఈ దేశమునకు అగ్రస్థానము కలదు. వెండి, మాగ్నసైట్, లిగ్నెయిట్ కూడ కొంతవరకు లభించుచున్నవి. ఆ యా ఖనిజముల ఉత్పత్తి 1971 లో వేల టన్నులలో ఈ దిగువరీతిగ ఉన్నది : రాక్షసి బొగ్గు

707; లిగ్నయిట్ 30,195; బాక్సయిట్ 1,959; పాదరసము 0.6; రాతి ఉప్పు 117; ముడి మాంగనీస్ 16; ముడి ఇనుము 3,724; ముడిరాగి 10,314; సీసము - తుత్తునాగము కలసిన ముడి లోహము 3,155; ముడి క్రోమ్ 3; యాంటిమనీ 101; ముడి పెట్రోలియమ్ 2,961; పైరైట్‌లు 276; మాగ్నసైట్ 493. 1971 లో బంగారపు ఉత్పత్తి 3,850 కిగ్రా.; వెండి 1,04,300 కిగ్రా. ఖనిజ నిక్షేపములందు సర్వస్వామ్యములు ప్రభుత్వమునకే చెందియున్నవి. దేశమున విద్యుదుత్పత్తి 2,950.9 కోట్ల కివా. (1971); ఇందు 1,564.4 కోట్ల కివా. జలవిద్యుత్తు. పరిశ్రమలును, బేంకులును జాతీయములు చేయబడినవి. చిన్నతరహా పరిశ్రమలు మాత్రము వైయక్తిక యాజమాన్యమున పనిచేయుచున్నవి. భారీ పరిశ్రమలును, నౌకా నిర్మాణ పరిశ్రమయు గత 30 ఏండ్లలో విరివిగ అభివృద్ధి చెందినవి. 1971 లో పారిశ్రామికోత్పత్తి వేల టన్నులలో ఈ రీతిగ ఉండినది : ముద్దఇనుము 1,514; ఉక్కు 2,511; సిమెంటు 4,954; గంధక ద్రావకము 807; నైట్రిక్ యాసిడ్ 644; రాసాయనిక ఎరువులు 1,492; ఇనుపపోత ఉత్పత్తులు 361; ఉక్కుపోతవి 50.1; ఇక జవుళీ వస్తువులు లక్షల చదరపు మీటరులలో : ప్రత్తి నూలు నేతవి 391; ఉన్నినేత 59; రేయాన్ 34; జనుపనార 65. ఎగుమతులలో పశువులు, పశుమాంసములు, యంత్రములు, నౌకలు ప్రముఖములు. దిగుమతులలో యాంత్రిక శకట పరికరములు, నానావిధముల ముడి వస్తువులు, రసాయన వస్తువులు పేర్కొనదగినది ఎగుమతుల విలువ 2,721.69 కోట్ల దీనారులు; దిగుమతుల విలువ 4,878.14 కోట్ల దీనారులు (1971). విదేశములందు పనిచేయు యుగోస్లావీయ కార్మికులు ఇంటికి చేర్చు మొత్తములును, యాత్రికులవలన లభించు ఆదాయమును చెల్లింపులలోటును పూరించుటకు కొంతవరకు ఉపకరించుచున్నవి. దేశపు బడ్జెటరీ వ్యయము 3,167.9 కోట్ల దీ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశము నందలి కార్మికు లందరికి పనిని చూపించు బాధ్యత శాసన రీత్యా ప్రభుత్వము నందున్నను, కొన్ని ఆర్థిక రంగములందు నిరుద్యోగ బాధ కొలదిగ కలదు. కార్మిక సమితులకు ఆయా పరిశ్రమల వ్యవస్థా నిర్వహణమున ప్రాబల్యము కలదు. ప్రతి సంస్థయందును ఇట్టి నిర్వహణకై, కార్మికులు రెండేండ్లకు ఒకసారి ఎన్నుకొను సమితులు కలవు; ఒక్కొక సమితిలోని సభ్య సంఖ్య 15. కనీసపు కూలియు, వేతనములును ప్రతి కృషికి చట్టరీత్యా నిర్ణయింపబడినవి. దేశమున ఆరు కార్మిక సంఘములు కలవు. దేశపు కార్మికులలో 80% న, ప్రతియొకడును పై సంఘములలో ఏదో ఒకదాని యందు సభ్యత్వము కలిగియున్నాడు. ఈ కార్మిక సంఘము లన్నియు, కమ్యూనిస్ట్ పార్టీకి చెందిన దేశీయ కేంద్ర కార్మిక సమాఖ్యకు అనుబద్ధములు. యుద్ధకాలమున, దేశమున 20% ఇండ్లు నాశనమైనవి. 1970 నాటికి గృహవసతి సమస్య చాల వరకు పరిష్కృతమైనది. విద్యా బోధన అన్ని స్థాయీలలోను ఉచితముగ జరుగుచున్నది. ప్రాథమిక పాఠశాలలు 13,995 లో 28,34,581 మంది; 422 ఉన్నత మాధ్యమిక పాఠశాలలలో 1,86,298 మంది; 610 సాంకేతిక పాఠశాలలలో 2,01,075 మంది; 743 వయోజన పాఠశాలలలో 97,974 మంది విద్యార్థులు కలరు. ఉన్నత విద్యను, ప్రత్యేక విద్యా విభాగము లందు ఉన్నత శిక్షణను కల్పించు 256 వివిధ సంస్థలలో (అకాడమీలు మొదలగు వానిలో) 2,61,203 మంది విద్యార్థులు శిక్షణను పొందిరి. అల్ప సంఖ్యాక జాతులగు హంగేరియనులు మొదలగు వారికి వారి భాషలలో విద్యను బోధించు వివిధ శ్రేణుల విద్యాసంస్థలు కలవు (1970-71). దేశము నందలి

ప్రతి గణరాజ్యమునను ఒక ప్రముఖ గ్రంథాలయము ఉన్నది. దేశపు మొత్తమున 3,339 గ్రంథాలయములు కలవు; మ్యూజియముల సంఖ్య 284 (1974); వీనిలో బెల్‌గ్రేడ్‌లోని జాతీయ మ్యూజియమ్, భిత్తిచిత్రాగారము లెక్కింపదగినవి. రాజ్యాంగ విధానమున పత్రికా స్వాతంత్ర్యము కల్పింపబడినను, ఆచరణయందు పత్రికా ప్రచారము ప్రభుత్వపు అదుపు ఆజ్ఞలకు లోబడియే జరుగుచున్నది. 'టాంజుగ్' అను ఏకైక సమాచార సంస్థ ద్వారా వార్తా సేకరణ జరుగుచున్నది. దేశమున 23 దినపత్రికలు వ్యాప్తి యందున్నవి. వానిలో 'వెసిరెంజి నవోస్తి' అనునది ప్రముఖము; దాని పాఠక సంఖ్య 376 వేలు (1968). సాంఘిక భీమా పద్ధతి అన్ని సంస్థ లందును నిర్బంధముగ అమలుజరుపబడుచున్నది. ఇందువలన వార్ధక్య భృతి, నిరుద్యోగ భృతి, రోగ ప్రమాదములందు సహాయము లభించుచున్నవి. అంగ వికలులకు, అనాథ శిశువులకు తగు వసతులును, ఒక కార్మికుడు మరణించినపుడు అతని భార్యకు, పిల్లలకు తగు జీవన వృత్తుల వసతులును కలవు. మాతా, శిశువులకు వైద్య సహాయము ఉచితము. దేశమున 69,646 శయ్యలు కలిగిన 140 జనరల్ ఆసుపత్రులును; 36,131 శయ్యలున్న 92 క్లిష్ట రోగముల ఆసుపత్రులును, ఇతరములగు డిస్పెన్సరీల వంటివి 4,000 కలవు. వైద్య సంఖ్య 20,436 (1968).

**12. యాత్రా సౌ.** . విదేశీయ యాత్రికులు పాస్‌పోర్టు వీసాలను విధిగ కలిగియుండవలయును; కాని కొన్ని నిర్దిష్ట దేశముల వారికి వీసాల అవసరము లేకుండ సౌకర్యము కలుగజేయబడినది. విదేశీయ యాత్రికుల వలన లభించు ఆదాయము దేశమునకు చాల సాయపడుచున్నది. 1971 లో 52,38,000 విదేశీయ యాత్రికులు దేశమును దర్శించిరి; వారు దేశమున దాదాపు 539 కోట్ల దీనార్లను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. మార్షల్ టిటో అను ఉపనామముతో విశ్వ విఖ్యాతిని ఆర్జించిన జోసిప్ బ్రోజ్ (జ. 1892): ఫాసిస్టుల ఆక్రమణ నుండి దేశమునకు విముక్తిని కల్పించుటలో ప్రజలకు నాయకత్వమును వహించుటయేగాక, సోషలిస్టు వ్యవస్థను రూపొందించుటకు ప్రతి దేశపు కమ్యూనిస్ట్ పార్టీయు స్థానిక పరిస్థితులను అనుసరించి, స్వతంత్ర పద్ధతులను అవలంబించ వలయునను సిద్ధాంతమును ఆచరణలోనికి తెచ్చిన ప్రముఖుడు. 2. ఐవో ఆంద్రిచ్ (జ. 1892): సారస్వతమున సాగించిన కృషికి 1961 లో నోబెల్ బహుమతిని ఆర్జించిన రచయిత.

—— ౨ ——

# 23. యునైటెడ్ కింగ్‌డమ్*

**ముఖ్యనగరము** : లండన్; **జెండా** : ఇంగ్లాండ్ (తెల్లని భూమికపై అమరిన ఎర్రని సిలువ), స్కాట్‌లాండు (నీలి భూమికపై అమరి ఎదురెదురు కోణములను తెల్లని రేఖలతో కలుపగ ఏర్పడిన సిలువ), ఐర్‌లాండ్ (తెల్లని భూమికపై ఎర్రని రేఖలతో కోణముల సంధింయ సిలువ) దేశముల జెండాలను సంయుక్తముగ ఒకే భూమికపై అమర్చుట వలన రూపొంది 'యూనియన్ జాక్' అని వ్యవహృతమగునది; **జాతీయ గీతము** : గాడ్ సేవ్ ద క్వీన్ (రాణిని ఈశ్వరుడు రక్షించుగాక) అను పల్లవి కలది; **నాణెము** : పౌండ్ స్టెర్లింగ్; ఒక పౌను 100 పెన్నీలుగ విభక్తము (ఈ దశాంశ విధానము ఫిబ్రవరి 15, 1971 నుండి అమలులోనికి వచ్చినది) ఒక పౌను = రు. 18 00; **కొలతూకములు** : 1975 అంతము నుండి మెట్రిక్ విధానపువి; అయినను పూర్వపు బ్రిటిష్ విధానపువియు అటనట ఇంకను వ్యాప్తిలో ఉన్నవి; **కాలగణన** : మ. 12 గ. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : యూరపు ఖండ ముఖ్య భూభాగపు వాయవ్య తీరమునకు ఆవల, ఆ తీరము నుండి ఇంగ్లీష్ చానెల్ చేత వేరు చేయబడిన ఈ ద్వీప రాజ్యమున, ఇంగ్లాండ్, స్కాట్‌లాండ్, వేల్సు అను ప్రాంతములు చేరియున్న గ్రేట్ బ్రిటన్ దీవియు, ఐర్‌లాండ్ దీవియందు ఉత్తర భాగము (ఉత్తర ఐర్లాండు) ను చేరియున్నవి. ఇంగ్లీష్ చానెల్ యొక్క కనీసపు వెడల్పు 33.6 కి మీ. మాత్రమే. గ్రేట్ బ్రిటన్ దీవి నుండి ఐర్లాండ్ దీవిని నార్త్ చానెల్, ఐరిష్ సముద్రములు వేరుచేయుచున్నవి ఈ ప్రముఖ ద్వీపములను ఆశ్రయించి అటనట నెలకొనియున్న కొన్ని అత్యల్ప ద్వీపములును రాజ్యాంగ రీత్యా యునైటెడ్ కింగ్‌డమ్‌లోనే చేరియున్నను, మాన్ దీవియు (717 చ. కిమీ.), చానెల్ దీవులు (194 చ. కిమీ.) ను న్యాయతః మకుటపు పాలిత ప్రాంతములేగాని రాజ్యాంతర్భాగములు కావు; అయినను గణాంక విషయమున సాధారణముగ ఇవియు రాజ్యాంతర్భాగములుగ లెక్కింపబడుచున్నవి. మొత్తపు ఈ ద్వీప రాజ్యము ఉత్తర, వాయవ్యము లందున్న అట్లాంటిక్ మహాసముద్రమునకును, తూర్పు ఉన్న నార్త్ సముద్రమునకును మధ్య ఉండి, 50°- 60° ఉ. అ. రేఖలకు మధ్య

---

* ఈ దేశమున ఇంగ్లాండ్‌నకు చారిత్రకముగ కీలకపాత్ర కలదు. ఇంగ్లాండ్‌తో వేల్సును కలిపి (1281), తదనంతరమున శాసనరీత్యా ఆ రెండు ప్రాంతములును 1536 లో ఒకే దేశముగ రూపొందించి ఏర్పరచిన బ్రిటన్‌కు 1603 లో స్కాట్‌లాండ్ చేరినది. ఆ స్కాట్‌లాండ్‌కు దేశపు పార్లమెంటులో ప్రాతినిధ్యమును కల్పించి, దేశమున భాగముగచేసి మొత్తపు దేశమునకు చట్టరీత్యా గ్రేట్‌బ్రిటన్ అను పేరు 1707 లో కల్పింపబడినది. తరువాత ఐర్లాండునకు పార్లమెంటున ప్రాతినిధ్యము ఏర్పడగ, దానితో కలపి మొత్తపు దేశమునకు 'యునైటెడ్ కింగ్‌డమ్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ అండ్ ఐర్లాండ్' అను పేరు చట్టరీత్యా 1800 లో కలిగినది. 1923 లో ఐర్లాండున అధికభాగము స్వతంత్రమై ఉత్తర ఐర్లాండ్ మాత్రమే ఈ రాజ్యమున మిగులగ, రాజ్యపుపేరు 'యునైటెడ్ కింగ్‌డమ్ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ అండ్ నార్తెరన్ ఐర్లాండ్' అను రీతిగ మారి సంక్షిప్తముగ 'యునైటెడ్ కింగ్‌డమ్' అని వ్యవహృతము. కాని, కొంత వరకు అపార్థద్యోతకములే అయినను, గ్రేట్ బ్రిటన్, బ్రిటన్, ఇంగ్లాండ్ అను పదములుకూడ ఈ దేశమునకు పర్యాయ నామములుగ వాడుట సర్వత్రా జరుగుచున్నది

(960 కిమీ.) ను, 1° 45′ తూ. - 8° ప. తులారేఖల నడుమను నెలకొని ఉన్నదని చెప్ప వచ్చును. స్కాట్‌లాండ్ ప్రాంతపు ఉత్తరాగ్రము 58° 40′ ఉ. అ. ను తాకియున్నది. 0° తులా రేఖ లండన్‌లోని ప్రాచీన గ్రీన్‌విచ్ వేధశాల ద్వారా పయనించుచున్నది.




పటము 21.

రాజ్యమున, ఇంగ్లాండ్ నందున తూర్పు, ఆగ్నేయ దిశలందు మాత్రమే విశాలపు నిమ్న భూములు కలవు. తక్కిన దిక్కులందు కొండలు విరివిగ కలవు; స్కాట్‌లాండ్ - ఇంగ్లాండ్‌ల

మధ్య సరిహద్దున తూర్పు - పడమరలకు పయనించు చెవియట్ కొండలు కలవు. ఆ సరిహద్దు నుండి ఉత్తర - దక్షిణ దిశలకు పెన్నైన్ కొండల శ్రేణి మధ్య-ఇంగ్లాండ్ వరకు వ్యాపించినది. ఇక తక్కిన భూతలమున సారవంతములై వ్యవసాయ యోగ్యములగు భూములు, మైదానములు, అటనట చిత్తడి నేలలు ఉన్నవి. పెన్నైన్ కొండలకు దక్షిణమున 'మిడ్ లాండ్స్' అని వ్యవహృతమగుచు అటనట కొలదిగ కొండలను, సారవంతములగు లోయలను కలిగిన మైదానము కలదు. తూర్పు తీరము అతి నిమ్న భూమి; ఇట భూమి ఎత్తు పలు ప్రాంతములందు సముద్రపు మట్టమునకు పైన 4.6 మీటరులను మించదు. ఈ ప్రాంతము సముద్రపు పోటుల వలన, తుపానుల వలన జలమయము గాకుండ రక్షించుటకై శతాబ్దముల తరబడిగ అంతటంతట సముద్రపు తటమును ఆనుకొని కరకట్టలు వేయబడుచున్నవి. ఇక దక్షిణ- తూర్పు ఇంగ్లాండులలో ఏ ప్రదేశమును 300 మీ.కు మించిన ఎత్తున లేకున్నది. ఇంగ్లాండులోని అత్యున్నత ప్రదేశము' స్కాఫెల్ పైక్ (978 మీ.). మధ్య దేశపు ఉన్నత భూముల నుండి సముద్రమునకు ప్రవహించు నదులలో పేర్కొనదగినవి : పశ్చిమమున ఉన్న సెవెర్న్ (336 కిమీ.), ఆగ్నేయమున ఉన్న తేమ్స్ (320 కిమీ.). ఇంకను తూర్పున హమ్బర్, తీస్, టైన్, ట్వీడ్; దక్షిణమున ఆవన్, ఏక్సీలు; పశ్చిమమున మెర్సీ అను కొన్ని చిన్న నదులు ఉన్నవి.

స్కాట్‌లాండ్‌లో ఉత్తరపు పీఠభూములు, మధ్య దేశపు నిమ్న భూములు, దక్షిణపు ఉన్నత భూములు అను మూడు విస్పష్ట భౌగోళిక ప్రాంతములు కననగుచున్నవి. ఇందు తొలుతటిది ఆ రాజ్య భాగపు ఉత్తరపు సగమును దాదాపుగ అంతటిని ఆక్రమించినది; ఇందే బ్రిటిష్ ద్వీపములందెల్ల అత్యున్నత స్థలమని చెప్పబడు బెన్ నెవిస్ (1343 మీ.) ఉన్నది. రెండవ ప్రాంతపు సగటు ఎత్తు 152 మీ.; ఇందే క్లైయిడ్, ఫోర్త్, టే నదుల లోయలు కలవు. దక్షిణ ఉన్నత భూములు అనబడునది ఒక బంజరుభూమి; ఇందు చాల చిన్న నదులును లోయలును కలవు; ఇందలి అత్యున్నత ప్రదేశము మెర్రిక్ (842 మీ.).

వేల్సున ఎక్కువగ పర్వత భూమి కలదు; అదియు వృక్షరహితము; గడ్డి బీడులు మాత్రము కలవు; ఆ ప్రాంతమును అంతటిని కాంబ్రియన్ పర్వతములే దాదాపుగ ఆక్రమించినవని చెప్పవచ్చును; అందలి అత్యున్నత శిఖరము స్నోడన్ (1,085 మీ.). పశ్చిమముననుా, దక్షిణముననుా తీరప్రాంతమున చీలికలుగ మైదానములును, ఉత్తరమున కొంత నిమ్న భూమియు కన్పట్టును. ఈ నిమ్నభూమి యందే డీ నదీలోయ ఉన్నది.

ఉత్తర ఐర్లండున, అంతగ ఎత్తులేని పీఠభూములును, 150 మీ. నుండి 180 మీ. వరకు ఎత్తుకలిగిన కొండలును, ఆగ్నేయ ప్రాంతమున మౌర్నీ పర్వతములును కలవు. ఆ పర్వతములలోని స్లీవ్ డోనార్డ్ (852 మీ.), ఉత్తర ఐర్లాండ్ నందెల్ల అత్యున్నత ప్రదేశము. ఆ ఉత్తర ఐర్లాండ్ మధ్య భాగమున నేల ఎత్తు విపరీతముగ తగ్గిపోయి 'లఫ్‌నేగ్' అను ఒక సరస్సు రూపుగొనినది. యునైటెడ్ కింగ్‌డమ్‌లోని సరస్సులందెల్ల ఇది పెద్దది.

దేశపు తీరభూములను సముద్రము కోయుట వలన నీటి కయ్యలు, అఖాతములు అనేకములు తీరముల పొడవున ఏర్పడినవి. నదులలో పెక్కింటి ముఖద్వారములు చక్కని హార్బరులుగ ఉపకరించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** అత్యుత్తర అక్షాంశ రేఖా ప్రాంతమున ఉన్నను ఈ రాజ్యము సమ

శీతోష్ణతను అనుభవింప గలుగుచున్నది. వెచ్చని నైరుతి పవనములును, ఉత్తర అట్లాంటిక్ నందలి ఉష్ణజల ప్రవాహమును ఇందులకు ముఖ్యకారణ ములు. శీతకాలమున సరాసరి ఉష్ణోగ్రత 39°–43° ఫా. మధ్యను, గ్రీష్మర్తువున 53°–63° ఫా. మధ్యను ఉండును. స్కాట్‌లాండులోని ఉత్తరాగ్ర మున సాలీనా సరాసరి ఉష్ణత 43° ఫా.; ఇంగ్లాండ్‌న దక్షిణపు కొనన అది 52° ఫా. అంతటంతట ఎండకాలమున 80° కును ఉష్ణో గ్రత పెరుగుటయు, శీతకాలమున 20° కు గాని ఇంకను దిగువకు గాని పడిపోవుటయు జరుగు చుండును. దేశపు సాలీనా వర్షపాతము 100 సెం.మీ. పైబడి యుండును (ఇంగ్లాండున సరాసరి వర్షపాతము 85 సెం. మీ.). పశ్చిమ, ఉత్తర ఉన్నత భూములలో వర్షపాతము అత్యధి కము (375 సెం. మీ.); తూర్పు, ఆగ్నేయ ప్రాంతములందు చాల తక్కువ. సంవత్సరము పొడవున ఒకే తీరుగ వర్షములు పడుచుండును; ఇందులకు తోడుగ పొగమంచు, మంచు తుప్పర తరచుగ పడుటవలన సూర్యరశ్మి చాల తక్కువగ దేశమునకు లభించును. శీతకాలమున దినమున అరగంట మొదలుగ రెండు గంటల వరకును, గ్రీష్మమున 5.5 గంటల నుండి 8 గంటల వర కును మాత్రమే సూర్యకాంతి లభించుచుండును.

సౌమ్యమగు శీతోష్ణస్థితి, విభిన్న సారముల ప్రదేశములు కలిగియున్న ఈ రాజ్యమున వృక్ష సంతతియు ప్రాంతములనుబట్టి మారుచున్నది. ఒకపుడు నిమ్న భూమియందు, చిత్తడినేల తప్ప తక్కినది అంతయు అరణ్యమయముగ ఉండినది. కాని శతాబ్దముల తరబడిగ వ్యవసాయము కొరకై అడవులను కొట్టివేయుటవలన ప్రస్తుతమున రాజ్యపు భూతలమున 7% న మాత్రమే అడవులు కలవు. స్కాట్‌లాండ్‌లోని తూర్పు, ఉత్తర ప్రాంతము లందును ఇంగ్లాండున ఆగ్నేయ ప్రాంతమునను మాత్రమే విశాలములగు అడవులు కలవు. అందు ఇంగ్లాండున ఓకు, ఎల్మ్, యాష్, బీచి చెట్లును, స్కాట్‌లాండ్‌న పైన్, భూర్జ వృక్షములును సర్వ సాధారణముగ కనబడును. పారిశ్రామిక కేంద్ర ములు గాక తక్కిన నిమ్నభూమి యంతయు వ్యవసాయముననే ఉన్నది. చిత్తడి నేలలు, చిట్టడ వులు, కొండలు, గుట్టల యందు మాత్రమే సహజ వృక్ష సంపదయు, గరికపట్టులును కలవు.

వాయవ్య యూరపున కననగు జంతు సంతతియే ఇటను నివసించుచున్నను, వాని సంఖ్య మాత్రము చాల తక్కువ. తోడేలు, ఎలుగు, అడవి పంది, మంచు జింక వంటి పెద్ద సస్తన జాతులు ఏనాడో అంతరించినవి. ఎఱ్ఱదుప్పి మాత్రము, ప్రభుత్వపు పరిరక్షణ వలన, బ్రతుక కలిగినది. ఇక చిన్న తరగతి సస్తన జాతులు – కుందేళ్ళు, మొదలగు నవి – ఎక్కువగ ఉన్నవి. నదులందు, సముద్రము లందును మత్స్య సంపద కలదు. దాదాపు 230 జాతుల పక్షులు దేశమున నివసించుచున్నవి; 200 ఇతర జాతుల పక్షులు స్థిరనివాసముగ ఉండక అంతటంతట వచ్చిపోవుచున్నవి. 21,000 జాతుల కీటకములు కలవని అంచనా.

**3. జనసంఖ్య మొ.:** 1971 లోని జన సంఖ్యా సేకరణను అనుసరించి రాజ్యపు జనసంఖ్య 5,55,30,121 (ఇంగ్లాండ్ 4,58,79,670; వేల్సు 27,24,275; స్కాట్‌లాండ్ 52,28,600; మాన్‌దీవి 49,743; చానెల్ దీవులు 1,25,240; ఉత్తర ఐర్లాండు 15,27,593). జనసాంద్రత చ. కిమీ. కు 234; ఇంగ్లాండ్, వేల్సుల

వరకు మాత్రమే లెక్కకట్టిన యెడల అచటి జనసాంద్రత చ. కిమీ. కు 323; ప్రజలలో 80% నగరములందు వసించుచున్నారు. మొత్తపు రాజ్యపు జనసంఖ్యలో దాదాపు 50%, మధ్య ఇంగ్లాండులోని 1,200 చ. మైళ్ళ వైశాల్యపు ప్రదేశమున వసించుచున్నారు. ఈ ప్రదేశముననే లండన్ మొదలగు ప్రముఖ నగరములు అనేకములు నెలకొనియున్నవి. ఈ నగరములు విపరీతముగ విస్తరించి ప్రక్కల నున్న చిన్న నగరములను కలుపుకొని బృహత్తర నగరములు (కన్నుర్‌బేషన్స్) గ లెక్కకు వచ్చుచున్నవి. ఇట్టి బృహత్తర నగరములలో లండన్ (జ. సం. 73,79,114), సెంట్రల్ క్లైడ్‌సైడ్ (16,98,000), మెర్సీసైడ్ (12,47,000), సౌత్ ఈస్ట్ లాంకషైర్ (23,95,000), టైన్‌సైడ్ (7,97,000), వెస్ట్ మిడ్‌లాండ్స్ (23,67,000), వెస్ట్ యార్క్‌షైర్ (17,37,000) పేర్కొనదగినవి. ఇక రాజ్యము మొత్తముమీద నగరములుగ లెక్కింపబడువానిలో బర్మింగ్‌హామ్ (జ. సం. 10,13,366), గ్లాస్‌గో (8,97,848), లివర్‌పూల్ (6,06,834), మాన్‌చెస్టర్ (5,41,468), షెఫ్ఫీల్డ్ (5,19,703), లీడ్స్ (4,94,971), ఎడింబరో (4,48,895), బ్రిస్టల్ (4,25,203) గణనీయములు (ఇందులో కొన్ని పై బృహత్తర నగరములలో అంతర్భాగములు). ప్రాచీనపు ఐబీరియన్, కెల్ట్, రోమన్, ఆంగ్లో-సాగ్జన్, డేన్, నార్మన్ జాతుల సంతతికి చెందినవారు మేళనమందుటవలన ఇచటి ప్రజానీకము రూపొందినది. దేశీయులందరును ఇంగ్లీషు మాటాడెదరు. కాని పశ్చిమ వేల్సులో, చాలమంది ప్రజలకు ఒక విధపు బ్రిటిష్ కెల్టిక్ మాతృభాషగ ఉన్నది; ఇక వేల్సులోనే 26% వేల్స్‌భాషను మాతృభాషగ కలిగియున్నారు. పశ్చిమ స్కాట్లాండ్‌లోని దాదాపు 81 వేల ప్రజలకు మాతృభాష ఒక విధపు గేలిక్; ఉత్తర ఐర్లండులో కొందరు వేరొకరకపు గేలిక్ మాటాడెదరు. మాన్ దీవిలో 'మాన్‌క్స్' అనబడు ఒక విధపు కెల్టిక్; సాధికార వ్యవహార ప్రకటనలకు, వినియుక్తము. చానెల్ దీవులలో కొందరు నార్మన్-ఫ్రెంచి అనబడు ఒక విధపు ఫ్రెంచి మాండలికమును మాటాడెదరు. ఆ దీవులలో ఒకటియగు జెర్సీయందు ఫ్రెంచియే అధికార భాషగ ఉన్నది.

రాజ్యమున మత స్వాతంత్ర్యము చట్టరీత్యా కల్పింపబడినది. అయినను చర్చ్ ఆఫ్ ఇంగ్లండ్, చర్చ్ ఆఫ్ స్కాట్‌లాండ్ అను రెండు క్రైస్తవ సంప్రదాయములకు సాధికారపు మన్నన కలదు. దేశపు రాజు, చర్చి ఆఫ్ ఇంగ్లాండ్‌నకే చెందియుండవలయునను నియమము కలదు. తక్కిన ప్రొటెస్టంటు క్రైస్తవ సంప్రదాయములకును, రోమన్ కేతలిక్ సంప్రదాయములకునుకూడ దేశమున గణనీయ వ్యాప్తి కలదు. యూదులు దాదాపు 450 వేలు కలరు. విశాల బ్రిటిష్ సామ్రాజ్యమునుండియు, కామన్‌వెల్తు రాజ్యములనుండియు ఇట వచ్చిచేరిన బౌద్ధులును, హిందువులును, ముస్లిములును అల్పసంఖ్యలలో ఉన్నారు.

**4. సమాచార సా. :** దేశమున 24,371 తపాలాఫీసులును, 10,044 తంతి ఆఫీసులును కలవు. టెలిఫోనుల సౌకర్యము విరివిగ కలదు; లండన్ నగరమున మొత్తముమీద 487 టెలిఫోన్ ఎక్స్‌చేంజీలు పనిచేయుచున్నవి; తక్కిన దేశమున అట్టివి 6,046 కలవు. దేశమున రేడియో, టెలివిజన్‌లను బ్రిటిష్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్ (బి. బి. సి), ఇండిపెండెంట్ బ్రాడ్‌కాస్టింగ్ ఆథారిటీ (ఐ. బి ఎ.) అను స్వయంపరిపాలనా ప్రతిపత్తి కలిగిన రెండు సంస్థలు నిర్వహించుచున్నవి. ప్రభుత్వ శాసనములవలన రూపొందింపబడిన ఈ ఈ సంస్థలపై నియమనాధికారము కొంత ప్రభుత్వమునకు ఉన్నను, ఆ అధికారమును ప్రభుత్వము

వినియోగించకుండ, దేశశ్రేయో దృష్టితో పక్షపాత రహితముగ వార్తా విశేషములను ప్రసారము చేయుటను ప్రోత్సహించుచున్నది. బిబిసి ప్రసారములు ప్రపంచమంతట అన్ని దేశములలో, పలు భాషలలో విననగుచున్నవి ఐబిఏ యందు మాత్రమే వ్యాపారపు ప్రకటనలు వెలువడుచున్నవి.

**5. యాన సౌ.:** గ్రేటు బ్రిటన్ (అనగా ఇంగ్లాండ్, స్కాట్‌లాండ్, వేల్సుల) లోని మొత్తపు రోడ్ల నిడివి దాదాపు 339 వేల కి. మీ.; ఇందు 15 వేల కిమీ. ట్రంకు రోడ్లు. హంబర్ నది మీదనున్న రోడ్డు వంతెన, ప్రపంచము నందలి అట్టివాని యందెల్ల పొడుగున (1,410 మీ) మిన్న. రైలు మార్గముల నిడివి 10,740 కి. మీ. యూరప్ ఖండపు ముఖ్య భూభాగమునకు సరాసరిగ రైలును నడపుటకు అనువుగ ఇంగ్లీష్ చానెల్‌లో ఒక కృత్రిమపు సొరంగము, ఫ్రాన్సు దేశపు సహకారముతో నిర్మింపబడుచున్నది. ఈ కృషి పూర్తియైనపుడు ఫ్రాన్స్ - ఇంగ్లాండుల మధ్య రైలు ప్రయాణ సౌకర్యము కలుగును.

100 టన్నులకు మించిన ప్రమాణముకల నౌకలను, ప్రపంచ మందున్న వానిని అన్నింటిని లెక్కించినచో, అందు 11% ఈ దేశమున రిజిస్టరయినటుల తేలుచున్నది. వర్తక రంగమున పనిచేయు సముద్ర నౌకల సంఖ్య 2,304 ; వాని మొత్తపు ప్రమాణము 27,693 వేల టన్నులు; ఆ వర్తక నౌకలలో పనిచేయువారి సంఖ్య 90,126 (1972) దేశపు రేవులలో లండన్ ప్రముఖము; ఇదిగాక 300 రేవులుకలవు; వానిలో లివర్‌పూల్, సౌతాంప్టన్, హల్, క్లైడ్‌ఫోర్డ్ ప్రముఖములు. దేశాంతస్థ జలమార్గముల నిడివి దాదాపు 4,000 కిమీ ఆ జలమార్గములందలి రేవులలో మాంచెస్టరు ప్రముఖము. ఒక కాలువద్వారా ఈ రేవునకు సముద్రపు నౌకలును కొన్ని రాగలుగుచున్నవి.

విమానయానము, జాతీయములు చేయబడిన రెండు ప్రముఖ సంస్థల - బ్రిటిష్ ఓవర్‌సీస్ ఎయిర్‌వేస్ కార్పొరేషన్ (BOAC), బ్రిటిష్ యూరపియన్ ఎయిర్‌వేస్ (BEA)-ఆధీనమున ఉన్నది. వేరుగ 20 స్వతంత్ర విమానయాన సంస్థలును కలవు; కాని వాని కార్యపరిధి చాల తక్కువ; పై పెద్ద సంస్థలతో ముడివడి మాత్రమే అవి పనిచేయ గలుగుచున్నవి. పై జాతీయ సంస్థలలో తొలుత టిది ప్రపంచ మందలి అతి దూరదేశములకును ప్రయాణములను నిర్వహించుచు, కామన్‌వెల్తు దేశములందలి విమానయాన సంస్థలతో సహకరించు చున్నది; రెండవది దగ్గర ప్రదేశములకు-యూరపు, ఉత్తర ఆఫ్రికా, పశ్చిమ ఆసియాలోని ప్రముఖ నగరములకును, దేశపు వివిధ ప్రదేశములకును- విమానయానములను నిర్వహించుచున్నది. ప్రయాణమునకు ఉపకరించు విమానముల మొత్తపు సంఖ్య 3,120 (1972). లండన్‌లోని హీత్‌రో విమానాశ్రయము, ప్రపంచపు అత్యుత్తమ విమానాశ్రయములలో ఒకటి. ఇక తక్కిన వానిలో స్కాట్‌లాండ్‌లోని ప్రెస్ట్‌విక్, మాన్‌చెస్టర్ వద్దనున్న రింగ్‌వే పేర్కొనదగినవి

**6. చరిత్ర:** తొలుత ఈ ద్వీప రాజ్యమున ఐబీరియన్ జాతివారు నివసించుచుండినటులను, ఆ తరువాత క్రీ. పూ. ఆరవ శతాబ్దమున కెల్టిక్ జాతులవారు ఇట చేరినటులను తెలియవచ్చుచున్నది. తొలుతటి నాగరిక జాతులలో మధ్యధరా ప్రాంతపు వారలు బంగారు తగరము మొదలగు లోహముల కొరకై ఈ ప్రాంతమునకు వచ్చిపోవుచుండిరి. క్రీ. పూ. 55లో, రోమన్ విజేత, జూలియస్ సీజరు ఈ రాజ్యముపై దండెత్తి, కొంత భాగమును ఆక్రమించియు, వెనుతిరిగి పోయెను. క్రీ. శ. ఒకటవ శతాబ్దిలో రోమన్ సేనలు ఇంగ్లాండుపై దండెత్తి, అందు అధిక భాగమును ఆక్రమించినవి. రోమనుల వశమున క్రీ. శ. 5 వ శతాబ్దము వరకు

ఈ ప్రాంతము ఉండినది. వారి పరిపాలనా కాలమున దేశమున ప్రముఖ నగరముల నిర్మాణము జరిగినది. అట్టి వానిలో ఒకటియే లండన్ నగరము. వారు రోడ్లను పెక్కింటిని నిర్మించిరి. అందు కొన్ని ఈ కాలమున సైతము వాడుకయందు ఉన్నవి. ఆ కాలముననే ఉత్తర స్కాట్‌లాండును, వేల్సునను. ఐర్లాండునను క్రైస్తవ మతము వ్యాపించినది.

రోమక సామ్రాజ్యపు చరమకాలమున వారి సేనలు ఇట నుండి వైదొలగినవి. అంతట ఇంగ్లాండు అంతర్యుద్ధములకును, స్కాట్‌లాండ్ ఐర్లాండుల నుండి దాడులకును లోనైనది. ఇందులకు తోడుగ యూరపు ఖండపు ముఖ్యభూభాగము నుండి ఏంగిలులు, సాగ్జన్‌లు, జూటులు ఇంగ్లాండుపై దండెత్తి ఆక్రమించుకొని, రాజ్యములను ఏర్పరుచుకొనిరి. దేశీయులగు కెల్టులు వేల్సున తలదాచుకొనిరి. ఇంగ్లాండ్‌ను ఆక్రమించిన విదేశీయ జాతులలోని ఏంగెల్స్ నుండియే ఆ ప్రాంతమునకు ఇంగ్లాండ్ అను పేరు కలిగినది. ఆ జాతులలోని సాగ్జనుల నాయకుడగు ఆల్‌ఫ్రెడ్ (మ. 901) ఎక్కువ పలుకుబడిని దేశమున అర్జించినను, అతని కాలముననే డేనులు దేశముపై దండెత్తి కొంత భాగమును వశపరచుకొనిరి. ఆల్‌ఫ్రెడ్ మరణానంతరమున డేనులు దేశమును అంతటిని వశపరచుకొనగలిగిరి. ఆ డేనిష్ రాజులలో ప్రముఖుడు కాన్యూట్. ఆ రాజవంశ మంతరించిన తరువాత, ఇంగ్లాండ్ నందలి వెస్సెక్స్ రాష్ట్రపు పాలకుడు రాజయ్యెను అతని అనంతరమున వారసత్వ రీత్యా రాజ్యము తనకు చెందవలయునని వాదించి, ఫ్రాన్స్‌లోని నార్మండీ మండల పాలకుడగు విలియమ్ ఇంగ్లాండ్‌పై దండెత్తి ఆ ప్రాంతమును వశపరచుకొనెను (1066) ఆ వంశపు రాజుల అనంతరమున, అంతర్యుద్ధముల ఫలితముగ వారి సమీప బంధువగు హెన్రీ II అనువంశిత పాలకుడు కాగలిగెను (1154). ఇతని కాలముననే స్కాట్లాండు ప్రాంతముపై ఇంగ్లాండునకు ఆధిపత్యము లభించినది. ఐర్లాండున కూడ బ్రిటిష్ ఆధిపత్యము మొదలైనది. ఫ్రాన్స్ దేశమున తమ వంశమునకు చెందిన ప్రాంతమును విస్తృత పరచుటకై ఇతడును ఇతని వంశపు వారును చేసిన కృషివలన ఇంగ్లాండు ఫ్రాన్సుల మధ్య వైరుధ్యములు పొడమినవి. ఆ వంశీయుడగు జాన్‌రాజుతో సర్దారులకు అధికార విభజన సందర్భమున వచ్చిన వివాదమున సర్దారులు విజయముపొంది మాగ్నా కార్టా అను ప్రజాస్వత్వ ప్రకటనకు రాజు అంగీకరింపవలసివచ్చినది (1215). దీనిని ఆ రాజ్యపు పార్లమెంటరీ పాలనకు తొలుతటి అంకురమని భావింపవచ్చును. తదనంతరమున 1265 లో సైమన్ డి మాంట్‌ఫర్డ్ అను సర్దారు, అప్పటి రాజుయొక్క అధికారములను తగ్గించుటకై, గ్రామీణ పెద్దలును, నగర ముఖ్యులును కలిగిన తొలుతటి పార్లమెంటును సమావేశపరచి, ప్రజల హక్కులను రాజు పరిగణించునటుల చేయగలిగెను. 1282 లో ఇంగ్లాండు పాలకులు వేల్స్‌ను ఆక్రమించిరి. కాని 1328 లో స్కాట్‌లాండ్ విడివడి స్వాతంత్ర్యమును ఆర్జించినది.

క్రీ. శ. 14 వ శతాబ్దిలో దేశము పెక్కు కారణములవలన సంక్షుభితమైనది. ఫ్రాన్సుతో నూరేండ్లు సాగిన సంగ్రామము 1337 లో మొదలైనది (చూ : పు. 766). 1348 లో దేశమున ప్లేగు జాడ్యము విపరీతముగ వ్యాపించి, ప్రజానీకమున మూడవవంతును నశింపజేయుటయేగాక, భూస్వామ్య వ్యవస్థయందలి పటుత్వమును సన్నగిల జేసినది. క్రైస్తవమతమున సంస్కరణోద్యమము చెలరేగినది. రైతుల తిరుగుబాటు దేశమున బలమును ఆర్జించినది. ఇందులకు తోడుగ లంకాస్టరు, ట్యూడరు రాజవంశములమధ్య రాజ్యాధిపత్యమునకై పోరాటములు సాగినవి. కడకు 1485 లో ట్యూడర్

వంశపు హెన్రీ VIII రాజగుటతో దేశ చరిత్రలో ఒక నవయుగము ఆరంభితమైనది.

ట్యూడరుల పాలనమున వాణిజ్యము విస్తృతి చెందినది; ఇంగ్లీషు నావికులు విశాల సముద్రములపై పయనింపనేర్చిరి. 1536 లో వేల్స్‌న, ఆంగ్ల దేశపు పాలనా విధానమును, ఆంగ్లభాషయును ప్రవేశపెట్టబడినవి. హెన్రీ VIII కాలమున రోములోని పోపు ఆధిపత్యమును కాదని దేశీయ చర్చిని రూపొందించుటయు, రాజే దానికి పెద్దయగుటయు సంభవించినవి. అతని కుమార్తెయగు ఎలిజబెత్ I పరిపాలనా కాలము (1558-1603) ఆంగ్లదేశపు చరిత్రలో సువర్ణయుగముగ పేరొందినది.

ఎలిజబెత్ I కాలమున ఇంగ్లాండునకు తొలుతటి వలసయగు న్యూఫౌండ్‌లాండ్ లభించినది. స్పెయిన్‌దేశపు నౌకా దండయాత్ర భగ్నము చేయబడినది, సాహిత్య, సంగీతములు వికసనము పొందినవి. ఎలిజబెత్ తరువాత ఇంగ్లాండ్ దేశపు సింహాసనము, వారసత్వరీత్యా స్కాట్లండు పాలకుడగు జేమ్స్ I (1603-25) అనువానికి దక్కినది. అతని కుమారుడగు చార్లెస్ I కాలమున పార్లమెంటునకు ఎక్కువ అధికారమును కల్పించుటకై మధ్య తరగతుల ప్రజలు కృషిచేసిరి. దీనిని రాజు ప్రతిఘటించగ దేశమున అంతర్యుద్ధము చెలరేగి, రాజు పరాజితుడై, మరణశిక్షకు లోనయ్యెను (1649). అంతట ఆలివర్ క్రామ్‌వెల్, రక్షకుడు (ప్రొటెక్టర్) అను హోదాతో, దేశమున శాంతి భద్రతలను నెలకొల్పెను. అతని అనంతరమున చార్లెస్ I యొక్క కుమారుడగు చార్లెస్ II రాజయ్యెను అతని కాలమున పార్లమెంటు తన అధికారములను నిలుపబెట్టుకొనగలుగుటయేగాక, అతని అనంతరపు రాజును పదవీభ్రష్టునిచేసి, తమకు నచ్చినరీతిగ రాజపుత్రికయగు మేరీ II ను, ఆమె భర్తయు డచ్చి దేశీయుడునగు విలియమ్ III ను సంయుక్త పాలకులుగ చేయగలిగినది. 1714 లో వారసత్వరీత్యా, పార్లమెంటుయొక్క ఆమోదముద్రతో జర్మనీయందలి హనోవర్ మాండలిక వశమునకు చెందిన జార్జి I దేశమునకు రాజయ్యెను. తరువాత ఆ వంశపు పేరు 'విండ్‌సర్' అని మార్పొందినది. ఆ వంశమునకు చెందిన ఎలిజబెత్ II ప్రస్తుతపు రాణి.

1707 లో ఇంగ్లండ్, స్కాట్లండ్ దేశములు శాసనరీత్యా, ఒకే పార్లమెంటు పాలనలో ఉండుటకు రెండు దేశముల పార్లమెంటులును అంగీకరించినవి. అంతట దేశమునకు గ్రేట్ బ్రిటన్ అను పేరు కలిగినది. 17, 18 శతాబ్దములందు వలసరాజ్యముల ఆర్జనకై ఫ్రాన్స్, హాలండ్‌లతో పోటీపడి ఈ రాజ్యము కృషి సాగించినది. 1714 నాటికి గ్రేట్ బ్రిటన్‌దే పెక్కు తావులందు పైచేయి కాగలిగినది.

హనోవర్ వంశీయుల పాలనతో, రాజుల జోక్యము లేకుండ మంత్రివర్గమే పార్లమెంటు ఆమోదముతో పరిపాలన సాగించుటయు, రాజు లాంఛనపు అధినేతగ వ్యవహరించుటయు అరంభితములైనవి. 18 వ శతాబ్దిలో వలసరాజ్యముల ఆర్జనలోను, వ్యాపార విస్తృతిలోను ప్రపంచరాజ్యములందు మిన్నగ బ్రిటన్ నెగ్గగలిగినది. ఉత్తర అమెరికాయందును, ఇండియాయందును విశాల ప్రాంతములు ఆ రాజ్యమునకు దక్కినవి. కాని 1781 లో ఉత్తర అమెరికాయందలి కొన్ని వలసలు మాతృదేశమును ప్రతిఘటించి పోరాడి యు. స్టే. అనుపేర నూత్నరాజ్యముగ అవతరించుటవలన గ్రేట్‌బ్రిటన్ చాల నష్టపడినది. 1800 లో ఐర్లండునకును పార్లమెంటున ప్రాతినిధ్యమును సమకూర్చుటతో దేశము యునైటెడ్ కింగ్‌డమ్' అను పేరును పొందినది.

యూరపు రాజ్యములందన్నింట తొలుతగ పారిశ్రామిక విప్లవము ఈ దేశముననే మొదలైనది; వలసలయందు లభించెడి ముడిపదార్థములు పరిశ్రమ

లకు దోహదము కల్పించినవి. ఉత్పత్తుల అమ్మకమునకు మార్కెటులుగ వలసలు ఉపకరించినవి. ఇందువలన దేశమున సాంఘికముగ పలుమార్పులకు ఆవశ్యకత ఏర్పడినవి. 1832 లో బానిసత్వము రద్దుచేయబడినది; పార్లమెంటునందు వోటుహక్కు మధ్య తరగతులవారికి, క్రమముగ కార్మికులకు ఏర్పడినది; కార్మిక శాసనములు రూపుగొనినవి. విక్టోరియా రాణి (1837-1901) పాలనలో దేశము కనివిని ఎరుగని సంపన్నతను, వైభవమును అనుభవించినది. బ్రిటిష్ సామ్రాజ్యము అన్ని ఖండముల లోను విశాల ప్రాంతములను లోగొనినది. సూర్యుడ స్తమించనిది బ్రిటిష్ సామ్రాజ్యము అను కీర్తిని అది ఆర్జించినది.

ప్రథమ ప్రపంచ యుద్ధమున ఫ్రాన్స్, రష్యాలతోను, చరమఘట్టమున యు. స్టే తోను చేరి ఈ రాజ్యము జర్మనీని, దాని సహచర రాజ్యములను ఎదుర్కొని పోరాడి విజయమును ఆర్జించినను విపరీత నష్టములకు లోనైనది; వలసలగు కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికాలకు స్వయంపాలనయే గాక, మాతృదేశముతో సమానమగు ప్రతిపత్తి చేకూరి 'బ్రిటిష్ కామన్‌వెల్త్' అనునది రూపుగొనినది. 1922 లో స్త్రీలకు వోటుహక్కు ఏర్పడినది.

ద్వితీయ ప్రపంచ యుద్ధమున విన్‌స్టన్ చర్చిల్ నాయకత్వమున ఈ రాజ్యము తక్కిన మిత్ర రాజ్యములతోపాటుగ ఎన్నో త్యాగములనుచేసి యుద్ధమున పాల్గొనినది. కడకు విజయము మిత్రరాజ్యములకే దక్కినను, ప్రపంచపు నూత్న పరిస్థితులును, ఈ దేశపు ఆర్థిక దురవస్థయు, సామ్రాజ్యపు ఉనికికి భంగకారులుగ పరిణమించినవి. అంతట ఈ దేశపు రాజకీయవేత్తలు అనుసరించిన వివేకయుత రాజనీతికి ఫలితముగ ఇండియా మొదలుగ పెక్కు వలసరాజ్యములు స్వతంత్రములు కాగలిగినవి. అందు కొన్ని యునైటెడ్ కింగ్‌డమ్‌తో అన్ని సంబంధములను త్రెంచుకొనినను కొన్ని మాత్రము 'కామన్‌వెల్తు' న చేరి సౌహార్ద్ర భావనతో కలసిమెలసి సమానహోదాతో, స్వతంత్రరీతిలో వ్యవహరించుచున్నవి. కొన్ని రాజ్యములు దాదాపుగ స్వతంత్రములయ్యు ఐచ్ఛికముగ బ్రిటిష్ సింహాసనపు పాలనను అంగీకరించి సహసభ్య (అసోసియేటెడ్) రాజ్యములుగ వ్యవహరించుచున్నవి. ఇంకను 25 పాలక ప్రాంతములుగ ఉన్నవి. వీనిలో రొడీసియా (చూ : పు. 197) తప్ప తక్కినవి అన్నియు చాల చిన్న ప్రాంతములు.

**7. పరిపాలన :** వంశానుగతమగు రాజరికము ఈ దేశమున అధికారమున ఉన్నను, వస్తుతః పార్లమెంటరీ ప్రజాస్వామ్యమే సర్వాధికారములనుకలిగి యున్నది. పార్లమెంటుద్వారా వెలువడు ప్రజాభిప్రాయమునకు అనుగుణముగ పాలనా యంత్రాంగమును నడపు పరికరముగ మాత్రమే దేశపాలకుని పాలనాధికారము ఇట వర్తింపగలుగుచున్నది. అందువలన, "పాలకుడు రాజరికమును నెరపునేగాని శాసించడు" అను లోకోక్తికి బ్రిటన్‌న వ్యాప్తి చేకూరినది. శాసన నిర్మాణమున చరమాధికారము పాలకునియందును, ప్రభువుల సభయందును, ప్రజా సభయందును న్యస్తము; ఈ మూడును సమష్టిగ పార్లమెంటు అని వ్యవహృతములు. దేశమున నాలుగు ప్రాంతములు ఉన్నను, అవి అన్నియు, సమాఖ్యారాజ్యముగగాక, ఏకరాజ్యముగనే పరిగణింపబడుటవలన, ఆ నాలుగు ప్రాంతములకును పార్లమెంటున ప్రాతినిధ్యము కలదు. అయినను ఉత్తర ఐర్లండున మాత్రము, పార్లమెంటునకు లోబడి, కొన్ని స్థానిక వ్యవహారములందు చట్టములను చేయు హక్కు కలిగిన ఒక శాసనసభ (స్టార్మూంట్) ఉన్నది. లండన్‌లోని, వెస్ట్‌మిన్‌స్టర్ ప్రాంతమున పార్లమెంటు పనిచేయుచున్నది.

ప్రభువుల సభయందు 1,000 కి పైబడిన ప్రభువులు కలరు. వీరిలో కొందరు వారసత్వ

రీత్యా ప్రభుపదవిని ఆర్జించినవారు; కొందరు ఇంగ్లాండ్ దేశపు చర్చికిచెందిన పీఠాధిపతులు, ఉప పీఠాధిపతులు; తక్కినవారు దేశమున వివిధ రంగములందు పేరొందుటవలన ప్రభు బిరుదమును ప్రభుత్వమువలన పొంది, దానిని వారసులకు చెంద జేయు అధికారము లేనివారు. ఇంతమంది సభ్యు లున్నను ఈ సభా సమావేశములకు సగటున 250 మంది హాజరగుచుందురు. ఈ ప్రభువుల సభకు తొలుత కొన్ని అధికారములు ఉండి, అవి కాల క్రమేణ చాల సన్నగిలినవి; ఈనాడు అందలి సభ్యులకు, తమ విస్తృత లోకానుభవమును శాసన నిర్మాణమునకు సహకరించు రీతిలో వినియోగించు అధికారము మాత్రమే మిగిలి ఉన్నదని చెప్ప వచ్చును. ప్రజాసభ (హౌస్ ఆఫ్ కామన్స్) లోని సభ్యసంఖ్య 630 (1971). ఇందు ఇంగ్లాండునకు 511, వేల్సుకు 36, స్కాట్‌లాండ్‌నకు 71, ఉత్తర ఐర్లాండునకు 12 మంది సభ్యుల ప్రాతినిధ్యము కలదు. అయినను, అంతటంతట జనసంఖ్యలోని మార్పు మొదలైనవానివలన ఈ ప్రాతినిధ్యము మారుటకు అవకాశము కలదు. దేశమున 17 ఏండ్లకు పైబడిన వయసుకలిగిన వారికి అందరికిని వోటు హక్కు కలదు. అయిదేండ్లకు ఒక పర్యా యము ప్రజాసభకు విధిగ ఎన్నికలు జరుగవలెను; ఆ మధ్యకాలమునగూడ పార్లమెంటున అధిక సంఖ్యా కుల బలమును కలిగిన ప్రభుత్వము లేనపుడుగాని, అప్పటి ప్రభుత్వము కోరినపుడుగాని పార్లమెంటునకు క్రొత్తగ ఎన్నికలు జరుగును. ఆర్థిక సంబంధ మైనవి కానట్టి బిల్లు ఏదియైనను, ఏ సభలోనైనా ప్రవేశపెట్టబడవచ్చును గాని, ఆర్థికములైనవి మాత్రము ప్రజాసభలోనే ప్రవేశపెట్టబడవలయును; ఆర్థిక బిల్లును మార్చుటకు ప్రభువుల సభకు అధి కారము లేదు. ఇతర బిల్లులలో సైతము ఏ బిల్లును, ఒకసారి ప్రజాసభ ఆమోదించినపుడు దానిని సంవత్సరమునకు మించి నిలిపియుంచుటకు ప్రభు వుల సభకు అధికారము లేదు. రెండు సభలు ఆమోదించిన బిల్లును, రాజు ఆమోదించగ, అది చట్టమగును. అట్టి ఆమోదము నిరాకరించు (వీటో) అధికారము రాజునకు కలదుగాని గత 200 సంవ త్సరములలో ఏనాడును అట్టి అధికారము విని యుక్తము కాలేదు.

పార్లమెంటులో అధిక సంఖ్యాక బలము కలిగిన నాయకుని ప్రధానిగను, అతని సలహాను అనుస రించి తక్కిన మంత్రులను రాజు నియమించును. ఈ మంత్రివర్గము సమష్టిగ పార్లమెంటునకు బాధ్యత వహించగ, వివిధ మంత్రులును, తమకు ఈయబడిన వివిధ ప్రభుత్వశాఖలను నిర్వహింతురు. స్కాట్లాండునకు చెందిన నాలుగు ప్రభుత్వ శాఖ లను నిర్వహించుటకు ఒక ప్రత్యేక మంత్రియు, వేల్సునకు చెందినవానిని నిర్వహించుటకు ఒక ప్రత్యేక మంత్రియు కలరు. ఉత్తర ఐర్లాండునకు చెందిన ప్రత్యేక శాఖలను ఆ ప్రాంతపు ప్రభుత్వమే నిర్వహించును.

బ్రిటిష్ రాజ్యాంగ విధానము లిఖిత రూపమును పొందలేదు. పార్లమెంటు అంతటంతట చేయు శాసనముల వలననే అది క్రమపరిణామము పొంది నది. శతాబ్దముల తరబడిగ జరుగుచుండిన ఈ క్రమపరిణామమువలన ఆ యా కాలములకు అను గుణముగ ఆర్థిక సాంఘిక రంగములందు ఆ అలి ఖిత రాజ్యాంగ విధానము, ప్రజల సమష్టి, వ్యష్టి శ్రేయస్సుల రెండింటికి అనుగుణముగ వికసనము పొందగలుగుచున్నది. ఆధునిక ప్రజాస్వామ్యము నకు తొలుతటి అంకురార్పణ బ్రిటిష్‌వారి పార్ల మెంటుననే జరిగినదని చెప్పవచ్చును. అందువల్లనే ఆ పార్లమెంటును పార్లమెంటుల జనని అని అభి వర్ణింతురు.

ఈ దేశపు పార్లమెంటు 13 వ శతాబ్దమునుండి క్రమపరిణామము చెందుచున్నను, పార్టీ విధానము

నూరేండ్ల క్రిందటినుండి మాత్రమే పనిచేయు చున్నది. కన్సర్వేటివ్, లిబరల్, లేబరు పార్టీలు దేశపు ప్రముఖ రాజకీయ పక్షములు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కన్సర్వేటివ్, లేబర్ పార్టీల మధ్యనే ప్రభుత్వాధికారము చేతులు మారు చున్నది. ప్రస్తుతమున (1977) లేబర్ ప్రభుత్వము చాల కొలది ప్రాబల్యముతో అధికారమున ఉన్నది. గ్రామీణ మండలములందును, పట్టణములందును స్థానిక పాలన, ఎన్నుకొనబడిన స్థానిక సంస్థల సాయమున, నిర్వహింపబడుచున్నది.

ఇంగ్లాండు, వేల్సులందు ఒకే విధపు న్యాయ పాలనా విధి అమలున ఉన్నను, స్కాట్లాండు, ఉత్తర ఐర్లాండులలో వేర్వేరు న్యాయపాలనారీతులు, స్థానిక సంప్రదాయములకు సంబంధించినవి కలవు. ఈ మూడు ప్రాంతములకు వేర్వేరుగ హైకోర్టులు కలవు. అయినను కొన్ని రీతుల వివాదముల చరమ నిర్ణయాధికారము ప్రభువుల సభకు కలదు. ప్రధాని సలహాను అనుసరించి జడ్జీలను రాజు నియమించును.

**8. దేశరక్షణ :** 19 ఏండ్ల వయసువచ్చిన ప్రతి పురుషుడును 2 సంవత్సరముల కాలమును జాతీయ సైనిక సేనలో గడపవలయునను చట్టము ఉన్నది (కొన్ని నిర్దిష్ట సందర్భములలో మాత్రమే కొందరిని ఈ సేవనుండి మినహాయించుటకు అవకాశము కలదు). అయినను 1960 నుండి ఈ నిర్బంధ సేవను అమలు జరుపుటలేదు. ఒకపుడు ప్రపంచ విస్తృతముగ నుండిన విశాల సామ్రాజ్య రక్షణకై విస్తారసేనను పోషించిన ఈ దేశము 1969 మొదలుగ తన సేనాబలమును, వ్యయమును తగ్గించు కృషిని క్రమబద్ధముగ సాగించుచున్నది. అన్నివిధముల సేనలలో కలసి మొత్తముమీద 3,71,100 సైనికులు కలరు (1973). ఇందు భూతల సేనలలో 181,400; నావికసేనలో 82,300; వాయుసేనలో 1,07,300 పనిచేయు చున్నారు ఇందలి ప్రతి సేనా విభాగమును అత్యాధునిక ఆయుధములను కలిగియున్నది. ఉత్తమ శ్రేణికి చెందిన వివిధ సైనిక శిక్షణా సంస్థలు, గ్రీన్‌విచ్, కేంబర్లీ, బ్రాక్‌నెల్, చెల్‌షామ్‌లలో కలవు తమ దేశీయులకేగాక, కామన్‌వెల్తు రాజ్యములకును మిత్రరాజ్యములకును చెందిన సైనికులకును ఇట శిక్షణ లభించుచున్నది. నావికసేనకు సాంప్రదాయిక యుద్ధనౌకలు, డిస్ట్రాయర్లు, జలాంతర్గాములు మొదలగునవియేగాక ఆణవిక శక్తిచే నడుపబడు జలాంతర్గాములును కలవు.

పై త్రివిధ సేనలుగాక రిజర్వు బలములలో 4,36,500 సైనికులు కలరు (1973). వివిధ సేనలకు కావలసిన ఆయుధములలో తగు పరిశోధనను సాగించుచు, క్రొత్తవానిని సమకూర్చుటకు ఒక ప్రత్యేక వైజ్ఞానిక శాఖ పనిచేయుచున్నది.

ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థయందు ఈ దేశము భాగస్వామ్యము కలది కావున అందులకు కొన్ని సేనలను సమకూర్చుచున్నది. నావికసేనలో అత్యధిక భాగమును, ఆణవిక శక్తితో నడచు జలాంతర్గాములును ఈ కృషికి అంకితములు. ఇవిగాక పశ్చిమ జర్మనీయందు ఇందులకై 58 వేల భూతల సైనికులను ఈ దేశము సర్వాయుధములతో సదా నిలిపియుంచుచున్నది. ఇవిగాక దేశమునందున్న వాయుసేనలోను కొన్ని దళములు ఈ వ్యవస్థకే నిర్ణయితములు. మాల్టా, సైప్రస్‌లలో కొన్ని భూతల సేనలను, హిందూమహా సముద్రమున ఆరు నౌకలను, మలేసియా సింగపూర్‌లలో కొన్ని సైనిక దళములను, అచటి సముద్రములలో కొన్ని నావిక సేనాదళములను, శాంతి సంరక్షణ కొరకై ఈ దేశము నిలిపినది. ఇచటి భూతల సేనలలో కొందరు గూర్ఖాలు కలరు. వీరు నేపాల్ దేశీయులైనను, ఒక ఒడంబడికను అనుసరించి

బ్రిటిష్ సేనలలో చేరు అవకాశము వారికి కల్పింప బడినది.

**9. అంతర్జాతీయ సం.:** ఈ దేశము ఐ. రా. స. వ్యవస్థాపక సభ్యరాజ్యములలో ఒకటి: అందలి ప్రత్యేక సంస్థలందు అన్నింట ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఉత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థయందును, మధ్యప్రాచ్య రక్షణ వ్యవస్థ యందును, ఆగ్నేయాసియా రక్షణ వ్యవస్థయందును ఈ రాజ్యము సభ్యత్వమును కలిగియున్నది; కాని వీనిలో చివరది అంతరించినది; రెండవది నామ మాత్రావశిష్టము. యూరపీయ కామన్ మార్కెటున 1973 మొదలుగ ఈ దేశము సభ్యత్వము కలిగి వ్యవహరించుచున్నది. వర్ధమానదేశములకు సాయ పడుటకై ప్రత్యక్ష, పరోక్షరీతులలో ఈ దేశము చాల కృషిచేయుచున్నది. ఈ ఆర్థిక, సాంకేతిక మార్గములలో ప్రత్యక్ష రీతిన జరుగు సాహాయ్యా మున 80% కామన్‌వెల్త్ రాజ్యములకు లభించు చున్నది.

**10. ఆర్థిక రంగము:** పారిశ్రామిక విప్లవ మునకు తొలుతగ లోనైన ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు పారిశ్రామికోత్పత్తులపై ఆధారపడి ఉన్నది. సమష్టి జాతీయోత్పత్తిలో మూడవవంతు పరిశ్రమలవలన లభించుచున్నది; ఇక తరువాత లెక్కకు వచ్చునది వ్యాపారరంగము. ప్రపంచ వ్యాపారమున నాలుగవ స్థానమును (యు స్టే., పశ్చిమ జర్మనీ, జపానుల తరువాత) ఈ దేశము ఆక్రమించినది; అట్టి వ్యాపారమున 6% ఈ దేశమువలన జరుగుచున్నది. ప్రపంచమున ఎగుమతియగు ముడి వస్తువులలో 10.4% ఈ దేశమును చేరుచున్నవి; ప్రపంచమున ఎగుమతియగు తయారీ వస్తువులలో 10.1% ఈ దేశము ఎగుమతి చేయుచున్నది. వ్యవసాయమునఉన్న భూమి తక్కువయేయైనను, దేశావసరములకు కావలసిన ఆహార పదార్థములలో దాదాపుగ సగమువరకు దేశముననే ఉత్పత్తియగు చున్నవి; తక్కినదానికి విదేశములపై ఈ దేశము ఆధారపడి యున్నది. వ్యవసాయ కృషిలో దేశపు ప్రజానీకమున 2.8% మాత్రమే పాల్గొనుచున్నారు. దేశపు సమష్టి జాతీయోత్పత్తి 5,390 కోట్ల పౌనులు (1972); సాలీనా తలసరి ఆదాయము 600 పౌనులు. సరియైన పన్నుల విధానమువలన ఆదాయములందు, వివిధ వర్గములమధ్య. వ్యత్యాసములు చాల తక్కువగ ఉండుటకై ప్రభుత్వము కృషి చేయుచున్నది.

19వ శతాబ్దిలో పారిశ్రామికముగ, ఆర్థికముగ, వ్యాపారరీతిగ ప్రపంచరాజ్యములం దన్నింట అగ్ర స్థానమునుపొంది ఈ దేశము రాణించినది. ఆ కాలమున లండను నగరము ప్రపంచపు ప్రముఖ వాణిజ్య కేంద్రముగ లెక్కకు వచ్చినది; కాని ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఈ పరిస్థితిలో మార్పు వచ్చి, 1930 నాటికి ఈ దేశపు నాణెమగు పౌనునకు బంగారపు ప్రమాణము రద్దయినది; ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము ఈ పరిస్థితి చాల విషమించినది. యు. స్టే. ఇచ్చిన ధనసహాయాదుల వలన పరిశ్రమలు పునరుద్ధరితములై ఉత్పత్తి పెరిగినను, ఉత్పత్తుల పెరుగుదల రేటును మించిన రీతిగ వ్యక్తిగత ఆదాయములు పెరుగుటవలన 1972 మొదలుగ పౌనునకు ఇతర దేశముల నాణెములతోఉన్న వినిమయ సంబంధమున సుస్థిరత లేకుండపోయినది.

దేశమున వ్యవసాయపు ఉపయోగమునఉన్న మొత్తపు భూమి 178 లక్షల ఎకరములు; ఇందులో గడ్డిభూములు, బంజరుభూమిపోగా సేద్యమున ఉన్నది 121 లక్షల ఎకరములు (1972). వ్యవసాయోత్పత్తులలో ప్రముఖములైనవాని ఉత్పత్తులు ఈ దిగువరీతిగ వేల టన్నులలో ఉన్నవి: గోధుమ 4,686; బార్లీ 9,098; ఓట్లు 1,235; ఉరల

గడ్డలు 6,441; చక్కెరబీటు 7,745 (1972). దేశమున గోజాతి 13,463 వేలు; గొర్రెలు 26,877 వేలు; పందులు 8,619 వేలు; కోళ్లు 1,40,045 వేలు ఉన్నవి. చేపల పట్టుబడి 948.7 వేల టన్నులు; దాని విలువ 91,811 వేల పౌనులు. అటవీ విస్తీర్ణము 33 లక్షల ఎకరాలు; ఇది మొత్తపు దేశ వైశాల్యమున 7% మాత్రమే; అటవీ కృషిలో 36 వేలమంది జీవించుచున్నారు; దేశపు కలప అవసరములలో 8% మాత్రమే అడవులవలన లభించు చున్నది; తక్కినదానిని దేశము దిగుమతి చేసికొను చున్నది. ఖనిజ సంపత్తి చాల తక్కువ; ఉన్న వానిలో రాక్షసిబొగ్గు ప్రముఖము; ఇచ్చటి రాక్షసి బొగ్గు గనులలో పని దాదాపుగ 300 సంవత్సర ములనుండి సాగుచున్నది. 1947 మొదలుగ ఈ గనులు జాతీయములు చేయబడినవి. తన అవసర ములకు పోను, మిగిలినదానిని ఈ దేశము విదేశము లకు విరివిగ ఎగుమతి చేయుచుండెడిది. కాని, ఇపుడు, యూరపునందలి కొన్ని దేశముల పోటీ వలన ఈ ఎగుమతులు తగ్గినవి. తక్కిన ఖనిజము లలో తగరము, తుత్తునాగము, టంగ్‌స్టన్‌లకు సంబంధించిన గనులు కొలదిగ కలవు. ఈ ఖనిజ ముల సాధనలో దాదాపు 63 వేలమంది జీవించు చున్నారు. దేశపు ఇంధనములలో రాక్షసిబొగ్గు తరువాత పేర్కొనదగినది ఇంధనవాయువు. ఉత్తర సముద్రమున ఇందు 90% వాయువు లభించు చున్నది. దీని సరఫరా కృషిలో 1,10,695 మంది జీవించుచున్నారు (1972). ఈ వాయువున దాదా పుగ సగము గృహోపయోగములకు వినియుక్తము; తక్కినది పరిశ్రమలకు, వ్యాపారమునకు వాడబడు చున్నది. దేశమున పెట్రోలు ఉత్పత్తి ప్రస్తుతమున 82,000 టన్నులు మాత్రమే. దేశావసరములకు ఎక్కువగ దిగుమతులపై ఆధారపడవలసిఉన్నది. కాని ఉత్తర సముద్ర తీరప్రాంతమున సముద్రపు అడుగున పెట్రోలుగనులు కనుగొనబడి వాని యందు కృషి 1965 మొదలుగ సాగుచున్నది. దీని ఫలితముగ 1980 నాటికి సాలీనా పెట్రోలి యపు ఉత్పత్తి 10 కోట్ల టన్నులవరకు పోగలదని అంచనా.

దేశమున విద్యుదుత్పత్తికి ప్రముఖాధారము రాక్షసి బొగ్గు; స్కాట్‌లాండ్ వేల్సులలో మాత్రము అటనట జలసహాయమున విద్యుదుత్పత్తి సాగుచున్నది. ప్రస్తుతమున అణవిక శక్తి కేంద్ర ముల నుండి విద్యుత్తును సరఫరాచేయు కృషి సాగుచున్నది; అయినను ఇందువలన దేశావసరము లలో 11% మాత్రమే విద్యుత్తు లభించుచున్నది. దేశమున మొత్తపు విద్యుదుత్పత్తి 23,800 కోట్ల కివా (1972) దేశపు పరిశ్రమలలో 7,613.3 వేల కార్మికులు పనిచేయు చున్నారు. ఇనుము–ఉక్కు పరిశ్రమ జాతీయము చేయబడినది వివిధ ఇంజనీరింగు శాఖలకు సంబంధించిన యంత్ర నిర్మా ణము, నౌకా నిర్మాణము, కార్లు విమానములు మొదలగు వాహనముల తయారీ, జవుళీ, లోహ పరికరములు – అను వానికి సంబంధించిన పరిశ్ర మలు క్రమ ప్రాముఖ్యములను కలిగి ఉన్నవి; భవన నిర్మాణకృషియు దాదాపు 8 లక్షల మందికి జీవనోపాధిని కల్పించుచున్నది. దేశపు ఎగుమతుల విలువ 97,45,682 వేల పౌ; దిగుమతుల విలువ 111,55,418 వేల పౌ. (1972). ఇతర దేశముల లోని పెట్టుబడులు, సేవా విధులవలని ఆదాయము మొదలగు వానివలన చెల్లింపుల లోటును పూరించు కొనుటకు దేశము కృషి చేయుచుచున్నది. దేశపు బడ్జెటరీ వ్యయము 1,864.8 కోట్ల పౌ. (1973–74).

**11. సాంఘిక రంగము :** ఒక క్రమ రీతిలో పరిపూర్ణ వికసనము పొందిన సాంఘిక భద్రతా ప్రణాళిక దేశమున 1948 మొదలుగ అమలున ఉన్నది. దేశమున 173 లక్షల నివాస గృహములు

కలవు; కుటుంబముల సంఖ్యయు, గృహముల సంఖ్యయు సరికుదిరియే యున్నను, కొందరికి అదనపు గృహములు ఉండుట వలన, లండన్ బర్మింగ్‌హాముల వంటి ప్రముఖ వ్యాపార పారిశ్రామిక కేంద్రములలో గృహ వసతికి ఇబ్బంది కొంత ఎక్కువగనే ఉన్నది. అయినను 85% దేశీయులు సముచితములైన నివాస గృహములలోనే నివసించు చున్నారని చెప్పవచ్చును. ప్రజల కందరకు చక్కని గృహ వసతిని కల్పించుట ప్రభుత్వపు ధ్యేయము. ఆ యా స్థానిక ప్రభుత్వములును, ఈ విధానమునకు అనుగుణముగ, క్రొత్త గృహములను ఒక ప్రణాళికను అనుసరించి నిర్మించుచున్నవి. ఇవిగాక వైయక్తిక సంస్థలును, వ్యక్తులును, పెరుగుచున్న అవసరములకు అనుగుణముగను, పాతవడిన ఇండ్లకు బదులుగను క్రొత్త గృహములను నిర్మించుచున్నారు: ఈ తీరున 2 లక్షల గృహములు క్రొత్తగ 1972లో నిర్మితములు. ఉన్న ఇండ్లలో 13% మాత్రమే అద్దె ఇండ్లు; అద్దెలను హద్దులో పెట్టు యంత్రాంగము కలదు.

సాంఘిక శ్రేయో భద్రతలకు ప్రభుత్వ సేనా సంస్థలే గాక, వైయక్తిక సంస్థలును కొన్ని పని చేయుచున్నవి. ఈ రెండు విధముల సంస్థలును సమన్వయిత రీతిలో పనులను నిర్వహించుచున్నవి. జాతీయ భీమా, పారిశ్రామిక ప్రమాదముల భీమా, కుటుంబ సహాయ భృతి, కుటుంబాదాయ సహాయ భృతి, యుద్ధపు పెన్షనులకు వసతులు ప్రభుత్వపు సాంఘిక భద్రతా ప్రణాళికను అనుసరించి ప్రజలకు లభించుచున్నవి. దేశమున నివసించుచు, పాఠశాలలలో చదివెడు వయసును దాటిన ప్రతి పౌరునికి జాతీయ భీమా సర్వసాధారణముగ వర్తించును. పనిచేయుచున్న కాలమున ప్రతి వ్యక్తియు తన జీతము నుండి ఈ భీమాకై సాంవత్సరిక ప్రీమియములో కొంత భాగమును చెల్లించును; కొంత భాగమును, అతడు పనిచేయు సంస్థ ఏదియైన ఉన్నచో, అది చెల్లించును; కడమను ప్రభుత్వము చెల్లించును. 70 ఏండ్లు దాటిన మగవాడును, 65 ఏండ్లు దాటిన స్త్రీయు దీనిని చెల్లింపనక్కరలేదు. ఇట్టి భీమా వలన, భీమాచేసిన పౌరునకు, నిరుద్యోగ కాలమున, రోగమున, స్త్రీల సందర్భమున పురిటి కాలమున, 60 ఏండ్లు దాటిన వారికి ఉద్యోగ విరమణ కాలమున, ఉద్యోగము చేయుచున్నను 70 ఏండ్లు దాటిన వారికిని, జీవన భృతి కొన్ని నిర్దిష్ట సూత్రములను అనుసరించి విధిగ లభించును. ఈ భీమా విధానమున చేరని వారైనను 80 ఏండ్ల వయసునకు మించిన వారైన యెడల వారికిని ఈ భృతి ఈయబడును. వేరు ఆదాయము లేని వితంతువులకును, ఈ పద్ధతిన, ప్రత్యేక భృతి లభించును. ఇట్టి భృతులలో కనీస భృతి వారమునకు 7.35 పౌ.

కుటుంబమున ఇద్దరు, లేక అంతకు మించిన బిడ్డలు ఉన్నపుడు కుటుంబ సహాయపు భృతిని ప్రభుత్వము ఇచ్చును పిల్లలకు 19 ఏండ్ల వయసు వచ్చువరకు ఇవి చెల్లింపబడును. ఇద్దరు బిడ్డలు ఉన్న కుటుంబమునకు వారమునకు పౌ. 0 90 చొప్పున, అంతకు మించిన ప్రతి బిడ్డకు వారమునకు ఒకపౌను చొప్పున ఈ సహాయము చెల్లింపబడును. సరియగు ఆదాయములేని కుటుంబమునకు బిడ్డల మొత్తపు సంఖ్యను అనుసరించి కుటుంబాదాయ సహాయ భృతి లభించుచున్నది. ఇందు వలన ఇద్దరు బిడ్డల కుటుంబమునకు వారమునకు చెల్లింపదగు గరిష్ఠ భృతి 5 పౌనులు; అంతకు మించి యున్నపుడు గరిష్ఠ భృతి వారమునకు 6 పౌనులు.

5 నుండి 15 ఏండ్ల వరకు వయసు కలిగిన బిడ్డలకు నిర్బంధ విద్యా బోధన అమలున ఉన్నది. ప్రభుత్వపు ఆధ్వర్యవమున నడచు పాఠశాలలే గాక 'సార్వజనిక పాఠశాలలు' (పబ్లిక్ స్కూల్స్)

ఆనబడునవి విన్‌చెస్టర్, ఈటన్, హేరో మొదలగు ప్రాంతములందు బాలురకు కలవు. శతాబ్దముల తరబడిగ, ఇవి విద్యాబోధన విషయమున, ప్రఖ్యాతిని ఆర్జించినవి. బాలికలకును అట్టి కొన్ని పాఠశాలలు ఉన్నవి. ఇంగ్లాండ్ వేల్సులలో ప్రయిమరీ, సెకండరీ పాఠశాలల మొత్తపు సంఖ్య దాదాపు 28,400; అందలి విద్యార్థి సంఖ్య 82 లక్షలు; వేల్స్‌లో ప్రయిమరీ పాఠశాలలలో ఇంగ్లీష్, వెల్ష్ భాషలు బోధింపబడును; స్కాట్లాండ్‌లో ప్రయిమరీ పాఠశాలల సంఖ్య 2,309; అందలి విద్యార్థి సంఖ్య 6,36,250; అచటి సెకండరీ పాఠశాలల సంఖ్య 54,153; విద్యార్థి సంఖ్య 3,27,514 (1970-71). దేశపు మొత్తమున 44 విశ్వవిద్యాలయములు కలవు. వీనిలో ఇంగ్లాండ్‌లోని ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయములు అతి ప్రాచీనములు; అందు తొలుతటిది 12 వ శతాబ్దమున, రెండవది 13 వ శతాబ్దమున నెలకొల్పబడినవి; స్కాట్‌లాండ్‌లోని విశ్వవిద్యాలయములలో సెయింట్ యాండ్రూస్, గ్లాస్‌గో, అబెర్‌డీన్, ఎడింబరో విశ్వవిద్యాలయములు 15, 16 శతాబ్దములలో స్థాపింపబడినవి ఈ విశ్వవిద్యాలయముల అన్నింటి విద్యార్థి సంఖ్య 241 వేలు (1971-72). పైవిగాకుండ, వివిధ విజ్ఞాన, కళా శాఖలందు ప్రత్యేకోన్నత విద్యను బోధించు సంస్థలు 850 కు పైగా దేశమున కలవు; వీనిలోని విద్యార్థి సంఖ్య 280 వేలు (1970-71).

విద్యా బోధన యందు ఇచట ఉన్న వసతుల దృష్ట్యా, దూర దేశముల నుండియు విద్యార్థులు పలువురు ఇటజేరి విద్యను అభ్యసించుచున్నారు. 1971-72 లో ఇట్టివాని సంఖ్య 70,000. వీరిలో 19,680 మంది విశ్వవిద్యాలయములందును, 19,100 మంది సాంకేతిక కళాశాలలలోను శిక్షణ పొందిరి; తక్కిన వారు భాషాభ్యసనము, న్యాయ శాస్త్రము, వైద్యము మొదలగు వానిలో శిక్షితులు.



దేశమున గ్రంథాలయ సౌకర్యము విరివిగ కలదు. దేశపు మొత్తమున సార్వజనిక గ్రంథాలయ పీఠములు (అథారిటీలు) 485 కలవు; ఇవి తమ 40 వేల శాఖా గ్రంథాలయముల ద్వారాను, సంచార గ్రంథాలయముల వలనను మారుమూల ప్రాంతములకు సైతము గ్రంథ పఠన వసతిని కల్పించుచున్నవి. లండన్ నగరమున 500 కు పైబడిన గ్రంథాలయములు ఉన్నవి; వానిలో బ్రిటిష్ మ్యూజియమ్ లైబ్రరీ అతి ప్రముఖము; ఇందు గ్రంథ సంఖ్య 70 లక్షలకు పైబడి ఉన్నది. ఎడింబరోలోని జాతీయ గ్రంథాలయమున 20 లక్షలకు పైబడియు, వేల్సు నందలి అబెరీస్ట్విత్‌లోని జాతీయ గ్రంథాలయమున 20 లక్షలకు పైబడియు గ్రంథములు కలవు. ఆక్స్‌ఫర్డ్‌లోని బోడ్‌లీన్ గ్రంథాలయము (32 లక్షల గ్రంథ సంఖ్య), కేంబ్రిడ్జి యూనివర్సిటీ లైబ్రరీ (40 లక్షల గ్రంథములు) పైవాని కోవకు చెందినవియే.

దేశమున ప్రతి నగరమునను పురాతత్వ, కళా, ప్రకృతి శాస్త్రములకు చెందిన మ్యూజియము ఉన్నదని చెప్పవచ్చును. మొత్తము మీద 900 మ్యూజియములు, చిత్రాగారములు (గేలరీలు) కలవని అంచనా. లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం, విక్టోరియా అండ్ ఆల్‌బర్ట్ మ్యూజియమ్, నేషనల్ గేలరీ, టేట్ గేలరీ, నేషనల్ పోర్ట్రయిట్ గేలరీ విశ్వవిఖ్యాతిని ఆర్జించినవి. కార్డిఫ్ నగరమునఉన్న నేషనల్ మ్యూజియమ్ ఆఫ్ వేల్స్, ఎడింబరోలో ఉన్న ఆరు జాతీయ మ్యూజియములు, ఉత్తర ఐర్లాండులో బెల్‌ఫాస్ట్ నగరమున ఉన్న చిత్రాగార మ్యూజియములు గణనీయములు.

ప్రపంచమున ఎచటను లేనంతగ ఈ దేశమున పత్రికా ప్రచారము కలదు. సగటున ఒక్కొక దినపత్రిక దాదాపు 18 లక్షల ప్రతుల వరకు ప్రతిదినమున అమ్ముడుపోవుచున్నది. దేశపు దిన

పత్రికల సంఖ్య (ఆదివారపు పత్రికలతో సహా) 131 (1973); ఇవిగాక వారపత్రికల సంఖ్య 1,135. కాని వార్తాపత్రికల ప్రచురణలో ఎక్కువ భాగము 7 ప్రముఖ ప్రచురణ సంస్థల అధీనమున ఉన్నది పత్రికలలో వార్తా ప్రచురణ విషయమున గాని, అభిప్రాయ ప్రకటన విషయమునగాని ప్రభుత్వపు నిర్బంధములు ఎట్టివియు లేవు. దినపత్రికలలో పాఠక సంఖ్యలను అనుసరించి ప్రముఖములుగ పేర్కొనదగినవి : డైలీ మిర్రర్ (పాఠక సంఖ్య 42,61,683), డైలీ ఎక్స్‌ప్రెస్ (32,96,983), ది సన్ (29,31,466), డైలీ మెయిల్ (17,03,215).

దేశమున ఆరోగ్యపు వసతులు చక్కగ అభివృద్ధి చెందుటవలన అపేక్షిత జీవిత వ్యవధి 70 సంవత్సరములను చేరుకొనినది. 1948 మొదలుగ దేశమంతట అమలులోనికివచ్చిన జాతీయ ఆరోగ్య సేవా విధానమువలన పౌరులకును, ఆగంతుకులకును వైద్య సహాయము, అడిగినంతనే లభించు సౌకర్యము కలిగినది. పౌరుడు తనకు నచ్చిన వైద్యుని వద్ద, ఆ వైద్యుడు ఇష్టపడునెడల, చికిత్స పొందుటకును, ప్రభుత్వమే ఆ వ్యయమును, కొన్ని సామాన్య నిబంధనలకు లోబడి, భరించుటకును వసతులు కలిగినవి. పౌరుల వైద్య చికిత్సా వసతులకు అగు వ్యయములో 11% ను మాత్రమే, చెల్లింపకలిగిన వారినుండి ఒక క్రమరీతిలో, వసూలుచేసి, తక్కిన దానిని ప్రభుత్వమే భరించుచున్నది. దేశపు వైద్యులలో మొత్తముమీద 98% ఈ ఆరోగ్య సేవా విధానమున పాల్గొనుచున్నారు. ఇందులో ఏ వైద్యునికిని 3,000 మందికి మించిన రోగులు లేరనియు, ఆ రోగుల విషయమున ప్రభుత్వము ఆ వైద్యునికి చెల్లించునది సాలీనా సగటున 3,367 పౌనులవరకు ఉండుననియు తెలియుచున్నది. దేశపు మొత్తము మీద 5,48,100 శయ్యా సంఖ్య కలిగిన 2,960 ఆసుపత్రులు కలవు.

**12. యాత్రా సౌ. :** సాధారణముగ పాస్‌పోర్టు, వీసాలు లేనిదే విదేశీయులు దేశమున ప్రవేశింప గూడదను నియమము ఉన్నను ఐర్లాండు వాసులకు పాస్‌పోర్టు అక్కరలేదు. కామన్‌వెల్తు రాజ్యములు, కమ్యూనిస్టేతర యూరపీయ రాజ్యములు, లాటిన్ అమెరికన్ రాజ్యములు, కువాయిట్, మొరాకో, దక్షిణ ఆఫ్రికా, టునీసియా, తుర్కీ, యు. స్టే. దేశముల పౌరులకు వీసాలు అక్కరలేదు. 1969 మొదలుగ, యాత్రికులకు సౌకర్యములను కలిగించుటకై ఒక ప్రభుత్వశాఖ ప్రత్యేక కృషిని సాగించుచున్నది. 1972 లో 74 లక్షల విదేశీయులు దేశమును దర్శించిరి; అందువలన, 53.8 కోట్ల పౌనుల ఆదాయము దేశమునకు లభించినది. ఇటులే దేశీయులు పలువురు విదేశములను దర్శించుచున్నారు. 1972 లో ఇట్టివారు విదేశములందు 52.8 కోట్ల పౌనులను వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు :** 16 వ శతాబ్ది మొదలుగ క్రమవికాసముచెంది 18-20 శతాబ్దములలో ఒక ప్రముఖ ప్రపంచ రాజ్యముగ పేరెన్నిక పొందిన ఈ రాజ్యమున లబ్ధ ప్రతిష్ఠులగువారలు పలువురు వివిధ రంగములందు జన్మించిరి. వారిలో విశ్వవిఖ్యాతిని ఆర్జించిన కొందరి పేరులు మాత్రమే ఈ దిగువ ఈయబడినవి.

1. ఎలిజబెత్ I (1533-1603) : దేశవైభవములకు పునాదులు ఈమె పరిపాలనా కాలమున వేయబడినవి; 2. విక్టోరియా (1819-1901) : ప్రపంచము అంతవరకు కనివిని యెరుగని విశాల సామ్రాజ్యముతో దేశము ఈమె పాలనా కాలమున వైభవమున పరాకాష్ఠను అందుకొనినది; 3. సర్ విన్‌స్టన్ లియొనార్డ్ స్పెన్సర్ చర్చిల్ (1874-1965) : ద్వితీయ ప్రపంచ యుద్ధమున, అతిక్లిష్ట సమయమున దేశమునకు నాయకత్వము వహించి, నాజీవాదమును నిర్మూలించుటలో ప్రముఖపాత్ర

వహించిన ధీశాలి; సారస్వత సేవకై నోబెల్ బహుమతిని ఆర్జించెను; 4. విలియమ్ షేక్స్పియర్ (1564-1616) : ఆంగ్ల సారస్వతమున అజరామర స్థానమును ఆర్జించి, ప్రపంచ ప్రముఖ మహాకవులలో ఒకడుగ ఖ్యాతిగాంచిన నాటక రచయిత; 5. జాన్ మిల్టన్ (1608-74) ఒక మహాకావ్య రచయిత; 6. జాన్ గాల్స్ వర్దీ (1867-1933) : నోబెల్ బహుమతిని ఆర్జించిన ఒక రచయిత; 7. విలియమ్ సోమర్‌సెట్ మాహమ్ (1874-1965) : ప్రపంచ ప్రసిద్ధిని ఆర్జించిన ఆంగ్ల నవలా రచయిత; 8. జార్జి బెర్నార్డ్ షా (1856-1950) : ఐర్లండున జన్మించినను, ఆంగ్ల సారస్వతమునకు, అందును నాటక రచనకు, అసమాన సేవచేసిన రచయిత; 9. సర్ ఫ్రాన్సిస్ డ్రేక్ (1545 ? - 1596) : నౌకలో ప్రపంచ ప్రదక్షిణము చేసిన తొలుతటి ఆంగ్లేయుడు; 10. కెప్టెన్ జేమ్స్ కుక్ (1728-1779) : ఆస్ట్రేలియా, న్యూజీలాండ్‌లను, పసిఫిక్‌లోని కొన్ని దీవుల తీర భూముల రూపరేఖలను లేఖాబద్ధము చేసిన ఆంగ్లేయ సాహసిక నావిక దేశాన్వేషకుడు; 11. హొరేషియో వైకౌంట్ నెల్సన్ (1758-1805) : ఫ్రెంచి నౌకాదళమును ఓడించి ఆ కృషిలో మరణించిన నౌకా యుద్ధ వీరుడు; 12. ఆర్థర్ వెలెస్లీ (1769-1852) : ఐర్లండ్‌న జన్మించిన రాజ్యతంత్రజ్ఞ యోధుడు; నెపోలియన్‌ను వాటర్లూ రంగమున ఓడించుటలో నాయకత్వము వహించిన సేనాని; 13 ఇనిగో జోన్స్ (1573-1652); ఒక సుప్రసిద్ధ వాస్తువేత్త; 14. క్రిస్టఫర్ రెన్ (1632-1723) : వాస్తుశాస్త్ర ప్రవీణుడు.

చిత్రలేఖన, శిల్పకళా రంగములలో; 15. సర్ జోషువా రెయనాల్డ్స్ (1723-92); 16. తామస్ గెయిన్స్‌బరో (1727-88); 17. జోసెఫ్ మల్లార్డ్ విలియమ్ టర్నర్ (1775-1851); 18. జాన్ కాన్‌స్టబుల్ (1776 - 1837); 19. జేకబ్ ఎప్‌స్టీన్; 20. హెన్రీమూర్ (జ. 1898) పేరొందినవారు.

19. సర్ ఐజక్ న్యూటన్ (1642-1727) : గురుత్వాకర్షణ సిద్ధాంతమును కనుగొనుటయేగాక, గణిత, ప్రకృతి శాస్త్రములకు అమోఘసేవచేసిన ప్రజ్ఞానిధి; 20. ఎడ్వర్డ్ జెన్నర్ (1749-1823) : మశూచిరోగ నివారణకై టీకాల పద్ధతిని కనుగొనిన ధీశాలి; 21. జార్జి స్టీఫెన్‌సన్ (1781-1848) : రైలు ఇంజనును తొలుతగ కనుగొనినవాడు; 22. మైకేల్ ఫేరడే (1791-1867) : రసాయన శాస్త్రవేత్త; విద్యుత్ ప్రసారమునకు సంబంధించిన పలు పరిశోధనలను నిర్వహించిన వైజ్ఞానికుడు; 23. చార్లెస్ రాబర్ట్ డార్విన్ (1809-92) : జీవ పరిణామ సిద్ధాంతమునకు బలమును కల్పించినవాడు; 24. సర్ అలెగ్జాండర్ ఫ్లెమింగ్ (1881-1955) : సూక్ష్మజీవ విజ్ఞాని; పెనిసిలిన్‌ను కనుగొని (1928), వైద్యశాస్త్ర సేవకై, నోబెల్ బహుమతిని 1945లో పొందినవాడు; 25. జాన్ మేనార్డ్ కీనిస్ (1883-1946) : నవీన ఆర్థిక శాస్త్ర ప్రగతికి మార్గదర్శి; 26. బెర్ట్రాండ్ ఆర్‌తర్ విలియమ్ రస్సెల్ (1872-1970) : తాత్త్వికుడుగ, గణితశాస్త్రవేత్తగ, మానవతావాదిగ, రచయితగ ప్రపంచ విఖ్యాతిని ఆర్జించిన ధీశాలి; 27. ఆర్‌నాల్డ్ జోసెఫ్ టాయన్‌బీ (1889-1975) : చరిత్రను నవ్యదృష్టితో రూపొందించిన ఐతిహాసికుడు.

**14. పాలిత ప్రాంతములు :** ఒకపుడు ఒక విశాల సామ్రాజ్యమును కలిగియుండిన ఈ దేశపు పాలిత ప్రాంతములలో అనేకములు, స్వతంత్రములైనవి. వానిలో బర్మా, పాకిస్తాన్, దక్షిణ ఆఫ్రికాలు తప్ప తక్కినవి, సమాన స్వతంత్ర ప్రతిపత్తితో బ్రిటన్‌తో సహకరించి కామన్‌వెల్త్‌గ రూపొందినవి : ఈ కామన్‌వెల్తు అనునది సర్వ

తంత్ర స్వతంత్రత కలిగిన వివిధ రాజ్యముల ఐచ్ఛికపు కూటమి. దీనికి పెద్దగ బ్రిటిష్ రాణియే పరిగణింపబడుచున్నను, వాస్తవముగ బ్రిటన్‌కు అందువలన. ఆ కామన్‌వెల్తున ఎట్టి ప్రత్యేకాధికార మును లభించుటలేదు. తమకు సమష్టిగ సంబంధించిన విషయములపైనను, ప్రపంచ రాజకీయముల పైనను సౌహార్ద పూర్వకముగ చర్చలను సాగించు ఒక వేదికగ మాత్రమే అది ఉపకరించుచున్నదని చెప్పవచ్చును. ఆ కామన్‌వెల్తున 1977 నాటికి 36 రాజ్యములు కలవు. తక్కినవి యునైటెడ్ కింగ్‌డమ్ పాలనలో ఉన్నవి. వానిలో మాన్‌దీవి (ఐల్ ఆఫ్ మాన్ – వైశాల్యము 572 చ. కిమీ.); చానెల్ దీవులు అని సంయుక్తముగ వ్యవహరింపబడు జెర్సీ దీవి (వైశాల్యము 28,717 ఎకరములు), గ్వెరన్‌సీ దీవులు (వైశాల్యము 75 చ. కిమీ.) నియమిత స్వయం పరిపాలనకలిగి, మకుటము నియమించు గవర్నర్లచేత పాలింపబడుచున్నను, సాన్నిహిత్యమును, చారిత్రక సంబంధమును అనుసరించి దాదాపుగ, దేశపు అంతర్భాగములుగనే పరిగణింపబడుచున్నవి. ఇక మిగిలిన పాలిత ప్రాంతములలో, జిబ్రాల్టర్, సెయింట్ హెలీనా తప్ప తక్కినవి ఆ యా శీర్షికలక్రింద ఈయబడినవి. అందువలన ఆ రెండింటిని గురించిన వివరములు మాత్రమే సంక్షిప్తముగ ఈ దిగువన ఈయబడినవి.

**i. జిబ్రాల్టర్ :** స్పెయిన్ దేశపు నైరుతి తీరముతో ముడివడిన ఒక సన్నని ద్వీపకల్పమని చెప్పదగు ఈ వలసయొక్క వైశాల్యము 6.5 చ. కిమీ. 426 మీ. ఎత్తుగల ఒక కొండయు, దానికి ఉత్తరమునఉన్న ఇసుక మైదానమును, ఇందు చేరియున్నవి; కొండయందు గుహలు అనేకములు కలవు; ఎండకాలమున ఎండలు అంతటంతట ఎక్కువగ ఉన్నను, మొత్తముమీద సమశీతోష్ణ ప్రాంతముగనే ఇది పరిగణనీయము; సాలీనా సరాసరి వర్షపాతము 88 సెం. మీ. జనసంఖ్య 28,694 (1971). స్పానిష్, మాల్టీజ్, పోర్చుగీజ్, జెనోవీజ్ సంతతులవారు ఇందు అత్యధికము; భాష చాలవరకు స్పానిష్; అయినను విద్యాబోధన ఇంగ్లీషులోనే జరుగుచున్నది.

క్రీ శ. 711లో ఆఫ్రికా ఉత్తర తీరపు ముస్లిములచేత ఇచట ఒక స్థావరము నెలకొల్పబడి, వారి నాయకునిపేర దీనికి 'జబల్ తారిఖ్' అను పేరు కల్పింపబడినది. ఆ పేరే వికృతిచెంది 'జిబ్రాల్టరు'గ పరిణమించినది. 1462లో దీనిని స్పెయినువారు ఆక్రమింపగ, వారినుండి, ఒక ఒడంబడిక మూలమున 1713లో గ్రేట్‌బ్రిటన్ దీనిని ఆర్జించినది. మధ్యధరా సముద్ర తీరమున కీలక స్థానమునఉన్న ఈ పర్వతప్రాంతము ఒక హార్బరుగ బ్రిటిష్‌వారికి, యుద్ధముల కాలమున ఎంతో ఉపకరించినది. ఈ ప్రాంతము తనకు చెందవలెనని స్పెయిను దేశము, వివాదము లేవదీయగా, 1967 లో జరిగిన జనాభిప్రాయ సేకరణమున, బ్రిటన్‌తో ముడివడి ఉండుటకే ఈ ప్రాంతము అంగీకరించినది. 15 మంది ఎన్నుకొనబడిన సభ్యులుగల శాసనసభా సాహాయ్యమున గవర్నరు ఇచట పాలనను నిర్వహించుచున్నాడు. జిబ్రాల్టర్ పౌండ్ అనబడు ఇచటి నాణెము, బ్రిటిష్ పౌండుతో సమానపు విలువను కలిగియున్నది.

ప్రాంతపు ప్రజానీకము యాంత్రికులవలన వచ్చు ఆదాయముపైనను, హార్బరులోని పనులపైనను ఆధారపడి జీవించుచున్నది. పొగాకు, కాఫీలకు సంబంధించిన చిన్న పరిశ్రమలు కొన్ని కలవు. ఎగుమతులు లేవనియే చెప్పవచ్చును. గ్రేట్‌బ్రిటన్ నుండియు, కామన్‌వెల్త్ రాజ్యములనుండియు దిగుమతులు ఇటకు చేరుచున్నవి. రేవు సుంకములు, సారా పన్నులు, ఆదాయపు పన్ను మాత్రమే ప్రభుత్వపు ఆదాయమార్గములు. బడ్జెటరీ వ్యయము

55,59,072 పౌ. (1971-72). నిరక్షరాస్యత చాల తక్కువ. వివిధ తరగతుల విద్యాశాలల మొత్తం 23; అందలి విద్యార్థి సంఖ్య 5 218.

**ii. సెయింట్ హెలీనా దీవి :** ఆఫ్రికా ఖండపు పశ్చిమ తీరమునకు 1,920 కిమీ. ల దూరమున అట్లాంటిక్ మహాసముద్ర పరివృతమై (16° ద.; 5°21′ ప.) ఉన్న ఈ ద్వీపపు వైశాల్యము 121.7 చ. కిమీ; జనసంఖ్య 5,056 (1971); ప్రధాన నగరము జేమ్స్‌టౌన్. ఈ దీవికి నైరుతిన 2,400 కిమీ. ల దూరమున (37° ద; 6° ప) ఉన్న ట్రిస్టాన్ డా కన్హాన్ దీవి (98 చ.కిమీ. వైశాల్యము) యు, దానికి అనుబంధితములగు గఫ్, నైటింగేల్, ఇనాక్సిసిబుల్ అను చాల చిన్న దీవులును రాజ్యాంగరీత్యా సె. హెలీనా దీవితో చేరి వున్నవి. పై వానిలో చివర మూడును నిర్జనములు. తొలుతటిదాని జనసంఖ్య 186 (1966). పైవిగాక సె. హెలీనా దీవికి వాయవ్యమున 1,200 కిమీ. ల దూరమున (8° ద.; 14° ప.) ఉన్న అసెన్షన్ దీవి (88 చ. కిమీ.; జనసంఖ్య 1,439) కూడ రాజ్యాంగరీత్యా సె. హెలీనాతో ముడివడి ఉన్నవి. ఈ దీవి ఒక ప్రముఖ కేబుల్ స్టేషనుగ పేరొంది నది. రాజ్యపు ద్వీపములు అన్నియు అగ్నిశైలీయములు. సె. హెలీనాలో ఆంగ్లేయులతో సంకర మొందిన వివిధ జాతుల ప్రజలు కలరు; తక్కిన జనావాస ద్వీపములలో అచ్చపు ఆంగ్లేయుల సంతతివారే వసించుచున్నారు. ప్రజలందరు క్రైస్తవులు. భాష ఇంగ్లీషు. ద్వీపములలో టెలిఫోను వసతులును, ద్వీపములమధ్య టెలిగ్రాఫ్ వసతులును కలవు.

1502 లో సె. హెలీనా దీవిని పోర్చుగీజువారు కనుగొనగ, 1633 లో డచ్చివారు తమదను వివాదమును లేవదీసిరి. తరువాత డచ్చి, బ్రిటిష్ నావికులమధ్య చేతులుమారిన ఈ ద్వీపము కడకు 1673 లో బ్రిటిష్‌వారికి దక్కినది. నెపోలియన్‌ను పరాజితునిచేసిన తరువాత అతనిని ఇట ప్రవాసమున ఉంచుట జరిగినది (1815); 1821 లో నెపోలియన్ ఇచట మరణించెను. 1834 లో ఇది మకుటపు వలసయైనది. బ్రిటిష్ ప్రభుత్వము నియమించు గవర్నరు, 12 మంది ఎన్నుకొనబడిన వారును, ఇరువురు సాధికార సభ్యులును కలిగిన శాసనసభా సాహాయ్యమున ఈ దీవిని పాలించుచున్నాడు. ఆంతరంగిక శాంతి రక్షణకై 21 మంది ఉన్న పోలీసు బలము మాత్రమే కలదు.

సె హెలీనా, ట్రిస్టాన్ డా కన్హాలలో కొలదిగ వ్యవసాయ యోగ్యమగు భూమి కలదు. అయినను ఆహార ధాన్యములలో అధిక భాగమును, తక్కిన వినియోగ వస్తువులను రాజ్యము దిగుమతి చేసికొనుచున్నది. నార, నారవస్తువులు ముఖ్యపు ఎగుమతులు. పరిపాలనా వ్యయమున అధికభాగము బ్రిటన్‌నుండి గ్రాంటుల మూలమున లభించును. బడ్జెటరీ వ్యయము 8,53,255 పౌనులు. నిరక్షరాస్యత లేనేలేదని చెప్పవచ్చును. 8 ప్రయిమరీ, 3 సీనియర్, 1 సెకండరీ పాఠశాలలు కలవు; అందలి విద్యార్థి సంఖ్య 1,314 (1972).

# 24. యూనియన్ ఆఫ్ సోవియెట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్*

**ముఖ్యనగరము :** మాస్కో (మోస్క్వా); **జెండా :** ఎర్రని భూమికపై, ఎగువ ఎడమ మూలన సుత్తి, కొడవలుల చిహ్నమును, దానిపైన బంగారపు కొనయంచులు కలిగిన పంచకోణపు ఎర్రని నక్షత్రమును కలది; **జాతీయ గీతము :** 'సోయుజ్ నెరూషిమీ రెస్‌పబ్లిక్ స్వోబోడ్నిష్' (స్వతంత్ర గణరాజ్యముల అనశ్వర సమ్మేళనము); **నాణెము :** రుబుల్; ఇది 100 కోపెక్కులుగ విభక్తము; ఒక రుబుల్ = రు. 8.22; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** దేశము అతి విశాలము కావున స్థానిక కాలమానములు ప్రాంతములను అనుసరించి మారుచున్నవి; భారతదేశమున సా. 5 గం. 30 ని. అయినపుడు మాస్కోలో సా. 3 గం.; వోల్గోగ్రాడ్‌లో సా. 4 గం.; సెర్డ్లూవస్క్‌లో సా. 5 గం.; ఓమ్‌స్క్‌లో సా. 6 గం.; క్రాస్నోయార్‌స్క్‌లో సా. 7 గం.; ఇర్కుట్‌స్క్‌లో సా. 8 గం.; చీటాలో సా. 9 గం.; వ్లాడివాస్టక్‌లో సా. 10 గం.; మగదాన్‌లో సా. 11 గం.; పెట్రోపావ్ లోవస్క్‌లో అర్ధరాత్రి; అనాదిర్‌లో మరునాటి ఉదయము 1 గం.

**1. ఉనికి మొ. :** రెండు ఖండములందు – యూరపున సగమునకు మించిన ప్రాంతమును, ఆసియాయందు దాదాపు మూడవవంతును లోగొని – వ్యాపించిన ఈ దేశము ప్రపంచ రాజ్యములందు అన్నింట విశాలతమము; భూగోళపు ఉపరితలమున ఆరవవంతు ఈ దేశమునకు చెందినది. ఉత్తరమున నుండి దక్షిణమునకు గరిష్ఠపు నిడివి దాదాపు 5,000 కిమీ.; పడమటినుండి తూర్పునకు గరిష్ఠపు కొలత 10 వేల కిమీ. దేశమునకే చెంది ఉత్తర, తూర్పు కోస్తాలకు సమీపమునఉన్న ద్వీపములను కూడ లెక్కలోనికి తీసికొనినపుడు ఈ దేశము 35°8′ నుండి 81°50′ ఉ. అ. రేఖల వరకును, 19°38′ తూ. తు. నుండి 169°40′ ప. తు. రేఖల వరకును వ్యాపించి ఉన్నదని చెప్పవచ్చును. ఉత్తరమున ఆర్కటిక్ మహాసముద్రమును, దానిలో అంతర్గతములగు బేరంట్స్, చక్‌చీ, తూర్పు సైబీరియన్, కారా, లెప్టెవ్, వైట్ సముద్రములును సరిహద్దున ఉన్నవి; దక్షిణమున నల్లసముద్రము, అజోవ్, కాస్పియన్ సముద్రములు కలవు; తూర్పున బేరింగ్, జపాను, ఓకటస్క్ సముద్రములు ఉన్నవి. ఇక భూతల సరిహద్దులకు సంబంధించినంతవరకు, ఉత్తరము మొదలుకొని అప్రదక్షిణ రీతిలో ఆగ్నేయము వరకు 12 రాజ్యములు – ఫిన్‌లాండ్, నార్వే, పోలండ్, జెకోస్లోవాకియా, హంగరీ, రుమేనియా, తుర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, చీనా, మంగోలియా, ఉత్తర కొరియా – సరిహద్దున క్రమముగ

* 'సోయుజ్ సోవియెట్‌స్కిఖ్ సోషియలిస్టికెస్కిఖ్ రెస్‌పబ్లిక్' అను రషియన్ నామమునకు ఇది ఆంగ్ల రూపము. దీనికే సంగ్రహముగ సోవియెట్ యూనియన్ (సోవియెట్‌స్కీ సోయుజ్) అను వ్యవహారము కలదు. పొడి అక్షరములలో యు. ఎస్. ఎస్. ఆర్. (USSR) అనియు వాడుక గలదు. దేశపు ప్రభుత్వము 'సోవియెట్ భూమి' అని అర్థమొసగు పేరుతోకూడ వ్యవహరించుచున్నది. అయినను చారిత్రకముగను, జనసంఖ్యా ప్రాబల్యమునుబట్టియు రష్యాకు ఈ దేశమునగల ప్రాముఖ్యమునుబట్టి విదేశీయులు 'సోవియెట్ రష్యా' అనియు ఈ దేశమును వ్యవహరించుచున్నారు. ఈ పేరు అపార్థజనకమే అయినను కొంత ఎక్కువ వ్యాప్తిని ఆర్జించినది; అందువలన ఈ గ్రంథమున పలు తావులందు 'సోవియెట్ రష్యా' అనియే ఈ దేశము వ్యవహృతము.

ఉన్నవి. దేశపు సముద్రతీరపు నిడివి 60 వేల కిమీ.; ఇది మొత్తపు సరిహద్దు నిడివిలో మూడింట రెండు వంతులకు సమానము. దేశ వైశాల్యము 224 లక్షల చ. కిమీ.

భూతల భౌతికరీతినిబట్టి దేశమును రెండు సమప్రాంతములుగ - యెనీసీనదికి పశ్చిమమున ఉన్న నిమ్నభూమి, ఆ నదికి తూర్పునఉన్న ఉన్నత భూమి అను ప్రాంతములుగ - విభజింపవచ్చును. నిమ్నభూమిని, మహా రష్యన్ మైదానము, పశ్చిమ సైబీరియన్ మైదానము అను రెండు మైదానములుగ ఊరల్ పర్వతశ్రేణి విభజించుచున్నది. యెనీసీ, లీనా నదుల మధ్య మధ్యసైబీరియా పీఠభూమి




పటము 22.

కలదు. ఇక బైకాల్ సరస్సునకు తూర్పున వివిధ ఉన్నత ప్రదేశ శ్రేణులు కలవు; అందే యబ్లనోవీ, స్టానోవాయ్, జుగ్‌జుర్, వెర్‌కోయాన్‌స్క్, చెరస్కీ, కొలైమా పర్వతములు కలవు. దేశపు ఉన్నత పర్వతములు దక్షిణపు సరిహద్దున వ్యాపించియున్నవి; అట్టివానిలో కార్‌పేతియన్ పర్వతములు, క్రిమియన్ పర్వతములు, కాకసస్ పర్వతములు యూరపీయ భాగమునకు చెందినవి; కాకసస్‌లోని ఎల్‌బ్రుజ్ శిఖరపు ఎత్తు 5,633 మీ. ఆసియా భాగమునకుచెందిన వానిలో కోపెట్‌గాడ్, పామీర్-ఆలే పర్వతమండలము, సాయన్, టీన్ షాన్, ఆల్టాయ్‌పర్వతములు ప్రముఖములు; పామీర్-ఆలేలోని కమ్యూనిజమ్ శిఖరము (7,495 మీ) దేశమునందలి అత్యున్నత పర్వత శిఖరము. దేశపు తూర్పు కొననఉన్న కాంచట్కా ద్వీపకల్పమున ఉన్నతములగు అగ్నిపర్వతములు కలవు; ఇందు 20 ఇప్పటికిని రగులుచునే ఉన్నవి. పామీర్-ఆలే పర్వత మండలమున కొన్ని విశాలములగు హిమ

శిలా భూములు కలవు; ఇందలి ఫెడ్చెంకో హిమ శిలయొక్క నిడివి 75 కిమీ. కాస్పియన్ సముద్రమునకు తూర్పున సోవియెట్ మధ్య ఆసియాలోనికి ఎడారులును, బెట్టభూములును కొంతవరకు వ్యాపించి యున్నవి. ఆ సముద్రమునకు తూర్పున, 'కరాజియే అవనతి' అని వ్యవహృతమగు దేశపు అత్యంత నిమ్నప్రాంతము కలదు; ఈ ప్రాంతము సముద్రపు మట్టమునకు 132 మీ. దిగువన ఉన్నది.

ప్రపంచపు పెద్ద నదులలో అనేకములు ఈ దేశముననే ఉన్నను, అవి విశాల సముద్రములకు చేర్చునవి కాకున్నవి. దేశపు ప్రముఖ నదులలో ఒకటియగు వోల్గానది (నిడివి 3,531 కిమీ) కాస్పియన్ సముద్రమున చేరుచున్నది; ఈ కాస్పియన్ సముద్రము, దేశాంతస్థము, భూపరివృతము నగు సముద్రము. డాన్ (2,120 కిమీ.), నీపెర్ (2,201 కిమీ.) నదులు నల్లసముద్రమున చేరుచున్నవి; ఇందులో తొలుతటిది సంవత్సరమున 125 దినములు హిమాచ్ఛాదితము; రెండవది నౌకాయానమునకు చాలవరకు తగినదికాదు. ఓబ్ 5,410 కిమీ.), యెన్సీ (4,092 కిమీ.), లీనా (4,406 కిమీ.), ఆమూర్ (4,416 కిమీ.) నదులలో తొలుతటి మూడును ఆర్కిటిక్ సముద్రమున సంగమించినను, ఆ సముద్రమున నీరు సంవత్సరమున దాదాపు పదినెలలు గడ్డకట్టియుండును; కడపటిదాని ముఖద్వారము సాలున చాలకాలము మంచుతో నిండియుండును. ఆమూ దర్యా (2,600 కిమీ.), సిర్ దర్యా (2,991 కిమీ.) నదులు, భూమధ్యస్థమై లోతులేని ఆరల్ సముద్రమున కలియుచున్నవి. 10 కిమీ. నిడివికి పైబడిన నదులు దేశపు మొత్తమున 150కి పైబడి ఉన్నవి. వాని వెరసి పొడవు 30 లక్షల కిమీ. దేశమున 270 వేల సరస్సులు కలవని అంచనా; వీనిలో 1 చ.కిమీ. వైశాల్యమునకు పైబడినవి దాదాపు 30 వేలు ఉన్నవి. ఆ సరస్సులందు విస్తృతినిబట్టి కాస్పియన్ సముద్రము (3,71,000 చ. కిమీ.), ఆరల్ సముద్రము (66,500 చ. కిమీ.), బైకాల్ (31,500 చ. కిమీ.), లడోగా (18,400 చ. కిమీ.), బల్ఖాష్ (18,200 చ. కిమీ.), ఒనేగా (9,610 చ. కిమీ.), ఇస్సిక్కుల్ (6,280 చ. కిమీ.) ప్రముఖములు; అందు తొలుతటి రెంటియందలి నీరు ఉప్పగ ఉండుటవలన అవి సముద్రములుగ వ్యవహృతములు.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశము అతి విశాలమగుటవలన, ధ్రువప్రాంతపు అతి శీతల పరిస్థితి నుండి దక్షిణ ప్రాంతపు ఉష్ణమండల పరిస్థితివరకు ఉష్ణోగ్రత పెక్కు మార్పులను, ప్రాంతములను అనుసరించి పొందుచున్నది. దేశపు నైరృతి ప్రాంతమునఉన్న బతూమీలో జనవరి నెలయందు ఉష్ణోగ్రత 32° ఫా. ఉండగ, ఈశాన్య సైబీరియాయందు వెర్ఖోయాన్స్క్వద్ద అదే నెలలో ఉష్ణోగ్రత - 90° ఫా. వరకు పడిపోవును. ప్రపంచపు తక్కిన జనావాసములలో ఎటను అనుభవ వేద్యము కాని చలిబాధ సైబీరియాలో కలదు; దాదాపుగ సంవత్సరము పొడవున మంచుతో ఉండు ప్రాంతములు అట కలవు; అచటి యాకూత్లో కనీసపు ఉష్ణత -95° ఫా. జులై నెలలో ఆర్కిటిక్ ప్రాంతపు ఉష్ణోగ్రత 32° ఫా.; అదే కాలమున దక్షిణ ప్రాంతపు సోవియెట్ మధ్య ఆసియాలోని తెర్మెజ్వద్ద ఉష్ణోగ్రత 120° ఫా. మధ్య ఆసియాలో 110° ఫా వేడిమి సర్వసాధారణము. ఇందువలన భూమియందు చెమ్మదనము అచట ఉండుటకే ఆస్కారములేక, వ్యవసాయమునకు ఆ ప్రాంతము అననుకూలముగ పరిణమించినది.

దేశపు పశ్చిమ ప్రాంతమున సాలీనా వర్షపాతము 63 నుండి 75 సెం. మీ. వరకు మారుచుండును; కాని కాకసస్ ప్రాంతపు నల్లసముద్రపు తీరమున వర్షపాతము సాలీనా 200 సెం. మీ. వరకు

ఉండును. యూరపునందలి తక్కిన ఏ ప్రాంతము నను సాలున ఇంతటి వర్షపాతము లేదు. తూర్పు నకు వచ్చిన కొలదియు వర్షపాతపు ప్రమాణము క్రమముగ పడిపోయి, మధ్యఆసియా ప్రాంతమున 10 సెంటిమీటర్లకు దిగజారును. మాస్కో ప్రాంత మున సాలీనా వర్షపాతము 55 సెం. మీ.; తూర్పు సైబీరియాలో 25 సెం. మీ. దేశమున అత్యధిక భాగమున ఎండకాలముల నిడివి తక్కువ; చలికాల ముల నిడివి ఎక్కువ. అందును ఉత్తరపు తండ్రా భూములలో ఎండకాలపు నిడివి 1 లేదా 2 నెలలు మాత్రమే; చలికాలమునందు హిమవర్షము విరివిగ పడును. కాకసస్ పర్వత ప్రాంతపు నల్లసముద్ర తీరమున ఉపోష్ణమండల పరిస్థితియు, క్రిమియా దక్షిణ తీరమున మధ్యధరా పరిస్థితియు కలవు. పసిఫిక్ తీరముతప్ప తక్కిన ప్రాంతములందు ఋతుభేదములేక అంతటంతట వానలు పడుచునే ఉండును. పసిఫిక్ తీరమున మాత్రము ఋతు పవనములను అనుసరించిన వర్షపాతమును, వేడి గ్రీష్మర్తువులును, శీతల నిరార్ద్ర శీతకాలములును వేద్యములు.

ప్రపంచపు అటవీ వైశాల్యమున దాదాపు అయి దవవంతు ఈ దేశమున ఉన్నది. దాని వైశాల్యము 75 లక్షల చ. కిమీ. లకు పైబడి ఉన్నది; దేశమున మూడవభాగము అటవీ భూమియే అని చెప్ప వచ్చును. దేశపు మొత్తమున దాదాపుగ 17 వేల వృక్షజాతులు కలవని లెక్కలవలన తెలియు చున్నది. వన్యజంతు వైవిధ్యము చాల ఎక్కువ. ఉత్తర శీతల భూములందు సీలు మృగములు, తెల్ల ఎలుగులు, వాల్‌రస్, తోడేలు, మంచునక్క, తెల్ల కుందేలు, మంచులేడి (రెయిన్ డీరు) వేర్వేరు రక ములకు చెందినవి కలవు. బొచ్చునకు ప్రత్యేకముగ పేరొందిన మూడు రకముల సీలుజాతులు, ఈ దేశపు పసిఫిక్ తీరమునకు సమీపస్థములగు దీవు లందు మాత్రమే కననగుచున్నవి. తక్కిన పశ్చిమ ప్రాంతపు అడవులలో నల్లఎలుగు, గోధుమరంగు ఎలుగు, గుంటనక్క, దుప్పి, అడవిపంది జాతు లును, దూరప్రాచ్యపు అడవులలో పులి, చిరుత పులి జాతులును, దక్షిణదేశపు గడ్డిమైదానములలోను ఎడారులలోను జింక, రేచు, చిరుత మొదలగు జాతులును కన్పట్టును. నల్లసముద్రపు తీరమున కొండమేకలు, పెద్ద జింకలు, ముళ్ళ పందులు కలవు. 1,500 రకముల మత్స్యజాతులు కలవు; అయినను వీనిలో 250 జాతులు మాత్రమే మత్స్య పరిశ్రమకు ఉపకరించునవి. ప్రకృతి సహజమగు వృక్ష జంతుసంపద అంతరించిపోకుండ కాపాడుటకు 80 ప్రకృతి శరణ్యములను (నేచర్ రిజర్వులను) వివిధ భౌగోళిక ప్రాంతములలో ప్రభుత్వము నెల కొల్పి పరిపోషించుచున్నది. వీనిలో ఉత్తర ఊరల్ పర్వతములందలి 'పెకోరా-ఇలిచ్' అను శరణ్యము అతి విశాలము; దాని వైశాల్యము 7,14,300 హెక్టేరులు.

**3. జనసంఖ్య మొ. :** ప్రపంచ దేశములలో చీనా, భారత దేశముల తరువాతి స్థానమును, జన సంఖ్యరీత్యా, ఈ దేశము ఆక్రమించియున్నది. 1970, జనవరి 15 న జరిగిన జనసంఖ్యా గణన మును అనుసరించి దేశపు జనసంఖ్య 2,447 లక్షలు; 1973 వ సంవత్సరమున అంచనా 2,500 లక్షలు. దేశమున 15 సోవియట్ గణరాజ్యములు (సో. గ.) చేరియున్నవి. ఆ యా గణరాజ్యముల వైశాల్యములు, జనసంఖ్యలు, ముఖ్యనగరములు, వాని జనసంఖ్యలు, ఈ దిగువ పట్టికా రూపమున ఈయబడినవి.

## దేశమునందలి సోవియెట్ సోషలిస్టు గణరాజ్యముల వివరములు

| వరుస సంఖ్య | గణరాజ్యపు పేరు | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య 1973. | ముఖ్యనగరము | ముఖ్యనగర జనసంఖ్య. 1973. |
|---|---|---|---|---|---|
| 1. | రషియన్ సమాఖ్య | 1,70,75,400 | 13,22,00,000 | మాస్కో | 74 లక్షలు |
| 2. | యుక్రెయిన్ | 6,03,700 | 4,82,00,000 | కీవ్ | 1 827 వేలు |
| 3. | బైలో రషియా | 2,07,600 | 92,00,000 | మిన్స్క్ | 1,038 వేలు |
| 4. | ఉజ్ బెక్‌స్తాన్ | 4,47,400 | 1,29,00,000 | తాష్కెంట్ | 1,504 వేలు |
| 5. | కజక్‌స్తాన్ | 27,17,300 | 1,37,00,000 | ఆల్మా-అటా | 794 వేలు |
| 6. | జార్జియా | 69,700 | 48,38,000 | టిబిసి | 946 వేలు |
| 7. | అజర్‌బైజాన్ | 86,600 | 54,20,000 | బాకూ | 1,337 వేలు |
| 8. | లిథూనియా | 65,200 | 32,00,000 | విల్నియస్ | 409 వేలు |
| 9. | మాల్దేవియా | 33,700 | 37,21,000 | కిషినేవ్ | 415 వేలు |
| 10. | లత్వియా | 63,700 | 24,30,000 | రీగా | 765 వేలు |
| 11. | కిర్‌గిజ్‌స్తాన్ | 1,98,500 | 31,45,000 | ఫ్రూన్‌జే | 463 వేలు |
| 12. | తాజిక్‌స్తాన్ | 1,43,100 | 32,00,000 | దుషాంబే | 411 వేలు |
| 13. | ఆర్మీనియా | 29,800 | 26,72,000 | యెరెవాన్ | 843 వేలు |
| 14. | తుర్క్‌మేన్‌స్తాన్ | 4,88,100 | 23,64,000 | అష్ఖాబాద్ | 273 వేలు |
| 15. | ఎస్తోనియా | 45,100 | 14,05,000 | తల్లిన్ | 386 వేలు |

దేశపు జనసాంద్రత చ. కిమీ కు 11. అయినను రషియన్ సమాఖ్య, యుక్రెయిన్, మాల్దేవియా, ఉజ్‌బెక్‌స్తాన్ గణరాజ్యములలోని జనసాంద్రత ప్రముఖ యూరపీయ దేశముల జనసాంద్రతకు సాటివచ్చును. ఉత్తర భూములందును, పర్వతమయ ప్రదేశములందును జనసాంద్రత చ. కిమీ. కు 1 మాత్రమే. ప్రజలలో 59% పట్టణములందు వసించుచున్నారు. పైన పేర్కొనబడిన గణరాజ్య ముఖ్య నగరములుగాక జనసంఖ్యా ప్రాబల్యములనుబట్టి గోర్కి (1,213 వేలు), ఖార్కోవ్ (1,280 వేలు), క్యుబిషేవ్ (1,094 వేలు), లెనిన్‌గ్రాడ్ (4,066 వేలు), నొవోసిబిర్స్క్ (1,199 వేలు), స్వెర్డ్‌లోవ్స్క్ (1,073 వేలు), వోల్గోగ్రాడ్ (852 వేలు) పేర్కొనదగినవి.

దేశమున వివిధ జాతులవారు కలరు; వారిలో, 1970 లెక్కలనుబట్టి, రషియనులు (1,290 లక్షలు), యుక్రేనియన్‌లు (4,08 లక్షలు), ఉజ్‌బెక్కులు (92 ల.), బైలోరషియన్‌లు (91 ల.), తాతారులు (59 ల.), కజక్‌లు (53 ల.). అజర్‌బైజానీలు (44 ల.), ఆర్మీనియనులు (36 ల), జార్జియనులు (32 ల.), లిథూనియనులు (27 ల.), మాల్దేవియనులు (27 ల.), యూదులు (22 ల.), తాజిక్‌లు (21 ల.), జర్మనులు (18 ల.), చువాషేలు (17 ల.), కిర్‌గిజులు (15 ల.), తుర్క్-

మీనియనులు (15 ల.), లత్వియనులు (14 ల.), మోర్‌దేవియనులు (13 ల.), బష్కిరులు (12 ల.), పోలులు (12 ల.), ఎస్తోనియనులు (10 ల.) ప్రముఖముగ పేర్కొనదగినవారు. దేశమున పలు భాషలు మాతృభాషలుగ వ్యాప్తియందు ఉన్నవి. అందు అగ్రస్థానము రషియన్ భాషది; తక్కిన భాషల వారును దీనిని రెండవ భాషగ చదువుచున్నారు. దేశమున మొత్తముమీద ఇండో-యూరపీయ భాషావర్గమునకు చెందిన రష్యన్, యుక్రేనియన్, బైలోరషియన్, లిథూనియన్, లట్వియన్, తాజిక్, ఒసీషియన్, కుర్దిష్, తాలిష్, బెలూచీ, యగ్నోబ్, పామీర్, మాల్దేవియన్, జిప్సీ, జర్మన్, ఆర్మీనియన్ భాషలును; ఫిన్నో - ఉగ్రియన్‌భాషా కుటుంబపు ఎస్తోనియన్, ఫిన్నిష్, కరీలియన్, కోమీ, మారీ, మోర్దివియన్, ఉద్మర్త్ భాషలును; తుర్కిష్ భాషలగు అజర్ బైజానీ, బష్కీర్, చువాష్, కజక్, కిరిగిజ్, తాతార్, తుర్కమీనియన్, ఉజెబెక్ భాషలును; కకేసియన్ భాషలగు జార్జియన్, మిన్‌గ్రెలియన్, స్వాన్, కబర్దియన్, సర్‌కేసియన్, అడిగే, అబ్‌ఖాజ్, అదర్ భాషలును మాతృభాషలుగ వివిధ వర్గములందు వ్యాప్తిలో ఉన్నవి. రషియన్‌భాష సిరిలిక్‌లిపిలో వ్రాయబడుచున్నది; తక్కిన వారిలో పలుభాషలవారు సిరిలిక్ లిపినే అనుసరించుచున్నారు; కాని ఆర్‌మీనియనులు, క్రీ. శ. నాలుగవ శతాబ్దినుండి తాము వాడుచున్న స్వీయలిపినే అనుసరించుచున్నారు; జార్జియన్ భాషకును సొంత లిపి ఉన్నది; లిథూనియన్, లట్వియన్, ఎస్తోనియన్, కరీలియన్ భాషలవారు లాటిన్ లిపిని వాడుచున్నారు.

మతముతో ప్రభుత్వమునకు ఎట్టి సంబంధమును లేదు. తమ తమ మత సంప్రదాయములను అనుసరించుటకు అందరికిని స్వాతంత్ర్యము కలదు; అటులే మత వ్యతిరేకతను, నాస్తికతను అనుసరించుటకును స్వేచ్ఛకలదు. ప్రభుత్వపు లెక్కలలో మతపు ప్రసక్తిలేదు కావున ఆ యా మతానుయాయుల సంఖ్యావివరములు తెలియవు. కాని క్రైస్తవులు అత్యధిక సంఖ్యాకులు; అందును రషియన్ ఆర్థడాక్స్ చర్చికి చెందినవారు చాల ఎక్కువ; ఆర్మీనియన్, రోమన్ కేథలిక్, ప్రొటెస్టంటు సంప్రదాయములవారు ఆ తరువాత లెక్కకు వత్తురు. ఇస్లాం మతానుయాయులు మధ్యఆసియా, కాకసస్, బష్కిర్ ప్రాంతములలో కలరు; వీరిలో అత్యధిక సంఖ్యాకులు సున్నీలు. మధ్య ఆసియాలోనే కొన్ని ప్రాంతములందు బౌద్ధులు కలరు; యూదులును మాస్కో మొదలగు నగరములందు అటనట చెదరిఉన్నారు. మతమున ప్రభుత్వపు జోక్యము లేకున్నను, ఛాందస భావనలను అంతరింపజేసి విజ్ఞాన శాస్త్రముపై ఆధారపడిన నాస్తికతకు వ్యాప్తిని కలుగజేయుట ప్రభుత్వపు ధ్యేయము. కాని దీనిని సాధుమార్గమున, తగు విద్యావాప్తిద్వారా వ్యాపింపజేయుటకే ప్రభుత్వము కృషిచేయుచున్నది.

**4. సమాచార సా.**: దేశమునందలి తపాలా, తంతి, టెలిఫోను ఆఫీసుల సంఖ్య 83 వేలు; వీనిలో దాదాపు 60 వేలు పల్లెప్రాంతములలో ఉన్నవి. టెలిఫోనుల సంఖ్య 120 లక్షలు (1971). ప్రపంచమునందలి ప్రతి రాజ్యముతోను ఈ దేశమునకు టెలిఫోను, రేడియో-టెలిఫోను సంబంధములు కలవని చెప్పవచ్చును. 1955 లో కుదిరిన ఒక ఒడంబడికవలన నేరుగ భారతదేశముతో రేడియో, టెలిఫోను సంబంధములు ఏర్పడినవి; రేడియో - టెలివిజన్ సదుపాయములు విరివిగకలవు. కృత్రిమవార్తాగ్రహణ ఉపగ్రహముద్వారా, మాస్కోనుండి అతి దూరపు ప్రాచ్యనగరములకు రేడియో ప్రసారముల నిర్వహణ 1965 నుండి సాగుచున్నది. 1971 అంతమునకు టెలివిజన్ స్టేషనులును, పునఃప్రసార స్టేషనులును కలసి మొత్తముమీద 1,344 స్టేషనులు కలవు; టెలివిజన్‌సెట్ల సంఖ్య 393 లక్షలు.

దూరదేశములలో కొన్నింటితో టెలివిజన్ ప్రసార సౌకర్యములు ఉన్నవి.

**5. యాన సౌ.:** దేశమునందలి రోడ్ల మొత్తపు నిడివి 5,40,400 కిమీ. (1971). అయినను మోటారులవలన రవాణా అంతగ జరుగుటలేదు; దేశమున రవాణా అగు సరుకులలో 8% మాత్రమే అందువలన జరుగుచున్నది. కాని ప్రయాణికులకు మాత్రము, రైలుమార్గముల తరువాత, మోటారు బస్సులు, కార్లు ఎక్కువగ ఉపకరించుచున్నవి. 1971-75 ప్రణాళికా కాలమున అదనముగ 110 వేల కిలోమీటర్ల రోడ్లు నిర్మింపబడినవి. దేశపు సరుకురవాణాయందు రైలుమార్గములు, మూడింట రెండువంతులకు, బాధ్యత వహించుచున్నవి. మొత్తపు రైలుమార్గముల నిడివి 136 వేల కిమీ. ప్రపంచపు రైలుమార్గముల మొత్తపు నిడివిలో ఇది పది శాతమునకు మించినది; కాని ప్రపంచమున రైలుమార్గములద్వారా జరుగు సరుకురవాణాలో సగము ఈ దేశపు రైలుమార్గములవలన జరుగుచున్నది. ఇది ఆ రైలుమార్గముల నిర్వహణలోని కుశలతకు నిదర్శనము. క్రొత్త రైలుమార్గముల ఏర్పాటులో సైబీరియా, మధ్య ఆసియాలకు ప్రాముఖ్యము ఎక్కువగ ఈయబడుచున్నది. రైలుమార్గములందు 120 వేల కిమీ. ల నిడివిన విద్యుత్ సహాయమున, డీజెల్ ఆయిల్ సాయమున బండ్లు నడచుచున్నవి.

దేశాంతర్గత జలమార్గములందు రవాణా సౌకర్యము విరివిగ కలదు. వైట్ సముద్రమును ఒనీగా సరస్సుతోను (227 కిమీ.), మాస్క్వానదిని వోల్గా నదితోను (128 కిమీ.), వోల్గానదిని డాన్‌నదితోను (101 కిమీ.), వోల్గానదిని బాల్టిక్ సముద్రముతోను (361) కలుపు కాలువలు ఇందు ప్రముఖములు. ఇందు కడపటిదానివలన బాల్టిక్, నల్లసముద్రముల మధ్య రాకపోకల సదుపాయములు ఏర్పడి, యూరపును చుట్టివచ్చు ప్రయాణ క్లేశమును తగ్గించినది. పై కాలువలును, నదులును కలసిన ఇట్టి జలమార్గముల మొత్తపు నిడివి 144,600 కిమీ.; ఇందు 83,700 కిమీ. లు పడవల రాకపోకలకు అనుకూలము.

దేశాంతర్గత వ్యాపారమున అధికభాగము, సముద్రతీరస్థపు రేవులనుండి తీరమును అనుసరించి కాస్పియన్, అజోవ్, నల్లసముద్రముల రేవులద్వారా సాగుచున్నది. దేశపు సముద్రపు రేవులలో బాల్టిక్ సముద్రతీరపు లెనిన్‌గ్రాడ్, రీగా, కాలినిన్‌గ్రాడ్, వెంట్‌స్పిల్స్, క్లెయ్‌పెడా; బేరెన్ట్స్ సముద్ర తీరపు మర్‌మన్‌స్క్; వైట్ సముద్రతీరపు ఆర్కేన్జెల్; జపాన్ సముద్రతీరపు వ్లాడివాస్టక్, సఖోడ్కా; బేరింగ్ సముద్రతీరపు పెట్రోపావ్‌లోవ్‌స్క్; ఓకటస్క్ సముద్రతీరపు కోర్సాకోవ్; కాస్పియన్ సముద్రతీరపు బాకూ, ఆస్త్రఖాన్, మఖాచ్‌కాలా, క్రాస్నోవోడ్‌స్క్; నల్లసముద్రతీరపు ఒడెస్సా, త్వాప్సే, బటూమీ, పోతీ, నోవోరోస్సియిస్క్ ప్రముఖములు. పై వానిలో ఆర్కటిక్ మహాసముద్రతీరపు రేవులందు, మంచుగడ్డలవలన, సంవత్సరమున చాలకాలము నౌకాప్రయాణము కష్టమైనను, హిమవిదళన నౌకల (ఐస్-బ్రేకర్స్) సాయమువలన ఆ అవరోధమును అతిక్రమించుటకు ప్రస్తుతమున కొంతవరకు వీలు కలిగినది. ఆణవిక శక్తిచే నడచు ఇట్టి తొలి హిమదళననౌక 1959 లో ప్రవేశపెట్టబడినది. ఈ దేశపు వర్తక నౌకాదళమునందలి నౌకలసంఖ్య రమారమి 1,600 (1971). దీని టన్నేజి 162 లక్షల టన్నులు.

ప్రపంచమునందలి 65 రాజ్యములతో ఈ దేశమునకు విమాన ప్రయాణవసతి కలదు. దేశీయమగు 'ఏరోఫ్లోట్' విమానయాన సంస్థ, ప్రపంచమునందలి అట్టి సంస్థలందన్నింట పెద్దది. దేశాంతర్గత నగరముల మధ్యను విమానయాన వసతులు

విరివిగ కలవు; పర్వత ప్రాంతములందును, సరిగ అభివృద్ధిచెందని ప్రదేశములందును హెలికాప్టర్ల వాడుక ఎక్కువ. ప్రయాణికుల విమానములలో పెద్దది, 220 మంది ప్రయాణికులను కొనిపోవ గలదు. 20 విదేశీ విమానయాన సంస్థలును, ఈ దేశపు అంతర్జాతీయ విమానయానమున పాల్గొను చున్నవి. ప్రయాణికులకొరకై తొలుతగ జెట్ విమానము, ఈ దేశముననే వినియుక్తము. మొత్తపు విమానయాన మార్గముల నిడివి 8 లక్షల కిమీ. కు పైబడి యున్నది (1972); ఇందు 225 వేల కిమీ. అంతర్జాతీయ మార్గములకు చెందినది. దేశీయ విమానయానసంస్థ, 1972 లో 820 లక్షల ప్రయాణికులను చేరవేసినది.

**6. చరిత్ర :** ఈ విశాల దేశమందలి మధ్య ఆసియా ప్రాంతము క్రీ. పూ. 1000 సంవత్సరములకు పూర్వమే కొన్ని నాగరిక జాతులకు నివాసమై ఉండి, వ్యావసాయికముగ, సాంస్కృతికముగ కొంత పురోగతిని పొందినది. క్రీ. పూ. 4 వ శతాబ్దమున అలెగ్జాండర్ మహావిజేత నెలకొల్పిన సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగమైనది. ఆ సామ్రాజ్యము శిథిలమైన తరువాత, పలు గ్రీకు మాండలిక ప్రభువంశములు ఇట పాలన నెరపినవి. క్రీ. పూ. 2 వ శతాబ్దియందు కుషానులు ఇట స్థావరము కల్పించుకొనిరి. క్రీ. పూ. ఒకటవ శతాబ్దిలో ఈ దేశపు పశ్చిమ భాగమున, నల్లసముద్రపు తీరము రోమనుల వశమై, అట ఒక నాగరిక వ్యవస్థ రూపుగొనినది. కాని క్రీస్తుశకారంభమునుండి అంతటంతట కొనసాగిన ద్రిమ్మరి జాతుల ధాటికిలోనై, మధ్యఆసియా, నల్లసముద్ర తీరములందలి నాగరిక వ్యవస్థలు నామమాత్రావశిష్టములైనవి.

పారంపర్యముగ వచ్చు కథనమునుబట్టి యూరపీయ రష్యా ప్రాంతపు స్లావ్ జాతులు క్రీ. శ. 862 లో ఒక రాజరికమును ఏర్పరచుకొనిరనియు, నోవోగ్రాడ్ ముఖ్యనగరముగ పాలించిన రూరిక్ కాలమున అది స్థిరతను ఆర్జించినదనియు తెలియ వచ్చుచున్నది. అతని తరువాతి ప్రభువులు ముఖ్య నగరమును 'కీవ్'కు తరలించి, రాజ్యమునకు 'కీవ్ రూస్' అను పేరును కల్పించిరి. ఆ పేరే నేటి 'రష్యా' అనుదానికి తొలి రూపము. ఆ రాజుల కాలముననే క్రైస్తవమతము ఇట వ్యాపించినది. తరువాత ద్రిమ్మరి జాతుల దాడులవలన ఈ రాజ్యము విచ్ఛిన్నమైనను (క్రీ. శ. 12 వ శతాబ్ది), ఆ సంస్కృతిని, భాషను గ్రహించి, వివిధ మాండలిక రాజ్యములు, క్రమేణ నీపర్‌నదీ ప్రాంతమువరకు విస్తరిల్లినవి. ఆ కాలముననే, కాకసస్‌కు ఈవల నున్న ప్రాంతము అరబ్బుల వశమైనది.

13 వ శతాబ్ది పూర్వార్ధమున ఈ రషియన్ మాండలిక రాజ్యములను, మధ్య ఆసియాను మంగోలులు వశపరచుకొనిరి. అయినను ప్రజల మత సంస్కృతులతోగాని, మాండలిక ప్రభువుల పరిపాలనా విధానముతోగాని జోక్యమును కల్పించుకొనక, తమ సర్వం సహాధికారముతో మంగోలులు తృప్తి వహించిరి. మంగోలులకు లోనైయున్న రషియన్ మాండలిక రాజ్యములలో మాస్కో రాజ్యము ఐవాన్ కలీతా (1325-40) నాయకత్వమున క్రమేణ ప్రాముఖ్యమును ఆర్జించి, రషియన్ జాతీయులను కూడగట్టుకొనగలిగినది. ఈ రాజ్యపు ప్రభువగు మిత్రీ (1359-89), 1380 లో మంగోల్ సేనలను ఓడించెను. 1480 నాటికి మాస్కో రాజ్యము సర్వసత్తాక రాజ్యముగ పరిణమించినది; రషియనులు వసించు వివిధ మాండలిక రాజ్యములు అందు అంతర్భాగములైనవి (1521). అంతట దానికి రష్యా అను పేరేర్పడినది.

ఆ రాజ్యమును పాలించిన ప్రభువులలో పీటర్ (1682-1725 ప.) కు పాశ్చాత్య సంస్కృతితో పరిచితి ఏర్పడినది; అతడు పరిపాలనను సంస్కృ

రితము చేయుటయేగాక, వివిధ సేనాదళములను సువ్యవస్థితములుచేసి రాజ్యమును బలిష్ఠముచేసెను; స్వీడెన్‌తో పోరాడి విజయ మార్జించి, బాల్టిక్ సముద్రతీరపు రేవులను ఆర్జించెను. కేతరిన్ II (1762-96) పరిపాలనా కాలమున, తుర్కీని ఓడించిన ఫలితముగ క్రిమియా ఈ రాజ్యమునకు దక్కినది. ఆస్ట్రియా, ప్రష్యియాతోకలసి పోలండును ఓడించి, ఆ రాజ్యమును పంచుకొనుటచేత రష్యాకు యుక్రెయిన్, బైలో రష్యాలు దక్కినవి; రాజ్యము విశాలమై తత్ఫలితముగ ఒక ప్రముఖ యూరపీయ రాజ్యముగ అది లెక్కకు వచ్చినది. 1801 లో జార్జియాయు, ఆ శతాబ్ది అంతమున కజక్‌స్తాన్‌లో అధికభాగమును రాజ్యమున లీనమైనవి. 19 వ శతాబ్ది ఆరంభమున ఫిన్‌లాండ్, బెస్సరేబియాలును, పోలండున అధిక భాగమును, కాకసస్ ప్రాంతపు కొన్ని భూములును రష్యాకు దక్కినవి. ఆ కాలముననే ఫ్రాన్సుదేశపు పాలకుడగు నెపోలియన్ తన దిగ్విజయయాత్రలో రష్యాపైగూడ దాడిని సాగించెను. కాని దేశీయ సేనలు, అతనిని 1812 లో త్రిప్పికొట్ట గలిగినవి. 1860-80 మధ్యకాలమున కజక్‌స్తాన్, మధ్య ఆసియా ప్రాంతములను రష్యన్ సేనలు వశపరచుకొనినవి. అదివరకే సైబీరియా మొదలగు ప్రాచ్య ప్రాంతములను వశపరచుకొనుటయేగాక, ఉత్తర అమెరికాలోని అలాస్కాను సైతము రషియనులు వశపరచుకొనిరి (18 వ శతాబ్ది). కాని 1887 లో అలాస్కాను, యు. స్టే. కు రష్యా విక్రయించినది.

ఇరువదవ శతాబ్దిలో కాలిడునాటికి రష్యా, రాజ్య విస్తీర్ణమునుబట్టి, ప్రముఖ రాజ్యముగ లెక్కకు వచ్చినను, అందలి సామాన్య ప్రజానీకము అతి దీనావస్థలో ఉండినది. ఈ పరిస్థితినుండి దేశమును రక్షించు విప్లవమును కొనితెచ్చు సంకల్పముతో 1883 లో తొలుతటి కార్మికోద్యమము, మార్క్సిస్ట్ పద్ధతిలో రూపొందినది. పీడితులగు రైతులు, కార్మికులు అంతటంతట చేసిన తిరుగుబాటులను ప్రభుత్వము నిర్దాక్షిణ్యముతో అడచివేయుచుండెడిది. ఇంతలో 1904-5 న జపాన్‌తో సాగిన యుద్ధమున రష్యా ఓడిపోవుటవలన ప్రభుత్వపు ప్రతిష్ఠ సన్నగిలి, ప్రజలు తిరుగుబాటులను విరివిగ లేవదీయ గలిగిరి. అంతట ప్రజలను సంతృప్తి పరచుటకై, ప్రజా ప్రతినిధులుగల 'డూమా' అను ఒక సభను ఏర్పరచి, కొన్ని అధికారములను ఆ సభకు చక్రవర్తి (జారు) దత్తము చేసెను. కాని ఈ అధికారములను త్వరలోనే సన్నగిలజేసి, అతడు తన నిరంకుశాధికారమును ఏదో రీతిగ అమలుచేయ గలుగుచునే ఉండెను.

1907 లో ఆంగ్లో - ఫ్రెంచి మైత్రిలో భాగస్వామిగ రష్యాయు చేరినది. అందువలన ప్రథమ ప్రపంచ యుద్ధమున జర్మనీ మొదలగు కేంద్ర రాజ్యములను ఎదుర్కొని ఈ దేశమును పోరాడినది. తత్ఫలితములగు ఆర్థిక, జననష్టములవలనను, పరాజయములవలనను, ప్రభుత్వము బలహీనమై ప్రజల తిరుగుబాటునకు లొంగగా, చక్రవర్తి పదవీచ్యుతుడయ్యెను (1917). ఆ తరువాత ఏర్పడిన తాత్కాలిక ప్రభుత్వము కొన్ని సంస్కరణలు ప్రవేశపెట్టినను, యుద్ధమున పాల్గొనుచు, దేశమునకు తగు సువ్యవస్థను చేకూర్చజాలకపోయినది. అంతట లెనిన్ నాయకత్వమున బోల్షివిక్ సేనలు తిరుగుబాటుజరిపి, ప్రభుత్వమును వశపరచుకొనినవి (25 అక్టోబరు, 1917). ఇదియే అక్టోబరు విప్లవమని వ్యవహృతము. మార్క్సిస్ట్ - కమ్యూనిస్ట్ సిద్ధాంతానుగుణముగ సాంఘిక వ్యవస్థను పునర్నిర్మించు ధ్యేయముతో లెనిన్ నాయకత్వమున ఏర్పడిన ప్రభుత్వము, జర్మనులతో ఒక ఒడంబడికను సాధించి, యుద్ధమునుండి విరమించినది (1918). ఈ ఒడంబడిక మూలమున పశ్చిమపు సరిహద్దున ఉన్న కొన్ని ప్రాంతములను రష్యా వదలుకొన వలసి వచ్చినది.

అంతట అంతర్యుద్ధములతోను, దేశమునందు సైనికముగ జోక్యము వహింపదలచిన విదేశీయ శక్తులతో జరిపిన పోరాటములతోను నూత్న ప్రభుత్వము 1920 వరకు సతమతమైనది. 1922 లో దేశము ప్రస్తుతపు నామముతో వ్యవస్థీకృతమైనది. 1924 లో లెనిన్ చనిపోవగ, కమ్యూనిస్ట్ పార్టీ కార్యదర్శియగు స్టాలిన్‌కును, యుద్ధమంత్రియగు ట్రాట్‌స్కీకిని మధ్య అధికారమునకై పోరాటము సాగినది. అందు స్టాలిన్ విజయిమందిన ఫలితముగ ట్రాట్‌స్కీ దేశభ్రష్టుడయ్యెను. 'ఒక దేశమున సోషలిజమ్' అను నినాదముతో స్టాలిన్ అధికారమును గ్రహించి క్రమముగ పార్టీయందును, ప్రభుత్వమునందును ఎదురులేకుండ చేసికొనగలిగెను. అంతటినుండి అతని ఆధిపత్యమున వరుసగ పంచవర్ష ప్రణాళికలను అనుసరించి, దేశము వ్యావసాయికముగ, పారిశ్రామికముగ ఎంతయో పురోగమించినది. తొలుత ప్రపంచ ప్రముఖరాజ్యములు సోవియెట్ యూనియన్‌తో దౌత్య సంబంధములు పెట్టుకొనకున్నను 1925 మొదలుగ అట్టి సంబంధములు ఏర్పడుట మొదలైనది. 1933 లో యు. స్టే. తో కూడ అట్టి సంబంధములు ఏర్పడి, 1934 లో నానాజాతి సమితియందు ఈ రాజ్యమునకు సభ్యత్వము సిద్ధించినది. 1939 లో జర్మనీతో నిరాక్రమణసంధిని కుదుర్చుకొని, ద్వితీయ ప్రపంచ యుద్ధపు తొలుతటి కాలమున తాను వైదొలగి యుండుటయేగాక, ఆ కాలమున లితూనియా, లట్వియా, ఎస్తోనియాలను ఫిన్‌లాండునందలి తూర్పు దక్షిణ భాగములను వశపరచుకొని తన సరిహద్దులను ఈ రాజ్యము బలపరచుకొనినది. కాని జర్మనీ, నిరాక్రమణసంధిని ఉల్లంఘించి జూన్ 22, 1941 న సోవియెట్ యూనియన్‌పై దండెత్తినది. తొలుత యూరపీయ రష్యాలోని పశ్చిమభాగము జర్మన్‌సేనల వశమైనను, కడకు సోవియెట్ సేనలు, జర్మనులను నిరోధింపగలిగినవి. స్టాలిన్‌గ్రాడ్ (ప్రస్తుతపు వోల్గోగ్రాడ్) వద్ద సోవియెట్ సేనలు ఘనవిజయమును సాధించినవి (1942-43). అంతటినుండి ఎదురుదెబ్బనుతీసి, పశ్చిమ యూరపున ఆంగ్లో-అమెరికను సేనలును, తక్కిన మిత్రరాజ్య సేనలును సాగించిన కృషికి, బలమును కలుగజేసి, జర్మనీని పరాజితముచేసి, కడకు ఆంగ్లో-అమెరికన్-ఫ్రెంచి సేనలతోపాటుగ సోవియెట్ సేనలు జర్మనీని వశపరచుకొనినవి. కాని ఈ యుద్ధమువలన, ప్రత్యక్ష, పరోక్ష రీతులలో దాదాపు 2 కోట్ల ప్రజలు నశించిరి; ఆర్థిక వ్యవస్థయు, పట్టణములును శిథిలములయ్యెను. అయినను విజయములవలన తూర్పు ప్రష్యా, పోలండు, జెకోస్లోవాకియా, రుమేనియా, ఫిన్‌లాండ్‌లలోని కొన్ని భాగములు దేశమునకు వశపడినవి; జపాన్ నుండి దక్షిణ సఖాలిన్, కురైల్ ద్వీపములు లభించినవి; ఇందులకు తోడుగ పశ్చిమ సరిహద్దున తూర్పుజర్మనీ మొదలగు రాజ్యములలో కమ్యూనిస్ట్ ప్రభుత్వములు నెలకొని ఆ సరిహద్దు సురక్షితమైనది.

యుద్ధఫలితములనుండి దేశమును పునరుద్ధరించి, పురోగతిలో నడపుటకు 1945 మొదలుగ కృషి తీవ్రముగ జరిగినది. 1953 లో స్టాలిన్ మరణించి, వ్యక్త్యారాధనకు దేశమున స్వస్తిజరిగి, ప్రభుత్వ విధానములందు కొంత ఉదారత పొడచూపి, పరిపాలన కొంతవరకు వికేంద్రీకృతమైనది. ఇక ఆర్థిక సాంఘికాది రంగములందు అభివృద్ధి ఆశ్చర్యజనకరీతిలో ముందునకు సాగి, ఆణవిక రంగమున రోదసీ పరిశోధనయందు యు. స్టే. కు సాటిగ ఈ దేశము నేడు నిలువగలిగియున్నది. రోదసిలోనికి ఉపగ్రహమును పంపుటలోను, మానవుని పంపి తిరిగి రప్పించుటలోను, ఈ దేశమే మార్గదర్శియైనది (1961).

చీనాలో ప్రపంచయుద్ధానంతరమున కమ్యూనిస్ట్ రాజ్యమే ఏర్పడినను, సిద్ధాంత వైరుధ్యములవలన

ఈ రెండు దేశములమధ్య 1961 లో వివాదములు పొడచూపినవి; ఇవి సరిహద్దు తగాదాలకును దారి తీసినవి. ఈ విభేదములు ఇప్పటికిని కొనసాగు చునే ఉన్నవి; ఇజ్రాయెల్ - అరబ్ రాజ్యముల తగాదాలలో అరబ్బులను, కాశ్మీర్ సమస్యను గురించి భారతదేశపు వాదమును ఈ దేశము సమర్థించుచున్నది. పలు అవరోధములను అతిక్రమించి, 60 ఏండ్ల కాలములో అద్భుత ప్రగతిని, సాధించిన ఈ దేశము యు. స్టే. తో దీటుగ అగ్రరాజ్యముగ నేడు పేరొందినది.

**7. పరిపాలన :** రాజ్యాంగ విధానమునుబట్టి, దేశపు సర్వాధికారములు, కార్మిక జనమునందు నెలకొనియున్నవి. ఈ కార్మిక జనశక్తికి, వివిధ స్థాయిలలోని సోవియెటులందలి కార్మిక ప్రతినిధులు ప్రాతినిధ్యము వహింతురు (సోవియెట్ అనగా ప్రజలు ఎన్నుకొనిన ప్రాతిపదిక పరిపాలనా సంఘము). సోపానరూపమున దిగువనుండి పై వరకు సువ్యవస్థితమైన ఇట్టి సోవియెట్ వ్యవస్థలో ఉచ్చతమాధికారము యూనియన్ సుప్రీమ్ సోవియెట్‌న న్యస్తము; దేశమునకు అంతటికిని చెందిన విషయములందు శాసనముచేయు అధికారము దీనికి మాత్రమే కలదు. ఇందు రెండు కక్ష్యలు - యూనియన్ సోవియెట్, జాతుల సోవియెట్ అనబడునవి- కలవు. 18 ఏండ్లకు తగ్గని వయసువచ్చిన పౌరుల చేత ఈ కక్ష్యలందలి సభ్యులు, నాలుగేండ్లకు ఒక సారి ఎన్నుకొనబడెదరు. అభ్యర్థి వయసుమాత్రము 23 ఏండ్లకు తగ్గకూడదు. ఎన్నికలు అపరోక్ష, రహస్య విధానమున జరుగును. దేశమున పోటీపడు సాంఘిక శక్తులుగాని, ప్రయోజనములుగాని లేనందున, అభ్యర్థులకు పోటీపడు అవసరములేదనియు, ఒక నియోజకవర్గమున ఒక అభ్యర్థి మాత్రమే నిలువగ, అతని యోగ్యతాయోగ్యతలనుగురించి, రహస్య వోటింగు పద్ధతిలో ఎన్నిక మాత్రమే జరుగవలెననియు, అచటి ప్రభుత్వపు అభిప్రాయము. అందువలన ముందుగ ఆయా నియోజక వర్గములవారీగా అభ్యర్థుల పట్టిక ప్రకటింపబడగ, దానియందలి తమ నియోజకవర్గపు అభ్యర్థి, ఆ పదవికి తగునా ? తగదా ? అను విషయమును మాత్రమే వోటర్లు నిర్ణయింతురు. ఇట్టి ఎన్నిక విధానమును ఏకపట్టికా విధానమని అనెదరు. ఇట్టి అభ్యర్థిని తొలుతగ నియోజక వర్గమునకు సంబంధించిన వివిధ కార్మిక సంఘములు చర్చలద్వారా సూచించును. దేశమున ఏకైక రాజకీయ పక్షమగు కమ్యూనిస్ట్ పార్టీయే, తుదకు ఇట్టి అభ్యర్థుల పట్టికను తయారుచేసినను, ఇందు కమ్యూనిస్ట్‌పార్టీ వారితోపాటుగ, ఏ పార్టీకి చెందని అభ్యర్థులును ఉండెదరు. అభ్యర్థుల ఎన్నిక ఖర్చులను ప్రభుత్వమే భరించును; వోటరులలో దాదాపు 99 శాతము ఎన్నికలలో పాల్గొనెదరు.

యూనియన్ సోవియెట్‌లోని సభ్యులలో ప్రతియొకడు 3 లక్షల ప్రజలుగల నియోజక వర్గము నుండి ఎన్నుకొనబడును. ఇక జాతుల సోవియెట్‌లో, ప్రతి సోవియెట్ గణరాజ్యమునకు 32 మంది చొప్పునను, స్వయంపాలక గణరాజ్యములలో ప్రతిదానికి 11 మంది చొప్పునను, స్వయంపాలక ప్రాంతములలో ప్రతియొకదానికి అయిదుగురు చొప్పునను, ప్రతి జాతీయ మండలము నుండియు ఒక్కొక్కరు చొప్పునను ప్రాతినిధ్యము కలదు. (దేశమునందలి గణరాజ్యములు 15; గణరాజ్యములలో పరిగణనీయ ప్రతిపత్తి కలిగిన అల్ప సంఖ్యాక వర్గములు నివసించు ప్రాంతములు స్వయంపాలక గణరాజ్యములుగ రూపొందింపబడి, నియమితాధికారములుగల సోవియెట్‌లను కలిగియున్నవి; అట్టివి రషియన్ సమాఖ్యలో 16, అజర్ బైజాన్‌లో 1, జార్జియాలో 2, ఉజ్‌బెక్‌స్తాన్‌లో 1 కలవు. ఇక కొన్ని ప్రముఖ జాతీయ లక్షణములు కలిగిన ఒక అల్పసంఖ్యాకవర్గము వసించునది స్వయంపాలక ప్రాంతము; ఇట్టివి రషి

యన్ సమాఖ్యలో 5, అజర్‌బైజాన్‌లో 1, జార్జియాలో 1, తాజిక్‌స్తాన్‌లో 1 కలవు. కొన్ని అల్ప సంఖ్యాక వర్గములు కలగాపులగముగ కలసియున్న చిన్న ప్రాంతము జాతీయ మండలము. ఇట్టివి పది మండలములు కలవు). 1970 లో ఎన్నుకొనబడిన యూనియన్ సుప్రీమ్ సోవియెట్‌లో సభ్యులసంఖ్య 1,517; అందు స్త్రీలు 463. రెండు కక్ష్యలకు సమానాధికారములు కలవు. ఈ యూనియన్ సుప్రీమ్ సోవియెట్, ప్రభుత్వపు కార్యనిర్వహణకై, ఉన్నత సంస్థలను ఎన్నుకొనును. అందు అతి ప్రముఖమైనది అధ్యక్షమండలి (ప్రెసీడియం). అందు ఒక అధ్యక్షుడును, గణరాజ్యమునకు ఒకొ్కకరు చొప్పున 15 మంది ఉపాధ్యక్షులును, కార్యదర్శియు, ఇరువదిమంది సభ్యులును ఉందురు. సుప్రీమ్ సోవియెట్ సమావేశముకాని సమయమున ప్రెసీడియమే ఆ విధులను నిర్వహించును; కాని చరమ నిర్ణయాధికారము సుప్రీమ్ సోవియెట్‌కే కలదు. పరిపాలనను నిర్వహించు మంత్రిమండలిని కూడ సుప్రీమ్ సోవియెట్ ఎన్నుకొనును. ఈ మండలిలోని మంత్రుల సంఖ్య 80 పైగా ఉన్నది.

ప్రతి గణరాజ్యమునను, పాలనా నిర్వహణకై ఇట్టి సోవియెట్ విధానమే కలదు. కాని అందు రెండు కక్ష్యలు ఉండవు. ఒక కక్ష్యమాత్రమే పని చేయును. ఇట్టి సంస్థలే స్వయంపాలక గణరాజ్యములందును, స్వయంపాలక ప్రాంతములందును, జాతీయ మండలములందును కలవు.

సోపాన క్రమమున దిగువనుండి పైవరకు న్యాయ నిర్వహణ వ్యవస్థ ఏర్పడియున్నది. యూనియన్ సుప్రీమ్ కోర్టులోని న్యాయాధిపతులను, యూనియన్ సుప్రీమ్ సోవియెట్ ఎన్నుకొనును; ఆ న్యాయాధిపతుల పదవీకాల పరిమితి అయిదు సంవత్సరములు. అటులే ఆ యా స్థాయిలలోని న్యాయాధిపతులను ఆ యా సోవియెట్‌లు ఎన్నుకొనును. న్యాయాధిపతులతోపాటుగ, ప్రజ లెన్నుకొనిన ఇరువురు న్యాయ ప్రతినిధులు (అసెసరులు) ను, విచారణలో పాల్గొనెదరు.

దేశమున ఒకే ఒక రాజకీయ పక్షము – కమ్యూనిస్ట్ పార్టీ – మాత్రమే పనిచేయుచున్నది. పార్టీకి చెందక, ప్రజా కార్యకలాపాలలో పార్టీతో సహకరించువారు పలువురు కలరు.

**8. దేశరక్షణ :** అధునాతన ఆయుధ సమన్వితములు, సుశిక్షితములునగు రక్షణ బలములు దేశమునకు కలవు. సైనిక బలమున, యు. స్టే. తో సరిదూగు ఏకైక రాజ్యముగ ఇది పేరుగన్నది. 19 ఏండ్ల వయసువచ్చిన ప్రతి మగవాడును లేదా మాధ్యమిక విద్యను ముగించిన వారి విషయమున 18 ఏండ్లు వయసువచ్చిన ప్రతి మగవాడును, విధిగ సైనిక శిక్షణను పొందవలయునను నియమము అమలున ఉన్నది; ఈ శిక్షణ కాలము, అతడు పని చేయు సైనికశాఖను అనుసరించి రెండునుండి మూడేండ్లవరకు మారుచున్నది. భూతలసేన, రాకెట్ సేన, కీలకబలము, వాయుసేన, నౌకాసేన, విమాన విధ్వంసక సేన, రాకెట్ విధ్వంసక సేన – అను ఏడు సైనిక శాఖలు కలవు. ఇందు ప్రతి శాఖయు ఒక సేనాపతి ఆధ్వర్యవమున పనిచేయుచు, స్వకీయమగు పరిపాలనా వ్యవస్థను కలిగియున్నది. భూతలముపై పోరాడు అన్నివిధములగు సైనిక శాఖలందును కలసి మొత్తముమీద 20 లక్షల సైనికులు కలరు. మొత్తపు డివిజనుల సంఖ్య 157; అందు 100 దళములు సర్వదా యుద్ధ సన్నద్ధములు. వీరుగాక దేశభద్రతకై భద్రతా సరిహద్దు దళములు కలవు. అందలి సైనిక సంఖ్య 356 వేలు (1970). నౌకాసేనయందు 2 హెలికాప్టరు వాహక నౌకలు, 17 క్రూయిజర్లు, 400 జలాంతర్గాములు (ఇందు అణవిక శక్తిచేత నడచునవి 100), 12 క్షిపణ్యాయత్తములగు క్రూయిజర్లు,

106 డెస్ట్రాయర్లు, తక్కు విధముల యుద్ధోపయోగి నౌకలు 1,265. ఇవిగాక సహాయక నౌకలు వగైరా వేల సంఖ్యలలో కలవు నౌకాసేన యందలి మొత్తపు సైనికసంఖ్య 5 లక్షలని అంచనా (1972). వాయుసేనయందు పనిచేయు యోధసంఖ్య 5 లక్షలకుపైబడి ఉన్నది; అందు ప్రథమశ్రేణి పోరాటపు విమానములు దాదాపు 10,000 కలవు; ఇవిగాక సైనికవాహక విమానములు మొదలగు ద్వితీయశ్రేణికిచెందిన యుద్ధోపయోగి విమానములు అధిక సంఖ్యలలో కలవు. ఖండాంతర దూరక్షిపణులకు తోడుగ, అత్యంతాధునిక ఆయుధ సమేతములై, అతి దూరము పోగలుగు బాంబర్లును, నౌకాసేనకు సహకరించు బాంబరు, హెలీకాప్టరు దళములును కలవు (1973).

తూర్పు సరిహద్దుల సమష్టి రక్షణకై, నేటో కూటమికి వ్యతిరేకముగ, 1955 లో రూపొందింపబడిన వార్సా ఒడంబడిక రాజ్యములందు ఈ దేశముతోపాటుగ, ఆల్బేనియా, బల్గేరియా, జెకోస్లోవాకియా, తూర్పు జర్మనీ, హంగరీ, పోలండ్, రుమేనియా చేరినవి. కాని తరువాత 1962 లో సిద్ధాంత విభేదములవలన అందుండి ఆల్బేనియా బహిష్కరింపబడినది. ఈ ఒడంబడికను అనుసరించి ఈ దేశపు భూతల సేనలలో 22 డివిజనులు తూర్పు జర్మనీయందును, రెండు (లేక మూడు) డివిజనులు పోలండులోను, హంగరీలో 2 డివిజనులును నిలిచియున్నవి; ఇందు చివరి దేశమున ఈ దేశపు వాయుసేనలోని 2 డివిజనులుకూడ నిలిచియున్నవి. యు. స్టే. కు ఏ విధముగ తీసిపోని సంఖ్యలో ఈ దేశమునకు అణ్వాయుధములు కలవు.

**9. అంతర్జాతీయ సం.** : ఐ. రా. స యందు ఈ దేశమునకును, ఈ దేశములోచేరిన గణరాజ్యములగు యుక్రెయిన్, బైలో రష్యాలకును సభ్యత్వములు కలవు. ఈ మూడింటికిని ఐ. రా. స. యందలి కొన్ని ప్రత్యేక సంస్థలందును సభ్యత్వములు ఉన్నవి. కమ్యూనిస్ట్ రాజ్యములు మాత్రమే ఉన్న ఆర్థిక పరస్పర సహాయ సంస్థయందును, వార్సా ఒడంబడికయందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున కొన్ని దేశముల విమోచనోద్యమములకు - అందును ముఖ్యముగ వియెత్నామ్ పోరాటమున - ఈ దేశము, ఆర్థిక, యుద్ధసామగ్రి సాహాయ్యములను కల్పించి తోడుపడినది. వర్ధమాన దేశములలో పెక్కింటికి ఆర్థిక, సాంకేతిక సాహాయ్యములద్వారా ప్రోత్సాహము ఇచ్చినది. ఇట్టి సహాయమును గ్రహించినవానిలో ఈజిప్ట్, ఇండియా, అల్జీరియా, ఇరాన్, తుర్కీ, పాకిస్తాన్ ప్రముఖములు. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, యూరపీయ రాజకీయముల ఫలితముగ యు. స్టే. మొదలగు పశ్చిమ రాజ్యములతో ఈ రాజ్యమునకు వైమనస్యము ఏర్పడినను, 1973 మొదలుగ పరిస్థితి కుదుటపడుట ఆరంభించినది. ఆ సంవత్సరమున ఆణవిక యుద్ధ నిరోధమునకై యు. స్టే. తో ఈ రాజ్యము ఒక ఒడంబడికకు రాగలిగినది; అట్టులే ఆణవిక పరిశోధన, రోదసీయానము మొదలగు కొన్ని రంగములందును ఈ ఉభయ అగ్రరాజ్యములమధ్య కొంత సౌహార్దమునకు ప్రస్తుతమున తావేర్పడినది.

**10. ఆర్థిక రంగము :** ప్రపంచమున, ఒక వినూత్న ఆర్థికవ్యవస్థకు దారిచూపినది ఈ దేశము. సోవియెట్ సోషలిస్టు వ్యవస్థ అని వ్యవహృతమగు ఈ వ్యవస్థయందు ఒక మానవుని శ్రమఫలితమును వేరొక మానవుడు దోచుకొనుటకుగల అవకాశము సర్వే సర్వత్ర రద్దుచేయబడినది. ప్రభుత్వపు సోషలిస్టు ఆస్తియందు ప్రజానీకమునకు అంతటికిని స్వామ్యము కలదు. ఇక సహకార, సమష్టి ఆస్తులు,

ఆ యా వృత్తికారులయు, రైతులయు, ఇచ్ఛా పూర్వక సహకారమువలన రూపొందినవి. ఈ రెండు విధముల ఆస్తులందును ఉత్పత్తి, సమష్టి కృషి వలన జరిగి, దేశపు మొత్తపు సంపదను, వ్యక్తిగత జీవిత స్థాయిని పెంచుటకు ఉపయోగపడుచున్నది. వ్యక్తిగత ఆస్తికి, కొన్ని పరిధులకు లోబడి, రక్షణలు చట్టరీత్యా కలవు. సామాన్య జీవితోపయోగ వస్తువులందేగాక, ఇల్లు, తోట, కారువంటి జీవిత వసతులను కలిగియుండుటకు వ్యక్తులకు అధికారము కలదు. కాని ఒక కర్మాగారమునుగాని, వ్యాపార సంస్థనుగాని, ఒక వసతినిగాని లాభార్జనకై వినియోగించుకొనుటకు ఏ వ్యక్తికిని అధికారములేదు. తమ సొంత కృషిపై ఆధారపడి జీవించు స్వత్వము పౌరునకు కలదుగాని, కూలీలనుపెట్టి ధనమును ఆర్జించు అవకాశములు మాత్రము పౌరులకు వ్యక్తిగతముగ లేవు. తొలుత ఈ దేశమున మొదలైన ఇట్టి వ్యవస్థయే, కొలది స్థానికపు మార్పులతో, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ప్రపంచమున రూపొందిన తక్కిన కమ్యూనిస్టు రాజ్యములలో అవలంబితమైనది. ఇట్టి వ్యవస్థను ఆశ్రయించి, సోవియెట్ యూనియన్ ఒక అరువది ఏండ్ల కాలములో అత్యద్భుతముగ పురోగమించి, పలు అంతః కల్లోలములను, నాజీ దురాక్రమణలను ఎదుర్కొని నిలిచి, ఒక అగ్రరాజ్యపు స్థితిని చేరుకొనినది.

1929 మొదలుగ క్రమరీతిలో వివిధ పంచవర్ష ప్రణాళికలను ఆశ్రయించి, ఈ దేశము ఆర్థికముగ పురోగమించినది. ద్వితీయ ప్రపంచయుద్ధము, దేశమునకు చాల నష్టమును కలిగించినను, 1950 నాటికి, ప్రజానీకపు సమష్టి కృషి ఫలితముగ ఆ నష్టము పూరింపబడినది. తరువాత ఇరువది సంవత్సరముల కాలమున (1951-71) సగటున సాలీనా అధికతర ఉత్పత్తి 10% నకు చేరుకొనినది.

దేశము అతి విశాలమే అయినను, అందు నాలుగవ వంతునకు లోపుగ మాత్రమే వ్యవసాయమునకు అనుకూలము. దాదాపు 5,460 లక్షల హెక్టేరులు సేద్యమునకు తగినటుల తెలియుచున్నది. ఇందును కొంత భాగమున అనావృష్టిబాధ, తరచుగ కలదు. అందువలన తగు నీటిపారుదల వసతులను కల్పించుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది. బాల్టిక్ ప్రాంతములందు భూమియంతయు చిత్తడి నేల; ఇచటి నీటిని వెలుపలికి పంపుటకు మురికి కాలువల ఏర్పాటు విరివిగ జరుగుచున్నది. ప్రస్తుతమున 120 లక్షల హెక్టేరులకు నీటిపారుదల వసతులును, 110 లక్షల హెక్టేరులకు మురుగు కాలువల వసతులును కల్పింపబడినవి (1973).

వ్యావసాయిక భూమియంతయు జాతీయపు ఆస్తిగ పరిగణ్యము. దానిని అమ్ముటకుగాని, కొనుటకుగాని ఎవరికిని అధికారము లేదు. అందు అత్యధికభాగము సమష్టి వ్యవసాయ క్షేత్రములకు, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములకును చెందియున్నది. సమష్టి వ్యవసాయ క్షేత్రముల మొత్తపు వైశాల్యము దాదాపుగ 1,100 లక్షల హెక్టేరులు (ప్రస్తుతమున పంటలను పండించు 2,230 లక్షల హెక్టేరులలో ఇది దాదాపుగ సగము). ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములందు కొన్నింట ప్రభుత్వమే వివిధ వ్యావసాయిక ప్రయోగములను నిర్వహించును; కొన్నింట పశు సంరక్షణ, కోళ్ళ పెంపకము మొదలగు కృషులను సాగించును. గృహావసరముల నిమిత్తమై చిన్న కూరగాయల తోటలను, పండ్ల తోటలను పెంచుటకై, సమష్టి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములలో పని చేయువారికి చిన్న స్వంత కమతములును ప్రత్యేకించుట జరుగుచున్నది. ఇట్టి స్వంత కమతముల మొత్తపు వైశాల్యము 79 లక్షల హెక్టేరులు (అనగా మొత్తపు భూమిలో 3.5 శాతము). దేశపు సమష్టి వ్యవసాయ క్షేత్రముల సంఖ్య 32,256

(1972); దేశపు వ్యాపార పంటలలో 50% వీని యందు ఉత్పత్తి అగుచున్నది. సగటున ఒక్కొక సమష్టి వ్యవసాయ క్షేత్రమున భూవైశాల్యము 6,000 హె.; ఇందు సగమున పైరులు పండింప బడగ, తక్కినది పశువులకు బీడుగ, సంచార భూమిగ ఉపకరించుచున్నది; ఒక్కొక్క క్షేత్ర మున 4,000 పశువులు (ఆవులు గొర్రెలు మొ) ఉండును; ట్రాక్టర్ల సంఖ్య 60.

ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రముల సంఖ్య 15,502; ఆధునిక యంత్ర, పరికర సాహాయ్యమున ఇట కృషిసాగుచున్నది. సగటున ఒక్కొక క్షేత్రపు వైశాల్యము 21 వేల హె. కు పైబడి ఉండును: ఇందు 6,000 హె. సేద్యమునకును, తక్కినది గడ్డిబీడులు మొ. వానికిని పనికివచ్చుచున్నది; ఇందలి పశుసంఖ్య 7,000; ట్రాక్టర్ల సంఖ్య 120. సాధారణముగ ఒక్కొక ప్రభుత్వ క్షేత్రము ఒక్కొక విధపు పంటసాగునకు, పశు పోషణరీతికి చెందియుండును. ఈ ప్రభుత్వ క్షేత్రములందలి ఉత్పత్తిని అంతటిని ప్రభుత్వమే కొనుగోలు చేయును. దేశమున అమ్మకమునకు వచ్చు ధాన్యము, కూరగాయలలో సగము, ప్రత్తి పంటలో అయిదవవంతు, పశూత్పత్తులలో 40 శాతము ఈ క్షేత్రములద్వారా లభించుచున్నవి. రైతులకు గృహావసరములకై ఇచ్చిన స్వంత కమతములందలి ఉత్పత్తిలో అధికభాగము వారి అవసరములకే సరిపోవును; మిగిలిన దానిని మార్కెటును, కేంద్ర సహకార సంఘముద్వారాను ఆ రైతులు విక్రయింతురు. సమష్టి వ్యవసాయ క్షేత్రములందలి ఉత్పత్తిలో అత్యధిక భాగమును ప్రభుత్వమే కొనుగోలు చేయును; ఇంకను అదనముగ ఉన్నదానిని మార్కెటునను, సహకార సంఘములద్వారాను క్షేత్రపు పాలకవర్గమే విక్రయించును. వ్యావసాయిక కృషియందు మొత్తముమీద ఇరువది లక్షల ట్రాక్టర్లు పనిచేయుచున్నవి; సగటున ఆ ట్రాక్టర్లలో ప్రతియొకదాని సామర్థ్యము 60 అశ్వ శక్తులు; ఇవిగాక వ్యవసాయరంగమున 13 లక్షల మోటారు వాహనములు, 650 వేల నూర్పిడి యంత్రములు మొదలగునవి పనిచేయుచున్నవి. ఈ విధముగ సేద్యపు పనియంతయు దాదాపుగ చాల వరకు యంత్ర సహాయముననే సాగుచున్నది. వ్యావసాయికోత్పత్తులలో ధాన్యములు అత్యధిక ప్రాముఖ్యము కలిగియున్నవి. వివిధ ధాన్యముల ఉత్పత్తులను లెక్కించుటలో ప్రభుత్వమును, తక్కిన సహకార సంఘముల మార్కెటులును కొనుగోలు చేసిన మొత్తములు మాత్రమే లెక్కింపబడుచున్నవి; సమష్టి వ్యవసాయ క్షేత్రములందును, స్వంత కమతములందును రైతులు సొంతముగ వాడుకొనిన ఉత్పత్తుల లెక్కలు అందులో చేరవు. ఆ విధముగ 1971 లో లెక్కదేలిన పంటలలో ధాన్యముల మొత్తము ఉత్పత్తి 1,810 లక్షల టన్నులు; ఇందులో దాదాపుగ సగభాగము గోధుమలు; ఇక తక్కిన వానిలో బార్లీ (200 లక్షల టన్నులు), ఓట్లు (145 లక్షల ట.), మొక్కజొన్న (86 లక్షల ట.), వరి (16 లక్షల ట.) పేర్కొన దగినవి. కూరగాయలు - దుంపకూరల క్రింద దాదాపు 100 లక్షల హెక్టేరులకుపైగా ఉన్నది. ఉరల గడ్డల ఉత్పత్తి ఈ దేశమున అత్యధికము. కూరగాయల-దుంపల మొత్తపు ఉత్పత్తి 190 లక్షల టన్నులు (1972). రొక్కపు పంటలలో దాదాపు 30 రకములు దేశమున సాగగుచున్నవి. వీటి అన్నింటిక్రింద మొత్తముమీద 145 లక్షల హెక్టేరులు సాగున ఉన్నది. వానిలో ప్రముఖము చక్కెర. చక్కెర ఉత్పత్తిలో ఈ దేశపుదే ప్రపంచమున అగ్రస్థానము; ఆ తరువాత లెక్కింపదగినది ప్రత్తి. 1971 లో ప్రత్తి (71 లక్షల ట.), చక్కెర బీటుదుంప (643 లక్షల ట.) ప్రొద్దు తిరుగుడు గింజలు (50 లక్షల టన్నులు) ఉత్పత్తి అయినవి. ఇవిగాక, పొగాకు, తేయాకు, వివిధ

రకముల పండ్లు పరిమిత ప్రమాణములలో ఉత్పత్తి అగుచున్నవి. దేశమున గోజాతి 1,024 లక్షలు (ఇందు పాడిఆవులు 412 లక్షలు); పందులు 714 లక్షలు; గొఱ్ఱెలు 1,399 లక్షలు కలవు (1972). ఒక్కొక్క ఆవు సాలీనా సగటున 2,300 కి.గ్రా. పాలను ఇచ్చుచున్నది.

అడవుల మొత్తపు వైశాల్యము 7,470 లక్షల హెక్టేరులు. ఇందు అత్యధిక భాగము ప్రభుత్వపు అధీనమున ఉన్నది; 390 లక్షల హెక్టేరులు మాత్రము రైతుల అవసరములకై ఉచితముగ వారికి వదలివేయబడినది. పైరుల రక్షణకై అడవులను ఆటనట పెంచుటకు ప్రభుత్వము కృషిచేయుచున్నది.

మత్స్య కృషియందును ఈ దేశము చాల పేరు గన్నది. ఈ కృషిలో మర్మన్స్క్, కాలినిన్ గ్రాడ్, ఆస్ట్రఖాన్, వ్లాడివోస్టక్, పెట్రోపావ్‌లోవస్క్ నగరములు ప్రముఖ కేంద్రములుగ పేరొందినవి. 1969 లో మొత్తపు చేపల పట్టుబడి 70 లక్షల టన్నులు.

దేశమున ఖనిజ సంపదయందు వైవిధ్యము చాల ఎక్కువ; ఆ విషయమున దేశము స్వయం పోషకము. ఇంధన సామగ్రులగు రాక్షసిబొగ్గు, పెట్రోలియం, ఇంధనవాయువు దేశమున విరివిగ లభించుచున్నవి. రాక్షసి బొగ్గునను, ఇంధన వాయువునను, ప్రపంచ రాజ్యములందు ఈ దేశపుదే అగ్రస్థానము. రాక్షసిబొగ్గు ఉత్పత్తి 6,550 లక్షల టన్నులు; పెట్రోలియమ్ ఉత్పత్తి 3,940 లక్షల టన్నులు (1972). పెట్రోలియమును సరఫరాచేయు గొట్టముల మొత్తపు నిడివి 40,000 కిమీ. ఈ దేశము ఇట్టి గొట్టములద్వారా దేశమున వివిధ కేంద్రములకేగాక పోలండ్, హంగరీ, జెకోస్లోవాకియా, తూర్పు జర్మనీలకుకూడ పెట్రోలియమును అందజేయుచున్నది. పై విదేశములకు సాలీనా ఈ రీతిగ 150 లక్షల టన్నుల నూనె చేరుచున్నది ఇంధన వాయువుల నిలువలు 9 లక్షల కోట్ల ఘ. మీ. కలవని అంచనా. సాలీనా ఈ నిలువలనుండి 25,000 కోట్ల ఘ. మీ. వాయువు దేశమునకు 80 వేల కిమీ. ల నిడివిగల గొట్టముల ద్వారా సరఫరా అగుచున్నది (1973). పోలండ్, జెకోస్లొవాకియా మొదలగు కొన్ని విదేశములకును ఈ ఇంధనవాయువున కొంత భాగమును ప్రభుత్వము ఎగుమతి చేయుచున్నది.

తక్కిన ఖనిజముల విషయమున సైతము దేశము సుసంపన్నము. దేశీయ శాస్త్రజ్ఞుల లెక్కలను అనుసరించి ప్రపంచమునందలి ముడి ఇనుము నిలువలలో 41%, అపటైట్ నిలువలలో 76.7%, మాంగనీజు నిలువలలో 88%, పొటాసియం లవణముల నిలువలలో 54%, ఫాస్ఫేటులలో 33% ఈ దేశమున కలవని అంచనా. ఇక పరిమిత ప్రమాణములలో లభించువానిలో రాగి, తుత్తునాగము, సీసము, టంగ్‌స్టైన్, యాంటిమనీ, అల్యూమినియం, కాడ్మియం, క్రోమైట్, వెండి, బంగారు క్రమరీతిలో పేర్కొనదగినవి.

దేశమున విద్యుదుత్పత్తి సాలీనా 85,800 కోట్ల కివా. (1972); ఇందులో 80% తాప విద్యుత్తు.

1922 మొదలుగ క్రమరీతిలో దేశము పారిశ్రామికముగ ఎంతయో పురోగమించినది. 1922 తో పోల్చినపుడు 1972 లో పారిశ్రామికోత్పత్తి 321 రెట్లు పెరిగినటుల లెక్కలవలన తేలుచున్నది. ప్రపంచపు ఉక్కు ఉత్పత్తిలో అయిదవవంతు, ఈ దేశమున జరుగుచున్నది; 1972 లో దాని ఉత్పత్తి 1,260 లక్షల టన్నులు; ముడి ఇనుము ఉత్పత్తి 2,080 లక్షల టన్నులు. ఇంజనీరింగ్ పరిశ్రమల ఉత్పత్తుల ప్రమాణమున యు. స్టే. తరువాత ఈ దేశమే లెక్కకు రాగలిగినది. వివిధ రీతుల ఇంజనీరింగ్ పరిశ్రమలును-విద్యుదుత్పత్తికి, రాకపోకల

సాధనములకు, వ్యవసాయ కృషికి సంబంధించిన అన్ని విధముల యంత్ర పరిశ్రమలును - ఇట సర్వతోముఖముగ అభివృద్ధి చెందినవి. సాలున మోటారుకార్ల ఉత్పత్తి 1,376 వేలు (1972). రసాయనిక పరిశ్రమలందు, ప్లాస్టికులు, కృత్రిమపు దారములు, ప్లాస్టిక్ గృహోపకరణములు, కృత్రిమపు రబ్బరు, రసాయనపు ఎరువులు విరివిగ ఉత్పత్తి అగుచున్నవి. తేలికరకపు పరిశ్రమలలో జవుళి పరిశ్రమ, చెప్పుల పరిశ్రమ, మెత్తని బొచ్చు వస్తువుల పరిశ్రమ ఉత్పత్తులరీత్యా చాల అభివృద్ధిని సాధించినవి. విమాన నిర్మాణమునను, యుద్ధోపయోగములగు తక్కిన యంత్ర సామగ్రుల నిర్మాణమునను యు. స్టే. తో సాటిగ ఈ దేశము నిలువగలిగినది. దేశపు ఎగుమతులలో పెట్రోలియం, బొగ్గు, ముడిఇనుము, ఇనుము, కాగితము, ప్రత్తి, వనస్పతి, ట్రాక్టర్లు, లారీలు, కారులు, గడియారములు, విద్యుత్తు ప్రముఖములు; దిగుమతులలో కొన్ని ముడిపదార్థములు, నిత్యోపయోగ సామగ్రి లెక్కింపదగినవి. మొత్తపు ఎగుమతుల విలువ 124,260 లక్షల రూబెల్స్ (ఇందులో 81,000 లక్షల రూబెల్స్ వ్యాపారము సోషలిస్ట్ దేశములతో జరిగినది); దిగుమతుల విలువ 112 280 లక్షల రూబెల్స్ (ఇందు 74,000 లక్షల రూ. వ్యాపారము సోషలిస్టు దేశములతో జరిగినది-1972). దేశపు బడ్జెటరీ వ్యయము 1,64,20,000 కోట్ల రూబెల్స్ (1971).

**11. సాంఘిక రంగము :** ప్రపంచ చరిత్రలో ప్రప్రథమముగ శాస్త్రీయరీతిలో ఒక సామ్యవాద మానవ సమాజమును నిర్మించు కృషి ఈ దేశమున మొదలైనది. దేశపు సంపదకుగల వనరులు అన్నియు సమాజపరము లగుటవలన, మానవుని శ్రమను వేరొక మానవుడు కొల్లగొట్టు అవకాశము లకు అట తావేలేదు. ప్రతి మనుజుని నుండి వాని సామర్థ్యమునకు అనుగుణముగ పనిని గ్రహించి, ఆ శ్రమఫలితము అందుకు తగినటుల అతనికి అందజేయుట అచటి సామాజిక వ్యవస్థ యందలి లక్ష్యము. చట్టరీత్యా ప్రతి పౌరునికి, స్త్రీ పురుష వివక్షత లేకుండ, తగిన పని, తగు విశ్రాంతి, ఉచిత విద్యాబోధనా సౌకర్యము, వైద్య సాహాయ్యము, వార్ధక్యమున, రోగకాలమున, దుర్బల స్థితియందు తగు భద్రత కల్పింపబడినవి. సామ్యవాద విధానపు అమలువలన ప్రతివానికి ఉద్యోగావకాశము కలిగినది. ప్రస్తుతమున నిరుద్యోగబాధ ఎచటను కన్పడదు. ప్రజల సమష్టి కృషివలన జాతీయాదాయము అతి తీవ్రగతిలో ముందంజ వేయుచున్నది. 1972 లో ఆ ఆదాయము 310 శతకోట్ల రూబెలులు. ఇందు నాలుగవవంతు మరల పెట్టుబడిగా పరిణమించి ఉత్పత్తిని అధికతరము చేయుటకు తోడ్పడుచున్నది. తక్కిన మూడు వంతుల జాతీయాదాయము, జీతములు సౌకర్యములు, సాంఘిక సేవా వసతులు మొదలగు వాని వలన ప్రజలకే చెందుచున్నది. వారమున అయిదు దినములు - 41 గంటలు - మాత్రమే పనికాలము; కొన్ని తీరుల శ్రమదాయకములగు వృత్తులందు ఈ పనికాలము సైతము చాల తగ్గింపబడుచున్నది. గనులవంటి వానిలో పనిచేయువారు వారమున 36 గంటలు మాత్రమే పనిచేయుదురు. దేశాదాయము పెరుగుచున్నకొలది క్రమముగ జీతములును పెరుగుచున్నవి. ఆ యా వృత్తులవారికి పనులలోని కుశలతను, సాంఘికపు విలువను అనుసరించి జీతములలో భేదములున్నను, పల్లెపట్టులవారికిని, పట్టణవాసులకును మధ్య (ఒకేతీరు పని చేయుచున్నపుడు) జీతములమధ్య భేదము లేనేలేదని చెప్పవచ్చును. జీతములమధ్య వృత్తులను అనుసరించి, ఏర్పడు తరతమ భేదములను చాలవరకు తగ్గించుటకై ప్రభుత్వము సామాజిక వినియోగ నిధిద్వారా కృషి చేయుచున్నది. తక్కువ జీతములవారికి, పెద్ద కుటుంబములు కలిగి ఆదాయము తక్కువగ

ఉన్నవారికి, విద్యా, ఆరోగ్య, శిశుపోషణాదుల యందు ఈ నిధిద్వారా ప్రభుత్వ సాహాయ్యము విధిగ అందుచున్నది. కొన్ని తక్కువ ఆదాయ కుటుంబముల వేతనపు ఆదాయములకు పైన అదన ముగ 30% వరకు ఈ నిధివలన లభించుచున్నది. 1972 లో ఇట్టి నిధివలన మొత్తముమీద ప్రతి పౌరునికి సగటున 300 రూబులులు ముట్టినవి.

దేశమున సామ్యవాదపు ప్రభుత్వము ఏర్పడి నప్పటినుండియు గృహ సమస్యను పరిష్కరించు టకు కృషి జరుగుచున్నది. కాని ద్వితీయ ప్రపంచ యుద్ధపు ఫలితముగ దాదాపు 120 లక్షల గృహ ములు నాశనమగుటవలన యుద్ధానంతర కాలమున ప్రభుత్వము తన కృషిని తీవ్రతరము చేసినది. నిర్మాణ విస్తృతిని లెక్కలోనికి తీసికొనినపుడు సాలీనా నూత్న గృహముల నిర్మాణమున ఈ దేశ పుదే ప్రపంచ రాజ్యములందు అగ్రస్థానము ప్రతి యేటా దాదాపు 30 లక్షల కుటుంబముల గృహ వసతి పరిస్థితి చక్కజేయబడుచున్నది. ప్రభుత్వపు ఇండ్లకై చెల్లింపవలసిన అద్దె చాల అల్పము; ఎచ టను అది కుటుంబపు ఆదాయమున 4 లేదా 5 శాతమును మించదు. ప్రభుత్వపు ఇండ్లలో ఉండ ఇచ్ఛగింపని పౌరుడు సొంతముగ ఒక ఇంటిని నిర్మించుకొనవచ్చును; అది మొత్తముమీద రెండు అంతరువులకు మించక, అయిదు గదులును దాటని విస్తృతిని కలిగియుండవలెనను నియమము కలదు; దేశపు గృహముల మొత్తపు సంఖ్యలో మూడవ వంతు యీ విధపు సొంతదారులచేత నిర్మింపబడి నవి. ఇట్టి గృహముల కట్టుబడికి కావలసిన స్థల మును ప్రభుత్వమే ఉచితముగ ఇచ్చి, గృహనిర్మాణ మునకు 700 రూబెలులవరకు ఋణమును, రెండు శాతపు వడ్డీతో, 7 సంవత్సరములలో తీర్చు షర తుపై ఇచ్చును.

7 నుండి 15/16 ఏండ్లవరకు వయసు కలవారికి విద్య నిర్బంధముగ, ఉచితముగ బోధింపబడు చున్నది. 4 ఏండ్లు, 8 ఏండ్లు, 11 ఏండ్లు క్రమముగ పఠన కాలము కలిగిన మూడుతీరుల పాఠశాలలు కలవు 1975 నుండి పాఠశాలా విద్యాబోధ 17 ఏండ్ల వయసువరకు జరుగునటుల నిర్ణయింప బడి నది సామాన్య సాంకేతిక విద్య 8 సంవత్సరముల కాలము (15 లేదా 16 ఏండ్ల వయసువచ్చువరకు) బోధింపబడును; ఆ తరువాత విద్యార్థి ఏ కర్మాగార మునసైనా 2 ఏండ్లు శిక్షణ పొందును. అయినను సాంకేతిక విద్యయందు అభిరుచి లేనివారు అంతట కళలను బోధించు విద్యాశాలలలో చేరి శిక్షణను పొందెదరు.

1971-72 లో ప్రయిమరీ, సెకండరీ పాఠశాలలు మొత్తముమీద 184,000 పనిచేసినవి. ఇందలి విద్యార్థిసంఖ్య 492 లక్షలు. ఇవిగాక 14,900 మాధ్యమిక పాఠశాలలలో 10 ఏండ్ల కాలము చది విన విద్యార్థులు 40 లక్షలు కలరు. 5,470 వృత్తి పాఠశాలలలో 25 లక్షల విద్యార్థులు శిక్షణపొందిరి. దేశమున విద్యాబోధన. దాదాపు 100 భాషలలో, ప్రాంతములను అనుసరించి జరుగుచున్నది.

1971-72 లో 4,260 సాంకేతిక కళా శాలలలో 44 లక్షల విద్యార్థులును, ఉన్నత విద్యను బోధించు విశ్వవిద్యాలయములు మొదలగు 825 సంస్థలలో 46 లక్షల విద్యార్థులును పఠించిరి. వీరిలో 2,290 వేలమంది సాయం కళాశాలలలోను, పత్ర వ్యవహార (కరస్పాండెన్స్) రీతిలోను చదివిరి. విశ్వవిద్యాలయములలో మాస్కో, లెనిన్ గ్రాడ్, ఖార్కోవ్, ఒడెస్సా, తర్తూ, కజాన్, సార తోవ్, తోమ్స్క్, కీవ్, స్వెర్డ్‌లోవ్స్క్, టిబిలిసి, ఆల్మా-అటా, టాష్కెంట్, మిన్స్క్, గోర్కీ, వ్లాడివోస్టక్ నగరములలోనివి ప్రముఖములు. దేశపు మొత్తమున జనవరి 1, 1972 నాటికి వివిధ ఉన్నత విద్యా సంస్థలలోను, అవేక్షణా స్థావరముల లోను, విజ్ఞానశాస్త్ర అకాడమీలలోను కలసి

10,02,900 మంది విజ్ఞాన శాస్త్రీయ కృషిలో పని చేయుచుండిరి.

సోవియెట్ యూనియన్‌లోని విజ్ఞాన శాస్త్రీయ అకాడమీ యందలి సభ్యసంఖ్య 675; ఆ సంస్థ ఆధ్వర్యమున పనిచేయు వివిధ విద్యాశాలలసంఖ్య 246; వానియందు విజ్ఞానశాస్త్ర బోధ చేయువారు 36,777. విజ్ఞాన శాస్త్రమున, అన్ని రంగము లందును దేశము ఎంతయో పురోగమించినది. తొలుతగ కృత్రిమ ఉపగ్రహమును భూకక్ష్యలోనికి పంపిన ఖ్యాతియు (అక్టోబరు 4, 1957), రోదసి యందు తొలుతగ మానవుని విహరింపజేసిన కీర్తియు (ఏప్రిల్ 12, 1961) ఈ దేశమునకు దక్కినవి. చంద్రుని యందును, శుక్ర అంగారక గ్రహములందును నూత్న పరిశోధనలను రోదసీ శకటాదులద్వారా ఈ దేశము నిర్వహించినది.

దేశపు మొత్తమున 360 వేల గ్రంథాలయములు కలవు; వీని అన్నింటకలసి 3.3 శతకోట్ల సంపుట ములు కలవు. గ్రంథాలయములందు అన్నింట, మాస్కోలోని లెనిన్ రాష్ట్రీయ గ్రంథాలయము ప్రముఖము; ఇందలి సంపుట సంఖ్య 2.5 కోట్లు. సాలీనా 27 లక్షలమంది ఈ గ్రంథాలయమును ఉపయోగించుకొను చున్నారు.

దేశపు మ్యూజియముల మొత్తపు సంఖ్య 1,144; వీనిని సాలీనా 10 కోట్ల ప్రజలు దర్శించు చున్నారు. మ్యూజియములందు అన్నింట మాస్కోలోని కేంద్రీయ లెనిన్ మ్యూజియమ్ విశ్వవిఖ్యాతిని ఆర్జించినది. లెనిన్‌యొక్క జన్మస్థలమగు ఉలియ నోవ్‌స్కలోని లెనిన్ స్మారక భవనాళియు, లెనిన్ తన శిక్షాకాలమును గడపిన షోషెన్‌స్కోయీలోని మ్యూజియమును, లెనిన్‌యొక్క జీవిత విశేషము లను తెలియజేయునవిగ పేరొందినవి.

వార్తా పత్రికలు అన్నియు ప్రభుత్వపు ఆధీనము ననో, కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యవముననో, కార్మిక సంఘముల యాజమాన్యముననో, నడచుచున్నవి. వైయక్తిక ప్రచురణ ఎట్టిదియు లేదు. 66 భాషలలో (ఇందు 58 దేశీయ భాషలు; తక్కినవి విదేశ భాషలు) 8,700 వార్తా పత్రికలు వెలువడుచున్నవి. వీనిలో 24 మాత్రమే దేశ మంతటా ప్రచారము కలవి. వానిలో ప్రావదా (పాఠక సంఖ్య 96 లక్షలు), త్రూద్ (పా. సం. 56 లక్షలు) కోమ్సోమోల్‌స్కయా ప్రావదా (పా. సం. 84 లక్షలు), పయనీర్‌స్కయా ప్రావదా (పా. సం. 98 లక్షలు) ప్రముఖములు.

దేశమున ప్రతి పౌరునికి వైద్య సౌకర్యము ఉచితముగ లభించుచున్నది; అయినను అటనట సొంతముగ వైద్యవృత్తిని నిర్వహించువారును కొల దిగ కలరు. వైద్య విజ్ఞానమునకు సంబంధించిన ఒక అకాడమీ 1944 మొదలుగ పనిచేయుచున్నది; దాని ఆధ్వర్యమున నేరుగ 36 అవేషణా సంస్థలు పరిశోధనలను సాగించుచున్నవి; ఇవిగాక పరోక్ష రీతిలో ఈ అకాడమీకి అనుబద్ధములై 363 అవేషణా సంస్థలు కలవు (1968). మశూచి, మలేరియా, కండ్ల కలకల బాధలనుండి దేశము నిశ్శేషముగ విముక్తమైనది.

దేశమున వైద్యవిద్యను బోధించు సంస్థలసంఖ్య 98; అందలి విద్యార్థి సంఖ్య 3,30,100. వైద్య విద్యా బోధనా కాలవ్యవధి ఆరు సంవత్సరములు (1971-72). దేశమునందు 27,27,000 శయ్యా సంఖ్య కలిగిన 25,800 ఆసుపత్రులు కలవు (సైనిక ఆసుపత్రులు ఇందు చేరవు). వైద్య సేవా కృషిని సాగించు వైద్యుల సంఖ్య 6,46,000.

దేశీయులు తమ సెలవు కాలములను హాయిగ గడపుటకును, యేవియైన రోగ బాధలున్నయెడల వానికి తగిన చికిత్సలను పొందుటకును, విశ్రాంతి గృహములను, ఆరోగ్యాశ్రమములను ప్రభుత్వము అటనట విరివిగ నెలకొల్పినది. ఇటుల ఒకే పర్యా యమున 750 వేల మందికి వసతిని కల్పింపగల

ఇట్టి సంస్థలు కలవు. అతి సామాన్య కార్మికునికి సైతము ఇట్టి సంస్థలు అందుబాటులో కలవు. 24 రోజులు ఒక విశ్రాంతి గృహమున గడపుటకు వ్యయము 60–90 రూబులుల మధ్య ఉండును.

**12. యాత్రా సౌ.** : గత కొలది సంవత్సరములలో దేశమున విలాస యాత్రా సౌకర్యములు విరివిగ అభివృద్ధి చెందినవి. విదేశీయ యాత్రికులు, తగు ప్యాస్‌పోర్టు మొదలగు పత్రములను కలిగియున్నయెడల, 5 నుండి 7 దినములవరకు దేశమున పర్యటించుటకు వీసాలను పొందవచ్చును. 1968 లో 16,76,200 మంది విదేశీయులు దేశమును దర్శించిరి. అయినను విదేశీయులకన్న మిన్నగ దేశీయులే ఈ యాత్రా సౌకర్యములను విరివిగ వాడుకొనుచున్నారు. 1972 లో ట్రేడ్ యూనియనుల ఆధ్వర్యవమున 2.8 కోట్ల దేశీయులు ఈ వివిధ యాత్రా కేంద్రములను సందర్శించిరి; ఇంతేగాక విదేశ యాత్రలందు సైతము దాదాపు 10 లక్షల సోవియెట్ దేశీయులు పాల్గొనిరి (1972).

**13. ప్రసిద్ధ పౌరులు** : విప్లవ కాలమునను, తత్పూర్వమునను, విప్లవానంతరమునను ప్రపంచ ప్రసిద్ధ క్రాంతికారులు, రచయితలు, వైజ్ఞానికులు పలువురు ఈ దేశమున జన్మించిరి. రచయితలు, వైజ్ఞానికులలో పలువురు నోబెల్ బహుమతులను ఆర్జించిరి. వారి అందరి పేరులను ఇచట ఇచ్చుటకు అవకాశము తక్కువ. అతి ప్రసిద్ధులగు కొలదిమందిని నామమాత్రముగ దిగువ పేర్కొనుట జరిగినది : 1. యన్. లెనిన్ అను పర్యాయ నామమున ప్రసిద్ధిని ఆర్జించిన వ్లాడిమిర్ ఇల్యిచ్ ఉలియనోవ్ (1870-1924) : విప్లవకారుడుగను, మార్క్సీయ సిద్ధాంత వేత్తయగు రాజనీతిజ్ఞుడుగను పేరొంది సామ్యవాద బద్ధమగు సోవియెట్ యూనియన్‌కు తొలుతటి రూపరేఖలను సంతరించినవాడు; 2. లియాన్ ట్రాట్‌స్కీ అను పర్యాయనామము కలిగిన లెవ్ దేవిడోవిచ్ బ్రాన్‌ష్టీన్ (1879-1940) : విప్లవమున పాల్గొని సోవియెట్ యూనియన్‌యొక్క సేనా నివహమునకు తొలుతటి రూపమును కల్పించినవాడు; 3. జోసెఫ్ స్టాలిన్ అను పర్యాయనామము కలిగిన అయోసిఫ్ విస్సారియోనోవిచ్ జుగష్విలీ (1879-1953) : లెనిన్ అనంతరమున అధికారమును వహించి, సామ్యవాద సమాజమునకు గట్టి పునాదులను ఏర్పరచుటయేగాక, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున జర్మన్ సేనానివహములను దేశమునుండి తరిమివైచి ఓడించుటలో నాయకత్వమును వహించినవాడు; 4. ఫియోదోర్ మైకోలోవిచ్ దోస్తోయెవ్‌స్కీ (1821-81) : ప్రపంచ ప్రసిద్ధ నవలా రచయిత; 5. లెవ్ నికొలయ్‌విచ్ టాల్‌స్టాయ్ (1828-1910) : రచయిత; సత్యాహింసలపై ఆధారపడిన నవసమాజ నిర్మాణమును సంభావించిన తాత్త్వికుడు; 6. మాక్జిమ్ గోర్కీ అను పర్యాయనామము కలిగిన అలెక్సీ మాక్సిమోవిచ్ పెష్కోవ్ (1868-1936) : తన రచనలచే విప్లవ భావములకు దోహదము కల్పించినవాడు; 7. యాన్‌తోన్ పవలోవిచ్ చెకోవ్ (1860-1904) : ప్రసిద్ధ నాటక, నవలా, కథానికా రచయిత; 8 బోరిస్ లియొనీడోవిచ్ పాస్తర్‌నాక్ (1890-1960) : 'డాక్టర్ జివాగో' అను సంచలనాత్మక గ్రంథమును రచించి నోబెల్ బహుమతిని ఆర్జించిన రచయిత; 9. డిమిత్రీ ఇవనోవిచ్ మెండెలెయేవ్ (1834-1907) : ఆవర్తన (పీరియాడిక్) పట్టికను కనుగొనిన రసాయన శాస్త్రవేత్త. 10. నికొలాయ్ ఇవనోవిచ్ లొబచేవ్‌స్కీ (1792-1856) : యూక్లిడేతర జ్యామితికి శ్రీకారమును చుట్టినవాడు; 11. ఇవాన్ పెట్రోవిచ్ పవ్‌లావ్ (1849-1936) : జంతువులందును, మానవులందును, జీర్ణకోశ గ్రంథులు, తంత్రీమండలము పనిచేయు తీరుతెన్నులను గురించి పలు విషయములను కనుగొని

1904 లో నోబెల్ బహుమతిని ఆర్జించిన వైజ్ఞానికుడు.

ఈ దేశమున అంతర్భాగములగు ఉజ్‌బెక్‌స్తాన్ మొదలగువానిలో విప్లవమునకు పూర్వముననే మధ్యయుగములందు ప్రపంచ ప్రసిద్ధులగు రచయితలును వైజ్ఞానికులును జన్మించిరి; అట్టివారిలో తాజిక్‌స్తాన్ వాసియగు రుదాకీ కవి (మ. 941); ఉజ్‌బెక్‌స్తాన్‌లో బొకారో ప్రాంతమున వసించి, అవిసెన్నా అను పర్యాయనామముతో వైజ్ఞానికుడుగను, అరబ్బీ రచయితగను పేరొందిన హుసేన్ ఇబ్న్ అబ్‌ద్ అబ్‌దుల్లా ఇబ్న్ సినా (980 ? - 1037); అజర్ బైజాన్‌వాసియై, పారసీక భాషా కవిగ పేరొందిన నిజామీ (1141-1203) లెక్కింపదగినవారు.

---

# 24. రుమేనియా

**ముఖ్యనగరము :** బుఖారెస్ట్; **జెండా :** నీలము, పసిమి, ఎరుపు నిలువు చారలు కలిగి, దానిమధ్యన దేశీయ యోధలాంఛనము కలది; **జాతీయ గీతము :** 'తే స్లావిమ్ రొమీనీ, పామింట్ పరింతేసే'




పటము 23.

(జయతు మా జన్మభూమీ, రుమేనియా) అను చరణము తొలుత కలది; **నాణెము :** లియూ; ఇది 100 బానీలుగ విభక్తము; 1 లియూ = రు. 1.25; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాల గణన :** సా. 2 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** ఆగ్నేయ యూరపున 48°15' - 43°37' ఉ. అ. రేఖల మధ్యను, 20°15' - 29°41' తూ. తు. రేఖల నడుమను వ్యాపించియున్న ఈ దేశమునకు ఉత్తర, వాయవ్యములందు సోవియెట్ దేశమును, దక్షిణమున బల్గేరియాయు, పశ్చిమమున యుగోస్లావియా, హంగరీలును, తూర్పున నల్లసముద్రమును సరిహద్దులందు ఉన్నవి. తూర్పు - పడమరల గరిష్ఠపు నిడివి 784 కిమీ.; ఉత్తర - దక్షిణముల గరిష్ఠపు కొలత 472 కిమీ. దేశపు వైశాల్యము 2,37,500 చ. కిమీ.

ఈ దేశమునకు వెన్నెముకవలె కార్పేతియన్ పర్వతములు వ్యాపించి ఉన్నవి. ఇవి తొలుత ఆగ్నేయ దిశగ పయనించి, అంతట పశ్చిమమునకు పోవుచున్నవి. వీనిలో దక్షిణ భాగమునకు ట్రాన్సిల్వేనియన్ ఆల్ప్సు అను పేరు కలదు; ఇందలి మోల్డో వెనూల్ శిఖరము (2,542 మీ.) దేశపు శిఖరములందెల్ల అత్యున్నతము. దేశపు నదులలో తూర్పునఉన్న ప్రూత్, దక్షిణమునఉన్న డాన్యూబ్ నది, ట్రాన్సిల్వేనియన్ పర్వత పరీవాహ ప్రాంతమునకు చెందిన మూరీస్, సోమీస్ పేర్కొనదగినవి. నల్లసముద్ర తీరపు నిడివి 243 కిమీ.

**2. శీతోష్ణస్థితి మొ.:** సరాసరి ఉష్ణోగ్రత. జనవరిలో 25° ఫా. నుండి 32° ఫా. వరకు మారు చుండును. డాన్యూబ్ నదీ లోయయందు ఎండ కాలమున దేశపు అత్యధిక ఉష్ణోగ్రత (75° ఫా.) వేద్యమగును. వాయవ్య, ఆగ్నేయ ప్రాంతములందు మొత్తముమీద ఉష్ణోగ్రత చాల తక్కువ. పశ్చిమ నుండి, తూర్పునకు పోవుకొలది వర్షపాతపు ప్రమాణము క్రమేణ తగ్గుచుండును. పర్వత ప్రాంతము లందు సాలీనా వర్షపాతము 100-125 సెం. మీ. మధ్య మారుచుండును; నదుల డెల్టాలలో అది 38 సెం. మీ. వరకు ఉండును.

పర్వత భూములందు ఆకురాల్చు తరగతి చెట్ల అడవులు కలవు; తక్కిన ప్రాంతములందు గరిక పట్టులు ఎక్కువ. అడవులలో గోధుమరంగు ఎలుగు, తోడేలు, అడవిపంది, గుంటనక్క కన నగును.

**3. జనసంఖ్య మొ.:** 1970 లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 2,02,52,541 దేశపు జనసాంద్రత చ. కిమీ. కు 86.2. ప్రజలలో 41% పట్టణములందు వసించుచున్నారు. పట్టణము లలో బుఖారెస్ట్ (జ. సం. 14,88,328), బ్రసోవ్ (1,85,259), క్లుజ్ (2,05,435), ప్లోస్టి (1,65,721), కాన్‌స్టాంటా (1,76 234), తిమి సోరా (1,95,470) పేర్కొనదగినవి. ప్రజలలో రుమేనియనులు 87.7%, హంగేరియనులు 8.4%, జర్మనులు 2% కలరు. తక్కిన అత్యల్ప సంఖ్యా కులలో యుక్రేనియనులు, జిప్సీలు, రష్యనులు, సెర్బులు, క్రోటులు, యూదులు, తాతారులు, స్లోవా కులు చేరియున్నారు. జాతీయభాష రుమేనియన్; ఈ భాషలో దాదాపుగ 90% వరకు లాటిన్ పదములు కలవు. ట్రాన్‌సిల్వేనియా ప్రాంతమున, అత్య ధిక సంఖ్యాకుల మాతృభాష హంగేరియన్. ప్రజ లలో 80% రుమేనియన్ ఆర్థడాక్స్ చర్చియను క్రైస్తవ సంప్రదాయమునకు చెందినవారు. తక్కిన వారిలో వివిధ సంప్రదాయముల క్రైస్తవ శాఖలు వ్యాప్తిలో ఉన్నను, కేతలిక్ శాఖవారికి రోము లోని పోపుతోగల సంబంధములు, ప్రభుత్వపు జోక్యమువలన 1948 లో తెగత్రెంపు లయినవి. యూదులు అత్యల్ప సంఖ్యలలో కలరు. నిరీశ్వర వాదమునకు వ్యాప్తిని ఎక్కువగ కల్పించుట ప్రస్తుత ప్రభుత్వపు ధ్యేయము.

**4. సమాచార సౌ:** తంతి తపాలా, టెలి ఫోను వసతులు అన్నియు ప్రభుత్వాధీనమున నడచుచున్నవి. 52 బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులును, 111 టెలివిజన్ స్టేషనులును పనిచేయు చున్నవి.

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 12,896 కిమీ.; అందు 9,082 కిమీ. అత్యాధునిక రీతికి చెందినవి. రైలుమార్గముల నిడివి 10,920 కిమీ (1971). దేశపు విదేశ వ్యాపారమునకు స్థావరమగు కాన్‌స్టాంటా, నల్లసముద్ర తీరమున ఉన్నది. దేశపు వర్తక నౌకాదళపు మొత్తపు ప్రమాణము 5,00,000 టన్నులు; అందలి నౌకల సంఖ్య 53 (1971). డాన్యూబ్, ప్రూత్ నదులు దేశాంతర్గత జలమార్గములుగ ఉపకరించుచున్నవి. డాన్యూబ్ నదిమీద ఉన్న రేవులలో గలాతీ, బ్రయిలా, గియుర్ జిన్ ప్రముఖములు. దేశీయమగు 'తరోమ్' విమానయానసంస్థ, దేశాం తర్గత విమానయానమును, దేశమునుండి ప్రముఖ యూరపీయ నగరములకు విమానయానమును నిర్వ హించుచున్నది. కొన్ని విదేశముల విమానయాన సంస్థలును ఈ విదేశీయ విమానయానమున పాల్గొను చున్నవి. బుఖారెస్ట్‌లోని ఓతోపేనీ విమానాశ్ర యము. విదేశీయ విమానయానమున ఒక ముఖ్య మైన మజిలీ.

**6. చరిత్ర:** ఈ దేశమునందలి దేసియా ప్రాంతమున, క్రీ. శ. 2 వ శతాబ్దిలో రోమనులు

వలస చేరుటతో ఈ దేశపు చరిత్ర మొదలైనదని చెప్పవచ్చును. వారి కాలమున క్రైస్తవ మతము ఇట కాలూనినది. క్రీ. శ. 3 వ శతాబ్దమున, రోమనుల అధికారము అంతరించినంతట, అనాగరిక జాతుల వారనేకులు దేశమును 7 వ శతాబ్దివరకు సంక్షోభపరచిరి. 7 వ శతాబ్దిలో వాలేచియనులను పేర ఈ దేశీయులు ఒక స్వతంత్ర ప్రతిపత్తిని ఆర్జించిరి. కాని అనతికాలముననే మంగోలులకు లోబడవలసి వచ్చినది. తరువాత 13 వ శతాబ్ది అంతమునను, 14 వ శతాబ్ది ఆరంభమునకు వాలాచియా, మాల్దేవియా అను రెండు దేశీయ రాజ్యములు ఇట ప్రక్క-ప్రక్కన వెలయుటతో దేశపు చరిత్రలో ఒక నూతనాధ్యాయము మొదలైనది. కాని 1513 నాటికి ఈ రెండు రాజ్యములును తుర్కీ ప్రభుత్వమునకు లొంగినవి. అంతట దాదాపు మూడువందల సంవత్సరముల తరువాత తుర్కులను ఓడించి, మాల్దేవియాలోని బెస్సరేబియాను రష్యా వశపరచుకొనినది (1812) క్రిమియా యుద్ధము ముగిసిన తరువాత (1856) పారిస్ కాంగ్రెస్ నిర్ణయములను అనుసరించి వాల్చేవియా, మాల్దేవియాలకు కొంత స్వపరిపాలనా ప్రతిపత్తి లభించుటయేగాక, బెస్సరేబియాయు తిరిగి మాల్దేవియాకు లభించినది. ఈ రెండు ప్రాంతములును 1859 లో రుమేనియా, అనుపేర ఏకరాజ్యముగ రూపొంది తుర్కీ-దేశపు సార్వభౌమత్వమునకు లొంగియుండి, ఒక రాజరికపు పాలనకు అంగీకరించినను, 1866 లో ఆ రాజరికమును తొలగించి కెరోల్ I అనువానిని రాజుగ గ్రహించినవి. 1878 లో తుర్కీ-దేశపు ఆధిపత్యమును అంతరింపజేసి రుమేనియా స్వతంత్ర రాజ్యమైనది. కాని బెస్సరేబియాను రష్యాకు వదలుకొనవలసి వచ్చినది. 1912-13 లో బాల్కన్ యుద్ధముల ఫలితముగ దక్షిణ దోబ్రుజా ప్రాంతము రుమేనియాకు లభించినది.

ప్రథమ ప్రపంచ యుద్ధమున, మిత్రరాజ్యముల పక్షమున పోరాడిన ఫలితముగ రష్యానుండి బెస్సరేబియాయు, ఆస్ట్రియానుండి బుకోవినాయు, హంగరీనుండి ట్రాన్‌సిల్‌వేనియాయు రుమేనియాకు లభించినవి. కాని 1940 లో జర్మనీదేశపు ఒత్తిడికి లోనై, బెస్సరేబియాను బుకోవినాను రష్యాకును, ఉత్తర ట్రాన్‌సిల్‌వేనియాను హంగరీకిని, దక్షిణ దోబ్రుజాను బల్గేరియాకును ఈ దేశము అప్పగించవలసి వచ్చినది. ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున తొలుత ఈ దేశపు ప్రభుత్వము అక్షరాజ్యముల పక్షముననే ఉన్నను, ప్రజల తిరుగుబాటువలన ఒక నూతన ప్రభుత్వము ఏర్పడి, ఆ ప్రభుత్వము మిత్రరాజ్యముల పక్షమున చేరినది. 1945, మార్చిలో కమ్యూనిస్ట్ పక్షపు నాయకత్వమున ఒక మిశ్ర ప్రభుత్వము ఏర్పడి, అనతికాలముననే రాజరికమునకు స్వస్తి చెప్పబడినది (డిసెంబరు 30, 1947); అంతట రుమేనియా ప్రజా గణ రాజ్యము అవతరించినది. పూర్వపు రుమేనియాకు 1941 లోఉన్న సరిహద్దులే, హంగరీ తప్ప తక్కిన రాజ్యములతో, యథాతథముగ ఉండుటకును, హంగరీతో మాత్రము 1938 సరిహద్దు పునరుద్ధరితమగుటకును అంగీకారము కుదిరి, అవియే ఇప్పటికిని కొనసాగుచున్నవి.

**7. పరిపాలన :** 1965, ఆగస్టు 21 న ఆమోదితమైన రాజ్యాంగ విధానమును అనుసరించి ప్రస్తుతమున పరిపాలన నిర్వహింపబడుచున్నది. ఇప్పుడు అచట సోషలిస్ట్ గణరాజ్య పద్ధతి అమలున ఉన్నది. ప్రజలలో 18 ఏండ్ల వయసునకు తగ్గని వారికి అందరికి వోటుహక్కు కలదు. దేశమున కమ్యూనిస్ట్ పార్టీకి అత్యధిక ప్రాబల్యము కలదు. ఆ పార్టీ ఆధిపత్యమున ఉండు సోషలిస్టు ఐక్యవేదికయే మహాజాతీయ సభ అనదగు శాసన సభకు అభ్యర్థులను నిర్ణయించును. ఇట్టి ఏకపట్టికా రీతిని ఆ జాతీయ సభలో 465 స్థానములకును

ఎన్నికలు జరుగును. వీరి పదవీకాల పరిమితి ఆయి దేండ్లు. సంవత్సరమునకు రెండుసారులు మాత్రమే ఈ జాతీయ సభ సమావేశమగును. అది సమావేశముకాని కాలమున శాసన నిర్మాణమును జరుపుటకు ఒక రాజ్యసభ కలదు; ఇందు ఒక అధ్యక్షుడు, నలుగురు ఉపాధ్యక్షులు, ఒక కార్యదర్శి, 22 మంది సభ్యులు ఉందురు. వీరిని జాతీయ సభయే ఎన్నుకొనును. రాజ్యసభాధ్యక్షుడే దేశపు అధినేతగ వ్యవహరించును. దేశీయ, విదేశీయ వ్యవహారములందు, రాజ్యసభకు సలహాదారుగ సోషలిస్ట్ ఐక్య వేదిక పనిచేయును. ఈ విధముగ కమ్యూనిస్ట్ పార్టీ దేశ వ్యవహారములపై పలుకుబడిని కలిగి వ్యవహరించును. కమ్యూనిస్ట్ పార్టీలోని సభ్యసంఖ్య 21 లక్షలు (1971).

ప్రజలు ఎన్నుకొనిన సంస్థలద్వారా స్థానిక పాలన నిర్వహింపబడుచున్నది. సుప్రీమ్ కోర్టులోని జడ్జీలను మహా జాతీయ సభయే ఎన్నుకొనును; వీరిలో ప్రతియొకని పదవీకాల పరిమితి 4 ఏండ్లు; దిగువ కోర్టులకు న్యాయాధీశులను ఆయా ప్రజా సంస్థలు ఎన్నుకొనును. వకీళ్లు సొంతముగ వృత్తిని నిర్వహించు అధికారము లేదు. న్యాయశాఖ నియమించు రీతిలో ఆయా వివాదములందు న్యాయవాదులు పాల్గొనవలెను.

**8. దేశరక్షణ :** నిర్బంధ సైనిక శిక్షణ దేశమున అమలున ఉన్నది. దేశపు సైన్యమున మొత్తముమీద 150 వేలమంది సైనికులును, 50,000 భద్రతాదళ సైనికులను కలరని తెలియుచున్నది (1969). నౌకాసేనయందు 8,000 సైనికులును, 82 వివిధ తరగతుల యుద్ధోపయోగ నౌకలును కలవు. వాయుసేన యందలి సైనిక సంఖ్య 15,000; పోరాటపు విమానములు 260 కలవు

**9. అంతర్జాతీయ సం. :** 1955 మొదలుగ ఈ దేశము ఐ.రా.స. యందును, దానికి చెందిన వివిధ ప్రత్యేక సంస్థలందును సభ్యత్వమును కలిగి యున్నది. వార్సా ఒడంబడిక వ్యవస్థ యందును, కమ్యూనిస్టు ఆర్థిక పరస్పర సాహాయ్య వ్యవస్థ యందును, డాన్యూబ్ కమీషన్‌లోను, ఇంకను పెక్కు అంతఃప్రభుత్వ సంస్థలందును ఈ రాజ్యము సభ్యత్వమును ఆర్జించినది. కమ్యూనిస్ట్ రాజ్యమే యైనను, కొన్ని విషయములందు, తక్కిన కమ్యూనిస్ట్ రాజ్యములకు భిన్నముగ వ్యవహరించుచు ఈ రాజ్యము కొంత స్వతంత్రతను ప్రదర్శించుచున్నది; పశ్చిమ రాజ్యములతో వ్యాపారరీత్యా సాన్నిహిత్యమును పెంపొందించుకొనినది; చీనా-సోవియెట్ వివాదమున దాదాపుగ తాటస్థ్యము వహించినది; జెకోస్లోవాకియాలో 1968 న సోవియెట్ దేశము జోక్యము వహించగ, ఆ చర్యను ఈ దేశము విమర్శించినది.

**10. ఆర్థిక రంగము.** ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వమున ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ, అటవీ పరిశ్రమలపైన ఎక్కువగ ఆధారపడి ఉండింది; కాని యుద్ధానంతరమున పరిశ్రమలు ఎక్కువగ అభివృద్ధి చెందుటవలన, 1967 లో వ్యవసాయ, అటవీ పరిశ్రమలవలన, సమష్టి జాతీయోత్పత్తిలో 22% లభించగ, పరిశ్రమల వలన 32.9% లభించినవి తదాదిగ పరిశ్రమలు ఇంకను ముందునకు పోగలుగుచున్నవి. సాలీనా 11-12% న పరిశ్రమలలో అభివృద్ధిని సాధించుట నాలుగవ పంచవర్ష ప్రణాళిక (1971-75) యొక్క ధ్యేయము.

వ్యవసాయ రంగమున 9,728 వేల హెక్టేరులు పైరు పంటలకును, 4,429 వేల హెక్టేరులు పశువుల బీడులుగను, 778 వేల హె. ఫలవృక్షముల పెంపకమునకును వినియుక్తములు (1971). దేశపు

మొత్తపు వైశాల్యమున 63% పైరీతిగ వ్యావసాయిక భూమిగ ఉన్నదని చెప్పవచ్చును. ఈ సేద్యపు భూమిలో 93.4%, సోషలిస్ట్ విధానమును అనుసరించి సమష్టి వ్యవసాయముననను, ప్రభుత్వ క్షేత్రముల అధీనముననను ఉన్నది; సమష్టి వ్యవసాయ భూముల మొత్తపు వైశాల్యము 90 లక్షల హె.; ప్రభుత్వ క్షేత్రముల వెరశి వైశాల్యము 21 లక్షల హె. (1971). స్వంత కమతముల విస్తీర్ణము చాల తక్కువ. వ్యవసాయమున యంత్రములు విరివిగ వాడబడుచున్నవి. ట్రాక్టర్ల మొత్తపు సంఖ్య 1,98,596. నీటిపారుదల వసతులు 9,56,700 హె. కు కలవు (1971). ఆ యా పంటల ఉత్పత్తులు వేల టన్నులలో ఈ దిగువ రీతిగ కలవు (1971); గోధుమ 5,595; బార్లీ 789; మొక్కజొన్న 7,850; ఉరల గడ్డలు 3,783; ప్రొద్దుతిరుగుడు గింజలు 791; చక్కెర బీటు 4,321. ద్రాక్ష ఫలముల ఉత్పత్తిలో, ప్రపంచ రాజ్యములందు, ఈ రాజ్యము ఏడవ స్థానమున ఉన్నది. దేశమున 6,54,000 గుర్రములు; 55,28,000 గోజాతి; 77,42,000 పందులు; 1,40,71.000 గొర్రెలు; 6,12,62,000 కోళ్లు కలవు (1972). ఈ దేశము ఆహారవిషయమున స్వయంపోషక మగుటయేగాక అందు కొంత భాగమును ఎగుమతి చేయగలుగు చున్నది.

దేశపు భూతలమున 27% (63.1 లక్షల హె.) అటవీమయము. 1948 లో ఈ సంపదయంతయు జాతీయము చేయబడినది. 1971 లో 55,616 హె. లు క్రొత్తగ అటవీ కృషిలోనికి తేబడినవి. మొత్తము సేకరింపబడిన కలప 55 లక్షల ఘ. మీటరులు (1971). మత్స్య పరిశ్రమ డాన్యూబ్ నదిని, నల్లసముద్రమును ఆశ్రయించి ఎక్కువగ సాగుచున్నది. చేపల పట్టుబడి 40,500 టన్నులు (1968)

యూరపులోని దేశములందు, సోవియట్ యూనియన్ తరువాత, పెట్రోలియపు ఉత్పత్తిలో ఈ దేశమే తొలుతగ ఎన్నదగినది. పెట్రోలియమునకు సంబంధించిన అన్వేషణాదుల సాంకేతిక విధానమునను ఈ దేశము చాల ముందంజ వేసినది. తక్కిన ఖనిజోత్పత్తులలో ఇంధనవాయువు, బొగ్గు, లిగ్నైట్, ఇనుము, రాగి, బాక్సయిట్, క్రోమియం, మాంగనీసు, యురేనియమ్ పేర్కొనదగినవి. ముడి పెట్రోలియం కొంత ఎగుమతి చేయబడుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 3,945.4 కోట్ల కివా. (1971).

దేశమున ఇనుము, ఉక్కు, రసాయనపు ఎరువులు, రసాయనిక లవణములు, సిమెంట్, చక్కెర, ఖాద్య తైలములు, వెన్న, జవుళీ, సిల్కు, ఉన్ని, రేడియో సెట్లు టి. వి. సెట్లు, బైసికిళ్ళు, కుట్టు యంత్రములు, పాదరక్షలు, రిఫ్రెజిరేటర్లు అను వివిధ వస్తూత్పత్తులకు సంబంధించిన పరిశ్రమలు కలవు. యంత్ర నిర్మాణ పరిశ్రమలో ట్రాక్టర్లు, ఓడలు, డీజెల్ యంత్రములు మొదలగునవియు ఉత్పత్తి అగుచున్నవి. దేశపు ఎగుమతుల విలువలో 18% యంత్ర పరికరముల ఎగుమతివలన లభించుచున్నది (1964); ఎగుమతులలో పెట్రోలు, దాని ఉత్పత్తులు, సిమెంట్, ఆహార ధాన్యములు, కలప, ట్రాక్టర్లు, పెట్రోలు త్రవ్వకపు పరికరములు, సిమెంటు మిల్లుల పరికరములు రసాయనిక కర్మాగార పరికరములు, నూనెశుద్ధి కర్మాగార పరికరములు, నౌకా నిర్మాణ పరికరములు ప్రముఖములు. దిగుమతులలో ముడి ఇనుము, పారిశ్రామికపు కోకు, ఇనుప రేకులు, విద్యుత్పరికరములు, మోటారు కారులు, పారిశ్రామిక వ్యావసాయిక పరికరములు పేర్కొనదగినవి. మొత్తపు ఎగుమతుల విలువ 1,260.6 కోట్ల లియీ. దిగుమతులవిలువ 1,261.6 కోట్ల లియీ. (1971). ఇందు 55% కమ్యూనిస్ట్ రాజ్యములతో జరిగినది. బడ్జెటరీ వ్యయము 13,423.7 కోట్ల లి. (1971).

**11. సాంఘిక రంగము :** 1940 లోని భూకంపపు ఫలితముగను, ద్వితీయ ప్రపంచ యుద్ధము వలనను, దేశమున గృహవసతికి తీవ్ర మగు నష్టము కలిగినది. ఈ నష్టమును పూరించి తగు గృహవసతిని ప్రజలకు కల్పించుటకై 1951 మొదలుగ ప్రభుత్వము చాల కృషి చేసినది; ప్రభుత్వము ఒక ప్రణాళికను అనుసరించి గృహ నిర్మాణమును సాగించుటయేగాక, 1965 మొదలుగ వ్యక్తులు సైతము స్వయముగ ఇండ్లు నిర్మించుకొనుటకు తగు సాహాయ్యమును కల్పించినది. ఇందువలన గృహసమస్య చాలవరకు పరిష్కృతమైనది. ప్రతి వ్యక్తికి నివాసమునకై 8 చ. మీ. ల గృహవసతి ఉండి తీరవలయునను నియమము పాటింపబడు చున్నది. దేశమున నిరక్షరాస్యత కన్పట్టదు. 6 నుండి 16 ఏండ్ల వరకు వయసు కలవారికి నిర్బంధోచిత విద్యావిధానము అమలున ఉన్నది. 10,809 శిశు విహారములలో 5,06,435 మంది; 15,503 సాధారణ పాఠశాలలలో 31,92,566 మంది; 303 ప్రత్యేక విద్యాశాలలలో 1,28,525 మంది; 409 వృత్తి విద్యాసంస్థలలో 2,10,364 మంది; 248 ఉన్నత వృత్తి విద్యాశాలలలో 34,292 మంది విద్యార్థులు కలరు (1971-72). దేశమున ఆరు విశ్వవిద్యాలయములు (బుకారెస్ట్, క్లజ్, తిమిసోరా, క్రయివోవా, ఇయాసీ, బ్రసోవ్) కలవు; వీనియందును తక్కిన ఉన్నత విద్యా సంస్థలందును కలసి 1,48,428 మంది విద్యార్థులు కలరు (1971-72). దేశపు గ్రంథాలయములలో అకాడమీ గ్రంథాలయము, కేంద్ర గ్రంథాలయము ప్రముఖములు; ఈ రెండింట మొత్తముమీద 1,070 లక్షల గ్రంథములు కలవు. దేశమునఉన్న 261 మ్యూజియములలో బుఖారెస్ట్‌లోని చరిత్ర మ్యూజియమ్, ప్రకృతిశాస్త్ర మ్యూజియమ్, జాతీయకళల మ్యూజియమ్ ప్రముఖములు. 57 దినపత్రికలు దేశమున ప్రచారమున ఉన్నవి; వానిలో 'సింటియా' అను కమ్యూనిస్ట్ పార్టీ పత్రిక విపుల ప్రచారమును కలిగియున్నది.

సాంఘిక భద్రతా వసతులు, కార్మికులకు అందరికిని కలవు. 62 ఏండ్లు దాటిన పురుషులకును, 57 ఏండ్లు దాటిన స్త్రీలకును పెన్షన్ వసతులు ఏర్పడియున్నవి. 1,73,296 శయ్యా సంఖ్య కలిగిన పలు రీతుల వైద్యశాలలు కలవు; అందలి వైద్య సంఖ్య 31,246 (1971). మలేరియా, గవదబిళ్ళ జబ్బు నిర్మూలింపబడినవి.

**12. యాత్రా సౌ. :** యాత్రికులకు తగు సౌకర్యములను ఏర్పరచి, ప్రభుత్వము ప్రోత్సాహమును కల్పించి, విదేశీ వినిమయ ద్రవ్యమును ఆర్జించుటకు కృషి చేయుచున్నది. పాస్‌పోర్టు, వీసాలు విదేశీయ యాత్రికులు కలిగియుండవలయును. దాదాపు 8 లక్షల మంది విదేశీయులు 1966 లో దేశమును దర్శించిరి. డాలరుకు 18 లియూల చొప్పున వినిమయ ద్రవ్యమును చెల్లించి ప్రభుత్వము ఈ యాత్రా పరిశ్రమకు ప్రోత్సాహమును ఇచ్చుచున్నది.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. జార్జి ఎనెస్కూ (1881-1955) : ప్రసిద్ధ వాగ్గేయకారుడు; 2. దీనూ లిపాత్తీ (1917-50) : అల్పకాలమే జీవించినను, పియానో వాదకుడుగ అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించినవాడు.

# 25. లక్జెంబర్గ్

**ముఖ్యనగరము** : లక్జెంబర్గ్; **జెండా** : పై నుండి దిగువకు ఎరుపు, తెలుపు, నీలిరంగుల అడ్డు చారలు కలది; **జాతీయ గీతము** : ఓన్స్ హేమెక్ట్ (మా జన్మభూమి); **నాణెము**.: లక్జెంబర్గ్ ఫ్రాంక్; 100 సెంటిమోలుగ ఇది విభక్తము; ఒక ల. ఫ్రాంక్ = రు 0.15; అయినను 100 ఫ్రాంకుల




పటము 24.

పైబడిన వానికి బెల్జియం దేశపు కరెన్సీయును చలామణిలో ఉన్నది; **కొలతతూకములు** : మెట్రిక్ విధానపువి; **కాలగణన** : సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : పశ్చిమ యూరపున 49°30′ ఉ. అ. న, 6′ తూ. తు. రేఖపైన నెలకొనిన ఈ చిన్న దేశమునకు ఉత్తర, పశ్చిమములందు బెల్జియం; తూర్పున పశ్చిమ జర్మనీ; దక్షిణమున ఫ్రాన్స్ సరిహద్దులందు ఉన్నవి. మొత్తపు దేశ విస్తృతి 2,586 చ. కిమీ.; ఉత్తర దక్షిణముల గరిష్ఠపు కొలత 100 కిమీ.; తూర్పు పడమరల గరిష్ఠపు వెడల్పు 61 కిమీ. పశ్చిమ జర్మనీనుండి ఈ దేశమును అవర్. సాయిర్, మోసెల్లీ నదులు వేరు చేయుచున్నవి. ఉత్తరదేశపు ఆర్డెన్నిస్ ఉన్నత భూములలో ఎత్తు 400 మీ. నుండి 490 మీ వరకు మారుచున్నది. దక్షిణ ప్రాంతము అతి సారవంతమగు నిమ్నభూమి; ఇది బాన్ పేస్ (మంచి భూమి) అను పేరున వ్యవహృతము; ఇచటి భూమి ఎత్తు 250 మీ. నుండి 375 మీ. వరకు మారుచున్నది. లోతగు లోయలు అల్లిబిల్లిగ దేశమును అలముకొని ఉండగ, అందలి నదులు తూర్పునకు ప్రవహించి సాయిర్ నదిలో సంగమించుచున్నవి; ఈ సాయిర్ నది కడకు మోసెల్లీ నదిలో కలయుచున్నది దేశమున మూడవవంతు వైశాల్యమును ఆక్రమించిన ఉత్తర ప్రాంతము అటవీమయము; అచటి నేల అంతగ సారవంతము కాదు. మోసెల్లీ నదిని ఆశ్రయించి ద్రాక్షతోటల భూమి విస్తారముగ కలదు; దక్షిణపు కొనన విలువగల ముడి ఇనుప గనులు ఉన్నవి; అటనే సికతాశిల, సున్నపురాయి కూడ విరివిగ లభించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ.** : సమశీతోష్ణతకు, సౌమ్యతకు పేరొందినది ఇచటి శీతోష్ణస్థితి. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 62° ఫా.; శీతర్తువులు బాధాకరములుగ ఉండవు; అపుడు అచటి ఉష్ణోగ్రత 32° ఫా. వర్షపాతము నైరుతి ప్రాంతమున అత్యధికము. దేశపు మొత్తమున సాలున సగటున వర్షపాతము 75 సెం. మీ. పైన్, చెస్ట్‌నట్, ఎల్మ్, బీచి వృక్షములును, కొన్ని ఫలజాతి వృక్షములును, పొదలును, పుష్పజాతులును దేశమున కననగును.

లేడి, మచ్చలలేడి, అడవిపంది మాత్రమే పేర్కొనదగు వన్య జంతువులు; పక్షి జాతులు విరివిగ కలవు; నదులలో పలురకముల మత్స్య జాతులు కలవు.

**3. జనసంఖ్య మొ.:** 1971 అంతపు లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 3 45,000. ముఖ్యనగరమగు లక్జెంబర్గ్‌లోని జనసంఖ్య 78,032. తక్కిన నగరములలో ఎష్చ్-ఆల్‌జెట్టి (జనసంఖ్య 27,539), డిఫర్‌డాంగే (17,976); దుదేలాంగే (14,625), పెతాంగే (11,903) పేర్కొనదగినవి. జనసాంద్రత చ. కిమీ. కు 130.1; దేశీయులే దేశమున అత్యధిక సంఖ్యాకులైనను 18% మాత్రము విదేశీయులు. దేశమున లెట్‌జ్‌బర్గెష్, ఫ్రెంచి, జర్మన్ భాషలు ప్రతియొకనికి సుపరిచితములు. ఇందు తొలుతటిది డచ్చిభాషకు సన్నిహితము. ప్రయిమరీ పాఠశాలలలో ఈ మూడు భాషలకు ఆదరము ఉన్నను, మాధ్యమిక విద్యయందు ఫ్రెంచి మాత్రమే వాడుకలో ఉన్నది. ప్రభుత్వ వ్యవహారములు ఫ్రెంచి భాషలోనే సాగుచున్నవి. దేశీయులలో అత్యధిక సంఖ్యాకులు క్రైస్తవ మతమందలి రోమన్ కేతలిక్ సంప్రదాయమునకు చెందినవారు; దేశమున చట్టరీత్యా మత స్వాతంత్ర్యము అమలున ఉన్నది. ప్రాటెస్టంట్ శాఖకు చెందినవారును, యూదులును కలసి 3% కన్న ఎక్కువ లేరు.

**4. సమాచార సౌ.:** 100 తపాలా ఆఫీసులును, 478 టెలిగ్రాఫ్ ఆఫీసులును కలవు. టెలిఫోనుల సౌకర్యము చాల విరివిగ కలదు. ఒక రేడియో ప్రసార కేంద్రము, ఒక టెలివిజన్ కేంద్రము పనిచేయుచున్నవి (1971).

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 4,949 కిమీ.; ఇందు 2 831 కిమీ. ప్రభుత్వపు రోడ్లు; తక్కినవి స్థానిక సంస్థలకు చెందినవి. రైలుమార్గపు నిడివి 271 కిమీ.; ఈ మార్గము బెల్జియంతోను, ఫ్రాన్సుతోను ఈ దేశమును అనుసంధించుచున్నది. ఫ్రాన్సులోని పారిస్ మొదలగు నగరములకు ఇటనుండి నేరుగ రాకపోకల వసతి కలదు. మోసెల్లీ నదిలో నౌకాప్రయాణపు వసతులు కలవు; 1,500 టన్నుల ప్రమాణమునకు మించని నౌకలు అందు పయనించగలవు. ముఖ్యనగరపు సమీపమున ఫిండెడ్ విమానాశ్రయము కలదు. ఇది పలు విదేశీయ విమానయాన సంస్థలకు మజిలీగ ఉపకరించుచున్నది.

**6. చరిత్ర:** క్రి. శ. 963 లో సీజిఫ్రాయిడ్ అను యోధుడు, ప్రస్తుతమున లక్జెంబర్గ్ నగరము ఉన్న ప్రదేశముననే, లుసిలిన్ బర్‌హుక్ (చిన్న దుర్గము) అను కోటను నిర్మించి, జనావాసములను నెలకొల్పుటతో ఈ దేశపు చరిత్ర మొదలయ్యెనని చెప్పవచ్చును. దేశము విస్తృతియందు పెద్దది గాకపోయినను ఇచటి రాజులు మధ్యయుగపు యూరపీయ రాజకీయములలో ప్రముఖ పాత్రలు వహించిరి. ఆ కాలమున ఈ దేశమును ఏలిన ప్రభువులలో నలువురు, అంతటంతట, పవిత్ర రోమక సామ్రాజ్యమునకు చక్రవర్తులుగ ఎన్నికకాగలిగిరి. వారిలో చార్లెస్ IV ప్రముఖుడు (1346-78 ప.). తన మాతృభూమియగు లక్జెంబర్గ్ ప్రాంతమునకు 'డచ్చీ' (మాండలిక రాజ్యము) అను ప్రత్యేక ప్రతిపత్తిని అతడు కల్పించెను. అతని తరువాతివారి కాలమున దేశము పేదవడి, క్రమముగ విదేశీయుల వశమైనది. క్రమముగ స్పెయిన్, ఆస్ట్రియా, ఫ్రాన్సు దేశముల పాలనలో దాదాపు 400 సంవత్సరముల పైకాలము ఈ దేశము అడగియుండినది. 1815 న వియెన్నా కాంగ్రెస్ చేసిన నిర్ణయముల ఫలితముగ ఈ దేశము గ్రాండ్ డచ్చీ (మహా మండలము) అను ప్రతిపత్తితో స్వతంత్రతను పొందినది; కాని నెదర్‌లాండ్స్ దేశపు పాలకుడే దీనికిని పాలకుడుగ ఉండుటకు అపుడు ఏర్పాటు జరిగినది. 1839 లో ఈ దేశ

మున అత్యధిక భాగమును బెల్జియంకు వశమైనది తరువాత లండన్ శాంతి ఒడంబడికను అనుసరించి (1867), ఈ దేశము ఒక తటస్థ రాజ్యముగ మనుగడను సాగించుటకును, లక్జెంబర్గ్ దుర్గము నిర్మూలింపబడుటకును అంగీకారము కుదిరి, దేశపు తాటస్థ్యమునకు యూరపీయ అగ్రరాజ్యములు హామీని ఇచ్చినవి. 1890 లో నస్సావ్-వీల్‌బర్గ్ వంశపు అడాల్ఫ్‌ని రాజుగ ప్రజలు గ్రహించిరి. రెండు ప్రపంచ యుద్ధముల కాలమునను జర్మన్ సేనలు ఈ దేశమును వశపరచుకొనినవి; అయినను యుద్ధానంతర కాలములందు దేశపు స్వాతంత్ర్యము పునరుద్ధరితమైనది. నస్సావ్ వీల్‌బర్గ్ రాజవంశీయుడే పాలకుడుగ ఈ దేశము తన తాటస్థ్యమును నిలుపుకొని, ఈనాడు మనుచున్నది. ఆర్థిక సౌకర్యమునకై బెల్జియం, నెదర్‌లాండ్స్‌తోకలసి ఈ దేశము ఒక ఆర్థిక మండలముగ రూపొందినది (1958). ఈ ఆర్థిక మండలమే 'బెనెలక్స్' అను సంక్షిప్త నామమున ప్రసిద్ధము.

**7. పరిపాలన :** వంశానుగతము, రాజ్యాంగ విధానబద్ధము అగు రాజవంశపు పాలన ఈ దేశమున అమలున ఉన్నది. శాసన నిర్మాణాధికారము ప్రతినిధుల సభ (చాంబెర్ డి డెప్యూటిస్) యందు న్యస్తము. వయోజన వోటింగు పద్ధతిన ఈ సభకు సభ్యులు ఎన్నుకొనబడెదరు; 5,500 మందికి పౌరులకు ఒక ప్రతినిధి చొప్పున ఈ సభలోని సభ్య సంఖ్య ఉండును. ప్రస్తుతమున ఆ సభ్యసంఖ్య 56; ప్రతినిధి సభలోని సభ్యుని పదవీకాల పరిమితి 5 ఏండ్లు. ఇదిగాక రాజ్యసభ ఒకటి వేరుగ కలదు. ఇందలి సభ్యసంఖ్య 21. వీరిని రాజే నియమించును; అటుల నియమితుడగు సభ్యుడు తన మరణముదనుక ఆ సభ్యత్వమును కలిగియుండును. ప్రతినిధుల సభచేసిన తీర్మానమున కొలది మార్పులను సూచించుటకును, ఆ తీర్మానమును అల్ప కాలము ఆపియుంచుటకును మాత్రమే రాజ్యసభకు అధికారము కలదు; అంతేగాని ప్రతినిధుల సభకు రాజ్యసభ ఏ విధముగను అడ్డుతగిలి వ్యవహరించదు. కార్యనిర్వాహణాధికారము రాజునందును, మంత్రిమండలియందును న్యస్తము. ప్రతినిధుల సభయందు అత్యధిక సంఖ్యాకుల బలము కలవానిని ప్రధానిగను, అతని సలహాపై తక్కిన మంత్రులను రాజు నియమించును. రాజ్యసభ ఎన్నుకొను ఏడుగురు సభ్యులుగల ఒక కమిటీ, పరిపాలనా విషయములకు సంబంధించిన న్యాయసూత్రములపై చరమ నిర్ణయాధికారమును కలిగిఉన్నది. దేశమున అయిదు రాజకీయ పక్షములు (క్రిస్టియన్ సోషల్, సోషలిస్ట్, డెమోక్రాట్, సోషల్ డెమోక్రాట్, కమ్యూనిస్ట్ పక్షమును) పనిచేయుచున్నవి. దేశమునఉన్న 3 జిల్లాలలో, ఎన్నుకొనబడిన స్థానిక సంస్థల సాయమున పాలన నిర్వహింపబడుచున్నది. ఫ్రాన్స్‌దేశపు న్యాయశాస్త్ర సంప్రదాయమే చాల వరకు ఇచటను అనుసరింపబడుచున్నది.

**8. దేశరక్షణ :** ఉత్తర అట్లాంటిక్ రక్షణ ఒడంబడిక (నేటో) సంస్థాపక రాజ్యములలో ఈ దేశమును చేరిఉన్నది. స్వచ్ఛందముగ సైనిక వృత్తిలో చేరిన 700 మంది సేన కలదు. నేటో సేనాబలమున ఇది ఒక అంతర్భాగము.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. సంస్థాపక సభ్య రాజ్యములలో ఈ దేశమును కలదు. యూరపీయ బొగ్గు - ఉక్కు కమ్యూనిటియొక్క ముఖ్య కార్యాలయము లక్జెంబర్గున ఉన్నది.

**10. ఆర్థిక రంగము :** దేశము చాల చిన్నదియే యైనను, పారిశ్రామికముగ అత్యంతవృద్ధిని సాధించిన రాజ్యములలో ఒకటిగ ఈ దేశము పేరు గన్నది. దేశపు భూతలమున 55% (1,34,245 హె.) వ్యవసాయమున ఉన్నది; అందు 15,000 ప్రజలు పాల్గొనుచున్నారు. బంగాళాదుంపలు, బార్లీ, **చక్కెరదీటు, ఓట్లు, గోధుమ ముఖ్యములగు**

పంటలు (1971). దేశమున పశుగణము అత్యధికము; 1,92,178 గోజాతి; 1,119 గుర్రములు; 1,06,014 పందులు, 3,642 గొర్రెలు కలవు. పాడి ఉత్పత్తులను కొంతవరకు దేశము ఎగుమతి చేయగలుగుచున్నది. ఖనిజ, లోహ పరిశ్రమలు చాల అభివృద్ధి పొందినవి. 1971 లో ముడిఇనుము 45 07,004 టన్నులు, దుక్క ఇనుము 45,88,403 టన్నులు; ఉక్కు 52,41,235 టన్నులు ఉత్పత్తి అయినది. విద్యుదుత్పత్తి 225.1 కోట్ల కివా (1971). ఉక్కు ఉత్పత్తిలో పశ్చిమ యూరపీయ రాజ్యములందు ఎనిమిదవ స్థానము ఈ దేశమునకు కలదు దేశ సంపదకు ఇదియే ముఖ్యాలంబనము. సమష్టి జాతీయోత్పత్తిలో 51% పరిశ్రమల వలనను, 6.2% వ్యవసాయము మొదలగు వానివలనను, 42.8% సంసేవా కార్యక్రమములవలనను లభించుచున్నది. సాలున దేశీయుని తలసరి ఆదాయము 1,930 యు. స్టే. డాలర్లు (1969). బెనెలక్స్ ఆర్థిక మండలమున ఈ దేశము చేరియున్నందున వేరుగ దీని ఎగుమతుల దిగుమతుల లెక్కలు తెలియవచ్చుటలేదు బడ్జెటరీవ్యయము 1,703.27 కోట్ల ఫ్రాం. (1973).

**11. సాంఘిక రంగము :** యుద్ధ ఫలితముగ దేశమున గృహవసతికి చాల నష్టము కలిగినను తరువాత జరిగిన కృషివలన, ఆ లోటు చాలవరకు చక్కజేయబడినది. 1969 లోనే దేశమున 80,800 గృహములు ఉన్నటుల తెలియుచున్నది. నిరుద్యోగ భృతి; రోగ, వార్ధక్య, అంగవైకల్య సందర్భములందు కార్మికులకు తగు సహాయ భృతులు; వృద్ధులకు పెన్షన్ సౌకర్యములు అమలున ఉన్నవి. నిరక్షరాస్యత దేశమున కన్పట్టదు. 6 నుండి 15 ఏండ్లవరకు వయసు కలవారికి నిర్బంధముగ, ఉచితముగ విద్య బోధింపబడుచున్నది. ప్రయిమరీ పాఠశాలలలోని విద్యార్థి సంఖ్య 35,737; 13 మాధ్యమిక పాఠశాలలలో 8,685 మంది విద్యార్థులు కలరు; వృత్తి విద్యాదులను బోధించు పాఠశాలలు 43 ఉన్నవి; అందలి విద్యార్థి సంఖ్య 9 904 (1971-72). దేశమున విశ్వవిద్యాలయము ఏదియు లేదు. ఉన్నత విద్యకై విద్యార్థులు బెల్జియం, ఫ్రాన్సులకు పోవుచున్నారు. దేశపు గ్రంథాలయములలో, ముఖ్యనగరమందలి జాతీయ గ్రంథాలయము ప్రముఖము; అందలి గ్రంథ సంఖ్య 3,89,000. ఆ నగరముననేఉన్న జాతీయ మ్యూజియం, దేశపు మ్యూజియములందెల్ల పేరొందినది. చక్కగ అభివృద్ధిచెందిన జాతీయ వైద్య సంసేవా కార్యక్రమము, ప్రభుత్వాధ్వర్యవమున పనిచేయుచున్నది; ఇదిగాక మత సంస్థలు నడపు వైద్యశాలలును కలవు. ఆసుపత్రుల సంఖ్య 37; వైద్యసంఖ్య 339 (1969).

**12. యాత్రా సౌ. :** రమణీయతకు పేరొందిన లక్జెంబర్గ్ దేశము, తొలుతనుండియు విదేశీయ యాత్రికులను విరివిగనే ఆకర్షించుచున్నను, ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము ఆ సంఖ్య క్రమేణ చాల పెరిగినది. దాదాపు 8 లక్షల యాత్రికులు 1969 లో దేశమును దర్శించిరి.

**13 ప్రసిద్ధ పౌరులు :** 1. జాన్ ప్రభువు (1296-1346): లక్జెంబర్గ్‌కు వారసత్వరీత్యా పాలకుడైన ఈ రాజు అంధుడైనను, తన రాజనీతి చతురతచే యూరపీయ రాజకీయములందు ప్రముఖ పాత్ర వహించి, కడకు బొహీమియాకును రాజు కాగలిగెను (1310-46); ఇతనిని జాతీయ వీరుడుగ ఈ దేశ ప్రజలు లెక్కింతురు. 2. గేబ్రియెల్ లిప్‌మన్ (1845-1921) : ప్రముఖ వైజ్ఞానికుడు; రంగుల ఫొటోగ్రఫీకి సంబంధించిన నూత్న విషయములను కనుగొనినందులకై భౌతిక శాస్త్రమునకు సంబంధించిన నోబెల్ బహుమతి ఈతనికి 1908 లో లభించినది.

# 26. లిక్టెన్‌స్టీన్

**ముఖ్యనగరము :** వాదుజ్; **జెండా :** ఎగువన నీలిమ, దిగువన ఎరుపు అడ్డుచారలు సమ ప్రమాణములలో ఉండగ, పై భాగమున దండముకడ రాజ మకుట చిహ్నము కలది; **జాతీయ గీతము :** ఓబెన్ అమ్ డూషెన్ రీన్ (జర్మన్ రైన్ ప్రాంతమున) అను చరణముతో మొదలిడబడునది; **నాణెము :** స్విజర్లాండు దేశపు నాణెములే 1924




పటము 25.

మొదలుగ ఇట చలామణిలో ఉన్నవి; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** దాదాపుగ త్రిభుజాకృతిలో ఉన్న ఈ చిన్న దేశము, పశ్చిమ యూరపున రైన్ నది లోయయందు 47°3′-47°14′ ఉ. అ. రేఖల మధ్యను, 9°29′-9°38′ తూ. తు. రేఖల మధ్యను నెలకొని ఉన్నది. దక్షిణమున స్విజర్లాండు; పశ్చిమమున రైనునది కొంతవరకు, స్విజర్లాండ్ కొంత వరకు; తూర్పున ఆస్ట్రియాదేశము ఈ దేశపు సరిహద్దులందు ఉన్నవి. ఉత్తర, దక్షిణముల గరిష్ఠపు నిడివి 28 కిమీ ; తూర్పు పడమరల గొప్ప నిడివి 11.2 కిమీ.; దేశవైశాల్యము 158 చ. కిమీ. ఈ దేశమున రైనునదీ తట పరిసర భూమి మాత్రము చదునుగా ఉన్నది; తక్కినది అంతయు పర్వతమయ భూమి. చదునుభూమి, దేశ వైశాల్యమున, అయిదవవంతును ఆక్రమించి ఉన్నది గ్రాస్‌పిట్‌జ్ (2,148 మీ.) అను పర్వత శిఖరము అత్యున్నత భూమిగ దేశమున లెక్కింపదగినది. ఇచటి పర్వత శ్రేణి రేషియన్ ఆల్ప్స్ అని వ్యవహృతము.

**2. శీతోష్ణస్థితి మొ. :** శీతోష్ణతి పరిస్థితి చాల వరకు సౌమ్యము నిమ్నభూములందు సాధారణపు ఉష్ణత 41° ఫా.; ఉన్నత భూములందలి పరిస్థితి తెలియదు. సంవత్సరమున 35 రోజులు మంచు కురియును; సాలీనా వర్షపాతము 113 సెం. మీ ; జూన్‌నుండి ఆగస్టువరకు వర్షపాతము చాల ఎక్కువ దేశమున ఎత్తుల హెచ్చు తగ్గులను అనుసరించి వృక్షజాతులును మారుచున్నవి. సాధారణముగ కనబడువానిలో బీచి మొదలగు జాతులును, సూచీపత్ర వృక్షములును ఎక్కువ. నక్కను మించిన వన్యజంతువు కన్పట్టదు. 120 జాతుల పక్షులు కలవు. కొన్ని మత్స్యజాతులు ఉన్నను, తాబేలు, ఎండ్రకాయ కనబడవు.

**3. జనసంఖ్య మొ. :** దేశపు జనసంఖ్య 21,350; ఇందు అత్యధిక భాగము, రైన్ నదీ తటపు రెండు జనావాసములలో వసించుచున్నారు. ముఖ్యనగరపు జనసంఖ్య 3,921. జర్మన్ జాతిలోని ఉపజాతియగు ఆలెమనిక్ వర్గమునకు చెందినవారు ఇచటి దేశీయ ప్రజలు; ప్రజలలో దాదాపు 4 300 విదేశీయులును కలరు. దేశీయుల భాష జర్మన్. రోమన్ కేతలిక్ సంప్రదాయపు క్రైస్తవము సాధి

కార మతముగ లెక్కింపబడుచున్నది; తక్కిన సంప్రదాయములవారు దాదాపు 1,500 కలరు.

**4. సమాచార సౌ. :** తంతి, తపాలా, టెలి ఫోను సౌకర్యములను, స్విజర్ లాండ్ దేశపు ప్రభుత్వమే. ఒక ఒడంబడికను అనుసరించి, ఇట నిర్వహించుచున్నది. అయినను తపాలా బిళ్లలను మాత్రము లిక్టెన్‌స్టీన్ ప్రభుత్వమే జారీ చేయుచున్నది. స్విజర్లండ్‌లోని రేడియో, టెలివిజన్ ప్రసారములు అచటి ప్రజలకు ఉపకరించుచున్నవి.

**5. యాన సౌ. :** పారిస్‌నుండి వియెన్నాకు పోవు రైలుమార్గము ఈ దేశముద్వారానే పోవుచు, ఈ దేశమునకు ఉపకరించుచున్నది. అయినను వేగముగపోవు రైలుబండ్లలో, అనేకములు ఈ దేశమున ఆగవు. అందువలన ఈ దేశపు ముఖ్యనగరమును చేరదలచు విదేశీయులు స్విజర్లాండులోని బక్స్ నగరమువద్ద రైలుదిగి, రోడ్డు మార్గమున 8 కిమీ. పయనించి అటకు చేరుదురు. రోడ్డ వసతి మాత్రము దేశపు 12 జనావాసముల మధ్య కలదు. ఆ రోడ్లు ఆస్ట్రియాను, స్విజర్లాండును ఈ దేశమునకు అనుసంధించుచున్నవి.

**6. చరిత్ర :** తొలుత షార్లమేన్ (చూ : పు. 768) ప్రభుని రాజ్యమున అంతర్భాగముగ ఉండిన ఈ ప్రాంతము, అతని మరణానంతరమున ఒక ప్రత్యేక మండలముగ ప్రతిపత్తిని ఆర్జించి, కొన్ని జమీందారీ కుటుంబముల ఆధిపత్యమున చాలకాలము మనినది. ఆ కుటుంబముల వారినుండి 1712 లో ఈ ప్రాంతమున లిక్టెన్‌స్టీన్ వంశికు డొకడు కొను గోలుచేసి, తన వంశనామమునే ఆ ప్రాంతమునకు పేరుగ కల్పించి, ఆస్ట్రియా దేశపు ప్రభువులకు సామంతుడుగ పాలనను నిర్వహించెను. నెపోలియన్ కాలమున ఈ రాజ్యము స్వతంత్రరాజ్య ప్రతిపత్తిని పొందినను, 1815 లో జర్మనీ రాజ్యముల కూటమిలో చేరినది. అంతట 1866 లో మరల స్వతంత్రమై, తదాదిగ యూరపీయ రాజకీయములందు తటస్థభావన వహించి మనుచున్నది. 1924 లో కుదిరిన శుల్క సమ్మేళనపు ఒడంబడిక వలన ఈ దేశమున స్విజర్లాండ్ దేశపు నాణెముల చలామణికిని, ఆ దేశముతో ఆర్థిక సహకారమునకును ఏర్పాటులు జరిగి, తదాదిగ కొనసాగుచున్నవి. లిక్‌టెన్‌స్టీన్ వంశపు పరిపాలకుడే ఇపుడును దేశమును పాలించుచున్నాడు.

**7. పరిపాలన :** వంశానుగతము, రాజ్యాంగ విధాన బద్ధము అగు రాజరికపు పాలన దేశమున అమలున ఉన్నది. 20 ఏండ్లకు తగ్గని పౌరులకు అందరికిని వోటుహక్కు కలదు. శాసన నిర్మాణాధికారము ఏక కక్ష్యకమగు శాసనసభయందు కలదు. ఈ సభలోని సభ్యసంఖ్య 15. ఈ సభకు సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. ఈ సభచేయు ప్రతిపాదనను అనుసరించి, రాజు ప్రధానిని, ఉప ప్రధానిని నియమించును; వీరి పదవీకాలము ఆరేండ్లు; వీరికి సాయము చేయుటకై శాసనసభ ముగ్గురు సభ్యులను నియమించును; వీరు ఆ పదవులలో నాలుగేండ్లు మాత్రమే ఉండెదరు. ప్రభుత్వమును, శాసనసభా సభ్యులును మాత్రమే గాక మూడు జనావాసములుగాని, 600 మంది వోటర్లుగాని ఒక బిల్లును ప్రతిపాదించవచ్చును. శాసనసభ ఆమోదించిన బిల్లును, జనాభిప్రాయ సేకరణకు నివేదించు వసతి ఈ రాజ్యాంగమున కలదు. శాసనసభా సమ్మతితో పాటుగ రాజుకూడ ఆమోదించినపుడే బిల్లు చట్టమగును. రెండు రాజకీయ పక్షములు (ఫాదర్ లాండ్ యూనియన్, ప్రగతిశీల పౌరపక్షము) కలవు. పరిమితాధికారములతో ఆంతరంగిక స్వయం పరిపాలనను స్థానిక సంస్థలు కలిగియున్నవి. గొన్ని వివాదముల విషయమున స్విజర్లాండు కోర్టులకును, ఈ దేశమున అధికారము కలదు; అయినను స్థానికముగ సైతము కొన్ని న్యాయస్థానములు పనిచేయుచున్నవి.

**8. దేశరక్షణ :** సైన్యము ఎట్టిదియు లేదు; కాని 60 ఏండ్లకు లోబడిన, సమర్థులగు పురుష లందరు, అవసరమైనపుడు, సైనికులుగ చేరవలసి యుండునను నియమము మాత్రము కలదు. 56 మంది గల పోలీసు బలగము మాత్రము కలదు.

**9. అంతర్జాతీయ సం. :** ఐ. రా. స. లో ఈ దేశమునకు సభ్యత్వము లేకున్నను ఐ. రా. స. శిశునిధియందు ఈ దేశము సభ్యత్వమును కలిగి యున్నది. ఈ దేశపు దౌత్య వ్యవహారములను, స్విజర్లాండ్ దేశపు దౌత్య కార్యాలయములే వివిధ దేశములందు నిర్వహించుచున్నవి. స్విజర్లాండ్‌న మాత్రము ఈ దేశపు దౌత్య వ్యవహర్త కలదు.

**10. ఆర్థిక రంగము :** పరిమాణమున చిన్న దియై, సాధన సంపత్తి చాల తక్కువగఉన్న ఈ దేశము, యాత్రికులను ఆకర్షించియు, వర్తక వ్యాపారములను ప్రోత్సహించియు, కుటీర పరిశ్రమ లను విరివిగ నెలకొల్పియు సుసంపన్నతను ఆర్జించి నది. కొన్ని విదేశీయ వ్యాపార సంస్థలు, కొన్ని న్యాయశాస్త్రీయ నియమములనుండి తప్పించు కొను టకై, ఈ దేశమున తమ ముఖ్య కార్యాలయములను నెలకొల్పుటవలనను, ఇచటి బ్యాంకులలో విదేశీ యులు తమ గుప్తధనములను నిలువయుంచుకొనుట వలననుకూడ ఈ దేశమునకు విరివిగ విదేశీయ ద్రవ్యము చేరుచున్నది. దేశపు ఆదాయమున 25% యాత్రికులవలన లభించుచున్నది. దేశమున 5,000 హె. మాత్రమే వ్యవసాయమునకు అను కూలము. మొక్కజొన్న, ఇతర ధాన్యములు, బంగాళా దుంపలు, కొన్ని విధముల ఫలములు ఇచట ఉత్పత్తి అగుచున్నవి; 30 వేల యాపిల్ చెట్లును కలవు (1964). కాలపరిస్థితి చక్కగ ఉన్నప్పుడు సాలున ఒక లక్ష లీటరుల ద్రాక్ష సారాయము తయారు చేయబడుచున్నది. 3,500 హె. భూమి పశువుల మేతబీడుగ ఉపక రించుచున్నది. 6,200 గోజాతి; 46 గుర్రములు; 1,200 గొర్రెలు; 150 మేకలు; 4,210 పందులు; 7,330 కోళ్లు కలవు (1970). ఆవులవలన సాలున 59 లక్షల కి. గ్రా. పాలు లభించుచున్నవి. మొత్తము మీద దేశపు ప్రజానీకమున 3% మాత్రమే వ్యవ సాయ, పశుపోషణ కృషిలో పాల్గొనుచున్నారు. పారిశ్రామిక సంస్థలలో 5,168 మంది పనిచేయు చున్నారు. పనివారు తగినంతమంది లేకపోవుట వలన, ఆస్ట్రియా మొదలగు విదేశముల కార్మికు లను ఇచట కార్మికులుగ చేయుచున్నారు. దేశపు విద్యుదుత్పత్తి 4,48,44,000 కివా. (1971). దేశపు ఎగుమతుల విలువ 37,16,08,743 స్విస్ ఫ్రాంకులు (1971); ఈ వ్యాపారమున అత్యధిక భాగము స్విజర్లాండ్‌తో జరిగినది. దిగుమతుల వివ రములు తెలియవచ్చుటలేదు. బడ్జెటరీ వ్యయము 6,75,91,440 స్విస్ ఫ్రాంకులు (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున గృహ వసతి చక్కగ కలదు; వార్ధక్య భీమా మొదలగు సాంఘిక భద్రతా సౌకర్యములు 1954 మొదలుగ అమలులో ఉన్నవి. 14 ప్రయిమరీ పాఠశాలలు, 5 సెకండరీ పాఠశాలలు కలవు. వానిలోని విద్యార్థి సంఖ్య 3,276 (1972). ఉన్నత విద్యకై దేశీయ విద్యార్థులు స్విజర్లాండ్, ఆస్ట్రియా, పశ్చిమ జర్మ నీలలోని విశ్వవిద్యాలయములకు పోవుచున్నారు. వాదుజ్ నగరమందలి ప్రిన్స్ లిక్టెన్‌స్టీన్ ఆర్ట్ గేలరీ, దేశపు ప్రముఖ సాంస్కృతిక కేంద్రముగ పేరుగన్నది; ఇందు లియొనార్డో డా వించీ మొద లగు ప్రముఖ చిత్రకారుల రచనలు కలవు; ఈ గేలరీకి సంబంధించిన గ్రంథాలయమున 60 వేల గ్రంథములు కలవు. వారమున మూడు రోజులు ప్రచురింపబడు ఒక పత్రికయు, వారమున నాలుగు రోజులు వెలువడు వేరొక పత్రికయు మాత్రమే వార్తా పత్రికలుగ లెక్కింపదగినవి. దైనిక పత్రి కలు లేవు.

**12. యాత్రా సౌ.:** ప్రభుత్వము పెక్కు సౌకర్యములను కలిగించి విదేశీయ యాత్రికులను ఆకర్షించుచున్నది. 1971 లో 73,961 మంది విదేశీయ యాత్రికులు దేశమును దర్శించి, దాదాపు 160 లక్షల స్విస్ ఫ్రాంకులను దేశమున వెచ్చించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు:** 1. జోసెఫ్ రీన్ బెర్గెర్ (1839-1901): ఆర్గన్ వాద్యమును వాయించు నిపుణుడుగనేగాక, వాగ్గేయకారుడుగ సైతము, స్వదేశ, విదేశములందు ఖ్యాతిని ఆర్జించినవాడు.

---

# 27. వాటికన్

**ముఖ్యనగరము:** వాటికన్ సిటీ; **జెండా:** పసిమి, తెలుపు నిలువుచారలు సమప్రమాణములలో, దండము కడనుండి క్రమముగ అమరియుండగ, తెలుపు చారపైన పసిమి రంగున సెయింట్ పీటర్‌కు చెందిన జంట తాళపు చెవుల చిహ్నముపైన కిరీట త్రయ చిహ్నము కలది; **జాతీయ గీతము:** 'పోంటిఫికల్ మార్చి' అను పేరున స్వరమాత్రముగ ఉండునది; **నాణెము:** లీరా; ఇది ఇటలీ యందలి లీరా నాణెముతో సమానపు విలువను కలిగియున్నది; సంవత్సరమునకు 7.5 కోట్ల లీరాలను మించి ముద్రించకుండుటకు వాటికన్ ప్రభుత్వము, ఇటలీ ప్రభుత్వముతో ఒక అంగీకారమునకు వచ్చినది; **కొలతూకములు:** మెట్రిక్ విధానపువి; **కాలగణన:** సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.:** పశ్చిమ యూరపునందలి ఇటలీ దేశమునకు ముఖ్య పట్టణమగు రోమ్ నగరమున ఇమిడి, రోమన్ కేతలిక్ క్రైస్తవ సంప్రదాయ పీఠాధిపతియగు పోపుయొక్క సర్వాధిపత్యమున, అతని నివాసముగ ఉండి 44 హెక్టేరుల వైశాల్యము మాత్రమే కలిగిన ఈ చిన్న స్వతంత్ర రాజ్యము, టైబర్ నదియొక్క పశ్చిమ తటమున నెలకొని ఉన్నది; తక్కిన అన్నివైపుల రోమ్ నగరపు వివిధ ప్రాంతములు కలవు. ఇందు సెం. పీటర్స్ బెసిలికా అనబడు ఒక పెద్ద చర్చి (ఇది ప్రపంచమునందలి చర్చీలలో అన్నింట పెద్దది); దాని ప్రాంగణము; పరిపాలనా కార్యాలయ భవనములు; పోపు, అతని పరివారము వసించు రమ్య భవనములు; వాటికన్ ఉపవనములు అనబడుచు వాటికన్ వైశాల్యమున సగమును ఆక్రమించిన తోటలు కలవు. 'వాటికన్ సిటీ' అనబడు పై ప్రాంతముగాక, రోమ్ నగరములోని కొన్ని మహా భవనములును, చర్చీలును పోపుయొక్క సర్వం సహాధికారమునకు చెందియున్నవి. రోమ్ నగరపు సరిహద్దుల ఆవల సైతము, దాదాపు 40.5 హె. వైశాల్యము గలిగిన ప్రాంతముపైనను, అందలి విశ్రాంతి భవనముపైనను, రోమునకు 20 కిమీ. ల దూరమున ఉండి 420 హె. వైశాల్యముకల ఒక ప్రాంతముపైనను కూడ వాటికన్ సర్వాధికారములను కలిగియున్నది. ఇందలి కడపటి ప్రాంతమున వాటికన్‌కు చెందిన ఒక రేడియో స్టేషన్ కలదు.

**2 శీతోష్ణస్థితి మొ.:** శీతకాలము సౌమ్యముగ ఉన్నను, గ్రీష్మర్తువున మాత్రము ఎండలు కొంత తీవ్రస్థాయిలోనే పగటిపూట ఉండును; అయినను సాయం సమయములు చల్లగనే ఉండును. జనవరిలో సగటు ఉష్ణోగ్రత దాదాపు 45° ఫా.;

జులైలో 76° ఫా. మేనుండి సెప్టెంబరువరకు వర్షములు ఉండవు; అక్టోబరు, నవంబరులలో అధిక వర్షము పడును. హిమవర్షము చాల అరుదుగ మాత్రమే పడును. రాజ్యమంతయు పట్టణ భూమి అగుటవలన, ఒక విస్పష్ట వన్యజాతి అట కనబడదు. వివిధములగు పుష్పజాతులకు అచటి తోటలు పేరెన్నిక గాంచినవి.

**3. జనసంఖ్య మొ. :** రాజ్యపు జనసంఖ్య 1,171 (1970); ఇందులో రాజ్యమున నివసించు పౌరసంఖ్య 360 మాత్రమే; పౌరస్వత్వములు లేకుండ రాజ్యమున వసించువారు 316; వాటికన్ వెలుపల నివసించుచు, రాజ్యపు పౌరసత్వమును పొందినవారు 174; పీఠాధిపతియగు పోపునకు అంగరక్షకులుగ ఉండు స్విజర్లండు దేశీయులు 70; వాటికన్‌కు ప్రతినిధులుగ విదేశములందు వ్యవహరించువారు 139. రోమన్ కేతలిక్ ఆచార్య వర్గమునకు చెందిన వివిధ దేశీయులు ఇందు ఉన్నను, అందు ఇటాలియన్ జాతివారి సంఖ్య చాల ఎక్కువ. పౌర వ్యవహారములకు సంబంధించినంతవరకు సాధికార భాష ఇటాలియన్ భాషయే అయినను, మత విషయిక వ్యవహార నిర్వహణలో లాటిన్ భాషయే చాలవరకు వాడబడుచున్నది. ప్రపంచ వ్యాప్తముగు రోమన్ కేతలిక్ మత పీఠాధిపతియగు పోపుయొక్క అధికార కేంద్రము ఇది అగుటవలన పౌరులందరు రోమన్ కేతలిక్ సంప్రదాయానుయాయులే అనుట స్పష్టము.

**4. సమాచార సా. :** రాజ్యమునకు సొంత తపాలా, తంతి సౌకర్యములు కలవు; వాటికన్ సిటీలో ఒక రేడియోస్టేషను, రోమునకు 20 కిమీ. ల దూరమున, ఒక సొంత స్థలమున వేరొక రేడియో స్టేషను పనిచేయుచున్నవి. ఈ రెండు తావులనుండి 31 భాషలలో ప్రసార కార్యక్రమములు క్రమ రీతిలో నిర్వహింపబడుచున్నవి. హ్రస్వ తరంగ ముల (షార్టు వేవ్) పై జరుగు ఈ ప్రసారములు ప్రపంచపు మారుమూల దేశములందు సైతము విననగుచున్నవి.

**5 యాన సౌ. :** రోము నగరపు ప్రముఖ రోడ్డు, రైలుమార్గములద్వారా, ఏ వైపుననుండి యైనను వాటికన్ సిటీని చేరవచ్చును. రాజ్యమున ఒక రైలు స్టేషను కలదు.

**6. చరిత్ర :** క్రైస్తవ మతము రోమన్ సామ్రాజ్య కాలమున ఇటలీయందు వ్యాపించిన కాలమునుండియు, రోము నగరము, క్రైస్తవమత పీఠాధిపతికి (పోపునకు) ఆవాస భూమిగ ఉండినది. మధ్యయుగములందు రోము నగరమేగాక, రోమ్ పరిసరములలో ఉన్న కొన్ని విశాల ప్రాంతముల పైన సైతము పోపునకు రాజ్యాధికారము ఉండెడిది. ఇటుల ఆధ్యాత్మికాధికారమునకు తోడుగ రాజ్యాధికారమును చలాయించిన పోపులు, తమ రాజ్యమును కాపాడుకొనుటకై, తక్కిన రాజ్యముల తగవులాటలలో జోక్యము వహించుటయు, తత్ఫలితముగ కొన్ని సమయములందు దేశమును వదలి పోవుటయు సంభవించినవి. 1850 నాటికి పోపునకు చెందిన రాజ్యమున దాదాపుగ అంతయు ఇటలీని పాలించు 'సవాయ్' రాజకుటుంబమునకు దక్కినది. అంతట ఫ్రెంచి యోధుల సాయముతో రోమునగరమున, తన ఆధిపత్యమును పోపు నిలబెట్టుకొనినను, ఫ్రెంచివారు తమ సహాయమును ఉపసంహరించినంతనే ఆ నగరము సైతము ఇటలీ దేశపు రాజు ఆక్రమించుకొనెను (1870). అంతట పోపుయొక్క ఆధ్యాత్మిక, మత విషయిక ప్రాముఖ్యమును, ప్రతిపత్తిని మాత్రము ఆదరించి, అతనికి కొంత వార్షిక ధనసాహాయ్యమును, కల్పించుటకు ఇటలీ దేశపు ప్రభుత్వము ఏర్పాటులను చేసినను, పీఠాధిపతి అందులకు నిరాకరించి, తాను, తన పరివారమును ఇటలీదేశ ప్రభుత్వపు ఖైదీలుగ

మాత్రమే పరిగణింపబడగలమని చెప్పిరి. పరిస్థితులు ఇటుల కొంతకాలము అనిశ్చితముగఉన్న తరువాత, ఫిబ్రవరి 11, 1929 న ఇటలీ ప్రభుత్వముతో అప్పటి పోపునకు వేరొక ఒడంబడిక కుదిరి, తత్ఫలితముగ ప్రస్తుతపు వాటికన్‌పై, పోపునకు సర్వం సహాధికారము ఉండుటకు ఏర్పాటులు జరిగి సరిహద్దులు నిర్ణయింపబడినవి.

**7. పరిపాలన :** రోమన్ కేతలిక్ మతాచార్య (కార్డినల్స్) వర్గము, సమావేశమై ఎన్నుకొనిన పీఠాధిపతి (పోపు) యొక్క సర్వాధిపత్యమునకు లోబడి ఇచట పాలన సాగుచున్నది. ఒకసారి ఎన్నుకొనబడిన పోపు, తన మరణ పర్యంతము, ఆ పదవియందు కొనసాగును. క్రొత్త పోపును, ఎన్నుకొనవలసి వచ్చినపుడు మతాచార్య వర్గము సమావేశమై ఒక ప్రత్యేక విధానమును అనుసరించి ఎన్నికను జరిపెదరు. మూడింట రెండువంతుల వోట్లువచ్చిన ఆచార్యుడు పోపుగ ఎన్నుకొనబడును. అటుల ఎవరికి ఓట్లు రానపుడు, అటనుండి కదలక మరల ఎన్నిక జరిపి, తుదకు నిర్ణీతపు వోట్లు ఒకనికి వచ్చువరకు సభను కొనసాగింతురు. 1970 నాటికి ఆచార్యవర్గమున సభ్యసంఖ్య 136. ఇందు రోమన్ కేతలికు మత సంప్రదాయములకు చెందిన వివిధ జాతులకు చెందిన ఆచార్యులు ఉందురు. 80 ఏండ్లు వయసు దాటిన ఆచార్యుడు వోటు హక్కును కోల్పోవును. సామాన్య పౌర, దండ వివాదములకు ఒక న్యాయస్థానము కలదు. మత విషయిక వివాదముల పరిష్కారమునకై మూడు తీరుల న్యాయ పీఠములు కలవు.

**8. దేశరక్షణ :** 'స్విస్ గార్డ్స్' అను వ్యవహృతులగుచు, పారంపర్యముగ స్విజర్లాండ్ దేశీయులు మాత్రమే ఉండెడు ఒక రక్షకదళము కలదు; ఇందు 70 మంది కలరు. 1506 లో తొలుతగ ఇది రూపుకొని తదాదిగ కొనసాగుచున్నది. వీరు నవీనాయుధములను ధరించక ప్రాతకాలపు కత్తులను, బాకులను ధరింతురు; వీరి యోధవేషములు సైతము ప్రాత కాలపువే; వాని తీరును, ప్రసిద్ధ చిత్రకారుడగు మైకెల్ ఏంజెలో (1475-1564) నిర్ణయించెనని చెప్పెదరు.

**9 అంతర్జాతీయ సం. :** దేశపు దౌత్య వ్యవహారములను రాజ్య సచివమండలి (స్టేట్ సెక్రెటేరియెట్) నిర్వర్తించును. దాదాపు 69 దేశములతో ఈ రాజ్యమునకు దౌత్య సంబంధములు కలవు (1969). ఐక్యరాజ్య కార్యాలయమునను, ఆహార వ్యవసాయ వ్యవస్థయందును, ఐక్యరాజ్య విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక వ్యవస్థ (యునెస్కో) యందును ఈ దేశపు ప్రతినిధులు కలరు.

**10. ఆర్థిక రంగము :** ఈ దేశపు ఆదాయము అంతయు, మతానుయాయుల చందాలవలన లభించుచున్నది; ఈ చందాలే ఆ మతపు పరిభాషలో పీటర్ పెన్నీలు (పీటర్ పెన్స్) అని వ్యవహృతములు. ఇవిగాక ఉదారులు, ధనవంతులునగు మతానుయాయులు ప్రత్యేక విరాళములనుకూడ ఇచ్చి సాయపడెదరు. వాటికన్ ప్రభుత్వము ముద్రించు తపాలా బిళ్ళల అమ్మకమువలనను, మత గ్రంథముల అమ్మకము వలనను కొంత ధనము లభించుచున్నది. తక్కువిధముల ధనార్జన మార్గములు ఏవియు ఇచట లేవు. మొత్తపు ఆదాయమును గురించిన వివరములను ప్రభుత్వము ప్రచురించుట లేదు. దేశమునకు ఒక విద్యుత్ ఉత్పత్తి యంత్రమును, రెండు అచ్చు యంత్రములును, కొన్ని కుట్టు పని సంస్థలును, ఒక మొజాయిక్ పని కేంద్రమును, ఒక వస్తు విక్రయ కేంద్రమును కలవు. ఇవి అన్నియు వాటికన్‌లో వసించు పౌరుల అవసరముల పరిపూర్తికి మాత్రమే వినియుక్తములు. వాటికన్ సిటీలోని పౌరులే, ఈ సంస్థలందును, తక్కిన సేవా, శౌచ కార్యక్రమములందును పాల్గొను

చున్నారు. ఎగుమతి దిగుమతి సుంకములు ఎట్టి వియు లేవు.

**11. సాంఘిక రంగము :** రోమన్ కేథలిక్ క్రైస్తవ సంప్రదాయపు ఉన్నత మత విద్యకు వాటికన్ ఒక ప్రముఖ కేంద్రము. ఆచార్య విధులకై తగిన శిక్షణ ఇట కల్పింపబడుచున్నది. వాటికన్ ఆధ్వర్యవమున రోమున పలు విద్యాకేంద్రములు కలవు. వానిలో గ్రెగరియన్ విద్యాపీఠము, ప్రాచ్య విద్యా సంస్థ ప్రముఖములు. వాటికన్‌లోని గ్రంథాలయము విశ్వవిఖ్యాతిని ఆర్జించినది. క్రీ. శ. 1450 లో నెలకొల్పబడిన ఈ గ్రంథాలయమున పది లక్షలకు పైబడిన గ్రంథములు 74 వేల వ్రాతపతులు, ప్రాతకాలపు అచ్చు గ్రంథములు 7 వేలు కలవు. వాటికన్ సిటీలో పలు మ్యూజియములు కలవు; వీనిలో అమూల్యములగు శిల్పములు, చిత్రములు కలవు. రఫెల్, మైకేల్ ఏంజెలో మొదలగు పునరుజ్జీవనయుగపు ప్రసిద్ధ కళాకారుల రచనలు అచటనేగాక, సిస్టైయిన్ దేవళము, పాలైన్ దేవళము మొదలగు వానిలో కననగుచున్నవి. దిన పత్రికలు లేవు; వారపత్రికలు, మాస పత్రికలు మాత్రము విరివిగ కలవు. 1861 లో స్థాపింపబడి, తదాదిగ సాగుచున్న ఒస్సర్వేతరో రోమానో అను వారపత్రికకు, వార్తా పత్రికగ, విపుల ప్రచారము కలదు. ఇచ్చటి ముద్రణాలయములనుండి ప్రపంచపు వివిధ భాషలలో మత గ్రంథములును, పత్రికలును విరివిగ ప్రచురింపబడుచున్నవి. రోము నగరమున, ఇటలీ ప్రభుత్వము నెలకొల్పిన ఆసుపత్రులు మొదలగు వాని వలననే ఇచటి పౌరులకును వైద్య సౌకర్యములు లభించుచున్నవి.

**12. యాత్రా సౌ. :** మత విషయిక ఉత్సవ సందర్భములందు మాత్రమేగాక, తక్కిన సమయములందును శిల్ప చిత్రాదులను దర్శించుటకు పలువురు విదేశీయులు ఇచటికి వచ్చుచుందురు. పాస్‌పోర్టు, వీసాలు యాత్రికులకు ఉండనవసరము లేదు. యాత్రికులకు నివాస సౌకర్యములు రోము నగరమున మాత్రమే లభించును.

**13. ప్రసిద్ధ పౌరులు :** రోమన్ కేథలిక్ మత పీఠాధిపతులకు ఆవాసమగు ఈ రాజ్యమున, ఆధిపత్యమును నెరపిన ప్రతి పోపు, మత విషయికముగ, ప్రపంచమందలి ఆ మతానుయాయులకు అందరికి మాననీయుడే యైనను, తక్కు విధముల కూడ చరిత్రలో అజరామర స్థానమును ఆర్జించిన పోపులును కలరు. వారు : 1. జాన్ XXIII (1881-1963) : 7 వ శతాబ్దినుండి మారుపు నొందకయున్న మత ప్రార్థనా పాఠమును కాలానుగుణముగ మార్చుటయేగాక, సాంఘిక పురోగతిని గురించియు కార్మికుల స్వత్వములను గురించియు క్రైస్తవు లవలంబి పదగు సమంజస మార్గమును నిర్వచించిన ఉదార హృదయుడు; సర్వమత సామరస్యమును ఆశించి, విశ్వశాంతికై ఈయన కృషి చేసెను. 2. పాల్ VI (జ. 1897) : ప్రస్తుతపు పోపు; క్రైస్తవ ప్రపంచమున, శాఖా సంప్రదాయ వైషమ్యములకు స్వస్తిచెప్పి ఐక్యమును సాధించుటకును, సర్వమానవ సౌభ్రాతృత్వముపై ఆధారపడిన ప్రపంచ శాంతిని నెలకొల్పుటకును ఈయన కృషి చేయుచున్నాడు.

---

# 28. సాన్ మారినో

**ముఖ్యనగరము :** సాన్ మారినో; **జెండా :** తెలుపు, నీలి అడ్డుచారలు సమప్రమాణములలో అమరియుండగ, మధ్యభాగమున, నీలిరంగున, పసిమి అంచుతో యోధలాంఛనము కలది; **జాతీయ గీతము :** ఒనోరే అతే, ఒనోరె, ఓ అంతికా రిపబ్లికా (జయతు జయ ప్రాచీన గణ రాజ్యమా) అను పదములు తొలుత గలది;




పటము 26.

**నాణెము :** ఇటలీ దేశపు లీరా నాణెమే ఇట చలామణిలో ఉన్నది; తనకు కావలసిన అట్టి నాణెములను ఒక ఒడంబడికను అనుసరించి, ఈ దేశ ప్రభుత్వము ముద్రించుచున్నది; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** అన్ని దిక్కులందును ఇటలీ దేశపు భూభాగముచే పరివృతమైఉన్న ఈ చిన్న దేశము 12°30′ తూ. తు. రేఖపైనను, 43°50′ ఉ. అ. రేఖపైనను నెలకొని ఉన్నది; దేశపు ఉత్తర దక్షిణముల నిడివి 9.6 కిమీ.; తూర్పు పడమరల కొలత 6.4 కిమీ.; దేశ వైశాల్యము 61.19 చ. కిమీ. దేశపు ముఖ్యనగరమగు సాన్ మారినో, టిటాన్ పర్వతపు శిఖరముపై ఉన్నది; తక్కిన దేశపు భూతలమంతయు దాదాపుగ టిటాన్ పర్వతశ్రేణిని ఆశ్రయించి యున్నది. ఈ పర్వత శిఖరములనుండి చూచువారికి పరిసర ప్రకృతి అతిరమ్యముగ కన్పట్టును. పర్వతపు పాదమును ఆశ్రయించిన కొన్ని చదునునేలలు మాత్రమే సేద్యమునకు ఉపకరించుచున్నవి.

**2. శీతోష్ణస్థితి మొ. :** ఈశాన్య ఇటలీయందలి పరిస్థితియే ఇట సైతము కానవచ్చుచున్నది; శీతకాలములో నీరు గడ్డకట్టును; ఎండకాలము హాయిగ, వెచ్చగ ఉండును. తగినంతగ వర్షపాతము కలదు. ప్రత్యేకముగ లెక్కింపదగిన వృక్ష, వన్యసంతతులు కన్పట్టవు.

**3. జనసంఖ్య మొ :** దేశపు జనసంఖ్య 17,000 (1971); వీరుగాక ఈ దేశపు పౌరులుగ లెక్కింపబడువారు దాదాపు 20 వేల మంది విదేశములలో వసించుచున్నారు. జనసాంద్రత చ.కిమీ.కు 279; ముఖ్యనగరపు జనసంఖ్య **దాదాపు** 4,000. జనసంఖ్య రీత్యా బోర్గో మగ్గియోరీ అనునది పెద్ద నగరము; దేశీయులందరు ఇటాలియన్ జాతికి సన్నిహితులు; దేశీయుల మాతృభాష ఇటాలియన్; దాదాపుగ దేశీయులందరు రోమన్ కేతలిక్ క్రైస్తవులు.

**4. సమాచార సా. :** ఈ దేశమునకు ఇటలీతో 1879 మొదలుగ తంతివార్తా సౌకర్యమును, 1904 మొదలుగ టెలిఫోన్ సంబంధమును ఏర్పడి యున్నది. తపాలా బిళ్లల రూపములను మార్చుచు, వానిని సేకరించువారివలన, ఈ దేశము చాల ధనమును ఆర్జించుచున్నది. దేశమునందు మూడు తపాలా ఆఫీసులు ఉన్నవి. ఇటలీ దేశపు రేడియో

స్టేషనులును, టెలివిజన్ స్టేషనులును ఈ దేశపు వారికికూడ ఉపకరించుచున్నవి.

**5. యాన సౌ. :** దేశమున వివిధ జనావాసములను కలుపుచు దాదాపు 10 కిమీ ల రోడ్లు కలవు. సమీపముననున్న ఇటలీలోని రోడ్లతో ఇవి ముడివడి ఉన్నవి. సమీపస్థమైన ఇటలీదేశపు రిమీనీ నగరము నుండి ఈ దేశమునకు బస్సు ప్రయాణవసతి కలదు. సాన్ మారినో - రిమీనీలమధ్య హెలికాప్టరుద్వారా ప్రయాణముచేయు సౌకర్యమును ఉన్నది.

**6. చరిత్ర :** రోమన్ సామ్రాజ్యము అంత మొందిన తరువాత ఇటలీదేశము, అనేకములగు చిన్న గణరాజ్యములుగను, మాండలిక రాజ్యములుగను విభక్తమైనపుడు తక్కినవానితోపాటుగ ఈ రాజ్యము ఏర్పడినది. కాని 19 వ శతాబ్ది మధ్య కాలమునకు ఈ చిన్న రాజ్యములలో, ఈ సాన్ మారినో తప్ప తక్కినవన్నియు ఏకైక ఇటలీ రాజ్యములో లీనమైనవి. కాని ఈ దేశము మాత్రము తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొనక మనగలిగినది.

క్రీ శ. 4 వ శతాబ్దమున మారినస్ అను రాతి పనివానిచేత, ఈ రాజ్యము సంస్థాపింపబడినటుల ఒక గాథ కలదు. డాల్మేషియా వాసియగు ఆ పనివాడు అచటి విమతస్థుల బాధలనుండి తప్పించుకొనుటకై తనవారితో ఇట దుర్గమ పర్వత స్థావరమునచేరి ఈ రాజ్యమును నెలకొల్పెనట అతనిని ఋషికల్పుడుగ ప్రజలు సంభావించిరి. అతని పేరనే సాన్ మారినో అనుపేరు ఈ దేశమునకు కల్గినది (సాన్ అనగ ఇటాలియన్ భాషలో ఋషి అని అర్థము). ఈ విధముగ ప్రపంచమునందు నేడు మనియున్న గణరాజ్యములందెల్ల ఈ చిన్న గణరాజ్యము ప్రాచీనతమముగ లెక్కకు వచ్చినది.

వైశాల్యమున చిన్నదియు, ఆర్థికముగ పేదవడినదియు అగుటవలన, దీని జోలికి, ఇటలీలోని తక్కిన రాజ్యముల వారెవరును, రాకుండుటవలన, ఈ దేశము శాంతముగ అతి దీర్ఘకాలము మనగలిగినది. అంతటంతట కొందరు దుస్సాహసికులు దీనిని హరించ యత్నించినను మారినస్ ఋషిమీది ఆదరమువలన, క్రైస్తవ మఠాధిపతియగు పోపు జోక్యమువహించి, తన పలుకుబడిని ఉపయోగించి ఈ దేశపు స్వతంత్రతను కాపాడెను. యూరపున పెక్కు రాజ్యముల జయించిన నెపోలియన్ సైతము ఈ దేశపు స్వేచ్ఛను మన్నించి, ఈ దేశమునకు అదనముగ కొన్ని మండలములను చేర్చుటకును ఉత్సహించెను; కాని, తమ రాజ్యము చిన్నదిగాను, పేదవడియును ఉండుటవలననే తాము స్వతంత్రులుగ ఉండినటుల సంభావించి, ఈ రాజ్యపు ప్రజలు ఆ మండలములను గ్రహించుటకు నిరాకరించిరట! 1897 లో ఇటలీ దేశముతో ఈ దేశమునకు శుల్క సమ్మేళనపు ఒడంబడిక కుదిరి, 1953 లో అది పునర్నవతను పొందినది. దేశము యూరపీయ రాజకీయములలో తటస్థ భావమునఉన్నను, ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున 1944, జూన్ 26 న మిత్రమండలి రాజ్యముల విమానములు ఈ దేశముపై బాంబులను వర్షించగ, దేశమునఉన్న ఒకే ఒక రైలుమార్గము ధ్వంసమై, పలువురు మరణించిరి.

**7. పరిపాలన :** ఇది ఒక ప్రజాసత్తాక గణరాజ్యము. అయిదేండ్లకు ఒకసారి సార్వజనీనమగు వోటు పద్ధతిన జరుగు సాధారణ ఎన్నికలలో ఎన్నుకొనబడిన 60 మంది సభ్యులు కలిగిన మహాజన సభ (గ్రాండ్ జనరల్ కన్‌సిగ్లియో) యందు శాసన నిర్మాణాధికారము న్యస్తము. ఈ సభనుండి 12 మంది సభ్యులు ఎన్నికై రాజ్యసభగ ఏర్పడుదురు. ఈ రాజ్యసభలోని సభ్యులనుండి ప్రతి ఆరు నెలలకు ఒకసారి ఇద్దరు ఎన్నుకొనబడగ, అందు ఒకడు సాన్ మారినో పట్టణమునకు, మరియొకడు తక్కిన దేశమునకును, కార్యనిర్వాహణాధికారులుగ

ఆ ఆరునెల కాలము పనిచేయుదురు. వారికి సాయపడుటకై ఇరువురు కార్యదర్శులు ఉందురు; అందొకడు విదేశ వ్యవహారశాఖను, రెండవవాడు ఆర్థిక, దేశీయ శాఖలను నిర్వహించుదురు. ఇటలీ లోని రాజకీయ పక్షములతో ముడిపడి ఇచటి రాజకీయ పక్షములు పనిచేయుచున్నవి. పౌర, దండ వ్యవహారములకు సంబంధించిన తగవులను పరిష్కరించు న్యాయస్థానములు ఉన్నను, దండ వ్యవహారములలో పెద్ద నేరములను విచారించు హక్కు ఇటలీలోని న్యాయాధిపతులకు కల్పింపబడినది.

**8.** దేశరక్షణ : 16 నుండి 55 వరకు వయసు గల పురుషులలో విద్యార్థులను, ఉపాధ్యాయులను తప్ప తక్కినవారందరు విధిగ, అవసరమైనపుడు, సైన్యమున చేరవలయునను నియమము కలదు; కాని యథార్థమున ఒక లాంఛనప్రాయపు సేన మాత్రమే కలదు; అట్టిదే సరిహద్దు రక్షణ దళము కూడ ఉన్నది. పోలీసు బలగమున దాదాపు 60 మంది పనిచేయుచున్నారు.

**9. అంతర్జాతీయ సం. :** ఫ్రాన్సు, స్విజర్లాండ్, మాల్టా, వాటికన్ సిటీలలో ఈ దేశము దౌత్య కార్యాలయములును, తక్కిన కొన్ని దేశములందు దౌత్యోద్యోగులును కలరు. సార్వజనీన తపాలా సమ్మేళనము మొదలగు కొన్ని అంతర్జాతీయ సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు.

**10. ఆర్థిక రంగము :** దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయ, పశుపోషణ, వస్తునిర్మాణ కృషులపై ఆధారపడి ఉన్నది. ఇతర దేశములలో నివసించు దేశీయ పౌరులు పంపెడు మొత్తములును, శుల్క సమ్మేళనా ఫలితముగ ఇటలీ దేశము చెల్లించు పరిహారమును దేశమునకు ఆర్థికముగ చాలవరకు సాయపడుచున్నవి. దేశమున వ్యవసాయమునకుగాని, పశుపోషణకుగాని మొత్తముమీద 6,000 హె. అనుకూలముగ ఉన్నది; ఇందు 4,600 హె. సాగగుచున్నది. దాదాపుగ 44 వేల క్వింటాలుల గోధుమలు, 7,000 క్వింటాలుల ద్రాక్షపండ్లు సాలీనా పండుచున్నటుల అంచనా; తక్కిన ధాన్యములు, కూరకాయలు, పండ్లు, పశుగ్రాసము పరిమిత ప్రమాణములలో లభించుచున్నవి. 6,000 పశువులు కలవు; అందు గోజాతి ఎక్కువ. చర్మముల ఎగుమతివలన కొంత ధనాదాయము లభించుచున్నది. జవుళీ, పెంకు ఇటుకల తయారీ, రంగుల అద్దకము, సిమెంటు, తోళ్ళ ఊనకం, కాగితపు తయారీలకు సంబంధించిన చిన్న పరిశ్రమలు కొన్ని కలవు. ఎగుమతులలో కట్టుబడిరాయి, సున్నము, కలప, గోధుమ, ద్రాక్షసారాయము, చర్మములు, పింగాణీ పాత్రలు ప్రముఖములు. దిగుమతులలో యంత్ర సామగ్రులు తయారీ వస్తువులు ప్రముఖములు. విద్యుదుత్పత్తికిని ఎగుమతి దిగుమతులకును సంబంధించిన లెక్కలు తెలియవచ్చుటలేదు. బడ్జెటరీ వ్యయము 6,47,49,69,565 లీ. (1971).

**11. సాంఘిక రంగము :** దేశమున తగినంతగ గృహవసతి కలదు. నిరక్షరాస్యత లేదనియే చెప్పవచ్చును. దేశపు 14 శిశుపాఠశాలలలో 653 మంది; 17 ప్రాథమిక పాఠశాలలలో 1,388 మంది; 2 సెకండరీ పాఠశాలలలో 740 మంది విద్యార్థులు కలరు (1966). 1691 లో స్థాపింపబడి తదాదిగ పనిచేయుచున్న ఒక కాలేజి ఉన్నది. ప్రజల వైద్య సౌకర్యములకై ఒక ఆసుపత్రి, ఒక డిస్పెన్సరీ, ఒక వైద్య విద్యా పరిశోధనశాల పనిచేయుచున్నవి. ఒక అనాథ శిశు సంరక్షణ శాలను, వృద్ధజన నివాసమును ప్రభుత్వము నిర్వహించుచున్నది.

**12. యాత్రా సౌ. :** ఎండకాలమున దాదాపు 20 వేలనుండి 30 వేలవరకు విదేశీయులు ఈ దేశమున పర్యటించుదురు. 1970 లో 23,43,700 విదేశీయ యాత్రికులు దేశమును సందర్శించిరి. యాత్రికులకు అన్ని సౌకర్యములును కలవు.

---

# 29. స్పెయిన్

**ముఖ్యనగరము :** మాడ్రిడ్; **జెండా :** రెండు ఎర్ర అడ్డుచారల నడుమ ఒక పసుపు అడ్డుచార కలది; అందు ఎర్రచారలు సమాన ప్రమాణముగ ఉండగ, పసుపుచార అందులకు రెట్టింపు ప్రమాణమున ఉండును; ఆ పసుపు చారపై జాతీయ యోధ లాంఛనము చిత్రింపబడి యుండును; **జాతీయ గీతము :** 'మార్చ్ గ్రానడేరా' (గ్రెనడీయుని పురోగతి) అను పేరున వ్యవహృతమగునది; **నాణెము :** పెసేటా; ఇది 100 సెంటిమోలుగ విభక్తము; 100 పెసేటాలు =రు. 10-70; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం =భారతదేశమున సా. 5 గం. 30 ని.




పటము 17.

**1. ఉనికి మొ. :** పశ్చిమ యూరపున, ఐబీరియన్ ద్వీపకల్పమున 36°-43°47′ ద. అ. రేఖల మధ్యను, 3°19′-9°30′ ప. తు. రేఖల నడుమను నెలకొనిఉన్న ఈ దేశమునకు ఉత్తరమున బిస్కే అఖాతమును, ఫ్రాన్సు దేశమును; తూర్పు దక్షిణములందు మధ్యధరా సముద్రము; పశ్చిమమున **పోర్చుగల్ దేశమును, అట్లాంటిక్ మహాసముద్ర**మును సరిహద్దులందు కలవు. దక్షిణ తీరమునకు కొలది దూరమున, మధ్యధరా సముద్రమున నెలకొనిన బాలెరిక్, కేనరీ దీవులును మొరాకో దేశమున తీరభూమి యందుండి ఈ రాజ్యపు స్వాధీనానుభవములలోఉన్న స్యూటా, మెలిల్లా నగరములును రాజ్యాంగరీత్యా దేశాంతర్భాగములుగనే పరిగణింపబడుచున్నవి. వీనితో కలసి దేశపు వైశాల్యము 5,04,879 చ. కిమీ. మధ్యధరా సముద్రమును అనుకొనిన తీరభూమి పొడవు 1 653 కిమీ.; అట్లాంటిక్ మహాసముద్రముపు వైపున తీరభూమి పొడవు 675 కిమీ. పిరనీస్ పర్వతశ్రేణి (పొడవు దాదాపు 670 కిమీ.) ఈ దేశమును ఫ్రాన్స్‌నుండి వేరుచేయుచున్నది; పోర్చుగల్‌తోగల సరిహద్దు పొడవు 981 కిమీ.

భూతలరీత్యా ఈ దేశము అయిదు ప్రాంతములుగ విభజింపదగియున్నది : 1. ఉత్తరపు తీర మైదానము; సారవంతములగు లోయలు కలిగిన పర్వతమయ ప్రాంతమిది. ఇందు దట్టపు అడవులు, పశుపోషణకు ఉపకరించు గడ్డిబీడులు కలవు; 2. మెసేతా అని వ్యవహృతమగు మధ్యపీఠభూమి; దీని సరాసరి ఎత్తు 670 మీ.; ఈ ప్రాంతముననే దేశపు ముఖ్యనగరము కలదు; 3. దేశపు దక్షిణ, నైరుతి భాగములను లోగొనిన అండలూసియా ప్రాంతము; ఇందు గ్వాడల్ క్వివిర్ నదీ మైదానము తప్ప తక్కినది అంతయు పర్వతమయభూమి; అయినను ఈ పర్వతముల మధ్య సారవంతములగు లోయలు కలవు; 4. లెవాన్టీ అని వ్యవహృతమగుచు దేశపు ఆగ్నేయ భాగమునఉన్న, మధ్యధరా తీరప్రాంతము; 5. కటలోనియా ప్రాంతము; దేశపు ఈశాన్య భాగమునఉన్న ఈ ప్రాంతమున ఎబ్రోలోయ కలదు. దేశమున ఎత్తైన పర్వతశ్రేణులు ఆరు కలవు (పిరనీస్, కార్పెతో-వెతేనికా,

ఓరెతానా, మరియానికా, పెనిబేటికా, ఐబీరికా). అందలి ఉన్నత శిఖరములలో పిరనీస్‌లోని పర్డిదో శిఖరము (3,351 మీ), పెనిబేటికా శ్రేణిలోని ముల్‌హాసిన్ శిఖరము (3,481 మీ.) పేర్కొనదగినవి. నదులలో ఎబ్రో, దూరో, తాగస్, గ్వాదియానా, గ్వాడల్ క్వివిర్ ప్రముఖములు. తీరభూమియందు నిలువున పైకి లేచినటులుండు కొండలు విరివిగ కలవు.

**2. శీతోష్ణస్థితి మొ.:** ప్రాంతములనుబట్టి శీతోష్ణస్థితి మారుచున్నది. ఉత్తర తీరభూములందు చలియు, గాలిలో తేమయు ఎక్కువ; సాలీనా సరాసరి ఉష్ణోగ్రత 57° ఫా.; ఋతు పరిస్థితినిబట్టి ఇందు 18° మార్పు అటునిటు వేద్యమగును. మధ్యదేశపు పీఠభూమియందు శీతకాలమున చలియు, గ్రీష్మమున ఎండలును ఎక్కువ; అయితే ఋతు వ్యత్యయమునుబట్టి 31° సరాసరి మార్పు ఉష్ణోగ్రతయందు ఇచట కాననగును. ఆండలూసియా, లెవాన్టీలలో సమశీతోష్ణ పరిస్థితి కలదు; అయినా అచటగూడ ఎండలకాలమున ఉష్ణోగ్రత, కొన్ని సమయములందు, 104° ఫా. వరకు నీడయందే పెరుగును. ఉత్తర తీరభూములందు సాలీనా సరాసరి వర్షపాతము 98 సెం. మీ.; దక్షిణ తీరభూమియందు ఆ వర్షపాతము 40 నుండి 78 సెం. మీ. వరకు ఉండును; మధ్యదేశపు మైదానమునందు వర్షపాతము ఏ సాలునను 40 సెం. మీ. కు మీరదు.

తక్కిన యూరపీయ దేశములలో దేనియందును కనరాని వృక్షసంతతి వైవిధ్యము ఈ దేశమున కనవచ్చుచున్నది. గాలిలో ఆర్ద్రత ఎక్కువగ ఉండెడు ఉత్తర ప్రాంతమున ఓకు మొదలగు ఆకు రాల్పు తరగతి వృక్షములు కలవు. వర్షము తక్కువగ ఉండు దక్షిణ ప్రాంతమున పైన్ వృక్షముల వంటి నిత్యశ్యామలజాతి వృక్షములును, ముండ్ల పొదలును విరివిగ కన్పట్టును. మెసేటా, ఆండలూసియా ప్రాంతములలో గడ్డి మైదానములు కననగును. జనావాసములు దట్టముగ ఉండుటవలన వన్యజంతు సంతతి చాలవరకు అంతరించినది; అటనట కొన్ని చిన్న వన్యజంతువులు మాత్రమే చూడవగును.

**3. జనసంఖ్య మొ.:** దేశపు జనసంఖ్య 3,33,23,918 (1970 ; జనసాంద్రత చ కిమీ. కి 70. ముఖ్యనగరమగు మాడ్రిడ్‌లోని జనసంఖ్య 31,46,071; తక్కిన నగరములలో బార్సిలోనా (జ సం. 17,45,142) వేలెన్సియా (6.53,690), సెవిల్లా (5,48.072), జరగోజా (4,79,845), బిల్‌బావ్ (4,10,490), మలాగా (3,74,452), మిర్షియా (2,43,759) పేర్కొనదగినవి శారీర లక్షణములనుబట్టి విభేదము అంతగ కన్పట్టకున్నను, ప్రాంతీయ భేదములనుబట్టి బాస్కులు, కేటలాన్‌లు అనువారు తాము విభిన్నజాతులకు చెందినవారమని చెప్పకొనుట ఇట చాలకాలమునుండియు కనవచ్చుచున్నది. జాతీయభాష స్పానిష్‌యేయైనను, ఇందలి వివిధ మాండలికములు - కేటలాన్, గెలీషియన్ మొదలగునవి - ఆయా ప్రాంతములందు మాతృభాషలుగ వాడుకలో ఉన్నవి. ఉత్తర స్పెయిన్‌లోని బాస్కులు, బాస్కు భాషను మాటాడెదరు; ఇది పోర్చుగీజు భాషకు సన్నిహితము. అందువలన, మధ్యదేశమున వాడుకలో ఉండి, కాస్టిలియన్ అను పేరుతో వ్యవహృతమగు స్పానిష్ భాషా మాండలికమే ప్రామాణిక స్పానిష్ భాషగ అధికార రీత్యా గుర్తింపబడినది. కేటలాన్, బాస్కు భాషలను, పాఠశాలలలో సైతము వాడగూడదను నిషేధమును ప్రభుత్వము విధించినది. జాతీయ మతముగ, రోమన్ కేథలిక్ సంప్రదాయపు క్రైస్తవ మతము, ప్రభుత్వముచేత గుర్తింపును పొందినది. ప్రజలలో 99.98% ప్రజలు ఆ మత సంప్రదాయమునకుచెందినవారు. ప్రొటెస్టంటు క్రైస్తవులు దాదాపు 26 వేలు, యూదులు రమారమి 5,000 కలరు.

**4. సమాచార సౌ. :** దేశమున 13,529 తపాలా ఆఫీసులు, 11,237 తంతి కార్యాలయములు కలవు (1967); టెలిఫోనుల సంఖ్య 45,69,000 (1970). 282 రేడియో ట్రాన్స్‌మీటర్లు, మూడు టెలివిజన్ స్టేషనులు కలవు (1970). అంతర్జాతీయ రేడియో - టెలిగ్రాఫ్ సౌకర్యములను ఒక ప్రయివేటు సంస్థ నిర్వహించుచున్నది.

**5. యాన సౌ. :** దేశమునఉన్న అన్ని విధముల రోడ్ల మొత్తపు నిడివి 1,39,394 కిమీ. ఇందు 55,336 కిమీ. మాత్రమే కంకర వేయబడినది (1970). రైలుమార్గముల మొత్తపు నిడివి 17,458 కిమీ (1979); ఇందు 5 860 కిమీ. లలో బండ్లు విద్యుత్ సహాయమున నడచుచున్నవి. దేశపు వర్తక నౌకాదళమున నౌకల సంఖ్య 2,857. దీని మొత్తపు టన్నేజి 35,81,000 టన్నులు. దేశపు సముద్రపు రేవులలో బార్సిలోనా, బిల్‌దావ్, వేలెన్సియా, సెవిల్లా రేవులు ప్రముఖములు. బాలెరిక్ దీవులలోని లాస్ పల్మాస్, కేనరీ దీవులలోని సెయింట్ క్రజ్ డి టెనెరిఫే రేవులు బొగ్గును, నూనెను నింపుకొను స్థావరములుగ నౌకలకు ఉపయోగించుచున్నవి. మధ్యధరా సముద్ర, కరిబ్బియన్ సముద్ర తీరస్థ నౌకాశ్రయములకును, దక్షిణ అమెరికాలోని రేవులకును స్పెయిన్‌నుండి నౌకాయాన సౌకర్యము విరివిగ కలదు. జాతీయమగు ఐబీరియన్ వాయుయాన సంస్థవలన దేశాంతర్గతమగు విమానయానము నిర్వహింపబడుచున్నది. ఈ సంస్థయే యూరప్, అమెరికాలలోని ప్రముఖ నగరములకును, స్పెయిన్‌నుండి విమానయానమును నడపుచున్నది. విదేశ విమానయానమున, విదేశీయ విమానయాన సంస్థలును జాతీయ సంస్థతోపాటుగ పాల్గొనుచున్నవి.

**6. చరిత్ర :** దాదాపు క్రీ. పూ. 1000 నుండియు ఈ దేశపు చరిత్ర తెలియవచ్చుచున్నది ఆ కాలమున ఈ దేశము, ఉత్తరముననుండి కెల్టు జాతుల దాడికిని, తక్కిన దిశలనుండి ఫినీషియన్‌ల, గ్రీకుల దాడులకును లోనైనది. అంతకు పూర్వము అట నుండిన ఆదిమజాతుల సంస్కృతిలో, ఈ నాగరిక జాతుల పరిచయమువలన, గొప్ప పరివర్తన సంఘటిల్లినది. క్రీ. పూ. 6 వ శతాబ్దినుండి 2 వ శతాబ్దివరకు, ఉత్తర ఆఫ్రికాయందలి కార్తేజి పాలకుల వశమున ఈ దేశము ఉండినది. తరువాత క్రీ. పూ. 133 లో ఈ దేశము రోమనుల వశమై క్రీ శ. 5 వ శతాబ్దివరకు వారి వశమున ఉండినది. ఆ కాలమున ఇట నగరములును, రోడ్లును నిర్మింపబడుటయేగాక భాషా సంస్కృతులును పరిణతిని ఆర్జించినవి; క్రైస్తవమతము రోమనుల పాలనలోనే దేశమున తావును ఆర్జించినది. 5 వ శతాబ్దిలో అనాగరిక జాతులగు గాతులు ఈ దేశమును వశపరచుకొనిరి; కాని ఆ జాతికి చెందిన రోడెరిక్ రాజును, ఉత్తర ఆఫ్రికా వాసులగు మూరులు (ముస్లిములు) 711 లో ఓడించి, దేశమున అత్యధిక భాగమును ఆక్రమించిరి. అయినను ఉత్తరపు కొన్ని జిల్లాలు మాత్రము క్రైస్తవ పాలకుల అధీనమున మిగిలియుండి, అంతటంతట దేశ విమోచనమునకై మూరు సేనలతో పోరాటములను సాగించుచునే ఉండినవి మూరులు 711 మొదలుగ 1492 వరకును, తమ అధీనమునఉన్న ప్రాంతమును పాలించిరి. వారి పరిపాలనా కాలమున దేశము వైభవోపేతములగు నగరములకును, పరిశ్రమలకును, వ్యవసాయమునకును నిలయమైనది; అసాధారణపు మేధా సంపత్తికి పేరొందిన పండితులు, దార్శనికులు, వైద్యులు అట ఉద్భవించిరి. ఆ ముస్లిమ్ పరిపాలకుల కృషివలననే గ్రీకుల, భారతీయుల, అరబ్బుల విజ్ఞానశాస్త్రములతోడను, కళల తోడను, యూరపీయులకు తొలుతటి పరిచితి కలిగినదని చెప్పవచ్చును. కడకు 1492 లో క్రైస్తవ సేనలు ముస్లిములను దేశమునుండి తరిమివైచినవి. అంతట

స్పెయిన్‌లోని మాండలిక రాజ్యమగు ఆరగాన్‌ను పాలించు ఫ్రెడరిక్ V న్ను, వేరొక మాండలిక రాజ్యమగు కేస్టిలీని పాలించు ఇజబెల్లా II న్ను దేశమునకు సంయుక్త పాలకులైరి. ముస్లిముల నిష్క్రమణవలన, దేశమున వృత్తి కుశలతలకును, ధీశక్తికిని పేరొందిన వారికి కరవేర్పడెను. ఈ లోటే తదనంతర కాలమున స్పెయిన్ దేశము బల హీనత చెందుటకు కారణభూతమైనదని పండితుల అభిప్రాయము.

1492 లోనే, క్రిస్టఫర్ కొలంబస్ అను సాహసిక నావికుడు, స్పెయిన్‌దేశపు రాజు యిచ్చిన సాయమున, స్పెయిన్ దేశపు జెండాకల నౌకలతో పయనించి, అమెరికా ఖండ పరిసరములను కనుగొనెను. అంతట ఆతనిని అనుసరించి స్పెయిన్ దేశీయులగు సాహసికులు పలువురు అమెరికా ఖండమునకు పయనించి, అట స్పెయిన్ దేశపు సర్వాధిపత్యమున ఒక విశాల సామ్రాజ్యమును సంస్థాపించిరి. అమెరికానుండి బంగారము విరివిగ చేరి, దేశము సుసంపన్నమై, స్పెయిన్ దేశపు భూతల సేనయు, నౌకాదళమును అజేయములను ఖ్యాతి, ఆ దేశమునకు, యూరపున లభించినది. కాని 16 వ శతాబ్ది ఉత్తరార్ధము మొదలుగ, క్రైస్తవమత సంప్రదాయములమధ్య యుద్ధములవలనను, సామ్రాజ్యార్జన కొరకై సాగించిన దుస్సాహసపు దండయాత్రల వలనను దేశము బలహీనమైనది. ఇంగ్లాండ్, నెదర్‌లాండ్స్, ఫ్రాన్స్‌లతో 17 వ శతాబ్దిలోను, దేశపు రాజరికపు వారసత్వమునకై 18 వ శతాబ్ది తొలుతటి దశాబ్దములోను సాగిన తీవ్ర యుద్ధముల ఫలితముగ స్పెయిన్‌నకు, యూరపునగల ప్రతిష్ట అంతరించినది.

1808 లో, నెపోలియన్ చక్రవర్తి, ఈ దేశపు రాజరికమును తొలగించి, తన తమ్ముని ఇట రాజుగ చేసినను, బ్రిటిష్‌వారి సాయముతో అతనిని తొలగించి తొలుతటి రాజవంశీయునే ప్రజలు కొనిరాగలిగిరి. కాని తదాదిగ, రాజరికపు అభిమానులకును, గణరాజ్యాభిమానులకును మధ్య దేశమున తీవ్రపు పోరాటములు చెలరేగి చాలకాలము సాగినవి. ఈ సమయముననే, దక్షిణ అమెరికాయందలి వలస లన్నియు స్వతంత్రములైనవి. 1898 లో, యు. స్టే. తో సాగిన యుద్ధపు ఫలితముగ క్యూబాను, ఫిలిప్పీన్సును ఈ దేశము పోగొట్టుకొనినది. (చూ : పు. 364).

ప్రథమ ప్రపంచ యుద్ధమున ఈ దేశము తటస్థత వహించినది. అయినను దేశమున రాజరికము నెడల వైముఖ్యము పెరిగినది. కడకు 1931 లో ప్రజల ఒత్తిడికి లొంగి రాజు వైదొలగెను; అంతట దేశమున గణరాజ్య ప్రభుత్వము ఏర్పడెను. తరువాత అధికారమునకు వచ్చిన ప్రభుత్వములు ప్రగతి దోహదములగు పెక్కు శాసనములను చేసినను, దేశమున ఏ రాజకీయ పక్షమునకును అధిక సంఖ్యాక బలము లేకపోవుటవలన దేశమున సువ్యవస్థిత ప్రభుత్వము లేక, కల్లోలములు చెలరేగినవి. అంతట, మొరాకోలోని స్పానిష్ సేనల నాయకుడగు ఫ్రాన్‌సిస్కో ఫ్రాంకో, తిరుగుబాటును లేవదీసి, తన సేనలతో స్పెయినునడిగి (17 జులై, 1936) ప్రభుత్వాధికారమును వశపరచుకొన యత్నించెను. తత్ఫలితముగ సాగిన అంతర్యుద్ధము దాదాపు రెండున్నర సంవత్సరముల కాలము దేశమును పీడించినది. ఈ అంతర్యుద్ధమున తొలుత నుండియు విదేశ ప్రభుత్వములు జోక్యము వహించినవి. జర్మనీ, ఇటలీలు ఫ్రాంకోకు ఆయుధములను, సైనికులను ఇచ్చి సాయపడినవి. సోవియట్‌రష్యా ప్రభుత్వము, గణరాజ్య సేనలకు సాయపడినది. ప్రగతిశీలురగు పలువురు ప్రపంచపు పలు మూలల నుండి వచ్చి గణరాజ్యపు సేనలలో చేరి సాయపడిరి. కాని తుదకు మార్చి 31, 1939 న ఫ్రాంకో

సేనాని విజయమును ఆర్జించి, తదాదిగ దేశమున తన నియంతృత్వమును స్థాపించి పాలించెను.

ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, నాజీలయెడ సానుభూతియున్నను, తన దేశపు భౌగోళికపు ఉనికిని, ఆర్థికపు బలహీనతను, గమనించి, ఫ్రాంకో సేనాని తన దేశమును తటస్థముగనే ఉంచి, యుద్ధ ఫలితమగు నాశనమునుండి దేశమును కాపాడెను. యుద్ధానంతరమున యు స్టే. మొదలగు రాజ్యములతో ఈ దేశము సాన్నిహిత్యము పెంపొందించుకొనినది. ఫ్రాంకో సేనాని, తన అనంతరమున, పూర్వపు రాజవంశికుడగు జువాన్ కార్లస్ రాజు కావలయునని ఏర్పాటుచేసి, తన కడపటి దినములలో తాను రోగగ్రస్తుడైనపుడు, జువాన్ కార్లస్‌నే తాత్కాలిక పాలకునిగ నియమించెను. ఫ్రాంకో గతించిన (నవంబరు 20, 1975) వెనువెంటనే జువాన్ కార్లస్ రాజయ్యెను. ఇతడు దేశమున ప్రజా ప్రభుత్వమును పునరుద్ధరించుటకై ప్రజలకు వాగ్దానము చేసెను. ఆఫ్రికాలో స్పెయిన్‌కుఉన్న వలస రాజ్యమగు స్పానీయ సహారాయొక్క స్వాతంత్ర్యమును ఈతని ప్రభుత్వము గుర్తించినది. (పు. 232).

**7. పరిపాలన :** ఫ్రాంకో సేనాని దేశమును పాలించు కాలమున 'ఫలాంజ్' అను రాజకీయ పక్షమొకటియే దేశమున పనిచేయగలిగినది. కాని ఆతని తరువాత పూర్వపు రాజకీయ పక్షములు అన్నియు పునరుద్ధరితములై పనిచేయసాగినవి. 'కార్టెజ్' అను జాతీయ శాసన సభయందు, ఫ్రాంకో కాలమున ఫలాంజ్ పక్షమువారే ఎన్నుకొనబడి, ప్రభుత్వమంతయు ఫ్రాంకో అధీనమునఉండి, ప్రతిపక్షముగాని, ప్రభుత్వ విమర్శనగాని ఎచటను ఉండుటకు అవకాశము ఉండెడిదికాదు. అతని మరణమునకు పూర్వమే 1966 నుండి ఈ నియంతృత్వమున కొంత సడలింపు జరిగినను, ప్రతిపక్షములు పనిచేయుటకు మాత్రము అవకాశములు ఉండినవి కావు. కాని ఇప్పటి రాజరికమున, నియంతృత్వమునకు సంపూర్తిగా స్వస్తిచెప్పబడినది. సోషల్ డెమోక్రాట్, కమ్యూనిస్ట్, సోషలిస్ట్ మొదలగు ప్రతిపక్షములును పనిచేయగలిగినవి. డిసెంబరు 15, 1976 న ప్రజాభిప్రాయ సేకరణవలన ఆమోదితమైన ఒక రాజ్యాంగ విధానమును అనుసరించి, కార్టెజ్ నందు ప్రతినిధుల సభ, శిష్టసభ అను రెండు కక్ష్యలుండునటులను, వానికి ఎన్నికలు సార్వజనిక, అపరోక్ష, రహస్య విధానమున జరుగవలెననియు నిర్ణయింపబడినది. ప్రతినిధుల సభయందు 350 మంది సభ్యులుందురు. వీరిని నైష్పత్తిక ప్రాతినిధ్య విధానమున ప్రజలు ఎన్నుకొనెదరు. శిష్టసభయందలి సభ్యసంఖ్య 204; దేశమందలి 50 రాష్ట్రములలో ప్రతియొకటియు నలువురు సభ్యులను, స్యూటా, మెలిల్లా నగరములు తలకు ఇరువురు ప్రతినిధులను ఈ సభకు ఎన్నుకొనును. ఈ సభల అధ్యక్షులను ఆ సభలే ఎన్నుకొనును. సమష్టి కోర్టెజ్‌యొక్క అధ్యక్షుని, రాజ్యసమితియొక్క అధ్యక్షుని రాజు నియమించును. రాజ్య సమితిలో ఏడుగురు సభ్యులుందురు. రాజునకు వారు సలహాదారులుగ ఉందురు. కార్టెజ్‌చేయు శాసనములను అనుసరించి రాజు పాలనను నిర్వహించును. కార్టెజ్ నిర్ణయములను ప్రజాభిప్రాయమునకు నివేదించు హక్కు రాజునకు కలదు. సుప్రీమ్ కోర్టునకు లోబడి దేశమున న్యాయనిర్వహణయు, ఎన్నుకొనబడిన సభల సాయమున స్థానిక పాలనయు సాగుచున్నది.

**8. దేశరక్షణ :** దేశమున సమర్థుడగు ప్రతి పౌరుడు రెండేండ్లు నిర్బంధ సైనిక శిక్షణ పొందవలయునను నియమము కలదు. భూతలసేనయందు 2,20,000 మంది సైనికులు కలరు. ఇందు ఒక కవచిత శకటదళము, 2 పర్వత దళములు, 12 కాల్బల దళములు, 1 ఆశ్విక దళము, 1 ఉన్నత

పర్వత దళము, 1 పారాచూట్ దళము, క్షిపణులను ప్రయోగింపగలుగు ఒక దళము కలవు. నౌకా సేనయందలి యోధసంఖ్య 52,200. ఈ సేనకు ఒక హెలీకాప్టర్ కేరియర్, ఒక క్రూయిజర్, 3 జలాంతర్గాములు, 2 చిన్న జలాంతర్గాములు, 18 డెస్ట్రాయర్లు, తక్కువిధముల యుద్ధోపయోగ నౌకలు 107 కలవు. వాయుసేనలోని సైనికసంఖ్య 33,000; పోరాటపు విమానముల సంఖ్య 200. 1953 లో ఈ దేశమునకు యు. స్టే. తో రక్షణ ఒడంబడికలు కుదిరి, తదాదిగ అంతటంతట పునరుద్ధరితములై కొనసాగుచున్నవి. వాని ఫలితముగ యు. స్టే. కు స్పెయిన్ దేశమున వైమానిక, నౌకా స్థావరములను కొన్ని నిర్ణీత స్థలములందు ఏర్పరచుకొను అవకాశము కలిగినది.

**9. అంతర్జాతీయ సం.:** ఐక్యరాజ్యసమితియందును తదనుబంధ ప్రత్యేక సంస్థలందును ఈ దేశమునకు సభ్యత్వము కలదు. ఆర్థిక సహకార, వికసన వ్యవస్థ (OECD) యందు 1959 మొదలుగ ఈ దేశము సభ్యత్వమును వహించి, యూరపీయ ఆర్థిక సంఘము (EEC) తో, సుంకముల తగ్గింపునకు సంబంధించిన ఒక ఒడంబడికకు రాగలిగినది (1970).

**10. ఆర్థిక రంగము:** వ్యవసాయము, పశుపోషణ, ఖనిజ సాధన - లను సాంప్రదాయికపు కృషులపై ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ చాలవరకు ఆధారపడి ఉన్నది. ఎగుమతులలో అత్యధిక భాగము ఈ కృషులవలననే లభించుచున్నది. అయినను ఆహార ద్రవ్యములందు అధికభాగమును, ముడి పదార్థములను కొన్నింటిని ఈ దేశము ఇప్పటికిని దిగుమతి చేసికొనుచునే ఉన్నది. పరిశ్రమలు 1953 మొదలుగ ప్రభుత్వపు ప్రోత్సాహమువలన కొంత ముందంజ వేయగలిగినవి. దేశీయుని తలసరి సాలీనా ఆదాయము 830 డాలర్లుగా అంచనా (1969). ఈ విధముగ ఈ దేశము తక్కిన యూరపీయ దేశములతో పోల్చినపుడు తక్కువ స్థాయికి చెందినదిగనే లెక్కకు వచ్చుచున్నది. విదేశీయ వినిమయ ద్రవ్యమును ఆర్జించుటలో యాత్రిక పరిశ్రమ దేశమునకు చాల సాయపడుచున్నది.

దేశపు మొత్తపు వైశాల్యమునందు దాదాపు 4,71,91,800 హెక్టేరులు వ్యావసాయిక భూమిగ లెక్కకు వచ్చుచున్నది; అయితే ఇందు 48.3% పశుగ్రాసపు గడ్డిబీడు; 29% పంటలు సాగగుభూమి; తక్కినది బంజరు (1970). ముఖ్యములగు పంటలు, వాని ఉత్పత్తులు (వేల టన్నులలో) ఈ దిగువరీతిగ కలవు : గోధుమ (4,060), బార్లీ (3,092); ఓట్లు (395), రై (1,863), వరి (388). మొక్కజొన్న (259), ఉరలగడ్డలు (4,937), చక్కెరబీటు (5,715), టొమాటోలు (1,506). ద్రాక్ష సారాయపు ఉత్పత్తి 2.5 కోట్ల హెక్టో లీటర్లు. వేల లెక్కలో పశుజాతి 1970 లో ఈ రీతిగ కలదు; గుర్రములు (282), గుర్రపు తట్టులు (533), కంచర గాడిదలు (368), ఆవులు (4,282), గొర్రెలు (17,005), మేకలు (2,551), పందులు (7,621) ఉత్తర తీరప్రాంతమున మత్స్య పరిశ్రమ విరివిగ సాగుచున్నది; వీని పట్టుబడిలో కొంత భాగము ఎగుమతి చేయబడుచున్నది; ఈ కృషిలో 15,250 చిన్న పడవలు పాల్గొనుచున్నవి. దేశపు భూతలమున 10% అటవీ భూమియేయైనను, ఇందలి అడవులన్నియు చాలవరకు క్షీణించినవి. పిరనీస్, గెలీసియా ప్రాంతములలో మాత్రమే కొన్ని మంచి అడవులు కలవు. మొత్తముమీద దేశావసరములకై కలపను చాలవరకు ఈ దేశము విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నది. కాని బిరడాలకు ఉపయోగించు ఒక రకపు బీలుగుచెట్లు ఇచట విరివిగ కలవు; అందువలన బిరడాల ఉత్పత్తిలో, ప్రపంచ దేశములందు, ఈ రాజ్యము రెండవ స్థానమును ఆక్రమించి ఉన్నది. ఖనిజములలో దాదాపుగ

అన్నియు ఈ దేశమున లభ్యములగుచున్నవి. దేశపు ఆర్థిక వ్యవస్థలో ఖనిజ సాధనకు ప్రముఖ స్థానము కలదు. 1975 లో ఆ యా ప్రముఖ ఖనిజముల ఉత్పత్తి (వేల మెట్రిక్ టన్నులలో) ఈ రీతిగ కలదు : ఆంత్రసైట్ (2,800), రాక్షసి బొగ్గు (7,810), లిగ్నైట్ (3,060), ముడిరాగి (82.5), శుద్ధరాగి (73), ముడి ఇనుము (8,070), ముడి సీసము (106), ముడి మాంగనీసు (18.4), పొటాష్ (4,235), గంధకం (33), ముడితగరం (0.7), ముడి తుత్తునాగం (161), ముడి వుల్ఫ్రామ్ (0.8), వెండి (0.119); బంగారము 427 కిగ్రా. బర్గెస్ అను నగరపు ప్రాంతమున 1966 లో పెట్రోలు గనులు కనుగొనబడినవి. ప్రత్తికి, ఉన్నికి సంబంధించిన పరిశ్రమలు ఎక్కువగ కలవు; అవియు ముఖ్యముగ కేటలోనియాలో మాత్రమే విరివిగ ఉన్నవి. ఆ యా పరిశ్రమలందలి ఉత్పత్తులు, 1971 లో (వేల మెట్రిక్ టన్నులలో) ఈ రీతిగ కలవు : ఊలుదారము (37), నూలుదారము (75), నూలుగడ్డలు (76), రేయాన్ వస్త్రాలు (25). 275 కాగితపు మిల్లులనుండి 6,00,832 టన్నుల వివిధ రీతుల కాగితము ఉత్పత్తియైనది. నౌకా నిర్మాణ పరిశ్రమలో మొత్తమువ 7,49,537 టన్నుల ప్రమాణముకల వివిధ నౌకలు నిర్మితములు (1970). విద్యుదుత్పత్తి 6,246 కోట్ల కివా. (1971); ఆ సంవత్సరమున ఉత్పత్తియైన ఇంధన వాయువు 74.3 కోట్ల ఘ. మీటరులు. దేశపు ఎగుమతుల విలువ 20,564.5 కోట్ల పె., దిగుమతుల విలువ 34,741.5 కోట్ల పె. (1971). బడ్జెటరీ వ్యయము 30,975.8 కోట్ల పె. (1970).

**11. సాంఘిక రంగము :** 1939 న ప్రారంభితమై తదాదిగ అంతటంతట అభివృద్ధికరపు మార్పులనుపొందిన సాంఘిక భద్రతా ప్రణాళిక దేశమున అమలునఉన్నది. వ్యవసాయరంగమునను, తక్కువిధముల రంగములందును పనిచేయు కార్మికులకు అందరికి ఇందువలన అనారోగ్య, వార్ధక్య, అంగ వైకల్యాదులందు జీవితభరణమునకై సహాయము లభించుచున్నది. దేశమున కార్మికుని కనీసపు జీతము రోజునకు 120 పెసేటాలుగ నిర్ణయింపబడినది (1970). దేశమున 97.3 కోట్ల గృహములు కలవు; అయినను సామాన్య ప్రజలకు గృహవసతి తక్కువగ ఉండుటవలన 16 ఏండ్ల ప్రణాళికను ఒకదానిని ప్రభుత్వము రూపొందించి, దాని ననుసరించి ఏడాదికి 250,000 గృహవసతి యూనిట్లను నిర్మింప జేయుచున్నది. దేశమున ఉన్న 1,38,114 ప్రయిమరీ పాఠశాలలలో 47,49,500 మంది; 4,455 మాధ్యమిక పాఠశాలలలో 14,77,800 మంది విద్యార్థులు కలరు (1970-71). వివిధ తీరుల ఉన్నత పాఠశాలలు 121 లో 1,65,600 మంది విద్యార్థులు కలరు (1969-70). దేశపు 13 విశ్వవిద్యాలయముల లోని విద్యార్థి సంఖ్య 1,25,771 (1965-66). ఇవిగాక 4 విశ్వవిద్యాలయాలు 1972 లో క్రొత్తగా సంస్థాపింపబడినవి. అందులో ఒకటి 'ఆరుబయలు' విశ్వవిద్యాలయము. వీనిలోని విద్యార్థుల సంఖ్యా వివరములు తెలియవు. దేశమున 426 గ్రంథాలయములు కలవు (1959); వానిలోని మొత్తపు గ్రంథ సంఖ్య 94,42,085. ఆ గ్రంథాలయములలో మాడ్రిడ్ లోని నేషనల్ లైబ్రరీ, సెవిల్లా లోని కాన్‌డెలాన్ ఇండియా లైబ్రరీ, సిమన్కాస్ లోని నేషనల్ లైబ్రరీ ఆర్కైవ్స్ ప్రముఖములు. దేశమున మ్యూజియముల సంఖ్య 299 (1960). వీనియందు, మాడ్రిడ్‌లోని ప్రాదో ప్రముఖము. 222 దైనిక వార్తాపత్రికలు ప్రచారమున ఉన్నవి. వీనిలో మాడ్రిడ్, సెవిల్లాలనుండి ఒకే సమయమున ప్రచురితమగు ఏబిసి కి అత్యధిక ప్రచారము కలదు (1971). దాదాపు 1,90,000 శయ్యా సంఖ్య కలిగిన 1,838 వైద్యశాలల వలన ప్రజ

లకు వైద్యసహాయము లభించుచున్నది; వైద్య సంఖ్య 41,932 (1967).

**12. యాత్రా సౌ** : దేశమున పర్యటింప దలచు విదేశీయులకు అందరికి పాస్‌పోర్టు వీసాలు ఉండి తీరవలయును. అయినను యు. స్టే. వాసులు వీసా లేకుండ ఆరు నెలలు ఉండవచ్చును. 1971 లో 268 లక్షల విదేశీయులు దేశమున పర్యటించిరి.

**13. ప్రసిద్ధ పౌరులు** : 1. క్రిస్టఫర్ కొలంబస్ (1451-1506) : ఇటలీ దేశీయుడగు ఈ నావికుడు, స్పెయిన్ దేశపు పాలకుల ఆదర ప్రోత్సాహముల వలన దేశాన్వేషణను నెరపి, అమెరికా పరిసరములను తొలుతగ కనుగొని, స్పెయిన్ దేశపు జెండాను అచట నెలకొల్పెను. 2. వాస్కో- వాస్కో నూనెజ్ డి బాల్బో (1475-1517) : పసిఫిక్ మహాసముద్రపు వివరములను కనుగొనిన సాహసిక నావికుడు; 3. హెర్నాన్ కార్టెజ్ (1485-1547) : మెక్సికోను జయించిన ప్రసిద్ధ సేనాని; 4. ఫ్రాన్సిస్కో పిజరో (1470-1541) : పెరూను జయించిన వీరుడు; 5. ఎల్ గ్రెకో అను పర్యాయనామము కలిగిన డొమెనికస్ తియోతోకోపౌలస్ (1548-1614) : గ్రీకు జాతీయు డయ్యును, స్పెయినున వసించి చిత్ర కారుడుగ ప్రపంచ ప్రసిద్ధిని ఆర్జించినవాడు; 6. సెయింట్ ఇగ్నేషియస్ డి లయోలా (1409-1556) : జెసూయిట్ సంస్థను నెలకొల్పి క్రైస్తవ మత ప్రచారమునకు అనన్య కృషి చేసినవాడు. 7. సాల్వడార్ డాలి (జ. 1904) : ప్రపంచ ప్రసిద్ధ చిత్రకారుడు.

---

# 30. స్విజర్లాండ్

**ముఖ్యనగరము** : బెర్న్; **జెండా** : ఎర్రని భూమికపై, సమభుజములు కలిగిన తెల్లని సిలువ; **జాతీయ గీతము** : "ట్రిట్‌స్ట్ ఇన్ మోర్గెన్‌రాట్ దహేర్, సేహ్ ఇక్ డిక్ ఇన్ స్ట్రాహ్లెన్ మీర్'' (ఆ పర్వత సీమలపై దివ్య ప్రభావమును సూర్యుడు వెలయించినపుడు) అను చరణము తొలుత కలది; **నాణెము** : స్విస్ ఫ్రాంక్; ఇది 100 సెంటైము లుగ విభక్తము; 4.87 స్విస్ ఫ్రాంకులు =రు. 7-50; **కొలతతూకములు** : మెట్రిక్ విధాన పువి: **కాలగణన** : సా. 1 గం. = భారత దేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : పశ్చిమ యూరపున 5°57' - 10'30' తూ. తు. రేఖల మధ్యను, 45°49'-47°49' ఉ. అ. రేఖలకు నడుమను నెలకొనిన ఈ దేశమునకు పశ్చిమ, వాయవ్యములందు ఫ్రాన్సు దేశమును, దక్షిణమున ఇటలీయు, తూర్పున ఆస్ట్రియా లిక్టెన్‌స్టీనులును, ఉత్తరమున పశ్చిమ జర్మనీయు సరిహద్దులందు ఉన్నవి. దేశపు ఉత్తర దక్షిణముల గరిష్ఠపు కొలత 219 కిమీ.; తూర్పు-పడమరల గరిష్ఠపు నిడివి 362 కిమీ. దేశపు వైశాల్యము 41,288 చ. కిమీ. భూతల స్వభావ రీత్యా ఈ దేశము మూడు ప్రాంతములుగ విభజింపదగి ఉన్నది : 1. స్విజర్లాండును, ఫ్రాన్సు నుండి వేరు చేయుచు, దేశపు ఈశాన్య దిశన ఉన్న జూరా పర్వతములు; 2. దేశపు విస్తృతిలో అయిదింట మూడు భాగములను ఆక్రమించి, దక్షిణ దిశన ఉన్న ఆల్ప్స్ పర్వతములు; 3. జూరా, ఆల్ప్స కొండల మధ్యన వ్యాపించి మిట్టెల్‌లాండ్

అని వ్యవహృతమై, సారవంతపు మైదానములను, అటనట గుట్టల వరుసలను కలిగిన మధ్యదేశపు స్విస్ పీఠభూమి. దేశ విస్తృతిలో 30%ను ఆక్రమించి, సరాసరిన 460 మీ. ఎత్తు కలిగిన మిటైల్ లాండును ఈ దేశపు వ్యావసాయిక, పారిశ్రామిక కృషులకు సంబంధించిన హృదయసీమగ భావింపవచ్చును. ఆల్ప్స్ పర్వత మధ్యభూమిని (సెం. గోట్‌హార్డ్ కనుమ చుట్టుపక్కలనున్న దానిని) ఒక ప్రముఖ జలవిభజన సీమగ పేర్కొనెదరు.




పటము 28.

ఇట ఉద్భవించిన వేర్వేరు నదులు వేర్వేరు దిక్కులకు ప్రవహించినవి: వానిలో రైన్‌నది ఉత్తరమునకు ప్రవహించి, ఉత్తర సముద్రమున చేరుచున్నది; రోన్ నది దక్షిణమునకు పోయి మధ్యధరా సముద్రమున పడుచున్నది; టిసినో నది, పో నదికి ఉపనదిగా మారి, దానితో ఆడ్రియాటిక్ సముద్రమున కలియుచున్నది; ఇన్ నది డాన్యూబ్ నదిలో చేరగ, ఆ నది నల్ల సముద్రమున సంగమించుచున్నది. ఆల్ప్స్‌లోని డూఫోర్ పాయింటు (4,634 మీ.) దేశపు అత్యున్నత భూమి; మాగ్గియోర్ సరోవరపు తీరము (193 మీ.) దేశపు అతి నిమ్న ప్రాంతము. దేశమున 1,484 సరస్సులును, 12,900 కు పైగా చిన్న మడుగులును కలవు. సరస్సులలో జెనీవా (లీమాన్) సరస్సు అతి విస్తృతము (564 చ. కిమీ.); కాని దేశపు సరిహద్దున ఉన్న ఈ సరస్సునను, అట్టివేయగు కాన్‌స్టాన్స్, మాగ్గియోర్, లుగాన్ సరస్సు లందును కొన్ని నిర్దిష్ట భాగములందు మాత్రమే ఈ దేశమునకు స్వామ్యము కలదు.

**2. శీతోష్ణస్థితి మొ.** : దేశమున ఆల్ప్స్ పర్వతములకు ఉత్తరమున ఉన్న ప్రాంతమున సమశీతోష్ణ పరిస్థితి ఉన్నను, ఎత్తున భేదములనుబట్టి అట సైతము ఉష్ణతాప్రమాణమున హెచ్చుతగ్గులు కానవచ్చుచున్నవి. సాలీనా సరాసరి ఉష్ణోగ్రత పీఠభూమి యందలి 44.7°ఫా. నుండి పర్వత సీమలందు 34.8°ఫా. వరకు మారుచున్నది. సరాసరి సాలీనా వర్షపాతము రోన్ నదీలోయ యందలి 52 సెం. మీ. నుండి లుగానోలోని 167 సెం. మీ. వరకు మార్పు పొందుచున్నది. ఆల్ప్స్, జూరా పర్వత ప్రాంతములందు 1800 మీ. పైబడిన ప్రాంతములు సదా హిమావరితములు. శీతోష్ణ పరిస్థితి యందును, ఉన్నతి యందును కలుగు మార్పులనుబట్టి వృక్ష, జంతు సంతతులందును మార్పులు కానవచ్చుచున్నవి. నిమ్న భూములందు అత్తి, నారింజ, సీమ బాదం, చెస్ట్‌నట్, వాల్‌నట్ చెట్లు కలవు; అటనుండి 1200 మీ. వరకు బీచి, ఓకుచెట్ల అడవులును, ఆపైన 1700 మీ. వరకు పైన్, ఫర్ చెట్లును, అంతట 2100 మీ. వరకు చిన్న జాతి పైనుచెట్ల కోవకు చెందిన ఎత్తుతక్కువ వృక్షములను, ఆ మీదట మంచు ప్రాంతములందు, దాదాపు 100 రకముల పుష్పజాతులును కానవచ్చుచున్నవి. అడవి పంది, జింక, నక్కవంటి చిన్న రకపు వన్య జంతువులు మాత్రమే కలవు. కోయిల మొదలగు పక్షులును, మాంసాహారులగు గ్రద్ద వంటి కొన్ని పక్షులును తరచుగ కన్పట్టును. సరస్సులందును, నదులందును మత్స్య సంతతి విరివిగ కలదు.

**3. జనసంఖ్య మొ.** : దేశపు 22 మండలము (కేన్‌టన్) లందును కలసి మొత్తపు జనసంఖ్య

62,69,783 (1970); జనసాంద్రత చ. కిమీ కు 152. దేశపు నగరములలో జూరిచ్ (జనసంఖ్య 7,15,300), బేసెల్ (3,78,300), జెనీవా (3,18,500), బెర్న్ (2,82,200), లసానే (2,25 800) పేర్కొనదగినవి. జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్ జాతులు తమ తమ ప్రత్యేక మండలములందు ఇట నివసించుచు, సమష్టిగ స్విజర్లాండ్ పౌరులుగ లెక్కింపబడుచున్నారు. (ఇచటి పౌరులకు 'స్విస్' పౌరులు అని వ్యవహారము కలదు). దేశమున ఆ యా మండలములందు జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్ భాషలు మాతృభాషలుగ ప్రజలందు వాడుకలో ఉన్నవి. 64 9% ప్రజలు జర్మన్ భాషను, 18.1% ఫ్రెంచి భాషను 11.9% ఇటాలియన్‌ను, 0.8% రోమాన్ష్ భాషను, తక్కిన 1.4% వివిధ ఇతర భాషలను మాతృభాషలుగ కలిగి ఉన్నారు. జర్మన్, ఫ్రెంచి, ఇటాలియన్ భాషలు సాధికార జాతీయ భాషలుగ పరిగణింప బడుచున్నవి. దేశమున మత స్వేచ్ఛ చట్టరీత్యా అమలున ఉన్నది; పౌరులలో 49.4% రోమన్ కేతలిక్ క్రైస్తవులు; 47.7% ప్రొటెస్టంటు సంప్రదాయపు వారు; 2.9% ఇతర మతముల వారు.

**4. సమాచార సౌ.:** దేశమున 4,076 తపాలా ఆఫీసులు కలవు. దేశమున ఉన్న 32 లక్షల పైబడిన టెలిఫోనులును ఒకే డయలుపై పని చేయుచున్నవి. 27 రేడియో బ్రాడ్‌కాస్టింగ్ స్టేషనులును, 6 టెలివిజన్ స్టేషనులును పనిచేయుచున్నవి. ఈ స్టేషనులు ప్రయివేటు కంపనీల యాజమాన్యమున ఉన్నవి.

**5. యాన సౌ.:** దేశపు రోడ్లనిడివి 18,511 కిమీ.; ఇందులో 651 కిమీ. మోటారుకార్లకు మాత్రమే ప్రత్యేకింపబడినది. రైలురోడ్ల నిడివి 8,008 కిమీ. (1971); ఇందు 97% నిడివిన రైలు బండ్లు విద్యుత్ సాయమున నడచుచున్నవి. తన ప్రాదేశికపు ఉనికినిబట్టి, ఈ దేశము పశ్చిమ యూరపీయ రాజ్యములలో పెక్కింటికి రైలుమార్గముల కేంద్రముగ ఉపకరించుచున్నది. ఇటనుండి ఫ్రాన్స్, జర్మనీ, ఆస్ట్రియాలకును, ఉత్తర యూరపునకును, ఇటలీ, దక్షిణ యూరపులకును రైలు ప్రయాణపు వసతులు కలవు. దేశాంతస్థపు జలమార్గములు, దేశపు ప్రయాణ, వర్తక వ్యాపారములందు అతి ప్రాముఖ్యమును కలిగియున్నవి. బేసెల్ నగరము, పేరొందిన ఒక నదీ తీరస్థ నౌకాశ్రయము. ఇట నుండి నదీ మార్గములద్వారా జర్మనీలోని రూర్ మొదలగు ప్రాంతములకు, నెదర్లాండ్స్‌లోని రోటర్‌డామ్ మొదలగు చోటులకు నౌకాయానవసతి కలదు. 'స్విస్ రైన్ నౌకాదళము' అనబడు ఈ దేశాంతస్థ జలమార్గ యానపు నౌకాదళమున 436 పడవలు కలవు; వీని మొత్తపు పరిమాణము 4,29,470 టన్నులు. దేశమునకు సముద్రతీరపు రేవు లేకపోయినను, ద్వితీయ ప్రపంచయుద్ధ కాలము మొదలుగ ఈ దేశము ఒక సముద్రయానపు వర్తక నౌకాదళమును నిర్వహించుచున్నది; ఇందు 32 నౌకలు కలవు; వీని మొత్తపు టన్నేజి 2,16,675 మెట్రిక్ టన్నులు (1971). 'స్విస్ ఎయిర్' అని వ్యవహృతమగు దేశీయ విమానయాన సంస్థ కలదు. జూరిచ్, బేసెల్, జెనీవాలలో పేరు వడిన అంతర్జాతీయ విమానాశ్రయములు కలవు. ఆటనుండి ప్రముఖ యూరపీయ నగరములకు, పశ్చిమ ఆసియాకు, ఉత్తర ఆఫ్రికాకు విమానముల ద్వారా రాకపోకల వసతులు కలవు. దేశీయ సంస్థయేగాక, విదేశములకు చెందిన 24 విమానయాన సంస్థలును, ఈ విమానాశ్రయములను తమ దూర ప్రయాణములకు వాడుకొనుచున్నవి.

**6. చరిత్ర:** తొలుత ఈ ప్రాంతమున హెల్వేతీ అను ఒక కెల్టిక్ తెగ వసించుచుండినది. వారిని క్రీ. పూ. 58 లో జూలియస్ సీజరు

జయించి, ఈ ప్రాంతమును రోమన్ సామ్రాజ్యమున అంతర్భాగముగ చేసెను. ఆనాడు ఈ ప్రాంతము హెల్‌వేషియా అని వ్యవహృతము. రోమనుల పాలనలో ఇట వైభవోపేత నగరములు పెంపొందినవి; వాణిజ్యము విస్తరించినది. క్రీ. శ. 250 లో ఈ ప్రాంతము జర్మానిక్ తెగలకును, తరువాత 433 లో బర్గండియనులకును వశమైనది. ఈ ఇరు తెగలను జయించి (496), ఫ్రాంకులు ఈ రాజ్యమును తమ సామ్రాజ్యమున కలుపుకొనిరి. ఫ్రాంకుల పరిపాలనా కాలమున దేశమున జూరిచ్ మొదలుగ కొన్ని క్రొత్త నగరములు నిర్మితములైనవి; క్రైస్తవమతము దేశమందంతట వ్యాపించినది.

క్రీ. శ. 1032 లో పవిత్ర రోమక సామ్రాజ్యమున ఈ ప్రాంతము అంతర్భాగమైనది. 13 వ శతాబ్దిలో హాబ్స్‌బర్గ్ వంశికులగు సామ్రాట్టులు ఈ రాజ్యమును తమ సామ్రాజ్యమున కలుపుకొని ప్రజలను పీడింపగ, ప్రజలు తిరుగుబాటుచేసి స్వాతంత్ర్యమును పొందిరి. ఆ స్వాతంత్ర్య పోరాటమున పాల్గొనిన మూడు మండలములు – ష్విజ్, ఊరీ, అంతర్‌వాల్డన్ అనునవి – ఒక 'శాశ్వతమైత్రి' ని, ఆగస్టు 1, 1291 న కుదుర్చుకొని, ఒక రాజ్యముగ రూపొందినవి. 1353 నాటికి అదనముగ అయిదు మండలములు – లూసెర్నీ, జూరిచ్, గ్లారస్, జగ్, బెర్న్ – ఆ రాజ్యమున స్వచ్ఛందముగ చేరినవి. ఈ 8 మండలములును కలసి తమ రాజ్యమును ఒక సమాహారము (కాన్‌ఫెడరసీ) గ పేర్కొని, ఆ మండలములందు పెద్దదియగు ష్విజ్ మండలపు పేరును అనుసరించి, ఆ సమాహారమునకు 'ష్విజేర్' అను పేరును కల్పించినవి. అదియే దేశనామము 'స్విజర్లాండు' గను, పౌరులు 'స్విస్' లు గను పేర్కొనబడుటకు మూలమైనది. ఈ దేశపు స్వాతంత్ర్యమును, పవిత్ర రోమక సామ్రాజ్యము 1499 లో గుర్తించినది. తరువాత ఫ్రెంచి విప్లవ కాలము (1789) వరకు, విదేశీయ దండయాత్రల బెడద ఎట్టిదియులేక స్విజర్లాండ్ మనగలిగినది. ఈ మధ్య కాలముననే ఆర్‌గావ్, తురగావ్, ఫ్రైబోర్గ్ – సోలోతుర్న్, బేసెల్. షాఫ్‌హౌసెన్, అప్పెంజెల్ మండలములు ఈ సమాహారమున, తమకు శాముగ ఎట్టి నిర్బంధమునులేక, చేరగ, మొత్తపు రాజ్యమున 1513 నాటికి 13 మండలములు ఏర్పడినవి. మరికొన్ని మండలములను సరిహద్దుల భద్రతకొరకై ఈ దేశము, జయించి వశపరచుకొనినది. 16 వ శతాబ్దిలో యూరపున రోమన్ కేతలిక్ ప్రభువులకును, ప్రొటెస్టంటు రాజులకును మధ్య సాగిన యుద్ధముల ఫలితముగ ఈ రాజ్యమునందలి విభిన్న క్రైస్తవ సంప్రదాయముల మండలములమధ్య కలతలు చెలరేగినను, 17 వ శతాబ్ది పూర్వార్ధమున ఆ కలతలు సమసిపోవుటయు, యూరపీయ రాజ్యములు అన్నియు స్విజర్‌లాండ్‌యొక్క స్వాతంత్ర్యమును గుర్తించుటయు జరిగినవి.

ఫ్రెంచి విప్లవ కాలమున, ఈ దేశమున సైతము విప్లవ భావములు కొన్ని యెడల ప్రజ్వరిల్లినవి. కడకు నెపోలియను, ఈ రాజ్యమును వశపరచుకొని, ఈ రాజ్యమును హెల్వెటిక్ గణరాజ్యముగ ప్రకటించి, తనను అనుసరించు ప్రభుత్వమును అట నెలకొల్పెను. నెపోలియన్ పతనము చెందిన తరువాత వియెన్నాలో 1815 న జరిగిన యూరపీయ రాజ్యముల సమావేశము (వియెన్నా కాంగ్రెస్) ఈ దేశపు స్వాతంత్ర్యమును, శాశ్వత తాటస్థ్యమును గుర్తించుటయేగాక, పరిసరముననున్న కొన్ని ఇతర మండలములును అందు జేరుటకు అనుమతించినది. ఈ విధముగ అప్పటికి ఈ దేశమున 22 మండలములు ఏర్పడినవి. అంతట 1848 లో ఈ రాజ్యము, ఒక రాజ్యాంగ విధానము రూపొందించుకొనినది; ఇది 1874 లో సవరణ పొందినది.

'శాశ్వత తాటస్థ్యము' అనునది ఈ దేశపు విదేశ వ్యవహార నిర్వహణకు పునాది. ప్రథమ, ద్వితీయ

ప్రపంచ యుద్ధముల రెండింటను ఈ దేశము తన తాటస్థ్యమును కాపాడుకొనగలిగినది. ఆ తాటస్థ్యమును బట్టియే, ప్రథమ ప్రపంచ యుద్ధానంతరమున ఏర్పడిన నానాజాతి సమితియొక్క కేంద్ర కార్యాలయమును, ఈ దేశమునందలి జెనీవాలో ఉంచుటకు, ప్రపంచ రాజ్యములు అంగీకరించినవి. ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరమున, ఐ. రా. స. ఏర్పడి, నానాజాతి సమితి రద్దయి అందుతోపాటుగ దాని కేంద్ర కార్యాలయము ఎత్తివేయబడినను నేడు సైతము రెడ్‌క్రాస్ మొదలగు పెక్కు అంతర్జాతీయ సంస్థల కేంద్ర కార్యాలయములు జెనీవాయందు పనిచేయుచున్నవి.

**7. పరిపాలన :** రాజ్యాంగ విధానమును బట్టి స్విజర్లాండ్ దేశము, స్విస్ సమాహారము (స్విస్ కాన్‌ఫెడరేషన్) అని వ్యవహృతము. సమాఖ్యా విధానపు పరిపాలన ఇట అమలున ఉన్నది. 1874 లో నవరణ పొందిన రాజ్యాంగ విధాన రీత్యా ఉచ్చతమ శాసన నిర్మాణాధికారము సమాఖ్యాసభ (ఫెడల్ అసెంబ్లి) యందును, కార్య నిర్వహణాధికారము సమాఖ్యా సంఘము (బున్‌డెర్ స్టాట్) నందును న్యస్తములు. సమాఖ్యా సభ యందు రెండు కక్ష్యలు-జాతీయ సంఘము, రాజ్య సంఘము-కలవు. జాతీయ సంఘము (నేషనల్ రాట్) న సభ్య సంఖ్య 200. 20 ఏండ్ల వయసునకు తగ్గని వయసు కలిగిన పౌరులవలన, అపరోక్ష రీతిలో, వీరు ఎన్నుకొనబడెదరు; ఈ సంఘమునకు ఎన్నిక సాధారణముగ నాలుగేండ్లకు ఒకసారి జరుగును. మండలములందలి జనసంఖ్యను బట్టి ఆ యా మండలములకు జాతీయ సంఘమున గల ప్రాతినిధ్యము నిర్ణయింపబడినది. (ఈ మండలములు 22 మాత్రమే అయినను, పెద్ద మండలముల మూడింటిలో ప్రతి యొక దానిని రెండేసి అర్ధ మండలముగ విభజించుట వలన ప్రస్తుతము 19 మండలములును, 6 అర్ధ మండలములును ఉన్నవి). జాతీయ సంఘమున మండలముల జనసంఖ్యను బట్టి ప్రాతినిధ్యము కల్పింపబడినను, ఏ మండలమైనను, లేదా అర్ధ మండలమైనను, జనసంఖ్యతో నిమిత్తము లేకుండా, కనీసము ఒక సభ్యునినైనను కలిగియుండ వలెనను నియమము ఏర్పడి పాటింపబడుచున్నది. రాజ్య సంఘము (స్టాండేరాట్) న సభ్య సంఖ్య 44; ప్రతి మండలమును ఇరువురు సభ్యులును, ప్రతి అర్ధ మండలము ఒక్కొక్క సభ్యుని ఇందు కలిగియున్నవి. దీనికిని నాలుగేండ్లకు ఒకసారి, సాధారణముగ ఎన్నికలు జరుగును.

సమాఖ్య సంఘమున సభ్య సంఖ్య 7. వీరిని మొత్తపు సమాఖ్యాసభా సభ్యులు నాలుగేండ్లకు ఒకతూరి ఎన్నుకొనెదరు. ఈ సంఘమునకు అధ్యక్ష, ఉపాధ్యక్షులను, మొత్తపు రాజ్య ప్రభుత్వమునకు అధ్యక్ష, ఉపాధ్యక్షులను, ఏడాది కొకసారి సమాఖ్యాసభా సభ్యులు ఎన్నుకొనెదరు. ఒక సంవత్సరమున ఆ పదవులలో దేనికైన ఎన్నికైనవాడు మరల వెనువెంటనే తరువాతి సంవత్సరమున ఆ పదవికి ఎన్నుకొనబడగూడదను నియమము కలదు. సమాఖ్యా ప్రభుత్వపు వివిధ ప్రభుత్వ శాఖలను, సమాఖ్యా సంఘసభ్యులు నిర్వహింతురు. సమాఖ్యా సభలోని రెండు కక్ష్యలును ఆమోదించిన బిల్లు మాత్రమే శాసనము కాగలదు. సమాఖ్యా సభా నిర్ణయములను అనుసరించియే సమాఖ్యా సంఘము వ్యవహరించును.

కేంద్రమునకు దత్తములు చేయబడని అన్ని అధికారములందును, మండలములు సర్వసత్తాకత కలిగియున్నవి. మండలములందును అర్ధమండలము లందును, ప్రజలు ఎన్నుకొనిన శాసనసభలు పనిచేయుచున్నవి.

సమాఖ్యాసభ చేసిన శాసనము ఏదియైన, తమకు నచ్చనిచో, 30000 పౌరులుగాని, 8 మండల

ప్రభుత్వములుగాని కోరిన యెడల ఆ శాసనమును జనాభిప్రాయము (రెఫరెండం)కు నివేదించి, ఆ నిర్ణయమును అనుసరించి ప్రభుత్వము వ్యవహరించును. రాజ్యాంగ విధానపు సవరణల విషయమున సైతము 50 వేల పౌరులు కోరిన యెడల, దానిని జనాభిప్రాయమునకు ప్రభుత్వము విధిగ నివేదించి, ఆ నిర్ణయమును ఆమోదించవలెను.

ఈ దేశమున తొలుత స్త్రీలకు వోటుహక్కు లేకుండినది. కాని 1971 మొదలుగ సమాఖ్యా సభకు జరుగు ఎన్నికలలో మాత్రము స్త్రీలకు వోటుహక్కు కల్గింపబడినది.

దేశమున పలు రాజకీయ పక్షములు కలవు; వీనిలో సోషల్ డెమొక్రాటిక్ పార్టీ, రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ, కన్‌సర్వేటివ్ క్రిస్టియన్ పార్టీ ప్రముఖములు. 50 ఏండ్ల నుండియు ఈ పక్షములు దాదాపుగ సమాన బలములతో వ్యవహరించుచున్నవి, జాతీయ సంఘమున దాదాపు 150 స్థానములు ఈ పక్షముల వశముననే కొనసాగుచున్నవి. లవ్‌సాన్నే నగరమున ఉన్న సమాఖ్యా న్యాయస్థానపు ఆధ్వర్యమున, వివిధ సమాఖ్యా శాసనములకు సంబంధించిన న్యాయనిర్వహణ సాగుచున్నది. ఇందలి జడ్జీల పదవీ కాలపరిమితి 6 సంవత్సరములు. వీరిని సమాఖ్యా సభాసభ్యులు ఎన్నుకొనెదరు. మండలములకు, వాని శాసనములకు సంబంధించినంత వరకు, వేరుగ న్యాయస్థానములు కలవు.

**8. దేశరక్షణ :** దేశమున సార్వజనికమగు నిర్బంధ సైనిక శిక్షణ, 20 నుండి 55 ఏండ్ల వరకు వయసు కలవారి విషయమున, అమలున ఉన్నది. ఏదైనా శారీరక దౌర్బల్యము వలన, ఎవరికైనా ఇందుండి మినహాయింపు లభించినను, అందులకు ప్రత్యామ్నాయముగ వారు అదనపు పన్నులను చెల్లించవలసి ఉండును. భూతల సైన్యమున 3 కవచిత శకట దళములు, 3 సరిహద్దు దళములు, 3 పర్వత దళములు, 18 ఆశ్విక దళములు, 4 దుర్గరక్షక దళములు కలవు. శాంతి కాలమున దాదాపు 6,44,500 సుశిక్షిత సైనికులను దేశము సమాయత్తము చేయగలదు. భూతల సేనానిర్వహణ, జీతముల చెల్లింపు ఆయా మండల ప్రభుత్వముల ఆధీనమున కలదు. కెప్టెన్ హోదా వరకు నియమనాధికారము మండలములకే ఉన్నది. ఈ సైనిక దళములు చాల సుశిక్షితములుగ పేరొందినవి; వాయుసేనయందు పోరాట విమానముల సంఖ్య 465; యోధ సంఖ్య 5,000; అయితే యుద్ధ సమయమున ప్రభుత్వాదేశముపై రాగల సుశిక్షిత వాయుసేనా యోధుల సంఖ్య 40,000. కాన్‌స్టాన్స్ సరస్సు స్థావరముగ పనిచేయు, ఒక దళము కలదు. ఇందు 10 పహరా పడవలు మాత్రమే కలవు

**9. అంతర్జాతీయ సం. :** ఐరాస యందు ఈ రాజ్యమునకు సభ్యత్వము లేదు; అయినను పలు అంతర్జాతీయ సంస్థలు (IPU, ILO వగైరా) తమ సమావేశములను ఈ దేశమందే జరుపుకొనుచున్నవి. యూరపు రాజ్యములకు సంబంధించిన కౌన్సిల్ ఆఫ్ యూరప్‌లో, 1961 న, ఈ దేశము సభ్యత్వమును పొందినది.

**10. ఆర్థిక రంగము :** దేశమున ఖనిజ సంపత్తియు, ముడి పదార్థములను, వ్యవసాయోత్పత్తియు చాల తక్కువ అగుటవలన ఈ దేశము ఆహార, పశుగ్రాసముల విషయమునను పరిశ్రమలకు సంబంధించిన ముడి పదార్థములు కొరకును విదేశములనుండి వచ్చు దిగుమతులపై ఆధారపడి ఉన్నది. ఉన్న కృషులలో వ్యవసాయము ముఖ్యమే యయినను, అందు పనిచేయు వారికి నాలుగురెట్లు, వస్తునిర్మాణ కృషిలో పాల్గొను చున్నారు. ఈ దేశపు ఉనికినిబట్టి అంతర్జాతీయ బ్యాంకింగు, భీమా, యాత్రికుల పర్యటన, రహదారులు-అను

వాని వలన ఈ దేశమునకు అధికాదాయము లభించు చున్నది.

దేశము మొత్తపు 41,28,790 హె. లలో దాదాపు 31,21,090 హె.లు పైరు పంటలకు, చెట్టుచేమలు పెరుగుటకు తగినది. ఇందులో 9,80,650 హె.లలో అడవులు కలవు. ఇక మిగిలిన దానిలో 2,60,400 హె.మాత్రమే సేద్యమున ఉన్నది (1969). 1970 లో ఆ యా వ్యవసాయోత్పత్తుల వివరములు (వేల టన్నులలో) ఈ రీతిగ కలవు: గోధుమ (353), రై (43), బార్లీ (142), ఉరలగడ్డలు (977), చక్కెర బీటు (379), పొగాకు (2), యాపిల్‌పండ్లు (280), పియర్స్ (170). 18 మండలములలో, 11,900 హెక్టేరులలో, ద్రాక్ష తోటలు పెంచబడుచున్నవి. వానినుండి ఉత్పత్తియగు ద్రాక్ష సారాయము 12,67,000 హెక్టోలీటర్లు (1970). దేశమున 47,400 గుర్రములు; 3,00,500 గొర్రెలు; 74,700 మేకలు; 18,40,600 గోజాతి (వీనిలో 8,73,400 పాలిచ్చు ఆవులు); 18,78,900 పందులు; దాదాపు 60 లక్షల కోళ్ళు కలవు. పాల ఉత్పత్తి 320 లక్షల క్వింటాళ్లు. ఉరలగడ్డల ఉత్పత్తి దేశావసరములకు సరిపోవుచున్నను, తక్కిన ఆహారపు పంటలు మాత్రము దేశావసరములలో 50%కు మాత్రమే సరిపోవుటవలన ఆహార వస్తువుల దిగుమతిపై దేశము చాలవరకు ఆధారపడి ఉన్నది. పాల ఉత్పత్తి, దేశావసరములకు కొంత వరకు మించియేయున్నను, మాంసమును, కోడి గ్రుడ్లను, విదేశములనుండి కొంతవరకు ఈ దేశము దిగుమతి చేసికొనుచున్నది. రాతిఉప్పు తప్ప ఖనిజములు ఇతరములు ఏవియు అంతగా లభింపవు. 1971 లో 2,90,829 మెట్రిక్ టన్నుల రాతి ఉప్పు త్రవ్వబడినది. ముడి ఇనుము, మాంగనీసు, ఇసుకరాయి, చలువరాయి కూడ అల్పప్రమాణములలో అంతట సేకరింపబడుచున్నవి. రాక్షసిబొగ్గు, లిగ్నైట్, తారు, రాతి నారలగనులు చాల కొలదిగ కలవు. దేశపు విద్యుదుత్పత్తి 3277.5 కోట్ల కివా. (1970-71); ఇందులో 88% జలవిద్యుత్తు. ఇంధనవాయువు ఉత్పత్తి 38 6 కోట్ల ఘన మీటర్లు (1971). అడవులలో లభించు కలప 39,43,881 ఘ. మీ.; అయినను దాదాపు 1440 వేల ఘ. మీ. కలపను దేశము దిగుమతి చేసుకొనుచున్నది. మత్స్య పరిశ్రమకు అంతగా ప్రాముఖ్యము లేదు. కొన్ని సరస్సులలోను, నదులలోను ఈ కృషి కొలదిగ సాగుచున్నను దేశావసరములలో 15% మాత్రమే ఇందువలన లభించుచున్నది. ఆహారోత్పత్తులపై ఆధారపడిన పరిశ్రమలు (జున్ను, వెన్న, చక్కెర, మాంసము, ద్రాక్ష సారాయములకు సంబంధించినవి), చుట్ట సిగరెట్ల తయారికి సంబంధించిన పరిశ్రమలు అధికముగ కలవు. తక్కిన వానిలో జవుళి, పాదరక్షలు, రసాయనములు, ఔషధ ద్రవ్యములు, గ్లాసు, సిమెంటు, ఇటుక, ఉక్కు, ఇనుము, యంత్రపరికరములు, గడియారములు-అను వానికి సంబంధించిన పరిశ్రమలు ప్రముఖములు. జవుళి పరిశ్రమలో 57,429 మంది; పాదరక్షల, దుస్తుల తయారీలో 60,021 మంది; రసాయనిక కృషిలో 66,692 మంది; మట్టి ఇటుక, గ్లాసు, సిమెంటు పనులలో 28,264 మంది; లోహోత్పత్తుల కృషిలో 1,20,734 మంది; యంత్రపరికరముల నిర్మాణమున 2,68,947 మంది; గడియారములు, చేతి గడియారముల, నగల తయారీలో 73,554 మంది పనిచేయుచున్నారు. 1971 లో 518.1 లక్షల గడియారములు (చేతి గడియారములు సహా) ఎగుమతి చేయబడినవి. దేశపు మొత్తపు ఎగుమతుల విలువ 2,361.7 కోట్ల స్వి. ఫ్రా.; దిగుమతుల విలువ 2,964,1 కోట్ల స్వి. ఫ్రా. బడ్జెటరీ వ్యయము 974.6 కోట్ల స్వి. ఫ్రా. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున సాంఘిక భద్రతకు సంబంధించిన నిర్బంధ భీమా పద్ధతులు-రోగము, వార్ధక్యము, నిరుద్యోగము, అంగవైకల్యములకు చెందినవి-అమలులో ఉన్నవి. గృహ వసతి దేశపు మొత్తముమీద చాలవరకు సరికుదిరియే యున్నను, అటనట కొన్ని ప్రాంతములందు మాత్రము తగినన్ని గృహములులేవు. ఇట్టి ఇబ్బందులను పరిష్కరించుటకై సాలీనా దాదాపు 60 వేల గృహములు నిర్మింపబడుచున్నవి. దేశమున నిరక్షరాస్యత లేనేలేదని చెప్పవచ్చును. మండల ప్రభుత్వములే విద్యావిషయమున బాధ్యత వహించి వర్తించుచున్నవి. ప్రయిమరీ విద్య ఉచితముగ బోధింపబడుచున్నది. శిశు శిక్షణ శాలలలో 140 వేల మంది; ప్రాథమిక పాఠశాలలలో 4 65,575 మంది; సెకండరీ పాఠశాలలో 2,49,578 మంది; వృత్తి పాఠశాలలలో 1,52,798 మంది విద్యార్థులు కలరు (1967-68). దేశమున 7 విశ్వవిద్యాలయములు కలవు; వీనిలోని మొత్తము విద్యార్థి సంఖ్య 34,367 (1971-72); దేశమున 45 పబ్లిక్ లైబ్రరీలు కలవు; వీనిలోని మొత్తపు గ్రంథ సంఖ్య 330 లక్షలు; ఇవిగాక 7 విశ్వవిద్యాలయ గ్రంథాలయములు కలవు; అందు బెర్నీ విశ్వవిద్యాలయము లోనిది (గ్రంథ సంఖ్య 15 లక్షలు), దేశపు గంథాలయములందెల్ల పెద్దది. దేశపు మ్యూజియములలో జూరిచ్‌లోని జాతీయ మ్యూజియం, బెర్నీలోని లలితకళా మ్యూజియం ప్రముఖములు. దేశమున దినపత్రికల సంఖ్య 118 (1970). వీని మొత్తపు పాఠకసంఖ్య 25 లక్షలు. జర్మన్ భాషలో వెలువడు పత్రికలందు బ్లిక్ (జూరిచ్) అనునదియు, ఫ్రెంచి భాషలో వెలువడు వానియందు లా సుయిస్సీ (జెనీవా) యను, ఇటాలియన్ భాషలోని వానిలో జర్నల్ డెట్ పాపులో (లుగానో) ప్రముఖములు. దేశమున ప్రజల ఆరోగ్య పరిస్థితి అత్యుత్తమ స్థాయికి చెందినది; వైద్య వసతులు విరివిగ కలవు. 71,742 శయ్యాసంఖ్య కలిగిన 427 ఆసుపత్రులు కలవు; అందలి వైద్యసంఖ్య 9,304 (1968).

**12. యాత్రా సౌ. :** దేశపు ఆదాయమార్గములలో యాత్రికులవలన లభించు దానికి అత్యంత ప్రాముఖ్యము కలదు. విలాస యాత్రాకేంద్రముగ ఈ దేశము, ప్రపంచమునందు అంతట పేరు గన్నది. ఆల్ప్స్ పర్వతములందలి హిమాచ్ఛాదిత భూములందు జారునడక (స్కియింగు), సరోవరములందలి ఈత సౌకర్యములు, ప్రకృతి రమణీయత, జెనీవా నగరపు జీవిత సౌకర్యములు పలువురు విదేశీయులను ఆకర్షించుచున్నవి. యాత్రికులకు ఉపకరించు 8,050 హోటళ్ళు కలవు; ఇందలి శయ్యాసంఖ్య 2 51,981. ఇవిగాక విశ్రాంతి మందిరములు కొన్ని, విలాస యాత్రా స్థావరములందు కలవు; విదేశీయులు పాస్‌పోర్టులు కలిగి యుండవలయునను నియమము ఉన్నను, యు. స్టే. వాసులకును, పశ్చిమ యూరపులోని పలుదేశముల పౌరులకును వీసాలు అక్కరలేదు. స్విజర్లాండులోని విలాస యాత్రా కేంద్రములను, విశ్రాంతి స్థావరాలను 1571 లో 69,20,066 విదేశీయులును, 35,65,581 స్వదేశీయులును సందర్శించిరి. ఇందువలన 227 కోట్ల స్విస్ ఫ్రాంకుల ఆదాయము లభించినది.

**13. ప్రసిద్ధ పౌరులు :** ప్రముఖ మతసంస్కర్తలకు, విద్యాబోధకులకు, వాగ్గేయకారులకు, చిత్రకారులకు, తాత్త్వికులకు, వైజ్ఞానికులకు జన్మభూమిగ ఈ దేశము పేరుగన్నది. స్థలాభావమును బట్టి, వానిలో కొలది అత్యంత ప్రముఖుల పేరులు మాత్రమే దిగువ ఈయబడినవి. 1. జాన్ కాల్విన్ (1509-64) : క్రైస్తవ మతమున ఒక సంస్కరణను కొనివచ్చిన మతతత్వవేత్త; 2. లియోనార్ట్ పీలర్ (1707-83) : ప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త;

3. జోహాన్ బెర్నొలీ (1667-1748) : గణిత శాస్త్రమున కొన్ని నూత్న విషయముల వెలయించినవాడు; 4. చార్లెస్ ఎడ్వర్డ్ గిల్లామీ (1861-1938) : భౌతికశాస్త్ర కృషివలన నోబెల్ బహుమతిని 1920లో ఆర్జించినవాడు. 5. పాల్ క్రెరర్ (జ. 1889) : విటమిన్‌లను గురించిన శాస్త్రీయ విషయములందు ప్రామాణికుడు; రసాయనశాస్త్ర ప్రజ్ఞకై 1937 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను; 6. మేడమీ డి స్టేల్ (1766-1817): నెపోలియను యొక్క నిరంకుశత్వమును ప్రతిఘటించి, స్వాతంత్ర భావ వ్యాప్తికై తన రచనలద్వారా కృషిచేసిన రచయిత్రి; 7. హెర్మన్ హెస్సే (1877-1962) : కవి; జర్మన్ భాషలోని తన రచనల ప్రాశస్త్యమువలన 1946 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను; 8. లే కోర్‌బూసియర్ (చార్లెస్ ఎడ్వర్డ్ జేనేరేత్, 1887-1965) : విశ్వవిఖ్యాతి పొందిన వాస్తువేత్త; 9. జోహాన్ హెన్‌రిఖ్ పెస్టలోజ్జి (1746-1827) : విద్యాబోధనలో నవ్య శాస్త్రీయ మార్గముల వెలయించిన పండితుడు; 10. హెన్రీ డూనాంట్ (1828-1901) : రెడ్ క్రాస్ సంఘమును స్థాపించినవాడు; శాంతికృషికై 1901 లో నోబెల్ బహుమతిని పొందెను.

---

# 31. స్వీడెన్

**ముఖ్యనగరము** : స్టాక్‌హోమ్; **జెండా** : 15వ శతాబ్ది మధ్యకాలమున రూపొందింపబడి తదాదిగ ఆరీతిగనే కొనసాగుచున్న దీనియందు నీలి భూమి కపై పచ్చని సిలువ, కుడి అడ్డుభుజము పొడవు మీరి, చిత్రింపబడినది; **జాతీయ గీతము** : దూ గామ్లాదూ ఫ్రియా, దూ జాల్‌హోగూ నోర్డ్ (హే పర్వత సంశోభిత ప్రాచీన ఔత్తరాహ భూమీ); **నాణెము** : క్రోనా; 100 ఓరులుగ విభక్తము: 5.17 క్రోనులు = రు 7-50; **కొలతూకములు** : మెట్రిక్ విధానపువి; **కాలగణన** : సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ.** : యూరపు నందలి దేశములలో విస్తృతినిబట్టి నాలుగవదిగ లెక్కకువచ్చు ఈ దేశము 55°20′ నుండి 65°4′ ఉ. అ. రేఖ వరకును; 10°58 నుండి 24°10′ తూ. తులా రేఖ వరకు విస్తరించియున్నది. దేశవిస్తృతిలో 15%, ఉత్తరధ్రువ వృత్తరేఖ (ఆర్కటిక్ సర్కిల్) నకు లోపల ఉన్నది. ఉత్తర దక్షిణముల గరిష్ఠపు నిడివి 1,574 కిమీ.; గరిష్ఠపు వెడల్పు 499 కిమీ. దేశపు మొత్తపు వైశాల్యము 4,49,749 చ. కిమీ. ఇందు జలమయమగు ప్రాంతపు వైశాల్యము 40,477 చ. కిమీ.; ఈ జలమయ ప్రాంతమున దేశపు నదులును, అందలి దాదాపు 96,000 సరస్సులును లెక్కకు వచ్చుచున్నవి. పశ్చిమ, ఉత్తరములందు (1,619 కిమీ.) నార్వే, ఈశాన్యమున ఫిన్‌లాండ్ సరిహద్దులందున్నవి; తూర్పు దక్షిణములందు బోత్నియా సింధు శాఖయు, బాల్టిక్ సముద్రమును, నైరుతియందు కట్టెగాట్, స్కెగెర్రాక్ సముద్రములును కలవు. కట్టెగాట్, ఓరిసండ్ సముద్రములు డెన్మార్కునుండి ఈ దేశమును వేరు చేయుచున్నవి. తీరప్రాంతముల ద్వీపములు అనేకములు, రాజ్యాంగరీత్యా, ఈ దేశమున అంతర్భాగములు; వీనిలో బాల్టిక్ సముద్రమునందున్న గోట్‌లాండ్, ఓలాండ్ దీవులు విస్తృతియందు పెద్దవి.

దేశపు ఉత్తర ప్రాంతము ('నోర్‌లాండ్' అన బడునది) జోలెన్ పర్వతశ్రేణుల కడనుండి నార్వే దేశపు సరిహద్దును అనుసరించి, క్రమరీతిలో బోత్నియా సింధుశాఖ వరకు క్రిందికి దిగివచ్చు వాలుభూమి; ఇందలి అత్యున్నత ప్రాంతపు ఎత్తు 2,123 మీ. అనేక నదులు నైరుతి దిక్కునకు




పటము 29.

ప్రవహించి, పీఠభూమిని బహుధా ఖండించుచున్నవి; వీనిలో గోతా, దాల్, ఆంగెర్‌మన్, ఊమీ, లూలీ నదులు పేర్కొనదగినవి. మధ్య దేశము ఒక నిమ్న భూమి; ఇందు ఆనేక సరస్సులు కలవు; వానిలో వానెర్న్ సరస్సు వైశాల్యమున మిన్న; యూరపు నందలి సరస్సులలో విస్తృతినిబట్టి ఇది రెండవదిగ లెక్కకు వచ్చును. (తొలుతటిది సోవియెట్ యూని యన్‌లోని లడోగా సరస్సు). ఈ సరోవర భూమికి దక్షిణమున స్మాలాండ్ మెరకలును, అందే స్కేన్ అనబడు అతి సారవంత భూమియు కలవు. మధ్య దేశపు నిమ్న భూములు అతి ప్రాచీన కాలమున జలమయములై ఉండి తరువాత పూడిపోయిన వగుటవలన సారవంతపు వండ్రునేల అట కన్ప ట్టును. ఆయితే, దేశమున అత్యధికభాగము పర్వత మయమనియే చెప్పవచ్చును; ఈ పర్వతములు అతి ప్రాచీనములు; యుగముల తరబడిగ హిమ పాతమువలన కోతపడి, ఆ పర్వత ప్రాంతములు రాతి, ఇసుక నేలలుగ చాలచోటుల పరిణమించి నవి 'స్కేన్'న మాత్రమే అతి సారవంత భూములు కలవు. దేశపు దక్షిణ భాగమున ఉన్న ఈ స్కేన్ మండలము, వ్యావసాయిక రీత్యా దేశమునకు తలమానికము. భౌతిక సంపత్తి, తద్వికసనముల రీత్యా ఈ ప్రాంతము డెన్మార్కును పోలియున్నది. దేశపు నదులందు జలపాతములు ఎక్కువ.

**2. శీతోష్ణస్థితి మొ. :** అత్యుత్తర అక్షాంశ రేఖా ప్రాంతమున ఉన్నప్పటికిని, ఈ దేశము ఆ పరిస్థితిలో ఉండవలసినంత శీతల ప్రాంతముగ ఉండక, కొంతవరకు ఎక్కువ సౌమ్యమగు శీతోష్ణస్థితినే కలిగి ఉన్నదని చెప్పవచ్చును. సమీప మహాసముద్రమునందు ఆంతర్గతమై ప్రవ హించు కవోష్ణపు ఉత్తర అట్లాంటిక్ మహాస్రవంతి (నార్త్ అట్లాంటిక్ డ్రిఫ్ట్)యు, పశ్చిమమునుండివచ్చు వేడి వాయుప్రవాహములును ఇందులకు కారణములు. అయినను ఉత్తర, దక్షిణ ప్రాంతముల మధ్య శీతోష్ణ స్థితియందు విభేదము చాల ఎక్కువ. ఉత్తర ప్రాంతమున శీతకాలపు నిడివి సాలున ఏడు నెలలు; ఎండాకాలపు నిడివి మూడు నెలలు. ఇక దక్షిణ ప్రాంతమున శీతకాలపు నిడివి రెండు నెలలు మాత్రమే; గ్రీష్మర్తువు నాలుగు నెలలు. అయితే ఉత్తర ప్రాంతమున ఎండకాలమున ఉష్ణోగ్రత చాల ఎక్కువ. సాలీనా వర్షపాతము నైరుతి ప్రాంతముననూ, నార్‌లాండు సరిహద్దునను ఎక్కువ

(58 సెం. మీ.). లాప్‌లాండ్‌లో ఆ వర్షపాతము 30 సెం. మీ. మాత్రమే. గ్రీష్మర్తువున వర్షములు విరివిగ కురియును; వసంతర్తువున వర్షపాతము చాల తక్కువ. సంవత్సరమున ఎక్కువ కాలమున మంచు పడుచుండును; ఉత్తర దేశమున సాలున దాదావు ఆరునెలల కాలమున భూమి హిమావృతమై ఉండును. సమీపస్థ సముద్రములందు, అందును ముఖ్యముగ బోత్నియా సింధుశాఖయందు, శీత కాలమున నీరు గడ్డకట్టి, నౌకాయానమునకు అభ్యం తరము కలిగించుచుండును. ఉత్తర ప్రాంతమున ధ్రువ ప్రాంతీయములును, అల్ప్స పర్వత జాతీయములును అయిన వృక్షజాతులు కలవు; కాని దక్షిణము వచ్చుసరికి, క్రమేణ అందు మార్పుకలిగి తొలుత సూచ్యగ్యజాతి వృక్షసంతతియు, అట మీదట ఆకురాల్పు తరగతి వృక్షములును కన వచ్చును. వన్యజంతు సంతతి తక్కువ; అయినను ఉన్నవానిలో ప్రముఖములగు మంచుజింకలు (రెయిన్ డీరు) నశింపకుండుటకై ప్రభుత్వము ప్రత్యేకశ్రద్ధ తీసికొనుచున్నది. పక్షి జాతులు వివి ధములు కలవు; కాని అందు ప్రముఖముగ పేరొం దిన ఒక విధపు డేగ జాతియు, కొంగ జాతియు అంతరించకూడా ప్రభుత్వము రక్షణను కల్పించి నది. మత్స్య సంపత్తి అత్యధికము.

**3. జనసంఖ్య మొ.:** 1749 మొదలుగ ఈ దేశమున క్రమరీతిలో జనసంఖ్యాగణన సాగు చున్నది. తొలుత మూడేండ్లకు ఒకతూరి అట్టి గణన జరిగినను, 1860 మొదలుగ పదేండ్లకు ఒక సారి అది జరుగుచున్నది. 1970 లోని లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 80,76,903; 1972 ఆరంభమున అంచనా 81,27,396; జనసాంద్రత చ. కిమీ. కు 20 (1971); అయినా కొన్ని ప్రాం తములందు ఆ జనసాంద్రత చాల అత్యధికము. అందును ముఖ్యముగ స్టాక్‌హోమ్ మండలమున జనసాంద్రత చ. కిమీ. కు 229; అత్యుత్తర మండలముఖందు జనసాంద్రత చ. కిమీ. కు 4 ను మించదు. దేశపు నగరములలో, 1972 ఆరం భపు అంచనా లెక్కలను అనుసరించి, ఈ క్రింది పట్టణములు పేర్కొనదగినవి: స్టాక్‌హోమ్ (జనసంఖ్య 7,23,688), గోటేబర్గ్ (4,50,419), మాల్మో (2,63,829), వేస్తెరాస్ (1,18,065), ఉప్సలా (1,30,097), నార్‌కోపింగ్ (1,16,209). పౌరులందు స్వదేశీయులే చాల ఎక్కువ; వీరందరు జర్మానిక్ జాతియందలి ఒక ఉపశాఖకు చెందినవారు; దేశమున ఉన్న అల్ప సంఖ్యాక వర్గములలో ఫిన్నులు ముఖ్యులు; వీరి జనసంఖ్య 1,09,334 (1972). దాదాపుగ వీరం దరును ఉత్తర ప్రాంతమున వసించుచున్నారు; అటనే లాప్ జాతీయులగు అల్పసంఖ్యాకులు దాదాపు పదివేలు కలరు. దేశీయుల మాతృభాష స్వీడిష్; ఇది నార్వీజియన్, డేనిష్ భాషలకు సన్ని హితము. స్వీడులలో పలువురకు ఇంగ్లీషు, జర్మన్ భాషలతో పరిచితి కలదు. అల్పసంఖ్యాక వర్గ ములు తమ మాతృభాషతోపాటుగ స్వీడిష్‌తోను పరిచయము కలిగియుందురు; అత్యల్ప సంఖ్యాకు లగు లాప్పులందు లాప్ భాష మాత్రమే వ్యాప్తి యందు ఉన్నది. రాజ్యాంగ విధానరీత్యా దేశమున మతస్వాతంత్ర్యము అమలున ఉన్నది. ప్రజలలో 94% లూతర్ చర్చి యను క్రైస్తవమత శాఖకు చెందినవారు. ఆ మతశాఖయే ప్రభుత్వాదరితము; రాజును, మత వ్యవహారములను పరిశీలించు మంత్రి వర్గ సభ్యుడును ఆ శాఖకు మాత్రమే చెందియుండ వలయునను నియమము కలదు. తక్కిన సంప్ర దాయముల క్రైస్తవులు, అటనట, అత్యల్ప సంఖ్యలలో కలరు.

**4. సమాచార సా.:** దేశమందలి తపాలా ఆఫీసుల సంఖ్య 2,481 (1971). తంతి, టెలి ఫోన్ వసతులు విరివిగ కలవు. టెలిఫోను సౌకర్య ముల విషయమున యు. స్టే. తరువాత ఈ దేశమే

లెక్కకు వచ్చుచున్నది. ఇట 1000 మంది పౌరులకు 525 టెలిఫోనులు కలవు; టెలిఫోను రుసుములును, తక్కిన దేశములతో పోల్చినపుడు, ఈ దేశమున చాల తక్కువ. ప్రభుత్వ పర్యవేక్షణక్రింద పనిచేయు ఒక స్వతంత్రపు వర్తకసంస్థ రేడియో, టెలివిజన్ సౌకర్యములను నిర్వహించుచున్నది. 1970 లో 87 రేడియో ట్రాన్స్మిటర్లు, 85 టివి ట్రాన్స్మిటర్లు కలవు. 1970 మొదలుగ రంగులలో టెలివిజన్ ప్రసారము నిర్వహింపబడుచున్నది. దేశమునందలి గృహములలో 85% న, టెలివిజన్ సెట్లు కలవు; రేడియోలోగాని, టెలివిజన్‌లోగాని వర్తక వ్యాపార ప్రకటనలు నిషిద్ధములు.

**5. యాన సౌ.:** దేశపు రోడ్ల నిడివి 97,484 కిమీ. (1972); ఇందు 27,669 కిమీ. అత్యుత్తమ స్థాయికి చెందినది. దేశమున మోటారుకార్ల సంఖ్య, దేశపు జనాభాను అనుసరించి చూచినప్పుడు, చాల ఎక్కువ. నలుగురు మనుజులకు ఒక కారుచొప్పున ఇచట కలదు. ఈ విధముగ తలసరి లెక్కన మోటారుకార్ల వసతిలో, యూరపీయ రాజ్యములందు ఈ రాజ్యపుదే అగ్రస్థానము. దేశపు రైలురోడ్ల నిడివి 12,171 కిమీ.; ఇందు 7,520 కిమీ. నిడివిన, బాట్లు విద్యుత్ సాయమున నడచుచున్నవి. దేశమున వర్తక నౌకాసంస్థల సంఖ్య ఎక్కువ. దాదాపుగ ప్రపంచమునందలి అన్ని రాజ్యములకును, ఈ దేశపు వర్తకనౌకలు పయనించుచున్నవి. మొత్తపు వర్తక నౌకల సంఖ్య 719 (1972). వాని మొత్తపు ప్రమాణము 49.5 లక్షల టన్నులు. (అయితే ఇందులో 100 టన్నులలోపు ప్రమాణము గల పడవలును, చేపల పడవలును, చేరవు). సముద్రపు హార్బరులలో స్టాక్ హోమ్, గోటెబర్గ్ మాల్మోలు అత్యంత ప్రముఖములు. దేశ మధ్యపు సరస్సులలో కొన్నింటిని, సముద్రమునకు అనుసంధించుచు కాలువలు త్రవ్వబడినవి. ఆ కాలువల ద్వారా, చిన్న ప్రమాణముగల సముద్ర నౌకలు సరసులలోనికి రాగలుగుచున్నవి. అట్టి కాలువలలో ట్రోల్ హట్టీ కాలువ ప్రముఖము. స్కాండి నేవియన్ (నార్వే, స్వీడెన్, డెన్మార్క్) దేశములకుచెందిన సమష్టి విమానయాన సంస్థ దేశీయ, విదేశీయ విమానయానమును నిర్వహించుచున్నది. దేశీయముగ 'ఎబిఏ' అను విమానయానసంస్థ ఉన్నను, అది పై సమష్టి సంస్థలో అంతర్భాగముగనే వ్యవహరించుచున్నది. స్టాక్‌హోమ్‌లోని బ్రొమ్మా, మాల్మోలోని బుల్‌తోఫ్తా, గోటెబర్గ్‌లోని తోర్ స్లాండా విమానాశ్రయములు, దేశపు విమానాశ్రయములలో ప్రముఖములు.

**6. చరిత్ర:** క్రీ. శ. మొదటి శతాబ్దముననే, ఈ దేశమున అత్యధిక భాగము స్వియోనులు అనబడు ఒక వీరజాతి వశమున ఉండెనని రోమన్ చరిత్ర రచయితలవలన తెలియవచ్చుచున్నది. 9, 10 వ శతాబ్దములలో ఈ వీరజాతి విజృంభించి, స్వీడెన్‌లోని అన్ని ప్రాంతములను వశపరచుకొనుటయేగాక, ఆగ్నేయ దిశగ రష్యాద్వారా పురోగమించి, కాన్‌స్టాంటినోపిల్ వరకు వివిధ సీమలను ఆక్రమించినది. ఆ జాతికిచెందిన యోధనాయకులలో ఒకని సంతతికిచెందిన రూరిక్, రష్యా రాజ్యమును సంస్థాపించి, 1582 వరకు పాలించెను. ఆ కాలముననే తక్కిన స్వీడిష్ యోధులు యూరప్‌న పలు ప్రాంతములందు, తమ ఆధిపత్యమును నెరపగలిగిరనుటకు, ఆ యా ప్రాంతముల స్థల నామములు ఈనాటికిని నిదర్శనములుగ ఉన్నవి.

12, 13 వ శతాబ్దములలో లాటిన్ భాషా సారస్వతముల పరిచితి, పశ్చిమ యూరపునందలి కళా సారస్వతములతో సాన్నిహిత్యము ఈ దేశమునకు లభించినవి. 1319 లో నార్వే, స్వీడెన్‌లు ఏక రాజ్యముగ ఒక రాజరికము క్రిందకు వచ్చినవి. కాని డెన్మార్క్‌దేశపు రాణియగు మార్గరెట్, 1397 లో నార్వే, స్వీడెన్‌లను కూడ

తన వశములోనికి తీసికొనగలిగినది. తదాదిగ దాదాపు ఒక శతాబ్దికాలము దేశీయులు, డేనుల ప్రభుత్వమును ప్రతిఘటించి పోరాడి, కడకు 1523 లో స్వతంత్రతను ఆర్జించి గస్టాఫ్ I అను వాని రాజరికమును ఆమోదించిరి. ఇతడే ఆధునిక స్వీడెన్‌కు జనకుడుగ సంభావితుడు; ఇతడు లూతరన్ సంప్రదాయపు క్రైస్తవమునకు ప్రభుత్వాదరమును కల్పించెను; ఆనువంశికమగు రాజరికమును ఏర్పరచెను; జాతీయ భూతలసేనా, నౌకాసేనలను వ్యవస్థీకరించెను. అతని వంశికుల కాలమున ఎస్తోనియాయు, తూర్పు యూరపున మరికొన్ని ప్రాంతములును ప్రభుత్వమునకు, విజయ యాత్రల ద్వారా, వశములైనవి. ఆ వంశికులలో పేరొందిన మరియొక చక్రవర్తి గస్టాఫ్ II. ఆధునికమగు పద్ధతిలో సేనను తొలుతగ వ్యవస్థీకరించిన ఖ్యాతి ఇతనికి దక్కినది. కరీలియా, ఇంగర్‌మాన్ లాండ్. లివోలియా మొదలగు బాల్టిక్ సముద్ర తీర భూములను ఇతడు జయించెను. ముప్పదేండ్ల సంగ్రామపు కాలమునను, తరువాతి అర్ధ శతాబ్దమునను స్వీడన్, యూరపీయ అగ్రరాజ్యములందు ఒకటిగ లెక్కకు రాగలిగినది. అప్పటివరకు డెన్మార్క్ వశమున నిలిచిపోయిన, స్వీడెన్‌లోని కొన్ని దక్షిణ ప్రాంతములను, స్వీడెన్ ప్రభుత్వము 1660 లో కైవసము చేసికొన గలిగినది. కాని 18 వ శతాబ్ది తొలిదశకమున డెన్మార్క్, పోలండ్, శాగ్జనీ రష్యాలు సంయుక్తముగ స్వీడిష్ సేనలను నిర్జించిన ఫలితముగ తూర్పు యూరపునను, తక్కిన దూరప్రాంతములందును తన వశమున ఉండిన రాజ్యభాగములను అన్నింటిని స్వీడెన్ వదలుకొని, తన దేశమువరకే తన రాజ్యమును పరిమితము చేసికొనినది. తదాదిగ ఈ దేశము బలసామర్థ్యముల గణనలో, రెండవ స్థాయికి చెందిన రాజ్యముగనే మన గల్గినది. 18 వ శతాబ్దమున దేశము అంతః కల్లోలముల పాలైనది; 1810 లో నెపోలియన్‌కు సన్నిహితుడగు ఒక ఫ్రెంచి సేనానిని ప్రజలు, తన రాజవంశమునకు వారసునిగ గ్రహించిరి. అతడు చార్లెస్ XIV జాన్ అను పేరుతో పాలనను నెరపెను. ఇతడు కడకు నెపోలియన్‌కు వ్యతిరేకియై, ఇంగ్లండ్ మొదలగు మిత్రరాజ్యములతో కలసి నెపోలియన్‌ను ఓడించుటలో పాల్గొనెను. 1814 లో నార్వేనుకూడ, స్వీడెన్ దేశపు రాజులు తమ వశములోనికి తెచ్చుకొనినను, 1905 లో నార్వే విడిపోవ గలిగినది. అంతట దేశపు ప్రభువులు క్రమముగ తమ అధికారములను ప్రజాప్రతినిధులకు వశపరచుటతో దేశమున, రాజ్యాంగ బద్ధమగు రాజరికము, ప్రజామోదముతో పరిపాలనను సాగించు వ్యవస్థ నెలకొనినది. రెండు ప్రపంచ యుద్ధములందును తన తాటస్థ్యమును ఈ దేశము కాపాడుకొనినది. తరువాతి కాలమున ఏర్పడిన ఉత్తర అట్లాంటిక్ రాజ్యముల కూటమియందును ఈ దేశము చేరక తన తటస్థతను కొనసాగింప గలిగినది.

**7. పరిపాలన :** రాజ్యాంగబద్ధము, ప్రజామోదితము, ఆనువంశికమునగు రాజరికపు పాలన దేశమున అమలులో ఉన్నది. 1809 లో రూపొందింపబడిన ఈ దేశపు రాజ్యాంగ విధానము, యూరపునందలి లిఖిత రాజ్యాంగ విధానములందెల్ల ప్రాచీనతమము. శాసన నిర్మాణాధికారము రాజ్యసభ (రిక్స్‌డాగ్) యందు న్యస్తము. రాజరికము ఆనువంశికముగ పురుష సంతతికి మాత్రమే సంక్రమించును. రాజ్యసభయందు అత్యధిక సంఖ్యాకబలము కలిగిన పక్షమునుండి, లేదా బహుపక్ష కూటమినుండి దాని నాయకుని, ప్రధానిగగు. అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. మంత్రులు పరిపాలనా మూల సూత్రములను మాత్రమే నిర్ణయింతురు; అంతట దైనందిన పరిపాలనా వ్యవహారములను ఆ యా శాఖలకు చెందిన కేంద్ర సంస్థలు నిర్వహించును;

ఈ సంస్థల పరిపాలనావధులను, రాజ్యసభ నిర్ణయించును.

1970 వరకు, రాజ్యసభయందు రెండు కక్ష్యలు ఉండెడివి. కాని 1971 మొదలుగ ఏకకక్ష్యా విధానమే అవలంబితమైనది. ఇందలి సభ్యులసంఖ్య 350 ఈ సభకు, సాధారణ రీతిలో, మూడేండ్లకు ఒకసారి ఎన్నికలు జరుగును. ఆ ఎన్నికలలో ఆ సభ్యులను, పౌరులు అపరోక్షరీతిలో ఎన్నుకొనెదరు. 19 ఏండ్ల వయసునకు తగ్గని స్త్రీ, పురుషలకు అందరికిని వోటింగు హక్కు కలదు. నైష్పత్తిక పద్ధతిని అనుసరించి రాజ్యసభకు ఎన్నికలు జరుగును. అందులకై దేశము 23 నియోజక వర్గములుగ విభజింపబడినది. వీనినుండి 310 మంది సభ్యులు ఎన్నుకొనబడెదరు. ఇక రాజ్యసభలోని తక్కిన 40 స్థానములను, దేశపు మొత్తమునకు చెందినవిగా భావించి, ఎన్నికలలో ఓడిపోయియు, ఒక నిర్ణీత శాతను వోట్లను తెచ్చుకొనిన పార్టీలకు వారి సామర్థ్యములనుబట్టి వానిని విభజించి, ఆ పార్టీల ప్రతినిధులకుకూడ స్థానములను కల్పించెదరు. మొత్తమున అన్ని నియోజక వర్గములలోను కలసి 4% కు తగ్గని వోట్లను ఆర్జించిన ప్రతి పార్టీకిని ఈ 40 సీట్లలో స్థానము లభించును. అభ్యర్థుల ఎన్నికల ఖర్చులకై ప్రభుత్వమే ధన సాహాయ్యము చేయును. అయితే, అంతకుముందు జరిగిన ఎన్నికలలో, రాజ్యసభయందు, కనీసము ఒక స్థానమైనను ఆర్జింపగలిగిన పార్టీకి మాత్రమే ఈ సాహాయ్యము లభించును. పోటీచేయు ఒక్కొక్క స్థానమునకు ప్రతి పార్టీకి 70 వేల క్రోనాలు ఇందువలన ఈయబడును (1970-71). రాజే ప్రభుత్వపు కార్యనిర్వహణ శాఖకు అధినేతగ వ్యవహరించుచు, ప్రధానమంత్రి ఆధ్వర్యమున పనిచేయు మంత్రిమండలియొక్క సలహాను అనుసరించి ప్రవర్తించును, దేశమున రాజకీయ పక్షములు-సోషల్ డెమోక్రాట్, లిబరల్, కన్సర్వేటివ్, సెంటర్, కమ్యూనిస్ట్ పార్టీలు - కలవు. వీనిలో తొలుతటిది, 1932 మొదలుగ, కొద్ది అవాంతరములతో, నలుబది సంవత్సరముల పై కాలము, 1976 వరకు అధికారమును తన చేతులలో ఉంచుకొన గలిగినది; కాని 1976 ఎన్నికలలో ఆ పార్టీ పరాజితమై ఒక మిశ్రపక్ష ప్రభుత్వము ఏర్పడినది. స్థానిక పాలనమున 'కమ్యూన్' అనునది తొలి ప్రాతిపదిక. దేశములో 25 కమ్యూనులు కలవు. ఆ యా కమ్యూనులలోని ప్రజలు ఎన్నుకొనిన సమితుల సాయమున, ఒక ఉద్యోగి, అచటి పరిపాలనా వ్యవహారములను నిర్వర్తించును; నైష్పత్తిక ప్రాతినిధ్య పద్ధతినే ఇచట ఎన్నికలు జరుగును. ఈ కమ్యూనులు, ముఖ్యముగా ప్రజారోగ్య సంబంధ విధులను నిర్వహించును. స్వతంత్ర న్యాయపరిపాలనా వ్యవస్థ కలదు. సుప్రీంకోర్టు ఆధ్వర్యమున, వివిధ శ్రేణుల న్యాయస్థానముల ద్వారా న్యాయనిర్వహణ సాగుచున్నది. పేద ప్రజలకు, న్యాయసలహాలను ఉచితముగ ఇచ్చుటకును, అవసరమైనపుడు వారి తరఫున ఉచితముగా వాదనను సాగించుటకును న్యాయవాదులను నియమించి, ప్రభుత్వమే ఆ ఖర్చును భరించుచున్నది.

**8. దేశరక్షణ :** 18 నుండి 47 ఎండ్ల మధ్య వయసు కలిగిన ప్రతి పురుషుడును, అవసరమైనపుడు. విధిగ సైన్యమున చేరవలయునను చట్టము అమలున ఉన్నది. ఇందులకై ఆ వయోవధిలో ఉన్న ప్రతి పౌరుడును, తాను చేరదలచు సైన్య వ్యవస్థా భాగమును అనుసరించి 330-643 రోజుల శిక్షణను పొందును. దేశపు శాంతికాలపు సైన్యమున, భూతల సేనయందు దాదాపు 6 లక్షల సైనికులు కలరు; ఇందు 15 పదాతి దళములు, 3 అశ్విక దళములు, 8 శకట దళములు, 7 శతఘ్ని దళములు, 6 విమాన విధ్వంసక దళములు, 3 ఇంజనీరింగు దళములు, 3 సిగ్నల్ దళములు, 4 సైన్యసేవా దళములు కలవు. వీరందరును, తమ

విధులకు సంబంధించిన ఆధునిక పరికరములు కలిగి, అందు సుశిక్షితులైనవారు. నౌకా సేన యందు ఒక క్రూయిజర్, 22 జలాంతర్గాములు, 8 డెస్ట్రాయర్లు, తక్కు విధముల యుద్ధోపయోగి నౌకలు 196 కలవు; ఈ సేనయందలి యోధ సంఖ్య 16 వేలు. చిన్న రాజ్యముల వాయుసేన లలో నెల్ల, అత్యంత సమర్థమని పేరొందిన వాయు సేన ఈ దేశమునకు కలదు; వాయుసేన యందలి యోధ సంఖ్య 9 300; పోరాటపు విమానముల సంఖ్య 650 (1971).

**9. అంతర్జాతీయ సం.:** ఐ రా.స యందును, తదనుబంధములగు ప్రత్యేక సంస్థలలో కొన్నిం టను ఈ దేశమునకు సభ్యత్వము కలదు. వర్ధ మాన దేశములకు ఐ.రా.స. కల్పించు సాంకేతిక సాహాయ్య కార్యక్రమమున పాల్గొనుటయే గాక ఈ దేశము స్వయముగ ఇండియా, పాకిస్తాన్ మొదలగు కొన్ని దేశములకు సాహాయ్యమును ఇచ్చి నది. తన సమష్టి జాతీయోత్పత్తిలో 1% ను ఇట్టి సాహాయ్యమునకై ప్రభుత్వము వినియోగించు చున్నది. ఐ.రా.స. నిర్వహించు శాంతి సంరక్షక కార్యక్రమములలో ఈ దేశపు సైన్యములు పాల్గొను చున్నవి, నార్వే, డెన్‌మార్క్, ఐస్‌లాండ్, ఫిన్ లాండ్‌లతో పాటుగ ఉత్తర రాజ్య సమితి (నార్డిక్ కౌన్సిల్‌లో) ఈ రాజ్యము సభ్యత్వమును 1953 మొదలుగ కలిగియుండి, సాంఘిక సంక్షేమ, ఆరోగ్య సంరక్షణాది రంగములందు తక్కిన రాజ్యాలతో కలసి సమష్టిగ వ్యవహరించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** పారిశ్రామిక రంగ మున అత్యంతాభివృద్ధిని సాధించిన రాజ్యముగ ఈ దేశము పేరుగన్నది. దేశపు సమష్టి జాతీయోత్ప త్తిలో 31% పరిశ్రమల వలనను, 6% వ్యవసాయ, అటవీ మత్స్య కృషుల వలనను, తక్కినది వ్యాపా రాది రంగముల వలనను లభించుచున్నది (1967). దేశ ప్రజలలో సగటున సాలీనా తలసరి ఆదా యము 3 230 యు స్టే. డాలర్లు. దేశపు మొత్తపు విస్తీర్ణమగు 4,11,47,900 హెక్టేరులలో 30,16,323 హె. వ్యవసాయ యోగ్యము; 1,41,318 హె. పశుగ్రాసపుభూమి; ముఖ్య వ్యవ సాయోత్పత్తుల సంఖ్యావివరములు (వేల టన్ను లలో) ఈ దిగువరీతిగ 1971 లో కలవు: గోధుమ (995), రై (301), బార్లీ (2,029), ఓట్లు (1,867), తక్కిన ధాన్యములు (1,867), ఉరల గడ్డలు (1 242), చక్కెరబీటు (1,705), నూనె విత్తనాలు (253). దేశపు పశుసంతతిలో 18,32 998 గోజాతి; గొర్రెలు 3,30,396; పందులు 22,80,830 కలవు. పాల ఉత్పత్తి 2,866 వేల టన్నులు; వ్యవసాయ రంగమున పని చేయు ట్రాక్టర్ల సంఖ్య 1,81,519. దేశపు భూతల మున 57% అటవీమయము; 1971 లో కలప ఉత్పత్తి 640 లక్షల ఘ. మీటర్లు; ఈ రంగమున 900 రంపపు మిల్లులును; 96 కాగితపు గుజ్జు మిల్లు లును పనిచేయుచున్నవి. మత్స్యకృషి గోటెబర్గ్, బోహస్, హాల్లాండ్ ప్రాంతములందు విరివిగ సాగు చున్నది. సాలీనా పట్టుబడిన చేపల విలువ దాదాపు 1980 లక్షల క్రో. (1971). దేశమున కొన్ని విధముల ఖనిజ సంపద విరివిగ కలదు. అందు ఇనుము ప్రముఖము. ముడి ఇనుమును ఎగుమతి చేయు దేశములలో ప్రముఖములగు వానియందు ఒకటిగ ఈ దేశము పేరొందినది. ఈ గనులలో ముఖ్యములైనవి ధ్రువవృత్తమునకు ఎగువన కలవు. ఇచటి ఉత్పత్తిలో కొంత భాగము, నార్వే యందలి, నార్విక్ రేవు ద్వారాను, మరికొంత భాగము ఈ దేశపు లూలియా రేవు ద్వారాను విదేశ ములకు ఎగుమతి అగుచున్నవి. 1971 లో ముడి ఇనుము ఉత్పత్తి 344 లక్షల టన్నులు; ఇందు ఎగుమతి యైనది 260 లక్షల టన్నులు. రాగి, సీసము, తుత్తునాగముల గనులు అటనట కలవు;

వీనినుండి ముడిరాగి 1,33,800 టన్నులు; ముడి సీసము 1,12,500 టన్నులు; ముడి తుత్తునాగం 1,76,100 టన్నులు ఉత్పత్తి యైనవి (1971). అల్యూమినియం గనులును కలవని తెలియు చున్నది; కాని వానియందు పని జరుగుటలేదు. దక్షిణ స్వీడెన్‌లో కొలదిగ పెట్రోలు లభించు చున్నది. అయినను పెట్రోలియమునకు, రాక్షసి బొగ్గునకు ఈ దేశము విదేశములపై చాలవరకు ఆధారపడి ఉన్నది; దక్షిణ స్వీడెన్‌లోనే యురేని యం కూడ కొలదిగ అటనట దొరకుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 6,655 కోట్ల కివా. (1971); ఇందు 78% జల విద్యుత్తు; జల విద్యుత్తును ఉత్పత్తి చేయు అవకాశములను అన్నింటిని పూర్తిగ ఈ దేశము ఇప్పటికే వినియోగించుకొన గలుగు చున్నది. లోహములు, లోహోత్పత్తులు, యంత్ర పరికరములు, యానసాధన పరికరములు – అను వానిపై ఈ దేశపు పారిశ్రామిక కృషి చాలవరకు ఆధారపడి ఉన్నది. మంచి తరగతికి చెందిన ఉక్కును తయారీ చేయుటలో ఈ దేశము తొలుత నుండియు ప్రసిద్ధి పొందినది. 1970లో మొత్తపు ఉక్కు ఉత్పత్తి 55 లక్షల టన్నులు; ఇందు 28% అత్యుత్తమ స్థాయికి చెందినది; దేశపు పరిశ్రమ లలో లోహ, లోహోత్పత్తులు తరువాత ప్రముఖ ములు కలపకు సంబంధించిన వస్తూత్పత్తి పరి శ్రమలు. ప్రపంచమున కాగితపు గుజ్జును, కాగి తమును, మంచి కొయ్యవస్తువులను పెద్దయెత్తున తయారుచేయు కొలది రాజ్యములలో స్వీడెన్ ఒకటి. తక్కిన పారిశ్రామిక ఉత్పత్తులలో మోటారు శకట ములు, ఓడలు, విమానములు, జవుళీలు, విద్యు త్పరికరములు చెప్పదగినవి. ప్రస్తుతమున రాసా యనిక పరిశ్రమ–అందును పెట్రోకెమికల్ శాఖ– చాలా అభివృద్ధి చెందుచున్నది. దేశపు మొత్తపు ఎగుమతుల విలువ 3,822.4 కోట్ల క్రో.; దిగు మతుల విలువ 3,619.2 కోట్ల క్రో. (1971). బడ్జెటరీ వ్యయము 5,212.1915 కోట్ల క్రో. (1972-73).

**11 సాంఘిక రంగము :** ప్రపంచమున ఆర్థిక, సాంఘిక, రాజకీయ స్వతంత్రతను ప్రతి పౌరునకు అందజేయగలిగిన కొలది రాజ్యములలో ఒకటిగ ఈ దేశము పేర్కొనదగినది. సాంఘిక భద్రతకై కృషి చాల కాలము పూర్వముననే, ఈ దేశమున మొదలై, ద్వితీయ ప్రపంచ యుద్ధానంత రమున, ఆ కృషి ఎక్కువగ వికసనము పొందినది. పౌరులకుగల హక్కులు చక్కగ కాపాడబడుటకును పరిపాలనా యంత్రము, కల్మష రహితముగ వర్తించుటకును ప్రభుత్వము తగు జాగరూకతను వహించును. ఇందులకై లోకాయుక్త (ఓమ్‌బడ్స్ మన్) అను ఉద్యోగ పదవి ఈ దేశపు రాజ్యాంగ విధానమున ఏర్పరుపబడినది. ఇట్టి లోకాయుక్తులు ముప్వురను రాజు నియమించును. వారు, పరిపాల నను నిర్వహించువారి—అనగా మంత్రులు మొద లుగ క్రింది ఉద్యోగుల వరకు ఆ యా పదవులం దున్నవారి–ప్రవర్తనను గురించి ఫిర్యాదులను విచా రించి తగు చర్యలను తీసికొనెదరు; కొన్ని సమ యములందు వారే స్వయముగ తమ యంత్రాంగము ద్వారా దోషులను కనుగొని విచారించి శిక్షింతురు.

దేశమున గృహవసతికై ప్రభుత్వము నిరంతర కృషిని సాగించుచున్నను, పట్టణములందు మాత్రము కొంత ఇబ్బందిగనే ఉన్నది. దేశమున వివిధ స్థాయిలలోని ప్రజలకు తగియుండునటుల వివిధ సాంఘిక భద్రతా పథకములు అమలున ఉన్నవి. వీనితో అస్వస్థత, ఉద్యోగమునవచ్చు ప్రమాదము, నిరుద్యోగము, వార్ధక్యము, అవశిష్ట పోషణ (సంపాదకుడు చనిపోగా మిగిలిన నిస్సహాయ కులగు అతని కుటుంబికుల పోషణ), మాతృ త్వము, శిశుపోషణ – అను వానికి సంబంధించిన పథకములు ప్రముఖములు. ఇవిగాక మౌలికపు

పెన్షన్ (బేసిక్ పెన్షన్) అనునది వేరొకటి కలదు; దీనివలన ప్రతి పౌరునకు 63 ఏండ్ల వయసు వచ్చినప్పటినుండి, సంవత్సరమునకు 7,446 క్రోనారులు చెల్లించబడును. శిశువుల పోషణకై, వారికి 16 ఏండ్ల వయసు వచ్చువరకు, ఒక్కొక్క శిశువునకై సంవత్సరమునకు రు 100 క్రో. చెల్లించబడు చున్నది. మొత్తముమీద దేశమున ప్రతి పౌరునికి పుట్టినప్పటినుండి చచ్చువరకు భద్రతాయుత జీవనమును, కనీసవు సౌకర్యములతో, గడపు అవకాశము కలదని చెప్ప వచ్చును. ఇట్టి సాంఘిక భద్రతా పథకములకై తగు పన్నుల విధానమును ప్రభుత్వము రూపొందించి కట్టుదిట్టముగా అమలు జరుపుచున్నది. ఆదాయపు పన్ను 10% నుండి క్రమముగ ఆదాయముల పెంపుదలను అనుసరించి 65% వరకు పోవుచున్నది. కార్మికుల పని కాలము వారమున 45 గంటలు మాత్రమే సంవత్సరమున మూడు వారములు జీతముతో సెలవు ఈయబడును.

దేశమున నిరక్షరాస్యత లేదు. 7 నుండి 17 ఏండ్ల వరకు బాల బాలికలకు, విద్య, నిర్బంధముగను ఉచితముగను బోధింపబడుచున్నది. ప్రయిమరీ పాఠశాలలలో 6,59,000 మంది; మాధ్యమికవిద్యలో దిగువ స్థాయియందు 3,20 900 మంది; మాధ్యమిక ఉన్నత స్థాయిలో 2,32,400 మంది విద్యార్థులు కలరు. వృత్తి పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య 65,100. ఇవిగాక ప్రజా కళాశాలలును, వయోజనులకు ఆధునిక వైజ్ఞానిక, కళా ప్రగతులను తెలియజేయుటకై కలవు; అందు 13,700 మంది పఠించుచున్నారు. దేశమున ఆరు విశ్వవిద్యాలయములు కలవు. వానిలో ఉప్సలా విశ్వవిద్యాలయము అతి ప్రాచీనము; అది 1477 లో నెలకొల్పబడినది. ఈ విశ్వవిద్యాలయములందు అన్నింట కలసి 90,059 మంది విద్యార్థులు కలరు. ఇవిగాక మూడు అనుబద్ధ విశ్వవిద్యాలయములు పనిచేయుచున్నవి; వానిలోని విద్యార్థి సంఖ్య 4,895. ఇంకను స్వతంత్రముగ పనిచేయు ఉన్నత విద్యా సంస్థలలో 14,195 మంది పఠించుచున్నారు (1971-72). దేశమున గ్రంథాలయముల సంఖ్య 1,744. వీనిలో ఉప్సలా, లుండ్, గోటెబర్గ్‌ల లోని విశ్వవిద్యాలయ గ్రంథాలయములును, స్టాక్ హోమ్‌లోని రాయల్ గ్రంథాలయమును, ప్రముఖములు. దేశమున ప్రచురితములగు గ్రంథములలో ప్రతియొకదాని ప్రతులలో ఒక్కొక్కటి ఈ గ్రంథాలయములకు ఉచితముగ పంపబడును. ఉప్సలాలోని గ్రంథాలయము అన్నింట పెద్దది; అందలి గ్రంథ సంఖ్య 12 లక్షలు. మ్యూజియములలో ప్రముఖములగునవి అన్నియును స్టాక్‌హోమ్‌లో ఉన్నవి; అందు పేరొందినది నేషనల్ మ్యూజియం. దేశమున 151 దినపత్రికలు ప్రచారమున ఉన్నవి; వీనిలో స్టాక్‌హోమ్ నుండి వెలువడు 'ఎక్స్‌ప్రెస్' అత్యంత ప్రచారము కలది. పౌరులకు వైద్య సహాయమునకు, ఆరోగ్య రక్షణకు ప్రభుత్వము పెక్కు వసతులను కల్పించినది. ప్రతి పౌరుడును విధిగ జాతీయ ఆరోగ్యభీమా పథకమున చేరి యుండ వలయును; దేశమున నివసించు విదేశీయులకు సైతము ఇది తప్పని సరి. ఇందు వలన రోగ కాలమున వైద్య సహాయము, పథ్యాహారము ప్రభుత్వ వైద్యశాలలందు ఉచితముగ లభించుచున్నవి. 1,12,049 శయ్యలు కలిగిన 722 ఆసుపత్రులు దేశమున కలవు. ఈ ఆసుపత్రుల నిర్వహణ చాల ప్రశస్తమని పేరుగాంచినది. దేశపు వైద్యుల సంఖ్య 9,240; ఇందు మూడవ వంతు మాత్రమే ప్రయివేటుగ వృత్తిని సాగించుచున్నారు (1968).

**12. యాత్రా సౌ. :** స్కాండినేవియా దేశములకు చెందిన పౌరులకు పాస్‌పోర్టు ఈ దేశ పర్యటనకు అవసరములేదు. కొన్ని పశ్చిమ యూరపీయ దేశముల వారికిని, కెనడా, యు.స్టే. పౌరులకును వీసాలు అక్కరలేదు.

**13. ప్రసిద్ధ పౌరులు :** 1. ఈసాయిస్ టెగ్నర్ (1782-1846): జాతీయ మహాకవి; 2. సెల్మాలాజెర్‌లోఫ్ (1858-1940) : ప్రసిద్ధ నవలా రచయిత్రి; ఈమె 1909 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను; 3. కారెల్ గస్టావ్ వెర్నెర్ ఫాన్ హిండెన్‌స్టామ్ (1859-1940): కవి; నోబెల్ బహుమతిని ఆర్జించెను; 4. కారల్ మిల్లెస్ (1875-1953): ప్రసిద్ధ శిల్పి; ఇతని మరణానంతరమున ఇతని గృహమునే మ్యూజియముగ మార్చి, అతని శిల్పములను అట ప్రదర్శించు ఏర్పాటు చేయబడినది; 5. కారల్ ఫాన్ లిన్నీ (1707-78) : వృక్ష సంతతులను, జంతు సంతతులను వర్గీకరించిన ధీశాలి; అతని పేరనే ఆ వర్గీకరణ వ్యవహృతము. 6. స్వాంతీ అర్‌హీనస్ (1859-1927) : వైద్యుతిక విశ్లేషణ యందును, రోదసీ భౌతికశాస్త్రము (కాస్మిక్ ఫిజిక్స్) నందును నూత్నాంశములను కనుగొని, 1903 లో నోబెల్ బహుమతిని ఆర్జించినవాడు; 7. ఆల్‌ఫ్రెడ్ నోబెల్ (1833-96) : డైనమైటు అనబడు ప్రేలుడు ద్రవ్యమును కనుగొని, తన్మూలమున కోటీశ్వరుడైనవాడు; ఇతని మరణ శాసనమును అనుసరించియే, ఇతని పేరున, నోబెల్ బహుమతుల పద్ధతి ఏర్పడి, అతని ఆస్తి అందులకై వినియుక్తమగుచున్నది; 8 గున్నార్ మిర్‌డాల్ (జ 1898): ఆర్థిక శాస్త్రవేత్త; ఒక నూత్న సిద్ధాంతమునకు కారణ భూతుడై 1976 లో నోబెల్ బహుమతిని ఆర్జించెను; 9 డాగ్ హేమర్‌షెల్డ్ : (1905-61) : రాజకీయార్థికవేత్త; ఐ.రా.స. కు కార్యదర్శిగ వ్యవహరించి, తన విధి నిర్వహణలో వైమానిక ప్రమాదమున మరణించెను.

---

# 32. హంగరీ
## (మాగియార్)

**ముఖ్యనగరము :** బుడాపెస్ట్; **జెండా :** ఎరుపు, తెలుపు, ఆకుపసిమి రంగుల అడ్డుచారలు, సమ ప్రమాణమున, పైనుండి దిగువకు అమరినది; **జాతీయ గీతము :** ఇస్టెన్ ఆల్ట్ మెగ్ అ మాగియార్ (మాగియారులను ఈశ్వరుడు కటాక్షించుగాక) అను చరణము తొలుత గలది; **నాణెము :** ఫోరింట్; 100 ఫ్లోరిన్‌లుగ ఇది విభక్తము; 11 74 ఫోరింట్‌లు = రు. 7-50; **కొలతూకములు :** మెట్రిక్ విధానపువి; **కాలగణన :** సా. 1 గం. = భారతదేశమున సా. 5 గం. 30 ని.

**1. ఉనికి మొ. :** మధ్య యూరపున, 16° - 23′ తూ. తు. రేఖల మధ్యను, 45°50′-48°40′ ఉ అ. రేఖల నడుమను పదిరియున్న ఈ దేశమునకు దక్షిణమున యుగోస్లావియా (629 కిమీ.), ఉత్తరమున జెకోస్లోవాకియా (605 కిమీ ), ఆగ్నేయమున రుమేనియా (429 కిమీ.), పశ్చిమమున ఆస్ట్రియా (354 కిమీ ) ఈశాన్యమున సోవియెట్ యూనియన్ (216 కిమీ.) సరిహద్దులందు ఉన్నవి. దేశమున దాదాపు మూడింట రెండువంతుల భూతలము 200 మీ. ఎత్తునకు లోపుగనే ఉన్నది. అత్యంత నిమ్నభూమి సముద్రమట్టమునకు 78 మీ. ఎత్తున మాత్రమే ఉన్నది; అత్యున్నతమగు కేకెసైతో శిఖరపు ఎత్తు 1,015 మీ.; ఇది మాత్రా పర్వత శ్రేణియందు ఉన్నది. భౌగోళికపు తీరులను

బట్టి ఈ దేశము నాలుగు ప్రాంతములుగ - 1. డాన్యూబ్ నదికి ఆవలనున్న భూమి; 2. మహా మైదానము (నాగీ ఆల్‌ఫోల్డ్), 3. చిన్న మైదానము (కిసాల్ ఫోల్ట్), 4. ఉత్తర ఉన్నతభూమి అను రీతిగ-విభక్తము. ప్రముఖములగు నదీలోయలును, పర్వత శ్రేణులును ఉత్తర ఉన్నత భూములందు కలవు. మొత్తముమీద భూమియంతయు సారవంతము. నదులలో డాన్యూబ్, తిస్సానదులు పేర్కొనదగినవి; సరసులలో బాలాతాన్ (594 చ. కిమీ.) అత్యంత విస్తృతము.




పటము 30.

**2. శీతోష్ణస్థితి మొ. :** దేశపు సాలీనా కనిష్ఠ ఉష్ణోగ్రత (జనవరిలో) 5° ఫా ; గరిష్ఠ ఉష్ణోగ్రత (ఆగస్టులో) 100° ఫా. ప్రదేశములను అనుసరించి వర్షపాతమున మార్పులున్నను, సాలీనా సరాసరి వర్షపాతము 58 సెం. మీ ; అయినను పశ్చిమమున ఇంతకు మించియు, తూర్పున ఇంతకు తక్కువగను వానలు పడుచుండును. ఎండాకాలమున వర్షపాతము చాల ఎక్కువ. అంతటంతట తీవ్ర అనావృష్టి బాధయు కలదు. తూర్పు యూరపున తక్కిన దేశములందు కననగు వృక్ష, వన్యజంతు సంతతులే ఇచటగూడ సాధారణముగ కనవచ్చుచున్నవి. అచటనుండి ఆకురాల్పు తరగతి చెట్లలో ఓకుచెట్టు విరివిగ కననగును; పర్వత సీమలందు సూచ్యగ్ర జాతి వృక్షములు వివిధములు కలవు. వన్యజంతు సంతతి విరివిగ కలదు. అందు జింక, అడవిపంది, కుందేలు పేర్కొనదగినవి. మహా మైదానము వివిధ పక్షిజాతుల కేంద్రావాసముగ పేరొందినది; నదులందును సరస్సులందును మత్స్యసంతతి చాల అధికము.

**3. జనసంఖ్య మొ. :** 1970 లోని లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 1,03,14,152 (1973 అంచనా 1,04,15,000); ప్రజలలో 55% గ్రామములలో వసించుచున్నారు; పట్టణములలో 45% వసించుచున్నారు; అందును ముఖ్య పట్టణమున 19% కలరు. జనసాంద్రత చ. కిమీ.కు 111. ముఖ్యనగరమగు బుడాపెస్ట్‌లోని జనసంఖ్య 19,39,522. తక్కిన నగరములలో మిస్కోల్క్ (జ. సం. 1,73,000), డెబ్రిసిన్ (1,55,000), పీక్స్ (1,46,000), సెగెడ్ (1,19,000) పేర్కొనదగినవి. ప్రజల మాతృభాష మాగియార్; ఇది ఫిన్నో ఉగ్రియన్ భాషా కుటుంబమునకు చెందినది; దేశమునందు విదేశీయ సంతతులవారు 4% మాత్రమే కలరు. వారియందు జర్మన్, స్లోవాక్, జిప్సీ, సెర్బ్, రుమేనియన్ భాషలు మాతృభాషలుగ ప్రచారమున ఉన్నవి. హంగేరియనులలో పలువురకు తమ మాతృభాషయగు మాగియార్‌తోపాటుగ జర్మన్, ఫ్రెంచి భాషలతో పరిచయము కలదు. ప్రజలలో 68% రోమన్ కేథలిక్ క్రైస్తవ సంప్రదాయమునకు చెందినవారు; తక్కిన వారిలో అత్యధిక సంఖ్యాకులు విభిన్న ప్రొటెస్టంట్ క్రైస్తవ సంప్రదాయములకును, 2.5% ఈస్టరన్ ఆర్థడాక్స్ చర్చికిని, 1.5 యూదమతమునకును చెందినవారు. రాజ్యాంగ విధానరీత్యా మతము, ప్రభుత్వ వ్యవస్థ నుండి వేరుపరచబడినది. మత, భావ స్వాతంత్ర్యములు కల్పింపబడినవి. కాని దేశమున ప్రభుత్వమును నిర్వహించు కమ్యూనిస్ట్ పార్టీ, ప్రజానీకమును నాస్తిక సమాజముగ రూపొందించు

టయే తన ధ్యేయముగ గ్రహించి వర్తించు చున్నది.

**4. సమాచార సౌ. :** దేశమున తపాలాఫీసుల సంఖ్య 2,456; అన్ని విధముల సమాచార సాధనములకు బుడాపెస్ట్ నగరము కేంద్రముగ వ్యవహరించుచున్నది. తంతి, టెలిఫోన్ సౌకర్యములు విరివిగ కలవు. రెండు రేడియో స్టేషనులు, ఒక టెలివిజన్ పనిచేయుచున్నవి. టివి కార్యక్రమములను మారుమూల గ్రామములకు సైతము అందజేయుటకై సూక్ష్మ తరంగముల శృంఖల (మైక్రోవేవ్ చైన్) ఒకటి అభివృద్ధి చేయబడినవి. హంగరీ, జెకోస్లోవాకియా, పోలండ్, సోవియెట్ యూనియన్, తూర్పు జర్మనీల మధ్య, టివి కి సంబంధించిన, ఇంటర్ విజన్ పద్ధతి అమలున ఉన్నది (1971).

**5. యాన సౌ. :** దేశపు రోడ్లనిడివి 29 600 కిమీ.; ఇందు 6,050 కిమీ. ప్రథమ, ద్వితీయ శ్రేణులకు చెందినది. రైలుమార్గముల నిడివి 8,663 కిమీ.; అందు 1,001 కిమీ.ల మార్గము విద్యుతీకరింపబడినది. నౌకాయానమునకు ఉపయోగించు దేశాంతర్గత జలమార్గముల నిడివి 1,688 కిమీ. ఇందులో డాన్యూబ్ నదీమార్గము ప్రముఖము బుడాపెస్ట్ నగరమునకు 16 కిమీ.ల దూరమున ఉన్న ఫెరిహేజీ విమానాశ్రయము, దేశపు ఆశ్రయములందెల్ల ప్రముఖము. దేశాంతర్గతమగు విమానయానమును, మాలెవ్ అను జాతీయ విమానయాన సంస్థ నిర్వహించుచున్నది. అంతర్జాతీయ విమానయానమున, ఫెరిహేజీ విమానాశ్రయమును, మాలెవ్ సంస్థయేగాక, 18 విదేశీయ విమానయాన సంస్థలను వాడుకొనుచున్నవి.

**6. చరిత్ర :** ఊరల్ పర్వత సమీపమున వసించుచుండిన 'మాగియారు' అను జాతికి చెందిన ప్రజలు క్రీ. శ. 895-96 లో ఈ ప్రాంతముపై దండెత్తి, తిస్సా డాన్యూబ్ నదుల తీరములను అనుసరించి వలసలను ఏర్పరచుకొనుటతో, ఈ దేశపు చరిత్ర మొదలయ్యేనని చెప్పవచ్చును. (మాగియార్ అను హంగేరియన్ అనురీతిగ విదేశీయుల ఉచ్చారణలో మార్పుచెంది, అందువలన దేశమునకు హంగరీ అను పేరు వ్యవహారణ కలిగినది). ఈ మాగియార్ జాతులు ఒక రాజరికమును ఏర్పరచుకొని, తమ రాజ్యమును విస్తృతీకరించుకొని, పరిసరములనున్న కొన్ని స్లోవాక్, స్లావ్ జాతుల ప్రాంతములను వశపరచుకొని, ఆ జాతులతో మిశితమై ఏకజాతిగ రూపొందినవి. స్టీఫెన్ I (997-1038 ప.) అనెడు పాలకుని కాలమున ఇచటి ప్రజలు క్రైస్తవమతమును అవలంబించిరి. 14, 15 వ శతాబ్దములలో ఈ రాజ్యము బలవత్తరమై వ్యవహరింపగలిగినది; కాని దేశీయులగు రైతుల తిరుగుబాటులవలనను, మాండలికుల అంతర్యుద్ధముల వలనను దేశము బలహీనముకాగా 1526 లో తుర్కులు దేశీయ సేనలను ఓడించిరి. అంతట వారి అధికారమునకు లోబడిన వివిధ మాండలికులు దేశమున కొంతకాలము పాలనను సాగించిరి. ఇంతలో 1683 లో తుర్కులను, ఆస్ట్రియా దేశపు ప్రభువు ఓడించుటవలన, తదాదిగ ఆస్ట్రియా ప్రభువుల సర్వాధిపత్యము ఇట నెలకొల్పబడినది. హంగేరియనులు, ఆస్ట్రియా ప్రభువులపై, జరిపిన తిరుగుబాటులు అన్నియు క్రూరముగ అడచివేయబడినవి. కడకు 1723 లో విధిలేక, హంగేరియన్ ప్రజాసభ, ఆస్ట్రియా దేశపు సర్వాధికారమును అంగీకరించినది. కాని స్వాతంత్రోద్యమము అంతరించక కొనసాగుచునే ఉండినది. కాలక్రమమున ప్రష్యియాదేశము బలవత్తరమై ఆస్ట్రియాను ఓడించగ, ఆస్ట్రియా బలహీనమై హంగేరియనుల జాతీయాశయములను కొంతవరకు ఆమోదించగ, ఒకే రాజరికముక్రింద ఆస్ట్రియా హంగరీలు వేర్వేరు రాజ్యములుగ వ్యవహరించుటకును,

హంగరీ కొంత స్వయం పరిపాలన కలిగి ఉండుట కును ఒడంబడిక కుదిరిగినది (1867).

ప్రథమ ప్రపంచ సంగ్రామమున ఆస్ట్రియా పరాజితముకాగా, అచటి రాజరికము అంతరించి, హంగరీ స్వతంత్రమైనది. తరువాత ద్వితీయ ప్రపంచయుద్ధ కాలమున ఈ దేశము అక్షరాజ్యములతో చేరి కొన్ని పరిసర ప్రాంతములను సైతము తన రాజ్యమున కలుపుకొన గలిగినది; కాని 1945 లో సోవియెట్ సేనలు దేశమును వశపరచుకొనగ, దేశమున గణతంత్ర ప్రభుత్వము ఏర్పడినది. 1937 తరువాత దేశము ఆర్జించిన ఇతర ప్రాంతములను అన్నింటిని ఆ ప్రభుత్వము వదలుకొనినది. 1948 లో దేశీయమగు కమ్యూనిస్టుపార్టీ అధికారమును కైవసము చేసికొని, ప్రజాగణరాజ్య ప్రభుత్వమును నెలకొల్పినది.

**7. పరిపాలన :** 1949 లో ఆమోదితమై, 1972 లో కొన్ని సవరణలను పొందిన రాజ్యాంగ విధానమును అనుసరించి ఈ దేశమున పరిపాలన సాగుచున్నది. ఉచ్చతమాధికారము జాతీయ శాసన సభ (ఓర్ షాగ్యూలిస్) యందు న్యస్తము. ఈ శాసన సభయందలి సభ్యసంఖ్య 352. ఈ సభకు ఎన్నికలు 4 ఏండ్లకు ఒకసారి జరుగును. 18 ఏండ్ల వయసునకు తగ్గని పౌరులకు అందరికిని వోటు హక్కు కలదు. ఎన్నికలు ఏకపట్టికా విధానమున జరుగును. ఆ పట్టికను కమ్యూనిస్ట్ పార్టీ ఆధ్వర్యమున పనిచేయు 'దేశభక్త సంఘటన' (పాట్రియాటిక్ ఫ్రంట్) తయారుచేయును. కాని 1971 నుండి ఈ పట్టికను తయారుచేయు విధానమున ఒక చిన్న మార్పు ప్రవేశపెట్టబడినది. పూర్వమున ఒక నియోజక వర్గమునకు ఒకే అభ్యర్థిని పట్టిక నిర్ణయించెడిది. ఇపుడు అటులగాక, కొన్ని నియోజకవర్గములందు ఇరువురు అభ్యర్థులను సూచించి, అందు ఎవనినో ఒకనిని ఎన్నుకొను అవకాశము వోటర్లకు కల్పింపబడినది. అయితే ఒక నియోజక వర్గపు వోటర్లు తొలుతగ జరిపిన చర్చలలో మూడవవంతుకుపైగా వోటర్లు ఒక ప్రత్యామ్నాయపు అభ్యర్థిని సూచించినపుడు మాత్రమే ఇట్టి ఏర్పాటు జరుగుచున్నది. శాసనసభ సమావేశముకాని కాలమున శాసన నిర్మాణమును కొనసాగించుటకు 21 మంది సభ్యులుకల అధ్యక్షమండలి ఒకటి కలదు. ఇందలి సభ్యులను శాసనసభయే ఎన్నుకొనును. ఈ అధ్యక్షమండలి యొక్క అధ్యక్షుడే దేశపు ప్రభుత్వాధినేతగ వ్యవహరించును. ఈ మండలి సూచనపై శాసన సభయే మంత్రి మండలినికూడ ఎన్నుకొనును. ఈ మంత్రి మండలి ప్రధానమంత్రి ఆధ్వర్యవమున, అధ్యక్ష మండలికిని, జాతీయ శాసనసభకును బద్ధమై తన విధులను నిర్వహించి పరిపాలన చేయును. దేశమున 1956 వరకు, కమ్యూనిస్ట్ పార్టీతో పాటుగ కొన్ని ఇతర రాజకీయ పక్షములును పనిచేసినవి. ఈ ఇతర పక్షములు, ఎన్నికల విధానమున మార్పునకై ఆందోళన లేవదీయగా, ఆ తిరుగుబాటును సోవియెట్ సేనలు అడచివేసినవి. తదాదిగ దేశమున కమ్యూనిస్ట్ పార్టీ మాత్రమే ఏకైక రాజకీయ పక్షముగ వ్యవహరించుచున్నది. ఎన్నుకొనబడిన ప్రజాసభల సాయముతో వివిధ స్థాయీలలో స్థానిక పరిపాలన సాగుచున్నది. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యవమున దేశమున న్యాయ నిర్వహణ సాగుచున్నది. ఈ కోర్టులోని జడ్జీలను, జాతీయ శాసనసభ ఎన్నుకొనును; అటులే క్రింది స్థాయీలలోని కోర్టుల జడ్జీలను, అందుకు సంబంధించిన ప్రజా సభలు ఎన్నుకొనును.

**8. దేశరక్షణ :** దేశపు భూతలసేన యందలి సైనిక సంఖ్య 90,000; ఇందు ఒక టాంకు దళము, 5 మోటారు శకట దళములు కలవు. నదీ మార్గముల రక్షణకు సంబంధించిన చిన్న నౌకాసేన కలదు. వాయుసేన, భూతల

సేనకు ఉపాంగముగ, పనిచేయుచున్నది; ఇందలి సైనిక సంఖ్య 12000. పోరాటపు విమానముల సంఖ్య 110. వార్సా ఒడంబడికయందు ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. ఆ ఒడంబడికను అనుసరించి, సోవియెట్ రష్యాకు చెందిన మూడు సైనిక దళములు ఈ దేశమున నిలిచి యున్నవి.

**9. అంతర్జాతీయ సం.:** ఐ. రా. స. యందును, తదనుబంధములగు కొన్ని ప్రత్యేక సంస్థలందును ఈ రాజ్యమునకు సభ్యత్వము కలదు. సోవియెట్ యూనియన్‌తో కలసి పనిచేయు అన్ని ఆర్థిక, సైనిక వ్యవహార సంఘములందును ఈ దేశము సభ్యత్వము కలిగి వ్యవహరించుచున్నది.

**10. ఆర్థిక రంగము:** తొలుత ఈ దేశపు ఆర్థిక వ్యవస్థ వ్యవసాయము పైననే ఎక్కువగ ఆధారపడి ఉండినను, 1939 మొదలుగ ప్రభుత్వము అవలంబించిన ప్రగతిశీలక విధానములవలన, పారిశ్రామికముగ దేశము పురోగమించినది. తత్ఫలితముగ ప్రస్తుతమున వ్యవసాయముకన్న మిన్నగ పరిశ్రమలవలన దేశమునకు ఆదాయము లభించుచున్నది. పరిశ్రమల అభివృద్ధికై దిగుమతుల అవసరము ఎక్కువగ ఉండుటవలన, దేశమున వస్తు వినియోగమును సాధ్యమైనంత మేరకు, తగ్గించి, ఉత్పత్తులలో అధిక భాగమును ఎగుమతిచేయు విధానమును ప్రభుత్వము అవలంబించి కృషి చేయుచున్నది. సమష్టి జాతీయోత్పత్తి, పరిశ్రమలవలన 36.2%, నిర్మాణ కార్యక్రమములవలన 7.1%, వ్యవసాయ అటవీ కృషులవలన 20.4%, రహదారుల వలన 13.2%, తదితర కృషుల వలన 23.1% లభించుచున్నది.

దేశమున వ్యవసాయ యోగ్యమగు భూమి 8,368 వేల హెక్టేరులు. ఇందు 5,033 వేలు సేద్యమున ఉన్నది; 1277 వేలు గడ్డి బీడులుగను, 222 వేలు ద్రాక్ష తోటలుగను, 323 వేలు ఇతరములగు తోటలుగను వినియుక్తము. ప్రభుత్వము సమష్టి వ్యవసాయమును ప్రోత్సహించుచున్నది. ఇట్టి సమష్టి వ్యవసాయ క్షేత్రములు దేశమున 2,373 కలవు; వాని మొత్తపు విస్తీర్ణము 56 లక్షల హె; ప్రభుత్వము స్వయముగ నిర్వహించు వ్యవసాయ క్షేత్రములు 180 కలవు; వాని వైశాల్యము 10 లక్షల హెక్టేరులు. ఇవిగాక చిన్న రైతుల స్వంత కమతములలో 5,53,000 హె. కలదు. మొత్తముమీద 2,05,500 హె.లకు నీటి పారుదల వసతులు ఉన్నవి; ట్రాక్టర్ల మొత్తపు సంఖ్య 70 వేలు (1971).

1971 లో వివిధ వవ్యసాయోత్పత్తులు (వేల మెట్రిక్ టన్నులలో) ఈ దిగువరీతిగ కలవు: గోధుమ (3,915), రై (180), బార్లీ (782), ఓట్లు (85), మొక్కజొన్న (4,674), ఉరలగడ్డలు (1,488), చక్కెర బీటు (2,023). దేశపు పశు సంతతతిలో వివిధ జాతులు (వేల సంఖ్యలో) ఈ విధముగ 1971 లో ఉన్నవి: గోజాతి (1,917), పందులు (7,510), కోళ్ళు (36,518), గొర్రెలు (2,657), గుర్రములు (249). పాల ఉత్పత్తి సాలీనా 170 కోట్ల లీటర్లు. బాలాతన్ సరోవర పరిసరమునను తోకాజ్ ప్రాంతమునను ద్రాక్ష తోటలు విరివిగ కలవు; అందుండి ద్రాక్ష సారాయపు ఉత్పత్తి 4560 లక్షల లీటర్లు (1971). అడవుల వైశాల్యము 14.8 లక్షల హె. 1971 లో కొట్టబడిన కలప 51 3 లక్షల ఘ. మీటర్లు. డాన్యూబ్, తిస్సా నదులు మత్స్య పరిశ్రమకు ముఖ్య స్థావరములు; 1971 లో చేపల పట్టుబడి 18 వేల మెట్రిక్ టన్నులు. రాక్షసి బొగ్గు, బాక్సైట్ ఖనిజముల త్రవ్వకం ఎక్కువగ జరుగుచున్నది; ఇనుప గనులు

కొలదిగ కలవు. సెగెద్ లోయలోను, జాలా మండలమునకు పెట్రోలియమ్, ఇంధన వాయువులు లభ్యములగు అవకాశములు కలవు. సోవియెట్ యూనియన్ లోని యుక్రెయిన్ నుండి ఒక గొట్టము (పైప్‌లైన్) ద్వారా ఈ దేశమునకు పెట్రోలియమ్ ఇంధన వాయువులు ఎగుమతి యగుచున్నవి. ఈ గొట్టపు నిడివి 2,837 కిమీ. (1971). దేశమునకు కావలసిన ముడి పెట్రోలియమును అంతటిని, డీజెల్ ఆయిల్‌లో 92%, ఈ విధముగ ఈ దేశము సోవియెట్ యూనియన్ నుండి తీసికొనుచున్నది. దేశపు విద్యుదుత్పత్తి 1,630 కోట్ల కివా. (1971); అణవిక విద్యుదుత్పత్తికై ఒక కేంద్రము నెలకొల్ప బడుచున్నది (1975); భారీ పరిశ్రమలకు తగిన ముడి ఖనిజములు ఈ దేశమున చాల తక్కువ; అందువలన వానిని దిగుమతి చేసికొని ఈ దేశము తన పరిశ్రమలను పెంపొందించుకొనుచున్నది. పారిశ్రామికోత్పత్తులలో బొగ్గు, ఉక్కు దిమ్మెలు, బాక్సైట్, సిమెంట్, యంత్రపరికరములు, బస్సులు, డీజెల్ ఇంజన్లు, మోటారు బండ్లు, టివి సెట్లు, రేడియో సెట్లు పేర్కొనదగినవి. దేశపు ఎగుమతుల విలువ 2,935.5 కోట్ల ఫొరింట్లు; దిగుమతుల విలువ 3,509.8 కోట్ల ఫా. (1971). బడ్జెటరీ వ్యయము 2,322 కోట్ల ఫా. (1972).

**11. సాంఘిక రంగము :** దేశమున ద్వితీయ ప్రపంచ యుద్ధ ఫలితముగ, గృహవసతి చాల నష్టమైనను, యుద్ధానంతరమున సాగిన కృషి వలన, ఆ సమస్య, ముఖ్యముగ పట్టణములకు సంబంధించినంత వరకు, చాల వరకు పరిష్కృతమైనది. దేశమున మొత్తపు గృహముల సంఖ్య 3,56,800 (1971). చిన్న పట్టణములందును, గ్రామములందును గృహ వసతి కొంత తక్కువగనే ఉన్నను, దానిని సరిచేయుటకు ప్రభుత్వము నిరంతర కృషిని సాగించుచున్నది. సాంఘిక సంక్షేమమునకు సంబంధించిన కొన్ని పథకములు అమలున ఉన్నవి. 60 ఏండ్ల పైబడిన మగవానికిని, 55 ఏండ్ల పైబడిన స్త్రీలకును పెన్షన్ వసతులు కలవు. శిశు పోషణకై, రెండవ బిడ్డ మొదలుగ ప్రతి బిడ్డకును పోషణ వ్యయమును, కుటుంబమునకు ప్రభుత్వము అందజేయు చున్నది. 6 నుండి 16 ఏండ్ల వయసు కలవారికి నిర్బంధోచిత విద్యాబోధన సాగుచున్నది. 3,536 శిశు పాఠశాలలలో, 2,47,000 మంది; 5,351 సాధారణ పాఠశాలలలో 10.7 లక్షల మంది; 541 సెకండరీ పాఠశాలల్లో 3,51,536 మంది; 212 ఉన్నత పాఠశాలల్లో 5,963 మంది విద్యార్థులు కలరు (1971-72). దేశమున నాలుగు విశ్వవిద్యాలయములు (బుడాపెస్ట్, పీక్స్, సెగెద్, డెబ్రెసిన్) కలవు; ఇవిగాక ప్రత్యేక విద్యల బోధించు 14 విశ్వవిద్యాలయములును, 19 ఉన్నత విద్యా సంస్థలును పని చేయుచున్నవి. వీని అన్నిటి కలసి విద్యార్థుల సంఖ్య 86,311 (1971-72). దేశమున గ్రంథాలయముల సంఖ్య 5,293; వీనిలో, బుడాపెస్ట్ లోని, జాతీయ గ్రంథాలయము ప్రముఖము; ఇందలి గ్రంథ సంఖ్య 52,62,000 (1968). ఆ నగరముననే ఉన్న జాతీయ మ్యూజియం, దేశపు మ్యూజియములందెల్ల ప్రశస్తము. దేశమున 29 పత్రికలు ప్రచారమున ఉన్నవి (1971); వానిలో నెప్‌షాబద్‌సాగ్ అను దానికి ఎక్కువ ప్రచారము కలదు. ప్రతి పౌరునకు వైద్యసాహాయ్యము ఉచితముగ లభించుచున్నది; మందుల ఖర్చులలో 15% మాత్రమే రోగి భరించును. మొత్తమున 84,818 శయ్యా సంఖ్య కలిగిన వైద్యశాలలు కలవు; వైద్య సంఖ్య 24 310 (1971);

**12. యాత్రా సౌ :** యాత్రిక పరిశ్రమను వృద్ధి చేయుటకై ప్రభుత్వము తగు వసతులను కలిగించి కృషి చేయుచున్నది. విదేశీయ యాత్రికుడు విధిగా పాస్‌పోర్ట్, వీసాలను కలిగి ఉండవలయును.

యాత్రికులను విరివిగ ఆకర్షించుటకై, వారికి ప్రత్యేకముగ యు. స్టే. డాలరుకు, 30 ఫారింట్ల వంతున వినిమయ సౌకర్యమును ప్రభుత్వము కలిగించినది.

**13.** **ప్రసిద్ధ పౌరులు :** 1. సాండర్ పెటోఫీ (1823-49) : జాతీయ వీరుడు, కవి; ఆస్ట్రియా ప్రభువులను ఎదుర్కొని పోరాడి దేశీయులను తన గేయముల ద్వారా ఉత్తేజమును కల్పించుటయే గాక, ఆ పోరాటములందు స్వయముగ పాల్గొనినవాడు; 2. మిహాలే ముంకాషీ (1844-1900) : ప్రసిద్ధ చిత్రకారుడు; 3. లోరాండ్ యూత్వోస్ (1848-1919) : టార్షన్ బేలన్స్ అను పరికరమును కనుగొనిన వైజ్ఞానికుడు; నోబెల్ బహుమతిని వైద్య శారీరక శాస్త్రములందు పొందినవారు : 4. రాబర్ట్ బిరానీ (1876-1936); 5. ఆల్బర్ట్ షెంట్-గ్యోర్జీ (జ. 1893); 6. జార్జి ఫాన్ బెకేసీ (జ. 1899).








The territorial waters of India extend into the sea to a distance of twelve nautical miles measured from the appropriate base line.

The boundary of Meghalaya shown on this map is as interpreted from the North Eastern Areas (Reorganisation) Act, 1971, but has yet to be verified.

( ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సౌజన్యముతో )

# భారత దేశము
## ( ఇండియా )

**ముఖ్యనగరము :** నయా ఢిల్లీ; భారతేతిహాస కాలము మొదలుగ ప్రముఖ రాజ్యముల రాజధానులుగ ఉండిన ఇంద్రప్రస్థము, తుగ్లగాబాద్ మొదలగునవి ఉన్న ఈ నగర ప్రాంతము, మొగలుల కాలమున రాజధానిగ అత్యంత ప్రసిద్ధిని ఆర్జించినది. బ్రిటిష్‌వారి పరిపాలనా కాలమున రాజధానిగ తొలుత కలకత్తాయే ఉన్నను, భారత చారిత్రక సంప్రదాయమును ఆదరించి, బ్రిటిష్ పాలకులు 1911 లో రాజధానిని ఢిల్లీకి తరలించి, ఆధునిక పరిపాలనావసరములకు అనుగుణముగ అందలి పాత నగరములకు చేరువనే నయా ఢిల్లీని నిర్మింప జేసిరి (1912-31).

**జెండా :** జాతీయ పతాకము త్రివర్ణ శోభితమై మధ్య భాగమున ధర్మచక్ర ప్రతిరూపమును కలిగి ఉన్నది. పతాకపు వెడల్పు పొడవుల నిష్పత్తి 2 : 3 లో ఉండును. పైనుండి దిగువకు సమ ప్రమాణములలో ఎరుపు (కేసరి), తెలుపు, దట్టపు ఆకుపసిమి అడ్డుచారలు ఇందు కలవు; మధ్యఉన్న తెల్లని అడ్డుచారయందు కేంద్రమున ధర్మచక్ర ప్రతిరూపమగు చక్రము, లేత నీలిరంగున అమరియుండును: సారనాథ్‌లోని అశోక స్తంభపు ఫలకముపై కన్పట్టు ధర్మచక్రపు రూపరేఖ ఈ చక్రమున అనుసరింపబడినది. దాని వ్యాసము, తెలుపు అడ్డుచారయొక్క వెడల్పునకు దాదాపుగ సరిపోయి ఉండును. చక్రమున దళముల సంఖ్య 24. ఈ జాతీయ పతాక రూపము జులై 22, 1947 న భారత రాజ్యాంగ విధానసభచేత ఆమోదితమైనది.

**జాతీయ గీతము :** విశ్వకవి రవీంద్రనాథ టాగూరుచేత రచింపబడిన 'జన గణ మన' గీతము జాతీయ గీతముగ, రాజ్యాంగ విధాన సభవలన, 24 జనవరి, 1950 న ఆమోదితమైనది. ఈ గీతము, కలకత్తాలో 27 డిసెంబరు, 1911 న, భారత జాతీయ కాంగ్రెస్ మహా సభయందు తొలుత పాడబడినది. మొత్తపు గీతమున అయిదు గేయ చరణములు ఉన్నను, అందు తొలుతటిది మాత్రమే జాతీయ గీతముగ ఆమోదితము. దాని మూలమును, అందులకు తెలుగు అనువాదమును ఈ దిగువ ఈయబడినవి :

| మూలము | తెలుగు అనువాదము |
|---|---|
| జన గణ మన అధినాయక – జయహే<br>భారత భాగ్య విధాతా | ప్రజానీకపు తలపులను రూపొందించు అధినేతా, భారత భవితవ్యమును తీర్చిదిద్దు సృష్టికర్తా ! నీకు జయము. |
| పంజాబ సింధు గుజరాత మరాటా<br>ద్రావిడ ఉత్కల వంగా | పంజాబ్, సింధు, గుజరాత్, మహారాష్ట్ర, ద్రావిడ, ఒరిస్సా, వంగ రాష్ట్రములవారి హృదయములను నీ నామము ఉత్తేజ పరచును. |

వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్చల జలధి తరంగా
తవ శుభ నామే జాగే

వింధ్య హిమాచలములు నీ నామమును ప్రతిధ్వనింప జేయును; యమునా గంగల గాన లహరిలో ఆ నామము మిళితమగును; హిందూ మహాసముద్ర తరంగములు ఆ నామమును జపించును.

తవశుభ ఆశిష మాగే
గాహే తవ జయగాథా

అవి నీ ఆశీసులను అర్థించును; నీ విజయ గాథల గానము చేయును.

జనగణ మంగళ దాయక జయహే
భారత భాగ్య విధాతా

భారత ప్రజానీకమునకు శుభములను చేకూర్చి, భారతదేశపు భవితవ్యమును తీర్చిదిద్దు నీకు జయము.

జయహే, జయహే, జయహే
జయ జయ జయ, జయహే

జయము, జయము, జయము, జయము నీకు జయము.

పై జాతీయ గీతముతో, చారిత్రకముగ సమానముగ ఆదరణ ఆర్జించినది 'వందే మాతరం' గీతము. బంకించంద్ర ఛటర్జీ దానిని రచించెను. స్వాతంత్ర్య సంగ్రామ కాలమున స్వాతంత్ర్య వీరులకు ఉత్తేజనమును కల్గించినది ఆ గీతము. 1896 లో, అఖిల భారత జాతీయ కాంగ్రెస్ మహాసభా సమావేశమున తొలుతగ అది పాడబడినది. ఆ గీతమున పెక్కు చరణములు ఉన్నను తొలుతటి చరణము మాత్రమే సాధికారముగ ఆదరితమైనది. దాని మూలమును తెలుగు అనువాదమును దిగువ ఈయబడినది.

మూలము

వందే మాతరమ్
సుజలాం సుఫలాం మలయిజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం
శుభ్ర జ్యోత్స్నా పులకిత యామినీం,
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీమ్
సుహాసినీం సుమధుర భాషిణీమ్
సుఖదాం వరదాం
మాతరమ్

తెలుగు అనువాదము

మాతృదేవీ, నీకు నమస్కృతి
మంచి జలమును, మంచి ఫలములను, మలయమారుతపు చల్లదనమును, పైరు పంటల ముదురు పసిమిని కలిగిన నీకు మాతృమూర్తీ!
కళంక రహితపు వెన్నెలలచే గగుర్పాటొందు రాత్రులచేతను వికసించిన పూలుగల చెట్లచేతను శోభిల్లుదానవై చల్లని చిరునవ్వును, కమ్మని తీయని మాటలను గలిగి, సుఖమునిచ్చి వరములొసగు మాతృమూర్తీ!

**నాణెము :** రూపాయి; ఇది 100 పైసలుగ విభక్తము (ఈ దశాంశ పద్ధతి 1957 నుండి అమలులోనికి వచ్చినది). రూపాయికి యునైటెడ్ కింగ్‌డమ్‌యొక్క పౌనుతో తొలుత సంబంధము ఉండి, దాని ద్వారానే, దాని వినిమయపు నిలువ నిశ్చితమయ్యేడిది. కాని 1974 లో, తక్కిన కొన్ని ప్రముఖ దేశముల నాణెములతోపాటుగ పౌను సైతము తన ప్రతిపత్తిని కోల్పోగా, భారతదేశము రూపాయికి పౌనుతోగల సంబంధమునకు స్వస్తి చెప్పినది. తదాదిగ పౌను–రూపాయల మధ్య

వినిమయ విలువ కాలానుగుణముగ మార్పులను పొందుచున్నది. యు. స్టే. దేశపు డాలరుతో సాధికారపు వినిమయపు రేటు ఒక డాలరు =రు. 7.50; దీనిని అనుసరించియే భారతదేశపు రూపాయికి ఆ యా విభిన్న దేశముల నాణెములతో వినిమయపు విలువలు ఈ గ్రంథమున తెలుపబడినవి. లోహపు నాణెముల రూపమున 1, 2, 3, 5, 10, 25, 50 పైసలకు చెందినవియు, రూపాయ నాణెములును చలామణిలో ఉన్నవి; ఇక కరెన్సీ రూపమున 1, 2, 5, 10, 20, 50, 100, 1000 రూపాయల నోట్లు వాడుకయందు కలవు.

**కొలతూకములు :** మెట్రిక్ విధానపు కొలతూకములు 1958 నుండి అమలులోనికి వచ్చినవి. అంతకు పూర్వమున బ్రిటిష్ విధానపు కొలతూకములును, కొన్ని సాంప్రదాయికములు స్థానికములునగు కొలతూకములును ఆదరితములై ఉండెడివి. ఈ మెట్రిక్ విధానమే అంతర్జాతీయ విధానమనియు వ్యవహరింపబడుచున్నది. 1954 లో వివిధ రాజ్యముల ప్రతినిధులవలన ఆమోదితమగు తీర్మానములను అనుసరించి నిడివి, బరువు, కాలము, ఉష్ణత అనువానికి క్రమముగ మీటరు, కిలోగ్రామ్, సెకండు, సెల్సియస్ (సెంటిగ్రేడ్) లేదా కెల్విన్ డిగ్రీ - అనునవి ప్రాతిపదిక ఏకాంక మానములుగ గ్రహింపబడినవి. ఈ మానములనే భారతదేశము అనుసరించుచున్నను, ఉష్ణతా మాపకములకు సంబంధించినంతవరకు - అందును ముఖ్యముగ వైద్యులుపయోగించు థర్మామీటరుల విషయమున - ఫారెన్ హీట్ డిగ్రీల కాలమానము దేశమున కొంత వ్యాప్తియందు ఉన్నది. దీనిని నిరోధించి సెల్సియస్ డిగ్రీలతోనే వైద్యుల థర్మా మీటరులనుకూడ రూపొందింపజేయుటకు ప్రభుత్వము ప్రస్తుతమున ఏర్పాటులను చేసినది. పత్ర వ్యవహారములందును ప్రభుత్వ పత్రములందును మెట్రిక్ విధానమే అనుసరింపబడుచున్నను, ప్రజలలో పలు ప్రాంతములందు పూర్వపు బ్రిటిష్ విధానపు అడుగులు, గజములు, ఎకరములు వాడుకయందున్నవి; అయినను క్రమేణ వాని ప్రసక్తి తగ్గిపోవుచున్నది.

**కాలగణన :** సంవత్సరముల గణనలో, బ్రిటిష్ వారి పరిపాలనా కాలమున నుండియు వాడుకలో ఉండిన క్రైస్తవ శక సంవత్సరముల లెక్కింపే, స్వతంత్ర భారతమున సైతము వాడుకయందు ఉన్నది; కాని, ప్రభుత్వము నియమించిన పంచాంగ సంస్కరణల కమిటీ ఇచ్చిన సలహాను అనుసరించి శకాబ్దములను అనుసరించుటకు భారత ప్రభుత్వము నిర్ణయించి, ఆ గణనమును అమలులోనికి తెచ్చినది (1957). ఈ శకాబ్ది గణనలో తొలుతటి సంవత్సరము క్రీ. శ. 78 లో మొదలైనది. అందువలన క్రైస్తవ శకాబ్దిలో 78 ని త్రోసివేయగా శకాబ్దము లభించును; శక సంవత్సరాది, క్రైస్తవశక సంవత్సరపు మార్చి 22 నకు సరిపోవును. లీపు సంవత్సరమున మాత్రము మార్చి 21 కి సరికుదురును. చైత్రము మొదలుగ ఫాల్గుణము వరకుఉన్న చాంద్రమానపు 12 నెలలే, ఈ శక సంవత్సరమున తగు మార్పులతో, సౌరమానపు మాసములుగ ఆ పేరులతోనే ఉంచబడినవి. అయినను ఈ శకాబ్ద గణనతో పాటుగ, క్రైస్తవ శకాబ్దపు తేదీకూడ ప్రభుత్వ పత్రములందు విధిగ పేర్కొనబడుచున్నది. కాని ప్రభుత్వ వ్యవహారములందుతప్ప తక్కిన రంగములందు ఎచటను శకాబ్దగణన వ్యాప్తిని పొందకున్నది.

దినగతిలో సూర్యుడు 82°30′ తులారేఖపై నిట్టనిలువుగఉన్న సమయమును మధ్యాహ్నము 12 గంటలుగ భారత ప్రభుత్వము గుర్తించి, తదనుగుణముగ ప్రామాణిక కాలమును నిర్ణయించినది. ఈ తులారేఖ, భారత ఖండమునకు దాదాపుగ మధ్యగ, ఉత్తర దక్షిణములకు అమరినందున, ఈ ప్రామాణిక కాలము, స్థానిక కాలములతో రమా

రమిగ సరికుదిరియున్నది. స్థానిక, ప్రామాణిక కాలములమధ్య వ్యత్యాసము ఎచటను ఒక గంటను మించదు. భారత దేశమున సా. 5 గం. 30 నిమిషము లైనపుడు, వివిధ దేశములందు ఉండగల కాలగతి, ఆ యా దేశముల విషయ కథన సందర్భమున తెలుపబడినది. భారతదేశమున మధ్యాహ్నము 12 గం. అయినపుడు తక్కిన కొన్ని ప్రపంచ ప్రముఖ దేశముల రాజధానులలో కాలగణన ఈ దిగువ రీతిగ ఉండును: వాషింగ్‌టన్ (యు. స్టే.) ఉ. 1 గం. 30 ని.; లండన్ ఉ. 6 గం. 30 ని,; మాస్కో (సోవియెట్ యూనియన్) ఉ. 9 గం. 30 ని.; టెహెరాన్ (ఇరాన్) ఉ. 10 గం.; జకర్తా (ఇండోనీసియా) సా. 2 గం.; టోక్యో (జపాన్) సా. 3 గం. 30 ని.

## 1. ఉనికి - విస్తృతి - భూతలరీతి

అత్యంత ప్రాచీన నాగరికతలకు జన్మస్థలము లగు భూములలో ఒకటిగ పేరొందిన ఈ ప్రాచీన దేశము, దేశపు రాజ్యాంగమున భారత్, ఇండియా అను రెండు పేరులతో పేర్కొనబడినది; ఇవిగాక హింద్, హిందూస్తాన్ అను పేరులును వ్యాప్తిలో ఉన్నవి. ఉనికినిబట్టి పూర్వార్ధగోళమున ఈ దేశము ఒక ప్రత్యేక కీలక స్థానమున ఉన్నది.

హిమాలయ పర్వతములందలి వర్షపాత విభజన రేఖవలన తక్కిన ఆసియానుండి నిర్దిష్టరీతిలో వేరుపరుపబడిన భారత ఉపఖండమునందు పాకిస్తాన్, నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్‌లుగాక, మిగిలిన భూభాగమంతయు భారతదేశమునకే చెందియున్నది. ఈ భూతలము ఉత్తరమునుండి దక్షిణమునకు విస్తరించుటలో కర్కాటకరేఖ మొదలుగ క్రమముగ సన్నగిలి, హిందూమహా సముద్రములోనికి చొచ్చుకొని పోవుటవలన, దేశపు దక్షిణ భాగము ద్వీపకల్పముగ రూపుగొనినది. ఈ ద్వీపకల్పమునకు తూర్పున బంగాళాఖాతము, పశ్చిమమున అరేబియా సముద్రము కలవు. మొత్తముమీద ఈ దేశము ఉ. అక్షాంశ రేఖలలో 8°4′ నుండి 37°6′ వరకును, తూ. తులారేఖలలో 68°7′ నుండి 97°25′ వరకును విస్తరించి యున్నదని చెప్పవచ్చును.

దేశపు వాయవ్య ప్రాంతమున నెలకొన్న కాశ్మీర్ రాష్ట్రమునకు ఉత్తర సరిహద్దుగ ముజ్‌తఘ్, అఘిల్, క్విన్‌లూన్ పర్వత శ్రేణులు ఉన్నవి. తక్కిన దేశపు ఉత్తర భాగమున క్రమముగ పడమటినుండి తూర్పునకు టిబెత్, నేపాల్, టిబెత్ మధ్యభాగము, భూటాన్, టిబెత్ తూర్పుభాగము సరిహద్దున కలవు. దేశపు తూర్పు సరిహద్దున కొంతవరకు బంగ్లాదేశ్ ఉన్నను, ఆ బంగ్లాదేశ్‌ను భారతదేశమునకు చెందిన అస్సామ్, మేఘాలయ, త్రిపుర, మిజోరామ్ ప్రాంతములు వలగొని ఉన్నవి. ఇటుల బంగ్లాదేశ్‌ను వలగొనిన భారత భూమికి తూర్పు సరిహద్దున బర్మాదేశము ఉన్నది. భారతదేశమునకు పశ్చిమ వాయవ్యములందు పాకిస్తాన్, అఫ్ఘనిస్తానులు క్రమముగ సరిహద్దులందు ఉన్నవి. దక్షిణపు చివరన మన్నార్ సింధుశాఖయు, పాక్ జలసంధియు ఈ దేశమును శ్రీలంకనుండి వేరుచేయుచున్నవి. ఉత్తరమునుండి దక్షిణమునకు దేశభూభాగపు గరిష్ఠపు నిడివి 3,214 కిమీ.; తూర్పు-పడమరల గరిష్ఠపు కొలత 2,933 కిమీ. దేశపు భూతలపు సరిహద్దు నిడివి 15,200 కిమీ.; తీరరేఖ పొడవు 6,083 కిమీ. బంగాళా ఖాతమున ఉన్న అందమాన్-నికోబార్ దీవులును, అరేబియా సముద్రమునందున్న లక్షద్వీపములును రాజ్యాంగ రీత్యా ఈ దేశమున అంతర్భాగములు. వీని అన్నింటితో కలసి దేశపు మొత్తపు వైశాల్యము 32,87,783 చ. కిమీ. (జులై 1, 1971 నాటి తాత్కాలికపు గణనకు సిక్కిం విస్తృతిని కలుపగా లభించినది).

దేశపు ముఖ్యభూభాగము మూడు నిర్దిష్ట ప్రాంతములుగ - 1. హిమాలయ ప్రాంతము, 2. గంగా

# భారతదేశము
## (నైసర్గిక స్వరూపము)

ఇండియా

గుజరాత్

అహమ్మదాబాద్

ఢిల్లీ

మథుర

బొంబాయి

నర్మదా

తపతి

గంగా

కలకత్తా

రామగుండం

సింగరేణి

మచిలీపట్టణం

నెల్లూరు

మద్రాస్

కోయంబత్తూరు

మధుర

అరేబియా సముద్రము

బంగాళాఖాతము

హిందూ మహా సముద్రము



The territorial waters of India extend into the sea to a distance of twelve nautical miles measured from the appropriate base line.



Courtsy: Andhra Pradesh Sahitya Akademi.

సింధు మైదానము, 3. దక్షిణ పీఠభూమి అను మూడు ప్రాంతములుగ – విభజింపదగి ఉన్నది. హిమాలయ పర్వతములందు మూడు పర్వత శ్రేణులు దాదాపుగ సమాంతరరీతిలో తూర్పు పడమరలకు వ్యాపించి ఉన్నవి. ఈ పర్వతసీమలందు అటనట పీఠభూములును, లోయలును కన్పట్టును. ఈ లోయలలో కాశ్మీర్‌లోయ, కూలూ లోయవంటివి అతి విస్తృతములుగను, అత్యంత సారవంతములుగను ఉండుటయేగాక ప్రకృతి దృశ్య రమణీయతకు విశ్వవిఖ్యాతిని ఆర్జించినవి. ప్రపంచపు అత్యున్నత పర్వత శిఖరములలో లెక్కకువచ్చు శిఖరములు ఇందు కలవు. వానిలో గాడ్‌విన్ ఆస్టిన్ (8,611 మీ.), కాంచనగంగ (8,584 మీ.), నందదేవి (7,816 మీ.), త్రిశూల్ (7,120 మీ.), బదరీనాథ్ (7,068 మీ.), ద్రోణగిరి (7,066 మీ.) పేర్కొనదగినవి. ఈ హిమాలయ పర్వతసీమ అత్యున్నతము, చాలవరకు హిమావృతము అగుట వలన దీనిగుండా పయనించుట చాల కష్టము. ఈ పర్వతసీమను దాటి ఆవలికి పయనించుటకు, కొన్ని కనుమలద్వారా మాత్రమే, అతి కష్టముమీద, సాధ్యమగుచున్నది. అట్టి కనుమలలో జీప్ లా, నాతూ లా, షిప్‌కీ లా అనునవి ప్రముఖములు. ఇందు తొలుతటివి రెండును డార్జిలింగునకు ఈశాన్యమున చుంబీ లోయగుండ పోవుచున్నవి. తిబెత్ – ఇండియాల మధ్య వ్యాపార వ్యవహారములకు ఇవి ఉపకరించును; సట్లెజ్ లోయలో కల్పాకు ఈశాన్యమున షిప్‌కీ లా కనుమ ఉన్నది. హిమాలయముల మొత్తపు నిడివి 2,400 కిమీ. ఆ పర్వత కుడ్యపు వెడల్పు 240 కిమీ. నుండి 320 కిమీ. వరకు మారుచున్నది. తూర్పున ఇండియా – బర్మాల మధ్యను, ఇండియా – బంగ్లాదేశ్‌లమధ్యను ఉన్న పర్వత శ్రేణులు ఎత్తున చాల చిన్నవి. అట తూర్పు–పడమరలకు పయనించు గారో, ఖాసీ, జయంతియా, నాగా కొండలు, ఉత్తర దక్షిణములకు వ్యాపించు లుషాహీ, ఆరకాన్ కొండల వరుసలతో కలయుచున్నవి.

గంగా సింధుమైదానపు తూర్పు – పడమరల నిడివి దాదాపు 2,400 కిమీ.; వెడల్పు రమారమిగ 240 కిమీ. నుండి 320 కిమీ. వరకు మారుచున్నది. గంగా, సింధు, బ్రహ్మపుత్రానదీ మండలముల వెల్లువలచేత రూపుగొనినది ఈ మైదానము. ప్రపంచపు అతి విస్తారపు ఒండ్రుమట్టి మైదానములలో ఒకటిగనేగాక అత్యంత జనసాంద్రతకు పేరొందిన ప్రాంతములలో ఒకటిగ సైతము ఈ మైదానము పేరుగన్నది. కొండలుగాని గుట్టలుగాని ఎచటను ఏమియు అంతగ ఇట కన్పట్టక మైదానమంతయు దాదాపుగ ఒకేఒక చదునునేలగ రూపుగొని ఉన్నది. ఢిల్లీ దగ్గరనున్న యమునా తీరభూమికిని, గంగా–సాగర సంగమపు బంగాళాఖాత తీరభూమికిని మధ్యనున్న దూరము దాదాపు 1,600 కిమీ. కాని ఈ మైదాన ప్రాంతముల రెండింటిమధ్య ఎత్తున భేదము 200 మీ. మాత్రమే.

దక్షిణపు ద్వీపకల్పము దాదాపుగ అంతయు ఒక పీఠభూమి. ఉత్తరపు గంగా – సింధు మైదానమునుండి, ఈ ద్వీపకల్ప పీఠభూమిని కొన్ని పర్వత శ్రేణులును, కొండల వరుసలును వేరుచేయుచున్నవి. వానిలో ఆరావళీ, వింధ్య, సాత్పురా, మేఖలా, అజంతా శ్రేణులు పేర్కొనదగినవి. పీఠభూమికి తూర్పు పడమర కొన అంచులందు తూర్పు కనుమలు, పడమర కనుమలు (సహ్యాద్రి) క్రమముగ కలవు. తూర్పు కనుమల సరాసరి ఎత్తు 610 మీ.; కాని పడమటి కనుమలలో ప్రదేశములను అనుసరించి ఎత్తు 915 మీ. నుండి 1,220 మీ. వరకు మారుచున్నది. పీఠభూమియొక్క దక్షిణపు కొనన తూర్పు, పడమటి కనుమలు నీలగిరివద్ద కలియుచున్నవి. పడమటి కనుమలకును అరేబియా సముద్రమునకును మధ్య సన్నని చీలికవంటి తీర

మైదానము కలదు; తూర్పు కనుమలకును బంగాళా ఖాతమునకును మధ్యఉన్న తీరమైదానము మాత్రము కొంత ఎక్కువ వెడల్పును కలిగియున్నది.

దేశమునందలి నదులను నాలుగు వర్గములుగ - i. హిమాలయ వర్గము, ii. దక్కన్ వర్గము, iii. తీరవర్గము, iv. దేశాంతర్గత వర్గము. అను రీతిగ - విభజింపవచ్చును. హిమాలయ నదీ వర్గమునకు జలము వానకాలమున వర్షముల వలననేగాక ఎండకాలమున మంచు కరగుటవలనకూడ లభించును; అందువలన వానియందు జలప్రవాహము సంవత్సరము పొడవున, కొలది ప్రమాణపు మార్పులతో, నిరంతరాయముగ సాగుచుండును. మధ్య భారతమున జన్మించి ఉత్తరమునకు ప్రవహించి గంగా, యమునలలో చేరు నదులును, సౌకర్యమునకై, ఈ వర్గములోనే చేర్చబడుచున్నవి. ఈ వర్గమునకు చెందినవానిలో గంగా, సింధు, బ్రహ్మపుత్రా నదులు ప్రముఖములు. వీనిలో గంగానది దాదాపుగ భారతదేశముననే ప్రవహించుచున్నదని చెప్పవచ్చును. ఉన్నత హిమాలయములలో గంగోత్రి అనబడుచోట భాగీరథి అను పేరుతో ఈ నది జన్మించి, దేవ ప్రయాగవద్ద అలకనందతో సంగమించి గంగయను పేరును గ్రహించును. అటనుండి హిమాలయపు లోయలనుదాటి, హరిద్వారము వద్ద మైదానమును చేరుకొని ఈ నది తొలుత దక్షిణమునకు కొంతవరకు పయనించి, అటనుండి ఆగ్నేయమునకు తిరిగి తన ప్రవాహగతిని సాగించి ఫరక్కాను చేరుకొనును. హరిద్వారమునుండి ఫరక్కా వరకు సాగించు ఈ నదీగతిలో రామగంగా యమునా, తోన్స్, చంబల్, గోమతీ, సోన్, గోగ్రా, గండకీ, బేత్వా, బుర్హి గండకీ, బాగ్మతీ, కోసీ నదులును, మరికొన్ని చిన్న నదులును అటనట వచ్చిచేరి జలసంపదను విశేషముగ సమకూర్చును. ఫరక్కా వద్దనుండి ఈ నదియొక్క డెల్టా ఆరంభమై నది బహు శాఖలుగ చీలును; ఈ శాఖలలో ఒకటి బంగ్లాదేశ్‌కు పోవగా, తక్కిన భాగము భారతదేశముననే దక్షిణమునకు పయనించి, కలకత్తాకు దిగువన బంగాళాఖాతమున చేరును. మొత్తముమీద ఈ నదియు, దాని ఉపనదులును, భారతదేశమున హిమాచల ప్రదేశ్, పంజాబ్, ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్, ఢిల్లీ, బీహార్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రములకు చెందిన ప్రాంతములద్వారా జలమును కొనివచ్చుచున్నవి.

సింధునది ఎగువ భాగమునకు చెందిన కొన్ని ఉపనదులు మాత్రమే భారత దేశమున ఉన్నవి; తక్కిన ఉపనదులును, సింధునది దిగువ భాగమును పాకిస్తాన్‌లో ప్రవహించును; ఆ నది పాకిస్తాన్‌న దక్షిణ తీరమున అరేబియా సముద్రములలో చేరుచున్నది. సింధునదికి ఉపనదులగు జీలం, రావి, చీనాబ్, బియాస్, సట్లెజ్ నదులు - జమ్మూకాశ్మీర్, పంజాబ్, హిమాచల ప్రదేశముల భూములలో ప్రవహించుచున్నవి.

బ్రహ్మపుత్రా నదియందు ఎగువ భాగము టిబెట్‌నను, మధ్యభాగము భారతదేశమునను, చివరి భాగము బంగ్లాదేశమునను ప్రవహించుచున్నవి. భారతదేశమునందలి అస్సామున ప్రవహించునపుడు, అస్సామ్ పశ్చిమ బెంగాల్‌లలోని బారక్, తీస్తా, తోర్సా, రైదక్ నదులు ఈ బ్రహ్మపుత్రలో చేరుచున్నవి. కడకు ఈ నది బంగ్లాదేశ్‌న, గంగా నదికి తూర్పు శాఖయగు పద్మానదితోచేరి, కొలది దూరము ప్రవహించి బంగాళా ఖాతమున చేరును.

రెండవదియగు దక్కన్ వర్గమునకు చెందిన నదులు అన్నియు వర్షాధారములు; వీనిలో కొన్ని ప్రముఖములగు వానియందు సైతము, ఎండకాలమున నీటి ప్రవాహము చాల సన్నబడియుండును; కొన్నింట నీరే ఉండదు. ఇందలి నదులలో మహానది, దామోదర్, గోదావరి, కృష్ణా, పెన్న, కావేరి,

నర్మదా, తపతీ నదులు ప్రముఖములు. వీనిలో గోదావరీ, కృష్ణా, కావేరి, పెన్నా నదులు పడమటి కనుమలలో జన్మించి పీఠభూమికి అడ్డముగను, తూర్పు తీరపు మైదానముననుప్రవహించి బంగాళా ఖాతములో చేరుచున్నవి. మహానదియు, దామోదర్ నదియు పీఠభూమియందు వాయవ్యదిశన జన్మించి తూర్పునకు ప్రవహించి బంగాళాఖాతమున సంగమించుచున్నవి. నర్మదయు, తపతియు పీఠభూమి యొక్క ఉత్తరపు కడయందున పడమటిదిశగా ప్రవహించి, తుదకు (అరేబియా సముద్రాంతర్భాగమగు) కచ్చి సింధుశాఖలో కలయుచున్నవి.

ఇక మూడవ వర్గపు నదులలో, పడమటి కనుమలందు జన్మించి, పశ్చిమమునకు ప్రవహించి, అరేబియా సముద్రమున చేరు శరావతి, నేత్రవతి, భరతపూండ్ల, పంబానదులును; తూర్పు కనుమలలో మహేంద్రగిరి మొదలగు చోటుల జన్మించి తూర్పునకు ప్రవహించి బంగాళా ఖాతమున చేరు వంశధార, నాగావళీ నదులును పేర్కొనదగినవి. ఇవి అన్నియు చాల చిన్న నదులు.

నాలుగవ వర్గమునకు చెందిన దేశాంతస్థపు నదులు పశ్చిమ రాజస్థాన్‌లో మాత్రమే కననగుచున్నవి. ఇవి కడవరకు ప్రవహించునవి కావు; నీటి ప్రవాహము, వానకాలమున మాత్రమే కన్పట్టును; ఆ ప్రవాహము సైతము కొంత దూరము పోయి థార్ ఎడారి చేరిన తరువాత నీటిలో ఇంకి అటనుండి నదియే కనబడకుండపోవును; ఇందులో కొన్ని, దేశాంతస్థములగు సంభార్ సరస్సువంటి ఉప్పునీటి మడుగులలో కలయుచున్నవి. వీనిలో లూనీ అనునది ఒక్కటి మాత్రమే ఎటులనో కడవరకు పయనించి, కచ్చి బురదమడుగు (కచ్చిరాన్) లో చేరుచున్నది.

నదీలోయల విస్తృతిని లెక్కలోనికి తీసికొనినపుడు గంగానదీ లోయ ప్రప్రథమముగ పేర్కొనదగినది; తరువాత గోదావరి, కృష్ణా, మహానది, నర్మదానదీ లోయలు క్రమగతిలో లెక్కకు వచ్చుచున్నవి.

## 2. శీతోష్ణ పరిస్థితి - వర్షపాతము - వృక్షజంతు సంతతి

దేశమున సాంప్రదాయికముగ సంవత్సరమున ఆరు ఋతువులు ఉన్నటుల పరిగణనఉన్నను, అనుభవమున దేశపు మొత్తమున నాలుగు ఋతువులు మాత్రమే వేద్యములగుచున్నవని వాతావరణ శాస్త్రజ్ఞుల అభిప్రాయము వీనిని i. గ్రీష్మర్తువు, (మార్చి-మే); ii. వర్షర్తువు, ఇది నైఋతి ఋతుపవన కాలము (జూన్ - సెప్టెంబరు); iii. వర్షానంతర ఋతువు, ఇదే ఈశాన్య ఋతుపవన కాలముగ పీఠభూమిలో దక్షిణ భాగమున, వేద్యమగు చున్నది (అక్టోబరు - నవంబర్); iv. శీతర్తువు (డిసెంబరు - ఫిబ్రవరి) - అని పేర్కొనవచ్చును.

విశాలమగు ఈ దేశమున ప్రాంతములను అనుసరించి, ఒకే కాలమున విభిన్నరీతుల ఉష్ణోగ్రతలు కననగుచున్నవి. మద్రాసు తీరప్రాంతము (కొరమాండల్ లేదా చోళతీరము) నను, మలబారు తీరమునను, గంగాసాగర సంగమ ప్రాంతభూమియందును ఉష్ణమండల శీతోష్ణతలు కననగుచున్నవి; ఇచటి గాలిలో చెమ్మదనము ఎక్కువ. పీఠభూమిలో అత్యధిక భాగమునను, గంగా బ్రహ్మపుత్రా నదులను ఆశ్రయించిన నిమ్నభూములందును తేమగల ఉపోష్ణమండల పరిస్థితులు మొదలుకొని సమోష్ణ పరిస్థితివరకు కాననగుచున్నవి. ఇక అతి పశ్చిమమున అరగొర వర్షపాతపు శాద్వల (గరికపట్టుల) భూములందును, ఎడారియందును ఉపోష్ణ మండల పరిస్థితినుండి సమోష్ణమండల పరిస్థితులవరకు గమనింపనగును. ఉత్తరపు పర్వత సీమలలో, ఎత్తు మార్పులను అనుసరించి నిరార్ద్రపు ధ్రువ ప్రాంత శీతోష్ణత అనుభవవేద్య మగుచున్నది.

పై కారణముల వలన దేశమునకు అంతటికిగాని, లేదా ఒక విశాల భౌగోళిక ప్రాంతమునకుగాని ఒక నిర్దిష్ట రీతిలో సగటు సాలీనా శీతోష్ణతలను, గరిష్ఠ, కనిష్ఠ ఉష్ణతా ప్రమాణములను నిర్ణయించుట శక్యముకాదు. కాని ఎండకాలమున, అందును మే నెలలో కొన్ని దినములందు ఉత్తర ప్రాంత మైదానములలో ఎడనెడ నీడయందు సైతము 120° ఫా. (49°c.) వరకును, పీఠభూమి తూర్పు కడఅంచున కొన్ని తావులందు 115° ఫా. (46 సెం.) వరకును ఉష్ణోగ్రత పోవుట కలదు. అపుడు వడదెబ్బకు పలువురు మరణించుచుందురు. కాని సర్వసాధారణముగ సగటున మే నెలలో ఉత్తరప్రాంత మైదానములందు మే నెలలో 91.4° ఫా. (33° సెం.) ఉష్ణోగ్రత కలదు. దక్షిణ పీఠభూమియందు ఆ కాలమున ఉష్ణోగ్రత దరిదాపుగ 90.5° ఫా. (32.5° సెం.) ఉండును; తీరమైదానములందు 86° ఫా. (30° సెం.); పీఠభూమిలోని అత్యున్నత పర్వత ప్రాంతములందును, హిమాలయ సానువులందును 62° ఫా. (16.5° సెం.) ఉండును. దినసరి గరిష్ఠ, కనిష్ఠ ఉష్ణోత్రతలమధ్య కేరళ ప్రాంతమున విభేదము 4° ఫా. నుండి 5° ఫా. వరకు మాత్రమే ఉండగా ఆ విభేదము రాజస్థాన్‌లో 38° ఫా. వరకు పోవుచున్నది. నవంబరు నుండి ఫిబ్రవరి వరకు మంచుబాధ ఉత్తరదేశమున విరివిగ కలదు. ఇట్టి విపరీత వ్యత్యాసములు కలిగిన ఈ దేశమున వివిధ దిశలందున్న పలు ప్రముఖ స్థలములందలి నెలవారీ సగటు ఉష్ణోగ్రతలు ప్రక్క పుటలోని పట్టిక I వలన తెలియనగును.

దేశమున వర్షపాతము నిర్ణీత రీతిలో ఉండుట లేదు; పడిన వర్షమైనను అన్ని చోటుల ఒక రీతిగ ఉండదు. ఈ మార్పు స్థలములను అనుసరించియే గాదు; ఒకే స్థలమున ఒక సంవత్సరము ఉండిన వర్షపాతరీతి వేరొక సంవత్సరమున ఉండదు. అయితే మొత్తముమీద సర్వసాధారణంగా పశ్చిమ తీరము, అస్సాము, బెంగాలు లందు సాలీనా వర్షపాతము ఎక్కువ అని చెప్పవచ్చును. సాధారణంగా అట వర్షపాతం సాలున 200 సెం. మీ. కు పైబడి ఉండును. బొంబాయి, మధ్య బీహారులలో ఆ సాలుసరి వర్షపాతము 90 సెం. మీ. నుండి 200 సెం. మీ. వరకు మారుచుండును. పీఠభూమి యందు 70 సెం. మీ. నుండి 140 సెం.మీ. వరకును; మద్రాసు, ఆంధ్ర తీరము లందును, గంగా-సింధు మైదానములందును 50 సెం. మీ. నుండి 100 సెం. మీ. వరకును సాలుసరి వర్షపాతము మారుచుండును. రాజస్తాన్‌తోని ఎడారి యందును, కాశ్మీరులోని లడక్ పీఠభూమి యందును వర్షము నామమాత్రముగనే ఉండును.

వర్షపాతము ఇంత వ్యత్యస్తరీతిలో ఉన్నను, ప్రపంచమున విపరీతమగు వర్షపాతమునకు పేరొందిన స్థలములును ఈ దేశమున కలవు. మేఘాలయ రాష్ట్రమందలి చిరపుంజిలో సంవత్సరమున 1080 సెం. మీ. వర్షము పడుట సర్వసాధారణ విషయము. భారతదేశమున అత్యధిక వర్షపాతము ఇటనే కలదు.

దేశమున వర్షపాతమునకు ఋతుపవనములే ఆధారములు. ఇందులో నైరుతి ఋతుపవనము వలన మాత్రమే దేశమున అత్యధిక భాగమునకు వర్షము లభించుచున్నది. నైరుతి ఋతుపవనములు అంతరించిన తరువాత ఈశాన్య ఋతుపవనము ఆరంభమగును. నైరుతి ఋతుపవనముతో పోల్చినపుడు ఈశాన్య ఋతుపవనపు కాలవ్యవధి చాల తక్కువ. అది దేశమున కొలది ప్రాంతములలో మాత్రమే వర్షపాతమునకు ఉపకరించుచున్నది. అయినను ముఖ్యంగా తమిళనాడునకును, ఆంధ్ర ప్రదేశ్ లోని కోస్తా ప్రాంతమునకును ఇదియే చాల వరకు వర్షపాతమునకు ఆధారము.

**పట్టిక I**

**భారతదేశమున విభిన్న స్థలములలో నెలసరి సగటు ఉష్ణోగ్రత (సెం. డిగ్రీ.)**

| వరుస సంఖ్య | స్థలము పేరు | భూమి ఉన్నతి మీ. | జనవరి | ఫిబ్ర. | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | జులై | ఆగస్టు | సెప్టెం. | అక్టో. | నవం. | డిసెం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆగ్రా | 169 | 14.8 | 18.0 | 23.8 | 29.7 | 34.5 | 35.0 | 30.9 | 29.3 | 28.9 | 26.2 | 20.6 | 16.1 |
| 2. | ఉదక మండలము | 2,249 | 12.5 | 13.5 | 15.1 | 16.1 | 16.5 | 14.5 | 13.7 | 14.1 | 14.3 | 14.3 | 13 6 | 13.0 |
| 3. | కలకత్తా | 6 | 20.2 | 23.0 | 27.9 | 30.7 | 31.1 | 30.4 | 29.1 | 29.1 | 29 2 | 27.9 | 23.9 | 20.6 |
| 4. | గౌహతి | 54 | 17.5 | 19.5 | 23.3 | 25.9 | 26.9 | 28.1 | 28.9 | 29.0 | 28.7 | 26.3 | 22.3 | 18.7 |
| 5. | చిరపుంజి | 1,313 | 11.7 | 13.7 | 16.7 | 18.5 | 19.2 | 20.1 | 20.3 | 20.5 | 20.5 | 19.1 | 15 8 | 12.9 |
| 6. | జయపూర్ | 390 | 15.1 | 18 1 | 23.2 | 28.7 | 33.2 | 33.3 | 29.9 | 28.1 | 28.1 | 25.7 | 20.5 | 16.7 |
| 7. | డార్జిలింగ్ | 2,127 | 6.1 | 7.7 | 11.3 | 14.4 | 15.7 | 17.0 | 17.6 | 17.6 | 17.3 | 15.1 | 11.3 | 8.1 |
| 8. | త్రివేండ్రం | 64 | 26.8 | 27.3 | 28.3 | 28.7 | 28.3 | 26.5 | 26.1 | 26.3 | 26.6 | 26.7 | 26.6 | 26.7 |
| 9. | న్యూ ఢిల్లీ | 216 | 14.3 | 16.9 | 22.7 | 28.6 | 33.5 | 34.3 | 31 3 | 29.9 | 29.3 | 25.9 | 20.3 | 15 7 |
| 10. | పాట్నా | 53 | 17.3 | 19.9 | 25.7 | 30.5 | 32.5 | 31.9 | 29.8 | 29.3 | 29.3 | 27.5 | 22.5 | 18.3 |
| 11. | బొంబాయి | 11 | 24.3 | 24.9 | 26.9 | 28.7 | 30.1 | 29.1 | 27.5 | 27.1 | 27.4 | 28.3 | 27.5 | 25.9 |
| 12. | మద్రాసు | 16 | 24.5 | 25.9 | 27.9 | 30.5 | 32.7 | 32.5 | 30.7 | 30.1 | 29.7 | 28.1 | 25.9 | 24.6 |
| 13. | లక్నో | 111 | 16.1 | 18.9 | 24.6 | 30.1 | 33.9 | 33.7 | 30.1 | 29.3 | 29.1 | 26.3 | 21.0 | 16.9 |
| 14. | శ్రీనగర్ | 1,586 | 1.1 | 3.5 | 8.5 | 13.3 | 17.9 | 21.7 | 24.6 | 23.9 | 20.5 | 14.1 | 7.7 | 3.5 |
| 15. | సిమ్లా | 2,202 | 5.2 | 6.7 | 10.6 | 15.2 | 19.2 | 20.3 | 18.3 | 17.7 | 16.9 | 14.3 | 11.1 | 7.7 |
| 16. | హైద్రాబాదు | 545 | 21.6 | 23.9 | 27.4 | 30.3 | 32.5 | 29.1 | 26.1 | 25.8 | 25.7 | 25.1 | 22.3 | 20.6 |

నైరుతి ఋతుపవనము సాధారణంగా జూనునెల ఆరంభంలో పశ్చిమ తీరమున ఆరంభమగును. అయినా ఇది మొదలిడుట, నిర్ధారణగా ఒక తారీకున జరుగునని చెప్పుట చాల కష్టము. అది ఒక్కొకపుడు మే నెల మధ్యలోనే (1918) జరగవచ్చును; ఒక్కొకపుడు జూన్ నెల మధ్యలో మొదలు కావచ్చును (1915); లేదా ఈ రెండు అవధులమధ్య ఏ తేదీననైన మొదలు కావచ్చును. అక్టోబరు, నవంబరు నెలలలో తూర్పు, పడమటి తీర ప్రాంతములందు తుపానుల బాధయు, ఉప్పెనల బెడదయు అంతటంతట కలదు

ఇటుల బహు విపర్యయములకు లోనగు ఈ వర్షపాతము దేశమున వివిధ స్థలములందు ఉండు తీరు తెన్నులు నెలసరి సగటు రీతిలో ప్రక్క పుటలోని పట్టిక II యందు తెలుపబడినవి.

దేశపు మొత్తమున వర్షపాతము వలన సాలీనా, నదులందు అన్నింట కలసి 1,88,10,570 లక్షల ఘన మీటరుల నీరు ప్రవహించుచున్నదని 1960 లో కొందరు శాస్త్రజ్ఞులు జరిపిన పరిశీలనవలన తేలినది. ఇందు మూడవవంతు మాత్రమే వ్యవసాయమునకు ఉపయోగింప వసతులు కలవు.

వైవిధ్యమునకు పేరుగనిన విస్తార వృక్ష సంతతి కలిగిన కొలది దేశములలో భారత దేశము ఒకటి; దేశ భూతలము విస్తృత అక్షరేఖా పరిధిని ఆక్రమించుటయే గాదు; అందున సైతము భూతలపు ఎత్తు సముద్రపు మట్టము మొదలుకొని, ప్రపంచపు అత్యున్నత పర్వత సీమల వరకు మారుపులను పొంది ఉండుటయు, వర్షపాతమునందలి వ్యత్యస్తతలును, గాలిలోని చెమ్మదనమున కన్పట్టు ప్రాంతీయ విభేదములును ఈ వైవిధ్యమునకు దోహదకారులయినవి. 1965 న ప్రచురితమైన 'గజెటీర్ ఆఫ్ ఇండియా' లో చేయబడిన వర్గీకరణను అనుసరించి దేశమున 8 విభిన్న వృక్ష మండలములు కలవు. అవి : 1. దక్కన్, 2. మలబార్, 3. సింధు మైదానము, 4. గంగా మైదానము, 5. అస్సాం, 6. తూర్పు హిమాలయములు, 7. పశ్చిమ హిమాలయములు, 8. అండమానులు.

దక్కన్ మండలమున దక్కన్ పీఠభూమి అంతయు కలదు. విభిన్న జాతుల తాళవృక్షములు ఇట సహజరీతిలో ఎదుగును. మలబారు మండలమున పశ్చిమ తీరమును, పడమటి కనుమలును చేరి ఉన్నవి. ఇందు ఉష్ణమండల సహజములగు వృక్ష సంతతులు కలవు. ఎర్ర చందనం, నల్లమద్ది, టేకు మొదలగు గట్టి కొయ్య జాతులే కాక బండారు చెట్టువంటి మెత్తని కలప జాతులును, వివిధములగు వెదురు జాతులును కలవు. సింధు మైదానపు మండలమున కచ్, ఉత్తర గుజరాత్, రాజస్థాన్, పంజాబు మైదానములును యమునాతీర ప్రాంతములును చేరి ఉన్నవి; ఇందు సహజ వృక్ష సంతతి చాల తక్కువ, గంగా మైదానపు మండలమున యమునానది మొదలుగ బెంగాలు వరకు గల విశాల భూమియు, ఒరిస్సాయును చేరి ఉన్నవి; ఇచటి అడవులలో వైవిధ్యము ఎక్కువ; అయినను ఏరుమద్ది (సాల) వృక్షముల సంఖ్య చాల ఎక్కువ అని చెప్పవచ్చును. అస్సాం మండలమున బ్రహ్మపుత్రా, సుర్మా లోయలును, ఆ మధ్యనున్న కొండల వరుసలును చేరి ఉన్నవి. ఇచట వృక్ష సంపన్నత చాల అధికము. గడ్డి సైతము చాల ఎత్తునకు ఎదుగును; విశాల పర్ణముల వృక్షములును, దట్టములగు వెదురు పొదలును ఇట విస్తృతిముగ కననగును. తూర్పు హిమాలయ మండలమున సిక్కిం మొదలుగ తూర్పునకుగల పర్వతభూమి చేరియున్నది; ఇందు డార్జిలింగు, కుర్సియాంగ్ మొదలగు అత్యున్నత స్థలములు కలవు. పుష్పించు వృక్షజాతులు 4,000 ఇందు దాదాపుగ కలవని అంచనా; వానిలో 20 తాళజాతులును చేరి ఉన్నవి; ఈ మండలపు సమ

## పట్టిక II

### భారతదేశమున విభిన్న స్థలములలో నెలసరి సగటు వర్షపాతం (మిల్లీమీటర్లలో)

| వరుస సంఖ్య | స్థలము పేరు | జనవరి | ఫిబ్ర. | మార్చి | ఏప్రిల్ | మే | జూన్ | జులై | ఆగస్టు | సెప్టెం. | అక్టో. | నవం. | డిసెం. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఆగ్రా | 16.2 | 8.8 | 10.9 | 5.3 | 10.0 | 60.0 | 210.2 | 263.2 | 151.5 | 23.5 | 2.1 | 3.7 |
| 2. | ఉదకమండలము | 25.8 | 12.0 | 29.5 | 108.5 | 172 6 | 139.2 | 176.6 | 128.2 | 109.7 | 213.3 | 126.5 | 59.1 |
| 3. | కలకత్తా | 13.8 | 24.2 | 26.5 | 42.7 | 120.6 | 259.1 | 300.6 | 306.3 | 289.7 | 160.2 | 34.9 | 3.2 |
| 4. | గౌహతి | 11.4 | 18.3 | 53.4 | 125.9 | 273.6 | 293.4 | 301.5 | 263.0 | 190.1 | 90.1 | 11.5 | 5.0 |
| 5. | చిరపుంజి | 19.8 | 37.3 | 178.9 | 605.2 | 1,705.1 | 2,921.5 | 2,456.7 | 1,827.5 | 1,167.7 | 447.4 | 46.7 | 4.9 |
| 6. | జయపూర్ | 14.0 | 8.4 | 8.6 | 4.2 | 10.0 | 54.0 | 193.2 | 239.0 | 89.8 | 19.3 | 3.4 | 4.2 |
| 7. | డార్జిలింగ్ | 21.7 | 26.7 | 52.4 | 109.0 | 187.1 | 522.3 | 712.9 | 572.5 | 418.5 | 116.1 | 14.2 | 5.0 |
| 8. | త్రివేంద్రం | 20.1 | 20.3 | 43.5 | 122.1 | 248.6 | 331.2 | 215.4 | 164.0 | 122.9 | 271.2 | 206.9 | 73.1 |
| 9. | న్యూ ఢిల్లీ | 24.9 | 21.8 | 16.5 | 6.8 | 7.9 | 65.0 | 211.1 | 172.9 | 149.7 | 31.2 | 1.2 | 5.2 |
| 10. | పాట్నా | 21.1 | 20.2 | 6.7 | 8.2 | 28.3 | 139.0 | 265.8 | 307.1 | 242.5 | 62.8 | 5.7 | 2.4 |
| 11. | బొంబాయి | 2.0 | 1.1 | 0.4 | 2.8 | 16.0 | 520.3 | 709.5 | 439.3 | 297.0 | 88.0 | 20.6 | 2.2 |
| 12. | మద్రాసు | 23.8 | 6.8 | 15.1 | 24.7 | 51.7 | 52.6 | 83.5 | 124.3 | 118.0 | 267.0 | 308.7 | 139.1 |
| 13. | లక్నో | 23.7 | 17.2 | 9.2 | 6.4 | 11.7 | 93.9 | 299.0 | 301.8 | 181.7 | 40.3 | 1.4 | 6.1 |
| 14. | శ్రీనగర్ | 72.8 | 72.3 | 104.1 | 78.1 | 63.4 | 35 6 | 61.0 | 62.8 | 31.8 | 28.7 | 17.5 | 35.9 |
| 15. | సిమ్లా | 65.2 | 47.6 | 58.1 | 37.6 | 53.7 | 147.5 | 414.5 | 385.4 | 195.2 | 45.4 | 6.7 | 23.7 |
| 16. | హైదరాబాదు | 1.7 | 11.4 | 13.4 | 24.1 | 30.0 | 107.4 | 165.0 | 146.9 | 163.3 | 70.8 | 24.9 | 5.5 |

శీతోష్ణ ప్రాంతమున విశాల పర్ణజాతులును సూచీ పత్ర జాతులును చాలగ కనపట్టును. భూర్జ వృక్షములును, సన్న ఆకుల వృక్షములును కలవు; రెల్లు రకములును, వెదురు జాతులును విరివిగ కలవు. పశ్చిమ హిమాలయ మండలమున కుమావ్ పర్వతములును, కాశ్మీర ప్రాంతమును చేరియున్నవి; ఇందలి దిగువ ప్రాంతమున ఏరుమద్ది అడవులు విపరీతముగ కలవు; అటనట మాత్రము ఎత్తుగ పెరిగిన తృణజాతుల భూములు కన్పట్టును; ఇచటి సమోష్ణ ప్రాంతమున సూచీపత్ర వృక్షములేగాక, విశాల వర్ణజాతులును అనేకములు కలవు; ఇంకను పైకిపోగా దేవదారు పాటల వృక్షములును, బూరుగ చెట్లును కానబడును; ఆ పైది అతి శీతల (ఆల్ పైన్) ప్రాంతము; అచట బూరుగ, శ్వేతభూర్జ వృక్షములు ఎక్కువ. అండమాన్ మండలమున అండమాన్, నికోబారు దీవులు చేరియున్నవి; ఇందు తీరప్రాంత సహజములగు ఆకుపొదల చెట్లును, చిట్టడవులును; నిత్య శ్యామల, అర్ధ శ్యామల జాతుల వృక్షములును, ఆకురాల్పు తరగతి చెట్లును గలవు. మండలముతో నిమిత్తము లేకుండా, పలు తావులందు మర్రి, మామిడి, వేప, రాగి వృక్షములు కన్పట్టును.

దేశమున జంతు సంతతియు ప్రాంతీయ వైవిధ్యమునకు పేరొందినది. 500 రకముల సస్తన జాతుల జంతువులును, 2000 విధముల పక్షి జాతులును కలవని అంచనా. ఇక కీటక జాతులు 30 వేలకు పైబడి ఉన్నవి; ఇవి గాక వివిధ రీతుల మత్స్య జాతులును, సరీసృప జాతులును కలవు. సస్తన జాతులలో ఏనుగు, కారెనుము, ఖడ్గమృగము ముఖ్యముగ పేర్కొనదగిన పెద్ద జంతువులు. సింధు నాగరికతా కాలమునకు పూర్వము నుండియే భారత దేశము ఏనుగులకు సహజపు నెలవుగ ఉండినటుల నిదర్శనములు కలవు. ప్రస్తుతమున ఇవి పీఠభూమి ప్రాంతపు కొన్ని అడవులలో మాత్రమే కలవు. వీనిని పట్టుకొని అలవరచి, పెద్ద కొయ్య దూలములను తరలించుట మొదలగు పనులకు వినియోగించుచున్నారు. కారెనుములు, అస్సాముననే గాక దక్షిణ దేశమున మూదుమలై జంతు శరణ్యమునను కననగుచున్నవి. ఖడ్గమృగములు అస్సాం, పశ్చిమ బెంగాలులోని అడవులలో మాత్రమే కలవు. భారత దేశపు ఖడ్గమృగము ఒకేఒక కొమ్ముకలది. దీని సంతతి అంతరించకుండ ప్రభుత్వము శరణ్యములను ఏర్పరచి కృషి చేయుచున్నది లేళ్ళలో అనేక జాతులు దేశమున వివిధ ప్రాంతములందు కలవు; వీనిలో కాశ్మీరపు జింక, మడుగులేడి, మచ్చలలేడి, కస్తూరి మృగము పేరుగన్నవి. చిలవలు పలవలు తీరిన కొమ్ములుగల లేడి (తామిన్) ఇపుడు మణిపూరులో మాత్రమే ఉన్నది. ఈ జాతులలోనే పేర్కొనదగినవి నీలగై అనబడు పొట్టి లేడి, చౌసింగా అనబడు నాలుగు కొమ్ముల లేడి. ప్రపంచమున నాలుగు కొమ్ములు కలిగిన జంతువు చౌసింగా ఒక్కటియే అనియు, అదియు భారత దేశమున మాత్రమే కలదనియు తెలియుచున్నది.

మాంసాశనములగు జంతువులలో ముఖ్యముగ పేర్కొనదగినది సింహము. ఆఫ్రికా ఖండము తరువాత సింహములు లభించు ఏకైకదేశము ఇండియాయే. ఒకపుడు ఉత్తర భారతమున ఇవి, అడవులలో, విరివిగ ఉండెడివి. కాని 19వ శతాబ్ది అంతమునకు, వేటగాండ్ర బెడదవలన, ఈ సింహజాతి దాదాపుగ అంతరించినది. 1880 నాటికి కతియవాడ్ లోని గిర్ అడవులలో 12 సింహములు మాత్రమే మిగిలినవి. తదాదిగ ఆ అటవీ ప్రాంతమును సింహముల శరణ్య భూమిగ ప్రభుత్వము పరిగణించి, ఆ జాతి అంతరించకుండ కట్టుదిట్టపు చర్యలను తీసికొనుటవలన ప్రస్తుతమున సింహజాతి గణనీయ సంఖ్యలో అట మన గలుగుచున్నది. సింహమువలెగాక, దేశమందు

అంతట గాఢారణ్యములలో సహజముగ కానవచ్చునది పెద్దపులి; సింహములు అన్ని చోటులందును లేకపోవుటవలన, ఇదియే ఈ కాలమున మృగరాజుగ లెక్కకు వచ్చినది. ఇందువలననే భారత ప్రభుత్వపు వన్యజీవ మండలి పెద్దపులిని జాతీయ మృగముగ పరిగణించినది. ఈ పెద్దపులులును దాదాపుగ 2,000 మాత్రమే ఉండుటవలన, వీని సంతతియు అంతరించి పోవునను భయము వలన ప్రభుత్వము 'వ్యాఘ్ర సంరక్షక పథకము' (ప్రొజెక్ట్ టైగర్) ను ఒక దానిని రూపొందించి అమలు జరుపుచున్నది. చిరుత పులులలో దేశమున నాలుగు జాతులు కలవు; వానిలో ఎక్కువగ కనబడునది మచ్చల చిరుత; నల్ల, గోధుమవాక చిరుతలును అటనట కలవు; తెల్లని చిరుత హిమాలయ ప్రాంతములందు మాత్రమే కలదు; నల్ల ఎలుగుబంటులు దేశమంతట వివిధాడవులలో వసించుచున్నవి. తెలుపు, ఎరుపు, గోధుమ వన్నెల ఎలుగుబంటులును, విపుల ప్రమాణముకల నల్లని పెద్ద ఎలుగును హిమాలయ సీమలలో మాత్రమే కలవు. మార్జాల జాతికి చెందిన చిన్న రకపు వన్యములలో పండా, పునుగుపిల్లి, అడవిపిల్లి, ముంగిసలు పేర్కొనదగినవి; ముంగిసలలో 18 రకములు కలవు తక్కిన మాంసాహారపు సాధారణ జంతువులలో తోడేలు, నక్క, అడవికుక్క, రేచగణ్యములు. చిన్నరకపు తోడేలు సర్వసాధారణముగ అన్ని అడవులందును కలదు; కాని పెద్ద జాతికి చెందిన బొచ్చు తోడేలు పశ్చిమ హిమాలయాటవులలో మాత్రమే కన్పట్టును. నక్కలలో నాలుగు జాతులును, అడవి కుక్కలలో పలుజాతులును కలవు. రేచులలో గీరల వెన్నుగల ఒకేఒక జాతి మాత్రమే దేశపు అడవులందు కన్పడును. గుర్రములు దేశమునకు సహజ సిద్ధములు కావు; రెండు జాతుల గాడిదలు మాత్రము కలవు. ఋశ్య శృంగ మృగము పశ్చిమ హిమాలయములందు మాత్రమే ఉన్నది.

మొసళ్ళలో మూడు రకములు దేశమున కన్పట్టుచున్నవి. వీనితో ఘరియాల్ అనునది సింధు, గంగ, మహానది, బ్రహ్మపుత్రా నదులందు కలదు; బురద మొసలి సర్వసాధారణముగ కొన్ని మడుగులలో కలదు; సముద్రపు మొసలి నదీ ముఖద్వారము లందు సముద్రమునకు చేరువన వసించును. తాబేళ్ళలో 50 జాతులు కలవు; బల్లి జాతులు నాల్గు రకములు ఉన్నవి; సర్పములును అనేక జాతులు కలవు; వానిలో పసిరికపాము, నీళ్ళపాము, మెట్టపాము ప్రముఖములు. విషసర్పములు పదమూడు జాతులు కలవు; అందు నాగుబాము ప్రముఖము; బాగుగ ఎదిగిన నాగుబాము 4 లేదా 5 మీటర్ల పొడవు ఉండును. భారతదేశపు కొండచిలువ, సర్ప జాతులలోనెల్ల రమ్యతయందును నిడివియందును ప్రముఖము. ఇది దాదాపు 6 మీటర్ల పొడవువరకు ఎదుగును; బరువు 90 కిగ్రా. ఉండును. దాదాపు 1,200 రకముల పక్షి జాతులు భారతదేశమున కలవని అంచనా; ప్రపంచమున మొత్తమున ఉన్న 8,600 పక్షి జాతులలో 14% ఈ దేశమున కలవని ఇందువలన తెలియనగుచున్నది. ఈ 1,200 జాతులలో కొన్నింట ఉపజాతులును కలవు; ఈ విధముగ తేలిన అన్ని తెగల సంఖ్య 2,061 ని చేరుకొనుచున్నది. ఇందు 1,750 తెగలు మాత్రమే భారతదేశమున స్థిరముగ వసించునవి. తక్కినవి ఋతుక్రమమును అనుసరించి వలసవచ్చి పోవుచుండును. నెమలిని జాతీయ విహంగముగ ప్రభుత్వము పరిగణించి, నెమలి జాతిని పరిరక్షించుటకు తగు చర్యలను అవలంబించినది.

దేశమున జనావాసములు పెరిగినకొలది అడవుల వైశాల్యముతగ్గి, తత్ఫలితముగ వృక్షజాతు

లును, వన్యజంతువులును అంతరించిపోవు ప్రమాదము ఉండుటవలన వాని రక్షణకై భారత ప్రభుత్వము వన్యజీవ సంరక్షక మండలిని 1952 లో నెలకొల్పినది. రాష్ట్రములందును చాలవరకు ఇట్టి సంస్థలు నెలకొల్పబడినవి. ప్రస్తుతమున 7 జాతీయ వనములు, 130 వన్యజీవ శరణ్యములు, 24 జంతు వనములు దేశమున కలవు (1976).

### 3. జనసంఖ్య - భాషలు - మతములు

భారతదేశమున తొట్టతొలుతటి జనసంఖ్యాగణన 1872 లో జరిగినది. 1881 మొదలుగ ప్రతి పది సంవత్సరములకు ఒకతూరి ఈ గణన సాగుచున్నది. సన్నిహిత భూతకాలమున అట్టి గణన 1971 లో జరిగినది. అపుడు భారతదేశమున అత్యధిక భాగమున ఈ గణన 10 మార్చినుండి 3 ఏప్రిల్ వరకు (ఏప్రిల్ 1 వ తేది సూర్యోదయ కాలమునకు అనువర్తించు రీతిలో) సాగినది; కొలది ప్రాంతములందు మాత్రము సెప్టెంబరు 1970 నుండి ఫిబ్రవరి 1971 వరకు, కొన్ని పరిస్థితులవలన, ఆ గణనను సాగింపవలసి వచ్చినది

ఆ 1971 జనాభా లెక్కలను అనుసరించి దేశపు జనసంఖ్య 54,79,49,809. (అయితే అప్పటిలో సిక్కిమ్ భారతదేశమున రాష్ట్రముగ చేరలేదు; కావున సిక్కింలోని అంచనాలనుబట్టిన జనసంఖ్య 1,97 000 ను కూడ చేర్చినచో దేశపు జనసంఖ్య 1971 లో 54,81,46,809 కాగలదు.) ఐ. రా. స. వారి డెమోగ్రాఫిక్ ఇయర్ బుక్కులోని లెక్కలను అనుసరించి 1975 లో భారత దేశపు జనసంఖ్య 59,80,97,000. దేశపు జన సాంద్రత చ. కిమీ. 178.* దేశమున వివిధ రాష్ట్రములందును కేంద్రపాలిత ప్రాంతములందును వసించు ప్రజానీకము, స్త్రీ పురుష సంఖ్యారీతులు, షెడ్యూలు కులముల, తెగల సంఖ్యలు దిగువ పట్టిక III లో తెలుపబడినవి.

(చూ : ప్రక్క పుట)

* ఈ జనసాంద్రత 1971 లెక్కలను అనుసరించి నిర్ణయింపబడినది. 1971 లో సిక్కిమ్‌లోని ప్రజానీకము గాని, జమ్మూ - కాశ్మీరున పాకిస్తాన్ ఆక్రమణలోఉన్న జనసంఖ్యగాని లెక్కలోనికి తీసికొనబడలేదనుట ఇట గుర్తింపదగు విషయము. ఇకమీదట ఈ కథనమున వచ్చు శాతములు, తదితర సంఖ్యలు 1971 లెక్కలను మాత్రమే అనుసరించును. సిక్కిమ్‌కు సంబంధించిన కొన్ని ముఖ్య విషయములు 14 వ ఉప శీర్షికలో రాష్ట్రముల వివరములను ఇచ్చునపుడు తెలుపబడును. జమ్మూ - కాశ్మీరున పాకిస్తాన్ ఆక్రమిత భాగము ఇంకను పాకిస్తాన్ వశముననే ఉన్నది. అందువలన దాని వివరములు ఈయబడలేదు.

## పట్టిక III

### భారతదేశములోని జనాభా (రాష్ట్రముల, కేంద్ర పాలిత ప్రాంతములవారీగా) 1971.

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | | మొత్తము | పురుషులు | స్త్రీలు | షెడ్యూలు కులములు | షెడ్యూలు జాతులు |
|---|---|---|---|---|---|---|
| **భారతదేశము** | మొత్తము | 547,349,809 | 283,936,614 | 264,013,195 | 79,995,896 | 38,015,162 |
| | గ్రామీణ | 438,855,500 | 225,218,984 | 213,636,516 | 70,441,388 | 36,720,681 |
| | పట్టణ | 109,094,309 | 58,717,630 | 50,376,679 | 9,554,508 | 1,294,481 |
| రాష్ట్రములు | | | | | | |
| అస్సాము | మొత్తము | 14,957,542 | 7,885,064 | 7,072,478 | 912,639 | 1,919,947 |
| | గ్రామీణ | 13,630,561 | 7,126,453 | 6,504,108 | 826,911 | 1,870,683 |
| | పట్టణ | 1,326,981 | 758,611 | 568,370 | 85,728 | 49,264 |
| ఆంధ్రప్రదేశ్ | మొత్తము | 43 502,708 | 22,008,663 | 21,494,045 | 5,774,548 | 1,657,657 |
| | గ్రామీణ | 35,100,181 | 17,698,247 | 17,401,934 | 5,092,130 | 1,572,627 |
| | పట్టణ | 8,402,527 | 4,310,416 | 4,092,111 | 682,418 | 85,030 |
| ఉత్తర ప్రదేశ్ | మొత్తము | 88,341,144 | 47,061,421 | 41,324,723 | 18,548,916 | 198,565 |
| | గ్రామీణ | 75,952,548 | 40,214,012 | 35,738,536 | 17,147,032 | 182,768 |
| | పట్టణ | 12,388,596 | 6,802,409 | 5,586,187 | 1,401,884 | 15,797 |
| ఒరిస్సా | మొత్తము | 21,944,615 | 11,041,083 | 10,903,532 | 3,310,854 | 5,071,937 |
| | గ్రామీణ | 20,099,220 | 10,041,023 | 10,058,197 | 3,103,244 | 4,924,582 |
| | పట్టణ | 1,845,395 | 1,000,060 | 845,335 | 207,610 | 147,355 |
| కర్ణాటక | మొత్తము | 29,299,014 | 14,971,900 | 14,327,114 | 3,850,034 | 231,268 |
| | గ్రామీణ | 22,176,921 | 11,249,209 | 10,927,712 | 3,202,756 | 206,067 |
| | పట్టణ | 7,122,093 | 3,722,691 | 3,399,402 | 647,278 | 25,201 |
| కేరళ | మొత్తము | 21,347,375 | 10,587,851 | 10,759,524 | 1,772,168 | 269,356 |
| | గ్రామీణ | 17,880,926 | 8.852,350 | 9,028,576 | 1,600,645 | 258,480 |
| | పట్టణ | 3,466,449 | 1,735,501 | 1,730,948 | 171,523 | 10,876 |
| గుజరాత్ | మొత్తము | 26,697,475 | 13,802,494 | 12,894,981 | 1.825,432 | 3,734,422 |
| | గ్రామీణ | 19,200,975 | 9,842,483 | 9,358,492 | 1,328,000 | 3,507,152 |
| | పట్టణ | 7,496,500 | 3,960,011 | 3,536,489 | 497,432 | 227,270 |

| భారతదేశము లోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | | మొత్తము | పురుషులు | స్త్రీలు | షెడ్యూల్డు కులములు | షెడ్యూల్డు జాతులు |
|---|---|---|---|---|---|---|
| జమ్మూ-కాశ్మీరు | మొత్తము | 4,616,632 | 2,458,315 | 2,158,317 | 331,277 | ... |
| | గ్రామీణ | 3.758,411 | 1,996,864 | 1,761,547 | 349,684 | ... |
| | పట్టణ | 858,221 | 461,451 | 396,770 | 31,593 | ... |
| తమిళనాడు | మొత్తము | 41,199,168 | 20,828,021 | 20,371,147 | 7,315,595 | 311,515 |
| | గ్రామీణ | 28,734,334 | 14,438,727 | 14,295,607 | 6,050,302 | 294,379 |
| | పట్టణ | 12,464,834 | 6,389,294 | 6,075,540 | 1,265,293 | 17,136 |
| త్రిపుర | మొత్తము | 1,556,342 | 801,126 | 755,216 | 192,860 | 450,544 |
| | గ్రామీణ | 1,393,982 | 717,227 | 676,755 | 182,667 | 445,059 |
| | పట్టణ | 162,360 | 83,899 | 78,461 | 10,193 | 5.485 |
| నాగాలాండ్ | మొత్తము | 516,449 | 276,084 | 240,365 | ... | 457,602 |
| | గ్రామీణ | 465,055 | 241,171 | 223,884 | ... | 438,218 |
| | పట్టణ | 51,394 | 34,913 | 16,481 | ... | 19,384 |
| పంజాబ్ | మొత్తము | 13,551,060 | 7,266,515 | 6,284,545 | 3,348,217 | ... |
| | గ్రామీణ | 10,334,881 | 5,533,475 | 4,801,406 | 2,856,046 | ... |
| | పట్టణ | 3,216,179 | 1,733,040 | 1,483,139 | 492,171 | ... |
| పశ్చిమ బెంగాల్ | మొత్తము | 44,312,011 | 23,435,987 | 20,876,024 | 8,816,028 | 2,532,969 |
| | గ్రామీణ | 33,344,978 | 17,173,552 | 16,171 426 | 8,093,232 | 2,475,625 |
| | పట్టణ | 10,967,033 | 6,262,435 | 4,704,598 | 722,796 | 57,344 |
| బీహారు | మొత్తము | 56,353,369 | 28,846,944 | 27,506,425 | 7,950,652 | 4,932,767 |
| | గ్రామీణ | 50,719,403 | 25,728,987 | 24,990,416 | 7,436,573 | 4,725,693 |
| | పట్టణ | 5,633,966 | 3,117,957 | 2,516,009 | 514,079 | 207,074 |
| మణిపూర్ | మొత్తము | 1 072,753 | 541,675 | 531,078 | 16,376 | 334,466 |
| | గ్రామీణ | 931,261 | 470,231 | 461,030 | 15,802 | 319,516 |
| | పట్టణ | 141,492 | 71,444 | 70,048 | 574 | 14,950 |
| మధ్యప్రదేశ్ | మొత్తము | 41,654,119 | 21,455,334 | 20,198,785 | 5,453,690 | 8,387,403 |
| | గ్రామీణ | 34,869,352 | 17,823,411 | 17,045,941 | 4,769,158 | 8,244,072 |
| | పట్టణ | 6,784,767 | 3,631,923 | 3,152,844 | 684,532 | 143,331 |

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | | మొత్తము | పురుషులు | స్త్రీలు | షెడ్యూలు కులములు | షెడ్యూలు జాతులు |
|---|---|---|---|---|---|---|
| మహారాష్ట్ర | మొత్తము | 50,412,235 | 26,116,351 | 24 295,884 | 3,025,761 | 2,954,249 |
| | గ్రామీణ | 34,701,024 | 17,482,020 | 17,219,004 | 2,279,026 | 2,825,955 |
| | పట్టణ | 15,711,211 | 8,634,131 | 7,076,880 | 746,735 | 128,294 |
| మేఘాలయ | మొత్తము | 1,011,699 | 520,967 | 490,732 | 3,887 | 814,230 |
| | గ్రామీణ | 864,529 | 441,533 | 422,996 | 1,673 | 747,113 |
| | పట్టణ | 147,170 | 79,434 | 67,736 | 2,214 | 67,117 |
| రాజస్థాన్ | మొత్తము | 25,765,806 | 13,484,383 | 12,281,423 | 4,075,580 | 3,125,506 |
| | గ్రామీణ | 21,222,045 | 11,060,995 | 10,161,050 | 3,493,437 | 3,057,790 |
| | పట్టణ | 4,543,761 | 2,423,388 | 2,120,373 | 582,143 | 67,716 |
| హర్యానా | మొత్తము | 10,036,808 | 5,377,258 | 4,659,550 | 1,895,933 | ... |
| | గ్రామీణ | 8,263,849 | 4,420,225 | 3,843,624 | 1,698,626 | ... |
| | పట్టణ | 1,772,959 | 967,033 | 815,926 | 197,307 | ... |
| హిమాచల్ ప్రదేశ్ | మొత్తము | 3,460,434 | 1,766,957 | 1,693,477 | 769,572 | 141,610 |
| | గ్రామీణ | 3,218,544 | 1,628,623 | 1,589,921 | 734,080 | 141,055 |
| | పట్టణ | 241,890 | 138,334 | 103,556 | 35,492 | 555 |
| *కేంద్రపాలిత ప్రాంతములు* | | | | | | |
| అండమాన్ - నికోబార్ దీవులు | మొత్తము | 115,133 | 70,027 | 45,106 | ... | 18,102 |
| | గ్రామీణ | 88,915 | 53,195 | 35,720 | ... | 18,099 |
| | పట్టణ | 26,218 | 16,832 | 9,386 | ... | 3 |
| అరుణాచల ప్రదేశ్ | మొత్తము | 467,511 | 251,231 | 216,280 | 339 | 369,408 |
| | గ్రామీణ | 450,223 | 239,369 | 210,854 | 335 | 365,939 |
| | పట్టణ | 17,288 | 11,862 | 5,426 | 4 | 3,469 |
| గోవా - దామన్ - దయ్యూ | మొత్తము | 857,771 | 431,214 | 426,557 | 16,514 | 7,654 |
| | గ్రామీణ | 630,997 | 310,909 | 320,088 | 10,809 | 5,824 |
| | పట్టణ | 226,774 | 120,305 | 106,469 | 6,705 | 1,830 |

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | | మొత్తము | పురుషులు | స్త్రీలు | షెడ్యూలు కులములు | షెడ్యూలు జాతులు |
|---|---|---|---|---|---|---|
| చండీఘర్ | మొత్తము | 257,251 | 147,080 | 110,171 | 29,073 | ... |
| | గ్రామీణ | 24,311 | 14,444 | 9,867 | 5,273 | ... |
| | పట్టణ | 232,940 | 132,636 | 100,304 | 23,800 | ... |
| ఢిల్లీ | మొత్తము | 4,065,698 | 2,257,515 | 1,808,183 | 635,698 | ... |
| | గ్రామీణ | 418,675 | 229,424 | 189,251 | 104,999 | ... |
| | పట్టణ | 3,647,023 | 2,028,091 | 1,618,932 | 530,699 | ... |
| దాద్రా-నగర్ హవేలి | మొత్తము | 74,170 | 36,964 | 37,206 | 1,332 | 64,445 |
| | గ్రామీణ | 74,170 | 36,964 | 37,206 | 1,332 | 64,445 |
| | పట్టణ | ... | ... | ... | ... | ... |
| పుదుచ్చేరి | మొత్తము | 471,707 | 237,112 | 234,595 | 72,921 | ... |
| | గ్రామీణ | 273,419 | 137,783 | 135,636 | 57,616 | ... |
| | పట్టణ | 198,288 | 99,329 | 98,959 | 15,305 | ... |
| లక్షద్వీప్ | మొత్తము | 31,810 | 16,078 | 15,732 | ... | 29,540 |
| | గ్రామీణ | 31,810 | 16,078 | 15,732 | ... | 29,540 |
| | పట్టణ | ... | ... | ... | ... | ... |

గమనిక : మిజోరామ్‌కు చెందిన వివరములు అస్సామ్‌లో చేరి ఉన్నవి.

1961 తో పోల్చినపుడు దేశమున 1971 నాటికి జనసంఖ్య 24.8% చొప్పున అభివృద్ధి యైనది. జనులందు 1000 మంది పురుషులకు 930 మంది స్త్రీల చొప్పునకలరు. ప్రజలలో 19.91% పట్టణములందు వసించుచున్నారు. దేశమున వివిధ శ్రేణుల పట్టణములు కలవు. "పట్టణము" అను దానిని స్థూలముగ జనసంఖ్యలో 5,000 కు పైబడి నదిగా నిర్వచించినను, కొన్ని వసతులనుబట్టి 5,000 జనసంఖ్యకు లోబడినవియు, కొన్ని ప్రాంతములందు ఆ లెక్కకు వచ్చుచున్నవి. అటులే 10 వేలకు పైబడిన జనావాసములును కొన్ని, వాని స్వభావమునుబట్టి, గ్రామములుగనే కొన్ని రాష్ట్రములందు లెక్కింప బడుచున్నవి. అయినను ఇట్టి అపవాదములు చాల కొలదిగ మాత్రమే కలవని చెప్పవచ్చును. కొన్నిచోట్ల ఒక పట్టణమే గాక, దానికి అనుబంధితములగు ఉపనగరములును, ఆ దరిదాపున ఉన్న చిన్న పట్టణములునుచేరి ఒకే ఒక విస్తృత పట్టణముగ లెక్కింపబడుచున్నవి. హైదరాబాదు, బొంబాయి, కలకత్తావంటివి ఇందులకు ఉదాహరణములు. భారతదేశపు మొత్తమున రాష్ట్ర, కేంద్ర పాలిత ప్రాంతముల వారీగా ఉన్న వివిధ శ్రేణుల పట్టణముల వివరములు ప్రక్క పుటలోని పట్టికలో ఈయబడినవి.

## పట్టిక IV

### పట్టణముల, విస్తృత పట్టణముల సంఖ్యారీతి (1971 జనసంఖ్యలను అనుసరించి)

| భారతదేశములోని రాష్ట్రములు, కేం పా. ప్రాంతములు | లక్ష, అంతకు పైబడినవి | 50,000 నుండి 99,999 | 20,000 నుండి 49,999 | 10,000 నుండి 19,999 | 5,000 నుండి 9,999 | 5,000 కు తక్కువ | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| **భారతదేశము** | 147 | 185 | 582 | 874 | 680 | 173 | 2,641 |
| రాష్ట్రములు | | | | | | | |
| అస్సాం | 1 | 5 | 9 | 24 | 22 | 8 | 69 |
| ఆంధ్రప్రదేశ్ | 13 | 17 | 59 | 76 | 38 | 4 | 207 |
| ఉత్తరప్రదేశ్ | 22 | 20 | 67 | 91 | 80 | 13 | 293 |
| ఒరిస్సా | 5 | 1 | 19 | 21 | 30 | 2 | 78 |
| కర్ణాటక | 12 | 9 | 38 | 99 | 46 | 26 | 230 |
| కేరళ | 5 | 7 | 40 | 25 | 9 | 2 | 88 |
| గుజరాత్ | 8 | 17 | 37 | 66 | 67 | 5 | 200 |
| జమ్మూ - కాశ్మీరు | 2 | — | 3 | 3 | 15 | 20 | 43 |
| తమిళనాడు | 16 | 27 | 57 | 86 | 44 | 11 | 241 |
| త్రిపుర | 1 | — | — | 4 | 1 | — | 6 |
| నాగాలాండ్ | — | — | 1 | 2 | — | — | 3 |
| పంజాబు | 4 | 8 | 22 | 32 | 30 | 10 | 106 |
| పశ్చిమ బెంగాల్ | 4 | 20 | 34 | 40 | 36 | 3 | 137 |
| బీహారు | 11 | 9 | 42 | 57 | 35 | 7 | 161 |
| మణిపూర్ | 1 | — | — | — | 4 | 3 | 8 |
| మధ్యప్రదేశ్ | 11 | 11 | 41 | 72 | 91 | 7 | 233 |
| మహారాష్ట్ర | 18 | 16 | 61 | 90 | 58 | 14 | 257 |
| మేఘాలయ | 1 | — | — | 1 | 1 | — | 3 |
| రాజస్థాన్ | 7 | 7 | 31 | 64 | 38 | 4 | 151 |

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | లక్ష, అంతకు పైబడినవి | 50,000 నుండి 99,999 | 20,000 నుండి 49,999 | 10,000 నుండి 19,999 | 5,000 నుండి 9,999 | 5,000 కు తక్కువ | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| హర్యానా | 2 | 9 | 14 | 15 | 20 | 5 | 65 |
| హిమాచలప్రదేశ్ | — | 1 | 1 | 5 | 7 | 21 | 35 |
| *కేంద్ర పాలిత ప్రాంతములు* | | | | | | | |
| అండమాన్-నికోబార్ దీవులు | — | — | 1 | — | — | — | 1 |
| అరుణాచల ప్రదేశ్ | — | — | — | — | 1 | 3 | 4 |
| గోవా-డామన్-దయ్యూ | | 1 | 3 | 1 | 4 | 4 | 13 |
| చండీఘర్ | 1 | — | — | — | — | — | 1 |
| ఢిల్లీ | 1 | — | — | — | — | — | 1 |
| దాద్రా-నగర్‌హవేలి | — | — | — | — | — | — | — |
| పుదుచ్చేరి | 1 | — | 1 | — | 2 | 1 | 5 |
| మిజోరామ్ | — | — | 1 | — | 1 | — | 2 |
| లక్షద్వీప్ | — | — | — | — | — | — | — |

దేశమున 10 లక్షలకు పైబడిన జనసంఖ్య కలిగిన మహానగరములు 9 ఉన్నవి. అవి: 1. కలకత్తా (జ. సం. 70,31,382), 2. బొంబాయి (59,70,575), 3. ఢిల్లీ (36,47,023), 4. మద్రాసు (24,69,449), 5. హైద్రాబాదు (17,96,439), 6. అహమ్మదాబాదు (17,41,522), 7. బెంగుళూర్ (16,53,779), 8. కాన్పూర్ (12,75,242), 9. పూనా (11,35,034).

అతి దీర్ఘ చరిత్ర కలిగిన ఈ దేశమున వివిధ మానవ జాతులు అంతటంతట వచ్చిచేరి, కలసి వసించవలసి వచ్చినందువలన, జాతి సమ్మేళనము పెద్ద యెత్తున జరిగినది; అందువలన ప్రాంతముల రీత్యా జాతి విభజనను గుర్తెరుగుట కష్ట సాధ్యము మానవజాతి విజ్ఞానవేత్తలు పలుపురు ఈ విషయమై కృషి సలిపి, భారత దేశమున నానాట వసింపవచ్చి, చేరిన పలు జాతులను వింగడించుటకు కృషిచేసిరి. వారిలో ఒకడగు డాక్టర్ బి. యస్. గుహా యొక్క అభిప్రాయములను అనుసరించి ఈ దేశపు ప్రజానీకపు రూపురేఖలలో ఆరు ప్రముఖ మానవ జాతులు సమ్మిళితములై నటుల తెలియవచ్చుచున్నది. అవి; నెగ్రిటో, 2. ఆస్ట్రిక్, 3. మంగోలాయిడ్, 4. ద్రవిడియన్, 5. ఆల్పయిన్-దీనారిక్, 6. ఆర్య జాతులు. ఈ విభజన అసమగ్రమని చెప్పక తప్పదు. అయినను స్థూలముగ, ఉత్తర భారతమున అర్యజాతుల, ప్రాచ్య భారతమున మంగోలాయిడ్ జాతుల, దక్షిణ భారతము ద్రావిడ జాతుల, వాయవ్య భారతమున ఆల్పయిన్ జాతుల లక్షణములు విరివిగ కన్పడుచున్నవని చెప్పవచ్చును. నెగ్రిటో జాతుల లక్షణములు దక్షిణ భారతపు కొన్ని కొండ జాతులందును, అండమాన్ దీవుల ఆదివాసులందును కననగును. ఆస్ట్రిక్ జాతి ఒకపుడు భారతదేశ మందం

తట వ్యాపించి యుండెననియు, భారతీయ మానవ జాతికి మూలకందము ఈ జాతియే అనియు కొందరి అభిప్రాయము. ఈ జాతుల ప్రముఖ లక్షణములు తూర్పు, మధ్య దేశములందలి కొండ ప్రజలలో కొంతవరకు కలవు. మొత్తముమీద భారత దేశమున చేరిన మానవ జాతులు ఎన్నియైనను, అవి అన్నియు చారిత్రక గతివలన చక్కగ మేళనము చెందుటవలన, భారతీయ జాతి అని విశిష్ట రీతిలో పేర్కొనదగిన ఒక మానవజాతి రూపొందినదని చెప్పదగును.

దేశమున జనసంఖ్యా గణనను అనుసరించి 1549 భాషలు మాతృ భాషలుగ ప్రచారమున ఉన్నటుల తెలియవచ్చుచున్నను ఇందు 1295 భాషలు, కొన్ని నిర్దిష్ట ప్రాంతీయ భాషలలో ఏదియో ఒక దానికి అతి సన్నిహితములుగ ఉండుటవలన వానికి ఒక ప్రత్యేకత దైనిక వ్యవహారములందు కన్పట్టదు. అందువలన కొన్ని నిర్దిష్ట ప్రాంతములందు ఒక ప్రత్యేక భాష, చాల వరకు అందరికిని, సుజ్ఞాతము. ఇందులకు అనుగుణముగ దేశమున రాష్ట్రముల సరిహద్దుల నిర్ణయము చాలవరకు 1956 లో జరిగినది. రాజ్యాంగము సైతము 15 భాషలను మాత్రమే జాతీయ భాషలుగ పరిగణించినది. అవి : 1. అస్సామీ, 2. ఉర్దూ, 3 ఒరియా, 4. కన్నడము, 5. కాశ్మీరీ, 6. గుజరాతీ, 7. తమిళము, 8. తెలుగు, 9. పంజాబీ, 10. బెంగాలీ, 11. మరాఠీ, 12. మళయాళం, 13. హిందీ, 14. సంస్కృతము, 15. సింధీ. వీనిలో సంస్కృత, సింధీ, కాశ్మీర భాషలు తప్ప తక్కిన వానిలో ప్రతి యొకటియు ఏదియో ఒక రాష్ట్రపు అత్యధిక ప్రజానీకపు మాతృ భాషగ, ఆ రాష్ట్రపు అధికార భాషా ప్రతిపత్తిని ఆర్జించినది.

హిందీ భాష, తక్కిన అన్ని భాషలకన్న, దేశమున అత్యధిక వ్యాప్తిని ఆర్జించినది. 1971 లెక్కలను అనుసరించి దాదాపు 15.4 కోట్ల ప్రజలు దీనిని తమ మాతృభాషగ పేర్కొనిరి. ఇక దీని మాండలికములగు బీహార్, రాజస్థానీ, పహారీ, బోజపురీలను మాతృభాషలుగ పేర్కొనిన వారి సంఖ్య దాదాపు 6 కోట్లు ఉండును. ఇంతేగాక ఉర్దూ కూడ చాల వరకు హిందీ భాషకు ఒక వికృతియే అగుటవలన, ఆ భాష మాటాడు వారికి సైతము హిందీ అర్థము కాగలదు. ఇటుల చూచినపుడు హిందీభాష దాదాపు 24 కోట్ల ప్రజలకు పరిచితము. ఈ సత్యమును గమనించియే భారత రాజ్యాంగ విధానము, హిందీ భాషను భారత ప్రభుత్వపు అధికార భాషగ గుర్తించినది. హిందీయందు పెక్కు మాండలికములు కలవు. అందువలన అందలి 'ఖడీ బోలీ' అనునదియే ఈ అధికార భాషగ నిర్ధారితము. సాహిత్య భాషగ హిందీని లెక్కించినపుడు అందు ఖడీ బోలీయే గాక వ్రజ భాష, బుందేలీ, అవధీ, మార్వారీ, మైథిలీ, భోజపురీ మాండలికములును లెక్కలోనికి వచ్చుచున్నవి. ఇందు వ్రజ భాషాదులందు సాహిత్యము దాదాపు 700 సంవత్సరముల నుండి కనవచ్చుచున్నను, ఖడీబోలీ మాత్రము 19వ శతాబ్ది ఉత్తరార్ధముననుండి మాత్రమే. సాహిత్య భాషగ రాణించి, ఈ శతాబ్దమున ఎంతయో అభివృద్ధిని పొందినది. భారత ప్రభుత్వపు అధికార భాషగనే గాక ఆరు రాష్ట్రములందు అధికార భాషగ హిందీ ఆదరణను ఆర్జించినది.

తక్కిన జాతీయ భాషలను మాతృ భాషలుగ కలవారి సంఖ్యా వివరములు దిగువ రీతిగ కలవు (1971); అస్సామీ 86,58,977; ఉర్దూ 2,86,00,428; ఒరియా 1,97,26,745; కన్నడము 2,15,75,019; కాశ్మీరీ 24,21,760; గుజరాతీ 2,56,56,274; తమిళము 3,75,92,794; తెలుగు 4,47,07,697; పంజాబీ 1,39,00,202; బెంగాలీ 4,45,21,533; మరాఠీ 4,17,23,893; మళయాళం 2,16,17,430; సింధీ 12,04,678. వీనిలో అస్సామీ అస్సామునను, ఉర్దూ జమ్మూ-కాశ్మీరునను, కన్నడము కర్ణాటమునను, గుజరాతీ గుజరాతునను, తమిళము

తమిళనాడునను, తెలుగు ఆంధ్రప్రదేశ్‌లోను, పంజాబీ పంజాబునను, బెంగాలీ పశ్చిమ బెంగాలు నను, మరాఠీ మహారాష్ట్రమునను, మళయాళం కేరళ రాష్ట్రమునను అధికార భాషలుగ గుర్తింపబడినవి. సంస్కృతమును మాతృభాషగ కలవారు దేశమున లేకపోయినను, సాంస్కృతికముగ ఆ భాషకును, సాహిత్యమునకు గల చారిత్రక ప్రతిపత్తిని, భారతీయ భాషా సాహిత్య సంస్కృతులపై నేటికిని దానికి ఉన్న ప్రత్యేక ప్రాముఖ్యమును గమనించి దానికి జాతీయభాషాప్రతిపత్తి కల్పింపబడినది.

ఇంగ్లీష్ భాషను మాతృ భాషగ కలవారు దేశమున 1,91,579 మాత్రమే అయినను, బ్రిటిష్ పరిపాలనా కాలమున, అధికార భాషగను, విద్యా బోధనకు మాధ్యమముగను ఆ భాష అనన్య ప్రతిపత్తిని ఆర్జించినందు వలన ఉన్నత విద్యావంతులకు అందరికి అది సుపరిచితము. దేశము స్వాతంత్ర్యము ఆర్జించిన తరువాత కేంద్ర పరిపాలనకు సంబంధించినంతవరకు ఆంగ్ల భాషకు బదులుగ హిందీని క్రమరీతిలో ప్రవేశపెట్టుటకు నిర్ణయము జరిగినను అది సంపూర్ణముగ అమలు జరగకున్నది. హిందీ భాషతో పరిచితిలేని రాష్ట్రములు, హిందీని ప్రవేశ పెట్టుటలో తగిన చొరవను చూపింపకుండుట ఇందులకు ముఖ్యకారణము. ఇందువలన హిందీయేతర రాష్ట్రములవారు కోరునంత కాలము ఇంగ్లీష్ భాషయు, హిందీతోపాటుగ అనుసంధాన భాషగ కొనసాగుటకై నిర్ణయము జరిగి దానిని అనుసరించియే ప్రభుత్వ వ్యవహారములు చాల వరకు ఇంగ్లీషుననే ప్రస్తుతమున కొనసాగుచున్నవి. కాని కాలక్రమమున రాష్ట్రముల ప్రభుత్వ వ్యవహారములందు అచటి ప్రాంతీయ భాషలకును, కేంద్ర ప్రభుత్వ వ్యవహారములందు హిందీకిని మాత్రమే వ్యాప్తి ఉండవలయుననుట ప్రభుత్వపు ధ్యేయము. ఇంగ్లీషుభాష అధికార భాషగ నాగాలాండ్, మేఘాలయ, మిజోరామ్, అరుణాచల ప్రదేశ్‌లలో గుర్తింపబడినది. జాతీయ భాషలలో సంస్కృతము, హిందీ, మరాఠీ భాషలు దేవనాగరి లిపిలో వ్రాయబడుచున్నవి. దేవనాగరి వలెనే బ్రాహ్మీ లిపినుండి జనించిన వేర్వేరు లిపులను తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ, బెంగాలీ, గుజరాతీ, ఒరియా, పంజాబీ, అస్సామీలు కలిగి ఉన్నవి. అరబ్బీ లిపినుండి జనించిన లిపిలో ఉర్దూ, సింధీ భాషలు వ్రాయబడుచున్నవి. అయినను ప్రస్తుతమున సింధీ భాషకు కూడ దేవనాగరి లిపిని ఎడనెడ వాడుచున్నారు. కాశ్మీరీ భాష ఉర్దూ లిపిలోను, దేవనాగరి లిపి జన్యమగు వేరొక లిపిలోను వ్రాయబడుచున్నది.

దేశీయులలో హిందువులు 82.72%, ముస్లిములు 11.21%, క్రైస్తవులు 2.6%, శిక్కులు 1.89%, బౌద్ధులు 0.7%, జైనులు 0.47%. జొరాస్ట్రియన్ మతానుయాయులు 91,266 మాత్రమే కలరు. ముస్లిములు దేశపు మొత్తమున అల్ప సంఖ్యాకులే అయినను జమ్మూ-కాశ్మీరులో 65.87%, లక్షద్వీప్‌లో 94.37%, పశ్చిమ బెంగాల్‌లో 20.46%, అస్సామ్‌లో 24.03%, కేరళలో 19.5%, బీహార్‌లో 13.48% కలరు. క్రైస్తవులు నాగాలాండులో 66.76%, మేఘాలయలో 46.98%, గోవా-దామన్-దయ్యూలో 31.77%, అండమాన్ నికోబారులలో 26.35%, మణిపూర్‌లో 26.03%, కేరళలో 21.05% కలరు. శిక్కులు పంజాబ్‌లో 60.22%, ఢిల్లీలో 25.45%, హర్యానాలో 6.29% గా లెక్కకు వచ్చుచున్నారు. బౌద్ధులలో 85% వరకు మహారాష్ట్రలోను 13.3% అరుణాచల ప్రదేశ్‌లోను వసించుచున్నారు. జైనులును, పార్సీలును చాల వరకు పట్టణ ప్రాంతముల లోనే కననగు చున్నారు. పార్సీలలో అత్యధిక సంఖ్యాకులు బొంబాయి నగరమున కలరు. జైనులు రాజస్థానమున 1.99% గను, గుజరాతున 1.69 గను, మహారాష్ట్రలో 1.40% గను, ఢిల్లీలో 1.24% గను లెక్కకు వచ్చుచున్నారు. భారత దేశమున వివిధ రాష్ట్ర, కేంద్రపాలిత ప్రాంతములందలి వివిధ మతానుయాయుల సంఖ్యా వివరములు ప్రక్క పుటలోని పట్టికవలన తెలియనగును.

## పట్టిక V

### భారతదేశీయ వివిధ ప్రాంతములందు వివిధ మతానుయాయుల సంఖ్యా వివరములు (1971)

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | మొత్తం జనసంఖ్య | హిందువులు | ముస్లిములు | క్రైస్తవులు | శిక్కులు | బౌద్ధులు | జైనులు | ఇతర మతములవారు | మతమును పేర్కొననివారు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| **భారతదేశము** | 547,949,809 | 453,292,086 | 61,417,934 | 14,223,382 | 10,378,797 | 3,812,325 | 2,604,645 | 2,184,556 | 36,083 |
| రాష్ట్రములు | | | | | | | | | |
| అస్సాం | 14,957,542 | 10,625,847 | 3,594,006 | 667,151 | 12,347 | 45,212 | 12,917 | 62 | 170 |
| ఆంధ్రప్రదేశ్ | 43,502,708 | 38,119,279 | 3,520,166 | 1,823,436 | 12,591 | 10,035 | 16,108 | 995 | 98 |
| ఉత్తరప్రదేశ్ | 88,341,144 | 73,997,597 | 13,676,533 | 131,810 | 369,672 | 39,639 | 124,728 | 423 | 742 |
| ఒరిస్సా | 21,944,615 | 21,121,056 | 326,507 | 378,888 | 10,204 | 8,462 | 6,521 | 91,859 | ... |
| కర్ణాటక | 29,299,014 | 25,332,388 | 3,113,298 | 613,026 | 6,830 | 14,319 | 218,862 | 380 | 2 |
| కేరళ | 21,347,375 | 12,683,277 | 4,162,718 | 4,494,089 | 1,284 | 605 | 3,336 | 562 | 1,357 |
| గుజరాత్ | 26,697,475 | 23,835,471 | 2,249,005 | 109,341 | 18,233 | 5,469 | 451,578 | 18,781 | 1,902 |
| జమ్మూ-కాశ్మీరు | 4,616,632 | 1,404,292 | 3,040,129 | 7,182 | 105,873 | 57,956 | 1,150 | 8 | 1,504 |
| తమిళనాడు | 41,199,168 | 36,674,150 | 2,103,899 | 2,367,749 | 4,355 | 1,148 | 41,097 | 6,080 | 690 |
| త్రిపుర | 1,556,342 | 1,393,689 | 103,962 | 15,713 | 318 | 42,285 | 375 | ... | ... |
| నాగాలాండ్ | 516,449 | 59,031 | 2,966 | 344,798 | 687 | 179 | 627 | 108,159 | 1,118 |
| పంజాబ్ | 13,551,064 | 5,087,235 | 114,447 | 162,202 | 8,159,972 | 1,374 | 21,383 | 355 | 4,092 |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| పశ్చిమ బెంగాల్ | 44,312,001 | 34,611,864 | 9,064,338 | 251,752 | 35,084 | 121,504 | 32,203 | 194,126 | 1,104 |
| బీహారు | 56,353,369 | 47,031,801 | 7,594,173 | 658,717 | 61,520 | 4,086 | 25,185 | 976,997 | 9,547 |
| మణిపూర్ | 1,072,753 | 632,597 | 70,969 | 279,243 | 1,028 | 495 | 1,408 | 83,167 | 1,369 |
| మధ్యప్రదేశ్ | 41,654,119 | 39,024,162 | 1,815,685 | 286,072 | 98,973 | 81,823 | 345,211 | 836 | 5,079 |
| మహారాష్ట్ర | 50,412,235 | 41,037,287 | 4,233,023 | 717,174 | 101,762 | 3,264,223 | 703,664 | 80,020 | 3,846 |
| మేఘాలయ | 1,011,699 | 187,140 | 26,347 | 475,267 | 1,262 | 1,878 | 268 | 318,168 | 91 |
| రాజస్థాన్ | 25,765,806 | 23,093,895 | 1,778,275 | 30,202 | 341,182 | 3,642 | 513,548 | 4,339 | 723 |
| హర్యానా | 10,036,808 | 8,956,310 | 405,723 | 9,802 | 631,048 | 845 | 31,173 | 5 | 128 |
| హిమాచల ప్రదేశ్ | 3,460,434 | 3,324,627 | 50,327 | 3,556 | 44,914 | 35,937 | 626 | 319 | 42 |
| కేంద్ర పాలిత ప్రాంతములు | | | | | | | | | |
| అండమాన్-నికోబార్ దీవులు | 115,133 | 70,134 | 11,665 | 30,342 | 865 | 103 | 14 | 1,264 | 756 |
| అరుణాచల ప్రదేశ్ | 467,511 | 102,832 | 842 | 3,684 | 1,255 | 61,400 | 39 | 296,674 | 785 |
| గోవా-దామన్-దయ్యూ | 857,771 | 550,482 | 32,250 | 272,509 | 885 | 260 | 556 | 269 | 560 |
| చండీఘర్ | 257,251 | 184,395 | 3,720 | 2,504 | 65,472 | 92 | 1,016 | ... | 5 |
| ఢిల్లీ | 4,065,698 | 3,407,835 | 263,019 | 42,720 | 291,123 | 8,720 | 50,513 | 527 | 241 |
| దాద్రా-నగర్‌హవేలి | 74,170 | 71,075 | 740 | 1,198 | 3 | 73 | 303 | 21 | 37 |
| పుదుచ్చేరి | 471,707 | 400,793 | 29,143 | 41,296 | 51 | 21 | 237 | 107 | 59 |
| లక్షద్వీప్ | 31,810 | 1,545 | 30,019 | 239 | 4 | ... | ... | 3 | ... |

### 4. సమాచార సాధనములు

తంతి తపాలా టెలిఫోన్ రేడియో టెలివిజన్ సౌకర్యములు కేంద్ర ప్రభుత్వపు ఆధీనమున పని చేయుచున్నవి. 1837 లో ప్రభుత్వపు తపాలాతో పాటుగ, పౌరుల ఉత్తరములనుకూడ, కొంత రుసుమును చెల్లించినమీదట, వాని గమ్యస్థానములకు చేర్చు వసతిని ప్రభుత్వము కల్పించుటతో, దేశమున ఆధునికపు తపాలా వ్యవస్థ ఆరంభమయ్యెనని చెప్ప వచ్చును. తొలుతటి తపాళా బిళ్ల 1852 లో, కరాచీ నగరమున విడుదల యైనది; కాని దాని వ్యాప్తి సింధు రాష్ట్రము వరకే అపుడు పర్యాప్తము చేయబడినది. 1854 లో మొత్తముమీద దేశమున అటనట 700 తపాలా ఆఫీసులు పనిచేయుచుండినవి; అంతట వీని కార్యరీతులను సువ్యవస్థీకృతము చేయుటకై ఆ సంవత్సరమే తపాలా డిపార్టుమెంటు నెలకొల్పబడినది. అంతట 1880 లో, ఉత్తరములనే గాక ధనమును సైతము ఒక చోటనుండి వేరొక చోటికి పంపు వసతిని (మనియార్డరు వసతిని) ఈ ప్రభుత్వశాఖ కల్పించినది. 1885 లో సేవింగ్స్ బ్యాంకు పద్ధతి తపాలా ఆఫీసులలో ఏర్పాటైనది. 1911 నుండి విమాన తపాలు కూడా అమలులోనికి వచ్చినది.

మార్చి 31, 1974 నాటికి దేశమున మొత్తముమీద 1,16,804 తపాలా ఆఫీసులు పనిచేయుచున్నవి; వీనిలో గ్రామీణ తపాలాఫీసుల సంఖ్య 1,05,491. సరాసరిన 4,684 మంది పౌరులకు ఒక తపాలాఫీసు పనిచేయుచు, 27.36 చ.కిమీ. వైశాల్యముగల ప్రాంతమునకు ఉపకరించుచున్నదని లెక్క తేలుచున్నది. తపాలాను కొనిపోవుటకు భూజల సంబంధములగు యాన సౌకర్యములే గాక, విమానములు సైతము వాడబడుచున్నవి. విమాన తపాలును లెక్కలోనికి తీసికొనక లెక్కించినపుడు తపాలును కొనిపోవుట 12% దూరము రైలు వలనను, 33% మోటారుల వలనను, 47% దూరము మనుజుల వలనను, 8% స్టీమర్లు, ఒంటెలు, గుర్రములు, సైకిళ్లు మొదలగు తదితర రీతుల యాన సాధనముల వలనను జరుగుచున్నదని లెక్క తేలుచున్నది (1972-73).

దేశాంతర్గతమగు రాత్రి విమానముల తపాలా వసతి దేశములోని ప్రముఖ నగరములను అన్నింటిని అనుసంధించుచున్నది. విమానపు తపాలాకై ఉత్తరములకు గాని, మనియార్డర్లకు గాని అదనపు రుసుము ఏదియు వసూలు చేయబడుటలేదు. 1972-73 లో తపాలాశాఖ వలని ఆదాయము 118.25 కోట్లు; అనగా సగటున ప్రతి పౌరుని నుండియు ఆ సంవత్సరమున ఈ శాఖకు రు 2.16 వసూలయినది. వెనుకబడిన ప్రాంతములందును, పర్వత ప్రాంతములందును, తగు ఆదాయము లేక పోయినను, తపాలా ఆఫీసులను నెలకొల్పుటకు ప్రభుత్వము పూనుకొని వ్యవహరించుచున్నది. వెనుకబడిన ప్రాంతములందు ఒక తపాలాఫీసును నిర్వహించుటకు అగు ఖర్చులో 15% అచట లభించిన చాలునని ప్రభుత్వము ఒక నియమమును విధించి, అట్టి కనీసపు ఆదాయము రాగలుగు అవకాశము ఉన్న ప్రతిచోట తపాలాఫీసును నెలకొల్పుచున్నది. ఇక పర్వత ప్రాంతముల విషయమున అపేక్షితమగు ఆ కనీసపు ఆదాయము 10% మాత్రమే.

దేశమున తొట్టతొలుత తంతి కార్యాలయము 1851 లో కలకత్తాలో నెలకొల్ప బడినది. అప్పుడు ఆ వసతి కలకత్తా - డయిమండ్ హార్బరుల మధ్య మాత్రమే ఉపకరించినది; తదాదిగ - అందును దేశమునకు స్వాతంత్ర్యము లభించిన తరువాత - ఈ సౌకర్యము క్రమేణ విస్తృతీకృత మైనది. మార్చి 31, 1973 నాటికి దేశమున మొత్తముమీద 16,710 టెలిగ్రాఫ్ ఆఫీసులు కలవు (తపాలా

ఆఫీసులోనే తంతి వార్తను గ్రహించు సదుపాయము కలవి ఇందులో చేరవు); ఈ శాఖ యొక్క ఆదాయము రు 40 98 కోట్లు. తంతి వార్తలు రోమన్ లిపిలోనే ఆంగ్లమున సాధారణముగ పంపబడు చున్నవి; అయినను 1949 మొదలుగ దేవనాగరి లిపిలో హిందీ, తదితర దేశ భాషల తంతి వార్తలను పంపు సౌకర్యము అమలులో ఉన్నది. 6,525 తంతి ఆఫీసులలో ఈ సౌకర్యము కలదు (1973). టెలిఫోను ద్వారా తంతి వార్తను పంపుటకు, గ్రహించుటకు వసతి కలిగించు ఫోనోగ్రామ్ పద్ధతి 2,463 స్థలములలో కలదు (1973). 1963 లో జాతీయ టెలెక్స్ సర్వీస్ ఆరంభితమైనది; 1969 లో దేవనాగరి లిపియందు కూడ టెలెక్స్ సౌకర్యము ఏర్పడి, తదాదిగ అమలున ఉన్నది. టెలిప్రింటర్ వసతులు 49 ప్రముఖ నగరముల మధ్య కలవు. దేవనాగరి లిపిలో కూడ ఇందు కొన్ని టెలిప్రింటర్లు పనిచేయును. ఈ టెలిప్రింటరుల వలన వార్తలు ముద్రిత రూపంలో ఒకరి నుండి వేరొకరికి నేరుగ చేరు సౌకర్యము లభించినది.

గ్రాహమ్ బెల్ అను వైజ్ఞానికుడు 1876 లో టెలిఫోనును కనుగొనగ ఆ వెనువెంటనే 1881 లో కలకత్తా యందు భారత ప్రభుత్వము, 50 లైనులు కలిగిన ఒక టెలిఫోను ఎక్స్చేంజిని తొలుత నెలకొల్పినది. ఆటోమాటిక్ లైనులు కలిగిన తొలుతటి ఎక్స్చేంజి, 1913 లో సిమ్లాయందు ఏర్పాటయినది. అయినను 1951 తరువాత మాత్రమే దేశమున టెలిఫోన్ సౌకర్యములు విరివిగ ఏర్పడినవి. టెలిఫోను ఎక్స్చేంజీల సంఖ్య 1974 లో 4,704; వానికి ముడివడిన టెలిఫోనుల సంఖ్య 16.29 లక్షలు. ఈ సౌకర్యమున ఆధునికములగు అనేక వసతులు క్రమేణ అమలులోనికి వచ్చుచున్నవి. వాడుక దారుల డైరెక్ట్ ట్రంక్ డయలింగ్ వసతి (STD) 1960 లో కాన్పూర్ - లక్నోల మధ్య ఏర్పాటై తదాదిగ విస్తరించి, 1973 నాటికి 68 నగరపు జంటల మధ్య అమలులోనికి వచ్చినది. సముద్ర తీరమునకు 750 కిమీ.ల దూరమునకు మించక సముద్రమున పయనించు నౌకలలో ఉన్నవారితో, తీరనగరము లందలి వారు మాటాడ గలుగు టెలిఫోన్ సౌకర్యము బొంబాయి, కలకత్తా, మద్రాసులలో కలదు. దేశమున టెలిఫోన్ సెట్టులను, తదితర వార్తా సౌకర్య పరికరములను విరివిగ తయారు చేయుటకై ప్రభుత్వ రంగపు ఆధ్వర్యమున 1948 లో ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ అను సంస్థ సంస్థాపితమైనది. దానికి సంబంధించిన కర్మాగారములు బెంగుళూర్, నైనీ, శ్రీనగరులలో పనిచేయుచున్నవి.

దేశపు తంతి తపాలా టెలిఫోనుల పరిపాలనను కేంద్ర ప్రభుత్వపు సమాచార శాఖ వ్యాపార రీతిలో నిర్వహించుచున్నది. 1970 లో ఏర్పడిన ఒక ఏర్పాటును అనుసరించి, ఆ శాఖపై 1963-64 వరకు పెట్టబడిన పెట్టుబడిమీద 4.75% డివిడెండును, తరువాతి పెట్టబడిపై 6.75 డివిడెండును ఈ శాఖ, కేంద్ర ప్రభుత్వపు జనరల్ రెవిన్యూకు ప్రతియేటా చెల్లించవలసి యున్నది.

సముద్రములకు ఆవలనుండు దూరదేశములతో ఉన్న వార్తా సౌకర్యముల నిర్వహణమునకై ఒక ప్రత్యేక శాఖ - ఓవర్ సీస్ కమ్యూనికేషన్స్ సర్వీస్ అనునది - బొంబాయిలో ముఖ్య కార్యాలయము కలిగి పనిచేయుచున్నది. దీనికి సంబంధించి బొంబాయి, కలకత్తా, మద్రాసు, న్యూ ఢిల్లీలలో ఉన్న అంతర్జాతీయ ద్వార కేంద్రముల ద్వారా సముద్రోత్తర దేశములకు టెలిగ్రాఫ్, టెలిఫోన్, టెలెక్స్, రేడియో - ఫోటో సౌకర్యముల సంబంధము భారత దేశమునకు లభించుచున్నది. 1971 లో పూనా సమీపమున ఆర్వీ వద్ద నెలకొల్పిన కృత్రిమ

ఉపగ్రహ భూ స్థావరము (విక్రమ్) ను కూడ ఈ ఓవర్‌సీస్ కమ్యూనికేషన్ సర్వీస్ ఉపయోగించుకొని, హిందూ మహాసముద్రముపై కుదురుకొనిన ఇంటెల్‌సాట్ III ద్వారా విదేశములతో సంబంధమును ఏర్పరచు కొనినది. ఇట్టి ఉపగ్రహ భూస్థావరమే వేరొకటి డెహ్రాడూన్‌లో 1977 లో నెలకొల్ప బడినది.

రేడియో ప్రసారము భారత దేశమున తొట్ట తొలుతగ 1924 లో మద్రాసున ప్రెసిడెన్సీ రేడియోక్లబ్ చేత మొదలిడబడినది. కాని కొన్ని ఆర్థికపు ఇబ్బందుల వలన 1927 లో ఆ క్లబ్ ప్రసారములను మానివేసినది. అంతట ఒక ప్రయివేటు సంస్థయొక్క యాజమాన్యమున 1927 లో బొంబాయి కలకత్తా నగరములందు ప్రసారములు మొదలైనవి. భారత ప్రభుత్వము 1930 లో ఈ కేంద్రములను స్వాధీనము చేసికొని, తంతి తపాలా శాఖవారికి అప్పగించినది. ఆ శాఖ దీనిని 'ఇండియన్ బ్రాడ్ కాస్టింగ్ సర్వీస్' అను పేర కొంతకాలము నిర్వహించినది; 1936 లో దీనిపేరు ఆల్ ఇండియా రేడియోగను, చివరకు 1957 లో 'ఆకాశవాణి' గను మార్పొంది, తదాదిగ ఆకాశవాణి అను పేరు తోనే వ్యవహరింప బడుచున్నది. దేశమునకు స్వాతంత్ర్యము లభించు నాటికి (1947), దేశము నందంతట ఆరు స్టేషనులు మాత్రమే ఉండినవి. ఇపుడు (1976) 71 స్టేషనులు పనిచేయుచున్నవి. ఇవి గాక మూడు సహాయక స్టూడియో కేంద్రములు వాదోదర, దర్భాంగ, శాంతినికేతనములలో కలవు; ' వీనికి తోడుగ వివిధ భారతి వ్యాపార కేంద్రములుగ చండీఘర్, కాన్పూర్‌లలో రెండు స్టేషనులు పనిచేయుచున్నవి. దేశపు ప్రముఖ సాంస్కృతిక, భాషా మండలముల అన్నింటి అవసరములకు ఈ స్టేషనులు తోడుపడుచున్నవి. దేశీయ ప్రసారములకై, ఈ స్టేషనులలో మొత్తము మీద సంవత్సరమున 270 వేల గంటల కాలము (అనగా రోజునకు 740 గంటల కాలము పైగా) వినియుక్త మగుచున్నది. భారతదేశపు వివిధ భాషల వారికి ఈ ప్రసారములు అందుబాటులో ఉండుటకై, ప్రసార కార్యక్రమములు 20 ముఖ్య భాషలలోను, దాదాపుగ 100 మాండలిక అత్యల్ప సంఖ్యాక భాషలలోను ప్రసారితములు అగుచున్నవి. ఇవిగాక విదేశములకు ఉద్దేశితములగు ప్రసారములు కలవు; ఇందు 16 విదేశీయ భాషలును, 8 దేశీయ భాషలును వినియుక్తములు; ఇట్టి వానికై మొత్తముమీద దినమునకు 58 గంటలు ప్రసారములు జరుగును. అన్ని స్టేషను లందును కలసి 141 ట్రాన్‌స్మిటర్లు కలవు; వీనిలో 109 మీడియమ్ వేవు తరగతికి చెందినవి.

తొలుతగ, 1959 లో ఢిల్లీ నగరమున, ఒక టెలివిజన్ కేంద్రము నెలకొల్ప బడినది; ఆ తరువాత క్రమముగ బొంబాయి, శ్రీనగర్, అమృతసర్, కలకత్తా, మద్రాసు, హైదరాబాదు, గుల్బర్గాలలో టి. వి. కేంద్రములు స్థాపితములైనవి. ఇవి గాక పూనాలో ఒక రిలే సెంటరు పనిచేయుచున్నది. కాని దేశ విస్తృతికి తగినంతగ టెలివిజన్ స్థావరములు ఏర్పడలేదు; ఉన్నవాని యందైనను తెలుపు నలుపు రంగుల ప్రసారమే గాని, తక్కిన వర్ణములలో ప్రసారము ఇప్పటికి ఏర్పరుప బడలేదు.

## 5. యాన సౌకర్యములు

నిడివినిబట్టి చూచినపుడు ప్రపంచమున గరిష్ఠపు రోడ్డు నిడివి కలిగిన దేశములలో భారతదేశము ఒకటిగ లెక్కకు వచ్చుచున్నది. కాని దేశపు విస్తృతిని, జన సంఖ్యాధిక్యమును దృష్టిలో పెట్టుకొని లెక్కించినపుడు రోడ్ల నిర్మాణమున దేశము చాల వెనుకబడి యున్నదని చెప్పక తప్పదు; ప్రస్తుతపు లెక్కలనుబట్టి దేశమున 100 చ. కిమీ. వైశాల్యపు ప్రాంతమున సగటున 15 కిమీ. ల నిడివిగల

రోడ్లు కలవు; ఇక జనసంఖ్యా దృష్టిలో లక్ష ప్రజలు వసించు ప్రాంతమున సగటున రోడ్డు నిడివి 75 కిమీ మాత్రమే. యూరపీయ దేశములతో పోల్చినపుడు ఈ పరిస్థితి చాల హీనముగ కన్పట్టును; అందేకాదు; కడకు ఫిలిప్పీన్స్, శ్రీలంక వంటి కొన్ని వర్ధమాన రాజ్యములును ఈ దేశము కన్న, రోడ్ల నిర్మాణమున చాల ముందంజ వేసినవి. పిలిప్పీన్స్‌లో 100 చ. కిమీ. కు సగటున రోడ్డు నిడివి 18.68; లక్ష ప్రజలకు ఉపయోగించు సగటు రోడ్డు నిడివి 146 కిమీ.

దేశమున జాతీయ రహదార్ల (నేషనల్ హైవేస్) విషయమున కేంద్ర ప్రభుత్వమే భాధ్యత వహించి నిర్వహించు చున్నది. 1971-72 లో ఈ రహదార్ల వర్గమునకు చెందిన మొత్తపు రోడ్ల నిడివి 28,819 కిమీ. ఇందు 55 ప్రముఖములగు రోడ్డు మార్గములు చేరియున్నని. స్వాతంత్ర్య సిద్ధి అనంతరమున 13,000 కిమీ. ల జాతీయ రహదారుల వెడల్పు పెంచబడినవి; 231 పెద్ద వంతెనలు నిర్మింప బడినవి. జాతీయ రహదారులు గాక రాష్ట్రముల చేతను, స్థానిక సంస్థల చేతను నిర్వహింపబడు రోడ్లు వేరుగ కలవు. ఆ యా రాష్ట్రముల వారీగా అందలి పక్కా. కచ్చా రోడ్డుల పొడవులను తెల్పు సంఖ్యా వివరములు దిగువ ఈయబడినవి.

## పట్టిక VI

రాష్ట్రములును, స్థానిక సంస్థలును నిర్వహించు రోడ్ల నిడివి (కిమీ లలో 31-3-1973 నాటికి)

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | పక్కా రోడ్లు | కచ్చా రోడ్లు | మొత్తము |
|---|---|---|---|
| ఆస్సాం | 6,474 | 24,359 | 30,833 |
| ఆంధ్ర ప్రదేశ్ | 47,866 | 32,943 | 80,809 |
| ఉత్తర ప్రదేశ్ | 37,644 | 86,217 | 123,861 |
| ఒరిస్సా | 11,915 | 34,410 | 46,325 |
| కర్ణాటక | 50,999 | 34,434 | 85,433 |
| కేరళ | 27,712 | 96,520 | 124,232 |
| గుజరాత్ | 24,283 | 21,247 | 45,530 |
| జమ్మూ-కాశ్మీరు | 5,748 | 8,599 | 14,347 |
| తమిళనాడు | 57,603 | 41,008 | 98,611 |
| త్రిపుర | 974 | 2,879 | 3,853 |
| నాగాలాండ్ | 1,065 | 4,274 | 5,339 |
| పంజాబ్ | 15,106 | 6,409 | 21,515 |

| భారతదేశములోని రాష్ట్రములు, కేం. పా. ప్రాంతములు | పక్కా రోడ్లు | కచ్చా రోడ్లు | మొత్తము |
|---|---|---|---|
| పశ్చిమ బెంగాల్ | 21,395 | 33,251 | 54,646 |
| బీహారు | 31,752 | 79,184 | 110,936 |
| మణిపూర్ | 1,245 | 7,406 | 8,651 |
| మధ్య ప్రదేశ్ | 34,544 | 53,027 | 87,571 |
| మహారాష్ట్ర | 46,939 | 55.558 | 102,497 |
| మేఘాలయ | 1,065 | 8,241 | 9,306 |
| రాజస్థాన్ | 23,830 | 19,947 | 43,777 |
| హర్యానా | 13,526 | 11,250 | 24,776 |
| హిమాచల ప్రదేశ్ | 2,983 | 10,216 | 13,199 |
| కేంద్ర పాలిత ప్రాంతములు | 9,339 | 8,500 | 17,839 |
| మొత్తము | 474,007 | 679,879 | 1,153,886 |

కేంద్రము నిర్వహించు జాతీయ రహదారుల లోనే, అంతర్జాతీయ రహదారులును, సరిహద్దు రోడ్లును పేర్కొన దగినవి. పాకిస్తాన్‌లోని లాహోరుతోను, బర్మాలోని మాండలేతోను భారత దేశమునకు మార్గ సౌకర్యమును కలిగించు అంత ర్జాతీయ రహదారి భారతదేశమున అమృత్‌సర్ - ఢిల్లీ - ఆగ్రా - కలకత్తా - గోలాఘాట్ - ఇంఫాల్ ద్వారా పయనించును. ఈ రహదారికి అనుబంధ శాఖలుగ వ్యవహరించు రెండు అంతర్జా తీయ రహదారులును కలవు. అందొకటి ధను ష్కోటి - బెంగుళూరు - హైదరాబాదు - గ్వాలి యర్ ద్వారా పయనించి తొలుతటి అంతర్జాతీయ రహదారిని ఆగ్రావద్ద కలియుచున్నది. రెండవది ఖాట్మండూ నుండి బయలుదేరి తొలుతటి దానిని బర్హి వద్ద చేరుచున్నది; దేశపు సరిహద్దుల భద్ర తకై తగు రీతిలో ఆ ప్రాంతములందు రోడ్లను నిర్మించుటకై ఒక బోర్డు 1960 మొదలుగ కృషి చేయుచున్నది. ఆ రోడ్లలో ఒకటియై, హిమాచల చల ప్రదేశ్‌లోని మనాలి నుండి, కాశ్మీరు నందలి లడక్ ప్రాంతపు లే నగరమును చేరు రోడ్డు, ప్రపం చము నందలి రోడ్ల అన్నింటలో, ఎక్కువ ఎత్తున నెలకొనినదిగ ప్రసిద్ధము. సముద్ర మట్టమునకు పైగా సగటున 4,167 మీ. ఎత్తున నుండు ప్రదేశ మున ఈ రోడ్డు నిర్మితము. ఇది నాలుగు కనుమల ద్వారా పయనించును; అందొకదాని ఎత్తు 5,486 మీ.

దేశమున రోడ్ల నిర్మాణమునకు ధనలోపము లేకుండ చేయుటకై, 1929 లో సెంట్రల్ రోడ్ ఫండ్ వ్యవస్థాపిత మైనది. మోటార్ స్పిరిట్‌పై విధించు సుంకమున లీటరుకు 3.5 పైసలు చొప్పున ఈ ఫండునకు ప్రతియేటా ఆదాయము లభించుచున్నది. ఈ ఆదాయమున 80% రాష్ట్ర

ములకును, కేంద్ర పాలిత ప్రాంతములకును, వాని యందు మోటారు స్పిరిట్ వాడకపు నిష్పత్తిలో పంచబడుచున్నది. ఈ విధముగనే గాక కేంద్ర ప్రభుత్వపు దేశీయ వ్యవహార శాఖ, రహదార్ల శాఖ తమకు సంబంధించిన రోడ్ల నిర్వహణకై ఇచ్చు గ్రాంటుల వలన కూడ సెంట్రల్ రోడ్ ఫండునకు అదనపు ఆదాయము లభించుచున్నది. ఇరువది యేండ్ల ప్రణాళికను (1961-81) ఒక దానిని రూపొందించి, దానికి అనుగుణముగ రోడ్ల అభి వృద్ధి కొనసాగింప బడుచున్నది. దీనిని అనుస రించి, ప్రణాళికాంతమునకు దేశమున ఏ వ్యావ సాయిక గ్రామమును పక్కా రోడ్డునకు 6.4 కిమీ.ల దూరమునకు మించిగాని, కచ్చా రోడ్డునకు 2.4 కిమీ. దూరమునకు మించిగాని ఉండకుండు నటుల అభివృద్ధి సాగగలదని ఆసించబడుచున్నది.

దేశమున తొలుతటి రైలు మార్గపు నిర్మాణము- బొంబాయి నుండి ఠాణాకు - 1850 లో ప్రారం భిత మైనది. 1853 లో పూర్తియై 33 కిమీ. ల నిడివి కలిగిన ఈ మార్గమున తొలుతటి రైలుబండి ఏప్రిల్ 16, 1953 న బొంబాయి నుండి ఠాణాకు పయనించినది. భారత దేశముననే కాదు; ఆసియా ఖండమున సైతము ఇదియే తొలుతటి రైలు మార్గము. అంతటి నుండి, ప్రభుత్వ ప్రోత్సాహ ముతో, వివిధ ప్రయివేటు సంస్థలు దేశమున పలు ప్రాంతము లందు రైలు మార్గముల నిర్మాణమున ముందంజ వేసినవి. కొన్ని సంస్థానములును, స్వయముగ గాని, లేదా ప్రయివేటు సంస్థలను ప్రోత్సహించిగాని తమ ప్రాంతములందు రైలు మార్గములను ఏర్పాటు చేసినవి. స్వాతంత్ర్య సిద్ధికి పూర్వమే భారత ప్రభుత్వము, తన ఆధీనపు దేశము నందలి రైలు మార్గములను అన్నింటిని కొనుగోలు చేసినది. స్వాతంత్ర్యము లభించిన తరువాత సంస్థానములును భారత రాజ్యమున లీన మగుట వలన దేశపు మొత్తమున ఉన్న 53,596 కిమీ. ల నిడివి కలిగిన రైలు మార్గము భారత ప్రభుత్వమునకు ఆధీనమయినది (1950). 1925 లో విద్యుత్ సాయమున కొన్ని మార్గము లందు రైలు బండ్లను నడపుట మొదలైనది. 1973-74 లో మొత్తపు రైలు మార్గముల నిడివి 60,234 కిమీ.; ఇందు 4,191 కిమీ. ల నిడివిన బండ్లు విద్యుత్ సాయమున నడచుచున్నవి.

రైలు మార్గముల నిర్వహణ భారత ప్రభుత్వపు ఒక మంత్రి ఆధ్వర్యమున నడచుచున్నది. రైల్వే బోర్డు సాయమున అతడు ఈ నిర్వహణను సాగిం చును. 1925 మొదలుగ రైలుమార్గముల విత్త వ్యవహారములు. కేంద్ర ప్రభుత్వపు సాధారణ బడ్జెటునుండి వేరుగ ఉంచబడుచున్నవి. రైలు మార్గములపై ప్రభుత్వపు పెట్టుబడిని అనుసరించి, ఒక నిర్ణీత రీతిలో, జనరల్ బడ్జెటునకు, ప్రతి యేటా ఒక మొత్తమును రైల్వేశాఖ సమకూర్చ వలసి ఉన్నది. 1964 వరకు పెట్టిన పెట్టుబడిపై $4\frac{1}{2}$% చొప్పునను, తరువాతి పెట్టుబడిపై $5\frac{3}{4}$% చొప్పునను ప్రతి యేటా రైల్వేశాఖ ఈ రీతిగ చెల్లించవలసి ఉన్నది; ఇదిగాక ఏటా 12.5 కోట్లను, అదనపు మొత్తంగా చెల్లించు ఏర్పాటు సైతము కలదు. రైల్వేశాఖయే, రైలు ఇంజను లను, రైలు బోగీలను నిర్మించుటకై మూడు కర్మా గారములను - చిత్తరంజన్, వారణాసీ, పెరం బూరులలో - నెలకొల్పినది ఇందు తొలుతటి దాని యందు ఆవిరి ఇంజనులును, 1961 మొదలుగ విద్యుత్ ఇంజనులును తయారు చేయబడుచున్నవి; రెండవ దానిలో డీజెల్ ఇంజన్లు తయారగు చున్నవి; కాని ఇందలి కొన్ని భాగములు విదేశ ములనుండి దిగుమతి అగుచున్నవి; మూడవ దానిలో సాధారణ బోగీలు, డీజెల్ రైలు కారులు, ఎయిర్‌కండిషన్ బోగీలు నిర్మింపబడు చున్నవి.

దేశాంతస్థములై, బోట్ల ప్రయాణములకు ఉప యుక్తములగు నదీ మార్గముల మొత్తపు నిడివి

దాదాపు 14,150 కిమీ. వీనిలో గంగానదీ, బ్రహ్మ పుత్రా నదులును, వాని ఉపనదులును; గోదావరీ కృష్ణా నదులును, వాని కాలువలును, కేరళలోని పోటు కాలువలును, ఆంధ్రప్రదేశ్ తమిళ నాడు లలో ప్రవహించు బకింగ్‌హామ్ కాలువయు; గోవా లోని మండోవీ, జువారీ నదులును ప్రముఖములు.

భారత దేశమున సముద్రతీర స్థలములగు రేవు నగరములు పది కలవు. అవి: బొంబాయి, కలకత్తా, కొచ్చిన్, కాండ్లా, మద్రాస్, మంగుళూరు, మార్మ గావ్, పరాదీప్, తూత్తుకుడి, విశాఖ పట్టణం. ఇవి గాక మధ్య తరగతికిని, చిన్న తరగతికిని చెందిన రేవులు మొత్తంమీద 160 కి పైగా కలవు. పెద్ద రేవుల అన్నింటిలో బొంబాయి యందలి హార్బరు చాల పెద్దది. దేశపు విదేశ వ్యాపారమున దాదాపు నాలుగవవంతు దీని ద్వారా నడచుచున్నది.

ఆసియాలోని రాజ్యములందు సముద్ర నౌకల సంఖ్యా విషయమున, భారత దేశము రెండవదిగ లెక్కకు వచ్చుచున్నది: కాని ప్రపంచ రాజ్యముల లెక్కలో అది ఏడవ స్థానమున ఉన్నది. జూన్ 1, 1976 నాటికి దేశపు వర్తక నౌకల సంఖ్య 318; వీని మొత్తపు ప్రమాణము 47.3 లక్షల టన్నులు; దేశపు మొత్తమున 34 నౌకా వ్యాపార సంస్థలు పనిచేయుచున్నవి. వీనిలో రెండు - షిప్పింగ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, మొగల్ లైన్స్ - ప్రభుత్వ రంగమునకు చెందినవి. తక్కినవి ప్రయి వేటు కంపనీల ఆధీనమున ఉన్నవి. ప్రభుత్వ రంగపు వానిలోని షిప్పింగ్ కార్పొరేషన్‌కు 105 నౌకలు కలవు; వాని మొత్తపు ప్రమాణము 14.35 లక్షల టన్నులు. దాదాపుగ ప్రపంచపు ప్రసిద్ధ సముద్ర మార్గములందెల్ల ఆ నౌకలు పయ నించుచున్నవి; అంతేగాక దేశపు తీర వ్యాపారము నను అందు కొన్ని పాల్గొనుచున్నవి. రెండవది యగు మొగల్ లైన్స్, మక్కా యాత్ర (హజ్) కై పోవు యాత్రికులను బొంబాయి నుండి జెద్దాకు కొనిపోయి తీసికొని వచ్చుట తన ముఖ్య కార్య క్రమముగ గ్రహించినది; అంతేగాక కొంకణ్ తీర మున ఆ సంస్థకు చెందిన రెండు నౌకలు వ్యాపార మునను పాల్గొను చున్నవి: ఆ సంస్థకు 7 నౌకలు కలవు; వాని మొత్తపు ప్రమాణము 55,787 టన్నులు. ప్రయివేటు రంగము నందలి నౌకా వ్యాపార సంస్థలలో, లక్షకు పైబడిన టన్నేజి కలిగినవి: 1. సింధియా స్టీమ్ నావిగేషన్ కంపనీ (5 లక్షల టన్నులు), 2. గ్రేట్ ఈస్టరన్ షిప్పింగ్ కంపనీ (2.74 లక్షలు), 3. ఇండియన్ స్టీమ్‌షిప్ కంపనీ (1.54 లక్షలు), 4. సౌత్ ఇండియా షిప్పింగ్ కార్పొరేషన్ (1.22 లక్షలు). దేశమున నాలుగు నౌకా నిర్మాణ సంస్థలు - విశాఖ పట్టణం, కలకత్తా, బొంబాయి, కొచ్చిన్ లలో - కలవు.

భారత దేశమున విమానయానము 1911 లోనే మొదలైనదని చెప్పవచ్చును. ఆ సంవత్సరమున పికెట్ అను ఫ్రెంచి పౌరుడు అలహాబాదు నుండి నైనీకి (10 కిమీ.) తపాలును విమానములో కొని పోయెను. ఈ విధముగ ప్రపంచమున తొలుతటి విమానపు తపాలును నిర్వహించిన ఖ్యాతి భారత దేశమునకు దక్కినది. అయినను వ్యవస్థిత రీతిలో విమానయానము 1920 జనవరిలో మొదలైనదని మాత్రమే చెప్పదగును. ఆ సంవత్సరమున కరాచీ - బొంబాయిల మధ్య ప్రభుత్వపు తపాలాకై విమానపు సర్వీస్ ఆరంభమైనది. క్రమముగ ప్రభు త్వమున 1927 లో ఒక పౌర విమానశాఖ ఏర్ప రుప బడినది. అటనట అంతట విమానాశ్రయ ములును, ఫ్లయింగ్ క్లబ్బులును ఏర్పడినవి; 1929 లో ఇండియా - గ్రేట్ బ్రిటన్‌ల మధ్య విమానయాన సౌకర్యము నెలకొల్పబడినది. స్వాతంత్ర్య సిద్ధి అనంతరమున విమానయానము విరివిగ విస్తృతిని పొందినది. 1949 లో రాత్రి విమానములలో తపాలాను కొనిపోవుట మొదలైనది.

దేశమందు ప్రస్తుతమున విమానయానము, ప్రభుత్వ రంగమున పనిచేయు, రెండు సంస్థల ఆధ్వర్యమున ఉన్నది. ఇందు ఎయిర్ ఇండియా అనునది అంతర్జాతీయ విమానయానమును నిర్వ హించును; ఇండియన్ ఎయిర్‌లైన్స్, దేశాంతర్గత విమాన యానములను నిర్వహించుటయే గాక, ఇరుగు పొరుగు రాజ్యములగు బర్మా, బంగ్లాదేశ్, నేపాల్, శ్రీలంకల ముఖ్య నగరములతో కూడ దేశమునకు యాన సౌకర్యమును కల్పించుచున్నది.

ఎయిర్ ఇండియా వలన భారత దేశము నుండి 29 విదేశములకు వాయు మార్గమున రాకపోకల వసతులు కలవు. భారత దేశమునకు ఆఫ్ఘనిస్తాన్, ఆస్ట్రేలియా, బెల్జియం, బర్మా, జెకోస్లొవాకియా, ఈజిప్ట్, ఇతియోపియా, పశ్చిమ జర్మనీ, ఫిజీ, ఫ్రాన్స్, హంగరీ, ఇండోనీసియా, ఇరాన్, ఇరాక్, ఇటలీ, జపాన్, కెన్యా, కువాయిట్, లెబనాన్. మలేసియా, మారిషస్, నేపాల్, నెదర్‌లాండ్స్, పాకిస్తాన్, ఫిలిప్పీన్స్, సౌదీ అరేబియా, సింగ పూర్, శ్రీలంక, స్వీడెన్, స్విజర్‌లాండ్, టాన్జె నియా, తాయ్‌లాండ్, ఉగాండా, యునైటెడ్ కింగ్ డమ్, యు. స్టే. సోవియెట్ రష్యాలతో విమాన యానపు ఒడంబడికలు కలవు.

దేశమున నాలుగు అంతర్జాతీయ విమానాశ్ర యములు - బొంబాయి (సాంతా క్రుజ్), కలకత్తా (డం డం), ఢిల్లీ (పాలం), మద్రాస్ (మీనం బాకం) లలో కలవు. భారత దేశపు విమానములే కాక, భారత దేశము ద్వారా పయనించు వివిధ విదేశీయ విమానయాన సంస్థలును ఈ విమానాశ్ర యములను వాడుకొనుచున్నవి. ఇవిగాక, దేశమున ప్రముఖ నగరములందు 84 విమానాశ్రయములు కలవు. ఇందు 15 ఆశ్రయములలో రాడారు వసతులు కలవు. పౌర విమాన యానమునకు తగు పైలటులను తయారు చేయుటకు అలహాబాదునను, హైదరాబాదు వద్దనున్న నాదర్‌గుల్ వద్దను రెండు విమానయాన శిక్షణ సంస్థలు కలవు.

ఎయిర్ ఇండియాకు బోయింగ్ తరగతిలో రెండు రకములకు చెందిన 14 విమానములు కలవు. ఎయిర్ ఇండియాకు వివిధ తరగతులకు చెందిన ప్రయాణిక విమానములు 45 కలవు (1976).

## 6. చరిత్ర

అతి ప్రాచీన కాలము నుండియు నిరంత రాయమగు చరిత్రయు, సాంస్కృతిక ప్రగతియు కలిగిన దేశములు రెండింటిలో భారతదేశ మొకటి (రెండవది చీనా దేశము). ఈ దేశమున మానవుడు నివసించుట ఎపుడు మొదలయ్యెనను విషయమున అభిప్రాయ భేదములు కలవు. కాని దక్షిణ దేశపు తూర్పు మైదానములందు, శీతోష్ణ పరిస్థితుల అనుకూల్యమువలన ఆదిమ భారతీయుడు రూపొంది, క్రమముగ ఉత్తరమున పంజాబ్ వరకు పయనింప గలిగెనని పండితులలో పలువురి అభిప్రాయము. ఆంధ్రప్రదేశ్‌లోని బిల్ల సుర్గపు పరిసరములందు శిలాయుగ కాలపు మానవా వాస ములు కననైనవి. ఇట్టులే హిమవత్పర్వత పాదపు సోన్ నదీ లోయ యందును ఆ యుగపు మానవా వాస చిహ్నములు కాన్పించినవి.

ప్రపంచపు ప్రాచీన నాగరికతా కేంద్రములలో, ఒకటిగ పేరుగన్నది సింధు నదీ ప్రాంతము. ఈ ప్రాంతమున క్రీ. పూ. 3000 పరిసరములలోనే ఒక వికసిత సంస్కృతి నెలకొనినటుల త్రవ్వకముల వలన స్పష్టమైనది. పాకిస్తాన్‌లోని మొహంజా దారో మొదలగు ప్రాంతము లందును, భారతదేశపు కాలీబంగన్, లోతాల్, రూపార్ మొదలగు ప్రదే శము లందును ఈ త్రవ్వకముల వలన, ఆ నాటి కోటల భవనముల వాస్తు నిర్మాణ విశేషములును, అజ్ఞాతమగు ఒక లిపిలోని వ్రాతలు కలిగిన ముద్రి కలును కానవచ్చినవి. భారత ఉప ఖండమున

పశ్చిమ భాగమున సిమ్లా మొదలుగ గోదావరి తటము వరకున్న విస్తృత భూమియందు ఈ నాగరికత కుదురుకొని యుండినటుల స్పష్టమైనది.

ఈ సింధు నాగరికత ఈజిప్ట్, సుమేర్, ప్రాచీన చీనీయ నాగరికతల కన్నను ప్రాచీన తరమని కొందరి అభిప్రాయము; సమకాలిక మని కొందరనెదరు. ఇచటి త్రవ్వకములందు కన్పట్టిన ముద్రికలు మొదలగు వానిపైని లిపి నేటికిని దురవగాహముగ ఉండుట వలన, ఆ నాటి విషయములను మనము సరిగ గుర్తెరుగజాల కున్నాము. భూమి పొరల లెక్కనుబట్టి చూడ అచటి తొలుతటి నగరము క్రీ. పూ. 3750 నాటికే రూపుగొనెనని తెలియవచ్చుచున్నది. అచటి ప్రజలు నగర నిర్మాణ నైపుణ్యమునను, నాగరక జీవనమునను అత్యుచ్చ స్థాయిని అందినటుల స్పష్టము. ఆ ప్రజలు ఏ మానవ జాతికి చెందిన వారనుటయు వివాదాస్పదమున ఉన్నది. క్రీ. పూ. 2000 దరిదాపులలో సింధు నాగరికత కొన్ని ప్రాంతములందు అంతరించె ననుటకు నిదర్శనములు కొన్ని కలవు. కాని దానిని అంతరింపజేసిన వా రెవరనుటలో కూడ పండితులందు ఏకాభిప్రాయము లేదు. ఆర్యజాతి భారత దేశమున క్రీ. పూ. 1500 పరిసరములలో సింధు ప్రాంతమున చేరెననియు వారు వచ్చుటకు ముందుగనే సింధు నాగరికత అంతరించి యుండుననియు కొంద రనెదరు. కాని ఆర్యుల సాంస్కృతిక భాండారమగు వేదములందు ఆర్యేతరజాతులగు దస్యులతో వారు సాగించిన యుద్ధముల ప్రసక్తియు, కొందరు అనార్య ప్రభువులు ఆర్య ఋషులను ఆదరించి వారికి దానముల నొసగుటయు, ఆ అనార్య ప్రభువులను కీర్తించు దానస్తుతులును ఉండుట వలన, ఆర్యు లిట చేరునప్పటికి ఒక ప్రాచీన నాగరికత (బహుశః సింధు నాగరికతయే) చైతన్య వంతముగ మనియుండినదనియు, ఆర్యులు ఆ నాగరికతలోని పలు విషయములను స్వీయములుగ చేసికొని, ఆ దస్యు జాతులలో ఆర్య సంస్కృతికి ప్రాపకము కల్గించిరనియు భావించుటయే సమంజసముగ కన్పట్టుచున్నది,

ఆర్యులు తొలుత సప్తసింధు ప్రాంతమున వసించి యుండిరనుట వైదికాధారముల వలన సుస్పష్టము. నేటి ఆఫ్ఘనిస్థాన్ లోని కాబూల్‌నది మొదలుకొని, భారత దేశములోని పంజాబు నందలి తూర్పు సరిహద్దు వరకు గల ప్రాంతమే ఆ కాలమున సప్త సింధువుగ వ్యవహరింప బడినది. (ఈ 'సింధు' పదమే పారసీకుల భాషలో వికృతి చెంది 'హిందు' అని మారి కడకు అదియే దేశమునకును, దేశము నందలి ప్రాచీన మతమునకును పేరుగ పరిణమించినది). ఈ ఆర్యులు తమ సంస్కృతిని క్రమముగ తూర్పునకును దక్షిణమునకును వ్యాపింపజేసిరి. రామాయణేతిహాసము, ఈ ఆర్య సంస్కృతి వ్యాపననే తెలియజేయు చున్నదని కొందరి అభిప్రాయము. ఈ కాలముననే ద్రావిడజాతి అనునది దక్షిణాపథమున కొంత సంస్కృతి స్థాయిని కలిగి మనగలిగినను కాలక్రమమున ఆ జాతియందు సైతము ఆర్య సంస్కృతి తావు కల్పించుకొనినది. ఆ నాడు ఆర్యులందు ప్రకృతి దేవతారాధనయు, పశు హింసతో కూడిన యజ్ఞములపై ఆధారపడిన ఆరాధనా విధానమును వ్యాప్తిగొని యుండెనని వేదములవలన తెలియనగును. అందుతో పాటుగ ప్రపంచ సృష్టికి అంతటికిని మూలాధారమగు పరమేశ్వర తత్త్వము ఒకటి కలదనియు, దానినే వారి వారి అభిరుచులను అనుసరించి వివిధ ప్రజలు వివిధ నామములతో వ్యవహరింతు రనియు చెప్పబడినది. ఇట్టి సమరస భావన, వివిధ స్థాయిలలో, భారత దేశమున వివిధ ప్రాంతములలో వసించు పలు తెగలను సాంస్కృతికముగ ఏకీకృతము చేయుటకు చక్కగ ఉపకరించినది. ఇట్టి సాంస్కృతికపు ఏకతతో పాటుగ రాజ్యపు ఏకతను సాధించుటకు కూడ కొన్ని యత్నములు జరిగినవి.

కురు పాండవ యుద్ధమును చిత్రించు మహాభారతేతిహాసము ఇట్టి కృషినే వివరించుచున్నదని కొందరి అభిప్రాయము. అయినను ఈ కృషి ఆ నాడు ఎక్కువగ ఉత్తర హిందుస్థానముననే సాగినది. క్రీ. పూ 6 వ శతాబ్దము నాటికే విశాల రాజ్యములను స్థాపించు ఇట్టి యత్నపు ఫలితముగ, ఆర్యావర్తమని ఆ కాలమున వ్యవహృతమైన ఉత్తర హిందూస్థానమున పదునారు ఆర్య మహాజన పదములు ఏర్పడినవి. వీనిలో అవంతి, వత్స, మగధ అనునవి సామ్రాజాధిపత్యమునకై పోటీపడి కృషి చేసినవి. కడకు, మహాపద్మనందుని కాలమున (క్రీ. పూ. 6 వ శతాబ్ది) మగధ రాజ్యము బలవత్తరమై తక్కిన రాజ్యములను లోగొనగ, రావీ నది మొదలు గోదావరి వరకు, ఆరేబియా సముద్రము మొదలుకొని బంగాళా ఖాతము వరకు విశాలమగు మగధ సామ్రాజ్యము రూపుగొనినది. 'ఏకరాట్' అను బిరుదును వహించి మహాపద్మనందుడు ఈ సామ్రాజ్యమును సువ్యవస్థితము చేసెను; కొలతూకములను ప్రమాణీకరించెను.

ఇటుల దేశమున ఒక సువ్యవస్థిత సామ్రాజ్యము ఏర్పడు నాటికి వైదిక మతము దేశ ప్రజలందు చక్కని కాలూనకొన గలిగినది. యజ్ఞములపై ఆధారపడిన ఆరాధనా విధానము ఆదరణీయమైనది; తొలుత ఆర్యులందు వృత్తిరూపకముగ ఏర్పడిన వర్ణ విభజన, జన్మపై ఆధారపడుట మొదలై, బ్రాహ్మణులకు ఆ వ్యవస్థయందు అగ్రస్థానము ఏర్పడినది; వేదములపై ఆధారపడిన కర్మకాండయు విరివిగ పెరిగినది. ఈ కర్మకాండను నిరసించి, పరమేశ్వర తత్త్వమును జ్ఞానము మూలమున సాధించ వలయునను ఋషులును ఆనాడు కొందరు ఉండిరి. ఉపనిషత్తులు అనబడునవి ఆ వాదమునే వివరించును. కాని అట్టి వారి సంఖ్య అత్యల్పమగుటవలన వర్ణాశ్రమములందు అంధ విశ్వాసము, పశుహింసపై ఆధారపడిన యజ్ఞములందు నమ్మిక సామాన్య ప్రజలందు గాఢముగ వ్యాపించినవి. ఈ పరిస్థితి నుండి ప్రజలను వెలికి లాగుటకై రూపొందినవే జైన, బౌద్ధ మతములు.

జైన మతమును వెలయించినవాడు మహావీరుడు (క్రీ. పూ. 540-468); బౌద్ధమత మూల ప్రవక్త 'బుద్ధ' నామమున వ్యవహృతుడగు సిద్ధార్థ గౌతముడు (క్రీ. పూ. 560-480). వీరు ప్రవచించిన మతములందు కొన్ని విభేదములున్నను వేదప్రామాణ్యమును, పశుహింసా మయమగు యజ్ఞకాండను నిరసించుట యందును, వర్ణవ్యవస్థ యందలి నమ్మికను సడలించుట యందును ఈ రెండు మతములును ఏకీభవించినవి. అహింసపై ఆధారపడి తన శీల, సదాచార సంపత్తిని మానవుడు వృద్ధిపరచు కొనునటుల చేయుటయే ఆ ఇరువురి లక్ష్యము. ఈ ఇరువురు మతాచార్యులును రాజవంశములందు జన్మించిన వారలే. అయినను పలువురు బ్రాహ్మణులే, వీరి ఉపదేశము లందలి సామంజస్యమును గ్రహించి, వారి శిష్యులై వారి మతముల ప్రచారములకు తోడ్పడిరి. పలువురు రాజులును, ప్రముఖులును ఆ మహా పురుషులను ఆదరించిరి; కాని తొలుత ఆ మతములు అంతగ ముందంజవై చి ప్రజలలో వ్యాపించినవికావు. కడకు క్రీ. పూ. మూడవ శతాబ్ది నాటికి పరిస్థితులు చక్కగ అనుకూలించి బౌద్ధ మతము, దేశ విదేశములందు ఆదరణను ఆర్జించినది

మహాపద్మనందుని తరువాతి పాలకుల కాలమున అలెగ్జాండరు (చూ. పు. 705) భారత ఉపఖండపు వాయవ్య ప్రాంతముపై దండయాత్ర చేసెను. అత డట కొన్ని అల్పరాజ్యములను వశపరచుకొనెను. కాని తక్కిన భారత దేశములోనికి చొరబారుటకు అతని సైనికులు నిరాకరించిరి. తక్కిన భారత దేశమును పాలించు సామ్రాట్టునకు ప్రచండ సేనాబలము కలదని తెలియవచ్చుటయు,

ఆ సైనికులు ఆటుల నిరాకరించుటకు కారణభూత మయ్యెనని ఆనాటి గ్రీకు రచయితల వ్రాతల వలన తెలియవచ్చుచున్నది. అపుడు భారత దేశమును పాలించు నందరాజుల బల ప్రసక్తి అది కావచ్చును. అలెగ్జాండర్ మగధ సామ్రాజ్య ద్వారము కడనుండి వెనుదిరిగిపోయిన (క్రీ పూ 328) తరువాత మగధ సామ్రాజ్యము కొన్ని ఆంతరంగిక కల్లోలములను ఎదుర్కొన వలసి వచ్చినది. రాజుల దుష్పరిపాలన వలన ప్రజలలో కలిగిన అసంతృప్తిని అండగ గ్రహించి రాజవంశమునకు సన్నిహితుడగు చంద్ర గుప్తుడు, చాణక్యుడను రాజ్యతంత్రజ్ఞుని సాయమున, తిరుగుబాటును లేవదీసి కడకు సామ్రాజ్యమును వశ పరచు కొనెను (క్రీ. పూ. 322) ఈతని వంశమే మౌర్య వంశము అను పేర చారిత్రక ప్రసిద్ధిని ఆర్జించినది. నంద రాజ్యమునే గాక, గ్రీకులను జయించి పంజాబ్, ఆఫ్ఘనిస్తాన్, బెలూచిస్తాన్‌లను; అత్యంత దక్షిణ భాగమును, కళింగమును తప్ప తక్కిన దక్షిణాపథమును ఇతడు తన సామ్రాజ్య మున కలుపుకొన గలిగెను. ఈతని మనుమడే సుప్రసిద్ధుడగు అశోక చక్రవర్తి (క్రీ. పూ. 272-231 ప) కళింగమును వశపరచుకొనుటకై అతడు సాగించిన యుద్ధమున ఉభయ పక్షము లందు జరిగిన జననష్టమును, రక్తపాతమును హింసా విధానములపట్ల అతనికి విముఖతను కల్పించి, బౌద్ధ ధర్మమును అతడు అవలంబించు నటుల చేసినవి (క్రీ. పూ. 261). తదాదిగ, పర ధర్మములయెడ అసమాన సహిష్ణుతను ప్రదర్శించు చునే, బౌద్ధమత ధర్మ ప్రచారము తన రాజ్య మునందే గాక, విదేశము లందును సాగునటుల ఆయన ప్రోత్సహించి, ఆ నాటి నాగరక ప్రపంచ మున అత్యధిక భాగమున ఆ మతమును వ్యాపింప జేసెను. విజయమును పొందియు తనంతగ తానే రణభేరి ఘోషను నిరసించి, ధర్మ ఘోషను ఆద రించి, ధర్మవిజయమునే ముఖ్యాదర్శముగ గ్రహించి ఆచరణలోనికి దానిని కొనిరాగలిగిన చక్రవర్తి, ప్రపంచ చరిత్రలో, అత డొకడు తప్ప, వేరొకడు కన్పట్టడు. బౌద్ధ ధర్మ ప్రచారమున కును, రాజ్య పరిపాలనా రీతికై ప్రభుత్వోద్యోగు లకు తగు సూచనలను ఇచ్చుటకును, ప్రజలకు సాధారణ నైతిక ధర్మములందు నిష్ఠను కలిగించు టకును, సామ్రాజ్యము నందు అటనట పలు ప్రాంతములందు శిలా శాసనములను ఆయన సంస్థా పింప జేసెను; అవి అన్నియు, ఆ కాలపు ప్రజ లకు సుజ్ఞాతమగు ప్రాకృత భాషలో వ్రాయబడి నను, ఆ యా ప్రాంతములందు వాడుకలో నుండిన లిపులలో వ్రాయబడినవి; ఇందులకై సామ్రాజ్యపు అతి వాయవ్య ప్రాంతమున గ్రీకు లిపిలోను, పశ్చిమ ప్రాంతమున ఖరోష్ఠి లిపిలోను, తక్కిన సామ్రా జ్యమున బ్రాహ్మి లిపిలోను ఈ శాసనములు రూపొందింప బడినవి. దేశమునందు అటనట, బౌద్ధమత పవిత్ర స్థలములందు శిలా స్తంభములను ఆయన నెలకొల్పె జేసెను. వాని యందలి శిల్ప రమ్యత ఈ నాడును పలువురి మన్ననలను అందు కొను చున్నది, అట్టి ఒక శిలా స్తంభము నందలి ధర్మచక్ర చిహ్నపు ప్రతిరూపమే నేటి భారత జాతీయ పతాక లాంఛనముగ ఆదరితమై, నిరంతరముగ, భారతీయ సంస్కృతి యందు కన వచ్చు ఏకతను ప్రస్ఫుటము చేయుచున్నది.

అశోకుని తరువాతి పాలకులు క్రమముగ బల హీను లగుటవలన మౌర్య సామ్రాజ్యము తన ప్రతి ష్ఠను కోల్పోవగా, దేశమున వివిధ సామంతులు ప్రబలులైరి. కొందరందు కొన్ని విశాల భాగము లను ఆక్రమించుకొని సామ్రాజ్యములను ఏర్పరచు కొనిరి. అట్టి వారిలో ఆంధ్ర సాతవాహనులు ప్రముఖులు. క్రీ. పూ. 28 మొదలుగ దాదాపు రెండు వందల సంవత్సరములు దక్షిణాపథమును, ఉత్తర హిందూస్థానమున కొంత భాగమును వీరు పాలించిరి. కాని వీరి పాలనా కాలముననే పశ్చిమ,

వాయవ్య భారతములు గ్రీకుల, శకుల, పహ్లవుల, కుషానుల దాడులకు గురియైనవి. ఇందు శక, పహ్లవులు ఆంధ్ర సామ్రాజ్య పతనమునకును కొంత వరకు కారణభూతులైరి. గ్రీకులు అనేక మాండలిక రాజ్యములను పాలించి, కడకు శక, కుషానుల ధాటికి చరిత్రనుండి అంతర్హితులైరి. కుషానులలో ప్రముఖుడు కనిష్కుడు. ఇతడు ఉత్తర హిందూస్థానమున అత్యధిక భాగమును పాలించెను. క్రీ. శ. ఒకటవ శతాబ్దికి చెందిన ఈతని పట్టాభిషేక కాలమే శక వర్షకాల గణనలో తొలుతటి సంవత్సరము (క్రీ. శ. 78) గ లెక్కకు వచ్చెనని కొందరి అభిప్రాయము; కాని ఇది వివాదాస్పద విషయము.

క్రీ. శ. తొలుతటి రెండు శతాబ్దములు ముగియు నాటికి భారత దేశము, చాల చిన్న మాండలిక రాజ్యములుగ విభక్తమైనది; అయినను దేశమున ఒక విధమగు సాంస్కృతిక ఐక్యము సర్వత్ర కుదురుకొని ఉండగలిగినది. అప్పటికి దేశమునందలి వైదిక, బౌద్ధ, జైన మతములు, ఇచ్చి పుచ్చుకొను రీతివలన బహుధా రూప వికృతులను పొందినవి. వైదిక మతము యజ్ఞము లందలి కర్మకాండను చాలవరకు త్యజించి, భక్తి మార్గమునకు ప్రాధాన్యము కలిగిన పౌరాణిక హిందూ మతముగ మారుచుండినది; బౌద్ధమున మహాయాన సంప్రదాయమును, బుద్ధదేవుని మూర్తిని ఆరాధించుటయు - ఎక్కువగ ఆదరణీయము లైనవి; జైన మతముకూడ విగ్రహారాధనను ప్రోత్సహించినది. ఈ మూడు మతముల వారును దేవాయతనములను నిర్మించి, మతమును సామాన్య మానవుని ఆలోచనా పరిధిలోనికి కొనివచ్చుటకై పోటీపడి కృషి సేయ సాగిరి. ఇందు వలన ఒక విశిష్ట రీతిలో భారతీయ వాస్తు, శిల్ప, చిత్రకళాది లలిత కళలు, ఆరాధనకు ఉపకరించు సంగీత కళయు వికసించినవి. బౌద్ధులును, జైనులును అదివరకు తాము మత ప్రచారమునకై వాడెడు ప్రాకృత భాషలను ఆవల నుంచి, బ్రాహ్మణ మతాను యాయులతో పాటుగ సంస్కృతమునే ఆశ్రయించిరి. ఈవిధముగ సంస్కృత భాష దేశమందలి అన్ని మతముల వారికి అనుసంధాన భాషగ ఉపకరించి, దేశైక్యమునకు దోహదము చేసినది.

క్రీ. శ. మూడవ శతాబ్ది మొదలుగ పదవ శతాబ్దము వరకు నడచిన భారరదేశ చరిత్రను వివిధ రాజ్యముల మధ్య సామ్రాజ్య వ్యవస్థాపన కొరకై జరిగిన విస్తృత యత్నముల కథనముగ పేర్కొనవచ్చును. ఇందులో ఉత్తర భారతమున గుప్త రాజులు కొంత వరకు, నాలుగవ శతాబ్ది మధ్య భాగమున నెగ్గి, దాదాపు రెండు వందల సంవత్సరముల కాలము సామ్రాజ్యపు సుస్థిరతను కాపాడు కొన గలిగిరి. వీరి పరిపాలనా కాలమున సంస్కృత భాష ఎంతయో వర్ధిల్లినది; ఆ భాషయందు నేడు ఉపలబ్ధమగు ఉత్తమ సారస్వతమున అధిక భాగమును, పురాణములందు అనేకములును, ధర్మ శాస్త్రములు అనేకములును ఆనాడు రూపుగొనినవి. గుప్త సామ్రాజ్యము హూణుల ధాటికి ఆరవ శతాబ్ది మధ్యభాగమున అంతరించగ, దేశమును అరాజక పరిస్థితులనుండి ఉద్ధరించి కాపాడినవాడు హర్షుడు (క్రీ. శ. 606-647). అతని అనంతరమున ఉత్తర భారతము మరల ఏకతను రాజకీయముగ కోల్పోయినది. కడకు ప్రతిహార వంశీయుడగు భోజుడు ఆ ప్రాంతమున అత్యధిక భాగమును లోగొని చక్రవర్తి కాగలిగెను (క్రీ. శ. 936). అయినను క్రీ. శ. 977 లో ఈ సామ్రాజ్యము స్థైర్యమును కోలుపోగా, అందలి వివిధ ప్రాంతములు స్వతంత్ర మాండలిక రాజ్యములుగ రూపు గొనినవి. 12 వ శతాబ్ది అంతమువరకు పరిస్థితి ఆ తీరుననే ఉండినది. ఆ మాండలికులు పరస్పరము తగవులాడుకొనుట ఆనాడు దేశమున ఎల్లెడల కననగుచుండెడిది.

ఇక దక్షిణ భారతమున సైతము సామ్రాజ్య స్థాపనకై వివిధ రాజ్యములమధ్య ఇట్టి కలహములే చెలరేగినవి. ఆంధ్ర సాతవాహన సామ్రాజ్యము అంతరించిన పిదప, దక్షిణాపథమున వాకాటకులు పల్లవులు మొదలగువారు ప్రబలులై ఆధిపత్యమునకు పెనగులాడిరి. అందు పల్లవులు కన్యాకుమారి నుండి కృష్ణవరకు ఉన్న ప్రాంతమును అత్యధిక కాలము పాలించిరి. ఆ పల్లవ రాజులలో సుప్రసిద్ధుడు విచిత్ర చిత్తుడని పేరొందిన మహేంద్రవర్మ (క్రీ. శ. 600-630). ప్రస్తుతము మద్రాసు సమీపమున మామల్లపురమున కననగు ఏకాశిలా నిర్మిత రథాలయ, గుహాలయ, నతోన్నత శిల్పములలో అధికభాగము అతడు రూపొందింప జేసినవియే. వాకాటకుల అనంతరమున దక్షిణాపథమున ఉత్తర భాగమునందు చాళుక్యులు బలవంతులైరి (క్రీ. శ. ఏడవ శతాబ్ది). చాళుక్య వంశీయుడగు పులకేసి II, హర్షుని, నర్మద దాటి రానీయకుండ నిరోధించగలిగెను. ఈ చాళుక్యులు దక్షిణాపథమున చాల భూమిని ఆక్రమించినను పల్లవ రాజులతోటి నిరంతరపు పోరాటములవలన బలహీనులైరి. తత్ఫలితముగ వారి సామంతులగు రాష్ట్రకూటులు, రాజ్యమును వశపరచుకొనిరి (753). రాష్ట్రకూట రాజులలో ఒకడగు నృపతుంగుని కాలమున (813-830) ఆ రాజ్యము, సమకాలీన ప్రపంచ రాజ్యములలో ఒక ప్రముఖ రాజ్యముగ పేరెన్నిక పొందినది. అతని అనంతరమున ఆ రాజ్యపు ప్రతిభ సన్నగిలగ, చాళుక్యులలో ఒక తెగకు చెందిన కల్యాణి చాళుక్యులనువారు, రాజ్యమును వశపరచుకొనిరి (973). ఇంతకు కొంత పూర్వముననే, కృష్ణకు దక్షిణమున పల్లవ, పాండ్యుల అధికారమును అంతరింపజేసి చోళులు అధికారమును గ్రహించిరి. అంతటినుండి దాదాపు రెండువందల సంవత్సరముల కాలము దక్షిణాపథ సర్వాధిపత్యమునకై చోళులును, కల్యాణి చాళుక్యులును, పరస్పరము పోరాడిరి. వీరిలో ఎవరును తమ ఆశయమును సాధింపజాలక పోయిరనుట యథార్థమే అయినను చోళులు మాత్రము రాజరాజ I (985-1016 ప.), అతని కుమారుడు రాజేంద్ర చోళ I (1012-1044) అను ప్రభువుల కాలమున ప్రబలతను ఆర్జించిరి. తమిళనాడు మాత్రమేగాక, భారతదేశపు తూర్పుతీరమంతయు వారికి వశమయ్యెను; గంగాతీరమువరకు వారి విజయయాత్ర సాగినది; వారి నౌకాబలధాటికి శ్రీలంక, మలయా, సుమత్రా ద్వీపరాజ్యములు తల యొగ్గినవి. కాని క్రీ. శ. 1120 తరువాత చోళ రాజ్య ప్రతిష్ఠ అంతరించి, తమిళ దేశమున పాండ్య ప్రభువులు ఆధిపత్యమునకు రాగలిగిరి. అట్టులే తరువాత కొంత కాలమునకు (1190) కళ్యాణి చాళుక్యుల వైభవమును నామమాత్రావశిష్టము కాగా, ఆ ప్రాంతమున దేవగిరి, ఓరుగల్లు, ద్వారసముద్రములు ముఖ్యనగరములుగ క్రమముగ యాదవ, కాకతీయ, హొయిసల రాజ్యములు రూపుగొనినవి.

క్రీ. శ. ఒకటవ శతాబ్ది మొదలుగ పండ్రెండవ శతాబ్ది వరకు సాగిన ఈ దీర్ఘ కాలమున, మౌర్యుల కాలమునందువలె, దేశమునందు అత్యధిక భాగమున ఒకే ఒక సామ్రాజ్యము ఏదియు నెలకొన జాలక పోయినను, సాంస్కృతిక ఐక్యము చెక్కుచెదరక నిలిచినది. భారతదేశమున సాంప్రదాయికముగ కుదురుకొనిన వర్ణవ్యవస్థ ఆనాటి పరిస్థితులలో, తక్కిన ఏ దేశమునను కనరాని సాంఘిక భద్రతను దేశమునకు చేకూర్చినది. ఈ వ్యవస్థకు బ్రాహ్మణ మతము మత ధర్మపు ముద్రను వైచినది; బౌద్ధాది వైదికేతర మతములు వర్ణ వ్యవస్థకు ఆరోపింపబడిన మత పవిత్రతను ఎంతగ నిరసించినను, సాంఘికముగ దానివలన చేకూరిన భద్రతను గుర్తించి, దానిని నిర్మూలించుటకు మాత్రము యత్నించినవి కావు. దేశమునందలి వివిధ మండలములలో రాజరికములందు ఎన్ని మార్పులు వచ్చినను, సాంఘిక సంస్థల భద్రతకు ముప్పు ఎట్టిదియు

కలిగెడిది కాదు; విద్యా సంస్థలు, పండిత పోషణ, కృషి, పశుపాలన, వ్యాపారాది వ్యవహారములు యథారీతిగ కొనసాగ గల్గెడివి. అందువలన ప్రజలు, రాజరికముల మార్పులతో ఏ ప్రసక్తిని పెట్టుకొనక, రాజుగ ఉన్నవానికి చెల్లించదగు పన్నులను మాత్రము చెల్లింపుచు స్వస్థ చిత్తముతో మనగలిగిరి. తత్ఫలితముగ కళలు, గణితాది విజ్ఞాన శాస్త్రములు చక్కగ వికసించినవి. ఆనాడు నిర్మితములై, ఈనాటికిని అటనట శిథిల రూపము లతో కన్పట్టు చైత్య, స్తూప, దేవాలయ, విహార ములు ఆ కాలమున భారతజాతి లలిత కళలందు సాధించిన ప్రగతిని తెలియజేయును; అటులే ఆ కాలమున రచితములగు కావ్య, నాట్యశాస్త్రాదులు సాహిత్య సంగీత, నృత్య కళలందు, భారతీయుల ఉత్కృష్టతను స్పష్టము చేయును. ఆ కాలముననే దశాంక గణితరీతి ఈ దేశమున సువ్యవస్థితమై, ఇటనుండి అరబ్బుల మూలమున, యూరపునకు ప్రాకి నేటి గణితశాస్త్ర వికసనమునకు చాలవరకు కారణభూతమైనది. అపుడు ఆర్యభట, వరాహ మిహిరాదులు, జ్యోతిశ్శాస్త్రమున గ్రీకు భారత సంప్రదాయముల రెండింటి మేళనమును సాధింప గలిగిరి. ఈ యుగపు అంతమున దేవగిరిలో రాజా స్థానమున గణకుడుగ ఉండిన భాస్కరుడు, భూభ్ర మణ సిద్ధాంతమునకు సోపపత్తిక రూపమును కల్పించెను.

పైవాని అన్నింటికన్న మిన్నగ పేర్కొనదగి నది, ఆ కాలమున దక్షిణ ఆగ్నేయాసియాలయందు వివిధ రాజ్యములలో నాగరికతా బీజములను నాటి, భారతీయ మత సంస్కృతులను అట పరిపోషించు టకై భారతీయులు చేసిన కృషి. శ్రీలంక కేగాక, బర్మా, తాయిలాండ్, లావోస్, కాంబోడియా, వియెత్‌నామ్‌లకును ఆ కాలమున భారతీయ సంస్కృతి వ్యాపించినది. బౌద్ధ, హిందూ మత ములు అట వ్యాపించి, స్తూప, విహార, దేవాయతన ములు అట నిర్మితములైనవి. ఆ యా దేశములందు భారతీయ రాజవంశములకు చెందిన రాజకుటుంబ ములు పరిపాలన నెరపినవి ఈ వివిధ దేశములతో భారతీయ వర్తక సంఘములు తమ నౌకల సాయ మున వాణిజ్య వ్యవహారముల నిర్వర్తించినవి.

కాని ఈ సాంఘిక భద్రతకు తగు రీతిగ దేశ మున ఒకే ఒక కేంద్రాధికారము ప్రాపుగ లేక పోవుటలోని బలహీనత, 12వ శతాబ్ది అంతమున దేశమునకు నష్టదాయకముగ పరిణమించినది. రాజ రికపు మార్పులతో సంబంధము పెట్టుకొనక ప్రజలు బ్రతుకుచుండుటవలన, ఇది నా దేశము, దీని అంతటి రక్షణ నా బాధ్యత అనుభావము ప్రజలలో మృగ్యమైనది. యుద్ధముచేసి, తమ ప్రాంతమును రక్షించుకొను బాధ్యత ఏ కొలది వర్గములకు మాత్రమో సంక్రమించినది. భారతదేశ సంస్కృ తికి అంకితములైన రాజరికములలో మార్పులు జరిగి నంతకాలము, ప్రజలకు అట్టి మార్పులవలన నష్టము లేకపోయినది. కాని ఒక ఇతర సంస్కృతికి అంకితమైన విదేశీయ వర్గము రాజరికమున మార్పును కొనివచ్చినపుడు అది సాంఘిక వ్యవస్థకు, భద్రతకు ముప్పును కొనివచ్చుటయేగాక, చాల కాలమువరకు కల్లోలములకు కారణభూతమై చరిత్ర గతినే మార్చివేసినది. ఆ మార్పును కొనివచ్చినది భారత ఉపఖండపు వాయవ్యపు సరిహద్దులద్వారా వచ్చిన ఇస్లామిక సేనల దండయాత్ర.

మహమ్మద్ ప్రవక్త (570-632) ప్రబోధించిన ఇస్లాము మత ధర్మముచే ప్రచోదితములైన ఇస్లా మిక సేనలు, ఆ ప్రవక్త పరమపదించిన ఒక శతాబ్దము లోపలనే పశ్చిమ యూరపున స్పెయినును, ఉత్తర ఆఫ్రికాను, పశ్చిమ ఆసియాను, వశపరచు కొనినవి. భారత ఉపఖండమునందలి సింధు రాష్ట్రము 711 లోనే అరబ్బుల వశమైనను, వారిని అటనుండి తక్కిన భారత భూమిలోనికి చొరనీయక,

ఆనాటి పరిసర భారతీయ పాలకులు నిరోధింప గలిగిరి. కాని 10 వ శతాబ్దిలో భారతదేశము అల్ప రాజ్యములుగ విభక్తమై, పరస్పర కల్లోలము లతో ఆ రాజ్యములు సతమతమగుచున్న కాలమున, ఇస్లామిక సేనల తొలుతటి దండయాత్ర, ఆఫ్ఘ నిస్తాన్‌నుండి భారతదేశముపై జరిగినది (977). కాని అదియు, దాని తరువాత గజనీ మహమూద్ జరిపిన దండయాత్రలును, దోపిడులుగ మాత్రమే పరిణమించినవి; రాజ్యాధిపత్యమునకై ఆ దండ యాత్రలు చేసినవారు యత్నించలేదు. ఆఫ్ఘనిస్తాన మును ఘోర్ వంశీయులు ఆక్రమించుకొనిన తరు వాత, ఆ వంశపువాడగు మహమ్మద్ ఘోరీ, 1192 లో అజ్మీర్ ప్రాంతమున పృథ్వీరాజను రాజ్యపాలకుని ఓడించుటతో, భారతదేశమున ఇస్లా మిక రాజ్య వ్యాప్తి మొదలైనది; ఆనాటి రాజ కుటుంబములలోని అనైక్యత, ఇస్లామిక సేనల విజృంభణమును సుగమము చేసినది. 13 వ శతాబ్ది ఆరంభమునకు ఉత్తర భారతదేశమున ముస్లిమ్ సామ్రాజ్యము సుస్థిర రూపము పొందినది. దక్షిణ భారతదేశము మాత్రము ఆ తరువాత కొంతకాలము స్వతంత్రముగ మనగలిగినను, 14 వ శతాబ్ది ఆరం భమున అదియును ముస్లిములకు దక్కినది. కాని ఆ కాలముననే ఢిల్లీ కేంద్రముగ ఉండిన ఈ ముస్లిమ్ సామ్రాజ్యము ఏకతను కోల్పోవగ, ఉత్తర భారత మున వివిధ ముస్లిం రాజ్యములు రూపుగొనినవి; ఈ అవకాశమును ఉపయోగించుకొని దక్షిణా పథ మున బహ్మనీ పాలకుల ఆధిపత్యమున ఒక స్వతంత్ర ముస్లిం రాజ్యము రూపుగొనినది (1347). ఇటుల భారతదేశమున దాదాపు అంతయు ముస్లిముల వశముకాగా, ప్రాచీన దేశీయ సంస్కృతిని పరి రక్షించుటకై విద్యారణ్యుడను మతాచార్యుని ప్రోత్సా హాశీర్వాదములతో, తుంగభద్రా నదీతీరమున విజయ నగర సామ్రాజ్యము హరిహర బుక్కరాయలచే సంస్థాపితమైనది (1335). క్రమముగ ఈ హిందూ రాజ్యము కృష్ణకు దిగువగల భూమిని అంతటినీ తన ఆధిపత్యములోనికి కొనివచ్చి, వైదిక ధర్మము నకు ప్రాపుగ దాదాపు 250 సంవత్సరములు మన గలిగినది.

ఉత్తర హిందూస్థాన్‌న ముస్లిముల అధికారము నకు కేంద్రస్థానమగు ఢిల్లీ యందలి సుల్తాన్‌లు, 16 వ శతాబ్దమున, బలహీనులుకాగా, మొగల్ నాయకుడగు బాబర్, ఆఫ్ఘనిస్తానునుండి, దేశ ముపై దండెత్తివచ్చి, ఢిల్లీని వశపరచుకొని (1525), అనతి కాలముననే తన రాజ్యమును ఉత్తర భారతమునందలి బహు ప్రాంతములకు వ్యాపింపజేసెను. ఈతని వంశమే మొగల్ వంశ మని వ్యవహృతము. ఈ వంశపు పాదుషాలు క్రీ. శ. 1857 వరకు (షేర్‌షా అను ఆఫ్ఘన్ పాలకుడును, అతని వంశీయులును పాలన నెరపిన 1540-1555 మధ్యగల కాలమున తప్ప తక్కిన కాలమున) దేశమును పాలించిరని చెప్పవచ్చును. భారతదేశ చరిత్రలో ప్రముఖ పాత్రను నిర్వహించిన మొగల్ సామ్రాట్టులలో అక్బరు (1555-1605 ప.) గణనీయుడు. మత సహిష్ణుతకు పేరొందిన ఆ చక్రవర్తి హిందూ, ముస్లిము ప్రజలు, పరస్పరావ గాహనతో, ఏక ప్రజానీకముగ రూపొందుటకు కృషి చేసెను. ఈతని సామ్రాజ్యమున, దక్కనునందలి రాజ్యములు చేరకున్నను, ఆ కాలముననే దక్కను లోని ముస్లిం రాజ్యములు, పొరుగునఉన్న ఏకైక హిందూ రాజ్యమగు విజయనగర రాజ్యమును ఓడిం చినవి (1565). తరువాత ఆ విజయనగర రాజ్యము, ఏదియో ఒక తీరున, దక్షిణ దేశమున కొంతకాలము మని కడకు అంతరించినది (1678). ఇందువలన 16 వ శతాబ్ది అంతమునకు దాదాపుగ భారతభూమి యంతయు ఇస్లామిక పాలకుల వశ మయ్యెను. మొగల్ పాలకులలో ఆరవవాడగు ఔరంగజేబు సమర్థుడగు రాజ్యతంత్ర వేత్తయే అయినను మత ఛాందసుడు. ఈతడు సామ్రాజ్య

మును భరతఖండపు దక్షిణ భాగమునకు సైతము వ్యాపింపచేసినను, తన మతాంధతవలన హిందూ ప్రజానీకపు ఆదరణను కోల్పోయెను. ఈతని కాలముననే మహారాష్ట్రులు శివాజీ నాయకత్వమున సుసంఘటితులై, సామ్రాజ్యపు భద్రతకు భంగమును కలిగింప సాహసించిరి; ఉత్తర దేశమున, రాజపుత్రులలో పలువురు మొగలులకు విరోధులైరి. ఇట్టి క్లిష్ట పరిస్థితులలో ఔరంగజీబు మరణించగ (1707), సామ్రాజ్యమందలి సేనానులు, బలవత్తరులై, అధికారము కొరకు పెనగులాడిరి. ఆ పెనగులాటలో బలవంతుని చేతి కీలుబొమ్మగ ఢిల్లీ యందలి పాదుషా వర్తించుచుండెను. ఇక దక్షిణ భారతమున, శివాజీ చూపిన మార్గమును అనుసరించి, అతని మరణానంతరమున (1680) మహారాష్ట్రులు దేశ భక్త్యుత్సాహములతో పురోగమించి, దేశపు తక్కిన భాగములను వశపరచుకొని, దేశమున ఏకరాజ్యమును తమ ఆధిపత్యమున నెలకొల్పుటకు కృషిచేసి, కొంత విజయమును సాధించిరి. కాని, ఈ పరిస్థితిలో అఫ్ఘనిస్తాన్ పాలకుడగు అహమద్‌షా అబ్దాలీ, దేశముపై దండెత్తివచ్చి, భారతీయ ముస్లిమ్ పాలకుల సాయముతో, పానిపట్టువద్ద జరిగిన యుద్ధమున, మహారాష్ట్ర బలములను ఓడించెను (1761). తత్ఫలితముగ మహారాష్ట్ర కేంద్ర ప్రభుత్వ ప్రతిష్ఠ సన్నగిలి, వివిధ ప్రాంతములందలి మహారాష్ట్ర మాండలికులు దాదాపుగ స్వతంత్రులైరి; పంజాబున, నానక్ అను మతాచార్యునిచేత 15 వ శతాబ్దిలో ప్రవర్తితమైన శిక్కు మతమునకు చెందినవారలు, ఈ కాలమున సుసంఘటితులై, పంజాబున రాజ్యమును నెలకొల్పి స్వతంత్రులుగ వ్యవహరింపసాగిరి. ఇటుల 18 వ శతాబ్ది చరమపాదమునాటికి, దేశమున నామమాత్రపు మొగల్ పాదుషా ఆధిపత్యమున, వివిధ రాజ్యములు ఏర్పడి, దేనికది స్వతంత్రముగ వ్యవహరింపసాగగ, దేశమున రాజకీయైక్యము శూన్యమైనది. ఈ పరిస్థితులు, బ్రిటిష్‌వారికి, ఇట తమ ప్రభుత్వమును నెలకొల్పుటకు చక్కగ ఉపకరించినవి.

15 వ శతాబ్ది అంతమున భారతదేశమునకు, సముద్ర మార్గమును పోర్చుగీజువారు కనుగొనినది మొదలుగ, పలు యూరపీయ దేశముల వర్తక సంఘములు, పోర్చుగీజులను అనుసరించి తక్కిన ప్రాచ్యదేశములందువలెనే, భారతదేశమునను వర్తక స్థావరములను నెలకొల్పుకొన సాగినవి. వర్తకమునకై ఇటుల సాగిన పోటీలో, భారతదేశమునకు సంబంధించినంతవరకు, 17 వ శతాబ్ది అంతమునకు, తక్కిన యూరపీయ దేశముల వర్తక సంఘములను ఆవలకు ద్రోచి, ఫ్రెంచి, బ్రిటిష్ వర్తక సంస్థలు మాత్రమే నిలువగలిగినవి. ఆనాటి భారతదేశపు పరిస్థితులలో, దేశీయ రాజుల కలహములలో జోక్యము వహించి, ఈ వర్తక సంఘములు కొంత రాజకీయ బలమును ఆర్జించుటకు అవకాశము కలదని తొలుత ఫ్రెంచివారు గుర్తించిరి. కాని అనతి కాలముననే ఫ్రెంచివారిని కడకు త్రోచి, బ్రిటిష్ వారికి చెందిన ఈస్ట్ ఇండియా కంపనీ అను వర్తక సంఘము ముందునకు రాగలిగినది. 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధమున విజయమును సాధించిన ఈ కంపనీ, బెంగాలున తొలుతగ రాజకీయ స్థానమును ఆర్జించి, 1766 లో ఉత్తర సర్కారులను, 1792 లో మైసూరును వశపరచుకొనినది. పేరునకు బ్రిటిష్‌వారు ఢిల్లీ పాదుషా ఆధిపత్యమును మన్నించినను, సర్వ స్వతంత్రులుగనే వ్యవహరించిరి. వారికి ఆనాడు ప్రతిస్పర్ధులుగ మహారాష్ట్రులు మాత్రమే ఉండగలిగిరి. కాని మహారాష్ట్రులలోని అంతఃకలహములు కంపనీ ప్రభుత్వమునకు చక్కగ ఉపకరించినవి. కడకు 1818 కి మహారాష్ట్రులను ఓడించి, ఈస్ట్ ఇండియా కంపెనీ, దేశమున సర్వం సహాధికారమును గ్రహించినది; అప్పటికి నిలిచియున్న హైదరాబాదువంటి రాజ్యములు, సైనిక సహకార ఒడంబడికలద్వారా ఆ కంపనీ సర్వాధికారమును

అంగీకరించి మనగలిగినవి; ఢిల్లీయందలి మొగల్ పాదుషా నామమాత్రపు దర్బారుతో, కంపనీ ప్రభుత్వమునకు వశుడై ఉండెను.

పై పరిస్థితులలో దేశమును స్వతంత్రము చేయుటకు, కంపనీవారి, ఆధిపత్యమున పనిచేయు కొన్ని దేశీయ సేనలు పూనుకొనినవి. వీరికి మహారాష్ట్ర నాయకుడగు నానాసాహెబ్ మొదలగువారి సహకారము లభించినది; మొగల్ పాదుషాయగు బహదూర్‌షా సానుభూతియు వారి పక్షమున ఉండినది. కాని శిక్కులు మొదలగు ఇతర ఉత్తర హిందూస్థానీయులేగాక, దక్షిణ భారతమున హైదరాబాదు మొదలగు సంస్థానముల పాలకులును బ్రిటిష్‌వారికి అండగ నిలిచిరి. కడకు, ఆ భారతీయ స్వాతంత్ర్య ప్రథమ సంగ్రామము విఫలమైనది (1857). దేశ సేవకులు ఎందరో తమ ప్రాణములను కోల్పోయిరి. విజయమును సాధించిన బ్రిటిష్‌వారు పాదుషాయగు బహదూర్‌షాను రంగూన్‌నకు ప్రవాసమునకై పంపిరి; అతడు అటనే అంతరించగ మొగల్ పాదుషాల వంశము నిశ్శేషమయ్యెను. అయినను ఈ పోరాటపు ఫలితముగ కంపనీ ప్రభుత్వమును కడముట్టించి, బ్రిటిష్ దేశపు రాణియగు విక్టోరియాయే భారతదేశపు సామ్రాజ్ఞిగ సర్వాధికారములను గ్రహించినది. బ్రిటిష్ పాలకుల పక్షమున రాజప్రతినిధి పాలించుట 1858 లో మొదలైనది. ఇటుల 1947 వరకు బ్రిటిష్‌వారి పాలన దేశమున సాగినది.

బ్రిటిష్‌వారి పరిపాలనా కాలమున, తమ సామ్రాజ్య పటిష్ఠతకై వారు చేసిన కొన్ని పనుల వలన, దేశమున రాజకీయైక్యము తిరిగి నెలకొనగలిగినది. ఆంగ్ల విద్యాభ్యాసమువలన దేశీయులలో కొందరికి అధునిక విజ్ఞానశాస్త్ర, రాజకీయ భావనలతో పరిచయము కలిగినది. ఇంగ్లండ్‌నందువలెనే తమ దేశమున సైతము ప్రజలకు బాధ్యత వహించు ప్రభుత్వము ఏర్పడవలయునను ఆకాంక్ష విద్యావంతులలో ప్రబలినది; విశాల హృదయులగు కొందరు ఆంగ్లేయులును దీనికి దోహదము కలుగ జేసిరి. దీనికి ఫలితముగ 1885 లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (భారత జాతీయ కాంగ్రెస్) వ్యవస్థాపితమైనది. తొలుత పాలకులకు, విజ్ఞాపనలను సమర్పించి కార్యసాధన చేసికొన వీలగు వేదికగ ఉపకరించిన, ఈ కాంగ్రెస్‌న 20 వ శతాబ్దపు తొలి దశకమున, బ్రిటిష్‌వారిని ధిక్కరించగలుగు తీవ్రవాదులకు స్థానము లభించినది. బ్రిటిష్‌వారియెడల కలిగిన ఈ నిరసనను ఫలదాయకమగు రీతిలో వ్యవస్థీకరించి, 1920 మొదలుగ కాంగ్రెస్‌న నాయకత్వము వహించి, దేశపు స్వాతంత్ర్య పోరాటమును నడిపినవాడు మోహన్‌దాస్ కరంచంద్ గాంధీ (1869-1948). 'మహాత్మ' అను ఉపనామముతో ప్రసిద్ధి వహించిన ఆ నాయకుడు నిద్రాణమై ఉండిన జాతిని మేలుకొల్పగలిగెను. సత్యాహింసలపై ఆధారపడిన సత్యాగ్రహమను కొంగ్రొత్త పోరాటపు విధానమును, ఆయన రాజకీయ రంగమున ఆవిష్కృతము చేసెను. పరిపాలకుల ద్వేషించక, పరిపాలకుల దుష్పరిపాలనను మాత్రమే ఎరుర్కొని, కారాగార నివాసమును, కష్టములను, కడకు మరణమును సైతము తత్ఫలితముగ కొనితెచ్చుకొనుటకు జంకనివాడే సత్యాగ్రహి. ఇట్టి విధానమును అనుసరించిన పోరాటములను ఆయన 1921, 1930, 1941, 1942 లలో నడిపెను; లక్షలకొలది ప్రజలు ఆ పోరాటములందు పాల్గొని, దేశమునకై సర్వస్వమును అర్పించిరి. కాంగ్రెస్ దేశమున బలవత్తర సంస్థగ ఇందువలన రూపొందగలిగినది. కాని ఈ పోరాటములందు 1921 లో ముస్లిములును విరివిగ పాల్గొనినను, ఆ తరువాత బ్రిటిష్ రాజనీతి ఫలితముగ, స్వతంత్ర భారతమున తమకు తగు స్థానము ఉండబోదను భయము ముస్లిం నాయకులలో కొందరికి కలిగినది.

ఈ అభిప్రాయమునకు ప్రాతినిధ్యము వహించిన ముస్లింలీగునకు మహమ్మదాలీ జిన్నా నాయకత్వ మును వహించెను. కడకు దేశమును ముస్లిం, హిందూ ప్రాంతములుగ విభజింపవలయునని ముస్లింలీగు పట్టుపట్టినది. ద్వితీయ ప్రపంచ యుద్ధాంతమునకు, బ్రిటిష్ సామ్రాజ్యపు పటిష్ఠత సన్నగిలి, ఆ ప్రభుత్వము ప్రజాందోళనకును, ప్రపంచ ప్రజాభిప్రాయమునకును తలయొగ్గి దేశమునకు స్వాతంత్ర్యమును కల్పింపవలసి వచ్చినది. ఆ సమయమున దేశపు రాజకీయైక్యమును కాపాడుటకై కాంగ్రెస్ ఎంత కృషిచేసినను, ముస్లింలీగ్ ఒప్పుకొనకుండినందున దేశ విభజనకు కాంగ్రెస్ సైతము అంగీకరించినది. కడకు 1947, ఆగస్టు 15 న, దేశము విభజితమై పడమట, తూర్పునఉన్న రెండు ప్రాంతములు సమష్టిగ పాకిస్తాన్ అనుపేరను, తక్కినది తొలుతటిదియేయగు ఇండియా (భారత్) అను పేరను స్వతంత్రములు అయినవి. హిందూ - ముస్లిం మతముల పేరట జరిగిన ఈ విభజన యొక్క శోచనీయ పరిణామములవలన ఉభయ దేశములందు, తదనంతరమున దాదాపు నాలుగు నెలల కాలము సాగిన మత కలహములవలన, విపరీతముగ ప్రాణనష్టము కలుగుటయేకాక, పాకిస్తాన్ నుండి హిందువులలో అధిక సంఖ్యాకులు ఇండియాకును, ఇండియానుండి కొందరు ముస్లిములు పాకిస్తాన్‌కును తరలిపోవలసిన దురవస్థ కలిగినది.

స్వాతంత్ర్యసిద్ధి తరువాత భారతదేశమున 1977 మార్చివరకు కాంగ్రెస్ పక్షమే కేంద్రమున అధికారమును నిర్వహించినది. ఆ కాలమున తొలుతటి పదియేడు సంవత్సరములు ప్రధాని పదవిని నిర్వహించిన పండిత జవహర్‌లాల్ నెహ్రూ (1889-1964) ఉదారభావ సంపన్నుడు; భారత దేశమున ప్రజాతంత్ర గణరాజ్యమునకు స్థిరములగు పునాదులను ఆయన నిర్మించెను. ప్రణాళికా బద్ధముగ దేశము ఆర్థిక పురోగతిని సాధించుటకు ఆయన మార్గములను ఏర్పరచెను. అతని అనంతరమున లాల్‌బహదూర్ శాస్త్రి 11 నెలలు ప్రధానిగ పనిచేసిన తరువాత, జవహర్‌లాల్ యొక్క పుత్రిక యగు ఇందిరాగాంధి ప్రధాని కాగల్గినది. దాదాపు 11 ఏండ్ల కాలము ఆమె ప్రధానిగ వ్యవహరించినది. ఆ కాలమున దేశము పటిష్ఠతను ఆర్జించినది; వ్యవసాయ, పారిశ్రామికోత్పత్తులందు దేశము చాలవరకు స్వయం సమర్థతను పొందినది. కాని, ఇతర రాజకీయ పక్షములతో సౌమనస్యము ఆమె తగినంతగ సాధింపలేక పోయినది; ఆమె అనుసరించునవి నియంతృత్వ మార్గములుగ తక్కిన రాజకీయ పక్షములలో కొన్ని భావించినవి. అంతేకాదు; అంతః కలహములవలన కాంగ్రెసు సైతము రెండు చీలికలైనది. కడకు 1975, జూన్ 11 న, ఆమె ఎన్నిక చెల్లదని కోర్టు ఇచ్చిన తీర్పుపై ఆమె రాజీనామా ఈయలేదని వ్యతిరేక రాజకీయ పక్షములు ఆందోలేవదీయ సంకల్పింపగ, ఆమె దేశమున ఆత్యయిక స్థితిని (యమర్జన్సీ) ప్రకటించి (జూన్ 25, 1975), ప్రతిపక్ష నాయకులను పలువురను నిర్బంధింప జేసినది. తరువాత 1977, జనవరి నాటికి వారిలో దాదాపుగ అందరిని విడుదలచేసి, ఎన్నికలను ఆమె ప్రకటించినది. అంతట ప్రభుత్వ వ్యతిరేక రాజకీయ పక్షములలో ప్రముఖములగు కొన్నింటిని, 'జనతా' అనుపేర ఏకపక్షముగ రూపొందింప జేయుటలో వృద్ధ స్వాతంత్ర్య యోధుడగు జయప్రకాశ నారాయణ్ కృతకృత్యతను సాధించెను. ఆ జనతా పక్షము ఎన్నికలలో విజయమును సాధించగ, ఆ పక్షపు ప్రతినిధులు ఎన్నుకొనిన నాయకుడు మురార్జీ దేశాయి ప్రధాని అయ్యెను (24 మార్చి, 1977).

## 7. పరిపాలన

భారతదేశపు రాజ్యాంగ విధానము, రాజ్యాంగ విధాన పరిషత్తువలన, 26 నవంబరు, 1949 న

ఆమోదితమై, జనవరి 26, 1950 నుండి అమలు లోనికి వచ్చినది ఈ రాజ్యాంగ విధానము. ఇండియా (భారత్) ను సర్వసత్తాక ప్రజాస్వామ్య గణతంత్ర రాజ్యముగ పేర్కొని, దాని పరిపాలనా సూత్రము లను విధించినది. రాజ్యాంగ విధానము సమాఖ్యా రాజ్య పద్ధతికి చెందినదియే అయినను, ఏకరాజ్య (యూనిటరీ) పద్ధతికి చెందిన కొన్ని లక్షణములను కూడ కలిగియున్నది. కార్యనిర్వాహణాధికారము రాష్ట్రపతి (ప్రెసిడెంటు) యందే న్యస్తమైనటుల రాజ్యాంగ విధానమున పేర్కొనబడినను, 'రాష్ట్రపతికి, తన విధి నిర్వహణలో, తగు సలహా ఇచ్చి సాయము చేయుటకై, ప్రధానమంత్రి ఆధ్వర్యవమున పనిచేయు మంత్రిమండలి ఒకటి ఉండు'నని అందే తెలుపబడినది. రాజ్యాంగ విధానమున జరిగిన 42 వ సవరణ* వలన ఈ విషయము స్పష్టతరము చేయబడి, మంత్రిమండలి ఇచ్చెడు సలహాలను రాష్ట్రపతి, తన విధి నిర్వహణమున, పాటించ వలయునని విధించబడినది. కావున యథార్థమున, ప్రధానమంత్రి ఆధ్వర్యవమున పనిచేయు మంత్రి మండలియందే కార్యనిర్వహణాధికారము న్యస్తము; ఈ మంత్రిమండలి సమష్టిగ లోకసభకు బాధ్యత వహించి పనిచేయును. ఈ విధముగనే రాష్ట్రము లందు, కార్యనిర్వహణాధికారి గవర్నరు (రాజ్యపాల్)గా పేర్కొనబడినను యథార్థమున, ముఖ్య మంత్రి పెత్తనమున పనిచేయు మంత్రివర్గమే, విధాన సభకు బాధ్యత వహించి, దైనందిన వ్యవహార ములలో కార్యనిర్వహణను కొనసాగించుచున్నది.

కేంద్రము (యూనియన్) నకును, రాష్ట్రముల కును మధ్య అధికార విభజన, రాజ్యాంగ విధానమున, స్పష్టముగ నిర్దేశితము. ఇందులకై పరిపాలనా విషయములు మూడు పట్టికలుగ విభజితములు. వీనిలో 1 వ పట్టికలోని విషయములపై యూనియన్‌కును, రెండవ దానిలోని విషయములపై రాష్ట్రములకును, 3 వ దానిలోని వానిపై సమష్టిగ యూనియనుకును రాష్ట్రములకును అధికారములు కలవు. సమష్టి పట్టికలో ఏ విషయముపైననైనా రాష్ట్ర, యూనియన్ ప్రభుత్వములు శాసనములు చేసినపుడు, యూనియన్ ప్రభుత్వపు చట్టమే చెల్లుబడి కాగలదు. తనకు సంక్రమింపచేయబడిన వానితోపాటుగ, అవశిష్టాధికారములు కేంద్రమునకే చెందుచున్నవి.

ఇదిగాక, స్థానిక స్వపరిపాలనా విధానముకూడ దేశమున అమలున ఉన్నది. రాజ్యాంగ విధానము నందలి 40 వ ఆర్టికిలులోని నిర్దేశక సూత్రాలలో గ్రామీణ పంచాయితుల వ్యవస్థీకరణకై తగు చర్యలను అవలంబింపవలయునని నిర్దిష్టముగ సూచింపబడినది. తదనుగుణముగ ప్రభుత్వము సాగించిన కృషివలన దాదాపుగ ప్రతి రాష్ట్రమునను గ్రామీణ పంచాయితీ రాజ్యవ్యవస్థ నెలకొలుపబడి, గ్రామ పంచాయితులు, కొన్ని నిర్దిష్టాధికారములతో పని చేయుచున్నవి.

దేశమున ప్రతి పౌరునికి ఒకే విధమగు పౌరస్వత్వము కలదు. భారతదేశమున జన్మించినను, లేదా, తలిదండ్రులలో ఏ ఒకరైనను భారతదేశమున జన్మించినను, లేదా రాజ్యాంగ విధానము అమలులోనికి వచ్చుటకు పూర్వమున అయిదు సంవత్సరములనుండి దేశమున వసించుచుండినను, అట్టి వానికి భారతీయ పౌరస్వత్వము లభించును; పాకిస్తాన్

---

*రాజ్యాంగ విధానమునకు 1951 మొదలుగ పలు సవరణలు జరిగినవి. అందును, ఆత్యయిక పరిస్థితి కాలమున జరిగిన 38, 39, 40 42 సవరణలు రాజ్యాంగ విధానమున అతి తీవ్రములగు మార్పులను కొనివచ్చినవి. వీనిని తగు రీతిగ మరల సవరించి 1975 కు పూర్వమున ఉన్న రూపమునే రాజ్యాంగ విధానమునకు కల్పించుటకు, 1977, మార్చిలో కేంద్రమున అధికారమును గ్రహించిన జనతా ప్రభుత్వము కృత నిశ్చయత వహించి పనిచేయుచున్నది.

నుండి వలసవచ్చినవారికి ఈ విషయమున కొన్ని సదుపాయములు కల్పింపబడినవి 1955 లోని పౌరస్వత్వ చట్టమువలన దేశమున పౌరస్వత్వము జన్మతఃగాని, అనువంశికత వలనగాని, రిజిష్టరీ నమోదువలనగాని, నివాసార్హతవలనగాని లభింప గలదని స్పష్టీకరింపబడినది.

రాజ్యాంగ విధానమునందలి మూడవ కాండ వలన, పౌరులకు ఈ క్రింది ఏడు ప్రాతిపదిక స్వత్వములు లభించినవి : 1. న్యాయశాస్త్ర దృష్టిలో సమాన స్వత్వము, 2. స్వాతంత్ర్యము కలిగి యుండు స్వత్వము, 3. దోపిడికి గురికాకుండు స్వత్వము 4. మత స్వేచ్ఛను కలిగియుండు స్వత్వము, 5. మత సంస్కృతిని, విద్యారీతిని రక్షించుకొను స్వత్వము, 6. ఆస్తిని కలిగియుండు స్వత్వము, 7. రాజ్యాంగ విధానముద్వారా తన స్వత్వములను పరిరక్షించుకొను స్వత్వము.

ఇవిగాక రాజ్యాంగ విధానమున నాలుగవ కాండలో నిర్దేశక సూత్రములు కొన్ని కలవు. న్యాయస్థానములద్వారా వీనిని చెల్లింపజేసుకొను వసతి లేకపోయినను ప్రభుత్వపు లక్ష్య, గమ్యము లను ఇవి బాగుగ తెలియజేయుచున్నవి. ప్రభుత్వము తగు విధానములను అవలంబించి, ఈ క్రింది లక్ష్యములను సాధింపవలయునని ఈ సూత్రములు నిర్దేశించు చున్నవి : 1. ప్రతి పౌరునికి తగు జీవిత వసతి; 2. దేశపు భౌతిక సాధన సంపత్తులు ఉచిత మగు రీతిలో చక్కగ పౌరులకు అందరికి విభజితములగుట; 3. ఉత్పత్తి సాధనములును, సంపదయు ఏ కొలదిమందికో దక్కియుండుటను నిరోధించుట; 4. ఒకే విధపుపనికి ఒకేతీరగు వేతనము; 5. తమ వయసునకు, పరిస్థితులకు తగని కృషుల వలన కార్మికులు తమ బలమును, స్వస్థతను కోల్పోకుండ, వారి బల, ఆరోగ్య పోషణను కొనసాగించుట; 6. గ్రామ పంచాయితీలను వ్యవస్థీకరించుట; 7. రోగ, వార్ధక్య, నిరుద్యోగములవలన బాధలేకుండ వసతులను కల్గించుట; 8. మానవతా దృష్టితో, న్యాయ శీలతతో పనికాలపు వసతులను, మాతృత్వ కాలపు సదుపాయములను కల్పించుట; 9. బ్రతుకునకు తగిన భృతిని, సౌకర్య యుతమగు జీవిత ప్రమాణ స్థాయిని కార్మికులకు అందజేయుట; 10. కుటీర పరిశ్రమల పరిపోషణ; 11. పౌరులకు అందరకు ఒకే విధమగు న్యాయ సంహిత; 12. రాజ్యాంగము అమలులోనికి వచ్చిన పదేండ్ల లోపున, పదునాలుగేండ్ల వయస్సు వచ్చువరకు బాల బాలికలకు అందరికిని నిర్బంధముగ, ఉచితముగ విద్యను బోధించు ఏర్పాటులను కల్పించుట; 13. దుర్బల వర్గముల - ముఖ్యముగ షెడ్యూలు కులముల, తెగలవారి - ఆర్థిక, విద్యా వికసనము లను సాధించుట; 14. ప్రజారోగ్య స్థాయి, జీవన ప్రమాణ స్థాయి, పోషకాహార స్థాయి - అనువాని పెంపుదల; 15. మత్తు పానీయముల, మత్తు ద్రవ్యముల సేవలను నిషేధించుట; 16. వ్యవసాయ, పశుపోషణలను ఆధునిక రీతిలో అభివృద్ధిచేయుట; 17. కళా, చారిత్రక దృష్టిలో అమూల్యతను పొందిన ప్రాచీన భవనాదులను, వస్తువులను కాపాడుట; 18. సార్వజనిక సేవలలో, న్యాయ, కార్య నిర్వాహక శాఖలమధ్య సంపూర్ణ విభజనను సాధించుట; 19. అంతర్జాతీయ శాంతి భద్రతల పెంపొందించుట.

దేశమున మొత్తమున ఇప్పటికి న్యాయ, కార్య నిర్వాహక శాఖలమధ్య విభజన మాత్రము సాధింప బడినది. నిర్దేశిక సూత్రానుగుణములగు తక్కిన లక్ష్యములు ఇంకను సాధింపబడవలసి ఉన్నవి.

న్యాయశాఖ, భారతదేశపు ఆడిటర్ - జనరల్ అండ్ కంప్ట్రోలరు, పబ్లిక్ సర్వీసెస్ కమీషను - అనువానికి స్వతంత్ర ప్రతిపత్తి రాజ్యాంగ విధానము ద్వారా కల్పింపబడినది.

దేశపు పార్లమెంటరీ పాలనా వ్యవస్థ వయోజనుల వోటింగు హక్కుపై ఆధారపడి ఉన్నది. 21 ఏండ్ల వయసునకు తగ్గని ప్రతి పౌరునకును వోటు హక్కు కలదు; 1977 లో వోటర్ల సంఖ్య దాదాపుగ 30 కోట్లను చేరుకొనినది.

వోటర్ల పట్టికను తయారు చేయించుట, పార్లమెంటునకును, రాష్ట్ర శాసనసభలకును, రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి పదవులకును ఎన్నికలను నిర్వహించుట - అను అధికారములు ఎన్నికల కమీషన్‌కు చెందజేయబడినవి. ఈ కమీషన్‌న ఒక ఎన్నికల చీఫ్ కమీషనరును, తగిన సంఖ్యలో ఎన్నికల కమీషనరులును ఉండెదరు; వీరిని రాష్ట్రపతి నియామకము చేయును. ఈ ఎన్నికల చీఫ్ కమీషనరు, తన విధులకు సంబంధించినంతవరకు, ఎవరికిని లోబడక స్వతంత్రముగ వ్యవహరించును. ఇతనిని పార్లమెంటు మాత్రమే తొలగింపగలదు.

దేశమున ప్రస్తుతమున (1977) 22 రాష్ట్రములును, 9 కేంద్రపాలిత ప్రాంతములును కలవు (చూ : 14 వ ఉప శీర్షిక).

కేంద్రపు పార్లమెంటున లోకసభ, రాజ్యసభ అనబడు రెండు కక్ష్యలు కలవు. మార్చి 1977 లో లోకసభయందలి సభ్యసంఖ్య 544. ఇందు ఆంగ్లో-ఇండియన్ వర్గపు ప్రతినిధులుగ ఇరువురను రాష్ట్రపతి నియామకము చేయును. తక్కిన 542 మందిని ఆ యా రాష్ట్రముల, కేంద్ర పాలిత ప్రాంతముల వోటర్లు ప్రాదేశిక నియోజకవర్గములను అనుసరించి ఎన్నుకొనెదరు. ఆ యా రాష్ట్రముల ప్రాతినిధ్యము ఈ తీరుగ కలదు : అస్సామ్ 14, ఆంధ్రప్రదేశ్ 42, ఉత్తర ప్రదేశ్ 85, ఒరిస్సా 21, కర్ణాటక 28, కేరళ 20, గుజరాత్ 26, జమ్మూ-కాశ్మీర్ 6, తమిళనాడు 39, త్రిపుర 2, నాగాలాండ్ 1, పంజాబ్ 13, పశ్చిమ బెంగాల్ 42, బీహార్ 54, మణిపూర్ 2, మధ్యప్రదేశ్ 40, మహారాష్ట్ర 48, మేఘాలయ 2, రాజస్తాన్ 25, సిక్కిం 1, హర్యానా 10, హిమాచల ప్రదేశ్ 4. కేంద్ర పాలిత ప్రాంతములకు లోకసభలో ఈ దిగువ రీతిగ ప్రాతినిధ్యము ఉన్నది : అందమాన్-నికోబారు దీవులు 1, అరుణాచల ప్రదేశ్ 2, గోవా-దామన్ - దయ్యూ 2, చండీఘర్ 1, ఢిల్లీ 7, దాద్రా-నగర్ హవేలీ 1, పుదుచ్చేరి 1, మిజోరామ్ 1, లక్షద్వీప్ 1.

రాజ్యసభలో మొత్తపు స్థానముల సంఖ్య 243 (1974); ఇందులో 12 స్థానములు కళా, వైజ్ఞానిక సాంఘిక సేవా రంగములందు ప్రసిద్ధి వహించిన భారతీయ పౌరులకు ప్రత్యేకింపబడినవి; ఈ ప్రతినిధులను రాష్ట్రపతియే నియమించును. తక్కిన 231 స్థానములకు ప్రతినిధులను రాష్ట్ర శాసన సభలు ఎన్నుకొనును. రాజ్యసభలో రాష్ట్ర, కేంద్ర పాలిత ప్రాంతములకు ఈ దిగువ రీతిగ ప్రాతినిధ్యము కలదు : అస్సామ్ 7, ఆంధ్రప్రదేశ్ 18, ఉత్తర ప్రదేశ్ 34, ఒరిస్సా 10, కర్ణాటక 12, కేరళ 9, గుజరాత్ 11, జమ్మూ-కాశ్మీర్ 4, తమిళనాడు 18, త్రిపుర 1, నాగాలాండ్ 1, పంజాబ్ 7, పశ్చిమ బెంగాల్ 16, బీహార్ 22, మణిపూర్ 1, మధ్యప్రదేశ్ 16, మహారాష్ట్ర 19, రాజస్తాన్ 10, హర్యానా 5, హిమాచల ప్రదేశ్ 3, అరుణాచల ప్రదేశ్ 1, ఢిల్లీ 3, పుదుచ్చేరి 1, మిజోరామ్ 1. రాజ్యసభ నిరంతరాయపు మనుగడ కలది; కాని రెండేండ్లకు ఒకసారి సభ్యులలో మూడవవంతు ఒక క్రమ పద్ధతిని అనుసరించి పదవీ విరమణ చేయగ, కొత్త సభ్యుల ఎన్నిక జరుగును.

లోకసభయొక్క గరిష్ఠపు పదవీకాల పరిమితి అయిదేండ్లు;* కాని అంతకు పూర్వమే అవసరమని తోచినపుడు, ప్రధాని సలహాపై రాష్ట్రపతి లోకసభను రద్దుచేసి, క్రొత్తగ ఎన్నికలను జరుపవచ్చును.

లోకసభా, రాజ్యసభా సభ్యులును, రాష్ట్రముల విధానసభల సభ్యులును చేరియున్న ఒక నియోజక వర్గము రాష్ట్రపతిని ఎన్నుకొనును. లోకసభా, రాజ్యసభా సభ్యులు చేరియున్న నియోజక వర్గము ఉపరాష్ట్రపతి, ఎన్నుకొనును. రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతులలో ప్రతియొకని పదవీకాల పరిమితి అయిదేండ్లు. ఆ యా పదవులకు ఎన్నుకొనబడునాటికి వారిలో ఏ ఒకని వయసైనను 35 ఏండ్లకు పైబడి ఉండవలయును. ఉపరాష్ట్రపతి అధికారరీత్యా రాజ్యసభకు అగ్రాసనాధిపతిగ వ్యవహరించును. కొన్ని పరిస్థితులలో ఒక విహిత ప్రక్రియను అనుసరించి లోకసభలో మూడింట రెండువంతుల సభ్యుల ఆమోదముతో రాష్ట్రపతిని అభిశంసించి, పదవి నుండి తొలగింపవచ్చును; అటులే ఉపరాష్ట్రపతిని, రాజ్యసభయందలి అధిక సంఖ్యాక సభ్యుల ఆమోద బలమున తొలగింప వీలగును. లోకసభయు, రాజ్యసభయు సమష్టిగ పార్లమెంటు అని వ్యవహృతములు. పార్లమెంటు సభ్యుని వయస్సు 30 ఏండ్లకు తక్కువగ ఉండరాదు.

లోకసభయందు అధిక సంఖ్యాక బలముగల నాయకుని ప్రధానిగ, అధ్యక్షుడు నియమించి, అతని సలహాను అనుసరించి తక్కిన మంత్రులను నియమించును. ప్రధాని ఆధ్వర్యవమునఉన్న ఆ మంత్రివర్గము పార్లమెంటునకు బాధ్యత వహించి పరిపాలనను నెరపును. శాసన నిర్మాణమునకు పార్లమెంటులోని ఉభయ సభల ఆమోదము విధిగ ఉండవలయును; కాని ధనసంబంధ వ్యవహారముల బిల్లుల విషయమున మాత్రము, రాజ్యసభామోదము లేకపోయినను, లోకసభ తనకు నచ్చినటుల వ్యవహరించవచ్చును. రాజ్యాంగ విధానమును సవరించు అధికారము పార్లమెంటునకు మాత్రమే కలదు. కాని కొన్ని శీరుల సవరణల విషయమున మాత్రము, రాష్ట్ర సంఖ్యలో సగమునకు మించిన రాష్ట్రములు ఆ సవరణను ధ్రువీకరించినపుడు మాత్రమే ఆ సవరణ అమలులోనికి రాగలదు.

రాష్ట్రములందు అన్నింటను, రాష్ట్ర పరిధిలోని అధికారములకు సంబంధించిన శాసనములను చేయుటకు విధాన సభలు కలవు. అందలి సభ్యులు ఆ యా రాష్ట్రముల ప్రజలచేత ప్రాదేశిక నియోజక వర్గములవలన ఎన్నుకొనబడెదరు. కొన్ని రాష్ట్రములలో – ఆంధ్రప్రదేశ్, ఉత్తరప్రదేశ్, కర్ణాటక, జమ్మూ-కాశ్మీర్, తమిళనాడు బీహార్, మహారాష్ట్రములలో – విధాన సభలకు తోడుగ విధాన పరిషత్ అనబడు కక్ష్యయును వేరొకటి కలదు. ఇట్టి విధాన పరిషత్తులోని సభ్యసంఖ్య ఆ యా రాష్ట్రపు విధాన సభల సభ్యసంఖ్యలో మూడవవంతును మించియుండదు; అయితే ఏ విధాన పరిషత్తునందును ఆ సంఖ్య 40 మందికి తగ్గకూడదను నియమము కలదు. విధాన పరిషత్తులోని సభ్యులలో రమారమి మూడవ వంతును, ఆ రాష్ట్రపు విధానసభా సభ్యులు ఎన్నుకొనెదరు (అయితే అటుల ఎన్నుకొనబడువారు విధాన సభలో సభ్యులై ఉండగూడదు); ఒక మూడవవంతు స్థానిక సంస్థల సభ్యుల వలనను, పండ్రెండవవంతు

*ఈ పదవీకాల పరిమితి లోకసభ విషయముననేగాక, రాష్ట్ర విధాన సభల విషయమున సైతము ఆరేండ్లకు రాజ్యాంగ విధానపు 42వ సవరణవలన పెంచబడినది (1976). కాని తరువాత మురార్జీ దేశాయి అధ్వర్యవమున కేంద్రమున అధికారమును గ్రహించిన జనతా పక్షపు ప్రభుత్వము ఈ మార్పును రద్దుచేసి, యథాపూర్వ స్థితిలోనే ఈ పరిమితిని ఉంచుటకు కృత నిశ్చయత వహించినది.

సెకండరీ స్థాయికి తగ్గని పాఠశాలలో పనిచేయు ఉపాధ్యాయుల నియోజకవర్గము వలనను; వేరొక పంద్రెండవ వంతు నమోదైన పట్టభద్రుల నియోజక వర్గము వలనను ఎన్నుకొనబడెదరు. తక్కిన స్థానములకు రాష్ట్రపు గవర్నరే తన మంత్రివర్గపు సలహాపై సాహిత్య, విజ్ఞాన, కళా, సహకారోద్యమ, సాంఘిక సంసేవా కార్యక్రమములందు పేరొందిన ప్రముఖులను నియామకము చేయును. విధాన పరిషత్తులోని సభ్యుని పదవీకాల పరిమితి ఆరేండ్లు; అయినను రెండేండ్ల కొకసారి పరిషత్తునందలి మూడవవంతు సభ్యులు పదవీ విరమణచేసి క్రొత్త వారు ఎన్నికయగు వసతి కల్పింపబడినది. ఈ విధముగ విధాన పరిషత్తు నిరంతరాయముగ మనుగడను సాగించును. రెండు కక్ష్యల శాసనసభ ఉన్న రాష్ట్రములందు, ధన సంబంధపు బిల్లులపై నిర్ణయాధికారము విధానసభకు మాత్రమే ఉండును. రాష్ట్రపు గవర్నరు, విధాన సభయందు అధిక సంఖ్యాక పక్షపు నాయకుని ముఖ్యమంత్రిగ నియమించి, అతని సలహాపై తక్కిన మంత్రులను నియమించును. ఈ మంత్రివర్గము, శాసనసభకు బాధ్యత వహించి దైనందిన పరిపాలనను నెరపును. విధానసభ విశ్వాసమును ముఖ్యమంత్రి కోల్పోవుట, లేదా రాష్ట్రమున ఏవియైన ఆంతరంగిక కల్లోలముల వలన పరిపాలన స్తంభించిపోవుట ఏర్పడి, వేరుగ ఏ పార్టీయు ప్రభుత్వమును ఏర్పరచలేని పరిస్థితి ఏర్పడినపుడు గవర్నరు నివేదికపై, రాష్ట్రపతి, ప్రధాని సలహాపై రాష్ట్ర విధాన సభను రద్దుచేయవచ్చును; లేదా కొంత కాలము ఆ సభను పనిచేయని స్థితిలో ఉంచవచ్చును. అట్టి పరిస్థితిలో రాష్ట్రపతియే రాష్ట్రపాలనను స్వీకరించగ, అతని పక్షమున గవర్నరు, దైనందిన పాలనను నెరపును; ఆ కాలమున శాసన నిర్మాణాధికారము, బడ్జెట్ వ్యవహారములు పార్లమెంటున న్యస్తములగును. విధానసభ రద్దయిన యెడల ఎన్నికలను ఆరు నెలలలోపల జరుపవలెను. కాని పార్లమెంటు ఈ కాలమును ఒక్కొక్కసారి ఆరు నెలల చొప్పున మూడేండ్లవరకు మాత్రము మొత్తముమీద పొడిగించుటకు అధికారము కలిగియున్నది.

పై రాష్ట్రపాలనారీతి జమ్మూ-కాశ్మీరున తప్ప తక్కిన అన్నింట ఒకే తీరుగ ఉన్నది. జమ్మూ-కాశ్మీరు రాష్ట్రము మాత్రము ఒక ప్రత్యేక స్థానమును కలిగియున్నది. ఆ రాష్ట్రమునకు సంబంధించినంతవరకు రక్షణ, రవాణా సౌకర్యములు, విదేశ వ్యవహారములు అను వానిపై మాత్రమే యూనియన్ ప్రభుత్వమునకు హక్కు కలదు. తక్కిన వాని విషయమున పార్లమెంటు చేయు చట్టములను ఆ రాష్ట్రము ఆమోదించినపుడే, అవి ఆ రాష్ట్రమునకు వర్తింపగలవు.

కేంద్ర పాలిత ప్రాంతములకు సహజముగ మంత్రివర్గములనుగాని, శాసన సభలనుగాని కలిగియుండు అధికారము లేదు. కాని ఏదైన ఒక కేంద్రపాలిత ప్రాంతమునకు, చట్టముద్వారా, పార్లమెంటు ఈ అధికారమును కల్పింప వచ్చును. ఇట్టి అధికారములను గోవా-దామన్-దయ్యూ, పుదుచ్చేరి, మిజోరామ్‌లకు పార్లమెంటు కల్పించినది. ప్రతి కేంద్రపాలిత ప్రాంతమునను, పరిపాలనాధికారిగ లెఫ్టినెంట్ గవర్నరు పనిచేయును.

దేశము స్వాతంత్ర్యమును ఆర్జించిన సమయమున జాతీయ పక్షములుగ పరిగణింపదగిన రాజకీయ పక్షములు రెండు - మహత్తర వ్యాప్తి కలిగిన భారత జాతీయ కాంగ్రెస్, అటనట కొన్ని ప్రాంతములందు బలము కలిగిన భారత కమ్యూనిస్ట్ పార్టీ - మాత్రమే ఉండినవి. తరువాత భారత జాతీయ కాంగ్రెసునుండి చీలికవలనను, దాని తోటి వైరుధ్యముల వలనను అంతటంతట పలు పార్టీలు రూపుగొనినను 1974 నాటికి ఆ యా పార్టీలలో కొన్ని కలయికలు, కొన్ని చీలికలు జరిగినవి.

1969 లో కాంగ్రెస్ రెండుగ చీలి భారత జాతీయ కాంగ్రెస్ (సంస్థా), భారత జాతీయ కాంగ్రెస్ (పరిపాలక) అను రెండు జాతీయ పక్షములుగ రూపుగొనినది. కమ్యూనిస్టు పార్టీయు 1964 లో చీలినది; ఆ చీలికలలో భారత కమ్యూనిస్ట్ పార్టీ, భారత కమ్యూనిస్ట్ పార్టీ (మార్క్సిస్ట్) అనునవి జాతీయ పక్షములుగ పరిగణన పొందినవి. స్వతంత్ర, భారతీయ క్రాంతిదళ్ మొదలగువాని మేళనమువలన 1974 లో భారతీయ లోకదళ్ జాతీయ పక్షముగ రూపొందినది. 1951 లో రూపుగొనిన జాతీయ జనసంఘ్ తదాదిగ జాతీయ, పార్టీగనే లెక్కింప బడినది. 1948 లో జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వమున రూపుగొనిన భారత సోషలిస్ట్ పార్టీ బహురూప వికృతులను కాలక్రమేణ పొంది, 1973 లో సోషలిస్టు పార్టీగ వ్యవస్థీకృతమై, జాతీయ పరిగణనను ఆర్జించినది. అయినను 1977 ఫిబ్రవరిలో జనసంఘ్, సంస్థా కాంగ్రెస్, సోషలిస్ట్, భారతీయ లోకదళ్ పక్షములు జనతాపార్టీగ మేళనమందినవి.

ఈ జాతీయ పక్షములుగాక, దేశమున వివిధ రాష్ట్రములందు, ఆ యా స్థానిక పరిస్థితులను అనుసరించి, అంతటంతట కొన్ని ప్రాంతీయ పార్టీలును రూపుగొనినవి. వీనిలో అంతరించినవి పోగా ద్రవిడ మున్నేట్ర కజగం, అన్నా ద్రవిడ మున్నేట్ర కజగం అనునవి తమిళనాడు, పుదుచ్చేరీలలోను, శిరోమణి అకాలీదళ్ పంజాబునను ప్రాబల్యములను కలిగియున్నవి. ఇవిగాక మహారాష్ట్రమునందలి పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ, గోవా-దామన్-దయ్యూలోని మహారాష్ట్ర వాదీ గోమంతక్ పార్టీ, నాగాలాండ్‌లోని యునైటెడ్ ఫ్రంట్, జమ్మూ-కాశ్మీరులోని జమ్మూ-కాశ్మీర్ నేషనల్ కాన్ఫరెన్స్, మేఘాలయలోని ఆల్ పార్టీ హిల్ లీడర్స్ కాన్ఫరెన్స్ ప్రాంతీయ పార్టీలలో పేర్కొనదగినవి. ఇంకను కొన్ని చిన్న పక్షములు అటనట ఉన్నను అవి గణనీయ రీతిలో ప్రజామోదమును పొందకున్నవి.

భారతదేశమున న్యాయశాఖకు స్వతంత్ర ప్రతిపత్తి రాజ్యాంగ విధానరీత్యా కల్పింప బడినది. భారతదేశపు సుప్రీమ్ కోర్టున ప్రధాన న్యాయాధీశునితో కలసి 14 మందికన్న ఎక్కువగ ఉండని జడ్జీలు కలరు. వీరిని రాష్ట్రపతి నియమించును. ఆ జడ్జీ పదవికి నియమింపబడిన వ్యక్తి 65 ఏండ్ల వయసు వరకు ఆ పదవియందే కొనసాగును. జడ్జీల వేతనములు మొదలగునవి చట్టరీత్యా సురక్షితములు. ఒక జడ్జీని పదవినుండి తొలగించవలయునన్న పార్లమెంటులోని ఉభయ సభలును, హాజరైన సభ్యులలో మూడింట రెండువంతుల ప్రాబల్యముతో ఆ చర్యను సూచించినపుడు మాత్రమే రాష్ట్రపతి ఆ జడ్జీని తొలగింప వీలగును. స్వయముగ కొన్ని రీతుల అభియోగములను, హైకోర్టు తీర్పులపైనను, ట్రిబ్యూనల్ తీర్పులపైనను అప్పీళ్ళను విచారించి తుది తీర్పు నొసగు అధికారము సుప్రీమ్ కోర్టునకు కలదు. రాష్ట్రములకు, యూనియన్ ప్రభుత్వమునకు అధికార పరిధుల మధ్య చెలరేగు వివాదములను విచారించి తీర్పు నిచ్చుటకును, రాష్ట్రపతి స్వయముగ సుప్రీమ్ కోర్టునకు నివేదించు ఒక న్యాయ విషయిక వ్యవహారముకు గురించి సలహాను ఇచ్చుటకును సుప్రీమ్ కోర్టునకు అధికారము కలదు.

సాధారణముగ ప్రతి రాష్ట్రమునను న్యాయ నిర్వహణపై ఆధ్వర్యవమును వహించి పనిచేయు హైకోర్టు కలదు; అయినను కొన్ని సందర్భములందు కొన్ని రాష్ట్రములకు సమష్టిగనో, రాష్ట్ర కేంద్రపాలిత ప్రాంతములకు సమష్టిగనో ఒక హైకోర్టు ఉండుటయును కలదు. సుప్రీమ్‌కోర్టులోని ప్రధాన న్యాయాధీశుని, రాష్ట్రపు గవర్నరును,

సంప్రతించి హైకోర్టునందలి ముఖ్య న్యాయాధిపతిని రాష్ట్రపతి నియమించును. తక్కిన హైకోర్టు జడ్జీల నియామకమున పైవారినేగాక, హైకోర్టుయొక్క ముఖ్య న్యాయాధిపతినికూడ రాష్ట్రపతి సంప్రతించును. హైకోర్టున జడ్జీగ నియమింపబడిన వ్యక్తి 62 ఏండ్ల వయసువరకు ఆ పదవియందు కొనసాగును. హైకోర్టుయొక్క నిర్ణయాధికారమునకు లోబడి ఆయా రాష్ట్ర, కేంద్రపాలిత ప్రాంతములందలి దిగువ శ్రేణులకు చెందిన పౌర, దండ న్యాయస్థానములు వ్యవహరించును.

భారతదేశపు సుప్రీమ్‌కోర్టు నయీ ఢిల్లీలో నెలకొనియున్నది. దేశపు మొత్తమున 18 హైకోర్టులు కలవు. ఆయా హైకోర్టుల పేరులును, వాని సంస్థాపనా సంవత్సరములును, వాని అధికారపు ప్రాదేశిక పరిధులును, పీఠస్థానములును దిగువ ఈయబడినవి.

## పట్టిక VII

## భారతదేశపు హైకోర్టుల వివరములు

| వరుస సంఖ్య | పేరు | | సంస్థాపనా సంవత్సరము | అధికారపు ప్రాదేశిక పరిధి | పీఠస్థానము |
|---|---|---|---|---|---|
| 1. | అలహాబాద్ | హైకోర్టు | 1866 | ఉత్తర ప్రదేశ్ | అలహాబాదు (లక్నోలో ఒక బెంచి కలదు) |
| 2. | ఆంధ్రప్రదేశ్ | ,, | 1954 | ఆంధ్రప్రదేశ్ | హైదరాబాదు |
| 3. | ఒరిస్సా | ,, | 1948 | ఒరిస్సా | కటక్ |
| 4. | కర్ణాటక | ,, | 1884 | కర్ణాటక | బెంగుళూరు |
| 5. | కలకత్తా | ,, | 1861 | పశ్చిమ బెంగాల్, అండమాన్-నికోబార్ | కలకత్తా |
| 6. | కేరళ | ,, | 1956 | కేరళ; లక్షద్వీప్ | ఎర్నాకులం |
| 7. | గుజరాత్ | ,, | 1960 | గుజరాత్ | అహమ్మదాబాదు |
| 8. | గౌహతి | ,, | 1972 | అస్సామ్, మణిపూర్, మేఘాలయ, నాగాలాండ్, త్రిపుర, మిజోరామ్, అరుణాచల ప్రదేశ్ | గౌహతి (అగర్తలా, ఇంఫాల్, కొహిమాలలో తాత్కాలికపు బెంచీలు కలవు) |
| 9. | జమ్మూ-కాశ్మీర్ | ,, | 1928 | జమ్మూ-కాశ్మీర్ | శ్రీనగర్, జమ్మూ |
| 10. | ఢిల్లీ | ,, | 1966 | ఢిల్లీ (కేంద్ర పా. ప్రాం.) | ఢిల్లీ |

| వరుస సంఖ్య | పేరు | | సంస్థాపనా సంవత్సరము | అధికారపు ప్రాదేశిక పరిధి | పీఠస్థానము |
|---|---|---|---|---|---|
| 11. | పంజాబ్&హర్యానా హైకోర్టు | | 1947 | పంజాబ్; హర్యానా; చండీఘర్. | చండీఘర్ |
| 12. | పాట్నా | ,, | 1916 | బీహార్ | పాట్నా |
| 13. | బొంబాయి | ,, | 1861 | మహారాష్ట్ర; దాద్రా-నగర్ హవేలీ | బొంబాయి (నాగపూర్‌లో బెంచి కలదు) |
| 14. | మద్రాసు | ,, | 1861 | తమిళనాడు; పుదుచ్చేరి | మద్రాసు |
| 15. | మధ్యప్రదేశ్ | ,, | 1956 | మధ్యప్రదేశ్ | జబల్‌పూరు (ఇండోర్, గ్వాలియరులలో బెంచీలు కలవు) |
| 16. | రాజస్థాన్ | ,, | 1949 | రాజస్థాన్ | జోధ్‌పూర్ |
| 17. | సిక్కిమ్ | ,, | 1975 | సిక్కిమ్ | గాంగ్‌టోక్ |
| 18. | హిమాచల ప్రదేశ్ | ,, | 1971 | హిమాచల ప్రదేశ్ | సిమ్లా. |

## 8. దేశరక్షణ

తన ఇరుగుపొరుగు దేశములతో సన్నిహిత సత్సంబంధములను పెంపొందించుకొని, వివాద విషయములను శాంతియుత చర్చలద్వారా పరిష్కరించుకొని, భారత ఉపఖండమునందును, తత్పరిసరములందును శాంతిని వర్ధిల్ల జేయుటయును, ఆ సమయముననే ముందు జాగ్రతకొరకై తన రక్షణ బలములను సమర్థవంతములుగ రూపొందించి, ఎట్టి దురాక్రమణనైనను ఎదుర్కొనుటకు సన్నద్ధముగ ఉండుటయును భారతదేశపు రక్షణ విధానమున మూల సూత్రములు.

దేశపు రాష్ట్రపతియందే సర్వవిధ సేనలపై నుండు ఉచ్చతమాధికారము న్యస్తము. ఆయనయే సర్వసేనాపతి. అయినను ఈ రక్షణ బాధ్యతను మంత్రిమండలియే వహించును. ప్రధాని ఆధ్వర్యమున పనిచేయు రాజకీయ వ్యవహార సంఘము, రక్షణకు సంబంధించిన ముఖ్య విషయములపై నిర్ణయములను తీసికొనును. రక్షణ సేనల నిర్వహణ విషయమున రక్షణమంత్రి పార్లమెంటునకు బాధ్యత వహించి వ్యవహరించును. త్రివిధ (భూ, నౌకా, వాయు) సేనలకు వేర్వేరుగ సేనాపతులు కలరు.

భూతల సేనకు చెందిన ముఖ్య కార్యాలయము నయీ ఢిల్లీయందు ఉన్నది. సౌకర్యార్థమై, దేశపు ప్రాంతములను అనుసరించి, ఈ భూతలసేన అయిదు ప్రాంతీయ మండల సేనలుగ విభజింపబడినది. అవి : పశ్చిమ, తూర్పు, ఉత్తర, దక్షిణ, మధ్య ప్రాంతీయ మండల సేనలు. ఆయా ప్రాంతీయ మండల సేనలలో ప్రతియొక దానికి ఒక జనరల్-ఆఫీసర్ - కమాండింగ్ - ఇన్ - చీఫ్ కలడు. మండలసేనయు ఏరియా, ఇండిపెండెంట్ సబ్‌యేరియా, సబ్‌యేరియా దళములుగ విభక్తము.

ఇందులో మొదటిదానికి ఒక జనరల్ ఆఫీసర్ కమాండింగ్, తక్కిన వానిలో ప్రతిదానికి ఒక బ్రిగేడియరును నాయకులుగ ఉండెదరు. భూతల సేనకు చెందిన పర్మనెంట్ కమీషన్డ్ ఆఫీసర్ల ఉద్యోగ నియామకము డెహ్రాడూన్‌లోని ఇండియన్ మిలిటరీ అకాడమీద్వారా జరుగును.

భూతల సేనగాక, టెరిటోరియల్ ఆర్మీ అని వ్యవహృతమగు ఒక ప్రత్యేక రక్షణ విభాగము 1949 సెప్టెంబరులో వ్యవస్థీకృతమై తదాదిగ పని చేయుచున్నది. దీని విధులు: 1. భూతల సేనకు, కొన్ని విధులలో సాయపడి, పౌర ప్రభుత్వమునకు అవసరమైనపుడు సాయపడుట, 2. విమానఘ్న దళములుగ వ్యవహరించుట, 3. అవసరమైనపుడు భూతల సేనలో అంతర్భాగముగ చేరి, ఆ విధులను నిర్వహించుట. ఈ విభాగమున త్రివిధ సేనల విధులకు చెందినవారు కలరు.

దేశపు భూతల సేనయొక్క అధికృత సైనిక సంఖ్య 8.38 లక్షలు. ఇందు ఆ సేనా విధులకు సంబంధించిన అన్ని విధముల దళములును చేరి ఉన్నవి. ప్రపంచ రాజ్యములలో సైనిక బలమున నాలుగవదిగ భారతదేశము ఖ్యాతిని ఆర్జించినది. ఇక టెరిటోరియల్ ఆర్మీయొక్క అధికృత సంఖ్య 50 వేలు.

భారత ప్రభుత్వపు నౌకాసేన, తొలుత 1613 లో ఈస్ట్ ఇండియా కంపనీ నిర్మించిన 'మరైన్' అనబడు అల్ప నౌకాదళమున రూపు గొని, క్రమముగ బ్రిటిష్ పాలనా కాలమున రాయల్ ఇండియన్ నేవీ అని వ్యవహృతమై, జనవరి 26, 1950 లో, స్వతంత్ర భారతమున, ఇండియన్ నేవీ అను నామమును గ్రహించినది; ఇందలి నౌకలకు పేరున ముందుగ ఐ. యన్. యస్. (INS) అను సంకేతము ఉండును. భారతదేశపు నౌకాబలమున ప్రముఖములగు నౌకల వివరములు ఈ దిగువరీతిగ కలవు:

| నిర్మిత సంవత్సరము | పేరు | టన్నులలో ప్రమాణము | ఆయుధ సంపత్తి | అశ్వశక్తి | వేగము (నాట్లలో) |
|---|---|---|---|---|---|
| | | | విమాన వాహక నౌక | | |
| 1961 | విక్రాంత్ | 16,000 | 15.4 మిమీ. ఆక్ ఆక్ | 40 వేలు | 24.4 |
| | | | క్రూయిజర్లు | | |
| 1940 | మైసూర్ | 8,700 | 9.6″; 8.4″ | 72,500 | 31.5 |
| 1933 | ఢిల్లీ | 7,114 | 6.6″; 8.4″ | 72,000 | 32 |

ఈ నౌకాదళముననే 4 జలాంతర్గాములు, 3 డిస్ట్రాయర్లు, ఒక ఫ్రిగేట్, 2 యాంటీ సబ్‌మెరైన్ ఫ్రిగేట్లు, 2 చిన్న ఫ్రిగేట్లు, 3 యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ ఫ్రిగేట్లు, 6 సాధారణ ఫ్రిగేట్లు, 5 ఎస్‌కార్‌ట్లు, 1 ఓషన్‌మైన్‌స్వీపర్, 4 తీరప్రాంతమైన స్వీపర్లు, 4 చిన్న తరగతిమైన్ స్వీపర్లు, 8 టార్పెడో-మిసిలీ బోట్లు, 9 కాపలా నౌకలు, 11 సముద్రరక్షక బోట్లు, 5 లాండింగ్ షిప్పులు, 4 సర్వేనావలు, 1 మరమ్మతుల నావ, 1 సబ్మరీన్ పేరంట్ నావ, 1 సబ్‌మెరీన్ పరిరక్షక నావ, 4 ఆయిలర్లు, 1 ఓషన్ టగ్గ

చేరి ఉన్నది. నౌకాబలసంపత్తికి పేరొందిన ప్రపంచ రాజ్యములలో. ఎనిమిదవదిగ లేదా తొమ్మిదవదిగ భారతదేశము పరిగణనకు రాగలదని, అభిజ్ఞుల అంచనా.

నౌకా సేనయొక్క ముఖ్య కార్యాలయము నయీ ఢిల్లీ యందు కలదు; ఈ సేన ప్రాంతములను అనుసరించి 1. పశ్చిమ నౌకా బలము, బొంబాయి. 2. తూర్పు నౌకా బలము, విశాఖపట్టణం. 3. దక్షిణ నౌకా బలము, కొచ్చిన్-అని మూడు శాఖలుగ విభక్తమై పని చేయుచున్నది.

విమానవాహక నౌకయగు విక్రాంత్‌న సాధారణముగ ఉండు పోరాటపు విమానములేగాక, వానికి తోడుగ ఒక సీ-కింగ్ తరగతి హెలీకాప్టరు దళము కూడ పని చేయుచున్నది. విశాఖపట్టణం, కొచ్చిన్, ఓఖాలలో నౌకాస్థావరములను, డాక్‌యార్డులను నిర్మించు కృషి త్వరితముగ సాగి చాలవరకు పూర్తియైనది; బొంబాయిలోని డాక్‌యార్డు, ఆధునిక రీతిలో పునర్నిర్మితమైనది. అండమాన్-నికోబార్ దీవులలోని పోర్ట్ బ్లయిర్‌వద్ద ఒక నౌకా వ్యవస్థ నెలకొల్పబడి, ఆ దీవుల పరిరక్షణకు ఉపకరించుచున్నది. నౌకా సేనలోని ఆఫీసర్ల, రేటింగుల మొత్తపు సంఖ్య 20 వేలు (1972).

భారతదేశపు వాయుసేన 1932 లో వ్యవస్థితమై తదాదిగ వృద్ధి చెందుచున్నది. ఈ సేన సౌకర్యార్థమై 1. పశ్చిమ ఎయిర్ కమాండ్, 2. సెంట్రల్ ఎయిర్ కమాండ్, 3. తూర్పు ఎయిర్ కమాండ్, 4. ట్రయినింగ్ కమాండ్, 5. మెయింటెనన్స్ కమాండ్ – అని 5 శాఖలుగ విభక్తము.

ప్రస్తుతమున (1977) లో వాయుసేనయందలి పోరాటపు విమాన దళముల వివరములు ఈ దిగువ తీరుగ కలవు :

| దళముల మొత్తం | వివరము | విమానపు తరగతి | విమాన సంఖ్య |
|---|---|---|---|
| 3 | లైట్ బాంబర్ స్క్వాడ్రన్‌లు | కాన్‌బెర్రా | 50 |
| 13 | గ్రౌండ్ ఎటాక్ స్క్వా.లు | ఎస్‌యు 7 | 100 |
| | | హెచ్‌పి 24 మారుత్ | 50 |
| | | హంటర్ | 65 |
| 18 | ఇంటర్ సెప్టర్ స్క్వా. లు | మిగ్ 21 | 270 |
| | | గ్నాట్ | 130 |
| 1 | వేగుపని దళము | కాన్‌బెర్రా | 57 |

పైవిగాక ఆర్డరు ఇచ్చియున్నవి.

| | |
|---|---|
| మిగ్ 21 యం. యష్ | 110 |
| ఇస్కార్స్ | 40 |
| గ్నాట్ | 100 |

పై పోరాట విమానములుగాక ట్రాన్స్‌పోర్టు దళముల విమానములును, హెలీకాప్టర్ దళములును గణనీయ సంఖ్యలో దేశమునకు కలవు. అన్నింట కలసి మొత్తమున వాయుసేనకు 2000 కు పైబడిన

విమానములు 45 స్క్వా.) కలవు. వాయుసేన లోని సైనిక సంఖ్య దాదాపు 80 వేలు.

యుద్ధమున ఉపయోగించు ఆయుధ పరికరాదుల విషయమున స్వయంపోషకతను సాధించుటకై భారతదేశము కృషిచేయుచున్నది. 28 ఆయుధ నిర్మాణశాలలు (ఆర్డ్‌నన్స్ ఫేక్టరీలు) ఆయుధములను, మందు సామగ్రిని, రసాయనములను, ప్రేలుడు పదార్థములను, సైనిక శకటములను తయారు చేయుచున్నవి. ఆవడియందలి భారీ వాహనాల ఫేక్టరీ 'వైజయంత' టాంకులను నిర్మించుచున్నది. చిన్న ఆయుధములకు, తేలికరకపు ఆర్టిలరీకి సంబంధించినంతవరకు దేశము ఇప్పటికే స్వయం పోషకతను సాధించినది.

1964 మొదలుగ భారతదేశము తనకు కావలసిన సైనిక నౌకలను తానే నిర్మించుకొనుటకు చాల కృషిచేయుచున్నది. బొంబాయియందలి మజగాంవ్ డాక్, గోవాలోని షిప్‌యార్డు, కలకత్తాలోని గార్డెన్ రీచ్ వర్కుషాపులు ఇందు చాల ముందంజ వేసినవి. 1964 లో స్థాపితమైన హిందూస్థాన్ ఏరోనాటిక్స్ సూపర్ సోనిక్ జెట్ ఫైటర్లను, సూపర్ సోనిక్ జెట్ ఇంటర్ సెప్టర్‌లను, గ్నాట్ రకపు తేలిక ఫైటర్లను, శిక్షణకు ఉపయోగించు అలూయెట్టి III, హెచ్‌జెటి-16 (కిరణ్) విమానములను, యస్-ఏ 315 రకపు హెలీకాప్టర్లను, హెచ్. యస్. 748 రకపు ట్రాన్స్‌పోర్టు విమానములను, గాలిలో పోరాటమున వాడనగు క్షిపణులను తయారు చేయుచున్నది. ఈ సంస్థకు బెంగుళూరు, నాసిక్, కోరాపుట్, హైదరాబాదు, కాన్పూర్, లక్నోలలో కర్మాగారములు కలవు. ఇంకను భారత్ ఎలక్ట్రానిక్స్ (బెంగుళూరు, ఘాజియాబాద్), భారత్ డైనమిక్స్, ప్రాగా టూల్స్, మిశ్రధాతు నిగమ్ (హైదరాబాద్) యుద్ధ సామగ్రి నిర్మాణమున పాల్గొనుచున్నవి. దేశపు జాతీయోత్పత్తిలో 4% మాత్రమే దేశరక్షణకై ప్రస్తుతమున వినియుక్తమగుచున్నది.

## 9. అంతర్జాతీయ సంబంధములు

ఐ. రా. స. సంస్థాపనా కాలమునుండియు ఆ సంస్థయందును, దానికి చెందిన ప్రత్యేక వ్యవస్థలలో పెక్కింటను ఇండియా సభ్యత్వమును కలిగిఉన్నది. కొరియా, వియెట్‌నామ్, లావోస్, కాంబోడియా, పశ్చిమాసియా, జయిరే, సైప్రస్‌లలో పోరాటములు చెలరేగినపుడు, యుద్ధవిరమణలను, తాత్కాలిక సంధులను అమలు జరుపులలో ఐ. రా. స. అవలంబించిన చర్యలందు శాంతి సంరక్షణ కృషిలో భారతదేశపు సైనిక దళములను, రాజకీయ సంఘములును ఎక్కువగ పాల్గొనినవి.

ప్రపంచశాంతి కృషిలో, భారతదేశము, తాను స్వాతంత్ర్యమును ఆర్జించినది మొదలుగ నిరంతయముగ దీక్షతో పనిచేయచున్నది. ప్రపంచమున అగ్రరాజ్యముల మధ్య ఏర్పడిన వైరుధ్యముల, ఫలితముగ ప్రపంచరాజ్యములు రెండు వర్గములుగ చీలు ప్రమాదము ఏర్పడినపుడు, ఆ బెడద నుండి ప్రపంచమును సంరక్షించుటకై అలీనరాజ్యవర్గమును వ్యవస్థీకరించుటకు ఈజిప్ట్, యుగోస్లావియాలతో కలసి ఈ దేశము పలుఅవరోధములను అతిక్రమించి, కృషిచేసి సఫలతను ఆర్జించినది. ఆ వర్గము ఇపుడు ఒక బలవత్తర వ్యవస్థగ రూపొంది ప్రపంచ రాజకీయములందు ప్రముఖపాత్రను నిర్వర్తించుచున్నది.

అన్ని ఇతర రాజ్యములతో శాంతి సామరస్యములతో మనుట భారతదేశపు వైదేశిక నీతియందలి మూలసూత్రము ఈ నీతిని అనుసరించియే చీనాలో కమ్యూనిస్ట్ ప్రభుత్వము ఏర్పడినపుడు ఆ రాజ్యమును గుర్తించుటకు భారతదేశము తొలుతగ ముందునకు వచ్చినది (1948). ఆ దేశమునకు న్యాయతః దక్కవలసిన భద్రతాసమితి శాశ్వత సభ్యత్వమును దానికి చెందనీయకుండ చేయుటకు యు. స్టే. ఆధ్వర్యవమున కొన్ని రాజ్యములు పట్టు

దల వహించినను, భారతదేశము చీనా ప్రభుత్వమునకు ఆ సభ్యత్వము చేకూరవలయునని పట్టుదలతో వ్యవహరించినది. దురదృష్టవశమున, చీనా ప్రభుత్వము పూనుకొనిన దండుడుకు చర్యవలన, భారత చీనా దేశములమధ్య సరిహద్దు పోరాటము చెలరేగి (1962), భారతదేశపు కొంది సరిహద్దు ప్రాంతమును చీనా ఆక్రమించిన ఫలితముగ, వైమనస్యములు ఏర్పడినపుడు సైతము, భద్రతాపమితి యందు చీనాకు గల శాశ్వత సభ్యత్వమును సమర్థించుటలో భారతదేశము వెనుకంజ వేయలేదు. ఆ సరిహద్దు పోరాటపు ఫలితముగ చీనా-భారతదేశముల మధ్య దౌత్య సంబంధములు రాయబారి స్థాయిలో విచ్ఛిన్నములైనను, 1977 లో పునరుద్ధరితములైనవి. సరిహద్దు సమస్యను, న్యాయరీతిలో సంభాషణల మూలమున శాంతియుత వాతావరణమున పరిష్కరించుకొనుటకు భారతదేశము తన సుముఖతను సదా వెల్లడించుచు, తన సరిహద్దు భూమిని తాను కైవసము చేసికొనుటకు కృతనిశ్చయత వహించియున్నది.

ప్రపంచరాజ్యములలో దక్షిణ ఆఫ్రికా, ఇజ్రాయెల్‌లతో మాత్రమే భారతదేశమునకు దౌత్య సంబంధములు లేవు. దక్షిణ ఆఫ్రికా అనుసరించు వర్ణ వివక్షతా విధానమును, నమీబియా ప్రజలకు స్వాతంత్ర్యమును కలిగించుటకు ఆ దేశము నిరాకరించుటను భారతదేశము నిరసించుచున్నది. అరబ్బు దేశములతో ఇజ్రాయెల్‌కు ఉన్న వివాదమున అరబ్బుల వాదమును భారతదేశము సమర్థించు చున్నది. ఈ పైరెండు సమస్యల విషయమున పరిష్కారములను సాధించుటకై ఐ. రా. స. చేయు కృషికి భారతదేశము తన సంపూర్ణ సహకారమును అందజేయుచున్నది.

భారత ఉపఖండములోని వివిధ రాజ్యములును (పాకిస్తాన్, ఇండియా, నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్ లు) శాంతి సామరస్యములతో, ఒద్దికతో జీవించినపుడే ఆ ఉపఖండము నందలి ప్రజలు, దారిద్ర్య బాధనుండి విముక్తిచెంది పురోగమింపగలరని భారతప్రభుత్వము విశ్వసించి అందులకై నిరంతర కృషిని సాగించుచున్నది. కాని భారత ఉపఖండ విభజన యొక్క పరిణామములు పాకిస్తాన్ ఇండియాల మధ్య సంబంధములను చాలావరకు తొలుత కలుషితములు చేసినవి. అందులో ప్రముఖము కాశ్మీర్ సమస్య. జమ్మూ-కాశ్మీర్ ప్రాంతము భారతదేశమున అంతర్భాగముగ, అందలి ప్రజల స్వచ్ఛందపు అంగీకారముతో, రూపొందినను, ఈ యథార్థమును గుర్తించుటకు పాకిస్తాన్ నిరాకరించి, దౌర్జన్యమార్గమున దీని పరిష్కరించు కొనదలచిన ఫలితముగ రెండు పర్యాయములు యుద్ధములు చెలరేగినవి. ఐ రా. స ఇందు జోక్యము వహించి చేసిన కృషి, ఏ పక్షమునకు సంతృప్తిని కలిగించక సమస్య అపరిష్కృతముగనే నిలిచినది పాకిస్తాన్-భారతదేశముల మధ్యనున్న వైరుధ్యములను, బంగ్లాదేశ్ ప్రాదుర్భావము మరింతగ విషమింపజేసినది. అప్పటిలో తూర్పు పాకిస్తాన్‌గ వ్యవహృతమయిన బంగ్లాదేశ్ ప్రజల స్వాతంత్ర్య కాంక్షను పాకిస్తాన్ నిరసించి దమననీతిని అవలంబించిన ఫలితముగ దాదాపుగ కోటిమంది బంగ్లాప్రజలు భారతదేశమునకు కాందిశీకులుగ తరలివచ్చి, భారతదేశపు ఆర్థిక సమస్యలను క్లిష్టతరములుగ చేసిరి (1971). సహజముగ స్వాతంత్రాకాంక్షలను మన్నించు భారతదేశము బంగ్లా ప్రజలయెడ వహించిన సానుభూతిని అపార్థము చేసికొని పాకిస్తాన్ ఇండియాపై దండయాత్రను మొదలిడగ, భారతసేనలు బంగ్లాదేశపు స్వాతంత్ర్య సంస్థాపనకు తోడుపడుటయే గాక పశ్చిమమున సైతము తమదే పైచేయిగ ముందునకు చొరబారి, స్వయముగ యుద్ధవిరమణను ప్రకటించినవి. తరువాత పాకిస్తాన్‌లో రూపుగొనిన నూత్న ప్రభుత్వము భారతప్రభుత్వముతో కుదుర్చు

కొనిన సిమ్లా ఒడంబడిక (1972) మూలమున సమస్యలు చాలావరకు పరిష్కృతములై రాయబార సంబంధములును, రాకపోకల సదుపాయములును పునరుద్ధరితములైనవి. కాశ్మీరు సమస్యను గురించి పాకిస్తాన్ ఇప్పటికిని తన వైఖరిని మార్చుకొనకున్నను. ఈ ఉభయ రాజ్యముల మధ్య ప్రస్తుతమున సత్సంబంధములు ఏర్పడి కాలక్రమమున సంపూర్ణసామరస్యము కుదురుకొనగలదను ఆశాభావమునకు తావేర్పడినది.

బంగ్లాదేశ స్వాతంత్ర్యము విషయమున భారతదేశము ఎంతయో సహకరించినను, ఆ తరువాత బంగ్లాదేశ్‌లో వచ్చిన రాజకీయ పరివర్తనలు భారతదేశమునెడల ఆదేశపు సద్భావనను తొలుత కొంత తగ్గింపజేసినవి. గంగానదిపై ఫరక్కావద్ద భారతదేశము నిర్మించిన ఆనకట్టవలన, తమ నీటి సదుపాయములకు భంగము కలుగగలదను వివాదమును బంగ్లాదేశ్ లేవదీసి దానిని అంతర్జాతీయ సమస్యగ చేయుటకు కృషిచేసినది. కాని భారతదేశము తగు చొరవ తీసుకొని సంభాషణల మూలమున, ఈ విషయమును పరిష్కరించుటకై పూనుకొనినది. తత్ఫలితముగ జరిగిన ఒక ఒడంబడిక వలన (జూన్, 1977) ఈ సమస్య పరిష్కృతమై ఉభయ రాజ్యముల మధ్య సహకారము ఏర్పడినది.

నేపాల్‌లోని ప్రజలు సంపూర్ణ ప్రజాస్వామ్యమునకై జరిపిన ఆందోళనయెడ భారత రాజకీయ పక్షములు చూపిన సానుభూతి, నేపాల్ భారత దేశముల మధ్య కొంత దురభిప్రాయమునకు తొలుత కారణమైనను, భారతప్రభుత్వము అవలంబించిన సాంత్వన విధానము వలన ఆ సమస్య పరిష్కృతమై సత్సంబంధములు నెలకొనినవి. నేపాల్ యొక్క ఆర్థికాభివృద్ధికై భారతదేశము చాల సహకారమును కల్పించుచున్నది.

భూటాన్‌తో సాంప్రదాయికముగ భారతదేశమునకు సన్నిహితమగు రాజకీయ సంబంధము కలదు. (చూ. పు. 381). అయినను ఇందువలన భూటాన్ యొక్క స్వతంత్ర ప్రతిపత్తికి ఎట్టి భంగమును రాకుండ, జాగరూకత వహించుచు, ఆ దేశపు ఆర్థిక వికాసమునకు అన్ని విధముల ఇండియా సహాయము చేయుచున్నది. ఆ దేశము ఐ.రా.స. లో సభ్యత్వమును పొందుటకు భారతదేశము సహకరించినది.

బ్రిటిష్‌రాణి యొక్క నామమాత్రపు పెద్దరికమున పనిచేయు కామన్‌వెల్తులో భారతదేశమునకు సభ్యత్వము కలదు, (చూ. పు. 819). సాంప్రదాయికముగ బ్రిటనుతోను బ్రిటనునకు పూర్వము చెందియుండిన వలసలతోను తనకు నెలకొనియున్న సంబంధములను ప్రపంచమునందలి వివిధ జాతుల మధ్య శాంతి సౌహార్దముల అభివృద్ధికై వినియోగించుకొనుటకు, దీనిమూలమున భారతదేశము కృషి చేయుచున్నది.

అగ్రరాజ్యములగు యు. స్టే; సోవియట్ యూనియనులలో ఏ ఒకదాని వైపున మొగ్గుచూపక ప్రపంచ శాంతి సాధనలో ప్రతియొక దానితోడను సహకరించుచు వర్తించుట భారతదేశపు లక్ష్యము. 1972 లో సోవియట్ యూనియన్‌తో భారతదేశము ఒక మైత్రీ ఒడంబడికను కుదుర్చుకొనినను, అందు వలన యు. స్టే. తో తనకున్న సత్సంబంధములకు ఎట్టి భంగమును కలుగబోదని భారతప్రభుత్వము స్పష్టము చేసినది. తొలుత ఈ ఒడంబడిక యు. స్టే. ప్రభుత్వమునకు అంతగ నచ్చక పోయినను, 1977 లో భారతదేశమున ఏర్పడిన నూత్న ప్రభుత్వపు వైఖరి, దేశపు అలీనతను స్పష్టతరము చేయగలిగినది. తత్ఫలితముగ యు. స్టే తోడను సోవియట్ యూనియన్ తోడను సమాన మైత్రీ భావనతో భారతదేశము వ్యవహరింప గలుగుచున్నది.

అణ్వాయుధముల వ్యాపన నిరోధపు ఒడంబడిక (చూ. పు. 46) విషయమున, రెండు అగ్రరాజ్య

ముల ఒత్తిడికిని లొంగక భారతదేశము వ్యవహరించుచున్నది.

## 10. ఆర్థిక రంగము

సువ్యవస్థితమగు నాగరిక మానవ సంఘమునకు అతిప్రాచీన కాలము నుండియు నెలవుగ ఉండిన ఈ దేశమున స్వయంపోషకమగు సంఘవ్యవస్థ లక్ష్యముగ గలిగిన గ్రామీణ వ్యవస్థ పూర్వకాలమున కుదురుకొని ఉండెనని చరిత్ర వలన తెలియనగు చున్నది. ఇందులకై సంఘము వివిధ వృత్తులుగ వ్యవస్థీకృతమై ఉండినది. వ్యవసాయము ఆ వృత్తులలో కేంద్రస్థానమున ఉండినను, తక్కిన పారిశ్రామిక వృత్తులును అత్యధిక ప్రజానీకమునకు జీవనాధారములుగ ఉండెడివి. గ్రామీణ పరిశ్రమల ఉత్పత్తులకు నగరములు విపణులు (మార్కెటులు)గ ఉపకరించెడివి. ఆదినుండి ఈ పారిశ్రామికోత్పత్తులు విదేశములకు సైతము వ్యాపారరీత్యా కొనిపోబడెడివి. ఈ వ్యాపారమువలన దేశము సుసంపన్నముగ ఉండెడిది. మధ్యయుగమున ముస్లిమ్ పరిపాలనా కాలమున ఈ పరిస్థితిలో, యుద్ధాదుల వలన తొలుత కొంత అస్తవ్యస్తత కలిగినను, త్వరలోనే కుదురుకొన గలిగినది. ప్రజలలో ఇస్లాము వ్యాపించిన ప్రాంతములందు సయితము సాంప్రదాయిక వృత్తులు పూర్వము వలెనే కొనసాగినవి. తొలుతటి ముస్లిము ప్రభువులు విదేశీయులైనను, వారును, వారి సంతతియు ఈ దేశమునే మాతృభూమిగ గ్రహించిన వారగుట వలన దేశమును సుసంపన్నము చేయుటకు పట్టుదల వహించి వివిధ వృత్తులను ప్రోత్సహించిరి. ఆ కాలపు దేశపు సంపత్తి యూరపునందలి వివిధ దేశీయ వర్తక సంఘములను ఆకర్షింప గలిగినది.

బ్రిటిష్‌వారి పరిపాలనా కాలమున ఆ పరిస్థితి క్రమముగ తారుమారైనది. ఇంగ్లండున తొలుత ఆవిర్భవించిన పారిశ్రామిక విప్లవమువలన ఆధునిక విజ్ఞానమును ఉపయోగించి, భారీయెత్తున కర్మాగారములలో వస్తువులను ఉత్పత్తి చేయుట సాధ్యమైనది. అధికార మందున్న బ్రిటిష్ ప్రభుత్వము, ఇంగ్లండు నందలి పారిశ్రామికోత్పత్తులకు మార్కెటుగ భారతదేశమును తయారు చేసినది. భారత దేశపు చేతివృత్తులు, ఈ ఆధునిక పారిశ్రామికోత్పత్తులపోటీకి తాళజాలక అంతరించినవి తదాదిగ వ్యవసాయము ఒకటి మాత్రమే ప్రజానీకమున అత్యధిక సంఖ్యాకులకు జీవనాధారముగ పరిణమించి, దేశము పేదవడినది. స్వాతంత్ర్యము లభించినది మొదలుగ భారతదేశము, ఈ శోచనీయ పరిస్థితి నుండి విడివడి దేశమును వ్యావసాయికముగను, పారిశ్రామికముగను సుసంపన్నము చేయుటకు, ప్రజల జీవన ప్రమాణ స్థాయిని పెంపొందించుటకు కృషి చేయుచున్నది.

దేశమును పారిశ్రామికముగ, వ్యావసాయికముగ సుసంపన్నము చేయుటకు ప్రణాళికా బద్ధమగు కృషి 1951 నుండి మొదలైనది. తదాదిగ నాలుగు పంచవర్ష ప్రణాళికలు నిర్వహింపబడినవి; అయిదవది 1978 మార్చితో ముగియనున్నది. ఇక మీదట ఈ ప్రణాళికారీతిని, ఇంకను పటిష్ఠతరము చేయుటకై ఆరవ పంచవర్షప్రణాళిక మొదలుగ నిరంతర ప్రణాళికా (రోలింగ్‌ప్లాన్) పద్ధతిని అనుసరించుటకు భారతప్రభుత్వము తలపెట్టినది. ఈ దేశమున భారీ పరిశ్రమలను, కీలక పరిశ్రమలను పబ్లిక్ రంగమున నెలకొల్పి ప్రభుత్వమే స్వయముగ వానిని పరిపోషించుటయు, వినియుక్త వస్తువుల ఉత్పత్తికి చెందిన పరిశ్రమలకు ప్రయివేటు రంగము చేపట్టి నిర్వహించుటకు తగు వసతులను కల్పించుటయు ఇప్పటికి సాగిన అయిదు ప్రణాళికల యందును ముఖ్యలక్షణములుగ ఉన్నవి. తొలుతటి నాలుగు ప్రణాళికలలో పబ్లిక్ రంగమున ఆయా ఉత్పత్తి విభాగములందు పెట్టబడిన పెట్టుబడుల వివరములు ఈ దిగువ పట్టిక వలన తెలియనగును.

# పట్టిక VIII

## తొలుతటి నాల్గు ప్రణాళికలలో పబ్లిక్ రంగమున పెట్టుబడులు (కోట్ల రూపాయలలో)

| వివరము | మొదటి ప్రణాళిక | రెండవ ప్రణాళిక | | | మూడవ ప్రణాళిక | | | నాల్గవ ప్రణాళిక | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము | కేంద్రము | రాష్ట్రము | మొత్తము | కేంద్రము | రాష్ట్రము | మొత్తము | కేంద్రము | రాష్ట్రము | మొత్తము |
| 1. వ్యవసాయము-తదను | 290 | 53 | 496 | 549 | 117 | 972 | 1,089 | 1,235 | 1,508 | 2,743 |
| బంధ రంగములు | (14.8) | (9.7) | (90.3) | (11.7) | (10.7) | (89.3) | (12.7) | (7.6) | (9.3) | (16.9) |
| 2. నీటిపారుదల-వరద | 434 | 55 | 375 | 430 | 10 | 665 | 675 | 17 | 1,188 | 1,205 |
| నివారణ | (22.2) | (12.8) | (87.2) | (9.2) | (1.5) | (98.5) | (7.8) | (0.1) | (7.3) | (7.4) |
| 3. విద్యుచ్ఛక్తి | 149 | 28 | 424 | 452 | 113 | 1,139 | 1,252 | 510 | 2,370 | 2,880 |
| | (7.6) | (16.2) | (93.8) | (9.7) | (9.0) | (91.0) | (14.6) | (3.2) | (14.6) | (17.8) |
| 4 గ్రామీణ-చిన్నతరహా | 42 | 106 | 81 | 187 | 1,764 | 203 | 1967 | 132 | 122 | 254 |
| పరిశ్రమలు | (2.1) | (56.7) | (43.3) | (4.0) | (89.7) | (10.3) | (2 8) | (0.8) | (0.7) | (1.5) |
| 5. పరిశ్రమ-ఖనిజములు | 55 | 898 | 40 | 938 | — | — | 1,726 | 2,772 | 211 | 2,983 |
| | (2.8) | (95.7) | (4.3) | 20.1 | | | (20.1) | (17.1) | (1.4) | (18.5) |
| 6. రవాణా-వార్తా | 518 | 1,092 | 169 | 1,261 | 1,818 | 294 | 2,112 | 2,345 | 638 | 2,983 |
| సౌకర్యములు | (26.4) | (86.6) | (13.4) | (27.0) | (86.1) | (13.9) | (24.6) | (14.5) | (3.9) | (18.4) |
| 7. ఇతరములు | 472 | 357 | 478 | 855 | 590 | 902 | 1,492 | 541 | 1,612 | 2,153 |
| | (24.1) | (41.8) | (58.2) | (18.3) | (39.6) | 60.4 | (17.4) | (9.6) | (9.9) | (19.5) |
| (అ) విద్యా-శాస్త్రీయ | 149 | | | 273 | | | 660 | 375 | 529 | 904 |
| పరిశోధన | (7.6) | | | (5.8) | | | (7.7) | (2.3) | (3.3) | (5.6) |
| (ఆ) ఆరోగ్యము | 98 | | | 216 | | | 226 | 151 | 186 | 337 |
| | (5.0) | | | (4.6) | | | (2.6) | 0.9 | (1.1) | (2.0) |
| (ఇ) కుటుంబ | | | | — | | | 25 | 262 | | 262 |
| నియంత్రణ | | | | | | | (0.3) | (1.6) | | (1.6) |
| 8. మొత్తము. | 1,960 | 2,589 | 2,083 | 4,672 | 4,412 | 4,165 | 8,577 | 8,552 | 7,649 | 16,201 |
| | (100.0) | (55.4) | (44.6) | (100.0) | (51.4) | (48.6) | (100.0) | (52.9) | (47.1) | (100.0) |

గమనిక :— బ్రాకెట్లలో గుర్తించబడిన సంఖ్యలు, ఆయా రంగములలోని పెచ్చింపబడిన శాత సంఖ్యను సూచించును.

అయిదవ పంచవర్ష ప్రణాళిక, కొన్ని అవరోధ ములవలన వార్షిక ప్రణాళికా రూపమున కొంత కాలము ముందునకు సాగినది; కడకు ఈ పంచవర్ష ప్రణాళికకు 1976లో తుదిరూపము కల్పింపబడి, ప్రణాళికాంతమునకు, అందు పెట్టుబడి పబ్లిక్ రంగమున 42,300 కోట్ల రూ లును, ప్రయివేటు రంగమున 27,000 కోట్లును ఉండునటుల నిర్ణ యింపబడినది. ప్రణాళికాంతమున మాత్రమే నిర్ది ష్టములగు సంఖ్యావివరములు లబ్ధములు కాగలవు.

ఇప్పటి వరకు పై ప్రణాళికలను అనుసరించి, దేశము చాలవరకు కొన్ని రంగములందు పురోగ మించినను, గ్రామీణులకు ఇందువలన కలిగిన లాభము చాలవరకు తక్కువగ ఉండుటవలన, ఇకమీదట చిన్నతరహా పరిశ్రమలను, గ్రామ ప్రాంత ములలో అభివృద్ధి చేయుటకును, వ్యవసాయము నకు ఎక్కువ ప్రోత్సాహమును కల్పించుటకై ప్రత్యేక శ్రద్ధ వహించుటకును అనువుగ ప్రణాళికా వ్యయమును రూపొందించుటకు ప్రస్తుత భారత ప్రభుత్వము సంకల్పించినది.

ప్రస్తుతమున భారతీయ ఆర్థిక వ్యవస్థయందు, అత్యంత శీఘ్ర పురోగతిని సాధించుటకు బీజ భూతములగు అవకాశములు కలవనియు, ఆహా రోత్పత్తి రంగమునను, పారిశ్రామిక రంగమునను దేశము, తగు నాయకత్వమున, ముందంజ వేయు టకు సుసన్నద్ధమై ఉన్నదనియు పలువురి అభి ప్రాయము.

ఈనాటికిని దేశపు ఆర్థిక వ్యవస్థలో వ్యవ సాయమే అగ్రస్థానమున ఉన్నది. దేశపు జాతీ యాదాయమున దాదాపు 50 శాతము దీనివలన లభించుచున్నది. ప్రజానీకమున 75 శాతము దానిని ఆశ్రయించి జీవించుచున్నారు. 1972-73 లెక్క లను అనుసరించి దేశమున 1371 లక్షల హెక్టె రులు సేద్యమున ఉన్నది; ఇందు 248 లక్షల హెక్టేరులలో ఒక కారుకు మించి సేద్యము జరుగుచున్నది. మొత్తపు సాగుబడి నేలలో 320 లక్షల హెక్టేరులకు నీటిపారుదల వసతి కలదు. ఈ వసతికల భూములలో 72 లక్షల హెక్టేరులకు రెండు కారులకు నీరు అందుచున్నది. కాని ఈ సాగునఉన్న భూమిలో అత్యధిక భాగము భూస్వాముల ఆధీనమున ఉండి, అచ్చముగ భూమిపై శ్రమించు సేద్యగానికి అందు ఎట్టి స్వామ్యమును లేకున్నందువలన, కలుగు సాంఘి కాదికములగు ఇబ్బందులను, అరిష్టములను గమ నించి ప్రభుత్వము భూమియందలి స్వామ్యమునకు ఒక గరిష్ఠఅవధి (సీలింగు) ని నిర్ణయించుటకు పూనుకొనినది తత్ఫలితముగ ఆయా రాష్ట్రములు కొన్ని గరిష్ఠ అవధులను నిర్ణయించినవి. ఈ అవధులు ఒక్కొక్క రాష్ట్రమున ఒక్కొక్క తీరుగ ఉన్నవి; అంతేగాక ఒకే రాష్ట్రమున సైతము భూముల సారము, నీటిపారుదల వసతి, పంటల తీరులను అనుసరించి మారుతున్నవి. ఆయా రాష్ట్రముల ఆ అవధులు (సీలింగులు) దిగువ ఈయబడినవి.

### పట్టిక IX

### అమలులో ఉన్న భూస్వామ్యపు అవధులు

| రాష్ట్రము. | భూవైశాల్యము (హెక్టారులలో) | | |
|---|---|---|---|
| అస్సాం | 6.74 | | |
| ఆంధ్రప్రదేశ్ | 4.05 | నుండి | 21.85 |
| ఉత్తరప్రదేశ్ | 7.25 | ,, | 18.21 |
| ఒరిస్సా | 4.05 | ,, | 18.21 |
| కర్ణాటక | 4.86 | ,, | 21.85 |
| కేరళ | 4.86 | ,, | 6.07 |
| గుజరాత్ | 4.05 | ,, | 21.85 |
| జమ్మూ-కాశ్మీర్ | 3.68 | ,, | 7.77 |

| రాష్ట్రము | భూవైశాల్యము (హెక్టారులలో) | | |
|---|---|---|---|
| తమిళనాడు | 4.86 | నుండి | 24.28 |
| త్రిపుర | 2.00 | ,, | 7.20 |
| పంజాబ్ | 7 00 | ,, | 21.80 |
| పశ్చిమ బెంగాల్ | 5.00 | ,, | 7.00 |
| బీహార్ | 6.07 | ,, | 18.21 |
| మణిపూర్ | 10.`2 | | |
| మధ్యప్రదేశ్ | 4.05 | ,, | 21.85 |
| మహారాష్ట్ర | 7.25 | ,, | 21.85 |
| రాజస్థాన్ | 7 25 | ,, | 21.85 |
| హర్యానా | 7.25 | ,, | 21.85 |
| హిమాచల్ప్రదేశ్ | 4.05 | ,, | 12.14 |

దేశపు ఆహారపు పంటలలో ప్రముఖము వరి. ముఖ్యముగా తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, పశ్చిమ బెంగాల్, అస్సామ్, ఒరిస్సాలలో ఇది సాగగు చున్నది. తరువాత పేర్కొనదగిన ఆహారపు పంట గోధుమ. ఉత్తరప్రదేశ్, పంజాబ్, హర్యానాలలో ఈ పైరు విరివిగ పండింపబడుచున్నది. ఆయా పంటలు సాగైన భూముల వైశాల్యము, పండిన పంటల వివరములు (1974-75) దిగువ ఈయబడినవి.

### పట్టిక X

### పంటల సాగుబడి వైశాల్యము, ఉత్పత్తి (1974-75)

| పంట వివరము. | వైశాల్యము వేల హె. లో. | ఉత్పత్తి వేల టన్నులు. |
|---|---|---|
| వరి | 37,922.3 | 40,252.5 |
| గోధుమ | 18,107.5 | 24,235.3 |
| జొన్న | 15,856.1 | 10,221 |
| మొక్కజొన్న | 5,920.9 | 5,722.6 |
| సజ్జ | 11,260.9 | 3,231.3 |
| రాగి | 2,529.5 | 2,030 9 |
| తక్కిన గడ్డి ధాన్యాలు | 4.510.2 | 1,8230.2 |
| బార్లీ | 2,930.7 | 3,150.4 |
| కందిపప్పు | 2,539.8 | 1,818.1 |
| తక్కిన పప్పులు | 20,038.0 | 8,578.2 |
| ప్రత్తి | 7,620.6 | 7,079.5 • |
| పెద్ద జనుము | 665.2 | 4 487.9 • |
| గోగు | 316.3 | 1,326.9 • |
| సన్న జనుము | 147.9 | 59 2 • |
| వేరుసెనగ | 7,167.0 | 4,990.5 |
| ఆముదాలు | 582.6 | 216.2 |
| నువ్వులు | 2,245.9 | 408.0 |
| ఆవాలు, కుసుమలు | 3,606.8 | 2,211.3 |
| అవిసెగింజలు | 1,984 0 | 537.8 |
| చెక్కెర చెరకు | 2,771.2 | 140,196 † |
| ఎండు మిరప | 709.8 | 450.3 |
| అల్లం | 24.02 | 39.46 |
| పసుపు | 76.2 | 147.6 * |
| మిరియాలు | 121.82 | 28.15 |
| అరటి | 218.8 | 3,142.4 * |
| కర్రపెండలం | 384.2 | 6,327 6 |
| ఉరలగడ్డ | 594.0 | 6,171.1 |
| పొగాకు | 409.2 | 394.8 |

పైవిగాక పట్టునూలు 2,445 టన్నులు, రబ్బరు 128.4 వేల టన్నులు, జీడిపప్పు 65,025 టన్నులు, జీడి గుల్లల నుండి నూనె 6,696 టన్నులు, తేయాకు 4894.8 లక్షల కి. గ్రా ;

• ఈ ఉత్పత్తి వేల బేలుల సంఖ్యను తెలుపును. బేలు అనగా 170 కి. గ్రా.

† ఇది గడతూకం వేలటన్నులలో తెలుపును. చక్కెర, బెల్లం ఉత్పత్తి 14313.1 వేల టన్నులు.

* ఈ సంఖ్య 1973-74 లోని ఉత్పత్తిని తెలుపును.

కాఫీ గింజలు 90 వేల టన్నులకు పైగా, వక్కలు 169,400 టన్నులు, లక్క దాదాపు 14000 టన్నులు సాలీనా దేశమున ఉత్పత్తి జరుగుచున్నది (1974-75). దేశమున వివిధ ప్రాంతములందలి శీతోష్ణస్థితులలోని మార్పులవలన నానా జాతుల ఫలములు దేశమున ఉత్పత్తి అగుచున్నవి. వీనిలో అతి ప్రాముఖ్యము మామిడి పండు. సాలీనా 90 లక్షల టన్నుల పండ్లు ఉత్పత్తి అగుచున్నటుల అంచనా. తక్కిన వానిలో నిమ్మ, నారింజ జాతులు, ద్రాక్ష, జామ, సపోటా, అనాస, పనస పేర్కొనదగినవి. దేశము ఆహార విషయమున 1972 వరకు విదేశములపై కొంతవరకు ఆధారపడి యుండినది. కాని, తదాదిగా వ్యావసాయిక రంగమున సాగిన అభివృద్ధివలనను, క్రొత్త వంగడపు ధాన్యముల సాగువలనను, దేశము ఆహార విషయికముగ స్వయం సమర్థము అయినది.

దేశమున అటవీభూమి వైశాల్యము 7.53 లక్షల చ. కిమీ. అనగా దేశవైశాల్యమున 23 శాతము అటవీమయము. అస్సామ్, హిమాచలప్రదేశ్, మేఘాలయ, ఒరిస్సా, అండమాన్ - నికోబార్, అరుణాచలప్రదేశ్, త్రిపురాలలో అటవీ శాతము 33% ను దాటుచున్నది. దేశమున తగువృక్ష సంపద ఉండవలయునన్న ఈ శాతము అడవిగా ఉండవలెనని ప్రభుత్వపు అభిప్రాయము. అందువలన తక్కిన రాష్ట్రములందును, అటవీ వైశాల్యము ఈ శాతమును చేరుకొనునట్లు చేయుటకై క్రొత్త అడవులను పెంచుటకు ప్రభుత్వము కృషి చేయుచున్నది. వంట చెరకునకు, వెదురునకు ఉపయుక్తమగు అటవీ ఉత్పత్తిగాక, 97 లక్షల ఘ. మీటరుల ప్రమాణముగల కలప పారిశ్రామికావసరములకై వినియుక్తమైనది (1972-73).

దేశమున పశుసంపద విరివిగ కలదు; అయినను పశుపోషణ చాలవరకు ప్రాచీనపు పద్ధతులలోనే సాగుచున్నది. కావుననే గోవుల, బర్రెల సంఖ్యలో ఈ దేశము తక్కిన అన్నిదేశములను అధిగమించినను, పశువువలన సరాసరిన లభించు పాల మొత్తము మాత్రము చాలతక్కువగ ఉన్నది. గోవుల, బర్రెల మొత్తపు సంఖ్య దాదాపు 18 కోట్లు; కాని సరాసరిన ఒక పశువువలన సంవత్సరము 380 కి. గ్రా. పాలు మాత్రమే లభించుచున్నవి. ఆధునిక రీతిలో పశుపోషణను ప్రోత్సహించుటకు, క్రొత్త వంగడముల సంకరజాతి పశుసంపదను వృద్ధిచేయుటకు ప్రభుత్వము కృషి సాగించుచున్నది, 1972 లో జరిగిన పశు సంఖ్యా గణనను అనుసరించి ఆయా జాతుల పశువుల సంఖ్యా వివరములు వేల సంఖ్యలలో ఈ దిగువ రీతిగ కలవు: గోజాతి 162 142; ఎనుముజాతి 54,764; గొఱ్ఱెలు 34,747; మేకలు 62,327; పందులు 5,244, కోళ్లు 112,911 (అయితే ఈ లెక్కలో తమిళ్‌నాడు, మణిపూర్, అరుణాచల ప్రదేశ్‌ల సంఖ్యా వివరములు లభ్యములు కానందున చేరలేదు).

చేపల పరిశ్రమకు దేశమున పెక్కు అవకాశములు కలవు. 5,100 కి. మీ. నిడివి కలిగిన సముద్రతీరమే గాక, దేశాంతస్థములగు నదులును అందులకు ఉపకరించుచున్నవి. మొత్తమున సాలీనా 14 లక్షల టన్నుల చేపల పట్టుబడి సాగుచున్నది; ఇందు 11 లక్షల టన్నులు తీరప్రాంతపు సముద్రమున లభించుచున్నవి. తక్కిన దేశములందలి ఉత్పత్తిలో పోల్చినచో ఇది చాలా తక్కువ.

దేశపు ఖనిజ సంపదలో ప్రముఖముగ పేర్కొనదగినది ఇనుము. ఆ తరువాత మాంగనీజు, అభ్రకము, రాక్షసిబొగ్గు గణనీయములు. ఈ దిగువ ఖనిజములు దేశావసరములకు తగినంతగ దేశమున కలవు : పటిక, అల్యూమినియం, యాంటిమనీ, ఆర్సెనిక్, బెరైటిస్, కట్టుబడిరాయి, సిమెంటుకై ముడి

పదార్థాలు, ముడిక్రోమ్, రాక్షసిబొగ్గు, ఫీల్ట్‌స్పార్, ఫ్లోరెడులు, గ్లాసు, ఇసుక, బంగారము, జిప్సం, పారిశ్రామిక వృత్తికలు, వజ్ర-రత్నములు, చలువ రాయి, డోలమైట్, పలకరాయి, కాకిరాతి రంగులు, సోడియం లవణాలు, క్షార ద్రవ్యాలు, యురేనియం, వనేడియం, జిర్కాన్.

ఈ దిగువ ఖనిజములు దేశమున చాల తక్కువ గనో, అలభ్యములుగనో ఉన్నవి: ఆస్‌ఫాల్ట్, బిస్‌మత్, కాడ్మియం, గ్రాఫైట్, సీసం, పాదరసం, నికెల్, కోబాల్ట్, ఫాస్‌ఫేట్లు, ప్లాటినమ్, పొటాష్, వెండి, గంధకం, తగరం, టంగ్‌స్టెన్, తుత్తునాగం.

పెట్రోలు అస్సామున 1867 లోనే కనుగొనబడి, తదాదిగ అది ఉత్పత్తి అగుచున్నను, అది దేశావసరములలో కొలది భాగమునకైనను సరిపోవదు. అందులకై 1955 మొదలుగ క్రొత్తగ పెట్రోలు స్థావరములను కనుగొనుటకు, ప్రభుత్వ సంస్థయగు ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కమీషన్ ఆధ్వర్యవమున కృషిసాగినది. ఆ కృషి ఫలితముగ కనుగొనబడిన క్రొత్త గనులలో 'బాంబే హై' అనబడు బొంబాయి తీరప్రాంత సముద్రస్థమగునది అతి ప్రముఖము. 1978-79 నాటికి దేశమున పెట్రోలు ఉత్పత్తి 120 లక్షల టన్నులకు చేరు కొనగలదని ఆసింపబడుచున్నది. 1974 లో దాని ఉత్పత్తి 7,490 వేల టన్నులు మాత్రమే

దేశమున వివిధ పరిశ్రమలు గత 30 ఏండ్లలో చాల పురోగతిని ఆర్జించినవి. ఆయా పరిశ్రమలు 1950-51 మొదలుగ క్రమరీతిలో సాధించిన పురోగతి క్రింది పట్టిక వలన విశదము కాగలదు.

## పట్టిక XI

### పారిశ్రామిక వస్తూత్పత్తి పురోగతి (కొన్ని ముఖ్య పరిశ్రమలలో)

| వ. నెం. | పరిశ్రమ (యూనిట్) | 1950-51 | 1960-61 | 1665-66 | 1969-70 | 1970-71 | 1971-72 | 1972-73 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| I. | ఖనిజ పరిశ్రమ: | | | | | | | |
| (1) | రాక్షసిబొగ్గు (లిగ్నైట్‌తో) లక్షల టన్నులు | 328 | 557 | 703 | 800 | 748 | 740 | 793 |
| (2) | ముడిఇనుము ,, | 30 | 110 | 181 | 213 | 225 | 232 | 240 |
| II. | లోహపరిశ్రమలు: | | | | | | | |
| (3) | దుక్క-ఇనుము ,, | 16.9 | 43.1 | 70.9 | 73.9 | 69.9 | 68.0 | 75.0 |
| (4) | ఉక్కు ,, | 14.7 | 34.2 | 65.3 | 64.3 | 61.4 | 64.1 | 68.2 |
| (5) | తయారీఉక్కు ,, | 10.4 | 23.9 | 45.1 | 48.0 | 44.8 | 47.9 | 50.8 |
| (6) | ఉక్కు-పోత (000 ట.) | — | 34 | 57 | 46 | 62 | 54 | 56 |

| వ. నెం. | పరిశ్రమ (యూనిట్) | 1950-51 | 1960-61 | 1965-66 | 1969-70 | 1970-71 | 1971-72 | 1972-73 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| (7) | అల్యూమినియం లోహము ,, | 4 0 | 18.3 | 62.1 | 135.1 | 166 8 | 181.5 | 174.5 |
| (8) | రాగి లోహము ,, | 7.1 | 8.5 | 9.4 | 9.8 | 9.3 | 8.3 | 12.6 |
| III. | యాంత్రిక ఇంజనీరింగ్ యంత్ర పరికర పరిశ్రమలు : | | | | | | | |
| (9) | యంత్ర పరికరాలు (రూ కోట్ల రూ.) | 0.3 | 7.0 | 29.4 | 32.9 | 43.0 | 55.0 | 62.9 |
| (10) | రైల్వే వాగన్లు (000) | 2.9 | 11.9 | 38.5 | 14.9 | 11.1 | 8.5 | 10.8 |
| (11) | ఆటోమోబైలు: | | | | | | | |
| | (a) వ్యాపార కార్లు (000 నెం.) | 8.6 | 28.4 | 35 3 | 35.4 | 41.2 | 39.7 | 38.4 |
| | (b) ప్రయాణీకుల కార్లు (000 నెం.) | 7.9 | 26.6 | 35 4 | 44 3 | 46.2 | 51.8 | 51.3 |
| (12) | మోటారు సైకిళ్ళు స్కూటర్లు (000 నెం.) | — | 19.4 | 40.7 | 91.0 | 96.0 | 112.8 | 116.6 |
| (13) | విద్యుత్తుతో నడుచు పంపులు (000 నెం.) | 35 | 109 | 244 | 359 | 259 | 208 | 287 |
| (14) | డీజిల్ ఇంజన్లు (000 నెం.) | 5.5 | 44.7 | 93 1 | 134.2 | 65.7 | 69.9 | 93.5 |
| (15) | సైకిళ్ళు (000 నెం.) | 99 | 1,071 | 1,574 | 1,976 | 2,042 | 1,766 | 2,383 |
| (16) | కుట్టు మిషన్లు ,, | 33 | 303 | 430 | 340 | 235 | 312 | 340 |
| IV. | విద్యుత్ ఇంజినీరింగ్ పరిశ్రమలు : | | | | | | | |
| (17) | విద్యుత్ ట్రాన్స్ఫార్మర్లు లక్ష కి.వా. | 1.8 | 14 1 | 44.6 | 56.6 | 80.9 | 88.7 | 94.4 |
| (18) | విద్యుత్ మోటార్లు (000 h.p.) | 99 | 728 | 1,753 | 2,283 | 2,721 | 2,348 | 2,789 |
| (19) | విద్యుత్ ఫాన్లు (లక్ష నెం.) | 2.0 | 10 6 | 13.6 | 15.5 | 17.2 | 20.7 | 24 3 |
| (20) | విద్యుత్ దీపములు (లక్ష నెం.) | 140 | 485 | 721 | 988 | 1,193 | 1,206 | 1,506 |

| వ. నెం. 1 | పరిశ్రమ (యూనిట్) 2 | 1950-51 3 | 1960-61 4 | 1965-66 5 | 1969-70 6 | 1970-71 7 | 1971-72 8 | 1972-73 9 |
|---|---|---|---|---|---|---|---|---|
| (21) | రేడియో రిసీవర్లు (000 నెం.) | 54 | 282 | 606 | 1,746 | 1,794 | 2,004 | 1,821 |
| (22) | విద్యుత్ కేబుల్సు వైర్లు: | | | | | | | |
| | (a) అల్యూమినియం కండక్టర్లు ('000 టన్నులు) | 1.7 | 23.6 | 40.6 | 61.2 | 64.2 | 79.7 | 78.1 |
| | (b) రాగి కండక్టర్లు ('000 టన్నులు) | 5.0 | 10.1 | 3.1 | 2.1 | 0.7 | 0.7 | 1.0 |
| V. | రసాయనిక, తత్సనంబంధ పరిశ్రమలు : | | | | | | | |
| (23) | నత్రజని ఎరువులు (000 ట.) | 9 | 98 | 233 | 716 | 830 | 952 | 1,059 |
| (24) | భాస్వరపు ఎరువులు ('000 టన్నులు) | 9 | 62 | 111 | 222 | 229 | 278 | 325 |
| (25) | గంధకి కామ్లము ('000 టన్నులు) | 101 | 368 | 662 | 1,197 | 1,053 | 975 | 1,206 |
| (26) | సోడాయాష్ ('000 టన్నులు) | 45 | 152 | 331 | 427 | 449 | 489 | 486 |
| (27) | కాస్టిక్ సోడా ('000 టన్నులు) | 12 | 101 | 218 | 354 | 371 | 385 | 397 |
| (28) | కాగితము-కాగితపు అట్ట ('000 టన్నులు) | 116 | 350 | 558 | 723 | 755 | 803 | 733 |
| (29) | రబ్బరు టైర్లు: | | | | | | | |
| | (a) ఆటోమోబైల్ టైర్లు (లక్ష నెం.) | 8.7 | 14.4 | 23.1 | 36.2 | 37.9 | 43.3 | 43.4 |
| | (b) సైకిలు టైర్లు) (లక్ష నెం.) | 33.0 | 111.5 | 184.6 | 213.2 | 192.0 | 223.6 | 196.3 |
| (30) | సిమెంటు (లక్ష ట.) | 27.3 | 79.7 | 108.2 | 138.0 | 144.0 | 150.0 | 155.0 |
| (31) | రిఫ్రాక్టరీలు (000 ట.) | 227 | 567 | 695 | 635 | 683 | 808 | 773 |
| (32) | సంస్కరిత పెట్రోలియపు ఉత్పత్తులు (లక్షట.) | 2 | 58 | 94 | 166 | 171 | 186 | 187 |

| వ. నెం. | పరిశ్రమ (యూనిట్) | 1950-51 | 1960-61 | 1965-66 | 1969-70 | 1970-71 | 1971-72 | 1972-73 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| VI. | జౌళి పరిశ్రమలు. | | | | | | | |
| (33) | జనపనార నేతవి (1000ట) | 837 | 1,097 | 1,302 | 944 | 958 | 1,129 | 1,168 |
| (34) | ప్రత్తి దారము. (కోట్ల కి గ్రా. లు) | 53.4 | 80.1 | 90.7 | 96.2 | 92.9 | 90.2 | 97.2 |
| (35) | ప్రత్తి వస్త్రములు | | | | | | | |
| | (a) మిల్లు రంగము (కోట్ల మీ.) | 340.1 | 464.9 | 440.1 | 419.2 | 405.5 | 403.9 | 422.4 |
| | (b) వికేంద్రీకకృత రంగము (కోట్ల మీ.) | 81.4 | 208 9 | 303.9 | 356.1 | 354.1 | 350.8 | 370.0 |
| (36) | రేయాన్ దారము (1000 ట.) | 2.1 | 43.8 | 75.6 | 98.8 | 98.1 | 102.3 | 113.0 |
| (37) | కృత్రిమ సిల్కు-తయారీ (కోట్ల మీ.) | 28.7 | 54.4 | 87.8 | 86.3 | 94 7 | 96.8 | 91.8 |
| (38) | ఉన్ని ఉత్పత్తులు: | | | | | | | |
| | (a) ఉన్ని&చెడిపోయిన దారము (లక్షల కి.గ్రా.లు) | 87 | 130 | 170 | 188 | 197 | ల.కా. | ల.కా. † |
| | (b) ఉన్ని వస్త్రాలు (లక్షల మీ.) | 61 | 133 | 92 | 122 | 143 | ల.కా. | ల.కా. |
| VII. | ఆహార పరిశ్రమలు: | | | | | | | |
| (39) | చక్కెర (అక్టోబరు-సెప్టెంబరు, లక్షల ట.) | 11.3 | 30.3 | 35.1 | 42.6 | 37.4 | 31.1 | 38.7 |
| (40) | తేయాకు (కోట్ల కి.గ్రా.లు) | 27.7 | 32.2 | 37.6 | 40.1 | 42.1 | 42.3 | 45.3 |
| (41) | కాఫీ ('000 ట) | 21.0 | 54.1 | 62.1 | 64.6 | 72.7 | 95 6 | 73.2 |
| (42) | వనస్పతి ('000 ట) | 170 | 340 | 401 | 477 | 558 | 594 | 581 |
| VIII. | ఉత్పత్తియైన విద్యుచ్ఛక్తి (కోట్ల కివా.) | 530 | 1,690 | 3,300 | 5,200 | 5,580 | 6,070 | 6,360 |

† లభ్యములు కాలేదు

విదేశ వ్యాపారమున ఎగుమతుల మొత్తము 1966 మొదలుగ క్రమముగ పెరుగుచు వచ్చుచున్నది. 1966 లో ఎగుమతుల మొత్తపు విలువ 806 కోట్ల రూ. గనే ఉండగ, అది 1976 నాటికి 3304 కోట్లను చేరుకొనినది. అంతేకాదు; ఎగుమతి వస్తువుల విషయమున సైతము వైవిధ్యము పెచ్చు పెరిగినది. సాంప్రదాయికముగ వచ్చుచున్న ముడి వస్తువుల, జవుళీ వస్తువుల ఎగుమతులే కాక క్రమముగ వివిధ విదేశములకు పారిశ్రామికోత్పత్తులగు ఇంజనీరింగు వస్తువులను కూడ ఈ దేశము ప్రస్తుతమున ఎగుమతి చేయగలుగుచున్నది. ఎగుమతులలో అత్యధికపు ఆదాయము జనుపనార సరకులు, చర్మములు, తేయాకు, జవుళీ వస్తువులు, ఇనుప ఖనిజము, పొగాకుల వలన లభించుచున్నది. దిగుమతుల మొత్తపు విలువ ఎగుమతుల విలువను మించియే యున్నను, ఇది ప్రస్తుతమున అనివార్యము. దేశము పారిశ్రామికముగ పురోగమించుటకు కావలసిన యంత్ర సామగ్రిని, కొన్ని విధముల ముడి సరకులును, పెట్రోలును దేశము విరివిగ దిగుమతి చేసికొనవలసివచ్చుట వలన ఇట్టి చెల్లింపుల లోటు తప్పనిసరి అగుచున్నది దేశపు ఎగుమతుల విలువ రూ. 3,304.14 కోట్లు; దిగుమతుల విలువ రూ. 4,464.71 కోట్లు (1974-75). ఇట్టి చెల్లింపుల లోటు చాలకాలము దేశమును బాధించుటవలన, ఆయా సమయములందు అంతర్జాతీయ ద్రవ్యనిధి నుండి ఋణమును దేశము గ్రహింపవలసి వచ్చుచుండెడిది. కాని 1975-76 నుండి పరిస్థితి చక్కబడినది. విదేశములందలి భారతీయోద్యోగులు దేశమునకు పంపు మొత్తములు మొదలగువాని వలన దేశపు విదేశీ ద్రవ్యనిలువలు అంతటంతట పెరుగ సాగినవి. 1976, జూన్ నాటికి ఈ నిలువలు రూ. 1711 కోట్లకు చేరుకొనినవి. ఈ మొత్తములు అంతకంతకు పెరుగుచున్నవి. వీని సాయము వలన దేశము చెల్లింపుల లోటును ప్రస్తుతమున ఎదుర్కొన గలుగుచున్నది.

దేశమున సువ్యవస్థితమగు బ్యాంకుల వ్యవస్థ కలదు. రిజర్వు బ్యాంకు 1935 లో నెలకొల్పబడినది. కరెన్సీ నోట్లను జారీచేయుట, ప్రభుత్వమునకు బ్యాంకుగ వ్యవహరించుట, వ్యాపార బ్యాంకుల వ్యవహారములను అదుపులో నుంచుట, ఈ బ్యాంకు యొక్క ముఖ్య విధులు. ఈ బ్యాంకు యొక్క ఆధ్వర్యమున పనిచేయు బ్యాంకులు రెండు తీరులవి-షెడ్యూల్డ్, నాన్-షెడ్యూల్డ్ రకములవి-కలవు. పెట్టుబడి, మూలధనములు కలసి రూ. 5 లక్షలకు తగ్గనివి షెడ్యూల్డ్ బ్యాంకులు; తక్కినవి నాన్-షెడ్యూల్డ్ బ్యాంకులు. 1969 లో షెడ్యూల్డ్ బ్యాంకులలో ప్రముఖములగు 14 బ్యాంకులను ప్రభుత్వము జాతీయములు చేసినది.

దేశపు కేంద్ర ప్రభుత్వమునకు రేవు సుంకములు, ఎక్సయిజు పన్ను, ఆదాయపు పన్ను, సంపద పన్ను, ఎస్టేట్ పన్ను, రిజర్వు బ్యాంకు నుండి రైల్వేల నుండి వచ్చు లాభభాగము, తంతి తపాల శాఖ సమకూర్చు మొత్తము - అనునవి ముఖ్య ఆదాయ మార్గములు. రాష్ట్రములకు భూమి పన్ను, అమ్మకపు పన్ను, వ్యవసాయాదాయ పన్ను, రాష్ట్రపు పరిధిలోని ఎక్సయిజు పన్నులు, స్టాంపు డ్యూటీ, రిజిస్ట్రేషన్ రుసుములు ఆదాయ మార్గములుగ ఉన్నవి; ఇవిగాక, కేంద్రము వసూలు చేయు ఆదాయపు పన్ను మొదలగు వాని నుండి, ఒక క్రమపద్ధతిని అనుసరించి రాష్ట్రములకు ఇచ్చు వాటా ధనములును, గ్రాంటులును, రాష్ట్ర ధన వ్యవహారములకు చాల ఉపకరించుచున్నవి.

కేంద్ర ప్రభుత్వపు సాధారణ బడ్జటు వివరములు 1975-76, 1976-77 సంవత్సరములకు ఈ దిగువ రీతిగ కలవు.

## పట్టిక నెం. XII

### కేంద్ర ప్రభుత్వపు ఆదాయపు వివరములు
(కోట్ల రూ. లలో)

| | 1975-76 | 1976-77 |
|---|---|---|
| *1. పన్నుల వలన వసూళ్లు:* | | |
| రేవు సుంకములు | 1357.00 | 1508.70 |
| ఎక్సయిజు సుంకములు | 3823.62 | 5000.12 |
| కార్పొరేషన్ పన్ను | 954.00 | 1025.00 |
| ఆదాయపు పన్ను | 1060.00 | 957.00 |
| ఎస్టేట్ పన్ను | 9.25 | 8.75 |
| సంపద పన్ను | 52 00 | 52 00 |
| వడ్డీ పన్ను | 78-00 | 85.00 |
| కానుకల పన్ను | 4.75 | 4.75 |
| ఇతర పన్నులు | 130.92 | 150.24 |
| *2. పైవానిలో రాష్ట్రముల భాగం పోవలసినది:* | | |
| రేవుఎక్సయిజు సుంక భాగం | 856.70 | 970.51 |
| ఆదాయపు పన్ను భాగం | 734 10 | 648.78 |
| ఎస్టేట్ పన్ను భాగం | 8.21 | 7.74 |
| *3. పన్నులు గాక మిగిలినవి:* | | |
| వడ్డీ ఆదాయము | 994.79 | 1056.43 |
| డివెడెండ్లు, లాభములు | 195.15 | 225 57 |
| ఇతరములు | 962 36 | 680 30 |
| మొత్తం నికర ఆదాయం | 8,022.83 | 8 226.83 |

## పట్టిక నెం. XIII

### కేంద్రప్రభుత్వపు సాధారణ వ్యయ వివరములు
(కోట్ల రూ. లలో)

| | 1975-76 | 1976-77 |
|---|---|---|
| ఉద్యోగులు | 4230.39 | 4510.39 |
| రాష్ట్ర వ్యవహారాలు | 77.74 | 90.68 |
| విత్త సంసేవావ్యయాలు | 193.35 | 279.49 |
| వడ్డీ చెల్లింపు | 1220.82 | 1351.86 |
| పరిపాలనా వ్యయం | 372.34 | 361.06 |
| పెన్షనులు | 174.52 | 141.67 |
| సైనికులు, దేశరక్షణ | 2191.62 | 2285.63 |
| సాంఘిక సంసేవ | 519 50 | 577.71 |
| ఆర్థికశాఖా వ్యవహారాలు | 1005.23 | 1168.66 |
| సాధారణ ఆర్థిక విషయాలు | 215.93 | 252.72 |
| వ్యవసాయము మొ వానికి | 363.45 | 447.77 |
| పరిశ్రమలు, ఖనిజములు | 246.99 | 262.78 |
| నీరు, విద్యుత్తు | 85.35 | 106.33 |
| రహదారులు, వార్తా సౌకర్యాలు | 93.51 | 99.06 |
| గ్రాంట్లు | 1361.56 | 1432.86 |
| రాష్ట్ర కేంద్రపాలిత ప్రాంతాలకు గ్రాంట్లు | 1292.62 | 1367 27 |
| ఇతర దేశాలకు సహాయం | 47.75 | 49.51 |
| ఇతర విధముల గ్రాంట్లు | 15.19 | 16.08 |
| మొత్తము | 7116.68 | 7689.62 |



పై సాధారణ బడ్జటు కాక, కేంద్రప్రభుత్వమునకు వేరుగ పెట్టుబడి బడ్జటు అనునది కలదు. దీనికి ఋణ సేకరణ, పొదుపు మొత్తములు, ప్రావిడెంటు ఫండులు మొదలగు వానివలన ఆదాయము లభించును. దీనిని ఆయా ప్రభుత్వ శాఖలందు శాశ్వతములగు పెట్టుబడుల క్రింద వినియోగింతురు. ఈ బడ్జటులోని ఆదాయ వ్యయ వివరములు ఈ దిగువ రీతిగ కలవు;

## పట్టిక నెం. XIV

### పెట్టుబడి బడ్జటు ఆదాయ వ్యయములు
(కోట్ల రూ. లలో)

| | 1975-76 | 1976-77 |
|---|---|---|
| ఆదాయము | 4129.93 | 4422.51 |
| వ్యయము | 5525.73 | 6280.04 |

సాధారణముగ గతమున, చాల సంవత్సరముల నుండియు, దేశపు బడ్జటు లోటు బడ్జటుగ ఉండుట పరిపాటియైనది. ఈ లోటును ఎక్కువ నోట్ల

చలామణీ వలన పూరించుట సహజముగ జరిగెడిది. దేశము అభివృద్ధి కార్యక్రమములకై పెద్ద పెట్టుబడులను సమకూర్చ వలసిన పరిస్థితులలో ఇట్టి చర్య తప్పని సరియని తొలుత భావింపబడినది. కాని ఈ కరెన్సీ నోట్ల ముమ్మరము వలన, ద్రవ్యోల్బణమును, తత్ఫలితముగ వస్తువుల ధరలలో విపరీతపు పెంపుదలయు వచ్చి, ప్రజలకు ఇబ్బందులను కలుగ జేసినవి. ఇందువలన ఇకమీదట సాధ్యమైనంత వరకు లోటుబట్జటు లేకుండ సరి చేయుటకు ప్రస్తుతపు కేంద్ర ప్రభుత్వము కృషి చేయుచున్నది. భారత ప్రభుత్వము, తన పెట్టుబడులు మొదలగు వానికై విదేశముల నుండి గ్రహించిన ఋణము 1976-77 అంతమునకు 7926.52 కోట్ల రూ. లు.

## 11. సాంఘిక రంగము

భారతదేశపు కార్మికసంఖ్య 1971 లెక్కలను అనుసరించి వివిధ ముఖ్య జీవిత రంగములందు ఈ క్రింది శాతములలో ఉన్నది :

**పట్టిక నెం. XV**

**వివిధ జీవితరంగము లందలి కార్మిక శాతములు**

| | | |
|---|---|---|
| 1. | వ్యావసాయికులు | 43.34 |
| 2. | వ్యవసాయ కూలీలు | 26.33 |
| 3. | పశుపోషణ, అటవీకృషి, మత్స్య పరిశ్రమ, వేట, ఓడపని మొ॥ వానివలన జీవించువారు | 2.38 |
| 4. | ఖనిజసాధన, రాతిగని పనివారు | 0.51 |
| 5. | వస్తు నిర్మాణకృషి, మరమ్మతులు మొ॥ వానిలోని వారు | 9 46 |
| 6. | గృహనిర్మాణ కృషిలోనివారు | 1.23 |
| 7. | వర్తక, వ్యాపార రంగములవారు | 5.57 |
| 8. | రహదారులు, వార్తాసౌకర్యముల | 2.44 |
| 9. | ఇతర వృత్తులవారు | 8.74 |

కాని దేశపు జనసంఖ్యలో, 1971 లెక్కలను అనుసరించి, 32.92 శాతము మాత్రమే కార్మిక శక్తిగ పరిగణనీయము. ఇందును, ఫ్యాక్టరీలు, గనులు, తోటలు వంటివానిలో పనిచేయు వ్యవస్థిత కార్మికరంగపు సంఖ్యావివరములు మాత్రమే బాగుగ లెక్కించుటకు వీలగుచున్నది. కార్మిక సంశ్రేయమునకై చేయబడిన చట్టములు అన్నియు ఈ వ్యవస్థిత రంగపు కార్మికులకు మాత్రమే వర్తించున్నవి. అవ్యవస్థిత రంగమునకు చెందిన వ్యవసాయక కార్మికులు మొదలగువారికై కనీసవేతనముల చట్టములు అమలునందున్నను, వాని ప్రయోజనము చాల స్వల్పము. ఈ అవ్యవస్థిత రంగముల కార్మికులకు, సంవత్సరము పొడువున పని ఉండదు. వ్యవసాయముపై జీవించువారికిని సంవత్సరము పొడువునను పనివుండదు. ఈ విధముగ సంపూర్ణమగు నిరుద్యోగము లేదా కొంత కాలపు నిరుద్యోగము ఈ దేశమున సర్వత్రా అలముకొని యున్నది. ఈ నిరుద్యోగుల సంఖ్యావివరములు సైతము విద్యావంతుల విషయమునమాత్రమే లభ్యములగుచున్నవి. ఈ నిరుద్యోగులకు ఉద్యోగ విషయిక సౌకర్య, సమాచారములను అందజేయుటకై 535 ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీలు పనిచేయుచున్నవి (1974); ఇందు నమూదైన నిరుద్యోగులసంఖ్య 51,76,274. ఇక విద్యారహితులగు నిరుద్యోగుల సంఖ్య అత్యధికము. గత ఇరువదియేండ్లుగ ప్రణాళికల మూలమున పారిశ్రామిక, వ్యావసాయిక రంగములందు అభివృద్ధి సాధింపబడినను, అందుతో పాటుగ నిరుద్యోగ శాతమును విరివిగ పెరిగినది. దేశమున అంతటంతట పెరుగుచున్న జనసంఖ్యయును ఇందులకు తోడ్పడినది. సంపదలోని పెంపుదల రేటునకు మించి జనసంఖ్యాభివృద్ధిలోని రేటు ఉండుటవలన, అధికోత్పత్తివలన, తలసరి ఆదాయమున పెంపు

దల కన్పట్టుటలేదు. ఇందులకై ప్రజలసహకారముతో కుటుంబనియంత్రణ కార్యక్రమమును ప్రభుత్వము కొనసాగింప యత్నించుచున్నది.

ద్రవ్యోల్బణమువలన రూపాయి విలువ అత్యధికముగ పడిపోయిన 1976-77లో, దేశమున తలసరి ఆదాయము రు. 1049 అని మాత్రమే లెక్కల వలన తెలియుచున్నది. యు.స్టే. వంటి దేశములతోనే కాదు, శ్రీలంక వంటి వర్ధమాన దేశములతో పోల్చినపుడును ఇది చాలా హీనము. ఇది సగటు ఆదాయమే అగుటవలనను, ఉద్యోగవసతులును, ఉత్పత్తి వసతులును, కొలదిమంది చేతులలో మాత్రమే ఉండుటవలనను, ప్రజలలో అత్యధిక సంఖ్యాకుల యథార్థపు తలసరి ఆదాయము ఇంతకన్న చాలా తక్కువ. దేశమున 60% ప్రజలు పేదరికపుస్థాయికి దిగువనే కాలమును గడుపుచున్నారని అధికారిక పరిశీలనవలన తెలియుచున్నది.

దేశమున గృహవసతి చాలాతక్కువ. 1951 మొదలుగ గృహనిర్మాణము విరివిగ సాగినను, అది పట్టణములకే పరిమితము. 1971 లెక్కలను అనుసరించి, ఉపయోగమునకు అనువైన గృహసంఖ్య 8.25 కోట్ల యూనిట్లుగ గణింపబడినది. దేశపు మొత్తపు 54.8 కోట్ల ప్రజలకు 9.7 కోట్ల యూనిట్లు కావలసి యుండుననియు, అందువలన ఇండ్లకొదవ 1.45 కోట్ల యూనిట్లు ఉండుననియు అధికారులు అపుడు లెక్కించిరి. కాని లెక్కదేలిన యూనిట్లలో కొన్ని ఒకే కుటుంబమునకు చెందినవియు ఉండుట సాధ్యమే అయినందున, యథార్థమున ఇండ్లకొరవ 1.45 కోట్ల యూనిట్లకన్నను ఎక్కువగనే ఉండును. ఈ లోటును పూర్తిచేయుటకు ప్రభుత్వము పలు గృహనిర్మాణ సంస్థలకు సౌకర్యములను, ఋణములను ఇచ్చి ప్రోత్సహించి కృషి చేయుచున్నను, ఈ సమస్య ఇంకను పరిష్కరింపబడలేదు. పట్టణములలో మురికి వాడలను నిర్మూలించి అచటి ప్రజలకు చక్కని గృహవసతులను కల్పించుట, పల్లెలలోని పేద ప్రజలకు ఉచితముగ ఇండ్ల స్థలములను ఇచ్చి, గృహనిర్మాణపు వసతులను కల్పించుట అను కార్యక్రమములను 1971 మొదలుగ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు నిర్వహించుచున్నవి. 1974 ఏప్రిల్ 30 నాటికి 5,30,000 క్రొత్త ఇండ్లు ఈ కృషివలన నిర్మితములైనవి; 11 వేల హెక్టేరుల భూమిని, గృహనిర్మాణమునకై, రాష్ట్రప్రభుత్వములు సేకరించినవి.

రాజ్యాంగవిధానపు నిర్దేశక సూత్రములలో 14 ఏండ్ల వయసువరకు, పౌరులకు అందరికిని ఉచిత నిర్బంధ విద్యాబోధనకు వసతి కల్పింపబడవలయునని నిర్దేశింపబడినను, ఆ లక్ష్యము ఇప్పటికిని సాధింపబడకున్నది. 1971 లెక్కలను అనుసరించి దేశమున అక్షరాస్యత 29.45 మాత్రమే అయినను రాష్ట్రములవారీగా చూచినపుడు ఈ శాతము చాలా విపరీత వ్యత్యయములకు లోనగుచున్నది. క్రింది పట్టిక ఆ విషయమును విదితము చేయగలదు:

పట్టిక XVI

అక్షరాస్యత

| భారత దేశములోని రాష్ట్రములు; కేం. పా. ప్రాంతములు | చదివినవారు | | | అక్షరాస్యతా శాతము | | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తము | పురుషులు | స్త్రీలు |
| **భారత దేశము** | 161,377,780 | 112,014,845 | 49,362,935 | 29.45 | 39.45 | 18.70 |
| రాష్ట్రములు | | | | | | |
| అస్సాం | 4,116,771 | 2,829,242 | 1,287,529 | 28.72 | 37.19 | 19.27 |
| ఆంధ్రప్రదేశ్ | 10,689,665 | 7,303,297 | 3,386,368 | 24.57 | 33.18 | 15.75 |

| భారత దేశములోని రాష్ట్రములు; కేం. పా. ప్రాంతములు | చదివినవారు | | | అక్షరాస్యతా శాతము | | |
|---|---|---|---|---|---|---|
| | మొత్తం | పురుషులు | స్త్రీలు | మొత్తము | పురుషులు | స్త్రీలు |
| ఉత్తరప్రదేశ్ | 19,173,970 | 14,812,311 | 4,361,659 | 21.70 | 31.50 | 10.55 |
| ఒరిస్సా | 5,745,399 | 4,227,806 | 1,517,593 | 26.18 | 38.29 | 13.92 |
| కర్ణాటక | 9,235,127 | 6,231,363 | 3,003,764 | 31.52 | 41.62 | 20.97 |
| కేరళ | 12,898,072 | 7,054,096 | 5,843,976 | 60.42 | 66.62 | 54.31 |
| గుజరాత్ | 9,555,289 | 6,363,767 | 3,191,522 | 35.79 | 46.11 | 24.75 |
| జమ్మూ-కాశ్మీరు | 857,964 | 657,660 | 200,304 | 18.58 | 26.75 | 9.28 |
| తమిళనాడు | 16,256,393 | 10,783,783 | 5,472,610 | 39.46 | 51.78 | 26.86 |
| త్రిపుర | 482,082 | 322,017 | 160,065 | 30.98 | 40.20 | 21.19 |
| నాగాలాండ్ | 141,518 | 96,681 | 44,837 | 27.40 | 35.02 | 18.65 |
| పంజాబ్ | 4,562,123 | 2,934,281 | 1,627,842 | 33.67 | 40.38 | 25.90 |
| పశ్చిమ బెంగాల్ | 14,711,739 | 10,031,891 | 4,679,848 | 33.20 | 42.81 | 22.42 |
| బీహారు | 11,237,613 | 8,839.395 | 2,398,218 | 19.94 | 30 64 | 8.72 |
| మణిపూర్ | 353 090 | 249 383 | 103,707 | 32.91 | 46.04 | 19.53 |
| మధ్యప్రదేశ్ | 9,223,081 | 7,016,649 | 2,206,432 | 22.14 | 32.70 | 10.92 |
| మహారాష్ట్ర | 19,752,608 | 13,331,079 | 6,421,529 | 39.18 | 51.04 | 26.43 |
| మేఘాలయ | 289,812 | 177,772 | 120,540 | 29.49 | 34.12 | 24.56 |
| రాజస్థాన్ | 4,914,293 | 3,875,435 | 1,038,858 | 19.07 | 28.74 | 8.46 |
| హర్యానా | 2,699,179 | 2,005,424 | 693,755 | 26.89 | 37.29 | 14.89 |
| హిమాచల్ప్రదేశ్ | 1,105,825 | 763,192 | 342,633 | 31.96 | 43.19 | 20.23 |
| *కేంద్ర పాలిత ప్రాంతములు* | | | | | | |
| అండమాన్-నికోబార్ దీవులు | 50,191 | 36,160 | 14,031 | 43.59 | 51.64 | 31.11 |
| అరుణాచల ప్రదేశ్ | 52,791 | 44,776 | 8,015 | 11.29 | 17.82 | 3.71 |
| గోవా-డామన్-దయ్యూ | 383,864 | 234,178 | 149,686 | 44.75 | 54.31 | 35.09 |
| ఛండీఘర్ | 158,371 | 98,495 | 59,876 | 61.56 | 66.97 | 54.35 |
| ఢిల్లీ | 2,301,605 | 1,438,268 | 863,337 | 56.61 | 63.71 | 47.75 |
| దాద్రా-నగర్హవేలి | 11,105 | 8,188 | 2,917 | 14.97 | 22.15 | 7.84 |
| పుదుచ్చేరి | 217,058 | 135,851 | 81,207 | 46.02 | 57.29 | 34.62 |
| మిజోరాం | 178,793 | 103,324 | 73,469 | — | — | — |
| లక్షద్వీప్ | 13,889 | 9,081 | 4,808 | 43.66 | 56.48 | 30.56 |

సెకండరీస్థాయివరకు విద్యాబోధన ఈ దిగువ రాష్ట్ర/ప్రాంతములందు, ఉచితముగ లభించుచున్నది: ఆంధ్ర ప్రదేశ్, కర్ణాటక, కేరళ, తమిళనాడు, అందమాన్-నికోబార్, అరుణాచల ప్రదేశ్, లక్షద్వీప్, జమ్మూ-కాశ్మీరు, నాగాలాండ్, దాద్రా - నగర్ హవేలీ, పుదుచ్చేరి. అన్ని రాష్ట్ర కేంద్రపాలిత ప్రాంతములలో షెడ్యూల్డు కులముల, షెడ్యూల్డ్ తరగతుల బాలబాలికలకు ఉచితముగ విద్య లభించుచున్నది. 1972లోని సంఖ్యా సేకరణను అనుసరించి ఈ క్రింది వివరములు లభ్యములగుచున్నవి:

పట్టిక నెం. **XVII**

వివిధ స్థాయిల పాఠశాలల సంఖ్యా వివరములు

| పాఠశాలారీతి | పాఠశాలల సంఖ్య | ఉపాధ్యాయ సంఖ్య | విద్యార్థి సంఖ్య (లక్షలలో) |
|---|---|---|---|
| ప్రయిమరీ/జూనియర్ | 4,14,406 | 10,96,561 | 614.3 |
| మిడిల్/సీనియర్ బేసిక్ | 94,199 | 6,70,629 | 140.8 |
| హై/హైయర్ సెకండరీ | 38,488 | 6,19,507 | 70.8 |
| యూనివర్సిటీలు/కాలేజీలు | 2,966 | 91,069 | 29 3 |

1974-75లో దేశమున విశ్వవిద్యాలయముల సంఖ్య 101. (వాని పేరులు ఆయా రాష్ట్రముల వివరములలో 14వ ఉపశీర్షికయందు ఈయబడినవి) యూనివర్సిటీలుగనే పరిగణింప బడదగిన కొన్ని ఉన్నత విద్యాసంస్థలు మరికొన్ని కలవు. అవి : 1 బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ & సైన్సు పిలానీ; 2. ఇండియన్ అగ్రికల్చరల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ న్యూఢిల్లి; 3. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సు, బెంగుళూరు; 4. జామియా మిలియా ఇస్లామియా, న్యూఢిల్లి; 6. గుజరాత్ విద్యాపీఠ్, అహమ్మదాబాద్; 7. గురుకుల్ కాంగ్డా విశ్వవిద్యాలయ, హరిద్వార్; 8. కాశీ విద్యాపీఠ్, వారణాసి; 9. టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్, బొంబాయి; 10. ఇండియన్ స్కూల్ ఆఫ్ మైన్స్, ధన్‌బాద్.

ఇవిగాక కేంద్ర విశ్వవిద్యాలయములుగ ఈ క్రిందివి పరిగణింపబడు చున్నవి : 1. అలీఘడ్ ముస్లిం యూనివర్సిటీ, అలీఘడ్; 2. బెనారస్ హిందూ యూనివర్సిటీ, వారణాసి; 3. జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీ, న్యూఢిల్లీ; 4. యూనివర్సిటీ ఆఫ్ ఢిల్లీ, న్యూఢిల్లీ; 5. విశ్వభారతి, శాంతినికేతన్; 6 నార్త్ ఈస్టరన్ హిల్ యూనివర్సిటీ, షిల్లాంగ్; 7 యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, హైదరాబాదు.

దేశమునందు విశ్వవిద్యాలయములలో పెక్కింట సాంకేతిక విద్యాబోధనకు వసతులు ఉండి, అచట పలువురు శిక్షణను పొందుచున్నను, సాంకేతిక విద్యకుగల ప్రాముఖ్యమునుబట్టి కేంద్ర ప్రభుత్వమే స్వయముగ కొన్ని సాంకేతిక కళాశాలలను, ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ అను పేరుతో నడుపుచున్నది. ఈ సంస్థకు చెందిన కళాశాలలు ఖరగపూర్, బొంబాయి, మద్రాసు, కాన్‌పూర్, న్యూఢిల్లీలలో కలవు. దేశము మొత్తమున 1975-76లో సాంకేతిక విద్యయందు, పట్టభద్రులుగ 14,019 మంది. డిప్లోమా ఆర్జించినవారు. 18,000 మంది ఉత్తీర్ణులైరి. ప్రస్తుతమున ప్రపంచ దేశములందు, సాంకేతిక విద్యాకుశలుర సంఖ్యలో యు. స్టే.; సోవియట్ రష్యాల తరువాత స్థానము భారతదేశము ఆక్రమించినది. అట్టి కుశలురగు పనివారలలో కొందరు విదేశములలో పని చేయుచున్నారు.

దేశమున వైజ్ఞానిక పరిశోధనల నిర్వాహణ ఐదు ప్రముఖ జాతీయ సంస్థల ఆధ్వర్యమున సాగుచున్నది. అవి: 1. కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రిసర్చి; 2. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసర్చి; 3. సెంట్రల్ కౌన్సిల్ ఫర్ రిసర్చి ఇన్ ఇండియన్ మెడిసిన్ అండ్ హోమియోపతి; 4. ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ అగ్రికల్చరల్ రిసర్చి; 5. డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఆటామిక్ యనర్జీ & స్పేస్ రిచర్చి అండ్ సయిన్స్ అండ్ టెక్నాలజీ. పైన తెలుపబడిన సంస్థల పర్యవేక్షణకు లోబడి ప్రాదేశికసంస్థలు పరిశోధనలను నిర్వహించుచున్నవి.

దేశమున సాంస్కృతిక రంగములందు, ప్రాచీన కాలమునుండి కొనసాగుచు వచ్చుచున్న సంప్రదాయములను పరిపోషించుచు, ఆధునికతను అందు మేళవించుటకై కేంద్రప్రభుత్వాదరణమున 1. సాహిత్య అకాడమీ (న్యూఢిల్లీ-స్థాపితం 1954), 2. లలిత కళా అకాడమీ (న్యూఢిల్లీ-స్థాపితం 1954), 3. సంగీత నాటక అకాడమీ (న్యూఢిల్లీ - స్థాపితం 1953) కృషిచేయుచున్నవి. కొన్ని రాష్ట్రప్రభుత్వములును తమ ప్రాంతములందు వీనికి అనుబంధ సంస్థలను నెలకొల్పి, ప్రాంతీయ సంస్కృతులను పరిపోషించుచున్నవి.

దేశమున 10 వేలకు పైబడిన గ్రంథాలయములు కలవు. గ్రంథాలయ నిర్వాహణ రాష్ట్ర సంబంధ విషయమే అయినను కేంద్రప్రభుత్వపు సాంస్కృతిక శాఖ, స్వయముగ కొన్ని కేంద్ర గ్రంథాలయములను నిర్వహించుటయేగాక, ఉత్తమ సార్వజనిక గ్రంథాలయముల నిర్వహించు స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సాహాయ్యమును కల్పించుచున్నది. పబ్లిక్ గ్రంథాలయముల నిర్వాహణను క్రమబద్ధము చేయుటకు అనువగు శాసనములను ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర, తమిళ్‌నాడు ప్రభుత్వములు రూపొందించి అమలుజరుపుచున్నవి.

గ్రంథాలయములలో దేశపు మొత్తమున మూడు ప్రముఖ గ్రంథాలయములను 'కాపీరైట్' గ్రంథాలయములుగ, కేంద్రప్రభుత్వము 1954 లో ఒక శాసనము ద్వారా నిర్ణయించినది. దేశమున ప్రచురితమగు నూత్న గ్రంథము, లేదా క్రొత్తమేగజినున ఒక ప్రతి, విధిగ ఈ కాపీరైటు గ్రంథాలయములలో ప్రతియొకదానికి పంపబడవలయును. ఆ గ్రంథాలయములు : 1. నేషనల్ లైబ్రరీ, కలకత్తా (గ్రంథ సంఖ్య 14.5 లక్షలు); 2 సెంట్రల్ లైబ్రరీ, బొంబాయి (గ్రంథ సంఖ్య 6 లక్షలు), 3. కన్నెమరా లైబ్రరీ, మదరాసు (గ్రంథసంఖ్య 2.5లక్షలు).

పై గ్రంథాలయములుగాక, కొన్ని వ్రాతప్రతుల గ్రంథాలయములును, ప్రాచ్యవాఙ్మయ గ్రంథాలయములునుకలవు. రాష్ట్ర ప్రభుత్వములకుగాని, ప్రత్యేక వ్యక్తులకుగాని చెందిన ఇట్టి గ్రంథ సంచయములు దాదాపు 100 కలవు. ఈ సంచయములలో లక్షలకొలది వ్రాతప్రతులు కలవు వ్రాతప్రతుల గ్రంథాలయములలో ఈ దిగువవి ప్రముఖములు : 1. సరస్వతీ మహల్ లైబ్రరీ, తంజావూరు, తమిళనాడు; 2. గవర్నమెంట్ ఓరియంటల్ మానుస్క్రిప్ట్ లైబ్రరీ, మదరాసు; 3. ఖుదాబక్ష్ ఓరియెంటల్ పబ్లిక్ లైబ్రరీ, పాట్నా; 5. రజా లైబ్రరీ, రామ్‌పూర్, ఉత్తరప్రదేశ్; 6 & 7. పూనా, వాదోదరలలోని ఓరియెంటల్ రిసర్చి లైబ్రరీలు; 8. సంస్కృత యూనివర్సిటీ లైబ్రరీ, వారణాసి, 9. విశ్వేశ్వరానంద్ వేదిక్ ఇన్‌స్టిట్యూట్, హోషియార్‌పూర్.

పై గ్రంథాలయములు గాక, యూనివర్సిటీ లందును ప్రముఖములగు గ్రంథాలయములు కొన్ని కలవు.

దేశమున తొలుతటి మ్యూజియమ్ 1814 లో కలకత్తా యందు నెలకొల్పబడినది. ప్రస్తుతమున దేశమున 200 కు పైబడిన మ్యూజియములు కలవు, వీనిలో ప్రముఖములు : కలకత్తాలోని ఇండియన్

మ్యూజియం, విక్టోరియాహాలు. అసుతోష్ మ్యూజియం; న్యూఢిల్లీ లోని నేషనల్ మ్యూజియం, నేషనల్ గేలరీ ఆఫ్ మోడరన్ ఆర్ట్, నెహ్రూ మెమోరియల్ మ్యూజియం అండ్ లైబ్రరి; హైదరాబాదు లోని సాలార్‌జంగ్ మ్యూజియం; బొంబాయిలోని ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం; మదరాసులోని గవర్నమెంట్ మ్యూజియం; వారణాసి లోని యూనివర్సిటీ మ్యూజియం. ఇవిగాక పురావస్తువుల మ్యూజియములు ప్రముఖ ప్రాచీన స్థలములలో- కోణార్క, నాగార్జునకొండ, నాలందా, సాంచీ, సారనాథ్‌వంటి వానియందు-కలవు. ఇంకను చేతిపనులకు నేతపసతనమునకు చెందిన మ్యూజియములును బాలల మ్యూజియములును, అటనట కొలదిగ వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రవిషయికములగు మ్యూజియములును కలవు.

ఆధునిక రీతిలో వార్తాపత్రికా ప్రచురణ భారత దేశమున 1780లో కలకత్తా యందు 'బెంగాల్ గజెట్' అను పత్రికను ప్రచురించుటతో మొదలైనది. 1976లో రిజిస్ట్రార్ ఆఫ్ న్యూస్ పేపర్స్, పార్లమెంటునకు సమర్పించిన నివేదికను అనుసరించి 1974లో వార్తా పత్రికల పరివ్యాప్తి మొత్తం (టోటల్ సర్క్యులేషన్) 330.92 లక్షలు. పత్రికల సంఖ్య 12,185. భాషలవారీగా చూచినపుడు హిందీ యందు అత్యధిక సంఖ్యలో పత్రికలు వెలువడు చున్నవి; అందలి పత్రికలసంఖ్య 3.200; తరువాత లెక్కింప దగినది ఇంగ్లీషు; అందలి పత్రికలసంఖ్య 2.483. 1974లో దేశమున దినపత్రికలసంఖ్య 822: వారమున రెండు లేదా మూడుసార్లు వెలువడు వాని సంఖ్య 68; వారపత్రికలు 3,666; ఇతర రీతుల కాల ప్రమాణములలో వెలుబడునవి 7,629. దినపత్రికల సంఖ్యలో అగ్రస్థానము ఉత్తరప్రదేశ్‌కు లభించుచున్నది; అచటి దిన పత్రికల సంఖ్య 135; తరువాతది మహారాష్ట్ర; అచటి దినపత్రికల సంఖ్య 122. కాని పత్రికల మొత్తపు సంఖ్యనుపట్టి చూచినపుడు మహారాష్ట్రకే అగ్రస్థానము లంభించుచున్నది. దేశపు ప్రముఖ నగరములగు ఢిల్లీ, బొంబాయి, కలకత్తా, మద్రాసుల నుండి 3,760 పత్రికలు (అనగా మొత్తపు పత్రికలలో 30.9 శాతము) వెలువడు చున్నవి. దినపత్రికలలో పరివ్యాప్తియందు లక్షకు మించినవి 22 మాత్రమే కలవు; బెంగాలీ భాషలో కలకత్తానుండి వెలువడు ఆనందబజార్ పత్రికకు ఇందు ప్రథమస్థానము లభించుచున్నది. దాని పరివ్యాప్తి 2,68,403. కాని పలుకేంద్రముల నుండి ప్రచురింపబడు పత్రికలను లెక్కించినయెడల ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికకు అగ్రస్థానము లభించుచున్నది; ఎనిమిది కేంద్రములనుండి ఒకే సమయమున వెలుబడు ఆ పత్రిక యొక్క పరివ్యాప్తి 4,12 205.

వార్తా పత్రికలకు సమాచారమును సేకరించు దేశీయసంస్థలు నాలుగుకలవు. అవి 1. ప్రెస్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా. 2. యునైటెడ్ న్యూస్ ఆఫ్ ఇండియా, 3. సమాచార భారతి, 4. హిందూస్తాన్ సమాచార్. ఇందు మొదటి రెండును ఆంగ్లమున వార్తలను అందించగ, తక్కినవి వివిధ దేశీయ భాషలలో కూడ వార్తలను అందించుచున్నవి. కాని 1975 - 76లో ఆత్యయిక పరిస్థితి కాలమున, ప్రభుత్వప్రోద్బలము వలన ఈ నాలుగు సంస్థలును 'సమాచార్' అను పేరున ఒకే ఒక సంస్థగ మేళనము పొందినవి. అయినను 1977 మార్చిలో అధికారమును గ్రహించిన నూత్న కేంద్ర ప్రభుత్వము, ఈ సంస్థలు మరల విడిపోయి, స్వతంత్రముగ పనిచేయుటకు చట్టరీత్యా మార్గమును సుగమము చేసినది.

స్వాతంత్ర్యము లభించినది మొదలుగ, దేశపు ప్రభుత్వము, ప్రజానీకపు ఆరోగ్య సంరక్షణకై పెక్కు వసతులను కల్పించుటకు ప్రణాళికా బద్ధముగ కృషి సాగించినది. ప్రజారోగ్యము, రాష్ట్రప్రభుత్వముల అధికార పరిధి లోనిదేయైనను,

కేంద్ర ప్రభుత్వమును ఒక కీలక పాత్రను ఇందు నిర్వహించుచున్నది. వైద్య విధానమున రెండు ప్రముఖ సంప్రదాయములు - 1. అల్లోపతీ, 2. ఆయుర్వేద సంప్రదాయము - అవలంబింపబడు చున్నవి. ఇవిగాక యూనానీ, హోమియోపతీ వైద్య సంప్రదాయములకును ప్రభుత్వాదరణ, పరిమిత స్థాయిలో లభించుచున్నది. అల్లోపతీ సంప్రదాయపు వైద్య విద్యారీతిని సువ్యవస్థరీతిలో నడపుటకై మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా వ్యవస్థిత మైనది (1956). వైద్యవిద్యా ప్రవీణులగు అల్లోపతీ డాక్టర్ల పేరులను ఆ కౌన్సిల్ నమోదు చేయు చున్నది. ఆ పట్టికను అనుసరించి డిసెంబర్ 31, 1974 నాటికి భారతదేశమున అల్లోపతి డాక్టరుల సంఖ్య 1,87,636. అటులే డెంటల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా అనునది దంతవైద్య విషయమున శ్రద్ధ వహించు చున్నది; దానిపట్టికను అనుసరించి 1974 లో దేశమున 7,088 రిజిష్టర్డ్ దంతవైద్యులు కలరు. ఔషధకారుల (ఫార్మసిస్టుల) పట్టికను తయారు చేయు బాధ్యత ఫార్మసీ కౌన్సిల్ ఆఫ్ ఇండియా యందు కలదు; దాని పట్టికనుబట్టి 1975 అంతమునకు దేశమున ఔషధకారుల సంఖ్య 94,500. ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్ అనునది నర్సుల, మంత్రసానుల, వైద్యసౌకర్య పర్యవేక్షకుల శిక్షణాదులను గురించి శ్రద్ధ వహించుచున్నది; దీని పట్టికను అనుసరించి 1972 నాటికి దేశపు నర్సుల సంఖ్య 78 వేలు. సెంట్రల్‌కౌన్సిల్ ఫర్ రిసర్చి ఇన్ ఇండియన్ మెడిసిన్ అండ్ హోమియోపతీ అను సంస్థ ఆయుర్వేద, సిద్ధ, యూనానీ, హోమియోపతీ, యోగ చికిత్సా విధానముల విద్యావిధానములను సువ్యవస్థీకరించుచు, ఆయా విధానములలో ప్రవీణులగు డాక్టర్ల పేరులను తన పట్టికయందు నమోదు చేయు చున్నది. పైన పేర్కొనిన విధానములే గాక, ప్రకృతి చికిత్సా పద్ధతులను అవలంబించు వైద్య కేంద్రములు ప్రభుత్వ సహాయమున అటనట పని చేయుచున్నవి.

అల్లోపతీ సంప్రదాయపు వైద్యవిధానమున శిక్షణను కల్పించుటకు దేశమున 105 వైద్యకళాశాలలు, 15 దంతవైద్యకశాలలు, 11 ఇతర వివిధ సంస్థలు పనిచేయుచున్నవి (1973-74). ప్రతియేట దాదాపు 12,500 మంది క్రొత్త విద్యార్థులు ఈ కళాశాలలో చేరుచున్నారు. ప్రజానీకమున 4,200 మందిప్రజలకు ఒకడాక్టరు చొప్పునకలరని అంచనా (1975). నర్సుల శిక్షణకై వివిధ తరగతుల సంస్థలు 635 పనిచేయుచున్నవి.

భారతీయ వైద్య సంప్రదాయములందు శిక్షణను కల్పించుటకై 92 ఆయుర్వేదవిద్యకు, యూనానీకై 10 కళాశాలలు పనిచేయుచున్నవి. ఈ సంప్రదాయములందు ఉన్నత శిక్షణకై జామ్‌నగర్, వారణాసిలలో రెండు విద్యాసంస్థలు స్థాపింపబడినవి. ప్రభుత్వపు పరిగణను పొందిన 74 సంస్థలు హోమియోపతిలో శిక్షణను ఇచ్చుచున్నవి.

దేశమున ప్రజలకు ఎక్కువ బాధాకరములుగ ఉన్న మలేరియా, మశూచి, బోదకాలిజబ్బు, క్షయ, కుష్ఠురోగము, కలరా, కంటి జబ్బు, సుఖ జాడ్యముల నిరోధ నిర్మూలనములకై జాతీయ కార్యక్రమ సంస్థలను నెలకొల్పి ప్రభుత్వము కృషి చేయు చున్నది. వీనిలో మశూచి రోగము, దేశమున లేకుండ చేయబడినటుల ప్రభుత్వము 1977లో ప్రకటించినది. మలేరియాయు చాలవరకు అరికట్టబడినది. తక్కినవాని విషయమున నిరోధకచర్యలు చాలవరకు సఫలతను పొందినవి. కేన్సరు, గుండె జబ్బు, క్షయలకై ప్రత్యేక చికిత్సా కేంద్రములు పలుతావులందు పనిచేయుచున్నవి.

1971-72లోని సంఖ్యా వివరములనుబట్టి దేశపు ఆసుపత్రులందలి శయ్యా సంఖ్య 260.8 వేలు, ప్రయిమరీ ఆరోగ్య కేంద్రములసంఖ్య 5,183. కుటుంబ నియంత్రణ కేంద్రముల సంఖ్య 38,568 వేలు. ప్రజానీకమున 1000 ప్రజలకు 66 వైద్య శయ్యలు మాత్రమేకలవని అంచనా. దేశమున పుర

షుని అపేక్షిత జీవిత వ్యవధి 50.7 సంవత్సరములు; స్త్రీ యొక్క అపేక్షిత జీవితవ్యవధి 49.3 సం. (1975).

## 12. యాత్రా సౌకర్యములు

దేశము అతి విశాలమై, వివిధ శీతోష్ణ పరిస్థితులకును వివిధ ప్రాకృతిక పరిసరములకును నెలవగుటవలన ప్రకృతి సౌందర్యమును వెలువరచు దృశ్యములు ఎన్నియో ఇట కలవు. ఇందులకు తోడుగ అయిదువేల సంవత్సరముల దీర్ఘ చరిత్ర గతిలో అటనట వెలసి అంతరించిన వివిధ ప్రాచీన సంస్కృతి కేంద్రముల అవశేషములును చాల విరివిగ కలవు. అందువలన ఈ దేశము జిజ్ఞాసువులగు వివిధ విదేశీయ పర్యటకులను ఆకర్షించుట సహజము. కాని ఇట్టి విదేశీయ యాత్రికులకు తగు ప్రోత్సాహమును కల్పించుటకు సువ్యవస్థిత కృషి 1966 నుండి మాత్రమే, కేంద్ర ప్రభుత్వము 'ఇండియన్ టూరిజమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్' అను సంస్థను నెలకొల్పుటతో ఆరంభితమైనది. ఈ సంస్థయొక్క ఆధ్వర్యవమున విదేశీయ యాత్రికుల సౌకర్యమునకై 1976 నాటికి 14 పెద్దహోటళ్లను, 2 మోటళ్లను, 2 సాగరతీర నివాసములును, 14 ప్రయాణిక వసతులును, 11 అల్పాహారశాలలును, 14 రహదారీ సౌకర్య సంస్థలును, 4 శుల్కరహిత వస్తువిక్రయశాలలును, 3 శబ్దకాంతి ప్రసార కేంద్రములును ఏర్పడినవి. ఈ రీతిగ యాత్రికుల వసతికై ప్రస్తుతమున దాదాపు 2000 గదులును, 3100 శయ్యలును ఏర్పడినవి.

విదేశీయ యాత్రికులలో ప్రతియొకడును ప్యాస్‌పోర్టు-వీసాలను విధిగ కలిగియుండవలెను. సన్నిహిత దేశములగు పాకిస్తాన్, నేపాల్, బంగ్లాదేశ్, శ్రీలంకల విషయమున ఇట్టి పత్రముల సేకరణలో కొంత సౌలభ్యము కలదు. (దేశమునందలి వివిధ దర్శనీయ స్థలములు ఆయా రాష్ట్రముల కథన సందర్భమున 14వ ఉపశీర్షికలో ఈయబడినవి). 1951 మొదలుగ దేశమున పర్యటించు విదేశీయ యాత్రికుల సంఖ్య క్రమముగ పెరిగి, దానితో పాటుగ అట్టి యాత్రికుల వలన దేశమునకు సాలీనా లభించు ఆదాయమును అభివృద్ధి చెందినది. అయినను ప్రపంచపు విదేశయాత్రికుల సంఖ్యలో 0.3 శాతమును మాత్రమే భారతదేశము ఆకర్షించుచున్నదని లెక్కలవలన తెలియుచున్నది. 1976-77లో దేశమును 5,69,000 మంది విదేశీయులు దర్శించిరి, అందువలన దేశమునకు 260 కోట్ల రూపాయల విలువగల విదేశీయ వినిమయ ద్రవ్యము లభించినది.

## 13. ప్రసిద్ధ భారతీయులు

నిరంతరాయముగ, హెచ్చుతగ్గులతో, ఒక ప్రసిద్ధ సాంస్కృతిక భూమిగ వేలకొలది సంవత్సరములు మనుగడను సాగించిన ఈ దేశమున ఎందరో ప్రసిద్ధులు జన్మించి, అంతటంతట మానవ సంస్కృతికి విశేషముగ సమకూర్చిరి. కాని ఇందు అతి ప్రాచీన కాలమునకు చెందిన వారిలో కొందరి పేరులు మాత్రమే మనకు లభించుచున్నవి. వేదములందు మంత్రద్రష్టలుగ పేర్కొనబడిన విశ్వామిత్రుడు మొదలగువారు చారిత్రక వ్యక్తులే అయినను వారి జీవిత విశేషములు తెలియవచ్చుట లేదు. అటులే ఉపనిషత్ కాలమునకు చెందిన యాజ్ఞవల్క్యుడు, గార్గి మొదలగువారి విషమును ఆ తీరుగనే ఉన్నది. ప్రసిద్ధ ఇతిహాసములగు రామాయణ, మహాభారతములను రచించిన వాల్మీకి, వ్యాసులను గురించిన చారిత్రక విషయములును మరుగున పడినవి. పైన పేర్కొనబడిన వారి కోవకు చెందిన మహాపురుషుల రచనలు మాత్రమే వారి ప్రశస్తిని మనకు అవగతము చేయుటకు నిదర్శనములుగ నిలచి ఉన్నవి. ఇక క్రీ.పూ. 7వ శతాబ్దికి పూర్వపు భారతదేశీయ పాలకుల విషయములును, పౌరాణిక గాథతోల ముడివడి చారిత్రక

వివరణకు లొంగకున్నవి. ఇక క్రీ పూ. 7వ శతాబ్ది తరువాతివారి విషయముననైనను సమగ్రముగ పట్టికను ఇచ్చుటకు ఇట అవకాశములేదు. కావున అట్టి వారిలో, పాశ్చాత్యాది ఇతర దేశీయుల దృష్టిని సైతము ఆకర్షింపగలిగిన కొందరు ప్రముఖుల నామ మాత్ర ప్రసక్తి మాత్రమే ఈ దిగువ చేయబడినది: 1. లగధ (క్రీ. పూ. 7వ శతాబ్ది): వేదాంగ జ్యోతిషమను జ్యోతిశ్శాస్త్రమును రచించి, విషువత్తులను, దినరాత్రముల వ్యవధులలో వచ్చు మార్పులను కనుగొనినవాడు; 2. బౌధాయన (క్రీ. పూ. 6వ శతాబ్ది); సమకోణ త్రిభుజ మందలి భుజముల మధ్య నుండు సంబంధమును, తొలుతగ సంభావింప గలిగిన గణిత శాస్త్రవేత్త; 3. మహావీరుడు (క్రీ. పూ. 540?–468?) జైనమత వ్యవస్థాపకుడు; 4. గౌతమబుద్ధుడు (క్రీ. పూ. 560–48?) బౌద్ధమతమును నెలకొల్పినవాడు; 5. చంద్రగుప్త మౌర్య (క్రీ. పూ 322–298 ప.): నందులను నిర్మూలించి, భారతదేశమున గ్రీకుల రాజ్యమును అంతరింపజేసి, దాదాపుగ భారతదేశమును అంతటిని తొలుతగ పాలించిన చక్రవర్తి; 6. కణాదుడు (క్రీ. పూ. 4వ శతాబ్ది): పరమాణు సిద్ధాంతమును తొలుతగ సంభావించిన వైజ్ఞానికుడు; 7. చాణక్యుడు (క్రీ. పూ. నాలుగవ శతాబ్ది); అర్థశాస్త్రమను పేర రాజ్యతంత్ర), ఆర్థిక శాస్త్రముల వెలయించిన ప్రజ్ఞాశాలి; చంద్రగుప్త మౌర్యుని మంత్రి; ఇతనికే కౌటిల్యుడు, విష్ణుగుప్తుడు అను పర్యాయ నామములు కలవు; 8. అశోకుడు (కీ. పూ. 272–231 ప.): బౌద్ధమతమునకు అత్యధిక వ్యాప్తిని దేశ విదేశములందు కల్పించిన చక్రవర్తి; 9. నాగార్జునుడు (కీ. శ. రెండవ శతాబ్ది); బౌద్ధమతమున మహాయాన సంప్రదాయమునకు సుస్థిర ప్రతిపత్తిని సమకూర్చినవాడు 10. సముద్రగుప్తుడు; (క్రీ. శ. 330–375 ప.) ఆర్యావర్త, దక్షిణా పథముల రెండింటి దిగ్విజయమును సాగించి, ఆర్యావర్తమును ఏకచ్ఛత్రముగ పాలించిన చక్రవర్తి; అలహాబాదు నందలి శిలాశాసనము ఈతని ప్రశస్తినితెలియజేయు చున్నది; 11. చంద్రగుప్త II (క్రీ.శ. 375–413 ప.) విక్రమాదిత్యుడను ఉపనామము కలవాడు; శకుల ప్రతిభను అంతరింపజేసిన విజేత; 12. కాళిదాసు (క్రీ. శ. 4 వ శతాబ్ది): విశ్వ విఖ్యాతిని ఆర్జించిన సంస్కృత కావ్య, నాటక రచయిత; ఈతని అభిజ్ఞాన శాకుంతల నాటకము పలు ప్రముఖ ప్రపంచ భాషలలో అనూదితము; 13. ఆర్యభటుడు (క్రీ శ. 6 వ శతాబ్ది): గణిత ఖగోళ శాస్త్రవేత్త; సూర్యకేంద్రక మగు భూభ్రమణ సిద్ధాంతమునకు ఉపపత్తి కలదని తొలుత సంభావించిన విజ్ఞాని; 14. వరాహమిహిర (కీ. శ. 6 వ శతాబ్ది): భారతీయ ప్రాచీన ఖగోళ విజ్ఞానమును, గ్రీకుల ఖగోళ విజ్ఞానమును మేళవించిన ప్రజ్ఞానిధి; 15. హర్షవర్ధనుడు (క్రీ. శ. 590–647): ఉత్తర భారతమున అధికభాగమును పాలించిన చక్రవర్తిగనేగాక కవిగను విద్వాంసుడుగను, బౌద్ధమత పరిపోషకుడుగను పేరొందినవాడు; 16. శంకరాచార్యుడు (788–820): అద్వైత వాదమునకు, హిందూమతమున ఆధిక్యమును కల్పించుటతో పాటుగ, బౌద్ధ జైనముల ప్రతిభను తన వాదనైపుణివలన సడలింపజేసి, పౌరాణిక హిందూ మత భావనకు విశాలమగు ప్రాతిపదికను దేశమున కల్పించినవాడు; 17. భోజుడు (కీ. శ. 1010–1056 ప.): స్వయముగ కవిగను, బహు శాస్త్ర పండితుడుగను మాత్రమే గాక కవిపోషకుడుగ పేరొందినరాజు; వివిధ విజ్ఞాన శాఖలపై ఇతడు రచించిన గ్రంథములు ఇరువదివరకు కలవు; 18. భాస్కరాచార్య (జ. 1114) తన కాలము వరకును వికసనము పొందిన గణిత ఖగోళ శాస్త్రములకు సువ్యవస్థిత రూపములను కల్పించుటయే గాక, భూభ్రమణ సిద్ధాంతమును సోపపత్తికముగ రుజువు చేసిన వైజ్ఞానికుడు; 19. రాజరాజ I (క్రీ.శ. 985–1018 ప.): దక్షిణ, ప్రాచ్య భారత

ములను జయించి వశపరచుకొనుటయేగాక, నౌకా సేన సాయమున సముద్రోత్తర ప్రాంతములగు సింహళ, మాల్దీవులను వశపరచుకొనిన విజేత; 20. రాజేంద్రI (1018-1044ప.) గంగానది వరకు తూర్పుతీరాన తన జైత్రయాత్రను సాగించి, అంతట తన నౌకాబల సాహాయ్యమున, మలయా జావా సుమత్రాలను వశపరచుకొసిన అసమాన పాలకుడు; 21. రామానుజాచార్య (1019-1139): విశిష్టాద్వైతమునకు, హిందూమతమున విశిష్ట ప్రతిపత్తిని కల్పించిన ఆచార్యుడు; 22 మధ్వాచార్య (1238-1317) ద్వైతవాదమునకు వ్యాప్తిని కల్పించిన ఆచార్యుడు; 23 అమీర్ ఖుస్రూ (1252-1324): భారతీయ ప్రాచీన పరంపరాగత సంగీత శాస్త్రమునకు, పారసీక గాన, వాద్యముల మేళవించి, ఔత్తరాహ (హిందూస్థానీ) సంగీత సంప్రదాయమునకు తొలిరూపమును కల్పించిన పండితుడు; 24. అక్బర్ (1542-1605): మొగల్ సామ్రాజ్యమును భారత దేశమున సుప్రతిష్ఠితముచేసి, హిందూ ముస్లిమ్ ప్రజలయందు ఏకజాతీయ భావనను నెలకొల్పుటకై కృషిచేసిన దూరదర్శి; 25. తాన్ సేన్ (మ. 1589): హిందూస్థానీ గాన పద్ధతియందు ధ్రువతారగ పేరొందిన గాయకుడు; రబాబీ,వీణాకార సంప్రదాయ మూలపురుషుడు; 26. గురునానక్ (1469-1538): హిందూ, ముస్లింమతముల సారభూత మగు శిక్కుమతమునకు తొలిరూపమును కల్పించిన ఆచార్యుడు; 27. తులసీదాస్ (1532-1623) హిందీసాహిత్యము నందు మహాకవిగ మాత్రమే గాక, మహాభక్తుడుగను పేరొందినవాడు; ఈతని రామచరిత మానస్ విపులఖ్యాతిని ఆర్జించినది; 28. ఔరంగజేబ్ (1618-1707):మొగల్ సామ్రాజ్యమును పరాకాష్ఠకు కొనిపోగలిగిన చక్రవర్తి; తన మత ఛాందసపు వర్తనవలన ఆ సామ్రాజ్యపు పతనమునకును బీజములను చల్లిన విచిత్రవ్యక్తి; 29. శివాజీ (1627-1680): అడగియున్న మహారాష్ట్ర సామాన్య ప్రజానీకమును ఒక వీరజాతిగ రూపొందించి, మొగల్ సామ్రాజ్య ప్రతిష్ఠను కూలద్రోయుటకు, వారిని సమాయత్తము చేసిన దేశభక్తుడు; 30. గురు గోవింద్ (మ. 1708) శిక్కులను ఒక వీర జాతిగ తీర్చిదిద్దిన శిక్కు మతాచార్యుడు; 31. జయసింహ (1686-1743) : మధ్యయుగములకు సంబంధించినంతవరకు కడపటి భారతీయ వైజ్ఞానికుడు; భారత దేశమున అయిదు ప్రముఖ నగరములలో వేధశాలలను నెలకొల్పి ఖగోళశాస్త్ర పరిశోధనలను సాగింపజేసిన విజ్ఞాని; 32. త్యాగరాజు, కాకర్ల (1759-1847): కర్ణాటక సంప్రదాయపు గాన ప్రాశస్త్యమును పరాకాష్ఠకు కొనిపోయిన భక్తగాయకుడు; 33. రాజా రామమోహన రాయ్ (1774-1833): పండితుడు; బహు భాషావేత్త; సంఘసంస్కర్త; సహగమనమును నిషేధింపజేయుటలో తీవ్రకృషి చేసినవాడు; బ్రహ్మ సమాజ సంస్థాపకుడు; భారత చరిత్రలో ఆధునిక విజ్ఞానవ్యాప్తికి వేగుచుక్క; 34 ఝాన్సీ లక్ష్మీ బాయి ( 1835-1858 ): భారతీయ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమున పాల్గొనిన వారిలో ప్రథమ శ్రేణికి చెందిన వీరవనిత; 35. స్వామి దయానంద సరస్వతి (మ. 1883): ఆర్యసమాజ సంస్థాపకుడగు సంఘ సంస్కర్త; 36. సయ్యద్ అహమద్ ఖాన్ ( 1817-1898 ): భారతీయ ముస్లిములందు ఆధునిక విజ్ఞానమునెడలను ఆంగ్ల భాషాభ్యసము నెడలను ఆసక్తిని కలిగించి, ఆలీఘడ్ ముస్లిం యూనివర్సిటీకి తొలిరూపమును ఏర్పరచిన పండితుడు; 37. దాదాభాయి నౌరోజీ (1825-1917): స్వదేశీ ఉద్యమ ప్రారంభకుడు; 38. రామకృష్ణ పరమహంస ( 1836-1886 ): సర్వమత సమభావన కలిగిన భక్తి సంపన్నుడు; 39. వివేకానందస్వామి (1863-1902): దేశ, విదేశములందు అద్వైతవాద ప్రాశస్త్యమును ప్రకటించి, ఖ్యాతినందుటయేగాక, రామకృష్ణ మఠ సంస్థా

పన ద్వారా నవభారత సమాజ నిర్మాణమునకు మార్గములను ఏర్పరచిన తాత్త్వికుడు; 40. అరవింద యోగి (1872-1950)· ప్రాచ్య, ప్రతీచీ భావనలు మేళవించిన విజ్ఞాన ఖనిగనే గాక, దేశభక్తుడుగను, ఆధ్యాత్మిక శక్తి సంపన్నుడుగను ఖ్యాతిని పొందిన ప్రజ్ఞానిధి; 41. రవీంద్రనాథ టాగూర్ (1861-1941): విశ్వఖ్యాతిని ఆర్జించిన బెంగాలీ కవి; దేశభక్తుడు; విశ్వమానవ సౌభ్రాతృత్వమునకై కృషిచేసిన ఉదారభావుకుడు, శాంతినికేతన సంస్థాపకుడు; 'గీతాంజలి' అను రచనవలన 1913లో నోబెల్ బహుమతి ఆర్జించెను; 42. చంద్రశేఖర వెంకటరామన్ ( 1886-1970 ): ప్రసిద్ధ వైజ్ఞానికుడు; కాంతి తరంగములను గురించిచేసిన కృషికై నోబెల్ బహుమతిని 1930లో ఆర్జించెను. 43 జగదీశచంద్రబోస్ (1858-1937) అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన వృక్షశాస్త్ర విజ్ఞాని; 44. లోకమాన్య బాలగంగాధర తిలక్ (1856-1920): దేశీయులందు స్వాతంత్ర్యాకాంక్షను, అందులకై పోరాటమును సాగించు దీక్షను రగిల్చిన దేశభక్తుడు; పండితుడు, ఖగోళవిజ్ఞాని; 45. మహాత్మా గాంధి (మోహన్‌దాస్ కరంచంద్ గాంధి, 1869-1948); అస్వతంత్ర భారత జాతిని ఉద్ధరించి, స్వతంత్ర భారతమును రూపొందజేసి, భారతజాతి జనకుడుగ సంభావితుడైన యుగపురుషుడు; సత్యాహింసలను జీవితమూల సూత్రములుగ గ్రహించిన తాత్త్వికుడు; 46. సుభాష్ చంద్రబోస్ (1887-1945) : స్వాతంత్ర్య సంగ్రామ సేనాని. ద్వితీయ ప్రపంచ యుద్ధకాలమున, ప్రాచ్య ఆసియా యందలి భారతీయులను, అక్షరాజ్య సేనలకు పట్టువడిన భారతీయ సైనికులను సంఘటితపరచి అజాద్ హింద్ ఫౌజ్‌ను సంస్థాపించి, సామ్రాజ్య సేనలను ఎదిరించి భారత స్వాతంత్ర్యమునకై సంగ్రామమును సాగించిన వీరుడు; నేతాజీ అనునది ఇతని ఉపనామము; 47. అబుల్ కలాం అజాద్ (1888-1958) : జీవితమును అంతటిని హిందూ-ముస్లిం సామరస్యమునకై ధారవోసిన మహాపండితుడు; ఇస్లామిక తాత్త్వికుడు; 48. రాజేంద్ర ప్రసాద్ (1884-1963) స్వతంత్ర భారత ప్రభుత్వపు ప్రథమ రాష్ట్రపతి; సచ్ఛీలతకు, త్యాగనిరతికి, పాండితికి పేరొందిన నిరాడంబరుడు; 49 పండిత జవహర్‌లాల్ నెహ్రూ(1889-1964): స్వాతంత్ర్యసంగ్రామ యోధుడు; స్వతంత్ర భారత ప్రభుత్వమున తొలుతటి ప్రధాని (1947-64); నవ్యభారతమున ప్రణాళికలమూలమున సుస్థిరపు పునాదులను నిర్మింపజేసిన పరిపాలనా దక్షుడు; 50 రాధాకృష్ణ, సర్వేపల్లి (1887-1975): తత్త్వశాస్త్ర పండితుడు, ఉదార భావుకుడు, భారత గణరాజ్యపుద్వితీయ అధ్యక్షుడు; 51. జయప్రకాశ్ నారాయణ్ (జ. 1902) : స్వాతంత్ర్యయోధుడు, భారతదేశమున సోషలిస్ట్ భావముల వ్యాప్తికి కారణభూతుడగు నాయకుడు, సర్వోదయవాది, అధికారమును దేనిని ఆసించక శీలమే బలముగ సమగ్ర విప్లవమునకై కృషి చేయుచున్న త్యాగమూర్తి.

## 14. రాష్ట్ర, కేంద్రపాలిత ప్రాంతములు

భారత గణరాజ్యమున అంతర్భాగములుగ ఉన్న 22 రాష్ట్రములను, 9 కేంద్రపాలిత ప్రాంతములను గురించిన కొన్ని ముఖ్య విషయములు అతి సంక్షిప్తరీతిలో ఆద్యక్షర వర్ణక్రమమున తరువాతి పుటలందు ఈయబడినవి. అందలి సంఖ్యా వివరములు, వేరుగ పేర్కొనబడనిచోట, 1971 లెక్కలవి. పాఠశాలల వివరములు 1973-74వి.

రాష్ట్రములు :

# 1. అస్సాం

వైశాల్యము:78,523; జనసంఖ్య :1,46,25,152; జనసాంద్రత : చ. కిమీ.కు 186; అక్షరాస్యత : 28.1 శాతము; ముఖ్యనగరం: దిస్‌పూర్; ప్రధాన భాషలు: అస్సామీ, బెంగాలీ; నదులు: బ్రహ్మపుత్రా నది, దాని ఉపనదులు, సువన్‌శ్రీ, భరేలీ, ధనసిరి, మానస్; జిల్లాల సంఖ్య : 9 : గ్రామముల సంఖ్య 21,995 (ఇందు 1,106 జనావాస రహితములు); ప్రయిమరీ పాఠశాలలు 48,737 (విద్యార్థులు 48,56,000); ఉన్నత పాఠశాలలు 4014 (విద్యార్థి సంఖ్య 8,35,000).




**జిల్లాలు**

| | జిల్లా | వైశాల్యం చ. కి.మీ. | జనసంఖ్య | ముఖ్యనగరం |
|---|---|---|---|---|
| 1. | సచార్ | 6,962 | 17,13,318 | సిల్చార్ |
| 2. | దర్రాంగ్ | 8,775 | 17,36,188 | తేజ్‌పూర్ |
| 3. | గోల్‌పారా | 10,359 | 22,25,103 | ధుబ్రి |
| 4. | కామరూప్ | 9,863 | 28,54,183 | గౌహతి |
| 5. | మికిర్‌హిల్స్ | 10,332 | 3,79,310 | దీఫూ |
| 6. | నార్త్ సచార్ హిల్స్ | 4,890 | 76,047 | హాఫ్‌లాంగ్ |
| 7. | నవగాంగ్ | 5,561 | 16,80,895 | నవగాంగ్ |
| 8. | శిబ్‌సాగర్ | 8,989 | 18,37,389 | జోర్‌హట్ |
| 9. | లఖింపూర్-డిబ్రుగర్ | 12,792 | 21,22,719 | లఖింపూర్, డిబ్రుగర్ |

*ప్రముఖ నగరములు: వాని జనసంఖ్యలు :* గౌహతి (1,46,025) డిబ్రుగర్ (80,348), జోర్‌హట్ (70,674), నవగాంగ్ (52,537).

*వ్యవసాయము :* రాష్ట్ర వైశాల్యమున సాగగు భూమి 2,335 వేల హె ; ఆ భూమిలో 70%న ఆహారపు పంటలు పండింపబడుచున్నవి. వానిలో ప్రముఖము వరిపంట. రొక్కపు పంటలలో జనుము, తేయాకు, నూనెగింజలు, ప్రత్తి, చక్కెరచెరకు, ఉరలగడ్డలు, పండ్లు పేర్కొనదగినవి. రాష్ట్రవైశాల్యమున 27% అటవీమయము; అందలి ఉత్పత్తులలో కలప, వెదురు, పేము, మూలికలు, లక్క, జమ్ము, ఏనుగు దంతాలు గణనీయములు.

*నీటిపారుదల, విద్యుత్ ఉత్పత్తి:* నీటిపారుదల 116,000 హెక్టేరులకు కలదు. విద్యుత్‌ను జనింపజేయుటకు ప్రకృతిసిద్ధముగ పలు సౌకర్యములు ఇటకలవు; దాదాపు 1.2 కోట్ల కి.వా. ఉత్పత్తికి అవకాశము కలదని అంచనా; ప్రస్తుతమున ఉమియం ప్రాజెక్టు వలన దాదాపు 50 వేల

కి. వా. జలవిద్యుత్తును; నామరూప్, గౌహాతీల లోని తెర్మల్ స్టేషనుల వలన 1,15,000 కివా. తాపవిద్యుత్తును ఉత్పత్తి అగుచున్నవి.

*ఖనిజ సంపద :* విశేష ఖనిజ సంపత్తి కలదు. పెట్రోలు ఉత్పత్తిలో ఈ రాష్ట్రమునకు అగ్ర స్థానము కలదు; తక్కినవానిలో రాక్షసిబొగ్గు, సున్నపురాయి, కోలమైట్, కొరండం, ఇంధనపు వాయువు లెక్కింపదగినవి.

*పరిశ్రమలు :* తేయాకును ఆశ్రయించి దాదాపు 750 సంస్థలు కలవు; పెట్రోలియంకు సంబంధించిన పరిశ్రమ ప్రముఖము; రెండు రిఫైనరీలు కలవు. చేనేత పరిశ్రమ, పట్టుపరిశ్రమ, వెదురు పని చెప్పదగిన కుటీరపరిశ్రమలు,

*విశ్వవిద్యాలయములు :* మూడు విశ్వవిద్యాలయములు కలవు. అవి : అస్సాం అగ్రికల్చరల్ యూనివర్సిటీ, జోర్‌హట్; గౌహతి యూనివర్సిటీ, గౌహతి; డిబ్రుగర్ యూనివర్సిటీ, డిబ్రుగర్.

*దర్శనీయ స్థలములు :* కాజీరంగా జంతుశరణ్యము.

*పరిపాలన :* శాసన నిర్మాణమునకై విధాన సభ కలదు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

---

# 2. ఆంధ్రప్రదేశ్




వైశాల్యము : 2,76,814 చ. కిమీ; జనసంఖ్య: 4,35,02,708; జనసాంద్రత : చ.కిమీ.కు 157; అక్షరాస్యత 24.56 శాతం; ముఖ్యనగరము : హైదరాబాదు; ప్రధానభాష : తెలుగు; ఇతర ముఖ్య భాష : ఉర్దూ; నదులు : గోదావరి, కృష్ణ ప్రముఖములు, తక్కిన వానిలో తుంగభద్ర, పెన్న. వంశధార, నాగావళి, ముసి, మంజీరా, చిత్రావతి పేర్కొనదగినవి; జిల్లాలు 21, తాలూకాలు 295; పట్టణములు 207; గ్రామసంఖ్య : 27,084; ప్రయిమరీ పాఠశాలలు 40,727 (విద్యార్థులు 40,35,000), ఉన్నత పాఠశాలలు 3,259 (విద్యార్థులు 11,00,000).

**జిల్లాలు :**

| జిల్లా. | వైశాల్యము చ. కి మీ. | జనసంఖ్య. | ముఖ్యనగరము. |
|---|---|---|---|
| 1. అనంతపురం | 19,125 | 21,15,321 | అనంతపురం |
| 2. ఆదిలాబాద్ | 16,133 | 12,88,348 | ఆదిలాబాద్ |
| 3. కడప | 15,356 | 15,77,267 | కడప |
| 4. కరీంనగరు | 11,824 | 19,63,928 | కరీంనగరు |

| జిల్లా. | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య. | ముఖ్యనగరము. |
|---|---|---|---|
| 5. కర్నూలు | 18,799 | 19,82,090 | కర్నూలు |
| 6. కృష్ణా | 8,734 | 24,93,574 | మచిలీపట్నం |
| 7. ఖమ్మం | 15,872 | 13,69,892 | ఖమ్మం |
| 8. గుంటూరు | 11,377 | 28,44,488 | గుంటూరు |
| 9. గోదావరి, తూర్పు | 10,970 | 30,87,262 | కాకినాడ |
| 10. గోదావరి, పశ్చిమ | 7,744 | 23,74,306 | ఏలూరు |
| 11. చిత్తూరు | 15,763 | 22,85,536 | చిత్తూరు |
| 12. నల్లగొండ | 14,242 | 18,19,738 | నల్లగొండ |
| 13. నిజామాబాదు | 7,969 | 13,13,268 | నిజామాబాదు |
| 14. నెల్లూరు | 13,058 | 16,09,617 | నెల్లూరు |
| 15. ప్రకాశం | 17,620 | 19,19,995 | ఒంగోలు |
| 16. మహబూబ్‌నగర్ | 18,419 | 19,32,082 | మహబూబ్‌నగర్ |
| 17. మెదక్ | 9,685 | 14,67,944 | సంగారెడ్డి |
| 18. వరంగల్ | 12,875 | 18,70,333 | వరంగల్ |
| 19. విశాఖపట్టణం | 13,799 | 28,05,366 | విశాఖపట్టణం |
| 20. శ్రీకాకుళం | 9,743 | 25,89,991 | శ్రీకాకుళం |
| 21. హైదరాబాదు | 7,707 | 27,91,762 | హైదరాబాదు |

*ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు:* హైదరాబాదు (17,96,339); విజయవాడ (3,17.258); గుంటూరు (2,69,991); విశాఖపట్టణం (3,55,045); వరంగల్ (2,07 520); రాజమండ్రి (1,65,912); కాకినాడ (1,64,200) కర్నూలు (1,36,710); నెల్లూరు (1,33,590); ఏలూరు (1,27,023);నిజామాబాదు (1,15,640); తెనాలి (1,20,937).

*వ్యవసాయము :* ఈ రాష్ట్రమున 70 శాతము ప్రజలకు వ్యవసాయమే ముఖ్యాధారవృత్తి. సాగున ఉన్న 11,078 వేల హెక్టేరులలో 31 శాతమునకు నీటిపారుదల వసతి కలదు. ఆహారధాన్యముల ఉత్పత్తిని – అందును ముఖ్యముగ వరిపంటను– తన అవసరమునకు మించి ఈ రాష్ట్రము సాధించినది. పొగాకు పంటలో దేశమున ప్రథమ స్థానమును ఆక్రమించినది; దేశపు వర్జీనియా పొగాకున 95% ఇచట పండుచున్నది. దేశపు మిరప పంటలో 31 శాతం, నూనెగింజలలో 20 శాతము, ఆముదపుగింజల పంటలో 46 శాతము, ఇచట పండుచున్నవి. అటవీ వైశాల్యము 61.17 లక్షల హెక్టేరులు; అనగా 22.3 శాతపు భూమిలో అడవులున్నవి. అటవీ ఉత్పత్తులలో కలప, వంట చెరకు, కర్రబొగ్గు, వెదురు, బీడీలఆకు, గంధపు చెక్క, ఎర్రచందనపు కొయ్య ప్రముఖములు.

*నీటిపారుదల, విద్యుత్ ఉత్పత్తి:* గత 25 సంవత్సరములలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు, ప్రకాశం బారేజి, తుంగభద్ర దిగువ కాలువ, కర్నూలు-కడప కాలువ, కడం ప్రాజెక్టు, రాంపేరు మురుగునీటి పథకము, ఎగువ పెన్నార్ ప్రాజెక్టులును, ఇంకను పెక్కు మధ్యతరగతి ప్రాజెక్టులును అమలులోనికి వచ్చినవి. మాచ్‌ఖండ్, ఎగువ సీలేరు, నిజాంసాగర్ హైడెల్ పవరు స్కీముల వలనను: నెల్లూరు, రామగుండం, కొత్తగూడెం తెర్మల్ స్టేషనుల వలనను విద్యుత్పత్తి సాగుచున్నది. రాష్ట్ర ప్రముఖ జలవిద్యుత్తు స్థావరముగా పేరొందనున్న శ్రీశైలం జలవిద్యుత్ ప్రాజెక్టు నిర్మాణమున ఉన్నది. 1974 అంతమునకు మొత్తపు విద్యుత్పత్తి సామర్థ్యము 887.9 మెగావాట్లు.

*ఖనిజసంపద:* ఖనిజసంపత్తిలో దేశపు రాష్ట్రములందు నాలుగవ స్థానము ఈ రాష్ట్రమునకు కలదు. అందు రాక్షసిబొగ్గు, ముడిమాంగనీసు, రాతినార, బెరైట్లు, అభ్రకం, ముడిఇనుము, సున్నపురాయి ప్రముఖములు. గుంటూరు జిల్లాలోని అగ్నిగుండాలలో రాగి గనులును, అనంతపురం జిల్లాలో బంగారపు గనులును ఉన్నటుల కొలదికాలము క్రిందట పరిశీలనల వలన తెలిసినది. ఖనిజములన్నింటి ఉత్పత్తిలో రాక్షసిబొగ్గుది అగ్రస్థానము. బీహారు, పశ్చిమ బెంగాలు, మధ్యప్రదేశ్ తరువాత ఈ రాష్ట్రమే రాక్షసిబొగ్గు ఉత్పత్తిలో లెక్కకు వచ్చుచున్నది.

*పరిశ్రమలు :* పారిశ్రామికముగ రాష్ట్రము చాల వెనుకబడియున్నది; ప్రస్తుతమున ఆ రంగమున అభివృద్ధిని సాధించుటకై కృషి జరుగుచున్నది. యంత్రపరికరాలు, సంయోజిత ఔషధములు, ఎరువులు, కాగితము, ఎలక్ట్రానిక్ పరికరములు, భారీ విద్యుత్ యంత్రసామాగ్రి, మందులు, విమాన భాగములు, ఓడలు అనువానికి సంబంధించిన పరిశ్రమలు కలవు. వీనిలో అనేకములు హైదరాబాదు, విశాఖపట్టణములలోనే ఉన్నవి. వ్యావసాయి కోత్పత్తులను-బియ్యము, పొగాకు వంటి వానిని - ఆశ్రయించిన పరిశ్రమల వలన వచ్చు ఉత్పత్తి, మొత్తపు పారిశ్రామిక ఉత్పత్తిలో మూడవ వంతు ఆక్రమించియున్నది. చేనేత పరిశ్రమ కుటీర పరిశ్రమలలో ప్రముఖము. బీడీ పని, ఫిల్‌గ్రీపని, తివాచీలనేత, అద్దకం, బొమ్మల తయారీలు కొందరికి జీవనాధారములు. ఈ రాష్ట్రపు కొండపల్లి బొమ్మలును, నిర్మల్ చేతి పనులును విపులఖ్యాతిని ఆర్జించినవి.

*విశ్వవిద్యాలయములు :* ఇట 7 విశ్వవిద్యాలయములు కలవు. అవి : 1. అగ్రికల్చరల్ యూనివర్సిటీ, రాజేంద్రనగర్, హైదరాబాదు; 2. జవహర్‌లాల్‌నెహ్రూ టెక్నికల్ యూనివర్సిటీ, హైదరాబాదు; 3. సెంట్రల్ యూనివర్సిటీ, హైదరాబాదు; 4. ఆంధ్ర విశ్వ విద్యాలయం, విశాఖపట్టణం; 5. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం, తిరుపతి; 6. కాకతీయ విశ్వ విద్యాలయం, వరంగల్; 7. నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు. 8. ఉస్మానియా విశ్వవిద్యాలయము,

*దర్శనీయ స్థలములు :* తిరుపతి, భద్రాచలం, శ్రీశైలం, హైదరాబాదు (చార్మినార్, సాలార్ జంగ్ మ్యూజియం, హుస్సేన్‌సాగర్, చౌమహల్లా, మక్కామసీదు, ఫలక్‌నుమా), గోల్కొండ, వరంగల్, రామప్పదేవాలయము, నాగార్జునసాగర్, విశాఖపట్టణం, విజయవాడ, లేపాక్షి.

*పరిపాలన :* శాసన నిర్మాణమునకై విధానసభ, విధాన పరిషత్తులు కలవు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

# 3. ఉత్తరప్రదేశ్

వైశాల్యము : 2,94,413 చ. కిమీ.; జనసంఖ్య : 8,83,41,144; జనసాంద్రత : చ.కిమీ. కు 300; అక్షరాస్యత : 21.70 శాతము; ముఖ్య నగరము: లక్నో; ప్రధాన భాష : హిందీ ; ఇతర ప్రముఖ భాష : ఉర్దూ ; నదులు : గంగా, యమునా, రామగంగా, గోమతి, ఘఘరా, గైహోల్, జోక్‌నాయ్, సాయ్, ఖోహ్, దోజోరా, కోసి, ఖాక్రా, గర్రా; జిల్లాల సంఖ్య : 54; తహశీళ్ళ సంఖ్య : 231; పట్టణముల సంఖ్య : 293; గ్రామసంఖ్య1,12,561; ప్రయిమరీ పాఠశాలలు : 62,846 (విద్యార్థులు 1,19,12,000); ఉన్నత పాఠశాలలు : 3793 (విద్యార్థులు 11,93,000).




**జిల్లాలు†**

| జిల్లా | వైశాల్యము చ. కి మీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. ఆగ్రా | 4,816 | 23,08,638 | ఆగ్రా |
| 2. ఆలీఘడ్ | 50,24 | 21,11,829 | ఆలీఘడ్ |
| 3. అలహాబాదు | 7,255 | 29,37,278 | అలహాబాదు |
| 4. ఆల్‌మోరా | 7,023 | 7,50,038 | ఆల్‌మోరా |
| 5. అజాంగడ్ | 5,744 | 28,57,484 | అజాంగడ్ |
| 6. బారైచ్ | 6,871, | 17,26,972 | బారైచ్ |
| 7. బల్లియా | 3,183 | 15,88,935 | బల్లియా |
| 8. బందా | 7,645 | 11,82,215 | బందా |
| 9. బారాబంకి | 4,422 | 16,35,593 | బారాబంకి |
| 10. బెరెలీ | 4,125 | 17,79,867 | బెరెలీ |
| 11. బస్తీ | 7,309 | 29,84,090 | బస్తీ |
| 12. బిజ్నూర్ | 4,852 | 14,90,185 | బిజ్నూర్ |
| 13. బుదౌన్ | 5,168 | 16,45,967 | బుదౌన్ |
| 14. బులంద్‌షహర్ | 4,895 | 20,73,343 | బులంద్‌షహర్ |
| 15. చమోలీ | 9,125 | 2,92,571 | చమోలీ |

† పట్టిక యందలి వరుస సంఖ్యలు దేశపటపు వరుస సంఖ్యలతో సరిపోవును.

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 16. డెహ్రాడూన్ | 3,088 | 5,77,306 | డెహ్రాడూన్ |
| 17. డియోరియా | 5,400 | 29,12,350 | దియోరియా |
| 18. ఈటా | 4,449 | 15,17,925 | ఈటా |
| 19. ఎటావా | 4,327 | 14,47,702 | ఎటావా |
| 20. ఫైజాబాద్ | 4,427 | 19,27,281 | ఫైజాబాద్ |
| 21. ఫరూకాబాద్ | 4,349 | 15,56.930 | ఫతేఘర్ |
| 22, ఫతేపూర్ | 4,168 | 12,78,254 | ఫతేపూర్ |
| 23. గర్వాల్ | 5,440 | 5,53,028 | పౌరీ |
| 24. ఘాజీపూర్ | 3,381 | 15,31,654 | ఘాజీపూర్ |
| 25. గోండా | 7,331 | 23,02,029 | గోండా |
| 26. గోరఖ్‌పూర్ | 6,316 | 30,38,177 | గోరఖ్‌పూర్ |
| 27. హమీర్‌పూర్ | 7,192 | 9,88,215 | హమీర్‌పూర్ |
| 28. హర్‌దోల్ | 6,012 | 18,49,519 | హర్‌దోల్ |
| 29. జలౌన్ | 4,549 | 8,13,490 | ఓరాయ్ |
| 30. జాన్‌పూర్ | 4,040 | 29,05,434 | జాన్‌పూర్ |
| 31. ఝాన్సీ | 10,069 | 13,07,058 | ఝాన్సీ |
| 32. కాన్పూర్ | 6,121 | 29,96,232 | కాన్పూర్ |
| 33. ఖేరి | 7,691 | 14,86,590 | లఖింపూర్ |
| 34. లక్నో | 2,528 | 16,17,846 | లక్నో |
| 35. మైన్‌పురి | 4,254 | 14,45,534 | మైన్‌పురి |
| 36. మథుర | 3,794 | 12,90,307 | మథుర |
| 37. మీరట్ | 5,944 | 33,66,953 | మీరట్ |
| 38. మీర్జాపూర్ | 11,301 | 15,41,088 | మీర్జాపూర్ |
| 39, మొరాదాబాద్ | 5,946 | 24,28,971 | మొరాదాబాద్ |
| 40. ముజఫర్‌నగర్ | 4,245 | 18,02,289 | ముజఫర్‌నగర్ |
| 41. నైనిటాల్ | 6,792 | 7,09,080 | నైనిటాల్ |
| 42. ఫిలిభిట్ | 3,504 | 7,52,114 | ఫిలిభిట్ |
| 43. పితోర్‌గడ్ | 7,217 | 3,13,747 | పితోర్‌గడ్ |
| 44. ప్రతాపగడ్ | 3,730 | 14,22,207 | బేలా |
| 45. రాయ్ బరేలీ | 4,603 | 15,10,812 | రాయ్ బరేలీ |
| 46. రాంపూర్ | 2,372 | 9,01,209 | రాంపూర్ |
| 47. సహరన్‌పూర్ | 5,526 | 20,54,834 | సహరన్‌పూర్ |

| | జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|---|
| 48. | షాజహాన్‌పూర్ | 4,581 | 12,86,104 | షాజహాన్‌పూర్ |
| 49. | సీతాపూర్ | 5,738 | 18,84,400 | సీతాపూర్ |
| 50. | సుల్తాన్‌పూర్ | 4,424 | 12,42.928 | సుల్తాన్‌పూర్ |
| 51. | తేరీగర్వాల్ | 4,421 | 3,97,385 | నరేంద్రనగర్ |
| 52. | ఉన్నావ్ | 4,586 | 14,84,393 | ఉన్నావ్ |
| 53. | ఉత్తరకాశి | 8,016 | 1,47 805 | ఉత్తరాకాశి |
| 54. | వారణాసి | 5,019 | 28,52,459 | వారణాసి |

*ప్రముఖ నగరములు, వాని జన సంఖ్యలు :* కాన్పూరు (11,54,388); లక్నో (7,49,299); వారణాసి (5,83,356); ఆగ్రా (5,91,917); అలహాబాద్ (4,90,622); మీరట్ (2,70,993); బెరైలీ (2,96 248); మొరాదాబాద్ (2,58,590); అలీఘడ్ (2,52,314); గోరఖ్ పూర్ (2,30,918); సహరన్‌పూర్ (2,25,396); డెహ్రాడూన్ (1,66,073); ఝాన్సీ (1,73,292); రాంపూర్ (1, 61, 417); షాజహాన్‌పూర్ (1, 35, 604); మథుర (1,32,028); ఫిరోజాబాద్ (1,33,863); ఘాజియాబాద్ (1,18,836); ముజఫర్‌నగర్ (1, 14, 783); అయోధ్య (1,02,835);

**వ్యవసాయము మొ. :** దేశమున గోధుమ, మొక్కజొన్న, బార్లీ, పప్పుధాన్యములు, చక్కెర చెరకు, ఉరలగడ్డల ఉత్పత్తిలో ఈ రాష్ట్రమునకు అగ్రస్థానము కలదు. ఆహార పంటలలో 37% గోధుమ ఆక్రమించుచున్నది. దేశపు గోదుమ పంటలో దాదాపు మూడవవంతు ఇట పండు చున్నది. మొత్తము మీద దేశపు ఆహారధాన్యము లలో 18% ఇచట పండుచున్నదని చెప్పవచ్చును. రొక్కపు పంటలలో చక్కెర చెరకు ప్రముఖము; అందు దేశపు పంటలో అయిదింట రెండు భాగములు ఈ రాష్ట్రమున సాగగుచున్నది; ఇక ఆవాలు, కుసుమలు, అవిసెగింజలు, నూవులు విషయమున ఈ ప్రాంతము ప్రముఖ స్థానమున ఉన్నది. మొత్తపు సాగుబడినేల 17,194 వేల హె. ఇచటి సహజ సంపత్తిలో అడవులు ముఖ్యముగ పేర్కొనదగినవి; వాని వైశాల్యము 4,952 వేల హె, అయినను వీనిని విరివిగ ఉపయోగించుకొనుటకై ఇంకను కృషిచేయవలసి ఉన్నది.

*నీటిపారుదల, విద్యుత్పత్తి :* నీటి పారుదల సౌకర్యము. సాగుబడి భూమిలో 36 శాతమునకు కలదు. అందు సగమునకుపైగా బావులక్రిందను, అయిదింట రెండు భాగములు కాలువల క్రిందను, 5 శాతము చెరువుల వలనను సాగుచున్నది. ఓబ్రా, రిహండ్, యమునా జలవిద్యుత్ సంస్థలును; కాన్పూర్, ఓబ్రా, హర్‌దయాల్‌గంజ్ తాపవిద్యుత్ సంస్థలును మొత్తము మీద 1,680 మెవా. సామర్థ్యము కలిగి ఉన్నవి (1973). నరోరావద్ద అణవిక విద్యుత్‌కేంద్రమును, కోటవద్ద ఒక సూపర్ తెర్మల్ కేంద్రమును నిర్మాణమున ఉన్నవి.

*ఖనిజ సంపద :* రాష్ట్రమున ఖనిజ సంపత్తి, తెలియవచ్చినంతవరకు, చాల తక్కువ. కాని కట్టుబడిరాయి, ఇటుకకు అనువగు మట్టి, కంకర మొదలగునవి మాత్రము విరివిగ లభించుచున్నవి

*పరిశ్రమలు :* చక్కెర ఉత్పత్తి ఒక ముఖ్య పరిశ్రమ. కుటీర పరిశ్రమలలో గణనీయము చేనేత పరిశ్రమ. ప్రభుత్వరంగమున కొన్ని ముఖ్య పరిశ్రమలు – హరిద్వార్‌వద్ద భారీ విద్యుత్పరికర సంస్థ, హృషీకేశ్‌వద్ద ఓషదీ సంస్థ, వారణాసి

వద్ద లోకోమోటివ్ ఫేక్టరీ, గోరఖ్‌పూర్‌వద్ద ఎరువుల పేక్టరీ, లక్నోవద్ధ హిందూస్థాన్ ఏరోనాటిక్స్ మొ.-స్థాపింపబడి పనిచేయుచున్నవి.

*విశ్వవిద్యాలయములు :* 1. ఆగ్రా యూనివర్సిటీ, ఆగ్రా; 2. అలీఘడ్ ముస్లిం యూనివర్సిటీ, అలీఘడ్; 3. అలహాబాద్ యూనివర్సిటీ, అలహాబాద్: 4. బెనారస్ హిందూ యూనివర్సిటీ, వారణాసి; 5. గోరఖ్‌పూర్ యూనివర్సిటీ, గోరఖ్‌పూర్; 6. కాన్పూర్ యూనివర్సిటీ, కాన్పూర్; 7. లక్నో యూనివర్సిటీ, లక్నో; 8. మీరట్ యూనివర్సిటీ, మీరట్; 9. రూర్‌కీ యూనివర్సిటీ, రూర్కీ; 10. అగ్రికల్చరల్ యూనివర్సిటీ, పంత్ నగర్, నైనిటాల్; 11. వారాణసీయ సంస్కృత విశ్వవిద్యాలయం, వారణాసి.

*దర్శనీయ స్థలములు :* అలహాబాద్, ఆగ్రా, ఆల్‌మోరా, బృందావన్, ఫతేపూర్ సిక్రీ, హరిద్వార్, లక్నో, మధుర, ముస్సోరి, వారణాసి.

*పరిపాలన :* శాసన నిర్మాణమునకై విధాన సభయు, విధాన పరిషత్తును కలవు. కార్య నిర్వాహణాధికారము గవర్నరునందు కలదు.

---

# 4. ఒరిస్సా




**వైశాల్యము :** 1,55,782 చ, కి.మీ.; జనసంఖ్య 2,19,44,615; జనసాంద్రత : చ.కిమీ.కు 141; అక్షరాస్యత : 26.18 శాతము; ముఖ్యనగరము: భువనేశ్వర్; ప్రధాన భాష: ఒరియా; ఇతర ముఖ్యభాషలు: తెలుగు, బెంగాలీ; నదులు: మహానది, సీలేరు, శబరి, ఋషికుల్య, సువర్ణరేఖ, వైతరణి, బ్రాహ్మణి, ఇంద్రావతి, బుధవలంగ. జిల్లాలు : 13; సబ్ డివిజనులు 56; పట్టణములు 81; గ్రామ సంఖ్య: 46,992; ప్రయిమరీ పాఠశాలలు : 32,106; ఉన్నత పాఠశాలలు 1,867.

### జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరం |
|---|---|---|---|
| 1. కటక్ | 11,211 | 38,27,678 | కటక్ |
| 2. కాలహంది | 11,835 | 11,63,869 | భవానీపట్న |
| 3. కెవంజార్ | 8,240 | 9,55,514 | కెవంజార్ |
| 4. కోరాపుట్ | 26,960 | 20,43,281 | కోరాపుట్ |
| 5. గంజామ్ | 12,527 | 22,93,808 | ఛత్రపూర్ |
| 6. ఢెంకనాల్ | 10,826 | 12,93,914 | ఢెంకనాల్ |
| 7. పూరి | 10,159 | 23,40,859 | పూరి |

| జిల్లా | వైశాల్యము చ.కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 8. బాలసోర్ | 6,394 | 18,30,504 | బాలసోర్ |
| 9. బోలంగిర్ | 8,903 | 12,63,657 | బోలంగిర్ |
| 10. బౌధ్‌ఖోండ్ మాల్ | 11,070 | 6,21,675 | ఫుల్‌బాని |
| 11. మయూర్‌భంజ్ | 10,412 | 14,34,200 | బారిపాదా |
| 12. సంబల్‌పూర్ | 17,570 | 18,44,898 | సంబల్‌పూర్ |
| 13. సుందరగడ్ | 9,675 | 10,30,758 | సుందరగడ్ |

**ప్రముఖ నగరములు, వాని జన సంఖ్యలు :** కటక్ (2,05,750); రూర్‌కేలా (1,72,502); బరంపూర్ ( 1, 17, 662 ); భువనేశ్వర్ (1,05,491); సంబల్‌పూర్ (1,05,085).

**వ్యవసాయము మొ. :** రాష్ట్రపు ప్రజలలో 90% పల్లెలందు వసించి వ్యవసాయముపై ఆధారపడి ఉన్నారు. పంటలలో వరిపంట ప్రముఖము; దేశపు వరిపంటలో పదవవంతు ఇట ఉత్పత్తి అగుచున్నది; తక్కిన వానిలో పప్పుగింజలు, నూనెగింజలు, జనుము, మెస్తా, చక్కెర చెరకు, కొబ్బరి, పసుపు పేర్కొనదగినవి. సాగుబడినేల వైశాల్యము 56.22 లక్షల హెక్టేరులు; అటవీభూమి రాష్ట్రమున 43 శాతమును ఆక్రమించినది; దాని వైశాల్యము 67.46 లక్షల హెక్టేరులు; అడవి ఉత్పత్తులలో కెందు ఆకుల వ్యాపారము జాతీయము చేయబడినది.

**నీటి పారుదల, విద్యుత్ సౌకర్యములు :** 13.90 లక్షల హెక్టేరులకు నీటి పారుదల వసతులు కలవు. హీరాకుడ్, ఋషికుల్యా, శబరీ ప్రాజెక్టులు నీటి పారుదల వసతులలో ప్రముఖము. హీరాకుడ్, బలిమెల, మాచ్‌ఖండ్‌ల నుండి జలవిద్యుత్తు, తలచేర్ కేంద్రమునుండి తాప విద్యుత్తు లభించుచున్నవి. విద్యుదుత్పత్తి సమర్థత 674 మెవా.(1974).

**ఖనిజ సంపద :** దేశపు రాష్ట్రము లన్నింటిలోను ఖనిజ సంపత్తికి ఒరిస్సా ప్రముఖమని పేరొందినది. లభించు ఖనిజములందు అన్నింట ముడిఇనుము ప్రముఖము; భూగర్భమున మొత్తము మీద 300 కోట్ల టన్నుల ముడిఇనుము కలదని అంచనా; అటులే దాదాపు 900 కోట్ల టన్నుల రాక్షసి బొగ్గును కలదని తెలియుచున్నది. మాంగనీజు, నికెల్, మాగ్నసైట్ మొదలగునవి అల్ప ప్రమాణములలో కలవు.

**పరిశ్రమలు :** 1960 మొదలుగ రాష్ట్రము పారిశ్రామికముగ చాలా పురోగమించినది. ఖనిజసాధన ఒక ముఖ్య పరిశ్రమ; పారిశ్రామిక సంస్థలలో రూర్‌కేలాలోని ఉక్కుఫేక్టరీ, బర్‌బిల్‌వద్ద ఉన్న దుక్క ఇనుముఫేక్టరీ, హీరాకుడ్‌వద్దనున్న అల్యూమినియంఫేక్టరీ చెప్పదగినవి; మధ్య తరగతి పరిశ్రమలు రాష్ట్రమున విరివిగ కలవు.

**విశ్వవిద్యాలయములు :** 1. బరంపూర్ యూనివర్సిటీ, బరంపూర్; 2. ఉత్కల్ యూనివర్సిటీ, భువనేశ్వర్; 3. సంబల్‌పూర్ యూనివర్సిటీ సంబల్‌పూర్; యూనివర్సిటీ ఆఫ్ అగ్రికల్చర్ అండ్ టెక్నాలజీ, భువనేశ్వర్.

**దర్శనీయ స్థలములు:** భువనేశ్వర్, కోణార్క, పూరి, చిలుక సరస్సు.

**పరిపాలన :** శాసన నిర్మాణమునకు విధానసభ కలదు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

# 5. కర్ణాటక




**వైశాల్యము**: 1,91,773 చ. మీ.; జనసంఖ్య 2,92,99,014; జనసాంద్రత : చ.కిమీ.కు 153; అక్షరాస్యత : 31.52 శాతము; ముఖ్యనగరము : బెంగుళూరు; ప్రధానభాష: కన్నడము; ఇతర గణనీయ భాషలు : తెలుగు, తమిళము, మళయాళము; నదులు: కృష్ణ, కావేరి, తుంగభద్ర, ఘటప్రభ, హేమవతి; శరావతి, సువర్ణవతి, హగరి, అర్కవతి, లోకపావని, స్వర్ణనది, మాలప్రభ, సీతానది, భీమానది; జిల్లాల సంఖ్య : 19; గ్రామసంఖ్య 29,533. ప్రయిమరీ పాఠశాలలు : 32,452 (విద్యార్థులు 42,96,590); ఉన్నత పాఠశాలలు (విద్యార్థి సంఖ్య 4,80,000).

## జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరం |
|---|---|---|---|
| 1. కూర్గ్ | 4,104 | 3,78,291 | మెర్కారా |
| 2. కెనరా, ఉత్తర | 10,276 | 8,49,105 | కార్వార్ |
| 3. కెనరా, దక్షిణ | 8,441 | 19,39,315 | మంగళూర్ |
| 4. కోలార్ | 8,223 | 15,16,646 | కోలార్ |
| 5. గుల్బర్గా | 16,224 | 17,39,220 | గుల్బర్గా |
| 6. చిక్‌మాగలూర్ | 7,199 | 7,36,647 | చిక్‌మాగలూర్ |
| 7. చిత్రదుర్గ | 10,852 | 13,97,456 | చిత్రదుర్గ |
| 8. తుమ్‌కూర్ | 10,606 | 16,27,721 | తుమ్‌కూర్ |
| 9. ధార్వార్ | 13,749 | 23,42,213 | ధార్వార్ |
| 10. బళ్లారి | 9,808 | 11,22,686 | బళ్ళారి |
| 11. బిజాపూర్ | 17,056 | 19,85,591 | బిజాపూర్ |
| 12. బీదర్ | 5,451 | 8,24,059 | బీదర్ |

| జిల్లాలు | వైశాల్యము చ. కి.మీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 13. బెంగుళూరు | 8,003 | 33,65,515 | బెంగుళూర్ |
| 14. బెల్గాం | 13,410 | 24,23,342 | బెల్గాం |
| 15. మాండ్యా | 4,958 | 11,54,374 | మాండ్యా |
| 16. మైసూర్ | 11,947 | 20,77,238 | మైసూర్ |
| 17. రాయచూర్ | 14,005 | 14,15,740 | రాయచూర్ |
| 18. షిమోగా | 10,548 | 13,01,485 | షిమోగా |
| 19. హస్సన్ | 6,823 | 11,02,370 | హస్సన్ |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** బెంగుళూరు ( 16,53,779 ); హుబ్లి - ధార్వార్ (3,79,166); మైసూరు ( 3,55,685 ); మంగళూరు ( 2,15,122 ); బెల్గాం ( 2,13,872 ); గుల్బర్గా (1,45,588); బళ్ళారి ( 1,25,183 ); దావనగెరె ( 1, 21, 110 ); బిజాపూర్ (1,03,931); షిమోగా (1,02,709); భద్రావతి ( 1, 01, 358 ) కోలారు గోల్డ్ ఫీల్డ్స్ (1,18,861).

**వ్యవసాయము మొ. :** రాష్ట్రము చాలవరకు వ్యావసాయిక కృషిపై ఆధారపడి ఉన్నది; సాగున ఉన్న భూమి 102 లక్షల హెక్టేరులు. ఆహారపు పంటలలో వరి, జొన్న, రాగి క్రమ ప్రాముఖ్యములను కలిగియున్నవి. దేశపు రాగి పంటలో 30% ఇచ్చట పండుచున్నది. రొక్కపు పంటలలో చక్కెర చెరకు, ప్రత్తి, నూనెగింజలు, పొగాకు, కొబ్బరి, కాఫీగింజలు, జీడిగింజలు, మిరియాలు, ద్రాక్ష, నారింజ పేర్కొనదగినవి. రాష్ట్ర వైశాల్యమున 16 శాతము అటవీమయము.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** పెక్కు నది లోయలను - అందును ముఖ్యముగా కృష్ణా, కావేరి లోయలను-ఆశ్రయించి పెక్కు నీటిపారుదల వసతులును, జల విద్యుత్ కేంద్రములును ఏర్పరుపబడినవి. నీటివసతులలో తుంగభద్ర, ఘటప్రభ, మాలప్రభ, ఎగువకృష్ణా, హరంగి, కబినీ, హేమవతీ ప్రాజెక్టులు ప్రముఖములు. విద్యుదుత్పత్తికి చెందిన వానిలో శరావతీ, శివసముద్రం, ప్రాజెక్టులు ప్రముఖములు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 947 మెవా. (1973).

**ఖనిజ సంపద :** ఆర్థికముగ ఎక్కువ విలువ గలిగిన ఖనిజసంపద కలదు. దేశపు బంగారు, వెండి ఖనిజములు మొత్తమును, ఇచటనే లభించుచున్నవని చెప్పవచ్చును. 500 టన్నుల ముడి ఇనుము, ఒక కోటి టన్నుల మాంగనీజు భూగర్భమున కలవని అంచనా. కుద్రేముఖ్‌వద్ద ఎక్కువ ఇనుపపాలుగల ముడిధాతువు లభ్యమగు చున్నది. క్రోమైట్ విషయమున ఒరిస్సాతరువాత కర్ణాటకయే లెక్కకు వచ్చుచున్నది.

**పరిశ్రమలు :** జవుళి, ఇంజనీరింగు, లోహ ఖనిజములు, ఆహార ద్రవ్యములు, పానీయములు, రసాయనములు, కాగితములకు సంబంధించిన పరిశ్రమలు కలవు. ప్రభుత్వ రంగమునకు చెందిన పెక్కు ప్రముఖ పరిశ్రమలు బెంగుళూరున, మైసూరున కలవు. దేశపు సిల్కున దాదాపు 80 శాతము ఇట ఉత్పత్తి అగుచున్నది. రాష్ట్రపు చందనతైలము, చందనపు సబ్బు సుప్రసిద్ధములు.

**విశ్వవిద్యాలయములు :** 1. బెంగుళూరు యూనివర్సిటీ, బెంగుళూరు; 2. కర్ణాటక యూనివర్సిటీ, ధార్వార్; 3. యూనివర్సిటీ ఆఫ్ అగ్రి

కల్చరల్ సయిన్‌సెస్, బెంగుళూర్; 4. యూనివర్సిటీ ఆఫ్ మైసూరు, మైసూరు; 5. ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సయిన్స్, బెంగుళూర్.

**దర్శనీయ స్థలములు :** బాదామి, బిజాపూర్, హలెబీడు, హంపి, జోగ్ జలపాతము, కోలార్, మైసూర్, నందిదుర్గ్, శ్రావణ బెల్గోలా, శ్రీరంగిపట్టణం, శివసముద్రం, బెంగుళూరు; రంగదిట్టం పక్షిశరణ్యాము; బందీపూర్ గజశరణ్యాము; నాగర్ హోల్, దండేలీలలోని జంతుశరణ్యాములు.

**పరిపాలన:** శాసన నిర్మాణమునకై విధానసభ, విధాన పరిషత్తు కలవు; గవర్నరు కార్య నిర్వాహణాధికారి.

# 6. కేరళ




**వైశాల్యము :** 38,864 చ. కిమీ.; జనసంఖ్య; 2, 13, 47, 375; జనసాంద్రత : చ.కిమీ.కు 549; **అక్షరాస్యత :** 60.42 శాతము; ముఖ్య నగరము : త్రివేంద్రం; ప్రధాన భాష :మళయాళం; ఇతరముఖ్య భాష : తమిళం. నదులు : భరతపూళ, పెరియార్, వాలపట్టణం, చలియార్, కడలుండి, చాలకుడి, పంపా, అచన్ కోయిల్, కల్లడా; జిల్లాలు: 10; తాలూకాలు : 57; గ్రామసంఖ్య : 1,332; ప్రయిమరీ పాఠశాలలు : 9,680; ఉన్నత పాఠశాలలు : 1503.

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** కొచ్చిన్ (4,39,066); త్రివేంద్రం (4,09,627); కళ్లికోట (3,33,679); అలెప్పి (1,60,166); క్విలన్ (1,24,208)

## జి ల్లా లు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. అల్లెప్పి | 1,884 | 21,25,722 | అల్లెప్పి |
| 2. ఎర్నాకుళం | 3,271 | 23,83,178 | ఎర్నాకుళం |
| 3. కన్ననూర్ | 5,706 | 23,65,164 | కన్ననూర్ |
| 4. కొట్టాయం | 6,389 | 20,85,134 | కొట్టాయం |
| 5. కొళ్లికోడు | 3,729 | 21,06,249 | కళ్లికోట |
| 6. క్విలన్ | 4,623 | 24,12,821 | క్విలన్ |
| 7. త్రిచూర్ | 3,032 | 21,28,797 | త్రిచూర్ |
| 8. త్రివేంద్రం | 2,192 | 21,98,606 | త్రివేంద్రం |
| 9. పాలఘాట్ | 4,400 | 16,85,342 | పాలఘాట్ |
| 10. మలాప్పురం | 3,638 | 18,56,363 | మలాప్పురం |

**వ్యవసాయము :** అధిక జన సాంద్రత కలిగిన ఈరాష్ట్రము, తన ఆహారావసరములలో దాదాపు 50 శాతమువరకు ఇతర ప్రాంతములపై ఆధారపడి యున్నది. సాగుబడి యందున్న నేలలో అధిక భాగము రొక్కపు పంటలకు వినియుక్తము. దేశపు రబ్బరులో 90 శాతం, లవంగములలో 60 శాతం, కొబ్బరిలో 70 శాతం, వక్కలలో 60 శాతం, మిరియాలలో 70 శాతం, కర్రపెండలమున 80 శాతం, నిమ్మగడ్డి నూనెలో దాదాపుగా అంతయును ఇట ఉత్పత్తి అగుచున్నవి. సాగున ఉన్న భూమి 2,197 వేల హె. రాష్ట్ర వైశాల్యమున 24 శాతం అటవీమయము.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** నీటిపారుదల ప్రాజెక్టులలో పెరియార్‌వేలీ, నెయ్యార్, మీన్‌కారా, కన్నెరపూళా, కుట్టియాడై, మాలంపూళా, పీచీ ప్రాజెక్టులు పేర్కొనదగినవి. విద్యుదుత్పత్తికి చెందినవానిలో పెన్నియర్, షోలయార్ , శబరిగిరి, సెంగులమ్, నెరియ మంగలమ్, ఇడుక్కి, పోరింగలకుట్ ప్రముఖములు. సాగుభూములలో 20.2 శాతమునకు నీటి పారుదల వసతులు కలవు. విపరీతమగు వర్షపాతము, వేగముగ ప్రవహించు చిన్ననదులు ఉండుటవలన విద్యుదుత్పత్తికి ఇట సౌకర్యములు విరివిగ ఏర్పడినవి. విద్యుదుత్పత్తి సామర్థ్యము 621.5 మెవా. (1973).

**ఖనిజ సంపద:** తీరప్రాంతమున ఇలయింనైట్, రుటైల్, మోనజైట్, జిర్కాన్, సిల్లిమనైట్, విలువగల మృత్తికలు, ఆలిచిప్ప, పటికశిల లభించుచున్నవి. కన్ననూరు జిల్లాలో బాక్సయిట్ నిలువలును, కొళ్లికోడ్ జిల్లాలో ముడిఇనుము నిలువలును, తోడుపూళ్లలో గ్రాఫైట్ నిలువలును, గణనీయరాసులలో కనుగొనబడినవి.

**పరిశ్రమలు :** రబ్బరు, తేయాకు, పింగాణీ, విద్యుత్ పనిముట్లు, టెలిఫోను తీగలు, ట్రాన్స్‌ఫార్మర్లు, ఇటుక, పెంకులు, రసాయనములు, ఔషధములు, సబ్బులు, నూనెలు, ఎరువులకు సంబంధించిన పరిశ్రమలు కలవు. ఎగుమతియగు వానిలో జీడిపప్పు, తేయాకు, మిరియాలు మొదలగు మసాలా ద్రవ్యములు, నిమ్మగడ్డినూనె, మత్స్య

ములు, ఎర్రచందనపు కొయ్య, కొబ్బరినార **ఉత్పత్తులు**, రబ్బరు ఉత్పత్తులు పేర్కొనదగినవి.

**విశ్వవిద్యాలయములు :** 1. కేరళ ఫారమ్ యూనివర్సిటీ, మన్నూతి, త్రిచూర్; 2. యూనివర్సిటీ ఆఫ్ కేరళ, త్రివేంద్రం; 3. యూనివర్సిటీ ఆఫ్ కళ్లికోట, కళ్లికోట ; 4. కొచ్చిన్ యూనివర్సిటీ, కొచ్చిన్.

**దర్శనీయ స్థలములు :** కొచ్చిన్, మట్టన్ చేరి, అలెప్పి, క్విలన్, త్రివేంద్రం, పెరియార్ జంతు శరణ్యము.

**పరిపాలన :** విధాన సభ కలదు; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

---

# 7. గుజరాత్




**వైశాల్యము :** 1,95,984 చ. కిమీ ; జనసంఖ్య: 2,66,97,475; జనసాంద్రత: చ. కిమీ. 136; అక్షరాస్యత : 35.79 శాతం ముఖ్యనగరము: గాంధి నగర్; ప్రధానభాష: గుజరాతీ; ఇతర ముఖ్యభాష హిందీ ; నదులు: సబర్మతీ; బనాస్, మహీ, శత్రుంజయ, తపతి, లూనీ, నర్మద, సరస్వతి; జిల్లాలు : 19; తాలూకాలు : 184; పట్టణములు: 209; గ్రామ సంఖ్య: 18,275. ప్రయిమరీ పాఠశాలలు : 21,831 (విద్యార్థులు : 37,21,000); ఉన్నత పాఠశాలలు : 2,778 (విద్యార్థులు : 10,27,000)

**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. అమ్రేలీ | 6,760 | 8,48,730 | అమ్రేలి |
| 2. అహమ్మదాబాదు | 8,707 | 29,10,307 | అహమ్మదాబాదు |
| 3. కచ్ | 45,612 | 8.49,969 | కచ్ |
| 4. ఖేడా | 7,194 | 24,51,387 | ఖేడా |
| 5. గాంధినగర్ | 649 | 2,00,642 | గాంధినగర్ |
| 6. జాంనగర్ | 14,125 | 11,11,343 | జాంనగర్ |

| జిల్లా | వైశాల్యము చ. కి మీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 7. జునాగడ్ | 10,607 | 16,56,677 | జునాగడ్ |
| 8. డాంగా | 1,683 | 94,185 | ఆహ్వా |
| 9. పంచమహల్ | 8,866 | 18,48,804 | గోధ్రా |
| 10. బనస్కాంత | 12,702 | 12,65,383 | పలన్‌పూర్ |
| 11. భరూచ్ | 9,045 | 11,09,601 | భరూచ్ |
| 12. భావనగర్ | 11,155 | 14,05,285 | భావనగర్ |
| 13. మహేశాన | 9,027 | 20,92,468 | మహేశాన |
| 14. రాజకోట | 11,203 | 16,24,072 | రాజకోట |
| 15. వాదోదర | 7,788 | 19,80,065 | వాదోదర |
| 16. వాల్సాద్ | 5,238 | 14,28,742 | వాల్సాద్ |
| 17. శబరకాంత | 7,390 | 11,87,637 | హిమత్‌నగర్ |
| 18. సురేంద్రనగర్ | 10,488 | 8,45,454 | సురేంద్రనగర్ |
| 19. సూరత్ | 7,745 | 17,86,924 | సూరత్ |

**ప్రముఖ నగరములు వాని జనసంఖ్యలు:** అహమ్మదాబాదు (15,91,832); సూరత్ (4,71,656) వాదోదర (4,67,487); రాజకోట (3,00,612); భావనగర్ (2, 25, 974); జాంనగర్ (2,14,816); నడియాడ్ (1,08,269).

**వ్యవసాయము మొ.:** ఆహారపు పంటలలో ముఖ్యము సజ్జ; మొత్తపు ఆహార ధాన్యముల ఉత్పత్తిలో దాదాపు మూడవవంతు సజ్జ పంటయే; ఈ విషయమున దేశపు సజ్జపంటలో నాలుగవవంతు ఈ రాష్ట్రమున పండుచున్నదని చెప్పవచ్చును. తరువాత లెక్కకు వచ్చునది గోధుమ; ఆహార ధాన్యోత్పత్తిలో నాలుగవ వంతు ఇందువలన లభ్యము. దేశపు ఆహారపు పంటలలో 14 శాతం వరి; 12 శాతం జొన్న; 8 శాతం మొక్క జొన్న. ప్రత్తి సాగుబడి నేలలో 20.8 శాతం గుజరాతున ఉన్నది; ఉత్పత్తి లెక్కలో దేశపు ప్రత్తి పంటలో 34.5 శాతం ఇట లభ్యము. ఇక వేరుసెనగ పంట విషయమున దేశపు సాగుబడి నేలలో 24.1 శాతము ఇట కలదు; దాని ఉత్పత్తి 30.3 శాతం. చెప్పదగిన వేరొక రొక్కపు పంట పొగాకు; దేశపు ఉత్పత్తిలో 14 శాతం ఇట పండుచున్నది. సాగున ఉన్న భూమి 9,062 వేల హె.; అటవీభూమి 1,576 వేల హె.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి:** రాష్ట్రపు సాగుబడినేలలో 31 శాతమునకు, అనగా దాదాపు 21.4 లక్షల హెక్టేరులకు, మాత్రమే నీటిపారుదలను చేకూర్చ వీలున్నదని అంచనా. అందున ఇప్పుడు 11.19 శాతమునకు మాత్రమే నీరు లభించుచున్నది; దీనియందును మొత్తపు పారుదలనేలలో 14 శాతమునకు మాత్రమే నదుల కాలువలవలన పారుదల జరుగుచున్నది. తక్కినవానికి బావులే ఆధారములు. మొత్తముమీద 948.23 మెవా. సమర్థతకల విద్యుదుత్పత్తి వసతి కలదు; ఇందు జల, తాప విద్యుత్తులు చేరిఉన్నవి (1972-73).

**ఖనిజ సంపద :** రాతిఉప్పు, సున్నపురాయి, మాంగనీజు, జిప్సం, పింగాణీమట్టి, కాల్‌సైట్, బాక్సయిట్ గణనీయపు నిలువలలో కలవు. అంకలేశ్వర్, కాంబే, కలోల్ ప్రాంతములలో పెట్రోలు, ఇంధనవాయువుల నిలువలు కనుగొన బడినవి.

**పరిశ్రమలు :** జవుళి, విద్యుత్ ఇంజినీరింగు, ఇంజినీరింగు, వనస్పతి తైలములు, రసాయనములకు సంబంధించిన పరిశ్రమలు కలవు. అహమ్మదాబాదు, సూరత్, జామ్‌నగర్, భావనగర్, రాజకోట ముఖ్య పారిశ్రామిక కేంద్రములు. కోయాళీ వద్దనున్న రిఫైనరిలో సాలీనా 43 లక్షల టన్నుల పెట్రోలు సంస్కరితమగుచున్నది.

**విశ్వ విద్యాలయములు :** 1. గుజరాత్ యూనివర్సిటీ, అహమ్మదాబాదు; 2. గుజరాత్ విద్యాపీఠ్, అహమ్మదాబాదు: 3. మహారాజా శాయాజీరావు యూనివర్సిటీ ఆఫ్ బరోడా, వాదోదర; 4. సర్దార్ పటేల్ యూనివర్సిటీ, వల్లభ్ విద్యానగర్; 5. సౌరాష్ట్ర యూనివర్సిటీ, రాజకోట; 6. సౌత్ గుజరాత్ యూనివర్సిటీ, సూరత్,

**దర్శనీయ స్థలములు :** అహమ్మదాబాదు, బరోడా, పోర్‌బందర్. ప్రభాస్‌పట్టణ్; శత్రుంజయ పర్వతము, గిర్ అడవులందలి సింహశరణ్యము, నాల్ సరోవర పక్షిశరణ్యము.

**పరిపాలన :** విధానసభ కలదు; కార్య నిర్వాహణాధికారి గవర్నరు.

---

# 8. జమ్మూ - కాశ్మీరు

**వైశాల్యము :** 2,22,236 చ,కిమీ. (ఇందులో 81,142 చ. కిమీ. భూమి పాకిస్తాన్ ఆక్రమణలో ఉన్నది); జనసంఖ్య: 46,16,632*; జనసాంద్రత చ. కిమీ. కు 32.7; అక్షరాస్యత: 18.58 శాతము; ముఖ్యనగరము: శ్రీనగర్ (శీతాకాలమున జమ్మూ); ప్రధాన భాషలు : కాశ్మీరీ, డోగ్రీ, ఉర్దూ, లడఖీ, బాల్టీ, దర్దీ, పహారీ; నదులు: జీలం, తావీ, సింధు, జీనాబ్, రావీ; జిల్లాలు: 10; గ్రామసంఖ్య 6,559; ప్రయిమరీ పాఠశాలలు : 3894 (విద్యార్థులు : 4,15,628); ఉన్నత పాఠశాలలు : 486 (విద్యార్థులు : 55,776)




---

* పాకిస్తాన్ ఆక్రమణలోను, చీనా ఆక్రమణలోను ఉన్న కాశ్మీర ప్రాంతముల జనసంఖ్యలు ఇందు చేరలేదు.

## జిల్లాలు

| | జిల్లా | వైశాల్యము (చ. కిమీ.) | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|---|
| 1. | అనంతనాగ్ (దక్షిణ కాశ్మీర్) | 5,382 | 8,32,280 | అనంతనాగ్ |
| 2. | ఉధాంపూర్ | 4,549 | 3,38,846 | ఉధాంపూర్ |
| 3. | కతువా | 2,651 | 2,74,671 | కతువా |
| 4. | జమ్మూ | 3,165 | 7,31,743 | జమ్మూ |
| 5. | దోదా | 11,691 | 3,42,220 | దోదా |
| 6. | పూంచ్ | 1,658 | 1,70,787 | పూంచ్ |
| 7. | బారామూలా (ఉత్తర కాశ్మీరు) | 7,458 | 7,75,724 | బారామూలా |
| 8. | రాజౌరి | 2,681 | 2,17,373 | రాజౌరి |
| 9. | లడఖ్ | 95,876 | 1,05,291 | లేహ్ |
| 10. | శ్రీనగర్ | 3,013 | 8,27,697 | శ్రీనగర్ |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** శ్రీనగర్ (4,03,413); జమ్మూ (1,55,338).

**వ్యవసాయము మొ. :** ప్రజలలో 80 శాతము నకు వ్యవసాయమే జీవనాధారము; దాదాపు 8.67 లక్షల హెక్టేరుల భూమి సాగున ఉన్నది; రాష్ట్రాదాయమున 30 శాతము వ్యవసాయమువలన లభించుచున్నది. వరి, గోధుమ, మొక్కజొన్న, జొన్న, సజ్జ ముఖ్యములగు ఆహారపు పంటలు. పండ్లతోటల పెంపకమున ఈ రాష్ట్రము ఎక్కువగ పేరొందినది. 1973-74లో 1.86 లక్షల టన్నుల పండ్లు ఎగుమతి అయినవి. వ్యవసాయము తరువాత ఎక్కువ ఆదాయము అడవులవలన లభించుచున్నది. రాష్ట్రమున 8,000 చ. మై. వైశాల్యము అటవీమయము. ఇందు 2,887 చ.మై. ప్రాంతమున మంచి రకము కలప లభించుచున్నది.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి:** నీటి పారుదల వసతి 1965-66 నాటికి 2.82 లక్షల హెక్టేరులకు కలదు. ఆ తరువాత పూర్తిచేయబడిన కతువా, ప్రతాప్ కాలువలవలన 17,140 హెక్టేరులకును, తావీ స్కీము వలన 13,480 హె. లకును అదనముగ నీటిపారుదల వసతి లభించినది. రాష్ట్రమున 3,950 మెవా. జలవిద్యుదుత్పత్తికి ప్రకృతి సిద్ధముగ వసతి కలదని అంచనా. కాని ఇప్పటికి పూర్తియైన ప్రాజెక్టులవలన ఈ అంచనాలో 0.75 శాతం మాత్రమే ఉత్పత్తి చేయబడు చున్నది. మొత్తపు వాడుకలోఉన్న విద్యుదుత్పత్తి యంత్ర సామర్థ్యము 83 మెవా. ( 1973-74 ). శ్రీనగర్ నుండి పఠాను కోటకు ట్రాన్స్మిషన్ లైనును 1974లో నిర్మించిన తరువాత, ఇచటి విద్యుత్ ప్రసారపు లైనులు, తక్కిన భారతదేశముతో అనుసంధితము లయినవి.

**ఖనిజ సంపద :** రాక్షసిబొగ్గు, లిగ్నయిట్ ప్రముఖ ఖనిజములు; బాక్సయిట్, ముడిఇనుము, ముడిరాగి, గ్రాఫయిట్, నికెల్, మాంగనీజు,

బంగారము, జిప్సం అల్పప్రమాణములలో కలవు. భారతదేశమున ఇంద్రనీలమణులు లభించు గనులు, కాశ్మీరునందలి ఉధాంపూర్ వద్ద మాత్రమే కలవు.

**పరిశ్రమలు :** పరిశ్రమలలో ముఖ్యముగ పేర్కొనదగినది పట్టుపరిశ్రమ. 1973-74 లో 22.39 లక్షల పట్టు ఉత్పత్తియైనది. తక్కు విధముల వస్త్రోత్పత్తి పరిశ్రమలు ఏవియు రాష్ట్రమున అంతగా స్థాపింపబడలేదు. జవుళీమిల్లులు, వడ్రంగపు మిల్లులు, గడియారాల ఫేక్టరీవంటి చిన్న పరిశ్రమలు కొన్ని కలవు. వీని వలన రాష్ట్రపు ఆదాయమున 9 శాతం మాత్రమే లభించుచున్నది. వస్త్రోత్పత్తి పరిశ్రమ కాకపోయినను, ప్రజలలో పలు వర్గముల వారికి జీవనాధారముగ కొంతవరకు ఉపకరించునది యాత్రిక పరిశ్రమ. ప్రకృతి రమణీయములగు పలుతావులకు నెలవగు ఈ రాష్ట్రమును సందర్శించుటకు యాత్రికులు పలువురు వచ్చెదరు; ఇందులకు తోడుగ అందలి యాత్రాస్థలములును తక్కిన భారతదేశమునుండి పలువురను ఆకర్షించుచున్నవి. యాత్రికుల సదుపాయములకై ప్రభుత్వము చాల ధనమును వెచ్చించి సౌకర్యములను సమకూర్చుచున్నది.

**విశ్వ విద్యాయములు :** 1. యూనివర్సిటీ ఆఫ్ కాశ్మీర్, శ్రీనగర్, 2. యూనివర్సిటీ ఆఫ్ జమ్మూ, జమ్మూ.

**దర్శనీయ స్థలములు :** చష్మాషాహి, దాల్ సరస్సు, పహల్‌నాగ్, గుల్‌మార్గ్, అంచార్ సరస్సు, మార్తాండాలయము, శంకరాచార్యాలయము, అవంతిపురా.

**పరిపాలన :** విధానసభ, విధాన పరిషత్తులు కలవు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

---

# 9. తమిళనాడు




**వైశాల్యము :** 1,30,069 చ.కిమీ.; **జనసంఖ్య :** 4, 11,99,168; **జనసాంద్రత :** చ.కిమీ.కు 317; అక్షరాస్యత: 39.46 శాతం; ముఖ్య నగరము: మద్రాసు ; ప్రధానభాష : తమిళం; ఇతర ముఖ్య భాషలు : తెలుగు, కన్నడం, మళయాళం; నదులు: కావేరి, పొన్నయ్యార్, పాలార్, వైగై , తామ్రపర్ణి, చెయ్యార్, మేయార్, భవానీ, అమరావతీ, చిత్తార్; జిల్లాల సంఖ్య 15; పట్టణముల సంఖ్య : 439 ; గ్రామసంఖ్య : 17,110; ప్రయిమరీ పాఠశాలలు: 32, 765 ( విద్యార్థులు : 65, 74, 785 ); ఉన్నత పాఠశాలలు : 2,842 ( విద్యార్థులు : 16,26,582 ).

## జి ల్లా లు

| జిల్లా | వైశాల్యము (చ. కి మీ.) | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. ఆర్కాటు, ఉత్తర | '2 265 | 37,55,797 | వెల్లూరు |
| 2. ఆర్కాటు, దక్షిణ | 10,898 | 36,17,723 | కడ్డలూరు |
| 3. కన్యాకుమారి | 1,684 | 12,22,549 | నాగర్‌కోయిల్ |
| 5. కోయంబత్తూరు | 15,673 | 43,73,178 | కోయంబత్తూరు |
| 4. చెంగల్‌పట్టు | 7,920 | 29,07,599 | కాంచీపురం |
| 6. తంజావూరు | 8,681 | 36,31,771 | తంజావూరు |
| 7. తిరుచిరప్పల్లి | 11,208 | 31,10,426 | తిరుచిరప్పల్లి |
| 8. తిరునల్వేలి | 11,433 | 32,00,515 | తిరునల్వేలి |
| 9. ధర్మపురి | 9,643 | 16,77,775 | ధర్మపురి |
| 10. నీలగిరి | 2,549 | 4,94,015 | ఉదకమండలం |
| 11. పుదుకోట | 4,137 | 9,47,351 | పుదుకోట |
| 12. మద్రాసు | 128 | 24,69,449 | మద్రాసు |
| 13. మదుర | 12,629 | 39,38,197 | మదుర |
| 14. రామనాథపురం | 12,578 | 28,60,207 | మదుర |
| 15. సేలం | 8,643 | 29,92,616 | సేలం |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** మద్రాసు (24,69,449); మదుర (5.49,114); కోయంబత్తూరు (3,56,368); సేలం(3,08,716); తిరుచిరప్పల్లి (3, 07, 400 ); తూత్తుకుడి (1,55,310); నాగర్‌కోయిల్ (1, 41, 288); తంజావూరు (1,40,547); వెల్లూరు (1,39 082); దిండిగల్ ( 1, 28, 429 ) ; సింగనల్లూరు (1,12,206); తిరుపూరు (1,13,302); కుంభకోణం (1,13,130): కాంచీపురం (1,10,657); తిరునల్వేలి (1,08,498); ఈరోడ్ (1,05,111); కడ్డలూరు. (1.01,335).

**వ్యవసాయము మొ. :** రాష్ట్రపు మొత్తమున సాగున ఉన్నభూమి దాదాపుగ 63.48 లక్షల హెక్టేలురు (41 శాతము). ఆహారపు పంటలలో వరి, మొక్కజొన్న, జొన్న, సజ్జ, రాగులు, పప్పు ధాన్యములు ప్రముఖములు. రొక్కపు పంటలలో చక్కెర చెరకు, నూనెగింజలు, ప్రత్తి, పొగాకు, కాఫీ, తేయాకు, రబ్బరు, మిరియాలు ప్రముఖములు. అడవుల వైశాల్యము 20,926 చ. కిమీ. కలప, గంధకపుచెక్క, వెదురు. యూకలిప్టస్ అందలి ఉత్పత్తులలో ప్రముఖములు,

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** సాగగు మొత్తపు భూమిలో 41 శాతమునకు నీటి పారుదల వసతి కలదు. నీటిపారుదల వసతులలో ముఖ్యములైనవి బావులు; పారుదల భూములలో 37% దీనివలన సాగగుచున్నవి; ప్రభుత్వపు కాలువలవలన 33.3 శాతము, తక్కిన సౌకర్యములవలన 25.5 శాతము సాగగుచున్నవి. కాలువలవలన పారుదల విశేషముగ తంజావూరు జిల్లాయందు మాత్రమే కలదు. ప్రసిద్ధములగు పైకారా, కావేరి, మెట్టూరు, పాపనాశం జలవిద్యుత్ ప్రాజెక్టులవలన రాష్ట్రమునకు విద్యుచ్ఛక్తి లభించుచున్నది. దేశపు రాష్ట్రములందెల్ల విద్యుచ్ఛక్తి సంపత్తిలో తమిళనాడు అగ్రస్థానమున ఉన్నది. నెలకొల్పబడిన విద్యుదుత్పాదక యంత్ర సామర్థ్యము 2254 మెవా. ఇందు తాప విద్యుత్తు 1030 మెవా. రాష్ట్రపు గ్రామాలకు అన్నిటికి విద్యుత్ చ్ఛక్తి లభ్యము చేయబడినది.

**ఖనిజ సంపద :** మొత్తముమీద ఈ రాష్ట్రమున ఖనిజసంపత్తి తక్కువయనియే చెప్పవచ్చును ఉన్నవానిలో ఉప్పు, సున్నపురాయి, మాగ్నసైట్, జిప్సం, ముడి అభ్రకము, బాక్సయిట్, లిగ్నయిట్, ముడిఇనుము చెప్పదగినవి సేలము నందలి మాగ్నసైట్ నిలువలు, దేశపు అట్టి ఖనిజ విశేషములలో అత్యుత్తమములు.

**పరిశ్రమలు :** బొంబాయి, కలకత్తాలవలనే దేశమున తొలుతగ పరిశ్రమలు నెలకొనిన ప్రాంతములలో లెక్కింపదగినది తమిళనాడు. దక్షిణదేశపు నాలుగు రాష్ట్రములలో పరిశ్రమలందు ఈ రాష్ట్రము చాల ముందంజవేసినది. అందు భారతదేశపు మొత్తమున మహారాష్ట్ర, పశ్చిమ బెంగాలులతర్వాత తమిళనాడు లెక్కకు వచ్చుచున్నది. పబ్లిక్ రంగమునకు చెందిన అనేక పరిశ్రమలు-ఇంటెగ్రల్ కోచి ఫేక్టరి, నెవెల్లీ లిగ్నయిట్ కాంప్లెక్స్ మొదలగునవి-ఇచట కలవు. పదునుచేసిన చర్మములు, చర్మపు సరుకులు, జవుళీ ఉత్పత్తులు, నూలుదారం, తేయాకు, కాఫీ, ఇంజనీరింగు సరుకులు, మోటారు వాహనముల పరికరములు ఇచట నుండి ఎగుమతి అగు వానిలో ప్రముఖములు.

**విశ్వ విద్యాలయములు:** 1. మదరాసు యూనివర్సిటీ, మదరాసు; 2. అన్నామలై యూనివర్సిటీ, అన్నామలై నగర్; 3. మదురై యూనివర్సిటీ, మదుర; 4. తమిళనాడు అగ్రికల్చరల్ యూనివర్సిటీ, కోయంబత్తూరు.

**దర్శనీయ స్థలములు:** మద్రాసు, కాంచీపురం, కూనూర్, కొడై కెనాల్, కోటగిరి, ఉదకమండలం, (నీలగిరి), రామేశ్వరం, శ్రీరంగం, కన్యాకుమారి, మహాబలిపురం, తంజావూర్, తిరువన్నామలై, తిరువాయూర్, వేదాంతగళ్ పక్షి శరణ్యము.

**పరిపాలన:** విధానసభ, విధానపరిషత్ కలవు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

# 10. త్రిపుర




**వైశాల్యము :** 10,477 చ. కిమీ. (తొలుత అస్సామ్‌న అంతర్భాగమగు ఈ ప్రదేశము వేరుచేయ బడి, జనవరి 21, 1975న రాష్ట్ర ప్రతిపత్తిని పొంది నది); జనసంఖ్య : 15,56,342; జనసాంద్రత : చ. కిమీ.కు 149; అక్షరాస్యత : 30.98 శాతము; ముఖ్యనగరము : అగర్తలా; ప్రధాన భాషలు : బెంగాలీ, త్రిపురీ, మణిపురీ; నదులు : గుంతీ, ఖోవాయ్, మనూ, హవరా, మహూరీ; జిల్లాలు: 3; తహశీలులు: 177; పట్టణములు : 6; గ్రామ సంఖ్య : 4,727. ప్రయిమరీ పాఠశాలలు : 1,454 (విద్యార్థులు : 1,47,762); ఉన్నత పాఠశాలలు : 104 (విద్యార్థులు : 49,974).

**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యం (చ కిమీ.) | జనసంఖ్య | ముఖ్యనగరం |
|---|---|---|---|
| 1. ఉత్తర త్రిపుర | 3,541 | 4,05,009 | కైలాషహర్ |
| 2. దక్షిణ త్రిపుర | 3,577 | 3,99,728 | ఉదయపూర్ |
| 3. పశ్చిమ త్రిపుర | 3,359 | 7,51,605 | అగర్తలా |

**వ్యవసాయము :** త్రిపుర యందలి భూవైశాల్య మున 60 శాతం అటవీమయము. 22% (236 వేల హెక్టేరులు) మాత్రమే సాగున ఉన్నది. వరి, జనుము, ఉర్లగడ్డలు, నూనె గింజలు, చక్కెరచెరకు, ప్రత్తి ప్రముఖములగు పంటలు. అయినను ఆహారధాన్య ముల లోటుకలదు. దాదాపు 30 వేల టన్నుల ఆహారధాన్యము ఏటా దిగుమతి యగుచున్నది.

**నీటి పారుదల విద్యుత్తు ఉత్పత్తి :** నీటి పారు దలకు గొట్టపు బావులు, లిఫ్టుపంపులు మాత్రమే ముఖ్యసాధనములు. వీని అభివృద్ధి వలన దాదాపు 1,000 హెక్టేరులకు నీటిపారుదల వసతులు కలిగి నవి. డీజెల్ ఆయిల్ యంత్రముల సాయమున అగర్తలా మొదలగు నగరములందు విద్యు దుత్పత్తి జరుగుచున్నది; అయినను వీని ఉత్పత్తి సామర్థ్యము 1650 కివా. మాత్రమే. కావున అస్సాం నుండి కొంత విద్యుత్తును రాష్ట్రము ప్రతిసాలున కొనుగోలు చేయుచున్నది. గుంతీనది వద్ద జల విద్యుదుత్పత్తికై యంత్రముల నెలకొల్పు పని ఇంకను పూర్తికాలేదు.

**పరిశ్రమలు :** తేయాకు పరిశ్రమ అతి ప్రము ఖము. 5376 హెక్టేరులలో తేయాకు తోటలు కలవు; అందలి ఉత్పత్తి రమారమి 30 లక్షల కి గ్రా. చేనేత, ఖాదీ. చేతిపనులు చెప్పదగిన కుటీర పరిశ్రమలు.

**పరిపాలన :** విధానసభ కలదు; కార్య నిర్వా హణాధికారి గవర్నరు.

# 11. నాగాలాండు




**వైశాల్యము** : 16,527 చ. కిమీ.; జనసంఖ్య : 5,16,449; జనసాంద్రత : చ. కిమీ.కు 31; అక్షరాస్యత : 27.40 శాతము; ముఖ్యనగరము : కొహిమా; ప్రధాన భాషలు : వేర్వేరు తెగలందు వేర్వేరు భాషలు ప్రచారమున ఉన్నవి. వానిలో నాగామీజ్ భాషకు ఎక్కువ వ్యాప్తికలదు. అయినను ఇంగ్లీషు భాషనే అధికార భాషగను, విద్యాబోధనకు మాధ్యమముగను రాష్ట్రపుశాసనసభ ఆమోదించినది; జిల్లాల సంఖ్య : 3; గ్రామసంఖ్య : 966; ప్రయిమరీ పాఠశాలలు : 986; ఉన్నత పాఠశాలలు: 94

**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. కొహిమా | 7,209 | 1,75,204 | కొహిమా |
| 2. మోకోక్‌చుంగ్ | 3,852 | 1,68,242 | మోకోక్చుంగ్ |
| 3. తుయెన్‌సంగ్ | 5,466 | 1,73,003 | తుయెన్‌సంగ్ |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** లక్షకు పైబడిన జనసంఖ్య కలిగిన నగరము లేదు.

**వ్యవసాయము :** 90 శాతము ప్రజలకు వ్యవసాయమే జీవనాధారం. పంటలలో వరి ప్రముఖము; సాగున ఉన్నభూమి వైశాల్యము 63 వేల హెక్టేరులు (1973-74); రాష్ట్రపు వైశాల్యమున 17.56 శాతం అటవీమయము; దీనివలన ప్రభుత్వమునకు చాల ఆదాయము లభించుచున్నది.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి:** కొంతవాగులను పారుదలకై మరలించిన వసతులే తప్ప, చెప్పదగిన నీటి ప్రాజెక్టులు లేవు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 2.1 మెవా. (1973-74).

**పరిశ్రమలు :** చెప్పదగిన పెద్ద పరిశ్రమ ఏదియులేదు. కుటీరపరిశ్రమలుగా పట్టుపరిశ్రమయు, చేనేతయు పలువురకు జీవనాధారములు.

**పరిపాలన :** విధానసభ కలదు; గవర్నరు కార్యనిర్వాహణాధికారి.

---

# 12. పంజాబు




వైశాల్యము: 50,376 చ కిమీ.; జనసంఖ్య; 1,35,51,060; జనసాంద్రత : చ.కిమీ.కు 270; అక్షరాస్యత : 33 67; ముఖ్యనగరము : చండీఘర్; ప్రధాన భాష : పంజాబీ; ఇతర ప్రముఖ భాషలు; హిందీ. ఉర్దూ; నదులు : బియాస్; సట్లెజ్, రావీ, సరస్వతి; జిల్లాలు : 12; పట్టణములు : 108; గ్రామసంఖ్య : 12,188; ప్రయిమరీ పాఠశాలలు : 9,120 (విద్యార్థులు : 18,19,517); ఉన్నత పాఠశాలలు : 1495 (విద్యార్థులు : 2,11,376).

## జిల్లాలు

| | జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|---|
| 1. | అమృతసర్ | 5,025 | 18,35,500 | అమృతసర్ |
| 2. | కపూర్తలా | 1,634 | 4,23,514 | కపూర్తలా |
| 3. | గురుదాసపూర్ | 3,557 | 12,29,249 | గురుదాసపూర్ |
| 4. | జలంధర్ | 3,396 | 14,54,501 | జలంధర్ |
| 5. | పాటియాలా | 4,669 | 12,11,303 | పాటియాలా |
| 6. | ఫరీద్‌కోట్ | 5,746 | 11,51,738 | ఫరీద్‌కోట |
| 7. | ఫెరోజ్‌పూర్ | 5,923 | 10,44,936 | ఫెరోజ్‌పూర్ |
| 8. | భటిండా | 5,564 | 10,27,293 | భటిండా |
| 9. | రూపార్ | 2,086 | 5,48,802 | రూపార్ |
| 10. | లూధియానా | 3,793 | 14,19,421 | లూధియానా |
| 11. | సంగ్‌రూర్ | 5,096 | 11,46,650 | సంగ్‌రూర్ |
| 12. | హోషియార్‌పూర్ | 3,887 | 10,52,153 | హోషియార్‌పూర్ |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** అమృతసర్ ( 4, 34, 951 ), లూధియానా (4,01,176), జలంధర్ (2, 96, 106), పాటియాలా (1,51,041), (చండీఘర్ ముఖ్యనగరమే అయినను అది కేంద్రపాలిత ప్రాంతముగ ఉన్నది.)

**వ్యవసాయము :** ప్రజలలో 76 శాతమునకు వ్యవసాయమే ముఖ్య జీవనాధారము; ఆహారధాన్యములను – ముఖ్యముగా గోధుమను, వరిని – ఈ రాష్ట్రము తన అవసరములకు మించి పండించుచున్నది. తక్కిన ఆహారపు పంటలలో మొక్కజొన్న, సజ్జ, జొన్న, పప్పుధాన్యములు, బార్లీ ప్రముఖములు. రొక్కపుపంటలలో నూనెగింజలు, చక్కెరచెరుకు. పొగాకు, ప్రత్తి, ఉరలగడ్డలు గణనీయములు. సాగున ఉన్నభూమి 40.86 లక్షల హెక్టేరులు రాష్ట్ర వైశాల్యమున 4 శాతం (2,11,128 హె.) అటవీమయము.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** సాగున ఉన్న భూమిలో 71.3 శాతమునకు నీటిపారుదల వసతులు కలవు; భాక్రానంగల్ ప్రాజెక్టు మొదలగు నీటిప్రాజెక్టులే గాక, గొట్టపు బావులును ఇందులకు ఉపకరించుచున్నవి. తలసరి విద్యుద్వినియోగంలో ఈ రాష్ట్రమునకు దేశమున ద్వితీయ స్థానము (165.23 కివా.) కలదు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 576 మెవా. (1974).

**పరిశ్రమలు :** చిన్నతరహా పరిశ్రమలకు పేరొందినది ఈ రాష్ట్రము, పట్టు సరుకులు, చెప్పులు, యంత్ర పరికరములు, సైకిల్ భాగములు కుట్టు యంత్రములు–వానిపరికరములు, ప్లాస్టిక్ సరుకులు, పైపులు, నట్లు, బోల్టులు, అట్టి పరిశ్రమల ఉత్పత్తులలో ప్రముఖముగ పేర్కొనదగినవి. ప్రభుత్వ రంగపు పరిశ్రమలలో నంగాల్ ఎరువుల ఫేక్టరీ గణనీయము. ఇంకను ట్రాక్టర్లు, బేటరీలు, పాలిస్టరు దారములు. టైరులు, నైలాన్ దారములు, ట్యూబులు, టి. వి. సెట్లు మొదలగువానికి చెందిన కొన్ని పరిశ్రమలును కలవు.

**విశ్వ విద్యాలయములు :** 1. గురునానక్ యూనివర్సిటీ, అమృత్‌సర్; 2. పంజాబ్ యూనివర్సిటీ, చండీఘర్; 3. పంజాబ్ అగ్రికల్చరల్ యూనివర్సిటీ, లూధియానా; 4. పంజాబీ యూనివర్సిటీ, పాటియాలా.

**దర్శనీయ స్థలములు:** రూపార్, అమృత్‌సర్, భటిండా, కపూర్తలా, పాటియాలా.

**పరిపాలన :** విధానసభ కలదు; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

———o———

# 13. పశ్చిమ బెంగాల్




**వైశాల్యము:** 87,853 చ.కిమీ.; జనసంఖ్య: 4,43,12,011; జనసాంద్రత : చ.కిమీ.కు 504; **అక్షరాస్యత** 33.05; ముఖ్యనగరము : కలకత్తా; ప్రధానభాష: బెంగాలీ; ఇతర ముఖ్య భాషలు : హిందీ, ఇంగ్లీషు; నదులు : గంగానది, దామోదర్, భాగీరథి, హుగ్లీ, మయూరాక్షి, రూపనారాయణ, అజయ, కాశయ్, తీస్తా, తోర్సా; జిల్లాల సంఖ్య : 16; గ్రామసంఖ్య : 38.550 ప్రయిమరీ పాఠశాలలు : 39,400 ఉన్నత పాఠశాలలు : 4,208

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు:** కలకత్తా (ఉపనగరములతో కలసి 70,05,362); దుర్గాపూర్ (2,072,32); ఖరగ్‌పూర్ (1,61,911); అసన్‌సోల్ (1,57,388); బర్ద్వాన్ (1,44,970).

**జిల్లాలు**

| | జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|---|
| 1. | కలకత్తా | 104 | 31,48,746 | కలకత్తా |
| 2. | కూచి బీహారు | 3,386 | 14,14,183 | కూచి బీహార్ |
| 3. | జలపయిగురి | 6,245 | 17,50,159 | జలపయిగురి |
| 4. | డార్జిలింగ్ | 3,075 | 7,81,777 | డార్జిలింగ్ |
| 5. | నడియా | 3,926 | 22,30,270 | కృష్ణనగర్ |
| 6. | పశ్చిమ దినాజపూర్ | 5,206 | 18,59,887 | బలూర్‌ఘాట్ |
| 7. | పురూలియా | 6,259 | 16,02,875 | పురూలియా |
| 8. | బంకూరా | 6,881 | 20,31,039 | బంకూరా |
| 9. | బర్ద్వాన్ | 7,028 | 39,16,174 | బర్ద్వాన్ |
| 10. | బీర్‌భూమ్ | 4,550 | 17,75,909 | సూరీ |

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 11. మాల్డా | 3,713 | 16,12,657 | ఇంగ్లీష్ బజార్ |
| 12. మిడ్నపూర్ | 13,724 | 55,09,247 | మిడ్నపూర్ |
| 13. మూర్షిదాబాద్ | 5,341 | 29,40,204 | బహరంపూర్ |
| 14. 24-పరగణాలు | 13,796 | 84,49,482 | ఆలీపూర్ |
| 15. హుగ్లీ | 3,145 | 28,72,116 | చిన్‌సూరా |
| 16. హౌరా | 1,474 | 24.17,286 | హౌరా |

**వ్యవసాయము** మొ. : రాష్ట్రపు ప్రజలలో 57.5 శాతం వ్యవసాయముపై ఆధారపడి జీవించుచున్నారు. దేశమున వరిపంటను పండించుటలో అగ్రస్థానము పశ్చిమ బెంగాలుది. సాగుబడిలో ఉన్న మొత్తపుభూమి 6,961 వేలహెక్టేరులు. సాగుబడి యందున్న నేలలో 70 శాతము వరిసాగున ఉన్నది; తరువాత లెక్కింపదగిన ఆహారపు పంట గోధుమ. కాని రాష్ట్రపు అవసరములకు ఆహారధాన్యములు సరిపోవకున్నవి; ఆ విషయమున లోటు రాష్ట్రముగనే ఇది లెక్కకు వచ్చుచున్నది. జనుపనార ఉత్పత్తులు, తేయాకు ఎగుమతివలన రాష్ట్రము పరిగణనీయమగు విదేశీయ వినిమయ ద్రవ్యమును ఆర్జించుచున్నది. రాష్ట్ర వైశాల్యమున 13.4 శాతము అటవీమయము; అటవీ ఉత్పత్తులలో కలప, కర్రబొగ్గు, వంటచెరకు, వెదురు ప్రముఖములు

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి** : వర్షపాతము ఎక్కువగ ఉండుటవలన, నీటిపారుదల వసరుల అభివృద్ధికి అంతగ ఆవశ్యకత లేదు. అయినను సాగుబడి భూమిలో 27 శాతమునకు నీటిపారుదల వసతులు కలవు. అట్టి వసతులలో దామోదర్‌వాలీ, మయూరాక్షి, కంగ్‌సబాతీ రిజర్వాయర్ ప్రాజెక్టులు పేర్కొనదగినవి. వీనిలో తొలుతటి రెండింటివలన విద్యుచ్ఛక్తియు కొంత ఉత్పత్తి యగుచున్నది. అయినను, రాష్ట్రమునకు కావలసిన విద్యుచ్ఛక్తిలో అధికభాగము రాక్షసిబొగ్గువలన లభించుచున్నది. ఉత్పత్తి సమర్థత 1,367 మెవా. (1973-74).

**ఖనిజ సంపత్తి** : దేశమున బీహారు తరువాత ఖనిజసంపత్తిలో లెక్కకువచ్చునది పశ్చిమబెంగాలు. భారత దేశపు ఖనిజోత్పత్తిలో అయిదవవంతు ఈ రాష్ట్రమువలన లభించుచున్నది, ఇందు దాదాపు 99 శాతం రాక్షసిబొగ్గు. పింగాణీమట్టియు, డోలమైటును ఇచట విరివిగ కలవు. అగ్నిమృత్తిక (ఫైర్‌క్లే) విషయమున బీహార్, మధ్యప్రదేశ్‌ల తరువాత లెక్కింపదగినది పశ్చిమ బెంగాలే, ఇంకను పటికరాయి, వుల్ఫ్రాం, మాంగనీజు, ఆర్సెనిక్ అటనట పరిమిత ప్రమాణములలో కన్పట్టుచున్నవి.

**పరిశ్రమలు** : దేశమున పారిశ్రామిక వికసనము తొలుతగ ఆరంభమైన ప్రాంతములలో ఈ రాష్ట్రమును లెక్కకు వచ్చుచున్నది. అందు జనుపనార, తేయాకునకు చెందిన పరిశ్రమలు తొలుతగ లెక్కింపదగినవి. కాగితపు పరిశ్రమయు, ఉక్కు, పరిశ్రమయు ఈ రాష్ట్రముననే తొలుతగ ఆరంభితము లయినవి. రాణీగంజ్‌లో బొగ్గుగనులు కనుగొనబడిన నాటినుండియే భారతదేశమున పారిశ్రామిక విప్లవము మొదలైనదని చెప్పవచ్చును. పబ్లిక్ రంగమును ప్రయివేటు రంగమును దాదా

పుగ సమానస్థాయిలో ఇట పారిశ్రామిక వికసనమున పాల్గొను చున్నవి. దుర్గాపూర్‌లోను, బరన్‌పూర లోను ఉక్కు కర్మాగారములు కలవు. ఇంకను జవుళీ, పట్టు, మోటారు వాహనములు, తేలిక ఇంజ నీరింగు, రసాయనములు, అల్యూమినియం, చక్కెర కలపపని, పింగాణి, గాజు, ఎముకపిండి, చర్మపు ఉత్పత్తులకు సంబంధించిన పరిశ్రమలు పలుప్రాంతములందు కలవు.

**విశ్వ విద్యాలయములు :** 1. బర్‌ద్వాన్ విశ్వ విద్యాలయము, బర్‌ద్వాన్; 2. యూనివర్సిటీ ఆఫ్ కలకత్తా, కలకత్తా; 3 జాదవపూర్ యూని వర్సిటీ, కలకత్తా; 4. యూనివర్సిటీ ఆఫ్ కల్యాణి, కల్యాణి; 5. యూనివర్సిటీ ఆఫ్ నార్త్ బెంగాల్, డార్జిలింగ్; 6. రవీంద్ర భారతి యూనివర్సిటీ, కలకత్తా; 7. విశ్వ-భారతి, శాంతినికేతన్.

**దర్శనీయ స్థలములు :** కలకత్తా, (విక్టోరియా మెమోరియల్, ఇండియన్ మ్యూజియం, జైన దేవాలయం, కాళీఘాట్, బెలెవడేర్ హౌస్-జాతీయ గ్రంథాలయం, ఈడెన్ గార్డెన్స్, దక్షిణేశ్వరాల యము) డార్జిలింగ్. శాంతినికేతన్, జలదపారా జంతు శరణ్యము.

**పరిపాలన :** విధానసభ కలదు ; కార్యనిర్వా హాధికారి గవర్నరు.

---

# 14. బీహార్




వైశాల్యము ; 1, 73, 876 చ. కిమీ.; జన సంఖ్య 5,63,53,369; జనసాంద్రత : చ. కిమీ.కు 324; అక్షరాస్యత : 19.9 శాతము; ముఖ్యనగరం; పాట్నా: ప్రధానభాష : హిందీ; ఇతర ప్రముఖ భాషలు : బెంగాలీ, ఉర్దూ; నదులు: గంగా, గండక్, కోసీ, కమలా, సోన్, బరకార్, దామోదర్, కోయెల్, బాగ్‌మతి, సువర్ణరేఖ; జిల్లాలు: 31;† సబ్-డివిజనులు : 70; పట్టణములు: 202; గ్రామ సంఖ్య:77,967; ప్రయిమరీ పాఠశాలలు: 48,738 (విద్యార్థులు: 48,56,000); ఉన్నత పాఠశాలలు: 2,814; (విద్యార్థిసంఖ్య: 8,35,000).

---

† దేశపటము 1971 కు పూర్వపుది అగుటవలన ఈ జిల్లాలు అన్నియు అందు కనపడవు.

## జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. పాట్నా | 3,182 | 22,50,883 | పాట్నా |
| 2. నాలందా | 2,346 | 13,06,062 | బీహార్ షరిఫ్ |
| 3. గయ | 4,288 | 19,24,289 | గయ |
| 4. ఔరంగాబాద్ | 4,409 | 12,92 666 | ఔరంగాబాద్ |
| 5. నవదా | 3,648 | 12,40,518 | నవదా |
| 6. భోజపూర్ | 4,024 | 19,95,146 | అర్రా |
| 7. రోహతాస్ | 7,296 | 19,43,888 | ససారమ్ |
| 8. శరణ్ | 3,200 | 17,09,722 | చాప్రా |
| 9. శివాన్ | 2,300 | 14,02,067 | శివాన్ |
| 10. గోపాలగంజ్ | 1,652 | 11,07,464 | గోపాలగంజ్ |
| 11. చంపారణ్-తూర్పు | 4,334 | 19,56,084 | మోతీహారీ |
| 12. చంపారణ్-పశ్చిమ | 4,862 | 15,87,019 | బెట్టియా |
| 13. ముజఫర్‌పూర్ | 3,160 | 19,09,058 | ముజఫర్‌పూర్ |
| 14. వైశాలి | 2,019 | 13,48 990 | హాజీపూర్ |
| 15. సీతామర్హి | 2,659 | 15,82,622 | సీతామర్హి |
| 16. దర్భాంగ | 2,296 | 15,17,151 | దర్భాంగ |
| 17. సమస్తిపూర్ | 2,856 | 182,4,718 | సమస్తిపూర్ |
| 18. మధుబాణి | 3,527 | 18 92,039 | మధుబాణి |
| 19. మాంఘీర్ | 7,928 | 27,45,180 | మాంఘీర్ |
| 20. భగల్‌పూర్ | 5 656 | 20,91,103 | భగల్‌పూర్ |
| 21. సంతాల్‌పరగణాలు | 14,129 | 31,86,908 | దుంకా |
| 22. బేగు సరాయ్ | 1,899 | 11,47,449 | బేగు సరాయ్ |
| 23. సహర్సా | 5,385 | 23,50,268 | సహర్సా |
| 24. పూర్ణియా | 7,990 | 28,84,990 | పూర్ణియా |
| 25. కతీహార్ | 3,023 | 10,56,873 | కతీహార్ |
| 26. పలమావ్ | 12,677 | 15,04,350 | డాల్టన్‌గంజ్ |
| 27. హజారీబాగ్ | 11,152 | 16,45,838 | హజారీబాగ్ |
| 28. గిరిదిహ్ | 6,908 | 13,74,376 | గిరిదిహ్ |
| 29. రాంచీ | 13,331 | 26,11,445 | రాంచీ |
| 30. ధన్‌బాద్ | 2,994 | 14,66,417 | ధన్‌బాద్ |
| 31. సింఘ్‌భూమ్ | 13,447 | 24,37,799 | చైబాసా |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** పాట్నా ( 4, 75, 300 ); జమ్‌షెడ్‌పూర్ (3, 41, 576); గయ (1, 79, 884); రాంచీ (1, 75, 934); భగల్‌పూర్ (1, 72, 202); దర్భాంగ ( 1, 32, 059 ); ముజఫర్‌పూర్ (1, 26, 379); మాంఘీర్ (1, 02, 474); బీహార్‌షరీఫ్ (1,00,046).

**వ్యవసాయము మొ. :** రాష్ట్రమున 84 లక్షల హె. భూమి సాగున ఉన్నది. ఆహారపు పంటలలో వరి, గోధుమ, మొక్కజొన్న, రాగి, పప్పు ధాన్యములు ప్రముఖములు. రొక్కపు పంటలలో చక్కెర చెరకు, నూనెగింజలు, పొగాకు, జనుము పేర్కొనదగినవి. రాష్ట్రపు భూతలమున 17 శాతం అటవీమయము; అందలి ఉత్పత్తులలో కలప, కెందూ ఆకులు, లక్క, తుమ్మబంక, యక్షధూపం పేర్కొనదగినవి.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** సాగుబడి యందున్న భూమిలో 26 శాతమునకు నీటిపారుదల వసతులు కలవు. ఆ వసతులలో కోసీ, గండక్, బాదువా, చందన్, ఉత్తర కోయెల్, బాగ్‌మతీ ప్రాజెక్టులు ప్రముఖములు; గిరిజన ప్రాంతములలో మధ్యరకపు నీటివసతులు విరివిగ కలవు. విద్యుత్తునకు సంబంధించినంతవరకు దామోదర్ వాలీ ప్రాజెక్టులలో పశ్చిమ బెంగాలుతోపాటుగ ఈ రాష్ట్రమునకును భాగము కలదు. అయినను రాష్ట్రము విద్యుచ్ఛక్తి విషయమున కొరవడియే ఉన్నది. బొకారో, చంద్రపూర్, పత్రాతూ తెర్మల్ స్టేషనులును, సువర్ణరేఖా జలవిద్యుత్ ప్రాజెక్టులును ప్రముఖ విద్యుదుత్పాదక కేంద్రములు. విద్యుదుత్పత్తి సమర్థత 1,314 మెవా. (1974).

**ఖనిజ సంపద :** భూగర్భమున ఉన్న ఖనిజముల నిలువలందేగాక, వానిని సాధించివెలికి దీయుటయందును బీహారు, భారతదేశమున, అగ్రస్థానమున ఉన్నది. దేశపు రాక్షసి బొగ్గులో 48 శాతం, రాగిలో దాదాపు 100 శాతం, బాక్సయిట్‌లో 48 శాతం, అభ్రకంలో 45 శాతం, క్యానైట్‌లో 100 శాతం, అపటయిట్‌లో 90 శాతం ఈ రాష్ట్రమున తీయబడుచున్నవి. రాష్ట్రమున అల్పప్రమాణములలో వెలికి తీయబడు ఖనిజములలో మాంగనీజు, సున్నపురాయి, గ్రాఫయిట్, ఫెల్‌స్పార్, కొలంబైట్, సురేకారం, గాజుఇసుక, పలకసీసం, వెండి, రేడియోధార్మిక ఖనిజములు పేర్కొనదగినవి.

**పరిశ్రమలు :** భారత ప్రభుత్వము ఈ రాష్ట్రమున బొకారో ఉక్కు కర్మాగారము, బరౌని రిఫైనరీ, ఎరువుల ఫేక్టరీ, హెవీ ఇంజనీరింగు కార్పొరేషన్‌వంటి పెద్ద కర్మాగారములను నెలకొల్పినది. జమ్‌షెడ్‌పూరున దేశప్రసిద్ధమగు ఉక్కు కర్మాగారము, ప్రయివేటురంగమున కలదు. కాని ఈ పరిశ్రమలవలన బీహారు మాత్రము తగిన రీతిలో ఆర్థికముగ ముందజ వేయకుండుట ఒక విచిత్ర యథార్థము. ఇవిగాక 28చక్కెర ఫేక్టరీలు. 7 సిమెంటు ఫేక్టరీలు, 8 జనుపనార మిల్లులు, 1 వాగన్ నిర్మాణశాల రాష్ట్రమున కలవు. కుటీర పరిశ్రమలలో పట్టు పరిశ్రమయు, తక్కువిధముల కొన్ని చేతి వృత్తులును పలువురకు జీవనాధారములుగ ఉన్నవి.

**విశ్వ విద్యాలయములు :** 1. భగల్‌పూర్ యూనివర్సిటీ, భగల్పూర్; 2. బీహార్ యూనివర్సిటీ, ముజఫర్‌పూర్; 3. కామేశ్వరసింగ్ సంస్కృత విశ్వవిద్యాలయ, దర్భాంగ; 4. మగధ యూనివర్సిటీ, బోధగయ; 5. పాట్నా యూనివర్సిటీ పాట్నా; 6. రాంచీ యూనివర్సిటీ, రాంచీ; 7. యల్. యన్. మిథిలా యూనివర్సిటీ, దర్భాంగ; 8 అగ్రికల్చరల్ యూనివర్సిటీ, ధోలీ, ముజఫర్‌పూర్.

**దర్శనీయ స్థలములు :** బుద్ధగయ, జంషెడ్‌పూర్, నాలందా, పాట్నా, రాంచీ, ససారమ్, హజారీదాగ్ జాతీయవనం, పలమావ్ జాతీయవనం.

**పరిపాలన :** విధానసభ, విధాన పరిషత్తు కలవు; కార్యనిర్వాహణాధికారి గవర్నరు.

# 15. మణిపూర్

**వైశాల్యము :** 22,356 చ. కిమీ.; జనసంఖ్య 10,72,753; జనసాంద్రత : చ. కి. మీ.కు 48 ; అక్షరాస్యత : 32.80 శాతం ; ముఖ్యనగరము : ఇంఫాల్; ప్రధాన భాష: మణిపూరీ; ఇతరప్రముఖ భాషలు: హిందీ, బెంగాలీ ; నదులు : ఇరిల్, తౌబాల్; ఇంఫాల్, బరాక్, నాంబూల్, లీమాఖాంగ్, ఖూగా; జిల్లాలు: 6; గ్రామసంఖ్య 1,941; 10 వేలకు పైబడిన జనావాసములు లేనేలేవు; ప్రయిమరీ పాఠశాలలు : 456; ఉన్నత పాఠశాలలు : 150,




## జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. మణిపూర్, సెంట్రల్ | 2,230 | 7,24,537 | ఇంఫాల్ |
| 2. మణిపూర్, తూర్పు | 4,409 | 62,229 | ఉఖ్రూల్ |
| 3. మణిపూర్, ఉత్తర | 3,417 | 1,04,175 | కరోంగ్ |
| 4. మణిపూర్, దక్షిణ | 4,581 | 98,114 | చురాచంద్‌పూర్ |
| 4. మణిపూర్, పశ్చిమ | 4,344 | 44,975 | తమెంగ్‌లాంగ్ |
| 6. తెంగ్‌నౌపాల్ | 3,375 | 33,723 | చందేల్ |

**వ్యవసాయము మొ.** : ప్రజలలో 66 శాతమునకు వ్యవసాయమే ముఖ్యవృత్తి. రాష్ట్రపు వైశాల్యమున 92 శాతం పర్వతభూమి. పంటలలో వరిపంట అతిప్రముఖము; గోధుమ, మొక్కజొన్న అల్పప్రమాణములలో పండింపబడుచున్నవి. పండ్లతోటలకు అనువగు పరిస్థితులు ఉండుటవలన, ఆ తోటల పెంపకము ఇపుడు విరివిగ సాగుచున్నది. వానిలో అనాస, నారింజ, మామిడి, జామ తోటలు ప్రముఖములు; సాగున ఉన్న మొత్తపునేల 140 వేల హె. రాష్ట్రపు భూతలమున నాలుగవవంతునకు పైబడిన ప్రాంతమున అడవులు కలవు. మంచి కలప, వెదురు, పేముబద్ద ఈ అడవులలో విరివిగ లభించును.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి** : కొండవాగులకు అడ్డుకట్టలు నిర్మించుటవలన ఏర్పడిన చిన్న జలాశయములు నీటిపారుదలకు ఉపకరించుచున్నవి. విద్యుదుత్పత్తి సమర్థత 7.6 మెవా. (1973-74).

**పరిశ్రమలు** : పెద్ద పరిశ్రమలు ఏవియులేవు చేనేత పరిశ్రమ ప్రతిచోట కననగు కుటీరపరిశ్రమ. తక్కినవానిలో పట్టు, వెదురు, పేము, వడ్రంగం, చర్మపుపని, ఖాదీ, తోళ్ళు, నూనెగానుగ, వడ్లదంపకములకు సంబంధించిన కుటీర పరిశ్రమలు పేర్కొనదగినవి.

**విశ్వ విద్యాలయము** : ఢిల్లీయందలి జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీకి చెందిన ఒక శాఖ ఇంఫాలున కలదు.

**దర్శనీయ స్థలములు** : లోక్‌టాక్ సరస్సు.

**పరిపాలన** : విధానసభ కలదు; కార్యనిర్వాహాధికారి గవర్నరు.

---

# 16. మధ్యప్రదేశ్




**వైశాల్యము** : 4,42,841 చ. కిమీ.; జనసంఖ్య: 4,16,54,119; జనసాంద్రత: చ.కిమీ.కు 94 ; అక్షరాస్యత : 22.12 శాతము ; ముఖ్యనగరము భోపాల్; ప్రధాన భాష : హిందీ ; ఇతర ప్రముఖ భాషలు : ఉర్దూ, మరాఠీ; రాజస్థానీ, గుజరాతీ, సింధీ; నదులు : నర్మద, మహానది, తపతి, చంబల్, బేత్వా, సోన్, ఇంద్రావతి, శిప్రా; జిల్లాలు 45; తహశీలులు : 190; గ్రామములు : 70,790; ప్రయిమరీ పాఠశాలలు 44,456 (విద్యార్థులు : 40,75,149 ); ఉన్నత పాఠశాలలు : 1,828 (విద్యార్థులు : 6,18,522)

## జిల్లాలు †

| | జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|---|
| 1. | బాలాఘాట్ | 9,245 | 9,77,583 | బాలాఘాట్ |
| 2. | బస్తర్ | 39,060 | 15,15,956 | జగదలపూర్ |
| 3. | బేతుల్ | 10,061 | 7,36,196 | బేతుల్ |
| 4. | భింద్ | 4,467 | 7,93,955 | భింద్ |
| 5. | బిలాసపూర్ | 19,905 | 24,40,962 | బిలాసపూర్ |
| 6. | ఛత్రపూర్ | 8,690 | 7,12,385 | ఛత్రపూర్ |
| 7. | ఛింద్‌వాడా | 11,824 | 9,89,413 | ఛింద్‌వాడా |
| 8. | దామోహ్ | 7,301 | 5,73,263 | దామోహ్ |
| 9. | దాతియా | 2,034 | 2,55,267 | దాతియా |
| 10. | దీవాస్ | 7,014 | 5,94,336 | దీవాస్ |
| 11. | ధార్ | 8,149 | 8,42,400 | ధార్ |
| 12. | దుర్గ్ | 19,670 | 24,61,901 | దుర్గ్ |
| 13. | తూర్పునిమార్ | 10,705 | 8,79,331 | ఖాండ్‌వా |
| 14. | గూనా | 11,017 | 7,83,748 | గూనా |
| 15. | గ్వాలియర్ | 5,213 | 8,58,005 | గ్వాలియర్ |
| 16. | హోషంగాబాద్ | 10,016 | 8,05,870 | హోషంగాబాద్ |
| 17. | ఇందోర్ | 3,910 | 10,25,150 | ఇందోర్ |
| 18. | జబల్‌పూర్ | 10,164 | 16,86,030 | జబల్‌పూర్ |
| 19. | ఝాబువా | 6,781 | 6,67,811 | ఝాబువా |
| 20. | మందసౌర్ | 9,726 | 9,61,522 | మందసౌర్ |
| 21. | మాండ్లా | 13,257 | 8,73,577 | మాండ్లా |
| 22. | మోరేనా | 11,586 | 9,85,338 | మోరేనా |
| 23. | నరసింహపూర్ | 5,139 | 5,19,270 | నరసింహపూర్ |
| 24. | పన్నా | 7,122 | 4,29,077 | పన్నా |
| 25. | రాయగడ్ | 12,910 | 12.78,705 | రాయగడ్ |
| 26. | రాయపూర్ | 21,251 | 26,13,513 | రాయపూర్ |

† దిగువ వరుస సంఖ్యలు దేశపటము నందలి సంఖ్యలతో సరిపోవును.

| | | | |
|---|---|---|---|
| 27. రాయ్‌సేన్ | 8,395 | 5,53,026 | రాయ్‌పూర్ |
| 28. రాజగడ్ | 6,163 | 6,44,346 | రాజగడ్ |
| 29. రత్లాం | 4,859 | 6,26,534 | రత్లాం |
| 30. రీవా | 6,315 | 9,77,894 | రీవా |
| 31. సాగర్ | 10,246 | 10,6౽,291 | సాగర్ |
| 32. సాత్నా | 7,495 | 9,13,531 | సాత్నా |
| 33. సేహోర్ | 9,015 | 10,84,953 | సేహోర్ |
| 34. సియోనీ | 8,752 | 6,68,352 | సియోనీ |
| 35. షాదోల్ | 14,028 | 10,29,839 | షాదోల్ |
| 36. షాజాపూర్ | 6,201 | 6,78,359 | షాజాపూర్ |
| 37. శివపూర్ | 10,285 | 6,76,567 | శివపూర్ |
| 38. సీధీ | 10,532 | 7,76,786 | సీధీ |
| 39. సుర్‌గూజా | 22,337 | 13,26,432 | అంబికాపూర్ |
| 40. తికమ్‌గడ్ | 5,047 | 5,68,885 | తికంగడ్ |
| 41. ఉజ్జయిని | 6,081 | 8,62,516 | ఉజ్జయిని |
| 42. విదిశా | 7,433 | 6,58,427 | విదిశా |
| 43. పశ్చిమ నిమార్ | 13,441 | 12,84,812 | ఖార్‌గోనే |
| 44. భోపాల్ | 2,763 | 5,72,169 | భోపాల్ |
| 45. రాజనందగావ్ | 11,003 | 9,92,774 | రాజనందగావ్ |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** ఇందోర్ (5,72,622); జబల్‌పూర్ (5,33,751); భోపాల్ (3, 92, 077); దుర్గ్ - భిలాయ్‌నగర్ (2,45,333); గ్వాలియర్ (4, 06, 755); ఉజ్జయిని (2,09,118); రాయపూర్ (2,05,909); సౌగార్ (1,54,811); బిలాసపూర్ (1,30,804); రత్లాం (1,18,625); బర్హాన్‌పూర్ (1,05,349);

**వ్యవసాయము మొ.:** దేశపు రాష్ట్రములందెల్ల వైశాల్యపు లెక్కలలో మొదటిదిగ లెక్కకువచ్చు ఈ రాష్ట్ర భూతలమున 56 శాతమునకుపైగా సాగుబడిలో ఉన్నది; సాగుబడియందున్న భూమి 18,497వేలహెక్టేరులు. ఆర్థికవ్యవస్థచాలవరకు వ్యవసాయముపైననే ఆధారపడి ఉన్నది; ప్రజలలో 84 శాతము పల్లెలలో వసించుచున్నారు; కాని వారిలో 37.3 శాతము మాత్రమే పని పాటులను చేయుచున్నారు. సాగుబడి భూమి చాలవరకు వర్షాధారము. ఆహారధాన్యములను, రొక్కపుపంటలను తన అవసరములకు మించి ఈ రాష్ట్రము పండించుచున్నది. ఆహారపు పంటలలో జొన్న, గోధుమ, వరి, పప్పుధాన్యములు ప్రముఖములు. రొక్కపు పంటలలో నూనెగింజలు, ప్రత్తి, చక్కెర చెరకు

లెక్కింపదగినవి. రాష్ట్రపు వైశాల్యమున 30 శాతము అటవీమయము. ఇందు టేకుచెట్ల అడవి దాదాపు 14 వేల చ. మైళ్లగను, ఏరుమద్దిచెట్ల అడవి 16 వేల చ. మైళ్లగను లెక్కతేలినది.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి** : సాగుబడి భూమిలో 10 శాతమునకు నీటి పారుదల వసతి కలదు. అట్టి వసతులలో చంబల్, తవా, హసదేవ్, మహానది, బర్నా ప్రాజెక్టులు ప్రముఖములు. జలవిద్యుదుత్పత్తికి ఎక్కువ అవకాశములుకలవు. ప్రస్తుతమున (1973-74) విద్యుదుత్పత్తి సమర్థత 757.5 మెవా.

**ఖనిజ సంపద :** ఖనిజ సంపత్తి విరివిగ కలదు; అందును ఆగ్నేయ, తూర్పు ప్రాంతములందు ఆ సంపద అత్యధికము. అందు రాక్షసిబొగ్గు, ముడి ఇనుము, సున్నపురాయి, డోలమైటు, బాక్సయిటు, వజ్రములు, మాంగనీజుల గనులు ముఖ్యముగ పేర్కొనదగినవి.

**పరిశ్రమలు :** భిలాయ్ వద్ద నున్న ఉక్కు కర్మాగారము, భోపాల్‌వద్ద నున్న భారత హెవీ ఎలక్ట్రికల్, ప్రముఖములగు పెద్ద పరిశ్రమలు. జవుళిమిల్లులు 19 కలవు, దేశమున న్యూస్‌ప్రింటును ఉత్పత్తి చేయు ఒకే ఒక కర్మాగారము ఈ రాష్ట్రపు నేపా నగరున ఉన్నది. సిమెంటు, బిస్కట్లు, యింజనీరింగు పరికరములు, పింగాణీ, రేయాన్, కృత్రిమపు పట్టులకు సంబధించిన పరిశ్రమలును అటనట కలవు. అయినను మధ్యప్రదేశ్‌లోని 45 జిల్లాలలో 36 జిల్లాలు పారిశ్రామికముగ వెనుకబడి నవిగనే ఉన్నవి., చేతి పరిశ్రమల విషయమున తివాచీలకు గ్వాలియర్, దుప్పట్లకు మందసార్, పనితనపు చీరెలకు మహేశ్వర్, చందేరి నగరములు పేరొందినవి.

**విశ్వ విద్యాలయములు:** 1 రవిశంకర్ విశ్వ విద్యాలయ, రాయపూర్; 2. జీవాజీరావ్ విశ్వ విద్యాలయ, గ్వాలియర్; 3. విక్రమ విశ్వ విద్యాలయ, ఉజ్జయిని; 4. అవధేర్ ప్రతాపసింగ్ విశ్వ విద్యాలయ, రీవా; 5. ఇందోర్ విశ్వవిద్యాలయ, ఇందోర్; 6. జబల్‌పూర్ విశ్వవిద్యాలయ, జబల్‌పూర్; 7. సౌగర్ విశ్వవిద్యాలయ, సౌగర్; 8. జవహరలాల్ నెహ్రూ కృషి విశ్వవిద్యాలయ, జబల్‌పూర్; 9. భోపాల్ విశ్వవిద్యాలయ, భోపాల్; 10. ఇందిరా సంగీత విశ్వవిద్యాలయ, ఖైరాగడ్.

**దర్శనీయ స్థలములు :** గ్వాలియర్, ఖజురహో, పచ్‌మర్హి, సాంచీ, ఉజ్జయిని, కన్‌హా జాతీయవనము, శివపురీ జాతీయ వనము.

**పరిపాలన :** విధానసభ, విధానపరిషత్తు కలవు; కార్యానిర్వహణాధికారి గవర్నరు

---

# 17. మహారాష్ట్ర




**వైశాల్యము :** 3,07,762 చ.కిమీ. జనసంఖ్య 5,04,12,235; జనసాంద్రత : చ.కిమీ.కు 164; అక్షరాస్యత : 39.18 శాతము ; ముఖ్యనగరము: బొంబాయి; ప్రధాన భాష: మరాఠీ; ఇతర ప్రముఖ భాషలు : హిందీ, గుజరాతీ, కన్నడము, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ; నదులు: గోదావరి, తపతి, పూర్ణా, వర్ధా, వైనగంగా, ఇంద్రావతి, ప్రాణహిత, భీమ, ఘటప్రభ, తీర్ణ, కృష్ణ; జిల్లాలు: 26; తహశీలులు: 232; పట్టణములు: 223; గ్రామసంఖ్య: 35,778; ప్రయిమరీ పాఠశాలలు : 48,271 ( విద్యార్థులు : 72,71,435); ఉన్నత పాఠశాలలు : 5,892 (విద్యార్థులు : 25,20,682).

### జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. అకోలా | 10,567 | 15,01,478 | అకోలా |
| 2. అమరావతి | 12,210 | 15,41,209 | అమరావతి |
| 3. అహమద్‌నగర్ | 17,035 | 22,69,117 | అహమద్‌నగర్ |
| 4. ఉస్మానాబాద్ | 14,117 | 18,96,687 | ఉస్మానాబాద్ |
| 5. ఔరంగాబాద్ | 16,200 | 19,71,006 | ఔరంగాబాద్ |
| 6. కొలాబా | 7,198 | 12,63,003 | కొలాబా |
| 7. కొల్హాపూర్ | 8,059 | 20,48,049 | కొల్హాపూర్ |
| 8. చంద్రపూర్ | 25,641 | 16,40,137 | చంద్రపూర్ |
| 9. జలగాంవ్ | 11,771 | 21,23,121 | జలగాంవ్ |
| 10. థాణా | 9,553 | 22,81,664 | థాణా |
| 11. ధూలియా | 13,143 | 16,62,181 | ధూలియా |
| 12. నాందేడ్ | 10,492 | 13,97,762 | నాందేడ్ |
| 13. నాగపూర్ | 9,928 | 19,42,688 | నాగపూర్ |
| 14. నాసిక్ | 15,582 | 23,69,221 | నాసిక్ |
| 15. పర్భానీ | 12,489 | 15,06,771 | పర్భానీ |

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 16. పూనా | 15,640 | 31,78,029 | పూనా |
| 17. బుల్‌దానా | 9,745 | 12,62.978 | బుల్‌దానా |
| 18. బొంబాయి | 603 | 59,70,575 | బొంబాయి |
| 19. భండారా | 9,214 | 15,85,580 | భండారా |
| 20. భీర్ | 11,127 | 12,86,121 | భీర్ |
| 21. యోత్‌మల్ | 13,925 | 14,23,677 | యోత్‌మల్ |
| 22. రత్నగిరి | 13,040 | 19,90,583 | రత్నగిరి |
| 23 వర్ధా | 6,307 | 7,79,562 | వర్ధా |
| 24. షోలాపూర్ | 15,021 | 22,53,840 | షోలాపూర్ |
| 25. సతారా | 10,492 | 17,27,376 | సతారా |
| 26. సాంగ్లి | 8,563 | 15,39,820 | సాంగ్లి |

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** బొంబాయి ( 59, 70, 575 ); నాగపూర్ (8, 66, 076); పూనా ( 8, 56, 105 ); షోలాపూర్ ( 3, 98, 361 ); కొల్హాపూర్ (2, 59, 050); అమరావతి (1. 93, 800); మాలెగాంవ్ (1,91,847); నాసిక్ (1,76,091); ఠాణా (1,70,675); అకోలా (1,68,438); ఉల్‌హాసనగర్ (1, 68, 462); ఔరంగాబాద్ (1,50,483); ధూలే (1,37,129); నాందేడ్ (1,26,538); అహమద్‌నగర్ (1, 18, 236) సాంగ్లి (1,15,138); జలగాంవ్ (1,06,71);

**వ్యవసాయము మొ. :** ప్రజలలో దాదాపు 70 శాతము వ్యవసాయముపై ఆధారపడి జీవించుచున్నారు. సాగుబడి యందున్న భూమి వైశాల్యము రమారమి 16,060 వేల హెక్టేరులు. ఆహారపు పంటలలో గోధుమ, వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జ, పప్పుధాన్యములు పేర్కొనదగినవి. రొక్కపు పంటలలో ప్రత్తి, నూనెగింజలు, చక్కెర చెరకు, వేరుసెనగ, పొగాకు ప్రముఖములు. 62,224 చ.కిమీల భూమి అటవీమయము; అందలి ఫలసాయమున టేకు కలప ప్రముఖము; తక్కినవానిలో బీడీ ఆకులు, వెదురు, బంక, యక్షదూపం, లక్క, తేనె, మైనం పేర్కొనదగినవి.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** నీటి పారుదల వసతుల విషమున, తక్కిన రాష్ట్రములతో పోల్చినపుడు, ఈ రాష్ట్రము చాల హీనస్థితిలో ఉన్నది. సాగుబడి నేలలో 7.8 శాతమునకు మాత్రమే నీటి పారుదల వసతులు కలవు. విద్యుత్తును ఉత్పత్తి చేయువానిలో కోయినా, పూర్ణా జలవిద్యుత్ ప్రాజెక్టులు ప్రముఖములు. తాప విద్యుత్తుకూడ విరివిగ కలదు. 1974 నాటికి విద్యుదుత్పత్తి సమర్థత 2,133 మెవా.

**ఖనిజ సంపద :** రాష్ట్రమున మాంగనీజు, ముడి ఇనుము, రాక్షసిబొగ్గు, బాక్సయిట్, సున్నపు రాయి గనులు విస్తృతముగ కలవు. అల్పప్రమాణములలో రాగి, టంగస్టయిన్, సీసం, తుత్తునాగం మొదలగునవియు ఉన్నవి. అయినను ప్రముఖము

ములగు ఖనిజములు అన్నియు యోత్‌మల్, భండారా, చంద్రపూర్, కొలాబా, కొల్హాపూర్, రత్నగిరి, ఠాణా జిల్లాలలో మాత్రమే లభించు చున్నవని చెప్పవచ్చును. బొంబాయి సమీపముననే తీరప్రాంతము నుండి పెట్రోలు తీయబడుచున్నది.

**పరిశ్రమలు :** దేశమున రాష్ట్రములందన్నింట మహారాష్ట్ర ఎక్కువగ పారిశ్రామిక వికసనము చెందినది. దేశపు ప్రజానీకమున 9 శాతం మాత్రమే ఇట వసించుచున్నను, జాతీయాదాయమున 12 శాతం ఈ రాష్ట్రమువలన దేశమునకు లభించుచున్నది. ఇచట దేశపు మూలధనములో 17 శాతం, ఫేక్టరీలలో 14 శాతం, పారిశ్రామిక కార్మికవర్గంలో 21 శాతం కలదని అంచనా. జవుళి, రేయాన్, వనస్పతి పరిశ్రమలకు చెందిన పెద్ద కర్మాగారములు అనేకములుకలవు. వీనిలో ఆత్యధికభాగము బొంబాయి నగరమును ఆశ్రయించియే ఉన్నవి. విదర్భ ప్రాంతమున లభించు మాంగనీజువలన, ఫెర్రో-మాంగనీజు పరిశ్రమ ఆట అభివృద్ధి చెందు చున్నది. చక్కెర ఉత్పత్తియందును రాష్ట్రము చాల ముందంజవేసినది. రసాయనములు, ఇంజనీరింగ్ సరుకులు, యంత్రపరికరములు మొదలగు వానికి సంబంధించిన పరిశ్రమలును ఎక్కువగ కలవు. సినిమా పరిశ్రమయందు ఈ రాష్ట్రము అగ్రస్థానమున ఉన్నది. రక్షణశాఖకు, పబ్లిక్ రంగమునకు చెందిన ప్రముఖ పరిశ్రమలును కొన్ని కలవు.

**విశ్వవిద్యాలయములు :** 1. యూనివర్సిటీ ఆఫ్ బాంబే, బొంబాయి; 2. యూనివర్సిటీ ఆఫ్ పూనా, పూనా, 3. నాగపూర్ యూనివర్సిటీ, నాగపూర్; 4. మరాఠ్వాడా యూనివర్సిటీ, ఔరంగాబాద్; 5. శివాజీ యూనివర్సిటీ, కొల్హాపూర్; 6. శ్రీమతి నాథీబాయి దామోదర్ థాకర్సే వుమెన్స్ యూనివర్సిటీ, బొంబాయి; 7. మహాత్మా పూలే అగ్రికల్చరల్ యూనివర్సిటీ, రహూరీ, అహమద్‌నగర్ జిల్లా; 8. పంజాబ్‌రావు దేశముఖ్ అగ్రికల్చరల్ యూనివర్సిటీ, ఆకోలా; 9. కొంకణ్ అగ్రికల్చరల్ యూనివర్సిటీ ( కృషి విద్యాపీఠ్ ), దపోలీ, రత్నగిరి జిల్లా; 10. మరాఠ్వాడా అగ్రికల్చరల్ యూనివర్సిటీ, పర్భానీ.

**దర్శనీయ స్థలములు :** అజంతా, ఎల్లోరా, ఔరంగాబాద్, దౌలతాబాద్, బొంబాయి, ఎలిఫెంటా గుహలు, మహాబలేశ్వర్, నాసిక్, పూనా, సేవాగ్రామ్, బొరివ్లీ జాతీయ వనము; నగజీరా వన్యజంతు శరణ్యము; ఠాన్సా సరోవర వన్యజీవి శరణ్యము.

**పరిపాలన :** విధానసభ, విధానపరిషత్తు కలవు. కార్యనిర్వహణాధికారి గవర్నరు.

---

# 18. మేఘాలయ




**వైశాల్యము :** 22,489 చ. కిమీ; జనసంఖ్య 10, 11, 699; జనసాంద్రత : చ.కిమీ.కు 45; అక్షరాస్యత : 29.49 శాతము ; ముఖ్యనగరము : షిల్లాంగ్; ప్రధాన భాషలు : ఖాసీ, జయంతియా, గారో, అనునవి ప్రధాన తెగల భాషలు; ఇంగ్లీషు అధికార భాషగ ప్రభుత్వామోదమును పొందినది; నదులు : బోగపానీ, కైన్షీ, కుప్లీ, డిగ్రు, జింజీరాంమ్, సింసాంగ్; జిల్లాలు : 3; గ్రామములు: 4583; విద్యాసంస్థల మొత్తపు సంఖ్య : 3604 (వానిలో విద్యార్థి సంఖ్య : 2,34,061).

**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. జయంతియా హిల్స్ | 3,863 | 1,91,875 | జోవయ్ |
| 2. ఖాసీ హిల్స్ | 10,542 | 4,91,209 | షిల్లాంగ్ |
| 3. గారోహిల్స్ | 8,085 | 4,06,615 | తురా |

**ప్రధాన నగరములు, వాని జనసంఖ్యలు :** షిల్లాంగ్ ( 1,22,752 ); తురా ( 15,489 ); జోవై (8,929).

**వ్యవసాయము :** ప్రజలలో 80.15 శాతం షెడ్యూల్డ్ తెగలును, 0.31 శాతం షెడ్యూల్డ్ కులములుగను ఉన్న ఈ రాష్ట్రమున వ్యవసాయమే 85 శాతమునకు ఏకైక జీవనాధారము; కాని వ్యవసాయానుకూలమగు భూమి 164 వేల హె. మాత్రమే. పోడు వ్యవసాయము ఎక్కువగ జరుగును. కాని స్థిరవ్యవసాయమును ప్రోత్సహించుటకై ప్రభుత్వము కృషిచేయుచున్నది. ఉరలగడ్డ, చక్కెర చెరకు, నూనెగింజలు, ప్రత్తి, జనుము, మెస్తా, తేజ్‌పాతా, పొగాకు, పోకచెక్క, ప్రముఖములగు పంటలు. ఎక్కువ దిగుబడిని ఇచ్చు వరి వంగడములను, గోధుమ, మొక్కజొన్నను పండించుటకు ప్రభుత్వము ప్రోత్సాహము కల్పించుచున్నది. ఖాసీ, జయంతియా కొండలలో పండ్లును, కూరలును విరివిగ పండింపబడుచున్నవి పండ్లలో అనాస, నారింజ, అరటి పండ్లు ప్రముఖములు. పశుపోషణ చాలమందికి ఆధారము; ఇటనుండి పాలు, అస్సామునకు ప్రతిదినమున ఎగుమతి చేయబడుచున్నవి. అటవీభూమి వైశాల్యము 740 వేల హె.; అందు మంచిజాతికి చెందిన కలప లభించుచున్నది. ప్రపంచమున విపరీత వర్షపాతమునకు పేరొందిన చిరపుంజి ఈ రాష్ట్రముననే కలదు.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** కొండ వాగులను అరికట్టగా ఏర్పడిన జలాశయముల వలన, సాగుబడిభూమిలో 27 శాతమునకు నీటి పారుదల వసతులు ఏర్పడినవి; విద్యుదుత్పత్తి సమర్థత 56 మెవా. (1973).

**ఖనిజ సంపద:** ఖనిజములు విరివిగ ఉండు అవకాశము కలదు; కాని వానిని గురించిన పరిశీలన బాగుగ జరుపబడలేదు. తెలియవచ్చిన వానిలో ప్రముఖము రాతిబొగ్గు; దాని నిలువలు దాదాపు 120 కోట్ల టన్నులు ఉండగలవని అంచనా. తక్కిన వానిలో సున్నపురాతి నిలువలు, తెల్ల మృత్తిక పేర్కొనదగినవి.

**పరిశ్రమలు:** సిమెంటు, కలపపనులకు సంబంధించిన కొన్ని ఫేక్టరీలు చిరపుంజి, దారుగిరి ప్రాంతములలో కలవు.

**విశ్వవిద్యాలయములు:** నార్తు ఈస్టరన్ హిల్ యూనివర్సిటీ అను ఒకే ఒక విశ్వవిద్యాలయము షిల్లాంగ్‌న కలదు.

**దర్శనీయ స్థలములు:** ఉమియం సరస్సు, క్రైలాంగ్ ఏకశిల నోసంతింగ్ జలపాతము.

**పరిపాలన:** విధానసభ కలదు; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

---

# 19. రాజస్థాన్




**వైశాల్యము:** 3,42,214 చ. కిమీ. జనసంఖ్య : 2,57,65,806; జనసాంద్రత: చ.కిమీ.కు 75; అక్షరాస్యత: 19.07 శాతము; ముఖ్యనగరము: జయపూర్; ప్రధాన భాషలు : రాజస్థానీ, హిందీ; ఇతర ముఖ్య భాషలు: గుజరాతీ, ఉర్దూ; నదులు : లూనీ, చంబల్, బనస్, మహీ, సబర్మతీ, బందీ, సరస్వతీ, కాలీసింధు, పర్వతీ, బెరాచ్; జిల్లాలు: 26; 196 తహశీల్‌లు; గ్రామసంఖ్య 33,305. ప్రయిమరీ పాఠశాలలు : 19,891; ఉన్నత పాఠశాలలు : 4,632.

### జిల్లాలు

| జిల్లా | వైశాల్యము చ.కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. అజ్మీర్ | 8,479 | 11,47,729 | అజ్మీర్ |
| 2. ఆల్వార్ | 8,382 | 13,91,162 | ఆల్వార్ |
| 3. ఉదయపూర్ | 17,267 | 18,03,680 | ఉదయపూర్ |
| 4. కోట | 12,437 | 11,43,870 | కోట |
| 5. గంగానగర్ | 20,629 | 13,94,011 | గంగానగర్ |

| జిల్లా | వైశాల్యము చ. కిమీ, | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 6. చితోడ్‌గడ్ | 10,858 | 9,44,981 | చితోడ్‌గడ్ |
| 7. చూరూ | 16,829 | 8,74,439 | చూరూ |
| 8. జయపూర్ | 14,000 | 24,82,385 | జయపూర్ |
| 9. జయసాల్ మేర్ | 38,401 | 1,66,761 | జయసాల్ మేర్ |
| 10. జాలోర్ | 10,640 | 6,67,950 | జాలోర్ |
| 11. జోధ్‌పూర్ | 22,860 | 11,52,712 | జోధ్‌పూర్ |
| 12. ఝులావర్ | 6,216 | 6,22,001 | ఝులావర్ |
| 13. ఝుంఝూనూన్ | 5,929 | 9,29,230 | ఝుంఝూనూన్ |
| 14. టోంక్ | 7,200 | 6,25,830 | టోంక్ |
| 15. డుంగర్‌పూర్ | 3,770 | 5,30,258 | డుంగర్‌పూర్ |
| 16. నాగౌర్ | 17,718 | 12,62,157 | నాగౌర్ |
| 17. పాలీ | 12,391 | 9,70,002 | పాలీ |
| 18. బన్స్‌వాడా | 5,037 | 6,54,586 | బన్స్‌వాడా |
| 19. బర్ మేర్ | 28,387 | 7,74,805 | బర్ మేర్ |
| 20. బికనీర్ | 27,231 | 5,73,249 | బికనీరు |
| 21. బుంది | 5,550 | 4,49,031 | బూంది |
| 22. భరతపూర్ | 8,093 | 14,90,206 | భరతపూర్ |
| 23. భిల్ వాడా | 10,450 | 10,54,890 | భిల్ వాడా |
| 24. సవాయ్ మాధవపూర్ | 10,593 | 11,93,523 | సవాయ్ మాధవపూర్ |
| 25. సికార్ | 7,732 | 10,42,648 | సికార్ |
| 26. సిరోహి | 5,135 | 4,23,815 | సిరోహి |

**ప్రముఖ నగరములు వాని జనసంఖ్యలు :** జయపూర్ (6, 15, 258): జోధ్‌పూర్ (3, 17, 612); అజ్మీర్ (2, 64, 291); కోట (2,12,991); బికనీర్ (1,88,518); ఉదయపూర్ (1,61,278); అల్వార్ (1,00,378).

**వ్యవసాయము మొ.:** రాష్ట్రమున 158 లక్షల హె. భూమి సాగున ఉన్నది. తొలుత ఆహార విషయమున లోటుప్రాంతముగ ఉన్న ఈ రాష్ట్రము 1967-68 నుండి దాదాపుగ స్వయం పోషకతను ఆర్జించినది; అయినను అంతటంతట కరు

వులబాధ కలదు. సాగుబడి చాలవరకు వర్షాధారము. జొన్న, సజ్జ, మొక్కజొన్న, గోధుమ, నూనె గింజలు, ప్రత్తి, చక్కెర చెరకు, పొగాకు ముఖ్యములగు పంటలు. భూతలమున 10.6 శాతము ( 36, 164 చ. కిమీ. ) ఆటవీమయము; అందు దొరకు చేకుకలప చాల తక్కువ తరగతిది. ఎడారులందలి ప్రజలు పశుపోషణవలన జీవించుచున్నారు.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** దాదాపు 25 లక్షల హె. లకు మాత్రమే నీటిపారుదల వసతులు కలవు; అందును దాదాపు 76 శాతం బావుల, చెరువుల సాయమున సాగుచున్నవి. తక్కిన నీటి పారుదల వసతులలో కోట బారేజి, రాణా ప్రతాప సాగర్ ప్రముఖములు. కాని కొన్ని నీటిపారుదల వసతుల నిర్మాణము తొలిదశలో ఉన్నది. అట్టి వానిలో ప్రముఖము రాజస్థాన్ కాలువ. ఇది పూర్తియైనపుడు ప్రపంచ కాలువలందు అన్నింట పొడవున గొప్పదిగ లెక్కకు రాగలదు. దీని వలన రాజస్థానపు ఎడారులు సస్యశ్యామలములు కాగలవు. విద్యుదుత్పత్తి సామర్థ్యము 785.53 మెవా. (1974-75). విద్యుదుత్పత్తికి జవహర్ సాగర్, రాణాప్రతాపసాగర్, కోటవద్దనున్న ఆణవిక శక్తి కర్మాగారము ముఖ్యాధారములు.

**ఖనిజ సంపద :** ఈ రాష్ట్రము ఖనిజముల గిడ్డంగిగ, భూగర్భశాస్త్రవేత్తలు చెప్పుచున్నను, వాని ఉనికిని గురించి సమగ్ర పరిశీలన ఇంకను జరుగలేదు. భారత దేశపు సీసము, ముడితుత్తునాగము, మరకతములు, పుష్యరాగములు దాదాపు సంపూర్తిగ ఇటనే లభించుచున్నవి. ఇక దేశపు జిప్సంలో 92 శాతం, వెండిలో 90 శాతం, రాతి నారలో 75 శాతం, అభ్రకంలో 20 శాతం ఇట గనులనుండి తీయబడుచున్నవి. రాతి ఉప్పుగనులు సంభార్ మొదలగు ప్రాంతము లందు విరివిగ కలవు.

**పరిశ్రమములు :** జవుళీ, కంబళ్లు, ఉన్ని వస్తువులు, చక్కెర, సిమెంటు, గాజు, సోడియం, ఆక్సిజన్ తయారు చేయు సంస్థలును, క్రిమి సంహారకములు, రంగులు ఉత్పత్తిచేయు ఫేక్టరీలును కలవు. పబ్లిక్ రంగమునకు చెందినవానిలో కోట వద్ద ఉన్న సునిశిత పరికరముల ఫేక్టరీ ప్రముఖము. ఈరాష్ట్రము సాంప్రదాయికముగ చేతిపనులకు కుశలతకు పేరొందినది. వానిలో చలువరాతి శిల్పము, తివాచీనేత, నగలతయారీ, కుట్టుపని, చర్మపు వస్తువుల తయారీ, ఇత్తడిపని, కుమ్మరిపని ప్రముఖములు.

**విశ్వవిద్యాలయములు** . 1. యూనివర్సిటీ ఆఫ్ రాజస్థాన్, జయపూర్; 2. యూనివర్సిటీ ఆఫ్ జోధ్‌పూర్, జోధ్‌పూర్; 3. యూనివర్సిటీ ఆఫ్ ఉదయపూర్, ఉదయపూర్; 4. బిర్లా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగ్ & టెక్నాలజీ, పిలాని.

**దర్శనీయ స్థలములు :** అబూ పర్వతము ; అజ్మీర్ ; భరతపూర్ ; బికనీర్ : జయపూర్ ; జోధ్‌పూర్ ; ఉదయపూర్; రతంభోర్, సరిస్కాలలోని జంతు శరణ్యములు.

**పరిపాలన :** విధానసభ కలదు ; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

---

# 20. సిక్కిం†

**వైశాల్యము** : 7300 చ. కిమీ.; భారతదేశపు ఉత్తర సరిహద్దున ఒక భాగమున ఒక కీలక స్థానమున ఈ రాష్ట్రము ఉన్నది. దీనికి ఉత్తరమున చీనాకు చెందిన తిబెత్, పశ్చిమమున నేపాల్ దేశము, తూర్పున భూటాన్; దక్షిణమున పొరుగు రాష్ట్రమగు పశ్చిమ బెంగాల్ కలవు. జనసంఖ్య 2,08,609; జనసాంద్రత : చ.కిమీ.కు 28.6; అక్షరాస్యత : వివరములు తెలియవు; ముఖ్యనగరము : గాంగ్ టోక్; ప్రధాన భాషలు : నేపాలీ, తిబెతీ; నదులు : తిస్తా అనునదియే పేర్కొనదగినది; జిల్లాలు : 4; గ్రామసంఖ్య తెలియవచ్చుట లేదు; ప్రయిమరీ పాఠశాలలు: 226; ఉన్నతపాఠశాలలు: 35; అన్ని విద్యాసంస్థల విద్యార్థి సంఖ్య: దాదాపు 25,000.

**జిల్లాలు** : రాష్ట్రమున నాలుగు జిల్లాలు కలవు; వాని వైశాల్యములు తెలియవచ్చుటలేదు; వాని పేరులును జనసంఖ్యలును ఈరీతిగ ఉన్నవి: 1. సింగ్ తమ్ (85,621); 2. మంగాన్ (13,104); 3. నాంచీ (52,423); 4. గ్యాల్ జింగ్ (58,785)

**ప్రముఖ నగరములు** : పెద్ద నగరములు ఏవియు లేవు; ఉన్నవానిలో గాంగ్ టోక్ ప్రముఖము; దాని జనసంఖ్య : 15 వేలు.

**వ్యవసాయము మొ.** : రాష్ట్రము పర్వతమయము. భూతలమున దాదాపు మూడవభాగము అటవీమయము. 7000,మీ. ఎత్తునకు మించిన పర్వతములు ఇట కలవు. ఇచటి అడవులయందలి వృక్షవిశేషములను గురించి సమగ్రపరిశీలన జరుపబడలేదు. సాగుబడినేల విస్తీర్ణము తెలియవచ్చుట లేదు; ఆహారపు పంటలలో వరి, మొక్కజొన్న ముఖ్యములు. కాని రాష్ట్రపు అవసరములకు తగినంతగ ఉత్పత్తి లేనందున, ఆహారధాన్యములను ఈ రాష్ట్రము దిగుమతి చేసికొనుచున్నది. కాని యాలక్కాయలు ఇచట విరివిగ పండుచున్నవి; అవి దాదాపు సాలున 200 టన్నులుపండునని అంచనా. ఇవిగాక నారింజ, యాపిల్ పండ్లును ఉరలగడ్డలును ఇటనుండి విరివిగ ఎగుమతి అగుచున్నవి. పశుపోషణ పలువురకు జీవనాధారము ; వానివలన ఉన్ని, చర్మములు ఎగుమతికి౧, ప్రజలవాడుకకును లభించుచున్నవి.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి** : చెప్పదగిన నీటిపారుదల వసతులు లేవు; నాలుగు జలవిద్యుదుత్పత్తి స్టేషనులు కలువు.

**ఖనిజ సంపద** : ఖనిజములు భూగర్భమున విశేషముగ ఉన్నటుల శాస్త్రజ్ఞుల అభిప్రాయము. వాని పరిశీలన కొంత జరిగినను, అది సమగ్రము కాదు. ఉన్నత స్థాయికి చెందిన బంగారు, వెండి, రాగి, తుత్తునాగముల గనులు అటనట కనుగొనబడినవి.

**పరిశ్రమలు** : చెప్పదగిన పెద్ద పరిశ్రమలు ఏవియులేవు. కాని ప్రజలలో పలువురు చేతిపనులందును, కుటీర పరిశ్రమలందును నేర్పుకలవారు.

---

† ఈ రాష్ట్రము- తొలుత కొంత స్వయం ప్రతిపత్తితో ఉండి, తరువాత అందలి ప్రజల స్వతంత్ర నిర్ణయమును అనుసరించి 1975లో భారతదేశపు రాష్ట్రములందు ఒకటిగ రూపొందినది, అందువలన దాని సంఖ్యా వివరములు 1971 లెక్కలలో చేరలేదు.

అడవుల ఉత్పత్తులను ఆశ్రయించిన పరిశ్రమలను-కాగితపు గుజ్జు ఫేక్టరీ వంటివానిని-నెలకొల్పుటకు కృషి జరుగుచున్నది.

**విశ్వవిద్యాలయములు :** ఇదివరలో ఉన్నత పాఠశాలా స్థాయివరకే విద్యాబోధనకు వసతులు ఉండెడివి. కాని 1976 నుండి ఒక కళాశాల పనిచేయుట మొదలిడినది. విశ్వవిద్యాలయములు ఎట్టివియు లేవు.

**దర్శనీయ స్థలములు :** కాంచనగంగ మొదలగు హిమాలయ శిఖరములు, గాంగ్‌టోక్,

**పరిపాలన :** విధానసభ కలదు; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

# 21. హర్యానా




**వైశాల్యము :** 44,222 చ. కిమీ; జనసంఖ్య 1,00,36,808; జనసాంద్రత: చ. కిమీ.కు. 227; అక్షరాస్యత 26.89 శాతము; ముఖ్యనగరము : చండీఘర్ (కాని ఇది ఈ రాష్ట్రమునకు చెందక, కేంద్రపాలిత ప్రాంతముగ ఉన్నది); ప్రధానభాష : హిందీ; ఇతర ప్రముఖ భాషలు : పంజాబీ, ఉర్దూ; నదులు: చెప్పదగినవి లేవు; కాని పేరొందిన రెండు పెద్ద సరస్సులు-బద్‌ఖాల్ సరస్సు, చక్రవర్తి సరస్సు-కలవు. జిల్లాల సంఖ్య : 11; పట్టణముల సంఖ్య 65; గ్రామ సంఖ్య: 7,064 (జనులు నివసించునవి : 6,731); పాఠశాలల మొత్తపు సంఖ్య 7,013; అందలి విద్యార్థుల సంఖ్య : 16,08,464.

**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యము చ.కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. అంబాలా | 3,833 | 10,98,405 | అంబాలా |
| 2. కర్నాల్ | 3,725 | 9,88,437 | కర్నాల్ |
| 3. కురుక్షేత్ర | 3,738 | 8,62,899 | కురుక్షేత్ర |
| 4. గుర్‌గాంవ్ | 4,889 | 13,72,197 | గురుగాంవ్ |
| 5. జీంద్ | 3,311 | 7,72,111 | జీంద్ |
| 6. భివానీ | 5,090 | 7,61,953 | భివానీ |

| జిల్లా | వైశాల్యము చ. కిమీ. | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 7. మహేందర్‌గడ్ | 2,983 | 7,34,143 | నార్నాల్ |
| 8. రోహ్‌టక్ | 3,843 | 10,98,548 | రోహ్‌టక్ |
| 9. సిర్సా | 4,271 | 5,33,604 | సిర్సా |
| 10. సోనేపట్ | 2,200 | 6,86,986 | సోనేపట్ |
| 11. హిస్సార్ | 6,339 | 11,17,525 | హిస్సార్ |

**వ్యవసాయము మొ.** : రాష్ట్రపు ఆర్థికవ్యవస్థ చాలవరకు వ్యవసాయముపై ఆధారపడి ఉన్నది. కాని ఆ రంగమున గత కొలది సంవత్సరములలో అత్యద్భుతమగు పురోగతిని ఈ రాష్ట్రము సాధించినది. సాగున ఉన్నభూమి 37.38 లక్షల హెక్టేరులు; గోధుమ, సజ్జ, మొక్కజొన్న. చక్కెర చెరకు, ఆవాలు, ప్రత్తి ముఖ్యములగు పంటలు. పశుపోషణ పలువురకు ఆధారము; రోజుకు సగటున 44.35 లక్షల పాలు లభించుచున్నవి. హర్యానాకు చెందిన ఆవు, ముర్రాగేదె దేశమంతట ప్రసిద్ధములు. అటవీభూమి చాలా తక్కువ; రాష్ట్రమున 3.4 శాతము మాత్రమే అటవీ భూమి; అదియు అత్యధికముగ అంబాలా జిల్లాయందున్నది.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి** : వర్షపాతము తక్కువ అగుటవలన, పలువిధముల నీటివసతులపై-ముఖ్యముగ గొట్టపు బావులపై-ఇచటి సాగుబడి ఆధారపడి ఉన్నది; గొట్టపు బావులసంఖ్య 96 వేలు (1971). ఉన్న పెద్ద నీటివసతి పశ్చిమ యమునా కాలువ ప్రాజెక్ట్ మాత్రమే. విద్యుదుత్పత్తిలో ఈ రాష్ట్రము గర్వకారణమగు పురోగతిని సాధించినది. గ్రామములకు అన్నింటికి విద్యుత్తు లభించుచున్నది. అయినను విద్యుదుత్పత్తి తగినంతగ లేకుండుట వలన ప్రక్క రాష్ట్రములపై కొంతవరకు ఆధారపడ వలసిఉన్నది. ఈలోటును సర్దుకొనుటకై ఫరీదాబాద్, పానిపట్‌ల వద్ద విద్యుదుత్పత్తి ప్రాజెక్టులు క్రొత్తగ నెలకొల్ప బడుచున్నవి, రాష్ట్రపు విద్యుదుత్పత్తి సమర్థత 504 మెవా. (1971). తలసరి విద్యుద్వి నియోగము 113 కివా. (1974-75).

**ఖనిజ సంపద** : రాష్ట్రమున ఖనిజ సంపత్తి చాల తక్కువ. సున్నపురాయి, పలకరాయి, మృత్తికలు, ఇతర అప్రముఖ ఖనిజములు మాత్రము కొంత విరివిగ లభించుచున్నవి.

**పరిశ్రమలు** : ఢిల్లీకి అతి సమీపమున ఉండుట వలన తగిన రాకపోకల వసతులు ఏర్పడి పరిశ్రమలకు అనువగు పరిస్థితులు ఇచట రూపొందినవి. దాదాపు 12 జవుళిమిల్లులు, రెండు కాగితపు మిల్లులు రెండు సిమెంటు ఫేక్టరీలు, కొన్ని చక్కెర ఫేక్టరీలు కలవు. బైసికిళ్ల, కుట్టుయంత్రముల విడిభాగముల నిర్మాణపు సంస్థలును కొన్ని కలవు. గాజు పనులకును, విజ్ఞానశాస్త్రీయ పరికరములకును అంబాలా ప్రసిద్ధము. మోటారుల విడిభాగములు, మోటారు సైకిళ్ల,టైర్ల కర్మాగారములు వల్లభఘర్, ఫరీదాబాద్, బహదూర్‌గడ్‌లలో కలవు.

**విశ్వవిద్యాలయములు** : 1. హర్యానా అగ్రికల్చరల్ యూనివర్సిటీ, హిస్సార్; 2. కురుక్షేత్ర యూనివర్సిటీ, కురుక్షేత్ర.

**దర్శనీయ స్థలములు** : కురుక్షేత్ర, అస్థల్ బోహర్, ఖోక్రాకోట్ (రోహ్‌టక్), సుఘ్ (అంబాలా), మితకాల్ (హిస్సార్,) బద్‌ఖాల్ సరస్సు, సోనా జలకుండము, సూరజ్‌కుండ్. చక్రవర్తి సరస్సు, సుల్తాన్‌పూరు పక్షిశరణ్యము.

**పరిపాలన** : విధాన సభ కలదు; కార్యనిర్వహణాధికారి గవర్నరు.

# 22. హిమాచల ప్రదేశ్

**వైశాల్యము :** 55,673 చ. కిమీ.; జనసంఖ్య 34,60,434; జనసాంద్రత : చ. కిమీ. కు 62; అక్షరాస్యత: 31.32 శాతం; ముఖ్యనగరము : సిమ్లా; ప్రధానభాష: హిందీ; నదులు: సట్లెజ్, రావీ, బియాస్, చీనాబ్, యమున; జిల్లాల సంఖ్య: 12; పట్టణముల సంఖ్య 36; గ్రామసంఖ్య 16,916; ప్రయిమరీ పాఠశాలలు: 3,894 (విద్యార్థులు 4,15,628); ఉన్నత పాఠశాలలు : 486 (విద్యార్థులు 55 776).




**జిల్లాలు**

| జిల్లా | వైశాల్యము చ.కిమీ | జనసంఖ్య | ముఖ్యనగరము |
|---|---|---|---|
| 1. ఊనా | 1,500 | 2,61,337 | ఊనా |
| 2. కాంగ్రా | 5,300 | 8,00.863 | ధర్మశాల |
| 3. కిన్నార్ | 6,600 | 49,835 | కాల్పా |
| 4. కూలూ | 5,400 | 1,92,371 | కూలూ |
| 5. చంబా | 8,200 | 2,55,233 | చంబా |
| 6. బిలాసపూర్ | 1,200 | 1,94,786 | బిలాసపూర్ |
| 7. మండీ | 4,000 | 5,15 180 | మండీ |
| 8. లాహుల్ స్పితీ | 12,000 | 24,538 | కైలాంగ్ |
| 9. సిమ్లా | 5,000 | 4,19,844 | సిమ్లా |
| 10. సిర్‌మూర్ | 2,800 | 2,45,033 | నహాన్ |
| 11. సోలాన్ | 2,100 | 2,37,403 | సోలాన్ |
| 12. హమీర్‌పూర్ | 1,600 | 2,65,011 | హమీర్‌పూర్ |

**వ్యవసాయము మొ.:** రాష్ట్రపు భూతలమున 60 శాతమునకుపైగా సేద్యమునకు అననుకూలముగానో, అటవీమయముగానో ఉన్నది. సాగునఉన్న భూమి 559 వేల హెక్టేరులు మాత్రమే. అయినను ప్రజలలో 76 శాతమునకు వ్యవసాయము, పండ్లతోటల పెంపకము జీవనాధారములు. ఆహారపు పంటలలో గోధుమ, మొక్కజొన్న, వరి ప్రముఖములు. యాపిల్ పండ్లు ఇట తోటలలో విరివిగ లభించును; అందు చాల భాగము ఎగుమతి అగుచున్నవి. అవిగాక తక్కువిధముల పండ్లును గణనీయ ప్రమాణములలో లభించుచున్నవి. భూతలమున 38.3 శాతం అటవీమయము. మంచిరకపు కలప, యక్షధూపము ఇట లభించును. ప్రభుత్వపు ఆదాయమున నాలుగవ భాగము అడవుల వలన వచ్చుచున్నది.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** సాగుబడి నేలలో 16.6 శాతమున మాత్రమే నీటి పారుదల వసతులు కలవు. ఈ వసతులలో ఏదియు పెద్ద తరగతికి చెందినది కాదు. సట్లెజ్, బియాస్ నదులు విద్యుదుత్పత్తికి ఉపయోగ పడుచున్నవి. రాష్ట్రపు విద్యుదుత్పత్తి 1,626 లక్షల కివా. (1972-73). తలసరి విద్యుద్వినియోగము 53.8 కివా.

**ఖనిజ సంపద :** రాతి ఉప్పు, జిప్సం, బెరైటిస్, సున్నపురాయి, పలకరాయి మాత్రమే పేర్కొనదగిన ఖనిజములు. ఇవియు చాలవరకు సిర్‌మూర్, బిలాసపూర్, సిమ్లా, చంబా, కాంగ్డా జిల్లాలలో కలవు.

**పరిశ్రమలు :** రాష్ట్రపు వివిధ ప్రదేశముల మధ్య రాకపోకలకు, భౌతిక పరిస్థితుల రీత్యా, తగు అవకాశములు లేకుండుట పరిశ్రమల అభివృద్ధికి ఒక గొప్ప ఆటంకముగ పరిణమించినది. నహాన్‌వద్ద ఉక్కుపని కర్మాగారము, కర్పూర తైలము ఫేక్టరీ; సోలాన్‌వద్ద ఉన్న పానీయ కర్మాగారమును, రాజావన్‌లోని సిమెంట్ ఫేక్టరీయు మాత్రమే లెక్కింపదగిన పరిశ్రమలు. భూత అద్దములు, ఎలక్ట్రిక్ మోటార్లు, గడియారపు విడిభాగములు, వైద్య ధర్మామీటర్లు, పారిశ్రామిక ధర్మామీటర్లకు సంబంధించిన చిన్న తరగతి పరిశ్రమలు కొన్ని కలవు. పల్లెపట్టులందు గొర్రెల పెంపకము, కొయ్యపని, కమ్మరము పలువురకు జీవనాధారములుగ ఉపకరించుచున్నవి.

**విశ్వవిద్యాలయములు :** 1. హిమాచల ప్రదేశ్ యూనివర్సిటి, సిమ్లా.

**దర్శనీయ స్థలములు :** గ్రీష్మర్తువున వసించుట కనువగు పర్వతస్థావరములు ఇట కలవు. వానిలో సిమ్లా, డల్‌హౌసీ, ధర్మశాల, కూలూ, మనాలి, కసౌలీ, సోలాన్, కాంగ్డా, కుఫ్రీ ప్రముఖములు.

**పరిపాలన :** విధానసభ కలదు; కార్య నిర్వాహణాధికారి గవర్నరు.

# 1. అండమాన్ - నికోబార్ దీవులు

**వైశాల్యము** : 8,293 చ. కిమీ.; జనసంఖ్య : 1,15,133 ; జనసాంద్రత : చ కిమీ. కు. 14 ; అక్షరాస్యత 43.59 శాతము; ముఖ్యనగరము. పోర్ట్ బ్లయర్ (ఇది దక్షిణ అండమాన్ దీవిలో ఉన్నది).

ఈ కేంద్రపాలిత ప్రాంతమున బంగాళాఖాతము నందలి 224 ద్వీపములు చేరి ఉన్నవి. వీనిలో నికోబార్ వర్గమున 19 దీవులు మాత్రమే కలవు. తక్కినవి అండమాన్ వర్గమునకు చెందినవి. బంగాళా ఖాతమున 6° నుండి 14° ఉ. అ. రేఖల వరకును 92° నుండి 94° తులారేఖలవరకును ఈ ద్వీప ప్రాంతము విస్తరించి ఉన్నది. అండమాన్, నికోబార్ ద్వీపవర్గముల మధ్య డిగ్రీ కాలువ అన బడు సముద్రశాఖ కలదు. ముఖ్యనగరమగు పోర్ట్ బ్లయర్, సముద్రమార్గమున కలకత్తా నుండి 1,255 కిమీ. ల. దూరముననను, మదరాసునుండి 1,191 కిమీ.ల. దూరముననను ఉన్నది. ఈ ప్రాంత మున ఉన్న ఆదిమవాసుల సంతతియందు ప్రాచీన నెగ్రిటో భాషలు ప్రచారమున ఉన్నవి ఆ ఆది 18,102 మాత్రమే వాసులసంఖ్య. వలసచేరిన భారతీయ ప్రజలలో వివిధ భాషలు ప్రచారమున ఉన్నను, అందు బెంగాలీ. తమిళ్, హిందీ, తెలుగు ప్రముఖములు. పరిపాలనకై నాలుగు డివిజనులుగ ప్రాంతము విభక్తము, గ్రామ సంఖ్య 399.

**డివిజనులు, (వాని వైశాల్యములు బ్రాకెట్లలో)**: 1. మాయారబందర్ ( 3,330 చ. కిమీ. ); 2. దక్షిణ అండమాన్ (3,010 చ. కిమీ.); 3. కార్ నికోబార్ ( 129 చ. కిమీ. ); 4. నాన్‌కౌరీ (1,824 చ.కిమీ.); ఈ డివిజనులందలి జనసంఖ్యా వివరములు తెలియవచ్చుట లేదు.

**వ్యవసాయము మొ.** : ప్రాంతపు ప్రజలందలి శ్రామిక జనమున 19% మాత్రమే వ్యవసాయ కృషిలో పాల్గొను చున్నారు. సాగునఉన్న భూమి 11 వేల హెక్టేరులు అందు దాదాపు 9,000 హె లలో వరి పండింపబడుచున్నది. తక్కిన పంట లలో చక్కెర చెరకు, పప్పుధాన్యాలు, పండ్లు, కూరలు పేర్కొనదగినవి. ప్రాయోగిక రీతిలో రబ్బరుచెట్ల తోటలు కొన్ని ప్రదేశములలో పెంచ బడుచున్నవి. దాదాపు 7,500 చ. కిమీ. అటవీ మయము; అందును కలపవిలువలో అండమాను లోని అడవులు చెప్పుకొనదగినవి. మత్స్యపరిశ్ర మకు చాల అవకాశములు కలవు.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి:** సాగుభూముల నీటిపారుదలకు బావులే ముఖ్యాధారములు. ప్రాంత మున నెలకొనిన విద్యుదుత్పత్తి సామర్థ్యము 3.08 మెవా. (1974).

**ఖనిజ సంపద :** సమగ్రమగు పరిశీలన జరుగ కున్నందున, వివరములు తెలియవు. నికెల్ వర్గ మునకు చెందిన ముడిఖనిజములును, పెట్రోలును లభింపవచ్చునని అభిజ్ఞుల అంచనా.

**పరిశ్రమలు :** నూనె, ప్లయివుడ్, నార, నిప్పు పెట్టెలకు సంబంధించిన చిన్న పరిశ్రమలు కలవు. రంపపు మిల్లులు కొన్ని కలవు.

**విశ్వవిద్యాలయములు :** ఎట్టివియు లేవు; ఒక కళాశాల మాత్రము కలదు. పాఠశాలల సంఖ్య 202, అందలి విద్యార్థులు 23,949.

**దర్శనీయ స్థలములు:** పోర్ట్‌బ్లయిర్, రంగత్, మాయాబందర్, కార్ నికోబార్.

**పరిపాలన :** రాష్ట్రపతి, ఇచటి పరిపాలనను, ఒక చీఫ్ కమీషనర్ ద్వారా నిర్వహించును.

# 2. అరుణాచల ప్రదేశ్

**వైశాల్యము:** 83,578 చ. కిమీ.; జనసంఖ్య: 4,67,511; జనసాంద్రత చ. కిమీ. కు. 5.6; **అక్షరాస్యత** 11.29 శాతము ; ముఖ్యనగరము: ఐతానగర్ ; ప్రధాన భాష : ప్రాంతమున వసించు వేర్వేరు తెగలు వేర్వేరు ప్రాంతీయ భాషలు మాటాడు చున్నారు. ఇంగ్లీషు సామాన్యభాషగ, విద్యావంతు లలో వాడుకయందున్నది; నదులు బ్రహ్మపుత్ర (దీనిని ఇచటి ప్రజలు సియాంగ్ అనియు, దిబాంగ్ అనియు ప్రాంతీయ భేదములను అనుసరించి వ్యవ హరింతురు), సువనసిరి; జిల్లాలు 5; గ్రామములు 2,973; ప్రయిమరీ పాఠశాల సంఖ్య 684 (విద్యా ర్థులు 28,790); ఉన్నత పాఠశాలల సంఖ్య 105 (విద్యార్థులు 3,194).

**జిల్లాలు (బ్రాకెట్లలో ముఖ్య నగరములు-జనసంఖ్యలతో)** : కామెంగ్ (బొండిలా-86,001); సువనసిరి (జిరో-99,239); సియాంగ్ (అలోంగ్ 1,21,936); లోహిత్ (తేజూ-62,865); తిరాప్ (ఖోన్‌సా-97,470).

**ప్రముఖనగరములు :** చెప్పదగిన పెద్ద నగర ములు ఏవియు లేవు; నగరములుగ పరిగణింప బడువానిలోనెల్ల పెద్దదియగు పాసిఘాట్‌లోని జన సంఖ్య 5,116. ముఖ్యనగరము ఐతానగర్ నిర్మా ణము 1974లో మొదలైనది.

**వ్యవసాయము మొ. :** సాగున ఉన్న భూమి వైశాల్యము 1,66,838 హెక్టేరులు (1975.) ప్రజ లలో 46 శాతమునకు వ్యవసాయమే జీవనాధారము; పోడు వ్యవసాయపు పద్ధతి పలు ప్రాంతములలో అమలున ఉన్నది. వరి, మొక్కజొన్న, జొన్నలు, గోధుమ, ఆవాలు, చెప్పదగిన పంటలు. అటవీ ప్రాంతపు వైశాల్యము 61,000 చ.కిమీ. ఏనుగులు మొదలగు వన్యజంతు సంపద అందు అధికము. మచ్చల చిరుత, కస్తూరిమృగము, కొండమేక ఈ ప్రాంతపు మృగజాతిలో ప్రత్యేకముగ పేర్కొ నదగినవి.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** నీటిపారుదల వసతులలో, చెప్పదగిన ప్రాజెక్టు ఏదియులేదు. కొండవాగులు మొదలగు వానివలన 14,000 హె. లకు పారుదల సౌకర్యములు కలవు. నాలుగు జలవిద్యుత్ స్థావరములు పనిచేయుచున్నవి. వాని విద్యుదుత్పత్తి సమర్థత 3 మెవా. (1973).

**ఖనిజ సంపద :** ఖనిజముల లభ్యతను గురించిన సమగ్ర పరిశీలన జరుగలేదు.

**పరిశ్రమలు:** అటవీ ఉత్పత్తులకు సంబంధించిన పరిశ్రమలు గణనీయములు. మధ్యరకపు వానిలో రంపపు మిల్లులు, బియ్యపు మిల్లులు, పండ్లనిలువ సంస్థలు పేర్కొనదగినవి.

**విశ్వవిద్యాలయములు :** ఎట్టి విశ్వవిద్యాలయ మును లేదు; ఒక కళాశాల మాత్రము పాసిఘాట్‌న ఉన్నది.

**దర్శనీయ స్థలములు :** భారత దేశమున ఈశాన్యపు సరిహద్దున ఉండి, పలు ప్రకృతి దృశ్య ములకు, జంతుసంతతికి నెలవగు ఈ ప్రాంతము సహజముగ దర్శనీయము; కాని ఇంకను పర్యట కులకు తగిన వసతులు అందు ఏర్పడలేదు.

**పరిపాలన :** విధానసభ కలదు ; రాష్ట్రపతి ఇచటి పాలనను లెఫ్టినెంట్ గవర్నరు ద్వారా నిర్వహించుచున్నాడు.

# 3. గోవా - దామన్ - దయ్యూ

**వైశాల్యము :** 3,813 చ. కిమీ ; జనసంఖ్య : 8,57,771; జనసాంద్రత: చ.కిమీ.కు 224.4; అక్షరాస్యత: 44.75 శాతము; ముఖ్యనగరము: పణజీ; ప్రధాన భాషలు: మరాఠీ,కొంకణీ, గుజరాతీ; నదులు: మండోవీ. జువారీ, తేరేఖోల్; జిల్లాల సంఖ్య : 3, గ్రామ సంఖ్య: 409; ప్రయిమరీ పాఠశాలలు 1,117 (విద్యార్థులు 1, 25, 373); ఉన్నత పాఠశాలలు 590(విద్యార్థి సంఖ్య 86,729).

**జిల్లాలు** (బ్రాకెట్లలో వైశాల్యములు - జన సంఖ్యలు): గోవా (3701 చ. కిమీ.—7,95,120); దామన్ (72 చ. కిమీ. — 38. 739); దయ్యూ (40 చ. కిమీ —23,912). వీనిలో గోవా, మహారాష్ట్ర మునకు దక్షిణమున ఉన్నది; దామన్ గుజరాత్‌ను ఆనుకొని ఉన్నది; దయ్యూ ఒక చిన్నదీవి, ఇది కాంబే సింధుశాఖచే పరివృతము. కొన్ని చారిత్రక కారణములవలన ఇవి ఒకే పరిపాలనా ప్రాంతముగ రూపుగొనినవి.

**ప్రముఖ నగరములు, వాని జనసంఖ్యలు :** పణజి ( 59, 258 ); మార్‌గావ్ ( 48, 593 ); మార్ముగోవా (44,065).

**వ్యవసాయము మొ. :** ప్రాంతపు భూతలమున 44,699 హె. సాగున ఉన్నది. ఆహారపు పంటలలో వరి ప్రముఖము; తక్కిన వానిలో రాగి, గోధుమ పేర్కొనదగినవి. రొక్కపు పంటలలో కొబ్బరికాయ, జీడిపప్పు, పోకచెక్కలును, పనస, అరటి మొదలగు ఫలజాతులును, వేరుసెనగయు చెప్పదగినవి. వరి విరివిగ పండుచున్నను, ఆహారధాన్యముల విషయమున ఈ ప్రాంతము తక్కిన దేశముపై కొంతవరకు ఆధారపడి ఉన్నది. భూతలమున 28.6 శాతము అటవీమయము.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి :** నీటిపారుదలకు చెరువులు, గొట్టపుబావులు, లిఫ్ట్ పారుదల వసతులు ముఖ్యాధారములు. తెర్మల్ స్టేషన్ వలన కొంతవిద్యుదుత్పత్తి జరుగుచున్నది; కాని అది ప్రాంతపు అవసరములకు సరిపోవదు. మహారాష్ట్ర, గుజరాతుల నుండి ఆ యా ప్రాంతీయ భాగములకు కావలసిన విద్యుత్తును ప్రభుత్వము గ్రహించుచున్నది. అటుల గ్రహింపబడిన విద్యుత్తు 39.39 మెవా. (1974-75)

**ఖనిజ సంపద :** బాక్సయిట్ నిక్షేపములు కనుగొనబడినవి; ముడి ఇనుప ఖనిజమునకు పూర్వము ఈ ప్రాంతము పేరొందినది; కాని ప్రస్తుతమున ఆ గనులలో పని చాల తక్కువ.

**పరిశ్రమలు:** జవుళిమిల్లులు; రబ్బరు ఫేక్టరీలు; ఎరువుల, క్రిమిసంహారుల ఉత్పత్తి సంస్థలు, సారా తయారీ పరిశ్రమలు, రంపపు మిల్లులు; నూనె, పిండి, సబ్బులకు సంబంధించిన చిన్న పరిశ్రమలు కలవు.

**విశ్వ విద్యాలయములు :** ఎట్టి విశ్వవిద్యాలయమును లేదు; 5 కాలేజీలు కలవు; పణజిలో ఒక పోస్ట్-గ్రాడ్యుయేట్ కేంద్రము పనిచేయుచున్నది.

**దర్శనీయ స్థలములు :** గోవాయందలి ప్రాచీన క్రైస్తవాలయములు; నర్వే, ప్రియోలి, కవాలే, బండోరా, మర్డోల్, ఫర్మగుడి షిరోదా, కాంచోనా, కారోగాంవ్ లందలి ప్రాచీన హిందూ ఆలయములు.

**పరిపాలన :** విధాన సభ కలదు; రాష్ట్రపతి లెఫ్టినెంట్ గవర్నరు ద్వారా, ఇచట కార్యనిర్వహణాధికారిగ వ్యవహరించును.

# 4. చండీఘర్

**వైశాల్యము :** 114.48 చ. కిమీ.; జనసంఖ్య : 2,57,251; జనసాంద్రత : చ.కిమీ. కు. 2, 254; ముఖ్యనగరము : చండీఘర్; ప్రధాన భాషలు : పంజాబీ, హిందీ; ఉర్దూ; ఈ కేంద్ర ప్రాంతమును దానిని అనుసరించిన ఉపనగరములును, అంతయు ఒకేఒక నగరము అగుట వలన జిల్లా, గ్రామముల, వ్యవసాయ, ఖనిజ సంపత్తుల ప్రసక్తి ఉండనేరదు. ముఖ్యనగరమగు చండీఘర్ లోని జనసంఖ్య: (ఉపనగరములు గాక)2,33,004.

**పరిపాలన :** రాష్ట్రపతి, ఇచటి పరిపాలనను చీఫ్ కమీషనరు ద్వారా నిర్వహించుచున్నాడు.

---

# 5. ఢిల్లీ

**వైశాల్యము :** 1,485 చ.కిమీ.; జనసంఖ్య : 40, 65, 698; జనసాంద్రత : చ. కిమీ. కు. 2,738; అక్షరాస్యత : 56.61 శాతం : ముఖ్య నగరము : ఢిల్లీ (కొన్ని పల్లెలు ఈ ప్రాంతమున చేరి ఉన్నను, అవి క్రమముగ నగరమున కలిసి పోవు చున్నవి). ప్రధాన భాష : హిందీ, కాని దేశపు రాజధాని అగుటవలన దేశపు తక్కిన వివిధ ప్రముఖభాషలకు ఇందు సముచిత ప్రతిపత్తి కలదు; ఒకే ఒక నగరమగుట వలన జిల్లా, గ్రామముల ప్రసక్తికి ఆస్కారము లేదు; 1974-75లో ప్రయిమరీ, తదితర పాఠశాలల మొత్తపు సంఖ్య 2,552 (విద్యార్థిసంఖ్య 10,87,400)




**వ్యవసాయము మొ. :** పల్లెపట్టులందలి వ్యవసాయ భూమియు చాలవరకు నగరావసరముల కొరకై ఆక్రమిత మగుట వలన, సాగున ఉన్న భూమి వైశాల్యము క్రమముగ తగ్గుచున్నది; 1974-75లో దానివైశాల్యము 70 వేల హెక్టేరులు. గోధుమ. వరి, మొక్కజొన్న, సజ్జ, ముఖ్యములగు ఆహారపు పంటలు; రొక్కపు పంటలలో ద్రాక్ష చక్కెర-చెరకు, ఆవాలు, పొగాకు ప్రముఖములు; కూరగాయలును విరివిగ పండింపబడుచున్నవి. అటవీభూమి వైశాల్యము 1,886 హెక్టేరులు.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** గొట్టపు బావులు మొదలగు చిన్నతరహా పారుదల వసతులు మాత్రమే కలవు. అట్టివసతికల భూమివైశాల్యము 54,763 హె. (1973-74). విద్యుదుత్పత్తి తెర్మల్ స్టేషనులవలన జరుగుచున్నది. నెలకొల్పబడిన స్థావరముల సమర్థత 278 మెవా. (1973-74);

**ఖనిజ సంపద :** ఎట్టిదియు లేదు

**పరిశ్రమలు :** ఎలక్ట్రిక్ మోటార్లు, ఎయిర్ కండిషనర్లు, రేడియో విభాగములు, మోటారు కారుల విభాగములు, బై సికిల్ భాగములు, లేతీలు, డ్రిల్లింగ్ యంత్రములు, బ్లేడులు, చేనేత, పపరు మగ్గములనేత, అల్లకం, కుమ్మరిపని, పిండిమలుర, వనస్పతి నూనెల మిల్లులు, ఎక్స్‌పెలర్లు, రంగులు, వార్నీషులు, రబ్బరు సరుకులు, మాయనగలు. రాగి ఇత్తడి సామగ్రి, చర్మపు సరుకులు, ఆటల పరికరములు, నారపనులకు సంబంధించిన పరిశ్రమలు కలవు.

**విశ్వ విద్యాలయములు :** 1. యూనివర్సిటీ ఆఫ్ ఢిల్లీ, ఓల్డ్ వైస్‌రీగల్ లాడ్జి; 2. జవహర్ లాల్ నెహ్రూ యూనివర్సిటీ, మెహరాలీరోడ్.

**దర్శనీయ స్థలములు :** నగరము నందలి వివిధ ప్రాచీన చారిత్రకావశేషములు; మొగల్ పరిపాలనా కాలపు రాజభవనములు, మసీదులు; లాల్‌కోట, కుతుబ్‌మినార్; పార్లమెంటు భవనము; లక్ష్మీనారాయణ ఆలయము; జంతర్‌మంతర్.

**పరిపాలన :** ఎన్నుకొనబడిన సభ్యులుకల మెట్రోపాలిటన్ కౌన్సిల్ కలదు; లెఫ్టినెంట్ గవర్నరు ద్వారా రాష్ట్రపతి కార్యనిర్వహణాధికారిగ వ్యవహరించును.

---

# 6. దాద్రా-నగర్ హవేలీ

**వైశాల్యము :** 491 చ. కిమీ.; జనసంఖ్య: 74,170 జనసాంద్రత చ. కిమీ. కు. 125; అక్షరాస్యత 14.86 శాతము; ముఖ్యనగరము : సిల్‌వస్సా; ప్రధాన భాషలు : గుజరాతీ, వార్లీ, మరాఠీ, ధోదియా, కొంకణి, హిందీ; జిల్లాలు : జిల్లాలుగ పరిగణింప బడకపోయినను రెండు ప్రత్యేక భాగములు కలవు; గ్రామసంఖ్య 72; ప్రయిమరీ పాఠశాలలు 144 (విద్యార్థులు 10,054); ఉన్నత పాఠశాలలు 4 (విద్యార్థులు 850).

**జిల్లాలు :** జిల్లాలు అనబడకపోయినను దాద్రా, నగర్‌హవేలీ అనబడు రెండు వేర్వేరు భాగములు కలవు; ఇందులో తొలుతటి దానిలోని గ్రామసంఖ్య 3; తక్కిన 69 గ్రామములు నగర్‌హవేలీ భాగమున ఉన్నవి. నగరములు లేనే లేవు.

**వ్యవసాయము మొ. :** ప్రజలలో దాదాపు 87 శాతమున్న ఆదివాసి ప్రజలకు అందరికిని వ్యవసాయమే ముఖ్యవృత్తి. దాదాపు 18 వేల హెక్టేరులు సాగున ఉన్నది. ఆహారపు పంటలలో వరి, రాగి, ప్రముఖములు ; గోధుమ కొలదిగ పండింపబడుచున్నది. అటవీభూమి భూతలమున 41.5 శాతమును ( 20,336) హె. ) ఆవరించి ఉన్నది; ఇందు టేకు కలప, గంధపు చెక్క లభించుచున్నవి.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** చెప్పదగిన నీటిపారుదల వసతి ఏదియులేదు. కాని గుజరాతు, గోవా-దామన్-దయ్యూ ప్రాంతములతో సమష్టిగ దామన్‌గంగా ప్రాజెక్టులో ఈ ప్రాంతమునను హక్కు కలదు.; దీనివలన 6,880 హె. లకు పారుదల వసతి కలిగినది. వాగులకు అడ్డుకట్టలు కట్టగ ఏర్పడిన జలాశయముల వలనను, లిఫ్ట్ పారుదల వలనను కొంతభూమికి నీటి పారుదల వసతులు ఏర్పడినవి. విద్యుదుత్పత్తి వసతులు ఏర్పడలేదు; గుజరాతునుండి, కావలసిన విద్యుత్తును ఈ ప్రాంతము గ్రహించుచున్నది; 11 కివా. ట్రాన్స్‌మిషన్

లైన్ద్వారా ఈ విద్యుత్తు గుజరాతునుండి ఇటకు చేరుచున్నది.

**ఖనిజ సంపద :** ఎట్టిదియు ఉన్నటుల కన్పట్టదు.

**పరిశ్రమలు :** పెద్ద పరిశ్రమలు ఏవియులేవు. పిపేరియావద్ద ఒక పారిశ్రామిక వాటిక నెలకొల్పబడినది. మోటారుకార్ల విడిభాగములు, క్రిమి సంహారులు, కళ్లద్దాలు, ఇంజనీరింగు సరుకులు, చేతి తయారీ కాగితము, చర్మపు వస్తువులకు సంబంధించిన పరిశ్రమలు ఆ వాటికలో ఆరంభితములైనవి (1975).

**విశ్వవిద్యాలయములు :** ఎట్టి విశ్వవిద్యాలయమును లేదు. ఇచటి విద్యార్థులకై తక్కిన రాష్ట్రముల లోని కొన్ని ఉన్నత విద్యా సంస్థలందు స్థానములను కొన్నింటిని కేంద్రప్రభుత్వము ప్రత్యేకించినది.

**దర్శనీయ స్థలములు :** ఏవియు లేవు.

**పరిపాలన :** రాష్ట్రపతియే, అడ్మినిస్ట్రేటర్ ద్వారా పరిపాలనను నిర్వహించుచున్నాడు.

---

# 7. పుదుచ్చేరి

**వైశాల్యము :** 480 చ. కిమీ.; జనసంఖ్య : 4,71,707; జనసాంద్రత: చ.కిమీ.కు. 983; అక్షరాస్యత: 46.02 శాతము; ముఖ్యనగరము : పుదుచ్చేరి; ప్రధాన భాషలు: తమిళం, ఫ్రెంచి, ఇంగ్లీషు, తెలుగు, మళయాళం; నదులు: ఈ ప్రాంతమున తమిళనాడుచే పరివృతములగు పుదుచ్చేరి, కరైకాలులును, కేరళ రాష్ట్రముచే చుట్టబడిన మాహీయు, ఆంధ్రప్రదేశమునందలి తూర్పు గోదావరి జిల్లాకు సన్నిహితమగు యానామును, చారిత్రక కారణములవలన చేరి యున్నవి. వానియందు పుదుచ్చేరీలోని గింజీ, మాలాతేర్, పొన్నేర్ నదులును ; కరైకాలులోని నందలార్, నూలార్, నదులును; మాహీలోని మాహీనదియు; యానాంలోని కోరింగయు పేర్కొనదగినవి; జిల్లాలు: 4; గ్రామసంఖ్య 388: ప్రయిమరీ పాఠశాలలు 340 ( విద్యార్థులు 36,143); ఉన్నతపాఠశాలలు 64 ( విద్యార్థులు 1,745)

**జిల్లాలు** (బ్రాకెట్లలో వైశాల్యము జనసంఖ్యలతో): కరైకాల్ (161 చ. కిమీ. 1,00,042); మాహీ ( 9 చ. కిమీ. - 23, 134 ); పుదుచ్చేరి ( 290 చ కిమీ. - 3, 40, 240 ); యానామ్ (20 చ. కిమీ. - 8,291).

**వ్యవసాయము మొ. ;** ప్రాంతపు భాగములు అన్నియు సముద్ర తీరములను ఆశ్రయించియే ఉన్నవి. అందు పర్వతభూమికాని అడవికాని లేనే లేవు. అందువలన జనావాసితమగునది తప్ప తక్కిన భూమియంతయు సాగుననే ఉన్నదని చెప్పవచ్చును. ప్రజలలో 15 శాతమునకు వ్యవసాయమే జీవనాధారము. ఆహారపు పంటలలో ప్రముఖము వరి; రొక్కపు పంటలలో వెరుసెనగ, చక్కెర చెరకు పేర్కొనదగినవి.

**నీటిపారుదల, విద్యుదుత్పత్తి:** నీటి పారుదల వసతులలో పేర్కొనదగినది ఏదియు లేదు. చెరువులు, బావులు నీటిపారుదలకు ఉపకరించుచున్నవి. విద్యుదుత్పత్తి సౌకర్యములును లేవు. తనకు కావలసిన విద్యుత్తును, ఆయా ప్రాంతభాగములకు పరిసరములనున్న తమిళనాడు, కేరళ, ఆంధ్రప్రదేశ్ల నుండి ఈ ప్రాంతము కొనుగోలు చేయుచున్నది. 1974-75లో అటుల కొనుగోలు

చేయబడిన మొత్తపు విద్యుత్తు 12.814 కోట్ల యూనిట్లు; ప్రాంతపు మొత్తమున తలసరి విద్యుత్ వినియోగము 230.90 యూనిట్లు; జిల్లాల వారీగా చూచినపుడు ఆ విద్యుత్ తలసరి వినియోగము పుదుచ్చేరి: 285.54; కరైకాల్: 68.50; మాహీ 159.76; యానామ్ 26.29 యూనిట్లు.

**ఖనిజ సంపద :** ఎట్టిదియు లేదు.

**పరిశ్రమలు :** పెద్ద పరిశ్రమలు ఏవియు లేవు, జవుళీ, చక్కెర, విద్యుత్ పరికరములు, కర్పూరము, చర్మపు వస్తువులు, కొయ్యసరుకులు, బైసికిల్ విడిభాగములకు సంబంధించిన చిన్న పరిశ్రమలు కొన్ని కలవు. పారిశ్రామిక ఆల్కహాల్‌ను తయారు చేయు పెద్దబట్టీ ఒకటి పనిచేయుచున్నది.

**విశ్వ విద్యాలయములు :** ఏ విశ్వవిద్యాలయమును లేదు: 9 సాధారణ కళాశాలలు, 1 వైద్య కళాశాల, 1 న్యాయశాస్త్ర కళాశాల, 12 వృత్తి విద్యా సంస్థలు కలవు.

**దర్శనీయ స్థలములు :** పుదుచ్చేరిలోని అరవిందాశ్రమము; ఆరోవిల్లీ.

**పరిపాలన :** విధాన సభ కలదు; రాష్ట్రపతి, లెఫ్టినెంట్ గవర్నర్ ద్వారా, కార్యనిర్వహణాధికారిగ వ్యవహరించును.

---

# 8. మిజోరాం




**వైశాల్యము :** 23,980 చ. కిమీ.; జనసంఖ్య: 3,21,986; జనసాంద్రత : చ. కిమీ.కు. 15.76; అక్షరాస్యత : 63.7 శాతం.; ముఖ్యనగరం: అయిజాల్; ప్రధాన భాషలు : మాతృ భాషలుగ ఆ యా తెగలందు విభిన్న భాషలు కలవు; ఇంగ్లీషు భాషయే సామాన్యభాషగ వాడుకయందు ఉన్నది ; నదులు : తివాంగ్ (ధవళేశ్వరి), కర్నపులి, కలాదాన్; జిల్లాలసంఖ్య : 3; గ్రామసంఖ్య తెలియవచ్చుటలేదు; ప్రయిమరీ పాఠశాలలు 483 (విద్యార్థి సంఖ్య 53 వేలు); ఉన్నత పాఠశాలలు 93.

**జిల్లాలు :** (బ్రాకెట్లలో వైశాల్యము ; జన సంఖ్యలతో ) : అయిజాల్ ( 12,428 చ. కిమీ.; 2, 29, 112); లూంగ్లీ ( 6,066 చ. కిమీ; 62,136); ఛింత్విప్వీ (2,596 చ.కిమీ.; 41,142)

**ప్రముఖ నగరములు :** పెద్ద నగరములు లేనే లేవు. రెండు చిన్ననగరములు - అయిజాల్, లూంగ్లీ - కలవు. వాని జనసంఖ్యా వివరములు తెలియవు.

**వ్యవసాయము మొ. :** సాగున ఉన్న భూమి వైశాల్యము 60,821 హెక్టేరులు. పంటలలో అతి ప్రముఖము వరి; తక్కినవానిలో మొక్కజొన్న, ప్రత్తి, వేరుసెనగ, అల్లం, ఉరలగడ్డ, తేయాకు పేర్కొనదగినవి. మంచిరకపు అల్లమునకు ఈ ప్రాంతము పేరొందినది. దాదాపుగ ప్రజలందరు వ్యవసాయముపై ఆధారపడిఉన్నారని చెప్పవచ్చును. వ్యావసాయిక భూమి అంతయు గ్రామపు ఉమ్మడి భూమిగ పరిగణింపబడుచున్నది. రైతులకు అందు వ్యక్తిగత స్వామ్యములేదు. కాని క్రమముగ వ్యక్తిగత స్వామ్యమును తోటలు మొదలగువాని యందు ప్రభుత్వము కల్పించుచున్నది. అటవీ భూమి వైశాల్యము 7,780 చ. కిమీ. దీని సాయమున కాగితపు పరిశ్రమను నెలకొల్పుటకై యత్నము జరుగుచున్నది.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** సాగు భూమిలో 1.7 శాతమునకు మాత్రమే నీటివసతి కలదు. నెలకొల్పబడిన విద్యుదుత్పత్తి స్థావరముల సమర్థత 2,391 కివా. (1974-75).

**ఖనిజ సంపద :** దీనిని గురించి తగు పరిశీలన జరుపబడలేదు.

**పరిశ్రమలు :** పెద్ద పరిశ్రమ ఏదియు లేదు. సాంప్రదాయికముగ అలవడిన కుటీర పరిశ్రమలు కొందరికి పనిని కల్పించుచున్నవి నేతపనిలో ఇచటివారు చాల కుశలురు; చక్కని ఉన్ని తివాచీలను వారు నిర్మింతురు; కాని అది చాల ఆలస్యపు పని అగుటవలన లాభధాయకము కాకున్నది. వెదురుతో బుట్టలను, టోపీలను అల్లుట కొందరికి ముఖ్య ఉపవృత్తిగ ఉన్నది.

**విశ్వవిద్యాలయములు :** ఎట్టి విశ్వవిద్యాలయమును లేదు. 4 కళాశాలలు మాత్రము కలవు.

**పరిపాలన :** విధాన సభ కలదు; కార్య నిర్వహణాధికారిగ, రాష్ట్రపతియే, లెఫ్టనెంట్ గవర్నరు ద్వారా, వ్యవహరించును.

---

# 9. లక్షద్వీప్




**వైశాల్యము:** 32 చ. కిమీ. (ఈ కొలది వైశాల్యమైనను ఏకప్రాంతముగ లేదు. అరేబియన్ సముద్రమున చెల్లాచెదరుగ, కేరళ తీరమునకు 200 నుండి 400 కిమీ.ల దూరమున 8° నుండి 12° ఉ. అక్షాంశరేఖల మధ్యను, 71° నుండి 74° తూ. తులారేఖల మధ్యను, ఉన్న 27 ద్వీపములు ఇందు చేరి ఉన్నవి. వీనిలో 17 ద్వీపములలో జనావాసములు లేవు); జనసంఖ్య: 31,810; జనసాంద్రత చ. కిమీ. కు 994; అక్షరాస్యత: 43.66 శాతం; ముఖ్యనగరం: కవరత్తి (ఇది ఆ పేరుగల ఒక ద్వీపమును ఆవరించి ఉన్నది); ప్రధాన భాష: ఒక విధపు మళయాళభాషా మాండలికము; నదులు: లేనేలేవు; జిల్లాలు: తహశీల్‌లు అనబడు నాలుగు జిల్లాలు కలవు; గ్రామములు: జనావాసితములగు పది దీవులును, దేనికది ఒక గ్రామముగ పరిగణనీయము.

**జిల్లాలు:** తహశీల్‌లు అనబడు నాలుగు జిల్లాలు- మినికాయ్, ఆన్‌డ్రోత్, కవరత్తి, అమీనీ-కలవు. పది జనవాసిత ద్వీపములును ఈ తహశీల్‌లలో ఏదియో ఒకదానికి చెందియున్నవి. ఆ జనవాసిత ద్వీపముల పేరులు (బ్రాకెట్లలో వైశాల్యము; జనసంఖ్యలతో) ఇటుల కలవు: మినికాయ్ (4.4 చ. కిమీ; 5,342); కాల్‌పేనీ (2.3 చ. కిమీ.; 3,152); ఆంద్రోత్ (4.8 చ. కిమీ.; 5,425); అగత్తి (2.7 చ. కిమీ.; 3,155); కవరత్తి (3.6 చ. కిమీ.; 4,420); అమీనీ (2.6 చ. కిమీ.; 4,542); కద్‌మత్ (3.1 చ. కిమీ.; 2,416); కిల్‌తాన్ (1.6 చ. కిమీ; 2,046); చెత్‌లాత్ (1.0 చ. కిమీ.; 1.200); బిత్రా (0.1 చ. కిమీ.; 112). నగరములనదగినవి లేనేలేవు.

**వ్యవసాయము** మొ.: కొబ్బరితోటల పెంపకమే ముఖ్యమగు కృషి. అందలి సాగుబడి విస్తీర్ణము 2,855 హెక్టేరులు. దాదాపు 2.05 కోట్ల

కొబ్బరికాయలు 1973-74లో ఉత్పత్తి అయినది ఆ తోటలలోనే చాల్లమధ్య అరటి, జామ, బొప్పాయి, నిమ్మజాతులు, మునగచెట్ల తోటలును; పచ్చిమిరప, రామములగ వంకాయ, చిరుగడదుంపల తోటలును పెంచబడు చున్నవి.

**నీటి పారుదల, విద్యుదుత్పత్తి :** బావులుతప్ప వేరు విధములగు నీటి పారుదల వసతులు లేవు. నెలకొల్పబడిన విద్యుదుత్పత్తి స్థావరముల సమర్థత 841.12 కివా. (1975).

**ఖనిజ సంపద :** ఎట్టిదియు లేదు.

**పరిశ్రమలు:** కొబ్బరి నారతో త్రాడులను పేనుట ఒక ముఖ్య గృహపరిశ్రమ. చేనేత, చాపల అల్లకం, ఇతర తీరుల అల్లకం, పండ్ల రసముల తయారీ కొందరకు జీవనాధారములుగ ఉన్నవి. కొబ్బరి త్రాడులను ఎగుమతి చేసి, అందులకు బదులుగా దేశపు తక్కిన ప్రాంతములనుండి బియ్యము మొద లగు ఆహార పదార్థములను ఈ ప్రాంతము దిగుమతి చేసికొను చున్నది. ఈ ఎగుమతి ఖర్చులను ప్రభుత్వమే భరించి, ప్రజలకు సాయపడు చున్నది. కొబ్బరిని ఆశ్రయించి మరికొన్ని ఉత్పత్తులు-నూనె గానుగ, కొబ్బరిడిప్పతో వింత వస్తువుల తయారీ మొదలగునవి-ప్రాంతమున వ్యాప్తిలో ఉన్నవి. మత్స్య పరిశ్రమ ఒక ముఖ్య పరిశ్రమ; ఈ కృషిలో 100 నకు పైగా మరబోట్లు పాల్గొను చున్నవి. ఈ బోట్ల నిర్మాణమునుకూడ ఆ ద్వీపములందే పలుప్రాంతములలో సాగించుటకు ప్రభుత్వము వసతులను కలిగించినందువలన, పలువురకు ఉపాధి సౌకర్యములు ఏర్పడినవి.

**విశ్వవిద్యాలయములు :** ఎట్టి విశ్వవిద్యాలయ మును లేదు.; జవహర్‌లాల్ కాలేజి అను ఒకే ఒక కళాశాల కవరత్తిలో కలదు. ఇది కేరళలోని కళ్లికోట యూనివర్సిటికి అనుబద్ధము.

**దర్శనీయ స్థలములు :** ప్రకృతి సిద్ధమగు రమణీయతకు తోడుగ, కొబ్బరి తోటలును, సముద్రమున బోట్లలో విహారమునకు వసతులును కలిగిన ఈ ద్వీపములు పర్యటకులను ఆకర్షించునవియే అయినను, అందులకు తగిన వసతులు ఏర్పడలేదు.

**పరిపాలన :** రాష్ట్రపతియే, అడ్మినిస్ట్రేటరు ద్వారా, ఇచట పాలనను నిర్వహించుచున్నాడు.

---

# అనుక్రమణ పట్టిక

## ఆ

## ఇ

ఉ

ఎ

ఖ



గ

## త

## ఫ

## మ

## య

## ర

## హ